# సాహితీవాల్లభ్యము

'సాహితీవల్లభ' 'ఆంధ్రభోజ'

శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి అభినందన సంపుటి




శ్రీ నరేంద్రనాథ సాహిత్య మండలి

తణుకు — ( ప॥ గో॥ జిల్లా. )

# సాహితీవాల్లభ్యము

(మొదటి భాగము)

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి

వ్యవస్థాపకాధ్యక్షులు

'సాహితీవల్లభ' 'ఆంధ్రభోజ'

శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు

సానందముగా

శ్రీ/శ్రీమతి [illegible] గారికి

బహూకరించినది

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి,
తణుకు.

వ్యవస్థాపకాధ్యక్షులు

## సాహితీ వల్లభులతో
## సంపాదక వర్గము



1. శ్రీ యేలూరిపాటి అనంతరామయ్య,
2. శ్రీ పిల్లలమర్రి మార్కండేయశాస్త్రి,
3. శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు,
4. శ్రీ మధిర భానుమూర్తి.



" సాహితీవల్లభ, ఆంధ్రభోజ "  శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు

# సభా వృత్తాన్తము.

శ్రీ సాహితీవాల్లభ్య ప్రకాశము తణుకులో జరుగుతుందని చుట్టుప్రక్కలనుండి చాలామంది సారస్వతేయులు సభకు సంతోషంగా వచ్చారు. సభారంగం అంతా నేత్రపర్వంగా ఉంది. వేదిక అంతా సుందరంగా అలంకరించారు. శాస్త్రీయంగా మంగళవాయిద్యములు మ్రోగుతున్నాయి. ఆ శాస్త్రంలో ఆ నాదవిద్వాంసులు సవినయంగా అగర్వంగా నాదాలాపం చేస్తూఉంటే పాలకులయిన ప్రభువుల మర్యాదలు పాటిస్తూ నాదాలాపంచేసే సంప్రదాయమంతా గుర్తుకు వచ్చింది. వేదికనంతా అలంకరించారు. శబ్దయంత్రాలు కూర్చారు. ధూప సామగ్రి శ్రీచందనం పన్నీరు పరిమల సంభారం వివిధములయిన పూలదండలు యథాక్రమంగా కూర్చారు. సమ్మానసామగ్రి భద్రపరిచారు. తాంబూలాదులన్నీ సిద్ధంగా ఉన్నాయి. కార్యకర్తలందరూ అన్నీ సావధానంగా సిద్ధపరిచారు. శ్రీమాన్ ధీమాన్ హరిశ్చంద్రప్రసాదు స్వసంతుష్టికై సర్వేక్షణం చేయడము ముచ్చటగాఉంది. బంధువులు మిత్రులు అందరూ కార్య సౌందర్యంలో చక్కగా సహకరించారు. అల్పాహార సంభారమంతా చిత్రమధుర పానీయములతో సహస్ర జన పర్యాప్తముగా సంసిద్ధముగా ఉంది. కార్యవిభక్తి అసంకీర్ణంగా ఉంది. నియతంగా ఆ యా వ్యక్తులా యా కార్యములను కూర్చి చేర్చి సమ్మోదము సంధానించారు. ఏ వస్తువున కావస్తువు నేను నేనంటూ వుంది. దీపకాంతుల సన్నాహం బాగుంది. దీపాలన్నీ తెల్లగా నవ్వుతున్నాయి—రాగరంజిత దీపాలు తీపిగా ఉన్నాయి. అన్నిపనుల్లోనూ అందరూ దక్షిణులుగా ఉన్నారు దక్షులుగానూ ఉన్నారు. ఈ కార్యదక్షులకు ఈ దక్షత సంపాదించింది ఎవరు? అన్న ప్రశ్నలేదు. ఈ దక్షత స్వయంభూదక్షత - హరిశ్చంద్రప్రసాదు కంటికొనలోని దక్షత, తిమ్మరాజు సంకల్పంలోని దక్షత—ఇది ముళ్లపూడి వంశానుగతమయిన దక్షత. సభలో సంభాషాచతురులకు ధోవతులు ఉత్తరీయాలు బహుమానించాలి. ధోవతులన్నీ ఒకటె ఎనుకుని ఒక్కసారిగా వచ్చి ఒక్కచోట ముచ్చటగా కూర్చున్నవి. కొన్ని రాంకవాలు జాతీయోద్యమం నిర్వహించి వచ్చి బింకంగాఉన్నాయి.

సాహితీవాల్లభ్య ప్రకాశన సభలో వక్తలుగా విచ్చేసినవారికి నూటపదార్లివ్వాలని సభకు విచ్చేసిన వ్యాసరచయితలకు మార్గ వ్యయాలిచ్చి పారితోషికాలివ్వాలని ఆదిలోనే అంతరంగంలో నిశ్చయించినందువలన సమ్మానపర్యాప్తధనమును లెక్కించి లెక్కించి గుప్తంగా కవరులలో భద్రపరచి శతాక్షులు కొందరు భద్రంగా చూస్తున్నారు. సభాసౌందర్య సంభావనలు చాలామంది సందేశాలు పంపించారు. వానినన్నిటినీ హుందాగా సేకరించి ఉంచారు. విడిదిలో విందులు కుడిచి త్రేణ్చుకుంటూ వియ్యాలవారిమాదిరిగా విద్వత్కవులు మోటార్లలో విచ్చేస్తున్నారు. సన్నాహకారులందరూ సావధానంగా ఉన్నారు. శతధా పర్యవేక్షణం చేస్తున్నారు. ఎవరికీ ఏమీ సూచింపవలసిన అవసరంలేకుండా అన్నీ ఆత్మపూర్ణంగా ఉన్నాయి. టేపు రికార్డు మిషనువచ్చింది. ఎప్పుడా ఎప్పుడా అంటూఉంది. శబ్దయంత్ర పరీక్షకులు వచ్చి — హల్లో హల్లో వన్ ట్రీ లు పలికి సంతుష్టు లయినారు. స్పష్ట ప్రతిపత్తి అందరకూ సంతుష్టినిచ్చింది.

సభాధ్యక్షులు ప్రాడ్వివాకాధ్యక్షులు శ్రీ సాంబశివరావు సభకు విచ్చేస్తున్నట్లు సన్నాయి మొదటగా గుర్తించింది. అవుననన్నది డోలు. తాళం తాళంవేసింది. స్వాగతరీతులు సంవిత్సుందరంగా ఉన్నాయి. అభిజ్ఞులున్నారని సన్నాయి విద్వాంసుడు పట్టుపట్టి ఉదాత్తగంభీరంగా శంకరాభరణం వాయించుతూఉంటే సభ్యుల తలలు తలపులుకలవారి తలలు తమంతటతాము దోగిసలాడాయి.

అనుకున్న సమయానికి సరిగా సభ ఆరంభమయింది. శ్రీ మధిర భానుమూర్తి వేదికపైకి రావలసినవారిని గురించి అన్యూనానతిరిక్తంగా ఆచి ఆచి తూచి తూచి పలకడం బాగుంది. అధ్యక్షులు వేదికకు వేంచేస్తున్నారు. పూలదండలు మెడలో పడినై ఫొటో తీసింది కెమెరా. సాహితీవల్లభాహ్వాన సమయంలో సభ్యులు కరతాలానందం సూచించారు, దండలు ఫొటోలు వాల్లభ్యావిష్కరణానికై శ్రీ దివాకర్ల వేదికకురాగా నంతట ఫొటోలు తమపని తాము చేసినై — సర్వసభా సౌందర్య సంధాత హరిశ్చంద్రప్రసాదు వేదికకు రావలసి వచ్చిన్నీ దండ వేయబోతే వేయించుకోలేదు. సభకు అది బాగుంది. దండలు వేయించుకున్నవారంతా దండలను దండలనుంచారు. ఒక్క మాధవరామశర్మమాత్రం దండను గుండెల ధరించాడు. అదేబాగానేఉంది, తిమ్మరాజు మనుమడు వెంకట్రాయుడు రావాలని సభావేదిక పిలిచింది కాని ఆయన అటుచూచి అటువెళ్లడం కార్యనిర్వహణభారం వ్యగ్రతతో వహించడమును చూచి సభ అంతా ముచ్చటపడింది. తగినపిలుపు అందుకొని కరుణశ్రీ — మాధవరామశర్మ — వేదుల — మార్కండేయశాస్త్రి — అనంతం — ఆసీనులయినారు. ఫొటో కెమెరాలు క్లిక్కుమన్నాయి. విశిష్టులయిన పెద్దలు కొందరు వేదికమీద తిమ్మరాజు పూజచేశారు.

శ్రీమాన్ నిడదవోలు మృత్యుంజయరావు సముచితంగా స్వాగతం పలుకడం ముచ్చటగా ఉంది. విశిష్ట సదస్యులతో సదస్యలతో సభ నిండుగాఉంది. అధ్యక్ష శ్రీ సాంబశివరావు :— నాకు వీరికి వంశపరిచయం ఉంది. న్యాయవాదిగా పరిచితుడను న్యాయమూర్తిగా సర్వము గుర్తించినవాడను. శ్రీ తిమ్మరాజు ఆయుష్యం ఆరోగ్యం సాహిత్యానికి పుష్టి, తుష్టి, సంపాదించుతుంది. తండ్రి కుమారుల సామరస్యము అభినందనీయంగా ఉంది. అభ్యుదయ విధానములను కుమారుడు సాధిస్తూఉంటే సాంస్కృతిక కార్యములను తండ్రి నిర్వహించడం రమ్యంగాఉంది. తండ్రి కొడుకులు చక్కగా సర్దుకుంటున్నారు. సంస్థ వ్యవస్థ సరిచూచుకుంటున్నారు. సంస్కృతి అంతస్తు సాహిత్యంవలన కళలవలన పెరుగుతుంది. ప్రభుత్వము తన నియమచక్రమును దాటి ఏమీచేయదు. చేయడానికి వీల్లేదు. ప్రజాసమాజం ఈ సమయంలో ఎంతయినా చేయాలి. సమాజప్రముఖుల బాధ్యత అధికంగాఉంది. శ్రీ తిమ్మరాజు సమాజప్రముఖుడు, రసికుడు, రసాస్వాదం చేయగలడు. రసమయహృదయుడు. మెచ్చుకోలేని శక్తివలన లాభంలేదు, ప్రజలకు అభిరుచి కలిగించాలి. శ్రీ తిమ్మరాజు స్వయం రచయిత కాకపోయినా రచనలను ప్రోత్సహించగల ధీశాలి. ఈ నాటి సముచితపాత్ర నిర్వహణం మంచిది. ఈ సంచికలో చరిత్ర సాహిత్యం సాహిత్యలక్షణం ఉన్నది. ఆంధ్రులకు చరిత్రసృష్టి తక్కువ. తిమ్మరాజు చరిత్రదృష్టి కలిగించుట ప్రసిద్ధం. అట్టి వివిధ వ్యాసాలు దీనిలో చాలాఉన్నవి. ఇది పరిశోధనకుపకరిస్తుంది. దీనిలో ముళ్లపూడి వంశచరిత్రం తక్కువ ఇతరవిషయాలు తక్కువ. సంపాదకవర్గ కృషి బాగుంది." అని ఉపన్యసించితే వాల్లభ్యమునంతా సూత్రీకరించి చెప్పినట్లు సభ్యులు హర్షించారు. మాకు హైదరాబాదలో సన్నిహితమయిన పరిచయం బాగాఉంది. హైదరాబాద

వాళ్లం పరస్పరం స్తోత్రం చేసికోవడంకాదు. శ్రీ దివాకర్ల వెంకటావధాని సాహిత్యానికి దివాకరుడు. ఇక దివాకర్ల వాల్లభ్యం ఆవిష్కరిస్తారు.

దివాకర్ల వేంకటావధాని "విద్యామంత్రికి పట్టవలసిన అదృష్టం నాకు పట్టింది. ఇది అనుకోకుండావచ్చిన సమాగమంవలెఉంది. 180 మంది రచయితల రచనలు దీనిలోఉన్నాయి, వారినుండి సేకరించడం కష్టం. ఇంతపని తిమ్మరాజుగారిది. ఉత్తమశ్రేణి వ్యాసాలు మనలో ఇంకా బాగా రాలేదు. దీనిలోకొన్ని మంచివి ఉన్నాయి. ఇన్ని ముద్రించడం కష్టం. అందరూచేయలేరు. తిమ్మరాజే సమర్థః — కుమారవర్గం ఉంది. సహాయకవర్గం ఉంది. ఇంతపనిచేశారు. దీన్ని ఆవిష్కరించుతాను. వాల్లభ్యాన్ని ఆవిష్కరించి తిమ్మరాజుకు సమర్పిస్తున్నప్పుడు వివిధములయిన మంగళ వాద్యాలు మోగినై, తిమ్మరాజుకు సత్కారం చేశారు తరువాత దివాకర్ల ఇంకా మాట్లాడుతూ— నేను 27 విషయాలపై మాట్లాడాలని సూచించారు. ఈ గ్రంథంలో మంచి సారస్వతవ్యాసాలున్నాయి, వానిని వేరుగాముద్రించితే ఎవరికయినా పాఠ్యంగా ఏర్పర్చవచ్చు. శ్రీనాథుడు ఇతరుల సారస్వత స్వరూపాలను పరిష్కరించి చెప్పాడు. ఆతడన్న ఉద్దండలీల—ఉభయవాక్ప్రౌఢి—సంస్కృత సమాస ప్రౌఢి తెలుగుపదాల కూర్పు వీనివిషయంలో పరిశీలించి ఆ యా కావ్యాలపై రచనలు చేశారు. సోదాహరణ విన్యాసము వీనిలోఉంది, నన్నయ రీతి తిక్కన రసాభ్యుచితబంధము సమీక్షించారు. ద్రౌపదిని కీచకుడు తరుమునప్పటి దృశ్యము "దుర్వారోద్యమ" పద్యము రసోచితంగాఉంది, ఇది కడు ముద్దరాలు కడు పసిబిడ్డ అని కుంతి అనడం బాగుంది, ఇలాంటివన్నీ కరుణ సూచకాలు, ఇలా తిక్కన బాగావ్రాస్తాడు. భీముడు రక్తం త్రావినపుడు 'ప్రేవడిపోయెగాక' పద్యం బాగుంది. ఎర్రాప్రగడ వైచిత్రి దీనిలో విస్తృత మయింది. ఎవ్వరిదానవు—తండ్రి పంపుపన్ చక్కని సూక్తి— పెద్దన అల్లిక జిగిబిగి ముద్దుపలుకు పదగుంభనము చర్చించారు. పెద్దన ఎరుపు కథలో:-గా ఉంది. మనువుకావలసినవాని లక్షణం సుఘటితమయింది. శ్రీనాథుని తెనిగింపుకో [illegible] 'ఏనును బ్రహ్మచారి' బాగుంది—వ్యాసాలలో వ్యక్తి దూషణంలేదు పరిమళము సెడదు అనేది ఈ పుస్తకానికే వర్తిస్తుంది.

శ్రీ తిమ్మరాజు బంధుమిత్రులు సమ్మానం చేశారు. మంగళవాద్యాలు మ్రోగుతూ ఉన్నాయి. చిన్నపిల్ల చక్కగా దండవేసింది. బాలకుడు బల్ల ఎక్కి నవ్వుతూ పూలదండ వేశాడు. బంధువు లందరూ హసన్ముఖులు ప్రసన్నవదనులు నేను నేనంటూ సాహితీవల్లభునకు సమ్మానం చేశారు. పట్టుశాలువలు సిల్కుదోవతులు పండ్లు నిమ్మకాయలు అరటి ఆపులు బత్తాయిపండ్లు అన్నిటికీ వినియోగంవచ్చింది. తిమ్మరాజు నిమ్మకాయలు అందుకొని వాసనచూడడం భోజలక్షణం ప్రభువులు ఆ విధంగాచేస్తారు, వస్త్రాలు దండలు ప్రోవులు ప్రోవులయినవి. భక్తి నమస్కారాలు శతానందంతో వచ్చినయి. ఒక పెద్దతల్లి వచ్చి చేతికి రక్షాబంధం కూర్చింది—పద్యాలు వ్రాసింది— శ్రీనివాసపటము బహూకరించారు. ముత్తయిదువులు వచ్చారు. నమస్సులర్పించారు. లజ్జావతులు కులీనలువచ్చి సంప్రదాయోచితంగా సపుస్కరించారు. శ్రీ తిమ్మరాజుగారి ధర్మపత్ని కుంకుమ శోభిత సౌభాగ్యవతి శ్రీమతి కమలాదేవికి సువాసినీ దేవతలువచ్చి పసుపుకుంకుమలిచ్చి పట్టు వస్త్రములిచ్చి కర్పూరతాంబూలమిచ్చి ఇంతటి వైభవానికి మీరు ముఖ్యవ్యక్తులన్న భావోపహారములిచ్చి సాహితీవల్లభ సాహితీరంగానికి శోభావిశేషము సంపాదించారు. సభలోఉన్న స్త్రీ లందరూ కంకణ నిక్వాణములు కూడుకొన్న కరతాళములతో సభ సకలకలంగా చేశారు. పుష్పవు

లంపిగా ఈ రమ్య దృశ్యమును ఇంటిపట్టుల పట్టింపాలనుకున్నారు. ఇట్టి సౌకర్యం లేనివాళ్లు తాము స్త్రీలయి భావించారు.

సభలో ఆహూతులయిన రచయితల కంద రక న్మానాలుజరిగినై. సదక్షిణ తాంబూలాలు పూలచందలు స్వయంగా సాహితీవల్లభ కుమారుడు హరిశ్చంద్రప్రసాదు జరపడంమనోహరంగాఉంది. ప్రసాదు కుమారుడు వెంకటాద్రియుడు సర్వమూ భావిస్తూఉన్నాడు, సభావక్తలకు జిలుగువస్త్రాలు నూటపదార్లూ ఇచ్చారు. వచ్చిన వ్యాసరచయితలకు మాన్యత్రయాలిచ్చి అర్ధనూటపదార్లు ఇచ్చారు, సభ్యులంకాకపోయినా కొందరు పద్యాలు శ్లోకాలూ చదివారు, సభలోఉన్న సభ్యులకందరకూ అల్పాహారాలు అధికంగా ఇచ్చారు. పండ్లు తాంబూలాలిచ్చారు.

రుధిర భానుమూర్తి సందేశాలు పంపిన వారిని విన్పించారు, గుడివాడ సాహిత్యమండలి అభినందనం పఠించినతరువాత అనంతరామయ్య వాల్లభ్యపరిచయము పలుకుటద్వారా విషయం అంతా తెలిసింది, ఒకప్పుడు ఈ పట్టణంలో ఇదే స్థలంలో శ్రీ తిమ్మరాజు జన్మదినోత్సవ సభా సమయంలో శ్రీ మాధవరామశర్మ ఔచిత్యవిచార చర్చ కృతిసమర్పణం చేసినపుడు 'సాహితీవల్లభ' బిరుదం ప్రకాశితమయింది. మేము సమ్మానసంపుటాభిలాష సూచింపగా సాహితీవల్లభు లంగీకరించ లేదు. ఈ విధంగా సాహితీవాల్లభ్యం రావాలన్నారు. వ్యాస సంకలనంచేశాము. సమీక్షా సమగ్రత సూచించడానికి యీ యత్నం చేశారు. అందరకూ సంతోషం కలిగించాలని అనుకున్నాము, మొదట ఒక సంపుటమె అనుకున్నాము కాని సర్వతుష్టికి రెండవది రావాలన్నది వల్లభయత్నం, కాలనియమానుసారంగా రచనలు ప్రకటించాలని స్తుతి నిందలులేకుండా ఉండాలని మాయత్నం—సాహితీ వల్లభ సూచనలన్నీ అనుసరింపలేకపోయాము. ఈ నరేంద్రనాథ సాహిత్యమండలిద్వారా సాహితీ వల్లభులు విమర్శవిధానం ఏర్పాటు చేయించాలన్న సంకల్పంతో ఉన్నారు. ఈ రెండు సంచికలు సిద్ధంకాగానే రచయితలకందరకు పంపించాలని వల్లభులసంకల్పం.

శ్రీ కేశిరాజు వేంకటనరసింహ అప్పారావు సమ్మానం అందుకుంటూ పద్యమాలిక పఠించారు—ఇక అసలు నియుక్తులయిన వక్తలు ఉపన్యసింప వలసిఉంది. తలాపావుగంట మాట్లాడాలని అధ్యక్ష సూచన. సభకు సంతోషం అయింది. కరుణశ్రీ ఉపన్యసిస్తూఉంటె "నానాధ్వనులలో ఒక మధుర ధ్వని—ఋషివాలీ—నరేంద్ర బాలకంఠధ్వని కరుణగీతం విన్పిస్తున్నది" అని అంటూఉంటే తిమ్మరాజు కన్ను తుడుచుకోవడం అందరి హృదయాలకూ ఆర్ద్రత కలిగించింది. తణుకు నాకొక తళుకు. వీరాంధ్రభోజులు. ఎంతయినా చేయగలరు. సభానంతరం బ్రహ్మసరస్వతిని అడిగాడుకదా! నీ అధరమెంత మధురమయినదేమి! దీని సమాధానంగా కరుణశ్రీ ఒక పద్యమాలిక చదవడం సభ్యులచే చప్పట్లు కొట్టించింది. తిమ్మరాజాదుల వదనానహాసం ఉదయించింది. కొల్లలుగుగాక సాహితీవల్లభునకు—కర్మవీర ధర్మవీర పరిశ్రమ వీర త్రివేణి సంగమం బాగుంది—

మాధవరామశర్మ ఉపన్యసిస్తూ తన ధోరణిని సభానియమానుగతంగా చేయడం సభ్యులకు అదోలా అనిపించింది. మా శర్మ ఉపన్యాస సమీక్ష వ్రక్కపుటల్లో ఉన్నది. అక్కడ చూడండి.

వేదుల శ్రీవల్లభప్రశంస చేయడము రామారావు ఆ శీః పద్యాలు చదపడం అయినతరువాత

సాహితీవల్లభ సంతుష్టి ఈవిధంగా ప్రకటితమయింది. అధ్యక్షా! ఉపాధ్యాయులన్నా కవు

లన్నా నాకు గౌరవం ఎక్కువ. ఉపాధ్యాయుడు భగవంతుడని నావిశ్వాసం—అందరిపై ప్రేమ చూపడం నాకు ఇష్టం—మాధవరామశర్మ కృతి స్వీకార సమయంలోనే నాకు 'సాహితీవల్లభ' బిరుదం పెద్దలిస్తే నేను ఏంతో చేయవలసిఉన్నదని గుర్తించాను. కవులతో బాగా సంబంధం కలుగజేసికొన్నాను. వందలకొలది రచయితలను గుర్తించాను. సంతసించాను. అందరి సహకారం అందుకున్నాను. నా పిల్లలు మేనల్లుళ్లు బంధువులు మిత్రులు అందరూ నాకు సహకరించారు. నా బంధువులు నిత్యమూ నాకు బంధువులు. సాహిత్యబంధువులు నన్ను ఉపయోగించుకొనండి. నాచేత ఇటువంటిపనులు చేయించండి. మాధవరామశర్మగారు నృత్తరత్నావళి ప్రసక్తి తెచ్చారు. సంతోషం ఆ గ్రంథమును శ్రీ మాధవరామశర్మగారు విశదంగా ఆంధ్రభాషలో వ్రాయాలని సభాముఖాన కోరుతున్నాను. ఆ పుస్తకాన్ని ముద్రించి లోకానికి అందించాలని ఉన్నది. శ్రీ శర్మగారు ఔచిత్య విచారచర్చ నాట్యవేదము మొదలయిన గ్రంథాలు చాలావ్రాశారు. వారి ఉపన్యాసంవలన మీకు స్పష్టమైఉంటుంది. ఈ గ్రంథాన్ని వారిచేత ఆంధ్రభాషలో వ్రాయించాలని అనుకున్నాను. వారు త్వరలో వ్రాయాలనికోరిక. నాకు గణపతిరుద్ర దేవుడన్నా జనకరాజర్షి అన్నా ఎంతో ఇష్టం. ఇంతమంది సాహిత్యపరులను చూస్తూఉంటే చాలా సంతోషం కలుగుతున్నది.

సభాసమాప్తిలో అధ్యక్షులు—ఈ వాల్లభ్యం పూర్వరంగం పూర్తిఅయింది. లోకం ఉపయోగించుకొనడము అవసరము—అన్నారు.

శ్రీ ముళ్లపూడి వేంకట్రాయుడు అన్యూనంగా లందరకు వందనసమర్పణం చేయుట—గ్రామాంతరమునుండి సభకు విచ్చేసినవారలందరకూ భోజనాలు ఏర్పరచినామని సూచించడము సాహితీవల్లభుల ఆంధ్రభోజుల హరిశ్చంద్రభావుల సముదాత్తమయినశీవికి సముచితంగా ఉంది. సభ సమాప్తమయింది. కాని జరగబోయే సభలకు ఇది సమారంభ సభ అని అనిపించింది—జగనణమన—సంతోషం కలిగింది. అస్తు—

జమ్మలమడక భవభూపతిశర్మ
M. Sc.

---

# సాహితీవాల్లభ్యము - అభిప్రాయము.

పేరుకుతగ్గ సాహితీకృషి ఈ వ్యాసావళి. ఆంధ్రభాష, సాహిత్యము, చరిత్రలు ఈ గ్రంథ వస్తువులు. వీటిపై సమగ్రమైన సమీక్ష తెలుగులో ఇంతవరకు వెలువడలేదు. బెంగాలీలోను, తమిళంలోను ఇట్టి బృహత్ప్రయత్నం జరిగిన సంగతి ఎరుగుదును. కాని తెలుగులో దీనికి పూనుకున్నవారు పెద్దలు తిమ్మరాజుగారే.

ఈ పూనికకు అన్నివిధాలా తగినవారు తిమ్మరాజుగారు. ఇటు సాహిత్యంలోను, అటు చరిత్రలోను అభిరుచి, అభిమానము ఉన్నవారు; రచయితల సహవాసానికి బాగా అలవాటు పడ్డవారు; భిన్నదృక్పథాలుగల రచయితలను ఒకవేదికమీదకు, ఒక కార్యక్షేత్రంలోకి తీసుకురాగల సంధానకర్తలు; వారిని ఆదరించి, ప్రోత్సహించి, నూతన రచనావ్యాసంగానికి పురిగొల్పగల రసజ్ఞులు; ఈనాటి ఆంధ్రసాహితీలోకానికి ఆత్మబంధువులు. అట్టి తిమ్మరాజుగారు సంకల్పించారు గనుకనే దీనికి రూపకల్పన అయింది.

ఆంధ్రసాహిత్యంపై ఇది ఒక విజ్ఞానకోశం; విజ్ఞానసర్వస్వం. నన్నయదగ్గరనుండి నేటివరకు నడచిన సాహిత్యకృషిపై, కాలక్రమంగా, ఈ సమీక్ష నడిచింది. ముందు వెనుకలు వెతకనక్కరలేకుండా, కాలాన్నిబట్టి వ్యాసక్రమంకూడా కూర్చబడ్డది. ప్రాచీన, మధ్యకాల, నవీనసాహిత్యాలచన్నిటినీ పరిశీలించి, పరిశోధించి, రచయితలు గ్రహించదగ్గ సమీక్షను ఆంధ్రపాఠకలోకానికి అందించారు. రెండవభాగంకూడా పూర్తి అయినప్పుడు, సాహితీవాల్లభ్యం, ఆంధ్రభాషపై సమగ్ర సమీక్ష కాగలదు.

తెలుగువారిలో చారిత్రదృష్టి స్వల్పం. తెలుగునాట అట్టిదృష్టిని నెలకొల్పడానికి శ్రమించిన కొద్దిమందిలో తిమ్మరాజుగారు. వీరు చరిత్రపై, విలువైన వ్యాసాలున్నవి ఈ సంపుటిలో.

వజ్రాలగనిలాంటిది ఈ గ్రంథం. ఒక్కొక్క వ్యాసం ఒక అమూల్యమైన కానుకను ఆంధ్రలోకానికి అందిస్తున్నది, దీనిని తెలుగువారు సద్వినియోగం చేసుకోగలరని ఆశిస్తాను.

ఆవుల సాంబశివరావు.

---

# సాహితీవావల్లభ్యము (ఆవిష్కరణోపన్యాసము)

ఈనాఁ డాంధ్రవాఙ్మయోద్యానము ననవరత సౌరభ్యసంపదల నోలలాడించు నొక నూత్న వ్యాససంపుటీ వల్లరి ప్రపంచమునకు ఆవిష్కరింపఁబడుచున్నది. ఈ యావిష్కరణ మహోత్సవము నాంధ్రప్రదేశ విద్యాశాఖామాత్యులు గౌ॥ శ్రీ పి. వి. నరసింహారావుగారు నిర్వహింపవలసియుండెను. అనివార్యకారణములచే వారు రాఁజాలనికతమున ఆ భాగ్యము నాకుఁ గలిగినది. తలవనితలంపుగా చేకూరు సమాగమము ఎక్కువ ఆనందకరమై యలరారునని ఒక సంస్కృతకవి చెప్పియుండెను. ఆ మాట నంఁదు ప్రియురాలితోడి సమాగమమును పురస్కరించుకొని చెప్పినను అది యొక్కొక్కప్పు డన్యసందర్భములకును అన్వయించుకు. తలవని తలంపుగా నీ యావిష్కరణమును నేను కావింపవలసివచ్చుట నా యదృష్టముగా భావించుచున్నాను. ఈమాట

నావిష్కరింపఁబడుచున్న ఈ యుద్గ్రంథము నుదాత్తతను దృష్టిలో నుంచుకొని చెప్పుచున్నాను, నిజముగా బహూభాషావేత్తలు, రసజ్ఞశేఖరులైన గౌ॥ శ్రీ మంత్రిగారే వచ్చి యీ గ్రంథము నావిష్కరించియుండిన నీనాటి యుత్సవము మఱింత శోభాయమానముగా నలరారియుండును. కాని యట్టి సన్నివేశము తిలకించి యానందించు భాగ్యము మనకు లేకపోయినది.

ఈ సాహితీవాల్లభ్యము నింత సర్వాంగ సుందరముగా, భావాభిరామముగా, తీర్చి దిద్దుటలో వాఙ్మయోద్యాన వల్లభులైన శ్రీ తిమ్మరాజు చౌదరిగారును, వారి సహచరులును ఎంత శ్రమపడి యుందురో నే నూహింపఁజాలుచున్నాను. ఇది యొక్కనిచే కాఁదగిన పనికాదు. పలుమంది విద్వద్విమర్శకుల సహకారముతోఁ గాదగినది. ఈ సాహిత్యవాల్లభ్యమున సుమారు నూటయెనుబది విమర్శవ్యాసములు సమకూర్పఁబడినవని వింటిని. అవి యేవో సాధారణ వ్యాసములు కావు. విమర్శన కౌశలమునకును, వైదుషీ వైభవమునకును నిలయములైనట్టివి. అట్టి వ్యాసములనన్నిటిని సేకరించుట యెంత క్లేశకరమైన కార్యమో నే నెఱుఁగుదును. తెలుఁగు భాషాసమితివారి భాషా సారస్వత సంపుటికి సంపాదకుఁడుగానున్న సమయమున అక్లేశము నాచే ననుభూతమైనది. ఏదైన వ్యాసమును వ్రాయవలెనని యెవ్వరైన నర్థించినప్పుడు పండితులు విమర్శకులు సహృదయభావముతో అట్లే వ్రాసిపంపెదమని చెప్పుదురు, వారియుద్దేశము సద్భావ సంపన్నమనుటలో సందేహము లేదు. కాని తరువాత నెన్నోయాటంకములు కలుగును. అందుచే వ్యాసము రచించి యన్నసమయమునకు పంపఁజాలకపోతిమే యని విచారించుచునే వారాలస్యము చేయుచుందురు. కొందఱతి కష్టముమీద పంపుదురు. కొందఱసలు వానిని పంపఁజాలకయేపోదురు. ఇట్టి పరిస్థితులలో శ్రీ తిమ్మరాజుగారిన్నివ్యాసముల నింతమంది విద్వద్విమర్శకులనుండి సంపాదింపఁగల్గుట వారి పట్టుదలను సాహిత్యవాల్లభ్యమునకును నిదర్శనమై నాకెంతో యాశ్చర్యము కలిగించుచున్నది.

గ్రంథకర్త యొక్కరేయైనచో వారిని ప్రార్థించియో బలవంతపెట్టియో ప్రాధేయపడియో వారిచే నా రచన పూర్తి చేయించవచ్చును. మఱి వ్యాసకర్తలసంఖ్య సుమారు రెండువందలైనప్పుడు వారందఱుచే సకాలమునకు వ్యాసములు వ్రాయించుట అసాధ్యమైన కార్యము. కాని శ్రీ తిమ్మరాజుగారట్టి అసాధ్యమైన కార్యమును తమ పట్టుదలచే సాధ్యముకావించినారు. వారేయూరైన నరుగునప్పుడు పనికట్టుకొని యందుండు కవిపండితులను కళాభిజ్ఞులను తప్పక దర్శింతురు. ఊరక దర్శించుటయేకాదు. వారిని ప్రోత్సహింతురు. వా[illegible]వింపవలసిన రచనలను సూచింతురు. రచన పూర్తియైనచో ముద్రింతుమని వాగ్దానము చేయుదురు. అట్లు కవిపండితుల యిండ్లకేగు శ్రీ తిమ్మరాజుగారిలో మనము చూచునది ధనసంపన్నుడైన యొక జమీందారునుగాదు; సరసహృదయుఁడైన యొక సాహితీవల్లభుని. అంతటివారి రాక యెవ్వరికైనా యానంద ప్రోత్సాహముల నొసంగుననుటలో సందేహము లేదు అట్లెన్నో మాఱులు వారు కవిపండితుల యిండ్లకరిగి వారి కానందోత్సాహములు కలిగించి యిన్ని ప్రశస్తములైన వ్యాసపారిజాతములను సంపాదింపఁగలిగినారు. వారు శ్రమపడినమాట నిజమే. కాని వారి శ్రమ యాంధ్రసరస్వతికొకయభినవాలంకారముగా, నాంధ్రసాహిత్య సేవకులకొక యమూల్యనిధానముగాఁ బరిణమించుటచే నానందప్రాయమే యగుచున్నది. "శ్రేయఃఫలేనహిపునర్నవతాం విధత్తే" యని కవికులగురువు కాళిదాసని యున్నాఁడుకదా.

శ్రీ తిమ్మరాజుగారికి సాహిత్యము, కళ, సంస్కృతి, ఆంధ్రచరిత్రయను వానియెడఁగల యభిమానము మేదురమైనది. నానావిషయములను గూర్చి కనఁబడిన విద్వాంసులతోనెల్ల చర్చింతురు. వారిచే గ్రంథములు వ్రాయింతురు. వ్రాయించి యాంధ్రవాణికపూర్వమైన యుపదగా నర్పింతురు, ఈ సాహిత్యవాల్లభ్యమున నాంధ్రసంస్కృత వాఙ్మయములకును, ఆంధ్రచరిత్ర సంస్కృతులకును, కళకును సంబంధించిన పెక్కు వ్యాసములున్నవి. అవియన్నియు నా యా రంగములో నాఱితేరిన పండితాగ్రగణ్యులచే వ్రాయఁబడినవి, ఉత్తమ విమర్శ వైశారద్యముతోడను, పరిశోధన పాటవముతోడను గూడిన యిన్ని వ్యాసముల కాలవాలమై సాహిత్యవాల్లభ్యమను నీ వ్యాససంపుటి యుత్తమమైన యొక ప్రమాణగ్రంథముగా సిద్ధమైనదనుటలో సందేహము లేదు,

కళాశాలతరగతులకు పాఠ్యగ్రంథములో నిర్ణయించునప్పుడు భాషాభావములం దుదాత్తములైన వ్యాససంపుటులు లభింపమిచే చాలకలఁత పడుచుందుము. ఈ సాహిత్యవాల్లభ్య మా లోపమును జాలవఱకు తీర్చివైచినది. ఇందలి పెక్కు వ్యాసములు విమర్శన పరిశోధన వైభవముతోఁ గూడి కళార్థులు మాటిమాటికిఁ జదువదగినవిగా నున్నవి. ఈ వ్యాససంపుటిని జూచి మనమానంద మొందుదుము. కాని ఇది యిట్టిరూపము దాల్చుటకు శ్రీ తిమ్మరాజుగారును, తత్పుత్రులును, సహచరులును పడినశ్రమ మనమాలోచించినఁగాని యవగతము కాదు. వారందఱును, ముఖ్యముగా శ్రీ తిమ్మరాజుగారును, భక్తిపూర్వకముగాఁ దనకుఁ గావించిన యీ యపూర్వ వరివస్యకు వాణీ యానంద తుందిలహృదయయై వారిపై ననవరత మాశీర్వర్షము కురియించును. ఇట్టి యుద్గ్రంథము నీ విధముగా రూపొందించినందుకు వీరినందఱిని హృదయపూర్వకముగా నభినందించుచు నేను దీని నానందమున నావిష్కరించుచున్నాను. ముక్కుతిమ్మనగారి పారిజాతమువలె నీ వ్యాసకుసుమమాలయు

"పరిమళము చెడదు, వాడదు
పరువముతప్పదు, పరాగభరభరితంబై
నిరతము జగదేకమనో
హరమై"

యలరారఁజాలును, అచిరకాలముననే సాహితీవాల్లభ్యము ద్వితీయసంపుటముకూడ ముద్రితమై యాంధ్రజనుల కరకమలముల నలంకరించుఁగాక యనియుఁ, బరమేశ్వరుఁడు శ్రీ తిమ్మరాజుచౌదరిగారి కాయురారోగ్యభాగ్యము లొసంగి వారిచే నింతో౽ధిక సారస్వతసేవ చేయించుఁగాకయనియు నాశించుచున్నాను.

దివాకర్ల వేంకటావధాని
**20-10-68**

# సాహితీవాల్లభ్య సముంన్మేషము

అవును! ఇది ఆవిష్కరణ మహాసభ. "నరేంద్రనాథసాహిత్యమండలి" సంస్థాపకులూ, ఆంధ్రభోజులూ, సాహితీవల్లభులూ, ఐన శ్రీ ముళ్లపూడి తిమ్మరాజమహోదయుల అరవై ఎనిమిదవ జన్మదినమహోత్సవం జరుగుతున్నది. ఈ శుభ సందర్భంలో "సాహితీవాల్లభ్య" మనే మహా గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్నారు.

మంగళవాద్యాలు మ్రోగుతున్నవి. వేద ప్రవచనాలు సాగుతున్నవి. నాదస్వర సంగీతాలు వీనులవిందు చేస్తున్నవి. సరస్వతీమూర్తులు ప్రసంగిస్తున్నారు. సభ్యులు సంతోషముతో కరతాళ ధ్వనులు చేస్తున్నారు. మహాసభ మానససరోవరం వికసించినట్లున్నది. నందనవనం నవ్వినట్లున్నది.

ఈ మహాహర్షంలో-ఈ ఆనందోత్కర్షంలో-ఈ పుష్పమాలికావర్షంలో—నాకొక మోహనాకారం కనిపించుతున్నది. ఒక అమరవాణి వినిపించుతున్నది. "ఏకో రసః కరుణ ఏవ" అనిపించుతున్నది.

ఆ కంఠం—ఆ కమ్మని కంఠం—ఆ కలకంఠ కంఠం—గగనమండలంలోనుంచి ఏమో ఆలపించుతున్నది—

నేను మీముందుమాత్రమే లేనుగాని
చూచుచున్నాను అనిమిషలోచనముల
నా ఋషీవాలి కీర్తి కన్యాకుమారి
తళుకులో కట్టుకొన్న అద్దాలమేడ.

ఎవరిదీ అమరకంఠం! ఎక్కడిదీ అమృత కంఠం! ఎచ్చటిదీ కరుణార్ద్ర కమనీయ కలకంఠ కంఠం!! అదిగో మళ్లీ వినపస్తున్నది.

ప్రియమైన నాన్నగారు! నా పేర మీరు
నాటినట్టి మనోజ్ఞ నందనవనంబు
ఆరపోసెను విజ్ఞాన సౌరభముల
నవనవోన్మేషమై దిగంతములనిండ.

ప్రియమయిన నాన్నగారు! నా పేర మీరు
వెలయఁజేసిన విజయమంగళ పతాక
ఎగురుచున్నది నవ్యాంధ్ర గగనవీధి
మందమలయ సమీరణ స్పందనముల.

గుర్తించాను. ఇది నరేంద్రుని కంఠస్వరం. గగనాంగణమునుండి సురేంద్రుని విమానములోనుంచి చూస్తూఉన్న నరేంద్రనాథుని కలకంఠకంఠమిది. అవును ఆ "అద్దాలమేడ" ఆ "మనోజ్ఞ నందనవనం" ఆ "విజయమంగళ పతాక" అదే మన "శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి" ఆ కరుణగానం ఇంకా సాగుతూనే ఉన్నది, ఆ తరుణకంఠం ఇంకా మ్రోగుతూనే ఉన్నది....

ప్రియమయిన నాన్నగారు! నా పేర మీరు
దిద్దితీర్చిన చలువరా దేవళంబు
పంచుచున్నది అగురుధూపముల నడుమ
సరసులకు సాహితీ సుప్రసాదములను.

ప్రియమయిన నాన్నగారు! నా పేర మీరు
తెలుగుదేశాని కెత్తిన తెలుఁగు దివ్వె

చిత్తముల నంధతమసంబు నొత్తిగించి
నింపుచుండెడి విజ్ఞాన కాంతిస్రవంతి.

ప్రియమయిన నాన్నగారు! నా పేర మీరు
సేకరించిన జీవనస్మృతి విపంచి
ప్రోగుచేసిన రమణీయ రాగవితతి
లలిత వాగ్దేవతా కరాంచలములందు.

నాయనా! నరేంద్రనాథ్! నీవు ధన్యుడవు! నిన్నుగన్న తల్లిదండ్రులు పరమ ధన్యులు! నాన్నగారు నీ నామాంకితంగా తమకు స్థాపించిన సరస సారస్వత సంస్థ "శ్రీ నరేంద్రనాథసాహిత్య మండలి" దినదినాభివృద్ధికరమై సుప్రసాదములు పంచుతూ ఉన్నది. వెలుగుదివ్వెయై విజ్ఞాన కాంతి ప్రసరణము చేస్తూ ఉన్నది. స్మృతి విపంచియై రమణీయ రాగములు ప్రయోగించుతూ ఉన్నది. సర్వలోకహితమైన సాహితీయాత్ర సాగించుతూ ఉన్నది. ఈ విజయప్రస్థానం ఇలాగే కలకాలము సాగాలని మా కాంక్ష. ఇదే పెద్దల ఆకాంక్ష. తథాస్తు!!

ఈ మహోత్సవం చూస్తుంటే నాకు రత్నావళిలోని ఈ శ్లోకం జ్ఞప్తికి వస్తున్నది—

"శ్రీహర్షోనిపుణఃకవిః పరిషదప్యేషాగుణగ్రాహిణీ
లోకేహారిచవత్సరాజచరితంనాట్యేషుదక్షావయమ్"

అవును! ఆంధ్రప్రదేశ హైకోర్టు న్యాయమూర్తులు ఆవుల సాంబశివరావుగారు అధ్యక్ష పీఠం అలంకరించారు. శ్రీ జమ్మలమడక మాధవ రామశర్మగారు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు మొదలైన విద్వన్మణులు ఉపన్యాసకులుగా విచ్చేశారు. బ్రహ్మశ్రీలు కొల్లూరి సోమశేఖరశాస్త్రిగారు, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, శ్రీ ఆంధ్ర శేషగిరి రావుగారు మొదలగు పండిత ప్రకాండులు సభామండపములో సమాసీనులైయున్నారు. సాహితీవల్లభుల సమ్మానసందర్భంగా సమావేశమైన ఈ రసజ్ఞ పరిషత్తుకు ధన్యవాదాలు సమర్పించుతున్నాను—

శ్రీ తిమ్మరాజుగారు లక్ష్మీపుత్రులు. విద్వన్మిత్రులు. సారస్వత ప్రోత్సాహకులు, ఉదార చరిత్రులు. "ఆంధ్రభోజులై" అనేకులైన కవి పండితులను ఆదరించి ఆశ్రయమిచ్చి కనకాభిషేకాలు చేశారు. "సాహితీవల్లభులై" అనేకకృతులను అక్షరరూపంలో ఆంధ్రులకు అందించారు.

శ్రీ తిమ్మరాజుగారి మాటలో మర్యాదలో మనస్సులో నిమ్మదనం ముమ్మూర్తులా కన్పించుతుంది. ఆయన ప్రథమ దర్శనంలోనే హృదయానికి ఒక విధమైన అనుభూతి కలుగుతుంది.

శ్రీ తిమ్మరాజుగారి వంశము సుప్రసిద్ధమైనది. సుప్రతిష్ఠితమైనది. శ్రీ తిమ్మరాజుగారి తండ్రిగారైన శ్రీ వేంకటరామయ్యగారు "అచ్చమైన రైతుబిడ్డ" అగ్రహారీకుడుగా, సంపన్నగృహస్థుగా ఉన్నా "పద్మపు మృదుహృదయం" కలవాడు. "[illegible]," పలుకు "వజ్రమయమైనా" భావం "అమృతమయంగా" అలరారినవాడు.

శ్రీ తిమ్మరాజుగారు అన్నివిధాలా తండ్రిగారికి తగిన కుమారుడు ఆయన "కర్మవీరు" డయితే ఈయన ధర్మవీరుడు.

శ్రీ తిమ్మరాజుగారి కుమారులైన శ్రీ హరిశ్చంద్రప్రసాద్‌గారు ఒక "విశిష్టవ్యక్తి. నిరాడంబరుడు నిర్మలహృదయుడు శాంతస్వభావుడు ఒక్కమాటలో "ధార్మికుడైన పారిశ్రామిక రాజకీయవేత్త."

శ్రీ హరిశ్చంద్రప్రసాద్‌గారి పుత్రుడు చిరంజీవి వేంకటరాయుడు. మధుర దర్శనుడు మధురభాషణుడు, మధురహృదయుడు. ముత్తాత గారి వ్యావసాయికరంగమూ, తాతగారి సాహితీ వ్యాసంగమూ తండ్రిగారి పారిశ్రామిక రాజ్యాంగమూ గంగా యమునా సరస్వతీ తరంగములై చిరంజీవి వేంకటరాయునితో త్రివేణిగా ప్రవహించాయి. వంశగౌరవాన్నీ జాతిగౌరవాన్నీ నిలబెట్టదగిన శుభలక్షణములన్నీ ఈ చిరంజీవిలో కేంద్రీకృతమైనాయి,

శ్రీ తిమ్మరాజుగారి వంశగౌరవాన్ని శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు, శ్రీ వేమల సూరిగారు, శ్రీ యర్రమిల్లి నరసింహారావుగారు హృద్యములైన గద్యపద్యములతో అనవద్యంగా చిత్రించారు. "సాహితీవాల్లభ్యం" ముఖపత్రాలలో.

శ్రీ "సాహితీవాల్లభ్యం" సారస్వత సముల్లసితమై సరస సాహితీసౌందర్య సంపన్నమై సహృదయ హృదయంగమమై అలరుతూ ఉన్నది.

ఎంతో వ్యయప్రయాసలకోర్చి శ్రీ తిమ్మరాజుగారు "సరస సారస్వత సర్వస్వాన్ని" ప్రకటించారు. ఎంతో శ్రద్ధతో సావధానతతో చాతుర్యముతో సంపాదకులు ఈ సముదాత్త సరస్వతీ స్వరూపాన్ని దిద్దితీర్చారు.

శ్రీ తిమ్మరాజుగారి సాహిత్యసేవ ఇంకా సర్వతోముఖమై పురోగమనం సాగించాలనీ వారి ఆస్థానంలో "గిరాందేవి" మంజుల మంజీర శింజితాలూ మణికంకణ నిక్వాణాలూ ఇంకా ఇంకా మార్మోగాలనీ ఆకాంక్షిస్తున్నాను.

— కరుణశ్రీ —

## కరుణశ్రీ శుభాకాంక్షలు

శారదాదేవి లోచనాంచలములందుఁ
జిందు నానందబాష్పంపుఁ జినుకు తునుక;
స్వామి నటరాజు చేతి సౌవర్ణఢక్క
ఢణఢణంఢణ ఢణఢణాంఢణుకు తణుకు,

## సరస్వతీ చతుర్ముఖుల సంవాదము

"పంచదారమాడ్కి భారతీ! నీమోవి
యింత తీయనైనదేమి నేఁడు?"
"స్వామి! తణుకు సభల "సాహితీవాల్లభ్య"
మధురసంబుగోలె నధరమందు."

# సా హి తీ వా ల్ల భ్య ము

సంగీతసాహిత్య శృంగార గంగా త
        రంగాంతరంగాలు పొంగులెత్తినలీల
చల్లచల్లని పాలవెల్లిలో జాబిల్లి
        మల్లెపువ్వులు మెల్లమెల్ల, జల్లినలీల
మందార కుందారవింద మాకంద మ
        రంద నిష్యంద మందందుఁ జిందినలీల
సోగ కన్నులరాణి రాగ రంజితపాణి
        వీణ తీవలు మునివ్రేళ్ళ మీటినలీల

"సాహితీవాల్లభ్య" సౌభాగ్య సంపదలు
సరససౌహార్దమ్ము సంతరించునుగాక !
"సాహితీవాల్లభ్య" సౌందర్య కిరణాలు
తెలుఁగుగుండెలఁ గ్రొత్తవెలుఁగు నింపునుగాక !

కరుణశ్రీ

## ఆ శీ స్సు లు

సింహాచల శ్రీనృసింహ సర్వాంగీణ
చారుచందన సారసౌరభములు
శేషగిరీశ్వర శ్రీ వేంకటేశ్వర
శుభ్రమందస్మిత విభ్రమములు
వరకాంచికాపురీ వరదరాజస్వామి
అక్షీణ దాక్షిణ్య వీక్షణములు
శ్రీరంగనాయక శ్రీరంగ మంగళ
వైజయంతీ కాంతి వైభవములు
శాంతపావన శ్రీమదనంతశయన
పద్మనాభప్రభు ప్రభాప్రాభవములు
శ్రీ జగన్నాథ దివ్య నీరాజనములు
కొల్లలగుగాక! సాహితీవల్లభులకు!

## సా హి తీ వ ల్ల భు లు

చల్లనిప్రొద్దుమీఁది; విరజాజులెగాని జపాప్రసూనముల్
చల్లనిచూపుమీఁది; సరసత్వము మైకొను శారదాభ్రమా
నల్లనిరూపుమీఁది; నయనప్రియమౌ భవదీయ "సాహితీ
వల్లభ" మూర్తి యొప్పు రసవత్కవితాంగణ చక్రవర్తివై!!

## శు భో ద య ము

మొల్లల్ పూచెను! మందమందపవనమ్ముల్ వీచె! సౌరభ్యముల్
కొల్లల్ కొల్లలు లేచె! తేనియల జల్లుల్ పెల్లుగాఁదోఁచె! వి
ద్వల్లోకమ్ము కరమ్ము సాచె! పరమోత్కర్షమ్మునన్, "సాహితీ
వాల్లభ్య" మ్ము పలభ్యమై యవతరింపన్ దెల్గు పూఁదోటలన్.

క రు ణ శ్రీ —

# సాహితీవాల్లభ్య సాహితీప్రభ

ఇట్టి గ్రంథములను నిబంధన గ్రంథము లని నేను భావింతును. చెదిరిపోయిన లోకమున వ్యవస్థను సంపాదించుటకు అభిజ్ఞులు ఇట్టివాని సంకలనము చేయుదురు. ఆంధ్రమున నిట్టివెన్నియో వచ్చినవి. అన్నియు నిట్లు వచ్చినవా? కొన్ని షష్టిపూర్తి ప్రకాశములు కలవు. మరికొన్ని సమ్మాన సంచికలు. మరికొన్ని వార్షిక ప్రకాశములు. విజ్ఞాన సర్వస్వగ్రంథము లిట్టివికలవు, ఇట్టివింకను కలవు. ఈ సాహితీవాల్లభ్యమునకు విశిష్టతకలదా! ఒక విధముగ కలదు. సాహితీ వల్లభునకు ఒక విశిష్టత యున్నది. ఆ విశిష్టత ఈ విశిష్టతకు హేతువు. పాఠకులు సంవిద్బలమున హృదయపాఠమును నవదరించుకొని సంతుష్టి పొందగలరు.

దీనిలో విషయవైవిధ్యమున్నది. ఉన్నను అనుగతియున్నది. ఇది వల్లభానుగతికి నిదర్శనము, ఇందుచరిత్ర సమీక్షణమున్నది. ఏల యుండదు? దీని వల్లభుడు చరితవల్లభుడు, ఇందు సాహిత్యశాస్త్ర పర్యాలోచనమున్నది. అది యట్లుండును. సాహిత్యలక్ష్య సమాలోచనమున్నది. అది యుండితీరును. శాస్త్రమున్నచో లక్ష్యము నుండును. ఈ సాహితీవల్లభుని చతుర్విధమయిన వైశిష్ట్యము దీనిలో చతుర్ముఖమై గోచరించును. ఈ సాహితీ వల్లభుడు మత్కృతి స్వీకర్త. నేనో కృతికర్తను. మా కనుగతమగు ఔచిత్యమున్నది. తదను సంధానముతో ఈ విచారచర్చయు ఉండవలయుట యుక్తము. ఏకవిధానబంధముగల విషయము లనేకములు దీనిలో సంగ్రథితము లయినవి. ఇట్టి వానిని ఏర్పికూర్చి పృథగ్గ్రంథముగ సంకలన మొనర్చినచో పునర్ముద్రణ మొనర్చినచో విద్యార్థు లయిన పరీక్షార్థులకు పాఠ్యార్థములు కావచ్చును. పరీక్షలలో లాక్షణిక గ్రంథము లక్ష్యాలోచనగ్రంథము ఆభిముఖ్యమున నుండుట యుక్తసంగతము. ఆ గ్రంథములవలన వచ్చునది ఆ యోగ్యతయితల కిచ్చునది అగుగావుత,

ధ్వన్యాలోక లోచనము దీనిలో నాలోచితమయినది. లోచనమున సమాలోచన మిచ్చినవాడు శ్రీమాన్ అభినవుడు చిరస్మరణీయుడు. నాకాతడనినచో సర్వమభినవముగనే గోచరించును. నేనే ఇంటిలోనున్నను ఆ ఇల్లు నాకు అభినవభారతి అగును. నాట్యవేదము ఆంధ్రమున వ్రాసి అభినవభాష్యమని నేను పేరెన్నిక చేసికొంటిని. ఆనందవర్ధనుని ధ్వన్యాలోకమును ధ్వనిసారమును నేననువదించితినికదా ముద్రితము కాకున్నను సంస్కృత భాషాత్మకమయిన నా సహృదయలోకలోచనము నన్ను కావ్యాలోకలోచనము ఆనందాభినవునే చేయునని నాలో నేననుకొందును. సాహిత్య విశ్వమున అభినవుడభినవుడే. ఆతని సిద్ధాంతము అప్రతిక్షేప్యము. కావ్యప్రపంచమునఅభినవసిద్ధాంత సమన్వయ మావశ్యము, సంస్కృత కావ్యములను అభినవలోచనమున చూడవలసియున్నది, అట్లే ఆంధ్రప్రపంచములోని కావ్యప్రపంచమును చూడవలయునని చూపుకలవారనవలసియున్నది. ఒక ప్పడకాదమిలో నేనిట్లే సూచించితిని. తన్ముఖ

సమాలోచన మావశ్యకమని యంటిని. అర్ధజరతీ న్యాయము సముచితము కాదు. ధ్వనితత్వ సమన్వయము సముచితము. ఈ యంశముననే ధ్వని భాష్య మనతగిన రసగంగాధరమను తెనుగుసేతలో సూచించితిని.

వక్రోక్తి జీవితముపై నింకొక విశిష్టరచన యున్నది. నేను దీని వాంధ్రమున వ్రాసితిని. ఎప్పుడేని ముద్రితము కావచ్చును. ఇది ధ్వనికి రూపాంతరము ఉక్తి చిత్రత ఇందలి విశిష్టత. దీని రచయిత కుంతకుడు సహృదయమ్మన్యుడని మహిమ భట్టనవలసియనెను. నా అముద్రిత వక్రోక్తి జీవితమును అటుగా ఇటుగా చూచి వేలూరి శివరామశాస్త్రి ఇట్లనెను. "నీవు వక్రోక్తిని చూచి చూచి నీవిట్టి భాష కలవడితివి. నీ భాషకు అనసూయులోకము అలవడుగావుత" ఏమో! శ్రీనాథుడు వక్రోక్తి అనెను. ఎట్టనకు వక్రోక్తి కలచనుచున్నారు. వారలకు ఈ వక్రోక్తి తెలియునా? వారలకు ఈ వక్రోక్తి తెలియునన్నచో వారిని నేనేమో యనినట్లగును. వీరి వీరి వక్రోక్తిని అవక్రముగ సమీక్షించువారు సమీక్షితులు కాగలరు. వక్రోక్తి అతిశయోక్తియే యనును, ఈ యతిశయోక్తి స్వరూప వివేకమును అభినవుడే చెప్పవలెను. రసభావ నిరపేక్షమయిన కావ్య సమయమని అనుట సహృదయవచనము కాదు, రసభావ పరత్వము నునుండుటను అభినవ నిర్వచనముగా గుర్తింప వలసియుండును. రమణీయమగు వక్రోక్తి జీవితము సుప్రకాశమై లోకమున కందినచో లోకము సాహితీభాష కలవడగలదు, ధ్వనికారుని వ్యంజక భేదములన్నియు ఇందు వక్రోక్తి భేదములయి కూరుచున్నవి. సంస్కృత భాషలో వ్యంజక పదములకు పరిష్కారమున్నది, తెనుగులో అది కుదురుకొనలేదు. ఎప్పుడు కుదురు కొనునో మనము మన సాహితీకల్పవృక్షములకు ఎప్పుడు కుదురు కట్టుకొనగలమో ఎప్పుడు చెప్పుదుము? ఎవరు చెప్పుదురు? నాకు నైరాశ్యము లేదు.

వ్యక్తి వివేకమును గూర్చిన వేరొక రచన యున్నది. అది ధ్వని ధ్వంసనాత్మకమయిన వ్యక్తివివేకమును సంబంధించిన రచన భట్టనాయకుడొకడు ఇట్టిపనికై హృదయదర్పణమన్న గ్రంథమును వ్రాసెను. దానిని మనమిప్పుడు చూడము. మహిముడు చూడగలిగియు చూడనేలేదట. అదిధ భావన భోగీకృతి భట్టనాయకుని వ్యాపారములు వానిపై మహిమున కాదరములేదా? అది సమాలోచనార్హము. గొప్పవారితో విరోధించుటకు గొప్పతనమిచ్చునని ఆంగ్లభాషలో సామెతయున్నదట. ఎప్పటివాడో అయిన మహిముడే "మహతాం సంస్తవఏవ గౌరవాయ" అనినాడు. అంతటి ధ్వన్యాలోకమును ఖండించుటకు నీవేల పూనుకొంటివి. అని ఎవరో అనగా, "నాకును ధ్వని ఇష్టమే. అయినను ఇట్లుచేసి చూచినచో ప్రసిద్ధుండునో అని భావించితిని." అని మహిముడనెనాటడ. ఇట్లనగలవా రెందరుందురు? అంతవరకు మహిమభట్టులుకారు. మహిముని వాదరి అభినందనీయము. ఆతని దోషవిమర్శనము ముహుర్ముహుర్భావనీయము. మమ్మట రుయ్యకులు కటాక్షము వేసిరేకాని మహిముని వివేకమును గ్రహింగి దాచిరి. కాళిదాసాదులకును దోషములుకలవు. ఇంతటిమాట ఎవడనగలడు? మహిముడే యనగలడు. మహిముని చదివిన వాడనగలడు గాని అట్లనగలిగినవానిని ఏమియు అనలేనివారుకూడ అనగలుగుటకు యత్నింతురు.

నృత్తరత్నావళి యొక రచనయున్నది. ఇది యిప్పటికి ముద్రితమైనది. ఎప్పుడో ముద్రితమయినను ఇప్పటికి ప్రకాశితమయినది. ఈ గ్రంథమాంధ్రమున అనూదితమై సుప్రకాశితము కావలెననిసాహితీవల్లభుని యాకాంక్ష. అది యీనాటిది

కాదు. ఆనాటినుండియు నున్నది. నేనీ మాటలు పలుకునపుడు శ్రీమాన్ సాహితీవల్లభ ఏమో అన జూచుచున్నట్లున్నది. అనుగావుత. దీని ఆంధ్రాను వా[illegible]న మొనరించుగావుత. గుంటూరు మండలములోని చేబ్రోలు కమ్మప్రభువులు ఈ రత్నావళి విశేషము గుర్తించిరి. శిల్పము[illegible] నానా భంగిమలున్నవి. ఒకదాని కొకదాని కేమిసంబంధము? ఆ సంబంధము గుర్తించుట కెట్టిభావ సంబంధము కావలెను, ఈ గ్రంధ సంబంధము అదియంతయు సూచింపగలదు. నృత్తమహార్ధ మెంతటిదో దీనిలో గుర్తింపవచ్చును. నృత్యములో నాట్యములో నృత్త మనుగతమయి యున్నది. కరణములు అంగహారములు పిండీబంధములు రేచకములు దేశీపద్ధతులు ఎన్నికలవో మనకేమితెలియును? జాయసేనాపతికే తెలియును. ఆ జాయ శ్లోకానుకారమున లోకమున నాట్యప్రయోగ మొనరించుట నవశ్యప్తి నీయగలదు. ఒకప్పుడు కొందరు నృత్తప్రతిమాల ప్రయోగించెడివారు. రెండుగడియలు చేయతగిన నృత్తప్రయోగమున అయిదారుగురు నర్తకీమణులుండి ఒకరు కొంత మరియొకరు మఱికొంత చేయుదురు. ఒకరిచేతకు తరువాయి మఱియొకరు చేతురు. ఇది నృత్తప్రతిమాల. బృందరీతి ప్రయోగములలో జాయసేనాని సూచించినాడు. నృత్తరత్నావళి నుద్దేశించిన నా విశిష్ట రచనను మరికొన్ని పుటలలో పాఠకులు చూచుట కవకాశమున్నది.

అలంకారసుధానిధి మరియొక్క రచన. మాధవసాయణ భోగనాథులు సోదరులు. ఈ గ్రంథము వారి సంబంధముకలదని మొదటిమాట. తత్సంబంధము లేనిదని రెండవమాట. ఆగ్రంధము ముద్రితమయి అందలేదు. ఏమిచేయుదుము? ఎవరో వ్రాసిరట. అప్పటి ప్రభుహస్తమేమేని యుండునా? ముద్రితమయి యుండునేని పరిశీలింతము. భోజరాజు శృంగార ప్రకాశము వ్రాసెను. అది దక్షిణదేశముననే వ్యాపించినది. ఇన్నాళ్ల కిన్నాళ్లకుగా కొన్నిసంవత్సరముల క్రిందటనే అది లభించినది. దాని దీని సంవాదమున చెప్పవలసిన మాటలుండును. ఇన్నిదినములలో శృంగారప్రకాశములోని కొన్ని ప్రకాశభాగములను తెనుగునవ్రాసి లోకమున కందింప దలచితిని. ఆంధ్రభోజా! ఇది భోజరాజ గ్రంధము. సాహితీభోజులకు కావలసిన గ్రంధము.

పండితరాయల లఘుకావ్యముల బరిశీలనాత్మకమయిన యొకరచన మిందున్నది. తెలుగునాట రసగంగాధరము వ్యాపించుటకు మా రాయడు శాస్త్రి శ్రద్ధహేతువు. నేను రసగంగాధరము వ్రాయుటకు రాయడు పాదశ్రద్ధ హేతువు. పండితరాయల కృతుల విశేషములు లోకమున కందలేదు. అవియందినకానీ కమనీయకవిత రాదు. కుతుకమున కావ్యమీమాంస రచించితినని యాతడనినాడు. అతని మీమాంస లఘుకృతులలో సంక్లిష్టమయినది. కవులు సావధానముగా భావింపవలసియుండును.

సోమపీథి రత్నాపణము దీనిలో పరామృష్టమయినది. రతి యొక్కటి నిమిత్తభేధమున శృంగారాది రసరూపముపొంది అందరి నానందింపచేయుటను చెప్పిన సోమపీథి సహజ పూర్ణరసోస్మిసోహం అనినాడు. సర్వరసముల నంగీకరించిన విద్యానాధుని గ్రంధవ్యాఖ్యాతగా భోజదేవుని శృంగార కైవల్యమును ఈ సోమపీథి యందుకొనినాడే. ఇందేమోయున్నది. విధ్యాధరుని ఏకావళి యను సాహిత్యశాస్త్ర గ్రంధమునకు ఈతని తండ్రి మల్లినాధుడు తరళమని వ్యాఖ్యానము వ్రాసెను. అందలి మతము వేరు ఇందలి మతము వేరు. విద్యాధర విద్యానాధులకు భావభేదమున్నది. మల్లినాధకుమారస్వాములకు అట్టిదికలదా? నేను

కుమారాస్వామిసోమపీఠి రత్నాపణవ్యాఖ్యా విశేష ములనన్నిటిని కవియకలిపి ప్రతాపరుద్రీయ మును వ్రాసి ప్రకటించితిని. చల్లపల్లి ప్రభువు తత్కృతి స్వీకారమున విశిష్టతను చూపెను. మరల నది ముద్రితమై తన విశిష్టతను చూప గలదు. మల్లినాథ వ్యాఖ్యాన వైభవములు రచ నయందున్నది. మల్లినాథుని కావ్యవ్యాఖ్యాన ములలో అలంకారశాస్త్రగ్రంథ వ్యాఖ్యావిశేష ములు సుగతమైయున్నవా? నేను రచించిన ఏకా వళి గ్రంథములో ఈ యంశములు స్పష్టములు కావచ్చును. మల్లినాథుని మనము సావధానముగా సమీక్షింప వలసియున్నది. ఈనాడు కొందరు ఔత్తరాహులు, దాక్షిణాత్యులు మల్లినాథుని వ్యాఖ్యా దోషములను పేరిట కొన్నిమాటలనుచున్నారు. అన్నవారిని మనవారును వినుచున్నారు.

సర్వజ్ఞ రసార్ణవసుధాకరము మరియొక రచనగలదు. అది యనూదితమై భావగోచరమయి నది. సర్వవిషయక్రోడీకారమున నిది యుపా దేయగ్రంథము. రచయిత సర్వజ్ఞ సింహభూపా లుడు. భోజదేవుని శృంగార ప్రకాశమున లేనివి లేవు. సంధ్యంతరములను సర్వజ్ఞుడంగీకరింప లేదు. భోజు డంగీకరించెను. మహాకావ్యమున నాలుగు చతుష్షష్టులుండునని భోజుడని సంధ్యంత రముల యవశ్యాంగీకార్యతను సూచించినాడు. సర్వజ్ఞవిషయమున తెలియదగినవి చాలకలదు. సంగీతరత్నాకర గ్రంథమునకు సర్వజ్ఞుడు మంచి వ్యాఖ్యానము రచించెను. దాని నడయారు ముద్రిం చినది. లోకహృదయము ముద్రించుకొనలేదు. రసార్ణవసుధాకర విషయమున విషయ ప్రధాన మయిన నా రచన అన్యత్ర యిట్టి సంకలన నిబం ధన గ్రంథమున ముద్రితము కావచ్చును. అట్లే సంగీతరత్నాకర వ్యాఖ్యాభిఖ్యా ప్రకాశము కూడ నావంతుగా వేసికొంటిని. సంగీతవిదులకు సాహితీ వాసన యుండదు. సాహితీవిదులు సంగీత శత్రు వులుగా నుందురు. కొందరు విశిష్టులటు నిటు చూచుకొందురు. ఆంధ్రభోజా! మీ చూపు మీ ఊపు మీ కాపు మీ ప్రాపు సర్వతోదృష్టి నిచ్చు గావుత. గాయత్రీమంత్రమునుండి సప్తస్వరము లావిర్భవించినవని యభినవగుప్తుడనెను. సర్వజ్ఞు డా యంశమును విస్తరించి చూపుటను మనము చూపుగలవారమై చూచెదము,

విద్యానాథునిపై రచన భావనీయము. ఆంధ్రదీపికది సహకారి. వారి గ్రంథము నా గ్రంథము సాహితీభోజుల కుపకారి. శ్రీ చల్లపల్లి ప్రభువు శ్రీ శివరామాలంకారముగా ఆంధ్రప్రతాప రుద్రీయమును నేను ముక్త్యాలలో కృతిసమర్పణ మొనరించు నపుడు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి నన్ను గట్టిగా కౌగలించుకొని "నవవిద్యానాథా!" అని సంబోధించి ప్రభువులకును సంతోషము కలి గించిరి. అదియొక చమత్కారచంద్రికగా రాణించి నది. ఎప్పుడు ప్రకాశించునో? ఉత్తర దక్షిణ వ్యక్తులు విద్యానాథుని లక్షణ పరిష్కారములను వాదమునకు ఖండించిరి. కాని యది యంతట పాతపద్ధతిలో నున్నది. ఆంధ్రమున వచ్చిన అలంకారగ్రంథములు కొన్ని విద్యానాథుని సాహి త్యనాథునిగ భావించినవి.

నేనీ పరిమిత సమయమున మితముగ భాషింతును. అకాడమి సాహిత్య పదకోశము నిర్మాణింపనున్నది. ఇందలి కతిపయ భావము అందు నుపాదేయములు కాగలవు. ఆంధ్రులు రచించిన సంస్కృతభాషాగతములగు అలంకార శాస్త్ర గ్రంథములను సమీక్షాయణులు పరీక్షించి ప్రాచ్యవిద్యేశ్వరులు P. H. D. కావచ్చును. ఆంధ్రమున వెలసిన ప్రాచీన సాహిత్య లక్షణ గ్రంథములనట్లే భావింపవలసియున్నది. ఇంతటి సాహితీ వ్యవసాయమునకు నవకాలమున వెలసిన అస్మాదృశుల సాహిత్యలాక్షణిక గ్రంథములను

సమీక్షించి ఎందరేని P. H. D. లు కావచ్చును. ఇట్టి యింతటి సమీక్షాపరీక్ష మాధృశులు రచించుచున్న రచింపబోవు గ్రంథముల సంభావనాచాతుర్యమున కుపకరింవగలదు. ఇంతటి యీ మహా సంభావనమునకు ఈ సాహితీవల్లభ సాహితీవాల్లభ్యలభ్య సాహితి సహకరించును. సర్వసహకారము సాహితీ వాల్లభ్యము. ఈ సాహితీ వాల్లభ్యమున నంతట సాహితీవల్లభ స్వభావ సౌందర్యము గోచరించుచున్నది. ఇంకను లోకమున గోచరింవగలదు. అస్తు

సాహితీతాపసస్యాయం
వాగ్విన్యాసోమమాదరాత్
సాహితీవల్లభస్యే దం
సదఃకుర్యాన్ముదాన్వితం.

జమ్మలమడక మాధవరామశర్మ
అభినవభారతి—గుంటూరు.

---

# సంస్కృత సాహిత్య వ్యాస సమీక్ష

శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ

ఈ సాహితీవాల్లభ్యంలో ప్రకటింపబడ్డ సంస్కృత సాహిత్యానికి సంబంధించిన వ్యాసాల్ని మాత్రం నేను యత్కించిత్తు సమీక్షించడానికి యత్నిస్తాను.

లోకంలో సాహిత్యంపేరుతో పిలువబడే గ్రంథాలు అనంతంగానేవున్నా శాశ్వతంగా నిలిచి యుండే గ్రంథాలు కొన్నిమాత్రమే. ఆ గ్రంథాలు అల్లాగ శాశ్వతత్వం సంపాదించడానికి వానిలో నుండే గుణవిశేషాలే కారణం. కలకాలం నిలిచి యుండే విషయాలు, శాశ్వతంగా నిలిచే భాషాచమత్కారాలు కొన్నిమాత్రమే వుంటాయి. కొన్ని తాత్కాలింగా బాగానేవున్నట్లు కన్పడినా అవి చిర కాలం నిలిచివుండడంలేదు.

సంస్కృత సాహిత్యంలో వ్యాసవాల్మీకి కృతాలైన భారత భాగవత రామాయణాలు, భాస కాళిదాస భవభూతి ప్రభృతుల కావ్యనాటకాలు అనేక శతాబ్దులక్రితం రచింపబడినా నేటికీ అవి నిలిచివున్నాయంటే వానిలోని విషయవైశిష్ట్యం, రచనావిశేషం, భాషాచమత్కారం అట్లాంటి వన్న మాట. ఆ యా విశేషాలేవిటో చెప్పేవ్యాసాల్ని వ్రాయించి ఏకత్ర సంకలనం చెయ్యడంవల్ల ఈ సాహితీవాల్లభ్యమూ, సాహితీవల్లభులు శ్రీ తిమ్మరాజుగారూకూడా ఈ గ్రంథాలున్నంతకాలం నిలిచి వుంటారు. వ్యాసవాల్మీకి భాసకాళిదాసాదుల గ్రంథాలను దాచిపెట్టుకొనేవా రందఱూ ఈ సాహితీ వాల్లభ్య సంపుటాలనూ దాచిపెట్టుకుంటారు. కొన్ని వ్యాసాలు పత్రికల్లో అప్పుడప్పుడు ప్రకటింపబడుతూవున్నా ఈ రకం వ్యాసాల్ని సంకలనం చేసిపెట్టిన బృహద్గ్రంథం ఇదిగాక తెలుగులో ఇంకోటిలేదు. ఈ విధంగా శ్రీ తిమ్మరాజుగారు అజరామరకీర్తిని సంపాదించుకుంటూన్నారు. వారు ప్రకటించదలచుకొన్న సంపుటాల్లో ఇది మొదటిది ఇప్పుడు ప్రకటితమైంది. రెండవదానికి జరిగిన విషయ సేకరణకూడ ఇందులో ప్రకటితమయింది. ఇంకా ఇలాంటివి ఎన్నో సంపుటాలు ప్రకటించాలనే కుతూహలంతోనే ఈ ప్రయత్నం జరుగుతూంది.

శాస్త్రం, సంస్కారం, మతం, భాష (తెలుగు, సంస్కృత) చరిత్ర; ఇన్నిటికీ సంబంధించి, శాశ్వతత్వాన్ని నిలువరించుకోదగ్గ ఎన్నో వ్యాసాలు ఇందులో ప్రకటింపబడడంలో శ్రీ తిమ్మరాజుగారికి ఇన్నిటిపైని ఎంతటి ఆసక్తి వుందో తెలుస్తూంది. వీనిలో ఏ ఒక్క విభాగమైనా చాలు వారిని శాశ్వతంగా నిలపడానికి. అన్నిటినీ వారు సమానంగానే అభిమానిస్తూండడం వారి సర్వతోముఖమైన సాహితీవాల్లభ్యానికి నిదర్శనం. సర్వవిధ సాహిత్యమందూ వారికున్న వాల్లభ్యానికి అక్షర రూపమిచ్చిన ప్రయత్నమే ఈ సాహితీ వాల్లభ్యం.

సంస్కృతసాహిత్య గ్రంథాలపైని పదిహేను వ్యాసాలు ఇందు ప్రకటింపబడ్డాయి. అవి 2, 3, 4, 5, 6, 8. 9, 13, 14, 15, 16, 26,

35, 46, 49 విషయసంఖ్యగల వ్యాసాలు, అన్ని వ్యాసాలు కలగాపులగంలాగ కలబోసివుండడంవల్ల విభాగ నిర్ణయంకోసం పై వ్యాస సంఖ్యలు చూప బడ్డాయి. ఇహ పై వ్యాసాలవైశిష్ట్యం సమీక్షిస్తాను.

ఇందు రెండవవ్యాసం 'రామాయణ రామణీయకం'. రచయిత శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ఇందు ఆదికవిలోని కవితాశిల్పం ఎట్లు తీర్చ బడిందో సవివరంగా తెలుపబడింది. దాంపత్య శిల్పానికి వారు చూపిన తీరు చూడండి!

'రామాయణమున సీతారాములుగాక మఱి మూడు దాంపత్యాలున్నవి. 1 దశరథుడు—భార్యలు 2 వాలి—తార 3 రావణుడు—మండోదరి.

దశరథుడు కౌసల్యను ప్రేమింపలేదు. దయ చూపెను. సుమిత్ర తటస్థురాలు. కైకేయిని చెప్పలేనంత ప్రేమించి తిరుగులేని దెబ్బతినెను. వాలి తారనెంత ప్రేమించినను ఆమెమాటయందు విశ్వాసముంచలేదు. ఆమె మాటను తిరస్కరించి మరణించెను.

రావణుడు మండోదరిని ప్రేమించనట్లు ఎక్కడను లేదు. ఆమె సీతతో సమానమైన సౌందర్యశాలిని. కాని రావణుడొక కామదవాస లము. అది సర్వ స్త్రీ వనమును చుట్టబెట్టనిదే శాంతింపదు. తుదకు ఆ వ్యసనమే ఆతనిని దహించివైచెను. పై మూడు దాంపత్యములతో చూచినప్పుడు సీతారాముల దాంపత్యము విలక్షణ ముగా మెరయుచు కాన్పించును.

తండ్రిచేసిన సంబంధమని రాముడు సీతను ప్రేమించెను. ఆ పిమ్మట సద్గుణ సౌందర్యముల వలన ఆతనిప్రేమ మఱింత అతిశయించెను.

అరణ్యగమనమునకు సీత ఎంత వేడు కొన్నను రాముడు వద్దనెను. అందులకు కుపితయై 'కింత్వామన్యతవై దేహః పితామేమిథిలాధిపః రామ జామాతరంప్రాప్య స్త్రియంపురుషవిగ్రహమ్ం ఈ దూషణమును నవ్వుచు స్వీకరింపగల్గిన సీతయొక్క భర్తయే భర్త. యుద్ధానంతరమున ఆతడామెను తీవ్రముగనే దూషించెను. ఆమె భరించి అగ్ని పరీక్షకు నిలచెను.

మూడు దాంపత్యాలలోను లోటుపాట్లు చూపించి సీతారాములలో విశిష్టదాంపత్యం నిరూ పించాడు ఆదికవి'. ఈ విధంగా శ్రీ ఇంద్రగంటి వాల్మీకి శిల్పసౌందర్యాలను ఎన్నో చూపి రామా యణంలోని రామణీయకాన్ని బహిర్గతం చేసిన తీరు మెచ్చుకోదగివుంది.

మూడవవ్యాసం 'శ్రీ మహాభారతనాయకుడు' రచయిత కేతవరపు వేంకటరామకోటేశ్వరశాస్త్రి.

భారతంలో నాయకుడెవరో నిర్ణయించడం చాల కష్టతరమైనపని. భారతంలో నాయకుడు శ్రీకృష్ణుడా, అర్జునుడా, ధర్మరాజా! ఎవరని అంటారు! దీనికి శ్రీ శాస్త్రిగారి సమాధానం చూడండి!

'భారతానికి కార్ష్ణవేదమని ప్రసిద్ధి. కృష్ణ సంబంధమైనది కానకార్ష్ణము. వ్యాసునకు కృష్ణ ద్వైపాయనుడనిపేరు. కృష్ణవేదమును వ్రాసిన వాడు కనుక కృష్ణద్వైపాయనుడైనాడు. భారతము నకు పంచమవేదమనే గౌరవమే యే విషయముల కలిమిని వచ్చినదో ఆ యా విషయములు కొంతలో శ్రీకృష్ణుని సంబంధము కలిగియున్నవి. ఈ కార ణముచే కృష్ణుడు భారత నాయకుడనుకొనవచ్చు. అంతమాత్రంచేతనే కృష్ణుడు నాయకుడుకాడు. ఫలప్రాప్తిపొందినవాడే నాయకుడు.

భారతయుద్ధమంతయు అర్జునునిమీదుగానే పోయినది. ఆతని మనుమనికి ఆ తరువాత ఆతని సంతతివారికే ఆ యుద్ధ ఫలముగావచ్చిన రాజ్యము

దక్కినది. అందుచేత అర్జునుడు నాయకుడు కావచ్చు. అయినను కర్మఫలము అర్జునునకు ప్రత్యక్షముగా చూపబడలేదు. కాన ఆతడును నాయకుడు కాడు.

'సర్వమును ఫలప్రాప్తి పర్యంతము ఎవరి వలననడుచునో ఆతడునాయకుఁడనబడును.' 'అని భరతాచార్యుల నిర్వచనము. మొదటినుండియు చివరివరకు భారతమున సర్వధర్మ ముధర్మజునకుచుట్టుకొన్నది. ఎవరేమిచేసినను అదిఅంతయు ధర్మరాజుకేచేసిరి. సర్వానుభవము ధర్మరాజుకే కాని మరొకరికికాదు. అందు మన భారతేతిహాసమున నాయకుడు కృష్ణుఁడుగాని, అర్జునుడుకాని కాక ధర్మరాజే యగుచున్నాడు,' బేష్ అనిపించేసమర్థము.

నాల్గవవ్యాసం భాసమహాకవిగూర్చి డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించినది. కాళిదాసుచే గౌరవ పురస్సరంగా స్మరింపబడినవాడు భాసుడు. భాసుని నాటక రచనావిధానముతో ఇతర నాటకరచనావిధానములకు పోలికలు, విలక్షణతలు, ఇందున సోదాహరణంబుగా చూపబడాయి. భాసుని ప్రధాన నాటకమైన స్వప్నవాసవదత్తలోని విశేషాంశాలెన్నో, అభినవగుప్త శారదాతనయులచే చెప్పబడిన వెన్నో ఇందు వివరింపబడాయి. 'నేడు వాడుకలోనున్న ఏకాంకిక నాటకాలకు మూలపురుషుడు భాసుడు. మధ్యమవ్యాయోగ, దూతవాక్య దూత ఘటోత్కచ కర్ణభారాలు భాసుని ఏకాంకికలు. ప్రతిమా స్వప్ననాటకాలు పరిపూర్ణతనందిన కళాఖండాలు. ఇతివృత్తములకొఱకు భాసుడు ఇతిహాసములు పురాణములేకాక జానపదగాథలను పరిశీలించాడు. ప్రతిమానాటకంలో నాటకశిల్పం చక్కగాపోషింపబడినది. వినోదమునకు తెచ్చిన వల్కలములుఅరణ్యవాసా నికుపయోగపడ్డాయి.

కైకేయి పదునాలుగురోజులనబోయి సంవత్సరాలన్నదని, దశరథునిచే శాపఫలం అనుభవింపజేయడానికి రామ వనవాసంతో రామమరణం నివారింపబడిందని సహేతుకంగా నిరూపించి కైకమీద మనం అంతా ఆలోపించే లోపాలు ఇందులో సర్దివేయటం జరిగింది. స్వప్నవాసవదత్త మహానాటకాలలో ఒకటి. ఉచితములైన పదజాలముతో సంభాషణలు చక్కగా దొర్లిపోయి సంస్కృతము జీవద్భాషగానున్నట్లు భాసనాటకములవలన మనకు బోధపడుతుంది, ప్రతిపాత్రకు వ్యక్తిత్వము ప్రస్ఫుటముగా నున్నది. ఇలాంటి నాటకశిల్పము అద్వితీయము.' ఈ విధంగా సువిమర్శతో సాగింది కేతవరపువారి రచన.

భాసుఁడు వ్రాసినరీతిగా ఆ నాటకాలు మనకు లభించుటలేదని నేఁడు భాసనాటకములని ప్రచురింపబడినవానిలో కనుపించని నాటక సన్నివేశములను శారదాతనయుడు భావప్రకాశ గ్రంథములో భాసునివిగా ఉదాహరణముల తెచ్చిన వానిని శ్రీ శాస్త్రిగారి వ్యాసమున ప్రదర్శించి చూపుట వారి బహుగ్రంథ ద్రష్టృతకు సాక్ష్యముగా నున్నది. చిన్నదైన ఈ వ్యాసము మిన్నగానే యున్నది.

ఐదవ వ్యాసం శ్రీ వాసిరెడ్డి వేంకటసుబ్బయ్యగారి 'హాలకవితాహేల'. రెండువేలసంవత్సరముల క్రితము శకప్రవర్తకుడు శాలివాహనుఁడు హాలుఁడు ప్రాకృతభాషయందు 'గాథాకోశము' రచించెను. సభ్యతాచ్ఛాయకూడ ప్రసరింపని ఆ కాలమున అనిదంపూర్వమగు ధ్వనికావ్యమది. మానవహృదయ గతములగు రహస్యభావములచే కావ్యమొక మహాభాగ్యమని, సంస్కృత మహాకవులుగూడ ఈ హాలకవిగాథలను పఠించియే కావ్యములు రచించుకొనిరని, హిందీమహాకవి బిహారీ హాలగాథల ననుసరించియే 'బిహారి సత్సయీ' కావ్యము రచించుకొనెనని శ్రీ వాసిరెడ్డివారు ఇందు బహూదాహరణలతో నిరూపించి

హాలునిలోని కవితాహేలకు ప్రదర్శించినారు. హాల కవిత్వాలలోని చమత్కారములు కోకొల్లలుగా ఇందుదహరింప బడ్డాయి. తెలుగు అనువాద పద్యాలను ఉదహరించి పాఠకులకు అర్థం సుగమం అయ్యేటట్లు చెయ్యడం ఈ విమర్శలో ప్రత్యేకవిశేషం. ధరణీసామ్రాజ్యంతోపాటు కవితాసామ్రాజ్యం హాలకవి ఎట్లు మధురంగా పరిపాలించాడో చెప్పడానికి ఇందు ఎన్నో గాథ లుదాహరింపబడ్డాయి. అందు ఎన్నో చమత్కార విశేషాలు చూపబడ్డాయి. హాలకవితలో కాపువులతోడి నుడికారపు మలకలకు, దంపతీప్రణయ జీవితమునకు, లౌకికజీవిత సౌభాగ్యమునకు, వృక్షముల దోహదప్రక్రియకు, ఆ నాడు విదుషీమణులైనను వంటవార్పులు స్వయముగా చేసికొను సంప్రదాయమునకు, కులీనతాప్రభుత్వ దర్పమునకు, సమష్టికుటుంబ జీవితమందు దురదృష్టవశమున సంభవించు విషమపరిస్థితులను భారతసాధ్వులెట్లధిగమింతురో తెలుపుటకు, పేదరికంలో మ్రగ్గుచున్నను ధర్మప్రతలైన మానవతు లెంత రాజసముగ కాపురము దిద్దుకొంటారో తెలుపుటకు, వేశ్యమాతల కపటనాటకములో రూపవేశ్య లెల్లావుండేవారో, చెప్పడానికీ. నాటి సంగ్రామ సంప్రదాయి వైభవలు చెప్పడానికి, ప్రేమము తాత్కాలికమైనదేకాని శాశ్వతమైనది కాదనుటకు, ఆటవికుల ఇంగితజ్ఞాన పాండిత్యమెంత నిశితమైనదో చూపుటకు, చిన్న యింటివాసాలు లెక్కించు ఖిలజనుల జీవితచరిత్రలు వెల్లడించుటకు, భర్తృవాల్లభ్యమును గడింపజాలినవి లావణ్య తారతమ్యములేకాని వేషభాషలుగావని, ఋజూ కరించుటకు, దాతృత్వ రసికత్వముతోడి పేదరికపుబ్రతుకు లెట్లుండునో తెలుపుటకు, మేలుమలువజాలని పేదసంసారుల సౌజన్య సౌశీల్యము లెట్లుండునో చూపుటకు, వేషధారులగు ఆషాడభూతుల పగటిభాగవత మెట్లుండునో ప్రదర్శించుటకు, ప్రజల డెందము నొవ్వకుండునట్లు వారినుండి పన్నులను దీసికొను ప్రభుభావ్యమంచు విధానము నెఱుకపఱచుటకు, చెడిబ్రతికినవారి జీవితపుతీరు వెల్లడించుటకు ఈ విధంగా ఇంకా ఎన్నెన్నో విషయముల నెఱుకపఱచుటకు ఎన్నోగాథలతో తెలుగు అనువాద పద్యములను ఉదహరించి శ్రీ సుబ్బయ్యగారు ఇంచుమించు హాలకవితా హేల నంతటిని మనముందు పెట్టినారు.

ఆరవవ్యాసం 'కవికులపతి కాళిదాసు' శ్రీ ధూళిపాళ అర్కసోమయాజిగారి రచన. కాళిదాసు రచనలందును ప్రతిష్ఠితములైన రఘువంశము, మేఘసందేశము, అభిజ్ఞాన శాకుంతలములను గూర్చి యిందు ప్రసంగింపబడింది.

'కాళిదాసు మాటలసారాన్ని, కాళిదాసుగాని, సరస్వతిగాని, చతుర్ముఖుడుగాని తెలియవలసిందే' నా వంటివారి కేంతెలుస్తుంది అని మల్లినాథసూరే ఒప్పుకొన్నారు అని అంటూ అసంతృప్తితోనే శ్రీ సోమయాజిగారు కాళిదాసుమాటల సారాన్ని మనకందించారు. రఘువంశంలో ద్వితీయ సర్గలోని మొదటి రెండు శ్లోకాలలోని అర్థగాంభీర్యాన్ని వివరిస్తూ వానిలోని 'ప్రజానామధిపః', 'జాయా' ధర్మపత్ని శబ్ద ప్రయోగాలను సవివరంగా విమర్శించారు. 'సొగసు కోర్కెలు రావలె నాల్కించినన్' అన్న పెద్దన్నగారి సూక్తికి కాళిదాసు కవిత్వాన్ని లక్ష్యభూతంగా చూపించారు. ఎందుచేతనో రెండవకావ్యాన్ని కుమారసంభవాన్ని విడిచి 'మూడవకావ్యం మేఘసందేశం' అంటూ ఎత్తుకొన్నారు. మేఘుని విరహం వర్ణించే సందర్భంలోని కాళిదాసు కవితారసాన్ని ప్రశంసిస్తూ 'నేడు వాఙ్మయములలో ఆచార్య బిరుదములను సంపాదించి విశ్వకళాశాలలందు ప్రాధ్యాపక పదవులందు విరాజిల్లుచు పండితులు పాశ్చాత్య ఖండగత విశ్వవిద్యాలయాహూతులై అచ్చటనేగి రెండు మూడు సంవత్సరములుండు సందర్భమున, ఈ

దేశమున విరహముచేత క్రుంగి కృశించు వారల గృహిణులకు లేఖలు వ్రాయుతరి మేఘసందేశాంతర్గత శోక ప్రతిపాదిత శ్లోకపరంపరా ప్రవహత్కవితా రసములో శతాంశమైనను స్పందింప జేయగలరా అను శంకనాకు తఱచు కలుగుచుండును" అని సందేహం వ్యక్తీకరించారు. ఏమిటీ అమాయిక శంక అనిపించింది నాకు. శాకుంతల నాటకాన్నిగూర్చి 'గఠే' పండితుని ప్రశంసలు శ్రీ సోమయాజులుగారు చక్కగా తెలియజేశారు.

'రమ్యాణివీక్ష్య' అను శ్లోకములోని భావ మాధుర్యమును వివరించి 'ఏవాఙ్మయమునందును ఏ కవియు ఈ భావమును చెప్పియుండలేదు.' అని ధూళిపాళవారు చెప్పినది అక్షరాల సత్యం.

ఎనిమిదవవ్యాసం శ్రీ గాలిపార్థ సారథిరావుగారి 'భారవి—అర్థగౌరవము' అన్నది. భారవి మహాకవి కావ్యమైన కిరాతార్జునీయవిమర్శమిది. "భారవేరర్థగౌరవమ్' అన్న సూక్తిని మెచ్చుకుంటూనే శ్రీ పార్థసారథిరావుగారు 'మాఘేసంతి త్రయోగుణాః' అన్నదాన్నిమాత్రం ఆమోదించలేదిందులో. అది వారికి భారవి పట్లగల గౌరవాధిక్య ప్రదర్శనకు నిదర్శనంమాత్రం అనాలి.

'అర్థగౌరవం' అన్నమాటను సాగదీసి అర్థానికి గౌరవము కింకృతమైనది అని వారు ప్రశ్నించుకొని 'అల్పాక్షరమందత్వార్థస్ఫూర్తి'యే అర్థగౌరవమని చెప్పి భోజరాజు వచించిన రచనా పద్ధతిని దానికి సమాధానంగా మాఘకావ్య శ్లోకాల సోదాహరణంగా చక్కగా వివరించారు. ఇంతటి అర్థస్ఫూర్తిని ప్రసరించిన భారవిగారి లేఖిని లాఘవక్లేశములకు నిలయములైన 'నమోనునో్న నున్నోనోనా నానానా ననాననునున్నో ఒనున్నో ననున్నేనోనానేనానున్ననున్న' ఇటువంటి ఏకవర్ణ జనిబద్ధ శ్లోకములు, పద్మబంధ చక్రబంధాది చిత్రకావ్య విశేషములను ఏలఉద్భవింపజేసినది?

అని ప్రశ్నించుకొని దానికి కారణము తత్కాల కావ్యకరణ సమయములని చెప్పుచు అవి నిబద్ధింపబడుట కవి సామర్థ్య సర్వతో ముఖత్వమునకు గీటురాయియని ఆనాటి విద్యావేత్తల అభిప్రాయముగా నిరూపించారు. ఆనాడుకూడ కవి సహృదయ శిరోమణియైన జగన్నాథుడు చిత్రకావ్యములు అధమాధమకావ్యములుగానైనను గణింపలేదు. ఇట్టి రచనకు కాళిదాసునందు స్థానములేదు. ఇట్టి రచన కవితావాహినికి మరుభూమివంటిది' అని స్వాభిప్రాయాన్ని ఆవిష్కరించారు 'శ్రీ గాలి' వారు.

తొమ్మిదవవ్యాసం' మాఘకవితాశాస్త్ర వైదుష్యము' అన్నది. దీనిని సంస్కృతంలో శ్రీ టి. కె. గోపాలంఅయ్యంగారు రచించారు. దానికి ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారి తెనుఁగు సేత యిది.

మాఘకవి శిశుపాలవధ ఇరువది సర్గల మహాకావ్యం. రసపుష్టంగా తత్త్వజుష్టంగా రచింపబడినదిది. "ఉపమాకాళిదాసస్య భారవేరర్థ గౌరవమ్, దండినః పదలాలిత్యం మాఘేసంతిత్రయోగుణాః" అన్న ప్రసిద్ధసూక్త్యుపకారం శిశుపాలవధలో ఈ మూడిటి వైశిష్ట్యము ఎంతవరకు సాధింపబడిందో చెప్పడమే ఈ వ్యాస ముఖ్యాంశం కావలసియున్నను అవి అందఱును చెప్పగలిగినవే యగుట విస్తరభీతిచేకాబోలు అట్లు చేయబడలేదు. కనుకనే వారు తమ వ్యాస శీర్షికను మాఘకవి—శాస్త్రవైదుష్యమని పేర్కొనిరి. ఇఁక మాఘునకుగల శాస్త్రపరిచయముగూర్చి, ఛందోవైవిధ్యముగూర్చి, బంధకవిత్వముగూర్చి, సాంఖ్య యోగ మతములగూర్చి, మీమాంసా సిద్ధాంతములు గూర్చి తనకుగల యాయజూకతనుగూర్చి, వ్యాకరణపాండిత్యముగూర్చి ఉపనిషత్తత్త్వమునుగూర్చి మాఘకవి ప్రదర్శించిన విశ్వతోముఖ పాండిత్యమును శ్రీ అయ్యంగారు ఇందు వివరించి

తమకు వాని యన్నిటియందునను గల ప్రగాఢ పరిచితిని ప్రదర్శించిరి.

'సపుండరీకాక్ష ఇతిస్ఫుటోభవత్' అని సూర్యకిరణ వికసితములగు పుండరీకములను భగవంతునికన్నులతో పోల్చుచు "కప్యాసంపుండరీక మేవాక్షిణీ తస్య ఉదితినామ' అను ఉపనిషదర్థమును గంభీరాంభస్సంభూతసుమృష్టనాళ రవికర వికసిత పుండరీకదలామలాయతేక్షణః' అన్న భగవద్రామానుజాచార్యులవారి భాష్య పరముగ చెప్పుటతో శ్రీకృష్ణ భక్తుడగు ఈ కవి విశిష్టాద్వైత మతస్థుడని స్పష్టపడగలదు. ఈ సంగతిని ఎంతో తెలివిగా శ్రీ అయ్యంగారు వివరించి తమ విమర్శనాపటుత్వమును వెల్లడించుకొన్నారు. ఈ కావ్యము సంస్కృతసాహిత్యములో విజ్ఞానోచ్ఛ్రీకగా శ్రీ అయ్యంగారు నిర్వచించడం చాల సమర్థవంతంగా ఉంది.

పదుమూడవ వ్యాసం శ్రీ హర్షుని కవితానైపుణ్యం. పి. శ్రీరామమూర్తిగారు రచించిరి. భట్టబాణుని పోషకుడు హర్షవర్ధనుడను మహారాజే శ్రీహర్షకవియని శ్రీరామమూర్తిగారి నిర్వచనము. ఈతడు ప్రియదర్శిక, రత్నావళి, నాగానందము అను నాటకములను వ్రాసెను. సరస కవిత్వమును సహృదయ హృదయంగమముగా రచించుటలో నెట్లు శ్రీహర్షుడు సిద్ధహస్తుడైనది శ్రీ శ్రీరామమూర్తిగారు చక్కగ వివరించినారు. రత్నావళీనాటకము ఆలంకారికుల ప్రశంసల నందినది. ప్రియదర్శిక రత్నావళినాటికలు ఇవిరెండును శృంగారమును చిందించునవి. నాగానందము నాటకము బౌద్ధమత పరమసిద్ధాంతమగు జీవకారుణ్యము బోధించుట దీని పరమప్రయోజనము. ఈ మూడింటిలోని ఇతివృత్తములు బృహత్కథనుండి గ్రహించినవనిపించునని శ్రీరామమూర్తిగారు వివరించిరి. కవిత్వముననే కాక రూపకశిల్పమున, ప్రయోగ యోగ్యములగు నాట్యవస్తువులుగ మూలమందలి కథలను మార్చుటలోగూడ నీకవి సిద్ధహస్తుడుగా నిరూపింపబడినది.

పధ్నాల్గవవ్యాసము డా॥ యస్వీ జోగారావుగారి 'కాదంబరీ మహాకావ్య మధుర సందేశము' అన్నది. ఈ వ్యాసరచన మొక కళాఖండముగనే తీర్పబడినది. 'కాదంబరీరసజ్ఞానా మాహారోపి నరోచతే' అన్నసూక్తి వీరి యీ విమర్శావ్యాసమును చదివినంతనే సత్యమనిపించితీరును.

'మనిషిని మనిషికి సన్నిహితము చేయునదే మహత్తత్త్వము' అనుసూక్తి నుదహరించి శ్రీ జోగారావుగారు కాబందరి మహాకావ్యమునుండి రెండు నిండుమనస్సులమధ్య నేర్పడిన మధుర బాంధవ్యమునకు జన్మాంతరమునను మఱి తిరుగు లేదనిపించిన కపింజలుడు, పుండరీకుడు, మహాశ్వేత, కాదంబరి, చంద్రాపీడుడు, పత్రలేఖలను ఆరు పాత్రములందు అనుస్యూతముగ నొక స్నేహసూత్రమును బాణుడెట్లు బిగించినాడో ప్రతి పాత్రను దడివి సవిపరముగ చక్కగ నిరూపించినారు.

స్త్రీ పురుష భేదమున్నను పత్రలేఖా చంద్రాపీడుల యనుబంధము మధురానుభవ ప్రసక్తి లేని పరమాదర్శ ప్రాయమైన పవిత్రబంధముగా బాణమహాకవి యెట్లు చిత్రించెనో 'శ్రీయస్వీ' చక్కగా చూపినారు.

పత్రలేఖతో చంద్రాపీడుని యనుబంధమద్భుతమైనది. సంస్కృత వాఙ్మయములోనే పత్రలేఖ విచిత్రమైన పాత్ర. శరీరస్పర్శ ప్రసక్తి లేకుండ స్త్రీ పురుషులమధ్య స్నేహస్థితి యెంత మేరకు సాధ్యమో ఆ సరిహద్దుపై చంద్రాపీడుని పజ్జ వినయగర్వముతో నిల్చిన పాత్రయామె. ఆమె రాజపుత్రి. త్రిలోకసుందరి. పగలనక రాత్రి

యనక సర్వకాల సర్వావస్థలందు ఛాయవలె చంద్రాపీడుని సేవించి మూర్తీభవించిన సేవా ధర్మమనిపించుకొనెను.

కాదంబరీరసజ్ఞులలో అగ్రగణ్యుడైన విశ్వకవి రవీంద్రుడు పత్రలేఖాపాత్రను బాణుడు సమ్యగున్మీలితము చేయలేదని, ప్రణయతృష్ణార్తము, చిరవంచితమునైన స్త్రీహృదయము నుపేక్షించినాఁడని ఒక అభాండము వైచినాడు. ఇది యెట్లు అభాండమో చక్కగా నిరూపించి పత్రలేఖాపాత్ర పరమార్థమును ఆద్యంతము రవీంద్రు డెట్లు గుర్తింపలేకపోయెనో వివరించి శ్రీ యస్వీ 'యశస్వీ. అనిపించుకొన్నారు.

పదిహేనవ వ్యాసము భవభూతి కవితా విభూతి. శ్రీ కె. వెం. నృ. అప్పారావుగారి రచనమిది.

చిత్రపట ప్రదర్శనము భవభూతి ప్రతిమ క్షౌక మచ్చుతునక యెట్లయినదో యిందు నిరూపింపబడినది. నిందతో పరిత్యక్తురాలైన సీతాదేవి దుఃఖముకంటె పశ్చాత్తప్తుఁడైన రాముని దుఃఖమే అతిశయముగాఁజూపి చివరకు సీతయే రామునిజూచి జాలిపడునట్లు చిత్రించి శ్రీరాముని పైనింద నారోపించు విమర్శకు భవభూతి వ్యంగ్యముగా సమాధానమిచ్చిన విధమును వివరించి శ్రీ అప్పారావుగారు రాముని నిర్దోషిని జేసినారు. "వాదియే వ్యాజ్యమును వదలుకొన్నప్పుడు ఇక న్యాయవాది యేమిచేయగలడు" అనిపించినారు.

ఇంకను ఎన్నో సన్నివేశములలో "ప్రజారంజనముకొఱకు తన్ను విడుచుట న్యాయమే" అని సీతచేతనే అనిపించి భవభూతి సీత పక్షమున నిలబడి రాముని విమర్శించు కువిమర్శకుల నోళ్లెట్లు మూయించినాడో శ్రీ అప్పారావుగారు సూటిగా తెలిపినారు. రామవియోగమునకు సీత శోకించినదేకాని ధర్మనిష్ఠపై ద్వేషముచే దుఃఖింపలేదని భవభూతి ధ్వనింపజేసిన ఘట్టమును శ్రీ రావుగారు చక్కగా వివరించి చెప్పినారు.

పదహారవ వ్యాసము భవభూతి వర్ణించిన గోదావరీప్రాంత మనునది. డాక్టర్, జాస్తి సూర్యనారాయణగారి రచనమిది. భవభూతి తన ఉత్తరరామచరిత్రములో తెలుగుదేశము నడుమనున్న గోదావరీప్రాంతమును ఎంత విపులముగా వర్ణించెనో ఉదహరించి ఆతనికా ప్రాంతముపైని గల యభిమానమునది దెల్పుచున్నదని, ఆ యభిమానమున కాతఁడాప్రాంతమున నివాసముగలవాడై యుండునని శ్రీ డాక్టరు జాస్తివారి నిరూపణములో సబబు జాస్తిగానున్నది.

ఇపవదియారవ వ్యాసం మహాకవి శ్రీహర్షుడు. శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి వ్యాసమిది. ఇందలి శ్రీహర్షుడు నాగానందాది నాటకరచయిత యగు మహారాజు శ్రీహర్షుడుకాదు. శ్రీ హీరపండితుడు మామల్లదేవి యను పుణ్యదంపతుల కుమారుడితడు, నైషధీయచరితమును వ్రాసిన మహాకవి. భారవి, మాఘకవులు శ్రీహర్షుని నైషధము పుట్టకపూర్వమే ప్రకాశించిరని 'తావద్భా భారవేర్భాతి । యావన్మాఘస్యనోదయః । ఉదితే నైషధేకావ్యేక్వమాఘః క్వచభారవిః' అన్న అభియుక్తుల సూక్తి హర్షుని లోకోత్తరప్రతిభను వెల్లడించుచున్నది. హర్షుని కావ్యమునుండి పెక్కుశ్లోకములుదాహరించి శ్రీ లక్ష్మణశాస్త్రిగారు హర్షుని భావనాపటిమను, యమకరచనను, అనన్యాదృశమగు ఉత్ప్రేక్షను, వాక్చమత్కృతిని, ప్రయోగచాతుర్యమును, అనుప్రాస సహితమైన పదలాలిత్యమును, తర్కశాస్త్ర మర్యాదను, వ్యాకరణనిరతిని, అద్వైత వేదాంత పరిపాటిని, కావ్యాలంకారజ్ఞతను చక్కగా నిరూపించిరి.

న్యాయకుసుమాంజలికి కర్తయైన ఉదయనాచార్యునంతటి ఉద్దండపండితు నోడించిన తర్క-

కర్కశమతియగు శ్రీ హర్షునకు మృదుమధుర రసస్ఫూర్తియగు కవిత అలవడుట ఆశ్చర్యమైన సంగతియేయని శ్రీ శాస్త్రిగారికే అనిపించింది.

ముప్పైఐదవ వ్యాసము విద్యానాథుడు. శ్రీ వెలమచెర్ల రంగాచార్యులుగారు దీనికర్త. అగస్త్య కవియే విద్యానాథుడని నిరూపించుటయే ఈ వ్యాసములోని ముఖ్యాంశము. ప్రతాపరుద్రమహారాజు ఆస్థానమున పేరెన్నికగన్న కావ్యమల్ల కవీశ్వరులు. వీరభల్లటదేశికుడు, అప్పయాచార్యుడు త్రిపురాంతకకవి, కోలచల మల్లినాథశతావధాని, గంగాధరకవి, విశ్వనాధనరసింహకవి, అగస్త్య విద్యానాథుడు ననువారిని సంస్కృత కవులుగా పేరెన్నికగన్నవారినిగూర్చి తెలుపుచు విద్యానాథు డగస్త్యకవియేయన్న సంగతిని విద్యానాథ కృతమైన ప్రతాపరుద్రీయయశోభూషణములోనిశ్లోకము చేతనే సుదృఢముగా నిరూపించినారు శ్రీ రంగాచార్యులుగారు. ఆపైని కాసె సర్వప్ప వ్రాతను గూడ సాక్ష్యాధారముగా జూపినారు. విద్యానాథు డన్నది ప్రతాపరుద్ర మహారాజు అగస్త్యకవి కిచ్చిన బిరుదపదముకాని అన్యముగాదని చక్కగా నిర్వచించినారు.

అగస్త్యకృతములైన బాలభారతము, శ్రీకృష్ణచరిత్రము, నలకీర్తికౌముది, అగస్త్య నిఘంటువు, మణిపరీక్ష, అను గ్రంథములలోని శ్లోకము లుదాహరించి వాని ప్రాశస్త్యమునుగూడ శ్రీ ఆచార్యులుగారు చక్కగా నిరూపించినారు. విద్యానాథుని ప్రతాపరుద్రీయ కృతిలో ప్రత్యేకతను వహించునది ఆంధ్రత్వ నిరూపణము. విద్యానాథు డాంధ్రతాపూర్ణ హృదయుడైనది శ్రీ ఆచార్యులవారు సోదాహరణముగ వివరించినారు. ఒక మానవమాత్రుడైన ప్రతాపరుద్రుని ప్రతిపద్యమున వంతగా వర్ణించుట నాక్షేపించిన కువిమర్శకులకు చక్కని సమాధానముగూడ చెప్పినారు. అలంకారసర్వస్వమేకాదు ప్రతాపరుద్ర యశోభూషణ కృతి ఆంధ్రవైభవ సర్వస్వమని శ్రీ వెలంచెర్ల వారు నేర్పుగా నిరూపించినారు.

నలభైయారవ వ్యాసం శ్రీ జటవల్లభుల పురుషోత్తంగారి 'మల్లినాథసూరి వ్యాఖ్యా వైభవ మన్నది.

మల్లినాథసూరి నైషధ షష్ఠములైన కావ్యములకు వ్రాసిన వ్యాఖ్యలోని ఘనత ఇందు వివరింపబడింది. అన్వయములోను, అర్థనిర్ణయంలోను విశదవైఖరి నవలంబించుటయేకాక సందర్భానుసారముగా నిఘంటువుల నుదాహరించుటలోను, అలంకార లక్ష్యలక్షణ సమన్వయము గావించుటలోను, తాత్పర్య వివరణమునకై శ్రుతి స్మృతిపురాణ ధర్మసంగీత శిల్పశాస్త్ర జ్యోతిష వైద్యాది సమస్త విద్యలనుండియు సంక్షిప్త సూక్తిగా వచనముల నుల్లేఖించుటలోను, శ్లేషాది గుణములను వ్యంగ్యవైభవమును సమస్త కావ్య సంపదను ప్రస్ఫుటముగా ప్రదర్శించుటలోను, అన్యూనాతిరిక్తముగా రమ్యమైన ధోరణిలో కవి హృదయము వ్యాఖ్యానించుటలోను మల్లినాథు డగపర్చిన లోకోత్తరములగు నిగూఢ ప్రజ్ఞా సమయస్ఫూర్తులను సోదాహరణంగా వివరించి శ్రీ జటావల్లభులు మల్లినాథసూరి వ్యాఖ్యావిశేషము లన్నిటిని కన్నులకు గట్టునట్లు చూపించినారు. అనేకత్ర గల విశేషములను ఏకత్ర చూపి 'ఆహా మల్లినాథు డెంతవాడు' అనిపించినారు. వ్యాఖ్యాన పంక్తులను పూర్వకాలమున కంఠస్థముచేసి కావ్య షట్కపఠనములో విద్యార్థులు సమస్తశాస్త్ర వైదుష్యము సంపాదించెడివారని నేడట్టి యలవాటు లేని విద్యార్థు లెన్నిచదివినను తేజోవంతులు కాలేకపోవుచున్నారని విచారమును వెల్లడించినారు.

నలభైతొమ్మిదవ వ్యాసము కుమారస్వామి సోమపీథి–రత్నాపణము. దీనిని శ్రీ ములగాలసేతు మాధవస్వామిగారు రచించిరి.

రత్నాపణము ప్రతాపరుద్రీయమను అలంకారశాస్త్రమునకు వ్యాఖ్యానము. దీనిని కుమారస్వామి సోమపీథి రచించెను. ఈతడు మల్లినాథసూరికి ద్వితీయపుత్రుడు. మల్లినాథపండితు డీతని పితామహుడు. తండ్రిగారి వ్యాఖ్యవలెనే ఈతడు తనవ్యాఖ్యానమున ఎంతప్రసిద్ధి నార్జించుకొన్నాడో వ్యాకరణ సమన్వయమునందు, శ్రుతిస్మృతి సంప్రదాయసమన్వయమందు, తర్కశాస్త్ర సమన్వయమందు, అలంకారశాస్త్ర సమన్వయమందు, ఎట్టి అద్భుత ప్రతిభ నీతఁడెంతగా ప్రదర్శించినాడో వివిధోదాహరణములతో శ్రీ ములగాల వారు చక్కగా బ్రదర్శించినారు.

కావ్యప్రకరణమున 'తాత్పర్యార్థము వ్యంగ్యార్థమే, అని నిర్ధారణము చేయుచు 'అభిప్రాయ విశేషరూపమైన వ్యంగ్యార్థము శబ్దార్థములచే ప్రకాశింపఁజేయబడును, వానితాత్పర్యముచేతనే ఆ వ్యంగ్యార్థము ప్రకాశ్యమానమగుచుకాన తాత్పర్యార్థమే వ్యంగ్యార్థము' అన్న ధ్వన్యాచార్యులమాటలే సమర్థించుచు సోమపీథి చేసిన వివరణమును శ్రీ మాధవస్వామిగారు సుగమముగా వివరించిరి. అట్లే రసప్రకరణమున శాంతి రసస్థాపనముగూర్చి శంకాసమాధానములను వివరించి హృదయ సమున్మేషకమైన సోమపీథి సమర్థనములను మూలపంక్తులతోను తమ అనువాదముతోను చక్కగా వివరించిరి. స్థాలీపులాకన్యాయముగా రత్నాపణ వ్యాఖ్యావైభవమును ప్రదర్శించి శ్రీ స్వామిగారు ధన్యులైరి.

ఏవంవిధవ్యాస ప్రకటనమున ఈ సాహితీవాల్లభ్యము సుస్థిరతనుఘటించుకొనగలదని, తత్ప్రకటనకర్తలు శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారీగ్రంథముతో నిజంగా సాహితీవల్లభులై శాశ్వత కీర్తిమంతులు కాగలరని నేను ఆశించుచున్నాను.

—

# విషయసూచిక.

(విషయానుక్రమణిక)

## అభినందనవిభాగము — వంశచరిత్ర.



## అభినందనవిభాగము — కృతిభర్త

# శ్రీసాహితీవాఙ్మయము (ప్రథమభాగము) సాంస్కృతిక విభాగము.

---

| వ. నెం. | రచయితలగురించి | పుట. |
| --- | --- | --- |
| 1. | శ్రీ సి. నారాయణరెడ్డి | 1 |
| 2. | ,, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి | 1 |
| 3. | ,, పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి | 3 |
| 4. | ,, ధూళిపాళ అర్కసోమయాజి | 4 |
| 5. | శ్రీమతి వారణాసి యశోదాదేవి | 5 |
| 6. | శ్రీ గాలి పార్థసారధిరావు | 6 |
| 7. | ,, తిరుపతికుమార గోపాలస్వామిఅయ్యంగార్ | 7 |
| 8. | ,, కొత్త బావయ్యచౌదరి | 9 |
| 9. | ,, బిన్నూరి నరసింహశాస్త్రి | 10 |
| 10. | ,, పోచెంచర్ల శ్రీరామమూర్తి | 11 |
| 11. | ,, యస్వీ జోగారావు | 13 |
| 12. | ,, కేశిరాజు వేంకటనృసింహ అప్పారావు | 13 |
| 13. | ,, జొన్నలగడ్డ ప్రభాకరశాస్త్రి | 15 |
| 14. | ,, భాష్యం అప్పలాచార్యులు | 16 |
| 15. | ,, సిష్టుగూరి హనుమంతరావు | 17 |
| 16. | ,, యలమర్తి విఠల్‌రావు | 21 |
| 17. | ,, ఆలమూరి రాజగోపాలరావు | 23 |
| 18. | ,, యడవల్లి ఆదినారాయణ | 24 |
| 19. | ,, భాగవతుల కుటుంబరావు | 25 |
| 20. | ,, రావూరి దొరస్వామిశర్మ | 26 |
| 21. | ,, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి | 27 |
| 22. | ,, వేదుల సూర్యనారాయణశర్మ | 29 |
| 23. | ,, నిడదవోలు వేంకటరావు | 31 |
| 24. | ,, దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి | 33 |
| 25. | ,, దీపాల పిచ్చయ్యశాస్త్రి | 34 |
| 26. | ,, అడుసుమిల్లి పూర్ణచంద్రరావు | 37 |
| 27. | శ్రీమతి నిర్మల తమ్మారెడ్డి | 38 |
| 28. | శ్రీ చెలమచర్ల రంగాచార్యులు | 39 |
| 29. | ,, వంకలపాటి రామచంద్ర | 41 |
| 30. | ,, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి | 42 |
| 31. | శ్రీమతి డి. సి. సరస్వతి | 43 |
| 32. | శ్రీ మేదూరి వేంకటసోమేశ్వరకృష్ణమూర్తి | 44 |
| 33. | ,, గుంటూరి శేషేంద్రశర్మ | 47 |
| 34. | ,, చిలుకూరి పాపయ్యశాస్త్రి | 48 |

ద్వితీయ భాగములోని రచయితల పట్టిక.

---

# సంపాదకీయము

ఆర్యా,

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి వ్యవస్థాపకాధ్యక్షులును, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ సభ్యులును అగు 'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు విద్వత్కవిచారిత్రక పక్షపాతముతో చిరకాలమునుండి సాహితీసేవను. సాహితీపోషణమును చేయుచు ఇతోఽధికముగ చేయ సంకల్పించియున్న విషయము తమరెఱుఁగనిది కాదు.

వారు బహుముఖవిద్యాప్రీతితో తమపుత్రులు శ్రీ హరిశ్చంద్రప్రసాద్, ఎం. ఎల్. ఏ. గారి ద్వారా శ్రీ రంగరాయ మెమోరియల్ మెడికల్ కాలేజి, శ్రీ ముళ్లపూడి వెంకట్రాయ మెమోరియల్ పోలీటెక్నిక్ కాలేజి వంటి అనేకసంస్థలను స్థాపింపఁజేయుటయు. ఇతరుల అనేకసంస్థలలో యావజ్జీవసభ్యు లగుటయు సర్వజనవిదితములు.

ఆంధ్రములో జరుగు మంచిపనులలో పరోక్షముగనో ప్రత్యక్షముగనో వారి సహకారప్రోత్సాహము లందనివి అరుదనుట స్వభావోక్తి.

అట్టి వారి నభినందించుచు నేఁడు ఆంధ్రప్రదేశమున సాహిత్యక సాంస్కృతిక చారిత్రిక రంగములలో జరుగుచున్న సత్కృషి సమగ్రముగా ప్రతిబింబింపఁగల "సాహితీవాల్లభ్యము" అను సంకలన సంపుటిని వెలువరించుటకు శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి సంకల్పించినది.

"ఈ సందర్భమున ఆ యా రంగములలో ప్రత్యేక పరిశ్రమ సల్పి నిష్ణాతులై ఔ ననిపించుకొనిన తమవంటి ప్రముఖుల రచనలను మండలి అర్థించుచున్నది."

ఇవి 3–4–1964వ తేదీని తమ తమ రచనలను పంపవేఁడుచు ఆ యా రచయితలకు శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి పంపిన అభ్యర్థనమునందలి వాక్యములు. ఇవి ఈ సంపుటిని ప్రచురించుటలో మాకుఁ గల ఆశయములను, దీని స్వరూపమునుగూర్చిన మా యూహచిత్రమును విశదపరచుచున్నవి.

మా కోరికను అన్ని విధముల మన్నించుచు రచయితలందఱును ఉత్సాహ సంతోషములతో సహకరించినందులకు వారికి మేమెంతయు కృతజ్ఞులము.

ఈ సందర్భమున ఒకటి రెండు విషయములను మనవి చేసికొనవలెను. దీనిని గుఱించిన మా ఆశయము, మా సంకల్పము మాకే కనిపించు ఈ క్రింది కారణములచే సమగ్రముగా సిద్ధింపలేదనుకొనవలసి యున్నది,

ఒకటి : ఆంధ్రదేశమున ఆ యా రంగములందు ప్రసిద్ధులయిన మఱి యెందఱి రచనలనో, ఇందుండితీరవలసినవానిని. అనేక కారణములచే — సహజగముగనే — సంపాదింపననువయినది కాదు. వారిక్షమ యాచించుచున్నాము.

రెండు ; సాహితీవల్లభుల సర్వమిత్రత్వమునుబట్టియు, రచనల పరిమాణము పెరిగిపోవుటచేతను, పెద్దలసూచన శిరసా వహించి అనివార్యముగా దీనిని రెండుసంపుటులుగా ప్రకటింపవలసి వచ్చినది.

మూడు : కొందఱు రచయితల చిత్రములను, మఱికొందఱు రచయితల సంగ్రహపరిచయములను, ఎంత ప్రయత్నించియు, వారందు

లకు సుముఖులు కాకపోవుటచే సంపాదించలేక పోయితిమి.

నాలుగు : రచనావిషయకాలక్రమమును బట్టి రచనలను ప్రచురించుటకు గాఢముగా సంకల్పించియు సరియగు సమయమున అందకపోవుట వంటి అనివార్యకారణములచే ఒండు రెండుచోట్ల అటునిటుగా ప్రచురింపవలసి వచ్చినది.

ఐదు : ఒక విషయమునుగుఱించి ఒకే రచన ప్రచురింప నిర్ణయించుకొనియు, రెండు, మూడు విషయములలో దీనినిగూడ సడలించుకొనక తప్పినది కాదు.

ఆఱు : ఎన్నడో దీనిని ప్రచురింపవలసియుండియు మానవ ప్రయత్నాతీతములయిన అనివార్యహేతువులచే తొలిసంపుటి ప్రచురించు నేఁటికే కొంచెె మించుగా నాలుగుసంవత్సరములు గడచిపోయినవి, ఈ లోఁగా, దీనికి రచనలు పంపినవారు కొందఱు పరలోకగతులగుటయు, దీనిసంపాదకులు ముగ్గురిలోనే యిద్దఱు గ్రామాంతరగతులు గావలసి వచ్చుటయు సంభవించినది. ఇందువలన కొంత ఉత్సాహభంగమును, ముద్రణ సమయమున సంపాదకుల ప్రత్యక్షపర్యవేక్షణమునకు అంతరాయమును ఏర్పడినవి.

అయినను నేటికి ఈ రూపమున దీనిని సమర్పింపఁగలిగినందులకు సంతోషించుచున్నాము.

ఇఁక : ఈ సాహితీవాల్లభ్యమునందలి ఈ మొదటిభాగమునందు రచనలు అభినందన విభాగము, సాంస్కృతికవిభాగము అను రెండు ప్రత్యేకవిభాగములక్రింద ప్రచురింపఁబడినవి. అభినందనవిభాగములో శ్రీ తిమ్మరాజుగారి బహుముఖకృషికి, వారివారికిని చెందిన బహువిషయ

ములు గల రచనలు ప్రచురింపఁబడినవి. ఇంకను వారికిని, వారికుటుంబమునకును, వారిసంస్థలకును చెందిన అనేక చిత్రపటములు ముద్రింపఁబడినవి. రెండవభాగమైన సాంస్కృతికవిభాగములో సాహిత్యాది వివిధసాంస్కృతిక విషయములకు చెందిన రచనలు ముద్రితములు. ఆ పై రచయితలచిత్రములును, తదనంతరము వారినిగుఱించిన సంగ్రహపరిచయములును అచ్చువేయఁబడినవి. చివఱ రెండవసంపుటిలోనుండు రచనలపట్టిక ఈయఁబడినది.

"గచ్ఛతః స్ఖలనం క్వాపి" "నడచువానికి జాఱుపాటు ఎక్కడనేని యుండకతప్పదు" అను సూక్తి నెఱిఁగిన పెద్దలను ఎన్నో పరిమితులకు లోనై సమకూర్చిన ఇందలి మేలున కానందింపఁ గోరుచున్నాము,

ఈ సంపుటి కొన్నిఫారముల ప్రూఫులను 'ప్రౌఢకవి, ఉభయభాషాప్రవీణ' శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్యగారును, మరికొన్ని ప్రూఫులను 'సరస్వతీకంఠాభరణ' 'విద్వాన్' శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారున్ను దయతో దిద్దిరి. వారికి మా కృతజ్ఞత.

దీనిని స్వీకరింపననుమతించిన శ్రీతిమ్మరాజు గారిని, తమ తమ రచనలుపంపించిన రచయితలను జరిగిన ఆలస్యమునకు — అలసతకు కాదు, తడవునకు — మరల మన్నింప వేడుచున్నాము. ఈ ఆలస్యము సంతసింపఁదగినది కాకున్నను, దీనివలన ఒక మేలుకూడ జరుగకపోలేదు. ఈ లోపున 'సాహితీవల్లభులు' 'ఆంధ్రభోజులు' కూడ నైనారు. మఱికొన్ని కృతులు స్వీకరించినారు. ఇవికూడ ఇందు పేర్కొనుట కవకాశ మేర్పడినది.



శుభమస్తు　　　　　　అవిఘ్నమస్తు

జొన్నవిరాచార్య కృతిస్వీకృతి శుభమహోత్సవ సభాసందర్భమున

# విద్వన్మహాకవిపండితపరిషత్తు

శ్రీనరేంద్రనాథ సాహిత్య మండలి వ్యవస్థాపకులు విద్యాపోషకులు

ప్రజాసేవాపరాయణులునగు

## శ్రీ ముళ్లపూడి తిమ్మరాజు చౌదరి గారికి

శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులగారిచే నిప్పించిన

# సాహితీవల్లభ

## బిరుదు ప్రదానము

తణుకు　　　　　　ఇట్లు

13-10-1963　　　　విద్వత్కవిపండితులు

1 [illegible]
2 [illegible]
3 [illegible]
4 [illegible]
5 [illegible]
6 [illegible]
7 [illegible]
8 [illegible]
9 [illegible]
10 [illegible]
11 [illegible]
12 [illegible]
13 [illegible]
14 [illegible]
15 [illegible]
16 [illegible]



శుభమస్తు                                                  అవిఘ్నమస్తు

# బిరుదప్రదానము

"సాహిత్యసమ్రాట్" కృతిస్వీకృతిమహోత్సవ
సభాసందర్భమున

## విద్వన్మహాకవి పండితపరిషత్తు

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి వ్యవస్థాపకులు
విద్యాపోషకులు ప్రజాసేవాపరాయణులు
"సాహితీవల్లభ" బిరుదాంకితులగు కృతిభర్త
శ్రీ ముళ్లపూడి తిమ్మరాజు చౌదరి గారికి

## ఆంధ్రభోజ

అను బిరుదము
కృతికర్త డాక్టర్ శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు [illegible] గార్కి

## సాహిత్యసమ్రాట్

అను బిరుదము
గౌరవ మాజీ ముఖ్యమంత్రి వర్యులు
సాహిత్య అకాడమీ అధ్యక్షులగు
డాక్టర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారిచే
సమర్పింపఁజేసినది

ఇట్లు

బెజవాడ గోపాలరెడ్డి

తణుకు          కృతిస్వీకృతి మహోత్సవ సభాధ్యక్షులు          ది 17-4-67



శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు



శ్రీమతి ముళ్ళపూడి రమణమ్మగారు



శ్రీమతి ముళ్ళపూడి కమలాదేవిగారు.



ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్‌గారు, జాగర్లమూడి గంగాభవానిగారు, శ్రీ పెండ్యాల అచ్చాయమ్మగారు,
ముళ్ళపూడి తిమ్మరాజుగారు, ముళ్ళపూడి కమలాదేవిగారు,
చిట్టూరి రమణాంబగారు, యలమర్తి రాజేశ్వరీదేవిగారు.

ఆంధ్రభోజ, సాహితీవల్లభ

# శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు

శ్రీ తిమ్మరాజుగారినిగూర్చి ఒక్క వాక్యంలో చెప్పాలంటే 'వారిలో ఇంటిపనులపై వైముఖ్యం పరుల పనులపై సౌముఖ్యంహెచ్చు' అని చెప్పాలి. మొదటినుంచీ మిత్రుల పనులు, ప్రజల పనులు, తాలూకాబోర్డు పనులు మీద వేసికొని పొరుగూళ్ళు తిరుగుతూ ఇంటిపనులు, పొలంపనులు ఒంటబట్టించుకొనేవారేకారు విస్తారమైన జమీ వ్యవహారములు, వ్యవసాయము, వ్యాపారములు ఒంటరిగా చూచుకోలేక తండ్రిగారు శ్రీ రాయుడుగారు మధనపడుతూనే వుండేవారు. పొలంపనులు అప్పగిస్తే పొలంవెళ్లినట్లేవెళ్లి పొలంలోనుంచే ఎవరిపనులమీదో, తాలూకాబోర్డు పనులమీదో గ్రామాంతరంవెళ్లి పొలంలోపనులు చక్కబెట్టే పాలేర్లవల్ల అవేళజరిగిన పనివివరం తెలిసికొని రాత్రికి తండ్రిగారితో అవన్నీ తానై దగ్గరుండి చేయించినట్లు లెక్కలుచెప్తూ వచ్చేవారు. వ్యాపారాలమీద పొరుగూళ్లు వెళ్ళవలసిన పనులు తండ్రిగారు అప్పగిస్తే అపనులు మరొకరికి అప్పగించి శ్రీ తిమ్మరాజుగారు మిత్రులను వెంటబెట్టుకొని దివ్యజ్ఞానసమాజంవారి సభలు వగైరాలకు కాశీ వగైరా వెళ్లివచ్చి తండ్రిగారిని నమ్మించిన ఘటాలెన్నో వారి జీవితంలో నడిచాయి. ఈ ఉదాహరణలవల్ల మనకి వారు తమ సొంతానికి లాభించేపనులను ఎంత వైముఖ్యంతో తేలికగా వదలివేస్తూంటారో, ప్రజలకూ విజ్ఞానసముపార్జనకూ సంబంధించిన పనులపైఎంతగా అభిముఖ్యం చూపిస్తూంటారో తెలియబడుతుంది. మొదటినుండి అయన పరులమనిషేకాని ఇంటిమనిషి కాడు. శ్రీ రాయుడుగారు ఏకపుత్రుడవడంవల్లా గారాబంగా పెరగడంవల్లా తిమ్మరాజుగారిని ఏమీ అనలేక చూచీచూడనట్టుంటూండేవారు. "మావాడు పొరుక్కి సింహాలక్ష్మి (శ్రీమహాలక్ష్మి)" అని ఇతరులతో అంటూండేవారు. ఇంటిపనులు చూచుకోవడానికి ఒంటరిగా బాధపడుతూ దౌహిత్రుడు రంగారావు (దొమ్మేరు) గారిపైని కార్యభారంనిల్పి సొంత పనులు నెరవేర్చుకొనేవారు. తర్వాత పౌత్రుడు శ్రీ హరిశ్చంద్రప్రసాదుగారు కొంచెం ఎదిగివచ్చేసరికి అన్నిపనులు అతనికినేర్పి భాధ్యతంతా ఆయనమీద అప్పగించి బరువుదించుకొని కృతకృత్యులయ్యేరు. ఆ అలవాటుతోనే శ్రీ హరిశ్చంద్రప్రసాదుగారే ఇంటిపెత్తనం యావత్తూ నేటికీ వహిస్తూంటారు, తమ తండ్రిటైములోను తమ కుమారుని టైములోనుకూడ స్వేచ్ఛాజీవితం మలచుకొని శ్రీ తిమ్మరాజుగారు ఈ విధంగా మిత్రుల పనులకు, విజ్ఞాన సముపార్జనకు, ప్రజల పనులకు, తాలూకాబోర్డు పనులకు, గ్రంధసేకరణకు, చరిత్రరచనా ప్రకటనలకు, సారస్వత గ్రంథప్రకటనలకు. కవి పండిత సన్మానములకు, సాహిత్య గోష్ఠులకు, ప్రాథమిక విద్యాపటుత్వ సంరక్షణకు ఎన్నెన్నో సొంతంకాని పనులకే జీవితంఅంతా అంకితపఱచి సేవామార్గంలోనే పయనించారని విస్పష్టంగా చెప్పొచ్చు. అయితే ఇదంతా ఎంతో నిరాడంబరంగా జరగడంవల్ల, అంత జమీందారీసంపత్తులోనూ ప్రతి చిన్నవారికీ అందుబాటులో వుంటూండడంవల్ల, మధ్యతరగతి జీవితవిధానాన్నే వరించి నలుగురితోను కలిసియుంటూండడంవల్ల వారి సేవారంగం ఇతరులమోస్తరుగా అడంబరం ఎరుగక అందలాల మీద ఊరేగలేదు,

శ్రీ తిమ్మరాజుగారు 10—10—1901 ని జన్మించారు. గర్భశత్రువులకుకూడ అపకారం తలపెట్టకుండ ఎఱుగని శీలంవీరిది. అందఱి అభివృద్ధిని తమ అభివృద్ధితో సమంగా ఆకాంక్షించే పవిత్ర హృదయంవీరిది. మిత్రులలోగాని, పనివారిలోగాని నూరులోపాలు కన్పించినా సరిపెట్టుకొనే క్షమాగుణం వీరిది. తనవారుండగా పైవారిని నెత్తికెక్కించుకొనే గుణంవీరిలోలేదు. మమకారంతప్ప అహంకారం అవగింజంతకూడలేదు. ఇది వీరివంశంలోనే లేదనడం అతిశయోక్తికాదు. వీరు చరిత్రఅంటే చెవికోసికొంటారు. ప్రతివారు తమ వంశచరిత్ర వ్రాసిపెట్టుకోవాలంటారు. అల్లాగేకనుకచేస్తే ఈనాడు చరిత్ర రచయితలు కాలస్థల నిర్ణయాలకోసం పడేతిప్పలుండవుగదా అని వారు పదే పదే అంటూంటారు. వంశవృక్షమైనా పది తరాలవరకు వ్రాసివుంచకపోయినవారు కుటుంబద్రోహులని వారు ప్రతివారిని హెచ్చరిస్తూంటారు. సారస్వతంపైని విశేషాసక్తియేకాని చరిత్రలో మాత్రం మంచి విజ్ఞానంకూడా వీరికుంది.

వీరు 1927 నుండి తాలూకాబోర్డులు రద్దయ్యేవరకు తాలూకాబోర్డు అధ్యక్షులుగా తాలూకాలోని వివిధగ్రామాలకు ఎంతగానో సేవచేశారు. ముఖ్యంగా ప్రాథమిక విద్యారంగంలో వారుచేసిన సేవ అపారం అనే చెప్పాలి. ప్రతిగ్రామంలోనుకూడ ఎలిమెంటరీ పాఠశాల స్థాపించడం అందులో జనరల్ ఎడ్యుకేషన్ ట్రయినింగు సర్టిఫికెట్లుతోపాటు తెలుగుప్రబంధాలు శతకాలు బాగావల్లించినవారిని, ఎంతో నేర్పు ఓర్పు గలిగి గ్రామస్థులను మంచిమాటచేసికొని విద్యారంగంలో సేవాదృష్టికలవారిని తాము స్వయంగా పరీక్షించి ఎన్నికచేసి మాస్టర్లుగా నియమించేవారు. ప్రాథమికవిద్యారంగంలో వీరుచేసినహృదయపూర్వకమైనకృషి మఱి ఏతాలూకాబోర్డు అధ్యక్షులూ ఆనాడు చూపలేదనుట నిజం. ఇప్పటికి వారు ఎక్కడ మాట్లాడినా ప్రాథమికవిద్యను ఉత్తమస్థాయిలో నుంచగల్గుతే దేశం సర్వోత్తమస్థితికి అదే వస్తుందని చెప్తూంటారు.

తాలూకాబోర్డులు అంతమయినతర్వాత శ్రీ తిమ్మరాజుగారు తణుకు పంచాయతీబోర్డుకు అధ్యక్షులుగా 7–11–1934 నుండి 10–4–1952 వరకును, తిరిగి 23–8–1956 మొదలు 31–8–1959 వరకును సుమారు ఇరువదియొక్క సంవత్సరాల సుదీర్ఘకాలం కడు సమర్థతతో పనిచేశారు. ఇంతటి దీర్ఘకాలం తాలూకాబోర్డు, పంచాయతీబోర్డులకు అధ్యక్షులుగా పనిచెశారంటేనే వారు ఎంతగా ప్రజల మనిషియై యుండాలో తెలుస్తూంది. ఈవిధంగా వారి జీవితప్రథమఘట్టం గ్రామసేవారంగంలో ఎంతగా కృషిచేసింది తెల్లమౌతూంది, చిట్టచివర తణుకు పంచాయతీబోర్డు సావనీరును బహు శ్రమపడి సంపాదించిన ప్రాచీనసభ్యులచిత్రములతో చరిత్రలతో కడు చక్కగా ప్రకటించారు. పోతే, ఇక చారిత్రక సారస్వతరంగాలలో శ్రీ తిమ్మరాజుగారు అద్వితీయంగా సేవచేశారని నిరూపించడానికి ప్రకటించినగ్రంథాలే బోలెడున్నాయి. శాశ్వతసభ్యత్వంపొందిన సంస్థలు లెక్కకు మిక్కియున్నాయి. ఈ రంగాలువారు జీవిత ద్వితీయఘట్టంలో ఎన్నుకొన్నారు. తమ ద్వితీయ పుత్రుడు నరేంద్రనాథ్ పదహారేండ్లు నిండకుండానే 27–9–42 తేదీని అకాలమృత్యువువాత పడ్డ-వల్ల అతనిని చిరంజీవిని చేయడానికి వారు "నరేంద్రనాథ సాహిత్యమండలి" అను పేరుతో సారస్వతరంగాన్ని ఏర్పరచి అందుకనుబంధంగా 'రాయల్ ప్రెస్' పేరుతో ముద్రణాలయాన్ని నెలకొల్పి చేసిన సారస్వతసేవ ఏమంత తక్కువదికాదు. ప్రతినెల సాహిత్యసభలు జరిపించడం, అనేక ఉత్తమోత్తమమైన సారస్వతగ్రంథాలు చారిత్రక గ్రంథాలు ప్రకటించడం శతకవాఙ్మయము ఎంతో చక్కని విశేషాంశాల పీఠికలను ప్రముఖపండి

తులచే వ్రాయించి ప్రకటించడం, సంస్కృతాంధ్ర భాషాపండితులను, శాస్త్రపండితులను ఘనంగా సన్మానించడం మూలంగా వారెంతగా చారిత్రక శాస్త్ర సారస్వతరంగాలకు జీవితాన్ని అంకితపఱిచారో విస్పష్టంగా ప్రకటితమైన గ్రంథ సాక్ష్యాధారం కన్పిస్తూనే వుంది.

ఇంకా వీరు ఆంధ్రసాహిత్యమండలి ఎకాడమీ (హైదరాబాదు) లో సభ్యులు. భారత ఇతిహాసిక మండలి (పూనా), చరిత్ర పరిశోధకమండలి (రాజమండ్రి) గౌతమీలైబ్రరీ (రాజమండ్రి) ఆంధ్రసారస్వత పరిషత్తు (కాకినాడ) చారిత్రక పరిశోధకమండలి (జయపూర్) దక్షిణభారత హిందీ ప్రచారసభ (మద్రాసు) వై. యమ్. సి ఏ. నెల్లూరు గ్రంథాలయము, అఖిలభారత హిష్టరీకాంగ్రెసు, భండార్కర్ లైబ్రరీ, అంధ్రఎసోసియేషను (ఢిల్లీ) మొదలగు పెక్కు సారస్వత చారిత్రక సంస్థలలో జీవితసభ్యులు. ధనసహాయంచేస్తూ సభ్యులుగామాత్రమే ఉండడమే కాకుండా ఆ యా సంస్థలుజరిపే సభాసమావేశాలకు ఎంతెంత దూరభారమైనాకూడా లెక్కచేయకుండా విధిగా మిత్రులనుకూడా వెంటబెటుకొని హాజరై ఆయా విషయాలు గ్రహించినవి గ్రంథస్థం చేయించడం ఆ యా సంస్థలు ప్రకటించిన సారస్వతం ఏభాష లోనిదైనా (మరాటీ, అరవం వగైరా) కొనితెచ్చి తమ లైబ్రరీలో ఉంచడం, ఆ యా భాషాపండితులచే అవి చదివించి వానిలోని సారాంశాలు తెలుగులోవ్రాయించడం మొదలైనవాని మూలంగా ఎంతగానో వానితో నిరంతర సంబంధంపెట్టుకొని తమ సంబంధం ప్రజోపయోగకరమయ్యేటట్లు చేస్తూంటారు. ఈవిధంగా వీరు చారిత్రక సాహిత్యరంగాలకు ఎంతగా కట్టుబడి జీవితాన్ని అంకితంచేస్తున్నారో నిరూపితమౌతూంది. స్వవిషయం కించిత్తూ చూచుకోకుండా ప్రతిక్షణం సేవారంగానికి శ్రీ తిమ్మరాజుగారు జీవితాన్ని అర్పించారని పైవిషయాలు సంగ్రహమైన ప్రబలసాక్ష్యాధారం కాదా!

ఇహ, శ్రీ తిమ్మరాజుగారిచే సన్మానితులైన ప్రముఖులను, వారిచే ప్రకటింపబడిన చారిత్రక సారస్వత గ్రంథాలను తెలిసికొంటే పైరంగాలలో వారి విస్తృత సేవాకార్యక్రమం వెల్లడౌతుంది.

శ్రీ కాశీ కృష్ణాచార్యులు, శ్రీ దివాకర్ల వేంకటావధాని, శ్రీ కుందూరి ఈశ్వరదత్తు, శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి, శ్రీ పెనుమెచ్చ సత్యనారాయణరాజు, శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి, శ్రీ తెన్నేటి కోదండరామయ్య, శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ, శ్రీ డాక్టర్ త్రిపురనేని వేంకటేశ్వరరావు, శ్రీ పిల్లలమర్రి మార్కండేయశాస్త్రి, శ్రీ ఏలూరుపాటి అనంతరామయ్యమొదలగు కవి పండితులకు వేయినూట పదార్లనుండి నూటపదార్లవరకు వివిధంగా సన్మానములు, కనకాభిషేకాలు చేసారు. ఇంకా ఎందఱెందఱో ప్రాచీన శాస్త్రపండితులనుండి అధునాతనభాషా కవిపండితులవరకు పెక్కురు వారిచే వస్త్రయుగ్మములచె సత్కరింపబడ్డారు. కొందఱ్ని సభాముఖంగా కొందఱిని ఇంటిపద్దను సత్కరించి పంపిస్తూండేవారు. ఎవరికి ఏమిచ్చినది (వేయినూటపదార్లు ఇచ్చికూడ) పైకివెల్లడించడం వారిలోఏనాడూ లేదు చాలమంది కొంచెమిచ్చి గొప్పగా ప్రకటించుకుంటూంటే శ్రీ తిమ్మరాజుగారు విశేషంగాఇచ్చి ఏమి పైకి తెలియనిచ్చేవారుకారు. ఏదో గుట్టుగా చరిత్రకి సాహిత్యానికి సేవచేయడమేకాని అప రచ్చకెక్కించుకొనే అట్టహాసం ఎంతమాత్రం వారిలోకన్పట్టదు. ఇది వారి వదాన్యతా వినయసంపత్తి కుదాహరణం.

వారు కృతిపొంది ప్రకటించిన గ్రంథాలు బుద్ధగీత, రాజానందం, సాహిత్యసమ్రాట్, కవిరాజు జీవితం, కరిమ్రింగిన వెలగపండు, ఔచిత్యవిచార

చర్చ, జంఘాలశాస్త్రి క్ష్మాలోకయాత్ర, మునుమూరి కాపయనాయకుడు మొదలగునవి. "నరేంద్రుడు" వారి కీ. శే. కుమారుని చరిత్రతో అంకితమైనగ్రంథము. భాషోద్ధరణమునకై కృతులు వెలువరించాలన్న ఉబలాటమేకాని వారికి కృతులు అంకితం పొందాలన్న ప్రత్యేకాభిలాష ఎప్పుడూలేదు. వారు అంకితముగా కోరకున్ననువారి కంకితమిచ్చిన గౌరవం పొందడానికి కవులు వారైచేసిన అంకితగ్రంథాలే అవి. అంకితం పొందకుండా ఊరకే ప్రకటించిన కృతులే హెచ్చు. ఆర్యచాణక్యుడు, కాకతిప్రోలరాజు, భవిష్యపర్యము, పండిత, నేతాజీపాల్కర్, రాజావీరబల్, శ్రీహర్ష శీలాదిత్య, కమ్మకుల చరిత్ర, పశ్చిమచాళుక్యచరిత్ర, ఆంధ్రనాయకశతకము, సింహాద్రినారసింహశతకము, విదురనీతి, ఖడ్గెన నీతిముక్తావళి, గోస్తనీమాహాత్మ్యము మున్నగునవెన్నెన్నో ప్రకటించారు. ప్రకటించిన పుస్తకాలలో సగం కృతికర్తకిచ్చివేసి మిగిలినవి వారు ఉచితంగా పంచిపెట్టుకొనేవారు. పుస్తకంమీద వెల వేయడమేకాని ఉచితంగానే అన్నిపుస్తకాలు పంపక మైపోతూండేవి. వీనిలో వందలపుటలలో బృహద్గ్రంథాలుకూడా వున్నాయి. శతకాలలో ఆ కవుల జీవిత విశేషాలు ఔనన్న చరిత్రవిజ్ఞులచే విపుల పీఠికవ్రాయించి ప్రకటిస్తూండడంవల్ల కవులు సారస్వతంతోపాటు తమచరిత్రతోకూడ ప్రసిద్ధికి రావడమందు వారికి విశేషాభిలాషగావుండడం తెలుస్తుంది.

ఇవికాక ఇప్పుడు కొమ్ములుతిరిగిన కవి పండితులను, చరిత్రజ్ఞులను సుమారు రెండువందలమందిని ఎన్నికచేసి వారిచేత అపునన్న వ్యాసాలు అడిగి వ్రాయించి వ్యాసకర్తల ఫోటోలతో జీవిత చరిత్రలతో సహా " సాహితీవాల్లభ్య " మనే పేరుతో వేల సంఖ్య పుటలతో సంపుటాలుగా ప్రకటిస్తూన్నారు ప్రథమ సంపుటం ఇపుడు విడుదలౌతూంది. ఈరకం సారస్వతోపయోగకరమైన బృహద్గ్రంథం ఇంతవరకు పుట్టలే దనేచెప్పాలి. ఈగ్రంథసంపుటాలు చదివితే సంస్కృతంలోగాని తెలుగులోగాని తెలియని కావ్యాలూ, అందని విశేషాంశాలూ,చరిత్రలూ వేవేవుండవు. ఈసంపుటాలు భాషాపరిశ్రమ చేసేవారికేకాక ఉత్తమ పండితులకు కూడా విజ్ఞానాన్ని ప్రసాదించే మహోపకారకములైన గ్రంథాలు ప్రతియింట, ప్రతిగ్రంథాలయమందు స్థిరంగా దాచిపెట్టుకోవలసిన మహోద్గ్రంథాలివి ఇది అందఱూ చేపట్టి చేయగలపనికాదు. డబ్బున్నా వ్యాససంగ్రహణకు పడేతిప్పలు అందఱూ పడలేరు. శ్రీ తిమ్మరాజుగారు ఆ యా కవి పండితుల గ్రామాలకు కారుమీద విసుగువిరామం లేకుండా నిత్యయాత్రగా పయాణంచేసి కొన్ని సంవత్సరాలుగా సేకరించిన భండారమిది. అందఱినీ సత్కరించి సంపాదించి ముద్రించి ప్రకటించిన మహోజ్వల వ్యాసరాజాలతో విరాజిల్లే మహాగ్రంథములివి ఏవినశించినా ఇవి నశించడానికి వీల్లేదు, అజరామరములైబాషావిజ్ఞులగు కవిపండితులకు చరిత్రజ్ఞులకు తప్పక అవశ్యపఠనీయ సంపుటములివి కావడంవల్ల భారత, భాగవత, రామాయణాల్లాగ, ప్రభుత్వ సాహిత్య అకాడమీ వారు ప్రకటించిన నిఘంటుసంపుటాల్లాగ ఇవి ఆచంద్రార్కం ఉండిపోయేగ్రంథాలు. అందుచేత వీనిని ఆంధ్రదేశంలో అందరియిండ్ల అందేవరకు పునః పునః ముద్రణము జరిపించి ప్రకటించేభారం శ్రీ తిమ్మరాజుగారు తమ తర్వాత తమ కుటుంబంవారుకూడ తప్పక వహించేవిధంగా ఏర్పాటుచేసి తీరాలి అని మనం ఆకాంక్షించక తప్పదు.

ఇవికాక ఎన్నెన్నో అముద్రిత గ్రంథాలను శ్రీ తిమ్మరాజుగారు సేకరించి భద్రపఱచారు. ఆచార్య వినోబాభావే పేదప్రజానీకాన్ని ఉద్ధరించడంకోసం భూదానోద్యమం గ్రామదానోద్యమం ప్రారంభించి భూములు, గ్రామాలుకూడ దానంగా స్వీకరిస్తూన్నట్లు శ్రీ తిమ్మరాజుగారు భాషోద్ధరణకోసం ప్రతిగ్రామం

వెళ్లి పూర్వులు రచించిన ముద్రిత అముద్రిత గ్రంథాల్ని అడిగి దానంగా స్వీకరించి చిన్న పెద్ద గ్రంథాలు, తాటాకుల సంపుటాలు, ఆయాకవుల ఛాయాచిత్రాలు ఏన్నోతెచ్చి తమ మేడ పై అంతస్థు అంతా నిండిపోయేటట్లు బీరువాల్లో భద్రపరచి యుంచారు. ఎన్నెన్నో అలభ్యమైన పుస్తకాలుకొని భద్రపరచారు. హిందీ, ఇంగ్లీషు, తెలుగు భాషలలో వారి గ్రంధభాండారములో దొరకని పుస్తకమంటూ వుండదు. ఎవరికీ కావలసినా ఇచ్చి అది వారు చదివేరో లేదో అని దానిలోని ముఖ్యాంశాలు వారిచేత వ్రాయింపించి తెప్పించి విని జాగ్రత్తచేస్తూంటారు. అనుక్షణం ఎవరినో పిలిపించి ఏదో విషయంమీద పరిశోధనా పరిశ్రమకు పురమాయించి అందుకు అవసరమైన గ్రంధాలు వారికి సప్లయిచేస్తూంటారు. తమదగ్గరలేకపోతే ఎచ్చటనున్నా కొని తెప్పించి అందజేస్తూంటారు. నిరంతరం ఒకరిచేత పరిశోధనా పరిశ్రమ చేయించడం అంటే వారికి ఎంతో సంతోషం కల్గించేవిషయం.

ఇంతతో సరిపోలేదు వారి భాషోద్ధరణ తృష్ణ. అముద్రిత ప్రాచీన తాళపత్రగ్రంధాలు తగిన పండితులను పిలిపించి వారిచేత పాఠభేదాలను సరిచేయింపించి శుద్ధప్రతులను వ్రాయించి జాగ్రత్త పెడ్తూండడం వారికి మహాయిష్టం. ఎక్కడా ఇప్పుడు లభ్యం కాదనుకుంటూన్న 'శివయోగసారం'అనే బృహద్గ్రంధం తాలూకు వివిధ పాఠభేదాలతోనున్న పెక్కు తాళపత్రగ్రంధాలు తెచ్చిపడేసి శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారిచేత పరిశోధింపజేసి వేలాది పద్యాలతోకూడిన ఆ గ్రంధానికి శుద్ధప్రతి తయారుచేయించి యుంచారు. ఆ శివయోగసారంలోని కృత్యాది పద్యాలలో ఎంతోమఱుగుపడి వెలుగులోనికిరాని చారిత్రకాంశా లుండడంవల్ల ముచ్చుకి కృత్యాదిపద్యాలుమాత్రం ప్రత్యేకం అచ్చువేయించి ప్రకటించి కవిచరిత్రలు రాజచరిత్రలు వ్రాసే వారికి ఎంతో సందేహనివారణంచేసి ప్రయోజనంచేకూర్చారు.

ఇంకా వివిధప్రదేశాలలోనుండే పెక్కురు కళావేత్తలను కవి పండితులను దర్శించి వారితో నిత్యపరిచయం పెంపొందించుకునేటందుకంటూ ప్రతి సంవత్సరం కొన్నినెలలు కారుమీద యాత్రచేస్తూ ఆ యా కవిపండితులను వారి యిండ్లవద్ద సాలుకొకసారియైనా కలుస్తూ సారస్వతవిషయంగామాత్రమే కాకుండా వారి కుటుంబ యోగక్షేమాలు, బిడ్డపాపల అభివృద్ధులు, సంబంధ బాంధవ్యములు తెలిసికుంటూ ఒక మహా అప్తమిత్రుడిలాగ సంచరిస్తూంటారు. వీరు స్వయంగా గడపత్రొక్కి పలుకరింపని కవి పండితచరిత్రజ్ఞుల గృహంలేదనే చెప్పాలి. వారివారికి అవసరమైన సహాయం అందజేస్తూ కుటుంబ సభ్యునిలాగ మెలగిపోయే మహామృదుహృదయం శ్రీ తిమ్మరాజుగారిది. ఇట్టివారు ఎవరుంటారు ? పూర్వం కవులను పోషించినరాజులు, జమీందారులుకూడ ఎంతెంతదానాలుచేసినా ఇంతగా చేరికగా బంధువుల్లాగ అనుక్షణం కుశలం కనుక్కుంటూ సాయపడేవారులేరు. వీరిలో ఇన్నిసారస్వత సుగుణాలను నిజంగా మనం చూడగల్గుతున్నామంటే ఆంధ్రభోజ, సాహితీవల్లభ అనే బిరుదాలు వీరికి తప్పకుండా సార్ధకమైనవే అని చెప్పితీరాలి.

ఉపమానపదాలు ఎక్కడా ఉపమేయపదం కంటె అనేకరెట్లు అతిశయంగానే వుంటూండడం ఆలంకారిక సాంప్రదాయమే. ఎక్కడాకూడా ఉపమాన సాదృశ్యం పూర్ణంగా ఉండనేఉండదు. ఉపమానగుణాలు ఉపమేయంలో కొన్నైనా ద్యోతకమవుతూండడమే కవిసమయం. అందుచేత అక్షరలక్షలిచ్చే భోజరాజుయొక్కపదం ఎల్లా సార్ధకమౌతుందని గాని సాహితికి వల్లభత్వం ఎల్లా సిద్ధిస్తుందనికాని సందేహ

పడడం శుద్ధ పొరపాటు   భోజాదులు అక్షరలక్ష లిచ్చినా (సరిగ్గా అక్షరానికి లక్షరూపాయిలు చొప్పున లెక్క పెట్టి ఇచ్చారనేది సత్యమేనా !) అను నిత్యం ఆవ్యాయం ప్రకటించి అందర్నీ ఆదరించలేదు. గ్రంథాల్నీ వ్రాయించనూలేదు. శ్రీ తిమ్మరాజుగారు ఒక్కసారి ఆదరించారంటే జన్మ అంతా ఆ ఆదరం అల్లా వుండవలసిందేకాని వీసం వారిలో ఎప్పుడూ తగ్గదంవుండదు. కాన భగవంతుడు వీరికి చిరాయు రారోగ్యాలు ప్రసాదించి ఇంకా సారస్వతసేవ చేయించాలని అక్షరాస్యులైన వాడల్లా కోరితీరాలి.

# శ్రీ ముళ్లపూడి వంశచరిత్ర

ఆంధ్రదేశమునందలి కమ్మ, కాపు, రెడ్డి, వెలమ బలిజ కులములు చరిత్రను కూలంకషముగ తఱచి చూచినప్పుడు ఈ కులాలవారు ఎవ్వరును ఆదిలో జన్మతః శూద్రులు కారనియు సూర్య చంద్ర వంశ సుక్షత్రియులనియు స్పష్టపడగలదు. సుక్షత్రియులు కొందఱు వేదమతమునుమించి కులవర్ణ వివక్షతలేని జైన వీరశైవ మతములు ప్రబలినకాలములో నామతములందుజేరిరి అప్పుడు వారు తమ క్షత్రియ కుల నామమును త్యజించిరి. దానితో వారి క్షత్రియ వంశ పూర్వకధలు క్రమముగా విస్మృతములైనవి. క్షత్రియనామము విడిచినను క్షత్రియ గుణము వారి నెవ్వరిని విడువనేలేదు. ఆ గుణము రక్తము నంటి పరంపరా నేటివరకు వచ్చుచునే యున్నది, ప్రజారక్షణముకై వారు రాజులై రాజ్యము నేలుచునే వచ్చిరి. కాని వారిని కులవాచకమగు క్షత్రియ పదము మాత్రము విడిచినది.

క్షత్రియకులముగా గాకున్నను వారు తమ మూలపురుషుల పేర్లతో ప్రత్యేక వంశనామములను వహించిరి. చలుకరాజు మూలపురుషుడుగా కొందఱు చాళుక్యులను వంశనామము వహించిరి. చోళరాజు పేరున కొందఱు చోళులు, కాకతిరాజు పేరున కొందఱు కాకతీయులు ననబరగిరి. పూర్వ క్షత్రియ వంశములలోగూడ కౌరవులు, యాదవులు, ఐక్ష్వాకులు, వార్ష్ణేయులు ననువారు ఆయా మూలపురుషుల పేర్లతో ప్రత్యేక వంశ నామములు వహించినవారే

ఈ విధముగా నేర్పడిన కులములలోనిదే కమ్మకులము. కమ్మరాజు చరిత్ర పురాణ ప్రసిద్ధమైనది. అతని తర్వాతివారు ఆ పేరుతో 'కమ్మవారు' అని పిలువబడిరి. ఆ కమ్మవారే ఉచ్చారణ లో[పము]తో కమ్మవారుగా స్థిరపడిరి. ఈ కమ్మరాజ యొక్క సంతానములోని 'కాకతి' యను రాజ యొక్క సంతతియే కాకతీయులనబడిరి. ఇదంతయు చారిత్రిక శాసన వాఙ్మయాధారములతో నిరూపింప బడిన సత్యము.

ఈనాటి పశ్చిమగోదావరి మండలమున కమ్మవారి వంశములందు సుప్రసిద్ధమైన శ్రీ ముళ్లపూడి వంశమువారి విశిష్టత శ్లాఘాస్పదము. ఈ వంశమున మమకారము హెచ్చుకాని అహంకారము మచ్చునకును కానరాదు. శాంతవినయ గాంభీర్యములకు కాణాచి ముళ్లపూడి కులము. తణుకు పట్టణములో శ్రీ ముళ్లపూడి తిమ్మన్నగారు మంచి భూస్వాములు. తణుకు పట్టణ స్వాములు. శ్రీ తిమ్మన్నగారి యాత్మీయత యనాటి పాలకులకును హర్షాస్పదమయినది. శ్రీ తిమ్మన్న జమీందారుగారికి బావగారయిన దొమ్మేరు జమీందార శ్రీ పెండ్యాల రాయుడుగారు వియ్యంకులునైనారు

శ్రీ తిమ్మన్న జమీందారు గారికి పుత్రసంతనము లేకపోవుటయు నొక విశిష్టతకు హేతువైనది పెండ్యాలవారి దౌహిత్రులు, కాల్దరి గ్రామస్థులును శ్రీ ముళ్లపూడి తిరుపతిరాయుడుగారి కుమారులు శ్రీ వేంకటరాయుడుగారు తిమ్మన్నగారికి దత్తపుత్రులైరి

శరత్కాలములో విజయదశమి పండుగులలో శైశవమున వేంకటరాయుడుగారు గురువుగారితో తోడి విద్యార్థులతో గిలకలబద్ద ధరించి కాల్దరినుండి తణుకు గ్రామము తమకు తండ్రివరుస బంధువులగు శ్రీ తిమ్మన్న జమీందారుగా రింటికి గురువునకు దక్షిణ లిప్పించు నిమిత్తమున వచ్చిరి. తిమ్మన్న

అమరజీవి

# శ్రీ నరేంద్రనాధచౌదరి

శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ

సాహితీవల్లభ శ్రీ ముళ్లపూడి తిమ్మరాజు గారి ద్వితీయ పుత్రుడు కీ॥ శే॥ నరేంద్రనాథ చౌదరి ది 5—4—1927 న జన్మించెను. ది 27—9—1942 న అస్తమించెను. "ఋషీవాలీ" పాఠశాలలో విద్యాభ్యాసము గావించెను. జీవించినది అత్యల్పకాలమే. కాని ఆ కొలది నాళ్లలోనే దాన దయా క్షమాగుణాలు అంచులు ముట్టమెఱఁగి "ధన్యజీవి" యనిపించుకొన్నాఁడు. "కలిమి ఆత్మోపభోగమునకుఁగాక దుఃఖార్తుల బాధానివారణమునకే వినియోగించవలె" నను సిద్ధాంతమును జీర్ణించుకొన్న మిన్న. గడ్డములు నెఱసిన వారికిఁగూడ పాఠములు చెప్పగల జీవితాదర్శము మెఱయించినదిట్ట. నూఱు సంవత్సరముల తమ జీవితకాలములో చేయఁగల్గియు చేయలేని పనులను చిన్ననాఁడే చేయఁగల్గిన మేటి. సుగుణాల పేటి. పై గుణములకు నరేంద్రుని జీవితకాలములో మిత్రులమధ్య, బంధువులమధ్య నడిచిన పెక్కు ఉత్తరముల సాక్ష్యాధారములు చూచి, సరస్వతీ కంఠాభరణ, విద్వాన్ శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు "నరేంద్రుఁడు" అను పద్యకావ్యమును రచించిరి. ఆ కావ్యమునుండి కొన్ని ఘట్టములిందు ఉదహరింపబడినవి.

సా. సం.

---

'ఋషీవాలీ' విద్యాభ్యాసము.

చాల పొడగరి సరిగ మోకాలువరకు
దిగిన బాహులు, చెవిదాకి యెగయుకనులు
సన్ననగు కౌను చామనచాయ మేను
సవదరించిన యొక బాలచంద్రుఁడతఁడు.

ఎడఁదలో కరుణాబ్ధి నిరుగడన్ బరపించు
పొడుగుచేతులు వింతబెడఁగుఁదీర్ప
శాంతమై యమృతనిష్యందమౌ హాసంబు
వదనచంద్రుని కళాన్వదునొనర్ప

అంచరెక్కలమించు మంచిదుస్తులు మేని
పొడవున కొకమంచి తొడవుఁజేర్ప
కరుణాతరంగిణీఝురపాతములు 'కండ్ల'
వెడలుపునకు నొక్క వెలుఁగుఁగూర్ప

కూర్చినటు లేర్చి సరిదిద్ది తీర్చినట్లు
సమవిభక్తాంగములు క్రొత్తసొరుఁజేర్ప
మురిపెముంగూర్చు మోహనమూర్తి యతఁడు
మూర్తికిందగ్గ సుగుణసంపూర్తి యతఁడు.



అమరజీవి శ్రీ ముళ్ళపూడి నరేంద్రనాధచౌదరి.

చౌదరీ ! విద్యావివాదంబులో మధ్య
  వర్తివై మా న్యాయమూర్తివగుము
చౌదరీ ! యాటపోటీదాడీలో మాకు
  నాయకత్వమున సేనానివగుము
చౌదరీ ! మన నటసమ్మేళమున నీవు
  వీరనాయకపాత్రధారివగుము
చౌదరీ ! మా పేదసాదలం దయఁజూచి
  దాతవై విద్యావిధాతవగుము

అనుచు ప్రేమించి తోడివిద్యార్థులెల్ల
చౌదరీ ! చౌదరీ ! యని సాదరమున
నుండఁగ నరేంద్రుఁడొక నరేంద్రుండువోలె
నేలుకొనుచుండె నా 'ఋషీవాలి' బడిని.

చౌదరీ ! చౌదరీ ! యని సాదరమున
ఎంతొ విద్యార్థులట గౌరవింతురతని
హృదయకమలాలి విచ్చి సమ్ముదమునొంద
మిత్రుఁడై వారినెల్ల ప్రేమించునతఁడు.

## కందుక క్రీడ

ఆది సాయంసమయమ్ము బాలకులు క్రీ
  డారామ భూమీస్థలిన్
గుదులై గుంపులుగూడి ఖేలనములో
  నుత్సాహశీధుద్రవా
స్వదనోన్మత్తమనస్కులై స్వపర ప
  క్ష న్యాయచర్చావదా
వదులై యాడిరి కందుకప్రహతు ల
  భ్రంబుచ్చి తూటాడగన్.

ఒక్కొక్కతాపు తాపునకు
  నుచ్చి నభమ్మునుండి పెచ్చికల్
రిక్కలతో పెకల్చి పగ
  లే రివురివ్వున రాలబంతితో
నెక్కడఁజూడ తానయగు
  చీగతికందుకఖేలన క్రియా
చిక్కణమైన కౌశలము
  చే రహియించె నరేంద్రుఁ డచ్చటన్.

ఓటుగెల్పులలో ప్రాణ మొడ్డివైచి
రెండుపార్టీలు బలిసి కేరించినిలిచె
రెబ్బటీలు ప్రీతి నొక్కపార్టీకి వాహి
నీంద్రుఁడై నిల్చినాఁడు నరేంద్రుఁడంత.

ఆటలోమది తన్మయమ్మగుట నెదిరి
నోటువుచ్చి జయమ్ము డబ్బాటుగొనగ
ఎగిరెగిరిపడె తలక్రిందులుగ నొకం, డు
ఖెత్తుగా, మోము బ్రద్దలై నెత్తురోడె.

అంతటి యాట యొక్కపరి
  యాగిన దందఋగుంపుగూడి రం
తంతట జీర్ణవస్త్రముల
  కై పరువెత్తిరి కట్టుగట్ట నా
ప్రాంతములందు; దానిఁగని
  పట్టునఁజీలిచి లాల్చి యశ్రుల
త్యంతము నోడగాఁదడిపి
  తానయికట్టె నరేంద్రుఁ డాదృతిన్.

ఓడికలుగట్టు నెత్తురువీడఁ దుడిచి
గట్టిగ నుబుకు నెత్తురు పట్టినొక్క
గుడ్డపొడిగొట్టి లోతుగా కూరిపెట్టి
కట్టుగట్టె నరేంద్రుఁ డా గాయమునకు.

అట జమీందారుబిడ్డలే యందతైన
బట్టలకు లోపమేలేనివారలైన
సమయవిస్ఫూర్తిగా సాహసమ్మె సున్న
అంతలోనున్న దాసూక్ష్మ మరసికొన్న.

## ఎక్స్‌కర్షన్

అది డిసెంబరునెల చలి యపరిమితము
గజగజ వణంకుచున్నారు కప్పుకొనియు
రైలులో వారలెల్ల రా రాత్రియందు
ఏవో సర్దుచునుండె నరేంద్రుఁడొకఁడు.

బలిసి యెక్స్కర్షనునకని బయలుదేఱి
యరసి ఢిల్లీని, తిరుగు ప్రయాణమందు
బడలి నిద్రించి రా ఋషీవాలి బాలు
రెల్ల; కావలియుండె నరేంద్రుఁడొకఁడు.

పెట్టెలోనున్న సాలువ విప్పి కప్పి
అక్కలకుకొన్న హాంబట్టుహౌసులేసు
వనితనపు జిలుగుచీరలన్ పైకితీసి
సరుకు లిటునటు పెట్టెలో సర్దుచుండె.

సర్దుకొన కొంత ముందుకుజరిగి సాల్వ
వెనుకకొన దేనికో పట్టుకొని పెనంగు
చుండెనని వెన్కకు దిరిగిచూచి యట్టె
కనుగొనల వేడిబాష్పముల్ గార్చినాఁడు.

బక్కచిక్కిన శతవృద్ధుఁడొక్కఁ డచట
పండుకొని నిద్రలో చలి మెండుకొనగ
కొనలువడి వెచ్చఁదవిలిన తనదు సాల్వ
కాలికిందార్చి లాగుటం గాంచినాఁడు.

వెంటనే మది వేడెక్కి వెన్నవోలె
కరఁగిపోయెను చలియెటో సురిగిపోయె
సాలువాతీసి నిండిన సానుభూతి
గండుకొన వృద్ధు నొడలెల్ల గప్పినాఁడు.

బాష్పముల్ చూపు నవరోధపఱచె నైన
నంతతో తృప్తి వడయలేదతని దృష్టి
తడివి యిటునటు పరికించి కడఁగిచూచి
ఎదుటిబల్లపు దృష్టి సారించినాఁడు.

అస్థిపంజరమాత్ర శిష్టాంగములకు
శిథిలపాంసుల శతపరిచ్ఛేద గాత్ర
సంఘటిత జీర్ణవస్త్ర మాచ్ఛాదనముగ
వణఁకు నిరుపుర సోదరీమణులఁ గాంచి

తలఁచినాఁడు దేశదౌర్భాగ్యమును లోన
విరిసి కనులవాన గురిసినాఁడు
పైకిఁదీసినట్టి పట్టుచీరలఁ గప్పి
యక్కలనుచు వారి నరసినాఁడు.

శతమునకుమైని వెలగల సాల్పులిచ్చి
తనకునై బావ స్వీయముగా కొనుచునిచ్చి
నూరునకుమించు విలువైన చీరలిచ్చి
అక్కలకు ప్రేమతోడ కొన్నట్టివిచ్చి.

కృత్రిమము డాంబికమ్ముల యింతలేని
సహజమౌ ప్రేమ ముంచును సాగనేసి
మనసునకు బంధుగౌరవము, ధనము గనము
వారిముందర నొకబలాదూరుగాదె!

### సహోదరహృదయము

"ఎల్లరను శిక్షయున్న శీలిల్లుమంచి
రెల్లరను ప్రాణమున్న ప్రీతిల్లుమంచి
'రాత్మవత్సర్వభూతాని' యని తలంచి
యెవ్వనికి నెట్టి శిక్షల నిడను మన్న!"

పాఠ్యగ్రంథమ్ములోఁ బద్యభాగమిట్లు
పైకిఁజదువుచు భావంబు వంటఁబట్ట
కన్నులరమూసి ధ్యానించి తన్ను మఱచె
శ్రీ నరేంద్రుండు 'ఋషివాలి'లోని గదిని.

'దొరికినాఁడు దొంగ, దొరికెను దొరికె' నం
చరికినాఁడు లోనికొక్క మిత్రుఁ
డదరి బెదరి చూచె నా నరేంద్రుఁడంత,
నంతరాయ మయ్యె ధ్యానమునకు.

'దొరికెను, తోటమాలి మన
దుర్గఁడు, నీ మణియుంగరమ్ముతో
దొరికె, నదృష్టవంతుఁడవు,
తోడ్కొనిరమ్మనినారు ప్రిన్సిపాల్
దొర నిను, రమ్మ, రమ్మనుచు
తొందర సేయఁగ నంతనాత్మలో
మెఱపు తళుక్కనన్ మెఱయ
మిత్రునితోడ నరేంద్రుఁడున్ జనెన్.

'పోయినదెపుడో యుంగర
మాయది యిపుడెట్లు దొరికె, నద్భుతముగదే!
నా యభియోగమ్మది లే
కే యొక్కనిఁ బట్టుకొనుట కేమికతంబో!'

అనుచు స్వగతముననె, ఆత్రత మిత్రుండు
లాగుచుండ నాతఁడేగుచుండె,
వాక్యభాగమందు పద్యభావము దారి
లోన, లోన నూడలూనుచుండె.

"దుర్గన్న మనయింటిదొంగ యీశ్వరుఁడైన
పట్టలేఁ డీనాఁడు పట్టుపడియె
ముసలిముసలి కెట్టిబుద్ధులుపుట్టెనో
ప్రాంతదోరి యింక పైకివచ్చు
బహుమూల్యమైనట్టి వజ్రాంగుళీయమ్ము
పోవఁగా ఫిర్యాదునీవ దేమి
నీవభియోగమ్ము నీకున్న నేమాయె
ఆనోటనానోట నదియెపాకె

మదనపల్లిబజారులో మనసఖునకు
దుర్గఁడమ్మఁగఁజూపఁగా దొరకెనంట
పట్టితెచ్చెను ప్రిన్సిపాల్ వద్ద కతఁడు
పాపమది యెన్నటికినైన పండకున్నె?

పదిమంది బిడ్డలుండిన
ముదివగ్గుకు నిట్టిబుద్ధి పుట్టందగునే!
తుదిదినము దగ్గరించెను
గదె దుగ్గని కిపుడు, ప్రాఁతకథలుండేలున్."

అనుచు పలికె మిత్రుఁ, డంగలువైచుచు
నేగినారు వారి లిరువు రంత
మూఁగినారు వారిముందు బాలకులెల్ల
'దుగ్గిగాఁడు దొంగ దొంగ' యనుచు.

ఎన్నొ మాసమ్ము లిచ్చుచున్న చౌదరి వస్తు
వపహరించుట పాప మనెడువారు
ఊర్మికాహీనమైయున్న చౌదరిహస్త
మిఁక కాంతు లీనునం చెంచువారు
దుర్గన్న పనినుండి తొలఁగ చౌదరి వాని
పనిపట్టవలె నంచు పలుకువారు
సన్మార్గపరుఁడౌట చౌదరి యంగుళీ
యక మేటి కెదురీదె ననెడివారు

నగుచును నరేంద్రుఁజుట్టును నగుచుఁ జేరి
చౌదరీ! చౌదరీ! యంచు సాదరముగ
చేతులను, లాగు, చొక్కాయి చెఱగు లూని
లాగుకొని ప్రిన్సిపాల్ వద్ద కేగినారు.

అదియొక పెద్దహాలు, బడి
యందలి బాలుర, నెల్లబోధనా
పదమున వేత్తలైన గురు
వర్యులనున్ పరిషత్తుఁదీర్చి రా
ప్పదముగ; ప్రిన్సిపాలు నొక
విష్టరమం దుపవిష్టుఁడయ్యె, పత్
తుదలు, సులోచనంబుల సు
లోచనముల్ వెలిదీప్తులీనఁగన్.

ప్రిన్సిపాలుకు ప్రక్కగా వెనుకగోడ
కానుకొని ముసలిదుగ్గఁడు గూనినడ్డి
మొగము వ్రేలాడ, బాష్పసంపూర్ణనేత్ర
యుగ్మమున్ దుడ్చుకొనుచు నిల్చుండియుండె.

అది శిక్షావిధిఁ దీర్చునట్టి పరిష
త్తంద ఱైక్యమ్ముగా
తుదినిర్ధారణ దీర్చుచుందర చటన్,
దుర్గన్నయుద్యోగమున్
గదలింపన్ దుదితీర్పుతీర్తురిఁక నే
కగ్రీవులై; 'ముద్రియ
య్యది నాదే' యని శ్రీ నరేంద్రుఁడును స్వీ
యామోదమున్ దెల్పగన్.

'వచ్చెవచ్చె నరేంద్రుఁ' డన్ పలుకు, లలఁ
ల్లోలి యూగాడె వెనుకకు ముందునకును
అందఱు నరేంద్రురాక కానందపడిరి;
దుర్గఁడొక్కండుమాత్రమే దుఃఖపడెను.

శాంతగంభీరమైన యాస్యంబునందు
దివ్యహాసంబుతో 'నమస్తే' యటంచు
వినయమున ప్రిన్సిపాలుకు ప్రణతినెఱపి
శ్రీ నరేంద్రుండు ప్రక్క నాసీనుఁడయ్యె.

'అనుమతిని దెల్పు సోదరీ!' యనుచు ప్రిన్సి
పాలు మెల్ల నరేంద్రునివైపు తిరిగి
'చర్చలన్నియు జరిగె, నీసమ్మతికి నె
వేచియున్నది సభ, తీర్పు వినుతు వినుము;

నీయది అనర్ఘమౌ నంగుళీయకమ్ము
దొంగిలించుట దుర్గనుద్యోగ మిపుడు
బర్తరఫుచేయఁబడె, వాని వర్తనంబు
కోర్టునకుఁదెచ్చి బాలకుల్ కోలుపడిన

వస్తువులఁగూడఁ దెప్పించి వాని ఖైదు
నకును ద్రోయంగ పోలీసులకు 'రిపోర్టు'
చేయఁదలఁచితి, మిఁక నాలసింపనీవు
ననుమతినిఁ దెల్పు సోదరీ! యనియె; సంత

నిస్తరంగమయ్యె నిఖిలసభాసీమ
శ్రీ నరేంద్రుఁ డేమి చెప్పునొకో
వినఁగవలయునను వీనులు నిక్కించి
యాలకింప నిల్చి రందరపుడు.

అంతయు నాలకించి మన
సంతయు గందరగోళమంది వి
శ్రాంతికి ధ్యానమూని నిము
సంబు; మనోఫలకంబుపైని స
శ్వంతగ తండ్రి తిమ్మవిభుఁ జేర్చి
యెదో యెదా భావవీథిలో
మంతనమాడి, సోదరి స
మస్థితిఁగూర్చెను చిత్తసీమునన్.

జనకు హృదయమ్ము వినలోనఁ జదివి చదివి
ఆత్మమథనమ్మునన్ దేలినట్టి యమృత
మోక్షమూలమ్ము లందుండి మొలిచి, నవ్వు
వెలికిఁ జిందఁ నరేంద్రుఁడు పలికెనంత.

"పోవనేలేదె అంగుళీముద్ర నాది!
ఈయనేలేదె అభియోగ మే నెవరికి!
ఇందు దుర్గని శిక్షింపనేమికలదు!
ఇంత సభచేసి చర్చింపనేమికలదు!

పూర్వమొకనాఁడు ముద్రికపోయెననుచు
నేను నాగరి వెదకితి నిజమె; పిదప
నద్ది మా తండ్రిగారిట కరుగుదెంచి
నపుడు కొనిపోయి, రదినేఁడు జ్ఞప్తివచ్చె.

నాయదియెకాదె యింతకు నంగుళీయ
మెవ్వరిదొ యేమొ! యియ్యది యెఱుఁగువరకు
దుర్గనికి దొంగతనమును దొడుగనేల!
నితని యుద్యోగమిపుడు మాన్పింపనేల!"

చెప్పి యిటు శ్రీ నరేంద్రుఁ డాసీనుఁడయ్యె
తెల్లమొగములువైచిరి యెల్లవారు
ప్రిన్సిపాలొక్కఁడు నరేంద్రు హృదయ మెఱిఁగి
ఎత్తుకొని ముద్దులాడి స్తుతించినాఁడు.

## విద్యాసేవ

లోనిస్వచ్ఛతదుస్తులలోనె తెలియ
ఎడఁద కరుణార్ద్రకనులలోనుడులు దిరుగ
*తెడ్డువరకు 'షికారు'గా దిరిగి మఱలి
యరుగుచుండె నరేంద్రుఁడొక్కరుఁడు నాఁడు.

వలకకొనుమంచు పొత్తమ్ము వలయుననుచు
కొంగుపట్టీగ్చి యేడ్చెడి కొడుకుఁగాంచి
కూలిపనిచేసికొను పేదరాలొకర్తు
ఎదుటదారినిఁబోవు నరేంద్రుఁజూపి

'అట్టిడబ్బున్నబాబుల కగునుగాని
కూలికేడ్చెడి యీ దిక్కుమాలినట్టి
మనకునీఁక విద్దెకూడనా' యనుచునంత
కనుల ముత్యాలసరులదేపనిగ దాల్చె.

బిరబిరా కాలుసాగించి వెడలిపోవు
నా నరేంద్రుని చెవిసోకి యట్టెలాగె
'అట్టి డబ్బున్నబాబుల కగునుగాని
మనకునీఁక విద్దెకూడనా' యనినమాట.

వెంటనే కంటతడివెట్టి వెనుకకరిగి
'ఏమి ముసలమ్మ! వాపోయెదేలయిట్లు
నీవుపనిచేయు యజమాని నీదుసుతుల
చదువునకు నింతమాత్రమ్ము సాయపడఁడొ!'

అనుచు పలికిన పలుకులో నమృతమాని
కొంగుపట్టీడ్చు బాలకున్ గుస్తరించి
పాపమా పేదరాలిట్లుపలికె నంత
'అంతభాగ్యమ్ముకూడ మాకగునెబాబు!

నెలతిరిగిపోయె జీతమ్మునీయఁడాయె
లెక్కలని డొక్కలని యేవొ చిక్కులనుచు
జరుపునేకాని శడుపుకక్కురితినెంచి
చూడఁ డిఁక విద్యకూడ నా! పాడుబ్రతుకు,

వానిమాటకు గడగడ వణఁకిపోయి
చేతులరుగంగ చాకిరీ చేసియున్న
మెప్పునకుమారు చీవాట్లు తప్పవెపుడు
నాయన! చదువునకుకూడ సాయపడున!'

అనిన పై వాపె బాధల వినగలేక
అవ్వ! యిఁక నీదుపిల్లనికైనఖర్చు
చదువులకు దుస్తులకు నేనొసంగువాఁడ
నదియె మాబడి యపుడపు డటకురమ్ము.

అనుచు తనజేబులో చేయిజొనిపి తీసి
యేమొసంగెనొ! అవ్వ కొండెక్కిపోయె
ఏదియోతోచి రేచన నరేంద్రుఁడంత
నిలువకలద్రొక్కు మనసుతోనేగె బడికి.

## సూర్యోపాస్తి—అంగులీయక ప్రదానము.

అదియొక సుప్రభాతము
శుభాశిషమంగళవేదగానముల్
మొదలిడసాగె సద్ద్విజన
మూహము; లెబ్బనివన్నెసంచులన్.

* 'తెడ్డు' అనునది మదనపల్లితాలూకాలోని ఋషివాలీ బడి కొకమైలు దూరమునగల పల్లె, అందు కూలి నాలి చేసికొను పేదజనులు నివసించుచుందురు.

రాజ్యమ్మునకుతగ్గ రాజుగల్గెనటంచు
రామరాజ్యమ్ముఁ దలంచువారు
బంధుజనులును, మిత్రులు, పరులు, భృత్యు
లెల్లరును ప్రేమ విరిసి రంజిల్లి, పల్ల
వింప నుల్లంబు లనుదినవృద్ధిఁగనుచు
నెంతొ సంతోషపడిరి నరేంద్రుఁజూచి

అరవమింగ్లీషు కన్నడమ్మాంధ్రభాష
నాల్గుభాషల మాట్లాడగల్గు నతఁడు
తిరిగి కనుగొని భారతదేశమెల్ల
ననుభవమ్మెంతొ గడియించినాఁడతండు.

తనబసకు బాపయిడిన సౌధమ్ముపైని
నొక్కగదిలోన మన నరేంద్రుండెవేవొ
ఈలపాటలలో కులాసాలగించి
సరుకు లిటునటు మార్చుచు సర్దుచుండె.

అంత యనాధదీనజనతాదరణ ప్రవణమ్ము వాని సు
స్వాంతము, మేడక్రింద పసివాఁడొకఁడా చలి
గాలిలోన న
త్యంతము బాధతో వణఁకుచార్చుచు బిచ్చము
వేడుచుంట తా
నింతటి తన్మయుండయి చరించుచుఁ గాంచె
నరేంద్రుఁ డాదృతిన్.

మేడపైనుండియే వానిమీఁదపడఁగ
పట్టుచొక్కాలు లాగులు బట్టలెన్నొ
దబదబా క్రిందవైచె, నాతనిని కవులు
కవితకెక్కింప కూరుకొఁగలరె యింక.

లెక్క లెన్నాళ్లయైనదొ లేనెలేదొ
యాతఁడటవచ్చి పరిజను లందఱతని
పట్టివదలరె! యెన్నెన్ని బట్ట లాతఁ
డెపరికొనఁగెనొ యన్యోన్య మెఱుఁగరెవరు.

నాన్నయెఱుఁగక తాతయ్యనడిగి కొన్ని
తాతయెఱుఁగక మఱి నాన్నచేత కొన్ని
అక్కచేఁగొన్ని బావయ్య నడిగి కొన్ని
బట్ట లెన్నెన్నొ కుట్టించివైచినాఁడు.

అన్ని చొక్కాలు లాగులు నన్నికోట్లు
తనకునని కొని వానిని తఱుకులోన
కొన్ని దొమ్మెరులో కొన్ని యన్ని పేద
కూలి జనులకు దానధర్మా లొనర్చె.

విలువయెఱుఁగఁడు చేతికి వెడలినన్ని
బట్టలేకాదు దొరికినవట్టు నెన్నొ
ధనము దస్కమ్ము లడిగినంతనె యొసంగు
వచ్చి యడుగనివానిదే పాపమంతె.

చిన్నదొరగారిదొ హాయా మెన్నఁడందు
కొనునొ యని యూరుచుండి రాకుఱ్ఱవాని
నరసి మురియుచు సేవకు, లాఁత డెంత
మంచితనపుమన తీపి తిన్పించినాఁడొ !

మామిడితోటకుం జని క్రమ
మ్మున వేలకువేలు కాయలన్
ప్రేమమెలర్పగా తనకు
విద్యలనేర్పెడి నొజ్జలిండ్లకున్
గ్రామములోని పేదలకు
కానుకలంపును కూరగాయ లే
మేమియొ నిత్యమంపు నని
యెల్లను తాతయగారి పేరితోన్.

చూడ కొకకొన్ని పీని మఱి చూచి కొన్ని
తాత రాయండు తిమ్మభూధపుఁడుతండ్రి
సహజదానాభిరతికి నుత్సాహపడిరి
కలిగెఁగా పేరునిలిపెడి మొలక యనుచు.

పూనగరాని పౌనా! "పరిపూర్ణ
శతాయురుపేతజీవినై
యేను సుఖింతు నంచు నెవఁ
డేనియు పూచివడంగఁజాలునో,
నే నిపు డుంటి రేఁపటికి
నేమగువాఁడనొ చెప్పఁ బోలునో!"

అను తుదిమాటలన్ వినిన
యంతనె తిమ్మనృపాలుఁ డెద్దియో
మనమున చేయి దూరిచి య
మాంతముగా కలయంగఁబెట్టిన
ట్లైనసిన "ఎందుకిట్లు పలి
కించితినొ యిది ప్రాణగొడ్డమై
నను బ్రతుకున్న కాలము తు
నాతునకల్ విదళింపకుండునే!"

అని దిగాల్పడి లోపల నణఁచి బాధ
"పాపము శమించుఁగావుత, ప్రతిహత మ
మంగళమ్మగుఁగావుత" మంచుపలికి
బాలు నాగోష్ఠి మఱలించివైచి పంపె.

అస్తమయము

ఒకటి రెం డిఁక మూఁడు నాళ్లకట! యిట్లు
నలువదియొకంపుగా లంఘణములువడియె
నాఁటికి నరేంద్రునకు, నదేలాటిజ్వరమొ
చిక్కి జీర్ణించి శల్యావశిష్టుఁ డయ్యె.

*భాస్కరుఁడు కేవల మ్మింటివద్దనుండి
'కండ్ల'లో వస్తు లిడుకొని కాచికొనుచు
వైద్య మొసరించియుండినన్ ఫలముగలదె
ఆపగింజంత ాయువే నద్దకున్న?

అద్ది దుస్సహ దుఃఖ దురంత దుష్ట
దిన విషమవేళ నాఁ డుషస్సున నదేదొ
సూర్యమండలమును మహాజ్యోతి యొకటి
మెఱసి భేదించుకొనిపోయె నెఱుఁగ రెవరు.

అంతటిదాక యాకసమునంత
తళత్తళ నూత్న కాంతు లా
శాంతముఁ జిల్కరించి తడియారని
చిక్కని కీర్తి రోచు లిం
తంతట నిల్పి జ్యోతియొక
టంత హఠాత్తుగ పర్వుఁదీసె లో
కాంతరసీమ కంతటి
మహత్తరకార్య మదేమి కల్గెనో!

కలక కలనూతనోజ్జ్వల వికాసము దేలిడి
నవ్వుమోముతో
నొలయు సుభాప్రపూరమున నొక్క
మహోన్నతభావవీధిఁ బ
క్కలిగిలిగింతలన్ ప్రకృతికిన్ దఱిలేని
హుషారుఁగూర్చునా
కలికి గుణాలపేటినిఁకంటికిగాననీవు దుర్విధీ.

ఇంత అపసవ్యమైనట్టి మృతినిచింత
'మరణమన్నది ప్రకృతిధర్మం' బటంచు
'మహికినియ్యది దైవమర్మం' బటంచు
మెట్టవేదాంతముల దిగమ్రింగఁగలరె!

చూడలేదు తిన్నజాడయైనను లేదు
వాయువశముఁజేసి పరిమళమ్ము
మూరుకొన్నవారు మొగ్గజారుటకేడ్చి
రన్న కన్నకడుపు నాపవశమె
ఓరి పాపిష్ఠిదుష్టవిధీ! రవంత
కనికరము లేకయె నరేంద్రుఁగన్నతల్లి

* డాక్టరు తటుకు భాస్కరరావు L.M.&. గారు శ్రీ ముళ్లపూడివారి గృహవైద్యులు. వారి యింటి ప్రక్కనే కాపురముమన్నారు

కడుపులోఁ చిచ్చు రగిలించి కట్టుకొన్న
మూటయేమిటొ యింత దుర్బుద్ధియేలొ.

## సాంత్వనము

విత్తనమునాటి మొలిపించి వివిధగతుల
పెంచి పోషించి యాపయి పెల్లగించి
పారవైచిన వనమాలి భావ మేదొ
పైకి వివరింపఁగల్గు వివక్షువేడి ?

ఆద్ది నీ దని యొక పెద్దయానసఁగొలిపి
వెలివడగరాని మమకార మలవరించి
నీదికా దని యంతలో నెట్టివైచు
భగవ దాంతర్య మెఱుఁగు విపదిషువేది ?

అమృతమున్నది మఱి హాలహలమునున్న
దబ్ధిమాత్రము దేనికి నంటువడదు
దైవప్రకృతికి వ్యంగ్య చిత్రమ్ము లివ్వి
వాస్తవముఁగ్రోలు భావపిపాసువేఁడి ?



శ్రీ ముళ్ళపూడి వెంకటరాయుడుగారు



శ్రీమతి ముళ్ళపూడి అక్కమాంబగారు



శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు దంపతులు, శ్రీ తిమ్మరాజుగారి సోదరీమణులు.

# శ్రీ ముళ్ళపూడి వేంకటరాయుడుగారు

శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ.

శ్రీ ముళ్ళపూడి వేంకటరాయుడుగారు 1857 సం॥న తణుకుతాలూకా కాల్దరి గ్రామమున శ్రీ ముళ్ళపూడి తిరుపతిరాయుడుగారికి శ్రీమతి బుల్లి వెంకమ్మగారివలన జన్మించిరి. కొవ్వూరు తాలూకా దొమ్మేరు గ్రామమునందు జమీందారు శ్రీ పెండ్యాల రాయుడుగారు వీరికి మాతామహులు. శ్రీ వేంకటరాయుడుగారిని తణుకు గ్రామమునసబు శ్రీ ముళ్ళపూడి తిమ్మన్నగారు వారు సతీమణి ఆశాలమ్మగారు దత్తపుత్రులుగా స్వీకరించిరి. వీరి మేనమామలు శ్రీ పెండ్యాల అచ్యుతరామయ్య గారు. శ్రీ అచ్యుతరామయ్యగారు శ్రీ తిమ్మన్న గారికి అల్లుడు. శ్రీ వేంకటరాయుడుగారికి వారిమేన మామ కుమార్తెయు దత్తత తండ్రికి దౌహిత్రియు నగు శ్రీమతి అక్కయ్యమ్మగారినిచ్చి వివాహము చేసిరి.

శ్రీ వేంకటరాయుడుగారు అచ్చమైన రైతుబిడ్డ. భూదేవిని నమ్మి సేవించి అమె యనుగ్రహము వడసి సకల జీవితసిద్ధులు సాధించిన మహావ్యావ సాయిక కర్మవీరులు. ఎంతెంతగా సొమ్ము వెచ్చించుటకైన వెనుకాడరు కాని భూమిమాత్రము ఒక్క సెంటుకూడ వదలుట సుతరాము నిష్టపడరు. కుమార్తెలకు సారెలకు, చీరలకు పసుపుకుంకుమ లకు లక్షలకొలదిసొమ్ము నొసంగిరేకాని స్వకుల స్థులు అందఱు నిచ్చునట్లు భూమిని మాత్ర మొసం గరైరి. వీరు భూదేవీ మహాభక్తులు. వ్యావ సాయికపు పనులన్నియు భూదేవీ పూజావిధులు గానే భావించి నిర్వహించిరి. ఒకప్పుడు వీరి వ్యాపారముచూచు గుమస్తాగారు పొలములో కలుపు తీయించుచున్న వీరివద్దకేగి 'ఈరోజున కోర్టు వాయిదాయున్నది, మీరు పొలములో కూర్చుంటే ఎట్లు! ఇది ఆఖరు వాయిదాగూడాను. ఇక వాయిదా ఇవ్వరు. మీరు రాకపోయిన కేసు వ్యతిరేక మగును అని చెప్పిరట. అప్పుడు శ్రీ వేంకట రాయుడుగారు చిరునవ్వుతో నేను రాకపోవుటవల్ల కేసు మనకు వ్యతిరేకముగా తీర్పయినచో అప్పీలు చేసికొని పైకోర్టులో గెలువవచ్చును. ఈ రోజున ఈ అదనులో దగ్గరనుండి కలుపు తీయించక పోయి నచో రేపటికి ఈ అదను ఆరిపోతుంది. ఈయేటి పంట దానితో నష్టమగును. ఏది ముఖ్యమంటావు అని గద్దించి పంపివేసిరట. ఈ ఉదాహరణము వలన శ్రీ రాయుడుగారికి వ్యావసాయిక కార్యక్రమ మందు ఎట్టి నిష్ఠాగరిష్ఠత యున్నది తెలియనగును.

"పాటుపడిన నెంతభాగ్యము కల్గునో, రైతు వృత్తి యెంత రమ్యమగునో" తొంబదేండ్ల తమ జీవితకాలమంతయు స్వయముగా వ్యవసాయము చేసి చూపి ఇట్లు చేసికొండని తెల్పి రైతులోకము నకే ఆదర్శ జీవితమును వెలార్చిన ధన్యజీవులు శ్రీ రాయుడుగారు.

"కష్టపడు టొకటె హేతువుకాదు సిరికి. కష్ట పడి సంపాదించిన సిరి ఏక యాజమాన్యముననే కదలకుండ నిలిచియుండు" నన్న సత్యమును చిరకాలానుభవమున వెలువరించిచూపిన ఆదర్శ జీవులు శ్రీ రాయుడుగారు.

శ్రీ రాయుడుగారు 18-2-43 తేదీని అస్తమించిరి. సుమారు 80 ఏండ్లు జీవించి సహస్రమాసాదిజీవు లనిపించుకొనిన అదృష్టవంతులు. (సహస్రమానజీవులకు భగవంతుడే చేయెత్తి మ్రొక్కునను పెద్దల నానుడికలదు.)

'హలముపట్టిన వాని మాహాత్మ్య నుతియె కలముపట్టిన జన్మకుగల ఫల'మ్మని తలచి సరస్వతీకంఠాభరణ, విద్వాన్ శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు 1943 సం॥న 'రైతురాయడు' అనుపేర శ్రీ రాయుడుగారి చరిత్రమును అప్రతిగ్రహముగా రచించి శ్రీ రాయుడుగారు చనిపోయిన పండ్రెండవరోజున సమర్పించు శ్రద్ధాంజలితో కలమును సఫలము గావించినారు. ఆ కావ్యము నుండి ఈ పద్యములు స్వీకరింపబడినవి.

సంపాదకుడు — సాహితీవాల్లభ్యము —

అది శరన్నవరాత్రమహస్సువేళ
గురువువెంబడి కొల్లగిపురమునుండి
బాలసైన్యమ్ము తమకుకు బార్లుదీరి
సాగి, విడసెను తిమ్మన చౌదరింట.

చక్కనగువాఁడు, సంపెంగ ముక్కువాఁడు,
చొక్కమగువాఁడు, జనపాలజుట్టువాఁడు.
డాబుదీరిన ముద్దు ముస్తాబువాఁడు,
ప్రేమగొలిపెడి ఆరేండ్ల పిల్లవాఁడు.

గిలకల్ బద్ద ధరించి శ్రీ విజయ ల
క్ష్మీజైత్రయాత్రా మహో
జ్జ్వల సంరంభ విశేషుఁడై జయజయ
ధ్వాన ప్రతిధ్వాన మ
గ్గలమందన్ 'విజయీభవా' యనుచు బు
క్కాకొట్టె ముత్తవ్వమేన్
పులకింపన్ ముళపూడి తిమ్మన మృదం
ఘోరాశి నోలాడఁగన్.

చేతులంజాపి యొడిలోకిఁ జేర్చినారు
పుడికి వాత్సల్యమున మేను దడివినారు
సుతులు లేరన్న చింతఁ దీర్చుకొనినారు
గురునిదోసిట రూకలు గుమ్మినారు.

బాబా! వేంకటరాయఁడా! యనుచు సం
భావించి ముద్దాడి పై
పై బా హల్లనసప్పళించి మన యీ
వంశాభి వృద్ధ్యర్థమై
'యీ బిడ్డండిఁక వేయియిండ్ల మొదలై
యేపారుగా'కంచు శ్రీ
ప్రాబల్యాన్వయ వృద్ధిచిహ్నము లెవో
భావించి రాదంపతుల్.

ఎత్తికొని మేడలోనికి నేగెనవ్వ
గురువుచెవిఁదాత యేదియో గొణఁగినాఁడు
దత్తుఁగొని రంత నాక శుభోత్సవము వేళ
రాయఁ డారాజ్యమున కొక రాయఁడయ్యె.

దినదినమ్ముకళల తీరు తియ్యము నొంది
పెరిగినాఁడు సర్వ మెఱిఁగినాఁడు
పాడి పంట పొలము వ్యవసాయమును తండ్రి
పెత్తనమ్ము చేతికెత్తినాఁడు.

పొలములో కాల్పెట్టి హలము లాగించెనా
బంగారుపాఁటలు ఖంగుమనియె
అదనున విత్తనాల్ వెదవెట్టఁజేసినా
రత్నగర్భ మణుల్ వరాలు నీనె
కట్టపై మే నాని గట్టుపై నిల్చె నా
పంటవెలంది సంబరముపడియె
చేతితో నిమిరి పచ్చిక గుప్పెఁడిడియెనా
గోష్ఠంబులో కుంభవృష్టి గురిసె

పట్టినదియెల్ల బంగారు పంటయగుట
ముట్టినదియెల్ల ముత్యాల మూటయగుట
పరువుఁగొన్నాఁడు సిరులు పాఁతరలుగాగ
రైతురాయండు వేంకటరాయఁడంత.

తిమ్మసదంపతు లెంతో
సమ్మదపడినారు పంటసంపద కిఁక పం
శమ్మభివృద్ధికినై తమ
యమ్మాయికుమార్తె యక్కయాంబికతోడన్.

కలిపినారుచేయి, కల్యాణ మొనరించి
కడుపుపంట కాసపడినవారు;
ఎల్లసంపదలకు హేతువై యేడాఁది
కవతరించె కవ క'నంతలక్ష్మి'

ఇంటిలోని లక్ష్మి యేఁటేఁట పెరుగంగ
పంటలక్ష్మి యింట వచ్చిపడియె
పైఁడి వెండి గోనుబస్తాల కెత్తించి
పెద్దపెద్దలాట్లు వెట్టినాఁడు.

అక్కయాంబగర్భ మది దోసపాదుగా
పండసాగె పొలము పంటతోడ
ఆరుగురుకుమార్తె లాత్మజుం డొక్కండు
పేరుగొన్న తాత పేరువాఁడు.

పదియునూర్లు నూరువందల యెకరముల్
విలిచినాఁడు, పేరు నిలిచినాఁడు
పాటుపడుచు పంటపండించి చెమటూడ్చి
రైతుపేరు నిలిపె రాయఁడొకఁడు.

లక్ష్మికంత యీడురాఁగ రాయండు దొ
మ్మేరు శ్రీ జమీనుదారు కిచ్చె
నంతకంతభాగ్య మభివృద్ధిగా నామె
పుట్టినింట కాలు మెట్టినింట.

బుగ్గమీసలు సింహపుంగర్జలే కాని
కమ్మని మృదుహృదయమ్ము వాఁడు
ధనసంగ్రహమ్ము సంస్థానవృద్ధికె గాని
నాణెంపుగుప్త దానమ్ము వాఁడు
వ్యవసాయ మది కులవ్యాపారమనికాని
లాభనష్టాల తౌల్యమ్ము వాఁడు
పెత్తన మ్మాదర్శవిధము చూపనెకాని
తిమ్మరాజన నమ్మకమ్ము వాఁడు

ఎడమ దెఱుఁగక కుడిచేత నిడినవాఁడు
కోర్టుకెక్కని చక్కని గుణమువాఁడు
శత్రువునకైన నుపకృతుల్ సలుపువాఁడు
రైతులకు కొమ్ము ముళపూడి [1]రాయఁడమ్మ.

పైకిఁ జూచి యెదురుపలుక జంకన్వలె
లోనఁ జూచి మెచ్చి లోఁగవలయు
పలుకు వజ్రమయము భావ మమృతమయం
బతని 'పోలసీకి' నది నయించె.

1 రాయడమ్మగారని వాడుక పేరు.

ఎల్లరును నతని మాటకు నెదురులేక
చెల్లుబడిచేసినార లింటిల్లిపాది
అదియె కారణ మపజయ్మనునదాతఁ
డెఱుఁగకుంటకు భాగ్యమ్ము పెరుగుటకును.

ఎన్నిపనులభార మున్న నెంతటిహితు
లున్న పాలికాఁపు లున్నఁగాని
స్వయముగాఁగ నన్ని పనిపాట్లు చక్కఁగా
చేసిమించె నతని శ్రీ వరించె.

రామచంద్రబుధుఁడు రాజ్యాంగములు దీర్చ
రాయఁ డింద్రభోగరాజ్య మేలె
మంత్రిచేత రాజు మఱి మంత్రి రాజుచే
వెలసినారు కీర్తి బలిసినారు.

తానై కోర్టున కెక్కలేదెపుడు నం
తంతాస్థిలో రైతులన్
తానై మార్చుటఁగాని సిస్తులకు ర
క్తాల్‌పిల్చి పీడించుటల్
గానీ, కాన మశీతివత్సరములున్
రాజ్యమ్ము పాలించుచో
నీ నీతిన్ నడిపించునట్టి నృపు లే
రీ! వేళ్ల లెక్కింపుఁడీ!

అడిగిన లేదననే దెవఁ
డడుగక యిడలేదు కష్టమందక యురకే
ఒప్పగనటనె భయము పడెదరు
చిన్నబడిపడు ననుచు కష్టజీవితు నతనిన్.

పాటుపడిన నెంతభాగ్యమ్ము కల్గునో
రైతువృత్తి యెంత రమ్యమగునొ
చేసిచూపి యిట్లు చేసికొండని తెల్పె
తొంబదేండ్ల జీవితంబునందు.

ఇతరులకేలా! యంతటి
సుతునే మనుమలనె యురక పోషరితనమున
జతగూడకుండ కష్ట
స్థితిసహనము నేర్పెఁ గష్టజీవియగుటచేత.

దుఃఖములమధ్య సౌఖ్యసందోహమెంతొ
పడయుమార్గమ్ము తాత్త్విపల్ సుడివినారు
కష్టపడునెడ నెంతభాగ్యమ్ము కలదొ
రాయఁడేచూపె నిది చరిత్రమున రెక్క.

'రత్నగర్భమ్ము మనది; ప్రయత్నపడక
నిద్రపోవుదు రేల! దరిద్రులారా!
చేతులం జాపి యొరుల యాచింపనేల?
రాయనిం జూచి నేర్చుకోరాదె మీరు.'

'రాయఁడుగారిపేరు విన
రా! కనరా! యటతణ్ణులోనఁ గ
ష్టాయుతమైనయట్టి వ్యవ
సాయములో నెటువంటి భాగ్యల
క్ష్మీయుతమైనజీవితవి
శేషముఁజూపెను? చూచి నేర్చుకొం
డాయన లోకమందు ముదు
రాయిత జీవితుఁడై చిరాయువౌ'

అనుచు నింటింట పోమరులైనసుతుల
మందలించుట పరిపాటిమాటయయ్యె
రైతుచరితమ్ము నెవరైన వ్రాయునెడల
ప్రథమతస్థానమందె మా రాయఁ డుండు.

మూఁడుజిల్లాలలో మూఁడువంతులుకానె
నిలిచినాఁ డిలనెల్ల వెలిచినాఁడు
వంశమ్ము దశదిశావ్యాప్తమై వెలుఁగొంద
పెంచినాఁ డభినుతిం గాంచినాఁడు

లక్షలక్షలు సారె లంపించి తనయలం
దనిపినాఁ డెల్లరను మనిపినాఁడు
బంధుత్వములు పలిపడకుండ వియ్యముల్
గలిపినాఁడు సత్కృతుల్ సలిపినాఁడు

చేయఁదగునన్ని తనచేతఁ జేసి, తాను
ధనము సంపాదనమున కాదర్శముగను
తనరి, ఘనమున కీర్తి నాదర్శముగను
విలిచికొను మని సుతుని దీవించినాఁడు.

తననాల్కకొనమాట తలఁ దాల్చురాఘవ
రాముండు శ్రీ తిమ్మరాజు సుతుఁడు
తన నీడబాటలన్ దాటని సుతసుతుం
డల రంగరాడ్జు మీఁదార్పిభుండు.
తన గీయుగీటు తప్పని ముద్దుపౌత్రుండు
సత్యవంతుఁడు హరిశ్చంద్రరావు
తనమాట వేయి రత్నాలమూటగనెంచు
ననుఁగుపౌత్రిక యచ్చయాంబదేవి

అడుగులందడుగు లిడుజాయ యక్కమాంబ
మమత సేవించు కోడలు కమలమాంబ
కలసికొలువంగ కౌటుంబ కలహములకు
సందిడక రైతురాయం డెసంగినాఁడు.

నిశయిది, చిత్రభానువు, పు
నీతము మాఘము, శుద్ధమౌ చతు
ర్దశియది, తొమ్మిదయ్యె, మన
రాయఁడు తృప్తిమెయిన్ ప్రపౌత్రునా
స్యశశి నిజాననంబునను
చక్కఁగఁ జేరిచి ముద్దులాడి న
ద్యశము నుడించి స్వర్గపద
మందె నదెంతటి పుణ్యమూలమో ?

"నాయన ! యెంతయెంతగ
ధనమ్ము గడించిన నీకు కాకనే
పోయెన ! యెంత దుర్దశను
పొందితి వయ్యయొ ! అయ్యో ! నా నరేం
ద్రా !" యని యంత్యకాలమున
నగ్నిని మ్రింగి [1]ద్వితీయపౌత్రునిన్
బాయఁగలేక వానికయి
స్వర్గముఁ జేరెను రాయఁ డార్తిమై.

రంగరావు హరిశ్చంద్రరావు, సుతులు
నెల్లరను పౌత్రుతోడ రంజిల్లియింక
రాఁగలుగుకాలమున తిమ్మరాజుఁ దనకు
మారుగాఁ గొల్తురని స్వాస్థ్యమందినాఁడు.

కష్టపడుటొకటె హేతువుకాదు సిరికి
అమరు నది యేకయాజమాన్యమ్ము నందె
నాదునగ్ని పరీక్షకు నాగినాఁడు
తిమ్మరాజింక నాపెత్తనమ్ము నడుపు.

నన్నుఁ బోలి నీవు నడుచుకో మీరును
నన్నుఁబోలె నితని నెన్నుకొనుఁడు
సర్వమునకు రామచంద్రుఁడే కలఁడని
సుతుకు మనుమలకును జూపినాఁడు.

ఎంతవ్రాసిన నిఁక నెంతయేని కలదు
భానునిం దివ్వెతో చూపుపగిది కోడి
అపుకొన్నాఁడి కలము ప్రయత్నమునను
నమసిపోలేదు నోట రసస్రవంతి.

---

1 శ్రీ తిమ్మరాజుగారికి కమలాంబవలన గలిగిన మొలక నరేంద్రనాథచౌదరి, ఈ బాలచంద్రుడు 5–4–27న ఉదయించి 27–9–42న ఉదయం 5–10 ని॥లకు అస్తమించెను.

హాలముపట్టినవాని మాహాత్మ్యమతియె
కలముపట్టిన జన్మకుఁ గ్రలఫలమ్ము
కలము హాలములె భరతభూఖండమునకుఁ
నగుసిరుల్ నాఁడు నేఁడు నేనాఁడుఁగూడ.

ఆకసమ్మున తారకాలోకమందు
నధిక విస్ఫూర్తిగను జ్యోతిరాత్మతోడ
నున్న శ్రీరాయనికి పరంజ్యోతి యొసఁగు
శాంతిసతతమ్ము నోమ్‌శాంతి శాంతి శాంతి.

## ఆశీస్సు

"కష్టసహనమ్ము సంపద భాగ్యమ్ము కలదు
హాయిగల దేశయాటవసాహసమ్ము సంపద"
రాయనికుటుంబ మిది యుపరామునకుగ
మనిచి నిలుపుత రైతురాయని ప్రతిష్ఠ.





శ్రీ పెండ్యాల శ్రీరామచంద్ర వెంకటకృష్ణ రంగారావుగారు



శ్రీమతి శ్రీ పెండ్యాల అచ్చాయమ్మగారు

# శ్రీ పెండ్యాల వేంకటకృష్ణరంగారావుగారు

జననము :— 16—5—1911 * * * అస్తమయము :— 21—3—58.

శ్రీ పెండ్యాల వేంకటకృష్ణరంగారావుగారు 16–5–1911 లో తణుకులో జన్మించిరి. వీరి జనకతండ్రి నిడదవోలు వేంకట్రామయ్యగారు. జనకతల్లి నారాయణమ్మగారు. వీరిని దొమ్మేరు జమీందారు కుటుంబమున పెండ్యాలవారికి దత్తత యిచ్చిరి. దత్తత తండ్రి పెండ్యాల వేంకటకృష్ణారావుగారు, దత్తతతల్లి అనంతలక్ష్మీదేవిగారు. వీరి దత్తతస్వీకారమహోత్సవము 11–11–1921న జరిగెను. వీరిభార్య అచ్చాయమ్మగారు (శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి ప్రథమ కుమార్తె)

శ్రీ రంగారావుగారి బాల్యము తాతగారగు శ్రీ ముళ్లపూడి వేంకట్రాయుడుగారింట గడచెను. వీరు జమీందారీ నిర్వహణ కవసరమగు శిక్షణను శ్రద్ధగ శ్రీ వేంకట్రాయుడుగారియొద్దనే పొందిరి. శ్రీ రంగారావుగారు తమ మేనమామలు, మామగారునగు శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి యొద్ద కూడ వ్యవసాయరంగమందును, జమీందారీ నిర్వహణ కవసరమగు మెలకువలను కూలంకషముగ గ్రహించిరి.

శ్రీ రంగారావుగారు దొమ్మేరులో జమీందారుగను, భూస్వామిగను చక్కని పేరు సంపాదించుకొనిరి. వీరు తమయొద్ద పనిచేయు సిబ్బందిని, వ్యవసాయకూలీలను, పేదసాదులను ననేక విధముల వారి సాధక బాధలను తెలిసికొనుచు సంరక్షించిరి. అర్థికి ధనరూపముననుు, మాట సహాయమువలనను కోర్కెలు తీర్చుటలో వారికి వారే సాటి. సొగసైన నిండైన విగ్రహము వీరిది. శత్రువును మిత్రునిగ జేసికొని విజయము సాధించు ప్రజ్ఞాప్రాభవములు గలవారు. వ్యవహార దక్షత, కార్యదీక్ష, నిర్విరామకృషి యిత్యాది సద్గుణ గరిష్ఠులు.

సిరిసంపదలకు నోచుకొన్న వ్యక్తి శ్రీ రంగారావుగారు. వీరికి నలుగురు పుత్రులును, ఎనమండుగురు పుత్రికలును జన్మించిరి.

అక్కాయమ్మ (27–7–31), వేంకటరమణమ్మ (13–9–33), రామలక్ష్మి (10–1–36), అనంతలక్ష్మి (10–9–38), సత్యనారాయణమ్మ (28–12–42), వేంకట్రాయుడు (4–6–45), నరేంద్రనాథచౌదరి (20–7–48), కమలాదేవి (12–9–50), వేంకటకృష్ణారావు (31–5–53), అచ్యుతరామయ్య ( ), రంగనాయకమ్మ ( ), ఉష ( –10–58).

శ్రీ నిడదవోలు సురేంద్రనాథచౌదరి, శ్రీ నిడదవోలు మృత్యుంజరావుగారలు వీరి జనక సోదరులు. దుక్కిపాటి లక్ష్మీకాంతం, ముళ్లపూడి చంద్రమతీదేవి వీరి సోదరీమణులు.

శ్రీ రంగారావుగారు పి. సి. సి. మెంబరుగను, M. L. C. గను, జిల్లాబోర్డు మెంబరుగను అనేక పదవులందుండి ప్రజలకనేక విధముల సేవ సల్పిరి. ఏలూరు కాలేజీస్థాపన, నిర్వహణలలో వీరి కృషి అపారము.

తణుకు పట్టణమునగల ఆంధ్రషుగర్స్ స్థాపనకు తమ మేనమామ శ్రీ ముళ్లపూడి తిమ్మరాజు, బావమఱది శ్రీ ముళ్లపూడి హరిశ్చంద్ర ప్రసాద్‌గారల కెన్నియో విధముల సహకరించిరి. శ్రీ రంగారావు, శ్రీ హరిశ్చంద్రప్రసాదుగార్లను కృష్ణార్జునులని కీర్తించెడివారు.

21–8–1949 న కొవ్వూరు రైల్వేస్టేషనుతో రైలు ఎక్కుచు ప్రమాదవశమున పడి గాయపడిరి. భగవంతుని కృపవలన వారా ప్రమాదమును తప్పించుకొనిరి. కాని భగవంతుడు వారికి పూర్ణాయుర్దాయము ప్రసాదించలేదు. వీరు తీవ్ర అస్వస్థులై అశేష బంధుమిత్రులను దుఃఖ సముద్రమున ముంచి 21–3–58 న, పరమ పదించిరి. వీరియాత్మకు భగవానుడు శాంతి ప్రసాదించుగాక.

శ్రీ రంగారావుగారి సంస్మరణార్థము కాకినాడలో రంగరాయ మెడికల్‌కాలేజీ స్థాపింపబడెను. వీరికుటుంబము వారు దానిస్థాపనకై భూరి విరాళ మందించిరి. అనేక ఉన్నత పాఠశాలలు కళాశాలలు స్థాపనలోగూడ వీరి భూరి విరాళములు గలవు.

---

— శ్రీ వేములు సూరి

1. పూర్ణిమన్‌జూడ చంద్రమోమో హనుడెటు
అస్తమింపడు తానెందు నర్థరాత్రి
పచ్చియౌవన మనుషాడబమ్మ త్రావ
మిత్తి నోరూటలూరి భూమిని నటించు.

2. ఆకటన్‌పొట్ట నకనకలాడువారు
కీర్తికై రేబవల్ ధరగేరు సఖులు
"కాటిలోబడె మానోటికూటి కరవ"
టంచు నీరోర్తు, రార్తులై ఆర్తురిపుడు.

3. పంటపొలతి ప్రాణమునకు ప్రాణమతడు
సస్యలక్ష్మికి ముఖ్య వయస్యుడతడు
స్నిగ్ధతాసుందరి కతండు జీవగఱ్ఱ
ఇంద్రునకుగూడ నతడు మహేంద్రుడటవె!

4. తప్తకాంచన గత ధగద్ధగలు వాని
దేహ పరమాణువులయందు తేజరిలును
చెఱకురసమూరు చూపుహసించు నతడు
మిత్తికింగూడ తియ్యమామిడి రసమ్మె!

5. అతనికి యంత్రరాజముల యందతికాంక్ష,
సరస్వతీసుత
ప్రతతియొనర్చు కార్యములపై మమకారము
మిత్రభావ సం
తతియన వెట్టితీపి, సరదారుల దారిరుచించు
నాతడే.
కతయయి కాలఘస్మరుని ఘర్మిత ఘస్రము
లన్ కనారిలున్.

6. ఆతనికతండె సాటియన
    నౌనన కాదనరాదుగాని బల్
బ్రదుకులు నిల్పునట్టి తన
    వాలు కనుంగవ మేటిచూపు లు
న్నతములు నెల్లవారల బె
    నంగెడు నెక్కటి మానటీని తీ
వితళుకు మేల్కనీనికలు
    వెన్నెలలార్చుట వానికేతగున్.

7. మాతామహుండైన తాతయ్య బగ్గమీ
    సల హాసునుండి నేర్చె శౌర్యపటిమ
ఆతాత నిలువెత్తు చేతి పొన్నుగఱ్ఱ
    తేపలనుండి పటిష్ఠత నును
చెవుల సంగాతమ్ము చేసి మీసాలరించు
    అ చూపుకోపుల రాచసిరియు
అంత స్రవంతియై అలలేచు ఉత్కరు
    ణాంతస్సునుండి సౌహార్దగరిమ

పుంజుకొని సంక్రమించిన మోహానునకు
రంగనికి తాతగారిదీర్ఘాయు వొకటి
మాత్రదక్కదు జడిసె అస్పృశ్యాప్త
కిల్బిష మహోగ్ర సార్వభౌమాఘ్రాణతకు.

8. చిరుతేనె బొట్టర చేతిలోవేసి నా
    కించడు మోచేతివంపునుండి
ఆదివారమునాడు అందలమెక్కించి
    సోమవారంనాడు జోలిసీడు
ఐనవారికి గుట్టుదాపులలో బెట్టి
    కానివారికి పైడికంచమిడదు
గోముఖవ్యాఘ్రాలు హూపస్థమంతాక
    భావులీతని తరవారికరులు

తాను వలచినదేరంభ, తానుమెచ్చ
గుంటయే గంగయంచు వాకొననివలతి
కాకులనుగొట్టి గ్రద్దల కడుపునింపు
తత్వమే! గర్భశత్రుప్రపాతనికి భళిర!

9. అవదలు వచ్చి లేదనుచు
    నార్పుటకొల్లడు సూచనావిధిన్
మనవియొనర్పజాలు పెరిమన్ గ్రహియించును
    కోర్కెదీర్చి పం
పును. మొకమందు పెట్టినగవుల్
    మొకమిచ్చకముల్, చిరాకు, కో
పన, కనరాక యీాగలడు
    వానివి సర్వము గుప్తదానముల్

నీరులేని మెరకనేలను పాతాళ
గంగ తోడతదుపు రంగరావు
నీరుతెచ్చుటన్ భగీరథుడైనాడు
కమిలికుములు తనచు, కమతములకు.

10. బడబడ వాగడెప్పు మిత
    భాషి అతండొక నవ్వునవ్వ బో
లెడు రుచిరార్థ సంపద సి
    లీనమటన్ ఒకపల్కుపల్క గం
పెడు నెరభావమందు కనుపించి
    చిగిర్చి ఫలించు వానిలో
చిడిముడి పాటుకాన తన
    చిత్తము పెద్దసముద్ర మధ్యమున్.

11. భారమదెంత యైనను ప్ర
    పంచపటమ్మున భారతాన గొ
ప్పొరు కనంబడందగు న
    పూర్వమెదేని సృజించి అందు దొ
మ్మెరును మేళవించెద మ
    మేయ పరిశ్రమలావటించి, నా
ధోరణి నుత్సహించెడు బు
    ధుందత డెంతట నెట్టులయ్యెనో!

12. బొందిలోప్రాణమ్ము ముడివేసికొనియుండు
కాయమ్ము లేతవంకాయకాదు
జీవమ్మునకుమేని జిగురంటుకొనియుండు
బెండకాయయుగాదు దొండగాదు
అసువులు దేహమ్మునం దైక్యమయియుండు
ముదురక కోయగా పొట్లగాదు
జీవాత్మతనువుతో జీర్ణమైనట్లుండు
సొరకాయగాదు వేగిరముగోయ

పండవలె రాలవలె తినవలెనుగాని
పూపపిందెలు కాయలు పుణుకనగునె
ఎప్పుడైనను నీదికాదే! సమస్త
జీవరాశియు, ఓమిత్తి చెనటికాన.

13. తనలోదానెదియో ఒకానొక మహాధర్మమ్ము
నూహించి దా
నిని సిద్ధాంతముచేసి తత్పరత నిర్ణిద్రాతి
కర్తవ్య సా
ధన జాంఘాలిక సార్వభౌముడయి కార్తార్థ్య
త్వముంగన్నదా
కను నిద్రింపడు క్షుత్తునార్పడల రాంగారావు
సామాన్యుడే.

14. తాత, రాయని నందనోద్యానమందు
వెలిసి పెరిగిన ఒక కల్పవృక్ష మితడు
దీనినీడనె శ్రీ కామధేను వెపుడు
నెమరువేయుచు లేత చంద్రికలుగాయు.

15. రంగరాయుని నీవెట్లు మ్రింగినావు?
ఎటులు నరికితివీ కల్పవృక్షమెల్ల
మిత్తిరో! నిన్నుమ్రింగెడి మృత్యు వెప్పు
డెందవతరించునో, ఇది సందియమ్ము.

16. దొడ్డిలోమేరువు తొలకాడు దొమ్మెరు
పేరుసార్థకమౌట వీనివలన
వేదాంత కవివంటి విన్నాణులకుగూడ
కొంగుబంగార మీ రంగరావు
రాజకీయాలలో రాజరాజీతండు
పోటరిమేటి బడేడిబడికి
హేలాపురీ కళాశాల రధ్యక్షుడై
శారదాలయపు బూజాతియయ్యె.

ద్రావిడాంధ్రుల కైకమత్యమ్ము బలియు
సంతతి కితండు జనకుడై కాంతులొలికె
ఎన్నియో రత్నములలోన అన్నిదెసల
వెలుగనెంచుమా 'కోహినూ' ర్వెలితి యటవె!

17. పంచాస్యాన్యసటాచ్ఛటల్ విసరిబొబ్బల్ వెట్టి
ఆంధ్రాశరం (సర్వాశలం)
బంచారించెగి ఆంధ్రసేనకిరి భాండారమ్ముగా
'పర్సు'లన్
చంచాడించిన రంగరావునకు దైవమ్మా
సుధర్మాసభా
పంచాస్యానన మిచ్చుగాక అనుకంపన్‌కాదు
ధర్మాత్ముడై

18. ఆధేయము గతి చూడక
ఆధారము దీసివేయు నజునకు కలదా!
మేధాఖ్యాకపదార్థము
వేధకు సదసద్వివేక బీజమ్మేదీ!

19. నవ్వులేడ్పులు, శేలవల్, నలువకొకటె
మంచిచెడ్డల, భేదమ్ము నెంచలేడు
మిణ్ణు బల్లాలెఋంగని వెఱ్ఱిబోడ
ఎటులెఋంగగలాడు తాపృత్యుభుక్తి.

20. శ్రీ వాల్లభ్యమునంది తాతవికసిం
చెన్ నాడు మామయ్య వా
ణీవాల్లభ్యముతో విరాజిలుచు నెం
తేరెచ్చు రంగయ్య నా
కేవాల్లభ్యము వీడినాడనుచు యా
దృక్చింత గన్నాడొ! భూ
మీవాల్లభ్యముగాంచె, బావ మది
గ్రమ్మెన్ యంత్ర వాల్లభ్యమున్

21. అతనికి దేవభాషయన
నందఱికిం గల తీపిగాదు తా
సుతల కితండు ప్రప్రథమ
సూక్తులు నేర్పగ దేవభాషతో
జత అతికించినాడ పర
జన్మము నందున దేవభాషకుం
బతియగు కోర్కె తీరదగు
మాత్రలు వేసికొనెన్ మదీయుడై.

22. భూదేవి యెద్దాని పులిహోరవలెతించు
త్రేంచునోయంచు నూహించువాడు
పచ్చకర్పూరపు పాయసమై యేది
ధరకించునోయంచు తలచువాడు,
పంట వలంతికే పానీయమందు నా
ప్యాయమోయంచు దా రోయువాడు
ఏ పిండివంటలం దీహయో ధరకంచు
వేవిళ్ళు తీర్ప తపించువాడు

పుడమి పడతి కడిగి కుడువంగ దగినట్టి
వంటయింటి పసిడిపాత్రలెల్ల
కిలములేక గంధకితముగా దా సమ
కూర్ప నెంచువాడు కునుకులేక.

23. సారస్వతపు బంటకై రేబవల్ దున్ని
బీజాలుచల్లె నీర్వెట్టదలచె
పంటవలంతి వంటింటి కోసరము బు
నాదులుత్రవ్వె, కానంగనెంచె
ధరకు గార్త్స్వరతావికస్వర భాస్వ
రపు శోభకై సపర్యల నొనర్చె
అలరు రసాయన వ్యవసాయపు బిపాస
చేలకు తీర్చి రంజింపనెంచె

ఆనఖశిఖమ్ము విశ్వంభరాంగనాంగ
కంగ శృంగారిత చిరత్న రత్నదీప్తి
మృదిత తపనీయమయము పరిష్కరింప
నెంచినా, డంతవిధి కొంపముంచినాడు.

24. రంగనాయక నాటకరంగమందు
నయ్యె ప్రథమాంకమిక ద్వితీయాంకమందు
నగముకాలేదు వర్షాదికములు
భరతవాక్య మదాటుగా పాడిరెవరొ!

25. చిప్పిలురసమ్ముకయ్యు కన్నెపులు విచ్చి
ప్రేక్షకాళికి హృదయాలు విరిగిపడియె
బీజములు మొల్కలై లేచి పెరుగునంత
నాయకుడు మాయమయ్యె నీ నాటకమున

26. శ్రవ్యకావ్యము వ్రాసికోరాదె బ్రహ్మ
దృశ్యకావ్యమునకు కలమెత్తనేల!
'నాటకాంతం కవిత్వమ్మ'నా నెఱుంగ
డజుడు లేక ఇదే నవ్యతాయనమ్మొ.

27. అతనిపేరున నింక శతశతాధిక సంఖ్య
గతిలేనివారలున్ బ్రతుకవలయు
తన్నామధేయమ్ముదాల్చి శ్రీదేవితా
దేశమ్ములందు నర్తించవలయు
యంత్ర పారిశ్రామికాంత్రమై దేశమ్ము
చెలగుత మాదొరసిరికతాన

సారస్వతశ్రీకి చీరె సింగారించి
రవణింపవలెను మా రంగని సిరి

తనయజాత శతృత్వమ్ము దారిజూప
గుండెబలిసిన తద్యశోడిండిమమ్ము
విందులిడుగాక సర్వత్ర సందడించి
సర్వబృందారక శ్రవశ్చషకములకు.

28. ముదుపకలయందు భక్తియు, ముక్తిపైని
రక్తియు, విరక్తి కుజన కలాపమందు,
భక్తసంసక్త శక్తికానక్తి రంగ
కౌటచేజెల్లె 'సుకృతిగతాయు' వనుట.

29. మన్మథ మన్మథుడై యా
వన్మాత్రము లొంగడతని బాణములకు, దా
దన్మయుడు కాడు కానీ
తన్మైత్రిని విడని రంగధాము డితండే.

30. కాయలిటు రాలిపోయెడి కాలమందు
మింట నర్కుడు నిశి నస్తమింపరాదె!
అలరు దివి చుక్కలిలనప రాహ్ణమందు
పృథు మహారిష్టపేటి భవిష్యమేమొ!

31. పిడుగు పడ్డదిచెట్టుపై నడికిరేయి
పెద్దగా తియ్యమామిడి విత్తనములు
పెరుగుచున్నవి చివురుపై జివురుపట్టి
పూచికాచి ఫలింపగా నోచుకొందు.

32. ఎదయెంతతీపియో మెదడంత పదునుగా
నిగనిగలాడు మన్నీడు "రంగ"
హృదయమ్ములోతెంత పొదలాడునో అంత
భావోల్బణముగల ప్రభువు 'రంగ'

అంతస్సుమాధుర్య మెంతయో! అంతటి
పైప్రవడిగలవాడు రంగరావు
ఎన్నికమున్నీటి పన్నాగములలోని
తీవికి రావు మాస్టీడు 'రంగ'

కంటిలో తుమ్మెదలునవ్వు. పంటిపైని
పాలసంద్రపు గెరటాలు పరిమళించు
నగవుతెర లోలగించు నందమునందగిన
దొరలకు వటారు మా 'రంగ' దొరుకడటవె!

33. నవ్వులు పల్కులొల్కును, మనస్సు నమ
స్తము వెన్నముద్ద, బల్
పువ్వులగుత్తి నెమ్మొగము, ముద్దులు చిమ్మెడి
చూపు లొంపరల్
చివ్వలమాసపేడు కవిశేఖరులన్ మెలపించు
మేటి మా
రవ్వల రంగరావు కనరాడటె భౌతిక నేత్ర
లక్ష్యమై

34. బ్రదికిరహించె "రంగ" కనుపట్టడు భౌతిక
మందు రూప సం
పద ఆది ఎంత చూపగలవారము మాటల
లోన వచ్చి మా
హృదయది రత్న వజ్రలహరీమణి దర్పణ
మందు చూడుడీ!
చదువుడి మా హృదంతర రసప్లుత కావ్యము
తెల్లమయ్యెడిన్.





శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్ గారు



శ్రీమతి ముళ్ళపూడి చంద్రమతీదేవిగారు

# శ్రీ ముళ్లపూడి హరిశ్చంద్ర ప్రసాద్

( ఒక మిత్రుని చిత్రణ )

రచన : శ్రీ యర్రమిల్లి నరసింహారావు

ఆతను ఒక విశిష్టవ్యక్తి—అగర్భ శ్రీమంతుడు, రైతురాజు, కాని శ్రీమంతులు సాధారణంగా చూపించేదర్పం, డాంబికం ఆతనిలో కానరావు. కాని హుందా ఆతని నడక తీరులో, రూపులో, మాటలో ఉట్టిపడుతూ వుంటుంది. ఆ ముఖ వర్చస్సు, అ వ్యక్తిత్వం ఎదుటివానికి అతనిని ఒక ఉన్నత కుటుంబీకునిగా, విశిష్టవ్యక్తిగా పరిచయంచేస్తాయి.

అతడు నిరాడంబరుడు—నిర్మలుడు—శాంత స్వభావుడు—కాని ఆతనిలో ఆగ్రహం లేకపోలేదు. కాని ముఖంలో అది ప్రస్ఫుటంకాదు. శాంతమూర్తిత్వమునకే అది అంకితమైపోయిఉండాలి. బహుశా! తొందరపాటు, కలవరపాటు—ఇవి చర్యలలో కానివ్వండి! మాటలలో కానివ్వండి! ఆతనికి స్వభావ విరుద్ధమైనవి. అతడు గంభీరుడు ఒక్కమాటలో.

అతడు సంభాషణలో బహుచతురుడు. కాని సునాయాసంగా, అప్రయత్నంగాకూడా చతుర సంభాషణ సాగిస్తాడు. అది ఆతనికి వెన్నతో పెట్టిన విద్య. హాస్య సంభాషణను ఆరగిస్తాడు. అంతలో మితభాషిత్వం ఆవహిస్తుంది.

అతని ఆలోచనవేరు. ఆతని భావములు బహుశా ముందే నిర్దేశితములు. అవి సాధారణంగా మారవు. తాను భావించినదానికి విభిన్న ప్రవర్తనకు ఆయన ఆమోదం ఎదుటివానికి లభించిన ఉదాహరణలు అరుదు. మనవాదనా పటిమ, వాక్చాతుర్యం, ఆయనపై ప్రయోగించి ఒప్పించవచ్చునని ఎవరైనా భావిస్తే వారు పప్పులో కాలు వేసినట్లే! అట్టి ధైర్యంతో వెళ్ళినవారు నిరుత్సాహంతో తిరిగివస్తారు. అంత్య నిష్ఠూరంకంటె ఆదినిష్ఠూరం మంచిదని భావించేవ్యక్తి.

శ్రీ ప్రసాద్ వయస్సు 47 సం॥లు. జననం 28–7–1921 సం॥ చిన్నవయస్సుననే తన ప్రజ్ఞా ప్రాభవములను ప్రకటించుకొని, అపూర్వ విజయములను జీవిత వివిధ రంగములలో సాధించిన బహుముఖ ప్రజ్ఞాధురీణుడు. అకుంఠిత కార్యదీక్ష, అవిరళకృషి అతని జీవిత విజయమునకు సోపానములు. నిరుత్సాహము, నిస్పృహ అతని నిఘంటువులో లేవు. శ్రీ ప్రసాద్ గొప్ప అనుభవజ్ఞుడు. వివిధ సమస్యలను అత్యద్భుతముగా ఆకళింపు చేసికొనగలడు. అతని అనుభవము పండుబారినదా! అనిపిస్తుంది. దానిని పరిణతి పొందిన దశలో మనం అతనిలో చూడవచ్చు! వయస్సు ముదిరితే, జీవితపాఠములవల్ల చాల మంది అనుభవజ్ఞులౌతారు. కాని ప్రసాద్‌లో ఇది పూర్తిగా భిన్నమైనది. అతనుచేసే ప్రతి పని లోను ప్రజ్ఞ, ప్రాభవము, అనుభవము ప్రస్ఫుటమౌతాయి.

శ్రీ ప్రసాద్ గొప్ప శ్రీమంతుడు. అయినా అతడు డబ్బుకంటె కాలమునకే ఎక్కువ విలువనిస్తాడు. చేయిజారిపోయిన డబ్బు తిరిగి సంపాదింపవచ్చును, కాని గడచిపోయినకాలము తిరిగి

రాదనే సత్యమును అతడు గ్రహించినంతగా మరొకరు గ్రహించిరేమో అనిపిస్తుంది. అందుకే అతడు వ్యర్థ సంభాషణలకు విముఖుడు. ఇచ్చకంమాటలు, పొగడ్తలు, కైమోడ్పులు అతనికి అవసరంలేదు. కాని వీటిని అతనిపై కుప్పించేవారికి కొదువలేదు. అయినమాత్రం ఇతరులపై వాటిని వారి మెప్పుకోలుకు ఉపయోగింపడు. ఎవరైనా ఆ పద్ధతుల్ని అతనిపై ప్రయోగిస్తే, చిరునవ్వుతో త్రిప్పి కొడతాడు. తాను అనుకున్న పనిని, అనుకున్న కాలమునకు వీలైనంతవరకూ చేసుకొంటూ పోవుటకే పూనికతో ఉంటాడు. ఇందువల్ల అనేక చిన్న పెద్ద పనుల్ని సునాయాసంగా, సులువుగా, తక్కువ వ్యవధిలో పూర్తిచేసుకొని ఆనందిస్తాడు. స్వంత పనుల్ని, సమాజపుపనుల్ని, ఇదేరీతిలో గడియారంవలె ఆయన చేసుకుపోతూఉంటే చూచే వారికి ఆశ్చర్యంవేస్తుంది, ఆనందం కలుగుతుంది. ఆయన పనిచేసేతీరు చూడ ముచ్చటగా ఉంటుంది. ఆదర్శనీయమైనది.

శ్రీ ప్రసాద్ నిండుకుండ వంటివారు. ఎట్టి క్లిష్ట పరిస్థితులలోను అతను తొణకడు, బెణకడు, ఇతరులకు చిక్కడుకూడాను. ఎన్నికయుద్ధంలో అనేకమార్లు ఆయనకు, ఆయన వర్గీయులకు విజయం లభించింది. కాని 1967 ఎన్నికలలో అతనికి అపజయం ఎదురైంది. దానిని ప్రజల తీర్పుగా అతను నవ్వుతూస్వీకరించాడు. ఈ ఎన్నికలలో ఓటమికి అతను బాధపడలేదు. కాని ప్రజలు తనను అపార్థం చేసుకున్నారేమో అని అతను వ్యథచెందుతూ ఉంటారు.

అది శ్రీ ప్రసాద్ రూపకల్పన చేసిన పాలిటెక్నిక్ హాస్టలవరూపంలో చూచి ఆనందించే సమయం, ఒకనాడు, మామూలులాగే నేను అతనితో ఉన్నా. ఇది బహుశా! మీరు ఊహించే 'తాజ్' అని అన్నా. 'ఇట్టివే నాకు ఆనందం' అన్నారు అతను. 'ఈ వృత్తి విద్యా సౌకర్యం మన పట్టణంలో ఏర్పరచి మీరు ఎంతో సేవ చేసారు' అన్నాను. 'అవును. మీ రాజకీయవేత్తలు టెక్నికల్ విద్య కావాలంటున్నారుగదా!' అని సమాధానం. తాను రాజకీయవేత్త కానట్లు!

ఇదే సందర్భములో మరొకసారి 'ప్రసాద్ గారూ! సీట్లు మీ కులంవారికే ఎక్కువగా యిస్తున్నారనే వదంతి వుంది. ఏమంటారు? అన్నా. దానికి సమాధానం 'అవన్నీ ఆధారంలేని వదంతులు. మంచిని మంచిగా తీసుకునే పరిస్థితి లేదండీ! ఈ కళాశాల కట్టించి అనేకమందివల్ల మాటలు పడుతున్నా. కాని సంతృప్తి ఉండనే వుంది వందలాది బాలురకు వృత్తి, విద్య లభింపచేస్తున్నానని!' ఇది ఆయన నవ్వుతూ చెప్పిన సమాధానం.

దూరదృష్టికి శ్రీ ప్రసాద్‌నుచెప్పి మరొకరిని చెప్పాలి. వీరిది జమీందారీ కుటుంబం. వ్యవసాయం వృత్తిగా సిరిసందలు పెద్దలు ఆర్జించారు. నేడో వీరిది ఒక పారిశ్రామిక కుటుంబం. భూస్వామిక వ్యవస్థనుంచి, పారిశ్రామిక వ్యవస్థకు తన జీవితమును మళ్ళించుకొన్న ప్రజ్ఞాశాలి ప్రసాద్. ఈ కార్యక్రమ నిర్వహణకు తొలిచర్యగా పంటభూములను చౌకవతో అమ్మివేసారు. ఆంధ్ర దేశంలో పరిశ్రమలు రాణించవని భయపడే రోజుల్లో ఆంధ్రనుగర్భు తముతులో స్థాపించి పారిశ్రామికపతాకను అతను ఎగరవేసాడు. అది అతని జీవితములో ఒక గొప్పమలుపు. నేడు తణుకు, కొవ్వూరు, సికింద్రాబాద్ నగరములకు అతని పారిశ్రామికరంగం విస్తరించి, విజృంభిస్తోంది.

అందుకే మనరాష్ట్ర పారిశ్రామికవేత్తలలో అతను ప్రముఖ వ్యక్తిగా రాణిస్తున్నారు. అతను స్థాపించిన పరిశ్రమలుకూడా విజయవంతముగా కొనసాగిపోతున్నాయి. నేడు ఆంధ్రాసుగర్సు 600 టన్నులనుంచి 2,000 టన్నులకు దాని ఉత్పత్తిశక్తిని పెంచుకొన్నది.

శ్రీ ప్రసాద్ పారిశ్రామికాభివృద్ధివల్ల విశేష లాభాలు గడించారు, ఒకసారి 'ప్రసాద్‌గారూ! మీరు సుగర్సులో చాలాలాభం తీస్తున్నారు' అని అన్నాను. 'ఔను. ఉత్పత్తి బాగా జరిగితే లాభం వస్తుంది. అదే నేడు మా పరిశ్రమలలో జరుగుతోంది. ఉత్పత్తి చేయుమనేగదా ప్రభుత్వం నేడు కోరుతోంది. ఆపనే మేము చేస్తున్నాం. ఇది నాస్వార్థంకోసం అని వ్యతిరేక ప్రచారం జరుగుతోంది. ఏమండీ! నరసింహారావుగారూ! మీరు సోషలిస్టులు ప్రభుత్వ రంగంలోని పరిశ్రమల కంటె మా పరిశ్రమలలో ఉత్పత్తి బాగాలేదా? అని నాపై ఒక ఛాలంజిలాంటి మాట విసరారు. నేను వెంటనే చెప్పాను. 'మీ పారిశ్రామికప్రజ్ఞను ఎన్నడో రాష్ట్రం గుర్తించింది. మీవంటి పారిశ్రామిక వేత్తలకు ప్రజాస్వామిక వ్యవస్థలో ఉచితస్థానం, ప్రోత్సాహం ఉండనేవుంది. అదే ప్రజాస్వామిక సోషలిస్టు సమాజంలోని విశిష్టత. అదీకాకుండా మనది మిశ్రమ ఆర్థిక వ్యవస్థగదా!' అన్నాను అలవాటుపడిన ప్రచారధోరణిలో—ఆయన నవ్వుతూ తల ఊపారు. ప్రయివేట్ రంగంలో శ్రీ ప్రసాద్ నడిపే పరిశ్రమలు, ప్రభుత్వరంగంలోని పరిశ్రమలకు నిజంగా ఒక ఛాలంజిలాంటివే! సందేహంలేదు.

అందుకే చాలామంది దృష్టిలో అతను ఒక వాస్తవవాది. చేసి చూపించుటే తన ధర్మంగా భావించే వ్యక్తి. 'ఒట్టిమాటలు చెప్పకోయ్, గట్టిపనులు చేయవోయ్' అనునది అతనిపట్ల అక్షరాల వర్తిస్తుంది.

శ్రీ ప్రసాద్ విశిష్ట వ్యక్తిమాత్రమే కాదు విచిత్రవ్యక్తి. ఆయనకు స్థానికాభిమానం లేదని భావిస్తే, అది కేవలం సత్యదూరం. తణుకు పట్టణాభివృద్ధి అతని ప్రథమలక్ష్యం. దానిని అతను సాధించారు. ఇంకాసాధిస్తారు. మంచిపనులకు అతనితోడ్పాటు లభిస్తుంది. దీనికి అతని జీవితంలో అనేక నిదర్శనాలు ఉన్నాయి.

శ్రీ ప్రసాద్ దానశీలి. ఆవితరణకు హద్దు లేదు. కాని దానికి ఒకపోతవుంది. పాత్రత ఎరిగి అతను దానంచేస్తారు. ఒకపని సక్రమంగా నెరవేరుతుందనే విశ్వాసం ఆయనకు కలిగితేచాలు ఆ పనికి అతనిసహాయం సులువుగాలభ్యమౌతుంది. అనేక చిన్న, పెద్ద విరాళాలు అతనినుంచి అనేక విద్యాసంస్థలు, వ్యక్తులు పొందారు. ఆజాపితా వ్రాయడం నా ఉద్దేశ్యంకాదు. కాని తణుకు పాలిటెక్నిక్, కాకినాడలో రంగరాయ వైద్యకళాశాల అతని వదాన్యతకు నిదర్శనములు. ఆయన నిజస్వరూపమును మనరాష్ట్రమునకు దర్పణంలో చూపిన భూరివిరాళములను ఈసంస్థలు పొందాయి. స్వస్థలంకాని కాకినాడలో అతను వైద్యకళాశాలకు ప్రకటించిన 5 లక్షల విరాళముతో శ్రీ ప్రసాద్ అంటే ఎంత ఉన్నతుడో తెలియనివారికికూడా తెలిసింది.

జీవితములోని ప్రతిక్షణము అమూల్యముగా భావించే ప్రసాద్ ప్రపంచ పర్యటనను జరిపి అనుభవమునకు అధునిక పరిజ్ఞానమును జోడించుకొన్న ఘటికుడు.

శ్రీ ప్రసాద్ కార్యశూరుడు. ఒకవ్యక్తి శక్తి సామర్థ్యములకు కొలమానము ఆ వ్యక్తి తన జీవితములో సాధించిన ఘనకార్యములే అని విశ్వసించేవ్యక్తి. అందువల్లనే ఒకరి మెప్పుకోలుతో నిమిత్తంలేకుండా వాటిని సాధిస్తూ ఉండటమే ఆయన జీవితలక్ష్యంగా తోస్తుంది.

అతను విస్మయపడతాడు ఒకప్పుడు. తనను ఎదుట పొగడుతూ, వెనుక నిందించే నైజంగల పెద్దల్ని గురించి—. సమాజంలో అసూయాపరులు, నిత్య విమర్శకులు గలరనే సంగతి అతనికి తెలియనిదికాదు. దానికి అతని సమాధానం ఒక్కటే. 'ఆత్మవిమర్శ' చేసుకోలేనివారే ఇట్టి అసత్యప్రచారకులుగా ఉంటారని అతని సబబైన వ్యాఖ్యానం.

శ్రీ ప్రసాద్ రాజకీయజీవితం ఒక రిక్రియేషన్‌లాంటిది. మదరాసు కౌన్సిల్ సభ్యత్వం, తరువాత రెండుసార్లు ఆంధ్ర ఎసెంబ్లీసభ్యత్వం అతను పొందారు. అనేక కమిటీలలో సమర్థతతో పని చేసారు. అనేక పారిశ్రామిక వ్యవస్థలలో ప్రముఖ పదవులలో ఉన్నారు.

శ్రీ ప్రసాద్‌కు రాజకీయములపట్ల పెద్ద ఆసక్తిలేదు. కాని అతను రాజకీయములకు దూరుడుకాడు. దానిలో ఉన్నాననిపిస్తారు. కాని నేటి రాజకీయవాదులకుండవలసిన లక్షణాలు అతనికి లేవు. అందువల్ల నేటి రాజకీయలలో అతని నడక ఒక ఎదురీతవంటిది.

ఒక్కవిషయం వ్రాయాలి. శ్రీ ప్రసాద్ మొదట పారిశ్రామికవేత్త తరువాత రాజకీయవాది. అందుకే అతనిని నేను 'పారిశ్రామిక రాజకీయ వేత్త' (Industrial Politician) అని అన్నాను. ప్రజలకు సేవచేయాలని అతను ఆకాంక్షిస్తారు. అందుకే అతనిదృష్టి రాజకీయములవైపు మళ్ళించారు, దానిలో గణనీయస్థానాన్ని ఆక్రమించారు. పారిశ్రామికవేత్తగా ఆర్జించిన ధనమును ధార్మికశీలి గనుక ధర్మకార్యములకు ఆశ్చర్యజనకముగా విరజిమ్మారు. అతను ఆర్జనపట్లచూపే శ్రద్ధ అపార్థములకు దారితీస్తుంది. కాని ఆర్జించిన ధనమును వెచ్చించే తీరు నిర్మల హృదయంతో అవగాహనతో పరిశీలిస్తే ఆయన ఆర్జనవెనుక దాగియున్న వదాన్యత గోచరిస్తుంది. ఒక్కమాటలో శ్రీ ప్రసాద్ 'ధార్మికుడగు పారిశ్రామిక రాజకీయవేత్త'. ఈ త్రిమూర్తిత్వమునకు ప్రతిరూపే శ్రీ హరిశ్చంద్రప్రసాద్.

శ్రీ ప్రసాద్‌గురించి వ్రాయడానికి ఎంతో చరిత్రవుంది. కాని అతనిని నేను నా సోదరుని గను, మిత్రునిగను భావిస్తా. అందువల్ల ఇంతకంటె ఎక్కువవ్రాయడం ఇష్టంలేదు. ముగిస్తా.





శ్రీ ముళ్ళపూడి వెంకట్రాయుడు (బాబు) గారు



శ్రీమతి ముళ్ళపూడి నారాయణమ్మగారు

# శ్రీ ముళ్లపూడి వేంకటరాయుడు బి. కాం.

రచన: శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ

చిరంజీవి శ్రీ ముళ్ళపూడి వేంకటరాయుడు ముత్తాతగారి పేరొందిన వర్ధమానభావుడు, బి. కాం పట్టభద్రుడు. అక్కమాంబా టెక్స్టైల్సు మానేజరు. శ్రీ హరిశ్చంద్రప్రసాద్ చంద్రమతీదేవులకు ప్రథమ పుత్రుడు. తే 3-11-1941 ని జన్మించెను, ఈతడు తనపైని మూడు తరములవారగు శ్రీ రాయుడుగారు, శ్రీ తిమ్మరాజుగారు, శ్రీ ప్రసాద్ గార్ల అంశములతో త్రిమూర్తి యనిపించుచు, ముత్తాతవలె వ్యావసాయిక రంగమున, తాతవలె విద్యావ్యాసంగమున. తండ్రివలె పారిశ్రామిక రంగమున నైపుణ్యమును ప్రదర్శింపగల బహుకార్య సాధకుడు. మొదటినుండి వ్యవసాయపు పనులు చూచుచుండుటతో ముత్తాతగారైన శ్రీ రాయుడుగారి అంశ ఆదిలోనే ఈతనికి సంక్రమించినది.

ఈతని విద్యాభ్యాసము దేశమున మిగుల ఆదర్శవంతములగు విద్యా కేంద్రములందు జరిగినవి. ఇదియే ఈతని భావి సత్ఫలసిద్ధికి కారణమైనది. అతి బాల్యమున అడయారు (మద్రాసు) కిండరుగార్డెను స్కూలు; తర్వాత థీసాఫికలుస్కూలు; బిసెంటుస్కూలులు, విద్యారంగములు. ఇవి బాలకుల మనస్తత్త్వము ననుసరించి ఉన్నత స్థాయికి తెచ్చునట్టి ఉత్తమ విద్యాకేంద్రములు. తర్వాత కాలేజీ విద్యాభ్యాసము ఆంధ్రలయోలా కళాశాల (విజయవాడ) లో జరిగినది. శ్రీ ముళ్ళపూడి వంశములో ప్రథమ పట్టభద్రుడీతడే.

చిన్నతనమున బిసెంటుస్కూలు (మద్రాసులో) లో ఒకటవఫారము చదువునపుడే, భువనేశ్వర్, కలకత్తా, పాట్నా, గయ, కాశీ, అలహాబాదు, హృషీకేశము, ఆగ్రా, ఢిల్లీ మొదలగు ఉత్తరాది యాత్రలు తోడిబాలురతో కలిసి పూర్తి చేసి, 'మా క్యాంపు' అను గ్రంథమును 1952లో ప్రకటించెను.

ఆ అతి బాల్యములోనే మఱల తోడి పిల్లలతోను, ఉపాధ్యాయులతోను కలసి రామేశ్వరము, ధనుష్కోటి, మధుర. కుర్తాలం, తిరునల్వేలి, కన్యాకుమారి, తిరువేంద్రము, తిరుచ్చి, తంజావూరు మొదలగు దక్షిణాదియాత్రలు పూర్తిచేసి ఆచ్చటచ్చట తాను చూచిన విశేషములను చేర్చి 'మా దక్షిణాదియాత్ర'అను గ్రంథమును 1953లో ప్రకటించెను. బాల్యమున ఒకటి రెండు సంవత్సరములలోనే మొత్తముమీద భారత దేశము యావత్తు పర్యటనము చేసెను. అంతేగాక ఆ వయసులో ఆ యా స్థలముల విశేషములు గ్రంథస్థములుకూడ చేసెను.

ఉత్తరాదియాత్రలో బేలూరు మఠములో శ్రీరామకృష్ణపరమహంస, శ్రీ మాతాజీ, శ్రీ వివేకానందస్వామివారల సమాధులను, శ్రీ పరమహంసలవా రుపయోగించిన మంచము మొదలగు వస్తువులు చూచునపుడు ఆతనిహృదయము ద్రవించినది, ఆ అతిబాల్యదశలోనే ఆతని మనస్సులో పరిణత వయస్సున ఫలమునకు రాగల బీజములు

చోటు చేసికొన్నదనిపించును. ఈ గుణము తాతగారగు శ్రీ తిమ్మరాజుగారి అంశమున సంక్రమించినది. శ్రీ తిమ్మరాజుగారు బాల్యమున వివేకానంద రామకృష్ణపరహంసలయందు అపార భక్తి తాత్పర్యములు ప్రకటించియుండుట వారి చరిత్రము తెల్పుచున్నది.

దక్షిణాదియాత్రలో పుదుకోట్టలో చూచిన బట్టలమిల్లు అతని హృదయములో ఆ చిన్ననాడే గట్టి ముద్రవైచినది. ఆ ముద్రఫలితమే నేడు అతడు అక్కమాంబా టెక్స్టైల్సుకు సర్వ పర్యవేక్షకుడుగా అతనిని దిద్ది తీర్చినదనిపించును. ఇది బలమైన బీజము కాన త్వరలో ఫలించినది. ఈ పారిశ్రామిక రంగాభిలాష తండ్రిగారగు శ్రీ హరిశ్చంద్రప్రసాదుగారి అంశమున సంక్రమించిన గుణము.

దక్షిణాదియాత్రలో తంజావూరులోని సరస్వతీమహలు లైబ్రరీ చిన్నివేంకటరాయని హృదయమును మిన్నగా హరించినది. ఆ బీజమే అతనిని బి. కాం. పట్టభద్రునిగా ఫలింపజేసినది. ఒక్కొక్క చిన్న సన్నివేశమే మహత్తర కార్య సాధకముకాగలదు. విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత ?

చిన్నతనమున హృదయమున చోటుచేసికొన్న సంస్కారములు వ్యర్థములుకావు. క్రొత్త కుండకు రంగు వెలిగిపోవునదికాదు. అందుకనియే ఎంతెంతగానో సొమ్ము వ్యయపఱచి అతి బాల్య వయసునుండి విద్యార్థులను ప్రముఖ యాత్రాప్రదేశలకు దీసికొనిపోవుట విద్యావిధానములో నొక ముఖ్యాంశముగా పరిగణింప బడుచున్నది.

అక్కమాంబా టెక్స్టైల్సు శ్రీ ముళ్ళపూడి వారి సొంత సంస్థయే. యౌవనారంభమునసే దాని సర్వ పర్యవేక్షణాధికారిగా ప్రవేశించి శ్రీ వేంకటరాయుడు విశేషానుభవ సంపాదనమునకై ప్రభుత్వముచే ఈజిప్టుదేశము పంపబడెను. Indian Cotton delegations పై ఈజిప్టు దర్శించిన పిమ్మట లండన్ లివర్‌పూల్ (ఇంగ్లండు) ఫ్రాంక్‌ఫర్టు, డసల్‌డార్ఫ్ (పశ్చిమజర్మనీ) జినీవా (స్విట్జర్‌లాండ్) రోము (ఇటలీ) మొదలగు విదేశములను వ్యాపారానుభవము సంపాదించుటకై పర్యటించివచ్చెను. ఆ విదేశ పర్యటనములలో విశేష పారిశ్రామికానుభవము సంపాదించి విదేశ విషయములెన్నో నేర్చివచ్చి అంతకుపూర్వము పెద్దఅనుభవము గలిగి నేర్పరులై తమ సంస్థలలో ఉన్నత పదవుల నధిష్ఠించియున్న విద్యావయోవృద్ధులలోని లోపములనుగూడ కనిపెట్టి కడు సమర్థతతో సరిదిద్ది ప్రజ్ఞా పాటవమును ప్రదర్శించెను.

తన పరిపాలనలో శ్రీ వేంకటరాయుడు తమ సంస్థలలోని ఇతర అధికారులందఱికంటె విభిన్నముగా శ్రామికులతో, ఉద్యోగులతో ప్రజలతో చక్కని మంచిపేరు సంపాదించుకొనెను. ఇతరులలో లేని శాంతము, దయా, క్షమాగుణములు ఈతనిలో చూచి ఈతని పాలనమునకు ఎంతగానో అందఱును ఆనందించుచున్నారు. ఇంకను మును ముందు లోటులు సవరించి తన సంస్థలను పునర్నిర్మాణముచేసి సర్వస్వతంత్రుడై అందఱిచే ఇంకను ఎక్కువగా తీపి తినిపించగలడని మనము ఆశింపవచ్చును.

ఏదేని ఒకటి చూచినపుడు అందుండి ఎంతో నేర్చుకొను గుణము అందఱిలో నుండదు.

చాలమంది నిష్ఫల దర్శనము మాత్రమే చేయుదురు. కొలదిమంది తాము దర్శించినది సార్ధకము చేసికొందురు. దర్శించినదానిలో నేర్చికొనినది అనుభవములోనికి దింపి ఫలోన్ముఖమునకు దెచ్చుకొందురు. ఇట్టివారే జీవితరంగమును విజయవంతముగా మలచుకొనగలరు. శ్రీ వేంకటరాయడు ఈ కోవకు చెందినవాడని ఆతని ఈ చిన్నతనమునందలి కొన్ని జీవితఘట్టములు స్పష్టముగా వెల్లడించుచున్నవి. ఈతనిలో బాల్యమున బీజప్రాయములై ఇంకను ఫలదశకురాని యంశము లెన్నో యుండకతప్పవు. అవన్నియు ఉత్తరకాలమున ఎంతో అభివృద్ధితో ఫలింపగలవని మన మాశింతము.



శ్రీ పెండ్యాల వెంకటరాయుడుగారు



శ్రీ పెండ్యాల నరేంద్రనాథ్ చౌదరిగారు

# శ్రీ తిమ్మరాజుగారు - ఉపాధ్యాయులు

శ్రీ వడ్లమాని సోమశేఖరం

## జననము.

పశ్చిమగోదావరిజిల్లా తణుకు గ్రామమున శ్రీ ముళ్లపూడివారి కుటుంబము సకలఐశ్వర్యములకు, భోగభాగ్యములకు పేరెన్నికగన్నది. ఈ కుటుంబము ఆదినుండియు రైతుకుటుంబము. ఇందు శ్రీ వేంకట్రాయుడుగారు "రైతురాయుడు" అని జిల్లాలో పేరుగాంచిరి. ఈయనభార్య అక్కాయ్యమ్మగారు. ఈపుణ్యదంపతులకు 1901 సంవత్సరము అక్టోబరు 10వ తేదీ తెల్లవారు జామున సింహలగ్నమునందు మగశిశువు జన్మించెను. అదివరకు ఆడుబిడ్డలేగాని మగపిల్లలు లేనందున ఈ శిశువును అల్లారుముద్దుగా పెంచుచు తాతగారిపేరు పెట్టిరి. అప్పటినుండియు ఈ బిడ్డని "తిమ్మరాజు"అని పిలువసాగిరి.

## బాల్యము.

శ్రీ రాయుడుగారికి ఆరుగురు ఆడుపిల్లలు, ఒకడే మగబిడ్డ. ఆ మగబిడ్డడే శ్రీ తిమ్మరాజుగారు. ఐదుగురు బిడ్డలతరువాత పుట్టుటచే ఎంతో అల్లారుముద్దుగా ఆయనను పెంచసాగిరి. ఈయనకు ఆరవ సంవత్సరము రాగానే శ్రీ శిష్టా కృష్ణమూర్తిగారిచే విద్యాభ్యాసమునకు నాంది జరుపబడినది. తదుపరి శ్రీ నాదెళ్ల శేషయ్యగారిచే అక్షరాభ్యాస మహోత్సవము వైభవముగా జరిపించి బడిలో వేసిరి. 'పూవుపుట్టుటతోనే పరిమళించును' అనునట్లు శ్రీ తిమ్మరాజుగారిలో ప్రాథమిక విద్యాభ్యాసకాలమునుండియే బంధువులన్నను మిత్రులన్నను ప్రేమ, ఆదరాభిమానములు మిక్కుటముగా పొడచూపినవి. ఆగర్భశ్రీమంతులైనను, అల్లారుముద్దుగా పెరిగి

నను హెచ్చు, తగ్గు, గొప్ప, పేద భావములులేక మిత్రులతోనే కలసిమెలసిఉండుచు, ప్రేమించుచు, క్షణమైనను వారిని విడువకుండుట వారి సహజగుణము. ఆగుణము ఇప్పటికిని మార్పు చెందక అభివృద్ధి చెందినది.

శ్రీ తిమ్మరాజుగారు తోడివిద్యార్థులతో కలిసి తరగతిలో అల్లరులు చేయుట, కొట్టుకొనుట మొదలగు చిలిపిచేష్టలుచేయుట, గోడకుర్చీవేయుట, కోదండముతీయుట మొదలగు శిక్షలు అనుభవించుట, తోడి స్నేహితులతో పొలములకు వెళ్లుట, కోతికొమ్మచ్చులాడుట, కాలువలో స్నానములు చేయుట, తండ్రిగారికి ఈ విషయములుతెలిసి ఆయన బాగుగా దండించుట, అటుతరువాత ఒక్కగాని ఒక్కబిడ్డను కొట్టినందుకు చాటున పశ్చాత్తాప పడుటకూడ జరిగెడివి.

## సెకండరీ విద్య.

1909వ సంవత్సరములో స్థానికహైస్కూలునందు మూడవతరగతియందు ప్రవేశము. శ్రీ ఈమని వెంకయ్యగారు అధ్యాపకులు. వారు రెండుపూటలు ఇంటికివచ్చి విద్యగరిపెడివారు. ఈప్రాయమున శ్రీ తిమ్మరాజుగారియందిమిడియున్న జాతీయభావములు, వారి మనస్తత్వము ప్రస్ఫుటము కాజొచ్చినవి. మహాపురుషుల చరిత్రలన్నను, వీరుల కథలన్నను, పూర్వుల పరాక్రమము తెలుపు నాటకములు, పాటలన్నను ఎంతో ఆసక్తిచూపుట, బొబ్బిలికథ ఎవరైనను చెప్పించుచుండిన అచటకువెళ్లి కూర్చుండి శ్రద్ధగా వినుట, ఆకథ ఆఖరు అగువరగు తండ్రిగారు ఎంతమంది నౌకరులను పంపినను వారిని తమవద్దనే కూర్చుండబెట్టుకొని కథ ముగిసిన తరువాత వారితోకలిసి యింటికి వెళ్లుటయు జరిగెడిది. సాధువులు ఎవరైనను వచ్చిన వారితో ప్రొద్దుపుచ్చుట వారువేయు ఆసనములు పరికించుట, నేర్చుకొనుటకూడవారికి అలవాటైనది. ఆ అలవాటు ఇప్పటికిని పోలేదు. ఇప్పుడుకూడ తెల్లవారుజామున నాలుగుగంటలకే లేచి ఆసనములు వేయుట, ఇంటిలోని బాలురచే వేయించుటకూడ కలదు.

సెకండరీవిద్య శ్రద్ధాసక్తులతో అభ్యసించిరి. మూడవఫారములోనికి వచ్చినప్పటినుండి తరగతి పాఠ్యపుస్తకములకంటె మహాపురుషుల జీవితచరిత్రలమీద, జాతీయ గ్రంథములమీద అభిరుచి ఎక్కువఅయినది. బడి విడిచినపిమ్మట శ్రీ కొండూరి నరసన్నగారితోకలసి పొలములో కూర్చుండి స్వామివివేకానందుని జీవితచరిత్ర వారు చదువగా వినువారు. అనంతరకాలముకూడ శ్రీ వేమూరి రామకృష్ణారావుగారు బాలగంగాధర తిలక్ జీవితచరిత్రను, శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు ముద్రారాక్షస నాటకమును, కౌటిల్యుని అర్థశాస్త్రమును చదువగా వినుచుండెడివారు.

## వివాహము.

25-5-1915వ సంవత్సరములో తూర్పుగోదావరిజిల్లా రాజోలుతాలూకా పెదపట్నం అగ్రహార నివాసులు శ్రీ బోళ్ల సుబ్బారాయుడుగారి కుమార్తె చిరంజీవి వేంకటరమణమ్మను ఇచ్చి అతివైభవముగా వివాహము జరిపించినారు. శ్రీ తిమ్మరాజుగారికి 1917లో ఆడుబిడ్డకలిగినది. ఆమెకు "అచ్చాయమ్మ" నామకరణము చేసిరి. పిదప 1921లో మగబిడ్డ కలిగినాడు. ఆ బిడ్డకు "సత్యహరిశ్చంద్రప్రసాద్" అని పేరుపెట్టిరి. ఈవిధముగా విద్య, సిరి, సంపద, దిన దినాభివృద్ధిపొందుచు వచ్చినది.

1921లో గాంధీమహాత్ముని శంఖారావము ఆసేతు హిమాచలపర్యంతము మారుమ్రోగినది. హూణవిద్యా బహిష్కరణము. విదేశవస్త్రదహనము, స్వదేశవస్తువుల ఆదరణము: ఖద్దరుధారణ, జాతీయవిద్యాభ్యాసము దేశములో ప్రారంభమైనవి. అనేక జాతీయవిద్యాలయములు దేశములో నెలకొల్పబడసాగినవి. మహాత్ముని పిలుపు వీనుల పడగానే శ్రీ తిమ్మరాజుగారు తణుకులో నాయకత్వము వహించిరి. హూణవిద్యకు స్వస్తిచెప్పిరి. విదేశవస్త్రదహన మొనరించి ఖద్దరుదీక్ష వహించిరి. జాతీయవిద్యాలయస్థాపన: ఆ వెంటనే తణుకు టవున్ హాలునందు జాతీయ విద్యాలయమును నెలకొల్పిరి. అందు శ్రీ ఆలమూరి రాజగోపాలరావుగారు, శ్రీ కొండూరి నరసన్నగారు, శ్రీ పొక్కులూరి సాంబశివరావుగారు, శ్రీ నండూరి పార్థసారధిగారు తమ హైస్కూలు ఉపాధ్యాయ పదవులకు రాజీనామాలిచ్చి జాతీయ విద్యాలయమున ఉపాధ్యాయులుగాచేరి పనిచేయసాగిరి. శ్రీ తిమ్మరాజుగారితోపాటు వారి మిత్రులు డాక్టర్ శ్రీ నాదెళ్ల వేణుగోపాలము, వేంకటాద్రి, జనాబ్ గౌస్ మొహిద్దీను మొదలగువారు విద్యాలయమున ప్రవేశించిరి; అప్పటినుండి జాతీయభాషయగు "హిందీ" మీద వీరికి అభిరుచి కలిగి శ్రీ కనకదండి సోమయాజులుగారివద్ద హిందీ అభ్యసింప మొదలుపెట్టిరి. తదుపరి బెజవాడలో కాంగ్రెస్ వర్కింగు కమిటీ సమావేశము 31 మార్చి 1 ఏప్రిల్ 1921 లో గాంధిమహాత్ముని ఆధ్వర్యమున జరుగగా దానికి శ్రీ తిమ్మరాజుగారు హాజరైనారు. అది ముగిసినపిమ్మట మంగళగిరి, కొండవీడు, కొండపల్లి వగైరాలకు వినోదయాత్ర గావించి ఇల్లు చేరుకొన్నారు. దీనితో శ్రీతిమ్మరాజుగారికి జాతీయనాయకులన్నను. చరిత్రలన్నను. చారిత్రాత్మక ప్రదేశములన్నను భక్తిశ్రద్ధలు మరింతగా పెరిగినవి. ఇట్లు రెండుమూడు సంవత్సరములు జాతీయవిద్యాలయమున గడచినవి.

స్థానికసంస్థలయందు ప్రవేశము, ప్రజాసేవ: 1923లో తణుకుతాలూకా బోర్డునకు వైస్ప్రెసిడెంటుగా ఎన్నుకొనబడి స్థానికసంస్థలలో ప్రవేశించిరి. తరువాత ఎన్నికలలో తాలూకా బోర్డు ప్రెసిడెంటుపదవికి పోటీచేసి గెలుపొందిరి. అప్పటినుండి వరుసగా అన్నిఎన్నికలలోను ప్రెసిడెంటుపదవికి పోటీచేసి గెలుపొందుచు తాలూకా బోర్డులు రద్దుఅయ్యేవరకు ఆపదవిలో 22 సంవత్సరములు ప్రజాసేవచేసిరి.

1927 నుండి 1933 వరకు జిల్లాబోర్డు సభ్యులుగాను, ది. 7—11—1934 మొదలు 10—4—1953 వరకును 23—3—1956 నుండి 31—3—1959 వరకు మొత్తము 22 సంవత్సరములు తణుకు పంచాయతీబోర్డునకు అధ్యక్షులుగాను ఎన్నుకొనబడి ప్రజారంజకముగా పరిపాలన సాగించిరి. వ్యక్తిసంస్కారమునకు, సంఘపరిణామమునకు నేటి భారత రాజ్యాంగమున గ్రామపంచాయతీయే ప్రథమ సోపానమనియు, గ్రామసౌభాగ్యమే దేశసౌభాగ్యమనియు, గ్రామాభివృద్ధియే దేశాభివృద్ధియనియు వీరిఅభిప్రాయము, తదనుగుణముగా తణుకుపంచాయితీని తీర్చిదిద్దిరి. వీరి పరిపాలనాకాలములో తణుకు పంచాయితీ బహుముఖములుగా అభివృద్ధిచెంది ఈ జిల్లాలోని పంచాయితీలన్నిటిలోను అత్యుత్తమమైనదిగా పేరెన్నికగన్నది. ఇట్టి భావములుగలవారు ఇంతకాలము అధ్యక్షులుగానుండి పాలించుభాగ్యము చాల తక్కువగ్రామములకు అబ్బియుండును.

## కళత్రవియోగము.

కాలమొకేరీతి గడువదుగదా! వెలుగునీడలు, సుఖదుఃఖములు, శీతోష్ణములు ఇట్టి ద్వంద్వముల కలయికయే కాలస్వభావము. 11-11-1923వ సంవత్సర కార్తీకశుద్ధ చతుర్థి నాడురాత్రి శ్రీ తిమ్మరాజుగారికి కళత్రవియోగము సంభవించినది.

తదుపరి 24-4-1924లో గుంటూరు జిల్లా ఇంటూరు వాస్తవ్యులు శ్రీ కాట్రగడ్డ శ్రీరాములుగారి పుత్రిక కమలాదేవిని వివాహము చేసికొనిరి. ఈ ద్వితీయ కళత్రమునకు ముగ్గురు కుమార్తెలు, ఒక కుమారుడు జన్మించిరి. 1927 లో జన్మించిన ఈ మగపిల్లవానికి "నరేంద్రనాథ్" అని నామకరణముచేసిరి. అప్పటినుండి వీరి కుటుంబము మరింత సిరిసంపదలతోను. భోగ భాగ్యములతోను వైభవముగా ఆనందముతో అల రారుచున్నది.

శ్రీ తిమ్మరాజుగారు — ఉపాధ్యాయులు : దేశాభ్యుదయమునకు గ్రామాభివృద్ధి ఎంత ముఖ్యమో ప్రజలలో విద్యాభివృద్ధికూడ అంత కంటె ముఖ్యమైనదని శ్రీ తిమ్మరాజుగారి స్థిరాభిప్రాయము, సుశిక్షితుడైన పౌరుడే దేశసౌభాగ్యమును తీర్చిదిద్దగలడు. ఈశిక్షబాల్యమునుండియే అభ్యసింపవలెను. వానికి ప్రాథమికపాఠశాలలే పునాదులు. ఈపాఠశాలలు యోగ్యతగల ఉపాధ్యాయులచే నడుపబడవలెను. క్రమశిక్షణ, నీతి, సహనము, విశ్వబంధుత్వము చిన్నతనము ననే బాలురకు అలవరుపవలెననియు, ఇట్లు అలవరచుకొనిన నేటి బాలురే భావిపౌరులై దేశమును తీర్చిదిద్దగలరనియు, శ్రీ తిమ్మరాజుగారి దృఢవిశ్వాసము.

వరుసగా తొమ్మిదేండ్లు తణుకు తాలూకా బోర్డు అధ్యక్షులుగానుండి వారుచేసినసేవ మరువరానిది. తాలూకాలోని గ్రామాల అభివృద్ధి అంతయు వారిపేరునే ఆశ్రయించుకొనియున్నవి. బాటలు లేని గ్రామములకు రోడ్లు, దిక్కును మొక్కును లేకమృత్యువాత పడవలసివచ్చుచోట్ల వైద్యశాలలు స్థాపింపజేసిరి. అన్నిటికంటె ముఖ్యమైనది చదువుసంధ్యలులేక పిల్లలు తిరుగుచుండు గ్రామాలలో పాఠశాలలు నెలకొల్పుట గమనింపదగిన విషయము. ఆయన పరిపాలనాకాలములో తణుకు తాలూకాలోని ప్రతిగ్రామములోను ప్రాథమికపాఠశాల నెలకొల్పబడినది.

శ్రీ రాయుడుగారిది వ్యవసాయక్షేత్రము. శ్రీ తిమ్మరాజుగారిది బాలబాలికల మనోవికాస క్షేత్రము. ఏవిధమైన పిచ్చిగీతలులేని బాలబాలికల మానసిక ఫలకములందు చక్కని సుస్థిరమైన అక్షరబీజములనాటి అంకురింపజేసి వృద్ధిగావించువాడు ఉపాధ్యాయుడు అనియు. అతడు సత్ప్రవర్తనుడు, సదాచారి, సత్కర్మనిరతుడు, ఆదర్శవంతుడు అయి యుండవలెననియు, అట్టి ఒజ్జల యొద్ద విద్యనేర్చి విద్యార్థులు సకలగుణసంపన్నులగుదురనియు శ్రీ తిమ్మరాజుగారి విశ్వాసము. అందుచేతనే ఉపాధ్యాయులను నియమించుటలో ఒకరి సిఫారసులను సరకుగొనక, ఉపాధ్యాయుని స్వయముగా పరికించి, పరీక్షించి యోగ్యతగల వాడిని నిర్ణయించుకొన్న తరువాత అతనిని నియమించు పాఠశాల, గ్రామముల వాతావరణము, పరిస్థితులు ఆతనికి తెలియజెప్పి సర్వవిధముల యోగ్యతగల ఉపాధ్యాయుడననిపించు కొనుమని హెచ్చరించి 'ఆర్డరు' చేతికిచ్చి పంపెడివారు. అంతటితో ఊరకుండక కొలదిరోజులలో ఆగ్రామమునకేగి. ఆ ఉపాధ్యాయునిగురించి గ్రామ పెద్దలను భోగట్టాచేసి అతని లోటుపాట్లను తెలిసికొనుట. అతనిని గౌరవముగా ఉపయోగించుకొను

డని తెలుపుటకూడకలదు. ఈవిధముగా ఉపాధ్యాయులను కంటికి రెప్పవలె కాపాడుచు వారిని తమ వృత్తిలో నిపుణత సంపాదింపుడని ప్రోత్సహించెడివారు.

ఉపాధ్యాయుల నియమించునపుడు పార్టీ పక్షపాతముగాని. కులమతభేదముగాని ఎన్నడును పాటించలేదు. వ్యక్తి ఏపార్టీకి చెందినవాడైనను, యోగ్యతగలవాడని తెలియగనే పిలిచి ఉద్యోగమిచ్చెడివారు. కాని ఒకమాట చెప్పకతప్పదు. ఏమన, గురుపదవికి అనాదినుండియు అగ్రజాతివారే అర్హులనియు, వారి ఆచారవ్యవహారములు, నడవడి. ఉచ్చారణము, బాలబాలికలు పిన్నవయసున అలవరచుకొందురనియు, అందుచే అవి వారి మనముల స్థిరపడుననియు శ్రీ తిమ్మరాజుగారిభావము. అందుచేతనే వారు నియమించిన ఉపాధ్యాయులలో నూటికి తొంబదితొమ్మిది మంది బ్రాహ్మణోపాధ్యాయులే.

"ఆకారైరైవ చతురా స్తర్కయంతి పరేంగితమ్" "చతురులు ఆకారమునుబట్టియే ఇతరుల మనోభిప్రాయమును ఊహింతురు" ఈఉక్తి శ్రీ తిమ్మరాజుగారియందు అక్షరశః మూర్తీభవించినది. ఆయన పాఠశాలల తనిఖీకి వెళ్లినపుడు ఉపాధ్యాయుల. విద్యార్థుల మనస్తత్వములను ముఖములు చూచియే గ్రహించెడివారు. తామే బాలబాలికలను ప్రశ్నలడిగెడివారు. తరగతిలో ఏ విద్యార్థులు చురుకైనవారో వారి ముఖవర్చస్సు, హావభావములనుబట్టి కనిపెట్టెడివారు. ఉపాధ్యాయుడు సూక్ష్మబుద్ధులనే ప్రశ్నలడుగుట కుద్యమించినపుడు మందబుద్ధి కలవారిని తమకుతోచిన బాలబాలకులను ప్రశ్నింపుమనెడివారు. అంతటితో సోమరి ఉపాధ్యాయుని ఆటకట్టు అగుచుండెడిది.

ఈవిధముగా ఏ ఉపాధ్యాయునిశక్తిలో ఎటి శక్తి యిమిడియున్నదో అతనికి ఏయే విషయములందున అనగా సాహిత్యమున. సంగీతమున, చిత్రలేఖనమున మరియే ఇతరకళలయందు అభిరుచి యున్నదో గ్రహించెడివారు, అంతటితో ఊరుకుండక వారిని తరచుగా తమవద్దకు పిలిపించి, ప్రోత్సాహపరచి, మురిపించి, ఆశలుకొలిపి, చేయూతనిచ్చి వారిని ఉన్నతస్థితికి తీసికొనివచ్చెడివారు.

ఇచట స్వకీయమైనట్టియు, నేనుస్వయముగా ఎరిగినట్టియు. కొన్ని విషయములను ఉదాహరించుట ఉచితమని వానిని పొందుపరచుచున్నాను. నేను తూర్పు గోదావరిజిల్లా అమలాపురము తాలూకా "పేరూరు" అగ్రహార వాసుడను. అది కోనసీమ. కారణాంతరమున పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు తాలూకా ఎర్నగూడెం ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయునిగా పనిచేయుచుంటిని. ఇది రెడ్డిసీమ. అపుడు కొవ్వూరు; తణుకు తాలూకాలు కలిసి ఒకే బోర్డుగా నుండెడివి. 1928లో శ్రీ తిమ్మరాజుగారు ఈ బోర్డునకు అధ్యక్షులుగా ఎన్నుకోబడిరి. వారు ఎర్నగూడెం మా స్కూలునకు తనిఖీకివచ్చిరి. నాలోని యే విషయము ప్రథమదర్శనమున వారి హృదయము నాకర్షించినదో నేను చెప్పజాలను. అప్పటినుండియు నాపై అవ్యాజకరుణ వారికి కలిగినది. కోనసీమవాడనని తెలియుటతోడనే రెడ్డిసీమనుండి వసిష్ఠనదీతీరముననున్న తణుకు తాలూకాలోని "ఖండవిల్లి" గ్రామ ప్రాథమికపాఠశాలకు నన్ను 1930 ఫిబ్రవరి 15వ తేదీనిబదిలీచేసిరి. నేను అచట చేరిన తరువాత ఖండవిల్లివచ్చి అచట గ్రామపెద్దలను క్షత్రియులతో మీకు యోగ్యత

గల ఉపాధ్యాయుని పంపించితిని. ఆయనను సగౌరవముగా ఉపయోగించుకొనుడని చెప్పిరి.

తదుపరి నేను హిందీ అభ్యసించుచున్నట్లును, ఒకటి రెండు పరీక్షలలో ఉత్తీర్ణుడనైనట్లును తెలిసి నన్ను 1932లో బెజవాడ హిందీ విశారదమహావిద్యాలయమునకు పంపిరి. అచట "రాష్ట్రభాషావిశారద" పరీక్షయందు ఉత్తీర్ణుడనై తిరిగి వచ్చితిని. 1947లో నన్ను తణుకు బోర్డు పాఠశాలకు ఖండవల్లినుండి బదిలీచేయించి అచటనుండి ఆ సంవత్సరములోనే బోర్డుహైస్కూలులో హిందీ పండితుడుగా నియామకము చేయించిరి. 1948లో వారి సొంతఖర్చులతో మద్రాసు దక్షిణభారత హిందీ ప్రచారసభకు "ప్రచారక్" శిక్షణకు పంపిరి. పిమ్మట తమ ఆస్థానములో హిందీ పండితునిగా ఏర్పాటుచేసిరి. 1952లో వారి మాతృశ్రీ అక్కాయమ్మగారు పరమపదించినపుడు ఆమెపేరిట అరఎకరముభూమి దానరూపమున నా కొసగి స్థిరనివాసము కల్పించిరి. ఈ విధముగా నాకు సర్వవిధముల తోడ్పడి నన్ను తణుకు నివాసిగాజేసి వారి స్వస్థలమున నిలిపిరి. నేను ఉద్యోగమునుండి రిటైర్‌కాగా "ది ఆంధ్రా షుగర్సులిమిటెడ్" వెంకట్రాయపుర మండలి "శ్రీ తిమ్మరాజు ప్రాథమిక పాఠశాల" యందు ఉపాధ్యాయునిగా నియమించి సహాయపడిరి. ఈ విధముగా ఒక సామాన్య ప్రాథమికోపాధ్యాయుడనైన నాకు సర్వవిధముల తోడ్పడి అభివృద్ధికి తెచ్చిన శ్రీ తిమ్మరాజుగారికి, శ్రీ ముళ్లపూడి కుటుంబమునకు నేను చిరకృతజ్ఞుడను. ఇటులెందరినో వారు వృద్ధిలోనికి తెచ్చిరి.

శ్రీ తిమ్మరాజుగారికి ఉపాధ్యాయులతోడిదే లోకమయినది. ఈ ఉపాధ్యాయులలో కవులు, గాయకులు, పండితులు, హరికథకులు, గ్రంథకర్తలు మొదలగు అన్నిరకములవారును కలరు. వారితోనే వారి నిత్యకాలక్షేపము తండ్రి రాయుడుగారి వ్యవసాయక్షేత్రమునకు వీరు "అంటీ అంటనట్లుగా" నుండుటయు, శ్రీ రాయుడుగారియనను అదుపులోమాత్రము ఉంచి, చూచి చూడనట్లు నటించుటయు జరిగిపోయెడిది. అందుచే శ్రీతిమ్మరాజుగారు పొలమునకేగినపుడు ఉపాధ్యాయులను వెంటబెట్టుకొని వెళ్ళెడివారు. అచట చేనిగట్టుమీద కూర్చుండి వారితో "మృచ్ఛకటికము" "ముద్రారాక్షసము" ఇతర సాహిత్యవిషయముల గూర్చి చర్చించుట, వారిచే చదివించుట, విమర్శించుట జరిగెడిది. ఈవిధముగా వీరికి సాహిత్యమన్నను, దేశచరిత్ర, చరిత్రాత్మక ప్రదేశములు, నాయకులు, రాజులు అన్నను మరింత ఆసక్తిమెండైనది. అప్పటినుండి అన్వేషణ మరింత తీవ్రరూపము దాల్చినది.

## పుత్ర వియోగము.

ఈసమయమున శ్రీ తిమ్మరాజుగారి ద్వితీయ పుత్రుడు నరేంద్రనాథుని విద్యాభ్యాసమునకు తగిన ఆదర్శప్రాయమైన గురుకులవిద్యాలయమునకై తమ మిత్రులును, గురువులును, హైస్కూలు ఉపాధ్యాయులును అగు శ్రీ నాదెళ్ల కృష్ణమూర్తిగారితో అన్వేషణ ప్రారంభించి పెక్కు గురుకుల విద్యాలయములు పరికించి తుదకాబాలుని "ఋషివాలీ"యందు ప్రవేశపెట్టిరి. ఆనరేంద్రనాథుడు లేవయసుననే ఓజస్వియు, తేజస్వియునయి, దానశీలుడు, దయాశీలుడునయి, యశశ్చంద్రికలు వెదజల్లి కీర్తిశేషుడైనాడు. ఆనరేంద్రుని స్మృతి ప్రతీకముగా శ్రీ తిమ్మరాజుగారు "నరేంద్రనాథ సాహిత్యమండలి" స్థాపించిరి. ఈ మండలి అనేకులగు పండితులను, కవులను అసాధారణముగా సత్కరించినది — సత్కరించు చున్నది.

పెక్కు గ్రంథములను ప్రకటించినది — ప్రకటించు చున్నది.

శ్రీ తిమ్మరాజుగారి చిత్తవృత్తి విచిత్ర మైనది—ఏదేని కార్యావసరమునకై కవులను, పండితులను ఉపయోగించుట యుక్తముకాదని వారిభావన. కవులును, పండితులును దినదినము రచనలు చేయవలెననియు అట్లు నిరంతర రచనలు వారి భావప్రచారమునకు హేతువులనియు కవి మానసమునందు సమధికముగా విశేషము లావిర్భ వింపగలవనియు వారి ధృఢవిశ్వాసము. ఈ కార ణముననే వారు తమ బృందములోని వారిలో శ్రీ నాదెళ్ల కృష్ణమూర్తి శ్రీ పండిత సత్యనారాయణ రాజు, శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ, శ్రీ మేడూరి వేంకట సోమమేశ్వర కృష్ణమూర్తి శ్రీ వేదుల సూరి మొదలగు ఉపాధ్యాయులను ప్రోత్స హించి, గ్రంథములు వ్రాయించి, వారి "రాయల ముద్రాలయమున"న అచ్చొత్తించి "శ్రీ నరేంద్ర నాథ సాహిత్యమండలి" పేరిట ప్రచురించిరి.

## జనకుని స్వర్గవాసము.

1943 ఫిబ్రవరి 18 వ తేదీని శ్రీ తిమ్మ రాజుగారి తండ్రియైన శ్రీ రాయుడుగారు స్వర్గస్థు లైరి. జమీందారీలయొక్కయు, కుటుంబము యొక్కయు యాజమాన్యము శ్రీ తిమ్మరాజుగారు వహించవలసివచ్చినది. కాని ఈయన సర్వభార మును తమ జ్యేష్ఠపుత్రులును తాతగారివద్ద తర్ఫీదు పొందినట్టి సమర్థులును, అగు శ్రీ హరిశ్చంద్ర ప్రసాదుగారిపైనుంచి తాము రాజర్షివలె, తామ రాకుపై నీటిబిందువు విధమున మెలగసాగిరి,

తరువాత శ్రీ తిమ్మరాజుగారికి రాత్రిం బవళ్లు నరేంద్రనాథ సాహిత్యమండలి అభివృద్ధి, ఉత్తమగ్రంథములు వెలువరించుట, ఉపాధ్యాయు లతోను, పండితులతోను సాహిత్యగోష్ఠి, యాత్రా స్థలములు, చరిత్ర ప్రసిద్ధ క్షేత్రములు దర్శించి అచటి విశేషములు పరికించుట, సాహిత్యసభలకు కవి సమ్మేళనములకు హాజరగుట, నిత్యకృత్యము లైనవి. ఆయన యాత్రలకు, సభలకు, సాహిత్య గోష్ఠులకు, చరిత్రాత్మక ప్రదేశములు చూచుటకు ఎన్నడును ఒంటరిగా వెళ్లరు. ఆ యా విషయ ములయందు అభిరుచిగల ఉపాధ్యాయులను వెంట బెట్టుకొని వెళ్ళి అచట పరికించిన విషయముల నన్నిటిని సాకల్యముగా వారిచే వ్రాయించి ఆ విశేషములు తమవద్ద పొందుపరచియుంతురు. ఇట్టి యాత్రలో కొన్నిటిని ఇచట ఉదహరించుట ఉచితమని తలచుచున్నాను.

## దేశ పర్యటనము

1940 లో శ్రీ నాదెళ్ల కృష్ణమూర్తిగారితో కలసి ప్రపంచ దివ్యజ్ఞాన సభలకు కాశీ వెళ్లి అచటనుండి గయ, ప్రయాగ. ఆగ్రా క్షేత్రము లను దర్శించిరి.

1953 లో శ్రీ వడ్లమాని సోమశేఖరం గారిని వెంటబెట్టుకొని ఉత్తర హిందూస్థాన యాత్ర గావించి ఢిల్లీ, హరిద్వార్, హృషీకేశము, డేరాడూన్, ముస్సోరీ, భాక్రానంగల్, కురు క్షేత్రము, మధుర. బృందావనము, ఆగ్రా. గయా. జాట్నా, నలందా, రాజగృహ్, అలహాబాద్. కాశీ, సారనాథ్, కలకత్తా, భువనేశ్వర్, పూరీ, జగ న్నాథ్ల దర్శించి ఆ యా ప్రదేశముల చరిత్రా త్మక, మతవిషయక, సాంస్కృతిక, పుణ్యక్షేత్ర విశేషములను వారిచే వ్రాయించిరి. ఈ యాత్రలో వారి మాతృ శ్రీ అక్కాయమ్మగారి చితాభస్మమును

హృషీకేశమున గంగానదిలో కలిపిరి. గయా క్షేత్రమున ఆమెకు పిండోదకముల వదలిరి.

1954 లో శ్రీ మేడూరి వెంకటసోమేశ్వర కృష్ణమూర్తిగారిని వెంట నిడుకొని ఓరుగల్లు విజ్ఞానయాత్ర గావించి అచటి దుర్గములను, శిథిలావశేషములను, శిలాశాసనములను శిథిల దేవాలయములను పరికించిరి. ఈ యాత్రా సమగ్ర చరిత్ర శ్రీ కృష్ణమూర్తిగారిచే వ్రాయించి పొందు పఱచిరి.

శరీరబలమున మిన్నయైన 'ఆంధ్రవస్తాద్' స్వర్గీయ శ్రీ కోడి రామమూర్తినాయుడుగారి జీవిత చరిత్రను సమగ్రముగ వ్రాయింప దలచి శ్రీ చెముటూరి సుబ్బారావుగారిని వెంట నిడుకొని కాకినాడ, విశాఖపట్టణము, విజయనగరము మొదలగు చోట్ల కేగి నాయుడుగారి జీవిత విషయములు, ఫొటోలు, సంగ్రహించి తెచ్చిరి. ఇంకను కొంత భోగట్టా జరుగవలసి యుండుటచే పుస్తకము ఇంతవరకు అచ్చునకు రాలేదు. (ఇటీవల ది 29-12-1966 వ తేదీని 29 వ ఇండియన్ హిష్టారికల్ కాంగ్రెస్ గోల్డెన్ జూబిలీకి ఆహ్వానము రాగా మైసూరు వెళ్లుచు బెంగుళూరులో ఆగి శ్రీ కె. వి. అయ్యంగారిని కలసికొని శ్రీరామమూర్తినాయుడుగారిని గురించి కొన్ని విషయములు సేకరించిరి. కొద్దికాలములో పుస్తకము అచ్చునకు రాగలదు.

1959 ఫిబ్రవరి 13 వ తేదీని శ్రీ తిమ్మరాజుగారు శ్రీ దేవరపల్లి సురేంద్రమోహన్‌చౌదరి గారితోను. శ్రీ దెందుకూరి సోమేశ్వరరావు గారితోను, శ్రీరామారావుగారితోను తెలంగాణా చారిత్రక విజ్ఞానయాత్ర గావించిరి. ఈ యాత్రలో రామప్ప గుళ్లయందలి శిల్ప చాతుర్యము. ఖమ్మంమెట్టు దుర్గము వరంగల్లు, అచటి దేవాలయములు, శిథిలావశేషములు, శిల్పము కాకతీయులనాటి అవశేషములైయున్న శిలావిగ్రహములు, నాట్యభవనములు, కొలనుపాక గ్రామములోని జైన దేవాలయము, జఫల్‌గడ్డ, బీదర్ దుర్గములు మొదలగునవి పరికించిరి. తిరుగు ప్రయాణములో హైదరాబాద్‌చేరి అచట చూడదగు కట్టడములు, ఉస్మానియా యూనివర్శిటీ, పారిశ్రామిక ప్రదేశములు చూచిరి. తరువాతరోజున "బీదర్" దుర్గమును, నానక్‌ఝూ మొదలగునవి చూచి మరల హైదరాబాద్ చేరిరి. ఆ మరునాడు నల్గొండ దుర్గమును సందర్శించి రాత్రికి మరల హైదరాబాద్ చేరుకొని మరునాటి ఉదయమున బయలుదేరి స్వస్థలమగు తణుకు చేరిరి—ఈ ప్రయాణమును తమ కారులో సుమారు 1200 మైళ్లు వారము రోజులలో ముగించి చాల చారిత్రక, విజ్ఞాన విషయములను గ్రహించిరి. ఈ యాత్రావిషయములను సమగ్రముగ శ్రీ రామారావుగారిచే వ్రాయించి పొందుపరచిరి.

1963 డిసెంబరు 27 వ తేదీని పూనాలో జరిగిన అఖిలభారత ఇతిహాసకాంగ్రెస్ రజతోత్సవ సమావేశమునకు శ్రీ మేడూరి వేంకటసోమేశ్వర కృష్ణమూర్తి, శ్రీ చెముటూరి వేంకటసుబ్బారావు గారుతో హాజరైరి. ఆ సమావేశములో పాల్గొనుటయే గాక యఱవాడ జైలు, ఆగాఖాన్ భవనము, మహారాష్ట్ర పీష్వాల శనివారవాడా దుర్గము, పూనా విశ్వవిద్యాలయము, చరిత్ర ప్రసిద్ధమైన యితర దుర్గములు, బాలగంగాధరతిలక్ నివసించిన భవనము దర్శించిరి. పూనాలో శ్రీ కె. సువర్ణ గద్దే అప్పారావు, తదితర మిత్రులను,

మహామహోపాధ్యాయ శ్రీ పోద్దార్, ఖరే, షెర్వానీ గారలను, ఇతరదేశములనుండి వచ్చిన "హిష్టరీ డెప్యూటింగు హెడ్సు"ను కలిసికొనిరి. పూనా నుండి తిరుగు ప్రయాణములో చరిత్ర ప్రసిద్ధము లైన నల్లదుర్గ, షోలాపూర్, పిల్లలమర్రి, అచటి దేవాలయములు, ఉండ్రకోట సందర్శించిరి.

1964వ సంవత్సరములో శ్రీ వాసిరెడ్డి గోపాలకృష్ణప్రసాద్ గారితో కలసి తెలంగాణాలో దేవరకొండ, పానగల్లు మొదలగు చరిత్రప్రసిద్ధ ములగు దుర్గములను దర్శించి, అచటి రాజులు, వారి చరిత్ర, ఏలుబడి మొదలగు విషయముల సంగ్రహించిరి.

1966 డిసెంబరు 21న మైసూరులో జరుగు 28వ ఇండియన్ హిష్టరీ కాంగ్రెస్ ఆహ్వా నము పురస్కరించుకొని శ్రీ మేడూరి వేంకట సోమేశ్వరకృష్ణమూర్తి, శ్రీ చెముటూరి సుబ్బారావు గారలతో మైసూరువెళ్ళిరి. మార్గమున బెంగుళూరు తో ఆగి అచట చూడదగిన లాల్‌బాగ్, కబ్బన్ పార్కు, నంది, విధాన్‌సభ మొదలగు వానిని దర్శించిరి.

మైసూరుతో యూనివర్సిటీ కాంపౌండులోని మానస గంగోత్రి అను పేరుగల హిష్టరీ డిపార్టు మెంటునందు ఈ సభలు జరిగినవి. మైసూరులో ముఖ్యముగా చూడదగిన మహారాజాపేలేస్,మ్యూజి యమ్, చాముండేశ్వరీ ఆలయము, నంది, ప్ర పంచ విఖ్యాతిచెంది రాత్రిపూట వివిధరంగుల మేళవింపుతో కళకళలాడు "బృందావన్‌గార్డెన్సు" కృష్ణరాజేంద్రసాగర్ ఆనకట్ట, నిషాత్‌బాగ్ మొద లగు ప్రదేశములు చూచిరి.

సభల అనంతరము కమిటీవారిచే ఏర్పాటు చేయబడిన ఎస్కర్షన్‌లో పాల్గొని చరిత్రాత్మక మైన, టిప్పుసుల్తానుకు ఆవాసమైన శ్రీరంగపట్ట ణము, అతని వేసవి భవనము, గోరీ మొదలగు వానినిచూచి, ఆ మరునాడు ది 1–1–1967వ జైనులకు అతి పవిత్రమైన ప్రదేశములు శ్రావణ బెల్గొళా (గోమతేశ్వరము) హోయసల వంశస్థు లచే నిర్మింపబడిన బేలూరు, హాలీబీడ్ (ద్వార సముద్రము) చెన్నకేశవస్వామి, హోయిసలేశ్వర ఆలయములను వానిశిల్పకళను దర్శించిరి. డాక్టర్ ఎస్. పి. సేన్, డా. పుషాల్కర్, డా. దీక్షిత్, డా. షెటీ, గోఖలే ప్రముఖులతో చరిత్ర విషయ ములు చర్చించిరి.

1967 డిసెంబరు 21 తేదీన పాటియాలాలో 29వ ఇండియన్ హిష్టరీ కాంగ్రెస్ ఆహ్వానము పురస్కరించుకొని శ్రీ మేడూరి వేంకటసోమే శ్వరకృష్ణమూర్తి, శ్రీ చెముటూరి సుబ్బారావు గారలతో పాటియాలా వెళ్లిరి. మార్గమున ఢిల్లీలో ఆగి జంతర్ మంతర్, లక్ష్మీనారాయణ దేవాలయము, భిర్లాభవనము, ఎర్రకోట, త్రిమూర్తి భవనము, శాంతివనము మొదలగువానిని దర్శిం చిరి. లక్ష్మీనారాయణ దేవాలయమందలి ప్రాచీన చక్రవర్తుల శిలావిగ్రహములు వారిని మిక్కిలి ఆకర్షించినవి.

ఈ పర్యటనలో సికిందరా. ఆగ్రా, ఫతే పూర్‌సిక్రి, దయాల్బాగ్‌లలో మొగలాయీచక్ర వర్తుల కోటలు, సమాధులు, తాజమహల్, ఇతర భవనములుచూచిరి. తాజమహల్‌ముందుహార్వాని మిత్రులతో ఫొటో తీయించుకొనిరి.

1967 డిసెంబరు 30, 31 తేదీలు మరియు 1968 జనవరి 1వ తేదీని పాటియాలా యూనివర్సిటీలో జరిగిన ఇండియన్ హిష్టరీ కాంగ్రెస్ సమావేశములకు హాజరైరి. పాటి యాలాలో మోతీబాగ్, ముబారక్‌కిలా, మ్యూజి యమ్, నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్సు దర్శించిరి.

సభల అనంతరము 2 జనవరి నాడు హిష్టరీకాంగ్రెస్‌వారిచే ఏర్పాటుచేయబడిన విజ్ఞాన యాత్రలో పాల్గొని సర్‌హింద్. ఆనందపూర్, నంగల్‌డామ్‌చూచిరి. చండీఘర్‌లో ఆగి అచట చూడదగిన సుఖనాలేక్, హైకోర్టు, సెక్రటేరియట్ దర్శించిరి.

ఢిల్లీలో శ్రీ చిట్టూరి సత్యనారాయణ. శ్రీ వేదుల వాణీప్రసాదరావు, శ్రీ మేడూరి వేంకటసుబ్బారావు, శ్రీ వాత్సవ మున్నగు మిత్రులను చూచిరి.

హిష్టరీకాంగ్రెస్‌సభల సందర్భమున శ్రీయుతులు డాక్టర్ ఫౌజాసింగ్, డాక్టర్ బిపిన్‌చంద్ర, డాక్టర్ జి. యస్. దీక్షిత్, డాక్టర్ సతీష్‌చంద్ర, డాక్టర్ పంచానన్ లాల్‌మిశ్ర ప్రభృతులతో చరిత్ర విషయమై చర్చలు సాగించిరి.

ఆదినుండియు వీరిది రైతుకుటుంబమగుటచే శ్రీ తిమ్మరాజుగారికి వ్యవసాయక్షేత్రములన్నను, ఉద్యానవనములన్నను ఎక్కువ మక్కువ. వీరు గావించిన ప్రతియాత్రయందును వ్యవసాయక్షేత్రములను నర్సరీలను చూచుట, కాయగూరల పూలమొక్కల విత్తనములు అంట్లు మొక్కలు సేకరించి వారి స్వస్థలముల పెంచుట వారికి ఆనందము, ప్రాంతమున లేని అనేకరకముల మొక్కలను, చెట్లను తెచ్చి నాటించి పెంచుచుందురు.

శ్రీ తిమ్మరాజుగారు సాహిత్య జిజ్ఞాసువులు. ఆయన తమ జీవితమును ముఖ్యముగా ఉపాధ్యాయులతోను, కవి పండితుల సాంగత్యముతోను కవితాగోష్ఠులు పండితసభలు జరిపించుటలోను. కవి పండితులకు ఉచితసత్కారముల చేయుటతోను, విషయములను గ్రహించి, జీర్ణముచేసికొనుటతోను ఇప్పటివరకు గడుపుచున్నారు. ఆయన గడించిన అనుభవము అపారము, "అనుభవమునకు మించిన విద్యలేదు" అని పెద్దలు చెప్పెదరు,

ఆయన ఉపాధ్యాయులుకారు. కాని ఉపాధ్యాయులకు ఉపాధ్యాయులు. కవికారు కాని ఆయనది కవితాహృదయము, సాహిత్య నిర్మాణము చేయలేదుకాని "సాహితీవల్లభులు". ఆయన ప్రత్యక్ష జ్ఞానము, అనుభవము, సాహిత్యసేవ గ్రహించియే ఆంధ్రప్రదేశ సర్కారువారు ఆయనను ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ సభ్యులుగ నెన్నుకొనిరి. అంతియేకాదు. ఇటీవల అఖిలభారత తెలుగు రచయితల సంఘమునకు ఉపాధ్యక్షులుగను, నవ్యసాహిత్య పరిషత్తునకు అధ్యక్షులుగను ఈయన ఎన్నుకొనబడిరి.

బిరుదములు.

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు అధ్యక్షులుగ ది 13–10–'65న శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి 63వ జన్మదినోత్సవముజరిగెను. ఆనాటి సభయందు శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు తమ "ఔచిత్యవిచారచర్చ" కృతి యిచ్చిరి. కవి పండితుల సమక్షమున శ్రీ తిమ్మరాజుగారికి "సాహితీవల్లభ" బిరుదమీయబడెను.

ది 17-4-'67 తేదీని విద్వన్మహాకవి పండితపరిషత్తు ఉత్తరప్రదేశ్ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతను జరిగెను. అందు శ్రీ తిమ్మరాజుగారు "సాహిత్యసామ్రాట్టు" అను కావ్యము డాక్టర్ త్రిపురనేని వేంకటేశ్వరరావుగారినుండి కృతి స్వీకరించుటయే గాక "ఆంధ్రభోజ" అను బిరుదమును పొందిరి.

ఈవిధముగా నిస్వార్థభావముతో సాహిత్యసేవ, ప్రజాసేవ, దేశసేవ ఇంకను అధికముగా చేయగల్గుటకు భగవంతుడు వారికి సంపూర్ణాయురారోగ్యములను, భోగభాగ్యములను, సిరిసంపదలను ప్రసాదించుగాక.

"జైహింద్"

శ్రీకృష్ణరాయల ప్రేమాదరణలను
నల్లారుముద్దుగా నలరి యలరి;
రఘునాథనాయకు ప్రాపునఁ గై పెక్కు
యిచ్చవచ్చినక్రియ నెసఁగి యెసఁగి;
పీఠికాపురినేత పేరిమిఁ గూరిమి
నతులితభోగంబు లంది యంది;
సరసులు, సౌమ్యులు, సౌజన్యవరులు, స
హృదయులు మీరని యెంచి యెంచి:
యాంధ్రభాషావధూటి మి మ్మాశ్రయించె.
దిక్కుమాలినదై నేఁడు, తిమ్మరాజ!
ముళ్లపూడి వంశాంబుధి పూర్ణచంద్ర!
యెట్లు బ్రోతురో, మీదయ యింకమీఁద.

కవికోకిలావళికి వసంతకాల ర
సాలసాల వనరాజంబు మీరు:

పండిత కలహంస మండలికిన్ విని.
ర్మలమానససరోవరంబు మీరు;
ఆంధ్రచరిత్రకారాశివారమునకుఁ
గుసుమితకల్పకకుజము మీరు;
ఆశ్రితజన చకోరశ్రేణికిన్ శర
త్పూర్ణిమా శీతాంశుమూర్తి మీరు:

సఖిశిఖావలపుంగవ జాలమునకుఁ
బ్రావృషేణ్యపయోధరపటలి మీరు;
ధన్యురా లయ్యెను దెనుఁగుతల్లి, మిమ్ముఁ
గని, సుగుణఖని! వితరణకర్ణ! యవని.

ఆయురారోగ్య భోగభాగ్యంబు లొసఁగి,
సంతతంబు శ్రీకేశవస్వామి ప్రోఁచుఁ
గాక! పరిపూర్ణకరుణారసైక వృష్టి
మిమ్ముల నపరభోజ! శ్రీ తిమ్మరాజ!

శ్రీ దామెర రాజగోపాలరావు

# సాహితీవల్లభుని సాహిత్యవాల్లభ్యము

*శ్రీ ఆంధ్ర శేషగిరిరావు*

'ఆర్యా ! శ్రీ నరేంద్రనాథ సాహిత్య మండలి వ్యవస్థాపకాధ్యక్షులును, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులును అగు 'సాహితీవల్లభ' శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు విద్వత్కవి చారిత్రక పక్షపాతముతో చిరకాలమునుండి సాహితీ సేవను, సాహితీ పోషణమును చేయుచు, ఇతోఽధికముగ చేయ సంకల్పించియున్న విషయము తమరెఱుగనిది కాదు . . . అట్టివారి నభినందించుచు నేడు ఆంధ్రదేశమున సాహిత్యిక సాంస్కృతిక చారిత్రిక రంగములలో జరుగుచున్న సత్కృషి సమగ్రముగా ప్రతిబింబింపగల 'సాహితీవాల్లభ్యము' అను సంకలన సంపుటిని వెలువరించుటకు శ్రీ నరేంద్రనాథ సాహిత్య మండలి సంకల్పించినది.'

అనునవి సాహితీవాల్లభ్యమునకు వ్యాసము కోరుచు కార్యకర్తలు వ్రాసిన జాబులోని ముందు మాటలు.

ఆమ్రేడితశబ్దములు

సాహితీ, వల్లభ, సాహిత్య, వాల్లభ్య శబ్దములు ఈ ముందు మాటలలో పలు తడవలు ఆమ్రేడితమైనవి.

ఆమ్రేడితములైన ఈ శబ్దాల అర్థం ఆలోచిద్దాము.

ముందు సాహితి, సాహిత్యశబ్దాల అర్థం విషయం.

సహితములైన శబ్దార్థాలయొక్క భావకర్మాలే సాహితీఅనీ, సాహిత్యమ్ అనీ నిఘంటువులు చెబుతున్నాయి.

ఇక వల్లభ, వాల్లభ్యశబ్దాల అర్థం సంగతి.

వల్లభశబ్దానికి నిఘంటువులు చెప్పే నానార్థాలలో ప్రియవస్తువు, అధ్యక్ష అనే విప్రకరణానికి చక్కగా అనువుపడి ఉంటాయి,

వాల్లభ్యము అంటే ఆధిపత్యము, దొరతనము, జనరంజకత్వము, దయ, ప్రీతి, చొరవ, విశ్వాసము, బలము, భక్త్యతిశయము అనే పలు అర్థాలు నిఘంటువుల్లో సూచితమవుతున్నాయి.

సాహితీవల్లభుని సాహిత్యవాల్లభ్యము ఈ అర్థాలను అన్నిటిని సార్థకం చేసేది అవుతుంది.

సహితములైన శబ్దార్థములయొక్క భావ కర్మాలు అతనికి ప్రియవస్తువులు.

సహితములైన శబ్దార్థాలయొక్క భావ కర్మాలకు అతను అధ్యక్ష మహాశయుడు.

ఆ అధ్యక్షునికి ప్రియవస్తువు ఐన సాహితికి ప్రదర్శనభూమి ఈ సాహితీవాల్లభ్యము.

సాహితీవల్లభుని సాహితీవాల్లభ్యానికి అక్షర రూపమిచ్చే ప్రయత్నంలో — ఈ గ్రంథం = ఈ పుస్తకం — వెలసింది.

చక్షు రక్షర సంయోగం

గ్రంథం, పుస్తకం ఆ నామాలు ఎంత పవిత్రమైనవి!

సహితములైన శబ్దార్థాల భావకర్మాలు గర్భితం ఒనర్చుకుని పాఠకులకు చక్షురక్షర సంయోగంద్వారా ప్రత్యక్ష మయ్యేవి పుస్తకాలు. విద్యలకు అధిదేవత ఐన సరస్వతి పుస్తక రూపిణి.

కావుననే పుస్తక ప్రాశస్త్యం ఇట్లు చెప్ప బడుతూ ఉంది.

1. 'Bɔoks are the treasured wealth of the world, the fit inheritance of generations and nations.'

—Thoreaw.

2. 'A good book is the precious life blood of a masterspirit, embalmed and treasured up on purpose to a life beyond life.'

—John Milton.

3. 'Everywhere have I sought rest and found it not, except sitting apart in a nook with a little book.'

—Thomas A. Kempis.

4. 'Syllables govern the world.'

—Selden.

5. 'A man's life is brief; a book's life may be prolonged century after century.'

—George Maore.

6. 'It is chiefly throug books that we enjoy intercourse with superior minds. In the best books, greatmen talk to us, give us their most precious thoughts and pour their souls into ours.

—W. E. Chauning.

7. A true University in these days is a good Collection of books.

—Carlyli.

## తెనాలికవి గ్రంథాలయం

పుస్తకాల ప్రశస్తి ఇట్టిదికాబట్టే సంస్కృతికి నోచిపుట్టిన, ప్రతికుటుంబమును పుస్తక సేకరణం, రక్షణ తమ విధాయక కృత్యాలలో ఒకటిగా పరిగణించేవి ;పరిగణిస్తూ ఉన్నవి.

తెనాలిరామకృష్ణుని పాండురంగమాహాత్మ్యములోని నిగమశర్మోపాఖ్యానమున 'పుస్తక భాండాగారంబు . . . అపుస్తకణి శిథిలబంధన యాచక ప్రముఖోపద్రవంబుల వలనం బాచి ప్రోచుచు' అను వర్ణనకలదు. ఈ వర్ణనను బట్టి పుస్తకములంటే మనవారికిగల శ్రద్ధ కొంతకు కొంత పొల్తి పట్టవచ్చు.

శ్లో॥ అగ్నేరక్ష, జలాద్రక్ష, రక్షమాంశ్లథ
బంధనాత్
పునశ్చ యాచకాద్రక్ష యాచనాంతంహి
పుస్తకమ్.

అనే పుస్తక ప్రార్థనశ్లోకం ఈ సందర్భంలో తడవతగి ఉంటుంది.

శ్రీ చెలికాని లచ్చారావు, శ్రీ దహగం లక్ష్మీనారాయణ, శ్రీ వేపా రామేశంపంతులు, శ్రీ బులుసు బుచ్చిసర్వారాయుడు మున్నగు ఆంధ్రమహనీయుల వలెనే ఈ సాహితీ వల్లభులును అమూల్యమగు సొంత గ్రంధాలయాన్ని ఒకదానినికూర్చి ఉన్నారు.

శ్రీ చెలికాని లచ్చారావు గ్రంధాలయం శ్రీ సంహారి సుబ్బారావును పరిశోధకుని చేసింది. శ్రీ దహగం లక్ష్మీనారాయణ గ్రంధాలయం నాగపుర విశ్వవిద్యాలయాన్ని పరిపుష్టం చేసింది. శ్రీ బలుసుబుచ్చి సర్వారాయుడు గ్రంధాలయం శ్రీ చాగంటి శేషయ్యచే కవితరంగిణి వ్రాయించింది.

## సాహితీవల్లభుని గ్రంధాలయం

సాహితీవల్లభులును ప్రశస్తమైన గ్రంధాలయాన్ని ఒకదానిని కూర్చిఉన్నారు. పుస్తక సేకరణపట్ల వారికిగల అభిలాష అగ్గలమైంది. విశేషమేమిటంటే వారినామం ముద్రించిన కరపత్రాలు జొనిపివారి సొంత గ్రంధాలయంలోని ప్రతిపుస్తకాన్ని బైండుచేయించి భద్రపరచడం.

సాహిత్యము. చరిత్ర అను రెండు శాఖలలో అనేక అపూర్వ గ్రంథాలతో వారి సొంత గ్రంధాలయం నిండారి ఉంది. ఆ గ్రంధాలయం విద్వాంసుల వాడుకచే ఉచితోపయోగ్య ప్రవృత్తిని అందాలని వారు తమ ఆకాంక్షను పలు తడవలు వెల్లడిస్తున్నారు.

వారిగ్రంధాలయంలో ఒకసారి పుస్తకాలు తిరగవేస్తున్నాను. వారు కృతిపొంది ముద్రించిన పుస్తకం ప్రతిఎవరెవరిపేర్లో వ్రాయబడినది ఒకటి కనిపించింది. దీనిని ఇంత జాగ్రత్తగా భద్రపరిచారేమిటి అని అడిగాను.

దానికి సమాధానంగా వారిట్లు చెప్పారు.

"ఈ గ్రంధాన్ని నేను కాంప్లిమెంటరీగా ఒకరికి ఇచ్చిఉన్నాను. వారు దీనిని భద్రపరచలేదనుకుంటాను. చేతులు మారి ఇది సెకండుహ్యాండు బుక్కుస్టాలుకు చేరింది. అక్కడ దీనిని నేను కొన్నాను.

## బెర్నార్డుషా సాదృశ్యము.

వారివలన ఈ ఉదంతం విన్న నాకు ఇట్టి సందర్భంగల బెర్నార్డుషా కథ ఒకటి జ్ఞాపకం వచ్చింది. బెర్నార్డుషా తాను రచించిన గ్రంథం

ప్రతి ఒకటి కాంప్లిమెంటరీగా 'గ్రంధకర్త అభివాదాలతో' అనే అక్షరాలతో ఒక మిత్రుడికి ఇచ్చాడు.

ఆ మిత్రుడు ఆ గ్రంధంపట్ల అంతశ్రద్ధ చూపలేదు; అమ్మకానికి సెకండుహ్యాండు బుక్కుస్టాలు వానికి ఇచ్చివేశాడు. ఒకసారి బెర్నార్డుషా ఆ సెకెండు హ్యాండు బుక్కు స్టాలుకు వెళ్లాడు. అచ్చటి పుస్తకాలు వెతకడంలో అతనికి తన పుస్తకం కనిపించింది. దానిని కొని అతడు 'గ్రంధకర్త పునరభివాదాలతో' అని వ్రాసి తిరిగి ఆ మిత్రునికి పంపాడు. అందుతో ఆ మిత్రుడు షా గ్రంధానికి తాను చేసిన అవజ్ఞత గుర్తింపగలిగాడు.

పుస్తక సేకరణపట్లనేకాక పుస్తక ప్రచురణ పట్ల కూడా సాహితీవల్లభునికి అభిలాష మెండు.

వారు కృతిపొందినవైతే ఏమి, ప్రచురించినవైతే ఏమి గ్రంథాలు ఇరవై అయిదుకుపైగా కనిపిస్తున్నాయి. అవి బుద్ధగీత, కాకతిప్రోలరాజు, ఔచిత్య విచారచర్చ, శ్రీకారముచేటి మాధవస్వామి శతకము, ఆంధ్రనాయకశతకము, ఆర్యచాణక్యుడు, భవిష్యపర్వము, రాజానందము, గోస్తనీనదీమాహాత్మ్యము, నీతిశాస్త్ర ముక్తావళి, ఆదర్శగృహిణి, నరేంద్రుడు, విపులనీతి కుమారసంభవ పీఠిక, తణుకు పంచాయితీ సావనీర్, దమపదము మున్నగునవి.

## నేను నాది అనే అభిమానం

ఆంధ్రనాయక శతకము, సింహాద్రినారసింహ శతకము, నీతిశాస్త్ర ముక్తావళి మున్నగు ప్రాచీన కవుల గ్రంధాలనేకాక భవిష్యపర్వము, రాజానందము, బుద్ధగీత మున్నగు ఆధునిక కవుల పద్యగ్రంధాలను ఆర్య చాణుక్యుడు, కాకతి ప్రోలరాజు మున్నగు చారిత్ర కోల్బణము గల కధాగ్రంథాలను — ఔచిత్య విచారచర్చ వంటి సాహిత్య గ్రంథాలను—గోస్తనీనదీ మాహాత్మ్యము వంటి స్థానిక పురాణగాధా గ్రంథాలను వారు ప్రచురించి ఉన్నారు.

తణుకు పంచాయితీ సావనీరు ప్రచురణముతో వారి స్వస్థానాభిమానము లెస్సగ నిరూపితమైంది. 'నేను నాది' అనే అభిమానము లేనిదే ఏ వ్యక్తికాని, ఏ జాతికాని పైకి రాలేదని శ్రీవారు తరుచు చెబుతూ ఉంటారు. ఆంధ్రులలో నేను, నాది అనే అభిమానము చాలతక్కువని వారుచెప్పే దానితో ఏకీభవింపనివారు చాల అరుదుగా ఉంటారు.

సాహితీవల్లభులు ప్రచురించిన గ్రంథాలలో ఒక్కొక్క దానిని గురించి ప్రత్యేకించి కొంత కొంత చెప్పవలసి ఉంది. కాని గ్రంధ విస్తరభీతి దానికి అడ్డువస్తున్నది.

ఈ సాహితీవల్లభుని సాహిత్యవాల్లభ్యము ఆంధ్రులకు ప్రశస్త సాహిత్యమును కొంత ప్రసాదించపది. ఆధునిక యుగాంధ్ర సారస్వతమున అది సముచితస్థానాన్ని ఆక్రమింపగల పౌరభాన్ని కలిగిఉంది.

సాహితీవల్లభుని ఈ సాహిత్యవాల్లభ్యము మనకు ప్రసాదించిన నరేంద్రనాధ సాహిత్యమండలి ఆధునికాంధ్ర సాహిత్యమును ఇతోధికంగా ఉద్దీపింపచేయగల స్తోమతను కలిగిఉందని ఇందుతో నిరూపితమైంది.

చెఱుకు నకు పండు,

అచ్చుకూటము అమరిఉంది. నన్నయనాటి నుంచి సారస్వత ప్రశస్తినందిఉన్న తఱుకు దానికి ఉంకువ సీమఐఉంది. ప్రశస్తసాహిత్యులు దానికి ప్రధాన ప్రాపకులై ఉన్నారు,

ఇట్లు క్షేత్ర, బీజములు ప్రశస్తమైనవై ఉన్నాయి.

అయితే ఈ నరేంద్రనాథ సాహిత్యమండలి సంకల్పించిన స్తవనీయ కార్యములన్నీ ప్రచార బాహుళ్యమునంది పచేళిమం కావడానికి దానితర ఫున సాహిత్య మాసపత్రిక ఒకటి ప్రచురితం కావడం చాలా అవసరమని తోస్తుంది.

కోయంబత్తూరులోని 'రంగమ్మ' పదాన్ని వెలికి తీసిన—కోడి రామమూర్తిని గురించి విషయ సేకరణలో విస్తర ప్రశస్తి చెందిన—కాకతికి సంబంధించిన స్థానికగాథలు అనేకం సేకరించిన—ఇత్యాది ఈ సాహితీవల్లభుని శతాధిక కృషులన్నీ ఎప్పటికప్పుడు లోకానికి అందాలంటే అట్టి పత్రిక . . .

'సాహితీవల్లభు'ని సత్వర సమాలోచనము. నకు ఇది అందునుకాక!



## శ్రీ బోడేపూడి వేంకటరావు

శ్రియం సమగ్రాం వితనోతుశశ్వ
త్కటాక్ష లీలాప్రవణం మహస్తే
సదా సదానందన నందితాయ
శ్రీ ముళ్లపూడ్యన్వయ శేఖరాయ.

తరతరంబులనుండి తఱగకమేలిమి రాణించువంశగౌరవము నెరసి
శ్రీమత్తగలిగియు ధీమత్తగలిగియు మహితసౌజన్యసంపత్తినెసఁగి
ప్రౌఢిమంబుగడించి ప్రాభవాంచితుఁడయ్యు దనయాజ్ఞఁదలదాల్చు తనయుఁగాంచి
ప్రాజ్ఞతాగరిమంబు రసికతామహిమంబు వాసింపఁ గవిజనావనత మెఱసి.

శాస్త్రవిద్యలతోఁ బరిశ్రమలతోడ
భావిభారతకల్యాణ పదముదీర్చి
సర్వధా సర్వలోక సంస్తవములందు
దీవదైశ్వర్య మహితుండు తిమ్మరాజు.

చారిత్రకవిశేషసందర్భములనెల్లఁ గరతలామలకముల్‌గా నెఱుంగు
ప్రత్నసూత్నకవిత్వ భాసనంపదలందు మంచిచెడ్డలనేర్పరించి మెచ్చు

సకలకలారహస్వి ప్రపంచంబుల మూలముట్టనెఱింగిపోనిసేయు
విజ్ఞానశాస్త్ర సంవేత్తృతాప్రౌఢిమ ప్రాజ్ఞు తానౌనను పాటినెనయు.

మాటలాడనేర్చు మధురాక్షరంబుగా
నొజ్జ జంటగాగ నుండనేర్చు
ఎల్లరకును దాను నెల్లరుఁదనదగు
దిట్ట ముళ్లపూడి తిమ్మరాజు.

స్మితపూర్వంబుగ మాటలాడుఁ గరుణంబందించు దీనాళిపై
నుతిపాత్రం బనుఁజరిత్రమూను బుధులన్ బోషించు ధర్మైక ప
ద్ధతులన్ నిచ్చలు నూనుధీరమతి యాత్మశ్లాఘకున్ దూరుఁడే
గతి భావించిన తిమ్మరాజుకు సరింగా తిమ్మరాజే మహిన్.

మంచితనముగల్గు మహిమాఢ్యతయుగల్గు
ధనముగలుగు దానగుణముగల్గు
ఎన్నదగినగుణము లన్నియునుంగల్గు
తిమ్మరాజు నభినుతింపఁదరమె.

## శ్రీ జాస్తి వేంకట నరసయ్య

శ్లో॥ "ముళ్లపూడ్య"బ్ధిసంజాతః తిమ్మరాజు సుధాకరః ।
అకరోత్ స్వయశోజ్యోత్స్నాం సర్వదిక్షు విహారిణీం ॥ 1

శ్లో॥ కవిపండితసమ్మాన్యః సాహితీవల్లభో భృశం ।
చకారబహుధాసేవాం త్యాగీ నిత్యమతంద్రితః॥ 2

శ్లో॥ నరేంద్రనాథసాహిత్యమండలిః స్థాపితాభువి ।
క్రియతే సాహితీసేవా తిమ్మరాజమహోదయైః॥ 3

శ్లో॥ శాంతోదాంతః మహాప్రాజ్ఞః పరసేవాపరాయణః ।
కవిపండితసంస్తుత్యః తిమ్మరాజాహ్వయోభువి॥ 4

శ్లో॥ ఉపాధ్యాయ సఖశ్చాయం నిరాడంబర జీవితః ।
సజ్జనానాం మార్గదర్శీ విలసద్గుణభూషితః॥ 5

శ్లో॥ హరిశ్చంద్రప్రసాదోఽస్య జ్యేష్ఠపుత్రో మహామనాః ।
ఆంధ్రశాసనసభ్యోఽయం అవాపమహతీం యశః॥ 6

శ్లో॥ పరిశ్రమకళాలా నానాలాభ సమాయుతా ।
స్థాపితా త్యాగినాఽనేన సదుద్యోగ ప్రదాయినీ॥ 7

శ్లో॥ శ్రీవేంకటేశ్వరః పాయాత్ తిమ్మరాజాహ్వయం సదా ।
ఆయురారోగ్యభాగ్యాని దత్వా భూరిదయాయుతః॥ 8

శ్లో॥ పూతః శ్రీకేశవస్వామీ పురుషార్థప్రదాయకః ।
పాయాద్ధీరస్వాంతమేనం కరుణాయుతచేతసా॥ 9



శ్రీ జాస్తి వేంకటరమణయ్య

శ్రీ చిలుకూరి రామభద్ర శాస్త్రి

ముళ్లపూడివారు మొదటినుండియు నాంధ్ర
ధనికులందుఁ జేరుగొనినవారు
ధనముతోడ వాణి – మనుజులసేవింప
తిమ్మరాట్ప్రపాదు – లమ్మడయిరి.

ముమతురుష్కులదాడిఁ గనుదేశరక్షయు
మతరక్షఁగావింప మమతనొంది
బుక్కరాయాదులు పూర్ణదీక్షకుబూని
ప్రాణాలకుతెగించి భాకులంది
సాధువిద్యారణ్య చరణసంసేవన
ఫలముచే ఘనవిత్తకలననొంది
దేశంబుఁగాపాడ ధీశక్తి వెలయ వి
ద్యానగరింగట్టి యందగించి

తనర తండ్రికుమారులు తణుకునిపుడె
యపరవిద్యానగరిఁజేసి హాయిఁగూర్చ
జానపోషింపఁదలఁచినా రాసమీర
ఆంధ్రసోదరులార। మీ కమృతమస్తు.

తారకాసురుపేరిటఁ దగులమందు
వనము విత్తంపునాగట పదునుఁజేసి
అలయయోధ్యగ రూపొందఁదలఁచినావు!
రాజుకానట్టి రాజుగా నోజనొందు
మీదుసొమ్మన రాళ్లపాల్గాదు – తిమ్మ
రాజ! మనుజుల పాలునౌరా! యనంగ.

# సప్తరత్నోపహారము

శ్రీ భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మ

శ్లో॥ శ్రీ ముళ్లపూడ్యభిధకమ్ర సదన్వయాబ్ధేః
పూర్ణాఽమృతాకర మనూనకలాఽలవాలమ్
"సాహిత్యపల్లవ" మమంద మరందవాచ
మవ్యాదుమాసహచరస్త్విహ తిమ్మరాజమ్॥

చంపకమాలికా.

అమలనరేంద్రమండలి నియంతృగణప్రవరుండు, సాహితీ
సమితికి నాంధ్రదేశమున, సభ్యుఁడు, సద్రసయుక్కవిత్వవ
త్ప్రముఖుఁడు; సాధువర్తనుఁ డరంద్రుఁడు, నైకకలావిభాసి; స
త్యమితహితోక్తి చాతురి సతంబురహిందెడువాఁడు సత్కవీ,
ట్కుముదసుధాకరుండు, బుధకోటికిఁ గొంగుపసిండి; దానధ
ర్మముల నజస్రదీక్షఁదగి, మానుగసల్పెడువాఁడు; భోగభా
గ్యముల నెసంగి సంస్థలఁ దగన్నెలకొల్పెడువాఁడు; సూటి మీ
రమి; దయదీనులందు; నపరాజయమంచితకృత్యరాజి; నో

రిమి; యకలంకచిత్తత; ధురీణత మేల్కృతులందు; సూరి స
త్తమచయసంగసక్తత; కృతజ్ఞత, జాగృతి మున్గలట్టి మే
లిమిగుణరాజికిక్కయయి, లేశము నేమరుపాటులేక ని
త్యముఁ బరమేశ్వరాంఘ్రిజల, జార్చనసక్తినెసంగి వాగుమా
రమలకుసాటియైన నిజ రామ భజింప ననూనభక్తిఁ; దా
లిమిఁదగి యన్నివిద్యల, నలేశసుపాండితిమించి రాజవి
ద్యమొనసి శాసనాభిదస డస్సున సభ్యతనొప్పు సత్యవ
క్తృమణి సనామసూనుమణి, తేకువమైనఁదనయానఁదీర్చలో
కమునకు మేలుసల్పుకుతుకంబునఁగ్రాలుచు "ముళ్లపూడి" వం
శమునలరించుచు న్ఘనయశంబునమించెడు తిమ్మరాజ స
త్తమునను గంత్రుయుక్తుని సదాశివుఁడోముత మెప్పుడున్గృపన్.॥

# సాహితీవల్లభుల సరసకృషి

శ్రీ చిలుకూరి వీరభద్రశాస్త్రి

దేనికంటె రెండవది ఉన్నదో అది తక్కువది. అది అల్పము. దేనికంటె రెండవది లేదో అది పెద్దది. 'భూమ' అని వ్యవహరింపఁబడును. ఎచ్చట మరియొకటి చూడబడదో, మరియొకటి వినబడదో, తెలియఁబడదో అది భూమ. ఇదియే అమృతము. అదియేసుఖము. అదియే బ్రహ్మము. అదియే రసము. అదియే ఆనందము, ఇది ఉపనిషన్నిష్కర్ష.

ఈ బ్రహ్మానందము సమాధినిష్ఠులగు యోగులకు జ్ఞానులకు నిత్యము అనుభవైకవేద్యమై యుండును. ప్రతిప్రాణియు నీ బ్రహ్మానందమును ప్రతిదినము పొందుచునేయుండును. స్వప్నము ప్రతిప్రాణిని, సింహమునైనను, వ్యాఘ్రమునైనను, పరమేశ్వరునిలో లయమొనర్చును. ఆ భూమానందములో లయమంది ప్రతిప్రాణియు తనశ్రమను పోఁజేసికొనును. వడ్రంగి ఉలి, బాడిత మొదలగు నుపకరణములతో కూడినపుడు అలసటపడును. ఇంటికివచ్చి వానివి ఒకచో పారవేయగనే శ్రమయంతయు విడనాడుకొనును. అటులనే శరీరభావమును మరచినపుడు బ్రహ్మానందమే. ఇటుల ప్రతిప్రాణి బ్రహ్మలోకమును ప్రతిదినము పొందుచుండును. అయినను ఎవ్వడు నేనిటుల బ్రహ్మాత్మైక్యమును బొందుచుంటినని యెరుగడు. తనపొలములో హిరణ్యనిధియున్నది. దానిపై పైని ప్రతిదినము యజమాని నడచుచునే యుండును. నిధి లోపలనున్నదని యెరుగడాతడు. అందుచే అతనికి నిధిసుఖములేదు. నిధి యచటనేయున్నది. ఇతఁడు తెలిసినను తెలియక పోయిన నచటనేయున్నది. తెలిసినను తెలియకపోయినను రసము, ఆనందము, బ్రహ్మము అను చెప్పబడునది మనయందే యున్నది.

ఈ హృదయాకాశమున రసాపరపర్యాయ మగు ఆనందములేనిచో ఏప్రాణియు ఉచ్ఛ్వాస నిశ్వాసములను విడుపనేరఁడని తైత్తిరీయోపనిషత్తు. ఈ యానందము నంశములే ఇతరవిషయానందములని బృహదారణ్యకము.

ఈ భూమసుఖమునకు సాధనములు భిన్నభిన్నములు. ఈ సాధనములు ఆ భూమానందమునకున్న ఆవరణములనన్నిటిని త్రోచివైచుట కుపయోగపడునవి. జ్ఞానము. నిర్వికల్పసమాధి ఆవరణమును దూరీకరించును. అప్పుడు నిత్యనిరంతరముగా భూమానందమభివ్యక్తమగుచునే యుండును. ఈస్థితిలో పుణ్యపాపములు వాని మూలములైన ధర్మాధర్మములు సుఖదుఃఖములు ఏవియు గోచరింపవు. దీనినే అతిచ్ఛందము. అపహతపాప్మము, అకామము. ఆత్మకామము, శోకవిదూరము అని బృహదారణ్యకము వర్ణించును.

'యంలబ్ధ్వా చాపరంలాభం మన్యతేనాధికంతతః
యస్మిన్స్థితోనదుఃఖేన గురుణాపి విచాల్యతే
సుఖమాత్యంతికంయత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియం'
అని భగవద్గీత యుద్ఘోషించును.

ఈజ్ఞానము—నిర్వికల్పసమాధి దృఢసాధనము. మిగిలినవి స్వల్పసాధనములు. స్వల్పసాధనములుకూడ తాత్కాలికమగు నావరణభంగము కుపయోగపడును, ఈ తాత్కాలికసాధనములు వ్యావహారికవిషయములు. ప్రాపంచికవిషయములు. కావ్యముకూడ ఆవరణభంగమున కుపయోగపడు సాధనమే. ఇయ్యది సమాధిసాధనమెట్టిదో అట్టిది. ప్రపంచములోని క్షణికసాధనముల కంటె విలక్షణమైనది.

స్థాయీభావము, విభావము అను భావము. సాత్త్వికభావము. సంచారిభావములు లోకములో వాస్తవములు. కావ్యమునందు శబ్దార్థమాలోపస్థాపితములు. కామము, సంకల్పము. విచికిత్స, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, సిగ్గు. భయము ఇవి యన్నియు అంతఃకరణ ధర్మములు. సంచారీభావాపేక్షయా స్థాయిభావములు చాలకాల ముండునుగాని స్థాయిభావముగూడ శాశ్వతము కానిది. అంతఃకరణధర్మమే. ఈ యంతఃకరణము వివిధవాసనలతో నిండియుండును.

దీపమునకు మూతయుంచిన దీపము మూతకు బయటనున్న వస్తువులను ప్రకాశింపచేయదు. తాను ప్రకాశించుచున్నను ప్రకాశలేనిదిగనే యుండును. మూతతీయగనే తను ప్రకాశించును. తనకు బయటనున్న వస్తువులను ప్రకాశింపచేయును. అటులనే యీ యాత్మచైతన్యము విభావాదుల (ప్రవర—వరూధినులు) యందలి రాగాదులను ప్రకాశింపచేయును. జాగ్రదవస్థలో ఆలిచిప్పను వెండిగను, త్రాడును పాముగను స్వప్నములో రథాదులను కనబరచునది ఈ యాత్మచైతన్యమే. వెండి, పాము, గుఱ్ఱములు. అంతఃకరణధర్మములు. ఆత్మవిమాత్రము కావు, ఒకవిధముగనున్నదానిని మరియొకవిధముగ నవభాసింపచేయునది మనస్సు. ఒకానొక మానసికదోషము నాయికా నాయకుల చేష్టాదులను తనవిగా నూహింపచేసి ప్రవరవరూధిన్యాదులతో తన్మయతను పఠితకు కల్పించును.

ఈ విభావాదులు అనుభావావస్థకు రాఁగా ఆత్మకు ఆవరణభంగము కలుగును. ఆవరణభంగము గలుగగనే రసానందము. భూమానందము. అడ్డులేనిదై వ్యాపించును. అప్పుడు రెండవ పదార్థమున్నదనికాని, తెలిసికొనవలసినది, తెలియబడునది, తెలిసికొనునది అను భావముండదు. భేదబుద్ధియే నశించును. "తద్యథాప్రియయా

స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కించనవేదనాంతరం" అను శ్రుతి యీ యానందస్థితి నిట్లేవర్ణించినది.

ఇది బ్రహ్మానందమే. ఈ యానందము యోగుల ఆనందము ఒకటి, లౌకికస్త్రీపురుషుల కలియకలోన బాహ్యాభ్యంతర భానముండనపుడీ యలౌకిక బాహ్యోపస్థాపితమగు నానందము బ్రహ్మానందమే. కొందఱు బ్రహ్మానంద సబ్రహ్మచారి యనిరి. "వినిశ్చేతుం....తవన్నర్శేస్సర్శే" అని భవభూతి. "ఒకరెరుగ కింకొకరు ఒదిగి నిద రోదాము" అను బసవరాజుగీతి లౌకికానందమును బ్రహ్మానందమనిరి.

కావ్యగతమగు పదములు, వాక్యములు క్షణికములు. కావ్యమువలనకలుగు అనుభూతియు క్షణికము. ఈ కావ్యవ్యాపార మాగినచో ఆత్మకు మరల ఆవరణము కలుగును. ఆనంద మాగును. ఆవరణము నిబిడమగును. మరల కావ్యశ్రవణమునకై మనస్సు తహ తహ పడును. సత్కావ్యము లభించిన మరల ఆవరణ భంగ మగుచుండును. అనుభూతి సమయములో శాస్త్రము—సమాధి—క్రియ—వస్తువు—అన్నియు తన స్వత్వమును వీడును. భూమానందసామ్రాజ్య మది. ఈ యీమానందానుభూతినుండి ఉత్థితి జరిగినపుడు మరల సర్వాపేక్ష — యోగులకు మన్నదే. సర్వాపేక్షాచయజ్ఞాదిశ్రుతేరశ్వవత్- అను వ్యాససూత్రము.

మనకు సమాధి కుదురదు. యోగాభ్యాసాభ్యసనమున కవకాశములేదు, జ్ఞానము సముపార్జింప మనసుండదు. కావున ఈ కావ్య మీమాంసతోనైనః బ్రహ్మానందము నుపార్జించుటకై యీ కృషి,

ఇంతకంటె తక్కువది ప్రాపంచికానందము బహు యత్నసాధ్యము, స్వల్పసుఖదము. దుఃఖ బహుళము. పరిణామవిషము. ఆదిని అమృత తుల్యము. ఇంద్రియ పరిమితము. అన్నమయ కోశ శరణ్యము. మనోమయ కోశ పరిమితము.

పై రసమును, బ్రహ్మానంద సబ్రహ్మచారి గను, ఆవరణభంగాభి వ్యంగ్యముగను, కొందరాలంకారికులు వర్ణించిరి. పైవారినందరిని ననుసరించుచు భగ్నావరణారత్వాద్యవచ్ఛిన్నా చితిరేవ రసః" అని జగన్నాథపండితులు నిర్వచించిరి. అనగా ఆత్మచైతన్యము, బ్రహ్మము—రసము—భూమానందము. అన్నియు నొక్కటియే యని యద్వైతసిద్ధినిస్థాపించినా డీ యాంధ్ర విద్వదగ్రగణ్యుఁడు.

"కావ్యమునందీరసశబ్ద వాచ్యమగు ఆనందము ఏ రీతిగనుపలభ్యమానమగును" అనుదానికయి అభిధ—లక్షణలకంటె విలక్షణ మగునొక శబ్దశక్తిని, ఒకవృత్తిని ఆలంకారికులొప్పిరి. అనగా సాధనమే రసముగాదు. సాధనముకంటె విలక్షణము రసము అని తేలనునది. జంత్రము వలన వెడలు శ్రీరాగము—సావేరి రాగాదులవలన వీర—కరుణరసములు వ్యక్తములయినట్లు శబ్దార్థ విలక్షణమయి రసము వ్యజ్యమానమగును. కేవల శబ్దానిరపేక్షముగా చేష్టాదులవలన రసమభివ్యక్తమగును. [illegible] వాచ్యముకాదు. వ్యంగ్యమని [illegible] పూర్వులంగీకరించిన వాదమును సిద్ధాంతీకరించి ధ్వన్యాలోకము వ్రాసినాడు.

ఈ వ్యంగ్యార్థమునకే ప్రాధాన్యమున్నధ్వని యని ఆలంకారిక సిద్ధాంతము, వస్తుధ్వని, అలంకారధ్వని—రసధ్వని యని బహుభేదభిన్నమీధ్వని

ఈ రసధ్వని అన్నిటికంటె నెక్కువది యనిరూ రసగంగాధరుడగు నాంధ్ర పండితరాయల నిశ్చితి. ఈ రసధ్వని నభివ్యక్తముచేయు కావ్యమునకే అంగ్రతాంబూలము వచ్చినది. తత్కర్తకు నది లభించినది. అట్టి కావ్యకర్త ఆంధ్రశాత (లి) వాహనుడు అనిన సాహసోక్తి కానేరదు.

ఉచ్చినుహిపతితకుసుమాని మాధుని శేఫాలి కాంహాలిక స్నుషే ఏషోహివిరసశబ్దః శ్వశురేణ శ్రూయతే వలయశబ్దః. ఓ కర్షకునికోడలా ! క్రిందఁబడిన పువ్వులనుమాత్రమే ఏరుకొనుము. శేఫాలిక (ప్రేబంకనము) తీగను కదపకుము. అట్లు కదిపిన గాజులు చప్పుడగును. ఆగాజుల చప్పుడు మామ వినినచో దురియొకరీతిగ భావించును. కోపించును.

దీనికి ఆంధ్రప్రభువు శ్రీనాథకవిసార్వభౌమ పోషకుడు సాహిత్యచక్రవర్తి పెదకోమటి వేమారెడ్డి మొదలగువారలిట్లు రసధ్వనిని వ్యక్తీకరించిరి.

తన చెలికత్తె ఉపనాయకునితో ఒడలెరుగక రమించుచుండెను. గాజులు చప్పుడగుచుండెను. ఇది ఆమె అత్తమామలువిన్న ప్రాణము మీదకు వచ్చునని చెలికత్తె ఈరీతిగ హెచ్చరించినది.

ఈరీతిగ నేడు వందల శ్లోకములను గ్రథించిన శాలివాహనుఁడు రసమును వ్యంగముఖముగ పోతపోసినాడు. చారిత్రకులనడిగిన ఇది ప్రాకృతముకాని సంస్కృతముకాదని, ఇది శాతవాహన కృతముకాదు. శాతవాహన సంకలితమని యేదియో చెప్పి గాధాసప్తశతికర్త నొక శిలాప్రతిమగా చేసి నీరసునిగా నొనర్తురు.

ఈ రసధ్వని గంగాలహరిగా ప్రవహింప నేతన్మార్గమనుసరించి కావ్యకర్తలు కావ్యసృష్టిని కావించిరి. మమ్మటభట్టు ఆనందవర్ధనుఁడు మొదలగు నాలంకారిక శిఖామణులు, అభినవగుప్తవాదులు మున్నగువారు ధ్వనికావ్యమునకు మూర్ధన్యోదాహరణములుగా పై పద్యమును

భ్రమధార్మిక విస్రబ్ధంసశునరోద్యమాంతస్తేన
గోదానదీకచ్ఛ నికుంజవాసినాకేనాపిదృప్తసింహేన

మొదలగు పద్యముల నుదహరించిరి. విధిముఖమై వాచ్యమయినపుడు నిషేధరూపము వ్యంగమనియు "శయ్యాయా మావయోర్మాంకీః" ఇత్యాదుల నిషేధరూపమై వాచ్యమయినపుడు విధి రూపమై వ్యంగమనియు నిరూపించిరి. ఈయాంధ్రధ్వని మార్గ మెన్నిశాఖోపశాఖలై ప్రవహించినదో చూతము. రసప్రధానకావ్యస్రష్టలలో ఇద్దఱు మువ్వురలోనగ్రగణ్యుడగు కాళిదాసుని యాశ్లోకము నరయుదము.

నేత్రానీతాః సతతగతినా యద్విమానాగ్రభూమీః
ఆలేఖ్యానాం స్వజలకణికాదోషముత్పాద్యసద్యః
శంకాస్పృష్టాఇవజలముచస్త్వాదృశో జాలమార్గైః
ధూమోద్గారానుకృతి నిపుణాఝర్ఝరానిష్పతంతి.

వాయువు మేఘములను అలకాపత్తనపు మేడలపై భాగములకు గొంపోయినది. ఆ మేఘములు మేడలలో గోడలమీద వ్రాసిన చిత్తరువులపై నీరు చిలికి రంగులను పోఁజేసినవి. ఈతప్పెవరేని ఎరిగిన తమకు బాధకలుగుననియెంచి శిధిలమై సుగంధధూమరూపమునొంది గవాక్షముల గుండా బయటకువచ్చివైచినవి. ఇది కాలిదాసుని వాచ్యరూపకవిత.

ఈ శ్లోకమునకు షట్చాస్త్రపారంగతుఁడు సర్వవిద్యాపారదృశ్వ మహామహో పాధ్యాయుఁడు సరసరసప్రధాన కవితా పట్టాభిషిక్తుఁడగు నాంధ్రుడు కోలచల మల్లినాధుఁడందించిన రసధ్వని నీక్రింది దాని నాంధ్రరసికు లరయుదురు.

"అంతఃపుర పరిచితికల యొకడు సంకేతము నేర్పరచి యొకనిని అంతఃపురమునకుచేర్చి నాయికకు రూర్చెను. ఆ జారుడామెతో రమించి. ఆమె శీలమునకు భంగము కలిగించి పరులు చూచెదరనుశంకతో మారువేషమును వేసికొని కాని మార్గమునుబట్టి మెల్లిగ దిగజారిపోవును" అని మల్లినాధసూరి.

ఇంత శృంగార రసబంధురముగా కాళిదాసు కవితచేసినాడా ? ఈ వ్యంగ్యార్ధము నుద్భావింపవలయునని యొకపదమైన నట్టిదానినిగూర్చినాడా ?

"చంచచ్చంద్రకరస్పర్శహర్షో న్మీలితతారికం
అహోరాగవతీ సంధ్యా జహాతిస్వయమంబరం"

అని వాల్మీకి ప్రోహాళించినటుల నేపదమునైన గుంఫించెనా ? లేదు. ఇంతటి రసధ్వనిని సృష్టించినది వ్యాఖ్యాత ఆంధ్రుడు మల్లినాధుడే.

సరసులు రసికాగ్రేసరులు సర్వసంపత్సంపన్నులు. సాహిత్యవల్లభులు,సౌందర్యాపోషకులు, సౌందర్య ప్రష్టలు సాహిత్యచక్రవర్తులు. సర్వజ్ఞ శిఖామణులు అయిన ఆంధ్రప్రభువుల వెల్లగొడుగు నీడలలో కడుపులోచల్ల కదలకుండ చల్లగా వర్ధిల్లిన మల్లినాధకవి సార్వభౌమ విద్వద్వతంసుడు సృష్టించియిచ్చిన తెలుగుల పంట, ప్రభువులు మధురస్వప్నములో నుందురు. కవులు మధుర భావనావలయములలో హాయిగానూగుచు ఆ స్వప్నములకు ఈ భావనలకు రూపు నిరూపించెదరు. భోగములకట్టి సాహిత్యవల్లభుల యాలంబనములో లోటే యుండదు. మధురభోగములు మధుర భావనలలో నోలలాడు కవిగీచిన ప్రతిరేఖ రస నిష్యందియై యెందులకు కానేరదు? ఇంకొక శ్లోకము.

త్వయ్యాయత్తం కృషిఫల మితిభ్రూ వికారానభిజ్ఞైః
ప్రీతిస్నిగ్ధైర్జన పద వధూలోచనైః పీయమానః
సద్యస్సీరోత్కషణ సురభిక్షేత్రమా రుహ్యామాలం
కించిత్పశ్చాద్వ్రజలఘుగతిర్భూయఏవో త్తరేణ.

చాలామంది భార్యలుగల నాయకుడు రహస్యముగ నొకనాయికతోకూడి తన దక్షిణ నాయకత్వమునకు భంగము కలుగునేమోయను జంకుతో నీచమార్గమున నా స్థలమునుండి బయటపడి ఎవ్వరునన్ను చూడలేదని యెంచి మరల సందఱకు నాయకునివలె యధాతధముగ సంచరించును. ఈ రీతిది మహామహోపాధ్యాయుని వ్యాఖ్య. మాల మున్నతభూతలం = ఎత్తుదిబ్బ మాలము. అని నిఘంటువునందించు నీయాంధ్రరస భావుకుడు.

ఇక తెలుగు కవులలో శ్రీనాధుడు రస ధ్వని కేతా మెత్తినాడు. తెలుగున బంగరుపంట పడించినవాడు. నూనూగు మీసాల ప్రాయములో గాథాసప్తశతి తెనిగించినాడు. ఏ మహారసిక చక్ర వర్తి పుణ్యము కట్టికొనిననాడో గాథాసప్తశతి అగాధములో మునిగిపోయినది. "దారణసేయ దావగొనవా ?" అను పద్యము మాత్రము స్మృతి చిహ్నముగా మిగిలినది.

ఈతఁడు రసప్రధానముగ కావ్యసృష్టి యొనరించినాడు. కాని యనువాదములే యన్ని

కావ్యములు నగుటచే ధ్వని ప్రధాన కావ్యసృష్టికి నదను దొరకలేదు. అయినను భీమఖండములో శృంగార రసమునకు కొంత ప్రాధాన్యమిచ్చి కావ్యమును పోనిచ్చినాడు.

భోగమోక్షమహైశ్వర్య యోగకాంక్ష
భీమమండలిఁగాపుండఁబ్రియముపుట్టు
మర్త్యయోని జనింపంగ మదిఁదలంతు
వివిధ గంధర్వ కిన్నర విబుధవరులు.

అని దేవతలకు—గంధర్వాదులకు భీమ మండలినుండఁ గోరిక కలుగునట్లు వర్ణించినాఁ డీ తెలుగుకవి. కారణము

అచ్చమగు భోగమోక్షము
లచ్చోటందొరకు కరతలా మలకముగన్
విచ్చలవిడి బ్రతికెననుం
జచ్చినకడులెస్స భీమశంకరు నగరన్

అని యట యథా రాజా తథాప్రజాః కనుక శంక రుడే భోగపరరసికుడైనాడు ఈ శ్రీనాథునిచేతిలో

ఎనయంగల్గినంకూర్మిభృంగిరిటిఁ గానీతండుఁ
గానీనికుం
భునిఁగానీ కయిదండఁబట్టుకొని సంభోగేచ్ఛ
నంతఃపురాం
గనలం గన్నుమొరంగి యప్పురమునం
గన్నేరుకాఁదారి పొ
ద్దున భీమేశుఁడు సానిదాడకరుగున్ ధూర్త
ప్రకారంబునన్.

ద. పురిసానికూతులఁ దవిలినాడు
విశ్వలోకకుటుంబి భీమేశ్వరుండు.

అని నిరాఘాటమగు శృంగారరసమునకు రాచదాట కల్పింపబడినది.

దివ్యమంత్రకములన్ సాయాహ్నకాలంబునన్
గంధర్వాప్సరత్ పురోపవనికాకల్పద్రుమచ్ఛాయలన్
గంధర్వాపనిషద్రహస్యముల వక్కాణించెదరట.

పదునాల్గు మహాయుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగవాలై యుం
డదుసాని పెండి యెప్పుడు
నది దక్షారామ మహిమమగునో కాదో.

యనుచు భీమమండలిని భోగమోక్షస్థానముగఁ జేసినాడీ శ్రీనాథమహాకవి. ఇక రసాభాసఘట్ట మగు నర్జునోర్వశీ సంభాషణఘట్టమును రసమధు రముగ సంతరించి పెద్దనాదులకు మార్గదర్శకుఁ డైనాడు.

వేసాలఁబోకరమ్మా
పూసెజ్జకుఁబొద్దుపోయెఁ బిలియుటనాలున్
వాసవనందన కుసుమశ
రాసనకేళీకళా విహారంబునకున్.

అని హరవిలాసమున నెంతగనో శృంగారరస బంధురముగ చిత్రించినాడు. అయిన రసము నకు వాచ్యత్వమే యెక్కుపగ నిరూపించినాడు.

కొమరేటికల్యాణకమలషండంబుల సౌరభ్య
భారంబు సంతరించి
నారికేళాటవీ నదపుష్పకుహళికా
వితతికన్నెలక [illegible]ల్పి
అప్సరఃకాంతావిహార హాటకరమ్య [illegible]
మణిగవాక్షములఁ దూటి
భీమనాయకుదేవుపేరురంబునఁ గ్రాలు భుజగ
హారములకు భుక్తివెట్టి.

రాజనారాయణస్వామి రమ్యభవన
తార్క్ష్యకేతనుపతికి నర్తనముగరపి.

పొలసె నధ్వపరిశ్రాంతి పొడవడంగ
మౌనివరునిపై కుమారవనానిలములు.

ఇది కొంత వ్యంగ్యమర్యాదా సమలంకృతము. ఈ క్రింది దివాయువర్ణనమే.

దరవికచ వకుళ కురవక
పరిమళసంభారలోద భంభరమాలా
పరిషఝుంకార ధ్వని
తెరువరులకు మన్మథప్రదీపన మెసగున్.

అని వాచ్యముగా ననినాఁడు.

ఈ రీతిగ వాచ్యవ్యంగములతో శృంగార రసమును నిబంధించి తెలుగుజాతికొక వన్నెతెచ్చి యుగ ప్రవర్తకుడు—జాతీయమహాకవియునై మన కవి సార్వభౌముడు శ్రీనాథుడు ఆంధ్రజాతికొక రసరమణీకతను జేర్చి "దేశభాషలందు తెలుఁగు లెస్స" అనుట కాలవాలమైనాడు.

ఇంక ఆంధ్రకవితా పితామహుఁడు పెద్దన ఈ రసధ్వని నిరూపణములో నద్వితీయుడై వెలుగొందినాడు. పెద్దన తన కావ్యమున రసమును ప్రతి పద నిష్యందిగా జేసినాడు. ప్రభువాంధ్ర సరస వాఙ్మయ పారావారపారీణుడు. అష్టదిగ్గజములను తన యాస్థానిలోఁ గట్టిపెట్టి వారి సుగంధ బంధుర కావ్యములను గ్రోలుటయే కాక తాను కావ్యస్రష్టయై నెగడొందినవాడు. కావ్యకన్యకలను పెండ్లియాడుటకై నిత్యము పచ్చని పెండ్లి పందిళ్లను పచ్చని తోరణములను నిర్మించినట్టి కళారసికుడు. ప్రభువు కావ్యస్రష్టయైనపుడు ఆ ప్రభువును మెప్పించు కవి సహస్ర గుణాధికముగ కావ్యనిర్మాణ పారంగతుడై యుండవలయును గదా? అట్టివాడే యీ పెద్దనకవి. అన్ని పద్యములు రసధునులే యైనపుడుదాహరించి పఠితల వినుగొందింపజేయుట అజ్ఞలక్షణము—"దృఙ్మనస్సంగ సంకల్పో జాగరః కృశతారతిః ఉన్మాదో మూర్ఛనం చైవ" మొదలగునవి పది మన్మథావస్థలు. ఇయ్యవి వర్ణించుట తద్వారా నాయికా నాయకుల రాగమును వర్ణించుట శృంగారకావ్యము కున్నదియ. ఆయ్యది కనియెన్ విద్యుల్లతావిగ్రహన్. అబ్బురపాటుతోట ఎక్కడివాడు! మును మున్ మొదలగునవన్నియు ధ్వనిరూపముగ సరిపడినవి.

అని తనకథ నెరింగించిన
తనకనుఁగవ మెరుగుయిచ్చుఁ దాటంకములున్
జనుగవయునడుమువణఁకఁగ
వనితసెలవి వారనవ్వి వానికి ననియెన్.

ఈ పద్యము వరూధినిని శృంగార రసాధిదేవతగ, రసమునంకతకు అభివ్యంజకముగ నీ శబ్దార్థములను సంతరించు కొనినది, 'ఎవ్వతవీవు'? అని ప్రవరుఁడు హిమాలయమునుండి వెలలేని వానిగను, తన మార్గదర్శితపైననే యాధారపడిన వానినిగను దెలిపినాడు. అందగాడు, ఒంటరి, కొలఁది యమాయకుడు. ఏకాంతమున లభించినాడు ఒకసారి యామెకు అనురాగ ముప్పొంగినది. భావశబలత రేకెత్తినది. ఆమె చేష్టయే యాంతర భావములను రూపుకట్టించి ప్రత్యక్షీకరించినది. ఈ శిల్ప చిత్రణము శిల్పి నిర్మాణ కౌశలాతీతము శబ్దములు కొంతవఱకె చెప్పఁగలవు. కనుఁగవ మెరుగులలోనను రాగము తొంగిచూచుచున్నది. సంభ్రమాశ్చర్యములతోబాటు నడుము—చనుగవ వణకుతో ననురాగము నాట్యము చేయుచున్నది. తాటంకములు ఔనని కాఁబోలునను నాట్యము చేయుచున్నవి. స్మితముగా సెలవిదార నవ్వులో నభిలాష ప్రస్ఫుటమైనది.

ఇఁక ఎవ్వతెవీవు అనుపద్యము ప్రవరుడు వాచ్యమర్యాదగా ననిను వ్యంగమర్యాదలోనే యని నాడని వరూధిని వ్యంగ్యరూపమగు వ్యాఖ్యానము గావించుచు "ఏకాంతమునందునున్నజవరాంధ్ర నెపంబిడి పల్కరించు లాగింతియ" అని యనివేసినది.

చాల దూరమువచ్చితి మీ రస విచారణమున. ఈ పెద్దన ధ్వని ప్రధానమగు కావ్యసృష్టియిక యే యాంధ్ర కవికి నలువడలేదు. ఇంతకంటె పందెములు వేసికొనియే శృంగారరసమును జూపుటకు ఆ కాలపు కవులు తరువాతి కాలపు కవులు యత్నించిరి.

చెప్పెడిదేమి నాకుఁగల జీవితమంతయు నీకుఁ గూర్చి యె
ల్లప్పుడు నన్నుఁబాయక ప్రియాచరణం బొనరించుచుందు నీ
చొప్పున కీవునియ్యకొని చొక్కపు జక్కపగుబ్బలాడి మే
ల్దప్పక యంతరంగమునఁ గాంచిన నన్ను నదీసు జేయవే—

ఇత్యాదిగా భట్టుమూర్తి ఈ రసధ్వనిని నిరూపింప యత్నించెను—శ్లేషతోడను, శబ్దార్థ రామణీయకముతోడను మిశితమై ధ్వనికి విచ్ఛిత్తి కలిగినది. కాళిదాసాదులకు వలెనె నిరాడంబరమగు శబ్దార్థములలో రసధ్వని వెలువఱుపగల సామార్థమొక్క పెద్దనకే మొదటినుండి తుదివఱకు కావ్యము నందంతట అలవడినది.

కూకటివేణితో కురులు కూడకమున్న కుచ ప్రరోహముల్
పోకలతోడి సామ్యమును బొందకమున్న నితంబ సీమకున్
ప్రేకదనంబొకింత ప్రభవింపకమున్న ప్రసూన చాణుడ
మ్మాకలఁబెట్టెఁ దాన అవనావెల బాలికకై విటావళిన్.

ఈ కవిత మధురభావి రసభావనా రమ్యమగు కావ్యరీతి. "అహం రాజా—సర్వాస్మితి మన్యతే సాన్యపర మోలోకః" ఏమియు రాకుండఁగనే అన్నియునయితినని, అగుదునని యూహించుట అన్నిటికన్న గొప్పతనము. అది సర్వోత్కృష్టమనును బృహదారణ్యకోపనిషత్తు, భావనకు విడచి రేఖామాత్రముగజూపి కావ్యస్రష్టయె కళాతపస్వి యనిపించికొనినాడీ యాంధ్రరసిక కవి శిఖామణి పింగళి సూరనార్యుడు.

ఆనందము ఆత్మనిష్ఠము. కావ్యములోని శబ్దార్థములవలన ఆవరణభంగముకాగ ఆనందముద్బుద్ధమగును. ఏతన్నిరూపణమునకే కావ్యకర్తల కావ్యసృష్టి. ఇట్టి కావ్యసృష్టికి రాజపోషణ అవసరమయినటులనే ప్రతిభ పాండితి. దేశాటనము మున్నగునవి అవసరము. సమృద్ధ సంపత్సంపన్నులయిన ప్రభువుల పాలనలో రసస్రవంతులు కావ్యరూపమంది జాలువారినది.

ఎదమెత్తనగుటకై సౌదగుందరా
అంతమదిగల అహంమెల్ల మలఁగిపోవునురా....
అర్థమ్ముకాని భావగీతమ్ము నాది.......
చెలియా! పూయగరాని యొక్కపువు పూచెన్....
రాసారింటికైన రంగు తెచ్చేపిల్ల
నాగుండె నామనసు నమలిమింగిన పిల్ల—ఎంకివంటి
పిల్ల లేదోయ్ లేదోయ్

ఇత్యాది కావ్యముల యుగమునకు దిగజారిన మనకు. మంచినీళ్లు త్రాగి గఱున త్రేచెడి

మనకు కాళిదాస కావ్యములు రసనిష్యందులయిన నేమి ? కాదంబరి కాదంబరియైననేమి ? పండిత రాయల రసగంగాధరధుని యేల ? కవి సార్వ భౌముల కవిసార్వభౌమత యెందులకు ? మల్లి నాథాదులకుండు సర్వశాస్త్రపాండితి యెందులకు? ఒక పద్యమో ఒక చమత్కృతి జనకమగు మాటో మాటాడిన దానివిని మెచ్చికొని వేయారులు సమ ర్పించు ప్రభువులుండగా, ఎవరిని వరింతుమా యని భూతకాలమం దెన్నడు సమృద్ధి యెరుగని లక్ష్మి యెల్లెడల రూపొంది స్వయంవర మాలాలం కృతయై నిలిచియుండగా శాస్త్రపాండిత్య కవితా ధౌరంధర్యము, మహాకావ్య గ్రథనప్రతిభ—బహు శ్రుతతయేల యెందులకు ? *అవసరముకాదని పించును. *విశ్వనాథుని కల్పవృక్షమెందుకు ?

ప్రభువులు వెనుకటికంటె ధనమును కళా కారుల యధీనము చేయుచునేయుండిరి. వారి రసి కతకు లోటులేదు. అట్టివారు శాశ్వతము స్థిర మును, దీర్ఘకాలస్థాయియగు మహోన్నతకృతికై యత్నించిన, పండితులు కళాస్రష్టలు నట్టివారే యగుదురు. కావున ప్రాచీన మహాకావ్య సృష్టి మహారాజులయు సంపన్నులయు నాలంబముననే జరిగినది. రసము పండినది. సాహిత్య చక్ర వర్తులు, సర్వజ్ఞులునగు ప్రభువుల యాలంబనము ననే జరిగినది.

నేటి యీ యైశ్వర్య సంపన్నులు—ఆంధ్ర రసిక కళాస్రష్టలు. కళాతపస్వులైన యీ తిమ్మ రాజ ప్రభువుల యాశ్రయముతో మల్లినాథాది పండిత ప్రకాండులు—శ్రీనాథాది కవిసార్వభౌ ములు-పెద్దనాది సరసకావ్య స్రష్టలు సృష్టింపఁ బడఁగలరని యాశ—అటుల సృష్టి కాకపోవుట వారిది వారి మార్గదర్శకులదియే లోటు—

# పంచరత్నములు

శ్రీ వి. సి. రామస్వామి

సీ. సాంఘిక శ్రేయమే స్వశ్రేయ మనువారు
భువిలోన శ్రీముళ్లపూడివారు
పరహితానందమే పరమార్థ మనువారు
పృథివిని యీ ముళ్ల పూడివారు
అడిగినలేదని నుడువ నేరనివారు
పుణ్యకాములు ముళ్ల పూడివారు
అనునట్టిమాట శిలాక్షర మనువారు
పుడమిని శ్రీ ముళ్లపూడివారు
తే. అట్టి సత్కులమందున నవతరించి
వరలు ముళ్లపూడ్యన్వయ వార్ధిచంద్ర !
సాహితీవల్లభ ! విబుధ ! సరసహృదయ !
కమ్మవంశాగ్రగణ్య ! శ్రీ తిమ్మరాయ ! 1

ఉ. ఎవ్వఁడు శాంతమూర్తియిల నెవ్వఁడు సద్గుణరాశినాఁబడున్
ఎవ్వఁ డుదారచేతసుఁడు నెవ్వఁ డఖండ కళాప్రపూర్ణుఁడౌ
నెవ్వఁడు నిత్యమున్ కవుల నెక్కుడు నాదరమొప్పజూచునో
అవ్విభు ముళ్లపూడి కలశాంబుధిచంద్రుని వేడ్కఁగొల్చెదన్. 2

ఉ. ఎందఱో ప్రాఙులీపురికినేగి చరింతురు పొట్టకూటికై
ఎందఱో యింజనీరులయి యేగుచునుంద్రు కళాప్రపూర్ణులై
ఎందఱో వైద్యరాజులయి యేగెదరచ్చట కాకినాడ వా
రందఱు నీదు నీదుసుతు నాశ్రయ మొందినవారలేగదా ! 3

ఉ. చేసిన పూర్వపుణ్యములు చెంగున నద్దెస లాక్రమించి పూ
ల్బూసెను వానిసౌరభము పుత్రునిరూపున లభ్యమాయె నీ
యాస లవన్నియున్ నఫలమాయెను సార్థక మెంచ మానవుల్
వేసిన బీజముల్ పెరుగవేడ్కను బొందెద రాఫలంబులన్. 4

ఉ. ఎందఱు లేరు తండ్రులు మఱెందఱు లేరు కుమారులుర్వి వా
రందఱకున్ మరేవి ? భవదారసగౌరవకీర్తిచంద్రికల్
పొందున మోతిలాలును సుపుత్రుఁడు జహ్వారుసాటి మీకు మీ
నందనుఁ డాంధ్రదేశమున నాయకరత్నముగా వెలుంగుతన్. 5

# జయతు సర్వదా

శ్రీ గోనెల్ల రామమూర్తిశాస్త్రి

శా॥ రాగాలాపసుధాప్రసర్షి మురళీగానైః, జగన్మోహనైః
బ్రహ్మానందవిమోహితం వ్రజకులం, గోగోపగోపీయుతం
కుర్వాణః యమునాతటే వనలతాకుంజేషు గాః చారయన్
విశ్వానందక వేణుగానరసికః గోపాలకః పాతు వః,

శ్లో॥ శ్రీతిమ్మరాజ ప్రభవో జయంతు,
తద్భాగ్యకల్పాః బహుధాఫలంతు,
తత్సాధకల్యాణకలాః స్ఫురంతు,
ఆయుర్యశోభాగ్యసుఖాని సంతు॥

శ్లో॥ శ్రీతిమ్మరాయోఽద్య మహాంధ్రదేశే.
శ్రీకృష్ణరాయోఽభినవః ప్రసిద్ధః,
పిబంతు కావ్యామృత మాదరాద్బుధాః,
తత్త్యాగలక్ష్మి మధురం సుధారమ్॥

## మంగళాశీః

శ్రీ భారతసామ్రాజ్యశ్రీః జయతు సర్వదా
చైనేశ్వరో దుష్టకబంధతుల్యః
వక్షోమిలద్భుగ్నకరాళవక్త్రః
నీపాలధక్ వ్యాస్తకరాళబాహుః
హిందూకరాసి ప్రహతోద్రుతం స్యాత్.

లావణ్యరాశ్యుజ్జ్వల హేమవల్లీ
లక్ష్మీకళారమ్య పురీమతల్లీ
మాంగళ్యభాగ్యప్రద కల్పవల్లీ
శ్రీభిః జయేత్ భారత రాజఢిల్లీ॥

వర్షంతు దేవాః భువిశాంతి వృష్టిమ్
నశ్యంతు క్రూరాస్త్రభయోనరాణామ్
ఫలంతు మాతుః భరతస్య భావాః
భరంతు దేశాఃభువి ధర్మనిష్ఠాః,



శ్రీ గోనెళ్ల రామమూర్తిశాస్త్రి

# ఆంధ్రప్రచారిణీ - తెలుగు - మఱికొన్ని విశేషాలు

శ్రీ వడ్డాది అప్పారావు M. A.

(కవికులాలంకార, కవిరాజహంస శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారితో శ్రీ వడ్డాది అప్పారావు పరిచయ సంభాషణము.)

"ఇది ప్రశ్న మనుకొందు వేమొ కాదనం జుమీ
        నీ సదుత్తరమును నిలిపికొనుము,
ఇది యుక్తి యనుకొందు వేమొ కాదనం జుమీ
        నీ ప్రతివాదంబు నిలిపికొనుము,
ఇది యుక్తి యనుకొందు వేమొ కాదనం జుమీ
        నీదు ప్రత్యుక్తిని నిలిపికొనుము,
ఇది యర్థ మనుకొందు వేమొ కాదనం జుమీ
        నీ పరమార్థంబు నిలిపికొనుము,
        సార మిది–విన్నవింతు విస్తార మేల
        ఉన్నవాడవే యైనచో నన్ను గూడ
        నున్నవానిగ జేయుమా, ఉండి లేని
        వాడవే యైన, నేమనువాడను ప్రభు!"

— (భావసంకీర్తనము).

ప్రశ్న: తాతగారూ, వేంకటపార్వతీశ్వర కవులన్నా ఆంధ్రప్రచారిణీ యన్నా ఒకటే అంటారుగదా మీరూ (బాలాంత్రపు వేంకటరావుగారూ), వోలేటి పార్వతీశంగారూ కలిసి వేంకటపార్వతీశ్వరకవులు ఎప్పుడయారు ?

వేంకట: 1903 సంవత్సరం ప్రాంతంలో ఆచంట వేంకటసాంఖ్యాయన శర్మగారు "కల్పలత" అనే సాహిత్యపత్రిక ప్రకటించేవారు. అందులో కొన్ని కవితా సమస్యలుకు పద్యరూపమునా గద్యరూపముగా సమస్యాపూరణములు వ్రాసి పంపి మెప్పించినవారికి బహుమతు లిస్తామని ప్రకటించారు. ఆ సమస్యలకు ప్రత్యుత్తరములు వ్రాసినవారిలో పిఠాపురం వాస్తవ్యులు మా మేనమామగారైన నడకుదుటి వీరరాజుగారికి మొదటి బహుమానము, వోలేటి పార్వతీశంగారికి ద్వితీయ బహుమానము, అప్పుడు తణుకులో ఉంటూండిన నాకు తరువాతి బహుమానము వచ్చాయి. అప్పుడు నేను పిఠాపురంవెళ్ళి పార్వతీశంగారిని కలిసికొని, స్నేహంచేశాక మే మిరువురము వేంకటపార్వతీశ్వర కవులనే పేరులో "చిత్రకథాసుధాలహరి" అనే ఆధునిక పద్యకావ్యం వ్రాశాము. అది మొదలు (1906) మే మిద్దరము తరువాత "కావ్యకుసుమావళి" అనే 800 పుటల సంపుటములలో ప్రకటితము లయిన అనేక అధునిక ఖండకావ్యములను వ్రాసి పత్రికలలో ప్రకటిస్తూ వుండేవారము.

ప్రశ్న: ఓహో! 1906 నుంచీ మీరు ఉభయులూ కలిసి జంటకవులుగా రచనలుచేసి ప్రకటిస్తూ వచ్చారన్నమాట. అయితే అంతకు ముందు అంటే మీరు ఉభయులూ కలియక పూర్వం ఒక్కొక్కరుగా ఏవేవో రచనలు చేసే ఉండాలిగా !

వేంకట: అప్పటికి నేను ధనాభిరామం అనే నాటకమూ, సురస అనే నవలా, పారంపర్యంగా స్త్రీలు ఇండ్లలో నోములు నోచుకునేటప్పుడు చెప్పుకునే నూరు కథలను సులభశైలిలో స్త్రీల వ్రతకథలుగానూ వ్రాసి ప్రకటించాను. పార్వతీశంగారు సువర్ణమాల, తారాశశాంకవిజయము అనే రెండు నాటకాలనూ వ్రాసి ప్రకటించారు.

ప్రశ్న: అయితే మీ రుభయులూ కలిసికొన్న ఆ రోజులలో ఏ వ్యాసంగములో ఉండేవారు? అప్పటి వివరాలు కొన్ని చెప్పండి.

వేంకట: నేను తణుకులో ఉండేటప్పుడు వకీలుగా ఉండే తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారికి వారి వృత్తిలోను వారి సాహిత్య వ్యాసంగములోను సహకారిగా ఉండేవాడను. అంతకు పూర్వమే ఏర్పాటయిన నవలారచన పోటీలో సూర్యనారాయణరావుగారు రచించిన 'సంజీవరాయ' చరిత్ర అనే నవలకు "చింతామణి బహుమానం" లభించింది. ఆయన ప్రకటించే "సువర్ణలేఖ" అనే మాసపత్రికకు నేను నిర్వాహకుడుగా వుండేవాడను. నేను వ్రాసిన సురస అనే నవల ఆ పత్రికలోనే ప్రకటింపబడింది. ఈ 'సువర్ణలేఖ' పత్రిక పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి అల్లుడూ మా మిత్రుడూ అయిన ద్రోణంరాజు వేంకటరమణారావుగారు తణుకులో నడుపుతూ ఉండిన సౌదామినీ ముద్రాక్షరశాలలో ముద్రింపబడేది. ఆ సమయంలో పిఠాపురం వాస్తవ్యులయిన వోలేటి పార్వతీశంగారిని తణుకు

రప్పించి సౌదామినీ ముద్రాక్షరశాల నిర్వాహకులుగా ఏర్పాటుచేశాము. అప్పటినుండి వేంకటపార్వతీశ్వరకవులుగా మాసారస్వతసేవ ఇతోధికాభివృద్ధి పొందింది.

వేంకట: అది 1911వ సంవత్సరం. అప్పటికే నిడదవోలులో స్థాపితమైన (Weaving mill) నేతమరమగ్గాల కర్మాగారానికి మేనేజర్‌గా ఉండిన — (మా అన్నగారి బావమరది) చాగంటి శేషయ్యగారికిన్నీ (ఇటీవల వెలువడిన ఆంధ్రకవితరంగిణి గ్రంథకర్త శ్రీ చాగంటి శేషయ్యగారు.) కొవ్వూరి బసివిరెడ్డిగారి తమ్మునికుమారుడైన కొవ్వూరి చంద్రారెడ్డిగారికిన్నీ నిడదవోలులో స్నేహంకలిసింది. చంద్రారెడ్డిగారికి ఆంధ్రసారస్వతం అంటే అధికప్రీతి. బంకించంద్రచటర్జీ వంగభాషలో రచించిన దుర్గేశనందిని అనేనవలకు చాగంటి శేషయ్యగారి తెలుగు అనువాదం విని చంద్రారెడ్డిగారు ఎంతో సంతోషించి "మీరున్నూ మీ బంధువులైన వేంకటపార్వతీశ్వరకవులున్నూ కలిసి నవలలు వ్రాసి ప్రకటించపూనుకుంటే నేను ద్రవ్యసహాయం చేస్తాను. మీరొక గ్రంథమాల పెట్టకూడదా" అని ప్రోత్సహించారు. అప్పుడు శేషయ్యగారున్నూ మేమున్నూ కలిసి ఆంధ్ర ప్రచారిణీ గ్రంథ నిలయము అనే పేర ఒక గ్రంథమాలను (1911లో) "నన్నయ్యభట్టుగారు యజనమ్మొనరించిన తావుగా" ప్రసిద్ధి పొందిన తణుకులో స్థాపించినట్లు చంద్రారెడ్డిగారికి విశదపరిచాము. అందు కాయన చాలాసంతోషించి, దుర్గేశనందినితో పాటు ఆరు నవలలు ద్రోణంరాజు వేంకటరమణారావుగారి సౌదామినీ ముద్రాక్షరశాలలోనే ముద్రితము లయేటట్లు ఏర్పాటుచేశారు. మొదటిది చాగంటి శేషయ్యగారి దుర్గేశనందిని, రెండవది మేమువ్రాసిన వసుమతీవసంతము. ఇది వేంకటపారతీశ్వరులుగా మేము వ్రాసిన స్వతంత్రనవల. మూడవది 'రాజసింహ' బంకించంద్రుని వంగ నవలకు మా అనువాదము. నాల్గవది పార్వతీశంగారి సోదరుడైన పోలేటి భాస్కరరామమూర్తి. కోట శేషగిరిరావుగారలు రచించిన లలితచంద్రహాసము. ఆ తర్వాత బంకిం చంద్రుని వంగనవల "సీతారామ"కు మా అనువాదము. ఆరవది మా అన్నగారైన బాలాంత్రపు వేంకటసుబ్బారావుగారు రచించిన "నూర్జహాన్" అను నవల. ఈ ఆరునవలలూ ఒక్కమాటే 1911 డిసెంబరు లోగా ముద్రింపించాము. ఆరోజులలో అయ్యగారి నారాయణమూర్తిగారు మా నిలయానికి సంపాదకులుగా ఉండేవారు.

ఢిల్లీలో ఐదవజార్జి చక్రవర్తి పట్టాభిషేక మహోత్సవానికి మా "నూర్జహాన్" నవలను చక్రవర్తికి కృతిఇచ్చి, పట్టాభిషేక పుష్పముగా ఢిల్లీదర్బారుకు పంపించినాము. అప్పుడు చక్రవర్తి కార్యదర్శినుండీ, వైసురాయికార్యదర్శినుండీ మా అంకితము అంగీకృత మైనట్లు ప్రశంసాపత్రములు అందాయి.

అంటే ఏమిటి? ఆంధ్రప్రచారిణీగ్రంథ నిలయము తణుకులో ప్రారంభమయి, అక్కడున్న ఒక్క యేడాదిలోనే ఆరునవలలను ప్రకటించిందన్నమాట.

ఆ సమయంలోనే పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు రచించిన సాక్షి వ్యాస సంపుటాలు ఒకటి, రెండు వారి తొలినాటకా

లైన నర్మదా, పురుకుత్సీయము, సారంగధర ద్రోణంరాజువారి సౌదామిని ప్రెస్‌లోనే ముద్రితములయినట్లు జ్ఞప్తికి వస్తున్నది!

ప్రశ్న : తణుకులో ఒక్క యేడాదే వున్నట్లు చెప్పారు. ఆంధ్రప్రచారిణీ ఆయేడాదీ అయాక నెక్కడికి వెళ్లిందండి ?

వేంకట : చంద్రారెడ్డిగారి నివాసస్థలమయిన నిడదవోలుకు ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయాన్ని మార్చాము. అప్పుడు పిఠాపురం రాజావారు 1500 రూపాయల విలువగల ముద్రాయంత్రం ఒకదానిని మొక్కపాటి సుబ్బారాయుడు, బుద్ధవరపు కామరాజుగారల ప్రోత్సాహంవల్ల మా ఆంధ్రప్రచారిణికి బహూకరించారు.

నిడదవోలులో ఆంధ్రప్రచారిణీ ముద్రాక్షరశాలను స్థాపించి క్రొత్తనవలలను, అనుబంధములుగా చిన్ననవలలను ప్రకటిస్తూ వచ్చాము, అందులో మా అన్నగారైన బాలాంత్రపు రామయ్యగారు ప్రచారకులుగా వుండి జిల్లాలలోనూ, రాష్ట్రంలోనూ పర్యటన చేసి విద్యార్థులూ, సంపన్నులూ సహాయం సమకూర్చేవారు.

ప్రశ్న ; చంద్రారెడ్డిగారు చాలా సారస్వత ప్రియులని చెప్పారుగదా. ఆంధ్రప్రచారిణికి సహాయకులుగా, అధ్యక్షులుగా ఉండిన చంద్రారెడ్డిగారి సారస్వతసేవలో ఇంకా ప్రత్యేకాంశాలేవైనా చెపుతారా ?

వేంకట : మేం నిడదవోలు చేరుకున్న వెంటనే 1912లో వసంతకాలంలో సారస్వతసభలు, సంఘసంస్కరణ సభలు, చారిత్రిక పరిశోధకుల సభలు. ఈలాటి ఐదు విధముల మహాసభలను నిడదవోలులో చంద్రారెడ్డిగారు తమ ధనంతో ఏర్పాటుచేశారు. పలుప్రాంతాల నుంచి వచ్చి సభలలో పాల్గొన్న విద్యార్థులకు, సంఘసంస్కారులకు. కవులకు, పెద్దలయిన ప్రేక్షకులకు విడిది, భోజన సదుపాయాలు చేయించి వారమురోజులు వారికందరికీ పెండ్లివారికి లాగా సత్కారం చేశారు. ఆ సభలలో సారస్వత సమావేశాలకు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు, చారిత్రక సభలకు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు, సంఘసంస్కరణ సభలకు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు మొదలగుపెద్దలు అధ్యక్షులుగానుండి సభలను చక్కగా నిర్వహించారు. శ్రీ వేదంవారు అధ్యక్షత వహించిన సభలో కొప్పరపు సోదరకవులు పాల్గొని వేదంవారి కోరికపైన ఒకటి రెండు గంటలలో నలచరిత్ర ఆశుప్రబంధముగా 900 పద్యాలతో చెప్పారు. ఆ కవనవేగానికి సభ్యులంతా ఆచ్చెరువందారు. ఈ సభలకయిన కొన్నివేలఖర్చు అంతా చంద్రారెడ్డిగారే భరించారు. పాల్గొన్నపెద్దలకు రాను పోను ఖర్చులు ప్రత్యేకబహుమతులుకూడాయిచ్చారు. ఆరోజులలో కవులని పేరుపొందినవారిలో చాలామంది ఆయనసాయము పొందినవారే. అప్పుడే శ్రీకృష్ణదేవరాయలు నాయకుడుగా మేమురచించిన స్వతంత్రచారిత్రికనవల 'ప్రమదావనము'ను శ్రీ చంద్రారెడ్డిగారికి కృతియిచ్చి వారియందు మాకుగల ప్రేమానందములను ప్రకటించుకున్నాము.

ప్రశ్న : కొప్పరపు సోదరకవులను గురించి చెపితే మిమ్మల్ని ఒకసంగతి అడగాలని

పిస్తోంది తాతగారూ, ఆకాలపు జంటకవు లయిన తిరుపతి వేంకటకవులు. కొప్పరపు కవులు, వేంకటరామ కృష్ణకవులు మున్నగు వారు పాల్గొన్నట్లు పరస్పర సారస్వత వివాదాలలోన్నూ, రాజసభాప్రసంగాలలోనూ, మీ జంటకూడా పాల్గొనేవారా ?

వేంకట : ఆ జంటలలో రామకృష్ణకవులు పిఠాపురం ఆస్థానాన్ని మాత్రం అంటిపెట్టుకొని వుండి ఎక్కడికీ వెళ్లేవారు కాదు. కాని తిరుపతివేంకటకవులతో, వారికి వాదప్రతివాదాలుండేవి, కొప్పరపువారూ తిరుపతివేంకటకవులూ, రాజాస్థానాలకూ పండిత పరిషత్తులకూ వెళ్లడమూ. ఢీ అంటే ఢీ అనడమూ ఉండేది. అయితే మాజంటకుమాత్రం ఎవరితోటీ వాదవివాదాలు లేవు. మేము ఆంధ్ర ప్రచారిణీ గ్రంధనిలయ నిర్వహణం ద్వారా గద్యపద్యకృతుల వెలువరించే సేవలో నిమగ్నులమై ఉండేవారము. ఆ సందర్భంలో పిఠాపురం మహారాజావారు. పదిహేను వందల రూపాయల విలువగల ముద్రాయంత్రాన్ని మాకు బహూకరించారని ముందేచెప్పాను కదూ! వేంకటగిరిమహారాజు వెలుగోటి రాజగోపాలకృష్ణ యాచేంద్రులు మా జ ం ట ను (వేంకటపార్వతీశ్వర కవులను) వెయ్యిన్నూట పదారులతో సత్కరించి, అదిలగాయితు ఏటేటా ఆంధ్రప్రచారిణీకి 200 రూపాయల చొప్పున విరాళం పంపేవారు. ఈ విరాళం ఆయన కాలంలోనూ. ఆయన కుమారుని కాలంలోనూకూడా ఆంధ్రప్రచారిణీకి లభించేది. ఆయన సోదరులు సురభిరాజావారు కూడా 150 రూపాయలు బహూకరించి ఏటేటా 50 రూపాయలు ఆంధ్రప్రచారిణీకి విరాళం పంపేవారు. ఆయన తర్వాత ఆయన భార్యయైన సురభిరాణీగారు, తునిరాణీగారు, ఏటేటా ఏభయ్యేసిరూపాయలు ఆంధ్రప్రచారిణీకి విరాళాలు పంపేవారు. తూర్పుగోదావరిజిల్లా కపిలేశ్వరపురం జమిందారుగారు బలుసు బుచ్చి సర్వారాయుడుగారు ఏటా ఏభైరూపాయలు పంపేవారు.

ప్రశ్న : జమిందారులు మాత్రమే కాకుండా ఆ కాలపు విద్యాసంస్థలూ ప్రభుత్వమూ మీ ప్రచారిణీకి ఏ విధంగానైనా సహాయం చేస్తుండేవారా?

వేంకట : ఆనాడు కేవలం వాణిజ్యసరళిలో సాగించే కంపెనీల పుస్తకాలకంటే, భాషాసేవయే ఆదర్శముగా పెట్టుకొన్న ఆంధ్రప్రచారిణీ గ్రంథములను విశ్వవిద్యాలయంవారూ, రాష్ట్ర టెక్స్టుబుక్ కమిటీవారూ పాఠ్యగ్రంథములుగా నిర్ణయించి మాకు చాలాప్రోత్సాహం ఇచ్చేవారు "ప్రాథమిక తరగతులనుండి, స్కూలు ఫైనల్. ఇంటర్మీడియేట్. బి. ఏ. ల వరకూ మా పుస్తకాలు పాఠ్యగ్రంథాలుగా ఉండేవి.

ప్రశ్న : "ప్రాథమిక తరగతు" లంటున్నారు. చిన్నపిల్లలకుకూడా పాఠ్యగ్రంథాలుగా ఉపయోగించే పుస్తకాలు వ్రాశారా మీరు తాతగారూ ?

వేంకట : ఆ! నిడదవోలులోనే (1912లో) ఒకటి మొదలు ఐదుతరగతులవరకూ పాఠ్యములుగా "బాలగీతావళి" అనే పిల్లల పద్యవాచకములను రచించి ప్రకటించాము. అవి రాష్ట్రటెక్స్టుబుక్ కమిటీవారి అనుమతినిపొంది అన్నిజిల్లాలలోనూ ప్రాథమిక పాఠశాలలలో విరివిగా ప్రచారం పొందాయి.

ప్రశ్న : ఆంధ్ర ప్రచారిణీ గ్రంథనిలయము నిడదవోలులోనేకాక ఆతర్వాత రాజమండ్రిలో కూడా ఉండేదనుకుంటాను. ఈమార్పు ఎప్పు డెలావచ్చింది తాతగారూ ?

వేంకట ; 1918లో చంద్రారెడ్డిగారు స్వర్గస్థు లవడంచేత, నిడదవోలులో గ్రంథమాల నిర్వ హణలో బాకీలు మిగిలిపోవడంచేత కొన్ని క్లిష్టపరిస్థితులు కలుగడంతో నేను రాజమండ్రి వెళ్లి వాణిజ్యప్రముఖులూ, సంపన్నులూ సార స్వతాభిలాషులు అయిన శ్రీ అద్దేపల్లి లక్ష్మణ స్వామిగారి సహాయమును అర్థింపవలసి వచ్చింది. అప్పుడాయన, ఆంధ్రప్రచారిణీకి గల అప్పులనుతీర్చి, సంస్థను తనకు అప్ప గిస్తే అధ్యక్షుడుగాఉండి, సహకరిస్తానని వాగ్దానం చేశారు. అప్పుడు అప్పులను తీర్చి వేసి నేనూ, పార్వతీశంగారూ కలిసి అద్దేపల్లి లక్ష్మణస్వామిగారు ఆంధ్రప్రచారిణీ గ్రంథ నిలయమును నడిపేందుకు అగ్రిమెంటు చేసి కొన్నాము, 1919 నాటికి ఆంధ్రప్రచారిణీ ఆవిధంగా రాజమండ్రి చేరుకుంది. అక్కడ నూతనోత్సాహంతో రెండేసినెలలకు ఒకనవల చొప్పున లక్ష్మణస్వామినాయుడుగారు ప్రక టించడం ప్రారంభించారు, మాతృమందిరం రాజమండ్రిలో వెలువడిన నవలల్లో మొదటిదీ స్వతంత్ర సాంఘికనవల. ఒకటి రెండు సంవత్సరాలు పని ఉత్సాహపూరితంగానే జరి గింది, ఇంతలో లక్ష్మణస్వామిగారికి సొంత సంస్థఅయిన సరస్వతీ గ్రంథమండలి బాధ్య తలు ఎక్కువ కావడంచేత ఆంధ్రప్రచారిణీ కార్యవేగం కొంచెం కుంటుపడింది. మళ్లీ ఆంధ్రప్రచారిణీ క్లిష్టపరిస్థితిలోపడి స్థానచలనం చేయవలసి వచ్చింది. అది 1922-23.

ప్రశ్న : ఓహో ! అప్పుడు రాజమండ్రినుంచి కాకినాడ చేరుకున్నారన్నమాట.

వేంకట : అవును. కాకినాడలో సుజనరంజనీ ముద్రాక్షరశాల అధ్యక్షులయిన పోతాప్రగడ బ్రహ్మానందరావుగారి సహాయంవల్ల, లక్ష్మణ స్వామిగారి అప్పులుతీర్చి, క్లిష్టపరిస్థితులుదాటి, ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయమును కాకినాడ తీసుకొని వచ్చాము. అంతకుముందే అంటే 1922లో మా పద్యఖండకావ్యముల నన్ని టినీ కావ్యకుసుమావళి అనే రెండు సంపు టాలుగా చేకుమళ్ల రాజగోపాలరావుగారి ఆంగ్ల పీఠికతోను, మా గురువుగారయిన నడకుదుటి వీరరాజుపంతులుగారి తెలుగుపీఠికతోనూ ప్రక టించాము. ఆ సంపుటాలను పిఠాపురం యువరాజయిన గంగాధర రామారావుగారికి అంకితం చేశాము.

ప్రశ్న : ఏకాంతసేవ ఎప్పుడు రచించారు ?

వేంకట : 1921 లో ఆంధ్రప్రచారిణీ కార్య కలాపం కొంతవరకూ స్తంభించడంచేత మే మిద్దరము (వేంకటపార్వతీశ్వరులు) కాకినాడ పిఠాపురాల్లో తిరుగుతూ కొవ్వూరి బసివిరెడ్డి కుమారుడైన సూర్యనారాయణరెడ్డిగారు సామర్ల కోట భీమవరంలో భీమేశ్వరాలయమున కార్తిక మాసపూజలు చేయిస్తోన్న సమయంలో మేము కూడా ఆ మిత్రులతో భీమవరం వెళ్లి, భీమే శ్వరస్వామి ఆలయంలో మంటపప్రాసాదం పైని మా భక్తి పూర్వకమైన, ప్రకృతి పర మేశ్వరారాధన రూపకమైన ఏకాంతసేవను రచించాము. ఆ రోజుల్లోనే ఏకాంతసేవలోని ఖండాలు కొన్ని కాకినాడలో దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారి అక్కగారైన శ్రీమతి వింజమూరి

వేంకటరత్నమ్మగారి "అనసూయ" పత్రికలో ప్రకటించాము. కాకినాడకాలేజీ ఆచార్యులు పెద్దాడ రామస్వామిగారి ఆంగ్ల పీఠికతోనూ, కృష్ణశాస్త్రిగారి తెలుగు పీఠికతోనూ ఏకాంత సేవను 1922 లోనే పుస్తకరూపంలో తొలి సారి ప్రకటించాము. 1923 లో ఆంధ్రప్రచారిణీ గ్రంధనిలయమును స్వాధీనము చేసికొని కాకినాడ చేర్చామని ముందే చెప్పానుగదా. అప్పుడు కాకినాడలో మహమ్మదాలీ అధ్యక్షతను అఖిలభారత కాంగ్రెసు మహాసభ జరిగింది. దేశంలో అన్ని ప్రాంతాలనుంచి ఆ సభలకు వచ్చిన ఆంధ్రమహాజనుల ఆదరంవల్ల మా గ్రంధనిలయ ప్రచురణలు వందలకొద్దీ అమ్ముడయి, మా అప్పులు తీరిపోయాయి. ఈ విధంగా రెండేసి నెలలకు ఒక నవల చొప్పున ప్రకటిస్తూ 1925 వరకూ మా "ప్రచారిణీ" కాకినాడలో అభివృద్ధిపొందింది.

ప్రశ్న : అయితే మీ ప్రచారిణీపేర వెలువడిన ఆపరాధ పరిశోధక నవలలు ఆ రోజుల్లో చాలా జనరంజకమైనవిగా పుండేవని వింటూంటాం. అవి కాకినాడలో వేశారా అంతకుముందే వేశారా ?

వేంకట : అంతకుముందే రాజమండ్రిలో ఉండగా ఎక్కువ వచ్చాయి. కాకినాడ వచ్చేక వెలువడిన నవలలు మరిన్ని ప్రజామోదం పొందాయి. వాటిలో మాయావి, మనోరమ, మాయావిని, రహస్యవిప్లవం, నీలాంబరి, జీవన్మృతరహస్యం, ప్రతిజ్ఞాపాలనం, మొదలైనవి. పాంచకడిదేవు వంగభాషలో రచించిన అపరాధ పరిశోధక నవలలకు అనువాదాలు ప్రసిద్ధమైనవి. ఇవికాక, బకించంద్రుని నవలల్లో విషవృక్షము, కృష్ణకాంతుని మరణశాసనము వంటి సాంఘిక నవలలు, రవీంద్రనాధ్ ఠాకూరు దృఢప్రతిజ్ఞ, నౌకాభంగము, గోరా వంటి ప్రసిద్ధ సాంఘిక నవలలు మా అనువాదాలద్వారా ఆంధ్రప్రజానీకపు మన్ననలను పొందాయి.

ప్రశ్న : అయితే పిఠాపురంనుంచి కూడా కొన్నాళ్లు ఆంధ్రప్రచారిణి నడిపించి నట్టున్నారు. కాకినాడనుంచి పిఠాపురం ఎప్పుడు వెళ్ళారు.

వేంకట : అప్పులు తీరిపోయి, మూడుపువ్వులూ, ఆరుకాయలుగా వున్న ఆంధ్రప్రచారిణిని తీసుకుని, 1825 ఆగస్టులో పిఠాపురం చేరుకున్నాము. అక్కడికి చేరిన కొద్దికాలానికే పిఠాపురం యువరాజా గంగాధరరామారావుగారి వివాహం అయింది. "బృందావనం" అనే ప్రబంధం రచించి, వివాహ మహోత్సవంలో యువరాజావారికి కృతి ఇచ్చాను. పిఠాపురంలో ఉండగా వెలువడిన మా పుస్తకాలన్నీ మా గురువుగారైన విమర్శాదర్శక సడకుదుటి వీరరాజుగారి విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలలో ముద్రించేవారము. వీరరాజు పంతులుగారు, సంపాదకులుగా, పురాణగ్రంథమాలను స్థాపించి, శివపురాణము, వామనపురాణము, బ్రహ్మపురాణము మొదలైన పురాణాలనుకూడ ప్రకటించాము. అంతేకాకుండా వీరరాజు పంతులుగారి సహకారంతో రచించిన బాలసూర్యవాచకములు ఒకటి నుండి ఐదవ తరగతివరకు ప్రాథమిక పాఠశాలల పాఠ్యగ్రంథములుగా టెక్ట్సుబుక్‌కమిటీవారి ఆమోదం పొందాయి. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథాలు, పురాణగ్రంథమాల ప్రచురణములు

ఇంకా ఇతర పాఠశాలాపాఠ్యగ్రంథాలూ ప్రకటిస్తూ పిఠాపురంలో 7, 8 ఏండ్లు గడిపినాము. అప్పటికి మా చందాదారులు సుమారు 3000 మంది ఉండేవారు. మద్రాసురాష్ట్రంలోని ఆంధ్రజిల్లాలూ, తెలంగాణాలలోనేకాక ఉత్తర హిందూస్థానంలోని జమ్షెడ్పూరు, కలకత్తా, బొంబాయి, ఢిల్లీ మొదలైన దూరభారతీయ ప్రాంతాలలోనూ బర్మా, మలయా, ఇండోనీషియా, వంటి విదేశాలలోను కూడ వ్యాపించి వున్న ఆంధ్రపాఠకు లెందరో మా చందాదారులుగా వుండేవారు.

ప్రశ్న : పిఠాపురంలో 7, 8 సంవత్సరాల దాకానే గడిపినామన్నట్లున్నారు. ఆ తర్వాత మళ్లీ స్థానచలనమా ఏమిటి ?

వేంకట : అవును. కాకినాడకు మార్చాము. మా అన్నగారైన చలాంత్రపు రామయ్యగారు ఆదిరోజుల్లో ఆంధ్రప్రచారిణికి ప్రచారకులుగా ఉండి పనిచేయుటంచేత ఆయన కుమారుడైన చలాంత్రపు సత్యనారాయణరావుగారిని ఆంధ్రప్రచారిణికి ఒక వాటాదారుగా చేర్చి కాకినాడకు కార్యస్థానం మార్చి 1936లో గ్రంథనిలయానికి రజతోత్సవం చేసుకున్నాము. ఆ రజతోత్సవానికి శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. అప్పుడు ఈ సాహిత్యసంస్థకు కాంగ్రెసువారు అయిన రాజకీయనాయకుల సహకారం లభించింది. ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము 10, 11 మంది సభ్యులబోర్డు ఆఫ్ డైరక్టర్సుతో ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్ కంపెనీగా మారింది. దానికి శ్రీ చలాంత్రపు సత్యనారాయణరావుగారు మేనేజింగ్ డైరెక్టరు అయినారు. ఆ తరువాత నాలుగేళ్లకు స్వాతంత్ర్యోద్యమ సంరంభంలో కాంగ్రెస్ ఆదేశానుసారము శ్రీ సత్యనారాయణరావుగారు సత్యాగ్రహముచేసి, శ్రీకృష్ణజన్మస్థానానికివెళ్లడంతో ఆంధ్రప్రచారిణీ కార్యనిర్వహణము కొంతకాలం కుంటుపడింది. ఆ సందర్భంలో నేనూ పార్వతీశంగారూ ఆంధ్రప్రచారిణీనుంచి తప్పుకొని పిఠాపురంలోవుండి శ్రీ పిఠాపురం యువరాజా గంగాధర రామారావుగారి ప్రోత్సాహమున వాల్మీకి రామాయణమును నిర్వచనాంధ్ర రామాయణముగా రచింప ప్రారంభించాము.

శ్రీ సత్యనారాయణరావుగారు జైలు నుంచి విడుదల అయ్యాక ఆంధ్రప్రచారిణీని రాజమండ్రికిమార్చి శ్రీ పైడిమర్రి సత్యనారాయణమూర్తిగారి సహకారముతో నిర్వహింప సమకట్టినారు. 1943 డిసెంబరులో రాజమండ్రిలోనే మాకు (వేంకటపార్వతీశ్వరకవులకు) షష్టిపూర్తిమహోత్సవము చేయుటానికి ఏర్పాట్లు గావించారు. కావ్యకుసుమావళిలో వెనుకటి అంశములకు తరువాతి ఖండకావ్యముల ఎన్నిటినో చేర్చి రెండు పెద్దసంపుటములుగా తిరిగి ప్రకటించారు. ఆధునిక కవుల ఖండకావ్యముల సమాహారముగా 'మహోదయము' అను సంపుటమును ఆధునికకవుల ఏకాంకినాటికల సంపుటము నొకదానిని ఆధునికుల కథానికల సంపుటము నొకదానిని శ్రీ శివశంకరస్వామి సంపాదకత్వమున మా కంకితముచేస్తూ ఆ షష్టిపూర్తి సందర్భములోనే ప్రకటించారు. 1943 డిసెంబరులో ఆ ఉత్సవము రాజమండ్రిలో రెండురోజులు వైభవంగా జరిగింది. ఆ సభకు అప్పుడు అవిభక్త మద్రాసురాష్ట్రపు గవర్నరుగాఉండిన హోంతి



* వడ్డాది అప్పారావు M. A.

రామమూర్తిగారు అధ్యక్షత వహించారు. దుర్గాబాయిగారు. మద్రాసు ఆంధ్రమహిళాసభ విద్యార్థినులతోవచ్చి నృత్యనాటక ప్రదర్శనము లిప్పించారు, సంగీతకళానిధి ద్వారం వేంకట స్వామినాయుడుగారి వయొలిన్ కచ్చేరీజరిగింది. వివిధప్రాంతములనుండి వచ్చిన కవి పండితులు, నవ్యసాహిత్య పరిషత్తుకు చెందిన ఆధునిక కవులుఅంతా ఉత్సవంలో పాల్గొన్నారు. కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు ఆసభకువచ్చి మాదగ్గఱకూర్చుండి మమ్మల్ని ఆశీర్వదించారు. ఈ షష్టిపూర్తి ఉత్సవాలకు ఆహ్వానసంఘాధ్యక్షులు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ఉపాధ్యక్షులు, విస్సా అప్పారావుగారు,పాలకోడేటి గురుమూర్తిగారుకోశాధికారి. అప్పుడు శివశంకరశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి గార్లు సంపాదకులుగాఉన్నారు. బులుసు సాంబమూర్తిగారు, దుర్గాబాయమ్మగారు చెన్నపురి ఆంధ్రమహాసభ, ఆంధ్రమహిళాసభల తరఫున సన్మానించారు. సన్మానసభ కార్యదర్శులు పైడిమర్రి సత్యనారాయణ, జనమంచి కామేశ్వరరావుగార్లు సభకువచ్చి, మాదగ్గర కూర్చుండి మమ్మల్ని ఆశీర్వదించేరు.

ప్రశ్న : తాతగారూ! వేంకటపార్వతీశ్వరకవులకు సారస్వతసభలో లభించిన బిరుదములు సెలవీయండి ?

వేంకట : నర్సారావుపేటలో 1913లో జరిగిన ఆంధ్రసారస్వత పరిషత్సభవారు "కవిరాజహంస"లనీ, రాజమండ్రిలో 1943లో షష్టిపూర్తి మహోత్సవసభలో "కవికులాలంకారు" లనీ రెండు బిరుదములుఇచ్చి సన్మానించారు.

ప్రశ్న : అయితే ఆంధ్రప్రచారిణీ ఇప్పుడు రాజమండ్రిలో లేదుగదా ? ఇప్పు డెక్కడుంది ? ఏం చేస్తోంది ?

వేంకట : 1944లో ఆంధ్రప్రచారిణి బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతక్రింద, దుర్గాబాయిగారు ఉపాధ్యక్షులుగా కొంతకాలం మద్రాసు మైలాపూరులో పనిచేసింది. తర్వాత కొంత కాలానికి బాలాంత్రపు సత్యనారాయణరావుగారు ప్రచారిణీ కార్యకలాపాలకు అంతవరకు జీవగర్రగా ఉంటూండే కార్యదర్శుడు స్వామీ సత్యప్రకాశ్‌గా సన్యాసాశ్రమ స్వీకారంచేశారు, అంధ్రప్రచారిణి ఆతరువాత రామచంద్రపురం చేరుకొంది.

ప్రశ్న : అక్కడున్న ప్రస్తుత కార్యనిర్వాహకులు ఏమైనా కొత్తపుస్తకాలు వేస్తున్నారా ?

వేంకట : లేదు భాషాసంపన్నులూ, లక్ష్మీసంపన్నులూ దానినీ పునరుద్ధరించవలసి వుంది.

ప్రశ్న : అయితే మీ నిర్వచనాంధ్ర రామాయణము పూర్తిఅయిందాండి ?

వేంకట : మేం వ్రాస్తూండగా సుందరకాండ ముగియవచ్చేసరికి 1955 జూన్‌లో పార్వతీశంగారు పరమపదించారు. అప్పటికి సుందరకాండలో చివరిభాగమూ, యుద్ధకాండమూ పూర్తిచేయవలసిఉన్నది. అప్పటినుంచి నేను అస్వస్థుడనై ఉండడంచేత దానిని ముగింపలేకపోయాను.

ప్రశ్న : ఓహో! అలాగా సరేగాని మీరు వ్రాస్తున్న భావసంకీర్తనము పూర్తి అయినదాండి ?

వేంకట : అది పదిఏండ్ల క్రిందటనే 360 ప్రార్థనా పద్యములుగా పూర్తిఅయింది.

గునుగుసీసాలు అనబడే వచనంలాసాగే సీస పద్యాలతో దాదాపు 100 పద్యాలు గల ఒక సంపుటం మా షష్టిపూర్తి సమయం లోనే 1943 లో వెలువడింది, అముద్రితములైన మిగిలిన పద్యములు కొన్ని పత్రికల్లో ఇటీవల అచ్చవుతున్నాయి.

ప్రశ్న : జంటకవులుగా సాహిత్యసేవ చేసిన మీకు ఈ ఒంటరితనం కష్టంగానే ఉందనుకుంటాను ?

వేంకట : కష్టం అనుకుంటే కష్టమూ, లేదనుకుంటే లేదు. భావసంకీర్తనంలోనే దేవుడితో ఏమన్నానో విను :

ఒంటి నేనని నొచ్చుకొంటిని కాబోలు
జంట నేనని అచ్చుకొంటివీనె
పద మందనని వెర్రిపడితిని కాబోలు
పదము లందించి కాపాడి తివె
అర్థ మున్నదె యని యనుకొంటి కాబోలు
శ్రుతు లంటి చూపి నవ్వితివి నీవె
భావ్యమా యని తొట్రుపడితిని కాబోలు
ఉపనిషద్భావాల నూర్చితీవె;

మనము వ్రాసిన దనుకొన జనితి నేమొ
మనము పాడిన దనుమాట మలపి యిదియె
భక్తతతి పాట జ్ఞానులబాట భావ
సూనముల పేట యని యెద జూపవె ప్రభు !

# కావ్యాశీస్సు

శ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీరాధాహృదయారవింద మకరం
దాసక్తపుష్పంధయః
కారుణ్యామృత పూరితోల్లసిత ర
మ్యాపాంగ విభ్రాజితః
కృష్ణః పంకజలోచనో మధురిపు
ర్వంశీ వినోదోత్సుకః
పాయాచ్ఛ్రీయుత ముళ్లపూడికులజం
శ్రీతిమ్మరాట్ సత్ప్రభుమ్. 1

అడుగొక్కించుకజాపి సవ్యచరణం
బద్దాన సంధించి కృ
ష్ణుఁడు సూతాకృతిఁ దేరుబోనడుపు చ
చ్చో జ్ఞానయోగమ్ముఁగ
వ్వడికిన్ బోధయొనర్చు నప్ప్రణయ దృ
క్పాతమ్ము నిత్యమ్ముఁ బ్రో
చెడుగాతన్ భువి "ముళ్లపూడి" ఘనునిన్
శ్రీ తిమ్మరాజేంద్రునిన్. 2

### శ్రీ చెఱుకూరి కాళహస్తీశ్వరశర్మ

సీ॥ ఉభయ భాషలయందు నుజ్జ్వలవైదుషీ
పూర్ణరాసిక్యంబు పుక్కిళించి
కవితాలతాంగికి కమనీయ కల్పద్రు
కుసుమదామంబుల గూర్చియిచ్చి
శారదాచరణ మంజీర మంజుస్వాన
నవమాధురికి జీవనంబుచిలికి
నిగమాంతవిజ్ఞాన నిర్మలామృత వృష
ద్వితతి నల్గడలను వెల్లిగొలిపి
కృషికి వాణిజ్యమునకు పరిశ్రమలకు
తెలుగుపొలమున నొక క్రొత్తవెలుగుకూర్చి
అఖిలజనముల జేజేల నందికొన్న
తిమ్మరాట్చంద్ర నిన్ను నుతింపతరమె॥ 1

కం॥ నీవంటి ఆర్ద్రహృదయులు
భావుక మహనీయకార్య పతతంత్రు లిలన్
ఎవారుందు రయా! కవి
తావల్లభ తిమ్మరాజ! దాతృబిడౌజా॥ 2

# సింహావలోకనము

శ్రీ మల్లంపాటి మధుసూదనప్రసాద్

శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి సాంస్కృతిక సేవను పురస్కరించుకొని ప్రచురించు సంచికలో నా మహనీయుని జీవితమును సింహావలోకనము( జేయ(బూనుట కడుంగడు నుచితమని నా యభిప్రాయము. ఎవరి జన్మదినము పర్వదినముగా పరిగణింపదగినది ? కారణ జన్ముల జన్మదినములు మాత్రమే పర్వదిన ప్రాయములు. శ్రీ తిమ్మరాజుగా రెట్లు కారణ జన్ములో వివరించెద.

దేశాధిపతులు (రాజులు) ధరాధిపతుల (భూస్వాముల) నాదరించు రోజులు పోయినవి. ఆస్తియర్హత, విద్యార్హతలతో నిమిత్తము లేకుండ వయోజనులందఱికి వోటింగ్ హక్కు ఈయబడినది, శ్రామికుల (వ్యవసాయ కార్మికులుకానిండు, పారిశ్రామిక కార్మికులు కానిండు) జనాభాయెక్కువ. వారికి హితము కూర్ప( బ్రయత్నించు రాజకీయ పక్షములకు తక్క నితర రాజకీయ పక్షములకు పుట్టుగతులుండు రోజులు కావివి. భూస్వామ్య యుగము గతించినది, భూస్వాము లంతరించు కాలము దాపురించినది, భూస్వాములు తమ చుట్టును గిరిగీచుకొని యుండు దినములు గడచినవి. కాలక్రమము ననుసరించి భూస్వాములు మాఱవలసిన రోజులు వచ్చినవి, భూస్వాములు దేశమునకు, సంఘమునకు సేవ చేయవలసిన తరుణ మాసన్నమైనది. కేవలము తమ శ్రేయస్సునే ధ్యేయముగా నెంచక, తమ శ్రేయస్సుతో( బాటు సంఘశ్రేయస్సు, దేశ శ్రేయస్సులను పరమావధిగ పెట్టుకొనవలసిన కాలమిది. పరిశ్రమల స్థాపన వలన నిది జరుగును, దీనివలన తమ సంపదను బెంచుకొనుచు, దేశసంపదను బెంపవీలగును. పుణ్యము, పురుషార్థము కలిసివచ్చినట్లగును. ఇహపరములు సాధించినట్లగును. పదిమందికి జీవనోపాధి గలిగించుటగదాయిది ! కాని భూస్వాములు భోగలాలసులై కాలగతిని గ్రహింపక జీవితమును గడుపుచుండిరి. తమ ప్రయోజనములను కూడ( గుర్తింపనేరని స్తబ్ధత వారినావరించినది. కాలగతిని గుర్తించి, సంఘ పరివర్తన ననుసరించి, తాము పారిశ్రామికులుగ మాఱి, నిద్రాణమైయున్న భూస్వామి వర్గమును జాగరిత

మొనరించినారు. పారిశ్రామికులు కండని శంఖారావముచేసి యావర్గమును మేలుకొలిపి, వారికి మార్గదర్శకులైనారు. కావుననే శ్రీ తిమ్మరాజుగారు కారణజన్ములు.

భూస్వాములు సాధారణముగ భోగలాలసులుగ నుండెదరు. నిరంతర మధుపానముచే మత్తిల్లిన మధుపములవోలె కాలమును గడిపెదరు, కాదు, కాదు. మధుపములు ఝుంకారమైనను చేయును. ఆపాటి చైతన్యమైనను భూస్వాములందుఁ గానరాదు. భోగలాలసత్వము తక్క వేఱొక వ్యాసంగమే పట్టదు వారికి. మన తిమ్మభూపతి యట్లుకాదు. భోగభాగ్యములను వర్జింపక పోయినను, వానియందే పారవశ్యము చెందు ప్రకృతికాదు వీరిది. తామరాకుమీది నీటిబొట్టు చందమున నుండుటయే వీరి ప్రవృత్తి. వీరి చిత్తము సంస్కార పూరితమైనది. వీరికి పండితులపట్ల పూజ్యభావము. కవులయెడ గౌరవము, ఉపాధ్యాయులమీద వాత్సల్యము మెండు. వీరికి చరిత్ర పరిశోధన ప్రియమైన వ్యాసంగము. పరమపదించిన పుత్రునిపేర నెలకొల్పిన నరేంద్ర సాహిత్య మండలియే వీరి సాహిత్యానురక్తికి నిదర్శనము. ఆ మండలిపేర వీరు పెక్కు పుస్తకముల ప్రచురణకు కారణభూతులైరి. పరస్పర స్పర్ధలు, ద్వేషము, ఈర్ష్య, అసూయ మున్నగు వానితో సతమత మగుచున్న ఆంధ్రావనీ పాలకులను కూడగట్టుకొని, కాకతీయ సామ్రాజ్యపతనము నదనుగా తీసికొని యెత్తివచ్చిన మహమ్మదీయ ముష్కరులను చీల్చి, చెండాడి యేకచ్ఛత్రాధిపత్యముగ సుమారు ముప్పదేండ్లు తెలుగు నాడును పాలించిన ముసునూరి కాపయ్యనాయకుని జీవితగాథ నరేంద్రసాహిత్యమండలి వెలువరించిన గ్రంథములలో నొకటి. ఇట్టి సాహిత్యమండలి సంస్థాపకులగు తిమ్మరాజుగారికి జమ్మలమడక మాధవరామశర్మగారు 'ఔచిత్య విచారచర్చ' యను అలంకార శాస్త్రగ్రంథమును అంకితము చేసి యుండుట యెంతయు నుచితము.

తిమ్మరాజుగారి జమీ తణుకు చెంతనున్న ఉంద్రాజవరము. తిమ్మరాజుగారర్థ బలము కలిగియు నహంకారము లేనివారు. అగర్భ శ్రీమంతులయ్యును, నిరాడంబరులు. పిన్నలతోను, పెద్దలతోను, పండితులతోను, పామరులతోను కలసి మెలసి యుండగల ప్రకృతి వారిది. వీరితండ్రి రాయుడుగారు.

## శ్రీ చల్లా నరసింహారావు

కవితాపరిమళములు నవ
నవమై చరియింపమీరు నర్మిలివిడకన్
కవిదళపాళికి వృంతవి
భవముననుంటిరికద—సుధవారెడి హృదితో.

పూర్వచరితలఘనతలు పొందుపఱచి
విశదముగ రచియించెడి వేదివీవు
పూజ్యచరితులమనసులు పొలుపుజూపి
వివరముగ పఠియించెడి వేధవీవు.

సాహితీవల్లభ శిశిరశాంతినిలయ
సుకవినికురుంబములు మీకు శోభగూర్ప
పద్యకోటీరమునిడిరి పావనమ్ముగ
దివ్యభావదీప్తులమున్గి తేజరిలుడు.

# భారతీయ సంస్కృతి

డా॥ సి॥ నారాయణరెడ్డి

## 1. చతుర్విధ పురుషార్థములు

ధర్మార్థకామమోక్షములు చతుర్విధ పురుషార్థములని భారతీయతత్వజ్ఞులు నిర్ణయించిరి. మోక్షము వినా త్రివర్గప్రతిపత్తిని వాత్స్యాయనుడు క్రిందివిధముగా నిర్ణయించెను.

*"శతాయుర్వై పురుషోవిభజ్యకాలమన్యోన్యాను బద్ధం పరస్పరస్యాననుఘాతకం త్రివర్గం సేవేత"*[1]

పురుషుడు తన జీవితకాలమును ప్రత్యేకముగా విభజించుకొని ఒకదానితోనొకటి విరుద్ధము కానివిధముగా పేర్చుకొని ధర్మార్థకామము లను మూడు పురుషార్థములను సేవింపవలయునని వాత్స్యాయనుడు అభిప్రాయపడెను. ప్రతిమానవుడు వయస్సునుబట్టి కాలవిభజనము చేసికొని పురుషార్థములను సాధింపవలెనని వాత్స్యాయనుడు వ్రాసెను. బాల్యమునందు విద్యాగ్రహణాద్యర్థములను, యౌవనమందు కామమును, వార్ధక్యమునందు ధర్మమోక్షములను సేవింపవలయునని ఈతడుతెలిపెను. మానవుని జీవితమును క్రమబద్ధముగా నడిపించుటకు ఈ పురుషార్థములు వెలుగుదారులుగా పనిచేసినవి. ప్రాచీన భారతీయులీ చతురర్థములను సాధించుటకు ప్రయత్నించిరి. ఇక వీనినిగూర్చి సంగ్రహముగాచర్చింతును.

### ధర్మనిర్వచనము :

"ధర్మస్తత్వాదర్శనమ్" అని దండి మహాకవి అభిప్రాయము. అనగా సత్తునుండి అసత్తును వేరు చేయునది ధర్మము. ధర్మమును వాత్స్యాయనుడు క్రిందివిధముగా నిర్వచించెను.

---

1. వాత్స్యాయన కామసూత్రములు (1–2–1) వివరణకర్త: పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి.

"అలౌకికత్వా దదృష్టార్థత్వా దప్రవృత్తానాం యజ్ఞాదీనాం శాస్త్రాత్ప్రవర్తనం లౌకికత్వాదదృష్టార్థత్వాచ్చ ప్రవృత్తేభ్యశ్చ మాంసభక్షణాదిభ్యః శాస్త్రాదేవనివారణం ధర్మః"[2]

(అలౌకికములును, అదృష్టార్థములును అగుట వలన యజ్ఞాదులను ప్రవర్తింపజేయునట్టిదియు, లౌకికములును, దృష్టార్థములును అగుటవలన ప్రవృత్తములైన మాంసభక్షణాదులనుండి నివర్తింపజేయు నట్టిదియును ఏదికలదో అది ధర్మమనబడుచున్నదని సూత్రార్థము)[3].

అర్థనిర్వచనము :

"విద్యాభూమి హిరణ్యపశుధాన్య భాండోపస్కరమిత్రాదీనామర్జన, మర్జనస్యపరిరక్షణ మర్థః"[4]

(విద్యలు, భూమి, హిరణ్యము, పశువులు, ధాన్యములు, గృహోపకరణములు, మిత్రులు మొదలగు వస్తువులలో అన్నిటిని అర్జనముచేయుట, అర్జించినదానిని వృద్ధిపొందించుట అను ఈరెండును అర్థమని సూత్రార్థము )

దండి దశకుమారచరిత్రలో అర్థనిర్వచన మించుమించుగా నిట్లేచేసెను.

" అర్థస్యావర్జనవర్ధనరక్షణాత్మకః కృషి పాశుపాల్య వాణిజ్య సంధి విగ్రహాది పరివారః తీర్థప్రతిపాదనఫలశ్చ" ఇందులో యోగ్యులకు దానము చేయుట క్రొత్తగా కనిపించుచున్నది.

కామనిర్వచనము :

"శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణానా మాత్మసంయుక్తేన మనసాఽధిష్ఠితానాం స్వేషుస్వేషు విషయే ష్వానుకూల్యతః ప్రవృత్తిః కామః"[5]

శ్రోత్రాది పంచేంద్రియములు ఆత్మమనస్సులతో గూడినవై తమతమవిషయములం దనుకూలముగా ప్రవర్తిల్లుటయే కామమనబడునని పైసూత్రములోని అభిప్రాయము.

"కామస్తు విషయాతిసక్త చేతసోః స్త్రీపుంసయోః నిరతిశయ సుఖస్పర్శవిశేషః"[6]

కామమనగా విషయాతిసక్తులైన స్త్రీపురుషుల యొక్క నిరతిశయ సుఖస్పర్శ విశేషమని దండి అభిప్రాయపడెను. లోకములో ఏది ఉజ్జ్వలముగా రమణీయముగా నుండునో అది కామోద్దీపనము కలిగించునని దండి ఇంకను విపులీకరించెను

మోక్షనిర్వచనము :

"దుఃఖాత్యంతనివృత్తిర్మోక్షః" "తదత్యంతవిమోక్షోఽపవర్గః" అని మోక్షము నిర్వచింపబడినది[7]. ఆధ్యాత్మిక, అధిభౌతిక ఆధిదైవికములగు దుఃఖముల యొక్క అత్యంతనివారణమే మోక్షమని వీని తాత్పర్యము. ఇదియే అపవర్గము. మానవుడు తెలిసికొనవలసిన ఆత్మాదిపదార్థములలో ముఖ్యమైన ప్రమేయమిది.

ధర్మప్రాధాన్యము :

ఈ చతుర్విధ పురుషార్థములలో తురీయమైన మోక్షమే జీవితలక్ష్యముగా నుండవలెనని భారతీయ తత్త్వజ్ఞులు విశ్వసించిరి. మొదటి మూడింటిలో ధర్మమునకే అగ్రతాంబూలము నిచ్చిరి. ధర్మమనునది

---

2. వాత్స్యాయన కామసూత్రములు (1–2–7)
3. సూత్రవివరణము : ఆదినారాయణశాస్త్రిగారు.
4. వాత్స్యాయన కామసూత్రములు (1–2–9)
5. వాత్స్యాయన కామసూత్రములు (1–2–11)
6. దశకుమారచరిత్రము (దండి)
7. న్యాయ సూత్రములు (1–3–14)

మతముకంటె విస్తృతమైనది. మానవుని స్వవిధులను, ఇతరులపట్ల నిర్వర్తింపవలసిన బాధ్యతలను నిర్దేశించునది ధర్మము. జగత్తును నైతికసూత్రములో బిగించు 'ఋతము' లో ధర్మము అంతర్వాహిని వంటిది ధర్మార్థకామములు మూడింటిలో తారతమ్య పరీక్ష చేసినచో ధర్మమే ఆచరణీయమని కామసూత్రములను రచించిన వాత్స్యాయనుడుసైతము వ్రాసెను. అతని సూత్రమిది—

"తేషాం సమవాయే పూర్వః పూర్వో గరీయాన్"[8]

అనగా ధర్మార్థకామములకు ఘర్షణము జరిగినప్పుడు కామము అర్థముచేత సాధింపదగినది కాన కామముకంటె అర్థమే శ్రేష్ఠమనియు, ఆరెంటికి సంఘర్షణముజరిగినచో అర్థము ధర్మముచేత సాధింపదగినది కనుక ధర్మమే శ్రేష్ఠమని ఈ సూత్రములోని భావము.

అర్థకామములుగూడ సజ్జనులకు బాధకములు కావని ప్రాచీనులు విశ్వసించిరి. కాళిదాసు "అప్యర్థకామౌ తస్యాస్తాం ధర్మఏవ*మనీషిణః"[9] అన్నాడు. అర్థకామములుగూడ మనీషియైన మహారాజునకు ధర్మముగానే పరిణమించినవని ఆతనియభిప్రాయము.

### సాహిత్యముపై ప్రభావము :

ఇక సాహిత్యముపై ఈ పురుషార్థముల ప్రభావ మెంతవరకుగలదో విశదీకరింతును. సర్వశాస్త్రములు, కావ్యములుగూడ ధర్మప్రతిపాదనమునకే రచింపబడినవని అలంకారికశిరోమణి అభినవగుప్తుడభిప్రాయపడెను.

8. వాత్స్యాయన కామసూత్రములు (1–2–14)
* ('ధర్మాయైవ' అని వావిళ్లప్రతి – సంపాదకుడు)
9. రఘువంశము : ప్రథమసర్గము.

"శమార్థం సర్వశాస్త్రాణి
నిర్మితాని మనీషిభిః
తస్మాత్ స సర్వశాస్త్రజ్ఞః
యస్య శాంతం మనస్సదా"[10]

శమమనగా శాంతి. శాంతి ధర్మచింతనము వలననే జరుగును.

ప్రాచీన భారతీయ సాహిత్యమంతయు ఈ చతుర్విధపురుషార్థముల పునాదులపైననే నిర్మింపబడినది. చివరకు గీతగోవిందమువంటి శృంగారకావ్యములోగూడ మోక్షసిద్ధియే పరమలక్ష్యముగా నిరూపింపబడినది. ఈ కావ్యములోని రాధాకృష్ణుల మధురభక్తి జీవాత్మ పరమాత్మల సంయోగమునకు సంకేతముగా చిత్రింపబడినది. అందుచేత గీతగోవిందముయొక్క చరమధ్యేయము తురీయపురుషార్థమైన మోక్షమనియే చెప్పకతప్పదు.

వాల్మీకిరామాయణమున ఈ ధర్మప్రతిపాదనమేకలదు. రాముని పితృవాక్యపరిపాలనము, అరణ్యావాసము, లక్ష్మణుని త్యాగశీలము, భ్రాతృభక్తి మున్నగునవి ధర్మవృక్షమునసాగిన కొమ్మలే.

మహాభారతము కేవలము అన్నదమ్ముల పోరాటమునకు సంబంధించిన గ్రంథము కాదు. అది తత్త్వగ్రంథముకూడ. అది మోక్షపురుషార్థమును ప్రతిపాదించుచున్నది. సాధారణముగా మహాభారతమున ధర్మము ప్రతిపాదింపబడినదని యందురు. కాని ఆనందవర్ధనుడు దానిలో మోక్షమే ప్రధానముగా ప్రపంచింపబడినదని స్పష్టపరచెను.

"మహాభారతేఽపి శాస్త్రకావ్యరూపచ్ఛాయాన్వయిని వృష్ణిపాండవ విరసావసాన వైమనస్యదా

10. 'అభినవభారతి' నుండి సంగృహీతము.

యునిం సమాప్తిముపనిబధ్నతా మహామునినా వైరాగ్య జననతాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్షలక్షణః పురుషార్థః శాంతోరసశ్చ ముఖ్యతయా వివక్షా విషయత్వేన సూచితః."11

కావున భారతమున ప్రధానముగా మోక్షము, గౌణముగా ధర్మము ఉపదేశింపబడినవని చెప్పవచ్చును.

కాళిదాసు తన కావ్యము లన్నిటిలో ధర్మ ప్రాధాన్యమును ప్రసాదించెను. రఘువంశ కావ్యమున దిలీపుడు సింహమునకు తన్నుతాను బలియిచ్చుటకు సంసిద్ధుడగుట గోరక్షణార్థమే. గోరక్షణమనగా ధర్మరక్షణమని వేరుగా చెప్పవలసిన అవసరములేదు కదా! అర్థకామములు ధర్మమును వ్యుత్క్రమించినచో అవి ఎట్లు కళ్యాణభంజకములగునో రఘువంశ కావ్యమున అగ్నివర్ణుని వృత్తాంతముద్వారా కాళిదాసు బోధించెను. అగ్నివర్ణుడు ప్రధానముగా కామోపజీవి. రాజ్యభారమును అనగా ధర్మరక్షణమును తృణప్రాయముగా త్రోసివేసి స్త్రీలోలుడైనాడు. తత్పర్యవసానముగా ఉభయభ్రష్టుడైనాడు. అభిజ్ఞాన శాకుంతలమున శకుంతల గాంధర్వ వివాహము కామలక్షణము. కామైకపరత్వములో కన్నుగానక ఆమె ధర్మమును విస్మరించినది. అందుకే ఆమె క్లేశముల పాలైనది.

ఉత్తరరామ చరిత్రమునందు ధర్మస్థాపనము కొరకు లోకారాధనము కొరకు సమస్తమును పరిత్యజింతునని రాముడు ప్రతిజ్ఞచేయును.

"స్నేహం దయాం చ సౌఖ్యం చ
యదివా జానకీ మపి
ఆరాధనాయ లోకస్య
ముంచతో నాస్తి మే వ్యథా"12

లోకారాధనము కొఱకు స్నేహము, దయ, సౌఖ్యము మొదలైనవేకాక తన ప్రాణములో ప్రాణమైన జానకిని గూడ పరిత్యజించినను తనకు దుఃఖము లేదని రాముడు వచించెను. ప్రజలను ఆరాధించుట యనగా వారి ఆదర్శములను పోషించుటయే. పాతివ్రత్యము ప్రజల ఆదర్శములలో నొకటి. అగ్నివంటి సీతాదేవి పాతివ్రత్యమునకు లోకాపవాదము నిమిత్తముగా కళంకమువ్వటిల్లెను. అది కల్లయని రాముని యంతరాత్మకు తెలియును. కాని ప్రజాభిప్రాయమును కాదనలేక ఆసాధ్విని పరిత్యజింపవలసివచ్చినది.

అశ్వఘోషుని బుద్ధచరిత్రము, సౌందరనందము అను కావ్యములలో శాంతరసమే కనిపించుచున్నది) శాంతరసము అపవర్గమునకు - అనగా మోక్షమునకు దారిచూపునదే కదా!

ఈ విధముగా వాల్మీకి రామాయణమునుండి గీతగోవిందము వరకు గల భారతీయ (సంస్కృత) సాహిత్యమంతయు చతుర్విధ పురుషార్థములలో ధర్మ మోక్షములే పరణీయములని ఉద్ఘాటించినది. అయినను అర్థకామములను ఆనుషంగికముగా ప్రతిపాదింపకుండ ఉండలేదు. వీనిని బొత్తిగా త్రోసివేసినచో జీవితము దారుసప్రశమైపోవునని వీనికి గూడ భారతీయులు తగిన స్థానమును కల్పించిరి.

## 2. వర్ణవ్యవస్థ :

ఆర్యావర్తమున ఆర్యులు స్థిరపడిపోయిన తరువాత అంతకుముందే అక్కడ నివసించుచున్న ఆదిమ వాసులనుండి తమ్ము వేరుగా నుంచుకొనుటకు, జాతి

11. ధ్వన్యాలోకము : చతుర్థోద్యోతము.

12. ఉత్తరరామ చరిత్రము : ప్రథమాంకము.

సాంకర్యమునుండి కాపాడుకొనుటకు వర్ణవ్యవస్థ నేర్పాటుచేసికొనిరి. వర్ణవ్యవస్థ ఏర్పడకముందు ఆర్యుడైన ప్రతివ్యక్తియు పురోహితుడుగా, యోధుడుగా, వర్తకుడుగా, కర్షకుడుగా నుండెడివాడు. క్రమముగా జనసంఖ్య పెరిగినది. ఒకేవ్యక్తి అన్నివృత్తులు నిర్వర్తించుకొనుట కష్టమైపోయినది. కర్మకాండకు, ధర్మకాండకు, కృషికి, సేవకు, తమలోనే వర్ణము లేర్పాటుచేసికొనుట మంచిదని వారు భావించిరి. విద్యాభ్యాసమునందభిరుచి గలవారు పురోహితులని (విప్రులని), పరిపాలనము చేపట్టినవారు క్షత్రియులని, మిగిలినవారందరు ప్రజలనియు లేక వైశ్యులనియు వ్యవహరింపబడిరి. క్రమముగా వాణిజ్యము చేయువారు మాత్రమే వైశ్యులనియు, పై మూడు వర్ణములవారి కన్నుసన్నలలో మెలగువారు శూద్రులనియు వ్యవహరింపబడిరి. తొలుత కేవలము కార్య సౌలభ్యముకొరకు చేసిన ఈ వృత్తివిభాగము క్రమముగా వంశపారంపరికమైనది.

వర్ణవ్యవస్థ మొట్టమొదటిసారిగా పురుషసూక్తమున ఉల్లేఖింపబడినది.

బ్రాహ్మణో౽స్య ముఖమాసీ
ద్బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః
పద్భ్యాం శూద్రో అజాయత"[13]

అయినను ఋగ్వేదకాలమున ఈ వ్యవస్థ సుప్రతిష్ఠితము కాలేదు. కేవలము వృత్తులపైనే ఇది యాధారపడియుండెను. బ్రాహ్మణములకాలమున ఈ వ్యవస్థ బలపడినది. చాతుర్వర్ణ్యములలో బ్రాహ్మణముల కగ్రతాంబూలము దొరకినది. ఉపనిషత్కాలమున క్షత్రియులు జ్ఞానవంతులును బ్రహ్మజ్ఞులును అయిరి. భగవద్గీతలో 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం *గుణకర్మవిభాగశః*' అని యున్నది. గుణములను బట్టియేకాక కర్మలనుబట్టియు వర్ణవిభాగము జరిగెనని దీనివలన తెలియుచున్నది.

అధునికకాలమున ఈ వర్ణవ్యవస్థ పరిహాసాస్పదముగా కనిపించినను ప్రాచీనకాలమున దీనికున్న ప్రాధాన్యమును త్రోసివేయుటకు వీలులేదు. వర్ణసాంకర్యమానాడు పాపముగాభావింపబడుచుండెడిది. కులధర్మములను కూలద్రోసినవారు నరకమున కేగుదురని భగవద్గీతయందుకలదు.[14] అభిజ్ఞాన శాకుంతలమున కాళిదాసు వంశపరంపరాగతమైన వృత్తినవలంబించుటయే మానవుని కర్తవ్యమని జాలరిచే అనిపించెను.

'సహజం కిల యద్వినిందితం
న హి తత్కర్మ విసర్జనీయకం
పశుమారణ కర్మదారుణో
ప్యనుకంపామృదురేవ భూసురః'[15]

బ్రాహ్మణుడు యజ్ఞాదులలో పశువిశసనము చేయుట పాపమెందుకుకాదనగా అది కులక్రమాగతమైన వృత్తియగుటవలననే యని కాళిదాసు వర్ణవ్యవస్థను సమర్థించెను "స్వధర్మే నిధనం శ్రేయః" అనియే కాక "పరధర్మో భయావహః" అనికూడ గీత హెచ్చరించెను.

సాహిత్యముపై ప్రభావము :

వాల్మీకిరామాయణమున ఈవ్యవస్థ సమర్థింపబడినది. భారతములో ఇదే కలదు. వర్ణవ్యవస్థను

13. ఋగ్వేదము : దశమమండలము (90వ సూక్తము)

14. ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ.
(భగవద్గీత : 1 అధ్యా. 44)

15. అభిజ్ఞానశాకుంతలము : షష్ఠాంకము.

పోషించుటయే ప్రభువుల కర్తవ్యమని ఈరెంటిలో అడుగడుగున చెప్పబడినది. కాళిదాసు కావ్యములలో ఈవ్యవస్థ ప్రభావము మిక్కుటముగా కనిపించును. రాజు వర్ణవ్యవస్థను విధిగా పాటింపవలెనని కాళిదాసు తెలిపెను.

"రేఖామాత్ర మపి క్షుణ్ణా
దామనోర్వర్త్మనః పరం
న వ్యతీయుః ప్రజాస్తస్య
నియంతుర్నేమి వృత్తయః"16

రాజు నియంత. అనగా సారథివంటివాడు. మనుప్రోక్తమైన వర్ణాశ్రమధర్మమే రాచబాట. ప్రజలు గుఱ్ఱములవంటివారు. వర్ణధర్మమును సక్రమముగా పాలించుటయే ఐహికాముష్మిక సుఖములకు ఏకైక సాధనమని కాళిదాసు అభిప్రాయము. తరువాత బాణుడు, భవభూతి మున్నగు కవులు దీనిని సమర్థించిరి. ప్రాచీన సంస్కృత కావ్యములన్నిటిలో ఎక్కడో ఒకచోట ఈ వర్ణవ్యవస్థప్రతిబింబము కానిపించును.

హైందవసంస్కృతికి వర్ణవ్యవస్థ మూలకందముగా నుండెడిది. తొలిదినములలో ఇది యంతగా సంకుచితము కాలేదు. స్మృతులకాలమున ఈవ్యవస్థ వికాసముకోల్పోయి బిగిసిపోయినది. బ్రాహ్మణత్వము జన్మముపైగాక శీలముపై ఆధారపడియున్నదని ఛాందోగ్యోపనిషత్తులోని సత్యకామ జాబాలుని కథ నిరూపించుచున్నది. అవరవర్ణుడైన జాబాలి ఉపనిషద్ద్రష్టలలో ఒకడు. క్షత్రియుడైన సనత్కుమారుడు బ్రాహ్మణుడైన నారదునికి పరమార్థము నుపదేశించెను, శుకుడు క్షత్రియుడైన జనకునిని గురువుగా స్వీకరించెను. దాల్భ్యుడు శూద్రుడు. ఇతడు బృహదారణ్యకోపనిషత్ద్రష్టలలో ఒకడు ఋగ్వేదమునకు వ్యాఖ్యారూపకమైన బ్రాహ్మణము వ్రాసిన మహీదాసుడు శూద్రుడే. భారతములోని ధర్మవ్యాధోపాఖ్యానములో కసాయివాడు బ్రాహ్మణునికి ధర్మసూక్ష్మములను వెల్లడించినట్లు కలదు. కావున ఈవ్యవస్థ ప్రారంభదశలో చక్కని వికాసము పొందెననుటలో సందేహములేదు క్రమముగా ఘనీభవించిపోయి సత్ఫలితముల నీయలేకపోయినది. ఏదియెట్లున్నను ప్రాచీనభారతీయ సాహిత్యముపై దీని ప్రభావమును విస్మరించుటకు వీలులేదు.

16. రఘువంశము : ప్రథమసర్గ (17 శ్లోకము)

### 3. ఆశ్రమధర్మములు

ఆశ్రమధర్మములు వైదికయుగములోనే స్థాపింపబడినవి. నాటి మానవుని జీవితము నాలుగు ఆశ్రమములుగా విభజింపబడినది. (1) బ్రహ్మచర్యము; ఇది వేదవిద్యాభ్యాసము చేయు కాలము. (2) గృహస్థాశ్రమము; యజ్ఞములుచేయుట, సంఘువిధులు నెరవేర్చుట. (3) వానప్రస్థము; భోగములను దిగద్రావి వనవాసముచేయుట: (4) సన్యాసము; సర్వసంగ పరిత్యాగముచేయుట. రామాయణ, భారతాది గ్రంథములలోని వ్యక్తులందరు ఈ యాశ్రమవ్యవస్థను పాటించినవారే. చివరకు శృంగారకావ్యమైన మనుచరిత్రలో గూడ గృహస్థాశ్రమధర్మము చక్కగా సమర్థింపబడినది. వరూథిని తృతీయ పురుషార్థమునకు సంకేతము. ప్రవరుడు తురీయ పురుషార్థమునకు, గృహస్థాశ్రమమునకు ప్రతిబింబము. కడకు గృహమేధియే జయించెనని మనుచరిత్ర చెప్పుచున్నది.

చతుర్విధ పురుషార్థములు, వర్ణాశ్రమ ధర్మములు ప్రాచీన భారత సంస్కృతికి ప్రధానాంగములు. ఆత్మతత్త్వము, పరమాత్మతత్త్వము, కర్మసిద్ధాంతము,

పునర్జన్మ సిద్ధాంతము ఉపాంగములు. వీనిగూర్చి సంక్షేపముగా ముచ్చటింతును.

### (i) ఆత్మతత్త్వము

భారతీయసంస్కృతి ప్రత్యేకత 'ఆత్మ' సిద్ధాంతములో నిబిడీకృతమై యున్నదని చెప్పవచ్చును. బుద్ధికన్న, మనస్సుకన్న ఆత్మ గొప్పదని గీత అభిప్రాయము. భారతదేశమున చిరకాలమునుండి ఆత్మకే అగ్రపీఠమున్నది. పాశ్చాత్యులలో పలువురు బుద్ధికే గద్దెనిచ్చినారు. మనలో నేటికిని ఆత్మవాదులే అధికముగా నున్నారు. గీతలో ఆత్మయొక్క ఔన్నత్యము ఇట్లు చెప్పబడినది.

> *"ఇంద్రియాణి పరాణ్యాహు*
> *రింద్రియేభ్యః పరం మనః*
> *మనసస్తు పరాబుద్ధి*
> *ర్యో బుద్ధేః పరతస్తుసః"*
>
> (కర్మయోగము : 42 శ్లో.)

దేహముకన్న ఇంద్రియములు, ఇంద్రియములకన్న మనస్సు, మనస్సుకంటె బుద్ధి, బుద్ధికంటె ఆత్మ- ఒకదానికంటె ఒకటి శ్రేష్ఠమని దీని యభిప్రాయము. ఇట్టి ఆత్మను తెలిసికొని, బుద్ధితో మనస్సును నిగ్రహించుకొని దుఃఖకారి యగు కామరూప శత్రువును నిర్జించవలెనని గీత ఉపదేశించినది. ఆత్మకు వినాశములేదని భారతీయుల అభిప్రాయము. అది సత్తు. దేహాదులు అసత్తులు, అవి నశ్యములు. ఆత్మకు ప్రత్యక్షాది ప్రమాణములు లేవు. ఇది చంపునదికాదు, చంపబడునది కాదు దీనికి జనన మరణములు లేవు. మనుష్యుడు చినిగిపోయిన వస్త్రములు విడిచి క్రొత్తవస్త్రములు గట్టుకొన్నట్లు ఆత్మ వివిధ శరీరములను విడిచి క్రొత్తశరీరములను పొందుచుండునని గీత బోధించినది.[17]

ఆత్మతత్త్వము నింత నిశితముగా, లోతుగా దర్శించిన జాతి భారతజాతి యొకటేయని చెప్పవచ్చును.

### (ii) పరమాత్మ తత్త్వము

వేదములలో దేవతలసంఖ్య 333 వరకుండెడిది. క్రమముగా వర్గీకరణముజరిగి ఏకేశ్వరసిద్ధాంతము బయలుదేరినది. క్రమముగా అనశ్వరమైనదియు, 'సత్తు' అను పరబ్రహ్మ పదార్థమొక్కటే యను అభిప్రాయము బలపడినది. *"ఏకం సద్విప్రా బహుధా వదంతి అగ్నిర్యమం మాతరిశ్వానమాహుః"* అనునది ఈ అభిప్రాయమునే బలపరుచుచున్నది.

### (iii) కర్మసిద్ధాంతము

లోకములో మానవుల సుఖదుఃఖములకు వారు పూర్వజన్మమందు చేసిన కర్మలే కారణములు కలిమిలేములు రెండును కర్మపరిపాకమునుబట్టి ఏర్పడును. సృష్టికర్తకు ఏ ఒక్కనియందు ప్రత్యేకముగా కోపముగాని, కూర్మిగాని ఉండవు. కర్మకు మూడు విభాగములు కలవు-ఆగామి, సంచితము, ప్రారబ్ధము. *"మొదలు పెట్టినందున వెట్టిదానిని అనుభవింపక తప్పదు. కాని ఆగామి సంచితాలను మానవుడు తన సత్ప్రవర్తనవలన, భగవత్కటాక్షము వలన గెలవవచ్చును."*[18] ఉపనిషత్తులుసైతము సత్కర్మానుష్ఠానమువలన మోక్షప్రాప్తి కలుగునని చెప్పెను.

---

17. *"వాసాంసి జీర్ణాని యథావిహాయ,*
    *నవాని గృహ్ణాతి న రోఽపరాణి*
    *తథా శరీరాణి విహాయ జీర్ణా,*
    *న్యన్యాని సంయాతి నవాని దేహీ"*
    (సాంఖ్యయోగ : 22 శ్లో)

18. కురుగంటి సీతారామయ్య: నవ్యాంధ్ర సాహిత్యవీథులు (పుట 259)

### (iv) పునర్జన్మ సిద్ధాంతము

జీవి మరణముతో ఆత్మ మరణింపదు. అది మరల క్రొత్తదేహములను ఆశ్రయించును. ఉపనిషత్తులయందును, తత్సారమైన భగవద్గీతలోను ఇదే చెప్పబడినది.

ఇదిగాక పురాణగాథలు. అవతారములు సైతము భారతీయసంస్కృతికి ఉపాంగములైయున్నవి. భారతసాహిత్యములో పై అంగముల ప్రభావము కంఠదఘ్నముగా నున్నది. భారత రామాయణములందు, కాళిదాసాదుల మహాకావ్యములందు వీని ప్రస్తావన ఎడనెడ కనిపించును. గ్రంథవిస్తరణ భీతితో వీని ప్రభావమును విపులముగా చెప్పుటకు వీలులేదు.

### 4. మత సంప్రదాయములు

భారతదేశములో అనాదినుండి అనేకమతములు బయలుదేరినవి. ప్రాచీనభారతమున సంఘముపై, సారస్వతముపై మతప్రభావము అమితముగా నుండెడిది. ఒక్కొక్క మతము ఉన్నతదశలో నున్న కాలమున ఒక్కొక్క ప్రభావము వేసినది. వ్యాసభారతము ప్రధానముగా వాసుదేవతత్త్వమును ప్రతిపాదించుటకు రూపొందినది. కాళిదాస కావ్యములపై అధికముగా శైవమత ప్రభావమున్నది. రఘువంశములో సైతము కాళిదాసు శివస్తుతియే చేసెను. విప్రలంభ శృంగారమాత్మగాగల మేఘసందేశమునగూడ అలకాపుర వర్ణన సందర్భమున 'బాహ్యోద్యాన స్థిత హరశిరశ్చంద్రికా ధౌతహర్మ్యా' అని శివుని ప్రస్తావన తెచ్చెను. అభిజ్ఞాన శాకుంతలమున మొదట శివునే స్తుతించెను. భారవి కిరాతార్జునీయములో శైవాధిక్యమునే ప్రతిపాదించెను. సర్వవిధముల అతనికి స్పర్ధియై కావ్యమువ్రాసిన మాఘుడు శిశుపాలవధలో వైష్ణవ పారమ్యము నుగ్గడించెను. బౌద్ధమతమును ప్రతిపాదించుటకే అశ్వఘోషుడు కవిత్వసాధనమును ఉపయోగించుకొనెను. సౌందరనందము, బుద్ధచరిత ఈదృష్టితోనే వ్రాయబడినవి.

తెలుగు సాహిత్యములో ఇట్టి కావ్యములు పెక్కులుకలవు. శివకేశవాద్వైతమును నిరూపించుటకు, తన్మతమును ప్రచారము చేయుటకు తిక్కన భారతమును సద్వినియోగము చేసెను. నన్నెచోడుడు, పాలకురికి సోమనాథుడు శైవాధిక్యమును ప్రతిపాదించుటకే కావ్యరచన కావించిరి. శ్రీనాథునిపై శైవమత ప్రభావమున్నది. కృష్ణరాయల యుగములో వైష్ణవమతసంబంధి కావ్యములు ఆదరము నొందినవి. కావున ఏ సాహిత్యములోనైనను మత సంప్రదాయములు ప్రతిఫలింపక తప్పవు.

### 5. సాంఘిక సంప్రదాయములు

భారతీయ సాంఘిక సాంప్రదాయములలో షోడశ సంస్కారములు ప్రధానములు ఈ సంస్కారములను ప్రతిపాదించుట ప్రతిగృహస్థుని విధిగా భావింపబడినది. జననము మొదలుకొని మరణము వరకు ఇవి పరివ్యాప్తములై యుండినవి. మనకావ్యములందు జనన వివాహాదులు విధిగా వర్ణింపబడినవి. మరణానంతర కర్మకాండ రామాయణ భారతాదులలో ఉల్లేఖింపబడినది. కాళిదాసు రఘువంశములో సీమంతోన్నయనమును వర్ణించెను.

అతిథికి అర్ఘ్యపాద్యములిచ్చుట భారతీయుల సాంఘిక సాంప్రదాయము. అతిథి దేవతుల్యుడుగా భావింపబడినాడు, (అతిథిదేవో భవ మొ॥) మనుస్మృతిలో "సర్వదేవమయోఽతిథిః" అని కలదు. మన కావ్యములన్నిటిలో అర్ఘ్యపాద్యములను ప్రస్తావింపక తప్పలేదు.

ఇంటికి వచ్చిన అతిథికి అర్ఘ్యపాద్యములతో పాటు తాంబూలమిచ్చుట భారతీయుల సాంఘిక సంప్రదాయము. ప్రత్యేకముగా రాజుల యిండ్లలో, ధనికుల యిండ్లలో 'తాంబూల కరండవాహిను' లుండెడివారు. ఎవరితోనైనను స్నేహము నెరప వలెనన్న తాంబూలమును లాంఛన ప్రాయికముగా నిచ్చెడివారు. బాణుని కాదంబరిలో, హర్షచరితలో ఇట్టివి కలవు, కవులకు ప్రభువులు జాంబూనదాంబరాగ్రహారాదు లిచ్చుటకు ముందుగా కర్పూర తాంబూలము నిచ్చుచుండిరి. తాంబూల సమర్పణమును తెలుగుకవి తెనాలి రామకృష్ణుడు చక్కగా వర్ణించినాడు.

"కలుకం దొయ్యలి మోవికాంతి
కెనయౌ బాగాలు అయ్యింతి చె
క్కుల బోలుం బలినాకు లయ్యువిద
పల్కుల్ వోలె కప్రంపు ప
లుకుల్ తోగూడిన వీడియంబొసగె
నాకున్ పద్మనాభార్చనా
కలనా పావనహస్తకంకణ
ఝణత్కారంబు తోరంబుగాన్."

(పాండురంగ మాహాత్మ్యము : పీఠిక')

భారతీయ సాంఘిక సంప్రదాయములలో సాష్టాంగ ప్రణామ మెన్నదగినది.

"ఉరసా మనసా చైవ
శిరసా వచసా తథా
పద్భ్యాం కరాభ్యాం జానుభ్యాం
ప్రణామోఽష్టాంగ ఉచ్యతే"

అని ప్రణామ సంప్రదాయము కలదు. మన కావ్యము లన్నిటిలో ఈ దండవత్ప్రణామమే కనిపించును. సామంతరాజులు దండవత్ప్రణామము చేయకున్నను చక్రవర్తుల పాదములపై శిరము వంచి నమస్కరించెడివారు 'నిటారు' గా నిల్చుండి చేయునది నమస్కారముగా మనవారు భావింపలేదు. కనీసము శిరమైనను వంచనిదే నమస్కారము కాదు. అసలు నమస్సులో ఉన్న 'నమ్' ధాతువున కర్థము వంగుట యనియేకదా, విస్తరణ భీతిచే కొన్ని సంప్రదాయములను మాత్రమే పేర్కొంటిని.

—'ఆధునికాంధ్ర కవిత్వములో సంప్రదాయములు ప్రయోగములు' అను నా పరిశోధన గ్రంథమునుండి—

డా. సి. నారాయణరెడ్డి

# రామాయణ రామణీయకము

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

వాల్మీకి మహర్షి తపఃఫల సర్వస్వము రామాయణ మహాకావ్యము. సర్వసంస్కృత సాహిత్య సంసారమునకును ఆదికవి శ్రీ వాల్మీకి అయిన ఆదికావ్యము శ్రీమద్రామాయణము. ఆ సాహిత్యమున తొలిరచన చేయుటమాత్రముచేతనే ఆయనను ఆదికవి యనుట తటస్థించలేదు. అనంత శిల్పసంపదతో సర్వమానవ జీవనరహస్య చిత్రణముతో గూడ ఆయన ఆదికవి యైనాడు. అట్లే మొదటిసర్గబంధకావ్య మైనంతమాత్రమున రామాయణము ఆదికావ్య మైనదని భావింపజాలము. లోకోత్తర గుణవిశిష్ట విశ్వకావ్యమగుట చేతనే అది ఆదికావ్య మన జెల్లినది.

ఆ మహాకావ్యము మ్రోల రసజ్ఞులు వినమ్రులై ఇట్లు పలికిరి.

'కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలమ్'

ఆ పవిత్ర తపోవనిలో అనేక మహావృక్షము లున్నవి అందు కొన్ని వేదాశ్వత్థములు, కొన్ని శాస్త్రమహావటములు. కాని- అందున్నది ఒకే ఒక్క కవితారసాలము. దాని కొమ్మపై వాల్మీకికోకిల మధిష్ఠించి మనోజ్ఞముగా మధురాక్షరములతో 'రామ రామ' యని అపురూపముగ కూయుచున్నది. ఆ కోకిలస్వామికి నమస్కారము.

కోకిల మూగదై వసంతము దృష్టికి వచ్చును. వసంత మాసగానే అరుణప్రవాళములతో మధుగంధిల నవపుష్పములతో ఒక నూత్నజీవితము స్ఫురించును. అంతవఱకు నిత్యము చూచుచున్న చెట్టే హఠాత్తుగా క్రొత్తవైపోవును. వినుచున్న స్వరముతో కోకిల కంఠమునందు పడి మధురకూజితము లగును. అచ్చముగ నట్లే- సంస్కృత వాఙ్మయమునకు నాడు వసంతము వచ్చినది. కవితామాకందపు పుణ్యములు పూచినవి. వాల్మీకి కోకిలము దానిశాఖపై నధిష్ఠించి

తన కంఠనాళమునుండి అమృత ప్రవాహముల నూరిపోసెను. అంతవఱకును నిత్యపరిచితములైన శబ్దములే అర్థములే దాని ముఖమున బడి రసప్లావితములై క్రొత్తరూపమునొంది అపూర్వ కావ్యగౌరవము నందినవి.

ఇందు వేదముల శాసనము గాని, శాస్త్రముల కాఠిన్యముగాని, దర్శనముల తైక్ష్ణ్యముగానిలేదు. దీనికి కుశాగ్రబుద్ధితోగాని, మేదాసమృద్ధితోగాని నిమిత్తము లేదు. దీని నాస్వాదింపవలె నన్నచో స్వాయత్తము చేసికొనవలె నన్నచో మృదువైన మనస్సును, ప్రసన్నమైన భావుకతయును ఉన్న చాలును. అ మాధుర్యమును మానవుడు తరతరము లనుభవింప గలిగి యుండును.

ఈ నూత్న సారస్వతప్రక్రియ ఇంతసరసమును స్వాదువును అగుటకు కారణము కరుణార్ద్రమైన మహర్షి హృదయము దీని జననభూమి యగుటయే.

గురుదేవుడై తనకు దర్శన మిచ్చిన నారద మహర్షివలన మహాపురుషుడు శ్రీరామచంద్రుని సుచరిత్ర విని ఆదికవి ప్రభావితుడైనాడు. పిమ్మట తమసానదీ తీరమున స్నాన సమయమున తలవని తలంపుగా చూచిన కిరాతకృత్యమునకు చకితుడై కరుణాళు డైనాడు. ఆ క్రౌర్యమును చూచి భరింపలేక ఆ కిరాతకుని హతాన్నిర్గతమైన ఛందోమయవాక్కుతో శపించినాడు. స్నానసంధ్యాద్యనుష్ఠానములు యథావిధిగ నెరవేర్చినను మహర్షి హృదయమును ఒక సన్ననిభావధార కలవరపెట్టుచునే యుండెను.

తొలుత ఒక మానవోత్తముని కథ వినుట, పిమ్మట అమాయక క్రౌంచపక్షి యుగళముపై బోయవాడు చూపిన దౌర్జన్యము కనుట, చూచినదే తడవుగ శోకమును శ్లోకముగా ననుట - ఈ మూడింటికిని దైవికముగ నేదైన సంబంధమున్నదేమో యని ఆయన తీరని విచికిత్స.

*'ఔను— ఈ మూడును అతర్కితోపనతయులు కావు. భగవత్సంకల్పబలముచే ఈ అనుభవత్రయము నీకు ప్రాప్తించినది. భగవతి సరస్వతి అనుగ్రహించి నీనోట పలికినది. తెమ్ము రామకథను మహాకావ్యముగా వెలయింపుము. అది సుస్థిరమై మానవజాతి నుద్ధరించును'* అని సాక్షాత్కరించి బ్రహ్మదేవు డనెను. మహర్షికి సంశయ విచ్ఛేద మయ్యెను. మనసు విప్పారెను. తృతీయనేత్రము తెరచికొనెను. చరచర కర్తవ్యమునకు కడంగెను.

వైదిక సాహిత్యముయొక్కయు సజీవ వ్యవహారము యొక్కయు తోడ్పాటుతో కావ్యోపయోగియైన సరళసంస్కృతభాషను సిద్ధముచేసెను. మాటకును మాటకును సంధి యెట్లుండవలెనో ఏపదమునకు ఏ పదముతో సమాసము చేసిన అర్థస్ఫూర్తి కలుగునో సమ మధురముగ ఎట్లు వాక్యము నిర్మింపవలెనో సూత్రించికొనెను. ఏమాత్రము కృతకత్వము లేని ప్రవాహరూపమైన ఛందోరూపమును తీర్చిదిద్దుకొనెను. ఏ యుపమేయమునకు ఏ యుపమానము సొగసో, ఏవస్తువునకు ఏయుత్ప్రేక్ష అందమో, ఏ శబ్దమునకు ప్రక్క ఏ శబ్దము శ్రుతిసుఖమో నిర్ణయించుకొనెను.

తన మహాకావ్యమునకు బాహ్యరూపము నిట్లు సిద్ధముచేసి అంతరరూపమును గూర్చి నిశితముగా నాలోచించినాడు.

తాను విన్న రామకథను తాను గన్న కిరాత కృత్యమును సింహావలోకనము చేసినాడు. ఆ కథలో కూడ పుణ్యదాంపత్యమునకు విఘాతమును గల్పించి తీరని దుఃఖము కల్గించిన ఒక కిరాతకు డున్నాడు. ధర్మాధర్మ, సౌజన్య దౌర్జన్య సంకీర్ణమైన ఈ మానవావళి హృదయమును పరిశుద్ధమొనర్చి ఉత్తమగుణ

సంపన్నము చేయవలె నని నిశ్చయించినాడు. ఈ విశ్వశ్రేయమును సాధించు మార్గమేది?

రాజనీతిపరులవలె శాసించుటగాని, మతప్రవక్తలవలె ధర్మోపదేశము చేయుటగాని నిరుపయోగము. జనులెరుగకుండ వారిపై మత్తుమందు చల్లి వారి హృదయములను లోగొనవలెను. దానికి కవిత ఒక్కటియే తిరుగులేని సాధనము. రసము వ్యంగ్యము చమత్కృతి మానవహృదయముపై విజయము సాధించి తీరును.

మహర్షి తననాటి లోకస్థితిని తేరిపారిచూచెను. ఎదుట ఆర్యధర్మబద్ధములైన సుక్షత్రియ రాజ్యము లున్నవి. అనార్యములైన ఆటవికరాజ్యము లున్నవి. అహంకార తామసిక ప్రకృతికములైన రాక్షసరాజ్యములున్నవి. వానివాని విరుద్ధ గుణములతో ఒండొంటిని డీకొల్పి వాని సంఘర్షణములో వచ్చు అద్భుత ఫలితములను చిత్రించి మానవజాతి కన్నులు తెరపింపదలచెను. అంతేగాదు పురుషార్థములలో అర్థకామముల ఆటోప మెంత తీవ్రమైనదో విస్తరించిచూపి వానిని ధర్మముతో నెదుర్కొన్నప్పుడే మానవజాతి విజయవంత మగు నని నిరూపింపదలచెను.

ఋషిసత్తము డిట్లు తనకావ్య బాహ్యాభ్యంతర రూపములను నిర్ణయించుకొని అర్థధర్మ బలముచే యోగశక్తిచే తాను రచింపదలచిన రామకథ నంతను స్పష్టముగ కన్నులకు గట్టినట్లు చూచెను.

*తతః పశ్యతి ధర్మాత్మా తత్సర్వం యోగ మాస్థితః*
*పురా యత్తత్ర నిర్వృత్తం పాణా వామలకం యథా*
*హసితం భాషితం చైవ గతి ర్యా యచ్చ చేష్టితమ్*
*తత్సర్వం ధర్మవీర్యేణ యథావ త్సంప్రపశ్యతి.*

ఈక్రిందిశ్లోకము రామాయణ హృదయమును పట్టి యిచ్చుచున్నట్లున్నది.

*వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ*
*పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ*

వాల్మీకి ముఖనిర్గతమైన రామాయణ కథావాహిని రామసాగరాభిముఖముగా ప్రవహించుచు సర్వలోకమును పునీత మొనర్చుచున్నది. అనగా సర్వ రామాయణకథకును పురుషోత్తముడు శ్రీరామచంద్రుడే లక్ష్యభూతుడు. ఆయన సహస్రకిరణునకు ప్రభారూపిణి సీతాదేవి.

ఆమె సర్వసచరిత్రస్త్రీ ప్రకృతికిని ఏకైక లక్ష్యము. ఆ సీతారాములే రామాయణహారమునకు నాయకమణులు. వారి శీలకాంతి ఆ హారమునందంతటను పడి మెరయుటయే రామాయణపరమార్థమనిపించును.

శ్రీరామచంద్రుడు అవతారపురుషుడని గ్రంథాదియందును లోకమునను రూఢియైనను ఆయన మానవోత్తముడుగనే చిత్రితుడైనట్లు రామాయణమునుబట్టి తెలియును. లోకాతీతప్రభావోపేతుడుగ గానవచ్చు శ్రీకృష్ణునికంటె శ్రీరాముడే మన హృదయమునకు దగ్గర అనిపించును.

రాగద్వేషములు ఈర్ష్యాసూయలు ప్రమాదప్రమోదములు లేని దేవతావిగ్రహముగాగాక ఆర్షకవి శ్రీరాముని సకలమానవ సాధారణద్వంద్వములతోనే చిత్రించి తుట్టతుద కాతని విలక్షణౌన్నత్యమును మెరపించును. అవిధముగా నాతడు సర్వాదర్శప్రాయుడైన శిష్యుడు, పుత్రుడు, భర్త, సోదరుడు, మిత్రుడు, శత్రువు, స్వామి, వీరుడు, ప్రజాపాలకుడు.

శ్రీరాముడు తన ఆచార్యదేవునిగా భావించినది విశ్వామిత్రునే. ఆయన బలాతిబలలను విద్యల నిచ్చెను. జృంభకాస్త్రముల నిచ్చెను. అపూర్వసహధర్మచారిణి సీతను చేకూర్చిపెట్టెను. అట్టిగురువు అన్నింటికిముందు రాక్షసియే . అగుగాక ఒకస్త్రీని

సంహరింపు మనెను. ఆచార్యుని ఆదేశము అంతే. నిరుత్తరముగ శిరసావహించెను. ఆసురుడు సంతుష్టుడై సర్వశ్రేయములను అందిచ్చి కథనుండి తప్పుకొనెను. వసిష్ఠుడు చిత్రకూటమున రాజ్యము స్వీకరింపు మని బతిమాలెను. శ్రీరాముడు తిరస్కరించెను. ఈ శైష్యోపాధ్యాయిక విచిత్రమైనది.

తండ్రి రాజ్యమును స్వీకరింపుమనెను. ఆదర్శ పుత్రుడుగా నీత డొప్పుకొనెను. పినతల్లి అడవికి పొమ్మనెను ఈతడు తిరుగు చెప్పక సిద్ధపడెను. రాజ్యము తనదికాదను రహస్యము తెలియును. కాని తండ్రిమాట నిలబెట్టవలెను. ముందు సమ్మతించుటయు పిమ్మట పరిత్యజించుటయును అందులకే. తండ్రియందలి ఆ గౌరవమున కంతు లేదు. కనుక తండ్రిపేరిట రెండుసార్లు చేపడిన రాజ్యమును తృణప్రాయముగా తిరస్కరించెను. తల్లికంటె పినతల్లియందే ఎక్కువ మమత. ఇట్టి పుత్రునికై ఏతండ్రి ప్రాణములు విడువడు? ఆతడు ఈ పుత్రునిగూర్చి యిట్లనును——

తిష్ఠేల్లోకో వినా సూర్యం సస్యం వా సలిలం వినా
న తు రామం వినా దేహే తిష్ఠేత్తు మమ జీవితమ్.

ఏమి పితాపుత్రులు !

రామాయణమున సీతారాములుగాక మరి మూడు దాంపత్యము లున్నవి. దశరథుడు భార్యలు, వాలితారలు, రావణమండోదరులు. దశరథుడు కౌసల్యను ప్రేమింపలేదు. దయచూపెను. సుమిత్ర తటస్థురాలు. కైకేయిని చెప్పలేనంత ప్రేమించి తిరుగులేని దెబ్బతినెను.

వాలి తార నెంత ప్రేమించినను ఆమె మాట యందు విశ్వాస ముంచలేదు. ఆమెమాటను తిరస్కరించి యుద్ధమున మరణించెను

రావణుడు మండోదరిని ప్రేమించ నట్లు ఎక్కడను లేదు. ఆమె సీతతోసమానమైన సౌందర్యశాలిని. కాని రావణు డొక కామదవానలము. అది సర్వస్త్రీవనమును చుట్టబెట్టనిదే శాంతింపదు. తుదకు ఆవ్యసనమే ఆతనిని దహించివైచినది. పై దాంపత్యములతో పోల్చిచూచినప్పుడు సీతారాముల దాంపత్యము విలక్షణముగా మెరయుచు కాన్పించును.

ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి
గుణా ద్రూపగుణాచ్చాపి ప్రీతి ర్భూయోఽభ్యవర్ధత.

తండ్రిచేసిన సంబంధ మని రాముడు సీతను ప్రేమించెను. పిమ్మట సద్గుణసౌందర్యములవలన ఆతని ప్రేమ మరింత అతిశయించెను.

అరణ్యగమనసందర్భమున సీత తానును అడవికి వత్తుననెను. రాముడు అటవిభయంకరత్వమును వర్ణించెను. కనుకనే నేనును వచ్చెదననెను. "అహం గచ్ఛామి పురతః మృద్నంతీ కుశకంటకాన్" అని హితము చెప్పెను. రాముడు వద్దనెను. ఆమె కుపితయై దూషించెను.

"కిం త్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహం.

ఈ దూషణమును నవ్వుచు స్వీకరింపగలిగిన భర్తయే భర్త. దీని కాతడు మండిపడలేదు. మంచి గంధమువలె ప్రేమపరిమళముచూపి వనమునకు తీసికొనిపోయెను. యుద్ధాంతమున ఆత డామెను తీవ్రముగనే దూషించెను. ఆమె భరించి అగ్నిపరీక్షకు నిలిచెను. ఆమె పరిశుద్ధి నట్లు చాటుటకు తోడ్పడి రామచంద్రుడు నిండుహృదయముతో నామెను స్వీకరించెను.

ఆతడు ఆదర్శసహోదరుడుగా తన సోదరులను ప్రేమించినంత రామాయణసోదరు లెవరును తమ

తోడబుట్టినవారిని ప్రేమింపలేదు. పైగా తమసోదరులు మరణించువరకు నిద్రింపరైరి.

విభీషణుడు రామునితో చేరుటకు వచ్చినప్పుడు సుగ్రీవుడు సందేహింపగా రాము డిట్లనెను.

*న సర్వే భ్రాతర స్తాత భవంతి భరతోపమాః*
*మద్విధా వా పితుః పుత్రాః సుహృదో వా భవద్విధాః.*

"*అందరును భరతునివంటి సోదరులుకారు. నావంటి కొడుకులును, నీవంటి మిత్రులును ఉండరు*" అని తన సోదరవైశిష్ట్యమును వెల్లడించెను. అంతేకాదు, రాజ్యము విడువవలసివచ్చినప్పుడు భరతునిగూర్చి యిట్లనెను.

*అహం సీతాంచ రాజ్యం చ ప్రాణా నిష్టాన్ ధనానిచ*
*హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతే నాప్రచోదితః.*

పర్ణశాలవద్ద లక్ష్మణుని ప్రశంసించుచు నిట్లనెను.

*త్వయా పుత్రేణ ధర్మాత్మా న సంవృత్తః పితా మమ.*

నీవాతండ్రికి తగినపుత్రుడవు. నీసంరక్షణములో నున్న నేను నాతండ్రి మరణింపలేదని భావించుచున్నాను.

రామునికి ముఖ్యమిత్రు లిద్దరు సుగ్రీవుడు, విభీషణుడు. వారిని మనస్సునకు హత్తుకొని ఆదర్శమిత్రులుగా ఆ భ్రాతృతిరస్కృతుల నిద్దరిని సింహాసన మెక్కించెను. ఇందొక చమత్కార మున్నది. తన శక్తిని శంకించిన సుగ్రీవునకు తుట్టతుదను, తన్ను సర్వదా విశ్వసించి శరణాగతుడైన విభీషణునకు మొట్టమొదటను పట్టాభిషేకము చేసెను.

*మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కదాచన*
*దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేత దగర్హితమ్.*

మిత్రునియెడల రామచంద్రుని ప్రవచనమిది.

సుగ్రీవవిభీషణులు సోదరులయ్యును మరణించిన వాలి రావణులకు అంత్యక్రియలు చేయజాలమనిరి. నిజమునకు విభీషణునికంటె రామునకే బద్ధశత్రువు రావణుడు. అయినను శ్రీరాముడు మరణించినవారితో నిక విరోధము లేదనియు మీమీఅన్నలకు యథావిధిగా అంత్యక్రియలు చేయు డనియు లేకున్న నేను చేయుదు ననియు పలికిన ఉదారశత్రువు.

*మరణాంతాని వైరాణి నివృత్తం నః ప్రయోజనమ్*
*క్రియతా మస్య సంస్కారో మమాప్యేష యథా తవ.*

శత్రువునెడల ఈ ఔదార్యము రామచంద్రునికిగాక యింక ఎవరికి జెల్లును.

హనుమ సముద్రమును దాటుచు—

*యథా రాఘవనిర్ముక్తః శరః శ్వసనవిక్రమః*
*గచ్ఛేత్ తద్వత్ గమిష్యామి లంకాం రావణపాలితాం.*

అని ధీరముగా పలికెను. రాముని బాణ మెట్టిదో తా నట్టివాడట. అది యెట్లు అమోఘమో తానను అట్టివాడనని ఆ భక్తుని నమ్మకము. లంకలో తొలుత సీత కాన్పించనప్పుడు తానింక తన ప్రభువుముఖము చూడజాల ననెను. అక్కడనే ప్రాయోపవేశము చేసి మరణింతు ననెను.

'దాసోహం కోసలేంద్రస్య' అని సగర్వముగా పలుకును. ఈ పరమభక్తుని సంప్రీతికి ఫలితముగా ఎందరో ఆత్మీయులు సభలోనుండగా సీతచే నొక అమూల్యహారమును హనుమంతుని కిప్పించిన ఆదర్శస్వామి శ్రీరాముడు.

మహావీరశబ్దమునకు వాచ్యు డొక రాముడే. ఆయన శత్రువిజయశీలమైన వీరత్వము మాట నట్లుంచి అయోధ్యలో చూపిన త్యాగవీరమును, భరతునివద్ద చూపిన ధర్మవీరమును, జనస్థానమునులయెడ చూపిన దయావీరమును ఆతనిని తిరుగులేని యేకైక వీరుని చేసినవి.

రామరాజ్య మనుమాట లోకవార్త యైనట్టిది. అయోధ్యలో చిట్టచివరివీధిలో పుట్టిన కింవదంతి నైనను మన్నించి ప్రజారాధనమును కొనసాగింప వలసినదే. ఒక పసిబాలకుడైనను క్రమముతప్పి మర ణించిన దానికి బాధ్యత వహించి ఆదోషమును పరిహరించవలసినదే. ఇట్టి మహాపురుషుని శీలౌజ్జ్వల్యమును మహర్షి యిట్లు సంగ్రహించెను.

*లక్ష్మీ శ్చంద్రా దపేయా ద్వా*
*హిమవా న్వా హిమం త్యజేత్*
*అతీయాత్ సాగరో వేలాం*
*న ప్రతిజ్ఞా మహం పితుః*

*దద్యా న్న ప్రతిగృహ్ణీయాత్*
*న బ్రూయాత్ కించి దప్రియమ్*
*అపి జీవితహేతో ర్వా*
*రామ స్సత్యపరాక్రమః.*

ఇట్టి ఆదర్శమూర్తికి తగిన సహచారిణి సీత. భారతీయస్త్రీత్వసంపద. మహర్షి పరమగౌరవముతో రామాయణమునే '*సీతాయా శ్చరితం మహత్*' అనిన గాని తృప్తిపడలేదు. భర్తనేగాక సర్వకుటుంబమును మహానురాగముతో ప్రేమించిన కులతిలకవధువు. ఘోరరాక్షసులమధ్య దినదినగండముగా గడుపుచుం డియు తనవద్దకు వచ్చిన హనుమంతుని అయోధ్యలోని కుటుంబక్షేమముగూర్చి యడిగెను. అంతియేగాక దశరథుని కోడలి నని సగర్వముగా చెప్పెను.

ఆర్షకవి ప్రత్యక్షముగా సీతాసౌందర్యము నెక్కడను వర్ణింపకున్నను వేరొకరిమాటలలో ఆమె లోకోత్తరసౌందర్యసంపదను వ్యంగ్యముగా నగ్గడిం చుట గమనింపదగినది. హనుమంతుడు సీతను చూడ గనే యిట్లనెను.

"రాముడు ఈమెకై సముద్రములవరకు భూమిని తలక్రిందులు చేసినను తగిన పనియే అనుకొందును. అత డీమెను విడిచి బ్రతుకుచున్నా డనగా గొప్ప దుష్కరకార్యమును నెరవేర్చుచున్నా డని తలంతును.

ముల్లోకముల రాజ్యమును ఒక ప్రక్కను, సీత నొక ప్రక్కను ఉంచిన ఆమెయొక్క 16వ వంతునకైనను ఆరాజ్యము సరితూగదు."

ఇట్టి అద్భుతస్త్రీసృష్టికి తోడుగా మహర్షి కల్పించిన శీలసౌరభము తరతరములకును భారత నారీలోకమునకు వన్నె పెట్ట జాలినది.

కనుల మిరుమిట్లుగొలుపు రావణవైభవము ఆమెను భ్రమ పెట్టలేకపోయెను. క్రూరరాక్షసుల బెదరింపులు ఆమెను కదలింపలేకపోయినవి. అన్ని విషమస్థితులను ఆమె మహాభిమానక్షత్రియాణిగా నెదుర్కొనెను. ఆమె శింశుపావృక్షమూలమునుండి రాక్షసస్త్రీల కిచ్చిన సమాధాన మిది. "*చరణేనాపి సవ్యేన న స్పృశేయం నిశాచరం*" ఎడమకాలితో నైనను రాక్షసుని తాకజాలను.

రావణుడు స్వయముగా ప్రార్థించినపు డిట్లనెను.

*న శక్యం సందర్శనే స్థాతుం శునా శార్దూలయో రివ*

కుక్క పెద్దపులులవద్ద నిలువలేనట్లు రామ లక్ష్మణుల చూపులో నిలువజాలకపోతివి.

*అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా*

సూర్యుని తేజము విడువలేనట్లు నేను రాముని విడుచుట అసంభవము. ఇట్టి సూర్యకాంతమాణిక్యమును బట్టుకొని ఒక నవ్య విమర్శకుడు '*సీత పెలపుముద్ద*' అనెను. బహుశః పాప మాయన రామాయణము చదివియుండడు. దీనికిజవాబుగా ఒక విచక్షణుడిట్లనెను.

I cannot forgive the people, who speak ill of Sita.



శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

ఇట్టి ఉజ్జ్వల నాయకీనాయకుల చిత్రించి తక్కిన రామాయణ స్త్రీపురుషపాత్రములతో వ్యత్యాసము చూపుచు వాల్మీకిమహర్షి ఆర్యావర్తమునకే కాదు విశ్వమునకే స్త్రీపురుషుల ఆదర్శమిట్టిదని ఎలుగెత్తి చాటెను.

లోకోత్తరపాత్ర చిత్రణ, కథానిర్వహణముల చేతనేగాక రామాయణము సర్వభారతీయ సభ్యతకును ఆర్యసంస్కృతికిని ప్రతిబింబమై ప్రవర్తిల్లినది. అంతఃపురములనుండి అరణ్యసీమలవరకును, వీరులనుండి భీరువులవరకును, మధుర స్వభావులనుండి మాయాశీలురవరకును, పశుపక్ష్యాదులనుండి పరమజ్ఞానుల వరకును అందు చోటుచేసికొనని అంశము లేదు. శ్రీ అరవిందులన్నట్లు ఏదైన ఒకనాడు హఠాత్తుగా సర్వ భారతీయ నాగరికతయు లుప్తమై పోయినను ఒక్క రామాయణము బ్రతికియున్నచో సర్వమును త్రుటిలో పునఃసృష్టి చేయవచ్చును.

విషయబాహుళ్యముచే రామాయణము ఎంత విశ్వరూపము దాల్చినను అందు ప్రత్యేక శ్రద్ధతో నిక్షేపించిన కవితాశిల్పము అలోకసామాన్యమై సర్వ భారతజాతినేగాక ప్రపంచకవితాప్రియులనే ముగ్ధులను గావించినది.

కవిత్వమునకు ప్రాణభూతమైన రససమృద్ధిని సృష్టించుటలో వాల్మీకి ప్రతిభ అద్వితీయము.

బాలఅయోధ్యాకాండలలోని సీతారాముల విశుద్ధసంయోగ శృంగారమును, అరణ్య కిష్కింధల లోని వియోగ శృంగారమును, కిష్కింధలోని తారా సుగ్రీవులయు సుందరములోని రావణాంతఃపురము యొక్కయు శృంగారమును నిర్వహించుటలో ఆదికవి ఔచిత్య పరమావధి గమనింపదగినది.

సుందరమున వానరులు కార్యసిద్ధి నొందిన ఉత్సాహముతో మధువనమున చూపిన ప్రవర్తనమును యుద్ధకాండమున రాక్షసులు కుంభకర్ణుని నిద్రలేపిన విధమును అరణ్యములోని శూర్పణఖా సన్నివేశమును వాల్మీకి పటుతర హాస్యచిత్రణమునకు ఉదాహరణములు కాగలవు.

రామవనవాస గమనమున కౌసల్యా దశరథులయు సర్వపౌరులయు ప్రగాఢకరుణదృశ్యములను, యుద్ధకాండమున సుప్రుచిత్రితములైన రౌద్ర వీర భయానకములను. సుందరమున అశోకవనిలో రాక్షస స్త్రీల బీభత్సరూపములను చూచి చకితులమగుదుము.

రసపోషణము తరువాత కవిశక్తి వర్ణనములలో తెలియును. అరణ్యములోని హేమంతము కిష్కింధలోని వర్షాగమము సుందరములోని సముద్ర లంఘన చంద్రోదయ సందర్భములును మహర్షి అపరిమేయభావనాబలమును నిరూపించును అరణ్యములోని ఒక తీగ కదలిక ఆతనికి ఎంత స్పష్టముగా తెలియునో అంతఃపురములోని ఒకరాణి అంతఃకరణముకూడ అంత విస్పష్టముగా తెలియును.

ఆదికవి ఉపమానములు కాళిదాసునకు భిక్ష పెట్టినవి అనగా వాని ఘనత ఎంతటిదో మనమూహింపవచ్చును. ఆయన ఉపమానములపోతకు ఈ శ్లోక మొక మచ్చుతునక.

*హంసో యథా రాజతపంజరస్థః*<br>
*సింహో యథా మందర కందరస్థః*<br>
*వీరో యథా గర్వితకుంజరస్థః*<br>
*చంద్రోపి బభ్రాజ తథాంబరస్థః.*

ఉదయించు చంద్రుని ఉపమావైవిధ్య మెంత చక్కగ నిరూపిత మైనదో యిందు గ్రహింపవచ్చును.

అచ్చు పోసినట్లున్న ఈ ఉపమానములను జూచి అచ్చెరు వందెదము.

(1) అలంకృతుడైనను రావణుడు శ్మశానము నందలి కోవెలవలె నున్నాడు.

(2) తెల్లనిపాన్పున నిద్రించిన కైకేయి హోమ వేదికయందలి అగ్నిశిఖవలె నున్నది.

(3) ఈర్ష్యారోషములను ఎంగిలిచేసిన నీటి వలె పారబోయవలెను.

శబ్దాలంకారములను అప్రయత్నముగా వాడుట యిందు చూడనగును.

*స్వగతేనైవ మృగీం హీనాం శ్వగణాభివృతా మివ*

ఆదికవి కవితాశిల్పమును ఇట్లుగ్గడింప దొర కొన్నచో సముద్రమున కేతా మెత్తినట్లగును. యథా శక్తిగా ఆయన పలుకును మేలుబంతిగ స్వీకరించి తరువాతి కవులందరును ఆయనకు పరోక్షశిష్యులై పలువిధముల ఋణపడియే యున్నారు, కనుకనే రామాయణప్రశంసలో 'పరం కవీనా మాధారం' అని చెప్పుట జరిగినది.

రామాయణకాలము, పాయసవిభాగము, సీతా రాముల వయస్సు మున్నగు ననేకవిషయములపై చర్చించి పలువురు ఇద మిత్థ మని ఏమియును తేల్చి చెప్పలేకపోయిరి. ఆ గహనవిషయముల జొచ్చుట కిది అదనుగాని అవసరముగాని కాదు. వీనికి శ్రీ అరవిందు లన్నట్లు ఒకేఒక్క సమాధానము.

ఇన్ని అనన్వితములున్నను అది యొక మహా గ్రంథము. రాజనీతిజ్ఞుల కొక నీతిశాస్త్రము. ఐతిహాసి కుల కొక ఇతిహాససంపుటము, సంఘపరుల కొక సాంఘికశాస్త్రము:- కవుల కొక మహాకావ్యము. రూపకప్రియుల కొక మహానాటకము. — వేయేల — అదియొక చిరంతన భారతీయవిజ్ఞానసర్వస్వ మనుట యుక్తము.

# శ్రీ మహాభారత నాయకుడు

డా. కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి

*'యమునంశమున బుట్టె నధిపతి ధర్మజుండు'* కౌరవ పాండవులలో నెవరెవ రేయే అంశములతో పుట్టినదియు వివరించు సందర్భమున ధర్మరాజును గూర్చి నన్నయ్యగారల్లు వ్రాసిరి. యముని యంశమున బుట్టిన ధర్మరాజు అధిపతి, అనిలేంద్రాశ్వినుల యంశమున బుట్టిన మిగిలినవారిలో నెవడు గాని అధిపతి లేడు, *'కలియంశంబున దుర్యోధనుండు బుట్టె'* *'జగదాదిజుడగు విష్ణుదేవు నంశంబున నుత్పాదిల్లె గృష్ణుడు'*. ఈవిధముగ— నందరను గూర్చి వ్రాసిన నన్నయగారొక్క ధర్మరాజు విషయముననే అధిపతి శబ్దమును నుపయోగించుట గమనింపదగినది.

అధిపతి యనగా నేమి? అధి - పతి, పతి యనగా తన నాశ్రయించుకొని యున్నవారి రక్షణము నం దుద్దేశము గలవాడై ప్రవర్తించు పురుషుడు. అధి- అవ్యయము. ఉపర్యర్థమునందున్నది. అధిపతి యనగా పీనుమిగిలిన పతియని యర్థము. అధికారి పురుషుడని తాత్పర్యము. ఏమిచేసినను అధికరించి చేయువాడు అధికారి. అధికరించి చేయుట యన నేమో ధృతరాష్ట్రునితో సంజయుడు ధర్మరాజును గురించి చెప్పిన మాటలవలన తెలియ గలదు. *'వశీకృతచిత్తుడు ధర్మసూతి మెత్తనిపులి. ఎల్లవారలు నధర్మము నీ పయిఁబెట్టునంతకున్ వినడును కానడున్— పిదప నీకును నాకు మరల్ప వచ్చునే—?'* చిత్తమును వశమునం దుంచుకొన్నవాడై, ఇక నెవరుగాని ఆ పనినుండి తనను మరల్పరానంత పూనికతో దానియందు ధర్మరాజు ప్రవృత్తుడగును. ఆ చేయబోవుదానివిషయమై ధర్మరాజంతగా పర్యాలోచనచేసి చేయును. అధికరించి చేయుట యనగా నది అధికారి పురుషుని ప్రవృత్తిలక్షణ మట్టిది.

శ్రీకృష్ణుని రాయబార మంపుచు వానితో ధర్మరాజిట్లనినాడు. *"సిరి నాకేలందునే—? గ్రాసవాసోదైన్యంబులువచ్చునాయరయునీచుట్లాలకుంగావునన్'* ధర్మరాజు రాజ్యసంపద నెవరికొరకుగా కావలయు

ననుచున్నాడో ఆవాక్యమునుబట్టి తెలియుచున్నదిగదా! అధిపతిలక్షణ మది. చెప్పవచ్చిన దేమనగా భారతేతిహాసమునకు నాయకుడు ధర్మరాజు. ఆ విషయమును నన్నయగారే ఆదిపర్వమున నిష్కర్షించి పెట్టినారు. తిక్కన్నగారు నన్నయ్యగారిపథకము నట్లే తుదముట్టించెను. *'ధరణికి నింక నాయకుడు ధర్మతనూజుడు'* శల్యుడు మరణించిన తరువాత సైన్యమట్లనుకొనినట్లుగా తిక్కన్నగారు వ్రాసిరి. మరియు *'సకల ధరణివలయ సామ్రాజ్యమునకు నేడేను భర్తనైతి.'* అని కర్ణుడు మరణించిన నాటిరాత్రి శ్రీకృష్ణునితో ధర్మరాజనినట్లుగా గూడ తిక్కన్నగారు వ్రాసిరి. ఇది అంతయు నన్నయగారివలెనే తిక్కన్నగారును భారతేతిహాసమునకు నాయక పురుషుడు ధర్మరాజను తాత్పర్యముతోడనే ఉన్నట్లు చూపుచున్నది.

ఇపు డిట్లు శంకింపవచ్చును— భారతమునకు నాయకుడు ధర్మరాజు కాదు. శ్రీకృష్ణుడు నాయకుడు. ఇంకను నైనచో అర్జునుడు కావచ్చును గాని ధర్మరాజసలుకాడు. *"కృష్ణార్జునోత్తమ నానాగుణకీర్తనార్థ ఫలమై"* నది భారతమనియు మరియునది *'అ నారాయణపాండవేయగుణమాహాత్మ్యయశోజ్యోత్స్న'*అనియు నన్నయగారే ఆదిపర్వమున జెప్పిరి. తిక్కన్నగారును *'భారతసంతతి కెల్ల పుండరీకాక్షుని వాసుదేవు ప్రకటార్థముగా గని విన్నమానవుం డక్షయ పుణ్యలోకములయందు రమించు నిరామయస్థితి'* నని భారతాంతమున స్పష్టముచేసెను. అందువలన భారతమున నాయకుడు శ్రీకృష్ణుడు. ఆయనలేనిచో ఏమియును లేదు. ఒకవేళ శ్రీకృష్ణుడు కానిచో యుద్ధతంత్రమంతయు భుజమున వేసికొని నడిపించిన యర్జునుడు నాయకుడు కావలెను. అంతేకాని నిష్క్రియుడుగా కనిపించు ధర్మరాజు నాయకుడగుట కూడదు మరియు మహాభారతమునకు కార్ష్ణవేదమని యొక పేరున్నది. శ్రీకృష్ణునివలన మహాభారతమునకు వేదగౌరవము వచ్చి ఆ పేరు వచ్చినది. శ్రీవాసుదేవ పరబ్రహ్మమునే భారతము కీర్తించెను. మరియు హరివంశము భారతము ననుసరించి యుత్తరభాగముగా నున్నది. భారతశ్రవణ పఠనాదుల వలని ఫలితము మోక్షముగా చెప్పబడినది. ధర్మరాజు పట్టిమానవుడు. ఆయన నాయకుడైనచో వాని చరిత్రమైన వానిని కీర్తించినదైన భారతమును వినినను చదివినను మోక్షము కలుగదు, కలుగునని చెప్పరాదు, కనుక శ్రీకృష్ణపరమాత్మయే భారతమునకు నాయకుడనవలెను— ఇది శంకయొక్క స్వరూపము. ఇక దీనిసమాధానము వ్రాయబడుచున్నది.

అయినచో నర్జునుడైనను భారతమునకు నాయకుడు కావచ్చును గాని శ్రీకృష్ణుడసలు కాజాలడు. శ్రీకృష్ణుడాదిజుడగు విష్ణువుయొక్క అవతారము. అయన అపగత ఖేదుడైన పరమాత్మ. శ్రీకృష్ణుని పరమేశ్వరత్వము భారతమున అచ్చటచ్చట చెప్పబడినది. *'దేవంబున వేరొకండు గలడె— కృష్ణుండ యది'* సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పినమాట ఇది. శ్రీకృష్ణుని విశ్వరూప ప్రదర్శనము లాయన పరమేశ్వరత్వమునకు ప్రబల నిదర్శనములు. అపుడు శ్రీకృష్ణుడు జగన్నాయకు డగును. భారతమునకు మాత్రమే ఏమి? సృష్టికే నాయకుడు. సర్వ గ్రంథములకు నాయకుడు. జాగన్నాయకత్వము వేరు. ఒక సాహిత్యప్రక్రియయైన ఇతిహాసమునందలి నాయకత్వము వేరు.

భరతుడు నాయకుని నిర్వచన మిట్లు చేసెను. *'వ్యసనియైగాని దుఃఖము పొందిగాని పిమ్మట ఎవడు అభ్యుదయమును పొందినవాడగునో అతడే ప్రధాన నాయకుడని తెలియవలెను. అనేకులకు ఒకేవిధముగా వ్యసన— అభ్యుదయములు రెండును కలిగిన ప్పుడు ఎవనివ్యసనాభ్యుదయములు పరిపుష్టములై ఉండునో అతడే నాయకుడగును—'* వ్యసనము కలవాడు వ్యసని, వ్యసనమనగా ఏది పురుషుని శ్రేయో

మార్గమునుండి తొలగించుటకు సమర్థమో దానియందు చిత్తము సక్తమగుట ఏది కలదో అది. అనగా నది యట్టిదని తెలిసియు దానియందలి ప్రవృత్తిని నిరోధించుకొనలేనితనమునకు వ్యసనమని పేరు. ధర్మరాజు వ్యసని. ద్యూతమునందతడు వ్యసని. *'బలవద్వ్యసనాభిభూతుడు'* అని ధర్మరాజు నుద్దేశించి నన్నయ గారు చెప్పిరి. ద్యూతమున పరాజితుడై ధర్మరాజు తమ్ములతో నరణ్యమునకు పోబోవుచు తల్లికి నమస్కరించినాడు. అపుడు కుంతి దుఃఖమును దిగమ్రింగుకొనుచు ఇట్లన్నది. *'ఇట్టి దుర్వ్యసనోపహతులైన వారి మిమ్ము జూడక యింబరసురలోకమునకేగి పాండుభూపతి పుణ్యభోగి యయ్యె—'* అని ధర్మజుని ఆ వ్యసనమే భారతము భారతమగుటకు హేతువు. దాని వలననే ధర్మరాజు పదమూడు సంవత్సరములపాటు పడరానిపాట్లు పడి చివరకు యుద్ధముచేసి రాజ్యానుభవరూప, మోక్షానుభవరూప అభ్యుదయమును పొందినాడు. అందువలన భరతుని నిర్వచనము ప్రకారము ధర్మరాజే భారతమునకు నాయకుడు. ఎవ డపగతఖేతుడో అనగా ఎవని కసలు దుఃఖాభ్యుదయములు లేవో వాడు నాయకుడగుట భరతు డంగీకరింపని విషయము. భరతుడనగా సర్వభారతీయాలంకారికులని యర్థము. కనుక భారతమునకు నాయకుడు శ్రీకృష్ణుడన్నమాట పుట్టుటకే వీలులేదు.

మరి నన్నయగారు చెప్పిన కృష్ణార్జున నానాగుణకీర్తన మొదలైన మాటల యర్థము నిట్లు సంగతము చేయవలయును. ఉపప్లావ్యమునకు ధృతరాష్ట్రునిచేత పంపబడి పోయి కృష్ణార్జునులను చూచి తాను తలపోసినదానిని సంజయుడు తిరిగివచ్చి ధృతరాష్ట్రునకు కొలువులో చెప్పుచో నిట్లనినాడు.

*"ఈ యిర్వురు( బంచినపని*
*సేయుదురట ధర్మజునకు( జేకురని తలం*
*పే యది? యతనిం దొడరుట*
*వేయేటికి జమునిశిరము వ్రేయుటకాదే?"*

ఈ యిర్వురు అనగా కృష్ణార్జునులు ఎవరి నానాగుణకీర్తనమే భారతమునందున్నదో అట్టివారు వారు. అనగా సర్వభారతమున సర్వ ప్రయోజకత్వమును కృష్ణార్జునులయందున్నది. అట్టి సర్వ ప్రయోజనములకు సాధనభూతులైన ఆ యిర్వురును ధర్మరాజునకు చెప్పినది చేయుటకున్నారు. ధర్మరాజు తనకు కావలసినదంతయు వారిర్వురవలన సాధించుకొనును. సర్వక్రియాఫలమును ధర్మరాజునియందు పర్యవసించుచున్నది. కృష్ణార్జునులయందు గాదు. వారిరువురును ఆయనకు సూర్చువారు. అంతమాత్రమే. సంజయుడు వచ్చి మాట్లాడి పోవుచున్నపుడు అచటివారి నందరిని తా నడిగినట్లుగా చెప్పుమని చెప్పుచు ధర్మరాజిట్లనినాడు.

*"దాసీదాసజనముల కు*
*దాసీనము గాకయుండ( దడయక యే మి*
*త్రాసంగ మొంది శత్రు ని*
*రాసం బొనరించి తమ్ము నరసెద ననుమీ'*

మిత్రాసంగము శత్రునిరాసము కావలసినది ధర్మరాజునకు గాని శ్రీకృష్ణునికి గాదు. ఆయన దైవము రాగద్వేషావేశముయొక్క లేమివలననే దేవత్వమగుచున్నది. శత్రుత మిత్రత ధర్మరాజునకున్నది గాని శ్రీకృష్ణునికి లేదు. ఆయన వాసుదేవ పరబ్రహ్మము ఆయన ధర్మమునం దునికి కలవాడు గనుక ధర్మరాజాదులు ధర్మాత్ములు కనుక వారియందు పక్షము కలవాడుగా కనిపించును. ధర్మవిరోధియైన దుర్యోధనునియందు లోకసంగ్రహణార్థమైన పగయే శ్రీకృష్ణునికున్నది గాని ధర్మరాజునకు దుర్యోధనునియందున్న పగవంటి పగ లేదు. తనరాజ్యము నపహరించి తనను కష్టములపాలు చేసినాడని ధర్మరాజునకు దుర్యోధనునిమీద కోపము. శ్రీకృష్ణుని కట్టిది లేదు. భారతమున శ్రీకృష్ణుడు చేసినదంతయు ధర్మముకొరకు. ధర్మము ధర్మరాజు.

ప్రతివీరుడైన దుర్యోధనుడు కూడ ధర్మజుని యందే దృష్టిని కేంద్రీకరించి చేసినాడు. యుద్ధకాలమున ద్రోణుని దుర్యోధనుడొక వరమడిగినాడు. ధర్మరాజును ప్రాణములతో పట్టుకొని తనవద్దకు తీసికొని రమ్మని ద్రోణుడు ఆ వరము నేల కోరితివనగా దుర్యోధను డనినాడు "*యుధిష్ఠిరుకాయంబు నొంపక తెచ్చి జూదంబాడుతెరంగొనర్చి మగుడ నడవికి నడిచిన తగిలి యతనితోడ తమ్ములు నా నంతతోన ఎల్ల దొసగు మాలు–*" ధర్మరాజుతో తమ్ములు కలిసి పోదురని దుర్యోధను డనుచున్నాడు. ఆయనగాని తిరిగి జూదమాడి ఓడిపోయి అడవులు పట్టినను తమ్ములు గాని, శ్రీకృష్ణుడు గాని కిమ్మనరు అనుటకు వీలు లేదు. ఏ మనగా ధర్మరాజు సర్వాధికారి. వారందరును ఆయన ఆజ్ఞకు బద్ధులు. ఆయనకెదురు చెప్పరు. అదె స్థితి. అందువలన ప్రాణములతో ధర్మరాజును తీసికొనిరమ్మని దుర్యోధనుడు కోరినాడు. మరల ధర్మరాజు జూదమున కంగీకరించునని దుర్యోధనుని కా నమ్మక మేమి? దర్మరాజు వ్యసన లక్షణము వానికి పూర్తిగా తెలియును. ఇంతకంటె ధర్మరాజును చంపినచో సరిపోదా? చంపు మనియే ద్రోణు నేల కోరలేదు. ఆ విషయమును తిక్కన్నగా రిట్లు వ్రాసిరి.

> "*ఆ ధర్మసూనుఁ గయ్యంబున జంపిన*
> *గోపించి గాండివి కురుకులంబు*
> *సమయించు మన మోపి సర్వపాండవులను*
> *జంపితి మేని ప్రచండచక్ర*
> *ధారఁ గౌరవకోటి తలలేఱి రాజ్యంబు*
> *గోవిందు డీకున్నె గొంతి కయిన?*
> *కాన యుధిష్ఠిరుఁ గాయంబు నొంపక*
> *తెచ్చి జూదంబాడు తెర గొనర్చి*"

అని ఈ మొదలుగా ద్రోణునితో దుర్యోధను డనినాడు ధర్మరాజును చంపినచో ప్రయోజనములేదు. కృష్ణార్జునులు మరియు కోపించి విజృంభింతురు. అనగా ధర్మజునికొరకు కృష్ణార్జును లున్నారు గాని వారికొరకు ధర్మరాజు లేడు. అందువలన భారతమునకు నాయకుడు ధర్మరాజే గాని శ్రీకృష్ణుడు కాదు. మరియొకడును కాదు. మరియు సంజయునితో శ్రీకృష్ణుడనినాడు '*ఈ సంధికార్యం బత్యంత దుర్ఘటంబు దీనిం ఘటియింపచేయ ట యశక్యంబని తలంచెద. అయిననుపాండవేయుల దగ ప్రార్థించి అందుల కొక్కట యె నైనను నయుగుపెంచి గౌరవులకు బుద్ధిగా చెప్పిచూచెద*' నని, భారతమున సర్వాధికారి పురుషుడు శ్రీకృష్ణుడైనచో పాండవులను ప్రార్థించి వారి యనుమతిని కౌరవులవద్దకు పోవలసినస్థితి యుండదు గదా? మరియు నంతకు పూర్వము ద్రుపదుడు తన పురోహితుని ధృతరాష్ట్రునొద్దకు పంపినది కూడ '*అజాతశత్రుననుమతి వడసి*' అనియే తిక్కన్నగారు వ్రాసిరి. కృష్ణార్జునులయొక్క అనుమతి ద్రుపదునకు అక్కరలేదన్న మాట. వా రధికారిపురుషులు కారు కనుక వేరు– ఇవన్నియు భారతమునకు ధర్మరాజునే నాయకునిగా సాధించుచున్నవి. కృష్ణార్జునోత్తమ నానాగుణకీర్తనార్థమైనది వలె భారతమున్నది. వారిరువురును ధర్మరాజునకు ప్రధానములైన సాధనములు. వారి మాహాత్మ్యము వారి ప్రతాపము ఎంతగా కీర్తింపబడినను అది యంతయు ధర్మరాజుయొక్క సాధనవైశిష్ట్యమునే స్థాపించును గాని భారతమునకు వారిని నాయకులుగా మాత్రము స్థాపించదు.

స్వర్గారోహణ పర్వాంతమున తిక్కన్నగారు వ్రాసినదాని కర్థ మిట్లు చెప్పుకొనవలయును. భారతసంహిత కంతయు ప్రకటార్థము వాసుదేవుడు, ఆ విషయము కనినవారు, వినినవారును అక్షయ పుణ్యలోకములు పొంది నిరామయస్థితి నొందుదురు. ఇది ఫలశ్రుతిగా చెప్పబడిన మాట– వాసుదేవుడు భారతమున ప్రకటార్థము. ప్రకటమనగా ప్రసిద్ధము. అర్థమనగా అర్థింబడినది మరియు ప్రార్థింపబడునది. భారతమున ప్రసిద్ధముగా ప్రార్థింపబడునది వాసు

దేవుడు. ఆయన ఎవరిచేత ప్రార్థింబడినా డనగా ధర్మరాజాదులచేత. ప్రసిద్ధముగా ప్రార్థింపబడుట యనగా ప్రకృష్టమైన సిద్ధి నుద్దేశించి ప్రార్థింపబడుట. ధర్మరాజు తనరాజ్యమును తాను తిరిగి పొందవలయు నను ప్రకృష్టమైన భావము వాసుదేవుని ప్రార్థించెను. ఆయన దయవలన ధర్మరాజు పొందవలసినది పొందినాడు. అట్లు ధర్మరాజు పొందుట భారతమున స్పష్టముగా నున్నది. ఆ యున్నదానిని కని గాని, అనగా చదివి తెలిసికొని, విని గాని, అనగా జదివి తెలిసికొని చెప్పు వారి మాటను విశ్వసించి గాని పాండవుల అర్థసిద్ధికి మూలము వాసుదేవుడు గదా యని ఎఱిగి, వానియందు బుద్ధిలగ్నము చేసికొన్న మానవులకు అక్షయ పుణ్యలోకములు ప్రాప్తించు నని తిక్కనగారి ఆ వాక్యమున కర్థము వాసుదేవుని యందు చిత్తము లగ్నమగుటకు తగినంతగా భారతమున వాని మాహాత్మ్యము చెప్పబడిన దని యర్థము. అది భారతమునకు శ్రీకృష్ణుడు నాయకు డన్న యర్థము చెప్పదు. ఇచట తిక్కన్నగారు వాడిన పుండరీకాక్ష, వాసుదేవ శబ్దములకు అర్థము తెల్ల తామర పూవులవంటి కన్నుల కల వాడని, వసుదేవుని కుమారుడని కాదు. "*హృదయస్థం పుండరీక మశ్నుతే వ్యాప్నోతి తత్రోపలక్షిత ఇతి పుండరీకాక్షః— వసతి వాసయత్యాచ్ఛాదయతి సర్వమితివా వాసుః దీవ్యతి క్రీడతే విజిగీషతే వ్యవహరతి ద్యోతతే స్తూయతే గచ్ఛతీతివా దేవః, వాసుశ్చాసౌ దేవ శ్చేతి వాసుదేవః*" అని శ్రీ మచ్ఛంకరులు చెప్పిన అర్థమును భావింపవలెను. అక్షయ పుణ్యలోకములందు నిరామయస్థితి కావలయునన్నచో అట్లే భావింపవలెను. భారతేతిహాసము నుండి పొంద దగిన, పొందవలసిన ఫలమిది సుమా యని తిక్కన్న గారు చెప్పిరి గాని ఆ పద్యమున భారతనాయకుడు వాసుదేవ పరబ్రహ్మమని చెప్పలేదు. కనుక ఆ పద్యము భారతమునకు శ్రీ కృష్ణుడు నాయకు డని సాధించదు. నాయకుడు శ్రీ కృష్ణుడు కాకపోయినను భారతమునందలి ప్రకటార్థము వాసుదేవ పరబ్రహ్మముగా నెఱిగి చిత్తము తదాయత్తము జేసినచో మోక్షము వచ్చుట కభ్యంతరము లేదు.

హరివంశ భవిష్యపర్వములు పురాణములు. భారతేతిహాసములోనివి గావు. స్వర్గారోహణ పర్వముతో భారతము ముగిసినది. అంతవరకు ధర్మరాజే నాయకుడు. హరివంశము ధర్మరాజు నుద్దేశించి ప్రవర్తించినది కాదు. భారతమునంతయు నుగ్రశ్రవసుడు చెప్పగా విని హరివంశము వినగోరిన శౌనకాదిమహర్షు లాయనతో ననిన మాటలివి.

*"కౌరవ పాండవ ప్రవర*
*గౌరవలీలలు నీవు చెప్పఁ దీ*
*పారెడుభంగి వింటిమి గు*
*ణాకర ఇంక జగత్రయంబునం*
*ధీరులు శూరులున్ విభవ*
*దీప్తులునా నుతిగన్న యా యదు*
*క్ష్మారమణాన్వయోత్తముల*
*చందములున్ విన వేడుకయ్యెడున్"*

భారత మంతయు కౌరవపాండవుల గౌరవము తోడనె ఉన్నది. హరివంశము యాదవవంశమునకు సంబంధించినది. మరియు ముఖ్యముగా నందలి శ్రీకృష్ణుని మాహాత్మ్యమునకు సంబంధించినది. '*పాండవోత్తముల చరిత్ర నాకు సతతమ్ము వినంగ నభీష్టమెంతయు*' నని రాజరాజు కోరుటచేత నన్నయగారిచేత భారత ముపక్రమింపబడినది. భారతమంతయు వినిపించి జనమేజయునితో వైశంపాయను డిట్లనినాడు. '*పాండవకౌరవ విషయ మైనయట్టి ఇతిహాసము ఏనుపాఖ్యానజాత సహిత మగునట్లుగా సమస్తంబు మహితవిస్తరంబుగ చెప్పితి*' శౌనకాదులకు భారత కథయంతయు చెప్పిన యుగ్రశ్రవసుడు చివరకు '*పాండవులకీర్తి ప్రకటించుటకును మరియు గొందరు జనపతుల చరిత్రలు జనుల కెఱింగించుటకును దేవ*

దేవుండగు వాసుదేవుని క్రీడావిశేషంబులు వివరించుటకును సర్వదేవజాతుల జన్మంబులును తదీయ సాయుజ్యంబులను దేటపరచుటకును సకలధర్మంబులునుం దెలుపుటకుగా పంచమవేదంబై పరగు నిమ్మహాభారత సంహిత (వేదవ్యాసుడు) యొనర్చె' నని చెప్పినాడు— ఈ ఉదాహరింపబడిన అందరి వాక్యముల యందును భారతము కౌరవ పాండవులకు సంబంధించిన దన్న తాత్పర్యమే ప్రధానముగా నున్నది. ఆ రెండు పక్షముల నాశ్రయించియే కథ పెరిగినది. చివరకు ఫలమనుభవించినది ధర్మరాజు. కౌరవ పాండవుల చరిత్రను చెప్పు గ్రంథమునకు శ్రీ కృష్ణుడు నాయకు డరుట పొసగనిది. యదుక్ష్మార మణాన్వయోత్తముల చరిత్రమును చెప్పు హరి వంశము పురాణ మనుట మూలముగా అందు నాయకప్రసక్తి రాదు. కనుక అచటను శ్రీకృష్ణుడు నాయకుడు కాడు. హరివంశము విష్ణు పారమ్యమును చెప్పుచున్నదని మాత్రమే అని అనవలెను.

ఇక భారతమునకుగల కార్ష్ణవేద మనుదాని విషయము- కృష్ణసంబంధము కార్ష్ణము. వ్యాసునకు కృష్ణద్వైపాయను డను పేరున్నది. పంచమవేదమైన భారతము నాయన రచించినాడు కనుక మఱియు ఆయన కా కథతో సంబంధమున్నది గనుక భారతము కార్ష్ణవేదము కావచ్చును. కాదు — వాసుదేవుడు నాబడు శ్రీకృష్ణసంబంధముచేత భారతము కార్ష్ణవేద మనబడుచున్నదన్నచో దాని అర్థమిది. భారతమునకు వేదగౌరవమును కూర్చుచున్న పర్వములు శాంతి అనుశాసన అశ్వమేధములు. మరియు ముఖ్యముగా భీష్మపర్వమునందలి భగవద్గీత శాంత్యనుశాసనపర్వములందున్న ధర్మప్రపంచమంతయు భీష్ముని ముఖమున వ్యక్తీకరింపబడినది. సూక్ష్మముగా విచారించినచో అదికూడ శ్రీకృష్ణుని బుద్ధినుండి అభివ్యక్తమైనదే. 'నాదుబుద్ధిస్ఫురణము నీ మనమునందు జొనిపితి ఇక నీవుచెప్పు' మని శ్రీకృష్ణుడు భీష్మునితో అనినాడు. ఆమాట శ్రీకృష్ణు డన్నతర్వాతనే భీష్ముడు నోరువిప్పినాడు, అశ్వమేధపర్వమున శ్రీకృష్ణుడు స్వయముగా మరల నర్జునునకు భీష్మపర్వము నందువలెననే ధర్మతత్త్వ ముపదేశించినాడు. భారతమునకు వేదగౌరవమే యే విషయముల కలిమిని వచ్చినదో ఆ యా విషయములు కొంతలో శ్రీకృష్ణుని ప్రత్యక్షసంబంధము కలిగియు కొంతలో నప్రత్యక్ష సంబంధము కలిగియు నున్నవి. అందువలన భారతము కార్ష్ణవేద మనబడి యుండవచ్చును. అంతేగాని శ్రీకృష్ణుడు నాయకు డగుటవలనమాత్రము కాదు.

ద్రౌపదికి కృష్ణ యని పేరున్నది. మహాభారతకథ ఆమె యుండుటవలన తీవ్రరూపముధరించినది. ఒకవిధముగా మహాభారతయుద్ధమునకు ద్రౌపదియే మూలకారణము. పంచమవేదమైన మహాభారతకథ అది అంతటిదగుటకు కృష్ణనాబడు ద్రౌపది మూలభూత మగుటవలనను, మహాభారతమునకు కార్ష్ణవేదమనిపేరు వచ్చియుండవచ్చును.

అయినచో అర్జునుడైనను భారతమునకు నాయకుడు కావచ్చునని సమాధానము ప్రారంభింపబడినది అర్జునుడుకూడ నాయకుడు కాజాలడు. కాజాలక పోయినను అట్లు ప్రారంభించుటలోని ఆంతర్యమిది. అర్జునుని పక్షమున ఫలానుభవ మొక విధముగా సాధింపవచ్చును. భారతయుద్ధమంతయు అర్జునుని మీదుగనే పోయినది, అనగా ప్రత్యక్షముగా అర్జునుడు యుద్ధతంత్రమును నిర్వహించినాడు. ఆ యుద్ధమునకు ఫలముగా వచ్చిన రాజ్యమును తాత్కాలికముగ ధర్మరాజు పాలించినను అర్జునుని మనుమనికే అయినది. అర్జునుడు యుద్ధముచేసి సాధించిన రాజ్యము తరువాత తరువాత ఆయనసంతతియే అనుభవించినది. ధర్మజుని సంతానము అనుభవింపలేదు. కొద్దిపాటి వ్యవధానముతో నైనను యుద్ధమువలని ప్రధానఫలము అర్జునునిరక్తముగల జీవులకే అయి

నది అందువలన నొకవేళ నాయకుడన్నచో అర్జునుని అనవచ్చును. కాని అది పద్ధతి కాదు కావ్యనాయకుని ఫలానుభవమునకును, ఇతిహాసనాయకునిఫలానుభవమునకును భేద మున్నది. అర్జునునిపక్షమున చూపబడినవాదము కొంతలోకొంత కావ్యనాయకునిఫలానుభవపుదృష్ట్యా చూపబడినది. భారత మితిహాస మగుట మూలముగా అది త్రోసిపుచ్చబడుచున్నది. కర్మఫల సంబంధముగల సర్వార్థములును ప్రత్యక్షముగ ఇతిహాసమున చూపబడవలెను. ఇహపరభేదముచేత కర్మ ఫలము ద్విధాభూతము. కావ్యము నాయకునిఇహానుభవమునే చెప్పును. భారతేతిహాసమునకు నాయకుడర్జును డైనచో స్వర్గలోకమున ధర్మజునిఅనుభవవర్ణనముగాక అర్జునుని అనుభవవర్ణనముండవలెను. మానుషతనువుతో పరలోకమునకు పోయినది ధర్మరాజు గాని అర్జునుడు కాదు శరీరముతో ధర్మరాజు పోయినాడు కనుకనే వాని చిత్తమునకు అనుభవ యోగ్యత కలిగినది. ఇతిహాసమునందలిప్రధానపురుషులందరియొక్క కర్మఫలానుభవము ప్రత్యక్షముగా వర్ణింపబడవలయును గనుక ముందు స్వర్గమున ప్రతివీరుడైన దుర్యోధనునియొక్క తరువాత నరకమున భీమార్జునాదినాయకపక్షమువారియొక్క యాతనాశరీరములతోడి యనుభవము ధర్మజునిముఖమున ప్రత్యక్షపరుపబడినది. అనగా ఆ యనుభవముకూడ ధర్మజునకే అయినట్లు. ఆ తరువాత గంగానదిలో మునిగి ధర్మరాజు మానుషతనువును త్యజించినాడు. అప్పుడనుభవము లేదు. యమునిలో నైక్య మయినాడు. అందువలన భారతమునకు ధర్మరాజే నాయకుడుగాని అర్జునుడు కాదు. శ్రీకృష్ణుడస లగుటకే వీలులేదు.

భరతుడు చెప్పినట్లుగా ధర్మరాజు వ్యసని, దుఃఖమును పొందినవాడు, మరియు నభ్యుదయము పొందినవాడు. "*సర్వమును ఫలప్రాప్తిపర్యంతము ఎవరివలన నడచునో అతడు నాయకుడనబడును.*" అని భరతుడు. మొదటినుండి చివరివరకు భారతమున సర్వము ధర్మజుని చుట్టుకొని యున్నది. ఎవరేమి చేసినను అది యంతయు ధర్మరాజుకొరకే చేసిరి. సర్వానుభవమును ధర్మరాజునకేగాని మరొకరికిలేదు. అందువలన మహాభారతేతిహాసమునకు నాయకుడు శ్రీకృష్ణుడు గాని, అర్జునుడు గాని గాక ధర్మరాజే అగుచున్నాడు.

# భాసమహాకవి

డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

భాసమహాకవి అతిప్రాచీనుడు. కాళిదాసునిచే గౌరవపురస్సరంగా స్మరింపబడినాడు. బహుశః వీరిద్దరకు సాహిత్యరంగంలో వైరంకూడా ఉన్నదేమో అని ఎంచటానికి ఆధారాలు కన్పించుతున్నవి మాలవికాగ్నిమిత్రంలో ఉన్న హరదత్తగణదాసుల వైరం భాసకాళిదాసుల మధ్యదేనని భావించటానికి వీలున్నది.

భాసుడు చాలా నాటకాలను వ్రాసినాడని ప్రతీతి. స్వప్నవాసవదత్త మీతనినాటకమని ప్రసిద్ధి. మిగిలిన నాటకాలను ఈయన వ్రాసినదీ లేనిదీ చెప్పటం కష్టము. నాటకాలపేర్లేమీఎత్తకుండా ప్రసన్నరాఘవంలో "భాసోహాసః" అని జయదేవుడన్నాడు. హాస్యరసాన్ని బాగా పోషించినవాడు భాసుడట! ప్రస్తుతము లభించే భాసనాటకాలలో మనకు ఈ హాస్యరసపోషణ సరిగా కన్పించదు.

ప్రతిమానాటకంలో సీత లేకుండానే రాముడు చివరకు అభిషిక్తుడైనట్లు చెప్పబడినది. కాని రామాయణంలో సీతకూడా అభిషిక్తురాలే. ప్రతిమానాటకంలో ఈఘట్టమున స్త్రీలు ఎవ్వరూ కన్పించరు.

ప్రతిజ్ఞాయౌగంధరాయణంలో మంత్రియైన యౌగంధరాయణుడు తమరాజు బంధవిముక్తుడై వాసవదత్తతో లేచిపోవటానికి పన్నిన పన్నాగమున్నది. ఇందులోవచ్చే కృత్రిమగజరంగాన్ని అవిశ్వసనీయమని భామహుడు విమర్శించినాడు. కాని భామహుడిచ్చిన ఇతర సన్నివేశాలీనాటకంలో ప్రస్తుతం కన్పించవు.

భాసనాటకాలని ప్రచారంలో ఉన్నవాటిలో ఆరు మహాభారతకథకు చెందినవి. ప్రతిమా, అభిషేక నాటకాలు రామాయణంలోనివి. బాలచరిత హరివంశంలోనిది. ప్రతిజ్ఞాస్వప్ననాటకాలు బృహత్కథకు

చెందినవి. అవిమారక, చారుదత్తములుకూడా గుణాఢ్యునికథలోనివే. ఈ పదమూడింటిలోను కొన్ని సామ్యాలు కన్పించుతున్నవి "నాంద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః" అనే పంక్తితో ఇవి ప్రారంభమౌతున్నవి. ప్రస్తావనకుబదులు వీటిలో స్థాపన ఉన్నది. అన్నింటిలోను ఇది దాదాపు ఒకేమాదిరిగా ఉన్నది "ఏవ మార్యమిశ్రాన్ విజ్ఞాపయామి అయే కిం ను ఖలు మయి విజ్ఞాపనవ్యగ్రే శబ్ద ఇవ శ్రూయతే అంగ పశ్యామి" అనే పంక్తులతోనే ఈ నాటకాలు నడుస్తున్నవి. కవినిగురించి ఎలాటిప్రస్తావన ఇక్కడ కన్పించదు. ప్రథమశ్లోకంలో ఆ నాటకానికిచెందిన ప్రధానపాత్రల పేర్లను కూర్చటం కనిపిస్తుంది. అన్నింటికీ భరతవాక్యం దాదాపు సమానమే.

భాష, శైలి, భావనలలో తుల్యత్వము అన్నిటిలోను కన్పిస్తుంది. విచిత్రపదాల పునరుక్తి, సువదనదుంతకాదిచిత్రఛందస్సులు, శ్లోకమంటే పక్షపాతము వీటిలో ఉన్నది. ఒకేవిధమైన అనుప్రాసాది శబ్దాలంకారాలు నాటకోచితసన్నివేశాలు తరచుగా కనబడుతవి. నాట్యశాస్త్రాదేశాలకు విరుద్ధంగా మృత్యువులు, యుద్ధాలు రంగస్థలంమీద చూపించబడినవి. ఈ సామాన్యలక్షణాల నన్నింటినీ ఉదహరిస్తూ—

"సూత్రధార కృతారంభైః
నాటకై ర్బహుభూమికైః
సపతాకై ర్యశో లేభే
భాసో దేవకులైరివ."

అని బాణుడన్నాడు. సూత్రధారునితో నాటకం మొదలౌతుంది. పాత్రలు అనేకములు. పతాకాస్థానము విరివిగా వాడబడినది. స్వప్న, బాలచరిత అవిమారక, అభిషేక, ప్రతిమానాటకాలలోమాత్రమే లక్షణానుగుణమైన పతాకా సన్నివేశాలు కలవు.

ఈ నాటకాలన్నీ రంగస్థలంమీద ప్రదర్శించటానికి చాలా యోగ్యమైనవి. పామరులను సంతోషపెట్టటానికి చాలా అపహాస్య వృత్తాంతములు చేర్చబడినవి. వీటిలో అలంకారికులకు అభిమతముకాని విషాదాంతనాటకముకూడా ఒకటి ఉన్నది. ఇది భాసకృతి అని చెప్పటానికి పూర్తిగా వీలుపడదు.

భాసుని ప్రధాన నాటకము స్వప్నవాసవదత్త. శృంగారప్రకాశలో దీనిలోని పంచమాంక విషయాలను వివరిస్తూ, "స్వప్నవాసవదత్తే పద్మావతీ సమవస్థాం ద్రష్టుం రాజా సముద్రగృహం గతః. పద్మావతీరహితం చ తదవలోక్య తస్యా ఏవ శయనీయే సుష్వాప. వాసవదత్తాం చ స్వప్నవదస్వప్నే దదర్శ. స్వప్నాయమానశ్చ వాసవదత్తామాబభాషే. స్వప్నశబ్దేన చేహ స్వాపోవా స్వప్నదర్శనం వా స్వప్నాయితం వా వివక్షితం' అని భోజుడన్నాడు. ఈసన్నివేశ మెలాంటి శృంగారమో తెలిసికోవాలంటే మనము సర్వానందుని అమరకోశ వ్యాఖ్యకు పోవాలి. భరతుడన్నట్లు ధర్మార్థకామభేదంచేత శృంగారము మూడు రకాలు. నలదమయంతి కథలో కన్పించే బ్రాహ్మణ భోజనము ధర్మశృంగారానికి ఉదాహరణ. 'ద్వితీయః స్వదేశ మాత్మసాత్కర్తు ముదయనస్య పద్మావతీ పరిణయః అర్థశృంగారః, తృతీయః స్వప్నవాసవదత్తే తస్యైవ వాసవదత్తా పరిణయః కామశృంగారః' కాని ప్రస్తుతం లభించే స్వప్ననాటకంలో మనకు కన్పించేది అర్థశృంగారము.

శారదాతనయుడీ నాటకాన్ని గురించి తన భావప్రకాశలో వ్రాస్తూ కుంకుమాలంకరణమును వత్సరాజునుంచి వాసవదత్త నేర్చుకొన్నదనినాడు. ఒక రోజున ఆవిధంగా తిలకం ధరించి వచ్చిన పద్మావతిని చూచి రాజు 'ప్రపచ్ఛమాలాతిలకౌ కేనే యౌ తే కృతే' అన్నాడు. అప్పుడు పద్మావతి 'అవంతికాధిధాయైషా తస్యాః శిల్పమిదం మహత్' అని సమాధానమిచ్చినది ఈ సన్నివేశము మనకు దొరికిన స్వప్న నాటకంలో లేదు భాస కృతిలో ఉదయన పద్మావతుల కథ ఉదయన వాసవదత్తల కథ రెండునూ చక్కగా మేళవింపబడి ఉండేవి.

దశవిధరూపకాలను గురించి వ్రాస్తూ పూర్ణ, ప్రశాంత, భాస్వర, లలితములను గురించి చెప్పి–
'*ప్రశాంత రసభూయిష్ఠః ప్రశాంతం నామనాటకం*
*న్యాసో న్యాససముద్భేదో బీజోక్తి ర్బీజదర్శనం*
*తతోఽనుద్దిష్టసంహారః ప్రశాంతే పంచసంధయః....*
*స్వప్నవాసవదత్తాఖ్య ముదాహరణమత్రతు*'

అని శారదాతనయుడనినాడు. వత్సరాజునుండి విడిపోయి వాసవదత్త పద్మావతి సంరక్షణలో నుంచబడినది. వాసవదత్త సజీవయే అని వత్సరాజు నమ్మకము. అనునయంతో వాసవదత్తను పిలచినాడు. ఘోషవతీ వీణను పొంది వాసవదత్తను వెదికినాడు. ఈ విషయాలతో శారదాతనయుడు ప్రస్తావించిన న్యాససముద్భేదమనే ద్వితీయ సంధి మన నాటకంలో కన్పించదు. న్యాసము, న్యాససముద్భేదము, బీజోక్తి అనే వరుస పాటింపబడినట్లు లేదు.

నాట్యవేదవివృతిలో అభినవగుప్తుడు "*క్వచిత్ క్రీడా, యథాస్వప్నవాసవదత్తాయాం*" అన్నాడు. రెండవ అంకంలో కందుకక్రీడ ఉన్నది. కాని భరతుడు ఒక్కొక్కనాటకంలో ఒక్కొక్కటి ప్రధానంగా ఉంటుందనిచెప్పుతూ "*క్వచిత్క్రీడా*" అన్నాడు. మనకు లభిస్తున్న నాటకంలో క్రీడకుమించిన ప్రాధాన్యము స్వప్నానికి ఉన్నది.

స్వప్నవాసవదత్తలోనిది అని అనినపుడు–
"*సంచితపక్ష్మకపాటం నయనద్వారం స్వరూపతరళేన ఉద్ఘాట్య సా ప్రవిష్టా హృదయగృహం మే నృపతనూజా.*" అనే శ్లోకమునిచ్చినాడు. ప్రియురాలిని తొలిసారి చూడగానే కాముకుని మనస్సులో కలిగే విపరీతమైన మార్పును తెలిపే దీ చక్కని శ్లోకము. ప్రస్తుత నాటకంలో ఇలాంటి శ్లోకానికి సరియైన సన్నివేశం కుదరదు.

భాసుడు వ్రాసినరీతిగా ఆ నాటకాలు మనకు లభించుటలేదని, స్వప్నవాసవదత్తలో రెండు ఇతివృత్తాలు వస్తుతః కలవని, హాస్యరసపోషణలో నితడు సిద్ధహస్తుడని, నాటకరంగమున అపూర్వ పరిణామములను తెచ్చినాడని దీనివలన స్పష్టమౌతున్నది. దూతవాక్య, అవిమారక, మధ్యమ వ్యాయోగములలో ఇంద్రజాలము, బాలచరిత పంచరాత్రములలో నృత్యము విశిష్టముగా కన్పించేవి, నేడు వాడుకలో నున్న ఏకాంకికలకు మూలపురుషుడు భాసుడు. మధ్యమ వ్యాయోగ, దూతవాక్య, దూతఘటోత్కచ, కర్ణభారాలు ఏకాంకికలు. తర్వాత వచ్చిన ప్రతిజ్ఞా, చారుదత్తములలో ఇతివృత్తపోషణ కొంత అభివృద్ధి ఉన్నది. అవిమారక, ప్రతిమా, స్వప్న నాటకాలు పరిపూర్ణత నందిన కళాఖండాలు. ఇతివృత్తముల కొరకు ఇతిహాసములు, పురాణములు, జానపదగాథలు పరిశీలించినాడు.

ప్రతిజ్ఞాయౌగంధరాయణము నాలుగు అంకాల నాటకము. పూర్వగాథను చక్కగా నాటకయోగ్యంగా చిత్రించి, రసపోషణ గావించినాడు. పాత్రపోషణ గాని, కవితాస్రవంతిగాని ఎక్కువగా ఇక్కడ కన్పించవు. ఇతివృత్తమే అతిప్రధానంగా గ్రహింపబడినది. ఇతివృత్తము త్వరత్వరగా ముందుకు సాగిపోతుంది. మామూలుగా జరిగే సన్నివేశాలలాగా కన్పించటానికి చక్కని సంభాషణలు పొదగబడినవి. వీటిలో అనవసరమైన పదమొక్కటీ కన్పించదు.

ఈ నాటకంలో ఉజ్జయినికి చెందిన మహాసేనుడే మగధవాడైన ప్రద్యోతుడుగా పరిగణింపబడినాడు. మొదటి అంకమున యౌగంధరాయణుడు, రెండవదానిలో మహాసేనుడు ప్రధాన పాత్రలు. వాసవదత్తకు తగిన వరుని అన్వేషించే యత్నాలతో నున్న రెండవ అంకము అహ్లాదకారి. వత్సరాజు పేరు రూపకయోగ్యంగా ప్రస్తుతించబడినది. అగ్నిగృహమున మూడవ అంకము. చక్కని పన్నాగమునకు దారిచూపినది. నాల్గవ అంకంలో వత్సరాజ వాసవదత్తల ప్రణయము సిద్ధించినది.

యౌగంధరాయణుడు ప్రభుసేవాపరాయణుడే కాని మాటకారి. కార్యసాధన కితడు ఉపకరించినది కొద్దిగానే. బహుశః ఇలాంటి పాత్రనే మనస్సులో పెట్టుకొని 'క్రియాకేవలముత్తరం' అని మాఘుడని ఉంశవచ్చును. ఈ యౌగంధరాయణుడు చాణక్యుని వలె ప్రవర్తించబోయి విఫలుడౌతాడు. 'అవస్థాఖలు నామ శత్రు మపి సుహృత్వేకల్పయతి' అని తనశత్రువుని గొప్పతనమును గుర్తించగలిగినాడు. 'మోచయామి న రాజానం నాస్మి యౌగంధరాయణః' అని నటునివలె ప్రగల్భాలు చేస్తాడు. పట్టుబడినప్పుడు కూడా 'జితమితి రాజకులే సుఖం విశామి' అంటాడు.

ప్రతిమా నాటకంలో నాటకశిల్పము చక్కగా పోషింపబడినది. వినోదమునకు తెచ్చిన వల్కలములు అరణ్య వాసానికి ఉపయోగింప బడినవి— 'మంగలార్థే అనయా దత్తాన్ వల్కలాం స్తావదానయ' లక్ష్మణుని నడతలో భీముడు కొద్దిగా గోచరిస్తాడు. రెండవ అంకమునకు సాహిత్యచరిత్రలో విశిష్టస్థానమున్నది. పుత్రవియోగము, సీతావనవాసము కల్గించిన దుఃఖము స్వాభావికంగా భావుకతతో ఉదాత్తంగా వివరించబడినది. ఇదేరీతిగా శ్రాద్ధదినమున ప్రతిమాగృహప్రవేశము ఒకచోట జరిగితే ఇంకొకచోట శ్రాద్ధానికి లేడిని వధించే ప్రయత్నం జరుగుతుంది. కైకేయి పదునాలుగురోజులనబోయి సంవత్సరాలని అన్నదట. తన పుత్రుడు గ్రామాంతరంలో ఉండటంచేత వనవాసం రామునికి వచ్చిందట. దశరథుడు శాపఫలాన్ని ఈరీతిగా అనుభవించవలసి వచ్చినదని అన్నిసంశయాలను సద్దివేయటం జరిగింది.

కరుణారసమిశ్రితమైన ధర్మవీర మీనాటకంలో ప్రధానరసము.

స్వప్నవాసవదత్త మహానాటకాలలో ఒకటి. క్రొత్తపాత్రలను రంగస్థలంమీద ప్రవేశపెట్టటానికి సరియైన పరిచయము, సందర్భము కల్పింపబడినవి. పద్మావతీవాసవదత్తల పరిహాసాలతో ప్రారంభమైన రెండవఅంకము చక్కని సన్నివేశానికి దారితీస్తుంది. "యథా యథా హి త్వరతే తథాతథా అంధికీ(యతే మే హృదయం" అని సపత్నీకత్వనిష్ఠమైన భావోద్వేగాలు ప్రదర్శింపబడినవి. వాసవదత్తయొక్క మానసికపరిస్థితిని చిత్రించే మూడవఅంకము ముఖ్యమైనది. అవిధవాకరణ సపత్నీమర్దన ప్రభావములుగల మూలికలతో హారాన్ని తయారుచేయ సంకల్పించిన వాసవదత్తలో ఒకవిధమైన నిర్లిప్తత కన్పడుతుంది.

భావోద్వేగము, కవిత్వము, అభినయము నాల్గవఅంకములో పరాకాష్ఠనందినవి. వీటితోబాటు రంగస్థలానికి వెలుపల జరిగిన సన్నివేశములను వర్ణించటంలో కవి అద్వితీయప్రతిభను కన్పరచినాడు. చివరిఅంకములో స్వప్నము.

భాసుని ప్రధానలక్ష్యము ఇతివృత్తపోషణమే గాని పాత్రపోషణముకాదు. సంవాదమునకు పాత్రలకు చక్కని సామరస్యమున్నది పాత్రలు మితభాషులు. సజీవములు, శక్తిమంతములు, ఉచితములునైన పదజాలములతో సంభాషణలు సాఫీగా దొర్లిపోయి సంస్కృతము జీవద్భాషగా ఉన్నట్లు మనకు ఇప్పటికీ కన్పిస్తుంది. ప్రతిపాత్రకు వ్యక్తిత్వము ప్రస్ఫుటముగానున్నది. ఇలాంటి నాటకశిల్పము అద్వితీయము.

# హాల సప్తశతి

**శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య**

రెండువేల సంవత్సరముల క్రితము శకప్రవర్తకుడగు శాలివాహనుడు, హాలుడు ప్రాకృతభాష యందు 'గాథాకోశము' అను ఒక కావ్యము రచించెను. ఆదిమమగు ముక్తకకావ్య మిదియే సభ్యతా కిరణాంకురచ్ఛాయగూడ ప్రసరింపని అకాలమున అనిదంపూర్వమగు నిట్టి ఉత్తమధ్వనికావ్యము రచించిన గౌరవ ప్రతిష్ఠలు భారత సాహితీ భాగ్యవిధాతకు శాతవాహన చక్రవర్తికి దక్కినవి. సంస్కృతాలంకార శాస్త్రములకీ కావ్యమే మూలబీజము. ధ్వని విచేచనా పాండిత్యమునకీ గాథాకోశమొక నికషోపలము. మానవ హృద్గతములగు రహస్యభావములకీ కావ్యమొక మహాభాష్యము. ఇందలి భావములచుంబితములు. గాథాకారుడు భువనోపజీవ్యుడు. క్షేమేంద్రమహాకవి తన కవికంఠాభరణ కావ్యమందు కవిభేద నిరూపణ మిట్లు చేసెను.

శ్లో. ఛాయోపజీవి పదకోపజీవి
పాదోపజీవి సకలోపజీవి
భవేదథ ప్రాప్త కవిత్వ జీవి
స్వో న్మేషతోవా భువనోపజీవ్యః

సంస్కృతాలంకారికులేకాక సంస్కృత మహాకవులు గూడ గాథలు పఠించియే తమకావ్యములు రచించుకొనిరి. కవికులగురువు కాళిదాసు గాథార్థప్రయోజన మనుభవించెను. శూద్రక విశాఖదత్తులు సప్తశతీ భావచ్ఛాయల నాశ్రయించిరి. 'అమరుకకవే రేకశ్లోకః ప్రబంధ శతాయతే' అని కీర్తింపబడిన అమరుక కవికి ఈగాథ లొజ్జబంతులు. ఆర్యాసప్తశతీకర్త గోవర్ధనాచార్యులు గాథాకారుని అంతేవాసి. హిందీ వాదుల ఏకైకమహాకవి బిహారి ఈగాథాకోశ మామూలచూడ మనుకరించియే తన 'బిహారీ సత్సయీ' కావ్యమును రచించుకొనెను.

ఇందలి భాషప్రకృతి సహజమగు ప్రాకృతము. భాషను మధురతరమొనర్చు జాతీయములగు నానుడులు సామెతలు ప్రాకృతభాష యందనంతము లగుటచే మానవుల నిత్యజీవితమందు సంభవించు

ఒడుదొడుకులు యథాతథముగ సహజభావ సమన్విత ముగ చిత్రింపబడినవి. ఈకావ్యమును పఠించియే 'బాణోచ్ఛిష్టమిదం జగ'త్తను సంతటి ప్రతిష్ఠమోచిన మహాకవి బాణుడు

శ్లో. అవినాశిన మగ్రామ్య
మకరోత్సాతవాహనః
విశుద్ధజాతిభిః కోశం
రత్నైరివ సుభాషితైః.

అని గాథాకారుని సూక్తి వైదుష్యమును కీర్తించెను. సంస్కృతభాషాపక్షపాతులయ్యును మహాకవులెందఱో ప్రాకృతభాషామాధుర్యమును ముక్తకంఠులై కీర్తించిరి. బాలరామాయణ విద్ధసాలభంజికాది రూపక నిర్మాతయు, కావ్యమీమాంసాకర్తయు నగు యాయావర మూర్ధన్యుడు రాజశేఖర మహాకవియును సంస్కృతకవు లనేకులునుగూడ ప్రసాదమాధుర్యాది గుణములయందు ప్రాకృతముముందు సంస్కృతమును గౌణీకరించిరి. చూడుడు !

తే. సంస్కృతగ్రంథములు పరుషప్రకృతులు
ప్రాకృతగ్రంథములు మృదుప్రస్తవములు
పురుష మహిళల నెంత యంతరముకలదొ
యంత యంతర మీరెంటియందుఁగలదు.
(కర్పూరమంజరి)

తే. అంగనావల్లభము మధురాక్షరమ్ము
లలిత లలితమ్ము శృంగార విలసితమ్ము
కమ్మనౌ ప్రాకృతప్రబంధమ్ము గలుగ
సంస్కృతగ్రంథ మెవ్వండు చదువఁదలఁచు
(వజ్జాలగ్గ)

ఈ ప్రాకృతగాథలు శైలీబంధ శబ్దశయ్యల యందు జానపదగీతికలకంటె మధురతరములు. భావార్థగుంఫన గుణగౌరవమందు ప్రౌఢసాహితీ సాచివ్యములు. గాథలన్నియు రసోద్గారములు. ఇందలి అలంకారములు నిసర్గసుందరములు. ప్రాకృత భాషామాధుర్యమున కీ గాథాకావ్యము పరమార్థము. భారతజాతి రసికతాముద్రకు ప్రత్యక్షప్రమాణము. ఈగాథలలోని శృంగారము అవధులుదాటదు. ఔచిత్యమునకు భంగము రానీయదు. పరిహాసరసపేశలము. విదగ్ధజనోచితము. మానవుల మనుగడలోని సహజములగు విషయములకేకాని అతిశయోక్తుల కిం దాస్కారములేదు. ప్రజల లౌకిక జీవితమంతయు నీగాథలయందు ప్రతిఫలించుచుండును. విశ్వమానవుల హృదయానుభూతరహస్య వృత్తాంతముల కొక విజ్ఞానసర్వస్వముగ నీ గాథాకావ్యమును రచించిన అతిలోక ప్రతిభావంతు డీ రాజకవిచంద్రుడెంతటి గహనసిద్ధాంతములైనను అరటిపండొలిచి చేతి కందించినట్లు తేటతెల్లముగ నిర్వచింపగలడు. ఎంతటి సామాన్యవిషయములనైనను గుంఫన గుణగౌరవముచే నుదాత్తభావ సమన్వితముగ చేయగలడు. ఎన్ని పోకలు పోవుటకైనను వలయు శబ్దసంపద ప్రాకృత భాషయందున్నదనుటకు సంస్కృతాద్యనువాదములే ప్రమాణము. అంత సంపన్నమైన సంస్కృతానువాదమందుగూడ గాథలలోని శ్లేషాదిచమత్కారములు పెక్కుతావుల మృగ్యములైనవి. కావుననే ప్రాకృతము భారత సాహితీభద్రాసన మధిష్ఠించి సరస కవితాసామ్రాజ్యమును చిరకాలమేలుకొన్నది.

ధరణీసామ్రాజ్యముతోబాటు కవితాసామ్రాజ్యమును చిరకాలము స్వచ్ఛందముగ పాలించిన శాతవాహనుల రాసిక్యమున కొక విజయపతాకయై వెలుగులీను ఈ గాథాకావ్యము విద్వద్రసికుల హృదయ సామ్రాజ్యమును చిరకాలమునుండియు పాలించుచున్నది. శాశ్వతముగ పాలించగలదు.

ఈ గాథాకావ్యమందలి ప్రధానవస్తువులు శాంతినిలయములగు గిరిగ్రామములు, తాటాకుకుటీరములు, అందునివసించు అమాయికస్త్రీలు, వారి సహజ శాలీనతాసంప్రదాయములు, ప్రోషితపతిక హృదయావేదనలు, ప్రపాపాలికల అపాంగవీక్షణ

ములు, పథికయువకుల వక్రోక్తులు, వేశయోషల కపటనాటకములు, విరహకాతరల దీనాలాపములు, హాలికనందనుల శృంగారభంగిమలు, పేదకోడండ్ల వేవిళ్ళముచ్చటలు, అత్తకోడండ్ర యెత్తిపొడుపులు, పూపజవరాండ్ర గౌతమీస్నానములు, భూమిజీవనుల మడకపూజలు, సమష్టికుటుంబుల సౌజన్యసౌశీల్యములు, పండి కైవ్రాలిన వరిపైరులు, విరియఁబూచిన జనుపచేలు, కలమగోపికల సురతవిస్రంభ చిహ్నములు, పంజరశారికల మధురప్రసంగములు, చతుర చేటికల చాటూక్తులు, పుష్పలావికల నుడికారపు పోడుములు, విటుకులాండ్ర భ్రుకుటీకటాక్ష విక్షేపములు, క్రొత్తయల్లుండ్ర ఆగమనములు, పెండ్లికూతుండ్ర పసపాడుభంగులు, కపటధార్మికుల గ్రామ్యధర్మములు, ప్రత్తిచేల ఏరువాకలు. జాణెతల చతురోక్తులు, శబరవీరుల ధనుర్విలాసములు, కిరాత కాంతల లావణ్య యౌవనసర్వాభిమానములు, చెంచు పూబోండ్ల యింగితజ్ఞానతీవ్రతలు, హరిణదంపతుల పవిత్రప్రేమలు, యూధిపతుల ప్రణయరహస్యములు, జెట్టిమల్లుల ఖురళీవినోదములు, ప్రియజానులగు వేటకాండ్ర కరుణాంతఃకరణములు, పేద సంసారుల జీవయాత్రాప్రకరణములు, సజ్జనుల గభీరప్రకృతులు, మానధనుల ధైర్యోత్సాహములు, ప్రశాంతగంభీరములగు వింధ్యారణ్యప్రదేశములు, గౌతమీతీర పుష్పనికుంజములు, సకలఋతుప్రస్తావములు, కమలాకరములగు సరస్సులు, సరయూసుణ సంకీర్తనము, గణపతిప్రస్తావము, బౌద్ధమతప్రతిపత్తి, లక్ష్మీనారాయణుల ప్రసక్తి, పార్వతీపరమేశ్వరుల సంప్రార్థనము, ఇత్యాదులు. గాథలలోని స్త్రీలు కృత్రిమ మెఱుగని అమాయికలు. సహజశృంగార భాసితలేకాని కనకభూషణభూషితలుకారు. కటివంకబొమలుకలరే కాని భ్రూలతావిభ్రమము లెఱుగరు. కర్ణాంతలోచనలే కాని కేకరాలోకములెఱుగరు. చెంగావులేకాని చీనిచీనాంబరము లెఱుగరు. శీతాతపవర్షబాధలకోర్చి చెమటతీసి జీవింతురేకాని సోమరితనమెఱుగరు. వీరి అంతఃకరణములు నిర్మలములు. వీరి ప్రేమకలాపములు పవిత్రములు. వీరు నివసించు కొండపల్లెలు కుసుమితకదంబసురభిళములు. పరిధౌతగండశిలాఫలకములు, గిరినదీసంగీతభంగీతరంగితములు. ఛాయా తరుషండమండితములు. పుష్పవనీపరిమళితప్రాంత దేశములు. నిర్మలాంభస్తటాకమండితములు. ఇచ్చటి పచ్చికబయళ్ళు ప్రశాంతసుందరములు.

ఈ గాథాకావ్యమందలి రసము ప్రధానముగ శృంగారము. ఈకావ్యమింత శృంగారసంగతముగ పరిహాసపేశలముగ చాతుర్యపరసీమగ రచింపబడిన దయ్యును మానవుల హృదయసంస్కారమునకు వలయు నైతికసామాజిక ధార్మికాద్యనేక విషయములు అన్యాపదేశముగ భంగ్యంతరవిన్యాసముతో లలితలలితముగ ఈగాథలయందు నిక్షిప్తములైనవి. నాటి వాతావరణమంతయు నీకావ్యమందాద్యంతము ప్రతిబింబించుచునేయుండును ఆత్మసౌందర్యవర్ణనము నకేకాని అంగసౌందర్యవర్ణనమునకీకావ్యమందు తావే లేదు. ఇతరకవుల కావ్యములందు స్వైరవిహారము చేసిన పచ్చిశృంగారము ఈ గాథలయందు లేనేలేదు. ఇందలిశృంగార ముదాత్తము. గాథలనాశ్రయించి శృంగారము రసరాజమైనది. గాథలను పఠించియే కావ్యములు కాంతాసమ్మితములని భావకులు ప్రకటింపగలిగిరి. రసికులైనవారు ఈ గాథాకావ్యము నొక పారాయణగ్రంథముగా నిత్యజీవితమందు పఠించుచుందురు. లౌకికమగు జీవితసౌఖ్యమునకీకావ్యమొక రసాయనము. ఈ గాథలయందలి వ్యంగ్యవైభవమును గ్రహించి ఆనందించువారికి మాత్రమే 'జీవితం వ్యంగ్యవైభవమ్' అను సూక్తిలోని పరమార్థము అనుభవమునకు వచ్చును. ఇందలి కవితాగుణము లనన్యములు,

గాథలలోని ధ్వని కృతచమత్కారము గాథోప జీవులగు అమరుకాది ముక్తకకావ్యములయందు ఎంత త్రవ్వియెత్తినను గోచరింపదని మార్మికుల అభిప్రాయము. ప్రసంగచాతుర్యమునకు ప్రాకృత ములోని నానుడులు సామెతలు ప్రయోగించుటలో గాథలలోని స్త్రీలు ప్రదర్శించు ఒడుపు స్త్రీజాతియొక్క సహజప్రసంగమునకు పరమార్థము. కాకువులతోడి నుడికారపుమలకలకు పొలిమేర, ఈగాథ చూడుడు!

ఆ. అవును! మేము అంకుటాంద్రమే! తొలఁగు నీ
కొలమునకుఁ గలంకు కలుగునేమొ!
కాని సాధ్వి! యే మొకానొక సామాన్య
పగిది నాపెతునకుఁ బాలుపడము. 5-17

ఈగాథకూడ చూడుడు!

ఆ. నాజ్వరమ్ము తగ్గినదొ లేదొ ప్రతివాని
కీ విచారమేల! యెమ్మెకాఁడ!
గుబులుకొనఁగ వచ్చి కుశలమా! యనెదు తాఁ
కకుము నన్ను! జ్వరముకంపుదాన. 1-51

ఇంకొక్కగాథ చూడవలెనందురా! చూడుడు!

ఆ. చేసినవియొ? లేక చేయుచునున్నవో?
చేయనున్నయవియొ? చెప్పు నిజము!
వేనిసైఁచుమనెదు? నీ నేరముల సిగ్గు
బొగ్గులైనవాఁడ! పోకలాడ! 1-90

ఇట్లెన్నియని ఉదాహరింతును? ఏదో ఒక చమత్కారము ఏదో ఒక విశేషము ప్రతి గాథయందును గోచరించును.

మఱొక్కగాథకూడ చూచెదరా? చూడుడు!

ఆ. అందగత్తె, సుగుణ యది యౌట నిజమె! నే
నెదియుఁ గానిమాట యదియు నిజమె!
కాని నీవెచెప్పు! దానిఁ బోలనివార
లెల్లఁ జావవలెనె? యెమ్మెకాఁడ! 6-11

ఈగాథాకావ్యమును అనుకరించుచు నెన్నియో గ్రంథములు వెలువడినవి. ఈవిషయము మా 'శాతవాహన సప్తశతి' పీఠికయందు విపులముగ చర్చింపబడినది. ప్రస్తుతము రెండు మూడు ప్రధాన గ్రంథములనుండి ఒండు రెండుదాహరణలిచ్చుచున్నాను, రసజ్ఞులగు కవితాకలామార్మికులు తారతమ్యవివేచనము చేయుదురుగాక!

*గాథాసప్తశతి – అమరుకము*

ఆ. ప్రియుఁడు కంటఁబడిన రెండుచేతుల రెండు
కనులు మూసివేయఁగలనుగాని
కడిమిపూచినట్టు లొడలెల్లఁ బొడము నీ
పులకలెచట మాటఁగలను? చెలియ!

(గాథాసప్తశతి)

చ. బొమముడివైచుకొన్న వల
పుం దమకమ్మునఁజూచుఁ గన్ను, డెం
దము శిలచేసికొన్న మెయిఁ
దార్కొను బుల్కలు; పల్కులాఁగినన్
మమతకులోఁగి యీ బయిసి
మాలిన పాడుమొగమ్మునవ్వు; వే
రిమి నెటు మానమున్ నిలువ
రింతును? కంటికి వాఁడు తోఁచినన్.

(అమరుకము)

ఆ. ఎవతె చిక్కిపోయెనేని నీకోసమా?
నన్నుఁజూచి యింత నవ్వు దేని
కెప్పుడైన నిట్టులే యౌట వేసవి
యందు నాకు సాజమనుచు నేడ్చె.

(గాథాసప్తశతి)

ఉ. ఏలకృశించె నీధు తను
వీ వణఁకెచ్చటి? దేలయిట్టులో
బేల! మొగమ్ముఁ జెక్కిళులు
వెల్వెలబాఱె? నటన్న; నాథుఁడౌఁ

జాలిఁక నీసమస్తమును
సాజము నాకని వెచ్చనూర్చుచున్
దూలుచురాల్చె బాష్పములు
తొంగలి ఱెప్పలఁ దోఁగియాఁడగన్.
(అమరుకము)

గాథాసప్తశతి – ఆర్యాసప్తశతి

ఆ. సూర్యబింబమందుఁ జొచ్చిన యకలంక
చంద్రబింబమునకు సాటియగుచు
వేని కౌస్తుభమునఁ గానిపించును రమా
ముఖము వాని కిరు మ్రొక్కులిడుఁడు!
(గాథా)

తే. తాను మగపాడి పోఁడిమి దేని నిల్వు
టద్దముగఁ జేసికొని లక్ష్మి యభ్యసించు
బింబితప్రేయసీ శరీరంబు జయము
గాంచుత సకౌస్తుభము రమాకాంతునురము.
(ఆర్యా)

గాథాసప్తశతి – బిహారీసత్సయీ

ఆ. అన్యసతుల ఎదసమందును బక్కల
ధవళ దీర్ఘ నీలతాంతములగు
కన్నుఁదమ్మి లుండుఁగాని చూచుటలోని
తీరుతీయములను వారెఱుఁగరు.
(గాథా)

ఆ. వెడఁదవాలుఁగనులు పడసిన స్త్రీ లీ జ
గాన నెందఱేనిఁ గలరు; కాని
రసికజనుల లోఁబఱచుకొనఁజాలు వా
లారుఁజూపు పఱుచు తీరె వేఱు.
(బిహారీసత్సయీ)

కావ్యకవితారసికు లీ గాథాకావ్యము నొక పారాయణగ్రంథముగ స్వీకరింతురు. మానవహృద్గత ములగు భావాణువులతోబాటు నాటి వాతావరణ మంతయు ప్రతిఫలించునట్లు కూర్పబడిన ఇందలి పదసంయోజనము అనిదంపూర్వము. ప్రజల హృద యములయందు దాగియున్న సహజశృంగార భావ వైభవమును తేటతెల్లముగ నిర్వచించు విజ్ఞానసర్వస్వ మీ గాథాకావ్యము. తాత్త్వికదృష్టితో నీ కావ్యమును పరిశీలించు స్నిగ్ధులకు ఇందలి సర్వోదయసూక్తులు స్పష్టముగ గోచరించును. ప్రతిగాథయందును ఒక చమత్కారముతోపాటు ఐహిక జీవితవృత్తాంతము ప్రతిబింబించుచుండును. రసజ్ఞపాఠకుల పరిశీలనా ర్థము కొన్నిగాథలు ఉదాహరింతును చూడుడు!

దంపతీప్రణయజీవితమునకు స్వస్త్యయనము గావింప పార్వతీపరమేశ్వరుల దాంపత్య ప్రణయ జీవితమును ప్రస్తావించుచు మంగళారంభముచేయు నీగాథలోని అర్థవైభవమును ఆలోచింపుడు!

ఆ. కోపరేఖ కెంపుగొన్న గౌరీముఖ
చంద్రు ప్రతిమ లోన సంక్రమింప
నాహితార్చనాబ్జ మట్టున్న శివుని సం
ధ్యాజలాంజలికిఁ బ్రణామ మిడుఁడు. 1–1

లౌకికజీవిత సౌభాగ్యమునకు ప్రాకృతకావ్య మును ఎంత పరమార్థముగ రసజ్ఞులు భావించెదరో ఈక్రిందిగాథ చూడుడు!

ఆ. ప్రాకృతప్రణీతబంధం బమృత మది
చదువ వినఁగ బుద్ధి చననివారు
కమ్మవింటివేని కళలోని తత్త్వార్థ
చింత సేయుపట్ల సిగ్గుపడరె! 1–2

గాథాకావ్యప్రతిపత్తిని వివరించు నీక్రింది గాథార్థమును చూడుడు!

ఆ. స్వరచిత మ్ములైన సాలంక్రియా కోటి
గాథలందు నేర్చి కమ్మఁదనము
గురియు నేడునూర్లుగూర్చె హాలుఁడు శాత
వాహనుండు సుకవివత్సలుండు. 1–3

ఉద్యానవనిలోని గోరంటమొక్కకు గల దోహదభాగ్యము తనకులేదుగదా! అని వగచు నిల్లాలి

ఈ వ్యాసమం దుదాహృతములైన తెలుగు పద్యము లన్నియును మదీయములు.

మనోరథము ఎంత పరిహాసపేశలముగ నీగాథయందు చిత్రింపబడినదో చూడుడు !

ఆ కురవకమ్ము కొఱకు నరసెదుగాని నీ
కొఱకు దోహదమ్ము నరయవేల ?
యనుచు నవ్వుచున్న దటుచూడు ! నీజాయ
మొగము చాటుచేసి సొగసుకాఁడ ! 1–6

అనాడు మధ్యమధ్య జనుము చాళ్ళుపెట్టి వరి నాటెదరను చరిత్రాంశమును సంకేత సంకథా కలనముతో భూషించిన హాలుని ఈగాథ చూడుడు!

ఆ వరిపొలాలు పలుకఁబాఱుచుండఁగ దేని
కీవు మొగమువాల్చి యేడ్చె? దదిగో!
విరిసె జనుముచాలు! హరితాళమున మోము
చాయమీఱు రంగసానివోలె. 1–9

ఆనాటి యిల్లాండ్రెంత గొప్ప విదుషీమణు లైనను వంటవార్పులను స్వయముగానే చేసికొనువారు అను సంప్రదాయమును సూచించు ఈక్రిందిగాథ యందలి వ్యంగ్యకలాసౌరభ మాఘ్రాణింపుడు !

ఆ. పంటపనులకెల్ల వలఁతివీవౌదు! కో
పమును విడుము! రక్తపాటలముల
వలచు నూరుపులకు వాఁచిపోవుచుఁ బొగ
చూఱఁగాని మండఁజూడఁడగ్ని. 1–14

ప్రభు సమ్మితములకంటె పదనైన శాసనముద్ర వేయగల నాటి కులీనతా ప్రభుత్వదర్పమును ఈ క్రిందిగాథయందు చూడుడు!

ఆ. ఇష్టమైనవారి యెడఁబాటు నిష్టము
కానివారి నెపుడుఁ గాంచుచుంట
యింతలేసి యిడుమ లీ రెండు భరియింతు
దేనికో కులీనతా! నమోస్తు! 1–24

సమష్టి కుటుంబ జీవితమందు దురదృష్టవశమున సంభవించు విషమపరిస్థితులను భారతసాధ్వు లెట్లధిగమింతురో ఈగాథ చూడుడు !

ఆ. మంచిమనసులేని మఱఁదికిఁ బవలెల్లఁ
గులముకోడ లింటిగోడమీఁద
వ్రాయఁబడిన కౌసలేయుఁగొల్చు సుమిత్ర
కొడుకుచరితలెల్ల నుడువుచుండు. 1–35

ఇట్టి దుష్టశక్తులమధ్య తాను జీవించుచున్నను తన యీలువును నిలబెట్టుకొనజాలిన భారతసాధ్విని ఈగాథయందు చూడుడు!

ఆ ఇల్లు చత్వరమున, నిరుగున జారిణి,
లేమిబాధ, యూరలేఁడు మగఁడు,
జవ్వనమ్ము నందచందాలుఁగలవైనఁ
జివురుఁబోఁడి నడత చెడదుగాద! 1–36

పేదఱికములో మ్రగ్గుచున్నను భర్తృవ్రతలైన మానవతు లెంత రాజసముగ కాపురము దిద్దికొందురో ఈగాథయందు చూడుడు!

ఆ. మానుషమ్ము వంశమర్యాద పాటించు
పేదమగని యింటిపేరు నిలుపఁ
గినియు బారుబూరు మనివచ్చు నెట్టి పో
రాని బంధులకును వానిగృహిణి. 1–38

వేశ్యమాతల కపటనాటకములో పూపవేశ్యల పాత్ర చిత్రణమీగాథయందెంత సుమనోహరముగ ప్రదర్శింపబడినదో చూడుడు !

ఆ. కపటనాటకమ్ముఁ గన్నారఁ గని తెగి
పడిన వలపు మఱల ముడినిడంగ
సరసమగునె? క్రాఁగి చల్లాఱిన జలమ్ము
విరసమగునె కాక వెఱ్ఱితల్లి. 1–53

నాటి సంగ్రామ సంప్రదాయముల వైఖరియు, నృపవీరుల ధనుష్టంకార ప్రభావమును ఈ క్రింది గాథయందు చూడుడు!

ఆ. పిడుగుమ్రోఁతకంటె బెడిదమౌపతి ధను
శ్శింజినీరవమ్ము చెవులు సోఁకఁ

దన్నుఁబోలెఁ జెఱను దవిలిన సతులక
న్నీరుఁగూడ బంది పాఱఁ దుడిచె. 1–54

వల్లభుని ప్రవాసగమనము నాఁగుటకు వర్షాగమమును అన్యాపదేశముగ సూచించు వాని యిల్లాలి ఉక్తిచాతుర్యము నీక్రింది గాథయందు పరిశీలింపుడు!

ఆ. నగమువిచ్చు శుక్తిసంపుటి బ్రహ్మ మీ
ముడుచుకొన్న తోకమొనకు సాటి
యగుచు నదిగొ! పక్వమైన మామిడిటెంకెఁ
దొలిచి వెలికివెడలు పిలకచూడు! 1–62

సమష్టికుటుంబ శాంతిపరిరక్షణకు భారత కులాంగన లెంత ఓరిమి చూపగలరో ఈక్రిందిగాథ చూడుడు!

ఆ. తన మగండు నమ్మఁదగని సాహసి చెడ్డ
మనసువాఁడు మఱఁది మధ్య వధువు
నలఁగుచున్నఁగూడ వెలిపుచ్చదు సుశీల
యింటిగుట్టు వీథికెక్కననుచు. 1–59

భర్తృవాల్లభ్యము గడించిన సౌభాగ్యవతు లెంతగర్వముతో ప్రవర్తించెదరో ఈ గాథ యందు చూడుడు!

ఆ. ఉత్సవమున సవతు లుల్లాసరభసలై
స్నానమాడి నగలుపూని తిరుగ
జలక మాడకయె స్వసౌభాగ్యమునుదెల్పు
కరణి వారిమధ్యఁ దిరుగు నార్య. 1–79

అనుభవ జ్ఞానధన్యుడు హాల భూపాలుడు ప్రేమము తాత్కాలికమైనదేకాని శాశ్వతమైనదికాదని ఈ గాథయందెట్లు దృష్టాంతీకరించు చున్నాడో చూడుడు!

ఆ. నిరతదర్శనమున నీచునకు నదర్శ
నమ్మువలన స్త్రీజనమ్మునకును
మూఢమతికిఁ గొండెముల దురాత్మునకు ని
ర్హేతుకముగ నంతరించుఁ బ్రేమ. 1–81

చలినాటి బాటసారి ఈ గాథాచిత్రమందెట్లు సాక్షాత్కరించుచున్నాడో చూడుడు!

ఆ. ఊరిదేవళమ్ము ద్వారమ్ముచెంత హే
మంతకాలపథికుఁ డదిగొ! చూడు!
కాలి చల్లనాఱు గడ్డినిప్పును భల్లు
కమునుబోలె నెగచి కలఁచుచుండె. 2–9

కన్నతల్లికి బిడ్డలపైనుండు ప్రేమానురాగము లెట్టివో దృష్టాంతీకరించుచున్న ఈ క్రిందిగాథలోని పరమార్థమును దర్శింపుడు!

ఆ. ఒడ్డుమీఁది గూటనున్న బిడ్డలఁ బ్రోవ
దత్తచిత్తయగుచుఁ దాను మునిఁగి
పోదునన్నభయము పోఁబెట్టి వెల్లితోఁ
గదలిపోవు కాకి నదిగొ! చూడు! 2–2

సత్పురుషులతోడి స్నేహము వారి కిచ్చిన ఋణమట్లు నిత్యవృద్ధితో ఫలించునను ప్రత్యక్షసిద్ధాంతమును ప్రదర్శించుచున్న ఈగాథ చూడుడు!

ఆ. మొదటినుండి తుట్టతుదదాఁక నొకరీతి
యేరి చెలిమి నిత్యవృద్ధితోడఁ
బుత్రులందు ఋణమువోలె ఫలించునో
యట్టి పురుషవర్యు లరిదిగాద! 2–13

ఆటవికజాతుల యింగితజ్ఞాన పాండిత్యమెంత నిశితమైనదో ఈగాథయందు చూడుడు!

ఆ. గంధకరుల గండఘర్షణవమధు క
శ్మలములగు తమాలశాఖ లరసి
ధవుని మృతి గ్రహించెఁ దనయంతఁగానె పు
ట్టింటినుండి వచ్చు నెఱుకుసాని. 2–21

తిన్నయింటి వాసాలు లెక్కించు ఖలజనుల జీవితచరిత్ర మెంత స్పష్టముగ నీ గాథయందు నిరూపింపబడినదో చూడుడు!

ఆ. ఎంత స్నేహదానమిడి యాశ్రయంబిచ్చి
యాదరించినను దదాలయమునె
కశ్మలం బొనర్చుఁ గానంతలోపలే
ఖలజనుండు దీపకళికవోలె  2–35

రాత్రిందివము లెంత పెరుగుచున్నను లుబ్ధు చేతిలోని దనము వట్టి పనికిమాలిన దంధనమే యగు నని దృష్టాంతీకరించు ఈగాథార్థమును పరిశీలింపుడు!

ఆ. కలిమి లోభివాని కరమునం దెంతగా
నిరత మెదుగుచున్న నిప్పులంబె
మండుగ్రీష్మవేళ నెండవేఁడికి మాఁడు
పథికునకును దనదు పాపవోలె.  2–36

వసంతాగమమును సూచించు ఈగాథలోని యుక్తిచాతుర్య మెంతహృదయంగమముగ ప్రదర్శింపబడినదో చూడుడు!

ఆ. మొదటి పూవుగుత్తి కుదిరెడి ప్రస్థాన
కలశమందు నీవు నిలిపినట్టి
లేఁతమావి చివురె యాతని పయనమ్ముఁ
బరిహరించు దుఃఖపడకు! బిడ్డ!  2–43

అనంతరసమగ్నులగువా రాశ్రితుల కోర్కెలు తీర్చుటలో వెనుకాడరు అను సూక్తిని సాహితీరస భావకుల నవనవోన్మేష ప్రతిభకొక నికషోపలముగ శాతవాహనకవిసార్వభౌముడు సృష్టించిన ఈగాథలోని కళాకౌశలమును పరీక్షింపుడు!

ఆ. సూర్యబింబమందుఁ జొచ్చిన యకలంక
చంద్రబింబమునకు సాటియగుచు
వేని కౌస్తుభముఁ గానిపించును రమా
ముఖము వాని కీరు మ్రొక్కులిడుఁడు!  2–51

ప్రోషితపతికలగు నాటి పేదయిల్లాండ్రు ఆత్మవల్లభులు వ్రాసియుంచిన గోడమీఁది గడువుగుర్తు నెంత ప్రాణపణముగ రక్షించుకొనుచుండెడివారో ఈ గాథయందు చూడుడు!

ఆ. ఏఁచి వీచు గాలి కింటికప్పెగిరి క్రం
తలను గురియు వానఁదడియు ననుచు
గోడమీఁది గడువుగుఱుతుఁ గేలొడ్డి ర
క్షించుచున్నదదిగొ! గేస్తురాలు  2–70

భర్తృవాల్లభ్యమును గడింపజాలినవి లావణ్యతారతమ్యములే కాని వేషభూషలుకావని రుజూకరించు ఈ గాథార్థమును పరిశీలింపుడు!

ఆ. గంధకరుల కుంభగతములౌ ముత్యాల
సరులుబాల్చు సవతిజనముమధ్యఁ
బొగరు దొలఁక నెమ్మిపురి మౌళి సొమ్ముగాఁ
జెక్కి తిరుగుఁ జెంచుఁ జివురుఁబోఁడి.  2-73

ధూర్తవల్లభులను విదగ్ధకాంతలు శిక్షించు నుడికారపు తీరుతెన్ను లెంత కవితామయములుగ నుండునో ఈ గాథయందు చూడుడు!

ఆ. దాని మోమునుండి నీ నెమ్మొగాన నా
కాలిమీఁద నీ మొగమ్మునుండి
చేరెఁ దిలక మిన్ని చేతులఁ జెయిమార్చి
గరిడిసాములెల్ల నెఱపినట్లు,  2–79

ఈ లోకులాదరించి సన్మానించువారెట్టి గ్రంథసాంగులో నిర్వచించు ఈ గాథాగతసూక్తి విశేషములను చూడుడు!

ఆ. ఓనమాలుగూడ రానివారినె గౌర
వాధికులుగ లోకు లాదరింత్రు
తమ భుజాగ్రములను దాల్తురుగద నిర
క్షరమయినను స్వర్ణకరుని త్రాసు.  2–81

అప్పయదీక్షితాద్యాలంకారికుల హృదయములు మథించివైచి చిరకాలమునుండియు కావ్యాలంకారమార్మికుల కంఠమందొక మణిహారమువోలె వెలుగుచున్న ఈక్రింది గాథాప్రయోజన మనుభవింపుడు!

ఆ. నేనుగాను దూతి నీవుగావు ప్రియుండ
విదట మనకుఁ గల పనేమి గాని
నింద నీకు వచ్చునే దాని చావుచే
ననుచు నేను ధర్మమాడుచుంటి. 2–78

ఆనాటి హాలికనందనుల శృంగారభంగిమలు ఈక్రింది గాథలయందు చూడుడు !

ఆ. జంబుదళము తనకు శ్రవణభూషణముగా
నందు నిందు మెలఁగు హాలికతనయు
సగము కనులఁజూచు చామనచాయ జ
వ్వనిముఖమ్ము నల్లవాతెఁ జూడు ! 2–80

ఆనాటి స్త్రీలు శ్యామశబలవ్రతము అను నొక వ్రతముపట్టి నోఁచెదరనుటకు ఈక్రింది గాథార్థమును పరిశీలింపుడు !

ఆ. నిడుపులైన వేఁడి నిట్టూరుపులఁ గ్రాఁగి
యశ్రుసలిలసిక్తమైన దాని
మోవి కానిపించు నీ వియోగమునందు
శ్యామశబలవ్రతము సలుపునట్లు. 2–85

ఆత్మదయితునకు కాలజ్ఞానముపదేశించు నొక చదురాలి యుక్తిచాతుర్య మెంత లౌకికజ్ఞాన ధన్యమైనదో ఈ గాథయందు చూడుడు !

ఆ. కొడుకు గంటువెట్టెఁ గ్రొత్తగా మొలచిన
పల్లువోయి ననుచుఁ బ్రాణపత్ని
నగుమొగమ్ముతోడ మగనిచేతికొసంగె
నిదిగొ! చూడుఁడనుచు బదరఫలము. 2–100

డెందములఁ గదల్చివైచు దెసమాలిన దీనావస్థలోబడి కుమిలికుమిలి కృశించిపోవు నాటి ప్రోషితపతికలను ఈ గాథాదర్శమందు చూడుడు !

ఆ. అవనతాంగి యగుచు నర్వగు నాలు కే
ల్సాఁచివైచునపుడు జాఱిపడిన
గాజునడుమనున్న కబళమ్ముఁ దన కురి
వెట్టిరనుచుఁ గాకిముట్ట వెఱచు. 3–5

'పయిగాలిసోకినన్ వెన్నవలెన్ గరంగు నలివేణులు' అన్న పల్లీపల్లవాధరలే అనుట కీగాథ చూడుడు !

ఆ. పల్లె కాలునపుడు పంటి నాచేఁ జేయిఁ
గొలిపి వాఁడు మార్చుకొనియెఁ గాన
నఖిల మందు దగ్ధమగుచున్నఁగూడ నా
నందకందమయ్యె నాయెడంద. 9–29

దాతృత్వ రసికత్వములతోడి పేదఱికపు బ్రతుకు ఈ మానవలోకమందెంత కష్టభాజనమో ఈ గాథ చూడుడు !

ఆ. కొమ్మలాకులేది కుబ్జయై యే కాన
నైన బుట్టవచ్చుఁ గాని మనుజ
జాతి పుట్టుచోట దాతయై రసికుఁడై
పేదవాఁడు పుట్టరాదుగాద ! 3–30

సహజ గుణసంపన్నమగు సామగ్రిముందు కృత్రిమోపకరణముల విలువ నిలువదను అంశమును భువనోపజీవ్యుడు హాలుడు సకల జగతీరసికుల కొక రసాయనముగ ప్రసాదించిన ఈ గాథాహృదయమును పరిశీలింపుడు !

ఆ. మాఘమాసమందు మఱి పచ్చడం బమ్మి,
కొనియె హాలికుఁ డొక్క కోడెగిత్త
పూపవయసుజాయ పొగలేని కుంపట్లు
వలుద గుబ్బచనులవంకఁ గనుచు. 6–38

అమాయికలగు పామరాగనల అల్పసంతోషమును సహజభావబంధురముగ రసికుల హృదయములు పులకితములగునట్లు చిత్రింపబడిన ఈ గాథ చూడుడు !

ఆ. లభ్యపడని గొప్ప లాభమొందిన యట్లు
కుసుమపూవు వన్నె కోక గట్టి
వీటనున్న రాజవీథులఁ బట్టఁ బ
గ్గాలులేక తిరుగుఁ గాఁపు వెలఁది. 3–41

గాథాకారు డెంత ఆరోగ్యశాస్త్ర విజ్ఞానసంప న్నుడో ఈ గాథాప్రయోజనమును పరామర్శింపుడు.

ఆ. ఒక్కనాఁటి కాఁక యొక నెల కాను
పొన్నెలల కడుపు నాఁటవలని యలుపు
కలిగి వలచు ప్రియలఁ గామించి వఱరాచ
సుఖములెల్ల సుతుఁడ! చూచిగొనుము. 3–59

అభిజాతలగు భారతకులాంగనల గభీరప్రకృతి యెంత దుర్జ్ఞేయమో ఈ గాథయందు చూడుడు !

ఆ. అదరము వివేకవైముఖ్యములు నున్న
కొలఁదిఁ జూపఁజాలు కులముసతుల
యెదఁదలను విరక్తి యెంతగల్గిన దాని
పొలకువైనఁ జూడఁ గలమె? సుతుఁడ! 3–66

నయవినయ గుణసంపన్నులగు మహనీయుల సహజస్వభావ మెంత ఉన్నతమైనదో ఈ గాథయందు చూడుడు !

ఆ. ఫల విపత్తియందుఁ బరమోన్నతి వహించి
ఫలము కలిమి వినయభంగి మెఱసి
మహితులైన వారి మనము భాసిలు మహా
భూరుహోచ్చ శిఖరములును బోలె. 3–82

'నా' యన్న దిక్కేకనిపించని నిఱుపేదల జీవితదైన్యమును ఱాలు కరగునట్లు కొండలు ద్రవించునట్లు కరుణామూర్తి శాతవాహనచక్రవర్తి చిత్రించిన ఈ గాథాతత్త్వమును పరామర్శింపుడు !

ఆ. చీకుఁ జింతగూడ లేక తల్లీ! యెట్టి
పులుఁగులైనఁ బొట్టపోసికొనును
గొందలైన లేమిఁ గ్రుంగిపోయినవారి
నుద్ధరించు సుమతు లుందురేని. 3–85

ప్రేమతత్త్వార్థదీపిక యగు మృగదంపతుల చరితార్థజీవిత మీ గాథయందు చూడుడు !

ఆ. కానలోని గడ్డి కానలోని జలమ్ము
వెదకికొనుచు దేనికదియె బ్రదుకు
గడుపుకొనుచు నుండుఁ గాని కురంగదం
పతుల ప్రేమ కవధి మృతియెకాద ! 3–91

పల్లీపురంధ్రుల సహజానురాగ సంభ్రమమగు నొక హృదయంగమ దృశ్యమును ఈ క్రిందిగాథ యందు చూడుడు !

ఆ. జాజిపోవుకొప్పుఁ జీరెముడియుఁ గేలి
కొనలఁ జక్కదిద్దుకొనుచు నుఱుకు
మనసుకలఁగ మంగలినిఁ జూచి భయముతోఁ
బఱచు బాలు నంటిపట్ట గృహిణి. 3–91

భారతాంగనల భర్తృవ్రతతత్పరత్వ మీక్రింది గాథయందు చూడుడు !

ఆ. ఎంతపేదయైన నెంత వృద్ధైనను
నెంత రూపహీనుఁడేనిఁ గులము
సతుల కాత్మధవుఁడు సత మంతకంతకుఁ
బరమమైన ప్రేమపాత్ర మగును. 3–93

నాటి బౌద్ధమత ప్రాభవము దేశమందెల్లెడల నెంత వ్యాప్తిలోనున్నదో సూచించు ఈగాథ చూడుడు!

ఆ. బుద్ధదేవు పాదములకు సాఁగిలు భిక్షు
తతుల చేతఁ బోలె క్షితితలమ్ము
చిలుక ముక్కుతోడఁ దులఁ దూఁగు మోదుగు
పూలతోడ నిండి పొలుచుఁ జూడు ! 4–8

వ్యంగ్యవైభవ ముట్టిపడు పల్లీపల్లవాధరల వచన రచనాచమత్కార మీగాథయందు చూడుడు !

ఆ. అనుభవింపు! ప్రాప్తమైనది; మాకెట్లు
వచ్చు లవణ? మిట్టి పల్లెకొంప
నెంత లవణమున్న నేమి నీకొరగు? స్నే
హమ్ము లేనిచోట నెమ్మెకాఁడ ! 4–16

మేలు మఱవజాలని పేదసంసారుల సౌజన్య సౌశీల్యముల నీ గాథయందు చూడుడు!

ఆ. పరుల మన్ననలను బడసియుఁ బ్రీతిచేయ
లేక సజ్జనుండు లేనివాఁడు
పడినయంతబాధ పడఁడెన్నఁడేనిఁ ద
న్నొరులు పరిభవించుచున్నఁగూడ. 4–20

చెలికారపు రహస్యగోపనమును అసిధారా వ్రతముగఁ బాలించు సజ్జనుల వ్రతదీక్షాతత్పరత్వ మీ గాథయందు చూడుడు!

ఆ. ఎట్టి కలహవేళనేనియు వెలికిరా
వాత్మయందె జీర్ణమగుచునుండు
మంచివారు విన్న మఱుఁగు మాటలు వారి
యంతమునఁ జితాగ్ని యాహుతించు. 4–21

మా సంకల్పములన్నియు మీ శ్రీమతియే నెర వేర్చినదిగదా అని ఆత్మవల్లభు నుల్లసమాడు నొక చదురాలి చతురోక్తివిలాస మీగాథ నుందు చూడుడు!

ఆ. ఎడఁదయందు గృహిణి నిడుకొనివచ్చి మా
డెందముల వసించుచుందు వీవు
కానియెడల సొగసుకాఁడ! నా మదిలోని
కోర్కె లామె కెట్లు గోచరించు? 4–37

దుర్గతజనుల కడగండ్లను కన్నులకు కట్టినట్లు ప్రత్యక్షీకరించు ఈ గాథ చూడుడు!

ఆ. ఎండుపిడుకనిప్పులెగచు కంపునఁ బొగ
వాఱి పోఁగులెడసి వలయుఁబోని
పాఁతె చూడు! పుండువంటి యీ చలివేళ
వీని బీదతనము వెల్లడించు. 4–29

వేషధారులగు ఆషాఢభూతుల పగటిభాగవత మెంత పరిహాసమాసముగ ప్రదర్శించుచున్నదో ఈ గాథ చూడుడు!

ఆ. సూర్యుఁడనెడిమిషను సుతుఁడ! కేల్మోడ్చి నీ
విట్లు మ్రొక్కుచుందు వెవరికోస
మఁటతి నగవు లిట్టి యరవాలుఁజూపులున్
గలవె దేవతలను దెలఁచునపుడు. 4–32

సజ్జనులకు మంచి నడవడి యలవఱచుకొనుట కంటె జీవితపరమార్థ మొండేదియులేదని చాటించు ఈగాథ చూడుడు!

ఆ. పూలకోఁత లిఁకను జాలిన్ని నీళ్లెత్తి
దోయిలింప సురలు తుష్టిగొండ్రు
కొడుక! మూలముట్ట నడవడి పొడమాపు
గౌతమీతలమునఁ గాలిడకుము! 4–55

వృద్ధవేశ్యలభక్తి వైరాగ్యప్రసంగములను రస భావయుక్తముగ పరిహాసపేశలముగ చిత్రించిన సుకవి వత్సలుని వాణీవిలాసము నీ గాథయందు చూడుడు.

ఆ. తరుణపిటులునాకుఁ దల్రిండుగా నాఁడు
పెట్టినట్టి గుజ్జువేల్పు ప్రతిమ
నేను మ్రొక్కుచున్నదాన నిప్పుడు హత
వార్ధకంబ! తృప్తిపడుము! చాలు. 4-72

అనుభవైక వేద్యమగు పత్నీ వియోగవ్యథకు అక్షరాకృతి ప్రసాదించిన హాలభూపాలుని ఈగాథ చూడుడు.

ఆ. నిదులుత్రవ్వి కొన్న పిదపఁ గన్పడుచోటు
లట్లు మునురమించి నట్టిచోటు
లాలిఁబాసి శూన్యమగు నింట నెద దగ్ధ
మగుచునుండఁ జూచు హాలధరుండు. 4–73

సహజగంభీరమగు ప్రకృతితోడి సత్పురుషుల జీవిత సంగ్రహ మీ గాథయందు చూడుడు!

ఆ. ఇడుమలందు దుఃఖపడరెన్నఁడును దొట్రు
పడరు భయముగలుగు పట్టులందు
వైభవముల గర్వపడరు బాగోగు లం
దొక్కరీతి సుజనులుంద్రు చెలియ! 4–80

యూథాధిపతులనుగూడ వివశులను జేయ జాలు ప్రేమరసప్రభావ మీ గాథయందు చూడుడు!

ఆ. ఎంతక్రుత్తువలన సంతపించుచునున్న
దయితమొగము జక్షిక్కిగిలినంత
వడఁ బడంగఁదొడఁగె వారణేంద్రు(ఁ)డు కేలఁ
దాల్చియున్న లేఁతతమ్మితూండ్లు. 4–83

ఆ కాలమున రాజద్వేషమున్న ప్రజలెంత భయకంపిత లగుచుండిరో వ్యంగ్యార్థసంపద పరమార్థ మగునట్లు చిత్రించిన ఈగాథ చూడుడు!

ఆ. తీయమావు లాకువేయుచోటనె మొల
కెత్తెనెదియొ! చూడుమీ! యటంచు
వెఱచి వెఱచి రాజవిద్వేషకథవోలెఁ
బథికుఁడాడుఁ దోడి పథికుతోడ. 4–96

బలశాలులైన కొడుకు లెక్కివచ్చునప్పుడు కన్న తలిదండ్రు లెంత అహంకరించి తిరుగుచుందురో దృష్టాంతీకరించు ఈగాథ చూడుడు!

ఆ. కొడుకు నిడుదమోము కడవెడలిన వాఁడి
దంష్ట్రకొనను జూచి తల్లిపంది
పనియెలేకయున్నఁ బల్లెచేరువనున్న
యవలు మేయుచున్నదదిగొ! చూడు! 5–2

దేవతలనూటే మఱపించి సత్యాహింస సౌశీల్య ప్రబోధముతొ బౌద్ధమతము ప్రపంచమును ముంచెత్తు సమయమందుఁగూడ శకప్రవర్తకునకు శాతవాహన చక్రవర్తికి గణపతి ప్రస్తావనము తప్పలేదనుట కీ గాథ చూడుడు!

ఆ. ఔర్వవహ్ని గగనమలమ లీలగనె తుం
డాగ్రకర్షణముల నంబులెల్లఁ
గ్రోలివైచి సాగరుని రిక్తుఁ జేయు దు
ర్వారునకు గణాధిపతికి జయము 5–3

సహగమనముచేయు నాఁటి సతీమణుల పాతి వ్రత్య ప్రభావ మీగాథయందు చూడుడు!

ఆ. సహగమనముచేయు గృహపతిసుత తన
పతినిఁ గౌఁగిలింపఁ బరవశమునఁ
బొడము చెమటనీటఁ దడిసిన మే నంటి
యదె! చితాగ్ని చూడు! మాఱిపోయె. 5–7

కాలప్రభావమున ఎంతెంత సంస్థానము లెట్లధోగతిపాలగునో సూచించు ఈ గాథార్థమును గ్రహింపుడు!

ఆ. ఎండుబురద వేఁడి కిటుసటుఁబొర్లు పా
ఠీనకమఠములును మీనములును
గాసివడఁగఁ జెఱువు గర్భమీగతినేఁడు
కంటఁబడియెఁజూడు! కాలమహిమ. 5–14

తమ చెప్పుచేతల నంటియుండు సరళస్వభావు లను వక్రబుద్ధులగువారు తొలుత దగ్గఱకు తీసికొని పిదప దూరముగ నెట్లు పతనముచేయుదురో ఈగాథ యందు చూడుడు!

ఆ. సహజసరళమైన స్వగుణలగ్నంబైన
విల్లు శరము నవల విసరివైచు
చెలియ! వక్రఋజుకముల మధ్యనుండెడి
చెలిమి యెన్నినాళ్లు నిలువఁగలదు? 5–24

ప్రజలకెందము నొవ్వకయుండునట్లు వారి నుండి పన్నుతీసికొను మృదువిధానమును దృష్టాంతీక రించుచు శాతవాహన చక్రవర్తి చిత్రించిన ఈగాథ చూడుడు!

ఆ. తనువుభారమెల్లఁ దనతెక్కలందిడి
కుశలియగుచుఁ దేఁటికోడె కాఁడు
మధువుఁగ్రోలు నదిగొ! మాలతీకలికా వి
కాసనైకశిల్పకల్పనుండు. 5–42

ఎందఱు భార్యలున్నను పెద్దభార్యదే పూజ్య స్థానమని తెలుపు ఈగాథ చూడుడు!

ఆ. సహగమనమొనర్ప సాలంకృతలు తన
యాంధ్రుచుట్టు నిలువ నాయములను

గోసివేయువేళఁ గూడఁ బ్రథమభార్య
మీఁద వ్రాలు గ్రామనాథుచూపు 5-49

వర్ణసాదృశ్య మెంతయున్నను పలుకుబడి యందుగల విశేషమే వేఱు అనుటకు ఈక్రిందిగాథ చూడుడు!

ఆ. అక్షరమ్ము లొక్కటైన సత్తా! యున్న
మర్మమెల్లఁ బలుకు మాటలందె
వలపుతోడి ముచ్చటలెవేఱు మొకమిచ్చు
కాలమాటి నాటకాలెవేఱు. 5-49

గోత్రస్ఖలనము చేసిన ధూర్తవల్లభుని శిక్షించు ఒక పోకలాఁడి చతురోక్తి విన్యాస మెంత నాగరిక ముగ నున్నదో ఈ గాథ పరిశీలింపుడు!

ఆ. కటికవాఁడ నాకుఁగల సుభగత్వ సం
పత్తి దాసిరొల్లు ప్రాప్తమగును?
దాని పేరు వొంగతనము చేసినదిగా
కీవు తెచ్చిపెట్టితిప్పుడు నాకు. 5-52

వన్యజంతువుల పరస్పర ప్రేమబంధ మెంత దుర్భేద్యమో ఈ గాథయందు చూడుడు!

ఆ. బురదఁ గూరుకొన్న కరిరాజుఁగని వాని
స్నేహ వాగురలను జిక్కుకొన్న
కరిణి వానిఁజుట్టి తిరుగు దుఃఖించుమపై
కెత్తుకొనకుఁ దుండమెత్తిచాఁచు. 5-54

ప్రేమతత్త్వ కలాహృదయమును టీకించు చున్న ఈ క్రింది గాథామర్మమును వివేచింపుడు!

ఆ గోష్ఠమందుఁ బోట్ల కోడెకొమ్మున కాత్మ
నయనపుటము మెల్లనను లగించి
కొదమగోవు గోఁకికొనుచు లోకమునకుఁ
జూపుఁ బ్రేమమహిమ చూచినావె? 5-60

ప్రాణగొడ్డమైన పనికి దిగిన మరది సాహస మును కులవధువు అత్తగారికి విన్నవించుతీరు ఈ క్రిందిగాథలో చూడుడు!

ఆ. పల్లెకెల్ల నొక్కపాదిలి మాత్రమే
గ్రామనాథునింటఁ గలదుగాన
దాని పూలు మఱఁది తలనిండఁగల విది
క్షేమమగునె మునుకుఁజెప్పు మత్త! 5-69

చెడి బ్రదికినవారి జీవితముతీరును ఈ క్రింది గాథయందు చూడుడు!

ఆ. నిండుజీవనమున నిచులు తిరిగెద
రాననమ్ములెత్తి నానలేక
యది తొలంగ సన్నములై చిరమే తాము
బానలట్టులుందురు నానలేక. 5-90

ఆనాటి అత్తకోడండ్ర మధ్యనుండు భక్తి ప్రపత్తుల సంప్రదాయ మీ గాథయందు చూడుడు!

ఆ. కోడ లంఘ్రిపూజకొఱకయి ప్రోషిత
పతిక వ్రాలుసరికిఁ బట్టుఁడలి
యున్న రెండుగాజులొకట రాలినఁజూచి
యత్తయేడ్చెఁ గోపకత్తెయయ్యు. 5-93

ఇరుగు పొరుగు అమ్మలక్కలు అడుగు కుశల ప్రశ్నకు చిరప్రవాసితుని యిల్లాలొసగు ప్రత్యుత్తర మెంత విషాదభరితముగ నున్నదో ఈగాథ చూడుడు!

ఆ. క్షేమమెచట? మామక్షేమ మీగతి మందు
చున్న; దింటిమో్రలనున్న గుజ్జు
మామి నెత్తిమీఁద మఱి పట్టుకొనివచ్చె
నదిగొ! చూడు! మొక యనర్థమిపుడు. 5-99

ప్రవాసోన్ముఖుని యింటియందు గుండెలు జలదరించునట్లు సంఘటిల్లిన ఒకనాటి దృశ్యమును ఈ గాథయందు చూడుడు!

ఆ. వీడుకొనెడిమాట విన్నంతనే చిన్న
పోయినట్టి గృహిణిమోముఁ జూచి
యెడఁదవ్రయ్య నింటిగడపయేదాఁటి కా
లటుఁ గదల్పఁడయ్యె నధ్వగుండు. 5-100

అవాఙ్మానస గోచరమగు ప్రణయగోష్ఠీతరంగ లాస్యకలావినోదమునకు అక్షరాకృతి కల్పించిన అనుభవరసికుడు పాలుడు ఈ గాథయందు పొందు పఱచినయుక్తి సంపద చూడుడు!

ఆ. చలము నీకు బొమల పొలపమ్ములును లేవు
లేదు జీవమిట్టి బీఱకనుల
నన్నుఁజూచువాఁడు నలుగురివలెనత్త!
యింకఁ జిక్కిపోక యెట్టులుండు? 6–6

పతిప్రేమలోగల ప్రాణపత్నీస్వార్థ మెంత విచిత్రమైనదో ఈ గాథయందు చూడుడు!

ఆ. ఎడఁద విడిచి యుండవేడిపించవుగాని
ప్రేమకగ్గమైన మేము నిన్ను
సంశయించుటెందు సాజమేకద! యంత
గుండె కలదె? యాఁడుకూఁతులకును. 6–8

అత్మదయితుని ఆక్షేపమును సౌమ్యముగ ప్రత్యుత్తరించు నొక యిల్లాలి సహజోక్తిప్రసంగ మీ గాథయందు చూడుడు!

ఆ. అందగత్తె సుగుణ యది యౌట నిజమె! నే
నెదియుఁగాని మాట యదియు నిజమె!
కాని నీవె చెప్పు! దానిఁ బోలని వార
లెల్లఁ జావవలెనె? యెమ్మెకాఁడ! 6–11

అభిజాతకాంతల పొలయలుకలు ఎంత గంభీర భావ ప్రణీతములో ఈ క్రిందిగాథయందు చూడుడు!

ఆ. మొలకనవ్వులెత్తి పొడుపులు బహుళ స
పర్యలెడఁదఁ గించపఱచు పనులు
కంట నీరిడుటయె కలహమాడుట మంచి
కోవలోని పుష్పకోమలులకు. 6-13

చింత విఱిగినను పులుసు విఱుగలేదను సామె తను అన్వర్థముచేయు మహాత్ముల జీవిత మీగాథ యందు చూడుడు!

ఆ. ధూళిమలినమైన దుర్దమకర్దమ
కలుషమైనఁ దనువు నిలుపఁ బ్రాణమె
గ్రాసమైననేమి? గజరాజు నిజపరి
మాణమైన డిండిమము వహించు. 6–26

ఉఱుములతో మెఱపులతో క్రమ్ముకొనివచ్చు తొలకరిమబ్బులను చూచి కుమిలి కుమిలి శోకించు ప్రోషితపతికల దీనావస్థను ఈక్రింది గాథయందు చూడుడు!

ఆ. నింగిమ్రింగుచున్న నీలిమబ్బులఁజూచి
జీవితమ్ముమీఁది చింతవిడిచి
మోముకంటినీట మునుఁగుచుండఁగఁ జంటి
పాపఁకంకఁజూచెఁ బతికునాలు. 6–38

శరీరమంతయు కృశించి కదలలేక మంచ మెక్కిన స్థితియందుగూడ నాటి ముత్తైదువలు కేలి గాజులను ఎంత ప్రాణపణముగ రక్షించుకొందురో ఈగాథ చూడుడు!

ఆ. ఐదువలకు మంగళాపాదియగు గాజు
జాఱిజాఱిపోవ సారెకలమి
తొంటిచోట నిలుపఁదొడిగెడి వృత్తియే
నిత్యకృత్యమయ్యె నెచ్చెలులకు. 6–39

చెంగావులే ధరించినను నగరకాంతల కాపు రములకుగూడ ముప్పతేజాలు సహజలావణ్య యౌవన భాసితలను నాటి పల్లెపడుచులను ఈగాథయందు చూడుడు!

ఆ. కుసుమవన్నెలెసఁగు నొసపరిరవికలే
వలయు సొమ్ముగాఁగ వలువచనుల
బింకమొప్పు పల్లె బింబాధరలు డక్క
గొందు రెంతవారి డెందమైన. 6–45

ఆపత్సమయమందు విరుద్ధ ప్రకృతిగలవారు గూడ యెట్లన్యోన్యమైత్రితో నుందురో ఈ గాథయందు చూడుడు!

ఆ. కోడెత్రాఁచుఁ జూచి కొండజాలని యెంద
కాఁక కడలి దున్న నాకుచుండె
పాముగూడఁ గృష్ణపాషాణ ఘురియంచు
దాని చొంగరసము త్రావుచుండె. 6–51

లోకమర్యాద నతిక్రమించినవారికి చెఱసాల తప్పదను భయముతో దుఃఖాశ్రుబిందువులు రాల్చు నాటి లోకమును దృష్టాంతీకరించు ఈ గాథ చూడుడు!

ఆ. జలకమాడి నిలుచు సమయమందున దాని
పిఱుఁదు లంటి వ్రేలు కురులు చూడు!
భావిబంధనైకభయముచే జాఱెడి
జలకణముల నేడ్చు జాడనుండె. 6–55

ప్రణయకలహమును పట్టువిడువక దీర్ఘముగ పెంచుకొను ప్రియురాండ్రు రసికులగు వారివల్లభు లొసగు మద్యగండూషమును రోషౌషధమట్లు సేవించు వైఖరి నీ గాథాచిత్రమున చూడుడు!

ఆ. చికురపాశ మొడిసి చేకొనఁ గిన్కమై
వదనమెత్తి మానవంతురాలు
కాంతుఁ డొసఁగు మద్యగండూష ముగ్ర రో
షౌషధమ్మువోలె నారగించు. 6–50

అమాయికలగు నాటి పల్లెకాంతల పవిత్రప్రేమ లెంత తీవ్రములో ఈ గాథయందు చూడుడు!

ఆ. చేట దగ్ధమయ్యె సెనగల వేఁపుడు
ముగియ దతఁడు చూపుమిగిలిపోయె
నత్త కినుకపూనె నఖిలమ్ముఁ జెపిటికిఁ
బట్టు శంఖమట్లు పదటవోయె. 6–57

భావప్రకాశపు ప్రణాళికలోని ఒక అంశమును ఈ గాథయందు చూడుడు!

ఆ. కినుక దవ్వు పెంచుకొని పట్టిపట్టక
మాటలాడు నపుడు మా మనమ్ము
పడినయంత బాధపడదు మాటాడుటే
మానవంతురాలు మానుకొన్న. 6–64

సుకవివత్సలుని ఈ క్రింది గాథాశిల్పములో ప్రతిబింబితమగు చంద్రవంకను చూచి ఆనందింపుడు!

ఆ. కుసుమవన్నె పైట ముసుఁగులో నవవధూ
స్తనతటమునఁ దోఁచు చంద్రవంక
క్రియ వెలుంగు సంజకెంజాయపొదివిన
చదల విదియనాఁటి చంద్రవంక. 6–69

పెన్నిధానముమీదను అన్నుమిన్నల మీదను గల ఆసక్తిలోని తంతులు ఈగాథయందు చూడుడు!

ఆ. కోడెత్రాఁచు గాచుకొన్న నిధానకుం
భమునఁ బోలె వీరపత్ని చంట
సారెసారె దృష్టి సారింత్రు చోరులు
కోరికయును భయము గ్రుమ్ములాడ. 6–76

ఉలికిపడి మేల్కొన్న శయ్యాగతుని ధూర్త వల్లభుని లాలించు నొక యిల్లాలి చతురప్రసంగ మీ గాథయందు చూడుడు!

ఆ. ఆతురముగఁ గోడికూఁతతోడనె మేలు
కొంటి! కౌఁగిలించుకొనుము నన్ను
నింటియాలి నొరుల యిల్లంచు నురియాడె
దింతభయమె? సొంతయింటఁగూడ. 6–82

సురతమును శిల్పముగ ప్రతిపాదించి శిల్పార్థ ప్రదర్శకుడైన రసికలోక మూర్ధన్యుడు శాతవాహనుడు ఆనాటి పంజర శారికల శ్రుతపాండిత్యమును ప్రకటించినతీరు ఈ గాథయందు చూడుడు!

ఆ. గురులచెంతఁ గూడ గోర్వంక చూడు! మా
సురతశిల్ప మెలుఁగు సోడుముట్టఁ
బాడఁదొడఁగ సిగ్గు పదటఁబో నే నెందు
దూఱుటకును తల్లి! నేరనైతి. 6–89

చిరప్రవాసితులగు పథికులకు మామిడిచివురు కంటఁబడుట యెంతదుఃఖావహమో ఈ క్రింది గాథ యందు చూడుడు!

ఆ. రక్తసిక్తమగుచు రంజిల్లు మరుచేతి
బాఁకువోని మావి మోకచివురుఁ
జూచుచున్నవారు చూడు! మదే! శోక
తప్తచిత్తులగుచు దారికాండ్రు. 6–85

ప్రాణప్రయాణ సమయమందుగూడ ప్రేమగలవారి హృదయతత్త్వ మెంత విషాదభరిత దృశ్యమును ప్రదర్శించునో ఈ గాథయందు చూడుడు!

ఆ. చేతికోలఁదిఁ బట్టి చెవిదాఁక లాగి యా
యములు ప్రయ్య వాలురమ్ము నాట
నిదియె నాకుఁ బ్రియుని తుదిచూపని కురంగి
మెడ మరల్చి చాలఁతడవు చూచె. 6–93

యుద్ధోన్మాదపు దుష్ఫలితములచేత ఎంత మానధనులుగూడ అవమానము పాలుగాక తప్పదనుటకు ఈ గాథ చూడుడు !

ఆ. చేరఁగాని మావిచెట్టు చివరికొమ్మఁ
బండి వ్రేలు నొక్కపండుఁ జూచి
చంటిపాప యేడ్వసాగ దీనముగ నీ
పగతునాలు వేఁడెఁ బ్రతిపథికుని. 6–95

నాటి పుష్పలావికలు పూవులమ్ముతీరు, వానికొఱకు చుట్టితిరుగు పడుచువిటులు బేరమాడు భంగులు ఈ గాథయందు చూడుడు !

ఆ. ఎత్తులమ్మ నొక్కబిత్తఱి భుజమూల
కాంతిఁజూడ దృష్టిగనక పడుచు
విటుఁ డొకండు రిత్తబేరాలతో దాని
చుట్టుఁ దిరుగు నదిగొ! చూచినావె? 6–98

మృగయాజీవులగు కిరాతుల కర్కశహృదయముగూడ ద్రవింపఁజేయజాలిన హరిణదంపతుల ప్రణయసందేశమును ఈగాథయందు చూడుడు!

ఆ. ఒండొరులను బ్రోవ నొకట దెబ్బకు నెదు
రేచు లేడిజోడు చూచి మనసు
కలుకు మనఁగఁ గాఱు కన్నీటఁ దడిసిన
చాప మెఱుకురాజు జాఱవిడిచె. 7–1

అదిపుత్రైనవారెప్పుడును నూతన ప్రియులుగానుందురని చాటించు ఈ గాథ చూడుడు!

ఆ. కోరివచ్చి తనకుఁ గ్రొత్తభోగిని యిడు
వాయనముల రుచికి వాఁచి తిరుగు
హాలికతనయుఁ డిప్పు డన్యులొసంగు వా
యనములన్న ఛీ యటంచుఁ దొలఁగు. 7–3

భారతకులబాలికలు కోటరికమునకు పోవుటే తడవుగా చిన్నతనపు చెఱుదములకు నీళ్లువదలి తమ గృహకార్య నిర్వహణ మెంతచక్కగ చేసికొందురో ఈ గాథయందు చూడుడు!

ఆ. మొదట వధువు నీళ్ళువదలె వేడుకల కొ
య్యారములకు నవ్వులాటలకును
నవల నాత్మవిధుల నణఁకువతోఁ దీర్చు
కొనుచు నిల్లు దిద్దుకొనఁగసాగె. 7–6

ప్రియజానులగు మాంసజీవుల కటికగుండెలుగూడ కరగించు ఒక దయనీయ దృశ్యమును ఈక్రింది గాథయందు చూడుడు !

ఆ. హరిణ మొంటియగుచు నరుగ నాసాసతో
స్రుక్కవడుచు లేడి చూచుచుండఁ
బ్రియుని బ్రాణమట్లు ప్రేమించు బోయని
కేలిధనువు జాఱి నేలఁ బడియె. 7–18

సహజ సౌందర్యకలాశిల్పమున కవధిగా రవికధరించు నాటి పల్లెకాంతలను ఈ క్రింది గాథాచిత్రమున చూడుడు !

ఆ. నీలివన్నెరవికె తాలుప నంగుళ
ద్వయ మనోజ్ఞమగు కపాటమెసఁగు
లలన నిజకుచస్థలము యువలకు మచ్చు
చూపునట్లు లదిగొ! చూచినావె? 7-20

మురికివానలు కురియు వర్షాకాలమందు చంటిబిడ్డతో పూరింట కాపురమున్న చితపువాసితుని బీద యిల్లాలు పడు దురవస్థను ఈ గాథయందు చూడుడు!

ఆ. కప్పుచూరునుండి కారునీటికిఁ బాంథు
నాలు తన శిరమ్ము నడ్డుపెట్టి
తనయుఁ గాచుకొనుటె తప్ప వానినిఁ దన
కంటినీటఁ దడుపుచుంటఁ గనదు. 7–21

తనచుట్టును అప్పులవలె చేరి దోచుకొని తిను ఖలజనులమధ్య నివసించు సజ్జనుని జీవిత మెట్లుండునో ఈ గాథయందు చూడుడు!

ఆ. జాత రాచిరాచి రత్నపరీక్షక
బ్బువులు నిన్నుఁ దొలిచిపుచ్చుచుండ
నీవు గింజయంత నీవైతి విందేమి
ధరపలుకును? నీకు మరకతంబ. 7–27

నాటిచెంచురాజు లెంత సత్యపరాక్రమక్రములో వారి కాంత లెంత రాజసముగ నుండెడివారో ఈ గాథయందు చూడుడు!

ఆ. కలరు చెంచుమగలు పలువురు జింక తొ
ళ్లడుగు మెవరినైన నర్థ్యగుండ!
యెపుడు లేళ్లమీఁద నిచ్చటి మా యువ
వ్యాఘుఁడెక్కు వెట్టఁ డాత్మధనువు. 7–29

అజన్మశూరుడగు చెంచువృద్ధుని వీరోచిత వచఃప్రాగల్భ్యముతోడి పరిహాసరసప్రసంగ మీ గాథా బంధమున కెంతజీవము పోయుచున్నదో పరిశీలింపుడు!

ఆ. ఏకబాణహతినె యెంతెంత భద్ర శుం
డాలములను వ్రచ్చు నా సుతుండు
పోవు నిప్పు డంప మోపులెత్తికొని కో
డలి కటాక్షమహిమ తెలియఁబడెనె? 7–30

నాటి గ్రామాధిపతుల పౌరుషజ్ఞాన ధన్యత్వ మెంత చరితార్థమైనదో ఈ గాథ చూడుడు!

ఆ. పల్లెయెల్ల వింధ్యపర్వత మెక్కెనన్
వార్త పొక్కనీయవలవ దిప్పు
డూపిరాడుచున్న దొకవేళ గ్రామణి
బ్రదికి దీని వినిన బ్రదుకఁ డింకను. 7–31

ఆనాటి సహగమన మహోత్సవమం దపూర్వముగ సంఘటిల్లిన ఒక అద్భుతోదంత మెంతరసోత్తరముగ చిత్రింపబడినదో ఈ గాథయందు చూడుడు!

ఆ. సహగమనమువేళఁ జలిపిన వైధవ్య
మండనము కులీన మానవతికి
మఱల బ్రదికినట్టి వరుఁజూడ సుభగతా
మండనముగ నదియె మాఱె మఱల. 7-32

జాతిమాత్రోపజీవులన్న ఆ నాటి వా రెంత ఏవగించుకొనుచుండువారో ఈ గాథయందు చూడుడు!

ఆ. పట్టుబట్టి గ్రామపతి ప్రాణములు వీడు
నపుడు బుద్ధిగఱపె నాత్మజునకుఁ
బరువు చెఱుచు బ్రదుకుఁ బల్లెలో నాపేరు
సాకుచేసి బ్రదుకఁబోకు మనుచు. 7–33

కృషికలాశూన్యబుద్ధుల చేతిలో ఉప్పుగూడ పండని భూమినుండి తత్కలాకుశలులైన వారెంత రసము తీయగలరో దృష్టాంతీకరించు ఈ గాథార్థమును గ్రహింపుడు!

ఆ. మునుపు కేలుసైతమును దడుపని కొఱ
గాని చేఁపుగలుగ ధేను విపుడు
పరిమలన కలాచతురుఁడైన గోపకు
కేలుతాఁకఁ గడవపాలు పిదుకు. 7–37

ఈ గాథయందు చిత్రితమైన నాటి గిరిగ్రామముల ప్రకృతి సౌందర్య మెంత హృదయంగమముగ నున్నదో చూడుడు!

ఆ. విరియు కడిమిపూల పరిమళమ్ము శిఖండి
తాండవము విధౌతగండశిలలు



శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య

గిరినదీరవమ్ముఁ బెరసి యొప్పెడి కొండ
పల్లె లరయ నెదలు పల్లవించు. 7–36

నాటి హాలసవన కలాదీక్షావ్రతులు ఆబోతు లన్న ఎంతప్రేమతో కాపాడుచుండెడివారో ఈ గాథ చూడుడు !

ఆ. బ్రదుకుచుండు ధవళ మది నీ కొఱకు సృష్టి
కులముగూడ దాని కొఱకె బ్రదుకు
నాలపోత నీవు హాళిమై బ్రదుకు నా
గోష్ఠమెల్ల నీకుఁ గుదువయుంతు. 7–38

నాటి గ్రీష్మకాలపు చండాతపము ప్రాణికోటి కెంత దుస్సహముగ నుండెడిదో ఈ గాథ చూడుడు!

ఆ. అద్రిచఱియలగ్నమగు పాముకుబుసమ్ముఁ
గాంచి వాఁగు జాలటంచు నందుఁ
జొచ్చిచూడు! వన్యఖండాలమదె వృథా
తనశిరమ్ముఁ దడుపుకొనఁ దలంచు. 7–40

తానొకటి చేయదలచిన దైవమొకటి చేయునను సామెతను నిజకవితా సుధారసముతో రంగరించి రసజ్ఞుల కొక ఆమెతగా సుకవివత్సలుడు శాతవాహన కవిసార్వభౌముడు ప్రసాదించిన ఈ గాథ చూడుడు!

ఆ. ఆశలనెడి కుంచియల మనం బేమేమి
వ్రాసికొనునొ హృదయపటమునందు
నెఱుఁగకుండ వానినెల్ల బాలునిరీతి
నలువ చెఱిపివేయు నవ్వుకొనుచు. 7–56

సాయంసమయ మెంత సుమనోమనోహరముగ సూచింపబడినదో ఈగాథయందు చూడుడు!

ఆ. బరువుకలన వంగు తరుణశాఖాంచల
స్థలులఁ గాలుజాఱి సగము విప్పు
గొన్న ఱెక్కలార్చి కుటజాగ్రముల నిల్వ
గలిగెఁబక్షు లష్టకష్టములను. 7–60

తన అశక్తతను ప్రకటించుకొను కొడుకుచేష్టలను చూచి దుఃఖించు వీరపత్నియగు ఎఱుకుమాతను ఈ గాథయందు చూడుడు !

ఆ. తాతతండ్రు లెత్తు ధను వూఁదివారెల్ల
కనఁగఁ జెక్కుతీయు తన తనూజుఁ
గాంచి మగని చావుఁగనినయప్పటికంటె
నేడ్చె మిక్కుటముగ నెఱుకుమాత. 7-63

అవాఙ్మానసగోచరమగు సృష్టితత్త్వ ప్రభావ మెంత విచిత్రమైనదో ఈ గాథయందు చూడుడు !

ఆ. అవుర! నీవు ధవళుఁడవె యైన రంజితం
బయ్యె నస్మదంతరంగమెల్ల
యెంత రాగభరిత హృదయమందడుకొన్న
నీవు రంజితుఁడవు కావుగాద !

పేదతనమున కున్న గుణగ్రహణ పాండిత్య మెంత గొప్పదో ఈ గాథయందు చూడుడు !

ఆ. సుగుణవంతులెవరొ సుజ్ఞాను లెవ్వరో
దానధర్మ కార్య దక్షులెవరొ
చక్కగా విమర్శ సలిపి వారినె నీవు
ప్రేమతో వరింతు బీదతనమ ! 7–71

అన్ని తిథులలోని చంద్రబింబముయొక్క ఆకార వైవిధ్యమును యుగపత్తుగా ప్రదర్శించుచున్న ఈ గాథాచిత్రమును తిలకించి యానందింపుడు !

ఆ. సకలతిథిసుధాంశుసందర్శనపు వేడ్క
లీవు చూడ నుత్సహింతువేని
చూడు! మొక్కసారి సుభగుఁడా! కంచుక
మోక్షవేళ దాని ముద్దుమొగము. 7–72

చెవులు గింగురుమను ప్రచార దుందుభుల రొదలో కలిసియున్నను సుకవితావాణీ నిస్వనమును గ్రహించి వినగల గుణరసికులు కలరు అని భంగ్యం తరముగ సూచించు ఈ గాథ చూడుడు.

ఆ. జనరవమునఁ గలసినను నీ పలుకుబడి
నదిగొ! వీనుదోయి యంజలించి
బాల క్రోల సాగె నీళులం గలసిన
పాలు రాజహంస క్రోలునట్లు! 7–76

ముచ్చిబంగారమునకు వలసిన తళుకుబెళుకులు మంచిబంగారమున కేల? యని విపరించు ఈవాథ చూడుడు!

ఆ. సారెసారె కతని చరితగూరిచి చెప్పు
చెప్పు మనెదు నీకు సిగ్గులేదె!
మరువకమున కట్టి పరిమళసర్వస్వ
కేల పూలకలిమి బేలకాన! 7–77

వానలుకురిసి వెలిసినపిమ్మట నాటి పల్లెటూళ్లు ఎట్లుండునో ప్రదర్శించుచున్న ఈగాథ చూడుడు!

ఆ. నడిమి బురద పలుచబడియుండ నిరుగడ
నెండు బురదతోడ నిండియుండఁ
బల్లెనెత్తిమీఁది పాపటవోలె ర
థ్యాముఖమ్ము వెలుఁగు నదిగొ! చూడు! 7–82

నాటి జెట్టిమల్లులు వార్ధక్యమందుగూడ నెట్టి బలవీర్యసంపన్నులై యుండెడివారో ఈగాథయందు చూడుడు!

ఆ. జెట్టిపోరఁజఱచు చెంపవ్రేటులకోర్చి
వ్రేలు చెవులతోడి వృద్ధమల్లు
కటిదరించి నట్టి కచ్చడంబే గుండె
లెల్లవచ్చుఁ బిఱికి మల్లులకును. 7–84

వెన్నెలరాత్రులందు పండికైవ్రాలిన పంటను చూచుచు ఆనందగీతిక లాలాపించు హాలసహసౄకృతార్థుని ఈగాథయందు చూడుడు!

ఆ. శరదవేళఁ బయిరులొరఁగఁబండఁగ నిచ్చ
కొలఁదిఁ బాడుకొనెడి హాలికుఁజూడు!
దంచఁబడిన క్రొత్తతండులమ్ములఁబోలు
వెలఁది వెన్నియలల వెలుఁగురేల. 7–89

వేఁగుబోఁకనే నాఁగలిదున్నుటకుఁబోయి ఆకటిచిచ్చుతో నలమటించు హాలికసందనుని చిత్తవిభ్రమము నీగాథయందు చూడుడు!

ఆ. నాఁగలికినిబోయి యోగిరమ్మునుదెచ్చు
నాలిమోముఁజూచి హాలికుఁడూడ్చె
పుచ్చె కోడెగిత్తమునకుఁ బ్రాడుమెడపట్టె
డూడఁదీయఁబోయి చూడు మదిగొ! 7-92

నాఁటి జెట్టిపోరులతీరును వృద్ధమల్లుల విక్రమ గాంభీర్యమును సాముగరిడీల పోకడలను ప్రత్యక్షముగఁ జూపించు గాథాకారుని ఈ క్రిందిగాథను చూడుఁడు!

ఆ. జెట్టిపోరఁజఱచు చెంపవ్రేటులకాఁగి
వ్రేలు చెవులతోడి వృద్ధమల్లు
కటి ధరించినట్టి కచ్చడంబే గుండె
లెల్లవచ్చుఁ బిఱికి మల్లులకును. 84

ఆ కాలమునఁగూడఁ గొండెకాండ్ర జీవితము ప్రజాజీవితము నెంతకలుషితముగఁ జేయుచుండెడిదో ఈగాథ వినుఁడు!

ఆ. తగదు వీరి నమ్మ మొగమిచ్చకాలాడి
కొండిచెప్పి బ్రదుకుచుండువారు
పనులు ముగిసినంత శునకమ్ములుంబోలెఁ
దిరిగి మనల మొగమె త్రిప్పికనరు. 86

ఆనాడు శాలిధాన్యపుక్షేత్రములు అందలిపైరు పచ్చతీరు పంటల సౌభాగ్యము హాలజీవనుల అల్ప సంతోషమును ఎంత సహజముగఁ జిత్రింపఁబడెనో ఈగాథ చూడుడు!

ఆ. పయిరు లొరఁగఁబండఁ బంటకారున నిచ్చ
కొలఁదిఁ బాడుకొనెడి హాలికుఁజూడు
దంచఁబడిన క్రొత్తతండులమ్ముల నిగ
నిగలుగ్రక్కు నిండునెలలరేల. 89

క్రొత్తగా నాగలిపనిఁకిబోయిన సేద్యగానితీరును శ్రమజీవితములోని ఆకలివైభవమును దానివలనఁ గలుగుఁ దొట్రుబాటును ఒక ప్రత్యక్ష చిత్రముగఁ

జూపించు ఈ గాథారత్నమును రసజ్ఞుల కంఠమం దలంకరించుకొనుఁడు !

ఆ. చేసెపనికిఁ గ్రొత్తగానేగి యన్నము
మోచితెచ్చు దానిఁజూచి విప్పి
పుచ్చె సేద్యగాఁడు ముకుఁదాఁడు మెడపలు
పూడఁదీయఁబోయి చూడుమదిగొ ! 92

వేషభూషాది పటాటోపము లేకయే పాండితీ మండనులగు రసికుల జీవితము ప్రజల నిత్యజీవిత మున కొక నూతనోత్తేజమగు పరిమళమొసఁగఁజాలు నని దృష్టాంతీకరించు హాలరాజన్యుని ఈ గాథార్థ మును పరిశీలింపుఁడు !

ఆ. ప్రియుని జీవితవుఁజరిత్రములను మాటి
కడుగుచుందు సిగ్గుపడవు నీవు
మరువకమున కఖిల పరిమళసర్వస్వ
కేలపూలకలిమి ? బేలకాన ! 77

యువదంపతుల కాఁపురములోని ఒడుదొడుకు లను జక్కఁబఱుచుటకుఁ బ్రయోగించు ప్రౌఢపురం ధ్రుల సహజ బాషావైదుష్యమును మార్మికులు ఈ క్రిందిగాథయందుఁ దిలకింపుఁడు !

ఆ. అశ్రుమండనమున నతిమనోజ్ఞముగఁ గ
న్పడు మొగమ్ము బిడ్డ ! తుడుచుకొనుము !
వదనమండనమగు నిదియేయటంచును
మరల మరల నిట్లె నెఱపకుండు 81

నాఁటి భారతదేశములోని పల్లెలస్వరూపము వానకాలమునందెట్లుండెడివో మన కనులకుఁ బ్రత్య క్షీకరించు చారిత్రాత్మకమగు గాథాకారుని సూక్తి వైభవము నీ క్రిందిగాథయందు చూడుడు !

ఆ. నడిమి బురద పలచవడియుండ నిరుగడ
నెండుబురదతోడ నిండియుండఁ
బల్లెనెత్తిమీఁది పాపటవోలె ర
థ్యాముఖమ్ము వెలుఁగు నదిగొ ! చూడు ! 82

క్రొత్తదంపతుల సుఖజీవితములోని సుమనో మనోజ్ఞమగు నొక ఘటనావిన్యాసమును అనుభవ ధన్యముగ లౌకిక పరిభాషలోఁ జిత్రించిన కల్పనా శూరుని హాలభూపాలుని ఈగాథ వినుఁడు !

ఆ. అపరసంధ్య నింటి కరిగిన యల్లున
కించు తమక మినుమడించె నింటి
పెరటియందు వధువు చిఱుబంతిపసుపాటఁ
దెలుపు కేలి వలయ ఘుంఘురలను. 83

# కవికులపతి కాళిదాసు

శ్రీ ధూళిపాళ అర్కసోమయాజి

"యస్యాశ్చోరశ్చికురనికరః కర్ణపూరో మయూరో
భాసో హాసః కవికులపతిః కాళిదాసో విలాసః."

అను చాటూక్తిప్రకారము సరస్వతీవిలాసాయమానుఁడైన కాళిదాసు మన భారతదేశమున జన్మించుట మన భారతీయులు గర్వింపఁదగిన విషయము. పదవాక్యప్రమాణపారావారపారీణ మహామహోపాధ్యాయ మల్లినాథసూరి యంతటి షట్ఛాస్త్రపండితుఁడు కాళిదాసకావ్య వ్యాఖ్యానసందర్భమున—

"కాళిదాసగిరాం సారం కాళిదాస స్సరస్వతీ,
చతుర్ముఖోఽథవా సాక్షాత్ విదుర్నాన్యేతుమాదృశాః"

అనగా "కాళిదాస వాక్సారము కాళిదాసే యెఱుంగును; లేదా సరస్వతిచతుర్ముఖు లెఱుంగుదురు; మావంటివారలు దెలియలేరు" అనుటలో కాళిదాస కవితాప్రౌఢిమ తెలియఁదగును. కాళిదాస యశశ్చంద్రిక దిగంతవిశ్రాంతమైనది యనుటలో తార్కాణము పాశ్చాత్యవిమర్శకశిరోమణి యనఁదగు గథే యంతటి పండితునివాక్యమే

"Wouldst thou the young year's blossoms
And the fruits of its decline
And all by which the soul is charmed
Enraptured, feasted, fed
Wouldst thou the Earth the Heaven itself
In one solemn name combine
I name thee 'O Sakuntala'
And all at once is said"

అనగా "వర్షాది వసంత సంజాయమాన కుసుమ సంజాతములు, వర్షాంత సంజాయమాన ఫల నికరంబులు నీ కొకేతఱి కావలయు నన్న దేనివలన నీచేతము ఆనందపరిప్లుతమై ఆహార పరిపుష్టమగునో అది నీకు కావలయునన్న; వేయేల! దేనివలన నీకు పృథివీస్వర్గములు రెండును ఏకకాలికముగ కరతలగతము లగునో, అట్టిది 'శకుంతలా' పఠనము చేత నీ కవన్నియు సిద్ధించఁగలవు"

పై పద్యములో గథేపండితుఁడు కవితాలక్షణమునే ప్రతిపాదించియున్నాఁడు. 'కవిత' యన

నేది యను ప్రశ్నకు సహస్రాధిక నిర్వచనము లన్ని వాఙ్మయములందును గానఁగును. సాహిత్యనిష్ఠమైన రసము "బ్రహ్మానంద సబ్రహ్మచారి" యని అలంకారికుల నానుడి. కావ్యమునకు 'ఆత్మ' రసమనియే పలువురు నిశ్చయించిరి. పెద్దనామాత్యుఁడు కవితా రసమునుఁగూర్చి చెప్పఁబూని సాక్షాన్నిర్వచనమును విడచి "సొగసుకొల్కులు రావలె నాలకించినన్", "చేతముఁ జల్లఁజేయవలెఁ జిల్లునఁ జల్లవలెన్" "గోస్తనీఫలమధుద్రవ గోఘృత పాయస ప్రసారాతి రసప్రసార రుచిరప్రసరంబుగ" అని పలువిధముల కవితారస మొక అనిర్వచనీయమైన ఆనందమని ప్రతిపాదించెను. అట్టి 'చేతముఁజల్లఁజేయఁగల', 'సొగసు కొల్కులఁబుట్టింపఁగల' రసఘట్టములు కాళిదాస కవితాప్రవాహములో సహస్రాధికములన నతిశయోక్తి కాదు. ఈ చిన్న వ్యాసములో సముద్ర సంకాశమైన కాళిదాస కవితారసమును నా స్వల్పమేధ యనుతెప్ప చేత తరింప యత్నించెదను.

'ఉపమాకాళిదాసస్య' అను సూక్తికి నిదర్శనముగ రఘువంశమహాకావ్యములోని ప్రథమశ్లోకములనే జెప్పవచ్చును. పార్వతీపరమేశ్వరులను వర్ణించుతఱి "వాగర్థావివసంపృక్తౌ" యనుటలో స్వారస్యము పండితులకు తెలిసినదియే. వేదాంత ప్రతిపాదిత ప్రకృతిపురుషులను చిత్రించుటకై ఆద్య మహర్షులు అర్ధనారీశ్వరులను రూపకమునువాడిరి. 'అర్ధనారీశ్వరత్వమెట్టిది' యను శంకాసమాధానముగ అవినాభావ తాదాత్మ్యప్రతిపాదకముగ కాళిదాసు 'శబ్దార్థములవలె కలిసియుర్న' అని ప్రయోగించినాఁడు. అర్థవచ్ఛబ్దమునకే శబ్దమనిపేరుఁ గావున, అర్థములేని శబ్దము, శబ్దములేని యర్థము దురూహములు గావున ఆరీతిగ పార్వతీపరమేశ్వరులను వర్ణించుటకంటె మఱియొక ఉపమానము దుర్లభము.

కాళిదాసు ఎంత గంభీరుడో అంత నమ్రుఁడు. "క్వ సూర్యప్రభవో వంశః" మొదలు మూడు శ్లోకములు అతని వినయమును ప్రతిపాదించును. మహాకవియగు నాతనికి అంతటి నమ్రత్వ మవసరములేదు గదాయని శంక రావచ్చు. కాదు. కాళిదాసు రఘువంశ రచనావసరమున తన్మూలభూతమైన రామాయణమును రచించిన వాల్మీకి మహాకవి హిమాలయ పర్వతాగ్రముపలె అతని మనోనేత్రమునకు గన్పట్టుటచేత "అథవాకృతవాగ్ద్వారేవంశేఽస్మిన్ పూర్వసూరిభిః, మణౌవజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తిమేగతిః" అనగా 'వజ్రసముత్కీర్ణమైన మణిలో సూత్రమువోలె వాల్మీకిమహర్షివేసిన బాటలో తాను పయనించుటకు కష్టము కాదుగదా' అని వాకృచ్చినాఁడు. ఈ ఉపమాన మెంత మనోహరముగానున్నది - అతని వినయములోనే ఆధిక్యము ప్రతిపాదితమైనది.

రఘువంశ ద్వితీయసర్గలో సంతానకాములైన సుదక్షిణాదిలీపులు వసిష్ఠాదేశమున, నందినీధేను శుశ్రూషఁజేయుట ఎంతయు చేతోహరముగా వర్ణింపఁబడినది. అందు ప్రథమ ద్వితీయ శ్లోకములు సాక్షాద్రత్నములే. ఆబాలగోపాలము కంఠస్థము చేయఁదగినవి. మధురాతి మధురములై, అర్థగంభీరములైన యీ శ్లోకములు, నా బాల్యమున పండితులు గల గ్రామ గ్రామములందును గానముచేయఁబడుచుండెడివి. నేఁడు ఆ సౌభాగ్యము ఏ విద్యార్థులు నోచుకొనలేదే యను బాధ ఆవేదనము కలుగఁజేయుచుండును. చూడుడు!

"అథ ప్రజానా మధిపః ప్రభాతే
జాయాప్రతిగ్రాహితగంధమాల్యాం
వనాయ పీతప్రతిబద్ధవత్సాం
యశోధనో ధేనుమృషేర్ముమోచ
తస్యాః ఖురన్యాస పవిత్రపాంసుం
అపాంసులానాం ధురి కీర్తనీయా
మార్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ
శ్రుతేరి వార్థం స్మృతి రన్వగచ్ఛత్.

దిలీపునకు రాజాపరపర్యాయములగు నృపాద్యనేక శబ్దములుండగ 'ప్రజానామధిపః' అని ప్రయోగించు

టలో స్వారస్యమేమి? 'క్రాంతదర్శకవిః' అనున్యాయమున దిలీపుఁడు సంతానవంతుఁడు కాఁబోవుచున్నాఁడను భావ్యర్థ సూచనార్థమై 'ప్రజానామధిపః' అను శబ్దములో 'సంతానవంతుఁడ'ని యర్థముండుటచేత కవి శ్లేషించినాఁడు. అంతియకాదు. భార్యాపర పర్యాయములగు శబ్దము లనేకములుండగ 'జాయా' శబ్దప్రయోగమేల జేయవలయును? సంతానవంతురాలు కాఁగల భార్యకే 'జాయా' శబ్దము వర్తించును. 'యదస్యాం జాయతే పునః' అని వేదము. ఎవతెయందు తాను పుత్రుఁడై పునర్జనించునో ఆమె జాయ. 'పీతప్రతిబద్ధవత్సాం' అనుటలో వత్సశబ్దప్రయోగము కూడ తదుద్దేశకమే 'ఋషేః' అని ప్రయోగించుటలో 'అగతానాగతజ్ఞాని' యగు వసిష్ఠుని వాక్కు వ్యర్థము కానేరదని భావము. ధేనుశబ్దప్రయోగము 'దుగ్ధే కామానితిధేనుః' అనగా కోరికల నిచ్చునదను అర్థసూచకముగ చేయఁబడినది. ద్వితీయశ్లోకమున 'ధర్మపత్ని' శబ్దముకూడ 'ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియముద్వహే' అను సంకల్పప్రకారము దిలీపుఁడు సుదక్షిణాపాణి గ్రహమందు 'ప్రజాసంపత్తికొఱకు ధర్మపత్నీస్వీకరణము చేసినా' డను భావమును స్ఫురింపఁజేయుటమే. 'శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్' అనుటలో స్వారస్యము విద్వదాహ్లాదకరముగా సుప్రసిద్ధమైనది. శ్రుతియొక్క అర్థమువెంబడి స్మృతి అనుసరించినట్లు నందినీమార్గముననే సుదక్షిణ వెళ్లెనని చెప్పుట ఎంత సమంజసముగా నున్నది! మహాకవి వాక్కులలో నిదియే స్వారస్యము, సంతానకాములైన దంపతు లేవిధమున గో శుశ్రూషాదీక్షితులైరో వర్ణించిన యీఘట్టము అట్లుఁ జేసెడి దంపతులకే తెలియఁదగును. 'సొగసుకోర్కెలురావలె నాలకించనన్' అను లక్షణమునకు లక్ష్యభూత మిట్టికవితయే. తదుపరి పంచమసర్గలో కౌత్సమహర్షిగాథ చాల అందముగ వర్ణింపఁబడినది. రఘుమహారాజు కౌత్సమహర్షిని ప్రశ్నించుచు ఒక్కసారి మన మనోనేత్రములందు ఋషివాటికలను చిత్రించెను. ఆ యాశ్రమములందు అభగ్నకామమృగసంచారము, ఉంఛషష్ఠాంకితసైకతములు, మహర్షుల నియమాభిషేకములు, తదర్పిత పితృనివాపాంజలులు, సుతనిర్విశేష సంవర్ధితాశ్రమ పాదపములనుగూర్చి వినుచుండగా అట్టి యాశ్రమములుకలవా, యున్నచో వాటి సందర్శనభాగ్యము మన జీవితములలో మనకు కలుగునా యను 'సొగసుకోర్కెలు' పుట్టకమానవు

ఇందుమతీ వియోగవర్ణనావసరమున మనలను కాళిదాసు కరుణరసప్రవాహములో ముంచి కళత్రవియోగదుఃఖమెట్లు పుటపాక ప్రతీకాశమో తెలియఁజెప్పెను. "విషమప్యమృతం క్వచిత్ భవేదమృతంవా విషమీశ్వరేచ్ఛయా" ఇది ఎంతటి సందేశము! ఎంతటి మానవుఁడైనను అహంకరించి తాను 'ప్రయోజకుఁడను' అని యనఁగలఁడా? జన్మాంతర పుణ్యాపాప పరిపాకమును, ఈశ్వరేచ్ఛను అతిక్రమించగలఁడా? ఎవరికిని అది శక్యము కాదని కాళిదాసు వాక్రుచ్చెను.

వేయేల? రఘువంశమం దే సర్గను పఠించినను, పవిత్రవాతావరణములు, పుణ్యతీర్థములు, యజ్ఞయాగాదిక్రతువులు, ఋషివాటికలు, పతివ్రతామతల్లులు, శుద్ధచారిత్రకరాజర్షులు, పూతపవిత్ర సత్యవ్రతదీక్షితులు, ధర్మమూర్తులు మన మనముల చూఱఁగొని మనలను పవిత్రీకరించి, నడవడులను దిద్దుకొనుటలో సహకరించును. ఇట్టి మహాకావ్యములు మనోరంజకములేకాక హృదయసంస్కారజనకములై "కావ్యం సద్యఃపరనిర్వృతయే, కాంతాసమ్మితతయా ఉపదేశయుజే" అను యాలంకారికసమయమునకు లక్ష్యభూతములై విరాజిల్లుచున్నవి.

కాళిదాసు మూడవకావ్యము మేఘసందేశము. మల్లినాథకవి "మాఘే మేఘే గతరవయః" అన్నాడట! అనగా మాఘమేఘసందేశ వ్యాఖ్యానములతోనే

తన వయస్సు గతించెనట. అత్యద్భుత భావకవితా మిళిత విప్రలంభ శృంగారపరీవాహములో చదువరులను ముంచెత్తి "మేఘాలోకే భవతి సుఖినోప్యన్యథావృత్తి చేతః" అనగా మేఘము కన్పించుతఱి అంకగత పత్నికుఁడైనను అన్యథావృత్తిచేతస్కుఁడైనట్లు, మేఘసందేశము చదివి అర్థముచేసికొనువానికి గృహిణి ప్రక్కనేయున్నను తద్విరహబాధ ఘటించునని కవి శ్లేషించెనాయని తోచును. ఆంధ్రదేశములో పండిత గ్రామములందు నలుబది, యేబది సంవత్సరముల పూర్వమువఱకు మేఘసందేశశ్లోకములు బాలకుల కంఠములలో మధురకూజితములై హృదయావర్జకములగుచుండెడివి. విప్రలంభశృంగారము – దానికి తగిన మందాక్రాంతవృత్తములు – మృదుమధుర శబ్ద విరాజమాన శయ్యామాధుర్యము, కవులకు భవభూతి యొక్క శిఖరిణీ మయూరీనాట్యమును స్మరింపఁజేయును. కాళిదాస మందాక్రాంతలు, భవభూతి శిఖరిణీవృత్తములు కవిమనోరంజకములు – మేఘసందేశమందలి శ్లోకములలో నూటికి ముప్పదివఱకు అర్థాంతరన్యాస శోభాయమానములై నేటికిని పండిత జిహ్వాగ్రములందు నాట్యము చేయుచున్నవి.

౧ కామార్తాహిప్రకృతి కృపణాశ్చేతనాచేతనేషు
౨ యాచ్ఞా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా
౩ నీచైర్గచ్ఛత్యుపరిచదశా చక్రనేమిక్రమేణ

మొదలగునవెంతయు స్వారస్యమును వర్ణించును. భార్యావిరహమున కామార్తుఁడై, ప్రకృతి కృపణుఁడైన యక్షుఁడు మేఘమును పిలచి, పూజించి, తన భార్యకై వార్తనుగొనిపొమ్మని చెప్పుచు ఒకగ్రంథము నంతను వార్తగాఁజెప్పి మహాచమత్కారముగ, శృంగార రసభూయిష్ఠముగ పాఠకులమనముల నేలోకమునకో గొంపోవుచున్నట్లు తోపింపఁజేసి, భారతదేశాంతర్గతములైన వివిధగహనవనగిరి నగర నదనదీవర్ణనల మనస్సుల రంజింపఁజేయుతఱి పాఠకులుకూడ మేఘములుగా మారిపోయి ఆయాదేశములందలి ఆయా సౌభాగ్య సౌందర్యములను తిలకింతురా యన్నట్లు మేఘసందేశకావ్యము పండితులకుఁదోచును. శ్రీవిశాలముగు విశాలానగరముయొక్క వర్ణనను విన్నవారికి జీవితములో ఎప్పటికైనను తత్తాదృక్ సౌభాగ్యయుక్త నగర సందర్శనభాగ్య మబ్బునా యనువాంఛ పుట్టక మానదు. నిజముగా అట్టినగరములు భూలోకములో గలవాయను శంకగూడ జనించి,

*స్వల్పీభూతే సుచరితఫలే స్వర్గిణాం గాంగతానాం*
*శేషైః పుణ్యైః హృతమివదివః కాంతిమత్ ఖండమేకం*

అను కాళిదాస వచనము యథార్థమని తోపకమానదు. యక్షుఁడు తనకొఱకై క్రుంగి కృశించు భార్యను మనఃఫలకమున నెల్లు చిత్రించుకొని మేఘునితో చెప్పినాఁడో ఆ ఘట్టము చదువరుల కన్నీరు చూఱగొనును. వచనైకరచనాపాటవము గల సామాన్య మానవులకును, కవితానేత్రముతో జూచు మహాకవులకు ఎంత తారతమ్యముకలదో మేఘసందేశము చాటును నేడు వాఙ్మయములలో ఆచార్యబిరుదముల సంపాదించి విశ్వకళాశాలలందు ప్రాధ్యాపకపదవులందు విరాజిల్లు పండితులు పాశ్చాత్యఖండగత విశ్వవిద్యాలయాహూతులై అచ్చటకేగి రెండు మూడు సంవత్సరములుండు సందర్భమున, ఈదేశమున విరహముచేత క్రుంగి కృశించువారల గృహిణులకు లేఖలు వ్రాయుతఱి, మేఘసందేశాంతర్గతశోకప్రతిపాదకశ్లోక పరంపరా ప్రవహత్కవితారసములో శతాంశమైనను స్యందింపఁజేయగలరాయను శంక నాకు తఱచు కలుగుచుండును. అట్టితఱి మహాకవి కాళిదాసునకు ఎన్ని ఆచార్యబిరుదముల నివ్వవలయును? సార్వకాలికుఁడైన యీ విశ్వమహాకవియొక్క ఛాయాపటమునకైనను మనము నోచుకొనలేదు, చరిత్రయో కాలగర్భములో లీనమైపోయినది. కొద్దిపద్దెముల వ్రాసియు మహాగద్యలను వ్రాయుచు, నాలుగు తేటగీతులనల్లి

మహాకవులను సమ్మానము వాంఛించు కవులు పెక్కండ్రుగల నేటికాలమెక్కడ? మహాకావ్యములను వ్రాసియు గోత్రనామముల స్మరింపని కాళిదాస మహాకవియెక్కడ? తత్కవితాగ్రంథములను తాళపత్రములలో శ్రమించి పరిశ్రమించి వ్రాసికొనియు, వేదములవోలె మౌఖికముగాను వానిని ధరించియు, కాలగర్భములో రాజ్యరాజధానులే ఖిలీభూతములగుచుండ, ఏనాటికాలమునుండియో కాళిదాస కవితాప్రవాహమును మనకందజేసిన మన పెద్దలకు మనము ఋణపడియున్నాము. కాలగర్భములో నశింపక జీవించుటయే మహాకవితాలక్షణము. ఇఁక

'కావ్యేషునాటకం రమ్యం నాటకేషుశకుంతలా
తత్రాపి చతుర్థోఙ్కః తత్రశ్లోక చతుష్టయం'

అను నానుడికి మూలభూతమైన శాకుంతలనాటకమును దిఙ్మాత్రముగా పరామర్శింతము. కాళిదాసు కృత కావ్యనాటకములలో నేయొక్కటినైనను పరామర్శించుటకు ఒక్కొక్కగ్రంథము వ్రాయవలసియుండును. అట్టితఱి ఒక చిన్నవ్యాసములో తత్కవితారసప్రవాహములోనుండి ఆచమనముకూడఁజేయుటకు సాధ్యము కాదు ఐనను దేశకాలనియమానుసారము కొద్ది పంక్తులు శాకుంతల నాటకమునుగూర్చి వ్రాసినఁగాని ఈవ్యాసమునకు సంపూర్ణత్వము సిద్ధింపదు.

శాకుంతలనాటకమును జాగ్రత్తగా చదివి యానందించుచో రెండు ముఖ్యవిషయములు పాఠకుల మనస్సునకు హత్తుకొనును అవి ఏవన (1) ఐహిక జీవితములోని సౌందర్యము. (2) ఆధ్యాత్మిక జీవితములోని యానందము. ఈరెంటిని మనస్సులోనుంచుకొనియే గెతేపండితుఁడు 'The young year's blossoms' అనియు 'The fruits of its decline' అనియు వ్యపదేశించినాఁడు. శకుంతలా సౌందర్యము దుష్యంతునికి తదనుభూతి ఐహికసౌందర్యప్రతిపాదకము. కణ్వమహర్షియొక్క ఆశ్రమవాటిక అచ్చటి ఆధ్యాత్మికవాతావరణము రెండవది.

శకుంతలను దుష్యంతునివద్దకు పంపుఘట్టము రసవంతమై మహావిద్వాంసుల మన్ననలనుపొందినది. శకుంతలను ముందుగా కణ్వుఁడు ఋక్ఛందస్సులో నాశీర్వదించును. "వైతానాస్త్వాం వహ్నయః పాలయంతు" అనుటలో ఎంతయందమున్నది! తదుపరి వనదేవతానుజ్ఞకై కణ్వుఁడు వనస్పతుల నుద్దేశించి 'పాతుం న ప్రథమం....' అను శ్లోకమునుఁజెప్పును. ఇందులో 'There is a soul in The apparently slumbering Nature' అను సందేశమును కవి మనల కందించుచున్నాఁడు. ఈ సందర్భములో "ఆరాత్తే అగ్నిరస్తు, ఆరాత్పరశురస్తుతే, నివాతేత్వాభివర్షతు స్వస్తితేస్తు వనస్పతే" అను వేదమంత్రమెంత అర్థవంతమైనదో చూడుడు. "ఓ వృక్షమా అగ్ని నీకు దూరములో నుండుగాక! గొడ్డలి నీకు దూరముగానుండుగాక! వాయురహితముగ మేఘము నీకై వర్షించుగాక!" ఈభావమునే అనువదించు మఱియొక వేదమంత్రము "నమో వృక్షేభ్యో హరికేశేభ్యః" అనునది ఎంతటి హృదయసంస్కారము! యావజ్జీవము ఫలించి సేవించిన వృక్షము ముదిమిలోనుండగా, నిర్ఘృణుఁడై, కృతఘ్నుఁడైన మానవుఁడు గండ్రగొడ్డలిచేత దానిని నరుక యత్నించును. అట్టి జాతికిని ప్రాచీన భారతీయవైదికార్ష దృక్పథమునకును ఎంతవ్యత్యాసమున్నది? మనుజుఁడు కృత్రిమ జీవితమును స్వార్థపరత్వమును విడనాడి, ప్రేమ పూర్ణుఁడై. మధుమంతమైన జీవితము నలవఱచుకొని, ప్రకృతిలో లీనుఁడై ఆశ్రమవృక్ష మృగాదులతో ఋషులవలె సమభాగజీవితము నలవఱచుకొనినచో, ప్రకృతితో సంభాషించగల సంస్కారము గలవాఁడగునను సందేశమును కణ్వాశ్రమవర్ణనములో కవి మన కందించుచున్నాఁడు. ఈసందర్భములో గౌతమీ వాక్యమునుఁ జూడుడు.

"జాతే, ఇదానీం జ్ఞాతి జనస్నిగ్ధాభిః అనుజ్ఞాత గమనాసి తపోవనదేవతాభిః! ప్రణమభగవతీభ్యః!



శ్రీ ధూళిపాళ అర్కసోమయాజి

ప్రియంవదా వాక్యమునుఁ జూడుడు !

'ఉద్గళిత దర్భకబళాః మృగాః,
పరిత్యక్త నర్తనా మయూరాః
అపసృతపాండుపత్రా
ముంచంత్యశ్రూణీవ లతాః.'

శకుంతల "తాత! లతాభగినీం వనజ్యోత్స్నా మామంత్రయిష్యే" అనుటలో ఎంతయందమున్నది?

సంగరహితుఁడు కాఁదగిన కణ్వబ్రహ్మర్షికి, శకుంతలాగతప్రేమ బంధకరముకాదా యను శంకకు సమాధానమేమనఁగా లతామృగాదులనుఁగూడ ప్రేమించెడి విశ్వప్రేమమూర్తులైన మహర్షులకు శకుంతలా గతప్రేమలో తప్పేమున్నది? ఆ ప్రేమ భగవంతుని ప్రేమవంటిది దానికి సంగదోషములేదు.

"యాస్యత్యద్య శకుంతలా......"
"అస్మాన్ సాధు విచింత్య........"

ఇత్యాది శ్లోకములు సుప్రసిద్ధములై బహు వ్యాఖ్యాతమగుటచేత పిష్టపేషణమునువీడి ఒక్క శ్లోక రత్నము నుదాహరించి ఈవ్యాసమును ముగించెదను.

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చనిశమ్యశబ్దాన్
పర్యుత్సుకీ భవతి యత్సుఖితోఽపిజంతుః
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని."

ఇదియొక శ్లోకరత్నము. గాఢహృదయాంతర్గత తత్త్వమును సముద్రాంతర్నిగూఢమైన రత్నమువోలె బయటికితెచ్చి కవి మనకందించెను. రమ్యవస్తువుల జూచుతఱి, మధురశబ్దముల విను సందర్భమున, ఏదియో అనిర్వచనీయభావనాలీఢమై మనస్సు పర్యుత్సుకితమగునట! ఏది అచ్చట హేతువు? జన్మాంతరీణములగు హృదయనిద్రాణ వాసనాసంస్కారములు, రమ్యవస్తుదర్శనముచేతను, మధురశబ్దశ్రవణముచేతను స్పందించి, అవిద్యావ్యాప్తమైన చేతనకు (Obscure physical mentality) సుదూరగగనసర్పసమాయాత నక్షత్రకాంతివోలె ఏదియో స్ఫూర్తికలుగును అది అనుభవైకవేద్యమే. ఏ వాఙ్మయమందును ఏకవియు ఈభావమును చెప్పియుండలేదు. అదియొక మధురాతిమధురమై గూఢాతిగూఢమైన భావము. అట్టి భావములెన్నియో శాకుంతలనాటకమున మనకు చెప్పఁబడియున్నవి. అదియే మహాకవియొక్క కవితావైశిష్ట్యము. స్థలాభావముచేత ఇంతటితో విరమించెదము.

# శాతవాహన సామ్రాజ్యములో రమణీమణులు

డాక్టర్ శ్రీమతి వారణాశి యశోదాదేవి

అఖండ దక్షిణభరతఖండమును ఏకచ్ఛత్రాధిపత్యముగ బరిపాలించిన ప్రప్రథమసామ్రాజ్యమే ఆంధ్రశాతవాహన సామ్రాజ్యము. శాతవాహన చక్రవర్తులు దక్షిణాపథపతి బిరుదాంకితులై క్రీ. పూ. 3వ శ. చివరిపాదమునుండి క్రీ. శ 3వ శ. మొదటి పాదమువరకును నాల్గున్నర శతాబ్దములు దేదీప్యమానముగ రాజ్యరమనేరపిరి. దక్షిణాపథమునుండి యుత్తరాపథమునకు విజృంభించి పాటలీపుత్రమును సైతమును జయించి యేలినది యొక్క శాతవాహన సామ్రాజ్యమే. ఉత్తరమున వింధ్యపర్వతశ్రేణులు, దక్షిణమున తుంగభద్ర నదీమతల్లియు, ప్రాచ్యప్రతీచ్య దిశలందు సాగరమును శాతవాహనసామ్రాజ్యపు సరిహద్దులు. సామ్రాజ్యపు మహోన్నతదశయందు, సామ్రాజ్యము పాటలీపుత్రమునుండి బళ్ళారివరకును, రాజపుత్రస్థానపు ప్రాగ్భాగమునుండి గోదావరీముఖద్వారమువరకును, ఉజ్జయినినుండి కడలూరువరకును వ్యాపించెను.

దక్షిణభారతదేశచరిత్రలో స్వర్ణయుగమనదగిన శాతవాహన సామ్రాజ్యకాలములో దేశము సస్యశ్యామలమై యుండెను. సంస్కృతి యున్నతశిఖరముల నందుకొనెను. "బౌద్ధవాఙ్మయమును, బౌద్ధకళయు కొంగ్రొత్తరీతుల విజృంభించినవి". భారతీయ సంస్కృతి ప్రాచ్యదేశములకు విస్తృతమై విస్మయ గాథకు ప్రాతిపదిక యేర్పడెను. దక్షిణాపథపు రమణీమణులు వివిధరంగములందును బాల్గొనుచు విజయశీలురై వేదకాలముయొక్కయు, బౌద్ధయుగము యొక్కయు ఔత్తరాహరమణులతో సాటివచ్చుచుండిరి.

శాతవాహనవంశపు రాణులు కొందరు రాజకార్యముల బాల్గొనుచు రాజ్యతంత్రమును నిర్వహింపు

చుండిరి. ప్రథమ శాతకర్ణిమహారాజు (క్రీ. పూ. 180–170) భార్యయైన దేవీనాగానిక, సామ్రాజ్య నిర్మాతయైన సిముఖచక్రవర్తి (క్రీ. పూ. 221–198) కోడలు. ఈమె తండ్రి మహారాష్ట్ర స్థానికనాయకుడైన మహారథిత్రణకయిరో. సిముఖమహారాజు మహారాష్ట్రమును జయించుటవలన ని రాజకీయ వైవాహికసంబంధము సంభవిల్లెను. నాగానికాదేవి యశేషశేముషీసంపదగలదై, అశ్వమేధయాగద్వయమునేకాక, తదితరములైన యనేక క్రతువులజేసిన భర్తతో సహధర్మము నెరపుచు తన నానాఘాట్ శాసనములో శాతకర్ణి కార్యముల బ్రశంసించెను. ఈ పుణ్యదంపతుల పుత్రులు నలువురు; వారిలో నొకరైన వేదశ్రీపక్షమున నాగానికాదేవి కొంతకాలము రాజ్యము పాలించెనేమోయని నానాఘాట్ శాసనము స్ఫురింపజేయుచున్నది.

మరియొకరాణియైన గౌతమీబాలశ్రీ శివస్వాతి మహారాజు భార్య. కుమారుడు శాతవాహనచక్రవర్తులందరిలోను మేటియై త్రిసముద్రతోయపీతవాహన బిరుదాంకితుడైన గౌతమీపుత్రశాతకర్ణి (క్రీ. శ. 78–102). ఈమె భర్తతోను, కుమారునితోను, పౌత్రుడైన పులోమావితోను కలిసి యశేషదానధర్మములజేసి, రాజ్యతంత్రనిర్వహణమున వారికి సహాయపడుచుండెను. మహారాణి వాసిష్ఠీదేవి గౌతమీబాలశ్రీ కోడలు; గౌతమీపుత్రశాతకర్ణి భార్య ఈ సుగుణశీల చేసిన ధర్మకార్యములు నాసికశాసనములలో పేర్కొనబడియున్నవి.

గౌతమీపుత్రశాతకర్ణి మొదలుగా శాతవాహన చక్రవర్తులు తమ మాతృనామములతోజేర్చి తమ నామధేయముల జెప్పుకొను నాచారము శాతవాహన మహారాజ్ఞుల సుగుణసంపదకు తార్కాణముగదా! ఉదా:– మాధరీపుత్రశకసేనా. ఈ యాచారము మాతృగోత్రమునుగాని, నామమునుగాని సూచించు నామముతో పుత్రుని నామదేయము జేర్చుట– వేదకాలమునందును వాడుకయందుండెను. కాని రాజ్యము మాత్రము పితృాధీనముగనే సంక్రమించుచుండెను. ఈ నామధేయ ఆచారము శాతవాహనులకు రాజకీయ వారసులైన యిక్ష్వాకురాజులకాలమందును సాగెను. మేనరికపు వివాహసంబంధములవలన ఋషిగోత్రములు చర్వితచర్వణమగుచుండెను.

శాతవాహనులకాలమున సంఘమున స్త్రీలు ఉన్నతస్థానము నలంకరించియుండిరి. ఆర్థికముగను, సాంఘికముగను స్వేచ్ఛను గల్గియుండిరి. రాజ్యతంత్రముల దీర్చిదిద్దిన పట్టపురాణులేగాక, ఉన్నత వర్గములకుజెందిన రమణులు ఉత్కృష్టధర్మకృత్యముల నెరవేర్చిరి. వీరు మహాభోజి, మహాసేనాపతిని, మహాతలవరి ఇత్యాది బిరుదులు వహించియుండిరి. గౌతమీబాలశ్రీ బౌద్ధభిక్షువులకొరకై యొక గుహను దొలిపించెను. వాసిష్ఠీదేవి రాజమాతయనియు, జీవసుతయనియు తన్నుగురించి చెప్పుకొని తిరణ్హుపర్వతమునందొక గుహను నిర్మింపజేసి బౌద్ధభిక్షువులకు దానమిచ్చెను. వారి గ్రాసార్థమై యొక గ్రామము నిచ్చెను. ఆ భిక్షువులచట నివసింపుచు గ్రామభూముల వ్యవసాయము జేయనందున, గోవర్ధననగరమునకు జెందిన రాజక్షేత్రమునుండి మరికొంతభూమిని వారికిచ్చి శాసనము వ్రాయించెను. గోవర్ధనమందలి రాజోద్యోగి రాణి యాజ్ఞను బాలింపుచు, యామె కుశలమునుగూర్చి ప్రశ్నించెను. రాణి ప్రజల యాదరాభిమానముల జూరగొన్నదనుట కిది నిదర్శనముగదా!

సామాన్యవర్గములకు జెందిన మహిళలు విరివిగ ధనమును దానధర్మములకై వ్యయపరచుచుండిరి. అమరావతిలో వివిధశిల్పసమన్వితమైన యనేక స్తంభములను, తోరణములను, స్తూపపుఫలకములను నిర్మించినది యుదారగుణసమన్వితలైన నారీమతల్లులేగదా! అమరావతి, కుడా, నాసికక్షేత్ర

ములందలి శాసనములు ఎన్నియో రమణులిచ్చిన దానములను, వారు ప్రేరేపించిన ధర్మములను జెప్పుచున్నవి. నాసిక్, కుడాలలోని చైత్యములు వీరు నిర్మించినవే. విశ్వవిఖ్యాతిగాంచిన కార్లాచైత్యనిర్మాణములో స్త్రీలు ఎంతయో ఉత్సాహముతొ పాల్గొని యుండిరి. విష్ణుదత్తయను శకయువతి నాసిక్‌లో బౌద్ధసంఘమునకు 3500 కర్షపణములు విరాళ మిచ్చెను,

రమణీమణులు బుద్ధస్మారక చిహ్నములను బూజింపుచుండిరి. సభలలో బాల్గొనుచుండిరి. వాద్యముల మ్రోయింపుచుండిరి, నృత్తగీతముల నానందించుచుండిరి. భర్తలతో అతిథిసత్కారముల జేయుచుండిరి సంవాదముల వీక్షించుచుండిరి. ఊరేగింపులతిలకించుచుండిరి. ఇట్టి దృశ్యములు అమరావతీ శిల్పప్రస్తరములలో గానవచ్చుచున్నవి. ఈకాలపు స్త్రీలు వేదములందు బేర్కొనబడిన దైవతములను భక్తితత్పరులై గొల్చుచుండిరి. ధర్మరాజునకు, ఇంద్రునకు, సంకర్షణునకు, వాసుదేవునకును, చంద్రసూర్యులకును, దిక్పాలురకును, నాగానికాదేవి వందనసమర్పణముతో నానాఘాట్ శాసనము ప్రారంభమగుచున్నది. ఇంద్రప్రతిమలు, శివకేశవులు, రాధాకృష్ణులు ఆరాధింపబడుచుండిరి. నాగానిక మాసోపవాసములను, గౌతమీబాలశ్రీ సత్యమును, దానమును, అహింసను, తపమును, దమనియమోపవాసములను బాటింపుచుండిరి.

ఆరాధనలు, పర్వములు, ఉత్సవములలో స్త్రీలు పురుషులతో సమానముగ బాల్గొనుచుండిరి. వైవిధ్యవైదుష్యమును గడించిన రమణీమణు లెందరో యుండిరి. శాతవాహన హాలచక్రవర్తికాలము ప్రాకృత సారస్వతస్వర్ణయుగమన్న నతిశయోక్తి గానేరదు. ఏడువందలగాథలతో గాథాసప్తశతిని సంకలనముజేసిన శ్రీపాలితుడు, హమారిలుడు, హాలుని యాస్థానములో కవితాగ్రేసరులు. ఈ సప్తశతి ధ్వని కావ్యమునుబట్టియే "అమృతం ప్రాకృతం కావ్యం" అన్న సూక్తి బుట్టినది. రచయితలలో రాజకవులు, తదితరకవులు, కవయిత్రులు నుండిరి. కవివత్సల బిరుదాంకితుడైన హాలుని పట్టమహిషి మలయవతి సంస్కృతాదిభాషలయందును, కవితయందును వైదుష్యము గల్గియుండెను. రసవత్తరమై ప్రణయలక్ష్మీ శృంగారవర్ణనముతో నుబికియున్న గాథాసప్తశతీ సంకలనమున చక్రవర్తి కీమె చేదోడువాదోడై యుండెననుట నిస్సంశయము. సప్తశతి రచయిత్రులు— అనులబ్ధి, అనులక్ష్మి, రేవ, ప్రహత, వర్ధవతి, శశిప్రభ, రోహ, మాధవి యనువారు.

ఈకాలపు కవయిత్రుల ప్రావీణ్యమునకు నిదర్శనముగ గాథాసప్తశతిలోని యీక్రింది పద్యముల జూపవచ్చును.

*"పచ్చని ఆకుజొంపములు*
*పండిన యెఱ్ఱని పండ్లగుత్తులై*
*ముచ్చటుసూపినట్టి శుకముల్*
*వెరనార్చుచు లేకపోవఁగా*
*నచ్చెరియమ్మతోడ నగి*
*రల్లన శుష్కవటమ్ముజేరగా*
*వచ్చిన పాంథులందరును*
*పల్మరుగొట్టుచు బెద్దచప్పటుల్."*

యని కపటానురాగము నభినయించుచున్న నాయకునినమ్మి మోసపోయి నిందించుచు అన్యాపదేశముగ నాయిక మరొకరమణితో ననియెను.

స్త్రీలకు వామనయన మదరుట శుభసూచకమని దెలిసి యొక ప్రోషితభర్తృక తన యెడమకన్ను అదరగా, ప్రియతమునిరాక కెదురుచూచుచు—

*"వామనయనమా! నీ శుభస్పందనమున*
*ప్రాణదయితుడు వేగనువచ్చెనేని*
*పొనరి దక్షిణనయనమ్ము మూసివేసి*
*వానిగనుగొందు జిరము నీద్వారమునన."*

అనిన అనులబ్ధరచితపద్యమునకు సప్తశతిలో నగ్రస్థానమీయబడినది.

కవయిత్రి రేవ రచనాపటిమ యీక్రింది పద్యములో గోచరింపుచున్నది.

"చేయచింతకుమున్నెన్ని ? చేయబోవు
మీపనికనెన్ని ? చేతిలో మెలగవెన్ని
యిప్పుడు తప్పులే నేవి క్షమింపవలయు."

అని నాయిక నాయకునితో చెప్పుచున్నది. మాధవి కవిత కుదాహరణ మీదిగువగల పద్యమగుచున్నది.

"ఎగసి అధికారమును గ్రహకటింపరెవరు ?
కోపగించిన ఖ్యాతియాలుకొందురెవరు ?
దాపురుటులు? వారలె నెంతలకు ప్రియులు."

హాలచక్రవర్తి లీలావతీప్రేమగాథను కవి కుతూహలుడు తన సతి సావిత్రికి చెప్పినట్లు మహారాష్ట్ర ప్రాకృతభాషయందున్న లీలావతీకావ్యమున గలదు. లీలావతి సింహళరాజు శీతమేఘుని కొమరిత సప్తగోదావరీభీమం — దాక్షారామములో నుండెనట. గుణాఢ్యుని బృహత్కథ రచనాసందర్భమున శాతవాహనచక్రవర్తి సంస్కృతము తెలియనివాడై జలక్రీడలలో రాణిచే పరిహసింపబడి తదుపరి ఆరుమాసములలో సంస్కృతములో ప్రవీణతగడించెనను ఐతిహ్యముగలదు. ఇట్టి సంఘటనలు రమణుల వైదుష్యమునకు నిదర్శనములుగదా !

బౌద్ధసన్యాసినులు— సమిణికలు, పవజితికాలు, బిక్షుణిలు యనబడుచుండిరి. గురువులయొద్ద విద్య నభ్యసింపుచుండిరి. సన్యాసినులలో ఉపాధ్యాయినులు 'యుఘఝుయాయిను' లనబడుచుండిరి. వీరు విద్యార్థినులకు విద్యాబోధ జేయుచుండిరి. కొందరు బిక్షుణిలు గృహస్థులుగానుండిరి.

ఆహారము, వినోదములందు శాతవాహన కాలపు స్త్రీలు స్వేచ్ఛగల్గియుండిరి. అజంతా, అమరావతీ, సాంచీ శిల్పములనుండి రాజులవలెనే రాణులును లాంఛనములను, పరివారమును భూషణములను ధరించుచున్నట్లు స్ఫుటమగుచున్నది. వారి యాభరణములలో చూడామణి, మకరిక, చటౌల తిలకమణి, లలాటిక, కుండలములు, యష్టి, అపవారతిక, హారములు, కంటె పలువిధములైన వలయములు, వంకీలు, వడ్యాణములు, ఉదరబంధములు, అంగుళీయకములు, కడియములు ప్రధానమైనవై యుండెను.

సౌందర్యసంరక్షణయందు స్త్రీలు సహజానురక్తలైయుండిరి. రాజప్రాసాదములందును, ఉన్నత వర్గములవారి గృహములందును అలంకరణమునకు ప్రత్యేకముగ సైరంధ్రులుండిరి. శిల్పములలో తైల పాత్రలు, దువ్వెనలు, అద్దములు, లత్తుకలు, మాల్యములు గానవచ్చుచున్నవి. ఈకాలపు స్త్రీల శిరోజముల యలంకరణము సిందుసంస్కృతినాటి శిరోజముల యలంకరణమును స్ఫురింపజేయుచున్నది. శిరోజములను అనేకవిధముల జడలుగగాని, ముడులుగగాని మలచుచుండిరి. వీనిలో వైవిధ్యమైన యలంకరణపద్ధతులు గలవు. వీనినే జటా, ప్రవేశా, కేశపాశము, కబరీబంధము, ధమ్మిల్లము అనుచుండిరి సర్వసామాన్యముగ శిరోజములతో పూల మాలికలు, ముత్యాలసరములు కలిపి యల్లుచు సువర్ణాభరణములతో నలంకరింపుచుండిరి. శిరోజాలంకారములు చెదరకుండ నుంచుటకు వివిధమగు నుపకరణములుండెను

గాథాసప్తశతినాటి సంఘవ్యవస్థకు ప్రతిబింబము. వాత్స్యాయనకామసూత్రములును నాటి సంస్కృతిని నిరూపించును అగ్రవర్ణములకుజెందిన యువతులును, విద్యావతులైన గణికలును చతుష్షష్టికళలలో ప్రవీణలైయుండిరి. స్త్రీలు హరిద్రమును మిక్కుటముగ వాడుచుండిరి. పర్వదినములలో నింటింట

నుపాయనములిచ్చుచుండిరి ఉద్యానవనముల కేగుచుండిరి. యక్షరాత్రి, కౌముదీజాగరము, మదనోత్సవము, సహకారభంజకము - ఇత్యాది వినోదములను, ఉత్సవములను సమీక్షలను పాలింపుచుండిరి.

లలితకళలు ఉచ్చదశయందుండెను. నృత్యమందును, వీణావాద్యమందును, రేఖావర్ణచిత్రముల రచనయందును సామాన్యస్త్రీలు కాలము గడుపుచుండిరి. స్త్రీల చేష్టలు కొన్ని శిల్పములవల్ల దెలియుచున్నవి. కార్లాగుహలలో మోకాళ్ళపై కూర్చుండియున్న యేనుగులపై లీలావిహారముసల్పుచున్న స్త్రీపురుషప్రతిమలు సజీవములేమోయన్న భ్రాంతిని గొల్పుచున్నవి. జగ్గయ్యపేటసమీపమున ధనబోడు శిథిలములలో నొకద్వారమున కిరుకెలంకుల పూజాద్రవ్యములతో నిలబడియున్న స్త్రీల శిల్పమును బోలియున్నది. అజంతా పదవగుహలోని శిల్పసమూహము. చేబ్రోలులో లభ్యమైన స్త్రీమృణ్మయప్రతిమ నాగార్జునకొండ, కొండాపురములలో లభ్యమైన మట్టిబొమ్మల చాలికలు గల్గియున్నది. కొండాపురమందలి హారీతిప్రతిమలో సౌందర్యఖనియై సర్వాభరణభూషితయైన స్త్రీ యాసీనురాలై వామభాగమున బాలుని కూర్చుండబెట్టుకొనియున్నది. సాంచీస్తూప ద్వారములో నొక స్తంభముపై బుద్ధశిల్పమునకు వెనుకగా ఉమతమ కార్యకలాపములలో నిమగ్నలైన నల్వురు గ్రామీణయువతులు శిల్పాంకితమైరి. ఈశిల్పమునకు ముందుభాగమున నైరంజననదియు అందుండి యొక భామ కడవలో నీరు మోసికొనిపోవుటయు జూడనగును. అమరావతిశిల్పములలో సర్వాలంకృతయైన శ్రీ లేక లక్ష్మి ప్రతిమగలదు. 'బుద్ధావశేషములకై తగవు' దృశ్యములో నొక రమణి యాసీనురాలై వీణ వాయింపుచున్నది వేరొకయామె నృత్యము సల్పుచున్నది. గోలీశిల్పమందలి వివిధభంగిమలందలి మిథునములు, ఆకాలపుస్త్రీల వేషభాషల దెలిసికొనుటకు సాధనములగుచున్నవి.

ఇవ్విధమున శాతవాహనులకాలమున స్త్రీలు సమస్తరంగములందును ఉన్నతస్థానమును, ప్రావీణ్యమును, గౌరవమర్యాదలను ఇచ్చిపుచ్చుకొనుచుండిరని రూఢియగుచున్నదిగదా !

Bibliography:—

1) Prof M. Rama Rao:
Satavahana Sanchika, Guntur (1950)

2) Sircar : Select Inscriptions I

3) Epigraphia Indica, Vol. VIII

4) K. Gopalachari:
Early history of the Andhra Country (1941)

5 M Rama Rao:
Buddha Jayanti Souvenir. Supplement (1956)

6) K. Lakshmiranjanam:
Andhrula Samskriti Charitra.

7) M. Rama Rao:
Satavahana Commemoration Volume, Guntur (1950)

8) M. Rama Rao.
Nagarjunakonda Souvenir.

9) Burgers.
Buddhist Stupas of Amaravati and Jaggayyapeta.

10) The Indian Academy of Art (Vols. 21)
Culcatta.

11) A Rea:
South Indian Buddhist Antiquities- Vol. VI (1894)

# భారవి - అర్థగౌరవము

శ్రీ గాలి పార్థసారథిరావు

సంస్కృత వాఙ్మయప్రపంచమున ప్రసిద్ధిగాంచిన కవిశేఖరులలో కవికులగురువైన కాళిదాసుని తర్వాత ఎన్నదగినవాడు భారవి. కరతలబదరమువలె నర్థసమర్పణముజేయుచు, శబ్దార్థస్వచ్ఛతారూపమైన ప్రసాదగుణము కాళిదాసుని సొత్తైనచో అతనితర్వాత ఆసంపదకు వారసుడు భారవి. స్వచ్ఛమగు దర్పణ తలమున పదార్థములు స్ఫుటముగా ప్రతిఫలించునట్లు, అతని వాగ్రచనయందు వివక్షితార్థములు విస్పష్టములై భాసించుచుండును. ఈయంశమే మనకు భారవిచే ధర్మరాజు వాక్యములయందు సూచింపబడినది.

"అపవర్జితవిప్లవే శుచౌ
హృదయగ్రాహిణి మంగళాస్పదే
విమలా తవ విస్తరే గిరాం
మతిరాదర్శ ఇవాభిదృశ్యతే.

తరువాత, కాళిదాస భారవి దండిమాఘుల వైశిష్ట్యమును ప్రతిపాదించు నీశ్లోకము సర్వజనవిదిత చరము.

"ఉపమా కాళిదాసస్య
భారవేరర్థగౌరవమ్
దణ్డినః పదలాలిత్యం
మాఘే సన్తి త్రయో గుణాః.

ఈ శ్లోకమేకవివిమర్శనాశక్తిఫలితమో తెలియదు, కాని పైకవిత్రయమునందున్న విభిన్నవైలక్షణ్యములు మూడును మాఘునియందున్నవని యతనికే కవితాసామ్రాజ్యధౌరేయత్వమును కట్టబెట్టచూచినట్లున్నది. మాఘుని యీకవితా సామ్రాజ్యధౌరేయత్వమును శంకించిన పండితప్రకాండులుగలరుగాని, కాళిదాసుని రసోచితాలంకారవినివేశనమును (ఉపమాశబ్దమిచ్చట ఉపలక్షణమగుటచే సర్వాలంకారములకు గ్రహణమగును) భారవియొక్క యర్థగౌరవమును, దండిపద లాలిత్యమును సందేహింప సాహసించినవారులేరు. భారవియే యచ్చటచ్చట శ్లోకములయందు, తనరచన యర్థగౌరవప్రాధాన్యమని సూచించుచుండును. మొదటి సర్గయందే —

"ససౌష్ఠవౌదార్య విశేషశాలినీం
వినిశ్చితార్థాం మితవాచమాదదే"
"ఇయమిష్టగుణాయ రోచతాం
రుచిరార్థాభవతేఽపి భారతీ"
"స్ఫుటతా న పదైరపాకృతా
నచ న స్వీకృతమర్థగౌరవమ్
రచితా పృథగర్థతా గిరాం
న చ సామర్థ్య మపోహితం క్వచిత్"

యిత్యాది శ్లోకములయందు తనకుగల అర్థపక్షపాతిత్వమును అనేకథాస్ఫుటీకరించును.

ఇకమనము విచారింపవలసిన విషయమిది - అర్థగౌరవమనగానేమి? "అర్థస్యగౌరవమ్" (అర్థము యొక్క గౌరవము) అనినచో యీగౌరవము లేక వైశిష్ట్యము కింకృతమైనది? దీనికిసమాధానము అనేకాంశములపై నాధారపడియుండవచ్చును. (1) అల్పాక్షరములందు అనల్పార్థమునిమిడించు ప్రతిభావిశేషము. (2) ధ్వనిమత్తారూపమైన గాంభీర్యగుణమును పోషించు సామర్థ్యము. (3) ప్రతిపాదింపబడు అర్థము సౌష్ఠవయుతమై తన చమత్కృతిచే శబ్దచమత్కృతిని అధఃకరించునట్లుచేయు శిల్పనైపుణ్యము-భోజుడును రచనా పద్ధతులను త్రిధాకరించుచు నిట్లుచెప్పును —

"క్వచిత్స్వల్పేఽప్యర్థే
ప్రగుణవచనైరేవ రచనా
క్వచిద్వస్తుస్ఫారం
కతిపయపదైరర్పితరసమ్
పునః శబ్దార్థాస్తే క్వచి
దివ తులాయామివ ధృతాః
త్రిభిః కల్ప్రైరేవం
కవి వృషభసందర్భనియమః"

ఒకానొకప్పుడు కవి స్వల్పార్థమునైనను ప్రచురవచన రచనతో నలంకరించును. మఱియొకప్పుడు మహార్థమునుగూడ కతిపయపదములయందిముడ్చ జూచును. వేఱొకసమయమున తులయందుసరిజూడబడినవివోలెనున్న శబ్దార్థములను సమకక్ష్యయందుపయోగించును. మొదటి రెండువిధములు ఓజోగుణ ప్రకారములని అలంకారికులందురు. "పదార్థేవాక్యరచనా, వాక్యార్థే చ పదాభిధా". మనము భారవి రచనను పరిశీలించినచో భోజరాజు వచించిన చివరి రెండు రచనాపద్ధతులలో నతనికావ్యసరణి నడచినదని చెప్పనొప్పును. ఇట్లైపైజెప్పిన మూడు అంశములలో మొదటి, చివరియంశములు భారవికవిత్వమును ప్రభావితము జేసినట్లెంతుము - ఉదాహరణమునకు :

"కథాప్రసంగేన జనైరుదాహృతా
దనుస్మృతాఖండలసూనువిక్రమః
తవాభిధానా ద్వ్యథతే నతాననః
స దుస్సహా న్మంత్రపదాదివోరగః"

ఈశ్లోకము యుధిష్ఠిరుని సమక్షమున వార్తాహరుడైన వనేచరుని వచనములయందు నిబద్ధింపబడినది. "ప్రసంగవశమున జనులచేచెప్పబడిన నీనామధేయమువలన అర్జునుని పరాక్రమము స్మృతికిరాగా దుస్సహమైన మంత్రముచే నురగమువలె నతాననుడై సుయోధనుడు వ్యథనొందుచున్నాడు" —

ఈయర్థమును ప్రతిపాదించుచునే భారవిఉరగ సంబంధి వృత్తాంతమును నిగూఢముగను అత్యంత రమణీయముగను శ్లోకమునందిమిడ్చినాడు.

"కథాప్రసజ్గేన" అనుపదమునకు "గోష్ఠిసందర్భమున" అని మొదటియర్థము.

"కథాప్రసజ్గేనజనైః" అనునది ఒకేపదముగా గ్రహించి "విషవైద్యమునందు సమర్థులైనజనులచేత" అని ఉరగపరముగ నర్థముజెప్పవలెను. "కథాప్రసజ్ఞ" మన విషవైద్యమునికూడ అర్థము. "కథాప్రసజ్గే వార్తాయాం విషవైద్యేఽపివాచ్యవత్" అని విశ్వకోశము. "జనః" అనగా సమర్థుడని యర్థము. ఇక "తవాభిధానాత్" అన "నీనామధేయమువలన" అని మొదటి యర్థము. "నామైకదేశగ్రహణేనామ గ్రహణమ్" (ఒకని నామము

యొక్క ఒకభాగమును ఉచ్చరించిన అతని నామము ఉచ్చరించినట్లేయగును) అనున్యాయమువలన, సత్యభామ యనునామెను, తన్నామైకదేశమును గ్రహించి "సత్య" యనిగాని "భామ" యనిగాని యనుట లోకసిద్ధము. అట్లే "తవాభిధానాత్" అను చోట "త" అనువర్ణముచే తార్క్ష్యునకు (గరుత్మంతుడు) "వ" అనువర్ణముచే వాసుకికి గ్రహణము. ఇట్లు సర్పసంబంధ్యర్థము సూచింపబడినది. ఇక "అనుస్మృతాఖండలసూనువిక్రమః" అన "స్మృతికివచ్చిన అర్జునుని పరాక్రమముగలవా" డని ప్రథమార్థము "స్మృతికివచ్చిన ఉపేంద్రుని (వాహనమైన) పక్షియొక్క పాదవిక్షేపముగలవా"డని ఉరగపరమైన యర్థము. ఇచ్చట సూనుశబ్దమునకు అనుజుడని యర్థము. "సూనుః పుత్రేఽనుజేరవౌ" అని విశ్వకోశము. కనుక "అఖండలసూనుః" అనగా దేవేంద్రుని తమ్ముడైన ఉపేంద్రుడు అనియర్థము. "విః" అనగా పక్షియని యర్థము. "క్రమః" అనగా "పాదవిక్షేప"మని యర్థము.

ఇట్లు అర్థమునందు క్లేశలేశమునుగూడ పరిహరించి, విశేషార్థసమర్పణముజేయు రచనయే అల్పాక్షరమునం దనల్పార్థమను సూక్తికి మూలమైనది. ఇట్టినిగూఢ చమత్కారకారి యగుటచేతనే మల్లినాథుడు భారవి రచనను నారికేళపాకమనెను.

"నారికేళఫలసమ్మితం వచో
భారవేస్సపది తద్విభజ్యతే
స్వాదయంతు రసగర్భనిర్భరం
సారమస్య రసికా యథేప్సితమ్"

ఇక చెప్పవలసిన యర్థమునకు సరిసమానముగా పదరచనచేయుట వివక్షితార్థప్రకటనమునందు స్పష్టత భారవి రచనాశక్తికి హస్తకములవంటివి. మొదటియంశమున కుదాహరణముగా లోకమునందు సుప్రసిద్ధమైన యీశ్లోకము గమనార్హము.

"సహసా విదధీత న క్రియా
మవివేకః పరమాపదాం పదమ్
వృణుతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధా స్స్వయమేవసంపదః"

"ఏపనినైనను త్వరపడి (అనాలోచితముగా) చేయరాదు. ఏలనన, అవివేకము పరమాపదలకు నెలవు. ఆలోచించి పనిజేయువానిని గుణముల యందు స్పృహగల సంపదలు స్వయముగానే వరించును". ఈపద్యమునందు వివక్షితమైనయర్థమునే మఱల తర్వాతిశ్లోకముననే గ్రహించి తనయుక్తివైచిత్ర్యముచే నూతనార్థసమర్పణము జేయుచున్నట్లుల భారవితోపింపజేయును.

"అభివర్షతి యోఽనుపాలయన్
విధిబీజాని వివేకవారిణా
స సదా ఫలశాలినీం క్రియాం
శరదం లోక ఇవాధితిష్ఠతి"

"ఎవడుకృత్యవస్తురూపములైన బీజములను వివేకమనెడి జలముచే నభివర్షించుచు కాలమును ప్రతిపాలించునో అతడు శరత్కాలమునందలి జనులు (సస్య) ఫలమును పొందినట్లే యిష్టార్థయుతుడగును" ఇట్లే ఒకేయర్థమును అనేక దృక్పథములయందు ప్రదర్శించుటవలన సహృదయునియందా వస్తువు చిరముద్రితమై నిలచును భీమునియందు వివేకిత్వ గుణప్రరోచనముకొఱకు యత్నించు ధర్మరాజునకిది యనుగుణమే. శ్రుతపూర్వములైన యర్థములను అశ్రుతపూర్వములనువలె ప్రదర్శించు మహాకవి లక్షణమును ఉద్దేశించియే సహృదయశిరోమణియైన ఆనందవర్ధను డిట్లువాక్రుచ్చెను.

"దృష్టపూర్వా అపిహ్యర్థాః
కావ్యే రసపరిగ్రహాత్
సర్వే నవా ఇవాభాంతి
మధుమాస ఇవ ద్రుమాః"

"అనుభూతపూర్వములైన విషయములైనను, రసపరిగ్రహమువలన మధుమాసమునందలి వృక్షములవలె అత్యంత వినూత్నములై విలసిల్లును."

వివక్షితార్థమునందు స్ఫుటతకు ఉక్తివైచిత్ర్యమునకు నెలవుగా మచ్చునకీశ్లోకము జూపవచ్చును.

"శుచిభూషయతి శ్రుతం వపుః
ప్రశమస్తస్య భవత్యలంక్రియా
ప్రశమాభరణం పరాక్రమః
స నయాపాదితసిద్ధిభూషణః"

"సంప్రదాయానుసారముగ లబ్ధమైన శ్రుతము శరీరమున కాభరణము. ఆ శ్రుతమునకు (శాస్త్ర జ్ఞానమునకు) క్రోధాభావము లేక శాంతము అలంకరణము. ప్రశమము లేక శాంతమునకు పరాక్రమము శోభాదాయి. (పరాక్రమ సహకృతముగాని శాంతము నిష్ఫలమనుట) ఆ పరాక్రమముగూడ కార్యసిద్ధ్యవినాభావియై యుండవలెను." ఇట్లుభారవి కార్యసిద్ధియను గమ్యముఁజేరుటకు వీలైన సోపాన మార్గమును నిర్దేశించినాడు- ఇచ్చట ప్రకృతార్థోపస్కారకమయిన ఏకావళియు అలంకారత్వసిద్ధినందినది.

ఇక పరిగ్రహింపబడిన శబ్దాలంకారములపలని శబ్దచమత్కృతి ప్రతిపాదింపబడిన అర్థచమత్కృతియందెట్లు లీనమగునో తెలుపుటకీశ్లోకమే నిదర్శనము.

"వనాంతశయ్యా కఠినీకృతాకృతీ
కచాచితౌ విష్వగివాగజౌ గజౌ
కథం త్వమేతౌ ధృతిసంయమౌ యమౌ
విలోకయన్ నుత్సహసే న బాధితుమ్"

"వనభూములయందు శయనించుటచే కఠినమైన తనువు గల్గినట్టియు, అంతటను వ్యాపించిన కచములతో పర్వతోన్నతములైన గజములవలె నున్నట్టియు, ధృతిసంయమముగలట్టియు కవలను (మాద్రీపుత్రులను) చూచుచున్నవాడవైనను ఏల వ్యథనొందవు?" ఇచ్చట సముపాత్తములయిన యమకానుప్రాసాలంకారములు కవియొక్క విశేష ప్రయత్నము లేకయే అహమహమికతో ప్రవృత్తములైనవై అర్థసాగరమునందు నిమగ్నములగుచున్నవి.

ఇట్లర్థైక పరతంత్రుఁడగు భారవి తనకావ్యమున

"ననోననున్నో నున్నోనో
నానా నానా ననా నను
నున్నోఽనున్నో ననున్నేనో
నానేనా నున్ననున్ననుత్"
(15వ సర్గ - 14వ శ్లో)

వంటి యేకవ్యంజన నిబద్ధశ్లోకములను, సర్వపాదములయందు సమానశబ్ద విన్యాసముగల

"స్యందనా నో చతురగాః
సురేభావా విపత్తయః।
స్యందనా నో చ తురగాః
సురేభావా విపత్తయః"
(15వ సర్గ - 16వ శ్లో.)

వంటి పద్యములను ఏల నిబంధించెను? పైన నిరూపింపబడిన యర్థగౌరవమునకు, నీపద్యములయందున్న తల్లాఘవక్లేశములకు ఒకే లేఖినినుండి యుద్భవించుట యెట్లుపొసగును? "కవిరేవసహృదయః, సహృదయ ఏవకవిః" అనునట్లు కవిత్వము, సహృదయత్వమును ఒకే సారస్వత ప్రక్రియయొక్క పరస్పరానుగ్రాహకములైన రెండుముఖములుకదా! అనినచో దీనికి కారణము తత్కాల కావ్యకరణసమయము లనియే చెప్పవలసివచ్చును. ఏకవ్యంజన నిబద్ధ శ్లోకములు, పద్మబంధ, చక్రబంధాది చిత్రకావ్యవిశేషములు ఆనాటి కవికి కావ్యమునందనివార్య నిరూప్యములు. ఇవి నిబద్ధింపబడుట కవి సామర్థ్యసర్వతోముఖత్వమునకు గీటురాయియని ఆనాటి విద్యావేత్తల అభిప్రాయమై యుండనోపు పండితరాయలు జగన్నాథునికంటె పూర్వీకులైన ఆలంకారికుల గ్రంథములయందు నిట్టి రచనల నిరాసము మనకు గన్పింపదు. దండ్యాది ప్రామాణికాలంకారికులు వీనిని తమగ్రంథములయందు నిర్వచించి, యుదాహరించిరి. కాని ఆలంకారికాఖండలుడై కవి సహృదయ శిరోమణియైన

జగన్నాథుడు వీనిని అధమాధమ కావ్యములుగానైనను గణింపలేదు. కావ్య సామాన్యలక్షణానాక్రాంతము లని నిరసించెను. అట్లని కాళిదాసుని రచనలయందు గూడ వీనికి స్థానము గన్పింపదు. ఇట్టి రచన కవితావాహినికి మధ్యేమార్గమున సంభవించిన మరుభూమివంటిది.

ఇక భారవి అర్థాంతరన్యాసరూపమున వెలువరించిన సూక్తులు అర్థమధువునందు చిరకాలమగ్నములైన ఖర్జూరములు

"న హి ప్రియం,
ప్రవక్తుమిచ్ఛంతి మృషం హితైషిణః"
"హితం మనోహారి చ దుర్లభం వచః"
"అనార్యసంగమాత్,
వరం విరోధోఽపి సమం మహాత్మభిః"
"అహో దురంతా బలవద్విరోధితా"
"నసువక్తృవిశేషనిస్పృహాః
గుణగృహ్యా వచనే విపశ్చితః"
"నివసంతి పరాక్రమాశ్రయాః
నవిషాదేన సమం సమృద్ధయః"
"న తితిక్షాసమమస్తి సాధనమ్"
"వీతస్పృహాణా మపి ముక్తిభాజాం
భవంతి భవ్యేషుహి పక్షపాతాః"
"విశ్వాసయత్యాశు సతాం హి యోగః"

ఇట్టిసూక్తి మౌక్తికముల నెన్నింటినైన భారవి రచనా శుక్తికలయందు మనము గమనింపవచ్చును. ఇక భారవి సంస్కృతభారతమునందులేని వనేచరవృత్తాంతమును గల్పించి తన కథకు సందర్భశుద్ధినిఁ జేకూర్చి నాడు. తన రాజకీయ విజ్ఞతచే తర్వాతివాడైన మాఘునకు మార్గదర్శియైనాడు. మాఘుడు బలరామ కృష్ణుల సంభాషణయందు జూపినపోకడ భారవి రచనా ప్రభావితమైనదే. ఇట్లు సంస్కృత కవివరేణ్యులలో భారవి స్థానము విశిష్టమైనది.

"సరస్వత్యాస్తత్త్వం కవిసహృదయాఖ్యం విజయతే"

---

సూక్తులకు తెనుగుసేత :

"హితమును కోరువారు ప్రియమైనదియయినను నసత్యము పలుకరు"

"శ్రేయోదాయకములు, మనోహరములునైన వచనములు దుర్లభములు"

"అనార్యులతో స్నేహముకంటె, మహాత్ములతో విరోధముమేలు"

"బలవంతుల విరోధము చాలదురంతమైనది"

"గుణమునే గ్రహింతు పండితులు వక్తృవిచారణము సలుపరు"

"సంపదలకు పరాక్రమ మాశ్రయము – అవి ఎప్పుడును విషాదసహకృతములుగావు."

"ఓర్పుతో సమానమైన సాధనములేదు."

"ముక్తినొందిన నిస్పృహులకుగూడ సత్పురుషులయందు పక్షపాత ముండును."

"సత్పురుషులతో సంగమము జనులకు వెంటనే నమ్మికను గల్గించును"

# మాఘకవి - శాస్త్ర వైదుష్యము

శ్రీ టి. కె. గోపాలస్వామి అయ్యంగార్

సాధారణముగా—

క్రాంతదర్శులైన మహాకవులు 'కావ్యం యశసేఽర్థకృతే' అను శ్లోకార్థము ననుసరించి, నిపుణమగు వర్ణనాచాతుర్యముతో, ప్రాచీనమగు చతుర్దశ విద్యలలో ఆరితేరి, తత్త్వశాస్త్రమునందును, (విశేషించి వేదాంత శాస్త్రమందును) ప్రగాఢపరిశ్రమ చేసి, మహాకావ్యములను రచింతురు. వీరు లోకవ్యవహార శిక్షణమునకు, ఐహికాముష్మికమగు మంగళ సంపాదనమును ఉద్దేశించి ప్రధానముగా కృషిచేయుదురు.

తాదృశకావ్యములలో—

కాళిదాసుని ఉపమాచాతుర్యము —

దండికవి పదలాలిత్యము —

భారవిమహాకవి అర్థగౌరవము —

ఈవిధముగా, ప్రసిద్ధతతో ప్రత్యేక లక్షణములు ఆయా కవులలో చారుతరములై కన్పట్టుచున్నవి.

ఈ మూడిటి వైశిష్ట్యమును ఒకచోటనే కూర్పవలెనను ఉద్దేశ్యముతో మహాకవి మాఘుడు, సుందరతరముగా 'శిశుపాలవధ' మను కావ్యమును రచించి కవి లోకములో విశేషప్రాముఖ్యమును సంపాదించెను.

ఉదారులగు మహాపురుషుల చరిత్రము —

భావ్యమగు నీతిబోధ —

చరిత్రవ్యవస్థాపనము —

మున్నగు గ్రహింపదగిన విషయములు కాళిదాసాది మహాకవుల మనస్సునందు స్వచ్ఛతరముగా పరివృతములై కావ్యలక్షణములుగా వెలసినవి. ఈదృష్టితోడనే ఆయాకావ్యములు తత్త్వప్రధానమగు సత్యమును నిరూపించుచున్నవి.

మాఘకవి శ్రీకృష్ణభక్తుడు. ఈకవి ఆమూర్తి దివ్యగుణముల కాకృష్టమానసుడై, పరత్వమందును పరమసులభుడైన శ్రీకృష్ణునిచరిత్రమునకు కావ్యరూపమీయగోరెను. మీమాంసాశాస్త్ర మిరువది అధ్యాయముల గ్రంథము. ఆవిధముగనే, ఇరువది సర్గలుగల పరమాత్మ పరమైన కావ్యమును రసపుష్టముగా, తత్త్వజుష్టముగా నిర్మించెను.

ఆంధ్రదేశమందు విఖ్యాతిగాంచిన కోలాచల మల్లినాధసూరి — 'సర్వంకషవ్యాఖ్యాలేనిదే మాఘుని కవి హృదయ మర్థమగుట కష్టము' అనురీతిగ 'శిశుపాలవధ' కావ్యమునకు వ్యాఖ్యానమువ్రాసెను. తాను స్వయముగ కవియగుటచే, ఆ వ్యాఖ్యానమందు ఆ కావ్యసౌభాగ్య ధన్యత్వములను ప్రకటించుచు నిట్లనెను.

"యే శబ్దార్ధ పరీక్షణప్రణయినః
యే వా గుణాలంక్రియా
శిక్షాకౌతుకినో విహర్తుమనసో
యే చ ధ్వనేరధ్వగాః
క్షుభ్యద్భావతరంగితే
రససుధాపూరే మిమంక్షంతి యే
తేషామేవ కృతే కరోమి
వివృతిం మాఘస్య సర్వంకషామ్"

కాళిదాసు మొదలగు కవుల గ్రంథసారమును చవిచూచిన మల్లినాధసూరికి మాఘకవియందుగల ఉద్వేలమగు గౌరవాతిశయమునకు, పైనిచూపిన శ్లోకమే ప్రమాణము. ఇదియే ఆకావ్య విలక్షణతను సువ్యక్తముచేయును.

"నేతాస్మిన్ యదునందనః స భగవాన్
వీరప్రధానో రసః
శృంగారాదిభిరంగవాన్
విజయతే పూర్ణా పునర్వర్ణనా
ఇంద్రప్రస్థగమాద్యుపాయవిషయః
చైద్యావసాదః ఫలమ్
ధన్యో మాఘకవి ర్వయం సుకృతినః
తత్సూక్తిసంసేవనాత్"

పై శ్లోకమందు పూజ్యమల్లినాధసూరి, మాఘకవిని వ్యాస, వాల్మీకి, పరాశరులతో సమానునిగా నెంచి, ఉదాత్తహృదయముతో, పక్షపాతవిధురముగా, ఈకవి వాక్కునుండిపుట్టిన ప్రతిపదమును సూక్తిగా తలచెను. అంతియేకాదు, ఆ కవిసూక్తిని సేవించుటచే తన్నుతాను ధన్యుడైనట్టులుగా భావించెను.

ఆస్తికులైనకవులు తరచుగా ప్రధానకథాభాగములను. మూలమునతిక్రమింపకుండగ ఆ పద్ధతిగనే వర్ణింతురు. ప్రధానరసమునకు హానికలుగకుండ, నాయక లక్షణములననుసరించుచు, తత్త్వగ్రహణమునందాసక్తిగలవారిని, రసికులను, శ్రోతలను, మనస్సుల కాకర్షదాయకముగా నాకర్షించి, ఉత్కృష్టమగు క్షేమ మార్గముల ననుసంధించెదరు.

ఈవిధముగా, ప్రియురాలివలె, ఉపనిషత్సంబంధములగు తత్త్వములను, వారిమనఃపీఠములందు సులగ్నమగునట్లుగా, దృఢతరముగా, ఉపదేశించెదరు. ఈవిధానముతో, భవిష్యత్తులో ఫలితమునిచ్చు నిట్టి విషయములను కారుణ్యముతో నుపదేశించెదరు.

కాలము గతచిపోయినప్పటికిని, మాఘుని వాక్కులు శ్రవఃపేయములై, నవనవోన్మేషములై, మనలను రససుధాపూరసాగరమున ముంచెత్తుచున్నవి.

విమర్శకులకు 'శిశుపాలవధ' మొక సముద్రము. ఈ అంశమును 'క్షుభ్యద్భావతరంగితే, రససుధాపూరే మిమంక్షంతి యే' అను మల్లినాధుని వాక్యమే స్పష్టముగా నిరూపించుచున్నది.

అయినను భారవి రచించిన కిరాతార్జునీయము నామూలము పరిశీలించి, ఈకవి తన శిశుపాలవధ కావ్యమును రచించెనను ప్రవాద మొకటి గలదు. నిజమునకి రెండు కావ్యముల యందును, కావ్యార్థ గుంఫనము, వర్ణనాచాతుర్యము, చిత్రబంధము మొదలైన విషయములలో పరస్పర సాదృశ్యమును గమనింపగలము ఉపమాసౌందర్యము, పదలాలిత్య వైలక్షణ్యము, అర్థగౌరవ సమృద్ధి — వీనితో నీకావ్యము దీప్తిమంతముగా మెరసి, భారవి కావ్యమునకు నిస్తేజతను కల్పించెను ఈ విషయమును 'తావద్భా భారవేర్భాతి, యావన్మాఘస్య నోదయః అను కవిసమయ ప్రసిద్ధవచనము నిరూపించుచున్నది.

ఇక ప్రకృతము—

మాఘునకు గల శాస్త్ర పరిచయమును గురించి క్రమముగా, సంగ్రహముగా విచారింతము.

**I.** తన ఛందశ్శాస్త్ర పాండిత్యమును విపులముగా ప్రకటించుటకు ఈతడు నాల్గవ సర్గయందు వివిధవృత్తముల నుపయోగించెను.

వసంత తిలకము, శాలిని, పథ్య, ప్రహర్షిణి, పుష్పితాగ్ర, జలధరమాల, ద్రుతవిలంబితము, ప్రమితాక్షరము, కురరీరుతము, మత్తమయూరము, దోధకము, ఆర్యాగీతము, జలోద్ధతగీతము, రథోద్ధతము, భ్రమరవిలసితము, మాలిని, పృథ్వి, వంశపత్ర పతితము, అను పదునెనిమిది. తరచుగా వినపడని వృత్తములు ఇందు గలవు.

ఈ సర్గయందే రైవతకాద్రి వర్ణనాసందర్భమున గల వృత్తసముదాయము అన్వర్థము, ఇది కవి సమయమును లోకమునకు నేర్పుటకా యనునట్లుదోచును.

కురరి, భ్రమరము, వంశపత్రము, మత్తమయూరము, పుష్పితాగ్రము మున్నగు వృత్తనామములే అచ్చట వర్ణింపబడిన కాననశోభకు దీప్తినిచ్చినవని చెప్పవచ్చును. ఇంతటితో నాగక అతడు చదువుటకు గూఢ క్లిష్టమగు 'ఉద్గత' మను వృత్తమును పదునైదవ సర్గయందు పూర్తిగా ప్రయోగించెను- అదియిది:

"పురంపవ వార్ణిణీ స నైర
మథ పునరముం తదర్చయా
మన్యుర భజదవగాఢతరః
సమవోషకాల ఇవ దేహినాం జ్వరః"

XVI—2.

**II.** 19వ సర్గయందు బంధకవిత్వము నెక్కువగా ప్రదర్శించెను. ఏకాక్షరశ్లోకము, సర్వతోభద్రబంధము, మురజబంధము, చక్రబంధము, గోమూత్రికాబంధము, మొదలగువానియందు తన అద్భుత కవితాశక్తిని ప్రదర్శించెను.

**III.** (ఎ) సాంఖ్య, యోగ, మతములను యథాతథముగ వర్ణించి, రెండుమతముల ఉద్దేశ్యములను ప్రకటించెను.

"మైత్ర్యాదిచిత్త పరికర్మవిదో విధాయ
క్లేశప్రహాణమిహ లబ్ధసబీజయోగాః
ఖ్యాతిం చ సత్త్వపురుషాన్యతయాధిగమ్య
వాంఛన్తి తామపి సమాధిభృతో నిరోద్ధుమ్"

ఇచట 'మైత్రి, కరుణా, ముదితా, ఉపేక్షా' అను నాలుగు వృత్తులను ప్రతిపాదించుచు, ఈకవి యోగమును వేఱొక అంగముగా చెప్పెను.

'క్లేశము' లను పేరుగల 'అవిద్య, అస్మిత' మున్నగు యోగమత పారిభాషికపదవిశేషములను ప్రయోగించెను.

ప్రకృతికార్యములు ఉపరతినందిన పిమ్మట పురుషుడు స్వస్వరూపముననుండుట 'ముక్తి' యను సిద్ధాంతమును మనయెదుట బెట్టుచు నీ మహాకవి 'సేశ్వరసాంఖ్య' మను యోగమును అష్టాంగములతోడను వివరించెను. యోగమునందు కాన్పించు 'ఈశ్వరప్రణిధానాదిక' ము నంగీకరించెను. ఇచటి శ్లోకములలో సేశ్వరసాంఖ్యమును ఈతడు ప్రతిపాదించెను

**III.** (బి) సాంఖ్యపురుషుడు తామరాకుపై నీటిబొట్టువలె నిర్లిప్తుడని సాంఖ్యమతము. దీనినే— XIV—19— లో

"తస్య సాంఖ్యపురుషేణ తుల్యతాం బిభ్రతః స్వయమకుర్వతః క్రియాః" అనుశ్లోకముచే వివరించెను.

**IV.** (ఎ) వాక్యశాస్త్రజ్ఞులగు మీమాంసకుల సిద్ధాంతమును, యాగప్రక్రియను, బాగుగా తెలిసికొనిన ఈ కవి విశిష్టుడు.

"శబ్దితామనపశబ్దముచ్చకైః
వాక్యలక్షణవిదో౽నువాక్యయా
యాజ్యయా యజనకర్మిణో౽త్యజన్
ద్రవ్యజాతమపదిశ్య దేవతామ్"



శ్రీ టి. కె. గోపాలస్వామి అయ్యంగార్

మంత్రవర్ణముతో దేవత ఉచ్చైఃప్రకాశితమగు ననియు, ఋత్విక్కులలో ఒకడగు 'హోత' చదువ వలసిన అనువాక్యయను యాజ్యచే ఇంద్రాది దేవత లను పిలచి హవిస్సునీయవలయుననెడి యాగ ప్రక్రి యను మాఘుడు వివరించెను. ఇచట మఱియొక విశేషము — ద్రవ్యత్యాగమునకు 'అధ్వర్యు' డను పురోహితుడు మాత్రమే అర్హుడు. అయినను, 'యాజ్యా' 'పురోవాక్యా' అనుపదముల ద్వారమున 'హోతా' 'ప్రశాస్తా' అనువారి సాంగత్యముగూడ, ఇచట నుండు టచే 'అత్యజన్' అను బహువచనమును బుద్ధిపూర్వక ముగా ప్రయోగించి, తన ప్రౌఢ మీమాంసాశాస్త్ర పాండిత్యమును స్పష్టపరచెను.

IV. (బి) ఈతడింకొక విశేషమును చూపెను.

సప్తస్వరములను సామవేదమునకు అన్వయిం చుచు 'రథంతరం' మున్నగు సామములకు యాగము నందుగల వినియోగమును ఎరిగినవాడగుటచే, తన యాయజూకతను ప్రకటించెను.

కరవిన్యాసభేదమువలన సప్తస్వరాభివ్యంజన మును ప్రదర్శించి ఆకాలమందలి సామగాతల అధ్యయన ప్రక్రియను స్మరింపజేసెను.

యజ్ఞవాటికలోని హోత, అధ్వర్యుడు, తది తరులు నెరవేర్చు ఋగ్యజుఃపారాయణమును చిత్రించి యాగ చిత్రమును మనస్సుపై ముద్రించెను.

యాగముచేయుచున్న యజమానునిభార్య నెర వేర్చు "ఆజ్యావేక్షణము" లను చెప్పుచు "పత్న్యవే క్షతే" అనుశ్రౌత ప్రక్రియను చూపెను. ఇదిచెప్పి, పత్న్యవేక్షణ సంస్కారవిధి ఆజ్యములకన్నిటికిని కలదని తెలిసినవాడుగావున 'వీక్షతాని' 'హవీంషి, అను బహువచన ప్రయోగములను ప్రయోగించెను. ఇట్లు వివరించి మీమాంసాశాస్త్రమందలి 'ప్రాణభృ న్యాయ' మును వివరించెను.

'ప్రణయనం' అను పారిభాషికపదమును గూడ ప్రయోగించి, మాఘుడీ ప్రకరణమునందే—

"శుష్మణి ప్రణయనాదిసంస్కృతే – తైర్హవీంషి జుహువాంబభూవిరే" అని చెప్పెను.

మంత్రముచే గార్హపత్యమునుండి స్వీకరించు టను సాదన, ప్రణయన, శబ్దములచే మాఘుడిట వివరించెను.

పరిస్తరణము, సమిదాధానము, సమ్మార్గము, మున్నగు అగ్నిసంస్కార కార్యములను గురించి, సంగ్రహముగ నీతడుచెప్పెను.

'ప్రణయనాదినా' అనుచోట 'ఆది' శబ్దముచేత ఈ అంశమే స్ఫురింపుచున్నట్లు మీమాంసాశాస్త్ర పరి చయముగల వారూహింపవచ్చును. దీనినిబట్టి మాఘుడు మీమాంసాశాస్త్రమందును, విశేషించి శ్రౌత మందును విశిష్టపరిజ్ఞానముగలవాడని నిశ్చయింప గలము.

మరియొక అంశము—

ఈతడు వ్యాకరణశాస్త్రమునందు పండితుడను విషయము నీతని శబ్దప్రయోగములే నిరూపింపగలవు.

"అనుత్సూత్రపదన్యాసా ........ శబ్దవిద్యేవ నో భాతి రాజనీతిరపస్పశా"అను శ్లోకమున శ్లేషచే, మహా భాష్యాంతర్గత పస్పశాహ్నికమును స్పష్టముగా సూచించెను,

ఆ అహ్నికమునే మనస్సునందు ఆకళించు కొనినాడని చెప్పుటకు చతుర్థసర్గయందలి ఈ శ్లోక ముదాహరణము—

"నాంజసా నిగదితుం విభక్తిభిః
వ్యక్తిభిశ్చ నిఖిలాభిరాగమే
తత్ర కర్మణి విపర్యణోనమన్
మంత్రమూహకుశలాః ప్రయోగిణః"

(XV—23)

"ఒకవిధముగ వినబడు శబ్దమునకు, వేఱొక విధమగు లింగవచనాది భేదములచే అర్థమును మార్చివేయుటను 'ఊహ' యనెడి ప్రక్రియగా, యాగప్రక్రియనెరిగిన మీమాంసకులు అంగీకరింతురు." ఈవిషయమును "కుశలాః ప్రయోగిణః" అను నీ శ్లోకభాగముచే కవి వివక్షించెను.—

"వ్యాకరణశాస్త్రజ్ఞులగు ఋత్విక్కులు మంత్రమును కర్మదేవతారూప వాక్యమునకు, సుప్విభక్తుల చేతను, తిఙ్ విభక్తులచేతను, అర్థమును మార్చిరి." అనునదియే యీ వివక్ష—.

పస్పశాహ్నికమందున్న వ్యాకరణశాస్త్రప్రయోజనమును, దానిని నేర్చు ఆవశ్యకతను, సిద్ధాంతీకరింపగోరుచు, పూజ్యపతంజలి—

"రక్షోహాగమ లఘ్వసందేహాః ప్రయోజనమ్" అనిచెప్పిన దానిని అనుసరించిన మాఘుడు, వ్యాకరణ మీమాంసాశాస్త్రములందలి తన వైదుష్యమును చూపెను.

ఇంతియేకాదు, ఈతడు, ప్రసిద్ధముగా, స్వరమువలన వచ్చు అర్థభేదమును సూచించుటకు 'ఇంద్రశత్రుః' అను సమాసపదమును తీసికొని, (XIV—24) ఋత్విజుడు, భిన్నార్థములుగల సమాసములకు విగ్రహమును నిశ్చయించెనని చెప్పుచుమహాభాష్యకారుడు చెప్పిన 'దుష్టః శబ్దస్స్వరతో వర్ణతోవా' అను భాగమును స్మరింపజేసెను.

ఉపనిషత్తులందలి తత్త్వవివరణములను, ఇతిహాసాదులందు వివరింపబడి గీతయందు ప్రతిష్ఠాపితములైనవానిని శ్రీకృష్ణపరమాత్మ స్తోత్రము ప్రసక్తముకాగా కూర్చి ఈ క్రిందిరీతి శ్లోకములను రచించును.

XIV

(1) మర్త్యమాత్ర మవదీధరద్భవాన్
మైనమానమితదైత్యదానవమ్
అంశ ఏష జనతాతివర్తినో
వేధసః ప్రతిజనం కృతస్థితేః (59)

(2) ధ్యేయమేక మపథే స్థితం ధియః
స్తుత్యముత్తమమతీతవాక్పథమ్
ఆమనంతి యముపాస్యమాదరాత్
దూరవర్తిన మతీవ యోగినః (60)

(3) పద్మభూరితి సృజన్ జగద్రజః
సత్త్వముచ్యత ఇతి స్థితింనయన్
సంహరన్ హర ఇతి శ్రితస్తమః
త్రైధమేష భజతి త్రిభిర్గుణైః (61)

(4) సర్వవేదిన మనాదిమాస్థితమ్
దేహినా మనుజిఘృక్షయా వపుః
క్లేశకర్మ ఫలభోగవర్జితమ్
పుంవిశేషమము మీశ్వరం విదుః (62)

(5) గ్రామ్యభావ మపహాతుమిచ్ఛవః
యోగమార్గపతితేన చేతసా
దుర్గమేక మపునర్నివృత్తయే
యం విశన్తి వశినం ముముక్షవః (64)

వీనిలో—

59వ శ్లోకమందు భగవంతుని సర్వాంతర్యామిత్వము. 60వ శ్లోకమందు అవాఙ్మానసగోచరత్వము, 61వ శ్లోకమందు అతని సృష్టిస్థితి సంహారత్వము— ఇంతియేగాక, అతని అకర్మవివశత్వము, సర్వజ్ఞత్వము, ప్రాణుల ననుగ్రహించు కోరికతో మానవరూపమునెత్తుట, అపునరావృత్తి రూపమగు మోక్షఫలప్రదత్వము — ఇట్టి తత్త్వములను ప్రతిపాదించెను. ఈ తత్త్వమంతయు 'సతే అంతర్యామ్యమృతః' — 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' — 'జన్మాద్యస్యయతః' — 'అనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్' — 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' — అని ఉపనిషత్తులందు, బ్రహ్మసూత్రములందు, గీతయందు చెప్పబడినవానినే మరలమరల వివరించెను.

భక్తితోడనె భగవంతుడు చేరదగినవాడు - అనినట్లుగా, భక్తిని ఉపాయముగా "భక్తిమంత ఇహ భక్తవత్సలే, సంతతస్మరణ రోణకల్మషాః అని చెప్పెను.

ఇచట 'సంతతస్మరణమ్' 'భక్తవత్సలః' అను రెండుపదములు ప్రేమపూర్వకముగ స్మరించుటయే భక్తిశబ్దార్థముగ వివరించెను.

ఈ ప్రకరణమును సూక్ష్మదృష్టితో విమర్శించి చూచినచో, ఈ కావ్యమంతయు ఉపనిషత్తులకు ప్రతిబింబమని చెప్పవచ్చును.

అవతారరహస్యమునుగూడ మాఘుడు చెప్పినాడు. 'పరిత్రాణాయ సాధూనామ్' అను గీతోక్తిని ఈకవి దృఢపరచెను.

శ్రియః పతిరూపముగు తత్త్వముపాసింపదగినదని కవి యుద్దేశ్యముగా—

"శ్రియః పతి శ్శ్రీమతి శాసితుం జగత్..." అను కావ్యారంభమే స్పష్టపరచును

మఱియొక ముఖ్యవిషయము— ఈ కవి, ప్రాచీనసంప్రదాయముగా వచ్చుచున్న వ్యాఖ్యానమును ప్రతిపాదించు కోరికగలవానివలె, ఉపనిషదర్థమును ఉన్నదున్నట్లుల వివరించు కోరికగలవానివలె, ప్రథమసర్గయందు ఒక శ్లోకమును వ్రాసెను

నారదుడు ఆకాశమునుండి శ్రీకృష్ణునిదగ్గరకు వచ్చినచోట, శ్రీకృష్ణు డాతని నిట్లు వర్ణించెను.

"నిదాఘధామాన మివాధిదీధితిమ్
ముదా వికాసం మునిమభ్యుపేయుషీ
విలోచనే విభ్రదధిశ్రితశ్రిణీ
సపుండరీకాక్ష ఇతి స్ఫుటోఽభవత్"

ఈ శ్లోకమందు సూర్యతేజస్సుతో వెలుగొందు నారదుని సన్నిధానమున, సుందరమైన తామరపూవువలె - భగవంతుని కన్నులు వికాసమును పొందినవనియు, ఆకారణముచేతనే యాతని పుండరీకాక్షత్వము అన్వర్థమైనదనియు ను భావము.

సూర్యకిరణ వికసితములగు పుండరీకములను భగవంతుని కన్నులతో పోల్చుచు—

'కప్యాసం పుండరీక మేవాక్షిణీ తస్య ఉదితి నామ' అను ఉపనిషదర్థమును బుద్ధిపూర్వకముగనే వివరించెను.

'కప్యాస' శబ్దమునకు లోకవ్యవహారమున ప్రాచుర్యమును పొందిన మఱియొక అర్థము మాఘుని కాలమునందు లేదని గట్టిగ చెప్పగలము.

వేదాంతియగు మాఘుడు ప్రాచీనకాలము నుండియు, గురుశిష్యపరంపరగా వచ్చుచున్న ఉపనిషదర్థమునే ఇచట వివరించెను.

ఈతత్త్వమునే — 'గంభీరాంభస్సంభూత సుమృష్టనాళ రవికరవికసిత పుండరీక దలామలాయతేక్షణః' అని భాష్యకారులగు భగవద్రామానుజాచార్యులు స్పష్టపరచిరి.

వాక్యకారుడు బ్రహ్మనంది, ఉపనిషద్వివరణమునచేసిన అన్వయప్రక్రియముదగ్గర ఒక్కటియే అన్వయమును మాఘుడు తీసికొని వాడెనని, నిష్పక్షపాతులగు పండితోత్తములు గుర్తింపగలరు. ఈ అన్వయము మాఘకవికి గల పరమ వేదాంతతత్త్వమును స్పష్టముగా చాటుచున్నది.

ఈవిధముగా— మాఘకవి తనకాలములో పరంపరగావచ్చుచున్న శాస్త్రవైదుష్యమును తన గ్రంథమందు వివరించి చూపెను.

ఇది ఈతని సామర్థ్యమునకు ప్రతీక సంస్కృత సాహిత్యములో నీతనికావ్యమొక విజ్ఞానోచ్ఛ్రీర్షిక.

ఇతిశమ్.

[సంస్కృతవ్యాసమునకు తెనుగుసేత :
శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ ]

# శ్రీశైల దేవాలయము

శ్రీ కె. ఉమావరమూర్తి

శ్రీశైలము భారతదేశమందలి ప్రసిద్ధదేవాలయములలో నొకటి. శివార్చనకిది యొక పవిత్రమైనస్థలము. అచటి దైవమగు మల్లికార్జునస్వామి హిందూదేశమందలి ద్వాదశజ్యోతిర్లింగములలో నొకఁడు. ఇది యత్యంత ప్రాచీనతగల యొక దేవళము. చరిత్ర పొడవునను దైవపూజకును, ఫలసిద్ధికిని, శాంతిప్రాప్తికిని, చక్రవర్తులు, రాజులు, సేనాధిపతులు, ఋషులు, సామాన్య స్త్రీపురుషులు శ్రీశైలమునకుఁ బోవుచుండెడివారు. కావున నిది యాంధ్రదేశచరిత్ర సాహిత్య మతములతో సన్నిహిత సంబంధమునుఁ బొంది యున్నది.

ABBREVIATIONS

| | | | |
|---|---|---|---|
| 1. | A. S. I | = | Annual reports of Archaelogical Survey of India. |
| 2. | A. S. S. I. | = | Annual reports of Archaelogical Survey - Southern Circle. |
| 3. | M. E. R | = | Madras Epigraphical Reports. |
| 4 | E. C. | = | Epigraphia Carnatica. |
| 5 | E. I. | = | Epigraphia Indica. |

శ్రీశైలము కర్నూలు మండలమందలి నందికొట్కూరు తాలూకాకు నీశాన్యదిగ్భాగమందలి చొఱ శక్యముకాని నల్లమలకొండ భాగములలో నున్నది. ఈ దేవాలయము శ్రీశైలము కొండపైని నొకచిన్ని లోయలోఁ గృష్ణానదిని దిగువగా నీక్షించుచున్నది. ఈదేవళమున కన్నివైపులను నరణ్యములు చుట్టుకొని యున్నవి. ఆకొండయెత్తు 1583 అడుగులు. ప్రస్తుత మున్నమార్గము నిర్మింపఁబడుటకుఁ బూర్వము కనీసము 10 మైళ్లమేర సాంద్రారణ్యములు, లోతైన రాతికనుమలు, ఎగుడుదిగుడులుగల పర్వతప్రాంతములగుండా ప్రజలు నడువవలసి వచ్చెడిది, 1853వ సంవత్సరపు సర్వేపటమున నీప్రాంతము చొఱరానిదిగా గుర్తింపఁబడియుండుటచే నాటివఱకు నది ప్రవేశమున కననుకూలముగ నుండెను.

ఈదేవాలయమును 1793 లో దర్శించిన మొదటి యెరోపీయనుఁడు కర్నల్ మెకన్జి. అతని సందర్శన విశేషముల వృత్తాంతము "ఆసియా పరిశోధనలు" అనుపత్రికలో భద్రపరుపఁబడి యున్నది, అతనికి లింగమును నద్దములోఁ జూపిం

చిరి. తరువాత సంచరించినవాఁడు 1854 లో వచ్చిన నెల్సన్ నావికుఁడు. ఆప్పుమిప ప్రదేశము, ప్రాకారకోటలు, దేవాలయములు, ధనురాకారప్రదేశములయొక్క శిథిలములమయమై యున్నదని ఆతఁడు వర్ణించెను నేటికి నవి యటులనే నిలిచియున్నవి. ఎండిపోయిన యడుగుబురద కనఁబడు తటాకములు, భూమిని సాగుచేయుటద్వారా గ్రామముల కాధారమై యుండుటచే నిది యొకానొకప్పుడు అభివృద్ధిలోనున్న ప్రదేశమని నెల్సన్ చెప్పుచున్నాఁడు.[1] ఆతఁడు చెప్పినది వాస్తవమే! 16వ శతాబ్దమున విజయనగర సామ్రాజ్యమునుఁ బరిపాలించిన శ్రీకృష్ణదేవరాయల కాలమున నది శ్రీశైలరాజ్యమని పిలువఁబడు నొక భూభాగమని శిలాశాసనములవలనను సాహిత్యము వలనను మనము తెలిసికొనుచున్నాము. ఇపుడు విడువఁబడిన నాగలూటి, సిద్ధాపురము, పెదచెఱువు వంటి కొన్ని గ్రామములు మల్లికార్జునుని దేవాలయమునకు బహుమానములుగా నొసఁగఁబడినవి.[2]

### దేవాలయోత్పత్తి

పెక్కుదక్షిణహిందూదేశపు దేవాలయముల వలె శ్రీశైలముయొక్క యుత్పత్తి ప్రాచీనకాలీనమగుటచే వినష్టమైనది దైవమగు మల్లికార్జునునియొక్క నామమునకు హేతువును వివరించుటకు స్థలపురాణమొక గాథనుఁ దెల్పుచున్నది. ఇది పూర్వకాలపుఁ జరిత్రాత్మక సంఘటనమును భద్రపఱచి యుండవచ్చును

అది యిట్లు చెప్పఁబడుచున్నది. ప్రాచీన కాలమునఁ జంద్రగుప్తుఁడను గుప్తచక్రవర్తి కృష్ణ కావలియొడ్డునఁ జంద్రగుప్తపట్టణమను పట్టణమునుఁ బరిపాలించుచుండెను, చాలకాలమువఱకు నతఁడనపత్యుఁడుగా నుండెను. తుదకు శివుని యనుగ్రహమున నాతనిభార్య యొక యాఁడుశిశువుఁగనెను. ఆ శిశువు జన్మించినవెంటనే యారాజు దూరదేశములకుఁ బోయి చిరకాలమువఱకు రాఁడయ్యెను. అతఁడింటికి దిరిగివచ్చి యుక్తవయస్కయై సౌందర్యవతియైన తన కూఁతును జంద్రావతిఁజూచెను. అతఁడామెను ప్రేమించి కామించెను. తండ్రియొక్క యీవిధమగు ప్రవర్తనకు భీతిలి యాబాల యాతనియొద్దనుండి పాఱిపోయి నదినిఁ దఱించి శ్రీశైలపర్వతమునకు వచ్చెను, చంద్రావతియొక్క శాపఫలితముగా నా తండ్రి శిలగామారి యాతని పట్టణము శిథిలమయ్యెను. శ్రీశైలపర్వతముమీఁద నామె దైవమును మల్లికా కుసుమములతోఁ బూజించెను. అనతికాలముననే దైవము ప్రత్యక్షమై యామె కోరికను నెరవేర్చెను. ఆమె పూజకు స్మృతిచిహ్నముగా నాతఁడు మల్లికార్జున నామము వహించెను. ఆ సమయమునుండి శ్రీశైల పర్వతముమీఁది దైవము మల్లికాకుసుమములతోఁ బూజింపబడిన దైవమను నర్థమువచ్చు "మల్లికార్జునుఁ" డని వ్యవహరింపఁబడుచున్నాఁడని పురాణము తెల్పుచున్నది.

ఈ పురాణము భారతదేశచరిత్రలోఁ బ్రసిద్ధి కెక్కిన గుప్తక్షత్రియ వంశమునకు సంబంధమును కలిగియున్నది. పెక్కండ్రు పండితులు దీనినాశ్రయించుకొని వివిధరీతుల వివరించిరి. ఉదాహరణకు 1915వ సంవత్సరపు శిలాశాసన నివేదికలలో నీ విధముగాఁ జెప్పఁబడినది. మౌర్యచక్రవర్తియగు చంద్రగుప్తునకు నిది యన్వయించును. ఉత్తర హిందూదేశమున గొప్ప కఱువు సంభవించిన సంవత్సరమున భద్రబాహుఁడుతోడుగా మైసూరురాష్ట్రమందలి శ్రావణబెలగోలకుఁ జంద్రగుప్తుడు వలస పోయెనను సంప్రదాయముతో నన్వయింపఁబడినది. ఈ వలసను సూచించు శిలాశాసనము లిటీవలి కాలమునకు సంబంధించినవి[3] స్వర్గీయ బి. వి.

1. Madras Journal of Literature & Science-XXII P-126.
2. 14, 33, 26, 54, 12 of 1915. (Madras Epigrophical reports) M. E R.
3. Ancient India IV PP. 15-25.

కృష్ణారావుగారు సూచించినదికూడ సత్యమే! చంద్రగుప్తుఁడు మౌర్యవంశమునకుఁ జెందినవాఁడని చెప్పుటలో న్యాయములేదనియు నది యట్లుండఁగా నీతఁడు గుప్తవంశజుఁడని పురాణము స్పష్టముచేయుచున్నదని యాయన వాదము. ఈరాజు మహాకోసలనుపాలించు చంద్రగుప్తరాజనియు నాతఁడు తనకూఁతును విష్ణుకుండిన వంశజుఁడగు మూఁడవ మాధవవర్మకిచ్చి పెండ్లిగావించెననియు నాయన యభిప్రాయము. [4] కేవలము నామసాదృశ్యముచే గతులు బునర్నిర్మించుట సాధ్యముకాదు. అయినప్పటికి నాంధ్రదేశముఁ బాలించిన క్షత్రియవంశములలో విష్ణుకుండినులు మాత్రము తమ రాగిరేకుల శాసనములలోఁ దాము శ్రీశైలదైవమునకు భక్తులమని ప్రకటించుటన్నది స్మరించుట వినోదదాయకము.

ఈ యితిహాసము, 12వ శతాబ్దము నాల్గవ పాదమున జీవించిన పాల్కురికి సోమనాథుని రచన యగు "పండితారాధ్య చరిత్ర" యందుఁగూడవర్ణింపఁబడినది [5] ఆ కథయందుఁ జంద్రగుప్తుఁడు సోమవంశమువాఁడనియు, గొప్పభక్తుఁడనియుఁ జెప్పఁబడియున్నది. తనకూఁతు నారాజు కామించిన సంఘటనమున కంధాధారములేదు. క్రీ. శ. 1512లో లింగనామక ప్రధానిచే దేవాలయమందున్న శిలాశాసనమునందీ యితిహాసము పునరుక్తము కావింపఁబడినది. [6] ఈ శాసనమునందును పైసంఘటనముగూర్చిన వర్ణన లేదు సరిగదా యారాజు గుప్తవంశమునకుఁజెందిన వాఁడని మాత్రము చెప్పఁబడినది. ఈకథ దేవాలయ ప్రాకారపు వెలుపలిగోడమీఁద రాతిచట్రములపైఁ జెక్కింపఁబడినది. పైదానివలనఁ జంద్రగుప్తుఁడను

4. B. V. Krishna Rao : "Early dynasties of Andhra Desa" - P 523.
5. పాల్కురికి సోమనాథుని " పండితారాధ్య చరిత్ర " II పుస్తకము, పుటలు 281-285.
6 MER 16 of 1915 - Text lines 31-44.

నొకానొక రాజును నాతనికూతురును మల్లికార్జునుని పరమభక్తులని మనము నిర్ణయింపవచ్చును. 13వ శతాబ్దమునాటికి వారి భక్తివృత్తాంతము ప్రసిద్ధేతిహాసములలోని కెక్కునంతటి ప్రసిద్ధిఁబొందెను.

ఈ దేవాలయము పూర్వమొకప్పుడు బుద్ధుల పుణ్యస్థలమనికూడఁ జెప్పఁబడుచున్నది. [7] ఇట్టి యభిప్రాయము కలుగుటకుఁ గారణమేమన బౌద్ధ సాహిత్యము తఱచుగా దక్షిణాపథమందలి పవిత్ర బౌద్ధ సంఘారామమగు శ్రీపర్వతముగూర్చి తెల్పుచున్నది. అటులనే "యమరావతిస్తూప" రచయితయగు బర్గెస్, నాగార్జునుఁడు వసించి బోధించిన శ్రీపర్వతమును శ్రీశైలముగా గుర్తించెను. ఏలన శ్రీశైలము తనతోనెంతమాత్రము తక్కువప్రసిద్ధిలేని శ్రీపర్వతమను నామాంతరము కలిగియుండెను. కాని శ్రీశైలము బౌద్ధమతముతో సంబంధము కలిగినట్లు సాహిత్యమందుఁగాని శాసనములందుఁగాని యెట్టివిధమైన సాక్ష్యమును లభింపలేదు. అది యట్లుండఁగా నాగార్జునకొండవద్దజరిగిన త్రవ్వకములయు, శాసనపరిశోధనలయు ఫలితముగాఁ బ్రసిద్ధికెక్కిన శ్రీపర్వత సంఘారామము అచటనున్నదని ధ్రువపరుపఁబడినది. అచటఁగనుఁగొనఁబడిన యొక శాసనమువలన విజయపురికిఁ దూర్పుననున్న శ్రీపర్వతముమీఁది బౌద్ధ సన్యాసుల ప్రయోజనమునకై యుపాసిక బోధిశ్రీ యొక విహారమును నిర్మించి ధారాదత్తము చేసినట్లు తెలియుచున్నది. [8]

శ్రీశైలము తనప్రారంభ దినములలో జైనులతో సంబంధము కలిగియుండవచ్చుననియు సూచింపఁబడుచున్నది. క్రీ. శ. 12వ శతాబ్దమునకుఁజెందిన "ధర్మామృత" మనఁబడు జైన రచన మీఁదఁ బైవిషయమాధారపడియున్నది. దాని సంపా

7. Burgers - 'Amaravathi stupa' P-7 PN-4
8 Epigraphia Indica. Vol. XX P-23, A S I. 1926-27 P. 186.

దకులగు స్వర్గీయ నేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆ కావ్యము (నిశ్చయముగానట్లు చెప్పఁబడకపోయినను) ప్రాచీన ప్రాకృత రచనమీఁద నాధారపడియున్నదని తెల్పుచున్నారు.[9] మల్లికార్జునస్వామి నామము జైనమునుండి యారంభమైనట్లు కనఁబడుచున్నది. ఏలన జైనసాహిత్యమునందు మల్లినాథ, మల్లిసేన, మల్లేశ్వరులవంటి నామములు మనకుఁదటస్థపడు చున్నవి. వాస్తవమేదియైనను నీ ప్రాచీనగాథలందీ విషయము తెలియనగుచున్నది. 8వ శతాబ్ది, యా తదుపరి కాలములందు జైనము కర్ణాటకదేశమందును శ్రీశైల పరిసరప్రదేశములందును బ్రసిద్ధికెక్కిన మతము. శ్రీశైలమునఁ క్రీ. శ 1512 నాటి ఒక శాసనము నందొక ప్రధానలింగము "శ్వేతాంబర జైనుని శిరస్సు ఛేదించినవాఁ" డని వర్ణింపఁబడి నది [10] వీరశైవులు జైనులను వధించినట్టియు, వారి దైవపీఠములఁ గూలఁద్రోసి లింగముల స్థాపించి నట్టియు విధానమునుఁ బండితారాధ్యచరిత్ర నిర్దుష్ట మైనరీతినిఁ దెలియఁజేయుచున్నది.[11] కావున 16వ శతాబ్దమువఱకును శ్రీశైలప్రాంతమందు జైనులు ప్రత్యక్షమైరనియు, వీరశైవులు 12వ శతాబ్దము తరువాతనుండి జైనమతమును నపరిమితమైన హింసారక్తపాతములతో, దరిమివేయుట మొదలిడి రనియు మనము విశ్వసింపవచ్చును.

ఈవిధముగా సాహిత్యమునందుఁ గనుఁగొన నగు స్థలపురాణేతిహాసములు దేవాలయముయొక్క పుట్టుకనుగూర్చి వెదకుట కంతవివరముగాఁదెల్పవు. అది యట్లుండ, నాప్రదేశమందుఁ గనుఁగొనఁబడిన శాసనములు విశ్వసించుట కుత్తమములైయున్నవి. కాని దురదృష్టవశమున నవి అర్వాచీనకాలమునకుఁ జెందినవి. క్రీ. శ. 1174 కాలమునాటి వెలనాటి రాజేంద్రచోడునిది ప్రప్రథమ శాసనము.[12] కాని నేటికిని శ్రీశైలము త్రవ్వకములు జరుపఁబడని శిథిలములతో నిండియున్నదని మనము జ్ఞప్తియందుంచు కొనవలయును. అది జరిగినప్పుడా దేవాలయము యొక్క ప్రాచీనతనుగూర్చిన యదనపు సమాచారము మనము పొందఁగలము.

శ్రీశైల దేవాలయముయొక్క దూరముగానున్న యీప్రాచీనతా విషయమున సందియముపొందఁ బనిలేదు. ఏలన క్రీ. శ. 420 నుండి 620 వఱకు నాంధ్రదేశము నేలిన విష్ణుకుండిన రాజులకుఁజెందిన శిలాశాసనములు శ్రీశైల దైవమునుఁ బేర్కొన్నవి ఈ పవిత్రప్రదేశముయొక్క యునికినిగూర్చిన సాహిత్య ప్రమాణము మనలను మహాభారత కాలమునకుఁ గొనిపోవును. అర్జునుడు సందర్శించిన తీర్థముల వర్ణనావసరమున మహాభారతమున శ్రీశైలమునుగూర్చిన యాధారమున్నది. అచట నిది శ్రీపర్వతమని వ్యవహరింపఁబడెను.[13] మార్కండేయపురాణ దేవిభాగవత భాగములందు శ్రీపర్వతమునుగూర్చిన వృత్తాంతముగలదు.[14] ఇది భాగవతపురాణమునందును బృహత్సంహితయందును సూచింపఁబడినది గుణాఢ్యుని (క్రీ. శ. 2వ శతాబ్ది) ప్రాచీనరచనయగు "బృహత్కథ" నాధారము చేసికొనిన సోమదేవుని "కథాసరిత్సాగరము" శ్రీశైలమును సూచించుచున్నది.[15] ఇచటకూడ నిది శ్రీపర్వతమనియే వ్యవహరింపఁబడెను. ఇచట నొక శైవఋషి తపమాచరించుటకైపోయి యమానుషశక్తినిఁ బొందెను.

9. 1928 నాటి "భారతి" - పుట 138.
10. MER. 16 of 1915 text line 70.
11. "పండితారాధ్యచరిత్ర పరిచయము" పుటలు 330-333, బసవపురాణము-షష్ఠాశ్వాసము-పుట 148

12. MER. 59 of 1942-43.
13. మహాభారత (Bhandarkar Edi.) 83 Adhyaya 16, 17, 18 శ్లోకములు.
14. మార్కండేయపురాణము I-290 (క్రీ శ. 4వ శతాబ్దికిఁజెందినది) 14వ పుటలోఁజూడుము.
15. Survey "Ocean of Story' Book VI P. 108.

సుబంధుని వాసవదత్త సంస్కృతనాటకము దక్షిణాపథమందు మల్లికార్జునుఁడు నివసించుచున్న శ్రీపర్వతమును వర్ణించుచున్నది.[16] సుబంధుఁడు క్రీ శ. 6వ శతాబ్దిని జీవించియుండెను. హర్షుని "రత్నావళి" యందు నొకపాత్రయగు శ్రీకంఠదాసుఁడు శ్రీపర్వతమునుండి రాజసభకు వచ్చెననికలదు.[17] శ్రీపర్వతమునుండి యఘోరనాథుఁడను కాపాలికుఁడుజ్జయినివచ్చినట్లు భవభూతియొక్క మాలతీమాధవమందు గలదు.[18] శంకరాచార్యుని శివానందలహరిలో మల్లికార్జునుని నుతించుచు శ్లోకములుగలవు. తెలుఁగు సాహిత్యమునందు నన్నయభట్టారకుని (11వ శతాబ్ది) కాలమునుండి యారంభమై శ్రీపర్వతముగూర్చిన భక్తిపూర్వకసాహిత్యము వృద్ధిచెందెను.

## దే వా ల యా భి వృ ద్ధి

దక్షిణహిందూదేశపు పెక్కు దేవాలయములవలెనే నాదిలో శ్రీశైలముకూడఁ దన పవిత్రవృక్షమును గలిగియున్నది. భారతదేశమున వృక్షపూజ చాల ప్రాచీనాచారమని చెప్పఁబడుచున్నది. సింధు నాగరికత యైదువేల సంవత్సరముల ప్రాచీనమైనది. దానికిఁజెందిన మొహంజదారోవద్ద త్రవ్వఁబడిన ముద్రలమీఁద శైవాని సూచనలు చూడవచ్చును.[19] శ్రీమతి సాన్‌హర్డింగ్ ఇట్లు వ్రాయుచున్నారు. "వృక్షపూజ ప్రాచీన పవిత్రాచారముగాఁ బ్రసిద్ధికెక్కినది. మఱి దానియొక్క మజ్జియూతలు ప్రపంచమందలి ప్రాచీనమైన తెగలందున్నవి."[20] డాక్టర్ యన్. వి రమణయ్యగారు తమ "దక్షిణహిందూదేశపు దేవాలయముల పుట్టుక" యనుమనిట్లు చెప్పిరి. "సామాన్యముగా నిం బవృక్షము పవిత్రమైనదిగా స్వీకరింపఁబడుచున్నది. ప్రజలు దీనికిఁ బూజనొనరించెదవారు. ఈరీతిని నారంభములోఁ బ్రతిచోటను బూజింపఁబడు నొక పవిత్ర వృక్షమున్నది"[21]

శ్రీశైలమునఁ బ్రధానదేవాలయమున కుత్తర దిగ్భాగమున నదేయావరణలో నొక పెద్ద వటవృక్షమున్నది. దానిక్రింద మల్లికార్జునునకొక చిన్న గర్భగృహము కేటాయింపఁబడినది మూలలింగములనుఁ గలిగియున్న మూలదేవాలయమిదియేయని స్థానికైతిహ్యము తెల్పుచున్నది. అమఱ్ఱిచెట్టు 44 అడుగుల కైవారము కలిగియున్నది. దానిమీఁద నొక రాతితిన్నె కట్టఁబడియుండెను.[22] ఈవిధముగా శ్రీశైలమందే ప్రాచీనపూజావిషయకముగా నావృక్షమయ్యెను. ఆ వృక్షముక్రింద నొక లింగమున్నది. అదేమూలలింగమని యైతిహ్యము తెల్పుచున్నది. ఇది "ముదిమల్లికార్జున" యనికూడ వ్యవహరింపఁబడును. దానికిఁ బ్రాచీనమల్లికార్జునుఁడని యర్థము. ఇది యా దేవాలయమునఁ బ్రాచీన లింగమిదియేయని తెల్పుచున్నది. దీనికనుగుణముగాఁ దన నివేదికలో మెకన్జీ "ముది-ముల్ల-కార్జీ" యని వర్ణించెను.[23] ఈలింగమునే చంద్రావతి పూజించెననియుఁ గఱ్ఱియావు పాల నను దినము దోహనక్రియ నొనరించిన యజ్ఞాతవ్యక్తి దైవముకాక వేరొకఁడు కాఁడన్న యితివృత్తమును నర్చకుఁడు మెకన్జీకిఁజెప్పెను. మెకన్జీచేఁ దెలుపఁబడిన యీగాథ దేవాలయప్రాకారపు వెలుపలిగోడమీఁదఁ జెక్కఁబడినట్లు కనఁబడుచున్నది. ఈవిధముగా లాంగ్‌హర్స్ట్ కనుఁగొనినరీతిని నైతిహ్యమునుఁ దఱచి

16. Vasavadatta - (colm Nine press Edition) P. 68.
17. "రత్నావళి" విల్సన్ అనువాదము - పుట 277.
18. "మాలతిమాధవము" విల్సన్ అనువాదము - పుట 18.
19 Marshall : Indus valley civilisation, Vol I, P. 63-65.
20 Quoted in Dr. K. K. Pillay, That of Incuidram Temple.
21. Dr. N, V. Ramanayya "origin of South Indian Temple" PP 4-5.
22. A S S I. 1917 - P. 25.
23. Asiatic Researches V. P. 132.

చూచిన నిదియే శ్రీశైలమందలి ప్రాచీన శివక్షేత్రమని మనమూహింపవచ్చును.[24]

ప్రధానదేవాలయము తూర్పుదిశ కభిముఖముగానున్న లింగము పది యడుగుల చదరముగా భూమిలోనికిఁ జొచ్చుకొనిన యొక చిన్నరాతి నిర్మాణపుఁగట్టడము, ముఖమండపము 15వ శతాబ్దమున నిర్మింపఁబడినదని మనమెఱుఁగుటచేఁ బ్రధాననిర్మాణము, 14వ శతాబ్దమునకుఁ బూర్వమీ దేవళపు భాగముగూర్చి యేమియు లేకపోయినను, 13, 14 శతాబ్దులకుఁగాని యంతకుముందు కాలమునకుఁగాని చెందినదైయుండవచ్చును. నేడు కనఁబడుచున్న రీతిని ప్రధానభవనముయొక్క పద్ధతినిగూర్చియు కాలమునుగూర్చియు లాంగ్‌హర్‌స్ట్‌యొక్క యభిప్రాయమిదియే!

పిమ్మటఁ బేర్కొనఁదగిన ముఖ్యభవనము గర్భగుడి కభిముఖముగానున్న ముఖమంటపము. ఇది 1405లో విజయనగరమునకుఁజెందిన హరిహరరాయనిచే నిర్మింపఁబడినది.[25] హరిహరుని భార్యయు కదంబ యువరాణియునగు విఠలాంబ క్రీ. శ. 1393లోఁ బాతాళగంగకుఁ గొనిపోవుమార్గమున సోపానములు నిర్మించెను. ఏలన మల్లికార్జునస్వామి యామెకు స్వప్నమున సాక్షాత్కరించి సోపానములు నిర్మింపుమని యామె నాజ్ఞాపించినట్లు శిలాశాసనము తెల్పుచున్నది. ఈరీతిని విజయనగరసంగమవంశమునకుఁజెందిన రాజ్ఞీచక్రవర్తు లిరువురును భక్తిపారవశ్యమున నా దేవాలయముతో సంబంధము గలవారై తమ నామధేయములను శాశ్వతస్మృతి చిహ్నములుగాఁ జేసికొనిరి! వారిభక్తి వారిర్వురితోడనే యాగలేదు. భావికాలమున వారి కుమారుఁడగు మొదటి దేవరాయలు ఉదయగిరియందు రాజప్రతినిధిగానున్నపుడు క్రీ. శ. 1400లో నాదేవాలయమునకు దానములొసంగెను.[26]

తూర్పుననున్న ప్రధానప్రవేశ ద్వారమునకును హరిహరుని ముఖమండపమునకును మధ్యనున్న వేఱొక విచిత్రమైన కట్టడము చిన్న దైవపీఠము. ఇది క్రీ. శ. 1578 లో ననవేమునిచే నిర్మింపఁబడిన ప్రసిద్ధ వీరశిరోమండపము[27] ప్రోలయవేముని సోదరుఁడునుఁ దన పినతండ్రియు నగు నన్నయరెడ్డి యొక్క ఘనతను జాటుటకై రాజుచే నీమండపము నిర్మింపఁబడెను. ఏతన్నిర్మాణము ఒక యుద్యోగియును, పంచభిక్షము రామయ్యకుమారుఁడునగు మల్లన్న యాధ్వర్యమున జరిగెను. ఈ రామయ్యయే రాజగు వేముని కాలమందు సోపాన నిర్మాణముఁ బర్యవేక్షించినవ్యక్తి. శివభక్తులగు కొంగువీరులు తమ నాల్కలను, శరీరావయవములను, నేత్రములను, శిరస్సులను సమర్పించుటకై యీమండపముద్దేశింపఁబడినది. ప్రాణములను శరీరావయవములను దైవమునకు సమర్పించు నభ్యాసము ముఖ్యముగా శైవులలో నాచారముగా నున్నట్లు సాహిత్యమువలనఁ దెలియుచున్నది. పండితారాధ్యచరిత్ర శ్రీశైలమున నీ యభ్యాసమున్నట్లు తెల్పుచున్నది.[28] 14వ శతాబ్దమున "చంపుడుగుడు" లనఁబడు కొన్ని దేవాలయములున్నట్లు తెలియుచున్నది. అచ్చట వీరు లాత్మార్పణము గావించుకొనెడివారు.[29] శ్రీశైలము మీఁద "కర్మహరేశ్వరం" మనఁబడు నొక ప్రదేశము గలదు. ఈప్రదేశమునుండి భక్తులు క్రిందకు మృతిచెందునట్లు దుమికెడివారు. దానివలన వారి కర్మ నాశనమయ్యెడిది, ఆ రోజులలో సీయభ్యాసము

24. ASSI - 1917 - P. 25.
25. 11 of 1915.
26. 45 of 1942-43.
27. 20 of 1915.
28. "పండితారాధ్య చరిత్ర" - II పుస్తకము - పుటలు 405, 409; క్రీడాభిరామము - పుట 142.
29. కొఱవి గోపరాజు రచన "సింహాసన ద్వాత్రింశిక"— I, IV, V, I7.

ప్రసిద్ధిగాంచెన్నట్లు ఈసత్యమునే యనవేముఁడు నిరూపింప నొక మండపము కట్టించెను రెడ్డిరాజవంశమందు మఱియొక వ్యక్తియు, కుమారగిరికి బావమఱఁదును నమాత్యుఁడును నగు రాచయవేముఁడు క్రీ. శ. 1405లోఁ బర్వతముమీఁది యున్నతి ప్రదేశమగు శిఖరేశ్వరదేవాలయమునకు సోపానములు నిర్మించెను. [30]

శ్రీకృష్ణదేవరాయల కాలమందుఁ గొన్ని యితరములగు నదనపు విషయములు ఆదేవాలయమునకుఁ గల్పింపఁబడినవి. విజయముపొంది కొంతవీటి యుద్ధమునుండి తిరిగివచ్చుచున్నప్పటి ప్రయాణములో నారాజు దేవాలయము సందర్శించెను. ఆయన దైవమునుఁ బూజించి రెండుగ్రామములను దైవమున కొసంగి తేరువీథియందు మండపములను నిర్మించెను. [31] ఈసమయమున శ్రీశైలరాజ్యము క్రీ. శ 1530 లో చంద్రశేఖరయ్య యనునాయన యధీనములో నుండెను. ఈ ప్రధాని మల్లికార్జునని శయనాగారమునకు ముందు నొక మండపము నిర్మించెను. ఆమండపమందాయన కృష్ణరాయలయొక్కయుఁ, దన మామగారి యొక్కయుఁ, దనయొక్కయు మూఁడు శిలావిగ్రహములను స్థాపించెను, ఆయన కూడ నందీశ్వర భృంగీశ్వరుల బంగారు విగ్రహములను, దైవముయొక్క యుపయోగమునకై యొక బంగారపుఁ బాత్రను బహూకరించెను.

క్రీ. శ. 1512లో శాంతభిక్షావృత్తి యనుచరుఁడును శాంతకుమారుఁడును నగు వేఱొక ప్రధానస్థానిక లింగధారి యాదేవాలయమునకు ముఖ్యమగు నదనపు టభివృద్ధులనుఁ గల్పించెను. అతఁడు దేవాలయము చుట్టును 22 అడుగుల ఎత్తుగల కోటవంటి స్థూలమైన గోడను నిర్మించెను. లోనిగోడలయొక్కయుఁ, బ్రధాన దేవళముయొక్క పైభాగము యొక్కయు బంగారు పూఁతపనికి నతఁడుకూడఁ గారకుఁడు. 1794లో దీనిని మెకన్జీచూచి వ్రాసెను. [32] కాని 1915లో నవి కనఁబడుటలేదు. ఏలన 1821లో జరిగిన మహమ్మదీయుల దోపిడీలో నవి వారిచేఁ దొలఁగింపఁబడెను, శిలాశాసనములవలనఁ దెలియనగు రాజులచే, రాణులచే, ప్రధానులచే శ్రీశైలదేవాలయమునఁ గూర్పఁబడిన యదనపువిషయములేకాక, భైరవుఁడు, భృంగి, ధ్వజస్తంభములు, దీపస్తంభములు, బలిపీఠములు నిర్మించిన ప్రత్యేక వ్యక్తులును గలరు [33]

అదే ప్రదేశముననున్న భ్రమరాంబా దేవ్యాలయముయొక్క యునికి చాల విచిత్రముగానున్నది, లాంగ్‌హర్స్ట్ చెప్పినట్లు దాని యునికి విశిష్టమైనది. ఏలన నితర దేవాలయములతోపాటుగా నిది ప్రధానమైన భూభాగముకాదు, దీని కనుబంధింపఁబడిన గోడలోఁ బశ్చిమదిశకు వేఱొకద్వారములేదు. ఇది బహిరంగ మార్గముద్వారామాత్రము ప్రధాన దైవపీఠముకంటెఁ బురాతనదేవ్యాలయమని యివ్విషయములన్నియుఁ దెల్పుచున్నవి. ఆభవనముయొక్కతీరు, ఆభవనము రహస్యపుటుత్సవములకొఱకు నిర్మింపఁబడినదని సూచించుచున్నది. అది వాస్తవముగా నొక శక్త్యాలయమని స్పష్టము. ప్రాచీనకాలములో నచట నరబలులు తప్పక జరిగియుండవచ్చును.

## మతవిషయకమైన యాధారము

ప్రాచీనకాలమునుండియు శ్రీశైలము శైవపుణ్యక్షేత్రముగాఁ బ్రసిద్ధికెక్కినట్లు తెలియుచున్నది. దీనిని ద్వాదశజ్యోతిర్లింగములలో నొకదానినిగా నొక ప్రాచీనైతిహ్యమును శ్లోకమును పేర్కొనుచున్నవి. [34] శ్రీశైలమల్లికార్జునుని శంకరాచార్యుఁడు పొగడుటచే

30. 43 of 1942-43.
31. 18 of 1915.
32. 16 of 1915.
33. 28, 29, 31, 35, 37, 42, 45 of 1918.
34. 1925 నాటి భారతి 2వ వాల్యూము, పుట 95.

వారణాసి మఱియు నితర ప్రసిద్ధక్షేత్రములతో పాటు ఇది శైవులకు బవిత్రమైనదగును బుణ్యస్థలము గను నగుచున్నది

శివపూజకన్వయించిన శివతత్త్వము ఋగ్వేద హిందూమతముకంటె ముందటిదని తెలియుచున్నది. మొహంజదారో కాలమునన్న శివలింగములు, ఒక ముద్రమీఁది దైవము తాను గుర్తించిన పూర్వకాలపు శివునిమోస్తరుగా మార్షల్ నిరూపించెను. [35] కావున భారతదేశమందు నార్యులకుఁ బూర్వమందున్న ప్రజల మతాచార విశ్వాసములందు శైవమున కాధార ముండునని యాయన తలఁచుచున్నాఁడు ఈయార్యులకుఁ బూర్వమందున్న ప్రజలు మొహంజదారో నాగరికతకు నిజమైన నిర్మాతలు. ఆ నాగరికతా మహిమ యార్యవిశ్వాసదైవములతోఁ గొన్ని విషయములలో బాగుగా భేదించినదని యాయన తెలుపుచున్నాఁడు. ఈవిషయమును విశదపఱచుట కాయన సాక్ష్యముల నుట్టంకించుచున్నాఁడు. సర్వశక్తి సంపన్నమైన స్వర్గదేవతయందు వారు విశ్వాసముంచిరి. మఱియు సంఘటనోచితముగా భూమాత శక్తిసగ్రహించునదియు నదియే! ప్రజలను గల్లోలపరచి బాధించిన దుష్టశక్తుల మీఁదనువలె మంచివానిమీఁదను నారెండును నాధిపత్యము వహించెను ఈసిద్ధాంతముతో నైక్యముపొందినది చని పోయినపిమ్మట పునర్జన్మ కలదను విశ్వాసము [36] సామాన్యముగాఁ జెప్పినచో, గర్మనుగూర్చిన యాలోచనలు, పునర్జన్మ, యోగాభ్యాసము, శివదేవులయమర భావమును కేంద్రముగాఁజేసికొనినట్టి మతవేదాంత విషయకభావములు, వేదసిద్ధాంతమగు హోమమునకు భిన్నమైన హిందూపూజావిధానము నివన్నియు హిందూమతమునో నెక్కువగాఁ బుట్టుకచే నార్యులవి కానివిగాఁ గనఁబడుచున్నవి [37] వైదికదైవమగు రుద్రుఁడుత్తరకాలమునఁ గొన్ని స్వభావములుగల శివునిగా గుర్తింపఁబడెను, రుద్రుని యనుచరులలో నాటవిక నిషాదులగు గణములు, కుంభకారులు, పనివారు మొదలగు వారుండిరి. ఈతెగల కన్నిటికిని సామాన్యవిషయకమగు రుద్రదైవము బహిరంగ ప్రదేశములందు, నరణ్యములందును, మరుభూములందును నున్నట్లును, నాగరక మానవుల నివాసములకు దూరముగా నున్నట్లును తెలియుచున్నది. [38] అంతేకాక యీభయంకర దైవమును దృప్తిపరచుటకు గృహ్యసూత్రములందొక యజ్ఞము సూచింపఁబడినది. ఇది "సులాగవ" మని వ్యవహరింపఁబడును. ఇందొక వృషభము హోమము చేయఁబడును. ఇది తప్పక యూరివెలుపలఁ జేయబడవలెను. ఇందు శేషించిన పదార్థములు గ్రామములోనికిఁ దేఁబడ రాదు. [39] పైగా భండార్కరిట్లు చెప్పుచున్నాఁడు: "ఋగ్వేదమునందు (VII, 21, 5) శిశ్నదేవులను. గానమొనరించువారి యధికారములను భంగపఱప రాదని యింద్రుఁడు ప్రార్థింపఁబడినట్లు పరిచ్ఛేదములుగలవు. వేఱొకసందర్భమున శిశ్నదేవుని దైవముగాఁ గల్గినవారినిఁ జంపినతరువాత నొక నగరము యొక్క సంపదలను జయింపవలెనని యాతఁడు ప్రతినిధులద్వారా కోరఁబడెను. దక్షప్రజాపతి యజ్ఞగాథ, దానికి హాజరగుటకై శివుని కాహ్వానము పుంపుట కాతని తిరస్కృతి, తత్ఫలితముగాఁ బార్వతి యాత్మార్పణము గావించుట యనునదికూడ, నీదైవము యజ్ఞోత్సవమున కర్హుఁడు కాఁడని భావింపఁబడుట, యార్యమతమునందలి యొకదశకు సూచన " [40]

35. Indus V Cvilisation Vol. I, P. 53 PL XII (17).
36. Ilid P. 48.
37. Pre-Aryan and Pre-Dravidian in India : Ed. by P. C. Baglin and JRASB XIV P. 100 Note I.
38. Bhandarkar " Vaishnavism & Saivism ' P. 104.
39. Ilid P. 105.
40. JRASB. XIV 00 5-7.

## లింగము — పూజ

శైవమందుఁ బూజకు విషయమైనది లింగము. ప్రాచీనసాహిత్యమునందీ పూజయొక్క యునికి లేద నియు, మహాభారతమందలి యానుశాసనిక పర్వమున నిది మనకుఁ బ్రప్రథమముగాఁ గనఁబడుచున్నదనియు భండార్కరు తెల్పుచున్నారు. శైవము పూజావిధాన మున భావమునందును నార్యుల వేదమతమునకు ముందటిదని యీవిషయము స్పష్టపఱచుచున్నది. మొహంజొదారో త్రవ్వకములలో లింగయోనులను బోలియున్న పెక్కురాతిముక్కలు కనుఁగొనఁబడి మార్షల్‌చే నవి లింగయోనులని గుర్తింపఁబడినవి. ఋగ్వేదమునందు (VII, 21, 5) శిశ్నదేవులు, అనఁగా లింగమును దైవముగాఁ గలవారిస్మరణ లింగపూజకు లకు ఋజుమార్గకమైన యాధారము. పురాణముల కాలమునుండియు లింగపూజ తఱచుగా జరుగుచు బలపరుపఁబడుచున్నది.[41] లింగపూజకుఁ బ్రారంభ దశలలో లింగమనునది పురుషలైంగికశక్తికి సూచన మనికూడ స్పష్టముగాఁ దెలియుచున్నది. భారతదేశ మునఁ బ్రాచీనలింగము "గుడిమల్లము"నఁ జూడ నగును. మఱియు నిది వాస్తవమైన యాకృతి కల దిగాఁ జేయఁబడినది. దీనియొక్క కాలము క్రీస్తు పూర్వము 2వ శతాబ్దమని గోపీనాథరావుగారు నిర్ణ యించిరి. అటుపిమ్మట నీ లింగములు సంప్రదాయ చిహ్నములుగా జేయఁబడినవి. ఇంచుమించుగా మానవలింగమును బోలియుండిన కొండలును, బర్వత శిఖరములును ప్రాచీనకాలమునఁ బవిత్రమైనవిగా భావింపఁబడెడివనికూడఁ జెప్పఁబడుచున్నది. కొన్ని ప్రత్యేక స్థలములందలి, ప్రత్యేకాకారముగల సహజ తటాకములును పడియలును దేవతలయోనులనుకొన బడినవని విశ్వసించుట హేతుసమ్మతము. కొన్ని సమయములందుఁ బర్వతములు దేవతలస్తనములనఁ బడెడివి. ఈవిధముగాఁ బ్రాచీనకాలమున జనులు పర్వతతటాకములవంటి ప్రకృతివస్తురూపములకు దేవీదేవతల శరీరావయవములతో సంబంధము కల్పిం చిరి. ఈభావము లితరములైనవానివలె ఆర్యేతర ప్రభావములు కారణములుగానున్నవి.[42] ఈభావ నలలోఁ గొన్ని శ్రీశైలమునకుఁగూడ నన్వయించునవి. లింగము స్వయంభువను వర్ణన మనకు లభ్యమగు చున్నది. ఆలయము పర్వతముమీఁదనుండుట గమ నార్హము. మల్లికార్జునునిఁ బూజించిన యొక యువ రాణిపేరున "మల్లికగుండ" మను తటాకము మనకుఁ దటస్థపడుచున్నది. పాలకుర్తి సోమనాథుఁడు పర్వత ములను దేవిస్తనములుగా వర్ణించినట్లు మనము కనుఁ గొందుము. బహుశః దీనికంతకునర్థము శైవ మపరి ష్కృతమైన యాదిమమైన మతమని కాదు. నిమ్నజాతు లలో నిది ప్రసిద్ధమైయుండుటకు హేతువైన దీని ప్రారంభమిట్టిదనిమాత్రమే! అటుపిమ్మటనే శాం తినిఁ (శుభమును) బ్రసరింపఁజేయువాఁడను నర్థము వచ్చు "శివుఁడు" దైవమయ్యెను.

### మాతృదేవీపూజ

శివపూజతో ముడివడియున్న శివుని యర్థాంగి యగు దుర్గ లేక యంబయొక్క పూజ వాస్తవమునకు మాతృదేవీపూజ. శ్రీశైలమున నామె భ్రమరాంబగాఁ బూజింపఁబడుచున్నది. భారతదేశమందలి యష్టాదశ శక్తులలో నామె యొకతెగా భావింపఁబడుచున్నది.

మాతృదేవీపూజయనునది వెనుక గొప్పచరిత్ర కలిగి ప్రాచీనప్రపంచముపొడవున నునికినిఁబొందెను. ఈపూజకు సంబంధించినట్టి సామాన్యముగా నంగీక రింపఁబడిన భావములేవనఁగా నామె జగన్మాత లేక ప్రకృతిదేవతవంటిది. ఆమెను బూజించువిధానము అనటోలియానుండి ప్రారంభమై యచటనుండి పశ్చి

41. B. C. Lan. Comn. Volume, Karmarkar : "Lingo-cult in Ancient India" P. 456 to 468.

42. JRASB. XIV P. 7.

మాసియా యంతటను వ్యాపించినదని విశ్వసింపఁబడు చున్నది. ఈపూజ క్రొత్తజాతియుగమందు నైలునది నుండి సింధునదివఱకు నాచరణలోనుండెను. ఈ పూజాపద్ధతి భౌగోళికముగా దగ్గఱప్రాంతముల వార గుటయేకాక, సాంస్కృతికముగాకూడ పరస్పరసమాన విషయములచే నైక్యముగల ప్రాంతజాతియుగపు ప్రజల పూజావిధానముపై తనప్రభావము ప్రసరింప జేసెను. [43] భారతదేశమందీ పూజ యున్నిగ్రామ ముల పుణ్యస్థానములందుఁ గనుఁగొనఁగును. ఇదియే శక్తిపూజ యభివృద్ధిచెందుటకు దారితీసెను. ఈ శక్తులు సాదవంతమైన దేవతలు. శక్తిపూజ వేద మతమునందుఁ గనఁబడదు. ఆర్యమతముయొక్క ప్రాచీనావస్థయందు దేవతలు బహుస్వల్ప పాత్రను వహించిరి. మాతృశక్తియొక్క విభిన్నమైననామములు సహజముగా విభిన్నమైన తెగలనుండి యుద్భవించి పిమ్మట శివునియర్ధాంగిగా గుర్తింపఁబడినవి. దుర్గ, పార్వతియను నామములు దుర్గమమైన పర్వతము లతో ముఖ్యముగా హిమాలయములతోఁగల సంబంధ మును ధ్రువపఱచుచున్నది. మఱియు వీరు పర్వత ప్రాంతవాసులగు ప్రజలచే సహజముగాఁ బూజింపఁ బడిరి. గిరియందు శయనించువాఁడని శివుని నామ మగు గిరీశపదమునకర్థము. ఉమాంబికా నామములు (కుషానురాజగు హువిష్కుని నాణెములమీఁదనున్న "ఓమ్మో" అనునది) ద్రావిడపదమగు "అమ్మ" నుండి పుట్టినవి. లోకమాతయను భావముకలదది. "కాళి" యనఁగా నల్లనిది లేక నల్లనిముఖవర్చస్సుగల దేవత. ఈమె నల్లని శరీరముగల ద్రావిడజాతిలోని కొందఱ దేవతయై యుండవచ్చును [44]

దక్షయజ్ఞ సందర్భమున శక్తిపీఠములయొక్క పుట్టుక పురాణములచే వివరింపఁబడినది. పార్వతి మరణానంతరము శివుఁడు ఆమె మృతకళేబరము తనభుజములందుంచుకొని యిటునటు తిరుగుచుండెను. ఇట్లు తిరుగుచుండఁగా పార్వతియొక్క వివిధ శరీరావ యవములు పెక్కుప్రదేశములందుఁబడెను. భారత దేశమందు భిన్నప్రదేశములలో నివియే యుత్తరకాల మున శక్తిపీఠములయ్యెను. [45] ఈశక్తిపీఠముల సంఖ్యనుగుఱించి వివిధములైన వ్రాఁతలలో నైక్యము లేదు. రాయల్ ఆసియాసొసైటీ, బెంగాలునందలి గ్రంథాలయమునకు సంబంధించిన "అష్టాదశ పీఠము" లను రచనయందలి శిలాశాసనసంఖ్య 5913. ఇది శంకరాచార్యుల రచనగా నారోపింపఁ బడినది. ఈరచన క్రీ. శ. 1661 లో నివసించిన బెంగాలు వాస్తవ్యుఁడగు శంకరాగమాచార్యుల రచన యని డి. సి. సర్కారు ఊహించుచున్నారు. ఈరచన శక్తిపీఠములనామములఁ దెల్పుచున్నది, వానిలో శ్రీశైలమొకటి. [46] సర్కారు చెప్పినట్లులిది కుతుక మును గలిగించునది. ఏలన శ్రీశైలముమీఁద భ్రమ రాంబనుంచిన మొదటి రచన యిదియే. ఇది క్రీ శ. 1806 లో వ్రాయఁబడినది. దేవీభాగవతమందు భ్రమరాంబాదేవినిగూర్చిన సమాచారము మనకు లభ్యమగును [47] ఇది భ్రమరాంబయొక్క శక్తిని గూర్చిన వర్ణన. దేవదేవురేరేపింపఁబడిన భ్రమరము లచే అసురుఁ (అరుణుఁ) డేవిధముగా వధింపఁబడెనో దానిసీకథ వర్ణించుచున్నది. నానైయా, ఆర్టిమ్సువంటి పశ్చిమాసియా యందలి మాతృదేవతల యాయారూప ములు తమచిహ్నములుగా భ్రమరములను గలిగి యుండుటన్నది గుర్తించుటకు కుతూహలజనకముగా నుండును.

43. Thd. V. Cini - P. 50.
44. Payne " Sakthas " - Chap III P 6, J R A S B. XIV P 3, J R A S. 1906, PP. 355-12.
45 JRASB. XIV, P. 18
46. Ilid P 18
47. Devi Bhagavatham (S. B E. Series) V 26, Part III, P. 1046-53.

## నరబలులు

భ్రమరాంబా దైవపీఠమును వర్ణించునపుడు, లాంగ్‌హర్ట్స్ ప్రాచీనకాలమున నరబలులొసంగఁబడు ప్రదేశముల దానివిధానము ననుసరించి యూహించెను. ఇది యుక్తమైనదే. ఏలన భ్రమరాంబ శక్తి. ప్రాచీనకాలమున శక్తిపూజ నరబలితోఁగూడియుండెడిది. భారతదేశమందుఁ బ్రాచీనకాలమునుండియు నరబలులున్నవని ఋజువుచేయుటకు విల్సన్ వేదములనుండి యుదాహరణల నొసంగుచున్నారు.[48] శక్తిపూజావిధానమున నరబలులున్న సందర్భమును ఋజువుచేయుటకు సాహిత్యమునందుఁ బెక్కుదాహరణములుగలవు తన "హర్షచరిత్రము" నందు బాణభట్టుఁడు నరమాంసమమ్మఁబడుటను సూచించుచున్నాఁడు.[49] శ్మశానమునందు భయంకర కర్మకాండలనుగూడ భైరవాచార్యునిద్వారా బాణుఁడు వర్ణించుచున్నాఁడు పుష్పభూతియెదుట.[50] భవభూతి యొక్క మాలతీమాధవమున శ్మశానదేవాలయదృశ్యమున్నది. అందు "కాపాలిక", "అఘోరఘంటు"లున్నారు. క్రీ.శ. 1000 కంటెఁ బూర్వమున నున్నదని భావింపఁబడు "కలికిపురాణ" మందు నరబలులన గూర్చి యొక పరిచ్ఛేదముగలదు.[51] కథాసరిత్సాగరమందుఁగూడ బలుల కుదాహరణములు మనకు లభ్యమగును.

దేవతను సంతృప్తిపఱచుటకై చేయఁబడు నాత్మార్పణోత్సవముతో దీనికి దగ్గరసంబంధము కలదు ఈ యభ్యాసము చాలఁ బ్రాచీనమైనదని ఋజువుచేయుటకు యు. యన్. ఘోసల్ ఒక వ్యాసమునందుఁ బ్రాచీన సంస్కృతవాఙ్మయమునుండి యుదాహరణల నిచ్చెను.[52] మహాబలిపురమునందలి ద్రౌపదీరథ వరాహగుహలందలి రాతిచత్రములందు నాత్మార్పణము గావించు నీ యుత్సవము కనుఁగొననగునని వోగల్ సూచించెను[53] తిరుచునాపల్లియందలి గుహ యీవిధమగు నుత్సవమును బ్రతిబింబించు వేఱొక యుదాహరణము నిచ్చుచున్నది. ఇదేపనికై శ్రీశైలముపద్ద "వీరశిరోమంటప" మను ప్రత్యేకమండపము నిర్మింపఁబడినదని మనమిదివఱకే తెలిసికొనియున్నాము. మఱియు నీయుగపుఁ దెలుఁగు సాహిత్య మట్టి యాచరణలయొక్క యునికిని బలపరచుచున్నది.

## పాశుపతులు - శ్రీశైలము

శ్రీశైలము పాశుపత శైవతత్త్వమునకు ముఖ్యమైన కేంద్రములలో నొకటిగాఁ గనఁబడుచున్నది, శ్రీశైలము పాశుపతులు నివసించి తపమాచరించు ప్రదేశముగా సాహిత్యమునందు తఱచు సూచింపఁబడెను. ఒక పాశుపతఋషి యచ్చట తపస్సు నొనరించుటచే నద్భుతమైన శక్తులను బొందెనని కథాసరిత్సాగరమందుఁ జెప్పఁబడుచున్నది. పాశుపత సన్న్యాసుల సందర్భమున "రాజతరంగిణి" యందు శ్రీశైలము పేర్కొనఁబడుచున్నది.[54] ఇది పాశుపతులకు నివాసస్థలమై యుండెనని శాసనములవలనఁ గూడఁ దెలిసికొనవచ్చును. క్రీ శ. 1062 కాలమునఁ బశ్చిమచాళుక్యవంశమునకు సంబంధించిన యొక శాసనము, సిద్ధపురమందుఁ కళ్యాణశక్తి యను నొక ఋషికి బహూకృతు లొసఁగఁబడినట్లు తెల్పుచున్నది[55] ఈ సిద్ధపురము శ్రీశైలపర్వత పాదము పద్ద నున్నది. క్రీ. శ 1057 కాలమునఁ బ్రథమ

48. Wilson. 'Essays on religions of Hindus' Vol. II, PP 247-270.
49. Bana's 'Harsha Charita' Tr. by Thomas- P. 135.
50 Ilid P. 92.
51. Asiatic Researches V. P. 381.
52. Indian Historical Quarterly 1940 – P. 491 PP.
53. Vogel - ' Bulletin of School of Oriental Studies" Vol VI, P. 540.
54. "రాజతరంగిణి" ఆర్ యస్ పండిట్ అనువాదము.
55. 38 of 1942-43.

సోమేశ్వరుని కాలమందలి వ్రాంత, యతనిరాణి యగు మైలాలదేవి మల్లికార్జునస్వామిని సందర్శించి యా దైవసముక్షమున కాలాముఖ గురువగు సోమేశ్వర పండితదేవునకు బహూకరింపబడినదియును చెప్పుచున్నది. [56] క్రీ శ 1069 లో రెండవసోమేశ్వరుని వేఱొకశాసనము సోమేశ్వరపండితున కీయఁబడిన బహుమతులఁ దెల్పుచున్నది. ఆయన శ్రీశైలపర్వత పాదమునద్దనున్న శివపురమందలి కాలాముఖ సహాయు ననుచుండి తెల్పఁబడుచున్నాఁడు. [57] క్రీ శ 1079 లోని త్రిభువనమల్లుని యొక శాసనము శ్రీశైలమున కత్తిసమీపమునున్న సంగమేశ్వరముపద్ద నున్న యొక యనంతశక్తి కొసఁగఁబడిన భూదాన మును దెల్పుచున్నది. [58] మఱియొక శాసనము అనస్తీశర్వమతమని పిలువఁబడు, శ్రీపర్వతముమీఁది కాలాముఖమఠమును దెల్పుచున్నది. క్రియాశక్తిదేవ వామశక్తిదేవ ప్రభృతులామఠమున కధిపతులు [59] రెండవబేతుని కాలమందు (1076-1126) రామేశ్వర దీక్షితులను నొక ప్రసిద్ధ కాలాముఖ గురువుండెను. శ్రీశైలముమీఁది మల్లికార్జున శిలామఠమునకాయన యధికారి [60] కాలాముఖగురువు రెండవప్రోలునకు (1126-1140) గురువుకూడ. శ్రీశైలమున వేఱొక మల్లికార్జున కాలాముఖుఁడుండెడివాఁడు. ఆయనకు నన్నెచోడుఁడు తన కుమారసంభవము నంకితము సేసెను. కాలాముఖ లేక పాశుపత శైవతత్త్వమునకు శ్రీశైలమొకప్పుడు ముఖ్యకేంద్రముగా నుండెడిదని యీవిషయములు ఋజువుచేయుచున్నవి. పాశుపత శైవతత్త్వము భారతదేశమందలి ప్రాచీనశాఖలలో నొకటివలెఁ గనఁబడుచున్నది పాశుపతులు భారత మందును వాయు కూర్మ లింగ పురాణములవంటి పురాణములందును గనఁగొననగుచున్నారు. [61] శివుఁడు బ్రహ్మచారిగా నొక మృతకళేబరమందుఁ బ్రవేశించి లకులీశనామము వహించెనని చెప్పఁబడు చున్నది ఏకలింగజీపుణ్యస్థానమునందున్న క్రీ శ. 971-72 నాటి శాసనమువలన నీ పురాణవృత్తాంతము బలపరుపఁబడినది. ఆ శాసనము బ్రాహ్మణకుర్చశివుని దేశమందుఁ దానే "కాయావరోహణ" మను నొక సంఘము తనచేతులలో నుంచుకొనెనని తెలుపు చున్నది. [62] శివునిగూర్చిన యీవృత్తాంతము క్రీస్తు శకారంభమునకంటె ముందుకుఁబోవును [63] ఇంత వఱకుఁ గనుఁగొనఁబడిన లకులీశ లేక నకులీశ విగ్ర హములు రెండుభుజములు కలిగియున్నవి. [64] 7వ శతాబ్దినాటికే యాంధ్రదేశమందు పాశుపతాచార్య లుండుట యన్నది వేంగిని బాలించిన తూర్పుచాళు క్యుల తామ్రశాసనములవలన మనకుఁ దెలియు చున్నది. పశ్చిమగోదావరిమండలమందలి తేరంబి యాచార్యులు తూర్పుచాళుక్యరాజగు 2వ అమ్మ (945-70) కాలమున నుండినట్లు మనకుఁ గనఁబడు చున్నది. విద్యేశ్వరనామము ధరించిన యొక కాలా ముఖగురువచ్చట నుండెను అమరావతిపద్దనున్న యమరేశ్వరాలయమువంటి ప్రాచీనదేవాలయము లందు కాలాముఖ గురుస్థానములున్నవని కూడఁ జెప్పఁబడుచున్నది. [65]

## వీరశైవము

వీరశైవమను వేఱొక శైవోద్యమము 12వ శతాబ్దిలో కాలచూరి బిజ్జలునికాలమునఁ బ్రసిద్ధిలోనికి

56. 675 of 1923
57. 9 of 1927-28.
58. 430 of 1923-24
59. Epigraphia Carnatica III C. K 35.
60. కాకతీయసంచిక - పుట 256; అనుబంధము నెం. 39.
61. JBBRS. 1912, PP 154-155.
62 E I. I, PP. 274-275
63 Journal of Indian Hist. Vol. XXVII, Dr. Mahalingam "Pasupathas" in S. India P. 44
64. JRASB. 1907 - P. 424.
65. MER. 1915, Part II, Para II.

వచ్చెను. దీనిని శక్తిమంతమగు సుద్యమముగా నొన ర్చినవాఁడు బసవేశ్వరుఁడు. వీరశైవసాహిత్యమునం దొక ఉదాత్తవ్యక్తిగా బసవేశ్వరుఁడు లెక్కింపఁబడి నాఁడు. ఇతడు బిజ్జలునికోశాధికారి యని యందు వర్ణింపఁబడినాఁడు. కాని ఈతనిగూర్చి తెలుపు సమకాలీనశాసనము మనకు లభ్యముకాకుండుట వింత. ఒకానొకప్పుడు ప్రజలు చారిత్రికముగా బసవేశ్వరుని స్థితిగూర్చి సందేహపడిరి. ఇటీవల నర్జునవాడ శాసనప్రచురణముచే నావిషయము గూర్చి సందేహపడవలసిన యవసరముపోయినది. ఈశాసనమందు బసవేశ్వరుఁడు సంగనబసవఁడనియు, జంగములకు లింగములకు భక్తుఁడనియు వ్యవహ రింపఁబడెను.[66] ఈశాసనముప్రకారముగా నిది కాళిదేవరసునిఁ బేర్కొనుచున్నది. అతఁడు బసవని నుండి నాల్గవతరమువాఁడు. ఈవిషయము, బసవన బిజ్జలునకు సమకాలీనుఁడని తేల్చుచున్నది.

వీరశైవవేదాంతము షట్స్థల సిద్ధాంతమని వ్యవహరింపఁబడును. ఇది శైవసిద్ధాంతముకంటె భిన్న మైనది. వీరశైవము విగ్రహారాధనము నెక్కువగా వ్యతిరేకించును. తుదకు దేవాలయములలో లింగము లను బూజించుటనుగూడ నంగీకరింపదు. హిందూ మతముయొక్క యుత్సవాదులను వీరశైవమంగీక రించుటగాని యాచరించుటగాని చేయదు. బౌద్ధజైన ములవంటి సంస్కారోద్యమములతోనిది పూర్తిభేదము కలది. గృహ్యసూత్రోక్త హైందవకర్మకాండ ననుస రించు వేదముల అధికారమును వీరశైవులు లెక్క పెట్టరు. ఉదాహరణమునకు వీరశైవులయొక్క వివాహవిధులు సహజముగా హిందువుల పద్ధతుల కంటె వేఱుగానుండును. వీరశైవమందు సప్తపద కార్యక్రమములేదు. అగ్నిలేదు, వితంతుపునర్వివాహ ములను వారంగీకరింతురు. వారు మృతులను ఖనన మొనర్తురు. వీరశైవమందు వారు జాతిలింగభేదము లను నిషేధించిరి.[67] వీరశైవము మతతత్త్వవిషయ ములమీఁదకంటె నాధ్యాత్మిక నైతిక విషయముల మీఁద నెక్కువ ప్రాధాన్యమిచ్చును. నిర్ణీతవిధులను బాలించుట యాత్మను బరిశుద్ధమొనరించుననియుఁ గ్రమక్రమముగా దానినున్నతస్థానమునందుంచు నని యును, దానియంతటనదే మాయ లేక యవిద్యనుండి విముక్తిఁబొందుననియును, నీమాయాదులఁ బోఁగొట్టు టచే నాత్మ శివసాయుజ్యముఁ బొందుననియు వీర శైవము విశ్వసించును. ఈతుదైయైక్యము "బయల" యని వ్యవహరింపఁబడినది. ఏమియునులేదని, యుని కియే యునికికానప్పు డుత్తదని దానికర్థము. దీని వర్ణన బౌద్ధుల నిర్వాణమునకు సరిపడును.[68]

వీరశైవమునకు గొప్ప నాయకుఁడగు బసవే శ్వరుని రోజులలోఁగూడ శ్రీశైలము వీరశైవముతో సంబంధము పొందియున్నట్లు కనఁబడుచున్నది. పెక్కుగద్యపద్యరచనలలో బసవేశ్వరుఁడు మల్లికార్జున స్వామిని స్తుతించియుండెను. శ్రీశైలమున కత్యంత సమీపముననున్న సంగమేశ్వరమువద్ద నాతఁడు మర ణించినట్లు తెలియుచున్నది. తరువాతి సంవత్సరము లలో గొప్ప వీరశైవ సాహిత్యము మల్లికార్జునుని మీదను నాతనిప్రసిద్ధిమీఁదను నుద్భవించెను. సుమారు 12వ శతాబ్దపు టంతిమపాదమునఁ బాల్కురికి సోమ నాథ రచితములైన బసవపురాణ పండితారాధ్యచరిత్రల యందు, శ్రీశైలమల్లికార్జునస్వాముల మాహాత్మ్యమును వర్ణించుచున్న వేలకొలఁదిపద్యములు(ద్విపదలు)గలవు. పండితారాధ్య చరిత్రయందుఁ బర్వతప్రకరణమను పేర సుమారు 200 పుటలలో శ్రీశైలముయొక్క మాహాత్మ్యము వర్ణింపఁబడినది.

66. E J. XXI, PP. 9-17 Dtd S. 1182. Baasva is mentioned in other inspectives like EC V. AK P. 10; EC XI JI 30; EC III MD. 33.

67. Nandimath - A hand Book of Veera-saivism - 73.

68. Ibid P. 93.

ప్రాచీన కాలముననే వీరశైవులు దేవాలయ ములమీఁద నాధిపత్యము వహించినట్లు శాసనములు కూడ ధ్రువపరచుచున్నవి. ఇంతవఱకుఁ గనుఁగొనఁ బడిన ప్రాచీనశాసనము, వీరశైవ జంగములఁ దెల్పు నది, విజయనగర ప్రథమ వంశమునకుఁ జెందిన మల్లికార్జునుని కాలముననున్నది. దైవనివేదనలకును, నిత్యమైనగురు జంగములకు భోజనమిడుటకును నొక రాజసేవకుఁడు దైవమునకు భూములను దాన మొనర్చెనని క్రీ. శ. 1453 నాటి శాసనమునం దున్నది.[69] 1465లో విజయనగర విరూపాక్ష చక్రవర్తి తనపట్టాభిషేక సందర్భమున మల్లికార్జున స్వామికి "సిరుచుంతకూరు" ను సమర్పించెను. అ దానగ్రహీత యొకానొక ఋషియగు శ్రీలింగ చక్ర వర్తి. ఈతఁడు సిద్ధభిక్షావృత్తిగాఁ దెలియఁగు చున్నాఁడు, ఈతఁడే ప్రసిద్ధికెక్కిన వీరశైవ మత గురువు. ఆచటి యితరములైన వ్రాఁతలందును నితని వృత్తాంతము కనఁబడుచున్నది.[70] క్రి శ. 1458 నాటి వేఱొక శాసనమందు నొక మహామండలేశ్వర పర్వతయదేవ మహారాజు దైవమునకు నిత్యకైంకర్య ములకు, బ్రాహ్మణ జంగముల భోజనవసతులకు సౌకర్యములు కల్పించెను.[71] ఈశాసనమందు సదరు భూమి "అయ్యంగార్ల" యధీనమున నుంచఁ బడెనని చెప్పఁబడుచున్నది. ఈయన పైనిఁజెప్పిన 'శాంత భిక్షావృత్తి' తప్పకయైయుండును. ఈ'అయ్యం గార్లు' తప్పక క్రీ. శ. 1514 నాటి యొకశాసనమున "శాంత భిక్షావృత్తి అయ్యంగా"ర్లని వ్యవహరింపబడిన శాంతభిక్షావృత్తియే యైయుండును. క్రి. శ. 1458 నాటికి వీరశైవులు తమంతఁదాము శ్రీశైలమున స్థిర పడిరని ప్రస్తుత శాసనిక సాక్ష్యము సూచించుటచే స్పష్టమగుచున్నది.[72] అంతకుముందు, సోమ నాథుని వ్రాఁతలు తెల్పుటవలన, 12వ శతాబ్దమున శ్రీశైలము వీరశైవ పుణ్యస్థలమాయెను.

### శ్రీశైలముమీఁది మఠములు

దక్షిణభారతదేశ దేవాలయముల కనుబంధిం పఁబడిన మఠములు మతప్రచారమునందును, విద్యా బోధయందును, సాహిత్యాభిలాషను బ్రోత్సహించుట యందును, దరిద్రసేవలందును బ్రముఖపాత్ర వహించెనని చెప్పఁబడుచున్నది.[73] సుమారు 10వ శతాబ్దమునుండి మఠములను దేవాలయముల కను బంధించుట సామాన్యవిషయమయ్యెను. ఇవిగొప్ప పలుకుబడినిఁ బొందెను. పెక్కుస్థలములందివి దేవాలయ వ్యవహారములందు నాధిపత్యము నిర్వ హించెను. వీనియందు యాత్రికులకుఁ గావలసిన బస లభ్యమయ్యెడిది.

శ్రీశైలముమీఁది మఠములు ప్రసిద్ధికెక్కినవి. కాని వానిని గుఱించిన సమాచారమస్పష్టముగా నున్నది. శాసనము లీమఠముల కొన్నింటి నామము లను దెల్పుచున్నవి. అరసు మఠమునకుఁ జెందిన యీశ్వర శివాచార్యునిచే మహామహేశ్వరుల సమక్ష మున నొనర్చిన ప్రకటనకార్యమును గాకతీయ వంశమునకుఁజెందిన ప్రతాపరుద్రదేవుని కాలమున క్రి. శ. 1313లోనున్న యొక శాసనము తెల్పు చున్నది. గణమఠమున కనుబంధింపఁబడిన వీరభద్ర దేవాలయముయొక్క ముఖమండపములో నీ మహే శ్వరులు సమావేశమయ్యెడివారు. దేవాలయ వ్యవ హారములను సక్రమమార్గమున నిర్వహించుటయే యీసమావేశములయొక్క లక్ష్యమైయుండెను.[74] ఈ శాసనము శ్రీశైలమందలి రెండు మఠములయొక్క నామములను మనకుఁదెల్పుచున్నది. అందొకటి అరసిమఠము. దాని కీశ్వరశివాచార్యుఁ డధ్యక్షుఁడు.

69. 22 of 1915.
70. E. I XV, P 18.
71. 33 of 1915.
72. See also 16 of 1915, Text L. 49 & 71; 12, 43, & 44 of 1915.
73. MER. 1923 - P. 100, Para 50
74. 36 of 1915 and also Mack. M S S. 15-3-6. P. 31.

వీరభద్రదేవాలయ మొకటి గణమఠమునకు ననుబంధింపఁబడినదని తెలియుట కుతూహలజనకమైన విషయము. వీరభద్రదేవాలయముయొక్క ముఖమండపమందు సదా సమావేశములు జరుపు సామాన్యాచారమున్నట్లున్నది. పూర్వపురాజులచే నీమఠములకొసఁగఁబడిన గ్రామముల పెద్దజాబితా ఈ శాసనమునఁ గలదు. దూరదేశములందున్న ప్రజలనుండి యరసి మఠము శక్తిమంతమైన యునికిని బొందినట్లు కనఁబడుచున్నది. గణమఠమున కనుబంధింపఁబడిన వీరభద్రదేవాలయముయొక్క యదే ముఖమండపమందు జరిగిన మాహేశ్వరుల సమావేశమును 1315 కాలమునాటి వేఱొకశాసనము సూచించుచున్నది.[75] రెండు సంవత్సరముల పూర్వమొక సమావేశమేర్పరుపఁబడి యది విఫలముకాఁగా వారు మరల సమావేశమైనట్లు కనఁబడుచున్నది. ఈసమావేశమునందు వారాజ్ఞకు సంబంధించిన క్రమశిక్షణ యందలి దోషములను జర్చించి మల్లికార్జునదేవాలయమునకు వచ్చు నాదాయములను క్రమబద్ధము సేయవలెనని నిర్ణయించిరి. దీనివలన మఠములు తమ యాస్తులను సక్రమముగా వినియోగపరచుట లేదనియు, మఠసిద్ధాంతములందుఁ గ్రమరాహిత్యము గలదనియు, నావిషయములను జర్చించుటకు రెండుసంవత్సరములలో రెండుపర్యాయములు సమావేశముల నేర్పరుపఁబడవలసిన యావశ్యకత కలిగెననియు స్పష్టమగుచున్నది. ఈవిధముగా నీ మఠములు ముఖ్యవిషయములను జర్చించుటకు నొకపద్ధతినిఁ గలిగియుండెడివి. మొదట నవి సామాన్యముగా వీరభద్రదేవాలయములో సమావేశమయ్యెడివి. అందరికంటె వృద్ధుఁడగు ప్రధానగురువు వాని కధ్యక్షత వహించెడివాఁడు. శ్రీశైలముకొండమీఁద నివసించునట్టియు నీమఠములకుఁ జెందినట్టియు సమస్తమైనట్టియు ఋషు లందుండెడివారు[76] ఈ ప్రాంతలవలన రెండుద్యోగములయొక్క నామములు తెలియుచున్నవి. అవి (అ) గురుదేవుఁడు మఱియు (ఆ) ప్రగ్గడ. ఈ ప్రాంతలవలన నన్యమఠములయొక్క నామముకూడఁ దెలియనగును. దీనిపేరు కాలుమఠము మఠాధిపతులు తమ పరిపాలనావిషయములగూర్చి చర్చించుటకు జరిపిన యొకానొక సమావేశమును దెల్పు వృత్తాంతము క్రీ. శ. 1585 నాటి వేఱొకశాసనము తెల్పుచున్నది. ఈవృత్తాంతమందిచ్చటఁ బంచమఠాధిపతులు సమావేశమై సారంగమఠాధిపతులు పరిచారకులను గలిగియుండరాదని నిశ్చయించిరి. ఇది మఠములయొక్కయుఁ దదధిపులయొక్కయు నామములఁ దెల్పుచున్నది. (1) నందినాథమఠము, (2) భృగుమఠము, (3) వీరభద్రమఠము, (4) బాలసిద్ధదేవునిచే నధ్యక్షతవహింపఁబడిన సారంగమఠము, (5) లింగదేవర యధ్యక్షుఁడైన కాలుమఠము. (6) సిద్ధదేవరచే నధ్యక్షతవహింపఁబడిన దొడ్డమఠము, (7) మూర్తిమఠము, (8) శ్రీ వీరచెన్నబసవభిక్షావృత్తి — ఈతఁడు సమావేశమున కధ్యక్షతవహించెనని చెప్పఁబడుచున్నది. (9) ఒడ్డయ్యమఠము - శాంతిదేవుఁడు, (10) తంజమఠము - గురుశాంతదేవర, (11) దాసమఠము - కటగనాథ శివమల్లికార్జునదేవ, (12) పల్లయ్యమఠము, (13) బసవమఠము, (14) కాళిందిరాజుమఠము, (15) బసవమఠము - చెన్నబసవరాజు. వీనిలో 5వదియు, 11వదియు గతశాసనమునఁ దెలుపఁబడినవి.[77] శ్రీశైలదేశమును బరిపాలించుచున్న కృష్ణరాయని ప్రతినిధియగు చంద్రశేఖరయ్యచే నొసఁగఁబడిన క్రీ. శ. 1559 నాటి యొకశాసనమందు 15వ సంఖ్యగల బసవమఠము మరలఁ గనఁబడుచున్నది. బసవమఠమునకుఁజెందిన రాచవేలి వీరన్న వడయలుకు బహూకరింపఁబడిన యొక గ్రామమునిది సూచించుచున్నది.[78] నాయనపల్లి శాసనము

75. 41 of 1915 - Text Line 15.
76. Ibid Text Lines - 9 & 10.
77. 44 of 1915
78. 15 of 1915.

ప్రాకారము శ్రీశైలముమీఁద భృంగిమఠమును కాకతీయ రాజగు గణపతిదేవుఁడు నిర్మించెనని చెప్పఁబడుచున్నది. [79] ఆదేమఠము మన జాబితాలో రెండవ సంఖ్యది. మల్లికార్జునశిలమఠమనునది కాకతీయ ప్రోలుని కాలమందున్న వేఱొక మఠము. రామేశ్వర దీక్షితుఁడు దాని కధ్యక్షుడుగానుండెను. ఇదియొక కాలాముఖమఠమైయుండెను. కాయస్థప్రధానియగు జన్నిగదేవునకుఁ జెందిన క్రీ శ. 1260 నాటి యొక శాసనమువలన శ్రీశైలముమీఁద రాజగురు శాంత పూర్వశివదేశికునిచే నధ్యక్షతవహింపఁబడిన యభినవ గోళకి మఠమనఁబడు వేఱొకమఠమున్నట్లు మనము తెలిసికొందుము. [80]

ఈ వీరశైవ మఠగురువులలో శాంతభిక్షావృత్తి చాలఁ బ్రసిద్ధికెక్కెను. ఈతని శక్తిని విస్తృతప్రసిద్ధిని వ్యక్తముచేయు బిరుదములతో నీతఁడు పెక్కుశాసనములలో వర్ణింపఁబడెను. [81] తెలుఁగు సాహిత్యము నుండియు నీతఁడెఱుఁగఁబడుచుండెను గౌరన్నను నవనాథచరిత్రను వ్రాయ నాజ్ఞాపించినవాఁడీతఁడే. [82] "గిజ్జలరాయమర్దనుఁడు", "శైవదీక్షా గురువు", "శ్వేతాంబర జైన సంహార" మొదలగు పెక్కు బిరుదములీయఁ గొనఁగఁబడెను. మహామండలేశ్వరులు ఈనయెడ వినయవిధేయతలు ప్రదర్శించుచుండ నొక రత్నసింహాసనముమీఁద నీతఁడు కూర్చుండెననియుఁ జెప్పఁబడుచున్నది. ఈవర్ణనమును శాసనములు బలపరచుచున్నవి. గౌరన్న 14వ శతాబ్ది పూర్వార్థమునకుఁ జెందినవాఁడు. ముక్తి శాంతభిక్షావృత్తి యనుచరుఁడగు ముమ్మడి శాంతయ్యకు శ్రీనాథుఁడు తన శివరాత్రి మాహాత్మ్యము నంకితముసేసెను. శ్రీశైలమందు ముక్తిశాంతభిక్షావృత్తి యధ్యక్షతను,

79. E I XXVII P. 196.
80. 50 of 1941-42.
81. 42, 44, 16, 12, 33 of 1915.
82. గౌరన్న "నవనాథచరిత్ర" పుటలు 2–5.

వర్తకులు శ్రీశైలమునకువచ్చు వస్తువులమీఁద సుంకములను నిర్ణయించుటకు సమావేశమైరని క్రీ. శ. 1448 నాటి యొక శాసనమువలన మనకుఁ దెలియుచున్నది [83] ఈ ముక్తిశాంతభిక్షావృత్తి గౌరన శ్రీనాథులకుఁ బోషకుడైయుండవచ్చును. ఈరీతి నీ శైవమతాచార్యుఁడు కావ్యములు వ్రాయుట కాంధ్ర కవులను బ్రోత్సహించెను. [84]

పుష్పవాటికలు, తటాకములు, నాంధ్రదేశమంతటను వ్యాపించిన యసంఖ్యాకములైన గ్రామములు, రాజులచేతను, సేనాపతులచేతను, నున్నత వంశస్త్రీలచేతను, మహామండలేశ్వరులచేతను, సామాన్యవుహోదాలకుఁ జెందిన పురుషులచేతను శ్రీశైల దేవాలయమున కొసఁగఁబడెననికూడ శాసనములవలన మనము తెలిసికొనఁగలము. శివరాత్ర్యుత్సవమునాఁడు కొండమీఁద నొక పెద్ద సంతజరుగుట యాచారముగా నుండెడిదనికూడఁ దెలియనగుచున్నది. అసంతకుఁ దేఁబడు వివిధసంబారములు, రవాణాసాధనములు, వానిమీఁద వసూలుచేయబడు సుంకములు — వీనిని గూర్చిన సమాచారమును శాసనములు మన కొసఁగుచున్నవి. పండితారాధ్యచరిత్ర పర్వతప్రకరణము శ్రీశైలపర్వతముమీఁది వేడుకలను విపులముగాఁ దెలియఁజేయు రూపచిత్రము వస్తువులమ్మఁబడెడివి. నృత్యసంగీత కార్యక్రమములు జరిగెడివి. పలువిధముల ప్రజలు వచ్చెడివారు. వారు పలువిధములయిన వస్త్రాభరణములను ధరించెడివారు. ఈ విషయమారోజులలో దేవాలయముయొక్క ఘనతను సూచించుచున్నవి.

83. 40 of 1915.
84. Local records contain many inscriptions about the activities of this Saiva pontiff, Mack. MSS 15–4–29 PP. 97, 94, Pages 120, 121 & 123

శిల్పశాస్త్రదృష్టితో నీ దేవాలయము గూర్చి పేర్కొనఁదగినదేదియు లేదు. ఇది 13వ శతాబ్దపుఁ గట్టడమనియుఁ బల్లవుల శిల్పమును బోలియున్న దనియు లాంగ్‌హర్ట్స్ తలంచెను. బురుజుపైని 22 అడుగుల యెత్తుగలగోడ సుధాధవళభవనము కట్టి యున్నది. ఈ కుడ్యముమీఁద ముఖ్యముగా శైవ పురాణములనుండి కథలను వర్ణించు విచిత్రమైన శిల్పములుగలవు. అవి విజయనగరమందలి హజార రామదేవాలయముమీఁది శిల్పమును బోలియున్నవని లాంగ్‌హర్ట్స్ తలఁచుచున్నాడు. కావున నవి శ్రీకృష్ణ దేవరాయల కాలమందుఁ జెక్కింపఁబడియున్నవని యాతఁడు తలఁచుచున్నాఁడు. ఈశిల్పమును జాగ్రత్తగా బరిశీలించుటవలన నాటివేషములు, విలాసములు, యుద్ధవ్యవహారములరీతులు, నింటియందలి స్త్రీలు, దేవాలయములకు ఊరేగింపుగా బయల్వెడలు రీతులు, వేటదృశ్యములు, సంగీతకులచే ననుకరింపఁ బడిన గొప్ప నృత్యములు, దేవాల ఆ అజ్ఞాతశిల్పులు చూచిన పదునాలుగవశతాబ్దియందలి, క్షణక్షణ పరిణామశీలమైన అనేక పార్శ్వసుందరమైన జనజీవన వైవిధ్యము కొలదిగాటిపరిధిలో మనకన్నులముందు సాక్షాత్కరింపఁగలదు. పాల్కురికి సోమనాథుని సాంస్కృతికవర్ణనల కీ శిల్పశ్రేణి జీవముపోయును.

[ఆంగ్లవ్యాసమునకు తెలుగుసేత :

శ్రీ అకెళ్ల కామశాస్త్రి,]



శ్రీ కె. ఉమావరమూర్తి

# ఏడుకొండలవాని పుట్టుపూర్వోత్తరాలు

*శ్రీ కొత్త భావయ్యా చౌదరి*

ఆంధ్రప్రదేశములో జేరియున్న పర్వతరాజములలో నొకటిగా ప్రసిద్ధివహించిన తిరుపతి కొండల మీదనున్న శ్రీ వేంకటేశ్వరస్వామి యావద్భారతదేశమునందు దేవుడుగా సేవింపబడుచున్నాడు వైభవమునందు, భక్తులర్పించు కానుకలందు, భక్తులకోరికలు నెరవేర్చుటయందు యీదేవునిచెప్పి మరియొక యాత్రాస్థలమును చెప్పవలయును. అందుచేతనే యీ దేవుని యైశ్వర్యము, త్యాగములు దేశమంతట వెల్లివిరియుచున్నవి. ఎన్నో సత్రాలు, విద్యాలయాలు, కాలేజీలు, ఆసుపత్రులు. యూనివర్సిటీ మొదలైనవి యీదేవుని ద్రవ్యముచే నేడు నిర్వహింపబడుచున్నవి. కొంతకాలము క్రిందట నెలకొక లక్షద్రవ్యమువచ్చు దేవునకిపుడు ఎనిమిదిలక్షలు దాదాపు వచ్చుచున్నది. ఇదియంతయు భక్తు లర్పించు కానుకలు, భూములు వగైరాలవల్ల వచ్చునదే. కలియుగ ప్రత్యక్షదేవు డితడే యని చాలమంది భక్తుల విశ్వాసము. ఇట్టి దేవుని పుట్టుపూర్వోత్తరాలు తెలిసికొనుట మహద్భాగ్య మన వచ్చును. ఈయన మహత్తులు వగైరా తెలుపు గ్రంథములు దాదాపు 25 వరకు గలవు. వానిలో నీయన పౌరాణిక గాథలన్నియు వ్రాయబడినవి. దానిని వదలి యిచట చారిత్రకముగా తెలిసినంతవరకు దెలిపెదను. తద్రూపముగా వివిధ కాలాల భక్తుల విశ్వాసములు తెలియగలవు.

ఈ దేవాలయము, క్రీస్తుశకము మొదటిశతాబ్ది నుండి యున్నట్లు కనబడుచున్నది. ప్రాచీన తమిళ వాఙ్మయ గ్రంథములలోని శిలప్పదికార మను గ్రంథములో నీదేవుని ప్రశంసగలదు. శంఖచక్రధారిగా నిత డందు వర్ణింపబడుటవల్ల, నీతడు విష్ణుమూర్తియే గాని యన్యుడుగాడు. వాసుదేవ విష్ణుమతము ఉత్తర హిందూస్థానమున క్రీస్తుపూర్వము రెండు శతాబ్దుల క్రిందనే యుండెను.[1] అది దక్షిణదేశమునకు క్రమ

1. వాసుదేవ మతమనగా, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు పూజాదేవతలుగా ప్రసిద్ధికెక్కిన నాటనుండి వ్యాపించిన మతము -

ముగా వ్యాపించి, యీ పర్వత దేవాలయ నిర్మాణమునకు కారణమై యుండును. విశాలమైన యేడు కొండలమీద తొండమండలము నేలుచున్న తొండమాను నృపాలు డీ దేవాలయమును కట్టించెను నాటి నుండి నేటివరకిది మహావైభవ మనుభవించుచు, రాజులు మొదలు సామాన్యజనులందరికి మిక్కిలి యాకర్షణీయమై రెండువేల సంవత్సరములుగా నిలిచి యుండుట మనదేశప్రజల యదృష్టమనవచ్చును.

వైష్ణవ భక్తులలో 3 మొదలు 8వ శతాబ్దివరకు గల పన్నిద్దరాళ్వారులలో నిద్ద రీ ప్రాంత మెరుగని వారు దప్ప, మిగతవారందరు యీ దేవుని స్తుతించుచు రచనల సాగించిరి. "దివ్య ప్రబంధము 4 వేలు" అను తమిళ గ్రంథములో యీ రచనలన్నియు హృద్యములుగా నుండి భక్తిపారవశ్యములుగా నున్నవి. ఈ ఆళ్వారులు కొందరు శ్రీరంగములోను, మరికొంద రితర చోట్లను ప్రసిద్ధిజెందిరి. వీరిలో తిరుమంగాయి లేక పాయిగాయి ఆళ్వారు, భూతమాళ్వారు, పేయాళ్వారులు పూర్వీకులు – వీరు గాక తిరుమలేశ ఆళ్వారు, నమ్మాళ్వారు, మధురకవి ఆళ్వారు, కులశేఖరాళ్వారు, పెరియతిరుమోలి పెరియ అళ్వారను విష్ణుచిత్తుడు, ఆండాల్ లేక గోదాదేవి అనువారుగూడ ఈ దేవునిమీద రచనల జేసినవారు. వీరందరును విష్ణుభక్తులైన వైష్ణవుల య్యుండి, విష్ణువే శ్రీకృష్ణుడుగా అవతరించెనని విశ్వశించుచు, నాతనిమహిమను గొనియాడుచు, బ్రహ్మ శివు లాతని తర్వాతవారని పేర్కొనుచు, వంగడమను పేరిట నపుడు పిలువబడుచుండిన వెంకటాచల దేవుడు విష్ణువుగానే నుతించియుండిరి. అందుననే తిరుపతి దేవుడు వాసుదేవ వైష్ణవమత మేర్పడిన తర్వాత యుద్భవిల్లినవాడని చెప్పనగుచున్నది. వంగడము తెలుగుబాసలో వెంకటగామారి, వెంకటేశ్వరుడను పేరు స్థిరపడినను ప్రాచీన ఆళ్వారుల దృష్టిలోనితడు శ్రీకృష్ణుడే యైయున్నాడు. హరిహరాభేదముగాగూడ గొన్ని స్తుతులున్నను మరలమరల శ్రీకృష్ణప్రశంసయే వారిహక్కులలో గలదు.

పల్లవరాజు లీ ప్రాంతమున 3 – 8 శతాబ్దుల మధ్య పాలించుచువచ్చిరి. కాని వారికాలపు విశేషములు హెచ్చుగా తెలియుటలేదు వారు శైవ, వైష్ణవములను పోషించిరి, చోళరాజులు 9వ శతాబ్దినుండి పాలించిరి. వారి కాలములో క్రీ. శ. 833 నుండి యిచట కొన్ని దాన శాసనాలు కనబడుచున్నవి. ఇందులో పల్లవ సామంతులవి కూడకలవు. దంతి విక్రమదేవు డను పల్లవరాజు పాలనలో దీపదానములు దేవునికి చేయుట వీనిలోనున్నవి. ఇవి తిరుచానూరు దేవళమున నున్నవి. ఇట్లే మరికొన్నికలవు. మరియొక శాసన మిద్దరు దేవాలయ బ్రాహ్మణులకు భోజనవసతికై చేయబడినది కలదు. 898 లో నొక గ్రామాదాయము దేవుని కిబడినది. రెండవ ఆదిత్యుని కాలములో సామవ్వ యను పల్లవ పేరుందేవి దేవునికి వెండితో విగ్రహమును, ఆభరణములు చేయించి యిచ్చి 3 వేంకుల్లి భూమి నిచ్చెను. లక్ష్మణ నంబి యను నతడు దేవాలయ మతకార్యము లాకాలమున చూచుచుండగా, నాతని కవి స్వాధీనపరచెను. మార్గళి ద్వాదశి యుత్సవమున కిట్లే కొంతభూమి మరి యొకరిచే నీబడెను.

935లో నొక దీపదానము గావించిన శాసనము కలదు. ఇది యొక చోళ పరాంతకసామంతు డొనర్చినది. ఇట్లే మరియొకటి కలదు.

రాజరాజు పాలించుచుండగా 1001లో పరాంతకదేవియు చేరరాజకుమారి యగు అమ్మనార్‌దేవి దేవుని కొక శిరోభూషణము చేయించి యొసగెను. ఇందులో వజ్రములు, ముత్యములు పొదుగబడెను.

1018లో దేవుని కిబడిన దీపదానములు అన్నియు నమలుచేయని విషయము రాజేంద్రచోళుని



శ్రీ కొత్త భావయ్య చౌదరి

అధికారియొకరు విచారించి వానినన్నిటిని అమలు చేయించెను ఈ కాలములో కొందరు దేవునికి పాలు, పెరుగు, వగైరాలు సమర్పించుచు శాసనాలు లిఖించిరి.

ఇట్లు క్రమముగా రాజుల పరిశీలనతోను, దాతల దానములతోను, దేవాలయము వృద్ధికివచ్చెను. దీపదానములు పూజలు మొదలైనవి భక్తులనేకులు కాపించుచుండిరి.

12వ శతాబ్దిలో చోళసామంతులుగా యాదవ రాజులీ ప్రాంతమును పాలించిరి. వారిలో తిరుకాలత్తి దేవ యాదవరాజొక గ్రామమును దేవునికి సర్వ మాన్యముగా నిచ్చెను. వాచియార్ అను యాదవ రాణి అఖండ దీపారాధనలకై 64 గోవులను, మరొక సారి 32 గోవులను, ఆంబోతును దానమిచ్చుటయేగాక దేవునికి మరొక గ్రామమును సర్వమాన్యముగా నర్పించెను. దీపారాధనలు గోవిందరాజస్వామి ఆల యములోను, వేంకటేశ్వరాలయమునను చేయునట్లు ఏర్పాటయ్యెను వీరనరసింగ యాదవరాయలు దిగ్విజయయాత్ర సల్పివచ్చి తులాభారముదూగి ఆ బంగారుతో దేవుని విమానమునకు బంగారు మలాము వేయించెను.

ఈయనగూడ దీపదానములకొరకై కొన్ని గోవు లను సమర్పించెను వీరనరసింగ యాదవరాయల రాణి గోవిందరాజస్వామి కొక రథమును చేయించెను. పదునాల్గవ శతాబ్ది ఆరంభమున తిరువెంగడనాథ యాదవరాయల కాలములో నొక యుత్సవమేటేట జరపుట కొకగ్రామము దానము దేవుని కీబడెను. రాచయ్యదండనాయకుని పేరిట ఆదినెలలో జరపుటకది యేర్పాటయ్యెను. సింగయ్యదండనాయకుని పేరిట పొంగలూరను గ్రామ మీయబడెను శఠగరగండ మఠములో నిత్యము 32 మంది వైష్ణవులకు భోజన వసతికి దేవుళ్ల నైవేద్యపూజాదులకు, పుష్పవనము లకుగా నది యీయబడెను.

అహూబిలిరాయుడను నతడు దేవునికి వైకుంఠ హస్తమును చేయించెను. అనేకమంది భక్తులు రాజో ద్యోగులు, ఇతరులుగూడ దేవుని కఖండ దీపారాధన లను గావించుచువచ్చిరి. వారినందరి నిచట తెలుప జాలము. ఎగువ తిరుపతి దేవళమునందును, దిగువ తిరుపతిలో గోవిందరాజస్వామి ఆలయమునను పది హేనువందలకుపైగా దానశాసనాలున్నవి. వాని వివరములన్నియు దేవాలయశాసన గ్రంథములు వివరించుచున్నవి.

అనంతాళ్వార్‌పిళ్లెయను నతడొక పూలవనము వేయించెను. తిరుపతిలో కామవిల్లియను నతడొక తటాకమును నిర్మించెను తటాకనిర్మాణము ముప్పది రెండు ధర్మకార్యములలో నొకటిగా నాశాసనమందు చెప్పబడెను.

11 శతాబ్దిలో తిరుమలనంబి యను నతడు దేవునివద్ద ఆచార్యపదవిలో నుండెను. నేటికి నా వంశీకులే తిరుపతిలో నున్నారు. ఈయనకు మేన ల్లుడే ప్రసిద్ధవైష్ణవ మతకర్త రామానుజుడు. తిరుమల నంబివద్ద రామాయణమును సాంగముగా నేర్చెను. ఈయన తిరుపతిలోని దేవునివద్దచేయు పూజావిధులు వగైరాలన్నియు కట్టుబాటులోనికి తెచ్చెను ఆకాల ములో చిదంబరములో శైవమతాభిమాని యగు చోళరాజు (కులోత్తుంగ) అచటివైష్ణవ విగ్రహములను తీసి సముద్రమున పారవేయుటకై యుత్తరువిచ్చెనట. అప్పుడచట నుండిన గోవిందరాజస్వామి విగ్రహ మును భక్తులు చిదంబరమునుండి తిరుపతికి కొని వచ్చిరి. యుక్తకాలములో దానిని తిరుపతిలో రామా నుజుడు ప్రతిష్ఠింపజేసెను. ఘట్టిదేవయాదవరాజా కాలపు సామంతరాజు, ప్రాకారాదులు నిర్మించి దాపుననే బ్రాహ్మణ నివాసములేర్పరచి, యాదేవా లయ మితడు నిర్మించెను. క్రమముగా శైవులు విజృంభించి తిరుపతి యాలయముగూడ శైవదేవా లయమని పోరాడి యాతనితో తగాదా పెట్టిరట.

రామానుజుడువచ్చి శాస్త్రరీతి యథార్థముచెప్పినను వారు వినలేదట. చివరకు ఒకనాటి రాత్రి శైవవైష్ణవ ఆయుదాలు దేవళములో పెట్టి, తెల్లవారువరకు దేవుడు వేనిని స్వీకరించునో దానినిబట్టి తేల్చుకొనుట కుభయ వాదులు సమ్మతించిరట. రామానుజుడు తెల్లవార్లును దేవుని భక్తితో ప్రార్థించెనట చివరకు దేవుడు రాత్రి శంఖచక్రధారి యయ్యెనట. తెల్లవారిన పిదప తలుపులు తెరువగనే యట్లుండుటజూచి శైవులు తమవాదనను వదలుకొనిపోయిరట. నాటినుండి వేంకటేశ్వరుని విష్ణువుగనే బావించిరట.

రామానుజుడు తిరుపతిలో మూడుసార్లుగా నివసించెను. ఆయన కాలములో నరసింహాలయము, రామ, వరాహ ఆలయములు, తిరుమలనంబి పేరిట ఉత్సవము, మొదలైనవి యేర్పాటుగావించెను.

ఇచట కపిలతీర్థము, స్వామిపుష్కరిణి, ఆకాశగంగ, గోగర్భము, పాపవినాశమను తీర్థములుగలవు. దేవాలయమందు రెండుబావులుగూడ రామానుజుడు బాగుచేయించెను. శ్రీ వేంకటేశ్వరునికి శ్రీదేవి, భూదేవి పౌరాణికపత్నులు. సాలెకులజయు, మహాభక్తురాలు నగు అలివేలుమంగమ్మ దేవునివరించి పెండ్లాడి, శతాబ్దులుక్రిందట నామెయు దేవునితో నైక్యమయ్యెను. ఈమె పేర తిరుచానూరులో గొప్పదేవళము కట్టింపబడెను. ఈమెయే వేంకటేశ్వరుని భూలోకరాణి యందురు. బీబీనాంచారియను మహమ్మదీయవనిత, యీ దేవుని దక్క నన్యులను పెండ్లాడనని శపథము చేసి, భక్తురాలుగా బ్రసిద్ధి వహించెను. ఈమె ఔరంగజేబు కాలపు భక్తురాలట. ఈమెపేరగూడ నొక దేవళము నడుపబడుచున్నది. అలివేలుమంగ, శ్రీదేవియను పద్మావతియవతార మందురు, స్వామివారి దేవాలయమునకు సంబంధించిన పుణ్యస్థలములలో దేవుని పరివారదేవతలలో 1. గోవిందరాజస్వామి, 2. అలివేలుమంగ (పద్మావతియందురు) 3. వరాహస్వామి, 4. విష్వక్సేనుడు, 5. పార్థసారథి, 6 నరసింహ, 7. శ్రీరామ, 8 అంజనేయస్వాములవి మాత్రమే కలవు. భక్తులైన అళ్వారులు పన్నెండుగురికి గోవిందరాజు ఆలయప్రాకారపు హద్దులతో వేరువేరు ప్రదేశాలు ఉన్నవి. వీనికన్నింటికి పూజాదులు జరుగును.

14వ శతాబ్దిని మల్లిక్ కాఫర్ అను మహమ్మదీయసేనాని దండయాత్రలో చిదంబరం, శ్రీరంగం, మధుర దేవాలయాలు దోచుకొనబడెనటగాని అదృష్టవశాత్తు తిరుపతి వారిదారికి చాలా దూరములోనిదగుటవల్ల ఆ యుపద్రవము లేకుండపోయెను.

కాని శ్రీరంగనాథస్వామి విగ్రహము ఆ దినములలో చాలచోట్లకు రక్షణార్థము కొంపోబడి, యెచ్చటను స్థిరమైన రక్షణలేక చివరకు తిరుపతికి కొనిరాబడెను. దానిని కాపాడుటకు, అర్చించుటకు లోకాచార్యుడాది ముగ్వురు (అర్చకులు బావ, బావమరది, అర్చకబాలుడు) వచ్చిరట. తిరుపతి కొండమీద నుండగా మహమ్మదీయులు వత్తురని భయపడి, దేవునివిగ్రహమును కొండమీది యొక లోయలోనికి గొనిపోయి, యచట నర్చనలు రహస్యముగా సాగించిరి. ఆ లోయలోనే కొంతకాలమున కందలి లోకాచార్యులు (వృద్ధఅర్చకుడు) చనిపోయెను. మిగతవారు మహమ్మదీయుల రాజ్యపాలన ఆఖరువరకు అచటనేవుండి వీరకంపరాయల మధుర రాజ్యదిగ్విజయానంతరము తిరిగి యాదేవుని శ్రీరంగమునకు దీసికొనిపోయి ప్రతిష్ఠించిరి. తదాది విజయనగరరాజులు ఆదేవుని కనేకవిధములైన పూజలు, భోగాల నేర్పాటుచేసిరట. ఈ విగ్రహమిట్లు రమారమి 50 సం॥లు ప్రవాసకష్ట మనుభవించెను. ఒక్క తిరుపతిలోనే పది సం॥లు దాదాపు ఉండెనట. హిందూ ధర్మరక్షణ మహమ్మదీయులు మనదేశమునకు వచ్చినపు డెట్లు దుర్భరమయ్యెనో యీసంఘటన తెలుపుచున్నది. ఆనాటి అర్చకుల దైవభక్తి, పట్టుదలలు గమనార్హములు.



శ్రీ కొత్త భావయ్య చౌదరి

రెండవ దేవరాయల కాలమునుండి దేవుని సన్నిధిని, ఉత్సవపుటూరేగింపులలోను వేదపారాయణము మంచివైష్ణవులు చేయుట కేర్పాటులు జరిగెను. తత్పూర్వ మట్టిది లేకుండెను. తదాది వరుసగా నేటికిని జరుగుచున్నది వేదముఖ్యులు రామానుజకాలమునుండి ప్రబంధములపఠనజరిగెడిది. దేవరాయలసోదరి సాళువతిప్పనృపాలుని పెండ్లాడిన పిమ్మటను, తత్పూర్వమును సాళువవంశీయులు చంద్రగిరి (తిరుపతిప్రక్కది) పాలకులుగా ప్రసిద్ధి జెందిరి. వారే యీదేవుని పాలకత్వమును పరిశీలించుచు గొప్ప దానములిచ్చుచు వచ్చిరి.

కొందరు భక్తులు దేవునిభూములకు కాల్వలు వగైరాలు త్రవ్వించి దేవునికి హెచ్చు అదాయము వచ్చునట్లు చేయుచుండిరి శ్రీరామానుజుడు బ్రహ్మసూత్రములకు, ఉపనిషత్తులకు, భగవద్గీతలకు, ప్రస్థానత్రయమునకు విశిష్టాద్వైతపరముగా భాష్యములువ్రాసి, మానవులు తరించుటకు జ్ఞానమొక్కటి చాలదనియు, దేవునికరుణ ముఖ్యమనియు చెప్పి దానికి సర్వాత్మసమర్పణయే హేతువగునని పల్కుచు, మూర్తి పూజాదులకు ప్రాముఖ్యతను నిరూపించెను. అప్పటినుండి మహారాజులందరు దేవుని పూజావైభవాదులకు తమశక్తిని, భక్తినిధారవోయుచు, దేశమున అస్తికభావమును వృద్ధికి దెచ్చిరి హరిహరబ్రహ్మల కభేదము జనులలో బలపడుచుండెను అందుననే పండితారాధ్యులు, పాల్కురికి సోమనాథాదులు శైవ పూజయే నిర్వాణమునకు దారియని బోధించుచుండినను, తర్వాతవచ్చిన దేశప్రజలు, రాజులు మున్నగు వారుగూడ హరిహరాభేదముగా పూజాపురస్కారములు సల్పుచువచ్చిరి. దేవుడొక్కడే నానారూప నామములతో నున్నట్లు కనుగొనిరి

వెంకటేశ్వరునికిగల మంటపము లేదేవాలయమందుననులేవు. లోగడనుండిన పెద్ద మంటపము సహస్రమంటపాదులుగాక అళ్వారు మొదలియార్ మంటపము, అప్పల చిన్నప్ప మంటపము, అరవీడు తిరుమలరాజు మంటపము, బొక్కసము నరసయ్య మంటపము, దానరినాయకర్ మంటపము, కమ్మతర్ మంటపము, కనకుపిళ్ల మంటపము, మట్ల కుమార అనంతరాయ మంటపము, నాచియప్పార్‌మంటపము, నారాయణ మంటపము, రామచంద్రయ్యమంటపము, రామానుజయ్య మంటపము, శిలంచిదయార్ శెట్టి మంటపము, తిల్లప్పనాయకర్ మంటపము, తిమ్మయ్య మంటపము, తిరుమలయ్యర్ మంటపము, తిరువేంబడియార్ మంటపము, వెంకమసరెడ్డి మంటపము, వెంకటాద్రిరెడ్డి మంటపము, విరప్పన్నంగారు మంటపము, దేవునికి 16, 17 శతాబ్దములలో కట్టింపబడినవి. వీనిలో నేటేట కొన్నాళ్లు దేవునియుత్సవాలు, భోగాలు, నైవేద్యాలు జరుగుట కేర్పాటులుండెను.

1260 లో జటావర్మసుందరపాండ్యరాజును, 1359 లో సాళువమంగును, 1417 లో చంద్రగిరిలో మల్లన్నయు, 1518 లో శ్రీకృష్ణదేవరాయలును, 1630 లో కోటి కన్యాదానతాతాచార్లుగారును, 1908 లో రామలక్ష్మణదానును, తిరుమలలో కనక కలశములను స్థాపించిరి. ఇవి స్వామివారి దేవాలయమునకు చెందినవి

17వ శతాబ్దిలో తాతాచార్లువగైరాలు దేవునికి నానాఉత్సవ సేవలకు 18 గ్రామాలను ధారవోసిరి గాలిగోపురమొకటి మట్ల అనంతరాజు కట్టించెను. ఈయనయే యొక సత్రమును కట్టించెను. ఈతడొక యేనుగును, గుర్రపుబండిని గోవిందరాజస్వామికి బహూకరించెను.

శ్రీకృష్ణదేవరాయలు దిగ్విజయయాత్ర ముగించుకొని తిరుపతిదేవుని దర్శించినపుడు తులాభారము తూగి ముప్పదివేల గద్యాణములను దేవునికి బహూకరించి, కొన్నిమంటపములను కట్టించి, తనయొక్కయు, తనరాణులయొక్కయు, ఇత్తడి విగ్రహములను దేవాలయమున నెలకొల్పెను. అచ్యుతరాయలు

తన పట్టాభిషేకమును దేవునిముందు జరిపించుకొని, కొన్ని దానములిచ్చెను వెంకటపతిరాయలు తన విగ్రహములను దేవునిపద్ద నిల్పించెను

1561 లో తిరుమలరాయలు దేవునికి డోలోత్సవమునకు (తెప్పతిరునాళ్ల) ఏర్పాటుగావించి శాసనముగావించెను. 1582లో పారువేట యుత్సవమును తిల్లప్పనాయకు డేర్పరచెను.

1583 లో కుమారతాతాచార్లు (యేటూరి) దేవుని కనేక నైవేద్యాది భోగములు సలుపుటకై నాలుగు గ్రామము లొసంగెను. ప్రసాదములలో కొంత భాగము భక్తులకు పంచిపెటబడుచుండెను. పులిహోర, దద్ధోజనము, వడలు నానారకములు, చక్రపొంగలి మొదలగు ప్రసాదములు దేవునికి నిత్యము జరుపబడుచుండును. ఉత్సవాలలో ప్రత్యేక ప్రసాదము లుండును,

ఈ దేవునికి భక్తులనేకులు నానావిధనైవేద్యములకొరకై కొన్నినిధులు, భూములు సమర్పించుచు వచ్చిరి. నైవేద్యముల ప్రత్యేకత యిచట హెచ్చుగా నున్నది 1528 లో నారాయణదాసరినాయకు కట్టించిన మంటపములో శ్రీరామ విగ్రహము ప్రతిష్ఠింపబడి యొకగ్రామము పూజాదులకును, గోవింద స్వామికొరకును ఈయబడెను. 1606 లో రాజశ్రీ శివరాజ రామచంద్రయ్యమాతలావు బంగారుకంటె యొకటి దానమిచ్చెను. హనుమాన్ పూజలకొరకు 3,500 పనములనిచ్చిరి. శ్రీనివాసర్ అనునతడు 2.730 పనములు పూజానిధిగా నొసంగెను. భూలోక సిద్ధయ్య వెయ్యి పనముల నొకయుత్సవమునకిచ్చెను. చిన్నతిమ్మయ్య, పురుషోత్తమయ్యలు గోవిందరాజ స్వామి పూజలకు 2 గ్రామములిచ్చిరి. వినిపల దేవుని కేటేట 1,200 ల బంగారు కాసులు ఆదాయము ఏచ్చేడిది. దానితో నిత్యపూజలు సలుపువారు. ఈరీతిగా నెందరో భక్తులు, అధికారులు. అనధికారులు దేవుని సేవించుచు వచ్చిరి 15వ శతాబ్దిని అన్నమాచార్యులు పదివేలకుపైగా భజనకీర్తనలు రచించి, తామ్రపురేకులలో చెక్కించి దేవునికి సమర్పించెను. ఇవి యిపుడు దేవస్థాన పాలకులు ముద్రించుచున్నారు. సాళువ నరసింగరాయ లతని సత్కరించుచు, నితని సంగీతమునకు మిక్కిలి ప్రీతుడగుచుండెనట.

ఈ దేవళము కొంతకాలము హత్తిరాం మఠము వారిపాలనలో నుండెను. 1849లో హత్తిరాం మఠాధిపతి మహంతు స్వామి పుష్కరిణి బాగుచేయించెను. 1865లో మహంతు పూర్వమహంతు పేరిట ఒక బృందావనమును వేయించెను. 1878 లో ఆయన బయిటి గోపురము బాగుచేయించెను.

1908లో విమానమునకు బంగారు మలాము వేసిరి. ఇవియన్నియు దేవునికి వచ్చునాదాయము నుండి చేయబడెను. ఇటీవల దేవుని యూరేగింపు వగైరాల కొక వెండి రథము, వజ్ర కిరీటము, అభయ హస్తము పాలక ట్రస్టీలు చేయించిరి. వీనిని ప్రసిద్ధములగు పండుగలలో ధరింపజేతురు. వీనికన్నిటికి రమారమి 4 లక్షల ద్రవ్యము ఖర్చు అయ్యెనట.

పూర్వం వసంతోత్సవాలు, బ్రహ్మోత్సవాలు ఇంకను ప్రముఖమైన 14 ఉత్సవాలు దేవునికి జరిగెడివి. వసంతోత్సవానకు శేష, హంస, గరుడ వాహనాలు, వైకుంఠవిమానము, ఏనుగు వాహనాలతో ఊరేగింపులు వైభవముగా చేయువారు. చందనాగరు కర్పూర, కస్తూరులు మున్నగు సుగంధ ద్రవ్యాలతో దేవునికి తిరుమంజనాదులుగూడ చేయువారు. బ్రహ్మోత్సవము 12 రోజులు జరుగుచుండును అందు రథోత్సవాదు లుండును 15, 16 శతాబ్దులలో ఇవి గొప్పగా జరిగినట్లు కనబడుచున్నవి. ఇట్టి దేవుని నిత్యము మనసార సేవించి మనమెల్లరము తరింతుముగాక !

ఈ వ్యాసము వ్రాయుటకు ముఖ్యముగా History of Tirupati దేవస్థాన శాసనాలు నాకు తోడ్పడినవి

కొ. భా.



శ్రీ కొత్త భావయ్య చౌదరి

# రేనాటి చోళుల శాసనములు

శ్రీ బి. ఎస్. శాస్త్రి

క్రిస్తుశకము ఆఱవ శతాబ్దమువఱకు తెలుఁగు శాసనములు వెలువడలేదు. అంతవఱకు ఉన్న శాసనము లన్నియు ప్రాకృత, సంస్కృత భాషలలో వ్రాయబడినవే. ఐనను ఈ ప్రాకృత సంస్కృత శాసనములలో కొన్ని తెలుఁగు పదములున్నవి. అవియు గ్రామ నామములు, సంఖ్యావాచకములు, విశేషణములు, వ్యక్తులపేళ్ళు, వారి బిరుదావళులు మాత్రమే గాథా సప్తశతియందును తెలుఁగుపదము లున్నవి.

కృష్ణానది దక్షిణ ప్రాంతమును, ఆకాలమున కొందరు మాండలిక రాజులు పాలించుచుండిరి. వారిలో రేనాటి చోళులు, వైదుంబులు, చిందవంశీయులు ముఖ్యులు. వీరు తమ శాసనములను ఆంధ్రభాషలో వేయించినారు. బాణరాజులు, వైదుంబులు, తెలుఁగువారే రేనాటి చోళుల శాసనములను గమనించి వీరు తమ శాసనములను తెలుఁగు భాషలోనే వ్రాయించినారు. రేనాటి చోళుల శాసనములు S. I. I. Vol. X లో 27 ను, E I. Vol. XXVII లో 12 ను ప్రకటింపబడినవి.

తెలుఁగు భాషాభివృద్ధిని, తెలుఁగు భాషాస్థితిని తెలిసికొనుటకు ఈ శాసనము లెంతేనియు ముఖ్యమైనవి. ముఖ్యముగా రేనాటి చోళుల శాసనములలోని తెలుఁగు భాషాస్థితిని గమనించిన ఆంధ్రవాఙ్మయారంభదశ యెట్లుండెనో తెలియును.

రేనాటి చోళులకును, దాక్షిణాత్య చోళులకును ఎట్టి సంబంధమునులేదు. ఈ రాజులు తాము పాలించిన దేశమును రేనాటి యేడువేల దేశమని శాసనములందు పేర్కొనినారు. ఇంకను వీరి శాసనములవలన వీరు కరికాల చోడుని సంతతి వారనియు, సూర్య వంశీయులనియు, కాశ్యప గోత్రులనియు తెలియుచున్నది. [1] వీరి శాసనములు

1. South Indian Inscriptions Vol. X. Ins. No. 594.

కడప మండలములోని ప్రొద్దుటూరు, జమ్మలమడుగు ప్రాంతములలో కనిపించినవి. శాసనములందు పేర్కొనబడిన రాజులలో ఈక్రింద తెలుపబడినవారు ముఖ్యులు.

1. ధనఞ్జయుఁడు.
2. చోళమహారాజు.
3. పుణ్యకుమారుఁడు. (పోర్ముఖరాయుని కుమారుఁడు)
4. విక్రమాదిత్యచోళమహారాజు.
5. పృథ్వీవల్లభుఁడు.
6. సత్యాదిత్యుఁడు.

7వ శతాబ్ది పూర్వార్థమున హిందూదేశమునకు వచ్చిన "హ్యూయన్ త్సాంగ్" పేర్కొనిన "చులియ" దేశము ఈ రేనాటి చోళులదే యనవచ్చును. వీరి శాసనములు క్రీస్తుశకము 575 నుండియే యున్నట్లు పరిశోధనలవలన తెలియుచున్నది. Epigraphia Indica Vol. XXVII లో ప్రకటింపబడిన ఈ వంశీయుల శాసనములనుబట్టి మొట్టమొదటి తెలుఁగు శాసనము ఎరికల్ముత్తు ధనంజయుని "కలమళ్ళశాసన" మని చెప్పవచ్చును. ఈ శాసన కాలము క్రీ. శ. 575. కావున రేనాటి చోళుల పరిపాలనము 6వ శతాబ్ది చివరిభాగమునుండి సాగుచుండెనని యూహించుట కవకాశమున్నది.

చాళుక్యులకు పూర్వము వెలసినభాష, శాసనాత్మకమైనది. దేశభాషయందభిమానముగల రేనాటి చోళులు, తెలుఁగు బాషలో శాసనములు వేయించినారు. ఈ కాలమున వేయింపబడిన సంస్కృతశాసనములందును గ్రామ నామములతోపాటు వానికి సంబంధించిన వివరములు తెలుఁగు భాషలో వ్రాయబడినవి.

క్రీ. శ. 575 నుండి వేయించబడిన రేనాటిచోళుల తెలుఁగు శాసనములన్నియు దానవిషయమును సూచించును. ఈ శాసనములందు రాజుయొక్క పేరు, విజయరాజ్య సంవత్సరములు పేర్కొనఁబడును. కొన్ని శాసనములందీ విజయరాజ్య సంవత్సర ప్రశంస చివరనున్నది. ప్రధానమైన దాన విషయము శాసనమధ్యమున వర్ణించబడుటయేగాక, శాసనమున దత్తములగు గ్రామములు, క్షేత్రములు, వాటి సరిహద్దులు, ఫలశ్రుతికూడ చెప్పబడును. సాధారణముగ ఈ శాసనములందు ఫలశ్రుతి ఒకేవిధముగ నున్నది. దానమును కాచినవారి కశ్వమేధయాగఫలము కలుగుననియు, వక్రము జేసినవారికి వారణాసిలో బ్రాహ్మణులను, కపిలగోవులను చంపిన పాపము కలుగుననియు చెప్పబడినది. ఫలశ్రుతి యనంతరము ఆజ్ఞప్తి, కర్తృలేఖకులపేళ్ళు శాసనమున చేర్చ బడినవి. కొన్ని శాసనములందీ ఆజ్ఞప్తి, కర్తృలేఖకుల పేళ్ళులేవు.

రేనాటిచోళుల శాసనములలోని తెలుఁగు భాషాపదములు, భాషాభివృద్ధిని తెలిసికొనుటకు ఉపయోగ పడుచున్నవి.

ఈ శాసనములందు ప్రాకృతశబ్దప్రయోగము విరివిగ కనిపించుచున్నది.

1. దుజయరాజులు
2, దుకరాజులు
3, పన్నస
} ఎఱ్ఱగుడిపాడు శాసనము.

4. అణతి — రామేశ్వరస్తంభ శాసనము.
5. వణం — చిలంకూరు శాసనము.
6 అణపోతులు — పొట్లదుర్తిమాలెపాడు శాసనము

ఈ శాసనములందలి కొన్ని తెలుఁగు పదములు అపరిచిత రూపములతోనుండి అన్యదేశ్యపదములవలె గన్పట్టును. ఈక్రింది పదములట్టివి.

1. రేవణకాలు, 2. కుణ్డికాళ్ళు, 3. రట్టకుట్ట, 4. తారుమున్ని, 5. ముట్ఫు, 6 అడ్లుపట్టు, 7. పసిణ్డిముడ్ఫు, 8. పాకాతుఱాన.

రేనాటి చోళుల శాసనములందు భూత, తద్ధర్మక్రియలు కానవచ్చును. కాని అసమాపక క్రియలుగల వాక్యముల సంఖ్య ఎక్కువగానున్నది. సమాపక క్రియలతోగూడిన వాక్యముల కొన్నింటి నిచట నుదహరించుచున్నాను.

1. విరిపఱితి కమ్మరి వినియనవ్రాసె (రామేశ్వరస్తంభ శాసనము)
2. మరుతున్లు ప్రసాదచేసిరి (చిలంకూరు శాసనము)
3. కాచేఱుపాఱ ఎఱమ వ్రాసిరి (వెల్దుర్తి శాసనము)
4. దన్తియ మున్గుతోళన్ పొడిచిపడియెన్ (బుడ్డిగడ్డపల్లి శాసనము)

కొన్ని శాసనములందలి వాక్యములలోని యర్థము భూతకాల క్రియాజన్య విశేషములతో వ్యక్తీకరింపబడును.

1 ఎఱిగల్ దుగరాజుల్ ఇచ్చిన పన్నస (ఇందుకూరి శాసనము)
2 అగ్గిశమ్మఁరికిచ్చినదతి (వెల్దుర్తి శాసనము)

కొన్నిచోట్ల తచ్ఛబ్దానుగత క్రియాజన్య విశేషములు క్రియలుగా వాడబడినవి.

1. దీనికి వక్రమ్మువచ్చువాన్డు — బారనాసి వేవురుపాఱజమ్మినవాన్డు (రామేశ్వరస్తంభ శాసనము)

ఈ శాసనములందు సంబంధ బోధక సర్వనామములతొ రెండువాక్యముల నొకేవాక్యముగా గలిపి వ్రాయుటయు కన్పించును.

1. ఇచ్చిన పన్నస పెన్నాఱ ఇశెతేెకిన్ 2. తేని ఒచ్చిన వాన్డుపఞ్చమహాపాతకున్డకున్
—పొట్లెదుర్తిమాలెపాడు శాసనము (పుణ్యకుమారుడు)

రేనాటి చోళుళ శాసనములన్నియు తెలుఁగుభాషలో వ్రాయఁబడినవి. ఈకాలమున వెలసిన ఇతర శాసనములు, సంస్కృతములోనున్నను గ్రామసీమాదులు తెలుఁగులో వ్రాయబడినవి. ఆరు, ఏడు శతాబ్దులలో వెలసినతెలుఁగు శాసనములు వచనశాసనము. అయినను అందలియతులు ప్రాచీనరూపములతోనుండి, తెలియరాని స్థితియందున్నవి. ఈ శాసనములలోని పదములు దాక్షిణాత్యభాషలగు తమిళ కర్ణాటకాదులతో సన్నిహితత్వము కలిగియున్నవి. తెలుఁగు భాషాపరిణామ వికాసవిధానమును సూచించునట్టిపదములున్నవి. రేనాటిచోళుల శాసనములందలి తెలుఁగుభాషపై ప్రాకృతప్రభావము ఎక్కువగా కనిపించుచున్నది. ఈశాసనములలోని పదములు సులభగ్రాహ్యములుకావు. తెలుఁగుభాషయొక్క ప్రాచీనస్థితిని తెలుపుటలో నివి ఉపయోగపడుచున్నవి. తెలుఁగు పలుకుబళ్ళు, ప్రాచీన ద్రావిడ సంప్రదాయమునుండి ప్రాకృతభాషాసంపర్కమున క్రొత్తపరిణామమును పొంది, భాషావికాసముయొక్క పరిమితిని పరిణామమును సూచించుచున్నవి. ప్రాకృత ప్రభావమును సూచించు పదముల నీ క్రింద నుదహరించుచున్నాను.

1. అసివైరు వులకితమ్— 1. చోళమహారాజు ఉరుటూరుశాసనము.
2 పొట్లదుర్తిమాలెపాడుశాసనము.

2. అణపోతులు (అజ్ఞప్తి)—పుణ్యకుమారుని మాలెపాడుశాసనము.
3. దుగరాజు—దుగిరాజు—యువరాజు అనియర్థము.
—చోళమహారాజు ఇందుకూరుశాసనము.

4 ఊరిస్వాముళ్
5 మహాసభియుళ్
6. సెడ్లసడుపుళ్
7. పెద్దళ్
8. పసుక్షేవుల కొణ్డుకళ్

(4–8) ప్రాకృతరూపమున నున్న తెలుఁగు పదములు.

ఈ శాసనములందలి వింతపదములు

1. సివబుకాను. 2. పన్నస 3. ఇరువదియాదినాల్కు మఱుతుల్లు.
—ఎల్లిగుడిపాడు శాసనము. E. I. Vol. XXVII Page 238
2. కాటుళున. 2. రట్టగుళ్ళు.
—చిలకూరు శాసనము (8వ శతాబ్ద్యారంభము)

రూప వైవిధ్యముగల పదములు

1. ఏమ్బది యె — తిప్పులూరి శాసనము.
2. ఏంభాది — వెల్లుర్తిశాసనము.
3. డచ్చిన – డచిన — పెట్లూరి శాసనము,
4. వ్రచ్చిన — ఉరుటూరు శాసనము.

(1) ఊరు

1. పాన్టూల్లు — సత్యాదిత్యుని సాలెపాడు శాసనము.

(2) ఏడు

1. ఏఱువేలనేల — బికిరాజు ముతుకూరుశాసనము 594
2. ఏఱువేలునేల — చోడమహరాజు ప్రొద్దుటూరు శాసనము
S. I. I Vol. X No. 595.

(3) తూర్పు

1. తూఱువ్వునూర్ల — Inscription No. 408 – 1904.
2. తూపుఱన — ,, 340 – 1905.

(4) పాఱుఁడు (బ్రాహ్మణుడు)

1. పాఱువారికి — 338 – 1922.
2. పాఱుళ — 284 – 1904.
3. పాఱ్ల — చిలంకూరు శాసనము,

(5) కపిలగోవు

| | | | |
|---|---|---|---|
| | 1. గవిలల | — | చోళమహారాజు సూర్యగ్రహణకాల శాసనము. |
| | 2. కవిళ | — | సాలెపాడు శాసనము (విష్ణువర్ధనుడు) |
| (6) | 1. పెణ్డంబు | — | S. I. I Vol. X 598 |
| | 2. పెడ్డాంబులు | — | 408 – 1904 |

రూప వైవిధ్యముకలవియు, వర్ణక్రమదోషములు కలవియునగు రేనాటిచోళుల శాసనములలోని పదముల క్రింద నుదహరించుచున్నాను.

| | | | |
|---|---|---|---|
| (1) | 1. సాక్షి | — | ఎఱ్ఱగుడిపాడు శాసనము. |
| | 2. సక్షి | — | చిలంకూరు శాసనము (అగస్త్యేశ్వరాలయము) |
| | 3. శాక్షి | — | ఎఱ్ఱగుడిపాడు శాసనము, |
| (2) | 1. భటరికి | — | బసినికొండ వెలికయచోడుని దొంగలసానికనుమ శాసనము. |
| | 2. భటారళకున్ | — | దిమ్మగుడి శాసనము. |
| (3) | 1. బారనాసి (వారణాసి) | — | రామేశ్వరస్తంభ శాసనము. |
| | 2. బారణా | — | నల్లచెఱువుపల్లి శాసనము. |
| | 3. వారణాసి | — | చిలంగూరు శాసనము. |
| | 4. బారనాసి | — | బికిరాజు శాసనము. |

రేనాటిచోళుల శాసనములందలి పదములు ప్రాకృతప్రభావమున సులభముగా నర్థముగునట్లులేవు.

| | | | |
|---|---|---|---|
| (1) | 1. పన్నస:-ఇదివింతపదము | — | ఎఱ్ఱగుడిపాడు శాసనమందున్నది. |
| | 2. పన్నాస | — | ఉరుటూరు శాసనము. |
| | 3. పన్నవీస – పన్నాశా | — | వెల్దుర్తిశాసనము |
| | పణ్నెయ | — | కన్నడ నిఘంటువు By Kittle |
| | పణ్యె | — | కన్నడ నిఘంటువు By Kittle |
| | పణ్నెయ=పెద్దపొలము | — | సేరి[1] |
| (2) | దత్తి[2] | — | దానము = దత్తము లేక ఈయబడినది. |
| | దత్తి | — | దత్తమును రూపమునుండి ఏర్పడినది. |
| | దత్తిడి[3] | — | విరళముగా కనిపించుచున్నది. |
| | దత్తి | — | దత్తిడి రూపాంతరము. |
| | దత్తి | — | నన్నయ తరువాతి శాసనములందును కన్పించుచున్నది. |

1. సేరి మాగాణి పొలమునకు మాత్రమే వర్తించును.
సేరి=మకాసా=సాగరము — తెలంగాణమున వాడుకలోనున్నది.
2. కపిలేశ్వరపుర శాసనము — బుదమనారాయలపాడు శాసనము.
3. Nellore Inscriptions Vol. 2 Page 297.

(ఏ) దత్తి = దత్తులు (బ) దేవదత్తి = దేవభోగము.

"ఇట్లు సంతానంబులు దేవబ్రాహ్మణదత్తులు"[1]

"గణపతిదేవమహారాజు విధించిన దత్తి,"

(3) మఱుతు — మాఱుత్రు — మఱుస్తుఱు

మరుతుస్డు — మరూతూ్రకి.

మఱుతుడ్లు — వి౹తుడ్లు.

మఱుతుంథ్లు.

"ఇది కన్నడశబ్దమగు మత్తరుయొక్క అసాధురూపము. ఒకానొక భూమి కొలమానమును సూచించునది.[2]

నూఱుమఱుతు — మోపురు భైరవస్వామి దేవాలయశాసనము

పాకాలశాసనమున "మత్తులు"[3] కావున

మఱుతు; మత్తు — ఏకవచనరూపములు

మఱుతులు; మత్తులు — బహువచనరూపములు.

(4) రట్టగుడి — రట్టగుళ్ళు. ఇవి 7వ శతాబ్దినుండి కనిపించుచున్నవి.

అరవళమహేంద్రరట్టగుడి — E. C. N. 798 of 1917.

పల్లవరట్టగుడి — E. C. N. 400 of 1904.

చల్కిరటగుడి — E. C.

తొల్పికామిరట్టగుళ్ళు
చోళియరట్టగుళ్ళు
గగ్గరట్టగుడి
అతిశయరట్టగుళ్ళు

} చిలంకూరు శాసనము – విక్రమాదిత్యచోళ మహారాజు E. I. Vol. XXVII 8th. Century.

రట్టగుడి — ఏకవచనము.

రట్టగుడ్లు; రట్టగుళ్ళు — బహువచనము.

రట్ట లేక రట్టు - ఒక తెగపేరు.

ఇప్పటి రెడ్డిపదము పూర్వపుశాసనములలో మార్పులతో కన్పించుచున్నది.

కాలక్రమమున రట్టగుడిపదములోని "గు" లోపించినది. రట్టగుడి వివిధరూపములనందినది.

1. రట్టోడి — E. I Vol V Page 139
2 రట్టయ — Nellore Inscriptions Page 38 P. 1201
3. రడ్డి — — Do — A 24. P. 230
K. 31. P. 724
K 22. P. 716

---

1. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం. 5 పేజి 361.
2. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక. — శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.
3. Nellore Inscriptions Vol I C. P. grant No. 17 Page 137.

4. రెడ్డి — — Do — O. 67. P. 1039
O. 58. P. 994

ఒకరాజు రట్టులపక్షమున ఒకరిమీదికి యుద్ధమునకు వెళ్ళినట్లు ఒక శాసనముననున్నది. E. Collection N 562 of 1915.

రట్టశబ్దము వివిధరూపములలో నామముల చివర కన్పించుచున్నది.

1 ప్రోలయ రట్టోడి — E. Collection No. 675 of 1917
2. ముప్పిరటి — — Do — No. 673 of 1917

రట్టులనుబట్టి రాట్టు పేరు వచ్చినది.
ఉదా: — కమ్మకరాట్టము.
రాట్టము — రాష్ట్రముగా మారినది.
కుట్టు — ఒక తెగపేరు.

కుట్టుపదము 3, 4 శతాబ్దములలో కాక తరువాతకాలమున పేళ్ళ చివరనున్నది.

సిరగుట్టి — E. Collection No. 735 of 1917.
అయ్యకుట్టి — —. — No. 735 of 1917.
రట్టుపదము 'రట్టి'గా కుట్టుపదము 'కుట్టి'గా మారినవి.
కుట్టు — కుట్టు, కుట్టి, కుడి గా మారినది.

ఈ రెండుతెగల అవినాభావ సంబంధమువలన రట్టు + కుట్టు=రట్టగుడి — ఏర్పడినది.

పరిశోధనవలన తేలినట్టి విషయము.

రట్టకుడు
రట్టగుడి } సంస్కృతమున రాష్ట్రకూటపదమయ్యెను.

"గుద్రహార విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినస్సర్వాన్సమా ..."

రాష్ట్రకూట పదముకన్న రట్టకుడు ప్రాచీనమైనది.
రట్టులు—రటులు—రాథోడయ్యెనని కొందరియూహ.
రాథోడు — ఒక వంశముపేరు — రాజపుత్రస్థానము.

కడప, అనంతపురము మండలములలోని ప్రాచీన శాసనములందు రట్టకుడు, రట్టగుడి అను పదములు (జాతికి సంబంధించినవి) నామములచివర కన్పించుచున్నవి.

మార్పిడుగు రట్టగుడి — వ్యక్తిపేరు.
కదుంబిడుగు — S I I Vol. I Page 63.
పెరుంబిడుగు — — ,, — Page 155

శ్రీ కంఠచోళుని పూర్వులనామములందు అగ్రణి పిడుగను పేరున్నది.

రాష్ట్రకూటులు — కుటుంబులు అనగా వ్యవసాయదారులు.

తమిళమున కుడివలన కుటుంబి అను శబ్దము వచ్చినదని శబ్దశాస్త్రజ్ఞుల యూహ.

రట్టకులు శబ్దమువలన రట్టగుడి, రట్టకుడు అను పదము లేర్పడినవి. ఇంకను ఈ విషయము పరిశోధింపదగినది.

మనుస్మృతిలో రాష్ట్ర — మహారాష్ట్ర శబ్దములున్నవి. (7, 109; 10, 61.) (7.32)

రాష్ట్రక — రాష్ట్రకూట — ల నుండి రట్టకుడను శబ్దము కల్గినదనుట సమంజసము.

రాష్ట్రకూటశబ్దమే రట్టగుడి — రట్టడి అదులకు మూలమనియు రాష్ట్రమునకు ప్రధానుఁడు లేక ముఖ్యుడని దాని యర్థమనియు శ్రీ జయంతి రామయ్యపంతులుగారి యభిప్రాయము.[1]

ఈ శాసనములందు ళళ, నణ, స శ, తచలు తారుమారుగా వ్రాయబడినవి.

ల ళ

ఏళన్—కలమళ్ళ శాసనము 575, ఇందుకూరు శాసనము, ఊరుటూరు శాసనము.

ఏలూరు ప్రాకృతశాసనమున 'ఏళూరు' రూపమున్నది.

(శాలంకాయన విజయదేవవర్మ క్రీ. శ. 4వ శతాబ్ది)

ఏలు + ఊరు=ఏలూరు.

ఏలు—కు ఇతర ద్రావిడభాషలలో 'అళ్' రూపమున్నది.

ఇది 'ఏళు' గా మారి 'ఏలు' యైనది.

న ణ

పణికేసరి S. I. I. Vol. X No 47

పణ్, పణ్ణులకు చేయు అర్థము తమిళ కన్నడములందున్నది.

ణ కారము పణిలోనున్నది.

అణతి
వినియణ } రామేశ్వర స్తంభశాసనము.

వణమ్ — చిలుకూరు శాసనము.

ఈ పదములపై ప్రాకృతభాషా ప్రభావము అధికముగా గాన్పించును.

'ణ' కారమునకు బదులు 'న' కారము తప్పుగా వ్రాయబడినది.

ఇట్లు వ్రాయబడుటకు కారణము ఆ శాసనలేఖకుల పొరపాటైనను, అజ్ఞతయైనను కారణమై యుండవచ్చును.

1. గ్రహనస్తితి — S. I. I. Vol X N. 595.
2. బ్రాహ్మనులకు — కుసుమాయుధుని శాసనము — ఉగాదిసంచిక.
3. వైశ్రవను — కపిలేశ్వరపుర శాసనము 740. A. D

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం. 24 పుట 163.

శ స

శ, స లు తారుమారుగా వ్రాయబడినవి. ప్రాచీనద్రావిడ భాషయందు శ, ష, స లున్నట్లు తోచదు. వీనికి బదులు 'చ' కారము వ్రాయబడెడిది.

ఈ శాసనములందు శ, చ వర్ణములకు బదులు సకారమును, ష, కు బదులుసకారమును వాడబడినది. 'శ' వర్ణమునకు బదులు 'స' వర్ణము వాడబడినది.

ఇసానశివులు — దొంగలసానికనుమ శాసనము.

సాసనబిదిగల్లు — S. I. I. Vol. X. N. 598

కాస్యపగోత్ర కరికాలాన్వయ — సూర్యగ్రహణకాలశాసనము.

సూద్రకుండు — గురిందగుంట శాసనము.

7, 8 శతాబ్దములలోని శాసనములందు దంత్య సకారమునకు బదులు శ వర్ణము వ్రాయబడినది.

ఉ: 1. శాక్షి — ఎఱ్ఱగుడిపాడు శాసనము.

2. శూర్య్యగ్రహన నిమిత్యంబున — బికింరాజు శాసనము.

3. ప్రసంఠ — ప్రచంఠకుబదులు - S. I. I. Vol. X No. 524.

వత్సరమునందలి త్స, చ్చ, చ్ఛ అను రూపములందున్నవి.

వచ్ఛరమ్బుళ్ — చామలూరు శాసనము - వినయాదిత్యచోళ మహారాజు.

త ద

త కు బదులు ద వాడబడినది. కొన్ని శాసనములందు దేనికిబదులు తేని కన్పించుచున్నది. రేనాటిచోళుల శాసనములందు

తేని, దేని — ఈ రెండింటిలో తేని ప్రాచీనమైన రూపము.

ఇది అతు, ఎతు — ల లోని హల్లు తెలుగులో సరళముగా గాక పరుషముగానే యుచ్చరింపబడు చుండిన కాలమును సూచించుచున్నది.

1. తేనిఙ్ఞచ్చుమహాపాతకము — చిలంకూరు శాసనము.

2. తెని ఒచ్చినవాన్డు — ఇందుకూరుశాసనము - చోళమహారాజు.

కొన్ని పదములందు 'ద' కారమునకు బదులు త కారము వ్రాయబడినది.

3. చోళమహారాజుల తేవుళ్ — నల్లచెఱువుపల్లి శాసనము.

4. ఇన్త్రలోకంబేెగ్రచిన్న — తిప్పసముద్రశాసనము S I. I Vol X N 621.

ఋ, రి :

శాసనములందు ఋ, రి గా వ్రాయబడినట్లు చూతుము. ఋ కు రి యుచ్చారణ అకాలమునందుండి యుండవచ్చును. నన్నయగారి కాలమునకూడ నిట్టి యుచ్చారణ ముండుటనుబట్టియే యాతఁడు ఋ, రి ల యతి మైత్రిని పాటించెను.

1. గ్రిహంబు — రేమయ్యశాసనము.

2. అశ్వత్థవ్రిక్షేన — కుసుమాయధుని శాసనము.

ఱ కారము : ఇది వింతయక్కరము. రేనాటిచోళుల శాసనములందును ఈవింతయక్కరమున్నది. చాళుక్యుల శాసనములందును నన్నయ తరువాతి శాసనములందును ఈ యక్కరము కన్పించుచున్నది. చేబ్రోలు శాసనమున (విక్రమచోళుడు 1127) న దేవనాగుని లిపి మధచోడశబ్దము వ్రాయు సందర్భమున నిది వ్రాయబడినది.

(శ్రీమాన్ మహామణ్డలేశ్వరనంబయ ఇచ్చిన గోఱయలు)

రేనాటిచోళుల శాసనములందీవింత 'ఱ' కారము కనిపించును. ఈయక్కరముతోగూడిన పదములు శాసనములందు కనిపించుటవలన జనవ్యవహారమున నీ 'ఱ' యుండెనని చెప్పవచ్చును.

1. చోఱ మహారాజులు — ఉరుటూరుశాసనము, ఇందుకూరుశాసనము, చిలంకూరుశాసనము, రామేశ్వర స్తంభశాసనము.

ఇందలి 'ఱ' చోడ, చోళ అని, డ, ళ రూపము పొందినది. తమిళ కన్నడములందిది 'ఱ' రూపముతోనే కనిపించును.

2. ఇన్దుప్రోలి అఱపోతులు — మాలేపాడుశాసనము – సత్యాదిత్యుడు.

పుఱోలు — లోని పువర్ణమునందలి ఉకారము లోపించుటవలన, ప్రోలు రూపములను బొందినది.

తెలుగుననున్న ౘ కి ఱ లు మూలరూపములు.

శకటరేపము (ఱ): తాన్తికొన్త, అఱుతొఱె — అత్తివర్మ గోరంట్లశాసనమునందున్నవి. అనగా క్రి. శ. మూడు, నాలుగు శతాబ్దముల కాలమునాటికే శకటరేఫము వ్యాప్తిలో నుండెనని చెప్పవచ్చును. శివస్కంద వర్మ మైదవోలుశాసనమున "విరిపర' అను గ్రామనామము సాధురేఫముతో వ్రాయఁబడినది.

పెన్‌పాఱ — పొట్లదుర్తి మాలేపాడుశాసనము – సత్యాదిత్యుడు.

పాఱుఁడు = బ్రాహ్మణుఁడు.

ప్రాచీనశాసనములందు 'డు' ప్రత్యయముతోకూడుకొనిన ఈపదములేదు. 'పాఱ' అను స్త్రీసమమే వాడబడినవి.

తిరువుళపాఱకు — ఉరుటూరు శాసనము.

కొట్టంబునపాఱకు — ఎఱ్ఱగుడిపాడు శాసనము E I Vol XXVII 9221.

వేపురుపాఱ — రామేశ్వర స్తంభశాసనము

వేపురుపఱ — బొడ్డులోళ్ళపల్లి శాసనము N. 437.

పాఱు — చూచు (To See) in Tamil

పాఱ — ద్రష్ట (Seer)

క్రాంత దర్శనులైన ద్రష్టలుగా బ్రాహ్మణులాకాలమున దలంపబడినారు. కావున వారికాపేరేర్పడినది. పాఱ — బ్రాహ్మణశబ్దభవమైన సాధురేఫము వికృతిలో శకటరేఫముగా మారినదనవచ్చును.

ఇశెఱెనికన్ — మాలేపాడుశాసనము – సత్యాదిత్యుడు.

ఇది బ్రాహ్మణునిపేరు ఈశ్వరుడను నామమునకు వికారరూపము. ఇందు 'ఱ' అనవసరము.

'న్టు' : రేనాటి చోళులశాసనములందు 'న్టు' రూపము కన్పించును. ముందీ 'న్టు' 'ణ్డు' గా తీర ప్రాంతములందు మారినది. ఇట్టి రూపములు రేనాటిచోళుల శాసనములందు కనిపించుచున్నవి.

పుణ్యకుమారున్టు, గణ్యమానున్టు, మదదితున్టు — పొట్లదుర్తిమాలేపాడు శాసనము.

అవినవాన్టు — తిప్పలూరిశాసనము

పఞ్చమహాపాతక సంయుక్తున్టగు – వెల్దుర్తిశాసనము. ఇందుకూరిశాసనము సత్యాదిత్యుని మాలేపాడు శాసనములతో నున్నది.

ఏలుచున్టి — సత్యాదిత్యుని మాలేపాడు శాసనము.

ఏలుచున్టి — ఏనుచుణ్డి — ఏలుచుండిగా మారినది.

'ణ్డు' కు బదులు న్టు – అనునది పూర్వరూపముగా వాడబడినది. ఇది సాధారణముగా ప్రథమా విభక్త్యేకవచనరూపములనుండు 'ణ్డు' కు బదులు కన్పించుచున్నది ఇతరపదములందలి 'ణ్డు'–ణ్డుగానే యున్నది.

రేనాటిచోళుల కాలమున అనుస్వారము బిందువుగను, వర్గానునాసికముగను వ్రాయబడుచుండెను

ధనంజయుఱు–రేనాణ్డు, చిరుమ్బూరి, పంపుచే, పఞ్చమహాపాతక–ధనంజయుని కలమళ్ళశాసనము.
E. I. Vol. XXVII P, No Date 675.

రాచమానంబున, వక్రంబు, పఞ్చమహాపాతక–ఉటూరుశాసనము–చోళమహారాజు.
E. I Vol. XXVII D 625 A. D.

పఞ్చమహాపాతక సంయుక్తున్టగు — ఇందుకూరుశాసనము చోళమహారాజు.

ఉత్తమోత్తముణ్డయిన,కొణ్డకొత్తిక్రయ, సోమవారంబు — తిప్పలూరి శాసనము పుణ్యకుమారుడు
S. I. I. Vol. X

సంవత్సరమ్బుళ్, నాణ్డు, వసన్తిపోఱి – రామేశ్వరస్తంభశాసనము E. I. Vol. XXVII

ఇన్తెద్దివాడి, కజ్జళూన్టు – నల్లచెఱువుపల్లిశాసనము, విజయాదిత్యచోళుడు.

రాజ్యంనియ, వెన్దరంబు – చోళమహారాజు వెల్దుర్తిశాసనము S. I. I Vol. X No. 780.

ఇరువదిరెణ్డు, వచ్చరంబుల్, పాంబుఱిగ్గి – చాములూరుశాసనము విజయాదిత్యచోళుడు.
S I. I. Vol. X

మహేన్ద్రన్, మంగు — బూడిదనద్దపల్లిశాసనము

పంఞ్చమహాపాతకున్టగున్ — పొట్లదుర్తిమాలేపాడుశాసనము

కాశ్యపగోత్రుణ్డు, రేనాణ్డు. చిఱుంమ్బూరి —

రేనాటిచోళుల శాసనములందు సాధురేఫ సంశ్లిష్టములైన అక్షరములను వ్రాయుపద్ధతి రెండువిధములు. సంయుక్తాక్షరములలో పూర్వాంశముగను, రకారముగా వ్రాసి దానిక్రింద మరొక హల్లుగుర్తును వ్రాయుట ఒక పద్ధతి. ఉత్తరాంశమును హల్లును ద్విత్వముగా వ్రాసి ప్రక్కన వలపలిగిలుక వ్రాయుట రెండవపద్ధతి. ద్విరుక్తము కాని హల్లుప్రక్కన వలపలిగిలుక వ్రాయుపద్ధతి ప్రాచుర్యమునకు వచ్చినది.

1. కొచ్చియపాఱ రేవశమ్మారికిన్ — ఇందుకూరుశాసనము చోళమహారాజు.
2. చిర్వలియపటుకాను — తిప్పలూరుశాసనము.
3. ప్రవర్ధన్మాన — రామేశ్వరస్తంభశాసనము.

అర్య, అజ్జ అయ్య, అయ 1563 S. I. I. Nol No 698.

సం. ప్రా.

ఆర్య — శబ్దము అజ్జగామూరి — అయ్య అను రూపములతో కన్పించుచున్నది.

రేమయ్య — S. I. I Vol. X No. 593.

అయ్య — కు పూజ్యార్థమున అర. ఆర్ రూపములు చేర్చబడినవి.

1. రేమయ్యారు — S. I. I. Vol. X No. 593.
2. పొట్టియారు — నల్లచెరువుపల్లిశాసనము.
3. బణ్ణియారు — అగస్త్యేశ్వర దేవాలయము No. 400 S. I. I. Vol. X

అయ్య శబ్దము లేకున్నను పూజ్యార్థమున ఆర్ వాడబడినది.

పాలశమ్మఁణరికి — వెల్దుర్తిశాసనము.

దేవశమ్మఁణరికి — ఇందులూరి శాసనము.

ఇరశమ్మఁణరికి — పిమ్మగుడి శాసనము.

రేవఁణాలు — పొట్లదుర్తి మాలెపాడు శాసనము.

పుద్దరాకులు — కాలు, కాళ్ళు – పూజ్యార్థములు.

పాలతేగారికి — గారను పూజ్యార్థమున వాడబడినది

భట్టుకు — భట్టార, భట్టారక రూపాంతరములున్నవి.

ఆర — ఆర్యశబ్దభవమని – Dr. దివాకర్లవారు ప్రా. న, యు. P. 189.

బహువచన ప్రత్యయము :–

విజయరాజ్య సంవత్సరంబుళ్, I తెలుగు బహువచన ప్రత్యయము.

కళ్ — అనుచిత విభాగమున ళ్, ళు గా తరువాత లుగా మారినవి.

సంవత్సరము తత్సమపదము. ఈ పదాంతము 'ళ' చేరినది.

రేనాటి చోళుల శాసనములందలి బహువచనాంతములు పూజ్యార్థకరూపములు.

1. దేవశమ్మఁణరికిన్ — వెల్దుర్తిశాసనము.
2. చోళమహారాజులాకు — రామేశ్వరస్తంభశాసనము.
3. ముత్తురాజుల్ల — ఎఱ్ఱగుడిపాడుశాసనము,
4. కుణ్డికాళ్ళుల — Do.

పూజ్యార్థమున బహువచనము వాడబడును. రేనాటిచోళుల శాసనములలో రాజు శబ్దమునకు ల్లు. ఌ్లు, బహువచనముగా వాడఁబడినది.

1. ఎఱికల్ముత్తురాజుల్లకుండికాళ్ళు — ఎఱ్ఱగుడిపాడు శాసనము.
2. చోళమహారాజుఌ్ల — ఉరుటూరు శాసనము.

ఇచట ఌ, లు, లు బహువచన ప్రత్యయములు. వీటిపై లు చేరుటవలన ఌ్లు, ల్లు అయినవి. ఊరు నకు ఊఌ్లు, ఊర్లు అనునవి బహువచనరూపములుగా శాసనములందు కనపడుచున్నవి, నేడు మనము ఊళ్ళు ఉపయోగించుచున్నాము.

పాఱ శబ్దము బహువచన ప్రత్యయములేకుండ బహువచనముగ వాడఁబడినది.

వేవురుపాఱజమ్మిన — రామేశ్వరస్తంభశాసనము E. I Vol. XVII

ఏకవచనాంతముగా ద్విగుసమాసము కొన్ని శాసనములందు వాడబడినది.

మున్నూరునేల — రామేశ్వర స్తంభశాసనము E. I. Vol. XVII

లింగము:— తత్సమపదములందు చివర లింగభేదమును సూచించు చిహ్నములులేవు.

1. సాక్షి — పాత్రకు — వారణాసి.

ఈ శాసనములందు సమాపక క్రియలనుగూడిన వాక్యములు తక్కువగానున్నవి. అట్టివి ఉన్నను పుంలింగపదకర్తృకములుగ నుండుటవలన క్రియలలో లింగభేదమెంతవరకు పాటింపబడినదో తెలుపుటకష్టము. తత్సమపదములలో న్టు, ణ్డు – వర్ణాంతముల పుంలింగపదములని, ము, బు, ంబు, లు వర్ణాంతముల నపుంసక లింగపదములని చెప్పవచ్చును.

1. ధనంజయుఱు — కలమళ్ళశాసనము.
2. రాచమానంబు — ఉరుటూరు శాసనము.
3. వక్రమ్బు — డిటో
4. సంయుక్తన్టు — ఇందుకూరుశాసనము.

దేశ్యపదములందు లింగసూచక చిహ్నరహిత సంఖ్య అధికము. అవి స్త్రీ సమములు.

1. చిఱుమ్బూరు — కళమళ్ళశాసనము.
2. పాఱ — ఉరుటూరు శాసనము.
3. పన్నస — ఎఱ్ఱగుడిపాడుశాసనము.
4. అమ్మ } చాములూరుశాసనము.
5. చిన్త }

కొన్ని శాసనములందు పుంస్త్వసూచకపదములగు న్టు, ణ్డు, లున్నవి.

ఇశటేనికిన్ — ఇశటేఁడు — ప్రథమావిభక్తి.

త్పోలయ
రేవణ } అయ్య, అయ, అణ, లు పుంస్త్వసూచకములు.
వుద్దణ

పురుష నామవాచకములచివర అమ అను పదములున్నవి.

కన్నమ } ఏడువాడలపాలెము శాసనము,
ఎఱమ } వెల్దుర్తిశాసనము.
యుమ్మయ } మాలెపాడుశాసనము.

వీనిలో ంబు, ము, అమహద్వాచకత్వమును తెలుపును.

చెఱువులోని 'వు' — ఇట్టిదే యనవచ్చును.

విభక్తులు – విభక్త్యంగములు:— డు, ము, వు, లు ప్రథమావిభక్తి ప్రత్యయములు—రేనాటిచోళుల శాసనములందు 'న్డు' తో కూడినవి ఆరు, ఏడు శతాబ్దులలోను, ణ్డుతో కూడినవి అటుపిమ్మటను, తరువాతికాలమున ణ్డు, ండు, లు వాడుకలోనికివచ్చినవి.

1. వచినవాన్డు — ఊరుటూరు శాసనము.
2. సంయుక్తున్డుగు — ఇందుకూరుశాసనము.
3. అచ్చినవాన్డు — పొట్లమర్తి మాలెపాడుశాసనము.
4. అమహేన్ద్రన్ — బూడివగడ్డపల్లిశాసనము.

ఇందలి 'అన్' ప్రాచీనప్రత్యయము.

'మహాపాతకు' మున్నగువానిలో ప్రథమావిభక్త్యేకవచన ప్రత్యయము కానరాదు. పాఱ-తే-లందునులేదు.

పాలఱేగారికి

పెన్పాఱ ఇశెఱేనికిన్

ము, వు, లు ప్రథమావిభక్త్యేకవచనమున అమహద్వాచక పదములచివర కనిపించుచున్నవి.

మ్ము, మ్బు, బు, పు, లు – 'ము' కు పూర్వరూపములు.

ఇవి దేశీయములకు మొదట వాడబడుచుండెను. క్రమముగా నివి తత్సమీకరింపబడినపుడు అదంత సంస్కృతపదములకు చేర్చబడినవి. కొన్ని సంస్కృత పుంలింగములైనను తెలుఁగున అమహద్వాచకములుగా లెక్కింపబడును. వాటిచివర నీ ప్రత్యయములు చేర్చబడును. అమహత్తులగు అదంతపదములకు 'మ్బు' అను దానిని ప్రథమైకవచనమున ప్రత్యయముగా జేర్చుట విక్రమేన్ద్రవర్మ చిక్కుళ్ళ శాసనమునుండి కనిపించుచున్నది. (విజయరాజ్య సంవత్సరంబుళ్)—చిక్కుళ్ళశాసనము

రేనాటిచోళుల శాసనములందు 'మ్బు' 'ంబు' లతోగూడిన పదములు ఎక్కువగా కనిపించుచున్నవి. కావున ఆరవ శతాబ్దినాటికే ఈ రూపములు, ఆంధ్రభాషలో సుస్థిరమైన స్థాన మాక్రమించినవని చెప్పవచ్చును.

రేనాటిచోళుల శాసనములందలివి :—

| | | |
|---|---|---|
| 1. | కొట్టంబున | — ఎఱ్ఱగుడిపాడుశాసనము E. I. Vol XXVII |
| 2. | రట్టంబున | రామేశ్వర స్తంభ శాసనము E. I. Vol. XXVII P. |
| 3. | ఫలోంబున | |
| 4. | విజయరాజ్యసంవత్సరంబుళ్ | |
| 5. | ఉత్తరంబున | |
| 6. | వక్రమ్బువచినవాన్డు | — ఉరుటూరుశాసనము. |
| 7. | దానఫలంబు | వెల్దుర్తిశాసనము. |
| 8. | మహాపాతకంబు | |

ఆరవ శతాబ్దినుండి తొమ్మిదవ శతాబ్దివరకు వేయింపబడిన శాసనములందనునాసికములేని కేవల 'బు' వర్ణముతోగూడిన రూపములు కనిపించుచున్నవి. 'మ్బు' తో కూడిన పదములసంఖ్య ఎక్కువగా నున్నది.

నివబుకాను — ఎఱ్ఱగుడిపాడుశాసనము.

శాసనములందు ప్రథమైకవచన ప్రత్యయము 'ము' ను అనుస్వారమున పలుకుచుండిరనుటకు ఉదాహరణములు కనిపించుచున్నవి.

1. వణంపరియారము — చిలంకూరుశాసనము E. I. Vol. XXVII
2 వక్రపల్కినవారు — వెలుదుర్తిశాసనము.
3. ప్రసాదచేసిరి — చిలంకూరుశాసనము.

ఇవి 'ము' వర్ణరహితరూపములు. పద్యాదులు పరములగునపుడు 'ము' వర్ణమునకు లోపముకాని పూర్ణబిందువుకాని వచ్చురూపము లీ శాసనములందు కనిపించుచున్నవి.

పల్కు, చేయు — అను క్రియలు పరమైన 'వక్రము' లోని 'ము' వర్ణము లోపించినట్లగుపడును.

కొన్ని శబ్దములు సంస్కృతమునుండి ప్రాకృతములోనికి తెలుగుభాషలోనికి వచ్చి చేరినవి.

పరిహారః — పరియారో — పరియారువు.

ధర్మః — దమ్మో — దమ్మువు.

పరిహారము } శబ్దములు సంస్కృతమున పుంలింగములు.
ధర్మము }

కాని తెలుగున నివి అమహత్తులు. అవి పరిహారము, ధర్మము, అని యుండవలెను, కాని నేరుగా సంస్కృతమునుండి ప్రాకృతమునకు, అందుండి తెలుగులోనికి వచ్చుటవలన పరియారువు, దమ్మువురూపములను బొందినవి.

1. సాసానవు — C P. grant No. 10 – 1908.
2. అచ్చర్వు — బూడిదగడ్డపల్లి శాసనము.

ఇవి 'వు' వర్ణాంతప్రయోగములు.

ఆశ్చర్య — అచ్చేరం — అచ్చెరువు.

384 – 1904 శాసనమున దమ్మువు దమ్ముఙ కు గా వ్రాయబడినది. ఇచట 'వు' లోపించినది.

దిర్మువు + అర్థువు—నన్నయభారతము.

చెఱువు } ఆదిదేశ్య పదములందును 'వు' కనిపించుచున్నది.
మదువు }

రేనాటిచోళుల శాసనములందు సమానాధికరణ విశేషణాది సంబంధములు పదములస్థితిమాత్రమున సూచించబడుచున్నవి.

ఇ, టి, తి, పు, అ, లు చేరి అసంబంధములను వ్యక్తపరచుచున్నవి.

ఉదా:—

1. కాశ్యపగోత్రుస్తు సత్యదితుస్తు — మాలెపాడుశాసనము.
2. కొచ్చియపాఱరేవశమ్మాఙరికి — ఇందుకూరిశాసనము.
3. విజిపటితి కమ్మరివినియన్ — రామేశ్వరస్తంభశాసనము.
4. వెంకణాదిత్యుణ్డు కొమరురభీముణ్డు - రామేశ్వర స్తంభశాసనము.
5. వెంకయాచోప్ఞమహారాజు — వెంకయచోడుని దొంగలసానికనుమశాసనము.
6. ఉత్తరంబుకట్ట — చామలూరుశాసనము.

ఇందు ప్రత్యయములేదు. 1, 2, 3 లలో సమానాధికరణ సంబంధమున్నది. ఇచట 'అగు' ధాతు సంబంధమున్నది. 'కాశ్యపగోత్రుండు' అగు సత్యాదిత్యుడు అని అర్థము.

ఇ:—

| | | | |
|---|---|---|---|
| 1. | చిరుమ్బూరి రేవణకాలు | — | కలమళ్ళశాసనము. |
| 2. | కూచపోఱియారితాంబుల్ | — | చామలూరిశాసనము. |
| 3. | ఇన్పుఱ్రోలి అనపోతులు | — | పొట్లదుర్తిమాలెపాడుశాసనము. |
| 4. | పల్లెయారికొడుకు | — | నలజానంపాడుశాసనము E I. Vol. XXVII P. 203. |
| 5. | వానిలోకమ్బు | — | మాలెపాడుశాసనము. |
| 6. | దీనియరిదాణంబు | — | చికిరాజుశాసనము S. I. I Vol. X No. 594 |

అ:—

| | | | |
|---|---|---|---|
| 1. | ముత్తిరాజుల్లకుట్టికాళ్ళు | — | ఎఱ్ఱగుడిపాడు శాసనము. |
| 2. | తక్కఃపుఱ్రోలపారదాయ | — | తిప్పలూరుశాసనము. |
| 3. | చోఁఱమహారాజుల అమ్మ | — | చామలూరుశాసనము. |
| 4. | విక్రమాదిత్యుల కొడుకు | — | మాలెపాడుశాసనము. |
| 5. | అశ్వమేధమ్బునఫలమ్బుగు | — | నలజానంపాడుశాసనము. |
| 6. | పట్టంబునవారికి | — | రామేశ్వరస్తంభశాసనము. |

తి:-

విఱిపఱితికమ్మరి — రామేశ్వర స్తంభశాసనము.

సర్వనామములు :- రేనాటిచోళుల శాసనములందు సమాపక క్రియలతోగూడిన వాక్యములు తక్కువ. కొన్నిచోట్ల ప్రథమపురుషకు సంబంధించిన రూపములున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1. | విరిపఱితి కమ్మరివినియణ్వ్రాసె | — | రామేశ్వర స్తంభశాసనము. |
| 2. | పక9మ్బువచినవాన్డుపఞ్చమహాపాతకు అగుఁను | — | ఉరుటూరుశాసనము. |
| 3. | ప్రసాదచేసిరి | — | చిలంకూరుశాసనము. |
| 4. | పసిణ్డిమఱెకొఱొచె | — | నల్లచెఱువుపల్లిశాసనము. |
| 5. | కచెఱుపాఱుఎఱమవ్డాసిరి | } | వెలుదుర్తిశాసనము. |
| 6. | కొణణ్డాళువాన్డుకొట్టె | } | |
| 7. | ఎఱిగల్తుగరాజఞ్జిఇచ్చినపన్నాస | — | ఉరుటూరుశాసనము. |

భూతకాల క్రియాజన్య విశేషణములతోను, అధికరణాత్మక యోజనముకల వాక్యములతోను తెలుపబడుచుండును.

రేనాటిచోళుల శాసనములందు వాన్డు, వారు అను ప్రథమైకవచన బహువచన రూపములు కనిపించుచున్నవి.

దీని, దేని, వానికి, వారు. అది, తేని, దేని, దేనికి ఆదులు శాసనములందున్నవి.



శ్రీ బి. యస్. శాస్త్రి

సంఖ్యావాచకములు:— రేనాటిచోళుల శాసనములందు పెక్కు సంఖ్యావాచకరూపములున్నవి.

1. నల్వాద్యదియొకటియగు నేణ్డి — దొంగలసానికనుమ శాసనము.
2. ఇరువదియాదినాల్కు మఱున్తుఱు — ఎఱ్ఱగుడిపాడు శాసనము.
3. రెణ్డుతోటలు — రామేశ్వర స్తంభశాసనము
4. ఇమ్మడి — వెల్లుర్తిశాసనము,
5. రెణ్డుగద్యలు — S I. I Vol. X No. 595.
6. నూటయిరువది మరుతుణ్డు — S I. I Vol. X No. 509.
7. పన్ణెన్డ్రుణ్డువుణ్డు — S I. I Vol. X No. 509.

మూఁడు.— రేనాటిచోళుల శాసనములందున్నవి.

1. మూన్డువుటు అఱపట్టుక్షేత్రంబు — నలజానంపాడు శాసనము.
2. ఇరుబాదిమూండుపుపర్తిల్ల — విక్రమాదిత్య బలికులబాణరాజులశాసనము.
3 మూనూరు — బాణరాజులశాసనము.

నాలుగు:-

1. ఇరువదియాదినాల్కు మఱున్తుఱు — ఎఱ్ఱగుడిపాడు శాసనము.
2 నల్వాద్యదియొకోటియగునేణ్టి — దొంగలసానికనుమ శాసనము.
3. నాలుగుస్తానంబులవారును — సూర్యగ్రహణకాల శాసనము.

ఐదు:—

1. ఏబది తిరువులపాఱకు — ఉరుటూరు శాసనము.
2. ఏబాది మఱున్తుఱునేల — చామలూరు శాసనము.
3. ఏమ్బదియె — తిప్పలూరు శాసనము.

ఏడు:—

1. రేనాణ్డేఱువేలునేల — S I. I Vol X No. 595
2. పఱువేఱునేఱంగా — కొసినేపల్లి శాసనము.
3. రెనాణ్డుపఱువేలు — S. I I. X No. 509.
4. రేనాణ్డి ఏఱువేళు — చెన్నరాయనిపల్లి శాసనము.

ఎనిమిది:—

నూటఎనుబొణ్డన్నడ్డ — పెద్దముడియం శివాలయశాసనము S.I.I. Vol. X
వేవురు — రామేశ్వర స్తంభశాసనము.
వేవ్వుర — నల్లచెఱువుపల్లిశాసనము.
ఇన్నల్వురుసాక్షి — బాణరాజులశాసనము.
పదున్డు — S. I. I. Vol. X No. 627.

ఇట్టి సంఖ్యావాచకములు మనకు విరివిగా కనిపించును.

విశేషణములు:-

రేనాటిచోళుల శాసనములందు బహువచనాంతములైన పదములను విశేషణములుగా మార్చుటకు 'అ' చేర్చబడిన ప్రయోగముల నీ క్రింద నుదహరించుచున్నారు.

1. ఇన్ముప్రోలిఅణపోతులు — పొట్లదుర్తి మాలెపాడుశాసనము.

2. చోళమహారాజుల అమ్మ — చాదులూరుశాసనము.

నూఱు శబ్దము విశేషణమైన 'నూట' రూపమును పొందుచున్నది.

1. నూటినమ్మణ్డను — మాలెపాడుశాసనము. నిత్యవర్షుడు.

2. పఱు — ధాతువు — స్థలనామాంతముల 'పట్టు' అను విశేష్యరూపమును పొందుచున్నది.

పఱు — పట్టుగా మారినది. అట్లు మారని సమయమునందు ద్విత్వమును కోల్పోయి 'తి' తో గూడి వాడబడినది. 'తి' లోని 'ఇ' సాహచర్యమున 'ఱు' లోని 'ఉ' 'ఇ' గా మార్పుచెందును.

రేనాటిచోళుల శాసనములందు 'పెర్' ధాతువు 'పెన్' గా వాడబడినది.

1. పెన్‌పాఱ ఇశెరేనికిన్ — పొట్లదుర్తి మాలెపాడుశాసనము.

2. పెన్‌పాఱ రేవశమ్మణపుత్రస్య — చామలూరుశాసనము.

'అయిన' ధాతుజ విశేషణము 'ని' ప్రత్యయాంతములకేకాక ఇతర విశేషణములకుపరమై వానికి తరువాత వచ్చు విశేష్యములకుగల సంబంధమును వ్యక్తముచేయుచున్నది

1. ఉత్తమోత్తముణ్డయిన వాన్డు — తిప్పలూరిశాసనము.

అగు, అను ధాతువుల తద్ధర్మార్థక విశేషణములు కొన్నినామవాచకములకు బరమై వానిని విశేషణములుగా నొనరించుచున్నవి.

1. బాదిరాజు అనువాన్డు — బాదిరాజనువాన్డు — నలజానంపాడుశాసనము.

2. అరివరజముణ్డనువాన్డు — బూడిదగడ్డపల్లిశాసనము.

రేనాటిచోళుల శాసనములందు సంధి పాటింపబడినది. కొన్నిచోట్ల అచ్చును, హల్లును కలిపి వ్రాయక పోవుటయేగాక, యడాగమమును వాడినచోట్లు కలవు.

సంవత్సరంబుళ్‌యేనగు — రామేశ్వరస్తంభశాసనము.

శ్రీమత్‌యన్మడి — ఏడువాడలపాలెపుశాసనము.

విసంధిగా వ్రాయబడినచోట్లు:-

1. రేనాణ్డుఏళన్ — కలమల్లశాసనము.

2. కామఇచ్చిన — ఎఱ్ఱగుడిపాడుశాసనము.

3. కాళ్ళుళఇచ్చిన
4. ఏళఎరిగల్
5. రాజుల్లఇచ్చిన
6. రాచమానంబున ఏబది
7. పాఱకుఇచ్చిన
8. పాతకుఅగు

(3–8) — ఉరుటూరుశాసనము.



శ్రీ బి. యన్. శాస్త్రి

| | | |
|---|---|---|
| 9. | కుమారున్ను అతిశయ | — వెలుదుర్తిశాసనము. |
| 10. | రట్టగుళ్ళు అనతిగాను | — రామేశ్వర స్తంభశాసనము. |

యడాగమము వచ్చినచోట్లు:—

| | | |
|---|---|---|
| 1. | అధిపతి యాయ్నవలు | — ఏడువాడలపాలెపు శాసనము. |
| 2. | రట్టోళి యిచ్చినది | — నిడుమానూరుశాసనము. |

సంధి పాటింపబడిన చోట్లు:—

| | | |
|---|---|---|
| 1. | రాజుల్లేళన్ | — ఇంచుకూరుశాసనము. |
| 2. | ఉత్తమోత్తమున్డయిన | } తిప్పలూరుశాసనము. |
| 3. | రేనాణ్డేలుచు | |
| 4. | ఏనగు | — రామేశ్వర స్తంభశాసనము. |
| 5. | చోళమహారాజులేళన్ | — చిలంకూరుశాసనము. |

ఉత్తునకు సంధి యగుచున్నది. అత్తునకు వైకల్పికము. ఇత్తునకు సంధిలేదు. సంధి లేనిచోట్ల యడాగమము చేయఁబడివది.

సమాసములు:— రేనాటిచోళుల శాసనములలో రాజుల బిరుదావళులు దీర్ఘసంస్కృత సమాసములతో గూడియున్నవి.

| | | |
|---|---|---|
| 1. | సూఱున్డపిడుకు (గు) | — తిప్పలూరిశాసనము. |
| 2. | మాఱురాపిడుగు | — బూడిదగడ్డపల్లిశాసనము |
| 3. | వేనాన్డూళు | — మాలెపాడుశాసనము, |

శుద్ధ సంస్కృతపదములతో కలిసిన తెలుగుపదములుగల సమాసములున్నవి.

| | | |
|---|---|---|
| 1. | అరివరజమున్డు | — బూడిదగడ్డపల్లిశాసనము. |
| 2, | సాసనబిడిగల్లు | — S I I Vol. X No 598 |
| 3. | అతిశయరట్టగుళ్ళు | — చిలంకూరుశాసనము. |
| 4. | అపిమన గొరవలు | — S I I. Vol. X No. 594. |
| 5. | త్రికోణమడువు | — C. P No. 13 |

ఇట్లు రేనాటిచోళుల శాసనములకు సంబంధించిన విషయములను ఈ వ్యాసమున సంగ్రహముగా తెలుప నైనది. ఇంకను ఈరాజులకు సంబంధించిన శాసనములెన్నియో ప్రకటింపబడవలసియున్నవి. ప్రకటింపబడిన శాసనములవలన తెలుఁగుభాష ఆఱవ శతాబ్ది ఉత్తరార్థమునుండి వ్యాప్తిలో నుండుటయేగాక, తెలుఁగుభాష శాసనస్థమై తెలుఁగు కవిత, ఆవిర్భవించి విలసిల్లినది.

# శ్రీహర్షుని కవితా నైపుణ్యము

శ్రీ పి. శ్రీరామమూర్తి

శ్రీహర్షుడు గద్యమహాకవి భట్టబాణుని పోషకుడగు హర్షవర్ధనుడే యనుటలో సందియము లేదు. ఈరాజు మొదట స్థానేశ్వరమునను తరువాత కాన్యకుబ్జమునందు నుండి చిరకాలమీ భరతఖండమును పరిపాలించియుండెను (606–648 A. D.) మహా పరాక్రమశాలి. ఆర్యావర్తమునంతను జయించి నర్మదను దాటి దక్షిణమునకు వెళ్ళబోగా చాళుక్య చక్రవర్తి పులకేశి యడ్డగించెను. అందుమీదట నా మహారాజు దక్షిణమునకు తన రాజ్యమును విస్తరింప జేయు ప్రయత్నమును మాని పరిపాలనము సుస్థిర మొనర్చెను. హుయాన్‌సాంగాతని రాజ్యవైభవమును మనోహరముగ వర్ణించెను. ఇత్సింగను వాడారాజు బోధిసత్త్వుని చరిత్రను పద్యరూపమున వ్రాసెననియు నది నాట్యభంగిమలతోడను సంగీతముతోడను ప్రయోగింపబడినదనియు వ్రాసెను. ఆ కృతి శ్రీహర్షకృతమగు నాగానంద నాటకమే

2. శ్రీహర్షుడు కవిజనపోషకుడు భట్టబాణమహాకవి యాతని యాస్థానమలంకరించియుండెను. బాణుడు తన రాజపోషకుని యశస్సును హర్షచరితమను నాఖ్యాయికారూపమున నవినాశిగ నొనర్చెను. సూర్యశతకకర్తయగు ప్రౌఢకవి మయూరుడుకూడ నాతని యాస్థానముననే యుండెను. ధావకుడను మహాకవియు నీ రాజువలన ద్వితీయ పురుషార్థమును సమగ్రముగ సాధించెనని కావ్యప్రకాశాదులవలన తెలియుచున్నది. మాతంగ దివాకరుడను కవియు నాతని యాస్థానమునందుండి నటుల తెలియుచున్నది,

3. శ్రీహర్షుడు నిపుణుడగు కవియునై యుండెను. ఈయనచే విరచింపబడిన మూడు దృశ్యకావ్యములు చిరకాలము సహృదయ హృదయములను సుప్రతిష్ఠితములైనవి. అందు ప్రసిద్ధమగు ఉదయనుని శృంగారకథల నితివృత్తములుగ వ్రాసిన

నాల్గంకముల నాటికలు రెండు. ప్రియదర్శిక, రత్నావళి. బోధిసత్త్వుడగు జీమూతవాహనుని కథ నాధారముచేసికొని జీవకారుణ్యమును ప్రబోధించుచు వ్రాసిన యైదంకముల నాగానంద నాటకము మూడవది. పూర్వ కవిత్వచ్ఛాయల ప్రకటముగ తెలుపుచుండుటచేతను, కవిత్వ మపరిపక్వముగ నుటచేతను ప్రియదర్శిక శ్రీహర్షుని ప్రథమకృతిగ నెన్నబడుచున్నది. కవియొక్క బౌద్ధమతానుయాయిత్వమును స్ఫుటమొనర్చుచు మత సామరస్య సమన్వయములుగల నాగానందము చరమకృతియనియు, రత్నావళీనాటిక యీ మధ్యకాలమున విరచింపబడిన దనియు విమర్శకుల నిర్ణయము.

4. సరసకవిత్వమును సహృదయ హృదయంగమముగ రచించుటలో సిద్ధహస్తుడీరాజకవి. మొదటి రెండునాటికలయందును సర్వజనసమ్మతమగు శృంగార మభివర్ణింపబడినది. నాగానందమున శృంగారముకూడ వర్ణింపబడినను దయావీరరసము ప్రధానమై సర్వరసచర్వణావిశ్రాంతిస్థానమగు శాంతమున పర్యవసించుచున్నది. శ్రీహర్షుని దృశ్యకావ్య నిర్మితి కావ్యశిల్పమునకు గీటురాయి. ఈయన రచనలు సర్వప్రస్థానసమ్మతములగుటచే సార్వజనీనముగ చర్వణాయోగ్యములగుచున్నవి. అయిన కావ్య శిల్పమునగల చమత్కారజనకగుణముల యథాశక్తి పరిశీలింతము.

5. ఉదయనుని కథలు సుప్రసిద్ధములు. అవంతిదేశమున గ్రామవృద్ధులు నయితము ఉదయన కథాకోవిదులని కాళిదాసు వర్ణించియుండెను. కథా కోశమగు బృహత్కథ శ్రీహర్షుని కాలమున ప్రచారములో నున్నటు లనేకములగు నాధారములవలన తెలియుచున్నది. కథాసరిత్సాగరము, బృహత్కథా మంజరులలో ప్రియదర్శికలోని యితివృత్తమును బోలిన కథాభాగము లుపలబ్ధములగుచున్నవి. కావున వీనికి పైశాచీమూలమును బృహత్కథనుండియే శ్రీహర్షుడు ప్రధానకథాభాగమును స్వీకరించి తగు మార్పులతో రూపకనిర్మాణమున కుపక్రమించి యుండును. ప్రియదర్శికయందలి యంతర్నాటకము శ్రీహర్షుని యుపజ్ఞఫలితమే.

6. ప్రియదర్శికలో నాయకుడు ధీరలలితుడు. దక్షిణుడు. అనేకములగు నంశములతో ఈ నాటిక మాళవికాగ్నిమిత్రమును బోలియున్నది. సాంకృత్యాయని పండితకౌశికి ప్రతిబింబమే. నాయికను బంధించుటయు తత్సదృశమే. ఇటులనే నాయికను భ్రమరము బాధించుట శాకుంతలమునుండి గ్రహింపబడియుండును. కాని భావనాపటిమయందును కవిత్వపరిపాకమునను, నాటకశిల్పరచనయందును, పదగుంభనమునను, ఛందోవైవిధ్యమునను ఈనాటిక యపరిణతమై ప్రతిభాశాలియగు కవియొక్క ప్రాథమిక ప్రయత్నఫలితమని ప్రకటము చేయుచున్నది.

7. ప్రియదర్శికయందలి శ్రీహర్షకవితకుదాహరణముగ కొన్ని శ్లోకముల పరామర్శింతము. నాయికయగు ప్రియదర్శన సుందరవదనమును నాయకుడిటుల వర్ణించును.

*అయి విసృజ విషాదం భీరు భృంగాస్తవైతే*
*పరిమళరసలుబ్ధా వక్త్రపద్మే వసన్తి*
*వికిరసి యది భూయస్త్రాసలోలాయతాక్షీ*
*కువలయ వనలక్ష్మీం తత్కృత స్త్వాం త్యజన్తి.* II–8

అభిమానవతియగు రాణి రూపమెంత గుప్తమొనర్చినను ప్రకటమగుచునే యున్నదనుట.

*స్నిగ్ధం యద్యపి వీక్షితం నయనయోస్తామ్రాతథాపిద్యుతిః*
*మాధుర్యేఽపి సతి స్ఖలత్యనుపదం తేగద్గదా వాగియమ్*
*నిఃశ్వాసా నియతా అపి స్తనభరోత్కంపేన సంలక్షితాః*
*కోపస్తే ప్రకటప్రసాదవిధృతోఽప్యేష స్ఫుటం లక్ష్యతే.*
III–14

సూర్యాస్తమయమును రాజిటుల వర్ణించును.
'కామీ స్వతాం పశ్యతి'

హ్యాత్వా పద్మవనద్యుతిం ప్రియతమే వేయం
విన శ్రీర్గతా
రాగోస్మిన్ మమ చేతసీవ సవితుర్బింబేధికం లక్ష్యతే
చక్రాహ్వోహ్వామివ స్థితః సహచరీం ధ్యాయ
న్నలిర్వ్యాస్తతే
సంజాతాః సహసా మమేవ భువనస్యాప్యంధకారా
దిశః II–10

8. రత్నావళీనాటికకును మూలము బృహత్కథయే యైయుండును. ఈనాటిక యనేకవిధముల ప్రియదర్శికను బోలియున్నది. మొదటి విష్కంభమున యౌగంధరాయణుడు సాగరికనుగూర్చి చెప్పుట ప్రియదర్శికయందు కంచుకి వినయవసువుని భాషణముతో సమముగనున్నది. రెండునాటికలయందును ద్వితీయాంకముననే నాయిక తన ప్రేమ నభివ్యక్తము చేయును. మరియు కపటవేషధారణము, విదూషకుని సహాయము వారి యుక్తిని రాణి గ్రహించుట, నాయికను విదూషకుని చెఱయందుంచుట నాల్గవ యంకమున విదూషకుని విడిపించుట, రాజు నాయికను సంరక్షించుట. నాయికాప్రత్యభిజ్ఞానము, రాణి సంతోషముగ నాయికను తన ప్రేమభాగస్వామినిగా స్వీకరించుట యివి యన్నియు నుభయసాధారణములే. రత్నావళియందు యౌగంధరాయణుడు ఘటనల నడిపించుటలో విధాతృత్వమును స్వీకరించును. నాయికానాయకుల సమాగమమునకు ప్రయత్నము చేయును. ఇట్టుల రత్నావళి ప్రియదర్శికతో మిక్కిలి సామ్యముకలదియై యున్నది మరియు సమానమగు నితివృత్తముతో నాటికను నిర్మించుటలో కవికి ఆకథయందుకల మిక్కిలియగు మక్కువ విశదమగుచున్నది. అందుచే నాతడాపోలికగల కథను ప్రతిష్ఠితుడైన వెనుక పరిష్కరించి వ్రాసెనాయని తోచుచున్నది

9. రత్నావళినాటిక పద్యములందు నాలంకారికుల ప్రశంసల నందినది. నాటికాలక్షణముల రత్నావళి తీర్చిదిద్దినది. "పరిమ్లానం" మొ॥ II–11 పద్యము "కిం పద్మస్యరుచం నహన్తి" మొ॥ శ్లోకము లాలంకారికుల కుదాహరణయోగ్యములైనవి. రాజు వాసవదత్త ననునయించుట యీవిధముగ వర్ణింపబడినది.

ప్రసీదేతి బ్రూయా మిద మసతి కోపే న ఘటతే
కరిష్యామ్యేవం నో పునరితి భవేదభ్యుపగమః
న మే దోషోస్తీతి త్వమిద మపిచ జ్ఞాస్యసి మృషా
కిమేతస్మిన్ వక్తుం క్షమమితి న వేద్మి ప్రియతమే.
II–18

రాజు దాక్షిణ్యము - వాసవదత్తయందలి ప్రేమ యీ-క్రింది శ్లోకమున వర్ణింపబడినది.

సమారూఢా ప్రీతిః ప్రణయబహుమానా దనుదినం
వ్యలీకం వీక్ష్యేదం కృత మకృతపూర్వం ఖలు మయా
ప్రియా ముఞ్చత్యద్య స్ఫుట మసహనా జీవిత మసౌ
ప్రకృష్టస్య ప్రేమ్ణః స్ఖలిత మవిషహ్యం హి భవతి.
III–15

10. ఈనాటికలు రెండును శృంగారమును చిందించుచు కేవలము ప్రతిహేతువులగుచున్నవి. కాని నాగానందమున కవి ప్రేక్షకుల కొక విశిష్టసందేశము నందజేయుచున్నాడు. బౌద్ధమతపరమసిద్ధాంతమగు జీవకారుణ్యమును బోధించుట యీనాటక పరమప్రయోజనము. ఇందలి యితివృత్తము జాతక కథలలో ప్రసిద్ధిగనిన జీమూతవాహన బోధిసత్త్వుని చరిత్ర. ఈకథను బృహత్కథామూలముననే కవి గ్రహించియుండనోపును. కథాసరిత్సాగరమందలి కథకును ఈ నాటకకథకును గల యత్యంత సామ్యమీ ప్రతిపాదనను బలపరచుచున్నది.

11. నాగానంద మయిదంకముల నాటకము. ఇందు రెండు ప్రధానభాగములు కలవు. మొదటిది మలయవతీ జీమూతవాహనుల వివాహము. ఈభాగము మూడంకములలో నిర్వహింపబడినది. ఈకథాంశమ యనేకాంశముల నన్యకృతుల ఛాయలు కలిగియున్నది. ఇందు నాయకుడు ధీరశాంతుడు.

పితృభక్తిపరాయణుడు. ఈ నాటకమందలి మలయ సానువులు, గౌరీదేవి యాలయము, వీణావాదనలు - వీనివర్ణనలు కాదంబరియందలి వర్ణనల బోలియున్నవి. కాని నాయికాప్రాణత్యాగోద్యోగము రత్నావళి యందువలె సహజముగ లేకున్నది. మలయవతీజీమూతవాహనుల ప్రణయమును కవి యిట్లు వర్ణించెను.

*"అన్యోన్య దర్శనకృతః*
*సమానరూపానురాగ కులవయసామ్*
*కేషాంచిదేవ మన్యే*
*సమాగమో భవతి పుణ్యవతామ్." II-14*

ఇట్లనే సపోహాపర్ణనముకూడ నతిమనోహరముగనున్నది.

*"దృష్ట్వా దృష్టి మధో దదాతి, కురుతేనాలాప మాభాషితా*
*శయ్యాయాం పరివృత్య తిష్ఠతి బలా దాలింగితా వేపతే*
*నిర్యాన్తీషు సఖీషు వాసభవనా న్నిర్గన్తు మేవేహతే*
*జాతా వామతయైవ మేద్య సుతరాం ప్రీత్యై నవోఢా ప్రియా." III-4*

12. జీమూతవాహనుడు మిత్రావసువుతో పాటు మలయసానువుల పరిక్రమించుచు గరుడునిచే చంపబడిన నాగుల యస్థిసంఘాతముల చూచును. మిత్రావసువు చెప్పగా విషయమంతయు తెలిసికొని జీమూతవాహనుడు స్వశరీరదానముచే నొక నాగుని సంరక్షించినను తను ధన్యుడనగుదునని తలంచెను. ఆనాడు శంఖచూడుడను నాగునివంతు శంఖచూడుని తల్లి పరిదేవించుచుండును. జీమూతవాహను డాత్మార్పణచేసి సంరక్షించెదననిన శంఖచూడు డంగీకరింపక 'నావంటి క్షుద్రజంతువు లెందరేని జన్మించి మరణించుచున్నారు. కాని మీవంటి పరార్థదత్తశరీరు లెందరెచట నుద్భవించి'రనును. శంఖచూడుడు గోకర్ణక్షేత్రమున ప్రదక్షిణ మాచరింపవెడలును. జీమూతవాహనుడు పరార్థమై దేహత్యాగము చేయుటలో గల ప్రీతిని భావించుచుండును. ఆతడు మలయవతీసంశ్లేషమునకన్నను, మాతృమూర్తియంకముననుండు శయనమునకన్నను వధ్యశిలాసంస్పర్శను సుఖప్రదముగ భావించెను గరుడుడు వచ్చెను. అతడు తన మాంసమును తినుచుండ జీమూతవాహనుడు వ్యథను పొందకుండుటయేకాక ప్రహృష్టమనస్కుడై యుండెను. గరుడు డాశ్చర్యవశుడై తినుట నాపిన జీమూతవాహనుడు :

*"సిరాముఖైః స్యన్దత ఏవ రక్త*
*మద్యాపి దేహే మమ మాంస మస్తి*
*తృప్తిం న పశ్యామి తవాపి తావత్*
*కిం భక్షణా త్త్వం విరతో గరుత్మన్."*

గరుడు డామహాసత్త్వుని యూర్జితవాక్కులవిని "నేను నీ హృదయమునుండి రక్తమును గ్రహించి తిని కాని నీవు నీధైర్యముచే నా హృదయమునే హరించినావు!" అనెను.

ఇంతలో శంఖచూడుడు వచ్చును. అంత గరుడుడు తాను చంపినది మహాత్ముడు కరుణార్ద్రచేతస్కుడగు బోధిసత్త్వుడని తెలిసి తన పాపమునకు పశ్చాత్తప్తుడై యగ్నిప్రవేశముచేయ నిశ్చయించును. ఇంతలో జీమూతవాహనుని పితరులు వచ్చుచున్నారని తెలిసి గరుడుడు సముద్రమున పడవెంచును. అప్పుడు జీమూతవాహనుడు "పాపపరిహారము ఆత్మహత్యకా"దనును. గరుడుడు పితరులయొక్కయు మలయవతియొక్కయు పరిదేవితముల గని నరకానల జ్వాలావలీఢుడై యత్యంతదుఃఖము ననుభవించుచు పాపవిముక్త్యుపాయమును మరల నభ్యర్థించును. తండ్రియానతినొంది నాయకుడు-

*నిత్యం ప్రాణాభిఘాతాత్ ప్రతివిరమ*
*కురు ప్రాక్కృత స్యానుతాపం*
*యత్నాత్ పుణ్యప్రవాహం సముపచిను*
*దిశన్ సర్వసత్త్వే ష్వభీతిం*
*మగ్నం యేనాత్ర నైనః ఫలతి పరిణతం*
*ప్రాణిహింసాసముత్థం*
*దుర్గాధే వారిపూరే లవణపల మివ*
*క్షిప్త మన్తర్ హ్రదస్య॥* V-24

ఈ యుపదేశమును విని గరుడుడు సర్వప్రాణివధ నుండి విరతుడగును. జీమూతవాహను డుపరతు డగును. గరుడు డమృతముతెచ్చి జీమూతవాహనునే కాక పూర్వభక్షితులగు నురగుల నందరను ప్రత్యుజ్జీవితులజేయ వేడలును. మలయవతీప్రార్థన విని గౌరి ప్రత్యక్షమై జగదుపకారియగు జీమూతవాహనుని బ్రతికించును గరుడుడు స్వర్లోకమునుండి యమృతము వర్షించును. సర్వులు ప్రియము నొందుదురు.

13. కవిత్వముననేకాక రూపకశిల్పమునకు శ్రీహర్షుడు సిద్ధహస్తుడే మూలమందలి కథలను ప్రయోగయోగ్యములగు నాట్యవస్తువులుగ మార్చుటలో నాతడు చాల నైపుణ్యమును ప్రదర్శించెను. ప్రియదర్శికయందు ప్రియదర్శనా వత్సరాజుల ప్రణయకథతో దృఢవర్మ కథను, వింధ్యకేతు కళింగాధిపతులపై వత్సరాజు జయమును చాల మెలకువతో సంయోజించెను. దీని ఫలితముగ నాయకుని ధీరస్వభావము పరిపుష్టమైనది. ఇటులనే యంతర్నాటకము యుక్తియుక్తముగ నిబద్ధమైనది. కాని యీనాటికయందు దసంగతవిషయములును పెక్కులు కలవు. రత్నావళి యన్నివిధములను కవియొక్క పరిణతప్రజ్ఞను పరిస్ఫురత్ప్రతిభను నభివ్యక్తమొనర్చుచున్నది. ఇందలి వర్ణనము లెన్నియో నాయికా నాయకుల యవస్థలకు నిర్దుష్టోదాహరణములు. అటులనే లక్షణగ్రంథములయందలి నాటికాలక్షణములును రత్నావళిని మనసులో నుంచుకొనియే చేయబడినటుల తోచును పాత్రల ప్రాతిస్వికలక్షణములు పరిస్ఫుటములు. కథ చిన్నది యగుటచే పాత్రల యవస్థావైవిధ్యముల కవకాశములేదు. ఇక నాగానందమున కావ్యశిల్పము పరాకాష్ఠనందినది. అనిదంపూర్వముగ శాంతరసము దృశ్యకావ్యమున ప్రతిష్ఠితమైనది, పరమపురుషార్థము ప్రబోధితమైనది. విశ్వశ్రేయస్సు కావ్యప్రయోజనమైనది.

'శివ మస్తు సర్వజగతాం
పరహిత నిరతా భవన్తు భూతగణాః
దోషాః ప్రయాన్తు నాశం
సర్వత్ర సుఖీ భవతు లోకః॥'

# కాదంబరీ మహాకావ్య మధుర సందేశము

"మనిషిని మనిషికి సన్నిహితము చేయునదే మహాతత్త్వము"

డాక్టర్ యస్వీ జోగారావు

భావితాంతఃకరణ శిరోమణియగు భట్టబాణుడు వినిపించిన కాదంబరీ కావ్యకచ్ఛపీశ్రుతులు రసికాంత రంగముల ప్రతిస్పందనములు పొందునప్పుడందలి ప్రధానసందేశమునకు సద్యఃస్ఫూర్తి యేర్పడును. అదేమన రెండు నిండుమనసులమధ్య నేర్పడిన మధురబాంధవ్యమునకు జన్మాంతరమునను మరి తిరుగులేదనుట. ఇందులకు గీటునకువచ్చి గీర్వాణ సారస్వతసింహద్వారమున శిల్పమనోజ్ఞములగు బంగరు సాలభంజికలవలె నిలువగల పాత్రము లారుగలవు కాదంబరిలో. కపింజలుడు, పుండరీకుడు మహాశ్వేత, కాదంబరి. చంద్రాపీడుడు. పత్రలేఖ— ఈయారు పాత్రములందును అనుస్యూతముగ నొక స్నేహ సూత్రము లగించినాడు బాణుడు.

ప్రధానముగ ఈ ఆరుపాత్రముల అను బంధము ముత్తెరగులు. మహాశ్వేతాపుండరీకులదియును, కాదంబరీచంద్రాపీడులదియును స్త్రీ పురుషోచిత స్నిగ్ధశృంగారాత్మక పవిత్రప్రణయము. కాదంబరీ మహాశ్వేతలదియు, కపింజల పుండరీకులదియు సజాతీయ పరమస్నేహధర్మపథమునకు పరాయణము. పత్రలేఖాచంద్రాపీడుల దొక చిత్రమైన యనుబంధము, స్త్రీపురుషభేద మున్నను అపదక్షిణ మధురానుభవప్రసక్తి లేని పరమాదర్శప్రాయమైన పవిత్రబంధము.

అచ్ఛోద సరస్తీరమున పుణ్యశ్లోకుడు పుండరీకుని కర్ణావతంసమై "యమకర కాముకాభిసారిక" వలె నున్న పారిజాత కుసుమమంజరి పరిమళమును గ్రహించుటతో మనస్విని మహాశ్వేత ప్రణయజీవితమునకు ప్రస్తావన జరిగినది. పారిజాతముపై వ్రాలిన మధుకరమువలె అతని రూపముపై నాపె మనసు లగ్నమైనది మొదట. చూచినంతనే "అహో! రూపాతిశయ నిష్పాదనోపకరణ కౌశలస్యాన్విజాతా విధాతుః" అనుకొన్నది. చూపులతో నాతనిరూపు

నాపోశనము పట్టినది. ఆమెకు సాత్త్వికోదయము నైనది. తొలిచూపులోనే వలపు తొలకరించినది,

"చూచిన చూపునుండి యెదసొచ్చిన సుందరరూప
భావనారోచి బహిర్గమించె మనోహరమూర్తి
మరొక్కచూపుగా"

ఈ ఘట్టము ఘట్టమంతట శృంగార సంగీతముతో విలాస శైలూషి. మధురలాలసాలాస్య మంజీర శింజితములు వినిపించినది. ఎంత ముగ్ధలకును హృదయాలయమున ప్రణయప్రతిష్ఠ జరిగినంత "అనేక సురత సమాగమ లాస్యలీలోపదేశోపాధ్యాయు" డైన మకరకేతనుడే వివిధవిలాసముల నుపదేశించుననుసత్యమును విశదీకరించినాడు బాణుడు. ఆర్ద్రై అమె సవ్యాజముగా సాకూతముగా పారిజాతకుసుమమంజరీ ప్రశంసాత్మకముగా పుండరీకునిగాక ప్రక్కనున్న కపింజలుని పలుకరించినది పుండరీకుడును ఇంగితజ్ఞుడు గనుక "అయి కుతూహలిని! కిమనేన ప్రశ్నాయాసేన? యది రుచిరసుం బిపరిమళా గృహ్యతా మియం" అని ఆ మంజరి నామెకు కర్ణావతంసముగా జేసేసినాడు. అవతంసస్థానమున ఆమెకు సద్యః పులకోద్గమము, అతనికి ప్రకంపితాంగుళులనుండి ఇక జపమేటికి, తపమేటి కనునట్లు జపమాలిక జారి పడుటయు నైనది. ఆ ప్రణయ ముభయప్రస్థితమైనప్పు డొక్కస్థాయిలో ఆలపితములైన రాగతానముల వలె ఆ హృదయస్పందనములు సమానముగా నుండుటను భావసూక్ష్మమిట సమ్యగున్మీలితము ఆ జారి పడిన అక్షమాలికను తీసి అమె యేమిచేసినదని! అతని చేతికిచ్చుటకు మారుగా తన మెడలో వేసికొన్నది. చూచితిరా అవతలి మనసు ఆసక్తమైనదని గ్రహింపగనే ఇవతలి మనసున కెంతచనవు నెసకొల్పినదో ప్రణయము! ఇంతలో పాప మిలుచేరు వేళయైనదని తల్లికడనుండి కబురువచ్చినది. ప్రథమాంకుశపాతము పొందిన కరిణివలె మహాశ్వేత అటు తిరుగవలసి వచ్చినది. కపింజలకర్శితుడైన పుండరీకు డపుడామె యెదుట చిత్రముగా నొకవాలకమువైచి చక్కని యొక అభినయము చేసినాడు— "అక్షమాల నిక్కపెట్టక అడుగు వేయరా" దని ఆజ్ఞాపించినాడు. అపు 'డలీకకోపము'తో నతని ముఖము "ప్రయత్నవిరచిత భీషణభ్రుకుటీ భూషణ" మైనది కాని "చుంబనాభిలాష స్ఫురితాధర" యైనదట! పట్టిముని పాపని చిట్టిమనసునగూడ ప్రణయరక్తి యెట్టి రసవ్యక్తి నవధరించినది!

ఇక మహాశ్వేత అంతఃపురమున అడుగు పెట్టినదే కాని ఆమెపడిన యవస్థ వర్ణనాతీతము. "కిం యాగతాఽస్మి? కిం తత్రైవ స్థితాస్మి? కిం పరివృతాస్మి? కి మేకాకి న్యస్మి? కిం జాగర్మి? కిం సుప్తాస్మి? కిం రోదిమి? కిం నరోదిమి? కిం దుఃఖ మిదం? కిం సుఖమిదం? కిం దివసఏషః? కిం నిశేయం? కాని రమ్యాణి? కాన్యరమ్యాణి? కిం శృణోమి? కిం పశ్యామి? కి మాలపామి?" ఇట్లనేక ప్రశ్నలామెను వెన్నాడుచున్నవి. క్రమముగా నదియొక అద్వంద్వమైన యవస్థగా, జగమంతా తన్మయముగా, నదియొక మహత్తపోయోగసమాధిగా పరిణమించినది. విరహము స్వారి చేయునపుడు ప్రణయము పరుగులు వారును.

అటు మహాశ్వేత ప్రస్థాన మది పుండరీకుని పాలిటికి మహాప్రస్థాన మైపోయినది. ఆ యవస్థలో "అన్యమివ, వాపృష్టపూర్వమివ, వాపరిచిత మివ, జన్మాంతర మివోపగతం,రూపాంతరేణేవ పరిణతం, ఆ విష్టమివ, మహాభూతాధిష్ఠిత మివ, గ్రహగృహీతమివ, హోన్మత్తమివ, ఛలితమివ, వాంధమివ, బధిరమివ, మూకమివ, విలాసమయమివ, మదనమయమివ పరాయత్తచిత్తవృత్తిం, పరాంకోటి మధిరూఢం మన్మథావేశస్య, అనభిజ్ఞేయపూర్వాకారం" అన్నట్లున్నాడట పాప మాయన కపింజలుని గుండె కూడ కరగిపోయినది. మొదట వారి యనుబంధము నధిక్షేపించినవాడు తానై మహాశ్వేతకడకు మిత్రభిక్ష నర్థింపనేగినాడతడు. ఆ పుండరీకుని విరహ విహ్వల

స్థితి అంతపని చేయించినది. ఆవార్త మహాశ్వేత గుండెలో నెగళ్లు పెట్టినది, కాని తా నంతఃపురము విడిచి వెంటనే బయలుదేరుట కవకాశములేదు. అర్ధమ రేయి "సర్వతిరస్కార్యయ మస్మత్ప్రకారాత్" అని తాను సంభావించుకొను ప్రియసఖి తరళిక తోడురాగా ఒంటరిగా బయలుదేరినది మరి పరిజన మెవ్వరును వెంటరారు. "ప్రియతమాభిసరణ ప్రవృత్తస్య జనస్య కిమివ స్పృశ్యం బాహ్యపరిజనేన... మారో హి శరాసనాసక్త సాయకోఽనుచరతి కుసుమాయుధః." అని అంతఃపరిజనుడైన మన్మథుడు నిరంతరము సజ్జ కార్ముకసన్నద్ధుడై యుండగా అభిసరణావసరము లందు బాహ్యపరిజనావశ్యకత యేమి? అను నొక కాముకధర్మము నిట వాత్స్యాయన వంశసంభవుడు బాణుడు సందర్భోచితముగా అనుసంధించినాడు.

మహాశ్వేత వచ్చినది కాని యేమిలాభము? అప్పటికే పుండరీక విరహాగ్నిగుండమునకు కపింజలుని గుండె గుగ్గిలమైపోయినది. ఆ చితార్చిష్మచ్చిట్చి టార్పటులవలె అతని రోదనధ్వనులు మిన్ను ముట్టి నవి. ఇక మహాశ్వేతసంగతి చెప్పవలెనా? పాపము అవర్షాశనిపాతమువలె ప్రియవయస్యునితో సంయోగ మునకుముందే వియోగము ప్రాప్తించిన దామెకు అమె యేడ్చి యేడ్చి యెదవ్రీలి వెంటనే మరణైక నిశ్చయ యైనది. కాని పుండరీకుని ప్రాణములు గ్రహించిన మహాపురుషుడె (చంద్రుడు) ఆమెకు పునస్సంగమప్రత్యాశ కల్పించి ఆ యుద్యమము నుండి వారించినాడు. నాటినుండి విరహదీక్ష పట్టి నట్లు, విరహమే విశ్వరూపము ధరించినట్లామె ప్రతి పన్ను పాశుపతవ్రతయై "మదనదేహనిమిత్తం హర ప్రసాదనార్థ మాగృహీత హరారాధానాం రతిమివ" సిద్ధాశ్రమమున శివసన్నిధానమున అఖండ నిర్వాత దీపకళికవలె, అనాఘ్రాత పారిజాత కోరకమువలె, అసావేరి రాగమువలె కాలము గడుపుచున్నది. ఆమె వియోగము చూచి చూచి నెచ్చెలియైన తరళిక "దుఃఖసబ్రహ్మచారిణి" యైపోయినది. ఆ వియోగ కథ విని "అహమ స్యాసమర్థః శ్రోతుమ్" ('మరి వినలేను') అన్నాడు సహృదయుడు చంద్రాపీడుడు. ఇక్కడ బాణుడు "గతించినవైనప్పటికి సుహృజ్జన దుఃఖగాథలు పునఃప్రవర్తితములైనప్పు డనుభవ సమానమైన వేదన కలిగించు" నని యొక సహృద యత్వమర్మము నుట్టంకించినాడు చంద్రాపీడపర ముగ నామె నాశ్వాసించుమ తాను కంటతడిపెట్టిన మహాబాహుడతడు కథ విని సెజ్జకు మేనుతార్చి పునః పునః మహాశ్వేతావృత్తాంతమునే భావమున అవృత్తము చేసికొన్నాడట! అయితే కప్పుడే అవాప్తురాలైన తరళిక ప్రస్తికి వచ్చినంట! వెంటనే ఆ "దుఃఖసబ్రహ్మచారిణి" తరళిక యెక్కడికి వెళ్ళినదని ప్రశ్నించును. కథ చెప్పి పురాస్మృతులు త్రవ్వుకొని త్రవ్వుకొని కలసిన మనసుతో అత్యంతదూరమున గవునెనలోని వీణవలె నిదురించుచున్న మహాశ్వేతను చూడగనే ఆయన కెందుకో హఠాత్తుగ తన అప్తులు వైశంపాయనుడును, పత్రలేఖయు స్ఫురణకు దగిలిరి. స్నిగ్ధహృదయ గోచరమైన ఒక మృదుభావమునకు తాదాత్మ్యయ సక లైకతానమైన వ్యాప్తి యేర్పడునెనుట యిచట పర మార్థము. మరి యా చంద్రాపీడు డెవడు? మనః కారకుడైన చంద్రుని యవతారము, పుండరీకుని ప్రాణములు హరించినవాడు చంద్రుడే. వైశంపా యను డెవడు? పుండరీకుడు, పత్రలేఖ? రోహిణి ప్రకృతము చంద్రాపీడునకు పత్రలేఖవలె మహా శ్వేతకు వైశంపాయనుడు భోగదూరుడుగదా

ఆ మహాశ్వేత కథ ముగిసినంత సాయంతన మైన దనుచు బాణుడు ఏదో పట్టి పొడిమాటలుగా పడమట సూర్యు డస్తమించెనని చెప్పుట కాక "శ్రుత మహాశ్వేతావృత్తాంతోపజాతశోక ఇవ సముత్సృష్ట దివసవ్యాపారో రవి రపి భగవా నధో ముఖతా ము యాసీత్" అనగా మహాశ్వేత వృత్తాంతము వినుటవలన నేర్పడిన విషాదముచే దివసవ్యాపారము సజ్జ

గించినవాడువోలె సూర్యభగవానుడుకూడ అధోముఖుడయ్యెను — అని చెప్పుటతో కర్మసాక్షికిసూడ సహృదయత్వ మారోపింపబడినది. అట్లు సూర్యచంద్రులిద్దరిలోను సానుభూతిస్ఫురణ మేర్పడిన దనుటలో అమె విరహగాథ యెంతటి వేదనాస్పదమైనదో తెలియగలదు. అమె వివాహబంధ మేర్పడకయే ప్రియుడు దివంగతుడైనను అతనిమీదనే మమకారము పెంచుకొని నిర్భరయౌవనముచేగూడ నిర్వికారపవిత్ర శిష్యనిర్విశేషముగ ఉపాసింపబడుచు కాలము వెళ్లబుచ్చుచున్నదనుటలో మంత్రప్రేరితమైన వివాహబంధమున కంటె మనఃప్రేరితమైన రాగబంధమే దొడ్డదని కవి ప్రవచించినట్లైనది. ఆ సందర్భమునందే "అవ్యాజరమణీయమైన ప్రేమ దీర్ఘకాల వియోగమును భరింపలే" దనియు "ఒక జన్మలో సమాగమ మేర్పడిన దనగా అది జన్మాంతర సహస్రవిరహానుభవఫలిత" మనియు నిక్కపుసూక్తులు నిక్షేపించినాడు బాణుడు.

మహాశ్వేతవెంట చిత్రరథాంతఃపురమున కరిగినాడు చంద్రాపీడుడు. అక్కడ కాదంబరిని చూచినంతనే "శేషేంద్రియాణ్యపి మే వేధసా కిమితి లోచనమయాన్యేవ న కృతాని ?" అనగా బ్రహ్మగారు తన మిగిలిన యింద్రియములనుగూడ నేత్రమయములుగా, చేయనందుకు మిక్కిలి వగచినాడు. ఒకనిమిత్తముగా పెండ్లిచేసుకొననని శపథముపట్టికూర్చున్న యామెకును మనసు ప్రసవించి సద్యోవ్యతికృత సర్వసాత్త్విక భావమైనది. ఇది యీ రసికచకోరముల సౌందర్యచంద్రికాస్వాదానివేశమును తెలుపుచున్నది. మహాశ్వేత కాదంబరి కాతని పరిచయము చేయుచు అతని వృత్తాంతమును వివరించి, యోగ్యతలు విశదీకరించి - "యథామయి తథాఽత్రాపి వర్తితవ్యమ్, ఏషతే మిత్రంచ, బాంధవశ్చ, పరిజనశ్చ" అని అమెచేతనే తాంబూల మిప్పించి వారి ప్రణయజీవితమునకు తాను ప్రస్తావన నడపినది. తదుపరి కాదంబరి ప్రీతిసూచకముగా ఒక హారము నభిజ్ఞానముగా తన కనుగ్రహించినపుడు "మహాశ్వేతా చరణారాధన తపఃఫలమిదం" అనుకొన్నాడు చంద్రాపీడుడు. అమె తన సమ్ముఖములోనే మధురవేదినా మదిరాపానము చేయుచున్నపుడు "ఇచ్ఛామి దేహదానేనాపి స్వస్థా యత్రభవతీం కర్తుం" అని అభయమిచ్చినాడు (దేహదానము చేసినైన అమెను స్వస్థురాలిగా చేయగోరుచున్నాడట మహానుభావుడు!) ఆ ప్రణయ మెంత సరసత్వమునైన అనుగ్రహింపగలదు.

పత్రలేఖను కేయూరకుడు—"దేవస్య చంద్రాపీడస్య ప్రసాదభూమిరేషా పత్రలేఖానామ తాంబూలకరంక వాహినీ" అని పరిచయము చేసినప్పటి నుండి కాదంబరి అమెయెడల ఎంతొ నెయ్యము నెరపినది. తమ వల్లభుల కభీష్టములగు సర్వవస్తువులందును తమకుగూడ ఆత్మీయతాభావ మేర్పడుట సహృదయనైజము. అట్లే మదలేఖా తమాలికా కేయూరకాది కాదంబరీ పరిజనమునందు చంద్రాపీడుడును బద్ధాదరుడు. అతడు రాజధానికి మగుడినంత అమె పడిన యవస్థ యింతయు నంతయునుగాదు. చంద్రాపీడునకు పత్రలేఖచే పంపిన సందేశమున ప్రణయార్ద్రము, వినిహ సురభిళమునగు నామె సుమనస్త్వమున కక్షరాకృతి యేర్పడినది. కాదంబరీ సందేశమును గొనివచ్చినదన్న సంతోషముతో చంద్రాపీడుడు పత్రలేఖ నమాంతము కావిలించుకొన్నాడు. ఆ వల్లమాలిన మక్కువ యట్టిది.

మహాశ్వేతా పుండరీకులందు మొదట మహాశ్వేతయు కాదంబరీ చంద్రాపీడులందు మొదట చంద్రాపీడుడును ప్రణయోత్సవ ప్రారంభులైరి. ఏమైనను నల్వురికి నల్వురును బహిరంత స్సౌందర్యములుగల ప్రేమికులు జీవితాంతము ప్రణయమే ప్రాణశ్వాసముగా బ్రదికినవారు. కవులు, ప్రేమికులు, సుమ్మెత్తులు నొక్కకోవలోనివా రననట్లు యున్నది బాణుని నిరూపణమును. స్వాదు కాదంబరీ సౌందర్యగాంధర్వగంధిలమైన చంద్రాపీడుని యవస్థ– "స్వయ

యత్నాని నానేకచింతా శతాకులా కవి మతి రిన తర లితా ఎతెంచిర్వోత్సేకతే" అన్నట్లున్నది. ఉండి యుండి పుండరీకుడు ప్రణయకవిత్వములో పడినాడు. మహాశ్వేత వినిమీటి విరహగాంధర్వము నాలపించి నది. కాదంబరి ఇందురోహామదిరామదోన్మత్తయై పోయినది. (కాదంబరి తల్లిపేరు మదిర. మదిరా కాదంబరీ శబ్దము లించుమించు సమానార్థకములు. కాదంబరి శబ్దమునకు సరస్వతి అనియు వేరొక యర్థముగలదు. అదియు బాణుని కావ్యముపట్ల సార్థకమగును. కాని మధురాసవ నామసామ్యమున మదిరయెడల కాదంబరికిగల యౌరసత్వమువలె ఆ మధురప్రకృతి యామెకు స్వభావసిద్ధమనియు మనము గ్రహింపవలెనని కవి యుద్దేశము కావచ్చును )

ఇట్లు మహాశ్వేతా వృత్తాంతమునను, తత్రాపి కాదంబరీ వృత్తాంతమునను సౌందర్యము, శృంగా రము, ప్రణయము, సహృదయత మొదలగు మహో త్తమమనఃప్రసాధన ప్రాయములైన · భావవ్యవస్థ లను గురించియు, ప్రణయప్రస్థములైన హృదయము లపై విరహము నెరపెడి ప్రభుత్వమును గురించియు మనకు చక్కని సందేశము లందజేసినాడు మహాకవి.

ఇక కేవలస్నేహవిషయము -- కాదంబరీ మహాశ్వేత లొక విపంచిపై వినిపించిన రెండు మధురస్వరములు. ఒక కంచములో తిని యొక మంచముపై పరుండిన చిఱుతకూకటి నాటి తఱు సంటి కూరిమి వారిది. "కాదంబరి నా రెండవ హృదయ" మని కంఠోక్తిగా చెప్పినది మహాశ్వేత. మహాశ్వేత యవస్థ నెరిగి "నాహం కథంచిదపి సఖో కాయాం మహాశ్వేతాయా మాత్మనః పాణిం గ్రాహ యిష్యామి" అని భీష్మించుకొని కూర్చున్నది కాదం బరి. మహాశ్వేత నచ్చజెప్పినచో తమ పుత్రిక పెండ్లి చేసికొనవచ్చునని యాసపడి యామెకు కబు రంపినారు తల్లిదండ్రులు. ఆమె కాదంబరికి వెంటనే పెండ్లి కమ్మని కబురంపినది. అందులకు చాల నొచ్చుకొన్నది కాదంబరి. తన ప్రతిసందేశమున "సుహృద్దుఃఖ ఖేదితే హి మనసికైవ సుఖాశా? (ఆప్తుల కష్టములకు కలిగిన మనస్సున సుఖాశ యెక్కడిది?) దివసకరాస్తమయ విధురాసు నలినీషు సహవాస పరిచయా చ్చక్రవాక యువతి రపి సమాగమసుఖాని పరిత్యజతి, కిముత నార్యః?" (రవి విరహ మనుభ వించు పద్మములతో సహవాసపరిచయముగల దగు టచే చక్రవాక యువతికూడ సమాగమ సుఖములను పరిత్యజించుచున్నదనగా ఇక స్త్రీల సంగతి చెప్పెడి దేమి ? అనగా దానివలె నిదియు ప్రకృతిసిద్ధమని ధ్వని) అని తన మనసు నామె కనులముందు బెట్టి నది. అంత మహాశ్వేత "యథార్థ మాచరిష్యామి" అని స్వయముగా బయలుదేరినది. ఆ గంధర్వలోక మతిమాత్ర మనోజ్ఞ మవశ్య దర్శనీయమని చెప్పి చంద్రాపీడునిగూడ తోడ్కొనిపోయినది. కాదంబరీ చంద్రాపీడులందు తనకొక అనురూప్యము స్ఫురించి, ఆతనిజూచిన కాదంబరి తప్పక వలచి వరింపగల దను ప్రత్యయముతోడనే ఆమె యిట్లు చేసియుండును. అతని యోగ్యతలు పూసగ్రుచ్చినట్లు వివరించి కాదం బరి మనసాతనిపై లగ్నమగునట్లు చేసినది. అతని కామె సంగతి యంతకుముందే చెప్పినది వారి ప్రణయ జీవితమునకు తా నంకురార్పణము గావించి పుణ్యము గట్టుకొన్నది. తన ప్రియసఖి కాదంబరియు తనవలె నిరాలంబయు, సుఖవిదూరయు కాకూడదని ఆమె అభినివేశము. ఆమె తన చెలికత్తె తరళికనుగూడ "న వ్యతిరిక్తేయ మస్మచ్ఛరీరాత్" అని సంభావించు చున్నదిగదా. సహృదయుడైన చంద్రాపీడుని తన కకారణ బంధువుగను, తన ప్రియసఖి కాదంబరికి తగిన వరునిగను పరిగణించినది. ప్రియుని వయ స్యుని కపింజలుని కేటికోల్పెత్తినది, ఆ మహేశ్వరి మహాశ్వేత డెందపుదేవళమున కుంభగతప్రదీపకళిక వలె వెలుగుచున్న స్నేహజ్యోతి అందుకొన్నవారికి హారతియే.

చెలికారము పేరు చెప్పునరికి సంస్కృత వాఙ్మయమున సుగృహీతనాముడు కపింజలుడు స్ఫురించును. అజిహ్మబ్రహ్మచర్యాశ్రమమున విద్యా పీఠమున వీరమఠముమైకొని భామినుల శషభిష లకు ససేమిరా చలించని బాలస్థాణు వతడు. మహా శ్వేతనుజూచి మోహపరవశుడై జపమాలికను జార విడిచిన మిత్రుడు పుండరీకుని "సఖే! పుండరీక! నైత దనురూపం భవతః క్షుద్రజనక్షుణ్ణ ఏష మార్గః" అని గద్దించినాడు, ఆ వెట్టిబాగుల మిత్రుడు విరహ విధుర హృదయుడై యొకించుక సేపు కనబడకపోవు సరికి అడవులు మడువులు గాలించినాడు. ఎట్టకేల కొకచో కన్పించినాడు పుండరీకుడు గాని మదనా తురుడై మ్రగ్గుచున్నాడు. కపింజలుడెన్నో హితోప దేశములు చేసినాడు; లాభము లేకపోయినది. శిశిరోప చారములు చేసినాడు లాభము లేకపోయినది. మిత్రుని ప్రాణములు కడబట్టుచున్నవి. "అన్యా గతి ర్నాస్తి" యని మహాశ్వేతకడకు బయలుదేరినాడు. "ప్రాణ పరిత్యాగే నాపి రక్షణీయాః సుహృదసవః" అన్నది. యతని పూనిక. ఆమెతో అతని సమాగమ మొకటి కాదంబరిలో మిక్కిలి సుస్మితమైన సన్నివేశము. "రాజపుత్రి! కిం బ్రవీమి? వాగేవ మే నాభిధేయ విషయ మవతరతి త్రపయా" అని యెత్తుకొని యెట్టిటో విషయము సవిస్తరముగ నివేదించి, "తద్గచ్ఛామి, సర్వాభిమత సుహృత్ప్రాణం రక్షార్థమ్, అయ ముపరచితోంజలిః, ఏష మే పరమో విభవః" అని సమాధానముకొరకుగూడ ఎదురుచూడక గిరుక్కున మరలివచ్చినాడు.

పరిజనమును కనుమొరగి అంతఃపురమునుండి మహాశ్వేత వచ్చునరికి అర్ధరాత్రమైపోయినది. అప్పుడే పుండరీకునిమనసు మహాశ్వేతయందును, అసువు లచ్చపు వెన్నెలయందును లీనమైపోయినవి. అవ తల కపింజలుడు-"హా హతోఽస్మి! హా దగ్ధోఽస్మి! హా వంచితోఽస్మి! దురాత్మన్! మదనపిశాచ! పాప! నిర్ఘృణ! కిమిద మకృత్యం మనుష్ఠితమ్?.... మహాశ్వేతే! దుర్వినీతే! కి మనేన తేఽపకృతమ్? ఆ పాప దుశ్చరిత! చంద్ర చండాల! కృతోఽసి ఇదానీమ్, అపగత దాక్షిణ్య! దక్షిణానిలహతక! పూర్ణాస్తే మనోరథాః....హా ధర్మ! నిష్పరిగ్రహోఽసి. హా తపః! నిరాశ్రయ మసి, హా సరస్వతి! విధవాఽసి... సఖే! న శక్నోమి భవతా వినా క్షణ మనస్థాతు మేకాకీ. కథమపరిచిత ఇవాదృష్ట పూర్వ ఇవాద్య మా మేకపదే ఉత్సృజ్య ప్రయాసి?....కథయ త్వదృతే క్వగచ్ఛామి? కం యాచే? కం శరణ ముపైమి? అంధోఽస్మి సంవృత్తః, శూన్యా మే దిశోజాతాః. నిరర్థకం జీవితం, అప్రయోజనం తపః, నిస్సుఖాశ్చ లోకాః..." అని చేయుచున్న ఆర్తనాదములు శబ్ద గుణమును బహుధా శకలితము చేయుచున్నవి. తదుపరి మహాశ్వేత సహగమనమును కుద్యుక్తురాలగు చుండగా ఆకసమునుండి చంద్రుడామెను వారించును. అంతలో కపింజలుడు కచ్చుబిగించి "నా సఖుని ప్రాణము లపహరించి ఎక్కడికేగెదవో చూచెదగాక" అని ఆకసమున కెగసి యాతనిని వెంటదగులును. అదీ ఆ మహాత్ముని స్నేహశీలత! అవ్యాజరమణీయ మది. అతడు దృఢవ్రతుడే కాని సమయము వచ్చు నపు డాతనికి స్నేహసూత్రమే యజ్ఞోపవీతము కంటె పరమము పవిత్రమునైనది "విపత్తిసౌఖ్యసదృశ క్రియు" డాతడు, మాటదురుసుకాని మనసుమెత్తని వాడు మహానుభావుడు. మిత్రలోకమున మింటి దీపమై వెలుగొందువాడు.

ఇక స్నేహము విషయమున చంద్రాపీడుని సంగతి: అత డుత్తమ మనస్వి. అసలు మనఃకారకు డైన చంద్రుని యవతారమే యతడు. ఎదగల యెల్ల వారికి నతనితోడి పరిచయ మచిరకాలమున పరమ స్నేహముగా పరిణమించును. వైశంపాయను డెట్లును బాల్యమిత్రము. కాదంబరి సరేసరి అతని స్నిగ్ధ హృదయ శివశిరశ్శేఖరశశిరేఖ యామె. ఆమె పరిచారకలు నతనికి పరమాప్తులు. మహాశ్వేత

అతనినిగూర్చి కాదంబరితో "ఏష చ దర్శనాత్ప్రభృతి ప్రకృత్యా మే నిష్కారణబంధుతాం గతః, పరిత్యక్త సంగ్రహసురా మపి మే సవిశేషైః స్వభావ సరళైర్గుణై రాకృష్ట చిత్తవృత్తిం వర్తతే. దుర్లభో హి దాక్షిణ్యపర వశో నిర్నిమిత్తమిత్ర మకృత్రిమహృదయః" అని యుద్ఘాటించినది.

అయితే పత్రలేఖతోడి యాతని యనుబంధ మపూర్వ మద్భుతము. కాదంబరి మొత్తముపై, కాదు కాదు, సంస్కృత వాఙ్మయములోనే ఒక చిత్ర మైన పాత్ర పత్రలేఖ. శరీరస్పర్శ ప్రసక్తిలేకుండ స్త్రీ పురుషులమధ్య స్నేహస్థితి యెంతమేరకు సాధ్యమో ఆ సరిహద్దుపై చంద్రాపీడునిపజ్జ వినయగర్వముతో నిల్చిన పాత్ర మామె. పోనీ అందములేని దందమా- అమె రాజపుత్రి. "మహానుభావాకార" "అహో! మానుషీషు పక్షపాతః ప్రజాపతేః" అని కాదంబరి సన దున్నది యామెకు. చంద్రాపీడునకు "ప్రకృతి వల్లభ" అని చెప్పబడినది. అతని కీ అపూర్వ సహచరిని తల్లి యప్పగించినది. "పత్రలేఖా తు తతః ప్రభృతి దర్శనేనైవ సముపజాత సేవారసా, న దివా, న రాత్రౌ, న సుప్తస్య, నాసీనస్య, నో త్థితస్య, న భ్రమతో, న రాజకులగతస్య ఛాయేవ రాజసూ నోః పార్శ్వం ముమోచ" అనగా నాడు మొదలామె చంద్రాపీడ దర్శనమాత్రముననే సేవానందము పొం దుచు, పగ లనక రే యనక సర్వకాల సర్వావస్థ లందును ఛాయవలె అతనిని కనిపెట్టుకొని యున్న దట. మూర్తీభవించిన సేవాధర్మ మామె. పేరిన స్నేహభావ మామె. కాదంబరీ చంద్రాపీడుల మధ్య ప్రణయానుబంధమునకు మనసిజుడు వ్రాసిన పత్ర మామె

కాని కాదంబరీరసజ్ఞులలో అగ్రగణ్యుడైన విశ్వకవి రవీంద్రుడు పక్షపాతకలుషితమైన అంధత వలన కృపణుడై పత్రలేఖపాత్రను సమ్యగున్మీలితము చేయక అమెలో "ప్రణయతృష్ణార్తము, చిరవంచితము" నైన యొక స్త్రీ హృదయ మున్నట్టే గుర్తింపక యుపేక్షించినాడని బాణునిపై నొక యభాండము వైచినాడు. అవిచారమూలక మిది. కవి యుద్దేశించి నంతవట్టు ఆ పాత్రతత్త్వపరమార్థము నాద్యంతము రవీంద్రుడు గుర్తింపలేదని చెప్పవలసియున్నది. ఇది సాహసోక్తికాదు. నగ్నసత్య మిటు చూడుడు :

చంద్రాపీడున కాతని తల్లి పత్రలేఖ నేమని యప్పగించినది ?

"సా మయా దుహితృనిర్విశేష మియంతం కాల ముపలాలితా సంవర్ధితా చ, తదియ మిదానీ ముచితా భవత స్తాంబూలకరంకవాహినీతి కృత్వా మయా ప్రేషితా, న చాస్యా మాయుష్మతా పరిజన సామాన్యదృష్టినా భవితవ్యం, బాలేవ లాలనీయా, స్వచిత్తవృత్తి రివ చాపలేభ్యో నివారణీయా, శిష్యేవ ద్రష్టవ్యా, సుహృదివ సర్వవిస్రంభేష్వభ్యంతరీకర ణీయా, దీర్ఘకాల సువర్ధిత స్నేహతయా స్వసుతాయా మివ హృదయ మస్యా మస్తి మే"

అనికదా అమె యాదేశము. తన తల్లి "స్వసుత"వలె చూచుకొను వ్యక్తి తనకేమి గావలెను? చెల్లెలి వరుసగదా. అస లా పత్రలేఖ యెవ్వతె? రోహిణి, నిత్యానపాయిని యగు చంద్రుని ప్రణయిని. చంద్రుడు శప్తుడై చంద్రాపీడుడై భువి కవతరించి నాడు. అమెయు అతని నెడబాయలేక పత్రలేఖ యైనది. (పత్రలేఖ యనగా అలంకారప్రాయమైన దని యర్థము). అయితే ప్రియుడు శాపగ్రస్తు డగుట వలన తన కీ జన్మలో భోగబాహ్యుడు. అందులకే అట్టి వట్టి యనుబంధము.

చిట్టచివరి కామె చిత్రచరిత్రము కాదంబరి యుత్తరభాగమున నిట్లు విస్తృతమైనది. పత్రలేఖ యేమైనదని చంద్రాపీడుని ప్రశ్నించినది కాదంబరి. "చంద్రాపీడమూర్తి శ్చంద్రమాః తచ్ఛ్రుత్వా అర్దితాం తరాత్మా ప్రత్యవాదీత్—ప్రియే! కుతో౽త్ర? సా ఖలు మద్దుఃఖదుఃఖితా రోహిణీ శప్తం మా ముపశ్రుత్య,

కథంత్వమే వైకాకీ మర్త్యలోకనివాసదుఃఖ మనుభవసి ఇత్యభిధాయ, నివార్యమాణాపి మయా ప్రథమమేవ మచ్చరణపరిచర్యాయై మర్త్యలోకే జన్మ గ్రగహీత్''

కాదంబరీ తు తచ్ఛ్రుత్వా రోహిణ్యా స్త్రథోదారతయా, మహానుభావతయా స్నేహలతయా, పతివ్రతతయా, పేశలతయా చ విస్మితహృదయా, పరం లజ్జితా న కించిదపి వక్తుం శశాక.''

లోకమున కొక లోకోత్తరమైన, పరమ పవిత్రమైన, అపూర్వ రమణీయమైన, నాన్యతో దర్శనీయమైన, ఆదర్శప్రాయమైన స్నేహధర్మోపదేశము చేయుటకు, ప్రణయ సందేశమును వినిపించుటకునై కోరి యీ పత్రలేఖ పాత్రజీవితసూత్రము నిట్లు పన్నినాడు బాణభట్టారకుడని గ్రహింపవలసియున్నది. కాదంబరీజ్యోతికి మట్టుననున్న నిర్భరస్నేహపాత్ర మీ పత్రలేఖ,

లోకోత్తర చరితములగు కొన్ని పాత్రముల యేకత్ర సన్నివేశము నింత మనోజ్ఞమధురానుబంధసుందరముగా నిర్వహించి మనసార తన మనస్సారసరసత్వ సర్వస్వమునే మధురసారస్వతముగా వెలయించిన మహాకవి బాణభట్టారకునకు మనః పురస్కారముగ నొక నమస్కారము.

మనిషిని మనిషికి సన్నిహితము చేయునదే మహాతత్త్వము. ప్రపంచములో నెవరు ప్రవచించిన తత్త్వములోగాని సారాంశ మిదియే, అదే తన కవితా సంస్థానము కాదంబరిద్వారా బాణభారతి మనకుచేసిన మహోపదేశము, ఇచ్చిన మధురసందేశము.

# భవభూతి కవితా విభూతి

శ్రీ కె. వేం. న్. అప్పారావు

"నానృషిః కురుతే కావ్యం" అనగా ఋషి కానివాడు కావ్యకర్త కాజాలడు అని అర్థము. ఋషి యనగా ద్రష్ట. ద్రష్టయను పదమునకు చూచువాడని యర్థము. దీనినిబట్టి కన్నులుగలవారందఱు ఋషులని అర్థము చెప్పరాదు. గీతలో చెప్పబడిన యీ క్రిందిలక్షణములుగలవారే ద్రష్టలు. "సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం, వినశ్యత్స్వ వినశ్యంతం యఃపశ్యతి స పశ్యతి"—అనగా 'సర్వభూతములు నశ్వరములై యుండగా, నిత్యము మార్పు చెందుచుండగా, వానిలో నశింపని తత్త్వమై హెచ్చు తగ్గులులేక వెలుగొందు పరమేశ్వరుని చూచువాడే కన్నులుగలవాడు!' సామాన్యజనులకు హేయముగా కన్పించు వస్తువులుకూడ ఋషినేత్రమునకు పరమాత్మ స్వరూపముగనే భాసించును. అట్లే కవిదృష్టికి కూడ ఈ ప్రపంచమంతయు చైతన్యమయము, రమణీయమునై కన్పట్టును. సామాన్యులకు జడపదార్థములుగా భాసించు కొండలు, నదులు, చెట్లు, లతలు, మున్నగునవి కవిచే ప్రాణప్రతిష్ఠ చేయబడినవై చేతనములవలె ప్రవర్తించును. ఇట్టి అలౌకిక జగత్తును తన కావ్యమందు నిర్మించుశక్తిగలవాడు కనుకనే అతనికి కవిబ్రహ్మఅను పేరు సార్థకమగుచున్నది.

సంస్కృత కవులలో ఇట్టి అలౌకిక జగత్తును తన కావ్యమందు నిర్మించి మన కందించినవారిలో ప్రథమగణ్యుడు భవభూతి. అతని కావ్యములలో ప్రథమగణ్యము ఉత్తరరామ చరితము. భవభూతి మూడు శాస్త్రములలో పండితుడు. వశ్యవాక్కు. బ్రహ్మకువలెనే సరస్వతి తనకు వశ్యురాలై ప్రవర్తించుననియు, తాను శబ్దబ్రహ్మ విదుడను, పరిణతప్రజ్ఞుడననియు చెప్పికొనెను. అతని శక్తినిబట్టి, ఇట్లుచెప్పుట అహంకారమనికాక ఆత్మవిశ్వాసముగా గణింపవలెను. శబ్దబ్రహ్మోపాసనచే ఆత్మదర్శనము గాంచినవాడు గనుకనే అట్లుపలుక గల్గెను,

ఆదికవియైన వాల్మీకిని భవభూతి ఆదర్శముగా గ్రహించెను. ఉత్తరరామచరిత్ర నాందీశ్లోకము నందలి పూర్వకవి స్తుతియేగాక, నాటకమునందలి వాల్మీకిపాత్రమును ఈ విషయమును సూచించు చున్నది. సీతాదేవికిగల్గిన మిథ్యాపవాదమును పోగొట్టుటకే వాల్మీకి రామాయణమును రచించెను. సంవత్సరకాలము రావణుని అశోకవనములోనున్న సీతాదేవి ప్రవర్తన యెట్లుండెనో మనమేమి యెఱుంగుదుము? అని శంకించిన ప్రజలకు రామాయణము లోని సుందరకాండము కనువిప్పుఆయినది. క్రాంతదర్శియగు మహర్షి సీతాదేవి అశోకవనవాసము కన్నులకు గట్టినట్లు చిత్రించెను. కనుకనే అది సుందరకాండమైనది. అదివిన్న ప్రజల మనస్సులలోని శంక లన్నియు సూర్యకిరణములకు మంచుబిందువులు హరించునట్లు హరించిపోయినవి. సీతాదేవిపైఅత్యంత భక్తిగౌరవములు నెలకొనినవి కాని ఈ మాటే 'అభాండము' రామునిమీద పడినది. పరమ పతివ్రతా శిరోమణియు, నిండు చూలాలైన భార్యను అక్రమముగా పరిత్యజించెననునింద రామునిపైపడెను. దీనిని పరిహరించు బాధ్యతను భవభూతి స్వీకరించెను. ఉత్తరరామచరిత రచనమునందలి యీ ప్రయోజనమును గ్రహింపనిచో భవభూతి కవితాభూతి మనకు గోచరముకాదు.

కావ్యమునకు వ్యంగము ప్రాణమనియు, అది అతిశయముగానున్న కావ్యము ఉత్తమకావ్యమనియు అలంకారిక సిద్ధాంతము. కాళిదాస భవభూతులలో కాళిదాసు వ్యంగ్యప్రియుడనియు, భవభూతి వాచ్యప్రియుడనియు కొందరు పండితుల యూహ. కాని సూక్ష్మముగా పరిశీలించినచో వ్యంగ్యవైభవములో భవభూతి కాళిదాసునకేమాత్రము తీసిపోడని చెప్పవచ్చును. ప్రస్తావనలోని "ఉత్తరం రామచరితం తత్ప్రణీతం ప్రయోక్ష్యతే" అను శ్లోకమున 'ఉత్తర రామచరితము' అనక 'ఉత్తరమైన రామచరితము' అనుటలో నే ఒక విశేషార్థము ధ్వనించుచున్నది. భవభూతి రచితమైన నాటకములలో మహావీరచరిత్ర యొకటి. ఇందు పూర్వరామచరిత వర్ణితము. ఈ ఉత్తరరామచరిత మహావీరచరిత్రకు తరువాతి గ్రంథమను సంగతిసేకాక అంతకంటె ఉత్కృష్టమైనదను అర్థమునుగూడ 'ఉత్తరం' అను పదము స్ఫురింప జేయుచున్నది. మహావీరచరిత్రలో ప్రధానరసము యుద్ధవీరమైన, ఉత్తరరామచరిత్రలో ప్రధానరసము ధర్మవీరము. యుద్ధవీరముకంటె ధర్మవీరము ఉత్కృష్టమేగదా! చాలమంది పండితులు ఉత్తర రామచరిత్రలోని ప్రధానరసము కరుణరసమని తలచుచున్నారు. కాని సూక్ష్మముగా పరిశీలించినచో భవభూతి ఇందలి ప్రధానరసమును ధర్మవీరముగానే యుద్దేశించినట్లు స్పష్టముకాగలదు. అంగరసములో కరుణమును ఎక్కువగా పోషించినంతమాత్రమున అదే ప్రధానరసము కానక్కరలేదు. అంగములపుష్టి అంగికే సంక్రమించునుగదా! ఉత్తరరామచరిత్రలో భవభూతిచేసిన చమత్కారమిదే. రసములన్నిటిలో మిక్కిలి ఆర్ద్రతకలది కరుణరసము. భవభూతి కీ రసమన్న మిక్కిలి యిష్టము. కనుకనే "ఏకో రసః కరుణ ఏవ"-అను శ్లోకములో కరుణరసమునుండియే తక్కిన రసములన్నియు పుట్టినవని చెప్పియున్నాడు. అంతమాత్రముచేత ఉత్తరరామచరిత్రలో ప్రధాన రసము కరుణము అని చెప్పుటచేగాదు. ఇందు సీతారాముల పునస్సమాగమము నిర్వహణసంధిలో బంధింపబడినది. ఇక మధ్యకాలములో సీతారాములు తాము తిరిగి కలిసికొనగలమను ప్రత్యాశతో లేరు గనుక, వారి విలాపములన్నియు కరుణరసములోనికే పర్యవసించుచుందురు. కాని భవభూతి నడుమ నడుమ ఈ ప్రత్యాశకు బీజములు వేయుచునే నిర్వహణములో సీతారాములకు కలయికను కల్పించెను. ఇందీతని వ్యంగ్యవైభవము గోచరించును.



శ్రీ కె. వెం. న్ర. అప్పారావు

ఉదాహరణమునకు ప్రథమాంకమున వసిష్ఠ మహర్షి సందేశమును తీసికొనివచ్చిన అష్టావక్రమహర్షి వృత్తాంతము తీసికొందము. "నీవు బాలుడవు, రాజ్యము క్రొత్త, త్రోవచూపుటకు నేను సమీపమున లేను. కనుక ప్రజారంజకము ప్రధానముగా బెట్టుకొని రాజ్యపాలనముచేయుము" అని వసిష్ఠసందేశము. దీనికిరాముని ప్రతివచనము "స్నేహమును, దయను, సౌఖ్యమును, చివరకు జానకినిగూడ ప్రజారంజనమునకై విడుచుటకు నేను బాధపడను" ఈ ప్రతిజ్ఞయే ఈ నాటకమునందలి ముఖ్యరసము ధర్మవీరమని తెలుపుచున్నది. పుత్రధర్మమును నిర్వర్తించుటకై రాజ్యపరిత్యాగముచేసిన రాముడే. తిరిగి రాజధర్మము నిర్వర్తించుటకై పత్నీపరిత్యాగము చేసెదనని పల్కినాడు. ఒక్కొక్క పరిస్థితిలో ఒక్కొక్కటి ప్రధానధర్మమగుచుండెను అని భవభూతి యీవాక్యము ద్వారా సూచించుచున్నాడు. యాదృచ్ఛికముగా అన్నమాటలే నిజమైనవి.

ఈ సందర్భములోనే సీతాదేవికిగూడ వసిష్ఠులువారొక సందేశమునంపిరి. "భూదేవి నీ తల్లి. బ్రహ్మతో సమానుడగు జనకుడు నీ తండ్రి. సూర్యుడును, నేనును గురువులమైన వంశమునకు కోడలవు. నీకు నేను ఆశీస్సుల నీయగలను? కేవలము వీరమాతవు కాగలవని ఆశీర్వదించుచున్నాను" ఇదివిని శ్రీరామచంద్రుడు "అనుగృహీతులము" అని ఋషిప్రభావము నిట్లు వర్ణించెను. "లౌకిక సాధువుల వాక్కును అర్థము ననుసరించును, గాని ఆద్యఋషుల వాక్కులనే అర్థము లనుసరించును" ఇట్లనుటచే వసిష్ఠులవారి వాక్యమునకు అన్యథాత్వము ఉండదను విశ్వాసము రామునకుగలదని స్పష్టమగుచున్నది. అట్లే ఋశ్యశృంగుని సందేశముకూడ ఈ సందర్భముననే అందింపబడినది "అమ్మాయీ, మేమిచట యాగనిమిత్తముగా ఉండిపోయితిమి. నిన్ను పుత్రులు ఒడిలో ఉండగా చూడగలము ఈలోగా బెంగవలదు"

ఇదికూడ లౌకిక సాధులవాక్కు కాదు. అడుగుపెట్టగనే అనావృష్టిని నివారింపగలిగిన ఋశ్యశృంగ ఋషివాక్కు. ఇవి సీతారాముల హృదయములలో నాటుకొని వియోగసమయమున ప్రత్యాశకు బీజముగా నున్నవని చెప్పవచ్చును.

ఇక ధర్మవీరమే ప్రధానరసముగా ఉద్దిష్టమైనప్పుడు కరుణరసము నంతగా పోషింపనేల? అను ప్రశ్నకు సమాధానము అది పరోక్షముగా వీరరసమునే పోషించునుగనుక. వీరరస ప్రధానమగు కావ్యములో నాయకుని పరాక్రమము ప్రత్యక్షముగా వర్ణించుట ఒకపద్ధతి. ప్రతినాయకుని పరాక్రమమును అతిశయముగా వర్ణించి చివరకు అతనికి నాయకునిచేతిలో ఓటమి కలిగించుట ఇంకొకపద్ధతి. అట్లే ధర్మవీరమునందును నాయకుని ధర్మనిష్ఠకు భంగము కల్గించు పరిస్థితుల ప్రాబల్యము నతిశయముగావర్ణించి చివరకాతడు వానికి లొంగకపోవుటకు ప్రదర్శించినచో అతనిలోని ధర్మవీరమునకు పుష్టిలభించును.

ధర్మనిర్వహణకై ఒక మహాపురుషుడు చేయు త్యాగముయొక్క పరిమాణమునుబట్టి అతనిలోని వీరత్వము ప్రస్ఫుటమగుచుండును. త్యాగములేనిచోట వీరత్వమునకు ప్రసక్తియేలేదు. అత్యంత ప్రియమైన వస్తువును ఒకధర్మమును నిర్వర్తించుటకై త్యాగము చేయగల్గుటకష్టము. కనుక అట్టు త్యాగముచేయుటను వీరత్వముగా చెప్పనగును. సత్యముకొఱకై రాజ్యత్యాగముచేసిన హరిశ్చంద్రుడు, పరోపకారమునకై దేహత్యాగముచేసిన జీమూతవాహనుడు మున్నగువారు త్యాగవీరులుగా ప్రసిద్ధులు. అట్లే సీతారాముల అన్యోన్యానురాగాతిశయమును ఎంతగా పోషించిన, అంతగా సీతాపరిత్యాగము చేసిన రాముని యందలి ధర్మనిష్ఠ ప్రస్ఫుటముకాగలదు. దీనిని సాధించుటకై ప్రథమాంకమున చిత్రపటవృత్తాంతమును కల్పించి పూర్వ రామచరితలోని రసవద్ఘట్టము లన్ని

టిని ప్రదర్శించినాడు భవభూతి. కేవలము సీతా రామలక్ష్మణులేకాదు ఆ చిత్రములజూచి యానందించి నది! భవభూతి కృపావిశేషమున మనము ఆ అక్షర చిత్రములజూచి ఆనందించుచున్నాము. ఈ చిత్రపటకల్పనము భవభూతి ప్రతిభకొక మచ్చుతునక. ఇందు సీతారాముల పంచవటీవిహారము, అందలి ప్రకృతి దృశ్యములు వర్ణించుటతోపాటు, సీతాపహరణమైన పిమ్మట ప్రియవియోగముచే శ్రీరాముడు "రాళ్లుకూడ ఏడ్చునట్లు" విలపించిన దృశ్యములును లిఖింపబడినవి. ఇవి చూచుటచే సీతకు, రాముని హృదయములో తనకుగల స్థానము సుస్థిరమైనదను విశ్వాసము దృఢపడి, అతని విషయములో ఆపోహకు అవకాశములేకుండ జేయుటకు తోడ్పడినది. కనుకనే తృతీయాంకమున రాముడు శంబూకవధకై దండకారణ్యమునకు వచ్చినపుడు, పంచవటినిజూచి విలపించుట సీతకు దుర్భరమైనది. సిందతో పరిత్యక్తురాలైన సీతాదేవి దుఃఖముకంటె, పశ్చాత్తాపతప్తుడైన రాముని దుఃఖమే అతిశయముగా వర్ణించి. చివరకు సీతయే అతనినిజూచి జాలిపడునట్లుగా చిత్రించిన భవభూతి శ్రీరాముని విమర్శించు విమర్శకులకు వ్యంగముగా సమాధాన మిచ్చుచున్నాడు. వాదియే వ్యాజ్యము వదలుకొన్నపుడిక న్యాయవాది యేమిచెయగలడు? ఏ సీతాదేవి పక్షమున నిలబడి ఈ విమర్శకులు రాముని విమర్శించుచున్నారో, ఆమెయే అతనికి అభ్యనుజ్ఞ నిచ్చినది. వసిష్ఠుని సందేశము విని "ప్రజారంజనముకొఱకు జానకినిగూడ విడువగల" నని రాముడన్నపుడు సీతచే కవి యొక చక్కని వాక్యము పలికించినాడు. "అతఏవ రాఘవకుల ధురంధరః ఆర్యపుత్రః" కనుకనే మీరు రఘువంశ ధురంధరు లని మెచ్చుకొన్నది. "ప్రజారంజనమునకు అవశ్యకమగుచో నన్ను పరిత్యాగముచేయవచ్చు" నని అభ్యనుజ్ఞ ఇచ్చుట చక్కగా ధ్వనించుచున్నది.

ఇక ధర్మనిర్వహణార్థము తన్ను పరిత్యజించుట కూడ ఆమెకు ఇష్టమగుపక్షమున ఇక శోకించుట యెందుకు? అను ప్రశ్నకు గూడ చక్కని సమాధానము కవియే యిచ్చినాడు. ప్రథమాంకప్రారంభములోనే చక్కని ఎత్తుగడతో దీనిని ధ్వనింపజేసినాడు. పట్టాభిషేకోత్సవములకైవచ్చిన జనకమహారాజుగారు తిరిగి మిథిలకు వెళ్లిపోవుటచే, తండ్రిగారికొఱకై బెంగపెట్టుకొన్న సీతాదేవిని ఊఱడించుటకై శ్రీరాముడు అంతఃపురమునకు వెళ్లుటతో అంకము ప్రారంభమగుచున్నది శ్రీరాముడు సీతను ఊఱడించుచు "గృహస్థులు ఆహితాగ్నులు కావున ఎక్కువ దినములు గృహమువిడిచియుండుటకు అవకాశము ఉండదు. ఈ హేతువుచేతనే వారు మనమింకను ఉండుమని కోరినను, వెళ్లిపోయిరి. కాని మనమీద ప్రేమలేక కాదుసుమా!" అని చెప్పగా, సీత దానికి ప్రత్యుత్తరముగా "ఈసంగతి నెఱుగకకాదు. అయినను, బంధుజన వియోగము దుఃఖము కలిగింపక మానదుగదా!" అని పలుకును. సూక్ష్మముగా పరిశీలించినచో నిందనేక వ్యంగ్యములు ద్యోతకములగును. జనకుని వియోగమునకే యింతబెంగపెట్టుకొనిన సీత పతివియోగము నెట్లు సహింపగలదను వ్యంగ్యముచే కరుణరసమునకుపుష్టి. ధర్మనిష్ఠాపరులైనవారికి ప్రియజనవిప్రయోగములు కలుగుట సహజము. వియోగము దుఃఖకరము కనుక గృహస్థులు దుఃఖించుట సహజమైనను, ఆదుఃఖమునకు అర్థము ధర్మనిష్ఠయందు ద్వేషముగా చెప్పరాదనియు ధ్వనించుచున్నది, దీనిని బట్టి శ్రీరాముని వియోగమునకు సీత యెంతశోకించినను, అతని యందామెకుగల పూజ్యభావము ఇసుమంతయు కొఱవడలేదను విషయమిచ్చుట ప్రతిపాదితము. కానిచో అతడధర్మము చేసినట్లు సీత భావించినట్లు చెప్పవలసివచ్చును. అట్లు భావించినచో ఆమె సీతయుకాదు. ఈతడు రాముడును కాడు.



శ్రీ కె. వేం. నృ. అప్పారావు

ఇక భవభూతి కవితలోని సొగసులను వర్ణింప వలెనన్న ఒక ప్రత్యేక గ్రంథమే వ్రాయవలసి యుండును. అందును ఉత్తరరామచరితమునందలి ప్రతిపద్యము ఒక రసగుళిక. కావున అందుండి యే స్థాలీపులాకన్యాయముగా కొన్ని యుదాహరణము లిచ్చి యీ వ్యాసమును ముగింతును.

"నాటకేషూత్తరం రామచరితం రమ్యతాస్పదం
తత్రాపీచ తృతీయాంక స్తత్శ్లోక చతుష్టయమ్."

కాళిదాసుని శాకుంతలమున చతుర్థాంకమువలె భవభూతి ఉత్తరరామచరిత్రమున తృతీయాంకము మకుటాయమానము. అందు నాకు నచ్చిన నాలుగు పద్యముల నీక్రింద వివరింతును.

"తటస్థం నైరాశ్యా దపిచ కలుషం విప్రియవశాత్
వియోగే దీర్ఘేస్మిన్ ఝటితి ఘటనాత్ స్తంభితమివ
ప్రసన్నం సౌజన్యాద్దయితకరుణైర్గాఢకరుణం
ద్రవీభూతం ప్రేమ్ణా తవ హృదయ మస్మిన్ క్షణ
ఇవ." (1)

దీనికి నా యనువాదము :

"ఇక నాకు నితనికి నెట్టిది సంబంధ
మను నిరాశఁ దటస్థతను వహించి
నిరపరాధను నన్ను దరలించెఁ గానకు
నను నల్క విమనస్కతను గలంగి
దీర్ఘవియోగంపుఁ జెరవీడకయె హఠా
ద్ఘటనంబుచే స్తంభితత్వమంది
సర్వంబు సహియించు సహజ సౌజన్య గు
ణంబుచే సుప్రసన్నత్వమూని
ప్రియుని శోకంబుచే నార్తిబెరసి కరము
ప్రేమవశమునఁ గరఁగి ద్రవించి నీదు
హృదయ మిపుడొక్క క్షణకాల మెడములేని
భావలహరుల సంకులత్వమునుబొందె!"

దండకారణ్యములో శంబూకుని వెదకుచు వచ్చిన శ్రీరాముని, సూర్యభగవానుని అర్చించుటకై రసాతలమునుండి అచ్చటికేవచ్చిన సీత అకస్మాత్తుగా జూచినప్పుడు ఆమె మనస్సునందొక్కుమ్మడిగా చెల రేగిన భావములను కవి. ఆమెతోగూడవచ్చిన తమసచే వర్ణింపజేసెను. ఇది శాకుంతలమునందలి "యాస్య త్యద్యశకుంతలేతి" అను పద్యమును స్మరణకుతెచ్చును. అందు కణ్వుడు తనస్థితిని తానే వర్ణించుకొనును. ఇందు సీత తన హృదయస్థితిని తానెఱుఁగలేకున్నానని చెప్పఁగా తమస వర్ణించుట రసోచితముగానున్నది.

"విలులితమతిపూరై ర్బాష్పమానందశోక
ప్రభవ మవసృజంతీ పక్ష్మలోత్తాన దీర్ఘా
స్నపయతి హృదయేశం స్నేహనిష్యందినీ తే
ధవళమధుర ముగ్ధా దుగ్ధకుల్యేవ దృష్టిః!" (2)

దీనికి నా యనువాదము :

"వెలుచన్ లోపలిహర్షశోకనదు లుద్వేలంబుగాఁ
బొంగి య
శ్రులు జాలై కనుఱెప్పలొత్తుకొని యస్తోకోద్ధతిన్
జాఱఁగన్
దెలినిగ్గుల్ దరితీపులున్ జిలుకు నీనెయ్యంపు
వాల్చూపు దొం
తులు ప్రాణేశ్వరు క్షీరధార నభిషిక్తుంజేయుటల్
రమ్యమౌ."

సీతకొఱకై విలపించి, విలపించి గంగాదేవి వరప్రభావముచే అదృశ్యురాలైయున్న సీతను గన జాలక శ్రీరాముడు అయోధ్యకు మఱలిపోవునప్పుడు ఆతని దివ్యసందర్శనముచే గల్గిన ఆనందము, ఆతడు వెళ్ళిపోవుచున్నాడను విషాదము చూపులలో నింపుకొని, ఇకముందు దుర్లభదర్శనుఁడగు నాతని నదేపనిగ చూచుచున్న సీత చూపును తమస పైవిధ ముగా వర్ణించును. ఇది శాకుంతలమునందలి "ఇతః ప్రత్యాదేశాత్ స్వజనమనుగంతుం వ్యవసితా" అను పద్యమును జ్ఞప్తికితెచ్చును. ధవళదృష్టియగుటచే సీత నిరలంకారనియమము వ్యంజితము.

"అస్మిన్నేవ లతాగృహే త్వ మభవ స్తన్మార్గదత్తేక్షణ
సా హంసైః కృతకౌతుకా చిరమ భూద్గో దావరీసైకతే

అయాంత్యా పరిదుర్మనాయిత మివ త్వాం విశ్వసద్ధ స్తయా
కాతర్యా దరవిందకుట్మలనిభో ముగ్ధః ప్రణామాంజలిః'' (3)

దీనికి నా యనువాదము :

"ఈ పాదరింటనేసుమి ప్రతీక్షయొనర్పుచునుంటి విభు, నాఁ
డాపెయు గౌతమీపులినమండలి యంచులఁ బూచు వేడ్కజా
గై పఱతెంచుచున్ గినుక నందినయట్లుగ నీవు గన్పడన్
బాపము! భీతిమై మొగిచెఁ బాణిసరోజయుగంబు దా వెసన్.''

వనవాససమయమున సీతారాముల కిష్టసఖిగా నుండిన వనదేవత వాసంతి, సీతను త్యజించినందుకు రామునిపై కోపముకలదై, అతనికి పూర్వపరిచిత స్థలములజూపు సందర్భములోని దీపద్యము. ఇందు సీత మౌగ్ధ్యసంపద, భర్తయెడ ఆమె అనువర్తనము, అంచల జూచి అనందించు సరళ చిత్తవృత్తి వర్ణితములై. రాముడామెకు విధించిన పరిత్యాగముయొక్క తీవ్రతను ద్విగుణీకృతముగా వ్యంజిత మొనర్చుచున్నవి.

"ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదాత్
భిన్నః పృథక్ పృథగివాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుదతరంగ మయాన్వికారా
నంభో యథా సలిలమేవతు తత్సమస్తమ్.'' (4)

దీనికి నా యనువాదము :

"కరుణరసమొక్కటే రసం బరయ నిదియె
కారణవిభిన్నతను గాంచు వేఱు వేఱు
రూపముల; బుద్బుదావర్త రూపమౌ వి
కారము లవెన్ని కలుగనీ, నీరమొకటె!''

ఉపమాలంకారములోనుండియే సర్వాలంకారములు పుట్టినవని ఒక ఆలంకారికుడు చెప్పినట్లుగా రసములన్నియు కరుణరసములోనుండియే ఆవిర్భవించినవని భవభూతి సిద్ధాంతము. రసమునకు ఆర్ద్రత ముఖ్యము. అది కరుణరసమునందున్నంత మఱేరసమునందును లేదు. గంగాస్రవంతివలె సకల కల్మషములను కడిగివేయగల శక్తి కరుణరస స్రవంతికేగలదు. కనుకనే శబ్దబ్రహ్మవిదుఁడైన భవభూతి పవిత్రమైన సీతారాముల కథను కరుణము ప్రధానాంగముగా గల నాటకమున గూర్చి తాను తరించెను. మనలను తరింపజేసెను.

"జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః''

# భవభూతి వర్ణించిన గోదావరీప్రాంతము

డాక్టర్ జాస్తి సూర్యనారాయణ

వింధ్యపర్వతములకు దక్షిణమునందున్న నదులలో ముఖ్యమయినది గోదావరి. ఆర్యావర్తమునందు "గంగ" వలె దక్షిణాపథమున గోదావరి ప్రశస్తి గాంచినది. ఈనది పడమటికనుమలలో నెక్కడనో పుట్టినను తూర్పుకనుమలను దాటివచ్చి తూర్పుతీరమును సస్యశ్యామలముచేసి సముద్రమునందు గలియుచున్నది. తూర్పుతీరమునందు గోదావరి, కృష్ణానదులు ప్రవహించు ప్రాంత మతిప్రాచీనకాలమునుండియు తెలుగు మాటాడువారి మూలస్థానము. తూర్పుకనుమల కావల "భద్రాచలము" మొదలగు ప్రాంతములు గలవు. ఇవియు తెలుగునేలయే. ఈ ప్రాంతమునందు శ్రీరాము డరణ్యవాసమును గడపినట్లు వాల్మీకి చెప్పియున్నాడు. మేఘసందేశమునందలి యక్షు డీప్రాంతమునందే ప్రవాసవత్సరమును (స్నిగ్ధచ్ఛాయా తరుషు వసతిం రామగిర్యాశ్రమేషు - మేఘు) విజయవంతముగ ముగించుకొనినాడు.

"భవభూతి" తన యుత్తరరామచరిత్ర మను నాటకమునం దీప్రాంతమునే సువిపులముగ వర్ణించి యున్నాడు. ఏడంకములు గల యీ నాటకమునందలి మొదటి మూడంకములందు గోదావరీపరిసరముల ప్రసంగము గలదు. అందును రెండు, మూడంకముల కథ గోదావరీప్రాంతమునందే జరిగినది. "ఛాయాంక" మని ప్రశస్తిగాంచిన మూడవయంక మీతని రచనాశిల్పమునకు మచ్చుతునక. ఈయంకము గోదావరీపరిసరమునందే జరిగినది. శంబూకవధకై రాముడు గోదావరీప్రాంతమునందలి దండకారణ్యమునందలి "పంచవటి"లోని జనస్థానమునకు వచ్చును. తనబిడ్డల ద్వాదశవార్షికమంగళమును నిర్వర్తించు నెపమున సీత యటకు రావింపఁబడినది. ఈసన్నివేశ

మవాల్మీకము. ఈసందర్భమునందు శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగా రిట్లు వ్రాసియున్నారు. [1]

ప్రథమాంకమునందలి చిత్రపట ప్రదర్శనము నందును గోదావరీసరిసరప్రాంతమునందలి గిరి, సరిద్గర్త, కాంతారములు, పశుపక్ష్యాదులు, వర్ణితము లయినవి. ఇట్టి వర్ణనమును స్థానికపు కృతివర్ణనమని చెప్పుదురు. ఆంధ్రకవులలో శ్రీనాథుడిట్టి వర్ణనమును చేసియున్నాడు.[2] శ్రీనాథుడు తాను ప్రత్యక్షముగ చూచినవానిని తన రచనలందు యథావకాశముగ జోడించియున్నాడు. ఆతడాంధ్రుడైనందున తన మాతృభూమిపై నభిమానముచేత నీవిధముగ నాయా ప్రాంతములను వర్ణించియుండు ననిపించును. తన నివాసస్థానముగాని ప్రాంతములందలి సూక్ష్మాతి సూక్ష్మములగు నంశములను వర్ణించుట సాధ్యము గాదు ఆత్మీయత, తాదాత్మ్యములేనిదే యట్లు వర్ణించుట జరుగదు. గోదావరీప్రాంతము నింతసు విపులముగ వర్ణించిన భవభూతి యాప్రాంతము నివాసముగ గలిగినవాడైయుండు ననిపించును. ఈ యాశయమును స్థాపింప శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగా రొక వ్యాసమును వ్రాసియున్నారు.[3]

తెలుగుదేశమునకు నడుమనున్న గోదావరీ ప్రాంతమునందలి యరణ్యవర్ణనము తెలుగుదేశవర్ణన యననగును. భవభూతికాలమునాటి గోదావరీప్రాంత వర్ణనమునుబట్టి ఏతద్గుణవిశిష్టములగు గిరి సరిత్కాంతారములు పశుపక్ష్యాదులు మన మాతృభూమిని శోభాయమానముగ చేయుచున్నవని గ్రహింప వచ్చును.

"భవభూతి" వర్ణనములందు అభిరుచిగలవాడని తోచును. మహాకావ్యములందు వర్ణింప యోగ్యతగాంచిన యష్టాదశవర్ణనలలో లేని యరణ్యవర్ణనమును తన నాటకమునందు సువిపులముగ గావించియున్నాడు. అష్టాదశవర్ణనములో నుద్యాన వర్ణనమాత్రము గలదు. భవభూతి మహారణ్యమును వర్ణించియున్నాడు. కవిది సౌందర్యదృష్టి. అరణ్యము నందలి సౌందర్య మన్యదుర్లభము. ఈయంశమును కాళిదాసుగూడ సూచించియున్నాడు.[4] ఈ యపురూపమగు సౌందర్యమును తా ననుభవించిన భవభూతి తన కావ్యము నాస్వాదించువారి కాసౌందర్యము నందింప ముచ్చటగలిగినది. సీతారాముల కథను మరుగుగా చేసికొని కవి ఈవర్ణనమును గావించియున్నాడు. కథావస్తువున కదుకని వర్ణనగాక వస్తువువర్ణన పరస్పరము శోభాజనకములగునట్లుగా వీనిని పొసగించుట యీతని నేర్పును చాటుచున్నది.

ప్రథమాంకమునందలి చిత్రపటమునందున్న చిత్రములలో నన్యతమము 'దక్షిణారణ్య' ప్రవేశము. సీతకు నాతపకారణముగా రాముడు తాళపత్రమును బూనెను. అనగా నాప్రాంతమునందెండ దుర్భరమని తోచును. వారికి ముందడవి చిత్రితమయినది. అది దక్షిణారణ్యమని ఎట్లుతోచును? దక్షిణారణ్యమందలి వృక్షము లతిసాంద్రములు. ఛాయాప్రధానములు. ఈ లక్షణలక్షితము దక్షిణారణ్యమే. కాని దానిని తెలిసికొనుట సులభము. ఈ యరణ్యమునకు గల

---

1 రామాయణంలో శ్రీరాముడు శంబూకవధ కొరకు జనస్థానానికిగాని, గోదావరీప్రాంతానికిగాని వచ్చినట్టులేదు.
దక్షిణాం దిశమాక్రమ్య - తతో రాజర్షినన్దనః
శైవలస్యోత్తరే పార్శ్వే - దదర్శ సుమహత్సరః
తస్మింత్సరసి తప్యన్తం - తాపసం సుమహత్తపః
దదర్శ రాఘవశ్శ్రీమాన్ - లమ్బమాన మధోముఖం.
అని యున్నట్లు చెప్పిరి.
(మన భవభూతి-భారతి June 1945 PP 487-492)

2. ఏపట్టణముమ్రోల నేవేరు ప్రవహించు - పృథివికి ముత్యాలపేరుచోలె — భీమ 2—52.

3. మన భవభూతి-భారతి June 1945 PP 487-492

4. దూరీకృతాః ఖలు గుణై రుద్యానలతా వనలతాభిః — శాకుం — 1-17.

యీ ప్రత్యేకతను తరువాతి యంకములందు యథావకాశముగ కవి వివరించియున్నాడు. తపస్సునకనువగు నీరు-నీడ-ఫలమూలములు దండకారణ్యోపవనమునందు లభించును. (2-1) దండకారణ్యోపవనమునందు గోదావరియున్నది. దాని కిరువైపుల వృక్షములు గలవు. వానియందు పక్షులున్నవి. మధ్యాహ్నపు ఎండకు, అనవరతము కూసి యలసినందునను, ఆకలిగొని యావృక్షముల పట్టలలోనికి ముక్కులనుదూర్చి అందలి సూక్ష్మజీవులను తినుచున్నవి. మదవుటేనుగులు తమ కండూతి నపనయింపనాచెట్లకు రాచుకొనుచున్నవి. ఎండవేడిమివలన ప్రశిథిలములగు బంధముగల ఆచెట్ల పూ లీరాపిడి వలన కంపించిన చెట్లనుండి జారి గోదావరిలో పడుచున్నవి. (2-9) ఆ యరణ్యములందలి వృక్షములు సాంద్రములు. దాన నీలిమ వ్యాపించినది. మరియు నావృక్షములు సుదీర్ఘములు. దాన చూచువారికి భయమును గల్గించుచున్నవి. ఎల్లయెడల గలగల ప్రవహించు కొండవాగులు. తీర్థాశ్రమ గిరినదిదర్త కాంతారవంత మీగోదావరీప్రాంతము. (2-14)

ఈ దండకారణ్యోపవనమునందలి సెలయేళ్ల కిరువైపుల గల వృక్షములక్రింద యాకులుండును. ఆ చెట్లనీడయే వారికి తపోవనములు. నీవారములతో నోగిరముగావించి దాన నతిథుల సత్కరింతు రాయతులు. (1-25) నిగమాంతవిద్యలను గరపు నగస్త్యాదులకు నునికిప ట్టాయరణ్యము. (2-3)

ఇంతవరకు నాయరణ్యమును స్థూలముగ చిత్రించియున్నాడు. ఇంక నందలి వివిధములగు స్థానికవిశేషములు.

ప్రస్రవణపర్వతము:— చుట్టునున్న స్నిగ్ధములగు వృక్షముల నీలిమచే పరివృతము. గోదావరీ ప్రవాహధ్వని ముఖరితములగు గుహలుగలది ఎపుడును వర్షించుచు మేఘములచే నినుమడించిన నీలిమగలిగినదియు నగు ప్రస్రవణము జనస్థానము మధ్యభాగమునందున్నది (P 32). ఈ పర్వతము గోదావరిసమీపమునందున్నది. మేఘములట్లే గిరియు సమీపమునందున్నట్లగపడును (2-25).

సత్వచయమునకు రోమోద్గమము జనింపజేయునవియు, మదించిన యడవిమృగములచే నావృతములయిన గుహలు గలిగినవియునైనవి జనస్థానప్రాంతమునందలి యడవులు. అనఁగ ప్రస్రవణగిరి పరిసరారణ్యములు (P 80). ఈ వనమునందొకచో నరవులు లేనందున నిశ్శబ్దత - ఒకవంక ధ్వనించు ప్రాణులు - స్వేచ్ఛగ నిద్రించిన పాముల యూర్పులందు మాటలు జనించుట వేరొకచో - నీరు విరళమయినందున దప్పిగొన్న తొండలు కొండచిలువల చెమటను త్రాగుట వేరొకచో (2-16). ఖరుడను రాక్షసునకు నివాసమైన దీజనస్థానము (2-17). 1414 రాక్షసులు ఖరదూషణులు నీ జనస్థానమువారు.

జటాయువృత్తాంతము:— గోదావరీవనాంతమునందు చెట్ల నలుపుదనపు సొగసు. అందు పక్షులయులివు. నడుమ పెద్దశిఖరము. అదియే జటాయునివాసము. ఆ శిఖర క్రిందిభాగమునందు పర్ణశాల. అదియే సీతారాముల నివాసము (2-26).

జటాయు శిఖరమునకు దక్షిణముగ గోదావరి. అందు సీతాతీర్థము (P 111). జటాయువు తునాతునకలుగావించిన రావణుని యుక్కురథము ఆ రథమునకు పూన్చిన గాడిదల కంకాళములు (3-43).

"కుంజవాన్" అను దండకారణ్యాభాగము. అందు దను కబంధాదులుండిరి. తత్సమీపమున మతంగాశ్రమము. అచటనే శబరి "పంప" అను పేర పద్మసరస్సు (P 37). ఈ సరస్సునందలి పుండరీకముల కాడలు సుదీర్ఘములు. అందలి హంసల రెక్కలు విదుల్చుకొన్నపుడు అవి కదలి అందలిలో జలము కన్నీరువలె స్రవించును. దాన కువలయము

లందలి లోభాగములగు కింజల్కాదులు గననగును. (1-31).

మాల్యవంతము:— ఈ కొండ దిశలను పరిమళింపజేయును. క్రొక్కారుమొగులా కొండ నాశ్రయించును (1-33).

ఇంక నరణ్యమధ్యభాగమును దిలకింతము

మధ్యమారణ్యము:— మదించిన నెమళ్ళు - వాని మృదుధ్వని, నీలమగు వాని కంఠచ్ఛవి యా పరిసరపర్వతమును వ్యాపించియున్నది. ఇచటి వృక్షములు ఛాయాప్రధానములు. ఇచటి వన్యమృగములసంభ్రాంతములు. దాన నిశ్శబ్దత - ప్రబ్బలిచెట్ల పూలు పక్షుల తాకిడివలన రాలి వాగులందు పడుచున్నవి. దాన నానీరు మంచి సుగంధమును గలిగియున్నది నేరేడుచెట్లు చాల ఫలములను గలిగియున్నందున నవనతములై నీలిమను గ్రక్కుచున్నవి. వానిపండ్లూడి వాగులందు పడఁగా నా నీరు ధ్వని చేయుచున్నది. మదపుటేనుగుల దానాంబువులచే వృక్షములు సిక్తములయినవి. ఆడుకొను పందులు పెకలించి సగమునమలిన తుంగవాసన యాప్రాంతమునందు గలదు. ఎలుగుకొదములు గుహలందు ఛీత్కారము చేయుచున్నవి. ఏనుగులు నమలిన సల్లకీవృక్షములనుండి సుగంధము వ్యాపించుచున్నది.

ఈ యరణ్యమున సీతాకథాప్రసంగములందు పాత్రతవహించిన వస్తువర్గము గలదు. 1. తపోవనమగు పంచవటి, 2. గోదావరీనది, 3. ప్రస్రవణ నగము, 4. జనస్థానవనదేవతయగు వాసంతి, ఎచట చెట్లు మృగములు బంధువులో యట్టి బహుకందర నిర్ఝరవంతములగు గోదావరీప్రాంతములకు దాను మరలవచ్చితినని రాముడు పంచవటీప్రవేశ సమయమునం దనును. ఈయంశము తరువాత వివరింపబడియున్నది.

సీత తన హస్తములతో నంటునీవారశష్పముల నొసగి తరుశకుని కురంగముల మనిచెను. కరికలభకము. గిరిమయూరము పుత్రనిర్విశేషమగు సీతాప్రేమకు భాజనమయినవి.

కదళీవనము నడుమనున్న శయనీయ శిలాతలము, లతాగృహములు, గోదావరీసైకతమునందలి హంసలు సీతారాముల వివిధవిస్రంభసాక్షులు.

ఇంత సువిపులముగ నీప్రాంతమును వర్ణించిన భవభూతి గోదావరీతీరనివాసియే కావచ్చును.

అట్లు గాదన్నను దూరదేశమువారికి నింత యింపుగతోచు గోదావరీప్రాంతము మన జన్మభూమి యగుట తెలుగువారి సుకృతము.

# ధ్వన్యాలోకము - లోచనము

శ్రీ జొన్నలగడ్డ ప్రభాకరశాస్త్రి

నిరంతర కావ్యానుశీలనాభ్యాసవశమున పవిత్రీకృతస్వాంతులగు బుధసత్తములచే కవి సహృదయోభయానుగ్రాహకముగా నిర్మింపబడిన శాస్త్రము అలంకారశాస్త్రము. అసంఖ్యాకములగు అలంకారశాస్త్రగ్రంథములలో ప్రథమస్థానమును ఆక్రమించిన నాట్యశాస్త్రమునకు రెండవదిగా అర్వాచీనాలంకారికలోకమున స్వీకరింపబడిన గ్రంథము ధ్వన్యాలోకము. ఈ గ్రంథనిర్మాత సహృదయచక్రవర్తియగు ఆనందవర్ధనాచార్యుడు. ఈతనికి పూర్వులగు అలంకారికులు అలంకారములను, గుణములను, వృత్తులను, రీతులను కావ్యమునకు కావ్యత్వసంపాదకములగు సౌందర్యాధాయక ధర్మములుగా పరిగణించిరి. కాని ఆనందవర్ధనుడు పూర్వలాక్షణికులకు అప్రసిద్ధమగు ధ్వని అను ఒక అంశమును కావ్యమునకు జీవితభూతమగు ధర్మముగా ప్రతిపాదించెను. ఈధ్వని వ్యంజన అను శబ్దవ్యాపారముచే ఉల్లసితమగు అర్థవిశేషము అని నుడివెను. కాని ఆనాటి పండితలోకమునందు ఈ వ్యంజనాఖ్యమగు శబ్దవ్యాపారము ప్రసిద్ధమయినదికాదు. దేశమునందు నలుమూలల అశేషవ్యాప్తములయిన పదవాక్య ప్రమాణశాస్త్రములు అభిధ లక్షణ అను రెంటినిమాత్రమే శబ్దవ్యాపారములుగా అంగీకరించినవి. ఇట్లు ధ్వన్యాలోకము ఒకవంక ఆనాటి అలంకారశాస్త్రమునకును మరియొకవంక పదవాక్య ప్రమాణశాస్త్రములకును అప్రసిద్ధమగు అంశమును ప్రతిపాదించుటచేత ఉభయసంప్రదాయచ్యుతమై ఉభయానుయాయులకును నిరసనాస్పదమయినది.

ఇది యిట్లుండ సంప్రదాయమాత్రాభినివిష్టబుద్ధులుకాక వస్తుతత్వమును ఎరిగి మెచ్చుకొనజాలు సహృదయులకుకూడ అతిప్రౌఢశైలి రచింపబడిన ధ్వన్యాలోకము సులభగ్రాహ్యముకాక దూరమయినది. ఈగ్రంథము కారికలు, వృత్తి, ఉదాహరణ

ములు అను మూడంశములు కలది. ఇందు కారికలు ప్రధానార్థమును బీజప్రాయముగా ప్రతిపాదించు మూలగ్రంథము. వృత్తి కారికార్థ విపులీకరణాత్మక మగు వ్యాఖ్యానము. ఉదాహరణములు తత్తదర్థ నిదర్శకములగు కావ్యఖండములు. ఇందు కారికా వృత్తులు రెండును అతిప్రౌఢశైలి రచింపబడినవి. తదర్థము అతిగంభీరమై సామాన్యపాఠకునకు దురవ బోధమై ఉన్నది. వాక్యవిన్యాసరీతియు అచ్చటచ్చట జటిలమై సులభముగా అన్వయింపరానిదై ఉన్నది. ప్రతిపదస్వారస్యమును అరయక పైపై చదువువానికి అచ్చటచ్చట అస్పష్టార్థవచనములు, పునరుక్తులు, పూర్వాపరసమన్వయాభావము మొదలగు దోషములు గ్రంథమున ఆభాసించును. ఇక ఉదాహరణముల చూచినచో ఆనందవర్ధనుడు కంఠోక్తిచే వానియందు లక్షణములను సమన్వయింపడు. అందుచే కొన్నిచోట్ల పాఠకునకు లక్ష్యలక్షణసమన్వయమున వ్యామో హము కలుగును.

దీనికి తోడుగా పూర్వలాక్షణికమతానుయా యులు గ్రంథమున ప్రతిపాదింపబడిన అంశములను అనేకములను ఖండించిరి. ఇట్లనేక కారణములచే ధ్వన్యాలోకము ఉపేక్షింపబడి కాలగర్భమున లీనముకాదగు క్లిష్టకాలము ఈగ్రంథము వెలసిన ఒక శతాబ్దికి ఏర్పడినది

ఇట్టి స్థితిలో శబ్దముయొక్క వ్యంజకభావమును నూతనయుక్తులచే సమర్థించుచు గ్రంథమునందు పూర్వపక్షులు చూపిన దూషణములను ఆక్షేపించుచు, లక్ష్యములయందు లక్షణమును సమన్వయించుచు గ్రంథార్థమును విశదీకరించునట్టి ఒక వ్యాఖ్యయొక్క ఆవశ్యకత ధ్వన్యాలోకమునకు కలిగినది. అభినవ గుప్తుని పూర్వికులలో ఒకరు 'చంద్రిక' యను వ్యాఖ్యను రచించిరికాని అది లక్ష్యసాధకము కానట్లు దాని ప్రచారాభావమువలన లోచన పరామృష్టక తిపయాంశములవలన తెలియుచున్నది.

ఇట్టి క్లిష్టసమయమున ధ్వని పక్షపాతియగు అభినవగుప్తుడు లోచనవ్యాఖ్యను రచించి ధ్వన్యాలోక మునకు ప్రతిపక్షభంజకము స్వపక్షోపష్టంభకము అగు పరికరబంధమును ఏర్పరచెను. అభినవగుప్తుడు అయాశాస్త్రములలో నిష్ణాతులై స్వతంత్రగ్రంథములు సైతము రచించిన దిగ్దంతులవంటి పండితులవద్ద సర్వశాస్త్రములను కూలంకషముగ పఠించెను. అలం కారగ్రంథములలో నాట్యశాస్త్రమును కావ్యకౌతుక గ్రంథకర్తయగు భట్టతౌతునివద్దను ధ్వన్యాలోకమును విద్వత్కవి సహృదయచక్రవర్తియగు భట్టేందురాజు వద్దను అధ్యయనముచేసెను. ఈతడు స్వయముగా కవి. విశేషించి కాశ్మీరదేశమున వెలసి ప్రచారమును కాంచిన శైవమతమునకు చెందిన మూలగ్రంథము లపై వ్యాఖ్యల రచించి సర్వజనులకు పూజాపాత్రు డయ్యెను. ఇట్లు స్వనామధేయ శ్రవణమాత్రముననే పండితులను ఆవర్జింపచేయజాలు అభినవగుప్తపాదు లచే చేపట్టబడినదను అంశమే సర్వజనులకు ధ్వన్యా లోకమునందు శ్రద్ధను ఉత్పాదింపచాలినది.

అభినవుడు తన వ్యాఖ్యానమునకు లోచనమని పేరిడెను. ఈ పేరునందు కల ఔచిత్యమును రెండు చోట్ల అతడే వ్యక్తముచేసెను. ఒకచో 'కావ్యాలోకం స్ఫుటయామి స్వలోచన నియోజనయా జనస్య' అని శ్లేషభంగిని గ్రంథగతార్థమును చూచుటయందు పాఠకునకు ఇది లోచనకల్పమై ఉపకరించును అని చెప్పెను. వేరొకచో,

> "కిం లోచనం వినా లోకో
> భాతి చంద్రికయాపి హి,
> తే నాభినవగుప్తోఽత్ర
> లోచనోన్మీలనం వ్యధాత్"

అని శ్లేషభంగిని చంద్రికయున్నను లోచనములేక లోకము భాసింపనట్లే లోచనవ్యాఖ్యానములేక ధ్వన్యా లోక భాసింపదు అని చెప్పెను. ఇట్టివిధమయిన నామనిర్వచనముచే అభినవుడు తన వ్యాఖ్యానమును



శ్రీ జొన్నలగడ్డ ప్రభాకరశాస్త్రి

అనుసరించి గ్రంథమును చదువనిచో తదర్థ మవగత ముకాదని చెప్పెను.

ఇక తన వ్యాఖ్యానరీతిని అభినవుడే యిట్లు చెప్పుకొనెను "యత్ కించి దప్యనురణన్ స్ఫుట యామి కావ్యాలోకమ్" కావ్యాలోకము (ధ్వన్యాలోక మునకు నామాంతరము) ను స్ఫుటీకరించుట అతని లక్ష్యము. "యత్ కించి దప్యనురణన్" అను విశే షణము అతని స్ఫుటీకరణరీతిని తెల్పుచున్నది ఈ గ్రంథలక్ష్యము యథావస్థిత గ్రంథార్థమును బాలురకు తెలియచేయుటకాదు. గ్రంథకృత్సిద్ధాంతావష్టంభక ములగు యుక్తిజాలమును స్వప్రతిభావిశేషముచే ప్రతిపాదించుచు గ్రంథమును ఉద్ద్యోతింపచేయుట ఈ వ్యాఖ్యానమునకు లక్ష్యము. మరియును గ్రంథాంత మునందు తన వ్యాఖ్యానము "ప్రోన్మీషత్సకల సద్వి షయప్రకాశి" అని చెప్పుకొనెను. తన వ్యాఖ్యానము ప్రసంగసంగతిచే అనేకములగు కావ్యోపయోగివిషయ ములను ప్రతిపాదించినదని ఈ గ్రంథకర్త భావము.

లోచనమునకు కారికావృత్త్యుదాహరణ రూపాం శత్రయయుక్తమగు ధ్వన్యాలోక మంతయు వ్యాఖ్యా విషయము. గ్రంథార్థవిశదీకరణము ధ్వనిసిద్ధాంత స్థాపనము, విపక్షదూషణనిరాసము అని స్థూలముగ లోచనమును మూడుభాగములుగ విభజింపవచ్చును. ఈ భాగములను ఒక్కొక్కటిగా గ్రహించి ఒకటి రెండు ఉదాహరణములతో స్వల్పముగా వివరించి లోచన వ్యాఖ్యాన మేరీతి నడచినదో చూపుట ఈ వ్యాసమునకు లక్ష్యము.

కారికా వృత్తుల ఏకరూపతానుసంధానము, వాక్యయోజనము, పదార్థవర్ణనము, ఉక్తార్థ నిరూప ణము, ప్రదర్శితదిగనుసరణము, విరోధపరిహారము, పూర్వవ్యాఖ్యాపరామర్శనము, ఉదాహరణ శ్లోక వ్యాఖ్యానము అను నిది గ్రంథ విశదీకరణాత్మక మయిన లోచనమునందలి అవాంతర ఖండములు.

కారికావృత్తుల ఏకరూపతానుసంధానము:— లోచనము కారికను వృత్తి ఎట్లు అనుసరించుచున్నదో పాఠకులకు స్పష్టముచేయుటయేకాక వృత్తి ఉత్సూత్ర ముగా ఉన్నదను శంకపొడముచోట్ల యుక్తియుక్తము దానిని వారించును. 'ప్రాగేవ'[1] 'యోపి'[2] 'తత్ర'[3] 'శ్లోకద్వయేన'[4] అను ప్రతీకల క్రిందివ్యాఖ్యానమును చూచిన ఈవిషయము స్పష్టముకాగలదు.

వాక్యయోజనము: పదములను యథాశ్రుతాను పూర్విని అన్వయించిన సుశ్లిష్టార్థము రానిచోట్ల పద ముల అనుపూర్విని మార్చి అన్వయించును. 'అపి చ సంకరాలంకారే పి చ క్వచిత్'[5] అను వృత్తి వాక్యమును 'క్వచిదపి సంకరాలంకారే చ' అని అన్వయించెను.

పదార్థవర్ణనము: పదములను ప్రసిద్ధార్థములో గ్రహించిన సంగతమగు అర్థము రానిచోట్ల దానికి సరియగు అర్థమును వర్ణించును. 'వాచ్యవాచక సంమిశ్ర'[6] ఇత్యాది వాక్యమునందు యోగమర్యాదను ఆశ్రయించి సంమిశ్రశబ్దమునకు 'వ్యంగ్యము'అర్థమని చెప్పెను. 'ధ్వనేః స ఏవవిషయః యన్తవ్యః' సంః కరోజ్ఝితః'[7] అనుచో సంకర శబ్దమునకు (అలంకారా న్తరే–.) 'సంభావన' అను అర్థమును ప్రతిపాదించెను.

ఉక్తార్థ నిరూపణము: గ్రంథమునందు ప్రతి పాదింపబడిన విషయములను చక్కగా నిరూపిం చును. ఆయా అలంకారములలో ధ్వని అంతర్భూ తముకాదు అను అంశమును హేతువును మాత్రము

---

ధ్వన్యాలోకము: చౌఖాంబా సంస్కృత సీరీస్ 1940

1. ధ్వ. పుట 162–63
2. ధ్వ. పుట 163
3. ధ్వ. పుట 165–66
4. ధ్వ. పుట 303–304
5. ధ్వ. పుట 124
6. ధ్వ. పుట 135
7. ధ్వ. పుట 131

నిర్దేశించి వృత్తి అతి సంక్షిప్తముగా చెప్పెను. లోచనము ఆయా అలంకారముల లక్షణములను ఉదాహరించి అలంకారమును వ్యాకరించి వాచ్య వ్యంగ్య విభేదమును ఏర్పరచి అలంకారములలో వ్యంగ్యము వాచ్యాధికము కాదను హేతువును తత్త్వముగాచూపి ప్రతిపాద్యార్థమును నిరూపించును. ఆరబ్ధవిశ్రాంతరసానుసంధానము తాపసవత్సరాజమున చేయబడెనను వృత్తివాక్యమును తాపసవత్సరాజ గ్రంథభాగములను ఉదాహరించి స్పష్టముచేసెను. 'యత్రాపి తత్ప్రతీన ప్రతిభాసతే తత్రాపి వ్యంజకే రచ రాంతరే యద్వృష్టం సౌష్ఠవం తేషాం ప్రవాహపతితానాం దదేవాఖ్యాసా దవోద్ధృతానాయ వ్యవభాసతే ఇత్యవసాతవ్యమ్'[8] అను వృత్తి వాక్యార్థమును చక్కగా వివరించి ఉదాహరణమును చూపి హృదయంగమముగా నిరూపించును.

ప్రదర్శితదిగనుసరణము: ధ్వన్యాలోకము దిఙ్మాత్రముగా నుడివిన వానిని పాఠకుల వ్యుత్పత్తికొరకు లోచనము ప్రపంచించును.

అంగిరసవిరోధపరిహార క్రమమును ఉపదేశించి వృత్తి 'అనయా దిశా అన్యేऽపి ప్రకారా ఉత్ప్రేక్షణీయాః'[9] అని చెప్పెను. దానిని లోచనము ఈక్రింది విధముగా ప్రపంచించెను. అంగిరస 'విరోధులను' విభావానుభావములకు ఉత్కర్షమును కల్గించకూడదు. లేదా నివేశనమే చేయకూడదు అట్టి నివేశనము చేసినచో అంగిరసవిభావానుభావములను ప్రపంచింపవలెను. విరుద్ధ రసవిభావానుభావములు పరిపోషింపబడినను అంగిరసమునకు అంగములగునట్లు చేయవలయును. ఈవిధముగా అనేక ప్రదేశముల యందు ఉక్తార్థమును చక్కగా ఉపబృంహణము చేయును.

---

8. ధ్వ. పుట 358–59
9. ధ్వ పుట 384

విరోధపరిహారము: మొదటికారికలో 'కావ్యస్యాత్మా ధ్వనిః' అని ధ్వనికావ్యాత్మగా చెప్పబడినది. రెండవకారికలో

' యోऽర్థః సహృదయశ్లాఘ్యః
కావ్యాత్మేతి వ్యవస్థితః
వాచ్యప్రతీయమానాఖ్యౌ
తస్య భేదా వుభౌ స్మృతౌ'

అని కావ్యాత్మఅను అర్థము వాచ్యము ప్రతీయమానము అని రెండువిధములైనవి అని చెప్పబడెను. కావ్యాత్మధ్వని (ప్రతీయమానము) అయినచో ఇది వాచ్యము ప్రతీయమానము అని రెండువిధములగుట ఎట్లు పొసగును? ఇట్టి రెండుకారికల అర్థము పరస్పర విరుద్ధమై వ్యాహతమైనది. సాహిత్యదర్పణ కర్తయు ఇచ్చట గ్రంథము పూర్వాపర విరుద్ధమై ఉన్నది అని ఈ క్రిందివిధముగా నిరసించెను.

'యచ్చ ధ్వనికారేణోక్తమ్
అర్థః సహృదయ శ్లాఘ్యః
కావ్యాత్మా యో వ్యవస్థితః
వాచ్యప్రతీయమానాఖ్యౌ
తస్య భేదా వుభౌ స్మృతౌ॥

ఇతి అత్ర వాచ్యాత్మత్వం కావ్యస్యాత్మా ధ్వనిః ఇతి స్వవచనవిరోధా దేవాపాస్తమ్'

ఇచట లోచన మీ క్రిందివిధముగా వ్యాఖ్యానించి విరోధమును పరిహరించినది.

కావ్యము శబ్దార్థశరీరమనుటలో గాక శరీరమును పేర్కొనుటచేతనే ఆత్మ ఒకటి ఉండవలయునని తెలుచున్నది. శబ్దార్థమయమగు కావ్యమున స్థూలమగు ప్రాణిశరీరమువలె సర్వజనసంవేద్యమగు శబ్దము కేవలము శరీరభూతము. కతిపయ జనసంవేద్యమగుట అర్థము ఆత్మవంటిది. కాని అర్థమాత్రము కావ్యత్వ ప్రయోజకము కాజాలదు. లౌకిక కావ్యములు అర్థవంతమయినను కావ్యములుగా పరిగణింపబడుటలేదుగదా. అందుచే కావ్యమునందు వాచ్యార్థముకంటె భిన్నముగా కావ్యత్వ ప్రయోజకము

అగు ధర్మము వేరొకటి ఉండవలెను. అదియే ప్రతీయమానార్థము. అదియే నిజమగు కావ్యాత్మ. ఈ పై నుడివిన భావమే కారికకు అర్థము కాని కావ్యమునకు వాచ్యము ప్రతీయమానము రెండును రెండు ఆత్మలు అనికాదు. ఈ వ్యాఖ్యానమును చదివినపిదప కారికార్థము ఏతత్పరమనుట స్పష్టము అగును సాహిత్యదర్పణకర్త అంతటివాడుకూడ లోచనమును చదువనిచో ఇట్లు గ్రంథమును అర్థము చేసికొనలేక ఆత్మదోషమును గ్రంథకర్తకు ఆపాదింప సాహసించెనను ఈ అంశమే ధ్వన్యాలోకమును అర్థముచేసికొనుటకు లోచనము ఎంత ఆదర్శమైనదో తెలియజేయుచున్నది.

పూర్వ వ్యాఖ్యాన పరామర్శనము: లోచనము అక్కడక్కడ చంద్రికా వ్యాఖ్యానాంశమును ఉదాహరించి ఖండించును. మరియును ఇతరులు కొందరు వర్ణించిన అర్థములనుగూడ చెప్పి అవి యెట్లుపొసగవో చూపును. ఈవిషయము ధ్వన్యాలోకమున (చౌఖాంబా సంస్కృత సిరీస్-ప్రతి) 24, 27, 84, 120, 225, 241-44, 290, 305-306, 315-316, 321, 326, 333 383, 385-86, 394, 403-4, 478, 484, 520 పుటలందు చూడతగును. ఇంకొకచోట తనగురువులుచెప్పిన వ్యాఖ్యానమును సబహుమానముగా ఉదాహరించును (4-8, 115)

ఇచట మనము ముఖ్యముగ గమనింపవలసిన అంశము ఒకటి కలదు. ధ్వన్యాలోకము ధ్వనిసిద్ధాంతమును ప్రతిపాదించు ప్రప్రథమగ్రంథము. కావున తత్సిద్ధాంతము నంగీకరించువారికి అవి పరమప్రామాణికమైన గ్రంథము. వైదిక సంప్రదాయ ప్రకారము మూలమునలేని ప్రధాన విషయములను తరువాతివారు చెప్పినపుడుగాని మూలమున ఏవేని పరిష్కారములు చేయునపుడుగాని ఆయా అర్థములు మూలగ్రంథమునందు రహస్యముగా నిక్షిప్తములై ఉన్నవని సమన్వయముచే చూపుట ఆచారము. అభినవగుప్తుడును అట్లే పూర్వాపర గ్రంథసమన్వయము చేయుచు మూలమును చదువునపుడు తోచని అనేక నూత్నార్థములను చెప్పను. ఈక్రింది ఉదాహరణములు ఈ విషయమును స్పష్టముచేయును.

పద, వాక్య ప్రబంధ భిన్నములగు వర్ణాది భాషాభాగములకు కేవలము రసవ్యంజకతనుమాత్రమే ధ్వన్యాలోకము చెప్పినది. కాని ఇవి సంలక్ష్యక్రమమునుగూడ నొకప్పుడు ధ్వనింపచేయును. అది చివరకు రసమునందు పర్యవసించును అని అనుస్వానోపమాత్మేత్యాది కారికయందును సుప్తిఙ్ వచనేత్యాది కారికయందును క్లిష్టమగు అన్వయమును చేసి సాధించెను. ఇట్లే ధ్వన్యాలోకము శబ్ద శక్తిమూలమగు అలంకార ధ్వనినిమాత్రమే కంఠరవముచే అంగీకరింపగా లోచనము శబ్దశక్తిమూలకమగు వస్తుధ్వనిని కూడ అంగీకరించెను. కావున లోచనమున చెప్పిన ప్రతిభావము మూలమున కలదని భావింపక మూలమును బాగుగా పరిశీలించి ఏ అర్థము నిజముగా మూలమున అభిప్రేతమై ఉన్నదో ఏది వ్యాఖ్యానముచే కల్పింపబడినదో వివేకించి నిర్ణయించుకొనవలయును.

లక్ష్యలక్షణసమన్వయము: లోచనమునందెల్ల హృద్యతమమై సహృదయ హృదయ రసాయన మనదగు భాగము ఉదాహరణశ్లోకములపై వ్యాఖ్య. ఉదాహరణ శ్లోకములయందు లక్షణమెట్లు సమన్వయించునో చూపుటయేకాక దానియందుగల ప్రతి దళమును తీసికొని వాని వ్యంగ్యార్థములను చక్కగా వ్యాఖ్యానించును. ఈ వ్యాఖ్యానము చదివిన ప్రతి సహృదయునకును ధ్వనిపై నిరతిశయమగు గౌరవభావ మేర్పడుననుట అనపహ్నవనీయమైనది. అభినవగుప్తుడు అతని మార్గానుసారులగు తరువాతివారు పద్యములపై చేసిన రమ్యములగు వ్యాఖ్యానములే

ధ్వనిసిద్ధాంతవ్యాప్తికి ప్రధాన కారణమనినచో అతిశయోక్తికాదు.

సిద్ధాంత స్థిరీకరణము: 'భమధార్మిక విస్రబ్ధః' ఇత్యాది పద్యమున ప్రతీయమానార్థమును నిరూపించునపుడు లోచనము ధ్వనిసిద్ధాంతము నొకసారి సమగ్రముగా చాలనముచేసెను. ధ్వనిసిద్ధాంతమునకు ప్రధాన ప్రతిపక్షులయిన మీమాంసకుల అభిహితాన్వయాన్వితాభిధాన పక్షముల రెంటియందునను వ్యంజనా వ్యాపారము అవశ్యస్వీకార్యము అను అంశమును నూతనయుక్తులచే ప్రతిపాదించెను. ఆనందవర్ధనుడు వివక్షితాన్యపరవాచ్యమునందు లక్షణలేదని చెప్పినను వివక్షితాన్యపరవాచ్యప్రభేదమగు సంలక్ష్యక్రమమున లక్షణ ఉన్నది అని వాదించు అవకాశము కలదని అభినవుడు ప్రతిపాదించి అట్లయినను అసంలక్ష్య క్రమమువద్ద వ్యంజనాస్వీకరణము ఆవశ్యకము అని నిరూపించెను.

విపక్షదూషణ నిరాసము: లోచనము ధ్వన్యాలోకమునందు విపక్షులు చూపిన దూషణములను పేర్కొని వానిని ఖండించును. ఈ దూషణములు అనేకవిధములు, వ్యంజనా వ్యాపారమును నిరసించు ఖండనములేకాక రస మలంకారమగును అను ఈచ్ఛ శములగు అవాంతర సిద్ధాంతాంశ తిరస్కారములును ఇందు కలవు. అంతేకాక ఉదాహరణ పద్యములపై కూడ విమర్శనములు కలవు, లోచనమీ దూషణములను అన్నింటిని సమర్థముగా తిరస్కరించును. ఈ విపక్షులలో ప్రధానుడయిన భట్టనాయకుని ఖండనములను మాత్రమే పేరెత్తి లోచనము చూపును.

ఈ అంశములనేకాక ప్రసంగ సంగతిని అనేకములగు అమూల్యాంశములు లోచనమున ప్రతిపాదింపబడి యున్నవి. కావ్యప్రయోజనము, రస స్వరూప వివేకము వీనియందు ముఖ్యమయినవి.

ఇక లోచనముయొక్క ప్రామాణికతనుగూర్చి కొంచెము చెప్పవలసి ఉన్నది. అర్వాచీనాలంకారికులకు పరమ ప్రామాణికుడు విభిన్నములగు అలంకారప్రస్థానములను ధ్వన్యాలోకపుఒరవడిలో సమన్వయించి ఆలంకార శాస్త్రమునకు ఒక వ్యవస్థను ఏర్పరచిన మమ్మటభట్టు లోచనానుసారముగా పెక్కుచోట్ల సిద్ధాంతములను ప్రతిపాదించెను. ఉదాహరణమునకు లోచనమున ప్రతిపాదింపబడిన శబ్దశక్తి మూల వస్తుధ్వనిని, కాక్వాక్షిప్తము అగు వ్యంగ్యము గుణీభూతమగునను అంశమును మమ్మటభట్టుగ్రహించెను. ఇంతేకాక మీమాంసకు పూర్వపక్షమును తిరస్కరించునెడ లోచనమున ప్రతిపాదింపబడిన నూత్నయుక్తులను ఈతడు స్వీకరించెను. ఇక అర్వాచీనాలంకారికులందరును లోచనమును ప్రామాణికముగా గ్రహించిరి.

లోచనమును ధ్వన్యాలోకముపై భాష్యమని వర్ణించినచో ఒక్కమాటలో లోచన ధ్వన్యాలోకముల సంబంధము స్థూలముగా చెప్పబడినదగును.

# వక్రోక్తి జీవితము - రాజానక కుంతకుడు

శ్రీ శ్రీభాష్యం అప్పలాచార్య

రాజానకకుంతకుడు సంస్కృతాలంకారికులలో విశిష్టస్థానము నాక్రమించిన సాహిత్య విమర్శకుడు. క్రీ. శ. 11వ శతాబ్దమున కాశ్మీరమున నీతడుండి యుండునని చారిత్రికుల నిర్ణయము. భామహాదులచే నారంభింపబడి ధ్వనికారులవరకు సాగిన వివిధాలంకారిక ప్రస్థానములలో స్వతంత్రకల్పమగు నొక ప్రస్థానమున కాచార్యుడు కుంతకుడు.

వక్రోక్తియే కావ్యజీవితమను సిద్ధాంతమును అవగాహనము చేసికొనుటకు ముందు దాని పూర్వ చరిత్రము నర్థముచేసికొనవలెను. వామనాదులు వక్రోక్తి నలంకారముగ నంగీకరించిరి. తరువాతి వాడగు రుద్రటుడు వక్రోక్తి కిచ్చిన నిర్వచనమే ప్రామాణికముగ తరువాతి ఆలంకారికులచే నంగీకరింపబడెను. కాని ప్రాచీనుడగు భామహుడు వక్రోక్తిని ప్రత్యేకాలంకారముగ పరిగణింపలేదు అలంకారమే కావ్యమున ప్రధానమని యంగీకరించినను వక్రోక్తియే సర్వాలంకారములకు అలంకారత్వమును ప్రసాదించునదని భామహుని యాశయము. భామహుడు తన 'కావ్యాలంకారము'న కావ్యభేదములను పరిగణించుచు, కావ్యముగా పరిగణింపబడవలెననిన వక్రోక్తి యావశ్యకమని పేర్కొనెను. అలంకారములను నిర్వచించుచు అతిశయోక్తి నిర్వచనమున "సైషా సర్వైవ వక్రోక్తిః" అని అతిశయోక్తి వక్రోక్తుల కభేదమును చెప్పుచు అతిశయమే వక్రతయని నిరూపించెను. అదియే కావ్యతాపాదక ధర్మము అని నిరూపించుచు, వక్రోక్తిని ప్రత్యేకముగ నలంకారముగ పేర్కొనలేదు. వక్రోక్తి లేకపోవుటచె హేతు, సూక్ష్మ, లేశాద్యలంకారములను భామహుడు ప్రత్యేకాలంకారములుగ పరిగణింపలేదు. భట్టుకూడ వక్రోక్తిని ప్రత్యేకాలంకారముగ పరిగణింపలేదు. ఇట్లు భామహుడు వక్రోక్తిని వేరే అలంకారముగాకాక అలం-

కారముల కలంకారత్వమునిచ్చు నొక సాధనముగా అంగీకరించెను.

"సైషా సర్వైవ వక్రోక్తి
రనయార్థో విభావ్యతే,
యత్నోస్యాం కవినా కార్యః
కోऽలంకారోऽనయావినా॥"

అతిశయోక్తియే వక్రోక్తి. వక్రోక్తిచేతనే కావ్యార్థము భావింపబడును. కావ్యమున వక్రోక్తి సంపాదనము నకై కవి యత్నముచేయవలెను. వక్రోక్తిలేనినాడు శోభయేలేదు. మహాకావ్య నాటక, కథాదిభేదభిన్న మగు కావ్యప్రక్రియలలో నంతటను వక్రోక్తియుండి తీరవలెను. ఇట్లు వక్రోక్తిని సర్వాలంకారాంతర్లీన మగు నొక ప్రసాధకసామగ్రిగా బామహుడు పరిగణించెను ఈవక్రోక్తిని అతిశయోక్తితో అభిన్నముగ వ్యవహరించుచు లోకాతిక్రాంతగోచరత్వమే వక్రత యని బావించెను. సామాన్యమగు లోకవ్యవహారమున కాన్పింపని ఒకానొక చమత్కారమును లోకోత్తర విషయవర్ణనారూపముగ కావ్యవాఙ్మయమున నీ వక్రోక్తి భాసిల్లజేయుననియు అట్టి చమత్కార జనకతారూపమగు వక్రతలేనినాడు అది కావ్యముకానే కాదనియు భామహసిద్ధాంతము. అందుచేతనే దండిచే ఆదరింపబడిన స్వభావోక్తికి అలంకారత్వ మును భామహు డంగీకరింపలేదు.

దండి అలంకారనిరూపణమున ప్రథమమున స్వభావోక్తిని నిరూపించి పిమ్మట ఉపమాది సంకీర్ణాంతము అలంకారములను నిరూపించి స్వభావోక్తి కంటె ఇతరములగు నలంకారములన్నింటికి వక్రోక్తి యనుదానిని సమష్టినామముగా నిర్దేశించెను. కావ్య వాఙ్మయమాతయు స్వభావోక్తి, వక్రోక్తి అని రెండు విధములుగా నుండునని దండి పేర్కొనెను.

"ద్విధాభిన్నం స్వభావోక్తిర్వక్రోక్తిశ్చేతి వాఙ్మయమ్"

వామనుడు దండిభామహులకంటె విలక్షణముగ వక్రోక్తి నొక ప్రత్యేకాలంకారముగ పరిగణించెను. రుద్రటుడు దీనిని అర్థాలంకారముగ పేర్కొని నిర్వచించెను. ఆ నిర్వచనమే తరువాతి అలంకార శాస్త్రములలో వక్రోక్తి నిర్వచనముగా పరిగణింపబడుచు వచ్చినది.

కుంతకుడు శైవానిలో భామహ సిద్ధాంతము నాదరించి తన వక్రోక్తిజీవితమను కావ్యాలంకారమున వక్రోక్తికి కావ్యాత్మత్వమును ప్రసాదించెను.

కుంతకుడు తన కావ్యాలంకార ప్రారంభమున నితరాలంకారికుల రచనలుండగా తాను గ్రంథమును రచించుట లోకోత్తర చమత్కారకారి వైచిత్ర్యసిద్ధికని పేర్కొనెను. అతని మతమున లోకోత్తర చమత్కారకారివైచిత్ర్యమే వక్రోక్తి. ఇదియే కావ్యాత్మ. శాస్త్రాదులయందు ప్రసిద్ధమగుశబ్దార్థనిబంధముకంటె భిన్న మగు శబ్దార్థారోప నిబంధమే వైచిత్ర్యము లేదా వక్రత. ఇది ప్రసిద్ధ ప్రస్థానముకంటె భిన్నమై లౌకిక వ్యవహారసరణి నతిక్రమించియుండును.

వక్రకవి వ్యాపారశాలియగు బంధమున నిబంధింపబడిన శబ్దార్థములే కావ్యమని కుంతకుని కావ్య లక్షణము. శబ్దార్థములు ప్రసిద్ధములై చెప్పదలచిన యర్థమును చెప్పజాలినంతమాత్రమున కావ్యత్వము నందవు. సహృదయహృదయాహ్లాదకారులై స్వస్పంద సుందరములగు శబ్దార్థములే కావ్యమన జెల్లును. శబ్దార్థముల ప్రసిద్ధస్వరూపముకంటె అతిరిక్తమగు రూపమే కావ్యోపయోగియగు రూపము. అట్టి స్వరూపమే వక్రత్వము లేదా వైచిత్ర్యము అనబడును. శబ్దార్థములు భిన్నములైనను అరెంటిని అలంకరించునది వైచిత్ర్యరూపమగు వక్రోక్తి యొక్కటే. ఇది ప్రసిద్ధమగు నభిధావ్యాపారముకంటె భిన్నమగు విచిత్రాభిధావ్యాపారము. అదియే వైదగ్ధ్యభంగీభణితి. వైదగ్ధ్యమనగా కవికౌశలము. అట్టి కౌశలముచే

జనించు రామణీయకతతో విచిత్రమగు చమత్కారమును జనింపచేయు శబ్దవ్యాపారమే వక్రోక్తి. దండి వాఙ్మయమును స్వభావోక్తి వక్రోక్తిభేదముచే ద్వివిధమని యంగీకరించెను. కాని కుంతకుని మతమున స్వభావోక్తి అలంకారముకాదు. కావ్యమున శబ్దార్థ స్వభావమే వర్ణనీయమగునపుడు అదే దాని నెట్లు అలంకరించును? కావున నది అలంకార్యమేకాని అలంకారముకాదు. వక్రోక్తియే కావ్యశోభాహేతువు. అట్టి వక్రోక్తికి మూలము వక్రకవివ్యాపారము లేదా కవివ్యాపారవక్రత. ఇట్టి కవికౌశలముచే జనించు ఉక్తివైచిత్ర్యమే వక్రోక్తి. అదియొక భణితిప్రకారము. అది కవికౌశలాధీనము. వక్రోక్తికి విరుద్ధమగు స్వభావోక్తి అలంకారము కాదు. చమత్కారరహితమగు స్వభావప్రతిపాదనపరమగు శబ్దార్థ సమూహము కావ్యముకాదు.

అతిశయమే వక్రత యను భామహమతమును గూడ కుంతకుడు తన వక్రోక్తియందే యిమిడ్చెను. ప్రకర్షకాష్ఠాధిరోహరూపమగు నతిశయము వైచిత్ర్యమే. ఇది విచిత్రమార్గమున నావశ్యకము. ప్రసిద్ధ ప్రస్థాన వ్యతిరేకియగు భంగీభణితిచే తద్విదాహ్లాదము జనించును. అట్లు సహృదయహృదయాహ్లాదమును జనింపజేయు వైచిత్ర్యముగల శబ్దార్థములకే కావ్యత్వము. కావ్యమునకు కావ్యత్వము నాపాదింపజేయు సమస్త ధర్మములను కుంతకుడిందే అంతర్భవింపజేసెను. వక్రోక్తి కావ్యమున కలంకారము అనుటకూడ విచార సహముకాదు వైచిత్ర్యవంతములగు శబ్దార్థములే కావ్యమనునపుడు అందలి వైచిత్ర్యమును శబ్దార్థముల నుండి వేరుచేసి ఇది అలంకారమని చెప్పుట ఎట్లు పొసగును? వక్రోక్తిరహితములగు శబ్దార్థములు కావ్యమున నుండనే యుండవు. కావున వక్రోక్తి నలంకారముగ వేరుచేసిచూప వలనుపడదు. నిరలంకారములగు శబ్దార్థములకు కావ్యత్వమే యుండదు. ఉపమాద్యలంకారములన్నియు నీ వక్రోక్తియందే యంతర్భూతములగును. వక్రతా (వైచిత్ర్య) హేతుభూతమగు కవి కౌశల మనంతమగుటచే వక్రత ఇన్నివిధములని పరిగణనముచేయుట సాధ్యపడదు. కాని స్థూలముగ నీ క్రిందివిధముగ విభజింపవచ్చును.

1. వర్ణవిన్యాస వక్రత.

పూర్వాలంకారికులు శబ్దాలంకారములని నిరూపించినఅనుప్రాసయమకాదులిందంతర్భూతములగును.

పదసంబంధి వక్రత:— ఇది రెండువిధములు.

2. పదపూర్వార్ధ వక్రత:

3. పదపదార్థ వక్రత:

పదపూర్వార్ధవక్రత 9 విధములు:—

1 పర్యాయ వక్రత, 2 రూఢివక్రత. 3 ఉపచార వక్రత, 4 విశేషణ వక్రత, 5 సంవృతి వక్రత, 6 వృత్తివక్రత, 7 భావ వక్రత, 8 లింగవక్రత, 9 క్రియావక్రత;

పదపదార్థవక్రత 8 విధములు:-

1 కాలవక్రత, 2 కారకవక్రత, 3 సంఖ్యావక్రత, 4 పురుష వక్రత, 5 ఉపగ్రహ వక్రత, 6 నిపాతవక్రత, 7 ఉపసర్గవక్రత, 8 అవ్యయవక్రత.

4. వాక్యవక్రత:

ఇది సహస్రవిధములకన్పట్టుచుండును. వక్రత కవి ప్రతిభాధీనమగుటచే ప్రతిభవలె నిదియు ననంతమై భాసిల్లును. అలంకారికులచే నలంకారములుగా పేర్కొనబడిన ఉపమాద్యలంకారములును, రసవత్, ప్రేయ ఊర్జస్వి, సమాహితాలంకారములును ఇందే యంతర్భవించును. రసమును ప్రధానముగా నంగీకరింపక అలంకారాంగముగ నంగీకరించిన ప్రాచీనులవలెకాక రసమునకు ప్రాధాన్యమునిచ్చును. దానికి వైచిత్ర్య సంపాదకత్వము నాపాదించి వక్రోక్తియందు అంతర్భవింపజేసెను.

5. ప్రకరణ వక్రత:

**6.** ప్రబంధ వక్రత:

పై ఆరువిధములగు వక్రతలును వక్రోక్తి జీవితమున లక్షణోదాహరణములతో వివరింపబడెను.

భామహుడు రీతికి తదాశ్రయములగు గుణములకు ప్రాధాన్యమునీయలేదు కాని కుంతకుడు రీతికి ప్రాముఖ్యమునిచ్చి తత్ప్రకాశకములగు గుణములను వామనాదులకంటె భిన్నముగ వివరించెను. వామనాదుల మూడురీతులకు బదులు మూడుమార్గముల నంగీకరించెను. రీతులకు ప్రాచీనులు చేసిన నామ నిర్ణయమును కుంతకు డంగీకరింపలేదు. వైదర్భీగౌడీ పాంచాలీరీతులని దేశభేదముచే రీతిభేదమును కల్పించి తన్నామముచే వ్యవహరించుట సమంజసము కాదు. రీతి ప్రత్యేక ప్రదేశనియతము కాదు. దేశధర్మమును కాదు. కవిగతశక్తి వ్యుత్పత్త్యభ్యాసభేదముచే నీరీతి భేద మేర్పడును. కాని ఒకదేశములో ఒకేరీతి యుండవలెనను నియమములేదు. అంతేకాక వానిలో నుత్తమ మధ్యమాధమ భేదముకూడ సమంజసముకాదు. కవి స్వభావమే కవితాప్రస్థానభేదమునకు కారణమనియు తద్గతశక్తి వ్యుత్పత్త్యభ్యాసాది భేదముచె రీతిభేదము లేర్పడుననియు నీతని నిర్ణయము. అట్టి కవితామార్గములు మూడువిధములు:— 1 సుకుమారమార్గము, 2 విచిత్రమార్గము, 3 మధ్యమమార్గము. కొందరు కవులు సుకుమారమార్గముననే రచింప సమర్థులు. కొందరీవిచిత్రమార్గమున రచింప సమర్థులు.

సుకుమారమార్గమున అనాహార్యమగు కవి కౌశలముచే వర్ణనీయపదార్థ స్వభావముననే ప్రాధాన్యముతో రచన సాగును. ఇందు కల్గిన అలంకారాదులు అప్రయత్నసిద్ధములై సహజముగ భాసించును.

విచిత్రమార్గమున వక్రోక్తి వైచిత్ర్యమునకు ప్రాధాన్యము ఎక్కువగానుండును. ఇందు వర్ణనీయ పదార్థములు భావనాప్రకర్షచే సముద్దీప్తములై విచిత్రములై అలౌకికస్వభావముతో భాసిల్లును. రెండుమార్గములయందును ప్రతీయమానమగు రసముండవలెను. దాని సుకుమారమార్గమున స్వాభావికతకు రస మంగముగానుండును. విచిత్రమార్గమున రసాకూతము ననుసరించి అలంకారప్రబంధనము జరుగును. విచిత్రమార్గమే శక్తిమంతులగు కవులచే నాదరింపబడును. రెండుమార్గములలో నది క్లిష్టము. ప్రతిభావంతుడగు కవియే దానిని నిర్వహింపజాలును.

పై రెండుమార్గములయందుగూడ ప్రసాదము, మాధుర్యము, లావణ్యము, ఆభిజాత్యము అను నాల్గు గుణము లుండవలెను. మార్గభేదములచె వాని లక్షణములు భిన్నములుగా నిర్వచింపబడెను. అన్నిమార్గములయందును కావ్యమునకు ఔచిత్య సౌభాగ్యములు సామాన్యగుణములు. అవి లేనిచో కావ్యము కావ్యమై మనజాలదు

ఈత డలంకారములకు రసభావములకంటె ప్రాధాన్యమిచ్చిన భామహదండ్యాదుల మతము నవలంబించినను రసభావము లావశ్యకములని యంగీకరించి వానిని అలంకారవివరణముననూ, ప్రకరణప్రబంధవక్రతానిరూపణముననూ వివరించెను. రసభావములు కావ్యవక్రతాసంపాదకములని యీతని యాశయము. రసభావహీనము కావ్యమే కాదని నిర్ణయించెను.

*"నిరంతర రసోద్గార*
*గర్భసౌందర్య నిర్భరాః ।*
*గిరః కవీనాం జీవన్తి*
*న కథామాత్ర మాశ్రితాః॥"*

కేవల కథాప్రతిపాదనపరములగు శబ్దార్థములు కావ్యములుగా నిలువవు. అవి రసగర్భములై సౌందర్యవిలసితములైననాడే సజీవములై నిల్చును. ఇట్లు రసభావములను వక్రోక్తిసంపాదనపరములుగా కావ్యమున నంగీకరించియు వక్రోక్తికే ప్రాధాన్యమును కుంతకుడు సాధించెను ఇట్లు సర్వాలంకారములను,

రసాదులను వాక్యవక్రతలోనే అంతర్భవింపచేసెను. ప్రకరణప్రబంధవక్రతలలోగూడ రసధ్వని యంతర్భవించును. వస్తుధ్వన్యలంకారధ్వనులుగూడ వాక్యవక్రతలో జేరును. లక్షణామూలధ్వని ఉపచార వక్రతలో నంతర్భవించును.

ఇట్లు బామహునిచే స్థాపింపబడిన వక్రోక్తిని విశాలహృదయముగజేసి కావ్యాంగముల నన్నింటి నిందే యంతర్భవింపజేయుచు "వక్రోక్తి కావ్య జీవితమ్" అను సిద్ధాంతము నితడు స్థాపించెను.

కాని ధ్వనికారుల తరువాతిదగుటచే ధ్వనిసిద్ధాంతము నెదిర్చి నిలువజాలక ఈసిద్ధాంతము తరువాతి ఆలంకారికలోకమున ప్రచారమునందలేదు.

ఏది యెట్లున్నను వైచిత్ర్యమే కావ్యత్వసంపాదకమని నిరూపించి అనేకవిధముల దానిని దృఢపరచి కావ్యశోభాహేతువుల నన్నింటిని ఇందే అంతర్భవింపజేసిన రాజానకకుంతకుని సిద్ధాంతము పరమరమణీయము.

# దక్షిణాపథమందలి బౌద్ధమతము

శ్రీ శిరుగూరి హనుమంతరావు

గౌతమబుద్ధుఁ డొక చారిత్రక పురుషుఁడు. ఈ మహనీయుని 2500 వ జయంత్యుత్సవము 25—5—'56 న భరతఖండమందంతటను జరుపఁబడినది. ఈతఁడు శిశునాగవంశమునకుఁ జెందిన బింబిసార, అజాతశత్రువులను రాజులకు సమకాలికుఁడు. పై రాజులిరువురు బుద్ధునియెడఁ దమకుఁగల భక్తిని ప్రకటించుటను అజంతాలోని పదునారవ గుహలోని రెండు చిత్రములు తెలుపుచున్నవి

బింబిసారుఁడు పర్షియన్ చక్రవర్తియైన "సైరస్"కు సమకాలికుఁడు. సైరస్ పుత్రుఁడు డెరయస్ (Darius) హిందూదేశములోని వాయవ్య ప్రాంతమును దన రాష్ట్రములలో నొకదానినిగాఁ జేసికొనెను. ఎకెమినిడెస్ (Achaeminides) లలోఁ గడపటివాఁడగు మూఁడవ డెరయస్ (Darius) క్రీ॥ పూ॥ 330 లో నలెగ్జాండరుచే నోడింపఁబడెను. అలెగ్జాండరు భారతదేశముపై దండెత్తి పురుషోత్తముఁడను రాజు నోడించెను. అలెగ్జాండరు క్రీ॥ పూ॥ 323లో చనిపోయెను. చంద్రగుప్తమౌర్యుడు హిందూదేశపు మొదటిచక్రవర్తి (322-299). అతని మనుమఁ డశోకుఁడు (క్రీ॥ పూ॥ 273 – 232) గ్రీకుదేశముతో నంతర్జాతీయసంబంధములను గలిగియుండెను. క్రీ॥పూ॥ 200 నుండి బాక్ట్రియను గ్రీకులు (యవనులు) హిందూదేశముపై దండెత్తుచుండిరి ఆ రాజులలో నొకఁడైన "మెనాండర్" (Monandar) క్రీ॥ పూ॥ మొదటి శతాబ్దిలో బౌద్ధమతమును స్వీకరించి "మిళిందుఁడ"ని పేరుబడసెను. క్రీ॥ పూ॥ 2వ శతాబ్ద్యుత్తరార్ధములో వారి ప్రాబల్యము ముత్రా (Muttra) వఱకు వ్యాపించినది. ప్రథమశతాబ్దాంతములో పహ్లవులు హిందూదేశ వాయువ్యప్రాంతమును కొలఁదికాలము పాలనచేసిరి. వారు మఱల "యుచ్" (Yuch-chi) అను తెగవారిచే జయింపఁబడిరి. కనిష్కుని యేలుబడిలో (క్రీ॥ శ॥ 2వ శతాబ్ది)

శాసనములలో హైదరాబాదు పురాతత్త్వపరిశోధక శాఖవారు కనుగొనిరి 'మాస్కి' శాసనములో 'దేవతలకు ప్రియమైనవాఁడు' 'దేవానాంప్రియ' 'ప్రియదర్శి' యని అతని బిరుదములేగాక "అశోకుడ"ని అతనిపేరును లిఖింపఁబడినది. బౌద్ధమత సహనశక్తికి అశోకుని పండ్రెండవశాసనము సాక్షీభూతము అందు 'అన్నితెగల ప్రజలు గౌరవార్హులు' అని తెలియఁబఱచినాఁడు.

1941-42 లలో హైదరాబాదునకు 43 మైళ్ళ దూరములోఁగల 'కొండాపూరి' దగ్గర త్రవ్వకములు చేసిరి. ఈ కొండాపురము పురాతన ఆంధ్రరాజ్యములో నుండిన ముప్పది దుర్గములలో నొకటియైనట్లు 'మెగస్తనీసు' పేర్కొనెను. కొండాపురమువద్ద దొరికిన వస్తువులలో నజంతాశిల్పములతో సరితూగఁగల టెర్రకోట (Terra-cotta) బొమ్మలు (మట్టితో జేసిన బొమ్మలు) వివిధములైన కేశాలంకరణములు గలవు. దక్షిణాపథమునం దారంభదశలోని మృద్వస్తు సంబంధమైన కళ శిల్పచిత్రకళలస్థాయి కించుమించుగాఁ జేరుకొన్నది

క్రీ॥ పూ॥ 3వ శతాబ్దినుండి క్రీ॥ శ॥ 3 శ॥ వఱకు దక్కను సంతటిని ఆంధ్రశాతవాహనులు పరిపాలించిరి. కొలఁదికాల మమరావతి (ధాన్యకటకము, ధరణికోట) వారి రాజధానిగా నుండెను. అది 7700 మంది విద్యార్థులతో విశ్వవిద్యాలయ (మునకు) కేంద్రస్థానమై విఖ్యాతికెక్కినది. అమరావతి దగ్గఱ దొరకిన బౌద్ధావశిష్టము భారతదేశమందలి (ప్రారంభ) కళావిర్భావమునకు మచ్చుతునకగా భావింపఁబడినది. హైదరాబాదునందలి చిత్రవస్తు ప్రదర్శనశాలలో అమరావతియందలి కొన్నిమాదిరి శిల్పములు ప్రదర్శింపఁబడినవి. అమరావతీశిల్పము అజంతాచిత్రములవలన నొక విషయము మనకు విశదమగుచున్నది. అజంతాశిల్పము భావములో నాంధ్రుల కతిసన్నిహితమైనది. ఇది గుప్తులకు సంబంధించినదే యనుట న్యాయసమ్మతముగాదు. అమరావతిలోని కళాభివృద్ధి ఉత్తరహిందూస్థానములోని కళాభివృద్ధికి దారితీసినది. అమరావతిలోని జాతకకథాచిత్రములను, అజంతాలోని కొన్ని చిత్రములను ప్రక్కప్రక్కన పెట్టిచూచినచో వానిభేదమును గనుగొనుట కష్టము. ఉదాహరణమునకు చాంపేయజాతకథలందుఁ జూపఁబడిన స్త్రీచిత్రములకు, అజంతా స్త్రీచిత్రములకు సామ్యమున్నది. అమరావతీ, అజంతా శిల్పచిత్రకారులిరువురు నొకే కళాసంప్రదాయముచే సమానముగాఁ బ్రేరేపితులయిరి అమరావతీ స్థూపముపై చెక్కఁబడిన కొన్ని చక్రములు, అజంతా 14వ గుహలోని చెక్కడములను బోలియున్నవి. ఆంధ్రరాష్ట్రము తన చిహ్నముగా నమరావతీ శేషమందలి ధర్మచక్ర, కుంభములను, అశోకుని సింహమును నుంచినది.

హీనయాన మనుపేరఁ జరగు బౌద్ధమత మారంభదశలో చాల సరళముగ నుండినది. వారు బుద్ధుని యవశేషములను బూజించిరి. అవశేషములపైన స్థూపములను, గోళాకారమైన కట్టడములను నిర్మించిరి. బుద్ధవిగ్రహమును, బుద్ధుని పాదములను, ధర్మచక్రమును, బోధివృక్షమును, ఱాతిపై మలఁచిరి. ఇట్టి సాధారణమైన బుద్ధుని యారాధన అతని ప్రవచనముల పఠనముచేఁ బరిపూర్ణము చేయఁబడినది.

బౌద్ధధర్మములు వినయ, సుత్త, అభిదమ్మ — అనుభాగములుగల త్రిపీటకములలోఁ బొందుపరుపఁబడినవి. సుత్తమును ఐదు నికాయములుగా విభజించిరి. అందు ఖుద్దనికాయమను భాగము ధర్మపథమునుగూర్చి చెప్పును. (అతఁడు నన్ను తిట్టెను, నన్ను కొట్టెను, నన్ను జయించెను, నాసొత్తు నపహరించెను అను భావములు గలిగిన మానవుఁడు తన ద్వేషములను బోగొట్టుకొనఁజాలఁడు. అపరిశుద్ధా

బౌద్ధమతము మధ్య ఆసియా, దూరప్రాచ్యములకు వ్యాపించినది.

క్రీ॥శ॥ మొదటి శతాబ్దిలో "భారత-రోము" రాజ్యములమధ్య వాణిజ్య, సాంస్కృతిక సంబంధము లుండినవి (Periplus of the Enythrean sea) అను "ఈజిప్టియన్-గ్రీకు" దినచర్య గ్రంథమున (Log book) పైఠాన్ (ప్రతిష్ఠానపురము), మచిలీ పట్టణము (మసాలియా), బ్రోచ్ (బరిగజా), టెర్ (టగారా) లు దక్షిణాపథమునందలి ముఖ్య వర్తక కేంద్రములని ఉల్లేఖింపఁబడినవి. అతిసున్నితమైన రవసెల్లాలు మచిలీపట్టణమునం దుత్పత్తి యగు చుండెడివి. అజంతాచిత్రములందలి సుందరులు ధరించిన వస్త్రము లుల్లిపొరలవలె నుండెడివి. కళింగదేశమునం దతిసున్నితమైన వస్త్రములనుగూర్చి "పెరిప్లస్" [1] అను గ్రంథమునఁ జెప్పఁబడినది.

క్రీ॥పూ॥ 5వ శతాబ్దినుండి క్రీ॥శ॥ 2వ శతాబ్ది వఱకు దక్కనుభూమి ప్రపంచమునందలి వివిధ జాతులకు సమావేశస్థానమై యుండినది. అజంతా చిత్రములు బౌద్ధమతమునందలి జాతిమతరహిత విధానవిషయమును స్పష్టముగాఁ దెలియఁజేయు చున్నవి. బౌద్ధమతము గ్రీకు, పర్షియన్, శక, పల్లవ, హూణ, కుషానులు మొదలగు నన్ని జాతుల ప్రజలకును స్వీకరించుట కనువుగ నుండినది. దక్షిణాపథము హిందూదేశమునకు హృదయము వంటిది. చరిత్రగతిలో నిది వివిధసంస్కృతులకు కూడలిస్థానము.

1910 లో నాంగ్లపరిషత్తునం దొసఁగిన యుపన్యాసములో రాధాకృష్ణపండితుఁడు బుద్ధునిగూర్చి "మహోన్నతులగు మానవులలో గౌతమబుద్ధుఁ డొకఁడు. ఇతఁడు జాతిచరిత్రలో నొక నూతన శకము నారంభించిన మహనీయుఁడు. ఆయన సందేశము లోకదేశమునకేగాక సార్వజనీనములని శతాబ్దులు గతించుకొలఁదిని యాయన యౌన్నత్యము పెరుగునని, మేధావంతులుగూడ నాయన మతము పట్ల గౌరవప్రతిపత్తులను గలిగియుందురని, ఇతఁ డుపనిషత్తుల కొక వినూత్నభావపటిష్ఠతను గలుగఁ జేసినవాఁడని, ఇతని మతమొక క్రొత్తమతముగాక యొక ఉత్కృష్టమైన జీవితవిధానమని, నవజీవనమున కనుగుణముగ రూపొందింపఁ బడినదని" నుడివినాడు. [1]

బుద్ధుఁడు ధర్మమును ప్రవచించెను. ధర్మచక్రము ప్రపంచధర్మస్థాపన కొక చిహ్నము. ఈ ధర్మము మానవుని మతవిశ్వాసములకంటె నుదాత్తమైనది. మానవుఁడు తన ధర్మములను నియమముతో నిర్వర్తింపవలెనను భావనయే ధర్మము. [2] మానవుని నైతికవిలువలకు సంబంధించిన యీ ధర్మచక్రమునే మనము రాజచిహ్నముగా స్వీకరించితిమి. అది మన జాతీయపతాకమున మధ్యనున్నది. దానికెట్టి మతప్రసక్తియులేదు. ఈ ధ్వజముక్రింద పనిచేయు వారందఱకును సత్య, ధర్మ, సద్గుణములను మూడు నియమములను గలవారై యుండవలయును. సంయమనముచే మానవుఁడు ప్రపంచకల్యాణమును సాధింపఁగలఁడని బౌద్ధమతము చెప్పుచున్నది. "ఈ ధర్మచక్రమే యనంతసృష్టికి సూచికాప్రాయమైన కాలచక్రము"ని రాధాకృష్ణపండితుఁడు నుడివి యున్నాఁడు.

అశోకుని శిలాశాసనములలో ధర్మముపై నెన్నియో బోధలు గలవు. అశోకుని కాలమునందలి ధర్మప్రవచనములను గూర్చిన విషయములను 'మాస్కి' 'కోబాల్' అను స్థానములందు దొరికిన

1. Ajanta Text Part III. P. 26 and Plates XXIV to XXVII.

1. A Source book of Indian Philosophy – Dr. S. Radha Krishna and charles A. More 1957 O. V. P
2. Discovery of India By Nehru P. 98.

త్ములు, అసత్యభాషణులు, ఆత్మనిగ్రహరహితులు, పీతాంబరము (Yellow rode) ధరింప నర్హులుగారు. అజంతా 2వ గుహాలోని చిత్రములు, శిలాశాసనములు బౌద్ధమతమును స్వీకరించుట కవసరమగు నర్హతలను బేర్కొనియున్నవి. వారి యాశ్రమవాస మీవిధముగ వర్ణింపఁబడినది.

"నివసంతి హి యత్రైవ
శాంతాః సద్గుణభూషణాః
తన్మాంగళ్యం మనోజ్ఞం చ
తత్ తీర్థం తత్ తపోవనమ్"॥

సహనముగల ముని కథయొక టీవిధముగఁ జెప్పఁబడినది. ఒక కోపోద్దీపితుఁడైన రాజు ఒక ముని శరీరమును అంగాంగములుగాఁ ఖండించివేసెను. అయినను ఆముని శాంతము నిసుమంతయు కోల్పోవక ఆ రాజు నాశీర్వదించెను.

"గాత్రచ్ఛేదే వ్యక్తశాంతిధీరం
చిత్తం తస్య ప్రేక్షమాణస్య సాధో!
నాసీత్ దుఃఖం ప్రీతియోగం నృపం తు
భ్రష్టం ధర్మాత్ వీక్ష్యం సంతాప మాప"॥

ఇసీబియస్ అను గ్రీకుతత్త్వవేత్తయం దీభావమే ప్రతిధ్వనించుచున్నది. "నేను ఏమానవునకు శత్రునిగాగాక ప్రతిమానవునకు స్నేహితునిగా బ్రతుకునట్లు దీవింపుము. నేను ఏమానవునకు కీడును జేయకుందుముగాక! ఇతరులు నాకు కీడు చేయునెడల నేను వారికి కీడు చేయకయే తప్పించుకొనునట్లు చేయుదువుగాక! మంచినే చేయుదునుగాక! సర్వమానవుల క్షేమమునే నెనెప్పుడు కోరుచుందునుగాక! ఒకరి కష్టములలో నేను సంతోషపడకుందునుగాక! చెడుకాలము నుగూర్చి మాటాడుచు కాలము వెళ్ళబుచ్చక మంచివారి ననుసరించెదనుగాక!

బౌద్ధమతమునం దున్నతభావములకుఁ బ్రాధాన్య మీయఁబడినది. దీనులయెడ కరుణకలిగియుండుట, ఆగ్రహావేశపరులయెడ శాంతమును జూపుట, ఆత్మత్యాగమొనరించియైనను దయనుజూపుట, భూతదయ గలిగియుండుట మానవులనేగాక జంతువులనుగూడ ప్రేమించుట మొదలగు విషయములన్నియు భావవిశదీకరణముతో నజంతాచిత్రములందు చిత్రింపఁబడినవి. జ్ఞానోదయమువలనఁ గలిగిన మహిమతోఁ బోల్చినపుడు రాజలాంఛనములు క్షుద్రముగా భావింపఁబడుచుండెడివి.

ప్రఖ్యాత చైనాయాత్రికుఁడు ఫాహియాన్ హిందూదేశమునందలి దివ్యస్థలముల నన్నిఁటిని సందర్శించెను, బహుశః అజంతాకూడ సందర్శించియుండును. అతఁడు హిందూదేశమునుండి తిరిగి పోవునపుడొక 'తుఫాను'లో 'ఓడపగిలి' చిక్కుదశలో నుండగా నాతఁడు బుద్ధభగవానుని మనఃపూర్వకముగా "ఓం మణిపద్మేహుం" అను మంత్రమును జపించి తన్నుతాను రక్షించుకొనెను. "కమలమునందున్న ఓదివ్యమణీ" అని దీని సామాన్యార్థము. "నాలో అంతర్లీనమైయున్న ఓ భగవంతుఁడా" అని ఆయన భావము.

సత్యాన్వేషణకై హిమాలయమార్గములగుండ వచ్చు తీర్థయాత్రికులను వర్ణించు "నికోలస్ రోరిక్" (Nicholas Revevich) చె వ్రాయఁబడిన చిత్రపటము భాగ్యనగర నిజాముకళాశాలా గ్రంథాలయ మందిరమునందున్నది ఈ చిత్తరువు అడుగుభాగమున "ఓం మణిపద్మేహుం" అను గూఢమంత్రము వ్రాయఁబడినది. మానవసంక్షోభావమునకు కళయొక సాధన మని రోరిక్ భావించెను. ఇతఁడాశ్లోకభావములను సుమారు 300 చిత్రములలో చిత్రించినాఁడు.

మతసంబంధమైన కార్యక్రమములందును పూజాసేవయందును ప్రముఖపాత్రను నిర్వహించిన స్త్రీలనేకులు బౌద్ధమతమందు గలరు. బౌద్ధమతమునకుఁజెందిన సన్యాసినులు "థేరీగాథ" లేక "సోదర

1. The Dhavmapada by Sri S. Radha Krishna 1950 O. U. P.

భక్తిగీతము" అనెడి పుస్తకములను సంకలనము చేసిరి. అందొకపద్యమునందు బౌద్ధమతగమ్యస్థానమగు "నిర్వాణము"ను గూర్చి యీవిధముగఁ జెప్పఁబడినది. "కోర్కెలను- ద్వేషమును, అహంకారమును జయించి మానసికశాంతి ననుభవించుటయే నిర్వాణము" ఇంతకంటె వేఱు ఆనందములేదు. నిర్వాణమనఁగా మిక్కిలి యుత్కృష్టమైన బ్రహ్మానందము లేక ఇహలోకసంబంధమైన భయదుఃఖముల నుండి విముక్తిఁ బొంది ఆముష్మికసుఖమును బొందఁగలుగుట అది చావులేనిస్థితి, అనఁగా నమరత్వము బొందుటయే. హిందూవేదములందు చెప్పఁబడిన భగవంతుని నిజస్వరూపమును దెలిసికొను దశలే "మోక్షము" లేక "అపరోక్షము"లతో నీ 'నిర్వాణము' సమానమైనది.

అజంతాగుహలలో 2వ శతాబ్దియందు చిత్రింపఁబడిన 10వ గుహయందు నట్టువరాండ్రు, సంగీత విద్వాంసులతోఁగూడిన పదునైదుగురు కళాకారులు గల చిత్రము చిత్రింపఁబడినది. మతసంబంధమైన ప్రక్రియలలో సంగీతమొక యున్నతస్థానమలంకరించినది. సంఘారామజీవితమునందు మతసంబంధమైన గీతాలాపకులుండు ప్రదేశమునకు మిక్కిలి గౌరవనీయమైన స్థానముండెడిది. అజంతాలోని స్త్రీమూర్తి చిత్రములు వారియొక్క శ్రేష్ఠమైన చిత్రకళకు నిదర్శనములు. స్త్రీమూర్తి చిత్రములలో నసభ్యత యనునది లేక చిత్రములన్నియు సౌకుమార్యముగలిగి మిక్కిలి యుచితమైన భంగిమలలో నున్నవి.

16వ గుహలోని మాతాశిశువులు యశోధరా రాహులుల చిత్రము గౌతమబుద్ధుని భార్యాపుత్రులను దెలియఁజేయుచున్నది. గౌతముఁడు సిద్ధార్థుఁడయిన పిమ్మట తన జన్మస్థలమైన కపిలవస్తును దర్శించినటుల నక్కడా యశోధర యాతనికి భిక్షయిచ్చుచున్నట్లు గలదు. ఆమె ముఖములో నీ పరివ్రాజకుఁడే తన భర్తయా యనునట్టొక విస్మయభావము కూడ కనఁబడును. ఆమెకు అతఁడొక మానవాతీతుఁడుగా గోచరించెను. ఒక ఉన్నతమైన మతప్రవృత్తిని మానవసహజమైన ప్రేమానురాగములలో నీచిత్రమును మేళవింపఁజేసెను. ఈక్రింది కథకూడఁగలదు. "ఓ సిద్ధార్థా! రాహులుఁడు జన్మించిననాటి రేయి నీవు ఈ రాజ్యమును వదలి నిశ్శబ్దముగా వెడలి పోయితివి. నేఁడు నీవంతకంటె దివ్యమైన రాజ్యమును బొందితివి." లారెన్సు బినియన్ ఈచిత్రముపై వ్యాఖ్యానించుచు "ప్రపంచములో నింత లలితమై, హృదయమును గదలించు చిత్రమింకొకటి లేద"నెను. ఇటాలియన్ చిత్రములలో "మెడోనా" (Madona) చిత్రమునకు దీనిని పోల్పవచ్చును. 1

క్రీ॥ శ॥ మొదటిశతాబ్దిలో మహాయానమత మభివృద్ధిచెంద నారంభించెను. మహాయానమనఁగా జ్ఞానమునుసంపాదించు మార్గము లేక జ్ఞానసంపాదనోపకరణమని యర్థము. ఈ మతమువారు కేవలము స్తూపమును, చెట్లను, బుద్ధుని పాదములను బూజించుటయేగాక బుద్ధుని యంశములను సిద్ధాంతీకరించి వారిని బోధిసత్త్వులని పిలిచి బౌద్ధమతమునకొక వసుధైకగుణము నిచ్చిరి. తమతోటివారందఱిలోను విముక్తిని బొందవలెననెడి చైతన్యము కలుగునంత వఱకు తమ విముక్తికి పాటుపడరాదు. సర్వమానవులయెడ ప్రేమ, దయ గలిగియున్నట్టి బోధిసత్త్వులతోఁ గూడిన భగవద్భక్తుల ప్రణాళిక నొకదానిని మహాయానమతావలంబకు లేర్పాటుచేసినారు. ఇది హిందూమతమునందలి భక్తిశాఖతో నెక్కువ సామ్యమును గలిగియున్నది.

అమరావతికి దగ్గఱనున్న నాగార్జునకొండయందు క్రీ॥ శ॥ 2వ శతాబ్దిలో మిక్కిలి ఘనతకెక్కిన

1. Ajanta Paintings Lalitakala Acadamy New Delhi 1956.

బౌద్ధతత్త్వవేత్తయగు నాగార్జునుఁడుండినట్లు చారిత్ర కాధారములు గలవు. బౌద్ధవాఙ్మయమును ప్రజ్వ లింపఁజేసిన నల్వురి సూర్యులలో నాగార్జునుఁ డొకఁడు. ఈతనిమేధ యత్యున్నతమైనది. నాగార్జు నుఁడు రసవాదవిద్య నెఱింగినవాఁడు. ఇతఁడు సుశ్రుతమును బునర్విమర్శించెను. కాక్ష్యపుట, తంత్ర రసరత్నాకర, ఆరోగ్యమంజరి యను గ్రంథములను సంస్కృతములో వ్రాసినట్లు చెప్పఁబడుచున్నది. నాగార్జునుని రసాయనికశాస్త్రపిత యని పిలువ వచ్చును. తన సమకాలీనపురాజులలో నొకని కితఁడు నీతివచనములతో నొప్పు నొక సుహృల్లేఖ నీరీతిని వ్రాసెను. "*ఉచ్చస్థితినందుటకు నీతి యాధారము గావున గంభీరముగ నిర్దోషిత్వముతో, నిష్కళంక మగు, పరిశుద్ధమగు నీతిని ప్రతిమానవుఁడు ప్రక టింపవలెను. మోసము, ఆత్యాశ, మోహము, సోమరితనము, గర్వము, లోభిత్వము, అసహనము - వీనిని మానవులు శత్రువులుగా భావింపవలెను. సహనము నలవఱచుకొనుట మానవునకు చాల మంచిది. జితేంద్రియుని లోకైకవీరునిగాఁ బేర్కొన వలెను. లోకపుపోకడల నెఱింగినవారు ఇహలోక సంబంధమైన లాభనష్టములు, సుఖదుఃఖములు, కీర్త్యపకీర్తులు, దూషణభూషణములయెడ సమ భావమును గలిగియుండవలెను, చేయిగాని, కట్టు కొనిన వస్త్రముగాని కాలునపుడు దాని నార్పివేయఁ జూతుము. అదేవిధముగ నాత్మ కోరికలతో కళంక మైనవు డాకోర్కెలను జంపివేయుటకు ప్రయత్నము చేయవలెను. ఏలయన అది కోర్కెను జంపుటకు మాత్రమే ఇంతకంటె నెక్కువ చేయవలసిన యావ శ్యకమేమియులేదు.*[1]

అజంతా మొదటిగుహలో "*పద్మపాణి*" యైన బోధిసత్త్వుని, యపారమగుదయతో ప్రాణికోటినంతను నవలోకించుచున్న అవలోకితేశ్వరుని చిత్రములు ఆంధ్రదేశములోని ప్రతిగృహమునందును గాన నగును. బౌద్ధులసంఘము "సంగరత్న" మనిపూన వంటిది. ఇది భారతదేశమందలి లెక ఆసియా యందలి చిత్రకళకంటె మిక్కిలి గొప్పగా భావ ప్రకటనము చేయఁబడిన కళాఖండముగాఁ బరిగ ణింపఁబడినది. ఇది కిరీటములనుండి మోకాలికి కొంచెము క్రిందివఱకు 5 అ. 6 అం ఎత్తుగలిగిన చిత్తరువు. ప్రపంచకళాచరిత్రలో దీనికి సరితూగ గలిగినది "లియొనార్డోవించి" ( ) చిత్రించిన "లాస్టుసప్పర్" మాత్రమే. ఈచిత్రమును చిత్రించిన చిత్రకారుడు కాలగర్భములోఁ గలిసి పోయినను కాంతి తగ్గుచున్న యీచిత్ర మున్నంత కాలము ఆ అజ్ఞాతకళాకారుని గొప్పతనము వెనోళ్ళ జాటఁగలదు.[2]

ఈ కళాఖండమునందలి పూర్వరంగము గంధర్వులు, కిన్నరులు, వృక్షములు మొదలగు వానితోఁగూడి సహజత్వముతో నొప్పుచు నమితానంద మును గూర్చుచున్నది. అక్రేషియన్ చిత్రమునందలి ద్వారపాలకుఁడు, పరిచారిక - విరు అబిసీనియా, పర్షియాదేశములకుఁ జెందినట్లు కనబఱుపఁబడినది.

క్రీ॥ శ॥ 4, 5 శతాబ్దములందలి యనేకచిత్ర ములలో హిందూదేశములో వివిధభాగములకుఁ జెందిన ప్రజలేగాక ముఖ్యముగా పర్షియా, బాక్ట్రియా, ఆఫ్ఘనిస్థాన్, బర్మా, సిలోన్, మలయా, చైనా, జపాన్ మఱియు ఆఫ్రికాదేశస్థులుకూడఁ గలరు. హీనయాన మునుండి మహాయానమునకు మార్పుచెందినపుడు మధ్యజరిగిన విషయములన్నియు 19, 26 గుహ లలో సోదాహరణముగాఁ జిత్రీకరింపఁబడినవి. ఈ రెండును చైత్యములే. 19వ గుహ ఒక దివ్యమైన దేవళము. హిందూదేశమునందలి బౌద్ధుల చిత్రకళ కిదియొక పరిపూర్ణమైన మచ్చుతునక. ఇందలి చెక్క

1. The legacy of India (O. U. P) Prop Das Gupatas article on Buddhism.

2. The Early history of the Deccan by G. Yazdami P. 766 O. U. P. 1960.

డముల, కట్టడముఁరీతి పనివారి పరిపూర్ణమైన నైపుణ్యము. వారికిఁగల గొప్ప సంస్కారాభిరుచిని యెలుగెత్తి చాటుచున్నవి. అచట వివిధ ధ్యానముద్ర లలోనున్న బుద్ధుని శిల్పము లనేకములున్నవి. మొదటి చైత్యములకు వీనికిఁ గల భేదమేమన "దగోబా" ముందటిభాగమున బుద్ధుని చిత్రము ప్రముఖముగఁ గనఁబడును. ఈ చిత్రములందు బుద్ధుని ప్రసన్నవదనములోఁ జూడవచ్చును. ఇందలి బౌద్ధకళ ఇతర సమకాలిక కళారీతులకు ప్రాచీన రోమనుపద్ధతులకును భిన్నత్వము గోచరించును.[1]

26వ గుహ యతివైభవమగు చెక్కడములతో చెక్కబడిన మఱియొక చైత్యాలయము క్రీ॥ త॥ 640లో ఈ గుహ ప్రఖ్యాత చైనాయాత్రికుఁడు "హుయాన్‌త్సాంగ్" దర్శించియుండవచ్చును. ఈ గుహలోనే బుద్ధుని నిర్యాణగాథ చిత్రింపఁబడి యున్నది. ఇందలి శిల్పము పొడవు 25′ లకుపైగా నుండును. బుద్ధుని ముఖము శాంతి నిర్మలత్వము లతోఁగూడి గాఢనిద్రలో నున్నట్లుగాఁ దోచును: ఆ బుద్ధుని పాన్పుదగ్గఱ బౌద్ధసన్యాసులు, సన్యాసినులు ఇరువదిమంది అతని నిర్యాణమునకై విలపించుచున్నట్లు గలదు. "నీవే ఒక జ్యోతిపై వెలుగొందుము. నిన్ను నీవే రక్షించుకొనుము. ఇతరులను శరణువేడ యత్నింపకుము. సత్యమే నీకు జ్యోతి యగుగాక!" ఇది యాతని తుదిసందేశము.

చైత్యములనఁగాఁ బ్రార్థనామందిరములు, విహారములు, విశాలమైన గదులు, అవి బౌద్ధభిక్షువుల వాసస్థానములు. అందు విద్యార్థులు, గురువులు ఉండెడివారు. కాలక్రమమున నీ విహారములందు ధ్యానముచేయుటకు, పూజలకొఱకు శిల్పములు చెక్కఁబడినవి. హిందూదేశమున ఱాలను మలఁచి నిర్మించిన దేవాలయము క్రీ॥ శ॥ 4వ శతాబ్దమునకుఁ

1. Ajanta Part IV Text by G. Yazdani P. 13

జెందినది. అందలి మొదటిగుహ మిక్కిలి రమణీయమైనదిగా నెంచఁబడినది. ధర్మచక్రముద్రగలిగి బోధ చేయుచున్నరీతిలో బుద్ధభగవానుని పెద్ద ప్రతిమ గలదు. ఇది "సారనాథ్" నందలి "డర్‌పార్క్" నందు బుద్ధుఁడిచ్చిన మతోపన్యాసమును సూచించు చున్నది. ఈతఁడు తన మొదటి యుపన్యాసములో "పుట్టుక - వార్ధక్యము - అనారోగ్యము - చావు - వ్యసనములతోకిడి - ఆశలీడేరకుండుట - అనున వన్నియు జీవితములోని బాధల"ని తెలిపి యున్నాఁడు. అన్నిఁటికిని మించినబాధ ఆశలీడేర కుండుట. పంచేంద్రియములతో నీప్రపంచమును బట్టుకొని యూగులాడుట యొక పెద్దబాధ. ఈ బాధల నిర్వృత్తికి బుద్ధుఁడు మార్గమును సూచించినాఁడు. దీనినే "యష్టవిధ న్యాయమార్గమని" యందురు. "సద్భావములు, సదుద్దేశములు, సద్భాష, సత్కార్యము, న్యాయవర్తనము, మంచియత్నములు, జాగరూకత, ఏకాగ్రత" అను నీ యెనిమిది మార్గములు ముక్తికి సోపానములని బుద్ధుఁడు బోధించెను. ఇది ధర్మశాస్త్రముకంటెను నుత్కృష్టమైనది. ఇదియొక జీవితమార్గము. బ్రహ్మనుగూర్చి చెప్పెడివారెవ్వరును ఆతనిని ముఖాముఖీగా చూచినవారుకారని బుద్ధుఁడు చెప్పెను. ఈర్ష్యాసూయలనుండి ముక్తినిపొంది యవ్యాజముగా మానసమునందు జనించు ప్రేమ యొక్క స్థితియే బ్రహ్మవిహార ప్రాముఖ్యమని బుద్ధుఁడు చెప్పెను.[1]

ఈ గుహలోని బౌద్ధవిగ్రహము మానవుని ఎత్తునకు సుమారు మూడురెట్లుండును. అత్యద్భుతమైన అతనిముఖము అద్భుతమైన అత్మశాంతిని, భావగాంభీర్యమును బ్రకటించుచున్నది.

1 S. Radhakrishna Dharmapada - Introduction P. 9 and R. Tagore Sadhana - P. 18 Indien Edition 1947.

శిల్పమునందలి ధ్యానబుద్ధుఁడు చిత్రములోని బోధిసత్త్వుఁడు ఆత్మసాక్షాత్కారమునొందిన యొక పరిపూర్ణమైన వ్యక్తి. ఆయన యనుభవము వాచామ గోచరము. దీనినంటఱు నందుకొనుట కర్హులేగాని దీనికి మిక్కిలి కష్టమయిన సాధన కావలసియున్నది. దీనియందు పరిపూర్ణత్వమును బొందుటకు జన్మ పరంపరలు కష్టపడవలెను. కొందఱకు క్షణమాత్ర మానందము కనిపింపవచ్చును. ఆత్మసంయమనము వలన కొద్దిమందిమాత్రము శాశ్వతానందమును బొందఁగలరు. "ఓంకారము"గాని మఱియేయితర మంత్రము గాని ధ్యానమునకు, ఏకాగ్రతకు సాధనముమాత్రమే. మంత్రమునందు నమ్మికలేనివారు దానియొక్క ఫలితమును బొందలేరు. "Science & Spirit" అనెడి గ్రంథమునందు స్వర్గీయ శ్రీ కొంతి రామ మూర్తిగారు "ఐ. సి. ఎస్" ఈవిధముగ వ్రాసిరి. *"నేనొకప్పుఁడొక ఆంగ్లవనితకు నటరాజ ఛాయాచిత్ర మును జూపి దీనిని నేను గంటలతరబడి ఆనం దించినాను"* అనిచెప్ప *"ఒక గంటకాలములోనే చూడఁగలిగినదేమ"*ని ఆమె ప్రశ్నించెను. ఈకారణ ముననే పెద్ద మతప్రవక్తలు తమ ఛాయాచిత్రము లను తీయుటయు, తమ బోధల నాశింపనివారికి చెప్పుటయు వలదని ఆదేశించినారు. బుద్ధుఁడు తన చిత్రము ప్రతి దుకాణమునందు తలపిన్నులయందు, కాగితపుబరువులయందును గనఁబడఁగలదని యెప్పు డును ఆశించియుండలేదు. అట్లుచేయుట కళను వ్యాపారముగఁ జేయుటయే. కళ ఆత్మకు పనికత్తె వంటిది. కళ యనునది మానవుని ఉన్నతశిఖరము లకుఁ గొనిపోవలయును.

హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, జొరాష్ట్రియన్ మతములవారు పదోచ్చారణ విశిష్ట తను గుర్తెఱింగి యుచ్చరించుటవలనఁ బ్రకృతిలోని సర్వశక్తులును లోఁబఱచుకొనవచ్చునని నమ్మినారు. "సాదిన్" కవిపర్యటనలన్నియు వీని నెఱింగిన మానవుని కనుఁగొనుటకు మాత్రమేయని యూహింపఁ బడనది. దీనిని కొందఱు 'ఓం' కారమనియు, మఱి కొందఱు 'హుం' అనియు నందురు. దీని నుచ్చ రించుట యెఱుంగనివారికి దానిశక్తియేమియు కని పింపదు. ఈమాటయొక్కశక్తి దాని నుచ్చరించు వారియొక్క పరిశుద్ధతపై ఆధారపడి యుండును. బుద్ధునివంటి ఋషీశ్వరులు మంత్రస్రష్టలు. అట్టి వారు తమ దివ్యత్వమును అధికజ్ఞానసంపన్నులైన శిష్యుల కందఁజేయఁగలరు. అట్టివారిని బోధిసత్త్వు లని, జీవన్ముక్తులని పిలువవచ్చును. అట్టివారు సంకల్పసిద్ధులు. అట్టి ఋషులే ఈప్రపంచములోని కష్టములను గడతేర్చఁగలరు. వారి ప్రపంచము నంతను విశ్వాత్మగా భావింతురు. (Universe of the Spirit) బుద్ధుని మతబోధలవలన నాకర్షింపఁ బడినవారిలో టాల్‌స్టాయ్ ఒకఁడు, 'What is art' అను వ్యాసమున *"కళలవలన మానవాళిలో సంఘీ భావమేర్పడునని"* టాల్‌స్టాయ్ నుడివినాఁడు.

విశ్వకళ భిన్నజాతులుగల మానవులమధ్య వేఱుపాటులను నాశనమొసరించి, ఏకభావమును, జ్ఞానోదయమును గలుగఁజేసి కారణమార్గమునగాక జీవితము ద్వారమున సంఘీభావమును బోధించును. విశ్వైకమత్యమువలనఁగలుగు సంతోషము జీవిత పరిధుల నధిగమించును.

ఠాగూరు శతజయంతి సంచిక 1961, 382వ పేజీలో బుద్ధునిపై ఒక పద్యముగలదు. *"నేటి ప్రపం చము అసూయోన్మాదములతో భయంకరముగా నున్నది. మిక్కిలి క్రూరమైన విభేదములతోఁగూడి అంతులేని బాధలకులోనై కుటిలమార్గములలోదురాశా పాశములలోఁ జిక్కుకొన్నది."*

జీవరాసులన్నియు పునర్జన్మముకొఱకు నాక్రోశించుచున్నవి. అనంతుఁడవైన ఓదేవా! వారిని రక్షింపుము. శక్తినిచ్చు నీ దివ్యవాణిని వినిపింపుము. అక్షయ మధుసంయుతమైన ప్రేమపద్మము నీకాంతియందు మధువు చిలకరించుగాక! ఓ తేజోమూర్తి! నీ అపారమైన కరుణ, మంచితనములచేత మానవ హృదయములందలి యజ్ఞానకళంకములను కడిగివేయుము. సర్వసంగ పరిత్యాగశక్తిని ప్రసాదించి మమ్ములను నిరహంకారులుగఁజేయుము ఇవియే నీవు మాకు ప్రసాదింపఁగల శాశ్వతబహుమానములు. జ్ఞాన భానూదయశోభలో అజ్ఞానజ్ఞాననేత్రము దెరువఁబడుగాక. నిర్జీవాత్మలు జీవమును బుంజుకొనుగాక! నీ యనంతమగు కరుణాజలముచేతను, మంచితనముచేతను మా ఆత్మకాలుష్యములకు ప్రక్షాళనము చేయుము.

# రాజరాజనరేంద్రుడు

శ్రీ వై. విఠల్ రావు

ఆంధ్రదేశమును పాలించిన రాజవంశము లలో తూర్పు చాళుక్యవంశము ప్రసిద్ధికెక్కినది. ఆంధ్రదేశమును పాలించిన చాళుక్యులకు తూర్పు చాళుక్యులనిపేరు. పశ్చిమచాళుక్యరాజైన రెండవ పులకేశి క్రీ. శె. 625 ప్రాంతమున విష్ణుకుండినుల నోడించి, ఆంధ్రప్రాంతమును వశపఱచుకొని, తన తమ్ముడగు కుబ్జవిష్ణువర్ధనుని, పిఠాపురము రాజ ధానిగాజేసి. రాజప్రతినిధిగా నుంచెను. రెండవ పులకేశి మరణానంతరము కుబ్జవిష్ణువర్ధనుడు స్వతం త్రుడై తూర్పుచాళుక్యవంశస్థాపకుడై పాలించెను. ఈతని వంశపురాజులు అయిదున్నర శతాబ్దముల కాలము ఆంధ్రదేశమును పాలించిరి. అట్టిరాజు లలో 11వ శతాబ్దమున పాలించిన రాజరాజ నరేంద్రుడు ముఖ్యుడు. ఇతడు క్రీ. శె. 1019 నుండి 1062 వరకు పాలించెను. ఈతని తండ్రి విమలాదిత్యుడు. తంజావూరును పాలించు చోళ రాజైన రాజరాజునకు అల్లుడు రాజరాజనరేంద్రుని తల్లిపేరు కుందవ. తూర్పుచాళుక్యరాజులు ధర్మ ప్రవర్తనానుసారముగా పాలనచేసి వైదికమతమును ప్రోత్సహించి, శైవమతము నుద్ధరించు సంప్ర దాయముకలవారు. విమలాదిత్యుడు జైనమతాభి మాని. అయినప్పటికిని మతసహనము కలిగియుం డెను. విజ్ఞాన విశేషములందును, కళలందును కడు శ్రద్ధవహించి ఆంధ్రదేశాభివృద్ధికి పాటుపడిన మహనీయులు తూర్పుచాళుక్యులు. ఆంధ్రదేశమనగా నెల్లూరునుండి గంజామువరకు నుండు కోస్తాప్రాంతము చాళుక్యభూమియని చెప్పవచ్చును. పిఠాపురము రాజధానిగానుండి, తరువాత వేంగీపురము రాజధానిగ మారినది. రాజరాజనరేంద్రుడు పాలించుకాలము నాటికి రాజమహేంద్రవరము రాజధానియై. తూర్పు చాళుక్యులు పూర్తిగ ఆంధ్రత్వము కలిగియుండిరను

ట్రకు సందియములేదు. అట్టి వ్యవస్థలో విలసిల్లిన వాడు రాజరాజ నరేంద్రుడు.

రాజరాజనరేంద్రుడు సింహాసనమునకు వచ్చు నాటికి తన సవతిసోదరుడు విజయాదిత్యునివలన బాధలుపడెను. శత్రువులగు కల్యాణి చాళుక్యులు. కళింగరాజులు విజయాదిత్యునికి సహాయముచేయగా, రాజరాజనరేంద్రుడు నిస్సహాయుడై తన మేనమామ యైన రాజేంద్రచోళుని సహాయముకోరెను. దీని పర్యవసానమే, చోళదండయాత్ర, రాజరాజనరేంద్రుని విజయము, రాజేంద్రచోళుని కూతురగు అమ్మంగదేవిని రాజరాజనరేంద్రుడు వివాహమాడుట, క్రీ. వె. 1022 లో పట్టాభిషేకమహోత్సవము జరుగుట. సింహాసనమునకు 1019 లో వచ్చినను, పట్టాభిషేకము మూడేండ్ల తరువాత జరిగినందులకు కారణ మిప్పుడు స్పష్టము.

తదుపరి నాల్గు సంవత్సరములకాలము శాంతి యుతముగా రాజరాజనరేంద్రుడు పరిపాలన చేయ గలిగినప్పటికిని తన సవతిసోదరుడగు, విజయాదిత్యునివలన కల్యాణిచాళుక్యులు దండెత్తిరాగా, మరల చోళుల సహాయముతో కలిదిండివద్ద 1035 ప్రాంతమున శత్రువుల ప్రయత్నమును విఫలమొన రించెను. ఈయుద్ధమున గతించిన ముగ్గురు గొప్ప చోళసేనానాయకుల జ్ఞాపకార్థము మూడు శివాలయములను రాజరాజనరేంద్రుడు కలిదిండిలో కట్టించెను. ఏది యెట్లున్నను, రాజరాజనరేంద్రుడు తన పరిపాలనా కాలప్రారంభమున కడు కష్టముల నెదుర్కొనవలసివచ్చెను. మరియొకతూరి కల్యాణి చాళుక్యరాజు సోమేశ్వరుని ప్రయత్నము పర్యవసానము, రాజరాజనరేంద్రునితో సంధికుదురుట. ఆ సంధివలన సోమేశ్వరుని ప్రధానులలో నొకడగు నారాయణభట్టును రాజరాజనరేంద్రుని యాస్థానమునకు సోమేశ్వరుడు పంపుట కంగీకరించెను. రాజ రాజనరేంద్రుడు 1062 సం. వరకు సకలైశ్వర్యాభివృద్ధితో పరిపాలించెను.

రాజరాజనరేంద్రునికాలము ఆంధ్రచరిత్రలో నొకయుగకాలమని చెప్పవచ్చును. నారాయణభట్టు, రాజరాజనరేంద్రుని యాస్థానకవియైన నన్నయభట్టునకు ఆంధ్రమహాభారతము రచియించుటలో తోడ్పడి నందులకు నందంపూడి గ్రామము దానమొసగెను. రాజరాజనరేంద్రుడు విజ్ఞాన, విద్యా విషయములందు శ్రద్ధవహించినరాజు. శివభక్తిపరుడు. అయినను, మతసహనముకలిగి, అన్నిమతములయందు సమదృష్టిచూపినవాడు. సనాతన ధర్మమునువదలక, వైదికసంప్రదాయమును ప్రోత్సహించి, శాస్త్రముల నభ్యసించుట, వైదికయజ్ఞయాగాది కర్మలననుష్ఠించుట యందు కడు శ్రద్ధవహించెను. తానుకూడ వివిధ విద్యలయందు జ్ఞానముకలిగియుండెను. పురాణములయందు ప్రవేశము, ఆగమములందు ప్రావీణ్యముకలిగి, సౌందర్యపిపాసియై యుండెను. అన్నింటి కంటెను ముఖ్యము వాఙ్మయమన్న కడుప్రీతి. ఇతని కాలమున తెలుగుభాష మిక్కిలి యభివృద్ధిలోనికి వచ్చినది. ఆంధ్రభోజుడై పండితులను పోషించి, ముఖ్యముగా తాను చెందిన చంద్రవంశపు క్షత్రియ రాజులైన మహాభారతవీరులగూర్చి రచియింపుమని నన్నయభట్టారకుని ప్రేరేపించెను. కృష్ణద్వైపాయన వ్యాసుని సంస్కృత మహాభారతమును తెనిగింపుమని కోరుటలో, రాజరాజనరేంద్రుడు తెనుగువాఙ్మయమునకు గట్టిపునాదులు వేసెనని చెప్పవచ్చును. నన్నయభట్టు ఆది సభాపర్వములు, అరణ్యపర్వములో కొంత భాగమును రచించెను. తెనుగుభాష దేశీయము, ఇతని కాలమున ప్రారంభమయ్యెనని చెప్పవచ్చును.

మరియు విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో వర్ణించిన రాజమహేంద్రవరము రాజరాజనరేంద్రుని రాజధానినగరము. పావులూరి



శ్రీ వై. విఠల్ రావు

మల్లన, జైనమహావీరాచార్యుని సంస్కృతగణితగ్రంథ మును తెనిగించెను నవఖండవాడ అను గ్రామ మును రాజరాజనరేంద్రు డతనికి దానమొసగెను. ఇంకను అతని ఆస్థానమున పొన్న, పంప, నాగవర్మ అను కన్నడరచయితలు, కవులుండిరట. రాజరాజ నరేంద్రుడు, చీదమార్యుడను బ్రాహ్మణునికి కోరుమిల్లి గ్రామము దానమొసగెనని కోరుమిల్లి శాసనముచెప్పు చున్నది. కోరుమిల్లిశాసన కావ్యకర్త బేతనభట్టు ఒక సంస్కృతాంధ్రకవి.

రాజరాజనరేంద్రునకు వర్తింపజేయు, చిత్రాంగి సారంగధర చరిత్రగాని, కనకాంబ చరిత్రగాని, చారిత్రాత్మకములుగావు. అవి సత్యదూరములు. రాజరాజనరేంద్రుని యశస్సునకు సరిరావు. ఉత్తర హిందూస్థానమున దండయాత్రలు సాగించుచున్న గజనీమహమ్మదు ఇతని సమకాలికుడు మాళవమును పాలించు పరమారరాజు భోజుడుకూడ ఆకాలపువాడే.

రాజరాజనరేంద్రునకు ఇరువురు భార్యలు– అమ్మంగదేవి. రేవలదేవి అనువారలు. అమ్మంగ దేవివలన కులోత్తుంగచోళుడును, రేవలదేవివలన 'సోమలదేవి'యను పుత్రికయు అను సంతానము వడసెను, సోమలదేవి ద్రాక్షారామభీమేశ్వరునికి, బంగారముతో జేయబడిన కల్పవృక్ష పుష్పమును, వెండిప్రమిదెయు, అఖండదీపమును ఇచ్చెనని. ద్రాక్షారామశాసనమొకటి తెనుగున చెప్పుచున్నది.

నన్నయభట్టారకుని రచనములలో, రాజరాజ నరేంద్రునకున్న బిరుదములు కానవచ్చును. "సత్యాశ్రయకులశేఖర, సర్వలోకాశ్రయ, రాజకంఠీరవ, త్రిభువనాంకుశ, సమస్త భువనాశ్రయ, బిరుదాంక భీమ, రాజమహేంద్ర, రాజమార్తాండ, పరగండ భైరవ, రాజపరమేశ్వర, నారాయణాఖ్య, విష్ణుమూర్తి" యని కానవచ్చును.

రాజరాజనరేంద్రుని తరువాత, అతని కుమా రుడు రాజేంద్రుడు లేక కులోత్తుంగచోళుడు తండ్రికి తగిన కుమారునివలె పాలించెను. రాజరాజనరేంద్రుడు దానకర్ణుడు, శైవభక్తిపరాయణుడు, వివిధవిద్యల నేర్చినవాడు, కళాపోషకుడై. తెనుగు వాఙ్మయమును విలసిల్లునట్లుచేసి సుప్రసిద్ధిగాంచిన మహారాజు. అతనిపేరు ఆంధ్రదేశమున చిరస్థాయియై నిలచినది.

# ఆంధ్ర భారతము – అవతారిక

ఆలమూరి రాజగోపాలరావు.

## ౧

### మతపరిస్థితులు – ఆంధ్ర భారతావశ్యకత.

బోద్ధలు మత్సరగ్రస్తులై, ప్రభువులు స్మయదూషితులై, సుభాషితాలు జీర్ణించి, ధర్మంసడలి, ఆదర్శాలు నశించి, లోకం భ్రష్టమయినాడు. పురుషోత్తములు సహింపరు, ప్రజలు భరింపరు విలయం వికటాట్టహాసం చేస్తుంది. కవులు ఘంటంచేబూని విజృంభిస్తారు.

అలనాడు కాళిదాసు తననాటి రాజలోక లాఘవజీవితాన్ని, విషయలాలసతను గుర్తించి, ధర్మం భ్రష్టమవుతున్నట్లు గ్రహించి, కావ్యాలు వ్రాసి సంస్కారానికి పూనుకొన్నాడు,

పార్వతీశివులవలె ధర్మం తదాశ్రయమైన ఆచరణ విభిన్నముకాక సంపృక్తముగా వుండాలి. మీ స్వర్గాభిలాష విషయవాంఛాపరితృప్తికి దాస్యమైపోరాదు. అయినచో ఊర్వశి తిరోగమింపకలదు. ( విక్రమోర్వశీయం ) నారీగమనం శాస్త్రోపదిష్టమయిననూ అది ప్రజామోదముద్రను పొందాలి. కానినాడు అది పునీతముకానేరదు. (శకుంతలా వివాహం) మీరు మీ కామతృష్ణాయుత నారీవాంఛను విడవండి. "*ప్రజాయై గృహమేధులుకండి*" సుధర్మాపీఠ సంరక్షణార్థమయి మీమీరథాలను స్వర్లోకపథానికి మళ్ళించండి. శైశమందు విద్య, యౌవనమందు గృహస్థధర్మం, వార్ధకమందు యోగముద్ర. అపైన యిచ్ఛామరణం మీకుతగినపని అని తననాటి ప్రభువులను, ప్రజలనుకూడ కాళిదాసు తన కావ్యాలద్వారా హెచ్చరించాడు.

సంస్కృతంలో ఆదికవి వ్యాసుడు. అతడు రచియించిన రామాయణాధారంచేత నాటిచరిత్ర మనం తెలుసుకోకలుగుతున్నాము. సంస్కృతకవులకు తమ కావ్యాలలో అవతారికలు వ్రాసే ఆచారంలేదు. అయినా వారి కావ్యాలలోని నాందీప్రస్తావనల ఆధారంచేత కవి కాలాదులను, నాటి చరిత్రను మనం కొంత గ్రహింపకలుగుతున్నాము. తమిళ, కన్నడ, ఆంధ్ర కవులు తమ కావ్యాలలో అవతారికలు, ఆశ్వాసాంతపద్యాలూ వ్రాశారు. వాటివలన మనకు అనాటి చరిత్ర ఎంతో లభ్యం అవుతోంది. తెనుగులో ఆదికవి నన్నయభట్టు, అతడాంధ్రమహాభారత కర్త. ఎత్కృతిభర్త రాజరాజనరేంద్రుడు. తెనుగులో మహాభారతం వుండడం అవసరమని నన్నయకవి, రాజరాజనరేంద్రుడు గుర్తించారు. రాజు పరమధర్మ విదుడు. ప్రజానురంజనముగ పరిపాలించు పాలకుడు. తనకు, ప్రజకు విశ్వజనీనమైన కావ్యం అవసరమని ఉవ్విళ్ళూరాడు. ప్రజలలోని విభిన్న తత్త్వాలను నెట్టి, సంఘశక్తులను ఏకముఖంచేసి ధర్మం, ఆచరణ యీ రెండూ విభిన్నపథగాములై భ్రష్టంకాకుండా కాపాడ కలిగింది మహాభారతమే అని రాజరాజు నిర్ణయించుకొన్నాడు. ఆరాజు పరమధర్మవిదుడు. విమలమతిన్ అనేకమైన పురాణాలు విన్నాడు, రసవత్తర కావ్య నాటకక్రమములు పెక్కు చూశాడు జగత్పరిపూజ్యములైన ఈశ్వరాగమములయందు అత్యంత భక్తితో హృదయం నిలిపినట్టివాడు. అయినా మహాభారతమే వినాలని తనకు అభిలాష పెద్దయైయుండునని గట్టిగా చెప్పాడు. భారతకథలు, బహువిధముల, బహుభాషలలో అతడు విన్నాడు. అవి బహుయాగముల ఫలం యివ్వకలవనేమాట యదార్థమే. కాని అవి "కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత్ మహాభారత బద్ధ నిరూపితార్థం" లోపించివున్నాయి. కనుక తన అధిక దీయుక్తిసాయంతో అట్టి మహాభారతాన్ని తెనుగున రచియింపుమని నన్నయభట్టును ఆ రాజు కోరాడు. నన్నయకవి అభిప్రాయంకూడా అట్టిదే.

ఇట్టి కోరిక కలగడానికి అనాటి మతపరిస్థితులుకూడా కొంత కారణమయాయి. రాజరాజునాటికే కేవల యాగకర్మాభిలాష, శుద్ధబౌద్ధం. శుద్ధజైనం, అన్నీ దిగజారాయి. భక్తి, పుణ్యలోకవాంఛ, మూర్తి ఆరాధనమాత్రం బలంగానే పెరిగాయి.

అనాటికే "లకులీశపాశుపత" ప్రభావంచేత జైనం శైవంగా మారిపోయింది. బౌద్ధులు, జైనులు, అంతవరకు ఆరాధిస్తూవచ్చిన శక్తిస్వరూపాలు పాడువటాలుగా మారాయి. జైనుల వృషభ ఆరాధన నందిపూజగా మారింది. కాగా పశుపతినాథుడు పార్వతీనాథుడైనాడు. అది ఉభయమతస్థులను ఏకోన్ముఖులుగా చేసింది. బౌద్ధారామాలలోని ఆయక స్తంభాలు శివలింగాలుగా మారాయి. గుళ్ళు, గోపురాలు లేచాయి బౌద్ధం, జైనం, శైవం సమ్మిశ్రితమయాయి. అయినా ఆయా గురువులూ, ఆయా మతాలూ, అన్నివర్ణాలలోనూ వుండి వర్ణవిచక్షణ వుంటూనేవుంది. జైనబ్రాహ్మణులు, జైనరాజులు, జైనవైశ్యులు (గోమతేశ్వర ఆరాధకులే కోమట్లు. గోమతులు కోమట్లయారు.) వేదవిప్రులు ఏవర్ణానికీ అవర్ణంవారు, ఆయాపేర్లతోనే కులక్రమాగతంగా వుంటూవచ్చారు. పార్వపతీధ్యానాన్ని అంగీకరించారు. విమలాదిత్యుడు, ఆతనికొడుకు రాజరాజు కూడ ద్రవిడాధిపతులైన చోళరాజకన్యలను వివాహమాడారు. అనాడు ఎందరో విప్రులు, తపేతరులు ద్రవిడదేశాన్నుండి వేంగికి వచ్చారు వారి ఆగమన కారణంగా వేంగినాటి విప్రులలో శాస్త్రాధ్యయనం ద్విగుణించింది. పండితలోకం పునరుజ్జీవితమయింది.

దక్షిణదేశంలో ఆళ్వారులు, శఠగోపుడు, నాథముని ప్రభృతులు భక్తిమార్గాన్ని ప్రబోధించారు. నయనార్లుకూడా శైవానికి భక్తిని జోడించి ప్రచారం

చేశారు. ఈ రెండుమార్గాలు ప్రజాజీవితంతో తీవ్రమైన భక్తిమార్గాన్ని రేకెత్తించి తమ ప్రభావాన్ని ముద్రించుకొన్నాయి. శంకరుని అద్వైతమతం, కర్మిష్టులను తృప్తిపరచకపోయినా, ఏకొందరిని మాత్రమో వశపరచుకొన్నా అది ప్రజామతం కాలేక పోయింది. అతడు యజ్ఞాదికర్మలను నిరసించాడు. బౌద్ధధర్మాలను చాలావరకు అంగీకరించాడు. ఇట్టి పరిస్థితులలో తను ప్రజలకు శిసలైన ధర్మమార్గం చూపకలిగింది ఆంధ్రమహాభారతమే కాగలదని రాజ రాజనరేంద్రుడు అతని కవి నన్నయ ఉభయులు నిర్ణయించారు కాగా ఆంధ్రభారతావరణకు పూను కొన్నారు భగవద్గీత భారతంలోనిదేకదా !

తిక్కన నాటి స్థితి:—మహాభారత విశిష్టతను గూర్చి లోగడ వ్రాయబడింది. రాజరాజనరేంద్రుడు పార్వతీపతి ధ్యానానికే అంకితుడయాడు. అయినా త్రిమూర్తులను రాజరాజు, నన్నయకూడ ఉగ్గడించి నమస్కరించారు. కాని తిక్కననాటికి పరిస్థితులు మారాయి నన్నయ క్రీ. శ. 11వ సతాబ్దివాడు. తిక్కన క్రీ శ 13వ శతాబ్దివాడు ఈ మధ్యకాలంలో దేశంలో వచ్చిన మతావేశాలు ప్రజలలో ఎన్నో మార్పులు తెచ్చాయి మల్లికార్జున పండితారాధ్యులు శివభక్తిని అందరికీచాటి ప్రజామతంగా మార్చారు. రామానుజాదులు వైష్ణవం ఆన్నివర్ణాలకు ముక్తి దాయకం అని ప్రచారించాదు. మధ్వాచార్యులద్వైత సిద్ధాంతం వ్యాప్తిచెందింది. శంకరుని అద్వైతం పండితలోకానికే పరిమితమయింది. అందుచేత భక్తి భావమే బహుళంగా ప్రబలింది. ఆ యా మతావ లంబకులైన శైవ, వైష్ణవ వర్గాలలోను, ప్రభువుల లోను తమదేవుడే అధికుడనే ఆవేశ కావేశాలు పెరిగి. మతోన్మాదం హెచ్చి రగడలు, యుద్ధాలుకూడవచ్చాయి ఇట్టి పరిస్థితులలో తిక్కన భారతరచనకు పూను కొన్నాడు.

తిక్కన వేదవిప్రుడు, రాజనీతిజ్ఞుడు, యోగి, యాజి. శివకేశవుల కభేద్యము కల్పించి, భక్తిని రేకెత్తించి పరతత్త్వమున ప్రబోధింపకలిగిన ధీశాలి.

"ఉ॥ వైదికమార్గనిష్ఠమగు
వర్తనమున్ దగనిర్వహించుచు
న్హృదయము లేవిభక్తి యవి
నిర్మలవృత్తిగఁ జేయుచుండు మ
త్పాద నిరంతరస్మరణ
తత్పరభావము కల్మినాత్మ స
మ్మోదముఁబొందఁ
గావ్యరసముంగొనియాడుచునుండునెప్పుడున్"

'నీ వఖండితభక్తిన్' భారతాన్ని తెనుగుబాస వినిర్మింపబూనుట భవ్యపురుషార్థ తరుపక్వఫలము కాదె. దీనికెదనియ్యకొని వేడ్కనూని "కృతిపతిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ" అని పరమేశ్వరుడు తనతో అన్నాడని తిక్కన చెప్పుకొన్నాడు. ఎందుచేత? "అప్పరమేశ్వరుం డాశ్రితులకు అత్యంత సులభుండు గాన" పరమేశ్వరుడే తన్నడుగవచ్చాడని తిక్కన వచించాడు ఎంత గర్వంగా ఉన్నా ఆ పరమేశ్వరుండు భక్తులకు అత్యంత సులభుడనికూడా వచించాడు. కనుక తిక్కన తలతిక్కకంటె అతని భక్తి భావమే యీవిషయంలో ప్రకటితమవుతున్నదనక తప్పదు. అదే అతడు చెప్పదలచుకొన్నది. మీరు భక్తులుకండు. మీకడకే భగవంతుడు వస్తాడు అతడు మీవాడే అని చాటిన తత్త్వమేది. పరమేశ్వరుడు భక్తులకు సులభలభ్యుడుసుమా అనీ, అయితే ఆ భగవంతుడు కేవలం శివుడుమాత్రమో, విష్ణువుమాత్రమో అనీ శివకేశవు లేకరూపులనీ, భక్తిమార్గంచేత పరమార్థాన్ని సాధింపనగుననీ ఆతడు తననాటిప్రభువులకు, పామరులకు, పండితులకుకూడ మహత్తరసందేశమిచ్చాడు. తద్వారా వేదవిప్రులను, శైవులను, వైష్ణవులనుకూడ తృప్తిపరచకలిగాడనక తప్పదు. భగవద్గీతార్థాన్ని యీ

విధంగా అర్థం చేసుకొని అతడు ప్రజలకు తనభావాన్ని తెం భారతరూపంలో అందించాడనవచ్చును.

భారతగమ్యం హరిహర 'ధర్మాద్వైతభావమే' అని అది అందరికిని ఆమోదయోగ్యమని నిర్ణయించాడు తిక్కన. అందుచేతనే

"శా॥ శ్రీయన గౌరినాఁబరగు
చిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరం
బగు రూపముదాల్చి విష్ణు రూ
పాయ నమశ్శివాయ యని
పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చుమెచ్చు పర
తత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్॥
మరియు

కం॥ వేదములకు నఖిలస్మృతి వాదములకు
బహుపురాణవర్గంబులకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థ కామమోక్షస్థితికిన్॥"

అని వ్రాశాడు తద్వారా భారతముయొక్క 'ధర్మాద్వైత స్థితి' ని ప్రస్ఫుటం చేశాడు.

అందుచేతనే తన భారతాన్ని నరాంకితంచేయక భగవంతునికె అంకితమిచ్చాడు. తన హరిహరనాథుని కన్నారచూడకలిగాడు.

"కిమస్థిమాలా కిముకౌస్తుభంవా
పరిష్క్రియా యాం బహుమన్యసేత్వం
కింకాలకూటం కిమువాయశోదా
స్తన్యం తవస్వాదు వద ప్రభోమే"

అని ప్రార్థింపకల పరమభక్తుడు తిక్కన. కర్మ, భక్తి, జ్ఞానం మేళవింపకల పరమార్థవేత్త అతడు

ఇట్టి పరిపక్వదృష్టికి తిక్కన్నను తీర్చి దిద్దినవి నాటి మతసాంఘిక పరిస్థితులే అనక తప్పదు. కవి పైన తన కాలప్రభావమును, తన సంఘముపై కవి ప్రభావమును ఉండకమానదనడంలో ఆశ్చర్యం లేదు.

ఇంతవరకు కవిత్రయం రచియించిన అవతారికల ఆధారంగా ఆయా కాలములనాటి మత పరిస్థితులు, సంఘముపై తమప్రభావమును చూపగా ఆయా పరిస్థితుల కవసరమైనతీరున ఆంధ్రభారత రచన కావ్యకత కలిగిందని తెలుసుకొన్నాము.

ఇక ఆయా కవులనుగురించి, ఆయా కాలము నాటి చరిత్రనుగురించీ, అవతారిక, ఆశ్వాసాంత పద్య పద్యముల సాయంతో నిర్మించుకోవలసిన అవసరం వుంది. యెఱ్ఱాప్రగ్గడ వ్రాసిన అవతారికాంశాలలో అతడు శివభక్తుడనిమాత్రం మనకు తెలుస్తోంది.

౨

ఇంతవరకు ఆంధ్రభారత రచనావశ్యతకు కారణాలను గురించి తెలుసుకొన్నాము. ఇక రాజరాజ నరేంద్రునియొక్కయు తూర్పుచాళుక్యుల యొక్కయు మతాభిమానమెట్టిదో కొంత తెలియవలసిన అవసర ముంది.

రాజరాజనరేంద్రుడు యిలా అన్నాడు :

"మ॥ ఇవియేనున్ సతతంబు నాయెడ కరం
బిష్టంబులైయుండు బా
యవు భూదేవకులాభితర్పణ మహీ
యః ప్రీతియున్ భారత

*శ్రీనతాశక్తియుఁ బార్వతీపతి పదా*
*జ్ఞధ్యాన పూజావిశేషా*
*త్సవమున్ సంతత దానశీలతయు శ*
*శ్వత్సాధుసాంగత్యమున్ ॥"*

భూదేవకులాభితర్పణం, పార్వతీపతినిగూర్చిన ధ్యానం, పూజ, దానశీలం తనకు చాలా ప్రియమన్నాడు. అయితే యిది రాజరాజుకే ప్రధాన లక్షణమా ? లేకపోతే అతని పూర్వీకులు కందరకును వున్నదా ? అనేది తెలుసుకొనడం అవసరం అతనికే యిట్టి ఆసక్తి అనగా, విప్రభక్తి, పార్వతీపతి చింతా వుంటే అది అతని ప్రత్యేక విశిష్టత అనవచ్చును. అలాకాక ఆతని పూర్వీకులకుకూడావుంటే అది వారి వంశక్రమానుగతమైన సామాన్యగుణం అనకతప్పదు. రాజనరేంద్రుడేకాదు ఆతని వంశీకుల కందరకుకూడ యిట్టిగుణాలున్నట్లున్నాయి వాళ్లశాసనాలే చాటుతున్నాయి. తూర్పు చాళుక్యులకు మూలపురుషుడైన కుబ్జవిష్ణువర్ధనుడు (క్రీ శ 616–633) భీమరథీ తీరమందున్న కొండొకగ్రామాన్ని తిమ్మాపురం చీపురుపల్లి, బెజ్జరాల, కలవకొండ గ్రామాలను బ్రాహ్మణులకు దానమిచ్చినట్లు ఆయా శాసనాలు తెలుపుతున్నాయి ఈతని కొడుకయిన జయసింహుడు (క్రీ శ. 676–700) నిడుంబయ్య, పుంబూరు, వెణకవుర్ర, పెనాకపర్రు, కొంబరు్ర విప్పర్లిగ్రామాలను వేదవిప్రులకు దానాలిచ్చాడు. వీరు జైనులు.

మంగియువరాజు : (క్రీ. శ. 676–700) ఇతడు అగ్రహారాలు దానమిచ్చాడు. బొండాడనొర్తి చెంవలూరు, తిమ్మాపురం, ఏడువాడపారెం, నూతులపర్రు, లక్ష్మీపురం వగయిరాలు.

రెండవిష్ణువర్ధనుడు. అతని తండ్రియైన ఇద్ర భట్టారకుడును దానాలిచ్చారు.

రెండవ విష్ణువర్ధనుడు (క్రీ. శ. 667–675) ఎన్నోగ్రామధానములు బ్రాహ్మణులకు యిచ్చారు.

మూడవ విష్ణువర్ధనుడు (క్రీ శ. 714-750) విప్రులకు, జైనాలయాలకు దానాలుచేశాడు అది ఇతని కాలంలో జైనం బహుళవ్యాప్తిని చెందింది. ప. గో జిల్లా పెన్మంచిలిలో జైనవిగ్రహాలున్నాయి కదా? ఇతని శాసనాలు: పసుపుంబర్రు మావిండిపల్లి ముసినికుండ, జలమూరు, పెర్మంచిలి, రెండుబల్లి మొదలయినవి

రెండవ విజయాదిత్యుడు : (క్రీ. శ. 804-848) ఇతడు 108 శివాలయాలను కట్టించాడు. తులాభారమునుతూగి వెండి బంగారాలను పేదలకు దానమిచ్చాడు. చంద్రగ్రహణకాలమున వేదవిప్రులకు గ్రామదాన మిచ్చాడు.

గుణగ విజయాదిత్యుడు, (క్రీ. శ. 850-892) మొదటి చాళక్యభీముడు యితడూ బ్రాహ్మణులకు దానాలుచేశారు. ఇందులో కొన్ని రాజకీయ కారణాలవల్లకూడా జరిగినట్లు తోస్తుంది అమ్మరాజు తన సైన్యాధిపతియైన భండనాదిత్యునకు గొంటూరు గ్రామం దానమిచ్చాడు. రెండవ భీమ సిపేర చాళుక్యభీమవరం నిర్మింపబడింది. పానారవంశ ప్రభువును వేగిదేశ రాజ్యరక్షకుడును అగు 'వజ్జయ' అను వానికోర్కెపై క్రమపాలియగు కొమ్మనకు 'కండేరువాడ' విషయంలోని 'కోడతల్లి' అను గ్రామాన్ని దానమిచ్చాడు. 'అకులమున్నాడు' పిద్దమయ్య అనే బ్రాహ్మడికి ఉత్తరాయణ సంక్రాంతి పుణ్యకాలమందు అగ్రహారంగా యిచ్చాడు.

ఇక రెండవ అమ్మరాజవిజయాదిత్యుడు : (క్రీ శ. 945-970) (1) ఇతడు తన కులబ్రాహ్మణుడును, కౌండిన్య గోత్రుడగు నొక బ్రాహ్మణునకు ప్రాక్తనక్షేత్రమును తిరిగి యిచ్చాడు.

(2) చంద్రగ్రహణకాలమందు ఒక బ్రాహ్మణునికి 'పడకలూరు'గ్రామంలోని భూమినిదానమిచ్చాడు.

(3) పాంబర్రుగ్రామంలోని కొంత భూమిని పట్టవర్ధని వంశజుడైన 'పల్లాల దేవవేలాభట్టుకు' దానమిచ్చాడు. పటవర్ధన వంశజులు కుబ్జవిష్ణువర్ధను నాటినుంచి మంత్రిత్వాది పదవులలో వున్నారు.

(4) యెలవర్రు గ్రామాన్ని ఉత్తరాయణ సంక్రాంతి కాలమున బ్రాహ్మణులకు దానంచేశాడు.

(5) 'గుండుగొలను' గ్రామంలో కొంత భూ భానం విప్రులకు దానంచేశాడు.

(6) అడ్డకావిగచ్ఛకుచెందిన వలహరిగణములోచేరిన జైనశ్రావకుడగు చామెకాంబ గురువైన అర్హనందిని అను జైనాచార్యునకు సర్వలోకాశ్రయ జైనభవనార్థముయిన భోజనశాలకొరకు అత్తిలినాండు విషయములోని 'కంచుబఱ్ఱు' (కంచుమర్రు) గ్రామాన్ని దానం చేశాడు.

(7) ఈరాజుకడ ఉద్యోగిగావున్న దుగ్గరాజు విజయవాటికలోని జైనాలయానికి అత్తిలివద్దవున్న ముల్లియంపూడి (మల్లిపూడి) గ్రామాన్ని దానం చేశాడు.

(8) కుప్పనామాత్యుడనేవానికి దానధర్మములు చేసినట్టు 'వాండ్ర' శాసనం తెలుపుతున్నది.

(9) తనగురువు పిద్వేశ్వరపండితుడు కొడుకు ముమ్మడి ప్రభూతరాశిపండితుడు అతనికి యీరాజు, అఘ్నులపూడి మొదలగు గ్రామాలు దానమిచ్చినట్లును ఇతడు శైవుడనీ తాడికొండ శాసనంవలన తెలుస్తున్నది.

కాగా యీరాజు శైవులకును, జైనులకును, విప్రులకును, రాజకీయోద్యోగులకును దానాలు యిచ్చాడు

విమలాదిత్యుడు : తన మంత్రియైన 'వజ్జియ ప్రగ్గడకు' రణస్థపూడి గ్రామాన్ని దానమిచ్చాడు. వజ్జియప్రగ్గడ యజ్ఞయాగాదిక్రతువుల నాచరించిన కర్మిష్ఠి. తిరువయ్యారులోని పంచనాథేశ్వరస్వామికి దానమిచ్చాడు విమలాదిత్యుడు. కాని ఈ విజయాదిత్యుడు జైనమతావలంబకుడు. త్రికాలయోగి సిద్ధాంత దేవుడను జైనాచార్యుడీతని గురువు.

రాజరాజు :

(1) కోరుమిల్లి గ్రామాన్ని చీదమార్యుడను బ్రాహ్మణునకిచ్చాడు.

(2) 'మండ' (మండపేట) అనే గ్రామాన్ని బ్రాహ్మణుడును, భారద్వాజ గోత్రుడును, అపస్తంభ సూత్రుడును, శివకుమారభట్టుని పౌత్రుడును, రామ దేవుని తనయుండును అగు అక్కయ్యఅను బ్రాహ్మణునకు సూర్యగ్రహణకాలమందు దానమిచ్చినట్లున్నది. ఇతనికి సమస్తభువనాశ్రయ బ్రాహ్మమహారాజు అనే బిరుదుంది. ఈ శాసన కావ్యకర్త నన్నయభట్టు.

పావులూరి మల్లన్నకు పితామహుడైన పావులూరి మల్లన్నకు 'నవఖండవాడ' గ్రామాన్ని దానమిచ్చాడు.

ఈతడు కలిదిండి మొదలగు గ్రామాలను శివాలయాల నిమిత్తం దానమిచ్చాడు. నందంపూడిని నారాయణభట్టుకిచ్చాడు. నారాయణభట్టు వంశం వారు అమాత్యులు, యజ్ఞాలు చేశారు.

ఈ పరిశోధనవలన తేలిన సారాంశం దానశీలత, భూదేవ కులాభితర్పణం. పార్వతీపతి పద ధ్యానం, తనకును పూర్వ వంశీకులందరకును వంశక్రమానుగతంగా వస్తున్నదనీ, అది రాజరాజు ప్రత్యేక లక్షణం కాదనీ తెలియకలదు. ఇంతేకాక పూర్వ చాళుక్యులు జైనమత పరిపోషకులును. పశుపతీ ధ్యానపరులును, భక్తిమార్గానుగాములును అయినట్టు కూడ బుజువుకాగలదు తూర్పుచాళుక్యులు కేవలం వైదికమత పతిష్ఠాపనాచార్యులని, అందుచేత తమ వేంగినుండి పంపాది జైనకవులును, జైనులును

యుత్తరప్రాంతాలకు పారిపోయారనే మాట యదార్థం కాదని రూఢిగా చెప్పవచ్చును. క్రీ. శ. 10వ శతాబ్దమువారు పంప. రన్న, పొన్న, నాగవర్మలను కవులు, తమ వేంగినాటి తూర్పుచాళుక్యులు జైన నిరోధు లైనందునను తాము జైనులయినందున యిక్కడ అధరణలేక జైనమతాభిమానులయిన పశ్చిమ చాళుక్యులకడకు పోయారనే వాదం కేవలం ప్రచారమాత్రమూ, కల్పితమూ.

(క్రీ శ 1011–1118) వరకు పాలించిన రాజరాజుతండ్రి విమలాదిత్యుడును, క్రీ శ.718-752 కాలంలో పాలించిన మూడవ విష్ణువర్ధనుడును జైనమతవ్యాప్తికి సాయపడినట్లు వాత్తచరిత్రలు, శాసనాలు చెబుతున్నాయి. అట్టిపరిస్థితులలో వేంగినాటి కవులు జైనులైనందున, తూర్పుచాళుర్యులు వైదికాభిమానులై, జైనమతాన్ని నిరసించినందున, ఆ యా కవులు వేంగినివిడిచి పశ్చిమచాళుక్యుల నాశ్రయింపబోయారనడం, చరిత్రవిరుద్ధము

మరొకవిషయం : తూ. చాళుక్యులు తాము స్వయం యజ్ఞయాగాదిక్రతువుల నాచరించినట్లుకాని, యజ్ఞయాగాదికములు చేసినందుకు లేదా చేయనున్నందుకుకాని ఏవిప్రులకు దానాలిచ్చినట్లు కన్పించదు. ఆనాటి మంత్రులు, ప్రెగ్గడలు, భట్టులు. శర్మలు, శౌరి వగైరాలు ఎట్టివారైనను వేదాధ్యయనం, యజ్ఞకర్మలు చేసేవారని శాసనాలవలన ఋజువుకాగలదు. తూ. చాళుక్యులు తామిచ్చిన దానాలెన్నో సూర్యచంద్రగ్రహణ కాలంలో యిచ్చారు. దీనివలన పుణ్యలోకం రాగలదనేవాంఛ ప్రకటించుకొన్నారు. కనుక రాజరాజువరకు తూర్పుచాళుక్యులు "సర్వలోకాశ్రితులైన" జైనులు, "పరమ మహేశ్వరులైన" శైవులు "పరమ బ్రహ్మణ్యులైన" వేదాభిమానులు వీటి నన్నిటినీమించి భక్తిమార్గగాములు.

గనుక తూ. చాళుక్యులు జైనమత విరోధులనరాదు. కేవలం కర్మమార్గపోషకు లనడానికినీ వీలునబడదు. వారిది పౌరాణిక భక్తిమాత్రమే అనవలసి వుంటుంది.

## II భాగం

### వేంగి

గత వ్యాసంలో ఆంధ్రభారత రచనావశ్యకతల గురించి కొంత చర్చింపబడింది. ఇప్పుడు అవతారికాంతర్గత విషయాలుకొన్ని ఛర్చించడం ఆవసరం. రాజరాజనరేంద్రుని రాజ్యం వేంగీదేశానికి పరిమితమయి వుందనీ, ఆవేంగీదేశం అఖిలజలధివేలావలయితమనీ, దానికి నాయకరత్నంబునుం బోనిది రాజమహేంద్రపురంబు అనీ అవతారికలో వ్రాయబడి వుంది. వేంగీసామ్రాజ్యాన్నిగురించి, వేంగీనిగురించి పలువురు లోగడ వ్రాశారు. అయినా ఒకటి రెండు విషయాలు ఇక్కడ వ్రాయడం అవసరము.

వేంగీ పశ్చిమగోదావరిలో ఏలూరుకు సమీపముంది. ఆదిలో అది ఒకనగరం. తర్వాత అది నాడుగా అయింది. ఆతర్వాత అది విషయంగా విస్తరిల్లింది. అపిమ్మట సామ్రాజ్యంగా విజృంభించింది, కనుకనే ఆంధ్రభారతంలో అది వేంగీదేశంగా వర్ణింపబడింది. ఈవేంగి క్రీ. పూర్వం నుంచీ ప్రసిద్ధికెక్కింది.

క్రీ. పూ. 322 ప్రాంతంలో కళింగదేశాన్ని గూర్చి వ్రాసిన మెగస్తనీసు తన "ఇండికా" అనే గ్రంథంలో ఆంధ్రులనుగురించి వ్రాశాడు. ఆంధ్ర

రాజులకు 30 నగరాలున్నాయనీ, ఆరాజులు పాటలీ పుత్రరాజైన చంద్రగుప్తుని తర్వాత చెప్పుకోదగ్గ మహా బలపరాక్రమ సంపన్నులనీ పేర్కొన్నాడు. వారి 30 నగరాలలోను వేంగి ఒకటి, అయితే యీ ఆంధ్రరాజులెవరు ? వీరు శాతవాహనరాజులు అని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. అలాకాదని నా మనవి. క్రీ. పూ 220 మొదలు క్రి. శ. 225 వరకు శాతవాహనుల ఆంధ్రరాజ్యాన్ని ఏలారు. వారి కాలంలో మొదట వేగి రాజధానిగా చేసుకొని తర్వాత కృష్ణానది తీరానికి మార్చారు. క్రీ. పూ. 322 నాటివాడు మెగస్తనీసు కాన, శాతవాహనులకు పూర్వమే వేంగి గొప్ప నగరమనక తప్పదు.

ఇకపోతే క్రీ. శ. 340 నుంచి 350 వరకు పాటలీపుత్రాన్ని సముద్రగుప్తుడు రాజ్యమేలాడు. ఆతడు పాటలీపుత్రంనుంచి దక్షిణాన కాంచీపురం వరకు దండయాత్ర సాగించాడు. అతడు జయించిన రాజులను, రాజ్యాలనుగురించి అలహాబాదులో శిలా శాసనం వ్రాయించాడు. అందులో

"*కౌసలక మహేంద్ర, మహాకాంతారక వ్యాఘ్రరాజ, కైరలకమంటరాజ, పైష్టపురక మహేంద్ర, గిరికొట్టూరక స్వామిదత్త, ఐరండపల్లకదమనక, కాంచేయక విష్ణుగోప' అవముక్తకనీలరాజ, వైజ్ఞేయకహస్తివర్మ, పాలక్కకఉగ్రసేన, దైవరాష్ట్రకకుబేర, కొస్థలపురక ధనంజయ*" మొదలయినవారిని జయించినట్లుంది. అయితే యీ హస్తివర్మ ఎవరు ? దీనిని తెలుసు కొనేందుకు యీ క్రింద వ్రాయబడిన శాసనంఅవసరం. ఈశాసనం క్రీ, శ 440లో శాలంకాయనవంశీకుడును హస్తివర్మ ప్రపౌత్రుడును అయిన నందవర్మ వ్రాయించాడు.

"*విజయవేగీపురానేక సమారావాప్త విజయినో హస్తివర్మరాజస్య ప్రపౌత్రః । వివిధధర్మప్రధానస్య నందివర్మ మహారాజస్య పౌత్రః ప్రతాపోపనత సామన్తస్య చణ్డవర్మమహారాజస్య పుత్రోజ్యేష్ఠః, భగవచ్చిత్ర రథస్వామి పాదానుధ్యాతో బప్పభట్టారక పాదభక్తః' పరమభాగవత శ్శాలంకాయన మహారాజశ్రీ నందివర్మ*" అని వుంది.

దీనివలన తేలినవిషయం సముద్రగుప్తుని దండయాత్రనాటికి (క్రీ. శ. 340–350) హస్తివర్మ వేంగికి (వైజ్ఞేయక) రాజుగా వున్నాడు, ఆతర్వాత అతని ప్రపౌత్రుడైన నందివర్మ మహారాజునాటికి ఆవేంగీ రాజ్యం మహారాజ్యంగా మారింది. కనుక హస్తివర్మరాజు, నందివర్మ మహారాజు అయారు. వేంగి మండలంగా మారింది. అదీగాక చిత్రరథస్వామి ఆలయంకూడా పేర్కొనబడింది. అట్టి ఆలయం వేంగిలో ప్రసిద్ధకెక్కింది, ఈ వేంగీమండలంలో బౌద్ధ, జైనం, యజ్ఞకర్మ సమానంగానే వుండేవి. భారతదేశంలోనే అలావున్నాయి. పూరీ జగన్నాథం సమీపంతోని "కోణార్కం" లోను, వేంగిలోను, శాలిహుండా శిథిలాలలోను, (అట్టిదే అరసవిల్లిలో వుంది) సూర్యాలయాలుండటం గమనింపదగ్గవిషయం. ఈ మూడుకూడా ప్రసిద్ధబౌద్ధక్షేత్రాలు. బౌద్ధులకు ఆరాధనీయుడయిన మైత్రావరుణుడే యీ విగ్రహాల ఆదిరూపం యీ ఆలయమూర్తులకు ఆదిమూర్తి.

ఖరవేలుడు జైనుడు. అయినప్పటికినీ బ్రాహ్మణుల ద్వేషింపలేదు అతని హాతిగుంఫాశాసనంలో 9వ పంక్తిలో "*అశ్వములతోకూడిన కల్పవృక్షమును, గుఱ్ఱములు, ఏనుగులు, రథములు, గృహములు మొదలగువాటిని బ్రాహ్మణులచే స్వీకరింపజేయుటకై వారికి బహుతృప్తిగా భోజనము లిడెను*" అనివుంది. (కళింగదేశచరిత్ర By R Bubbarao P. 42)

కనుక బౌద్ధమతము, జైనము, సంధ్యావందనం పరస్పర విరోధముకలవనుటకు అస్కారములేదు సరికదా యీమూడు ఒకే ప్రాతిపదిక కలవననతప్పదు. యదార్థాన్ని గుర్తింపలేని విదేశ చరిత్రకారులు బ్రాహ్మణమతం, బౌద్ధమతం, జైనమతం యీమూడూ

పరస్పర విరుద్ధములు అని వ్రాయడం దౌర్భాగ్యమే. యజ్ఞయాగాది ప్రధానమతమే బ్రాహ్మణమతం అనడం మరీదౌర్భాగ్యం క్షత్రియులు యాగాలు చేయలేదా? కనుక వేంగిలో యీ మూడుమతాలూ వుండేవి.

పైభాగంలో హస్తివర్మనుగురించి తెలుసు కొన్నాము ఇతనిపేరనే అత్తిలి గ్రామం దుర్గం నిర్మింపబడినాయి. తర్వాత "అత్తిలినాండు" అయింది. వేంగితోసహా యింకా వుంటున్న యితర దుర్గాలుకూడా ప్రముఖస్థానాన్ని వహించాయి. అయినా పేరుమాత్రం వేంగిదేశం అని వుంటున్నా ఆయారాజులు వేంగిరాజ్య పాలకులమనే చెప్పు కొన్నారు. బహుశః నందిమూరు నందివర్మ పేర కట్టబడి వుండాలి. ఇది విడదవోలుకు సమీపగ్రామం ప్రసిద్ధ దుర్గాలలో పిఠాపురం ఒకటి. ఇది సముద్ర గుప్తునినాటికే వున్నట్టు మనం అతనిశాసనంవలన తెలుసుకొన్నాము. 7వ శతాబ్దినాటికి వెంగీ కళింగ దేశాల రెంటికినీ యిది ముఖ్యనగరిగావుంది.

పైన సూచించిన సముద్రగుప్తుని శాసనంలో "దైవరాష్ట్రకకుబేర" అనివుంది. దైవరాష్ట్రమంటే విశాఖపట్నం జిల్లాకు ఆరోజులలో పేరంటున్నారు. వేంగిలోవున్న నిడదవోలులో దేవేశ్వరుడు అనే యీశ్వరునికి శివాలయం పూర్వంఉన్నట్టు శాసనా ధారాలున్నాయి. ఈపేరుకీ ఆపేరుకీ ఏయిదనా సంబంధం వున్నదేమో చెప్పలేము.

ఈవిధంగా వేంగీరాజ్యాన్ని ఏలుతున్న చాళు క్యులకు వేంగీ లేక తూర్పుచాళుక్యులనీ, వాతాపి రాజధానిగా చేసుకొని యేలుతున్న చాళుక్యులను వాతాపి చాళుక్యులు లేక పశ్చిమచాళుక్యులు అనీ. చరిత్రకారులు పేరుపెట్టారు. అయితే ఒకవిషయం. పశ్చిమచాళుక్యులలో కొందరు తాము వేంగీదేశాధి పతులమని వ్రాసుకొన్నారు.

రాజమహేంద్రపురము :

వేంగీదేశానికి రాజమహేంద్రపురం నాయక మణిగావుందని నన్నయ పేర్కొన్నాడు. తూర్పు చాళుక్యరాజైన మొదటి అమ్మరాజు (క్రీ. శ. 918–925) కు రాజమహేంద్రుడు అనే బిరుదుంది. ఆతడే మొదటి రాజమహేంద్రపురాన్ని నిర్మించా డంటున్నారు. కాని విన్నకోట పెద్దన తన కావ్యా లంకార చూడామణిలో "రాజమహేంద్రస్థాత రాజ నరేంద్రుడు" అని వ్రాశాడు. తర్వాత రాజరాజ నరేంద్రుడు కాలంలో యిది అత్యంత ప్రసిద్ధిచెందింది. "ప్రవహించునే వీటి పశ్చిమప్రాకారమొరసి గంగమ్మ సాగరపుంగొమ్మ ప్రావృష్ఫవించినాడే వీటికోటలో బల భేది మదనగోపాలమూర్తి" అని శ్రీనాధుడు పేర్కొన్న ప్రాకారమూకోటా, రాజరాజనరేంద్రుడు కట్టించినవి కావు. అవి రెడ్డిరాజుల కాలంలో కట్టబడ్డాయి. అసలు రాజరాజుయే రాజమహేంద్రపురాన్ని కట్టిం చాడు. అంతకుపూర్వం యీ తూర్పుచాళుక్యులు "నిరవద్యపురం, పిఠాపురం, బిక్కవోలు" వంటి కోటలను తమ సైనికకేంద్రాలుగాను, ముఖ్యనగరులు గాను వుంచుకొంటూ వుండేవారు. రాజరాజు రాజమండ్రిని అత్యుత్తమ విద్యాకేంద్రంగాను, ముఖ్య నగరిగాను చేసుకొన్నాడు.

## నిరవద్యపురం (నిడదవోలు)

నిరవద్యపురం అనేది నిడదవోలుకు పూర్వం పేరు. ఈ నిరవద్యపురం అతిపురాతనమైనదనీ దీనిని రాష్ట్రకూటులు ఒకప్పుడు యేలివుండవచ్చుననీ అను కొంటున్నాను. అసలుదుర్గంకాక ఆయాకాలాలలో యితరదుర్గాలు కొన్ని యిక్కడ కట్టబడ్డాయి. పశ్చిమ చాళుక్యరాజైన రెండవ విజయాదిత్యునకు 'నిరవద్య' అనే బిరుదుంది. అనాటి అవసరాన్ని గుర్తించి ఆతడే యీ దుర్గాన్ని కట్టించడమో జయించడమో జరిగివుండాలి, ఈ విజయాదిత్యుడు (క్రీ. శ. 699–

729) వరకు రాజ్యంచేశాడు. ఇతనిని గురించి South Indian Epigraphy, Annual Report for 1941 Page 84 Paragraph 6 లో వుంది.

" Niravadya was the name of a Westren Chalukya King Vijayaditya (il) (A. D. 699-729)" కనుక తూర్పుచాళుక్యులు వేంగిని ఆక్రమించిననాటికే నిరవద్యపురం కాని లేదా చాళుక్యులు సైనిక కేంద్రంగా వుండడంకోసం దుర్గాన్నిక్కడ నిర్మించడంకాని జరిగివుండాలి. ప్రస్తుతం హైస్కూలున్నప్రాంతం మొదటి కోట. ఆతదనంతరం అది నాశనమయిపోగా యిప్పుడు దిబ్బల ఆకారంతో వున్నకోటను చాళుక్యవంశీకుడైన మహాదేవుని పూర్వీకులు కట్టివుంతవచ్చును. నిడుద ప్రోలుదుర్గం ఎప్పుడుకూడా కీలకకేంద్రమే కనుకనే యిక్కడ యుద్ధాలుకూడా చాలా జరిగాయి. అటు గోదావరిదాటి రావాలన్నా, దాటడానికి పోవాలన్నా శత్రురాజులకు యీదుర్గం చాలా ఆటంకంగావుండేది. ఇక్కడ బయలుపడిన శాసనాలెన్నో వున్నాయి. విగ్రహాలు క్రమక్రముంగా బయలుపడుతున్నాయి. దీనిని గురించిన చరిత్ర శాసనాధారంచేత, నిడదవోలు వాస్తవ్యులు శ్రీ గోపరాజు వెంటటానందంగారు నిడదవోలు చరిత్ర అనే పేరుతో చిన్నపుస్తకం ప్రకటించారు. మరికొన్నివిషయాలు ప్రస్తుతం యిక్కడ పేర్కొంటున్నాను. తూ. చాళుక్యులకాలంలో యిక్కడ మల్లీశ్వరుడు, దేవేశ్వరుడు వగైరా శివాలయాలూ, తూ. చాళుక్యులకు ఆరాధ్యదైవమయిన కుమారస్వామి ఆలయమును యింకా యితరాలయాలు ప్రసిద్ధిలో వుండేవి. కుమారస్వామి తూ. చాళుక్యులకు ప్రధాన దైవం.

నిడదవోలు రాజమండ్రికి పడమటగా 10 మైళ్లలో వుంది. విజయేశ్వరం మీదుగా గోదావరి దాటి ధవళేశ్వరంచేరి ఆపైకి పోయేందుకు పూర్వం ఒకప్పుడు బాట ఉండేది గోదావరికి తూర్పుగట్టున కూడ ఒక ముఖ్యమైన, బలమైన దుర్గం అపసరమని గుర్తించి యిప్పటి "వేమగిరి"అనేచోట పూర్వందుర్గం ఒకటి నిర్మింపబడింది. కనుకనే అదికూడా ఒక కూడలి అని చెప్పుకోవాలి. తూర్పు ఇండియాకంపెనీ రోజులలోకూడ ధవలేశ్వరం వాళ్ల సైన్యాలకుస్థానం. రెడ్డిరాజులు నేటి రాజమండ్రిని బాగాప్రస్థిచేసి పెద్దపెద్ద కోటలుకట్టారు. ఇటు నిడదవోలు, అటు రాజమండ్రి, వేమగిరి గోదావరికి నాడు కంచు కోటలు నిడదవోలు సముద్రమట్టానికి పైన 11 అడుగులు మాత్రమే వుండడంచేతన, అదిగాక గోదావరి ఏరులు పొంగినప్పుడు గ్రామానికి ముంపు బాధ కలుగుతుంది కనుక, దుర్గాలు చాలాఎత్తుగను, బలంగాను కట్టవలసివచ్చినందున యీ నిడుదప్రోలు దుర్గాల నిర్మాణార్థం ఎలసిన మట్టియావత్తూ మెట్ట ప్రాంతాలనుంచి తెచ్చారు ఆలా తీసుకువచ్చిన భాగాలే నేడు బ్రహ్మాండమైన కొలనులుగావుండి వాటికి "*తాడిమళ్ల అవ*" అనీ "*చాగంపూడి అవ*" అనీ అంటున్నాము.

శాసనాలు పరిశోధిస్తే ద హిం. శా. IV సం 1243 కలశాసనంలో "*చక్రవర్తి శ్రీవిజయాదిత్య నిరవద్యప్రోలివీటు విజయంచేసియుణ్డ్ మల్లేశ్వర మహాదేవ [పట్ట]నమున వేంగీమండలమున ౭పజకు రాజరాజమర్యాద నిచ్చిన పత్రస్తశాసనస్థితి...*" అని వుంది. దీనిఅర్థం :

ఉభయ కులోత్తుంగచోళుని కొడుకయిన రాజరాజు కాలంలో విజయాదిత్యదేవుడు (6వ) నిరవద్య ప్రోలువచ్చి వేంగమండల ప్రజలకు శాసనవిషయం చాటించాడు. దీనివలన వేంగివిషయ ప్రజకు నిరవద్యప్రోలు ముఖ్యనగరమనకతప్పదు. అది. పరిపాలనా ప్రధానకేంద్రం. నాటి జననాథపురం యిదే కాదుగదా,

ఇది కానిచో నిడదవోలుకు సుమారు మూడు మైళ్ళలోనూ తాడేపల్లిగూడెం సమీపంలోని అరుగొలను కోటదిబ్బలకు మైలులోపునవున్న జగన్నాధపురం అయి వుండాలి. ఆ గ్రామంలో మల్లీశ్వరాలయం వుంది. అదీగాక అరుగొలనుకోట చాళుక్యులవనే ప్రతీతివుంది. జననాధపురం క్రమంగా జగన్నాథ పురంగా మారింది.

Annual Report of Epigraphy for the year 1921–22 at page 97లో యిలావుంది.

"The copper plate record No. 3 appendix A sent to me by Divisional Officer Elur, Kristna Dt. is a grant of the later Eastren Chalukyan king Raja Raja II son of Rajendra choda II alias Kulottunga choda I. This is the first copper plate inscription known so far issued by the king ... ... .... . The king's cornation took place on 1076 July 27th. The purpose of the grant was the gift of twelve villages to MUMMADI BHIMA of the solar race .... .... . BHIMA is said to have been brought up by his grand uncle Vijayaditya VII. Among the boundaries given in the records occurs the name of Niravadyapura.

కనుక పై రాతిశాసనంలో వుదహరించినదాని కిని యీ తామ్రశాసనంలో ఉదహరించినదానికినీ సరిపోతున్నది. కాగా ఉభయకులోత్తుంగచోడుని కొడుకయిన రాజరాజుయొక్క మర్యాదను అనగా కట్టడినిలేక ఆజ్ఞతో అని మొదటిశాసనం. విజయా దిత్యునిచే పెంపబడిన ముమ్మడిభీముడనేవాడికి 12 గ్రామములు దానమిచ్చినట్లు రెండవదాని అర్థం. నిరవద్యపురం రెండుశాసనాలలోను వుంది. ఈ శాసనం క్రీ. శ. 1076 ప్రాంతంనాటిది:

క్రీ శ 918 మొదటి చాళుక్యభీమునికాలంలో రాష్ట్రకూటరాజైన రెండవ కృష్ణుడు దండెత్తిరాగా నిరవద్యపురంవద్దనూ పెదవంగూరుకడను జరిగిన యుద్ధాలలో ఆరాష్ట్రకూటరాజు సేనాని యైన దండెన గుండయను జయించినట్లు శాసనాలున్నాయి

క్రీ. శ. 848–892 వరకు ఏలినగుణగ విజయాదిత్యుని సేనానియైన పండరంగనిగూర్చిన కందుకూరు శాసనంలో "శ్రీ నిరవద్యుండు" అని పేర్కొనబడింది. ఈ నిరవద్యశబ్దప్రయోగం "నిర వద్యపురకోటకు" అధిపతి అనే అర్థంతో వ్రాయ బడిందని నే ననుకొంటున్నాను. ఈ పండరంగని వంశంవారే నేటికీ పశ్చిమగోదావరి భీమవరంవగైరా ప్రాంతంలో "పండ్రంగి" యింటిపేరుగా చాలా మంది వున్నారు. ఈ పండరంగ నామధేయులు శాసనాలలో పెదపండరంగు "కరణము పండరంగు" అని యిద్దరున్నారు. యిద్దరు సమకాలీనులు. తాతా మనుమలు.

మరొక కొంతకాలం వెనుకకుపోతే (క్రీ. శ. 714–51) నాటిది? "అహవనకర"శాసనంవుంది. దీనిఅర్థం తెలియడంలేదు. అందులో 27వ పంక్తిలో "నైరవద్యమహాసర్థ్ణవళ్" అనివుంది. దీనిఅర్థము "అనింద్యమైన సార్థవాహులు" అని వ్రాశారు. అది సరియైనదికాదు. ఎందుకంటే 30 పంక్తిలో "నిరవద్య ప్రిధివికనదిరజుల్" అని వుంది దీని కర్థము నిరవద్యపురానికి చెందిన ప్రిధివికనాడిరాజులు అని తోస్తుంది. ఈ కన్నాడిరాజు రాష్ట్రకూట రాజయిన కృష్ణుడేమో చూడవలసివుంది. 31వ పంక్తిలో "రమిశ్వర ప్రిధివిమహాసర్థ్ణ వళ్" అని వుంది. దీనిఅర్థం రామేశ్వరసార్థవాహులు అని వ్రాశారు. కనుక రమిశ్వరవలె "నిరవద్య" కూడ గ్రామనామమయి వుండాలి.

కా.గా ప్రిథివి అంటే పృథ్వి అనీ, మహాసర్ధ పళ్ అంటే సార్థవాహులనీ అర్థం అయివుండదని నే ననుకొంటున్నాను. కనుక "నిరవద్య" అంటే నిరవద్య ప్రోలు అనే అర్థం. అది గ్రామనామమేకాని అన్యం కాదు.

ఉభయకులోత్తుంగచోళుని కొడుకులఅనంతరం వేంగిసామ్రాజ్యం చీలిపోయి చిన్నభాగాలుగాఅయింది. కొంతకాలానికి చాళుక్యుడును, సర్వలోకాశ్రయ బిరుదాంకితుడును అయిన నిడుదప్రోలి మహాదేవుడు ప్రభృతులు నిడదవోలు ప్రభువులుగా 13 శతాబ్ది వరకును వున్నారు. వీరికిని చోడరాజులతోను అటు కాకతీయులతోడను సంబంధ బాంధవ్యములున్నాయి. కాకతీయవంశము కకుత్సవంశము, కకుత్సపదం కాకత్, కాకతీగామారిందని నా మిత్రులు కొండేపూడి సూర్యనారాయణగారన్నారు. నేటి జగదల్పూరు రాజులు కాకతీయవంశస్థులు. శ్రీరాముని అనంతరం అతని వంశస్తులు దక్షిణకోసల (జగదల్పూరు) ప్రాంతాలకు రాజులుగాపోయినట్లు రామాయణకథ. వరంగల్ రాజైన కాకతీయ ప్రతాపరుద్రుడు నిడదవోలువాడు.

నిడదవోలును పాలించిన చళుక్యరాజులకు మంత్రిశేఖరులు ఇందులూరివారు.

*"అనూకన పెగ్గడకును*
*సూనుండై బల్లిపెగడసుధి యొప్పారెన్*
*దీనిధి నిరవద్యాపుర*
*మానవనాథులకు( దాన మాత్యుండగుచున్"*
*"అతనిసుతుడు వరశివాచారరతుడు*
*జననుతుండు ధైర్యశౌర్యయుతుడు*
*జగతి నిడుదవోలి చక్రవర్తుల రాజ్య*
*మహిమ(దాల్చె నాగమంత్రియనగ"*

(శివయోగసారం)

అసలు విషయం: నన్నయకవి రాజరాజ నరేంద్రుని 'నిరవద్య నరేశ్వర', 'నిరవద్యరవిప్రభ', 'నిరవద్యయువతిమదన' అని తన ఆశ్వాసాంతాలలో సంబోధించాడు. కనుక రాజరాజనరేంద్రుడు నిడదవోలురాజు. అతని తర్వాత 13వ శతాబ్దివరకు యీ నగరాన్ని చాళుక్యరాజులే యేలారు. ఇంతకాలం అనగా 7వ శతాబ్దినుంచి 13వ శతాబ్దివరకు ఒకే దుర్గాన్ని ఒకే వంశీకులు పాలించడం అసాధారణం.

ఈసందర్భంలో మెకంజీ వ్రాయించినకైఫియత్ లలో నిడదవోలునుగురించి వున్నవిషయం తెలుసుకొనడంకూడ అవసరం.

A descriptive Catalouge of the Telugu manuscripts Vol XIV Telugu local tracts No. 1 to 150 Page 10 M. 42.

నిడదవోలు (Nidadavole) Folios 2 to 4. "An account of Nidadavole. How the name underwent changes, the extent of the village along with the boundaries are mentioned. A legendary origen of the temples in the village is described. The rulers from the Gajapaties are mentioned. An account of the Geelakarragudem is also found.

Page 49. కసుబె నిడదవోలు సర్కారు యేలూరుతాలూకా కైఫియతు

*"కృతయుగమందున అనెనవోలు*
*త్రేతాయుగమందున బెడదనవోలు*
*ద్వాపరయుగమందున నిడుమధ్యాపురి*
*కలియుగమందున నిడదవోలు".*

సదరుహీ నాల్గుయుగాలకు నాలుగు నాతులుకలవు. నిడదవోలు గ్రామానకు తూర్పుగావున్న సంగలమ్మ మడుగు ఉత్పత్తి రాజమహేంద్రవరంజిల్లా తాలూకా తాళ్ళపూడి గూటాలమధ్య పూర్వం పూడుచెట్లువిస్తారం వున్నందున అఖండగోదావరికి పడమటనెక్కుగావుండి యీ పూడుగుచెట్లు అరణ్యమందు కాలవ ప్రవహించినందున ఆకాలవకు పూడుగుకాలువ అనేపేరు ప్రసిద్ధి

అయి అక్కడనుంచి పడమర రాజమహేంద్రవరం జిల్లా తాలూకు... అని వగైరాపుంది దీనిని పూర్తిగా సంపాదించి చదవాలి.

ఇదేగ్రంథంలో పుట 14–15 లో M. 58 లో Folios 43–65 లో రాజమండ్రిని గురించి యిలా వుంది.

"An account of the historic city of Rajahmundary. An account of the fort of Vemagiri and the administration under Deshapandays is given. The towrn of Bikkavolu, then called as Biru Ranka Roypuram and its successive rulers of Kubja Vishnu Vardhana, Vijayaditya are detailed. Then another line of rulers and their dates are mentioned. How Vijayaditya advised by a shepherd boy constructed the fort of Vemagiri is described. The fort is described in detail with all its ceremonies. A list of kings and duration of each ruler, till Raja Raja Narendra son of Vimaladitya is recaorded. The legend of Sarangadhara is mentioned.

The line of kings how then changed to Reddies mentioned. An account of temples is given – Vijayaditya, contructed 108 temples and constructed tanks. Administration of Kapilewara Gajapati is mentioned

ఈ కైఫియత్తు పూర్తిగా చదివితే చరిత్రనిర్మాణానికి కొంత ఆధారం అవుతుంది. ఇందులో బిక్కవోలుకు "*బిరుడాంకరాయపురం*" అనే విషయం చరిత్రకు చాలా అవసరం.

**గోదావరి**: కఠోరదండకారణ్య గమనశ్రమనుడిగి గోదావరీతీరాన సుఖోపవిష్టులైన తన సీతారాములను చూచుకొని మైమరచాడు ఆదికవి వాల్మీకి గద్గదనదద్గోదావరీ సైకతసీమల విహరించు హంస మిథునములచూచి తన రామునే మఱచింది దండకారణ్యవాస ప్రియసఖి సీత. వేంగిని రాజమహేంద్రి యొనర్చె అమ్మరాజవిజయుడు. అలనాడు తన ఆంధ్రభారతి నెన్నొసట కస్తూరితిలకముంచి తీర్చిదిద్ది రాజరాజనరేంద్రుడు పులకించినది యీ గోదావరీతీరమందె. కాని నన్నయకవి భారత అవతారికయందు కాని అశ్వాసాంతమందుకాని యీ గోదావరిపేరైన ఎత్తలేదేమి? అవతారిక అతని స్వతంత్రరచన కాదా? లేక గోదావరినెరుగడా? తాను వ్రాసిన నందంపూడి శాసనంలోకూడ "*శ్రీ రాజరాజదేవో రేండేఱుల నడిమినివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః సమాహూయ*" అని వ్రాసితోసి వేశాడేకాని గోదావరిని పేర్కొనలేదే ఆయితే యీ రెండేఱులు గోదావరివికావా! అయితే అరెండును ఎఱ్ఱకాలువ, గోస్తనీనదికావాలి. తీర్థయాత్రా వర్ణన సందర్భంలోకూడ నన్నయపేర్కొన్న అర్జునుడు

*సీ॥ "దక్షిణగంగనా దద్దయునొప్పిన*
*గోదావరి"ని*

చూచినవాడై "*శ్రీపర్వతంబునకు*" దద్దయు లంఘించాడు అన్నాడు.

ఈవిధంగా గోదావరిని నన్నయ విస్మరించడం చిత్రంగానే కనిపిస్తున్నది. నన్నయేకాదు, పూర్వ చాళుక్యుల శాసనాలలో పగుణవారంలోని గుఱ్ఱస్తని (గోస్తనీనది) కిచ్చినంత ప్రాముఖ్యం గోదావరికిచ్చినట్లు కన్పింపదు. దీనికి కారణమూ తెలియరాదు

ఇంతవరకు యీభాగంలో "*గోదావరి*" పేరు నన్నయ ఎత్తుకోలేదనీ, నేటి నిడదవోలు నాటి నిరవద్య పురమనీ, జననాదపురం, నిడదవోలు సమీపమందున్న అరుగొల్లుకడ జగన్నాథపురం అనీ నేటి బిక్కవోలుకు పూర్వకాలంలో "*బిరుదాంకరాయపురం*" అనేపేరుందనీ తెలుసుకొన్నాము.

# III భాగం

## రాజరాజనరేంద్రుడు

రాజరాజనరేంద్రుడు (క్రీ. శ 1022-1063)

రాజరాజనరేంద్రుని గురించి చాలామంది వ్రాశారు. కనుక కొన్ని విషయాలు మాత్రమె యిక్కడ వ్రాస్తాను.

క్రీ. శ 1022 ఆగష్టు 16వ తేదీని యితడు పట్టాభిషిక్తుడయాడు ఏచోట అయినదీ తెలియదు. నన్నయ యీరాజును "రాజా" అనే పదాలతోసంబోధించాడు. "అదిక్షత్రచరిత్ర" అని ఒకచోటమాత్రమే పేర్కొన్నాడు. కనుక చాళుక్యులు క్షత్రియులేనా? అనే సంశయం కలుగకమానదు.

రాజరాజు చాళుక్యరాజు. చాళుక్యులు "అగ్ని క్షత్రియులు" అని కల్నల్‌టాడ్ రాజపుత్రస్థాన చరిత్రలోవుంది. అగ్నిక్షత్రియులే బ్రహ్మక్షత్రియులు. ఈ బ్రహ్మక్షత్రియులనుగూర్చి బ్రహ్మపురాణంలో వుంది, (చూ. అగ్నిక్షత్రియులు By శ్రీ కోట వేంకటాచలం.) వీరిలో కొందరు రాజవంశీకులుగను నురికొందరు శస్త్రోపజీవులయిన బ్రాహ్మణులుగను విడిపోయారట. (Ref. చాళుక్యులచరిత్ర—రాజరాజ నరేంద్ర పట్టాభిషేకసంచిక.) రాజరాజుయొక్క "తన కులబ్రాహ్మణుడు" యిట్టి బ్రహ్మక్షత్రియుడే అనే అభిప్రాయంవుంది. బ్రహ్మాండాది నానాపురాణ నిరతుడైనా నన్నయ.

హిమకరుదొట్టి:— తన వంశం చంద్రవంశం అని రాజరాజన్నాడు. విమలాదిత్యుని రణస్థిపూడి శాసనంవరకు తూర్పుచాళుక్యులు తాము చంద్రవంశజులమని యెక్కడా చెప్పుకోలేదు. సూర్యవంశస్థులైన చోడులతో విమలాదిత్యుని వివాహసంబంధమే దీనికి కారణం. కాగా బేతనభట్టు చాళుక్యులను చంద్రవంశజులన్నాడు. నన్నయ అతని పిమ్మట శాసనకావ్యకర్తలు రణస్థిపూడి శాసనకావ్యకర్తఅయిన బేతనభట్టుమాటనే పలికారు.

మానవ్యసగోత్రం:— రాజరాజనరేంద్రునిది మానవ్యసగోత్రం అని నన్నయ వ్రాశాడు (అశ్వాసాంతం). శాసనాలలో మానవ్యసహారీత ద్విపక్షగోత్రికులు చాళుక్యులనివుంది. ఈరెండుగోత్రాలు కలవారు చాళుక్యులొకరేకాదు. కదంబులుకూడ యీ రెండుగోత్రాలు మాకున్నాయని వ్రాసుకొన్నారు. ఈ కదంబులు బ్రహ్మక్షత్రియులు.

కులబ్రాహ్మణుడు:— అంటే పురోహితుడన్నారు. నన్నయ తన ఆంధ్రభారతంలోకానీ తాను కావ్యకర్తగావున్న శాసనాలలోకాని "కులబ్రాహ్మణ" పదం పురోహితఅర్థంలో వాడితే పురోహితుడు అనే అర్థం అంగీకరింపకతప్పదు. అట్టిదీ ఏదీ వ్రాసినట్లు లేదు. పురోహితుడు అనవలసినచోట పురోహితుడు అనే వ్రాశాడు (Ref. నందంపూడి శాసనం.)

నన్నయభట్టు:—ఇతడు ఉభయకావ్యరచనాభిశోభితుడు అనగా తెనుగున సంస్కృతమున కవి. కన్నడకవికాదు. ఇతడు అదికవి. పద్యాలువ్రాయడం ఇతనికి పూర్వం వుండవచ్చు. అంతమాత్రాన అవి ఉత్తమకావ్యాలు కానేరవు, అమరనిఘంటువు, ఆంధ్రనామసంగ్రహం కావ్యాలు కాగలవా. ఆ దృష్టితోచూస్తే నన్నయ ఆదికవి అనకతప్పదు.

ఇంతవరకు జనసామాన్యం సాధారణంగా చదువుతూవచ్చినవి కథా సరిత్సాగరం బేతాళవింశతి. కనుకనే 'కానటుబేసటు చదివి' అనే దానికర్థమయిందని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వ్రాశారు.

కనుకనే నన్నయఆంధ్రభారతంతో శిష్టమైన ఆంధ్ర కావ్యవాఙ్మయం ప్రారంభమయింది.

నారాయణభట్టు:—ఈతడు "వాణస వంశ ధరామరుండు" "వాణస" అనే మాటకుబదులు, అర్థంపొసగక "వాసిగ" అనీ "తానును" అనీ పరిష్కర్తలు మార్చారు. "వాణస వంశం" అనేది ఉన్నట్టు చాలాశాసనాలలోవుంది సంస్కృతకర్ణాట ప్రాకృతపైశాచి శాంధ్రభాషా సుకవి రాజశేఖరుడు, హరితగోత్రుడు, కాంచనసోమయాజి ప్రపౌత్రుడు, ఆకలంకాశాంకనామాత్యుని (శౌచాంజనేయుడు) పుత్రుడు నారాయణభట్టు. "వాణస" అ టే 'వాజసనేయ' కు వికృతికావచ్చునని శ్రీ సాం. గు లక్ష్మీనరసింహారావుగారు (తణుకు) అన్నారు. దే అయితే వాణసవారు యాజ్ఞవల్క్యులు అవుతారు.

రాజరాజును "వైరివీరరసవైద్య" అని నన ము సంబోధించాడు. అంటే వైరివీరులకు రాజు జు రసవైద్యుడన్నమాట? లేదా వైరివీరరసానికి వై ౖౖ వుండాలి. అదీకాకపోతే వైరుల వీరరసం గి పొరలి విజృంభిస్తే దానిని గ్యారంటీగా బాగుచేయ ల రాజవైద్యుడనాలి.

## IV భాగం

### మతప్రబోధం

రాజరాజు మహోన్నత మతసందేశం :

రాజరాజు కోరిన మతవిధానమెట్టిది అని లోగడ కొంత చర్చించడమైంది. ఆంధ్రలో భారతరచనా వశ్యకత యెట్టిదోకూడ చూడడమైనది. అతడు నమ్మిన మతమెట్టిదో, ప్రజకిచ్చిన ప్రబోధమెట్టిదో యిప్పుడు తెలియనగును. నన్నయ స్వంతరచన అనగా అను వాదరూపము కానట్టిది అతని అవతారిక భాగమేకదా రాజరాజు నన్నయతో ఇలా అన్నాడు.

చ॥ అమలసువర్ణశృంగఖుర
మై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేదవిప్రులకు
దానముచేసినఁ దత్ఫలంబు త
థ్యముసమకూరు భారత క
థాశ్రవణాభిరతిన్.

పై పద్యములో క్రింద గీటుంచిన అరసున్నాదులు ప్రక్షిప్తాలనకతప్పదు. "దానముచేసిన తత్ఫలంబు" అంటే సరియైనఅర్థం పొసగుతుంది. ఇక తరు త భాగంలో "భారతబద్ధస్పృహులగువారికి నె ర బహుయాగంబులఫలంబు పరమార్థమగున్" స్వ అంతకుముందుభాగంలో "పార్వతీపతి పదాబ్జ వ పూజామహోత్సవమున్" అని రాజరాజు స్వయ ం అన్నట్టుంది.

ఎంతోమంది వేదవిప్రులకు వందలాది గోవులను దానంచేస్తే వచ్చేఫలం యావత్తూ భార విన్నమాత్రాన వినినవారందరికీ వస్తుంది. భారతబద్ధస్పృహులగువారందరికి. యాగాలు కుండానే ఎట్టిపరిస్థితులలోనైనాసరే బహుయాగ ఫలం పరమార్థమవుతుంది సుమా! అని రాజ ప్రబోధించాడు. కనుక భారతశ్రవణం వుంటే యాగాలు, గోదానాలు అతిశయోక్తి ప్రాయా యనే అతని ప్రబోధం. రాజరాజిచ్చిన గోదానా కాని, చేసిన లేక చేయించిన యాగాలుకాని

అతడు ప్రబోధించినది "ధ్యానం, పూజామహోత్సవం, భక్తి మాత్రమే. అదే పరమార్థము కాగలదు'' అని అతని విశ్వాసం. కనుక భారతకథలను వినండి పరమార్థమును తద్వారా సాధించండి అని భక్తిని తద్వారా పరమార్థప్రాప్తిని అతడు అన్నివర్ణాలవారికి ప్రబోధించాడు. పాండిత్యంకంటె భక్తి ముఖ్యమన్నాడు.

భారతం పూర్తిగా అనువదించనందున నన్నయ కవి మనకాసందేశాన్ని పూర్తిగాఅందించలేకపోయాడు. తుదకు ఆకీర్తి తిక్కనకుదక్కింది. భగవద్గీతను అనువదించకుండా విడువటంలోకూడ తిక్కన విశిష్టతను గుర్తింపనగును.

ఈవిధంగా బౌద్ధ జైనమతాల అహింసాధర్మాన్నీ, గీతాప్రబోధిత పరమార్థప్రాప్తిమార్గాన్నీ సమన్వయించి తన తెలుగుప్రజకందించిన నరపాలుడు రాజరాజు.

మతం మానవుని జన్మహక్కు. అది యినుప తెరలో బంధింపబడేదికాదు. అది వాడవాడలా గడపగడపకూ నివాళులెత్తుకుంటూ పరుగిడాలి. వర్ణవిచక్షణారహితంగా అందరూ పరమార్థాన్ని సాధించుకోగలగాలి. ప్రజామతం అవసరం అని గుర్తించాడు రాజనరేంద్రుడు. నాడు రామాయణం విన్నట్టుగా నేడు అందరూ భారతకథలు విని పునీతులు కావాలని ఆకాంక్షించాడు. కనుకనే ఆతడు సమస్త వర్ణాశ్రమధర్మపరిరక్షకుడు, లోకరంజకుడు కాగల రాజు.

అంతటితో ఆరాజు పరితృప్తినొందలేదు. పరమాత్మ ప్రాప్తిసాధనకు అక్షరజ్ఞానంకూడా అవసరం లేదుసుమా అని సందేశమిచ్చాడు. "భక్తితో" "విని" "చూచి" "హృదయము నిలిపి" "ధ్యానం, పూజ" అలవరుచుకొంటే పరమాత్మప్రాప్తి లభిస్తుందనే మహోజ్జ్వల సందేశమిచ్చిన విమలమతి, రాజరాజ నరేంద్రుడు అట్టిరాజు అంతర్యాన్ని గుర్తింపగల లోకజ్ఞుడు నన్నయకవి.

సమాప్తి.

| పుట | కాలం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 160 | 1 | 1 | వ్యాసుడు | వాల్మీకి |
| ,, | ,, | 11 | భారతి | భారత |
| ,, | 2 | 10 | పాడునటాలు | పానవట్టములు |
| 162 | 1 | 15 | నఖిల | నఖిల |
| 163 | ,, | 16 | చాణుక్యులు | చాళుక్యులు |
| 165 | 1 | 5 | నిరోధు | విరోధు |
| ,, | ,, | 12 | వాత | వారి |
| ,, | 2 | 12 | శితు | శ్రితు |
| ,, | 2 | 15 | గనుక | కనుక |
| 166 | 2 | 2 | పాథ | పాద |
| ,, | 2 | 27 | Bubba | Subba |
| 167 | 2 | 15 | రెడ్డీ | రెడ్డి |

# నన్నయ్య ఉభయవాక్ప్రౌఢి

శ్రీ యడవల్లి ఆదినారాయణ

*"వచియింతు వేములవాడ భీమనభంగి*
*నుద్దండలీల నొక్కొక్కమాటు*
*భాషింతు నన్నయభట్టు మార్గంబున*
*నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు."*

అని కవిసార్వభౌముడు శ్రీనాథుడు కాశీఖండమున తనకు పూర్వులైన కవులలో, తన కాదర్శప్రాయులైనవారిలో, తనకు నచ్చిన యొక్కొక్కగుణమును స్వీకరించి తన కవితలో పొందుపరిచినట్లు చెప్పెను.

"*ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి*" యన్నారు శ్రీవిశ్వనాథ. నన్నయ, తననుగూర్చి రాజరాజనరేంద్రుని ముఖమున "*తనకులబ్రాహ్మణు* ....*లోకజ్ఞు, నుభయభాషాకావ్య రచనాభిశోభితు, సత్ప్రతిభాభియోగ్యు*" నని పల్కించెను. మహాభారతసంహితను తాను రచించులక్ష్యము "*సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలోనారసిమే*" లనుట యితరు లక్షరరమ్యత నాదరించుటగా తెల్పెను. ఈలక్ష్యసాధనకు తాను "*నానారుచిరార్థసూక్తినిధి*" యయ్యెనట. ఈసూక్తినిధిత్వమున నుభయవాక్ప్రౌఢిమ చేరును. కాన "*నుభయవాక్ప్రౌఢిమ*" యన్నదావి స్వరూపమేమో విచారింతము.

నన్నయ మార్గకవితాగామియనియు, శైవకవులు దేశి, జాను తెనుంగుల నుద్ధరించిరనియు, భాషా, సారస్వతచారిత్రకు లుద్ఘాటించుచున్నారు. శైవయుగము తర్వాతివాడగు శ్రీనాథకవిసార్వభౌముడు నన్నయ నుభయవాక్ప్రౌఢిమ గలవానిగా నుద్ఘోషించినాడు.

వ్యాసకృత సంస్కృత భారతము నాధారముగా దానిసారమును తెనుగున రూపొందింప యత్నించుట చేతను, నప్పటికి సంస్కృత పండితాదరమును, రాజాస్థానాదరమును తెనుగుపొందని కారణముననను, తెనుగు

సంస్కృత భవమేయగుభాష యను భావముకలవాడు నన్నయ యగుటను "శ్రీవాణీ గిరిజాః" అన్న శ్లోక ముతో "రాజకులైకభూషణుఁ డ" న్న తత్సమపద బహుళమైన పద్దెముతో తెనుగు భారతము నవత రింపజేసెనేగాని, 'మార్గ' మార్గమునే యవలంబించి 'దేశి'ని వదలవలెననిగాని, 'దేశి' 'మార్గ' మార్గముల విడదీసి రెండుగా చేయవలెననిగాని యాత డూహించి నట్లు నాకు తోపదు. తెనుగు నుడికారమును చక్కగా తన భారతమునందెల్లెడల పొందుపరిచి, సంస్కృతాంధ్రములకు భేదము పరిశీలించినగాని తెలియ నంతగా వాడిన మహామహుడు, ఆంధ్రభాషోద్ధరణకు నడుముకట్టిన మహోద్యమ ప్రవర్తకుడు నన్నయ. తెనుగుకవులలో చక్కని నుడికారమును వెలయించి కావ్యములందెల్ల దెనుగుదన ముట్టిపడునట్లు చేసిన కవులలో ప్రథమగణ్యుడు శ్రీనాధుడు. కాశీమహాపట్టణమునగూడ నాంధ్రత్వమును ముద్రింపచేసిన జాతీయకవిసార్వభౌము డాతడు. ఆతడు సంస్కృతాంధ్రముల కుడియెడమల వాడగల సవ్యసాచి. ఆతని కావ్యములలో ప్రదితముగా కన్పట్టునవి మహోజ్జ్వలమైన పద్యరచనాశిల్పమును, నందెల్లెడలను ప్రచురముగా భాసించు తెనుగు సంస్కృతముల పొందిక. ఈయందమున కాతనికి నన్నయ యాదర్శమట

అయితే తెనుగు సంస్కృత శబ్దములుగల మహాంధ్రమున నారెండు భాషలపదములను కలిపి వాడుటగూడ నొక గొప్పయేనా! దీనికి వాగనుశాసనులును, కవిసార్వభౌములును కావలెనా అని అనిపించును. కాని కలిపివాడుటయేగాదు వాడుటయందలి ప్రౌఢిమ చూడవలె. దీనికి సత్ప్రతిభాభియోగ్యత కావలెను.

ముందు శ్రీనాధునిలోని 'ఉభయవాక్ప్రౌఢిమ' ను స్థాలీపులాకముగా చూపుదును.

"కలశాబ్ధికన్యకా కదపల్లవద్వయీ
సంవాహనక్రియా సముచితంబు."

ఈసీసమిట్లే ప్రౌఢసంస్కృత సమాసములతో ప్రతిపాదమును కూడి యలరారుచున్నది,

"మకరకుండల వజ్రమాణిక్యదీప్తులు
చెక్కుటద్దములపై జిరువార."

ఇందలి మొదటి సగము సంస్కృత సమాసము. రెండవ సగము తెలుగు. ఒకదానికొకటి తీసిపోని అందాల సంతరించుకొన్నవి. సంస్కృతసమాసమున కుద్దియైన తెనుగువాడి మెప్పించుట శ్రీనాధేతరులకు సుసాధ్యముకాదు.

"డాకాలిగండపెండారంబు దాపున
బొమ్మలై వైరిభూభుజులు వ్రేల."

ఇందు తెనుగు సంస్కృతపదములు మిశ్రితములైనవి.

"త్రసరేణు పరిమాణధాతు ధూళీపాళి
యలికంబులకు వింత చెలువునొసగ"

నన్న సంస్కృత సమాససౌష్ఠవమునకు తీసిపోని

"ఘనమైనరారాపు చనుదోయి రాయిడి
నిఱుపేద నడిమికి వెఱపుచూప
తొలుకాఱు మెఱుగుదీగెల నేలుకన్నులు
వడదాకి యొక్కింత వాడుపాఱ"

నన్న తెనుగుపదముల యల్లికసొంపుతో పద్యమును హుందాతనముతో నడిపించుటయు,

"సింధూల తిలకంబు, చెమటచిత్తడిదాకి
యలకభాగంబు నం, దసలుకొనగ"

నని రెండుగణములు సంస్కృతపదములు రెండుగణములు తెలుగుపదములుకూర్చి రెండు బాసలకుభేదము నేర్పరింప శక్యముగానట్లు రచించుట ప్రౌఢులకును ప్రతిభావంతులకునే సాధ్యమన సాహసమగునా!

"వేనలిపాటుపాటు నఱ
వెంద్రుకతోఁ దిలతండులాన్వయ
శ్రీనటియింపగైనడలి
వ్రేకనిచన్నులు పాలవంకలై

కౌనసియార్పవాలుఁదెలి
కన్నులఁ గల్కితనంబు వీడ్కొనన్
మానినిహస్తమూది యొక
మంజులభాషిణి వచ్చె వీధికిన్."

ఇందు తెనుగుఁదనము పదములందేకాక పాత్రచిత్రణ యందును గలదు. వెంటనే

"వేదపురాణశాస్త్ర పద
వీనదవీయసియైన పెద్దయు
త్తైదువ కాశికానగర
హాటకపీఠశిఖాధిరూఢ య
య్యాదిమశక్తి సంయమివ
రా! యిటురమ్మనిపిల్చె హస్తసం
జ్ఞా వరలీలరత్నకట
కాభరణంబులు ఘల్లుఘల్లనన్.

అనుచు నామెనే "ఆదిమశక్తి"గా చూచియు "పెద్ద ముత్తైదువ"గా గుర్తించుచు సంస్కృతమున వ్యాకరణజ్ఞులు మురిసిపోవు పదప్రయోగ కౌశలమును ముద్దుగా ప్రదర్శించినవాడు కవిసార్వభౌముడు.

నన్నయ యీదృశమైన రచనలో శ్రీనాథున కాదర్శమై యుండనోపు.

నన్నయ శ్రీనాథుల పద్యరచనా శిల్పమున భేదము చాలకలదు అందుచే నన్నయవిగానేచూపు నుదాహరణములు శ్రీనాథుని వానికి చాయలుగానుండ గలవేగాని త్రాసున తూపగలట్టులుండవు.

నన్నయ సంస్కృతమున వాల్మీకి రచనాశిల్ప ముగలవాడని శ్రీ విశ్వనాథులన్నది సరియైనది. సంస్కృతమున నార్షరచనాశైలి విలక్షణమైనది అది చాల సంక్షిప్తముగా నున్నట్లు కన్పట్టి విమర్శించిన కొలదియు రుచిరార్థదాయకముగా నుండును. దానిలో విశేష్యవిశేషణ బంధమెక్కువ. తెనుగునగల యతి ప్రాస వైఖరి సంస్కృత పద్యరచనమున లేకున్నను విశేషణ విశేష్యము లేకవిభక్తికములౌటచే నంత్యము లోకేవిధముగనుండి శ్రుతిపేయములగును. దేశీయమైన ప్రాసయు, అర్థులాత్మకమైన యతిమైత్రియు తెనుగుపద్యముల గూర్చుటయేగాక నన్నయ యార్ష శైలియందలి యేకవిభక్తిక విశేషణ విశేష్యబంధ ప్రాచుర్య సౌందర్యము నిందు కల్గించుటచే పద్యము లక్షరరమ్యములును,హృద్యములునగుటయేగాక విశిష్టములుగాకూడ కన్పట్టును. చూడుడు!

"రాజకులైకభూషణుడు,
రాజమనోహరు, డన్యరాజ తే
జో జయశాలి శౌర్యుడు, వి
శుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజిత సర్వలోకు, డప
రాజిత భూరిభుజాకృపాణధా
రా జల శాంత శాత్రవ ప
రాగుడు, రాజమహేంద్రుడున్నతిన్.

ఇందక్షరరమ్యత యేమి హృద్యత యేమి రచనాశిల్ప మేమి పరాకోటి నందినవి. కావునే మురిసి శ్రీనాథుడు కాశీఖండమున

"రాజశశాంకశేఖరుడు
రాజకిరీటవతంస ష్పష్ట ది
గ్రాజ మనోభయంకరుడు,
రాజులదేవర, రాజురాజు, శ్రీ
రాజమహేంద్ర భూభువన
రాజ్య రమారమణీయమనోహరుం
డాజి కిరీటి, కీర్తినిధి,
యల్లయ వీరనరేంద్రుడున్నతిన్."

అని వ్రాయక యుండలేకపోయెను. మరల నిట్టిదే నన్నయ ప్రథమాశ్వాసాంతమున మఱియొకటి "రాజకులాగ్రగణ్య..." అని వ్రాసి తనిసెను. ఈ పద్దె మందది మెప్పులు చూరగొన్నదో. ఇంతకు నిది భారతమున మొదటిపద్దెము. ఇందు విభక్తి ప్రత్యయములు తప్ప తక్కినదంతయు సంస్కృత పదబంధమే. ఇది యంతయు నొక్కసమాసము చేయుటయో విస్తరించి

ప్రాయులయో ప్రబంధకవులతీరు. నన్నయ విరిచి అర్షశైలి ననుకరించును. ఇందు సంక్షిప్తతయు, లోతు దనము నుగలవు. ప్రబంధశైలిలో విస్తృతియు, ప్రాకట్యమును గలవు. నన్నయ పైపద్యము సంస్కృత వాక్ప్రౌఢిమకు మచ్చుతునుక.

"పరమవివేక సౌరభ వి
భాసిత సద్గుణపుంజవారిజో
త్కరయుచిరంబులై, సకల
గమ్య సుతీర్థములై, మహామనో
హర సుచరిత్ర పావన ప
యః పరిపూర్ణములైన, సత్ప్రభాం
తర సరసీవనంబుల,
......................"

ఇందు మూడు విశేషణాత్మకములైన సమాసములును, అయి పదాంతములై సంస్కృతమునందలి యేక విభక్తి కములగు విశేషణ విశేష్యముల సుందము నించు చున్నవి.

"తాం సనందన సంకాశాం,
మృగపక్షిభి రావృతాం
హర్మ్యప్రాసాద సంబాధాం,
కోకిలాకుల నిస్వనాం
కాంచనోత్పల పద్మాభి
ర్వాపీభి రుపశోభితాం."
... ... ... ....

ఇది అర్షశైలి. ఈరచనాప్రౌఢిమ నన్నయ సంస్కృతమునుండి గ్రహించి తెనుగున పొందుపరిచెను. ఇది నిగూఢార్థ ప్రతిపాదకము. విశేషణములన విశిష్టార్థకములుగదా. అర్షగ్రంథములం దివి తప్పక యట్లేయుండును. వాని సార్థక్యము తరిచిచూచిన గాని వాని అందము తెలియదు. అవియే "కవీంద్రులలో నారసి మేలునాన్" అన్నది నన్నయ. కాన సంస్కృతకవుల సంప్రదాయము తెలియనివారికి నన్నయ వ్యర్థపదానుబంధిగా కన్పట్టు. తెలిసిన వానికి రుచిరార్థసూక్తినిధిగా తోచు. ఇదికూడ శ్రీనాథు నుద్దేశించియే యామెచ్చుకొనుట.

జాతీయత, నుడికారమను పదములు మనము వాడుచున్నాము. ఒక్కొక్కజాతి కొకొక్కభావనా రీతియు, భావప్రకటనా వైఖరియు నుండును. ఏజాతి నుడికార మాజాతిదే అందుచే నన్నయ సంస్కృత భారతమునందలి రహస్యములను, అందమును, సారమును మాత్రమే గ్రహించి తెనుగు మూసలోపోసి "ఆంధ్రకవిత్వ విశారదుడు"గా "తిక్కన"చే గణుతింపబడెను. ఒక భావమును పద్యమున రూపొందించునపుడు దానిని సంపూర్ణముగా చిత్రించుశబ్దములు, యతిప్రాసలు, ఛందము నెన్నుకొనుట యొక జాగ్రత. దానినిమించి యేకొననుండి చెప్పినచో భావమునకు దీప్తి కలుగునో తెలియుట యొకప్రత్యేక జాగ్రత. ఇది సామాన్య కవులకు కొఱతగానుండును. నన్నయ బావము నుద్దీప్తముగా ప్రకటించుటయేగాక జాతీయముగాగూడచేసి విశిష్టతనుచాటును. చూడుడు!

"భూనుతకీర్తి, బ్రాహ్మణుడు
పుట్టుడు, తోడనపుట్టు నుత్తమ
జ్ఞానము..................."

"బ్రాహ్మణుడు పుట్టటంతోటె యివన్నీ పుట్టుతవి" అనునది మనమిప్పటికిని చేయు వాక్యరచనావైఖరి, ఇది మన జాతీయము. పుట్టునవన్నియు ముందు చెప్పి, బ్రాహ్మణుడు పుట్టుటతోడనే అనునది తర్వాత పెట్టినచో నీదీప్తియుండదు.

ఇట్లే,

"ప్రల్లదుడైన యొక్కకుల
పాంసను చేసినదానతత్కులం
బెల్లను దూషితంబగుట
యేమి యపూర్వము ?"

ఈమాదిరి వాక్యవిన్యాసము తెలుగులది. ఇందలి ద్విత్వలకారము, 'ఎల్లను'న'అంథా' అను దాని సమగ్రత భావమునకు నిండుదనమును కూర్చుచున్నవి.

మూలమునుండి గ్రహింపని సంపూర్ణమైన సంస్కృత సమాసాదిక రచనముగల సముద్రవర్ణనము చూడుడు!

"అలఘుఫణీంద్రలోక కుహ
రాంతరదీప్తమణిస్ఫురత్ప్రభా
వలిగలదాని, శశ్వదుద
వాసమహావ్రత శీతపీడితా
చలముని సౌఖ్యహేతు విల
సద్బడబాగ్ని శిఖాచయంబులన్
వెలిగెడు దాని, గాంచి రర
విందనిభాననలమ్మహోదధిన్."

సరళమై ప్రసన్నమైన శైలీమాధుర్యముతో సంస్కృత పదరచన యిందెట్లుసాగినదో చూడుడు. రెండు పెద్ద సంస్కృతసమాసముల చివర 'గలదాని', 'వెలిగెడు దాని' అని ముగింపుచేసి రచనాశిల్పమున మెరుగులు చూపెను. వర్ణనలుచేయునప్పుడు వస్త్వౌదాత్త్యమును బట్టి సంస్కృతసమాసబాహుళ్యముతో పద్యరచన సాగించుట నన్నయతీరు. సంభాషణలయందు మృదులాతి మృదులమైన తెనుగునుడికారము చిందు సరళశైలి నుపయోగించుట యాతనినేర్పు.

దేవయానీశర్మిష్ఠల సంభాషణము చూడుడు:

దేవయాని :

"శ్లాఘోత్తర చరితుండగు,
నా కావ్యతనూజ నకు నారాధ్యుడు నే
ప్రాకటభూసురకన్యక,
నీకట్టిన మైలకట్ట నేర్తునె చెప్పుమా."

ఈమె బ్రాహ్మణి, ఆత్మాభిమాన, కాన సంస్కృత పద బహుళ రచన ఉదాత్తతా సూచకముగా నామెను గూర్చి నంతవరకు చేసెను.

శర్మిష్ఠ :

"మాయయ్యకు పాయకపని
చేయుచు జీవించి ప్రియముచేయుచునుందున్
మీయయ్య యుండియహములు
నాయొద్దను పలుకనికు నానయు లేదే."

అభిజాత్యగర్వము దేవయానికి. అధికార గర్వము శర్మిష్ఠకు. రజోగుణమూర్తి శర్మిష్ఠ. దానిని 'నాయొద్దన పలుక' లో 'రామస్యగాత్రమసి' అను అనుదాని వ్యంగవైభవమును తెనుగుదనముతో రూపొందింపచేసినవాడు నన్నయ. ఈపద్యమున శర్మిష్ఠ దేవయాని నెంత తక్కువగా చూచినదో కానవచ్చును. ఆమెను బుగ్గలు పొడుచుచున్నదా యన్నట్లున్నదిరచన పదములకూర్పులో పాత్రల నాట్యభంగిమలు చిత్రించుట ప్రౌఢిమ కాదామరి. ఈరెండుపద్యముల పదములకూర్పు తత్స్వభావములకు, తద్గతనాయికల రూపములకు ప్రతిబింబములుగానున్నవి. అని శర్మిష్ఠ "నాకట్టిన పట్టంబు నీకుం కట్టంగాదుగాకేమి? అని విసిరినది. దేవయాని "నీకట్టిన మైల" యనగా శర్మిష్ఠ "నాకట్టిన పట్టంబు" ని మార్చినది. ప్రత్యక్షరము నింత జాగ్రత్తగా వ్రాయు జాణతనముగలవాడు నన్నయ.

సంస్కృత కావ్యాలంకారిక మర్యాదలన్నియు పుణికి పుచ్చుకొని నన్నయ 'ఉభయభాషా కావ్యరచనాభిశోభితు'డైనట్లు ప్రతిఘట్టమునను మనకు కన్పట్టును.

నూతనున్న దేవయానిని యయాతి యుద్ధరించుట.

"జలధి వీచి వీచి వీల
సత్కలికాంచనమంచితావనీ
తలవహనక్షమంబయిన
దక్షిణహస్తమునం దదున్నయ
ద్గళదురుఘర్మవారికణ
కమ్రకరాబ్జమువట్టి నూతిలో
వెలువడ కొమలిం దిగిచె
విశ్రుతకీర్తి యయాతి క్షితీశ్వర్"

ఇది సంభాషణాత్మక శైలి. ఇక వర్ణనయే పద్దెమున

*"మందమనోజ్ఞహాసముఖ*
*మండలమెత్తి మృగాక్షిచూచి సం*
*క్రందన సన్నిభుఁ నృపతిఁ*
*గన్గొని యుల్లసిల్లె ప్రీతితో."*

ఈ నాయికావర్ణనమును తత్సన్నివేశ చారుత్వమును నీ సుకుమార వర్ణనమావేశమున నెట్లుచిత్రింపబడినదో భావింపుడు. ఇందలి బిందుపూర్వక దకార ప్రాస మీ శృంగార సన్నివేశమునకు తళుకుపూత,

పెద్దన మనుచరిత్రమునందలి సౌందర్యములను నన్నయ ఘట్టములనుండియే గ్రహించెననుట సుస్పష్టము ప్రతిశబ్ద సార్ధక్యమును, అర్ధగాంభీర్యమునుగలిగి సంస్కృతమున మేటికవుల కావ్యములతో తులదూగఁజాలిన శిల్పవైభవము గలది మనుచరిత్ర.

*"ఎందుండి వచ్చి తిందుల*
*కెందులకేగుదు మహామునీశ్వర విద్వ*
*ద్వందిత ! ... ..."* అన్న నన్నయపద్దెము;

*"ఎందుండి యెందుబోవుచు నిందులకే*
*తెంచినార లిపుడు విద్వద్వందిత ....*

అన్నవిధానైనది మనుచరిత్రలో.

*నారలుగట్టు కూరలశ*
*నంబుగ నుగ్రవనంబులో"*

నన్నది యథాతథముగా నెత్తిన గైకొనెను.

కర్ణుండు *'సజల జలధర ధ్వాన గంభీర రవంబున'* నన్నది శ్రీనాధుడు నలునకు *'ప్రావృషేణ్య పయోధర ధ్వానగంభీరంబైన యెలుంగు'*గావాడెను.

*"అమలసుధారమ్య హర్మ్యతలంబుల*
*నవకుసుమామోద నందనముల*
*కృతకాద్రి కందర క్రీడా గృహాంగణ*
*వివిధరత్నోపల వేదికలను*
*కలహంసకలనాద కమనీయ*
*కమలినీదీర్ఘికాసైకతతీరములను"*

అను సీస సౌందర్యము శ్రీనాధుని నాకర్షించి యుండబోలు.

నన్నయ సీసములు రెండు రకములు - కథాకథన సీసమొకటి, వర్ణనాసీసము రెండు. మొదటి వానికి సమగతిగాని చక్కని తీర్చిదిద్దిన పాదక్రమము గాని యుండదు. పైసీసము రెండవ రకమునకు చెందును ఇవి నన్నయలో తక్కువ. ప్రబంధ కవులు రెండవరకమువానినే ఎక్కువగా నవలంబించిరి. శ్రీనాధుని సీసముల హొయలు చెప్పరానిది.

*"వచశ్శ్రీః, జయశ్రీ భూషణశ్రీ"* వంటి మధ్యాంతములందు శ్రీకారముతోగూడి నేడు సారస్వత ప్రియుల మోదమునకు పట్టైన ప్రౌఢ ప్రయోగములు నన్నయవే.

*"నెఱి కురులున్ విలోలసిత*
*నేత్రయుగంబును నొప్పులొల్కు వా*
*తెఱయును దీని యాననము*
*తెల్వి కరంబు మనోహరంబు నా*
*యెఱిగిన యంతనుండి సతి*
*నిట్టి లతాలలితాంగి చూచి యే*
*నెఱుగ సురేంద్రకన్యకలు*
*నిట్టిరె రూపవిలాస సంపదన్."*

ఈపద్యము నన్నయ యుభయ వాక్ప్రౌఢికి చక్కని మచ్చుతునక. తెనుగు సంస్కృతములు వేర్పరింపజాలనంతగా యదికిపోయినవి.

ఇంద్రప్రస్థ వర్ణనమునందలి వృత్తములు ప్రబంధముల పురవర్ణనములకు మాతృకలు.

*"గంగ నిజాంగదీప్తి లెసగన్"*

అన్న వృత్తపదబంధము

*"గంగాధరపింగజటా*
*సంగమ మంగళవిశాల చటులతరంగన్*
*గంగానది సేవించెన్"*

అన్న కందమునందలి బింగుస్వాగత గకార ప్రాసానుప్రాసలును తర్వాతి కవుల నదీ పర్వతాది వర్ణనల శబ్దాలంకారములకు ప్రత్యేక శైలులకు మూలములు.

"క్వణదనుకింకిణీకలిత
కాంచన కాంచికలాపముఁ రణ
న్మణికల నూపురంబులు సమధ్వని..."

అన్నదాని కమ్మని శైలీబంధము, "రణన్మణి"యను దాని విరుపు నందము గీర్వాణికి బంగరు చిరుగంటల మొలత్రాడు గాదా.

"సంకులమిళితాళీనీల పరి
కుంచిత కోమలకుంతలఁ
శకుంతల యను కన్యకఁ గనియె"

నన్న సమాససౌరభము యావత్కాళి దాస శకుంతలా సౌందర్యము నాచికొన్నదన్న దోసమా !

సభాపర్వమున నన్నయశైలి పరిపక్వమై పరాకోటి నందినదా అనిపించు. ఈభాగము చాలవరకు నాటకీయ శిల్పసంపదగలది. శిశుపాలుని యుపాలంభనవాక్యములు, ఆ పాత్రను ఆ సన్నివేశమును కన్నులయెదుటనే పెట్టును. ఇట్టి వాక్ప్రౌఢిమ మరెందు నింతగా కానరాదు

"ఇతనికి గూర్తురేని ధన
మిత్తు రభీష్టములైన కార్యముఁ
మతిఁ బొనరింతు రిష్టుడని
మంతురుగాక, మహాత్ములైన భూ
పతులయు, విప్రముఖ్యుల స
భఁ విదితవృష్టవిశిష్టపూజనా
యతికి ననర్హు నర్హుడని
యచ్యుతు నర్చితుజేయ బాడియే."

పాత్రముఖమున కవి చెప్పింపదలచిన భావము వ్యక్తమై స్పష్టమై సూటిగా శరమువలె నెల్లు వచ్చినట్టి యీ వాక్యరచనావిన్యాసము తెనుగుందనము నకు పొలిమెరగాదో ఆలోచింపుడు. "మీకుకావలసినవారైతే యింటికి తీసికొనిపోయి కట్టిపెట్టవలెను గాని సభామర్యాద నుల్లంఘించుటా" అను శిశుపాలుని భావమును చక్కగా చిత్రించి కృతకృత్యుడైనాడు నన్నయ.

"చనబేడకి దారక్రియయును,
జెవిటికి మధురగీతియును, జీకునక
త్యనుపమ సురూపదర్శనమును."

ఇందు "పేడి, చెవిటి, చీకు" అనునవి తెనుగు మాటలు. "దారక్రియ, మధురగీతి, అత్యనుపమ-సురూపదర్శనము" నను నవి సంస్కృతము ఇవి యొకదానిమించి యొకటి దీప్తములై పెంపుదలను చూపుచున్నవి తెలుగుపదము లంగవికలులబోధించును సంస్కృతమునవి వారికందని విషయము బోధకములు. ఈ సన్యాసులకింత గొప్పవియాయనను నొక్కి పెంపునకీభేదము కల్పింపబడినది

ఇట్లే

"ఈమునిపల్లె నుండు టిది
యేల? కరం బనురాగ మొప్పగా
భామిని నాకు భార్యవయి
భాసురలీల నశేషరాజ్యల
క్ష్మీమహనీయసౌఖ్యముల
మేలుగ నందు మునింద్రశేందు సౌ
దామలతుంగహర్మ్యముల
హారిహిరణ్మయకుడ్యములఁ."

"ఈమునిపల్లె" చాల యల్పభోగసూచకము, ఆమెకు తగనిది. ఆతనిని చేపట్టినచో వచ్చులాభము సంస్కృత సమాసాలలో పోనుపో నుదాత్తముగా నుండునట్లు తద్భావసూచక పదబంధముతో సాగినది.

ఇదే కందుకూరు రుద్రకవి :

"అకటా! చేరెడునేలకుందగడె ?
సప్తాంభోధి వేష్టిభవత్సక లోర్వీప కలాప..."

అను పద్యమున చేసెను. 'చేరెడునేల' అనుతెలుగు పదయుగళము, మిగిలిన మొత్తము సమాసమునకు మెరుగుపెట్టినది. ఇది రెండు భిన్నస్థితిగతులచూపవలసినప్పటి రచనావిధానము.

*"భూరిగుణోన్నతులన దగు*
*వారికి, ధీరులకు, ధరణీవల్లభులకు వా*
*క్పారుష్యముచన్నె మహా*
*దారుణమది విషముకంటె దహనముకంటెన్"*

ఈపద్యమున నన్నియు సంస్కృతపదములే. తత్సమములైనవి. కాని రచనా చమత్కారమేమో మొత్తము తెనుగా యన్నట్లు భాసించును. సర్వ సులభముగా నున్నట్లు కన్పట్టు. ఈయననీతులు ఈరకపుశైలిలో ఉండును. నీతుల బోధించుటలో మర్మమేమియు నుండరాదుగదా. అందుచే నిట్టి ఘట్టములు స్ఫటికనైర్మల్యముగల సుస్పష్టభావబోధకములుగా నుండును.

"మూర్ఖపు శిశుపాల" అనునది చాల చక్కని రూపము. కోపమును తక్కువ యక్కరములలో బాగుగా స్ఫురింపచేయవచ్చు. తత్సమములలో చిత్రములైన రూపములెన్నో తయారై వాడబడినవి. "గుణవృద్ధ"ని యొకరూపము.

తెనుగువాక్యరచనా విన్యాసమున నందము చిందు మఱికొన్ని యుదాహరణములు చూడుడు :

*"ఎఱపక యర్ఘ్య మచ్యుతున*
*కిచ్చితి, మిచ్చిన దీనికిం దొడం*
*బడమని.........."* అను సహదేవు వాక్యము.

"ఏం, ఇచ్చాం, ఇస్తే, కాదనేవాడెవడొరమ్మను చూస్తాం" ఈ ఊతలో నీభావము చిత్రింపబడినది. దానికి "ఇచ్చితి, మిచ్చిన" అనునవి పోషకములుగా వాడబడినవి.

ఇతనికి నిట్లు నన్నూరక ఎగ్గులువల్కగవోలె గాక. (ఊరికే తిట్టటానికి సాగిందిగాని లేకపోతేని) ఆశ్చర్యప్రకటనకు "ఆహా, ఓహో" శబ్దములు వాడక వాక్యరచనలోనే దాన్ని ద్యోతింపచేయుటకు "అర్ధరాత్రంబు నపుడుగాని కుడువదట్టె ?" అనుట ప్రౌఢిమ. ఇవన్నియు వ్యంగ్యవైభము నంతర్భూతము చేసికొనినవే.

ఇట్లుభయభాషల శబ్దములను వాడుటలోని నైపుణ్యమున నన్నయ కావ్యముల శిల్పసంపదనంతను వెల్లివిరియించినాడన్న నతిశయోక్తికాదు.

శ్రీనాథ కవిసార్వభౌముడు నన్నయాదుల యందములన్నియు తన కావ్యముల గూర్చినట్లు చెప్పికొనుట సత్యమే. ఇవన్నియు శ్రీనాధునిలో జూపుట ప్రకృతముకాదు. కావున నుపేక్షించితిని.

సారస్వత ప్రక్రియలో, ప్రయోగములలో, అందములు స్వానుభవమున నెఱుంగవలెనేగాని దిఙ్మాత్రముగాజూపిన విమర్శలవలన సంపూర్ణానందము కలుగదు. అయినను నాయోపినంతవరకు, నానేర్చినంతకు, స్థాలీపులాకముగా జూపితిని. సహృదయులు గ్రహింతురుగాక !



శ్రీ యడవల్లి ఆదినారాయణ

# మహాకవి క్షేమేంద్ర కర్పూరకము

శ్రీ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు

### ౧వ దళము

### సారభోల్లాసిని

క్రీ.10, 11వ శతాబ్దములు సంస్కృతసారస్వతోద్యానమునకు వసంతకాలము. అంతకు పూర్వమెన్నఁడును జరుగనిసంస్కృత సారస్వతకృషి ఈ రెండు శతాబ్దములయందును ఉద్వేలముగా జరిగినది. అప్రతిమ ప్రతిభాభాసురులగు సంస్కృతమహాకవులు, శాస్త్రావతారములే యనఁదగు మహావిద్వాంసులు, విఖ్యాత సాహిత్యవేత్తలును విరాజిల్లిన కాలమది. కాశ్మీరదేశమున మహారాజ అనంతుఁడు (పాలన 1028–64) పిమ్మట ఆయన కుమారుఁడు రణాదిత్యబిరుదముకల మహారాజకలశుఁడు (1064-89). ఈయన తనయుఁడు, మహారాజహర్షుఁడును (పాలన 1089–1101), కలశునికి మేనమామయు, విగ్రహరాజు తనయుడును అగు క్షితిరాజును ఈకాలముననే రాజ్యపాలనము, కవిపండితపోషణము నొనరించుచుండెడివారు

గుణాఢ్యుని బృహత్కథకు సంస్కృతపరివర్తనము 'కథాసరిత్సాగర' మనుపేర రచించిన సోమదేవసూరియు, గుణాఢ్యుని రచనకే 'బృహత్కథామంజరి' యను మఱియొక సంస్కృతానువాదమును నిర్మించిన మహాకవి క్షేమేంద్రుఁడును, అనంతుని విద్వత్సభయందు ఖ్యాతినందినవాడే. స్వయముగా కవియై, క్షేమేంద్రాది కవికోవిదులకు పోషకుఁడై కీర్తినందిన కలశమహారాజును. కలశుని తనయుఁడు సుగృహీతనాముఁడును హర్షవర్ధన చక్రవర్తికంటెను ఉత్కృష్టకవితావిలాససంపద గలిగిన హర్షదేవుఁడును ఈకాలముననే శారదారాధన మొనరించిరి. మఱి కొందఱు విఖ్యాతవిద్వత్కవుల నామముల నిట పేర్కొనవచ్చును :

క్షేమేంద్రునకు సాహిత్యవిద్యాగురువగు అభినవగుప్తునకు పితృవ్యుఁడును, సాహిత్యగ్రంథనిర్మాతయు నగు వామనగుప్తుఁడు.

భట్టేందురాజు మొదలగు నిరువదిమంది మహా విద్వాంసులు అభినవగుప్తునకు వివిధశాస్త్రబోధ నొనర్చినవారు. క్షేమేంద్రుని గురుమండలి లోనివారే గంగకోపాధ్యాయుడు, సోమపాదాచార్యులును. కాశ్మీరదేశమున కలంకారప్రాయమగు ప్రవరపురమున విఖ్యాతవిద్వత్కుటుంబ మొకటి తత్కాలమున వర్ధిల్లెను. మహాభాష్యపాఠప్రవచనమున విఖ్యాతి నందిన మహామతి జ్యేష్ఠకలశుడు. ఈయనకిష్టరామకవి, బిల్హణకవి ఆనందకవి యను కవిశేఖరులు తనయులు. వీరిలో "కర్ణసుందరి"యను నాటకము "విక్రమాంకదేవచరిత" మను మహాకావ్యము రచించి ఖ్యాతి నందినకవితిలకుడు బిల్హణుడు. మహారాజకలశనిజతనయుడగుహర్షదేవుని సాహిత్య గోష్ఠికి (1073–1101) చెందినవాడు శంభుమహాకవి ఈయనరచనలు "అన్యోక్తిముక్తాలత, రాజేంద్ర కర్ణపూర ము"లు. సంస్కృతసాహిత్య క్షేత్రమునగలమహాశిఖరములలో నొకడును, కావ్యప్రకాశ నిర్మాతయు నగుఆచార్యమమ్మటుడు(1050-1100) ఈయనసోదరుడు, వేదభాష్యకారుడు నగు ఉవ్వటుడు

సాహిత్యక్షేత్రమున 'వక్రోక్తిజీవితము' ను రచించి వక్రోక్తిప్రస్థాన ప్రవర్తకుడగు కుంతకుడు (950–1050) 'వ్యక్తివివేక' నిర్మాత యగురాజానకమహిముడు 'వ్యక్తివివేక' మను ధ్వనిసిద్ధాంతధ్వంసక మగు గ్రంథమును రచించి, సాహిత్యప్రపంచమున విశేషసంక్షోభము నొసరించినమహిమభట్టు (1025 టు 1100). ఈకాలముననే మాళవదేశమున, లాటదేశమున డాహళదేశమున సారస్వత పోషకు లగుమహారాజులు కొందఱువర్ధిల్లిరి. 'వాక్పతిరాజ' బిరుదాలంకృతుడగుముంజమహారాజు (974–95) స్వయముగా కవియై 'కవిమిత్ర, కవిబాంధవ' బిరుదముల నందెను. ఈయనవిద్వన్మండలియందలివారే హలాయుధుడు, ధనంజయుడు, ధనికుడును. ముంజునియనుజుడు "నవసాహసాంక" బిరుదభూషితుడు సింధురాజు. ఈయనపోషణమున వర్ధిల్లినవాడే "పరిమళకవి" యనినామాంతరముకల పద్మగుప్తుడు "నవసాహసాంకచరిత" మనుమహాకావ్యమును నిర్మించెను. సింధురాజుతనయుడే ప్రాతఃస్మరణీయుడగుభోజమహారాజు (పాలన 1010–1055) ఈయన శారదావతారమే యనదగును. మహావిద్వాంసుడును, మహాకవియు నగునీమహాపురుషుడు 104 గ్రంథములను రచించి, 104 దేవాలయముల ప్రతిష్ఠించి, 104 బిరుదముల నందెనట. ఈయన సాహిత్యగోష్ఠి 500 మందిమహాకవులతోడను, మహాపండితులతోడను, కిటకిటలాడుచుండెడిదట. ఈయనయాస్థానకవి చిత్తపమహాకవి. ఈక్రింది కవులును, పండితులును తదాస్థానమున విలసిల్లిరట. గద్యసింధువు విద్యాచక్రవర్తియగు గోవిందభట్టు, పద్యాపతిస్థానము నలంకరించిన భాస్కరభట్టు, ముచుకుందుడు, శంకరకవి, కవిరత్నకవి, విశ్వంగకవి, రామేశ్వరకవి, క్రీడాచంద్రుడు, కవయిత్రి యగు సీతాదేవి డాహళదేశాధిపుడగు కర్ణమహారాజు నాస్థానమున నీక్రిందికవికోవిదు లుండెడివారట. కర్పూరకవి, నాచిరాజు, విద్యాపతి, బిల్హణుడు, గంగాధరుడు, నాడు కొంకణదేశమును ఒకరి తరువాతనొకరుగా సోదరు లగు నీ ప్రభువులు–చిత్తిరాజు, నాగార్జునుడు, ముమ్మణిరాజు కవిపండిత పోషకులుగా ఖ్యాతి నందిరట. "ఉదయసుందరీ కథ"ను నిర్మించినసోడ్ఢలకవి వీరియండనే శారదారాధన మొనరించెనట.

### ౨వ దళము.

### సంస్కృత సాహిత్య ప్రపంచమున క్షేమేంద్రుని విఖ్యాతి.

సమకాలికసాహిత్యరంగమున క్షేమేంద్రుఁడు విశిష్టయశస్సు నందినవిద్వత్కవి. నాఁటిప్రభువులలో, రాజకుమారులలో నెందఱో ఈతనిశిష్యత్వభాగ్యము నందిరి. జ్హల్హణుని సూక్తిముక్తావళి (క్రీ. 13వ శతాబ్దము) మొదలుకొని నేఁటివఱకు సంస్కృత సుభాషిత గ్రంథములయం దీతనిపద్యము లెన్నియో యుదాహరింపఁ బడియున్నవి. మాకుఁ దెలిసినంతవఱకు 13 సుభాషితగ్రంథములు (ఇందు 3 అముద్రితములు) క్షేమేంద్రుని శ్లోకముల నెన్నిటినో గ్రహించెను. 19వ శతాబ్దమున 1వ పాదమున బొంబాయి లోని నిర్ణయసాగర్ ప్రెస్ వారు క్షేమేంద్రుని రచనలలో కావ్యమాలాగుచ్ఛకములయందు 8 లఘుగ్రంథములను కావ్యమాలయందు 5 బృహద్గ్రంథములను ప్రకటించి క్షేమేంద్రునిగ్రంథముల కెంతయో వ్యాప్తిని గలిగించిరి. ఈయన బౌద్ధావదానకల్పలత టిబెట్ భాషానువాదముతో 2 సంపుటములుగా కలకత్తా యందలి ప్రాచ్యదేశీయగ్రంథావళిలో (Bibliotheca Indica) ఏషియాటిక్ సొసైటీ ప్రచురించెను. 1884 ప్రాంతములకే క్షేమేంద్రునికీర్తి యూరప్‌దేశము నందును వ్యాపించెను. నిర్ణయసాగర్ ప్రెస్‌వారు 1887లో కవికంఠాభరణమును మొదటిసారి ప్రచురింపఁగా నంతకు మూఁడేండ్లకు ముందే జర్మనీ యందలి గీర్వాణాచార్యు లొకరు(Prof Schonberg) దీనిని జర్మన్‌భాషలోని కనువదించి, 1884లోనే ప్రకటించెను క్షేమేంద్రుని గ్రంథములలో కనీసము 9, భారతీయ భాషలలో నాఱింటిలోనికిని, 2 ఐరోపీయభాషలలోనికిని పరివర్తింపఁబడినవి. క్షేమేంద్రునికీర్తిసౌరభము భారతవర్షముననే కాక, పశ్చిమ దేశములందును ప్రసరించె ననుట కిది ప్రస్ఫుట సూచిక.

### ౩వ దళము.

### క్షేమేంద్రుని వంశావళికము.

క్షేమేంద్రునిజనకుఁడు ప్రకాశేంద్రుఁడు ప్రబల శైవపక్షపాతి. బహుసంపన్నుఁ డగు నీతఁడు దైవతములకు, భూదేవులకు, మఠములకును చేతి కెముక లేకుండ మూఁడుకోట్లు వ్యయించె నఁట. దీనిని బట్టి క్షేమేంద్రుఁ డాగర్భశ్రీమంతుఁ డని విశదమగును. ఈయన గంగకోపాధ్యాయులు, అభినవగుప్తపాదులు, సోమపాదాచార్యులచరణోపాంతమున వివిధవిద్యల నధిగమించెను. తాను సర్వమనీషి గంగకోపాధ్యాయుని శిష్యుఁడ నని వక్కాణించెను. 'సర్వమనీషి' గంగకోపాధ్యాయునకు విశేషణముగాఁ గొందఱు పేర్కొనిరి. కాని నాఁటి కాశ్మీరము నందలిప్రఖ్యాతులగుమహావిద్వాంసుల నిది సూచించు ననియు, క్షేమేంద్రుఁడు వారియందఱిసన్నిధిని విద్యాభ్యాస మొనరించె ననియు చెప్ప నగును. ఆజన్మకఠోర బ్రహ్మచారియు, పూర్ణపురుషాయుషజీవియు నగు అభినవగుప్తపాదుఁడు విఖ్యాతు లగు 20 మంది పండితప్రకాండులసన్నిధిని వివిధశాస్త్రముల వ్యాసంగ మొనర్చెను. అభినవగుప్తునకు 200 మంది శిష్యు లుండెడివా రఁట. వారిలో ప్రఖ్యాతులలో మన కవియు నొకఁడు. గురువువలెనే మనకవియు ప్రసిద్ధి నొందిననాఁటిమహాకోవిదు లెందఱియొద్దనో వివిధ విద్యలఁ బడసి యుండెను.

### ౪వ దళము.

### క్షేమేంద్రునిప్రౌఢవైదుష్యము, సునిశిత సాహిత్యవిమర్శనాపాటవము.

బహుముఖప్రజ్ఞాధురంధరుఁ డగుక్షేమేంద్రుఁడు వివిధవిషయవిచారకము లగు నెన్నియోగ్రంథముల

నిర్మించెను. భవిష్యత్కవులకు తా నొనరించిన యుపదేశములను తా నాచరించి, విలక్షణసాహిత్య రచనాకౌశలమును, కవితాసౌరభమును, బడయఁ గల్గెను. విశాల మగుసంస్కృతసాహిత్యక్షేత్రమున మహారాజభోజుఁడు, ఆచార్య హేమచంద్రుఁడు మొద లగునెకొలఁదిమందియో తప్ప క్షేమేంద్రునివలె వివిధ విషయముల గూర్చి బహుళగ్రంథముల నిన్నిటిని రచించినవారు లేనేలేరు

కావ్యనిర్మాణప్రావీణ్యము, కావ్యరసాస్వాదన సామర్థ్యమును పరస్పరవిలక్షణశక్తులు. ఎక్కడనో కాని యీరెండును ఒకవ్యక్తియందే కన్పట్టవు.

శ్లో. 'కశ్చి ద్వాచం రచయితు మలం, శ్రోతు మేవాపర స్తాం
*కల్యాణీ తే మతి రుభయథా విస్మయం న స్తనోతి*
*న హ్యేకస్మి న్నతిశయవతాం సన్నిపాతో గుణానా*
*మేక స్సూతే కనక ముపల స్తత్పరీక్షాక్షమోఽన్యః'* *

రాజశేఖరుని 'కావ్యమీమాంస' † లో ఉదాహృతము. సువర్ణము నొసఁగురాయి యొకటి; కాని బంగారు వన్నెను పరీక్షించురాయి వే ఱొకటి. కాని క్షేమేంద్రునియందు ఆనందవర్ధనాదు లగు నెకొలఁదిమంది యందు వలెనో. కావ్యకరణకౌశలమునకుఁ దోడు కవితారసాస్వాదనపక్షతయు నమరి యున్నవి. మహాకవియే కాక క్షేమేంద్రుఁడు సునిశిత మైనవిమర్శకుఁడు. సాంఘికలోపములను గాని, కవితాదోషములను గాని గుర్తించి తీక్ష్ణముగా విమర్శించుటయం దీతఁడు యమునికంటెనుగూడ నిర్ఘృణుడు. ఔచిత్య విచార-కవికంఠాభరణ-సువృత్తతిలకములందీతఁడు 30 మందికవులరచనములనుండి దోషోదాహరణము లకై శ్లోకముల నెత్తి చూపి, చర్చించి, దోషపరిహార సూచనములను గూడ చూపియుండెను. కావున నీతడు కేవలము దోషైకదృ క్కగు పురోభాగి కాఁడు. అమరుక-కుమారదాస-మాతృగుప్తులు, కాళిదాస-మాఘ-రాజశేఖరులు, భవభూతి - భట్టబాణ - బట్ట నారాయణ-మయూరులవంటిసుప్రతిష్ఠితు లగుకవి శేఖరులు కూడ నీతనిశితవిమర్శకు గురి యైరి. అభినవగుప్తునకు గురుపును, తనకు పరమగురువు నగుభట్టేందురాజు కూడ నీతనిదోషవిమర్శకు గురి యాయెను. గుణదోషవిచారమున నీతఁడు స్వపర భేదదృష్టిలేని నిష్పాక్షికుఁడు. తనగ్రంథముల నుండియే నాల్గింటినుండి 6 పద్యముల నెంచి, వాని యందలినెరసులను ఔచిత్యవిచారమున చర్చించెను. సువృత్తతిలకమున తనపద్యములనే నాల్గింటిని దోష ములకై యుల్లేఖించుకొనెను.

* 'సదుక్తికర్ణామృతము'న (III 3.4; P. A. 188) కాళిదాసకృతముగా నుదాహృతము (193)

† 3rd ed. Baroda (1934) P. 14.

## ౫వ దళము

## క్షేమేంద్రుని రచనలు-తత్పౌర్వాపర్యము.

సర్వతోముఖప్రతిభాభాసురుఁడు, బహుశాస్త్ర వేత్త, బహుభాషావిశారదుఁడు నగు క్షేమేంద్రుఁడు వివిధవిషయములపై ననేకగ్రంథరాజములను రచించి యుండెను. అవహేళనకృతులు (Satire) కథాత్మక కావ్యములు, కామశాస్త్రము, కావ్యములు, కోశము, ఛందస్సు, నాటకము, నీతి పురాణేతిహాససంగ్రహము, బౌద్ధవాఙ్మయము, సాహిత్యము-అను విషయముల నధికరించి, ఈయన ఎన్నియో గ్రంథముల నిర్మించెను. సర్వతోముఖప్రజ్ఞ, కూలంకషమైన వైదుష్యము, నిష్పాక్షికవిమర్శదృష్టి ఈయనకు పెట్టనిభూషణములు. తద్రచనములు మనకు తెలియవచ్చినవి 40. వీనిలో నీక్రిందివి 12యు సూర్యాలోక భాగ్యము నందివి:

1 ఔచిత్యవిచారచర్చ
2 కళావిలాసము
3 కవికంఠాభరణము

4 చతుర్వర్గసంగ్రహము
5 చారుచర్య
6 దర్పదళనము
7 దశావతారచరితము
8 దేశోపదేశము
9 నర్మమాల
10 బృహత్కథామంజరి
11 బౌద్ధావదానకల్పలత
12 భారతమంజరి
13 రామాయణమంజరి
14 లోకప్రకాశకోశము (కొంతవఱకేముద్రితము)
15 వేతాళపంచవింశతి
16 వ్యాసాష్టకము
17 సమయమాతృక
18 సువృత్తతిలకము
19 సేవ్యసేవకోపదేశము

ఈక్రింది రచన లుత్పన్నములు :

1 అమృతతరంగము
2 అవసరసారము †
3 కనకజానకి
4 కవికర్ణిక
5 క్షేమేంద్రప్రకాశము
6 చిత్రభారతము †
7 దానపారిజాతము
8 నీతికల్పతరువు
9 నీతిలత †
10 నృపావళి (= రాజావళి)
11 పంచతంత్రము
12 పద్యకాదంబరి
13 పవనపంచాశిక
14 ముక్తావళీకావ్యము †
15 మునిమతమీమాంస †
16 లలితరత్నమాల †
17 లావణ్యవతీకావ్యము †
18 వాత్స్యాయనసూత్రసారము †
19 వినయవల్లి †
20 శశివంశమహాకావ్యము
21 శిలాశతకము.

పండితమధుసూదనకౌల్ క్షేమేంద్రుని రచనల పౌర్వాపర్యము నీక్రిందివిధమున సూచించెను :

I బృహత్కథామంజరి భారతమంజరి, రామాయణమంజరి.

II పవనపంచాశిక, సువృత్తతిలకము.

III వినయవల్లి, లావణ్యవతి, మునిమతమీమాంస, నీతిలత, అవదానకల్పలత, అవసరసారము, లలితరత్నమాల, ముక్తావళి, వాత్స్యాయనసూత్రసారము, ఔచిత్యవిచారచర్చ.

IV పద్యకాదంబరి, శశివంశమహాకావ్యము, దేశోపదేశము, నర్మమాల, చిత్రభారతనాటకము, కనకజానకి, అమృతతరంగమహాకావ్యము, చతుర్వర్గసంగ్రహము, కవికంఠాభరణము.

V దర్పదళనము, కళావిలాసము, సమయమాతృక, సేవ్యసేవకోపదేశము, దశావతారచరితము, చారుచర్య.

పైవర్గీకరణమున 3, 4వ వర్గము లందలి గ్రంథములముందువెనుకలు కొంచెము విచారణీయము. 3వ వర్గమున పేర్కొనబడినచిత్రభారతనాటకము, చతుర్వర్గసంగ్రహము నాల్గవ వర్గములోనివి. సమయమాతృక, క్రీ. 1050లోను అవదానకల్పలత క్రీ.

† ఈగుర్తుగల రచనలలోని శ్లోకములు కొన్ని ఔచిత్యవిచారచర్చయం దుదాహృతములు.

† ఈగుర్తుగల రచనలలోని శ్లోకములు కొన్ని ఔచిత్యవిచారచర్చయం దుదాహృతములు.

1052లోను రచింపఁబడినవి. సమయమాతృకకు చాల పూర్వమే అవదానకల్పలత రచింపఁ బడినట్లు కౌల్ పండితునిమతము. ప్రారంభరచన లగుమంజరీత్రయమునకు పిమ్మట సువృత్తతిలకము రచింపఁబడె ననుట సరి యని తోచదు. ఏమన సాహిత్యక్షేత్రమున కఠోరవ్యవసాయఫలముగా సువృత్తతిలకము కన్పట్టును.

క్షేమేంద్రునిగ్రంథరచనాకాలముల నిర్ణయించు నెడ ప్రధానముగా ఔచిత్యవిచారచర్చ, కవికంఠాభరణము సువృత్తతిలకమును ప్రామాణికాధారములు. ఏమన స్వరూపమున కొంతవరకు నివి సుభాషిత గ్రంథములను పోలి యున్నవి పైమూఁడుగ్రంథములప్రమాణమును బట్టి క్షేమేంద్రునిగ్రంథముల నిర్మాణకాలమును తిరిగి పరిశీలింతము గాక.

మహారాజరత్నసింహునితనయుఁ డగుఉదయసింహుఁడు క్షేమేంద్రునిశిష్యమండలిలో నొకఁడు. ప్రధానముగా నీరాజకుమారునికొఱకే ఔచిత్యవిచారచర్చ రచింపఁ బడెను. ఉదయసింహుఁడు ఔచిత్యవిచారమున వ్యాసంగము చేసినపిమ్మట, "లలిత, భక్తిభవము" అను రెండుకావ్యములను రచించి యుండును ఈరెండును తనయంతేవాసి యగు "మహాశ్రీ" ఉదయసింహునిరచన లనుచు వీనినుండి 2 శ్లోకములను క్షేమేంద్రుఁడు కవికంఠాభరణమున నుల్లేఖించుకొనెను దీనివల్ల ఔచిత్యవిచారమునకుఁ బిమ్మటనే కవికంఠాభరణము రచింపఁ బడె ననఁ దగును

క్షేమేంద్రునిరచనలలో నీక్రిందివి ఔచిత్యవిచారచర్చయం దుల్లేఖించుకొనఁ బడుటవలన నీగ్రంథము లన్నియు ఔ. వి. చర్చకంటెఁ బ్రాక్తనము లనుట స్పష్టమే.

౧ అవసరసారము (1 శ్లో.)
౨ చతుర్వర్గసంగ్రహము (1)
౩ చిత్రభారతనాటకము (1)
౪ నీతిలత (4)
౫ బౌద్ధావదానకల్పలత (3)
౬ ముక్తావళి (1)
౭ మునిమతమీమాంస (15)
౮ లలితరత్నమాల (1)
౯ లావణ్యవతి (6)
౧౦ వాత్స్యాయనసూత్రసారము (1)
౧౧ వినయవల్లి (2)

సువృత్తతిలకరచన మెప్పుడో నిశ్చయముగాఁ జెప్పలేము. క్షేమేంద్రుఁడు తనశ్లోకములనే ఎన్నిటినో(39 శ్లో.)యిం దుదాహరించుకొనెను. కాని ఒక్క "పవనపంచాశిక" యందలిశ్లోకమునకుఁ దప్ప, తక్కినవానికి వేనికిని ఆకరము సూచింపఁ బడ లేదు. బహుశః ఇవి క్షేమేంద్రరచనలనుండి ఉద్ధరింపఁబడినవికాక కవి ఉదాహరణములకొఱకే వీనిని రచించి యుండ నోపును. వృత్తవినియోగవిచారక మగు సువృత్తతిలకము కవిశిక్షాగ్రంథ మగు కవికంఠాభరణమునకు పరిశిష్టము వంటిది. కనుక కవికంఠాభరణ-పవనపంచాశికలకు పిమ్మట నిది రచింపఁ బడి యుండును. సుతిలకమున తుదిశ్లోకమున † ఔచిత్యవిచారకర్త అనంతరాజురాజ్యపాలనకాలమున నైఛందోగ్రంథమును రచించినట్లు వక్కాణించెను

క్షేమేంద్రునిగ్రంథరచనావ్యాసంగమున ప్రథమదశయం దీక్రిందిగ్రంథములు రచింపఁబడి యుండును. రామాయణమంజరి, భారతమంజరి, వ్యాసాష్టకము, బృహత్కథామంజరి, పద్యకాదంబరి. మొదటి నాల్గింటిలో రామాయణమంజరియే మొట్టమొదటిది కావచ్చును. ఏమన "వ్యాసదాస" అను కవిబిరుదము దీనియం దుల్లేఖింపఁబడ లేదు. ఈబిరుదము క్షేమేంద్రునకు భారతమంజరీరచనానంతరమే వచ్చి

† IIIHO శ్లో. ౧౧౬వు- (సంస్కృతఅకాడెమీప్రతి-1961)

యుందును. రామాయణమంజరికిఁ బిమ్మట భారత మంజరియు, తదనుబంధ మగువ్యాసాష్టకమును రచింపఁబడి యుండును. పైరెండుమంజరులకుఁ బిమ్మటనే బృహత్కథామంజరి రచింపఁ బడి యుండును. దీనిరచనాకాలము క్రీ. 1037. వాత్స్యాయనసూత్రసారము, పద్యకాదంబరి వీనిపౌర్వాపర్యము నిశ్చయముగా చెప్పఁ జాలము.

సౌపజ్ఞము లగురచనలయందు దేశోపదేశము నర్మమాల ప్రథమరచనలు కావచ్చును. తక్కిన రచనలకాలమును నిరూపించుటకు ఆధారములులేవు.

ఉపదేశము :

క్షేమేంద్రుని గ్రంథావళి

1. **అమృత తరంగ కావ్యము†** (లుప్తము):— దీనినుండి కవికంఠాభరణమున రెండుశ్లోకము లుదాహృతములు

2. అవసర సారము‡ (లుప్త):— ఔచిత్యవిచార చర్చయందు ఒకశ్లోక ముదాహరింపఁబడెను.

3. ఔచిత్యవిచారచర్చ*:— తెనుఁగు లిపియందు పలుసార్లు నాగరిలిపియందును ముద్రితము. బహుప్రాచ్య పాశ్చాత్య భాషలలోనికి పరివర్తితము

క్షేమేంద్రుని గ్రంథరాజములలో సాహిత్య ప్రపంచమున విశిష్ట ఖ్యాతినందినది ఔచిత్యవిచార చర్చ. దీనియందు ప్రార్థనాశ్లోక మొకటి, 38 కారికలు, ఉపసంహారశ్లోకములు, 5, ఉదాహరణ ప్రత్యుదాహరణ శ్లోకములు 107 ను కలవు. వీనిలో రమారమి అరవంతు (38 శ్లోకములు) క్షేమేంద్రుని గ్రంథముల నుండియే యుల్లేఖింపఁబడినవి. క్షేమేంద్రుఁడు దోషజ్ఞచూడామణియే కాక, సాహిత్యసమీక్షయందు స్వపరభేద మెఱుఁగని నిశిత మైననిష్పాక్షిక దృష్టికలవాఁడు. అందువలనే యితఁడు ఔచిత్యమునకే కాక, అనౌచిత్యమునకుఁ గూడ తనపద్యముల నుదాహరించుకొనెను. గీర్వాణసాహిత్య ప్రపంచమున మహారథు లగు అమరుకుఁడు, ధర్మకీర్తి ప్రవరసేనుఁడు, మాతృగుప్తుఁడు, కాళిదాసు, భట్టబాణుఁడు, భవభూతి, కుమారదాసు, మాఘుఁడు, రాజశేఖరుఁడు మొదలగువారి రచనలయందలిదోషముల నుద్ఘాటించుట కితఁడు వెనుకాడలేదు. తనపద్యములయందలి దోషముల నెత్తి చూపుటకును వెనుదీయని యితఁడు అభినవగుప్తుని గురువును, తనకు పరమగురువు నగు భట్టేందురాజుపద్యముల యందలి దోషములను గూడ చర్చించెను. ఈసందర్భమున శాస్త్రావతారము లనఁ దగు శేషశ్రీకృష్ణపండితుఁడు ఆయన శిష్యుఁడగు భట్టోజీదీక్షితుల వృత్తాంత మించుక స్మరింపఁ దగును. భట్టోజీ తనగురువగు శేషశ్రీకృష్ణుని 'ప్రక్రియాప్రకాశము' నందలి విషయములను తన 'మనోరమ' యందు తీవ్రముగానిరసించి, సమకాలికవిద్వల్లోకము నుండి 'గురుద్రోహి' అనునపప్రథకు గుఱి యయ్యెను.

ఔచిత్యవిచారము ప్రకరణములుగా విభాగింపఁబడలేదు. క్షేమేంద్రుఁడు అనూచాన శైవసంప్రదాయ కుటుంబమున అవతరించుటచే నేమి పరమమాహేశ్వరుఁ డగు తనజనకుఁడు ప్రకాశేంద్రుని ప్రభావమున నేమి, మొదటినుండియు శైవసిద్ధాంతానుయాయిగానే యుండెను కాని కొంతకాలమునకు పిమ్మట పరమవైష్ణవాగ్రేసరుడును, తన కాచార్యవర్యుఁడు నగు సోమపాదుని ప్రభావమున పరమవైష్ణవుఁ డయ్యెను. అందువల్లనే అచ్యుతునికి నమస్క

† క్షేమేంద్రలఘుకావ్యసంగ్రహము (పు. 80–81: శ్లో. ౨౬, ౨౭) సంస్కృత-ఎకాడెమీ-గ్రంథావళి-7 (హైదరాబాద్)–1961

‡ అందే - పు. 36; శ్లో. ౧౩.

* అందే (పుటలు 11–62)

రించి యీగ్రంథము నుపక్రమించెను. ఇందు మొదటి 10 కారికలును, వానిని వివరించు గద్యభాగముల యందును ఔచిత్య మన నేమియో విశదీకరించి, కవితాక్షేత్రమున, సాహిత్యశాస్త్రరంగముననుదాని సర్వతోముఖప్రాముఖ్యమును తెలిపి, తానే రచించిన యొకశ్లోకమున దాని నుదాహరించెను.

ఈగ్రంథమును 27 భాగములుగా విషయ మును బట్టి విభజింపఁ వగును. వీనిలో రసచర్చ చాల విపులముగా నున్నది. వైపుల్యమున దానికి పిమ్మట చెప్పఁదగినది కారకచర్చ. ప్రత్యంశమును నొక కారికతో నుపక్రాంతమగును. పిమ్మట వచన మున దానివివేచన ముండును. తరువాత నుదా హరణములుగా ప్రాచీనకవులవి కాని, సమకాలిక కవులవి కాని యొకటి, రెండు శ్లోకములను, గద్య మున వాని వివరణమును, ప్రత్యుదాహరణమును, వచనరూపనిరూపణము నుండును ప్రతికారికయం దును హృదయావర్జకము లగు నుపమాలంకారము లున్నవి సామాన్యముగ ప్రత్యంశమునకు నీతఁడొక యుదాహరణమును ఒక ప్రత్యుదాహరణము నొసఁ గును ఈక్రిందివి మాత్ర మతివాదములు:

| | ఉదాహరణ ములు | ప్రత్యుదా హరణములు |
|---|---|---|
| అలంకారౌచిత్యము | 1 | 2 |
| పదౌచిత్యము | 2 | 1 |
| రసౌచిత్యము | 2 | 1 |
| హాస్యవీరశాంతములు | 2 | 1 |
| నామౌచిత్యము, ఆశీర్వచనౌచిత్యము | 2 | 1 |
| ప్రబంధౌచిత్యము, గుణౌచిత్యము | 2 | 2 |
| వాక్యౌచిత్యము, కాలౌచిత్యము | 3 | 1 |

రసచర్చయందు రససాంకర్య నిరూపణమున నీతఁడు శృంగారశాంతసాంకర్యమునకే ఉదాహరణ ప్రత్యుదా హరణము లొసఁగి: ఈక్రిందివానికి ప్రత్యుదాహరణ ముల నొసఁగక ఉదాహరణములను మాత్ర ముల్లే ఖించెను.

శాంతము+శృంగారము
బీభత్సము+శృంగారము
వీరము+కరుణ
శాంతము+శృంగారము+కరుణము+బీభత్సము

క్షేమేంద్రుఁ డనుసరించిన క్రమమున 27 విషయములను ఈక్రింద చూపఁబడుచున్నవి :

1 పదౌచిత్యము
2 వాక్యౌచిత్యము
3 ప్రబంధార్థ
4 గుణౌచిత్య
5 అలంకారౌచిత్య
6 వివిధరసములు
I హాస్య
కరుణ
రౌద్ర
వీర
భయానక
బీభత్స
అద్భుత
శాంత
II రససాంకర్యము
శాంత+శృంగార
బీభత్స+శృంగార
వీర+కరుణ
శాంత+శృంగార+ కరుణ+బీభత్స
శృంగార+శాంత
7 క్రియాపదౌచిత్య
8 కారకౌచిత్య
కర్తృపద
కర్మపద
కరణ
సంప్రదాన
అపాదాన
అధికరణ
12 ఉపసర్గ
13 నిపాత
14 కాల
15 దేశ
16 కుల
17 వ్రత
18 తత్త్వ
19 సత్త్వ
20 అభిప్రాయ
21 స్వభావ
22 సారసంగ్రహ
23 ప్రతిభా
24 అవస్థా
25 విచార

| | |
|---|---|
| 9 లింగ | 26 నామ |
| 10 వచన | 27 ఆశీర్వచనౌచిత్యములు |
| 11 విశేషణ | |

ప్రత్యుదాహరణములయందు క్షేమేంద్రుడు దోషముల నుద్ఘాటించుటయే గాక ఎడనెడ ఆదోషముల నెట్లు పరిహరింపదగునో సూచించియున్నాడు.

'లావణ్యాద్భుత...'

అను ధర్మకీర్తిశ్లోకమున నాల్గవపాదమున 'తన్వాః' అనుదానికి 'యువత్యాః' అని సవరణ మొనర్చిన ఆదోషము తొలగు నని నుడివెను. కాని అట్లు సవరించినచో ఛందోభంగము కలుగు నని క్షేమేంద్రుడు గుర్తింప లేదు.

'అపి మాషం మషం కుర్యాత్,
ఛందోభంగం న కారయేత్'

యను శాసనము కావున క్షేమేంద్రుని సవరణ నుపాదేయము కాదు.

ఔచిత్య ప్రస్థానము :

రసస్ఫోరకములగుటచే హృద్యములు, వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థములచే మనోహరములు నగు శబ్దార్థములయే కావ్యశరీర మని ఆచార్యదండి వక్కాణించెను. అటులైనచో కావ్యమున కాత్మ ఏది? యని మొట్టమొదట ప్రశ్నించిన సాహిత్యవేత్త కాశ్మీరవాసి, వామనాచార్యులు. ( )

"రీతి రాత్మా కావ్యస్య
విశిష్టా పదరచనా రీతిః విశేషో గుణాత్మా"

ఇత్యాదిగా ఆయన సమాధాన మిచ్చెను. కావ్యమునకు ప్రాణమేది? ఆత్మ యేది? అను విషయమునకు వివిధ సాహిత్యవేత్తలు భిన్నభిన్నములగు నుత్తరముల నొసగిరి. ఇట్లు బయలుదేరినవే ఈక్రింది సాహిత్య ప్రస్థానములు : రసప్రస్థానము, రీతిప్రస్థానము ధ్వనిప్రస్థానము. వక్రోక్తిసిద్ధాంతము, ఉత్పత్తివాదము, అనుమితివాదము, భక్తివాదము, అభివ్యక్తివాదము, ఔచిత్య ప్రస్థానము, చమత్కారసిద్ధాంతము అను వివిధ రాద్ధాంతములను వివిధకాలములందు సంస్కృత సాహిత్యమహారథులు ప్రతిపాదించిరి.

భరతాదులు రసప్రస్థానవాదులు భామహోద్భటులు, దండిరుద్రటులు, ప్రతిహారేందు రాజాదులు అలంకార మతానుయాయులు. వామనాదులు రీతి మార్గవాదులు. ఆనందవర్ధనుడు, అభినవగుప్తుడు రాజానక రుయ్యకుడు ధ్వనిమతవాదులు. కుంతకుడు వక్రోక్తివాది. భట్టలోల్లటుడు ఉత్పత్తివాది. శంకుకుడు అనుమితివాది. భట్టనాయకుడు భక్తివాది. అభినవగుప్తుడు, మమ్మటుడు మొదలగువారు అభివ్యక్తివాదులు. క్షేమేంద్రుడు ఔచిత్య ప్రస్థానప్రవర్తకుడు. విశ్వేశ్వర పండితుడు చమత్కార చంద్రికను రచించి, చమత్కారప్రస్థానమును ప్రతిపాదించెను. గుణాలంకారరీతులు వక్రోక్తిధ్వనులు అనుమితిరసములు మొదలగు వీనిలో నేది కావ్యాత్మయైనను ఔచితీయుక్తము లయినప్పుడే వానివానికి కావ్యాత్మత్వము సిద్ధించును. ఇట్లు ఔచిత్యమే కావ్యాత్మ యని స్పష్టముగా సిద్ధాంతీకరింపబడినది. ఔచిత్యము కవితాచమత్కారముపై నాధారపడినది చమత్కార మన కవితావిచ్ఛిత్తి, కావ్యసౌందర్యము. ఔచిత్యవిచారచర్చయందు క్షేమేంద్రుడు చమత్కార చర్చ నెత్తుకొనలేదు, కాని కవికంఠాభరణమున దీనిని విశదముగా నిరూపించెను

"ఏకేన కేనచి దనర్ఘమణిప్రభేణ
అభిసరతి ... "-(3.౧)

అనుచు నుపక్రమించి ఈతడు చమత్కార విరహితుడగుచో కవి ... కవిత్వము కాదనియు కావ్యము సార్థకనామము కాదనియు వక్కాణించి, చమత్కారము పదివిధము లని యిట్లు వర్గీకరించెను.

| | |
|---|---|
| అవిచారితరమణీయము | అర్థగతము |
| విచార్యమాణరమణీయము | శబ్దార్థగతము |
| సమస్త సూక్తవ్యాపి | అలంకారగతము |
| సూక్త [illegible] | రసగతము |
| శబ్ద [illegible] | |

[illegible] కన్నిటికిని చాలవఱకు తనగ్రంధముల నుండియే లక్ష్యముల నొసంగెను. చమత్కారమునకు యశోవర్మశ్లోకము [illegible] ప్రత్యుదాహరణముగా మాళవ రుద్రుని శ్లోకము [illegible] చెను.

[illegible] సాహిత్యవేత్తలందఱును సూచ్యముగా నో వాచ్యముగానో కావ్యమున ఔచిత్యము అవశ్య ముండవలయు ననియే వక్కాణించియే యున్నారు. భరతాచార్యులు నాట్యశాస్త్రమున ఔచిత్యము నిట్లు సూచించి యున్నారు.

ఆదేశజములవఱకు భావరసావస్థలకుతగి నట్లుగా నాయికలు భూషణములధరింపవలెనను ఈయన [illegible] ము ఔచిత్యమునే సూచించును.

'అదేశజో హి వేషస్తు న శోభాం జనయిష్యతి,
మేఖలోరసిబద్ధే చ హాస్యాయై వోపజాయతే.'

అను పైవద్య మనౌచిత్యమునకు లక్ష్యము. దీని భావమే క్షేమేంద్రుఁడు.

'కంఠే మేఖలయా, నితంబఫలకే తారేణ హారేణ వా' (12పు ౧శ్లో.)

అని ఔచిత్యవిచారమునను,

'వృత్తః [illegible] కామా దస్థానే వినివేశితా,
కథయ త్యజ్ఞతా మేవ మేఖలేవ గళే కృతా'
(3. ౧౩)

అని సువృత్తతిలకమున నుడివియున్నాఁడు

'సన్నివేశ విశేషా త్తు దురుక్త మపి శోభతే'
అని భామహుఁడును

'సముదాయార్థ [illegible] తదాపార్థ మి తిష్యతే'

అని దండియు, ఔచిత్యమునే సూచించి యున్నారు. కవులలో ఔచిత్యశబ్దమును మొదటిసారి ప్రయో గించినవాఁడు యశోవర్మ (695—735.) ఈయన సాహిత్యగోష్ఠి [illegible] భవభూతియు '[illegible]' యను ప్రాకృతకావ్యమును రచించినవాక్పతియు. యశోవర్మ రచించిన '[illegible]' మను నాటక ముత్పన్నము కాదు. యందలిశ్లోకరత్నములు కొన్ని శృంగారప్రకాశము మొదలగు సాహిత్యగ్రంథముల యం దుదాహరింపఁబడియున్నవి. పైనాటకము నందలిప్రస్తావనను [illegible] ప్రాకృతమును [illegible] శ్లోక భాగమును చూడుఁడు

"ఔచిత్యం వచసాం ప్రకృత్యనుగతం,
సర్వత్ర పాత్రోచితా పుష్టిః స్వావసరే రసస్య''

సాహిత్యగ్రంథకర్తలలో ఔచిత్యపదమును ప్రయోగించుటకు [illegible] ప్రథముఁడు. ఈయన కావ్యాలంకారమున నిట్లు వచించియున్నాఁడు.

"ఏతాః ప్రయత్నా దధిగమ్య సమ్యక్
ఔచిత్య మాలోచ్య తథార్థసంస్థమ్"

"ఇతి [illegible] సమ్యగాలోచయద్భిః
సుకవిభి రభియుక్తైః వస్తు చౌచిత్యవిద్భిః"

ఆనందవర్ధనుఁడు ధ్వన్యాలోకమున

"అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణం
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా"
(ఉద్యోత 3. పు ౧౮౬) †

అని ఔచిత్యమును, అనౌచిత్యమును పేర్కొనెను. బీజప్రాయముగా ఈయన సూచించిన ఔచిత్యసిద్ధాంత

---

† 'రక్తస్త్వం నవపల్లవైః'-(క్షే.ఔ.కౌ. సంగ్రహః. 71 పు. ౧౪ శ్లో)

‡ 'వేల్లత్పల్లవసమ్మిళల్లత'—(అందే. 71 పు. ౧౩శ్లో.)

† శ్రీమధుసూదనమిశ్రుల 'అవధాన' వ్యాఖ్యతోడిప్రతి. (Calcutta Sanskrit Series-253.)—1938.

6. కవికంఠాభరణము † (ముద్రితము). ఇందు సంధు లనుపేర 5 ప్రకరణములు కలవు. ప్రత్యంశము కారికలతో నుదాహరణపూర్వకముగా వివరింపఁబడెను. కావ్యనిర్మాణ క్షేత్రమున కృషిచేయ నుత్సహించు వ్యుత్పత్సువులకు సాహిత్యశిక్షణము చక్కఁగా నిందు వివరింపఁబడెను.

౧వ సంధి:— కవిత్వప్రాప్తి — ఇందు 24 కారికలు 3 లక్ష్యశ్లోకములతో కవితాకళయందు కౌశలము ప్రాప్తించుమార్గ ముపదేశింపఁబడెను.

౨వ సంధి:— శిక్షాప్రకరణము 22 కారికలు, 9 ఉదాహరణములు. కవితానిర్మాణ మార్గమున ప్రావీణ్యము నార్జించినవారి కిందు చక్కని విషయము లుపదేశింపఁబడెను

3వ సంధి :— చమత్కారకథనము 3 కారికలు 10 ఉదాహరణములు. ఇది కవితాచమత్కార విచారకము,

౪వ సంధి:- గుణదోషవిభాగము ఉపక్రమోప సంహారములు 2శ్లో. కారికలు 10 ఉదాహరణములు. ఇట కవితాగుణములు దోషములును విస్తరముగా నిరూపింపఁబడెను. ఇందలి వర్గీకరణము శబ్దార్థముల ప్రసన్నతమీఁదను, రసనిరూపణము మీఁదను ఆధార పడినది.

౫వ సంధి:— పరిచయప్రాప్తి—ఉపక్రమము 1శ్లో. లక్ష్యములు 2౯శ్లో. ఉపసంహారము 3శ్లో. ఇట సమగ్రసంస్కృతి సంపాదనమును గూర్చి వివరింపఁ బడెను. ప్రారంభమున ఒకశ్లోకమును, అంత్యమున 3 ఉపసంహార శ్లోకములును 28 ఉదాహరణములు నిందు కలవు.

† 1. క్షేమేంద్రలఘుకావ్య సంగ్రహ — పు. 83–84. (1961). 2. Kavyamata part 4. (1st ed 1887 2nd ed. 1899; 3rd ed. 1937.)
Haridas Sanskrit Series 24 Benares (1933)

కవికంఠాభరణమున ప్రమాణీకరింగుకొనఁబడినకవులు :

| | |
|---|---|
| అమరుక | చంద్రక |
| అర్యభట్ట | భట్టదామోదరగుప్త |
| ఇంద్రభాను | ,, నారాయణ |
| ఉత్పాలాజదేవ | ,, బాణ |
| కాళిదాసు | ,, భల్లట |
| (క్షేమేంద్ర) | ,, మయూర |
| చక్రపాల | ,, ముక్తికలశ |
| భట్టవాచస్పతి | వ్యాస |
| భట్టశ్రీశివస్వామిన్ | శ్రీహర్ష (వర్ధన) |
| భట్టోదయసింహ | ముక్తాకణ |
| రాజశేఖర | |
| లక్ష్మణాదిత్య | |
| విద్యానంద | |

7. కవికర్ణిక:— ( కావ్యాలంకారము ) — ఉత్పన్నము

'కృత్వాపి కావ్యాలంకారాం క్షేమేన్ద్రః కవికర్ణికామ్
తత్కలంకం వివేకం చ విధాయ విబుధప్రియమ్,
ఔచిత్యస్య చమత్కారకారిణ శ్చారుచర్వణే
రసజీవితభూతస్య విచారం కురుతేఽధునా'

మహామహోపాధ్యాయ డాక్టర్ పాండురంగ వామన కాణే పండితుఁడు కావ్యాలంకారవిచారక మగు కవికర్ణిక కవికంఠాభరణముకంటె భిన్నమో కాదో తెలియ దని వ్రాసియున్నాడు †.

8. క్షేమేంద్రప్రకాశము:— క్షేమేంద్రుని లోకప్రకాశము'నకే ఇది నామాంతరమేమో.

† History of Sanskrit Poetics ( 3rd ed 1951 ) పుట.



(† ఈయూర్లో వెంకట వీర రాఘవాచార్యులు

9 చతుర్వర్గసంగ్రహము :- † ఇందు 4 పరిచ్ఛేదములు, 105 శ్లోకములు కలవు మొదటి ప్రకరణము ధర్మ ప్రశంస (27 శ్లోకములు). 2వ ప్రకరణము అర్థప్రశంస (25 శ్లోకములు). 3వ పరిచ్ఛేదము కామప్రశంస (2౦ శ్లోకములు). 4వ పరిచ్ఛేదము మోక్షప్రశంస (29శ్లోకములు). ఈ గ్రంథము ధర్మార్థకామమోక్షము లను చతుర్విధ పురుషార్థములను విశదముగా వివరించెను. అందు ము ఖ్యముగా కామప్రశంసా పరిచ్ఛేదము మిక్కిలి మనోహరముగా నున్నది.

10 చారుచర్యా † :- ముద్రితము. ఇందు 100 అనుష్టుప్ శ్లోకములు గలవు. దనిప్రధానోద్దేశము నీతిబోధ. ప్రతిశ్లోకమున మొదటి పాదమున నీతిని బోధించునూక్తియు 2వ పాదమున కావ్యముల నుండియో పురాణములనుండియో ఉదాహరణములు నుండును ఈగ్రంథము నుజ్జీవించియే ద్యాద్వివేద పండితుఁడు (1484 క్రీ, 'నీతిమంజరి' అనుగ్రంథ మును జల్హణకవి 'ముగ్ధోపదేశముచు' రచించిరి. చారుచర్యయను శీర్షికలో ధారాధిపతి యైనభోజుఁడు రచించిన యొకవైద్య గ్రంథము కూడఁ గలదు. భోజుని ఈకృతిని మున్ముత్తి అప్పనకవి ఆంధ్రీకరించెను.

11. చిత్రభారతనాటకము :- † (ఉత్ప న్నము) ఈ గ్రంథము ఔచిత్యవిచారచర్చయందును 52 పు ... ప.) కవికంఠాభరణమునందును ‡ క్షేమేంద్రుఁ డుల్లేఖించు కొనెను.

చరిగొండ ధర్మన్న యనునాంధ్రకవి చిత్ర భారతమనునామముతోడనే ఒకయాంధ్రప్రబంధమును రచించెను.

2. దర్పదళనము :- (ముద్రితము) ఇందు 'విచారము' లను 7 ప్రకరణములును మొత్తము 596 శ్లోకములును కలవు మొదటివిచారము— కులవిచారము (82 శ్లోకములు) 2 వర విచారము (115 శ్లో). 3 విద్యావిచారము (154 శ్లో). 4 రూప విచారము (75 శ్లో). 5 శౌర్యవిచారము (4౬ శ్లోక ములు), 6 దానవిచారము (54 శ్లో). 7 తపోవిచా రము (73 శ్లో). మొదటిప్రకరణమున ఆభిజాత్యము, ఐశ్వర్యము, విద్యావైభవము, సౌందర్యము శౌర్యము, వితరణము, తపస్సు అనునేడును దర్పకారణము లని నిరూపించి, వీనిని ఏడుప్రకరణములయందు విశదీక రించెను. ప్రత్యంశమునకు చక్కని కథల నుదాహర ణములుగా నొసఁగును. పైయేడును మానవుని పతన మున కెట్లు కారణము లగునో వివరించెను. నీతి బోధక మగు ఈగ్రంథరాజమున సుభాషితములు లోకోక్తుల వంటిసూక్తులు ఎన్నియో కలవు.

13. దశావతారచరిత కావ్యము :- * (ముద్రి తము) ఇందు 10 సర్గలు, 1764 శ్లోకములును కలవు, శ్రీమహావిష్ణువుయొక్క దశావతారములు నిందు చిత్రింపఁబడెను. ఇందలివస్తువు పురాణముల నుండి స్వీకరింపఁబడెను. ఇందు 8వ సర్గయందు శ్రీరామావతారచరిత్ర నిరూపణమున కవి తనయుప జ్ఞను ప్రదర్శించెను. రావణుఁడు ప్రధానపాత్రగా రామాయణకథ యంతయు ఇందు వర్ణితము. ఇందలి వర్ణనములు మిక్కిలి స్ఫుటముగా చేయఁబడెను. బుద్ధభగవానుని శ్రీమహావిష్ణువుయొక్క అవతారముగా చిత్రించిన ప్రాచీనగ్రంథములలో క్షేమేంద్రు గ్రంథ

† క్షేమేంద్రలఘుకావ్య సంగ్రహః — పు. ౧౧౯—౧౩౪. ౧౩౪—౧౫ ౪ (Sanskrit Academy series 7 Hyderabad) 1961.

† III 19 v. 72 p; V. 49 v. 79 p. (Also in Smortha-tilaka III 79 v. III p.)

‡ క్షేమేంద్ర ల. కా. సంగ్రహ—పు. 145-206 (1961)

* Kavyamata No. 26. (19 )—N. S. Press, Footnote Bombay.

మొకటి. గౌతమబుద్ధునిజీవితమును కవి బౌద్ధ వాఙ్మయకృతులనుండి స్వీకరించెను ఈకావ్యము నందలిశయ్య సరళముగా, ధారావాహికముగా నుండును. ఈకృతి త్రిపురేశపర్వతముపై (లౌకిక వత్సరము 41లో) క్రీ. 1066 సంవత్సరమున రచింపఁబడెను.

| | | |
|---|---|---|
| ౧వసర్గ (60 శ్లో.) | ౫వసర్గ (223 శ్లో.) | ౯వసర్గ (74శ్లో.) |
| ౨ ,, 40 | ౬ ,, 35 | ౧౦ ,, 41 |
| ౩ ,, 29 | ౭ ,, 294 | ఉపసంహారము 5 |
| ౪ ,, 90 | ౮ ,, 873 | 1764 శ్లో. |

14. దానపారిజాతము:—‡ (ఉత్సన్నము.)

15. దేశోపదేశము:— † (ముద్రితము) 'ఉపదేశము' అను నామముతో నిందు 8 ప్రకరణములును, 300 శ్లోకములును కలవు. కాని, వీని యందు 3 శ్లోకములు లోపించినవి. మొదటిఉపదేశము దుర్జనవర్ణము (24 శ్లో). ౨ కదర్యవర్ణనము (36 శ్లో). ౩ వేశ్యావర్ణనము (48 శ్లో). ౪ కుట్టనీవర్ణనము 34 శ్లో. ఇందు 2½ శ్లోకములు స్పష్టమైనవి. ౫ నిటవర్ణనము (28 శ్లో). ఇందు ఒక శ్లోకపాదము లోపించినది. ౬ ఛాత్రవర్ణనము 45 శ్లో. ౭ వృద్ధభార్యావర్ణనము (31 శ్లో). ౮ ప్రకీర్ణవర్ణనము (5. శ్లో. 2 ఉపసంహారశ్లోకములు). అష్టమోపదేశమున ఈక్రిందియంశములు వర్ణింపఁబడెను. గురువు, దివిరుఁడు, కులవధువు, భట్టు, వణిజుఁడు, కవి, ధాతువాది, ద్యూతకరుఁడు, బుద్ధివిహీనుఁడు, గురుభక్తుఁడు, వైణికుఁడు, వైద్యుఁడు, నిర్గుణుఁడు, పండితుఁడు, లేఖకుఁడు, జటాధరుఁడు, రండ. పైగ్రంథమున కవి తనకాలమునందలి యాచారవ్యవహారములను, లోకప్రతారణను చేయువ్యక్తులను సూక్ష్మముగ విశదముగా చిత్రించెను మొదటియుపదేశమున దుష్టజనావహేళనము బాగుగా నిరూపితము రెండవ యుపదేశమున లుబ్ధులయొక్క జీవితము, అభ్యాసములు తీక్ష్ణముగా విమర్శింపఁబడెను ఇంటికి బంధువుగాని, అతిథి గాని వచ్చినప్పుడు లుబ్ధుఁడు భార్యతో జగడము పెట్టుకొని, మిథ్యాక్రోధమును నటించుచు భోజనమును కూడ మానివేయును. దీనిని చూచి వచ్చినయతిథి వచ్చినట్లే తిరిగి పోవును.

16. నర్మమాల:— ‡ పరిహాసములు అను మూఁడుప్రకరణములును 407 శ్లోకములును దీని యందు కలవు. ఇతివృత్తమున, రచనావిధానమున నీగ్రంథము దేశోపదేశమువంటిదే. ఇందలి శయ్య ధారావాహికము, సరళము, హాస్యచమత్కారప్రచురము మాత్రమే కాక సజీవముగ నుండును. ఛలోక్తులు, పరిహాసములు, తీవ్రవిమర్శలు కలిగిన ఈ కృతి విద్వాంసులకును, సజ్జనులకును, వినోదముగా నుండును. ఇందు కవి కాయస్థప్రభుత్వాధికారియొక్క నికృష్టపరిపాలనా విధానమును నిర్దాక్షిణ్యముగ ఖండించి, తనకాలమున అనంతమహారాజు సన్నిధిని రాజ్యతంత్రమును నిర్వహించుసమకాలికోద్యోగులకు జీవితవిధానమునఁ గాని, పరిపాలనాపద్ధతియందు గాని వెనుకటివారి ననుకరింప వలదని చక్కని హితోపదేశము చేసెను.

‡ Dr. S. K. De: Sanskrit Poetics 2nd ed Vol. I. p. 132 – Calcutta (1960.)

† క్షే. ల. కా. సంగ్రహ – పు. 27?-306 (1961)

‡ 1. Ed. by Madhusudana Kaul, along with Desopadesa (Kashmir Series of Text of Studies No. Ho. (1923) Srinagar.

2. Minor works of Ksemendra pp. 307-46 (1961) Hyderabad.

17. పద్యకాదంబరి:- * (ఉత్సన్నము) కవికంఠాభరణమున క్షేమేంద్రుఁడు దీనినుండి 8 శ్లోకములను† నుల్లేఖించుకొనెను.

హర్షవర్ధనచక్రవర్తి దర్బారులో ఆస్థానకవి యగుభట్టబాణుఁడు కాదంబరీ కథను పద్యరూపముగా రచింప నారంభించి, యది అంత సరళముగ సాగనందున, తిరిగి దానిని గద్యకావ్య ముగ నిర్మించెను బాణునకు గద్యమంతసరళముగ పద్యము సాగలేదు భోజుఁడు "యాదృగ్గద్యవిధౌ బాణః పద్యబంధే న తాదృశః" అని సరస్వతీ కంఠాభరణమున వ్రాసి యున్నాఁడు. కొందఱకు పద్యనిర్మాణమున విశృంఖలముగా కలము సాగును. కొందఱకు గద్యరచనమున లేఖిని సరళముగ నడచును. బాణునకు పద్యముకంటె గద్యనిర్మాణము నందే కౌశలము మెండు. ఈతనిపద్యకాదంబరి నష్ట మైనదని తిరిగి క్షేమేంద్రుఁడు దీనిని పద్యరూపముగ రచించెను. ఇదియు నుత్సన్న మైనది. క్షేమేంద్రుఁ డుదాహరించిన భట్టబాణుని శ్లోకమొకటియు బహుశః ఈతని పద్యకాదంబరినుండి మనకు లభించిన పద్య శకలము

18. పవనపంచాశిక:- (ఉత్సన్నము) ఇది వాయుదేవుని వర్ణించు 50 శ్లోకములు కల స్తుతిరూప లఘుకావ్యము. సువృత్తతిలకమున (III 91 ప; H ౧౧౪ ప.) ఉదాహరింపఁ బడిన "శ్రేంఖ శృంఖాభిఘాత" - అనునొక్కశ్లోకము వల్లనే యిది జీవించి యున్నది.

† Minor works of Ksemendra — Kavi Kanthabharana. III p. 12, 16, 18 verses; p. 73, 21 v. IV p. 75, 25, 27 v; V p. 78, 35, 38 verses; p. 80, 46 v. (Total 8 verses.)

19 బృహత్కథామంజరి *: ముద్రితము. ఇందు 18 లంబకములును, ఒక ఉపసంహార పరిశిష్టమును కలవు. ఈ గ్రంథమునందలి పద్యములు 7680.

"భూతభాషామయీం ప్రాహుః అద్భుతార్థాం బృహత్కథామ్"

అని ఆచార్యదండిచే కీర్తింపఁ బడినగుణాఢ్యుని ప్రాకృత గ్రంథమునకు (గలసంస్కృత పరివర్తనము మూఁడింటిలో క్షేమేంద్రుని దొకటి దీనికి సమకాలికమే సోమదేవసూరి "కథాసరిత్సాగరము". ఈ రెంటి కంటెను ప్రాక్తనము బుధస్వామి (క్రీ 900) రచించిన బృహత్కథాశ్లోకసంగ్రహము.

బృహత్కథామంజరిని క్షేమేంద్రుఁడు క్రీ.1037న ముగించెను. తనయొద్ద గుణాఢ్యునిగ్రంథముకల దనియు, దాని నుజ్జీవించియే తనగ్రంథరచన సాగిన దనియు నీతఁడు వక్కాణించెను. దీనిని బట్టి గుణాఢ్యునిగ్రంథస్వరూపము, ఇతివృత్తము, పరిమితియు విశద మగును. లంబక మనఁగా బహుశః నాయకుని దిగ్విజయము కానోపును. ఇందలివస్తువు ౧. కథా పీఠలంబకము గుణాఢ్యునికథ, అతఁడు తనకృతిని ప్రాకృతమున రచించుటకు హేతువు. ౨. లంబకము కథాపీఠము. ఉదయన మహారాజవైభవ చిత్రణము. ౩. లం- ఉదయనుఁడు పద్మావతీప్రణయమును పొందుట. ౪. లం, విద్యాధరుల భవిష్యచ్చక్రవర్తి యగు నరవాహనదత్తుని జననము, ౫. శక్తివేగుఁడు విద్యాధరనగరమున కేఁగి, నలుగురుకన్యలను జయించి తీసికొని వచ్చి నట్లు నరవాహనదత్తునితో నివేదించుట. ౬. లం-సూర్యప్రభవృత్తాంతము. ౭. కళింగ సేనుని జనకుఁ డగు కళింగదత్తుఁడు సూర్యప్రభను

* కావ్యమాల, 69. డెమ్మీ 662 పుటలు. నిర్ణయసాగర ప్రెస్, బొంబాయి (1901). సంపాదకులు : శివదత్త పండితుఁడు, కాశీనాథ పాండురంగపండితుఁడును. 2nd ed (1931) Demi. pp. 620 to 7.

వివాహ మాడు మని ఉదయనునితో చెప్ప నీతఁ డంగీకరించె. కాని గనికి ఆతనిమంత్రి యగు యౌగంధరాయణుఁ డట్టి రత్నగా కళింగసేనని తనయుఁడు నరవాహనదత్తుడు వివాహమాడునట్లు చేయు దున. ... ము చేయుట. ౮. లం మదిరావతి తద్వృత్తాంతము. మానసవేగుడు మదనమంచుక నపహరించుట. ౯. ౧౦. ఉదయనుఁడు లలిత లోచనను వరించుట, ఆమె యంతర్హిత మగుట. ౧౧. లం--విక్రమాదిత్యుని కథలు ౧౧ లం-లలిత లోచన తిరిగి లభించుట. ౧౨. ముక్తాఫలకేతు వృత్తాంతమును గోముఖుఁడు చెప్పుట ౧౩. ఉద యనుఁడు అయిమగురు విద్యాధరకన్యకలసాయమున మదనమంచుకను వెదకి పట్టుకొనుట. ఆమె తిరిగి తప్పించుకొని పోవుట. అతఁ డందలి నలువురు కన్యలను వివాహ మాడుట. ౧౪ లం--ఉదయ నుఁడు రత్నప్రభను వివాహ మాడుట ౧౫. లం-అతఁడు అలంకారవతిని పెండ్లియాడుట. ౧౬ లం-శక్తియశస్సును పరిణయ మగుట. ౧౭. లం-ఉద యనుఁడు వాసుదేవమహర్షినుండి రత్నసప్తకమును పడసి, మందారదేవుని సంహరించుట. ౧౮. లం-ఉజ్జయినీప్రభువు లగు గోపాలుఁడు పాలకుఁడును రాజ్యపాలనమును పరిత్యజించుట. అవంతివర్మ నాయికను పరిణయ మగుట, వీ రిరువురను అసూయాగ్రస్తుఁ డగు విద్యాధరునుండి నరవాహన దత్తుఁడు రక్షించుట. ౧౯. లం-ఉపసంహారము.

20 బౌద్ధావదానకల్పలత † : (ముద్రితము) బౌద్ధజాతకకథాసాధాన మగు నిందు 'పల్లవములు' అను 107 సర్గలు కలవు. క్షేమేంద్రుని తనయుఁ డగు సోమేంద్రుఁడు మరి యొకపల్లవమును రచించి ఈపల్లవసంఖ్యకు పవిత్ర మగుఅష్టోత్తరశత సంఖ్యను కల్పించెను. క్షేమేంద్రునిమిత్రు లగు సజ్జలానందుఁడు నక్కుఁడు క్షేమేంద్రు నీరచనమున ప్రోత్సహించి రఁట. సుదీర్ఘ మగునీజాతకకథలు వినుగు కలిగించుటచే 3 అవదానములను మాత్రము రచించి, కవి రచనము నాపివేయఁగా బుద్ధభగవానుఁడే కవికి స్వప్నమున సాక్షాత్కరించి, ఈరచనమును పూర్తి చేయవలె ననియు, తానును తోడ్పడుచుననియు చెప్పె నఁట. బౌద్ధవాఙ్మయగ్రంథములయందు పండితప్రకాండుఁ డగు ఆచార్యవీర్యభద్రుఁడును క్షేమేంద్రుని కీరచనమున సాయ మొనర్చెను. వ్యాసునికి మహాభారతరచనమున గణనాథుఁడు లేఖకుఁ డైనట్లు సూర్యశ్రీ యనునాతఁడు క్షేమేంద్రునికి అవదానకల్పలతారచనమున లేఖకుఁడుగా నుండెను. ఈగ్రంథము క్రీ. 1052 లో వైశాఖమాసమున పూర్తి చేయఁబడెను. క్షేమేంద్రునిగ్రంథము 70 ఏండ్లకుఁ బిమ్మట 'టిబెట్' భాషలోనికి చక్కనికావ్యముగా అనువదింపఁబడెను.

21 భారతమంజరి : (ముద్రితము) వ్యాస మహర్షి రచించినమహాభారతమున కిది సంగ్రహాత్మక మగు మధుకోశము. ఇందు ఖిలపర్వ మగుహరివంశముతో 19 పర్వములును, 10692 శ్లోకములును గలవు. ఈమంజరి సప్తర్షిశకము 93వ వత్సరమున రచింపఁబడినట్లు ఒకవ్రాఁతప్రతిలో గలదు. కాని యిది క్షేమేంద్రుని ప్రారంభరచనములలో నొకటి యగుటచే లౌకికశకమున 41వ శతాబ్దమున నిది రచింపఁబడె ననుట సరి యని తోచదు. ఏమన కవి క్రీ. 1070 కి పిమ్మట నెంతకాలమో జీవింప లేదు. కావున పై సప్తర్షిశకవత్సరము వ్రాఁతప్రతి

† 1. Edited by Sarat Chandra Das, Hari Mohan and Mahamahopadhyaya Dr. Satis Chandra Vidyabhusana. (Bibliotheca Indica, Vol. I. 1888; Vol. II 1918) Calcutta. It has its Tibetan version also.
2. Dr. P.L. Vaidya's, ed in 2 Vols.(1959). Mithila Sanskrit. Series, Darbhanga.

లిఖింపఁ బడినకాలము కావచ్చును భారతమంజరీ రచనమువలన కవి నాటి సారస్వత ప్రపంచమున మహోన్నతస్థానము నలంకరించి, విద్వన్మండలిచే "వ్యాసదాస" బిరుదముచే సమ్మానింపఁబడెను. దాని యందలి ఈక్రింది శ్లోకమును చూడఁదగును.

"ఏష ఏష్టుక ధాత్రిర్థం పుణ్యావత సలిలోక్షితః
ప్రాప్తః సామాన్యజల్పో ఽపి క్షేమేన్ద్రోవ్యాసపీఠదాసమ్"

భారతమంజరియందు కవితాచమత్కారములు కాని, సాహిత్యవిశేషములు కాని యుండవు. ఇది కథాకథనసమర్థతకై రచింపఁ బడినసరళగ్రంథము మాత్రమే. ఎక్కువ కథను తక్కువ పద్యములయందు కవి యిముడ్చుటవలన పెక్కుతావులయందు రచన దుర్బోధముగ నున్నది. మహాభారతకథ యందు ప్రసక్తానుప్రసక్తముగా కన్పట్టిన అంశములను, ఘట్టములను, ఉపాఖ్యానములను కవి యొక్కొక వాక్యమునందో, ఒక్కొక్కసమాసమునందో సూచించుచు వచ్చెను. క్రీ. 11వ శతాబ్దమున మహాభారతమూల గ్రంథము ఎట్టిస్థితిలో నుండెనో భారతమంజరివలన మనకు తెలియనగును. శాంతిపర్వము నందలి 342–353 అధ్యాయములు భారతమంజరియందు విడువఁబడెను. అనఁగా క్రీ. 11వ శతాబ్దమునకు పిమ్మట ఈ ప్రకరణములు మూలగ్రంథమున ప్రక్షే పింపఁ బడె నన్నమాట.

22 ముక్తావళీకావ్యము:— (ఉత్పన్నము) ఇది యొకమహేశ్వరుని జీవితము నభివర్ణించు లఘు కావ్యము. దీనినుండి రెండుశ్లోకములు క్షేమేంద్రుఁడు ఔచిత్యవిచారమున, కవికంఠాభరణమున నుదాహ రించుకొనెను. ముక్తావళీనామముతో సంస్కృతమున ననేకగ్రంథములు రచింపఁబడినవి.

ఉదా:— న్యాయముక్తావళి.

23. మునిమతమీమాంస:— (ఉత్పన్నము) క్షేమేంద్రునికి వ్యాసభగవానునియం దఖండితభక్తి. "వ్యాసదాస" బిరుదాంకితుఁ డగు నీతఁడు రచించిన "వ్యాసాష్టకము" భారతమంజరికి ననుబంధింపఁ బడెను. వ్యాసమహర్షి యొనర్చినలోకోపదేశామృత మును శ్లోకరూపమున క్షేమేంద్రుఁడు సంగ్రహించెను. దీనినుండి 15 శ్లోకములు ఔచిత్యవిచారచర్చయం దుల్లేఖింపఁ బడెను.

24. రాజావళి:— (ఉత్పన్నము) కల్హణుని రాజతరంగిణివలెనె యిది కాశ్మీరదేశాధీశులచరిత్రము నభివర్ణించు నైతిహాసికకావ్యము. రాజతరంగిణిలో (I. 13) క్షేమేంద్రునిగ్రంథ మిట్లు పేర్కొనబడెను.

"కే నాప్యనవధానేన కవికర్మణి సత్యపి
అంశో ఽపి నాస్తి నిర్దోషః క్షేమేంద్రస్య నృపావళౌ"

I. 13.

క్షేమేంద్రుని ఈకృతి స్పష్టమగుటచే కల్హణుని పైయభిప్రాయము ఎంతవఱకు సమంజసమో చెప్పఁ జాలము.

25 రామాయణమంజరి:—† (ముద్రితము) ఇందు 7 కాండములును 6186 శ్లోకములునుకలవు. ఇది వాల్మీకిరామాయణమునకు సారసంగ్రహము. క్రీ. 11వ శతాబ్దిలో వాల్మీకిరామాయణమునకు మూలపాఠ మెట్లుండెనో తెలిసికొనుట కిమంజరి మిక్కిలి యుపయోగించును. దీనియందు కవితా సౌరభ మంతగా కానరాదు. ఇదీ కథాకథనమార్గమున సాగెను. ఇం దనేకభాగములు క్షేమేంద్రుని ప్రౌఢ వైదుషీప్రభావమున చిక్కగా నుండి దుర్బోధములుగా నుండును.

26. లలితరత్నమాల:— (లుప్తము) బహుశః ఈకృతి రూపకము కావచ్చును. ఇందు వత్సరాజరత్నావళీప్రణయకథ యితివృత్తము. దీని

† కావ్యమాల–83. (1903) — శ్రీ భవదత్తశాస్త్రి — కాశీనాథపండితులచేఁ బరిష్కృతము.

నుంది యొక శ్లోకము ఔచిత్యవిచారచర్చయం దుదాహృతము. (క్షే. ల. కా. సంగ్రహ 40 పు. ౬౭ ప.)

27 లావణ్యావతీకావ్యము* : (లుప్తము)– దీనినుండి ఔచిత్యవిచారమున 6 పద్యములును, కవికంఠాభరణమున నొకపద్యమును ఉదాహరింపఁబడెను. ఈకృతియందు లావణ్యవతియే నాయిక. వేదవేత్తయగు అత్రివసువును వేశ్యయగు వాసంతిక తనవలలలో వేసికొనుటకు పన్నిన మాయోపాయములిట వర్ణితములు

28 లోకప్రకాశకోశము † : (అసమగ్రము-ముద్రితము)–డాక్టర్ వేబర్‌పండితుఁడును మధుసూదనకౌల్‌పండితుఁడును ఈకోశము క్షేమేంద్రకృతము కాదనిరి. కాని డాక్టర్ జార్జిబ్యూలర్ పండితుఁడు మాత్రము వ్యాసదాసక్షేమేంద్రుఁడే దీనిని రచించెనని వక్కాణించెను ఇతరగ్రంథములయం దెచ్చటను లభింపని భారతీయుల దైనందిన జీవితమునకు సంబంధించిన విశేషము లెన్నియో దీనివలనఁదెలియుచున్నవి. హుండీలు (లెటర్స్ ఆఫ్ ఎక్స్చేంజ్ బాండ్స్) కాశ్మీరదేశోద్యోగుల బిరుదములు, హోదాలు, కాశ్మీరమునందలి వివిధపరగణాల నామములు ఇత్యాద్యనేకవిషయము లిందు క్రోడీకరింపఁబడెను. భౌగోళికాంశములు, రాజ్యపాలనయంత్రమునకుఁ జెందినయంశములు, వ్యాపారవిశేషములు, ఆయా శాస్త్రగ్రంథములయందుఁగాని, కావ్యాదులయందుఁగాని లభించుటయేలేదు. దీనివలన ఈకోశము యొక్క ప్రాముఖ్యము విశదమగును. దీనియందు సంస్కృతప్రాకృతశబ్దములేకాక పెర్షియన్ (Persion) పదములును ఎన్నియో క్రోడీకరింపఁబడెను

29. వాత్స్యాయన సూత్రసారము : (లుప్తము)–పంచసాయకమున నీగ్రంథ ముద్ధృతము. ఇందలి శ్లోక మొక్కటి మాత్రము ఔచిత్యవిచారమున నుదాహృతము. వాత్స్యాయనుని కామసూత్రమున కీగ్రంథము సారసంగ్రహము (ఔచిత్య వి. చ. 61పు. ౧౦౬ ప.)

30. వినయవల్లి : (లుప్తము)–ఇందలి శ్లోకములు రెండు ఔచిత్యవిచారమున నుదాహృతములు. మహాభారతమునందలి యొకానొక యుపాఖ్యానము దీని కాధారము కానోపును. (ఔచిత్య వి. చ. 15పు ౫-౬ ప.)

31. (A) వేతాళపంచవింశతి : ఇది బృహత్కథామంజరియం దంతర్గతము కాని ప్రత్యేకరచనకాదు.

31. (B) వ్యాసాష్టకము ‡ : భారతమంజరి కనుబంధముగాఁ జేర్పఁబడెను. క్షేమేంద్రునకు వ్యాసభగవానునియం దఖండభక్తి కల దని యిదివఱకే సూచింపఁబడెను. వ్యాసునిమహాభారతమును భారతమంజరియందు సంగ్రహించుటయే కాక క్షేమేంద్రుఁడు అను పదముకు తన "వ్యాసదాస" బిరుదము నుల్లేఖించు కొనుచుండెను

32. శశివంశమహాకావ్యము * : (ఉత్సన్నము)– రఘువంశము, అశ్మకవంశము మొదలగు వంశానుచరితాత్మకములవంటి మహాకావ్యము.

* ఔచిత్య వి. చ. 23 పు. (౨౬, ౨౭); 36పు. (౫౬ప.); 56 పు. (౯౬, ౯౭ప.); 57 (౯౮ ప.); కవికంఠా 73పు. (౨౦, ౨౨ప.). 'సదాసక్తంశైత్యమ్-ఈపద్యము ఔచిత్యవిచారమున (36-౫౬) కవికంఠాభరణమునను (73-౨౦) కలదు.

† Part I oblong 132 leaves. (Adictionary and Miscellany dealing with daily life.) S. D. L. Jain Pustakoddhar–Vol. 65. Bombay (1926).

‡ క్షే. ల. కా. సంగ్రహ. 8పు.

* కవికంఠా. 72 పు. (౧౫, ౧౬ ప); 74 (౨౪); 75 (౨౬); 81 (౫౬ ప.)

ఇందలి యుక్తివృత్తము చంద్రవంశచరిత్ర మని గ్రంథ నామమును బట్టియే తెలియుచున్నది. దీనినుండి 5 శ్లోకములు మాత్రము కవికంఠాభరణమున నుదాహరింపఁబడినవి.

33. సమయమాతృక † : (ముద్రితము)— ఇందు 8 సర్గలును, 639 శ్లోకములును కలవు. ఇది క్షేమేంద్రుని గ్రంథరత్నములలో నొకటి. ఇం దీతఁడు తననాఁటి సంఘమును తీవ్రముగ విమర్శించుచు నీతి బోధ మొనర్చెను. నాఁటి సమాజజీవితమున కిది ప్రస్ఫుట ప్రతిబింబము. వేశ్యల, వ్యభిచారిణుల ప్రలోభవిధానములు, వారు పన్ను వివిధమాయోపాయములను కవి చక్కఁగా ప్రదర్శించి తీవ్రముగ విమర్శించెను. కాశ్మీర దేశాధీశ్వరుఁడగు జయాపీడ మహారాజుకాలమున సమాజ మెంత నీచస్థితియం దుండెనో దీనిని బట్టి విశద మగును.

1వ ప్రకరణమున కళావతి యను భవిష్యద్వ్యభిచారిణి ఒకానొక మంగలివానిచే కంకాళి యను ముసలి తార్పుడుగానికి పరిచయ మొనర్పఁబడెను. 2వ ప్రకరణమున కాశ్మీరమున, కంకాళీవిశృంఖల విహారములు మనోజ్ఞముగ చమత్కారముగ చిత్రింపఁబడెను. ఈమె ఒకనితరువాత నొకనిని ఇట్లెందఱనో పెండ్లియాడి యెన్నిసారులో వితంతువగును. ఈమె ఎన్నియో వృత్తుల నవలంబించి తుదకు కుట్టనీవృత్తి నవలంబించెను. 3వ ప్రకరణమున సాయంకాలమున వ్యభిచారభవనములందు జరుగువిచిత్రవివిధాంశములు వివరింపఁబడెను. 4వ ప్రకరణమున కంకాళి కళావతిని కలసికొని, ఎన్నియో వేశ్యల మాయావాగురలనుగూర్చి విశదీకరించెను. 5వ ప్రకరణమున 8 తరగతుల విటులు నిర్ధనులగు వ్యభిచారులను గెంటివేయుటకు పన్ను 23 మాయోపాయములను పేర్కొనఁబడెను. 6వ ప్రకరణమున వ్యభిచారగృహమున ఉదయమున జరుగు విశేషవిషయము లెంతయు చక్కఁగా నభివర్ణింపఁబడెను. 7—8వ ప్రకరణములయందు ఒకానొక వైశ్యపుత్రుని కుమారుని కళావతి తనవలలలో వేసికొని మోసగించుట వివరింపఁబడెను.

ఈగ్రంథమున పాంచాలధారామఠము, కృత్యాశ్రమ విహారములను గూర్చిన ప్రాచీనోల్లేఖనము కన్పట్టును, ప్రాచీనకాలమున జరుగులవణవ్యాపారము వర్ణింపఁబడెను. క్షేమేంద్రుని కళావిలాసము వలెనే ఇదియు సమాజవిచారకము, నీతిబోధకము నగు గ్రంథరత్నము.

34. సువృత్తతిలకము : పలుసారులు ముద్రితము— ఛందోగ్రంథములయం దిది మిక్కిలి వినోదజనకమగు కృతి. తక్కిన ఛందోగ్రంథరచయిత లెవ్వరును స్పృశింపని ఛందోవిషయముల నెన్నిటినో యిది విశదీకరించును. ఏవృత్తము ఎట్లు రచించిన మనోహరముగా నుండునో, ఎట్లు రచించిన శ్రుతికటువుగా నుండునో, ఏఘట్టమున నేవృత్తము రచించు టుచితమో, ఆయారసముల నొప్పించుట కేయేవృత్తము లుచితములో మొదలగు నంశము లనేకము లిట వివరింపఁబడెను.

ఈ గ్రంథము 3 విన్యాసములుగా విభజింపఁ బడెను.

I వృత్తావచయము (ఉచితవృత్తముల నెన్నుకొనుట.) ఇందు 38 కారికలు, 26 ఉదాహరణములును కలవు.

II గుణదోషదర్శనము : ఇందు 46 కారికలును, 47 ఉదాహరణములును కలవు.

† కావ్యమాల–10. (I ed. 1888; II ed. 1925); క్షే. ల. కా. సంగ్రహ. 349–416పు. (1961)

III వృత్తవినియోగము : సందర్భముల కుచితము లగు వృత్తముల నిర్ణయించుట. ఇందలి కారికలు 40. ఉదాహరణములు 16. ఈ లఘుగ్రంథమున,

ఈ క్రిందివృత్తములనుగూర్చి కవిచర్చించెను.

| | |
|---|---|
| ౧ అనుష్టుప్ | రథోద్ధతా |
| భుజంగశిశుభృత | ౧౫ శాలినీ |
| దోధక | శార్దూలవిక్రీడిత |
| ద్రుతవిలంబిత | శిఖరిణీ |
| ౫ హరిణీ | స్రగ్ధరా |
| ఇంద్రవజ్రా | స్వాగతా |
| కుమారలలిత | ౨౦ తనుమధ్యా |
| మందాక్రాంతా | తోటక |
| మాలినీ | ఉపజాతి |
| ౧౦ నర్కుటక | ఉపేంద్రవజ్రా |
| ప్రహర్షిణీ | విద్యున్మాలా |
| ప్రమాణీ | ౨౫ వంశస్థ |
| పృథ్వీ | వసంతతిలక |

సంస్కృతమున కొందఱు మహాకవులకు కొన్ని కొన్ని వృత్తములయందు ప్రత్యేకాభిమానము కలదనుచు ఈక్రిందికవులను వారి యభిమానవృత్తములను గ్రంథకర్త పేర్కొని యున్నాఁడు.

| | | | |
|---|---|---|---|
| 1 | అభినందుఁడు | : | అనుష్టుప్ |
| 2 | పాణిని | : | ఉపజాతి |
| 3 | భారవి | ; | వంశస్థ |
| 4 | రత్నాకర | : | వసంతతిలక |
| 5 | కాళిదాస | : | మందాక్రాంతా |
| 6 | రాజశేఖర | ; | శార్దూలవిక్రీడిత |
| 7 | భవభూతి | : | శిఖరిణీ |

సువృత్తతిలక † మొకవిధముగా ఔచిత్యవిచారచర్చకును, ఒకవిధముగా కవికంఠాభరణమునకును పరిశిష్టగ్రంథ మనఁదగును. దీనియందు తనశ్లోకములు (39) కాక 28 మంది యితరకవుల శ్లోకములు 51 ఉదాహరింపఁబడెను. క్షేమేంద్రునిపవనపంచాశిక యిట్టు దుర్లభింపఁబడిన ఒక్క శ్లోకమువల్లనే జీవించి యున్నది

85 సేవ్యసేవకోపదేశము * : 61 శ్లోకములుగల ఈలఘుకృతి ముద్రితము. ఇందు అధికారుల, సేవకుల విధులు, పరస్పరసంబంధములు వివరింపఁబడెను. క్షేమేంద్రుని స్వాతంత్ర్యప్రియత్వము నీలఘుగ్రంథము ప్రకటించుచున్నది. సేవకుల కుండుసంకటములను వారి ధౌర్త్యములను కవి చక్కఁగా వివరించెను. సేవకులకే కాక సేవ్యులకు నిందు చక్కని మందలింపు లున్నవి. నాఁటిసమాజమును సంస్కరించు పవిత్రోద్దేశముతోడనే కవి యిట్టి గ్రంథములను నిర్మించెను.

౭వ దళము.

క్షేమేంద్రుని హాస్యరచనా ప్రావీణ్యము నర్మాలాపకౌశలము.

ఆంగ్లమున 'యూమర్' (Humour) ఆంధ్రమున ఛలోక్తి, వ్యాజోక్తి, ఇత్యాది శబ్దములతో నించుమించు సమానము ఆంగ్లమున.

---

† కావ్యమాల–౭వ గుచ్ఛక (I ed. 1886; II ed 1932); Haridas Sanskrit Series–24. Banaras (1933) క్షేమేంద్ర, ల. కా. సంగ్రహ. 85–116 పు. (1936)

కావ్యమాల–Part II pp. 79–85. (I ed. 1886; II ed. 1932)–Bombay.
Published also in the Sanskrit Monthly–Sarada, Vol. II Nos. 10 & 11. (oct. Nov. 1916), pp. 386–89. Prayaga (=Allahabad.)

'విట్' (Wit) ఆంధ్రమున నర్మోపాలంభము అనఁబడును.

ఆంగ్లము నందలి పైరెండులక్షణములును షేక్స్పియర్ (Shakespeare: 1564-1616) కాలమునుండి నేఁటివఱకు ఆంగ్లరచయితలలో కొలఁదిమంది గ్రంథములయందే కన్పట్టును. జగద్గీత కీర్తి నందిన షేక్స్పియర్‌నాటకములయందీహాస్య చమత్కారము సమృద్ధిగా కన్పట్టును. మహాకవి మహా విద్వాంసుఁడు నగుమిల్టన్ (Milton: 1608-1674) షేక్స్పియర్‌తో సమానుఁడే; కాని, ఆయనరచనల యందు హాస్యవిశేషము లోపించుటచే విమర్శకు లాయనకు రెండవస్థానము నిచ్చెదరు. సంస్కృత కవికోవిదుఁ డైనభవభూతి చిత్తవృత్తివలెనే 'మిల్టన్' చిత్తవృత్తియు హాస్యవిముఖము, ఉదాత్తమును, భవభూతినాటకములయం దెందును హాస్యప్రవణుఁ డైనవిదూషకుఁడు లేనే లేఁడు. ఇన్‌గెర్‌సాల్ (Ingersoll) అను ప్రఖ్యాతుఁ డగు ఆమెరికారచయిత 'యూమర్, విట్' అనురెండుపదములస్వరూపమును చక్కఁగా నిట్లుదాహరించెను. "గులాబిపువ్వు నందలి పరిమళముతో నున్నపైభాగము 'యూమర్' వంటిది. దానిక్రింద నున్నముళ్ళవంటిది 'విట్'." అనఁగా హాస్యగర్భ మైనవాక్యము నొకనిపై ప్రయోగించిన, దానికి గుఱి యైనవ్యక్తియు ఆవాక్యమును విని, యానందించును కాని, ఒకనిపై నర్మగర్భవాక్య మును ప్రయోగించినచో అతని నది హృదయశల్యము వలె బాధించును. క్షేమేంద్రుఁడు తననాఁటిసమాజము నందును, రాజ్యతంత్రనిర్వాహకులందును ప్రచుర ముగా నున్నవ్యసనములు, ధనలోభము, అవినీతి మొద లగునెన్నియో లోపములను కన్నులార కాంచి, వీనిని నిర్మూలించి, రాజ్యతంత్రమును, సమాజమును సంస్కరించుటకై, ప్రశస్తగ్రంథములను, కొన్ని హాస్య ప్రచురముగా, నర్మోపాలంభనిర్భరముగా రచించెను. ఇట్లు రచింపఁబడినగ్రంథములే కళావిలాసము, దర్పదళనము, దేశోపదేశము, నర్మమాల, సమయ మాతృక అనునవి.

వీని నుండి రెండుమూఁ డుదాహరణములు: (1) కళావిలాసము IX 9 కేశవృద్ధికై మందుల నమ్మువాఁడు తనశిరస్సు రాగిచెంబువలె నున్నగా నుండఁగా తనచేతనున్న మందులు శిరోజవృద్ధికై దివ్యౌషధము లని ప్రచారము చేయుచు ఈవ్యాపా రమువలన క్రమముగా బాగుపడును. కాని, బట్ట తలకై ఈమందును కొనినవా రెవ్వరును అతని శిరస్సుపై శిరోజము లేల లేవని అడుగనే యడుగరు. (2) కళావిలాసము IX 6. జ్యోతిషశాస్త్రవేత్త యొకఁడు నిశితముగా గణన మొనర్చి, విశాఖానిశా పతులసమాగమ మెప్పుడో సరియైనకాలమును నిర్ణ యించి చెప్పఁ గలఁడు. కాని, తన గృహావరణము నందే, వెనుకభాగమున వివిధవిటులతో తనభార్య విహరించు చుండుట, పాపము అమహనీయునకు తెలియనే తెలియదు. (3) దేశోపదేశములు VII 25. వృద్ధుఁ డొకఁడు వజ్రాయుధము వంటి వాజీ కరణౌషధములను విశేషముగా సేవించి, యొక తరుణీమణిని వివాహ మాడెను. ఆమెయందు కన్ను వేసినయువకులలో నొకనిధర్మమా యని ఆమె యంతర్వత్ని ఆయెను.[1] వృద్ధుఁ డైనభర్త తనవాజీకర ణౌషధప్రభావముననే ఈఫలము కల్గిన దని ఆనం దించుచుండెను. ఆదంపతులకు ఆప్తమిత్రులు, ఇరుగుపొరుగువారును పుత్రోత్సవమునకు ఆహ్వా నింపఁబడిరి. ఉత్సవమునకు వచ్చిన మహిళా మణులు వృద్ధుఁ డైనభర్తయొక్క శక్తిసామర్థ్యములను నర్మగర్భముగా, ముసిముసినవ్వులతో, గేయరూప ముగా నిట్లు ప్రశంసించిరి.

---

1. 'గర్భిణీ పరబీజేన, వృద్ధ స్యోత్సవకారిణః, దదా త్యను జ్ఞాం సతతం పాదసంవాహనే వధూః'. (దేశోప ౭-౨౩)

"Withered and leafless tree doth yield
Unexpected fruit in the field"[2] —
Desopadesa (VII-25)

(ఆకులు రాలిపోయి, జీర్ణించినఅవకేశి తలఁ పనితలంపుగా ఫలించెను.)

## రాజ్యతంత్రము, సమాజపరిస్థితులపై క్షేమేంద్రుని నర్మాలాపము.

## (Ksemendra as a Political and Social satirist.)

క్షేమేంద్రునికాలమునందు కాశ్మీరదేశమున సమాజమును, రాజ్యతంత్రమును వ్యసనప్రచురమై, అవినీతిపూర్ణమై దోషదూషితమై, కలుషముగా నుండెను. వీనిని బాగుపఱచుటకై క్షేమేంద్రుఁడు కళావిలాసాదిగ్రంథముల నెన్నిటినో వక్రోక్తులతో, వ్యాజోక్తులతో, ఛలోక్తులతో, నర్మోపాలంభములతో, అన్యాపదేశములతో, అప్రస్తుతప్రశంసలతో. విపరీత లక్షణములతో (శ్లోకరూపమున) నిర్మించెను. ఇట్టి రచనలను అంగ్లమున "శటైర్" (Satire) అందురు. వీనిని రచించుట యందలిపరమోద్దేశము సమాజము నందలిలోపముల నెత్తి చూపి, దోషములను, లోపములను తొలఁగించుటయే. ఇట్టి నర్మగర్భరచనముల నిర్మించినవారిలో క్షేమేంద్రునకు పూర్వము ప్రఖ్యాత సంస్కృతకవు లిరువురు కలరు. కలుషిత మైనసమాజమును, అవినీతిభూయిష్ఠ మైనరాజకీయతంత్రమును సంస్కరించుటయే ఆయాగ్రంథకర్తల పవిత్రమైన పరమోద్దేశము.

ఆచార్యదండి (635-700) దశకుమార చరిత్రమున ముఖ్యముగా అష్టమప్రకరణమున విశ్రుత చరిత్రమున అతిప్రాచీనకాలమున రచింపఁబడిన కామందకీయాది రాజనీతిగ్రంథములనే గ్రుడ్డిగా ననుసరించుచు, తమకాలము ననుసరించియైనను వలయుమార్పులను జేయక రాజకీయయంత్రమును నడుపుమంత్రివర్గమును ప్రభువులకు దుష్టోపదేశములు చేయువారిని తీవ్రముగా నర్మగర్భముగా ఖండించెను.

దండితరువాత యశస్తిలకచంపువును, నీతివాక్యామృతమును రచించి, సోమదేవసూరి (క్రీ. 951- ) నర్మాలాపశస్త్రముతో మిక్కిలినేర్పుతో సమాజశరీరమునకు శస్త్రచికిత్స చేసెను.

వీనిలో 'యశస్తిలకచంపువు' నందు మహారాజులమంత్రివర్గము నందుఁగలయవినీతిని, లోటుపాటుల నుద్ఘాటించుచు సుదీర్ఘము లగువిమర్శనలు కలవు. సంస్కృతపద్యవాఙ్మయమున రాజ్యతంత్రముపై విపులము, నిశితము నగుమొదటివిమర్శన మిదియే. ఈగ్రంథము 959 క్రీ.న రచింపఁ బడెను. రాజ్యతంత్రవిమర్శనమును, సమాజలోపోద్ఘాటమును చేసి, ఈరెంటిని సంస్కరించు పవిత్రోద్దేశము కల సోమదేవసూరి తదనంతరకాలము నందలిక్షేమేంద్రునకు మార్గదర్శి యనఁ దగును.

కళావిలాస, దర్పదళన, దేశోపదేశ, నర్మమాలా, సమయమాతృకలు సోమదేవసూరిమార్గము ననుసరించియే క్షేమేంద్రుఁడు సుతీక్ష్ణముగా రాజకీయయంత్రమును, సమాజమును విమర్శించెను. ఈగ్రంథముల రచించుటలో కవి పరమోద్దేశము రాజకీయయంత్రమును, సమాజమును సంస్కరించుటయే కాని కేవలము లోకులకు వినోదము కలిగించుటకు మాత్రము కాదు. కవియే ఈవిషయమును పలుసారులు గ్రంథములందు వక్కాణించి యున్నాఁడు.

"హాసేన లజ్జితోఽత్యంతం, న దోషేషు ప్రవర్తతే
జన స్తదుపకారాయ మమాయం స్వయముద్యమః"
దేశోపదేశము ౧, ౭.

2. 'ఘుణజగ్ధస్య దగ్ధస్య తరో ర్జాతోఽయ మంకురః, ఇది బ్రువాణా వృద్ధస్య ప్రసృత్య స్ముత్సవే స్త్రియః'. ౭-౨౫

లోకులను అవినీతికరము లగు వృత్తులనుండియు సమాజమున కపకార మొనరించు వర్తనములనుండియు, నికృష్టములు, అకీర్తికరములునగు నాచారములనుండియు తొలఁగించుటయే తన పవిత్రోద్దేశము కావున, ఆయా గ్రంథములయందుఁగల దోషైక దృష్టిని వాక్పారుష్యమును క్షంతవ్యములని, ఎడనెడ దేశోపదేశాది గ్రంథములలో కవి విన్నవించుకొనియే యున్నాఁడు. ఉద్రేకపూరితమును, ఉష్ణరక్తనిర్భరమును అగు యువజనమునకు నీతిబోధ, హితోపదేశము చేయుటకు నర్మగర్భము లగు నుపాలంభములకంటె చమత్కారకారి యగు హాస్యరచనయే ప్రయోజనకారి యగు నని కవికి తెలియకపోలేదు. కాని, తీవ్రమైన రోగములకు తీక్ష్ణములైన చికిత్సలే ఫలవంతము లగు నని కవిహృదయము. నాఁడు కాశ్మీరసమాజము మిక్కిలి జఘన్యస్థితిలో నుండ,దానినెట్లయినను సంస్కరించుట తనవంటివారికి విధి యని యాతఁడు భావించెను. సమాజశరీరమున ఏయంగము రోగపీడితమో బాగుగా పరిశీలించి, గుర్తించి, కవి దానికి తగినచికిత్స యొనర్చెను.

ప్రఖ్యాతాంగ్లేయగ్రంథరచయిత యగు ఎడిసన్ (Addison)–(1672 to 1719 A. D.) స్వదేశమునందలి మానవులను, వారి యాచారములను, వృత్తులయందలి దోషములను లోపములను సంస్కరించుటకు నునిశిత మగు అవహేళనశస్త్రమునే ఉపయోగించెను. ఆంగ్లదేశమున ప్రఖ్యాతులగు స్టీల్ (Picherd Steel 1672–1729), స్విఫ్ట్ (Jonathan Swift–1667–1745), లాంబ్ (Cherles Lamb–1775–1834), షెరిడన్ (Richard B. Sheridn–1751–1869. స్వదేశమునందలి సమకాలికసమాజమును సంస్కరించు పవిత్రహృదయముతో తీవ్రమగు అవహేళనశస్త్రము వంటి తమరచనలను సాగించిరి.

గృధ్రమువలె సూక్ష్మదృష్టియు, దూరదర్శనమునుగల క్షేమేంద్రుఁడు తనరచనముల మూలమున నాఁటి సమాజదోషముల నుద్ఘాటించి, సంస్కరింప యత్నించెను. ఇతఁడు కేవలము సమాజద్వేషియు, దోషైకదృష్టియు కాఁడు. ఈతని అవహేళనము, విమర్శయు కేవలఖండనాత్మకములు కావు. సమాజమునఁగల దంభము, లోకప్రతారణము, కూటవృత్తి మొదలగు వాని నీతఁడు బాగుగా గుర్తించి, తనరచనలయందు వీని నుద్ఘోషించి పరిహసించును. ఆంగ్ల కవి యగు "ఎడిసన్" వలెనే ఈతఁడును తన యవహేళనశస్త్రమును సమాజమునకు దెబ్బ తగులకుండ ప్రయోగించును. ఈతని విమర్శాయుధము కేవలము ధ్వంసాత్మకము కాదు. ఒకవర్గమునందు కాని, జాతియందు కాని దోషములనే యెత్తిచూపుట యీతని యుద్దేశముకాదు. ఔచిత్య విచారచర్చయందు తాను జూపిన దోషములకు సరియైన సవరణలను సూచించినట్లే సమాజవిషయమునను సంస్కరణ విధానములను సూచించెను. ఈవిషయమున నీతనికిని "ఎడిసన్" పండితునికిని భేదము కనఁబడదు. "ఎడిసన్" పండితుఁడు సమాజమునందలి దోషములను, వ్యసనములను తన రచనములద్వారమున లోకులకు ప్రకటించి, అంతమాత్రముచే తన విధికృత్యము ముగిసినదని యెంచును. కాని సంస్కరణవిధానములను సూచింపనే సూచింపఁడు.

విఖ్యాతాంగ్లరచయిత యగు "స్విఫ్ట్" పండితుఁడు (1667–1745) సహజముగ సమాజద్వేషి. సమాజము నందలి లోకుల మనఃప్రవృత్తిని, అవగుణములనే కాక గుణములను కూడ నిర్దాక్షిణ్యముగ విమర్శించి ద్వేషభావముతో పరుషముగా ఎత్తిపొడుచును. ఈతనిరచనలకును క్షేమేంద్రుని రచనలకును సామ్యమే లేదు. చమత్కారపూరితమగు హాస్యరచనయందు "లాంబ్" కవి (1775-1834) కూడ అవహేళనశస్త్రమును చేపట్టెను. కాని యిది యాతని హాస్యవిధానమునకు చేటికవంటిది. పైని పేర్కొనిన

పాశ్చాత్యరచయితల గ్రంథరచనావధి పరిమితము. క్షేమేంద్రుని రచనాపరిధి సువిస్తృతము. ఏమన మన దేశమునందలి సమాజము పాశ్చాత్యసమాజములవలె కాక, సంకీర్ణము. మన సమాజములందు విశిష్టమయిన మతదృష్టి, గాఢమయిన వర్ణాశ్రమపద్ధతియు పాశ్చాత్య సమాజమున మృగ్యములు. మన సమాజము నందలి దోషములను లోపములను సంస్కరించుటకై చేయఁబడిన హితోపదేశములను క్షేమేంద్రుని చారుచర్య చతుర్వర్గ సంగ్రహము, కళావిలాసము, సేవ్యసేవకోపదేశములందు విలోకింపఁదగును. ఆంగ్లదేశమున విఖ్యాతమహిళారచయిత యగు మాంటేగ్ విదుషీమణి (Lady Mary Mortley Montague 1689-1762 A. D.) అవహేళనాస్త్రము నిట్లు చక్కఁగా నిరూపించెను.

"Satire Should, like a Polished razor keen,
Wound with a touch that's scarcely felt or seen".

(వాడియగు క్షురికవలె, అవహేళనాయుధము గుర్తింపఁబడకుండనే పనిచేయవలెను.

పై లక్షణము క్షేమేంద్రుని అవహేళనశస్త్రమున కంతగా అన్వయింపదు. క్షేమేంద్రుఁడు నిశిత విమర్శశస్త్రమును చేపట్టినను లోకహితైషి. స్వర్ణమునందలి మాలిన్యమును తొలఁగించుటకై అగ్నిస్పర్శ చేసి, నిర్మలసువర్ణమును గ్రహించునట్లు సమాజమును దోషరహిత మొనర్చి ఉత్కృష్టముగాఁ జేయవలెననియే యీతనిహృదయము ఈయన సమాజమును సర్వంకషముగా నిశితదృష్టితో పరిశీలించి, దానిని హాసజనక చిత్రముగ వర్ణించి, కన్నులకు కట్టినట్లుచేయును. స్వదేశమునందలి సర్వవర్గములవారితోడను గాఢపరిచయముండుటచే క్షేమేంద్రుని సామాజికజ్ఞానము సువిస్తృతము.

౮వ దళము

## క్షేమేంద్రుని మతము

కాశ్మీరదేశాధీశ్వరుఁ డగు జయాపీడుని అమాత్యులలో నొకఁడు నరేంద్రుఁడు ఈతని వంశమున భోగీంద్రుఁ డను నాయన యవతరించెను. ఈయన తనయుఁడు సింధువు. పౌత్త్రుఁడు ప్రకాశేంద్రుఁడు. ప్రకాశేంద్రుని పుత్త్రరత్నమే క్షేమేంద్రుఁడు. ఈయన కుమారుఁడు సోమేంద్రుఁడు. ప్రకాశేంద్రుఁ డఖండైశ్వర్యసంపన్నుఁడే కాక చేతికి ఎముకలేని వితరణశాలి. బ్రాహ్మణపోషణ నిరతుఁడగు నీయనభవనమున వేలకొలఁది బ్రాహ్మణులకు అవిచ్ఛిన్నముగా సమారాధనము జరుగుచుండెడి దఁట. ఈయన యనేక శివలింగములను ప్రతిష్ఠించి, ఆలయములను నిర్మించెను. మఠముల ననేకముల నిర్మించెను. దేవ–బ్రాహ్మణ–మఠనిర్మాణముల కీమహాభాగుఁడు మూఁడు లక్షలద్రవ్యమును వెచ్చించెను మొత్తమీయన దానకార్యములకై వినియోగించిన ధనము 25 లక్షలఁట. పరమమాహేశ్వరుఁ డగు నీమహనీయుఁడు స్వయంభూదేవాలయమున నొకనాఁడు ప్రసరద్బాష్పనిర్భరుడై అత్యంత శ్రద్ధాభక్తులతో శివపూజచేసి, శివలింగము నాలింగనము చేసికొని ప్రాణముల విడిచెనఁట. మహామాహేశ్వరుఁడగు ప్రకాశేంద్రుని అనూచానశైవసంప్రదాయమునఁ బుట్టి పెరిగిన క్షేమేంద్రుఁడును మొదట శైవసంప్రదాయము ననుసరించినవాఁడే. దీనికి తోడు ప్రత్యభిజ్ఞా శైవసంప్రదాయ ప్రవర్తకుఁడగు అభినవగుప్తుని అంతేవాసిత్వమువలన క్షేమేంద్రుఁడు శైవసంప్రదాయ విషయమున అత్యంత శ్రద్ధాళువుగానుండెను. శైవసంప్రదాయమున అవతరించి మహోద్దండ శైవసంప్రదాయవేత్త యగు అభినవగుప్తుని శిష్యుఁడయ్యు పిమ్మట పరమవైష్ణవుఁడును, భాగవత సంప్రదాయవేత్తయు అగు సోమపాదాచార్యుల శిష్యత్వప్రభావమున క్షేమేం

ద్రుఁడు పరమవైష్ణవుఁడుగా మారిపోయెను. అంతియే కాదు, దేశోపదేశమునను, నర్మమాలయందును క్షేమేంద్రుఁడు శైవసిద్ధాంతముల పరిహాస మొనర్చెను. దశావతారచరితమును ఈయన పరమవైష్ణవప్రపత్తితో నిర్మించెను. ఈయన గ్రంథములలో నిది చిట్టచివరిరచన యగుటచే మనకవి జీవితాంతమువఱకును వైష్ణవసంప్రదాయమున నేవర్తిల్లెననఁ దగును. శైవసిద్ధాంతమును నిరసించినను బౌద్ధమతప్రవర్తకులగు విద్వాంసుల ప్రభావమున బౌద్ధవాఙ్మయమున ఈయనకూలంకష వ్యాసంగ మొనర్చెను. బౌద్ధమతవాఙ్మయముల ప్రభావము క్షేమేంద్రుని తుదిరచనలయందు విశేషముగా కన్పట్టును. దీనికి ప్రస్ఫుటోదాహరణము అవదాన కల్పలతారచనము. ఈయన బౌద్ధమతానుయాయి కాలేదు కాని ఆసంప్రదాయమునెడల ఈయన కఖండవిశ్వాసము. గౌతమబుద్ధుని మహావిష్ణువు నవతారములలో నొకటిగా ఈయన దశావతారచరిత్రమున అభివర్ణించెను. బుద్ధుఁడు విష్ణువుని అవతారములలో నొకఁడుగా చిరకాలమునుండియు భారతీయులలో భావింపఁబడుచుండినను దీనిని మొట్టమొదట గ్రంథస్థముచేసిన కవి క్షేమేంద్రుఁడే.

అవైదికమగు బౌద్ధసంప్రదాయమున క్షేమేంద్రునకు విశేషాదరమున్నను, జీవితాంతము వఱకును ఈయన వైదికమతానుయాయియే. చారుచర్యయందు క్షేమేంద్రుఁడు శ్రుతి, స్మృతిమూలకమగు వైదికమతమే పరమోపాదేయ మనియు, మహావిష్ణువే జీవితాంతము కుపాస్యుఁడైవ మనియు ప్రతిపాదించియున్నాడు.

## ౯వ దళము.

### క్షేమేంద్రుని గురుశిష్యపోషకమండలి, మిత్రబృందము.

**1. గురుచరణులు :**

**1. అభినవగుప్తపాదులు:—** క్షేమేంద్రుఁడు తాను సర్వమనీషిశిష్యుఁడ నని ఔచిత్యవిచారచర్చయందు వక్కాణించి యున్నను, తన గురువులలో ముగ్గురునలుగురను మాత్రము పేర్కొని యుండెను. వీరిలో ప్రథముఁడు, బోధవారిధియు, విద్యావివృత్తి మొద లగునుదాత్తము లగుబహుగ్రంథముల నిర్మించిన అభినవగుప్తపాదాచార్యులు. ఈయన చరణోపాంతమున సాహిత్యమునందే కాక ప్రత్యభిజ్ఞా శైవసంప్రదాయమునను మనకవి కఠోరవ్యాసంగ మొనర్చెను.

**2.** గంగకోపాధ్యాయుఁడు:— ఈయన పండిత మూర్ధన్యుఁడే కాక, సంస్కృతమున కవి యనియు తెలియు చున్నది. ఈయనశ్లోక మొకటి ఔచిత్య విచారమున ఆశీర్వచనౌచిత్యమున కుదాహరింపఁబడెను.

3. సోమపాదాచార్యులు:— పరమభాగవతోత్తముఁ డగునీమహనీయుని చరణసేవాభాగ్యము లభించిననాఁటి నుండియు క్షేమేంద్రుఁడు శైవమత విముఖుఁడై వైష్ణవమతమున విశేషశ్రద్ధాభక్తులతో ప్రవర్తించెను. ఈవిషయము మీక్రింది "యాకరము" వలన విశద మగును.

'శ్రీమద్భాగవతాచార్యసోమపాదాబ్జరేణుభిః,
ధన్యతాం యః పరం యాతః నారాయణపరాయణః'
బృహత్కథామంజరి 38

4. సర్వజ్ఞదేవధరపండితుఁడు : బృహత్కథామంజరియందే కవి దేవధరు నిట్లు పేర్కొనెను.

'స శ్రీదేవధరాఖ్యస్య ద్విజరాజ్యపదస్థితేః,
సర్వజ్ఞ స్యాజ్ఞయా చక్రే కథా మేతాం వినోదినీమ్'
(బృ. క. మంజరి-ఉపసంహారము-41.)

దేవధరుని యాజ్ఞవల్లనే బృహత్కథామంజరిని క్షేమేంద్రుఁడు నిర్మించెను. ఈయన సర్వజ్ఞబిరుదాలంకృతుఁ డగుటచే మహావిద్వాంసుఁడని భావింపఁదగును. బహుశః, ఈయన క్షేమేంద్రుని గురువులలో నొక్కఁడు కానోపును.

II శిష్యులు :

1. కాశ్మీరదేశాధీశుఁ డగు రత్నసింహభూపతి తనయుఁ డగు భట్టోదయసింహుఁడు క్షేమేంద్రుని శిష్యపుంగవులలో నొకఁడు. ఈయనకొఱకే తాను ఔచిత్యవిచారమును రచించినట్లు కవి ఉపసంహార శ్లోకములలో నొకదానియందు నుడివియున్నాఁడు. ఈయనపద్యములు రెండు కవికంఠాభరణమున క్షేమేంద్రుఁ డుల్లేఖించుకొనుచు "మచ్ఛిష్య-మహాశ్రీ-భట్టోదయసింహస్య - లలితాభిధానే మహాకావ్యే" అనియు, "అస్యైవ భక్తిభవనామ్ని మహాకావ్యే" అనియు పేర్కొనియున్నాఁడు. దీనినిబట్టి "మహాశ్రీ" అను ఉపపదమువల్ల ఉదయసింహుఁడు సింహపీఠిక నలంకరించినకాలముననే కవికంఠాభరణమున తన్నిర్మితశ్లోకములు రెండు ఉదాహృతము లనియు, లలితమహాకావ్యము భక్తిభవ మహాకావ్యమును ఈయనరచన లనియు తెలియుచున్నది.

2. రాజపుత్త్రలక్ష్మణాదిత్యుఁడు:- క్షేమేంద్రుని శిష్యులలో నొకఁ డగునీతనిగుఱించి విశేషములు తెలియుట లేదు. కాని తన్నిర్మితశ్లోక మొకటి "వివేకపరిచయో యథా మచ్ఛిష్య - రాజపుత్త్ర - లక్ష్మణాదిత్యస్య" అని క్షేమేంద్రునిచే కవికంఠాభరణమున నుదాహరింపఁ బడెను.

III రాజపోషకులు :

"లిఖనం వస్తుని యేన సూక్ష్మసుభగం తత్త్వం గిరాకృష్యతే."

వస్తువునందు, దారువహ్నివలె. సామాన్యులకు దుర్నిరీక్ష్యమగు సూక్ష్మమగు సౌందర్యమును తన ప్రతిభావిశేషముచే గుర్తించి, అట్లు గుర్తించిన దానిని తన వాక్చతురతచే కవి చిత్రించి వంద్యుఁ డగుచున్నాఁడు.

౧౦వ వళము.

క్షేమేంద్రుఁడు - తన్నామగంధులు.

క్షేమేంద్రుఁడు, తన్నామగంధము గల యితర సంస్కృత రచయితలు.

1. యదుశర్మ తనయుఁడు, హస్తిజనప్రకాశ కర్తయు నగు క్షేమేంద్రుఁడు.

2. కాశ్మీరవాసియు, అభినవగుప్తుని శిష్యుఁడును, మనక్షేమేంద్రుని సబ్రహ్మచారియు నగు క్షేమరాజు. నాఁటికాశ్మీరమునందలి మహావిద్వాంసులలో నొకఁ డగుఈయన శివసూత్రములకును, తన గురు వగుఅభినవగుప్తుని పరమార్థసారమునకును ప్రశస్తవ్యాఖ్యలు నిర్మించుటయే కాక, ఇంకను కాశ్మీరమున ప్రచలిత మగుప్రత్యభిజ్ఞా[illegible]కము లగు ననేకగ్రంథముల రచించెను. క్షేమేంద్రుఁడు రమారమి తనగ్రంథములన్నిటియందును 'వ్యాసదాస' బిరుదమును స్వనామాంకితముగా ప్రయోగించుకొనెను. క్షేమరాజు తనగ్రంథములయందు రాజానకపదమును "క్షేమరాజ" శబ్దముతో వాడుకొనెను. ఈయన వరాహగుప్తునిపౌత్రుఁడు క్షేమేంద్రుఁడు నిమ్నాశయుని పౌత్రుఁడు.

3. క్రీ 1901 లో జర్మనీదేశమున 'లీప్జిగ్' (Leip-Zig) నగరమున ప్రకటింపఁబడిన "ఏకశృంగ" మను గ్రంథమును రచించినక్షేమేంద్రుఁడు వ్యాసదాసునికంటె నితఁడు భిన్నుఁడా యను నది విమర్శనీయము.

4. స్పందసందోహకర్త యగుక్షేమేంద్రుఁడు.

5. సాంబపంచాశిక రచయిత క్షేమరాజు.

6. చండకౌశిక మనునాటకమును నిర్మించిన ఆర్యక్షేమీశ్వరుఁడు.

పరిశిష్టము – 2.

బృహత్కథామంజరినుండి ఉపసంహారలంబకమునందలిశ్లోకములు :—

1 'కాశ్మీరకో గుణాధారప్రకాశేంద్రాభిధోఽ భవత్,
నానార్థిజనసంకల్పపూరణే కల్పపాదపః. ౬

2 యస్య మేరో రివోదారకల్యాణాపూర్ణసంపదః,
అగణేయ మభూద్ గేహే యస్య భోజ్యం ద్విజన్మనామ్. ౭

3 సూర్యగ్రహే త్రిభిర్లక్షైర్ దత్వా కృష్ణాజినత్రయమ్
అల్పప్రదోఽస్మీ త్యభవత్ స లజ్జానతకంధరః. ౮

4 స్వయంభూనిలయే శ్రీమాన్ యః ప్రతిష్ఠాప్య దేవతాః.
దత్వా కోటిచతుర్భాగం దేవద్విజసురాదిషు. ౯

5 పూజయిత్వా స్వయం శంభుం,
ప్రాసదద్బాష్పనిర్భరః,
గాఢం దోర్భ్యాం సమాలింగ్య,
య స్తత్రైవ వ్యపద్యత. ౧౦

6 క్షేమేంద్రనామా తనయ స్తస్య విద్వత్సు విశ్రుతః,
ప్రఖ్యాతః కవిగోష్ఠీషు నామగ్రహణ యోగ్యతామ్. ౧౧

7 శ్రుత్వాభినవగుప్తాఖ్యాత్ సాహిత్యం బోధవారిధేః
ఆచార్యశేఖరమణేః విద్యావివృతికారిణః. ౧౨

8 శ్రీమద్భాగవతాచార్యసోమపాదాబ్జరేణుభిః,
ధన్యతాం యః పరం యాతః నారాయణపరాయణః. ౧౩

9 కదాచి దేవ విప్రేణ స ద్వాదశ్యామ్ ఉపోషితః
ప్రార్థితో రామయశసా సరసః స్వచ్ఛచేతసా ౧౪

10 కథామేతామ్ అనుధ్యాయన్ దినేషు విపులేక్షణః,
వివధే విబుధానందసుధాస్యందతరంగిణీమ్. ౧౫

11 స శ్రీదేవధరాఖ్యస్య ద్విజరాజ్యపదస్థితః,
సర్వజ్ఞ స్యాజ్ఞయా చక్రే కథా మేతాం వినోదనీమ్. ౧౬

"ఇతి శ్రీవ్యాసదాసాపరాఖ్య—క్షేమేంద్రకృతాయాం బృహత్కథామంజర్యాం స్వచరితమ్."

పరిశిష్టము – 3.

భారతమంజరినుండి ఉపసంహారకుసుమాంజలి:—

1 'కాశ్మీరకో గుణాధారః ప్రకాశేంద్రాభిధోఽ భవత్,
నానార్థిసార్థసంకల్పపూరణే కల్పపాదపః. ౧౭

2 సంపూర్ణదానసంతుష్టాః ప్రాహు స్తం బ్రాహ్మణాః సదా,
ఇంద్ర ఏ వాసి కిం త్వేకః ప్రకాశస్తే గుణోఽధికః. ౧౮

3 కదాచిద్ బ్రాహ్మణే నైష్య స రామయశసార్థితః,
సంక్షిప్తాం భారతకథాం కురు ష్వే త్యార్యచేతసా. ౧౯

4 స తమూచే కరోమ్యేవ ప్రాగేవ చ్చరితం మమ,
హృష్టః సత్యవతీసూనుః స్వప్నే జ్ఞాననిధిర్ దదౌ. ౨౦

5 తం నమస్కృత్య, వరదం సృష్టోఽహం త్వత్కృతేమిహితే,
ఇత్యుక్త్వా స్వప్నదృష్టస్య మునే స్తుష్టావ తద్వపుః. ౨౧

ఇతి శ్రీ వ్యాసదాసాపరాఖ్య—క్షేమేంద్రవిరచిత భారతమంజరీసముద్భృతం స్వకీయచరితమ్.

పరిశిష్టము – 4.

రామాయణమంజరినుండి ఉపసంహారపద్యపుష్పాంజలిః—

1 'కాశ్మీరేషు బభూవ కశ్చిదసమ ... చంద్ర ఇవాపరః,
ప్రకాశేంద్రః స్థిరా యస్య పృథివ్యాం
కీర్తికౌముదీ. ౨౨

2 సదా దయార్ద్రహస్తేన మహతా భద్రమూర్తినా,
సాధుకుంజరితా యేన, ప్రాప్తా కీర్తిపతాకినా. ౨౩

3 విద్వజ్జనసపర్యాప్తపర్యాప్తస్వజనోత్సవః,
కథాసారసుధాసారం క్షేమేంద్ర స్తనయో
వ్యధాత్. ౨౪

4 ముక్తాత్మనా రణత్తారహారినూపుర మేఖలా,
విలాసలాసికా యస్య వదనం యాతి భారతీ. ౨౫

5 లోభాభిమాననులినాని దనాని నిశ్శ
కాంతాకటాక్ష ...
జ్ఞాత్వేతి చంద్రదళాని యశాంసి యేన
కావ్యైః స్థిరాణి భువనేషు నివేశితాని ౨౬

6 ఆమోదయంతి సరసా న్యతికోమలాని
శ్రీ ... రామయశసా పరిభావితాని,
యేనానిశం ప్రణయభూషణతాం జనస్య
నీతాని కావ్యకుసుమా న్యసితాని తాని. ౨౭

7 గుణాగుణితయా భాంతి యేషు వ స్తేషు విస్మయః
నిర్గుణేషు గుణా నేవ యే వదంతి జయంతి తే. ౨౮

ఇతి శ్రీ వ్యాసదాసాపరాఖ్య – క్షేమేంద్రవిరచిత రామాయణమంజరీసముద్ధృతమ్ ఆత్మోదంతమ్.

పరిశిష్టము — 5.

ఔచిత్యవిచారచర్చనుండి ఉపసంహారపద్య పుష్పాంజలి:—

1 ఆసీత్ ప్రకాశేంద్ర ఇతి ప్రకాశః
కాశ్మీరదేశే త్రిదశేశ్వరశ్రీః
అభూద్ గృహే యస్య పవిత్రపాత్ర
మచ్ఛిన్న మగ్రాసన మగ్రజానామ్. ౨౯

2 యః శ్రీస్వయంభూభవనే విచిత్రే,
లేప్యప్రతిష్ఠాపితమాతృచక్రః
గోభూమికృష్ణాజినవేశ్మదాతా,
తత్రైవ కాలే తను ముత్ససర్జ. ౩౦

3 తస్యాత్మజః సర్వమనీషిశిష్యః,
శ్రీవ్యాసదాసాపరపుణ్యనామా
క్షేమేంద్ర ఇత్యక్షయకావ్యకీర్తి శ్చక్రే,
నవౌచిత్యవిచారచర్చామ్. ౩౧

4 శ్రీరత్నసింహే సుహృది ప్రయాతే
శార్వం పురం శ్రీవిజయేశరాజ్ఞి
తదాత్మజ స్యోదయసింహనామ్నః,
కృతే కృత స్తేన గిరాం విచారః. ౩౨

5 యస్యాసీః పరివారకృత్ త్రిభువన
ప్రఖ్యాతశీలశ్రుతేః
సర్వస్యావనతేన యేన నితరాం ప్రాప్తా
విశేషోన్నతిః,
ఆశాః శీతలతాం నయ త్యవిరతం య...
స్వప్రాపాల
స్తస్య శ్రీమదనంతరాజనృపతేః కాలే క
లాయం కృతః. ౩౩

ఇతి శ్రీప్రకాశేంద్రాత్మజ – వ్యాసదాసాపరాఖ్య శ్రీ క్షేమేంద్రకృతా ఔచిత్యవిచారచర్చా సమాప్తా.

పరిశిష్టము — 6.

కవికంఠాభరణమునుండి:—

1 'ఇత్యుక్తా రుచిరోచితా పరిచయప్రాప్తి
ర్విభాగైర్గిరాం
దిఙ్మాత్రేణ విచిత్రవస్తురచనామైత్రీపవిత్రీకృతా,
యద్య స్త్యత్ర నవోపదేశవిషయే లేశో
ప్యపాదేయతా
తత్ సద్భి ర్గుణకౌతుకా దపసరః శిష్యేషు
సమాధీయతామ్. ౩౪

 

2. కృత్వా నిశ్చలదైవపౌరుషమయోపాయం
ప్రసూత్యై గిరాం
క్షేమేంద్రేణ యదర్జితం శుభఫలం తే నాస్తు
కావ్యార్థినామ్,
నిర్విఘ్నప్రతిభాప్రభావసుభగా వాణీ
ప్రమాణీకృతా
సద్భి ర్వాగ్భవమంత్రపూతవితతశ్రోత్రామృత
స్యందినీ. ౩౫

ఇతి శ్రీ వ్యాసదాసాపరాఖ్య — క్షేమేంద్రకృతే కవికంఠాభరణే—పరిచయప్రాప్తిః పంచమసంధిః.

3. కాశ్మీరేషు పృథుప్రతాపసవితుః కీర్త్యంశుతారాపతేః
ప్రౌఢారాతిపనానలస్య ధనదస్యేంద్రస్యభూమండలే,
విశ్వాకారవతః పునః కలియుగే విష్ణో రివోత్సాహినో
రాజ్యే శ్రీమదనంతరాజనృపతేః కావ్యోదయోయం
కృతః ౩౬

ఇతి కవికంఠాభరణం సమాప్తం.

## పరిశిష్టము — 7

సువృత్తతిలకమునుండి ఆత్మవృత్తాంతసూచకమగు ఉపసంహారపద్యము :

1 'ఇత్యౌచిత్యప్రచురరచనావిశ్రుతశ్రవ్యవృత్త
వ్యక్తిః శక్తిప్రసృతవచసాం దర్శితా సంగ్రహేణ
క్షేమేంద్రేణ ప్రణయవిపదాం హర్తు రాశ్చర్యకర్తుః
భూభృత్భర్తుర్ భువనజయినోఽనంతరాజస్యరాజ్యే'

ఇతి శ్రీప్రకాశేంద్రాత్మజ-వ్యాసదాసాపరనామ శ్రీక్షేమేంద్రవిరచితం సువృత్తతిలకమ్.

## పరిశిష్టము — 8

చారుచర్య యందలి ఉపసంహార శ్లోకము :

2 'శ్రవ్యా శ్రీవ్యాసదాసేన సమాసేన సతాం మతా
క్షేమేంద్రేణ విచార్యేయం చారుచర్యా ప్రకాశితా.

ఇతి శ్రీప్రకాశేంద్రాత్మజ-వ్యాసదాసాపరాఖ్య-మహాకవి శ్రీ క్షేమేంద్రకృతా చారుచర్యా సమాప్తా.

## పరిశిష్టము — 9

సేవ్యసేవకోపదేశమునందలి ఉపసంహార పద్యము :

3 'విద్వజ్జనారాధనతత్పరేణ, సంతోషసేవారస
నిర్భరేణ
క్షేమేంద్రనామ్నా సుధియాం సదైవ, సుఖాయ
సేవావసరః కృతోయం. ౩౮

ఇతి వ్యాసదాసాపరాఖ్య-మహాకవి క్షేమేంద్ర కృతః సేవ్యసేవకోపదేశః సమాప్తః

## పరిశిష్టము — 10

కళావిలాసమునుండి ఉపసంహారశ్లోకములు :

1 'కేళీమయః స్మితవిలాసకళాభిరామః
సర్వాశ్రయాంతరకళాప్రకటప్రదీపః,
లోకోపదేశవిషయః సుకథావిచిత్రో
భూయాత్ సతాం దయిత ఏష కళావిలాసః. ౪౦

2 కళావిలాసః క్షేమేంద్రప్రతిభాంభోధినిర్గతః
శశీవ మానసానందం కరోతు సతతం సతామ్. ౪౧

ఇతి మహాకవి శ్రీ క్షేమేంద్రవిరచితే కళావిలాసే సకలకళానిరూపణం నామ దశమఃసర్గః.

## పరిశిష్టము — 11

దేశోపదేశము నందలి ఉపసంహారశ్లోకము :

1 'ఇత్యుద్దేశనిదర్శనేన
వివిధం యత్ కించి దుక్తం మయా
త త్సర్వం స్మితకారణం,
సహృదయాః శృణ్వంతు సంతః క్షణమ్
క్షేమేంద్రః ప్రణతిం కరోతి,
న పటు ర్లోకోపహాసే ష్వలం
కిం ద్వేషః [illegible]
ప్రతిపదం దేశోపదేశః కృతః' ౪౨

ఇతి శ్రీ వ్యాసదాసాపరాఖ్య—క్షేమేంద్రవిరచితే దేశోపదేశే ప్రకీర్ణవర్ణనం నామ అష్టమ ఉపదేశః.

## పరిశిష్టము – 12

నర్మమాలను ండ ఉపసంహారపద్యము :

2 'ఇతి దివిరనియోగివ్రాతపశ్యేష్టితానాం
కుసృతిచరితచర్చానర్మమాలా కృతేయమ్
అపి సుజనవినోదాయోంభితా హాస్యసిద్ధ్యై
కథయతి ఫలభూతం సర్వలోకోపదేశమ్' ౪౩

ఇతి శ్రీవ్యాసదాసాపరాఖ్య– క్షేమేంద్రవిరచితాయాం నర్మమాలాయాం తృతీయః పరిహాసః.

## పరిశిష్టము – 13

సమయమాతృకలోని ఉపసంహారశ్లోకములు :

1 'సాలంకారతయా విభక్తిరుచిరచ్ఛాయా
విశేషాశ్రయా
వక్రా సాదరచక్షుషా రసవతీ ముగ్ధార్థలబ్ధా పరమ్
ఆశ్చర్యోచితవర్ణనా నవనవాస్వాదప్రమోదార్పితా
వేశ్యా సత్కవిభారతీవ హరతి ప్రౌఢా కలాశాలినీ.

2 సంవత్సరే పంచవింశే పౌషశుక్లాదివాసరే
శ్రీమతాం భూతిరక్షాయై రచితోఽయం స్మితోత్సవః.

3 అద్రిచ్ఛిద్రవినిద్రరౌద్రఫణినా మత్తాస్తి
కాలం కులం
మత్తాస్తత్ర వసంతి దంతిపతయః సింహాశ్రయేయం
గుహా
ఇత్యార్తిప్రతిపక్షవృద్ధశబరీనర్దేణ మార్గాగ్రగా
యద్వైరిప్రమదాః సదా వనమహీనాథగ్రహే
నాథితాః ౪౬

4 వీరస్యార్తరయాపిదేయమనసః శీలవ్రతాలంకృతేః
నిస్త్రింశః పరదారకృజ్జయవిధౌ యస్యైకకార్యః
సుహృత్
తస్యానంతమహీపతేర్వ్యరజసః ప్రాజ్యాధిరాజ్యోదయే
క్షేమేంద్రేణ సుభాషితం కృత మిదం సత్పక్ష
రక్షాక్షమమ్. ౪౭

ఇతి శ్రీవ్యాసదాసాపరాఖ్య – క్షేమేంద్రకృతా– సమయమాతృకా సమాప్తా.

## పరిశిష్టము – 14

క్షేమేంద్రుని యీక్రింది మూఁడు గ్రంథముల యందు నుల్లేఖింపఁబడినకవులు కావ్యములు

| | కవి నామములు. | ఔచిత్య వి. | కవి కంఠాభరణ. | సువృత్త తిలక. |
|---|---|---|---|---|
| 1 | అనురుక | 1 | — | — |
| 2 | (అవసరసార) | 1 | — | — |
| 3 | ఉత్పలరాజ | 1 | — | — |
| 4 | కలశక | — | — | 1 |
| 5 | కాళిదాస | 2 | — | 1 |
| 6 | కుమారదాస | 1 | — | — |
| 7 | (క్షేమేంద్ర) | 6 | — | 4 |
| 8 | చంద్రక | 3 | 1 | — |
| 9 | చక్ర | 1 | — | 1 |
| 10 | ధర్మకీర్తి | 1 | — | — |
| 11 | దీపక | 2 | — | — |
| 12 | (నీతిలతా) | 1 | — | — |
| 13 | పరిమళ | 3 | — | — |
| 14 | పరివ్రాజక | 1 | — | — |
| 15 | ప్రవరసేన | 2 | — | — |
| 16 | భట్టనారాయణ | — | వచన | — |
| 17 | భట్టబాణ | 1 | — | 1 |
| 18 | భట్టిలట్టిస | 1 | — | — |
| 19 | భట్టిపల్లట | — | — | 1 |
| 20 | భట్టేందురాజ | 2 | — | 1 |
| 21 | భవభూతి | 1 | — | — |
| 22 | మయూర | — | 1 | — |
| 23 | మాఘ | 1 | — | — |
| 24 | మాతృగుప్త | 1 | — | — |
| 25 | మాలవరుద్ర | 1 | 1 | — |
| 26 | ముక్తాపీడ | 1 | — | — |
| 27 | (మునిమతమీమాంసా) | 3 | — | — |

| | కవి కావ్యములు. | ఔచిత్య వి. | కవి కంఠాభరణ. | సువృత్త తిలక | | కవి కావ్యములు. | ఔచిత్య వి. | కవి కంఠాభరణ. | సువృత్త తిలక. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 28 | యశోవర్మా | 1 | — | .. | 33 | వరాహమిహిర | 1 | — | — |
| 29 | రాజశేఖర | 7 | — | — | 34 | వీరదేవ | — | — | 1 |
| 30 | రిస్సు | — | — | 1 | 35 | శ్యామల | 1 | — | 1 |
| 31 | లాటడిండీర | — | — | 1 | 36 | శివస్వామిన్ | — | 3 | — |
| 32 | (లావణ్యవతీ) | 1 | — | — | | | | | |

## పరిశిష్టము 15.

### ఔచిత్యవిచారచర్చ — ఉదాహరణ ప్రత్యుదాహరణదర్పణము.

| వివిధౌచిత్యములు : | ఔచిత్యోదాహరణము : | ప్రత్యుదాహరణము : |
|---|---|---|
| 1 పదౌచిత్యము | ౧ పరిమళకవిశ్లోకము | 1 ధర్మకీర్తిశ్లోకము |
| | ౨ హర్షవర్ధనునిశ్లోకము | |
| 2 వాక్యౌచిత్యము | ౩ క్షేమేంద్రుని వినయవల్లినుండి | 2 రాజశేఖరుని బాలభారతమునుండి |
| | ౪ రాజశేఖరుని బాలరామాయణశ్లోకము | |
| 3 ప్రబంధార్థౌచిత్యము | ౫ కాళిదాసకవిపద్యము | 3 రాజశేఖరుని బాలరామాయణపద్యము |
| | ౬ భవభూతిపద్యములు | 4 కాళిదాసశ్లోకము |
| 4 గుణౌచిత్యము | ౭ భట్టనారాయణునిపద్యము | 5 చంద్రకునిశ్లోకము |
| | ౮ భట్టబాణునిపద్యము | 6 రాజశేఖరునిది |
| 5 అలంకారౌచిత్యము | ౯ హర్షవర్ధనునిశ్లోకము | 7 చంద్రకునిశ్లోకము |
| | | 8 మాళవరుద్రునిశ్లోకము |
| | ౧౦ కార్పటికకవిశ్లోకము | 9 రాజశేఖరునిశ్లోకము |
| 6 రసౌచిత్యము | ౧౧ హర్షవర్ధనునిశ్లోకము | 10 కాళిదాసకవి శ్లోకము |
| | ౧౨ కాళిదాసకవిశ్లోకము | |
| ౧ హాస్యరసము | ౧౩ క్షేమేంద్రుని లావణ్యవతిలోని రెండుశ్లోకములు | 11 శ్యామలుని శ్లోకము |
| ౨ కరుణరసము | ౧౪ క్షేమేంద్రుని మునిమతమీమాంస యందలి పద్యము | 12 పరిమళకవిపద్యము |
| ౩ రౌద్రరసము | ౧౫ భట్టనారాయణుని పద్యము | 13 ప్రవరసేనుని ప్రాకృతగాథ |
| ౪ వీరరసము | ౧౬ క్షేమేంద్రుని నీతిలతనుండి | 14 భవభూతి శ్లోకము |
| | ౧౭ రాజశేఖరుని పద్యము | |
| ౫ భయానకరసము | ౧౮ హర్షవర్ధనుని శ్లోకద్వయము | 15 రాజపుత్రముక్తాపీడుని శ్లోకము |
| ౬ బీభత్సరసము | ౧౯ మునిమతమీమాంసనుండి | 16 చంద్రకుని శ్లోకము |

| | | |
|---|---|---|
| ౭ అద్భుతరసము | ౨౦ చంద్రకుని శ్లోకము | 17 మునిమతమీమాంసనుండి |
| ౮ శాంతరసము | ౨౧ క్షేమేంద్రుని చతుర్వర్గసంగ్రహమునుండి | 18 శ్రీమదుత్పలరాజపద్యము. |
| | ౨౨ మునిమతమీమాంసనుండి | |
| శాంత+శృంగారరసములు | ౨౩ భగవాన్ వ్యాసునిశ్లోకము | |
| బీభత్స+శృంగారరసములు | ౨౪ క్షేమేంద్రునిబౌద్ధావదానకల్పలతనుండి | |
| వీర+కరుణరసములు | ౨౫ క్షేమేంద్రుని మునిమతమీమాంసనుండి | |
| శాంత+శృంగార+కరుణ+ బీభత్సరసములు | ౨౬ క్షేమేంద్రుని మునిమతమీమాంసనుండి | |
| శృంగార+శాంతములు | ౨౭ రాజశేఖరుని కర్పూరమంజరినుండి | 19 అమరుకునిశ్లోకము |
| 7 క్రియౌచిత్యము | ౨౮ క్షేమేంద్రుని నీతిలత | 20 శ్రీ ప్రవరసేనుని పద్యము |
| 8 కారక:౧ కర్తృపదౌచిత్యము | ౨౯ భట్టబాణునిది | 21 పరిమళకవిది |
| ౨ కర్మపదౌచిత్యము | ౩౦ క్షేమేంద్రుని లావణ్యవతినుండి | 22 క్షేమేంద్రుని అవసరసారము |
| ౩ కరుణపదౌచిత్యము | ౩౧ గౌడకుంభకారుని శ్లోకము | 23 భట్టబాణుని పద్యము |
| ౪ సంప్రదానౌచిత్యము | ౩౨ భట్టప్రభాకరుని పద్యము | 24 రాజశేఖరుని శ్లోకము |
| ౫ అపాదానౌచిత్యము | ౩౩ మాళవరుద్రునిది | 25 భట్టేందురాజు పద్యము |
| ౬ అధికరణౌచిత్యము | ౩౪ కాళిదాసుని కుంతేశ్వరదౌత్యమునుండి | 26 పరిమళుని పద్యము |
| 9 లింగౌచిత్యము | ౩౫ క్షేమేంద్రుని లలితరత్నమాలనుండి | 27 క్షేమేంద్రుని నీతిలతనుండి |
| 10 వచనౌచిత్యము | ౩౬ క్షేమేంద్రుని నీతిలతనుండి | 28 మాతృగుప్తుని పద్యము |
| 11 విశేషణౌచిత్యము | ౩౭ క్షేమేంద్రుని మునిమతమీమాంసనుండి | 29 భట్టలట్టనకవి పద్యము |
| 12 ఉపసర్గౌచిత్యము | ౩౮ మునిమతమీమాంసనుండి | 30 కుమారదాసుని పద్యము |
| 13 నిపాతౌచిత్యము | ౩౯ మునిమతమీమాంసనుండి | 31 శ్రీచక్రకవి పద్యము |
| 14 కాలౌచిత్యము | ౪౦ మునిమతమీమాంసనుండి | 32 వరాహమిహిరుని పద్యము |
| | ౪౧ మాళవ [illegible] లయకవిపద్యము | |
| | ౪౨ భట్ట[illegible]నిపద్యము | |
| 15 దేశౌచిత్యము | ౪౩ భవభూతిపద్యము | 33 రాజశేఖరునిపద్యము |
| 16 కులౌచిత్యము | ౪౪ కాళిదాసకవిశ్లోకము | 34 యశోవర్మదేవుని పద్యము |
| 17 వ్రతౌచిత్యము | ౪౫ క్షేమేంద్రుని ముక్తావళినుండి | 35 దీపకకవి శ్లోకము |
| 18 తత్త్వౌచిత్యము | ౪౬ క్షేమేంద్రుని బౌద్ధావదాన | 36 మాఘకవి పద్యము |
| | ౪౭ కల్పలతనుండి | |
| 19 సత్త్వౌచిత్యము | ౪౮ క్షేమేంద్రుని చిత్రభారతమునుండి | 37 భట్టేందురాజ శ్లోకము |
| 20 అభిప్రాయౌచిత్యము | ౪౯ దీపకకవి శ్లోకము | 38 దీపకకవి శ్లోకము |
| 21 స్వభావౌచిత్యము | ౫౦ మునిమతమీమాంసనుండి | 39 మునిమతమీమాంసనుండి |

22 సారసంగ్రహౌచిత్యము
23 ప్రతిభౌచిత్యము
24 అవస్థౌచిత్యము
25 విచారౌచిత్యము
26 నామౌచిత్యము
27 ఆశీర్వచనౌచిత్యము

౩౧ మునిమతమీమాంసనుండి
౩౨ క్షేమేంద్రుని లావణ్యవతినుండి
౩౩ లావణ్యవతినుండి
౩౪ మునిమతమీమాంసనుండి
౩౫ కాళిదాసకవి పద్యము
౩౬ బౌద్ధావదానకల్పలతనుండి
౩౭ క్షేమేంద్రుని గురువగు గంగకుని పద్యము
౩౮ క్షేమేంద్రుని వాత్స్యాయనసూత్రసారము

40 పరివ్రాజకుని శ్లోకము
41 లావణ్యవతినుండి
42 రాజశేఖరుని శ్లోకము
43 మునిమతమీమాంసనుండియే
44 కాళిదాసకవి పద్యము
45 అమరుకకవి శ్లోకము

పరిశిష్టము — 16

## క్షేమేంద్రుని వంశవృక్షము.



# మహిమభట్టు - వ్యక్తివివేకము

శ్రీ భాగవతుల కుటుంబరావు

అలంకార శాస్త్రమునందు విశిష్టమగు స్థానమును గడించిన వారలలో మహిమభట్టొకడు. ప్రతీయమానార్థమును గురించి విభిన్నములగు భేదాభిప్రాయములు కలవు. ప్రతీయమానార్థ మున్నదని వాదించువారినే అభివ్యక్తివాదులనియు, ధ్వనివాదులనియు అందురు. ఈవాదమును ఖండించుచు ప్రతీయమానమనునది అనుమీయమానమగు నర్థమే యని వాదించువారు కలరు. వీరి వాదమునే అనుమితివాద మని యందురు. ఈ యనుమితవాదమును గురించియు ననేక గ్రంథములు వెలసినవి. కాని అవి ఏవియు ప్రస్తుతము మనకు సంపూర్ణముగ నుపలభ్యమానములు కావు. అచట నచట వారిగ్రంథములనుండి యుద్ధృతములైన కావ్యముల వలననే వారి వాదముల స్వరూపము తెలియుచున్నది. ఇట్టి పరిస్థితులలో ననుమితివాదమునకు సంపూర్ణమగు నొక స్వరూపమునిచ్చి గ్రంథరూపమున వ్రాసినవారిలో మహిమభట్టొకడు. అతని గ్రంథము ప్రస్తుతము మనకు సంపూర్ణముగ లభించుచున్నది. అందువలన ప్రస్తుతము మనకు లభించు అలంకార గ్రంథములలో వ్యక్తివివేకమునకును తద్రచయితయగు మహిమభట్టునకును నొక విశిష్ట స్థానము లభించుచున్నది.

ఇతఁ డభినవగుప్తుడు, కుంతకుఁడు-వీరిరువురకును తరువాతివాడు. రుయ్యకునకు వెనుకటివాడు. అందుచే నీతఁడు క్రీస్తుశకము 11వ శతాబ్దము మధ్యకాలమునకు సంబంధించినవాడని విమర్శకు లనుచున్నారు. క్రీ శ, 1020-1050 ప్రాంతముల నుండవచ్చునని వారి నిశ్చితాభిప్రాయము.

ఇతఁడు కాశ్మీరీయుఁడు. శ్రీధైర్యుఁడనువాని కుమారుఁడు. మహాకవి శ్యామలకుని శిష్యుఁడు. ఇతని కుమారులలో భీముఁడనువాఁ డొకఁడు కలడు. తన మనుమలకొఱకై ఈగ్రంథమును రచించినాడు. ఇతరుల రచనలయందలి దోషములను చూపవలసినదిగ నభ్యర్థితుఁడై, తన కిష్టములేకున్నను, శిష్యులను

సంతృప్తిపడుటకై కాళిదాసాది మహాకవులందఱి లోను దోషములను చూపినాడు.

"ఛాత్రాభ్యర్థనయా తతోద్య
సహసైవోత్సృజ్యమార్గం సతామ్
సౌరోభాగ్యమభాగ్యభాజన
జనాసివ్యమయాంగీకృతమ్"
స్వకృతిష్వనియన్త్రితః కథ
మనుశిష్యాదన్యమయమితీవాచ్యమ్
వారయతి భిషగపథ్యాత్
ఇతరాన్ స్వయమాచరన్నపితత్—

తాను మహాపండితుఁడనను నహంకార మీతనియందధికముగను భాసించును. వక్రోక్తికారునిసైతము తృణముగా తుడిచివేయును. అయినను తనరచనము నిర్దోషముకాదనియు, హృదయదర్పణము చంద్రిక మొదలగు పూర్వగ్రంథములను పరిశీలింపకయే ధ్వనికర్తను విమర్శింపఁబూనుట సాహసమేయనియు, అయినను పెద్దవారినిగుఱించి ప్రసంగించినను దనకు కీర్తికలుగుననియు నాశతో నీ సాహసమునకుఁ బూనినాననియు స్పష్టముగఁ దెల్పినాఁడు.

"ఇహ సంప్రతిపత్తితోఽన్యథా వా
ధ్వనికారస్య వచోవివేచనం నః
నియతం యశసే ప్రపత్స్యతే యు
న్మహతాం సంస్తవ ఏవ గౌరవాయ
సహసా యశోభిసర్తుమ్
సముద్యతాదృష్ట దర్పణా మమధీః
స్వాలంకార వికల్ప
ప్రకల్పనే వేత్తి కథమివావద్యమ్."

## గ్రంథరచనకు లక్ష్యము :

ధ్వనికర్త వివరించిన ధ్వనిభేదములన్నియు ననుమానమునం దన్తర్భావము నొందునని చూపుటయే యీగ్రంథమునకు లక్ష్యము.

"అనుమానేఽన్తర్భావమ్ సర్వ
స్యైవ ధ్వనేః ప్రకాశయితుమ్
వ్యక్తివివేకమ్ కురుతే ప్ర
ణమ్య మహిమా పరాం వాచమ్,"

వక్రోక్తిజీవితకర్తయగు కుస్తకుని సిద్ధాన్తములనుఁ గూడ నీతఁడు ఖండించును. లక్ష్యార్థము వ్యంగ్యార్థము ననునవి యనుమానమునందే యన్తర్భవించునని నిరూపించును.

## గ్రంథస్వరూపము :

ఇది మూఁడుభాగములుగ నున్నది. మూఁటిని మూఁడు విమర్శలని పేరిడినాడు. ప్రథమవిమర్శమున ధ్వనిలక్షణముపై నాక్షేపములను వివరించి నాఁడు. ద్వితీయవిమర్శమున అనౌచిత్యవిచారముఁ జేసినాఁడు. తృతీయవిమర్శమునందు ధ్వన్యుదాహరణములఁ గొన్నిటిని గ్రహించి యవియన్నియు ననుమానమునందన్తర్భావము నందునట్లు సమన్వయముఁజేసిచూపినాఁడు.

గ్రంథమంతయు గద్యపద్యములు సంగ్రహశ్లోకములనియు, అన్తరశ్లోకములనియుఁ గొన్నిటిని రచించినాఁడు. సంగ్రహశ్లోకములయందు దింతకుఁ బూర్వము తాను వచించిన సిద్ధాన్తములు సంగ్రహముగఁ దెలుపును. అంతరశ్లోకములయందుఁ బూర్వము నిరూపించిన హేతువులకధికముగఁ గొన్ని హేతువులను గూర్చుచున్నట్లు కన్పడుచున్నది. ఈ యంతరశ్లోకము లితనివగునా కాదాయని విచారింపవలసియున్నది. మహిమభట్టు వ్యక్తివివేకమే గాక తత్త్వోక్తికోశము మఱియొక గ్రంథమునుగూడ రచించినట్లు తెలియుచున్నది.

సిద్ధాన్తములు : పరావాక్కును ప్రస్తుతించుట చేతను,

"మూలం ప్రతిభా ప్రత్యర్థాభాసావిష్కృతిలోకతః"

అను వాక్యమున గాశ్మీరశైవమునకు సంబంధించిన యాభాస వాదప్రసక్తియుండుటచేతను, ప్రత్యక్షానుమానశబ్దప్రమాణములనుమాత్రమే యంగీకరించుట

నభవము, నితరములగు కొన్ని వాదముల పరిశీలనము వలన నితఁడు తార్కికశైవసిద్ధాంతుల నభిమానించినవాఁడని తెలియును. రసవాదమున నీతఁడు శ్రీశంకుకు ననుసరించినాఁడు. అతఁడు ప్రతిపాదించని మఱికొన్ని వాదములనుగూడ ప్రతిపాదించి నాఁడు మహిమభట్టు పదములను నామాఖ్యాతని పాతోపసర్గ కర్మప్రవచనీయములని యైదుగా విభజించినాఁడు. శబ్దములకు అభిధకంటె భిన్నమైన శక్తిలేదని యూహించెను. వ్యక్తి పకోక్తి యను సట్టివియు ననుమితియందే యన్తర్భావము నొందు నని యూతనిభావము "నాపి శబ్దస్య అభిధావ్యతిరేకేణ వ్యాపారాన్తర ముపపద్యతే యేనార్థాన్తరం ప్రత్యాయయేత్-వ్యక్తేరనుపపత్తేః సంబంధాన్తరస్యచాసిద్ధేః" రసాభివ్యక్తియుకూడ ననుమితిజన్యమే. "యాపి విభావాదిభ్యః రసాదీనాం ప్రతీతిః సానుమాన ఏవాన్తర్భవతి—విభావాను వ్యభిచారిభావప్రతీతిర్హి రసాది ప్రతీతేః సాధనమిష్యతే"—అను మేయార్థము రెండు విధములు (1) అనుమేయార్థము (2) అనుమితానుమేయార్థము.

"సువర్ణపుష్పామ్ పృథివీమ్ చిన్వన్తి పురుషాస్త్రయః
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుమ్"

శూరాదులకు విభూతులు సర్వత్ర సులభమే యను నర్థమిచట ననుమేయము.

"పశ్య శిరశ్చన్ద్రకలా మనేన
స్పృశేతి సఖ్యా పరిహాసపూర్వమ్
సా రంజయిత్వా చరణౌ కృతాశీ
ర్మాల్యేన తాం నిర్వచనం జఘాన"

నఖరంజనమైన తరువాత పార్వతి సఖి యామెనాశీర్వదించినది. పార్వతి యేమియు మాట్లాడలేదు. పుష్పమాలతో సఖినిఁ గొట్టినది. నిర్వచనము, మాల్యమున హననము ననువానిచే, పార్వతియందలి కౌతుకౌత్సుక్యహర్ష లజ్జాదివ్యభిచారి భావము లనుమేయమానములు. ఈయనుమేయార్థమునుండి పార్వతికి శివునియందనురాగ మనుమీయమాన మగుచున్నది. ఇది అనుమితానుమేయార్థము. భట్టతౌతాదులు నిర్ణయించినట్లు "కవికర్మ" కావ్యముకాదు. రసాభివ్యక్తి యున్న కవివ్యాపారమే కావ్యము. అభినేయార్థము, అనభినేయార్థము నని రెండువిధములు

"కవివ్యాపారో హి విభావాది సంయోజనాత్మా రసాభివ్యక్త్యవ్యభిచారి కావ్య ముచ్యతే - తచ్చాభినేయార్థానభినేయార్థత్వేన ద్వివిధమ్."

అనౌచిత్యము రెండురకములు- అర్థవిషయము, శబ్దవిషయము. మొదటిది అంతరంగము - రెండవది బహిరంగము. రసవిషయముగ విభావానుభవ వ్యభిచారిభావములన యథాయథము [illegible] దించుట యంతరంగమగు ననౌచిత్యము బహిరంగానౌచిత్య మైదువిధములు. ప్రక్రమభేదము క్రమభేదము, పౌనరుక్త్యము, వాచ్యావచనము - విని నే రెండవవిమర్శమునందు విచారించినాఁడు. ఇంకను శాస్త్రీయములును, జటిలములు నగు సిద్ధాన్తము లనేకముల నీగ్రంథమునందుఁ జూడనగును

ధ్వని లక్షణాక్షేపము :

ధ్వనికర్త యిచ్చిన ధ్వనిలక్షణము :—

"యత్రార్థః శబ్దో వా త మర్థ ముపసర్జనీకృతస్వార్థౌ వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః"

(1) అర్థశబ్దమునకు "ఉపసర్జనీ[illegible]" యను విశేషణము వ్యర్థము. (2) శబ్దః అను [illegible]ర్థము. (3) ఆశబ్దమునకు ఉపసర్జనీకృతవిశేషణము నిష్ప్రయోజనము. (4) తమ్ అని తచ్ఛబ్దమును పుంలింగములోనుపయోగించుట నిరుపయోగము (5) వ్యంక్తః అని ద్వివచన మనుపపన్నము. (6) వాశబ్దమున కిచట వికల్పార్థమసంభవము (7) "[illegible]" యను శబ్దమునకు ధ్వని కర్త్రభిమతమగు నర్థము సంగీకరింతుమేని అవ్యాప్త్యతివ్యాప్త్యసంభవ దోషములకు దారితీయును. (8) కావ్యమునకు ధ్వని యని నామ

కరణముపలన ప్రయోజనము శూన్యము. (9) "కావ్యవిశేష" అని విశేషశబ్దముచే కావ్య వైశిష్ట్యముఁ దెలుపుటవలన నవాచ్యవచనదోషము. (10) "హాలిఖిత కవితా" అని "హాల" పదము వలన నవాచ్యవచనదోషము కల్గును — ఇవి ప్రధానములగునున్న దోషములు. ధ్వనిభేద ప్రభేదలక్షణము లను ప్రతిపాదించునప్పుడింకను సంఖ్యేయములగు దోషములున్నవని మహిమభట్టు నిరూపించినాడు. తృతీయవిమర్శమునందు ధ్వనికర్త ధ్వనిలక్షణము నకు లక్ష్యములుగానిచ్చిన శ్లోకములు అనుమితికే యుదాహరణములగునని చూపినాడు.

"భ్రమ ధార్మిక విస్రబ్ధః స శునకోఽద్య మారితస్తేన
గోదావరీకచ్ఛకుంజవాసినా దృప్తసింహేన"

"ఓ ధార్మికుడా! స్వేచ్ఛగాఁ దిరుగుము - అడుగడుగునను నిన్నుఁ దాకవచ్చు నా శునకము నిపుడు గోదావరీతీరమునఁ గుహలోనుండు దృప్త సింహము చంపివేసినది" అని విప్రలంభసంభోగ సుఖాస్వాదలాలసయై, తన ప్రియునితో నాప్రదేశమును సంకేతముగ నేర్పాటుఁజేసికొనిన యొక నాయిక తన మనోరథమునకు భంగము కలుగసేయురీతి నాప్రదేశ మునకే కుసుమాపచయముకొఱకై వచ్చుచున్న యొక ధార్మికు నుద్దేశించి పలికినది ఇచట స్వేచ్ఛగా దిరుగుము — అను విధి వాచ్యార్థము— (ఇచటఁ దిరిగితివా ఆసింహము నిన్ను చంపును కావున) ఇచటకురాకుము అని నిషేధము వ్యంగ్యమని ధ్వని కర్తయొక్క యభిప్రాయము.

మహిమభట్టు పైసమన్వయము నంగీకరింపఁడు. అతనిమతమిది — ఇచట విధిరూపమగు వాచ్యార్థము, ప్రతిషేధరూపమగు ప్రతీయమానార్థము క్రమముగా ప్రతీతములగుచున్నవి. ధూమాగ్నులకువలె నా రెంటికిని సాధ్యసాధనభావమున్నది ఇచట భ్రమణ విధిరూపమగు సాధ్యమును, దానికి విరుద్ధమగు క్రూరకుక్కురమారణరూపమగు సాధనమును, రెండు నుండుటచే భ్రమణరూపమగు మొదటియర్థమును గ్రహించుట యనాలోచితము.

అందువలన వివేకియగు నతఁడు — పైయర్థ ములకు లోపమును గ్రహించినవ్యక్తి- ఈవచనములఁ బల్కిన నాయికయొక్క స్వభావము నరయుచు నేసి కొనును, అపుడు సామర్థ్యమువలన నిషేధరూపమగు నర్థము ప్రతీతమగును. శునకము చనిపోయినను నంతకంటె క్రూరతరమగు సింహము చటనుండుటయే సామర్థ్యము. అదియే యిచట సాధనము. ఇచట సాధ్యసాధనముల కవినాభావనియమము విరోధ మూలము ఇట్టి దానికుండుట లోకప్రమాణసిద్ధము.

ఇచట రెండు వాక్యార్థములుండఁగ రెండవ నిషేధరూపమగు రెండవయర్థమునందే యేల విశ్రాంతియుండవలయును? కేవలము విధిరూపమగు మొదటియర్థమునుగాని, లేదా విధినిషేధరూపము లగు రెండువాక్యార్థములనుగాని యేల గ్రహింపఁ గూడదు? అని సందేహము కలుగవచ్చును. సమాధానమిది.

తిరుగుము — తిరుగవద్దు అను విధినిషేధ రూపములగు రెండర్థములును నేకాశ్రయములుగ నుండవు. అందుచే అయర్థసముచ్చయమును, అనగా రెండర్థములను గ్రహించుటకు వీలుండదు

తిరిగినఁ దిరుగుము. లేకున్న మానుము అను వికల్పార్థమును చెప్పుటకు వీలులేదు. భ్రమ వా మాభ్రమీః — అని వికల్పార్థమునుఁ దెల్పు వాశబ్దము లేకున్నను, వికల్పము భాసించుచో, వాశబ్దప్రయో గమే యంతటను నిరర్థకమగును.

విధినిషేధముల కంగాంగిభావము పొసగదు. అందుచే నీవాక్యముల కంగాంగిభావమును పొస గదు. ఉత్తరార్ధము వేఱొకతీరున భాసించుచుండ పూర్వార్ధముననే సమాప్తము సేయుట కెట్లువీలగును?

పర్యవసానమున— భ్రమణవిధికి హేతువుగ దృప్తపంచాననవ్యాపారమిచట నుపాత్తమైనది. వీనికిఁ గల బాధ్యబాధకభావమును విచారింతుమేని ఈ వాక్యార్థసన్నివేశము ధార్మికభ్రమణనిషేధమునందే పర్యవసించును.

అనున్మత్తుఁ డగు వా డెవడు, శునకముండుట మాత్రముననే భ్రమణమును చాలించినవాఁడు. అస్థలముననే దృప్త సింహమున్నదని సందేహము కల్గినను, నిర్భయముగఁ దిరుగఁగలడు ?— ఇటనుమేయార్థము నందు పర్యవసానము నొందుటకు హేతునగు బాధ్య బాధక భావమను విశేష మిచట నుండనేయున్నది. ఇట్టి బాధ్య బాధక భావము నవశ్యము మన మంగీకరింపవలయును.— లేకున్న శుక్తికారజతప్రతీతి స్థలముఁగూడ నిటే ఉద్గతియే పట్టును — ఇన్ని వికల్పములకును నవకాశ మీయవలసిచ్చును — కావున నీ బాధ్య బాధక భావ నిశ్చయము ననుసరించియే యిచట నుత్తరార్ధమునందే వాక్యార్థములు పర్యవసించునని నిశ్చయించుట యైనది,

"భ్రమధార్మిక విస్రబ్ధః"— అను వాక్యార్థము నందలి భ్రమణ విధి వాచ్యము "స శునకోఽద్య మారితస్తేన" అను వాక్యార్థమువలన లభించు దృప్త సింహ విహితమగు క్రూర కుక్కుర మారణ రూపమగు వాక్యార్థమే, అర్థమగు హేతువు. భ్రమణ నిషేధము అనుమేయమేగాని వాచ్యముగాదు. పంచమ్యాది హేతువాచకము లిట లేవుగదా !—

"గోదావరీతీరగుహ" ఇచట పక్షము- దృప్త సింహ సద్భావము హేతువు,— హేతువైన సింహము పక్షమైన గోదావరీతీర గుహయందుండుటచే హేతువు పక్షమున నున్నది.

ఈ హేతువునకును, నిర్భయ భ్రమణరూపమగు సాధ్యమునకును సహానవస్థానరూపమగు విరోధము ప్రసిద్ధమే— కావున నుభయార్థప్రతీతి పొసగదు. కావున భ్రమణనిషేధమనుమేయమేగాని వ్యంగ్యము కాదు- ఇచట శీతస్పర్శలేదు - అగ్ని యుండుటవలన (నాత్రశీతస్పర్శః అగ్నేః) అనుచోట వలెనే యిచటను గ్రహింపవలయును—

తుదకు-' అయం దేశః భీరుభ్రమణాయోగ్యః, దృప్తసింహ సద్భావాత్' దృప్తసింహమిచట నుంటచే నీదేశము భీరుభ్రమణయోగ్యము కాదు- అనువాక్యము లభించును—

ఈలక్ష్యమునందొక దోషముకూడ నున్నది—

ఉన్మత్తగజముల సంహరించు సింహము కుక్కను చంపినదనుట యనౌచిత్యము— ఈ యనౌచిత్యము రసభంజకము.

ఈరీతిగ మహిమభట్టు, ధ్వనికర్త యిచ్చిన లక్ష్యములఁ గొన్నిటి ననుమితి కనుకూలముగ సమన్వయించినాడు. మఱికొన్నిటిని లక్ష్యములుగనే కుదురవని త్రోసివేసినాడు— ఇట్టింక ననేకవిషయము లీగ్రంథమున నున్నవి. ఇచట దిఙ్మాత్రముగ నాయా విషయములఁ గొన్నిటిని మాత్రము సూచించితిని— ఇంతకంటెను నిటు విస్తరింపకున్నందుకు విజ్ఞులు సైరింతురుగాత- అచిరకాలములో గ్రంథరూపమున రానున్న నాయాంధ్రవ్యక్తి వివేకమున నీవిషయముల విస్తృత స్వరూపమును విలోకింతురని ప్రార్థన,

# కవిజనాశ్రయము - భీమనఛందము

విద్వాన్. రావూరి దొరసామిశర్మ

తెలుఁగుభాషలోఁ దెలియవచ్చినంతలోఁ బ్రాథమిక మనఁదగిన ఛందము కవిజనాశ్రయము. ఇది యత్యంతప్రసిద్ధి ప్రచారములుగలది. దీని కర్తృత్వ విషయము నేఁటికిని వివాదాస్పదముగానే నిలిచియున్నది. దీనికర్త భీమనయని, రేచనయని యుభయమతములు గలవు. ఈ వివాదమునకుఁ గారణమును దెలిపి దాని తత్త్వమును బరామర్శించి యుపలబ్ధాధారములతోఁ గర్త యెవఁడనుటలో సామంజస్యముగలదో నిర్ణయించుటే యీ వ్యాసరచనోద్దేశము.

కవిజనాశ్రయావతారిక :—

అనవద్యకావ్యలక్షణ
మొనరంగాఁ గవిజనాశ్రయుఁడు మల్లియరే
చనసుకవి కవిజనాశ్రయ
మను ఛందముఁ దెనుఁగుబాస నరుదుగఁజెప్పెన్.

గద్య:— ఇది వాదీంద్రచూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాన శ్రావకాభరణాంక విరచితంబైన కవిజనాశ్రయ మను ఛందంబు.

వాదీంద్రచూడామణి శిష్యుఁడు శ్రావకాభరణాంక కవిజనాశ్రయ బిరుదాంకితుఁడు మల్లియరేచన యీ ఛందము రచించెనని పై యవతారికాగద్యలవలన నేర్పడును. దీనిఁబట్టియే కవిచరిత్రకారులు ఇది రేచనఛందమని నిర్ణయించిరి. కాని పుట్టిననాఁటినుండి నేఁటివఱకు దీనికి భీమనఛంద మను వ్యవహారము బహుళప్రచారములోనున్నది. రేచనఛంద మను వ్యవహార మెందునుగానరాదు.

కవిజనాశ్రయము వ్రాఁతప్రతులు పరస్పరము భేదించుచు బహురూపముల నందియున్నవి. కవిజనాశ్రయమువలె మఱి యేఛందముగాని యిట్టి మార్పులఁ గాంచలేదు. అప్పకవినాఁటికే యిది చాల మార్పులుగాంచియుండినదని "వికటకవులు కొన్ని యెంతలుకల్పించి కవిజనాశ్రయమునఁ గలిపినారు" అను అప్పకవీయవాక్యమే వ్యక్తముచేయుచున్నది.

కవిజనాశ్రయ ప్రతులలో నొకదాని యవతారికలో నీక్రింది పద్యములున్నవి:—

గొన్నింటి నుద్ధరించి యీక్రిందఁ బ్రదర్శించెద— కవి చింతామణి (తాతంభట్టు క్రీ. 1480–1520)

'భీమన అఖండంబు మొదలయిన కొన్నివళు లకు లక్షణ లక్ష్యంబులు చెప్పఁడు....'

* సులక్షణసారము (లింగముగుంట తిమ్మన- 1560 క్రి, శ.)

ఇందు భీమన ఛందములోనివిగా సుమారు75 పద్యములు గ్రహింపఁబడియున్నవి.

అది తగణమొప్పు నది దేవతాగణం
బరసిచూడ దాని కమరగురుఁడు
గ్రహముగానఁ బద్యగద్యముఖంబులఁ
మంచిదనుచు భీముఁడెంచినాఁడు.            (305)

ఇందు భీమునఁపేరే యంకితమైయున్నది. ఇది ముద్రిత కవిజనాశ్రయములోఁగానరాదు.

ముద్రితప్రతిగా నించుక భిన్నరీతిలోఁ గొన్ని వ్రాఁతప్రతులు ప్రాచ్యలిఖితగ్రంథాలయములలోఁ గలవు. అందు గ్రంథాంతమున నీ క్రిందిపద్య మున్నది.

గీ॥ భీమనయు ననంతనయును బెద్దనయును
తాతనయుఁజెప్పినట్టి ఛందములుగూర్చి
ప్రకరణములొప్పఁజేసెను బ్రహ్మసంఖ్య
నొనర లింగముగుంట తిమ్మనయనుకవి.

అప్పకవియము – (క్రీ. 1656)

తే॥ భారతముఁ దెనుఁగించుచుఁ దారచించి
నటి రాఘవపాండవీయము నడంచె
ఛందమునడంచ నీఫక్కి సంగ్రహించె
ననుచు భీముఁ బ్రుచ్చిలి యడఁచె దాని.
(పీఠిక–44)

* తాతంభట్టకృతముగాఁ జిరకాలముగా తప్పులతడకగా ముద్రితమైయున్న యీగ్రంథము తిమ్మనకృతముగా నాచే సుపరిష్కృతమై వావిళ్లవారిచే 1950లో ప్రక టితమైనది.

తే॥ చెల్లునని ముందు భీమన చెప్పెననుచుఁ
గలుపుదురు రేఫములును అకారములును
(2–232)

క॥ భీమన పవిచెప్పె ననం
తామాత్యుఁడుచేసె వెనుకయతులిరువదినాల్గు.(3-7)

*ఆ॥ వికటకవులు కొన్ని వింతలుకల్పించి
కవిజనాశ్రయమునఁ గలిపినారు
వానిఁగైకొనంగ వలదప్రయుక్తంబు
లేలచెప్ప భీముఁడెఱిఁగియెఱిఁగి.            (3–260)

వ॥ కవిజనాశ్రయము నందు "శ్రీకాంతా" యని వేములవాడ భీమకవియును.... మొదలంగది యుంచిరి.            (4-67)

మ॥ హరవక్త్రం... శ్రీనుసత్కవి ననం
తామాత్యు... సంగందఁచి
చెప్పంబూని... రిచే
తరచింపఁబడి...ట్టి ఛందముల చందం
బెల్ల నెందంబుగన్.            (4–6)

లక్షణదీపిక - వార్తాకవి రఘునాథయ్య—
17 శతాబ్ది)

"కన్యాపూరంతు వైశ్యానాం" అన్నాడు గనుక వైశ్యులకు స్త్రీపూరపొంతన వుండవలె నన్నంటను సమ్మతి–ఛందంబులు వేములవాడ భీమకవిగారి ప్రయోగంవున్నది. 'శ్రీకాంతాత్మజయ' అన్నాడు. గనుక కృతికర్త రేచన నక్షత్రంస్వాతి, ప్రాద్య క్షరం శవర్ణంగనక దుశ్శంర్యూదా ఉత్తరాభాద్ర గనక

* "అప్పకవి కవిజనాశ్రయములోని పద్యములను లక్ష్యములనుగాఁ గైకొనెనేగాని కవిజనాశ్రయకర్త యెవ్వఁడోచెప్పలేదు" అని ఆంధ్రకవి తరంగిణీ కాములు వేములవాడ భీమకవిచరిత్రలో వ్రాయుట వింతయయి తోఁచబడుచున్నది. వారీ పద్యములను జూడలేదేమో! (కవితరంగిణి-1 సంపుటము-234పుట)

ఉత్తరాషాఢ్రకు అభిజిత్తుకూడగా సంఖ్య ॰॰ అయెను. స్త్రీదూరపొంతువు దొరసెను, మిగి॰॰ ॰క్ష॰॰లు అన్ని ॰॰॰ ఉన్నవి. ॰ ఖితప్రతి)

॰క్షణశిరోమణి (పొత్తపి వే॰క॰॰నుణకవి– 17వ శతాబ్ది)

కవిజనాశ్రయపద్యము ॰॰॰ ॰॰॰తములు.

భీమన్నగారు 'అమర(గవేల్పుల॰॰గబ్బము), పురా॰॰మైన భీమనగారు రచియి ॰॰ సమవృత్తాధి కార॰॰నందు, భీమన్నగారు '॰పప॰ ॰॰॰నుసు॰ప' (ప్రాదియతిపద్యము)

భీమన్నగారు ఇరువది ఉపసర్గ॰॰న్ను ఉపరి స్వర॰యుక్తమైన నుభయము॰ జెల్లునన్నారు.

యతులు కవితామహత్త్వంబునందాది భీమన్న గారి మతంబున దశవిధములన(బడియె.

॰ ॰॰గారి కవిజనాశ్రయ మను ఛందంబున ఎక॰ ॰॰ మతి.

కవి॰॰॰క్షణసారము (ఓరుగంటి రామకవి - 1710)

*"భీమేశ్వరలబ్ధ కవితావాచాసిద్ధి గల వేముల వాడ భీమనార్యుం డొనరించిన కవిజనా॰శయంబను ఛందంబు నందు॰ జెప్పిన సమవృత్తంబులందు"*

రంగరాట్ఛందము (కస్తూరి రంగకవి – 1740-50)

ఇందు కవిజనాశ్రయపద్యము లనేకము లు॰॰॰॰ములు. "ఆదిమకవి భీమన, భీమన చ్ఛందము" అని యా యెల్లపద్యములమీ(ద(బేర్కొ॰ బడినవి.

*"ఆదిమకవి భీమనార్యముఖ్యులు పల్కు*
*ఛందమ్ములనుగల్గు చందములును." (3-3)*

దశవిధచ్ఛందములలో భీమనచ్ఛంద మొకటిగా॰ బేర్కొన(బడినది—

*''వను నుత్తమగండా ధ*
*ర్వ॰॰హనుమదనంత సుకవిరాక్షసజయదే*
*వనుత॰ ॰ర గోక*
*ర్ణని॰॰ ॰॰వి భీమనచ్ఛందంబుల్" (॰-6)*

॰॰ ॰రాది చతుర్జాతులకు॰ బొం॰॰నను

"॰ ॰॰యూరంతు వైశ్యానాం"

భీ॰॰ఛందమున,

*"॰శిక ॰॰తిప్రియవా*
*॰క్భి॰ ॰ ॰॰త్రయైక సేవితనుత వి*
*ద్యా॰ ॰ దివ్యకావ్య స*
*దే॰॰॰॰॰॰॰కాంతి యీవృతమాకున్."*

వ॥ అని రేచనమీ(ద నంకితంబుగా॰ జెప్పె. నా(డు ॰॰ నాతని నక్షత్రము స్వాతి. ప్రబంధా ద్యక్షరమ॰ ॰వర్ణమునకు ఉత్తరాభా॰ద స్వాతిమొద లుత్తరాభా॰దవఱకు నెంచ(గా నభిజిత్తుతో॰గూడ॰ బదుమూ॰॰నక్షత్రములయ్యెను. కాన స్త్రీ దూరము దొరకెను; క॰తిపతిరాశి తుల, మగణరాశి వృశ్చికము గనుక రెంటి॰॰ వైరములేదు. (2అ-250, 251, 252)

ఆ॰॰సాహిత్య పరిషత్తు ప్రకటించి॰ ॰క్షణ గ్రంథ వివరణసూచి:—

24 సంఖ్య– బాలబోధచ్ఛందస్సు ప్రతిలో "॰రా॰॰॰॰॰మూర్తి భీమన్నగారిఛందము పూర్ణ ముగా ॰॰సెను" అని యొక పత్రమున॰ గలదు. 32, 33, 34 సంఖ్యలు గల లక్షణగ్రంథములు "భీమన॰॰॰" మను పేరితోనే నిర్దేశింప(బడినవి.

మదరాసు ప్రాచ్యలిఖితగ్రంథ వివరణపట్టిక Descriptive Catalogue) 1307 సంఖ్య - ఛందో విషయము—

*సుకవిజనాశ్రయ మన(గా॰*
*ఋ॰॰॰తముగ ఛందమాంధ్రభాష నొనర్చెన్*
*సకల కవి సమ్మతమ్ముగ*
*నకలంకు(డు భీమకవి రయమ్మున జగతిన్.*

1279 సంఖ్య – కవిజనాశ్రయము—

ఇందు మూఁడధికారములు గలవు. ఇందే ప్రతి పద్యమునకు బ్రౌనుదొరగారి యాంగ్లభాషా పరివర్తనము గలదు ఆగ్రంథమున నిట్లు వ్రాయఁబడినది. "Bhimana's Treatise on Telugu Prosody translated by C. P. Brown 1825."

"This is the oldest work on Telugu metre and is popularly known as written by Bhimakavi But in the work itself the author's name is mentioned as one Malliyarecana." కూచిమంచి వెంకట్రాయకవి (1850) రచించిన సుకవిమహారంజనిలోను, ముద్దరాజు పెదరామన సంతరించిన రాఘవపాండవీయాదర్శవ్యాఖ్యలోను భీమనఛంద మనియే పేర్కొనఁబడినది.

ఆంధ్రలాక్షణికులందఱు ఏకవాక్యతె భీమన చందమని పేర్కొనుచుండఁగా రేచనకృతమని నిర్ణయించుటలో సామంజస్యములేదని చెప్పఁబనిలేదుగదా?

పూర్వకవిస్తుతిలో గ్రంథకర్తలు పెక్కురు భీమనను బేర్కొన్నారేకాని రేచనను బ్రస్తావించిన పుణ్యాత్ముఁ డొక్కఁడేని గానరాఁడు. మీఁదుమిక్కిలి భీమకవిని లాక్షణికకవిగాఁ గొందఱు ప్రస్తుతించియున్నారు.

ఆంధ్రకవి రామయ్య — విష్ణుకాంచీమాహాత్మ్యము (15వ శతాబ్ది.)

'ఛందోనిబంధన చాతురీధౌరేయ
వాగ్వాము వేములవాడభీము'

చిత్రకవి పెద్దన — లక్షణసారసంగ్రహము—(16 శతాబ్ది)

'త్ర్యక్షవరప్రసాదకవి
తాఢ్యుని వేములవాడభీము న
య్యక్షతభక్తి విస్ఫుర
దనంతు ననంతుఁ గవిత్వలక్షణా
ధ్యక్షులఁ గాచి రాజు బస
వార్యుని, భైరవు, సూత్రదంతి, వా
గ్వీక్షణ కర్ణనేతయగు
వెల్లఁకి తాతబుధేంద్రు నెన్నుచున్'

మదరాసు ప్రాచ్యలిఖితగ్రంథాలయత్రైవార్షిక సూచిక—(పుట—1572) R 620. శేషధర్మములు—తురుమెళ్ల రామన—లాక్షణిక కవిస్తుతి.

'శ్రీ వెలయంగ నే ఘనులు
చేసిరి లక్షణకావ్యముల్ కవి
స్తోమములెంచనట్టి గుణ
రుజ్జ్వల (?) లక్షణచక్రవర్తులన్
వేమరునాత్మలోఁదలఁతు
వెల్లఁకి తాతమనీషి భైరవున్
భీము ననంతుఁ జిత్రకవి
పెద్దసుధీంద్రు జగత్ప్రసిద్ధులన్'

లక్షణగ్రంథకారులు భీమనను బేర్కొనుటయే కాక యితరులు లాక్షణికకవిగా భీమకవిని స్తుతించియుండుటను గమనింపక కవితరఁగిణీకారులు 'శ్రీనాథాదికవు లెల్లరు నాతనిని (భీమనను) లక్షణవేత్తయని చెప్పలేదు' (భీమకవిచరిత్ర—I సంపుటము పుట 234) అని వ్రాయుట ప్రమాదభూయిష్ఠము

శ్రీనాథుఁడు కాశీఖండములో 'వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాఱు' అని పేర్కొనెను. శ్రీనాథుఁడాతనికవిత యుద్దండలీల యన్నాడేకాని, యది లక్షణగ్రంథమా యితరమా చెప్పలేదు లక్షణగ్రంథకవిత యుద్దండమగుట యెట్లు? భీమకవి యితరప్రబంధకవిత్వమేదో యాతఁడుద్దేశించియుండును. భీమకవి నితరప్రబంధకర్తలెందఱో స్తుతించినవారుగలరు. భీమన రచనలు కొన్నికలవని లక్షణగ్రంథోదాహృతులవలనఁ దెలియవచ్చెడు. శతకంధరరామాయణము, నృసింహపురాణము, హరవిలాసము, రాఘవపాండవీయము

మున్నగు నుద్గ్రంథము లాతని పేర నామమాత్రా వశిష్టములై యున్నవి.

ఆంధ్రశబ్దచింతామణి నన్నయకంటఁగట్టి తన వాదము నిలువఁబెట్టుకొనుటకు వేములవాడ భీమ కవికి కవిజనాశ్రయకర్తృత్వము నంటఁగట్టినాఁడను మున్నగు వ్రాతలు నిరాకరములు. అప్పకవికిఁ జిరపూర్వమే కవిజనాశ్రయము భీమనఛందమను ప్రసిద్ధి ప్రచారములో నున్నదను ఋజువాఁక ఆకరములు చూపఁబడినవి.

ఇది రేవనఛందమనుట కిటీవల మఱొక క్రొత్త యాధారము చూపఁగఁడఁగినారు విరోధులు.

తమిళభాషలో 11వ శతాబ్దినాఁటిదగు 'యాప్పరుంగలక్కారికై' యను ఛందోగ్రంథములో సంస్కృత కర్ణాటాంధ్ర ద్రావిడ భాషలలోని ఛందములు పేర్కొనఁబడినవి. అందలి పంక్తుల కనువాదము—

"వినినంతయు చరణాశ్రయమును జయదేవమును మిశ్రాకృతియును పింగళమును మా (మహా) పింగళమును రణయామంజూషయును చంద్రకోటిచ్ఛందమును, గుణాంకియనెడు కర్ణాటకచ్ఛందమును, వాంచియచేసిన తెలుగుఛందముమ (వాంచియార్ సెయిద వడుగచ్ఛందముమ్—వాంచియాల్ అనఁగా వాంచియ, వడుగ అనఁగా తెలుగు — వడుగరి — తెలుఁగువారు) ... ప్రసేశముగల వారి నడిగి తెలిసికొనునది" ఈవిషయమునుదొలుత నుద్ధరించినవారు వేటూరి ప్రభాకరశాస్త్రులు (రాజరాజనరేంద్రపట్టాభిషేకసంచిక—నన్నయకుఁబూర్వపు ఛందస్సు)

ఇందలి వాంచియార్ అను తమిళలిపి 'రేచియార్' అని చదువనగునని ప్రాచీన తమిళలిపి పరిశోధకులు చెప్పిరని వాంచియఛందము రేచన తెలుఁగుఛందము అనఁగాఁ గవిజనాశ్రయముగానుండునని యూహించిరి వేటూరివారు. 'వాంచియార్—రేచియార్' అను తమిళలిపిరచనలో భేదముగలదని తమిళభాష నెఱిఁగినవారికిఁ జెప్పనక్కఱలేదు. 'వాంచియార్' అను వ్రాఁతను 'రేచియార్'గా సరిపెట్టుకొనుట తగాదని నాయభిప్రాయము. ఒకవేళ ఆ కారికలోఁ జెప్పబడిన ఛందము రేచన ఛందమే (కవిజనాశ్రయము) అని యంగీకరించినను సుసాధ్యము గాదు 11వ శతాబ్దిలోని యాప్పమిళచ్ఛందములోఁ బేర్కొఁబడిన తెలుఁగుఛందముకడపటి 10వ శతాబ్దిలోనైనఁ బుట్టినదై సుప్రసిద్ధమై యత్యంత ప్రచారము కలదై తమిళ లాక్షణికుని యెఱుకకు వచ్చినదై యుండవలె. కాని యీ కవిజనాశ్రయము అందలి మధ్యాక్కరయు లక్షణమునుబట్టి నన్నయ యెఱ్ఱనలమధ్యకాలమునఁ బుట్టినదని చెప్పవలసియున్నది. నన్నయ భారతములోను దానికిఁబూర్వము వెలసిన యుద్ధమల్లుని శాసనములోనుగల మధ్యాక్కరలలో 5వ గణము ప్రథమాక్షరము యతి గూర్పఁబడినది. నన్నయతర్వాత మధ్యాక్కర నుపయోగించినవాఁడు ఎఱ్ఱనయొక్కఁడే. ఎఱ్ఱన హరివంశోత్తరభాగ పర్వశేషమున మధ్యాక్కరలో 4వ గణము మొదటియక్షరమునకు యతి పాటించెను. కవిజనాశ్రయ మధ్యాక్కరలోఁ జతుర్థగణాద్యక్షర యతియే పాటింపఁబడినది. దీనిం బట్టి కవిజనాశ్రయము (వాంచియ—రేచయ ఛందము) నన్నయకుఁబూర్వము అనఁగా 10 శతాబ్దిలోఁ బ్రభవించినది గాదనుట స్పష్టము. కాన యాప్పరుంగల కారికాకర్త పేర్కొన్నది రేచన ఛందముకాఁజాలదు. ఆ తమిళలాక్షణికుఁడు పేర్కొన్నది సంస్కృతభాషలో ఆంధ్రశబ్దచింతామణివలె రచితమైన యేదో యొక తెలుఁగుఛందమై యుండవలెను. అట్టిదొకటి కలదనుటకు

"జాతులు మాత్రాను సంధానగణవి
నీతులుగాన 'ననియతగణార'
నియును 'బ్రాసావా' యనియు 'యతిర్వా' య
నియుఁజెప్పు ఛందో వినిహితోక్తిగాన

ప్రాసమైనను యతిపైవడియైన
దేసిగానిలిపి యాప్రాసనియతి
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు"

అను పాల్కురికి సోమన పండితారాధ్యచరిత్ర వాక్యములు ప్రమాణములు. అఛందమేదో తమిళలాక్షణికుఁడు పేర్కొన్న వాంచియఛందమందులకును భిన్నమో యూహింపనలవిగాని విషయమైయున్నది. వాంచియఛందము రేచనఛందముగాచనుట ప్రస్తుతము (*)²

అవతారికలో రేచన వ్రాసినట్లుండఁగా లాక్షిణికాదుల వ్రాఁతలంబట్టి భీమన రచించెననుట సయుక్తికమా యని యడుగవచ్చు. మన యాంధ్రవాఙ్మయ చరిత్ర నాటినుండి పరిశీలించినవారికిట్టిది వింతగాఁదోఁపదు. కొందఱు ప్రభువులు సంపన్నులు కవుల కాశ్రయమిచ్చి తమపేరు చిరస్థాయిగా నుంటకై కృతిభర్తలయిరి. మఱికొందఱు కవియశఃప్రార్థులై తమపేరితోనే గ్రంథములు కవులచే వ్రాయించుకొని కృతికర్తలై వెలయఁజూచిరి, గోన బుద్ధారెడ్డిపేర వెలయు రంగనాథరామాయణము, వల్లభరాయలు కృతికర్తగానున్న శ్రీనాథుని క్రీడాభిరామము, పండి పెద్ది కృష్ణస్వామి రచనగా లిఖితమైయున్న (*)¹ చిత్రకవి సింగరార్యుని బిల్హణీయము నున్నగు గ్రంథముల విషయమెట్టిదో యట్టిదే యీ రేచనపేరఁబరఁగు భీమనకవిజనాశ్రయము. లాక్షణికులు కవిజనాశ్రయమునకు భీమనకృతికర్తృత్వమును రేచన కృతిభర్తృత్వమును అక్షరాంకితము చేసియేయున్నారుగదా?

కోమటి రేచనకు కవిజనాశ్రయుఁడని బిరుదు ప్రసిద్ధము. ఆబిరుదమునుబట్టియే ఛందమునకు నామకరణము చేయబడినది కవిజనాశ్రయమని. కవిజనాశ్రయబిరుదముచేతనే రేచన కృతిపతియని స్పష్టమగుచుండుటలేదా? రంగనాథ శ్రీనాథాదులవలె భీమకవి ద్రవ్యలోభమున కవిజనాశ్రయమును రేచన పేర రచించిపెట్టెను. కాని యథార్థమెంతకాలము దాగదుగదా!

కవిజనాశ్రయము భీమనచ్ఛందమే యగు. దీనికి కృతికర్త వేములవాడ భీమకవి. కృతిభర్త కవిజనాశ్రయుఁడు కోమటి రేచనయని నాయభిప్రాయము.

(*)² తెలుఁగుభాషలో ఛందోరీతులు—అను నాగ్రంథమున దీని వివరము గాంచనగును.

(*)¹ చూ. భారతి-1966 ఫిబ్రవరి సంచిక – చిత్రకవి సింగరార్యుఁడు అను నా వ్యాసము.

# మహాకవి శ్రీహర్షుఁడు

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

సంస్కృత సాహిత్యములో లలామభూతమై ప్రపంచ విఖ్యాతమైన నైషధీయచరితమను మహాకావ్యమును రచియించిన విద్వజ్జన చూడామణి, కవి తార్కికసార్వభౌముఁడు, లోకోత్తర ప్రతిభావంతుఁడునైన మహాకవి శ్రీహర్షుడు క్రీ॥ శ॥ 12వ శతాబ్దిలో వెలసినాఁడు. ఈమహాకవి శ్రీహీరపండితునిసుతుఁడు. ఈతనిని తనగర్భశుక్తి ముక్తామణిఁగాఁ గన్న తల్లివిదుషీమణియైన మామల్లదేవి ఈ సత్యమును శ్రీహర్షుఁడే యీక్రింది శ్లోకముద్వారా వ్యక్తపఱచెను :

"శ్రీహర్షః కవిరాజరాజిమకుటా
లంకారహీరః సుతః
'శ్రీహీరః' సుషువే జితేంద్రియచయం
'మామల్లదేవీ' చ యమ్॥" అని

అనగా : "శ్రీహర్షుఁడు, కవిశేఖరుల కిరీటాలంకారమైన వజ్రమణి, జితేంద్రియుఁడైన యతనిని 'శ్రీహీరపండితుఁడు, మామల్లదేవి'యను పుణ్యదంపతులు కనిరి" అని తాత్పర్యము.

కొందఱు విమర్శకులీకవి మైథిలబ్రాహ్మణుఁడనియు, మఱికొందఱు కాన్యకుబ్జబ్రాహ్మణుఁడనియు ననుచున్నారు. తమతమ పక్షమును సాధించుటకు అనేక హేతువులను వారుచూపుచున్నారు. ఏదేశమువాఁడైనను నీమహాకవి సకలప్రపంచ ప్రశంసను గనెను. మహామహిమోపేతుఁడగు నీతనినిగూర్చి లోకములో నొక కథ చెప్పికొనుచుందురు.

శ్రీహర్షునకు బాల్యమునందే దైవవశమున పితృవియోగము సంభవించెను. పతివియోగాగ్నిచేఁ దపించుచున్నను ఆతని జనని దీనురాలై సుతవాత్సల్యముచేత నతనిని లాలించుచు పాలించుచుండెను. అతి చపలమతియైన యాబాలుఁడు తన యైదవయేఁటనే తన తండ్రిచేయుచున్న శాస్త్రార్థయుద్ధములో "ఉదయనాచార్యుఁడు" అను నొకపండితునిచేత తండ్రియవమానింపఁబడినట్లు కర్ణపరంపరగావిని విదీర్ణహృదయుఁడై తనతండ్రిని అవమానముచేసిన పండితుని

జయి నిచ్చుతో లోకోత్తరమైన వైదుష్యమును సంపాదింపఁదలంచి చింతామణి మంత్రమునుబడసి సరస్వతీదేవి నారాధించుటకుఁ బూనుకొనెను. తనను యథావిధిగా నారాధించుచున్న యాబాలకునికి అచిర కాలములోనే వాగ్దేవత ప్రసన్నురాలై లోకోత్తరప్రతి భను, పాండిత్యమును ప్రసాదించెను అతరువాత శ్రీహర్షుఁడు కాన్యకుబ్జరాజసభకు వెళ్ళి తనతండ్రిని అవమానించిన పండితుని జయించుటకు నిశ్చయించెను. అట్టి అవసరమునందు ఆ పండితునితో శాస్త్రార్థము నకు అవకాశమును కల్పించుకొని అతనిని జయిం చెను. (అ పండితుడు సుప్రసిద్ధనైయాయిక సార్వ భౌముఁడైన ఉదయనాచార్యుఁడని లోకములో నొకకిం వదంతి ప్రచారములోనున్నది.) వాగ్దేవతా౽౽రాధన ప్రభావమువలన శ్రీహర్షుఁడు దిగ్విజయముచేయుచు విజయచంద్ర మహారాజుసభకువెళ్లి యీక్రిందిపద్యము చేత ఆరాజును స్తుతించెను.

"గోవిందనందనతయా చవపుశ్శ్రియా చ
మా౽స్మిన్నృపే కురుత కామధియ స్తరుణ్యః
అస్త్రీకరోతి జగతాం విజయే స్మరః స్త్రీ
రస్త్రీజనః పునరనేన విధీయతే స్త్రీ॥"

అనఁగా : ఓ తరుణులారా! యతఁడు గోవిందనంద నుఁడనికాని, మంచి రూపసంపద కలవాఁడనికాని మీరీ మహారాజును మన్మథునిఁగా (ఇతనియందు కామ బుద్ధిని) తలఁపకుఁడు. ఎందుకనఁగా : మన్మథుఁడు లోకవిజయార్థమై స్త్రీలను అస్త్రములుగా చేయుచున్నాఁ డు. ఇతఁడైతేనో. అస్త్రధారులను స్త్రీలనుగాఁ జేయు చున్నాఁడు" అని స్తుతించెను.

విచిత్రపదవిన్యాసముగల పై శ్లోకమునువిని సభాసదులందఱు చకితులై శ్రీహర్షమహాకవిని ప్రశం సించిరి. కాన్యకుబ్జాధీశ్వరుఁడైన జయచంద్రుఁడు గూడ ఈమహాకవిని విశేషముగా నాదరించెను. కొంతకాలమునకు శ్రీహర్ష మహాకవి ఆ రాజాస్థాన ములో లబ్ధప్రతిష్ఠుఁడై విద్వజ్జనములో వరిష్ఠుఁడుగా పరిగణింపఁబడెను. విశేషరాజసమ్మానమునుగూడ నొందెను. ఈవిషయమును శ్రీహర్షుఁడే యీక్రింది విధముగాఁ జెప్పెను :

"తాంబూలాద్వయ మాసనం చ లభతే
యః కాన్యకుబ్జేశ్వరాత్;
యః సాక్షాత్కురుతే సమాధిషు పర
బ్రహ్మప్రమోదార్ణవమ్ ।
యత్కావ్యం మధువర్షి; ధర్షితపరా
స్తర్కేషు యస్యోక్తయః;
శ్రీ శ్రీహర్షకవేః కృతిః కృతిముదే
తస్యాభ్యుదీయా దియమ్॥"

అనగా:— ఏమహాకవి, కాన్యకుబ్జాధీశునుండి అతనిసభలో తాంబూలద్వయము, విద్వత్పీఠము, అను గౌరవద్వయమును సంపాదించుకొనుచున్నాఁడో, వీ తత్త్వదర్శి తన తపస్సమాధులలో అనందసముద్ర స్వరూపుఁడగు పరబ్రహ్మను సాక్షాత్కరించుకొను చున్నాఁడో; ఏమహాకవి కావ్యము, రసామృతమును వర్షించునో; ఏపండితుని వాక్కులు తర్కములలో నాతనికి శత్రువిజయమును సాధించుచున్నవో; అట్టి మహనీయుఁడైన శ్రీహర్షుని యాకృతి విద్వాంసులకు సంతోషమును గలిగించుఁగాక" అని భావము. ఇంతటి పాండిత్యాభిమానముతో ఆత్మవిశ్వాసమును సభలో ప్రకటింపఁగల మహావిద్వత్కవి సార్వ భౌములు అరుదుగా సాహిత్యచరిత్రలో మనకు గోచరించెదరు.

ఈవిధముగా సరస్వతీసమారాధనమువలన లభించిన అసాధారణ ప్రతిభతో విలసిల్లిన యా మహాకవి క్రాంతదర్శియై, "నైషధీయచరితము, శివ శక్తిసిద్ధి, సాహసాంకచంపువు, ఛందఃప్రశస్తి, విజయప్రశస్తి, గౌడోర్వీశకులప్రశస్తి" యను మొద లైన అమృతవర్షికావ్యములను, ఈశ్వరాభిసంధాన

పరముకైన "ఖండనఖండకాద్య స్థైర్య విచారణా ప్రకరణములు" మొదలగు అలౌకిక సంస్కృత వాణీభూషణములైన అనేక తర్కగ్రంథములను రచియించినప్పటికిని, అతని కావ్యములలో నైషధీయ చరితమునకును, గ్రంథాంతరములలో ఖండనఖండ ఖాద్యమునకును లోకములోఁ గలిగినంత ప్రఖ్యాతి యతని యితరగ్రంథములకు గలుగలేదు. సంస్కృత కావ్యప్రపంచములో నైషధీయచరితము అత్యుత్కృష్ట మగు స్థానము నలంకరించుచు, విద్వదౌషధమని పేరుగాంచినది. అందలి "మృదుమధుర పదవిన్యాస నైపుణి, ఉత్తమాలంకార చమత్కారములు, అసమాన ములగు అనుప్రాసవిలాసములు, అప్రతికక్ష్యమైన ఉత్ప్రేక్ష, నిరుపమానమైన ఉపమాచాతురి" మున్నగు అనుపమాన కావ్యసామగ్రి యా మహావిద్వత్కవి యొక్క లోకోత్తరప్రతిభను ఆవిష్కరించుచున్నవి. దీనినిబట్టియె:—

"తావద్ భా భారవే ర్భాతి
యావ న్మాఘస్య నోదయః
ఉదితే నైషధేకావ్యే
క్వ మాఘః క్వ చ భారవిః॥"

అం ఆభియుక్తులు చెప్పిరి. అనఁగా :

"మాఘోదయము (మాఘకవి ఉత్పత్తి) వరకే భారవి ప్రకాశించుచున్నాడు. నైషధము ఉదయించిన త...త మాఘభారవులు కనఁబడరు" అని తాత్ప ర్యము.

శ్రీహర్షమహాకవినిగూర్చి విద్వత్ప్రపంచములో మరియొక చిత్రకథ ప్రచారములోనున్నది "ఇతనికి బాల్యములోనే తల్లిదండ్రులు మరణింపఁగా మేనమామ యితనిని తనయింట నుంచుకొని రక్షించెను. మాతులుఁ డతని లోకోత్తర ప్రతిభావైశద్యమునుజూచి యోర్వలేక యతని బుద్ధికి మాంద్యము కల్పింప సమకట్టెను. దురుద్దేశ ముతో తనుపాయమును యోచించుచుండెను."

"స్యాలకో గృహనాశాయ సర్వనాశాయ మాతులః" అను సామెత ("ఇలుచెరచు నాలితమ్ముఁడు, సలలిత ముగ మేనమామ సర్వముచెరచున్") ప్రకారము, తన భార్యతో "ప్రతిదినము శ్రీహర్షునకు ఉదయమున మినుపగారెలు ఆహారముగా పెట్టుము" అని చెప్పెను. (మినుములు మతి మాంద్యము కలిగించునని అతని విశ్వాసము.) అలాగే ఆమె ప్రతిదినము ఆహారమిడెను. 2—3 మాసములు గడచిన తరువాత బాలునికి "ఇప్ప టికి బుద్ధిమాంద్య మేర్పడియుండు" నని తలఁచి మేన మామగారు బయటినుండి "శ్రీహర్ష! కిం కరోషి?" (శ్రీహర్షా! ఏమిచేయుచున్నావు?" అని ప్రశ్నించెను. దానికి ప్రత్యుత్తరముగా :

"అశేషశేముషీమోషం మాషమశ్నామి మా తుల! (సమస్తబుద్ధివైభవమును దొంగిలించుమినుములను తినుచున్నాను మామా!) అని శ్రీహర్షుఁడు చెప్పెను. అదివిని మామగారు ఇట్టి ఆహారదానాదులువల్ల మన యిష్టసిద్ధి కలుగదని ఆ ఆహారమును మాన్పించెను" అను కథవాడుకలో నున్నది బాల్యములోనే అంతటి కవితావైభవోపేతుఁడుగా శ్రీహర్షుఁడు వెలసినాఁడు.

అతని కవితారసము సుధారసస్పర్ధిగానుండి సహృదయులకు అమందానందము గలిగించును. ప్రారంభములోనే యా విద్వత్కవిశేఖరుఁడు ఈక్రింది శ్లోకములో నతిసుందరమైన రూపకాలంకారమును నిరూపించినాడు:—

"నిపీయ యస్య క్షితిరక్షిణః కథా
స్తథాఽఽద్రియంతే న బుధా స్సుధా మపి।
నల స్సితచ్ఛత్రితకీర్తిమండలః
స రాశి రాసీన్మహసాం మహోజ్జ్వలః॥"

అని ఈ శ్లోకములో కీర్తిమండలమునందు సితచ్ఛత్రి తత్వనిరూపణముచేయుట అపూర్వము, అనన్యాదృ శము. ఈ కొద్దిరూపకమునకు బ్రహ్మానందపడి శ్రీనాథ కవిసార్వభౌముఁడు ఉదారముగా కలముకొద్ది తన

అనువాదమును "తపనీయదండైక ధవళాఽతపత్రి తోద్దండతేజఃకీర్తిమండలుండు" అని నడిపించినాఁడు. ఇంతియేకాక శ్రీహర్షుఁడు :—

"ప్రతాపసప్తార్కయశస్సు స్థితావిమౌ
వృథేతి చిత్తే కురుతే యదా యదా ।
తనోతి భానోః పరివేషకైతవాత్
తదా విధిః కుండలనాం విధో రపి॥"
"యదస్య యాత్రాసు బలోద్ధతం రజః
స్ఫురత్ప్రతాపానల ధూమమంజిమ ।
తదేవ గత్వా పతితం సుధాంబుధౌ
దధాతి పంకీభవదంకతాం విధౌ॥"

పై శ్లోకములలో అచుంబితమైన భావనాపటిమను జూపి పఠితలకు హృదయాఽనందమును గలిగించుచున్నాడు. ఇందలి మొదటిశ్లోకములో నలమహారాజుయొక్క కీర్తిప్రతాపములుండఁగా లోకములో సూర్యచంద్రులక్కరలేదని బ్రహ్మ ఆ యిరువుర మండలములకు పరివేషము నెపముచేత కుండలీకరణము (సున్న) చేసినాఁడట. ఇందు సాపహ్నవోత్ప్రేక్ష గమ్యమానమై రుచిరముగనున్నది. రెండవ శ్లోకములో, నలుని యుద్ధయాత్రలలో సైన్యముత్రొక్కిడిచేత రేగిన దుమ్ము నలుని ప్రతాపాగ్ని ధూమమువోలె మంజువర్ణముగలదై పాలసంద్రములోపడి అక్కడ ఉదయించిన చంద్రమండలమునకు అంటుకొని దానివలన అతనికి కళంకమేర్పడినదట. దీనివలన నలుని కీర్తికి చంద్రుఁడోడినందున అట్టివాఁడు కళంకితుఁడైనాఁడని మనోహరమైన ధ్వనికూడ ఈశ్లోకములో గోచరించుచున్నది. దమయంతి నేత్రములను వర్ణించుచు శ్రీహర్షమహాకవి:—

"నలినం మలినం వివృణ్వతీ
పృషతీమస్పృశతీ తదీక్షణే ।
అపి ఖంజనమంజనాంచితే
విదధాతే రుచిగర్వదుర్విధమ్॥"

అని సుందరముగా వ్రాసినాఁడు. దమయంతి లోచనములు కమలమును మలినముగా, లేడినిదూరముగా కాటుకపక్షిని సౌందర్యగర్వదరిద్రముగా చేయుచున్నవని అతిశయోక్త్యలంకారమును చెప్పుటద్వారా ఆకన్నులకు అవస్తువులు ఉపమానములనెడి ఉపమాలంకారము వ్యంగ్యమానముగునట్లుగా, అలంకారముచేత అలంకారధ్వనినిగూడ ఇచట నిరూపించినాఁడు. యమకరచనలో కూడ శ్రీహర్షుఁడు సిద్ధహస్తుఁడు:—

"లోకేశకేశవశివా నపి యశ్చకార
శృంగారసాంతర భుజాంతర కాంతభావాన్ ।
పంచేంద్రియాణి జగతా మిషుపంచకేన
సంక్షోభయన్ వితనుతాం వితను ర్మదం వః॥" అని

శ్రీహర్షమహాకవి ఉత్ప్రేక్షగూడ అనన్యాదృశముగనుండుననువిషయమీక్రింది గ్రంథమువలన స్పష్టమగుచున్నది:—

"నిలీయతే హ్రీవిధురః స్వజైత్రం
శ్రుత్వా విధు స్తస్య ముఖం ముఖాన్నః ।
సూరే సముద్రస్య కదాపి పూరే
కదాపి దభ్రభ్రమ దభ్రగర్భే॥"

"నలునిముఖము తనను జయించినదిగా విని చంద్రుఁడు ఒకప్పుడు సూర్యునియందు, మఱియొకప్పుడు సముద్రమునందు, వేఱుసమయమున ఆకాశమున తిరుగు మేఘమునందును విలీనుఁడగుచున్నాఁడట. ఇటు యమకముగూడ సుందరముగానున్నది. ఈశ్లోకములో చంద్రుఁడాయాస్థలములలో నిలీనుఁడగుట స్వాభావికమైనను, లజ్జానిమిత్తముగా జరిగినదని ఉత్ప్రేక్షింపబడెను ఆ అలంకారముగూడ ఇటు సుందరముగా గమ్యమానమైయున్నది. దమయంతీ సౌందర్యవర్ణనముగూడ అతినిపుణముగా శ్రీహర్షుని వాక్కులలో మనము చూడవచ్చును:—

"హృతసారమివేందుమండలం
దమయంతీవదనాయ వేధసా ।
కృతమధ్యబిలం విలోక్యతే
ధృతగంభీరఖనీఖనీలిమ॥"

అనఁగా:— బ్రహ్మదేవుఁడు దమయంతీవదననిర్మాణము నకుగాను సరియైనవస్తువు లోకములో లభించనందున చంద్రమండలమధ్యమున సారభూతమైన వస్తువునుమాత్రము తీసికొని నిర్మించెనఁట. అందువల్లనే, చంద్రమండలము మధ్యభాగములో రంధ్రము పడి అబిలముగుండా నల్లనియాకాశము కనపడుచుండునఁట. దానినే లోకులు కళంకమని చెప్పుచుందురఁట. ఈశ్లోకములో మహాకవి అతినిపుణముగా అపహ్నవాలంకారమునుచెప్పి, తద్ద్వారా ఉపమావ్యంగ్యము చెప్పెను. ఇచ్చట కావ్యలింగోత్ప్రేక్షల సాంకర్యము గూడనున్నది. నలుని వరించవలెనని దమయంతికిఁ గల యిచ్ఛను వర్ణించుచు మహాకవి:—

"మనస్తు యం నోజ్ఝతి జాతు యాతు
మనోరథః కంఠపథం కథం సః
కా నామ బాలా ద్విజరాజ! పాణి
గ్రహాభిలాషం కథయే దభిజ్ఞా॥"

అనఁగా, మనస్సు ఎప్పుడును మనోరథమునువీడక గట్టిగ పట్టుకొనియుండును. అట్లు నియంత్రితమైన నామనోరథము కంఠమువాఁకవచ్చి పాణిగ్రహణాభిలాషను ఎట్లు వెలిఁబుచ్చఁగలదని అతిచమత్కారముగా కవి పలికెను.

శ్రీహర్షుని కృతులలో మనకుఁ గనపడు పదప్రయోగచాతుర్యము మఱియెవ్వరియందుఁ గనరాదు.

ఒక్కొకచోట అతని పదగుంఫనములో జటిలత్వము ఉండి కావ్యములోనిప్రసాదగుణము కుంటుపడుచున్నట్లు ఈక్రిందిగ్రంథమువలన తెలియును:—

"దేవః పతిర్విదుషి! నైషధరాజగత్యా
నిర్ణీయతే న కిము న వ్రియతే భవత్యా
నాయం నలః ఖలు తవాతి మహానలాభో
యద్యేనముజ్ఝసి వరః కతరః పునస్తే॥"

ఇట్లున్నను ఇందు అనుప్రాససహితమైన పదలాలిత్యము బహుళముగానున్నది గనుక అందులో జటిలత్వము అంతర్ధానము జెందుచు మనోహరముగనేయున్నది. నిజముగా శ్రీహర్షుని పదవిన్యాస చాతుర్యము సర్వోత్కర్షముగానున్నదనుటలో అవంతయు సంశయము లేదు. అతని కావ్యము పఠించుచున్నప్పుడు సహృదయుఁడైనవాఁడు తప్పక అమందానందమునొందును. దమయంతి విరహము వర్ణించుచు:—

"కురు కరే గురుమేకమయోఘనం
బహిరతో ముకురంచ కురుష్వ మే
విశతి తత్ర యదైవ విధుస్తదా
సఖి! సుఖాదహితం జహి తం ద్రుతమ్॥"

పైనిఁజెప్పఁబడిన విధముగాఁ జంద్రునిఁ జంపుట అసంభవమైనను అతనిని జంపువిధానము దమయంతి చెప్పుటచేత నిచట ఆమెకుఁగల విరహోన్మాదము మేఘదూతమునందువలెఁ జెప్పఁబడినది. మన్మథజ్వరోన్మాద ప్రతాపముచేత దమయంతిచేసిన చంద్రదూషణమును వర్ణించు మహాకవియొక్క కవితాచారుత్వచాతుర్యము స్పష్టమగుచున్నది. ఇట్టి ఉన్మాదావస్థ "అయి విధుం పరిపృచ్ఛ"అను శ్లోకమునుండి "ఇతివిధోక్తి విగర్హణ" అను శ్లోకమువరకు దాదాపు 25 శ్లోకములలో చతుర్థసర్గమునందలి చంద్రదూషమునఁ గనపడును. సూర్యాస్తమయవర్ణనమునందు:—

"అదాయ దండం సకలాసు దిక్షు
యోఽయం పరిభ్రామ్యతి భానుభిక్షుః
అబ్ధౌ నిమజ్జన్నివ తాపసోఽయం
సంధ్యాభ్రకాషాయమధత్త సాయం॥"

అని మహాకవి అతిసుందరముగా పై శ్లోకమున ఉత్ప్రేక్షించెను అనగా:—సూర్యుఁడను సన్యాసి సమస్త దిక్కులయందును దండమును (పరివేషమును) ధరించి సముద్రమునందు మునిఁగి (స్నానముచేసి) సంధ్యాకాలమేఘమనెడు కాషాయవస్త్రమును ధరించెనాయనునట్లున్నాఁడని శ్లిష్టవిశేషములచేత ఉత్ప్రేక్ష అతిచతురముగా కూర్చినాఁడీమహాకవి. ఈలాగే సూర్యాస్తమయమును,

"కాలః కిరాతః స్ఫుటపద్మకస్య
వధం వ్యధాద్యస్య దినద్విపస్య
తస్యైవ సంధ్యా రుధిరాప్లుతారా
తారాశ్చ కుంభస్థితమౌక్తికాని॥" అని

సుందరముగా శ్రీహర్షుఁడువర్ణించెను. అనఁగా:— "కుంభస్థలమునందు, తొండమునందును బిందువులు (పద్మములు)గల దినగజముయొక్క వధమును కాలము అను కిరాతుడు చేయఁగా, అట్లు చంపఁబడిన దినద్విపముయొక్క రక్తధారయా యనునట్లు సంధ్యయు, గజకుంభస్థితములగు ముత్త్యములా యనునట్లు నక్షత్రములును సాయంకాలమునందు ఆకాశమునఁ దోఁచుచున్నవని ఉత్ప్రేక్షింపబడినది.

కావ్యచాతుర్యమును శాస్త్రముతో మేళవించి యీమహాకవి యనేక శ్లోకములద్వారా తర్కశాస్త్ర మర్యాదను, వ్యాకరణగతిని, అద్వైతవేదాన్తపరిపాటిని (చింతామణీ మంత్రసందర్భములో) నైషధీయచరితములో నిబంధించెను.

సమస్తశాస్త్రములను అవలోడించిన బుద్ధిగల యీ విద్వాంసుడు తర్కశాస్త్రమునందు నిష్ణాతుఁడై నట్టితఁడు రచియించిన ఖండనఖండఖాద్యమనెడి ఉద్గ్రంథమువలనఁ దెలియుచున్నది. సాధారణముగాఁ దర్కశాస్త్రజ్ఞులకు కవితలో నారళ్యముకలుగుట దుర్ఘటమని, "నైవ వ్యాకరణజ్ఞమేతిపితరం న భ్రాతరం తార్కికం" అను వచనమువలన తెలియుచున్నప్పటికిని శ్రీహర్షమహాకవిమాత్రము, ఉద్దండతర్కపండితుడైనను తన కవితామాధురిని ఖండనఖండఖాద్యగ్రంథారంభకవితచేత తనకుఁగల కావ్యాలంకారజ్ఞతను స్పష్టపఱచెను;—

"మానాపనోదనవినోదనతో గిరీశో
భాసేవ సంకుచితయో రుచితం త్వదంఘ్రోః
భేత్తుం భవాని శచితం దురితం భవాని!
నమ్రీభవాని ఘనమంఘ్రిసరోజయోస్తే॥"

భగవతియైన శక్తిని సంబోధించుచు శ్రీహర్షుఁడు "ఓ భవానీ! నీకోపమును పోగొట్టుటకు పరమేశ్వరుఁడు వంగిన పాదములకు నమస్కరించినపుడు అతని శిరమునందలి చంద్రుని వెన్నెలచేత ముడుచుకొనినవా యనునట్లున్న నీపాదసరోజములకు, అనేక జన్మములందు నిరంతరము సంపాదించుకొనిన నాపాపమును భేదిల్లఁజేయుటకు సర్వదా వినమ్రుడనై నమస్కరించెదను" అని తాత్పర్యము. ఈమహావిద్వత్కవి తన ప్రౌఢోక్తిని ప్రఖ్యాపనచేయుచు తన ప్రకాండపాండిత్యమునుగూడ ఈక్రింది ఖండనఖండఖాద్యశ్లోకముచేత తెలిపెను:—

"గ్రంథగ్రంథి రిహ క్వచిత్క్వచిద
పి న్యాసి ప్రయత్నాన్మయా
ప్రాజ్ఞంమ్మన్యమనా హఠేన
పఠితీ మాఽస్మిన్ ఖలః ఖేలతు॥
శ్రద్ధాఽఽరాద్ధగురు శ్లథీకృత
దృఢగ్రంథిః సమాసాదయ
త్వేత త్తర్కరసార్మి మజ్జన
సుఖేష్వాసంజనం సజ్జనః॥"

అనుటచే నిఖండనఖండఖాద్యగ్రంథము కేవలము గురుశుశ్రూషచేసి గుర్వనుగ్రహమువలన సంపాదించిన పాండిత్యముగలవారికే బోధపడునుగాని ఖలపండితునికి వీలుకాదని చెప్పెను.

దమయంతి శరీరసౌందర్యమును వర్ణించునట్టు శ్రీహర్షుఁడు చూపిన అపూర్వచాతుర్యము అనిర్వర్ణనీయము. ఆమె అధరవర్ణనసందర్భమున :—

"అధరం కిల బింబనాయకం
ఫల మస్యా ఇతి భవ్య మన్వయం।
లభతేఽధరబింబ మిత్యదః
పద మస్యా రదనచ్ఛదం దధత్॥"

అనగా "బింబఫలమును (దొండపండును) అధరీకరించుచున్నది గనుక దమయంతి క్రిందిపెదవికి "అధరబింబము" అను పేరు ఎంతో సమంజసముగ

నున్న"దని అతిశయోక్త్యలంకారమును సునిపుణముగా నిరూపించి శ్రీహర్షుఁడు దానిద్వారా ఉపమను వ్యజ్యమానముగాఁ జేసెను.

ఇట్లే మఱియొకచోట దమయంతి అవయవములను వర్ణించుచు:—

"శిరీషకోశా దపి కోమలాయాః
వేధా విధాయాంగ మశేష మస్యాః /
ప్రాప్త ప్రకర్ష స్సుకుమారమార్గే
సమాపయ ద్వాచి మృదుత్వముద్రామ్॥"

అనఁగా "దమయంతి అవయవములను అతి మృదువులుగా సృజించుచు, బ్రహ్మ మృదువులైన అవయవములను నిర్మించుటలో మంచి అభ్యాసమును, నైపుణ్యమును సంపాదించి చివరకు అత్యంతమృదు వగు వాక్కును సృజించెను" అని భావనాపరాకాష్ఠా నిబద్ధమైన ప్రబంధమును నిబంధించి ఆసేతుహిమాచలము గల విద్వన్మహాకవుల ప్రశంసలకు పాత్రుఁడైనవాఁడు శ్రీహర్షమహాకవి.

నైషధశ్లోకములన్నింటిలోను అతిముఖ్యమైనది, సరస్వతీదేవి చింతామణీమంత్రమును ఉపదేశించు శ్లోకము:—

"అవామావామార్ధే / సకలముభయాకారఘటనాత్
ద్విధాభూతం రూపం / భగవదభిధేయం భవతియత్
తదన్తర్మంత్రం మే / స్మరహరమయం సేందుమమలం
నిరాకారం శశ్వ / జ్జప నరపతే! సిధ్యతు స తే॥"

అనునది సరస్వతియే స్వయముగా నలునకు చింతామణీమంత్రమును ఉపదేశించినట్లు పై శ్లోకము వలనఁ దెలియుచున్నదని పండితులు చెప్పెదరు. ఈశ్లోకములో అద్వైతవేదాంతవిద్యారహస్యము నిక్షేపముగా ఉంచఁబడినది. దీనివలన శ్రీహర్షుఁడు తత్త్వవేత్త, శాస్త్రవేత్త పరమార్థవేత్త అని స్పష్టమగుచున్నది.

అత్యంత చమత్కారభరితమై కవితకు కిటుమసంత నన్వయించు శ్లిష్టవిశేషణములతో శ్రీహర్షుఁడు ప్రతిభావంతముగా రచియించిన యీక్రింది శ్లోకము అతిరమణీయముగ నున్నది:—

"గుణానామాస్థానం / నృపతిలక! నారీతివిదితాం
రసస్ఫీతామంత / స్తవ చ తవ వృత్తే చ కలితః
భవిత్రీ వైదర్భీ / మధికమధికంఠం రచయితుం
పరీరంభక్రీడా / చరణశరణామన్వహమహమ్॥"

అని ఇదియొక యనన్యాదృశమైన భావనచే నిర్మితమైన శ్లోకము. ఇందు కవితకును, దమయంతికిని నన్వయింపఁదగిన విశేషణములు గలవు. గుణానా మాస్థానం (రూపసౌందర్యాది గుణములకు దమయంతి— ప్రసాదమాధుర్యాది కావ్యగుణములకు కవిత యని భావము), నారీ-ఇతి విదితాం అని దమయంతికి, న అరీతి (రీతిరహితముకానిది) అని కవితకు సమానము. రసస్ఫీతాం— రాగస్ఫీత దమయంతి, శృంగారాదిరసస్ఫీత కవిత, తవవృత్తే— దమయంతికి నడవడిక, కవితకు కైశిక్యాదివృత్తులు, వైదర్భీరీతియనియు, వైదర్భి— విదర్భరాజపుత్రి దమయంతియనియు రుచిరమైన అర్థద్వయముచే కూర్పఁబడినది యీశ్లోకము "నమః ప్రామాణ్యవాదాయ మత్కవిత్వాపహారిణే" అనునట్లు తర్క కర్కశమతికి మృదుమధురరసస్ఫీత కవిత అలవడుట అరుదు, దానికి అపవాదముగానేకాక సమస్తకవి తార్కికసింహుఁడై సరసకవితాధురీణుఁడైన శ్రీహర్ష మహావిద్వత్కవి ప్రపంచకవులెల్లరకు ప్రాతః స్మరణీయుఁడు ఇతఁడు మహాశివభక్తిపరుఁడు గావున "శివభక్తిసిద్ధి" యను గ్రంథమునుగూడ రచియించినాడు. "న్యాయకుసుమాంజలి" కర్తయైన ఉదయనాచార్యునంతటి ఉద్దండతర్కపండితుని తన బాల్యమునందే రాజసభలో జయించినవాఁడన్నచో శ్రీహర్షుని పాండితీవైభవమునకు మేరలు వేవన వచ్చును పటుత్వమును సంపాదించినవాడే నారికేళమును నమలి, రుచిననుభవించి శరీరపుష్టిని సంపాదించుకొనునట్లు పాండిత్యమును సంపాదించినవాడే

శ్రీహర్షుని నారికేళపాక కవిత్వమును అనుసంధానము చేసి ఆనందించఁగలఁడని తెలియనగును.

శ్రీహర్షమహాకవి కావ్యప్రవాహములో దార్శనికత్వముగూడ ఎడనెడఁ గనుపడుచుండును. ఈ విషయ మతని నైషధీయచరితమునందలి ద్వితీయ సర్గములోని "కలశే నిజహేతుదండజః" ఇత్యాది శ్లోకములవల్లను, అతని శాస్త్రీయబంధము "గమికర్మీకృతనైకనీవృతా" ఇత్యాదులవలను, బ్రహ్మవిద్యానిష్ణాతత్వము చింతామణీమంత్రోపదేశికమైన "అవామావామార్ధే" ఇత్యాదిశ్లోకములవల్లను స్పష్టమగుచున్నది. ఇంతియేకాక యీ మహాకవి నైషధీయ చరితములోని సప్తమసర్గలోగూడ నిట్టి దార్శనికత గోచరించు ననేకశ్లోకములు ఉపనిబద్ధములైయున్నవి. అచ్చట ఔలూకా పరనామధేయముగల కణాద మునిని ప్రస్తావించుచు శ్రీహర్షుఁ డీక్రిందిశ్లోకమును వ్రాసెను:—

*"ధ్వాంతస్య వామోరువిచారణాయాం*
*వైశేషికం చారు మతం మతమ్మే*
*ఔలూకమాహుః ఖలుదర్శనం తత్*
*క్షమం తమస్తత్త్వనిరూపణాయ॥"*

అను శ్లోకము చమత్కారముగా ఉపశ్లోకింపఁబడినది. శ్రీహర్షమహాకవి గొప్ప ఆశుకవియనికూడ లోకప్రశస్తి గలదు:—"ఒకానొకప్పుడొక విద్వాంసుఁ డీమహాకవి యొక్క ఆశుకవిత్వశక్తిని పరీక్షింపఁదలఁచి శ్రీహర్షుని యింటికివచ్చి, అప్పుడు ఖండనఖండఖాద్య గ్రంథమును రచియించుచున్న ఆవిద్వాంసునిఁజూచి యీ క్రిందిశ్లోకముద్వారా అతనితో మాట్లాడుటకారంభించెను:—

*"తర్కకర్కశవిచార చాతురీ*
*కిం తురీయవయసా విభావ్యతే*
*ఆతురీభవతి యత్ర మానసం"*

అను ప్రశ్నాత్మకమైన శ్లోకభాగమునువిని శ్రీహర్షుఁడు దానికి ఉత్తరముగా నాల్గవపాదమును "ధాతురీప్సితమపాకరోతి కః?" అని వెంటనే ఆశువుగా చెప్పెను.

విద్వదౌషధమని ప్రశస్తిగాంచిన యీతని నైషధము 22 సర్గలుగలది. 17వ సర్గలో తనకుఁగల సర్వశాస్త్ర విజ్ఞానమును బ్రకటించెను. దమయంతీ స్వయంవరఘట్టమునందు "పంచనళీయము" అను పేర కొంత గ్రంథము ప్రఖ్యాతమైయున్నది. అందలి ప్రతిశ్లోకములోను, ఇంద్రాగ్నియమవరుణులకును నలునకును అన్వయించునట్లు ఐదర్థములు ప్రతిపాదించెను.

ఇట్లు అద్వితీయ ప్రతిభాపాండిత్యశోభితుఁడైన రసవత్తరకావ్యనిర్మాత సంస్కృతములోనేకాక ప్రపంచ భాషలలో మఱి యెక్కడను ఇంతవఱక జన్మించలేదన్నచో నసత్యము ఉండదు. ఇట్టి విద్వన్మహాకవి యొక్క కావ్యోన్నత్యమును పదవాక్యప్రమాణ పారావార ధురీణుఁడై మహోపాధ్యాయ బిరుదాంచితుఁడైన మల్లినాథసూరియే అందుకొనఁజాలక కొన్ని చోట్లనీకాకు పడెననఁగా సామాన్యులకు ఈగ్రంథగ్రంధిని విడదీయుట అసాధ్యము. శ్రీనాథాదులుగూడ నలచరిత్రను మహాకావ్యముగా రచింపఁదలఁచి శ్రీహర్షమహాకవియొక్క నైషధీయచరితమునకు స్వేచ్ఛానువాదమొనర్చిరే కాని శ్రీహర్షుని హృదయమునుపూర్తిగా ప్రదర్శింపఁజాలకపోయిరనికూడ పలువురు విమర్శక విద్వాంసుల యభిప్రాయము.

*"నిష్ణాతః సర్వశాస్త్రేష్వనితరధిషణః*
*కోమలే కావ్యతంత్రే*
*విద్వత్కావ్యప్రణేతృ ష్వతిరుచిర సమా*
*న్నత్యపీఠే శయానః*
*వైదుష్యం సత్కవిత్వం ప్రతిభటవిధురం*
*లాలయన్ ఖేలతే యః*
*తం శ్రీహర్షం విపశ్చిత్కవితిలకగురుం*
*భక్తిభావేన వందే॥"*

# కాకతీయ పదోత్పత్తి

శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ

కాకతీయపదమునకు వ్యుత్పత్త్యర్థమును పలువురు పలువిధముల ప్రదర్శించుచున్నారు. కాకతీయులచరిత్ర సమగ్రముగ పరిశీలించి ఏ అర్థము చెప్పుకొనిన దానికి సరిపడునో అదిమాత్రమే నిజమైన వ్యుత్పత్త్యర్థము కాఁగలదు.

కాన ముందు కాకతీయులను సాధించుటకు కొందఱు చరిత్రజ్ఞులు చెప్పిన వ్యుత్పత్తులు-అందలి లోపములు వివరించి ఆపైని సరియైనదని నాకు తోచిన వ్యుత్పత్త్యర్థము నిచ్చట ప్రదర్శింతును.

(1) 'కాకతి ర్నామ దుర్గాశక్తి రేకశిలానగరేశ్వరాణాం కులదేవతా, సా శక్తిర్పూజనీయా అస్యేతి కాకతీయః' అని ప్రతాపరుద్రీయ వ్యాఖ్యానమగు రత్నాపణమందు మల్లినాథసూరి కుమారుఁడగు కుమారస్వామిసోమయాజిచే వ్రాయఁబడినది 'కాకతి' యనునది యొకదుర్గాదేవియని, ఆదేవి నారాధించిన కారణమున కాకతీయులని పేరు ఏర్పడినది అని దాని యర్థము. కాకతీయులు 'కాకతి' ని ఆరాధించిన విషయము సత్యదూరముకాదు. కాని స్వయంభూదేవునికూడ కులదైవముగ పూజించుచుండెడివారు. ఈ విషయమును ప్రతాపరుద్రీయమునఁగలదు.

'కాకతమ్మకు సైదోడు ఏకవీర' అను క్రీడాభిరామకావ్యముననున్నది. కాకతమ్మగుడి ఓరుగల్లులో నున్నది. కాకతి ఒకదేవతపేరనుట స్పష్టమే. దుర్గాశక్తికి కాకతి అనిపేరు. దుర్గాశక్తి పర్యాయపదములలో మాత్రము కాకతిపేరు కనుపట్టదు. 'ఏకవీర' దుర్గాపర్యాయముగానున్నది. దుర్గాపర్యాయముకాన ప్పుడు కాకతికి దుర్గాశక్తిపేరు ఎట్లువచ్చినది?

(2) కాకతి యను ప్రదేశమునకు సంబంధించినవారు కాకతీయులు అని మఱియొక వ్యుత్పత్త్యర్థము. 'కాకతి' యన్ను పేరున మైసూరురాజ్యమున ఆంధ్రదేశపు సరిహద్దున ఒక గ్రామము కన్పట్టుచున్నది. కేవలము కాకతి, కాగది అన్ను పదముల

సామ్యమునుబట్టిమాత్రమే కాగితిపురమునకు సంబంధించినవారు కాకతీయులని చెప్పవలసివచ్చుచున్నది. ఈగ్రామమును ఏరాజు ఎప్పుడుపాలించెనో నిర్దుష్టము లగు ఆధారములులేవు.

క్రీ. శ. 945 ప్రాంతములో కాకర్త్యగుండ్యన పేరు కానవచ్చుచున్నది. ఈతని తండ్రితాతలు గుండియ, ఎఱ్ఱియ యనువారు రాష్ట్రకూటులు. వారు తమ పదముచివర రాష్ట్రకూటపదమును చేర్చియే వ్యవహరించిరి. కాకతీయ మూలపురుషుడు గుండ్యనమాత్రము కాకర్త్యపదమును తన పేరుచివర దాల్చుటకు కారణము చాళుక్యభూపాలునివలన నాతఁడు గ్రహించి పాలించిన నతనాటిసీమకు "కాకతి" అను గ్రామము ప్రధాననగరమై యుండ వచ్చునని కొందఱు చరిత్రజ్ఞు లూహించుచున్నారు. కాకర్త్య కాకత్య కావచ్చును. కాకతినగరసంబంధము కలవారు కాకత్యులు కాకతీయులు అనుతద్ధితాంత రూపము లేర్పడవచ్చును. దీనికి గుండ్యనతాల్చిన కాకర్త్యపదమునకుఁ జేసిన వట్టియూహయేతప్ప తగు ప్రమాణము కానరాదు.

(3) కాకతి యన గుమ్మడితీగ యనియు ఒకప్పుడొక రాజాంతఃపురమును శత్రువులు నాశనము చేయుతఱి నొక పసిబాలుఁడు దైవప్రేరణమున నంతఃపురమునుండి వెలువడి తొందరగవచ్చుటలో గుమ్మడితీగలో చిక్కుకొని శత్రువులబారినుండి తప్పె ననియు, అతఁడు పెఱిగి పెద్దవాడై శత్రువుల పరిమార్చి స్వరాష్ట్రమును సంపాదించెననియు తదాదిగ ఆతని సంతతివారు తమవంశము గుమ్మడి తీగవలన సంరక్షింపఁబడినదగుటచే గుమ్మడితీగను గౌరవించుటకై కాకతీయులము (గుమ్మడితీగకు సంబంధించినవారము) అని చెప్పికొనుచు వచ్చి యుందురనియు కొందఱు చెప్పుచున్నారు. ఈవాదము నకు 15వ శతాబ్దమున రాజమండ్రి రెడ్డివనితయగు అనితల్లిచే వేయింపఁబడిన కలువచేరుశాసనము ప్రమాణము. అందు "కాకత్యాః పరశక్తేః కృపయా కూశ్మాండపల్లికా కాచిత్పుత్రమసూత తదేతజ్ఞాత మనఘం కాకతీయసంజ్ఞ మభూత్" అని అందున్నది.

గణపతిదేవునకు పూర్వ మొక యుద్ధములో రాజాంతఃపురస్త్రీలు గుమ్మడికాయలోని గుజుజుతీసి వైచి యందు తమవంశమునిల్పు నొక శిశువునుంచి వత్సవాయవారి (క్షత్రియగోత్రికులు) పొలములోఁ బడవేయించిరనియు దానిని ఆపొలమును రక్షించు మాలవాఁడు తమ యజమానులకిచ్చెననియు వారా శిశువు మందపాటివారి (క్షత్రియగోత్రికులు) శిశువని యెంచి వారికొసఁగిరనియు, మందపాటివారు నేఁటికి తాము కాకతివర్మలమని చెప్పుకొందురనియు కూచిమంచి జగ్గకవిచే రచింపఁబడిన సోమదేవరాజీయము నందలి

*"శ్రీకాకతి రుద్రాన్వయ*
*నాకాధిప మందపాటి నారాయణ ధా*
*త్రీకాంత! హృదయకమల*
*ప్రాకారనివేశ సత్యభామాధీశా!"*

అను పద్యము మందపాటి నారాయణరాజును కాకతి వంశికునిగానిరూపించుననియు,మందపాటివారిండ్లలో పెండ్లిండ్లకుముందు గుమ్మడికాయతో మట్టెలు మంగళ సూత్రములును చీర జామారులును పంచమునకొసఁగి యతఁడిచ్చు అక్షతలను ధరించి ఆపైని పెండ్లిండ్లు జరుపుకొనుట ఆచారముగా నున్నదనియు .అని తల్లి కలువచేరుశాసనమునకు పోద్బలముగా కొందఱు చెప్పుచున్నారు. ఈ "గుమ్మడి" వాదమున కంతకు కాకతిపదమునకు గుమ్మడి అర్థమున్నదనిచెప్పి గుమ్మడికి సంబంధించినవారు కాకతీయులుఅని వ్యుత్పత్తి చెప్పవలసియున్నది. కాకతి పదమునకు గుమ్మడి అని యర్థ మే నిఘంటువులలోను కనుపట్టుటలేదు. అమరకోశములో "కూశ్మాండకస్తుకర్కారుః" అని

కూష్మాండకమునకు. కర్కారువు అనునది మాత్రమే పర్యాయపదముగా చెప్పఁబడినది "ఏప్టే" గారి సంస్కృతాంగ్లనిఘంటువులో కాకతిపదమేలేదు. బహుజనపల్లి సీతారామాచార్యులుగారి శబ్దరత్నాకరములో "కాకతిందుకము" అను పదమున్నది. దానికి కాకితుమ్మి అని వృక్షవిశేషవాచకముగ అర్థము వ్రాయఁబడియున్నది. దానికి గుమ్మడి అర్థముకాదు. కాకితుమ్మి ఒకదినుసు [illegible]. అప్పుడుకూడ కాకతిందుకపదములో కాకతిపదము విడిపదముకాదు. తిందుకము అనఁగా తుమ్మికి అను వృక్షవిశేషమర్థము. కాకిదొండవలె కాకతిందుకము, తిందుకములలోని ఒకవిశేషమగును కాకతిపదమే దీనిలో లేనప్పుడు ఈపదమువలన సాధించున దేమియులేదు. కాకతిపదమునకు గుమ్మడి అర్థమున్నదని చెప్పువారీపదము నే వాఙ్మయములో నచ్చటఁ జూచినది వ్రాసి యుండలేదు.

(4) జైనతీర్థంకరులలో "నేమినాథుఁ" డిరువదియొండవవాఁడు. అతనికి "కూశ్మాండిని" యను యక్షిణి శాసనదేవిగా నున్నట్లు I. A for 1903. P. 159లో నున్నది. శాసనదేవియనఁగా ఉపాస్యదేవత గావచ్చును. ఈ కూశ్మాండినీ యక్షిణినే శ్వేతాంబరజైనులు "అంబిక" యనుపిల్చెదరు. వారిశాస్త్రము ననుసరించి యీమెకు నాల్గుచేతులును. కుడివైపు రెండుచేతులలో నొకదానిలో మామిడిపండ్లగుత్తియు, మఱియొకదానిలో పాశమును, ఎడమవైపుచేతులలో నొకదానిలో అంకుశమును, మఱియొకదానిలో శిశువును ఉండవలెను. దిగంబరజైనుల గ్రంథముల ననుసరించి ఈమె తొడలపై నానుకొని ఒడిలో నిరువురుశిశువు లుండవలెను.

కూశ్మాండమన గుమ్మడియని యర్థము. కలువచేరుశాసనమందలి గుమ్మడితీగకును రాజశిశువునకు గల సంబంధమును జైనవిగ్రహ శిల్పమునందలి కూష్మాండినీయక్షిణి విగ్రహమందలి రాజశిశువునకును సన్నిహితసామ్యము కన్పట్టుచున్నది. కాకతియను మాటకు గుమ్మడితీగ అర్థమైనచో కూశ్మాండినిపదము నకు గుమ్మడి అర్థమేకనుక కూష్మాండినీయక్షిణిని (కాకతిని) ఆరాధించువారు కాకతీయులు కాగలరు. కాకతీయులలో మొదటితరమువారందఱు జైనమతస్థులే. క్రీ శ. 1115 సంIIరమునుండి తర్వాతివారు శైవ, వీరశైవ మతములకు చెందియున్నారు. కూశ్మాండినీయక్షిణి పదమును దిగంబరజైను లుపయోగించిరి. కాన కాకతీయులు ఆశాఖకే చెందియుండవలెను 15వ శతాబ్దమునందలి అనితల్లికలువచేరుశాసన కాలమునకు కాకతీయులు జైనమతావలంబులను విషయము ప్రచారమునుండితప్పి విస్మృతముకాగా కూశ్మాండినీయక్షిణీ ప్రశంస యడుగంటి కూశ్మాండిని యను పదమునకు గుమ్మడితీగయను అర్థముమాత్రము పరిగ్రహింపఁబడి యొకగాథ ప్రచురణములో నుండవచ్చును. అదియే ఆశాసనమున నిబంధింపఁబడి యుంట సంభవము కానగును.

బౌద్ధజాతకకథలలో "కాకతి" కథ యొకటి కలదు. కాకాతిపదము కాకతిగా రూపొందవచ్చును. నామసామీప్యమేకాని కాకాతిజాతకకథ కాకతీయులను సాధించుటకు తగినదిగాలేదు. పైగా కాకతీయులు జైనసంప్రదాయమునకుఁ జెందినవారేకాని బౌద్ధ సంప్రదాయమునకుఁ జెందరు జైన, బౌద్ధమతములు రెండును చాలవిషయముల సన్నిహితములేయైనను శాస్త్రసంప్రదాయములు ఎవరివివారివే జైనము బౌద్ధముకంటె పూర్వమగుట పూర్వులగు కాకతీయులు జైనులేయగుట బౌద్ధ 'కాకాతి' జాతకథతో కాకతీయ పదము సాధించుట కుదురదు.

(5) పాణిన్యాచార్యులు ఆయుధజీవికగణములో 'కాకంది' శబ్దమును వాడినారు. కాకంది, కాకన్ది, కాకత్తి, కాకతిగా మారియుండవచ్చునని

భాషాశాస్త్రవేత్త లనుచున్నారు. కాకతీయులు ఆయుధ జీవికులగు క్షత్రగణములోనివారేకాక ఈవ్యుత్పత్త్యర్థ మునకు ఆక్షేపణములేదు. ద్రవిడదేశమున 'నాన్ కాకట్టియన్, పొక్కట్టియన్ అల్ల' అను సామెత ప్రచారములోనున్నట్లు దెలియుచున్నది. 'నేను కాకట్టియన్ అసహాయుడనుకాదు అని దానిఅర్థము. కాకతీయ పదమే 'కాకట్టియన్' అని ద్రవిడభాషలో మారి యుండును. కాకతీయపదము పాణిన్యాచార్యులవారి 'కాకంవి' శబ్దమునుండి పుట్టినదన్నచోఆయుధజీవికుఁ డర్థము చెప్పవచ్చును కాన 'కాకట్టియన్' అనగానే నాయుధసహాయుఁడను అని అర్థము చెప్పవచ్చును. ద్రవిడదేశమందలి సామెతప్రకారముకూడ కాకతీయ పదమునకు నిస్సహాయుడు కానివాడుఅర్థము చెప్పి కొననగుటచే ఆయుధజీవికుఁడను అర్థముచెప్పు కొని పాణిన్యాచార్యులవారి వ్యుత్పత్తికి బలముకల్పిం పను వచ్చును. కాకతీయులు వీరులై రాజ్యములు పాలించినవారగుట ఆయుధజీవికార్థము చెప్పుటకాక్షే పణము కనుపట్టదు కాని ఇది కేవలము భాషలోని పదమునకుఁగల అర్థమునుబట్టి ఒకజాతిని నిర్ణయించు టకు సమర్థమైనదిమాత్రము కాఁజాలదు. కాకతీయులు మాత్రమే ఆయుధజీవికులై ఇతరులింకెవ్వరు ఆయుధ జీవికులుఁలేనప్పుడాపదము వారినే చెప్పగల్గియుండ వచ్చును కాని రాజ్యములుపాలించిన వీరాధివీరుల వంశములు పెక్కులున్నవనుచు కాకతీయపదము వారందఱకును చెందవలసియుండును కాన ఇది సమర్థమైన వాదముమాత్రము కాఁజాలదు.

పైవాదములన్నిటిలోను కాకతిశక్తిని కుల దేవతగా నారాధించినవారు కాకతీయులు అను మొదటివాదము మాత్రమే బహుళప్రచారములో నున్నది ఆంధ్రదేశమున సోమేశ్వరుఁడు, రామేశ్వ రుఁడు, రాజరాజేశ్వరుఁడు మొదలగుపేర్లతోనున్న దేవాలయములలో నన్నిటను ఒకేపరశివుని లింగ మూర్తి కన్పట్టును. ఈశ్వరపదాంతములైన సోమ, భీమ, రామ, రాజరాజపదములు ఆ లింగమూర్తిని ప్రతిష్ఠించిన మహాపురుషుల పేర్లుగాని, అవి పరశివునకు పర్యాయపదములు మాత్రము కావు. భీమరాజుచే ప్రతిష్ఠింపఁబడిన దైవము భీమేశ్వరుఁడు; సోమరాజుచే ప్రతిష్ఠింపఁబడిన దైవము సోమేశ్వ రుఁడు; రాజరాజుచే ప్రతిష్ఠింపఁబడిన దైవము రాజ రాజేశ్వరుఁడు. అట్లే మామిళ్ళమ్మగుడి, కనకాలమ్మ గుడి, పోమాలమ్మగుడి పేర్లుగల దేవాలయములోని దుర్గాశక్తియు నొక్కటే. ఆ శక్తిని ప్రతిష్ఠించినవారు గాని, ఆ గుడికి కారకులైనవారిగాని, ఆకాలమున మహామహిమాన్వితులైనవారిగాని పేర్లతో ఆ యాల యము లంకితములైనవి. గుడిలోని పరాశక్తికి భేదము లేదు. అట్లే 'కాకతి' అను పేరుగల మహాపురుషునిచే ప్రతిష్ఠింపఁబడిన దుర్గాశక్తి కాకతమ్మ కాకతిశక్తి అను పేర్లను తప్పక పొందవచ్చును. అట్లయినచో ఈదుర్గాశక్తిని ప్రతిష్ఠించిన కాకతి అనువాఁడెవరు? అతనినిగూర్చి మనకు తెలుపు ఆధారములు లభిం చునా? ఇదియొక ఆలోచనాంశమే ఈ యాలోచనము సాగించినవారు కాకతీయులఁగూర్చి పరిశోధనము గావించినవారిలో నింతవరకుఁ గనరారు. శాసన సాహిత్యములో 'కాకతి' అను పదమును మొట్టమొదట ప్రయోగించినది క్రీ. శ. 1000 లో విరియాల కామసానియొక్క గూడూరుశాసనము అని కొంద రనిరి "*బేతభూవిభుని కాకతివల్లభుఁజేసి వానితా / బరగఁగఁజేతబెట్టి ఘను బల్లవరాయని యాగిజూచి భా / స్కరవిభు చక్రవర్తినిగ కాకతినిల్పుట కోటి సేయదే*" అని యున్నది. ఇందలి బేతరాజు రెండవ బేతరాజు. ఇందలి కాకతిపదము పరంపరాగతమైన ఒక కులమునకు అంకితమైనదిగఁ దెలియుచున్నది. కాజీపేట మొదటిశాసనము ( J. A. H. R. S. VII – i. p. 115 ) లో "*సామంతవిష్టవశః శ్రీమాన్కాకతి పురాధినాథో చేతః చోళక్ష్మాపాల చమూ*

వార్ధి ప్రసన్నసయార్ధితోర్జితలక్ష్మీః" అని మొదటి బేతరాజును కాకతిపుర ప్రభువుగఁ జెల్పుచున్నది. కాకతిపదపూర్వమైన పురము మొదటిబేతరాజునకు పూర్వమే యున్నదన్న సంగతి దీనివలన స్పష్టపడు చున్నది. ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారిచే సంపాదింపఁబడిన ఖాజీపేట శాసనము ఉత్తరభాగమున "మహామండలేశ్వరానుమకొండ పురవరేశ్వర పరమమాహేశ్వర పతిహితచరితం వినయభూషణం శ్రీమన్మహామండలేశ్వరం కాకతియ బేతేశ్వరం..." అని బేతరాజునకు కాకతీయపదము విశేషణముగా వాడఁబడినది. త్రిపురాంతకశాసనమునఁగూడ కాకతి పురప్రశంసకలదు కాకతిపదమునకు సమీపమున నున్న నామాంతరములుగల ప్రదేశములు ఆంధ్ర దేశమున గంజాం, విశాఖపట్టణము, తూర్పుగోదావరి, కృష్ణా, గుంటూరు, చిత్తూరు, అనంతపురం జిల్లాల యందుఁగలవు. కాకతీయుల రాజదానియగు ఓరుగల్లు నకు కాకతిపురమను పేరుండవచ్చునని కొందఱను చున్నారు బేతరాజు నేఁటి వరంగల్లుజిల్లాయందలి మధిరతాలూకా ప్రాంతమును (నతనాటిసీమ) పాలిం చెను. మానుకోటతాలూకా (కొఱవిసీమ) ప్రాంతమును బాలించెను కావున అతని రాజదాని ఓరుగల్లుకాదు. అయినప్పుడు కాజీపేట మొదటిశాసనములో "కాకతి పురాధినాథో బేతః" అన్నప్పుడు నాఁటి కాకతిపుర మేదికావలెను ?

పైశాసనములలో పురపదమునకు పూర్వమున నున్న కాకతిపదముకూడ కాకతిశక్తిపరములోని కాకతి పదమువలెనే ఒకమహాపురుషుని కంకితమైయుండ వచ్చును మహాపురుషులపేర్లతో అనేకగ్రామముల నిలువరించుట మనకుఁ దెలిసినదే చాళుక్యప్రభు వగు రాజరాజుపేరుతో రాజమహేంద్రపురము, కాకతి రుద్రదేవిపేరుతో రుద్రపురము. గణపతిదేవిపేరుతో గణపవరమువంటి పెక్కు ఉదాహరణములు లభింపఁ గలవు. అట్లే 'కాకతి' అనువానిపేరున కాకతిపురము వెలయుటయు సంభవమే. 'కాకతి' మహాపురుషుఁ డైనవుడు ఆపేరుతో పెక్కుప్రదేశముల పెక్కు గ్రామములు నిర్మింపఁబడియుంటలో వింతలేదు. అట్లే పెక్కుదుర్గాలయములును కాకతిఅనువానిపేరుతో నిర్మింపఁబడియుండును. మఱి యీమహాపురుషుఁడగు కాకతియెవరు ?

పురాణవాఙ్మయము పరిశోధింపఁగా అష్టాదశ ఉపపురాణములలో నొక్కటగు దౌర్వాసపురాణమున దేవీసంహితలో 57, 58 అధ్యాయములలో 'రజి' అను మహాశక్తిసంపన్ననకు 'కాకతి' మొదలగు అయిదువందలమంది కుమారులపేర్లతో అయిదు వందల వంశములు ప్రవర్ధిల్లినట్లును అందు కాకతులు (కాకతయః) అను వంశస్థులు పెక్కుతరములు రాజ్య ములు పాలించినట్లును వ్రాయఁబడియున్నది. "కాకతయః" అనునది ప్రథమాబహువచనాంతముగా వాడఁబడినది. దీని ఏకవచనము 'కాకతి' అనునది. దీనివలన కాకతిఅనురాజు కాకతులకు మూలపురుషుఁ డని తెల్లమగుచున్నది. కాకతిపదముపైని గోత్రార్థ తద్ధితాంతరూపము 'కాకతీయులు' అని యగుచున్నది. ఈవ్యుత్పత్త్యర్థము చాల సమంజసముగానుండుటయే కాక పైవాదముల కన్నిటికి ఏకవాక్యత కూర్చుటకు సమర్థముగానున్నది. 'యావద్వశ్శాంభవీభక్తిఃవైష్ణవీ శాక్తికీచవా । ప్రకాశతే నిరాఘాటం తావద్వశ్శ్రిత తాంభువి।' అని అలర్కుఁరు కాకతిరాజుయొక్కపూర్వి కుడగు ఖనిదుత్రనితోఁ జెప్పినాఁడు. 'మీకులమున వైష్ణవీ, శాంభవీ, శాక్తికీఅను మూఁడురకముల శక్తు లలో నేయొకశక్తిని ఆరాధించునంతకాలము మీకు రాజ్యమునిలుచును' అని అలర్కుఁడు చెప్పియుండు టచే కాకతిరాజు శక్తిభక్తుఁడై శక్తిఆలయములను పెక్కు ప్రతిష్ఠగావించియుండును. అతనిచేత ప్రతిష్ఠితలగు శక్తి కాకతిశక్తిగా పేర్వడియుండుటలో విప్రతిపత్తి

యేమున్నది? తమ మూలపురుషుఁ డారాధించిన శక్తిని తర్వాతివారును కులదేవతగా నారాధించుట పరిపాటిసంగతియే. కాకతీయపదమును కాకతిరాజు నుండికాక కాకతిశక్తినుండి తర్వాతివారు వ్యుత్పన్నము చేసిరి. ఆప్రకారమే 'కాకతిర్నామదుర్గాశక్తి రేకశిలా నగరేశ్వరాణాం కులదేవతా । సాశక్తిర్భజనీయా ఆస్యేతి కాకతీయః' అని కుమారస్వామి సోమపీథి వ్రాసియున్నాడు. అదియే బహుళప్రచారమునందు కొన్నియున్నది.

పైవిధమున కాకతీయశబ్దవ్యుత్పత్తి కాకతిరాజ గోత్రార్థ తద్ధితాంతముగా నిరూపించినపుడు కాకతీయులు, క్షత్రియులా, శూద్రులా, క్షత్రియులైనచో సూర్యవంశస్థులా, చంద్రవంశస్థులా, శూద్రులైనచో రెడ్డివారా? కమ్మవారా? అని నేఁటికిని చరిత్రజ్ఞులను పీడించుచున్న సందేహములన్నియు పటాపంచలు కాగలవు దౌర్వాసపురాణము, మార్కండేయ భవిష్యోత్తరఖండముల నాధారముగా పైవిషయములన్నిటికిని నేను ఏకవాక్యతసంఘటించి పరిష్కరింపఁగలిగి యున్నాను. అవిషయములన్నియు తెలుపుటకు ఇచ్చట స్థలముచాలలేదు కాన నా 'కాకతిప్రోలరాజు' పుస్తకముచదివి పై విషయములకు ఏకవాక్యత తెలిసికొనవలసినదని పాఠకులను గోరుచు కాకతీయ పదోత్పత్తితో నీవ్యాసమును ముగించుచున్నాను.

# కాకతీయులనాటి సాహిత్యము

శ్రీ నిడదవోలు వేంకటరావు

[చిరస్మరణీయమగు ప్రాచీనాంధ్రసామ్రాజ్య వైభవులను పునరుద్ధరించి ద్విశతాబ్దుల పర్యంతమాంధ్ర దేశము దేదీప్యమానముగ బరిపాలించి, కమనీయ యశఃకాయులైన కాకతీయుల సాహిత్యచరిత్రమాంధ్ర మహాజనుల కవశ్యపఠనీయమై, యమితోత్సాహజనకమై యలరారును. కాకతీయులు, కమ్రకీర్తులును, గణనీయులును, కవనీయులునగు [1]కమ్మవంశీయులగుటచేత, నేడు ప్రాచీనసాహితీసముద్ధరణ దీక్షాదక్షులై, ఆ యుద్యమమునకు మూలస్తంభాయమానులైన శ్రీ ముళ్లపూడి తిమ్మరాజు కమ్మకులాలంకారుని శుభాంకితముగావెలయుచున్న సాహితీవాల్లభ్యమునకు-నీవ్యాసమొక యుపశ్రుతిగా విద్వల్లోక మంగీకరించుగాక-]

## ఆంధ్ర సాహిత్యము.

ఆంధ్రవాఙ్మయచరిత్రమున ప్రాఙ్నన్నపార్య, కవిత్రయ యుగముతో, కాకతీయుల యాంధ్రసాహిత్య పరిణామము సమన్వయము జెందుచున్నది. ఈ సమన్వయము కేవల సారస్వతచరిత్రకేగాక, మత, సాంఘిక, సాహితీప్రక్రియాపరిణామమునకు దోహదము నొనరించినది. అందు మొదటిది శాసనవాఙ్మయము.

ప్రాఙ్నన్నయకాలమున—అద్దంకి, కందుకూరు, బెజవాడ యుద్ధమల్లశిలాశాసనములవలె, కాకతీయ యుగసాహిత్యచరిత్ర విరియాల కామసాని గూడూరు శాసనముతో ప్రారంభమగుచున్నది.

## విరియాల కామసాని

### గూడూరుశాసనము క్రి. శ 1000

తెలుగుసాహిత్యములో మొట్టమొదట 'కాకతి' అను శబ్దమున పైశాసనముననే ప్రయోగింపబడినది చారిత్రకముగ కాకతీయశాసనములలోనిది మొదటిది. సాహిత్యమున మొదటిదే—ఇందు 3 చంపకమాలికలు. 2 ఉత్పలమాలికలుగలవు. నన్నయకు ముందు

1. కాకతీయులు కమ్మవంశోత్పన్నులని కాలాంతరమున స్థలాంతరముగ ప్రత్యేకముగ నిరూపింతును.

శాసనములలో దేశివృత్తములగు సీసమధ్యాక్కర లుండగా నిందు సంస్కృతవృత్తములగు చంపకోత్పలములుండుట విశేషము. విరియాలవారు, విశిష్ట కమ్మవంశీయులనుట నిర్వివాదమైనవిషయము. ఈ శాసనము చాలముఖ్యమైనదగుటచేత దీనినిగూర్చి పరిశీలన వ్యాసంగమింకను జరుగుచున్నది.

[1]వెల్లకి గంగాధరమంత్రి
కరీంనగరశాసనము – క్రీ. శ. 1171
( పద్యమయము )

నన్నయ యుగమువెనుక, తెలుగువాఙ్మయమున శివకవియుగము వెలసినది. అయుగమున వెలసిన శివకవులనుగూర్చి తెలుపుటకుముందు శాసన కవియు, మంత్రిశేఖరుడునగు వెల్లకి గంగాధరమంత్రిని గూర్చి తెలిపెదము. క్రీ, శ. 1115 నుండి 1158 వఱకు ననుమకొండను పరిపాలించిన రెండవ పోల రాజు గంగాధరమంత్రిని వేగిదేశమునుండి పిలిపించి ననుమకొండ రాచనగరున కధ్యక్షునిగ నియమించెను. అవెనుక – క్రీ. శ. 1158 నుండి క్రీ. శ. 1195 వఱకు పాలించిన రుద్రదేవచక్రవర్తి కాలమున నీతడు మహామాత్యపదవి వహించెను. అకాలము నందు వేయించినది పైశాసనము.

ఈశాసనము ముప్పదిరెండు పద్యములుగల యొక చిన్నకావ్యము—ఇందు పద్యములలో గంగాధర మంత్రి చేసినఘనకార్యములు వర్ణితములైనవి. శాసనమున "నేను చేసితిని" "నేను ప్రతిష్ఠించితిని" అని యుండుటచేత గంగాధరమంత్రియే శాసనకావ్యకర్త. ఈతడు శివ, విష్ణ్వాలయములు కట్టించుటయేగాక బ్రహ్మకు, కేశవాది చతుర్వింశతి నామదేవాంకితముగ నిరువదినాలుగు గుళ్ళను నిర్మించియున్నాడు. సాహిత్యమున నీక్రింది రెండుగుణములచేత నీశాసనము ప్రాముఖ్యము వహించినది.

1) విభక్తిప్రత్యయముల నుదాహరించు[2]నుదారలక్షణము గల్గియుండుట

2) సప్తసంతాన ప్రశంస—

ఇందు రెండవది ప్రసిద్ధమే. మొదటిదాని కొక యుదాహరణము. రుద్రదేవునికి తృతీయా విభక్తివిశేషణములను జేర్చుచు మూడు పద్యములు రచించియున్నాడు. వీనివలన యాతనికవితాశైలియు తెలియనగును.

*స. శ్రీకాంతాకాంతుచే నాశ్రితవిబుధజనాశీస్థిర ప్రాజ్యరాజ్య*
*శ్రీకాంతాకాంతుచే విస్తృత నిజభుజనిస్త్రింశ నీతాన్యరాజ*
*శ్రీకాంతాకాంతుచే దిక్క్షితిగగనసమాశ్లిష్ట విస్పష్టకీర్తి*
*శ్రీకాంతాకాంతుచే నూర్జితరిపుమృగరాజీ మృగారాతిచేతన్.*

*చ. వరనరపాలమౌళిమణి భాస్వరదీప్తిలతా నితాంత వి*
*స్ఫురిత పదాబ్జుచే, నహిత భూతలనాథ వరూథినీ సరో*
*వరమథనప్రభూత మదవద్విర[1]దాధిపుచే, విరోధి భూ*
*ధర శిఖరప్రభిన్న విదితత్రితశేంద్ర నిశాతహేతిచేన్.*

1. శాసనపాఠము వెల్లంకి అని యుండదగును.
(చూడుడు తెలుగుకవులచరిత్ర ప్రస్తుతవ్యాసకర్తరచితము మదరాసు విశ్వవిద్యాలయ ముద్రణము 296—297 పుటలు).
(వెల్లింకిగ్రామనామము ప్రాచీనులైన తెలుగుకవులలో వెల్లంకి తాతంభట్టు అన్నప్రసిద్ధలాక్షణికుడుగలడు).

2 విస్మృతప్రాయమైన యీ యుదాహరణశాఖను నేనే మొదట యుద్ధరించి ఆ వాఙ్మయచరిత్రను రచించి, నవీనకాలమున నా సాహిత్యప్రక్రియ రచనకు దోహదము గల్పించితిని.

1. శాసనపాఠము మదవద్విరదాధిపుచేతని యుండదగును.

క. సురకరిపతి, మృగపతిహరి
సురసతి ధవళ సరసిరుహ శుక్తిరుహసదృక్
సురుచిర విశదయశోభా
సురనిధిచే సుకవి తరణి సురనిధిచేతన్."

శివకవిత్రయము

మల్లికార్జున పండితారాధ్యులు

అంధ్రదేశమున నారాధ్యసంప్రదాయము లేక సవైదిక వీరమాహేశ్వరాచారమును ప్రవర్తిల్లజేసిన మల్లికార్జున పండితారాధ్యుడు, శైవపండితత్రయమున త్వతీయుడు. పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమునకు కథానాయకుడు. ఈతడు కాకతి రుద్రదేవచక్రవర్తి సామంతుడగు పానుగంటి ఉదయా వనీశుని కాలమున (క్రీ. శ, 1162) నున్నవాడు– ఈతని గ్రంథములు శివతత్త్వసారము (అసమగ్రము), గద్యకృతులు ఆరాధ్యసంప్రదాయమునకు పరమ ప్రామాణికములైయున్నవి.

నన్నెచోడ కవిరాజు

కుమారసంభవ మహాకావ్యకర్తయగు నన్నెచోడకవి యీకాలమువాడే. ఈతడు మల్లికార్జున పండితుడు బ్రహ్మచారియై, శ్రీశైలమున తపస్సుచేయు చున్నకాలమున నాతనికి కుమారసంభవము కృతి నొసంగెను.[2] ఇందుపయుక్తమైన శైవమతసాంకేతిక ములు. జంగమలింగ, శివపారమ్యాదు లీతడాధ్య సంప్రదాయమునకు కొంచెము ముందుగా వెలసిన వాడని నిరూపించుచున్నవి. ఇది యీతనికాలము నిర్ణయించుట కొక ప్రబలాధారము.

పాల్కురికి సోమనాథుడు.

ఈతడు బసవన ప్రతిపాదించిన యవైదిక శైవసంప్రదాయమగు జంగమ సంప్రదాయమును, పండితారాధ్యుడు ప్రవర్తింపజేసిన సవైదికారాధ్య సంప్రదాయమును కర్ణాటాంధ్రదేశముల చిరస్థాయిగ వెలయునట్లు తన కవితచే ప్రచారముగావించిన మహనీయుడు ఈతడు తెలుగు, సంస్కృతముల యందేగాక తమిళ, కన్నడ, మహారాష్ట్రాది భాషల యందు మంచి ప్రవేశముగలవాడు. కన్నడభాషలో నీతనిగ్రంథములే కలవు. ఇక తెలుగున దేశభాషను సాధనముగా, మతప్రచారముచేసిన మహాకవి. ఆంధ్ర వాఙ్మయమున దేశిసంప్రదాయమునకు మూల పురుషుడు. తెలుగున నీక్రింది నూతనసాహిత్య ప్రక్రియలకు, ఆయాశాఖలకు నీతనిగ్రంథములే ప్రాథమికములు.

1. ద్విపద — బసవపురాణము, పండితా రాధ్యచరిత్ర.

2. శతకము — వృషాధిపశతకము.

3. ఉదాహరణము— సంస్కృతాంధ్ర బసవో దాహరణములు, పంచప్రకారగద్య ఇత్యాదులు.

5 ముక్తకరచన — బసవాష్టకాదులు.

ఈతడు చతుర్వేదపారగుడు. స్మృతులు, అగ మములు, పురాణేతిహాసములు, కావ్యనాటకములు మొదలగు సమస్తవైదిక లౌకిక సంస్కృత భాషా గ్రంథముల నాకళించుకొన్న సర్వజ్ఞుడు ఈతని పండితారాధ్యచరిత్రము *"తెలుగువారి తొలివిజ్ఞాన సర్వస్వము"*

ఈతడు కాకతిరుద్రదేవ, మహాదేవులకాలము నందును, గణపతిదేవచక్రవర్తి కాలమున పూర్వార్థ మున నున్నవాడు. ఇప్పటికి నెనిమిదిశతాబ్దులకు పూర్వమే జాతీయసమైక్యతకు, భాషాసమైక్యత ప్రధాన సాధనమని నిరూపించి కృతకృత్యుడైన దీర్ఘదర్శి

రుద్రదేవచక్రవర్తి

ప్రతాపరుద్రుడను నామాంతరముగల రుద్ర దేవచక్రవర్తి సంస్కృతాంధ్రభాషలయందు కవియు

2. నా కుమారసంభవ ముద్రణపీఠిక—వావిళ్లప్రచురణము మద్రాసు.

పండితుడునై ప్రఖ్యాతిజెందెను. ఈతనికి "విద్యా భూషణుడు" అను బిరుదముగలదు. ఈతడు సంస్కృతమున "నీతిసారము" అను గ్రంథము రచించినట్లుగా నీక్రిందిపద్యమునుబట్టి తెలియుచున్నది.

చ పరువడి యాంధ్రభాషగల బద్దెన నీతియు, సంస్కృతంబులో
బరగఁ బ్రతాపరుద్ర నరపాలునిచే రచియింప బడ్డ యా
నరవరు నీతిసారము వినం జదువం గడు మంచిదంచుఁ జె
చ్చెరఁ గవి నీతిపద్ధతులు చేసె వినోదము బాల బోధకున్.

తెలుగునకూడ "నీతిసారము" నీతడు రచించినట్లు మడికిసింగన రచితమైన సకలనీతిసమ్మత పద్యంబులనుండి తెలియుచున్నది ఈతని సంస్కృత నీతిసారమును, ముద్దరాజురామన, తన రాఘవ పాండవీయ వ్యాఖ్యానమున పేర్కొన్నాడు. రుద్రదేవచక్రవర్తి ప్రాచీన రాజకవులలో నొక్కడనుటకు సందేహములేదు

## పావులూరి మల్లన

మల్లన సారసంగ్రహ గణితములో కొన్ని ప్రతులలో —

సీ "ఘనుడు ప్రతాపరుద్రుని పట్టణంబున
పట్టుమగల విడు పరగనడచె."

అను పద్యపాదముండుటవలన మల్లన రుద్రదేవ చక్రవర్తి కాలమువాడేయని చెప్పవచ్చును మఱియు నీతని గణితమే కాకతీయులకాలమున, సర్వవ్యవహారములయందు నుపయుక్తమయ్యెడిదని తెలియవచ్చుచున్నది ఈతనివిషయమై శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు (త్రిలింగ 1-3-1949), కీ శే. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక 1923 వ్రాసిన వ్యాసములు చూడనగును.

## గణపతిదేవ చక్రవర్తి

త్రిలింగసామ్రాజ్యస్థాపకుడగు గణపతిదేవచక్రవర్తికాలమున నాంధ్రసాహిత్యము పెంపొందినది. ఈతనికాలమున తీరప్రాంతకవులకు త్రిలింగ లేక నేటి తెలంగాణాప్రాంత కవులకు సమావేశముగల్గినది. మధ్యయుగమున పెక్కునాడులందుండిన యాంధ్రులందఱిని నొకేసామ్రాజ్యస్థులనుగా చేసినదీతడే.

## కేతన

దశకుమారచరిత్ర, ఆంధ్రభాషాభూషణము, విజ్ఞానేశ్వరము అను మూడుగ్రంథములు రచించిన కేతన తొలుత తెలుగులో "ఒరుగల్లు" అని కాకతీయ రాజధానిని తన ఆంధ్రభాషాభూషణమున పేర్కొన్నాడు. ఈతనికాలము క్రీ. శ. 1250.

## తిక్కన

తిక్కనసోమయాజి - కేతన దశకుమారచరిత్ర భర్త. మహాభారతమున పదునైదుపర్వములకు కృతికర్త. ఈతడు తన యేలికయు, నెల్లూరుప్రభువును నగు మనుమసిద్ధిని దాయాదులు సింహాసనభ్రష్టుని చేసినపుడు తిక్కన, గణపతిదేవచక్రవర్తి సాహాయ్యమున వారిని తరిమించి, మనుమసిద్ధిని సింహాసన పునఃప్రతిష్ఠితుని చేసెనన్నవిషయ మందఱెఱింగినదే గావున వివరింపలేదు. తిక్కన ఓరుగల్లునకు వచ్చినప్పుడు గణపతిదేవచక్రవర్తి సమక్షమున గణపతి దీక్షాగురువు మంత్రియు నగు శివదేవయ్యను కలిసికొనుట కాకతీయసాహిత్య చరిత్రమున నొక లోకోత్తరసన్నివేశము. శివదేవయ్యను, తిక్కన "ఈతడు సాక్షాదీశ్వరుడుగాని మనుష్యమాత్రుడు కాడని" చెప్పుటయే శివదేవయ్య విశ్వాతీత విశిష్టతను వేనోళ్ళ తెలుపుడు చేయుచున్నది. అట్టి శివదేయ్యనుగూర్చి యిపుడు తెలిసికొందము.

### శివదేవయ్య

ఈతడే గణపతిదీక్షాగురువగు విశ్వేశ్వరశివ దేశికులు ఈతడు గణపతిదేవచక్రవర్తి కాలమున కాకతీయసామ్రాజ్యమున-రాజకీయ సాహితీరంగముల ప్రధానుడైయుండెను. ఈతడాంధ్రభాషలో కవియగుటయేకాక, ప్రప్రథమముగా

"*ఆంధ్రకవితాపితామహుఁడు*"

అను బిరుదమందినవాడు[1]. ఈతని రచనలు రెండు- 1. పురుషార్థసారము. 2 శివదేవధీమణిశతకము.

వీనిలో నేవియు పూర్తిగలభింపలేదు. శివదేవ ధీమణి శతకమున రెండుపద్యములుమాత్రమే లభ్యమగుచున్నవి. అవి రెండును లోకోత్తరకవితాప్రతిభ ప్రదర్శించుచున్నవి—ఒక్కటి యుదాహరింతును.

చ. అరయగఁబిన్ననాడు సిరియాళుఁడనై
  యెలబ్రాయమందు సుం
 దరుఁడను నంబియై పదనుదప్పిన
  గుండయగారి చందమై
 ధరఁ జరియింపగల్గిన తథాస్తు వృథా
  పరిపాకరూప దు
 ష్కరజననంబిదేమిటికి కాలుపనే శివదేవధీమణీ

శాంతిపర్వములో తిక్కన — భీష్మునిగూర్చి చెప్పుచు— "*పురుషుడు పురుషార్థసారభూషణుడు*" గదే అని యీతని పురుషార్థసారకృతిని స్ఫురింపజేసి యున్నాడు. ఇందుండి 38 పద్యములను మడికి సింగన తన సకలనీతిసమ్మతములో నుదాహరించి యున్నాడు.

### బద్దెన

బద్దెనీతియను నీతిశాస్త్రముక్తావళిని రచించిన బద్దెన గణపతిదేవచక్రవర్తి కాలమువాడని యీతని శాసనమొకదానిమూలమున తెలియనైనది.

### యథావాక్కుల అన్నమయ్య

క్రీ. శ. 1242 లో సర్వేశ్వరశతకము రచించిన యథావాక్కుల అన్నమయ్యయు నీ గణపతిదేవ చక్రవర్తికాలమువాడే.

### బయ్యన

అనంతామాత్యుని ముత్తాతయగు బయ్యన తిక్కనచే భవ్యభారతియని బిరుదుపొందినవాడగుటచే నాతడీకాలము వాడే.

### శరభాంకుడు

క్రీ॥ శ॥ 1295 నుండి క్రీ॥ శ॥ 1323 వఱకు కాకతీయసామ్రాజ్యమునేలిన కడపటి కాకతీయచక్రవర్తి ప్రతాపరుద్రుని మంత్రియై సంస్కృతాంధ్ర కవియై పేరందినవాడు శరభాంకుడు. ఈతడు రచించిన తెలుగుకృతులలో '*శరభాంకలింగశతకము*' అనునొకటిమాత్రము మనకు లభ్యమగుచున్నది. సంస్కృతమున లింగధారణచంద్రిక యీతనికృతి. ఈతని శరభాంకలింగశతకమున తురక లోరుగల్లు కోటను ముట్టడించుటకు వచ్చినసందర్భము వర్ణింపబడుటచే నిది— క్రీ॥ శ॥ 1320—23 ప్రాంతముల రచితమై యుండవచ్చును.

ఉ. చాపముగానహార్యమును జక్రిని బాణముగాగ,
  నారిగాఁ
 బాపదొరంబొనర్చి తలపంద్రిపురంబుల
  గాల్పవే, మహో
 ద్దీపిత తీవ్రకోపమున దేవతలెల్ల నుతింప నాటివిల్
 పాపపుఢిల్లిమీద తెగబాపఁగదే శరభాంకలింగమా.

"ఢిల్లీ" అనుమాటకు తెలుగున నిదియే తొలి ప్రయోగము. ఈతడు శివదేవయ్యవలె, తన్నుదాను సంబోధించుకొన్నాడు. ఈతనితరువాత నూఱేండ్లకు వేమన యీవిధానము నవలంబించినాడు తన పద్యములలో నీ శరభాంకుని పేర్కొన్నాడు.

---

1. చూడుడు నావ్యాసము-ప్రథమాంధ్రకవితాపితామహుడు శివదేవయ్య-భారతి-పార్థివ-ఫాల్గునము-
(ఫిబ్రవరి-1945)

## వచనవాఙ్మయ ప్రథమాచార్యుడు కృష్ణమాచార్యుడు

కాకతీయులకాలమున శైవమతమేగాక, వైష్ణవ మతము కొంత ప్రవేశముచేసికొన్నట్లు కృష్ణమాచార్య వృత్తాంతమువలన తెలియుచున్నది. ఈతడు సింహగిరి నరహరివచనములు, శఠగోపవిన్నపములు వచనముగా రచియించి యాంధ్రవచనవాఙ్మయమున ప్రథమాచార్యుడైనాడు [1] ఈతడు శరభాంకుని సమకాలికుడై, ప్రతాపరుద్రుని కాలమున నున్నట్లు యేకామ్రనాథుని ప్రతాపచరిత్రము తెలుపుచున్నది. అందీతనిమహిమలు కొన్ని వర్ణితములైనవి. ఈతనిని గూర్చి యీతని గ్రంథములనుగూర్చి వేఱొకచో దెలిపితినిగాన యిటమానితిని.[2]

## ఏకామ్రనాథుడు

ఈకాలమునకు జెందినవాడే. ప్రతాపచరిత్రను వ్రాసిన యేకామ్రనాథుడు. ఈతని యసలుపేరు ఏకోరామనాథుడు. ఈతడు "మల్లంపల్లి"వారి వంశమునకు మూలపురుషుడు. (చూడుడు నావ్యాసములు త్రిలింగ 24-12-1949 — 5-1-1950)

## మారన

తిక్కన శిష్యుడై మార్కండేయపురాణము రచించిన మారన ప్రతాపరుద్రునికాలమున ఓరుగల్లు నగర రక్షాధినేతయైన నాగయగన్నసేనానికి కృతి నిచ్చియున్నాడు.

## భాస్కర రామాయణ కవులు

నేడు మనకులభ్యమగు భాస్కరరామాయణము బహుకర్తృకమైనను, నందలి కవులందఱును కాకతీయ సామ్రాజ్యమునకు సంబంధించినవారే. భాస్కరుని యరణ్యకాండము సాహిణిమారాంకితము. ఈ సాహిణిమారుడు ప్రతాపరుద్రుని యశ్వసాహిణి - భాస్కరుని పుత్రుడు మల్లికార్జునభట్టు, సాహిణి మారునికుమారుడగు కుమారరుద్రదేవుడును [3] నానాకాలమువారే యగుదురుగదా. ఇక యుద్ధకాండ శేషము పూరించిన యయ్యలార్యుడు శాకల్యమల్లకవి సోదరుడగు అప్పయార్యుని కుమారుడు. ఈ శాకల్య మల్లకవి ప్రతాపరుద్రు నాస్థానియని యీతరువాత తెలుపుదును.

## గోన బుద్ధరాజు

రంగనాథరామాయణ కృతికర్తయగు గోన బుద్ధరాజు-క్రీ॥ శ॥ 1265-70 ప్రాంతముల రుద్రమదేవికాలమున నున్నట్లు తెలియుచున్నది. ఉత్తర కాండ రచించిన కాచవిభుడు విఠలరాజును తమతండ్రి బుద్ధరాజునానతిని రామాయణోత్తరకాండముపూరించినట్లాగ్రంథమున వ్రాసికొన్నారు. వారి యింటిపేరు కోటవారని కొన్నిప్రతులలో నున్నది. ప్రతాపరుద్రదేవుని సామంతులుగా, కోన గన్నారెడ్డి—రద్రాజ్యరక్షామణియైన విఠలనాథుడు క్రీ॥ శ॥ 1294 సంవత్సరమున రాయచూరుశాసనముగ పేర్కొనుచున్నది- ఈరంగనాథరామాయణకర్తృత్వవిచారమింకను జరుగుచునేయున్నది—క్రీ॥ శ॥ 1957 వఱకును. రంగనాథ రామాయణము-కాకతీయులనాటిదియనియే యందఱు భావించిరి- కాని కీ॥ శే॥ మల్లంపల్లి సోమశేఖరశర్మ గోనవంశీయులలో నొకడగు కాటయశాసనమునుబట్టి రంగనాథరామాయణము క్రీ॥ శ॥ 1380-1400 ప్రాంతముల రచింపబడెనని యూహించిరి[1].

---

1 చూడుడునావ్యాసము— వచనవాఙ్మయ ప్రథమాచార్యుడు భారతి పార్థివ భాద్రపదము (సెప్టెంబరు 1945)

2 ,, కృష్ణమాచార్యుడు-ఆంధ్రప్రదేశ అవతరణసంచిక (1950)

3 కుమారరుద్రదేవుడు ద్వితీయప్రతాపరుద్రుడే యని యీ తరువాత అనుముల వేంకటశేషకవిగారు తమ "కుమార రుద్రదేవుడు" అను గ్రంథమున దెలిపిరి.

చూ. రంగనాథరామాయణ పీఠికపుట 8. రాయల్ అండ్ కో., కడపవారి ప్రచురణ.

వాడుకలో మాత్ర మీ రామాయణమునకు రంగనాథరామాయణము అని కలదు కొన్నిలక్షణగ్రంథములలో ఆచ్చవెల్లి గంగన్నగారి రామాయణము అని కలదు. ఈరంగనాథుడువేఱు—కాని కాకతీయుల కాలమునకు సంబంధించినవారిలో మఱియొక రంగనాథుడుకలడు—అతడు.

## చక్రపాణి రంగనాథుడు

ఇతడు తొలుత వైష్ణవుడై — శ్రీరంగనాథుని సేవించుచువచ్చి, శివనింద చేయుటచే అంధుడయ్యెను పాల్కురికి సోమనాథుని ప్రత్యుద్దియై, యాతనికరుణవలన కన్నులను బడసెను. ఈతనిచరిత్ర ప్రతాపచరిత్రయందు వర్ణితమైనది. ఈతడు పాల్కురికి సోమనాథుని సమకాలీనుడుగాన కాకతీయసామ్రాజ్యమునకు సంబంధించినవాడే. ఈతడు కన్నడభాషలో కవి. తెలుగున పెక్కుకృతులు రచించినట్లు కన్నడగ్రంథము తెలుపుచున్నది. అందు నొకటియగు "నయన రగళ"ను శ్రీ॥ శే॥ ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించియున్నారు.

ఇట్లు తెలుగుకవులు, కాకతీయులకాలమున వెలసినను—కాకతీయరాజులు కృతినందిన తెలుగుగ్రంథమొక్కటియైన యింతవఱకు లభ్యముకాలేదు. ఆయుగమున లభ్యమైనవానిలోనైన-భాస్కర, రంగనాథరామాయణకవులు వారి కర్తృత్వవిచారణ—కాలనిర్ణయ నిర్ణయవివాదములింకను సాగుచునేయున్నవి. కూలంకషముగ తాళపత్రప్రతులు పరిశీలించినగాని యీవివాదముల కంతుండదు. ఒక రామాయణమునకేగాదు, తక్కిన కాకతీయులనాటి సాహిత్యమునకు సంబంధించిన యే యొకటి రెండు గ్రంథములోతప్ప తక్కినవి సుపరిష్కృతములై వెలయలేదు. ఆంధ్రభాషావిద్వాంసులు, ప్రామాణికపరిశోధకు లిట్టిపరిశీలనకు కడగినచో, కాకతీయులనాటి తెలుగుసాహిత్య విశిష్టత యింతకన్నను విశదముగా తెలియగలదు[1].

## సంస్కృత సాహిత్యము

కాకతీయులనాడు సంస్కృతసాహిత్య మభివృద్ధి జెందినది. తెలుగునందువలె సంస్కృతమునందును ప్రసిద్ధులగు ఈశ్వరసూరి అపంచితేంద్రయతి—నాగదేవకవి మొదలగువారుకలరు. వారినిగూర్చిన ప్రస్తావనస్థలసంకోచముచే విరమించితిని. ఇక కవులు గ్రంథములనుగూర్చి సంగ్రహముగా దెలిపెదను.

౧: జాయపసేనాని నృత్తరత్నావళి—ఈతడు గణపతిదేవచక్రవర్తి బావమరది. అతనిగజసాహిణి. ఈతడు మహాశూరుడు—కమ్మకులజుడు. ఈతని 'నృత్తరత్నావళి' నేటికిని సంగీతశాస్త్రవాఙ్మయమున నొక ప్రశస్తగ్రంథముగా ప్రసిద్ధిజెందినది

౨. విద్యానాథుడు— ప్రతాపరుద్రుని కాలమున వ్యాప్తినందిన సంస్కృతగ్రంథములలో మకుటాయమానమైనది. విద్యానాథమహాకవి విరచితమైన ప్రతాపరుద్రయశోభూషణము విద్యానాథుడనునది బిరుదనామము. అతనియసలు పేరగస్త్యుడు[1]. ఈనామముతోడనే గంగాదేవి తన మధురావిజయమున నీతనిస్తుతించినది. ఈతడు రచించినకృతులు డెబ్బది.

3 గంగాధరకవి—మహాభారతకథను నాటకరూపమున రచించినకవి. సిద్ధనాథుని పుత్రుడు.

౪. నరసింహకవి—కాదంబరీ నాటకకర్త

---

1 శ్రీ తిమ్మరాజ మహోదార సాహితీపరిపోషణమున నీ యుద్యమము చిరకాలములలోనే ఫలవంతము కాగలదు.

1. చూడుడు, అగస్త్య బాలభారతపీఠిక-సుప్రసిద్ధసంస్కృత సాహితీచరిత్ర గవేషణాచార్యులు శ్రీమాన్ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు.

౫. విశ్వనాథుడు—"సౌగంధికాపహరణము" అను సంస్కృతనాటకకర్త. ఈతడు తానగస్త్యకవికి మేనల్లుడనని వ్రాసికొనుటచేత విద్యానాథునికి మేనల్లుడు.

౬. వీరభల్లటదేశికుడు— ఈతనిగ్రంథము లభ్యములు కాలేదు. అనేక శాస్త్రములలో పాండిత్యముగలవాడని శాసనము తెలుపుచున్నది.

౭. అప్పయార్యుడు—ఈతడు క్రీ॥ శ॥ 1310 లో జినేంద్రకల్యాణాభ్యుదయము అను కావ్యము రచించెను. ఈగ్రంథరచనవలన కాకతీయుల నాడు సాహిత్యరచనమున మతవైషమ్యములు లేవని తెలియుచున్నది

౮. రావిపాటి త్రిపురాంతకుడు—ఈతడు సంస్కృతమున 'ప్రేమాభిరామము' అను వీధినిరచించెను. వినుకొండ వల్లభరాయడు దానిని 'క్రీడాభిరామమను' పేర తెలిగించెను.

కాని పై సంస్కృతరచనలలో ప్రతాపరుద్రీయమునకు వచ్చిన ప్రఖ్యాతి యే యితరగ్రంథమునకు రాలేదు. ఆంధ్రకవుల కుపజీవ్యమైన సంస్కృతాలంకారగ్రంథమది యొక్కటియే యనిన దీనిప్రాశస్త్యము తెలియగలదు. మూర్తికవి నరసభూపాలీయము, నాటకప్రకరణము వినా· దీని భాషాంతరీకరణమే కొన్ని సంస్కృతగ్రంథములు ముద్రణయే కాలేదు. ఇంతయేల సంగీతసాహిత్య ప్రపంచము లెదురుచూచుచున్న జాయసేనాపతి నృత్తరత్నావళి యింతవఱకు ముద్రణములోజూచుభాగ్యము మనకు లభింపలేదు

కాకతీయులనాటి సంస్కృతాంధ్ర సాహిత్యమునుగూర్చి యొకమహోద్గ్రంథమే వ్రాయదగినంత సామగ్రిగలదు. అయిన, కాలస్థలపరిమితులననుసరించి సంగ్రహముగా వ్రాసినందులకు. విద్వల్లోకమును మన్నింపుడని వేడుకొనుచున్నాను. త్వరలోనే సంపూర్ణగ్రంథ మాంధ్రమహాజనులకు నందించెదనని మనవి.

౯. శాకల్యమల్లకవి—ఈతని పూర్తిపేరు శాకవెల్లి మల్లికార్జునకవి. ఈతడు ప్రతాపరుద్రుని యాస్థానకవియే. కాకతీయరాజ్యవిచ్ఛిన్నానంతర మీతడు విజయనగరాస్థానముచేరెను. యీతడు సంస్కృతమున నిరోష్ఠ్యరామాయణము రచించినట్లు మరింగంటి సింగరాచార్యులు పేర్కొన్నాడు. ఈతడు చతుర్భాషా పండిత బిరుదాంకితుడు. అప్పకవి యితని పేర్కొన్నాడు. "అవ్యయసంగ్రహము" అను సంస్కృతగ్రంథమీతనిది. తంజావూరి పుస్తకశాలలోగలదు.

# చోళమన్మసిద్ధి

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

దానకాలములేని నాయకపల్లి శిథిలశాసనములో "కాకతిగణపతిమహారాజులు దిగ్విజయముసేసి పరమండలములు సాధించ్చి—నెల్లూరి రాజుచేత ఎనుంగులం గన్కిగగొనివచ్చి" రన్నట్లు స్థూలముగాచెప్ప బడినది. కాని ఇందలి 'నెల్లూరిరా' జెవరో స్పష్టముగా చెప్పలేదు.

తిక్కన నిర్వచనోత్తర రామాయణములో "వైరిమదాంధకారమునకు — భూరిప్రతాపంబు" వెలుగునివ్వగల మనుమసిద్ధి నెల్లూరు చోడవంశమూల పురుషుడైనట్లు అవతారిక వ్రాసినాడు. కాని, శాసనములో "తిక్కయదేవమహారాజులు — ధర్మాధర్మం విచారించి తమ తండ్రి తిరుకాళేశ్వర శ్రీమహాదేవరకు నంగభోగ రంగభోగములకూ—చిలుకపాటి కంపనలములో బోగడపాడనున్నది (పొలము)" దానముచేసినట్లు చెప్పబడియున్నది. రెంటిని కలిపి తిరుకాళ మనుమసిద్ధియనుట నిర్వివాదము.

"—చోళతిక్కధ్మాత్రీశుఁడు కేవలుండే—"
శైశవలీలనాఁడు పటు
శౌర్యధురంధర బాహుఁడైన పృ
థ్వీశ నరేంద్రుమస్తకము
నేడెఱఁగందుక కేలిసల్పఁడే.

ఈ వెల్నాటి — పాకనాటి చోడయుద్ధము క్రీ. శ. 13 శతాబ్ది ప్రారంభమునాటిదని నిశ్చయింపక తప్పదు.

క్రీ. శ. 1205—06 శకమునకు పిమ్మట వెల్నాటిచోడ పృధ్వీశుని రాజ్యపాలన శాసనములో చిక్కకపోవుటనుబట్టి తత్పూర్వమే నెల్లూరు మొదటి మనుమసిద్ధి కాకతి గణపతితో సంధికావించుకొని వెల్నాటిచోడ పృధ్వీశునితోను, విరోధులైన పడిహారి బయ్యన తిక్కనలతోను యుద్ధమునకు సన్నాహము చేయగా, యువరాజగు చోళతిక్కయ యౌవనోద్రేకముతో తెగించి యుద్ధములో వెల్నాటిచోడ పృధ్వీశుని తల ఖండించినట్లేర్పడుచున్నది.

పిమ్మట క్రీ. శ. 1209–10 శకప్రాంతములో కాకతిగణపతి దక్షిణదిగువభాగమున నెల్లురుగాల్చి బయ్యన తిక్కనల శాత్రవ శిరంబులం గ్రందుక క్రీడ వినోదమునలిపినట్లు సమన్వయము కుదురుచున్నది.

క్రీ. శ. 1209–10 నాటి కందుకూరుతాలూకా గుండ్లపాలెం శాసనములో *"శ్రీమన్మహామండలేశ్వర తిరుకాల్తి దేవమహారాజుల మూల (భృ) త్యులైన నెల్లూరుకోటపడవారిలో సిద్ధ్రీమదేవని కొడుకుసేనాం గమూలము"* పేరు పేర్కొనబడినది.

*"కాకతిగణపతి ధర్మార్థము"* పునర్దత్తము కావింపబడిన బాపట్లతాలూకా పెద్దచెరు శాసనదాత రెండవ నన్నిచోడుని కొడుకు (మల్లిదేవుడు) ప్రశస్తిలో *"కందుకూరుపురవరేశ్వర-పాకనాండువిషయ(ము)"* తన రాజధాని యైనట్లు చెప్పుకొన్నాడు. కాగా క్రీ. శ. 13 శతాబ్ది ప్రారంభకాలమునుండి తదంతమువరకు నెల్లూరు పాకనాడు కాకతీయసామంత రాజ్యముగా ఉన్నట్లు కనబడుచున్నది.

క్రీ. శ. 1214–15 నాటి కావలి తాలూకా దూబగుంటశాసనములో *"కాంచింగప్పుమగొన్నట్ట–శ్రీరాజేంద్రచోడమహారాజుల కొడుకు మన్మసిద్ధన దేవబోధమహారాజులకు ధర్మువుగా వారితమ్ముండు బసువ (తకల్కి)–"* దానమిచ్చినట్లున్నది. బసువతి తిరుకాలచోడుని అన్న మనుమసిద్ధి నెల్లూరు చోడ వంశికుడగునో, కాదో తెలియదు.

గుంటూరుజిల్లా నర్సారావుపేట శాసనములో నెల్లూరు చోడరాజవంశమంతయు కలదు. కాని క్రీ.శ. 1206–07 నాటి మొదటి మనుమసిద్ధిపేరందులో చేరకపోవుట చిత్రము.

ఇందలి కాలములన్నియు శాసనాధార క్రీ. శ. కాలములని విశ్వసింపవచ్చును.




క్రీ. శ. 1295–1326 మధ్యకాలములో క్రీ. శ. 1297–98 ప్రాంతమున రెండవ కాకతీయ ప్రతాపరుద్రునికి నర్సారావుపేట శాసనదాత సామంత రాజైనట్లుకూడ చెప్పబడినది. అన్ని విధముల నెల్లూరు పాకనాడు కాకతీయసామ్రాజ్యములో సామంతరాజ్య మనుటకంటె గత్యంతరము కనబడలేదు.

క్రీ. శ. 1263–64 నాటి కావలి తాలూకా ముంగమూరు శాసనములో *"శ్రీమన్మహామండలేశ్వర మన్మసిద్ధ దేవచోడమహారాజుల మహాప్రధాని శ్రీవత్సగోత్రం–"*అని చెప్పుటచేత అది గౌతమగోత్రు డగు తిక్కనమంత్రి వంశము కాదని చెప్పకతప్పదు.

క్రీ. శ్రీ. 1230–31 నాటి ముసునూరుశాసనములోని గండగోపాలుండ ఖండకిటిఃదిప(రు) కాల్తి దేవభూవరుని రాజ్యము–మంత్రికేతనుండు శ్రీవత్స గోత్రుడో, గౌతమగోత్రుడో స్పష్టముగ చెప్పజాలము. తిరుకాల్తిదేవునికి *'చోడతిక్కాలతిల'*యను నామాంత

రమున్నట్లు ముసునూరి సంస్కృతశాసనము చెప్పు చున్నది.

ఎట్లయినను క్రీ. శ. 1252 తేది ఉదయగిరి తాలూకా యేపిలగుంట శాసనములో శ్రీమన్మహామండ లేశ్వర (ప్రసాహిత) తిక్కయదేవ మహారాజులు సమస్తప్రశస్తిసహిత శ్రీమన్మహాప్రధానులైన సిద్ధన పెగడ తిక్కయనాథరి పెగడయుం దమతాండినంతోడు నింతవట్టునుంగూడి-స్వస్తిశ్రీసకవరుషంబులలో ౧౧౭౪ నేండు—వరీధావి సంవచ్చర(ము) దానముచేసినట్లు చెప్పబడియున్నది. కావున క్రీ. శ. 1252 నాటికి ఖడ్గతిక్కన యనబడు "*తిక్కయనాథరి పెగడ*" నెల్లూరు చోడతిక్క తిరుకాళుని రాజ్యములో సేనాధి పతియై క్రీ. శ. 1281–82 ప్రాంతమందలి కాటమ రాజు యుద్ధములో మరణించినట్లు చెప్పవీలున్నది.

అప్పటికి రెండవ మన్మసిద్ధికాని, మొదటి తిక్కరాజుకాని జీవించియున్నట్లుతోచదు. రెండవ తిక్కరాజును, నలసిద్ధిరాజును క్రీ. శ. 1281–82 కాటమరాజు యుద్ధములో-పశువులపుల్లరియుద్ధములో పాల్గొని మరణించియుందురనిపించుచున్నది.

వోరుగంటి ప్రతాపరుద్రుని (రుద్రమదేవి) కాలమున కాటమరాజు ౩౨ రాజ్యంసేసి లింగాలకొండ యరగ(డ్డ)పాడను నలసిద్ధిరాజుంగూడి యుద్దముసేసి బడుగులవారు చనిపోయేనాటికి కప్రులియుగంబొచ్చి ౧౯౮౫! యేండాయెను. అని గుండ్లపాలెం శాసన ములోకలదు.

ఇందలి యుద్ధకాలమెప్పటిదో కాటమరాజు కథనుబట్టి నిర్ణయింపవీలున్నదేమో పరిశీలింతము.

"ఎద్దులుమేపిన యెదురాడరాదు
బీడు కంచ్చలు బెదెరించరాదు
కడువేడ్క యీరీతి కట్టళ్ళుమాకు
అనిన యామాటలకు అంద్దరువొప్పి
తనరవ్రాయించిరి తిక్కనచాత
వి(రు)షు సంవత్సరవెలయుకాతికా్క
యా శు(ద్ధ)విదియ యలమి గురువారము.
యిలలోన నలసిద్ధిరాజిచ్చిన 'కవులు'.

ఆ వు ల మే పు క థ

పై కాటమరాజు కథలో శకకాలసంఖ్య చెప్పక పోయినను, శాసనకథలో సూచించినట్లో'*కాకితరుద్రుండు కట్టిన కోటయు*' పేర్కొనబడినది. కాగా, లెక్క ప్రకారము శా. శ, ౧౨౦౩ అగు నేటి వృషసంవ త్సరం కార్తిక శుద్ధ ౨ గురువారమునకు 16.10-1231 తేది బేస్తవారము సమకాలమగుచున్నది. విషు సంవత్సరములో పుల్లరికొలు పుట్టినను, చిత్రభాను కడపటికి కాటమరాజు యుద్ధము ముగిసినట్లు "*చిత్ర భాను అంత్యముకడ యదువంశ(ం)*" సూచన చేయు చున్నది. క్రీ. శ. 1281–82 మధ్యకాలములో నెల్లూరు అవులయుద్ధము ముగిసినందున ఖడ్గతిక్కన మరణము క్రీ శ. 13 శతాబ్ది కడపటికి సరిపోవు చున్నది.

ఖడ్గతిక్కన తమ్ముడగు కవితిక్కనకాలము కూడ కాకతి రుద్రమదేవి రాజ్యకాలమునాటిదే కాబో లనిపించుచున్నది. క్రీ. శ, 1282–90 మధ్యకాల ములో (కవిపతి మన్మసిద్ధిమరణానంతమే) తిక్కన తెనుగు భారతరచన కావించినట్లు తోచుచున్నది. రుద్రమదేవి వ్యక్తిత్వము ద్రౌపదిలోను, అవులపుల్లరి యుద్ధము, ఉత్తరగోగ్రహణాదులలోను కన్నులకు కట్టినట్లు వ్యక్తమగుచున్నది. రాయభారాదుల పునాది కాటమరాజు కథలోనివే కాబోలు.

క్రీ. శ. 1206–52 మధ్యకాలములో నెల్లూరు రాజ్యమును తిరుకాళతిక్కరాజు స్థాపించగా క్రి. శ. 1252–63 మధ్యకాలములో చోళమన్మసిద్ధిపాలిటి

(ప్రాయేటం?) యుద్ధములో విజయక్ష్మాధీశు నోడించెను (ఇతను ద్రవిడ–కర్ణాటోర్వీపతులపై దండెత్తిన వైరిగొంగ.) రక్కసగంగన గర్వమునణచి, చేకొన్న రాజ్యాంగము గంగయ సాహిణికిచ్చి రాజు గావించెను

మహారాష్ట్ర సామంతుడగు సారంగపాణిని యుద్ధములో ఓడించి, అతని అశ్వమును కానుకపొందిన మేటిరౌతు మన్మసిద్ధిచోళుడు.

అట్టి చోళమన్మసిద్ధికి క్రీ.శ. 1260–63 మధ్య కాలములో కవిబ్రహ్మ తిక్కనచే నిర్వచనోత్తరరామాయణ మంకితమిచ్చి, మామా యని పిలిపించుకొన్న ధన్యజీవి.

మనుసిద్ధితండ్రి తిక్కభూవిభునకు 'కవిసార్వభౌమాంక మవనిఁజెల్లు(టు)' కలదని తిక్కన చెప్పుట 'సకలవిద్యాపరిశ్రమ' మెరిగియేకాని, ముఖప్రీతి కొరకుకాదని స్పష్టమగుచున్నది

ఆశ్వాసాంతగద్యలలోని "శ్రీయుముభయకవిమిత్ర – తిక్కన నామధేయ ప్రణీతంబు" కృతిపతి మన్మసిద్ధి "ఉభయకవిమిత్ర" వ్యంగ్యచరిత్ర నెరిగించున్నదేమో! పరిశీలింపుడు

"మనుమభూవిభుసభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా నుభయకవిమిత్రనామము దాల్చె" నను అభినవదండి వివరణకంటె, వ్యంగకవిమైత్రియే వాంఛనీయమగుచున్నది.

# తిక్కయజ్వరసాభ్యుచితబంధము

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

*"వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా*
*భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు."*

అని వేమభూపాలుఁడు తనను గూర్చి పలికినట్లు శ్రీనాథమహాకవి చెప్పికొన్నాఁడు (కాశీ. 1-13)

'*రసాభ్యుచితబంధ*' మనఁగా, రసమున కుచితములైన పదముల కూర్పు. తిక్కయజ్వకవిత్వ మట్టి మార్పుకలదియని యర్థము. రసవంతమని భావము.

తిక్కనరచన రసప్రచురమనుట సువిదితవిషయమే. కాని, ఆ రచన నర్థముచేసికొని, అందలి రసము నాస్వాదించుట సామాన్యపు చదువరులకు సాధ్యము కాదు. అటు సంస్కృతభాషాసంప్రదాయములను, ఇటు తెలుఁగుపోకడలను చక్కఁగా గుర్తించియున్న పండితులకు మాత్రమే సాధ్యము. ఒక్కొక్క పట్టున, అర్థనిర్ణయము, పండితులకును దుర్ఘటమే యగుచుండును. ఆవిషయమునే నే నీ వ్యాసమున యథావకాశము తెలుపఁదలఁచుకొన్నాను.

భట్టారకుని భారతానువాదముతో ప్రభవ మొందిన '*ఆంధ్రభాష*' తిక్కనమనీషి చేపట్టుటతో '*తెలుఁగుభాష*'గా తీరి, యించుమించు స్వతంత్రభాషగా దీపించినది. తిక్కన పద్యగద్యములలో మూఁడు వంతులు తేటదెనుఁగుమాటలే యుండును. అట్లున్నను అర్థము సుగ్రహము కాదు.

ఎందువల్లననఁగా : ఆమాట లనేక మీనాఁడు వాడుకలో లేవు. కొన్ని నిఘంటువులకే యెక్క లేదు. ఎక్కినవాటికి చెప్పినయర్థములలో పొరపాటు లున్నవి. ఆవిషయ మట్లుండఁగా, గ్రంథమునం దపపాఠములు నందుకొనియున్నవి. అనువాదము విశేషభాగము స్వతంత్రముగుటవలన సందేహనివారణకు మూలగ్రంథ మెక్కడనో గాని, సర్వత్ర సహాయ పడదు.

మఱియు, తిక్కనపదప్రయోగవిన్యాసము — అనితరకవి సాధారణము. ఆయన యన్వయములు

తెనుఁగుతెన్నున నడవవు. సంస్కృతసరణిలో సాగి పోవును. అవి అప్పుడు తెనుఁగుచదువరుల కంతు పట్టక చిక్కులు పెట్టును.

యజ్వ తెనుఁగుపలుకుబళ్లను, జాతీయములను విరివిగా నుపయోగించును. అవి కేవలసంస్కృత సాహిత్యపరులకు దురవగాహములై తికమకలు కల్పించును.

*విరాటోద్యోగములకు టీకలువ్రాసిన పండితులే, యెన్నోతావుల ప్రమాదమున కగ్గమైయున్నారు. ఇఁక సామాన్యపాఠకులమాట చెప్పవలెనా ?

ఈయెల్లయంశములకును తార్కాణలుచూపుచు అనువాదమున తిక్కనకైకొన్న స్వాతంత్ర్య మెట్టిదో మూలములోని భావములను తెనుఁగున పొందుపఱచిన చందమెట్టిదో తెలియుటకు, ఎడనెడ మూలమునుగూడ నుదాహరింతును.

భాషాభాగస్పృయులైన నేఁటి పిన్నలకు -- తిక్కన తెనుఁగుతెన్నుల తీరుతియ్యములతో పరిచయము గల్గించుటే నా యీ యుద్యమముయొక్క ముఖ్యోద్దేశము. నా వివరణములోని గుణదోషములకు భాషాభిజ్ఞులు ప్రమాణము.

(విరాటపర్వము)

'రూపమున యెడ్డెఱ'

'ఇమ్మహనీయ రూపమునయెడ్డెఱఁ గ్గొని వేడ్క నీకు యో
గ్యమ్మగుభంగిఁ జెప్పితిమిగాని సరోత్తమ! యొండు గాదు'

(1-226)

'రూపము...యెడ్డెఱ=ఆకారముయొక్క గొప్పతనము' అని టీక.

'రూపమున యెడ్డెఱ' షష్ఠీతత్పురుషము కాదు; సప్తమీ తత్పురుషము. ('కొన్నియెడల సప్తమీతత్పురుషమునందు న వర్ణకంబగు'. ప్రౌఢ సమాస 3.)

ఇట్లే తిక్కన 'చెల్వమునయెడ్డెఱ' అనియు ప్రయోగించియున్నాఁడు.

'రోహిణియొండె నొండెను నరుంధతి గాక మనుష్యజాతియే
యీ హరిణాక్షి చెల్వమునయెడ్డెఱ చూడ్కుల నాఁచికోలకా
దాహితగౌరవంబగు శుభాంగము తేజముఁ జూడ బుద్ధి సం
దేహముఁబొందుచున్నది సతీజనమిట్టిదియెట్లుగల్గుఁబునన్'

(1-295)

'ఈ హరిణాక్షి, రోహిణీ యొండె, అరుంధతి యొండెను. కాక మనుష్యజాతియే?' అని యన్వయము. 'ఈయింతి, దేవతాజాతిగాని, మానవకాంతకా'దని భావము.

'చెల్వమున యెడ్డెఱ=అందమునందలి యతిశయము చూడ్కులన్-ఆఁచికోలకాదు = చూపులను హరించుటయే కాదు; ఆహితగౌరవంబగు = గౌరవయుక్తమైన శుభాంగము తేజమున్, చూడన్=శుభాంగముయొక్క కాంతిని చూడఁగా, బుద్ధి-సందేహముఁ పొందుచున్నది'అని యర్థము. 'శుభాంగముఁ దేజముఁ జూడ'అనివావిళ్ల-వేమూరివారి పాఠము-సరికాదు.

'ఈ హరిణాక్షిచెల్వమున యెడ్డెఱఁ జూడ్కులు నాఁచికోలుగాదా'? హితగౌరవంబగు శుభాంగము దేజముఁ జూడ'అని చదలువాడవారి పాఠము.

'ఈ హరిణ అక్షి చెల్వమున నెడ్డెఱ=జింకకన్నులవంటి కన్నులుగల యీ ద్రౌపది చక్కదనమునకు, ఎడ్డెఱ = అతిశయముచేత, నాఁచికోలు = చిక్కినవి, కాదా=కావనుట. హితగౌరవంబు - ధరింపఁబడినఁ గొప్పతనము గలది. శుభాంగమున్=మంచిదేహమును' అని వారి టీక.

* విరాటపర్వమునకు శ్రీ చదలవాడ సుందరరామశాస్త్రి గారును శ్రీ వండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారును, టీకాకర్తలు. ఉద్యోగపర్వమునకు శ్రీ నేలటూరి పార్థసారథ్యయ్యంగారు టీకాకర్త.

వారి పాఠము; వారుచేసిన పదవిభాగము, 'ఈ హరిణాక్షి=ఈద్రౌపది' యిత్యాదిగా వారుచెప్పిన యర్థము. ఎంతవఱ కొప్పఁదగి యున్నదో, విజ్ఞులగు పాఠకులే విచారింతురుగాక!

'రూపమున యేడ్తెఱ' వంటిదే—ఇంకొకప్రయోగము.

'మధ్యం. దినమునయినుమాడ్కి బయలఁ దేజో నిధి శంతనుసూనుఁ డొప్పె' (భీష్మ 3-393)

'మధ్యందినమున యినుమాడ్కిన్=మధ్యాహ్నమునందలి సూర్యునివలె' అని యర్థము.

2. 'అనుజ్జ్వలముసేయు'

'కాళ్లయొప్పిద మాఁడుక ట్టనుజ్జ్వలముసేయంగ' (1-228)

'అఁడుకట్టు-కాళ్లయొప్పిదము - అనుజ్జ్వలము సేయంగన్' అని యన్వయక్రమము.

'అఁడుకట్టు=అర్జునుఁడుకట్టుకొన్నచీర, కాళ్ల యొప్పిదము=(అతని) కాళ్లయొక్క అందమును, (ఒప్పిదము) - ద్వితయార్థమున ప్రథమ) అనుజ్జ్వలము సేయంగన్=ఉజ్జ్వలము కాని దానినిగా చేయఁగా' అని యర్థము. 'కాళ్లఅందమును చెఱచుఁగా'అని భావము.

'ఉజ్జ్వలముచేయు'; 'ప్రచురముచేయు'-అనుట సహజము. 'అనుజ్జ్వలముచేయు'; 'అప్రచురముచేయు' వంటిప్రయోగము లరుదు.

3. 'మఱుఁగువడు'

"మంచు మఱుఁగువడిన మార్తాండుఁడును బోలె
నీఱు గలిసియున్న నిప్పువోలె" (1-228)

'మంచు-మఱుఁగుపడిన = మంచు-అడ్డపడిన, మార్తాండునివలె' అని యర్థము. 'మఱుఁగువడు' అను క్రియకు 'అడ్డపడు' అను నర్థమును నిఘంటువు లియ్యలేదు. 'దాఁగు, తిరోహితమగు' అను నర్థమును మాత్రమే యిచ్చినవి. ఆ యర్థము పద్యమున సరి పడదు అందువలననే టీకాకర్తలు— "మంచు మఱుఁగుపడిన=మంచుకప్పిన" అని యర్థము వ్రాసినారు.

'నిప్పుఁబోలె' అని అచ్చుప్రతుల పాఠము. 'నిప్పువోలె' అని యుండుట వ్యాకరణసమ్మతము. (చూ. ప్రౌఢ సమాస ౩౮)

4. "కూర్చికాక"

"అవలవచ్చు నాపదల కన్నిటికోర్చి లతాంగిఁ గూర్చికా
కి వెడమాటలన్ మదలఁడు" (2-78)

కూర్చికాక=కూర్పక. (కూర్చినదేగాని)

అవతలవచ్చు ఆపదల కన్నిటికిని తల యొగ్గి ఎట్టైనను, ఈ లతాంగిని (సైరంధ్రిని) కీచకునకు కూర్పవలసినదేగాని, అట్లు కూర్పక, పట్టిమాటలతో వానిని మరలింపఁజూచుట వృథాప్రయత్న మని భావము.

'కూర్చికాక' వంటి ప్రయోగము లితరగ్రంథములలో మృగ్యములు.

5. "చూపిచెప్పు"—"కావలయు"

"ఎన్నివిధంబులఁ జూపిచెప్పినం, గావలసైన వీఁడు
తగుకార్యమువట్టునె?" (2-78)

"చూపిచెప్పినన్=చెప్పినను"అని టీక.

'చూపిచెప్పుట'—అనఁగా 'చెప్పుట' కాదు. మంచిమాటలతో దృష్టాంతపూర్వకముగా మందలించుట.

'చూపిచెప్పు'—స. ప. క్రియ, అందియిచ్చు; చెప్పిపంపు; పట్టియాడు—మొదలగు క్రియలవంటిది. తిక్కన మఱిరెండు తావులలోను వాడియున్నాఁడు.

(1) "మాకుం గుడుమిం, డిదె మీరు ప్రక్కగొనుఁ డని
చరురడిచిన మనసుపొందు చక్కంబడునే?"—
"అని చూపిచెప్పి" (ఉద్యో 1-312, 313)

ఇక్కడ, "చూపిచెప్పి=పొడిచి పలికి" అని టీకాకర్త వ్రాసిన యర్థము. అనుచితము.

(2) ఏ నట్లు సూపిచెప్పితిఁగాని యది రణంబుపాడి గామి యెఱుఁగుదున్" (శల్య 2-105)

(ఈ 'చూపిచెప్పు' అను క్రియనుగుఱించి, నేను శుభకృత్సంవత్సరాదిసంచికలో— 'తిక్కన తెనుఁగు తెన్నులు' అను వ్యాసమున చర్చించియున్నాను) నిఘంటువులలో 'చూపిచెప్పు' అనుక్రియలేదు.

"కావలమైనవీఁడు" అని, వావిళ్ల - వేమూరి ప్రతుల పాఠము. కావలము=కావలము కలవాఁడు, అహంకారి. (రూపాంతరము-'కావరము')

'కావరుఁడైన వీడు' అని చదలువాడ-పా.- 'కావరుఁడు=దుష్టుఁడు' అని వారి టీక.

'కావరుఁడు' అన నక్కఱలేదు, 'కావరము' అన్నను మహద్వాచకమే యగును. కావరములు" అని తిక్కన వాడియున్నాఁడు.

"నీవు సుయోధను పాలికిఁ
బోవఁగవల దనియు నొక్క బుద్ధి వొడమెడున్
గోవింద! యతఁడు మంత్రులుఁ
గావరములు చక్కవినరు కార్యవచనముల్"
(ఉద్యో-3-28)

సూ. ని; 'కావరము' క్రింద,—"కావరమునఁ జక్క వినరు కార్యవచనమున్" అను పాఠమును చూపి, (వ్రాతప్రతి పాఠము-కావరములు. ముద్రి-భా-ల-వ్యా) అని తెలిపినది.

'కావరముచేత వినరు' అనుటకంటెను, 'దుర్యోధనుఁడును అతని మంత్రులును-దురహంకారులు; కార్యవచనములు వినరు' అనుటయే యుచితము. కావున 'కావరములు' అను పాఠమే గ్రాహ్య మనఁ దగి యున్నది.

మూలమున ఈమాట లేదు.

"న మమైతన్మతం కృష్ణ యత్త్వం యాయాః కురూన్ప్రతి సుయోధన స్సూక్ష్మమపి న కరిష్యతి తే వచః" (71-83) అని మూలము.

6. "దివసము లోఁబుత్తెంతు"; "కొఱలుము"

"అనవమున కని నీదు ని
వాసమునకు దివసములఁ నవశ్యంబును నే
నా సుదతిం బుత్తెంతు ని
జాసక్తి ఫలింపఁ గొఱలు మభిమతకేళిన్"(2-81)

దివములోన్-పుత్తెంతున్=పగటిలో పంపుదును 'పగలుపంపుదు' ననుట నేఁటి వాడుక. వాడుకమాట యెట్లున్నను, సుదేష్ణ సైరంధ్రిని పగటివేళ పంపుదు నన్నట్లు చెప్పుటలో ప్రయోజన మేమో, ఊహ కందుటలేదు. ఈమాట మూలములో లేదు.

'కొఱలుము' అను క్రియకు టీకాకర్త లర్థము చెప్పలేదు. సూ. ని, కోపించు; ఉండు; వెలుఁగు; అతిశయించు; ఒప్పు; నిండు; పడయు; కోటు—అను అర్థము అర్థము లిచ్చినది గాని, అం దొకటియు నిందు సరిపడుటలేదు.

సందర్భము ననుసరించి, అభిమతకేళిన్=ఇష్టమైన క్రీడయందు (=రతిక్రీడయందు). నిజాసక్తి ఫలింపన్=నీకోరికతీరునట్లు, కొఱలుము= అనుభవింపుము' అని చెప్పుట యుచితముగా కనఁబడుచున్నది. "తత్రైనాం ప్రేషయిష్యామి సురాహారిం తవాంతికమ్ తత్ర సంప్రేషితా మేనాం విజనే నిరవగ్రహే"
(15-6)
"సాంత్వయేథా యథాకామం సాంత్వ్యమానా రమే ద్యది" (,,-7)
అని మూలము.

7. "పుట్టుటగలుగ భావించు"

"పాంచాలివలని తగులు చిత్తంబు నుత్తలపఱు పం దలరి.... దుర్విదగ్ధుండుగావున నమ్ముగ్ధకుం దన సన్నిధిఁ గామవికారంబు పుట్టుటగలుగ భావించుచు."
(2-82)

కామవికారంబు, 'పుట్టుటగలుగభావించుచు' అనగా, పుట్టియుండు ననుకొనుచు' అని యర్థమై

యు డునని తోఁచుచున్నది. కాని 'పుట్టుట-కలుగన్' అనఁగా సరియైన యర్థ మేమో స్పష్టముగా నేర్పడుట లేదు అందువలననే కాఁబోలు! టీకాకారులు, 'కామవికారంబు=మన్మథవికారము' అనిచెప్పి, 'పుట్టుట కలుగన్' అను భాగమును వదలివేసినారు. ప్రతి పదార్థము చెప్పఁ గుదురని యిట్టి చిక్కుముట్టము లందందు గోచరించుచుండును.

8. "ఏలుదెంచి"

"కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్లుఱికెడు
వాలుగుసోగల నేలుదెంచి" (2-83)

అని వావిళ్ల, వేమూరి-ప్రతుల పాఠము. 'వాలుగు' అసాధువు. 'వాలుగ' సరియైన రూపము.

ఇది కన్నుల వర్ణనము— 'క్రేళ్ళుఱికెడు= ఎగిరిపడు, వాలుగ=వాలుగచేఁపలయొక్క, సోగలన్= సోగతనమును, ఏలుదెంచి=ఏలి, శాసించి' అని యర్థము. ('ఏలుదెంచు' ఔపమ్యద్యోతకము) కన్నులు వాలుగలవలె చంచలములును, సోగలునునై యున్న వని భావము. కన్నులను వాలుగలతో పోల్చుట ప్రసిద్ధము.

"తెలి వాలుగల డాలుగల సోగ కనుదోయి" (శుక. 1-315)

'ఏలుదెంచు' అనుక్రియ శ. ర. లో లేదు. సూ. ని. లోను లేదు. వా. ని., "ఏలుదెంచు. (ఏలు+ తెంచు. స్వార్థమున) శాసించు" అని యర్థముచెప్పి, ఈప్రయోగమునే చూపించినది.

"వాలుగ సోగల మేలుడించి" అని శ. ర. పా. ('సోగ' క్రింద) "క్రెళ్ళుఁగెడు వాలుగు సోగల మేలు డించి" అని సూ. ని. పా. ('మేలు' క్రింద).

చదలువాడవారిదియును ఇదే పాఠము— "క్రేళ్ళుఁగెడు వాలుగసోగలమేలు = వాలుగచేఁపల యొక్క దీర్ఘతలయొక్క చక్కఁదనమును. డించి= తక్కువపఱచి" అని వారిటీక.

క్రియ 'క్రేళ్ళుగయు' గాని, 'క్రేళ్ళుఁగు కాదు. కనుక 'క్రేళ్ళుఁగెడు' అను పాఠము తప్పు.

"మేలుడించి" అను పాఠమును అసాధువే. ఎందువల్ల ననఁగా :

'వాలుగసోగలన్ — ఏలుదెంచి'
'నెఱవిఱితమ్ములన్ — ఊఱకతెగడి'
'వాలికతూపులన్ — తూలఁదోలి'
'క్రొక్కారుమెఱుఁగులన్ — ఉక్కడించి'.

అని పద్యమున - నాలుగుపాదములలోను — వాక్యములు చక్కఁగా - ఒక్క ఫక్కిలో నడపఁబడినవి. నాల్గుపాదములలోను, సోగల; తమ్ముల; తూపుల; మెఱుఁగుల - అను ద్వితీయాంతముల వెంటనే ప్రాస యతులు కూర్పఁబడినవి. అది యొక శిల్పము.

"వాలుగసోకలమేలు - డించి"

(వాలుగ సోగలయొక్క మేలున్ - డించి) అను పాఠమున వాక్య మాఫక్కిలో లేదు. తక్కిన మూఁడువాక్యములతో నతుకక పద్యములోని శిల్పమును భంగపఱచుచున్నది. కనుక అది కవిపాఠము కాదు. 'ఏలుదెంచి' అనునదే కవిపాఠము.

9. 'అడ్డమువొచ్చిన సిగ్గుపెంపు'

"చిత్తము మెచ్చి నావలనఁ జిక్కఁగ వెండియు నా
ఉతాంగి య
చ్చొత్తినయట్లు నాకుఁ దన యుల్లము దెల్లము సేయ
కున్కి దా
నత్తఱిఁ గ్రొత్తకాన్పగుట నడ్డమువొచ్చిన సిగ్గుపెంపు న
న్నుత్తలమందఁజేయుటకునో తలపోసి యెఱుంగ
నయ్యెడున్." (2-84)

ఇది వావిళ్ళ వేమూరి ప్రతులపాఠము. చదలువాడవా రిపాఠమునే తీసికొని అర్థతాత్పర్యము లిట్లు వ్రాసినారు.

"సిగ్గుపెంపు = సిగ్గుయొక్క యతిశయము— మనస్సు నాయందుఁ దగిలియున్నను సైరంధ్రి తన

భావమును నాకు వెల్లడిచేయకపోవుట, ప్రథమదర్శన మగుటచే నాకు సంతాపము గల్గింప సిగ్గు అడ్డపడు టచేతనై యుండవచ్చును— పాఠాం— సిగ్గుపెంపు త న్నుత్తలమందఁజేయుటకునో = సిగ్గుయొక్క యతిశ యము, తన్ను = సైరంధ్రిని, కలఁతనొందఁజేయుట చేతనో, ఇదియే స్వరసతరమైన పాఠము."

'కీచకునకు సంతాపముగల్గించుటకు సైరంధ్రి సిగ్గు అడ్డపడిన దనుటయు, 'ఉత్తలమందఁజేయుట కునో' అను మాటకు, 'కలఁతనొందఁ జేయుటచేతనో' అని అర్థముచెప్పుటయు సరికాదు. వారు తీసికొన్న పాఠము, స్వరసతరమని వారు ప్రశంసించిన పాఠాం తరము - రెండును - అసాధువులే.

సూ. ని. లోను, వా. ని. లోను ('కాన్పు' క్రింద) "తా. నత్తఱిఁ గ్రొత్తకాన్పగుట నడ్డముసొచ్చెనో సిగ్గుపెంపు" అని పాఠము.

పైపాఠముకంటెను కొంత మేలేగాని, పాఠము- అడ్డముసొచ్చెనో సిగ్గుపెంపు' అనియుండుట కంటెను, 'అడ్డముసొచ్చిన సిగ్గుపెంపో ?' అని యుండుట యుచితతరము.

అప్పుడు, 'సైరంధ్రి నన్నువలచియు, తన యుల్లమును నాకు స్పష్టముగా తెలుపకుండుట, క్రొత్తగాచూచుటవలనఁ గలిగిన సిగ్గుచేతనో? లేక న న్నుడికింపఁదలఁచి అవిధముగా నున్నదో?' అని యర్థమగును.

ఏమైనను, పద్యములోని భావము స్ఫురించు చున్నదేగాని, రచన ప్రతిపదార్థముచెప్పుట కనువు పడుట లేదు అదే తిక్కన కవిత్వములోనున్న చమత్కారవిశేషము.

## 10. 'ఇక్కడక్కడవెట్టు'

"ఏడు సాగరములు నిక్కడక్కడవెట్టి
పలుచనిరొంపి మై నలఁదికొనఁగ" (2-134)

"ఏడు...ఁబెట్టి=ఏడుసముద్రముల నీరంతయుఁ బాఱఁజల్లి" అని టీక.

ఇక్కడక్కడవెట్టుట-యనఁగా 'కలఁచుట' గాని 'పాఱఁజల్లుట'కాదు. ఇక్కడక్కడవెట్టి=కలఁచి-అని యర్థము.

తిక్కన యీక్రియను నిర్వచనోత్తరరామాయణ మునను వాడియున్నాఁడు.

"ఒడలి పెంపున వీచి జడనిధు లిక్కడ
క్కడవైచు మంథనగంబు కరణి" (4-22)

క్రీడాభిరామమునను, ఈక్రియ [illegible].

"[illegible] చేసి చలి యిక్కడక్కడ వెట్టు వేకువన్" (45) 'ఇక్కడక్కడవెట్టున్=భాధించును' అని యిక్కడ అర్థము.

'ఇక్కడక్కడఁబెట్టి'అని భారతమునను, ఇక్కడ నక్కడఁబెట్టు' అని క్రీడాభిరామమునను ముద్రితమై యున్నది. కాని, యిది శబ్దపల్లవక్రియ. కనుక 'ఇక్కడక్కడవెట్టి'-'ఇక్కడనక్కడవెట్టు' అని యుండ నగును.

ఈక్రియ శ. ర. లో లేదు. సూర్యరాయ వావిళ్ల నిఘంటువులలోను లేదు.

## 11. "ఇక్కడక్కడపడు"

"ఇంతి, ధన్నుఁజూడమి కెంతయుఁ దల్లడిల్లు,
నిక్కడక్కడపడుఁ దగు అనుమడింపఁ,
జూచు నత్తన్వి" (2-250)

ఇక్కడక్కడపడున్=క్షోభించును. (చదలువాడ వారు, ఈక్రియ కర్థము వ్రాయలేదు.)

'ఇక్కడక్కడఁబడున్' అను అచ్చుప్రతుల పాఠము ఇదియును శ. ప. క్రియయే. కావున ఆపాఠము సరికాదు.

ఈక్రింది పద్యములలో సరియైనరూపమే ముద్రితమై యున్నది.

"అదరి మొన లక్కడక్కడ, వడి దిరిగిన"
(నిర్వ. 6–121)
"అనుమానముతోడ నిక్కడక్కడపడినన్"
(నిర్వ. 8–100)

ఈక్రియ వా. ని. లో నున్నది. సూ ని. శ. లలో లేదు.

12. "పట్టునఁబఱుప"

"అదరి కోర్కులు చిఱ్ఱుముత్తాడ వేడఁగు
పడిన యుల్లంబు పట్టునఁ బఱుపఁ దినకు
వశముగాకున్న నెంతయు వంతఁబొందు"(2-292)

'వెడఁగుపడి యుల్లంబు=కలఁతనొందిన మనస్సును, పట్టునఁ బఱుపన్=చక్కఁబెట్టుటకు, వశముగాకున్నన్' అని యర్థము.

'పట్టుపఱుపన్'అను నర్థమున 'పట్టునఁబఱుపన్' అని ప్రయోగింపఁబడినది. అన్ని యచ్చుప్రతుల లందును పాఠ మిట్లే యున్నది. 'పట్టునఁబఱుచు' విశేష ప్రయోగము ఈక్రియ నిఘంటువులలో లేదు.

13. 'చేపడు'

"నాపతులగు గంధర్వుల
చేపడి మృతిఁబొందె వీఁడె సింహబలుఁడు" (3-3)

'గంధర్వుల చేపడి=గంధర్వులకు చిక్కి' అని యర్థము.

'చేపడు' శ. ప. క్రియ. (చేపడు)

"ఈపనిమీఁది భారమున నీవిట వచ్చితిగాన పాతకుల్ సేపడిరేని చంపను." (విరా. 4–68)

'చేపడు' – ఏకపదము. ఇట్టి ప్రాసస్థాన ప్రయోగములు కనఁబడుచున్నను, పండితులు కొందఱు, 'చేఁబడు' అని యెందుకనఁగూడదు? అని వివాదించుచున్నారు. పొరపాటు.

'చేన్+పడు=చేఁబడు' అన్నచో, అవి వ్యస్త పదములు గావున శ. ప. క్రియ యనిపించుకొనవు. 'చేతియందు–పడు' అను నర్థము నిచ్చునేగాని, 'చిక్కు, వశమగు' అను నర్థము నియ్యవు. వివాద మపరిజ్ఞానమూలకము.

14. 'ఎల్లవాఁడు'

"ఎల్లవాఁ, డుం దనవారిఁ దోకొని కడున్ రభసంబునఁ గూడి వార్తకున్, ముందఱఁ బోయి గోధనము ముట్టుకొనన్ వలయున్" (3–126)

(ఎల్లవాఁడున్=ఒక్కొక్కడును" అని టీక.

'ఎల్లవాఁ' డనఁగా 'ప్రతివాఁడును' అని యర్థముగాని, 'ఒక్కొక్కఁ' డని కాదు. అందు క్రింది ప్రయోగము నిర్ధారకము.

"వెర విట్టితెఱఁగని వెంగలితనముని
యెల్లవాఁడును దన యెఱిఁగినట్టి
తెఱఁగున నిజకార్యదృష్టిఁ గనుంగొను"
(సౌప్తి 1-45)

వ్యవహారమున 'ఎల్లవారు' అను బహువచన రూపమున్నది గాని 'ఎల్లవాఁడు' అను ఏకవచన రూపము లేదు. 'ప్రతివాఁడు' అనుట నేఁటి వాడుక.

15. 'పొదులు నించెద.'

"వెఱచితిరేని నిల్వుఁ డొకవీరున కొక్కఁడ చాలుఁ గాక యెం
దఱు వలయుం గపిధ్వజము దవ్వుల వ్రేల్మిడిఁ ద్రుంచివైచెదం
బఱపెదఁ దత్పిశాచముల భగ్నము సేసెదఁ దేరు సారథిన్.
నెఱుకులు నొంచెదం బొదులు నించెద నర్జును గాత్రశాలలోన్." (4-201)

'పొడి' యనఁగా–తూణీరము. (అంబు లుంచు గొట్టము.)

"తరకసంబు; చిత్తళిక పొడి దొన యనఁ బరఁగుఁ దూణి" (సాంబ. స్థావర. 63)

'గాత్రమున–అంబులపొదులు (తూణీరములు) నించెద' ననుటలో ఔచిత్యము లేదు. అందువలన, సూ. ని.

'పొది' అను పదముక్రింద ఈపద్యమునే యుదాహరించి, "పొదులు = బాణసమూహములు, నించెదను" అని యర్థము చెప్పినది ఆ యర్థము ప్రకరణము ననుసరించి చెప్పఁబడినది. ప్రయోగాంతరములేదు తిక్కన ప్రయోగములు స్వతః ప్రమాణములు.

సూ. ని. చెప్పిన యర్థ ముచితముగనే యున్నదిగాని, పద్యమున అర్జునునిగాత్రము శాలగా చెప్పఁబడియున్నది. 'శాలలో బాణసమూహము నించెద' ననుటలోను, ఔచిత్యముగపడదు మఱి.

'పొది' కి మఱియొక యర్థమున్నదో! లేక పాఠములో పొరపాటున్నదో! విచారింపఁదగును. మూలములో 'పొదులు' లేవు; 'గాత్రశాల' యునులేదు.

"అద్య దుర్యోధన స్యాహం శల్యం హృదిచిరస్థితమ్.
సమూల ముద్ధరిష్యామి బీభత్సుం పాతయన్ రథాత్"
(48–21)

"హతాశ్వం విరథం పార్థం పౌరుషేపర్యవస్థితమ్,
నిశ్వసంతం యథానాగ మద్య పశ్యంతు కౌరవాః"
(48–22)

ఇప్పటికే వ్యాసము పెరిఁగి, యెల్ల నించుకగా నతిక్రమించినది. అందువలన– తిక్కన భారత భాగము తాళపత్రప్రతులసహాయమున పరిష్కృతము కావలసియున్న దనియు, ఆ కవిబ్రహ్మరచన కంతకును మంచి వివరణగ్రంథమొకటి వెలువడినఁ గాని, అందలి యర్థభావసౌరస్యముల నవగతముచేసి కొని యానందించుట కందఱికిని ననువుపడదనియు మనవిచేయుచు నింతటితో విరమించుచున్నాను.

# బద్దెన నీతి సారముక్తావళి

శ్రీ నిడదవోలు వేంకటరావు

[నేడాంధ్రభాషాపోషకులలో శ్రీ తిమ్మరాజుగారగ్రగణ్యులు. ముఖ్యముగా ప్రాచీనాంధ్రసాహిత్య సముద్ధరణకు శ్రీ ముళ్లపూడివారు మూలస్తంభాయమానులు— వారి అభినందన సంచికకిదియొక చిన్ని కానుక. శివుని యనుగ్రహమున శ్రీ తిమ్మరాజుగారు అఖండాయురారోగ్యైశ్వర్యభాగ్యములను బడసి ఇతోఽధికముగా నాంధ్రభారతీసమారాధకులై విలసిల్లుదురు గాక!]

ప్రాచీనాంధ్ర వాఙ్మయమున ప్రముఖప్రచారమును బడసిన కావ్యములలో బద్దెన నీతిసారముక్తావళి ప్రముఖగణ్యము. బద్దెనీతులని యిది వ్యవహార నామము. ఈగ్రంథము నిప్పటి కేబది మూడేండ్ల క్రింద కీ. శే. మాగవల్లి రామకృష్ణకవి మహోదయులు ముద్రించిరి. కాని యీనాడా ప్రతులు లభ్యముగుట చేత శ్రీయుతులు ముళ్లపూడి తిమ్మరాజుగారు దీనిని కీ.శే. నరేంద్రనాథ సాహిత్యమండలి పక్షమున పునర్ముద్రణము చేసి యాంధ్రవిద్వల్లోకమున కందించి యున్నారు. ఇందులకు సాహిత్యలోకమంతయు వారికి కృతజ్ఞత చూపవలసియున్నది.

ఈ పునర్ముద్రణము శ్రీ కవిగారి గ్రంథముకే యయ్యెను. నిందు పూర్వము కీ. శే. చెలికాని లచ్చారావుగారు ప్రకటించిన బద్దెనీతులలోని పద్యములుకూడ (కవిగారి ముద్రణమునలేనివి) చేర్చి ముద్రితములైనవి. అంతేకాక ఇందు మఱియొక విశేషముగలదు.

సాధారణముగ మనము ఒకగ్రంథము ముద్రితమై దానికి పీఠికయున్నప్పుడు. తిరిగి ఆ గ్రంథము ముద్రితమైనప్పుడా ప్రథమముద్రణపీఠికను విడిచి పెట్టియే ముద్రించుచుందుము. దానితో కవి కాల నిర్ణయాదులను గూర్చియేగాక సాహిత్యవిషయములను గూర్చి కొన్ని వివాదములు చెలరేగుచున్నవి. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి నన్నెచోడని కుమార సంభవమునకు రెండుభాగములకు రెండుపీఠికలు

కలవు ఈరెండింటిని నేడు కుమారసంభవమును తిరిగి ముద్రించిన, మదరాసు విశ్వవిద్యాలయము వారుగాని, వావిళ్లవారుగాని ముద్రింపనేలేదు. అవి యందుబాటులో లేనందున నేటివఱకును నన్నెచోడని గూర్చిన విషయములు సమస్యలుగానే యున్నవి. ఈగ్రంథము నందట్లుగాక, కవిగారిపీఠిక యథాతథముగా ముద్రితమైనది[1]—ఇదియంతయు ప్రశంసనీయమైన పద్ధతి.

ఇక నీగ్రంథ పునర్ముద్రణమున జేర్పదగిన కొన్ని యంశముల నిట వివరించుచున్నాను.

## సకలనీతిసమ్మతము

తెలుగున క్రీ. శ. 1430 ప్రాంతముల వెలసిన మడికి సింగన సకలనీతిసమ్మతములో బద్దెనీతినుండి చాలపద్యము లుదాహృతములైనవి. అందు "బద్దెనీతులు" అని యీగ్రంథము పేరుగలదు. దీనిని బట్టి యీకృతి సాహిత్యమున నెంతప్రచారముగడించినదో తెలియనగును.

ఇది మొట్టమొదట తెలుగులో వెలసిన సంచలన గ్రంథము[2]-ఇందీనాడు మనకలభ్యములైన, పురుషార్థసారము కామందకము ముద్రామాత్యము పంచతంత్రి మొదలగు నపూర్వగ్రంథము లుద్ధరింపబడినవి-భారత కుమారసంభవ దివ్యకావ్యములనుండి పద్యములు చేకొనబడినవి కాబట్టి కేవలము మనకు నష్టప్రాయములైన గ్రంథములనుగూర్చియేగాక "పాఠభేదములను" చూచుటకును నెంతో యుపయోగపడును.

ప్రస్తుత ముద్రణమున 35 పుటనుండి 45వ పుటవఱకును నున్న "పాఠికపద్యములు" అను శీర్షికతో, భోజరాజవిభూషణాది గ్రంథములనుండి ముద్రితములైన పద్యములన్నియు నీ సకలనీతిసమ్మతములోనివేయని యెఱుంగనగును.

## రాయవాచకము

సకలనీతిసమ్మతమునవేగాన, క్రీ. శ. 1530 ప్రాంతములవెలసిన "రాయవాచకము[1]" నందును బద్దెనీతుల ప్రశంసగలదు. ఇది విజయనగరరాజులకు, ప్రాతఃకాలమున పఠనీయముగానుండినటుగాతెలియుచున్నది. చూ[...] నున్న యీక్రిందివాక్యములు.

*"విద్యానగరమందు వీరనృసింహరాయలవారు బ్రాహ్మీముహూర్తాన లేచి ఆరాధ్యుల[...]మావళులున్నూ అధ్యాత్మసంకీర్తనలున్నూ. పాండవగీతలు, భ్రమరగీతలు, గజేంద్రమోక్షం, భారతసావిత్రి, దధివామన స్తోత్రము......[...]యనీతి, విదురనీతి, చాణక్యనీతి; బధ్యనీతి ఇవి మొదలైనవిన్ని పఠించేవారు."*

పైవానిలో 'బద్యనీతి' అనగా బద్దెననీతిసార ముక్తావళి—ఇచ్చట బద్దెనీతిని పేర్కొనుటయేగాక, యాగ్రంథము[...] యీక్రిందిపద్యములను రాయవాచకకర్త యుదాహరించియున్నాడు

1క. న్యాయము ప్రజపెక్కువకును
పాయము ప్రజకలిమిసిరికుపాయంబగుటన్
న్యాయము[...]ము నర
నాయకులకునండ్రు కీర్తినాయకుఁడా.

1 ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) వారి ప్రథమప్రచురణ చదలవాడ పిల్లన విప్రనారాయణ చరిత్ర క్రీ. శ. 1940లో ద్వితీయముద్రణ జరిగినపుడు ప్రథమముద్రణ పీఠికతో నాపీఠిక గలదు.

2 ఇది యిప్పటికి 40 యేండ్లక్రింద ఆంధ్రగ్రంథమాలలో వెలువడినది. ఈముద్రితప్రతులీనాడలభ్యములు. ఇది శ్రీ కవిగారు సంపాదించినదే—పీఠికతోనున్నది. ఇది తత్క్షణమే పునర్ముద్రణము కావలసిన యుద్గ్రంథము. ఈనాడు మనకు లభ్యమలైన నూతనవిషయములతో వెలువరింపదగినది.

1 రాయవాచకము—కర్ణాటరాజుల దినచర్యదెలుపు వచన గ్రంథము. [...]నాయకుని స్థా[...]పతి రచించినది. విజయనగర [...]కులకు ప్రా[...]కైనది. ఆంధ్ర సాహిత్యపరిష[...]ప్రకటితము.

ఈపద్యము ముద్రితగ్రంథమున 3 వది. ప్రాయము అనుదానికి బ్రాయము అని పాఠము మార్పుచెందినది.

2 బలవర్గము సామంతుల
బలమున కగ్గలముగల నృపాలున కొదవే
బలిమె పెఱ నృపతికాజ్ఞా
పతుసంపద కెంతదవ్వు బద్దెనరేంద్రా.

ఇది 11వ పద్యము. నృపాలున కొప్పున్ అను పాఠము సరియైనదిగలదు.

3 పత్నిధరిత్రియు, పురుషులె
రత్నములెప్పుడు పురంధ్రి రత్నములు శిలా
రత్నము లవనీపతులకు
పత్నుల రత్నములు వగప బద్దెనరేంద్రా![1]

ఇది 6వ పద్యము—'వగప' అనుదానికి 'తలప' అను పాఠభేదముగలదు.

బద్దెనీతిలోనే యీగ్రంథము ప్రభాతవేళ పఠియింపవలయునని, గానివలన నెంతయు మేలుకలుగు నని 122వ పద్యమునగలదు.

ఉ. బద్దెననీతియెవ్వరు ప్ర
భాతమునం బఠియించిరేని వా
రెద్దెసకేగిరేని తన
యింటసుఖంబున నున్నయట్లయా
పద్దశవాయు శత్రులును
బంధులుగావున భద్రవాక్యముల్
పెద్దలు మెప్పుచేసి కడు
మెప్పుననుందురు రెల్లకాలమున్.

ఇది రాజనీతిగ్రంథముగాన రాజులు బ్రాహ్మీముహూర్తమునలేచి, పఠియించుచుండిరనుటకు రాయవాచకమే మనకు ప్రమాణమగుచున్నది. ఇందు లోకనీతులుగూడ నుండుటచేత రాజులేగాక యిందలి పద్యములు బాలికలు—కోమటి పడుచులుకూడ పఠించుచున్నట్లుగా నీక్రింది పద్యపాదములవలన దెలియుచున్నది.

గీ. .... .... ....లోకనీతి
పద్ధతులుచేసి భువినతిప్రజ్ఞవెలయ
బద్దెనీతియు కోమటిపడుచునోళ్ల
కతనదబ్బరపాఠంబుగదియఁ గవులు
తప్పువెడలింప నెంతయు నొప్పుభువిని.

మొదటిపద్యము

## ప్రబంధరత్నావళి[1]

ఇది ఉదాహరణపద్యములు—జగ్గన ప్రబంధరత్నాకరము అను రెండుగ్రంథములనుండి యేర్చి కూర్చిన యపూర్వసంకలనము. ఇందు బద్దెభూపాలుడు అను శీర్షికలో (పుట 90) రెండు పద్యములుదాహరింపబడినవి.

క. పతికలిగి తానె పోలియును
బతినలిగించుటను దనకె భంగమువచ్చున్
బతిమతమెకాని భటునకు
బతితోనాగ్రహము చనదు బద్దెనరేంద్రా.

ఈపద్యము 54వ పద్యముగానున్నది. బతి "హితమె" అని ముద్రితపాఠము.

క. పతిచీరలట్టి చీరలు
పతి తొడవుంబోలుతొడవుఁ బతిగతివేష
స్థితియును సేవకులకు దగ
దతి ధనయుతులైన ననుఁగులైనను సభలోన్.

ఈపద్యము ప్రస్తుతముద్రణమున కానరాదు.

ఈవిధముగనే సకలనీతి సమ్మతమునందలి పద్యములతో పోల్చిచూచిన పాఠభేదములేగాక లోపిం

1 చూడుడు నా దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము పుటలు 216–217.

1 కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంపాదితము. (1918)

చిన పద్యములు తెలియవచ్చును. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో కొంతకాలముక్రిందట బద్దెనీతులు ప్రకటింపబడినవి. కాని దానిని ప్రత్యేకపుస్తకముగా ప్రకటింపలేదు. దానితో పరిపోల్చిన యింకను కొన్ని విశేషములు లభ్యములు గాగలవు.

మూలము

బద్దెనీతికి మూలము, విద్యాభూషణ బిరుదాంకితుడగు ప్రథమప్రతాపరుద్రుని సంస్కృతనీతిసారమును భర్తృహరి నీతిశతకమునునని చెప్పవచ్చును. ప్రతాపరుద్రుని సంస్కృతనీతిసారము లభింపలేదు. భర్తృహరి నీతిశతకమునుండి బద్దెన గ్రహించిన రెండింటెను ముచ్చట కిందుదాహరించుచున్నాను.

శ్లో. రాజ న్దుధుక్షసి యదిక్షితిధేనుమేనాం
తేనాద్యవత్సమివలోకమిమం పుషాణ
తస్మింశ్చ సమ్యగనిశం పరిపోష్యమాణె
నానాఫలంఫలతి కల్పలతేవ భూమిః
నీతిశతకము—37

ఉ. చేతులు వత్సరూపముగఁ
జేకొని చేపియభీష్టవస్తు సం
ఘాతములెప్పుడునే గురియు
కామదుఘాత్వగుణప్రసిద్ధి ధా
త్రీతలధేనువుండఁ దమి
దీఅమి నన్యులనాశ్రయించి తృ
ష్ణాతురులైన జొప్పడునె
యర్థము రాజమనోజ భూభుజా !
80 పద్యము

శ్లో. అర్థాహసన్న్యుచిత దానవిహీనచిత్తం
భూమిర్న రంచ మమ భూమిరితిబ్రువాణం
జారాహసన్తి తనయా నుపలాలయంతం
మృత్యుర్న సత్య వనిపం రణరంగ భీమమే.
నీతిశతకము 40 అధికపద్యము

క. క్షితినవ్వు దనముదాచగ
నతిశయముగఁ దనువుదాప నవ్విధి నవ్వున్
సుతుముద్దాడగ నవ్వును
పతిజూచిన వారకాంత బద్దెనరేంద్రా! 140

ఈపద్యము—ఆత్మకూరిప్రతి యధికపద్యములో నున్నది చూ. పుట 25

ఇట్టి విశేషములనన్నింటినిజేర్చి యీగ్రంథమునకు పీఠికగానో లేక యనుబంధముగానో ప్రకటించిన యెడల నీ గ్రంథప్రచురణ సార్థకమై ప్రాచీనకావ్యపఠనాభిరుచికి దోహదము గలిగించునని మనవిచేయుచున్నాను.

# జాయప సేనాని

అడుసుమిల్లి పూర్ణచంద్రరావు

శాలివాహనయుగం తరువాత ఆంధ్రదేశం చరిత్రలో క్రీస్తుశకం 1050 నుంచి 1350 వరకు పరిపాలించిన కాకతీయుల శకానికిది ఒక స్వర్ణయుగం.

పశ్చిమచాళుక్యుల పతనానంతరం మొదటి బేతరాజు స్వాతంత్ర్యం ప్రకటించి కాకతీయసామ్రాజ్యానికి పునాదివేశాడు.

కాకతీయులు దేశంకానిదేశంనుంచి వచ్చినవారుకారు. రాజ్యకాంక్షచే రాజ్యాలు స్థాపించినవారు కారు. ఈగడ్డపై పుట్టి, ఈగడ్డపై పెరిగినవారు. ఈప్రజలలోపుట్టి ఈప్రజలలో పెరిగి, ఈ ప్రజల చేత ఎన్నుకొనబడి, ప్రజలకొరకు పరిపాలించిన ప్రజలు.

నిరంతర కలహాలద్వారా ఆంధ్రప్రజ అనుభవిస్తున్న బాధలను వీరు స్వయంగా చూచారు. ఉత్తరంనుంచి ముంచుకవస్తున్న మహమ్మదీయ శకాన్ని గమనించారు. ఈసమయంలో ఆంధ్రులనందరినీ ఒకేప్రభుత్వంకిందకు, ఒకేజండాకిందకు తీసుకురా ప్రయత్నించి, స్వయంకృషిద్వారా ఒక కొత్తశకాన్ని స్థాపించినవారు కాకతీయులు.

కాకతీయుల కాలంలో పైరుగాలి వీచింది. భూమాత సస్యశ్యామల మయింది. వర్తక వాణిజ్యాలు పెంపొందాయి. ఓడ వ్యాపారం విరివిగా సాగింది. సాహిత్యం, శిల్పం, లలితకళలు అన్నీ వికసించాయి.

కాకతీయుల పాలనలో తెలుగునాట సంగీత, గీత, నృత్త, నృత్యాల స్థితిగతులు తెలుసుకోవడానికి మనకు పండితారాధ్య చరిత్ర, బసవపురాణం, క్రీడాభిరామం, పల్నాటివీరచరిత్ర, తిక్కన భారతప్రయోగాలు ఉపకరిస్తాయి.

పల్నాటి యుద్ధానంతరం చిన్నచిన్నరాజులనందరినీ అణచి 1186 ప్రాంతంలో ప్రతాపరుద్రుడు గుంటూరు, కృష్ణ, గోదావరిమండల ప్రాంతాన్ని స్వాధీనంచేసుకొని కాకతీయరాజ్యంలో కలిపివేశాడు.

అప్పుడప్పుడే తలయెత్తుతున్న వెలమ, రెడ్డి, కమ్మ కులాలమధ్య ద్వేషాలు పెరుగకుండా కాకతి గణపతిదేవుడు ఎంతో కృషిచేశాడు,

ఈ కాలంలోనే గోపాలకవి, హరిహరార్యుడు, తిక్కనసోమయాజి, బాలభారతి, వంశమిత్రుడు, కవిచక్రవర్తి, మయూరభట్టు మొదలైన ప్రసిద్ధకవులు మతసామరస్యంకొరకై కృషిచేశారు.

జాయప తాత – ముత్తాతలు.

ఆకాలంలోనే కృష్ణానదీ ముఖద్వారప్రాంత మయిన తలగడదీవి, హంసలదీవి, మోపిదీవి, నాగాయలంక, అవనిగడ్డ మొదలయిన తీరస్థాంధ్ర ప్రదేశంలో 'అయ్య' వంశపు కమ్మప్రభువులు వుండే వారు. ఈ సుప్రసిద్ధ వంశానికి భీమయ్య మూల పురుషుడు.

భీమయ్య పుత్రుడు చల్లయ్య చోళరాజు తరఫున కన్నరదేవుని జయించాడు. దీనితో చోళ సైన్యాధికారి అయాడు.

చల్లయ్య తమ్ముడు నారయ్య కృష్ణానదీసాగర సంగమ ప్రాంతానికి అధిపతి అయాడు. ఆ సీమను జననివాసయోగ్యమయిన పవిత్రప్రదేశంగా మార్చాడు. దీవిసీమ దివిసీమ అయింది. వెలనాటి చోళభూపా లుడు నారయ్యను తన సైన్యాధ్యక్షునిగానే నియ మించుకొన్నాడు.

చల్లయ్యకు నలుగురు పుత్రులు. ఈనలుగురు నాలుగు దిక్కులై వెలనాటి మహామండలేశ్వరునకు సేనానులై ఆ నృపతికి శత్రుశేషం లేకుండా చేశారు. వీరిలో రెండవవాడు పినచోడయ్య.

పినచోడయ్య భార్య దామమ్మ. ఈదంపతు లకు నారమ్మ, పేరమ్మ అనే కుమార్తె లిద్దరు; పృథ్వీపతి (నాయడు), జాయప(స) నాయడు, నారప(స) నాయడు (నారాయణుడు) అనే ముగ్గురు కుమారులు వున్నారు.

1198 నుంచి 1261 వరకు - అరుదశాబ్దాలకు పైగా - పరిపాలించిన కాకతిగణపతిదేవ చక్రవర్తి సేవణ, కర్ణాట, లాట, కళింగ, చోళరాజులను జయించి వెలనాటిని ఆక్రమించుకొని 1203 లో దివిసీమను లోబరచుకొన్నాడు. అయితే, గణపతి దేవుడు కయ్యాన్ని వియ్యంగా మార్చుకొన్నాడు. పినచోడయ్య పుత్రికలయిన నారమ్మ పేరమ్మలను పరిణయమాడాడు. జాయపను చేరదీసి స్వయంగా పెంచాడు.

జాయప ప్రతిభ.

గణపతిదేవ మహారాజుకు బావమఱది అయి నాటికి జాయప పిన్నవయసులోనివాడే. జాయపలో గల కళాభిరుచిని చక్రవర్తి గమనించి, గుండా మాత్యులవారిచేత అతనికి రాచవిద్యలను, సకల కళలను నేర్పించాడు.

సకల కళాప్రపూర్ణుడయిన పిదప చక్రవర్తి జాయపను బహుభంగుల గౌరవించి బిరుదావళితో సత్కరించాడు. తన సేనపై అధిపత్యాన్ని, గజసాధ నత్వాన్ని ఇచ్చాడు. కనుకనే జాయపను జాయ చమూపతి, జాయసేనాధినాథుడు, గజసాహిణి జాయప, గజసైన్యనాథుడు జాయన మొదలైన పేర్లతో పిలిచారు.

చక్రవర్తి పనుపున వెళ్ళి తిరుగబడిన కళింగు లను జయించుకవచ్చాడు జాయప. ఇతను మహా శౌర్యవంతుడు కనుకనే "వైరిగోధూమఘరట్ట" అనే బిరుదంతో సమ్మానించి ఛత్రచామరాదులు బహూక రించాడు చక్రవర్తి. అంతేకాదు, 1213 లో జాయపకు దివిసీమకు అధిపతినిచేశాడు. 1213 నాటికే జాయప "సకలనాట్య వైదిక గ్రామణి" అని, "కవిసభా శిఖామణి" అని పేరందాడు

జాయపసేనాని పరమశివునకు ప్రియభక్తుడు. దివిసీమలోని తలగడదీవినుంచి సామ్రాజ్య రాజధాని ఓరుగల్లువరకు నూటఒక్క శివాలయాలు ప్రతిష్ఠించి, నూటఒక్క తటాకాలను తవ్వించి, భూములను దానం చేశాడంటారు. "నూటఒకటి" అతిశయోక్తి కావచ్చునేమోకాని ఇతని పేరుపై ఇప్పటికీ కొన్ని శిథిల శివాలయాలు కనుపిస్తూవుంటాయి.

ఇతను చేబ్రోలులో తన తండ్రి పినచోడయ్య పేరిట చోడేశ్వరాలయాన్ని ప్రతిష్ఠించాడు. చోడ సముద్రం (చెరువు) తవ్వించాడు. అక్కడగల దేవ దాసీలకు రెండంతస్థులతో రెండువరుసల మిద్దెలు కట్టించి ఇచ్చి, దేవభోగానికై మోదుకూరు గ్రామాన్నే దానమిచ్చాడు.

ద్రాక్షారామంలో భీమేశ్వరస్వామికి అఖండ దీపదానం గావించాడు. తన చక్రవర్తి గణపతిదేవుని పేరిట గణపేశ్వరాలయాన్ని కట్టించి దానిపోషణకై గ్రామాలను గ్రామాలనే దానమివ్వడమేగాక పడవ కొళ పణంగా పన్ను వసూలుచేసుకొనే అధికారాన్ని ఇచ్చాడు.

గామాలపాడు గ్రామంలో 1122లో ఇతను వ్రాయింపించిన శాసనంద్వారా కాకతీయుల పరిపాలనాప్రాశస్త్యాన్ని తెలుసుకొనవచ్చు.

ఈ దుర్జయాశ్వయుడు జాయపసేనాని మహా బలశాలి, యుద్ధశాస్త్ర ప్రవీణుడేకాక నృత్య, సంగీతాలలో మహాపండితుడు. ఆయన స్వయంగా నాట్యం చేసేవాడు. నాట్యాన్ని గురించి ఒక శాస్త్రీయగ్రంథం వ్రాసేడు అదే "నృత్త రత్నావళి".

కొద్దిమార్పులు జరిగినా ఆంధ్రావనిలో నాడు దేవదాసీలు, నేడు నృత్యవేత్తలందరు "నృత్య రత్నావళి" శాస్త్రపద్ధతులనే అభినయించారు.

## పూర్వ రంగం.

శైవమత విజృంభణంతో నాట్యకళకు కొత్త జీవం వచ్చింది. అది పునరుజ్జీవనం పొందింది.

పూర్వ చాళుక్యులు, పూర్వ గాంగవంశజులు నాట్యకళను ఆదరించారనడానికి ఆధారాలు వున్నా, ఆంధ్రులు రచించిన నాట్యశాస్త్రగ్రంథాలు కాకతీయుల కాలంవరకు కానరావు.

చాళుక్యప్రభువు భూలోకమల్ల సర్వజ్ఞ సోమేశ్వరుడు 1131లో "అభిలషితార్థ చింతామణి" అనే పేరుగల "మానసోల్లాసము" రచించాడు. దీనిలో సంగీత, నాట్యాలను ప్రస్తావించడం జరిగింది. తెలుగు దేశంలో తరువాతికాలంలో నాట్యకళాభివృద్ధికి ఈ గ్రంథం తోడ్పడింది.

సోమేశ్వరమహారాజు స్వయంగా నాట్యంచేసేవాడు, నాట్యాచార్యుడుకూడాను. ఈయనకాలంలో 'గొండ్లి'అనే నాట్యభంగిమ ప్రశిద్ధిగాంచింది. నృత్యం చేసే ఒక గోండువనిత మహారాష్ట్రనుంచి ఈయన ఆస్థానానికిరాగా, మహారాజు సింహాసనందిగి, ఎదురేగి స్వయంగా ఆహ్వానించిన కళాభిమాని. ఈవిషయం తన "నృత్తరత్నావళి" లో పేర్కొన్నాడు.

అలాగే పార్శ్వదేవుడు "సంగీత సమయ సారము" అనే గ్రంథం ఒకటి వ్రాశాడు.

అయితే ఈ రెండుగ్రంథాలుకూడా పూర్తిగా నృత్యానికి సంబంధించిన సమగ్ర గ్రంథాలుకావు. ఆనాటి పండితులలోను, ప్రజలలోను వెల్లివిరిసిన నాట్యకళాభిరుచికి అనుగుణంగా అవిర్భవించిన ఒక్కే ఒక్క గ్రంథం "నృత్తరత్నావళి" మాత్రమే.

ఆంధ్రులు సంస్కృతంలో రచించిన నాట్య గ్రంథాలలో 'నృత్తరత్నావళి' ప్రప్రథమగ్రంథం.

## 'నృత్తరత్నావళి'

గణపతిదేవ చక్రవర్తి అభీష్టానుసారం ఆయన ప్రోత్సాహంతో జాయపసేనాని 'నృత్తరత్నావళి'ని రచించినట్టు తనగ్రంథం అష్టమాధ్యాయంలో జాయప స్వయంగా చెప్పాడు

తను ఈగ్రంథాన్ని తనకు అరవైసంవత్సరాలు దాటినపిదప కలియుగం 4355 అయిన ఆనంద సంవత్సరంలో—అంటే క్రీస్తుశకం 1253-54 లో—రచించినట్టు జాయపయె చెప్పుకొన్నాడు.

'నృత్తరత్నావళి' తోపాటు జాయపసేనాని సంగీతాన్ని గురించిన శాస్త్రీయగ్రంథం 'గీతరత్నావళి'ని కూడా రచించినట్టు ఈ గ్రంథంలో అతను చెప్పాడు. అయితే 'గీతరత్నాళి' అలభ్యం.

కాకతి ప్రతాపరుద్రుని ఆస్థాననర్తకి మాచలా దేవి 'నృత్తరత్నావళి' లోని భంగిమల నన్నిటినీ అభినయించింది.

హనుమకొండలోని వేయిస్తంభాల ఆలయంలో నిత్యనైవేద్యం, పూజ, ప్రార్థనాదులు జరిగేవి. గర్భ గుడికి ఎదురుగా—లోపలినుంచి పరమశివుడు రుద్ర దేవుడు తమను వీక్షిస్తున్నట్లె భావించుకొని—బలి పీఠంవద్ద ప్రతిసాయంసమయాన నర్తకీజనం నాట్యం చేసేవారు. 'నృత్తరత్నావళి' వివరణానుసారం ఈ నర్తనం జరిగేది.

పాలంపేటలోని రామప్పగుళ్లలో ఎక్కడ చూచినా నృత్యభంగిమలుగల అపురూపశిల్పాలే కను పిస్తాయి. ఈ దేవాలయానికి గణపతిదేవుని మంత్రి రేచర్ల రుద్రదేవుడు 1203లో శంకుస్థాపనం చేశాడు. అయితే, కాకతీయుల నృత్త, శిల్ప కళాభిమానానికి పరాకాష్ఠగానున్న ఈ దేవాలయనిర్మాణం తరువాత శతాబ్దకాలానికిగాని పూర్తికాలేదు. ఈ ఆలయాలపై గల కళలు జాలువారే శిల్పాలన్నీ జాయపసేనాని 'నృత్తరత్నావళి' లోని భంగిమల వర్ణనల ననుసరించే మలచబడినాయి.

జాయపసేనానికి పూర్వం సుమారు 40మంది నృత్త, నృత్య, నాట్య, రస అలంకార శాస్త్రాలను గురించిన వ్యాఖ్యానసంహిత గ్రంథాలను వ్రాశారు. కాని, తెలుగువారు సంస్కృతంతో నృత్తశాస్త్రీయ గ్రంథరచన చేయడంమాత్రం జాయపసేనానితో నే ప్రారంభమయింది.

## గ్రంథ ప్రాశస్త్యం

'నృత్తరత్నావళి' గ్రంథప్రాశస్త్యం అఖిల భారతఖ్యాతిగాంచినది.

రాజపుత్రరాజు రాజా కుంభకర్ణుడు 'సంగీత రాజ' అనే గ్రంథాన్ని వ్రాశాడు. ఇది సంగీత మీమాంసాగ్రంథం. తన గ్రంథం రచనకు 'నృత్త రత్నావళి' తోడ్పడినదని కుంభకర్ణుడు చెప్పాడు.

'నృత్తరత్నావళి' ప్రతులు రెండు తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయంలో వున్నాయి. ఇవి రెండు తెలుగులిపిలోవున్న పాళపత్రప్రతులే. మూడవప్రతి నాగరలిపిలో వున్నది. ఇది కలకత్తా ఏసియాటిక్ సొసైటీ వారి గ్రంథాలయంలో వుంది.

'నృత్తరత్నావళి'ని మద్రాసు విశ్వవిద్యాలయం సంస్కృతశాఖాచార్యులయిన డాక్టర్ వి. రాఘవన్ మద్రాసు ప్రాచ్యలిఖితగ్రంథాలయం తరఫున కృషి చేసి పరిష్కరించారు,

## నృత్తం అంటే........

అతి ప్రాచీన కాలంనుంచి 'నృత్తం' విపుల ప్రచారంలో వున్నది.

శరీర అవయవ విక్షేపాలను లయాన్వితం చేయ నెంచిన ప్రాక్తన మానవుడు ప్రప్రథమంగా సృష్టించుకొనిన కళ నృత్తం.

ఏ పటహవాద్యమో నెరపుతూ ఆ తాళానికి అనుబద్ధంగా లయశుద్ధి ఓనగూరేట్టు ఆదిపూరుషుడు జరిపిన పాదవిన్యాసమే నృత్తానికి ప్రారంభదశ అయింది. నృత్తం చేసేప్పుడు ముఖ్యంగా తాళాక అపేక్షించబడుతుందిగాని గాత్రంకాదు.

నృత్తం అంటే నర్తనం. స్వాతి వాద్యానికి, నారదుడు గానానికి, భరతసుతులు అభినయానికి పెట్టినది పేరుకాగా, నృత్తాన్ని నర్తించడంలో అప్సరసలది అగ్రస్థానం. నృత్త-గీత-వాద్య-అభినయాల సమ్మేళనం నాట్యమనబడుతుంది

మంజుకేశి, సుకేశి, మిశ్రకేశి, సులోచన, సౌదామిని, దేవదత్త, దేవసేన, మనోరమ, సుదతి, సుందరి, విదగ్ధ, విపుల, సుమాల, సంతతి, సునంద, సుముఖి, మాగధి, అర్జుని, సరల, కేరళ, ధృతి, నంద, పుష్కల, కమల - అనే పేర్లుగల అప్సరసలు నృత్తం చేశారు.

కరణ-అంగహార సంపన్నమైనది నృత్తం. ఇది కేవల అవయవ విన్యాసాలతోకూడి వుంటుంది. నృత్తమందలి అభినయంకలిస్తె నృత్యమువుతుంది.

నృత్తంలో తాండవం, లాస్యం అనే రెండు పద్ధతులున్నాయి. ఉద్ధతంగావుండే నృత్తాన్ని తాండవమని, సుకుమారంగా వుండేదానిని లాస్యమనిఅంటారు.

శోభను కలిగించి రంజింపచేయడానికే నృత్తం ప్రవర్తితమయింది. ఇది మంగళప్రదమైనది. వివాహం, పుత్రజననం, ఆవాహం, ప్రమోదం, అభ్యుదయం మొదలైన సంతోష సమయాలలో వినోదార్థం ఈ నృత్తప్రదర్శనం జరుపుతారు.

నాట్యశబ్దం నేడు నృత్యానికి పర్యాయపదంగా వాడబడుతోంది. అసలు నాట్యశాస్త్రంలో నృత్యం అనే పదమేలేదు. అభినవగుప్తుడుకూడ ఆ పదాన్ని వాడిఉండలేదు.

నాట్యశాస్త్రంలో నృత్త-నాట్యపదాలువున్నాయి. నాట్యం బ్రహ్మచే సృష్టించబడింది. నృత్తాన్ని పరమ శివుడు ప్రవర్తింపచేశాడు. నృత్త-నాట్యాలను సమ్మిళితంచేసినది శివుడే, శివుడు సంధ్యాసమయంలో నృత్తంచేస్తాడు.

నృత్తం నాట్యంకంటె చాలా ప్రాచీనమైనది. మహేశ్వరాదేశాన్ననుసరించి భరతుడు ప్రప్రథమంగా నృత్తాన్ని నాట్యంలో చేర్చాడు.

తండువు (నందీశ్వరుడు) చెప్పినది గనుక నృత్తం తాండవమనికూడా పిలువబడింది. శివుడు చేసేది తాండవ నృత్తం. ఆశారిత, ధృవా (మహా) గీతాలన్నిటినీ నృత్తంద్వారా పూర్తిగా అభివ్యక్తంచేయవచ్చు.

ప్రాకృతంలో సయితం నృత్తశబ్దం ప్రస్తావించబడింది.

పాణిని మహర్షినృత్తశబ్దాన్ని నిష్పన్నం చేశాడు.

వేదాలలో–ఋగ్వేదం 1-51-3, యజుర్వేదం 30–6, అథర్వవేదం 10–1–28–నృత్తం నిరూపెతమయింది.

నిగమ, ఆగమ, ఉపనిషత్, ఆరణ్యక, బ్రాహ్మణ సూత్రాలలోకూడ నృత్తశబ్దధాతువు కనబడుతుంది.

వాత్స్యాయనుడు తన కామసూత్రాలలో (జయమంగళవ్యాఖ్య 1–4–42) సంగీత నృత్తాలను నాగరక వృత్తంలో ప్రస్తావించాడు. కన్యలకు చతుష్షష్ట కళాపరిచయం కావాలనేది వాత్స్యాయనుని మతం.

పాల్కురికి సోమనాథుడు తన 'పండితారాధ్య చరిత్రము' లో వివిధదేశీ నృత్తాలను అభివర్ణించాడు.

బృహన్నల దేశి నృత్తాన్ని అభ్యసించినట్టు మహాభారతం విరాటపర్వంలో తిక్కన పేర్కొన్నాడు.

భరతుడు తన నాట్యశాస్త్రంలో నృత్తాన్ని విపులీకరించాడు. అభినవగుప్తుడు ఈశ్వరప్రవర్తితాలయిన నృత్యాలను (నృత్తాలను?) ఏడువిధాలుగా 'అభినవ భారతి'లో పేర్కొన్నాడు. 974-96 కాలపు ధనంజయుడు తన 'దశరూపకం'లో నృత్తాన్ని వివరించాడు. మూడవ శతాబ్దానికి చెందిన నందికేశ్వరుని 'అభినయ దర్పణము'లో నృత్తం వర్ణించబడింది.

'*నాట్యం—నృత్తం—నృత్యం : వాటి వివరణ, సంబంధం*' అనే పేరుతో కలకత్తాలోని ఓరియంటల్ లాగ్మన్స్‌వారు ప్రచురించిన గ్రంథంలో నృత్తవర్ణనం చేయబడింది. గత కాలపు నాట్యపద్ధతులు ఇందులో అవలోకించబడినాయి. దీనిని శ్రీ కె. ఎమ్. వర్మ ఆంగ్లంలో రచించారు.

## జాయప వివరణం

జాయపసేనాని రచించిన '*నృత్తరత్నావళి*'లో రెండు ప్రధానభాగాలు వున్నాయి. మొదటిది భరతప్రోక్తమయిన మార్గనృత్తం. దీని నిర్వచనంలో జాయప అభినవగుప్తుడు (980-1020). ఆతనికి పూర్వుడయిన కీర్తి ధరాచార్యులను అనుసరించాడు. రెండవది 'దేశి' నృత్తం. దీని నిర్వచనంలోకూడా మతంగు (760) విరచన 'బృహద్దేశి'ని అనుసరించాడు.

'*నృత్తరత్నావళి*'లో మొత్తం ఎనిమిది అధ్యాయాలు వుంటాయి. 'మార్గ' నృత్తం వివరణంలో నాలుగు, 'దేశి' నృత్తం వివరణంలో నాలుగు అధ్యాయాలు ప్రత్యేకించబడినాయి.

మొదటి అధ్యాయంలో నర్తనవివేకం, రెండవ అధ్యాయంలో అంగ నిరూపణం, మూడవ అధ్యాయంలో చారీ-స్థానక-మండల లక్షణం, నాల్గవఅధ్యాయంలో కరణ-అంగహార వివేచనం చేయబడింది.

అయిదవ అధ్యాయం ప్రారంభంలో నృత్తవిద్యలోని మార్గ—దేశి భేదాలు సమీక్షించబడి, దేశి స్థానక, కరణ, భ్రమరీలక్షణాలు నిర్వచించడం జరిగింది.

ఆరు, ఏడు, ఎనిమిదవ అధ్యాయాలలో ఆ కాలంలో తెనుగునాట 'దేశి' నృత్త పద్ధతులుగా పరిగణించబడిన పేరణి, ప్రేక్షణ, రాసక, శివప్రియ, కందుక, ఖాండిక, ఘటసరి, చరణ, బహురూపాలు, చిందు, కోలాటాలు మొదలైనవి అభివర్ణించబడినాయి.

ఆంగికాభినయ భేదాలను (*భరతకోశము* 798వ పుట ప్రకారం)"*నృత్తరత్నావళి*" "*శాఖాభినయ మనగా శాఖా—అంగ—ఉపాంగ—ప్రత్యంగాభినయము; ముఖజాభినయ మనగా కేవల ఉపాంగాభినయము; చేష్టాకృత మనగా శాఖా-అంగ-ఉపాంగ సహితమైన స్థాన—ఆసన—గత్యాది చేష్టాయుతమగు అభినయము*" అని అభివర్ణించింది.

ఈవిధంగా 'నృత్తరత్నావళి'ని నృత్తాన్ని తడుముకొంటూపోతే అదొక వ్యాఖ్యానగ్రంథమే అవుతుంది.

'నృత్తరత్నావళి' ప్రాశస్త్యాన్ని ప్రతి ఒక్కరు తెలుసుకొని, జాయపసేనాని బహుముఖప్రజ్ఞను అవగాహనం చేసుకోవడం అవసరం.

# కవిరాజశిఖామణి రతిదేవి

తమ్మారెడ్డి నిర్మల

లౌకిక ప్రపంచములోని వ్యక్తులవలెనే సాహిత్య ప్రపంచములోని పాత్రములుకూడ విభిన్నములుగా నుండును. అందుకొన్ని వ్యక్తిత్వము కలిగినవి. మఱి కొన్ని వ్యక్తిత్వములేనివి. స్త్రీ పాత్రములను బరిశీలించిన ద్రౌపదివంటి పాత్రములు విశిష్టవ్యక్తిత్వముతో విరాజిల్లునవి వ్రేళ్లమీఁదికిఁ జాలవు. సీతవంటి పాత్రములు బంగారు బొమ్మలు సాహిత్యప్రపంచమునెల్లెడలను కోకొల్లలు. కవిరాజ శిఖామణి నన్నెచోడుఁడు పురాణ ప్రసిద్ధయైన రతీదేవిని విశిష్టమైన వ్యక్తిత్వము ముద్దకట్టిన స్త్రీ మూర్తిగా తన కుమారసంభవమున తీర్చిదిద్దినాఁడు.

కామదహన పూర్వ ఘట్టమున కాళిదాసుని రచనయందలి మదనవధువు పతివర్త్మగగా, మోహపరాయణగా వన్యకుసుమ ప్రసాధనము, కుసుమాస్తరణము, పాదరాగరచన, శిరోవందనాలు – ఇట్టివే భర్తృ నిత్యకృత్యములుగా భావించెడి అమాయిక. కాని నన్నెచోడుని రతి పాత్రచిత్రణలో నొక విశేషమున్నది. కాళిదాసుని రతిదేవి మన్మథుఁడు స్థాణ్వాశ్రమమున కేఁగినపుడు సాశంకముగా నతని ననుసరించినదని రేఖామాత్రసూచన. అంతియే. మరల మన్మథదహనము జరుగువరకు నామె ప్రసక్తిలేదు. ఇందు రతికి రతిపతి తనయుద్యమము నెఱిఁగింపలేదు. కాని ఆమె తెలిసికొనినది. అందువలననే భయపడుట. భయపడినదేగాని భర్తను వారించుటకు ప్రయత్నించినట్లు లేదు. మౌనముగా అనుసరించినది. ఈమె పతిప్రేమయే ప్రధానధర్మముగాఁ గలిగినవ్యక్తిగామాత్రము చిత్రితయు. వ్యక్తిత్వము, లోకానుభవము, ప్రతిప్రేమము, పరిణతబుద్ధి, పెద్దలయెడభక్తి, పరమేశ్వర మాహాత్మ్యముపట్ల విశేషభక్తిప్రపత్తులు మున్నగువాని సమాహార స్వరూపము నన్నెచోడుని రతిదేవి. ప్రభువుల కొలువునకు ముఖ్యమైన రాజకార్యముమీఁద భర్తపోయినాఁడు. నిర్వహింపవలసిన కార్యభారమేమియో తెలియదు. నిజస్వామి ఎప్పుడువచ్చునా

యని నిలువెల్ల కన్నులుగా, రాజకార్యమేమో తెలిసికొన కుతూహలపడుచు, నిలచియున్నది.

వలరాజు సురరాజుచేత తాంబూలము తీసికొనిన సమయమునకు సరిగా నన్నెచోడుని రతిదేవి మతియందు తల్లడము పొడసూపినది. అద్భుతములు దుర్నిమిత్తములనేకము పుట్టినవి. నిజాంగ సంగతోర్జిత భయదాసురాద్యశుభచేష్టల కామె దుఃఖితయైనది. జరుగరానిపని జరుగనున్నప్పుడు, చెడు జరుగఁబోవునపుడు జనులకు దుర్నిమిత్తములు పొడసూపుట ప్రసిద్ధము. అదియే రతిపట్ల సంభవించినది,

ఈయవస్థలో మన్మథుఁడు వచ్చినాఁడు. పతిని చూడగానే రతి నిజాంతర్గతఖేదమును మఱుగుగానిడి తత్కాలోచితముగ మాట్లాడినది. ఆమాటల నడుమ సురపతి నిన్నేమి పనియుండి పిలిపించెనని తఱమి యడిగినది. అంతర్గతఖేదమును మఱపుగానిడి కాలోచిత వచనాంతరముల నిట్లని యడిగినదిగాని ఆమె ముఖమునందామె యాందోళన స్పష్టముగా కనిపించుచునే యున్నది. కావుననే మనసిజుఁడు రతిముఖ వికారముగని–

*"బెదరుచు నంతరంగమున*
*భీతికిఁ గంపవడంబు సుట్టి ప*
*ల్కెదు పొరపొచ్చెమున్ వెఱపుఁ*
*గేనముఁబెయ్యుల కొలినెత్తు వె*
*ట్టెదు వడిమోవియుం గరువ*
*టిల్లెడు నీమదినింత దల్లడం*
*బొదవు డిదేమి గారణము*
*యుగ్మలి! నా కెఱిఁగింపు మేర్పడన్."*
4–59

అని యడుగుట నంభవించినది. ఆమెకు తెలియకుండఁగనే ఆమె భయము వెల్లడియైనది. అపుడు తన కకారణముగ దుర్నిమిత్తములు పుట్టుటెఱింగించి దీనాననయై పోయివచ్చిన పనియేమటని పతిని అడిగినది. ఆ! ఏమంత పెద్దపనికాదులే! మహేశ్వరుని తపోభంగముసేయుట కంగీకరించి వచ్చితినని మదనుఁడు పలుకఁగా రతివిని యదరిపడినది. మనమునఁ దల్లడిల్లినది. అందులకు తగినకారణము లేకపోలేదు. దానినే మన్మథున కామె వివరించినది.

సీ. మనకులదైవమన్ మన్ననలేదేనిఁ
దిభువనారాధ్యుఁడన్ లెక్కలేక
పరమయోగాత్ముఁడన్ భక్తిలేదేనియు
సర్వేశ్వరుండను శంకలేక
యజశిరోదళనుఁ డన్నదరు లేదేనియుఁ
గాలారియనునోట కండలేక
విషమాంబకుండను వెఱపులేదేనియుఁ
బ్రళయాగ్నిరుద్రుఁడన్ భయములేక

ఆ. పంచె నట్టి యుగ్రుపైనిన్ను నది మీఁద
బోయి తనకు లగ్గఁబోయి లగ్గ
వచ్చునే ప్రధానవైరాన మరణంబు
ధ్రువమనంగ వినఁడె దివిజవిభుఁడు. 4–61

శివుఁడు మనకులదైవమనెడి మన్ననలేకపోయినను త్రిభువనారాధ్యుఁడను లెక్కయైనను లేకుండఁగ, పరమయోగాత్ముఁడనెడి భక్తిలేకపోయినను సర్వేశ్వరుఁడను శంకయైనను లేకుండఁగ, నింద్రుఁడు నిన్నతని పైకి పంపించినాఁడనెనది. ఇది శంకరునిపట్ల భక్తియును, భయమును రెండను నీకులేకపోయినవా యని ప్రశ్నించుటయే, శివుఁడజశిరోదళనుఁడు, కాలారియను విషయమును జ్ఞాపకముచేసినది. అంతటివారే శంకరునిముందు నిలువలేకపోయిరని భగ్యంతరముగా సూచించుటయినది. అతఁడు ఘోరాంబకుఁడని ఎచ్చరించినది. ప్రళయాగ్ని రుద్రుఁడని భయపెట్టినది. జరుగబోవు కార్యము తెలిసినదానివలె జోస్యముచెప్పినది, ఆమె భయ మామెచేత అట్లు పలికించినది. అటువంటి యుగ్రునిపైకి నిన్ను పంపుచున్నాఁడా దివిజవిభుఁడు. ఇట్టి ప్రధానవైరమున మరణము ధ్రువమను విషయము నతఁడు వినలేదా ? అని ప్రశ్నించి

నది. ఈవిధముగా నీ వా రుద్రునితో వైరము పెట్టు కొనిన కీడు తప్పదని మన్మథునికి హితవు చెప్పినది. ఇంద్రుండీపనికి పూనుకొమ్మనినను అతండొక యేలిన వాండని నీవు సిద్ధపడినావు. నీవు గొప్పవాండవును, మృడుండు ఎల్లిదుండునా ? ఇంద్రుండు, నీవు సింహపు వేటకు సిద్ధపడినారు. ఇట్లయినచో చివరకు మీ రిరువురు దక్కుదురా ? అన్నది.

అంతతో ఆంగినదా రతిదేవి ! ఇంద్రుడీపనిలో మన్మథుని నియోగించుటలోని ఆంతర్యమునకు హేతు వులు ప్రోవుచేసినది. స్వర్గమునందుగల మానిను లందఱు నీపై మనసుకలిగియుండుటను సహింపక సురవిభుండు నిన్నీ నెపమున చంపదలంచి యీపనిచెప్పి నాండన్నది. నిన్నుచూచిన కన్నులతో సురవనితలు తన్నుంజూడకపోవుటచేత వాసవుండీర్ష్యాగ్రస్తుండై నిన్ను చాంబంచిన నతనిచలము సాధ్యపడునట్లు దుస్సాహ సమునకు తలపడుట నీకు తగునా ? అని యడిగినది. దీని కంతకు కారణ మింద్రుని మాత్సర్యమేయని తేల్చి నది. కావున మన్మథుండు శివునిపైకి వెళ్లకపోయినను నష్టములేదని స్పష్టముచేసినది

దేవతలు పిలిచి పంపుట గొప్పగా భావించి దేవదేవుని చేతకానివాండని భ్రమించి ఇట్టి కార్యము నకు సాహసించితివి ఇటువంటిపనులు మానుమని నది. ఈవిషయమును లక్ష్మీ విష్ణువులు వినినచో మెచ్చరు. మీ తలిదండ్రులకు తెలిసినచో నేమందురు? దీనిని మెచ్చికోరుసుమా అని పెద్దలపైంగల గౌరవము నడ్డుపెట్టినది అత్తమామలపై ఆమెకుంగల భక్తి తాత్పర్యములకిది చక్కని నిదర్శనము హరుండలిగి చూచినచో క్షణములో నఖిలజగములు సంహారమగును. అకటా! నీ వట్టి యుగ్రుపైకి పోయెదవా? అని భయా శ్చర్యములం బ్రకటించినది. ఆపని యగ్నిశిఖలలో మిడుత సెనయుటవంటిదని తెలిపినది.

ఈవిధముగ పరమేశ్వరు నెఱింగించుచున్న రతితో మనసిజుండు జగములెల్లను నాయాజ్ఞను మీఱక పోవుటను తెలిసియు నింతభయము నెందులకుపొందు చున్నావు ? నేను గౌరీశంకరుల మేనుల నొక్కటిగం గూర్తునని ధైర్యముగం బలికినాండు.

అయినను రతికి ధైర్యము చిక్కలేదు. ఇప్పు డామెకు పరమేశ్వరుని మాహాత్మ్యము జ్ఞప్తికి వచ్చినది. అతండు మహాత్ముండుకనుకనే అతనితో వైరముపెట్టు కొనుట అనంగా తపోభంగమునుగావించుటను వినిన వెంటనే భయపడినది. ఇది వధూజన సహజము. ఇదియే ఔచిత్య పోషణము. ఈఘట్టమున రతిదేవి సామాన్యవలె భయపడినదనుట నీరసవాదము. ఈ ఘట్టమున నామె యొనర్చిన సుదీర్ఘప్రసంగము రతి పాత్రమునకు సర్వాంగీణత్వమును సమకూర్చినది. ఆమె మన్మథుని శక్తిసామర్థ్యములను, విజయ పరం పరలను ఎఱుంగనిదికాదు. భర్తకిట్లు హితబోధచేయుట పరమేశ్వరుని మాహాత్మ్యము తెలిసినది యగుటవలననే. యుద్ధమునకు బయలుదేరు పతికివిధముగా ధీరువు వోలె బోధించుట యనునది రాజకవి గంటమునుండి రావలసిన విషయమా అని సందేహింప నవసరము లేదు. రతికి ధైర్యసాహసములులేవనిగాదు. ఆమెకు శివునిపై నపారమైన భక్తిప్రపత్తులుగలవు. అతని మాహాత్మ్యమును దెలిసినది అతండు వారి కుల దైవము. ఇది కేవలము కవియొక్క ఆత్మీయత. నన్నెచోడుండు శైవుండు. శివుని మాహాత్మ్యమును బాగుగ నెఱింగినవాండగుటయేకాక శివతత్త్వప్రకాశ మతియును. అదియే తన పాత్రయగు రతిదేవి ముఖ మున వ్యక్తీకరించినాండు. అతండు మహాభక్తుండు. కావుననే భక్తికి, పరమేశ్వరుని శక్తికి ప్రాముఖ్యము నిచ్చినాండు. స్వీయాభిప్రాయ ప్రకటనమున కను గుణముగా రతిపాత్రమును నవదరించినాండు. తన్ను మాలిన ధర్మములేదుకదా! ఆమె మాంగల్య మామెకు సర్వస్వము. బలవంతులతో నిగ్రహించుట దుస్సా హసమని ఆమెతలంపు. విశేషించి, తన్నెఱింగి ఎదిరి

నెఱిఁగి సిద్ధపడిన ఉద్యమము కాదిది. కుడిచి కూర్చుండక ఈ గొడవ యేలయని ఆమె అభిప్రాయము కావచ్చు. ఈవిధముగనే రంగనాథరామాయణములో రావణునకు మందోదరి హితబోధ గావించినది. ఆమె సీతాదేవిని సగౌరవముగ రాముని కప్పగింపుమని రావణునితో చెప్పినది. బలవంతులతో, మహాత్ములతో యుద్ధము వలదనినది. కాని రావణుఁడు విని పించుకొనలేదు. మఱల నతఁడు రణగంగమునుండి వెనుదిరిగి వచ్చినపుడు కర్తవ్యముపదేశించినది.

"...ఓప క్తికంధరనీకు, జనునెదేనునిభంగి
శౌర్యంబు విడువ
నేఁడింత ధైర్యంబు నీకులేకున్న, నాఁడేల
తెచ్చితి నరనాథుదేవి''
యుద్ధకాండము–పుట 430

అన్ని ప్రశ్నించి ఉత్సాహపఱిచి యుద్ధరంగమునకు పంపినది. ఈవిధముగనే రతిదేవియుఁ బ్రవర్తించినది. తపోవనమునఁ దొలుత హరుఁగని ప్రాణము ఝల్లని కదలక నిల్చిన రతిపతి రతిప్రబోధితుఁడగుట తరువాత-పంచమాశ్వాసప్రారంభమునమనము చూడఁగలము. ఇట మందోదరి మొదట హితోపదేశముఁజేసినది. గావున నామెను భీరువన గలమా? అనంతరమామె వీరపత్నివలె ధీరతతోఁ బలుకలేదా ?

ఈ ఘట్టమే మఱింత సుందరముగా భాస్కర రామాయణమునఁగలదు. దశకంఠుఁడు రామునితో యుద్ధమొనర్చుటకు నిశ్చయించెనను విషయమునంతయు మందోదరి యెఱింగి యూపాక్షాది మంత్రి సమేతయై భర్తకు నీతిఁగఱపును.

"రాముం బుణ్యగుణాభిరాముఁ ద్రిజగద్రక్షైక
దీక్షాగురున్
సామాన్య క్షితినాథుఁగాఁదలఁచి తత్ సామర్థ్య
మూహింప కా
భూమిశాగ్రణిదేవి నుత్తమసతిం బూతవ్రతన్ నీకుల
క్షేమంబొల్లనిభంగిఁ దెచ్చితి ప్రభుశ్రీనింత గర్వింతురే"
(భాస్కరరామాయణము–యుద్ధకాండ769)

శ్రీరాముఁడు సామాన్యుఁడు కాఁడనియు నా మహానుభావుని శక్తిసామర్థ్యముల నూహింపలేకయే తనభర్త రాముని నెదిరింపఁదలఁచెననియు మహాపతివ్రత మందోదరి భావము. మందోదరి రాము పరాక్రమము సోదాహరణముగా వివరించినది.

"జనకులనాథు మున్నువినమే మనమట్టి
ఖరాదులన్ రణం
బునఁ దునుమాడడే యొకఁడ పూని విరాధుఁ
గబంధుఁ దాటకా
తనయు వధింపఁడే వినుము తక్కినవేయును
నేల యమ్మహా
వనచరు నొక్క తూపునన వాలిఁ బరాక్రమశాలిఁ
గూల్చఁడే"
(పైది–770 ప)

ఖరవిరాధ తాటకా తనయులను విశేషించి యవక్ర పరాక్రమశాలియైన వాలిని ననాయాసముగ సంహరించిన రామునితో సంధిచేసికొనుటయే సముచితమని మందోదరి హితోపదేశము. పరశుజితసహస్ర బాహులైన పరశురాముని లీలమెయి గెల్చిన రాముని జయింప రావణుని తరమాయని యామె ఆశంక.

రావణుఁ డాహవరంగమునుండి రామునిచేఁ బరిభూతుఁడై హోమప్రవర్తకుఁడైనప్పు డాతని సతి మందోదరి ప్రోత్సాహము నత్యంతమును నొసఁగును.

"అకటా చాపవిశేష కౌశలము మాయాకృత్య
పాండిత్యమున్
వికటాస్త్రావలి పెంపు దుర్దమ భుజావీర్యాది
సామగ్రియుం
బ్రకటాడంబర ఘోరసైన్యముల శుంభచ్ఛక్తియుం
గల్గి యూ
రక నీకీమునివృత్తి నొందఁదగునే రక్షోగణాధీశ్వరా"
(భాస్కరరామాయణము–యుద్ధకాండ 1583)

మందోదరి రావణుని మునివృత్తి విడువఁగోరు టయేకాక "నెమ్మనమున ధైర్యము విడిచిన నిను నగరె సుపర్వులైన నిర్జరవైరీ" యని పతికి ధైర్య మొసఁగినది.

మందోదరి మొదట భర్తకు నీతులఁజెప్పి పగతు పరాక్రమము వర్ణించినంతమాత్రమున నామె భీరువని యెవరనఁగలరు. ఆమె ధర్మపరిరక్షణ తత్పర. అంతియకాని పతి పౌరుషము నెఱుఁగనిదికాదు. కను కనే భర్త రణరంగమునుండి విజయుఁడుకాక వచ్చి నప్పుడు ఎంతయో ప్రోత్సాహమొసఁగి నిజనాథుఁడు పునర్యుద్ధ కౌతూహల చేతస్కుఁడగునట్లు చేసినది మందోదరి. అదియేకదా సతీధర్మము!

రతి మన్మథునితో శివునకు, నీకు గల తారతమ్యమును పర్యాలోచింపుమని చెప్పినది. ఉద్యమ నిర్వాహకములగు పరికరములపై ఆమె దృష్టి ప్రసరించినది. శివునకు కనకాచలము శరాసనము. ఇక్షు శరాసనము నీకున్నది. మేరు ధరాధరేంద్రముతోఁ చెఱకు తలపడగలదా? అతనికి పాశుపతమమ్ము. నీకును నమ్ములుగలవు; పూవులే నీకమ్ములు. అవియు నంటిన కందెడునవి. ఇట్టి దీనితో నీవాతనిపై యుద్ధమున మోహరించి యేమిచేయుదువని ఎత్తిపొడుపు. అతఁడు పురాపహారి, నీవు విరహాతుర పాంథజనాపహారివి. పురాపహారి యనుటలో పరమేశ్వరుని పరాక్రమమును మఱొక్క పర్యాయము గుర్తుచేసినది. ఆతనికి నీకు నేవిధముగఁజూచినను హస్తిమశకాంతర మున్నదన్నది. దోమవంటి మన్మథుఁడు హస్తివలె నున్న పరమేశ్వరునితో వైరము పెట్టుకొని యేవిధముగ సాధింపగలఁడని వ్యంగ్యము.

నీమృదుపుష్పకాండ నికరము ఈశ్వరభక్తుల హృదయములనుగూడ గాఁడనోపనిది. ఆతనిని ధ్యానించువారినే కదలింపలేని నీ ఆయుధము లాస్థాణుని భేదింపగలుగునే! భేదింపజాలవు, నీ కతఁడసాధ్యుఁడు, అసాధ్యుల సాధింపఁదలఁపఁ దగదని బోధించినది. ఆఁడుదానను అబలనునైన నేనించుక యలిగి చూచిన నీవు భయపడుదువు. అట్టి నీ కుగ్రు నుగ్ర లోచనోద్భూతవహ్నికి నెదిరి నిలువశక్యముకాదన్నది. ఇచట రతి యలుకకును, నుగ్రుని యలుకకునుపోలిక. ప్రణయకోపమునకు ప్రళయాగ్నికిని సామ్యము. నే నలిగినచో భయపడెడి నీవు రుద్రునితో తలపడుట యేమిటని రతిదేవి హేళనము.

ఇప్పటికి మన్మథుని అయుధములు శివునాయుధములతోఁబోల్చి ఇరువురకుఁగల భేదమును స్పష్టపఱిచి పరమేశ్వరు నాధిక్యము, మనసిజుని అల్పత్వము‌ను తెలియఁజేసినది. ఇఁక స్వీయబలమును, ఎదిరి బలమును నిరూపించుచున్నది. మన్మథుని బలము లెంత బలహీనములో విశదపఱచుచున్నది. బాలురైనను తిని పిప్పిని యుమిసెడు చెఱకును నమ్మి దానినే విల్లుగా చేతఁబట్టినావు! బాలురే నమలెడు చెఱకు శివు నేమిచేయును? మెలఁతలకేశముల నుంచుటవలననే కందెడు పుష్పముల నమ్ములుగ భావించితివి. ఇట్టి సుకుమారములైన యమ్ములు అంబరకేశు హృదయము నెట్లు భేదింపఁగలవు? చిగురాకులనైన కదల్పజాలని మంద పవనుఁడు పెనుప్రాపుగాఁగ, అబలల చేయూఁపుల కులికి ఆకాశమున పరుగెత్తు తుమ్మెదలు, చిలుకలు మూలబలముగాఁగ నీవుగ్రుపైకి బోవుచున్నావు. చిగురాకులకంటె నబలలకంటె నల్పమైన నీ బలముల శక్తి అతని ముందేపాటి? కావున నీకిది తగదని బోధించినది.

ఇఁక ఎదిరిని గుఱించి ఆ విశ్వసంహరునితో నరసింహుఁడు, జలజోద్భవుఁడు, జముఁడు ప్రతిభటించి పరాజయ మందినారు. వారికంటెను నీవు గొప్పవాఁడవా? అని, కాదని సమాధానము వచ్చునట్లు ప్రశ్నించినది. అతనిని కలహమున నోర్చుట మన్మథునకు చేతకాదని తేల్చినది చివరకు,

"హర కంకాలము చేతియుద్ర దివిజేంద్రాస్థుల్
సుభూషావళుల్
గరళం బభ్యవహార మంతక తను క్షారంబు మై
పూత పం
కరుహాసీన శిరఃకపాల మురు భిక్షాపాత్రగా విశ్వసం
హరు వర్తించు మహావ్రతోపహతి సేయం
బూన నీ ప్రాప్తియే" 4–77

అని చివరిమాట చెప్పినది. అట్టి విశ్వసంహరుని మహావ్రతమునకు భంగముకలిగించుట నీకు వలను పడదని నిశ్చయముగఁ బలికినది.

కాని ప్రభుకార్య నిర్వహణ దీక్షాదక్షుఁడగు మన్మథుఁడు రతి హితవచనములఁ బాటింపలేదు. భార్యగా రతిదేవి తన ధర్మమును నెఱవేర్చినది. దుర్మార్గమున వర్తింపబోవు పతులకు హితమును గఱపి సన్మార్గమున నడపించుటకు ప్రయత్నించుట సతుల పరమధర్మముగదా! 'షట్కర్మయుక్తా కులధర్మపత్నీ' అని కదాసూక్తి! విధ్యుక్తధర్మమునే వివేకపరిపాకము గల రతిదేవి పాటించినది. కాని మన్మథుఁడు ఆది సృష్టికి కారణంబైన కామతత్త్వ మహత్త్వంబును నామెకు దెలిపి, సమర్థించుకొని, సతి నొడంబఱిచి, రతిసమేతుఁడై పరమేశ్వరుని తపోవనమున కేఁగినాఁడు. అచట హరునిఁ జూడఁగనే పచ్చవిల్తుఁడు ప్రాణము ఝల్లుమనఁగా నచైతన్యవృత్తిని గదలక నిలచినాఁడు. కాని ఆక్షణములోనే రతి ప్రబోధితుఁడై త్రిణయను సమాధి వైకల్యముసేయ నుపక్రమించినాఁడు. ఇట రతిచేత ప్రబోధితుఁడైనాఁడు మన్మథుఁడు. స్థూల దృష్టితోఁజూచినచో నింతవరకామె చెప్పిన మాటల కిది విరుద్ధముగా గోచరించును. కాని అతి భారమైన ఒక ఉద్యమమును తలపెట్టి అందులకు సతియగు రతినిగూడ అంగీకరింపఁజేసి మన్మథుఁడచటి కేతెంచినాఁడు. అక్షణములో వెనుకంజవేయుట ధీరలక్షణము కాదని తెలుపుటయే రతి ప్రబోధము. ఈఘట్టమంతయు నన్నెచోడుని స్వకపోల కల్పనమే.

ఇఁక మన్మథ దహనానంతరము కాళిదాసు ననుసరించి నన్నెచోడుఁడు రతిదేవిపాత్ర పోషణమును జేసినాఁడు. రతి విలాపఘట్టము రతి మన్మథుల పవిత్ర ప్రణయ తత్త్వమునుబట్టి యిచ్చునట్టిది. మనోభవుని ప్రయత్నమును గనిన శివుఁడతనిని నీఱుచేసి పోయి నపుడా యగ్నిశిఖలనుగాంచి రతిదేవి భయరసావేశమున తల్లడిల్లి పరవశయై పడినది. ఆమె మరల లేచి చూచునరికి "శిఖిపాడవు నిజేశ్వరు పొడవుఁగాన కచ్చటఁ బురుషాకృతి నున్న భస్మపుంజము" ను మాత్రమే చూడగలిగినది. అక్షణములో నామెకు మనసిజుని గతినిగుఱించి స్థిరమైన అభిప్రాయము కలుగలేదు.

కావుననే కాయజుఁడా యగ్నిలోఁబడి కాలెనో లేక భీతిచేత పాఱిపోయెనో అనుకొనినది. పోయినచో తన్ను వదలిపావునా? పోయినచో నీ భస్మపుంజమెక్కడిది? అని ప్రశ్నించుకొనినది. ఇది మాయయేమో అని పరిపరివిధముల నాలోచించుచు సంశయాకుల చిత్తయై అత్మేశు నన్వేషించినది నీవు నాకు దర్శన మీక ఈపొదలలో దాఁగినావు. నిన్నుబాసి నేను నిమిషమైన నుండఁగలనా ? రతి హితుఁడవైన నీవు రతిని ధుఃఖితజేసి పోయితివని విలపించినది.

"అబలఁ గడునెడ యెఱుఁగని యాడుదాన
మెల.త నతిభిత నన్ను నమ్మించి తెచ్చి
కాననంబులోఁ గన్నులు కట్టి కాడు
పఱచి నీకట్లు పోఁజన్నె భావజన్మ" 5–65

అని దుఃఖములో ప్రశ్నించినది. ఆమె అబల. లోక వ్యవహారము తెలియని ఆడుఁది. మిక్కిలి భయపడుచున్న అమెనతఁడు నమ్మించి తీసికొని వచ్చినాఁడు. అట్టి తన్ను కాననములో వదలిపోవుట తగునా? అది న్యాయముకాదని అమె భావము. అనంతర మామె పుష్పకోదండ పల్లవచ్ఛత్ర మకరకేతనంబుల నచ్చు పడియున్న మరుభస్మాకారంబుఁగని త్రినయనానలా

పూతుండఁగుట నిశ్చయించి శోకపరవశయై పడి చేత రించి విభ్రాంతయై చూచినది. అందు పతింబొడ గానక హాయని ఎలుగెత్తి వాపోయినది. ఆమెశోకము మిన్నంటినది.

ఆ శోకభరమున రతిదేవి కన్నీటితో, విరిసిన వేనలితో, బీటవాఱి కంపించిన మోవితో, పెరిగిన తారహారభాతితో మోము వెన్నెల పలకఁబాఱ చేష్టలు దక్కినది. ఇట్లు ఆడలుచు పతివలను గనుఁగొని అతని నుద్దేశించి కొన్ని పలుకులు పలికినది. నా శరీరముపై ప్రీతితో నీ వలఁదిన చందనము తడియైన నాఱలేదు. కాని నీ చారురూప తను విభ్రమ సంపద క్షణములో కాలి యాఱినది. గిరిజను వరదునితోఁగూర్చి ఆతనిచే వరమును బడయఁగలవని నేను నమ్మియుండఁగా నీ కిట్టిచావు సంభవించినది! మన కెంతటి వియోగము గలిగినది!

*"తప్పున దారులేసీ పెఱతాపసులన్ వెఱపించునట్లుని*
*వప్పరమేశు నేయుట నయంబు భరంబని చెప్పఁ*
*జెప్ప నా*
*చెప్పుట యింతి కర్జమని చేకొన కొయ్యన వచ్చితీశు పెం*
*పిప్పుడెఱింగితే కడవనేచిన నీకిది యింత పెద్దయే"*
5-75

ఇతరతాపసులవలెగాక పరమేశ్వరు నేయుట కష్టమని నేను చెప్పినను వినక స్త్రీలమాట వినుటేమి యని వచ్చితివి. ఈశు పెంపిప్పుడెఱింగినావుగదా! అని తన మాటను వినకపోయినందులకు పరితపించినది. రతి కేదిదిక్కు చెప్పుమని మనోభవుని ప్రశ్నించినది. నీ పరిరంభణము ధరణీ పరిరంభణమైనది. రసాలాప ములు విలాపములైనవి. నా జీవనమున కాధారమైన నీవు నన్ను వదలిపోవుట తగునా? అనినది.

*"అక్కట వేల్పులార కుసుమాయుధు నాఱడి*
*చావు చూచి మీ*
*రెక్కడ మాయమైతి రసమేశఱ మన్మథు నీఱుసేసి నీ*
*వెక్కడ పోయితయ్య పాదవెవ్వారుఁజూపర కానలోన నే*
*నెక్కడ సొత్తునాకు దెసయెయ్యది యో వలరాజ*
*చెప్పవే"* 5-80

అని అనాథయైన రతి దీనాననయై వేల్పులను, అసమే క్షణుని, వలరాజుని ప్రశ్నించినది. దేవతల కోరికపై వారిపనిలో నిమగ్నుమైయుండగా మన్మథుఁడు అపదలో చిక్కుకొనినపుడు వారు కనిపింపకపోవుటచేత వేల్పు లను, తన యవస్థకు కారకుఁడైన విషమాక్షుని, తన భర్తయైన వలరాజును బశ్నించుట యొంతయు సమంజ ముగానున్నది. శోకములోనున్న రతికి వనమంతయు శివుని కోపములో కాలిపోయినట్లగపడినది. నల్లని తమాలవృక్షములు ధూమమువలెను, పుష్పించిన యశోకములు తీవ్రానలమువలెను, పూచిన పొన్నలు కాలియాఱిన భస్మమువలెను కనిపించినవి. పుష్ప మధు వ్రశుజలమువలె, కొమ్మలపైనుండు పక్షిరవ మార్తరవముగ, అలిమాలికలు నిభృతకేశభరముగ భూజములన్నియు రతిదేవి చుట్టునుజేరి అమెతోకూడ సానుభూతితో దుఃఖించుచున్నట్లున్నవి. నిస్సహాయ యైన రతిమతి నిరంతానంత శోకమతిశయింప

*"తలఁకి కనుఁగవఁ గన్నీరు ధారలొలుక*
*మేనఁబేర్పొందు లురులంగ మెలఁత వొలిచెఁ*
*గేలు బ్రిదిలిన జలధారలోలి గలయఁ*
*గ్రమ్మి చెదరెడు ధారా గృహమ్ముపోలె"*...5-85

ఇటపార ఘోరకాంతారాంతరా పూరితమై చెలఁగు రతిదేవి రోదనధ్వని వసంతుని చెవులఁబడినది, అతఁడులికిపడి అతి సంభ్రమమున నామెకడకేతెంచి నాఁడు. అతనిని గాంచిన రతి దుఃఖమతిశయించి నది. అలిగి పూవైన నలఁపలేని యాయబల శోకబల మున కరతలములు తోలుతెరలి జర్జరమై పోవునట్లు మోదికొనినది. ప్రాణవల్లభుఁడు నాయెదుట భస్మపుంజ ముగా నెరిసిపోవుట గనియు నాజీవమొడలబాసి పోవుటలేదు. నాకంటె కఠిన హృదయలైన స్త్రీ లీజగతి

నెవరున్నారు ? అని నిందించుకొనినది. అవును, ఆమె కతఁడు ప్రాణవల్లభుఁడు. ప్రాణములకు వల్లభుడు అతఁడే లేకున్న ఆమె ప్రాణము లెట్లు నిలుచును? అందుకొఱకే మరణింప నిశ్చయించి అగ్ని ప్రవేశము సేయుటకు నుంకించెను. ఆ సమయమున నాకాశవాణి త్రిలోచనుఁడు త్రిలోక హితార్థము అంగజుని దయతో నీ కిచ్చునని పలికినది. కాని రతి ఆమాటను వెంటనే నమ్మఁజాలక ఉగ్రకోపానలాహుతుఁడైన వాఁడు తిరిగి వచ్చునాయని సందేహించినది. దానిని గగనాంతర వృత్తి నివారించినది. అప్పుడు రతి మరణ పరిచ్ఛేదమును విచ్ఛేదము చేసినది. కాని శోకాగ్ని యందామె శరీరము కరఁగియు పొడవలక లోన కాలుచున్నది. మఱియు—

"అలమట నడియొందె నలుపయు చిత్తంబు
మూర్ఛిల్లి వెడఁబాసి పోవఁబొందె
నూఱటఁగొని యొందె నాఱదు శోకాగ్ని
పేర మాలఁగొని కాలిపోవఁ బొందె
ఘర్మాగ్ర జలము లొక్కట కట్టుకొనఁ బొందెఁ
బొడవంతయుఁ గరఁగి పోవఁబొందెఁ
బర్వు నిట్టూర్పులు పట్టునఁ బడఁ బొందెఁ
బొందిమ్ముగాఁబాసి పోవఁ బొందె
నిట్టి కడలేని దుఃఖాబ్ధిఁ బెట్టియుంపఁ
దలఁచియో కాక పోనీక బలిమి నాదు
ప్రాణ మొకపలిలో నాకాశవాణి పేర్చి
మగుడఁ బెఱఁబెట్టెనని రతి మఱఁగుచుండె" 5-101

ఇట్లు దుఃఖాబ్ధిలో మునిగియున్న రతిదేవి నిరతిశయ భక్తితో పరమేశ్వరారాధనమును జేయుచు మన్మథుని పునరవతారమున కెదురుచూచినది.

ఉమామహేశ్వరుల వివాహానంతరము వరదుఁడు కరుణించి అంగజుఁడు జగముల కనంగుఁడై రతికిఁ బ్రాక్తన స్వరూపుఁడై ప్రవర్తించునని వరమిచ్చి అతని పూర్వనియోగమును దయసేసినాఁడు. అప్పుడు రతీశ్వరుఁడు పూర్వవైభవముతోవచ్చి రతిమ్రోల నిలిచినాఁడు ఆ క్షణమున రతిదేవికి ఆననమున దరహాసము తలుకొత్తినది. మేనపులకలు కలిగినవి. లోల నయనాంభోజాతపత్రములలో సమ్మదాశ్రు జలము వెలరినది. ఇచట నయనములు చలించుచున్నవి. వానికిని రతివలెనే మన్మథుని జూడవలెనని తొందర. అందువలననే పద్మపత్రములలె వెడల్పయినవి. ఇంకను—

"ఎలమి ప్రాణేశున కెదురేఁగె నుగ్మలి
ప్రాణంబులన మేను ప్రాణువడియెఁ
దనరు శోకాబ్ధిలో మునిఁగి లేచిన భంగి
నొడలఁ జెక్కింద లొండొండ పర్వెఁ
బ్రియుఁబాసి [illegible] యిన వ్రతము దన
నలుపుటఁదెలిపె నాఁబులక లతరెఁ
బతిగాంచి కన్నుల పాపలుత్సవమున
నాడెనో నలినాఁగ హర్షవారి
గ్రమ్మెఁగనుఁగవ నంత నక్కమ్మదేవ
దేవు నుగ్రాక్ష శిఖి నిజజీవితేశుఁ
డతనుఁడైన విధమ్మును నాత్మవిరహ
భరముఁగలకన్న కరణి విస్మరణఁబొందె"–9-49

దీర్ఘకాలము విరహవ్యథ ననుభవించిన తరువాత పతిని గాంచిన రతి పరిస్థితిపై పద్యమున ప్రకృతార్థ పరిపోషకముగా సృష్టింపఁబడినది ఆ సంతోషములో నామె నిజ జీవితేశుఁడతనుఁడయిన విధమును, ఆత్మ విరహభరమును కలఁగన్న కరణి విస్మరించినదఁట. అంత సంతోషమును రతి పొందినది. అందువలననే సర్వము కలవలె నూహింపఁగలిగినది.

ఇట్లు సంయోగ వియోగములలో విశిష్ట వ్యక్తిత్వమును వెలార్చిన రతీదేవి పాత్రమొక రసఘుటిక.

# కాయస్థ రాజులు

నేలటూరి వేంకటరమణయ్య

కాకతీయ యుగమునందు ఆంధ్రదేశమును పాలించిన రాజవంశములలో కాయస్థవంశమొక్కటి. కాయస్థులాంధ్రదేశజులుగారు. ఆంధ్రప్రజలలో కాయస్థులులేరు. కాయస్థు లన్యదేశములనుండి యాంధ్రదేశమునకువచ్చి యచ్చట స్థిరనివాసము లేర్పఱచుకొని కాలక్రమమున రాజ్యాధిపత్యమును బడసిరి. కావున కాయస్థులనుగూర్చి మొదట విచారింపఁదగిన విషయము వారి యాదిమనివాసస్థాన మెద్దియని—స్థానిక చరిత్రలు (Local Records) కాయస్థులు ఒడ్డెవారు అని తెలుపుచున్నవి. ఒడ్డెలనఁగా ఓఢ్రదేశజులు. కాని ఇవి యంత తృప్తికరముగ కన్పట్టదు. బాలభానుదేవు మున్నగు ఒడ్డెరాజు లొకరిద్దరు క్రీ. శ. 11వ శతాబ్ద ప్రాంతమున గుంటూరు మండలమునుబాలించినట్లు స్థానిక చరిత్రలు దెల్పుచున్నను వారికిని కాయస్థ రాజులకును నెట్టిసంబంధముండినట్లు అగపడదు. ఆంధ్ర కాయస్థస్త్రీల నామములు 'బాయి'యను ప్రత్యయపదముతో నంతమగుచున్నవి. పదుమాబాయి, కవలాబాయి, గంగుబాయి ఇత్యాది నామము లిందుకు తార్కాణ. కాయస్థు లాశ్వికులు. కాయస్థప్రభువులలో ప్రథముఁడనఁదగిన గంగయ కాకతి గణపతిదేవుని కొలువు నందశ్వసాహిణియై యుండెను. కావున నాతఁడు గంగయసాహిణి యను పేరఁ బ్రసిద్ధుడాయెను. మఱియును, 'అతి విషమ హయారూఢ ప్రౌఢ రేఖారేవంత' యను బిరుదు కాయస్థరాజుల కందఱకును సామాన్యము వీరి దళము లందశ్వదళము ప్రధానమైనది. కాయస్థు లశ్వారోహణ కుశలురైన రాహుతు లగుటయు. వారి స్త్రీలనామములు 'బాయి' పదాంతము లగుటయుఁజూడ వారిని ఓఢ్రులనుటకంటె మహారాష్ట్రులని యెంచుట యుక్తమని తోఁచుచున్నది. అంబదేవ, మాయిదేవ, నామదేవాది పురుషనామములు ఈ యూహకు గొంత యూతనిచ్చుచున్నది. ఈ సందర్భమున గమనింపఁదగిన యంశమింకొకటి కలదు. క్రీ. శ. ౧౩వ ప్రారంభము నుండియు పెక్కండ్రు మహారాష్ట్రు లేకారణముననో స్వదేశమును

వదలి యాంధ్రదేశమునకు వలసవచ్చి యచ్చటనే స్థిరనివాసము లేర్పఱచుకొనినట్లప్పటి శాసనములవల్ల తెలియుచున్నది. మహారాష్ట్రులను మన పూర్వికులు 'అరె'లని పిలుచువారు. ఇది 'ఆర్య' శబ్దమునకు వికృతి. 'అరె'లు స్థిరనివాసము లేర్పఱచుకొనిన తావులకు అరెవీడులను సార్థకనామము కలిగినది. ఇట్టివి కొన్ని నేటికిని ఆపేరులతోడనే వ్యవహరింప బడుచున్నవి. కర్నూలుజిల్లా కంబముతాలూకా యందొక అరెవీడుకలదు మఱియొకటి చిత్తూరు జిల్లా చంద్రగిరితాలూకాలో నొక అరెపల్లెయు గాన వచ్చుచున్నది. నెల్లూరుజిల్లా అత్మకూరు తాలూకా యందొక అరెవీడును, అరెవీటి పల్లెయు కలవు. కాకతీ[illegible]ాటి యొకానొక శ్రీశైలశాసనమునం దాంధ్ర[illegible]ములలో 'అరెభూమి' అను దేశవిభాగముండినట్లు తెల్పుచున్నది[1]. ఇట్లు దేశాంతరాగతులైన అరెవారు కాకతీయులతో నేకీభ వించి ముత్తుకూరుయుద్ధమున పాండ్యరాజులతోయుద్ధ ముచేసి పరాజితులై పారిపోయిరని పాండ్యశాసనము లందు చెప్పియున్నది.[2] పైజెప్పిన అరెలవలె కాయ స్థులుగూడ మహారాష్ట్రమునుండి తెలుగుదేశమునకు వలసలు వచ్చినవారు కాదగుదురు

కాయస్థులజాతి : కాయస్థరాజులు తమ శాస నములలో గొన్నింటియందు తమ జాతినిగూర్చి యిట్లు చెప్పకొనియున్నారు :

దేవస్య పద్మజనుషో ద్రుహిణస్య కాయాత్
కాయస్థ ఇత్యజని కోపి నరేంద్రవంశః॥[3]

అనియు

యద్ధాటీ తురగావలీ పృథుకరక్షుణ్ణోద్ధతి క్ష్మారజః
ప్రచ్ఛన్నా ప్రవిలోక్యతా దశదిశో భీతావదంతిస్ఫుటం
దైవజ్ఞావయమాది తాపస గణాస్స్రద్వాహ్మణాశ్శాంభవా
స్పష్టం కర్పటికా వయం వయమహోస్సక్షత్రియా
పార్థివాః॥

అస్తికస్యపసంభూతకాయస్థకులవారిధిః।
కళాకలాపకల్లోల ప్రరూఢగుణమౌక్తికః॥[4]

అనియు కలదు పద్మపురాణాంతర్గత కాయస్థజాత్యు త్పత్తికథ దీనికాధారమగుచున్నది. కాని పురాణ ములయందీ జాత్యుత్పత్తి కథయొక్క తీరున నుండక పలువిధములుగా గానవచ్చుచున్నది. ఆవిషయమును గూర్చిన చర్చ యిచ్చట ప్రస్తుతముగాదు.

కాయస్థరాజు లేవురు శా. శ. 1212 (క్రీ. శ. 1290–91) యొక త్రిపురాంతక శాసనమునందువీరు పేర్కొనబడియున్నారు.

తస్మాదభూత్ జలనిధేరివ పారిజాత శ్రీగంగయస్తురగ
సాధనికో మహీశః
ఉదభవత్తదను ద్విభుజోన్నృపః స్వసురపత్య మమున్య
జనార్దనః
బహుళకీర్తి సముద్గమ చామర ప్రకటితాఖిల
దిక్కరిమండనః॥
తస్యానుజన్మ త్రిపురారిదేవః పయోధికాంచీ
మశేషధాత్రీం
సుమేరు సారా దదికస్యదోష్ణోః ప్రతాపతాపేన
నివర్తితార్కః॥
శ్రీమానుపేంద్ర ఇవతస్య సురేశ్వరస్య కల్పద్రుమా
హరణ దానవిధిః కనియాన్।
అజ్ఞాత శీకృతదిశాన్ ఘనమంబదేవో ధర్మేణ
రక్షతి కృపాణధురీణ బాహుః॥

ఇందువలన కాయస్థవంశమున గంగయసాహిణి యను రాజు పుట్టెననియు, నతని యనంతర మతని

1 AR. No. 36 of 1915, 599 X 504
2 ARE. 1914, Part 11 Pare 19
3 AR. No. 268 of 1905, 599 X–65
4 AR. Nos. 304 of 1905 of 283 of 1937–38 of 10 of 1940–41

తోఁబుట్టువు పుత్రులైన జనార్దన త్రిపురారులను వెనుక త్రిపురారి తమ్ముఁడైన యంబదేవుఁడు ప్రజాపాలన మొనర్చె ననియుఁ దెలియుచున్నది. వీరు నలువు రేకాక యంబదేవుని యనంతరము అతని పుత్రుడైన రెండవ త్రిపురారి సింహాసనము నధిష్ఠించి కొంత కాలము రాజ్యమును పాలించినట్లు అతని శాసనముల వలన తెలియుచున్నది.[5] ఇంతవఱకు లభించిన శాసనాధారములనుబట్టి చూడఁగా నీవంశమునకు జెందిన రాజు లేవురని తెలియుచున్నది.

1. గంగయ సాహిణి.
2. జనార్దనుఁడు – ఇతనికి జన్నిగదేవుఁడను నామాంతరము గలదు.
3. మొదటి త్రిపురారి–ఇతడు త్రిపురాంతకు డనియు బేర్కొనబడియున్నాడు.
4. అంబదేవుఁడు.
5. రెండవ త్రిపురారి లేక త్రిపురాంతకుడు.

ఈ రాజుల కొండొరులకుగల సంబంధము శాసనములవలన విస్పష్టముగ దెలియవచ్చుచున్నను. వంశస్థాపకుఁడైన గంగయసాహిణియొక్క పూర్వికుల వృత్తాంతముగాని, అతని తోబుట్టువు యొక్కయు, తద్భర్తయొక్కయు పేర్లుగాని వివరించియుండలేదు. గంగయసాహిణి పూర్వికుల వృత్తాంతమును దెల్పు శాసనములుగాని యన్యచరిత్రాధారములుగాని ఇంత వఱకు లభ్యపడలేదు. కాని గంగయసాహిణి భార్యయైన కవలాబాయి లేక కమలాదేవియు సోదరియైన చందుబాయి అమ్మయు నతని శాసనములందు బేర్కొనఁబడియున్నారు.[6] శాలివాహన శకము 1212 (క్రీ.శ, 1290–91) నాటి యంబదేవుని నీలగంగవరశాసనమునందు అతఁడు తన తలిదండ్రుల అనఁగా గంగయ సాహిణియొక్క సోదరీ భావుకుల నామములను వచించియున్నాఁడు. అందిట్లు కలదు.

క్షత్రియజాతికి జెందిన కాయస్థవంశమున గంగయసాహిణి యుదయించెను. అతని సోదరియైన చందలదేవి–ఈమెయే మీఁద పేర్కొనిన చందుబాయి అమ్మ–యంబక్ష్మాపతిని పెండ్లాడెను. జనార్దనుఁడును త్రిపురారియు వీరిపుత్రులు. త్రిపురారియొక్కతమ్ముడుఁ అంబదేవుఁడు.[7] చందలదేవి భర్తయైన యంబక్ష్మాపతి శాసనమొక్కటి శా. శ. 1166 (క్రీ. ద. 1244)నాటివి గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా సత్రశాలయను గ్రామమునందు కానవచ్చుచున్నది. అందీతఁడు కాకతి గణపతిదేవుని పాదపద్మారాధకుఁడనియు, మండలిక బ్రహ్మరాక్షస, గండపెండార, అతివిషమహయారూఢప్రౌఢరేఖారేవంత దామోదర దిశాపట్టేత్యాది బిరుదాంకితుఁడనియుఁగలదు.[8] ఈ యంబక్ష్మాపతికి జనార్దన త్రిపురాంతకాంబదేవులను మువ్వురుపుత్రులు మాత్రమేకాక పదుమాబాయి అమ్మయను పుత్రిక యొక్కతె యుండెను. ఆమె మహామణ్డలేశ్వర బిరుదాంకితురాలు. ఆమె శా. శ. 1177, రాక్షసకార్తిక శు 15 గురువారము (18, అక్టోబరు, క్రి. శ. 1255) నాడు తన తండ్రియైన యంబదేవునికిని భర్తయైన లక్ష్మీదేవునికిని సుకృతార్థము పలవాయగ్రామమందలి కాళేశ్వరదేవాలయమును జీర్ణోద్ధారణ మొనర్చి భూదానము నొసఁగెను.[8]

పైశాసనముల నాధారపఱచుకొని కాయస్థరాజ వంశానుక్రమణిక నీక్రిందివిధమున విరచింపవచ్చును.

5 AR. Nos. 391 of 1933–39 & 65 of 1939–40.

6 AR. Nos. 304 of 1905, 233 of 1937–38 & 10 of 1941–42

7 AR. No. 229 of 1935–36.

8 AR. No. 314 of 1930–31

9 AR. No. 21 of 1929–30,




## కాయస్థరాజులు పాలించిన దేశము

కాయస్థరాజులు తమ శాసనములలో తమయేలుబడి క్రింది దేశవిస్తారమును వివరించియున్నారు. పానుగల్లు మొదలు మార్జవాడిదనుక వారి యేలుబడి క్రింద నుండినట్లు పెక్కుశాసనములయందు గానవచ్చుచున్నను కొన్నిటియందు పానుగల్లు మొదలు కైవారము కోటవఱకును వ్యాపించినట్లు చెప్పియున్నది.[10] పానుగల్లు అను పేరుగల స్థలములు రెండు గలవు. ఒక్కటి మహబూబునగర జిల్లాయందున్నది. మఱియొకటి నల్లగొండజిల్లాయందున్నది. ఈరెంటిలో రెండవదే కాయస్థరాజుల శాసనములలో బేర్కొనఁబడిన పానుగల్లు. మార్జవాడియనునది మహారాజవాడియొక్క అపభ్రంశరూపము. ఇది 7000 రాజ్యము. మొదటనిది రేనాఁడు 7000 అని శాసనములలోఁ బేర్కొనబడియున్నది. ఈ రాజ్యమాద్యమున చోళమహారాజు లేలుచుండిరి. అటు పిమ్మట నది వైదుంబ మహారాజుల యేలుబడిక్రిందికి వచ్చెను. ఇట్లు చిరకాలమది మహారాజుల పాలన క్రింద నుండిన గారణమున దానికి మహారాజ పాడి (మహారాజులేలిన దేశము) అను పెరుకల్గియుండ వచ్చును అని కొందరు చరిత్రకారులు అభిప్రాయ పడియున్నారు. కైవారముకోట ఇప్పటి మైసూరు రాష్ట్రాంతర్గతమైన కోలారుజిల్లాలోని చింతామణి తాలూకాయందున్నది. కాయస్థరాజులు తమప్రభుత్వమునకు లోఁబడియుండిన రాజ్యవిస్తారము నిట్లు వివరించియున్నను వారి శాసనములు గానవచ్చుస్థలములనుబట్టిచూడ వారేలిన దేశమింత విశాలమైనది కాదనియు నింతకంటె జిన్నదనియు దోఁచుచున్నది. వారి శాసనములు కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకాలోను గుంటూరుజిల్లా పల్నాడు, వినుకొండ

10 AR. No, 550 of 1909, 599 X 402

తాలూకాలలోను నెల్లూరుజిల్లా దర్శిడివిజనులోను, కడపజిల్లా యందంతటను గానవచ్చుచున్నవి. కావున వాస్తవముగ కాయస్థరాజుల ప్రాభవ్యము కర్నూలు గుంటూరు మండలములలో మీద వివరించిన భాగము లందును కడప మండల మందంతటను జెల్లుచుండె నని తలంచుట యుక్తము. కాయస్థ రాజుల రాజధాని ఇప్పటి కడపతాలూకాలోని వల్లూరు. దీనికప్పుడు వల్లూరు పట్టణమను పేరు చెల్లుచుండెను. ఇదిగాక జమ్మలమడుగు తాలూకాలోని గండికోట, మనోరధ పురముగూడ వీరి కడపటి రాజులలో మఱియొక రాజధానియై యుండెనని శాసనములవలన దెలియు చున్నది.

1. AR. No. 36 of 1915, 599 X 501
2. ARE., 1914., Part II, Para 16.
3. AR. No, 268 of 1905. 5. 99.X465.
4 AR. No. 571 of 1909 F. S. 99X334.
4. AR. Nos. 304 of 1905, 283 of 1937-38, 10 of 1940-41.
5, AR. Nos, 391 of 1938-39, 65 of 1939-40.
6. AR. Nos. 304 of 1905, 233 of 1937-38, 10 of 1941-42.
7. AR. No. 229 of 1935-36.
8. AR, No. 314 of 1930-31.
9. AR. No. 21 of 1929-30.
10. AR. No. 550 of 1909, 599 X 402.

### గంగయ సాహిణి

### శా. శ. 1161-1179.

గంగయ సాహిణి కాయస్థరాజులలో మొదటి వాఁడు. ఇతఁడు గుంటూరుమండల పల్నాడుతాలూకా లోని గుండ్లూరు గ్రామములో శకాబ్దము ౧౧౬౧వ సంవత్సరమున విషువ సంక్రాంతిసమయమున నెల కొల్పిన శిలాశాసనమునందు పేర్కొనబడియున్నాఁడు, ఇదియే చరిత్రరంగమునందితని ప్రథమ ప్రవేశము. ఇందు గండపెండేర గంగయ సాహిణియని మాత్రము కలదు. ఇతర బిరుదులెవ్వియులేవు. తరువాతి కాలమునందు కానవచ్చు ఇతని శాసనములందువలె నింది తని యధిపతిని పేర్కొనలేదు.[11] దీనినిబట్టి చూడఁగా నప్పటి కాతఁడింకను స్వతంత్రుడై యుండెనని తోఁచు చున్నది; కాని శకాబ్ద 1164వ సం॥నాటి మఱియొక శాసనము నందితఁడు కాకతీయ గణపతిదేవుని కొలువు నందా మహారాజు పక్షమున ఏఱువ త్రిసప్తతి దేశమును క్రొచ్చెరుల రాజధానినుండి పాలించుచుండి నట్లు చెప్పియున్నది, అందితనికి అరివీర బ్రహ్మ రాక్షసయను బిరుదుండినట్లు చెప్పియున్నది [12] మఱి యెనిమిదేండ్లవఱకు ఇతని ప్రస్తావము శాసనములందు కానరాదు. శా. శ. 1172 సాధారణ సంవత్సరము (క్రీ. శ. 1250) నాటిది కర్నూలుజిల్లా మార్కా పురము తాలూకా త్రిపురాంతకమున మూలబ్రహ్మేశ్వ రాలయాంగణమున ఇతనిది మఱియొక శాసనము గలదు. ఇందు గంగయ సాహిణికి మహామండలేశ్వర, బాహత్తర నియోగాధిపతి, అనేక దేశాధిపతి, చాతు ర్వర్ణసముద్ధరణ, పశ్చిమ రాయదామోదర సైన్యదిశాపట్ట, ఏకాంగవీర, వీరావతార, అతివిషమ హయారూఢ ప్రౌఢ రేఖారేవంత. నాయక నారాయణమున్నగు బిరుదము లున్నట్లు తెలియుచున్నది [13] ఈ బిరుదులనుబట్టి చూడఁగా కాకతీయ సామ్రాజ్యమున గంగయ సాహిణియొక్క ప్రాధాన్యము శకాబ్దము 1164, 1172 ల మధ్య అతిశయించినట్లు తెలియుచున్నది. ఏ మహత్కార్యములకు ఫలితముగ నీతని ప్రాధాన్య మతిశయించి యాతనికి మండలేశ్వరపదమును, బాహ-

11 AR. No. 69 of 1929-30.
12 AR. No. 267 of 1949-50.
13 AR. No. 283 of 195 S 99 X 332

త్తర నియోగాధిపత్యమును, అనేక దేశాధిపత్యమును, నాయక నారాయణత్వమును లభించెనో నిశ్చయముగ దెలియదు. పై వివరించిన బిరుదావళిలో "పశ్చిమ రాయ దామోదర సైన్య దిశాపట్ట" యనునది గమనింపదగినది. ఈ దామోదరుఁడెవ్వడో గంగయ సాహిణి ఇతని సైన్యముల నెచట యేసందర్భమున నోడించి తఱుముగొట్టెనో వివరించుటకు దగినసాధనము లింకను లభ్యపడలేదు. కాని యతఁడు మహారాష్ట్రుఁడగునేమో యను సంశయము గలుగుచున్నది, ఆ దామోదరుఁడు పశ్చిమరాయఁడట. అనఁగా కాకతీయ సామ్రాజ్యమునకు బశ్చిమమున నప్పుడువర్ధిల్లుచుండినది సేవుణ రాజ్యము, దీనినే దేవగిరి యాదవ రాజ్యమని చరిత్రకారులందురు. సేవుణ కాకతీయ రాజ్యములకు దరతరములనుండియు వైరమభివృద్ధియై వచ్చుచుండినది. ఈ కారణము నీ పశ్చిమరాయ దామోదరుఁడు దేవగిరి యాదవరాజు కాకపోయినను నతని యధికారమునకు లోఁబడి యుండిన సామంత రాజై యుండవచ్చును, పశ్చిమరాయ దామోదరసైన్య దిశాపట్టయను బిరుదు గంగయసాహిణి కొక్కనికి మాత్రమేకాక యతని బావమఱదియైన యంబక్ష్మాపతికిని, యంబక్ష్మాపతి పుత్రులైన జన్నిగదేవ త్రిపురాంతకాంబదేవులకును సామాన్యముగఁ జెల్లుచుండెను. అంబక్ష్మాధిపుని సత్రశాల శాసనముపై వ్యాఖ్యచేయుచు భారతీయ శాసనశాఖవారు ఇట్లు చెప్పుచున్నారు. "*గంగయ సాహిణియు నతని బావమఱఁదియగు నంబక్ష్మాధిపునివలె 'పశ్చిమరాయదామోదర సైన్య దిశాపట్టు'డనని చెప్పుకొనియుండుటచేత. కాకతీయ గణపతిదేవుని పక్షమున వారిరువురును ఏకమై యీ ఘనకార్యమును సాధించియుందురని తలంచుట యుక్తముగ నున్నది.*"[14] జన్నిగదేవుఁడును త్రిపురారియు దమమేనమామయగు గంగయసాహిణికి భుజప్రాయులని యొకశాసనమున జెప్పియుండుట వలన[15] వారుకూడ దామోదరునితోనైన యుద్ధము నందు పాల్గొనియుండవచ్చును. ఇట్లు తండ్రియు సోదరులును మేనమామతోగూడ దామోదరునితో యుద్ధమునకు నడుమనుండ శూరుఁడైన అంబదేవుఁడు వారికి బాసటయై పోవక వెనుదీసియుండునా? కావున కాయస్థకుటుంబమువారందఱు నేకీభవించి దామోదరుని ప్రతిఘటించి యోడించియుందురని మన మనుకొనవచ్చును.

దామోదరుని మీఁది విజయమునకు ఫలితముగనె గంగయసాహిణికి మహామండలేశ్వర పదవియు బాహత్తర నియోగాధిపత్యమును ననేక దేశాధిపత్యమును, నాయక నారాయణ పదమును లభించియుండును. మహామండలేశ్వర బిరుదము రాజపదవిని సూచించును. ఇది యప్పటి సామంతప్రభువులేకాక స్వతంత్రులైన దేశాధిపతులుసహితము వహించుచుండిరని యప్పటి శాసనములవల్ల దెలియుచున్నది సమస్తాంధ్రావనికి పాలకుఁడైన కాకతి గణపతిదేవునివంటి స్వతంత్రప్రభువుకూడ కొన్ని శాసనములందు మహామండలేశ్వర బిరుదముతోడనే పేర్కొనబడియున్నారు. బాహత్తర నియోగులనఁగా డెబ్బదిరెండు వగల రాజకీయోద్యోగులకును మీఁది యధికారి. నాయకనారాయణుఁడనఁగా రాజుకొలువులోని దళనాయకులకునెల్ల నధిపతి. కాకతి భూపా... ...లులు డెబ్బది యేవురు నాయకులుండిరని శాసనాది చరిత్రసాధనములవలన దెలియుచున్నది. నాయక నారాయణుఁడు వీరి తలనాయకుఁడు. ఈ బిరుదులనుబట్టి చూడఁగా గంగయసాహిణి కాకతీయ రాజ్యాంగవ్యవస్థయందు రాజునకు తరువాతి యున్నతపదవి నధిష్ఠించియుండెనని తోఁచుచున్నది. అనేక దేశాధిపతియను బిరుదును నిరర్థకమైనదికాదు. సార్థకమైనదే. దీనిని వివరణ శకాబ్దము 1173 విరోధి సంవత్సరమున

14 ARE — 1935–36 Part II Para 30.

15 AR. No. 261 of 1905 S 99 X 465.

గంగయ సాహిణి మంత్రియైన నామదేవపండితుఁడు గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలోని దుర్గియను గ్రామమున నెలకొల్పిన శాసనమందు కలదు. ఇందు "గంగయ్య సాహిణి పానుగల్లు మొదలు మార్జవాడి దాంకా సుఖ సంకథావినోదంబున రాజ్యంబుసేయు చుండె" నట్లు చెప్పియున్నది.[16] ఇ-దు పెర్కొనిన రాజ్యము నల్లగొండ జిల్లాలోని పానుగల్లునుండి కడప మండలమువఱకును వ్యాపించియుండెనని పూర్వ ప్రకరణమున వివరించియున్నాడను. దీని యధార్థ మును కర్నూలు మండలము మార్కాపురము తాలూకాలోని త్రిపురాంతకమందును, గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలోని దుర్గి, గుండ్లపాడు, నాగులవరము, మాచర్ల, పలువాయి సత్రశాల మున్నగు గ్రామములందును, కడపజిల్లాలోని రాజం పేట కడప, కామలాపురము తాలూకాలకు చెందిన నందలూరు, పుష్పగిరి, పొడదుర్తి గంగివరగ్రామము లందును గానవచ్చు గంగయ సాహిణియొక్కయు, నాతని సంబంధికులయొక్కయు శాసనములు ఋజువు సేయుచున్నవి.[17] కాని పానుగల్లునందుగాని తత్పరి సరప్రదేశములందెందుకాని కాయస్థరాజుల శాసన మొక్కటేనియు లభింపకపోవుట చిత్రము. అయినను నామదేవపండితుని దుర్గిశాసనమునను తదనంతర కాయస్థశాసనములందును చెప్పినట్లు గంగయసాహిణి పానుగంటినుండి మార్జవాడి పర్యంతము వ్యాప్తమైన రాష్ట్రమును పాలించెనని స్థూలముగ నిశ్చయింప వచ్చును.

16 AR. No. 579 of 1909 ⟩ 99 X 334.

17 AR Nos. 176, 231 and 291 of 1905; 305 and 695 of 1907; 21 and 69 of 1929–30; 306 and 314 of 1930–31; 233 and 269 of 1937–38; 10 of 1941–42; and 267 of 1942–50,

## గంగయసాహిణి – రక్కసగంగఁడు.

గంగయసాహిణియొక్క సచివుఁడును. శ్రీకర ణాధిపుఁడునైన నామదేవ పండితుఁడు శకాబ్దము 1176 అనందనామ సంవత్సరమునందు త్రిపురాంత కమున నిల్పిన శిలాశాసనమున గంగయసాహిణికి తత్పూర్వ శాసనములలో గానరాని "రక్కస గంగ దిశాపట్టు" యను బిరుదొకటి క్రొత్తది కానవచ్చు చున్నది.[18] ఇందువలన గంగయసాహిణి రక్కస గంగఁడను శత్రుని యుద్ధమున నోడించి పాఱదోలెనని తెలియుచున్నది. శతాబ్దము 1186 (క్రి. శ. 1264) రాక్షసలో గంగయ సాహిణియొక్క మేనల్లుఁడైన జన్నిగదేవుని సర్వాధికారియైన మాయిదేవుఁడు కారెంపూడియందు నెలకొల్పిన శాసనములో దన ప్రభు వునకు "రక్కసగంగ బెంకొండగండ" యనఁగా రక్కసగంగని వెన్నంటి తఱిమిన శూరుఁడను బిరు దుండినట్లు తెల్పినాడు.[19] జన్నిగదేవుఁడు "మావ సంకార" యనగా దన మేనమామయగు గంగయ సాహిణియొక్క అంకకాడగుటచేతను,[20] అతఁడును నతని యనుజన్ముఁడైన త్రిపురారియు గంగయసాహి ణికి బాహుద్వయమువంటివారని యుండుటచేతను[21] నా మామయల్లుండ్రిరువురును రక్కసగంగని దారసిల్లి యోడించి వెన్నంటి పాఱదోలిన సంఘటనయొక్క రణరంగమందే యని యెంచుట యుక్తము.

గంగయసాహిణిచే నోటువడి పాఱిపోయిన రక్కసగంగఁ డెవ్వఁడు? గంగయసాహిణి అతని నెప్పు డేకారణమున తారసిల్లి పోరాడెను? అను ప్రశ్నలు సమాధానమును కోరుచున్నవి. రక్కసగంగ యనునది వైదుంబవంశజుఁడును కలుకడ పురవరాధీశ్వరుఁడును

18 AR No. 321 of 1905 ⟩ 99 X 343.

19 AR No 550 of 1909 ⟩ 99 X 402.

20 Paid,

21 AB No, 268 of 1905 ⟩ 99 X 465

నిశ్శంక బిరుదాంకితుఁడునునైన రాయదేవమహారాజు యొక్క నామాంతరము. ఇంతవఱకును నితనివి రెండు శిలాశాసనములు వెల్వడినవి. ఒకటి కడపజిల్లా రాయచోటి యను గ్రామమునందు కలదు. శకాబ్దము 1155 నందనసంవత్సరమున నితఁడు మారాయపాడి (మార్జవాడి) అండపూరను గ్రామమునందుండు జనార్దనస్వామికి స్వనామాంకితమైన రాయనారాయణ పుత్తూరను గ్రామమునుదానము చేసినట్లు తెల్పుచున్నది.[22] మఱియొకటి కడపజిల్లా సిద్ధవటము తాలూకా జోతి గ్రామమున జోతినాథుని యాలయమున గలదు. ఇది రక్కస గంగనామాంతరుఁడైన రాయదేవమహారాజు పృథ్వీరాజ్యముసేయుచుండఁగా నతని భృత్యుఁడయిన జ..ిు..ానాయఁడు శకాబ్దము 1169 ప్లవంగ సంవత్సరమున జోతినాథుని కోటగోడయు అక్రపోలను ఇరూగలసాని గుడిని గట్టించెననియు, బేటూరునందు చెఱువును ద్రవ్వించెననియు గుడి గట్టించి యగ్రహరమును విడిచెననియు జెప్పియున్నది.[23] ఈశాసనములను జూడఁగా నీ రక్కస గంగరాయ దేవమహారాజు శకాబ్దములు 1155, 1169లలో మార్జవాడియందును పొత్తపినాడులోను ప్రభుత్వము నల్పుచుండినట్లు తెలియుచున్నది,

ఇక గంగయ సాహిణికి రక్కసగంగరాయదేవమహారాజుతో కయ్యమేల కలిగెనో కనుగొనవలసియున్నది. శ. 1169 నాటి జోతిశాసనమువలన నతఁడు సిద్ధవటప్రాంత దేశమునేలుచుండినట్లు తెలియుచున్నదికదా! సిద్ధవటము మార్జవాడిలోనిది. శ1173 నాటి నామదేవుని దుర్గిశాసనమునందు గంగయ సాహిణి పానుగల్లు మొదలు మార్జవాడిదాక గల రాష్ట్రమును పాలించుచుండెనని చెప్పియున్నది. శ. 1161 నాటి గుంప్లూరుశాసనమందును, శ 1172 నాటి త్రిపురాంతక శాసనమునను[24] గంగయసాహిణి పైఁ జెప్పిన పానుగల్లు మార్జవాడుల ప్రస్తావము గానరాదు. కావున నప్పటికా రాష్ట్రములపై నతనికింకను ప్రభుత్వము చేకూడలేదని తోఁచుచున్నది. కావున గంగయసాహిణి శ 1169, 1173ల మధ్య మార్జవాడిపై దండువెట్టి యాదేశపాలకుఁడైన రక్కసగంగరాయదేవమహారాజు నోడించి యతనియేలుబడి క్రింది రాష్ట్రమును గైవసము గావించుకొనెనని యూహింపఁదగియున్నది. కాని యీ దండయాత్రయందు గంగయ సాహిణికికే యెల్లయెడలను జయము కలుగలేదు. ఒకప్పుడతఁడు రక్కసగంగనిచే పరాభూతుఁడై తన సర్వస్వమును గోలుపోయెను. ఇట్లనుటకు గొంత శాసనసాక్ష్యముగలదు. శకాబ్దము 1244 దుందుభి వర్షమున జమ్మలమడుగు తాలూకా తాళ్లప్రొద్దటూరు గ్రామమున జగతాపిగుత్తి ప్రభువైన గంగదేవచోడ మహారాజు వ్రాయించి నెలకొల్పిన శాసనమందు తనకు '*గంగయసాహిణి సర్వస్వ బందికాఱ*' యను బిరుదుండినట్లు తెల్పియున్నాఁడు. కాని యీ గంగదేవ చోడమహారాజు గంగయ సాహిణికి సమకాలీనుఁడు గాఁడు. అతనికంటె నర్వాచీనుఁడు. గంగయసాహిణి గతించిన తరువాత నొక యర్ధశాతబ్దముమీఁదగాని యతఁడు చరిత్రరంగమున బొడచూపలేదు. కావున నతఁడు స్వయముగ గంగసాహిణియొక్క సర్వస్వమును చూఱగొని యుండజాలఁడు. అతనికి అబిరుదు కులక్రమాగతమై వచ్చియుండవలయును. ఆతని తండ్రియైన యల్లుగంగరాజు కలుకడపుర వరాధీశ్వరులైన వైదుంబసోమిదేవకేశవులకు మిత్రుఁడు. గంగయ సాహిణియొక్క కడగొట్టు మేనల్లుఁడైన అంబదేవునికి బ్రతిపక్షి. కావున గంగదేవమహారాజు పూర్వికులకు కాయస్థరాజులతో వైరముండెనని తెలియుచున్నది.

22 AR. No. 446 of 1211.
23 AR. No. 568 of 1915.
24 AR, Nos. 69 of 1929–30, 267 of 1949–50 and 283 of 1905.

అట్లు గంగరాజుగాని యతని తండ్రిగాని రక్కసగంగని గలసి గంగయసాహిణి నెదిర్చి యోడించి యతని సర్వస్వమును హరించియుండును. గంగయసాహిణి యొక్క సమకాలికుడైన తిక్కనసోమయాజి అతనికి రక్కసగంగని చేతైన పరాభవమును గుర్తెఱుగును. నిర్వచనోత్తర రామాయణ పీఠికయందు తిక్కనసోమయాజి యిట్లు వ్రాసియున్నాఁడు.

"రంగమువార కీర్తియగు రక్కసగంగనఁ బెంజలంబుమై భంగ మొనర్చి మన్మజనపాలుఁడు బల్విడినాచికొన్నరాజ్యాంగము లెల్లనిచ్చి దనయాశ్రితవత్సలవృత్తియేర్పడన్ గంగయసాహిణింబదముగైకొనఁబంచెఁ బరాక్రమోన్నతిన్"[26]

గంగయసాహిణి తన్నాశ్రయింపఁగా మన్మజనపాలుఁడు (నెల్లూరు తెలుగు చోళరాజైన రెండవ మన్మసిద్ధి) యాతని పక్షమున రక్కసగంగనిపై నెత్తిపోయి యాతని యుద్ధమందు పరాభూతునిగావించి బలిమిచే నతని రాజ్యాంగములను హరించి తన యాశ్రితవత్సలవృత్తి తెల్లముగునట్లు ఆరాజ్యాంగములను గంగయసాహిణికి బ్రసాదించి యతని నతనియొక్క పదమును గైకొనఁబంపెనని పైపద్యముయొక్క సారాంశము. ఈపద్యము తాళ్లప్రొద్దటూరు శాసనసాక్ష్యమును బలపఱచుచున్నది. గంగయసాహిణికి సమకాలీనుఁడును నతనికి రక్కసగంగని నిర్జించుటకు తోడ్పడిన రెండవ మనుమసిద్ధిమంత్రియైన తిక్కన సోమయాజి వాక్యములు సత్యాత్మకములనుటకు సంశయములేదు. గంగయసాహిణియు నాతని యనుయాయులును తమ శాసనములలో నతని విజయములను మాత్రము బేర్కొని యాతని పరాజయములను గప్పిపెట్టుట వింతకాదు. ఈపట్టున విచారింపఁదగిన యంశ మొకటికలదు. గంగయసాహిణి కాకతి గణపతిదేవుని యధికారివర్గములలో నొక్కఁడని యాతని శాసనములవల్ల దెల్లమగుచున్నది. గంగయసాహిణి సామాన్యుఁడుకాఁడు; అతఁడు గణపతిదేవుని యశస్సాహిణి బాహత్తర నియోగాధిపతి అట్టివాఁడు తనకు రక్కస గంగనితోడి పోరాటమున బరాజయము గలిగి తన్మూలమున సర్వస్వమును గోలుపోయినపుడతఁడు తన ప్రభువైన గణపతిదేవు నాశ్రయింపక నెల్లూరు తెలుగు చోళప్రభువైన రెండవ మనుమసిద్ధి నేల యాశ్రయించెను? ఆ మనుమసిద్ధి యాతనికేల యాశ్రయమిచ్చి సాయమొనర్చెను? దీనికి రెండు కారణములు గానవచ్చుచున్నవి. (1) మనుమసిద్ధి కాకతీయ గణపతికి మిత్రుఁడు; అతఁడు గణపతి మహారాజుచే మహోపకారమునుబొందియుండెను మనుమసిద్ధి తండ్రియైన తిరుకాళత్తిదేవ మహారాజు శ 1169 లోనో తరువాత యచిరకాలముననో మృతినందెను.[27] తండ్రి మరణానంతరము మనుమసిద్ధి రాజ్యాధిపత్యమును వహించెను; కాని యతనికి రాజ్యము స్వాధీనము కాలేదు. దాయాదులును, బంధువులును ఇతర రాజ్యప్రముఖులును నతని యధికారమును ధిక్కరించి యతని పదభ్రష్టుని జేయసమకట్టిరి. దక్షిణమున కంచియందు అల్లున్ తిక్కరాజను నతఁడు స్వతంత్రుఁడై తత్ప్రాంత భూముల నాక్రమించుకొనెను. విజయగండగోపాలుఁడు మఱికొంత రాష్ట్రమును వశపఱచుకొనెను. పడవాళ్లు తిక్కన బయ్యనలు తిరుగుబాటుచేసి రాజధానియైన విక్రమసింహపట్టణమును స్వాధీనపఱచుకొనిరి. నెల్లూరురాజ్యమిట్లు అంతఃకలహములవల్ల కలతవడియుండ రాజ్యాధిపత్యమును వహించిన మనుమసిద్ధి స్వకీయశక్తిచే శత్రువులను సాధించి రాష్ట్రమునంతటిని తన యేలుబడిక్రిందికి తెచ్చుకొనజాలక, యప్పుడు ఆంధ్రదేశమున జాల భాగమున కధిపతియు, దనతండ్రియైన తిక్కరాజునకు మిత్రుఁడునునైన కాకతిగణపతిదేవుని సహాయము నర్థించెను. ఈవిషయమును విపరించు నైతిహ్యా

26 నిర్వ 1-41.

మొక్కటి కాసె సర్వప్పయను నతఁడు రచించిన సిద్దేశ్వర చరిత్రయను ద్విపదకావ్యమందు కలదు. అక్కన బయ్యన లనువారు నెల్లూరు రాజగు సిద్ధిరాజుపై దిరుగుబాటుచేసి యతని రాజ్యము నాక్రమించి యేలుచుండఁగా నాసిద్ధిరాజు పక్షమున తిక్కనసోమయాజులు ఓరుగంటికిపోయి గణపతిదేవుని దర్శించి యక్కన బయ్యనలను శిక్షించి సిద్ధిరాజు నతని రాజ్యమున పునఃప్రతిష్ఠితుని జేయవలయునని యర్థింప నతఁడట్లె కావించెనని యందు వ్రాయబడియున్నది.[28] ఈ సిద్దేశ్వర చరిత్రను సోమదేవరాజీయమను పేర కూచిమంచి జగ్గకవి పద్యకావ్యముగ రచించెను. అందును ఈ కథ కలదు. కాని యీ గ్రంథములందు చెప్పినటు తిక్కసోమయాజు లోరుగంటికి రాయబారమేగి గణపతిదేవుని మనుమసిద్ధికి యతనిసాయము వడసెనను విషయము మఱియు బుజువుచేయు సాధనాంతరము లెవ్వియుఁ గానరావు. కాని యది యసంభవమని త్రోచిపుచ్చఁదగదు. ఏలనఁగా తిక్కన బయ్యనలను వారు మనుమసిద్ధిపై తిరుగుబాటుచేసి యతని రాజ్యము నాక్రమించు కొనినది వాస్తవము తిక్కనసోమయాజి మనుమసిద్ధి మంత్రియైయుండినదివాస్తవము మఱియు గాకతిగణపతిదేవుఁడు నెల్లూరు రాజ్యముపై నెత్తిపోయి తిక్కన బయ్యనల నోడించి మనుమసిద్ధిని యతని రాజ్యమునందు పునః పతిష్ఠ గావించుటయు వాస్తవము కాబట్టి మనుమసిద్ధియొక్క యాదేశముపై తిక్కనసోమయాజులు ఓరుగంటకిబోయి గణపతిదేవుని సాయము వేడియుండినను నుండవచ్చును. సోమయాజులవేడికోలును ఆదరించి గణపతిదేవుడు మనుమసిద్ధిని ఆతని రాజ్యమునందు పునఃప్రతిష్ఠితుని జేసియుండవచ్చును. గణపతిదేవునికి ప్రత్యుపకారము సేయు వాంఛతో మనుమసిద్ధి గంగయసాహిణికి తోడ్పడియుండవచ్చును.

2) రక్కసగంగరాయ. దేవ మహారాజు మనుమసిద్ధికి శత్రువు ఆతఁడు నెల్లూరు తెలుగు చోళరాజులకు చెల్లచుండిన పొత్తపిరాజ్యము నాక్రమించుకొనటవలన వారికి వైరము కలిగినది. అతని రాయచోటి జోతి శిలాశాసనములు అతని దురాక్రమణను ఋజువు చేయుచున్నవి ఈ రెండుకారణములవల్లను మనుమసిద్ధి గంగయసాహిణికితోడ్పడ నిశ్చయించుకొనెను ఒక ప్రక్క మిత్రుఁడును దన్ను దనరాజ్యమున బునః ప్రతిష్ఠ చేసినవాఁడును నగు కాకతీయ గణపతికి ప్రత్యుపకార మొనర్చినట్లగును. మఱియొక్కప్రక్క శత్రువుపైఁ బగ తీర్చుకొనినట్లును నగును. ఇంతియకాక కాకతీయగణపతి తన బాహత్తర నియోగాధిపతియైన గంగయసాహిణికి తోడ్పడుమని మనుమసిద్ధి నాదేశించియుండినను నుండవచ్చును.

ఈ యుద్ధ మెట్లు నడచెనో తెలియదు. లభ్యమైన చరిత్రాధారములవలన రక్కసగంగన యుద్ధమునం దోడి పాఱెననియు తదనంతరము మనుమసిద్ధి గంగయసాహిణిని నతని రాజ్యమున బునఃప్రతిష్ఠితుని గావించెననియు దెలియుచున్నది. శ. 1172నకు సరియైన సాధారణ సంవత్సరమున గంగయసాహిణి యొక్క మంత్రియైన సారంగు నాయకుడు కడప జిల్లా రాజంపేట తాలూకా నందలూరు సౌమ్యనాథ స్వామి యాలయమునందు నెలకొల్పిన శాసనమును[29] బట్టి చూడఁగా నప్పటికే రక్కసగంగనితో యుద్ధము ప్రారంభమై నందలూరు పర్యంతము వ్యాప్తమైయుండిన పొత్తపిరాజ్యము గంగయసాహిణికి స్వాధీనమైనట్లు తోచుచున్నది. శ. 1176 ఆనంద సం॥ నాటినామదేవుని త్రిపురాంతక శాసనమున గంగయసాహిణి రక్కసగంగని దిశాపట్టుని గావించినట్లుండుటవలన[30] నప్పటికి యుద్ధము ముగిసి

---

28. ఆంధ్రకవుల చరిత్రము. పుటలు—33–35.

29 A.R. No. 595 of 1907

30 A.R. No. 559 of 1909 } 99 x 402

యకఁడు నిజపదమున పునఃప్రతిష్ఠితుఁడైనట్లు యెంచఁదగియున్నది ఈ యుద్ధమునకు ప్రతిఫలముగ గంగయసాహిణి మార్జవాడియందు సుస్థిరుఁడై నెలకొని ములికినాటిలోని వలూరు పట్టణము రాజధానిగ ప్రజాపరిపాలనము సేయఁగడఁగెను. రక్కసగంగరాయదేవమహారాజు మనుమసిద్ధిచేతను గంగయసాహిణిచేతను పరాజయమును పొందిన పిమ్మట యచిరకాలముననె మృతి నొందెను. అతని వెనుక కలుకడపురవరాధీశ్వరుఁడు త్రైలోక్య మల్ల భుజబల వీర నారాయణ నిశ్శంక ప్రతాప బిరుదాంకితుఁడైన శ్రీమన్మహామండలేశ్వరసోమి దేవమహారాజు రాజ్యాధిపత్యమును వహించెను. ఇతనికి రక్కసగంగరాయదేవమహారాజుతో గల సంబంధ మెట్టిదియో తెలియదు. కాని యితడు రాజ్యము సేయుచుండగా, సిద్ధవటము తాలూకా మాచుపల్లి గ్రామములో శ 1178 రాక్షస సం॥కర్కటక శు 15 మంగళవారమునాడు వ్రాయించి నెలకొల్పిన శాసనములో ములికివలనాటిలోని వల్లూరు నందు రాజ్యము సేయుచుండిన మాండలిక బ్రహ్మరాక్షస గండపెండార గంగయసాహిణి అతని యొక్క శ్రీపర్వత దక్షిణ ద్వార సమీపమందుండు మాసురుపల్లి యను గ్రామమును గైకొని మలయమండల వాస్తవ్యుఁడైన కాలడివాసుదేవ నాయకుఁడను బ్రాహ్మణునకు పృథ్వీదానముజేసినట్లు చెప్పియున్నది.[31] ఇందువలన గంగయసాహిణి వల్లూరు రాజధానిగ ములికినాడు పాలించుచుండెనని తెల్లమగుచున్నది; కావున శాసనకాలమునాటికి ములికినాడు అతనికి స్వాధీనమై యతని యేలుబడిక్రిందికి వచ్చెనని నిస్సంశయముగ జెప్పవచ్చును. వల్లూరు వైదుంబులకుగూడ రాజధానిగ నుండెననుటకు గొంత యవకాశము గలదు. వైదుంబుల యేలుబడి యప్పటికి కింకను సంపూర్ణముగ తుదముట్టలేదు. సోమిదేవ మహారాజు సిద్ధవట ప్రాంత భూమిని పాలించుచుండెను. అతఁడు గంగయసాహిణికి సామంతుఁడై యుండనోపు. అప్పటి వ్యవహార మర్యాదల ననుసరించి మసరుపల్లి తనకరిగాపైన సోమిదేవ మహారాజుయొక్క సామంతసీమకు జెల్లుచుండినందున నతని నడిగి కైకొని దానము జేయవలసివచ్చెను. గంగయసాహిణి శాసనములు మఱికొన్ని కడప మండలమునందు కానవచ్చుచున్నవి. కామలాపురము తాలూకా పొదదుర్తి నొకటికలదు అందతఁడు శ. 1178 నల సం॥ జ్యేష్ఠ శు 3 భానువారమునాడు (క్రీ. శ. 1256 మే) 28 పొదతొల్తియను పూర్వదత్తి గ్రామమును పునరుద్ధరించెనని వ్రాయఁబడియున్నది.[32] కడప తాలూకా కొట్లూరు గ్రామమున మఱియొక శాసనమున్నది. అందు శ 1196 పింగళ వర్షమున కాకతీయపురవరాధీశ్వరుఁడైన గంగయసాహిణి పుష్పగిరి దేవాలయ పరిచారకుల కేదో దానము చేసినట్లు చెప్పియున్నది.[33] ఇందు శాసన కాలము వ్యత్యస్తముగ నున్నది. పింగళనామ వర్షమునకు సరియైన శకవర్షము 1179 కాని 1196 కాదు; గంగయసాహిణి కాకతీయ పురవరాధీశ్వరుఁడును గాఁడు. అట్లనుట పొరపాటు. గంగయసాహిణియొక్క శాసనములతోపాటు అతని యధీశ్వరుడైన కాకతిగణపతిదేవుని శాసనములును కొన్నియెడల కన్పట్టుచున్నవి. కామలాపురము తాలూకాలోని గంగవర గ్రామమందలి శాసన మిందుకు తార్కాణ శ. 1179 పింగళ వత్సర ఆషాఢ శు. 15 గురువారమునాడు (క్రీ. శ. 1257) గణపతిదేవుడు పృథ్వీపరిపాలన చేయుచుండఁగా గంగయసాహిణియు, నాతని ధర్మపత్నియైన కమలాదేవియు ములికినాటిలోని గంగవరమను గ్రామమును పుష్పగిరియందలి పుష్పేశ్వర

1. ఎపి. ఇండి. XXVI. P. 120

32 A. R. No. 269 or 1937–38–33–Rangacharya Topographical list of Inscriptions in the Madras Presidency–Vol I. cd. 63.

మహాదేవర పూజాపురస్కారములు నడపుట కొఱకు సదరు గ్రామమును దానముజేసిరి. ఇయ్యది ఈశాన గురుదేవుని చేతియందు ధారవోసి దత్తము సేయ బడెను.[34]

మీఁద నుదహరించిన శాసనమువలన ములికి నాడును మార్జవాడిలోని మఱికొంత భాగమును శకాబ్దములు 1176, 1179 ల మధ్య గంగయ సాహిణి యొక్క యేలుబడిక్రిందికి వచ్చెననియు దత్పూర్వ మా ప్రాంతములను బాలించుచుండిన కలుకడపుర వరాధీశ్వరులైన వైదుంబరాజులు అతని కరిగాపు వైరనియు, సతఁడా ప్రాంతములను గాకతి గణపతి దేవుని యాధిపత్యము క్రింద పాలించుచుండెననియు దెలియవచ్చుచున్నది.

గంగయ సాహిణి ప్రభుత్వము శ. 1179 (క్రీ. శ. 1257) తో సమాప్తమైనట్లు తోఁచుచున్నది. అటుతరువాత అతని శాసనము లెవ్వియు గానరావు. శ. 1180 సం॥ నుండి ఆతని మేనల్లుఁడైన జన్నిగ దేవుని పాలన ప్రారంభమైనట్లు శాసనముల వలన తెలియుచున్నది.

గంగయ సాహిణికి యుద్ధములందు అతని మేనల్లుడైన జన్నిగదేవ త్రిపురారులు కుడి యెడమ భుజములవలె వర్తించువారు.[35] రక్కస గంగనితో నైన యుద్ధమున జన్నిగదేఁవుడు నాయకత్వము వహించి యాతనివెన్నంటి తఱిమెనని యింతకుముందే చెప్పియున్నాఁడను. రాజ్య పరిపాలనా కార్యములందు సమర్థులైన మంత్రులతనికి ప్రాపైయుండిరి. ఇతని ప్రధానులలో నొక్కఁడైన సారంగునాయకుఁడు శ. 1172 కు సరియైన సాధారణ సంవత్సరమున కడపమండలములోని నందలూరు సౌమ్యనాథస్వామి యాలయమున నొక శాసనమున పేర్కొనఁబడి న్నాఁడు.[35A] ఇతనికంటె బ్రాహ్మణుఁడు మాయిదేవ పండితుఁడు. ఇతఁడు కాయస్థకులజుఁడు-వాయిపండితు నకు గంగాబాయియందు జన్మించినపుత్రుఁడు. స్వకీయ గుణములను యోగ్యతను ఇట్లు వివరించుకొని యున్నాడు

"*గండపెండారు గంగయ్య సాహిణి సమస్త రాజ్య సముద్ధరుండైన స్వస్తి సమస్త రాజ్యభార నిరూపిత మహామాత్య పదవీ విరాజ్యమాన మానోన్నత ప్రభు మంత్రోత్సాహ శక్తిత్రయగుణ సంపన్న ఆన యాసన ద్వైధీభావ షాడ్గుణ్యగుణోపేత పరేంగిత జ్ఞాన అష్టావధారణౌ దాయన్ భరిత ఉత్పన్నమతి సంపన్న సురగురు సమాన సకల శాస్త్ర పారావారక మంత్రి మాణిక్య నీతి చాణక్యపతి కార్యదురంధర పరివార కల్పలతా పూజ్య దీనార్థిజన సువర్ణ ధారానటన గభీర ...... దీనానాంధగాయక వైతాళిక వైభాసిక దండి ముండి ఖండి నానాపేక్షపోషక యాచక దరిద్రఖండన నిత్యనేమానుష్టాన వాశిష్ఠ పురోగమనులైన నామదేవ పండితులు*"[36]

నామదేవ పండితుఁడు పల్నాటిలోని దుగ్గ పట్టణమున తన తండ్రిపేర వంకేశ్వరశివాలయమును నిర్మించెను. ఈ యంశమును దెల్పుచు శ. 1173 ఆనంద సంవత్సరమున నిల్పిన శాసనమున స్వవిషయమై యతఁడు మఱికొంతచెప్పుకొని యున్నాడు. గంగయ సాహిణియొక్క 'సకలరాజ్యసముద్ధరుండును శ్రీ కరణాధిపతియునుం గాయస్థకుల వార్ధివర్ధన సుధాకరుండును నైన నామదేవపండితులు పల్లినాటి లోని దుగ్గ పట్టణమునందు తమ తండ్రి వాయి పండితుల పేరను వంకేశ్వర దేవరం బ్రతిష్ఠసేసి గణపతిదేవ మహారాజులనుగానిచి కారుణ్యమువడసి మూరురాయ జగదళపడగాను చలమెత్తు గండ బిరుదూందెచ్చి సకల సన్నాహము మెఱసి ఎద్రువచ్చి కానిపించుకొని.

34 A. R. No. 233 of 1937–38

35. A. R. Mo. 268 of 1905, 599 X No. 465

35A. AR. No. 595 of 1907.

36. AR No. 595 of 1907.

షతగా బిరుదూ నిచ్చినం జేకొని సంతోషించి యున్న యవసరంబున దేవ కారుణ్యమున దుగ్యను వంకేశ్వర దేవర బ్రతిష్ఠసేస్తినని విన్నపము సేసెసను ఆ దేవరకు నమస్కరించి ... వంకేశ్వర దేవర కంగరంగ భోగ నైవేద్యములకుం గృష్ణవేణీసమీపంబున నాగార్జునికోట తూపునాన నెయ్యూరి సహితముగానిచ్చె.[37]

గంగయసాహిణి శైవమతాభిమాని. అతఁడు చేసిన దానధర్మములన్నియు శివాలయమునకు జేసినవే. త్రిపురాంతకమందు నెలకొనియున్న త్రిపురాంతకేశ్వరుఁడితని కిష్టదైవమైనట్లు తోఁచుచున్నది. శ. 1172 సాధారణ వర్షమున శ్రీ త్రిపురాంతక మూల స్థానదేవర యంగ రంగభోగములకు దువలికంపనము నకు జెందిన బోయపల్లెను, రెడ్లపల్లె పొలమును చతుస్సీమము సకలాయ సహితముగ ధారా పూర్వకము చేసి యిచ్చెను.[32] మొట్టవాడిలోని పుంచెప్పు రెడ్డి ఊరు చతుస్సీమమును సకలాయ సహితముగాను శ. 1177 రాక్షస సంవత్సరమున శ్రీ త్రిపురాంతక మహాదేవరకు దమ సంధ్య యంగరంగ భోగములకు ధారాపూర్వకము సేసి యిచ్చెను.[33] గంగయసాహిణి యొక్క ధర్మపత్నియగు కమలాబాయియు భర్తవలె శైవమతాభిమానినియె. ఆమెకు పుష్పగిరిక్షేత్రము మీఁద అభిమానము మెండు. అచ్చటనామె అల్లుగి నరపాలపుత్రిక హాచలాంబతోడను ఖండేరాయ నామ ధారియగు పల్లరాజుతోడనుగూడి యొక్క త్రికూటేశ్వ రాలయమును నిర్మించెను. అమెచే ప్రతిష్ఠింపబడిన లింగమునకు కమలేశ్వరుఁడనియు హాచలాంబచే స్థాపింపబడిన లింగమునకు హాచలేశ్వరుఁడనియును ఖండేరాయ ప్రతిష్ఠితలింగమునకు పల్లవేశ్వరుడనియు పేరులుగలిగెను.[34] మఱియు భర్తతోగూడ నామె శ. 1179 కి సరియైన పింగళ సంవత్సరమున కామ లాపురం తాలూకా గంగవరమను గ్రామమును పుష్పగిరి పుష్పేశ్వర మహాదేవుని పూజాపురస్కారములు నడపుటకొఱకు దానము జేసెను.[35] ఇట్లీ రాజదంపతులిర్వురును శివాలయ నిర్మాణము లందును వానియందు నిత్యనైవేద్యాది కైంకర్యములు నడపుటకు దగినట్టి యేర్పాటులను గావించుటయందును శ్రద్ధవహించుటచేత వారికాలమున శైవము చక్కఁగఁ బెంపొందెను. గంగయసాహిణి హిందూ ధర్మములను చక్కఁగ పోషించెను. 'చాతుర్వర్ణ సముద్ధరణ' యను బిరుదు వల్లనీ యంశము విదితమగుచున్నది.[36] ఈ బిరు దితని తరువాతి కాయస్థరాజు లుద్ధరించి యుండుటచే వారును ఇతని ననుసరించి వర్ణధర్మములను కాపాడిరని యూహింపదగి యున్నది

## జన్నిగదేవుఁడు.

గంగయసాహిణికి సంతానములేదు. కావున నతని మరణానంతర మతని మేనల్లుఁడు—చందుబాయి అంబక్మాధిపుల జ్యేష్ఠపుత్రుఁడు – జన్నిగదేవుఁడు కాయస్థరాజ్యమున కధిపతియాయెను. ఇతనికి జనార్దనుఁడను నామాంతరము గలదు. శకాబ్దము 1180 మొదలు 1191 వఱకును పండ్రెండేండ్లకాల మతఁడు రాజ్యము పాలించినట్లతని శాసనములవలన దెలియు చున్నది. గంగయసాహిణివలె నితఁడును పానుగల్లు

37. A. R. No. 571 or 1909 ∫ 99 X 334.
32. A. R. No. 283 or 1905, ∫ 99 X No. 332.
33. A. R. No. 176 or 1905. ∫ 99 X No. 346.
34. A. R. No. 304 or 1905. Rangacharya Topographical list Inscuriptions in the Madras Presidency Vol. IId. 73.
35. A. R. No. 233 or 1937–38.
36. A,R. No. 283 or 1905 ∫ 99 x 332

మొదలు మార్జవాడి పర్యంతము వ్యాప్తమైన రాష్ట్రముపై ప్రభుత్వము చేసినట్లు తన శాసనములందు ప్రకటించుకొనియున్నాడు ఇతఁడు కాకతి గణపతి దేవునికి మంత్రియై యతని తుది రాజ్యవర్షములలో నతనికి గుడిభుజమువలె బ్రవర్తించుచు కార్యఖడ్గములకు గర్తయై సేవించెను

జన్నిగదేవుఁడు నెఱజోదు. పిన్ననాడు తన మేనమామయగు గంగయసాహిణి ప్రస్తవమున బని గొని మావనంకకాఱ (మామయొక్క ఖడ్గకార్యములను నెఱవేర్చుట కంకితుఁడైన యోధుఁడు) అను బిరుదును బడసెను. గంగయసాహిణి మరణానంతరము కాకతీయుల యశ్వసేన కధిపతియై గణపతిదేవునికి రణరంగము లందనర్ఘమైన సేవ యొనర్చెను; కాని యతడు చేసిన యుద్ధములగూర్చికాని యతనిచే పరాభూతులైన శత్రువుల విషయమైకాని విస్పష్ట వివరణ మెందును కానరాదు; ఆతని బిరుదులవలన యూహించి కనుగొనుటకు కొంత అవకాశము గలదు. 'పశ్చిమరాయ దామోదర దిశాపట్ట,' రక్కసగంగ బెంకొండగండ, "ఒడ్డియరాయ అభిమాన చూఱకాఱ' అనునవి యతని ముఖ్యమైన బిరుదులు. మొదటి రెండు బిరుదు లెట్లు కలిగెనో పూర్వప్రకరణమున గంగియసాహిణి చరిత్రలో వివరింపబడియున్నది. వాని ప్రస్తాపము మరల నిచట ప్రసరము కాదు. మూఁడవ బిరు దే సందర్భమున నెట్లు చేకుఱెనో కనుగొనవలసియున్నది. జన్నిగదేవునిచే పరిభవమునంది మానము గోల్పోయిన ఒడ్డియరాయఁడెవ్వఁడు ? ఒడ్డియరాయఁడనగా నోఢ్రదేశప్రభువని యర్థము. జన్నిగదేవుఁ డెప్పుడెచట నోఢ్రదేశప్రభువుతో యుద్ధము సల్పెనో కనుగొందము. శకాబ్దము 1180 ప్రాంతమున జన్నిగదేవుని యధిపతియైన కాకతీయ గణపతిదేవునికి కళింగోత్కళాపుధిడైన గాంగవంశజుఁడైన మొదటి నరసింహదేవునితో పోరు కలిగినది. ఈ పోరాటమునకు సంబంధించిన విషయములెవ్వియు దెలియరావు. కావున చరిత్ర కారులీ యుద్ధవృత్తాంతమును దలపెట్టరు. నెల్లూరు రాజైన తెలుగుచోడ ఇమ్మడి మనుమసిద్ధి ఈ యుద్ధమునందు పాల్గొనెను. ఆతఁడు కాకతీయ గణపతిదేవునియొక్క మైత్రిని సంపాదింపగోరి తాను గోదావరీ తీరమునకు బోయి యతని శత్రువుతో బోరాడితినని శకాబ్దము 1181 కి సరియైన వీరరాజేంద్రచోళదేవుని 13 వ రాజ్యవర్షమున కడపజిల్లా నందలూరునందు సౌమ్యనాథస్వామి యాలయమునందు నెలకొల్పిన శాసనము నందు తెల్పియున్నాడు.[38] గణపతిదేవుని పట్టసాహిణియైన పదిరము బొప్పేశ్వరుఁడు తాను '.సాంపరాయ సందర్శితరిపుకవంద తాండవ గోదావరి తీర సమరగాండి' వుడనని బ్రకటించుకొనియున్నాఁడు.[39] ఈ యుద్ధమునందే జన్నిగదేవుఁ డొడ్డియరాయనితో బోరి యతని మానమును చూఱగొని యుండవలయును. జన్నిగదేవుని శత్రువులలో బల్లవ వంశజుఁడైన బ్రహ్మరాక్షస సిద్ధయ దేవ మహారాజొక్కఁడు. కడపజిల్లా మైదుకూరు నందు శకాబ్దము 1181 సిద్ధార్థి సంవత్సరమున నెలకొల్పిన శాసనమునందు గణపతిదేవ మహారాజు రాజ్యపాలన సేయుచుండఁగా గాంచీపుర వరేశ్వర కామకోట్యంబికావరప్రసాద లబ్ధ విభవ భారద్వాజ గోత్ర పవిత్రులయిన కదంబరాయ భీమదేవ మహారాజుల యొక్క పుత్రుడయిన బ్రహ్మరాక్షస సిద్ధయదేవ మహారాజులు చతురంగబలములను గూర్చి కొని యెత్తివచ్చి పినాకినీ తీరమందలి సోమశిలదగ్గర విడిసినట్లును, ఆ వృత్తాంతము దెలియవచ్చినంతటనే జన్నిగదేవుఁడు చతురంగ బలములను గూర్చుకొని

38 A. R. No. 580 of 1907, APT 1908 Para 75

39. A. R. No. 194 of 1905 S I I X. 398.

సోమశిలవద్దకిపోయి యతని బ్రతిఘటించి వధించి నట్లును, తన విజయ చిహ్నముగ శ. 1183 దుర్మతి మాఘ బ॥నాడు జన్నిగదేవుఁడు జయస్తంభమును బ్రతిష్ఠించినట్లును, నచట భీమయలింగముపేర శివలింగమును బ్రతిష్ఠగావించి దేవాలయమునిర్మించి యందు నిత్య నైవేద్య పూజాపురస్కారములను నడపుటకొఱకు వృత్తులనిచ్చి తగినయేర్పాటులను గావించినట్లును చెప్పియున్నది [40] గణపతి దేవుని కడపటి రాజ్య వర్షములలో దక్షిణదేశమున పాండ్యులు విజృంభించి చోళసామ్రాజ్యము నంతటిని యాక్రమించుకొనిరి. శకాబ్దము 1194 ప్రాంతమున పాండ్యరాజు, జటావర్మ సుందర పాండ్యుఁడు నెల్లూరు తెలుఁగు చోడ రాజ్యము మీఁదికి దండెత్తివచ్చెను. నెల్లూరు రాజైన మనుమసిద్ధి ప్రభువగు గణపతిదేవుడు సైన్యము నంపెను. కాకతీయసేన నెల్లూరి సేనతో నేకీభవించి నెల్లూరునకు పదునాల్గుమైళ్ళు తూర్పున సముద్రతీరమందుండు ముత్తుకూరు సమీపమున పాండ్యదళములను దారసిల్లెను. ఇరువాగులకు పోరు ఘోరముగ సాగినది; తుదకు పాండ్యుల నోర్వజాలక కాకతీయ తెలుగు చోళసైన్యము లోడిపాఱెను. వారిని వెన్నంటి కృష్ణానది పర్యంతము తఱిమి కసిమసగినట్లు పాండ్య రాజులు దమ శాసనములలో బ్రకటించుకొని యున్నారు. మనుమ[41] సిద్ధి ముత్తుకూరు రణక్షేత్రమున వీరశయ్య నలంకరించెను. నెల్లూరు రాజ్యము సమస్తమును పాండ్యులకు హస్తప్రాప్తమైనది. పాండ్య రాజు జటావర్మ సుందర పాండ్యుఁడు నెల్లూరు విక్రమసింహ పట్టణమున వీరాభిషేకమును గావించుకొని నెల్లూరునందును కడప మండలములోని నందలూరు నందును తన విజయ సూచకముగ శాసనములను నెలకొల్పెను.[42] తరువాత పాండ్యులు కాకతీయ రాజ్యముపై దండువెడలిరి. కర్నూలు మండలము లోని త్రిపురాంతకమందును దూర్పు గోదావరిమండల మందలి, దాక్షారామము నందును గానవచ్చు పాండ్య సామంతుఁడైన కొప్పెరంజింగని శాసనములనుబట్టి చూడగా పాండ్యులదాడి పైప్రదేశముల పర్యంతము తీరాంధ్ర భూమిలోనికి జొచ్చుకొని పోయినట్లు తోఁచుచున్నది; [43] కాని యచటివారు కాలాన్పి నిలువ జాలకపోయిరి. గణపతిదేవుఁడు క్రొత్త దళములను సమకూర్చి వారిని ప్రతిఘటింపనంపెను. కొప్పెరంజింగఁడు గణపతిరుద్రమదేవుల యాధిపత్యము నంగీకరించుటను జూడ నతఁడును నతనితోపాటు పాండ్య బలములును పరాజయమునంది నిజదేశమునకుమరలి పోయినట్లు విదితమగుచున్నది. పాండ్య విద్రావణ కార్యమున జన్నిగదేవుఁడెట్లు ప్రవర్తించెనో విస్పష్టముగ దెలియరాదు. కాని శ. 1186 రక్తాక్షియందు కడప మండలములోని రాజంపేట తాలూకా నందలూరు నందతఁడు వ్రాయించి నెలకొల్పిన శాసనము వలన నతడు తత్పూర్వ మాప్రాంతము నాక్రమించుకొని యుండిన పాండ్యులను వెడలనడఁచి దానిని మరల స్వవశము గావించుకొనెనని తెల్లమగుచున్నది.[44] గణపతిదేవుని కడపటి రాజ్యవర్షములలో గాకతి సామ్రాజ్య నిర్వహణభారము జన్నిగదేవుని భుజములపై నానియుండెను శ. 1186 లో గుంటూరు మండలము పల్నాడు తాలూకాకు చెందిన కారెంపూడిలో నితఁడు నిల్పిన శాసనమునందు తాను '*గణపతిదేవ దక్షిణ భుజదండ*' మని ప్రకటించుకొని యున్నాఁడు.[45] ఈ శాసనమునందు జన్నిగదేవుఁడు సామ్రాజ్యధిపతియైన కాకతి ప్రభువును బేర్కొనలేదనియు దత్కారణమున రుద్రమదేవి పేర

40. Gandikota Kaifiyat.
41. T. T. D. I. I. 19.
42. A. R. No, 613 of 1907.
43. 599. XII 247, IV 1341 1342-32.
44. A. R. No. 610 of 1907.
45. A. R. No. 550 or 1909, ʃ99 X. No. 402.

నతఁడే రాజ్యము సేయుచుండెనని యు దక్షిణ భారత శాసన శాఖాధ్యక్షులు తమ నివేదికయందు ప్రకటించి యున్నారు.[46] ఇది యుక్త యిపోహ. ఇందు కాకతి రాజు పేరు బుద్ధిపూర్వకము పడవేయబడెనని తలఁచుట సరికాదు. ఒకప్రక్క తాను గణపతిదేవుని దక్షిణ భుజమని జన్నిగదేవుఁడు ప్రకటించుకొని యుండ అతఁడు నిజాధిపతియైన కాకతి ప్రభువును బేర్కొనకపోవుట యెట్లు? అప్పటికింకను గణపతి దేవుఁడు బ్రతికియేయున్నాఁడు; రుద్రమదేవి యింకను పట్టోద్ధతియేకదా -

గణపతి దేవుఁడు శ. 1164 సం॥న రాజ్య పాలనమును మానుకొని తన కుమార్తెయైన రుద్రమ దేవిని రాజ్యా [illegible] రాజ్యమును ప్రజలను అమె కప్పగించెను ఆమె రుద్రదేవమహారాజు అను పురుషనామమును స్వీకరించి రాజ్యపాలనము సేయఁ గడగినది. జన్నిగదేవుఁడు ఆమెయెడ భక్తి గలిగి కొలిచి యామె విశ్వాసమునకు పాత్రుఁడాయెను. గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా తాళ్ళపల్లి గ్రామమున శ. 1189 స॥ మందలి యొక శాసనము జన్నిగదేవుఁడు కాకతీయ పురాధీశ్వరుఁడైన రుద్రదేవ మహారాజునకు సామంతుఁడైనట్లు తెలుపుచున్నది.[46] మఱియు కడపజిల్లా సిద్ధవటం తాలూకా అట్లూరు గ్రామమందు గానవచ్చు శ. 1190 నాటి శాసనమందు మండ [illegible] బ్రహ్మరాక్షస. ఒగ్గెళ గండ పెండేర (పేరుమాసినది) కాయస్థ రాజొకఁడు అనుమకొండ పురవరేశ్వరుఁడైన రుద్రదేవ రాజునకు సామంతుఁడని తెలుపుచున్నది.[47] పై శాసనమందు నమూదు సేయఁబడిన శకాబ్దమప్పుడు రాజ్యము సేయుచుండిన కాయస్థరాజు జన్నిగదేవుఁ డగుటవలన నిందు మాసిపోయిన పేరిఁటి రాజతఁడే కావలయును. తరువాతి శాసనములలో నితనిపేరు కానరాకపోవుటచేతను నితనితమ్ముఁడైన త్రిపురారి రాజ్యము సేయుచున్నట్లును చెప్పియుండుటచేతను జన్నిగదేవుడు శ. 1190 సంవత్సరముననో ఆ మరుసటి యేటనో కాలగతినంది యుండునని యూహింపఁ దగియున్నది.

జన్నిగదేవునికి రాజ్యపాలనమందు ముగ్గురు మంత్రులు తోడ్పడినట్లు తెలియుచున్నది ఒకడు మహాప్రధాని. అనంతదేవుఁడు ఇతఁడు జన్నిగదేవుని సర్వాధికారి శ 1181 కాళయుక్తి సంవత్సరమున కర్నూలుజిల్లా గిద్దలూరు తాలూకాలోని తురిమెళ్ల గ్రామమందలి ముక్కంటీశ్వర దేవునికి దన్నేలిన ప్రభువైన జన్నిగదేవుని సుకృతార్థము భూదానమును గావించెను.[48] మఱియొకఁడు గండపెండారు మెయిదేవుఁడు. పై పేర్కొనిన అనంతదేవుని తరువాత జన్నిగదేవునికితఁడు సర్వాధికారియైనట్లున్నది. శ. 1186 రక్తాక్షిలో నితఁడు గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోని కారెంపూడి సోమేశ్వరదేవర యంగరంగభోగాలకు భూదానము చేసెను.[49] మూఁడవ వాఁడు తాళ్ళపల్లి దేవపరాజు, ఇతఁడు జన్నిగదేవుని ప్రధాని. శ. 1189 ప్రభవ సంవత్సరమున నితఁడు గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా తాళ్ళపల్లియందు, తాను ప్రతిష్ఠించిన లక్ష్మీనారాయణస్వామి యొక్క పూజాపురస్కారములకొఱకు కొంత భూమిని యంబసముద్ర గ్రామము యొక్క సుంకములను దానమొనర్చెను.[50]

మొదటి త్రిపురారి.

జన్నిగదేవుఁడు శ. 1190 విభవ సంవత్సరము వఱకును రాజ్యము సల్పినట్లున్నది తరువాత

a) 46. A. R. 1910 - Para 44.
b) 46. A. R. No. 324 or 1930–31.
47. A. R. No. 1 or 1939–40.
48. A. R. No. 274 or 1949–40.
49. A. R. 550 or 1909 ∫ 99. X 402.
50. A. R. No. 322 or 1930-31 & 329.

నితని తమ్ముఁడైన త్రిపురాంతకుఁడు రాజ్యాభిషిక్తుఁ డాయెను. ఇతనికి త్రిపురారియను నామాంతరము కలదు. ఇంతవఱకును ఇతనిని నాలుగు శాసనములు వెల్వడినవి. రెండు నెల్లూరుజిల్లా దర్శితాలూకా పొట్లపాడుగ్రామమున వీరభద్రస్వామి యాలయమున కెదుట పాతియుండు రాతి బండలపై చెక్కియున్నవి. ఇందితఁడు 'కాకతికుల తిలకరుద్రదేవ మహారాజ చరణవిధేయ' కాకతికులతిలక రుద్రదేవ మహారాజ చరణ నళిన యుగళ సమారాధక' యని కలదు. ఆ రుద్రదేవ మహారాజు రుద్రమదేవి. కావున త్రిపురాంతకుఁడును దనయన్న జన్నిగదేవునివలె కాకతిరాజ్ఞి పాదపద్మారాధకుఁడైన సామంతప్రభువె. పై శాసనముల యందొకటి త్రిపురాంతక మహాదేవరకు శ. 1151 ప్రమాది ఆశ్వీజ శు 15 నాటి సోమగ్రహణ పుణ్యసమయమందు అంగభోగ నిత్యార్చనాదులకు గండ ఎండారు త్రిపురాంతక దేవమహారాజులు చేసిన దానమును దెల్పుచున్నది. రెండవది యతఁడు శ్రీ త్రిపురాంతక శ్రీ మన్మహాదేవరయొక్క అంగభోగాదుల కొఱకు శ. 1157 ప్రమాది ఆశ్వీజ శ 15. మ. నాటి సోమగ్రహణ పుణ్యసమయమందు చేసిన దానమును దెల్పుచున్నది. పై రెండు శాసనములందును ఉదాహృతమైన శకాబ్దమును ప్రభవాద్యావృత్తి పక్షమును సరియైనవికావు. శ 1151 1157 సం॥ లప్పటికింకను కాయస్థరాజ్యము పుట్టనేలేదు. కావున నప్పుడు కాయస్థరాజులలో మూడవవాఁడైన త్రిపురాంతక దేవమహారాజు రాజ్యపాలనముజేయుట యసంభవము. ఇతనికి పూర్వుఁడైన జన్నిగదేవుఁడు శ. 1190 ప్రభవ పర్యంతము రాజ్యము చేయుచుండినట్లతని శాసనములవల్ల తెలియుచుండుటవలన నతని తమ్ముఁడు త్రిపురారి యటుతరువాతనే రాజపీఠము నధిష్ఠించెనని తెల్లముగుచున్నది. ప్రమాది ప్రమోదకు బదులు తప్పుగఁ జెక్కఁబడినది. అగునేని ప్రమోద శ 1192 కు సరిపోవుచున్నది. కావున పై శాసనములందు వివరింపబడిన దానకాలము శ 1192 ప్రమోదయని యూహింపవచ్చును. ఆ సంవత్సర ఆశ్వీజ శు 15 నాటివారము మంగళవారమే. ఇది క్రీ శ. 1270 సెప్టెంబరు 30 మంగళవారమునకు సరిపోవుచున్నది. ఆ రోజున సోమగ్రహణము సంభవించెను. త్రిపురాంతక దేవమహారాజుయొక్క శాసనము దర్శితాలూకా అలువలపాడు గ్రామమునందు కలదు. అందితఁడు శ. 1194 అంగిరస శ్రావణ శు 15 బుధవారమునాటి సోమగ్రహణ పుణ్యకాలమున త్రిపురాంతక దేవర అంగ రంగ భోగాలకు శ్రీ త్రిపురాంతక దేవర దివ్యశ్రీ పాద పద్మారాధకులైన శ్రీమతు త్రియంబక శివాచార్యుల హస్తమందు పోలిగండ స్థలములోని అలువులపాండు యనెడి యూరు చతుస్సీమంబూను సకలాయ సహితముగాను ధారాపూర్వకముసేసి ఆచంద్రార్క స్థాయిగా నిచ్చినట్లు చెప్పియున్నది.[52] ఈ రాజుయొక్క దానశాసనము మఱియొక్కటి కర్నూలుజిల్లా మార్కాపురము తాలూకా త్రిపురాంతకమున త్రిపురాంతక మహాదేవర గుడియందు కలదు. అందితఁడు శ 1194 అంగీరస ఆషాఢ శు 14 వ తిథియందు త్రిపురాంతకదేవరకు భూషణములను కొన్నిటిని సమర్పించినట్లు చెప్పియున్నది.[53] దర్శిశాసనములన్నిటి యందును త్రిపురాంతక దేవమహారాజు తాను 'శ్రీ కాకతి కులతిలక రుద్రదేవ మహారాజ చరణ విధేయు' డనవియు, 'కాకతి కులతిలక రుద్రదేవమహారాజ చరణ నళిన యుగళ సమారాధకు' డననియు బ్రకటించుకొనియున్నాఁడు. శాసనోక్త కాలమునుబట్టి చూడ నిచటఁ బేర్కొనఁబడిన రుద్రదేవమహారాజు పురుషనామ

52. Ibid D. 1
53. A. R. No. 248 of 1905 ∫ 99X. 43I.

ధారిణియైన రుద్రమదేవియేయని గుర్తింప వలసి యున్నది. కావున దన యన్న జన్నిగదేవునివలె త్రిపురాంతక మహారాజును కాకతీయ మహారాజ్ఞి నాశ్రయించిన సామంతుఁడని తెలియుచున్నది. ఇతఁడు రాజ్యముచేసిన మూఁడేండ్ల కాలములోను విశేష చరిత్రాంశము లెవ్వియు సంఘటిల్లలేదు. ఇతని యేలుబడి శ. 1194 అంగీరసములో సమాప్తినందెనని తోచుచున్నది. అటుతరువాత ఇతని శాసనములు గానరావు. అప్పటినుండియే ఇతని యనుజన్ముఁడైన యంబదేవుని ప్రభుత్వ ప్రారంభమైనట్లని శాసనములవల్ల దెలియ వచ్చుచున్నది. త్రిపురారి తన పూర్వులవలె శైవ మతాభిమాని. త్రిపురాంతకమహాదేవుఁ డతని యిష్ట దైవము. అతఁడు చేసిన దానములన్నియు నాదేవుని యర్చనాదులకొఱకు చేసినవే.

అంబదేవుఁడు

త్రిపురాంతకుని తరువాత అతని తమ్ముఁడైన అంబదేవుఁడు రాజ్యాధిపతియాయెను. ఇతఁడు కాయస్థ రాజులందరిలోను మిక్కిలి బలాధికుఁడు. ఇతని శాసనములనుబట్టి చూడఁగా నితఁడు శ. 1194 మొదలు 1224 వఱకును ముప్పదియేండ్లకాలము రాజ్యము చేసినట్లు తెలియుచున్నది. ఇతఁడు పెక్కండ్రు తెలుఁగురాజులను జయించుటయేకాక కాకతీయ సామ్రాజ్యమున గొంతరాష్ట్రము నాక్రమించుకొని స్వతంత్రుఁడై ప్రభుత్వము జేసెను. తనపూర్వులైన గంగయ సాహిణ్యాదులవలె తాను కాకతీయుల యాశ్రితుఁడనని యెచ్చటను జెప్పుకొనలేదు. కాకతీయుల బేర్కొననైనలేదు. వారికి పరమశత్రువులైన పాండ్యసేవుణాదులతో సఖ్యమునెఱపి స్వతంత్రుఁడై పుడమినేలెను శ. 1212 (క్రీ. శ. 1290) నాటి త్రిపురాంతక శాసనములో నితఁడు తన ఘనకార్యముల నిట్లు వివరించియున్నాడు.[54]

54. A. R. No. 268 or 1906, ʃ99 X 465.

శ్రీపతి గణపతి నృపతిం జిత్వా శక్తిం
ప్రకాశయన్ రౌద్రీం
తస్మాదాహృతవాన్యోయుదిరాయ సహస్రమల్ల
బిరుద పదం॥
ఘూర్ణత్తుంగతనికాయ కుంఠితదినా
ధీశ ప్రభా సంపదాం
ఘోటీ ఘట్ట ఖురాగ్ర పాంసు పటలీ
పర్యాయ మిలద్దిశాం
యః పంచాధిక సప్తతిక్షితి భృతాం
మౌలిస్ఖలీయాంబుజా
న్యాజౌ పూజిత వాన్విజేక్షణ సముద్భూతాం
యుషం దేవతాం॥
దోష్ణా రేఖువ మల్లిదేవధరణీ
భర్తుర్బల ద్వ్యాజినో
దర్పేణా పతతో స్వపక్షస్సపతి
ప్రాతేన సాకం రణే
ఛిత్వా శీర్ష ముదస్త హేతిరపనౌ
పతిభ్యాం క్షిపన్నుత్క్షిపన్! (?)
క్రీడాకందుక తాడన వ్యతికరో
యశ్చ వ్యధా దవ్యథః॥
అరిరాయ మత్తయ గండం గండర
గండం చ గండభేరుండం।
ఉభయరగండం చ హరాత్ బిరుదం
యః ఖండితారిర్నా హృతవాన్॥
బాహు విక్రమలబ్ధ వీరకటక ప్రాలంబిత
ద్వాదశ క్షోణీమండలి
కోపక్షోభిత పదం దృప్యంత మాయోధనే।
ఏవం భైరవవేషధారణ మరక్ష్మా
భృచ్ఛిరో మాలయా
స్తోతుం భూపతి మంబదేవ
మవనౌ జిహ్వా విజిహ్రేతికిం॥
విద్రావ్య కేశవ నృపం సోమిదేవ
సహితమల్లు గంగయుతం
యస్తు పరాక్రమ మూల్యా నశ్వా
నఖిలా న్స్వమాహృతవాన్॥
(౧౦) తత్ప్రియమని మల్లికార్జున పతేః
పాపస్య ధర్మద్రుహో

దేవ బ్రాహ్మణాః పరిహారన్ (?)
యశ్చాత్ర పూర్తం వధం
సప్తాంగం పరిగృహ్యా తస్య విలస
ద్దోశ్చండ ముద్రావయన్
దానైః పూర్వ మనన్య దుర్లభ యశో
లోకే ఋభాం ప్రాప్తవాన్ ॥
ఉచ్చీభ త్సుకృతస్య బోలయపతే
రక్షేణ సద్దక్షిణా
నాహూత్తాన్ స్వపవనాన్ సుతాయ సుధియే
రాజజ్ఞ నామ్నే నిజాం
పుత్రీం యః ప్రతిపాద్య నందన
పుర స్పృష్ట్యాంచ రాజశ్రియం
సర్వా నాంధ్ర మహీపతీన్ రణముఖే
జేతా యశో లబ్ధవాన్ ॥
నిజ పరి(వా)ర విలోపిత రాజ్య
పదం మనుమ గండగోపాలం ।
విక్రమ సింహపురే య స్థాపితవాన్
పునరముం స్వశౌర్యేణ ॥
ఏకం వేతండ మశ్వం నికషిన మమృతం
పంకజా మప్యనేకే
లబ్ధుం సంక్షోభయంతో జలనిధి రమరాః
కాళకూటాద్వి తాస్తే
అవ్యాంబ్యో స్తంబదేవో విషనిధి మథిత్వా
త్రింశ ముక్తస్య గృష్టా
త్యశ్వీయం హాస్తికశ్రీ రమృతగురు
యశః పాండ్య కల్పవృక్షాంశ్చ ॥

దోస్తంభ సంభృత ధాత్రియ గుప్తమేనం
ధర్మస్య హర్మ్యమివ జాంగ యమంబదేవం
ఆదంద్ర మాచర విరక్షతు మేరుధన్వా
గౌరీవిమిశ్రిత తనుస్త్రిపుర ప్రమాథీ ॥

ఇందు వివరింపబడిన యంబదేవుని ఘన కార్యము లివి ;

1. శ్రీపతి గణపతినిజయించి, అతనిదైన 'రాయ సహస్ర' బిరుదును హరించెను.
2. పంచాధిక సప్తతి క్షితిభృతుల ఖండిత శీర్షములతో తన కంటియం మద్భవించిన రుషదేవ తను రణక్షేత్రమున పూజించెను.
3. ఏఱువ మల్లిదేవుని యుద్ధమున వధించి యతని తలతో కందుక క్రీడ సల్పెను.
4. ద్వాదశక్షోణీ మండలికులు గొలువగా శత్రు రాజుల శిరోమాలను ధరించిన భైరవ వేషధారియైన యంబదేవుడు జనులచే యాహ్విచ్చికముగ స్తుతింపబడెను.
5. సోమిదేవయల్లు గంగులతో కూడిన కేశవనృపతిని తఱుమగొట్టెను.
6. సెంతిసీములో బాహాత్కుడును ధర్మద్రోహియునైన మల్లికార్జునుని యప్రతిహతముగ పదను త్యజించి సప్తాంగములను హరించి పాఱ బోలెను.
7. బోలయ పుత్రునికి రాజ్జన్నకు నుదాపురపృష్టమగు రాజ్యశ్రీని తన పుత్రికతోఁ గూడ నొసఁగెను.
8. సర్వమైన ఆంధ్రరాజులను రణముఖమున జయించి యశము నార్జించెను.
9. నిజపరివారముచే పదచ్యుతినందిన మనుమ గండ గోపాలుని విక్రమసింహపురమునందు ప్రతిష్ఠతుని గావించెను.
10. ఒక యేనుఁగును గుఱ్ఱమును చెట్టును, అమృతమును పడసి పొందుటకొఱకు అమరులనేకులు కడలనిద్రచ్చి కాలకూటముచే విహతులుకాఁగా తానొక్కడే రెండవవారి సహాయములేకయే శత్రుసైన్య విషనిధిని మథించి యశ్వీయహాస్తికసంపదను నశింపని కీర్తిని (పంచ) పాండ్య కల్పవృక్షములను గైకొనెను.

పై వివరించిన కార్యములేకాక యేతచ్ఛాసనోక్త బిరుదావళివలన మఱికొన్ని తెలియవచ్చుచున్నవి. ఈ క్రిందివి గమనింప దగినవి :

1. దామోదర దిశాపట్ట
2. ప్రత్యనీక ప్రాసాదాయమాన కులశేఖరిగండ
3. దేవగిరిరాయ ప్రస్థాపిత ప్రాభృత మణికనక భూషణ
4. కాడవరాయ విధ్వంసన
5. అతి ప్రాంగన పరాక్రమ పాండ్యరాజన్యప్రియ ప్రేషిత చండ వేతండ వైనతేయ జంఘాల తురంగ సార్థన్ విరాజమాన పోషితప్రాహం
6. రాయస్థాపనాచార్య

పై పట్టికలలో జెప్పిన కార్యములెల్ల నెప్పుడు నడచెనో నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. వాని కాలమున లభించిన శాసనాద్యాధారములను బట్టి యూహించి కనుగొనవలసి యున్నది. వానియందు తొలుదొల్త విచారింపదగినది దామోదర దిశాపట్టము. ఇది యంబదేవుని రాజ్యకాలమున నడచిన చరిత్రాంశముగాదు. 'దామోదర దిశాపట్ట', 'పశ్చిమరాయ దామోదర దిశాపట్ట' యనునది కాయస్థరాజుల కందఱకు సామాన్యమైన బిరుదము. ఈ విషయ మింతకు పూర్వము గంగయసాహిణి చరిత్రయందు విశదీకరింపబడియున్నది కావున దత్ప్రస్తావమిచట మరల జేయనవసరము లేదు.

తరువాత విచారింపదగినది శ్రీపతిగణపతి విషయము. ... నీలగంగవర శాసనము నందతనిచే నోటువడినట్లు చెప్పియుండు గురిందాల గణాధిపుడితడై కావచ్చును.[55] అగునేని యితడు గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోని గురిందాలకు ప్రభువై యుండును. ఈ యూహ సరియైనదే యని సదరు గురిందాల గ్రామమున గానవచ్చు శ. 1190 విభవము సంవత్సరమునాటి శిలాశాసన మొకటి రుజువు సేయుచున్నది. అందు శ్రీపతిగణపతికి అనుచరుడైన మారినాయకుడు ముతుకూరు చెన్నకేశవ దేవునికి గొంతభూమిని దానము చేసినట్లు చెప్పియున్నది. ఆ రాతిమీదనే యదే కాలమునందు మహామండలేశ్వర రుద్రదేవ మహారాజు పృథ్వీపరిపాలనము సేయుచుండగా వీరబలంజ సంఘమువారు ఆ మహారాజునకు బ్రహ్మము కలుగుటకొఱకు పైజెప్పిన చెన్నకేశవస్వామివారికి సరకులపైవరుంబడిలో గొంత భాగమును దానముజేసినట్లు వ్రాసియున్నది.[56] ఈ రెండు శాసనములవల్లను గురిందాలగ్రామము ఏక కాలమున మహామండలేశ్వర రుద్రదేవ మహారాజుల యొక్కయు శ్రీపతిగణపతియొక్కయు ఏలుబడిక్రింద నుండెనని తెలియుచున్నది. ఇరువురు స్వతంత్ర ప్రభులొకే ప్రదేశముపై నేకకాలమున పాలించుట అసంభవము. పై వారిలో నొక్కడధిపతియు మఱి యొక్కడు సామంతుడునై యుండును. మహామండలేశ్వర రుద్రదేవమహారాజు అప్పుడు పురుష నామముతో ఆంధ్రదేశములో జాలభాగమున కధిపురాలై ప్రజాపాలన సేయుచుండిన కాకతిమహారాజ్ఞి రుద్రమదేవియేకాని యన్యులెవ్వరునుగారు. శ్రీపతిగణపతి యామె కరిగాపైయుండిన స్థానిక సామంత ప్రభువని యెంచదగును. అంబదేవుని శాసనముల సాక్ష్యమును బట్టి చూడగా నీ పోరాటము నందతడె విజయుడాయెను. ... శ్రీపతి గణపతియొక్క 'రాయసహస్రమల్ల' బిరుదము సత్తె డొడిసికొనిపోయెను దెలియుచున్నది. శ 1190 తరువాత శ్రీపతిగణపతి పొడ మఱియెందును కానరాదు. అంబదేవుడతని తనరాజ్యారంభ దశయందె యోడించి యుండునని తోచుచున్నది.

తరువాత అంబదేవుడు యుద్ధమునందు పంచాధిక సప్తతిక్షితిభృతులయొక్క ఖండిత శీర్షాంబుజములతో తన తీక్ష్ణదృష్టులనుండి సముద్భూతమైన పరుష

---

55 EP. End. XX∠ – P. 227

56 AR.Nos. 87-A and 87 of 1929-30.

దేవత నర్చించెనట రణరంగమునం దంబదేవుని కోపమునకు గురియైన పంచాధిక సప్తతిక్షితి భృతులు గాకతి మహారాజ్ఞిపాదపద్మోప జీవులైన డెబ్బది యేవు రాంధ్రనాయకులే కాని యన్యులుగారు. తన కాశ్రితుఁడైన శ్రీపతి గణపతితో కలహించి యతని గయ్యమం దోడించి యతనిదగు రాయసహస్రమల్ల బిరుదును గ్రహించినందులకు రుద్రాంబ యంబదేవునిపై గినుక వహించి తన నాయకుల నెల్లర నొక్కుమ్మడి యాతనిపై కంపినట్లున్నది. ఈయుద్ధసంఘటనము లెవ్వియు దెలియరావు. అంబదేవుని శాసనములతనికే జయము చేకూడినట్లు సాక్ష్యము పల్కుచున్నవి. కాని పంచాధిక సప్తక్షితిభృతుల శిరముల నితఁడు ఖండించుట యతిశయోక్తియని తోఁచుచున్నది. అది యెట్లైనను నతఁడు కాకతీయ సైన్యముపై ఘనవిజయమును పొందెనని చెప్పవచ్చును. తత్ఫలితముగ నంబదేవుఁడు కాకతీయుల యాధిపత్యమును దొలగద్రోసి నిజస్వాతంత్ర్యమును బ్రతిష్ఠించుకొనెను. ఇట్లు స్వతంత్రుడైన పిమ్మట దన యేలుబడిక్రింది రాష్ట్రమును బెంపొందింపఁ దలపెట్టి ఇరుగు పొరుగు మాండలికులపై దండు వెడలెను. మొదట యతనిదృష్టి యేఱువపైఁ బర్వినది. గంగయ సాహిణి కాలమున నీసీమ యతని యేలుబడికిలోఁబడి యుండినది. శ. 1164 లో గంగయ యేఱువ మూఁడు డెబ్బదులను కొచ్చెఱుల రాజధానినుండి పాలించుచుండెనని తురిమెళ్ళశాసనము దెల్పుచున్నదికదా.[57] అంబదేవుఁడు రాజ్యమునకు రాకపూర్వమెప్పుడో ఏఱువ కాయస్థులచేతులనుండి దుసికిలినట్లున్నది. కావున యేఱువను సాధించుట ప్రధమ కర్తవ్యమని యెంచి యంబదేవుఁ డప్పటచట రాజ్యము సేయుచుండిన భీముడను రాజుపై నెత్తిపోయి యతనిని యుద్ధమున సంహరించి యేఱువను మరల కాయస్థుల యేలుబడిక్రిందికి దెచ్చెను. ఈ విజయమును సూచించుటకై యతఁడు ఏఱువ భీముని తలగొండు గండయని బిరుదును వహించెను.

అటుపిమ్మట సెంతిసీమ పాలకుఁడైన మల్లికార్జునుని దుష్కృత్యము లంబదేవుని దృష్టి నాకర్షించినవి. ఈ మల్లికార్జునుఁడెవ్వఁడో యతడు పాలించుచుండిన సెంతిసీమ యెచట నుండెనో తెలియదు; కాని యతఁడు పాపాత్ముఁడనియు, ధర్మద్రోహియనియు త్రిపురాంతక శాసనమతని గర్హించుచున్నది. అంబదేవుడును దన పూర్వికులైన కాయస్థ నృపాలురవలె 'చాతుర్వర్ణ సముద్ధరణ' బిరుదాంకితుఁడుగదా. కావున ధర్మద్రోహియైన పాపాత్ముని శిక్షించి ధర్మము నుద్ధరించుట తన కవశ్యము కర్తవ్యమని నిశ్చయించి యతనిపై దండువెడలెను. యుద్ధమున మల్లికార్జునుని నోడించెను. ఏ కారణముచేతనో శస్త్రపూతమైన వధను ద్యజించి యతని సప్తాంగములను బరిగ్రహించి పాఱదోలెను.

అంబదేవుఁడటు తరువాత సర్వాంధ్ర మహీపాలురను రణముఖమున జయించి కీర్తినిగడించెనఁట. ఇది క్రొత్త విజయమో లేక పూర్వము అతఁడు పంచాధిక సప్తతిక్షితిభృతులనోడించి పొందిన విజయము యొక్క పునఃప్రస్తాపనయో నిశ్చయించుటకు వీలులేదు. క్రొత్తవిజయమేయని తలఁచినట్లైన రుద్రమదేవి యతని నడఁచుటకు దననాయకులనెల్ల మరల నంపెననియు వారినందఱను నంబదేవుఁడు మరల జయించెననియు నెంచవలసియున్నది.

శ. 1200 ల ప్రాంతమునం దంబదేవుఁడు వైదుంబ సోమేశ్వరునితో గలసియో ప్రత్యేకముగనో ద్రావిడ దండయాత్ర నెదుర్కొనవలసి నట్లగపడుచున్నది. ఈ దండయాత్ర రాజంపేట తాలూకాలోని నందలూరు పర్యంతము జొచ్చుకొని వచ్చినట్లు అచటి సౌమ్యనాధస్వామి యాలయమునందలి త్రిభువన చక్రవర్తి విజయగండ గోపాలదేవుని 29 వ రాజ్య బహుధాన్య సం॥న (శ. 1201) నెలకొల్పిన శాసనము వలన దెలియుచున్నది.[58] ఈ విజయగండ గోపా-

58. A. R. No. 417 or 1911.

లుఁడు నెలూరు తెలుగుచోడ ప్రథమ తిక్కరాజు యొక్క మరుమగఁడు (అల్లుడు) నని చెప్పుకొని యున్నాఁడు. తన యన్నయైన యల్లు తిక్కరాజు తరువాత శ. 1172 సం॥ న కంచి సింహాసనము నాక్రమించుకొని ముప్పదియేండ్ల కాలము రాజ్యము జేసెను. ఇతఁడు చెదిమండలమును పాలించు చుండిన కాడపరాయ బిరుదాంకితుడైన రెండవ కొప్పరంజింగదేవుని మిత్రుఁడు. ఇతఁడును మిత్రుఁడైన కాడవరాయనివలె మొదటి జటావర్మ సుందరపాండ్యు నిచే నోటువడి పాండ్యుల కరిగాపాయెను. నందలూరు నందతని శాసనము పాండ్యుల పునరాగమనమును సూచించుచున్నది. నందలూరు ప్రాంతరాష్ట్రమప్పటి కింకను వైదుంబసోమిదేవుని యేలుబడిక్రింద నున్నను అంబదేవుఁడు పాండ్యుల నెదుర్కొని యుద్ధముచేసి జయించినట్లు అతని బిరుదావళి సూచించుచున్నది. ఈ సందర్భము ముఖ్యముగ గమనింపదగినది. కాడవరాయ విధ్వంసన'యను బిరుదు 'కాడవరాయ విధ్వంసన' యనగా కాడవరాయని నాశముచేసిన లేక కాడవరాయని చంపినవాఁడని యర్థము.[59] ఇది శ. 1194, 1201 మధ్యప్రాయశః విజయగండగోపాలుని యుద్ధయాత్రా సందర్భమునసె జరిగియుండును. తరువాత యంబదేవుఁడు కేశవసోమిదేవులను వారితో గూడ యల్లుగంగని నోడించినట్లు త్రిపురాంతక శాసనమందు కలదు. కేశవసోమిదేవు లిర్వురును గలుకడపురవరాధీశ్వరులగు వైదుంబవంశజులు. అల్లుగంగఁడు తెలుగుచోళుఁడు. ఇతఁడు శ. 1244 ప్రాంతమునందనంతపురమండలములోని జగతాపిగుత్తిని పాలించుచుండిన గంగయదేవ మహారాజుయొక్క తండ్రి.[60] సోమిదేవుడు గంగయసాహిణి కాలమునుండియు ములికినాటిని పాలించుచుండెను. ఇతనికడ శ. 1178 లో మనసుపల్లి గ్రామమును గ్రహించి గంగయసాహిణి వాసుదేవనాయకుఁడను మఱమండల బ్రాహ్మణునకు దానమిచ్చుటను ముందె చెప్పితిమికదా.[61] కేశవుని సంపూర్ణనామము మురారికేశవ దేవమహారాజు. సోమిదేవకేశవు లిరువురును గలసి రాజ్యము చేయుచుండినట్లు కడపజిల్లా పుష్పగిరి క్షేత్ర సమీపమందుండు చింతలపత్తూరు గ్రామమందుండు ఇంద్రనాథస్వామి యాలయములోనుండు శ. 1190 నాటి శాసనమువలన దెలియుచున్నది [62] గంగయసాహిణి మరణానంత

59 దక్షిణ ఇండియా శాసనావళి XII సంపుట సంపాదకులైన శ్రీ వి. వెంకటసుబ్బయ్యగారు 'కాడవరాయ విధ్వంసన' యనుమాటకు 'కాడవరాయని' ఓడించినవాడని [illegible] చెప్పి యా యోటమి శ. 1184 లో [illegible] గు వేంగిదేశముపై నడపిన దండయాత్ర యందు కలిగెనని ఏకాక్కాణించియున్నారు. 'విధ్వంస్' అనుమాటకు 1. To fall to pieces 2. To be dispetced or scattered 3. To perish, be destroyed or ruined Cans. 1. To destroy. Crush annililate. 2 to injure, to hurt అని యాప్టేగారు అర్థమును నిర్వచించియున్నారు. అంబదేఁడువు తవయన్నయైన త్రిపురారి మరణానంతరము శ 1194 లోసింహాసనము నధిష్ఠించెను. తత్పూర్వ మతని వృత్తాంతమేమియుఁ దెలియరాదు. కాకతి గణపతిదేవునికి తానుఆశ్రితుడనని యతఁడు తన దాక్షారామ శాసనమందు (S 99 IV 1341 of 1342) చెప్పుకొనుటవలన అతఁడు పరాజితుఁడాయెనని తెలియుచున్నది. గణపతిదేవుని పక్షమున నెవ్వరాతని నోడించిరో తెలుపు సాధనములెవ్వియు లేవు. కావున నంబదేవుఁడు శ 1184 లో కొప్పెరంజింగని వేంగి దండయాత్ర యప్పుడోడించి నాడనుట నిరాధారమైన వ్రాత. అంబదేవుడు కాడవరాయని విధ్వంసము జేసియుండిన నది యాతఁడు రాజ్యాధిపత్యమునకు వచ్చి తరువాతనే కావలయును.

60. AR No. 308 of 1935–36
61. AR No. 33 of 1939–40 EP. Ind XXV. P. 120.
62. AR No. 319 of 1905.

రము పాండ్యుల దండయాత్రవలనను రుద్రమదేవి యాధిపత్యము నంగీకరింప నొల్లని కాకతీయ సామంతుల దుండగముల వలనను రాజ్యమునందు పాలన పటుత్వము డిందు వడియుండెను. స్వామిభక్తి పరాయణులై కాకతీయ సామ్రాజ్యసముద్ధరణ నిమగ్నులైయుండిన జన్నిగదేవ త్రిపురారులు స్వరాష్ట్రపాలనయందించుక ప్రమత్తులగుటవలన సోమిదేవ కేశవులకు తలయెత్తుట కవకాశముగల్గినది. వారు కాయస్థుల యధికారమును ధిక్కరించి స్వరాష్ట్రమును బెంపొందింపసాగిరి. సోమిదేవుఁడు కామాలాపురం తాలూకా యెల్లారెడ్డిపల్లెయందు శ. 1189 లో నెలకొల్పిన శాసనమందు తాను ములికి 300 హోంనహటి (హొన్నవాడి) 90 పెండెకల్లు 300 రాష్ట్రములను వల్లూరుపట్టణ రాజధానినుండి పాలించుచుండినట్లు ప్రకటించుకొని యున్నాడు.[63] రాజంపేట తాలూకా నుండ్లూరునందలి శ. 1206 నాటి మఱియొక శాసనమువలన నతని యధికారము పొత్తపినాడు నందు సహితము జెల్లుచుండెనని తెలియుచున్నది.[64] ములికినాడు హొన్నవాడి పొత్తపిదేశములు గంగయ సాహిణినాటినుండియు కాయస్థులకు జెల్లుచువచ్చినవి. గంగయ సాహిణియు నతనియనంతరము జన్నిగ దేవుడును వలూరు పట్టణము రాజధానిగ రాజ్యము సేయుచుండినట్లు శాసన సాక్ష్యముగలదు. కావున నంబదేవుఁడు రాజ్యమునకు రాకమునుపు పైఁబేర్కొనిన రాష్ట్రములను వల్లూరు పట్టణమును వల్లూరు పట్టణమును సోమిదేవుఁ డాక్రమించుకొనెను. ఈ దురాక్రమణను సహింపక తాను రాజ్యాధిపత్యమును వహించిన క్రొత్తలో సోమదేవమురారి కేశవులపై దండయాత్ర ప్రకటించి యుద్ధ ప్రయత్నములు సేయఁదొడఁగెను. అంబదేవుని బలిమి కలుముల నెఱంగినవారగుటచే సోమిదేవ మురారి కేశవులు దమమిత్రుఁడైన జగితాపియల్లు గంగరాజును సాయము రా వేడిరి. ఆతఁడును కాయస్థులయెడ పూర్వవైరమున స్మరించి నిజదళములతో వచ్చి వారినిగూడెను. ఇరువాగులవారు నొండొరులపై దారసిల్లఁగా ఘోర సంగ్రామము సాగినది. పోరిలో నంబదేవుఁడు విజయుఁడాయెను. సోమిదేవ మురారి కేశవులును అల్లు గంగరాజుతో గూఁడ పరారిచిత్తగించిరి. వారి యశ్వబలమును యేలఁబడి క్రిందిరాష్ట్రములును అంబదేవునికి హస్తగతమాయెను. ఈ యుద్ధకాలమెప్పుడో యది యెచట నడచెనో తెలియదు కాని శ. 1209 సర్వజిత్తు సంవత్సరమునందంబదేవుని ప్రధానియైన ఘోడెరాయ గంగదేవుఁడు కడపజిల్లా రాజంపేట తాలూకా అత్తిరాల గ్రామమున బరశురామేశ్వరాలయమున నిల్పిన శిలాశాసనమున దన్నేలిన ప్రభువైన యంబదేవుఁడు వల్లూరుపట్టణంబు రాజధానిగాను ఖండికోట ములికినాండు రేనాండు పెడకల్లు సకిలి యేరువ పొత్తపినాండులోనుగాను సకలదేశములను పాలించుచుండినట్లు చెప్పియుండుటచేత సోమిదేవకేశవాదులదె నంబదేవుఁడంతకుముందే పోరి జయించి పాఱదోలి యుండవలయును.[65]

పై విజయములవలన నంబదేవుని బలపరాక్రమాదులును ప్రకటితములై యతనికీర్తి యాంధ్రదేశమంతటను ప్రసరించెను. రాజకీయ విపర్యాసము వలన నిజపదభ్రష్టుడైన సింహవిక్రమ పట్టణాధిపతియైన మనుమగండగోపాలుఁడు అంబదేవుని కీర్తినివిని యతని సాయము నర్థించెను. ఇతఁడు శ. 1204 ప్రాంతము సింహాసనము నధిష్ఠించినట్లతని శాసనముల వల్ల దెలియవచ్చుచున్నది. అంతకు పూర్వముచట రాజ్యము సేయుచుండిన రెండవ మనుమసిద్ధి కుమా

63. A. R. No. 226 or 1937–38.
64. A. R. No. 622 of 1907.

65. A. R, No. 406 of 1911 ∫ 599 X 448.

రుఁడైన ఇమ్మడి తిక్కరాజునకును నితనికి నెద్దియేని సంబంధంముగలదేమో తెలియదు. నిజపరిజనులితని పైఁ దిరుగుబాటుచేసి యితని పదభ్రష్టునిగావించిరట. అంబదేవుఁడితని కుయ్యాలకించి సైన్యసమేతుఁడై విక్రమసింహపురమునకుబోయి యతని శత్రులను బాఱదోలి యతని మరల స్వపీఠముపై సుప్రతిష్ఠితుని గావించెను; ఈ సందర్భమునవెకాబోలు నతడు 'రాయస్థాపనాచార్య' యను బిరుదు గైకొన్నది.

మనుమ గండగోపాలుని పునఃప్రతిష్ఠ పాండ్యుల తోడ యుద్ధమునకు దారితీసినది. ముత్తుకూరు యుద్ధమున రెండవమనుమసిద్ధి మృతినందినప్పటినుండియు నెల్లూరు రాజ్యము కొంతకాలము పాండ్యులకులోనై యుండినది. తరువాతవారి యధికారపటిమ ఇంచుకంత సడలినది· వారి యధికారమును [illegible] కాకతీయ రుద్రమదేవి పక్షమున దాదినాగదేవుఁడు మూఁడు నాలుగేండ్ల పర్యంతము ప్రభుత్వమునల్పెను. అతనివెనుక మనుమసిద్ధి కుమారుఁడు ఇమ్మడి తిక్కరాజు స్వతంత్రుడై రెండేండ్లేలెను· తరువాత పై బేర్కొనిన మనుమగండగోపాలుఁడు రాజ్యభారము వహించెను. ఇంతలో శ. 1190 లో మారవర్మ కులశేఖరుఁడు పాండ్యసామ్రాజ్యమును కథినాథుడాయెను. ఇతఁడుబహుపరాక్రమవంతుడు. సామ్రాజ్యాధిపత్యము వహించినదాది ఇతఁడు తమయధికారమునుండి తొలఁగిపోయి నెల్లూరు రాజ్యమును మరల స్వాధీన పఱచుకొనుటకు దలపెట్టి యుద్ధసన్నాహములు సేయుచుండెను. శ 1200 లో బొత్తపిపై వచ్చి గండగోపాల కాడవరాయల దండయాత్ర కులశేఖరుని ప్రయత్నమునకు ప్రథమఫలము. ఇది విజయవంతముగ కొనసాగలేదని ముందు చెప్పియున్నదికదా. కావున కులశేఖరుఁడు పునఃప్రయత్నము జేయవలసి వచ్చెను. అతని సంనాహము లింకను పూర్తికాక మునుపే నెల్లూరు రాజ్యమున రాజకీయ పరిస్థితులు మారినవి· వైదుంబ సోమిదేవాదులను పాఱదోలి యంబదేవుఁడు పొత్తపి నాక్రమించుకొనెను· మనుమ గండ గోపాలుని విక్రమసింహపురమున బునఃప్రతిష్ఠితునిజేసి యచట దన యాధిపత్యమును నెలకొల్పెను. కావున నెల్లూరు రాజ్యమును స్వాధీనము జేసికొన వలయునని కులశేఖరున కంబదేవునితో పోరాటము తప్పనిసరి యాయెను· పాండ్యసేనలు గదలివచ్చి నెల్లూరిని పొత్తపిదేశము నాక్రమించుకొయెను తరువాత నడచిన యుద్ధమునందంబదేవునికె జయము గల్గెనని యతని శాసనములు చాటుచున్నవి. అంబదేవుఁడు ప్రత్యనీక ప్రాసాదాయమాన కులశేఖర గండడనియు, నద్వంద్వుఁడై శత్రుసైన్య విషనిధిని ద్రచ్చి యాశ్విక హస్తికజలమును (పంచ) పాండ్య కల్ప వృక్షములను గైకొని సశింసకీర్తిని గడించెనని త్రిపురాంతక శాసనము ఘోషించుచున్నదికదా. నెల్లూరు పొత్తపి సీమలలో గానవచ్చు పాండ్య శాసనముల సాక్ష్యమునుబట్టిచూడగా నంబదేవుని కంతటి గొప్పవిజయము జేకూడలేదని చెప్పవచ్చును. నెల్లూరు రంగనాయకులపేట రంగనాయకాలయ పశ్చిమ ప్రాకారము గోడపై త్రిభువనచక్రవర్తి కోనెరిన్మైకొండాన్ సుందరపాండ్య దేవునిశాసన మొక్కటికలదు ఇందు శాసనకాలమును దెల్పు భాగము మాసిపోయినది ఇది కళింగరాయని విన్నపముపై సుందరపాండ్యదేవుఁడు ముండనాటిలోని మావడికుండై (ఇప్పటి మామిడిపూడి) యను గ్రామము మును విక్రమసింగపుర నామాంతరముగల నెల్లూరు చిత్రమేతివిణ్ణగరి పళ్లికొండ పెరుమాళ్లకు దానము చేసెనని తెల్పుచున్నది. [66] ఈ శాసనమునందు పేర్కొనఁబడిన సుందర పాండ్య కాళింగరాయలు ప్రాయశః నెల్లూరు వీరాభిషేక మొనర్చుకొన్న

66. Nellore District Inscriptions. Vol. II PP. 830-32.

మొదటి జటావర్మ సుందరపాండ్యుఁడును గాకతి గణపతిదేవుఁడును గానవచ్చునని నెల్లూరుజిల్లా శాసన సంపుటముల సంపాదకులు శ్రీ బట్టువర్తి వేణుగోపాల సెట్టిగార లూహించుచున్నారు.[67] కాని వీరియూహ సమంజసముగ గన్పట్టదు. సదరు శాసనములోని సుందరపాండ్యుఁడు మొదటి జటావర్మ సుందర పాండ్యుఁడని యూహించుటకు తగిన కారణము గాన్పించదు అతఁడు క్రింద యుదాహరించిన నంద లూరు శాసనములలో బేర్కొనియున్న రెండవ జటా వర్మ సుందరపాండ్యుఁడైనను గావచ్చును. కళింగ రాయఁడు కాకతి గణపతి కాజాతుఁడు. అతనికి కళింగ రాయడను నామాంతరముండెననుట కేయధారమును లేదు. ఈ కళింగరాయఁడు ద్రవిడ దేశమందు కొప్పెరుంజింగని శాసనములలో బేర్కొనబడియుండు నా పేరిఁటి సామంతప్రభువై యుండనోపును.

రెండవ జటావర్మ సుందరపాండ్యుని శాసనము లాఱు కడపజిల్లా రాజంపేట తాలూకా నందలూరు గ్రామమునందు కానవచ్చుచున్నవి :- ఇందు మూఁడతని 10 యవ రాజ్య వర్షమునకు సరియైన వ్యయ సంవత్సరమునందు నెలకొల్పబడినవి.

1) పాండి మండలములోని తిరుమఅకై కూఱ్ఱమందలి ఉజ్జలూరు వాస్తవ్యుఁడైన ఎడుత్తకైయలు గియారను నామాంతరముగల పిళ్లైపల్లవరాయనను నతఁడు చేసిన భూదానమును దెల్పుచున్నది.[68]

2) పైఁ జెప్పిన పిళ్లైపల్లవరాయఁడే దేవాల యముకొఱకు గాబోలు పుష్పవాటికను వేయించెనని తెల్పుచున్నది.[69]

67. I bid. Vol III – P. 1461.
68. AR. No, 592 of 1907.
69. A R No. 591 or 1907.

3) పిళ్లై పల్లవరాయఁడు పూఁదోట వేయిం చుటకొఱకు సువర్ణమును దానము చేసెనని చెప్పు చున్నది.[70]

4) సుందరపాండ్యుని 15 వ రాజ్యవర్షము నకు సరియైన విరోధి సం॥న వ్రాయించిన యొక శాసన మొకటి కలదు. అది మిక్కిలియు శిథిలావస్థ యందుండుటవలన యందలి విషయము దుర్గ్రాహ్య ముగ నున్నది.[71]

అతనిచే 17 వ రాజ్యవర్షమునకు సరియైన నందన వత్సరమున వ్రాయించిన శాసనములు రెండు కలవు.

5) జయగొండ చోళమండలములోని మణ విల్కోట్టమునకు జెల్లుతోయారునాటి తొయారుగ్రామ వాస్తవ్యుఁడొకఁడు సౌమ్యనాథస్వామికిని అమ్మవారి కిని తిరుమంజనము జేయించెనఁట.[72]

6) మన పరిపాలుని యాజ్ఞమేరకు తొండై మాన్ తిరుచెల్వేలి యుడైయార్ నందివర్మ పేరట ఎవ్వరో పూలతోఁటను వేయించెనఁట.[73]

ఈ శాసనములందు పేర్కొనబడియుండు సుందర పాండ్యదేవుఁడు క్రీ. శ. 1276 నకు సరియైన శ. 1207 వ వర్షమున సింహాసనము నధిష్ఠించెను. ఇతని 15 వ రాజ్యవర్షము శ. 1212 నకును, 17 వ రాజ్యవర్షము శ. 1214 సరిపోవుచున్నవి. జటావర్మసుందర పాండ్యునివేకాక మారవర్మసుందర పాండ్యదేవుఁడను మఱియొక పాండ్యభూపాలుని 13 వ రాజ్యవర్షమున వ్రాయించిన శాసన మొక్కటి రాజంపేటతాలూకా వేపాక గ్రామమున గలదు. ఈ రాజు చరిత్రకారులచే నింకను గుర్తింపబడలేదు.

70. A R No. 593 or 1907.
71. A R No. 590 or 1907.
72. A. R. No. 588 of 1907
73. A. R. No. 594 of 1905

ఇతఁడు రాజ్యవర్షమునకు సరియైన శకాబ్దమేదియో నిశ్చయించుటకు వీలులేకున్నది; కాని నెన్నొక్కైవిణ్ణ గరనఁబడు కేశవపెరుమాళ్ల యాలయమున కెదుట మిఅలై కూఱ్ఱమునకు జెందిన నడవీర్కూట్రులోని తుంజలూరు ప్రభువైన పల్లవరాయనిపేర పల్లవ రాయన్ తిరువీధియను నొకవీధిని యేర్పఱచుటకు చేసిన భూదానమును దెల్పుచున్నది. [74] తుంజలూరి ప్రభువైన పల్లవరాయఁడు జటావర్మ మారవర్మసుందర పాండ్యుల కిరువురకును సమకాలికుఁడనుట పై శాసనములవల్ల తెల్లమగుచున్నది. కావున జటావర్మ మారవర్మ లిరువురుగూడ సమకాలికులని మనమనుకొనవచ్చును.

పై నుదహరించిన పాండ్య శాసనములవల్ల శ. 1207 మొదలు 1214 వఱకును పొత్తపినాడంతయు గొంతపోయినను జాలభాగమైనను పాండ్యుల యేలుబడిక్రింద నుండెనని తెలియుచున్నది. శ. 1212 నకు ముందె పాండ్యులపై యంబదేవునికి త్రిపురాంతక శాసనమునందు చెప్పినంతటి ఘనవిజయమే కలిగియుండినయెడల శ 1214 వఱకును పొత్తపినాఁడు వారిస్వాధీనమందుండి యుండుట యసంభవము, పాండ్యులపై యంబదేవుఁడు పొందిన విజయముయొక్క వాస్తవికత యెట్లున్నను, చుట్టుపట్టు రాజ్యములయందతఁ డప్పటి యాంధ్రదేశ ప్రభువులలో బలాధికుఁడను తలంపు వ్యాప్తియందుండెను. పరదేశపాలకులతని సాయమునుగోరి కానుకలనంపి స్నేహము జేసికొనిరి. అట్టివారిలో నిరువురు త్రిపురాంత శాసనమునందు పేర్కొనఁబడియున్నారు. ఒకఁడు సేవుణ వంశజుఁడైన దేవగిరియాదవరాజు. 'దేవగిరిరాయ ప్రస్థాపిత ప్రాభృతమణి కనక భూషణ' యని శాసనప్రశంస. మఱియొకఁడు పాండ్యరాజు ఇతఁడు అతిపాండవ పరాక్రముడఁట. ప్రేమతో చండవేతండములను, వైనతేయజంఘాల తురంగములను ధనమునుపంపి తన సౌహార్దమును పోషించెనఁట. అంబదేవునికి దేవగిరిప్రభువేల మణి కనకభూషలంపెనో, పాండ్యరాజు ప్రేమతో వేతండములను తురంగములను ధనమునుపంపి తన సౌహార్దమును బ్రకటించుకొనవలసి వచ్చెనో కనుగొనవలయును. రాజులు ప్రబలమైన రాజకీయకారణములచే ప్రేరితులుగాక ఇట్టిచేతల నూరక చేయరు. సేవుణ పాండ్యభూపాలుర కిర్వురకును అంబదేవునితో మైత్రి యావశ్యకమైనది. రుద్రమదేవిపాలన యుత్తరార్ధమున నామె దౌహిత్రుఁడును స్వీకారపుత్రుండునైన కుమారప్రతాపరుద్రదేవుఁడు నిర్వాహకుఁడై స్వయముగా రాజ్యకార్యము నిర్వర్తింపఁగలిగినంతట సమస్త రాజ్యాంగములందును నూతన చైతన్య మావిర్భవించి పరభూమిపతుల హృదయములభీతి నావహిలజేసినది. కాకతి మహాదేవరాజు మరణానంతరము దేవగిసేవుణ ప్రభువులు కాకతీయరాజ్య పశ్చిమగడి ప్రదేశభూముల నాక్రమించుకొనియుండిరి. గణపతిదేవుని చరమదశయందు పాండ్యులు ప్రబలి నెల్లూరు రాజ్యము నాక్రమించుకొనియుండిరి, పరాక్రమవంతుఁడైన కుమార ప్రతాప రుద్రదేవుఁడు తమక్రిందనుండిన కాకతీయ రాష్ట్రమును మరల స్వాధీనపఱచుకొనుటకు బ్రయత్నము సేయకపోఁడనభీతి వారి హృదయములను గలతపెట్ట నారంభించినది. కావున వారు కాకతీయులతో రానున్న సంగ్రామమునందు స్వపక్షమును బలపఱచుకొనుటకొఱకు కాకతీయుల యధికారమును ధిక్కరించు వారి సైన్యముల నిరుమార్లోడించి నిజ స్వాతంత్ర్యమును నెలకొల్పి భూపరిపాలన సేయుచుండిన యంబదేవునియొక్క మైత్రినపేక్షించి మణి కనకభూషణాదుల నొక్కరును సార్ధవేదండ తురంగమాది యుద్ధోపకరణములను మఱియొక్కరును పుత్తెంచి సంధిగావించుకొనిరి. వారెదురుచూచుచుండిన పోరాటము సత్వరమె సంఘటిల్లినది. కుమారప్రతాప

74. A. R. No. 425 of 1911.

రుద్రదేవుడు సంగ్రామ సన్నాహముల సంపూర్తి చేసికొని ప్రస్థాన భేరి మ్రోయించి దండు వెడలెను. తొలితాకునకు గురి యంబదేవుడు. దండయాత్ర యెవ్వరి నాయకత్వముక్రింద నడచెనో తెలియదు. కుమార ప్రతాపరుద్రుడే స్వయముగ నడపెనేమొ. యుద్ధ వివరములు తెలియరావు, కాని కుమార ప్రతాపరుద్రునికె విజయము చేకూరినట్లు తోచుచున్నది. ఎటువ మున్నగు కాయస్థరాజ్యపు టుత్తర సీమలు కాకతీయులకు హస్తగతమాయెను. అంబదేవుని శాసనములు త్రిపురాంతకమున శ. 1213 ఖర నిజాషాఢమువఱకె కాన్పించుచున్నవి.[75] తరువాతివి యొక్క త్రిపురాంతకము నందేకాదు, ప్రస్తుత కడప మండలమునకువెలుపల మఱియెచ్చటను గానరావు. శ. 1213 ఖరసంవత్సర శ్రావణమునుండియు కాకతీయ శాసనములు ప్రారంభమగుచున్నవి: ఆ శ్రావణ శు 15 మ. సోమగ్రహణపుణ్యకాలమందు కాకతీయ మహారాజ్ఞి రుద్రమదేవి మహాప్రధానులలో నొక్కడైన ఇందులూరి గన్నయప్రెగ్గడ పుత్రుడైన యన్నల దేవుడు త్రిపురాంతక మహాదేవుని యఖండ దీపమునకు వ(??) మో కాలుదానముచేసి శాసనమెత్తించెను.[76] ఆ సమయముననె రుద్రదేవమహారాజుల సకల సేనాధిపతి మహా(రాయ)సాహిణి దాడి సోమయసాహిణి.... పెద్దయసాహిణి చేసిన దానమును దెల్పు శాసనము మఱి యొక్కటి యుంచెకలదు [77] ఆ కార్తీక శు 15 గురువారము నాడు మహామండలేశ్వర కాకతీయ కుమార రుద్రదేవ మహారాజులకు పుణ్యము గల్గుట కొఱకు రాయ సకలసేనాధిపతి సోమయాదుల రుద్రదేవ నింగారుచేసిన దానమును దెల్పు శాసనమొక్కటి సయితమందేకానవచ్చుచున్నది. ఏకకాలమున కాయస్థ రాజ్యములోని త్రిపురాంతకమున కిందటు కాకతీయ సేనాపతులరాక కేవలము కాకతాళీయమై యుండజాలదు. వారు దండయాత్రా సందర్భమున నచటికి వచ్చి యుందురను తలంపుకలుగుచున్నది. శ 1213 ఖర నిజాషాఢమువఱకు త్రిపురాంతకమునం దంబదేవుని శాసనములు గానవచ్చుటయు నటుతరువాతివి యొక త్రిపురాంతకముననేకాక ప్రస్తుత కడప మండలమునకు వెలుపల మఱియెచ్చటను లేకపోవుటయు తరువాత కాకతీయ సేనాపతుల శాసనములు గానవచ్చుట చూడగా త్రిపురాంతకమును దత్పరిసర ప్రదేశములును గాయస్థుల యేలుబడినుండి వీడ్వడి కాకతీయ సామ్రాజ్యములో కలసిపోయెనని తోచుచున్నది. ఈ యభిప్రాయము సరియైనదేని పైమార్పు అంబదేవునికి కాకతీయులతోనైన యుద్ధమునందు కలిగిన పరాజయమునకు ప్రతిఫలమని చెప్పనగును.

కుమార ప్రతాపరుద్రదేవుడును పైబేర్కొన్న కాకతీయ సేనాధిపతులును అంబదేవునిమీద దాడి సేయుచుండిన సమయమందే మఱియొక కాకతీయ సైన్యము విక్రమసింహపురముపై నడచినది. అచట నపుడు రాజ్యము సేయుచుండిన మనుమగండ గోపాలుడంబదేవుని కాశ్రితుడు. నిజపరివారము పదచ్యుతిని గావింపగా నంబదేడు అతని మరల తన స్థానమును సుప్రతిష్ఠితునిజేసి యుండెకదా. అతని నంబదేవుని గలియనీయక ప్రత్యేకపఱచి యుద్దరిపైఁ గవసిన జయము సులభతరముగ జేకూరునని నిశ్చయించి కుమారప్రతాపరుద్రుడు రాయ సకల సేనాధిపతియు, '*రుద్రదేవదక్షిణ భుజాదండ*' బిరుదాంకితుడునైన అడిదంమల్లును ప్రచండ సైన్యముతో నెల్లూరిమీదికంపెను. యుద్ధమునం దడిదంమల్లు

75. A R. No. 173 & 174 or 1905, ∫ 99 X. 466 & 470.
76. A. R. No. 228 of 1905 ∫ 99 X 467.
77. A. R. No. 318 or 1924 ∫ 99 X 468.

మనుమగండ గోపాలుని వధించి 'మనుమగండ గోపాల శిరఃఖండన' యను బిరుదుగైకొనెను.[78] ఈ యుద్ధము శ 1212 న నడచి యుండవలయును. ఎటనఁగా నతని యనంతరము నెల్లూరు సింహాసనము నధిష్ఠించిన రాజగండ గోపాలుని ప్రథమ రాజ్య వర్ష మా సంవత్సరమందె ప్రారంభమగుచున్నది.[79] ఈ రాజగండ గోపాలుఁడెవ్వఁడో యతఁడెట్లు సింహాసనాధిపత్యము వహించెనో నిశ్చయము తెలియదు. అతడొకవేళ కాకతీయుల ప్రాపువలన రాజ్యాధిపత్యమును బడసి యుండవచ్చును. అగునేని యతఁడు కృతఘ్నుఁడై కాకతీయులు దనకు చేసిన మేలును విస్మరించి పాండ్యులతో మైత్రి చేసికొనెను. కావున కుమార ప్రతాపరుద్రుఁడు రాజగండగోపాలుని యతని మిత్రులైన పాండ్యులను శిక్షించుటకొఱకు మనుమగండ గోపాలుని యాధిపత్యముక్రింద దక్షిణదేశముపై నొక్క దండయాత్ర నంపవలసివచ్చెను. ఇతడంబదేవునిచే విక్రమసింహపురరాజ్య పునఃప్రతిష్ఠితుఁడై యటు పిమ్మట నడిచముమల్లుచే వధింపబడిన గండగోపాలుడుగాఁడు. అతనికంటెభిన్నుఁడు. నెల్లూరు రెండవ మనుమసిద్ధి కుమారుఁడైన నల్లసిద్ధియొక్క పుత్రుఁడు. రెండవమనుమసిద్ధి ముత్తుకూరు యుద్ధమున నిహతుఁడైన పిమ్మట నల్లసిద్ధి స్వదేశమును విడిచిపెట్టి కాకతీయ సామ్రాజ్యములోని గుంటూరు మండలమునకు వలసపోయి యచట నర్సారావుపేట ప్రాంతమున కుమార రుద్రదేవుఁడు ప్రసాదించిన సామంత సీమ నేలుచుండెను. అతని కుమారులలో నొక్కడైన యీ మనుమగండ గోపాలుఁడు ప్రతాపరుద్రునికి నచ్చిన యోధుడు. రాజగండగోపాలుని గర్వము నణఁచి పాండ్యుల యాటోపము డిందు పఱచుట కితఁడె శక్తుఁడనియెంచి ద్రావిళ దండయాత్రకితని నధిపతిగ నియోగించెను. ఈ దండయాత్ర వివరములెవ్వియు దెలియవు. కాని శ. 1219 హేవిళంబిసంవత్సరము నందితఁడు నర్సారావుపేటయందు నెలకొల్పిన శాసనమువలన నితఁడే దండయాత్రను విజయవంతముగ నడిపినట్లు తెలియుచున్నది. ఇతఁడు తాను రాజగండగోపాలుని విహితులైన యహితుల మానభంగము గావించునట్లును, ద్రావిళ బలవార్ధి పరిషణ బడబానలుఁడైనట్లును చెప్పుకొనియున్నాఁడు.[80] ఇందువలన నితని దక్షిణాశా దిగ్విజయము విజయవంతముగ నడచెనని యెంచఁదగియున్నది. రాజగండగోపాలుని ద్రావిళాధి పతులనేకాక సేవణులను కూడ జయించినట్లు పై శాసనమునందే కానవచ్చును. 'సేవుణ కటకవేణు కబళన దావపావక' యను బిరుదు సూచించుచున్నది. ఈ విజయము గోన విఠ్ఠలుని కృష్ణాతుంగ భద్రల యంతర్వేది జైత్రయాత్రయందు సంఘటిలెను. శ. 1219 హేవిళంబి సంవత్సరమున రాయచూరుకోటయందు నిల్పిన శిలా శాసనమునందు తాను బళ్లారి మండలములోని యూవిహాని తుంబుల దుర్గములను సాధించితిననియు నచటినుండి కృష్ణాతుంగభద్రల యంతర్వేదిని ప్రవేశించి మానువ హాళువ దుర్గములను సాధించి తత్ప్రాంత రాష్ట్రముల నేలుచుండిన ప్రభువులను జయించి రాయచూరిని కైవసము చేసికొని దేశ సంరక్షణకొఱకు అచట బలిష్ఠమైన దుర్గమునునిర్మించితినని వివరించియున్నాఁడు.[81]

78. A. R. No. 179 or 1905 ʃ X 479
79. రాజగండగోపాలుని శాసనములం దుదాహృతమైన కాలమానమువల్ల నిది విదితమగుచున్నది.

| Ref : N.D.I Vol I | శక స॥ | రాజ్యవర్షము | రాజ్యారోహ సం. |
|---|---|---|---|
| G. 115 | 1222 | 9 | 1212–93 |
| ,, No. 60 | 1225 | 12 | 1212 |
| ,, No. 62 | 1221 | 9 | 1212–13 |
| ,, No. 65 | 1237 | 25 | 1212 |

80. ʃ99 IV 661
81. Kakatiya Same chika APP. 33, PP. 8485

ఆదవాని తుంబుళములను మానవహాళువలు రాయచూరుతోగూడ కృష్ణాతుంగభద్రా యంతర్వేది యంతయు దత్పూర్వము దేవగిరి సేవుణరాజుల యేలు బడిక్రిందనుండి యుండుటవలన, వారిని జయించి పాఱదోలియే గోనవిర్ఠలుఁడు వానినన్నిటిని స్వాధీనము జేసికొనెనని తెల్లమగుచున్నది. ఈ దండయాత్రయందు పాల్గొనుటవల్లనే మనుమగండ గోపాలునికి సేవుణ కటకవేణుక బళనదావపావక యనుబిరుదు కలిగినది.

పైవివరించిన యుద్ధములలో గాకతీయ సైన్యములకు సర్వత్ర విజయమె చేకురినది. అంబదేవుఁడును నతని మిత్రులైన పాండ్యసేవుణులును పరాజయమును పొందిరి, నెల్లూరు పొత్తపిమండలము లను స్వాధీనపఱచుకొని పాండ్యులు స్వకీయ రాష్ట్రభూమికి మరలి పోవలసివచ్చెను, సేవుణులు పశ్చిమాంధ్రమును విసర్జించి యుత్తరకర్ణాట మహారాష్ట్రములకు వెడలి పోవలసివచ్చెను. మిత్రబలము సమసిపోగా నంబదేవుఁడు రెక్కలుదెగిన పక్షియాయెను. అతని రాజ్యమున జాలభాగము కాకతీయులకు హస్తగత మైనది. కాని యాతఁడుమాత్రము కాకతీయులకు లొంగలేదు. లభ్యమైన శాసన సాక్ష్యమునుబట్టి చూడఁగా శ. 1213 నుండి 1224 వఱకును నతఁడు ములికినాడు పొత్తపినాడులను స్వతంత్రుఁడై పాలించు చుండినట్లు తెలియవచ్చుచున్నది.[82] ఈ పండ్రెండేండ్ల కాలమున విశేషసంఘటన లెవ్వియు గలిగినట్లు కన్పట్టదు. శత్రుల యొత్తిడిలేక దేశమున శాంతి వ్యాపించినట్లు తోఁచుచున్నది. ఈ మధ్యకాలమున శ. 1218 సం॥న కాకతీయ మహారాజ్ఞి రుద్రమదేవి కాలగతినందినది. ఆమె స్థానము నంచామె దౌహిత్రుఁడును రాజ్యభారధురంధరుఁడై యుండిన ప్రతాప రుద్రదేవ మహారాజు రాజ్యాభిషిక్తుఁడాయెను అంబదేవుని శాసనములు శ. 1224 తరువాత కానరావు. అతడితో నతని రాజ్యము సమాప్తమగుచున్నది.

**అంబదేవుని సంతతి:—** ఇతనికి త్రిపురారి యను పుత్రుఁడును పుత్రిక యొకతెయు గలరని తెలియుచున్నది. త్రిపురారి తండ్రి యనంతరము రాజ్యాధిపతి యాయెను.[83] ఇతని పుత్రికయొక్క పేరు తెలియదు; కాని యామెను బోలయపుత్రునికి రాజణ్ణకు నందనపుర స్వ్రష్టరాజ్యశ్రీతోగూడ నిచ్చి, యుద్వాహము గావించినట్లు త్రిపురాంతక శాసనమందు కలదు.[84] ఈ బోలయయు నతని పుత్రుఁడైన రాజణ్ణయు నెవ్వరో కనుగొనవలసియున్నది. అప్పటి కాకతీయ సామంతులలో బోలయయు నాతని పుత్రుఁడైన రాజరుద్రుఁడును గానవచ్చుచున్నారు. కర్నూలు జిల్లా నందికొట్టూరు తాలూకా మల్యాల గ్రామమున గానవచ్చు శ 1212 వికృతినామ సం॥ నాటి శాసనమున గాకతి రుద్రకుమారుని కరిగాపులైన మహాసామంత చెఱకు బొల్లయరెడ్డియు నతనికుమారుఁడు రుద్రదేవుఁడును బేర్కొనబడియున్నారు.[85] సదరు తాలూకాయందే లింగాలగ్రామమునందుండు శ. 1213 నందన సంవత్సరమున వ్రాయించిన మఱియొక శాసనమున కాకతి ప్రతాపరుద్రుని యధికారమునకు లోనైన మహాసామంత వేలూరుచెఱకు బొల్లయరెడ్డియు నాతని పుత్రుఁడైన రాజరుద్రదేవుఁడును గానవచ్చుచున్నారు.[86] మల్యాల శాసనములో మహాసామంత చెఱకు బొల్లయరెడ్డియు లింగాలశాసనములోని మహాసామంత చెఱకు వేలూరు బొల్లయరెడ్డియు నొక్క వ్యక్తియేగాని భిన్నులుగారు. అందలి రుద్రదేవుఁడే యిందలి రాచరుద్రదేవుఁడు. వీరే యంబదేవుని వియ్యంకుఁడైన బొల్లయయు నల్లుఁడైన రాజణ్ణయు.

82. A. R. No. 207, 324 of 1935–36 and 404 or 1911.

83. AR No. 65 or 1939–40.
84. AR No. 268 or 1905, ʃ99 X 466.
85. AR No. 321 of 1937–38
86. AR No. 56 of 1943–44

నామసామ్యమును సమకాలికత్వమును వారి యైకాత్మ్యమును సూచించుచున్నవి. అగునేని యంబదేవుని వియ్యంకుఁడును నల్లుఁడునగు బొల్లయరాజన్నలు ఆతనికి శత్రుఁడైన కాకతి ప్రతాపరుద్రుని కెట్లరిగాపులైరను ప్రశ్న యొకటి బయలు వెడలుచున్నది. దీనికి సమాధానము ఆరెవీటివారి వంశ చరిత్రలందు కానవచ్చుచున్నది దోనేరు కోనేరు నాథకృత ద్విపద బాలభారతాంతర్గతమైన యొౌకు రాజవంశావళియందు.

*' నమితారితాత పిన్న మహీవిభుండు*
*సమితిలో వెలకు రాచ నరేంద్రుగెలిచి*
*అలవుగా సప్తాంగ హరణంబొనర్చి*
*పొలుపొందె భువి మన్నె పులియనిపేర-*[87]

రామరాజీయమునందు '*సమస్త దురాచరణ వెలకు రాజనాయక సప్తాంగ హరణ*' యనియు గలదు.[88]

తాత పిన్నమహీవిభుఁడు ఆరెవీటి వంశమునకు మూలపురుషుఁడు. ఇతని పుత్రులలో జ్యేష్ఠుఁడైన కొటికకంటి రాఘవుఁడు శ. 1242 ప్రాంతమున కాకతి ప్రతాపరుద్రుని సైన్యముతోగూడ కుంమట ముపై నెత్తిపోయి యప్పుడచట రాజ్యము సేయుచుండిన కంపిలిరాయని పరాభూతునిజేసి యాతని సప్తాంగములను హరించెను.[89] అతని రెండవ కుమారుఁడైన సోమిదేవుఁడు శ. 1250—1258 ల మధ్య ఢిల్లీ తురుష్క సామ్రాజ్యమునకు జెందిన కంపలి రాష్ట్రముపై నెత్తిపోయి నాగులపాడు, సాతానికోట, ముసలిమడుగు, ఆనెగొంది, ముదుగల్లు మొదలైన దుర్గములను సాధించెను.[89] కావున తాతపిన్నమ శ. 1200-1225 ప్రాంతమున వర్ధిలి యుండవలయును. తన జ్యేష్ఠపుత్రుఁడైన కొటికంటి రాఘవునివలె నితఁడు కాకతీయ సామంతుఁడైయుండి, తన ప్రభ్విణియైన మహారాజ్ఞి రుద్రమదేవి యాజ్ఞానుసారము ఆమె యధికారమును ధిక్కరించి స్వతంత్రుఁడై యంబదేవుని కుమారితను బెండ్లాడి యాతనిపక్షము నవలంబించి నందులకు వెలకు రాజేంద్రుని శిక్షించుట కతనిపై నెత్తిపోయి యుద్ధమున బరాజితునిజేసి యతని సప్తాంగములను హరించియుండును. తరువాత రాచనరేంద్రుఁడు తండ్రియైన బొల్లయతోగూడ ప్రతాపరుద్రు నాశ్రయించి మహాసామంత పదమును బొందినట్లున్నది.

కడపజిల్లా సిద్ధవటంతాలూకా పట్టస్రుగాయి గ్రామమందలి యొక శాసనమునందు అంబదేవమహారాజునకును జన్నయదేవ మహారాజునకును నభ్యుదయము గలుగుటకొఱకు వారి యనుచరుఁడొక్కఁడు ఎద్దియో దేవాలయమునకు గాబోలు ఉత్సవమాన్యమున ధారబోసినట్లున్నది.[90] ఇచట నంబదేవునితో గూడ బేర్కొనిన జన్నయదేవుఁ డతని కుమారుఁడగునేమొ. తన కుమారుఁ డిమ్మడి త్రిపురారికి చిన్నన్నయగు మొదటి త్రిపురారి పేరుపెట్టినట్లు అంబదేవుఁ డితనికి దన పెద్దన్నయగు జన్నిగదేవుని పేరు బెట్టెనేమొ.

అంబదేవుని మంత్రులు: అంబదేవుని మంత్రులు కొందఱు శాసనములయందు బేర్కొనబడి యున్నారు. కడపజిల్లా రాజంపేట తాలూకా వేబాక గ్రామమందలి చెన్నకేశవ దేవాలయములోని యొక తమిళ శాసనమున అంబదేవుని సర్వాధికారి ఇరుమదిదేవుని పుత్రుఁడు గంగదేవుఁడొకఁడు పేర్కొనబడి యున్నాఁడు.[91] శ. 1209 సర్వజిత్తు సంవత్సరమున

87. Bharathi VI Sukla Jyeshta P. 848
88. Sources of Vizianagara History p 79
89. Bharati VI Sukla Jyeshta. P 848
89. Bharati VI Sukla Jyeshta P 848

90 AR No. 98 of 1939-40
91 AR No. 423 of 1911

అత్తిరాల పరశురామేశ్వర దేవాలయమునందు నిల్పిన శాసనములో మహాప్రధాని ఘోడెరాయ గంగదేవుఁడు అంబదేవమహారాజులకు ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధి యగుట కొఱకు భూమిని దానము చేసినట్లున్నది. [92] సిద్ధవటం తాలూకా బ్రాహ్మణపల్లె చెఱువుకట్ట శ 1212 వికృతివర్షమున నెలకొల్పిన శాసనమున మహాప్రధాని గోడెరాయగంగిదేవయంగారు రావులకొలను గ్రామమున చెఱువుకట్టించి యెల్ల లేర్పరచి కొంతభూమిని దానము చేసినట్లు చెప్పియున్నది. [93] వేబాక శాసనములోని ఇరుమదిదేవుని పుత్రుఁడైన గంగదేవుఁడును అత్తిరాల బ్రాహ్మణపల్లె శాసనములలోని ఘో (గో) డె రాయ గంగిదేవయంగారును నొక్కరౌదురో కాదో నిశ్చయించి [illegible] వీలుతోగు భిన్న[illegible] [illegible] సాధము చున్నది. ఘోడె[illegible]గంగిదేవయ్యంగారు తన మహాప్రధాన పదమును జక్కఁగ నిర్వహించి రాజ్యార్థికాభివృద్ధికి దోహదమిచ్చెను. చెఱువులు తటాకములు గట్టించి యందుండి పొలములకు నీరు పారించుటకు కాలువలు త్రవ్వించెను. పొలములను కొలిచి రైతులు [illegible]రుకు చెల్లించవలసిన పన్నులను నిశ్చయించెను. [illegible]దేవాలయముల నుద్ధరించి భూ[illegible]లిచ్చి [illegible]జాపురస్కారములు నిరవచ్ఛిన్నముగ సాగుటకు [illegible]న యేర్పాటులను గావించెను.

ఘోడెరాయ గంగిదేవయమంత్రి మాత్రుఁడు గాఁడు. శైవమతాచార్యుఁడు. ఘోడెయరాయ గురుపీఠస్థాపకుఁడు. అద్దంకి కొండవీడురెడ్డి రాజ్యస్థాపకుఁడైన ప్రోలయ వేమారెడ్డి ఇతని ప్రముఖ శిష్యులలో నొక్కఁడు, ఇతని కృపవల్లనే వేమారెడ్డి రాజ్యమును స్థాపించెనని ఎఱ్ఱాప్రగ్గడ దనహరివంశమున నుడివి యున్నాఁడు.

"శ్రీ పర్వతేశ భక్తి
ఖ్యాపితగుణ ఘోడెరాయగంగ గురుకృపా
స్థాపిత సామ్రాజ్యసము
ద్దీపితవేమక్షితీంద్ర దీప్తదినేంద్రా." [93]

మఱియు వేమారెడ్డి రాయలసీమలోని నగు నహోబల శ్రీశైల క్షేత్రములకు సోపానములను గట్టించెను. [95] మఱియు నితని తమ్ముఁడు మల్లారెడ్డి కురుములూరి పురనాయకుఁడట.

'సకల ద్వీపాంతర ర
త్న కలాప నిరంతరార్చనా కలనారం
భక కురుములూరి పురనా
యక మల్లచమూ వరేణ్య హరిని షేవ్యా' [96]

ఈ కురుములూరు కడపజిల్లా సిద్ధవటం తాలూకాలోని కురుములూరే నని చరిత్రకారులు గుర్తించియున్నారు. ఇట్లు అంబదేవుని మంత్రిసత్తముఁడైన ఘోడెయగంగి దేవయంగారికి ప్రోలయ వేమారెడ్డి శిష్యుఁడగుటయు నిజగురుప్రసాదమున వేమారెడ్డి సామ్రాజ్యమున స్థాపింపగల్గుటయు, నంబదేవుని రాజ్యమునందలి యహోబల శ్రీశైల క్షేత్రముల కతఁడు సోపానములు గట్టుటయు నతని యనుజుఁడు మల్లారెడ్డి సిద్ధవటం తాలూకాలోని కురుములూరు పాలకుఁడై యుండుటయుఁ జూడ మొదట ప్రోలయ వేమారెడ్డియు నాతని సోదరులును నంబదేవుని కాశ్రితులైయుండి తరువాత కాయస్థ రాజ్య పతనానంతరము గోడెయరాయ గంగిదేవయ సాయమున రాజ్యనిర్మాణ కార్యమును నిర్వహించిరని తోఁచుచున్నది.

92 AR No. 406 of 1911. ∫99 X 448.
93 AR No. 3 of 1939–40

94. హరి. ఉత్తర 4 : 1.
95. CP. No. 5 of 1919–20, CR 507 PP. 114–117, LR 42 PP. 387–411, ND. I II, Kr. 34, ∫99 VI 226.
96. హరి – పూర్వ 1. 198.

అంబదేవుని యనుచరులు మఱికొందఱు శాసనములలో గానవచ్చుచున్నారు. అందు కోయి న్నాయని పుత్రుఁడు ఖదేవుఁడొక్కఁడు. ఇతఁడు శ 1213 ఖర సంవత్సరమున దన్నేలిన యంబదేవ మహారాజునకు బుణ్యముగా నిజాషాఢ శు 15 బుధ వారమునాటి పవిత్రారోఫణ పుణ్యకాలమున త్రిపు రాంతకదేవరకు నెద్దియోదానమునుజేసెను. [97] మఱి యొకఁడు సవదర అంబయరడి. ఇతఁడు మనుమ కులవార్ధి వర్ధన సుధాకరులు. నలంపఱువ ప్రభువు మహామండలేశ్వర గండపెండార అంబదేవ మహా రాజులు ఎఱ్వ చెల్లించుకొన్ననాడు త్రిపురాంతకదేవర అఖండదీపమునకు ౫౦ మొదవులను ౧ సలగ యెద్దును, ౧ అంబోతును ఇచ్చెను. [98]

కాయస్థరాజు లందఱివలెనె అంబదేవుఁడు శివ భక్తిపరాయణుఁడు శ్రీశైలపూర్వద్వారా ధిష్ఠిత త్రిపు రాంతక మహాదేవుఁడితని కిష్టదైవము ఆ దేవుని యంగరంగ భోగ నిత్య నైవేద్య పూజా పురస్కార ములను నడపుటకు పెక్కుదానములను జేసి యున్నాఁడు,

శ. ౧౨౧౨ వికృతి సం॥ భాద్రపద బ ౧౫ సూర్యగ్రహణ పుణ్యకాలమున శ్రీ త్రిపురాంతక శ్రీ మన్మహాదేవరకు ప్రాతఃసంధ్య మధ్యాహ్నసంధ్య నడు మను తమ పేరింట ఒక అవసరమును కల్పించెను. [99] అదేసమయమందు అతఁడు శ్రీ త్రిపురాంతక దేవర ఊళ్లనుకానికె మొదలుగా సకలము మంనించెను. ఎందులకనఁగా, 'శ్రీ పర్వత పూర్వన్ ద్వార శ్రీ కుమార గిరినివాసాయ మందస్మిత మాత్రోస్మాలిత త్రిపుర విలాసినీ తాటంకశృంగరాయ, శ్రీ త్రిపురాంతక దేవాయ. అంగరంగభోగధూప దీప నైవేద్య తాంబూల శ్రీగంధ కుంకుమ కస్తూరి కర్పూరాగరు సగంధ ద్రవ్యాద్యుప భోగార్థ చీని తు మహాచీని హంస మాళాలంకృత సితక్షౌమ రక్తక్షౌమ దివ్య నిచయ సర్మణార్థం ఖండస్ఫుటిత జీర్ణో ద్ధార మాట కూట ప్రాసాద మండప నృత్త గీత వాద్యాది భరత విద్యావిశారద నటజనోప సంగ్ర హార్థం కుమారగిరి క్షేత్రాసక్త మానసానాం నియతానుష్ఠాన రతానాం కృత ప్రతిజ్ఞానాంతపోధన బ్రాహ్మణ క్షత్ర సన్న్యాసి వీరవ్రత మహేశ్వర శైవ పాశుపత మహావ్రత కాళాముఖయామిళ భైరవాదీ నామన్నసనాచ్ఛాదనార్థం సునివారిత సత్రప్రదా నార్థంచ శ్రీ త్రిపురాంతక దేవసాత్కృతాన్నిఖిల గ్రామాన్ ప్రతిపాద యతిస్మ. [100]

ఆ సమయమునందే అంబదేవ మహారాజులు శ్రీ త్రిపురాంతక క్షేత్రవాసులైన రెండేవ్రుల మల్లి నాథయంగారికి మొల్లకల్లూరు సర్వబాధా పరిహారము ఆచంద్రార్కస్థాయిగా శివపురముజేసి యిచ్చెను. [101]

రెండవ త్రిపురారి.

అంబదేవుడు శ. 1224 వఱకు రాజ్యపరి పాలనమొనర్చి మృతినందెను. అతని యనంతర మతని పుత్రుఁడు రెండవ త్రిపురారి రాజ్యపీఠము నధిష్ఠించెను. ఇతనివి రెండుశాసనము లింతవఱకు వెలువడినవి. అందొకటి కడపతాలూకా లేబాక గ్రామమునందు కలదు. అందు మహామండలేశ్వర త్రిపురారి దేవమహారాజు ములికినాటిలోని వల్లూరు పట్టణము రాజధానిగ పృథ్వీసామ్రాజ్య మేలుచు శ. 1226 క్రోధన వైశాఖ శు 6 బృహస్పతి వారము నాఁడు లేబాకలోని యల్లారనాథస్వామికి శ్రోత్రియ సర్వమాన్యముగ చేసిన భూదానమును దెలుపు చున్నది [102]

97 AR No. 173 of 1905 ∫99 X 466
98 AR No. 242 of 1905 ∫99 X 460
99 AR No. 174 of 1905 ∫99 X 464
100 AR No. 268 of 1905 ∫99 X 465
101 Epi. Ind XXV. P. 278.
102 AR No. 391 of 1938–39, AR 1938–39 Para 9, P. 74

ఈ శాసనమున త్రిపురారి తనతండ్రిని పేర్కొని యుండలేదు. కావున గవర్నమెంటు శాసనశాఖ వారి తఁడు అంబదేవుని యన్నయైన త్రిపురారియే యని వ్రాసిరి. [102] అంబదేవుని యన్నయైన త్రిపురారి ప్రభుత్వము శ. 1194 తో సమాప్తమైనది. అప్పటి నుండియు శ 1226 దనుక ముప్పది రెండేండ్లు త్రిపురారి ప్రచ్ఛన్నుఁడై తరువాత తమ్ముడు కీర్తిశేషుఁ డైనంతటనె మరల రాజ్యపాలనసేయ గడంగెననుట సమంజసముగ గన్పట్టదు- ఇతడు అంబదేవుని యన్న యైన త్రిపురారికంటె భిన్నుడని తోచుచున్నది. తా నెవ్వఁడైనదియు నతఁడె పై శకాబ్దమునసె సిద్ధవటం తాల్లూకా వరికుంట గ్రామమున నెలకొల్పిన శాసన మున వివరపఱచియున్నాఁడు. తాను అంబదేవమహా రాయని పుత్త్రుఁడననియు. శ. 1226 క్రోధనచైత్ర శు 7 గురువారమునాడు సకలిలోని వరికుంటగ్రామమును సాదసుంకము అష్టాయములతోఁగూడ సర్వమాన్య ముగ సిద్ధనాథదేవరకు దానము జేసితిననియుఁ బ్రక టించియున్నాఁడు. [103] కావున యంబదేవుని యనంత రము కాయస్థ రాజ్యపీఠమలంకరించి నాతఁడు అతని యన్నయైన మొదటి త్రిపురారికాదు, కుమారుఁడైన రెండవ త్రిపురారి యనుట నిశ్చయము.

రెండవ త్రిపురారి దీర్ఘకాలము రాజ్యము సేయుటేమొ కాకతీయ ప్రతాపరుద్ర దేవమహారాజు తన సేనాపతులలో నొక్కఁడైన మహారాయ పట్ట సాహిణి సోమయ నాయకునియొక్క గొప్పసైన్యముతో కాయస్థరాజ్యమును జయించి స్వాధీనపఱచుకొనుమని యాజ్ఞాపించిపంపెను ఇందులూరు అన్నయమున్నగు సుప్రసిద్ధ దళనాయకు లతనివెంట జనిరి. ఈ యుద్ధ మున జరిగిన విశేషాంశము లెవ్వియు దెలియరావు; కాని కాకతీయులకే జయము గలిగెననియు కాయస్థ రాజ్యము వారికి హస్తగతమాయెననియు శాసన సాక్ష్యమువలన దెల్లమగుచున్నది. కడపజిల్లా జమ్మ లమడుగు తాలూకా దేవిగుడిగ్రామమందలి తల్లకంటీ శ్వరి గర్భాలయమునకు నుత్తరబాగమున శ. 1231 సౌమ్య సంవత్సర ఫాల్గుణ శు 7 గురువారమునాడు వ్రాయించిన శాసనములో మహారాయ పట్టసాహిణి సోమయనాయనివారు తత్ప్రాంత దేశమును బరిపా లించుచుండఁగా నాగరాజు అయ్యపరాజు కొడుకులు ఐయ్యనచిన్నయలను శుల్కాధికారులు తాము గైకొను చుండిన మార్గసుంకములో తలకంటిదేవి యఖండ దీపారాధనకై నెల 1కి 2 రెండురూకలు దానముచేసి నట్లు కలదు [104] కర్నూలుజిల్లా నందియాలతాలూకా కానాల గ్రామమందలి యొక శాసనమున కాకతీయ ప్రతాపరుద్ర దేవమహారాజు ఓరుగల్లు రాజధానిగ పృథ్వీసామ్రాజ్యము పరిపాలించుచుండఁగా నతని పక్ష మున రాయపట్టసాహిణి సోమయనాయకుఁడు గండి కోట ములికినాడు, పెనంపాడి, పొత్తపినాడు, పెద కలు, నతవాడి విషయముల నేలుచు శ. 1230వ సం॥ మందు కొనాల మూలస్థానం నాగనాథదేవునికి కొంతభూమిని దానముజేసినట్లు కలదు [105] ఇందు వలన ఈ శాసనకాల మప్పటికి అంతవఱకు కాయ స్థుల యేలుబడిక్రింద నుండిన గండికోట మున్నగు పై పేర్కొనిన రాష్ట్రములన్నియు గాకతీయసామ్రా జ్యమున గలసిపోయెనని తెల్లమగుచున్నది. కావున ప్రతాపరుద్రుఁడంతకుముందె శ 1226—1230 లకు మధ్య జయించి స్వాధీనముచేసికొనియుండునని తోఁచు చున్నది.

103 AR 65 of 1939–40.

104 C. Virabhadra Rao. Andhrula Charitra. V. P. 548–9

105 AR No. 260 of 1935–36

# అలంకారశాస్త్ర ప్రవాగస్త్యుడు - విద్యానాథుడు

శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు

**1. అగస్త్యమహాకవి—విద్యానాథుడు :-**

*'విద్యా కైరవకౌముదీం శ్రుతి శిర*
*స్సీమంత ముక్తామణిం*
*దారాన్ పద్మభువస్త్రిలోక జననీం*
*వందే గిరాందేవతామ్*
*యత్పాదాబ్జ నమస్క్రియాః సుకృతినాం*
*సారస్వత ప్రక్రియా*
*బీజన్యాసభువో భవంతి కవితా*
*నాట్యైక జీవాతవః'*

అనుచు కవిపండితమండలి హర్షధ్వానములు చెలగ ఆంధ్రసామ్రాజ్య రమాధినాయకుడగు ప్రతాపరుద్రదేవుని పేరోలగమున మూర్తీభవించిన యాంధ్రత్వము, పుంభావసరస్వతి, అగస్త్యపండితాఖండలుడు వాగ్దేవతాస్తోత్రముతో తన అలంకారశాస్త్ర సర్వస్వ సంగ్రహమునకు మంగళాచరణమును కావించినాడు. ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి అమరవాఙ్మయరత్నము కర్ణమ్ములో ప్రతిబింబించి శాశ్వతమూర్తియై విలసిల్లినది.

ఏమి యీ శ్రీయలంకార ప్రబంధము? ప్రత్యక్షరమునను రసము తొణికిసలాడుచున్నదే! అడుగడుగునను ఆంధ్రకీర్తి ముద్రలుగొన్నదే! అహా! అపూర్వసారస్వతప్రక్రియ! విద్యానాథుడీ మహానుభావుడు-విద్యానాథుడు! అని పండితలోకము ఏకకంఠమున పల్కినది. నిజముగా విద్యానాథుడే అన్నాడు శివస్వరూపుడు శివదేవయ్య సచివశేఖరుడు. చిరునవ్వు చెంగలింప విద్యానాథ మహాకవి అని అనువదించినాడు త్రిలింగరాజ పరమేశ్వరుడు. అగస్త్యుని ఉత్తమాంగమున సువర్ణప్రసూనములు కురిసినవి. మెడలో రత్నహారములు మెరసినవి. మంగళవాద్యములు మొరసినవి. ప్రతాపరుద్ర యశోభూషణము సహృదయులకు కర్ణభూషణమై వెలసినది. అగస్త్యమహాకవి విద్యానాథుడుగా వాసిగాంచినాడు: పాతపేరు వ్యవహారమున పాతపేరై మెఱుగు తఱిగి మఱుగు పడినది. ఎవరీపుణ్యశాలి అగస్త్యుడు?

2. ఆంధ్రచక్రవర్తి యాస్థానము - విద్వత్కవులు :

అది క్రీ శ. పదమూడు పదునాలుగవ శతాబ్దులమధ్యభాగము. కళాలతలకు వసంతము. కాకతీయ నందనోద్యానము కన్నులపండువుగా కళకళలాడుచున్నది. రుద్రదేవ, గణపతిదేవ, రుద్రమదేవులు అలారుముద్దుగా పెంచినారు. ప్రతాపరుద్ర చక్రవర్తి కొత్తజాతి అంటుమొక్కలు కూడ చేర్చి వన్నెలు కూర్చినాడు. సహస్రస్తంభదేవాలయము, రామప్పగుడులవంటి పెక్కునిర్మాణములు కాకతీయశిల్పకళా సంపదకు మచ్చుముక్కలుగా నిల్చినవి. పాకాల తటాకమువంటి వారి నిర్మాణములు నేటికిని చెక్కుచెదరకున్నవి. రాజధానిలో వేలసంఖ్యలో ఆనాడు చిత్రకళామందిరములున్నట్లు ప్రతాపచరిత్రము, సిద్ధేశ్వర చరిత్రములు సాక్ష్యమిచ్చుచున్నవి.

కాకతీయుల కళాపోషణములో తక్కిన కళలన్నియు ఒకయెత్తు కావ్యకళయొకయెత్తుగా వర్ధిల్లినది. విశేషించి ప్రతాపరుద్ర సార్వభౌముని పాలనము విద్యావ్యాప్తికి స్వర్ణయుగమనదగినది. ఆ సహృదయ శేఖరుని ఔదార్యము జగత్ప్రసిద్ధము. అతనిచేతికి ఎమ్ములేదు. ఆ చల్లనిభూవల్లభుతల్లజు నాశ్రయించిన కవివతంసులు, పండితగ్రామణులు గజాంతైశ్వర్యముల ననుభవించినారట. ఈవిషయమును తెలుపునట్టి ఆఖ్యానకమొకటి కువలయానందములో కన్పట్టుచున్నది. అదియిది—

'కతిపయదివసైః క్షయం ప్రయాయాత్
కనకగిరిః కృతవాసరావసానః
ఇతిముదముపయాతి చక్రవాకీ
వితరణ శాలిని వీరరుద్రదేవే'

బంగారుకొండ మేరుపర్వతమే అతని యీవిలో చెల్లిపోవునట. పేరుతెలియని కవిప్రశంస యేమంత పెద్ద ? ఆచారశీలుని దాతృతాఫలమును నిండుగా అనుభవించిన యదృష్టవంతుడు అగస్త్యవిద్యానాథుడే స్వయముగా ఏమన్నాడో చూడుడు—

'వదాన్యోనాన్యోస్తి త్రిజగతి సమోయదనృపతేః
గుణశ్రేణి శ్లాఘాపిహిత హరిదకానయశసః
సమంతాదుద్భూతైర్ద్విరదమదగంధైః సురభయః
క్రియంతే యద్విద్వజ్జన ప్రాంగణభువః

ఆహా! ఆ రాజేంద్రుని ఆస్థానకవిపండితుల గృహాంగణములు మత్తగజముల మదగంధముతో గుబాళిల్లుచున్నవి. మఱియొకచోట ఈవిద్యానాథకవియే—

'సుధారసముచోవాచో
దత్త్వా కాకతి భూభుజే
అతోలభంతేకవయః
సహస్రం గంధసింధురాన్'

అన్నాడు, ఇంకను స్పష్టముగా. ఔరా! ఎంత రమణీయ పరివృత్తి! అరసికశేఖరునకు కవితామృత కలశాలు సమర్పించి కవీశ్వరులు గంధసింధురములను బహూకృతులుగా అందుకొనుచుండిరట! రారమ్మనుచున్న రసాలములకు పుంస్కోకిలలు చేరవా? ప్రతాపరుద్రచక్రవర్తి ఆస్థానములో శాస్త్రనిష్ణాతులైన పండితులును కావ్యకళాధౌరేయులైన కవులును రెండు వందలమందికి మించియుండిరని లెక్కకట్టిచెప్పిన కాసె సర్వప్పమాట యొప్పేకదా! కొంత అతిశయోక్తి యున్నను మొదటికి ముప్పులేదు కదా! వీరిలో బంగారుపల్లకీలెక్కి తేని కొలువుకూటమునకు వచ్చువారునూట యేబదిమందియట!

ఈవిధముగా ఆ ప్రభువరేణ్యుని ఆదరమునంది తదాస్థానము నలంకరించిన సంస్కృత విద్వత్కవులలో పేరెన్నికగన్న వారిలో కొందఱువీరు—

1. శాకల్యమల్లకవీశ్వరుడు : ఈతడు మహాపండితుడును కవీశ్వరుడును అయినవాడు. ఉదారరాఘవమును మహాకావ్యమును రచించెను. చిత్రకవితలోను మల్లకపిచంద్రుడుదిట్ట. నిరోష్ఠ్య నియమముతో రామాయణమును రచించి భళి! యని

షించుకొన్నవాడు. చతుర్భాషానిఘంటువునుకూర్చి మేటినైఘంటికుడుగాకూడ ఖ్యాతిగాంచినవాడు.

2. వీరభల్లటదేశికుడు : సర్వశాస్త్రపారంగతుడైన యీ యుద్దండపండితుడు శాస్త్రపరీక్షకుడుగా కాకతి విద్వత్సభకు భూషాయమాణుడై వెలయుచుండెను. 'సభా పండితైః' పండితులు సభకలంకారములుగదా!

3 అప్పయార్యుడు : జినేంద్ర కల్యాణాభ్యుదయకర్తయగు ఈతడు జైనపండితుడు. అన్ని మతములవారును కాకతిరాజుల పరిపాలనమున సుఖజీవితమును గడపిరనుటకు ఈ యప్పయార్యునివంటి నారే తార్కాణ

4. త్రిపురాంతకకవి: ఈమహాకవి బహుగ్రంథకర్తగా ప్రసిద్ధిపహించినవాడు. కవితాప్రక్రియలలోను భిన్నగతులు వెలయించినాడు. క్రీడాభిరామమునకు మూలమైనప్రేమాభిరామముగు సంస్కృతగ్రంథమును రచించినవాడీతడే. ఈతని త్రిపురాంతకోదాహరణము సుప్రసిద్ధము. సంస్కృతాంధ్రములలో మేటిరచయితగా విఖ్యాతిగాంచినవాడు.

6. కోలచలమల్లినాథశతావధాని : సుప్రసిద్ధ వ్యాఖ్యాతయగు మహామహోపాధ్యాయ మల్లినాథసూరి వంశీయులు పరంపరగా మహావిద్వాంసులుగా, కవీశ్వరులుగా పేరుమోసినవారు. వ్యాఖ్యాతృచక్రవర్తియగు మల్లినాథుని తండ్రి కపర్దిపండితుడు, మంత్రకోవిదుడు. శ్రౌతకల్పమునకు వృత్తిరచించినవాడు. ఈతని జనకుడును మల్లినాథాభిధానుడే. ఈతడు మహావిద్వాంసుడేగాక ఆంధ్రులకు సొంతసొత్తుగా వచ్చుచున్న శతావధాన విద్యయందును ఆరితేరినవాడు. ఈ మల్లినాథ శతావధాని ప్రతాపరుద్రునాస్థానమున కవితావిలాసములు వెలయించి ఆ రాజన్యమౌళిచే స్వర్ణాభిషేకగౌరవమునందెను. ఏతద్వంశీయుడును చంపూరామాయణ వ్యాఖ్యాతయునగు నారాయణపండితుడు తన పూర్వజులను ప్రశంసించుచు ఈ సంగతి నిట్లు తెలిపెను.

*'కోలచలమాన్వయాబ్ధిందుర్మల్లినాథో మహాయశాః*
*శతావధాన విఖ్యాతః వీరరుద్రాభివర్ధితః*
*మల్లినాథాత్మజః శ్రీమాన్ కపర్దీమంత్రకోవిదః*
*అఖిలశ్రౌతకల్పస్య కారికావృత్తిమాతనోత్'*

6. గంగాధరకవి: గీర్వాణభాషలో భారతకథను నాటకముగా నిబద్ధించి అపరవ్యాసుడని కీర్తి వహించినవాడీ మహాకవి.

*'స్తుమ స్తమపరవ్యాసం గంగాధరమహాకవిమ్*
*నాటకచ్ఛద్మనాదృష్టాం యశ్చక్రేభారతీంకథామ్'*

అని గంగాదేవిచే మధురావిజయమున ప్రస్తుతింపబడినవాడీతడే. అగస్త్యమహాకవి ఈతని బావమఱదియట. ఈతని వంశమువారెల్ల కవిపండితులుగా వన్నెకెక్కినవారే.

7. విశ్వనాథకవి : సౌగంధికాహరణమును రచించి పేరుగాంచినవాడు. గంగాధరకవికి జ్యేష్ఠపుత్రుడు. మహావిద్వాంసుడు కాదంబరీనాటకకర్తయైన నరసింహకవికి అగ్రజుడు. అగస్త్యమహాకవికి మేనల్లుడు. మధురావిజయమును రచించిన గంగాదేవియను కవయిత్రికి ఆచార్యుడు. ఈతనికవిత మిగుల మనోహారిణియై విలసిల్లినట్లుగ్గడింపబడినది.

*'చిరంజయీ భూయాత్ విశ్వనాథకవీశ్వరః*
*యస్యప్రసాదాత్ సార్వజ్ఞం సమింధేమాదృశేష్వపి.'*

అని గంగాదేవి ఈ కవీశ్వరుని మహిమను కొనియాడినది. అతని యనుజుడు నరసింహకవి.

... ... ... ...

*సుధారసతరంగిణీ సురభిసూక్తి రస్యాగ్రజః*
*శితౌ సహృదయాగ్రణీ ర్జయతి విశ్వనాథః కవిః'*

అని పొగడినాడు.

8. నరసింహకవి : ఈతడు గంగాధర కవికి ద్వితీయపుత్రుడు. విశ్వనాథకవికి అనుజుడు. అగస్త్యమహాకవికి రెండవ మేనల్లుడు. కాదంబరీ కల్యాణమను నాటకమును సంస్కృతమున రచించెను.

ఇంకను ఇట్టి సంస్కృత పండిత కవులు పెక్కురు ప్రతాపరుద్రదేవుని ఆస్థానము నలంకరించిరి. తెలుగు కవులలో భాస్కరరామాయణ కర్తలు భాస్కరాదులు. మార్కండేయపురాణ రచయిత మారన, నయనరగత రచయిత రంగనాథుడు మొదలైనవారును, పదకర్తయగు కృష్ణమాచార్యులును ఆశ్రేణిలో పేర్కొనదగినవారు. నక్షత్రములలో పూర్ణచంద్రునివలె ఈకవులందఱిలోను మేటికిరీటియై ప్రకాశించిన వాఁడగస్త్యకవి

3. అగస్త్యమహాకవియే విద్యానాథుఁడు :

నలకీర్తికౌముది, బాలభారతము, ప్రతాపరుద్ర యశోభూషణము మొదలైన డెబ్బదినాలుగు గ్రంథములు రచించి విశేషకీర్తి నార్జించిన కవీశ్వరుని మొదటిపేరు అగస్త్యుడనియు పిమ్మట చక్రవర్తిచే విద్యానాథుడను బిరుదమొసగబడిన దనియు విమర్శకుల యభిప్రాయము. ఈనామనిర్ణయము కొంచెము జటిలముగానేయున్నది. నలకీర్తికౌముది మున్నైనగ్రంథముల ఆశ్వాసాంత గద్యములలో కవి నామము అగస్త్యుడుగానే కనబడును. 'ఇతిశ్రీనలకీర్తికౌముద్వాఖ్యే లక్ష్మీపదలాంఛనే అగస్త్యకృతే మహాకావ్యే ప్రథమః సర్గః'—ఇత్యాది.

బాలభారతములోను—

*'శ్రీవన్తూలస్థూలం కరణభణితిగ్రంథి నిష్ఠ్యూతైః*
*కవింమన్యైరన్యైః కిమిహ రోమంథ హారిత్రైః*
*విమర్దాదర్వాంతః ప్రతిఫలదలంకార రచనైః*
*అగస్త్యః పౌరస్త్యా ననుసరతి సూక్తైః సుమనసః-'*

అని అగస్త్యపదమే యుపలబ్ధమగుచున్నది. విద్యానాథపదము వ్యవహరింపబడలేదు. ఇక ఈమహాకవిని కీర్తించిన కవులుకూడ అగస్త్యపదాభిధేయునిగానే కీర్తించిరి.

విశ్వనాథకవి ( సౌగంధికాపహరణములో )- అగస్త్యమహాకవి మేనల్లుడగు ఈ కవివర్యుడు తన కవిత యుదారమధురముగా నుండుట యేమంత గొప్పవిషయముకాదనియు, అంతటివాడైన అగస్త్య పండితుడు తన మేనమామయైయుండ ఈ యింత వచ్చుటేమి ఘనతయనియు ప్రశంసించెను.

*'వాచ స్సన్యకవేరుదారమధురా*
*ఇత్యత్ర చిత్రం కిము?*
*ప్రఖ్యాతః సకలాసు విద్యాసుగుణేషు*
*శ్రేయానగస్త్యః సుధీః*
*వేధశ్చంద్రముఖీకరాంగుళిదళా*
*సంగక్వణద్వల్లకీ*
*నాదోయుక్తి సహోక్తి దర్శితసుధా*
*జన్మా స యన్మాతులః'*

భారతీదేవి కరాంగుళిస్పర్శచేమ్రోయు వీణావాదము వలె అమృతాయమానమగు కవిత్వముచెప్పెడి నేర్పు గలవాడు తన మేనమామ అగస్త్యుడన్నాడు.

రాజచూడామణి దీక్షితులు (రుక్మిణీకల్యాణములో) ఈ అగస్త్యమహాకవిని నుతించుచు—

*'జడాశయానాం హృదయం జగత్యాం*
*యస్యోదయాత్ యాతితమాం ప్రసాదమ్,*
*స విషసారస్వత మర్మవేది*
*విభాతియోగీ విదుషామగస్త్యః—'*

అగస్త్యోదయమున జలాశయములు తేటుకొనును. అట్లే యీయగస్త్యప్రభావమున జడులహృదయము కూడ ప్రసన్నములగును. సారస్వతరహస్యవేదియగు నగస్త్యకవి విద్వన్మౌళియై విలసిల్లుచున్నాడు శ్లేషాభిరామమైన ఈ పద్యమునను అగస్త్యపదమే ప్రయుక్తమైనది.

మహారాజ్ఞి గంగాదేవి=(మధురావిజయములో) తన గురువైన విశ్వనాథకవికి మాతులుడైన ఈమహాకవికి పుష్పాంజలి ఘటించుచు–

'చతుస్సప్తతి కావ్యోక్తి వ్యక్తవైదుష్యసంపదే
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయేత్కోన కోవిదః'

అనెను. డెబ్బదినాలుగు కావ్యములు రచించి విఖ్యాతుడైన అగస్త్యమహాకవిని ఎవరుకోరరు? అనుచో అగస్త్య పదమునే వాడెను

ఇట్లన్నిచటను అగస్త్యశబ్దమే ఏతత్కవి నామముగా గోచరించుచున్నది. వీనిలో విద్యానాథపదమీ కవీశ్వరాభిధానముగా ఎందును కానరాదు.

ఇక ప్రతాపరుద్రీయములోనో విద్యానాథ పదమే ప్రకరణాంత గద్యలలో 'ఇతి శ్రీవిద్యానాథ కృతౌ ప్రతాపరుద్రయశోభూషణే అలంకారశాస్త్రే నాయకప్రకరణమ్'–ఇత్యాదిగా కనబడును. ప్రకరణాంత గద్యములెవరో వ్రాసియుందు రనుకొనినచో, గ్రంథకర్తయే స్వయముగ నాయకప్రకరణమున పదియవకారికలో విద్యానాథుని కృతి యిదియని స్పష్టపఱచుట కాననగును.

'కాకతీయనరేంద్రస్య యశోభూషయితుంకృతా
విద్యానాథ కృతిశ్శ్రేయం స్వయంతేన విభూష్యతే.'

అంతియేకాదు. సాధారణముగా కవిపేరు బైటపడు చక్రబంధములోకూడ అగస్త్యపదములేదు. 'విద్యానాథ కృతి వీరరుద్రయశః' అనియే స్ఫురించుచున్నది. ఆ చక్రబంధమిది—

'లక్ష్మీవికత వైభవస్యజగతాం నాథస్యభద్రశ్రియో
దిక్పారబ్ధనిజప్రతాపజనితాం భాకృద్ధురాంయచ్చతః
నిత్యంరుద్రజనాధిపస్యజయినో భాతిప్రకాశం స్థిరా
రాజత్పాలన మోదితాత్మనిభుజే యోగ్యాశ్రయత్వాద్ధరా'

ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాతలలో ముఖ్యుడైన కోలాచల కుమారస్వామి సోమపీధి – రత్నాపణావతారికలో

'పుణ్యశ్లోకగుణోక్తిశాణనికషా యత్తేజనానాంలంభితం
సంజగ్రాహరసాదిరత్ననిచయం విద్యాధినాథః పురా,
సోయాంతద్వ్యవహారహేతుమధునా కించిత్కరోమ్యాపణం
తత్రానుగ్రహయూల్యతోఖిలమితం క్రీణంతుధన్యాజనాః'—

అని కవిని విద్యాధినాథశబ్దముచే ఉపపాదించియు వెంటనే 'అథతత్రభవాన్ విద్యానాథనామా మహాకవిరలంకారశాస్త్రమారభమాణః'— ఇత్యాదిగా అవతారికా వాక్యమున విద్యానాథుడనియే కవిని పేర్కొనెను. అగస్త్యమహాకవియని యెక్కడను అనలేదు. ఇక రెండవవ్యాఖ్యాత శుకవటము (చిలకమఱ్ఱి) తిరుమలాచార్యుడును తన రత్నశాణ వ్యాఖ్యలో

విద్యానాథః కథమపిబహూరాకరాచ్ఛాస్త్రజాలాత్
సంజగ్రాహప్రకృతికఠినే రత్నజాలంకరండే,
విద్వద్గోష్ఠ్యాహృదయరమణే రత్నశాణేథునాస్మి
అంతర్గూఢద్యుతివిలసితం తత్సముత్తేజయామి'...

అనుపద్యములో విద్యానాథపదమునే కవినామధేయముగా ప్రయోగించెను. ప్రతాపరుద్రీయమును పరామర్శించిన లాక్షణికులును విద్యానాథ పదమునే వాడినారు.

విషయమిట్లుండగా ఆ అగస్త్యుడే ఈ విద్యానాథుడనుటకు అవకాశమెందున్నది ? ప్రసక్తిమేది?

ఇదిగో! ప్రతాపరుద్రీయములోనే యున్నది. కావ్యప్రకరణమున గుణీభూతవ్యంగ్య ప్రస్తావములో అగూఢవ్యంగ్యమునకు విద్యానాథుడిచ్చిన లక్ష్యశ్లోకములో కనబడుచున్నది యాకవీశ్వరుని తొలిపేరు అగస్త్యుడనునది. ఆ శ్లోకమిది—

'ఔన్నత్యంయదివర్ణ్యతేశిఖరిణఃక్షుద్రత్వంలిసిద్ధైః కృతాః,
గాంభీర్యంయదికీర్త్యతేజలధయః క్షోభ్యంతిగాధీకృతాః,
తత్త్వాంవర్ణయితుంబిభేమి;యదవా జాతోస్మ్యగస్త్యః స్థితః
త్వత్పార్శ్వేగుణరత్నరోహణగిరే! శ్రీవీరరుద్రప్రభో!'

ఓ వీరరుద్రప్రభూ! నీ ఔన్నత్యము వర్ణింతునా తమ్ము తక్కువపఱచితినని కొండలు కోపించును. నీ గాంభీర్యమును కీర్తింతునా తమ్ము తేలికపఱచితినని సముద్రాలు ఘూర్ణిల్లును. కావున నిన్ను కీర్తింప భయపడుచున్నాను. అయినను నే నగస్త్యుడనుకదా!

ఇందు పర్వతములకు సముద్రములకు నేను భయపడను. నిన్ను కీర్తించియే తీరుదును—అన్న వ్యంగ్యము గూఢముగలేక బట్టబయలైనది. కావున ఆ గూఢవ్యంగ్యము.

ఈ పద్యములో కవి ప్రయోగించిన అగస్త్య పదము ఆకవి తొలినామమే. సందేహములేదు. అది శ్లిష్టముగా ప్రయుక్తమైనది. అగస్త్యమహర్షి యన గానే వింధ్యపర్వత గర్వనిర్వాపకుడు గనుక కొండలకు గుండెదెదరు. అట్లే సముద్రజలాలను పుడిసిలి పట్టి త్రావివైచినవాడౌట ఆయనపేరంటే సముద్రాలకు హడలు. ఈ పౌరాణికభావమును తన నామధేయమైన అగస్త్యపదములో శ్లేషభంగిచే చక్కగా కుదుర్చుకొని కల్పనచేసి రచించి నాడీలక్ష్యపద్యమును మహాకవి అట్లుకాదేని నేనగస్త్యుడనులే అనుట పొసగదు. చమత్కరించుట కనువుగా ఉన్నందున కవీశ్వరుడిట తన మొదటిపేరు వాడు కొన్నాడని తత్త్వము. విమర్శకులెల్లరును అగస్త్య విద్యానాథుల యైక్యవాదమునకు ఈ శ్లోకమునే అంతరప్రమాణముగా అంగీకరించినారు. ఇట ఒక విషయము స్పష్టము. శాకల్యమల్లభట్టారకుడు మొదలైన విద్వద్గేసరులవలె అగస్త్యమహాకవి తొలినుండియు ప్రతాపరుద్రచక్రవర్తి కొలువున ఆస్థాన విద్వాంసుడుగా చేరినట్లు కనబడదు. పూర్వదశయంతయు నలకీర్తికౌముది, బాలభారతము, శ్రీకృష్ణచరితములవంటి బహుగ్రంథములను రచించుటలోను, శిష్యులకు పాఠములు చెప్పుటలోను గడచియుండును. ఉత్తరదశలో చక్రవర్తి దృష్టికివచ్చి తదాహూతుడై ఆస్థాన విద్వాంసుడుగాచేరి విద్యావైభవమువలన విద్యానాథ బిరుదము నందియుండును. అప్పటినుండియు పూర్వనామము వ్యవహారమునుండి తొలగ విద్యానాథనామముతోనే ప్రసిద్ధుడై ప్రతాపరుద్రీయ కృతిలో ఆ బిరుదనామమునే వాడుకొనియుండును. ఆతని పూర్వగ్రంథాలలో విద్యానాథపదము లేకపోవుటకును ప్రతాపరుద్రీయములో అగస్త్యపదము సర్వత్ర కనబడకపోవుటకును హేతువిదియేయనుట సమంజసము.

కానె సర్వప్ప ఈ క్రిందివ్రాతకూడ దీనికనుకూల సాక్ష్యమగుచున్నది. తురకసర్దారు ప్రతాపరుద్రుని చెఱపట్టి ఢిల్లీకికొనిపోవుచు దారిలో గోదావరియొద్దున విడిసియుండగా ఆ రాజచంద్రునిజాడ ప్రజలును, అధికారులును, శివదేవయ్యమున్నగు మంత్రివర్యులును అచటికి వచ్చిరనిచెప్పి, ... *అందునొక్క విప్రుండు ప్రతాపరుద్రీయంబను కావ్యంబుచెప్పి, ఆ రాజునకు అంకితంబుగా చేయుటయు, సర్వజ్ఞుండు ......ఆ విప్రునకు ప్రతాపరుద్రుండు అంగులీయకంబు నిచ్చి యతనిని విద్యానాథుండని వినుగు నెక్కించి చాటించుటయు—'*

(సిద్ధేశ్వరచరిత్ర—170 పు.)

దీనినిబట్టి అగస్త్యమహాకవియే విద్యానాథుడని తేలుచున్నది

4 అగస్త్యవిద్యానాథుని కృతులు :—

ఈమహాకవి డెబ్బదినాలుగు కృతులు రచించెనని మధురావిజయ రచయిత్రి మహారాజ్ఞి గంగాదేవి వాక్యమువలన తెలియుచున్నదికదా! ఆ గ్రంథములన్నిటి పెల్లైనను నేడు వినవచ్చుటలేదు. కాలముకడుపుకడలి. అందులో ఎన్ని మునిగి రూపుమాసినవో! శిథిలములై మిగిలిన యీ మహాకవి కృతులలో కొన్ని యివి.—

1 బాలభారతము :—

*'బహుభాషల బహువిధముల*
*బహుజనములవలన వినుము భారతబద్ధ*

స్పృహులగు వారికి నెప్పుడు
బహుయాగంబుల ఫలంబు పరమార్థమగున్.'

అన్నారు-నన్నయ్యగారు. అట్టిది భారతీయుల భారత బద్ధస్పృహ! ఆ భారత పవిత్రగాథను ఏదోరూపమున రచించి కవిధన్యతనొంద యత్నించును. అగస్త్యమహాకవి ఈగాథనే చేకొని 20 సర్గముల మహాకావ్యముగా రచించెను. కథ భారతగాథ. కవిత 'శారదావతారుడును, వేధశ్చంద్రముఖీ కరాంగుళి దళాసంగక్వణద్వల్లకీ వాచోయుక్తి సహోక్తి దర్శితసుధాజన్ముండును అగు అగస్త్యమహాకవిది. చెప్పెడిదేమి? 'హేమ్నః పరమామోదః' బాలభారత మెంత మనోహరమో! తలమున్కలైన రాజకీయాలుండినవాడయ్యు ఎట్లో తీఱిక గల్గించుకొని ఈ మహాకావ్యముపై మనోహరయను వ్యాఖ్య [illegible] మహామంత్రి. ఎట్టి మనోహరసన్నివేశము! తెలుగుమహాకవి కావ్యము— తెలుగు మహామంత్రి వ్యాఖ్యానము!

మచ్చుకొకపద్యము—

'లాలాట నేత్రజ్వాలనోష్మతాపితాః
కపర్దసింధోః పరిపీతపాథసః
ఫణామణీనాం కషణేన భోగినాం
శిలీముఖాః శాతముఖాః కిరీటినః'

ఇక ఇట్టి శాతముఖములైన శిలీముఖములుగల ఆ జగజ్జెట్టి కిరీటికి సాటియేరీ?

2. శ్రీకృష్ణచరిత్రము :— విశ్వమోహనములగు శ్రీకృష్ణ లీలావిలాసములకు ముగ్ధముకాని హృదయ మేది? అగస్త్యమహాకవి తన కవితా సుధాధారలు శ్రీకృష్ణభగవానుని వరివస్యలో సమర్పించి కృతకృత్యుడైనాడు. ఇంకొక విశేషము ఈ కావ్యము గద్యకావ్యము. 'గద్యం కవీనాం నికషం వదంతి' అందురు. సవ్యసాచియగు అగస్త్య కవీంద్రుడు తన గద్యకవితా ప్రాభవమును శ్రీకృష్ణ చరితములో ప్రదర్శించెను ఉత్తమశ్రేణి గద్యకావ్యములలో ఇది యొకటియని పరిశోధకులు ప్రశంసించినారు.

3 నలకీర్తి కౌముది :— భారతాదిపురాణ ప్రసిద్ధమైనది నల చరిత్ర. నలదమయంతులగాథ, పుణ్యావహము.

'కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్—'

అని ప్రసిద్ధి. విఖ్యాతమగు శ్రీహర్షుని నైషధకావ్యమున్నను పాపహరమగు నలదమయంతుల కథయందలి యాదరముచేతను, నైషధకావ్యము కొంత అతివర్ణనము, అశ్లీలస్పర్శము కలదను విమర్శకు గుఱియైనదగుటచేతను, సారస్వత మర్మవేదియగు ఈ అగస్త్యమహాకవి యట్టి లోపములు లేకుండునట్లును, గ్రంథగ్రంథులు లేకుండనట్లును [illegible] ఈ మహాకావ్యమును నిర్మించి లోకమునకందించినట్లు భావింపవచ్చును. శ్రీహర్షుడు నైషధమును ఆనంద పదాంకితముచేయగా అగస్త్యమహాకవి తన నలకీర్తి కౌముది కృతిని లక్ష్మీపదచిహ్నితము కావించెను. మధుర సార్థ్రమంజరీపుంజమువలె నలకీర్తికౌముదీ పద్యనివహము మనోహరమై యొప్పారుచుండును.

ఉపలబ్ధమైన సర్గాంత గద్యమునుబట్టి యిది మహాకావ్యమే యనవలెను. 'ఇతి శ్రీ నలకీర్తి కౌముద్యాఖ్యే లక్ష్మీపదలాంఛనే అగస్త్యకృతే మహాకావ్యే ద్వితీయసర్గః' ఈ మహాకావ్యము సమగ్రముగా లభింపకుండుట దురదృష్టము. ఉదాహరణమున కిందలి రెండుపద్యములు—

'స్నాతాఘటాభ్ర పరిముక్త పయోభి, రాప్త
కౌశేయకాశకుసుమా, లసదాస్యపద్మా,
ఆయుక్తమౌక్తిక విభూషణ సస్యపూర్ణా
భాతి ప్రభీమతనయా శరదుర్వరేయమ్'

దమయంతీశరల్లక్ష్ములెంత హృద్యముగ చిత్రింపఁబడినారో!

'సామంపస్మి కతత్జ్ఞితాతివిశదజ్యోత్స్నాస్ఫురచ్చారదా,
శైమీంశారపవుంశరికపదరాంవిప్రామువాక్కారదామ్
తామూశిరసాభరాపనపదాం మందస్మితాంశారదా
బాలే! త్వామభియాను సర్వజగతి సామ్రాజ్యలక్ష్మీః
స్వయమ్'

శారదావతారుని శారదాశీర్వాదమిది!

ఈ మహాకావ్యము బహుముఖ ప్రచారము నొందియుంటుటచే ఇందలి కొన్ని పద్యముల భావము లను పిమ్మటి కవులు తమకావ్యములలో అనుసరిం చిరి. అట్టి యనుసరణములలో వసుచరిత్రములోని యీపద్యమొకటి

'నానాసూనవితానవాసనల నా
నందించుసారంగమే
లాగుల్నెల్లను బొందు గంధఫల బ
ల్కాకం దంపంబంది, యో
షానాసాకృతిఁబూల్చి సర్వసుమన
స్సౌరభ్య సంవాసియై
పూనెం బ్రేక్షణమాలికా మధుకరీ
పుంజంబు లిర్వంకలన్—'

దీనికి నలకీర్తికౌముదిలోని యీ క్రిందిపద్యము మూల మందురు.

'భృంగానవాప్తిప్రతిపన్నఖేదా
కృత్వావచే గంధఫలీతపోఽలమ్
తన్నాసికా భూపనుభూత గంధా
స్వపార్శ్వనేత్ర కృతభృంగసేవ్యా—'

4 అగస్త్య నిఘంటువు: ఈ మహాకవి ప్రామాణికమగు ఒక నిఘంటువునుకూడ రచించి నట్లు విమర్శకులు భావించుచున్నారు. ఉత్తరరామ చరిత్ర నాటకమునకు వ్యాఖ్య రచించిన ఘనశ్యాము డను పండితుడు తన వ్యాఖ్యతో అగస్త్యనిఘంటువు నుండి ప్రమాణముల నొసగియున్నాడు.

5. మణిపరీక్ష: రత్నముల పుట్టువు, జాతివిశేషములను తెలుపు గ్రంథము మణిపరీక్ష. మల్లినాథసూరి తన వ్యాఖ్యలో 'కరిణాం ముక్తా యోనిత్వే ప్రమాణమాహ అగస్త్యః

'జీమూత కరిమత్స్యాహి వంశశంఖ వరాహజాః
శుక్త్యుద్భవాశ్చ విజ్ఞేయా అష్టౌమౌక్తిక యోనయః'

అను శ్లోకమును అగస్త్యునిదిగా పేర్కొన్నాడు.

6 లఘుకృతులు: లక్ష్మీస్తోత్రము, లలితా సహస్రము, శివసంహిత, శివస్తవము, సకలాధి కారము వంటివి మఱికొన్ని అగస్త్యపండితుని కృతు లుగా చెప్పబడుచున్నవి.

7. ప్రతాపరుద్ర యశోభూషణము: అగస్త్య మహాకవిని విద్యానాథునిచేసి అఖండకీర్తి నార్జించి పెట్టినది అలంకారశాస్త్ర సర్వస్వ సంగ్రహమును నామాంతరముగల ఈప్రతాపరుద్ర యశోభూషణమే అలంకారశాస్త్రార్ణవమునకు నిజముగా అగస్త్యుడేయై తత్సారమెల్ల సంగ్రహించి సర్వోపభోగ్యముగా ఒకచో నిడి మహోపకారము కావించినాడీ మహానుభావుడు. కావ్యప్రమేయములో ఏ యొకరసమో అలంకారమో, ధ్వనియో తీసికొని గ్రంథములు రచించిన అలంకారి కులే యెక్కువ. అవి ప్రౌఢుల కుపకరించును. ఒకచో కావ్యసామాగ్రినెల్ల చూడగోరువారి కుపకరించు గ్రంథములేని కొఱతను ఈ విద్యానాథునికృతి తీర్చు చున్నది. ఇది నాయక, కావ్య, నాటక, రస, దోష, గుణ, శబ్దాలంకారార్థాలంకార, మిశ్రాలంకారములను తొమ్మిది ప్రకరణములుగల గ్రంథము. నాతివిస్త రములైన ప్రకరణములలో బోద్ధవ్యములైన కావ్య విషయములను లక్ష్యలక్షణ సమన్వయపూర్వకముగా పఠితృహృదయమునహత్తునట్లు నిరూపించుట యిందలి విశేషము. ఇట్లు విషయసౌలభ్యము. దానికి వన్నె దెచ్చు పరిణత కవితావిలాసము సమకూడినదగుటచే ఈలక్షణగ్రంథము పండితామోదమునుపొంది శీఘ్ర కాలముననే పఠనపాఠనములతో విశేషప్రచారము నందినది. మహావ్యాఖ్యాత లుట్టంకించుకొనదగు

ప్రామాణగ్రంథమైనది. అలంకారశాస్త్రమున ప్రకరణ గ్రంథముగా ఆసేతు శీతాచలము ఖ్యాతివడసినది. కొందఱు లాక్షణికులు ఇందలి కొన్నియంశములను విమర్శింపగా మఱికొందఱా విమర్శలను పరామర్శించి గ్రంథమును సమర్థించిరి. వ్యాఖ్యాతృ చక్రవర్తియగు మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి కుమారుడు కుమరస్వామి సోమపీథి విద్యానాథుడు సంతరించిపెట్టిన విషయరత్నములందఱకును అందునట్లు రత్నాపణమును తెఱచెను ఈవ్యాఖ్య మూలమునకు దీటైనదని కీర్తిగడించినది. ప్రతాపరుద్రీయముపై చేయబడిన మఱియొకవ్యాఖ్య రత్నశాణము. అర్వాచీనము.

5, విద్యానాథకృతి—ఆంధ్రత్వైకప్రత్యేకత :

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్నారు. తనజాతి, తనదేశము, తన భాష యనుచు అభిమానింపనివారుండరు. వట్టి యభిమానమువలన ప్రయోజనములేదు. అది కావ్యరూపమును దాల్పవలెను. స్వాభిమానమును కావ్యరూపమున ప్రకటింపగల్గు శక్తియు, అదృష్టమును పుణ్యము చేసికొన్న కొందఱకేకల్గును అట్టివారిలో అగస్త్య విద్యానాథుడొకడు. ఆంధ్రతాపూర్ణహృదయుడీకవి. కృతినెల్ల ఆంధ్రకీర్తిస్మృతిగా పాఱిచినాడు ఆంధ్ర చక్రవర్తికి కంఠమెత్తి కైవారములు పాడినాడు. ఆంధ్రయోధుల శౌర్యోత్సాహాలు అగ్గించినాడు ఆంధ్ర పండితకవిగోష్ఠు లభివర్ణించినాడు ఆంధ్రరాజధానీ లక్ష్మీనందల మెక్కించినాడు. సర్వత్ర ఆంధ్రతా ముద 'అగ్రామ్యాశ్రసిక్తాఃపితరశ్చతృప్తాః' ఒక పనిచే రెండర్థములు సాధించినాడు విద్యానాథుడు. ఇటు స్వజాతికీర్తనము—అటు చక్కని లక్షణ గ్రంథనిర్మాణము. వర్ణ్యుడు అదర్శగుణభూషితుడు ప్రతాపరుద్ర చక్రవర్తి. అతడు ఆంధ్రసంస్కృతికి మూర్తి తదంకితముగా వెలసిన యీ కృతి యాంధ్రజాతికే యంకితమైనదిగా పర్యవసించును.

ఒక ఆక్షేపము :—

ఇందు మానవుడు వర్ణ్యుడగుట నిజమే! ప్రతాపరుద్ర చక్రవర్తి మానవుడే! కాని యెట్టి మానవుడు? వైదిక ధర్మరక్షాదీక్షితుడు. వాఙ్మయ కళాపోషకుడు. ప్రజారంజకుడు భగవదవతారముగా సత్యవచనులచే కీర్తింపబడిన పుణ్యమూర్తి. అట్టి పురుషోత్తముని కీర్తించుట గుణమే. దోషము కాదు. సత్సంప్రదాయముకూడ. నరాంకితముగిట్టని సోమన, పోతన, ధూర్జటివంటి కవులు కొందఱున్నను, నన్నయ, తిక్కన, యెఱ్ఱన, శ్రీనాథ, పెద్దనాది మహాకవులు గుణగ్రాహులై ఉత్తమగుణ శోభితులగు రాజవరేణ్యులకు, మాన్యులగుమంత్రి, దండనాథాదులకు తమకృతులను అంకితము చేసియున్నారు. వీరెల్లరు కుక్షింభరులనికొట్టివేయదగినవారగుదురా. నిజమునకు వీరిలో ఎందఱో తృణీకృతపురందరులు, ఋషిసదృశులు. కావున విద్యానాథమహాకవి ప్రతాపరుద్ర చక్రవర్తిని తన కృతిని వర్ణ్యునిగా స్వీకరించుట యా కవీశ్వరుని గుణగ్రాహిత్వమునకే తార్కాణగాని లోపముకాదు ఆ మహాకవి తన గ్రంథారంభమున—

'యద్యప్యస్మాత్ప్రబంధేషు ప్రాచాంసాధునిరూపితా,
తథాప్యస్యాఃపరంనేతు ర్నోదాహరణమాదృతమ్।
పుణ్యశ్లోకస్యచరిత ముదాహరణయమ్యహో,
నకశ్చిత్తాదృశఃపూర్వైః ప్రబంధాభరణీకృతః—'

రసాలంకారాదికావ్య ప్రమేయము పూర్వులచే ప్రతిపాదింపబడినను దానికి తగిన నాయకుని వారుదాహరింపలేదు, అని నాయకమహిమచే కావ్యమహిమ యినుమడించుననుచు నిట్లుచెప్పెను.

'ప్రబంధానాంప్రబంధౄణా మపికీర్తి ప్రతిష్ఠయోః
మూలం విషయభూతస్య నేతుర్గుణ నిరూపణమ్.'

ఈభావమునకు ఉపష్టంభకముగా రామాయణాదుల మహత్తకు రామాదుల గుణవర్ణనమే కారణమని పలు విధములు చర్చించి చూపెను. ప్రతాపరుద్ర చక్ర

వర్తి లోకోత్తర గుణోత్తముడనుటను కావ్యములు, చరిత్రలు, శాసనములు వేనోళ్ల చాటుచున్నవి. అట్టి పూత చరిత్రు(ని) ఉపశ్లోకుడుగా లభించుటయే దుర్ఘటము. అట్టి మహనీయుడు లభించినవాడు సమర్థుడైన కవీశ్వరుడు ఏమిగెక్కినంతయగును. 'తద్గుణైః కర్ణ మాగత్య చాపలాయ ప్రచోదితః' అన్నాడు గుణ గరిష్ఠులైన రఘువులను కీర్తించు అవకాశము లభించినదని మురియుచు కవికుల చక్రవర్తి కాళిదాసు. 'అలంకారశాస్త్ర మెంతకాలమునకు ధన్యమైనది? ఆహా!' అన్నాడు అంధ్రచక్రవర్తి వర్ణ్యుడుగా లభించె నను ఆనందముతో విద్యానాథమహాకవి.

'చిరేణచరితార్థో౽భూత్ కావ్యాలంకార సంగ్రహః
ప్రతాపరుద్రదేవస్య కీర్తిర్యేన ప్రకాశ్యతే—'

భామ హోద్భట, రుద్రభట్ట, భోజరాజాది ప్రాక్తనాలంకారికుల సూక్తులను ఈ సందర్భమున వృద్ధ సమ్మతిగా ప్రకటించినాడు. భూష్యభూషణ భావముతో విలసిల్లుచున్నారు. విద్యానాథ వీరరుద్ర భూనాథులు.

'కాకతీయ నరేంద్రస్య యశోభూషయతుంకృతా
విద్యానాథకృతిశ్శ్రీయం స్వయంతేన విభూష్యతే'

ఎంతటి హృదయంగమసన్నివేశము!

విద్యానాథ మహాకవి వాఙ్మయ రంగములో ప్రవేశపెట్టిన ఈ యశోభూషణ నవ్య ప్రక్రియ అనంతరికులను అలంకార శాస్త్రకారుల నెంతగనో ఆకర్షించినది. పలువురు కవులీ పద్ధతి ననుసరించి రచనలు సాగించినారు. ఇదియొక ప్రత్యేక శాఖగా వర్ధిల్లినది

ప్రతాపరుద్రీయము చదువుచుండగా అంధ్ర హృదయములో ఏదో నూతనోత్తేజము కలుగుచుండును.

'రేరేఘూర్జర జర్జరోసి మరే, లంపాకకి కంపసే!
వంగస్త్వంగసికిం! ముధాబలరజఃకాణోసికింకొంకణ
హూణ ప్రాణపరాయణోభవ! మహారాష్ట్రాపరాష్ట్రో స్యమి
యోద్ధారోవయమిత్యరీనభిభవం త్యంధ్రక్షమా భృద్భటాః'

ఎక్కడో అంధ్రవీరులు పగతురను కవ్వించి కవ్వించి తఱిమి తఱిమి కొట్టుచున్నట్లున్నది. ఏమి యీ వీరలీల! అవిగో కనకవేత్రహస్తుల హెచ్చరికలు!

'కాళింగ్యాత నిషీద! కొంకణపతే దూరేభవాంగేశ్వర!
ప్రాంతం సంశ్రయమాలవేంద్ర! శనకైః స్వోపాయ నంప్రాపయ!
పాండ్యాగ్రేభవ సేవణక్షితిపతే పశ్చా న్నృపా [illegible] వః
స్వామీకాకతివీరరుద్రనృపతిః [illegible]'

ఉపాయనహస్తులై ఆయారాజన్యులు అహమహమికతో త్రొక్కిసలాడుచున్నారు. త్రిలింగరాజ పరమేశ్వరుని దర్శనార్థము! బంగరుబెత్తాలెత్తి క్రమపఱచుచున్నారు వారిని వేత్రహస్తులు! ఔరా! అంధ్ర సామ్రాజ్య రమాప్రాభవము! ఆ కొలువులో తాను కూడ ఒకడై యుప్పొంగుచున్నాడు అంధ్రపఠిత.

అలంకారశాస్త్ర సర్వస్వమే కాదు. అగస్త్యవిద్యానాథమహాకవి సృష్టించిన ప్రబంధము— ఇది అంధ్రవైభవ సర్వస్వము!

'ప్రతాపరుద్రదేవస్య గుణానాశ్రిత్యనిర్మితః
అలంకారప్రబంధోయం సంతః! కర్ణోత్సవో౽స్తువః'

యథార్థముగా ఇది సహృదయులకు కర్ణోత్సవమే! అలంకారశాస్త్రార్ణ వాగస్త్యుడు విద్యానాథుడు వాఙ్మయాకాశములో పూర్ణచంద్రుడై వెలుగొందుచున్నాడు.

జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తియేషాంయశఃకాయే జరామరణజం భయమ్.

# ప్రబంధకవుల దృష్టిలో సూక్తివైచిత్రి

శ్రీ వి. రామచంద్ర

'సూక్తి' అను మాటనుగుఱించి ప్రప్రథమముగా నొక విషయము చెప్పవలసియున్నది. ఈమాట కొకనాఁడుండిన సువిశాలమైన యర్థము నేఁడులేదు. నేఁడు దానియర్థమునకొకపరిమితి యేర్పడినది. కాని యీనాటికైనను సూక్తియనఁగా నిట్టిదని సూత్రప్రాయముగా నిర్వచించుటకష్టమే. అయినను 'సూక్తి' అనఁగానే ఒకనీతినో, ధర్మమునో, న్యాయమునో సూటిగా సూత్రప్రాయముగా నిర్దేశించెడిమాటలే మనకు స్ఫురించును. అందుకే మన మే సామెతలనో, ఏఅర్థాంతరన్యాసములనో సూక్తులుగా నంగీకరించినట్లు కేవల మృదుమధురశబ్దసంయోజనమ సూక్తిగా నంగీకరింపము. కారణము అందుకూడ నొకధర్మమో, నీతియో నిర్దేశింపఁబడకుండుటయే ఈవిధముగా "సూక్తి'యర్థము నేఁడింక కొంతపరిమితమైనదని చెప్పవచ్చును. నేనిదివఱకాంధ్ర సాహిత్యఅకాడెమీవారి సూక్తిసుధాకరమునకు సూక్తులను సేకరించుటలో నేఁటి యీపరిమితార్థములోనే వాటిని గ్రహించితిని. అందుచేతనే అవి రెండువందలకు మించలేదు. కాని మన ప్రాచీనకవులదృష్టిలో సూక్తియనఁగా నెట్టిదో విచారించినచో ఈసిద్ధాంతమచట పనికిరాదు నాఁడు సూక్తియొక్క యర్థము సువిశాలము. మనోజ్ఞములగు కవివాక్కులన్నియు వాఁడు సూక్తులనియే వ్యవహరింపంబడెను. అందుచేతనే శ్రీనాథాది మహాకవులు ఎఱ్ఱనగారి సూక్తివైచిత్రిని కొనియాడిరి. వారి యభిప్రాయములో సూక్తియనఁగా మనోహరమగు పదప్రౌఢమే. అట్లే కానిచో వారు నేఁడు నేను చూపిన రెండువందల సూక్తులే యాధారముగా నెఱ్ఱనగారి సూక్తివైచిత్రినిఁ బ్రశంసించిరని చెప్పవలసివచ్చును. అదిసరికాదు. అందుచేతనే సూక్తిశబ్దమునకు నాఁటియర్థము నేఁటిదానికంటె సువిశాలమైనదనుట సూక్తికిఁగల యీ విపులార్థమునకు సంబంధించినదే నా యీ వ్యాసము.

'సూక్తి' అనఁగా 'మంచిమాట'అని అవయవార్థము. కాని సాహిత్యరంగమున దీనికిమాత్రపు

టర్థమే యున్నచో, దీనినిగుఱించి మనము చెప్పుకొన వలసిన యవసరమే యుండదు. దీని అవయవార్థము వేఱు. సాహిత్యరంగమున దీనికున్న విశేషార్థము వేఱు. అనఁగా అది సాహిత్యమునఁ దన యవయవార్థమును బూర్తిగాఁ గోల్పోవుచున్నదనిగాదు. సాహిత్యమున ఆ మాట వాడఁబడినచోటనెల్ల అది తన యవయవార్థమును విడనాడకయే, తత్తద్దశా విశేషము ననుసరించి విశేషార్థ ప్రదముగుచున్న దన్నమాట. అనఁగా లోకవ్యవహారమున మనము 'సూక్తి' అను మాటకే యర్థమును గ్రహించుచున్నామో—ఆ యర్థము కంటె భిన్నము కాకపోయినను. విశేషమైన యర్థమును, ఆ మాటకు మనము కవితారంగమున గ్రహించుచున్నాము. అసలు 'సూక్తి' అనునదే కవిత్వమున వాడఁబడుచున్నను, లోకవ్యవహారమునందలి మంచిమాట కాదు. ఆ యర్థమున వ్యవహారమున 'మంచిమాటలాడుట' అనుమాటలు వాడఁబడును. ఇచట 'మంచి మాటలాడుట' అనఁగా 'హితోపదేశముచేయుట' అని యర్థము. లేదా 'ప్రియోక్తులు పలుకుట' అనియైనను చెప్పవచ్చును. ఇంతకంటె విశేషమైన యర్థమీ మాటకు లోకవ్యవహారములో నుండుట కవకాశము లేదు. కాని కవిత్వములో 'మంచిమాట' అను దాని పరిధి చాలపెద్దది. అచట హితోక్తులు, ప్రియోక్తులునేగాక, చతురోక్తులు, మృదూక్తులుగూడ మంచి మాటలేయగును. కాని యిచట 'మంచి' అనఁగా నెవరికి మంచి? లోకములో హితోక్తులును, ప్రియోక్తులును ఉపదిష్టులకుమంచి. వానితోపాటు చతురోక్తులును, మృదూక్తులును కవితారంగములో సహృదయులకుమంచి. కావున లోకవ్యవహారమునందలి యీ 'మంచిమాటలు' అను దానికి సంబంధించిన యర్థము కవితారంగములోనికి వచ్చుసరికి మఱింత విపులమై "మంచిమాట" అను పేరు దానికి చాలక పోవుచున్నది. అందుచే ఆయర్థపరిధికిఁ దగిన

పేరొకటి మన కవీశ్వరులు పెట్టిరి. అదియే "సూక్తి" అనునది. కవిత్వమునందలి హితోక్తులు, ప్రియోక్తులు, మృదూక్తులు, చతురసంభాషణలు మున్నగు నెట్టి యెట్టి మంచిమాటలన్నియు నీపేరుతో నతికి, దాని పరిధిలో భ్రమించునవే. అయితే ఆ మాటలకు గూడ నొకలక్షణముగలదు. అది నిర్దిష్టమును, నిర్ధుష్టమును గాకపోవచ్చును. కాని "సూక్తి" అనఁగానే అకఠినము, అభినందనీయము—అగు గుణ గుణమొకటి అందు మనకు పొడగట్టును. ఆ గుణమే మృదుత్వౌజ్జ్వల్యముల కలయిక. మృదుత్వము, ఔజ్జ్వల్యములేక హృదయస్పందనవిదూరమై మనస్సు నాకట్టుకొనలేని యేమాటయు సూక్తికానేరదు. కవుల కల్పనలలో వివిధదశావిశేషముల ననుసరించి, వివిధ రచనా విధానముల ననుసరించి, వారి మాటలు రకరకములైన పోకడలుపోవును. అందుచే కవుల సూక్తులనంతములు. కవిత్వములో 'సూక్తి' అను మాట కర్థముగూడ ననంతమే.

ఇట్టి అనంతమైన యర్థముగల సూక్తినిగుఱించి ఇది యిదె—అని నేను నిర్వచింపఁబూనుకొనలేదు. ఏమనఁగా అనంతమైనదేదియు నిర్వచింపఁబడదు. అది మానవుని శక్త్యనుసారము వివరింపఁబడును. ఆపనినే నేను చేసితిని. అనఁగా "సూక్తి" అను మాటకు కవిత్వరంగమునఁగల యర్థమును, దాని వ్యాప్తినిగుఱించి పైని నేను చెప్పినమాటలు నావివరణకు సంబంధించినవేగాని, నా సిద్ధాంతమునకు సంబంధించినవిమాత్రము గావనుట. అసలింతకును సూక్తి అను మాటనుగుఱించి నే నింతగా వ్రాయుట యెందుకు? మనము దేనిని "సూక్తి" అనుచున్నామో అది కేవలము శబ్దసౌందర్యముపై నాధారపడినది గాదు. అర్థసౌందర్యముపై నాధారపడినది. శబ్దసౌందర్యము దానికి దోహదకారిమాత్రమే. అర్థము యొక్క సౌందర్యమునునదెప్పుడును శబ్దమిచ్చు నర్థ

మున కలితమైయుండును. ఆ సౌందర్యమును చిత్రింపఁగలిగినదే సూక్తి. అదే కవిత్వమనఁగా. దీనినే మన లాక్షణికులు కావ్యమునందు వ్యంగ్యమర్యాదగా పరిగణించిరి. అయితే వ్యంగ్యమనఁగానే వ్యంగ్య మర్యాదలేని దెద్దియు సూక్తికానేరదను సిద్ధాంతము తీయరాదు. ఏమాత్ర మర్థసౌందర్యము మనకు హృదయగోచరమగుచున్నగు అమాట లేమాత్రము మన హృదయముల నాకట్టుకొన్నను, అవి సూక్తులే యని చెప్పుటలో తప్పులేదు. అర్థసౌందర్యమువే మనకుఁ గలుగునవి హృదయవికాసముమాత్రమే. రసానందముగాదు. అది కలుగునదానందపారవశ్యముచే. కేవల హృదయవికాసమున కంతటి యానంద పారవశ్యముకలుగలేదు. అర్థసౌందర్యము సహృదయ హృదయ వీణాతంత్రులలో నొకదానిని మాత్రమే కదలించును. రసనిర్భరత ఆ తంత్రులపై దివ్య గానము నుద్భవింపజేసి హృదయము నానంద పరవశ మొనర్చును. అదే కేవల హృదయ వికాసమునకును, రసానందానుభూతికినిఁగల భేదము. అట్టి భేదమే సూక్తికిని, వ్యంగ్యవైభవమునకునుగలదు ఇది సాధారణసిద్ధాంతము మాత్రమే. ఒకచో సూక్తిలో వ్యంగ్యవైభవము పొడకట్టవచ్చును. వేఱొకచో వ్యంగ్యమర్యాద సూక్తివైచిత్రి ప్రతిష్ఠితము గావచ్చును. తప్పులేదు. అంతేగాక ఆఱచుగానవి రెండును పరస్పరాశ్రయములే. శబ్దార్థముల ప్రసక్తివచ్చుసరికింత పుట్టుకు కవకాశమున్నది గనుకనే నేను శబ్దవైచిత్రి యనియో, అర్థవైచిత్రియనియో, మఱొకటనియో, వేఱొకటనియో అని, వానినిగుఱించి చర్చింపక, వీని యన్నియర్థములును నిండి నిబిడీకృతమైయున్న "సూక్తి'—అను మాటనుగుఱించి చర్చించితిని. ఈ కారణముచేతనే మనకవులుగూడ ఆ మాట నంతగా మన్నించిరి. ఇది సూక్తినిగుఱించిన నా వివరణములోని సామంజస్యము.

అసలు నాయుద్దేశము ప్రబంధ పరమేశ్వరుని సూక్తి వైచిత్రిని గుఱించి వ్రాయుట. అతని సూక్తి వైచిత్రి నెఱుగుటకుముందు అసలుసూక్తి యన నెట్టిదో యెఱుఁగవలసియున్నది గనుక ఈ వివరణ మవసరమైయున్నది. ఇప్పుడు సూక్తి వైచిత్రి ప్రబంధ పరమేశ్వరునిలో నెట్లు కాన్పించుచున్నదో, దానిచే నతని ప్రతిభా ప్రభావముము లెట్లు వెల్లడి యగుచున్నవో యించుక పరిశీలింతును.

స్ఫుటమైన యర్థముతో, ఝటితిస్ఫూర్తి గలిగి యుండునదే సూక్తియనఁగా. దానిశబ్దగుణమును, అర్థ గుణమునుగూడ సరళతాభాజనములై, స్వచ్ఛతా విశిష్టములై సూటిగా మనస్సునకుఁ దగులునప్పుడే అది నిజమైన సూక్తి అట్లుగాక కొంకజెరుగట్లతో నారికేళ పాకమునఁబడి, ఆలోచించిన మీఁదఁగాని స్ఫురింపని యర్థముగల దేదైనను—అదియెట్టి పద గుంభనమైనఁ—గానిండు, ఆ యర్థమెంత మనోహరమైనఁగానిండు—, సూక్తి అనఁబడుదు. ఈ యన్నింటికినిఁ బ్రాతిపదికగా కవి మనస్సు స్వచ్ఛమై అతని బావన స్పష్టతరమై యుండవలెను. అప్పుడుగాని అతనినోటివెంట స్ఫుటమై, అర్థవంతమైన వాక్కురాదు. అట్లు వచ్చిననేగాని అది ఝటితిస్ఫోరకముగాదు. ఈ గుణము, అనఁగా ఈ యుత్కృష్టభావ ప్రకటనము మహాకవుల సొమ్ము. వారి గ్రంథములన్నియు ననేక సూక్తుల కాకరములు. మనకనేకులు మహాకవులు గలరు వారిలో ప్రధానస్థానము నాక్రమించినవారు కవిత్రయమువారు, ఆ మువ్వురలోను శ్రీనాథునంతటి మహాకవిచే సూక్తి వైచిత్రికుదాహృతిగాఁ జూపఁబడి, కొనియాడఁబడినవాఁడు ఎఱ్ఱనార్యుఁడు. అతనిని ప్రబంధ పరమేశ్వరు నొనర్చిన యతని కవితా గుణములలో నీ సూక్తివైచిత్రియే ముఖ్యమైనది. మఱి కొందఱు కవులుగూడ నీతని వాగ్వైభవమును గొనియాడిరి. జక్కన యీ కవి శబ్ద వైచిత్రిని మెచ్చు

కొనెను, ఎఱ్ఱనగారి యా శబ్దవైచిత్రినే యెల్లనార్యుఁడు "నానావిధ పటునటదీశానశివశిరస్సరిద భంగసలి తోర్మి ఘటా నూనధ్వని మృదు మధుర వచ" స్సంపదగా నుతించెను. ఆ వచస్సంపద పేరే సూక్తి వైచిత్రి. అది నానావిధముల నుండును. వానిలో మచ్చునకుఁ గొన్నింటినిమాత్ర మేరి చూపెదను,

## ఉ దా హృ తు లు.

**హితోక్తికి :-**

జననీజనకులకప్రియ
మనఁ జనుసద్ధర్మమైననది దురితమకా
ముసు లుగ్గడింతురది నీ
మనమునఁ దలపోయవలదె మహితవిచారా!

( నృ. పు. 5, 15 )

హింస సేయునివాఁడు లేఁడిజ్జగమున
నొక్కడైనను దమ తమ యోపినట్లు
హింసతెరువున కెడగల్గి యేఁగవలయు
నదియుచూవె యహింస నానతిశయిల్లు.

( భార, అర, 5, 60. )

**ప్రియోక్తికి :—**

ఒక యల్పమను జుక్రియ సో
మకులోత్తమ నీకు నిట్లు మహనీయ సుఖ
ప్రకృతియగు నిజశరీరం
బకట విడువఁదలఁపనగునె యవిహితబువిద్దిన్.

"పాండవులచేత వియుక్తుండనైతినని వగచె దంతియకాని నీకుం గార్యగతియందు వివేకంబు సాలదవి యెట్లనిన నే రాజు రాజ్యంబున నిశ్చింతు లయి జనులు తమ తమ జీవనంబుల వర్తింతు రారాజునకు నట్టి జనంబులు బంట్లుగావునఁ దార మ్మహీపతికిం దేజమి గల్గినచోట్ల నెల్లనుం దమ తమ పౌరుషంబులు నెఱపవలయుఁ గౌంతేయులు నీదేశంబుననుండి, నీ యాజ్ఞవలనం గృతారంభులై యుష్పవారగుటంజేసి వారు నీ కింకరులు, నీకు నైన యక్కఱదీర్పుట వారి కర్తకృత్యంబు etc".

( భార, అర, 6, 28&30. )

**చతురోక్తికి :—**

"ఎవ్వరిదాన వంబుజదళేక్షణ యేకతమిట్టులేల నీ
వివ్వనభూమియందుఁ జెరయించెదు నావుఁడుఁ దండ్రి
పంపునం
దివ్వనభూమియందుఁ జరియించెద సద్వరుఁ గోరి
కన్యనే
నెవ్వరిదానఁ గావలయు నేర్పడఁ జెప్పుము రాజ
నందనా!

( భార, అర, 4, 324. )

**మృదూక్తికి :—**

తల్లి చనుబాలు గ్రుక్కెడు తక్కినయప
పుట్టెడును నొక్కరూపనభూమిఁ బరగు
నుడువు బొంకయ్యెఁ జన్నిత్తుఁ దొడలమీఁద
గుండెవట్టి యుంచుక దడవుండవన్న!

( హరి, పురి, 5-238. )

**మధురోక్తికి :—**

"వ్రతములఁగ్రొచ్చి శీలములవ్రచ్చి జపంబులఁగోలి
యుత్తమ
క్రతువులఁదోలి యోగములుగ్రాంచి తపంబులవేఁచి
యెందున
ప్రతిహతలీలమై మదను బాణచయంబుల తోడు
నీడలై
ధృతులు దొంలంచుచుండు సుదతీమద తీక్ష్ణ కటా
క్షకోణముల్.

( నృ. పు. ఆ—2—49. )

**భక్తిప్రబోధమునకు :—**

"ఊషర బీజముల్భసిత యోజ్య ఘృతంబులు షండ
కన్యకా
న్వేషణము ల్పయోధిగత వృష్టి తతుల్మృగతృష్ణి
కాంబుగ

యోషలు దుర్గకానన కరోరితచండ్రిక లేఢ మూకస
ద్భాషలు విష్ణుమంగళ కథావిముఖాత్ములు దుష్ట
జన్మముల్."
( నృ. పు. 5, 24 )

దాతవ్యుండొకండు విష్ణుండు
శ్రోతవ్యుండొకండు దనుజసూదనుండు సము
ద్గాతవ్యము హరినామము
చేతవ్యము విష్ణుభక్తిచే నఖిలంబుల్.
( నృ. పు. 5, 58 )

నీత్యుపదేశమునకు :—

ఎంత ప్రియవస్తువులపై
నంతఃకరణంబు గలుగునది మీఁదట న
త్యంతంబగు సంతాపం
బంతయుఁగూర్పగఁ నిమిత్తముగుఁ బురుషు
నకున్.
( నృ. పు. 4, 71 )

ధర్మోపదేశమునకు :

వినుము మనోవాక్కాయము
లనమూఁడు దెఱంగులందు నంతఃకరణం
బనఘ ప్రధానము గావున
మనమునఁ గైకొన్న భర్త మానందగునే !
( భార, అర, 7, 183 )

ఇట్లే వ్రాయుచుఁ బోయినచో ఈ వ్యాసము పెరిగి ఒక పెద్ద గ్రంథమే యగును. ఎఱ్ఱనగారి సూక్తి వైచిత్రిని రకరకములుగా విభజించి చూపవచ్చు ననియేగాని, ఆ విభాగములన్నియు నిట నుదాహరింప వలెననుట నా యుద్దేశముగాదు. అందుచేతనే దిక్ప్రదర్శనముగాఁ బైయుదాహృతులు కొన్నింటిని మాత్రమే చూపితిని. ఇట్టి సూక్తులు—అనేక విషయములకు సంబంధించినవి అతని గ్రంథములలో కోకొల్లలు. సూక్తులను—అనఁగా పొందికైన మాటలను ఆ యా సందర్భములకుఁ దగినట్లుగా వివిధ విచిత్ర రీతుల మలఁచుకొని, వానితో సాహిత్యశిల్ప నిర్మాణము సాగించిన యెఱ్ఱనార్యుని ప్రావీణ్యమనల్పము. అతని యీ ప్రావీణ్యమున కాతని నృసింహపురాణ మద్దము పట్టినట్లు చెప్పవచ్చును. పురాణములలోని నృసింహావతారకథ ఎఱ్ఱనార్యుని నృసింహపురాణమునకు పేరునకు మాత్రమే మూలము. ఈ కథను ఔచిత్య శుద్ధముగా మలఁచుకొనుటలో గాని, అందలి పాత్రలను చిత్రించుటలోఁగాని యెఱ్ఱన నూటికి తొంబదిపాళ్ళు స్వతంత్రతనే చూపెను. తన నృసింహపురాణమును విపులవర్ణనాత్మకమైన యొక స్వతంత్ర ప్రబంధముగా సంతరించెను. అందుచేతనే అది తరువాతి తెలుఁగు కవులకు మార్గదర్శకమై మాననీయమయ్యెను.

నేను నృసింహపురాణము నంతయు వ్యాఖ్యానించుటచే తక్కిన యాతని గ్రంథములు సూక్తిసుందరములు గావనుట నా యుద్దేశముగాదు. అరణ్యపర్వశేషమునఁగాని హరివంశమునఁగాని అతని సూక్తి వైచిత్రి మన కెచటఁబట్టిన నచటనే విశదమగుచుండును. వానిలోని యీగుణమే పరాకాష్ఠనందినది నృసింహపురాణమునందని తలఁచెదను.

సూక్తిచతురులుగాని కవులందఱును సుకవులు గాలేరు. ఈనాఁడు పెద్దకవి, గొప్పగానో పట్టు వడసినవారు మనకెందరో కలరు ఎటువచ్చియు ఆ యా కవుల కావ్యములలో మనకు స్పష్టతరముగాఁ గాన్పించుగుణమే యొకటే ప్రధానము. ఈ ప్రాధాన్యమునుబట్టియె ప్రసాదగుణముగూడ సూక్తివైచిత్రి కెఱ్ఱననే పేర్కొనుట; అట్లే నన్నెచోడకవిని "రసాభ్యుచితబంధ"మని యతఁడు పేర్కొనెననఁగా నతని కవిత్వమునఁ దక్కినగుణములు లేవనిగాదు. రసాభ్యుచితబంధము ప్రధానగుణమని మాత్రమే. ప్రతికవి కవిత్వముతోను ఏదో యొక ప్రత్యేకతాగుణమునకు తక్కిన గుణము లానుషంగికము లగుచుండును. అట్లన్నిం

తీఱి మించి వెలుఁగు ఆ గుణమే యాకవి వైలక్షణ్యమునకు నిదర్శనము. ఈ వైలక్షణ్యము కవి కవికి అవ్యక్తముగా నగపడుచుండును. దానికి కారణము మానవమనఃప్రకృతులు భిన్నభిన్న కోణములలోఁ బయల్పడుటయే. ఇట్టి వైవిధ్యము ననుసరించియే మన కవులు భీమకవిది ఉద్దండలీలయని, నన్నయది ఉభయవాక్ప్రౌఢిమయని, పెద్దనది జిగిబిగిగల యల్లికయని, ముక్కుతిమ్మనది ముద్దుపలుకని ఆ యా కవుల కొందఱ కవిత్వగుణములను గుఱించి వ్యాఖ్యానములు చేసిరి. అట్లే చూచినచో ప్రతికవి కవిత్వములోను రసవంతమో రసహీనమో-ఏదో ఒకగుణము పొడకట్టుచునే యుండును. అట్లే యెఱ్ఱాప్రెగడకవిత్వము మొత్తముపై మనకగపడు నతని విశిష్టకవితాగుణము సూక్తివైచిత్రి. దానిచే సాధింపఁబడినదే. యాకవి వర్ణనాత్మకశైలి. ఇట్టి యీసూక్తి వైచిత్రినే శ్రీనాథుఁడు కొనియాడి, తన కావ్యరచనలలో ననుసరించెను. అది తరువాతి కవులకు మార్గదర్శకమయ్యెను. ఈవిధముగా నెఱ్ఱనగారి సూక్తివైచిత్రి ఆంధ్రవాఙ్మయమున పరిణామసుందరమై, ప్రబంధప్రక్రియాసృష్టి కనుకూలమగుటకు మూలహేతువై సాహితీ తపస్వుల కుపాదేయమై యుపాస్యమయ్యెను.

# [illegible]

శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

"యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"

భగవద్గీత 4 అధ్యా. 7, 8 శ్లో.

ధర్మమునకు గ్లానియు, నధర్మమునకు విజృంభణ మెప్పు డెప్పుడు గలుగుచుండునో అప్పుడు నేను భూమిపై నవతరింతును. అనియు--సాధురక్షణమునకును, దుర్జన శిక్షణమునకును, ధర్మ సంస్థాపనార్థమును బ్రతియుగమునను బుట్టుచుందును అనియు నర్జునుని నిమిత్తమాత్రునిఁగా నిలిపి శ్రీకృష్ణపరమాత్మ యుపనిషత్సారమును గాన మొనర్చినాఁడు. వెనుకటి యుగములందు రామకృష్ణాద్యవతారము లెత్తి పరమేశ్వరుఁడు ధర్మసంస్థాపనము చేసినట్లు పురాణములు తెలుపుచున్నవి. కలియుగమునఁగూడ నధర్మము విజృంభించినపు డెల్ల నీశ్వరుఁడు పరిపూర్ణావతారమెత్తకున్నను, అంశావతారమో, అంశాంశావతారమో యెత్తి. దుష్టశిక్షణ, శిష్టరక్షణపూర్వముగా ధర్మసంస్థాపనము చేయుచునే యున్నాఁడనుటకు విద్యారణ్యుల వంటి మహాపురుషుల యవతారములు తార్కాణలు.

హూణశకము పదునాల్గవ శతాబ్దమునకు భారతదేశమున నుత్తరభాగ మంతయు తురుష్కాక్రాంతమై మంగలములోని పేలాలవలె వేఁగిపోవుచుండెను. నాఁటి ఢిల్లీపాదుషాహి యగు మహమద్బిను తుగ్లక్కునకు ఇస్లాము మతవ్యాప్తి, రాజ్య విస్తృతి, దేవాలయ ధ్వంసనము ననుదృఢవాంఛలు మూఁడు. దక్షిణ భారతముగూడ వశము కానిదే తనసార్వభౌమత్వము పూర్ణము కానేర దని పెక్కుసారులు దండెత్తెను. అందాఱుసారులు రాజపరమేశ్వరుఁడు వీరాధివీరుఁడు త్రిలింగరాజ్య సర్వస్వాధిపతి కాంచీపుర సంస్థాపిత విజయధ్వజుఁడు బహుగజ బలపరివృతుడు నగు ప్రతాపరుద్ర మహారా జెదురొడ్డి తురకలదండు నోరుగల్లు దాఁటకుండ నిలిపి వెనుకకు మరలించుచు

వచ్చెను. కాని యేడవ దండయాత్రయందు విధి విపర్యాసముచే నామహారాజు తురకలకుఁ జిక్కిపోయి, ఢిల్లీకి సకుటుంబముగా బందియై కొనిపోవఁబడుచు మార్గమున నర్మదాతీరమందు కుటుంబముతో నస్తమించిపోయెను. ఇంకే మున్నది? కట్టతెగిన వెల్లువ వలె మహమ్మదీయసేనలు దక్షిణభారతము నంతయు ముంచివైచెను.

ప్రతాపరుద్రగజపతి యస్తమయముతో—తురకలచే భారతీయప్రజ లొందిన దురంతక్లేశములు విలసశాసన మక్షరరూపమున నిట్లు చాటుచున్నది.

"ప్రతాపరుద్రః తిగ్మాంశౌ లోకాంతర తిరోహితే,
తురుష్కాంధతమసేనాయం సమాక్రాంతం మహీతలం,
ద్విజాతయః త్యాజితకర్మబంధా
భగ్నాశ్చ దేవప్రతిమాః స్వమస్తాః,
విద్వాంశ్చ దిష్టైః చిరకాలభుక్తాః
సర్వే వ్యపాహారిషతాగ్రహారాః
ఆత్తే కర్షణలాభే పాపై ర్యవనై ర్బలాత్కారాత్
దీనా దీనకుటుంబాః కృషీవలా నాశ మాపన్నాః
ధనదారాదికే స్వానాం కస్మింశ్చి దపి వస్తుని
స్వామిత్వ ... తస్యాం మహాపది
పేయా సురా గోపిశితంచ భోజ్యం
లీలావిహారో ద్విజఘాతనంచ,
అశ్రాంత మాసీ ద్యవనాధమానాం
కథం ను జీవేత్ ... జీవలోకః
ఇత్థం ... ప్రబాధ్యమానం
త్రైలింగం ధరణీతలం సురారికల్పైః

అనఁగా

"ప్రతాపరుద్రసూర్యుఁ డస్తమింపఁగనే భూమి నెల్ల తురుష్కాంధకారము క్రమ్మెను. బ్రాహ్మణులు కర్మదూరులుగాఁ (బలాత్కారమున) జేయఁబడిరి. దేవతాప్రతిమలు భగ్నమై పోయెను. పండితుల కీయఁబడిన యగ్రహారము లెల్ల నపహరింపఁ బడెను. పండించుకొనిన పంటలు బలాత్కారముగా దుష్టులగు తురకలు హరింప సేద్యగాండ్రు దిక్కులేక యాలుబిడ్డలకు మొగము వాచి నశించిరి: ధనదారాదులగు నేవస్తువునందును మనుజుల కెవ్వరికిని 'నాది' అనుబుద్ధి కలుగున వకాశము లేని మహావిపత్తు కలిగెను. దుర్మార్గులగు యవనులు కల్లుత్రాగి గోమాంసము దిని, వినోదార్థము బ్రాహ్మణవధ చేయుచు విహరింప నిఁక నేప్రాణి బ్రతుకును? రక్తస్నములగు తురకలచే నాక్రమింపఁబడి భూమి యంతయు దవాగ్నిచేఁ జుట్టుకొనిన యరణివలెనైపోయినది."

అట్టి యెడఁ దెలుఁగువారి పుణ్యమున "అంకావతీర్ణో భగవాన్ని వాద్యః పోలశతస్తో వసుధాం బిభర్తి" భగవదంశమున కమ్మజాతికి చెందిన ముసునూరినంశమున ... యుదయించిన ప్రోలయనాయకుఁడు తూర్పుసముద్రమునుండి ... తెలుఁగుదేశము నంతయు వశపఱచుకొని రక్షించుచు భద్రాచల సమీపమున గోదావరియొడ్డున నున్న రేకపల్లి రాజధానిగాఁ జేసికొని యడవులవెంట వచ్చు మహమ్మదీయవాహినులకు సేతువుగా నిలిచెను.

ఇది యిట్లుండ నోరుగల్లురాజ్యము కూలిన నాఁటినుండియు. ప్రతాపరుద్రుని పాలనమున నుండెడి కాంచీపురావధికమైన దక్షిణాపథ మంతయు నరాజకమై క్షోభించుచుండ—కర్ణాటాంధ్రరాజ్యములకుఁ గూడలియై. తుంగభద్రాతీరమున నున్న యానెగొంది ప్రాంతమునఁగూడ ముసునూరి ప్రోలయనాయకుని వలెనే ధర్మసంస్థాపనమునకై తపస్వియై మాధవాచార్యుఁడును తహతహ లాడుచుండెను అ మాధవుఁడే తురీయాశ్రమస్వీకారానంతరము విద్యారణ్యులనుపే రొందినవాఁడు.

విద్యారణ్యులజన్మస్థానము బడగనాఁటను గల మంగళాపురము. శ్రీశైలప్రాంతమున నందికోట కూరుతాలూకాయును, కర్నూలుమండలమును నంద్యాలతాలూకాలోని కొంతభాగమును కలిసియున్న ప్రదేశమునకు బడగనాఁ డని పే రనియు, అచటివారు

తెలుఁగువా రైనను, కన్నడమునకు సరిహద్దునందుండుటచేత నాభాషకూడ కొంచెము కలిసిన తెలుఁగు మాటాడువా రగునాజనులను "బడగనాట కన్నడిగలు" అని వ్యవహరింతు రనియు జరిత్రపరిశోధకుల యభిప్రాయము 'విద్యారణ్యకథాతరంగిణి' యను కర్ణాటదేశీయ కవి కృత మగుసంస్కృతకావ్యమున ("తీరే స్తి తస్యాః సంతః సుపుణ్యా పంపాభిధానా సుజనైకభూః పూః" "అయాం దేశే ప్రవిభాతి యస్యాః పంపాభిధా... మనోజ్ఞా") పంపాసరస్సునకు మిగుల దగ్గఱగా పంపానామక నగరముకల దనియు, నదియే విద్యారణ్యుల జన్మస్థాన మనియు వర్ణింపఁబడినది. దీనినిబట్టి వీరు కర్ణాటదేశీయుఁ డని తెలియుచున్నది. కాని కాశీవిశ్వవిద్యాలయపండితుఁ డగు శ్రీ ... ఎం. ఏ. ... ఆచార్యునిచె హిందీలో రచింపఁబడిన "ఆచార్యసాయణ్ ఔర్ మాధవ్" అనుగ్రంథమున–అతః యిద ఇస్ నామకరణశైలీకో బహుత్ప్రాదియా జాయ్, తో కహనా పడేగా, కి సాయణ్ కర్ణాటక్ థే. పరంతు ఇస్కే బాధక్ అనేక ప్రమాణోంకీ ఉపస్థితిమేఁ యహ అనుమాన్ విశేష్ సబల్ నహీ జాన్ పడతా, సాయణ్ నే స్వయంహీ "అస్మాకమాంధ్రాణామ్" లిఖ్ కర్ అపనా ఉల్లేఖ్ కియా హై... అతః సాయణ్ కా ఆంధ్రదేశీయ హోనా అధిక్ యుక్తియుక్త జాన్ పడతా హై." అని కలదు. "సాయణ్ణ మాయణ్ణ" ఇత్యాది నామాంతములందు అణ్ణాశబ్ద ముండుటజేసి మాధవాదులు కన్నడు లని యనుచుందురు కన్నడులు కానివారియందును నట్టినామకరణశైలి కనఁబడుటచేతను, సాయణుఁడే స్వయముగా "అస్మాకమాంధ్రాణామ్" అనగా "ఆంధ్రుల మైన మాకు" అని వ్రాసికొని యుండుటచేతను ఇంకను పెక్కుప్రమాణములచేతను సాయణుఁ డాంధ్రుఁడే కాని యన్యుఁడు కాఁ డనిస్పష్టముగా నున్నది. కాన సాయణునిసోదరుఁ డగుమాధవ నామము గల విద్యారణ్యు లాంధ్రులే యనుట కెక్కువ బలము కనఁబడుచున్నది. ఆయన తలిదండ్రులు శ్రీమతీమాయణులు. తమ్ములు సాయణ భోగనాదు లనువారు. భారద్వాజగోత్రము, బోధాయన సూత్రము అని తద్గ్రంథములవలనఁ దెలియుచున్నది. వీరు మువ్వురు సోదరులును నాల్గువేదములు, సాంగముగాఁ జదివి యన్నిశాస్త్రములును, అన్నికళలు నభ్యసించి పూర్ణపండితు లగుటయే కాదు. లోకజ్ఞులై రాజనీతిధురంధరులై వెలసిన మహనీయులు.

మాధవుఁడు పెండ్లాడి దారిద్ర్యభారమున క్రుంగిపోయి, ధనమునకై పంపాక్షేత్రమున నున్న భువనేశ్వరి నారాధింప నాదేవి ప్రత్యక్షమై ఈ జన్మమున నీకు ధనయోగములేదు. మఱుజన్మమునఁ గలుగును ... అని జందెమును త్యజించి సంన్యసింపగా–ఆతని త్యాగమునకు మెచ్చి యాదేవి 3½గడియల కాలము పంపాక్షేత్రమున బంగారమును గురియింప–తనకుటుంబముతోపా టెల్లరదారిద్ర్యమును తొలగుటయే కాక భువనేశ్వరీ విరూపాక్షుల భాండాగారములును బంగారుతో నిండిన వని కావ్యములందుగొన్నిఁట గనఁబడుచున్నది. దంతకథలందు వినఁబడుచున్నది.

చారిత్రకులును, కొన్నిసంస్కృతకావ్యములును "మాధవుఁడు పెండ్లి మాని సన్యసించి శృంగేరిపీఠాధిపతిగా నుండెను. ... హొయిసలవంశపు రాజులు ... యేలుచుండు దూర్పుచాళుక్యులు, ... మహమ్మదీయ ... నెగి వచ్చునపుడు, అటునుండి పశ్చిమచాళుక్యులు బంధుప్రీతిచే రాజ్యమునకు వచ్చియేగునప్పుడును మార్గమధ్యమున పావనపంపాక్షేత్రమున నాఁగి భువనేశ్వరీవిరూపాక్షుల నారాధించి కానుకలుగా నొసఁగిన యపారధనములును, వారిరాజులు నిలుపుదోపుగా నాదైవతముల కిచ్చిన సువర్ణరత్నాభరణములును 'భువనేశ్వరిభాండాగారమున రాసులుగా నున్న వెల్లఁగి యాతఁ డవి తురుష్కులపాలు

గాకుండ నాబండారమును రక్షింప దీక్ష వహించి విరూపాక్షదేవాలయమును విడువక, యచటనే భువనేశ్వరీ మంత్రోపాసన మొనర్చుచు నుండె'' ననియు తెలుపుచుండుటచే మాధవునకుఁ బెండ్లి యయ్యె ననుమాట యవిశ్వసనీయము. మఱియు శృంగగిరిపీఠాధిరోహణ మొనర్చు నాచార్యపురుషులు నేఁటివఱకు బ్రహ్మచర్యమునుండి సంన్యసించినవారే యై యుండు నాచారమునకు విరుద్ధముగా నాపీఠము విద్యారణ్యు లెట్లధిరోహింతురు? "వివాహితుఁడై మాధవుఁడు సన్యసించెను" అనుమాట కల్ల యని గ్రహింపఁదగును,

అట్లు విరూపాక్షదేవుని సన్నిధిని తప మొనర్చుచునే శిష్యకోటివలన దేశమున నవైన జరుగుచుండు తురకలదుండగములు తెలిసికొనుచు వారి నరికట్టు నుపాయములను వెదకుచుండెను.

ఉత్తమ క్షత్రియవంశ సంజాతుఁ డగుసంగమ భూపతికి కామాంబిక యనుధర్మపత్నియందు "హరిహరరాయలు, బుక్కరాయలు, కంపన, ముద్దప, మారపలు" అను నైదుగురు పుత్రు లాజన్మశూరులు పుట్టిరి. వారిలో హరిహరరాయలును, బుక్కరాయలును ప్రతాపరుద్రచక్రవర్తి కోశాధిపతులై, యాకాకతీయరాజ్యము కూలిపోయినపిదప-తుంగభద్రకిరువైపులను వశ మొనర్చుకొని రాజ్య మేలుచున్న కంపిలిరాయనిఁజేరి. యాతనికిఁ గోశాధికారులై యుండిరి. ఢిల్లీసుల్తాను తుగ్లక్కు కంపిలిరాయని స్వాతంత్ర్యము హరింప దండెత్తి రాఁగా శత్రువులతోఁ బోరి కనయిమపురుకొడుకులును కంపిలిరాయఁడును వీరశయనమొందఁగా, హరిహరుఁడును, తమ్ముఁడును నిరుత్సాహులై రణము మాని నిశ్చేష్టులై యుండ, యవనసేనానులు వారిపైఁ బడి బంధించి ఢిల్లీకిఁ గొనిపోయి సుల్తాను నాజ్ఞచే చెఱయం దుంచిరి "కంపిలికి ముఖ్యపట్టనము లగుకుమ్మటమునను, ఆనెగొందియందును తుగ్లక్కు నెలకొల్పిన తురుష్కాధికారులకు ప్రజలు పన్ను లీయ మాని అరవీటిసోమదేవరాయల ప్రోత్సాహమునఁ దిరుగఁబడఁజొచ్చిరి. ఆసంగతి తెలిసి తుగ్లక్కు" వారి నణచివైచి పన్నులు వసూలుచేయ హరిహరరాయనికి బలాత్కారముగ మహమ్మదీయ మతసంస్కారములను గావించి, బుక్కరాయనితోఁ గంపిలిరాజ్యమున కంపెను. తురకవేషముతో నున్న హరిహరునకుఁ బన్ను లీయకపోవుటయే కాక ప్రజలెల్ల రెదిరించి తఱిమివేయగా, నడవులకరుగఁగా విరూపాక్షదేవాలయప్రాకారమున కిప్పల మాధవార్యుల దివ్యదర్శన భాగ్యము వారికిఁ గలిగెను.

ఆ సోదరులకు దర్శన మిచ్చుటకుఁ బూర్వమే శంకరానందయతీంద్రుల యనుగ్రహమున మాధవుఁడు యత్యాశ్రమియై విద్యారణ్యు లను పే రొందెను. క్షాత్ర మొలుకుచున్న చేయెత్తు గంభీరాకారముతో నెదుట నున్న హరిహరుని బుక్కరాయని జూచి యొడలు పులకించి స్వాములవారు చల్లఁగఁ జూచుచుండ వారు దూరముననే సాష్టాంగ మొనర్చి, చేతులు గట్టుకొని తలలు వంచి కన్నీరు మున్నీరుగాఁ మూఁగలవలె నిలిచి యుండిరి. స్వామి దగ్గఱకు వచ్చి ప్రశ్నింపఁ బూన గుర్తించినట్లు తమపూర్వ వృత్తమంతయుఁ దెలిపి, బలవంతముగా మహమ్మదీయమతకళంకమునఁ బతితులైతి మని విలపించిరి. స్వాములవారు దీర్ఘనిశ్వాస పుచ్చి "నాయనా! హరిహరా! విలపింపకుము. దేశము మహమ్మదీయపీడావిముక్తమై ఆర్షసంస్కృతితో తొల్లిటివలె నిలిచియుండుఁ జూడవలె నని ప్రతిక్షణమును కలలఁ గనుచున్నాను. చేదోడు వాదోడుగా మీసోదరులు నాకుండెద మని వాగ్దాన మొనర్తురేని చేయఁదగు యత్నమునకుఁ బూనెదను." అనెను. వెంటనే హరిహరుఁడు చేతులు జోడించి "స్వామీ! మునుసూరి ప్రోలయనాయకుఁడును, నాతని పితృవ్యపుత్రుఁ డగు కాపయనాయకుఁడును మహమ్మదీయులబారినుండి తెలుఁగుదేశము రక్షింపగా దీక్ష వహించి రని వినుచున్నాము. వేఁగిదేశము మొదలు పిఠాపురముదాఁక వశపఱచుకొని

రట. పిఠాపురము మొదలు కళింగమువఱకు వీర సామంతుఁ డగుకొప్పుల నాయయనాయకుఁడు వశపఱచుకొని ప్రోలయనాయకునకు మిత్రుఁడుగా నున్నాఁడట. భీమపరప్రాంత మాక్రమించి భక్తిరాజను వంటవంశ క్షత్రియకుమారుఁడు మున్నగు పెక్కు రాతనికి మిత్రులైరా రట. ఢిల్లినుండి యడవి మార్గమున వచ్చు యవనసేనల నెదిరించ గోదావరీ తీరమున నున్న రేకపల్లిలో కోట కట్టి ప్రోలయనాయకుఁ డాటవికులను సైనికులుగా నుద్యమున్నాఁడట. కావున నటువంక చూడ నక్కఱలేదు. కృష్ణాతుంగభద్రల నడిమిదేశము రక్ష లేక యున్నది. ఆప్రదేశము నిట్టిపక్క మొదల్బఁ హాము దీక్షఁ బూనినచో మీశిష్యపరమాణువులగు నీయిరువురు నగ్నిలో దూఁకుఁ డనిన దూఁకుటకుద్యుక్తులగు నుదని భావింపుఁ డనుచుండఁగా, కన్నులు విప్పార విద్యారణ్యులు వారినిగాంచి నాయనలార! ఐహికముగా నాకెట్టి వాంఛయు లేదు మీకు గావలసినంత ధనము నే నీచ్చెదను. మీరు మందిని సమకూర్చుకొని వారిని యోద్ధలనుగా తీర్చిదిద్దుకొను దండెత్తుఁడు. భువనేశ్వరీ విరూపాక్షదేవుల కరుణ మీకు తప్పక జయలక్ష్మివి ఘటించును, ఒక్కమాట. తుగ్లక్కునకు దేవాలయములగూర్చి అందలిసకలధనములు, దేవతాలంకారములు హరించి, ఇస్లాముమతము నద్దెస వ్యాపింపఁజేయు వాంఛగలదని మీరును వినియే యుందురు. కంపిలిరాయనిమృతితో నేఁడో రేపో తుంగభద్రా దాటి యీవలకు వచ్చి విరూపాక్ష భాండాగారము దోఁచుకొనక మానఁడు. వాఁ డిటకు రాకముందే యాభాండాగారమందలి ధనములును రత్నములును, బంగారును మీరు వశపఱచుకొని దేవునిరాజ్యము నిలుప రండోయని ప్రజలను బిలువుఁడు. శైవ. వైష్ణవ స్మార్తాది మతభేదములు తలంపక యెల్లరును మీసేనలలోఁ జేరుదురు. దాన విజయము సాధింపుఁడు మీరు గెలిచినపిదప—విరూపాక్ష దేవుని ద్రవ్యమువలన సంపాదించిన యారాజ్యము మాస్వామిదే కాని మీది కా దని గుర్తింపుఁడు. మీరును మీవంశ్యులును ఆదేవునికి ధర్మకర్తలుగామాత్రమే యుండి రాజ్యపాలనము చేయుచుండవలెను.

ఏనాఁడు మీరు చక్రవర్తు లగుదురో నాఁటినుండియు నేనును నాసోదరులును, శిష్యులును యథాపూర్వముగా నార్షసంస్కృతి నిలుప, నానాముఖముల శ్రుతి స్మృతి పురాణాదులను భారతభూమిని వ్యాప్త మొనర్ప శ్రమపడెదము.'' అనుటయు హరిహరుఁడామహర్షియాజ్ఞచొప్పున సేనలం బ్రోఁగుచేయ నారంభించెను.

స్వాములవారు వేగరులగు వేఁగులవారివలన దేశస్థితిని ప్రతినిమిషము తెలిసికొనుచుండెను. అప్పటికిఢిల్లీ సేనలు రాజమహేంద్రమునఁ జాళుక్యుల కులదైవతమగు గోపాలస్వామి యాలయమును మసీదుగా మార్చి వేసె ననియు, వృద్ధుఁడైన ప్రోలయనాయకుఁడు రేకపల్లెయందే వ్యాధిగ్రస్తుఁడై మంచమెక్కి. బాధపడుచుండఁగాఁ జూడవచ్చిన కాపయనాయకుఁ డన్నకు మ్రొక్కి, "అన్నా! యేమి బాధ?" అని ప్రశ్నింప నాప్రోలయవిభుఁడు "భారతీయసంస్కృతికి వెన్నెముక యనఁదగు వేదశాస్త్రముల రక్షణము నకై గోదావరీశాఖావృత్తమై శత్రుదుర్గమ మైన కోనసీమలోని "విలస" గ్రామమును "వెన్నయ, గణపయ" లను నుత్తమోత్తమచరిత్రులగు పండితసోదరులకు సర్వకరపరిహారముగా నగ్రహారమొనర్చి, యిచ్చి వేదశాస్త్రపండితులను బో షిం పఁ గడఁజేసితిని. వారును ధర్మబుద్ధితో రెండేసి మూఁడేసి వేదములు, మూఁడేసి నాల్గేసి శాస్త్రములు చదువుకొనిన యెనుబది మంది (80) పండితులను రాపించి, యా గ్రామమును 108 భాగములుగా విభజించి, తారతమ్యము ననుసరించి, వారల కిచ్చి మనయార్షసంస్కృతిని కాపాడుచున్నారు. కాన నావిషయమున నా కెట్టి క్షేపమును లేదు. కాని యోరుగల్లుకోటపై తెలుఁగు బావుటా యెగుర వేయ లేకపోతేనే యనుబాధ యొక్కటి తక్క ఇతరము లేవియును నాకు లేవు అని దీర్ఘవిశ్వాసము పుచ్చుటయు కంటనీరిడుకొను నన్నగారి మొగమువంకఁ జూడలేక కాపయనాయకుఁ

డాప్రభుని పాదములపైఁ జేయివైచి "అన్నా నే నెగుర వైచెదను నీ విఁక నిశ్చింతముగా నుండు" మను మాటకు "తమ్ముఁడా! నీ వనినంత పనియుఁ జేయఁ గలవాఁడవే" యని పట్టరాని యానందమున శ్వాసమున కవకాశము లేక ప్రోలయప్రభుని ప్రాణములు మేను విడిచివైచెను. కాపయనాయకుఁడు దుఃఖాంధకారమునఁ గొంతవడి కొట్టుకొని స్మృతి తప్పి పడియుండి లేచి వెంటనే ప్రతిజ్ఞాపాలనమునకై యచట నున్న సేనలతో ఓరుగల్లు చేరుకొని యచటికోటయందు తుగ్లక్కు నిలిపిన రాజప్రతినిధి "మలిక్ మగ్బాలు తిలింగీ" అను నాతనిపై హఠాత్తుగాఁ గవిసెను. "మన కేమి భయ"మని ధైర్యముతో నుండిన యా రాజప్రతినిధి తగినంత సేన లేకపోవుటచేత భయపడి ఢిల్లీకి పారిపోయెను. కోటలో నున్న తురుష్కభటులం జెల్ల చిందరవందరచేసి, కాపయనాయకుఁ డోరుగల్లు కోట గుమ్మమున మరల మామిడాకుతోరణము కట్టి మొనటిబురుజుపై తెలుగుజెండా యెగురవైచి ప్రోలయనాయకున కశ్రుతర్పణము గావించెను. కాని పరుగెత్తిన యారాజప్రతినిధి ఢిల్లీనుండి సేనలతో వచ్చునని తగుసన్నాహమున కాపయనాయకుఁడు మునిఁగి యున్నాఁ డనియును వేగులవలనఁ దెలిసి హరిహరు లాశ్చర్యసంభ్రమములఁ గాంచి "అన్నా! యిప్పుడు మీ రడ్డుపడి కాపయనాయకుఁ డెత్తిన యాంధ్రధ్వజము కాపాడవలయు" అని విద్యారణ్యు లనిరో లేదో వెంటనే రణభేరి వేయించి పెద్దసేనతో హరిహరసోదరులు జైత్రయాత్రకు వెడలిరి. తుంగభద్ర యొడ్డుదరికిఁ జేరఁగనె యానెగొందిని, కుమ్మటమును వశ మొనర్చుకొనిన తురుష్కరాజప్రతినిధులతో ఘోర యుద్ధము తటస్థించి యచటనే చాలకాలము హరిహరాదులు చిక్కుకొనిరి. పాదుషాసేనలు కొన్ని యోరుగల్లువద్దను కొన్ని తుంగభద్ర యొడ్డునను రెండుగా విభక్తము లగుటచే కాపయనాయకుఁడు విజృంభించి కోటను ముట్టడించిన శత్రుసేనలను దఱిమివేసి తెలుఁగుబావుటా నిలుపుకొనఁగల్గెను. అన్నయగు ప్రోలయనాయకుఁ డాక్రమించిన కృష్ణా గోదావరుల మధ్యమండలమును తానై జయించిన యోరుగల్లుప్రాంతమును నేలుచు "శ్లాఘ్యప్రస్ఫుట ధర్మకర్మ చతుర" "బావ ప్రభావోదయ" "కాశీ విశ్వపతి ప్రసాద మహిమ ప్రాప్తాఖిలప్రాభవ" "ప్రతాపరుద్ర ప్రతిమ ప్రభావ" అనియు శిలాశాసనాదులందు తనకీర్తి యక్షరరూపమై వెలయ నొప్పారుచుండెను,

హరిహరాదులు కృష్ణాతుంగభద్రల నడుమ నుండు దేశమును, తుంగభద్రకు దక్షిణదిశ నుండు విశాలభూమండలమును జయించి శాత్రవ రక్తసిక్తములగు ఖడ్గములను విద్యారణ్యులవారి పాదములకడ నుంచి నమస్కరింప, నామహాత్ముఁ [illegible] నాసోదరద్వయగాత్రములు తడుపుచు దీవించి పంపాక్షేత్రమున శ్రీరూపాక్షుని పాదముల చాఁగను విద్యానగర మను పెద్దనగరమును నిర్మించి శ్రీచక్రాకారముగా మిగులయెత్తైనప్రాకారమును కట్టించి హరిహరుని యంగీకారమున విద్యానగరసింహాసనమున బుక్కరాయల నెలకొల్పి పట్టాభిషిక్తుని జేసెను. బలాత్కారముగా మెడఁ జుట్టుకొనిన ప్రాయశ్చిత్తములేని యిస్లాముమతగర్త పతనమునఁ దాను పడకుండ నైతి ననియు, ఈపతితబీజము భారతీయమతమునఁ బ్రవేశింపక తనయొక్కనితోడనే యంత మగు ననియు హరిహరుఁడు తలఁచి పెండ్లియాడక యావజ్జీవమును బుక్కరాయని రాజ్యమునకు వజ్రకవచమై యార్ష సంస్కృతిని రక్షించుచుండెను. బుక్కరాయలును సోదరునియందలి భక్తిచేతను, కృతజ్ఞతచేతను, తనకొమరునకు హరిహరరాయలని పేరుపెట్టి, యన్నపేరిని జిరస్థాయి నొనర్చెను అని చారిత్రకులు చెప్పుదురు. బుక్కరాయల పట్టాభిషేకమునకుఁ గొంచెకాలము ముందే కాపయనాయకుఁడు విద్యారణ్యులవా రంపిన

యాశీర్మంత్రాక్షతలు దలఁదాల్చి యోరుగల్లుసింహాసన మెక్కెను. ఈరీతిగా తలయెత్తిన ఓరుగల్లు విద్యానగరరాజ్యములు సేతువులై నిలువరించుటచేత మహమ్మదీయ వాహినులు దక్షిణాపథమున నంతగాఁ బ్రసరింపక యందలి దేవళములు నేలపాలు గాక నిలిచినవి. లే కున్న నుత్తరాపథమందువలెనే సర్వశూన్యమై పోయియుండెడివి.

ఆర్షసంస్కృతిని నిలుపఁదలఁచియే బ్రహ్మచర్యమునుండి సన్యసించిన మాధవవిద్యారణ్యులు శంకర భగవత్పాదులచే స్థాపింపఁబడిన శృంగగిరి శారదా పీఠమున శంకరానంద యతీంద్రుల యాదేశమువే పదునొకొండవ యాచార్యపురుషుఁడై పారమహంస్య సామ్రాజ్య సింహాసనము నెక్కి యాపీఠమునకు జాగీరులను, గజాశ్వభటాది పరివారమును జేకూర్చి ప్రభుశక్తితో వైదికమతమును దక్షిణాపథముననే కాక కాశీ, బదరికావన, జగన్నాథాదిక్షేత్రములందలి శంకర ప్రతిష్ఠిత మతపీఠములఁ జక్క దిద్ది తన్మూలమున నుత్తరాపథమునఁ గూడ వ్యాప్త మొనర్చెను. అంతతో దనియక వైదికమతమునకు శాశ్వత శిలాప్రాకారములుగా సోదరుఁడగుసాయణునిచేత నాల్గువేదములకు నూతనముగా భాష్యములను, తన పర్యవేక్షణమున రచింపఁజేసియు, తానును వేద, వేదాంత గ్రంథములను పరాశరమాధవాది స్మృతిగ్రంథములను శతాధికముగా రచించెను. అన్ని శాస్త్రములందును బెక్కురు పండితులచేత నసంఖ్యాక గ్రంథములను రచింపఁజేసెను. ఆనాఁడేపండితుఁడే శాస్త్రగ్రంథము రచించినను దానిపై విద్యారణ్యముద్రయున్ననే దానికి సభ్యతా ప్రామాణ్యములు. వేదశాస్త్రశాఖలందాతనిపేరి గ్రంథము లేనిశాఖ యొక్కటియు లేదనిన నతిశయోక్తి కాదు కాలమాధవము, ముహూర్త మాధవము, అభినయమాధవము, సంగీతమాధవము, మాధవీయధాతువృత్తి మున్నగు గ్రంథములు వందలకొలఁది యానాఁడు బయలుదేఱి వైదికమతరక్షకములై వెలసినవి. దేశమున కామహనీయుఁ డొనర్చిన మహోపకార మక్షరరూపమున సూర్యచంద్రు లున్నంతకాలము నుండునదే. అతఁడు కవి, పండితుఁడు, రాజ్యాంగవేత్త, మంత్రాంగ నిపుణుఁడు, శూరుఁడు ధీరుఁడు ఆస్తికశిరోరత్నము, నాస్తిక విజేత, ఇంతవాఁడయ్యు సర్వసంగ పరిత్యాగి. ఆలుబిడ్డలు లేనివాఁడయ్యు జగత్కుటుంబి. సంగమవంశమును కొన్నితరములుగా సింహాసన మెక్కించిన నిస్సంగి. తానై వేదవేత్తలకగ్రహారము లిచ్చుటే కాక సంగమవంశీయులచే విరూపాక్షదేవుని యానతిచే నిచ్చుచున్నట్లనే కాగ్రహారము లిప్పించిన యుదారుఁడు. సకలకళాపోషణము తానొనర్చి యితరులచేఁ జేయించిన రసజ్ఞుఁడు. అట్టివాఁడు "న భూతో న భవిష్యతి" "అగ్రత శ్చతురో వేదాః పృష్ఠతః సశరం ధనుః, ఇదం బ్రాహ్మమిదం క్షాత్రం శాపాదపి శరాదపి" అనిన పరశురాముఁ డొక్కఁడే యాతనికుపమాన వస్తువు కాఁగలఁడేమో! ఇంతకంటె భగవదవతారమునకు కేమి కావలెను? శంకరులు మతము నొక్కదానినే చక్కఁదిద్దెను. రామానుజ మధ్వాదులగు మహనీయులును మతరక్షణమాత్ర తత్పరులే. మాధవవిద్యారణ్యులో ఒకచేత రాజ్యస్థాపన, తద్రక్షణకృత్యములు, ఒకచేత వైదిక మత జీర్ణోద్ధారము, తద్రక్షక వాఙ్మయ సముద్రసృష్టి యొనర్చి "ధన్యోఽస్మి" యనుకొని భారతీయ సార్వకాలిక కృతజ్ఞతాపూర్వక భక్తి కాలంబమైన దివ్యజ్యోతి. "నమో జగద్గురో! జయ జయ వేద జననీ"యని గొంతెత్తి యాదివ్యపురుషుని కీర్తిగాన మొనర్చి, యామహనీయుని మోడుపాఱిన సంకల్ప కల్పశాఖి చివురొత్తి పూచి, కాచి, ఫలించి, యధునాతనాజ్ఞానాంధకార మగ్నమైన భారతమును లేవనెత్తి కాపాడుఁగాత యని యాశాసించుచు, నింతతో కలమునాఁపెదను. ఓం తత్సత్.

# అలంకారసుధానిధి - సాయణుడు

కుమారి డి. సి. సరస్వతి

వ్యాస విషయసూచి:— పీఠిక, వ్రాత ప్రతుల వివరములు, గ్రంథస్వరూపము, గ్రంథరచనా కాలము, గ్రంథ విషయసూచి కవి — కావ్యము, దోషము, గుణము, అలంకారము, రసము, ధ్వని, గ్రంథపరిమితి, అందు పేర్కొన్న గ్రంథములు, గ్రంథ కారులు, అలంకారసుధానిధి గ్రంథకర్తృత్వము, ఉప సంహారము, అనుబంధము (అలంకారసుధానిధియందు దాహృతములైన భోగనాథుని గ్రంథభాగములు).

పీఠిక:—హిందూదేశ నాగరికతలో మహోన్నతస్థాన మాక్రమించిన ప్రఖ్యాతప్రభువులు విజయనగరాధీశులు. వీరొనర్చిన గీర్వాణాంధ్ర భాషా పోషణ మపారము. తత్ప్రోత్సాహమున రచింపబడిన సంస్కృత వాఙ్మయమునం దధికభాగము సాయణ మాధవభోగనాథులదే యని చెప్పనొప్పును. వారిలోగూడ సాయణాచార్యులదే యగ్రస్థానము. సంస్కృతవాఙ్మయమునం దించుమించు ప్రతిశాఖయందును వీరు రచించినట్లు తెలియుచున్నది. అలంకారశాస్త్రమున యింకను యముద్రితమైన 'అలంకారసుధానిధి' యను గ్రంథమొకటి సాయణుని పేరమున కుపలబ్ధమగుచున్నది. ఇచట, అగ్రంథ పరామర్శనము చేయనా ప్రయత్నము. చారిత్రకదృష్ట్యా మాత్రమే. ఇదివఱకు విమర్శకులు మఱి గ్రంథకర్తను పరిచితము జేసిరి. ఇచట సాహిత్యప్రపంచమునం దీసుధానిధికున్న స్థానమును జూతము.

వ్రాతప్రతుల వివరములు:- అలంకారసుధానిధి వ్రాతప్రతులు నాలుగు మైసూరు ప్రాచ్య లిఖితగ్రంథాలయమునం దున్నవి.[1] మాగుచువులు

1. చూ. New Catalogus Catalogorum. వాల్యూము—1. పే 299.
1. SA. 615 (దేవనాగరిలిపి) 2. SP. 223 (తెలుగు) 3 SP. 78 (కన్నడము) 4. SP. 862 (గ్రంథము) ఈ ప్రతులను కాపీచేయించి తెప్పించి నా విమర్శకు తగు ప్రోత్సాహము నిచ్చినందులకు మా గురువులు డాక్టరు వే. రాఘవన్‌గారికి నా కృతజ్ఞతాభివందనములు.

డాక్టరు రాఘవన్‌గారి కోరికపై యీగ్రంథాలయాధి కారులు ఈగ్రంథమునకు ప్రతినొకదానిని పాఠ భేదములతోసహ వ్రాయించి పంపిరి. అచ్చుటచ్చట SP. 862 అను వ్రాతప్రతియందు కొన్ని యధిక భాగములు కానసగును. వీటితోగలసి గ్రంథము 281 పుటలగును. అన్ని ప్రతులలోను తృతీయో న్మేషమున ఉపమేయోపమాలంకార విచారమువఱకే మన కుపలభ్యమగుచున్నది. గ్రంథాదిభాగము కృమిదష్టమై యందలి విషయములను సమ్యగవ గాహనము జేయవీలుగాకున్నది.

గ్రంథాదిభాగము—(ఈభాగము SA. 862 ప్రతిలో మాత్రమున్నది.)

ప్రతివిభుత మృత్యు...ప్రతినృపతి...ప్రా...రితన ...
పావద్వయకృతే సువర్ణానాం కోటిర్వ్యశదశ...
కుమారా
డస్యప్రసాదతః అసాధ్యం రోగ...స్పుజ్య తేజస్వం
సమపద్యత.
పంచాశదేవ పద్యాని సాంబాపి ప్రతిపాదయన్
కాప...
...త/ అస్మద్గ్రాహ్యనామాపి మాధవార్యో మహా
మనాః/
ప్రాప్తవాన్ స్థిరమారోగ్యం హాలవిప్లు సునస్తుతేః.

గ్రంథాన్తభాగము— (SA. 862లో మాత్ర మున్నది).

నైకోప మాచస్య కృప్తావేకస్యే వోపమేయస్య/
నికస్మిన్ భిన్నే వా ధర్మే మాలోపమా ఖ్యాతా॥
పత్యా వాచాం సుధర్మేవ పత్యాదేరివ తేజసాం:
భవతాభాసతేఽత్యర్థం సాయణార్యవసుంధరా॥
అత్ర భవత ఇతి క్రియారూపో ధర్మోభిన్నః/
తిగ్మాంశురివ తేజస్వీ వాగ్మీ వాచమివ ప్రభుః/
కల్పద్రుమ ఇవ త్యాగే సాయణ స్సచి వోత్తమః॥
అత్ర తేజస్విత్వ వాగ్మిత్వ త్యాగత్వాది భిన్నధర్మాః/సః?
...నోపమా.

గ్రంథస్వరూపము:— అనేకాలంకార గ్రంథములవలెనే యీ సుధానిధియు కారికలు, వృత్తి, ఉదాహరణములని మూడు భాగములుగా నున్నవి. ఏకావళి ప్రతాపరుద్రీయాదులవలె నిదియొక యశో భూషణగ్రంథము. ఇందలి ఉదాహరణములన్నియు గ్రంథకర్తయైన సాయణాచార్యుల యశస్సురభి పరి మళములుగా నున్నవి.

గ్రంథరచనాకాలము:— వేదవ్యాఖ్యా తగా విఖ్యాతిగాంచిన మనగ్రంథకర్త సాయణాచార్యుల గూర్చి విపులముగా వ్రాయనవసరములేదు. సాయ ణుడు విజయనగరాస్థానమునందు నలుగురి పరిపాల కుల వద్ద మంత్రిగా యున్నట్లు వారిగ్రంథములబట్టి తెలియుచున్నది.[1]

సాయణుడీసుధానిధిని కంపణప్రభుపుత్రుడయిన రెండవ సంగముని (క్రీ. శ. 1356— ) కాల మున వ్రాసినట్లు క్రింది శ్లోకములు తెలుపుచున్నవి.

సంగమేంద్రస్య సాచివ్యే సమేఽపి న్యాత్కథం.../
సాయణార్యస్య చాన్యేషాం సచివానాం కృతస్థితిః॥
*    *    *
స జయతి సంగమరాజ సచివేంద్రస్సాయణోఽపి
తత్సచివే
*    *    *
సత్యం సాయణమంత్రివర్య సకలశ్లాఘావచో వైఖరీ
భూమా సంగమ భూమిపాల సకలస్త్వేమా చ
మామానహాః/

1. కంపణప్రభువుయొక్క అధ్యక్షతమున విద్వత్సభ యందు సాయణాచార్యులు వారి సుభాషితసుధానిధిని చదివి వినిపించినట్లున్నది.

స కదాచిత్స మాజేఽథ కంపభూపం కలానిధిః/
ఆశ్రావయదమూనశ్రీ ర్లోకైఃయనుకరం పరం॥

మాధవీయధాతువృత్తి—

అస్తి శ్రీసంగమక్ష్మాపః పృథ్వీతల పురందరః/

యత్కీర్తి మౌక్తికాదర్శే త్రిలోక్యాం ప్రతిబింబ్యతే॥
* * *
తస్య మంత్రి శిరోరత్న మస్తి మాయణసాయణః।

ఋగ్వేదవ్యాఖ్యానము—

బుక్కభూపాల సామ్రాజ్యధురంధరేణ
సాయణాచార్యేణ

తైత్తిరీయబ్రాహ్మణవ్యాఖ్యా—

ఇతి శ్రీమద్రాజాధిరాజ—పరమేశ్వర వైదికమార్గ
ప్రవర్తక శ్రీ
వీర హరిహర భూపాల సామ్రాజ్య ధురంధర
సాయణాచార్య...

ఈ ప్రభువుల వంశవృక్షమిట్లున్నది—




కంపణప్రభువు స్వర్గస్థులగునప్పటికి సంగమ ప్రభువు బాల్యమునందో లేక అప్పటికి జన్మించకయో ఉన్నందున, అతని రాజ్యమునకు వచ్చువరకు సాయణాచార్యులే రాజ్యభారమును వహించినట్లును తెలియుచున్నది.

సంగమేంద్ర నరేంద్ర త్వయ్యకృతార్థ పరిగ్రహే।
విధాయోర్వీ ధుర మగాత్ స్వారాజ్యం కంపణః కథం॥
* * *
సాయణ సచివాయత్తం సంగమరాజస్య పశ్య
రాజ్యమిదం।
విద్యా వినోద రసికైర్విద్వద్భి ర్బహుమతాభోగం॥

* * *
శౌర్యోచ్ఛృంఖల సంగమేశ్వర మహాసామ్రాజ్య
సంపాదన

రాజ్యభారమును వహించుటేగాక సాయణుడు సంగముని విద్యావంతుని జేయుభారమునుగూడ స్వీకరించెను.

బాల్యేఽపి ప్రతిబోధయస్యవహితం శ్రీసంగమ
క్ష్మాపతిం
బోధైకాస్పద సాయణార్య భగవద్వ్యాసావతార...।
* * *
ఆన్వీక్షిక్యా మధిక విహితౌ హర్ష శోక వ్యుదాసే
మార్గోల్లేఖం విదధతి నృణాం మానసే ధర్మశాస్త్రీ।
సమ్యక్ శిక్షాం సచివ గమిత శ్రైనతే సాయణార్య
ప్రౌఢిం గాథాం ప్రకటయతి తే సంగమేంద్ర ప్రయోగే॥

సాయణకర్తృత్వమున మనకుపలబ్ధమగు సుధానిధి వర్గమున జేరిన యజ్ఞతంత్రసుధానిధియందు సాయణుడు సంగముని కులగురువుగా జెప్పబడెను [1]

తస్యా భూదన్వయగురు స్తత్త్వ సిద్ధాంత దర్శకః।
సర్వజ్ఞః సాయణాచార్యో మాయణార్య తనూద్భవః॥

చారిత్రకముగా జూచిన క్రీ. శ. 1355 లో హరిహరుని ప్రభుత్వమంత మొందెననియు. తదనంతరము రాజ్యము (మొదటిసంగముని తృతీయపుత్రుడు) తన రెండవ తమ్ముడైన బుక్కరాజాధీనమయినట్లును దెలియుచున్నది దీనినిబట్టి క్రీ. శ. 1355 నాటికే కంపరాజు పరమపదించినట్లున్నది. లేకున్న అతనిని వదలి, అతని తమ్ముడైన బుక్కరాజును రాజ్యాధికారిగా జేయుటకు కారణము కానరాదు.

శాసనములనుబట్టి జూడ క్రీ. శ. 1340–46 కాలమున ఉదయగిరియందు కంపణుడు వైస్‌రాయ్‌గా

1. చూ. Indian Antiquary 1916.
పే. 22-4.

యుండినట్లు తెలియుచున్నది.[1] క్రీ. శ. 1356 ప్రాంతమున అతని పుత్రుడు రెండవ సంగమరాజు పరిపాలించినట్లతని బిట్రగుంట శాసనమునందున్నది (క్రీ. శ. 1356).[2] ఇందు సంగముడు తనతండ్రి కంపరాజుయొక్క శ్రాద్ధదినము నంతదని స్మృతి చిహ్నముగా దానమిచ్చునట్లు వ్రాసినట్లు శ్రీ టి. యే. గోపీనాధరావుగా రుద్దేశించినట్లిది[3] కంపణుని పది యవ శ్రాద్ధమయిన యీ పదివర్షములు (1346–56) సాయణుడు సంగముని రాజ్యభారము వహించి యుండవలయును. మఱియు యీ కాలముననే సాయణుడు తన యలంకార సుధానిధినిగూడ రచించి యుండవలెనని తోచుచున్నది.

1 చూ– Origin of the City and the Empire by Dr. N. Venkataramanayya. P. 130.

'An epigrah near Buggabhavi at Udayagiri dated 1343 records a gift of Kampara to a deity. Hence Kampara's rule of Udayagiri should have begun either in 1342 A. D. or a little earlier. చూ– Further Sources of Vijayanagar History Vol. I P. 24' Mysore Gazetteer II. iii. P. 1462–4.

2. ఈ శాసనము సాయణుని సోదరుడయిన భోగనాదునిచే రచితము. ఎపిగ్రాఫియా ఇండికా (Vol. III. PP. 21–35) లో ప్రకటితము.

3. చూ. మధురావిజయము పీఠిక, తిరువనంతపుర ముద్రణము. 1916.

చంపనరేంద్రుడను నొక ప్రభువును సాయణుడోడించి నట్టలంకార సుధానిధి యందొక శ్లోకమున నున్నది.

*సమరేశపత్నసైన్యం సాయణ తవబింబితం వహన్ ఖడ్గః*
*క్రీడతి కైటభరిపురివ క్రోడేజగత్త్రయం జలధౌ/*
*దిష్ట్యాదైష్టికభావ సంభృతమహాసంపద్విశేషోదయం॥*
*జిత్వా చంపనరేంద్ర మూర్జితయశాః ప్రత్యాగతస్సాయణః॥*

ఈ చంపనరేంద్రుడే మధురానగరమును పాలించిన సంబువరాయలు. ఇతనిపైకి క్రీ. శ. 1352లో కంపణరాజుని కుమారుడయిన సావణ్ణుడు, మంత్రియైన సాయణుల సహాయముతో దండెత్తెను.[1]

ఈపై కారణములచేత అలంకార సుధానిధి 14 వ శతాబ్దమున 1345 నుండి 1360 ల మధ్య కాలమున రచింపబడియుండవలయును.

1. మధురానగర చరిత్రయందు చంప సంబువరాయడు అను నామమున ముగ్గురుండిరి. 1. వెన్నుమర కొండార్–I సంబువరాయుడు (1332–39) 2. రాజనారాయణ సంబువరాయుడు (1339–1359) 3. వెన్నుమరకొండార్–II సంబువరాయుడు (ఇతడు రెండు మూడు సంవత్సరములకంటె యెక్కువకాలము పాలించినట్లులేదు)

విజయనగర సామ్రాజ్యచరిత్రయందు వారు (విజయనగరాధీశులు) మూడుమారులు మధురానగరముపైకి దండెత్తిరి—1. క్రీ. శ. 1352 లో మొదటి కంపణుడు తన కుమారుడైన సావణ్ణుని సహాయముతోను, 2. క్రీ. శ. 1365 లో బుక్కరాజ పుత్రుడైన వీరకంపరాయల (గంగాదేవియొక్క మధురావిజయమునందలి నాయకుడు) పరిపాలనమునందున, 3. క్రీ. శ. 1371 లో మధురను పాలించిన మహమ్మదీయ ప్రభువులమీదను. చూ—యస్. తిరువెంకటాచారిగారి మధురావిజయపీఠిక. అన్నామలై యూనివర్శిటీ ముద్రణము.

అలంకార సుధానిధికి విపులవిషయసూచి—

ఈ గ్రంథమింకను అముద్రిత మయినందున తదంతర్గత విషయములను విపులముగా సూచించెదను.

మన కుపలబ్ధములయిన ప్రాతప్రతు లన్నిటి యందును గ్రంథాదిభాగము లేదని యిదివరకే తెలిపితిమి.

కావ్యప్రాధాన్యము; కావ్యరసము బ్రహ్మానంద స బ్రహ్మచారి; కావ్యపరమావధి; వేదములకంటెను కావ్యాధిక్యత; కవిత్వావశ్యక శక్తివ్యుత్పత్తులు; వ్యుత్పత్తి మూడువిధములు— లోకవృత్తజ్ఞానము, శాస్త్రవృత్త జ్ఞానము, అభ్యాసము.

కాళిదాసాది కవుల గ్రంథపఠన ప్రాధాన్యము; కవి ప్రాముఖ్యత; సృష్టికర్తకంటెను కవియొక్క ఆధిక్యత, కావ్యప్రశంస.

అలంకార శాస్త్రమునందలి వివిధమతముల వివరణము, సుధానిధికారుడు ఆనందమతానుయాయి.

కావ్యవిభజనము—ఉత్తమ (ధ్వని), మధ్యమ (గుణీభూతధ్వని), అధమ (అస్ఫుటధ్వని) లేక చిత్ర కావ్యము; తద్భేదములు, చిత్రకావ్యము ద్వివిధము— శబ్దచిత్రము, అర్థచిత్రము.

కావ్యమున ధ్వని ప్రాధాన్యత— కావ్యశరీర సౌదృశ్యము, రసము కావ్యాత్మ, రసముయొక్క ప్రాముఖ్యత, గుణాలంకారాది కావ్య సామగ్రి యంతయు రససంబద్ధము.

దోషలక్షణము, దోష విభజనము— శాబ్ద దోషము, వాక్య(చ్య?)దోషము, ఉభయదోషము, రస దోషము.

అలంకారము, తల్లక్షణము.

గుణము, లక్షణము. శౌర్యాదిగుణములతో సమానము, మూడుగుణములు—మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము, తదనుకూలరసములు; వామనమతఖండనము, గుణముల కనుగుణవర్ణములు (అక్షరములు), గుణసంఘటనాసంబంధము.

ఇచట ప్రథమోన్మేషము ముగియుచున్నది. తదున్మేషాన్తగద్య మిట్లున్నది.

*'ఇతి శ్రీమత్పూర్వ పశ్చిమ దక్షిణోత్తర సముద్రాధిపతి బుక్కరాజ ప్రథమదేశిక మాధవాచార్యానుజన్మన శ్రీమత్సంగమ రాజ సకల రాజ్య ధురంధరస్య సకల విద్యానిధానభూతస్య భోగనాథాగ్రజన్మన స్సాయణామాత్యస్య కృతా వలంకార సుధానిధౌ కావ్యమార్గ ప్రతిష్ఠాపనం నామ ప్రథమోన్మేషః।*

ద్వితీయోన్మేషము—శబ్దము త్రివిధము— వాచకలక్షక వ్యంజకములు; అర్థము త్రివిధము— వాచ్యలక్ష్యవ్యంగ్యములు; త్రివిధశబ్దవృత్తులు—అభిధా లక్షణ వ్యంజనలు. మన గ్రంథకర్త తాత్పర్యము నంగీకరించడు.

లక్షణావృత్తి రెండువిధములు—అ గూఢము (గుణీభూతధ్వని) గూఢము (ధ్వని); వ్యంజనావృత్తి అభిధాలక్షణలకంటె భిన్నము; ధ్వని ప్రధానభేదములు—అవివక్షిత వాచ్య ధ్వని, వివక్షితాన్య పద వాచ్యధ్వని; తద్భేదములు.

వివిధవ్యంజకములు—ప్రస్తావాదులు; ధ్వనిభేదములు, తదుదాహరణములు, తాత్పర్యానుమానముల కంటె ధ్వని భిన్నమని నిరూపించుట

అసంలక్ష్యక్రమధ్వని అష్టవిధములు—రసము, భావము, రసాభాసము, భావాభాసము, భావోదయము, భావసంధి భావశబలత, భావశాన్తి.

రససూత్ర వివరణము, విభావాది రససామగ్రికి ఉదాహరణములు. రససూత్ర వివరణమునందు మన గ్రంథకర్త భట్ట లొల్లటాదులను వదలి అభినవ గుప్తాచార్యుల ననుసరించెను, శాంతరస సామగ్రిని

రంగముపై నభినయింప వీలుకానందున ఆరసమును శ్రవ్యకావ్యమునందు మాత్రమనుమతించిరి.

రసము సదా వ్యంగ్యము.

శృంగారము, తద్విభావాదులు; శృంగారము త్రివిధము. సంయోగము, విప్రయోగము, సంభోగము.

దశశృంగారావస్థలు—అభిలాష, చిన్త, స్మృతి, గుణకథనము, ఉద్వేగము, ప్రలపితము, ఉన్మాదము, జ్వరము జడత, మరణము.

విప్రయోగము ద్వివిధము— మానము, ప్రవాసము. మానాపనోద నోపాయములు.

త్రివిధనాయికలు— ముగ్ధ, మధ్య ప్రగల్భ, తద్భేదములు.

ప్రవాస విప్రలంభమునకు కారణములు, త్రివిధ ప్రవాసభేదములు— యాస్యన్ ప్రవాసము, గచ్ఛన్ ప్రవాసము, గతప్రవాసము,

శృంగారమునకు కరుణమునకు గలభేదము.

సంభోగలక్షణము; దశావస్థలు— లీల, విలాసము, విభ్రమము, కిలికించితము, లలితము, వికృతము, ఒప్పికము, మోట్టాయితము, కుట్టమితము, విచ్ఛిత్తి.

నాయిక. ఇతికొన్ని భేదములు-స్వాధీనభర్తృక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, ఖండిత, కలహాన్తరిత, విప్రలబ్ధ (లేక విమానిత), ప్రోషితపతిక, అభిసారిక. తచ్చేష్టలు.

భావములు, తదువాహరణములు.

హాస్యరసము, రెండువిధములు— ఆత్మస్థము, పరస్థము; హాసభేదములు-స్మితము, హసితము, ఉపహసితము, అపహసితము.

వీరరసము మూడువిధములు-రణవీర, దానవీర, దయావీర.

అద్భుతరసము.

బీభత్సరసము మూడువిధములు— క్షోభము. శుద్ధము, ఉద్వేజకము.

భయానకరసము రెండువిధములు-రౌద్రశ్రవణజము, రౌద్రసత్త్వదర్శనజము.

రౌద్రరసము రెండువిధములు- మత్సరకృత క్రోధపరిపోషరూపము, విరోధివైకృత కృతము.

కరుణరసము మూడువిధములు= ఇష్టనాశము వలన, అనిష్టకార్యమువలన, నియన్త్రణావ్యాప్తివలన.

రసముల పరస్పర సంబంధము- స్నేహము, విరోధము.

శాన్తరసము- శ్రవ్యకావ్యమునందే యుండును. దృశ్యకావ్యమునందు పోషింపబడదు; తద్విభావాదులు.

రతి, ప్రీతి, భక్తి, వానికి మధ్యగలభేదము.

రసాభాసము, బావాభాసము.

నంలక్ష్యక్రమధ్వని మూడువిధములు- శబ్దశక్తిమీదను, అర్థశక్తిమీదను. అరెంటిమీదను ఆధారపడునది, తద్భేదములు,

గుణీభూతవ్యంగ్యము (మధ్యమకావ్యము), అష్టవిధములు. అగూఢము. అపరస్యాంగము. వాచ్యసిద్ధ్యంగము, అస్ఫుటము, సందిగ్ధము, తుల్యప్రాధాన్యము, కాక్వాక్షిప్తము, అసున్దరము.

రసవత్తు, ప్రేయస్సు, ఊర్జస్వి, సమాహితము.

ధ్వనిభేదము లసంఖ్యాకములు,

ఇచట ద్వితీయోన్మేషము ముగియుచున్నది.

**తృతీయోన్మేషము** — అధమకావ్యము లేక చిత్రకావ్యము, రెండువిధములు- శబ్దచిత్రము, అర్థచిత్రము.

శబ్దచిత్రము. ఆరుశబ్దాలంకారములు-వక్రోక్తి, అనుప్రాసము, యమకము, శ్లేష, చిత్రము, పునరుక్తవదాభాసము.

వక్రోక్తి, దాని ప్రాముఖ్యత, తద్భేదములు- కాకు వక్రోక్తి, శ్లేష వక్రోక్తి, ఏతద్ద్వయము.

అనుప్రాసము మూడువిధములు. తద్భేదములు.

1. ఛేకానుప్రాస.
2. వృత్త్యనుప్రాస – ఉపనాగరికావృత్తి, గ్రామ్యవృత్తి.
3. లాటానుప్రాస – మూడువిధములు.

యమకము- వ్రాతప్రతులన్నిటిలో నీ భాగ మెక్కువగా క్రిమి దష్టమైయున్నది,

శ్లేష, అష్టవిధములు – వర్ణము, పదము, లింగము, భాష, ప్రకృతి, ప్రత్యయము, విభాగము, వచనము.

చిత్రాలంకారము – పద్మబంధము, ఖడ్గ బంధము, మురజబంధము, సర్వతోభద్రము (సచిత్రముగా లిఖించబడలేదు.)

పునరుక్తవదాభాసము మూడు విధములు – సభంగము, అభంగము, శబ్దాశ్రయము.

'ఇతి శబ్దాలంకారా' అను ప్రకరణాన్తక సూచకమగు వచనముతో నీ శబ్దాలంకార ప్రకరణము ముగియుచున్నది. ఆపైన చిత్రాలంకారభేదములకు వివిధగ్రంథములనుండి గ్రహించబడిన శ్లోకములుదాహరించబడినవి. సందర్భముతో సంబంధము లేనందునను అలంకార సుధానిధికన్నను వెనుక వ్రాయబడిన చమత్కారచంద్రిక యందలి పద్యములు వీనిలో యున్నందున నిస్సందేహముగా నీభాగము[1] ప్రక్షిప్తమై యుండవలయును. పైగా యీ శ్లోకస్వభావము గూడ భిన్నముగానుండుట గమనార్హము. అనగా నివి సాయణాచార్యస్తుతి పరములుగాలేవు.

అర్థాలంకారములు-

ఉపమాలంకారము [ లుప్తా–19 భేదములు
[ పూర్ణా [ శ్రౌతి } × { వాక్యే
[ ఆర్థీ } { సమాసే
{ తద్ధితే

అనన్వయాలంకారము, ఉపమేయోపమాలంకారము. దీనితో అలంకారసుధానిధి వ్రాతప్రతు లంతమొందుచున్నవి.

---

1. ఆగ్రంథభాగము క్రింద నివ్వబడినది

సాచ మాతపిత భావనావసా సాక్షరానగత
పాదసారసా।

(Foot notes continued)

సారసా దధతు శింగయం రసాసారయం
గజపతీక్షమా పసా॥

పద్మబన్ధ :

భాసతే ప్రతిభాసార రసాభాతా భతావిభా।
భావితాత్మా భావాదే దేవ శుభావత తే సభా॥

అయమపి పద్మబన్ధ :

సానన్ద వన్ది జనగీత విచిత్ర భూమా
మాతంగ బంధురగతం మహనీయభాసా
సారోత్తరేణ వపుషా ప్రతిసంధిహింసా
సాతత్యసంగ యదునాథ జడాగతశ్రీః॥

ఖడ్గబంధ : యథావా–

విద్యారక్తమనాస్సమస్త జనతాబన్ధు స్స్వవర్మస్థిరో
దర్పావిష్కృత కాముకార్తిజననం ధత్తేయశః కర్ణయో
సత్యం నిర్జిత భద్రవాహ్నిజ మధుస్యన్దే యుతాస్త్యేః
పదే
దేవస్యాబిరతో దమేన సహితో రోషో గుణానస్పదే॥

చక్రశ్లోక : (?)

షోడశదళ పద్మబంధో యథా–

మహామహిమ రామశ్రీమన్నామ శ్యామకోమలం।
మనోమన్యే మతా మతిమసీమస్థేమ దాయకం॥

అష్టదళ పద్మబన్ధే యథా–

యాశ్రితా పావనతయా యాతనచ్ఛేదనీ చ యా।
యాచనీయా య యా మాయా స...సంస్తుతాం శ్రియా॥
కర్ణికాయాం న్యసేదేకం ద్వేద్వే దిక్షు విదిక్షు చ।
ప్రవేశ నిర్గమోదిక్షు కుర్యాదష్టదళాం బుజే॥

భ్యాసములున్నను యీ కావ్యబీజము లేకున్న కావ్యో త్పత్తి కలుగదు.

శక్తిః కవిత్వ బీజం హి ప్రాక్తనీ కాపి సంస్క్రియా।
యయా వినా న ప్రసరేత్ కావ్యం శిక్షావతామపి॥

ఈశక్తినే ఆలంకారికులు ప్రతిభ యనెదరు. ఈ ప్రతిభను 'నిత్యాభినవత్వమును గూర్చు నేర్పు' అని వారు నిర్వచించిరి

ప్రజ్ఞా నవనవోన్మేష శాలినీ ప్రతిభా.

ఈ శక్తివలెనే వ్యుత్పత్తియు కావ్యోత్పత్తియు ముఖ్యకార కారణము ప్రతిభ కీ వ్యుత్పత్తి సదా ప్రియమిత్రుని వలె సాయమొసగును

వ్యుత్పత్తిరపి శక్త్యైవ సంగతా చను వర్తతే।
సా హి శక్తేః ప్రియసఖీ నిత్యం వ్యభిచారిణీ॥

వ్యుత్పత్తి లేక పాండిత్యము మూడు విధములు లోక వృత్తజ్ఞానము. శాస్త్రవృత్తజ్ఞానము, అభ్యాసము లేక గురుసాన్నిధ్యమున అనవరతము కావ్యరచనమునకు ప్రయత్నించుట

వ్యుత్పత్తిర్లోక చారిత్ర శాస్త్రకావ్యాద్యపేక్షణం।
అభ్యాసం తు విజేతాం కావ్యజ్ఞానాం చ సమ్మతా॥

మమ్మటుడీ యభ్యాసమును శక్తివ్యుత్పత్తులతో సమాన స్థాయినుంచెను.

కవిసామగ్రి విషయమై చర్చించునపుడు అలంకార సుధానిధి అంతకుముందున్న మతములన్నిటికొక విధమయిన సమాధానమును తెచ్చినట్లు గమనించదగినది. ఆలంకారికు లీ కావ్యసామగ్రిని గూర్చి పరిపరి విధముల నుద్దేశించిరి. భామహుడు కావ్యరచనమునకు ప్రతిభయొక్క అవశ్యకతను దెలుపుచూ అది కొలదిమందియందే యుండునని వ్రాసెను. ఆ తరువాత పాండిత్యము, అనుభవజ్ఞానము మొదలగు వానినిగూడ నతడు కావ్యరచనా కారణములనుగా దెలిపెను. శక్తియు, నిర్దుష్టమయిన పాండిత్యము, అనవరత కావ్యరచనాభ్యాసము లివన్నిటిని జేర్చి దండి కావ్యోత్పత్తికి కారణముగా నిచ్చినను శక్తి లేకున్నను శ్రుత ప్రయత్నాదులచేతను యెదో నొక విధమయిన కావ్యరచనము జరుగుననియు నభిప్రాయపడెను. ఇట్లు దండియందు ప్రతిభ శ్రుతము యత్నములను మూటిని కావ్యకారణములుగా జూడనగును వామనుడు ప్రతిభను ప్రకీర్ణ కవి సామగ్రియందొకదానినిగా నిచ్చినను దానిని కవిత్వబీజముగా వర్ణించి యది లేనిదే కావ్యోత్పత్తియే గలుగదనియు, అట్లు జరిగినను హాస్యాస్పద మగుననియు నుద్దేశించెను.

లక్ష్యజ్ఞత్వ మభియోగో వృద్ధసేవావేక్షణం ప్రతిభాన మవధానం చ ప్రకీర్ణం

కావ్యాలంకారసూత్రము I. iii. il.

కవిత్వబీజం ప్రతిభానం। I. iii. 16

కవిత్వస్య బీజం కవిత్వబీజం। జన్మాంతరాగత సంస్కారవిశేషః కశ్చిత్ యస్మాద్వినా కావ్యం న నిష్పన్నం వా హాస్యాయతనం భవతి.

రుద్రటుని ప్రకారము శక్తివ్యుత్పత్త్యభ్యాసముల సమ్మేళనమే కావ్యరచనకు కారణము.

తస్యాసార నిరాసాత్సార గ్రహణాచ్చ చారుణః కరణే।
త్రితయమిదం వ్యాప్రియతే శక్తిర్వ్యుత్పత్తి రభ్యాసః॥

కావ్యాలంకారము I. 16

రుద్రటుననుసరించియే మమ్మటాదులు కావ్యరచనకు త్రివిధకారణములను ప్రతిపాదించిరి. (శక్తి, వ్యుత్పత్తి, అభ్యాసము) మన సుధానిధికారుడు అభ్యాసమును వ్యుత్పత్తియందే యిమిడ్చి యొకమార్పును గలిగించెను.

'ప్రజ్ఞా నవనవోన్మేష శాలినీ' యను సుప్రసిద్ధ ప్రతిభాలక్షణము భట్టతౌతుని కావ్య కౌతుకములోనిది. ఈగ్రంథ మనుపలబ్ధము. పై ప్రతిభాలక్షణమునే అభినవ గుప్తాచార్యులు 'ప్రతిభా అపూర్వవస్తు నిర్మాణ క్షమా ప్రజ్ఞా' అని వివరించిరి. ఆనంద

వర్ధరాచార్యులును ప్రతిభయొక్క ఆవశ్యకతను దెలుపుచూ యితిప్పృత్తమెంత పురాతనమయినను ప్రతిభ వలననే యప్పు కొంగ్రొత్తగా కన్పించుచుండునసియు, దీనివలననే కావ్యభాగధేయము నిత్యాభినవత్వమనియు ప్రతిపాదించిరి.

తిరిగి ప్రస్తుతమునకు వత్తము. చరాచరాత్మకమయిన ప్రపంచమును పరికించుట కావ్యరచన కొక ప్రధానకారణము,

*చరస్థిరానేక విధ లోకవృత్తాను వర్తిత ।*
*కావ్యస్వ్య కరణం లోకజ్ఞాన ముచ్ఛ్రసితం కవేః॥*

ఎంతటి కావ్యరచనాశక్తియున్నను, యీలోకజ్ఞానము లేని కవి ఋశ్యశృంగునివలె లోకుల పరిహాసమున కాస్పదమగును.

*అజ్ఞాత లోకవృత్తో యః కావ్యస్య కావ్య విదస్యతాం*
*ఋశ్యశృంగ ఇవాశేషైర్హస్యతే ముగ్ధసంసది॥*

అనవరతము కావ్య పఠనమును ఆత్యావశ్యకము.

*లోకశాస్త్ర విశేషజ్ఞః కావ్యనిర్మాణ కౌతుకీ।*
*కావ్యాని కాలిదాసాదే స్సతతం పరిశీలయేత్॥*

కవికి వివిధరచనములతో (శాస్త్రేతిహాస పురాణకావ్యములతో) పరిచయముండవలయును ఎందువలననగా నొక్కొక్కజంతువునకు నడక వేరువేరుగా నున్నట్లు యీరచనల రీతులును వివిధముగానుండును.

*అన్యా హి గతిః శ్వాన్య గతి రన్యా ఖరోష్ట్రయోః*
*మదక్లిన్న కపోలస్య గతిరన్యా హి దన్తినః॥*
*లోకశాస్త్ర పురాణానాం రీతయో హి పృథక్ పృథక్*
*రీతిరన్యైవ కావ్యానాం లోకోత్తర పదస్పృశాం॥*

సుధానిధి కారుడిట్లు కవికి ఉత్తమస్థానమునిచ్చుచూ, తదర్థము వేదప్రామాణ్యమును గూడ నిచ్చెను.

*అనన్త మవ్యయం కవిం.*
*కవిం కవీనా ముపమశ్రవస్తమం.*
*విం స్వమూజ మతిథిం జనానాం.*

ఈకవి సృష్టికర్తయగు బ్రహ్మకన్న మిన్న. ఈభావమునే ధ్వనికారుడును ప్రతిపాదించెను. బ్రహ్మవలె గాక యీ కవికి చరముల నచరములుగను, అచరములను చరములుగను మార్చుశక్తి యున్నందున యితనియందు బ్రహ్మకన్నను యాధిక్యత గన్పించుచున్నది. ఈసందర్భమున ధ్వన్యాలోకమునందలి యొకశ్లోకము గూడ వివ్వబడినది.

*భావానచేతనానపి చేతనవచ్చేతనా నచేతన వత్*
*వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే*
*స్వాతంత్ర్యతయా॥*[1]

కావ్యశరీరము తద్వివిధావయవములతో నొక భౌతికదేహముతో పోల్చబడినది. ఈకావ్యశరీర సాదృశ్యము మొదట ధ్వనికారునిచే ప్రతిపాదింపబడినది.

*శబ్దార్థౌ దేహవద్దోషాః చి(శ్వి)త్రాది వదథోగుణాః।*
*శౌర్యాది వదలంకారాః హారగ్రైవాం గదాదివత్॥*
*రసాదిధ్వని రాత్మైవేత్యనయా కిం వ్యవస్థయా।*

ఈ కావ్యసామగ్రి లోకసామగ్రుల సాదృశ్యము విద్యానాథునిచే చక్కగా వివరింపబడినది[1]

---

1. కవిసృష్టి విశ్వసృష్టికన్నను అధికమనుభావము మమ్మటునియందును కాననగును.

*నియతికృత నియమ రహితాం*
*హ్లాదైక మయీ మనన్య పరతంత్రాం।*
*నవరస రుచిరాం నిర్మితి*
*మాదధతీ భారతీ కవేర్జయతి॥*

1. ప్రతాపరుద్రీయము. (బాలమనోరమాప్రెస్ పే 32)

*శబ్దార్థౌ మూర్తిరాఖ్యాతౌ జీవితం వ్యంగ్యవైభవం*
*హారాది వదలంకారాస్తత్ర స్యు రుపమాదయః॥*
*శ్లేషాదయో గుణాస్తత్ర శౌర్యాదయ ఇవస్థితాః।*
*ఆత్మోత్కర్షావహాస్తత్ర స్వభావా ఇవ రీతయః॥*
*శోభా మాహార్యకం ప్రాప్తా వృత్తయో వృత్తయో యథా।*
*పదానుగుణ్య విశ్రాన్తిశ్శయా శయ్యేవ సమ్మతా॥*
*రసాస్సాంద్ర ప్రభేదాస్స్యుః పాకా పాకా ఇవ స్థితాః।*
*ప్రఖ్యాతాలోకవదియం సామగ్రీ కావ్యసంపదః॥*

## దోషము

కావ్యదోషములను చర్చించు భాగము మన కుపలబ్ధముకానిది విచారకరము. ద్వితీయోన్మేషమున గుణాలంకారాదులకు సాధారణ లక్షణములనిచ్చుచూ దోషమును 'ముఖ్యార్థవ్యాహతి' అని, అనగా రసపోషణ నిరోధమని నిర్వచించెను

ముఖ్యార్థ వ్యాహతిర్దోషో రసో ముఖ్యస్త దాశ్రయాత్ :। [1]

దోష మెంతలేశమయినను సుందరమయిన శరీరమునొక బొల్లిమచ్చ యెట్లు దుర్భగముగునట్లు జేయునో, అట్లే నిదియు కావ్య సౌందర్యమును పాడు జేయును.

శబ్దార్థౌ దేహవద్దోషాః చి (శ్చి) త్రాదివదధో గుణాః। [2]

నాలుగు విధములయిన దోషములను మన గ్రంధకర్త చర్చించినట్లు యీ సందర్భమున వ్యాఖ్యాత్రీ వికముగా వ్రాయబడినది.

అత్రాచ్యుత సంస్కారాది శ్శబ్దదోషః। ప్రతికూల వర్ణత్వాది వాక్య (వ్య) గతోదోషః। శ్రుతికటుత్వాది రుపదోషః। వ్యభిచారి స్థాయి భావానాం శబ్ద వాచ్యాదయో దశ (రస) దోషాః॥

ఈ దోషములపై పెద్దల చర్చ మన వ్యాఖ్యాతలయందు తారతమ్యమున యున్నంతవరకు మన గ్రంధకర్త మమ్మటుపై నాధారపడెనో తెలియదు.

## గుణము.

రసధ్వని మతానుయాయి అయినందున మన గ్రంథకారుడును కావ్యశరీర సాదృశ్యము నామోదించెను.

శబ్దార్థౌ దేహవద్దోషాః చి (శ్చి) త్రాది వదధో గుణాః।
శౌర్యాది వదలంకారా హార గ్రైవేయగదాది వత్॥. [2]

భౌతికదేహమున శౌర్యాదిగుణము లాత్మగుణములో నట్లె యీ కావ్యగుణములును కావ్యాత్మయైన రసమునకు సంబంధించినవి.

శౌర్యాదయ ఇవాత్మాపం యే ధర్మా అంగినం రసం।
ఉత్కర్షయన్తి నియతయస్తే గుణా ఇహా॥

X X X

సమ్యస్తి నిత్యముత్కర్షం సమవాయా ద్రసం గుణాః।
శౌర్యాదయ ఇవాత్మానం శరీరేషు శరీరిణాం॥

ఈ సందర్భమున ఉద్భటుని మతఖండనము చేయబడినది. ఉద్భటుడు గుణాలంకారములు రెండును కావ్యముతో సమవాయ సంబంధము గలవియని దురభిప్రాయపడెను.

మమ్మటునను సరించి మన సుధానిధికారుడును మాధుర్యాదులనే యంగీకరించెను—మాధుర్యము, ఓజస్సు, ప్రసాదమను, అంతేగాక మమ్మటునివలెనే యితడును వామనుని శబ్దార్థగుణముల నన్నింటిని వివరించెను. [2] కొన్నింటిని పైమూడు గుణముల నంతర్భవింపజేసెను. కొన్నిగుణములను దోషాభావ

---

1. చూ. మమ్మటుడు VI. 1.
ముఖ్యార్థ వ్యాహతిర్దోషో రసశ్చ ముఖ్యస్త దాశ్రయాద్వాచ్యః।

2. చూ. దండి. I. 7.
తదల్పమపి నోపేక్ష్యం కావ్యేదుష్టం కథంచన।
స్యాద్వపుస్సుందరమపి శ్విత్రేణైకేనదుర్భగం॥.

1. చూ. మమ్మటుడు—
యే రసస్యాంగినో ధర్మాశ్శౌర్యాదయఇవాత్మనః।
ఉత్కర్ష హేతవస్తేస్యుం రచల స్థితయోగుణాః॥.

2. ఇచట మన గ్రంథకర్త చాలావఱకు మమ్మటుని వచనములను స్వీకరించెను.
చూ. కావ్యప్రకాశము.

 

చూ మమ్మటుడు.

దీప్త్యాత్మ విస్తృతేర్హేతు రోజో వీరరసస్థితి।
బీభత్స వీర రసయో రస్యానిక్యం క్రమేణతు॥

ఈ రసక్రమమునందును మన గ్రంథకారుడు మమ్మటునే యనుసరించి ఆనందవర్ధనాభి నవగుప్తుడిచ్చిన అద్భుతరసమునకు పర్యాయముగా బీభత్సమునిచ్చెను. విద్యాధరునివలె ఓజోగుణము భయానకరసమం దధికమనియు ప్రతిపాదించెను.

కావ్యప్రకాశోక్త ప్రకారేణ ఓజసో త్రయవృత్తిత్వం ప్రతిపాద్య విద్యాధర ప్రతిపాదిత క్రమేణ మగ్న మనోవృత్తి స్వభావే భయానకేచ విభావ్యస్య దీప్తత్వ ఓజః పరాంకాష్ఠా మధితిష్ఠతీతి ప్రతిపాదయతి.

కించిన్మగ్న మనోవృత్తి స్వభావే ऽపి భయానకే।
దీప్తత్వేన విభావ్యస్యతజత్యోజః పరాంభవం॥

ప్ర-ప్రసాదగుణము శుష్కేంధనము నందగ్ని వ్యాపించినట్లు చిత్తమున శీఘ్రముగ ప్రసరించును.

యశ్చిత్తంవ్యశ్నుతే ऽహ్నాయ శుష్కేంధనమివానలః।
స ప్రసాదో గుణస్సర్వ రససాధారణ స్థితిః॥

చూ మమ్మటుడు, ఆనందవర్ధనుడు—

శుష్కేంధనాగ్ని వత్స్వచ్ఛ జలవత్సహసైవ యః।
వ్యాప్నోత్యన్య ప్రసాదో ऽసౌ సర్వత్ర విహితాస్థితిః॥
కావ్యప్రకాశము VIII 70

సమర్పకత్వం కావ్యస్య యత్తు సర్వరసాన్ ప్రతి।
స ప్రసాదో గుణోజ్ఞేయ స్సర్వ సాధారణ క్రియః॥
ధ్వన్యాలోకము (చౌఖంబ ముద్రణము).
పే 86

తదనంతర మీ గుణముల కనుగుణమయిన అక్షరములు, ఆయా గుణములకు తగినట్లు వాని కూర్పు చర్చింపబడినవి. గుణసంఘటనల మధ్యగల సంబంధ విషయమై మనగ్రంథకారుడు ధ్వనికారుని వలెనె వక్తృవాచ్యాదుల ఔచిత్యమె సంఘటనకు నియామక హేతువని నిరూపించెను

గుణ స్సంఘటనా చైకం, తత్త్వమిత్యాద్రియేత చేత్।
హేతవ స్తన్నియమనే రసా వాచ్యాదయో యథా॥
గుణాధీనా సంఘటనే త్యస్మిన్ పక్షే రసాదయః।
రచనాయాం నియన్తారః తదా వాచ్యాదయో నహి॥
యథాకవేర్నిరసత్వే వక్తుః తద్గ్రథితస్య చ।
రచనాయాం కామచారః నరసత్వే తయోర్నపః॥
రచనా పరతంత్రత్వే గుణానాం స్వీకృతే సతి।
వక్తృ వాచ్య ప్రబంధానాం ఔచిత్యాద్రచనా భవేత్॥
ప్రాతికూల్యేన వర్ణానాం దోషో ऽపి న తదాభవేత్।

అలంకారము [1]

కావ్యశరీర సాదృశ్యమున కావ్యాలంకారములు హారకేయూరాదులతో బోల్చబడినవి.

యేత్వంగభూత శబ్దార్థద్వారా తం సన్తమేకదా।
అలంకుర్వన్త్యలంకారా హారాద్యా ఇవ తే పునః॥ [2]

1. అలంకారచర్చకై నిర్ణీతమయిన యీతృతీయోన్మేషమునమొదట అలంకారలక్షణాదిక మివ్వక భట్టగోపాలుని సాహిత్యచూడామణియందలి కొంతభాగము నిచ్చుట ఆశ్చర్యకరము, ఈ భాగమున అలంకారసామాన్య లక్షణమును, తద్భేదములును యివ్వబడినవి. ఆ గ్రంథభాగ మిట్లున్నది—

క్రమప్రాప్తం తృతీయకావ్యం లక్షయతి. అస్మిన్ ప్రసంగే గోపాలస్వామినః పద్యాని కాని (చ) న లిఖ్యంతే

అథ శబ్దైక విషయానలంకారాన్ ప్రచక్ష్మహే।
యావతః ప్రాహురాచార్యా స్సంక్షేపణ చిరన్తనాః॥
తత్రాపి యమకాదీనామస్పష్ట రససంపదాం।
కావ్యాంగ గదుభూతత్వా ద్దిఙ్మాత్ర ముపవర్ణ్యతే॥
కో నామ రసికో లోకే లావణ్యామృత వర్షిణి।
కపోలఫలకే తన్వ్యాః కుర్యా దేందద కుండలం॥
వదన్తి శబ్దాలంకారాన్ బహూనన్యే మనీషిణః।
పరివృత్తి సహిష్ణూన్వా న తే శబ్దైక భాగినః॥
తే చ వక్రోక్త్యనుప్రాసౌ యమకం శ్లేష ఇత్యపి।
చిత్రం చ పంచమ ష్షష్ఠో ऽప్యాఖ్యానః పునరుక్తవాన్॥

2. చూ కావ్యప్రకాశము.

ఉపస్కుర్వన్తి తం సంతం యో ऽంగద్వారేణ జాతుచిత్।
హారాదివదలంకారాస్తే ऽను ప్రాసో పమాదయః॥
ధ్వన్యాలోకము II 18

అలంకృతానాం సర్వాసా మలంకారత్వసాధనం।

అలంకారములు శబ్దార్థమయమయిన కావ్యదేహమున కుత్కర్ష గల్గించుచూ, తద్ద్వారా కావ్యాత్మయైన రసమునుగూడ నుపస్కరించుచున్నందున నివి రసముతో సంయోగ సంబంధమును గలిగియున్నవి. కాని గుణములు రసము (ఆత్మ) నందే యున్నందున వానిది సమవాయ సంబంధము.

సంయోగవృత్త్యాలంకార శబ్దార్థ విషయా రసం।
కదాచిదుపకుర్వన్తి హారాద్యా ఇవ దేహగాః॥

తృతీయోన్మేషమునందు మొదటి భాగము మాత్రమే మన వ్రాత పతులం దుపలబ్ధమగుచున్నది. ఈ యున్మేషమంతయు నలంకారచర్చకే నిర్ణీతమయినట్లున్నది

కాని తృతీయభేదమయిన చిత్రకావ్యము లేక అధమకావ్యముక్రింద నీ యలంకారములు చర్చించబడినవి. ఈ చిత్రకావ్యమున వ్యంగ్యార్థము సమ్యగ్వ్యక్తముగాదు.

తస్యాస్ఫుటత్వే ऽలంకార ప్రాధాన్యే కావ్యమిష్యతే।
చిత్ర శబ్దార్థ విషయమధమం చిత్రమిష్యతే॥ [1]

చిత్రకావ్యము ద్వివిధము—శబ్దచిత్రము, అర్థచిత్రము. వీటిక్రింద శబ్దాలంకారములు, అర్థాలంకారములు చర్చించబడినవి శబ్దాలంకారములారు – వక్రోక్తి, అనుప్రాసము, యమకము, శ్లేష, చిత్రము, పునరుక్తవదాభాసము ఈ అలంకారచర్చ యంతయు కావ్యప్రకాశమునందువలెనే యున్నది. అర్థాలంకారములలో ఉపమేయోపమాలంకార చర్చతో వ్రాతప్రతులన్నియు ముగియుచున్నవి.

## రసము

ద్వితీయోన్మేషమునం దసంలక్ష్య క్రమధ్వని భేదములలో రసము చర్చించబడినది. రసమొక అలౌకికమయిన ఆనందానుభూతి హృదయమును చొచ్చుకొని కౌగలించినట్టి రసానుభవముండును.

హృదయంసమావిశన్నివ సర్వాంగీణమివ గాఢమాలింగన్,
సర్వమివాన్యత్తిరయన్నలౌకిక చమత్క్రియాకారీ॥

సర్వవిధముల యీ రసానుభవము బ్రహ్మానంద సబ్రహ్మచారి అను అభినవగుప్తుల వచనమును మమ్మటునివలెనే మన గ్రంథకారుడును ఆమోదించెను.

అనుభావయన్నేవ పరబ్రహ్మాస్వాదైక నియతమానందం
అలంబ్య దన్మితస్థితి రభిధా తాత్పర్యలక్షణా పదవీం॥
అనధిగత నిర్వికల్పకసరణి మననమాత్రభూతః।
స్వాద శృంగారాది ర్న చ కార్యోనైవ చ జ్ఞాప్యః॥
ఇత్యభినవ గుప్తోక్తం రసస్య లక్షణ ముదితం నన్యక్[1]

అభినవగుప్తుల రసధ్వని మతము నవలంబించుచు అంతఃపూర్వము రససూత్రమును వ్యాఖ్యానించిన వాదములనన్నిటిని సంక్షిప్తముగా వివరించెను.

ఈ రసము కావ్యాత్మ అయినందున గుణాలంకారాది కావ్యాంగములన్నియు దీని స్వాధీనమునందుండును.

దోషా గుణా అలంకారా స్సర్వేऽపి రసగోచరాః।
కావ్యస్యాత్మా రసో యస్మాదాత్మ ధర్మాశ్రితే యతః॥

అందుచేతనే రసమున 'ముఖ్యార్థ' యని దోష నిర్వచనముండెను

ముఖ్యార్థవ్యాహతి ర్దోషో రసోముఖ్యస్త దాశయాత్,

విభావానుభావాది సామగ్రిచే రసము స్థాయీభూతమైనందున అభిధాలక్షణాతాత్పర్యాదులతో దీనికి సంబంధములేదు.

1. చూ. మమ్మటుడు. I. 5.
శబ్దచిత్రం వాచ్యచిత్ర మవ్యంగ్యం త్వవరం స్మృతం।
కావ్యస్యాత్మా రసో యస్మాదాత్మ ధర్మాశ్రితే యతః॥

1. మమ్మటుడు (Calcatta Sanskrit Series–6. P. 113–14)
హృదయమివ ప్రవిశన్ సర్వాంగీణ మివాలింగన్ సర్వమివ తిరోదధత్ స్వాదమివానుభవయన్నలౌకిక చమత్క్రియాకారీ శృంగారాదికో రసః।

ఈ సందర్భమున నవరసములును తత్తద్విభావాది సామగ్రియు వివరింపబడినవి. ఇందలి రస చర్చ మమ్మటకావ్యప్రకాశమున కంటె నెక్కువ విపులముగా నున్నది.

ఈరస భావాదులు (అనౌచిత్యకారణముచే) సమ్యక్ పరిపుష్టములుగాకున్న అవి సరిగా ప్రతిభాసములుగాక రసాభాసములు, భావాభాసములగును.

ఔచిత్య వర్జితా యే రసాశ్చ తే తదాభాసాః॥[1]

మన గ్రంథకారుని ప్రకారము శృంగారాభాసమే హాస్యరసమగును. తత్ప్రమాణముగా భరతుని వచనమివ్వబడినది.[2]

నన్వత్ర రసో హాస్యః ? సత్యం శృంగారాభాస ఏవహాస్యః 'శృంగారానుకృతి ర్యాతు స హాస్య ఇతి కథ్యతే' (సంజ్ఞిత:) ఇత్యుక్తత్వాత్ ।

పశుపక్ష్యాదుల శృంగారాదికము రసాభాసము కాదనియు, అదియును రసమే యనియు నభిప్రాయపడిన విద్యానాథునితొ మన సుధానిధికారు డేకీభవించెను.

అపరే తు రసాభాసం తిర్యక్షు పరిచయన్తి (ప్రచక్షతే)తాః పరీక్షాం క్షమతే (తన్న పరీక్షాక్షమం) ఏతేష్వపి విభావతః

సంభోగ విప్రలంభములను శృంగార రస భేదములు రెండును మనకు సుపరిచితములు. వాటికి గ్రంథమందు "నవయోగ"మను తృతీయభేదమొకటి నూతనముగా జేర్చబడినది ఈ నవయోగము పూర్వానురాగమనబడు విప్రలంభభేదమేగాని వేరొండు గాదు.

నవయోగ విప్రయోగౌ సంభోగశ్చాను బంధనో భేదాః।
తత్ర నవయోగ స్త్వసంగమోఽన్యోన్యసక్తయో రుభయోః॥
గుర్వాది పారతంత్ర్యా ద్దైవాద్వా విప్రకర్ష జుషోః।

విప్రలంభమున కితరాలంకారికులిచ్చిన పంచ భేదములలొ మానప్రవాసాదులు మాత్రమే యిచట గ్రహింప బడినవి.

విప్రలంభవతీ రుభయో ర్విశ్లేషో విప్రయోగస్తు।
మానప్రవాస భేదాత్..................॥

ప్రాప్తయోగప్రాప్తి ర్విశ్లేషో విప్రయోగః। తస్య ద్వౌభేదౌ। మానః ప్రవాసశ్చ ।

విప్రలంభభేదమయిన పూర్వానురాగమే నవయోగమను సంభోగ భేదముగా నివ్వబడినట్లు పైన జూపితిమి. ఇక శాప కరుణ భేదములు గ్రహింపబడలేదని గమనార్హము.

కావ్యమునందు రసమున కెంత ప్రాధాన్యమున్నను ఒక్కొక్కమారు తదధీనమునందున్న భావాదులు తదాధిక్యమును పొందుచుండును. ప్రభువొకడు తన యధీనుని వివాహోత్సవమునకుం బోయినతాత్కాలికముగా నతడు తన ప్రాధాన్యము నెట్లు గోల్పోవునో, అట్లే రసమును, భావాదులకు తాత్కాలికౌన్నత్యము నొసంగుచుండును. ఈ భావాదుల పోషణమునందు ఉదయము శాన్తి, సన్ధి, శబలత యను నాలుగంతస్థులను జూడగలము.

శాన్తి రుదయశ్చ సంధి ర్భావానాం శబలతేతి తే భావాః।
ముఖ్యత్వేఽపి రసానాంతేఽపి కదాచి ద్భజంతి ముఖ్యత్వం॥
...రాజానుగత వివాహప్రవృత్త భృత్యప్రకారేణ... ।

## ధ్వని.

మమ్మటుని వలెనే సుధానిధికారుడు అభిధా లక్షణావ్యంజనలను శబ్దవృత్తిత్రయమును వివరించి

1. చూ మమ్మటుడు–IV 46.
తదాభాసా అనౌచిత్య ప్రవర్తితాః

2. నాట్యశాస్త్రము ( Gaekwad Oriental Series ) I. 640-
శృంగారాభాసము హాస్యమగుటకు వీలులేదని యనిన భట్టగోపాలుని మతమును ఖండించుటయే యిచట సుధానిధికారుని ప్రధానోద్దేశముగా నున్నట్లున్నది.

ను, లక్షణావృత్తియందు మాత్ర యొక్క చిన్న మార్పు కలిగినది. రూఢిలక్షణ ప్రయోజన శూన్య మని, అభేదము నితడనుమతింపలేదు. మమ్మటుని లక్షణాభేదముల నారింటితో, విద్యాధరుడు జహద జహల్లక్షణను జేర్చి, యీ యేడింటిని ప్రయోజన లక్షణాభేదములుగా నిరూపించెను.

...వ్యంగ్య భూత ప్రయోజన శూన్యక్యా కుశలాదిషు రూఢి లక్షణయా అభిధాప్రాయత్వా ద్వ్యంగ్యస్యై వకార్య త్వా ద్రూఢిలక్షణాము పేక్ష్య జహత్స్వార్థా మజహత్స్వార్థాం జహదజహత్స్వార్థాం ద్వివిధాం సారోపాం ద్వివిధాం సాధ్య వసాయాం చాంగీకృత్య సప్తవిధత్వం లక్షణాయాః ప్రతి పాదితం। ఇత్థం ప్రయోజనవతీ సప్తవిధా లక్షణాదృష్టా।

మూడు శబ్దవృత్తులలోను వ్యంజనావృత్తి లేక ధ్వని ప్రధానమయినది. అదిలేని కావ్యమేయుండదు.

వ్యంగ్యస్య సత్తా ఛాయాపి యత్ర నాయాత్య వస్థితిం।
అలంకృత మలంకారై రపి కావ్యం న తద్భవేత్॥

స్త్రీకి సిగ్గే భూషణమయినట్లు, కావ్యమునకు ధ్వని ప్రధాన భూషణము.

'ముఖ్యా మహాకవి గిరా మలంకార భృతామపి
ప్రతీయమాన చ్ఛాయైషా భూషా లజ్జేవ
యోషితాం॥'[1]

యథా కేయూరహారాద్యనేకాలంకృతామపి స్త్రీణాం లజ్జైవ ముఖ్యాభూషా భవతి, తథా చిత్రయమక శ్లేషాలంకారా లంకృ... మహాకవిగిరాం ప్రతీయమాన చ్ఛాయైవ ముఖ్యాభూషా భవతి.

అలంకార ... మేకాదు. ఈధ్వని కావ్యమునకు ప్రాణము—(జీవితము).

తద్వ్యంగ్య ఏవ వాక్యార్థః కావ్య జీవిత మిష్యతే।

సుధానిధికారుడు ధ్వనివాదము నిట్లంగీకరించుచూ, తద్విరోధి మతముల నన్నింటిని ఖండించి, ధ్వనిమతముయొక్క సామంజస్యమును నిరూపించెను.

1. ధ్వన్యాలోకము. III 37.

ధ్వని ప్రాధాన్యతనుబట్టి కావ్యము, ఉత్తమ మధ్యమా ... భేదములుగా విభజింపబడినది

ప్రాధా... ణ భావాభ్యాం వ్యంగ్యస్యోత్తమ మధ్యమే।
కావ్యం ధ్వని ర్గుణీభూత వ్యంగ్య మిత్యుదితే ఉభే॥
తస్యా స్ఫుటత్వే ల్ంకార ప్రాధాన్యే కావ్య మిష్యతే
చిత్ర శబ్దార్థ విషయ మధమం చిత్ర మిష్యతే॥

ఎచట వ్యంగ్యార్థము ప్రధానమో అది ఉత్తమకావ్యము. వాచ్యార్థము ప్రధానముగానున్న కావ్యము మధ్యమ కావ్యము. వ్యంగ్యార్థము స్పష్టముగాకున్న యది అధమకావ్యము లేక చిత్రకావ్యము.

గ్రంథ పరిమితి.

అలంకార సుధానిధియందు కావ్యశరీర సాదృశ్యమునే ఊతగా గ్రహించి కావ్యాంగములన్నియు చర్చించబడినవని పైన జూపితిమి

శబ్దార్థౌ దేహవద్దోషాః చి(శ్వి)త్రాది వదధోగుణాః।
శౌర్యాది వదలంకారా హారగ్రైవాంగ దాదివత్॥
రసాది ధ్వనిరాత్మైవే త్యనయా కిం వ్యవస్థయా।

*            *            *

దోషా గుణా హ్యలంకారా స్సర్వేఽపి రసగోచరాః।
కావ్యస్యాత్మా రసో యస్మాదాత్మ ధర్మాశ్చ తే యతః॥

ఈ శ్లోకములనుబట్టి సుధానిధి యందు ప్రతిపాదితములయిన ఆలంకారిక విషయములు తెలియ నగును. పైన యివ్వబడిన విషయసూచిని దీనితో సరిపోల్చిచూచిన, కావ్యసామగ్రి యందు దోషచర్చ తప్ప తక్కినవన్నియు యున్నట్లు తెలియుచున్నది. ఈ గ్రంథకారుడు దోషచర్చనే చేయలేదేమోయనిన కాదు. ప్రథమోన్మేషమున ప్రాస్తావికముగా ప్రసంగించిన దానిని బట్టిజూడ నాలుగు విధములయిన దోషములు వివరింపబడినట్లు తెలియుచున్నది కదా!

తత్ర చ్యుత సంస్కారాది శ్శాబ్దో దోషః। ప్రతికూలవర్ణ త్వాది ర్వాక్య(చ)గతోదోషః। శ్రుతి కటుత్వాది రుభయ గతః। వ్యభిచారి స్థాయిభావానాం శబ్దవాచ్యాదయో దశ (రస)దోషాః॥

అన్ని విషయములలోను కావ్యప్రకాశమునే ప్రధానాదర్శముగా నుంచుకొన్నందున, యీగ్రంథము దానితో పోల్చిచూచినను దోషచర్చమాత్రమే యుందు లోపించినట్లు తెలియుచున్నది.

కాని సుధానిధియందు దోషచర్చ గలిగిన భాగముండి యుండవలయును. అది మన వ్రాతప్రతులలో కానరాకుండుట విచారకరము.[1]

**అలంకార సుధానిధియందు పేర్కొనబడిన గ్రంథములు, గ్రంథకారులు**

అలంకార సుధానిధియం దుదాహృత గ్రంథముల, గ్రంథకర్తల పట్టీ యిచట నివ్వబడినది—

అభినవగుప్తుడు, ఆనందవర్ధనుడు, ఉదాహరణమాల, ఉద్భటుడు, కాళిదాసు, కావ్యప్రకాశము, కుంతకుడు, (భోగనాథుని)* గణపతి స్తవము, (భోగనాథుని)* గద్యచూడామణి, గోపాలస్వామి (భట్టగోపాలుడు), (భోగనాథుని)* గౌరీనాథాష్టకము, విశ్వపతి కవియొక్క చమత్కారజ్యోత్స్న (విశ్వేశ్వరుని చమత్కారచంద్రిక).[2] (భోగనాథుని)* త్రిపురవిజయము, నాగానందము, బృహత్కథ, భట్టనాయకుడు, భట్టలొల్లటుడు, భరతుడు, భామహుడు, భాసుడు, భోగనాథుడు, భోగనాథకావ్యము (?) భోజుడు మంఖుకుడు, మమ్మటుడు, (భోగనాథుని)* మహాగణపతిస్తవము* (చూ. గణపతిస్తవము), మహాభాష్యము, మహావీరచరితము మహిమభట్టు మాలతీమాధవము, (భోగనాథుని)* మూషికాష్టకము, (భోగనాథుని)* రామోల్లాసము, రుద్రటుడు, లోచనము, వామనుడు, వాసవదత్త, విద్యాధరుడు, గోపాలస్వామి (ఆనందవర్ధన ? —) విరచిత విషమబాణము, వేణీసంహారము, వ్యక్తివివేకము, శంకుకుడు, (భోజుని) శృంగారప్రకాశము, (భోగనాథుని)* శృంగారమంజరి, షట్సహస్రీకృత్. (భరతుడు), హరి 1

1. శ్రీ రావు బహదూర్ నరసింహాచార్యులుగారు అలంకార సుధానిధిని దశోన్మేషముల గ్రంథము ఎట్లు అభిప్రాయపడిరో స్పష్టమగుటలేదు.
(Indian Antiquary 1916. P.32 ff)

* ఇట్లు పేర్కొనబడిన గ్రంథములు అనుపలబ్ధములు. సుధానిధియందున్న యీ గ్రంథభాగములను యీ వ్యాసమున కనుబంధముగా జేర్చితిమి

2. చమత్కారచంద్రికనుండి ఉదాహృతములయిన రెండు శ్లోకములలో నొకటి చక్రబంధోదాహరణము. ఈ చక్రబంధమునుగూర్చి ప్రయత్నము చేసి గ్రంథముయొక్కయు, గ్రంథకారునియొక్కయు నామములు (చమత్కారచంద్రిక, విశ్వేశ్వరుడు) చమత్కారజ్యోత్స్న, విశ్వపతి యని మార్చబడినవి ఇయ్యది శ్రీ యమ్. పి. యల్. శాస్త్రిగారిచే సరిగా నవగాహనము చేసికొనబడలేదు. (చూ. Indian Calture VI. PP. 439–47) 'The works of *Visvapati Kavi*, Gopalasvamin and Satsahasrc Krt have not come down to us. Nor the works from which he has quoted such as the *Camatkarajyotsna*, Udaharanamata, Tripuravijaya and Srngaramanjari అందు పేర్కొనబడిన గోపాలస్వామియే మమ్మటుని కావ్యప్రకాశమును వ్యాఖ్యానించిన భట్టగోపాలుడు. షట్సహస్రీకృత్తు నాట్యశాస్త్రకారుడయిన భరతుడు.

పై విషయసూచియందు జూపబడినట్లు అలంకార సుధానిధియందు చమత్కారచంద్రికాదు లుదాహరింపబడిన గ్రంథభాగమునకు సందర్భాను సరణమేలేదు పైగా అలంకార సుధానిధి 14 వ శ—లోని కన్నను చమత్కారచంద్రిక (1330–1400) వెనుక వ్రాయబడినందున దాని ప్రస్తావమే యుండదసంభవముగా నున్నది. కనుక యీ సందిగ్ధసాక్ష్యముపై నాధారపడి సుధానిధి కాలనిర్ణయమును జేయదగదు.

1. ఇంకను అనేకగ్రంథములనుండి ఉదాహరణములు సుధానిధియందున్నవి. కాని వాని గ్రంథనామములు కంఠోక్తిగా జెప్పబడలేదు.

## అలంకార సుధానిధి గ్రంథకర్తృత్వము

అలంకార సుధానిధియందలి ఆశ్వాసాంత గద్యములయందు తద్గ్రంథకర్తృత్వము, వేదవ్యాఖ్యాతయు, మాధవభోగనాథభ్రాతయు నయిన సాయణాచార్యులకే యున్నది. వ్రాతప్రతులు పరిశీలింపగా నిందలి కారికలు, వృత్తి, ఉదాహరణములు - వీటన్నిటికి నొకే గ్రంథకర్తృత్వ మున్నట్లు తోపదు.

ఆశ్వాసాంత గద్యములలో సాయణుని పేరున్నందున యితడు కారికలను రచించి యుండవచ్చును

ఇతిపూర్వ పశ్చిమ దక్షిణోత్తర... ..భోగనాథాగ్రజన్మనః సాయణాచార్యామాత్యేన కృతావలంకార సుధానిధౌ కావ్యశాస్త్ర ప్రతిష్ఠాపనం నామ ప్రథమోన్మేషః

ఇంతేగాక సాయణాచార్యుల సుధానిధి వర్గమున[1] కు గ్రంథము జేరియుండునని గ్రంథనామమునుబట్టి జెప్పగలము

సుధానిధియందలి ఉదాహరణములలో చాల వఱకు సాయణాచార్యస్తుతి పరముగా నున్నవి. సాహిత్యశాస్త్రమున ఏ గ్రంథమునను యీ విధముగా ఉదాహరణములలో గ్రంథకర్త ఆత్మస్తుతి యొనర్చుట కానరాదు. పైగా సంస్కృత వాఙ్మయమున పేరు వడసిన సాయణుని ఆత్మస్తుతి యొనర్చెననుట యెంతయు అనుచితము. ఉదాహరణములన్నియు భోగనాథుని ఉదాహరణ మాలనుండి గ్రహింపబడి యుండవలయునని పేరునుబట్టిజూడ, నీ యుదాహరణ మాల, అలంకార సుధానిధియందలి కారికల నుదాహరించు నిమిత్తమై వ్రాయబడిన శ్లోకసముదాయముగా నుండునట్లున్నది.

---

1. సుభాషితసుధానిధి. యజ్ఞతంత్ర సుధానిధి, ఆయుర్వేద సుధానిధి, కర్మవిపాక ప్రాయశ్చిత్త సుధానిధి. పురుషార్థ సుధానిధి.

సుధానిధియందలి ఉదాహరణములలో సాయణస్తుతి పరములయిన శ్లోకములేగాక మహాగణపతి స్తవము, రామోల్లాసము మొదలగు భోగనాథుని గ్రంథములనేకముల నుండియు సద్గృహీతములయినవి యున్నవి మఱికొన్ని శ్లోకములే గ్రంథములనుండియో సూచింపబడలేదు. కాని పరికింపగా నివియు భోగనాథ రచితములుగనే యున్నవి కాన సుధానిధి యందలి ఉదాహరణములన్నియు భోగనాథునిచే రచింపబడినవని చెప్పవచ్చును.

ఉదాహరణము లందును, వృత్తి యందును, సాయణాచార్యులను ప్రథమపురుషయందే పేర్కొనుటచే, యితడు వానిని రచించియుండడని యూహింపవచ్చును, ఇట్లే భోగనాథుడు వృత్తికారుడు కాడని యీ క్రింది వాక్యములవలన విదితమగుచున్నది

1. తేషా ముదాహరణాని భోగనాథ కావ్యేషు ద్రష్టవ్యాని
2. భోగనాథ విరచితే గౌరీనాథాష్టకే.... ...
3. ... .....భోగనాథ భక్తిభావ ప్రతిపాదన పరే
4. సభీసమావర్జనరూప నాయకస్య భోగనాథాదేర్వచనమిదం
5. ఇత్థమన్యే ऽప్యష్టాభేదాః శ్రీ భోగనాథ విరచితేషు గద్యచూడామణి ప్రభృతి షూన్నేయాః

భోగనాథుడే వృత్తికారుడయిన, తన్ను తాను ప్రథమ పురుష యందిచ్చియుండడు

కాన వృత్తికారుడు వేరని యిందు నిరూపితమయినది. ఇంతకుముందు, చమత్కార చంద్రికాది గ్రంథములనుండి ఉద్ధృతమయిన గ్రంధభాగము ప్రక్షిప్తమయి యుండునని జూపితిమి. కొందరు విమర్శకులు దీనిని ప్రక్షిప్తముకాదని యభిప్రాయపడి, దానినాధారముగా జేసికొని, చమత్కారచంద్రిక కన్నను అలంకార సుధానిధి వెనుక వ్రాయబడినదని యనిరి. అట్లయినను సుధానిధి—వృత్తికారుడు మాత్రమే విశ్వేశ్వరునికి వెనుకటివాడుగా యుండియుండునని భావించవచ్చును.

అన్యసాక్ష్యములు లేనందున ప్రస్తుతమునకు సాయణాచార్యులు సుధానిధికారికలను రచించెననియు యీ కారికలను భోగనాథుడు తన ఉదాహరణమాలయ దుదాహరించెననియు, వీరిద్దరికిని వెనుక మఱియొకడు కారికలను, ఉదాహరణములనుగూడ కలిపి వృత్తిని వ్రాసియుండవలయునని తోచుచున్నది. లేక సాయణాచార్యుల కోరికపై నెవ్వరో విద్వాంసుడీ సుధానిధిని రచియించి వారిపేరనే ప్రకటించియుండవచ్చును క్రిమిదష్టమయిన యొక శ్లోక మిందులకు ప్రమాణాధారకముగా నున్నట్లున్నది.

x x రసాశ్చర్య సంగ్రహే (సా) యణప్రభో:
ఆజ్ఞయావ్యాక్రియన్తే ... ర్థా అలంకారసుధానిధౌ॥.

ఈ ఊహ యొకనాటికి తథ్యమగునేమో! ఎందుకనగా యిట్లే సాయణాచార్య విరచితముగా నొప్పుచుండిన ఆయుర్వేద సుధానిధికి యాథార్థ్యముగా ఏకామ్రనాథుడే గ్రంథకర్తయని నిరూపింపబడెనుగదా! [1]

ఏది యెట్లున్నను మఱికొన్ని వ్రాతపతులు బయటపడి యీ సందేహమును దీర్చుగాత యని కాంక్షించుదము

ఉపసంహారము

అలంకార సుధానిధియందు ప్రత్యేకముగా గమనార్హమగు నట్టి విషయము లెక్కుడు లేవు. ధ్వనిమతము ననుమతించిన గ్రంథములలో నిదియొకటి. కావ్యప్రకాశమునే ప్రధానాదర్శముగా జేసికొని యీ సుధానిధి వ్రాయబడినది.

సాంస్కృతికముగ చారిత్రముగను సుధానిధి యొక్క ప్రాధాన్యత చెప్పదగియున్నది విజయనగర పాలకులొనర్చిన సంస్కృత వాఙ్మయ పునరుద్ధరణ సందర్భమున, రచింపబడిన గ్రంథములలో నలంకార సుధానిధి యొకటి. అంతేగాక, సాయణానుజుడైన భోగనాథుని గ్రంథముల విషయమై తెలిసికొనుటకు సుధానిధి యొక్కటే పరమావధి.

అనుబంధము

అనుపలబ్ధములైన భోగనాథ గ్రంథములనుండి సుధానిధియందు ఉదహరింపబడిన గ్రంథభాగముల నిచ్చట నిచ్చెదము—

1. రామోల్లాసము :—

తత్ర రామోల్లాసే—

శిశిరేషు శిలాతలేషు రామః తరుమూలేషు తలోదరీ దరీషు।
సరసీషు చ విశ్రమయ్య సుగ్రాం సహ సౌమిత్రిని తాం శనై రనైషీత్॥

ఇందు రామకథ ఇతివృత్తముగా నున్నది. ఇదే యితివృత్తముతో, గ్రంథనామము నుడువక మఱికొన్ని శ్లోకములు సుధానిధి యందున్నవి. అవియును రామోల్లాసము నందలివేమో.

క. పరితామ్ర విద్రుమ లతా పరంపరా
పునరుక్త దీధితి విశేషశోభినా।
రఘునాథ బాణదహనేన రంహసా
బడబానలస్య వపురప్యదహ్యత॥

ఖ. రటద్ధ్వంశ స్ఫోటాం చటుపతిత ముక్తా పటలికాం
నవజ్వాలాలీఢ స్ఫటికమణి వాతాయనపుటాం।
క్రిటన్ ... స్త్రీ వచన ... తాక్త ...
దపల్యం త్వాద్యం తు ... తిగ్మప్రహ మధాక్షీ దరిపురీం॥

అత్ర క్రీటత్ పుటభేదన ఘోషణ చేష్టా ప్రపంజన ఉపయకర్మణి పరుషాది వర్ణ విన్యాస విశేష రూపస్య.........

2. త్రిపురవిజయము :—

క. తథాత్రిపురవిజయే—

ఉపర్యధో రచిత మయశ్చ రాజితం
తయోర్ధ్వయోః కనకమయం చ మధ్యత:।
పురత్రయం దహనవిధేః పురో ప్యగాత్
సధూమతాం సదహనతాం సభస్మతాం॥

ఇత్యాదౌ భయానకరసే ఓజస్స్వీకార ః।

---

1. చూ. New Cotalogus Catalogorum Vol. II. P. 154 a.

ఖ. తథా భోగనాథకావ్యే త్రిపురవిజయే—

పౌలోమ్యాః కరయుగయంత్ర వారిధారా:
దీర్ఘాయా దశశతలోచనే పపాత।
సాపక్ష్మ వ్యతికర చంచరీక చంచ
న్నేత్రాబ్జస్తబక హ్రదేకనాల మాసీత్॥

అత్రబ్రహ్మ సృష్టానాం కమలత్వ ప్రతిపాదనం పక్ష్మాణాం చంచరికత్వ కథనం సలిలఘారాయాః కమలనాళత్వం బహూనాం కమలానామేక నాళ ధృతత్త్వంచ। ఏవం ప్రతిపాదనేన సహస్రముఖ ప్రసరత్కమల రూప కామాస్త్ర సిద్ధత్వం చ మహేంద్రస్య కవిసృష్టం చమత్కారావహం భవతి,

ఇందలి యితివృత్తము శివుని త్రిపురదాహమని గ్రంథ నామమువలన స్పష్టమగుచున్నది.

3. శృంగారమంజరి :—

క. ఉదాహరణం శృంగారమంజర్యాం—

సంభావ్యన్తే భరితభువనాస్సాగరోపాన్తవాసాః
విద్యుద్వల్లీ వలయిత వపుర్విభ్రమాః కాలమేఘాః।
అన్యోన్యాంగ వ్యతికరముషా మస్తరా గోపికానాం
రాసక్రీడా రసికమనసాం రాగిణా దైవతేన॥

ఖ. భోగవిభావో యథా భోగనాథస్య శృంగారమంజర్యాం—

ఈషస్పృష్ట కురంగనాభి తిలకై రిద్ధాన్త ఘర్మోదయై:
వ్యక్తీభూత రదక్షత వ్యతికరై ర్వ్యాకీర్ణ మూర్ధాలకై:।
శామ్యత్కుండల తాండవైశ్శశిముఖీ వక్త్రైస్తదాప్రేక్షితై:
అంభో విభ్రమ దర్పణై ర్నిజగదే సంభోగలీలా ముః॥

శ్రీ ప్రష్ణలీలలతో ముందలి మున్నెని ... యున్న ట్లున్నది, [1] గ్రంథముపేరు పేర్కొనక, యిదే విధముగ నున్న శ్లోకములింకను కొన్ని యున్నవి

క. చతురవిలాస యౌవన పతుర్విత చంద్రముఖీ
చకరా సరోజ చంక్రమ పదం కణ రింఖరాయా।
వయమిహ వర్ణనీయ విభవా శుకవానపయా
వనరుహనాభ వామనయనా కరుణాభరణా॥

---

1. ఇది అలంకారశాస్త్ర గ్రంథమని శ్రీ యమ్. పి. యల్ శాస్త్రిగారి యూహ సరిగాదు. (చూ. Indian Historical Quarterly XVII. 1941.PP. 393-7)

ఖ. భద్రం వాంశికచక్రవర్తి భవతాం పుష్ణాతు తేజః పరం
దృష్ట్వా దృష్ట్వ ఘనోదయ ప్రసరయా వృష్ట్యైవతాపాద్రహా
నిర్ధాంధాన మహీధరేంద్రవలనం నీరంధ్ర తాదృగ్గ సం
కర్ణై రంజలిభి: పిబన్తి కిల యద్గీతామృతం గోపికాః॥

గ. వామాంసో పరిభాగతో వివళిత గ్రీవాభిరామం వహత్
పక్త్రం వేణులతాప్తసప్త సుషిరవ్యాపార లోలాంగుళి
వ్యత్యాసోర్జిత పాదపద్మయుగళం వ్యాలంబిచూళీభరం
గోష్ఠ్యామాస్థితమాచ్యుతంవిజయతేగోటీమనోమోహనం॥

ఘ. ఉత్తంభయాచ్యుత శిరోభవి దుగ్ధకుంభ।
ముత్తంభయామి దయితే నహి తే వివేకః।
ఉత్తుంగయో రుపరి తాం స్తనయో రియం తే
హాహా కిమర్థ తి వదేతి హరిర్జహాస॥

జ. పాథఃక్రీడనమారచయ్యసిచయంవ్యత్యస్తమాపాదయన్
విశ్వాస ప్రసభహాస్యగం ప్రియసఖీ సత్యాసనాద్వంచితే।
కంసారిం కమలాకరే విరచయన్ ... వాంఛితం
సంవ్యానం సవిధీకరోతు భవతామవ్యాహతాం సంపదం॥

చ. ఆసీన్నాదః ప్రథమముదయస్తత్ర జాత శ్రుతీనాం
తస్మాల్లగ్నే సరిగమపదే త్వక్షరాణాం వికాసః।
తస్మాద్రాగాస్స్ఫుట ముదమిషంస్తన్ముఖాదేవ శౌరేః
వేణోరాసన్ వివిధరచనా స్సానుబంధాః ప్రబంధాః॥

ఛ. అపురాణ మమూల్య మప్రమాణం
నిరపాయం నిరుపాధి కల్పనీయం।
నిజమధ్యజుషాం నితంబినీనాం
యమునా శంబర మంబరం వ్యతానీత్॥

4. గౌరీనాథాష్టకము :—

క భోగనాథ విరచితే గౌరీనాథాష్టకే

కష్టాయ ప్రపన్నాయ శాస్త్రపదవీ శిష్టాయ సాంఖ్యానల
పుష్టాయ ప్రథమాన మత్సరగణా పుష్టాయ దుష్టాత్మనే।
రుష్టాయ ప్రతిషిద్ధ కార్యఘటనాతుష్టాయ స్పష్టాగసే
గౌరీనాథ గణాధినాథజనక ప్రీణాతు మహ్యం భవాన్॥

ఖ. మూఢాయ ప్రతికూల కాల ఫణభృల్లీఢాయ రూఢిచ్యుత
ప్రౌఢాయ ప్రబలానిరోధ కలహవ్యూఢాయ గాఢాంహసే।
గూఢాయ ప్రథమానదుర్మద ముహూర్మూఢాయ సోఢాఖిలం
గౌరీనాథ గణాధినాథ జనక ప్రీణాతు మహ్యం భవాన్॥

అత్రవైరాగ్య జుగుప్సి తవ్య స్వరూప ప్రతిపాదన పరపాద త్రితయవర్తి బీభత్స రస వ్యంజక పరుష వర్ణ విన్యాస రూపస్య మార్గస్య శృంగార రసావలంబన భూత గౌరీనాథ విషయ భోగనాథ భక్తిభావ ప్రతిపాదన పరే తురీయే పాదే పరిత్యాగో న కృతశ్చే త్స ఏవ దోషః।

అనుప్రాసాలంకృతమైన యీ అష్టకమునకు "గౌరీనాథ... ..' అను మకుటమున్నట్లున్నది.

5. మహాగణపతి స్తవము :—

క. దేవతాగుర్వో రుభయోరపి భక్తిర్యథా భోగనాథస్య మహాగణపతిస్తవే—

మందారశ్చ తరుః పరేఽపి తరవో మేరుశ్చ శైలః పరే
ప్యాశ్శైలాః కమలాగృహస్థశయనం చాబ్ధిః పరేఽప్యబ్ధయః।
శ్రీకంఠశ్చ గురుః పరేఽపి గురవో లోకత్రయేఽప్యద్భుతం
భక్తాధీన భవాంశ్చ దైవతమహో సర్వేఽప్యమీ దేవతా॥

ఈ శ్లోకమునందు, భోగనాథుని గురువు శ్రీకంఠుడు పేర్కొనబడెను.

6. మూషికాష్టకము :—

క. భోగనాథస్తోత్ర సహస్ర్యాం మహాగణపతిస్తుతా మూషికాష్టకే—

క్షీ.......................కలయ త్వేక్షవో రక్షణీయా
మాద్యో మాద్యాస్తు వేద్యాశ్రయతు ధృతవపుః పౌష్కరం సన్నిధానం।
హృద్యాకారో దయార్ద్రః ప్రవిశతు కిమయం దుగ్ధరూ...
.....................సలిలనిధీనా ఖు రాఖ్యాత్యుపేతాన్॥

ఖ. పై శ్లోకమే మరియొక సందర్భమునను యున్నది
క్షీశాత్తా ద్వారి రోధం క్షణమిహ కలయత్వైక్షవో రక్షణీయా
మ(మా)ద్యో మాద్యాస్తు వైద్యాశ్శ్రయతు ధృతవపుః పౌష్కరం సన్నిధానం ।
దధ్యాకారో దయార్ద్రః ప్రవిశతు కిమయం దుగ్ధరూపో దయార్ద్రః
స్వీకార్యం స్వైరమిత్థం తవ సలిలనిధీ నాఖు రాఖ్యాత్యుపేతాన్॥

అత్ర రౌద్రబీభత్స వీర రసప్రసంగా భావేఽపి తదుచిత రచనా స్వీకార యోగ్యాఖ్యాది ప్రబంధవ్యతిరేకేణ స్థాయీ భూత భక్తిరూప రతి భావే మహాగణపతి స్తవే శ్రీమతో మహాగణపతే ... వాహనత్వేన సముపజాయమాన గర్వగరిమ్ణః ప్రభు భావనాధి... ప్రావౌద్ధత్యవ్యఞ్జ మూషికస్యోక్తౌ పరుషాక్షర ప్రాణపతి(థు)సంఘటనా శ్రీభోగనాథేన మహాకవినా నంముటితో।

ఈ శ్లోకావతారికనుబట్టి భోగనాథుడు 'స్తోత్రసహస్రి' నొకదానిని రచించినట్లును, దానినుండి మహాగణపతి స్తవమును, మూషికాష్టకమును ఉద్ధృతములయినట్లును విదితమగుచున్నది అంతేగాక మూషికాష్టకము మహాగణపతి స్తవాంతర్గతమనియు తెలియుచున్నది. ఈ క్రింది శ్లోకము... మూషికాష్టకమునుండియే యుండవచ్చును.

క... ...తర స్ఫూర్తయే
త్వ... ...(వే) గణేశ వృషతానాథాయ తస్మైనమః।
యద్వేగేన గుణాంత వాత సుహృదా యాదృచ్ఛికేనావిరాః
శీఘ్రా అప్య సకృత్పునర్వమధుభిః పూర్ణాస్స్వరం చార్ణవాః॥

ఇది ప్రసాదగుణమున కనుగుణ వర్ణముల కుదాహరణము

7. గద్యచూడామణి :—

ఇత్థ మన్యేఽప్యష్టౌ భేదాశ్శ్రీభోగనాథ విరచితేము గద్య చూడామణి ప్రభృతిషూహ్న్యాః

ఈ గ్రంథమును గూర్చి ప్రాస్తావిక వాక్య మొకటి యున్నది,

ఉదాహరణమాల అను గ్రంథము భోగనాథ విరచితమని చెప్పియుంటిమి. ఇది సుధానిధి కారికల నుదాహరించు నిమిత్తమై శ్లోకసముదాయమే గాని ప్రత్యేక గ్రంథముకాదు.

ఈ శ్లోకములన్నియు భోగనాథుని రచనా కౌశలమును తెల్లముజేయును భోగనాథుడు తన సోదరులైన మాధవసాయణులవలె విఖ్యాతి గాంచకున్నను, సాహిత్య వైశారద్యమునను, రచనా ప్రావీణ్యమునందును వారికి దగిన సోదరుడే యనదగును.

# ముసునూరి కాపయనాయకుఁడు

శ్రీ మేడూరి వేంకటసోమేశ్వర కృష్ణమూర్తి

కాకతి ప్రతాపరుద్రుని కాలమున 'ఓరుగల్లు' దివ్యవైభవమందెను. 'ఏకశిలానగరము' దుర్గప్రాకారాదులతో, సుందరోద్యానములతో, ఫలభరితములైన వృక్షసంపదతో, స్వచ్ఛశీతల జలప్రవాహములతో, అపురూపశిల్ప కళాసంపదతో భారతదేశమంతటను విఖ్యాతిఁజెందెను. ఎఱ్ఱదాచానాయక మాచయనాయకులు, ఇందులూరి రుద్రయ, బెండపూడి అన్నయామాత్యుడు, రేచర్ల సింగమనాయకుఁడు, సాహిణిమారుఁడు మొదలగు మహామాన్యులు, ప్రతాపరుద్ర రాజ్యభార దురంధరులు. ప్రతాపరుద్రుఁడు పండిత కవుల నాదరించెను. ఆంధ్రకవులేగాక, సంస్కృత, కర్ణాటక కవిపండితులుఁగూడ నాతని యాదరణకు పాత్రులైరి. విద్యానాథుఁడు ప్రతాపరుద్రయశోభూషణమను అలంకార గ్రంథము రచించెను. మార్కండేయపురాణము, భాస్కరరామాయణము నలనాఁటి సుప్రసిద్ధ గ్రంథములు. అగస్త్య విశ్వనాథులను కవులు సంస్కృత బాషలో నూతన గ్రంథ రచనలకుఁ దోవఁజూపిరి.

ఇట్టి మహావిభవముతో నలరారు కాకతీయ సామ్రాజ్యము ప్రతాపరుద్రుని కాలమున (బలుమార్లు ముసల్మానుల దాడులకు గురియయ్యెను. అల్లాయుద్దీన్ ఖిల్జీతోఁ బ్రారంభమైన యీ దాడులు 'ఉల్లుఖాన్'తో సమాప్తి జెందినవి. ఇతఁడే చరిత్ర ప్రసిద్ధిగాంచిన 'మహమ్మద్ బిన్ తుగ్లక్' ప్రతాపరుద్రుఁడితనికి బందీగా జిక్కినాఁడు. నాటితో గాకతీయ సామ్రాజ్య వైభవ మడుగంటెను. 'ఓరుగల్లు' పతనమయ్యెను. ఈ దుస్సంఘటన క్రీ. శ. 1323 లో జరిగెను.

ఒకప్పుడు శ్రీకాకుళము, వేంగి, విజయవాటిక, ఓరుగల్లు మొదలగు నగరములలో విలసిల్లి, సకల సంపదలతో, వీరశైవ ప్రచారములతో, భైరవార్చనలతో, మైలారదేవుని పూజలతో, ఏకవీరాదేవి (రేణుకాదేవి) మహోత్సవములతో, వైరిజనుల హృదయములు దద్దరిల్లజేయు కమ్మ, బలిజ, పద్మనాయక వెలమ, రెడ్డివీరుల శౌర్యప్రతాపములతో నలరారిన

కాకతీయసామ్రాజ్యము, పరతంత్రమగుటతోడనే ప్రజలవేదనలు, రోదనలు తెలుగునాట మిన్నుముట్టినవి. ముసల్మానుల భీషణదారుణ కృత్యములకగ్గమై జనులష్టకష్టములకు లోనైరి. ముసల్మానులు ధనవంతులను మట్టుపెట్టి వారి సిరిసంపదలు హరించిరి. దేవాలయములు మూలమట్టమొనర్చి దేవతావిగ్రహముల వికృతమొనర్చిరి. కవి పండితుల యగ్రహారములూడఁబెరికిరి ధనధాన్యములు. దారాపుత్రాదులు ఎప్పుడేమగునోయను చింత పురుషులఁబీడించుచుండెను. గో, బ్రాహ్మణహత్యలు వారి దైనందిన కార్యక్రమములు.

అట్టి దారుణదినములలో ప్రజలఁగాపాడి, ధర్మరక్షణకు స్వేచ్ఛా భాస్కరునివలె ప్రకాశించు కమ్మకులజుడగు ముసునూరి ప్రోలయనాయకుఁడు వారికి బాసటగ నిలిచినాఁడు. ముసల్మానుల దౌర్జన్యములకుఁ బ్రతిక్రియగ క్రీ. శ 1325 నాటికే ఇతని నాయకత్వమున పిఠాపురమునకుఁజెందిన కొప్పుల ప్రోలయనాయకుఁడు, అద్దంకి ప్రోలయ వేమారెడ్డి, తెలంగాణమునకుఁజెందిన రేచర్ల సింగమనాయకుఁడు, మంచికొండ గణపతినాయకుఁడు మహమ్మదీయుల పాలననుండి తెలుగునాటిని విముక్తము జేయ సంకల్పించిరి. ఈ స్వాతంత్ర్యపు పోరాటమునకు భద్రాచలమునకు సమీపమునఁగల 'రేకపల్లి' కేంద్రముగ నుండెడిది. ముసల్మానుల దండయాత్రలఁ బ్రతాపరుద్రుని సమయమునఁ బలుమార్లు నెదిర్చిన వయోవృద్ధులగు అన్నయమంత్రి కొలని ప్రతాపరుద్రదేవుల యండదండలు ప్రోలయనాయకునకు లభించెను. భద్రాచల ప్రాంతారణ్యములు వీరి నివాసప్రాంతములు వీరి నణఁచుట ఢిల్లీసైన్యముల కశక్యమయ్యెను దైవవశమున ఇదే సమయమున ఢిల్లీసుల్తాన్ ఘియాజుద్దీన్‌తుగ్లక్ పరమపదించెను. ముసల్మానుల దమననీతి నెదిరించుట కదను లభించెనని ఆంధ్రకోస్తాకు జెందిన మండలేశ్వరులు గ్రహించిరి. కమ్మవీరుఁడగు ప్రోలుని నాయకత్వము వీరికి లభించెను. తమ నెదిరింపగల వీరుఁడులేడని ముసల్మానులు మిడిసిపడు సమయమున వారికి బుద్ధిచెప్పి తిరిగి స్వాతంత్ర్యమునకు ప్రోలయనాయకుఁడు పునాది వేసెను.

ప్రోలయనాయకుఁడు కొలనిరుద్రదేవుఁడు, బెండపూడి అన్నయమంత్రి మొదలగు నాయకుల సహకారముతో తురుష్కసైన్యముల నోడించి శత్రువులబారినుండి ఆంధ్రకోస్తాప్రాంతమును విముక్తమొనర్చెను ప్రోలయ తురుష్కులచే బలాత్కారముగ నూడబెరుకఁబడిన యగ్రహారములు తిరిగి బ్రాహ్మణులకిచ్చెను. హిందూమత సంప్రదాయానుసారము నిర్భయముగఁ బ్రజలు కర్మలాచరించుటకుఁ బ్రోత్సహించెను. ప్రోలుని సత్పరిపాలనము గుర్తించి రైతులు ముందుకువచ్చి సానందముగ పండిన పంటలో నారవవంతు పన్నుఁజెల్లించిరి.

'ఓరుగల్లు' నాక్రమించి ముసల్మానుసైన్యముల దరిమి కాకతీయవైభవముఁ బునఃప్రతిష్ఠించుటయే ప్రోలయనాయకుని ప్రబలవాంఛ. కాని యతని కోరిక యీడేరకముందే ప్రోలయ మరణించెను.

ప్రోలయనాయకుని కార్యభార మతని పినతండ్రి కుమారుఁడగు కాపయనాయకునిపైఁబడెను. సామంతనాయకులందరు 'కాపయ' నాయకత్వము మెచ్చి, హర్షించి, యామోదము తెల్పిరి. ముసల్మాను సైన్యములఁబూర్తిగ తెలుగునాఁటనుండి తరిమి 'ఓరుగల్లు' పై వరాహలాంఛితమగు బావుటా నెగురవేయుటయే యాతని దృఢసంకల్పము

మహమ్మద్‌బిన్‌తుగ్లక్ అఖండవిజయములు సాధించి ఢిల్లీచేరిన కొలఁదికాలమునకే దక్షిణమున పరిస్థితులు తారుమారయ్యెను. ప్రోలయనాయకు

నకు లభించిన విజయములు హిందూనాయకులకు, మండలేశ్వరులకుఁ బ్రోత్సాహమిచ్చినవి. వీరందరు మహమ్మదుబీన్‌తుగ్లక్‌న కెదురుదిరిగిరి. క్రీ. శ. 1336లో హరిహరరాయలు, అతని సోదరుఁడు బుక్క రాయలు మహమ్మదీయ ప్రాభవము బ్రతిఘటించుటకు తుంగభద్రానదీ తీరమున ఋషిపుంగవుఁడును, ప్రకాండపండితుఁడు నగు విద్యారణ్యస్వామి యాశీర్వచనముతో విజయనగర సామ్రాజ్యమునకుఁబునాది వేసిరి. క్రీ. శ. 1335లో మధుర నవాబగు "జలాలుద్దీన్", తుగ్లక్ సార్వభౌమత్వమంగీకరింపనని ప్రకటించెను.

"తుగ్లక్" తెలంగాణముఁ బరయధీనమందుంచుకొనుట [illegible]స్తరమని గ్రహించెను. పరిపాలనాసౌలభ్యమునకై తెలంగాణము-'ఓరుగల్లు, బీదరు' ముఖ్యపట్టణములతో తూర్పుపశ్చిమభాగములుగఁ జేయబడెను. "మాలిక్‌మక్బూల్" తూర్పుతెలంగాణమునకు [illegible]గ నేర్పాటు చేయబడెను. తుగ్లక్ తిరిగి ఢిల్లీచేరెను.

ముసునూరి కాపయనాయకుఁడీపరిస్థితులనెప్పటికప్పుడు జాగరూకతతో గమనించుచుండెను. అతఁడు తెలంగాణమును నిదివరకే ప్రచ్ఛన్నముగ బ్రజలను తిరుగుబాటునకు సిద్ధపఱచెను. కాపయ తన మనోవాంఛా ఫలసిద్ధికై హిందూరాజుల, మండలేశ్వరుల సహకారమత్యంతావశ్యకమని గ్రహించెను. ఢిల్లీ సుల్తాను నెదిరించుట సామాన్యవిషయమా! కాపయ హోయసలరాజగు మూఁడవ బల్లాలునితో రాయబారములు సాగించి యతని సహకారము పొందెను. వీరుగాక ప్రోలయవేమారెడ్డి; హరిహరరాయలు కాపయకు తోడ్పడిరి. క్రీ. శ. 1340 నాటికి కాపయ ఓరుగల్లును స్వాధీనము చేసికొని "మాలిక్‌మక్బూల్"ను పారఁద్రోలెను. కాపయ "ఆంధ్రసురత్రాణ", "ఆంధ్రాధీశ్వర"యను బిరుదములు వహించెను. ఓరుగల్లు కోటపై శ్రీ[illegible] వరాహలాంఛిత కాషాయధ్వజము నెగురుటఁజూచి కాపయ నేత్రములానంద బాష్పములచే నిండెను. స్వదేశ, స్వధర్మ, స్వమత రక్షణార్థము ప్రోలయనాయకుఁడు లేవదీసిన ఉద్యమముఁజేపట్టి కాపయ కృతకృత్యుఁడయ్యెను.

కాపయ వీరుఁడు. పరిపాలనాదక్షుఁడు. శాత్రవాళి కళనిపాతము. అతఁడు రాజ్యాధికారముఁజేపట్టగనే, తనకు హృదయపూర్వక సహాయసహకారములందించినవారినే యా ప్రాంతములలోఁ బరిపాలకులుగ నియమించెను. తొయ్యేరు, రాజమహేంద్రవరములందు తన పినతండ్రి కుమారుడగు అనపోతనాయ[illegible]బాల తెనుంగు నృపాలుని కుమారుఁడగు ముప్పభూపాలుని సబ్బినాటను, కోరుకొండలో కూనయనాయకుని పరిపాలకులుగ నియమించెను. కాపయ రాజ్యమందంతటను శాంతిభద్రతలు గాపాడుటకుఁ దగినయేర్పాటు గావించెను. ప్రాచీన దుర్గములను బాగుచేయించి, ప్రధాన కేంద్రములందు సైన్యసమూహముల నేర్పాటుజేసెను. ఇట్లు కాపయ, తన తిరుగుబాటును సహింపక, మహమ్మదుబీన్‌తుగ్లక్ తిరిగి దండెత్తివచ్చిన నెదుర్కొనుటకుఁ దగిన సన్నాహములుచేసి, తెలుగుప్రాంతమును దృఢపఱచెను.

అటులుండియు, ఆంధ్రులలో ననైకత, జాతీయైకతను మట్టుఁబెట్టుచునే యున్నది. అద్దంకిలో ప్రోలయ వేమారెడ్డి స్వతంత్రుఁడయ్యెను, రాచకొండ, దేవరకొండలందు రేచెర్ల సింగమనాయకుఁడు స్వతంత్రుఁడై శత్రుత్వము వహించెను. ఈవిధముగ, నాంతరంగిక యుద్ధములకు మరలఁ బునాదులు పడెను. వీరిలో "రేచర్ల" వంశస్థులగు వెలమ నాయకులు కాకతీయు లనాదినుండియు సేవించెడివారు. వారి రాజధాని "రాచకొంత" ప్రకృతిసిద్ధములగు దుర్భేద్యములగు పర్వతపంక్తుల నరిహద్దులతో,

బలిష్ఠమై యుండెను ఈ వంశమునకుఁ జెందిన "ప్రసాదిత్యనాయకుఁడు" గణపతి, రుద్రమదేవుల సేవించెను వీరికుమారులగు వెన్న, గుబ్బినాయకులు రుద్రాంబ, ప్రతాపరుద్రుల కాలమున ననేక యుద్ధములలోఁ బాల్గొని తమ వీరప్రతాపములచేఁ బ్రఖ్యాతిఁజెందిరి. వెన్ననాయకుని కుమారుఁడగు ఎఱ్ఱదాచానాయకుఁడు ప్రతాపరుద్రుఁడు పాండ్యరాజులపై చేసిన దాడులలోఁబాల్గొని విజయములను బడసెను. అతని కుమారుఁడు సింగమనాయకుఁడు ఆంధ్రదేశాధీశ్వరుఁడైన కాపయయెడల నీర్ష్యాభావము గలిగియుండెను. ఇతడు "రాచకొండ"కు ఉత్తర దక్షిణప్రాంతములందు రాజ్యవిస్తరణముఁ గావించుటకుఁ బ్రయత్నించెను. చివరకు సింగమనాయకుఁడు కాపయపై దండెత్తెను. కాపయకుఁ బ్రథమమున నపజయము వాటిల్లినను, జాగుసేయక బలము చిక్కఁబట్టి పిల్లలమఱ్ఱిని జయించి రేచెర్లవంశీకులకుఁగల "అనుమనగంటి పురాధీశ్వర" బిరుదము నందెను.

"అల్లాయుద్దీన్ అబ్దుల్ ముజఫర్ హసన్ గంగూ బహమన్‌షా" క్రీ. శ. 1347లో బహమనీ రాజ్యము స్థాపించెను. కాపయ యాతనికి "తుగ్లక్" నెదిరించుటలో సైన్యసహాయముచేసెను పొరుగుననున్న నవాబుతో మైత్రితోనుండుట శ్రేయస్కరమని యతని తలంపు. కాని "బహమన్‌షా" బహమనీ రాజ్యము స్థాపించిన వెంటనే కాపయకు, హరిహర రాయలకు తన సార్వభౌమత్వ మంగీకరింపుమని ఓరుగల్లు, విజయనగరములకు రాయబారిమంపెను. కాపయ "బహమన్‌షా" దురుద్దేశ్యమును బ్రతిఘటించెను. "బహమన్‌షా" దురాక్రమణకు సిద్ధపడెను. మిత్రుఁడు ద్రోహమునకుఁ దలపెట్టునని కాపయ యూహింపలేదు. "బహామన్‌షా"తో గాపయ సంధి చేసికొనెను. కాపయ "బహమన్‌షా"కు గొన్ని యేనుఁగులు కానుకగ సమర్పించెను. ఈ సంధి ఫలితముగ "కౌలాస" కోటను దాని సామంత ప్రదేశముతో గూడ "బహమన్‌షా"కు నిచ్చివేయవలసి వచ్చెను.

ఇట్లు బహమనీరాజ్యస్థాపనము కాపయ యోచించినట్లు భద్రత కలుగకపోగా, ఓరుగల్లు సామ్రాజ్యమునకు భయాందోళనములకుఁ గారణమయ్యెను. మహమ్మద్‌బిన్‌తుగ్లక్ మరణానంతరము 'బహమన్‌షా' ఢిల్లీదండయాత్రలు సడలిపోయెనని సంతసించి నిర్భీతితొ దన యిచ్చవచ్చినట్లు సంచరించెను. "కౌలాస దుర్గము" వదలుకొన్నను, కాపయ తన సార్వభౌమత్వ మంగీకరింపలేదను సాకుతో నతనిని బూర్తిగ నణచివేయవలెనని క్రీ. శ 1356లో 'బహమన్‌షా'స్వయముగ వాహిని నడిపి తెలంగాణముపైఁ బడెను. సుమారు సంవత్సరకాలము కాపయ యాతనిని బ్రతిఘటించెను. 'బహమన్‌షా' భువనగిరిప్రాంత మాక్రమించి, దేవాలయములను పడఁగొట్టి, యా ప్రదేశమునందు మసీదులను నిర్మించెను కాపయ నాయకునకుఁగలిగిన ఈయపజయమువలన కోస్తాప్రాంత మందాతని పలుకుబడి తగ్గెను.

క్రీ శ. 1359 లో 'బహమన్ షా' మరణించెను. అతని కుమారుడు 'మహమ్మద్ షా' బహమనీ సుల్తానయ్యెను కాపయ బహమనీ సుల్తానుల యధికారము శాశ్వతముగ తుడిచిపెట్టుటకు హరిహర రాయలుతో మంతనములు సాగించెను విజయనగర హరిహరరాయలుకూడ తుంగభద్రా కృష్ణానదుల ఉత్తరభాగమును బహమనీసుల్తానునకు గోల్పోయియుండెను తమప్రక్కలో దినదిన ప్రవర్ధమానమగుచున్న మహమ్మదియ సామ్రాజ్యమువలన హిందూ రాజ్యాధికారమునకు ముప్పు వాటిల్లునని యుభయులు గ్రహించిరి. ఒడంబడిక చేసికొనినవెంటనే హరిహర రాయలును, కాపయనాయకుఁడును తమ తమ రాజ్య ప్రదేశములు తమకుఁ దిరిగి యిచ్చివేయవలసినదిగ

'మహమ్మద్ షా' కు రాయబారము మూలముగ కోరిరి.

'మహమ్మద్ షా' యుక్తిపరుడు. అతడు రాయబారములతో సంప్రదింపులు సాగించు నెపమున పదునెనిమిది మాసములు కాలహరణము చేసెను. ఈ కాలములో రక్షణకేగాక, విజయయాత్రకుఁగూడ కావలసిన యుద్ధసన్నాహముఁ బూర్తిచేసెను. సర్వవిధముల సమాయత్తుఁడై, విజయనగర ఓరుగల్లు ప్రభువుల కోరికల మన్నింపక, తాను సార్వభౌముఁడు గనుక, కానుకలు బంపుడని ప్రత్యుత్తర మిచ్చెను. 'మహమ్మద్ షా' చేష్టలు కాపయ కరికాలు మంట నెత్తి కెక్కించెను అతఁడు తన తనయుఁడైన వినాయకదేవునకు విశేష సైన్యమిచ్చి 'మహమ్మద్ షా' మీదకు పంపెను. అప్పటి విజయనగర రాజగు బుక్కరాయలు ఇరువది వేల అశ్విక దళము ను సహాయముగఁ బంపెను. 'మహమ్మద్ షా' పెద్ద సేన నిచ్చి వినాయకదేవు నెదిరించుటకు 'బహదూర్ ఖాన్' ను బంపి తాను విజయనగర రాజ్యముపైఁ బడెను. 'మహమ్మద్ షా' విజయమంది బుక్కరాయల నుండి యమూల్యమైన యాభరణములు, ప్రసిద్ధి కెక్కిన అరబ్బు గుఱ్ఱములు, నడగొండలవంటి యేనుగులు చేజిక్కించుకొని, తనరాజధాని గుల్బర్గా సేరెను. ఇతని సేనాపతి "బహదూర్ ఖాన్" మాత్రము వినాయకదేవుని చేతిలో బూర్తిగఁ బరాజితుఁడయ్యెను. ఇట్లు వీరయువకుఁడు వినాయకదేవుఁడు గెలుపంది భువనగిరి ప్రాంతమును వశపఱచుకొనెను. కాని వెంటనే 'మహమ్మద్ షా' మఱల సైన్యముఁగూర్చుకొని వినాయకదేవుని బరాజితునిఁజేసెను. కాపయ ఇరువది ఐదు ఏనుగులు, అమూల్య రత్నరాసు లర్పించి 'మహమ్మద్ షా' తో సంధి చేసికొనెను.

ఈ సంఘటనలు జరిగిన కొలఁది కాలముననే యొకనాఁడు గుఱ్ఱపువర్తకులు ప్రశస్తములైన గుఱ్ఱములను 'మహమ్మద్ షా' కమ్ముటకు 'వెలంపట్టన్' మీదుగ బోవుచుండిరి. అచ్చటనున్న వినాయకదేవుఁడు వారి గుఱ్ఱములను లాగుకొనెను. ఈవార్త నందిన 'మహమ్మద్ షా' బలసమేతముగ 'వెలంపట్టన్' ముట్టడించి, వినాయకదేవునిఁ గ్రూరముగ హింసించి చంపెను.

వీరయువకుని దుర్మరణమాలకించిన యాంధ్రప్రజలాగ్రహోదగ్రులైరి. వారు "మహమ్మద్ షా" పై కసి తీర్చుకొనుటకుఁ గంకణము కట్టుకొనిరి. వారు తెగబడి బహమనీసైన్యముపై రాత్రులందు దాడులు చేయుచు "కైలాసకోట" కుఁ జేరుచుండువున, బహమనీ సైన్యములో మూడింట రెండువంతులు మట్టుబెట్టిరి. 'మహమ్మద్ షా' గాయపడి ప్రాణముతో బైటపడెను.

కాపయ బలిష్ఠమైన తురుష్కరాజ్య మెట్లు పడఁగొట్టుటాయని యోచించుచుండెను. బుక్కరాయలు తనకు సహాయమంపుటకు వీలులేకపోయెను. కాపయ ఢిల్లీసుల్తాన్ ఫిరోజిషా తుగ్లక్ సహాయ మపేక్షించెను. అతఁడుకూడ కాపయకు సహాయ మంపలేదు. కాని ఢిల్లీ సుల్తానుతోఁ గాపయచేయు రాయబారపు వర్తమానమంది 'మహమ్మద్ షా' మఱల ఓరుగల్లుపై విఱుచుకొని పడెను. పరిస్థితులను మెలఁకువతో గ్రహించిన కాపయ తనదేశము వినాశముగాకుండ రక్షించుకొనుటకు 300 గజములు, 250 అశ్వములు, 33 లక్షల రూపాయల నిచ్చుకొని క్రీ శ. 1365 లో బహమనీసుల్తానులతో సంధి చేసికొనెను. అంతియే గాక 'గోల్కొండ' పర్వతదుర్గము బహమనీసుల్తానుకు వదలివేసెను. కాపయ 'మహమ్మద్ షా' కు రత్నఖచిత సింహాసనము కానుకగ పంపెను. నాఁటితో బహమనీసుల్తానులతో గాపయ మైత్రి వహించెను.

కాపయ మహమ్మదీయుల దండయాత్రల నెదుర్కొను సమయమున దేవరకొండ, రాచకొండలందు పద్మనాయకులు బలపడిరి. రేచర్ల సింగమనాయకుని

కుమారులైన అనవోత, మాదానాయకులు 'రాచకొండ' దుర్భేద్యముగావించి కృష్ణానది పర్యంత నాక్రమించిరి. అంతరంగిక యుద్ధమువలన ఐక్యమత్యమునకు విఘాతము కలుగునని యింతవఱకు సైరించిన కాపయ అనవోతనాయకుని తన యదుపులో నుంచఁ బ్రయత్నించెను. అనవోతనాయకుడు వెంటనే యుద్ధము ప్రకటించి, తనబలములతో నోరుగల్లు సమీపించెను, మహమ్మదీయులతోఁ జేసిన పోరులలో విపరీత నష్టమునకు గుఱియైన కాపయ యీ యనూహ్య సంఘటన నెదుర్కొనవలసియుండునని భావింపలేదు. విధి బలీయముగదా! క్రీ. శ. 1368 లో ఓరుగల్లునకు సమీపమునగల భీమవరముచెంత యుభయులకు ఘోర సంగ్రామము జరిగెను. ఈ యుద్ధయున కాపయ వీర స్వర్గమందెను.

కాపయ ప్రతిభావంతుఁడైన పరిపాలనాదక్షుఁడు, అకలంక దేశాభిమాని. ముసల్మానులు స్వైర విహారములు చేయు సమయమున వారినెదిర్చి హిందూ మత రక్షణఁ గావించిన మేటిప్రభువు. కమ్మకుల భూషణుఁడు. వర్ణ, కులభేదములను నిరసించి సంఘటితశక్తి, ఐక్యము కాంక్షించ్చిన విశాల హృదయుడు.

# కూచిపూడి నృత్యం

శ్రీ బందా కనకలింగేశ్వరరావు

కూచిపూడి కృష్ణాజిల్లాలో విజయవాడకు 32 మైళ్ళ దూరంలో బందరురోడ్డున ఉన్న గ్రామం. ఇది పూర్వం కృష్ణ ఒడ్డునే ఉండేది. కాని ఐదువందలేండ్ల క్రితం ప్రవాహమార్గం మారటంవల్ల కృష్ణానది కూచిపూడికి మూడుమైళ్ళు దూరమైంది. సాగరసంగమానికి ముందు త్రివేణి కావటంవల్ల లంకలేర్పడి ఆ ప్రదేశమే 'దివిసీమ' దివ్యసీమ అయింది.

కుచేలుడు కట్టినది కనుక కుచేలపురియైనది. క్రమముగా కూచిపూడి అయిందని పెద్దలంటారు. శ్రీకృష్ణుని ప్రియమిత్రుడైన కుచేలునికీ ప్రాంతంతో సంబంధమేలేదు. కనుక యీ వ్యుత్పత్తి కుదరదు. ఇది బహుశః పూర్వం కూచీలపురిగాని కుశీలవపురిగాని అయివుండాలనుకొంటాను. కుశీలవుడంటే సంచార నాట్యసంఘ సభ్యుడని అర్థం. దాని వైకృతమే 'కూచి' కావచ్చు. దీన్నిబట్టి కొన్ని సంచార నాట్య సంఘాల స్థావరమే కూచిపూడి అయివుంటుంది. మనకు తెలియవచ్చిన అనేక సంగతులకు ఇది సుసంగతం కూడా.

ఈ కూచిపూడి ప్రాంతానికి పెద్ద చారిత్రక ప్రాముఖ్యం ఉంది. శాతవాహన సామ్రాజ్యానికి తొలి రాజధానియైన శ్రీకాకుళం ఇక్కడకు ఆరుమైళ్లు. శ్రీకాకుళ నిర్మాత ఆంధ్రవిష్ణువిభుడు. అయన పేరిటనే నేటికీ ఇక్కడ ఒక దేవళం వుంది. తరచుగా వచ్చే కృష్ణముంపుకు వెరచి శాతవాహనులు తమ రాజధానిని ఇక్కడనుంచి 10 మైళ్ళ దూరంలోవున్న ధాన్యకటకానికి మార్చారు. ఈ ఆంధ్రవిష్ణు దేవాలయాన్ని సందర్శించి కళింగప్రభువులు అనేక దానధర్మాలు చేశారు. శ్రీకృష్ణదేవరాయలు ఆంధ్రవిష్ణువును పూజించి ఆ ఉత్తేజంతో ఆముక్తమాల్యద రచించాడు మహాయాన ఆచార్యుడు ఆర్యనాగార్జును డిచ్చటనే తనజీవితపూర్వార్థం గడిపి ప్రజ్ఞాపారమితలు సంస్కృతీకరించాడు.

కూచిపూడికి 5 మైళ్లలో ఘంటసాల ఉంది. అది క్రీ శ 2 వ శతాబ్దినుండి 14 వ శతాబ్దివరకు ప్రసిద్ధ బౌద్ధక్షేత్రంగా ఉండేది. బుద్ధుని గుర్రము పేరు కంటకశైలము. ఆ పేరుమీదనే ఘంటసాల వెలిసిం కంటకశైలమే మార్పుచెంది ఘంటసాల అయింది ఇది పూర్వం కృష్ణాతీరంలో పెద్దరేవు. ఇక్కడనుండి రోము, జావా, ఇండో చైనా దూర ప్రాంతాలతో వ్యాపారం జరుగుతుండేది ప్రవాహ మార్గం మారినందువల్ల కృష్ణ ఇప్పుడిక్కడికి రెండు క్రోసులదూరమైంది. మొవ్వగోపాలపదాలు వ్రాసిన క్షేత్రయ్య జన్మస్థానం మొవ్వ ఇక్కడకి రెండుమైళ్లు.

భారతదేశంలో కళల కన్నిటికీ మతమే మూలం అందువల్ల ఈ ప్రాంతములో ఏ మత ప్రాబల్యం ఎలా ఉండేదో తెలిసికోవలసి వుంది. క్రీ. పూ. 2 వ శతాబ్ది శాతవాహనులకాలంలో ఇక్కడ వైదికమతమే ప్రబలంగా ఉండేది. అది ప్రభువుల మతం కావటాన ప్రజలుకూడా హైందవ ధర్మాన్నే ఆరాధించారు. ఆనాడు దేవతార్చన ఒక నిత్యకృత్యం. శ్రీకాకుళంలోని ఆంధ్రవిష్ణ్వాలయం ఒక గొప్ప యాత్రాస్థలం. ఆ ప్రాంత ప్రభువులు దాన్ని ఆదరించి పెక్కు గ్రామాలు ఆ స్వామికి సమర్పించుకున్నారు. మూడువందలమంది దేవదాసీలు ఆ దేవాలయానికి తమ జీవితాలను అంకితంచేసారు. ఇక్కడ దొరికిన శిల్పఖండాలు వివిధ భంగిమల్లో ఉన్న దేవదాసీలను చూపుతున్నాయి. వారి కాచార్యులు బ్రాహ్మణులు. వారు ఉభయసంఖ్యలలో భగవానుని సమక్షంలో ధూపదీపాలతో నృత్యం చేసేవారు.

శాతవాహన రాజధాని ధాన్యకటకానికి మారిన తర్వాత వేదమతాన్ని వెనక్కిత్రోసి బౌద్ధమతం పైకెక్కింది. పలువురు విదేశ వర్తకులిక్కడికి వ్యాపారం కోసం వచ్చి పోతుండేవారు. వాళ్ళకేదో వినోద కాలక్షేపం కావాలి. అందుచేత శ్రీకాకుళ దేవదాసికలు ఘంటసాలకు వలసపోయారు. నెమ్మది నెమ్మదిగా బౌద్ధవిహారాలు వ్యభిచారకేంద్రా లయాయి. దేవదాసీలు భోగ కాంతలయారు. వారిని రాజనర్తకు లనేవారు. మానవమాత్రులను సంతోష పెట్టటమే రాజనర్తకి లక్ష్యమయింది. దైవ సేవకు మారు రాజరంజనమే పరమార్థం కావటంవల్ల నృత్యలక్ష్యమే మారిపోయింది. ప్రభువుల చిత్తవృత్తుల ననుసరించి ఇతివృత్తాలు రీతులు గీతాలు తలలెత్తాయి. భక్తికి బదులు విషయాసక్తి ప్రబలి శృంగారం చెలరేగింది.

ఐదవ శతాబ్దినుండి పదవ శతాబ్దివరకు కూచిపూడి వేంగీ సామ్రాజ్యాధిపత్యంలో ఉంది. ఇక్కడికి వేంగి రాదాపు 40మైళ దూరం సమ్రాట్టులైన తూర్పు చాళుక్యులు జైనులు కావటంవల్ల బౌద్ధం స్థానాన్ని జైనం ఆక్రమించింది. జైనులు తమ ప్రచారంకోసం అప్పటి కా ప్రాంతంలో ప్రచారంలో వున్న కళారూపాల నన్నిటిని ఉపయోగించుకొన్నారు. జానపద నృత్యరీతి కనిపెట్టారు. ప్రాంతీయ కళా సంప్రదాయాలను ఉపయోగించుకొన్నారు. ఈ విధంగా 12 వ శతాబ్ది అంతంవరకూ జానపద శాస్త్రీయ నృత్యరీతులు మతప్రచారానికి విరివిగా వినియోగించాయి వీటిలో శాస్త్రీయ నృత్యాన్ని మార్గి అనీ, జానపద నృత్యాన్ని దేశి అనీ అంటారు.

ఓరుగంటి కాకతీయ సామ్రాజ్య విస్తృతిలో వేంగి పడిపోయింది. కాకతీయులు మొదలు జైనులు, కాని బసవాచార్యుల ప్రభావంవల్ల వారు పాశుపత వీరశైవాన్ని స్వీకరించారు కాకతి సార్వభౌముడు గణపతిదేవుడు 1230 ప్రాంతంలో ఆంధ్రప్రాంతాన్ని చాలమట్టుకు ఆక్రమించాడు. ఒకానొక దండయాత్రలో గణపతి శ్రీకాకుళంవద్ద అయ్య వంశీయుడైన జాయప్ప నెదుర్కొన్నాడు. జాయప్ప మహాపరాక్రమవంతుడు. దివిసీమకు ప్రభువు. గణపతిదేవు డాతనితో సంధిచేసికొని అతని సోదరిని పెండ్లాడి, అతన్ని

తన సామ్రాజ్యంలో హస్తి దళాధిపతిగా నియమించాడు.

తన ప్రాంతీయాలైన కళాసంప్రదాయములపట్ల జాయప్పకు అత్యంతాసక్తి. అతడు గుండామార్యుని వద్ద దేశిమార్గ నృత్యరీతుల ప్రయోగ విజ్ఞానాన్ని సమకూర్చుకొన్నాడు. ఆ విజ్ఞానంతో అతడు నృత్తరత్నావళి అనే ఉత్తమ నాట్యగ్రంథం రచించాడు. అతడు చేబ్రోలులో దేవళం కట్టించి అందులో మూడువందల మంది దేవదాసీలను నియమించి వారికి గుంటూరు జిల్లాలోని మోదుకూరు యీనాముగా ఇచ్చాడు. నృత్యరత్నావళిలో అనేక మార్గదేశి నృత్యరీతులు విస్తరింపబడ్డాయి కూచిపూడిప్రాంతపు నృత్యవైభవం ఇందున్నది. తన రాజధానియైన శ్రీకాకుళానికి రెండుమైళ్ళ దూరంలోనే ఉన్న కూచిపూడిని గురించిమాత్రం అతడు ప్రస్తావించలేదు-దీన్నిబట్టి 1260 నాటికి కూచిపూడి అనే గ్రామమే లేదనుకోవలసి వస్తుంది.

కాకతీయులు వీరశైవము స్వీకరించిన తర్వాత జైనమతము చాల దెబ్బతిన్నది. ప్రసిద్ధ వీరశైవ ప్రవక్తలలో నొకడైన మల్లికార్జున పండితుడు పెక్కుచోట్ల జైనులను వాదమునం దోడించినాడు. అంతవరకు మతప్రచారార్థము జైనులు వాడుకొంటూ వచ్చిన వివిధ జానపద నృత్యరూపాలను వీరశైవులు తమ మతప్రచారానికి వినియోగించుకొన్నారు. కాకతీయుల కాలమునాటి కవీశ్వరుడైన పాల్కురికి సోమనాథుడు రచించిన పండితారాధ్య చరిత్రలో యీ కళారూపాలు పేర్కొనబడ్డాయి. ఈ గ్రంథంలో కూడా కూచిపూడి ప్రసక్తిలేదు. దీన్నిబట్టి కూచిపూడి ఆ తర్వాత కాలంలోనే నృత్యనికేతనంగా రూపొందివుండాలి,

మహమ్మద్ బిన్ తుగ్లక్ 1221 లో ఓరుగంటి మీద దండెత్తాడు. దానితో కాకతి సామ్రాజ్యం విచ్ఛిన్నమైపోయింది దేశం అరాజకమైయింది. ఈ విచ్ఛిత్తికిముందు కాకాతీయులు కళింగులు పరస్పరం పోరాడుకొంటూ వుండేవారు. 1262 లో కంళిగరాజు మూడవ వీరనరసింహుడు శ్రీకాకుళప్రాంతాన్ని ఆక్రమించాడు. అతని సవతి సోదరుడు అనంతపాలుడు అంధ్రవిష్ణు దేవాలయాన్ని పునరుద్ధరించాడు. అప్పటికే దేవదాసీ పద్ధతి పతనమై నృత్యం వ్యభిచారుల చేతిలో పడింది. వీరశైవం ప్రబలంగా వుంది.

కళింగప్రభువులు వైష్ణవులు. పూరీజగన్నాథాలయాన్ని వారే పునరుద్ధరించారు. వీరసింహుడు కోణార్క దేవాలయం కట్టించాడు. సింహాచలం దేవళాన్ని పునరుద్ధరించాడు. శ్రీకాకుళం ప్రాంతంలో వైష్ణవ మతప్రబోధం చేయాలని అతడే సంకల్పించాడు. అప్పటికి కళింగంలో జయదేవుని గీతగోవిందం బాగా ప్రచారంలో ఉంది. ఉత్తర కళింగంలో కృష్ణభక్తి ప్రబలి వున్నది. ఈ తత్వప్రవక్త ఆనంద తీర్థుడు—అతడే మాధ్వసిద్ధాంత ప్రవక్త. అయన కళింగరాజాస్థానాన్ని సందర్శించి అక్కడ శోభనభట్టు—శ్యామశాస్త్రి అనే మహామాత్యుల్ని తన సిద్ధాంతంవైపు తిప్పుకొన్నాడు. వారు అయన శిష్యులైనారు. వారిలో శోభనభట్టు పద్మనాభ తీర్థుడుకాగా శ్యామశాస్త్రి నరహరి తీర్థుడైనాడు. అతడే తర్వాత ఉడిపి మఠపీఠాధిపతియైనాడు.

1263 నుండి 1277 వరకు మొదటి భానుదేవుడు కళింగానికి ప్రభువు. ఈ గంగరాజు మరణించాక యువరాజు బాలుడు కావటాన నరహరి తీర్థుడు రాజప్రతినిధియై కళింగ సామ్రాజ్య దక్షిణసీమాంతమైన శ్రీకాకులాన్ని సందర్శించాడు. నరహరి తీర్థుడు యీ ప్రాంతంలో కృష్ణభక్తి ప్రబోధిస్తూ శ్రీకాకుళంలో 11 సంవత్సరాలున్నాడు. అయన కళింగంనుండి శ్రీకాకుళానికి నర్తకులను పిలిపించాడు. తీర్థుల సంతృప్తికోసం అక్కడి కళాకారులు గీతగోవింద నృత్యాన్ని అభ్యసించారు. ఈ విధంగా దివిసీమలో కృష్ణభక్తి తత్వాన్ని నరహరితీర్థుడు ప్రచారంలోకి

తెచ్చాడు. తరువాత ఉడిపి మఠాధిపతియైనాడు. 1263 వరకు జీవించాడు.

నరహరితీర్థుడు శ్రీకాకుళంనుండి ఉడిపికి మాధ్వమతాధిపత్య స్వీకరణకై వెళ్లిన తర్వాత శ్రీకాకుళంలో అతని శిష్యులు సంస్కృతంలో శ్రీకృష్ణస్తుతి గీతాలు రచించారు. ఈ పాటలకు బ్రాహ్మణ గురువులు నృత్యరూపకల్పన చేశారు. అప్పటి దేవదాసీలు రాజనర్తకులు నృత్యం చేశారు.

నరహరితీర్థుని శిష్యులలో గోపాలకృష్ణ సరస్వతి ఒకడు. ఆయన శ్రీకాకుళ నివాసి శ్రీకృష్ణస్తుతి గీతాలనేకం సంస్కృతంలో వ్రాశాడు, మహాభాగవతమంతా 123 పాటల్లో కూర్చాడు. శ్రీకృష్ణ జలక్రీడ అనే నృత్యనాటకాన్ని, గోపాలకృష్ణవృత్తి అనే నాట్య శాస్త్రాన్ని రచించాడు. శ్రీకాకుళంవాడే ఆయన. మొదట శైవుడే అయినా నరహరితీర్థుల ప్రభావంవలన వైష్ణవుడైనాడు. దీన్నిబట్టి 14 వ శతాబ్దిలో యీ ప్రాంతంలో కృష్ణభక్తి బాగా వ్యాప్తిలో ఉన్నట్లు కనిపిస్తుంది. ప్రాంతీయములైన జానపద శాస్త్రీయ నృత్యములన్నీ శ్రీకృష్ణ సంస్తుతికే అంకితములైనాయి. దేవదాసీలు రాజనర్తకులు జయదేవుని గీతగోవిందం గోపాలకృష్ణ సరస్వతి మహాభాగవత గీతలు—నృత్యం చేసేవారు. ప్రతినర్తకి తానొక గోపికనని రాధనని అనుకొనేది. క్రమంగా శృంగార నృత్యాలు ప్రారంభమయాయి. కాని గురువులుమాత్రం తమ సనాతన సాహిత్యాన్ని కాపాడుకొంటూనే వచ్చారు.

సిద్ధప్ప ఆ ప్రాంతంలో ఏదో గ్రామానికి చెందిన అనాథబాలుడు. అతనిది ఏఊరో అతని తల్లిదండ్రులెవరో ఎవ్వరికీ తెలియదు కాని అతడు బ్రాహ్మణ బాలకుడని అక్కడివారికి విశ్వాసం.

తమ బిడ్డల పెళ్లిళ్లు చేసికొనేటప్పుడు వారితోపాటు పేదపిల్లలకుకూడా చేయించటం ఆనాటి అలవాటుకాబట్టి ఎవడో ధనవంతుడు అతనికి వివాహం చేయించాడు. అలా అతనికి తెలియకుండానే సిద్ధప్ప వివాహితుడైనాడు, అతడు ఊరూరూ తిరుగుతూ ఏదో దొరికినచోట ఇంత తింటూ ఏ అరుగుమీదనో సత్రంలోనో నిద్రపోతూ కాలం గడిపేవాడు. ఎవరి ఇంట్లోనైనా ఏదో కార్యం అయి, వారు బహూకరిస్తేనే అతనికి క్రొత్తబట్టలు.

నీవు వివాహితుడవని అతని కెవడో ఎప్పుడో గుర్తుచేస్తాడు. అతని భార్యవయస్సు అప్పటికి ఆరు నెలలు. కృష్ణకవతలివైపున అత్తవారిల్లు. ఆ వివాహం అతనికి గుర్తులేనంత అయోమయంగా [illegible] జరిగిపోయింది. ఆ భార్యను చూడాలనికూడా అతనికి లేదు. ఆ పిల్ల పాపం ఇంకా పాలుకుడుస్తూనే వుంది. అతనికి నర్తకులన్నా నర్తనమన్నా ఇష్టము. నర్తకులే అతని ఆరాధ్య దేవతలు. అతనివల్ల హానిలేదని తెలిసి అతనితో వారు వేళాకోళాలాడుతుండేవారు. అతడు వారితోకలిసి దేవాలయోత్సవాలకు వెళ్ళేవాడు పూజారులు అతని పతనస్థితినిచూసి చీవాట్లు పెట్టేవారు.

నరహరితీర్థులు ఉడిపికి వెళ్ళిన అనంతరం శ్రీకాకుళంలో ఒక మాధ్వమతశాఖ నెలకొల్పాడు. రాత్రల్లా నృత్యంచూచి పడుకొనెచోటు చిక్కక ఒక నాడు సిద్ధప్ప ఆ మఠంలోచేరి పగలల్లా నిద్రపోయాడు. అతడారాత్రిచూసిన నృత్యాలనుగూర్చి కలవరించాడు. శ్రీకృష్ణుడు తనపొట్టమీద నాట్యం చేస్తున్నట్టు కలవరించి నిద్రలేచాడు. కృష్ణా—కృష్ణా అని కేకలువేస్తూ సంభ్రమంతో మేల్కొన్నాడు. ఆ మఠాధిపతి అతని తల నిమిరి ఆదరించాడు అంతా అర్థంచేసికొన్నాడు— అతనికేదో ఉజ్వల భవిష్యత్తు ఉన్నదని ఊహించి అతన్ని ఉడిపి మఠానికి పంపాడు అ మర్నాటి నుండి సిద్ధప్పజాడ ఎవ్వరికీ తెలియదు—అతన్ని తలచినవారుకూడా లేరు.

నరహరతీర్థుల శిష్యులు ఆ బాలునిపై జాలి తలచి తీర్థులవారివద్దకు తీసికొనివెళ్ళారు. ఆ నాడే

పవిత్రస్నానం చేయించి అతనిచేత వేదాధ్యయనము చేయించారు ఆశ్రమనియమాలు సిద్ధప్ప జీవితాన్ని సరిదిద్ది సరియైన దారిలో పెట్టాయి ఇరవై ఏండ్లు గడిచాయి అతడు వేదశాస్త్రాలలో పండితుడైనాడు అతని ఉజ్వల నేత్రాలు విశాల ఫాలప్రదేశమూ అతని మహత్త్వాన్ని ప్రదర్శించేవి భరతనాట్య శాస్త్రంకూడా అతనికి అలవడినది. అతని ప్రత్యంగ విన్యాసమూ ఒక ముద్ర. గురువుల మన్ననపొందాడు. సంస్కృతంలో శ్లోకరచన చేయగల శక్తి సంపాదించాడు. గంధర్వగానం అతని సొమ్ము—చివరకు స్వదేశం పోవలసిందిగా అతని గురువుల ఆజ్ఞ అయింది. 15 ఏళ్ల తర్వాత తోవనపడి ఏడాది నడిచి శ్రీకాకుళం చేరుకున్నాడు.

పునరాగమనం:— ఆ ప్రాంతమంతా అతనికి కొత్తగావుంది. అతన్ని గుర్తుపట్టినవారేలేరు. ఆ పాండిత్యం చూస్తే ఊరి పెద్దలకు ఆ సిద్ధప్పేనా ఈయన అనిపించింది, పరిశీలించినపిదప ఆయనే యీయన అని నమ్మి ఆశీర్వదించి నది కావలనున్న భార్యవద్దకు పొమ్మని చెప్పారు. సిద్ధప్ప తాను వస్తున్నట్లు మామగారికి కబురంపాడు. ఆ అద్భుతవార్త చేరగానే వారు శోభన ముహూర్తం నిర్ణయించారు. అప్పటి కాయన భార్య నిండు యౌవనంలో శృంగార దేవతవలె నున్నది.

తన అత్తవారి ఊరుపోవటానికి సిద్ధప్ప ఏరు దాటాలి జ్యోతిష్కులు ముహూర్తనిర్ణయం చేశారు. హృదయం ఆనందంతో ఉప్పొంగిపోతూ ఉండగా కృష్ణ దాటసాగాడు. భావి సుఖస్వప్నాలతో అతనికి ఏటి యీత కష్టమనిపించలేదు. తుఫాను ప్రారంభించింది. అవతలగట్టుకు చేరాలని సిద్ధప్ప శక్తికొద్దీ యీదుతున్నాడు. నదిమధ్యకు చేరాడు. ఇంక వెనక్కు తిరిగి లాభంలేదు. కనుక అవతలివైపుకే పోవాలని యీదుతున్నాడు. అంతలో ఒక పెద్ద కెరటం అతన్ని ముఖంమీద కొట్టింది. కళ్ళు మూసుకొని పోయాయి పరిసరాలు కానరావటంలేదు. ఆ మహానది కూడా ఆ దంపతుల కలయికకు అసూయ చెందినట్లు అతనిపై విజృంభించింది. తనకు మరణ మాసన్నమైనట్లు సిద్ధప్పకు అర్థమయింది. బలవత్తరములైన మృత్యుసంఘాలను ప్రతిఘటించి ప్రయోజనంలేదు. కనుక శ్రీకృష్ణుని ప్రార్థించి మృత్యుముఖంలో ఆతురసన్యాసం స్వీకరించాడు.

తాను బ్రతికి బయటపడితే సన్యాసజీవితం గడుపుతానని ప్రమాణం చేశాడు. ఆ తుఫాను మ్రోతలతో శృతికలిపి భక్తిగీతా లాలపించాడు. సన్యాసానికి గుర్తుగా జందెం తీసివేశాడు. అతని కళ్ళఎదుట అభయముద్ర దాల్చిన శ్రీకృష్ణుడు తప్ప మరేమీ కనిపించలేదు.

కళ్ళుమూసి తెరచేసరికి అవలియొడ్డున మెత్తని బురదలో తాను పడియున్నట్లు తెలిసికొన్నాడు. చెదరిపోయిన పడవల్ని వెతుక్కుంటూ అటువచ్చిన పల్లెవాండ్రు అతన్ని చూశారు.

అప్పటికతని నాడి నీరసంగా కొట్టుకుంటున్నది. వారు అతనికి తగిన పరిచర్యలుచేసి లేవదీయగా స్పృహ వచ్చింది. వారిసాయంతో ఊరు చేరాడు. అతని మామగారు ఊరిపెద్దలతో మాట్లాడుతూ అతని కోసం ఎదురు చూస్తున్నాడు

సిద్ధప్ప తాను ఫలానా అని చెప్పుకోగానే అతన్ని కౌగిలించుకొని మామగారు ఇంటికి తీసుకుపోయారు. వారి కుటుంబమంతా అతనికి స్వాగతం చెప్పింది వెంటనే వేడినీటిస్నానం చేయించి సుష్టుగా భోజనం పెట్టారు తర్వాత చక్కగా అలంకరించిన గదిలో కూర్చోపెట్టారు. అక్కడి కొక తరుణసుందరి రావటంచూస్తే అతనికాశ్చర్యంవేసింది. అది అతని భార్య. అపర రతీదేవి. ఆమె అందాన్ని నేత్రాలతో ఆస్వాదిస్తూ అలా కూచున్నాడు. ఆ పిల్ల సిగ్గుపడు

తూనే తలయెత్తి తన భర్తవంక చూసి భయంతో నేల కూలిపోయింది. సన్యాసి అని భారంగా నిట్టూర్చింది. సిద్ధప్ప ఇప్పుడు వాస్తవ జగత్తులో పడ్డాడు. శ్రీకృష్ణు నకు తాను వేసిన బాస జ్ఞప్తికి తెచ్చుకున్నాడు తక్షణం శ్రీకృష్ణుడూ అతని ప్రియపత్ని సత్యభామా అతనికళ్ళ ముందు కన్పించారు. అతని చెక్కిళ్ళమీదుగా కన్నీళ్లు జాలువారాయి. ఆ మరుక్షణమే ఆ దివ్యదంపతులు తిరోహితులైనారు. వారికోసం సిద్ధప్ప వెదకసాగాడు. తనభార్య ఇంకా నేలమీద పడేవుంది. ఆమెవంక చూశాడు—ఆమెలో అతనికి సత్యాదేవి గోచరించింది.

నెమ్మదిగా తలుపు తెరిచాడు. నవోదయాన్ని ప్రబోధిస్తూ కోడికూసింది. గొంతులో ఏవో గొణు క్కుంటూ సిద్ధప్ప నదివద్దకు వచ్చాడు. అతనిమాటలు కొత్తపాటలు. రాధామాధవ భక్తిస్వరూపాన్ని అతడు తన గురుదేవులవద్ద అభ్యసించాడు. రాధ ప్రకృతి. కృష్ణుడు పురుషుడు. ప్రకృతియొక్క ఉనికి పురుషు నిపై ఆధారపడివున్నది. వారిప్రేమలో ఇంద్రియ లాలనకు తావులేదు. అయితే ఇంద్రియసుఖం ఎందు కున్నది? మానవ జీవితాలను ఆక్రమించేటంత శక్తి దాని కెందుకున్నది? కనుక విషయాసక్తమైన ప్రేమ తప్పుకాదు, కాని అది ఉదాత్తమై ధర్మబద్ధమై ఉండాలి అని తీర్మానించుకొన్నాడు. సత్యభామ తన భర్తను వ్యామోహంలోనే ప్రేమించింది అతన్ని శాశ్వతంగా తానే తన కౌగిటిలో పెట్టుకోవాలని ఆమెకోరిక, ఏకా గ్రమైనప్పుడు ఆవేశపూరితమైన ప్రేమకూడా ఒకరకం భక్తియే స్వార్థం పాపం కాదు, తన సొంతం చేసికో వాలనేదే దాని ప్రయోజనం. ప్రతి ఆత్మ పరమాత్మ సాయుజ్యం కోరుతుంది ఇదే బ్రాహ్మతత్వం, దీనినే తర్వాత మధురభక్తి అన్నారు.

బ్రాహ్మ తత్వము:— పురుషుడొక్కడే అని, అతడు శ్రీకృష్ణుడే అని ప్రతిభక్తుడూ తలుస్తాడు, తనతోసహా తక్కిన మానవులందరూ స్త్రీలు. కృష్ణుడు లోకభర్త. మానవులంతా గోపికలు. ఆ భగవదైక్యం వాంఛించే గోపికలలో సిద్ధప్ప ఒక గోపిక. ఆ భగ వంతుడు తననుమాత్రమే కౌగలించుకోవాలని అతని వాంఛ. అది స్వార్థమే. కాని భగవదాశ్లేషంపొందటం అనేది తన హక్కుగా అతను భావించాడు తక్కిన అందరికంటె సత్యభామయే శ్రీకృష్ణునియందు అత్యధిక భక్తి కలది అని ఆయన తలంపు

బ్రాహ్మతత్వ స్థాపకుడు సిద్ధప్ప. క్షణమైనా భర్తృవియోగమోర్వని సత్యభామ పాడిన విధంగా ఆయన పాటవెంట పాట అల్లాడు. ఆయన పాటల సంపుటియే భామాకలాపము ఆ పాటలు పాడుతూ ఆయన నాట్యం చేశాడు. అది సమగ్రమైన నృత్య నాటకమైంది గ్రామీణు లాయనచుట్టూ గుమిగూడారు. ఆ నృత్యాలు భక్తి పారవశ్యమూ వారిని ఆశ్చర్య చకి తుల్ని చేశాయి, కొద్దిరోజుల్లో ప్రతిబాలుని నోటా అతని పాటలే. అప్పటివరకు గీతగోవిందం బాగా ప్రచా రంలోవుంది. గీతగోవిందం పాడినవాడల్లా తాను రాధ ననుకొనేవాడు—భామాకలాపం ప్రచారలోకి వచ్చిన తర్వాత ప్రతిభక్తుడూ తాను సత్యభామ ననుకొన్నాడు.

అంతవరకూ నృత్యం దేవదాసీల రాజనర్తకుల సొత్తుగా వుండేది. మువ్వసాలలో శ్రీకాకుళంలో వారి కుటుంబాలు మూడేసి వందలుండేవి. ఈ నాట్య కత్తెలు ఇప్పుడు భామాకలాపం నేర్వగోరారు. వారు అప్పటికే గీతగోవిందంలో ఆరితేరినవారు సిద్ధేంద్రు డని పిలువబడుతున్న సిద్ధప్పవద్దకు వచ్చి వారు తమకు భామాకలాపం నేర్పవలసిందిగా అర్థించారు. భామాకలాపం పాటలు ఇంద్రియ లోలుపమైన ప్రేమతో నిండివున్నాయి. అటువంటి భంగిమలలో యీ నాట్యకత్తెలు యీ వరకే ప్రవీణులై ఉన్నారు కనుక యీ భామాకలాప నృత్యంతో వారు సంఘాన్ని మరింత ఆకర్షించి అవినీతిపాలు చేస్తారు, అందువల్ల సిద్ధేంద్రుడు చక్కని బ్రాహ్మణ యువకులను యీ భామాకలాప నృత్యం చేయడానికి ప్రోత్సహించాడు.

అంతకుపూర్వం బ్రాహ్మణులెన్నడూ నృత్యం చేయలేదు కనుక ఆ బాలురూ వారితండ్రులూ అభ్యంతర పెట్టారు. వారికి కుల బహిష్కృతి ఉండదని చెప్పి సిద్ధేంద్రుడు ఒప్పజెప్పాడు. ఉడిపిమఠాధిపతి వద్దనుండి అమోదపత్రిక తెప్పించాడు. బాలురకు భామాకలాపం నేర్పారు. సత్యభామ పాత్రతో సహా అన్ని స్త్రీ పాత్రలూ పురుషులే ధరించారు. అప్పట్లో "పారిజాత" మని పిలువబడిన యీ నృత్యనాటకంలో స్త్రీలు పాల్గొనరాదని నిషేధించాడు, తాము తమ జీవితాన్ని యీ నృత్యకళకు అంకితం చేస్తామని బ్రాహ్మణ యువకులచేత శపథం చేయించాడు. దానికి గుర్తుగానే యీనాటికికూడా పుట్టిన పిల్లవాడికి వెంటనే మొలగంట కట్టడం అక్కడ ఆచారంగా ... నట్టువ కూటువతో ఆయన విస్తారముగా సంచారము సాగించాడు.

ఇది ఆ ప్రాంతంలోని కొందరు సనాతన బ్రాహ్మణుల అసూయకు కారణమై ... ఆజ్ఞనుల్లంఘించి వారు కళాకారులను వెలివేశారు, వారితో ఇచ్చిపుచ్చుకోవటాలు పంక్తిభోజనాలు నిషేధించారు. సిద్ధేంద్రుడు యీ కళాకారులను వారి అభిమానాలను ఆ ప్రాంతంలో వేరొకచోటికి తీసుకపోయాడు. అక్కడే వారు తమ నివాస మేర్పరచుకొన్నారు. అప్పటికే వారు కుశీలవ ఖ్యాతి పొందిన వారు—కనుక ఆ గ్రామానికి కుశీలవ పురి—కూచీలపురి అనే పేరు వచ్చింది.

సిద్ధేంద్రుడు వారికి చక్కని క్రమశిక్షణ ఏర్పాటు చేశారు. ప్రతినర్తకుడూ వేదశాస్త్రాలు చదవాలి. సంస్కృతం క్షుణ్ణంగా నేర్చుకోవాలి. పంచకావ్యాలు చదవాలి. సంగీతం పూర్తిగా రావాలి. నృత్యానికి ఆయన ఏర్పరచిన ప్రణాళిక ఇంకా ఇప్పటికీ అమలులోనే ఉంది. ఈ విధంగా 1350-1450 మధ్యకాలంలోని సిద్ధేంద్రుడు కూచిపూడి నాట్యవ్యవస్థకు సంస్థాపకుడైనాడు.

కూచిపూడి నాట్యం దక్షిణభారతంలో త్వరలోనే విస్తరించింది. విజయనగర చక్రవర్తి వీరనరసింహదేవరాయలు కూచిపూడి నాట్యబృందాన్ని పిలిపించుకొన్నాడు. నాట్యబృందం ... విజయనగరం బయలుదేరింది. వారు దారిలో ... జిల్లాలోని సిద్ధవటం గ్రామంలో ఒకనాడు విశ్రాంతి తీసుకొన్నారు. ఆ ఊరి పరిపాలకుడు సండెట గురవరాయుడు పట్టిరాక్షసుడు. హింసించి పన్నులు వసూలుచెయ్యటం అతనికి అలవాటు. స్త్రీలను ఇళ్ల నుండి బయటకులాగి అవమానపర్చేవాడు. ఈసంగతి కూచిపూడి నటులకు ఆగ్రహం కల్గించింది. విజయనగరం వెళ్లినతర్వాత వారు ... చక్రవర్తి సమక్షంలో ప్రదర్శించారు. ... అడిగినమీదట వాస్తవం వెల్లడించారు. దానిపై చక్రవర్తి గురవరాయుని తల నరికించాడు.

విజయనగర సామ్రాజ్య పతనానంతరం చాలామంది కళాకారులు, కవులు, నర్తకులు, గాయకులు తంజావూరువెళ్లి రాజాదరం పొందారు. క్రి. శ. ౧౫౦౦ లో కొందరు కూచిపూడి కళాకారులు తంజనగరం అచ్యుతరాయల అనుగ్రహం సంపాదించారు. ఆయన సమక్షాన ఒక నాటకం ప్రదర్శించారు, ఆ రాజు ఆమేళమువారికి తన పేరిట అచ్యుతపురాన్ని అగ్రహారంగా యిచ్చాడు. దానినే ఇప్పుడు మెలట్టూరు అంటారు. ఈనాటికి యిక్కడ తెలుగు యక్షగానాలను ప్రదర్శించే భాగవత మేళోత్సవాలు జరుగుతున్నాయి. ఈ మేళాలను బాలూభాగవతారు నిర్వహిస్తున్నాడు.

కొంతమంది కూచిపూడి కళాకారులు తమ పురాతన గ్రామంలోనే నివసిస్తున్నారు. వారిని ఆదరించేవారులేరు. పొలం దున్నుకొని కాలం గడపుకొనేవారు. ఆ తరువాత గోలకొండ నవాబులు

సర్కారు జిల్లాలను తమ స్వాధీనం చేసుకోవటంతో కూచిపూడికూడ వారి ఆధీనమైంది. చిట్టచివరి గోల కొండ నవాబు అబుల్‌హాసన్ తానీషా ౧౬౭౮ లో మచిలీపట్నం సందర్శించాడు. తన సేనాపతియైన పింగళిమాదన్నతో కలసి ఆయన కూచిపూడి మీదుగా పోతూ అరాత్రికక్కడ విశ్రమించాడు. అప్పుడు రాజగోపాల దేవాలయంలో కూచిపూడి బాలురు భామాకలాపం ఆడుతున్నారు.

ఆ పాటను విని నవాబు వారిని తమ మకా ముకు పిలిపించుకొన్నాడు. వారి ప్రదర్శనం చూచి సాహిత్యకళాపోషకుడైన ఆ నవాబు మిక్కిలి సంతో షించి తన సేనాని సలహాపైన ఆ కళాకారులకు కూచిపూడిగ్రామం యీనాముగా యిచ్చాడు. కూచి పూడి నర్తకులు పరమానందపడ్డారు కాని వెంటనే వాలాల పంపిణీలపైన తగాదాలు తలెత్తాయి. ఆ ఈనామును తమ తమ కుటుంబాలకు అనుగుణంగా పంచుకోవాలని వారికోరిక. క్రీ. శ. ౧౭౬౩ లో నిజామునవాబు ప్రతినిధులైన మొసలికంటి రామోజీ పంతులు కాండ్రేగుల జోగిపంతులు అనేవారు ఆ విభజనపత్రాన్ని సిద్ధంచేశారు. వేదాంతం, వెంపలి, హరి, భాగవతుల, వసుమర్తి, జ్యోశ్యుల, మహంకాళి, ఏలేశ్వరపు వారిమధ్య యీ విభజన జరిగింది. ఈ కుటుంబాలు యీనాటికీ ఆ భూముల ననుభవిస్తూ తమ జీవితాలను నృత్యకళకు అంకితంచేస్తూ ఆ గ్రామంలోనే నివసిస్తున్నారు.

పారిజాతము, గొల్లకలాపము అనే రెండు నృత్యనాటికలను సిద్ధేంద్రుడు రచించాడు, పారిజా తాన్నే భామాకలాపం అంటారు. గొల్లకలాపం సంగీతబద్ధమైన తాత్వికసంభాషణ. ఒక గొల్లభామకు బ్రాహ్మణునకు మధ్య జరిగిన సంభాషణయిది. మాన వులందరు సమానులే అనీ భక్తిచేతమాత్రమే ఎవ్వ రైనా మోక్షము పొందగలడనీ, వైదికములైన యజ్ఞ యాగములు జపతపములు వ్యర్థములనీ ఆ గొల్లభామ సిద్ధాంతం చేస్తుంది.

ఆ తరువాత కూచిపూడి నాట్యాచార్యులు ప్రహ్లాద, రుక్మాంగద, హరిశ్చంద్ర, ఉషాపరిణయం గయ మొదలైన నృత్యనాటకాలను రచించారు.

ప్రతి కూచిపూడి కళాకారుడు తన శరీరాన్ని ఏ భంగిమలైనా మలచుకొనులకుగాను శరీర వ్యాయా మం చేయవలసి వుంటుంది. దండెములు, బస్కీలు. ఒంటికాలి దండెములు, కాలిసాము, నిలువుమొగ్గ, ఆలి, ఎత్రాలి, చక్రదండె, పావచారులు, హస్త చారులు, అడవుసాము, చౌకము, మండెకొప్పు, క[illegible], [illegible], [illegible]మంగళం, చుట్ట డుగు మొదలైనవి యీ శరీర వ్యాయామంలోకి వస్తాయి.

అన్ని సంయుక్త అసంయుక్త హస్తములు అభి నయ దర్పణములో పేర్కొనబడిన శీర్ష, గ్రీవ, నేత్ర, భ్రూవిన్యాసములైన ౧౦౮ కరణములతోసహా యీ కళాకారులకు నేర్పేవారు.

నృత్యంతోపాటు శాస్త్రీయసంగీతంకూడా నేర్పే వారు. ఆ తర్వాత విద్యార్థి అలంకారశాస్త్రం, నాయక, నాయికా, విభేదాలు పూర్తిగా నేర్చుకోవాలి. నవరస సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా నేర్చుకొని సాత్వికాభి నయం అలవర్చుకోవాలి. యీవిధంగా కూచిపూడి నాట్యవిద్యార్థికి సుదీర్ఘమైన పాఠ్యప్రణాళిక వుంది. దీన్ని పూర్తిచెయటానికి పదిఏండ్లు పడుతుంది. అతడు ఆహార్యం స్వయంగా తయారుచేసికోవటంకూడ నేర్చు కోవాలి. కూచిపూడి నర్తకుల అభరణాలు పునుగు చెక్కతో చేయబడుతాయి. బాడితచెక్క కూడ వాడు తారు. ఆ చెక్క చాలా తేలిక, మెత్తన కనుక ఉలితో సులభంగా చెక్కవచ్చు రంగురంగుల గాజుముక్కలు ఆ అభరణాల్లో అమర్చబడుతాయి. మిగిలిన భాగ

మంతా లక్కపూత. యీ ఆభరణాలు స్త్రీలకు 32 రకాలు. పురుషులకు కత్తి, డాలు, కవచంతో సహా ౧౦ రకాలు.

కూచిపూడి సాంప్రదాయం ప్రకారం సత్యభామ ప్రధానాలంకారాల్లో జడయొకటి దీన్ని వెంట్రుకలతోపాటు కడతారు. దీనికి ప్రత్యేక ప్రాధాన్యం వుంది. విష్ణువు దేవదానవులకు అమృతం పంచటం కోసం మోహినివేషం వేసినప్పుడు యీ జడ వేసికొన్నాడని అపని అయినాక ఆ జడతో పని తీరిపోయిందని కృష్ణావతారంలో దాన్ని సత్యభామకు సమర్పించాడని అంటారు. యీ జడలో అనేక భాగాలు నల్లనిదారంతో గుదిగుచ్చబడి వుంటాయి.

**విశ్వసంకేతం:—** ఈ జడకు ఎడమ వైపున నడినెత్తిన అంగుళన్నర వ్యాసంగల గుండ్రని బిళ్ల సూర్యునికి సంకేతంగా వుంటుంది, కుడివైపున అలాగే బాలచంద్రుడు. ఆ జడను నుదిటితో కలుపుతూ పాపిటనుండి ఒక ముత్యాలచేరు, దీని పైన ప్రకృతికి ప్రతిబింబంగా చిన్న రామచిలుక. ఇక వెనుకభాగం జ్ఞానపారమ్యానికి ప్రతిరూపమైన పాముపడిగతో ప్రారంభమై ౨౭ నక్షత్రాలను సూచించే ౨౭ ముక్కలతో అతకబడి వుంటుంది. దాని చివర త్రిభువనాలనుచూపే మూడు కుప్పెలు. ప్రతికుప్పెకు చివర మూడేసిచొప్పున మొత్తం ౯ చిరుకుప్పెలు నవగ్రహాలకు చిహ్నంగా వేలాడుతూ వుంటాయి. యీ కూచిపూడి జటాలంకృతి చెక్కముక్కలతో చేయబడి బంగారురంగు పూయబడి వుంటుంది. ఇది అనంత విశ్వానికి చిహ్నమని చెపుతారు, సత్యభామ జీవుడని యీ విశ్వమంతా తదనుబంధి అని దీని అంతరార్థం. కూచిపూడివారికి యీ జటాలంకారమంటే చాల యిష్టం. అసలు కూచిపూడి కళకు అదే ప్రాతినిధ్యం వహిస్తుందని అంటారు, భామాకలాపం ఆడేటప్పుడు ఆ సత్యభామ తెరవెనుక నుండి ప్రేక్షకులకు కనిపించేటట్టుగా తెరమీదగా జడను బయటకు వేస్తుంది. ఆ సత్యభామ పాత్రధారితో పోటీచేయగల కళాకారుడెవడైనా ప్రేక్షకుల్లో ఉంటే రావచ్చునని చేసే సవాలు అది. ఎవడైనా ముందుకువచ్చి జయించినట్లయితే వాడు ఆ జడను కత్తిరించుకొని విజయచిహ్నంగా వుంచుకోవచ్చు. కూచిపూడి సంప్రదాయంలో యిదొక వింతవిషయం.

కూచిపూడి నాట్యమునందలి పత్యేకత ఏమిటని అడుగుతారు. ఈ సంప్రదాయాన్ని సిద్ధేంద్ర యోగి నిర్మించాడని, శ్రీకాకుళం ఘంటసాల ప్రాంతాల్లో వేలకొలది దేవదాసికలు రాజనర్తకులు వుండేవారని ఇదివరకే పేర్కొన్నాను ఇటీవల ఇక్కడ బయల్పడిన శిల్పాలు యీ ప్రాంతంలో నృత్యం సర్వసామాన్యమయిన కళఅని, నర్తకులు ఆ కళను సంపూర్తిగా స్వాధీనంచేసికొన్నారని తెలుపుతున్నాయి. కూచిపూడివారు భరతుని నాట్యశాస్త్రాన్ని నందికేశ్వరుని అభినయదర్పణాన్ని అనుసరించారు ఇంతేగాక ఇంకా అనేక జానపద నృత్యరీతులుకూడ ఆచారంలో ఉండేవి. యాదవులు, ఏనాదులు, దాసరులు, జక్కులు ఇనబడే తక్కువ కులాలవారు యక్షగానాలు కురునంజులు ప్రదర్శించేవారు. యక్షశబ్ద వైకృతరూపమే జక్కు.

యక్షగానమంటే ఒకే పాత్రతోకూడిన పురాణకథాప్రదర్శనము. అది రానురాను బహుపాత్రలతో కొత్తరూపం ధరించింది. ఒకపాత్ర సూత్రధారునివలె కథ నడుపుతాడు. అప్పుడప్పుడు ఒకానొక పాత్రను కూడా అభినయిస్తాడు ప్రతిపాత్ర ఒక కీర్తనతో దన్నుదాను పరిచయం చేసికొని రంగం మీదకు వస్తుంది అందలిభాష సులభమైంది. అక్కడక్కడా మోటుహాస్యంగూడా వుంటుంది. కళాకారులు ఆయాపాత్రలను ధరించి దరువులుపాడి లయతో అడుగువేసి ఆడటంవల్ల యక్షగానమంటే

ఒక నృత్యనాటకమే అవుతుంది, ఇందులోని నృత్యాలు శాస్త్రీయములైనవి కావు అవి నాట్యశాస్త్రాన్ని అనుసరించినవిగావు. లయానుసారులైన అంగీ కరచరణ ప్రచారములు మాత్రమే ఆ నృత్యములు. సంగీతం కూడా అక్కడక్కడా శాస్త్రీయములైన వివిధ పాత్రధారులు రంగంమీదకువచ్చి ఆ యా పాత్రలను అభినయించుటంవల్ల ఇదికూడ నాటకమే. కాని ఇందలి సంభాషణ పాటరూపంలో వుంటుంది.

ఈవిధంగా నృత్యానికి నాటకానికి మధ్య యక్షగాన మొక సంధివంటిది. రాత్రిళ్లు ప్రతిపూరిలో యక్షగానాలు ఆడేవారు. చాలమంది గుంపులుగూడి చూచేవారు. చదువుకొన్నవారిలో శాస్త్రీయ నృత్యం ప్రసిద్ధమైయుండగా ప్రజానీకంలో యక్షగానం ప్రసిద్ధి చెంది వుండేది. సిద్ధేంద్రుడీ రెండింటిని సమ్మిళితం చేసి దానికి "భాగవత మేల" అని పేరుపెట్టాడు. అది శాస్త్రీయకళాసంపన్నమైన జానపద రూపం. అభినయదర్పణ పద్ధతిలోనే నృత్యం రీతులు కొన్ని ఉండేవి. భాష సంస్కరింపబడి సంగీతం శాస్త్రీయ రీతికి మార్చబడి ఉత్తమ అభినయం చూపబడి పాత యక్షగానమే కొత్తగా కూచిపూడి నాటకమయింది భామాకలాపం దీనికొక చక్కని నిదర్శనం. నాటకీయ దృష్టితో అక్కడక్కడా నృత్యాలుకూడా చేర్చబడ్డాయి

పౌ రా ణి క గా ధ లు:—కూచిపూడి నాట్యాచార్యులు యిటీవల కొన్ని కొత్తకళాఖండాలను ప్రవేశపెట్టారు వీటిని శబ్దము లంటారు. ఇవి లయబద్ధములైన కీర్తనలు. వీటిలో కొన్ని తమ దాతలను ప్రశంసించేవి. కొన్ని ఎదో ఒక కథనో లేక పురాణాలలోని ఒక సంఘటననో ప్రదర్శించేవి. మరికొన్ని కేవలం శబ్దసౌందర్యాన్ని ప్రదర్శించేవి, దీనిలో కొన్ని యీ క్రింద ఉదహరిస్తాను.

పెదపులిపల్లు వాస్తవ్యులు సిద్దాంతులు రంగదాసు రచించిన దశావతార శబ్దం, ఇది జతులతో కూడివున్నది. మేలట్టూరు కాశీనాధయ్య రచించిన మండూక శబ్దము. ఇందులో అంతా మాటలుగారడి. వానాకాలంలో చెరువులలో కప్పలు చేసే ధ్వనుల అనుకరణమే యిది. ఇందులో చివరకు మహాభాగవతంలోని గజేంద్రమోక్షం ఘట్టం ప్రదర్శితమైంది. నర్తకుడు కప్పవలె కూర్చుని నాట్యం చేస్తాడు.

మేలట్టూరు వేంకటరామశాస్త్రి రచించిన ప్రహ్లాద శబ్దము మహాభాగవతములోని ప్రహ్లాదుని కథను చూపుతుంది. లంకనుండి తిరిగివచ్చిన తరువాత రాముడు పట్టాభిషిక్తుడైన ఇతివృత్తాన్ని చూపే శబ్దం. మరొకటి తులాజాజి శబ్దం. 18 వ శతాబ్దిలో తంజావూరు పాలకుడైన తులాజాజి అనే తుక్కోజీని ప్రశంసిస్తుంది. అలాగే తంజావూరు పాలకులైన శరభోజీనిగురించి మహారాష్ట్రుడైన శివాజీని గురించి వ్రాసిన శబ్దముంది. తిమ్మప్రభువుపై రచించిన 'శద్ది' శబ్దంకూడా వుంది.

కూచిపూడ కళాఖండాల్లో ఇంట్లాటివి 20 శబ్దాలు వున్నాయి. వీనికితోడు ఎక్కడైనా నాటకం రక్తికట్టనప్పుడు జతులను ప్రయోగించటంలో కూచిపూడివారు ప్రవీణులు. అట్టి జతులు 100 వున్నాయి. అవసరాన్నిబట్టి కొత్తవి కూర్చి అప్పటికప్పుడు ప్రయోగించటం కూడ వుంది.

సూ చ్య సూ న న:— సంభాషణను కథాకథనాన్ని పాత్రపరిచయాన్ని నడిపే పాటలే దరువులు. ప్రతిపాత్రా రంగంమీదికి వచ్చాక ఒక దరువుతో తన్నుతాను పరిచయం చేసికొంటుంది. సూత్రధారుడు కథాసందర్భాన్ని కలుపుకుంటూ పోతాడు. యీ నృత్యనాటకములు శబ్దాలు ప్రయోగించటమేగాక కూచిపూడి కళాకారులు జయదేవుని గీతగోవిందాన్ని, నారాయణ తీర్థుల తరంగాలను క్షేత్రయ్య పదాలను అభినయిస్తారు. లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృత శ్లోకా

లను సాభినయంగా ప్రదర్శిస్తారు. ఇంకా వున్నత ప్రమాణంగల కొన్ని నృత్యాలుకూడ వున్నాయి. కృష్ణ లీలా తరంగిణిలోని బాలగోపాల తరంగాన్ని అభినయించేటప్పుడు నర్తకుడు తలపై జలకుండికను పెట్టుకొని ఇత్తడిపళ్ళెం అంచుమీద అడుగువేస్తాడు. బోర్లించిన మట్టికుండపై నిలబడి నృత్యం చేస్తాడు. అలా నాట్యం చేస్తున్నా అతని కాలివేళ్లతో నేలపై చిత్రలేఖనం చేస్తాడు. వారినేర్పుకు యివికొన్ని నిదర్శనాలు మాత్రమే.

కూచిపూడివారు హాస్య సంభాషణలతో పగటివేషాలువేసి జనాన్ని రంజింపజేస్తారు. పనిలేనికాలంలో పల్లెలకువెళ్ళి వారు యీ విధంగా అనేక పాత్రలను అభినయిస్తారు. కూచిపూడి నాట్యానికి పెద్ద రంగస్థలంతో పనిలేదు. పైన కొబ్బరియాకులతో తాటియాకులో కప్పిన ఒక ఎత్తైన అరుగుచాలు. వీరి నాటకాలు చతుష్పథాల్లోకాని దేవాలయాలముందుగాని, ఊరి పెద్ద ఇంటిముందుగాని ప్రదర్శింపబడుతాయి. ఏగోడైనా నేపథ్యంగా పనికివస్తుంది. అటూ ఇటూ చేతితో పట్టుకొన్న తెరవెనుకనుండి పాత్ర ప్రవేశిస్తుంది. అటూ ఇటూ కాగడాలు పట్టుతారు. పాత్ర ప్రవేశించేటప్పుడు వీనిమీద సాంబ్రాణి చల్లుతారు. పూర్వం రాక్షసపాత్రలు ప్రవేశించేటప్పుడు ప్రజల మనస్సుల్లో భీతావహం కలిగించటంకోసం మద్దెలలు మ్రోగించేవారు. కూచిపూడి నటకుని ఆహార్యం అతి సామాన్యమైనది. పచ్చరంగు తెలుపు యెరుపు కొబ్బరినూనెతో కలిపి ముఖానికి పూసుకొనేవారు ఇటీవల కొందరు ఆధునికములైన రంగులే వాడుతున్నారు.

పంచమ వేదము:— వేదపఠనముతో నాటకం ప్రారంభమవుతుంది నాట్యశాస్త్రము పంచమవేదము. ఋగ్వేదమునుండి వాచ్యాన్ని, యజుర్వేదమునుండి అభినయమును సామవేదమునుండి గాత్ర సంగీతాన్ని, అథర్వవేదమునుంని రసాన్ని తీసికొని బ్రహ్మ దీన్ని నిర్మించాడు, కనుక నాటకారంభంలో చదువబడే చతుర్వేదసూక్తాలు నాట్యవేదావిరావాన్ని సూచిస్తాయి. ఆ తరువాత నాట్యరంగాన్ని పుణ్యోదకాలతో పవిత్రీకరిస్తారు. దీనినే పుణ్యాహవాచన అంటారు. ఆ తరువాత చిత్రవర్ణ రజస్సులతో రంగాలంకరణ చేస్తారు. వేరొక కళాకారుడు సాంబ్రాణి ధూపం వేస్తాడు. రంగాధి దేవతకు 53 దీపాల తోరణంతో హారతు లెత్తుతారు. ప్రేక్షకుల ఆశీస్సులు కోరుతూ పూలు చల్లుతారు.

పిమ్మట రంగభూమిపై ఇంద్రధ్వజమెత్తుతారు. నాట్యశాస్త్రంలో దీనికి సంబంధించిన ఒక కథవుంది. దేవేంద్రుడు అమృతమథనం ప్రదర్శింపవలసినదిగా భరతమునిని కోరాడు. బహుశ ఇదే మొట్టమొదటి నృత్యనాటకం కావచ్చు. నాటకం జరుగుతుండగా రాక్షసులకు అవమానం తోచి రాక్షసమాయతో దేవతలను ఎదుర్కొన్నారు. భరతుడు నోరు కదపలేక పోయాడు. దేవేంద్రుడు యీ రాక్షస మాయలను కనిపెట్టి తన జెండాకఱ్ఱతో వారిని నాశనంచేశాడు. అప్పటినుంచి ఇంద్రధ్వజానికి జర్జరమనే పేరు వచ్చింది. ప్రతినాటకానికి ముందు దానిని ప్రతిష్ఠింపవలసిందని చెప్పి దేవేంద్రుడు దానిని భరతమునికిచ్చాడు. దానినిచూస్తే రాక్షసులకు భయం. అప్పటినుంచి ప్రతినాటకానికి ముందు రంగస్థలాన ఆ ధ్వజాన్ని ప్రతిష్ఠించటం పరిపాటయింది. దీని తరువాత విఘ్నేశ్వరుడు ప్రత్యక్షమై ప్రదర్శనం నిరంతరంగా జరుగుగాక యని కళాకారులను దీవిస్తాడు. ఆ తరువాత సాంప్రదాయకమైన ఆ-బా ప్రార్థనం ఇద్దరు ముగ్గురు కళాకారులతో కలసి సూత్రధారుడు చేస్తాడు.

సూత్రధారుడు తన వంకరకర్రతో రంగస్థలం మీద నిలబడుతాడు. ఈ కర్రను, బ్రహ్మ భరతమునికి బహూకరించినట్లు నాట్యశాస్త్రంలో వుంది.

దీనిని కుటిలకమంటారు. సూత్రధారుడు గురుపూజానంతరం ప్రేక్షకులకు స్వాగతం చెపుతాడు. కథచెప్పి అందలి విశేషాలను వివరిస్తాడు. అంతటితో నాటకమారంభ మవుతుంది. సూత్రధారుడు నాటకంలో విదూషక పాత్రకూడ ధరిస్తాడు. అతడు హాస్యప్రవీణుడు. తన అంగభంగిమలచేత సంభాషణలచేత ప్రేక్షకులకు ఆనందం కలిగిస్తాడు.

గత శతాబ్దిలో క్షుద్రమంత్రాలు ఎక్కువగా ప్రయోగించేవారు. కూచిపూడివారు ఏదైనా గ్రామానికి వెళ్ళితే అక్కడి మంత్రగాడు వారిమీద తన మంత్రశక్తులను ప్రయోగించేవాడు దాన్ని అరికట్టడంకోసం సూత్రధారుడుగూడ మంత్రప్రయోగం చేసేవాడు. కూచిపూడివారు నాటకాలాడుతూ చాలాచోట్ల తిరిగేవారు. ఒకసారి మైసూరులో ఒకగ్రామంలో నాటకం ఆడబోతున్నారు. ఆ వూరిలో ఒక పెద్ద మంత్రగాడున్నాడు. ఏ కళాకారుడైనా వస్తే నాటకం ఆడేముందు అతని అనుమతి పొందవలసి వుండేది. కాని కూచిపూడివారు అలాచేయలేదు.

మంత్రగాళ్ల యుద్ధం:— కూచిపూడివారికి భాగవతుల దశరథరామయ్య నాయకుడు ఆయన త్రోవనబోతూ పొరపాటున ఒక మంత్రగాడి ఇంట్లోకి వెళ్లి చుట్ట నిప్పు తెమ్మన్నాడు. ఆ మంత్రగాడు తన భార్యనుపిలచి నిప్పు తెమ్మన్నాడు ఆపెడ మండుతున్న నిప్పుకణిక అరచేత పట్టుకొనివచ్చింది. అప్పుడు దశరథరామయ్య ఇది మంత్రగాని యిల్లని నిశ్చయించుకొన్నాడు. వెంటనే ఆ నిప్పు వేయమని తన పైపంచ పట్టినాడు. దశరథరామయ్యయొక్క ప్రతిభ అర్థంచేసుకొని మంత్రగాడు అతనికి హాని చేయదలచాడు ఏవో మంత్రాలు చదివాడు. సత్యభామ పాత్రధరించవలసిన దశరథరామయ్యకు భరించరాని కడుపునొప్పి వచ్చింది. దశరథరామయ్యకూడ తన మంత్రశక్తితో వాడిని ఎదుర్కొన్నాడు. తత్ఫలితంగా వాడి పండ్లు వూడి పడిపోయాయి. పండ్లులేనివాని మంత్రాలు పనిచేయవుగదా—

కూచిపూడివారి సంగీతం:— కూచిపూడివారి సంగీతం సంప్రదాయ శాస్త్రీయమైన కర్ణాటక రీతిలోది. రాగముల, మిశ్రమములు, ఆహిరిరాగాన్ని తరచు పాడుతారు. అదివారి అభిమానరాగం. ఒక పాత్ర సహాయక గాయక బృందంతో కలసి పాట పాడుతాడు. నాట్యశాస్త్రంలో చెప్పినట్లు నాట్యకారుడు గాత్రంతో సంగీతం పాడుతూ హస్తముద్రలతో దాని భావం సూచిస్తూ నేత్రచాలనంతో దాని అంతరార్థం వెల్లడిస్తూ అడుగులతో దాని లయను అనువర్తించాలి. నృత్యంచేస్తూ పాటపాడటం కూచిపూడినాట్యంలో ఒక ప్రత్యేకత. 1. శ్రుతి=ఇప్పటి హార్మోనియం 2 వాయులీనం, 3. వీణ 4. మురళి-యివి వాద్యవాయిద్యాలు. తాళాలకు ఇందులో ప్రత్యేక ప్రాముఖ్యంవుంది. సూత్రధారుడు తాళం వేస్తాడు.

ఏ స్త్రీకి నాటకంలో పాత్రధరించే అధికారం లేదు. ఈ నాట్యరీతిలో ప్రసిద్ధులైన కొందరు పేర్కొనదగిన వారున్నారు. గతశతాబ్దిలో 1. వేదాంతం సాంబయ్య, 2. హరిచలపతి, 3. భాగవతుల దశరథరామయ్య, 4 భాగవతుల రామదాసు, 5. భాగవతుల రామయ్య, 6. నాగలింగయ్య, 7. సుబ్రహ్మణ్యం, 8 విస్సయ్య 9. చింతా పార్వతీశం మున్నగువారు ప్రసిద్ధులు, వీరిలో మొదటి అయిదుగురు గొల్లకలాపాన్ని నూతనభావాలతో రచనలతో కొత్త కూర్పు చేసారు ఈ శతాబ్ది తొలికాలంలో వెంపటి వెంకటనారాయణ సుప్రసిద్ధుడు. అతని ప్రతిభను పెద్దలు కూడ వేనోళ్ల అభినందిస్తారు.

ఈ నాట్యాచార్యులలో ఒకడైన వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి ఇటీవలదాకా జీవించియున్నారు. 20 మంది విద్యార్థులను తయారుచేశారు. యామినీ

కృష్ణమూర్తి మొదలైన వారిని యీ కళలలోనికి ప్రవేశ పెట్టిరి. ఆయనే. 70 ఏండ్ల వయస్సులోవున్నా ఆయన నాట్యప్రదర్శనంచూచి ఉదయశంకర్, రాగిణీ దేవి మొదలైన నాట్యకళాప్రవీణులు నివ్వెరపోయారు. కీ. శే. చింతా వేంకట్రామయ్య ఇప్పటి వేంకటరామ నాట్యమండలి సంస్థాపకులు. ఆయన గొప్పఆచార్యుడు, సూత్రధారుడు, ఆయన నాటకాలు నేను అనేకం చూచాను. ఆయన గొప్పపండితుడు 50, 60 మంది శిష్యులకు శిక్షణ యిచ్చాడు. ఆయన శిష్యులు యీ నాటికి కూచిపూడి కళాజ్యోతిని వెలిగిస్తున్నారు. వారిలో వేదాంతం రాఘవయ్య, వెంపటి సత్యం, పసుమర్తి వేణుగోపాలకృష్ణశర్మలు ప్రత్యేక ప్రశంసార్హులు. ప్రస్తుతం వేంకట్రామ నాట్యమండలి దర్శకుడైన చింతా కృష్ణమూర్తి ఆయన కుమారుడే. అనేక అవరోధాలను అధిగమించి కూచిపూడి నాట్యకళను ప్రచారంచేస్తున్న కీర్తి యీనాడు అయనకే చెందుతుంది. నాయకీ పాత్రధారణంలో భారతావ్యక్ష బహూకృతి పొందిన వేదాంతం సత్యనారాయణశర్మ ఆయన శిష్యుడే.

కళా పునరుజ్జీవనం:– గత రెండు దశాబ్దులుగా ప్రజాదరణ లేకపోవటంవల్ల సినిమా తాకిడివల్ల కూచిపూడినాట్యం చాలా దెబ్బతిన్నది. కూచిపూడి నాట్యకళ శాస్త్రీయమైనది కాదని కొందరు చేసిన సిద్ధాంతాలను ప్రతిఘటించడం కోసం ఆంధ్రప్రదేశ సంగీతనాటక ఎకాడమీ 1959 లో కూచిపూడి నాటక కళమీద ఒక చర్చావేదిక ఏర్పాటు చేయటంతో మళ్లీ మంచిరోజులు వచ్చాయి. ఇప్పుడు కోరాడ నరసింహారావు ఇంద్రాణి. రహమానులు కూచిపూడి కళాజ్యోతిని విదేశాలకు తిసికొనిపోతున్నారు. వారి పరిశ్రమవల్ల కూచిపూడి పేరు ప్రసిద్ధిలోకి వచ్చింది. కూచిపూడిలో యీనాడు నాట్యకళార్థులకు శిక్షణ యిచ్చే నిమిత్తం శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం స్థాపించబడింది. ఎక్కడనుంచి వచ్చిన విద్యార్థులకైనాసరే అక్కడ వసతి ఏర్పాటు వుంది. విద్యాబోధన వుచితం.

కూచిపూడి కథాకళి ఆహార్యాల్లో స్పష్టంగా కొంత పోలికవుంది కాని కూచిపూడివారి ఆహార్యం కంటె కధాకళి అహార్యం కొంతవిశేషంగా వుంటుంది. కొద్దిపాటి విభేదాలు వదిలేస్తే యీరెండు రీతులకు నందికేశ్వరుని అభినయదర్పణమే ఆధారం. రెంటిలోనూ యితివృత్తాలొక్కటే. మరి భేద మెక్కడ ? కూచిపూడినాట్యం మందమందంగా రాజఠీవితో సాగితే కథాకళినృత్యం శీఘ్రగమనంతో నడుస్తుంది. కథాకళిలోకంటె కూచిపూడిలో సాత్వికాభినయం ప్రాధాన్యం వహిస్తుంది కథాకళిలోని ముఖం, రాగం గుస్తుల స్వాత్వికాభినయ విశేషానికి అవకాశమివ్వవు. అంతేగాక నాట్యధర్మి, లోకధర్మి అని రెండురకాల అభినయమున్నదని నాట్యశాస్త్రం చెపుతున్నది ముద్రాదికంతోకూడిన సాంప్రదాయకమైన అభినయమే నాట్యధర్మి ముద్రలయొక్క అర్థాన్ని వ్రయోజనాన్ని తెలిసికొన్నవారు మాత్రమే అదిచేయుగలరు. నాట్యధర్మి రీతియందలి భంగిమలనుమాత్రమే చూచి సామాన్యమానవులు సంతోషించగలరు. కాని విశిష్టత వారికి తెలియదు. సంఘంలోని సడవడులను ప్రతిబింబిస్తూ చేసే వాస్తవికాభినయమే లోకధర్మి. ఆయా ప్రత్యేక సన్నివేశాలలో మానవుల సహజ మనోవృత్తులయొక్క ప్రతిబింబమే అది సుమా. అది అందరికి అర్థమవుతుంది. దానిని చూచి పండిత పామరులు సమానంగానే ఆనందిస్తారు.

వర్తమానరీతులు-సామాన్య వైషమ్యాలు: కథాకళి కేవలనాట్యధర్మి. అందులో ముద్రలు మిక్కలి ప్రధానమైనవి, కూచిపూడిలో నాట్యధర్మి లోకధర్మి చక్కగా సమ్మిళితమైనాయి. అందువల్ల యీ విశిష్టతలు తెలిసినవారికి మాత్రమే కథాకళి ఆస్వాద యోగ్యంకాగా కూచిపూడి అందరికీ అనుభవయోగ్యం

గావుంది భరతనాట్యంఅంటే ఏకపాత్రాభినయ ప్రదర్శనం మాత్రమే. అది స్వచ్ఛమైన నాట్యధర్మి రీతినే అనుసరిస్తుంది కాని కూచిపూడిలో నాటకీయత వుంది. ఇక్కడ రసం ప్రధానం. భరతనాట్యం కూచిపూడినాటకంలో సమ్మిళితమైంది. నిజానికి భరతనాట్యంలో మనం చూచేది నాట్యం. భరత నాట్యమన్నప్పుడు నాట్యశబ్దాన్ని సార్ధంగా ప్రయోగించటంలేదు. దాన్ని భరతనృత్య మనవచ్చును. కాని కూచిపూడినాట్యంలో నృత్త–నృత్య నాట్యములు ప్రయోగింపబడుతున్నాయి. జతులలోది నృత్తము. నృత్తానికి పాటగాని ఇతివృత్తంగాని రసంగాని వుండదు.

కూచిపూడి జతులు కేవలం నృత్యాలు; శబ్దములు నృత్యములు వాని రసభావములు మాత్రమే వున్నవిగాని నాటకీయతగాని ధారావాహికమైన ఇతివృత్తంగానిలేదు. సాంప్రదాయికమైన కూచిపూడి నృత్యనాటకముయొక్క వాస్తవికాభినయం న్యాయంగా నాట్యమని చెప్పవచ్చును అందులో ఒక కథ, నాటక సన్నివేశం, భావం, రసం వుంటాయి. కనుక కూచిపూడి నాట్యము నృత్తనృత్య నాట్యముల సమగ్రమైన స్వయంసంపూర్ణమైన సమ్మిళిత కళాఖండమని చెప్పవచ్చును, అది పండిత పామరులుభయులకు ఆస్వాదయోగ్యమైనది నాట్యశాస్త్రంలో చెప్పబడిన సూత్రాలకు పూర్తిగా అనుగుణమైంది. నృత్యనాటకాల మనోహర సమ్మేళన కర్ణపేయమై నేత్రపర్వమై హృదయానందదాయకమై యున్నది.

# శ్రీనాథావతార తత్త్వము

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

శ్రీనాథుడు ఆంధ్రసాహిత్యంలో జగన్మోహిని అవతారము. ఆ మహామాయకు బద్ధులుగానివారు లేరు. ఆ అద్వితీయ సౌందర్యవిలాస విభ్రమములకు ఎంతటి శబ్దసంయమీంద్రులైనా లోబడక తప్పదు. వాక్కు పరాశక్తి. ఆ మహాదేవియే సృష్టిస్థితి సంహార కారిణి "ఆరాధ్యాం హరిహర విరించ్యాదిభిరపి" ఆ జగదేకమాతయొక్క కటాక్షమే. పుష్పబాణములు, మధుకరమౌర్వి, ఇక్షుకోదండము కలిగిన అనంగుని త్రిజగద్విజేతగా చేసింది, నిరక్షరాస్యులైన వాల్మీకి కాళిదాసాదులను అఖండ కవితాసుధారసధారాధౌరేయులను చేసింది. ఆశక్తి ఓం నమశ్శివాయేతి ప్రారంభశుంభ దక్షరసమామ్నాయ శోభాయమానమైన త్రిలింగదేశమున శ్రీనాథుడై అవతరించింది.

శ్రీనాథావతారముతో ఆంధ్రభాషా ప్రపంచాన్ని వైష్ణవీతేజమావరించింది. అక్కడనుంచీ ఆంధ్రకవిత కవితకాదు, మోహరజ్జువు. "వలమాన తాటంక, వజ్రాంకు రచ్ఛాయ లేతవెన్నెల వుక్కిలించియుమియ, విరులదండల తోడివేణికాభారంబు పాంకంబు పిరుదుల పొరలియాడ, కుదురునిండిన చిన్ని గుబ్బచన్నులమీద ముత్యాల త్రిసరంబు మురువుజూప, మణితులాకోటి కోమల ఝణత్కారంబు రవళి మట్టెలమ్రోత యవఘళింప" శ్రీనాథకవిత ఆంధ్రవీధుల్లో విహరిస్తూ జగజగాలకు మరులుకొల్పింది. ఆవేవి రసోద్రేకభారంతో ఉద్ధూతలూగినప్పుడు సముద్ధత శబ్దావష్టంభ శాంభవచ్ఛవి వెల్లివిరిసింది. "పాదాభిహతి సప్తపాతాళములతోడ నుర్వీకటాహ ముద్ధూతలూగ, నిర్భరతర జటానికురుంబకంబులు చెదరి బ్రహ్మాండంబు చెంపవెట్ట, బాహార్గళాస్తంభ పరివర్తనంబున బృథ్వీధరంబులు పెల్లగిల్ల ఢమరుధానాదముల సముద్రములుకలగ, నారభటివృత్తి దాండవంబవధరించె. ప్రళయవేళ మహాకాలభైరవుండు, కాళరాత్రి కుచంబులు గగురుపొడువ"—"ఎవ్వాడు వింధ్యాద్రి నిజ్ఞంకులింకించె గంభీరహుంకార గర్జనమున అంభోధులేడింటి నాపోశనంబెత్తి కలిగించె నెవ్వాడు క్రమ్మరంగ"అంటూ సీసపద్యగణాలు జటాపటలి విరియగా శివాలాడాయి. ఒకవైపుచూస్తే ఒక

మాయామనోహర విహారమూర్తి సాక్షాత్కరిస్తుంది. మరొకవైపు చూస్తే ఒక ప్రచండ తాండవోద్రేక పౌరుష స్ఫూర్తి ప్రత్యక్షమవుతుంది. ఈ ద్వైతమూర్తిత్వమే పరా శక్తియొక్క సమగ్రస్వరూపము "*అహామాహామార్థే సకలముభయాకార ఘటనాత్, ద్విధాభూతమ్ రూపమ్*" ఇట్టిది ఆ అపర పరాశక్తియైన శ్రీనాథుని అవతార తత్త్వము.

ఏమీ ఉండదు, ఎంతో ఉన్నట్లు కనుపిస్తుంది. అది చిత్తమును మోహసంక్రాంతముమ చేస్తుంది. ఇదేగదా జగత్తత్త్వము. "*నెలమసలెనిందువదనకు, జలజాక్షికి నల్లనయ్యె జన్నుల ముక్కుల్, తలిరుం బోడికి నళిని దళపాండువులయ్యెగండ దర్పణతలముల్.*" "*చిఱుసాన బట్టించి చికిలిసేయించిన గండ్ర గొడ్డలి నిశాగహనలతకు, గాల్కొన్న నిబిడాంధకార ధారాద్భుతాప్రతవాటికి వీతిహోత్రజహ్వ.*"
ఇక్కడ ఏమున్నది? ఏమీలేదు. కానీ ఎంతో జాజ్వల్యమానమై కండ్లకు మిఱుమిట్లు గొల్పుతూ ఉంది. ఇది ఈ కవిత్వపు ప్రధానలక్షణము శబ్దశక్తి దుర్విలంఘ్యము. అన్నమయాది మనోమయకోశ పర్యంత త్రిభువనములను మోహసముద్రమున ముంచివేయును. శబ్దము ప్రవృత్తిమూలము, ఆనందము నివృత్తి మూలము. ప్రవృత్తి అనంతకోటి కామకళావిలాస భాసురమైయుండును. అట్టి ప్రవృత్తివెనుకనే నివృత్తి. శక్త్యనుగ్రహము సిద్ధించి శక్తిపాతము కలిగిననేగాని బ్రహ్మసాక్షాత్కారము కలుగదు. ఈమాట శాస్త్ర మూలము; దానికి శ్రుతిమూలము. "ఆనందో *బ్రహ్మేతి వ్యజానాత్*" అని అతర్వాత తైత్తరీయము. "*యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ*" అంటుంది. వాగ్వ్యవహారాదులు నివృత్తమైనప్పుడే బ్రహ్మానందము కలుగును. వాఙ్నివృత్తి శక్తిపాతము తుల్యక్రియలు, బ్రహ్మసాక్షాత్కారము సమానము. ప్రవృత్తిమూలము విభ్రమజనకము అగు శబ్దశక్తిచే సమావిష్టుడైనజీవి తచ్ఛక్తి తత్త్వమెరుగక తచ్ఛక్తి సాక్షాత్కార కటాక్షములు సిద్ధించక ధ్వనిరూప నివృత్తిపొందడు. అట్టి నివృత్తిమార్గమంటక రస బ్రహ్మమును పొందలేడు. జీవన్మరణ కాలముల మధ్య ప్రవహించు అనంతమాయామోహాసమైన ౨క స్సృష్టితత్త్వమెఱుగక, అది బ్రహ్మభిన్నమని యెరుగక జీవి ముక్తుడెట్లగును? ఇదీ అంతే. కనుకనే కాళిదాసాదులు "*వాగర్థావివ*" అని అరెండింటికి తుల్య స్థానమిచ్చి పూజించిరి. ఇక్కడ "అర్థ" అంటే అభిధాది త్రిధాభూతార్థములు నభివ్యజ్యమానములైనవి.

ఇట్టి దుర్విలంఘ్యమైన శబ్దశక్తి ఆంధ్రసాహిత్య జగత్తున శ్రీనాథరూపమున సమగ్రసాక్షాత్కారము నిచ్చినది. ఆశక్త్యావిర్భావము ఎంత ఆశ్చర్యకరమో చెప్పలేము. ఆశక్తి మనలోని ప్రాణస్థానములను కుదిపి లేవనెత్తివేయుచున్నట్లుండును. "*రణకండూభరదుస్సహంబయిన ఆరాజన్యదేవేంద్రు దక్షిణ బాహాగ్రమునం జనించిన మహాకీర్తి ప్రవాహంబు కారణ సంక్రాంత గుణానుషంగమునసో ప్రస్ఫుత దిఙ్మత్త వారణగండస్థల కుంభకూలములతో రాయున్ దివారాత్రముల్.*" '*రణకండూ*' అని ప్రారంభమయింది. ఇందు "*మహాకీర్తి ప్రవాహంబు*" కర్త. హకారవర్ణాత్మకమైన శబ్దశక్తి '*రణ*' దగ్గర ఒకబీజ రూపంగా బయలుదేరి '*కండూ*'అని తలయెత్తింది. '*రాజేంద్రు*' అనవచ్చుగా, అనదు. '*ఆరాజన్యదేవేంద్రు*' అంటాడు. అక్కడ లేచినిలిచి '*బాహువులు*'జాపింది, అంతట '*దక్షిణబాహాగ్రమున*' అనగానే హక్షవర్ణ ద్వితయప్రతిపాదిత విక్రమస్ఫూర్తియై ఆజ్ఞాచక్ర పర్యంతము పెరిగింది అంతట బ్రహ్మలోకము చేరింది. "*కారణసంక్రాంత గుణానుషంగము*" వలన "*దిఙ్మత్తవారణగండ స్థలకుంభకూలములతో*" అనుటతో దిక్కుల నాక్రమించుకున్నది. అంతట "*దివారాత్రముల్*"అనుటచే అహోరాత్ర విభాగము నధిగమించినది. బ్రహ్మకారణము, శక్తికార్యము, కార్యకారణముల భిన్నములనుట సిద్ధాంతము. అందు

చేత 'కారణసంక్రాంతగుణానుషంగము" అంతట దిక్కుల నాక్రమించుట, అంత నహోరాత్ర విభాగము నధిగమించుట. కనుక ఇక్కడ మహాకీర్తి ప్రవాహ రూపక శబ్దశక్తి బీజదశనుంచి విరిసి విశ్వరూపము ధరించి బ్రహ్మభిన్నమై "దిక్కాలాద్యనవచ్ఛిన్నానంత చిన్మాత్రమూర్తి"యై బ్రహ్మాండభాండము లావరించినది. ఇక్కడ నాకు వ్రాత్యకాండలోని అధర్వమంత్రములు ఎప్పుడో చదివినవి జ్ఞప్తికి వస్తున్నాయి.

"సదిశోఽనువ్యచలత్ తమ్ విరాడమవ్యఽచలత్
సర్వేచదేవాః
సర్వాశ్చదేవతాః......ససర్వానంతర్దేశానువ్యఽ
చలత్...
...స మహిమా సద్యుర్భూత్వాంతం పృథివ్యా
అగచ్ఛత్ ససముద్రో
ఽ వత్...సోఽరజ్యత్ తతో రాజన్యోఽజాయత."

విద్వాంసులు నాతో యీ ఆనందమును పంచుకొందురు గాక. ఇట్టి రహస్యములు శాస్త్రములందున్నవి. తన్మూలకమైన వేదమునందున్నవి. పూర్వకావ్యములు వేదశాస్త్రసమాశ్రితములు. ఈ సంప్రదాయ మెఱుగనివారికి [illegible] యందలి రసతత్త్వము గోచరముకాదు. గోచరముకాక ఫలములేదు.

ఇంతశక్తి ఈ రణకండూభర పద్యమున ఉన్నది. శ్రీనాథశబ్దము సముదగ్రశక్తి సంపన్నము. నిరుపమాన ప్రయోగవైఖరీ విశిష్టము. 'శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారకహార పంక్తులం జారుతరమ్ములయ్యె' అన్నప్పుడుగాని నళినగళాములన్ మృదుమ్మృణాళకములం ఘనసారపాంసులన్ దళిరుల శయ్యలన్ సలిలధారల చందనచారుచర్చలన్ 'అన్నప్పుడుగాని ఒకరకమైన అవ్యక్త మధురధ్వని వినియోగము సిద్ధించునున్నదేగానీ' దిఙ్మత్తవారణ గండస్థల కుంభకూలములతో రాయుం దివారాత్రములన్ 'అన్నప్పుడు కలుగు ఒకానొక జీవగర్భ నిర్వేదక సముద్దండ స్ఫూర్తి కలుగుటలేదు. ఇదియే ఆశక్తి ప్రభావము.'

మంత్రమునందు మంత్రాధి దేవతయొక్క కీలకము పెట్టినట్లు శ్రీనాథుడు తన పద్యపాదాల్లో ఎక్కడో ఒకచోట జీవాన్ని నిక్షేపిస్తాడు. పద్యమంతాగానీ లేక సీసములలో అయితే ఆపాతంగానీ ఆ జీవస్థానమైన కీలకంచుట్టూ పరిభ్రమిస్తూ ఉంటుంది. రణకండూ పద్యంలో మహాకీర్తి ప్రవాహంబు అట్టికీలకము— 'పాదాభిహతి సప్త పాతాళములతోడ ఉర్వీకటాహముఝ్ఝూతలూగ' ఇక్కడ కటాహశబ్దం కీలకం. ఎట్లా? ఉర్వీ ఉఝ్ఝూత శబ్దాలు కటాహమనే యిరుసు చుట్టూ గిర్రున తిరుగుతూ ఉంటాయి. ఈ కటాహశబ్దం తీసివేస్తే యిరుసునుంచి ఊడిన చక్రాలవలె పద్యపాదంలోని శబ్దాలు నిరాశ్రయములై పద్యం కూలిపోతుంది. ఇట్టి కీలకపద్ధతిని 'పాండురంగడు' గ్రహించాడు. 'తన వాయుగంటుంబు మొనవాడి విశ్వంభరా ప్రజలకు ప్రాణరక్షగాగ' ఇక్కడ భారమంతా విశ్వంభరామీద ఉంది. సర్వం సహా ఇత్యాది మరేదన్నా పద్యం చచ్చిందన్నమాటే. ఇట్లాగే ''మెఱుగుకోఱలు డుల్ల మృత్యుదేవత నోరు ధట్టించి ఆఱకాలదన్నినాడు'' అన్నప్పుడు కీలకం ధట్టించి లోపెట్టాడు. ధట్టించి వల్ల దన్నిలోని దకు ఇబ్బడిబలం వస్తున్నది. ధట్టించి లేకపోతే ఏమీలేదు. "పంచవన్నియతోడ ప్రసవనారాచుని ఎత్తిచిప్పఱకంట జుట్టినాడు"లో కీలకం జుట్టినాడు. ఇటాకీలకం గ్రహించకపోతే కవితను ఆస్వాదించినట్లుకాదు. ఇవన్నీ శ్రీనాథుడి యింట్లోకి నిరాఘాటంగావెళ్ళి ఏగాదిలో ఏముందో తెలిసి ఆ యింట్లో పెత్తనంచేసే చొరవఉన్నవాళ్ళకు తెలిసే అంతర్యాలు, గేటుదగ్గరఉన్నవాళ్ళకు తెలీవు. గేటుదగ్గరఉన్నవాళ్ళు దుశ్శాలువలుధరించి, గండపెండేరాలు తగిలించుకుని ఎంత దగద్గాయమానంగాఉన్నా లాభంలేదు. ఇది శ్రీనాథశబ్దశక్తిస్వరూప నిరూపణ.

మూలప్రకృతియగు శక్తి మహత్తయి, అంతట త్రిగుణములచేత స్థూలసూక్ష్మ కారణ శరీరములు, జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు, జగజ్జీవేశ్వరులు

-ఆ ఖున సృష్టినిచేసినట్లు, మూలశబ్దప్రకృతివర్ణశబ్దభాషా రూపమహత్తయి, అంతట గుణములవంటి కైశిక్యాది వృత్తిభేదములచేత వివిధ సంయోజనావిశేషములు పొంది, అతిరమణీయ వాక్యరూపమైన సూక్ష్మశరీరమును పొందుతుంది. అటుపిమ్మట ఛందోమయమైన స్థూలరూపమును పొంది కవిత అవుతుంది. ఇట్టి కవితాశరీరమునకు వర్ణాదులు బ్రహ్మదండి. క్రియాపదము మూలాధారము, భావన సహస్రారము

తత్త్వమెరిగినవాడు శ్రీనాథవర్ణవైలక్షణ్యమును చప్పున పోల్చుకోగలడు సాధారణంగా అయన "*శరీరంలో*" ండ, ధ, హ, భ, ష, ట యిత్యాది వర్ణములు తత్సదృశవర్ణములు బ్రహ్మదండిగా నిలిచి ఉంటాయి, అన్యవర్ణములుండవనికాదు. పము దృఢస్థితిలో ఉండుటే ఉండుట. అట్టి దృష్టితోచూచి చెప్పినమాటయిది అయన శబ్దములుకూడా అట్టి వైశిష్ట్యమున్నవే-ప్రతిభటించి, ఉద్దండించి బ్రహ్మాండము ("*ధరణీ నాథునికీర్తిదాలె కడునుద్దండించి బ్రహ్మాండమున్*") అజాండకర్పరము. అవష్టంభము, వ్యతికరము, విప్రతీపము, గోడగించు, అకరువు, కట్టెజ్జు, బీరెండ, ఇవతాళించు, అసలుకొన్న, గుస్తరించు, నెఱకగట్టి, కొడుకుకుజ్జు దాయాదము, పాణింధమము, శృంగాటకము సంబెళవహించు, వాగెవచ్చు, ఇట్లాఉంటాయి.

అంధ్రసాహిత్యలోకంలో ఒక ఘోరమైన అపప్రధఉంది, శ్రీనాథకవిత సంస్కృతభాషాజుష్టమనీ తెనుగు తక్కువఅనీ — ఇది అవిచారమూలకము, నన్నయభట్టులోకంటె శ్రీనాథుడిలో తెలుగు ఎక్కువ ఉంది. ఇది ఎంత నిర్భ్రాంతపరచేమాట అయినప్పటికీ వాస్తవము. శ్రీనాథుడిలో సంస్కృతాంధ్రములు చెరిసగముఉంటే, నన్నయలో నూటికి అరవైపాళ్ళు సంస్కృతం నలభయిపాళ్ళు తెలుగు ఉంటుంది. అయితే శ్రీనాథుడికి అపప్రధవచ్చింది, నన్నయకు రాలేదు. నన్నయ ఎక్కువ సంస్కృతం వాడినా దానిని లలితీకరించి తెలుగుతో రంగరించి తెలియనీకుండాచేసి తెలుగువారిచేత సేవింపజేశాడు ఇదిపోకిరితనం వంటిది. కానీ శ్రీనాథుడు కొంతవరకు అట్టి లలిత సమ్మిశ్రమవిధానం వాడినప్పటికీ బహుళంగా ప్రౌఢప్రయోగములమీరి మోజుచేత వాటిని నిరాఘాటంగా గుప్పించి సముద్భటారభటీవృత్తితో కవితను తాండవింపజేసి తన సంస్కృతాన్ని బట్టబయలు చేసుకున్నాడు. కనుక నన్నయలో సంస్కృతం దృశ్యాదృశ్యంగా ఉండగా శ్రీనాథునిలో స్వస్వరూపంతో భాసిస్తుంది. ఆకారణంగా ఈ అపప్రధవచ్చిందేగాని నిజానికి నన్నయభట్టే ఎక్కువ సంస్కృతం వాడాడు

శ్రీనాథుడు సంస్కృతాంధ్రములను నిర్వహించుపట్ల ప్రతిభ సమానస్కంధంలో ఉంటుంది. సంస్కృతమెంత రమణీయంగాను ప్రౌఢంగాను ఉంటుందో తెలుగుకూడా అంత రమణీయంగాను అంత ప్రౌఢంగాను ఉంటుంది. సంస్కృతంతో శ్రీనాథుని గమి కర్మీకృతాది ప్రసిద్ధప్రయోగములవంటివి యింకా ఉన్నాయి. ఉదా— '*కిసలయరస జిగ్రహిషా వ్యసనాకుల*' జిగ్రహిషా. హర్షభట్టుయొక్క '*ఔపయికం*' వంటి కేవల శాస్త్రజన్యశబ్ద చమత్కారములు యివి. కానీ శ్రీ రమణీయపద్ధతి ఆకర్షణీయము. '*అఖండాండవ మార్భటీపటహ లీలాటోప విస్ఫూర్జిత క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ క్రోడాఘాత కఠోరకోటి కరుటీకోటి లురవ్వింధు వీచీచాలా పటలీ పరిస్ఫుటతరస్ఫీత ధ్వని ప్రౌఢిమన్.*' "(*గంభీరవాక్ ప్రౌఢిమన్*)" అని మరొకచోట అన్నాడు, అనకూడదన్న పండిత బ్రువులు చచ్చేటట్లుగా మరొకటి, '*కుటిలారాతివరూథినీ ధవళిర, కుట్టాకధాటీ మహాపటహధ్వాన విపాట్యమాన దశదిగ్భాగుండు*'—'*జంభారాతిభశోభా చకచకసిభముల్ శాంభవియాట్టహాసారంభా వష్టంభ రేఖారభట లటహముల్.*' ఇంత సంస్కృత బంధురమైనా తెలుగు

లోకి వెళ్ళేసరికి అదెంత రమ్యంగా ఉంటుందో చెప్పలేము. 'తిలకంబు బలుతేనియల బోకమోకల పుప్పొడి లతావి పుక్కిలించి'–'శేతవెన్నెల పుక్కిలించి ఉమియు'–'వడకుగుబ్బలి రాచవారి కూరిమికన్య, భీమయ్య శుద్ధాంతభామ'–'సిద్ధవాహిని నీటు చిఱుబువ్వ పసుపాడి'–'ఘనమైన రారాపు చనుదోయి రాయిడి నిఱుపేద నడిమికి వెఱపుజూప, పాలుపాఱు మెఱుగు దీగెలబోలు కన్నులు వడదాకి యొక్కింత వాడబారు, సిందూర తిలకంబు చెమటు చిత్తడిదాకి యళిక భాగంబునం దసలు కొనగ'–'చిఱుసాన పట్టించి 'చికిలిసేయించిన గండ్రగొడ్డలి' నిశాగహనంతకు'–'పొన్నపువ్వులబోలు పొక్కిళ్లు 'బయలుగా గట్టనేర్తురు' చీరకట్టి భరమున, దొడువంగనేర్తురు నిడువేలు జెవులయం దవతంసకంబుగా నల్లిపువ్వు శ్రీపాదముల బైడిచిగురు గజ్జెలతోడ రవళించు శతపెండార మమర, వెలిదామరలబోలు వెడద కన్నులు మద్దికాయలతోడ నుద్దివడయ, మొలక కూకటిగ్రాలు ముక్తాలలామంబు భసితంపు బొట్టుతో బాదరింప, పాలబుగ్గలదీప్తి పల్లవంబులతోడ చిన్నెలే నగవుతో చెలిమిసేయ, లజ్జయెఱుగని కటిమండలంబుమీద వలుదవజ్రాల కమరు గర్వంబుసూప' ఎంత మెరుపుగొల్పు తెలుగిది! క్రీడా రో 'గన్నేరు బూజాయ' అనే పద్యం కమ్మతెనుగు పూలచుట్ట. ఇట్లా తెలుగు సంస్కృతాలు సమాన స్కంధంలో నడుపుతాడు అంతేకాదు–మరొక ముఖ్యమైనవిషయం. శ్రీనాథుని తెలుగున కున్నంత కమ్మదనము లాలిత్యము లావణ్యము, ఆయన పూర్వులైన నన్నయాదులలో ఎవ్వరిలోనూ లేదని నిశ్శంశకగా చెప్పవచ్చును. ఇది అందరూ జాగ్రత్తగా పరిశీలించి గుర్తింగవలసిన విషయము.

శ్రీనాథుని వర్ణములు శబ్దములు భాష యిట్లా ఉంటాయి. ఇక ఆయన శబ్దసంయోజనా వైలక్షణ్యము తత్ప్రక్రియాజన్య విన్యాసము పరిశీలిద్దాము. అట్టి విన్యాసమే కవితయొక్క సూక్ష్మశరీరముగనుక–పదములకూర్పును ఆలంకారికులు రీతి అన్నారు. ఆ రీతి అర్థాశ్రితములైన వృత్తిభేదముల నాశ్రయించిఉన్నచో ఆశోభ శోభగాదు. రసజ్ఞులపాలిభోగము. శ్రీనాథుని పద్ధతి అట్టిది. "కంఠాగ్రకరిరాజు ఢుంఠివిఘ్నేశుండు వడకుగుబ్బలి కూతుకొడుకు కుజ్జు" వడకుగుబ్బలి–కూతు–కొడుకు–కుజ్జు! ఎంతచిత్రమైన శబ్దసంయోజన!! "గోపాలరామల గుబ్బచన్నులమెచ్చు గీర్వాణ వంద్యుండు కేశవుండు" గోపికల అనవచ్చుగా, అనడు. "గోపాలరామల" అంటాడు. ఈరామల అన్న శబ్దం ఆగోపాల అన్న శబ్దము కలసి రంభానలకూబరుల వలె ఐక్యమై జగన్మోహనస్థితిని గాంచినవి "శ్రీపాదముల బైడి చిగురుగజ్జెలతోడ" చిగురుగజ్జెలు, చిఱుగజ్జెలు అనేవాడు మరొకడైతే ఇక్కడ ఒక చక్కని బాలుని గురించి వర్ణన. ముద్దు మురిపెములు తొణికిసలాడునట్లు ముచ్చటగా చెపుతున్నాడు కనుక, చిగురుగజ్జెలు అన్నాడు; చిగురు శబ్దంతో ఆ ముద్దు ముచ్చటలన్నీ తీర్చుకున్నాడు కవి. 'కలమ గోపికల చక్కని చన్నుగవలపై వటపల్లవంబులు వాయదట్టి' కలమగోపికలు అనే శబ్దసంపుటి ఆణిముత్యము కడుపులో కలిగిన శుక్తివలె ఉన్నది మందమారుతము పరివెన్నులను గప్పియున్న పల్లవదళములను తొలగద్రోయుచు వీచిన దృశ్యమును కవి వర్ణించుచున్నాడు. ఒక్క గోపికల అను శబ్దప్రయోగ చమత్కారముచేత మొత్తము వాక్యమునకంతా ఒక రమణీయార్థకాంతిని ఆపాదించినాడు. మారుతము పుంలింగము ఏకవచనము; కలమ గోపికలు స్త్రీలింగము అనేకవచనము, ఇక్కడ మారుతమునకు దక్షిణనాయకత్వం ఇచ్చాడు. వటపల్లవంబులు అంటే పరివేష్టించియున్న చిగురాకులు అని అర్థం (వటవేష్టనే) ఒక పండితుడు భీమఖండానికి టీక వ్రాస్తూ వటపల్లవములు అంటే మఱ్ఱిచిగుళ్లు అని వ్రాశాడు. 'చిలువతేమలు సేవింపవెలితి పడుచు'–'మలయాచలంబుపై చిలువ యిల్లాండ్ర ఫణారత్నములమీద ప్రతిఫలించి' చిలువతేమలు

ఎంత చక్కటి సంయోజన ! అట్లాగే, "జవరాలి బొడ్డ గన్న విస్వాసపై నేయు తులసిపూ చిగురాకు తూపుమరుదు'— తులసిపూ చి గు రా కు తూపు "వేదవిప్రునిగన్న విధవపై ఘళిపించు దర్భపల్లవ హేతి వసంతుడు"— దర్భపల్లవహేతి 'పంచబాణస్య సాయకాః' అని మన్మథుడికి ఐదు బాణాలుంటే దేవీ కటాక్ష మెట్టిదోగదా మరొక రెండు ఆయుధాలిచ్చాడు అపర పరాశక్త్యవతారమైన శ్రీనాథుడు !

"చికిలించుకొనియుండు జిలుగురెప్పలలోన కుసుమ సాయకవైరి నొసలికన్ను"
"మండువేసంగినాటి మార్తాండ బింబంబు గోడగించు పసింతి గుబ్బతోడ"
"అచ్చవెన్నెలచాయ హెచ్చుగూడాడెడు వెలిపట్టు జగజంపు వలువతోడ"
"పసికమ్ములతోడి కుసుమపూవన్నియ సిద్ధలక్ష్మ బుట్టంబు నెఱికగట్టి."

పారిజాతకతరుప్రసవగర్భకమైన కబరిపై చెంగల్వ కచ్చునిల్పి— ఇట్టి మనోహర శబ్దసంయోజనా ఫలితంగా శ్రీనాథుని పద్యాలు నిరంతరపఠనీయములై సర్వదా శ్రవ్య సేవ్యములై కమ్మని సుగంధద్రవ్యములు బొగ పిన పుక్కిటివీడియములవలె ఉంటాయి.

ఈ సూక్ష్మశరీరసృష్టిలో మరొక చమత్కార మున్నది, పుంలింగాది శబ్దములు ఆయన కవిత్వ ధారాధోరణిలో స్త్రీలింగములుగా మారిపోయి దొర్లు తుంటాయి. ఇది ఆయనలో ఉన్న మిక్కిలి అసాధారణ లక్షణం ఈకారాంతము ప్రియము.

"చిరకాలంబు నటించుచుండు కవిరాజిగేహరంగంబులన్" — "పత్రపాత్రీమధ్యంబున బిండివంటకములున్ దివ్యాన్నములన్ షడ్రసీ సామగ్రీ రుచిమత్పదార్థచయములన్" — "అభిమానచ్యుతి వాటిలెం ద్రిపుర దైత్యగ్రామణీ శ్రేణికెన్" — "కలశీ శతంబులజలకమార్చు" — "సముద్భట నటద్ఘోటీభట ప్రౌఢి" — "సంగ్రామస్థలి గాండీవుల్" — "కఠిన రంభాపుటి" — "వేదవిభాగమున్ బరిఢవించిన పుణ్యుడు వేడ్కబూన్చె పల్వదశపూజనంబు" — "ఇక్షుశరాసనవైరి జూటికా కోటిక."

ఛందోమయరూపము కవితయొక్క స్థూలశరీరము. శ్రీనాథుని శిల్పపు హరువు సౌందర్యకల్పతరువు. నన్నయాదులనుంచీ ఈశిల్పం పరంపరాభివృద్ధిపొందినా, నాచన సోమనాథుడు అట్టిదానికే నవీనగుణనాథబిరుదము వహించినా శిల్పం శ్రీనాథావతారంతోనే అపారపారావారంగా విస్తరించుకున్నది. శ్రీనాథ శిల్పంలో ప్రధానమయింది సీసము నాచన కూడా "పన్నగంబులవాడు పగవాడుకూడ నీ శయనంబు పయనంబు సంతరింప" అంటూ ఎన్ని కులుకులు కులికించినా, శిల్పము శబ్దాలంకార సమాశ్రితమై కించిత్ కృతకత్వ పంకసంకలితమై ఉన్నది. కానీ శ్రీనాథశిల్పము శబ్దాలంకార నిరపేక్షకమై నాచన యందువలె శబ్దచ్ఛందోహ దేహరాహూయమాణముగాక కర్పూర గంధసారములవలె శబ్దశిల్పములు అన్యోన్య సమ్మిశ్రితములై అత్యంత సహజకాంతి సమన్వితమై ఉంటుంది. నాచనాదుల శిల్పము ప్రయత్నాత్ కల్పితము, శ్రీనాథునిది నిసర్గరమణీయము శ్రీనాథుడు చూడండి—"బాము ండియొనరించు ఝంపె తాళమునకు భృంగీశ్వరుండాడె ప్రేంకణంబు, వెనుక దిక్కుననుండి కనకభూషణము మోయ సూర్యుండు శశియు వివాహ్ఫులిడిరి, వెండికట్టులతోడ వ్రేత్రదండము బూని నందడి నెడ గ్గ జడిసెజముడు, కాలోచితంబుగా గైవారమొనరించె బలుకుదొయ్యలి నృత్యాపద్య సరణి" — ఘల్లుఘల్లని రత్నకంకణంబులు మ్రోయ గంధవాహులవియాలు కసవునూడ్చు" — "జిలుగు సంధ్యారాగ చీనాంబరముగట్టె, కుసుమగర్భము గకిర్కొప్పుదురిమి, కస్తూరిమెదచిన గంధసారము లంది ముత్యాలతాటంకములుధరించి. శ్రీపాదముల హేమ నూపురంబులు దాల్చి కటిమీద వజ్రాల కమరునిల్పి" — "హాలాహలంబను ఆల్లొనేరెడుపండు మిసిమింతుడునువోలె మ్రింగినాడు, పెనువ్రేలి కొనగోట బిసరుహాసనుమోము కెందమ్మివిరివోలె గిల్లినాడు.



శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

పంచవన్నియతోడ ప్రసవనారాచుని నెఱ్ఱచిచ్చుఱ కంటఁ జుఱ్ఱీ రాడు మెఱుగుకోరలుడుల్లి మృత్యుదేవత నోరు ఘట్టించి యఱ కాలదన్నినాడు"– "కనకమేఖల గుచ్చి కట్టెనెవ్వఁడులీల జాఱగుపై భూషార్క మెఱుగు పండ్లు, కొసరకొవ్వఁడు పదాంగుష్ఠభాగంబున నుడు రాజుపాట్లగుంజుఱుకనూడె, దఱగె నెవ్వఁడు ఖడ్గ ధారాంచలంబున నగ్నివాలుకలేడు నంటదఱిమి, మోదె నెవ్వాఁడు ముప్పదిమూఁడుకోట్ల వేలుపులబార బార వేన్వెంట దఱిమి"–

ఇందులో జీవభూతమైన రహస్యమొకటి ఉన్నది. సర్వసాధారణంగా శ్రీనాథపద్యరచనాపద్ధతి సంస్కృత చ్ఛందోమర్యాద ననుసరించి ఉంటుంది. వాసియందు యతి అనగా విరతి; అక్కడికి పదమో పాదమో విరిగి పోవలెను. "కౌరవసేన గాదు త్రిజగంబులునొక్కట" అన్నట్లు అభంగముగా సాగిపోగూడదు. మరొకటి, యతిమైత్రి అన్న కక్కుర్తికిపోడు. పకు వవేయడం, మకు బిందుపూర్వకపబలువేయడం ఇట్లాంటి "జీర్ణ తృణంబు" మేయఁడు. మూడువంతులు ఆద్యాక్షర మునే వేస్తాడు. ఈ రెంటిచేతనే పద్యమెంతో హాయి నిస్తుంది ఆపైన చేసే చమత్కారాలు అతడు మన కిడిన మహాభోగము.

హిమాలయముయొక్క ఆత్మ ధాతువుల్లోనూ, గీర్వాణముయొక్క అయువు తిఙ్గంతములలోను, శ్రీనాథుని శక్తిక్రియాపదప్రయోగములలోనూ ఉన్నది. హిమాలయమున అతిరమణీయమైన వనసీమలు, నిర్ఝరీప్రవాహములు, పశుపక్ష్యాదులు. దేవతలు ఉండ వచ్చునుగాక కానీ ఆత్మ ధాతువులందే కలదు అట్లే గైర్వాణీ శ్రీనాథులందును సమన్వయముచేత స్వార స్యము తెలియబడును. శ్రీనాథుని క్రియాపదముల నన్నింటిని సేకరించినచో శ్రీనాథకవితారహస్యము గుప్పిట్లో చిక్కించుకున్నట్లే. ఎంతో అందంగా సోహ ళించుకున్న ఒక పద్యపాదం ముగించడం ఎప్పుడూ చిక్కయిన పనిగానే ఉంటుంది, అక్కడ ఒక్క గురి గింజవాసి వెలితివచ్చినా పాద మావాదిమస్తకము వికృతమైపోతుంది. "సీమంతపథమున చేర్చుక్క సవరించి కురులపై చిన్నిపూగుత్తరించి" ఇక్కడ ఈ పాదపు గౌరవమంతా గుస్తరించి అన్న ఒక్క పదం మీద నిలిచి ఉంది. కబరికాభారంబు కైపెక్కు విరులతో నవటుభాగంబుపై నర్తమిల్ల, మణితులాకోటి కోమల ఝణత్కారంబు రవళిమట్టెలమ్రోత యవఘళింప– కటుమనోజ్ఞములైన కర్ణపార్శ్వంబుల బెనుపాపపోగులు బిత్తరింప– అత్తమిల్లు, అవఘళింప, చిత్తరింప– ఇంత కంటె రమ్యమైన క్రియాపదాలతో ఆపాదాలు ముగించ లేము. అయన క్రియాపదాలు:– ఇపతాళించు, సవద రించు, తవతించు, ప్రతిఫలించు, అస్ఫోటించు, అసలుకొన్న, చినుకు ఇత్యాదులు.

ఇక్కడ ఒక రహస్యమున్నది. శ్రీనాథుని క్రియా పదాలకొక అపూర్వప్రతిభ ఉంది. ఆయన ఒకసామాన్య క్రియాపదాన్ని తీసుకుని కావ్యప్రయోజనాను రూప స్వరూపాన్ని సమకూర్చుతాడు. ఇట్టి విశిష్టప్రయోగ చమత్కారంచేత దానికొక అపూర్వ మహిమ సిద్ధి స్తుంది. పుక్కిలించు అన్నపద మెంతపాటిది? నీరు పుక్కిలించి ఉమిశాడు అన్నచోట అది వట్టి పుక్కి లించుగామాత్రమే ఉన్నది కానీ శ్రీనాథుని చేతిలో అది ఏమయిందో చూడండి. 'వలమానతాటంక వజ్రాం కురచ్ఛాయ లేతవెన్నెల పుక్కిలించి ఉమియ'. ఈ పుక్కి లించుకు ఆ పుక్కిలించుకు ఎంతతేడా ఉంది! ఈ పదాన్ని శ్రీనాథుడు బహువారములు వాడుకుంటాడు. 'పువ్వుబాళలతావి పుక్కిలించి', 'పోకపువ్వులతావి పుక్కి లించు', 'గరళకూటము ఛాయ గ్రాచియుమియు,' 'కౌముదీచ్ఛాయలగ్రాచి యుమియు' అని శ్రీనాథ విశేషాలన్ని ప్రబంధకవులు పట్టుకున్నారు. 'పాండు' ఈ చమ త్కారంవదలి శబ్దబంధాన్ని మాత్రం తీసుకున్నాడు 'వీడియం బెరలించి విదురత్న కనకాలు కాంచిశాంబువు పుక్కిలించి యుమిసి', యిది చాలదు.—'వియ్యఘందు

అనుచానిలో సామాన్యంగా ఏమీలేదుగదా? శ్రీనాథుడు దాన్ని ఏమిచేశాడో చూడండి. వియ్యంబందు తదీయ కీర్తులు దిశావేదండ తుండాళితోన్'—'పాటలీవకుళ చంపక సౌరభముతోడ విచికిలామోదంబు వియ్యకుండా' ఇట్లా అవి విశేషార్ధసంపన్నంగా ఉంటాయి; మామూలుగా ఉండవు. మరికొన్ని :—పాలబుగ్గలదీప్తి పల్లవంబుల తోడ చిన్నితేనగవులు చెలిమిసేయ, లజ్జయెఱుగని కటి మండలంచుమీద, వలుద వజ్రాల కమరు గర్వంబుసూప;—వనితలు భీమనాయకుని వారక యెసిరి కమ్మదేనియల్ చినుకు పసిండి లేజెఱుకు సింగిణి విండ్లను పుష్పబాణముల్.—ఈ క్రియలన్నీ అట్టివే. ఈ చినుకుక్రియ ప్రత్యేకించి మోహనమైనది. నామవాచకమే క్రియగా వాడబడింది. వెనకకూడా ఒకసారి 'సందడి నెడగల్ల జడసె జముడు' అన్నాడు. జడిసె.—'అలతిలే జేమటచే నసలుకొన్న లలాట కుంకుమంబున చిన్నికురులు మునుగ.' అసలు కొన్న అనగా బురద అయిన, ముఖకుసుంభ జంబాలమున ముంగురులు మునిగినవి, మజ్జనమాడినవి అని,—శ్రీనాథుని రామణీయకమునకు అవధిలేదు. ఈ మునుగు ఎంత మహామాధుర్యము! అసలు కొన్న అను ప్రయోగము శ్రీనాథుని వియ్యమందు. వుక్కిలించులవలె పాణింధమాది శబ్దాలవలె ఆయన అభిమాన ప్రయోగము 'అసలుకొల్పిన మషీరసముగాగ'. 'గొజ్జంగిపూ నీరు కులికి మేదించిన కమ్మకస్తురి మేన కలయనలది'—'ఎవ్వాడు డాచేతి క్రొవ్వాడి నఖమున బిదిమె భాషాదేవి చిగురుముక్కు' 'పెనువ్రేలి కొనగోట బిసరుహాసను మోము కెందమ్మి విరివోలె గిల్లినాడు'.

ఇట్లా సామాన్యశబ్దాల నుద్ధరించి కవితా ప్రతిపత్తి సమకూర్చు ప్రక్రియను ఆంధ్రభాషా ప్రపంచమున ప్రవేశ పెట్టినవాడు శ్రీనాథుడే. ఆంధ్రభాషకు మహోపకారము చేసినవారు ముగ్గురే. వారు నన్నయ, తిక్కన, శ్రీనాథుడు. నన్నయభట్టు తత్సమ శబ్దాలు కుసుమించులాంటి క్రియాపదాలు ఇచ్చి భాషను పెంచగా, తిక్కన వ్యావహారిక భాషను గ్రంథరచనకు స్వీకరించి దాన్ని గట్టొరసి పాలు గంగపాలె చేశాడు ఇంత జరిగినా భాషకు కవితాను రూపమైన పరిపక్వత రాలేదు. ఆ పని శ్రీనాథుడు ముగించాడు. ఈ ప్రక్రియ భాష పరిపక్వమైన సాహిత్యప్రౌఢిని సంతరించుకొన్న దశను సూచిస్తుంది. ఇది సంస్కృతమున గలదు. "సహకారకుసుమ కేసర నికర భరామోద మూర్ఛిత దిగంతే"—లో మూర్ఛిత వుక్కిలించ్వాదులవంటిది. ఇది శబ్దనైపథ్యమంటాను.

కానీ శ్రీనాదుని ఈ కవితాను రూప శబ్ద నైపథ్య ప్రక్రియ మరొక చమత్కార భావనావిశేషం మీద ఆధారపడిఉంది. శ్రీనాథుడు ఎప్పుడూ ఒక సామాన్య విషయము అనుకుంటాడు; కానీ ఉన్నది ఉన్నట్లు చెప్పడు. ఆ సామాన్య విషయం శ్రీనాథ వాణిలోబడి ఒక అపూర్వ స్వరూపాన్ని సంతరించుకుంటుంది. కశ్యపుడు అని చెప్పాలి; ఇంతే!—దానికి, ఆకాశలక్ష్మికి అవతంసకంబైన ముని మండలములోని మొదలిచుక్క' అంటాడు "అఅకాల బ్రహ్మాండ మప్పళించినయట్టి చిన్నివేల్పులరాజు గన్నతండ్రి" అంటాడు. పార్వతిఅనుటకు, "పడకుగుబ్బలి రాచవారి కూరిమికన్య" అంటాడు గణపతిని. 'కంధరంబుననుండి గంధసింధురమైన, గుజ్జువేల్ప......' 'విశ్వామిత్రున్ని' అఖిల ప్రపంచంబు నన్యథాకల్పించె పటురోష దక్ష సాఫల్యమంద, త్రైశంకవంబైన తారకామండలం బాకాశమధ్యంబు నందు నిల్పె—ఎవ్వడాతండు సామాన్య ఋషియె తలప తాటకా కాళరాత్రికి దాశరధికి, కాలకంధర కోదండ ఖండనున కుద్మకాచార్యవర్యుండు గాధిసుతుడు. ('ఈ త్రైశంకవము ఎంతరమణీయంగా ఉంది. త్రిశంకుడు తలక్రిందుగా వ్రేలాడుతుంటాడని పురాణము. ఈ తలక్రింది దృశ్యాన్ని త్రిశంకుశబ్దాన్ని తలక్రిందుచేసి నట్లు స్ఫురించే త్రైశంకవాన్ని వేసి కనుపింప జేశాడు.) విశ్వామిత్రుని మహిమ ఎంతగొప్పగాచెప్పాడో చూడండి—

వింధ్యము నారదునికి భక్తితో మ్రొక్కింది అనడానికి ఎక్కడనుంచి మొదలిడుతాడో చూడండి —'మొగులు ముట్టిన మహామూర్ధంబు ధరమోవ పాదాంబుజములకు బ్రణతి సేసి.' పశ్చిమాకాశమున దోచు సంధ్యారాగాన్నిగురించి— "సంజయంబరము కొంగున నూన్చె కుసుంభరాగమున్" అంటాడు. ఇది ఒక చుపకమాల చివరవచ్చు ఖండము. ఈ పద్యచేలాంచల మెంత రాగరేఖామనోహరమో భావుకులకే ఎఱుక! ఇది నూత్నవస్త్రానికి కట్టుకునేముందు కొంగుకు కుంకుమరాయుట అనే పద్ధతిని తీసుకుని కవిత్వ చమత్కారం చేయడం.—

ఇక్కడ ఒక ముఖ్యమైనభేదము గ్రహించవలెను. శ్రీనాథుని భావనావైచిత్రి ఒక అపూర్వ భావనా స్వభావ సంజనితముకాదు. ఉన్నదానినే చమత్కరించి చెప్పుట. అన్నాది త్రికోశ పరిమితానుభూతి కందునట్టిదేగాని అపరిధి నధిగమించి విజ్ఞానమయసీమల నంటునట్టి సముజ్జ్వల భావహేవాకము గాదు. తిక్కనసోమయాజి "మున్మథుడు నన్ను సముయింపకుగుడ నీవు బడయవచ్చునె......" (విరాటపర్వం) అన్నచోట అది ఉన్నదానిని ముచ్చటగానే చెప్పే పద్ధతిగాదు. నేలవిడచి ఆకాశమున కెగసి చేయు చమత్కారప్రక్రియ. అక్కడ స్వారస్యము వ్యంజనా శక్తిచేతనే సిద్ధించును. కానీ "ఆకాశలక్ష్మికి అవతంస శంఖైప మునిమండలములోని మొదలిచుక్క"అన్నచో అట్టి శక్తి నాశ్రయింపనక్కరలేదు. ఇది ఈ రెండుమార్గముల భేదము.

ఈవిధంగా విలక్షణశబ్దసంపాదనచేతను, మనోహర శబ్దసంయోజనచేతను, రమణీయ సంస్కృతాంధ్ర తుల్యస్కంధ సంధానముచేతను, గైర్వాణీఛందశ్చర్యా మర్యాదచేతను, విశిష్టక్రియాపద ప్రయోగచాతురి చేతను, ఒకానొక మనోహర ప్రకారభావాభివ్యక్తిచేతను శ్రీనాథుడు ఆంధ్రసాహిత్య ప్రపంచంలో ఎట్టివారిని గూడ మోహపెట్టి పాదాక్రాంతులమ చేసుకొన్నాడు.

దీనికంతటికి తాత్పర్యమొక్కటే. శ్రీనాథుని కవితామహిమ శబ్దాశ్రితము. కాని మహాశ్చర్యము! శ్రీనాథుడు అతి సకృత్తుగాతప్ప ఎక్కడా శబ్దాలంకారాలు వాడడు. అథవా వాడితె ఎక్కడయినా వృత్త్యనుప్రాసం వాడుతాడు. అది ఒక అలంకారంగా గణించారేగానీ, ఆపేరుకు అది అసమగ్రము. వచ్చీరాని అవయవాలతో ఉన్న రెండు మూడునెల గర్భస్థపిండము వంటిది. కనుక నా మతమున శ్రీనాథుడు శబ్దాలంకారాలు వాడలేదు. ఎక్కడో "మాతులుండు యశోమహీమాతులుండు" అనీ "కాంచనకేతికి కుసుమగర్భదళోదర సోదరప్రభా" అనీ "గంధు మెఱసి రెండవకుసుమకోదండుండునుం బోలె నవ్విలాసినీ మండలికి కన్నులపండువగుచు" అనీ అప్పటికీ అది కదాచిత్తు ఆంధ్ర సాహిత్యలోకము రెండుయుగాలున్నాయి. ఒకటి శబ్దాలంకారయుగము, మరొకటి అర్థాలంకారయుగము; మరొకదృష్టితోచూస్తే అవే పురాణయుగము, ప్రబంధయుగము అనిపించుకుంటాయి. ఈరెంటిమధ్య వేగుచుక్కనలె శ్రీనాథుడున్నాడు. శ్రీనాథుని పూర్వము నన్నయ మల్లికార్జునభట్టు, నాచనాదులు శబ్దాలంకారాలు బహుళంగా వాడారు. అది ఆ యుగపుకవుల ముఖ్యలక్షణం. నాచన నవీనగుణసనాథ బిరుదం కొంత దీనికిగా కూడాను. "అరిజూచున్ హరిజూచు చూచుకములం దందందమందార కేసర మాలామకరందబిందు సలిలస్యందంబు లందంబులై" అనీ గవయంబుం గొనయంబు నెన్నడుముతో కర్ణావతంససంబుతో చను దోయింగనుదోయి సాయకముతో సంధానహస్తంబుతో... ఇట్లా నాచన సోముడు నడిచాడు. కానీ శ్రీనాథుడే తొలిసారిగా ఆ శబ్దాలంకారయుగానికి స్వస్తిచెప్పి తన నైషధానువాదంద్వారా అర్థాలంకారయుగాన్ని ఆవిష్కరించాడు. అదే ప్రబంధయుగమై వెలిసింది. ప్రబంధ పరమేశ్వరుడని బిరుదున్న ఎఱ్ఱనను ఏ ప్రబంధకవి అనుసరించలేదు. శ్రీనాథనైషధమే ఆంధ్రప్రబంధ

మాతృక అని నామతము. కనుక శ్రీనాధుడే ప్రబంధ పరమేశ్వరుడు. శ్రీనాధుణ్నే ప్రబంధకవులందరూ అన్ని విధాలా అనుకరించారు. నైషధానువాదంలోనే అలంకారిక ప్రమాణవిధేయములైన శృంగార శాకుంతల వసుచరిత్రాది సమగ్ర శాస్త్రలక్షణలక్షిత కావ్యాలు బయలుదేరాయి !

కానీ ఆశ్చర్యమేమిటంటే, శబ్దాలంకారాలు వాడకుండానే, వాటిచేతకలిగే శక్తికంటే వేయిరెట్లు అధికమైన శక్తిని శ్రీనాధుడు కలిగించాడు. ఇదిశబ్దాధికారం అని పిలువబడే సామాన్యశక్తికాదు. శబ్దాలు లక్ష తెలుసా కోటి తెలుసా అనడం శబ్దాధికారం. ఇది అదికాదు. ఇట్టి శబ్దముయొక్క కడుపులో ఉన్న పేగులనుకూడా లెక్కింపగల కూలంకషమైన తత్త్వవేత్తృత్వం. శబ్దశక్తి శబ్దాలంకారాశ్రితమని భ్రమ. కానీ శబ్దాలంకార కవులెవ్వరూ శ్రీనాధుని మడమల వరకుకూడా రారు. పరిపూర్ణశబ్దశక్తికి శ్రీనాధుడే ఆశ్రయము. శబ్దాలు మందగా కలసి చేసే పనులు శబ్దాలంకారాలు. ఈపనుల్లో శబ్దములయందు ఆత్మోపస్థితమైన శక్తిస్వరూపిణి సంపూర్ణముగా ప్రవృత్తము గాదు. మనుష్యుడు యోగసమాధిచేత ఏకైకస్థితిలో సమాహిత మొనర్చుకున్నంతశక్తిని సామూహిక కార్యకలాపంలో సమకూర్చుకోలేడు. తత్కాలోపలబ్ధ కించిన్మాత్రశక్త్యంశములు అనేకములుకలసి ఆ సామూహిక కార్యాన్ని గడుపుతాయి. అట్లాంటివి శబ్దాలంకార కార్యములు. కానీ శ్రీనాథుని శబ్దప్రకృతి పరాశక్తియొక్క సాక్షాత్కారమే. అట్టి శ్రీనాథరూపావతార జగన్మోహినికి, జగన్మాతకు నా నమస్కారము.

# శ్రీనాథుని రచనపై సంస్కృతకవుల ప్రభావము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథకవి సార్వభౌముని కవితాస్రవంతి ఆంధ్ర భాషామర్మజ్ఞుల కొక పుణ్యతీర్థము. బ్రాహ్మీదత్తవర ప్రసాదుఁడై యీశ్వరార్చన కళాశీలుఁడై పుణ్యశ్లోక చరిత్రమును పరమేశ్వర విలాసమును తనివిదీఱ నాలపించుచు నపూర్వకావ్య స్రష్టయైన యాకవిపకంసుని తెలుఁగు రచనలను జదివి యానందింపని సహృదయాంధ్రపాఠకు లెవ్వరు నిన్న మొన్నటివఱకు లేరు. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శృంగారశ్రీనాథము, క్రీడాభిరామమున కుపోద్ఘాతము వెలువడసంతవఱకు తెలుఁగు సాహిత్యముతోఁ బరిచయము నార్జింపఁగోరు వారందఱు ప్రధానముగ నైషధమును కాశీఖండమును జదువుకాని శ్రీనాథుని కవిత్వమునం దత్యాదరము కలిగియుండెడివారు. వెనుకటివారు శ్రీనాథ నైషధమును పంచకావ్యములలో నొకటిగాభావించి చదువుకొని, సంస్కృతాంధ్ర నైషధముల రెండిటి నవగాహనముచేసికొనిన తృప్తి ననుభవించెడివారు ఆంధ్ర పంచకావ్యములలో నొక్కటి యగుటనే కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారీ నైషధమునకు సమగ్రమైన వ్యాఖ్యానము రచించి, యాంధ్రపాఠకులకు తదవగాహము సుగమముచేసినారు. పరమేశ్వరభక్తిభావమును పెంపొందించుకొనఁదలఁచినవారు భీమేశ్వర పురాణమును హరవిలాసమును జదివి యానందించుచుండెడి వారు. అంతియగాని శ్రీనాథుఁడు స్త్రీలోలుఁ డనుకొని, యాతని ప్రబంధములలో శృంగారరస భావ నిబంధనముగల పట్టులనుమాత్రమే చదివి, మిగిలిన భాగములదెసకుఁబోని తీరేర్పడినదీ నడుమనే.

శ్రీనాథుని ప్రబంధముల కాంధ్రభాషలోఁ బ్రత్యేకస్థానము నార్జించిపెట్టిన దాతని సంస్కృత కావ్యానువాద సరణియే. తన రచనలోఁ గూర్చిపెట్టిన మనోహర భావములకుఁగాని, పదజాలమునకుఁగాని, వెనుకతట్టు నున్నది సంస్కృతకావ్య సామగ్రియే యనుట నిర్వివాదమైన విషయము. సంస్కృత పదములను తెలుఁగుపదములను సముచితరీతిని మేళవింపఁ జేసి శ్రుతిమధురమైన శైలిలో భావము నావిష్కరించి, ఆ యా రచనలు తెలుఁగున స్వతంత్రముగ బయలు

దేరునట్లు పాఠకులను భావింపజేయుట యాతని రచనకుఁగల ప్రత్యేకత వివిధ శాస్త్రీయ సంప్రదాయముల ననాయాసముగ సహజమైనశైలిలో జతఁగూర్పఁగలిగిన పాటవ మాతనికి బ్రాహ్మీవరప్రసాద లబ్ధమగుటచే, వివిధ శాస్త్రీయ సిద్ధాంతసారమై విద్వదౌషధమైన నైషధమునతి దక్షతతో నాంధ్రీకరించి సఫలుఁడైనాఁడు తరువాత మఱికొందఱు ఆ నైషధము నాంధ్రీకరించుటకు యత్నించియుఁ గృతకృత్యులు గాకుండుటయు శ్రీనాథుని ప్రత్యేకతకుఁ దార్కాణ మనక తప్పదు.

శ్రీనాథుని శాస్త్రపాండిత్యము భావనాశక్తియు విలక్షణములనుమాట అతని బావమఱఁది దగ్గుపల్లి దుగ్గన్ననోట నీవిధముగ వినవచ్చినది.

సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య
భాషాపరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌమ భాషిత మహా
భాష్య విద్యా సమభ్యాస బలము
నక్షపాద కణాద పక్షిలో దీరిత
న్యాయకళా కౌశలాతిశయము
శ్రుతిపురాణాగమస్మృతి సాంఖ్య సిద్ధాంత
కబళన వ్యుత్పత్తి గౌరవంబు
పూర్వకవి ముఖ్యవిరచితా పూర్వకావ్య
భావరస సుధాచర్వణ ప్రౌఢతయును
గందళింపఁగఁగాశి కాఖండనైష
ధ ప్రముఖ వివిధ ప్రబంధము లొనర్చి.

నాచికేతూపాఖ్యానము.

ఈ పద్యములో నిరూపితములైన విషయములన్నియు నాతని నైషధ కాశీఖండములలో సమన్వితములై చూపట్టుటచే దగ్గుపల్లిదుగ్గన తెలిపినదంతయు సత్యమే కాని బావమఱఁదిమీఁది యభిమానముచే నేకరువెట్టినది, ఈనాటి యుపన్యాస ధోరణినిబట్టినది మాత్రము కాదు.

నిష్కృష్టమైన శాస్త్రపాండిత్యములేక, యాతని రచనపై సద్భావములేక, సాహిత్యపథమునందలి పోకడలనెఱుఁగక, ఆత్మీయులను కొన్న కవులపై నధికాదరము వహించువారి కాతని రచన రుచింపక పోవచ్చునేమోకాని. తన కృతులలో కైమోడ్పు లర్పించిన సంస్కృతాంధ్రకవుల ప్రౌఢ రచనలను బాగుగ నవగతముచేసికొని, వాని విశిష్టతను గుర్తించుచు, సమయోచితముగ నా యా భావములను తెలుఁగు కరువునఁబోసి నూత్న శిల్పమును తెలుఁగువారి కందిచ్చిన శ్రీనాథుని కవితారీతులను సహృదయతతో నవగతము చేసికొనఁగలిగిన ఆంధ్రపాఠకుల కాతని ప్రబంధము లన్నియుఁ గర్ణరసాయనములు ఆలోచనామృతములు ననియే చెప్పవచ్చును. సంస్కృత సాహిత్యముఁలో నుదాత్త మధురమై కానవచ్చెడి భావసామగ్రి చాల వరకు నాతని ప్రబంధములలోఁ బొడచూపుచునే యుండును. కాళిదాసాది మహాకవులు వాల్మీకినోట వెలువడిన రామాయణ మహాకావ్యము నందలి భావములను సమయోచితముగ సంతరించుకొని తమవిగా నిరూపింపఁజేసినట్లును శ్రీనాథుఁడును తన ప్రబంధములలో ప్రకరణోచితముగ సంస్కృత కావ్యములందలి మధురోదాత్త భావసామగ్రిని, శ్రుతిసుఖపదజాలమును సమకూర్చుచు వచ్చినాఁడు. అది యానాఁడు మొదలు నేఁటివఱకు చాలవఱకు ననుకరణయోగ్యమై విలసిల్లినది.

శ్రీనాథుఁడు తెలుఁగు కవిగా నవతరించుటకై కన్నుగట్టునాఁటికి సంస్కృత కావ్యానువాదము యథాతథముగఁజేయు పరిపాటి యంతగఁ గానరాదు. కేతన దశకుమార చరిత్రము మంచన కేయూర బాహుచరిత్రమును బోలినవి విరళముగ నుండినవి. అవి కూడ కృష్ణానదీతీర సమీపముననే వెలువడినవి. అటివి కూడ చాలవఱకు స్వేచ్ఛానువాదములేగాని యథాతథములు గావు. నైషధానువాదమున కవి కొంత ప్రోత్సాహము

నిచ్చియుండెనేమో? చెప్పలేము. మూలమునకుఁ జాల సన్నిహితముగా సంస్కృత కావ్య పరివర్తనము సాగి తెలుఁగులో నుత్తమ రచనగా రూపొందినది శ్రీనాథుని యాంధ్రనైషధమే. దాని తరువాతనే తత్సరణిలో పంచతంత్రము శృంగార శాంకుతలము విక్రమార్క చరిత్రము మున్నగునవి యనుకరణశైలిలోను స్వతంత్రశైలిలోను నవతరించినవి. నైషధము తరువాత నీ నాఁటివఱకు బయలుదేఱిన ప్రసిద్ధ ప్రబంధముల న్నిటిలోను శ్రీనాథుని నైషధశైలీ ప్రభావము పట్టు బడనిచోటులు చాలతక్కువ. ఆ కవి సార్వభౌముని రచనాప్రభావ మట్టిది నైషధము తరువాతి రచనగాఁ దెలియవచ్చెడి హరవిలాసములో కాళిదాస విరచితమైన కుమారసంభవములోని కొన్ని పట్టులు మూలము సన్నిహితముగనే యనూదితమైనను, నైషధానువాదములోని పొంకము మాత్ర మిచట లేదని, యుభయభాషా మర్మజ్ఞులైనవారిలోఁ గొందఱి యభిప్రాయము. ఎదుటివారి రచనలో వంకలెత్తుట సులభమైనపని. ఎదుటివానివలె, లేక అంతకు మిన్నగనైన రచనసాగించి పాఠకలోకమును మెప్పించుట దుష్కరము. అయినను దోషైక దృక్కులాపనిచేయుట మానరు. నేఁటి విమర్శకులలోఁ జాలమంది యిట్టి మార్గమునే యవలంబించుచున్నారు. అట్టివారిని గుణదోష ప్రకరణములలో దోషప్రకరణమేగాని గుణప్రకరణమెఱుఁగని వారనుకొనిన సరిపడును. సునిశిత విమర్శకులైన యలంకారశాస్త్రజ్ఞులు గుణ దోష ప్రకరణములను రెండింటిని తమ గ్రంథములలో నంగీకరించియే యున్నారు. వారిమాట యటుంచి శ్రీనాథుని సంస్కృతానువాద సరణితో కాళిదాసాది మహాకవుల రచనాప్రభావ మే విధముగ నవతరించినదో కొంచెము పరికింతము.

హరవిలాసములో పార్వతీకల్యాణ ఘట్టమున కుమారసంభవమునందలి తొలిభాగము రెండాశ్వాసములుగా రూపొందినది. ఆ మహాకావ్యమునందలి యేడు సర్గల విషయములను 200 గద్యపద్యములలో మలిచిపెట్టి హరవిలాససూత్రములో గ్రథనముచేసినాఁడు ఈ హరవిలాసము ప్రారంభమున సంస్కృతాంధ్రకవుల కెవ్వరికి నతులర్పింకయే యిష్టదేవతాస్తుత్యనన్తరమునఁ గృత్యవతారిక నారంభించి యున్నాఁడు దీనినిబట్టి చూచినను, హరవిలాసము నందు. అంతకుముందప్పటప్పటఁ దాను గూర్చిపెట్టు కొన్న కవితాంశముల నేకసూత్రతకుఁ గొనివచ్చినాఁడనిపించును. శ్రీనాథుని సంస్కృత శ్లోకానువాద పద్ధతిలో వింతలు కొన్ని గోచరించుచున్నవి. మూలములోనుండిన యితి వృత్తమును, ఒక సీసపాదముగనో ఆటవెలదిగనో తేటగీతిగనో కందముగనో మలఁచి పెట్టినచోట మూలమునకు సరిపడిన యనువాదమనిపించును. అటుగాక మూలములోని ఉపజాత్యాది వృత్తములనుగాని. అనుష్టుప్పునుగాని, ఉత్పలమాలాది వృత్తములలోనికిఁగాని, సీసగీతములలోనికిఁగాని మలఁచిపెట్టిననాఁడు మూలానుగుణముగ యథాతథానువాదమే యుండవలయు ననుకొనువారి కట్టిరచనలో లోపమున్నట్లు లనిపించును. కాని నిదానముగఁ బరికించినఁ గొన్నితావులందట్టి విస్తృతి సముచితమే యనిపించును. ఒకవృత్తమును తేటగీతో మలఁచిన చోటును, ఒక అనుష్టుప్పును వృత్తముగ మలఁచిన చోటును పరికించి యచటి రచన యెట్లుసాగినదో నరిఁజూచెదము.

వసంతోదయ ప్రస్తావములోని దిక్రింది శ్లోకము.

శ్రుతాప్సరోగీతి రపిక్షణేఽస్మి
న్హరః ప్రసంఖ్యాన పరో బభూవ,
ఆత్మేశ్వరాణాం న హి జాతు విఘ్నా
స్సమాధిభేద ప్రభవా భవన్తి

హరుఁడీసమయమున నచ్చరలుపాడు పాటనువిన్నను, ఆత్మానుసంధాన పరత్వమునందేయుండును. విఘ్నము

తెన్నడును మహానిగ్రహము గలవారి సమాధికి (ఏకాగ్రస్థితికి) భంగమును గలిగింపజాలవు. ఈ శ్లోకవిషయములను శ్రీనాథుడీవిధమున ననువదించినాడు.

అచ్చరలుపాడు హిందోళమాలకించి
యిందు మౌళిప్రసంఖ్యాన మెడలదయ్యె,
నిర్జితేంద్రియులైనట్టి నియమపరుల
నంతరాయంబులేమి నేయంగఁగలవు?

కాళిదాస శ్లోకములో విధినిషేధరూపములలోఁగూర్పఁబడిన భావములు, గీతము పూర్వోత్తరార్ధములలో నిషేధవిధిరూపములలో రూపొందినది. భావమేమియు సడలకుండ గీతములోని కవతరించినది. పదములుమాత్రము కొంచెము మారినవి తెలుగు కరుపునఁ బోతపోయునపు డట్టిమార్పులు సంభవించునని యాతడనుకొని యుండవలెనుగదా! భిన్నరుచిర్హిలోక: "శ్రుతాప్సరోగీతిరపి" యనుదానికి, అచ్చరలుపాడు హిందోళమాలకించి—అని యనువదించుటలో మాత్ర మొకమెలకువ యున్నదనవచ్చును. కర్మణిప్రయోగము కర్త్రర్థకమై తెలుగు పరిపాటి కనువుపడుట యొకటి. "అపి" యను శ్వార్థకము హేత్వర్థకమై అపూర్వమును దెలుపుట యింకొకటి. పాడెడిపాట పట్టిదిగాక హిందోళరాగ సమంచితమగుటయును జతపడినవి. వసంతములో అచ్చరలు హిందోళముతోఁ బాడుచు పరమేశ్వరు నారాధించుట యనిన కవిసార్వభౌముని కభిమతమైనట్టులు, అచ్చరలు పాడిన పాటయని కాళిదాసునఁగా అపాట హిందోళమున ననిపించుటలో నభివ్యక్తమగుచున్నది. హిందోళమున రాగ మాలపించినను పాటపాడినను, అది సంగీత సారజ్ఞున కెంతయు హృదయాహ్లాదకరముగ నుండుననుట తథ్యము.

మఱియొకమాట. శ్రీనాథుడు సామాన్యముగ స్వర్లోకమును భూలోకమునుగ జేయుచుండును స్వర్వాసులకు భూలోక విలాసములను గూర్చి, అచటనుండెడి వారి నిక్కడివారినిగాఁ జేయుచుండును. కైలాసవాసిని దాక్షారామమునకుఁ గొనివచ్చి నవ్వడచటిసేవికాజనమును దేవగంధర్వాప్సరో భామినీజనముగా నిరూపించెను. వారిచే నా పరమేశ్వరునకు రాజోపభోగములను సమకూర్చి దేవోపభోగములుగా రూపొందించినాడు. భీమేశ్వరస్వామి దాక్షారామమున స్వయం ప్రతిష్ఠితుడైనవుడు వచ్చిన వసంతములో, వసంతోత్సవమునఁ బాల్గొనిన యచ్చరలు

సందుగ్ధార్ణవ చంద్రమండల శిఖిజ్వాలాతటిద్వల్లరీ
కందర్పేక్షుశరాసనాచ్యుత తనూగంధర్వవంశోద్భవల్
హిందోళంబునఁబాడి రచ్చరలు భీమేశుం ద్రిలోకాధిపున్
మందారద్రుమవాటి యందు సుమనోమైరేయముల్
ద్రావుచున్

దేవగంధర్వాప్సరోజాతి వనితలు క్షీరసాగరాదుల నుండి యుద్భవించినవారని వర్ణించిన విషయమంతయు భట్టబాణుని కాదంబరినుండి కొనఁబడినది. అచట మహాశ్వేత జన్మవృత్తాంతమును దెలుపునపుడు అప్సరస్త్రీల జన్మాదికమును గూర్చి తత్తద్వంశములను గూర్చి విపులముగఁ దెలిపియున్నాఁడా మహాకవి. అచటి క్రమమిది. "తాసాంచతుర్దశకులాని ఏకంతగవతః కమలయోనేర్మనసః సముత్పన్నమ్ అన్యద్వేదేభ్యః సంభూతమ్. అన్యదగ్నేరుద్భూతమ్. అన్యత్పవనాత్ప్రసూతమ్. అన్యదమృతాన్మథ్య మానాదుద్భూతమ్ అన్యజ్జలాజ్జాతమ్. అన్యదర్క కిరణేభ్యో నిర్గతమ్. అన్యత్సోమ రశ్మిభ్యోనిష్పతితమ్. అన్యద్భూమేరుద్భూతమ్. అన్యత్సౌదామినీభ్యః ప్రవృత్తమ్. అన్యన్మృత్యునా నిర్మితమ్. అపరంమకర కేతునా సముత్పాదితమ్. అన్యత్తుదక్షస్య ప్రజాపతే రతిప్రభూతానాం కన్యకానాం మధ్యేద్వేసుతే మునిరరిష్టాచ బభూవతుస్తాభ్యాం గంధర్వైః సహకులద్వయంజాతమ్. ఏవమే తాన్యేకత్ర చతుర్దశకులాని" అప్సరః స్త్రీ ప్రస్తావమువచ్చినప్పుడెల్ల శ్రీనాథుడీ విషయమును వల్లెవేయుచునే

యుడును మఱియొక్క విషయము. ఏదేని యొక విషయమును వర్ణింపఁ దలపెట్టినదానిని సర్వాంగ పరిపుష్టముచేసి వర్ణించెడి తీరంతయు కవిసార్వభౌమునకు భట్టబాణుని విషయాను సరణ సంస్కారమే యనవచ్చును. కుమారసంభవమునందు కాళిదాసొక చిన్నవృత్తములో నిరూపించిన మన్మథునిరాక సీసగీతములలో సర్వాంగ పరిపుష్టముగ వర్ణించుట తన్మూలమే యనిపించును. ఆ ఘట్టమును కొంత పరామర్శింతము.

అథ స లలితయోషిద్భ్రూలతాచారుశృంగం
రతివలయ పదాంకే చాప మాసజ్య కంఠే
సహచర మధు హ స్తన్య స్తచూతాంకురాస్త్రః
శతముఖ ముపతస్థే ప్రాఞ్జలిః పుష్పధన్వా.

కుమా. 2. స.

ఈ శ్లోకప్రస్తార మీ క్రిందివిధమున సాగినది.

కాంతాజనంబుల కనిపంక బొమలతోఁ
బ్రతివచ్చు పుష్పచాపంబుతోడఁ
గోకిలవ్రాతంబు గ్రుక్కిళ్లు మ్రింగించు
క్రొమ్మావి చిగురాకు గొడుగుతోడ
రతిదేవినిడుసోగ గ్రాలు కన్నుల డాలుఁ
దలపించు మీనకేతనముతోడ
భుజగ లీలావతీ భుక్తముక్తములైన
గంధవాహ కిశోరకములతోడఁ
జంమరునితో వసంత మాసంబుతోడ
రాజకీర రథంబెక్కి ప్రాభవమున
వచ్చెవలరాజు చిత్తాను వర్తనముగ
సంభ్రమముతో మహేంద్రు నాస్థానమునకు.

వలరాజు దేవేంద్రుని సభకువచ్చునప్పటి యాతని విభవ వర్ణనమిది. సార్వభౌముని యాస్థానికి సామంతరాజొకఁడు వచ్చునప్పటి ఠీవియంతయు వెలయునట్టులిది చిత్రమైనది. కాళిదాసు రచనలోని సారళ్యముకంటె నిచట నాడంబరమధికముగ చూపట్టుచున్నను వలరాజు ప్రాభవము మాత్రము సర్వాంగ సంపూర్ణమై వెలసినది సమయోచితముగ మూలాను సరణమున వలరాజు సంభ్రమమును వర్ణించినతీరు సరసముగనే సాగినదని చెప్పవచ్చును. ఈ తీరుగ మూలములోని విషయమును బెంచుటకు మూలముకూడ సన్నిహితమైన చతుర్థసర్గములోని విషయమేని కావలయును. ఈ విధముగ మన్మథుని ఠీవిని వర్ణించిన సంస్కృత కావ్యస్థ విషయమేనియై యుండును. మొత్తముమీఁద శ్రీనాథునకుఁ దనరచనతో రచనాశిల్పమును బరిపుష్టము చేయుటకై మూలవిషయమును బెంపు చేయు నుత్సాహ మధికమని యనిపించును. ఈక్రింది విషయముకూడ నందులకే యుదాహరణము కాఁగలదు.

*తస్మిన్సం యమినామాద్యే జాతే పరిణయోన్ముఖే*
*జహుః పరిగ్రహవ్రీడాం ప్రాజాపత్యాస్తపస్వినః.*

కుమా. 6. స.

యోగీశ్వరులలో మొదటివాఁడైన యీశ్వరుఁడు వివాహమున కుత్సుకుఁడైనపుడు బ్రహ్మపుత్రులైన తపశ్శాలురు భార్యలతోనుంటమను సిగ్గును వదలుకొనిరని యీ శ్లోకభావము.

అతఁడు సమస్త సంయమిజనాద్యుఁడు శైలసుతా
పరిగ్రహో
ద్యతుఁడయి యుండఁగా సురమహర్షి వరేణ్యులు
ప్రాక్తన ప్రజా
వ్యతికర సంభవంబయిన యచ్చపులజ్జఁ బరిత్య
జించుచున్.

పైయనుష్టుప్ శ్లోకములోని విషయము యథాతథముగనే యీ చంపకమాలలోని కవతరించె ననవచ్చును. పరిమిత పదములతోఁగూడిన కాళిదాసుని రచనమెంత సరసమనిపించునో, శ్రీనాథుని విపులీకరణము కూడ నంత సరసముగనే సాగినదని చెప్పవలెను.

ఇచటనే గీతపద్యమునో కందపద్యమునో కూర్పక వృత్తమునేల యెత్తుకొనవలసివచ్చెనని, అతనికి వృత్త రచనమునం దుత్సాహము మెండని చెప్పవలెను. అట్టియుత్సాహ మీ యనువాద సరణిలో నేల గ్రహించినాఁడు? అని ప్రశ్నించుకొన్న దానికి సమాధానమే రాదు. ఒక కవి రచనమును వేఱొక కవి యనుసరించినపుడుగాని, యనుకరించినపుడు వానివాని యభిరుచి ననుసరించి సంక్షేప విక్షేపముల నందింపక మానఁడు. వాల్మీకి రామాయణములోని పెక్కు విషయములను కాళిదాసు తన కవితలోఁ గూర్చుకొనినపుడు సైతమిట్టి వ్యత్యాసము తప్పలేదు అట్లైనను కాళిదాసు కవితాప్రతిభను కాదందుమా? అనువాదకుని రచనలోని యౌచిత్యా నౌచిత్యములను, అతని దృష్టిపథమును బాగుగ నవగతము చేసికొని నిర్ణయించుట యుక్తము. ఈ గౌరీ కల్యాణఘట్టము నందే యొక విషయమును బరికింతము

పార్వతితోఁ గపటవటుఁడనిన మాటలివి.

*కియచ్చిరంశ్రామ్యసి గౌరివిద్యతే*
*మమాపిపూర్వాశ్రమ సంచితం తపః*
*తదర్ధభాగేన లభస్వకాంక్షితం*
*వరం తమిచ్ఛామిచసాధువేదితుమ్.*

పార్వతీ! నీ విట్లెంతకాలము శ్రమింతువు? నేనుగూడఁ బూర్వాశ్రమమునఁ గూడంబెట్టిన తపస్సున్నది. దాని సగభాగముతో నీ యభిమతము నొందుము. ఆ వరుని గూర్చి బాగుగఁ దెలియఁగోరుచున్నానని యీ శ్లోక భావము.

ఈ క్రిందిపద్య మీ శ్లోకమున కనువాదముగ రూపొందినది.

ఏనున్న బ్రహ్మచారిఁ దరళేక్షణ! నీవును గన్య
వింత కా
లానకు నీకుఁ బెండ్లియ ఫలంబగునేని విచార
మేల న
న్మానముతోడ నన్ను మునిమాన్య వివాహము
గమ్ము లెమ్ము కా
దేనిఁ దపంబులోని సగమిచ్చెద మాను తపోఽభి
లాషముల్.

పైశ్లోకములోని భావమును నిరూపించుటలో నీయనువాదమున నన్వయక్రమ మనుసరింపఁబడలేదు. మూలములో 'పూర్వాశ్రమ సంచితంతపః' అనుట వలన బ్రహ్మచర్యాశ్రమమునఁ గూడఁబెట్టిన అను నర్థమేగాక, సతీదేవితోడి గృహస్థాశ్రమమునఁ గూడఁబెట్టిన అనునర్థముగూడ వ్యక్తమగుచున్నది అటులనే 'తదర్థబాగేన లభస్వకాంక్షితం' అనువాక్యముచే, తపస్సులోని సగభాగముచే అనునర్థమేగాక, నా శరీరార్ధభాగ లాభముచే నీయభిమతము నీడేర్చుకొనుమను నర్థము వ్యక్తమగుచున్నది. ఈయర్థస్ఫూర్తి గొనివచ్చుటకు శ్రీనాథుఁడు మూలవిషయమును విస్తృతము చేసినాఁడు ఆ పదములనే తెలుఁగుకరువునఁ బోసి విభక్తులను జేర్చినచో, డుమువులు అనువాదమేగాని యందేమియుఁ బసలేదని మనమని వేయుదము

ఈ యనువాదములోని 'బ్రహ్మచారి' యను పదము. నన్ను మునిమాన్య వివాహముగమ్ము అను వాక్యమును వ్యంగ్యార్థ స్ఫోరకము లనుకొనిననాఁడు అన్వయ క్రమము మూలానుగుణము కాకపోయినను భావస్ఫూర్తికి భంగము లేదనవచ్చునేమో! సతీ వియోగానంతర మింతవఱకు నేను బ్రహ్మచర్య వ్రతమునే పాలించుచుంటినను నర్థస్ఫూర్తిని బ్రహ్మచారి పదము కలిగించుననుకొనిన సామాన్యముగ స్ఫురించు గ్రామ్యతాదోష ప్రసక్తి యుండఁబోదు. పార్వతి తపస్సు అభీష్టవరప్రాప్త్యర్థమే యను విషయమును బ్రహ్మచారి యంతకుమునుపే తేల్చిపెట్టియున్నాఁడు. 'నన్ను ముని మునిమాన్య వివాహము గమ్ము' అను వాక్యములో సైతము పరమేశ్వరుఁడనైన నా కర్ధాంగివి గమ్ము అనునర్థము వ్యంగ్యమర్యాదచే స్ఫురించుచునే

యున్నది 'కియచ్చిరంశ్రామ్యసి' అను ప్రశ్నార్థకమునకు మారుగ 'మాసుతపోభిలాషము' అను వాక్యమేర్పడినది ఈ విధముగ నాయోజించుకొన్నచో నీయను వాదముకూడ వ్యంగ్యార్థసంపన్నమై బహుళార్థ సాధకము కాఁగలదనిపించును. అంతియగాని గ్రామ్యతా దోష జుష్టమనుకొన నక్కఱలేదేమో? కాళిదాసువలెనే శ్రీనాథుఁడును పార్వతి పరమేశ్వర పదపద్మ భక్తుఁడై యా యాదిమ దంపతుల మహత్త్వమును భయభక్తులతోఁ దన కవిత్వమునఁగూర్చి పెట్టిన విద్వాంసుఁడే గాని, పాఠకసామాన్యమునకు గిలిగింతలు గలిగించు చవుకబారు కవిత్వమువ్రాయు కవియనుట భావ్యము కాదేమో!

మఱియొకచోటి యనువాదసరణికూడ పరికింతము.

*సుగన్ధి నిశ్వాసవివృద్ధతృష్ణం*
*బింబాధరాసన్నచర ద్విరేఫమ్.*
*ప్రతిక్షణం సంభ్రమలోల దృష్టి*
*ర్లీలారవిందేన నివారయన్తీ.*

ఈ పద్యానువాదము తెలుఁగు నుడికారపుఁ దీరులో నీ క్రిందివిధముగ సాగినది.

కమ్మని యూర్పుగాడుపుల గంధముగ్రోలఁగవచ్చి యోష్ఠ బిం
బమ్ము సమీపదేశమునఁ బాయక యాడెడి తేఁటిఁ గేళి ప
ద్మమ్మున పూచి యీటికి సమంచిత విభ్రమలోల దృష్టియై
యమ్మదిరాక్షి చోఁపె దరహాస వికస్వర గండ పాళియై.

ఇచట 'సుగన్ధినిశ్వాసవివృద్ధతృష్ణం' అనుటకు 'కమ్మని యూర్పుగాడుపుల గంధముఁగ్రోలఁగవచ్చి' యను తెలిఁగింపు సుందరముగాదు అనినారు ప్రభాకరశాస్త్రిగారు. ఎందుచేత సుందరముగా లేవో కారణము తెలుపలేదు. కాళిదాసమహాకవికి పరిమిత పదములతో విశేషభావమును వ్యక్తముచేయుటలో నాదరముండినట్లే శ్రీనాథున కాయాకవుల మధురభావములను దనరచనలో స్పష్టముగ శ్రుతిమధురమైన శైలిలో విపులీకరించి చెప్పుట యలవాటనుకొనిన నీ యనువాదము సుందరమే యగునేమో? ఏమన మంచి పరిమళముగల నిట్టూర్పువాయువులు గ్రోలుటకై దొంగవందువంటి క్రిందిపెదవి దగ్గఱ దుమ్మెద తిరుగుచుండెనని వర్ణించుచు పార్వతి పద్మినీజాతి వనితయని కాళిదాసు వ్యంగముగాఁ దెలిపియున్నాఁడు అట్టి వ్యంగార్థ స్ఫురణ మీ వాదమునను గలుగుచునే యున్నది. మూలములో నేకసమాసపదము నందలి యర్థమును నాలుగు తెలుగు పదములలోఁ గూర్చిపెట్టుట సుందరముగాలేదందుమా? అట్లయినచోఁ దీనినెట్లు తెలుఁగు చేయవలెనని తెలుపవలసి యుండెనుగదా! ఆ విధమయిన సూచనలేకుండ సుందరము గాదనుటలో మాత్ర మేమిసౌందర్యమున్నది? అట్లనుట దృష్టి భేదమే యగును

ఈ శ్లోకము ననువదించుటలో శ్రీనాథుఁడు పాటించిన సరణిసుందరమే యనవచ్చును 'సుగన్ధి' పదమునకు 'కమ్మని' యను పదమును గూర్చుటయే సుందరముగా నున్నది. ప్రాసకొఱకై నిబద్ధమైనను మదిరాక్షిపదము పద్మినీత్వమున కుపష్టంభకమై విభ్రమలోల దృష్టియగుటను సమర్థించునదియైనది. మఱియొక్కమాట. 'స్త్రీకన్యగతిశ్చింతనీయా' అనునది భారతీయ శాస్త్రీయ సంప్రదాయము. లోకమునందెంతటి మహాకవి రచనమునందైనను దోషములున్నవని యుద్భావించుట యాధునిక విమర్శకుల కొకపరిపాటి. ఆక్రమమునఁ గొనసాగినదియే కాళిదాసాది మహాకవుల రచనలలోఁ గొన్ని దోషములు గలవని యనుకొనుట. పాశ్చాత్య దృష్టితో ప్రాచ్య సాహిత్యమును విమర్శింపఁబూనునప్పటికి దృష్టిభేద మేర్పడుచు వచ్చుచున్నది. శ్రీనాథుని యనువాద సరణిలో

దోసఁగులున్న వనుకొనుటయు నట్టిదే. పరిమిత విషయ పరిజ్ఞానముగలిగి శివేతరక్షతికై రచించిన మహా కవుల కావ్యములందు దోషములు గలవని యుద్భా వించుట భావ్యముకాదేమో. యని నాతలఁపు

శ్రీనాథుని రచనలో శ్రుతిసుఖదమైన పదముల కూర్పు ప్రధానవిషయము. దానికనువైన సామగ్రిని సంస్కృత మహాకవుల కావ్యములనుండి సంగ్రహిం చిన విధము నీవఱకుఁ జాలవఱకుఁ బెద్దలు తెలిపియే యున్నారు. తన ప్రబంధములలో మూలాతిక్రమణ మున నేవిషయమునేని కూర్చిపెట్టినాఁడన్న, నది యేదియో యొక మహాకవి కావ్యమునందు పనిబద్ధమై యున్నదియే యైయుండును ఏది యెక్కడినుండి గ్రహిం పఁబడెనన్న విషయమును సంగ్రహింప వలెనన్న నది బహుగ్రంథాధ్యయన సాధ్యము, బహుశ్రమసాధ్య మును, దానికిఁ జాలకాలము పట్టును. ఏ పట్టునం దైనను మధుర మనిపించు భావమునకుఁగాని శ్రుతి సుఖదమైన శబ్ద సంయోజనమునకుఁగాని వెనుకతట్టున మహాకవుల రచన లవలంబముగా నుండుననుట నిశ్చయము. ఒకప్పుడిట్టి నిశ్చయము కలిగియుండియు శ్రీనాథుఁడు మూలాతిక్రమమున స్వతంత్రముగాఁ గూర్చినాఁడనుకొన్న విషయమునకు మూలము, అమరుకములోఁ గానవచ్చినది. భీమేశ్వరపురాణము లోని యా ఘట్టమును చూపించెదను. త్రిపురాసుర సంహారప్రకరణమిది. ఇచట మూలమగు భీమేశ్వర పురాణమునందున్న శ్లోకమును ముందు తెలిపి దానిని శ్రీనాథుఁ డెట్లు ప్రపచించెనో తెలిపెదను.

*తతోదైతేయ నగరాణ్యదహ్యన్త మహీయసా*
*లలాటేక్షణ నిర్ముక్త విష్ణుసాయక వహ్నినా.*

భీమ. 19. అ. 40 శ్లో.

కరపల్లవంబులు కబళించుఁ గబళించి
ప్రబలనితంబ భారమున వ్రాలుఁ
జెక్కుటద్దములపైఁ జెరలాడుఁ జెరలాడి
శ్రవణాంతములను మంజరులు ముట్టు
వలిచన్నుఁగవలపైఁ బొలపాడుఁ బొలపాడి
నాభిరంధ్రములపై నటనసేయు
వేణీభరములపై విహరించు విహరించి
బింబాధరములపై బిత్తరించు
సభవుకరముక్త నారాయణాస్త్ర వహ్ని
కాముకునికోమలాస్త సంగంబుపగిదిఁ
దెగువమీఱంగఁ ద్రిపుర దైతేయరాజ
సదనశుద్ధాంతభామినీ జనములందు.

—భీమ. 4–140.

శ్లో. *క్షిప్తోహస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాద దానోఽంశుకాన్తం*
*గృహ్ణన్కేశేష్వ పాస్తశ్చరణనిపతితో నేక్షితస్సం భ్రమేణ*
*ఆలింగన్యోఽవధూతస్త్రిపుర యువతిభిస్సాశ్రు నేత్రోత్పలాభిః*
*కామీవార్ద్రాపరాధస్స దహతు దురితం శాంభవో వశ్శరాగ్నిః*

అమరు. 2.

'లలాటేక్షణనిర్ముక్త విష్ణుసాయకవహ్నినా' అను సమాస పదమును ప్రస్తారముచేయు నుత్సాహము గలిగిన నపు డమరుకావ్య విషయము సీసగతిమూల మున నవతరించినది. అట్లేల విస్తృతము చేయవలె ననిన, నట్లుచేయుట యాతని కభిమతమనియుటక్క వేఱొండు సమాధానము కానరాదు. ప్రకరణోచిత మైన తన కభిమతమైన భావము సన్యకవి కృత సంస్కృత కావ్యములనుండి గొనివచ్చికూర్చుట యాతని కభిమతమనుకొనవలెనుగాక మఱేమనవలెను. ఇట్లు మల చుట యాతని యసమర్థతగా గణించువారుండు రేని వారికి నమోవాకములు. అట్టివారు శ్రీనాథుని కవిగా లెక్కింపకుండుటయేభావ్యము.

కీ. శే. ప్రభాకరశాస్త్రిగారు హరవిలాసమునకుఁ బీఠిక వ్రాసిపెట్టుచు, శ్రీనాథుని రచనపై నొకపాటిగ నీరసభావ మేర్పడునట్టులు గొంతవ్రాసి పెట్టినారు. కాళిదాసు కుమారసంభవమును శ్రీనాథుఁడు సరిగా ననువదింపలేదనుట యొకటి. ఇప్పుడు చాలామంది దీనికి వంతపాటు పాడుచున్నారు. అది గతానుగతిక ముగ సాగుచున్నది. సంస్కృత భాషామర్యాదను శ్రీనాథునివలెఁ దెలసి, శాస్త్రసమ్మితమైన పాండిత్యము నాతనివలె నార్జించి, యాపైన నాతని కవితను సమ చిత్తతతోఁ బఠించి, పదప్రయోగములందలి లోతుపాతులనెఱిఁగి, ఆ నాఁడు ఆతనిరచన సరిగాలేదనుట భావ్యముగాని, అన్యానుకరణ పద్ధతితో మహాకవుల రచనలను సరిగాలేవనుట సంభావ్యముకాదని యను కొందును. ఇటులనే ఆ పీఠికలోనే శ్రీ శాస్త్రిగారు శ్రీనాథుఁడే సంస్కృత భీమఖండమునుగూడ రచించి యుండునన్నట్టు నేనెన్నఁడో చిన్ననాఁడు విన్నకింవదంతి నిక్కమగునేని యీ నిర్ణయము నిలువఁజాలక పోవును అనినారు. ఈ మాటతో లేనిపోని తర్జనభర్జన లెన్నియో బయలుదేరినవి. తుదికి భీమేశ్వర పురాణమునకు మూలమైన సంస్కృత భీమఖండము శ్రీనాథుని తెలుఁగురచనకు సంస్కృతీకరణమే యనియు, అదికూడ నొక్కప్రతియే దాక్షారామములోఁదక్క మఱి యెచ్చటను లేనేలేదను నంతటివఱకు వచ్చినది. ప్రభాకరశాస్త్రిగారు కింవదంతి యనఁగా దానినే సిద్ధాంతము చేయుట కుద్యమించుచున్నారు. ముందుగ నీసంస్కృత భీమఖండమునకొక ప్రతి కాకినాడవారికి లభించినది. తరువాత టీకతో సహితము కీ. శే. జయంతి సూర్యనారాయణశాస్త్రిగారు ప్రకటించిననాఁడు విభిన్నములైన రెండు తాటియాకు ప్రతులను వారియొద్ద నేను జూచినాను. ఆంధ్రసాహిత్య పరిషత్తులో నింకొక తాటియాకు ప్రతి యున్నది. నేఁటి కయిదువందల యేండ్ల క్రిందట, కొలచెల్మ కుమారస్వామి సోమపీథి ప్రతాపరుద్రీయరత్నాపణ వ్యాఖ్యానమున నీ భీమఖండము లోని శ్లోకము నుదహరించినాఁడు. మనవలె కుమారస్వామి సోమయాజి అమూలకముగా వ్రాయు నలవాటు గలవాఁడు కాఁడనుట సర్వవిదితము. మఱియు, శ్రీనాథుని రచనను యథాతథముగ సంస్కృతీకరించి, స్కాందార్గతము చేసిన ఆ మహనీయుఁడు, పై సీస పద్యవిషయము నెందులకు సంస్కృతము చేయుట మానివేసినాఁడో ? ఇట్టిసిద్ధాంతములను చేయునపుడు ఉభయభాషలను దలస్పర్శిగాఁ దెలిసి యామీఁద నేదయినా వ్రాయ నుద్యమించుట భావ్యమేమో ? అజ్ఞతతోనో, అల్పజ్ఞతతోనో ఏదేదియో వ్రాయఁబూనిన మహాకవులయెడ నన్యాయ్యము చేసినవారము కామా ?

హరవిలాసము పీఠికలోనే 'ధన్వివాదము' అను శ్రీనాథప్రయోగము తప్పేమో ? ధన్వివాదము— అని యుండవలెనేమో ? యని సూచించినారు. 'ఉపసర్గస్యఘఞ్యమనుష్యేబహుళమ్' అను సూత్రముచే నారూపము సాధువే యగును. శ్రీనాథుఁడు భాష్యాంతముగ వ్యాకరణము బాగుగఁజదివిన వాఁడేకాని, చదువనివాఁడు కాఁడు. ప్రభాకరశాస్త్రిగారివంటి వారికే ఆతని ప్రయోగములు భ్రాంతిజనకములైనప్పుడు తదనుయాయుల సిద్ధాంతములనే మనుకొనవలెనో ? ఇంతకు శ్రీనాథుని రచనలోని విశిష్టతను గొంచెమేని తెలియవలెనన్న, ముందా కవిమీఁద సద్భావము ఆతని యుభయభాషా పాండిత్యముమీఁద నమ్మకయుండి, బహుగ్రంథ ద్రష్టృత్వము, ప్రాచీన సంప్రదాయ వేత్తృత్వముసుండుట భావ్యము. సంస్కృతసారస్వతమునం దుత్తమ కవుల రచనలన్నియు నాతని ప్రబంధ సరణిలో నడుగడుగున నడుగిడినవి. వానిని ప్రపంచించుట చాల శ్రమ సాధ్యమని మనవి చేయుచు విరమించుచున్నాను.

# శ్రీనాథునిపై పాల్కురికి సోమనాథుని ప్రభావము

శ్రీ బండారు తమ్మయ్య

పాల్కురికి సోమనాథుఁడు శ్రీనాథుఁడు నిరువురుగూడ శివకవి గణమునకుఁజెందినవారు. శివకవి యనఁగా శివునిపైగాని, శివునకుఁ దద్భక్తునకున భేదము ను భావముతో శివభక్తుల కంకితముగాఁగాని కృతుల రచించి శివార్పిత మొనర్చినవాఁడని పెద్దలు నిర్వచించిరి. 'శివస్య ఇదం శైవమ్' శైవములో సామాన్య శైవము, పూర్వశైవము, మిశ్రశైవము, శుద్ధశైవము, శ్రౌతశైవము, మార్గశైవము, వీరశైవము, సామాన్య వీరశైవము, విశేషవీరశైవము, నిరాభారవీరశైవము అను దశ విధములున్నట్లు శివాగమములలోఁ దెల్పఁబడినది. ఇవి యొక్క టొక్కటె యుత్తరోత్తరముగ నుత్తమములని విశేష ఫలదాయకములని చెప్పఁబడినవి.

వీనిలో దీక్షితునకు లింగధారణము విధించునవి మార్గశైవము, వీరశైవము. మొదటి గర్భాష్టకమున నుపనయన సంస్కారమంది నూలు యజ్ఞోపవీతమును ధరించి శ్రౌతస్మార్త కర్మల నాచరించుచు ననంతరము లింగధారణ దీక్షనొందినది మార్గశైవము. తెలుఁగు దేశమున శైవ బ్రాహ్మణులనియు, ఆరాధ్య బ్రాహ్మణులనియువ్యవహరింపఁబడువారుమార్గశైనాఁబకులు వీరశైవములోఁ గేవలము లింగధారణదీక్షయు యుండును. గర్భాష్టకమునఁగాక పుట్టిన యిరువదియొకటవ దినముననే శిశువునకు లింగధారణ దీక్ష విధింపఁబడినది. "దీయతేలింగ సంబంధః క్షీయతేచ మలత్రయమ్" అని దీక్షా శబ్ద నిర్వచనము. వీరశైవులకు ఇష్టలింగమే యజ్ఞోపవీతము. లింగయజ్ఞోపవీతినే 'శివలాంఛన ధారకాయ' అని వీరశైవ పంచాచార్యుల పూజామంత్రము ఉద్ఘోషించుచుండును.

పాల్కురికి సోమనాథుఁడు వీరశైవకవి సార్వభౌముఁడు. వీరశైవ మతోద్ధరణమునకయి ద్వితీయ

శంభుఁడను నందీశ్వరుఁడు బసవేశ్వరుఁడయి యవత రించి నాతని చరితమును లోకమున విస్తరింపఁజేయు టకయి భృంగీశ్వరుఁడే సోమనాథుఁడయి యవతరించె నని వీరశైవుల విశ్వాసము. కాఁగా సోమనాథుని కృతులు చాలవఱకు బసవేశ్వరున కంకితములు గావించెను. కేవలము నసంఖ్యాకములగు బసవస్తోత్ర పదములుగానో రచింపఁబడినవి. ఆతఁడు వీరశైవకవి సార్వభౌముఁడు. క్రీ. శ. 1160–1240 మధ్య నుండినవాఁడు.

శ్రీనాథుఁడు శైవకవి సార్వభౌముఁడు క్రీ. శ. 1370–1450 మధ్య నుండినవాఁడు. ఇరువురకు మధ్య రమారమి రెండు శతాబ్దుల యంతరమున్నది. ఇరువురు వీరశైవ శైవాఙ్మయములకు సంబంధించిన కృతులనే రచించిన సుప్రసిద్ధ కవులు. శ్రీనాథుని కృతిపతులలో వీరభద్రారెడ్డి, ముమ్మయ, శాంతయ వీరశైవులు-మామిడి ప్రెగడయ్య, సింగనామాత్యుఁడు, బెండపూడి అన్నయ్య, అవచి తిప్పయ సెట్టి శ్రీనాథుని వలెనే మార్గశైవాలంబకులు-శ్రీనాథుఁడు తాను లింగ ధారణ దీక్షనొందిన మార్గశైవాలంబకుఁ డవుటచేతనే తనకును కృతిపతి సింగనమంత్రికిఁగూడ గోత్రకర్త యగు భారద్వాజ మునీంద్రుని శైవదీక్షను 'ఘోరంబైన తపోవిశేషమున సద్యోజాతవక్త్రంబునన్ గౌరీవల్లభుచేత దీక్ష గొనియెన్ సప్తర్షులఁ దొక్కఁడై, తారావీధి నలంకరించెఁ బదసేన్ద్రయ్యార సంఘాతమున్ భారద్వాజ మహాము నీంద్రుఁ దగదేబ క్తిం బ్రశంసింపఁగన్' అని శృంగార నైషధావతారికలో వర్ణించినాఁడు.

ఇట్టిపట్టుఁ దనకన్నముందుగా వెలసిన సుప్ర సిద్ధ పరశైవ కవిసార్వభౌముఁడగు సోమనాథుని ప్రభావము శ్రీనాథునిపై విశేషముగఁ బ్రసరించుట సహజమని చెప్పనవసరములేదు. సోమనాథుని కావ్య ములలో నాతఁడు ద్విపదలోఁగూర్చిన బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు ప్రధానములు–శ్రీనాథుఁడు సోమనాథుని గ్రంథములను విశేష భక్తిశ్రద్ధలతోఁ జదివి యాతనియెడ నపారభక్తి గౌరవములఁ బ్రక టించెననుట చర్విత చర్వణము.

సోమనాథుని ప్రతిభ యాతని యితర కృతు లలోకన్నఁ బండువాఱిన నిండువయస్సులో బసవేశ్వ రున కంకితముగా రచించిన పండితారాధ్య చరిత ములో మఱింత వ్యక్తమయినదనుట పండితజనైక వేద్యము. శ్రీనాథుఁడు పండితారాధ్య చరిత్రమును రచించెననుటకు 'నవమరుత్తు చరిత్రంబు నైషధంబు సప్త శతి పండితారాధ్య చరితమనఁగఁ గావ్యములు పెక్కు చెప్పియు గాంక్ష చనక వెండియును గావ్యమొకటి గావింపఁ దలఁచి" అను భీమఖండావతారికయందలి పద్యమును, 'జగము నుతింపఁగఁ జెప్పితి ప్రెగడయ్యకు నాయనుంగుఁ బెద్దనకుఁ [illegible] నిగమార్థసార సంగ్రహముగ నారాధ్య చరిత్రనామగఁ [illegible]' అని [illegible] నైషధ కృతిపతి మామిడి సింగనామాత్యుఁడు ప్రశంసించి నట్లుగాఁ దద్గ్రంథావతారికలో శ్రీనాథుఁడు వ్రాసిన పద్యమును బరమ దృష్టాంతములు. సోమనాథుని గ్రంథము నాతఁడు నిగమార్థ సారసంగ్రహమని నుతించినాఁడు.

అట్లగుటచే దానినాతఁ డత్యంతభక్తి శ్రద్ధలతోఁ జదివి యంతలోఁ దృప్తిచెందక దానిని బద్యకావ్యముగా ననువదించినాఁడు. పాల్కురికి సోమనాథుని శిష్య ప్రశిష్యుఁడు నాతని యనంతరము మూఁడు శతాబ్దు లలో క్రీ. శ. 1560 ప్రాంతమున నుండినవాఁడునగు పిడుపర్తి సోమనాథుఁడు, సోముని ద్విపద బసవ పురాణమును బద్యకృతిగా ననువదించి దాని నాతని కి యంకిత మొనరించినాఁడు. ఆ గ్రంథావ తారికలో నాతఁడు వ్రాసిన,

సీ॥ విరచించె జైమిని వేదపారస్తవం
బొక పాదమున వేదయుక్తిని లిపి

హరభక్తి వైదికంబని శ్రుతులిడిచెప్పెఁ
బ్రతిభ సోమేశుఁడారాధ్యచరిత
నరవి శ్రీనాథుఁడాచరిత పద్యప్రబం
ధముచేసె ద్విపదలు తఱచు నిలిపి
అతండు నైషధంబాంధ్రీకరించెను
నంచితహర్షవాక్యములు పెట్టి
గీ॥ సోమగురువాక్యములు పెట్టి భీమసుకవి
గరిమ బసవ పురాణంబు కన్నడించె.

అను పద్యము వలన శ్రీనాథుఁడు సోమనాథుని ద్విప దలనే విశేషముగఁగైకొనుచుఁ దన పద్యానువాదమును సాగించినట్లు స్పష్టమగుచున్నది. శ్రీనాథుని పద్య కృతి మనదురదృష్టమున నేఁడు దుర్లభమయినది. కాని పిడుమర్తి సోమనాధుని పద్యమునుబట్టి యది యానాఁటికిఁ బ్రచారమందున్నట్లు విశదమగుచున్నది. ఇట్లు సోమనాధుని ద్విపదకావ్యమును బద్యకృతిగా ననువదించుటమూలముననే యాతని ప్రభావము శ్రీనా థునిపై నెక్కువగఁ బ్రసరించినట్లు భావింపనగును.

ఇంతియేగాక కృతిరచనా విధానమునఁగూడ సోమనాధుని ప్రభావము శ్రీనాధునిపై విశేషముగ న ధి కా ర ము చలాయించినది. సోమనాధుఁడు: 'ఉరుతర గద్యపద్యోక్తులకంటె। సరసమై పరగిన జాగు తెనుంగు। చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ। గూర్చెద ద్విపదలుగోర్కెదైవార।' అమూథగత్యపద్యాది ప్రబంధ। పూరిత సంస్కృత భూయిష్ఠరచన। మాగానుసర్వసామాన్యంబుగామి। జానుతెనుఁగు విశేషము ప్రసన్నతకు' అని తన గ్రంధావ తారికలలో వ్రాసినను, అఖండ పండితుఁడగు నీతఁడు సంస్కృత పదజాలమందలి వ్యామోహమును విడనా డక పలుతావులఁ దన కావ్యములను సంస్కృత పద భూయిష్ఠముగ రచించినట్లు కానసగును. ఆయన బసవ పురాణముకన్నఁ బండితారాధ్య చరిత్రము మఱింత సంస్కృత పదభూయిష్ఠముగ రచితమయినది. దీర్ఘ ముగ సంస్కృత పదజటిలముగ విశేషముగ ద్విపద రచనముగావించి యాతరువాత వెనువెంటనే జాను తెనుఁగుపదముల జాలువార్చుచు రచన పెంపొందించుట యాతనికృతులఁ జదువువారికి గోచరించుచుండును. ఇట్టి రచనావిధానమునే శ్రీనాధుఁడు ననుసరించి నాఁడని మనకాతని కృతులవలనఁ గానవగును. దృష్టాంతములఁ జూపవలెనన్న గ్రంధ విస్తరమగును.

భీమఖండావ తారికలో 'హర చూడాహరిణాంక వక్రతయుఁగా। లాంతస్ఫురచ్చండికా।పరుషోద్ఘాథప యోదర స్ఫుటతటీ। పర్యంత కాఠిన్యమున్। సరసత్వంబును సంభ వించెననఁగా। సత్కావ్యముల్ దిక్కులన్।క్షీరకాలంబు నటించుఁచుండుఁ గవిరా జీగేహరంగంబులన్' అని సత్క వితారచనా విధానమును శ్రీనాధుఁడు వివరించియే యున్నాఁడు. గాఢసమాస బంధముతో రచితము లయిన పద్యము లాతని కృతులలోఁ దఱచు ప్రత్యక్ష మగుచుండును. ఇంతకు నెట్లు రచించిన రస విస్ఫు రణము కలుగునో. ఎచ్చట సంస్కృత పదములతో రచన సాగింపఁదగునో, మఱెచ్చట దెనుఁగుపదముల నెక్కువగఁ జొనుపవలెనో యా కవితా రహస్యము సోమనాధునకు, నాతని మార్గదర్శిగా నారాధించిన శ్రీనాధునకుఁ దెలిసినట్లు మనబోంట్లకుఁ దెలియరాదు- కావుననే '(ప్రౌఢిఁబలికింప సంస్కృత భాషయందు।పలుకు నుడికారమున నంధ్రభాషయందు। ఎవ్వరేమనకొన్న నా కేమికొదవ। నాకవిత్వంబు నిజము కర్ణాటభాష' అని తన కవిత సరసమై పాఠకులకుఁ గర్ణరసాయనము కాఁగల దని వ్యంగ్యముగఁ బ్రకటించినాఁడు. సోమనాధుని భక్తితో నారాధించి యనుసరించిన శిష్యుఁడవుట వల ననే యాతఁడిట్లు చాటఁగలిగినాఁడు.

సమాన సంవిధానములుగల కథపట్టులు వచ్చి నప్పుడు సోమనాధుఁడు కవితావేశముతోఁ బౌర్వాపర్య విచారమును బాటింపకయే యనంతరము జరిగిన విషయములఁగూడ నంతకుఁబూర్వపు కథావిధానము లలో జొనుపుట చాలపరిపాటి. ఇది యాతని కృతు

లలోఁ బలుతావులఁ బాఠకులకు గోచరింపఁగలదు. పండితారాధ్య చరిత్ర మహిమ ప్రకరణములో మల్లికార్జున పండితారాధ్యుఁడు బసవేశ్వరుని దర్శించుటకయి కళ్యాణపట్టణమునకుఁ బయనమయిపోవుచు మార్గమధ్యమునఁ జందవోలులో వెలనాటి చోడుని యాస్థానమున నాతని బౌద్ధగురునితో వివదించిన సందర్భమునఁ బండితారాధ్యుని శిష్యులు బౌద్ధగురుని వధించిరందు కానేరమును దనపైమోపి చోడుఁడు నేత్రములు తీయించినందుకుఁ గినిసి పండితారాధ్యుఁడాతఁడు నిర్వంశముగఁ బుత్ర కళత్ర సహితముగ సత్వరముగ నశించుఁగాక యని శపించెడి సందర్భములో, అటుతరువాతఁ గొంతకాలమునకు పండితారాధ్యుఁడు కళ్యాణపట్టణమును జేరకమున్నే యచ్చటఁ జరిగిన కల్లోలములో బసవేశ్వరుఁడు నాతని యనుచరులు బిజ్జలుని నిట్లే శపింప నాతఁడు నిర్వంశముగ నశించెనను వృత్తాంతమును సామ్యమునకై సోమనాధుఁడేకరువుపెట్టినాఁడు చారిత్రక దృష్టితోఁ బరీక్షించు వారికిది విడ్డూరముగఁ దోఁపకమానదు ఇది వాస్తవముగఁ గవికిదోషమునేగానిగుణమునాపాదింపఁజాలదు

ఈ విషయమునఁగూడ సోమనాధుని ప్రభావమే శ్రీనాధునిదెనఁగూడ సంక్రమించినదని చెప్పవచ్చును. హరవిలాసములోఁ జిరుతొండ నంబి చరిత్రములో

'కలియుగంబునఁ గళ్యాణ కటకనగరి
నాకు భక్తుండు బసవర నాయఁడొకఁడు
కంచినగరంబులో వణిగ్వంశవరుఁడు
నాకుభక్తుండు చిరుతొండ—నంబి యొకఁడు'

అని సర్వజ్ఞుఁడు శివునినోటనే శ్రీనాధుఁడు పార్వతితోఁ బలికించినాఁడు—వాస్తవముగఁ జిరుతొండ నంబికాలమునకు బసవేశ్వరుఁ డవతరించనేలేదు.... ఇరువురకు నయిదువందల సంవత్సరముల యంతరమున్నది. కావునఁ జారిత్రకదృష్టిలో నిందలి వైపరీత్యము పాఠకులకు గోచరించుచుండును. ఇటు గుణదోషములు రెంటనుగూడ సోమనాధుని ప్రభావము, విధానము శ్రీనాథునికి సంక్రమించినవి.

ఇఁక వర్ణనములలోఁగూడ శ్రీనాధుఁడు సోమనాథుని స్థూలముగ ననుసరించిన పట్టులం దందుఁ గాననగును. మచ్చునకీ క్రిందివి చూడుఁడు.

"ఇసుమంతబూడిద నొసటఁ బూసినను
మసలక కొండంత మరులెత్తెనవుట
తెల్లమనుచు రాజు మెల్లననగుచుఁ
జెల్లవో! బసవయ్య! శివమరుల్ గొంటె"

(బసవపురాణము)

"అవగింజంత బూదిమై నలఁదెనెని
వెలది గుమ్మడికాయంత వెఱ్ఱిపుట్టుఁ
గటకటా! యెట్లు తనబుద్ధి కాటగఁలియ
నిసువుఁ జంపంగనెంచెనో నీమగండు"

(హరవిలాసములోఁ జిరుతొండ నంబిభార్యతో మాయాజంగము రాలి వేషముననున్న పార్వతి పలికిన వాక్యములు.

ఇట్టిపోలికలు, సంవిధానములు, సోమనాథ శ్రీనాథుల గ్రంథములఁ బరిశోధన పూర్వకముగఁ బరీక్షించిన నెక్కువగనే గోచరింపఁగలనని నావిశ్వాసము.

మఱియుఁ శ్రీనాథునిపద్యములలో ముఖ్యముగ మత్తేభ శార్దూలములందును, సీసపద్యములందును మనోహరమయిన సమత్వము, తూఁగుందనము, శయ్యాసౌభాగ్యము చదువరులకు గోచరమగుచుండును. ఈ పద్యములకు సోమనాథుని అనుభవసార, చతుర్వేదసారములందలి మత్తేభ శార్దూలములు, సీసపద్యములె వరవడులని యా గ్రంథములఁ జదువువారికి స్పష్టమగుచుండును. కావున శ్రీనాథుని కవితయందలి ఏవంవిధ గుణవిశేషములకు సోమనాథుఁడే మార్గదర్శకుఁడని మనమెఱుంగఁదగును—శ్రీనాథుని సీసపద్యములందలి సొగసుగూర్చి నేనాతని కర్పించిన గురుదక్షిణా నవరత్నములలో నిట్లు ప్రశంసించియున్నాను.

'చెవులకు దుర్భరంపు వ్యధ సీసములం గరఁగించి పోయఁగా! నవుననిలోకమందు జను లాడెడి మాటల నోటువుచ్చిమేల్! చవులనువిందుచేయుచును సంతత కర్ణరసాయనంబులై! హవణిలునీదుసీసములహా! రసమూరవిచిత్రరీతులన్'

# సర్వజ్ఞ సింగభూపాలుడు

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

సర్వజ్ఞసింగభూపతినామధేయులు ఇద్దరు కలరు. వీరు రేచర్ల వంశీయులు. ఈ వంశమునందు చరిత్రకారులు సింగమనామధేయ మహీపాలురను ముగ్గురిని గుర్తించుచున్నారు. పాఠక సౌకర్యమునకై వీరి వంశవృక్షమును ప్రసక్తమైనంతవరకు సంగ్రహముగా నిచ్చుచున్నాను.

మొదటి సింగభూపతి
|
కుమారుడు అనపోతానాయడు క్రీ.శ. శాసనము 1380
|
కుమారుడు రెండవ సింగభూపతి 1385-97
|
,, రెండవ అనపోత లేక కుమారాన్నపోత
|
,, మూడవ సింగభూపతి. 1422 (సర్వజ్ఞ బిరుదాంకితుడు)

సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారును, డా॥ నేలటూరి వెంకటరమణయ్య గారును 'సర్వజ్ఞ' బిరుదము మూడవసింగ భూపాలునకు మాత్రమే కలదనియు రెండవ సింగమనీనికి అట్టి బిరుదము లేదనియు భావించుచున్నారు. సర్వజ్ఞ బిరుద భూషితుడైనను మూడవ సింగమనీడు రచించిన గ్రంథములేవియు కానరావు. ఈ మూడవ సింగభూపుడే బమ్మెర పోతరాజ కృతభోగినీ దండకమున ప్రశంసింపబడినవాడై ఆ మహాకవి నామములో కలిసి కీర్తి ప్రపంచమున విహరించుచున్నాడు.

సర్వజ్ఞ బిరుదము లేదని చెప్పబడు రెండవ సింగ భూపాలుడే రసార్ణవసుధాకరాది ఉద్గ్రంథములను రచించి తన కీర్తిచంద్రికలో తానే స్నానమాడుచున్నాడు. కావున సర్వజ్ఞ సింగభూపాలుని పేర కీర్తింప బడదగినవాడు రెండగసింగమనీడని భావించి, ఈయననుగూర్చియే నరేంద్రనాథ సాహిత్యమండలి వారు వ్యాసము వ్రాయ నాదేశించిరని తలచుచు రసార్ణవసుధాకర గ్రంథకర్త యశోగానమునే చేయుచున్నాను. మఱియు 'వెలుగోటివారి వంశచరిత్రము' అను సవిమర్శ గ్రంథమును రచించిన మనీషులు

శ్రీ వేటూరి సదాశివశాస్త్రిగారు సర్వజ్ఞనామము సింగభూపాలద్వయమునకు ఉండినట్లే వ్యవహరించినారు. మనము దాని ననుసరించిన ప్రమాదములేదు.

రెండవ సింగభూపాలుని ప్రసిద్ధ గ్రంథములలో తెలియవచ్చినవి మూడు (1) రసార్ణవ సుధాకరము అను అలంకారిక మహాగ్రంథము (2) రత్నపాంచాలికయను నామాంతరముగల కువలయావళీ నాటిక (3) 'సంగీత సుధాకరము' అను సంగీత రత్నాకరవ్యాఖ్య వీనిలో మూడవదానిని నేను చూడలేదు. రసార్ణవ సుధాకరమునందుగాని, కువలయావళీనాటికయందుగాని సింగభూపాలుడు తనకు సర్వజ్ఞ బిరుదమును వైచుకొనలేదు. రత్నపాంచాలిక ఆముఖమునందు సూత్రధారుడు నాటక కర్తనుగూర్చి చేసిన ప్రశంస సముచితముగను మితముగను నున్నది. "అద్యాహం రాజశైలాభిధానాం రాజధానీ మధివసంతః ప్రసన్న గోపాలదేవస్య వసంతయాత్రా మహోత్సవే సకలదిగంత సమాగతేన నాగరిక రాజసభాజనేన, సభాజనపురస్సర మిదమాదిష్టోఽస్మి "అయి రంగలక్ష్మినివాస! లలితకవితా విలాస చతురాననేన ... ... ఖడ్గనారాయణేన, శ్రీమతా సింగభూపాలేన ప్రణీతామఖండ పరమానంద వస్తు చమత్కారిణీం కువలయావళీం నామ నాటికాం ప్రయోగతో దర్శయేతి".

రసార్ణవసుధాకరమునందు గ్రంథ ప్రస్తావనా సందర్భమున సింగభూపాలుడు తన వంశమును ఆత్మ-వితరణ ప్రతాపాదికమును వివరించి, తుదకిట్లు చెప్పెను

'సోఽహం కల్యాణ రూపస్య వర్ణోత్కర్షైక కారకమ్/ విద్వత్ప్రసాదనాహేతోర్వక్ష్యే నాట్యస్య లక్షణమ్' సింగభూపాలుడనగు నేను విద్వాంసుల ప్రీతికొఱకై కల్యాణాత్మకమైన నాట్యముయొక్క లక్షణమును చెప్పుచున్నాను.

ఈ రాజన్యుడు వినయభూషితుడైనను ఆత్మప్రత్యయములేనివాడు కాడు. మరొక సందర్భమున అనగా సుధాకరమునందలి మూడవదగు భావకోల్లాసమున (నాటికప్రకరణమున) చతుర్విధ కవులను గూర్చి ప్రసంగించుచు, కవులు—ఉదాత్త, ఉద్ధత, వినీత, ప్రౌఢ—భేదములచే చతుర్విధములనునందురని చెప్పి, అందు ప్రౌఢ కవిభేదమునకు లక్ష్యముగా తననే చెప్పుకొనెను. ప్రౌఢ కవి నిర్వచనము నిట్లు చేసెను

'యుక్త్యా నిజోత్కర్షవాదీ ప్రౌఢ ఇత్యపరైః స్మృతః యథా మమైవ :—

(శ్లోకము) "నేదానీంతన దీపికా కిము తమస్సంఘాతమున్మూలయే / జ్యోత్స్నా కిం న చకోరపారణకృతే/ తత్కాలసంశోభినీ/ బాలః కిం కమలాకరాన్ దినమణి / ర్నోల్లాసయేదంజసా / తత్సంప్రత్యపిమాదృశామపివచః స్యాదేవ సత్ప్రీతయే"

"ఇప్పటి దీపము కారుచీకట్లను నిర్మూలించుటలేదా, ఇప్పటి వెన్నెల ఆహారదానముచే చకోరములను పోషించుటలేదా, బాలుడయ్యును సూర్యుడు కమలములను వికసింపజేయుటలేదా అట్లే ఈ కాలమునకు జెందిన మమ్ముబోంట్ల మాటలును (రచనములును) విద్వత్ప్రీతికి కాకుండునెట్లు" అని యీ ప్రభుమౌళి సమర్థించుకొనెను. ఈ శ్లోకమునందు మహాకవి కాళిదాసుయొక్క "పురాణమిత్యేవ నసాధు సర్వమ్" అను శ్లోకచ్ఛాయలు స్ఫుటముగా కాన్పించుచునే యున్నవి. సింగభూపాలుడు సంస్కృత కావ్యనాటిక, అలంకారశాస్త్ర వాఙ్మయమును మంథరపర్వతమువలె ఆపాతాళ నిమగ్న పీవరతనువై మథించినవాడు. అందును కాళిదాసు కృతులీయనకు ప్రత్యేకాభిమాన పాత్రములు. రసార్ణవ సుధాకరమునందు అన్నియుల్లాసములందును లక్షణము లొసంగు సందర్భములో కాళిదాసు ప్రబంధములనే యెక్కుడుగా ఆదరించెను.

ఈ సింగభూపాలుని తల్లిదండ్రులు అన్నమ, అనపోతనాయకులు. సింగభూపాలీయము నందిట్లు చెప్పబడినది. కువలయావళీనాటికయందు తల్లిపేరు కొంచెముభిన్నగముగానున్నది. ఆమెపేరు 'ఉమాదేవి' యన్నట్లు తోచుచున్నది "ఖడ్గనారాయణేన, మాన్య మహిలాగుణ విశేషలీలా సదనోమాంబికా విదూర విశ్వంభరావిమల రత్నకందలేన శ్రీమతా సింగ భూపేన" అనియున్నది. అన్నమ-అన్నపూర్ణ గనుక, ఆమెయే ఉమకూడ అయియుండునేమో లేదా అన్నమ అనుటకు బదులు లేఖక ప్రమాదముచే 'ఉమ' అయి యుండవచ్చును. రెండవ సింగమనాయకుని తండ్రి అనపోతనాయడు ప్రచండ విక్రమశాలి. ఈయనకు 'సోమకుల పరశురామ' అనునది బిరుదు. తనకు ప్రత్యర్థులైన రాచవారిని ఈయన నిర్దాక్షిణ్యముగ శిక్షించుటచే పరశురాముడను కీర్తివచ్చెను. ప్రకృతము మనము వీరిపాలనా విశేషములనుగూర్చియు చరిత్రను గూర్చియు విస్తరింప బూనుకొనలేదు.

ప్రకృత వర్ణనీయుడైన సింగభూపాలుడు శ. క్రీ. 1385-1397 సంవత్సరముల నడుమ వంశక్రమాగత రాజధానియైన రాచకొండయందు ధర్మపరిపాలన చేసె నని చెప్పవచ్చును. ఈ కాలపు ఆంధ్రదేశాధీశ్వరుల రాజ్యవిధానము ప్రతాపాగ్ని బహుళమయ్యె. నయ విరహితమగుటచే శత్రు దాహముకన్న మిత్ర దాహ మును ఆత్మదాహమునే విస్తారముగ చేసెననుట తథ్యము. రెండవ సింగభూపాలునికి సమకాలికుడు కొండవీటి కుమారగిరిరెడ్డి. చిత్రముగా, ఈ రాజు లిద్దరును మహావిద్వాంసులు కావ్యగీతి ప్రియులు. మొత్తముమీద పద్మనాయకరాజులు తమకు అనంతరు లైన బహమనీసుల్తానులతోను, రెడ్డిరాజులు విజయ నగర చక్రవర్తులతోను మైత్రిపాటించి, మిత్రానురోధ మునకాబోలు అన్యోన్య వినాశన మొనర్చుకొనుచుండిరి. సంగ్రామరంగమునందు మిక్కిలి ఉద్ధతులయ్యును వేదమార్గ సమ్మతముగను ధర్మప్రీతిగను వీరందరును రాజ్యపాలన చేసిరనుటయు పరమసత్యమే. సింగ భూపాలీయమునం దిట్లు చెప్పనైనది.

"రాజా సరాజా చలనామధేయా/ మభ్యాస్యవం శక్రమరాజధానీమ్/ సతాంచ రక్షామ సతాంచ శిక్షాం/ న్యాయానురోధాదను సందధార"

కువలయావళీనాటికలోని భరతవాక్య మిట్లున్నది

"కల్యాణమస్తు జగతాం సతతం త్రయాణామ్
సంవర్ధితో భవతు వైదిక ఏవ మార్గః
సారస్వతాని సరసాని కవీశ్వరాణాం
మాత్సర్య దిగ్ధహృదయాన కలంకయంతు"

* మూడులోకములకును క్షేమమగుగాక. వైదికమార్గమే సంవర్ధితమగుగాక. సరసకవుల ఉత్తమ రచనలను మాత్సర్యపూరితులై యితరులు కలుషితము చేయ కుందురుగాక—

సింగభూపాలుని యాస్థానమునందు విశ్వేశ్వర పండితుడగు మహావిద్వాంసుడుండెననియు అతడు చమత్కారచంద్రిక మున్నగు పెక్కు గ్రంథములను వ్రాసెననియు తెలియుచున్నది. రసార్ణవసుధాకర కర్త కీ విద్వాంసునిపై అమిత గౌరవము. విశ్వేశ్వర పండితుని స్తుతుల నందుకొనుటయే తనగొప్ప సౌభా గ్యముగ నీనృపాలు డెంచినాడనినచో వారి యను బంధ మెతాదృశమని చెప్పరానిది.

ఈ యంశము రత్నపాంచాలిక యందిట్లు చెప్పబడినది.

---

*రసార్ణసుధాకరమును ఆమూలాగ్రముగ పుంచి సమర్థ తతో అనువదించినవారు పండిత శ్రీ బులుసు వేంకటరమ ణయ్యగారు. కువలయావళీనాటికను డాక్టరు గిడుగు సితా పతిగారు లలితమధురముగ ఆంధ్రీకరించినారు. పండిత మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారుకూడా రత్నపాం చాలికను తెలుగు చేసిరని వింటిని.

అహో సాహిత్య సౌభాగ్యం
శ్రీసింగ ధరణీపతేః
శ్లాఘాయై యస్య సన్నద్ధా
విశ్వేశ్వర సరస్వతీ!

సింగభూపాలీయమునందుగూడ ప్రసక్తాను ప్రసక్తముగ విశ్వేశ్వరపండితునిపై తనకు గల్గినగౌరవాభిమానము నీ రాజశేఖరుడిట్లు ప్రకటించెను. భావకోల్లాసమునందు వీథ్యంగములను ప్రపంచించుచున్నాడు. అందు ప్రశ్నోత్తరమాలికా రూపమైన ఉద్ఘాత్యమున కీ లక్ష్యమిచ్చినాడు. ఆంధ్రానువాదము:

"ప్రశ్న: సేవింపదగినదేది?
ఉత్తరము: ఉత్తముని చరిత్రము.
ప్రశ్న: లోకోత్తరుడగు పురుషు డెవరు?
ఉత్తరము: శ్రీ సింగభూపతి.
ప్రశ్న: అతడెట్టివాడు?
ఉత్తరము: ధర్మమునకు నిధి.
ప్రశ్న: ఏదిధర్మము?
ఉత్తరము: సత్యవాక్యము.
ప్రశ్న: వాక్యమనగా నేది?
ఉత్తరము: కవిచే నుతింపబడునది.
ప్రశ్న: ఆ కవి యెవరు?
ఉత్తరము: విశ్వేశ్వరుడు.
ప్రశ్న: అతడెట్టివాడు?
ఉత్తరము: విశ్వములందు విశ్వేశ్వరునివలె విజయము పొందుచున్నవాడు!"

రసార్ణవసుధాకరమువలన తెలియవచ్చు మఱియొక విశేషాంశమేమన—సింగభూపాలుని తండ్రి అనపోతనాయకుడుగూడ సంస్కృతమునందు నాటక రచయితగాకనబడుచున్నాడు. అనపోతనాయుడు భయంకరఖడ్గధారిగానే మనకు తెలియవచ్చుచున్నాడు కాని మృదుకవితా రీతియందును వడితిరిగిన చేయిగలవాడుగా వినబడలేదు. పితృభక్తిగల సింగమనాయడు తనతండ్రి రచనను పేర్కొని ఆయనకు సారస్వతక్షేత్రమున పేర్కొనబడు భాగ్యము కలిగించినాడు. వీథ్యంగమయిన అవలగితమునకు లక్ష్యమొసంగుచు సింగభూపాలుడిట్లు వ్రాసెను. "అన్యప్రసంగాదన్యస్య సిద్ధ్యా అవలగితంయథా—అభిరామ రాఘవీయే—అనపోతనాయకీయే:—

"హంత సారస్వతంచక్షుః కవీనాం క్రాంతదర్శినామ్ అతిశయ్య ప్రవర్తేత నియతార్థేషువస్తుషు"
క్రాంతదర్శులగు కవుల సారస్వతనేత్రము నియమితార్థములుగల వస్తువుల నతిక్రమించి ప్రవర్తించును. మమ్మటాచార్యుని 'నియతికృత నియమ రహితామ్' ఇత్యాది కవి భారతీస్తుతి దీనియందు ధ్వనిత మగుచున్నది అభిరామరాఘవ మనునది అనపోతానాయకుని కృతిగా నిచ్చట వినవచ్చుచున్నది. దీని నుండి సింగభూపాలుడు రెండు మూడు స్థలములలో నుదాహరణము లిచ్చియుండుట గమనింపదగినది.

అనపోతానాయకుని కాలమునందు అతని అయ్యనవోలు శాసనమువలన తెలియవచ్చు పశుపతి నాగనాథుడను విద్వత్కవి కలడు ఇతడు విశ్వేశ్వర కవి శిష్యుడని శ్రీ చాగంటి శేషయ్యగారు వ్రాయుచున్నారు. అనగా, విశ్వేశ్వరపండితుడు సింగభూపాలుని తండ్రికాలముననే వర్ధిల్లి, కడువృద్ధుడైయుండవలెను. సింగభూపాలుడు విశ్వేశ్వరుని శిష్యుడో? యేమో నిర్ణయింపలేము పశుపతి నాగనాథుని కుమారుడు గంగాధరుడు సింగభూపాలునితొ గలిసి సంగీత రత్నాకరమునకు వ్యాఖ్య రచించెనని ఆంధ్రకవి తరంగిణి నుడువుచున్నది.

రసార్ణవసుధాకరమువలన తెలియవచ్చు ఒందు రెండు విశేషాంశములను ఇచ్చట సూచించుట అప్రస్తుతము కాకపోవచ్చును. కొన్ని చారిత్రకాంశములను పునర్వీక్షణ చేయుట కివి తోడ్పడవచ్చును. అనపోతానాయడు శైవమతాభినివేశము గాఢముగా

కలవాడనియు, భైరవప్రతిష్ఠలు చేసెననియు ఆంధ్రుల చరిత్రవాకొనుచున్నది. ఈ నాయడు వీరప్రతాపుడై అట్లుచేసిన చేసియుండవచ్చును గాని అతడు విష్ణుభక్తి విముఖుడు కాదనుటకు ఆయనపేర తెలియవచ్చు అభిరామ రాఘవనాటకమునుండి యూహింపనగు చున్నది. ఆశీరూపమైన నాందికీ దీనినుండి సింగ భూపాలు నుదాహరించియున్నాడు. ఇది శుద్ధవిష్ణు స్తోత్రపరముగా నున్నది. పశుపతి నాగనాథుడు శైవుడయ్యు విష్ణుపురాణమును రచించెనని యుదా హరణపద్యములవలన తెలియవచ్చుచున్నదని ఆంధ్ర కవి తరంగిణీకారులు వ్రాయుచున్నారు.

మరియొక చిన్నవిషయము. సంస్కృతము నందు ప్రసన్నరాఘవనాటకమును వ్రాసిన జయ దేవుడు 15వ శతాబ్దమువాడను భావము విద్వాంసు లలో కలదు. కాని రసార్ణవసుధాకరమునందీతని శ్లోకము ఉట్టంకింపబడినది. వీథ్యంగములలో 'నాలిక' యనునది 'అంతర్లాప–బహిర్లాప'యని రెండువిధము లని చెప్పుచు. అంతర్లాపభేదమునకు '*ప్రత్యంకమంకు రిత సర్వరసావతారమ్*' అను శ్లోక మీయబడినది. కావున ప్రసన్నరాఘవనాటకకర్తయైన జయదేవుడు క్రీ. శ. 14వ శతాబ్దికిముందువాడగుచున్నాడు.

సింగభూపాలుని కృతులు నొకింతపరామర్శిం తము. కువలయావళీరసార్ణవసుధాకరములలో నేది పూర్వమో, ఏదిపరమో నిర్ణయించుటకు నిశ్చితాధార ములు కనబడలేదు. సుధాకరమునందు రత్నపాం చాలికాశ్లోకములేవియు ఉదాహృతములైనట్లు కాన రాలేదు. అయినను సమగ్రముగను సావధానము గను పరిశీలింపవలెను. చిన్నకృతియగుటచే రత్న పాంచాలికను మున్ముందు కైకొందము. ఇది మాల వికాగ్నిమిత్రము, రత్నావళివంటి నాటికల కోవకు చెందిన మధురరూపకము నాయకనామధేయము కువలయావళియైనను దీనికి రత్నపాంచాలికయను సంకేతమును నాటికాంతమున కవియే యొసగి యున్నాడు.

> "*ప్రార్థేయం సింగభూపేన*
> *గ్రథితాభుధుజల్పితైః*
> *రత్నపాంచాలికానామ*
> *నాటికారసపేటికా*"

ఇది కథాగతమైన కల్పనయేకాని వ్యర్థమైనదికాదు. కథాసారాంశమిది. శ్రీకృష్ణుడు కాలయవనుని జయిం చుటకై దండయాత్ర వెడలిన కాలమున అతని దేవే రులు భర్తృవిజయమును కాంక్షించి వ్రతములు చేయుచుందురు నారదమహర్షి యొసడుమ దివ్య సౌందర్యముగల యొక కన్నియను రుక్మిణివద్ద న్యాస ముగా నుంచును. ఈమెయే కువలయావళి. ఈమె చేతికొక ప్రభావశాలియైన ముద్రికయుండును. దాని వనివలన నీమె పరపురుషులకంటబడినప్పుడు రత్న పాంచాలికా భ్రమను కలిగించును. ఈ ముద్రిక యెవనిచేతికి లభించునో అతడే యీమెను పెండ్లాడు నని దానిపై చెక్కబడియున్నది.

శ్రీకృష్ణుడు శత్రుసంహారము చేసివచ్చి, "హరా త్రుగ" కనబడి తన రాణులను సంభ్రమావిష్టు రాంద్రను చేయదలచి రుక్మిణీదేవి యుద్యానవనమ్ముతో నిభృతుడైయుండును కువలయావళియు, ఆమె చెలికత్తె చంద్రలేఖయు ఉద్యానశోభను తిలకించుటకై వత్తురు. నాయికా నాయకు లచ్చట అన్యోన్యసంద ర్శనముచే రాగప్రేరితులగుదురు. మొదట మొదట శ్రీకృష్ణునకుగూడ కువలయావళి విషయమై రత్న పాంచాలికా భ్రమకలుగును. జాతానురాగయైన కువలయావళి కన్యాజనోచిత సాధ్వసములో వెడలి పోవ నుంకించుచుండ ఆమె వ్రేలిముద్రిక జారిపడి పోవును. ఆమె దానిని గుర్తించలేదు దివ్యప్రభా వముగల యా ముద్రిక శ్రీకృష్ణునకు లభించినది.

పోయిన ముద్రికను వెదకుకొను నెపమున చంద్రలేఖయు కువలయావళియు శ్రీకృష్ణ శ్రీవత్సుల

సందర్శింతురు శ్రీవత్సుడు నర్మసఖుడు నాయికను నాయకుడు స్వేచ్ఛగా కలిసికొనుటకు అవకాశము కల్పించుటకై విదూషకు డొకయుక్తిపన్నును. శ్రీకృష్ణ విజయమునకై దేవతల నారాధించుమిషచే రాణు లందరును రైవతాద్రికి తరలింపబడిరి. శ్రీకృష్ణుడు అస్వస్థతను నటించి వెనుక చిక్కెను. తుమ్మెదయొకటి వ్రేలిని కుట్టుటచే బాధపడిన సత్యభామయు యోగ మాయా ఉత్సవమునకు పోలేదు. నాయికా నాయ కులు తిరిగికలిసికొనిరి. శ్రీకృష్ణుడు ప్రణయప్రకటనము చేయువేళకు సత్యభామ ప్రత్యక్షమైనది. సత్య భామను శ్రీకృష్ణుడెట్లో అనునయింపజేయుచుండెను. ఈ సన్నివేశము ఫలితముగా కువలాయవళిపై కట్టు దిట్టము లెక్కువయయ్యెను.

కాలయవనుని సోదరుడు శ్రీకృష్ణునిపై ప్రతీ కారబుద్ధితో కువలయావళి మాయచేయుటయు. అంతః పురము సంభ్రాంతమగుట, రుక్మిణీదేవి తనమూలమున నీయకృత్యము జరిగెనేయోయని పశ్చాత్తాపపడుట, చివరకు శ్రీకృష్ణుడు కాలయవన సోదరుని సంహ రించి కువలయావళిని విడిపించుట, కువలయావళిని రుక్మిణి శ్రీకృష్ణునకు సమర్పించుట చతుర్థాంకమున జరిగినవి.

ఇది చిన్నదైనను ముద్దులొలుకు భాషయు కల్పనలుమగల చిన్న రూపకము నాయికను ఆపాయములోపెట్టి, పెద్దరాణికి పశ్చాత్తాపముకలి గించుటకై సంస్కృత నాటికారచయితలు కోతులను, వ్యాఘ్రములను తెచ్చి అవస్థపడుచుందురు సింగ భూపాలుడట్లుకాక, కాలయవన సోదరుని ప్రవేశ పెట్టుట సహేతుకముగా నున్నది.

ఒక లలితసన్నివేశము. కువలయావళి నిరాశో పహతయై దీర్ఘికయందుపడి మరణింప నుద్యోగించును. శ్రీకృష్ణుడామె నా వ్యాపారమునుండి విరమింపజేయ యత్నించును. ఆమె చిత్తరంజనమునకై దిగుడుబావి లోని చక్రవాకములచర్యలు వర్ణించును.

నాయకః (సాకూతమ్) దీర్ఘికాయామిదమేక మవ లోక్యతామ్

*అచర్వణేన విరళీకృతకాండబంధం*
*చంచూపుటే సహచరేణకృతం మృణాళం*
*హాతుం గ్రహీతుమపినేచ్ఛతి చక్రవాకీ*
*దత్తంమయా ధరమివత్వ మధరనేత్రే!*

*కువలయావళీ — సోఽప్యేకోధూర్తః*
*నాయకః — ప్రియే! కిమహమపరోధూర్తః*

సింగభూపాల విరచితమగు రసార్ణవసుధాకర మునకు అలంకారశాస్త్రమునందు ఉన్నతస్థానముకల దని చెప్పుదురు. వ్యాఖ్యాతృచక్రవర్తి. మల్లినాథ సూరి యీ గ్రంథమును ప్రామాణికముగా భావించి దీనిని తన వ్యాఖ్యానములలో పరామర్శించుచుగాం తుము. విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూష ణమువలె దీనియందు సాహిత్యశాస్త్రాంగములన్నియు చేబట్టబడలేదు. త్రివిధమైన అర్థజాతము. ధ్వని నిరూపణము, దోషప్రకరణము. శబ్దార్థాలంకార ములు — వీనిని సింగభూపాలుడెత్తుకొనలేదు. అలం కారశాస్త్రసంబంధమైన పాఠ్యగ్రంథముగ దీని నాతడు నిర్మింపదలచుకొనలేదు. దృశ్యశ్రవ్యకావ్యములు రెం డింటను సమప్రాధాన్యమువహించు రసజగత్తునకే తన వివేచనమును సీమితముచేసెను. కావున శిక్ష కన్న కావ్యానుభూతి క్రమమును విశదముచేయుటయే ఆయన లక్ష్యముగా తోచును.

ఇందు రంజకోల్లాసము. రసికోల్లాసము, భావ కోల్లాసము అను మూడు ఉల్లాసములుగలవు రంజక. రసికోల్లాసములు దృశ్యశ్రవ్యసామాన్యములైనను. సింగ భూపాలునిదృష్టి ప్రధానముగా భావకోల్లాసమనబడు దృశ్యప్రబంధ లక్షణముమీదనే లగ్నమయినట్లు గ్రంధారంభ శ్లోకములవలన దెలియుచున్నది. పూర్వము ఇంద్రాదులు బ్రహ్మదేవునిచేరి దృశ్యము

శ్రావ్యము, ధర్మ్యము మనోరమము ఐన, సర్వ శిల్పప్రదర్శకమై సర్వవర్ణములకు అర్హమైన ఐదవ ఆమ్నాయమును సృజింపగోరిరి. బ్రహ్మదేవుడు నాల్గువేదముల సారముగా నాట్యవేదములు నిర్మించి భరతాచార్యునకిచ్చెను. ఆయనయు ఆయన పుత్రులును దానిని బహుధా విస్తరింపజేసిరి. వారు నానా విధగ్రంథములను రచించిరి. అయినను,

*"తేషామతిగభీరత్వా ద్విప్రకీర్ణక్రమత్వతః।*
*సంప్రదాయస్యవిచ్ఛేదా త్తద్విదాంవిరలత్వతః॥*
*ప్రాయోవిరలసంచారా నాట్యపద్ధతిరస్ఫుటా।*
*తస్మాదస్మత్ప్రయత్నోఽయం తత్ప్రకాశనలక్షణః॥*

ఇట్లు ప్రధానముగ దృశ్యకావ్య లక్ష్యముతోనే సింగభూపాలు డీ రచనకు పూనుకొనెను.

ప్రతాపరుద్రీయమునందు నాటకప్రకరణము చాలచిన్నది. విశ్వనాథుని సాహిత్యదర్పణము రసార్ణవసుధాకరముకంటె ముందె వెలసినట్లు తోచుచున్నది. దీనియందు రూపకలక్షణము కొంత విపులముగనే యున్నది. అయినను సింగభూపాలుడు దానిని అనుకరింపక స్వతంత్రముగ విషయవిభాగమును చేసికొనెను. రసానుభూతి మానసిక వ్యాపారమగుటచే చిత్తవృత్తుల వైభవమును, వైపుల్యమును సింగభూజాని మిక్కిలి శ్రద్ధతో పరికించి, దక్షతతో ఉదాహరణపూర్వకముగ వివరించెను ఉదాహరణములు అతి బహుళసంఖ్యలో పూర్వ మహాకవులనుండి గైకొనబడుటయొక విశేషము. సకృత్తుగమాత్రమే సింగభూవుడు తన స్వీయరచనలనుండి యుదాహృతుల నొసగెను. చిత్తవృత్తుల విశ్లేషణమునందీరాజన్యుడు చూపిన శ్రద్ధకు ఒక ఉదాహరణము. అనుభావము గూర్చి ఇతరాలంకారికులు సంగ్రహముగ చెప్పియుండిరి. సింగభూపాలుడు వీనిని నేర్పుతో విస్తరించి పెక్కు విభాగములుగా వర్గీకరించెను. ఇవి చిత్తారంభములు, గాత్రారంభములు, పౌరుష సాత్త్వికములు, వాగారంభములు, బుద్ధ్యారంభములు అను రీతిని విభాగించి అన్నిటికి మహాకవుల లక్ష్యముల నిచ్చెను.

నాటకమునందు పంచసంధులనుచెప్పి సింగభూపాలుడు "సంధ్యంతరములు" అని వానినిగూర్చి విశేషముగా చెప్పెను. సంధ్యంతరములను భరతుడు సూచించెను. అభినవగుప్తు డామోదించెను. కాని యెవ్వరును ఉదాహరణముల నీయలేదు. సాహిత్యదర్పణకారుడు వీనిను పేక్షించెను. దశరూపక కారుడు వీనిని సంధ్యంగములలో నంతర్భవింపజేసెననియు, అది తనకు సమ్మతము కాదనియు సింగభూపాలుడు స్పష్టముగా వాక్రుచ్చెను. వీనిప్రయోజనము నాతడిట్లు తెలిపెను.

*"ముఖాదిసంధిష్వంగానా మశైథిల్యప్రతీతయే*
*సంధ్యంతరాణియోజ్యాని తత్రతత్త్రైకవింశతిః"*

పంచసంధులను వానియంగప్రత్యంగములను సింగమహీపాలుడు బాలరామాయణము నాధారముగా గొని సమగ్రముగ ప్రపంచించెను. విశ్వనాథుడు వేరుగా విస్తరించిన నాట్యాలంకారములను రసార్ణవసుధాకరము ఆదరింపలేదు. ఉపరూపకములను సాహిత్యదర్పణము విస్తరించి పేర్కొనెను. సుధాకరము వీని నెత్తుకొనలేదు ఇవి యెక్కువగా నృత్తగేయ ప్రధానములు. అప్రధానముగా రసాశ్రయములు. సింగభూపా డీ కారణముననే వానిని ప్రశంసింపలేదేమో ప్రహసనాదిరూపక భేదములను మాత్రము రసార్ణవసుధాకరము పెక్కు ఉదాహరణలతో నాదరించినది. ఆముఖము–ప్రస్తావన–స్థాపన మన్నగు వానిని నిర్వచించుటలో సింగమహీశుని మార్గము మనకు పరిచితమైనవానికంటె భిన్నముగా నున్నది. సాహిత్య దర్పణకారుడు ఆముఖమే ప్రస్తావనయని చెప్పెను.

"ఆముఖం తత్తువిజ్ఞేయం—నామ్నా ప్రస్తావనాపిసా" సింగభూపాలుని మతమున ఆముఖము (1) ప్రస్తావన (2) స్థాపన అని రెండు విధములు. కొంచెము వీధ్యంగములతోగూడి ఆముఖాంగములు కలసి ప్రస్తావన సమస్తమైన వీధ్యంగములతోను ఆముఖాంగములతోను గూడినది స్థాపన. భాసుడు తన నాటకములందు స్థాపనయను పదమునే తరచు వాడుట మన మెరుగుదుము. కాని యాతని స్థాపనలు మిక్కిలి సంగ్రహము. మొత్తముమీద సింగభూపాలుడు స్వతంతముగా రచనచేయువాడు కాని గతానుగతికముగ ఇతరులను అనుకరించువాడు కాడు.

ఇదియట్లుంచి ఈ రాజమౌళియొక్క వితరణాదికమును కనుగొందము. తనను గూర్చి యొకచోట నిట్లాతడు చెప్పకొనెను.

"శ్రీసింగభూపేన కవీశ్వరాణామ్
పిశ్రాణితానేకవిభూషణేన"

రంజకోల్లాసము తుది నొక చమత్కారమైన శ్లోకమున్నది. దాని భావమిది "సింగభూపాలుడు భూసురులకు కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, ఐరావతము మున్నగు వానిని దానముచేయుచుండెను దానములుగ్రహించిన విప్రులు ఆరుగుల పైగూర్చుండి యొండొరులతో నిట్లు ప్రసంగింతురు" "ఓయీ! మీకామధేనువు మాకల్పవృక్షపుటాకులను దినివేయును దానిని కట్టివేయుము! మీయైరావతము మాచింతామణివేదికను దంతములతో పాడిచివేయును. దానిని దూరముగా తిసికొనిపొమ్ము!"

సింగభూలుని గద్య—ఇతి శ్రీమదాంధ్రమండలాధీశ్వర, ప్రతిగండభైరవ, శ్రీ అన్నపోతనరేంద్రనందన భుజబలభీమ, శ్రీ సింగభూపాల విరచితె రసార్ణవ సుధాకర నామ్ని నాట్యాలంకారశాస్త్రే—ఇత్యాది.

# నాచన సోముని నవీన కవితా గుణ [illegible]

శ్రీమతి పాకాల యశోదారెడ్డి

నాచనసోముఁడు రచించినది యుత్తర హరివంశమను నారాశ్వాసముల చిన్న గ్రంథము. అయ్యు నిది కొన్ని శతాబ్దములనుండి మహానుభావులైన కవిపుంగవులెందరికో యొరవడియై వారిరచనలను తీర్చి దిద్దినది.

విమర్శకు లప్పుడప్పుడు మహాకవులు వారి గ్రంథములగూర్చి శ్రవణసుభగములయ్యు రసగుళికలవంటి పద్యమురచించు నెఱజాణయనియు, నలతి యలతిపదముల ననల్పార్థరచన జేయగల సమర్థుఁడనియు, కావ్యమునందచ్చటచ్చట శబ్దాలంకారయుతమైన దీర్ఘసమాసరచన గానవచ్చినప్పటికిని పుస్తకమంతయు దెనుఁగుతనమచ్చొత్తి నట్లుండుననియు నితని కవిత రసభావ ప్రగల్భయైన ప్రౌఢవలె బలుపోకలు పోనేర్చినదనియు ననేకవిధములైన ప్రశంసా వాక్యములు పలుకుట పరిపాటి ఇట్టి ప్రశంసల కన్నిటికి కూడలి పట్టుగ సోముఁడీయుత్తర హరివంశమును రచించినాఁడు.

ఆంధ్రసాహిత్యమునందు సోమునివే చవిచూడబడని మార్గములేదు. నవీనమార్గము లన్నిటి కాతఁడాద్యుఁడు. మనయాంధ్ర భాషయందలి పంచమహాకావ్యకర్తల భావములందుననో, కవిసార్వభౌముల పద్యపు నడకలయందుననో, కవితాపితామహుల రససమీకరణమునందుననో, మఱి వేఱొక మహనీయుని పలుకులపొందికయందో, కాక మఱి వేఱు కొన్ని తావులందో సోముఁడు లీలగ భాసించుచునే యున్నాఁడు. ఇంతటివైభవ ప్రాభవములు కలిగిన సోముఁ డెంతటివాఁడైయుండనోపునని యితని యుత్తర హరివంశమునందలి బిరుదములే సమాధానమును, సాక్ష్యమునిచ్చుచున్నవి, ఇతఁడు భాషాభూషణుఁడట, సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తియట, ఇన్ని బిరుదములధరింప యోగ్యుఁడనని ప్రపంచమునకు చాటుకొల్పుగను, ప్రత్యక్షర ప్రమాణముగ నీగ్రంథమును రచించి తాను సంపూర్ణ కీర్తియైనాఁడు.

సాధారణముగ చెట్టులేనిచోట నాముదపు చెట్టును మహావృక్షమని పరిగణింపవచ్చును గాని

మహారణ్యములుగల తావులందదియొక లెక్కలోనిది గాదు. ఆ విధముగనే దేశమునందలి రాజకీయాది వ్యత్యాసముల వలననో, మఱియే యితర మహోపద్రవముల వలననో సారస్వత సంపద నశింప ఎక్కడడో ఒక పద్యమువంటిది కానుపింపనది రచించినవాఁడు కవి, మహాకవి. కాని సౌభాగ్యవంతమైన ఆంధ్రదేశము నందు. ఆంధ్రుల అదృష్టమువలన, అప్పటికే రెండు మూఁడు శతాబ్దములుగ నాంధ్రభాష యవ్యాకృత మార్గమును వీడి, మహాకావ్య ప్రయోగార్హతను సంతరించుకొని రాజాస్థానములందును, పండిత సదస్సులందును సవిలాసలాస్యము జేయుచుండినది వాగనుశాసనకవి బ్రహ్మోదు లవతరించి గురుపీఠము నధిష్ఠించినారు అట్టిచో సమకాలీనులైన కవిపండితులచే దలలూపింపజేయు కవిత్వమునుజెప్పి, భళిరాయనుపించుకొని బిరుదములొందు టొక సామాన్యవిషయము కాదు. ఇట్టి యసామాన్య ప్రజ్ఞాధురంధురఁడగుట చేతనే సోముఁడు నవీనగుణసనాధుఁడైనాఁడు.

ఇఁక ఇతని నవ్యతయెట్టిది ?

శ్లో॥ త ఏవ పదవిన్యాసా స్తా ఏవార్థవిభూతయః
తథాపినవ్యంభవతికావ్యం గ్రథనకౌశలాత్॥

ఆవిధమున సంప్రదాయసిద్ధయై తరతరములనుండి వచ్చుచున్న కావ్యకళనే మహాపండితుఁడు, లోకజ్ఞుఁడైన సోముఁ డుపాసింప నది యాతనికి వశంవదియై మెలఁగి లోకమునకు నవీనయై కానుపించినది

పూర్వోత్తరభాగములు కలిగిన హరివంశమును సోముఁడు గ్రహించి పూర్తిగ దెనుగించెనని కొందరును, సోముఁడు రచించినది కేవల ముత్తరభాగమని కొందరును భావించుచున్నారు. ఇతఁడు పూర్వ హరివంశమునుగూడ దెనిగించియుండనోపునని భావించువారు. వారి యూహల కాధారముగ గ్రంథాదియందవతారిక లేకుండుటను ప్రధానకారణముగ జూపుచున్నారు. నిజమునకు సర్వకవి సామాన్యమైన గ్రంథావతారికలేక, కావ్యమునకు కృతిస్వామియైన హరిహరనాధుని స్మరణమాత్రముచేతనే కృత్యారంభముగావించుట యనునదీ మహనీయుని నవీనకవితా గుణమున కొక గీటురాయి. కవికుల గురువైన కాళిదాసు సయితము తన కావ్యములం దవతారికలను రచించినట్లుగ కానరాదు ఏప్రభువునకును గృతి నొసఁగక సర్వస్వతంత్రుఁడైన సోమునివంటి ప్రఖ్యాత మహాకవికి కవివంశాదిక విశేషవర్ణనముతోగూడిన యవతారిక యంత వాంఛనీయము గాకపోవచ్చును. అందుకొరకే యీ మహానుభావుఁడు సర్వసాధారణమైన గ్రంథావతారికను వదలి యుత్తరహరివంశమును రచియించి యాంధ్రకవులలో తానొకనవీనమార్గమును ప్రదర్శించినాఁడు.

సాధారణముగ భవభూతి రచించిన ఉత్తర రామచరితమునుగూర్చి చెప్పునప్పుడీ యుత్తర యను విశేషణము కేవలము తరువాతది యనునర్థమునందే గాక ఉత్తమత్వ సూచకమగు శ్రేష్ఠవాచకముగా వాడబడినట్లుగ కొందరు విమర్శకులభిప్రాయపడుచున్నారు. ఆవిధముగనె సోముని గ్రంథనామమైన 'ఉత్తర హరివంశ'మను పదమునుగూడ నాలోచింప నాడువెలసిన హరివంశములందు తన గ్రంథము మేలైనదియగుటచేత ఉత్తరయను పదమునకు శ్రేష్ఠత్వమను నర్థముధ్వనించునట్లుగ తనగ్రంథమున కాపేరుంచి తానొక చమత్కారమును ప్రదర్శించి నవీనుఁడైనాడని తోచుచున్నది.

నిజమునకు సంస్కృత హరివంశమష్టాదశ పురాణపట్టికలో చేర్చబడకపోయినను, శతపర్వ సంవృతమైన భారతమునకిది ఖిలపర్వమైనను, విష్ణు పారమ్యమును బోధించు ప్రధానగ్రంథమనియె చెప్పవచ్చును. వైష్ణవమతమున కాయువుపట్టువంటి హరివంశము నాధారముగ స్వీకరించినప్పటికి నితఁడు ప్రజ్ఞ గోలుపోలేదు కేవలము తన గ్రంథమును హరి

హరనాథున కంకితము చేయుటచేతనేగాక హరివంశము నందలి యుపాఖ్యాన స్వీకృతిచేతను తన సర్వజ్ఞత్వ మును లోకమునకు గనబరచినాఁడు.

హరివంశమునందలి పూర్వభాగము సృష్టిస్థితి, పూర్వరాజవంశవర్ణన, శ్రీకృష్ణ జననాదిబాలక్రీడలచే వెల్లితమగుచు కృష్ణాధిక్యమును సూచించు సన్నివేశ ములతో పూరింపఁబడినది. కేవలము విషయనివే దన మాత్రమున కుపకరించు నీ పూర్వభాగమును విశిష్టప్రయోజనమును కాంక్షించు నీ మహాకవి స్పృ శింపలేదు. ఇఁక ఉత్తరభాగమునుండికూడ అన్ని కథలను స్వీకరింపక. రసోపస్కారకములును, రమ్య ములును. శివకేశవా భేదము నిరూపించుటకనువై, యద్వైతసిద్ధాంత ప్రతిపాదకములైన కొన్నికథలను మాత్రమె స్వీకరించి కాంతాసమ్మితోపదేశ ప్రతిపాదక మైన తన మహాకావ్య ప్రయోజనము నతిమనోహర ముగ సాధించినాఁడు. నాటి సంఘమునందు నూతన మతమునకు గురుప్రాయుఁడై రాబోవు తరమునకు రాచబాట వైచినాఁడు.

ఉత్తరహరివంశమునందలి శ్రీకృష్ణుఁడు దుష్ట సంహార శిష్టరక్షణముల నొసరించు దేవదేవుఁడు. ఇట్టి శ్రీమహావిష్ణ్వవతారమైన శ్రీకృష్ణుఁడు, శూరులు. వరగర్వితులు. శివకేశవ భేదభావులైన, దుష్టమానవ రాక్షసాదులను సంహరించు వీరావతారముగ చిత్రించి నాఁడు. స్థూలముగ పరిశీలింప నరకాసురాది రాక్ష సులును, హంసడిభకాది రాజేంద్రులు నొక్క కరువు లోనివారుగ కానుపింతురు. కాని సూక్ష్మపరిశీల నముచేత జగద్ధితమును కాంక్షించి లీలావతారుఁడైన శ్రీకృష్ణుఁడు వేరువేరు కారణములవలన వీరినిశిక్షించి నట్లుగ గోచరించుచున్నది.

నాచన సోముని యుత్తరహరివంశమునందు శ్రీకృష్ణునిచే శిక్షింపఁబడినవారు నరకుఁడు, పౌండ్రక వాసుదేవుఁడు, హంసడిభకులు, బాణాసురుఁడను వారలు. వీరిలో నరకుఁడు బల్లిదుఁడైన రాక్షసకులా భరణము. ఇతఁ డంభోరుహాసనుచేత లబ్ధవరుఁడై స్వర్గంబుపై దాడివెట్టి. సురబలము నిట్టట్టుపడవైచి, దిక్పాలురతోగూడ దేవేంద్రుని దిశాపట్టంబుగావించి అదితికుండలంబులు తన శ్రీవోలంకారములుకాగా స్వర్లోకమునేలిన మేటివీరుఁడు. అయ్యును మునిగణ మానససరోవరముల గలచిన కారణమున శ్రీకృష్ణుచే నిహతుఁడైనాఁడు. అప్పుడు నరకాసురుని తల్లియైన వసుంధరకృష్ణుమ్రోల నిలచి

*"అట్లేల జగములన్నియు*
*బుట్టింపం చెంపఁ ద్రుంపఁబురుషులుముగురై*
*పుట్టినవేలుప వట నా*
*పట్టియెడందగునె నడిమిపనిమానుటకున్"*

అని ప్రశ్నించియు తానె సమాధానముగ *"కాల పాకము దప్పింపలేముగదా"* యని కర్మసిద్ధాంతము నకు ప్రాధాన్యమునిచ్చి యూరటచెంధినది. ఈపద్య మును పురస్కరించుకొని చూడ శ్రీకృష్ణుఁడు కేవలము యాదవుఁడైన కృష్ణుఁడుకాక త్రిమూర్త్యాత్మకుఁడైన పరమేశ్వరుఁడని లోకమునకు వసుంధర ద్వారమున చాటినాఁడు సోముఁడు

ఇఁక పౌండ్రకవాసుదేవుఁ డితడు కేవలము బాహాశ్శక్తికలిమియై గర్వితుఁడై, ప్రభావహీనములు. మానవనిర్మితములైన ఆయుధములనే చపడవుని మహామహిమోపేతములు సహజజన్యములైన, నందక, పాంచజన్య, శార్ఙ్గకౌమోదక సుదర్శనములకు సరి జోదులని ప్రల్లదంబున మిడిసిపడినాఁడు. అట్టి అత్యల్పబుద్ధిని, దుర్మదాంధుని, శౌర్యోపేతు నుపే క్షించుట లోకవ్యవస్థను భద్రపరచు జగన్నాథునకు పాడిక్షాదు. అందునకే

*"ఏనుంగులాగు పందికి*
*మానిసిచందంబు నిరుమానిసికి నగుం*
*గాని గుణంబులు గలుగవు*
*పూనకు చక్రంబు చక్రిపూనగనెదురన్"*

అని దేవమునిచేత హితవుగఱపింపఁజేసి చివరకు శిక్షితుఁగావించినాఁడు.

హంసడిభకులు పార్వతీపతింగూర్చి తపమొన రించియు నాదేవునిమూలమున వరదానంబులు వడ సియు ముంగొంగు బంగారమైయుండు శ్రీకృష్ణు నాంతర్యమెరుఁగలేక యుద్ధతులై దూరువడిసినవారలఁ గూర్చి దుర్వాసుఁడు

*"హరుఁడు వరమిచ్చె వాణి*
*వరవరుణ కుబేర సురప వైవస్వతు లి*
*త్తురుగాక నీవు గినిసిన*
*వరముల గినియులను బ్రదుకువారే కుమతుల్"*

అని వారి మృత్యువునకు కారణము సూచించినాఁడు.

బలితనయుఁడైన బాణాసురుఁడు చంద్రశేఖరు నుగ్రతపమొనరించి యాదేవుని మెప్పించి తానిని కరుణవడసి కార్తికేయ, పర్వతకన్యా స్థాణులు పొత్తున మనగా దనుజశోభనకరుఁడై శోణిత నగరమును బాలించియు తనియక చేతులకసివోఁ గయ్యమును కాక్షించిన కారణమున శ్రీకృష్ణునిచే శిక్షితుఁడైనాఁడు.

*"తమచేసిన దుష్కృతములు*
*తముజెఱచుంగాక వేఱు తడవంగలదే*
*తమచేసిన సుకృతంబులు*
*తముగాచును రెండునేల దైవంబునకున్"*

బాణాసురాభవమునకు కారణమును మంత్రియైన కుంభాండుఁడు మొదటనే యూహించినట్లుగ పాఠకు లకు తెలియచేసినాఁడు సోముఁడు

శ్రీకృష్ణదేవుఁడు రక్షించినవారిలో ఘంటా కర్ణాదిపిశాచములు, మృతశిశువులపొందిన బ్రాహ్మ ణుఁడు ముఖ్యులు. సకలసౌభాగ్యములుకలిగియు మృత్యువు పురిటిలోనె బిడ్డలను పొట్టనుబెట్టుకొన బిడ్డలుబేసి బ్రతుకు లేబరమని చింతించి యీసారి గర్భమునైన గావుమని శ్రీహరిని బ్రార్థించినాఁడు. జగన్నాటకసూత్రధారి యజ్ఞదీక్షితుఁడై పోలేనికారణము గల్పించి పార్థునిబంప జము నెదిరింపలేక పార్థుఁ డపార్థుఁడుకాగా, విప్రుఁడు

*"ఓ పార్థ! నిన్ను నమ్మితి*
*బాపనిరక్షింప కిట్లపార్థుఁడవైతే*
*నాపాలి పారిజాతము*
*గోపాలకచక్రవర్తిఁ గొనిరానైతిన్"*

అని చింతించియు తిరిగి

*"పాఱెడుబండ్లకు కాళ్లుచాపగా*
*నలవడునన్నపోటుమగఁడైయిటువేసితిగాకయాసతో*
*నిలుతు మురారి నన్నుచటు నీరులముంచిన పాల*
*ముంచినన్"*

అను మాటలలో కేవలము బాహువిక్రమముచేత నరుఁడు మృత్యువు నెదిరింపలేఁడనియు నయ్యది కేవలము సృష్టి, స్థితి, లయకారుఁడైన శ్రీమహావిష్ణువు నకే సాధ్యమని తోపింపఁజేయుచున్నాఁడు.

ఇఁక ఘంటాకర్ణుఁడకుటిలమతియై విప్రమాంస మును పునుక పాత్రికలోన గఱిగిపెట్టుచు, కృష్ణున కర్పిత మనుచు

*"మత్ప్రీతిచేసి నన్నేలుకొనుము*
*భక్తిగాని నీకేమియు బ్రాతిగాదు"*

అని యర్పించిన నా మురారి యావేదురుజూచి నవ్వి నాఁడట. ఇచట లోకమునందొకతెగ యందుండు అకలంకమైన భక్తిప్రాభవమును అమాయకతను కన బరచి ఆస్తికమైన లోకవ్యవస్థను బహుముఖముల ప్రకాశింపజేయుట కిదియొక సుందరసన్నివేశము గల్పించినాఁడు.

కవిబ్రహ్మయైన తిక్కన ప్రారంభించిన హరి హరాద్వైత తత్త్వము నాచనసోముని ద్వారమున ప్రత్యక్షప్రమాణమై వ్యాప్తిగాంచినది

శివకేశవులిద్దరొకచో వేంచేసినప్పుడు వారిరు వు రభేదబుద్ధితో మెలగి, యొకరినొకరత్యంత గౌరవ భావముతో సంభావించుకొనునట్లుగ చూచి

"ఇత్తెఱఁగున నయ్యిరువుర
చిత్తముగతి నొడలుఁగలసి సిద్ధాంతపరా
యత్తులగు మునుల యెఱుకకు
విత్తై వెలువారె జమిలివేల్పని తెలుపన్॥

సిద్ధాంతపరాధీనులైన మునుల బుద్ధికే తెలిసినదియై యీ హరిహరనాథతత్త్వము జమిలివేల్పుగ దీపించిన దట. సిద్ధాంతమును కేవలసిద్ధాంతరూపము సందుంచుటయేగాక, రెండుతత్త్వముల కాయువువట్టైన ఇద్దరు దేవతల కలయికతో హరిహరనాథాత్మకమైన జమిలి వేల్పును రూపింపజేసిన సర్వజ్ఞుఁడైన సోముని నవ్యత నెంతని కొనియాడగలము!

ఈవిధముగ సోముఁడు మతతత్త్వవిషయ ప్రతిపాదనమందును, కథాసంగ్రహణ సంవిధానము నందును, గ్రంథప్రారంభమునందును నూతనత్వమును ప్రదర్శించుటయేగాక, భాషయందు, భావప్రకటనమునందు, ఆలంకారికమై కాదంబరిని తలపింపజేయు వచనరచనమునందు, అనేకవిధములై శ్రుతిసుభగములైన అనుప్రాసాది శబ్దాలంకారములను వాడుటయందును, ఇదియని చెప్పక శృంగారమునందలి యనేక యంతరములను సుకుమారముగ పొడగట్టజేయుచు కావ్యమును నడుపుటయందును నతఁడుపోయిన పోకడలు ఆనందదాయకములు, ఆశ్చర్యజనకములు, అనన్యసాధారణములు.

యుద్ధవర్ణనముల గావించునప్పుడు, ఆ యా బలములు దాడివెడలిన విధానము ననుసరించియే రాబోవు జయాపజయములను సూచించుట సోముఁడు చూపిన నవీనగుణము. సాధారణముగ శుభోదర్కమైన దానిని ప్రదక్షిణక్రమముగ చెప్పుటాచారము. ఆవిధముగనే రఘువంశములో కాళిదాసు రఘువు దిగ్విజయ సందర్భమున

"స యయౌ ప్రథమం ప్రాచీం తుల్యప్రాచీనబర్హిషః"

అని ప్రదక్షిణక్రమమున వర్ణించిన విషయమునే సోముఁడు ఉత్తరహరివంశమున, నరకుఁడు విజృంభించి స్వర్లోకముపై దాడివెడల దేవతలయ్యును కాల ప్రభావముచేత మతిదప్పివచ్చిన "వచ్చె యశగుహ్యకులతో వైశ్రవణుఁడు" అని దేవతల దండును అప్రదక్షిణక్రమమున వర్ణించుటచేతనే కలుగబోవు నవ జయమును సూచించినాఁడు

ఆవిధముగనె సర్వాలంకార శోభితుఁడైన మన్మథుని కైసేతను వర్ణించునప్పుడు అగ్నిసంబంధముగ (వచనము ఆశ్వా. 2. పు. 84) వర్ణించి రాబోవు కామదహనమును సూచించినాఁడు. కావ్యమునందిది యొక నవీనగుణము.

సాధారణముగ గంభీరమైన విషయములను రచించునప్పుడు హాస్యమునకు తావుండదు. కాని లోకవృత్తమును దెలుపుట కొకసారి మహాకవి దానిని చేబట్టి నవ్యతను కనబరచును. సర్వసంగపరిత్యాగులు, శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వములులేనివారుగ నుండవలసినవారు ఋషులు. అయ్యును మానవులే నని జూపించుటకును, ఎదుటివారెంతటి మహానుభావులు, వందనీయులైనప్పటికి నాయా సన్నివేశముల వలన హాస్యముత్పన్నమగునను మానవస్వభావ నైజము గనబరచుటకు నుదాహరణముగ సోముఁడు రాక్షసులచే బాధింపబడినప్పటి ఋషులయవస్థను

'జడలు కంపలువట్టి జరుగనికున్నచో
విడిపింప కిమ్ముల వెదకువారు"

అను పద్యమున చిత్రించి రాబోవు కవులు హాస్యరస పోషణమున వైవిధ్యమును కనబరచుటకు తావునిచ్చినాఁడు.

కావ్యములందు నాటకోచితమైన పరిభాషను వాడుటకును, ఆంగికాదులైన యభినయముల ప్రవేశపెట్టుటకు నితఁడాద్యుఁడు. ఇదొక నవీనగుణము.

ఉదా : కినుకం దెచ్చి ఘటింపఁజూచు
జయలక్ష్మీనిత్య నైపథ్యమున్

ఇచ్చట నైపథ్యము = వేషరచన.

ఇఁక ఊర్వశినిజూచిన నరకుని చేష్టాభినయము ను గనుఁడు.

*"దనుజేంద్రుఁడాతలోదరి*
*గనుగొని చొల్లెంబు నియుద్గ్రగమ్మునబైకొం*
*గనుపుబఱచు గేదఁగిరే*
*కు నఖంబులఁ జాఱుగులుకుఁ గోయ్కలదేలున్"*

శాస్త్రాదులందపారమైన పాండిత్యము కలిగిన సోముఁడు తర్కశాస్త్రాదులం దుపయోగించు పారిభాషికపదములను గ్రహించి కావ్యములందు చొప్పించి కావ్యమునకొక యపురూపసౌందర్యమును, నూతనత్వము గల్పించినాఁడు. ఉదాహరణమునకు నరకుఁడు శతమఖుగెల్చి యమరపురియగు నమరావతిఁ [illegible] నాపురంబు నిత్యశోభనంబుల గోలుపోయి కనుపట్టు నరకుని మానసికస్థితిని

*"కదళికామకూలంబులు, గంపమాన*
*చమరవాలంబులును లేని చంద్రశాల*
*లును గనుంగొని ప్రమదకల్లోల లోల*
*మానసుండయ్యె దిక్పాలమర్దనుండు"*

అని తర్కశాస్త్రమునందు నిశ్చయజ్ఞానము అనుదానికి ప్రమ అను పదమును స్వీకరించి తన పద్యమున నిమిడ్చి నవ్యతను ప్రదర్శించినాడు.

ఈవిధముగనె దేశీయములైన రెండు వేర్వేరు పదములనుండి ఏకపదమును సృష్టించుటయందిత డుద్దండుఁడు ఉ: సమరాంగణమునుండి వైదొలఁగిన వైవస్వతునిగూర్చి దానవులు "ఇట్టికసూడని వాఁడో, యొట్టిడుకొన్నాడో" యని పరిహసించినారట. ఇట్టికము=లజ్జ, సూడుట=కాల్చుట. ఈరెంటిని జతపఱచి లజ్జను విడచినాడు, లజ్జానిరహితుఁడను నర్థమున నుపయోగించినాఁడు.

గదాధర :— ఇయ్యది అసాధారణముగ కనబ్పట్టు కృష్ణసంబోధన. కాని గది యనునది కృష్ణుని బిరుదము. పంచాయుధములందిది యొకటి. భాగవతములో బలిచక్రవర్తి పాతాళగృహమునకు కావుగ శ్రీమహావిష్ణువు గదనుధరించియే యున్నట్లుకలదు "గదాధరఃభోక్తా" అని శ్రాద్ధమంత్ర సందర్భములందు గానవచ్చుచున్నది. అట్టి పదమునే గ్రహించి సందర్భశుద్ధిం నుపయోగించి తాను నవీనగుణుడైనాడు.

ఇఁక సాధారణముగ నాంధ్రమునందు కవులెవ్వరును వాడని జాతీయములను, జనబాహుళ్యమునందు వేర్లూనిన సామెతల నుపయోగించి ప్రతిపద్యము నూతనమై గానుపించునట్లు సింగారించిన సోముని ఎంతకీర్తించినను తనివితీరదు. ఇంతవరకే మహామహులు తరచితరచి విడిచిన విషయమిది. దానిని నేను స్వీకరించి వ్రాయుట నిజమునకు సాహసమే అయ్యును వ్రాసినదానియందలి తప్పొప్పులను విజ్ఞులు సరిచూతురుగాకయని మనవి.

# మల్లినాథసూరి వ్యాఖ్యావైభవము

శ్రీ జటావల్లభుల పురుషోత్తము

నైషధపష్ఠములైన కావ్యములను పఠించి పూర్వులు చక్కని సాహిత్యమును సంపాదించుకొనుటయేకాక విస్తృతసంస్కృతి నలవఱచుకొని పండితులుగ గణుతికెక్కెడివారు. నేడు ఆ కావ్యములనే వివిధపరీక్షలకు చదువువారి కట్టి తేజస్సు కల్గుటలేదు. ఈభేదమునకు కారణ మేమనఁ: మల్లినాథవ్యాఖ్యాసహితముగానే కాని కావ్యములను పఠించునాచారము పూర్వములేదు. నేడు మల్లినాథవ్యాఖ్య యుపేక్షింపబడుచున్నది. ఇంతభేదమునకు వ్యాఖ్యయే కారణమనుటయు సాధారణముగా నమ్మదగిన విషయము కాదు కాని మల్లినాథవ్యాఖ్యా వైశిష్ట్యమట్టిది.

అన్వయములోను, అర్థనిర్ణయములోను విశదవైఖరి నవలంబించుటయేగాక సందర్భానుసారముగా నిఘంటువుల నుదాహరించుటలోను అలంకారలక్ష్యలక్షణ సమన్వయము గావించుటలోను, తాత్పర్యవివరణమునకై శ్రుతిస్మృతి పురాణనీతిశాస్త్ర జ్యోతిష వైద్యాది సమస్త విద్యలనుండియు సందర్భశుద్ధిగా వచనముల నుల్లేఖించుటలోను, శ్లేషాదిగుణములను, వ్యంగ్యవైభవమును, సమస్తకావ్యసంపదను ప్రస్ఫుటముగా ప్రదర్శించుటలోను, అన్యూనాతిరిక్తముగా రమ్యమైన ధోరణిలో కవిహృదయమును వ్యాఖ్యానించుటలోను మల్లినాథుడు తనకు తానే సాటి. సమస్తవిద్యలలోను నాతనికిగల సునిరూఢప్రజ్ఞ. సమయస్ఫూర్తి లోకోత్తరములు

కొన్ని యుదాహరణములతో నేతద్వ్యాఖ్యావైభవమును పరికింతము.

## శ్రుతులు

వేదపరిజ్ఞానమున్ననేకాని యన్వయింపని పట్టులు కావ్యములలో నెన్నియో కలవు. అప్పట్ల మల్లినాథుడు వ్యవహరించిన తెఱఁగును చూతము.

యజ్ఞమునకు దక్షిణవలె దిలీపునకు సుదక్షిణ పత్నిగా నుండెనని కాళిదాసు చెప్పినాఁడు యజ్ఞమునకు దక్షిణ భార్య యనుటకు వేదప్రామాణ్యమును

మల్లినాథుడు చూపును. "యజ్ఞో గంధర్వ స్తస్య దక్షిణా అప్సరసః" "తే దక్షంతే దక్షిణాం ప్రతి గృహ్య" అను శ్రుతివాక్యముల నెంతయో సందర్భ శుద్ధితో నాత డుదాహరించినాడు

హిమవంతునకు దేవతలతోపాటు యజ్ఞభాగము కల్పింపబడినదని కాళిదాసు కుమారసంభవములో చెప్పినదానికి మల్లినాథుడు శ్రుత్యాధారమును కన్పఱచుచు "సోమస్య రాజ్ఞః కురఙ్గ ఇందోః శృఙ్గీ సింధోః శింశుమారో హిమవతో నాస్తి" అను వచనము నుదాహరించినాడు.

ఇంద్రుడు మన్మథుని పిలిపింపగా మన్మథుడు "ఏ యేకపత్నిని నీకు స్వాధీనము చేయుదును ?" అని ప్రశ్నించును. ఆసందర్భమున గన్పట్టు నీ ప్రశ్నను సమర్థించుచు మల్లినాథుడు "అహల్యాయై జార" యను శ్రుతివాక్యము నుదాహరించినాడు. మల్లినాథుడు వేదమును జిహ్వాగ్రమందుగలవా డనుట స్పష్టము.

"జాయా ప్రతిగ్రాహిత గంధమాల్యాం" అను చోట కవి సుదక్షిణాదేవిపట్ల భార్యాది శబ్దములను వాడక జాయాశబ్దమును ప్రయోగించినాడు. దీని సారస్యమును శ్రుత్యాధారముచే మల్లినాథుడు నిరూపించినాడు. త్వరలో సుదక్షిణాదేవి కుమారుని కనునను భావము జాయా శబ్దమువలన స్ఫురించును. జాయాశబ్దము 'జని ప్రాదుర్భావే' యను ధాతువునుండి వచ్చినది. పురుషుడు పుత్రరూపమున తానే భార్యనుండి జనించుచున్నాడు. కావున నామె జాయయగుచున్నది. ఐతరేయబ్రాహ్మణములోని యీక్రింది వాక్యమును మల్లినాథు డుదాహరించి సుదక్షిణ జాయ కాబోవుచున్నదను ధ్వనిని మనకు చూపినాడు.

"పతి ర్జాయాం సంప్రవిశతి
గర్భోభూత్వేహ మాతరం
తస్యాం పునర్నవో భూత్వా
దశమే మాసి జాయతే
తజ్జాయా జాయా భవతి
యదస్యాం జాయతే పునః"

## ధర్మశాస్త్రము

కుమారసంభవములో మైనాకజన్మమును పేర్కొనుటలో కాళిదాసునుద్దేశము మల్లినాథునిచే నిట్లా విష్కరింపబడినది. పార్వతికి సోదరుడున్నట్లు చెప్పనిచో పెండ్లికుమార్తె కానున్న పార్వతి కది యొక లోపమగును అభ్రాతృకన్యను వివాహమాడ రాదను స్మృతి వచనమున్నది.

"యస్యాస్తు నభవే ద్భ్రాతా
నవిజ్ఞాయేత వా పితా
నోపయచ్ఛేత తాంప్రాజ్ఞః
పుత్రికా ధర్మశంకయా"

అను మనువచనమును మల్లినాథు డుదాహరించి యుండనిచో మైనాకప్రసంగ మప్రస్తుత ప్రసంగమని మనకు తోచియుండును.

శివునివంటి భర్తయు, అట్టి ప్రేమయు తపస్సువలన లభింపవలయునుగాని మరెట్లు లభ్యమగును ? అని కాళిదాసు చెప్పగా మల్లినాథుడు అసాధ్యముగా గన్పట్టు దానిని సాధించుటకు తపస్సొక్కటియే సాధనమను మనువచనము నుదాహరించుటచూడ సరిగా నెక్కడ నే ప్రమాణవచనము నుదాహరింప వలయునో నిర్ణయించుకొనుటలో నాతడు సిద్ధహస్తుడని స్పష్టమగును.

దిలీపమహారాజు సర్వతేజోభిభావిగా నున్నాడని కాళిదాసు వర్ణించినాడు. ఎంత సూటియైన స్మృతివచనము నుదాహరించి మల్లినాథుడు దీనిని వ్యాఖ్యానించినాడో చూడదగును.

"అష్టాభిశ్చసురేంద్రాణాం
మాత్రాభిర్నిర్మితోనృపః
తస్మా దభిభవ త్యేషః
సర్వభూతాని తేజసా"

వ్యాఖ్యాత అనేకులు ప్రమాణగ్రంథములలో నుండి వచనముల నుల్లేఖించుట కలదు. కాని మల్లినాథుడుదాహరించినన్ని శాస్త్రములను కాని, అంత సూటిగా కాని యుదాహరించినవారు లేరు.

"జ్ఞానే మౌనం క్షమా శక్తౌ" అను దిలీపవర్ణనమును సమర్థించుచు 'శక్తానాం భూషణం క్షమా' అను చాణక్యవచనమును, "త్యాగే శ్లాఘావిపర్యయః" అనుదానిని సమర్థించుచు "న దత్వా పరికీర్తయేత్" అను మనువచనము నుదాహరించినాడు. ఇట్టివి పెక్కులు కలవు

మరొక అద్భుతసందర్భము పరికింప దగియున్నది. సుదక్షిణాదేవియు దిలీపమహారాజును వసిష్ఠాశ్రమము చేరిరి. అపుడు వసిష్ఠమహాముని అగ్నిహోత్రానుష్ఠానములో నుండెను. అనుష్ఠానము ముగియగనే దిలీపుడు భక్తిపూర్వకముగా నమస్కరించెను. ధర్మశాస్త్ర సంస్కారపరిణతుడైన మల్లినాథుడు కవి యీరీతిగా చెప్పుటకుగల ధర్మశాస్త్రసంబంధమైన కారణమును చూపుచున్నాడు. జపహోమాద్యనుష్ఠానములో నున్నవానికి నమస్కారము చేయరాదను మనుస్మృతివచనమును మల్లినాథు డుదాహరించినాడు.

*"జపం హోమం చ కుర్వాణో*
*నాభివాద్యో ద్విజో భవేత్"*
*"ఇత్యనుష్ఠానమధ్యేఽభివాద నిషేధాత్"*

అని మల్లినాథుడు వ్యాసియుండనిచో మనము అనుష్ఠానవిఘ్నము కల్గింప నిచ్ఛలేనివాడై దిలీపుడు తాళి నాడని భావించియుండెడివారము. దేవతాసేవలో నున్న వాడు అభివాదమును స్వీకరించుట దేవతాపచారమను మహత్తరభావమును మల్లినాథుడు చూపినాడు.

నడుచుచున్న గోవుల పాదములవలన రేగిన పరాగము శరీరమునకు తగులుటచే దిలీపునకు తీర్థాభిషేకశుద్ధి కల్గినదని కాళిదాసు నుడివినాడు, గోరజః స్నానము వాయవ్య తీర్థాభిషేకమనియు, భస్మలేపనము ఆగ్నేయస్నానమనియు, జలమజ్జనము వారుణస్నానమనియు, ఆపోహిష్ఠేతిమార్జనము బ్రహ్మస్నానమనియు తెల్పుస్మృతివచనమును మల్లినాథు డుదాహరించినాడు.

*"ఆగ్నేయం భస్మనా స్నాన*
*మవగాహ్యంతు వారుణం*
*ఆపోహిష్ఠేతి చ బ్రాహ్మ్యం*
*వాయవ్యం గోరజః స్మృతం"*

ఈరీతిగా మల్లినాథుడు తన శాస్త్రజ్ఞానముచే వ్యాఖ్యానమునకు తేటనిచ్చినాడు.

## సంగీతము

నేడు మల్లినాథ వ్యాఖ్యలో కావ్యములను పాఠముచెప్పు విద్వాంసులు సంగీతశాస్త్రమునకు సంబంధించిన యంశములను అజ్ఞాతములనియో, అప్రధానములనియో త్రోసివేయుచుందురు. మల్లినాథున కజ్ఞాతవిషయమే లేదనిపించును. అప్రధానములుగ గన్పట్టున వెన్నియో వాస్తవముగ నెంతప్రధానములుగా నుండుట కవకాశమున్నదో యాతడు మనకు చూపుచుండును.

'*ఉద్గాస్యతా మిచ్ఛతి కిన్నరాణాం*' అను చోట ఉదుపసర్గప్రయోగమునకు మల్లినాథుడిటు సార్థకతను చూపును. గాంధారగ్రామముచేత మాత్రమే దేవతలు గానము చేయుచుందురని సంగీతశాస్త్రములో నారదోక్తి "*ఉద్గాస్యతాం దేవయోనిత్వా—దుచ్చై ర్గాంధారగ్రామేణ గానం కరిష్యతాం—ఉక్తంచ నారదేన:*

*"షడ్జమధ్యమ నామానౌ*
*గ్రామౌ గాయన్తి మానవాః*
*నతు గాంధార నామానం*
*స లభ్యో దేవయోనిభిః"*

అట్లే "*షడ్జసంవాదినీః కేకా ద్విధా భిన్నా శిఖండిభిః*" అనుచోట కేవలద్విధాభిన్నత్వమును

షడ్జ సంవాదినీత్వమును శాస్త్రప్రమాణ వచనములచే నీవ్యాఖ్యాత వివరించినాడు.

## వైద్యశాస్త్రము

బహుశాస్త్ర బరిచయముగలవారికే మాత్రమే గోచరింపగల ధ్వనులు కొన్ని కాళిదాసాది మహాకవులలో గలవు వానిని పైకి తీయగల ప్రతిభ మల్లినాథున కుండుటయు, అట్టి సునిశితబుద్ధి నుండియు, బహుముఖపాండిత్యమునుండియు వెలువడిన యాయన వ్యాఖ్యానములు వెనుకటి వ్యాఖ్యానములవలె అంతరించిపోక నేటికిని నిలిచి ప్రచారములో నుండుటయు మన మహాభాగ్యము.

గర్భిణియైన సుదక్షిణ కోరినదానినెల్ల రాజు కూర్చెనని కాళిదాసు చెప్పెనాడు హితాహితముల నాలోచింపక యిట్లు భార్యావశుడగుట స్త్రీ లౌల్యమను దోషముకాదా యన మల్లినాథుడు కాదని యిట్లు సమర్థించును. గర్భిణీవాంఛాపూరణము న్యాయము. దీని కనుగుణమగు వైద్యశాస్త్రవచనమును మల్లినాథుడు కనబఱచినాడు.

వైద్యశాస్త్రమునకు సంబంధించిన యీక్రింది ధ్వనిని చూడదగును: మేఘసందేశములో యక్షుడు మేఘునితో నిట్లనును "నీ వా పర్వతముమీద వర్షించి వనగజమదముచే పరిమళింపజేయబడిన నీటిని త్రాగి తిరిగి బయలుదేరుము. అప్పుడు బరువుగలవాడవైనందున వాయువు నిన్ను కదల్ప జాలదు." వాతరోగికి ముందుగా వమనము చేయించుటయు పిమ్మట బాధకలుగకుండుటకై వానిచే చేదుకషాయమును త్రాగించుటయునను వైద్యప్రక్రియ ఇచ్చట ధ్వనితమని నుడువుచు మల్లినాథుడు దానికి సంబంధించిన వాగ్భటశ్లోకముల నుదాహరించినాడు. తిక్త శబ్దమునకు "పరిమళము" గల అనియు, "చేదైన" అనియు రెండర్థములకు నైఘంటికాధారముకలదు. ఎక్కడనో వైద్యగ్రంథములలోనున్న శ్లోకములనంత సందర్భశుద్ధిగా నుదాహరించి శ్లోకసారస్యమును ప్రదర్శింపగల యీ వ్యాఖ్యాత అదివరకుండిన వ్యాఖ్యానముల నాచ్ఛాదించెననుటలో నాశ్చర్యములేదు.

"పర్వతముమీద జాలపై కొట్టుకొనుచు ప్రవహించు లఘూదకమును సేవింపుము" అనుచోట మల్లినాథుడు జాలపైని కొట్టుకొనుచు ప్రవహించునీరు లఘువుగా నుండునని యనుటకు వైద్యశాస్త్రమునుండి ప్రమాణవచనములను చూపినాడు

"ఉపలాస్ఫాలనక్షేప
విచ్ఛేదైః ఖేదితోదకాః
హిమవన్మలయోద్భూతాః
పథ్యా నద్యో భవన్త్యమూః"

ఈరీతి వ్యాఖ్యానములను మల్లినాథునివంటి సకలశాస్త్రపండితుడేకాని రచింపజాలడు

## జ్యోతిషాది శాస్త్రములు

రఘువు పంచగ్రహములుచ్చలో నుండగా జన్మించెను ఇది రఘువునకు దేవత్వమును సూచించునని మల్లినాథుడు కృష్ణీయమను జ్యోతిష గ్రంథమునుండి ప్రమాణమును చూపినాడు

"అభ్యున్నతాంగుష్ఠ నఖప్రభాభిః" ఇత్యాది శ్లోకములో పార్వతిపాదములు వర్ణింపబడినవి. అట్టి పాదములుగల బాలిక నృపతిసమ్మితురాలగు ననుటకు సాముద్రిక శాస్త్రశ్లోకములను మల్లినాథు డుదాహరించినాడు.

ఇందుమతీ స్వయంవరములో ఒకరాజు చేతితో లీలారవిందమును త్రిప్పెను. ఇందుమతి యతని నెంచుకొనక మరొకరాజునొద్దకేగెను ఎందువలననో కాళిదాసు చెప్పలేదు. మల్లినాథుడు శకున సాముద్రికాది శాస్త్రములలో మహావిద్వాంసుడైనందున నిట్టిపట్ల కాళిదాసాభిప్రాయమును వ్యాఖ్యానింపగల్గినాడు. "హస్తఘూర్ణకత్వమపలక్షణ"మని మల్లినాథుడు స్పష్టపఱచినాడు.

మతౌకరాజు శత్రురాజులను నాశనముచేయుధు నని తెలుపుటకు కాలు నేలరాచెను. పాదోల్లేఖనము లక్ష్మీవినాశకమని మల్లినాథుడు వివరించినాడు.

మెలకువతో వ్యాఖ్యానించి మల్లినాథుడు మెరుగు పెట్టిన ఘట్టము లసంఖ్యాకములు.

యక్షుడు భార్యకు సందేశమును పంపుటలో "స్వప్నములో కన్పట్టిన నిన్నాలింగనము చేసికొనుటకు నేను బాహువులను సాచగా నన్నుచూచి జాలిపడు దేవతలు కార్చు కన్నీరు చెట్లచిగుళ్లపై బడుచున్నది" అని చెప్పెను.

దేవతల కన్నీరు చెట్లచిగుళ్లపై పడుచున్నదని కాళిదాసెందులకు చెప్పెనో మల్లినాథుడు వివరించినాడు. దేవతల కన్నీరు నేలపైబడుచో అపశకునమనియు, యక్షుడు శాపాంతములోగా మరణించునను భయము దానివలన నాతనిభార్యకు కల్గుననియు ఆ భయమును వారించుటకై దేవతల కన్నీరు తరుకిసలయములందు పడుచున్నదని చెప్పనడినదనియు మల్లినాథుడు వ్యాఖ్యానించుచు నీ క్రింది నిమిత్త శాస్త్ర శ్లోకము నుదాహరించినాడు.

"మహాత్మ గురుదేవానా
మశ్రుపాతః క్షితౌయది
దేశభంగో మహద్దుఃఖం
మరణంచ భవేద్ధ్రువం"

మన్మథుడు శివదృష్టిని పురశ్శుక్ర ప్రదేశమును వలె తప్పించుకొనెనని కాళిదాసు చెప్పినాడు. ఈ యుపమానమును వివరించుచు మల్లినాథుడు—

"ప్రతిశుక్రం ప్రతిబుధం
ప్రత్యంగారక మేవచ
అపి శక్రసమో రాజా
హతసైన్యో నివర్తతే"

అను జ్యోతిషశ్లోకము నుదాహరించినాడు.

వ్యాకరణాది శాస్త్రములలోనేకాక అర్థశాస్త్రాదులలోనూడ నాతనికున్న నిశితపరిజ్ఞానమునకు మనకు జమొందురుము. రఘుమహారాజు జైత్రయాత్రకేగంబోవుచు అశ్వములకు నీరాజనము చేయించెను అప్పు డగ్నిహోత్రుడు ప్రదక్షిణమైన జ్వాలకలవాడై ఆ జ్వాలయనెడు హస్తముచేత రఘువునకు జయము నొసగెనని కాళిదాసు చెప్పినాడు ఆహవయాత్రయను గ్రంథములో అట్టి నీరాజనములో అగ్నిహోత్రుడు ప్రదక్షిణగతుడైనచో సముద్రరశనయైన భూమిని స్వాధీనము చేయించునని చెప్పబడియున్నదని మల్లినాథుడు

"ఇత్థం ప్రదక్షిణతో హుతభుఙ్నృపస్య
హాత్రీం సముద్ర రశనాం వశగాం కరోతి"

అను వచనము నుదాహరించినాడు. కాళిదాసు ప్రదక్షిణ శబ్దము నొక సందర్భశుద్ధిగా వాడినాడని సామాన్యుడు గ్రహింపజాలడు

కామందక నీతిశాస్త్రము, కౌటిలీయార్థశాస్త్రము మల్లినాథునకు కరతలామలకములు. ఈ గ్రంథములనుండి యెన్నియో సందర్భములలో నాతడు వచనముల నుదాహరించుచుండును.

రఘువుబారినుండి తమ్ము రక్షించుకొనుటకు సింహళదేశస్థులు వైతసవృత్తి నాశ్రయించినారని కాళిదాసు చెప్పినాడు కౌటిలీయార్థశాస్త్రములో సరిగా బలవంతుని ముందు దుర్బలుడు వైతసవృత్తి నవలింబించవలెనని చెప్పబడియున్నది. వెల్లువవచ్చినపుడు నీటిప్రబ్బలి చెట్టువంగినదై తన్నుతాను నిలద్రొక్కుకొని ప్రవాహము తగ్గగానే లేచి నిలబడగలుగుచున్నది, అట్లే బలవంతుడు దండెత్తివచ్చునపుడు దుర్బలుడు వంగి యాత్మరక్షణము కావించుకొనవచ్చును. కాళిదాసు వేతసోపమానమును సమర్థించుటకు మల్లినాథుడు కౌటిల్యార్థశాస్త్రములోని వైతసఘటితమైన యీక్రింది పంక్తి నుదాహరించుచున్నాడు,

"బలియసాభియుక్తో దుర్బలస్సర్వత్రానుప్రణతో వైతసం ధర్మమాతిష్ఠేత్"

రత్న జంతుశాస్త్రాదులలోకూడ మల్లినాథుని పాండితి అగాధమైనది. అది యాతని వ్యాఖ్యానమునకు ఎంతయో మెరుగుతెచ్చినవి.

గజకుంభ స్థలమున ముత్యము లుండుటను వ్యాఖ్యానించుచు నాతడు ముత్యము లుత్పన్నములగు స్థలముల నన్నిటిని పేర్కొన్నాడు :

"కరీంద్ర జీమూత వరాహ శంఖ
మత్స్యాహి శుక్త్యుద్భవ వేణుజాని
ముక్తాఫలాని ప్రథితాని లోకే
తేషాంతు శుక్త్యుద్భవ మేవ భూరి."

విదూరపర్వత సమీప ప్రదేశమున రత్నము లుద్భవములగు ననుట కాతడు రత్నశాస్త్రమునుండి శ్లోకము నుదాహరించినాడు.

ఏ విషయమై వ్యాఖ్యానింపవలసి వచ్చినను దానికి సంబంధించిన శాస్త్రములో కూలంకష ప్రజ్ఞను కనబరచిన యీ మహా విద్వాంసుడు ఒక సంచార గ్రంథాలయముగా వర్ణింపదగినవాడు.

వింధ్యపర్వత వర్ణనములో కాళిదాసు గజప్రశంస సచేసినా, మల్లినాథుడు వింధ్యగిరి గజాకరమగుటను గజాయుర్వేదశ్లోకము నుదాహరించి నిరూపించినాడు.

అట్లే 'బిలయోనయః' అనుచోట అశ్వముల బిలోత్పత్తిని అశ్వశాస్త్ర శ్లోకోల్లేఖనముచే నిరూపించినాడు.

అది యిది యననేల? ఏ శాస్త్రమునకు సంబంధించిన యంశమువచ్చినను ఆ శాస్త్రప్రమాణవచనములతో వ్యాఖ్యానించుట మల్లినాథుని యలవాటు.

ఇట్టివ్యాఖ్యానములతో కావ్యపఠనము చదివిన వారికి భాషాజ్ఞానము, అన్వయశక్తి, రసాస్వాదన సామర్థ్యము, విమర్శపాటవము, బహుశాస్త్ర మర్యాదాభిజ్ఞత కల్గెడి వనుటలో నాశ్చర్యమేమి ?

కావ్యశ్లోకములనువలెనే మల్లినాథుని వ్యాఖ్యాన పంక్తులనుకూడ విద్యార్థులు పూర్వకాలమున కంఠస్థముచేసెడి వారనుటలోనే తద్వ్యాఖ్యా వైభవము స్పష్టమగుచున్నది.

# జక్కన వైదుష్యము చక్కన

శ్రీ పంగనామాల బాలకృష్ణమూర్తి

జక్కన మహాకవి పదునైదవ శతాబ్దపువాఁడు. తండ్రి అన్నయ్య, తాత పెద్దయామాత్యుఁడు పెద్దయామాత్యుని ప్రతిభావిశేషముల నుగ్గడించుచు విక్రమార్కచరిత్ర గ్రంథారంభమున "సంస్కృత ప్రాకృత ...ఎల్లవిద్యల సంచులెఱుఁగనేర్చు" – (1–20) నని నెల్లూరి తిక్కభూవిభుని సముఖమున మహిమగాంచినవాఁడని యున్నది అన్నయ్యకూడ బాణమయూరాదుల కైతలకన్న మిన్నయగు కవితనల్లనేర్చినవాఁడని ప్రశంసగలదు. ఇట్టి తాత తండ్రిగల విద్వద్వంశమున జనించుటచే జక్కనకూడ నట్టి ప్రతిభావిశేషములఁగలిగి ప్రసిద్ధమహాకవి యాయెను. సిద్ధమంత్రి, విక్రమార్కచరిత్రమును ప్రబంధరీతిని నుడివి తన కంకిత మొనర్ప జక్కనను వేడెను. ఆ సందర్భమున జక్కనను

కం. "చక్కన నీ వైదుష్యము,
చక్కన నీ కావ్యరచన చాతుర్యంబుల్,
చక్కన నీ వాగ్వైఖరి,
చక్కన నీ వంశమహిమ జక్కన సుకవీ"
(1-23)

కం. స్వాభావిక నవకవితా,
ప్రాభవముల నుభయభాషప్రౌఢిమఁజెప్పన్
భూభువనంబున సరిలే,
దాభారతి నీవుదక్క నన్నయ జక్కా" (1మ24)

అని అతని ప్రతిభావిశేషములను పేర్కొని సరస్వతియే యతనికి సాటియని ప్రశంసించినాఁడు. ఈ మహాకవి సంస్కృతాంధ్రములలో చక్కని కవిత నల్లనేర్చినాఁడు. సాహసౌదార్యాది గుణగణాలంకృతుఁడగు విక్రమార్కుని చరిత్రము ఏనిమిదియాశ్వాసముల ప్రబంధము ఇందలి కవిత్వము శైలిప్రౌఢము. సంస్కృతాంధ్రముల రెంటను మహావిద్వాంసుఁడగుటనీతని కైతయందెల్లెడల నాయుభయభాషావైదుష్యము గోచరించుచునే యుండును. ఈతఁడు విద్వన్మహాకవి. బహుశాస్త్రవేత్త.

వైదుష్యము సర్వతోముఖపాండిత్యము. సకలశాస్త్రపాండిత్యము, కథ యందలి పాత్రపోషణము, రసపోషణము, వర్ణనా వైచిత్రి, రుచిరార్థసూక్తిప్రయోగనైపుణ్యము మొదలగునవి వైదుష్యసూచకములు.

జక్కన మహాకవి తన రచనయగు విక్రమార్కచరిత్రమున నిజవైదుష్యము నెంతవఱకు ప్రతిఫలింపఁజేసెనో పరికింతము.

జక్కన చేపట్టిన మహాప్రబంధము విక్రమార్కచరిత్రము, కథానాయకుఁడు విక్రమార్కుఁడు సర్వజ్ఞుఁడు. సాహసౌదార్యములకు కాణాచి, ఆ సర్వజ్ఞత్వమును దెలుపుతావుల జక్కన నిజపాండిత్యమును స్ఫురింపఁజేసినాఁడు. విక్రమార్కుని జననకాలమున "*నిజోచ్చక్షేత్రసంస్థితులై, యన మందార సురాసురేజ్య బుధులాచంద్రుఁ విలోకింపగః*' అని సూర్యశన్యంగారక గురుశుక్ర లుచ్చస్థితులై చంద్రుని చూచుచుండగా ననియు "*కుముదగహనబంధౌ వీక్ష్యమాణౌ సమస్తై*" రను హోరాశాస్త్రశ్లోకము నుదహరించుచు, గ్రహబలమును దెలిపి యట్టిసమయమున జనించినవాఁడు మహాచక్రవర్తి యగునని ప్రశంసించుట నీతని జ్యోతిశ్శాస్త్రపరిచయము వ్యక్తమగుచున్నది. శీలవతి పట్టియగు వరరుచి పాండిత్యమును నుడువుఘట్టమున పేర్కొనఁబడిన మంత్రశాస్త్రప్రశంస '*భవ్యహారాయణీయ, ప్రపంచసార, శారదాతిలకాది గ్రపఠన్త మంత్రశాస్త్ర సర్వంకషప్రజ్ఞా రసరణి మించె*' (1-188) ననుట జక్కనవిషయమున స్వవిషయమే యైయుండనోపు. అంతియకాక విక్రమార్కుఁడు బ్రహ్మాస్త్రమును సంపాదించిన సందర్భమున నెన్నియో మంత్రశాస్త్రరహస్యములు నుడువఁబడినవి. ఇవి యన్నియు జక్కనకుగల తంత్ర, మంత్రశాస్త్ర ప్రావీణ్యమును చాటుచున్నవి.

కమలావతి యొక మునితపోనిష్ఠనుండ, తానాతనికి తపోభంగముగావించి శాపమునకు గుఱియైతినని తెల్పు సందర్భమున '*బద్ధసిద్ధాసన సరణి* ... *బొడగంటి మనుజనాథ!*' (2-248)అని యామునిని ఆతని సమాధినిష్ఠను వర్ణించుచో యోగశాస్త్రవిషయములు ప్రాణాయామాదికము, షట్చక్రముల విషయము, మున్నగు విషయములు ప్రశంసితములగుటచే జక్కన యోగశాస్త్రమందును కృతపరిచయుఁడని తెలియుచున్నది. చతుర్థాశ్వాసమున నారదుఁడు విక్రముని కుశలప్రశ్న లడుగుచు రాజనీతి విషయములఁ బ్రశంసించుట, ప్రశ్నించుట మున్నగునవి జక్కనకు గల రాజనీతి వైశారద్యమును వెల్లడిచేయుచున్నవి.

ఈతని కవితాశిల్పము ప్రశంసార్హము. సంస్కృతాంధ్రపదముల మేళవింపు జక్కనకు కడుచక్కగ నమరినది. ఈతని యీ రచనావైదగ్ధ్యము నన్నయనుండి పుణికిపుచ్చుకొనెనా యనునట్లుండును. ఈకవితయందొకవిధమగు శ్రవణపేయమగు నాదామృతము జాలువారుచుండును. కొన్ని స్థలములలో కేవలము సంస్కృతపదములతోడనే ఆంధ్రచ్ఛందము ననుసరించి పద్యరచన గావించినాఁడు. ఒకవృద్ధభూసురుఁడు విక్రమార్కు నాశీర్వదించుపట్టున సీసపద్యమంతయు సంస్కృతభాషామయము. సీ. '*బ్రహ్మాయురస్తు*...... *మంగళానిభవంతుతే మనుజనాథ*' (2-185) శ్రీశైల మల్లికార్జునలింగస్తుతి పద్యములు (2-200, 202, 203, 204, 205) అన్నియు సంస్కృతము. విరూపాక్షస్తుతి కేవల సంస్కృతమునే శ్లోకరచనగా వ్రాసెను (2-222, 223 224) ఇక మహాకాళీస్తోత్రరూపమైన దండకము జక్కన గైర్వాణవాణీ వైదుష్యమునకు నికషోపలము. (2-58)

అచ్చటచ్చట సంస్కృత సూక్తులను '*ధర్మస్య త్వరితాగతి:*' (2-185), '*కా చింతా మరణే రణే*' (4-70), '*కామాంధోఽపి నపశ్యతి*' (3-68) మొదలగువానిని పొందుపరచి భాషాపోషకలంకారముగ సువర్ణమణిహారము వడువున రచన సాగించినాఁడు. ప్రతి ఆశ్వాసాంతమునను నొక్కొక సంస్కృతచ్ఛందస్సున పద్యము వ్రాసి యెనిమిది యాశ్వాసములందు నెనిమిది వృత్తముల రచించెను, అవి క్రమముగా మాలిని, ధృతి, భుజంగప్రయాతము, బంధురము,

కాంతము, మందారదామము, స్రగ్విణీ, మంగళమహాశ్రీ యనునవి. కుమారసంభవ గ్రంథాంతమున నన్నెచోడమహాకవి మంగళమహాశ్రీ వృత్తము నుపయోగించినాడు. జక్కనకూడ నట్లేయొనర్చి తనరచనకొక వైలక్షణ్యము నాపాదించెను.

పాత్రపోషణము వైదుష్యమున నొకయంశము. విక్రమార్కుడు, భట్టి, శకభూపతిమున్నగు పురుషపాత్రల నెంతచక్కగ పోషించెనో యట్లే స్త్రీ పాత్రలను కూడ నాయా సందర్భముల వారికి తగిన రూప భాషల కల్పించి కడుంగడు సరసముగ రచన సాగించినాడు విక్రమార్కుని చెయ్దములుకొన్ని యతిమానుషములుగ గోచరించినను నతని సాహసౌదార్యముల మూలమున మానవత్వమునే యాపాదించుచు, చదువను చదువనుహాయి గూర్చుచుండును.

జక్కన రసోపాసకుడు. కావ్యరచనా సందర్భమున రసముపై దృష్టిగల కవి కలంకారములు తముంతట తామే యహమహమికతో దొరలుచుండును. స్త్రీ వర్ణన సందర్భములన్నియు శృంగారరస గుళికలే. చంద్రగుప్త భూసురుడు నిజభార్యలతో సుఖించుటను దెల్పినపద్యము

"శీలవతీ నిత్యశృంగార ... చంద్రగుప్త మహీసుర చక్రవర్తి (1-163)

అష్టమాశ్వాసమున నాడువారి మాయల వర్ణించు ఘట్టములన్నియు శృంగారవిలసితములు

శకభూపాలునితో విక్రమార్కుడు యుద్ధమొనర్చు ఘట్టమంతయు వీరరసోపేతము. ఆఘట్టమున కవితాశైలియు రథగమనమువలె నుద్ధతముగ నడచినది జక్కనంలయు పరుసవేదివంటిది ఏమి వ్రాసినను సువర్ణమయమగును. అమాత్యకులావతంసుడగుట యుద్ధాదులం దద్భుత చాతుర్యనిర్వహణము; భట్టిమంత్రి మంత్రాంగము లెస్సగ నిర్వహింప గల్గినాడు. తిక్కనకర్వాత నిట్టిరచనల కితనికేతడేసాటి యనిన నత్యుక్తి కాజాలదు.

ఇక వర్ణనావైచిత్ర్యము తిలకించినచో నావిషయమునను జక్కన సిద్ధహస్తుడు. ఇందుపమాలంకారములు కోకొల్లలుగ నున్నవి. ఒకచో సముద్రమును రాజునకుపోల్చి యెంతో చమత్కారముగ శ్లేషాలంకారమున నిర్వహించినాడు

" సీ॥ లక్ష్మీసముత్పత్తి లావణ్యసంపత్తి
గోత్రరక్షణవృత్తిఁ గొమరుమిగిలి
కవిరాజవిలాసత్వ ఘనరసాంచితయుక్తి
బూర్వాపరవ్యక్తిఁ బొలుపుమిగిలి
పటుసత్త్వవిస్ఫూర్తి బంధురతరకీర్తి
గంభీరతాపూర్తి గరిమకెక్కి
వాహినీశఖ్యాతి వరరత్నమయభూతిఁ
బురుషోత్తమప్రీతిఁ బొగడువడసి

గీ॥ త్రిజగదానందకం కళాదీప్యమాన
రాజసందర్శనోత్సవ నిరూఢి
నతిశయిల్లెడు నీకునీయ్యంబు నీధికి
మహిత సద్గుణసమితిమై మైత్రియొనరు"
(5-113)

పై పద్యమున లక్ష్మి (లక్ష్మీదేవి, సంపద), లావణ్య (ఉప్పందనము, సౌందర్యము), గోత్ర (పర్వతములు, వంశము), కవి (పక్షులు, కవులు), ఘనరస (నీరు, శృంగారాదిరసములు), సత్త్వ (జంతువులు, బలము), వాహినీ (నదులు, సేనలు), పురుషోత్తమ (మహావిష్ణువు. రాజు), రాజసందర్శన (చంద్రదర్శనము, భూపాలదర్శనము) పదములు శ్లిష్టములై సంబుధి పరముగను, మహారాజ పరముగను నన్వయించుచున్నవి చంద్రోదయవర్ణనము ప్రశంసాపాత్రము (6-68, 69)

నాచనసోమనాథుఁ డుత్తర హరివంశమునఁ జప్పన్నదేశముల నొక్క సీసమాలికలో నొక్కసమాస

ము కే రచించెను. అట్టి రచనా విశేషమును గమనించి జక్కనయు నిందు బ్రహ్మసభలోని ఋషీశ్వరుల పేళ్ళ జాబితా నొక సీసమాలికలో భంగములేక నిర్వహించెను. రచన యందంతట నాదస్ఫోరకములగు సరళాక్షరములతో మధురముగ సాగించినాఁడు.

ఒక తెలుగు రచనయందు జక్కన కైత విలక్షణము. ఈ ప్రబంధమున సంస్కృతాంధ్రముల మేళవింపు చక్కగ నమరి శైలి కమ్మగ సాగినది. అచ్చటచ్చట కేవలము తెనుగుననే కొన్ని పద్యములు రచియించియున్నాడు. పురందరుఁడను వణిక్కుమారుని మహోదారతను వర్ణించు సందర్భముననూ,

'కం॥ కట్టక, కుడువక, యొరులకు
బెట్టక తనతండ్రి గూడబెట్టినసిరిఁ దా
గట్టియు, గుడిచియు, నొరులకు
బెట్టియుఁ దనయిచ్చవెచ్చఁబెట్టఁ దలంచున్
(2–163)

'కం॥ అడెడు వారలకిచ్చును.
పాడెడు వారలకునిచ్చు బట్లకు నిచ్చున్
బాడబవరులకు నిచ్చును.
వేడుకకాం డరకునిచ్చు వివిధార్థంబుల్॥'
(2–164)

మఱియొకతావునను

వలపులబరపిక చిలుకలకొలికి రుపారంపుఁ గులికి
గుబ్బలనవలా
పులుగడిగిన ముత్యము సిరి వులకండపుబొమ్మ
యనగఁ బొలఁతుక యొప్పున్.
(8–49)

తెనుగుపదములతోడనే రచన సాగించినాడు.

కవితాశిల్పమని మహాకవులు తమ యనుభవ సారమును సూక్తులమూలమున నందుండు సమయము దొరకినచోట్లనెల్ల సమకూర్చుచుందురు. నన్నయరచన నానారుచిరార్థసూక్తి నిధియని ప్రశస్తిబడిసిన దీసూక్తుల వలననే కదా! ఈ సూక్తులమూలముననే యెన్నియో ధర్మము లుపదిష్టములగుచుండును. జక్కన కవి చంద్రుఁడును విక్రమార్క చరిత్రమున సందర్భము దొరికినపుడెల్ల సూక్తుల ననుసంధించి నిజలోకజ్ఞతను చాటుచునెన్నియో సదుపదేశముల గావించినాఁడు. ఈ జక్కన చక్కని సూక్తులు కొన్ని యిట ముందున నుదాహరింతును. తిలకింపుఁడు.

1 వట్టిమ్రాకులఁ జిగురులు వుట్టినట్లు (1=112)
2 తెడ్డునాకి యుపవాసము మాన్పికొనఁగ నేటికిన్
(1–150)
3 మనుపీనుగు నిర్ధముండు మది పరికింపన్
(2–172)
4 ధనమార్జింపగ నెవ్విధంబున వలయున్ (2-174)
5 కడు పేదరికంబుకంటె కష్టముగలదె (2-174)
6 గుడి మ్రింగువారికి నంది పిండివడియమను
బల్కెఱుంగవే పుడమిలోన (2–238)
7 పులిమిసల సుయ్యేల లూగవచ్చునే (4–59)
8 ఆడువారల దిట్టతనంబెఱుఁగ బ్రహ్మదేవుని వశమే
(8-47)
9 ఆడువారి బలుమాయలఁగాయజుఁడైన జిక్కఁడే
(8–69)
10 విలాసినుల నమ్మఁదగ దెవ్వరికిన్ (8–77)

పైరీతి నన్నిపోకడల కైతనల్లి, నన్నయ తిక్కన, సోమనల పోకడల సమకూర్చి హృద్యముగ రచనసాగించి మేటికవియని కొనియాడబడినాఁడు. సిద్ధయమంత్రి గ్రంథారంభమున ప్రశంసించిన వాక్యములు యథార్థములగునట్లు జక్కన మహాకవి తన బహుశాస్త్ర పాండిత్యము, పాత్రపోషణము, రసపోషణము వర్ణనావైచిత్రి, సూక్తివిన్యాసము మున్నగు నంశములన్నియు శ్రద్ధతో నిర్వహించి కవికోటి కీర్తుల నందికొన గల్గినాఁడు.

"వెన్నముద్దకు రూపువెట్టిన మాడ్కి
నున్నమెత్తని మేనునొప్పెడువాడు
ఎన్నడు ఎండ కన్నెఱుగని శిశువు
గన్నుల ముత్యాలు గాఱనేడ్చెడిని"

*　　*　　*

'రాచమెచ్చుల, ప్రతిమ గాదిది పచ్చి పగడంపు
లతిక'—చంద్రమతి

*　　*　　*

"ప్రబల సంధ్యారాగ పటలంబునందు
సొబగొందు క్రొన్నెలసోగ బాగుగను
మలసిమండెడు పెను మంటలలోన
నిలిచి" నదట చంద్రమతి—

ఈపై కలకండాలు గౌరన హరిశ్చంద్రోపాఖ్యానంలోనివి.

ఇతడు శ్రీనాథయుగానికి చెందినవాడు. ఒక శతాబ్దిలో కొందరు కవులు పుడతారు. కాని ఒకొక్కడు మాత్రం అప్పటివరకూ వచ్చిన మార్గాలలో ఏదో ఒక దానికి చెంది అత్రోవలోనే ఒదిగిపోడు. తానుగా నిలబడతాడు రసవద్రచనా శిల్పాదులన్నిటిలోనూ ప్రత్యేక వ్యక్తిత్వంతో మరొక వెలుగుపుంత త్రొక్కుతాడు. క్రొత్తగొంతు ఎత్తుతాడు. అందరిలోనూ విడిగా వెలుగుతూ ప్రతిభావంతుడుగా నిలుస్తాడు. అట్టాంటివాడు ఈ గౌరన.

ఇతనికాలం విలక్షణమైనది ప్రతిభావంతులైన కవులు ఈ కాలంలో రచన సాగించారు. రాబోయే ప్రబంధయుగానికి మార్గదర్శకంగా ఆనాటికి ఉన్న ప్రబంధస్వరూపానికి చక్కని రూపురేఖలు తీర్చి దిద్ది ప్రబంధరచనకు స్పష్టతనిస్తూ రచనలుచేసిన శ్రీనాథ మహాకవి ఉన్నాడు. జక్కన, అనంతుడు, పినవీరన ప్రభృతులున్నారు.

అనువాదరీతిలో, వృత్తాల ఎత్తుగడలో. సీస రచనలో, వృత్తరచనలో, వాని విరుపులలో, పదాల పోహళింపులో క్రొత్తత్రోవలు త్రొక్కి యుగపురుషుడుగ నిలిచాడు శ్రీనాథుడు రచనావస్తువును ఎన్నుకొనుటలోను, ప్రాబంధిక రచనావిధానంలోను,

ప్రత్యేక వ్యక్తిత్వంతో రచనలు చేశారు అనంతాదులు. వీరందరు తమ గ్రంథాలను పద్యగద్యాలలో ప్రబంధ పద్ధతిని రచించారు అందరూ శక్తిమంతులైన కవులే. కాని వీరు చేసినది ప్రబంధపద్ధతి రచన శ్రీనాథమహాకవి ప్రతిభావంతంగా ఆపద్ధతి రచనచేసి ఉండడం వల్ల ఆయినప్రభావం వీరందరిమీద ఏదోవిధంగా పడింది సీసరచనలో నో, వర్ణనావిధానంలోనో, సంస్కృత వాఙ్మయంలోని సుందర కావ్యఖండాలను తమ గ్రంథాలలోనికి స్వేచ్ఛానువాదం చేసికొనుటలోనో, ప్రయోగవైచిత్రిలోనో, తెలుగు పలుకుబడి, లోకోక్తి-వీనిని వాడేపద్ధతిలోనో ఆ మహాకవి ఛాయ ఏదోవిధంగా వీరిమీదికి వచ్చేసింది. ఈ విషయాన్ని గౌరన గుర్తించాడు. ఆ కాలంలో ఆ మార్గంలో రచన చేసి మెరగడంకన్న మరొక మార్గాన్ని ఎన్నుకొని ఆ రచనాపద్ధతిపై తన ప్రత్యేకవ్యక్తిత్వ ముద్రవేసి తానుగా విడిగా నిలబడాలనుకొన్నాడు. పద్య గద్య వాసనలేని దేశిఛందస్సు ద్విపదను దీనికి అనువుగా ఎన్నుకొన్నాడు. ద్విపద అన్న పదం సంస్కృతంగా వచ్చు గాని ఇది తెలుగుల స్వంత ఆస్తి తెలుగులపాలిటి అనుష్టుప్పు. దేశిఛందస్సును గ్రహించినపుడు తెలుగు నుడికారం, పలుకుబడి, లోకోక్తి, చిన్న చిన్న మాటలతో అర్థగౌరవ యుక్తరచన—దీనికి ఆయువుపట్టని గౌరన గ్రహించాడు ఆ హృదయాన్ని తన ద్విపదకిచ్చి రచన సాగించాడు పురాణ ద్విపదలు, రంగనాథరామాయణం పల్నాటి వీరచరిత్ర—ఇన్ని వచ్చినవి కాని రసవత్కావ్య ద్విపద కిత డధి నాయకుడు.

హితంగా, రసమహితంగా సత్యసూక్తిని గురించి పాడవలెననుకొన్నాడు కవి. అతడా "సరస సాహిత్య లక్షణ విచక్షణుడు". ఆ నిశితవైచక్షణ్యంతో హరిశ్చంద్రకథను తీసికొని సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దాడు. కథా సంఘటనలను బలంగా పన్నుకొని, పలుపాత్ర నిర్మాణంలో కవితా రసపుష్టితో బిగిగా నడిపించి రసశిఖరాలకి చేర్చాడు కావ్యాన్ని.

మొదట ఇతని పాత్ర నిర్మాణ చాతురి ఎట్టిదో చూదాం.

తెలుగుగడ్డమీద ఊపిరి పీలుస్తూ మసలే నవజీవన మూర్తుల్లా ఉంటాయి గౌరన పాత్రలు. కవితా రస వాహినిలో పాత్రలు మునిగిపోకుండా ప్రస్ఫుటంగా చిత్రించడం ఇతని ప్రత్యేకత. శ్రీ నాథుని కవితా రసార్ణవంలో ఆయన పాత్రలూ, వ్యక్తిత్వాలూ మునిగిపోతుంటాయి. ఆయన కవితావైభవం వైపే పాఠకుని మనస్సు మొగ్గిపోతూ ఉంటుంది. అట్లాగే మిగిలిన కవుల తీరుకూడ చాలమటుకు ఉన్నట్లనిపిస్తుంది. గౌరనమాత్రం తన పాత్రలకు రసవద్రీతిలో క్రొత్తతేజస్సు ఇస్తాడు. తెనుగు ఊళ్లల్లో ఎదురయ్యే అప్పు వసూలుకానికి మారు పేరు నక్షత్రకుడు. పరమ కోపి ఎవడైనాఉంటే 'వాడో విశ్వామిత్రుడయ్యా' అంటాడు తెలుగువాడు.

గౌరన పాత్ర చిత్రణంలో కొన్ని సొగసులు, ఒయ్యారాలూ పోయాడు. ఒకచోట పాత్ర బాహ్యమూర్తిని. గుణగణాలను వర్ణనాత్మకంగా కళ్లకి కట్టేటట్లు చేసాడు మరొకచోట వాచ్యం చెప్పకుండ పాత్ర మనస్తత్వాన్ని, వ్యక్తిగత లక్షణాలను, ఆ యా సంఘటనలలోను, సంభాషణలలోను, చిత్ర విచిత్రంగా మెరిపిస్తాడు. ఒకొక్కప్పుడు కథలోనివారిచేతనే అందులోని వ్యక్తుల వ్యక్తిత్వాలనుగూర్చి సొగసుగా పలికిస్తాడు.

జాతి సంప్రదాయంతో, ఆ భాషయొక్క నుడికారంతో, పలుకు పొందికతో పాత్ర చిత్రణంచేస్తే అది పాఠకుని మనస్సుకు దగ్గరగా వస్తుంది. కంటియెదుట సజీవంగా నిలుస్తుంది. అట్లా చేసాడితడు. చూడండి—

"తనువొల్లసత్యంబు, తలవెల్లకరుణ,
పనులెల్ల ధర్మంబు, పలుకెల్లప్రియము,
బొంకు నాలుకకు వెయ్యలు కానివారి"

హరిశ్చంద్రమూర్తిని ఐదు ముక్కల్లో మన యెదుట పెట్టాడు. అతడెంతటి సత్య స్వరూపుడో, ఎంతటి కరుణాళుడో, ధార్మికుడో, బొంకు అంటే అతని దృష్టిలో ఎట్టిదో మనకు కథలో సంఘటనాత్మకంగా నిరూపిస్తాడు.

హరిశ్చంద్రుడు సత్యంకోసం పడిన పాట్లన్నిటిని అతి సహజంగా వివరిస్తాడు. మానవ మనస్సు పలు బలహీనతలతో కూడుకొన్నది. మనోదౌర్బల్యాన్ని అతిక్రమించి 'మనిషి' నిలబడగలిగాడా అతడుత్తమ మానవమూర్తి కాగలడు. హరిశ్చంద్రుడుకూడా ఈ సత్యవ్రత పరీక్షలో కొన్ని కొన్ని సమయాల్లో బేల పడిపోతూ ఉంటాడు. అట్లాంటి బలహీన పరిస్థితుల్లో అతని ఇల్లాలు అతనికి మానసికధైర్యం ఇచ్చి ప్రోత్సహిస్తూ ఉంటుంది సత్యవ్రతపరీక్షలో వచ్చే ఒడిదుడుకులన్నింటిలోను నడుస్తూ బలహీన సమయాలను నెట్టుకొంటూ సత్యవ్రతంకోసం పలుపాట్లు పడ్డ ఉత్తమ మానవమూర్తిగా హరిశ్చంద్రుని చిత్రించాడు.

ఇక చంద్రమతి— (అగ్నిలో ఊరికేముందు)

"మదిలోన, వాక్కున మఱి చేతలందు
వదలక పతిభక్తి వరలుచునేని

*  *  *

"పరమశీలుడవై ప్రాణదానంబు
కరుణమై తొలుత నక్షత్రకున కొసగి
మునినాధు ఋణమున మునిగిపోకుండ
మనుజేశ కొడుకును మఱికావు"—

మనునట్టి 'ఉత్తమ ఇల్లాలు' ఈమె. సత్యవ్రత పరీక్షలో అడుగడుగున చంద్రమతిని నిజమైన అర్ధాంగిగా చిత్రించాడు. చంద్రమతే లేకపోయినట్లయితే విశ్వామిత్రుని మహేంద్రజాలంలో విభ్రాంతుడై హరిశ్చంద్రుడు ఆడితప్పేవాడేమో అనిపిస్తుంది. పతిశీల, ధీర హృదయ, గంభీరమానస, అత్యుత్తమురాలైన చంద్రమతి, ఈ అష్టకష్టాలలోను హరిశ్చంద్రునికి తల్లిగా, భార్యగా, నెచ్చెలిగా, మంత్రిగా భర్తను లాలింపించిది, సేవించింది, సేదదేర్చింది, ఆలోచనలుచెప్పి సత్పథంలో నడిపించింది. ఈమె మహాపతివ్రత. ఆ విషయాన్ని గురించి కవి మాట్లాడడు. దావాగ్ని సంఘటనలో అమె శీలౌన్నత్యాన్ని పాఠకుడేగుర్తించి అద్భుతపడేటంత సొగసుగా చిత్రిస్తాడు కవి. ఆ సంఘటనచూచిన పరమశత్రువు విశ్వామిత్రుడే నోరార పతిభక్తి ఔన్నత్యాన్ని కీర్తించి ఆమె పతిభక్తిముందు తన తపశ్శక్తి నిర్వీర్యం అని కొంటాడు, ఆమె పాతివ్రత్యపు వన్నెకు విశ్వామిత్రుణ్ణి గీటురాయి చేస్తాడు.

విశ్వామిత్రుడు :—

'మలకలతపసి'—హరిశ్చంద్రుని దృష్టిలో.
'కపటనాటకుడు'—చంద్రమతిమాట
'కుటిలకౌశికు తీవ్ర కోపాగ్ని శిఖల
పెట పెట ప్రేలక పగిలి పోవశమె'—నక్షత్రకుడు.

'కడగి పీనుగుమీద కంచంబు పెట్టి
కుడువగాజూచు కర్కోటకుడు'—ప్రజలమాట

హరిశ్చంద్ర చంద్రమతులతర్వాత కథలోని ప్రముఖవ్యక్తి ఇతడు. ఋషియైన ఈయనలో ఉండే రాజసం, మొండిపట్టుదల, అవేశయుతమైన క్రోధం తొందరపాటుతనం, ఇన్నింటినిమించి అంతర్వాహినిగాసాగే వసిష్ఠునిమీది ఎనలేనికోపం— విశ్వామిత్రుణ్ణి ఎటా తయారుచేశాయో పై ముక్కలు మచ్చుతునకలు. పరమకోపి ఎట్లా పతనుడవుతాడో మనం విశ్వామిత్రునిలో చక్కగా చూడవచ్చు. వసిష్ఠ విశ్వామిత్ర కలహంలో, వారి సంభాషణంలో, ప్రతిజ్ఞల్లో, మిగిలిన కథాసంఘటనల్లో ఇతనిని అతి సహజంగా చిత్రించుకొంటూ వెడతాడు. విశ్వామిత్ర పాత్ర విషయంలో అయన మనస్తత్వ చిత్రణంతోను, గుణగణాల చిత్రణం

తోనే విశ్వామిత్రుని మన కళ్లముందు పెడతాడు. రామాయణ విశ్వామిత్రుడు బ్రహ్మర్షిత్వాన్ని సాధించి సత్యమూర్తియైన మహనీయుడు వసిష్ఠుని ఆశ్రమానికి అతిథిగావచ్చి గోవుకోసం తగవుపడి వెళ్ళిపోయి వసిష్ఠునివలె ఋషికావడానికై యత్నంచేసే తొలిదశల లోని రాజసప్రవృత్తిగల విశ్వామిత్రుణ్ణే గ్రహించి గౌరన తెలుగుల మనస్సుకు హత్తుకొనేలా స్పష్టరూప చిత్రణం చేశాడిక్కడ

వసిష్ఠుడు :—

కలహంలోను, ఇంకొక్కచోటమాత్రమే వచ్చినా వసిష్ఠమహర్షిని పురాణప్రసిద్ధమైన బ్రహ్మర్షి గా చిత్రించాడు.

*'కులసతిబానిన, కొడుకు వోయినను*
*తలమీద వచ్చిన'*....... .......వసిష్ఠ విశ్వామిత్ర కలహంలో వసిష్ఠుడన్న ఈ మాటలు చదవగానే "ఋషీణాం పున రాద్యానాం వాచమర్థో నుధావతి" అన్నసూక్తి జ్ఞప్తికివస్తుంది. మహర్షులమోఘవాక్కులన్న విషయాన్ని చటవ్యంగ్య పరచుడమేకాక భావి కథాసూచనంకూడ చేశాడు కవి.

నక్షత్రకుడు :—

*"తుద లేదు పీనుగుతోడి జాగరము*
*నిను నేడు ముఖమున నెత్తురు గ్రామి*
*కొని గుల్లపడుపక కొలికికిరావు*
*పట్టి గుత్తని నిన్ను ప్రజలు వీక్షింప*
*చట్టు మోయించెద సర్వదా చూడు"* మనునట్టి నిష్కరుణుడైన అప్పువసూలుకాడితడు నక్షత్రకుడితని ప్రత్యేకపాత్ర ఇతనిసొమ్ము ఇతని తరువాత కవులు కూడ ఈ నక్షత్రక విశ్వామిత్రులనే మనసులో పెట్టుకొని రచన చేసినట్లు కనిపిస్తుంది కవి ఇతని బాహిర మూర్తి వర్ణనం ఎక్కడాచేయడు. అప్పువసూలుకోసం హరిశ్చంద్రుని వెంబడించడం దగ్గరనుంచి ఇతడు కథారంగంలోనికి వస్తాడు. అప్పువసూలు చేసికొనే వాడు ఎదుటివ్యక్తిని ఎన్నివిధాల బాధిస్తాడో—సూటి పోటిమాటలనే తీరులో, ఎదుటివ్యక్తి బలహీనస్థితులిని గుర్తించి అతని కుంగదీయడంలో, ఇరుకున పెట్టడంలో, నిర్దాక్షిణ్యం ప్రదర్శించడంలో, చివరికి దొక్కలో పిడికిటిపోటు పొడవడం దగ్గరనుంచికూడ విడువకుండా అప్పువసూలు కాని నగ్నమనస్తత్వాన్ని పాఠక మనస్సునైతం చిరచిరలాడేలా చిత్రిస్తాడు కవి.

కాలకౌశిక కలహకంఠులనుకూడ హృదయానికి హత్తుకొనేటట్లు చిత్రిస్తాడు.

కాలకౌశికుడు :—

*'తోలునస్థులు బిక్క తూగాడుమేను*
*వేలురాలెడు సిగ పెడతల గణితి*
*పిల్లికన్నులు గురుపిచు మీసములు*
*ఒదుగునోరును, వెలికుంకినపండ్లు*
*మటుమాయలాడు కంబళిపురిషంబు'* ఇతని రూపు ఇది

కలహకంఠి :—

*'బుజ్జముక్కును లొట్టపోయిన కన్ను*
*వెజ్జిచూపును తెగివ్రేలాడు చెవులు*
*వ్రాలు చన్నులు ఒడబాకి నోరు*
*వాటుగాలును తోలువలెనున్న నడుము'* ఇది ఈమె స్వరూపం—

గురువుకీ గురుపత్నికి తంపులుపెట్టి తలుపు గొళ్లెం పెట్టి మదురుగోడ దాటిపోయే 'కర్కోటక' శిష్యులను కూడ పట్టి సొగసుగా చిత్రించడంలో ఏమరుపాటు పడడీతడు. ఈకవి కవితాతూలిక ఇందలి ప్రముఖపాత్రలకు ఎంతబలంగా అక్షరమూర్తిత్వం కల్పిస్తుందో అంతబలంగానూ చిన్నపాత్రలకునైతం జీవరేఖతో అక్షరరూపం ఇవ్వగలదు.

కవితారీతిలో అన్నివైపులా సమంగా దూసుకొని పోగల చురుకైన వెలుగు చూపు ఇతనిది.

తనకవితాచమత్కృతి కవులందరు శిరఃకంపం చేసేటట్లు వీనులపండువుగా వ్రాయుదునన్నాడు. ఆతీరు చూదాం.

శృంగారరసం ప్రధానంగా తీసికొని శ్రీనాథాదులు నైషధం మొదలైనవాటిలో ఆ రస చిత్రణం గొప్పగా చేశారు. శృంగారరస ప్రధానమైన రచనలూ ఆ కాలంలో చాలా వచ్చాయి. ఈ రస చిత్రణం ప్రహతమున్న గౌరన శృంగారమేకాక మిగిలిన వీర, కరుణ, భీభత్స, హాస్యాదులనూ ఎంత అద్భుతంగా చిత్రించవచ్చో అంతగానూ చిత్రించాడు.

రచనావిధానంచూస్తే ఇతని రసదృష్టి ఎట్టిదో గోచరిస్తుంది. రసమహితం అయిన రచనకాబట్టి ప్రసాదగుణంతో రచన సాగిస్తాడు. అసమాసయుత రచన. రసతత్త్వ వేత్తకనుక ఎక్కడోతప్ప సుదీర్ఘ సమాసరచన చేయడు. కరుణాది సుకుమారతర రస సన్నివేశాలలో అట్టిరచన అసలు చేయడు. రసస్థితికి భంగంరాని రీతిలో అలంకారిక రచన చేస్తాడు. ఒడుపైన తెలుగు పలుకుబడి, లోకోక్తి, జాతీయాదులు—వీటిని పట్టి రసపుష్టికి తగినట్టుగా కూర్చుకొంటూ రచన సాగిస్తాడు. శబ్దశక్తిని దృష్టిలోఉంచుకొని అలతి అలతిమాటల కూర్పుతో అర్థగౌరవ బంధంతో రససిద్ధికి అనుగుణంగా రచిస్తాడు,

ఒకొక్కపుడు రసవంతంగా పాత్ర ప్రవేశం చేయిస్తాడు. ఈ భీభత్స భయానకమూర్తి బేతాళుని చూడండి—

*"పారిదారకలు మొలపూసలుగాగ*
*బెరిగి..........................*
*వడిదాివ రొమ్ముపై వరదలు వార*
*నుడుగక వడియుచున్న రక్తంబు*
*...పీనుగు పచ్చిమాంసంబు*
*గరచి పీకుచు జెతగలమోటు బలక*
*పురియ మూగలు మెడ బొడమని మ్రోయ"*

ఈ 'అవస్థ' లో ఏమి రసస్ఫూర్తి!

కలహకంఠి నిద్రావస్థ—

*"వడి జొల్లు సెలవులవడియ, నూరుపులు*
*నిడుదలై గొటు గొటు నిగుడ వెంట్రుకలు*
*విరిసియంజూరువల మ్రోలాడ వెడట*
*దొసగు కఠంబుల దుర్గంధమెసగ*
*...పండ్లను చెట పెట గొర్కొనుచు"* పంది చందమున నిద్రించినదట.

ఇది ఒకభీభత్స సన్నివేశం—

*"ఆ త్తరి గములు కం పడరి దిక్కులను*
*మొత్తమై నిగుడు క్రొంబొగలు......*
*.........మనుజ రక్తములు*
*బుజియల నటమిగ్రింగి పుల్కిలేవులడర*
*నరగక పొరలాడి యరచు రక్కసుల"* తోను ఉంది శ్మశానం.

ఇట్లాగే దావాగ్ని సంఘటనదగ్గర చంద్రమతి దావాగ్నిలో ఉరికేటప్పుడు, లోహితాస్యుడు, తల్లి కొంగు పట్టుకొని లాగుతూ వెంబడించేచోట కరుణ రసస్థితి గొప్పది. చంద్రమతిని అమ్మేఘట్టం, లోహితుని మరణ సంఘటనాకూడ ఇట్లాంటివే. శ్మశానంలో లోహితుని దహన విషయంలో చంద్రమతి హరిశ్చంద్రునితో అనేదగ్గర—

*"సకలదీవులనేలు జనపతి పుత్రు*
*డకట చేరెడు నేల కర్హుండు గాడె"* ఇత్యాది.

ఇందులో ముఖ్యం రసం అయిన వీరం హరిశ్చంద్రుడు చంద్రమతిని చంపడానికి కత్తి ఎత్తేదగ్గర రసస్థితికి చేరింది. సత్యపాలనంకోసం అయిన అతని దృఢయత్నం చివరికి అక్కడ రసస్థితికి వస్తుంది అక్కడ పాఠకహృదయం రసార్ద్రమై ఉప్పొంగుతుంది. ఈ రసం పరిపుష్టస్థితికి రావడానికి కవి క్రమానుసారంగా పేర్చుకుంటూ సంఘటనలను చక్కగా పరిపోషణం చేసికొంటూ వచ్చిన స్థితినిచూస్తే అతని ప్రతిభ మనకు అవగతం అవుతుంది. అంగరసాలయిన కరుణ భీభత్సాదులు అంగిరసానికి ఎంతో దోహదమిచ్చాయి.



శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

ముందు రాజ్యదానం, తరువాత విశ్వామిత్రు డికి పూర్వం యాగార్థం ఇచ్చిన మాటప్రకారం సొమ్ము చెల్లించడానికి కాలపరిమితితో ఒప్పుకొనడం, నక్షత్ర కుడు వెంబడించగా ప్రయాణం, అడవులలో విశ్వా మిత్రుడు పెట్టిన కష్టాలు— ఇవికాక ద్వితీయభాగపు దగ్గరకు వచ్చేటప్పటికి కథ మలుపు తిరిగి గమ్యం వైపు వేగంగా సంఘటన తరువాత సంఘటన వరు సగా సాగుతుంది. చంద్రమతిని అమ్మడం, తన్నే అమ్ముకోవడం, లోహితుని మరణం, చంద్రమతీ హరి శ్చంద్రులు నిష్ఠుర దుఃఖస్థితిలో శ్మశానంలో కలవడం, అప్పుడుకూడ హరిశ్చంద్రుడు జంకక 'మాట' కోసం చంద్రమతినిత్రిప్పిపంపడం, చంద్రమతి దొంగగా అతని దగ్గరకే తీసికొనిరాబడడం, విశ్వామిత్రుడు ప్రలోభ పెడుతున్నా సత్యనిష్ఠకై ఆమెను నరక కత్తి పట్టడం— ఈ క్రమాన్ని చూస్తే రసస్థితికి ఎలావచ్చిందో గ్రహించ వచ్చు. ఈయన సరస సాహిత్య లక్షణ విచక్ష ణుడుగదా!

కావ్య సహజసౌందర్యం మరుగు పడకుండు నట్లుగా అలంకరణ చిత్రణం చేస్తాడు కవి. ఇతడు వాడే ప్రతీ అర్థ, శబ్ద అలంకారంలోనూ ఇతని ప్రతిభ పదునుగా తళతళ మెరుస్తూ గోచరిస్తుంది. సూర్యా స్తమయాది వర్ణనల దగ్గర, రసస్థితికి భంగంగలగని రీతిని ఆయా ఘట్టాలలోనూ ఆలంకారిక రచన చేస్తాడు. కావ్యానికి అందం కలిగేలా అర్థాలంకా రాలూ, ద్విపదకు వన్నెవచ్చేలా శబ్దాలంకారాలూ వాడుతూ రచన సాగించాడు. సూర్యాస్తమయ వర్ణనంలో—

> "భవచండ తాండవ భ్రమణవేగమున
> దివినుండి జారిన అందియ యనబోలి
> అరుణబింబము పశ్చిమాంబుధి గ్రుంకె" నట.

చంద్రమతి మన నేత్రాలలో గ్రమ్మే బాష్ప బిందు వులు— 'మెరుగు, ముత్యంబుల మ్రింగు మినంబు లదిగల్ వెన్గ్రక్కునట్లు' ఉన్నాయట.

మాతంగసతులు హరిశ్చంద్రుని దగ్గర పవడంపు పసిడి వీణియల గౌసెనలు సడలించి పాడగా—"మొరయు వీణాదండమును చిగురొత్తిన' దట. 'వలను ల వ్రాసిన వన్నెచిత్రములు చైతన్యతంబొదలి తలలు గదల్చినవట. తళుక్కు వెన్నెలలు— మనసిజడను మఱుమాయపొంగ జనులపై ఇల్లు మోహ ఖడ్గము వలె ఉన్నదట. వక్రమవ చంద్రుడు— సురరాజు దేవి ధరియించు కర్పూర తాటంకమువలె ఉన్నదట. ఇలా ఎన్నైనా ఎన్నుకోవచ్చు

ఏమీ వైవిధ్యంలేని ఒకేద్విపదఛందస్సులో కావ్యం చదవడానికి విసుగుగా ఉంటుంది. అలాంటి ద్విపద చేపట్టినా దానిని ఒయ్యారపు నడకలు నడిపించి కావ్యం అంతా ఏకబిగిని చదివేటంత సొగసుగా వ్రాస్తాడు. అసమాపకాలతో త్రుంచుతూ, ముక్త పదగ్రస్తాలతో పెంచుతూ, అంత్యాను ప్రాసాదులతో త్రెంచుతూ రకరకాలుగా అందంగా నడిపిస్తాడు.

ఉదాహరణకు కొన్ని రకాలు—

> 'కంతునికొరరాసి, కన్నులుమూసి
> చింతలొక్కటిజేసి, శిఖతలపూసి'
>
> 'సుందరిగాదిది సొబగురాయంచ
> అంచగాదిది నడపారు క్రొమ్మించు
> మించుగాదిది'..................
>
> 'నృపవర సూనృత నియతి బెంపొందు
> నెమ్ముర మముబొందు నీకిదే సందు'
>
> 'భారంబు హారంబు, ఖాసుర గంధ
> సారం బసారంబు, సార కాసార
> తీరంబు దూరంబు'...........
>
> 'ముర[illegible]
> చురచుర నిప్పు లకులు నుప్పుతిల్లి'—

ఈయనవాడే లోకోక్తులు, జాతీయాలు, పలుకుబళ్ళు మొదలైనవి ఎంత సొగసైనవో—

మొగిలిలోపలి నీరు నమ్మి దొననీళ్లు జల్లు వేదురుడు, నీరు వట్టాయనే నెయి ద్రావికొనిన, వాపోపునే విల్లి వడి డిన్నకోడి ... ... నూలుపోగున చిక్కనుసలకుండులు, నిట్టరాడున బోలె నిలుచుండుట, తల పువ్వువాడక, పాటనబయలగు, ఓరంతప్రొద్దు, సడపీనుగు, పీనుగుతోడి జాగరము, చురుకుకన్ను, తియ్యనివిల్లు, లజ్జసాని, ఒజ్జసాని, పులివాళ్ళువాడ, వెలివాడ తలిరాకుబోండ్ల, మొ॥నవి.

ఈయన శ్రీనాథునివలె మహాశివభక్తుడు. శివమయమైనవాక్కు. ఈయన తనపాత్రల రసనల్ని కూడ శివమయంచేశాడు. ఇందలి పాత్రలు తమ ప్రతి పనికి చంద్రకళామౌళిని సాక్షిగా జేసికొంటాడు. జాజ్వల్యమానం ఆయిన శివతేజఃపుంజాన్ని ఆత్మనా దర్శించిన ఆనందం, ఆవేశంతో పరమ శివమూర్తిని కళ్ళకి కట్టేటంత సొగసుగా చిత్రిస్తాడు.

సూనృతశక్తిని కవితామృతరసంలో రంగరించి హరిశ్చంద్రోపాఖ్యానం రసవద్ద్విపద కావ్యంగా ఎదుట బెట్టిన ప్రతిభాశాలి గౌరన.

'సత్యంవద' అన్నసూక్తి జీవించినంతకాలం ఈ హరిశ్చంద్రోపాఖ్యానం జీవిస్తుంది.

# కుమారస్వామి సోమపీథి—రత్నాపణము

శ్రీ ములగాలసేతు మాధవస్వామి

రత్నాపణము ప్రతాపరుద్రీయమను అలంకారశాస్త్రగ్రంథమునకు వ్యాఖ్యానము. ప్రతాపరుద్రీయము అలంకారశాస్త్ర సర్వస్వ సంగ్రహము. ప్రతాపరుద్రీయమును విద్యానాథ పండితుఁడు రచించెను. వ్యాఖ్యానమైన రత్నాపణమును కుమారస్వామి సోమపీథి రచించెను. ఈతఁడు కొలచల మల్లినాథ పండితుని ద్వితీయపుత్రుడు తండ్రిగారి వ్యాఖ్యానమువలెనే ఈతని వ్యాఖ్యానము మూలాతిక్రమణములేని ఉత్తమ వివరణము. ఈయన విద్యాఖ్యాసాదికము వ్యాఖ్యాన పీఠికయందిట్లు వివరించియున్నాఁడు

శ్లో. "వాణీం కాణభుజీ మజీగణ దవాసాసీచ్ఛ వైయాసికీ
మంతస్తంత్ర మరంస్త పన్నగ గవీ గుంఫేషు చాజాగరీత్,
వాచామాచకల ద్రహస్యమఖిలం యశ్చాక్ష పాదస్ఫురాం
లోకేఽభూ ద్య దుపజ్ఞమేవ విదుషాం సౌజన్య జన్యం యశః 1
త్రిస్కంధశాస్త్రజలధిం చులుకీ కురుతేస్మ యః,
తస్యమల్లినాథస్యతనయోఽజనితాదృశః 2
కోలచల పెద్దయార్యః ప్రమాణ పదవాక్య పారదృశ్వాయః,
వ్యాఖ్యాత నిఖిలశాస్త్రః ప్రబంధకర్తాచ సర్వ విద్యాసు. 3
తస్యానుజన్మా తదనుగ్రహాత్త
విద్యోనవద్యో వినయావనమ్రః,
స్వామీ విపశ్చి ద్వితనోతి టీకాం
ప్రతాపరుద్రీయ రహస్యభిత్త్రిమ్. 4

కుమారస్వామిపీథి తండ్రియైన మల్లినాథసూరి వ్యాకరణమునందును, న్యాయ వైశేషికముల యందును, పూర్వోత్తర మీమాంసలయందును మహాపండితుఁడు. శాస్త్రవాదములలో విద్వాంసుల మెప్పునొందిన మహామహోపాధ్యాయ బిరుదాంకితుఁడు. మల్లినాథసూరి వ్యాఖ్యానములయందు శాస్త్ర పాండిత్యము సుసమాహితమై వెలయుచున్నది. మల్లినాథుని జ్యేష్ఠకుమారుఁడు పెద్దయార్యుఁడు. తండ్రివలెనే పదవాక్య

ప్రమాణపారావార పారీణుడు. నిఖిలశాస్త్ర వ్యాఖ్యాత. సర్వవిద్యలయందు ప్రబంధకర్త. కుమారస్వామి సోమపీథి మల్లినాథుని ద్వితీయపుత్రుడు. అన్నగారి యొద్దనే సమస్త శాస్త్రములను అధ్యయనముచేసిన మహాపండితుడు. తండ్రియు అన్నయు నడచిన మార్గమననుసరించి వాఙ్మయసేవ చేసిన ధన్యుడు. ఈతడు యజ్ఞముచేసి సోమపీథియై వైదికధర్మమార్గ నిష్ఠాగరిష్ఠుడై తండ్రిని మించిన తనయుడైనాడు. ప్రతాపరుద్రీయమునకు అలంకారశాస్త్ర సంప్రదాయ రహస్యములతో రత్నాపణ వ్యాఖ్యానము రచించిన వినయ వినమ్రుడైన మహనీయుడు ప్రతాపరుద్రీయమునుగూర్చియు వ్యాఖ్యానమునుగూర్చియు పీఠిక యందిట్లు చెప్పియున్నాడు—

శ్లో. పుణ్యశ్లోక గుణోక్తి శాణ కషణా దుత్తేజనాం లంబితం
సంజగ్రాహ రసాది రత్ననిచయం విద్యాధి నాథః పురా,
సోఽహం తద్వ్యవహార హేతు మధునాకంచిత్క రోమ్యాపణం
తత్రానుగ్రహ మూల్యతోఽభిలషితం క్రీణన్తు ధన్యాజనాః 1
యద్య న్నిగూఢ మఖిలం శక్త్యా తత్తత్ ప్రకాశ్యతే,
నామూలం లిఖ్యతే కించిత్ నానపేక్షిత ముచ్యతే.

ప్రతాపరుద్రుని యాస్థానకవియైన విద్యానాథుడు పుణ్యశ్లోకగుణోక్తియను సానయందు మెరుగుపెట్టి రసాదిరత్ననిచయమును, ప్రతాపరుద్రీయమను తన అలంకారశాస్త్ర ప్రబంధమునందు సంగ్రహించి యున్నాడు. మన కుమారస్వామి సోమపీథి తద్రత్నాపారానుగుణమైన ఆపణమును—విశిష్టమైనదానిని రచించి, అనుగ్రహమను మూల్యముతో అభిలషితమైన రత్నమును కొనవలసినదని, ధన్యులైన జనుల నాహ్వానించుచున్నాడు. నిగూఢమైన విషయమంతయు శక్తితో, ప్రకాశింపజేయుచున్నానినియు అపేక్షితమైనది మూలము ననుసరించి వివరించుచుననియు తన వ్యాఖ్యానరీతిని ప్రతిజ్ఞ యొనర్చియున్నాడు.

తర్కవ్యాకరణములు, పూర్వోత్తర మీమాంసములు—మొదలైన శాస్త్రములయందేగాక శ్రుతిస్మృతి పురాణములందును అలంకార శాస్త్రమునందును ఈతడు పాండిత్య ప్రకర్షగలవాడు. ఈయన వ్యాఖ్యానరీతి—సమయోచితము, విషయానుగుణము, సమగ్రము, సరసము, సంప్రదాయసిద్ధము సహృదయ హృదయానంద దాయకమునై విరాజిల్లు చున్నది "సర్వశాస్త్ర సమాహారః సాహిత్యమ్" అని సకల శాస్త్ర సంప్రదాయ సమన్వయము అలంకారశాస్త్ర వ్యాఖ్యానమైన రత్నాపణమునందు తిలకింపుడు—

### 1. వ్యాకరణ సమన్వయము—

(క) గ్రంథారంభమున మంగళశ్లోకమునందలి "త్రిలోకజననీం" అను సమాసమునకు విగ్రహ వాక్యము—"త్రయాణాం లోకః, తస్యజననీం– అని షష్ఠీసమాసము అట్లుగాక 'త్రయాణాం లోకానాం సమాహారం' అని సమాహారద్విగువు చెసినచో 'త్రిలోకీ అని రూపమగును కనుక సమాహారద్విగు సమాసము చెప్పరాదు. అని నిరూపించి "త్రయవయవా విద్యా త్రివిద్యా, తామధీతే వేత్తివా త్రైవిద్యః" అని మధ్యమపదలోపసమాసము నిర్ణయించిన పతంజలి మహాభాష్య ప్రమాణముతో ఇట్లు వివరించియున్నాడు.

"త్రయవయవో లోక త్రిలోకః. శాకపార్థివాదిత్వాత్ మధ్యమపదలోపసమాసః. లోకత్రయ సముదాయోఽత్ర త్రిలోకశబ్దేన వివక్షితః. తస్యజననీమి తి షష్ఠీ సమాసః అన్యథాతద్ధితార్థ ఇత్యాదినా సమాహారసమాసే అకారాంతోత్తర పదత్వేన స్త్రీత్వాత్ "ద్విగోః" ఇతికారే త్రిలోకీ ఇతిస్యాత్. అతఏవ

"ద్విగోర్లుగనపత్యే" ఇత్యత్ర త్ర్యవయవా విద్యా త్రివిద్యా. తామధీతే వేత్తి వా త్రైవిద్యః. నతు త్రిస్రో విద్యా అధీతే ఇత్యర్థప్రత్యయనిమిత్తః. "తద్ధితార్థ ఇత్యాదినా సమాసః. అతఏవ ప్రత్యయస్య లుగభావః ఇత్యాహ భగవాన్ భాష్యకారః".

(ఖ). నాయక ప్రకరణమునందు "సదాతేజో భానౌ" అనుశ్లోక వ్యాఖ్యానమున "అసూర్యం పశ్యానామ్" అను సమాసమునకు 'నసూర్యం పశ్యంతీత్యసూర్యం పశ్యాః, తాసామ్' అని విగ్రహమనియు, 'నఞ్' కు సూర్యుడు కర్మగాఁగల దృశిక్రియతో సంబంధము కనుక 'అసూర్యం' అనునది అసమర్థ సమాసమనియు, వివరించుచు "అసూర్యం పశ్యాని ముఖాని" అనుచోట భాష్యకార వచనప్రమాణముతో కూడిన వ్యాఖ్యానము గమనింపఁదగినది—

'నసూర్యం పశ్యంతీత్యసూర్యం పశ్యాః 'అసూర్య లలాటయోర్దృశి తపోః' ఇతిఖశ్ ప్రత్యయః. 'అరుర్ద్విషత్—ఇత్యాదినా ముమాగమః 'ఉపపద మతిఙ్' ఇతిసమాసః. అత్ర నఞః సూర్యకార్మికయా దృశిక్రియయా సంబంధో నతు సూర్యస్యయా. అతో ఽసూర్యమిత్య సమర్థ సమాసః. తథాపిసాధురేవ. యదాహ భగవాన్ భాష్యకారః—'అవశ్యం కస్య చిన్నఞ్ సమాసస్యాసమర్థస్య గమకస్య సాధుత్వం వక్తవ్యమ్. అసూర్యంపశ్యాని ముఖానీతి.'

ఇట్టి నిర్ణయములందు సునిశితమైన వ్యాకరణ పాండిత్యము వ్యక్తమగుచున్నది.

## 2 శ్రుతిస్మృతి సంప్రదాయ సమన్వయము

(1) 'విద్యాకైరవకౌముదీం' అను మంగళ శ్లోకమున 'యత్పాదాబ్జనమస్క్రియాః' అనుచోట బహువచనమువలన భక్తి శ్రద్ధాతిశయములు దెలియుచున్నవను వ్యాఖ్యానము—శ్రుతిప్రమాణము—

"నమస్క్రియా ఇతి బహువచనం తాసాం భక్తి శ్రద్ధాతిశయ పూర్వకత్వం ద్యోతయతి. తథా విదానామేవ శ్రేయస్కరత్వాత్. తథాచ శ్రుతిః—'భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ.' ఇతి.

(2) నాయకప్రకరణమున వేదశాస్త్ర పురాణాదులవలెనే సదాశ్రయమైన కావ్యము హితప్రాప్తిని అహితనివృత్తిని కల్గించుచున్నదని నిరూపించు సందర్భమున "యద్వేదాత్..." అను శ్లోకవ్యాఖ్యానమున వేదశబ్దార్థ వివరణమునం—అప్రత్యక్షమైన ఇష్ట ప్రాప్త్యుపాయమగు జ్యోతిష్టోమాదికమును, అనిష్టపరిహారోపాయమైన కలంజభక్షణముతో నిరూపించి యున్నాడు—

"ప్రత్యక్షాద్యవిషయ మిష్టప్రాప్త్యుపాయం జ్యోతిష్టోమాదిక మనిష్టపరిహారోపాయం కలంజ భక్షణ వర్జనాదికం చ యేన విదన్తి సవేదః. తదుక్తమ్—'ప్రత్యక్షేణానుమిత్యావా యస్తూపాయో నబుధ్యతే, ఏనం విదన్తి వేదేన తస్మాద్వేదస్య వేదతా" ఇతి.

(3) ఈ శ్లోకముననే "కావ్యశ్రియా కర్తవ్యేకుతుకీబుధో విరచితః" అనుచోట, కావ్యసంపదచే బుధుఁడు కర్తవ్యమునందు కుతూహలము కలవాఁడగుచున్నాఁడు— అనియు, అకర్తవ్యమునందు కుతూహలము లేనివాఁడగుచున్నాడనియు, సమంజసమైన వ్యాఖ్యానము. కామిని కటాక్ష వీక్షణాది విలాసముల చేతనే కాముకుని ఆకర్షించి అభిలషితము నెరవేర్చునట్లును అనభిలషితము చేయకుండు నట్లును చేయగల్గునో అట్లే కావ్యసంపదయు వేదపురాణాదులకంటె విలక్షణమై వ్యంజనావ్యాపారముచేతనే కర్తవ్యా కర్తవ్యములను బోధించి ప్రవర్తింపఁజేయుచున్నదీ—అను వ్యాఖ్యానము సహృదయానంద సంధాయకమైనది—

"కుతుకీరాగవాన్ విరచితః. ఉభయత్రాప్యకార ప్రశ్లేషాదకర్తవ్యే పరదారహరణాదావకుతుకీ ద్వేషవాంశ్చేతి లభ్యతే. యథాకామినీ కటాక్షవీక్షణాది విలాసైరేవ కామిన మావర్జయన్తీ మమేదమభిలషితం కురు అనభిలషితం మాకుర్విత్యనుక్త్వైవ సర్వం

సంపాదయతి, తథాకావ్యస్యాపి రసవ్యంజనావ్యాపార మాత్ర పరత్వేన ఉపసర్జనీభూతశబ్దార్థాభ్యాం ప్రభుసుహృత్సమ్మితాభ్యాం వేదపురాణాభ్యాం విలక్షణాసతీ, సహృదయహృదయాహ్లాద కారణావ్యంజనా వ్యాపారేణైవ రామాదివద్వర్తితవ్యం నతురావణాది వదితిపుంసః కర్తవ్యేప్రవర్తయతి, నివర్తయతివాకర్తవ్యాదిత్యస్యాః కాంతాసమ్మితత్వ మవగన్తవ్యం. ఏతేనాస్యాః సరసతాపాదనేన ప్రవర్తకత్వాత్ భయానునయ పురస్సరం ప్రవర్తకాభ్యాం వేదపురాణాభ్యాం విశేషోవివక్షిత ఇతి బోద్ధవ్యమ్."

ఈ వ్యాఖ్యానము కావ్యసంప్రదాయ సర్వస్వ సంగ్రహ మనవచ్చును.

(4) ఈ శ్లోకమునసే 'తస్యైస్పృహాంకుర్మహే' అనుభాగమును వ్యాఖ్యానించుచు-విషయము, ప్రయోజనము, సంబంధము, అధికారి-అను, అనుబంధ చతుష్టయ మిట్లు నిరూపించియున్నాఁడు—

'పురుషార్థోపదేశః కావ్యస్య ప్రయోజనం తద్యుక్తం కావ్యంవిషయః, తజ్జ్ఞానం ప్రయోజనం, ఉభయోః సాధ్యసాధకభావః సంబంధః, జిజ్ఞాసురధికారీత్యనుబంధ చతుష్టయంసూచితమ్.'

ఇట్లు శాస్త్ర సంప్రదాయసిద్ధమైన కావ్యసంప్రదాయ సమన్వయము సమంజసమై యొప్పుచున్నది.

## 3. తర్కశాస్త్ర సమన్వయము—

"వైశేషికాదేరీశ్వర ప్రతిష్ఠాపకతయా జగత్పూజ్యతా" ఈవాక్యము వివరించుచు— అంకురాదికము ఘటము వలెనే కార్యమగుటచే సకర్తృకము-అనియు తర్కశాస్త్రము ఈశ్వరుని ప్రతిష్ఠించుచున్నదనియు, అనుమాన వాక్యముతో-"అంకురాదికం సకర్తృకం కార్యత్వాత్ ఘటవత్" ఇత్యాది ప్రమాణైరితిభావః," అను సంగ్రహ వివరణము తర్కశాస్త్ర పాండిత్య స్ఫోరకమగుచున్నది.

## 4. పూర్వమీమాంసా శాస్త్రసమన్వయము—

మహాపురుష గుణవర్ణనమే కావ్యమునకు ప్రాణమని నిరూపించుచు—"అథాతోధర్మ జిజ్ఞాసా' ఇత్యుపక్రమమాణేన సూత్రకృతా మహర్షిణాపి. పురుషాశ్రితస్య గుణశ్రేష్ఠస్య ధర్మస్య జిజ్ఞాసాద్వారేణ మహాపురుష గుణవర్ణనమేవ శాస్త్రస్యప్రాణా ఇత్యురరీకృతమ్—"అను మూలమును వివరించుచు-. వేదాధ్యయనమైనపిమ్మట వేదము వివక్షితమైన అర్థము కలదగుటవలన ధర్మజిజ్ఞాస చేయవలయును.—అని సూత్రార్థము. ధర్మమనగా శ్రేయస్సాధనమైన యాగాదికమేగాని అపూర్వముగాదు—అని భాట్టమతము. యాగాదివ్యతిరిక్తమైన అపూర్వమే ధర్మమని-ప్రాభాకరమతము—అను వ్యాఖ్యానము శాస్త్ర రహస్యార్థ సమన్వితము—

"అపూర్వం చ యాగాదేరవాన్తరవ్యాపారః శక్తిర్వా.' ఇతిభాట్టాః తస్యతాశ్రయణే ధర్మస్యాపూర్వద్వారా పురుషాశ్రితత్వం గుణత్వం చౌపచారికమ్. ప్రాభాకరాస్తు యాగాదివ్యతిరిక్తంస్థిరకార్యం లిజ్ఞాదివాచ్య మపూర్వమేవ ధర్మఇతి ప్రతిపేదిరే. తన్మతే పునస్తస్యాత్మ నిష్ఠత్వం గుణత్వంచ సంప్రతిపన్నమేవేతి సుష్ఠూక్తమ్"

ఇట్లు మీమాంసాశాస్త్రమునందును మహాపురుష గుణవర్ణనమే శాస్త్రమునకు ప్రాణమని, మతభేదసమన్వయముతోకూడిన వ్యాఖ్యానసరణి మీమాంసాశాస్త్ర పాండిత్య ప్రభావితమై యున్నది.

## 5. వేదాన్తశాస్త్ర సమన్వయము

నాయక ప్రకరణమునందు— "కింబహునా వేదాన్తా అపి బ్రహ్మప్రతిపాదకతయా పర ముత్కర్షయన్తే" వేదాన్తశాస్త్రము బ్రహ్మప్రతిపాదకమగుటచేతనె పరమోత్కర్షనందుచున్నదను మూలమును వివరించుచు ఆనందము, విషయానుభవము, నిత్యత్వము అను ధర్మములు బ్రహ్మయందున్నవనియు, సచ్చిదానంద

స్వరూపుడైన బ్రహ్మ నిర్గుణుడైనను నిర్దోషత్వమే గుణమనియు సప్రమాణమైన వ్యాఖ్యానము గమనింపుడు-

"నను చిదేకరసతయా నిర్ధర్మకస్య బ్రహ్మణః ప్రతిపాదకేషు వేదాన్తేషు గుణవత్పురుషవర్ణనం నాస్తీతి చేన్నైషదోషః, బ్రహ్మణ్యానన్దాదీనా మౌపాధికానాం విద్యమానత్వాత్ తదుక్తం పఞ్చపాదికాయామ్-ఆనన్దో విషయానుభవో నిత్యత్వంచేతి సన్తి తద్ధర్మాః" ఇతి అథవాసచ్చిదానన్దస్య బ్రహ్మణః నిర్గుణస్యాపి నిర్దోషత్వమేవగుణః యథాహమాఘః- "అపదోషతైవ విగుణస్య గుణః" ఇతి

ఇందు బ్రహ్మయొక్క సగుణత్వ నిర్గుణత్వ చర్చతో శాస్త్రసాహిత్య సమన్వయము వేదాన్తశాస్త్ర పాండిత్య నిదర్శకము.

## 6. అలంకారశాస్త్ర సమన్వయము

(1) కావ్య ప్రకరణమున 'తాత్పర్యార్థోఽపి వ్యఙ్గ్యార్థఏవ' అనునది అలంకారశాస్త్ర ముఖ్యఘట్టములలో నొకటి. మీమాంసకులు వర్ణించు తాత్పర్యార్థము వ్యఙ్గ్యార్థమునందే అంతర్భావము నొందునని ఈ వాక్యాభిప్రాయము. కవిసమయమున వాచ్యలక్ష్య వ్యఙ్గ్యములని అర్థములు మూడువిధములు. తాత్పర్యార్థము వ్యఙ్గ్యార్థమేగాని వేరుగాదు అని అలంకారికుల యభిమతము. రసాదిరూపమైన అర్థమునం దాసక్తములైన పదములభావమే తాత్పర్యార్థము. కాగా పదములయొక్కగాని పదార్థములయొక్కగాని విశిష్టార్థ ప్రత్యాయనశక్తి తాత్పర్యమని మతభేదముచే మీమాంసకులు తాత్పర్యార్థము నంగీకరించుచున్నారు. 'దేవదత్త, దండేన గా మానయ' అను వాక్యమున దేవదత్తకర్తృక, దండకరణక, గోకర్మక, అనయనరూపమైన విశిష్టార్థమే వ్యఙ్గ్యభిన్నమైన తాత్పర్యార్థము. దీనికి వ్యఙ్గ్యార్థమున అంతర్భావమెట్లు? అనగా 'ప్రతీయమానమైన రసాద్యర్థాంతరమునందే కవిసంరంభవిశ్రాంతి గాని మీమాంసకులు వర్ణించెడి తాత్పర్యార్థమునందుగాదు. కావున కవిసమయమునందు రసాద్యర్థాంతరమే తాత్పర్యార్థము'- అని నిర్ణయ సమాధానము. సంసర్గరూపమైన వాక్యార్థమెట్లేర్పడుచున్నదనగా-

'తార్కికాణామివ వాక్యార్థమహిమ్నా
అకాంక్షాది మత్త్వేసతి పదానాం
పదార్థానాం వా సమన్వయశక్తిర్వాక్యం
తద్బలాయాతో వాక్యార్థః'- అని సమాధానము,

ఇచట ఆలంకారిక సంప్రదాయ సమన్వితమైన వ్యాఖ్యానము పరికింపదగినది- 'ఏవంచసతి ప్రాచీనాలంకారిక శాస్త్రకారాణాం సంసర్గరూప వాక్యార్థస్య తాత్పర్యార్థత్వేన ప్రతిపాదనం మతాంతరాభిప్రాయేణేతి ద్రష్టవ్యమ్, అతఏవోక్తం కావ్య ప్రకాశే-' తాత్పర్యార్థోఽపికేషుచిత్ 'ఇతి ఉక్తంచ సుధానిధౌ-' అస్మన్మతం తాత్పర్యవ్యాపారాపేక్షం నభవతి ఇతి విద్యాధరేణాప్యుక్తమ్ తాత్పర్యంనామవ్యాపారాన్తరం పరైరభ్యుపగతమ్' ఇతి తస్మాద్వ్యఞ్జనాపరపర్యాయమేవ తాత్పర్యం కవిభిరఙ్గీకృతమ్ వాన్యదితిసిద్ధ అత ఏవోక్తం భావప్రకాశే "అతోర్థ్వన్యాఖ్య తాత్పర్య. గమ్యమానత్వతః స్వతః కావ్యే రసాలంక్రియాది ర్వాక్యార్థో భవతి స్ఫుటమ్" ఇతి ఉక్తంచ ధ్వన్యాచార్యైః- "యత్త్వభిప్రాయవిశేషరూపం వ్యఙ్గ్యం శబ్దార్థాభ్యాం ప్రకాశ్యతే తద్భవతి వివక్షితం తాత్పర్యేణ ప్రకాశ్యమానమ్" ఇతి

ఈ వివరణము ఆనందవర్ధనాచార్యాద్యాలంకారికాభిప్రాయశోభితమై రత్నాపణమునందొకరత్నమై ప్రకాశించుచున్నది.

(2) రసప్రకరణమున శాంతరసస్థాపనము.

ఈఘట్టము అత్యంత రమణీయమైన రసవాదఘట్టము. ప్రశ్నోత్తర సిద్ధాంతరూపమైనది, "రసతే న్స్వాదనార్థత్వాత్రస్యన్త ఇతితేరసాః" రసధాతువునకు ఆస్వాదించుట అని యర్థము, కనుక ఆస్వాదింపబడునవి రసములు. "విభావానుభావసాత్త్విక వ్యభిచారి సామగ్రీ సముల్లాసిత స్థాయీభావోరసః"

అని రససామాన్యలక్షణము సజాతీయ విజాతీయానభిభూతమై ఆస్వాదపదవ్యామము స్థిరమైనభావమే-స్థాయిభావము. ఆస్వాద్యమానమైన స్థాయిభావమే నిర్భరానంద సంవిద్రూపము నొందింపబడి రసపద వ్యవహార్యమగుచున్నది.

"అష్టౌనాట్యే రసాః స్మృతాః" నాట్యమునందు "శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుతములు" అనునవి ఎనిమిదిరసములు-అని నాట్యాచార్యుడైన భరతముని వచనము. ఈ సాక్షికవచనము ననుసరించి "శాంతరసము" లేదని భ్రాంతిపడువారు కలరు, వారిట్లు ప్రశ్నింపదగిన వారు.

(1) భరతముని శాంతరసమునకు స్థాయి భావము నిరూపింపనందువలననా? (2) రసమునకు సామగ్రి లేకపోవుటవలననా ? (3) శ్లాఘ్యము కానందువలననా ? (4) ఉక్తరసములందన్తర్భావము వలననా ? (5) పురుషార్థము కానందువలననా ?

సమాధానము:—

(1) నిర్వేదమేశాంతమునకు స్థాయిభావమని భరతముని యంగీకరించియున్నాడు. "నిర్వేదము స్థాయిభావముగాగల శాంతము నవమ రసమని"-కావ్యప్రకాశ తెల్పుచున్నది. "తృష్ణాక్షయ సుఖము యొక్క పరిపోషలక్షణమైన శాంతరసము ప్రతీయమానమగుచున్నది"- అని ధ్వన్యాచార్యులు ఇట్లు నిర్వేదము శాంతరసమునకు స్థాయిభావము కలదని మొదటి ప్రశ్నకు సమాధానము

(2) వైరాగ్యాది సామగ్రికలదు- "వైరాగ్య సత్పురుషసేవా వేదాన్తవిచారాదికము - విభావము, యమనియమాదులు-అను భావములు, మతిస్మృతి చింతాధృత్యాదులు - వ్యభిచారిభావములు" అని రెండవ ప్రశ్నకు సమాధానము,

(3) "రాగద్వేషకలుషితులకు అచర్వణీయమైనను, వీతరాగులగువారికి శ్లాఘ్యమై చర్వణీయమగుచున్నది" అని మూడవప్రశ్నకు సమాధానము.

(4) 'సామగ్రీభేదముకలదగుటవలన శృంగారాది రసములందంతర్భావము నొందుననుప్రసక్తియేలేదు'-అని నాల్గవప్రశ్నకు సమాధానము.

(5) మోక్షమను చతుర్థపురుషార్థము శాంత రసముచేతనే సాధ్యమగుచున్నది. అని అయిదవ ప్రశ్నకు సమాధావము.

ఇట్లు శాంతరసస్థాపనమున అలంకారశాస్త్ర హృదయసమున్మేషకమైన రత్నాపణరసరత్న మవధరింపుడు.

నను 'అష్టౌనాట్యేరసాః స్మృతాః' ఇతి నియమ నాన్నవమః శాన్తరసో నసంభవతీతి చేత్ తర్హిత ఏపంప్రష్టవ్యాః—కింమునినా శాంతరసస్థాయిన ఏవా నిరూపణాత్ తదభావః, ఉత తత్సామగ్రి వైఫల్యాత్ అహోస్విదశ్లాఘ్యత్వాత్ (4) అథవాన్తర్భావాత్ (5) యద్వాపురుషార్థాభావాత్ ?

నాద్యః, నిర్వేద ఏవశాంతస్య స్థాయిభావ ఇతి మునినాఙ్గీకృతత్వాత్ తదుక్తం కావ్యప్రకాశే- "నిర్వేదస్యామంగలప్రాయస్య ప్రథమమనుపాదేయత్వేఽపి ఉపాదానం వ్యభిచారిత్వేఽపి స్థాయిత్వాభిధానార్థమ్. తేన నిర్వేదఃస్థాయిభావః శాంతోఽపినవమోరసః ఇతి ఉక్తంచ ధ్వన్యాచార్యైః- "తృష్ణాక్షయసుఖస్య యఃపరిపోషస్తల్లక్షణోరసః ప్రతీయతఏవ" ఇతి. ఏతద్వ్యాఖ్యానవ్యాజేన లోచనేఽ ప్యుక్తమ్- 'తృష్ణానాం విషయాభిలాషాణాం సిద్ధోయః క్షయః సర్వతోనివృత్తి రూపోనిర్వేదః స ఏవసుఖం, తస్యస్థాయిభూతస్య యః పరిపోషః, తస్యచర్వ్య మాణతాకృతః, సఏవలక్షణం యస్యసః శాంతోరసః ప్రతీయతఏవ' ఇతి నచనిర్వేదః తృష్ణాక్షయాత్మా శమ పర్యాయో నసుఖరూపఇతి శంకనీయమ్. వైయాసికానా మవిద్యానివృత్తి పద

స్యాపి సుఖరూపత్వసంభవాత్ తదుక్తమ్-'యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యంమహత్సుఖం, తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతః షోడశంకలామ్ ఇతి.

నద్వితీయః, వైరాగ్యాది సామగ్ర్యాః సులభత్వాత్. తథాహి—వైరాగ్య పరమేశ్వరానుగ్రహ ప్రాచీనకుశల పరిపాక సత్పురుష సేవా వేదాన్తవిచారాదయోవిభావాః, యమనియమాదయోఽనుభావాః రాజ్యధురోద్వహనాదయోఽపిశాస్త్రస్య జనకాదేరనుభావా ఇత్యుక్తంలోచనే. మతిస్మృతి చింతా ధృతి వితర్కాదయో వ్యభిచారిణ ఇతి.

న తృతీయః, రాగద్వేష కలుషితాంతః కరణానామచర్వణీయత్వే నాశ్లాఘ్యత్వేఽపి వీతరాగాణాం తదభావాత్ యదికతిపయాశ్లాఘ్యత్వమాత్రేణ రసత్వాత్ ప్రచ్యవేత తర్హి వీతరాగాణామశ్లాఘ్య ఇతి శృంగారోఽపి ప్రచ్యవతామ్.

నచతుర్థః, సతావచ్ఛృంగారాదావస్తత్వాభవః సంభవతి, అప్రసక్తత్వాత్.

నాపిపంచమః, చతుర్ధ పురుషార్థస్య ముక్తేరేతదేక సాధ్యత్వాత్. తదుక్తంభావప్రకాశే—'సర్వప్రకారైః సంపూర్ణ కామః సంతుష్టమానసః, ప్రాప్నోతిముక్తిం చరమే శాన్తే నైవ రసేనసః.' ఇతి లోచనేచోక్తమ్—'మోక్ష ఫలత్వేన చాయం పరమపురుషార్థ నిష్ఠత్వాత్ సర్వరసేభ్యః ప్రధానతమః స చాయం శాన్తరసః' ఇతి. తస్మాన్నవైప రసాఇతి సిద్ధమ్."

ఇట్టి వ్యాఖ్యానము స్వప్రమాణమై సంప్రదాయ సిద్ధములైన అలంకార శాస్త్ర సిద్ధాంతములతో సమగ్రమై వెలయుచున్నదని స్థాలీపులాక న్యాయముగా మనవిచేసి తత్సూక్తి సంసేవనమువలన ధన్యుడనైతిని.

కుమారస్వామిసోమపీథి ఆలంకారిక శిరోమణి యగుటచే కాబోలు తనపాండిత్య ప్రకర్ష సుస్పష్టముగా చెప్పియుండలేదు. అయినను వ్యాఖ్యాన పాటవము ననుసరించి ఈతడును 'పదవాక్యప్రమాణ పారావార పారీణుడే' యని తెలియగలదు.

ఈ పండితవంశముచే ఆంధ్రదేశము అలంకరింపబడినదనియు, కుమారస్వామి సోమపీథి ప్రపితామహులైన మల్లినాథపండితుడును, తండ్రియైన మల్లినాథసూరియు, అన్నయైన పెద్దయార్యుడును— ప్రతాపరుద్ర, సర్వజ్ఞ సింగభూపాలాదులచే కనకాభిషేకాది గౌరవములందినట్లును, చరిత్రవలన తెలియుటచే, ఈతనికాలము క్రీ. శ. 14 వ శతాబ్ది ఉత్తరభాగమై యుండును. ఈ మహనీయుని రత్నాపణము సంస్కృత సాహితీ సామ్రాజ్యమునందు ఉన్నత పదము నధిష్ఠించి సహజ రత్నకాంతులతో విరాజిల్లుచున్నది.

# ప్రాచీన కావ్యములు – ఆనందోత్సాహ [illegible]

శ్రీ మానాప్రగడ శేషశాయి

తెలుగుసాహిత్య మొక సుందరమగు పూల తోట. అందుగల పూలజాతు లనేకములు. చంపకములు, శిరీషములు, పారిజాతములు, నందివర్ధనములు, కరవీరములు, కదంబములు—ఇవి యవి యననేల సకలర్తు సౌందర్య సారభూతములగు నానా పుష్ప తరువులతో భువి కవతరించిన నందనమువలె కన్పట్టును. అందలి వర్ణవిన్యాస వైచిత్రి కన్నులను మెఱపించి మనస్సును పరవశమొనర్చును

ఈ వసంత సుందరోద్యానమును తీర్చిదిద్దిన పూర్వాంధ్రకవీశ్వరులు చిరస్మరణీయులు తెలుగులెల్ల వేలుపులుగా కొలువదగిన మహాకావ్యమూర్తులను ప్రసాదించిన ధన్యజీవనులు. ఇవి మా జాతీయ మహాకావ్యములని తెలుగులు గర్వింపదగిన సుందర కృతులను అందజేసిన ప్రబంధ పరమేశ్వరులు. జాతికొక మేలుసేతయే వారి జీవనపరమార్థము. మంచిమనసుతో జాతిని ముందునకు నడపించుటయే వారి మహా సంకల్పము జాతిని కరగించి ఆశయముల కనురూపముగా పోతపోయవలెను. ఒక నవజీవనముతో ఒక నవ్యోత్సాహముతో జాతి వెలుగొందవలెను. ఆ సంకల్పమును సాధించుటకు వారెన్నుకొన్న మార్గములే మన మహాకావ్యములుగా రూపొందినవి.

మంచిమాటలు నాలుగు మనసునకు నచ్చునట్లుగా చెప్పి జాతిని అనురూపముగా మలంచుకొనవలయును. వారి వారి అభిరుచులు వేరు వేరులు కదా! ఒకరికయినది మఱియొకరికి కాదు ఒకనికొక పద్ధతిలో చెప్పినపుడు దానియందు మనస్సు ఏర్పడును. అందముగా కథ చెప్పినచో కొందఱు ఆనందింతురు వీనులకు విందగునట్లు పొందికగా మాటాడినచో కొందఱభినందింతురు. చక్కని పలుకుబడితో జాతీయములతో, సూక్తివైచిత్రితో పలుకరించినచో కొందఱు పరవశులగుదురు. సుధామధురమగు సుకుమార ఫణితికి మఱికొందఱు చొక్కుదురు అనంతములగు మార్గముల నాశ్రయించి వారి వారి అభిరుచులకు సరిపడునట్లు వారా యీ కావ్యములను

రూపొందించినారు. లోకశ్రేయమే వారి ధ్యేయము. ధర్మమును రమ్యముగా ఉపదేశించుటయే వారి తాత్పర్యము. అందఱును ఆ మార్గమునకు చెందినవారే. కాని వారా ధర్మమును చిత్ర విచిత్ర ఫణితులలో కావ్యముఖమున ఆవిష్కరించిరి. పూర్వాంధ్రకవులు తాకని సాహిత్య ప్రక్రియలేదు. పట్టినది బంగారమై, పలికినది కర్పూరమై దిగ్దిగంతములను సాహిత్య సౌరభముతో గుబాళింపజేసిన అమృతమూర్తులు. భోజరాజీయమును రచించిన అనంతామాత్యుడు ఆ కోవకు చెందినవాడు. సుధామధురమగు శైలీవిన్యాసముతో, సుకుమారమగు కావ్యమును నిర్మించి ఆంధ్రభారతిని అలంకరించిన కీర్తిశాలి.

అనంతు ముందున్న మహాకవులను తలంచుసరికి అనంతునకు తత్తరము బయలుదేరినది. ఇతివృత్త నిర్వహణములో కాని, కవితా ప్రాగల్భ్యములో గాని, వారిఛాయలనైన నిలుపమే! ఇక ఏ మార్గము నాశ్రయించి రసజ్ఞులను మెప్పింతును? పదిమంది రసజ్ఞుల మన్ననలు కన్నదికదా కావ్యము! చదివిన కొలంది చవులూరించుచు కాలమునకు నిలబడి సంతత శ్రావ్యమై సకలజనామోదమును పొందజాలిన కావ్యమును నిర్మింపవలెనన్నదే అనంతుని ఆలోచనము. వాణీవరప్రసాద లబ్ధమగు వాగ్విభవము తనకున్నది. ఆపాతమధుర గంగామనోజ్ఞమగు కవితాశైలి తనకు దావలచివచ్చినది. తెలుగులకు ధర్మమన్నచో అనంతమగు అభిమానమున్నది. కథలు వినుటలో వారికున్న మమకారమనంతము. ప్రసన్నముగా కథ చెప్పెడివారున్నచో రేయనక పవలనక వినుచునేయుందురు. తెలుగుల ఈ అంతఃకరణ ధర్మమును అనంతుడు గమనించినాడు. ధర్మోపదేశ సుందరములగు విచిత్రకథారత్నములను ప్రసన్న కవితా సూత్రముతో కూర్చినచో తెలుగులకు తీపియని అనంతు డెఱుంగును. అందులకే భోజరాజీయమును కథాకమనీయముగా రచించి తెలుగులకందించి సుప్రతిష్ఠితుడయినాడు.

కథను పట్టుగా నడపించుటలో అతని దందె వేసినచేయి. కథను కమ్మగా చెప్పికొనిపోవుచు, కథలో కథలను తొడుగుచు అవాంతర కథలచే ప్రధాన కథకేమాత్రము అఘాతము కలుగకుండ పాఠకుని మనస్సు నావర్జించు గుణము అతనిలో పుష్కలముగానున్నది. పాఠకుని మైమఱపించి తనతో గొనిపోవును. తాను చెప్పదలసిన ధర్మోపదేశమును కథాసంవలితమొనర్చి అందముగా మనసున కంటించిగాని విడువడు కనుకనే ఆ కావ్యము తావులను వెదజల్లు దొంతరమల్లెవలె మనకు సాక్షాత్కరించును. కథను కథగాను ధర్మమును ధర్మముగాను చెప్పినచో తీర్థమునకు తీర్థమై ప్రసాదమునకు ప్రసాదమై పదనుచెడి కావ్యమనిపించుకొనుటకే దూరమై యుండెడిది. కథాగతమై ధర్మము, ధర్మానుగతమై కథావిధానము పరస్పర పోషకముగా సాగి ఆ కావ్యమున కనంతశోభ సంపాదించి పెట్టినవి. ఆ కథాపుష్ప సౌరభ మిట్టిదియని వేర్పఱుపరానిది. కేవల మనుభవైక వేద్యము. అతని కథలన్నియు ధర్మోపదేశసుధలే. వానిలో గోవ్యాఘ్ర సంవాదమునకు ఏదానికిలేని ప్రశస్తి వచ్చినది. అది రెండాశ్వాసములమేరకు పఱవబడినది. ఆ విషయమే మనస్మృతికి రానీకుండ కథను సాగించుటయే అతని కథాకథన చాతురి. కథను కళకట్టించుటయన్న సామాన్యమగు పనికాదు. కవి లోకవృత్తమును సాకల్యముగా ఎఱింగినవాడు కావలయును. కథాకథనతత్త్వము నామూలాగ్ర మాకళించుకొన్నవాడు కావలయును. సంవాద కౌశలమెఱుంగవలయును. భిన్న భిన్న తత్త్వములను, మనఃప్రవృత్తులను తెలిసినవాడు కావలయును. ఈ లక్షణములకు తోడు మధుమయమగు ఫణితి ఉండవలయును. ఇవి యన్నియును కలవాడే కథాకథన కుశలుడుగా మన

గలడు. అనంతప్రతిభులకు మాత్రమే అవి సాధ్యమగునవి. అల్పప్రతిభులకు అలవికానివి.

రత్నమండనుడను రాకొమరుడు ఒక బ్రహ్మ రక్షస్సునకు పాల్పడును. ఆ రాక్షసుడు అకటి పెల్లున అతనిని గ్రసించుటకు సిద్ధపడును. వృద్ధులగు తల్లి దండ్రులకు, అప్పుడే పెండ్లాడిన ప్రియరాలికి ఈ వార్త తెలియజెప్పి వత్తునని రత్నమండనుడనును. విడచిపుచ్చినచో తిరుగ రాడని రాక్షసునిభయము. ఉత్తమమగు మానవజన్మమంది ఆడితప్పుటయును ఒక బ్రదుకగునా! పశువు నయితము సత్యమును పాటించుటకై ప్రాణములు విడచుటకు సంసిద్ధపడినదే! నా విషయమై శంకఏల ? అని రత్నమండనుడనుటయు ఆ కథావిశేషమును ఎఱిఁగింపుమని రాక్షసు డడుగుటయు జరిగినది ఈ వ్యాజముతో కథ నారంభించి మధురోదాత్తముగా గోవ్యాఘ్ర సంవాదమును నిర్వహించినాడు

ఒక విప్రవర్యునకొక హోమధేను వున్నదట. అమె నిత్యసత్యవర్తిని. సదాచారసంపన్న, ఎన్నడును కలహమునకుపోదు కల్గినదానితో తృప్తిపొందును చిఱుబుఱు మసుటలే ఎఱుఁగదు. కాలు కదపదు. పాలను ఆనందముతో కురియును. కొమ్ము విసరదు. చక్కని చనుకట్టు కల్గినది. ఇట్టి గోరత్నమొకనాడు పూరిమేయుటకై గ్రామపరిసరముల కేగినది. అక్కడ ఒక పులి ఒక పొదమాటున ఒడలెల్లదాచి. గోవును చూచి, ఆనందాతిరేకముతో, తోకతో నేల తాటించుచున్నదట! చూచినది తడవుగా కేలెత్తి ఆవుపై బడుటకు జంకించినది. ఇక ఏమున్నది? ఒకక్షణ మూరకున్నచో పైబడి పులి తన్ను విఱచును. గోవు ఏ మాత్రము కళవళములేకుండ 'నిలు నిలు' మని అన్నది ఎత్తిన కేలెత్తిన యట్లుండగా చిత్తరువులో వ్రాసినయట్లు పులి అట్లే నిలచిపోయినది. ఈ సన్నివేశ మెంత ఆశ్చర్యకరముగా నున్నది! అడవిలో ఆకటితో అలమటించుచున్న వ్యాఘ్రమా! మంచి శరీరపుష్టితో ఇమ్ముగానున్న గోవు కన్పడుటయా! గోవాగుమనియనగా దానిని విఱువక పులి అట్టులే నిలచుటయా! దీనిని రూపొందించుటలో అనన్యతు డవలంబించిన శిల్పము చూడుడు గోవును గుఱించి చెప్పవలయును. ఆమె హోమధేనువు. నిత్యసత్యవర్తిని. మొదలగు మహోదాత్తములగు విశేషణములతో మానవాధికమగు ఎత్తులో దానిని నిలబెట్టి ఆ వెనుక గోత్వ నిరూపకములగు గో సహజ లక్షణములను వర్ణించినాడు. మనకాగోవు సాత్త్వికముగా ఒక పెద్ద ఎత్తులో స్ఫురింపవలయును. ధర్మఘంటిక దానిమెడలో నిరంతరము మ్రోగుచునే యుండవలయును. అట్లని గో సహజ లక్షణమునకు దూరముకారాదు. ధర్మసోపానమును మనతోబాటెక్కించుచు గోత్వమునుగూడ నెడనెడ చూపించును ఇందువలననె ఆ గోవు ధర్మముప దేశించినను రమ్యముగానున్నది. మనకది ఎబ్బెట్టుగా లేదు. ఒక ఆత్మీయుడు, ఒక సహజత్వము, ఒక తాదాత్మ్యము ఆ గోవుతో పొందగలుగుచున్నాము. ఒక మారు ఉజ్జ్వల సత్త్వమూర్తిగా, ఒకపరి సర్వధర్మ స్వరూపిగా, ఒకసారి సంవాదపటువుగా, మఱొక మారుత్తమ గోమాతృమూర్తిగా దర్శనమిచ్చి మన అంతరంగమును మధురోదార భావములతో నింపివైచినది. ఒక ఉత్తమ చిత్రకారుని వర్ణచిత్రములోని వర్ణవిన్యాస వైవిధ్యమువలె వివిధ భంగిమలలో గోమూర్తిని దర్శింపజేసినాడు. దాని సాత్త్వికతకు, సత్యవాక్ప్రౌఢిమకు మనమేకాదు పరమ క్రూరస్వభావమగు అడవిపులి గూడ అట్టే నిట్టనిలువున నీరై నిలచినది. నిలచుటయే కాదు, ఒక పరివర్తనముతో హింసామయమగు ప్రవృత్తిని విడచి, జోహారుచేసి, విడచిపుచ్చినది.

పులియటె దీపనానలము పొంగుచు నుస్కియట్టె—యి
మ్ములనొక పాడిగోవపుడు ముందటికిం జనుదెంచు నట్టె - హో
నిలుమనినం భయంబడక నిల్చి కనుంగొన నట్టె బాపురే!
కలగక యాడుమాటలు అయి కాలునికైన శమింపజేయదే!

ఏమాత్రము కళవళములేకుండ గోవాడిన మాటలలో అంతటి గాంభీర్యమున్నది అనంతుడుగూడ ఆశ్చర్య చకితుడై అర్థాంతర న్యాసమున నిలచినాడు

ఇంతలో గోవునకు తన లేగనుగురించిన భావన వచ్చినది. అయ్యో! రేపు చనుగుడిపి వచ్చితినే! ఇటునటు గంతులు వైచును ఆ పుడిసెడుపాలు జీర్ణము కాగా, నాకై ఎంతగా కుతిలపడునో! అంబేరావముతో ఆరాటపడుచు గొడ్డుటావులకో, మహోక్షములకో అడ్డుగానేగుచో నా పసిలేగగతి ఏమికావలయును? ఒకగడియ లేగనుగురించిన దైన్యముతో తల్లడిల్లినది తనదైన్యము, వైవర్ణ్యము పైకి తోపనీకుండ, లోలోనదిమికొని పులితో తన చావు చెప్పినదట! ఎంతటి గాంభీర్యము! అవునుమరి—తనదైన్యము పులిరాజు గమనించినచో అతడు సంశయపడును ఇది తన్ను కేవలము బేల్పరచుటకు పన్నిన పన్నాగమనుకొనవచ్చును అట్లనుకొన్నచో పోనీయనేపోనీయదు. మొదలికే మోసమువచ్చును. కనుకనే వైవర్ణ్యము తోపనీకుండ పులితో ఉన్న తెఱంగు చెప్పగలిగినది.

"మునుమునవుట్టె నాకునొక ముద్దులపట్టి, యతండు పుట్టి ఏ
డెనిమిదినాళ్ళపాటి గలడింతియు పూరియు మేయ నేరడే
జని కడుపార చన్గుడిపి చయ్యనవచ్చెద నన్ను పోయిర
మ్మని సుకృతంబు కట్టికొనవన్న దయాగుణ ముల్లసిల్లగాన్
గుమ్మెడుపాలు నాసుతునకున్ బరితృప్తి ఘటించుగాని మాం
సమ్ము ఖిలమ్ము గైకొనక చాలదు నీయుదరాగ్నికైన ని
క్కమ్ముగ నిందులో ప్రథమకార్య వినిర్గతి నీవెఱుంగవే
పొమ్మనవన్న వ్యాఘ్రకులభూషణ చయ్యన పోయి వచ్చెదన్"

అన్నా! పులిఱేడా! మొన్న మొన్న పుట్టిన నా చిన్నికందును ఒక్కసారిచూచి, గుమ్మెడుపాలు ఇచ్చి వెన్వెంటవత్తును. నన్ను నిశ్శేషముగా ఆరగించినగాని నీ కడుపుమంట చల్లారదు. నాపిల్లడన్న నోపసికూన. గుమ్మెడుపాలు చాలు. నాబుల్లిలేగ నొక్కమారు అక్కున చేర్చికొని, ముద్దిడికొని, దానిబొజ్జనింపి. నీ పాదములపై వ్రాలెదను. పులికులమునకే నీ వలంకారప్రాయుడవు. పోయిరా నను జ్ఞయిమ్ము అన్నది గోవు. ఈ సంవాద మెంత కరుణరస నిర్భరముగానున్నది? ఎంత సహజ సుందరముగా నున్నది! వాత్సల్యవారాశియైన ఏ పెద్దముత్తయిదువో మాటాడినట్లున్నది. 'ఇంతయు పూరియు మేయనేరడు'—చన్గుడిపి చయ్యనవచ్చెద......గుమ్మెడుపాలు' మొదలగు మాటలచే గో సహజమగు వాతావరణము పొడకట్టుచున్నది. 'ఒక ముద్దులపట్టి—అతండు—ఏడెనిమిదినాళ్ళపాటిగలడు—మేయనేరడు' మొదలగువానిచే కథ ఆ వాతావరణము నుండి ఒక సముదాత్తమగు ఎత్తునకులేచి, మనమనసులోని మాధుర్యమును పుణికొని రమ్యముగా దర్శనమిచ్చుచున్నది. అనంతమగు కథాకథన కౌశలమున్నవాడుకాని కథకీ మాధుర్యమును కలిగింపలేడు. సరేగాని—బిడ్డకు పాలిచ్చి వత్తునంటివి అడవి బ్రతుకయినంతమాత్రమున నాకింత వివేకము లేదనుకొంటివా! ప్రాణము లెవ్వరికిని తీపికావు. అని

ప్రాణత్యాగ మెంతకష్టమో, ఆ సమయమున ప్రాణి ఎంత గిజ గిజ లాడునో రుజువుచేయుటకు పులి ఒక మునీశ్వరుని కథ చెప్పెను పులి, కథ చెప్పినను మనకు అసంభావ్యముగా నుండదు. అట్లుండకపోవుటలో నున్నది ఈ కథామర్మ మంతయును ఆ గోవ్యాఘ్రములట్టివి. ఇది ఎట్లును నన్ను నమ్మకున్నదేయని సత్యాచరణ మహత్త్వమును రుజువు చేయుటకై గోవు మదనరేఖా వృత్తాంతమును చెప్పి పులితో కొన్ని శపథములు పల్కెను. తాను తిరిగి రాకున్నచో "వెలదులసంసర్గము విడువలేని యతి పోవుగతికి, మధ్యస్థులమని చెప్పి పక్షపాతమతి బల్కు నాతనిగతికి, గోవు లుపవాసముండంగ కుడిచినతని గతికి, గోవుల తప్పులేకయును కొట్టిన తిట్టిన యాతడేగతింబోవునో—ఆ గతికి—వల్లదములాడి పెద్దలను బాధించు నతనిగతికి, విప్రుల కసేవ్య స్థలము లొసగు నతనిగతికి, పూర్వదత్తములగు వృత్తులను దోచు నతనిగతికి—అతిథిని నిరాదరించిన వానిగతికి తాను పోవునట!" ఇట్లు శతవిధములగు ధర్మశపథములు చేసినది. వజ్రకఠోరమగు వ్యాఘ్రహృదయముగూడ ఆ యమ చేసిన శపథములకు మెత్తపడినది. ఆవు అచ్చపు ధర్మదేవతగా తనకు పొడగట్టినది. ఆమె ధర్మ ప్రావణ్యము, ప్రసంగ మధురము తనలో కొంత పశ్చాత్తాపమును పాదుకొల్పినవి. కేవలము ధర్మోపన్యాసము చేసినను తాను నమ్మదు. కార్యార్థము ఏకరువు పెట్టినదిగా దాని మొగముననే తోచియుండెడిది. మొగమిచ్చకమునకో, మొగము దాచుకొనుటకో మాత్రము చేసిన పరమకృత్రిమ సంభాషణముగా ఉండియుండెడిది. అది యట్లుగాక తన మనసులోని మెత్తని పొరలను దయామధురముగ, స్వభావసుందరముగ కదలించినది. సహజము అగు వాతావరణమును సృష్టించి, గోసంబంధి సన్నివేశములోక కొన్నింటిని స్పృశించి, ఆ ప్రసంగమంతయును ఆత్మసంవాదముగామలచి, పులిగుండెనుగూడ వెన్నవలె కరగించినాడు అనంతామాత్యుడు. పోయి రమ్మన్నదే తడవుగా ఆ గోమాత చెంగుచెంగున ఒక్క అంగలో అల్లారు ముద్దుబిడ్డను సమీపించినది. సుధారస సమంచిత సారపయః పూరములతో ఆ చిఱులేగ బొజ్జను, యజమానుల పాలకుండనుగూడ నింపినది. తల్లికి సంబంధించిన ఉపద్రవము ఆ లేగ ఎఱుగదు. చెవులు వేలవైచుచు తల్లినానికొని నిశ్చేష్టముగ కొంత తడవుండును చెంగు చెంగున గంతులువైచును. కడలేని పొంగుతో భూమ్యాకాశములు పట్టకుండ పరువులెత్తును. తల్లిని ఏల్మారు తలఎత్తి చూచును. పసిపెట్టుకొనుచు, మోమిడి మూర్కొనుచు, అంతలో పసిబిడ్డ ఒడ్డగించినచో వారిని జంకించి మిన్నంటు చౌకళించుచు శైశవక్రీడలు నెఱపుచున్నది. ఆ నెత్తురుకందును చూచునరికి తల్లికి కన్నులలో నీరు నిండినది. ఈ పసివానిని విడచిపోవలయునా! ఎంతటిదైన్యము దాపురించినది? తల్లి తన్ను విడచి పోవలయుననియైనను ఎఱుంగదే! తల్లు లరుదెంచుచుండగా తన యీడుకోడెలతోబాటు, తానును ఎదురేగి, తనతల్లి లేకున్న విషయము తెలిసి తానెంత తల్లడిల్లునో! మఱికొంతసేపిచట తడసితినో పులి ఆకటికోర్వలేక నాపయి సత్యదోష మారోపించును. అని పిల్లవానిని చేరజని అతనికి కొన్ని నీతులు కఱపినది ఆనీతులు వేదాంతపు లోతులు. అనంతామాత్యుని బహుముఖీన ప్రతిభకు నిదర్శనములు.

"నిన్నుగని యిన్నిదినములు చన్నిచ్చితి
నేను ఋణవశంబున నిక నీ
వెన్నడు నన్నుదలంపకు మన్న మమత్వంబు
విడువుమన్న మనమునన్
మమకారంబు నహంకారము సంసారానుబంధ
రజ్జువులని చి
త్తముల వివర్జింతురు సంయమి లీవును నడపుమా
తదాచారంబున్

ఆడకుమసత్యభాషలు - కూడకు కొఱగానివాని -
గొంకక ఒరు లె
గ్గాడిన నెదురుత్తర మీజూడకు విని విననివాని
చొప్పునజనుమీ
నూతులవరులను లోతగుపాతటి కసవులను
ఎట్టిపచ్చికయున్నన్
బ్రాతిపడి మేయబోకుము మూతియిడకు ముగ్ర
సత్త్వములుగలనీటన్
ఏనుగలిగియుండగ నెవ్వానికి నినుముద్దుసేయ
వాలాయమగున్
కాని ఇటమీద నెవ్వడుగానికిగైకొనక చుల్కగా
జూచుజుమీ
చులకన జలరుహతంతువు చులకన తృణకణము
దూది చుల్కనజుమ్మీ
ఇలనెగయుధూళి చుల్కన చులకనమఱి తల్లిలేని
సుతుడు కుమారా!"

కనుక తల్లికై ధురపిల్లక సజ్జనమైత్రితో ప్రొద్దులు పుచ్చుము-తల్లి తన్నేల బుజ్జగించుచున్నదో తనకు తెలియదు తల్లిని ప్రాధేయపడి కారణమడిగినది. ఎట్టకేలకు నిజము తెలిసికొన్నది. పిడుగడచినట్లు నేలపై కొఱిగినది. వడవడ వడంకినది. దురంతమగు శోకముతో అంబారవముతో ఘూర్ణిల్లినది, నేలపై పొరలాడినది. తల్లిలేకున్న తన జీవనమే వ్యర్థమని తల్లడిల్లినది. తల్లితోడిదే లోకమని తనతో వత్తునని మారాముచేసినది. బిడ్డను ఎట్టలెటో బుజ్జగించినది త్యాగమహత్త్వమును ఎఱుకపరచినది. జీవితపువిలువలను తేటపరచినది. అనువంశికమగు ప్రతిష్ఠకు అభ్యుదయమునకు ఔరసుడవు కమ్మని ఉద్బోధించినది. పిల్లవానికి నచ్చజెప్పి తానిక రాదెమోయను సంశయముతో కుందుచున్న పులిదగ్గఱకు ఒక్కపరువున పోయి వ్రాలినది. రక్తమాంస పుష్కలమైన తన శరీరమును తృప్తిగా భుజించి తన్ను పుణ్యలోకములకు పంపుమని పులిరాయని ప్రార్థించినది. పులిబుభుక్షతీర్చుటయే తనపాలిట పుణ్యలోకమన్నది. ఆగోవుతెగువకు, ధీరతకు, సత్యవాక్శుద్ధికి పులి వెలవెలపోయినది. ఆ గోరత్నమును జూచి "నీ విమలసత్యప్రౌఢికిఁ మెచ్చువచ్చె, నినున్ జంపగ జాల నీదుతలగాచెఁ ధర్మమిప్పుడు సొమ్ము నిజావాసముచేర" అన్నది. ఎంతగా బ్రతిమాలినను గోవు తన గంగడోలును బిగియగ మెడఎత్తుకొని తినుమని పులిదగ్గఱకు పోయినదట. గోవు జరిగినకొలది పులి వెనువెనుకకు నడచుటయేగాని దానిని విఱచుటకు సమ్మతింపలేదు. ఆగోమాత సత్యవాక్శుద్ధికి, పులిరాయని కృపాసమగ్రబుద్ధికి దేవతలే వెఱగందిరట. శ్రీమన్నారాయణుడు అనంతకల్యాణగుణ సంపన్నములైన ఆ గోవ్యాఘ్రములను ఆనందముతో అనుగ్రహించెనట. ఆగరుడవాహనుని చరణములను గోవ్యాఘ్రములు శిరసుతో నంటినపుడు ఆయన త్రివాహనుడయినట్లు పొలిచెనట!

"కలువలుఁదమ్ములున్ నమవికాసము నందగజేయు
క్రొలుగ
న్నులుగలనీకు, బొన్నును మనోజ్ఞరథంబును
నాగ తద్విరో
ధులయిన నీకు నారయ జతుర్భుజ! చేయగ దె గోవునుం
బులియును శత్రుభావముల బోనిడి మైత్రియొనర్చు
నట్లుగాన్"

అనంతుని కథలోనున్న చమత్కారమే ఇది. పరమ సాత్త్విక స్వభావముగల గోవును, అత్యంతక్రూర స్వభావముగల వ్యాఘ్రమును ఒకచో నిబంధించి,

కథాపాటవ మేమాత్రము సడలనీకుండ, ఉపదేశమునే పట్టునను పైకుబుకనీయక, సంయమనముతో, సంవిధాన చతురిమతో, సరసోదారమగు శైలీమాధుర్యముతో దేవతలు సయితము విస్మయపడునట్లుగా కథను ప్రసన్నమొనరించినాడు. భావసంఘర్షణమును ఇంత సుకుమారముగా మలచుట మహాకవికిమాత్రమే సాధ్యమగును. గోవ్యాఘ్రములు ధర్మాధర్మములకు ప్రతీకలు ధర్మవిజయమే అనంతామాత్యుని కథా పరమార్థము,

భోజరాజీయమొక ప్రసన్నకవితా సరస్సు. కలువలును, తామరలును సమవికాసముతో వికసించి చూపరులను ఆనందపరచుటయే ఆ సరసులోని విశేషము.

# సాళువ నరసింహరాయల సాహితీపోషణము

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

సత్కవిసత్కారమునకు, సత్కృతి నిబంధమునకు, సారస్వతాభివృద్ధికి, సాహితీ పోషణమునకు, సత్కళాపోషణ పరాయణులగు రాజచూడామణులును వారి కవితాపోషణ ప్రశస్తికి, నిర్నిద్ర విజయోపార్జిత సకలవైభవోపేత సామ్రాజ్య సంవర్ధనమును మూలం కారణములు. విజయనగర రాజ్యమేలిన సంగమ రాజ వంశావసానమున, ప్రభువులు దుష్టులు, దుర్బలులగుట రాజ్యమరాజక మయ్యెను. రాజ్యమెప్పుడును వీరభోగ్యము విజయనగర రాజ్యలక్ష్మి దుర్జనులగు జననాథుల సన్నిధానమున నుండనొల్లక బల దర్ప శౌర్య ప్రతిభావంతులగు సాళువాన్వయ నరపాలుర నాశ్రయించి వారి బాహుపీఠము నధిష్ఠించెను.

రెడ్డి రాజ్యావసానమున తూర్పుతీరాంధ్రమును గజపతులు, నరపతులు, అశ్వపతులు కదనరంగముగ మార్చివేసి, యొకరితో నొకరు పోరాడుచుండిరి. తుట్టతుదకీ ప్రాంతమంతయు గజపతుల పాలబడియెను. అంత కొంతకాలము దేశమునందు శాంతి భద్రతలేర్పడెను. జనులకు, జననాథులకు విరామమేర్పడెను. శాంతి సుఖములే సారస్వతాభ్యుదయమున కత్యంతావశ్యకములు. తూర్పుతీరమున గజపతులు, సామంతమండలేశ్వరులు ఆంధ్రకవీశ్వరుల నాదరించి, పోషించి, యాంధ్రసాహిత్యపోషణమునకు గారకులైరి. ఉదయగిరి దుర్గ ప్రభువగు బసవ భూపాలునకు దూబగుంట నారాయణకవి పంచతంత్ర మంకితమిచ్చెను. అతని మంత్రియగు గంగయామాత్యునకు శ్రీనాథుని మఱదియైన దుగ్గనకవి నాచికేతోపాఖ్యానమును రచించి యంకిత మొసంగెను. నందిమల్లయ్య, ఘంటసింగయ్య యను జంటకవులు ప్రబోధచంద్రోదయ కావ్యమును రచించి పైగంగయామాత్యునకే యంకితము నొసంగిరి. ఇదియే తూర్పు తీరమున పదునేనవశతాబ్దాంత రాజకీయ సారస్వత వాతావరణము.

ఇక విజయనగర రాజ్యమందున్ననో యట్టి పరిస్థితులే పరిఢవిల్లెను. విరూపాక్షరాయల రాజ్యాంత

కాలమున సంభవించిన యల్లకల్లోలముల నణచివైచి, వైరివీరుల నుక్కడగించి, అర్వీటి బుక్కరాయల సహాయముచేతను, తన సామంత దండనాథుడగు తుళువ నరసింహరాయల తోడ్పాటువల్లను, సాళువ నరసింహరాయలు విజయనగర రాజ్యసింహాసన మధిష్ఠించెను గజపతుల తోడను, మహమ్మదీయుల తోడను సంగ్రామములు సమసిపోయెను. దేశమునందు విప్లవములులేక రాజకీయ వాతావరణము ప్రశాంతమై యుండెను. ఇచ్చట నింకొక విషయము చెప్పవలసి యున్నది. విజయనగరమేలిన మొదటిరాజవంశమగు సంగమరాజవంశము కర్ణాటకకులమునకు జెందినది ప్రభువులు దేవభాషయగు సంస్కృతమున, దేశభాషయగు కర్ణాటకమునను బోషించిరి. ఆంధ్రులలో కొందఱు మాత్రము దండనాయకులుగను, భండాగారాధికారులుగను, మంత్రులుగను నుండిరి. బుక్కరాయలు నాచనసోమునకు నొసగిన గ్రామదానశాసనమును ప్రౌఢదేవరాయల కాలమున శ్రీనాథునకు కనకాభిషేక మహోత్సవ కార్యమును ఆ ప్రభువు లాంధ్రకవి పోషణమునకు జేసిన ప్రముఖకార్యములు. సాళువరాజులాంధ్రులు, వీరుపూర్వము ఆంధ్రదేశమున స్థిరనివాసమేర్పఱచుకొని చంద్రగిరిదుర్గమున కేలికలై, కీర్తిగాంచినవారు. అందు సాళువ నరసింహరాయలు సుప్రసిద్ధుడు. కావుననె ఆంధ్ర సాహిత్య వాహిని తూర్పుతీరమున నాకనాటినుండి పశ్చిమవాహినియై తుంగభద్రానదిలో గలిసిపోయెను.

ఉదయగిరిరాజ్య మేలిన బసవభూపాలకుని యాస్థానమున ప్రసిద్ధిని గాంచిన దూబగుంట నారాయణకవి, నందిమల్లయ, ఘంటసింగయ, దుగ్గన కవుల నిదివఱకే పేర్కొనియున్నాము. ఆ కాలమున నే, పాకనాటి యందలి సోమరాజుపల్లె నివాసియగు నియోగిప్రభువైన వెన్నమంత్రికి పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి శకుంతలాపరిణయకావ్యమును రచించి, కృతి యొసంగెను. శకుంతలాపరిణయ కావ్యము రచించు నాటికే కవి ప్రసిద్ధుడు ఈకవి తానురచించిన కావ్యములనిందు వ్రాసి యున్నాడు. అవి అవతారదర్పణము, నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాససారము అనునవి. ముప్పది సంవత్సరములు సంగమరాజన్యుల సామంతమండలేశ్వరులై, చంద్రగిరి దుర్గాధ్యక్షుడై ప్రసిద్ధిని గాంచిన సాళువ నరసింహరాయలు క్రీ శ 1485–86 సంవత్సర మధ్యమున విజయనగరసింహాసనాధ్యక్షుడయ్యెననుటకు శాసనములె ప్రమాణము ఇతని యమాత్యశ్రేష్ఠులలో నాదెండ్ల చిట్టిగంగనయొకడు నరసింహరాయల సహాయులలో పిల్లలమఱ్ఱి పినవీరన్న సోదరుడగు పెదవీరభద్రుడొకడు. ఇతడు రాయసింహాసనమునుండి, డెబ్బదివేల సామంతుల కధికారియై ప్రఖ్యాతి గాంచిన వాడు. కావుననే పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి కర్ణాటక రాజధానియైన విజయనగరమునకు వచ్చి, రాయల యాస్థానకవియై, సంస్కృత జైమినిభారత కావ్యమును దెనుగు గావించుచు, నాపురాణమే నరసింహరాయల కభిమానమగు గ్రంథమవుటజేసి, యాతని యాజ్ఞ చొప్పున ప్రభువునకంకితమిచ్చెను. పై విషయము జైమినిభారతకృతియందు కవి యిట్లు వ్రాసియున్నాడు.

కం. నామది నిరతము భారత
రామాయణ కథలఁ బ్రేమ రంజిలు నంటన్
జైమిని భారతమనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్.

తే. ఆ పురాణము గనఁ దెనుఁగయ్యెనేనిఁ
జెప్పనేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁ డేనిఁ
దెనుఁగు నుడికారమున మించు గవియె యేనిఁ
కుందనము కమ్మవలచిన చందమగును

వ. అని సభాసదుల మొగంబులు చూడ
నవధరించిన నా రాజసత్తము చిత్తం
బెఱింగి వారిట్లని విన్నవించిరి.



శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

కం ఏ రీతి నెఱిఁగెనో పిన
వీరన దేవర తలంపు విఖ్యాతముగాఁ
బేరును బెట్టెది యును దన
పేరుగ రచియించెఁబూనెఁ బేశలఫణితిన్

కం. తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువన భాసుర కృతి ని
ర్మాతలు పిల్లలమఱ్ఱి వి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్.

విజయనగర రాజ్యంలో అంధ్రకావ్యకృతి భర్తయైన ప్రథమ పృధ్వీపతి సాళువ నరసింహ రాయలు. నాటినుండియు అంధ్రకవితా రమణికి విజయనగరాస్థానము నాట్యమందిరమయ్యెను. అంధ్ర మంత్రులకును, ఆంధ్రకవీశ్వరులకును కాణాచియగు పినవీరభద్రకవి అంధ్రకవితా పతాకమును విజయ నగరాస్థాన భవన ప్రాంగణముపై నెగురవైచెను.

జైమినిభారతము అరువది యెనిమిది యధ్యా యముటకల యుద్గ్రంథము. దాదాపు అరువదివేల పైగా శ్లోకములు గల యీ సంస్కృత మహాపురాణ మును, పినవీరభద్రకవి ఎనిమిది యాశ్వాసముల యాంధ్రకావ్యముగా నొనర్చెను సంస్కృత జైమిని భారతము ముద్రితమైనది ఇందనేక రమ్యములైన కథలుకలవు. ఇట్టి యపూర్వమైన పురాణ కథా శ్రవణము నందు నరసింహప్రభువున కభీష్టముకల్గు టయు, నద్దానిని అంధ్రీకరించుతలంపు పినవీరభద్రు నకు సంభవించుటయు సంభావింపదగినది.

కం స్తుత్యముఁ గలికల్మష రా
హిత్యము నాఖ్యాయికావిహిత బీజ చతు
ష్టిత్యము శ్రీహరికథలను
నిత్యంబునునైన జైమినిజభారతమున్,

జై. భా. ౧. అ,

పినవీరభద్రకవి శ్రీభారతీతీర్థ గురుచరణ కరుణాలబ్ధ సిద్ధసారస్వత పవిత్రుడు. ఈ భారతీతీర్థ యతీంద్రుడు శృంగేరీ మఠమలంకరించిన మఠాధిపతులలో నొకడు. వారిలో నీదిగువ యిద్దఱిలో నొకరైయుందురు.

| | | క్రీ శ. |
|---|---|---|
| (1) | రెండవ నరసింహ భారతి | 1464–1472 |
| (2) | రెండవ పురుషోత్తమ భారతి | 1472–1517 |

ఈకవి పురుషార్థసుధానిధి యను గ్రంథము రచించి యున్నాడు. ఈ గ్రంథము విద్యారణ్యులుసంస్కృత మున రచించిన పురుషార్థనిధికి తెలుగై యుండునని పరిశోధకుల యభిప్రాయము.

ఏనాడు ప్రభువులు కవితాపోషకులైరోయానాడె మండలేశ్వరులును, వారి ననుసరింతురు. సాళువ నరసింహరాయల చమూపేశ్వరుడును, శ్రీకృష్ణరాయల తండ్రియునగు తుళువ ఈశ్వరనరసింహరాయలు నందిమల్లయ ఘంట సింగయలను కవిద్వయము రచించిన వరాహపురాణ కావ్యము కృతినందెను ఈ జంటకవులె యిదివఱకు బసవభూపాలుని మంత్రి యైన గంగయామాత్యునకు ప్రబోధచంద్రోదయ కావ్యమునురచించి కృతినిచ్చియుండిరి. వరాహ పురాణావతారికలో గవులిట్లు వ్రాసియున్నారు.

*"అట్టి నరసింగ రాజరత్నంబు చేత మన్నన వడసి సైన్యనాయక పట్టబద్ధత్వంబున నిర్భర విజయ లక్ష్మీ మహత్త్వంబున మదవదభియాతి భయద సత్త్వంబున దీర్ఘాయురైశ్వర్యధుర్యుండైన యీశ్వర నాయకునకుం బ్రియతనూభవుండు సరస వసుధాధ్యక్షుండు నిర్వంచింతానుగ్రహంబునం బరి గ్రహించి యుమ్మహాప్రబంధమునకు, శృంగార విభూషణంబుగాఁ దదీయ వంశావతారంబు రచి యింతుమది యెట్టిదనిన"*

అంధ్ర సారస్వతపోషణము సామ్రాజ్యాధి నేతలేగాక, సామంతదండనాథులు సహితము గావించి కీర్తికాముకులైరనుటను పైవిషయమె చాటుచున్నది. సాళువ నరసింహరాయల అంధ్ర సాహితీపోషణమె

తదువాతి ఆంధ్ర సాహిత్యాభివృద్ధికి ఆలవాలమయ్యెను. పోషకులు, పోషితులు పరస్పరము తమతమ సాహిత్యాభిరుచిచే నన్యోన్య వాత్సల్యాదిక గౌరవోపేతులై, యాచంద్రార్కము కీర్తిని గాంచియున్నారు.

సాళువ నరసింహరాయలు ఆంధ్రకవితా పోషకుడౌటయే గాక సంస్కృత సాహితీ పోషణమును గావించెను సాళువాభ్యుదయ, అచ్యుతరాయాభ్యుదయ, భాగవతచంపూకావ్యముల రచించిన రాజనాథ కవి సాళువాభ్యుదయ కావ్యములో సాళ్వ నరసింహ రాయలను స్తుతించి యున్నాడు. రాజనాథకవి నరసింహరాయలు చనిపోయిన చాలకాలమునకు పిమ్మట సాళువాభ్యుదయ కావ్యమును రచించియుండెను. రాజనాథకవి పూర్వులు రాయల యాస్థానమున, శాసనకర్తలైయుండి యాతనిచే పోషింపబడుటకారణముగా నీ కావ్యమును రచించియుండును. సాళువ నరసింహరాయలు రామాభ్యుదయ సంస్కృతకావ్యమును రచించెనని యా కావ్యమునందలి కొంతభాగము "విజయనగరచరిత్రనుగూర్చిన యాధారము"లను సంకలిత గ్రంథమునం దుదాహరింపబడినది. కాని యాగ్రంథమందె రామాభ్యుదయ పంచమసర్గములోని కడపటి శ్లోకము దాహరింపబడి. యయ్యది రాజనాథ కవి అభిరామ నాయికల కుమారుడైన శోణాద్రినాథుడే రచించి నట్లు తెలుపబడినది ఈవిషయ మింతటితో ముగింపనగును.

ఈ వ్యాస రచనమున సంప్రదించిన గ్రంథములు.


(1) దూబగుంట నారాయణకవి - పంచతంత్రము

(2) దగ్గుపల్లి దుగ్గనకవి - నాచికేతోపాఖ్యానము.

(3) నందిమల్లయఘంటసింగయ - ప్రబోధచంద్రోదయము వరాహపురాణము.

(4) పిల్లలమఱ్ఱి పినవీరన్న - శృంగారశాకుంతలము జైమినిభారతము.

(5) జైమిని సంస్కృతభారతము - ప్రచురణకర్తలు - గంగాధరశాస్త్రి - లక్ష్మీవేంకటేశ్వర ముద్రణాలయము, కళ్యాణనగరము బొంబాయి (Bombay)

(6) Vijayanagar Sex Centenary Commemoration Volume 'Sanskrit Literature under Vijayanagara'

(7) 'Sources of Vijayanagar History' by S. Krishnaswamy Ayyangar.

(8) ఆంధ్రకవితరంగిణి - ఆఱవ సంపుటము శ్రీ చాగంటి శేషయ్య.

(9) సంస్కృత వాఙ్మయచరిత్రము - శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

# ఉజ్జ్వల నీలమణి

శ్రీ రావూరి ప్రసన్నసత్యనారాయణ

అఖండమైన చిచ్ఛక్తియొక్క యుజ్జ్వలమైన యొక మధురోహయె యీ ప్రపంచము ఉజ్జ్వలతలో మాధుర్యమున్నది – మాధుర్యములోనే ఉజ్జ్వలత యున్నది. సగుణబ్రహ్మముయొక్క విశిష్టలక్షణములైన యౌజ్జ్వల్య మాధుర్యముల మధురమేళనమే యానందస్వరూపమైన నిర్గుణబ్రహ్మముయొక్క రూపము.

రసరూపుఁడైన భగవానుని నిర్గుణునిగ గ్రహించిన పరమభక్తుఁడు పరజ్ఞాని శ్రీరూపగోస్వామి. రసమునందు మఱి గుణములేదుగదా! రసరూపుఁడైన భగవానునిలో లీనమగుట యనెడి రసరూపసాయుజ్యముక్తిని బొందుటకు భారతీయాధ్యాత్మిక శాస్త్రము బోధించుమార్గములందెల్ల రసరూపమైనది భక్తిమార్గము. విష్ణువుయొక్క విభవావతారములందెల్ల మధురరసప్రవాహ సముజ్జ్వలమైనది శ్రీకృష్ణావతారము. కృష్ణసమ్బద్ధమైన భక్తిమార్గములందెల్ల నగ్రగణ్యము భాగవతభక్తి సంప్రదాయము. భాగవతమందలి మధురరసాలంబనములైన గోపికాకృష్ణులాలంబనముగా వెలసినది వల్లభాచార్యుని పుష్టిమార్గము. వల్లభసంప్రదాయమందలి గోపికాకృష్ణుల దృష్టిలో నిడికొని గోపికలకు శ్రీకృష్ణునియెడఁగల మధురరసౌజ్జ్వల్య పరిపుష్టమైన భక్తియందలి పరస్థితిలోని తుట్టతుదిస్థాయియైన మహాభావము నాధారముగాఁజేసికొని రాధాకృష్ణపరముగ వెలసినది చైతన్యుని మధురభక్తి సమ్ప్రదాయము జీవుఁడు పరమాత్మలోవలె మధురభక్తి సంప్రదాయములోఁబుట్టి మధురభక్తిలో జీవించి మధురభక్తిరసములోనే లీనమైన చైతన్యభక్తుఁడు, శిష్యుఁడు శ్రీరూపగోస్వామి.

రూపగోస్వామి చైతన్యునికంటె నైదేండ్లు చిన్నవాఁడు – చైతన్యుని శ్రీకృష్ణసాయుజ్యానంతరముగూడ ముప్పదియాఱేండ్లు జీవించినవాఁడు (చైతన్యునికాలము క్రీ. శ 1485–1527 రూపగోస్వామి కాలము క్రీ. శ. 1490–1563) రూపగోస్వామి చరిత్ర తెలిసికొనుటకుఁ బ్రధానాధారగ్రన్థము నరహరి చక్రవర్తి రచించిన భక్తిరత్నాకరము. నరహరి చైతన్యుని

శిష్యుఁడు. భక్తిరత్నాకరమునందు రూపగోస్వామి చరిత్రతో పాటింకను బెక్కురుభక్తుల చరిత్రములు వర్ణింపఁబడినవి. రూపగోస్వామి సంపన్నకుటుమ్బ సఞ్జాతుఁడు. గోస్వామి పట్కమునందు రెండవవాఁడు. ఈతనితండ్రి. కుమారనామకుఁడు—అన్న సనాతన గోస్వామి—తమ్ముఁడువల్లభుఁడు. వల్లభునిపుత్త్రుఁడు జీవగోస్వామి రూపగోస్వామికి శ్రీరూపుఁడు శ్రీరూప దేవుఁడు ననువాడుక యున్నది. ప్రయాగయందు రూపగోస్వామిని కాశియందు సనాతనగోస్వామిని భక్తి సంప్రదాయ ప్రచారముకొఱకు చైతన్యుఁడు నియమించినాఁడు. ప్రచారానంతరము కొంతకాలము రూప గోస్వామి బృన్దావనమునందు మహాభావ పరమోత్కర్ష తర్షితుఁడై జీవించి తుదకు శ్రీకృష్ణసాయుజ్యము నొందినాఁడు. ఈయన రచనలు: విదగ్ధమాధవము, లలిత మాధవము, ఉద్ధవసందేశము, హంసదూత, భ్రమర దూత, దానకేళికౌముది, పద్యావళి, ఉజ్జ్వలచన్ద్రిక, యమునాస్తోత్రము, గన్ధర్వప్రార్థన, ఆనన్దమహోదధి, గౌరాంగస్తవ కల్పతరువు, కుసుమస్తబకము, ముకున్ద ముక్తావళి, మధురామహిమ, ఉజ్జ్వలనీలమణి, భక్తి రసామృతసిన్ధువు, మున్నగునవి. ఇందుఁ గొన్నిముద్రితములు—కొన్నియముద్రితములు. విదగ్ధమాధవము రాధామాధవులు నాయికానాయకులుగా భక్తిరసప్రధానముగా రచియింపఁబడిన యేడంకముల నాటకము. చైతన్య భక్తిసంప్రదాయ సంబంధిమైన విజ్ఞానము సర్వము తనరచనలయందు సంపూర్ణముగ వెల్లివిరియ వలెనని గ్రన్థరచన విషయమున రూపగోస్వామి చూపయినట్లు తెలియుచున్నది.

భరతుని రససిద్ధాంతము నాధారముగాఁజేసికొని రాధామాధవుల నాలంబముగాఁజేసి రాధకు గృష్ణుని పైఁగల శృంగార రూపభక్తి, రసస్వరూపమైనదని యారసజనక ప్రక్రియసంతతిని సాంగోపాంగముగ సొంతముగ సంపూర్ణముగ నిరూపించుచు రూపగోస్వామి వ్రాసిన గ్రన్థమే యుజ్జ్వలనీలమణి. భక్తి తత్త్వదృష్టితో నాలంకారిక సంప్రదాయదృష్టితో నుజ్జ్వల నీలమణికిఁగల స్థానము విశిష్టము నద్వితీయమునైనది. కారణము రూపగోస్వామికిఁ బూర్వమందున్న యాలంకారిక శిరోమణులు భరతదండిభామహోద్భట వామన రుద్రట భట్టలోల్లట భట్టశంకు కానందవర్ధన రాజశేఖర భట్టనాయక క్షేమేంద్ర మమ్మట శారదాతనయ హేమచంద్ర వాగ్భట రాజానక రుయ్యకవిద్యానాథాదు లందఱును శృంగారమునకుఁగల రసత్వమును వేయి ముఖముల ముమ్మాటికి నొక్కి వక్కాణించి భక్తికి గల రసత్వము విషయమై యాయాసు నైత్తిక యుజ్జగించి యూరకొన్నవారే. రూపగోస్వామికిఁ దరువాతివారైన మధుసూదన సరస్వతి (భక్తిరసాయనము—శ్రీ పోతుకూచి సుబ్రమణ్యశాస్త్రిగారి యాంధ్రవివృతితొ తెనాలి శ్రీ సాధన గ్రంథమండలి వారిచే 1953 వ సంవత్సరమున ప్రకటితము), విశ్వనాథపండితుఁడు (ప్రేమరసాయనము—చౌఖంబా సంస్కృత సీరిజ్ ఆఫీసువారిచే శ్రీ విష్ణుప్రసాద్‌భండారిగారిచే సంశోధింపఁబడి 1928 వ సంవత్సరమున ప్రకటింపఁబడినది. సాహిత్యదర్పణ కర్తయైన విశ్వనాథునికంటెఁ బ్రేమరసాయన కర్తయైన విశ్వనాథుఁడు భిన్నుఁడని శ్రీ విష్ణుప్రసాద్ భండారిగారు తమ ప్రేమరసాయన భూమికయందు నిర్ణయించిరి). విశ్వనాథ చక్రవర్తి (మాధుర్యకాదంబిని) మున్నగువారు భక్తిపదార్థమునకు రసత్వమును ఘంటాపథముగా నిరూపించిరి కాని, వారిది కేవలము తాత్త్వికదృష్టి. వారు తామాలంకారికులమని యేకోశమునందైన భావించినట్లుగా వారి రచనలనుబట్టి మనము గ్రహించుట కవకాశమే మాత్రము గనుపింపదు. వారిది కేవలము మహర్షి మార్గము. ఆలంకారికశిఖామణి యనఁదగిన పండితరాయలు మధుసూదనసరస్వతికిఁ దరువాతివాఁడు. లౌకికాలౌకిక ప్రవృత్తులు రెండింటిని సమమైన పాళులలో రంగరించి పుచ్చుకొన్న వాఁడాయన. ఆయన

విష్ణుభక్తుఁడు-సూర్యోపాసకుఁడు. సుధాలహరి, కరుణాలహరి, లక్ష్మీలహరి, అమృతలహరి, పీయూషలహరి, (గంగాలహరి), మున్నగు భగవత్స్వరూప గ్రంథములను రచించిన యుత్తమ భక్తుడాయన. పరబ్రహ్మము నొక మహిళగ మాతగ దర్శించిన

(పరే నిత్యం మాతర్గుణమయి పరబ్రహ్మమహిళే!
జగన్నాథస్యాకర్ణయ మృదులవర్ణావళిమిమామ్—
లక్ష్మీలహరి)

మధురభక్తుఁడు జగన్నాథుఁడు ఆధివ్యాధి జరాపరాహతులైన మానవులను 'నిజమైన క్షేమమును వాంఛించినచో వృథాశ్రమలుపొందక శ్రీకృష్ణుఁడనెడి రసాయనమును చవిచూఁడుఁడని

(ఆధివ్యాధి జరాపరాహత యదిక్షేమం నిజం వాంఛసి
శ్రీకృష్ణేతి రసాయనం రసయ రే!శూన్యైఃకిమన్యైః శ్రమైః-
కరుణాలహరి)

కృష్ణభక్తి రసాయనమును దాను తనివితీరఁ గ్రోలి యా భక్తిరసాయనమును గ్రోలుడని పండితలోకము నుద్బోధించిన పరమభక్తిప్రచారకుఁడు జగన్నాథుఁడు. భామినీవిలాసము నదేపనిగ చూచిచూచి మనోరమాకుచమర్దనము నతినిపుణముగ నిర్వహించిన రసికశేఖరుఁడు జగన్నాథుఁడనినచో, అట్టిజగన్నాథుఁడు భక్తికి రసత్వమును బ్రతిపాదింతమను దృష్టితోఁడనే చర్చను బ్రారంభించి తుదకేలొకో యావాదమును నట్టనడుమనే విడచివైచినాఁడు. తనరసగంగాధరములో జగన్నాథుఁడు భక్తిరసవాదము నిట్లు చేరులుదెగిన యట్టి స్థితిలో విడుచుట బహుశః పండితలోక నిరాకరణను భరింపలేకయును యుండునని యనుకొనవచ్చును. ఇంక బాహ్యములైన యేపరిస్థితులు కారణములైనవో స్పష్టముగా నిదమిత్థమని నిర్ణయించుట కాధారములు లేవు సత్యమును నిర్భయముగఁ జెప్పఁగలిగిన మనఃస్థైర్య మదియొక సంతలోని వస్తువుగాదుగదా కొని తెచ్చుటకు! జగన్నాథుఁడిల భక్తిరసమని నిర్ణయింప సంశయించినాఁడనుటయందు నాతనిది కేవలము లౌకికదృష్టియనుట స్పష్టము. అలౌకికదృష్టితో భక్తి పదార్థమును రసరూపముగ గ్రహించి లౌకికదృష్టితో నావిషయము నాలంకారికవచోరీతిలో రాధాకృష్ణుల కన్వయించి లౌకికవాఙ్మయములో మొట్టమొదటగఁ జెప్పిన గౌరవ మెవరేమన్నను నుజ్జ్వలనీలమణి కర్తయైన రూపగోస్వామికిఁ దక్కవలసినదే. జగన్నాథాద్యాలంకారికుల యధికారమును శంకించుటకాదుగని భక్తికిఁగల రసత్వము విషయమై చెప్పుటకు నుత్తముఁడైన యధికారి ముమ్మాటికి శ్రీ రూపగోస్వామియే.

భగవానుఁడు రసస్వరూపుఁడనియు (రసోవైసః రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి-తైత్తిరీయోపనిషత్తు — ఆనందవల్లి — సప్తమానువాకము), నాతనకు సంబంధించిన యానందమును భావించి చవిచూడవలసినదనియు (సకలంపరంబ్రహ్మైవతత్‌యోధ్యాయతి రసతి భజతిసోఽమృతోభవతి-కృష్ణఏవ పరమోదేవస్తం ధ్యాయేత్తం యజేత్తం భజేత్-గోపాలతాపనీయోపనిషత్తు పూర్వభాగము) నుపనిషత్తులన్నియు నిర్ఘోషించుచున్నవి. కృష్ణుఁడొక ఋషిగా మంత్రద్రష్టగా మనకు ఋగ్వేదమునందు కనిపించుచున్నాఁడు శ్రీకృష్ణునికి శైవదీక్షాగురువైన ఉపమన్యుఁడును—నుపమన్యుని తండ్రియైన వ్యాఘ్రపాదుఁడును ఋగ్వేద సూక్తకర్తలు. ఋగ్వేదమండలిశౌరదేవుఁడే శ్రీకృష్ణుఁడు. (ఈ విషయము శ్రీకావ్యకంఠవాసిష్ఠగణపతిముని చెప్పినట్లు శ్రీ గుంటూరి లక్ష్మీకాంతముగారిచే రచితమైన "నాయన" యను గ్రంథము చెప్పుచున్నది) ఉపనిషత్తుల కాలమునకు నందును బ్రధానముగా సగుణోపనిషత్తుల కాలమునకుఁ గృష్ణుఁడు భగవానుఁడు, పరదేవుఁడు నైనాఁడు. కృష్ణుఁడు స్వయముగా భగవానుఁ డనుటలో మఱియొకరు నోరెత్తుటకు వీలు లేకుండ వ్యాసుఁడు పురాణములలో స్థాపించినాఁడు.

ఇక రాధ ఋగ్వేదమందే యున్నదనియు నామె శ్రీకృష్ణునివలన గర్భవతియై, చర్మరోగ పీడితుడై యడవిలో వసించుచున్న పాండురాజుతో సహవాసము చేయుచున్న కుంతికుటీరములోఁ దలదాఁచుకొని కర్ణుని గని యాతనిని గుంతియొద్దనే విడచి వెళ్లినదని కావ్య కంఠ శ్రీ వాసిష్ఠగణపతిమహర్షి నిర్ణయించిరి. హరి వంశవిష్ణుపురాణ శ్రీమద్భాగవతములయందామెప్రసక్తి పేరునలేదు. బ్రహ్మవైవర్తపురాణము మాత్రమామె శ్రీకృష్ణుని శరీరమునుండియే యాయన యానందము కొఱకుఁ బుట్టినదని చెప్పుచున్నది. నారదపాంచ రాత్రముగూడ నీ విషయమున బ్రహ్మవైవర్తపురా ణాభిప్రాయమునే యనుసరించినది. శ్రీమద్భాగవ తమునందు రాధకుఁజేసినలోటును వ్యాసుఁడు శ్రీపురా ణమునందు రాధను నాయికగాఁజేసి సవరించుకొన్నాఁ డని యభిజ్ఞులవక్కాణ ప్రసిద్ధము కొన్నితంత్రములు పద్మపురాణదేవీభాగవతాది పురాణములు రాధకొక ప్రముఖమైన స్థానము నిచ్చుచున్నవి.

ఉజ్జ్వలనీలమణికి నైదువ్యాఖ్యానములు వచ్చి నవి. (చూ శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి సంస్కృత కవిజీవితము పు–512) అందు జీవ గోస్వామి రచిత లోచనరోచినీ టీకయు విశ్వనాథ చక్రవర్తి కృతానంద చంద్రికాటీకయుఁ బ్రసిద్ధములు. (ఈరెండుటీకలతోనే బొంబాయి నిర్ణయసాగర ముద్ర ణాలయమువా రుజ్జ్వలనీలమణిని బ్రకటించిరి. 1922 సం. సంశోధనకర్తలు మహామహోపాధ్యాయ, పండిట్, శ్రీదుర్గాప్రసాద్, శ్రీవాసుదేవలక్ష్మణశాస్త్రి పణ్శీకర్‌గారలు) భావశూన్యసద్భావస్థితిగతుఁడైనరూప గోస్వామివంటి వ్యక్తియొక్క యుజ్జ్వలనీలమణివంటి రచనకు జీవగోస్వామి, విశ్వనాధచక్రవర్తివంటి నిరం జనులు వ్యాఖ్యాతలుగ లభించుట నీలమణివంటి యుజ్జ్వలరసముయొక్క పూర్వపుణ్యఫలము. ఉజ్జ్వ లము మధురమునను శబ్దములు శృంగాతరసపర్యాయ వాచులు (శృఙ్గారశ్శుచిరుజ్జ్వలః–అమరము–ప్రథమ కాండము–నాట్యవర్గము–17) శృంగారరసముయొక్క వర్ణము శ్యామమని భరతుఁడు తన నాట్యశాస్త్రమునఁ (రసప్రకరణము) జెప్పినాఁడు. శ్యామవర్ణమనఁగా నీలము. నాకుఁ బచ్చయను నర్థములున్నవి. నీలమణి యనఁగాఁ గృష్ణుఁడనియు నింద్రనీలమణి యనియు నర్థములున్నవి. నీలమణియనఁగా రాగప్రభేదమైన నీలిరాగమునకు మణివంటివాఁ డనియు నర్థము చెప్పవచ్చును – లేదా మణివంటి నీలిరాగమనియుఁ జెప్పవచ్చును శృంగారరసమున కధిదైవతము శ్రీమహావిష్ణువు – నీలమణివంటి యుజ్జ్వలరసమును గలిగినదనియు నుజ్జ్వలనీలమణి శబ్దమున కర్థము చెప్పవచ్చును. లేక యుజ్జ్వలమైన యింద్రనీలమణి యనియు నుజ్జ్వలనీలమణి శబ్దమున కర్థముచెప్ప వచ్చును. రసజగత్సమ్రాట్టు శ్రీకృష్ణుఁడు – రస రాజము శృంగారము. ఆశ్రీకృష్ణుఁడు శ్యామవర్ణుఁడు– శృఙ్గారముయొక్క వర్ణము శ్యామము–శృంగారమున కధిదైవతము విష్ణువు–విష్ణువుయొక్కవర్ణముశ్యామము. కృష్ణుఁడు స్వయముగా భగవానుఁడైన శ్రీమహావిష్ణువు. (కృష్ణస్తుభగవాన్ స్వయమ్–శ్రీమద్భాగవతము)–ఈ యంశములను బురస్కరించుకొని యుజ్జ్వలనీలమణి యనఁగా శృఙ్గారశ్రీకృష్ణుఁడను నర్థముచెప్పుటయే యుక్తమని తోఁచును. వ్యాఖ్యాతలుగూడ నీవిషయ మున నేకీభవించుచున్నారు. శృఙ్గారమునకు నుజ్జ్వ లము మధురమునను పర్యాయపదములను జెప్పుట యందు నల్పము క్షణికము వ్యయప్రయాసలతోఁ గూడినదియునైన మానుషశృఙ్గారము నమరసింహుఁ డెక్కువగా నుద్దేశించియుండఁడని తలంచుట కవకాశ మెక్కువగానున్నది. కారణము మానుషశృంగారము నందుఁ జివరకు మిగులునది యానందముకంటె నానందేతరమైన యంశమే యెక్కువయనుట స్పష్టము. ఇందులకు రసికహృదయమే పరమప్రమాణము.

భగవత్పరమైన శృఙ్గారమన్నచో నది యల్పమైనది కాదు—మహోన్నతమైనది క్షణికమైనదికాదు—శాశ్వతమైనది, వ్యయప్రయాసములతోఁ గూడినదికాదు - అవ్యయము ననాయాసలభ్యమునైనది.

శృంగారరసనిధియైన శ్రీకృష్ణునియెడ శృంగారరసముయొక్క రూపమేయైన రాధకుఁగలభక్తి, రసరూపమైనదియని యుజ్జ్వలనీలమణియందు సాంగోపాంగముగ సోపపత్తికముగ నిరూపించి నిర్ధారణ చేసినాఁడు రూపగోస్వామి. గ్రన్థప్రణాళికాక్రమ మీక్రిందివిధముగ నున్నది. ప్రకరణనామముతో వ్యవహృతములైనవియుఁ గానివియు మొత్తమిరువది యొక్క విభాగములు గ్రంథమునందున్నవి. అవి నాయకులు - నాయక సహాయకులు - హరిప్రియలు - రాధ (బృన్దావనేశ్వరి)-నాయికలు - యూథేశ్వరులు - దూతికలు-సఖులు-విశేషసఖులు-హరివల్లభలు - ఉద్దీపన విభావములు-అనుభావములు-సాత్త్వికభావములు-వ్యభిచారిభావములు- స్థాయిభావము- పూర్వరాగము-మానము-విప్రలమ్భము-సంయోగవియోగస్థితి-మధురరసపరిపాకవివేకము-సంభోగము ననునవి.

"నామాకృష్టరసజ్ఞః శీలేనోద్దీపయన్సదానన్దమ్
నిజరూపోత్సవదాయీ సనాతనాత్మా ప్రభుర్జయతి"

అను మంగళాచరణ శ్లోకముతో గ్రంథమారంభమగుచున్నది. ఈశ్లోకమును శ్రీకృష్ణుని పరముగను రూపగోస్వామికి గురువైన చైతన్యప్రభువు పరముగను వ్యాఖ్యాతలన్వయించినారు. చైతన్యుఁడు శ్రీకృష్ణుని యవతారమని చైతన్య సంప్రదాయస్థుల నమ్మిక ము. అందువలననే శ్రీకృష్ణునికిఁ జైతన్యునికి నిట నభేదమును రూపగోస్వామివ్యక్తము చేసినాఁడు. నామముచే నాకర్షింపఁబడిన రసజ్ఞులుగలవాఁడును, దన యైశ్వర్యమాధుర్యములనెడి శీలముచే నెల్లప్పుడు నానందమును గలుగఁజేయువాఁడును, దనరూపముచే నన్నిలోకములకు నుత్సవము ననఁగా నానందమును గలిగించువాఁడును బరబ్రహ్మయునైన శ్రీకృష్ణుఁడు జగత్ప్రభువు జయించుచున్నాఁడని పయిశ్లోకమునకుఁ గృష్ణపరమైన యర్థము. శ్రీకృష్ణనామ సంకీర్తనమున నాకర్షింపఁబడిన నాలుక కలవాఁడును, దనసచ్ఛీలముచే జనుల కానందమును గలిగించువాఁడును సాక్షాత్పరబ్రహ్మస్వరూపుఁడునైన చైతన్యప్రభువు జయించుచున్నాఁడని పయిశ్లోకమునకుఁ జైతన్యపరమగు యర్థము. పయిశ్లోకమందలి "రస- ఆనంద- సనాతనాత్మా- జయతి" శబ్దములు దాను గ్రంథోపరిభాగమందుఁ బ్రతిపాదింపఁబోవు భక్తిరససిద్ధాంత మనఁగా సనాతనాత్మయయిన జగత్ప్రభుపుసంబంధమైన యానందము రసమను సిద్ధాంతము జయించితీరకతప్పదని సూచించుచున్నట్లు తోఁచును. మంగళాచరణానంతరము భక్తిరసతత్త్వమునుగూర్చి రూపగోస్వామి యీక్రిందివిధముగ ననుచున్నాఁడు :

"ముఖ్యరసేషు పురాయః సంక్షేపేణోదితో
రహస్యత్వాత్
పృథగేవ భక్తిరసరాట్ సవిస్తరేణోచ్యతే మధురః
వక్ష్యమాణైర్విభావాద్యైః స్వాద్యతాం మధురారతిః
నీతా భక్తిరసః ప్రోక్తో మధురాఖ్యో మనీషిభిః"

రహస్యమైనది యగుటచే భక్తిరసామృత సింధువునందు ముఖ్యమైన శాంత దాస్య సఖ్య వాత్సల్యరసములతో పాటు సంక్షేపముగఁ జెప్పఁబడిన మధురమనియెడి భక్తిరసరాజమిటఁ బ్రత్యేకముగ విస్తరించి చెప్పఁబడుచున్నది. ముందు జెప్పఁబోవు విభావాదులవలన స్వాదుత్వమును బొందిన మధురరతియే భక్తిరసమని చెప్పఁబడుచున్నది. అట్టి భక్తిరసమే పండితులచే మధురమని చెప్పఁబడుచున్నది యని యర్థము శాన్తి దాస్య సఖ్య వాత్సల్యరసములతోపాటు సంక్షేపముగ భక్తిరసామృత సింధువునందుఁ జెప్పుటవలననే భక్తిని బ్రత్యేకరసముగ విస్తరించి చెప్పుదమను నుద్దేశముతోనే యుజ్జ్వలనీలమణి గ్రంథమును రూపగోస్వామి యారంభించినాఁ డనుటను వ్యాఖ్యాతలైన జీవగోస్వా

మియు విశ్వనాథచక్రవర్తియు నంగీకరించినారు. భక్తియే రసరాజమనుట యెంతయు సమంజసము. కారణము జగదుత్పత్తి యగునపు డనఁగాఁ బరమేశ్వరునినుండి ప్రకృతి విడివడునపుడు ప్రకృతికిఁ బరమేశ్వరునియందుఁ గల భావము భక్తియే. భక్తియను నది యుత్పన్నమైన క్షణమదియే ప్రకృతికిఁ బరమేశ్వరునియెడఁగల యీ భక్తిభావమే జగద్వ్యాపారము నందు రసరూపమును బొందుచున్నది. రసమునుండి యుద్భవించి, రసరూపమై జగదాదికారణమైన ప్రకృతికి రసమునెడఁగల భావము రసత్వమును బొందనిచో జగత్తులోఁ దదితరమైనదేది మఱియొక రసత్వమును బొందును? అట్టియెడ రసరూపుఁడైన భగవానుని యంశమైయుండి, రసము ననుభవించు ప్రకృతిచే నావృతుఁడైయుండు రసరూప జీవాత్మకు రసరూప పరమాత్మయెడఁ గల భావము రసత్వమును బొందక యేమగును? అందువలననే జగత్తునకాదిమైన రసము భక్తియనియు నదియే రసరాట్టనియు ననఁగా మిగత శృంగారాది రసములన్నియు భక్తిరసమునుండి యుద్భవించినవేయనియు రూపగోస్వామి యనుచున్నాడు. భక్తిరసమే సాంద్రత కొంచెము తగ్గినపుడు శృంగార రసమగుచున్నది భక్తిరసమే హాస్యకరుణ వీర రౌద్రాద్భుత భీభత్స జుగుప్స శాంతరసరూపములుగ వేఱు వేఱు సమయములయందుఁ గన్పించుచున్నది. నవరసములకును మూలము మాత్రము భక్తిరసమేయని రూపగోస్వామి యభిప్రాయము. ఇటనొక విషయము చెప్పక తప్పదు. శృంగారము రసమనుటలో నాలంకారికులలో నెట్టి విప్రతిపత్తియు లేదు—కారణ మది యనుభవవేద్యము గనుక. సృష్టియంతయుఁ బరిణామమే కాని విపర్యస్తముకాదు. సృష్టిపరిణామ మన్నప్పుడు జీవుల సంస్కారమునందు భిన్నదశ లనివార్యము, ఉన్నత సంస్కారదశను బొందిన జీవుని యనుభవ మంతకంటెఁ గ్రింది సంస్కారదశయందున్న జీవునికి నసత్యము—కారణమది యతని యనుభవమునకు దూరమగుటయే. అనాదియు ననంతము బూర్ణమునైన సత్యపదార్థమును సాదిసాంతము నసంపూర్ణుఁడునైన జీవుఁడు తన యనుభవము బ్రమాణముగాఁ జేసికొని కొలచుట యుచితముగాదు. సర్వ మేకమైనది యగుటచే దాని యందెన్నఁడును బిన్నత్వముండదు-భిన్నత్వము దానిని దర్శించుటయందే యుండి యుండవలయును. భగవానుని యస్తిత్వమును నాస్తికు లంగీకరింపరు. భగవానుఁడు లేఁడనుట నాస్తికునకు సత్యమే—కాని జగత్సత్యముగాదు. నాస్తికుఁడు లేఁడని యన్నంత మాత్రమున భగవానుఁడు లేకుండఁ బోవునా?. 'అస' లింకొక విషయము: సత్యమును సంపూర్ణముగ గ్రహించిననాఁడు జీవుఁడు సత్యమునకు వేఱైయుండలేఁడు. అనఁగా నప్పుడు జీవునికిఁ బ్రకృతి జన్యమైన దేహోపాధి యుండదు. అందువలననే మరణమే జీవునికిఁ బ్రకృతియనియు. జీవనమే వికృతియనియుఁ జెప్పఁబడినది. ఇంతకుఁ జెప్పవచ్చినది భక్తి రసమా కాదా యనువిషయమును నిర్ణయింపవలసినవాఁడు భక్తుఁడుగాని కేవలాలంకారికుఁడుగాదు. కేవలాలంకారికుఁడు భక్తిరసత్వమును నిర్ణయించుటకుఁ బూనుకొని చివరకు భక్తియనునది రసముగాదని నిర్ణయించుట, నాస్తికుఁడు పరబ్రహ్మ స్వరూపమును నిర్ణయించుటకుఁ బూనుకొని చివరకుఁ బరబ్రహ్మమనునది లేదని నిర్ణయించుట వంటిదే యగును. ప్రేమలేనిచోట జ్ఞానముండదు. జ్ఞానములేనిది సత్యమెఱుకపడదు. అందువలననే పరప్రేమయుఁ బరజ్ఞానము నొక్కటేయని చెప్పుట. అందువలననే భక్తి యనునది పరమ ప్రేమస్వరూపమని చెప్పఁబడినది. ప్రేమలేని యజ్ఞాని సత్యస్వరూపమును నిర్ణయించుటకుఁ బూనుకొనుట గ్రుడ్డివాఁడు చూపున్నవానికిఁ ద్రోవజూపుటకుఁ బూనుకొనుట వంటిది. ప్రేమరూపమైన భక్తిలేనిది జ్ఞానమెటనుండి వచ్చును?—జ్ఞానములేనిది సత్యనిర్ణయమున కర్హత

యొక్కడిది? — కావున భక్తిరస విషయమున రూప గోస్వామి మాట యక్షరాల సత్యమనుట సిద్ధాంతము.

విభాగము సేయుటయందు, నిర్వచనముల యందలి వాక్యరచనయందుఁ గొంచెముటనట భేద మున్నదికాని రసవిషయక సాధనసామగ్రిని నిరూ పించుటయందు రూపగోస్వామి సర్వథా తనకుఁ బూర్వులైన యలంకారికులనే యనుసరించినాఁడు. పరకీయయైనను కృష్ణునియెడఁగల ప్రేమాధిక్యముచే నత్యుత్తమయైనరాధను నాయికగను, నెన్నియోవేల మంది వనితల సాంగత్యమును సర్వథా సర్వదా యనుభవించుచుండినను రాధయొక్క ప్రేమకువశె నితరుల ప్రేమకుఁ గట్టుపడని శ్రీకృష్ణుని నాయకుని గను నిరూపించుటయందును, రాధకుఁ గృష్ణునియెడఁ గల శృంగారరూపమైన భక్తి రసత్వస్థితిని బొందినదని చెప్పుటయందును నుజ్జ్వలనీలమణియొక్క వైశిష్ట్య మంతయు నిమిడియున్నది.

నాయకుఁడైన కృష్ణుఁడు సురమ్యుఁడు-మధుర మైనవాఁడు - సర్వసల్లక్షణాన్వితుఁడు - బలవంతుఁడు- నవతరుణుఁడు - వావదూకుఁడు (యుక్తియుక్తముగా మాటాడువాఁడు)- ప్రియంవదుఁడు-సుధీశాలి - ప్రతిభా వంతుఁడు - ధీరుఁడు - విదగ్ధుఁడు - చతురుఁడు - సుఖి- కృతజ్ఞుఁడు - దక్షిణుఁడు - ప్రేమవశ్యుఁడు - గంభీర తాంబుధి-శ్రేష్ఠుఁడు-కీర్తిమంతుఁడు-నారీమోహనుఁడు- నిత్యనూతనుఁడు. సాటిలేని కేళిసౌందర్యము. ప్రియ తమమైన వేణునాదము నాతని చిహ్నములు.

నాయికయైన రాధ మహాభావస్వరూప - గుణ ములచే నతివరీయసి. ఆమె మాహాత్మ్యమును గోపాలోత్తరతాపిన్యుపనిషత్తును బ్రహ్మపురాణమును బహుముఖములఁ బ్రశంసించుచున్నవి. హ్లాదినీశక్తి యొక్క సారభావమే యామెరూపమని తంత్రములు చెప్పుచున్నవి. ఆమె సుష్ఠుకాన్తాస్వరూప-ధృతషోడశ శృంగార-ద్వాదశాభరణాశ్రిత, ఆమె మధుర - నవ వయస్క-చలాపాంగి - ఉజ్జ్వలస్మిత - చారుసౌభాగ్య రేఖాఢ్య - గంధోన్మాదిత మాధవ-సంగీతప్రసరాభిజ్ఞ - రమ్యవాక్-నర్మపండిత-వినీత-కరుణాపూర్ణ - విదగ్ధ- పాటవాన్విత - లజ్జాశీల - సుమర్యాద - ధైర్యశాలిని - గాంభీర్యశాలిని - సువిలాస - మహాభావ పరమోత్కర్ష తర్షిణి-గోకులప్రేమవసతి-జగచ్ఛ్రేణీలసద్యశ-గుర్వర్పిత గురుస్నేహ - సఖీప్రణయితావశ - కృష్ణప్రియావళీ ముఖ్య-సంతతాశ్రవకేశవ (ఎల్లప్పుడు వాక్కునందుఁ గేశవుని గలిగినది). ఇటుగుణములవలెనే యామె గుణములు సంఖ్యాతీతములు. మాధుర్యము-చారుత- నవ్యవయస్సు - కైశోరమధ్యమత్వమునని యామెగుణ ములు నాలుగువిధములు. ఇంతవఱకుఁ జెప్పఁబడినవి యామెయొక్క ముఖ్యగుణములు మాత్రమే అము ఖ్యము లూహ్యములు. రాధయొక్క పయిముఖ్య గుణములందతిముఖ్యమైన మహాభావమును జీవగో స్వామి యీక్రిందివిధముగా వ్యాఖ్యానించుచున్నాఁడు : "తథాహి బ్రహ్మసంహితాయామ్; 'ఆనన్దచిన్మయ రసప్రతిభావితాభిః' ఇత్యనేన సర్వాసామపి భక్తి రసప్రతిభావితాత్వం గమ్యతే. భక్తిర్హి పూర్వం గ్రన్థే శుద్ధసత్త్వ విశేషాత్మకత్వేన పరమానన్దతయాదర్శితా. తస్యాశ్చరసత్వాపత్తిః స్థాపితా. తతశ్చ తేనానన్దచిన్మ యాత్మకేన రసేన భక్తివిశేషమయేన ప్రతిభావితాభిః ప్రతిక్షణం నిత్యమేవ భావితాభిః సమ్పాదితసత్తాభిః కలాభిః శక్తిభిరిత్యర్థః — తదేవం తాసాం భక్తివిశేష రసమయభక్తి రూపత్వేసతి తాసు సర్వాసు వరీయ స్త్వం శ్రీరాధాయాం లబ్ధ్యతఏవ మహాభావస్వరూ పతా గుణైరతివరీయస్తాచ" (అనంద చిన్మయరస ముచే భావింపఁబడినవారని గోపికలనుగూర్చి బ్రహ్మ సంహితయందుఁ జెప్పఁబడుటచే గోపికల కందఱకు భక్తిరసప్రతిభావితాత్వముగమ్యము. శుద్ధసత్త్వవిశే షాత్మయొక్క పరమానందతయే భక్తియని యింతకుఁ బూర్వము చెప్పఁబడినది. భక్తికి రసత్వము స్థాపి

తము. అందువలన భక్తివిశేషమయమైన యానంద చిన్మయాత్మక రసముచేత నిత్యము ప్రతిక్షణము భావింపఁబడుటచేతఁ గలిగిన శక్తియని యర్థము. గోపికల రసమయభక్తివిశేషరూప మట్లుండఁగా వారి యందరియందు నతిశ్రేష్ఠతమయని చెప్పఁబడుటచే రాధయొక్క భక్తివిశేషము మహాభావమని చెప్పఁబడుచున్నది) యని. జీవగోస్వామి మహాభావమునుగూర్చి యింతదూరము చెప్పఁగా నావిషయమై తానింకఁ జెప్పవలసిన దేమున్నది యన్నట్లు విశ్వనాథచక్రవర్తి "ప్రేమభక్తేః స్నేహప్రణయాద్యుత్తరః పరమసారభాగో మహాభావః" (ప్రేమభక్తియందు స్నేహప్రణయాదులకంటెఁ బరమైన సారభాగమే మహాభావము) అనియూరకొనినాఁడు. ఇంకను "మహాభావలక్షణము జీవగోస్వామి చెప్పినాఁడు గదా!" యని యూరకొనినాఁడు. విశ్వనాథచక్రవర్తి యిక్కడ నిట్లూరకొనినాఁడు గాని తన "మాధుర్యకాదంబిని"(భక్తిరస ప్రతిపాదక గ్రంథము) యందుఁ దానును మహాభావమును స్పష్టముగా "కృష్ణస్య సుఖే పీడాశంకయా నిమేషస్యాఽపి అసహిష్ణుతాదికం యత్రసరూఢో మహాభావః. కోటిబ్రహ్మాండగతం సమస్తసుఖం యస్యసుఖస్య లేశోఽపి నభవతి, సమస్తవృశ్చిక సర్పాదిదంశకృత దుఃఖమపి తస్యదుఃఖస్య లేశోనభవతి, ఏవంభూతే కృష్ణసంయోగ వియోగయోః సుఖదుఃఖే యతోభవతః సః అధిరూఢః మహాభావః, అధిరూఢస్యైవ మోదన మాదన ఇతిద్వేరూపేభవతః" (కృష్ణుని సుఖమున కెక్కడఁ బీడ కలుగునో యను శంకచేత నిమిషముగూడ సహింపలేకుండుట మొదలగు లక్షణములు గలది యధిరూఢ మహాభావము. కోటి బ్రహ్మాండములయందున్న సమస్తసుఖము నెవ్వనిసుఖమునందు లేశముగూడఁ గాదో, కోటి బ్రహ్మాండములయందున్న సమస్తవృశ్చిక సర్పాదులవిషమువలనఁ గలిగిన దుఃఖముగూడ నెవని దుఃఖమునందు లేశముగూడఁ గాదో యట్టి శ్రీకృష్ణుని సంయోగమువలనఁ సుఖమును వియోగమువలన దుఃఖమును దేనివలనఁ గలుగుచున్నదో యది యధిరూఢ మహాభావము. అధిరూఢమహాభావము మోదనము మాదనమునని రెండు రూపములుగనున్నది.) అని నిర్వచించినాఁడు.

కృష్ణుని ప్రియలందఱినిగూర్చి చివరకు రుక్మిణీ సత్యలతోఁగూడ 'టూకీ'గాఁగొట్టివైచి రాధకుఁ బ్రత్యేకముగ నొక ప్రకరణమును వినియోగించి హరి గుణములవలెనే యామె గుణములనంతమైనవనిచెప్పి యందలి ప్రధానగుణము లిరువదియైదింటిని మహాభావములవంటివానినే యింత విస్తృతముగనే సోపపత్తికముగ నభివర్ణించి స్థాపించుటయందు, నందును మహాభావమున కింతటి ప్రాముఖ్యము నిచ్చుటయందును రూపగోస్వామి తన యుజ్జ్వలనీలమణియందు రాధకెట్టిస్థానము నీఁదలఁచినదియు నామెకుఁ గృష్ణుని యెడఁగల మధురభక్తి యెంతపరమ దశస్థితిని బొందినదియు స్పష్టమగును. మహాభావమును బొందిన రాధయొక్క స్వరూప మిట్లుండిదిధముగ నన్నదని రూపగోస్వామి యనుచున్నాఁడు.

"అస్రాణామతివృష్టిభిర్ద్వి గుణయన్త్యర్కాత్మజాం నిర్ఝరం
జ్యోత్స్నీ స్యన్ది విధూపలప్రతికృతిచ్ఛాయం
వపుర్బిభ్రతీ
కణ్ఠాన్తః స్తృతవక్రవాద్య పులకైర్లబ్ధా కదమ్బాకృతిం
రాధా వేణుధర ప్రవాత కదలీ తుల్యాక్వచిద్వర్తతే"

(మహాభావమును బొందిన రాధయొక్క యశ్రువులయొక్క యతివృష్టిచేఁ గాళిందీనది ప్రవాహము రెట్టింపగుచున్నది! వెన్నెలను విరజిమ్ముచున్న చంద్రకాంతశిలవలె శరీరము ప్రకాశించుచున్నది. మాట పెగలుటలేదు. పులకరించినశరీరము కదంబవృక్షమువలెనున్నది. కృష్ణా! యనెడి సుడిగాలిచేఁ జెకలింపఁబడిన యరఁటిచెట్టువలె రాధ యున్నది.) రాధయొక్క సఖి, రాధయొక్క విరహమునుగూర్చి—కృష్ణునితోఁ జెప్పుచున్న మాటలివి. బాగుగా నుద్దీపింపఁబడిన

యష్టవిధ సాత్త్వికభావములు గల్గిన యీస్థితి రూఢ మను పేరుగల మహాభావమని ("స ఏష సూద్దీప్త సాత్త్వికైః యో రూఢాఖ్యోమహాభావః స్పష్టః యథాచ వక్ష్యతే సూద్దీప్తాః సాత్త్వికాః యత్రసరూఢ ఇతి భణ్యతే"ఇతి) జీవగోస్వామి చెప్పినాఁడు. పరమ విరహవైవశ్యముచేత సూద్దీప్తములైన సకలసాత్త్వికభావ ములుగలిగిన యీస్థితియే రూఢమహాభావమందు మోదనమని చెప్పఁబడుచున్నది ("అత్రపద్యేసర్వ ఏవ సాత్త్వికాః సూదీప్తాః మహాభావవిశేషం సూచయన్తి. తథాచవక్ష్యతే-'మోదనోఽయం ప్రవిశ్లేష దశాయాం మోహనోభవేత్, యస్మిన్ విరహవైవశ్యాత్ సూద్దీప్తాఏవ సాత్త్వికా' ఇతి")యని యన్నాడు విశ్వనాథచక్రవర్తి రాధయొక్క ప్రేమాతిశయము చేతనే చతుర్భుజుఁడగు హరిద్విభుజుఁడగుచున్నాఁడు. (భుజాచతుష్టయం క్వాఽపి నర్మణాదర్శయన్నపి వృన్దావనేశ్వరీ ప్రేమ్ణా ద్విభుజః క్రియతే హరిః).

శృంగారరూప భక్తిరసమునకు స్థాయిభావము మధురరతి. ప్రమాణములో రతికంటె నల్పము—సమము=నధికమునైన సంభోగేచ్ఛవలన రతియందనేక భేదములేర్పడుచున్నవి రతియే క్రమముగా నభివృద్ధినిబొంది ప్రేమ-స్నేహము-మానము ప్రణయము-రాగము-అనురాగము-మహాభావమునను దశలను బొందుచున్నది. అనఁగా రతియొక్క సర్వోత్కృష్టతా పరమావధిరూపమే మహాభావమన్నమాట. మహాభావమునందును గొన్ని దశాభేదములున్నవి. ఒక్క రాధికుమాత్రమే సంవేద్యమైనది యీ మహాభావస్థితి. శ్రీకృష్ణుని యష్టమహిషులకుఁగూడ నతి దుర్లభమైనది మహాభావస్థితి. అమృతస్వరూపమైన మహాభావస్థితిని బొందినపుడు మనస్సంతకంటె వేఱుగ నుండుటయుండదు మహాభావమనఁగా రసరూపమైన నిర్వికల్ప సమాధియన్నమాట. రాధయందు మహాభావము కలిగినపుడు జగద్వ్యాపారమునుగూడ వర్జించి శ్రీకృష్ణుఁడు రాధకు వశుఁడగుటచే బ్రహ్మాండమంతయు క్షోభించుచున్నది-తిర్యక్కులుగూడ రోధించుచున్నవి. ఒక్కమాటలోఁ జెప్పవలెనన్న ఉజ్జ్వలనీలమణియొక్క వైశిష్ట్యమంతయు నొక్క మహాభావస్వరూప నిరూపణమునందే యున్నదియని చెప్పక తప్పదు. భక్తిరసముయొక్క సర్వోత్కృష్టతకుఁబరమావధిరూపమైనదే మహాభావము, మహాభావముయొక్క పరమస్థితియందు భక్తునకు భగవత్సంబంధమైన విరహముండదు ముక్తులకు సిద్ధులకు మహాభావ మను భావ్యముగాదు.

రూపగోస్వామి తన యుజ్జ్వలనీలమణియందలి లక్ష్యరచనమునందుఁ బ్రదర్శించిన కవితాశిల్పమున కొక్కయుదాహరణ—గౌరీతీర్థమందుఁ గృష్ణునితోఁగూడి విహరించుచున్న రాధను నీవీస్రంసన సందర్భమున దూరముగానుండి చూచుచున్న యొకచెలికత్తె మెల్లఁగా రాధనే సంబోధించి యీక్రిందివిధముగా వర్ణించుచున్నది :

"నైరఞ్జన్యముపేయతుః పరిగలన్మో ద్రాక్షణీలోచనే
స్వేదోద్ధూతవిలేపనం కిల కుచద్వన్ద్వంజహౌ
రాగితామ్
యోగౌత్సుక్యమగాదురః స్ఫురదితిప్రేక్ష్యోదయం
సజ్జినామ్
రాధే!నీవిరియంతవశ్లథగుణా శజ్కే మముక్తాందధే"

"బొటబొట కాఱుచున్నవి యానంద్రాపవులు. కనుల కాటుకపోయినది. స్వేదమువలనఁ జందన కుంకుమాది చర్చపోయినది. కుచద్వంద్వము కుంకుమయొక్క యెఱ్ఱఁదనమును వదలినది. ఉరము శ్రీకృష్ణ వక్షఃస్పర్శను గోరుచున్నది. కామసుఖేచ్ఛ యెక్కువ యయినట్లున్నది. ఔనులే—తెలిసినదిలే! ఊడిపోవుచున్న నీవిబంధము స్ఖలనేచ్ఛతో నున్నదిలే" యని సఖియనుచున్నదన్నమాట. ఇట రూపగోస్వామి ధ్వనిమూలమున రాధమోక్షేచ్ఛతో సర్వబంధములను విదలించివయిచి కృష్ణునిలో లీనముకావలెనని కోరుచున్నదని స్ఫురింపఁజేయుచున్నాఁడు. ఇట ధ్వనికి

శ్లేషముపకరించినది. ధ్వన్యసుసారము శ్లోకార్థ మీ క్రిందివిధముగా నుండును : సత్యదర్శనమువలనఁ గలిగిన భక్తిచేఁగలిగిన యానందముచే లోచనములు ప్రకృతిమలమును బోఁగొట్టుకొన్నవి. భక్తిసుఖోత్థమైన స్వేదముచే విషయేంద్రియ సంసర్గము, విషయాసక్తియు వదలఁబడినవి. హృదయమష్టాంగ యోగౌత్సుఖ్యముసు బొందినది. సంగముయొక్క యుదయముద్దీప్తమగుచున్నదియని తలఁచి సత్త్వాది గుణములను సడలించినది—మోక్షేచ్ఛను బొందినది. యని యర్థము కన్నుల కందమును నారోగ్యమును గాటుక కలిగించుచున్నది. అందము పరులకొఱకు. నారోగ్యముదనకొఱకు, కొంతవఱ కందముగూడఁ దనకొఱకు నారోగ్యముగూడఁ బరులకొఱకయినను గావచ్చును. కాటుక మితముగాఁ బెట్టుకొన్నచోమాత్రమే పయి రెండు లాభములును గలుగును. తక్కువయయినచో నారోగ్యము కొంతవఱకుఁ గలిగినఁగలుగ వచ్చునేమోకాని యందముమాత్రము సాధ్యముగాదు. కాటుకయే కొంచె మెక్కువయయినచో నీరుకారుట మాట యటుంచి కన్నులుదెఱచుటకే వీలుండదు. కాటుక 'యస'లే పెట్టుకొననుట స్త్రీజాతినే యవమానపఱిచినట్టులని రసికులైన యభిజ్ఞులు భావింపవచ్చును. ఎక్కువయయినచో నొకలాభము నొక నష్టము, దక్కువయయినచో నొకలాభమో యొక నష్టమో లేక రెండునుగూడనో, 'యస'లే లేనిచో నొక లాభము నొకనష్టము నీవిధముగ నొకదానికొకటి సంబంధించియుండుటయే ద్వంద్వత్వము. ద్వంద్వ రూపమయినదే ప్రకృతి. కష్టసుఖరూపమైన ద్వంద్వమును బోఁగొట్టుకొనవలెనన్నచోఁ బ్రకృతిని బోఁగొట్టు కొనవలెనన్నమాట. ప్రకృతిగూడఁ గాటుకవలెనే మలరూపమైనది. కాటుక కొంచెము బలుచనైనచో ముఖమునిండ గుడ్డలనిండనగును—కొంచెము గట్టిపాకములో నున్నచోఁ బెట్టుకొనుచుండఁగనే దొరలి క్రిందకిఁ బడును. ఇట్టి చీకాకుగలుగుట కంతటికిని హేతువు కాటుక బెట్టుకొనవలయునని యనుకొనుటయే. కాటుక కన్నులకు హాయిని గలిగించినఁ గలిగించుఁగాక! - యీశ్రమ యంతటిని భరించుటకు సిద్ధమయియుండవలసినదేకదా! అంజన శబ్దము గాటుకకును గాటుక పంటిదేయయిన ప్రకృతిరూపమలమునకును వర్తించును. శబ్దము బ్రహ్మస్వరూపమగుటవలననే యది బోధించు నర్థమునందుఁగూడ నొకయనుగతియున్నది. బ్రహ్మమొక్కడే—నాదమొక్కటే. అట్టితఱి బ్రహ్మము నుండి యుద్భవించిన నాదమును, నాదమునుండి యుద్భవించిన శబ్దమును, శబ్దము బోధించు నర్థమును రెండు రెండెట్లగును? సరిగ నిట్టి మలము పోయినపుడే యనఁగా హృదయగ్రంధి విచ్ఛిన్నమైనపుడే పూర్ణముగ నిండిన యశ్రువులు కన్నులనుండి కాఱును. అనఁగా హృదయము దఃి యవధినప్పుడే పోగొట్టుకొని రసరూప పరమాత్మతో నేకత్వమును బొందుటకుద్యుక్తమవుచున్నది యన్నమాట. ఇట్టి స్థితి భక్తివలననే కలుగును. భక్తి మఱి రసరూపమైనదాయె!, అరసము మఱి శృంగారరూపమైనదాయె! భక్తిరసము శృంగార రూపమైపడి యగుటవలననే పయి పరిస్థితి కలిగినది తాధకు, లోచనములు దర్శనధర్మముగలవి. బాహ్య దర్శన సమర్థములైన లోచనముల మాలిన్యముపోఁగా వాని ధర్మమంతర్ముఖత్వమును వహించి సత్యదర్శనము గలుగును. కన్నులయందలి కాటుకరూపమైన మాలిన్యమును తెచ్చిపెట్టుకొన్నది. పోఁగొట్టుకొన వలయునన్నచో వీలగునదియే. మాలిన్యము పోవుట— హృదయగ్రంధి విచ్ఛేదమగుట యొకేకాలమున జరుగు పనులు. అందువలననే యశ్రువులవలన నంజనము పోయినదని చెప్పఁబడినది. అంజనముండుట—అంజనముపోవుట—అశ్రువులు—... యన్నియు దర్శనమునకు సంబంధించినవి అందువలననే లోచన పరముగ నీవిషయము చెప్పఁబడినది. అంతరమైన

దర్శనరూపక్రియవలన భాహ్యముగఁగలిగిన విక్రియయే స్వేదము. దర్శనమువలననే యనఁగా భక్తిరసత్వమును బొందినపుడు విలేపనరూపమైన విషయసంసర్గమను నాశంసర్గముయొక్క ఫలితరూపమైన రక్తిమరూపరాగమును బోవుచున్నవి. కుచము లురమునకు సమీపభాగమునందుండును. హృదయస్థానమురము. ఇట హృదయమనఁగా నంతరాత్మ. అనఁగా నంతరాత్మయొక్క యనఁగా హృదయముయొక్క యాదేశమునకు సన్నిహితముగాఁ బోవునమయమందు విషయసంగము. రాగము బోవున్న మాట. అందువలననే యతి కుచపరముగ వర్ణింపఁబడినవి. ఉరము యోగౌత్సుక్యమును బొందుచున్నది యనఁగా నురఃస్థానీయమైన హృదయమనఁగా నంతరాత్మ, పరమాత్మ సాయుజ్యరూపయోగమును వాంఛించు చున్నదన్న మాట. సర్వమునకుఁ గారణము హృదయము. భగవానుని హృదయమే యీవిశ్వము. హృదయమునందు భక్తిరసరూప శృంగార ముద్భూతమగుచున్నది. భగవత్ప్రాప్తి విషయరూపశాస్త్రమునందిట్టి యుత్తమదశను బొందినను దేహమున్నంతవఱకు సంగములనుండి సంపూర్ణముగాఁ దప్పించుకొనుటకు వీలులేదు. అవి యెక్కువయగుచునే యుండును. అందువలననే సంగములనుండి సంపూర్ణమైన ముక్తిని బొందవలెనన్నచో గుణరూపమైన త్రాటితో బిగింపఁబడిన నీవిరూపదేహమును బోఁగొట్టవలెను. గుణమును శ్లథముచేసిననేకాని నీవి వదలుకాదు. గుణమును దీసివేసిననేకాని నీవి యూడిపోదు. దేహము పోయిననే కాని యాత్మ యనంతమైన బ్రహ్మమునందు లీనము కాదు. దేహరూపమైన నీవి పోయిననేకాని భక్తిరసరూపమైన శృంగారము సంపూర్ణముగా ననుభూతమగుటకు వీలుండదు. రాధ యిట్టిస్థితినిబొంది తన నీవిని స్రస్తము సేయఁబోవుచున్నది. ఇట్టి స్థితియందున్నవాఁడే రూపగోస్వామిగూడ. ఇట్టిస్థితిని సవిస్తరముగ బోధించుటయే యుజ్జ్వలనీలమణి యొక్క పరమప్రయోజనముగూడ పైన రాధకును గృష్ణునకు నిరువురకును సుఖము గలుగుచున్నది అయినను గృష్ణుని సుఖమునే రాధ కోరునది గ్రంథరచనమువలనఁ గర్తకును బఠితకును నానందము గలుగుచున్నది. అయినను బఠిత యానందమునే గ్రంథకర్తకోరునది. రాధస్వరూపమును భక్తిరసస్వరూపమును దత్త్వస్వరూపమును ననఁగా సత్యస్వరూపమును జెప్పుటతోపాటు రూపగోస్వామి తన స్వరూపమును దన జీవితపరమార్థముయొక్క స్వరూపమును బఠిత గ్రహింపవలసిన పరమార్థముయొక్క స్వరూపమును సర్వజగత్స్వరూపమును బరమాత్మ స్వరూపమును నొక్క చిన్నశ్లోకములో వ్యక్తము చేసినాఁడు.

ఇంకొక్క యుదాహరణ. రాధయొక్క యతిలోకసౌభాగ్యమునకు విషాదమును బొందుచుఁ దాను గృష్ణుని నాకర్షించుటలో రాధయంతటిదానను గాకపోయితిని గదాయని వాపోవుచున్న చంద్రావళిని బద్మయను సఖి యోదార్చుచు నీక్రిందివిధముగ ననుచున్నది :

"న విత్రస్తా కా తే ప్రతియువతిరాసీన్ముఖరుచా
దధారస్తైమిత్యం ప్రణయఘనవృష్ట్యా తవ న కా
వ్రజే శిష్యా కాభూన్నహితవకలాయామితి హరే
ర్నికుఞ్జ స్వారాజ్యేత్వ మసిరసికే పట్టమహిషీ"

"అమ్మా చంద్రావళీ! విలపింపకుమమ్మా! రాధ యంతటి సౌభాగ్యవతిని గాకపోయితినని విలపించుట యెందులకమ్మా! నీముఖకాంతికిబృందావనమునం దేగోపిక భయపడుటలేదొ చెప్పవమ్మా! నీప్రణయమను ఘనవృష్టికిఁ దిమ్మిరులెక్కని దెవరికో చెప్పుము మాతము. నీవు విషాదమును బొందుట యర్థములేనిపని. లేకున్న నీకళలో (కళయనఁగా నిట సౌందర్యమనియు రతి కళయనియుఁ జెప్పవచ్చును) నీకు శిష్యలుకాని వ్యక్తులీవ్రజమునం దెవరున్నారో చెప్పవమ్మా! హరియొక్క పూఁబొదరిల్లనెడి రసికస్వర్గాధిపత్యమందు నీవు పట్టమహిషివి. నీకేమమ్మా!"

యని యర్థము. స్త్రైణమైన ప్రకృతియందు లోక వ్యాపారదృష్టితో దుస్సహమైన యంశములందొకటి యైన యసహనమనునంశమే పైనఁ జెప్పఁబడినది. అత్యానందమునందే యతిదుఃఖమున్నది. అనఁగా నత్యానందమున్నచోట నతి దుఃఖముండునని యొక యన్వయము—అదికా దత్యానందముయొక్క రూపమే యతిదుఃఖమనది మఱియొక యన్వయము. ఆనంద దుఃఖములు ద్వంద్వమనుటకు నానందమే దుఃఖమను టకు స్త్రీ ప్రకృతి యొక విశిష్టమైన ప్రతీక. అమృత హాలాహలములు వేఱువే అరలలో నునుపఁబడిన యొకే భాండమువంటిదది. ఈ విషయమును మన మహ ర్షులే యంగీకరించినారు. 'అస' లమృతమనునది వేఱుగ లేనిచో హాలాహలమే యమృతమువలె వ్యవహ రింపఁబడి యుండెడిదేమో !—యీ విషయమువేఱు. ప్రకృతిలోని సర్వభావముల సంపుటీకరణముయొక్క పరిణతస్వరూపము మానవప్రకృతి. ప్రకృతి భావ పరిణత సంపుటీకరణముయొక్క యుపశమిత దశ పురుషప్రకృతి—ఉజ్జ్వలదశ స్త్రీ ప్రకృతి. ఉజ్జ్వ లతయే సత్యమున కెప్పుడైనను నతిత్వరితముగ సన్ని హితము గాఁగలుగుచున్నది. అందువలననే స్త్రీ ప్రకృతి సన్నిహితమైనంత త్వరగాఁ బురుషప్రకృతి భగవాను నికి సన్నిహితముకాలేదు. ఒక యుజ్జ్వలత మఱియొక యుజ్జ్వలత నాకర్షింపలేదు సరిగదా—సన్నిహితము కాలేదు సరిగదా—'యస' లా రెండిటికి సరిపడుట యనునదియేయుండదు. రెండు సూదంటురాలయొక్క యుత్తరధ్రువములు రెండును బరస్పరాకర్షణము లేక పోఁగా నొకదాని నొకటి నిరాకరించునాయె !. అందు వలననే పురుషునికిమాత్రమే స్త్రీ యాకృష్టయగుట— స్త్రీకిమాత్రమే పురుషుఁడాకృష్టుఁడగుట యనునది సంభవించుచున్నది. పరస్పర పూరకత్వము—పర స్పర సహిష్ణుత్వములేని యొకేదశకుఁ జెందిన ప్రకృతి కలవారగుటచేతనే యే యిరువురు పురుషులకుఁగాని యే యిరువురు స్త్రీలకుఁగాని సరిపడకుండుట, వైవాహి

కాది సహవాసరూపబంధ మిరువురు స్త్రీలకుఁగాని యిరు వురు పురుషులకుఁగాని కాక స్త్రీపురుషులకు మాత్రమే లోకమునందుఁ బ్రసిద్ధమగుటకు హేతువగుచున్నది. వారసము, ప్రజాతంతువు వ్యవచ్ఛిన్నముగాకుండుట యను కారణ ములు బయి కారణమున కంగభూతములు మాత్రమే. వికారరూపములైన భావములన్నియు మనస్సునుండి పుట్టుటవలనను నా మనస్సనునది జీవుని యందొ క్కటిమాత్రమే యగుటవలన నొక భావమనునది యున్నచో సర్వభావములు నుండుటయు నొకభావ మున్న పరిమాణములోనే సర్వభావములు నుండు టయు సంభవమగుచున్నది. భావోజ్జ్వలతకు స్పష్ట ప్రతీకమైన స్త్రీయందుఁ బ్రేమరూపమైన కామముతో పాటు క్రోధ లోభ మోహ మద మాత్సర్యాది సర్వ భావములు నదే పరిమాణములో నుండుటయున్నది స్వభావము. పురుషునికిఁగల కామేచ్ఛకంటె స్త్రీకిఁగల కామేచ్ఛ యెనిమిది రెట్లధికమని నీతిశాస్త్రము చెప్పు చున్నది. అనఁగాఁ గామమునకు సబ్రహ్మచారులైన క్రోధ లోభ మోహాదులుగూడఁ బురుషునికంటె స్త్రీకి నెనిమిది రెట్లధికమని యర్థము. ఎనిమిది రెట్లనుట యిటఁ గేవల మౌపచారికమైన యర్థములో మాత్రమే. గడియారములోని ముల్లు తిరిగినదనఁగాఁ గాలము గడచినదనియేకదా యర్థము ! ఇట గడియారపు ముల్లు కామమునకును, కాలము గడచుట క్రోధ లోభాదులకును బ్రతినిధులు. దివ్యమైన యొక భావ మున్నచోట నాసురమైన మఱియొక భావ మునకును నస్తిత్వమున్నదనుట స్పష్టము. ద్వంద్వ రూపమైన ప్రకృతి యందొకదానిని గోరినవాఁడు రెండవదానిని భరింపకతప్పదు. రెండవది లేకుండ నుండవలెనన్న మొదటిదియు లేకుండ నుండవలెనన్న మాట పరమాత్ముని బొందవలెనన్నచోఁ బ్రకృతిని బొంది తీరకతప్పదు. కారణము ప్రకృతినిబొందనిచోఁ బరమాత్మను బొందుట యనునదియే యుండదు. ఉజ్జ్వలప్రకృతియొక్కగమనము స్వైరముగానుండును.

ఉజ్జ్వలతకు స్వైరత నిసర్గముగనుక. స్వైరత యెల్లప్పు డును వక్రముగఁ గుటిలముగనే యుండును. భగ వానుని ప్రకృతి స్వైరమైనది కనుకనే యాయన మార్గము లౌకికవ్యావహారికదృష్టిలో వక్రముగఁ గుటి లముగ నుండును. దానిని సంపూర్ణముగ నర్థము చేసికొనని మానవులెందఱో భగవానుని ద్వేషించుట తిట్టుట నిత్యానుభవమనందుఁ బ్రసిద్ధము. స్వైర గమనముగల స్త్రీ ప్రకృతియు వక్రము గుటిలము నందువలననే యగుచున్నది. అందువలననే

"నదీనాఞ్చ వధూనాఞ్చ భుజఙ్గానాఞ్చ సర్వదా
ప్రేమ్ణామపి గతి ర్వక్రా కారణం తత్ర నేష్యతే"

(నదులు-వధువులు-భుజంగములు-ప్రేమ వీనియొక్క గమనము కారణములేకయే వక్రమైనది) యని చెప్పఁ బడినది. మఱి యిటఁ జంద్రావళిస్త్రీ-అందును గృష్ణుని యెడ నత్యంతానురక్త. ప్రేమయనునది ప్రపంచము నందలి యున్నతతమమైన భావమగుటచే నద్వితీయ మైన యది. ద్వితీయతను సహింపలేదు. (అనన్యముగ నన్నుఁ జింతింతురు (అనన్యాశ్చిన్తయన్తో మాంయేజనాః పర్యుపాసతే—గీత 9-22) నని భగవానుఁడు గూడఁ జెప్పుటకు హేతువిదియే). అందువలననే చంద్రావళి రాధవిషయమై విషాదమును బొందుచున్న పద్మ యూరార్చుటయందుఁ జంద్రావళి కొంత సాంత్వన మును బొందియుండవచ్చును. "బాహ్య సౌంద ర్యములచే వ్యక్తి ప్రాశస్త్యము ననుభవించుచున్న నీకు నేమి కొదువ!" యని పద్మయొక్క పలుమాటల సారాంశము సుస్పష్టము. చంద్రావళియొక్క ముఖ కాంతికి ప్రజవనితలందఱు భయపడుచున్నారనుట యందు నామె బాహ్యసౌందర్యము సూచితము. బాహ్యసౌందర్యము ప్రేమయొక్క యుత్కర్షమును బోధించుటయందు మొదట నావశ్యకమైనదోఁ గావచ్చు నేమోకాని తుదకుఁ గావలసినది-పటుతరమైనది-స్థిర మైనది-యత్యంతమవశ్యమైనది యంత స్సౌందర్యమనక

తీరదు. అందువలననే యామె ప్రణయము ఘన వృష్టివంటిదని పైశ్లోకములోని రెండవపాదములోఁ గవి చెప్పుచున్నాఁడు అనఁగాఁ గృష్ణునియెడ నామెకుఁ బ్రణయము వర్షమువంటిదన్నమాట. వర్షమనుట యం దది యున్నతస్థానములో నుద్భవించినదనియు నల్పమైనది కాదనుటయు సూచితము. వృష్టియను నది కురియుచున్నపుడానందముగనే యుండును గాని యది నిరంతరముగా నెల్లవేళల సంభవము గాదు మేఘములు లేనిచో వృష్టియుండదు. మేఘములను నవి వాతావరణమునుబట్టియాకాశమునందుండుటయుఁ బోవుటయు జరుగుచున్నది. మేఘములయందు వర్షమునిచ్చునవికొన్ని—వర్షములేనివికొన్ని. సుడిగాలి కనుక వీచినచో మేఘములు చెదరిపోయి 'యనుకొన్న' వర్షము లేకపోవచ్చును—లేక మఱియొకచోటఁ గురియ వచ్చును. ఇటఁ జంద్రావళికిఁ గృష్ణునియెడఁగల ప్రణయము ఘనమైనదైనను నది కాలమునను సరించి పరిస్థితుల ననుసరించియున్నయట్టిది యని కవి సూచించుచున్నాఁడు. అందువలననే కాలమును బరి స్థితులను నతిక్రమింపఁగలిగి కేవల మంతస్సౌందర్యమే యాధారముగాఁ గలిగినరాధిక, హరియొక్క నిత్య ప్రియలయందుఁ బ్రథమయనియుఁ, జంద్రావళిద్వితీయ యనియుఁ జెప్పఁబడినది, అనంతమైన భావమును సాంతములైన శబ్దములచే సూచింపఁగలుగుట యుత్తమ కవిత్వముయొక్క యొక లక్షణము. ఉజ్జ్వలనీల మణియందు లక్ష్యములుగఁ జూపఁబడిన రూప గోస్వామిశ్లోకములన్నియు నిరుపమానముగ నిదేస్థాయిలో నున్నవి. ఏశ్లోకమున కాశ్లోకమే యొక యనర్ఘమణి.

లక్షణములకు లక్ష్యములిచ్చుటయందుఁ దా నప్పటికప్పుడు రచించినవి కాక రూపగోస్వామి తన విదగ్ధమాధవము-లలితమాధవము-హంసదూత-ఉద్ధవ సందేశము-పద్యావళి మున్నగు రచనలనుండియేకాక శ్రీమద్భాగవతము - బిల్వమంగళీయము - గీతగోవిం

టము-గాథాసప్తశతి - పద్మపురాణము - హరివంశము-జగన్నాథవల్లభీయము-విష్ణుపురాణము - క్రమదీపిక-గోవిందవిలాసము - రసుధాకరము - రుక్మిణీస్వయంవరము (ఈశ్వరపురీ కృతమని విశ్వనాథుఁడు చెప్పినాఁడు)-ఛందోమంజరి-ముక్తాచరితము-కార్తీక మాహాత్మ్యము (స్కాందపురాణాంతర్గతము) - దశరూపకము మున్నగు గ్రంథములనుండిగూడ గ్రహించినాఁడు. ప్రాచీనోక్తములనుచు నొండు రెండు ముక్తకములు గూడ లక్ష్యములుగ నుదాహృతములైనవి. ఇతరుల గ్రంథములనుండి గ్రహించిన లక్ష్యములు గ్రంథ పూర్వభాగముకంటె నుత్తరభాగమందే యెక్కువ.

మధురరసపరిపక్వము మహాభావ పరమోత్కర్షతర్షితమునైన రూపగోస్వామి మధురహృదయము గ్రంథాంతసందర్భమున నీక్రిందివిధముగ ధ్వనించుచున్నది : "అంతులేనిది – లోఁతుతెలియనిది – దుర్విగాహమైనదియైన పరమధురరస సముద్రమును స్పృశించితినంతే"యని. ముక్తము సిద్ధమునైనహృదయమాయె మఱియది !

శ్రీమతి టి. జయప్రదాదేవి

"శిలలు ద్రవించియేడ్చునవి. జీర్ణములైనవి
తుంగభద్రలో
పల, గుడిగోపురమ్ములు సభాస్థలులైనవి
కొండముచ్చుగుం
పులకు, చరిత్రలో మునిగిపోయిన దాంధ్ర
వసుంధరాధి పో
జ్జ్వల విజయప్రతాప రభసం బొక స్వప్నకథా
విశేషమై"

—శ్రీ కొడాలి సుబ్బారావు.

విజయనగరసామ్రాజ్యము ప్రాచీన సంప్రదాయబద్ధమైన హిందువుల కడపటి సామ్రాజ్యము. ఈ సామ్రాజ్యమును సంగమ, సాళువ, తుళువ వంశములవారు పరిపాలించినారు. రెండున్నర శతాబ్దములు ఈ సామ్రాజ్యము మహోజ్జ్వలవైభవముతో విరాజిల్లి, అనేకమంది పాశ్చాత్య చరిత్రకారుల ప్రశంసలను పొందినది.

పేస్ అను పోర్చుగీసు యిలా వ్రాసినాడు : "విజయనగరము చుట్టూ 72 మైళ్ళ నిడివిగల కొండలవరుస కలదు. ఆ ఆవరణలోపల పండ్ల తోటలు, సారవంతమైన భూములు విస్తారముగా ఉన్నవి. జలసమృద్ధిగల చెఱువులు అసంఖ్యాకముగానున్నవి. వర్తకులు నివసించు వీధులలో వజ్రములు. ముత్యములు, కెంపులు, నీలములు కుప్పలు కుప్పలుగాపోసి అమ్ముచున్నారు, రోము నగరమంత పెద్దదిగాను, సుందరమైనదిగాను నాకు విజయనగరము కనుపించినది."

అబ్దుల్‌రజాక్ అను పారశీకుడు విజయనగర వైభవమునుగూర్చి యిలా వ్రాసినాడు 'The city is such that eye has not seen nor ear heard of any whence resembling it upon the whole earth."

హరిహరరాయలచే ప్రారంభించబడిన విజయనగర సామ్రాజ్యము కృష్ణదేవరాయలనాటికి సకల విధముల పరిపూర్ణతనొందినది. తెలుగుజోదు శౌర్యము తెలుగురేడుకీర్తి దశదిశల అనన్యశముగ వ్యాపించినది. రాయల తరువాత వచ్చినరాజులు అంతనమ

ర్థులుగారు అందువేత విజయనగరసామ్రాజ్యము మహ్మదీయ దండయాత్రలకు గుఱికావలసివచ్చినది. క్రీ. శ. 1565 సం॥లో జరిగిన తళ్ళికోట యుద్ధంలో అహమ్మదునగర సుల్తాను రామరాజును చేతులారా నఱికివేసినాడు. ఈయుద్ధముతో ఆంధ్రవైభవము, ఆంధ్రసంస్కృతి, ఆంధ్రప్రాభవము అంతర్హితమైనవి. మహమ్మదీయులు ఐదారుమాసములు విజయనగరమును దోచుకొని, విధ్వంసముచేసిన విధమును రాబర్ట్‌సీవెల్ ఇలా వర్ణించినాడు

"All the beautiful buildings and temples and palaces were destroyed. The exquisite carvings and sculptures were smashed, and huge bonfires were lit to burn up everything that could be burnt. Destruction went on till only a heap of ruins was left. Never perhaps in the history of the world has such havoc been brought, and brought so suddenly, on so splendid a city; teeming with a wealthy and industrious population in the full plentitude of prosperity one day, and on the next seized, pillaged, and reduced to ruins amid scenes of savage massacre and horrors beggaring description"

ఆనాటి విజయనగరసామ్రాజ్యమునకు చిహ్నముగా నేడు 'హంపిశిథిలములు' మనకు నిలిచియున్నవి.

ఒకదేశము నందొక కాలమందలి సాంఘిక పరిస్థితులను తెలిసికొనుటకు ఆ దేశమున నాకాలమందు వెలసిన సారస్వతము ప్రముఖ ఆధారముగా గైకొనవచ్చును. శ్రీకృష్ణదేవరాయలనాటి సామాజిక పరిస్థితులనుగురించి తెలిసికొనుటకు ఆ కాలమందలి శాసనములు, నాణెములు, సారస్వతము విదేశీయుల రచనలు చాలావఱ కుపయోగపడుచున్నవి.

విజయనగరసామ్రాజ్యము పరిపాలన సౌలభ్యమునకై ఆరు మండలములుగా విభజింపబడినది. ప్రతిమండలము ఒక సామంతుని ఆధీనమందుండెను: రాజు నిర్ణయించినప్రకారముగా సామంతులు ప్రతి సంవత్సరము కప్పము చెల్లించుచుండవలెను. నియమిత సైన్యముతో సిద్ధముగానుండి ఆజ్ఞయైనప్పుడు ఆ సైన్యముతో రాజసేవలోనికి వెళ్ళుటకు బాధ్యులై యుండిరి.

విజయనగరరాజులు లక్షలకొలది సైన్యమును కలిగియుండిరి. తళ్ళికోట యుద్ధములో రామరాజు ఆరులక్షల సైన్యముతొ మహమ్మదీయులతో పోరాడినట్లుగా అంచనా వేయబడినది విజయనగర చక్రవర్తులు సైన్యముమీద, గుఱ్ఱములమీద అధికముగా వ్యయము చేసిరి. బహమనీరాజ్యము ఐదు చీలికలై—అహమ్మదునగర్, గోలకొండ, బీదర్, బీజపూర్, బీరారు—ప్రమాదహేతువై యున్నందున విజయనగర చక్రవర్తులు సైన్యముపై అత్యంత శ్రద్ధవహించిరి. పోర్చుగీసువారు ఈ రాజులకు గుఱ్ఱముల నమ్మిరి చక్రవర్తియొక్క గుఱ్ఱము ఖరీదు రు. 5000-/ ఉండెను, విజయనగర సైన్యములో 40,000 గుఱ్ఱములుండెను. కాల్బలములు కత్తులు, బల్లెములు పట్టుచుండిరి మొత్తము 10 లక్షలసేన యుండెను సైన్యమునుగురించి పీస్ యిట్లు వ్రాసినాడు.

*"సైనికులు వివిధ రకములైన ఖరీదుగల రంగుబట్టలను ధరించుచుండిరి. వారు పట్టుకొను డాలులమీద పులులు, సింహములు చిత్రింపబడి యుండెను. వారు పట్టుకొను కత్తులమీద బంగారు పనితనము కనిపించుచుండెను. ధనుర్యుద్ధముచేయు దళముకూడా సైన్యములో కలదు.*

కాల్బలము ప్రాణములను లెక్క పెట్టేదికాదు. 10,000 ఏనుగుల సైన్యముండెను. ఏనుగులకు అంబారీలుకట్టి అలంకరించిరి. సైన్యములో భటులకు కుస్తీలు, ఆయుధప్రయోగములను, సవారి మున్నగునవి నేర్పెడివారు. రాయలవారు సాములోను, సవారీలోను ఆరితేరినజెట్టి.

శ్రీ కృష్ణదేవరాయలు రెండుజేనల పొడవుగల జరీటోపీని ధరించెడివాడు. యుద్ధమునకు వెళ్ళునప్పుడు నూలురుమాలనుకట్టి దానిపై నానారత్న ఖచితములైన భూషణములను ధరించుచుండెను. జరీ పనిగల తెల్లని వస్త్రములను ధరించుచుండెడివాడు. రాజభవనములందలి పరిచారికలుకూడా టోపీలు ధరించెడివారు. రాజు ఒకసారి ధరించిన దుస్తులను మరల ధరించెడివాడుకాదు.

విజయనగ రారంభదశలో వైష్ణవ మతవ్యాప్తి కానవచ్చెను. ఈ కాలముననే అద్వైత విశిష్టాద్వైత ద్వైతసిద్ధాంతములు వ్యాప్తిలోనికి వచ్చెను విజయనగరసామ్రాజ్యములో శైవుల ప్రాబల్యము తగ్గెను. వైష్ణవ ప్రాబల్య మధికమయ్యెను. విజయనగరరాజులు మాత్రము మతసంప్రదాయిక ద్వేషములకు తావిచ్చినవారుకారు హిందువులలో ఐక్యత కలిగించుటయే రాజనీతిగా నుండెను ఆనాటి విదేశయాత్రికులు విజయనగరమందు సర్వమతసహన ముండుటనుచూచి ఆశ్చర్యచకితులైరి.

విజయనగరసామ్రాజ్యములో బంగారు, వెండి, రాగినాణెములు వ్యాప్తిలోనుండెను. కవులు తమకావ్యములలో "మినుకు", "మాడలు", "వీసము", "వరహాలు" వున్నట్లుగా పేర్కొనిరి. హరిహరరాయలు పన్నులను నాణెముల రూపములో చెల్లింపవలెనని ఆజ్ఞయిచ్చెను. అంతకుముందు ప్రజలు పన్నులను ధాన్యరూపములోకూడా చెల్లించుచుండిరి. విజయనగరనాణెములపై హనుమంతుడు, గరుత్మంతుడు, ఎద్దు, ఏనుగు, రాముడు ముద్రించబడినట్లు లభించిన నాణెములనుబట్టి తెలియుచున్నది.

విజయనగరరాజుల కాలములో వర్తకవాణిజ్యములు వృద్ధినొందినవి. బర్మా, మలయా, ఇండోనేషియా, చైనాదేశములతో వ్యాపారము జరుగుచుండెను. విజయనగరసామ్రాజ్యము తూర్పున కటకమునుండి రామేశ్వరమువఱకును, పడమట గోవా నుండి కన్యాకుమారివఱకును వ్యాపించియుండెను. పడమట గోవాలో కాలికట్టురేవులో ఎక్కువ వ్యాపారము జరిగెను. రత్నములు, ముత్యములు, ఆభరణములు, గుఱ్ఱములు, ఏనుగులు, పట్టు, నూలు బట్టలు, సుగంధద్రవ్యములు, ఔషధులు, ఇనుము, వెండి, విశేషముగ వ్యాపారవస్తువులై ఉండెను. విజయనగరసామ్రాజ్యమునుండి బట్టలు, బియ్యము, చక్కెర, సుగంధద్రవ్యములు ఎగుమతియయ్యెను గుఱ్ఱములు, ఏనుగులు, ముత్యములు, పాదరసము, కుంకుమ, చీనాపట్టు, ముఖ్మల్ సామ్రాజ్యములోనికి దిగుమతియయ్యెను.

విజయనగరమందు సకలవస్తువులు లభించుచుండెను. బియ్యము, గోధుమలు, పప్పుధాన్యములు, జొన్నలు, చిక్కుళ్ళు తదితర ధాన్యములు చాలచౌకగా లభించుచుండెను.

విజయనగరములో ఐదు లక్షల జనాభా కలదని కొందఱు, అంతకంటె ఎక్కువ కలదని మరికొందరు చరిత్రకారులు వ్రాసినారు. అట్టినగరములో వ్యాపారము విరివిగానుండెను. రత్నములు రాసులు పోసి అమ్ముచుండెడివారని సమకాలీన చరిత్రకారులు పేర్కొనినారు. నగరవాసులవైభవము అనంతముగా నుండెను. గులాబీపూలు గుట్టలుగాపోసి అమ్ముచుండిరి. విలాసవస్తువులకు కొదువలేదు.

విజయనగర సామ్రాజ్యమునందు సామాన్య ప్రజల సాంఘిక, నైతిక జీవన మెట్లుండునో పరిశీలించెదను. కొండవీటిరెడ్డిరాజులకు, విజయనగర చక్రవర్తులకు నిరంతరము యుద్ధములు జరుగుచుండెను తుట్టతుదకు రెడ్డిరాజ్యము పతనమయ్యెను. సామ్రాజ్యములోని రెడ్లు గ్రామాధికారులుగను, వ్యవసాయదారులుగను, సైనికులుగను జీవనముగడిపిరి. ఆ నాడు వ్యవసాయము ప్రాధాన్యత వహించి యుండెను. ఆ నాటి వ్యవసాయమును గురించి బార్బోసా యిట్లు వ్రాసినాడు. *"జనులు దేశములో వరి పండింతురు. జడిగెములుకట్టి, గొఱ్ఱులతో విత్తనములు జల్లెదరు. విజయనగరచక్రవర్తులు సమృద్ధిగా చెఱువులు కట్టించి, రైతులనాకర్షించి, దేశమును సుభిక్షముగా చేసిరి".*

న్యూనిజ్ అను సమకాలీనుడిట్లు వ్రాసినాడు : *"నాగులాపురములో రాయలు చాలా గొప్పచెఱువును త్రవ్వించెను. ఆ చెఱువునీటితో వరిమళ్ళువేసి తోటలు సమృద్ధిగాపెంచిరి. రైతుల నాకర్షించుటకు రాయలు ఆచెఱువుక్రింద సాగవుచున్న భూములమీద మొదటి తొమ్మిదివత్సరములు పన్నును తీసుకొనలేదు. అటుతరువాత వచ్చిన 20వేల మాడలపన్నుతో ఉదయగిరిలో అనంతసాగరమును కట్టించెను",*

రాయలవారు స్వయముగా వ్యవసాయదారుల కనుకూలములు కల్పించినను పలువురు మండలాధికారులు పన్ను లెక్కువగా గుంజి బాధించిరి. అందు చేత చాలామంది రైతులు పన్నులు తక్కువగానుండు ప్రదేశములకు వెళ్ళిపోయిరి.

కరణములు వ్యవసాయపుపన్నుల లెక్కలు వ్రాసెడివారు. ఆకాలములో భూములపై శాశ్వత పట్టాయిచ్చు పద్ధతిలేదు. పన్నులు చెల్లించనివారిని ఈడ్చుకొనివెళ్ళి, బండలెత్తి, ఎండలోనిలబెట్టి, చేతులకు కాళ్ళకు సంకెళ్ళువేసి బాధపెట్టెడివారు.

విజయనగరమున ఆయుర్వేదకళాశాలలుండెను. అందులో అరబ్బు విద్యార్థులుకూడా చదువుకొనుచుచుండిరి.

ధనికులు, అధికారులు, కవులు పల్లకీలలో ప్రయాణములుచేస్తూ వుండేవారు. ఈ పల్లకీలను బోయీలు మోసెడివారు.

విజయనగరములో బోగముసానులసంఖ్య అపారముగానుండెను. అప్పుడు 'ముక్కెర' సర్వసాధారణమగు ఆభరణము. నేటికిని రాయలసీమ, తెలంగాణా ప్రాంతములలో కొందరుస్త్రీలు 'ముక్కెర' పెట్టుకొనుచున్నారు.

బ్రాహ్మణులు విద్వత్తుచేతను, వైదికవృత్తిచేతను జీవించెడివారు. వారు దేవాలయములందు అర్చకులుగాను, పౌరోహితులుగాను, జ్యోతిష్కులుగాను జీవించిరి. వారికి దేవాలయ సత్రములందుచితముగా భోజనము లభించెడిది. బ్రాహ్మణులకు సర్వత్రా అపూర్వమర్యాదలు జరిగెను.

నికోలోకాంటీ యను ఇటలీదేశస్థుడు అప్పటి జనుల వేషభాషలనుగూర్చి యిట్లు వ్రాసినాడు :- *"జనులు జుట్టుపెంచి కొప్పుముడివేయుదురు. యూరపువాసులవలె జనులు ఎత్తుగానుండి, ఆయురారోగ్యములు కలిగియున్నారు. తెలుగుభాషను వారు మాట్లాడుచుండిరి. పట్టుజముఖానాలపై జరీఅంచు దుప్పట్లు పఱచుకొని పరుండుదురు",*

బార్బోసాయను మరొక పాశ్చాత్యు డిట్లువ్రాసినాడు : *"పురుషులు చిన్నరుమాళ్ళను కట్టుదురు లేదా పట్టుటోపీలను పెట్టుకొందురు, కిర్రుచెప్పులను తొడుగుకొందురు".*

బీదప్రజలఇండ్లు పూరికప్పులవై యుండెను. కొన్ని మట్టిమిద్దెలుకూడా ఉండెను.

నేరములకు శిక్షలు చాలా ఘోరముగానుండెను. చిన్నదొంగతనములు చేసినవారికి జరిమానాలు,

ఒక చేయి నఱికివైచెడివారు. పెద్దదొంగతనములు చేసెడివారిని ఏనుగులచేత త్రొక్కించుట, తలలు కొట్టించుట చేసెడివారు. కొన్ని స్వల్పనేరములకు అధికారులు జనుల వీపులమీద బండలెత్తించి దినమంతయు వంగబెట్టెడివారు.

రాయలకాలములో గ్రామములు స్వయంపోషకముగానుండెను అప్పుడు కోర్టులులేవు. ప్రతి గ్రామమునందును గ్రామపెద్దలు ప్రతిఫలాపేక్షలేక తగాదాలు పరిష్కరించెడివారు, బ్రాహ్మణులే సభాసదులు, వారితీర్పులపై రాజునకుఅప్పీలు(appeal) చేసుకోవచ్చును. ముఖ్యమైన నేరములను రాజు స్వయముగా విచారించినను, సభవారిని పిలిచి వారిసహాయముతో తీర్పుచెప్పెడువాడు.

విజయనగరములో క్షౌరశాలలు, పూటకూళ్ళ వసతిగృహములు సమృద్ధిగా నుండెను.

వివాహసందర్భములలో నేటి కాలమువలెనే బంధుమిత్రులు వస్త్రములను, ఆభరణములను చదివించెడివారు

ఈనాటిపండుగలే ఆనాడునుకలవు. ఏరువాక వ్యవసాయదారులకు ముఖ్యమైనట్టిదిగా వుండెను.

దసరాపండుగ రాయల ఆస్థానములోను, సామంతుల ఆస్థానములందును వైభవోపేతముగా జరుగుతూవుండెను. ఇప్పటికినీ హంపీవీధులములలో మనము 'మహనవదిబ్బ'ను చూడవచ్చును.

హోలీపండుగను రాయలవారి కాలములో 'వసంతోత్సవ'మని పిలిచెడివారు.

దీపావళి పండుగనాటిరాత్రి నేటివలెనే పటాకాలను (బాణసంచాను) కాల్చెడివారు.

కోలాటమందు జనులకు ఆసక్తిమెండు. కోడి పందెములు విరివిగా జరుగుచుండెను.

విజయనగర చక్రవర్తుల కాలములో కళాభివృద్ధి పరమావధి పొందెను. చక్రవర్తులు, సామంతులు, మంత్రులు, ధనికులు -శిల్పవృద్ధికి పాటుపడిరి. రాజును, ప్రజలును కవిత్వమును, చిత్రలేఖనమును, సంగీతమును పోషించిరి. దేవాలయములమీద, పెద్దపెద్ద భవనముల గోడలమీద చిత్తరువులు వ్రాయించిరి.

విజయనగర చక్రవర్తులలో కృష్ణదేవరాయలే ఉత్తమశిల్పములతోకూడిన దేవాలయములను నిర్మింపజేసెను హజర రామాలయము. విఠలాలయము బహుసుందరముగానుండి అనేక శిల్పవేత్తల ప్రశంసలందుకొన్నవి. కృష్ణరాయల సభాభవనమును 'భువనవిజయ'మనిరి. ఆనాటిసాంఘికచరిత్ర విజయనగర శిల్పములందు పూర్తిగా ప్రతిబింబితమయ్యెను.

ఏకాలములో ప్రజల జీవనస్థాయి అత్యున్నత దశలో వుండునో, దానిని సాంఘికముగా స్వర్ణయుగము (Golden Age) అందురు. అదేవిధముగా ఉన్నతమైన సాహిత్యవిలువలతో ఉత్తమకావ్యములు ఉత్పన్నమైనయెడల నది 'స్వర్ణయుగ'మని పించుకొనును. ఆంధ్రసాహిత్యములో పదునారవ శతాబ్దము 'స్వర్ణయుగ'మని సాహితీవేత్తల అభిప్రాయమై యున్నది

శ్రీకృష్ణదేవరాయలు సాహిత్య పోషకుడు, స్వయంగా ఆయన కవి. 'ఆముక్తమాల్యద' అను ప్రౌఢప్రబంధమును రచించినాడు ఇది పండితైకవేద్యమైన ఉత్తమకావ్యము. రాయలవారు శ్రీకాకుళాంధ్రదేవుని సందర్శించినప్పుడు స్వామి కలలో కనుపించి, తనపేరిట ఒక రసబంధురమైన కావ్యమును రచించుమని ఆజ్ఞాపించినాడట ఈప్రబంధములో గోదాదేవి రంగనాథుని వరించుటయు రమణీయముగా వర్ణించబడినది ఆముక్తమాల్యద అనగా 'కొప్పులోధరించిన పూలమాలను సమర్పించిన కన్య' అని అర్థము ఈమెయే వైష్ణవభక్తురాలైన గోదాదేవి.

సమకాలీన ప్రజాజీవితము వ్యక్తముకావడము ఈ కావ్యములోని మహోవిశేషముగా కన్పించుచున్నది.

రాజకార్యభారనిమగ్నుడైన రాయలు సామాన్యప్రజల జీవితపు లోతులను దర్శించి. సహజముగా వర్ణించడము ప్రజలతో ఆయనకున్న సాన్నిహిత్యమును తెలియజేస్తున్నది-

రాయలకాలములో "అష్టదిగ్గజకవులుండిరి". ఈయనకాలమునుండీ "దేశభాషలందు తెలుగులెస్స" అను సూక్తి సార్థకమైనది రాయలవారి ఆస్థానకవి అల్లసాని పెద్దన. రాయలవారీకవిని "యెదురైనచో తన మదకరీంద్రముడిగ్గి కేలూతయొసగి ఎక్కించుకొనెడి" వాడట. ఆంధ్రకవితా పితామహుడనిపించుకొనిన అల్లసాని పెద్దన 'స్వారోచిషమను సంభవ' మను ప్రబంధమును రచించి రాయలవారి కంకితము చేసినాడు. ఈకావ్యములో వరూధిని ప్రవరాఖ్యుల చరిత్ర కడు హృదయంగమముగా వర్ణించబడినది. "అల్లసానివాని అల్లిక జిగిబిగి"అను వాడుక అందరికీ తెలిసినదే.

ముక్కు తిమ్మనార్యుడు 'పారిజాతాపహరణము'ను, మాదయగారి మల్లన 'రాజశేఖరచరిత్రము'ను, ధూర్జటి 'కాళహస్తిమాహత్మ్యము'ను, అయ్యలరాజు రామభద్రుడు 'రామాభ్యుదయము'ను, పింగళిసూరన 'కళాపూర్ణోదయమును'ను, రామరాజ భూషణుడు 'కావ్యాలంకార సంగ్రహ' మను లక్షణగ్రంథమును, 'హరిశ్చంద్ర నలోపాఖ్యాన' మను శ్లేషకావ్యమును, 'వసుచరిత్ర' మను ప్రబంధమును, తెనాలిరామకృష్ణుడు 'పాండురంగ మహాత్మ్యము'ను రచించినాడు.

ఆంధ్రసాహిత్యము 16వ శతాబ్దములో పొందిన ప్రచారము, ఆదరణ మరి ఏయుగములో కూడా పొందలేదు.

రాయలు సామాన్య సార్వభౌముడు కాడు. ఈయనకీర్తి కృతికర్తగను, కృతిభర్తగను, సామ్రాజ్యాధినేతగను జగద్విఖ్యాతమైనది. రాయలు "కవితాప్రావీణ్యఫణీశుడై", "సాహిత్యసమరాంగణ సార్వభౌముడై" ఆంధ్ర సామ్రాజ్యపీఠమునేగాక, సాహిత్య సామ్రాజ్యభద్రాసనము నలంకరించిన రసికాగ్రణి రాయలు.

ఆనాటి రాయలవలెనే, ఈనాడు శ్రీ [illegible] తిమ్మరాజుగారు అనేకమంది కవిపండితులను ఆదరించి భాషాపోషణ చేయుచున్నారు. ఈతరం సాహిత్యోద్ధారకులలో వారు అగ్రగాములు. వారి సాహితీసేవను గుర్తించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, వారికి సభ్యత్వమునిచ్చి గౌరవించినది. పండితలోకం వారికి 'సాహితీవల్లభ' బిరుదునిచ్చి తనకు తామే గౌరవించుకొన్నారు. ఈనాడు వెలువడుతున్న అభినందన సంచిక చంద్రునికొక నూలుపోగు వంటిది. వారికివే నా శతాధిక అభినందనలు.

ఈ వ్యాసము వ్రాయుట కుపకరించిన గ్రంథములు.

ఈ రచయితల కందరికూ నా కృతజ్ఞతలు.

1. An Advanced History of India – Majumder Raychaudhuri Datta.
2. A Forgotten Empire – R. Sewell,
3. Hampi Ruins – A. N. Longhurst.
4. ఆంధ్రుల సాంఘికచరిత్ర – శ్రీ సురవరము ప్రతాపరెడ్డి.
5. అష్టదిగ్గజములు – అష్టదిగ్గజ వర్ధంత్యుత్సవసమితి వెలురించిన ఉపన్యాససంపుటి–హైదరాబాద్.
6. ఆంధ్రుల చరిత్ర – శ్రీయేటుకూరి బలరామమూర్తి.
7. Glimpses of World History - జవహర్లాల్ నెహ్రూ.
8. ఆంధ్రవాఙ్మయచరిత్ర – శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు.

# ఆముక్తమాల్యద - కావ్యశిల్పము

డాక్టర్ ॥ కోవెల సుప్రసన్నాచార్యులు

ఆముక్తమాల్యదనుగూర్చి ఏదైనను చెప్పవలసి వచ్చినపుడు దానిని రాయలవా రేదృష్టితో రచించిరో భావింపవలయును. ఈ మహా ప్రబంధమును రచియించునప్పుడు రచయిత యే యుద్దేశమును భావించి నాడో తెలిసికొని దానిని తనకావ్య మందెట్లు తీర్చిదిద్దినాడో చూడవలయును.

సాధారణముగా ఏ మహాకావ్యమును పరిశీలించినను అందలి రచనా సౌందర్యము, శయ్యా సౌభాగ్యము ప్రధానముగా మనల నాకర్షించును. ఈ యాకర్షణము వలన తత్కావ్య గతములైన యితర విషయములుకూడ పాఠకుల మనోలక్షణము నాశ్రయించి ఆనందానుభవమును కలిగించును. కావ్యము నందలి యితి వృత్తము ఒడుదుడుకులు లేక ఏక సూత్రమునం దనుసంధింపబడి ఆరంభము నుండి ఫలప్రాప్తివరకు నొకేమార్గమున నిర్వహింప బడి నప్పుడు ఆ కావ్యము రసాస్వాదనమున కెక్కువగా విలు కలిగియుండును. కావ్యమునం దీయితివృత్త నిర్మాణ చాతుర్యములేని యపుడు కావ్యమున నేక వాక్యత సంధిల్లదు. రసాస్వాదనమునకు నిది భంగ కారణము

అసలు ఇతివృత్తమునం దేకవాక్యతలేని యపుడు రసము పుట్టుటకే వీలులేదు. ఈ ఏకవాక్యత యనునది ఒక నాయకునిగాని ఒకే యితివృత్తము గాని యాశ్రయించి యుండనక్కరలేదు ఒకయుజ్జ్వల భావముగాని ఒక ఉన్నతాదర్శముగాని వాని యన్నింట సాధారణమైనప్పు డావానిపములన్నియు నెడతెగక యొక సూత్రమునందే యనుసంధితములైన పుడుకూడ కావ్యమున నేకవాక్యత సంభవింపవచ్చును. రఘువంశమునం దొక మహారాజధర్మ మాదర్శమైన కొందరు మహారాజుల చరిత్రము చెప్పబడినది. ఈ చరిత్రములలో నొక్కొక్క దానియందు నొక్కొక్క ధర్మమునకు విశిష్ట ప్రాధాన్యమున్నను సామాన్యముగా నారాజులందరు ప్రధానమైన సూర్యకుల రాజ

ధర్మము నాచరించినవారే. అందువలన కావ్యము నందలి భిన్న భిన్న చరిత్రమునందలి రసానుభవము కంటె వేరు సంపూర్ణమైన యొక సమాహారభూతమైన శాంతభావము (Tranquility) కలుగును. ఇది విలక్షణమైన అనుభవము. ఇది ఈ మహాకావ్య మందలి రసము.

స్థూలముగా చూచినచో నాముక్త మాల్యద యందు నితివృత్తములో నైక్యతలేదని చెప్పవలెను. కథలు వేరు వేరు. వీనికి నడుమ నతివిస్తారములైన ఋతువర్ణనములు. ప్రధానమైన యాముక్తమాల్యదా వృత్తము నాల్గాశ్వాసములదాక రానేరాదు. ఆ వెనుక కూడ ఋతువర్ణనములు కొంత, మాలదాసరి కథ కొంతపోగా నామె వృత్తాంతము చెప్పిన పద్యములు చాల కొలదియె. ఇది కారణముగా కావ్యమునందు కథానిర్మాణము లోపభూయిష్ఠమనియే చెప్పవలెను. కాని బహు మహాకావ్యశ్రోత, మహాకావ్యములు రచి యింప చేసినవాడు, మహాపండితుడు, కవియైన రాయలవారి కీ మాత్రము విషయము తెలియదా? తెలిసి రసభంజకమైన ఈ నిర్మాణ మెలచేసినాడు?

ఒకవిధముగా పరిశీలించినప్పుడు కవియొక్క మనోవృత్తి కావ్యమునందు, దాని నిర్మాణమునందు వ్యక్తమగునని చెప్పవచ్చును. రాయలు గొప్ప అహంకారము కలవాడని చరిత్రలు చెప్పుచున్నవి. ఆయన మిక్కిలి స్వతంత్రుడు. కావ్యమును బట్టి చూచినచో ఆయన కల్పనాశక్తి యెంత క్రొత్తదో తెలియవచ్చును. అంతరమైన ఈ ప్రవృత్తియే అతనికావ్యమున ప్రతిబింబించినది. సాధారణముగా రచయిత ఒక మార్గము ననుసరించిపోవును. చాలమంది అట్లే చేయుదురు. ఒక చట్రములో నొదిగిపోవుటకు యత్నింతురు. కొందరు మాత్రము ప్రాచీనమైన మార్గము తమ స్వేచ్ఛాప్రవృత్తికి చాలదన్నట్లు క్రొత్తమార్గము నిర్మిం తురు కావ్యముయొక్క చట్రమును దాటునట్టి రచన చేయుదురు. వారురచించినదే ముందువా రనుసరించు నప్పుడదియే మరల సంప్రదాయమగును. ఆ మార్గము ననుసరించుట దుస్సాధ్యమైనప్పుడట్టి కవులు వాఙ్మయ చరిత్రలో తమప్రత్యేక వైలక్షణ్యముతో నిలుతురు. సంస్కృతములో "మురారేః తృతీయః పంథా" అన్న మాట ఇట్లే పుట్టినది. తెలుగుకవులలో నిట్టివాడు శ్రీకృష్ణదేవరాయలు.

రాయలనాటికి తెలుగు సాహిత్యములో ప్రయోజనవాదము క్షీణించి కళాత్మకవాదము పెరుగుచున్నది. అందువలననే కావ్యములు పురాణేతిహాసములనుండి ఏకొంచెమో కథను స్వీకరించి స్వీయ ప్రతిభచే వర్ణనాంశములను కల్పించి రచించిరి. కథ కేవలము గోడవంటిది. ఈకవులయొక్క శక్తిచేత దానియందనేకములైనవర్ణనములు పరుచబడుచుండెను. ఆ రోజులలో కవియొక్క ప్రతిభకే పట్టాభిషేకము. ఈ ప్రతిభ కావ్యముయొక్క సంపూర్ణమైన అనుభవమును గూర్చిగాక, కావ్యములందలి ఏకదేశములైన పద్యముల నొక్కొక్కదానిని తీర్చుటయందు వినియుక్తమైనది. కావ్యము తెఱచి ఏ పద్యము చదివినను అహా! యనిపింపవలయునని నాటి కవుల యాదర్శము. ప్రతిపద్యమును దేనికదిగా తీర్చుకొనుచున్న నాటికవికి మొత్తము కావ్యముమీద దృష్టి నిలువలేదు ఏ పద్యము నెత్తుకొన్నను, రచనాచమత్కారమో ఉక్తి చమత్కారమో, వృత్తరచనా వైలక్షణ్యమో, ఒక కల్పనయో, ఒక విలక్షణమైన భావమో, చివరికొక శబ్దాలంకారమో ఏదియో యొకటి ప్రకాశింపవలెను. ఇట్టి దుర్దశ కవికావ్యమునుగాక పాఠకునిపై దృష్టి నిడుకొని రచించుటవలన వచ్చినది.

రాయలనాడు వాఙ్మయమునకున్న పరిస్థితి ఇది.

ఈ జిలుగుపని రెండురకములైనది. కావ్యము లందు కొన్ని సన్నివేశములను ప్రధానముగా సృష్టి

యుండునట్లొనరించి వానిని రమణీయముగా తీర్చుట యొకటి ఇవి ఈ ప్రకరణమున ముఖ్యములు. అప్పుడా కావ్య ప్రశస్తి ముఖ్యముగా నా ఘట్టముల నాశ్రయించును. ఈ ఘట్టములే మొత్తము గ్రంథమును "దేహళీదీప" న్యాయమున ప్రకాశింపచేయు చుండును. ఈ కాలమునాటి గ్రంథములలో నీ లక్షణముగూడ కలదు. ఈ దృష్టి కవికి ప్రధానముగా నితివృత్తములో బలము లేనప్పుడు కలుగును. ఒక క్షేత్రమాహాత్మ్యమునందలి బహువిధములైన యుపాఖ్యానములు, ధర్మోపదేశములు, క్షేత్రస్థములైన తీర్థకుండాదుల వర్ణనములు కలచోట కవి తనకిష్టమైన యొక కొన్ని యుపాఖ్యానములనే శిల్ప మర్మ పరిజ్ఞాతయై రసాలంకార స్ఫోరకముగా దిద్దితీర్పవచ్చును. పాండురంగ మాహాత్మ్యమున సోమశర్మ కథ కిందువలననే ప్రాధాన్యము. కాని కవియొక్క విశిష్టమైన శైలి కావ్యమందంతటను ప్రకాశించుటచేత మిగిలిన కావ్యమున కంతటికిని స్వాదుతాలక్షణము కలుగుచున్నది.

ఈ రెండు విధములైన ఏకదేశ శిల్పరచన నాడు చాల కావ్యములందును గోచరించును. కథాదృష్టితో చూచినచో చాలకావ్యములు నిల్వవు రాయల కావ్యమునకూడ ఈవిధమైనదృష్టియే ప్రాధాన్యమునహించి కావ్యమును తీర్చినది కావ్యములోని కథలన్నింటి యందు గల భక్తిభావ సామాన్యత్వము చేత కవియొక ఏకవాక్యత కల్పింపజూచినాడు. కాని యా యతికిన పద్ధతి ఏయంగమున కాయంగముగానై సమాహారముగా వైశాల్యమును సంతరించుకొనలేదు. రఘువంశమును గూర్చి చెప్పినపుడు దానియందు ఇక్ష్వాకు వంశ సూత్రము అనుస్యూతము ధర్మముయొక్క పరంపర, భావముయొక్క పరంపర ప్రజల రాజుల నడుమ సంబంధములో నొక పరిణామము. ఇదంతయుకూడ ఒక మహాసమాజముయొక్క వేల యేండ్ల మహాధర్మము నకు నిలువుటద్దముగా గోచరించుచున్నవి. ఇందు వలన ఆకావ్యమందు ఐక్యత కల్గినది.

ఇట్టి కావ్యములయందు సన్నివేశరచనా చారుత్వముగాని, పద్యరచనా వైలక్షణ్యముగాని యుండదని చెప్పరాదు. అది సమృద్ధిగా నుండును. కాని మహాకావ్యగతమైన అనుభూతి ప్రవాహము దీచమత్కారములన్నియు నంతర్భూతము లగుచుండును.

అముక్తమాల్యదలో నున్న వృత్తాంతములు : విష్ణుచిత్తుని కథ, ఖాండిక్య కేశిధ్వజ సంవాదము, యామునాచార్యుని కథ, గోదాదేవి కథ, మాలదాసరి కథ. ఈ ఐదును విడిగా చెప్పబడినను విష్ణుచిత్తుని కథయు, గోదాదేవి కథయు నొక కథగానే గణింపవలయును ఇవియే ప్రధానకథ. మిగిలిన మూడును ప్రాసంగికేతి వృత్తములు. విష్ణుపురాణాంతర్గతమైన ఖాండిక్యకేశిధ్వజ సంవాదము భక్తియోగ ప్రతిపాదనమునకై ప్రతివాదులనోడించి స్వమతస్థాపనసేయు విష్ణుచిత్తుడు చెప్పినది. వామనపురాణాంతర్గతమైన మాలదాసరి కథ గోదాదేవి విరహ వృత్తాంత మెరిగి విల్లిపుత్తూరులోని స్వామి యామె భూదేవి యవతారమని చెప్పుటకు చెప్పినది నడుమ యతికిన వృత్తాంతము–యామునాచార్యులది. విష్ణుచిత్తునివలె పర్మస్థాపనముజేసినవాడు వేరొకడు కలడని భగవంతుడీతని వృత్తాంతము లక్ష్మీదేవితో చెప్పెను. 'ఆముక్త' ననుసరించి చూచినచో శ్రీవిల్లిపుత్తూరుస్వామి కథలను చెప్పుటలో చాల నేర్పరిగా కానవచ్చుచున్నాడు. ఈ కథలలోని విష్ణుచిత్తాదు లొక్కొక్క రొక్కొక్క మార్గమున భక్తియోగము నాశ్రయించినవారు. ఈభక్తి భావనయే ఈ కావ్యమున కేకత్వము సంధింపవలసి యున్నది. కాని ఈకథలు ప్రధానకథలో నంతర్భవించినట్లుకాక, ప్రాసంగికములట్లుగా భాసింపక దేనికదే యొక స్వతంత్ర వృత్తమువలె భాసించుటచేత దీనియందలి యైక్యతాపాదనమున కిది భంజకమగు

చున్నది. ప్రథానకథోపాఖ్యానముల సంబంధదృష్టితో చూచినచో నిది శిథిలబంధమని చెప్పవలెను. కాని శ్లిష్టబంధమని చెప్పుటకు వీలుపడకున్నది.

స్థూలముగాకాక సూక్ష్మముగా చూచునపుడు మరికొన్ని చమత్కారములతోమను శ్రీరంగనాథుడు సప్తప్రాకార పరివేష్టితమైన రంగమందలివాడు. ఈయన కథానాయకుడు. వేంకటభర్త ఏడుకొండలవాడు ఈతడు కృతిభర్త. కావ్యము సప్తాశ్వాస పరిమితము [1] ఈ సంఖ్య ఒకవిధమైన ఐక్యత. భగవంతునికి సప్తప్రాకార మధ్యత్వమేమి? ఇవి కేవలము ప్రాకారములుకావు షట్చక్రములును సహస్రారము. ఈ ఏడవదియైన సహస్రారమందే జీవునికి భగవంతుని సాక్షాత్కారము. ఆధారాది షట్చక్రములకు ఆరు ప్రాకారములును చివరిప్రాకారమునకు సహస్రారమును గుర్తు కావ్యమునందు ఏడాశ్వాసములు రచించుట ఈ ఎఱుకను స్ఫురింపజేయుచున్నది.

అవతారికలో ఆంధ్రవిష్ణువు 'రంగమందయిన పెండిలి' చెప్పమనినాడు. రాయలీపెండ్లిని శ్రీరంగములో చేయలేదు శ్రీరంగనాథుని స్వయముగా విల్లిపుత్తూరునకు రప్పించి యచ్చట చేయించెను. ఆముక్తమున్నైన మాల్యములను గోదాదేవి విల్లిపుత్తూరు స్వామికే యిచ్చినది. కాని రంగనాయకుడామెను స్వీకరించినాడు. ఇది యొక విరోధము. ఈ ప్రియాపరిభుక్త భాక్కథను వ్రాయుమని ప్రేరేపించినవాడాంధ్రవిష్ణువు. అలుపు సొలుపు లేక అంకితము గొన్నవాడు లీలాపార్థుషికుడు అనగా వడ్డికాసులవాడు. "అంకితమొయ్యదగ నీకల వేంకటపతి యిష్టమైన వేల్పగుట తదీయాకితము సేయు మొక్కొనసంకేతముగాకతడ రసన్నొకానే" అని ఆంధ్రవిష్ణువే చెప్పినాడు, ఇది మరియొక విరోధమే.

ఇక్కడ కవి విశిష్టాద్వైతమునందలి యొకానొక రహస్యమును వెల్లడించుచున్నాడు పరవ్యూహాదులయందు నర్చావతారము మిగుల సౌలభ్యము కలది అర్చావతారార్చాపరతంత్రుడైన ముముక్షువు అనేక దివ్యక్షేత్రములయందు విభిన్ననామములతో వెలసిన నారాయణుని ఒకానొకమూర్తి విశేషమునందే సమాకృష్టుడు కావచ్చును. భక్తుని మన స్వచ్ఛలనే విశేషముగా నిలుపును అందువలన భక్తజనుల సౌలభ్యముగూర్చి స్వయంభువుగా నవతరించినస్వామియందును విశేషాభిమానములు భక్తులుకలిగియుందురు. ఇందువలననే శ్రీకృష్ణదేవరాయలు ఏడుకొండలవానికి కావ్యమిచ్చుట, గోదాదేవి శ్రీరంగమునందలి స్వామిని కోరుట

రాయలవారు తన కావ్య మంకిత మిచ్చుచు ఏడుకొండలవాని నెచ్చటను 'వేంకటేశ్వర' శబ్దముచే పిలువలేదనియు, దానికి కారణ మందు శివవిశిష్ట సూచకమైన 'ఈశ్వర' పదముండుటయే యనియు విమర్శకులు కొందరు చెప్పినారు. రాజ్యతంత్రములో రాయలవారెంత సర్వమత సామరస్యము ప్రకటించుకొన్నను ఆత్మతంత్రమందు ఏదో ఒక మార్గమున నేగువారు. అచ్చట వేరుత్రోవలతో రాజీపడుటలేదు. ఇట్టిగాఢ విశ్వాసమే ఏసాధనకైనను అవసరము.

ఆముక్తమాల్యద మిగిలిన సర్వాంధ్రకావ్యముల కన్న విలక్షణమైన స్థానము కలది. ఇది మిక్కిలి ప్రౌఢప్రబంధము. ఈ ప్రౌఢిమ పలువిధములుగా కావ్యమునందు సంక్రమింపవచ్చును. రచనావైచిత్రి, భావనచేత, రీతి శయ్యా పాకాదులచేత దీనిని సంతరింపవచ్చును. ఆముక్తమాల్యదయందలి ప్రౌఢిమ వీని యన్నిటిచే నేర్పబడినది అందువలన నిది మిక్కిలి ప్రౌఢమని చెప్పవచ్చును.

ఈకావ్యములో ప్రౌఢత్వముతెచ్చిన ప్రధాన విషయములు సంస్కృతాంధ్రపదములయొక్క విచిత్రమైన మేళనము.

1 కొన్ని ముద్రణములందాఱాశ్వాసములేకలవు.

పగడపుఁజాయ చెందిరముఁబ్రామిన పాండ్యవధూ
కుచంబులన్
నగు నరుణంపు బొండముల నారికెళంబులు
వజ్రకుట్టిమం
బగు పథముంజెలంగు పవనాహృతశేషితరత్న రక్షక
వ్రగ తరుసంతతిన్ బ్రథమభార్యఁబుకిన్ గిఱవుంచె
వార్ధినాన్. (1–54)

ఈ పద్యమునందలి రచన దిజ్మాత్రముగా పరిశీలింపవచ్చును. సంస్కృతాంధ్రశబ్దము లిచ్చట పూర్వకవుల సమ్మేళనమునకన్న విచిత్రముగా మేళవించినవి. 'చెందిరముఁ బ్రామినపాండ్యవధూకుచంబులన్ నగు' నడుమ సంస్కృతసమాసము. అరుణంపుబొండ్లములు-ఇది మరియొకపద్ధతి. గిఱవుంచుట మరియొకటి ఇది సంస్కృత రచన తరువాత పద్యముచివరిమాట. ఈవిధమైన వైలక్షణ్యము కావ్యమునం దెచ్చటుచూచినను గోచరించును. ఇది అలవాటైన పద్ధతికాదు. కవిత్రయము, పోతన్న, శ్రీనాధుడు మొదలైనవారు అచ్చిక సంస్కృతములను కలిపినపద్ధతి మన కలవాటుగానున్నది. ఇది విచిత్రముగా నున్నది.

ఈకావ్యమున కీపద్ధతి ప్రౌఢిమమేకాక క్లిష్టతనుగూడ ఆపాదించినది. ఈక్లిష్టత మరి యనేక కారణములచేత సంక్రమించినది. కొన్ని నైఘంటికములైన పదములు వాడుట. 'ఉంభిత'-'తృణతా'-'సృణి'-'హెవాక'-'ఘుసృణ'- మొదలైన శబ్దములు, ఇవి పూర్వకావ్యములందు క్వాచిత్కముగా ప్రయుక్తములు. రెండవది సంస్కృతవ్యాకరణశాస్త్రము తెలిసినవారికే వింతగొలిపెడి నూతన ప్రయోగములు. 'ఇరమ్మదీకృత' – 'బాడబీకృత' – 'జ్యోత్స్నిగవి' – 'మహీణాండాకరండకధూర్వహ' – ఈ విధముగా నెన్నియేని చూపవచ్చును. ఇంకను తెలుగు వ్యాకరణము ననుసరించికూడ సాధారణముగాని సంధికార్యములు చేయుటకలదు. 'గంగనుకాసె' – 'రంగభర్తంచు' – 'అందిచ్చు' – 'నీరుబుగ్గ'–'గందపట్టెలు' మొదలైన విట్టిప్రయోగములు ఈకావ్యమునందు అగపాలులు. సాలెవాంద్రు, కృషికులు మొదలైన వృత్తులవారు వారివారిలో వాడుకొను కొన్నిపదములు కూడ చేరినవి. ఇవికూడ క్లేశాపాదకములేయని చెప్పవలెను.

ఇంకను క్లేశాపాదకములైన కారణములు రెండు· అన్వయక్లేశము, కొన్ని పద్యములలో చెప్పవలసిన వృత్తాంతము నొకపద్యములోనే కుదింపగోరెడి లక్షణము.

తళుకొత్తున్ భుజకీర్తివజ్రఘృణి సూత్రస్యూత హారస్ఫురత్కలికాచిత్ర కుచద్వయోపరి గళాధస్స్వల్పవిస్తార దైర్ఘ్యలసత్తిర్యగురస్తటంబగు వివాహోంచన్మనోజాత పాటల దంతచ్ఛదబోడ బాసికము దండల్వోలెఁగేల్మింతికిన్
(5–20)

ఇది గోదాదేవి నగ్నవర్ణనలోని పద్యము. ఆమె చేతులు దండలవోలె నున్నవి ఈదండలు కుచములపైన, మెడకు క్రిందగలభాగము భుజకీర్తుల కాంతులచేతను, మెడయందలి హారముల యలంకారములచేతను ఒక బాసికమువలె నున్నదట, ఈబాసికమునకు రెండువైపుల అలంకారములుగాకట్టిన పూలదండలు ఆమెచేతులు. ఈభావము చాల అందమైనది. కాని పద్యమందన్వయము వ్యాఖ్యానాపేక్షమగుచున్నది. దీనియందలి భావము స్ఫురించుట కష్టముకాని దాని యనంతరము చర్వణమువలన కలుగు నానందము మిక్కిలియని చెప్పవచ్చును.

ఈ పద్యమునందు 'కుచద్వయోపరి గళాధస్స్వల్ప విస్తారదైర్ఘ్యలసత్తిర్య గురస్తలంబు' రాయలవారొక్కరే వర్ణించిరి. ఇది అయన ప్రత్యేకత. అందరు కవులకన్న అయన విశేషముగా చూచును. ఆయనబుద్ధి నవనవోన్మేషశాలిని. ఈ స్తనోపరి

భాగము భూషణహారకాంతులచేత తళతళలాడుచు బాసికమువలె నున్నది. ఈబాసికమునకు హస్తములు దండలు. ఈ వర్ణనలో భావి కథార్థసూచన మున్నది.

బాసికము వివాహమునకు ప్రతీక. దండలు ఆముక్తమాల్యదకు ప్రతీకలు. అనగా గోదాదేవి వివాహమునకు, పూలదండలకు నవినాస్థితి యున్నది. ఆ రెండును లంకె వేయబడినవి, ఇవి కవి కావ్యములోని వర్ణనాంశమును భావి కథావ్యంజకముగా నుపయోగించుకొనెడి నేర్పు.

మనమనురక్తి హెచ్చునిదెమందని కందము కౌగలించి నిక్కిన ఫణిరాజవల్లి యెఱిగింపఁగనోయనఁ
బూగముల్బరం
బున బడుమట్టచే చెఱకు ముత్తియముల్
చిటిలించి తద్రసం
బనిశము వంటు నంతిక తలాంతికఁ జూర్ణముఁజేయు
నప్పురిన్. (1–70)

ఇది విల్లిబుత్తూరు వర్ణనములోని పద్యము. ఆ యూరిలో చెఱకుతోటలున్నవి. వానియందే పోకమ్రాకులును, తమలపాకు తీగలును పెరుగును. పోకచెట్టును నాయకుని, తమలపాకు తీగయనునాయిక కౌగిలించుకొనుచున్నది పోకచెట్టు భారముచే దాని మట్ట చెఱకుగడమీద పడగా నదివిరిగి దానియందలి ముత్యములు ప్రక్కన చెఱకురసమువండు ప్రొయ్యిలో పడి సున్న మగుచున్నది. ఈ సున్నమగుట మన యనురాగము నెరుపుసేయు మందని తమలపుతీగ పోకచెట్లతో నన్నట్లున్నది. ఆకులు, పోకను, రెండును సున్నముతో కలిసిననే కదా భోగయోగ్యమగును. వాని కెరుపు సున్నమువలననే సంక్రమించును.

ఈ పద్యమునందు మూడు వస్తువులున్నవి, ఒకటి అక్కడ జరుగుచున్న దృశ్యము. రెండవది నాయికా నాయిక రూపమైన శృంగారభావము. మూడవది సున్నము రక్తిమ-(అనురక్తి-ఎరుపుదనము) హెచ్చింపజేయుట యన్న మూడవ విషయము. ఈ మూడును సాధారణకవి మూడు పద్యములుగా వ్రాయును. లేదా సీసమువంటి పెద్దపద్యములో విస్తరించి వ్రాయును. కాని రాయల వారెంతటి భావమైనను ఒకే పద్యములో కుదించివేయుదురు. అదికూడ ఈ కావ్యమందు శ్లేశము నాపాదించివిన యొక 'గుణము'.

ఇంకొక యుదాహరణము చూపింతును.

కాంచెన్వైష్ణవు డర్ధయోజన జటా ఘాటోట శాఖోపశా
ఖాంచజ్జూట చరన్మరుద్రయ దవీయఃప్రేషితోద్యచ్ఛదో
దంచత్కోట కృశవ్రణచ్ఛలన లిప్యాపాదితాధ్వన్య ని
స్సంచారార్త మహాఫలోపమ ఫలస్ఫాయద్వట
క్ష్మాజమున్. (6–15)

ఆ మాలదాసరి వటవృక్షమునుజూచిన వర్ణన. ఆ వటవృక్షముయొక్క యూడ లొక్కొక్కటి రెండు క్రోసుల దూరము వ్యాపించియుండెను. వానికి కొమ్మలు, ఆ కొమ్మలకు కొమ్మలును మొలచినవి. ఈప్రదేశముల పచెడుగాలిచేత దాని యాకులు దూర దూరముగా విసరివేయబడుచుండెను. ఆ ఆకుల యందు పురుగులు తొలచి రంధ్రములుచెసెను. ఆ అకులు పాంథులకీ వృక్షముపై బ్రహ్మరాక్షసు డున్నాడనియు నిచ్చటికి రారాదనియు నా వృక్షము జాబువ్రాసినదా యన్నట్లుండెను. అందువలన బాట సారులు దూరముగా తొలగి వేరొక దారిబటగా నది నిస్సంచారమై యుండెను.

ఇదంతయు నొక కథవలెనున్నది, ఇంతకథ యొక్క శార్దూలములో కుదింపబడినది. పాఠకుడు ప్రతిపదమును చర్వణముచేయవలెను. శ్లేశముతో నన్వయించుకొని మనస్సులో బొమ్మ కట్టుకొనవలెను.

ఒక చిన్న కిటికీ కోసం ఒక మహాసౌధములతో వ్యాపించిన రాజమార్గమునంతయు మూసివేసినట్లున్నది ఈ రచనా సంవిధానము. కిటికీ తెఱచుటయే శ్రమయనుకొన్న చో అస్పృశ్యము కనబడు ప్రశ్న లేదు. అట్లే పద్యమును చూచి బెదరిపోయినదో దానివలన కలిగెడు అనన్యాదృశ్యమైన అనుభవమును మనము పోగొట్టుకొనుచున్నాము.

ఆముక్తమాల్యదయందలి క్లేశము ఈ కారణములచేత సంక్రమించినది. అందువలననే దీనిని నారికేళపాకమనియు పాషాణపాకమనియు కొందరు పేర్కొన్నారు. కళాప్రపూర్ణులు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు "ఆముక్తమాల్యదను నేను నారికేళపాకమనను. మఱి యే మనందునన పరిపక్వ పనసఫలపాకమందును తేటలుగా జెప్పిన పనసపండు పాకమగును. పనసపండు రుచి గుజ్జునకు త్యజింప నక్కఱలేదు", (సంజీవనీవ్యాఖ్య-పీఠిక 61వ పేజీ).

ఇది సరియైన వ్యాఖ్య. ఆముక్తమాల్యదయందెంత క్లేశమున్నను దాని నన్నింటిని మించిన సౌందర్యము దానియందున్నది. ఏభాషయందైనను మహాగ్రంథములన్నింటికి కొక్కొక్క వ్యక్తిత్వముండును. ఒకదానినిపోలి మరియొకటి యుండదు. తెలుగు భాషలో ఆముక్తమాల్యదను పోలినగ్రంథ మాముక్తమాల్యదయే

గ్రంథప్రౌఢిమకు ప్రధానకారణము పైన చెప్పిన 'కుదింపు' అన్న లక్షణమే.

ఖనటత్పయోబ్ధివీక్ష్య రసాతలాన్యోన్య
పిండీకృతాంగ భీతాండజములు
ధృత కులా యార్ధఖండిత సమిల్లవరూప
చరణాంతికభ్రమత్తరు వరములు
ఘన గుహా ఘటిత ఝాంకరణ లోకైక ద్వి
దుందుభీకృత మేరు మందరములు
చటుల ఝంపా తరస్స్వనగరీ విపరీత
పాలితా శాకోణ పరి బృఢములు

ప్రబలతర బాడబీకృత తేరమ్మదములు
భాస్వ రేరమ్మదీకృత బాడబములు
పతగ సమూత్పతత్ప్ర ప్రభంజనములు
వృజిన తూలౌఘములఁ దూల విసరుగాత. (1-3)

ఈ పద్యము గ్రంథాది యందలి వైనతేయ స్తుతిలోనిది. ఈరచన మిక్కిలి ప్రౌఢగాఢబంధము. సీసపద్యముయొక్క నడకకూడ లోకోత్తరమైనది. గరుడుని రెక్కల గాలిచేత మాపాపతూలములు విసరగొట్టబడవలెనని కవి వాంఛ. అతని రెక్కల గాలిని వర్ణించును దానివలన సముద్రములు ఆకాశమువరకు నెగిరి కల్లోలితమగుచుండగా నీరులేని పాతాళములో ముల పాములొకదానినొకటి చుట్టుకొని పిండి పిండి చేసికొన్నవట అతని కాళ్లకడ మహావృక్షములు తాకి పక్షులు ఏరుకొనిపోవు చిదుగులవలె నున్నవట. మేరు మందర గుహాలయం దీగాలి కలిగించిన ధ్వని రెండు రణదుందుభులు మోగించినట్లుగా నున్నది. అప్పుడు దిక్పాలకులే ఎగిరిపోయి ఒకరిదిక్కులో యందు వేరొకరుగా పడిపోయిరట. మెరపులు సముద్రమందలి బడబాగ్నులును బడబాగ్నులు మేఘములందలి మెరపులును ఐనవట. ఇది రాయల వర్ణన

దీనియందు ఆయన మనోలక్షణము కనిపెట్ట వచ్చును మొదటిపాదమందు చెప్పినట్లు సముద్రములాకాశమున కెగురుట పాతాళమున పాములు పరస్పరము చుట్టుకొని పిండిపిండి చేసికొనుట–ఈరకమైన ఊహచేయుట సామాన్యుడు చేయలేడు ఇది ఒక జగజ్జేత చేయవలసిన ఊహ ఈదృశ్యమూహించుటకే మన మనస్సుచాలదు, రెండవపాదమందు కవి ఆకాశమును, భూమిని సముద్రము నేకముచేసిన గరుడుని సామాన్యపక్షి సామ్యముతెచ్చి సర్వకవి సామాన్యమైన కల్పనచేసినాడు. మేరు మందరములు దుందుభులగుట యుద్ధభేరీ శ్రవణమున కలిగిన యూహ కావచ్చును. నాల్గవది ఆయనలోనున్న హాస్య గుణ

మునుపట్టి యిచ్చుచున్నది. అష్టదిక్పాలకులొకరి నగరములయం దొకరుగా నెగిరిపడిన నెట్లుండును ? ఇది విచిత్రమైన మనోలక్షణముగల కవి చేయవలసిన యూహ. ఇట్లూహసేయుట రాయలుకాక రామకృష్ణుడును చేయునేమో? మిగిలిన వారిది చేయరు.

గీతపద మెత్తుగడలో నొక వైచిత్రియున్నది. సీసములోని నాల్గుపాదములు నాల్గుభావములే చెప్పినవి. ఒక్కొక్కటి ఒక్కొక్కసమానము. గీతము కూడ అట్లే చేయవలసినచో రెండుపాదములు సమకూర్చి ఒకటిగా చేయవలయును. కాని రెండుపాదములు రెండేకదా! అందువలన రెండుపాదములు దేనికదే విరచినను ఊహమాత్ర మొక్కటే. అదే మరల గలక్రిందులుగా చెప్పినాడు ఇక్కడ బాద బేరమ్మదములు మారుటలో భూమ్యాకాశములుచక్రము తిరిగినవి

ఒకే పద్యములో నిన్నివైవిధ్యములు గోచరించినవి. అవతారికలో గరుడుని వర్ణనమిట్లు చేయవలసిన యవసరమేమి యని ప్రశ్న రావచ్చును. ఈ గరుడుడే కథానాయకుడు. విష్ణుచిత్తుడు గరుడాంశ సంభూతుడు. *"మిథునే స్వాతిజం విష్ణోః రథేశం ధన్వినఃపురే / ప్రపద్యే శ్వశురం విష్ణోః విష్ణుచిత్తం నమామ్యహం"* అన్నది విష్ణుచిత్తుల తనియ. ఆచార్య సూక్తి ముక్తావళియందు "*సకల వేదమయుడైన శ్రీగరుత్మంతుని యంశముచే బుట్టె*" (పూ. పి-2-4) నని చెప్పబడినది. ఈ విష్ణుచిత్తుడు విశిష్టాద్వైత మతమును స్థాపించి మధురలో విజయము గొనితెచ్చెను. విష్ణుచిత్తుడు '*ఇతఃపురావరిత శాస్త్ర గ్రంథ జాత్యంధు*' డని చెప్పికొన్నవాడు ఈ విష్ణుచిత్తుడు భగవంతుని యనుగ్రహముచేత పాండ్యరాజసభలో సర్వశాస్త్రముల ప్రమాణములతో సర్వేతర మతములను ఖండించి విశిష్టాద్వైతమును స్థాపించెను.

ఏమాత్రము చదువు సంధ్యలులేనివాడు ఎంతటి భగవదనుగ్రహమున్నచో భగవంతుని మహిమాదుల బలముతో తన ప్రభావముచూపి కొన్ని సాధారణ భక్తివిశేషములు, భక్తమహిమలు చెప్పి వశముచేసికో వచ్చును కాని భగవదనుగ్రహమువలన వ్యాస సూత్రములను, బాష్యములను, సర్వదర్శనములను, సర్వోపనిషత్తులను ఉక్తిప్రత్యుక్తులయందుదహరించుచు వాదించుటలో నౌచిత్యము భాసింపదు. "*మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం*" ఇత్యాది శ్లోకములచేత దీని నిచ్చట సమర్థింపవచ్చును. కాని సరిగా నాలోచించినచో రాయ లీవిషయమును భావించియే యిచ్చట గరుడవర్ణనము నింత యట్టహాసముతో వర్ణించెను. గరుడాంశ సంభూతుడైన విష్ణుచిత్తుడు తన స్వరూపము నెరుగక ప్రాకృతునివలెనే వ్యవహరించుచుండెను. భగవంతుని దర్శనముతర్వాత తన '*వేదమయత్వము*' స్ఫురించియుండును అందువలననే అయన యట్లు వాదించెను. అనగా విష్ణు దర్శన స్థాపనముకొరకు వైనతేయుడే కారణజన్మము నెత్తెను.

ఈ విషయము స్ఫురింపజేయుటకే రాయలు మరి రెండుచోట్ల వైనతేయు నెక్కియున్న భగవంతుని వర్ణించెను.

విష్ణుచిత్తుడు సభయందు తక్కినవారినెల్ల జయింపగా ప్రత్యక్షమైన భగవంతుడు "*విభుడు బొట్లపుదోయి జెందమ్ములను దార్క్ష్యహస్తోదరముల దివ్యాంఘ్రు లమర*" వేంచేసినాడట. ఎఱ్ఱనితామరల వంటి స్వామి పాదములు తార్క్ష్యుని చివురాకులవంటి యరచేతులలో జాగ్రత్తగా పొదుగబడి యున్నవి. ఇచ్చట భగవత్పాదములు వైనతేయుని చేతులచేత వాడిపోకుండ కందకుండ పరిరక్షించబడుచున్నవి దీనివలన భగవద్భక్తి మతము శ్రీవిష్ణుచిత్తుల వాదము వలన నాడు పరిరక్షితమైనదని వ్యంగ్యముగా నెఱుగ

వచ్చును. ఇచ్చటనే "పతత్త్రిప్రభంజనయులు" కూడ వచ్చినవి. అచ్చట మూగిన దేవ దానవాదు లలో దానవాదులు కొట్టుకొనిపోయిరట. ఇది చేటలచేత చెరగినపుడు బియ్యము మిగిలి ఊక యెగిరిపోయి నట్లున్నదని కవి యుపమించుచున్నాడు. ఇచ్చట ఈ ప్రశస్తియేలననగా విష్ణుచిత్తుని విజయమువలన లోకములో జైన బౌద్ధ చార్వాకాదులైన యన్యమత ములు దూరీకృతములై సారవంతములైన వైదికమత ములు నిలిచినవని సూచించుటకొఱకు.

గరుడావతారమైన విష్ణుచిత్తుడు నిత్యముక్తుడు. బద్ధుడుకాడు. అతడు కర్మాధీనుడై జన్మమెత్తినవాడు కాడు. దర్శనస్థాపనమాతని యుద్దేశ్యము. తనపని యొక నటనమే యని యెఱగినవాడు— "అంత కట్టిన భూమిక తాల్చు మాకు ఘనత యిది యయ్యుఁజేయుట తనదు ఘనత" (7–58) అన్నచోట తాను భగవం తుడు కట్టిన భూమిక తాల్చినవాడు మాత్రమే యని చెప్పియున్నాడు. కావ్యమంతయు నీవిధముగా గరు డునియొక్క విలాసమే. కాని అతని ప్రాధాన్యము మత స్థాపనము నంతవరకే కనుక తరువాతి కథలో నాతనికి ప్రాముఖ్యములేదు.

ఇందువలననే "ఖనటత్పయోబ్ధి" యన్న పద్య మిట్లు రచింపబడినది.

శ్రీకృష్ణదేవరాయలు మహాపండితుడు. బహు శ్రుతుడు. బహుభాషాకావ్యములఁ జదివినవాడు. బహుకవి పండిత పోషకుడు భక్తుడు వైష్ణవ మతాభినివేశముగలవాడు, బహుపురాణేతిహాస కథా విదుడు. ఈ విషయము లవతారికయందు చెప్ప బడుటయేకాక కావ్యమునంతట గోచరించు విషయ ములు,

రాయల మతగురువులు తిరుమల తాతాచార్యుల వారు. ఈయన పంచమతభంజన మను గ్రంథమును రచించెను. ఆకాలమున నహోబల మఠమున నేడవ పీఠాధిపతియైన శఠగోపయతి కలడు. ఈతడు పెద్ద నామాత్యుని గురువుకావచ్చును. ఈ మహనీయు లైన తాతాచార్యుల సన్నిధానమున రాయలు భాష్య భగవద్విషయములను సేవించియుండును. ఈ పాండిత్యము లేనిచో సామాన్యసాహిత్యవేత్త ఆముక్త మాల్యదలోని వేదాంత ఘట్టముల నట్లు తీర్పలేడు.

ఆముక్తమాల్యదా రచనాకాలము అవతారి కలో చెప్పిన దానినిబట్టి 1519 జనవరి 26వ తదీ. కాకుళములనున్న హరివాసరమని నిశ్చయించుటచేత 1519 నుండి కొన్ని సంవత్సరముల పర్యంతము వ్రాయబడియుండును. ఇది ఒక ఊపుగో రచించిన గ్రంథముకాదు. రాయలప్పుడప్పుడు తాను రచించిన వర్ణనాదుల నచ్చటచ్చట చేర్చియుండవచ్చును. కావ్య మునొక్క సంపూర్ణరూపము రాయల మరణము తరువాత ఏ పెద్దనయో తీర్చియుండును. ఇది కార ణముగా నీగ్రంథమున తరువాతి లేఖకులు పెద్దన పద్యములనుకూడ కొన్ని చేర్చియుందురు.

ఈకావ్యముయొక్క రచనలో నితఃపూర్వము లేని కొన్ని వైలక్షణ్యములున్నవి. కావ్యావతారికలో నిష్టదేవతా వర్ణనమునందు త్రిమూర్తులను వారిభార్య లను వర్ణించుట విఘ్నేశుని వర్ణించుట, కసుస్తుతి, కుకవినింద మొదలైన సంప్రదాయము లిచటలేవు. ఈ కవి పరమవైష్ణవునివోలె వేంకటపతిని, అనంత గరుడవిష్వక్సేనులను విష్ణు పంచాయుధములను, పన్నిద్దరాళ్వారులను స్తుతించెను అనంతాదులను, పంచాయుధములను విస్తరించి వర్ణించినకవి లక్ష్మీదేవి నిచట వర్ణించలేదు అనంతాదులు నిత్యజీవులు. విష్ణువునకన్న నితరులు "భోగసామ్యలింగాచ్చ" యన్నచోట చెప్పినట్లు విష్ణుసామ్యము భగవదనుభవ మునందే. లక్ష్మీదేవి విశిష్టాద్వైతమున నట్లుకాదు ఆమె అనపాయిని. పురుషకార స్వరూప 'శ్రియం దేవిం

నిత్యానపాయినీం నిరవద్యాం" ఇత్యాదిగా రామాను జులు వర్ణించిరి. అందువలన వైష్ణవ సంప్రదాయము శ్రీరహితముకాదు. శ్రీరహితుడైన నారాయణుడు భాగవతులకు దగ్గరివాడుకాడు. వైష్ణవగ్రంథములందు శ్రియఃపతి యనియే నారాయణునిపేరు. అష్టాక్షరీ ద్వయములయందును శ్రీవిశిష్టుడైన నారాయణుడే ప్రతిపాదితుడు. అమెను బట్టియే మనకు చుట్టరికము. ఈరహస్యమెరిగినవాడు కనుకనే రాయలు "శ్రీకమనీయహారమణి చెన్నుగతానును కౌస్తుభంబునం దాకమలా వధూటియు నుదారత దోప"అని ప్రారంభించినాడు, కావ్యము శ్రీదేవితోడనే ప్రారంభమైనది. ఒకరి వక్షోహారమునం దొకరు గోచరింపగా తమ తమ సౌందర్యములకు మురిసిపోయినట్లు ప్రతిబింబము అచ్చముగా పైకిదోచినట్లు శోభిల్లినది. శ్రీదేవియందు నారాయణుడును, నారాయణునియందు శ్రీదేవియును. ఇందువలన వేరువేరుగా నిర్వురను స్తుతింపవలసిన యావశ్యకము లేకపోయినది.

రెండవది అనంతునిస్తుతి. లక్ష్మీదేవిని నిత్య సామీప్యముండే మోసపుచ్చి నారాయణుడు అనంతుని ఫణాపంక్తులనెడు చంద్రశాలయందు భూదేవితోకలసి నాడట. ఈ పద్యమువలన కావ్యమునందు నాయిక యైన యాముక్తమాల్యద సూచితమైనది అమె భూదేవియొక్క యవతారము. శ్రీరంగమునందు స్వామి గోదాదేవిని స్వీకరించెను. ఆమెను స్వీకరించుటకు విల్లిబుత్తూరున కరిగెను వారిద్దరి వివాహ మచ్చట జరిగెను. అనంతుడు రామానుజుడుగా నవతరించెను. రామానుజులవారు మహావిష్ణువైభవము ననంతముఖములుగా వ్యాపింపజేసినవారు కనుకను గోదాదేవి "అన్నా" యని పిలిచినదని రామానుజుల వారి చరిత్రలోకలదు. (ఆచా-పూర్వ-11-46) అన్న చెలెలికి సమస్తసౌఖ్యములు సమకూర్చునుకదా! అనంతుడు భూదేవికి చేసినసేవకూడ నట్టిదే. అందువలననే ఈపద్యమున అనంతునితో పాటు రామానుజుల స్తుతికూడ చెప్పబడినట్లయినది. పన్నిద్దరాళ్వారుల స్తుతిలో భక్తియొక్క లక్షణము, భక్తుని లక్షణము స్పష్టముగా వ్యక్తమగుచున్నది ద్వాదశాదిత్యుల యందు (పన్నిద్దరు సూర్యులందు) సూర్యమండలస్థుడైన నారాయణుడు తాపముపొందగా దానిని తొలగించుటకు తమ హృదయమరందముల ప్రవహింపజేసి మురారిని చొక్కజేసినారు. ఆళ్వారులభక్తి యమాయికమైనది. వీరు భగవంతుని బాధలనుకూడ తమ సేవచేత తొలగింపజేయుదురు విష్ణుచిత్తునకి ప్రత్యక్షమైన భగవంతుని యాతడు స్తుతింపక "మంగళాశాసనము" చేసెను. "తిరుప్పల్లాండు" అన్న చిన్న రచన [illegible] నందు భగవంతునికన్న భాగవతునకే ప్రాధాన్యము. అందువలననే "భాగవత క్షోభంబునకు భువన భర్తయు భయంపడి"(7-48) అని కవియే శ్రీరంగ నాథుడు భయపడినట్లు చెప్పినాడు.

ఈ విధముగా ఈ కావ్యమందలి యిష్టదేవతాదికము సర్వేశ్వర రహస్యవిలక్షణమై పరమవైష్ణవ ధర్మరహస్య బోధకమై ప్రకాశించుచున్నది.

ఈ కావ్యమునందు మరియొక వైలక్షణ్యము అశ్వాసాంతము పద్యములలో వ్రాయుట. సంస్కృతమున శ్రీహర్షుడు లటి పద్ధతిని రచించిరి. రాయలవారు తెనుగున నిట్లు వ్రాసిరి. "ఇది సింహాచల దంభకేసరి పదాభిష్టార్చనాలబ్ధ ప్రణ్యాదురుత్తుంకణా పొట్టనూరు విజయస్తంభోపలోట్టంకితాంక దృఢోష్ట్రాక్షర కృష్ణరాయ నృప"(చతుర్థాశ్వాసాంతము) ఈవిధముగా నొక్కొక్క పదము నడచును.

రాయల రచనలో ఎంత ప్రౌఢిమ కాన్పించునో అయిన యంత సుకుమారముగా వ్రాయగలవాడు. ఎంత విజృంభించినట్లు కల్పన లోకాతీతముగాజేయునో అంతగానే ప్రకృతిలోని సహజమైన పరమసుకుమార

ధర్మములను వెల్లడించును. ఏది చెప్పినను నచ్చినను, నచ్చకపోయినను రాయలవారి ముద్ర ప్రతి పద్యమునందు నుండవలసినదే. గోదాదేవి లభించినంతనే విష్ణుచిత్తుడు తన దేవేరికీయగా నామె పెంచెను. ఆమెయందు యౌవన మంకురించెను. కవి యిచ్చట ఆమె శైశవమును బాల్యమును వర్ణింపలేదు. ఒకేసారి యౌవనమునకు దూకెను. ఇట్లేకవియు వ్రాయడు. బాల్యావస్థపోయి యౌవనావస్థ వచ్చిన సంధిలో కవి వర్ణన మారంభించెను.

"వాతెఱ తొంటికైవడి మాటలాడదు
　　కుటిల వృత్తి వహించె కుంతలంబు
లక్షులు సిరులు రానలకంట కనుగొనె
　　నాడించె బొమగొని యాననంబు
సనుగొన ల్మొగయ నక్షము సాక్షి కరకత్తెఁ
　　బాణి పాదము లెఱ్ఱవాఱఁ దొడగె
సారెకు మధ్యంబు దారిద్ర్యమును జెప్ప
　　జొచ్చెర్వ కిటు లోగజొచ్చె మేను
నట్టి గాంభీర్య మొక్కండు నెట్టుకొనిగా
నాభి నానాటి కీ గతి నాటి ప్రియము
చపుకయైనట్లు యిచ్చట చనదు నిలువ
ననుచు జాఱినకరణి బాల్యంబు జాఱె (ఆ5-7)

ఇది పరమ మధురమైన పద్యము. లోకోత్తరమైన పద్యము. బాల్యము జారిపోయి యౌవనము వచ్చినది. యౌవనము వచ్చుట బాల్యమునకు తెలియదు. ఎప్పుడో తెలియకుండ వచ్చినది. అందు వలననే తానెఱుగకుండ గోదాదేవియం దెన్నియో మార్పులు వచ్చినవి. అమ్మవారు నిన్నటి దనుక బాల్య సహజములైన జిలిబిలిపలుకులు పలుకుచుండునది నేడో హఠాత్తుగా మారిపోయినది. ఆమెమాటలు వెనుక టివలెలేవు. ఇది సహజమైన లోకోక్తి. తనకు చిరపరిచితుడైన వానిలో మార్పు కలిగినప్పుడు లోకము వారిట్లు చెప్పుకొందురు. బాల్యమునకూడ నిదే పరిస్థితి. అంతయు మారిపోయినది. తన ప్రియము - చెలిమి - నానాటికి తగ్గిపోవుచున్నదని అదిజాఱిపోయినదట. వాతెఱ-కుంతలములు-అక్షులు-ఆననము ఈవిధముగా ఒక్కొక్క అవయవమునందు కల్గిన మార్పును సూచించుచు వేరొక విధముగా ఆమె సౌందర్యమును కవి వర్ణించుచున్నాడు.

ఇట్లే పరమ సహజముగా లోకవృత్తమును కవి కావ్యమునందు సూచించును.

వనధి గమనజ గర్భార్క జనిత ఘృణులు
మఱి ప్రసూతికి నతని ధామంబు జేరె
ఘనతజొచ్చిన యిండ్లనుఁ దనుజలుండి
కాన్పునకు పుట్టినిండ్లకు క్రమము గనమె. (4-78)

సూర్యకిరణములు సముద్రుని చేరుటచేత మేఘరూపముతాల్చి యాకాశమును చేరినవి. ఇది చూచి కవి సామాన్యగృహవృత్తము సూచించుచున్నాడు. సూర్యకిరణములనెడు వనితలు సముద్రుని పొందుటచే గర్భముధరించి పుట్టినిల్లయిన యాకాశమును చేరినవి. సాధారణముగా నాయికలు ప్రసూతికొఱకు పుట్టినిండ్లకే వత్తురుకదా! ఈలోకధర్మము ప్రకృతియొక్క పరిణామముతోకూడ నట్లు కని జోడించి మనకు సూచించుచున్నారు.

విష్ణుభక్తుడైన రాయలు తనకావ్యమందు దశావతార వర్ణనముజేసెను. తత్పూర్వము నైషధమునగల దానిని శ్రీనాథుడు తెలుగుచేసెను. రాయలవారు ప్రయోజనదృష్టితో తన కావ్యమునందుచేర్చిరి. పర వ్యూహ విభవాంతర్యామ్యర్చావతారములయందు భక్తునకు అర్చావతారము పూజనీయము. సంకీర్తింపదగినది. రామకృష్ణాద్యవతార రూపమైన విభవము. విభవమే లేనిచో భక్తునికి భగవంతునకు సంబంధము లేదు, భగవంతుడు భక్తులకొరకై యనేక జన్మలనెత్తి యెందరినో రక్షించెనన్న విషయము భక్తునకాత్మ ప్రత్యయము కల్గించును. ఏదియులేనిచో దేనిని

ధ్యానించదగినయట్టి అవతారములయందలి భగవంతుని అనంత కల్యాణగుణములు అనేక వృత్తాంతముల ద్వార మున ప్రకాశిత పొందినవి. అందువలన భక్తికిని అవతారములకును విశేష సంబంధముకలదు. భక్తి ప్రతిపాదకమైన ఈ గ్రంథమున కవి రెండు మూడు మాఱులు దశావతారవర్ణన చేయించినాడు. ఒకటి విష్ణుచిత్తునిచేత, రెండవది గోదాదేవిచేత. రెండును ఒకదానికొకటి ప్రతిధ్వనులుగావు, ఒక్కొక్కటి తమ తమ ప్రత్యేకత నిలబెట్టుకొన్నవి.

విష్ణుచిత్తుడు మహాభక్తుడై వర్ణించినాడు. ఇదు వరాహావతార వర్ణన విచిత్రమైనది. అది వరాహస్వామి ముట్టెతో చిమ్మగా ఈ బ్రహ్మాండము పైపైకి చిట్లి యుపసాగరములందలి జలములతో సహా పైకెగురగా -అవి–అనేక బ్రహ్మాండములతో కూడిన ఆ మహదాకాశమందు ప్రకృతిదేవికి ముంగర వలె నున్నదట. ఇది రాయలు చేయదగిన కల్పన. అది ఈ విశ్వమునుదాటి యూహచేసెడి లక్షణము. నృసింహమూర్తిని రాయలు వర్ణించినపద్ధతి విచిత్ర మైనది

"అసురేంద్రాశయ కుండికాస్ఫు రుధిర వ్యాప్త
స్వకచ్ఛాయఁగాం
చి సముద్యత్ప్రతిసింహ మత్సరమిళచ్ఛ్వేష్టన్
దదుద్దామ దీ
ర్ఘసటాఝూటముఁ బెల్లగించు గతి నాంత్రశ్రేణిఁ
గిన్కన్ పెరం
జసిత క్రూర భవన్నఖావళులు ప్రోచున్
మర్త్యపంచాననా" (4–22)

నృసింహుడు హిరణ్యకశిపుని కడుపుచీరినాడు అది ఒక రక్తపుగుండమువలె నున్నదట. ఆగుండములోని రక్తములో సింహమునకు వేరొకసింహము (ప్రతి బింబము) కన్పించినదట. అందువలన మత్సరముతో దాని సటలను పెల్లగించుబో యన్నట్లు హిరణ్యకశి పుని ప్రేవుల యొక్క సమూహమును పెల్లగించు చున్నాడు. ఇట్టిదే పంచతంత్రములో నొక కథ కలదు. రాయలు దానినితెచ్చి యిచ్చటనను సంధించి నాడు. రామావతార వర్ణనలోనున్న "స్యందనస్థిత బిడౌజ శత్రుజాద్యకృత్"అన్న పద్యము మరల ఖన టత్పయోబ్ధి అన్న పద్యమువంటిది. ఇది రామబాణ ములను వర్ణించినది ఈ పద్యములు చూచినపుడు సీసపద్యమునకు శ్రీనాథుడొక మహాఝరీ సదృశ లక్ష ణము కల్పింపగా రాయలు దానికి జలపాతమువంటి తీవ్రవేగమును సమకూర్చినాడని చెప్పవచ్చును. ఇది నాన్యతోదృశ్యమైనట్టిది

బలరామావతార వర్ణనమున రాయల సుకు మార భావుకత్వము స్ఫురించును బలరాముడు హలధరుడు. యమునానదిలోనికి తన నాగేట హస్తినా పురమును త్రోయ సమకట్టినాడు. ఆయన తెల్లని వాడు. దీనిని కవి యిట్లు వర్ణించుచున్నాడు.

"క్షితి హలకృష్టిఁ బుట్టియడఁగెన్ క్షితి యందునె
సీత యంచుఁ ద
త్ప్రతి విరహార్తిఁ బొండిమముఁ దాలిచి రామ
శరీరమెత్తి, యా
క్షితి ఖననక్రియ న్మగుడఁ జెందగఁ గాక, కళింద
జాతటిన్
క్షితి దునవేటికిన్ హలము చేఁగొని నీ కవతాత్మతన్
హలీ" (4–28)

శ్రీరామావతారమున సీత భూమిలోనికి చొచ్చి నందువలన విరహవశుడై శరీరమునందు పాండిమము పూనినవాడై బలరామశరీరమున సీత మరల నాగేటి చాలులో దొరకునని హలమును ధరించి యమునానది తీరమున దున్నినాడట. సీతారాముల దాంపత్య మెంత యున్నతమైనదో, రాముని మనస్సులో సీతాదేవి యెడ నెంతటి ప్రేమయున్నదో భవభూతి యుత్తర రామచరిత్రలో వ్రాసినాడు. దాని బావనయే ఇది కూడ.

విష్ణుచిత్తుని దశావతార వర్ణనమిట్లు నడువగా గోదాదేవి వర్ణన మరియొకమార్గమున బోయినది. ఆమెతోపాటు నాగకన్యలు మరాళికాదులు వయస్యలై పుట్టిరి. వారు బొమ్మల పెండ్లిండ్లలోపాడు "పద్మాలయా పరిణయామేయగేయముల ననంత కల్యాణగుణము లద్భుతంబొప్ప విని అతని గవయుబుద్ధి ప్రాగ్జన్మసంస్కారమున జన్మింప తదవతారానుమేయ కథాసుధానుకలిత లీలానుకృతుల" వర్తిలు చున్నది. ఈహరి యందు కలిగిన ప్రేమవృద్ధియై విరహమున నతనియందే దోషములెన్నుట ప్రారంభమైనది "మీరు హరినిగూర్చి పాడుచున్నారు, అతడేయువతులు వలచిరాగా కాపాడినాడు?" అనిప్రశ్నించినది. అతని అవతారములం దొక్కొక్కవేళ నెందరిని వంచనచేసినాడో చెప్పుచున్నది. ఈ పద్యముల యందు భగవంతునిమీది యనురాగము వ్యంగ్యముగా గోచరమగుచున్నది. ఇట్టి రచన తెలుగుభాషలో కాసుల పురుషోత్తముడు చేసెను. ఈ పద్యములలో నొక్కపద్యము నుదహరింతును.

*"ధరపై నీతడు పూర్వకల్పముల సక్తస్త్రీ*
*విశాలాంబక కాం*
*బురుహశ్రేణి జలంబుమైఁ బులకలన్ బూరించుచున్*
*వేచు దు*
*ర్భర కర్మంబు మరంగ వచ్చు జలజత్వ స్తబ్ధ*
*రోమత్వ కే*
*సరి తల్పావ్యవతార దంభమున నాచ్ఛాదించుఁ*
*దాఁ బ్రౌఢిమై"* **(5–44)**

భగవంతుడు పూర్వకల్పములయందు తన్ను వలచిన స్త్రీల కన్నులయందు జలమును మై పులకలను (స్తబ్ధరోమత్వమును) కలిగించెను. అందువలననే జలములయందు పుట్టిన మత్స్య కూర్మ రూపములు, స్తబ్ధరోమమైన వరాహావతారము, కేసరి రూపము కల్గినవి. అతడు వాని నవతార దంభమున దాచుచున్నాడు.

గోదాదేవియొక్క ఈ యుపాలంభము పరమ విచిత్రముగా నున్నది అమె మనస్సుయొక్క సౌకుమార్య మట్టిది, అందువలననే ఆయోముఖి శూర్పణఖ విరూపలను చేయించినందుకును రాముచంద్రునికూడ అమె దూషించినది ఈ రకముగా అవతారముల యుపాలంభనము మరే కావ్యమునను లేదు.

గోదాదేవి కథ రాయలు మామూలు ప్రబంధములవలె తీర్పలేదు. చంద్రోపాలంభనాదులు లేవు. పూర్వ మామె సత్యభామ. తత్పూర్వము భూదేవియట వరాహావతార వేళయందామె భగవంతుని సంకీర్తనముచేయుచు పాడుటయందలి మాహాత్మ్యమును గూర్చి మాలదాసరికథ విన్నది. అందువలన తాను ప్రత్యక్షముగా లక్ష్యమేర్పరచుటకు గోదాదేవియై యవతరించి 'తిరుప్పావై', 'నాచ్చియార్ తిరుమొళి' యన్న గీతములను పాడి భగవంతుని చేరినది ఆమె చరిత్రములో సర్వవ్యాప్తముగా నీ యలౌకికత్వము స్ఫురించుచునే యున్నది

రాయల కావ్యమునుగూర్చి చెప్పునప్పుడు అతని వర్ణనా వైశిష్ట్యములుగూర్చి చెప్పుట చాల అవసరము. రాయలు వర్ణనాశక్తియందు తెలుగు కవులలో నందరికన్న మించినవాడని చెప్పవచ్చును. జడ ప్రకృతిని వర్ణించుటలో సంస్కృతమున వాల్మీకి యెట్లో తెలుగున రాయలట్లు

కవికి వర్ణనాశక్తి చాల ముఖ్యమైనది. కావ్యములోని విభిన్న సన్నివేశములు చిత్రించుటకు వాని యథార్థత్వావభాసమునకు లోకప్రతిఫలనము చాల అవసరము. ఈ లోక స్ఫూర్తిలేనిచోట కావ్యమువలన పాఠకుడు తన్మయీభావము పొందలేడు. కావ్యరసాస్వాదనమునకిది చాల అవసరమైన లక్షణము.

ఈవర్ణనము రెండువిధములుగా నుండవచ్చును. కవియొక్క భావన. కవియొక్క కల్పన. మొదటి

భావన యన్నది వస్తువుల యాంతరమును రూపుకట్టించుకొని పలుకుట. ఇందు వస్తువులు కవియొక్క వాక్కుచేత పాఠకుని మనస్సులో విస్పష్టముగా స్ఫురించును. కల్పన యన్నది రెండవశ్రేణికి చెందినది. ఇక్కడ కవి తనయొక్క యూహలను వస్తువులమీద నారోపించును. గోరంతలు కొండంతలు చేయును. కొండంతలు గోరంతలు చేయును. దీనికికూడ వస్తుదర్శనమే ప్రయోజనము. భావనాపద్ధతికి ఉపమానము ప్రాణభూతమనుకొన్నచో కల్పనాపద్ధతికి యుత్ప్రేక్ష ప్రాణమని చెప్పవచ్చును. ఉపమా ఉత్ప్రేక్షలన్నవి కేవలమవియే వాడుదురని భావము కాదు. కాని ఈ అలంకారముల మూలగుణము వానికి చెందియున్నదనియే తాత్పర్యము. భావనను Imagination అనియు కల్పనను Fancy అనియు చెప్పవచ్చును. వాల్మీకి మొదలైన మహాకవులయందు రెండవలక్షణము ప్రధానముకాగా తరువాతి కవులయందు రెండవ లక్షణ మప్రధానమైనది. రాయల రచనలో భావనయున్నది-కల్పన మున్నది. ఒకటి మనస్సుపైన ముద్రవేయును. రెండవది ఆశ్చర్యము కల్గించును.

ఈ వర్ణన మెన్నోవిధములైనది. జడ ప్రకృతిని వర్ణించుట—పశుపక్ష్యాదులైన జంగమముల వర్ణించుచు వాని ప్రవృత్తిని వెల్లడించుట—మనుష్యాదుల బహిర్వేష వర్ణనము-వాని యాంతరములో వృత్తుల వర్ణనము. ఈ కావ్యమునందు రాయలు జడప్రకృతిని వర్ణించి సమృద్ధిగా దాని సౌందర్యమును వెల్లడించెను. గ్రీష్మ వర్షాశరద్వసంతముల వర్ణనము చేయబడినది. రెండుమారులు పురవర్ణనము చేయబడినది. ఇదియంతయు ఆయన వర్ణనావైభవమునకు తార్కాణమైనది. మాలదాసరికథలో ఖాండిక్యకేశిధ్వజ సంవాదములో మానవ ప్రకృతిని చక్కగా వర్ణించియున్నాడు. రాయల వర్ణనములో శ్రీరంగనాథునకుకూడ మామూలుమర్త్య సహజమైన ప్రవృత్తికలవాడు. ఈతనికి తన భక్తుల నాడించెడి యొక పరిహాస ప్రవృత్తికలదు.

భావనకు కల్పనకు వర్ణనలో గుర్తించుటకు కొన్ని పద్యములు పరిశీలింపవలయును. "తలపక్షపుటస్వచ్ఛ" యన్న చాల ప్రసిద్ధమైన పద్యము కవియొక్క భావనాశక్తికి తార్కాణ. రెక్కలలో తలను జేర్చిన యా బాతులు, బ్రాహ్మణుడు ఉదికి పిండి ముడిచిపెట్టిన వస్త్రములోయని భ్రాంతినికల్గింపగా వాని నా బ్రాహ్మణుల కందీయగోరిన ఆరెకులు దగ్గరకు చేరగానే అవి యెగిరిపోయెను. అదృశ్యమును చూచి వారిస్త్రీలు నవ్వినారట. ఇది చాల సహజమైన వర్ణనము. మనకు కన్నులయెదుట కట్టినట్లున్నది. కవి యిందులో క్రొత్తగా కృత్రిమముగా కల్పించినదేమియులేదు.

అప్పు డపారఁ బాట వహించి విప్పగాఁ
బూవులు గోటమీటుతఱి బోయెడు తేటులుమ్రోత కామిశం
కావహమౌఁ గృతాభ్యసనలౌటను దంతపుమెట్ల వెంబడిన్
జేవడి వీణమీటుటయుఁ జిక్కడలించుటయున్
సూరింగారి (1—62)

విల్లిపుత్తూరుతో స్త్రీలు కుచములపై జడవిచ్చి పూలను గోటవిసరివేయుచుండగా వానిలోని తుమ్మెదలు ఝుంకారము చేసినవి. ఆమ్రోత వీణానాదమువలె నున్నది. పూవులు దంతపుమెట్లవలెను కుచములు గుబ్బకాయలవలెను స్ఫురించి దూరముననున్న కాముకులు కృతాభ్యసనలైనవారు వీణవాయించుచున్నట్లు భావించిరట. ఇదియు భావనలోనున్న వైలక్షణ్యమేయని చెప్పవలెను.

కవి ప్రారంభమున సుదర్శన వర్ణనము జేయుచు రాహుదళన కృత్యమును స్మరించుచున్నాడు. అమృతము త్రావుచున్న రాహువు మస్తకము విష్ణువు

సుదర్శనముచే ఛేదింపగా నోటిలోనుండి అమృతపు ధారలును, గళమునుండి రక్తధారలును వెలువడు చున్నవి. ఆ దృశ్యము పొయ్యిమీదనున్న ఎసటికుండ వలె నున్నదట. రక్తధారలు పొయ్యిలోని మంటల వలెను, రాహుమస్తకము కుండవలెను, వానినోటిలో నుండివచ్చు అమృతధారలు పొంగి పొరలిన గంజి వలెను తోచినదని చెప్పుచున్నాడు. ఇది కవి ఆరోప ణమే. ఇచ్చట ఎసటికుండను ఊహించుట కవి యొక్క వైలక్షణ్యమే. దీనిని సంపూర్ణముగా భావన యని చెప్పలేము, కాదా ఊహ (కల్పన) యని చెప్ప లేము. ఇది రెంటికి నడిమి సంధివంటి పద్యము.

కల్పనకు విలక్షణమైన యుదాహరణము దశా వతారస్తుతిలో కృష్ణావతార వర్ణనము.

ఆయత యుష్మదాకృతి కరాగ్రనగాంచల వాంత వారి ధా
రాయుత చంద్రకాంత ఫలకావళి బింబితమై చెలంగ నా
రాయణమూర్తి మత్కవచ రత్నముచే బరి రక్ష గాంచె నా
నోయదువీర! వృష్టి బడియాఱ బ్రోవవె సప్త రాత్రముల్ (4–23)

ఇది ఉత్తమశ్రేణికిచెందిన కల్పన శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి నెత్తెను. పైనుండి ఇంద్రుడు వర్షము కురి యించుచుండగా కొంత యంచులనుండి ధారలు ధార లుగా చుట్టును జలధార పడుచుండెను. ఆ జలధారలు చంద్రకాంత ఫలకములవలెను, వానియందు ప్రతి బింబించిన కృష్ణుని మూర్తిసహస్రము వారిరక్షకై యేర్పడిన కవచమువలె నుండెను. ఇది కేవల కల్ప నయే కాని చాలా మనోహరమైన దృశ్యమును సాక్షాత్కరింప జేయుచున్నది. ఆ దృశ్యము నిజముగా కల్గుటకు వీలున్నదాయన్నచో నది వేరే ప్రశ్న. కృష్ణుడే యల ప్రతిఫలించును, గోపకులేల ప్రతి ఫలింపరాదు? ఈ విధముగా లక్ష ప్రశ్నలు పుట్ట వచ్చును. కాని ఈకల్పనవలన ఊహించిన ఊహ యొక్క స్వాదుతా లక్షణముచే నీ ప్రశ్న లన్నియు నందే యంతర్భూతము లగుచున్నవి.

ఈ కావ్యమునందు కథాసందర్భములలో రూప మును కట్టించుటకు రచయిత భావచిత్రములు సమృ ద్ధిగా రచించును. వర్ణములలో వారి వారి ఆహార విహారముల నన్నింటిని అభివర్ణించుచుండును. ఒక్కొక్కచోట తన యొక్క యుపమానముచేత తన లోకోత్తరశక్తిని వెల్లడించును. వేసవిలో భోగులు లేత మామిడి ముక్కలతో, ఎండిన చెఱువులనుండి తెచ్చిన చేపలను నూనెలో వేగించి తినగా కనరు త్రేన్పులు వచ్చినవట. వాని కనరుదనము పోవుటకు వారు సాయంకాలములయందు ఇసుకలలో దాచియుంచిన కొబ్బరికాయలను పగులగొట్టి నీరు త్రావెదరట. గ్రామ గ్రామమున సామంతులకొరకు ఏర్పరచిన చలువపందిళ్ళు 'కుంపటిలో తామర' వలె నున్నవట. ఇక్కడ కుంపటిలో తామరయన్నది లోకోక్తి అనుప కారకమైన పరిసరములయందు వృద్ధిచెందిన సల్లక్షణ మని యర్థము. కాని ఇచట ఈ సామెత మరి యింత యర్థమును సేకరించుకొన్నది. అగ్రీష్మము లోక మును కుంపటివలె చేసినది అనుటచేత తాపాధి క్యము నూహించుకొనవచ్చును. అప్పుడీ చలువపందిళ్లే తాపార్తులకు శరణ్యమయ్యెను. రాయలవర్ణన యేవస్తు వును స్పృశింపదని చెప్పుటకును వీలులేదు వర్షావర్ణ నలో 'ఇల్లిల్లుదిరుగ నొక్కొంతబ్బు శిఖయబ్బె' (4–127) అన్నపద్యములో వర్షాకాలమున సుజనులు సామాన్య గృహస్థులు పొయ్యి మండక, మండినను అన్నము వుడక, పొగచూరి అన్నము తినుటకు వీలు లేక, వండిన అన్నము మగవారికిని అనుకోకుండ వచ్చిన అతిథులకు సరిపోగా ఆడవారి వంటకు పునః

ప్రయత్నమగుట. ఈ విధముగానున్న బాధలన్నియు రాయలు వర్ణించియున్నాడు.

'రవిజూవి కుడుచువారలకును కృకలాస
ములకును దృష్టి మిన్నులనె నిలచె (4-123)

అన్న పద్యములో మానవజీవితమునకు జంతువుల కీటకముల జీవనమునకు సాధారణమైన వర్షాప్రతిబంధకమును కవి వెల్లడించినాడు. అయనదృష్టిని కృకలాసములు కూడ తప్పించుకొనలేదు

ఖాండిక్య కేశిధ్వజ సంవాదములో పులి యజ్ఞధేనువును చంపుట నాలుగు పద్యములలో వర్ణింపబడినది. ఈ పద్యములలో పులియొక్క స్వభావము అది చంపెడి పద్ధతి కనులకు కట్టినట్లున్నది.

రాయల విశిష్టత చూపుటకు వేరొక పద్యము చూడవచ్చును. ఇది గోదాదేవి నూగారును వర్ణించు పట్టున ప్రయోగింపబడినది. మన్మథుడు విరహులపై కోపముతో నొఱనుండి తీయకనే ఖడ్గమును విసరెను. ఆ వేగముచే కట్టుతెగి ఖడ్గపు అంచు కానవచ్చుచుండెను.

విరహతతిమీద కోపానమరుఁడు డివియ
వేగమై పైడి యొఱతోన విసరఁ గుట్టు
దునిసిబైటికి నసి ధారతోచె ననగ
కనకరుచి మధ్యలత నారు కాంత కలరు (5-24)

నారు ఖడ్గపుటంచువలెను, బంగారుమయమైన కత్తియొఱవలె సన్నని మధ్యభాగము నెచ్చట వర్ణింపబడినది. ఇది ఊహయే ఈ విధముగా రాయలే ఖడ్గమును విసరినాడేమో? ఈ ఊహ విలక్షణమైనది.

ఈ కావ్యమునందిన్ని యుపమానములు, ఇన్ని ఉత్ప్రేక్షలు, అని లెక్క పెట్టుటకు వీలులేదు. కావ్యమంతయు రత్నముల గనివంటిది. ఎచ్చటచూచినను అందములైన పద్యములే

ఈతని వర్ణనములోగూడ వైష్ణవమతాభి నివేశము కన్పించును. 'విశదపయోదపుంబొరలవేష్టనచే' అన్న పద్యములో పాలసముద్రములోని శ్రీమన్నారాయణుని వర్ణనము, అయనిష్టక ధవళాతపత్రి (4-165) అన్న పద్యమున శ్రీరాముడొనర్చిన ధనుర్భంగము సూచితమైనది.

ఆముక్తమాల్యద సౌందర్యమునుగూర్చి రంగనాథుడే మోహపడెను. తలంబ్రాలవేళ

ఇంతదోయిలు సేసబ్రాలెత్తుచోట
గుబ్బపాలిండ్ల క్రేవ గ్రక్కున మురారి
కన్ను వేయుట గని లజ్జగదుర బాహు
లెత్తక కరాగ్రములన పైకెగరజల్లె (7 ఆ)

శ్రీరంగనాథుడే అంతగా నాకృష్టుడైనాడు. ఆమె సౌందర్యమే కావ్య సౌందర్యము.

శ్రీ చెఱకుపల్లి జమదగ్నిశర్మ

వ్యక్తుల కున్నట్టే సూక్తులకు జాతకముండును. కొన్నికొన్ని సూక్తు లవిపుట్టిన వేళనుబట్టి మిక్కిలి ప్రచారము నందగా మఱికొన్ని స్మరించువారుగూడ లేక మాటుమణఁగి యుండును. ఈ సూక్తికి లభించిన ప్రచారమునుబట్టి చూడఁగా సహజశక్తివంటి దీని జాతక ప్రభావమే ...కమేమో యనిపించును,

కాకమాని మూర్తికవి (ఇతఁడు భట్టుమూర్తి కాఁడు) తన పాంచాలీపరిణయ మను ప్రబంధములో స్వశక్తిప్రకటనార్థ మీ పద్యమును జెప్పికొనినాఁడు.

అల్లసాని వాని యల్లిక జిగిబిగి
ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు
పాండురంగవిభుని పదగుంఫనంబును
కాకమాని రాయ నీకె తగుగ

ఇందు పేరుకొనిన ముువ్వురు కవుల వైలక్షణ్యములును దన కవితయందుఁ గలవని చెప్పికొనిన మూర్తికవి కవితకు ప్రశస్తిరాలేదు. రాకపోఁగా పాండురంగవిభుఁడు అనఁగా తెనాలి రామకృష్ణుఁడు 'నీ కంతశక్తి యెక్కడిది? ఆ వైలక్షణ్యములు కాక దురదతో గ్రామసింహ ...రాయుడు నీకే తగునన్న దృష్టితో విపరీతార్థమును శ్లేషించి కాకమాని రాయ నీక తగుర' అని అధిక్షేపించినట్లును జనశ్రుతి వినిపించుచున్నది. తెనాలియు నీ మూర్తికవియు సమకాలికులగుదురో కాదో యీ జనశ్రుతి యథార్థమో యయథార్థమో నిర్ణయింపలేము గాని మూర్తికవి కావ్యములు చూచినచో నీ యధిక్షేపము నిరాధారమనిపింపదు. స్వశక్తి తక్కువ యయినను మూర్తికవి యీ ముువ్వురు కవుల వైలక్షణ్యములను శక్తిమంతిముగనే చెప్పుట తటస్థించినది కావున నీ పద్యమునకు మాత్రము ఆ కవి కావ్యములకంటె నెక్కువ ప్రచారము లభించినది. 'బాలాదపి సుభాషిత' మన్నట్లు మంచిమాట యెవరినోట వెలువడినను పరిశీలింపఁదగినదియే !

ముక్కుతిమ్మన, తెనాలి రామకృష్ణుల విషయములో మూర్తికవి పద్యరచనయందలి పదప్రయోగ-

వైవిధ్యమునే యుద్దేశించినట్లు స్పష్టమగుచున్నది. ముక్కుతిమ్మన కవితలో పదలాలిత్యము మెండు. రామకృష్ణుని కవితలో ప్రౌఢపదగుంపన మధికము. ఈ క్రమమునుబట్టి పెద్దన కవిత్వ విషయమునగూడ పద్యరచనాశిల్పము నుద్దేశించియే మూర్తికవి యల్లిక జిగిబిగి యున్నట్లు భావింపవచ్చును. పెద్దన పద్య రచన 'జిగికలది, బిగికలది' అని భావము. అందులో సందేహములేదు. కాని యీ యల్లిక జిగిబిగి యను ప్రశంసను ప్రబంధ కథా నిర్మాణమునకుఁగూడ నన్వయించినప్పుడే పెద్దన పెద్దరికము నెఱుంగుట కవకాశము లభించును. అట్లుకాక ప్రకరణమునుబట్టి పద్యము నల్లికకుమాత్రమే పరిమిత మొనర్చినను, పెద్దన [illegible] తనుగూర్చి మనము స్థూలలక్షణమునే పరిశీలించిన వార మగుదుము. మూర్తికవి యుద్దేశించిన దంత మాత్రమేకదా యన్నచో నొకమాట యనువలెకే వక్త కధికారముగాని యర్థము కేవల మాతని యభీష్టమునకు లొంగియుండదు. అది ప్రకరణమునుబట్టి, శ్రోతల యౌత్తమాధికారమునుబట్టి యధికాధికము కావచ్చును. పెద్దనార్తికింత ప్రచారము పత్కృష్టిచేఁగాక యిట్టి హేతువులచేతనే వచ్చినది.

పద్య మల్లుటయున్నది, కథ యల్లుటయున్నది. అందుచే నల్లికయనుమాట రెంటి కన్వయించును. అల్లిక యున్నచోనెల్ల బిగి వే జిగి వచ్చుటకలదు. బిగి యనఁగా సందీయనితనము. జిగి యనఁగా మెఱుఁగు. కొన్ని యల్లికలలో జిగితోఁచునుగాని పరీక్షించినచో బిగి యుండదు. జిగివే నాకృష్టుల మగుదుము. చాల బాగున్నదని దరిఁజేరుదుము. చేరి చూడఁగా నే మాత్రము బిగి లేక బాడెలు బాడెలై యెచటికచట వదులు వదులుగానున్న యల్లిక కనబడును. బట్టల యల్లికలో నీ యనుభవము సర్వజన విదితము. అట్లే పద్యము లందును బిగియుండి జిగిలేని యల్లికలు

నుండవచ్చును. కాని యవి యాకర్షింపవు. అట్లుగాని వాని యల్లిక జిగివే నాకర్షించునది. సూక్ష్మపరిశీలన కాగు బిగి కలది. కావుననే యతఁడాంధ్రకవితా పితామహుఁడైనాఁడు

పద్యరచనములో నీ లక్షణము నన్వయించుటకు పెద్దన కావ్యమంతయు నుదాహరింపఁదగినదే! అందఱకుఁ దెలిసిన పద్యములందేకాదు. యాదృచ్ఛికముగా నెదురుపడ్డ యే పద్యమును గైకొనినను నీ యల్లిక జిగిబిగి నెఱుంగవచ్చును.

శ్రీకృష్ణదేవరాయ వంశవర్ణనములో నీ పద్యమున్నది.

ఘనుఁడై [illegible]
వాఁతా
శనరాడాశాంతదంతి స్థవిరకిరుల జంజాటముల్
మాన్చి యిమ్మే
దిని దోర్దండైక పీఠిన్ దిరముపఱిచి కీర్తిద్యుతుల్
రోదసిఁ బ
ర్వ సరాతుల్ నమ్రులై పార్శ్వములఁగొలువఁ
దేజఃప్రతాపంబు నూపెన్.

తుళువ వంశీయనృపతులలో నగ్రగణ్యుఁడైన తిమ్మభూపతి భూభారవహన సామర్థ్యము నభివర్ణించు పద్యమిది ఇంతలీవిగా నడిచిన మహాస్రగ్ధరయే సాహిత్యమునం దపురూపము. అతీవిచేతనే పాఠకు లాకృష్టులగుదురు. మహాస్రగ్ధర సిద్ధవృత్తము. భూభారమును వహించుచున్న కూర్మము, కులపర్వతములు, నాదిశేషుడు, దిగ్గజములు, నాదివరాహము, నివి యన్నియు నసమర్థత్వమునో యనేకత్వమునో కలిగియున్నవి. నిర్వహింపలేక గిజగిజలాడుచున్నవి. సమర్థుఁడైన తిమ్మభూపతి వాని జంజాటములను మాన్చి వానికంటె నధికమగుచున్న మహా మహా భారము నవలీలగాఁ దాను వహించుచున్నాఁడు. ఈ

భార మెతయుల కెంత దుర్భరమో యితనికెంత సుక రమో తెలుపుటకే విలక్షణ సమాసగ్రథనమున కను కూలమైన యీ వృత్తము నేర్పరచినాఁడు కవి. సమాస దైర్ఘ్య గ్రథనకౌశలములచే భావాధిక్యమును స్ఫురింపఁ జేయును తిమ్మభూపతి దోర్దండమున కంతటి బరువును, తేలికయనుటకి 'మ్మేదిని' యను సుకుమార పదప్రయో గమును గావించినాఁడు. అంతటితోఁబోక సమాసములో భూభారనిర్వాహకుల కొక్కొక్కరికి కొక్కొక్క విశేషణము జోడించి వారివారి యసమర్థతల నుగ్గడించినాఁడు. కమఠము శరము మొండిమోఁతయే కాని యుపాయ మెఱుఁగదు. గ్రావములకు సంఘాతత్వము. అనఁగానే యొక్కటియు సమర్థములు కానట్టి యుగూడి తంటా లుపడుచున్నవి. అశేషమన్న వాతాశనరాట్టు. వట్టి గాలి తిని బ్రదుకు వాఁడింత దుస్సహమైన భూభారము నకుఁ బూనుటయే మి? ఆ శాంతదంతులా శాంతదంతులే! లాభములేదని నిరాశనందుచున్నవి. ఎనిమి దొక్క పనికిఁ బూనుకొనియు నా శాంతము నందక తప్పలేదు. ఇఁక కిరికి స్థవిరత్వము తటస్థించినది. ఇప్పటిదా, యేనాటిదో యీ వరాహము ఎన్నియుగములని మోయఁగలదు ? కాఁగా నీ భారము వీరందఱకు దుస్సహ మగుచున్నది. సంయుక్తాక్షర పూర్వములై గురుత్వము నందుచున్న వర్ణము లీ దుస్సహత్వమును ప్రస్ఫుట మొనరించుచున్నవి. తిమ్మభూపతి సమర్థుఁడు. వీరు పడుచున్న పాటు గమనించినాఁడు దోర్దండైకపీఠి యందు ఈ మేదినిని స్థిరపఱినాఁడు. ఏ మేదినిని? వారందఱకు మోయరాని దగుచున్న మేదినిని ఎచ్చట? దోర్దండమను నొక్కటియేయైన పీఠియందు. ఇచటి యేకశబ్దము పూర్వనిర్వాహకుల బహుత్వమునకుఁ బ్రతిద్వంద్వి యగుటయే కాక రాజునకున్న రెండు బాహువులలో దక్షిణబాహువును సూచించుటకు. దానిలో దాక్షిణ్యము వ్యంగ్యమగును. అనఁగా దయఁ దలఁచి వారికి విశ్రాంతి నొసఁగవలెనని యాభారమును భూను వహించినాఁడు. అంతటి సామర్థ్యమును ప్రక టించుటచేతనే కీర్తిద్యుతుల భువనభోగ్యాప్తమైనవి. 'పర్వ నరాతుల్' చతుర్థపాదమిట్టు పాల్పిస్థానమున విఱుగుట తిమ్మభూపతి పరాక్రమమునకు శత్రువులెంత వెఱచిరో తెల్పుచున్నది. మోఁల నిలువలేకపోయిరి. స్వామిసన్నిధిలో భక్తు లుభయపార్శ్వముల నిలిచినట్లు నిలిచికొలిచిరి. అంతటి తీవ్రప్రతాపమును తిమ్మభూపతి చూపినాఁడు. పద్యమునందలి బిగి యనఁగా నిది. ఛందస్సు. పదములు,కూర్పు, విఱుపు సర్వము నిగూఢ భావద్యోతకములే! సమర్థుఁడైన పనివాఁడెట్లల్లినను జిగి యుండును బిగి యుండినచోఁ జెప్పెడిదేమి !

ఈ భూభార వహనమునే రాయల పరముగాఁ జెప్పిన పద్యము చూడుఁడు

అలపోత్రిప్రభుదంష్ట్ర, భోగికర భోగాగ్రాళిరా,లుద్భటా
చలకూటోపల కోటి రూపుచెడనిచ్చుల్ రాయగానైన మొ
క్కలు భూకాంతకు నున్ననయ్యె నరసక్ష్మాపాలు
శ్రీకృష్ణ రా
యల బాహామృగనాభి సంకుమద సాంద్రాలేప
పంకంబునన్॥

తుళువవంశములో భూభారవహన సామర్థ్య మానువంశికలక్షణమైపోయినది అందుచేత రాయల విషయమున నవలీలఁగా వహించుటకు దెలుపనక్కఱ లేదు వెనుక భూభారాధిక్యమును దెలుపుటకై యన ఉసమైన పెద్దవృత్తముతోడను బనిలేదు. ఇక్కడ తెలుపఁదలఁచినది రాయల రాసిక్యము, రాయలయెడ భూకాంతకున్న ప్రేమాధిక్యము. కావున నుదాత్త శృంగారవ్యంజకమగు మత్తేభవృత్తము తగును. ఇచటి కల్పనలో భూమికి భర్తలైన వరాహాదులు రసికతలేని మోటువారైనారు వారికి భూమియెడల ప్రేమ యున్నదికాని సౌకుమార్యములేదు. ఒకఁడు పోత్రి ప్రభువు. ప్రేమప్రకటనాంగ మాముట్టియందలి కోఱలు. మఱొకఁడు భోగివరుఁడేగాని రాళ్లుమోయు

వాఁడు. రాళ్లతోడి భోగములే ప్రేమప్రకటనాంగములు. మిగిలినవి కదలక మెదలక పడియుండు రాళ్లగుట్టలు. వారితోడి సాంగత్యముచే భూకాంత రూపే చెడిపోయినది. ఒడలంతయు గంట్లుపడిపోయినది. ఇచటి సమాసములలోని సంయుక్తాక్షర పూర్వ గుర్వక్షరములు ఆయాభర్తల కార్కశ్యమును సూచించుచున్నవి. దీర్ఘసమాసముచేయక మూఁడు ముక్కలుగా చెప్పుట యొక్కొక్కరు నొకరినిమించి యొక రరసికులని తెలుపుటకే! నిత్యసువాసిని యయిన భూమికి రసికాగ్రేసరుఁడయిన రాయలు భర్తయైనాఁడు. ఆమె గంధవతి కావున మృగనాభి సంకుమదసాంద్రాలేప మనోహరుఁడైన యా రాయల కౌగిఁటిలో నొదిగిపోయినది. అరసికులైన పూర్వభర్తలు నిచ్చల్ రాయగా నైన ముక్కలు నున్ననై స్వస్వరూపము సిద్ధించినది. ఆమె సుఖపారవశ్యము నందినది. రాయల కౌఁగిలి యెంత సాంత్వనహేతువైనదో పారవశ్యహేతువును వర్ణించు దీర్ఘసమాసము వ్యక్తమొనర్చుచున్నది.

ఇట్లు ఏ పద్యమును చూచినను జిగియు బిగియు నిబిడమై కనిపించును. మఱియొక విధమైన బిగిని గమనింతము. యయాతి తనయుఁడైన తుర్వసుని వంశమే తుళువ వంశమైనదని చమత్కారముగా రాయల వంశమునకుఁ జంద్రవంశముతో సంబంధము కలిపినాఁడు కవి. మూలపురుషుఁడగు చంద్రుని మొదటి పద్యములో లోకోత్తరముగా వర్ణించినాఁడు. ఆ చంద్రుని కొడుకు బుధుఁడని చెప్పవలయును. ఉన్నదున్నట్లు కథ కప్పినచో ప్రతిష్ఠాహేతువు కాకపోవచ్చును అని యథార్థము చెప్పరాదు. ఈ సందర్భమున పెద్దన వ్రాసిన పద్యమిది.

ఆ సుధాధాము విభవ మహాంబురాశి
కుబ్బుమీఱంగ నందనుఁ డుదయమయ్యె
వేదవేదాంగ శాస్త్రార్థ విశదవాస
నాత్తధిషణాధురంధరుండైన బుధుఁడు

ఆ చంద్రుని వైభవమనెడి మహాసముద్రమున కుబ్బుమీఱఁగా నందనుఁ డుదయమైనాఁడఁట! ఏమి యీ గడుసుపోకడ! వంశపయః పారావార రాకా సుధాకరులని పుత్త్రులను వర్ణించు కవి సమయమున్నది. చంద్రునికి పుత్త్రోదయము వర్ణించు పట్టున దానినట్లే [illegible] మహాంబు రాశియనక విభవమహాంబురాశి చేసినాఁడు. దాని కుబ్బుమీఱంగ నందనుఁ డుదయమైనాఁడఁట! మీఱంగ ననుచో మీఱునట్లుగా అనఁగా అహ్లాదకరుఁడగుచు నని యర్థము చెప్పికొనవచ్చును. కాని అనంతర్యార్థము అనఁగా ఉబ్బుమీఱిన పిమ్మట అని యర్థము చెప్పికొనినచో వైభవాతిశయముచే గర్వించి హద్దుమీఱి ప్రవర్తింపఁగా గురుభార్య[illegible] పుత్త్రోత్పత్తియగుట స్ఫురింపును. దోష[illegible] యందున్నదిగాని కుమారునకు సంక్రమింపలేదు. గురుశుశ్రూషా సమయమునఁ జంద్రుఁడార్జించినది వేద వేదాంగ శాస్త్రార్థ పరిజ్ఞానము. [illegible] విశద వాసనాత్తధిషణా ధురంధరుఁడైనాఁడు బుధుఁడు. అసలుకథ నింత నిగూఢమొనర్చుటచే పురూరవుని గురుద్రోహ వృత్తాంతము కప్పివైచి నట్లైనది. వంశప్రతిష్ఠా భంగములేకుండ యథార్థము చెప్పినట్లైనది. ఇంతటి బిగి నాస్యతో [illegible]దా!

ఇంతవఱకు [illegible] పద్యములు [illegible] నవతారిక యందలివె. కావ్యముఖమునందలి యవతారికలో నిట్టిబిగి యుండవచ్చును. [illegible] నిట్లుండునాయని యెవరైన ననవచ్చును. షష్ఠాశ్వాసము నందలి [illegible] వృత్తాంతములోని యీ పద్యము చూడుఁడు.

ఆహా ధన్యుఁడనైతి, మద్వమల వంశాచార విద్యా
తప
శ్రీ[illegible] నైక[illegible] నాగ
వాసంబు మ

ద్గేహక్షోణికి బిడ్డనేయుటకు నేతేఁగాంచుటన్,
బ్రాహ్మ్య మిం
కోహోచాలు ! బొకాలిపోయెదరొ పోరో ! నోటి
క్రొవ్వేటికిన్ ?

ఇది ప్రసంగశైలిగల పద్యము. స్వరోచిభార్య యగు మనోరమ చెలికత్తెయయిన కళావతి మనోరమా ప్రార్థనమున స్వరోచిచేఁ జికిత్సితయయి స్వస్థతనంది స్వీయవృత్తాంతము నాతనితోఁ జెప్పుచున్నది. ఆమె తండ్రియయిన పారుఁడను బ్రహ్మర్షి కన్నవెంటనే తల్లి విడిచిపోగా తానే తల్లియునై యల్లారు ముద్దుగా పెంచిన బిడ్డను భార్యగానిమ్మని యడుగుటకు సాహసించిన బంధుపరివేష్టితుఁడైన గంధర్వునితో నీ మాటలనుచున్నాఁడు. వాఁడు వచ్చినతీఱు, నడిగినతీఱు పారునకు జుగుప్స కలిగించినది. మనస్సు పట్టలేక యీ మాటలనినాఁడు. ఇంతకంటె తీవ్రాధిక్షేపము మఱొకచోట నుండదు. మద్విమలవంశాచార విద్యా తపశ్శ్రీహోమాదులన్న సుదీర్ఘ సమాసము పారుని మనసులోని యావేదన నంతను వ్యక్తము చేయుచున్నది. మాయింటి పట్టునకు—బిడ్డనిమ్మని యడుగుటకు— ఈ బోగము మేళము వచ్చినందువలన యావజ్జీవము నేనొనర్చిన సత్కృత్యము ఫలించెనుగదా యనుటలో నెంత యుమ్మలిక యున్నదో చెప్పలేము. ఇట్లధిక్షేపమయముగా నాల్గుపాదములోఁ గొంత యగువఱకు పద్యమంతయు నడిపి ముగించినతీఱు మనుష్య స్వభావ మర్మజ్ఞమైనది. 'పొకాలిపోయెదరొ పోరో నోటి క్రొవ్వేటికిన్ ?' సరిగా లోకములో నిట్లే వ్యవహరింతురు. ఆ చివర దాపరికముండదు. కోపమంతయు నా విష్కృతమగును 'పోతారా పోరా ఇక్కడనుంచి—నోరు కొవ్వెక్కి కొట్టుకుంటున్నారా ?' అన్న వ్యవహారములోని తీవ్రతయంతయు గ్రాంధిక రూపము దాల్చినది. ప్రసంగశైలిలో జిగిబిగులు లభించునది యిట్టి లోకానుకృతియందలి సామర్థ్యముచేతనే!

పద్యగతమయిన జిగిబిగులు ప్రసిద్ధకవులందఱి యందు కనిపించును. కథానిర్మాణమునగూడ నవి యున్నప్పుడే వారు మహాకవి ప్రశస్తి నందుదురు. అల్లసాని పెద్దన ఆంధ్రకవితాపితామహ బిరుదాంచితుఁడు. కవితాప్రావీణ్య ఫణీశుఁడగు రాయలవంటి కవి ప్రభువుచే సర్వాత్మనా సమ్మానింపఁబడినవాఁడు. సర్వలక్షణ సమన్వితములైన యెన్నో ప్రబంధము లెన్ని పుట్టినను మనుచరిత్ర యిప్పటికి నెప్పటికి మనుచరిత్రయై వెలయుచున్నది ఈ కథ యల్లికలోని జిగిబిగులెట్టివో గ్రహించి పెద్దన పెద్దరికము నెఱుంగుదము.

లోకములో మనుచరిత్ర యన్నంతనే పరూథినీ ప్రవరాఖ్య ఘట్టమున్న మొదటి రెండాశ్వాసములు మూ చూచి విడచుట యాచారమైపోయినది. పెద్దన కవితాప్రశస్తిరా ఘట్టమే [illegible] సర్వస్వముదంటి ప్రామాణిక గ్రంథములలోని, పెద్దల వ్యాసములుగూడ భ్రాంతి గొల్పుచున్నవి. [illegible] నేరికొనుటలోఁ గవి యాశయమెట్టిది? లక్ష్యసిద్ధి నందుటలో నాతఁడెంతవఱకు కృతకృత్యుఁడైనాఁడు ? మొత్తము కావ్యముచూచి యిట్టి విచారణచేయువా రరుదైనారు. పిడుగునకు బియ్యమున కొకటే మంత్ర మన్నట్లు సాహిత్యమునందుఁగూడ స్థాలీపులాక న్యాయమే రాజ్యముచేయుచున్నది. కవి ఏకపాత్ర నీయుఁడు. అతఁడు చెప్పినదంతయు వినిన పిమ్మట మనకుఁ దోఁచినట్లర్థము చెసికొనవచ్చును. మొదటి వాక్యముమాత్రము విని 'చాలునిఁక చెప్పనక్కఱలే' దని శ్రోత పెడమొగము పెట్టుచో నెవరును నెవరి యభిప్రాయమును నితరుల కందింపలేరు. కావ్యోద్దేశముతోఁ దృప్తినందుట యిట్టి శ్రోతల మగుటయే! మనుచరిత్రము విషయమున మొన్న మొన్నటివఱకు మనమిట్లే వ్యవహరించినాము. (అల్లసాని వాని యల్లిక జిగిబిగి) యను శీర్షికతో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

గారు విమర్శక వ్యాస పరంపరను ప్రకటించి గ్రంథ రూపమున వెల్వరించిన పిమ్మట మనుచరిత్రయెడల నిన్నాళ్లు జరిగిన యాదరము పేరి నిరాదృతి చాల వఱకు తగ్గినది. వారాగ్రంథములోఁ గావ్యమును సమగ్రముగా చూచి యనేక నూత్న విషయములను జెప్పినారు. ఎంతచెప్పినను ఎఱుక యొకరిసొమ్ము కాదు, విజ్ఞశ్రీ కావ్యము నింకను తఱచి తఱచి చూడ వలసి యున్నది. అప్పుడుగాని పెద్దన పెద్దరికము నెఱుంగుటకు సాధ్యముకాదు. ఈ వ్యాసమున నాకుఁ దోచినఁ కొన్ని విషయములను ప్రస్తావింతును. సర సులు సహృదయతతోఁ బరిశీలింతురని నమ్ముచున్నాను.

ఈ కావ్యమునకుఁ గవి కభిప్రేతమయిన నామము స్వారోచిష మనుసంభవము. కథాప్రారం భమునందు, నాశ్వాసాంత గద్యలయందు నీనామమునే యాతఁ డుపయోగించినాఁడు. కాని లోకము మను చరిత్రమనియే దీనిని వ్యవహరించుచున్నది, కవియు నొకానొక చాటువులో నట్లు పేర్కొనుట తటస్థించినది. ఈ సంక్షిప్తనామమునకు సౌలభ్యమే హేతువుకానోపు, దీనిని బట్టి కావ్యమును పర్యాలోచించి యిందులో మనువు చరిత్రములేదు, వస్త్వైక్యములేదు, మున్నగు నాక్షేపణము లొనర్చుట న్యాయ్యము కాదు. కవిచెప్పి నది స్వారోచిష మనుసంభవమునే! కృతిపతి యడిగి నదియు దానినే!

మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రసమంచిత కథలన్
విననింపు కలిధ్వంసక
మనఘ! భవచ్చతుర రచన కనుకూలంబున్॥

కృతిపతి యొనర్చిన యీ యభ్యర్థనములో గమనింపఁదగిన యంశములు కొన్ని యున్నవి. 'రస సమంచిత కథలన్ విననింపు' అన్నచోట కథ లలో నని సప్తమ్యర్థమునేకాక కథలతోనని తృతీయార్థ మునుగూడఁ జెప్పవలెను. తృతీయార్థమును జెప్ప టయే కవి కభిమతమనిపించును. స్వారోచిషమను సంభవ వృత్తాంతము పరస్పర సంబంధముగల భిన్న కథలతోఁగూడినది ఆ కథలన్నియు రసమంచిత ములు. కావుననే భిన్నరసములను సమర్థముగా నిర్వహింపఁగల పెద్దన చతురరచన కనుకూలమైనది. అంతేకాదు. రసానందముతోపాటు పరమార్థము నుపదేశించున దగుటచేఁ గలిధ్వంసకము.

కృతిపతిచే నిట్లడిగించికొనిన కవి నిర్వహణము కూడ దీని కనుగుణముగనే చేయవలయును కదా! వరూథినీ ప్రవరాఖ్యుల వృత్తాంతమించలి రససమం చిత కథలలో మొదటిది. దానిని పెద్దన నిర్వహించిన తీఱు సర్వలోక విదితము. తన యభిమానమంతయుఁ బ్రవరుని యందున్నను వరూథినికొమ్ము పడిపోనీయక యంతటి ప్రబలమైన యా[illegible] లొంగలేటని తేల్చు[illegible] [illegible] శీల[illegible] [illegible] డిట్లుండవలయునని యుపదేశించినాఁడు పెద్దన

బ్రాహ్మణుఁ డింద్రియవశగతి
జిహ్మచరణైక నిపుణ చిత్తజ నిశితా
జిహ్మగముల పాలై చెడు
బ్రహ్మానందాధి రాజ్య పదవీచ్యుతుఁడై!

[illegible] చెప్పుచుటు కథాపరమార్థము నావిష్కరించు[illegible] [illegible] తైత్తిరీ యానందవల్లియందలి ఆనంద మీమాంసాభాగమునకు వ్యాఖ్యానరూపము బ్రహ్మానందముద్భాషిలో మాను షానందము మొదలు హిరణ్యగర్భానందము వఱకు సర్వానందములు తుచ్ఛములే మానుషానందమునకు ప్రమాణభూతుఁడై బ్రహ్మానంద మహత్త్వమెఱిఁగిన ప్రవరుఁడు మనుష్యగంధర్వానందము[illegible] [illegible]తుఁ డెట్లగును? బ్రహ్మానంద మతనివంటి అకామహతుఁ డైన శ్రోత్రియునకే సాధ్యము. 'శ్రోత్రియస్య చాకా మ హతస్య' యను పదము[illegible] [illegible]మై శ్రోత్రియత్వా కామహతత్వములకున్న ప్రాధాన్యమును ఆ ఆనంద

మీమాంసాభాగము స్పష్టముగా ప్రకటించుచున్నది. పెద్దన కీ తత్త్వదృష్టియుండుట చేతనే ప్రవరునిచే నీ మాటలుగూడ పలికించినాడు.

నీ వన్నయర్థమెల్ల
నిజము కాముఁడైన వానికి, నకాము.
డిది గణించునె జలజాక్షి!

ప్రవరపాత్ర చిత్రణ మంతటను కవికీదృష్టి యున్నది. దీని నెఱుఁగకున్నచో కథా పరమార్థము నకు దూరమగుదుము

ప్రతి కథకును దాని పరమార్థము దానికుండఁగా ప్రధానకథతో ముడివడియుండి మనుసంభవ మనెడు పరమార్థమునఁ బర్యవసించునట్లు రచించుటయే యీ కావ్యమునందలి బిగి

వరూధిని ప్రవరుని నిజముగనే ప్రేమించినది. అతఁడు శ్రోత్రియుఁడు అకామహతుఁడు నగుటచే నామె నాదరింపలేదు. అమెను ప్రేమించి తిరస్కృతుఁడైన కలి గంధర్వుఁడు మాయాప్రవరుఁడై యామెను మోసగించినాఁడు. తాను వంచిత యగుచున్నట్లే యామెకుఁ దెలియదు అమె ప్రవరునే ధ్యానించినది. గంధర్వుఁడు ప్రవరదేహసమిద్ధ శిఖిశిఖా రంభవీ మహిమను సంగ్రహించి తాల్చిన ప్రవరరూపముతో నామెకు సౌఖ్యానుభూతిఁ దేల్చినాఁడు. చలనమేదిన యామె మానసాబ్జమున నామూర్తియే నిలచినది. పుట్టిన పుత్రుఁడు నట్టిడియే! అది తేజోమయుఁడై వృద్ధినందినది. స్వరోచి జన్మించినాఁడు. తల్లి ధ్యానించినది ప్రవరుని. సంతానముకన్నది గంధర్వునకు. తల్లిదండ్రు లిరువురు గంధర్వులే యయినను తల్లిచేసిన మనుష్య ప్రవరభావనచే స్వరోచి మనుష్య గంధర్వుఁడైనాఁడు. మృగీరూపమున వచ్చిన వనదేవతతోడి సంభాషణలో నతఁడు తనయందుగల నరత్వమును స్మరించుట గమనింపఁదగును. స్వరోచిలో తండ్రి

యంశకే ప్రాధాన్యము లభించినది. ప్రవరతేజము నున్నదికాని యకామహతత్వము రాలేదు. పైగా తలిదండ్రు లిరువురి లక్షణములచే నతికాముఁడై నాఁడు. అతఁడు మనువు కాలేదు. మనువగుటకు ఈ కాముకత్వము తొలఁగుటయేకాక మఱెన్నియో లక్షణములు సంక్రమింపవలయును స్వరోచి విగ్రహములన్నియు నందుకే యుద్దిష్టములైనవి. వానిలో ననేక కథలు వచ్చినవి. అవి యన్నియు పెద్దన చతురరచన కనుకూలములైనవి.

వానిలో మొదటిది యిందీవరాక్షునికథ. ఈ యిందీవరాక్షుఁడొక గంధర్వరాజు మనోరమకుఁ దండ్రి. తోడఁబుట్టినవాఁడే! ఇతని కుమార్తెయే మనోరమ కర్మగతి చాలవిచిత్రమైనది. ఈతండ్రి బిడ్డలిరువురును వేఱువేఱు కారణములచే శపింపఁబడినారు. బ్రహ్మమిత్రుఁడను మునిని ఆయుర్వేదము నేర్పుమని యిందీవరాక్షుఁడు ప్రార్థించినాఁడు. ఇతఁ డయోగ్యుఁడని భావించి యాముని నిరాకరించెను ఇందీవరాక్షుఁడు శాంభవీ విద్యచే నదృశ్యుఁడైయుండి ఆయుర్వేదము సాంగముగా సంగ్రహించెను. అంతటితో నూరకొనక విద్యయంతయు నేర్చి తిసన్న యహంకృతితో గురువు నధిక్షేపించినాఁడు. దానితోఁ గుపితుఁడై ముని యితనిని రాక్షసుఁడవు కమ్మని శపించినాఁడు. మనోరమయు నామె చెలికత్తెలును ఒకానొక ఋషిపుత్రుని పరిహసించి శప్తలైనారు. చెలికత్తెలు రాజయక్ష్మపీడితలు కాఁగా మనోరమ రాక్షసుఁడైన తండ్రికే యెరయయి యతనిచేఁ దఱుమఁబడినది. ఈ సన్నివేశ మెంత విశిష్టమైనది? గంధర్వరాజు రాక్షసుఁడగుట, కన్నబిడ్డనే యాహారముగా స్వీకరింప వెంటాడుట—వా రిరువురకు శాపమోచకుఁడగు స్వరోచి సరిగా నాసమయమున కచటనుండుట. ప్రతిభావంతుఁడైన కవికి ఇంతకంటె రసవమునుచితమైన కథ యెచట నుండును? పెద్దన శక్తిచే నీ సన్నివేశము

బీభత్సకరుణాద్భుతములతో వెల్లివిరిసి సహృదయ లోకము నలరించుచున్నది.

ఇందీవరాక్షుఁడు స్వీయకథ చెప్పుచు ముని శాపవశమున నసురభావము తన్నుజెందినప్పటి స్థితి నెట్లు వర్ణించినాఁడో చూడుఁడు.

అభ్రమండలి మోచు నందాక నూరక
పెరిగినట్లొ మేను నరవరేణ్య !
యవధిభూధర సానువందాక నూఱక
పఱచినట్లొ మేను పార్థివేంద్ర !
యబ్జభూభువనంబు నందాక నూరక
యెగసినట్లొ మేను జగదధీశ !
యపాలోక తల మంటునందాక నూరక
పడినయట్లొ మేను ప్రభువతంస !
యఖిల జగములు మ్రింగు నంతాకలియును
నబ్ధులేడును జెడఁగ్రోలు నంత తృషయు
నచల చాలన చణమైన యదటుఁగలిగె
నసురభావంబు నను జెందు నవసరమున॥

ఇంతకంటె నవధిభూతమైన రాక్షసత్వము నెవరు భావింపఁగలరు ?

మనోరమ తన శాపకథ చెప్పినప్పటి జీర్ణముని వర్ణనము చూడుఁడు.

ఊసరవెల్లి చందమున నొక్కట బీఅనరాలుదేఱఁగా
మీసలు గడ్డముం జడలు మే నుదరంబును వీనులున్‌జరా
ధూసరమైన రోమతతితోఁ బెన గంబడి దూదిరాశిగాఁ
జేసినరీతి నున్న యొక జీర్ణమునింగని కౌతుకంబునన్॥

ఇతని వదనకుహరమెద్ది నేత్రద్వయం
బెద్ది కర్ణయుగళ మెద్దియనుచు
బూచివోలె నున్న వాచంయముని మోము
బాల్య చాపలమునఁ బట్టుటయును.

అంతయునైన తరువాత చెప్పుచున్న ధగాపున మునియని పేర్కొనక తప్పుటలేదుగాని పట్టునప్పు డామెకు నతఁడు మునియని తెలియదు. తలఁచుచోఁ బట్టిడిదేహ ... మైన జాకృతియున్న దూదిరాశివంటి బూచి ... నోరే ... కన్నెద్ది ... యని చాపల్యమునఁ దడవినది. ఆమెకాబూచి యెంత కుతూహలము కలిగించినదో పాఠకులకు నంత కుతూహలము కలిగించుచున్న దీవర్ణనము.

ఇట్టి విశేషము లీకథలన్నిట నెన్నియో యున్నవి. వానిమాట యట్లుండి కథా ప్రయోజనము చెంతకు వత్తము. మనోరమ స్వాయంభువ మనువు నుండి తండ్రిదాఁక వచ్చి యతనినుండి తనకువచ్చిన యస్త్రహృదయము స్వరోచికిచ్చియే తన్మహిమచేఁ దనకును దండ్రికిని శాపమోచన మగునట్లు చేసినది. ... ముక్తుఁడైన ఇందీవరాక్షుఁడు తాను నేర్చిన యాయు ర్వేదము నరణముగానిచ్చి స్వరోచికి మనోరమనిచ్చి వివాహము కావించినాఁడు. ప్రథమసమాగమవేళ మనోరమ ఖిన్నయైయుండి యేల యిట్లున్నావని యడిగిన భర్తకుఁ దన చెలికత్తెల మిస్త్రొతని స్వరోచికిఁ దెచ్చి ... వనముత కప్పుడేపోయి యాయుర్వేదమహిమచే వాండ్ర వ్యాధినిర్ముక్తల గావించినాఁడు. వారిలో విభావరి తనకడనున్న మృగ పక్షి జాతుల భాష నెఱుంగు మేటివిద్యను స్వీకరించి తన్ను వివాహమాడుమని యతనిని ప్రార్థించినది. కళావతి తన కథచెప్పి పార్వతీదేవి తన కనుగ్రహించిన పద్మినీ విద్యను స్వీకరించి తన్నుగూడ వివాహమాడుమని ప్రార్థించినది. స్వరోచి వారిరువురినిగూడ వివాహమాడినాఁడు. ఇవి వివాహములా, విద్యాస్వీకరణములా? రెండును. ఈ వివాహములలో మరొక విశేష మున్నది. స్వరోచికి లభించిన భార్యలు ముగ్గురును యదృచ్ఛాలబ్ధలే! తండ్రియైన గంధర్వునివలె నాతఁడు కన్నిచ్చువడ్డ కాంతను కామించలేదు. ఆ పాశవిక ప్రకృతి రాకుండుట కితని యందున్న ప్రవరతేజమే

హేతువు కావచ్చును. అయిననేమి ? లభించిన యాభార్యలయందే యతఁడతికాముకుఁడయినాఁడు.

తమక తమక ప్రియుండని తమకమెసఁగఁ
బడతు లుప్పొంగఁ గ్రీడించెఁ బద్మినీ ప్ర
[illegible]
మాల్యవస్త్రానులేప సామగ్రిఁజెంది.

స్వరోచికి నతనిభార్యలకుఁ గల యన్యోన్య ముఁ[illegible] జూచి [illegible] యన్యోన్యముండుటకు వీరెంత తపమొనర్చిరో కదా! పూర్వజన్మ వాసనాబలముచేతనే భార్యాభర్తలకు వలపు పరస్పరము సమమైయుండును. [illegible] గించుచున్నా' రన్నది. చక్రవాకి హంసితో నేకీభవింపలేదు. "పలువురయందు నొక్కనికి నొక్కని యందుఁ ఖల్వురకు ప్రేమకలుగుట యాశ్చర్యకరమైన విషయము, వీరికిఁ బరస్పరము ప్రేమలేదు. సేవ్యసేవక భావమేయున్నది. దాసీనికరము కైవశమై సంచరించు క్రమమున విద్యాప్రావీణ్య [illegible] [illegible] జెప్పుకుము.

తగులు నెవ్వఁడొక్క తరుణికి, నొకనికి
మెలత వలచు, నదియె మేలనంగ
వచ్చుగాని పెక్కువనితలపైఁ గూర్మి
గలుగుననుట బొంకుగాదె తరుణి! "

అని ప్రత్యాఖ్యానము చేయుటయేకాక తానును తనభర్త యేధన్యలని సగర్వముగా గొంతెత్తి చెప్పినది చక్రవాకి. మృగపక్షి భాషలెఱిగిన స్వరోచి యీమాటలు విన్నాఁడు. తలవాంచి యున్నరన్నాఁడు మనసున వివేకమున్నది. కానియేమిలాభము ? కవిగుంధర్వ దత్తమైన తముప్రభావమే యధికమై మానరాని తమకమున నాసెలతలతో నూఱేండ్లు విహరించినాఁడు. పిమ్మట మ

ఱొక్కమాఱు తనచుట్టుచేరిన ప్రియురాండ్రను మందలించు నెపమున కంఠోక్తిగా నపహసించిన యీహామాటలు విని విరక్తిఁజెందియు వివేకము నిలువక యాఱు నూఱు సురపాలునవు లాసతులతో విహరించినాఁడు. ఓహో! కామమెంత దుర్జయమైనది? లక్షవిద్యలున్నను వివేకము లభింపదుగదా ! ధర్మ్యకామ సంతానము. కాక యథేచ్ఛా కామసంతానమునకుఁ గామమెంత యసౌఖ్యకా మనుష్యగంధర్వుఁడైన యీ స్వరోచి జీవితము తెలుపుచున్నది. మనసుచే నాలోచించి. ధర్మము నెఱుంగవచ్చును. ఆచరించుటకు శరీర మనుకూలమైనది కావలెను. అట్టి శరీరము యథేచ్ఛాచారముచే లభింపదు. తలిదండ్రుల యదేచ్ఛావార [illegible] వచ్చినది. ఎన్నియో విద్యలతనిని వరించినవి. ప్రవరతేజో మహిమచే స్వరోచియైనాఁడు. కాని యీ శరీరముతో నతఁడు మనువు కాలేకపోయినాఁడు. ప్రవరతేజమున కంతమాహాత్మ్యమున్నచో ప్రవరుఁడే మనువేల కాలేదు? శ్రోత్రియుఁడై యకామహతుఁడైన ప్రవరునకు మనుత్వ మవరము, అతఁడు బ్రహ్మీభూతుఁడే. యగును. అతనికి మనుత్వము గొప్పమాట చ[illegible] మెట్టు దానికిఅకాముఁడై సర్వవిద్యావేత్తయై తపస్వియైన క్షత్త్రియుఁ డర్హుఁరు. స్వరోచికే యకామతాతపస్విత్వములున్నచో నతఁ డర్హుడయ్యెడివాఁడే ! దురదృష్టవశమున నతని కవిలేవు బహుకాలభోగముచే నతని యందుఁ గామముగూడ నుడిగినపిమ్మట దేవతలు వనదేవతను మృగీరూపమునఁబంపి యాతనిచే నామెయందు స్వారోచిషుని బడసినారు. ఈస్వారోచిషునకు మనుత్వయోగ్యత సమగ్రమై సంక్రమించినది. అతఁడు 'శాంతిదాంతి దయాసత్యశౌచనిరతుఁడైయకామతఁజిరతపంబాచరించె నచ్యుతునిగూర్చి'. ఇచట పెద్దన మరల నకామత' యను పదమును వాడుట లోని ప్రాముఖ్యమును గమనింపవలెను. ద్వితీయా

శ్వాసములో ప్రవరునిచే నాతఁడకాముఁడనిపించి తిరిగి స్వారోచిషుని యందకామత చెప్పుటచే ప్రవర ధ్యానరూపమైన వరూధినీ తపస్సు కుమారునియందుఁ గాక మనుమనియందు ఫలించిన దని తెలియుచున్నది. వరూధిని మనుమఁడైన స్వారోచిషుఁడు అచ్యుతునిచే మనుత్వమున కభిషిక్తుఁడైనాఁడు. స్వారోచిషుఁ డాపదవిని కోరలేదు. అతఁడు యోగ్యుఁడని యచ్యుతుఁడే నియమించినాఁడు. స్వారోచిషుని యకామత యట్టిది. ఇట్లీ మనుసంభవ కథ పౌత్త్రునిలో పితామహుఁడైన కలిగంధర్వుని లక్షణమైన కాముకత్వము విధ్వస్తమై ప్రవరతేజస్స్ఫారమైన శ్రోత్రియత్వా కామహతత్వములు ఫలించుటను నిరూపించుచున్నది. పైకి సరసాలాపములు, వివాహములు, విహారములుగా నున్నను తాత్పర్యమున భోగనిరాసకమై యకామతకుఁ గల మాహాత్మ్యము బోధించుచున్నది

సూత్రము గనిపించకుండ పూలదండ కట్టుట యందే జిగియు బిగియు నుండును. ఇందలి కథల నన్నింటిని కలిపికట్టుచున్న సూత్రము మనుత్వ యోగ్యత. అది యంతట నమస్యూతమై యుండియు స్వారోచిషుఁడు మనువైనాఁడనునంత వఱకు వ్యక్తమగుటలేదు. ఇంతకంటె జిగితోడి బిగి మఱియెచ్చట నుండును ? అల్లసాని వాని యల్లిక జిగిబిగి యన్న మాట నెవరన్ననేమి ? అది సర్వదా సత్యము !

# శ్రీ కొసరాజు రాఘవయ్యచౌదరి

[తెలుగుజోదుల వీరగాథలు స్మరించినకొద్ది రక్తం తుకతుకలాడించే స్వభావంకలవి. ఆవసరమైనప్పుడు ప్రాణాన్ని తృణప్రాయంగా బలిచేయగల సాహసమూర్తులు ఈగడ్డపై పుట్టారు. వారి చరిత్రలు ఏకరువు పెట్టినప్పుడల్లా ఆవేశం ఉరకలెత్తుతూనే వుండడం సహజం. అకథలను మననంచేసుకుంటూ అహా మనపూర్వు లింతవారా! అని వేయిభుజాలై మురుసుకుంటూ వుండడమే మనం చేయగలపని.

కవులు ఒకరికై పాడరు, కోయిల ఒకరికై గానంచేయదు, మేఘాలు ఒకరికై వర్షించవు అన్నమాట అక్షరాలానిజం. ఎందరో మహానుబావులు చరిత్రసత్యాలను కైఫీయతులద్వారాగాని, గ్రంథరూపేణాగాని దేశంలో వెదజల్లబట్టే పంబల, జవనాడు. పిచ్చుకుంట తెగలవారు యీ వీరగాధా స్రవంతిని అడ్డమాకలులేనంతా వ్యాపింపజేయడానికి తమ సర్వస్వం ధారబోసి చిరస్థాయిని కల్పించారు.

ఈ కోవకుచెందినవే గండికోట పెమ్మసానివారి యుద్ధగాథలు. గండికోట కడపజిల్లా జమ్మలమడుగు తాలూకాకు చెందిన గ్రామం. ఇప్పటికీ అ చారిత్రక దృశ్యాలు మనకు స్పష్టంగా కనబడుతూనే వున్నాయి. పెమ్మసానివారి వంశం కర్నాటకరాయ సామ్రాజ్యానికి రక్షకులై తను ధనప్రాణాలు ధారబోసి తమ ప్రతాపాన్ని ప్రకటించిన ఘట్టాలువిన్న ఏ తెలుగు వాడికి ఒళ్లు పులకరించకుండా వుంటుంది?

బుక్కరాయలు హయాంమొదలుకొని శ్రీరంగరాయలు రామరాయల హయాములవరకు నమ్మినబంటులుగా, రాయ పంస్థానికివారు చేసినసేవ మరువరానిది.

రాయ సంస్థానం శిథిలమై అదుకోవడానికి ఆత్మమిత్రులు కరవైన పరిస్థితులలో పెమ్మసాని వంశంలో కడపటి చినతిమ్మానాయుడు ఏకైకవీరుడుగాపోరి చివరకు మీర్జుమ్లా కుతంత్రంచే వీరమరణంపొందాడు.

అ వంశమువా రిప్పటికి చిత్తూరుజిల్లా కావేటిరాజపురంలో (అంటే ఇప్పుడు చెంగల్పట్టు జిల్లాలో చేరిందనుకొండి) ఉన్నారు ముప్పదిమూడేళ్ళనాటిమాట. నేనూ శ్రీ పరుచూరు వెంకటసుందరవరదులు, ఎం. ఎ. ఎల్. ఎల్. బి. గారూ

ఆగ్రామం రైతుసంఘ ప్రచారసందర్భంలో వెళ్ళడం తటస్థించింది. అప్పుడు పెమ్మసాని తిమ్మానాయనింవారు అను పేరు గలవారే గ్రామపెత్తనం చలాయిస్తూవున్నారు, మేమంతా ఊరివెలుపలకు రాగానే నాయనింవారు డాలు, డవాలు, కత్తి, పాగా, రాజలాంఛనాలతో పంబడోళ్ళు, జముకు, మొదలగు వీరవాయిద్యాలతో ఎదురువచ్చి స్వాగతమిచ్చారు.

అప్పుడు ఆగ్రామంలో ఎనభై సంవత్సరాల వృద్ధుడు పూర్వం గండికోట పూర్వగాధలన్నీ పూర్తిగా తెలిసివున్న వేలూరు కృష్ణప్పనాయనింవారు మమ్ములను పిలిపించుకొని ఎంతో ఆనందించి అలనాటి ఇతివృత్తాలన్నీ మాకు వినిపించి, పెమ్మసాని తిమ్మానాయునిం వారింట్లో తరతరాలుగా వ్రాసి పెట్టుకుంటున్న "గండికోట కైఫీయతు దాస్తు" లేక పెమ్మసానివారి వంశావళి అను వ్రాతప్రతిని మాకు యిప్పించారు. చరిత్రపరిశోధకులు ఆలోచించవలసిన ఎన్నో క్రొత్తక్రొత్త విషయాలు అందులో దాగిఉన్నవి. ఆవంశంలో ప్రముఖులుచేసిన యుద్ధాలన్నీ కళ్ళగ్గట్టినట్టు వర్ణింపబడినవి. సంవత్సరాలు తేదీలు పేరులు ఆయా తరాల్లో పాల్గొన్న ప్రక్కసంస్థానాల యోధుల వివరాలు సమగ్రంగా వ్రాసిఉన్నవి. మచ్చుకు మాత్రం అందులో ఒకరి చరిత్రకు సంబంధించిన ఒక ఘట్టం ఉన్నదున్నట్టుగా ఆభాషతోనే అందిస్తున్నాను. ఇక చదవండి.]

పెమ్మసాని తిమ్మానాయనింవారు

ఆ పెమ్మసాని తిమ్మానాయనింవారు ఘండికోట యేలుతూవుండగా బుక్కమహీపాలవారి వంశస్థులైన ఎనిమిదవ పురుషుడు కృష్ణరాయలవారు విజయనగరం చతుర్దిక్కులయందు ఆశేతు హిమాచలపర్యంతం రాజ్యపాలనము చేస్తూవుండగా కలుబర్గివారు పౌజుమంది కట్టుకొని రాజ్యంలో కార్యభాగములు చేస్తూవుండగా మహారాజ రాజశ్రీ కృష్ణరాయలవారు కోట సాధించేనిమిత్తం పౌజుమందితొ పోయేవేళ ఘండికోట సంస్థానం యేలే పెమ్మసాని తిమ్మానాయనింవారికి మీమందీ మార్బలంతోగూడా రావలెనని కాగిత పత్రములు వ్రాయించి పంపించినందున తమ పౌజుమందితోగూడా రాయలవారి సముఖానకు పోయి దర్శనము చేసుకొని తదనంతరము కలుబర్గి కార్యభాగము నిమిత్తం రాయలవారి వెంబడిగాపోయి కలుబర్గిమీద సేనవిడిచి నాలుగుదిక్కుల మోర్చాలవేసి కార్యభాగములుచేసి ఈశ్వర సంవత్సర చైత్ర బ॥ ౧౩ శనివారంనాడు యుద్ధ సన్నాహముచేసి కోటలగ్గలకు కమ్మించినవేళ పెమ్మసాని తిమ్మానాయనింవారు కోటపు పశ్చిమ భాగమందు తమ మందితోకూడా అగ్గలకు యెక్కి కోట రాజ్యముచేసికొని రాయలవారి జెండా యెత్తించినందున కృష్ణరాయలవారు నిండా సంతోష భరితులైనట్టివారై బంగారు హౌదాకట్టిన ఏనుగును తెప్పించి దివ్యవస్త్ర భూషణములతోగూడా బహుమానం చెయించినవారైరి.

తదనంతరం తిమ్మానాయనింవారు రాయలవారి వెంబడిగా విజయనగరం చేరినపిమ్మట రాయలవారి సెలవు తీసుకుని తమ ఘండికోట సంస్థానము వచ్చి చేరి రాజ్యభారం చేస్తూవుండెను.

ఇట్లా వుండగా యింతలో కృష్ణరాయలవారు గజపతివారిమీద కార్యభాగానకు పొయ్యేవేళ ఘండికోట సంస్థానము పెమ్మసాని తిమ్మానాయనింవారికి పౌజుమందితోగూడా రమ్మని రాయలవారు వ్రాయించి పంపించినందున ఆప్రకారం తిమ్మానాయనింవారు తమ యావత్ పౌజుమందిని వెంట బిలుచుకొని విజయనగరానకుపోయి రాయలవారి దర్శనం చేసుకొన్న తదనంతరం రాయలవారు ఈతిమ్మానాయనింవారితో కొన్ని రాజార్థములు సెలవు యిచ్చినది యేమంటే

"గజపతివారిని సాధించగలందులకు యావత్ సైన్యముతోగూడా ప్రయాణం నిశ్చయంజేసి వెలి గుడారులు వేయించినాము, మీరున్నూ, మీపౌజు మందితోగూడా మావెంబడిగావచ్చి యిందర కాగల కార్యభాగములు నిగ్రహించి జయప్రదం చేసికొని రాగలందులకు ప్రయాణం నిశ్చయం చేయించవలసింది"ని సెలవు యిచ్చినందున—

తాము యేదినం యావత్ సైన్యముతోగూడా ఆజ్ఞాపత్రిక వ్రాయించి పంపించినారో ఆదినమే వున్న సైన్యాన్ని పిలుచుకొని ప్రయాణసన్నాహముతో గూడా సన్నిధానానికి వచ్చిచేరినామని యీ తిమ్మా నాయనింవారు మనవి చేసికొన్నందున రాయలవారు నిండా సంతోషభరితులై ప్రయాణభేరీ వేయించి యావత్ సైన్యము పిలుచుకొని సకల సంస్థానాలలోన సమూహ సైన్యంతోగూడా సాగిపోయి గజపతివారి రాజ్యం సరిహద్దునందు నిలిపినవారైరి. తదనంతరం రాయలవారు ఘుండికోట పెమ్మసాని తిమ్మానాయని వారితో సెలవుయిచ్చిన వివరం యేమంటే : "మీకు క్రొత్త ఫౌజును వశం చేస్తున్నాము. ఆఫౌజును మిస్తూళం ఫౌజుమందితోగూడా పోయి గజపతివారి సీమలో గడిస్థలాలు సాధించి ఆ గడిస్థలాలయందు ఠాణ్యాలువుంచి రాజ్యం స్వాధీనం చేసుకుంటూ రావలసినందుకు పోవలసినద"ని సెలవు యివ్వగా:

సెలవు ప్రకారం నాయనింవారు ఫౌజుమందిని పిలుచుకొని గజపతివారి రాజ్యంలో కార్యభాగములు చేసి గడిస్థళాలు తీసుకొని రాజ్యం స్వాధీనంచేసుకుంటూ ప్రబలమైన గడిస్థళాలయందు యుద్ధప్రసంగాలు చేస్తూ వుండగా :

గజపతివారు కృష్ణరాయలవారిమీద అనేక యుద్ధములు చెయగా రాయలవారి ఫౌజులు శానా హతమై విరిగిపొయ్యే సమయమందున ఘుండికోట పెమ్మసాని తిమ్మానాయనింవారు ఆ యుద్ధమైన స్థళాలకు ఘరువుదూరములోగా ప్రబలమైన గడిమీద యుద్ధంచేస్తూవుండి రాయలవారి ఫౌజు విరిగెనని వర్తమానం తెలిసి యకాయకీపోయి గజపతివారి ఫౌజు మీద యడాపాటున చప్పాపడి అనేక యుద్ధం చేసి బహుమంది సర్దార్లను ఫౌజుమందితోగూడా హతంజేసి హతశేషమైనవారిని పలాయనంచేసి జయభేరివేయించి కృష్ణరాయలవారి సముఖానికివచ్చి నిలిచినందున ఆ పెమ్మసాని తిమ్మానాయనింవారు జయప్రదమైనయుద్ధం జేసినందులకు రాయలవారు అత్యుత్సాహ భరితులై తిమ్మానాయనింవారిని సన్నిధానమందు కూర్చుండబెట్టుకొని నవరత్నఖచితమైన దివ్యభూషణములును దివ్య పీతాంబరంబులును తెప్పించి బహుమానం చేయించి గజపతివారిని కొట్టి సాధించినందున గండభేరుండం చెక్కిన శిఖావుంగరం బిరుదుయిచ్చి సకల సంస్థానాల వారికి యెరుకయ్యేటట్టుగా భేరీ ఝాంకృతధ్వనుల చేయించి తదనంతరం గజపతివారి రాజ్యం చతుర్దిక్కులున్నూ కట్టుకుంటూ రాగా, గజపతివారు రాయలవారితో యుద్ధంచేసి నిగ్రహించలేక సంధిచేసుకోగలందులకు తగువారిని అంపించినందున రాయలవారితో మంత్రులైనవారు మనవిచేసినది యేమంటే : "గజపతివారు కౌలుకార్యములు చేసుకోగలందులకు తగువారిని అంపించినారు. ఆ వివరము యేమంటే- ఇదివరకు వారిరాజ్యం మనం కట్టుకున్నాము గదా! ఆరాజ్యంతోగూడా స్వాధీనంచేసి ముందుకూడా తమ రాజ్యం దాటినట్లయితే చౌధాయీ వంతున యాకలు యిస్తూవుంటామని సంధికి వచ్చినార"ని మనవి చేయగా అందుకు రాయలవారు సెలవు యిచ్చినది : "లోగడ గజపతివారి కుమార్తెను మాకు వివాహం చేసుకోగలందులకు పెద్దమనుష్యులైనవారి నంపించియుండగా తమకుమార్తెను యీయక దంభనంచేసినందున యింతసన్నాహం చేస్తూరావలసి వచ్చెను. ఇప్పుడైనా గజపతిరాజు కుమార్తెను మాకు వివాహం చేసి యిచ్చినంతటు వారి రాజ్యం వారిస్వాధీనంచేసి చౌధాయీ యిచ్చేటట్టు నియామకంచేసి తదనంతరం విజయనగరానకు పోతున్నామని గజపతివారి తట్టునుండి వచ్చినవారితో చెప్పి పంపించవలని" సెలవు యిచ్చినందున ప్రధానులైనవారు ఆ వచ్చినవారితో రాయలవారు సెలవు యిచ్చిన ప్రకారం చెప్పినందున వారు రాయలవారి సముఖానకుపోయి మనవిచేసిన వివరం యేమంటే : "ముందర నడవగల శుభ కార్య భాగములకు తమతట్టునుండి పెద్దమనుష్యు

లైనవారిచే వెంబడినే మంగళద్రవ్య సహితముగా పంపమనగా పెద్దలను వచ్చినవారి వెంబడినే పంపించినందున ఆ వచ్చినవారు తమరాజుగారి తావుకుపోయి యావద్వర్తమానం మనవిజేసుకున్నం తట గజపతిరాజువారు నిండా యోచించినవారై, రాయలవారి శట్టునుండి వచ్చిన పెద్దమనష్యులను తమ నగరునకు పిలిపించుకొని రాయలవారి మనో భీష్టప్రకారం తమ కుమార్తెయైన రుఖ్మాదేవిగారిని విక్రమ సంవత్సర మాఘ శుద్ధ పంచమీ గురువారం లగ్నం నిష్ణయంచేసినామని లగ్నపత్రిక వ్రాయించి యిచ్చి, వచ్చినపెద్దమనుష్యులకు వస్త్రబహుమానాలు యిచ్చి పంపించినవారైరి".

తదనంతరం పోయివచ్చిన పెద్దమనుష్యులైన వారి వెంబడిగా గజపతిరాజుగారు పంపించిన లగ్న పత్రిక కృష్ణరాయలవారుచూచి, నిండా సంతోష భరితులై భేరీ భాంకృతాది మంగళధ్వనుల చేయించి కృష్ణరాయలవారు గజపతిరాజు కుమార్తెను వివాహము చేసుకుని గజపతిరాజుగారి రాజ్యం తాముకట్టుకొని వుండినది పున: వారి స్వాధీనంచేసి, వారి రాజ్యానకు చౌథాయీమేరకు రూకలు యిచ్చేటట్టు నిష్కర్షచేసు కొని కృష్ణరాయలవారు సకుటుంబ సపరివార సకల సంస్థానీకులు సైన్య సమూహం చతురంగబల సమేత ముగా తమ కర్నాటక రాజ్యమునకువచ్చి విజయనగరల చేరిన తదనంతరం సకలసంస్థానాలవారికి వస్తువాహ నాది మెహమతులుచ్చేసి వారివారి స్థలాలకు వారివారికి సెలవుయిచ్చి పంపించిన వారైరి.

తదనంతరం రాయలవారి సెలవుతీసికొని పెమ్మసాని తిమ్మానాయనింవారు ఘండికోట సంస్థా నానకు వచ్చి చేరినవారైరి.

తదనంతరం పెమ్మసాని తిమ్మానాయనింవారు ఇరవైఅయిదు సంవత్సరములు రాజ్యం ప్రభుత్వం చేసినవారై తమకొమార్తైన బంగారు తిమ్మానాయనిం వారికి ప్లవ సంవత్సరం జ్యేష్ట శుద్ధ పాడ్యమి సోమ వారమందు పట్టాభిషేకం చేసినారు.

—ఇది ఒకకలం

[ఇదే విధంగా బుక్కరాయల హయాములో కుమార తిమ్మానాయుడు, ప్రౌఢరాయల కాలంలో ధర్మానాయుడు. అళియరామ రాయల హయాములో బంగారు తిమ్మానాయుడు, శ్రీరంగరాయల రోజులలో బొజ్జతిమ్మానాయడు అనేక యుద్ధాలలో జయభేరీ మ్రోగించి శాశ్వతమైనకీర్తి సంపాదించారు. ఈ వంశానికి మూలపురుషుడు వినుకొండ బెల్లంకొండ సీమల పాలించిన పెమ్మసాని తిమ్మానాయుడు. ఈ వంశంలో పెదతిమ్మానాయుడు చినతిమ్మానాయుడు అని ఏందరో తిమ్మానాయుళ్లు వుండడం వల్ల చరిత్రకారులకు ఎవరు ఎమో తెలుసుకోవడం గడ్డుసమస్య.]

## డాక్టర్ కె. వి. ఆర్. నరసింహం

ఆంధ్రభాషాయోష నమూల్యాలంకారములఁ గైసేసిన మహాకవులలో నంది తిమ్మన్న యొకఁడు. ఈతనికి ముక్కుతిమ్మన యనియు నామాంతరము గలదు. కథాకల్పనమునందేమి పాత్రచిత్రణము నందేమి రసోచిత పదసంయోజనమందేమి వర్ణనా చమత్కృతియందేమి — యెందు జూచినను తిమ్మన పారిజాతాపహరణమొక విశిష్టమార్గమున నడచినది. పలుకుదేనియల నుగ్గుబాలతో రంగరించి భాషాయోష యిమ్మహాకవి జిహ్వాగ్రమున నుంచినది గావలయు. లేకున్న నమ్మహాప్రబంధమున నామూలచూడముగ నట్టి మృదులశయ్యాసౌభాగ్యము నంతరింపఁబడి యుండదు. పారిజాతాపహరణమున పారిజాతసౌరభములు గుబాళించుచుండును. వియద్గంగావీచి కాశీకరాసారతుందిల మందపవమానాంకురములల్ల నల్లన వీచుచుండును. కనత్కనకమణికంకణ కలనాదము లుప్పతిల్లఁ గనులసంభవు రాణివాసము కమ్రస్వనములఁగచ్ఛపి నాలపించుచుండును. శ్రుతిపేశలములును సముచిత భావనిర్భరములు నగు నిమ్మహాకవి యమృతవాక్కుల కానందింపని సహృదయులుండరు. వేయేల ముక్కుతిమ్మనార్యుని ముద్దుపల్కులు సరస భావుకజననిత్యసంభావనా యోగ్యములు.

మనము తొలుదొల్త సత్యభామను నగరిపొంత నొక శృంగారవనములో దర్శింతుము దిద్ది తీర్చిన పూఁదేనియ యేటికాలువ దరిని జెంగల్వపుప్పొళ్లు నించిన చంద్రోపలవేదిపై నాయమ తన చెలిమికత్తియతో సరసగోష్ఠిం దేలుచు వనజాతాయతనేత్రుఁడైన శౌరిగుణములను వర్ణించుచుఁ గాలయాపనము చేయుచుండును. కాలయాపనము చేయుచున్నదే కాని సత్యభామ బుద్ధిమాత్రము సంకయగ్రస్తమై యున్నది. అళికులారావములుగాని, కిసలయాకుల కోకిలకాకలీకలకల నాదములుగాని యాయమ మనంబున కింపు నింపలేదు. కమ్మని తమ్మికొలంకులనుండి

వీతెంచు తెమ్మెరలు నాహ్లాదజనకములు గాకుండెను. కారణమేమి? అంతలోనే దక్షిణాంస చూచుక నయన ప్రకంపము సంభవించినది. అమ్మానవతి హృదయము నీయపశకునములచే సంశయాకులితమైనది. కాని తనకుఁ గలుగఁబోవు మహాపద యెట్టిదైయుండునో యామె నిర్ణయింపలేకుండెను. ప్రాణనాథుఁడొండొక చపలాక్షినిఁగూడి తన్నొల్లని చెయిదముఁలేనియైనఁ జేసి యుండునేమో యని యామెకు సంశయ ముదయించినది. ఇంతకంటె మహాపద యయ్యిందువదన కుండదుగదా!

ఇంతలోనే నెచ్చెలి వచ్చినది. కనుఁగవ నెఱసంజ వొడమగాఁ బారిజాతాప్రసూన వృత్తాంతమంత యుఁజెప్పినది. అమరైకయోగ్యము, నతిసౌఖ్యకరము, ననితర సులభమునైన యా దివ్యకుసుమమును గొప్పులోఁ దాల్చుటయే తడవుగ సానఁబట్టినమకరాంకు శస్త్రముగతిఁ దేజరిల్లినదనియు, నా కుసుమధారణము వలన నామెను మహామహిమ వచ్చుటచే గద్దియమీఁద నెక్కి ముల్లోకములుఁ దానె యేలుగతినున్నదనియుఁ దోడి కామినీలోకము మచ్చరంబును మదిలోనఁదొలంగె యామెను భయభక్తులతో భజించుచున్నారనియు నా వాక్యముల సారాంశము. ఇంతేకాక సత్యభామకుఁ గోపమతిశయించుట యీక్రిందిరీతి నా చెలికత్తియ వచించినది—

*"ఎంతకులేఁడు నారదమునీంద్రుఁడు శౌరి*
*వినంగ రుక్మిణీ*
*కాంత వినంగ నేను విన(గాఁ బలికెన్*
*బతిఁగూర్చుదావ నా*
*యంతటివారు లేరని యహంకృతి నెవ్వరు*
*విఱ్ఱవిగుచున్*
*వంతువవచ్చు సత్యగరువం బిఁక జెల్లదటంచు*
*మానినీ!"*

మానినీ! యను సంబోధన సాభిప్రాయము.

*"ఆరణబౌజనుమతకము*
*లారుక్మిణినటన లా మురాంతకు చెయ్యుక*
*వేరి కనుంగొనుచో వె*
*వ్వారికిఁ గోపంబురాదు వారిజనేత్రా!"*

అగ్నికి వాయువు తోడైనది. సత్యభామకిది సైరింపరాని యపచారము. మొదల నద్దివ్యకుసుమంబు నెన్నుఁడు రుక్మిణి కిచ్చుటయే యోర్వరానిపని. అంతతోఁ బోకతమ్ముఁగూర్చి కలహభోజనుఁడాడు మాటలనుగూడ శౌరి సైరించుటయా? అదియు సవతి ముందఱ. మాన మప్రతిహతవేగమున విజృంభించినది. ఈర్ష్యాసూయ లాక్రోధాగ్నికి వీవనగా వీచినవి. ఇంకేమున్నది? ఇప్పటి సత్యభామాస్వరూపము నా గని యెంతమనోహరముగ జిత్రించినాఁడో చూడుఁడు.

*''అనవిని వ్రేటువడ్డయురనాంగనకైవడి నేయి*
*వోయి భ*
*గ్గన దరికొన్న వీక్షణహుతాశనకీల యనంగఁ దోచి పొ*
*చ్చిన కనుగొలుకెంపు తన చెక్కులం గోపసంప*
*పత్రభంగ సం*
*జనితనవీనకాంతి వెదఁజల్లఁగ దగ్గదఖిన్నకంఠియై."*

అనూహ్యంబగు నీ సమాచారము, దుర్భరమగు నావేదనము సత్యభామ మనస్సున మంటలు ముట్టఁగలించి వైచినవి. కాని కౌతుకము మాత్రము చివిచేయుచునే యున్నది. తన్నుఁగూర్చి రుక్మిణీసతి యేమైన నన్నదేమోయన్న సందియ మామెకు మిక్కుటముగ బాధించుచున్నది. 'రుక్మిణీసతి'యని సత్యభామనోటఁ బలికించిన కవి ప్రతిభ యనన్యసామాన్యము కదా! చెలికత్తె చెప్పిన వాక్యము నాలించినంతనే సత్యభామకుఁ బట్టరాని యాశ్చర్యము కల్గినది. నిజముగా నిట్టిది జరిగెనాయను సందేహము క్షణమాత్ర మామె మనస్సునఁ బొడసూపినది. అప్పటి యామె మనఃపరివర్తనమును ముక్కుతిమ్మనార్యుఁ డీక్రిందివిధమున వ్యక్తము చేసియున్నాఁడు.

"ఏమేమీ! కలహాశనమండవటికై యేతెంచి యుల్లాడెనా?
యామాటల్పైవియొగ్గి కాంచినయెనా గోపికావల్లభుం
డేమేమాడెను రుక్మిణీసతియు? నీ వింకేటికిందాఁచెదే!
నీ మోమాటలు మాని నీరజము నిక్కంబెఱింగింపవే"

"అతులమహాసుభావమని యల్విరిఁ దానొక పెద్దసేసి య
చ్యుతునకు నిచ్చకంబొదవ నూడిద యిచ్చిన నిచ్చెఁగాక తా
నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణ చేసినఁ జేసెఁగాక యా
మతకరి వేలుపుందపసి మమ్ముఁదలంపఁగనేల యచ్చటన్"

ఈ పద్యములలోని ప్రతిపదము నస్వర్థమనియే చెప్పవలెను. 'ఒక'యను పదమువలన సత్యభామ కవ్విరిపైగల యలక్ష్యభావము సూచింపఁబడినది. రుక్మిణియను పేరు చెప్పక ప్రియముకల్గునెడక చెప్పుటచే సత్యభామకు సవతియగు రుక్మిణిపైఁగల యసూయ సూచింపఁబడినది. అప్పట్టున రుక్మిణి పేరుచ్చరింపుటకూడ సత్యభామ కనిష్టమగు కార్యమే. ఇది నారీజన సహజమగు గుణము. మఱియు సత్యభామ వంటి మానవతి కెంతయుఁ దగియున్నది. నన్నను టకు బదులు మమ్మని చెప్పియుండుటచే స్వాభిమానాతిశయము సూచింపఁబడినది. తరువాతఁ గవి సత్యభామకుఁగల కోపకారణమంతయు నీ క్రింది పద్యములలో వ్యక్తము చేసియున్నాఁడు.

"పలుదెఱగు ముళ్లమాటలఁ
గలహమె కల్యాణమని జగంబులవెంటన్
మెలఁగెడు మౌనికి సహజము
వలదని వారింపవలనె వల్లభుఁడతనిన్."

"మునియేమిసేయు రుక్మిణి
గొనఁ గారణమేమి ధూర్తగోపాలుఁడు సే
సిన చెయిదమేమి చెప్పుడు
మనమెఱియదె ప్రాణమైన మగఁడిట్లయినన్"

కలహభోజనుఁడైన నారదుఁడట్టి మాటలాడుటలో సత్యభామ కాశ్చర్యకరమగు నంశమేమియును లేదు. కాని యాతఁడట్టి మాటలను సపత్నియెదుట నాడుచుండఁగా వల్లభుఁడూరకుండుటయా? మగఁడే యిట్లైన నింక నాపాతిని మన్నించువారెవరు? ఇంతకును మగవారందఱు నట్టివారేయని యామె సిద్ధాంతము. ధూర్తగోపాలుఁడనుటచేఁ బసులమేపరికి నుత్తమగుణము లుండునాయని సత్యభామ యభిప్రాయము. ఆమె తనభర్తను బ్రాణతుల్యముగఁ బ్రేమించినది. నిజమాలోచింపఁగాఁ బ్రాణమైన మగఁడిట్లగుట విచారకారణమే. ఒకనిదుండగ మందఱకు నుపద్రవ కారణమైనట్లు సత్యభామాక్రోధము మగజాతి నందఱను విసరికొట్టినది.

"పరికింపరు తమ జాడలు
తరుణుల తగులములు నమ్మఁదగదండ్రు మదిన్
శరదంబుద చలచిత్తులు
పురుషులెపో వారినమ్మఁ బోలునె చెలియా!"

ఇంతలో నీర్ష్యాసూయలకుఁ జేదోడు వాదోడుగా నభిమానము తలసూపినది. ఇట్టి తిరస్కృతినందిన తానెట్లు సపత్నులయెదుటఁ దలయెత్తి తిరుగఁగలదు. మగఁడు తనగీచినగీటు దాటఁడను గర్వము తనకీనాఁటితో కడఁగి పోయినదని సపత్నులు మనసునందైన ననుకొనరా? ఇప్పటి సత్యభామ చిత్తవృత్తి నీ క్రింది పద్యములలోఁ గడుంగడు మనోహరముగాఁ జిత్రించియున్నాఁడు.

"ఇన్నిదినంబులు న్సవతు లిండ్లలోఁ గడు గౌరవంబునన్
గన్నియ నన్నువల్లభుఁడు గన్నులఁ గప్పుకొనంగ నుండె యా
వన్నెయు వాసియుం దఱిగివారు ననుం దలయెత్తి చూడఁగా
సన్నల జాయలం బలుకనైఁతునె ప్రాణములెంత తీపొకో"

"'నామొగమాటకై వలసి నాటకము ల్మటియించి రుక్మిణీ
కామిని మీఁదటం గలుగు గౌరవమం గృపయుం బ్రియంబు దా
నేమియుఁ గాననీక యిట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చె నో
తామరసాక్షి! మెచ్చవలదా మురదానవభేది కృత్యముల్'"

"ఓచెలి! శౌరికిచ్చెనఁట యొక్కలతాంతము దెచ్చి నారదుం
డా చపలాక్షి కిచ్చెనఁట యాతఁడు నచ్చెరి యిట్టి మాట లా
హా! చెవుల న్వినంబడియుఁ బ్రాణము దాల్చెద మేన నింతఁగా
నోచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మెయి నున్న దాననో"

సత్యభామకు స్వాభిమానము మెండు, "నారదుఁ డొక్క లతాంతము శౌరికీయఁగా నది యాతఁడు రుక్మిణి కొసఁగినాఁడు". అను నీ వాక్యము వినియు జీవించియుండుట హేయమని యామె నిశ్చయము. 'ఇన్ని దినములు నీపై నధికానురాగముగల కృష్ణుఁ డింతలో నిట్లు మాఱుటకుఁ గారణమేమి?' యని యందురా యది వట్టి నటన. మున్నుగూడ నా రుక్మిణియే కృష్ణునకుఁ బ్రియతమ నాపైఁ జూపిన ప్రేమయంతయు నా ధూర్తగోపాలుని కపటనాటకము. ఇది యామె వాదము. కష్టసుఖములు కావడికుండలు గదా! ఇంతమాత్రమునకే రుక్మిణి యంత మురియ నగునా?

"పూనుకొని మేలుఁ గీళ్లకు
లోనయి విహరించువారి లోకమెఱుఁగదొ
యానరకాసురదమనుఁడు
దా నెఱుఁగఁడొ భోజకన్య తా నెఱుఁగదొకో"

నరకాసురదమనుఁడనుటచే నరకాసుర వధ యందలి సత్యభామాసాహాయ్యము సూచితము. కాని యిది యంతయు నొక్కపెట్టు. విరి ధరించిన యా భోజకన్యను సపత్నులందఱు గౌరవము నుజ్జగించి భజించుట యొక్కపెట్టు. ఇంతలోఁ దనయెడఁ బతి మున్ను చూపిన ప్రేమ జ్ఞప్తికి వచ్చినది. ఇది యాఁడువారికి సహజగుణము. వారేవిషయమునైనను ద్రవ్వి తలకెత్తక విడువరు. మేలు గీడులలో నెద్ది వచ్చినను వాని పూర్వాపరములన్నియుఁ బూసగ్రుచ్చి నట్లు వారికి జ్ఞప్తికివచ్చును. మానక్రోధవివశయై యున్న సత్యభామకు మున్ను కృష్ణుఁడు దానను సలిపిన విహారములు నడపిన యుత్సవములు ననుభవించిన కేళీవినోదములు జ్ఞప్తికివచ్చినవి. కలలో నైనను నవ్వులకైనను దనమాట నాతఁడు జవదాఁట వెఱచుననియు నెట్టి పదార్థంబు నామె యెదుటఁ బెట్టక మున్న యెవ్వారికి నొసంగఁడనియు చెలు లామెతో నేమి కొండెములు చెప్పిపోదురో యని వారికి లంచము లిచ్చుననియుఁ దోడి చేడియలు పంతుల కామెతో నిలువఁగా నయ్యది యాతఁడు సైరింపఁజాలఁడనియుఁ గపట మెఱుఁగని మమతలతోఁ గలసిమెలసి యున్ని నాళ్లుంటి మనియు సత్యభామ తన చెలిమికత్తెకడ వచించినది.

ముక్కుతిమ్మనార్యుఁడు సత్యభామా స్వభావో న్మీలనము గావించుటలోఁ గడు జాగరూకత వహించి నాఁడు మానక్రోధవివశయయ్యు నీర్ష్యాసూయలచేఁ గలంచఁబడియు సత్యభామ మహాపతివ్రత. ఆమె పతిని బ్రాణతుల్యముగఁ బ్రేమించినది. తానెట్లు పతిని బ్రేమించుచున్నదో పతియుఁ దన్నట్లే ప్రేమింప వలయునని యామె యాశయము. ఆమెకుఁగల ప్రేమప్రభావమే ఆమె యీర్ష్యాసూయలకు గారణము గాని మఱెట్టి దురాలోచనములును గావు. ఆమెకుఁ బతియెడఁగల ప్రేమను గవి యీ తీరున వ్యక్తము చేసియున్నాఁడు.

'పతిప్రాణసదృశ బంధువు
పతిదైవం బెడుగడయుఁ బతిసతులకు వ

తృప్తి యకట మేఁదప్పిన
గతి కులకాంతలకు వేఱు గలదే చెపుమా!''

''వర మిచ్చి పుచ్చుకొన్నను
మరమున నోర్వంగవచ్చు మగఁడింతులకున్
జనవిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె యింక నేటిమాటలు సెపుమా!''

ఇంతతో సత్యభామాస్వభావోన్మీలనము నందలి యొక ప్రకరణము సమాప్తమైనది. ఇందుఁ దిమ్మనార్యుఁడు చూపిన మనోవృత్తి వివరణకౌశల మద్భుతము. సత్యభామ సుందర సుకుమారశరీర. పతివ్రతలలో నగ్రగణ్య ప్రేమస్వరూపిణి. కాని యాప్రేమ సాపేక్షము. అందువలననే యీర్ష్యాసూయలకుఁ దావలమైనది. ప్రప్రథమమునఁ దన చెలికత్తె పారిజాతకుసుమ వృత్తాంతమును జెప్పఁగనే యామె హృదయమును గ్రోధాశ్చర్యములు రెండు నొక్కసారియే పెనగొన్నవి. తన్ను నిందించుటచేఁ గ్రోధము. నిట్టిది జరిగెనా యను నాశ్చర్యము. అందులకే ''ఏమేమీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా యామాటల్ చెవియొగ్గి తా వినియెనా యాగోపికా వల్లభుండు'' అని యామె ప్రశ్నించినది. ఈ క్రోధాశ్చర్య సందేహములకుఁ దోడభిమాన మవతరించినది. ఎవరికో యేదో మగఁడిచ్చినాఁడన్నంత మాత్రమున నింతగాఁ జిందులు త్రొక్కుటకుఁ దానేమి చులకన మానిసియా? అట్లు గాదు. అభిమాన కారణమువేఱు మతకరివేలుపుం దపసి తమ్ముఁ దలంచుటయే యపచారము. దానిని జెవియొగ్గి తన ప్రాణవల్లభుఁడు వినుట మహాపచారము. ఇటువమానితయై హేయపుంబ్రతుకు బ్రతుకుటకంటె మరణించుటయే మేలుకదా! ఇట్లు వగల మిగులఁ బొగులుచుఁ గ్రోధాగారమున నామెప్రవేశించినది. తొలుతఁ గ్రోధము – పిదప నాశ్చర్య సందేహములు – తుదకు దుఃఖము. సత్యభామా మనోవృత్తి పరిణామమందలి సోపానములు.

సత్యభామా స్వభావోన్మీలనము నందలి రెండవ యంతరు వామె క్రోధాగార ప్రవేశముతో నారంభమగును.

''అని వగల మిగులఁ బొగులుచు
జనితామర్షమునఁ గోపసదనంబునకున్
జనియెను లతాంగి హరిచం
దనకోటరమునకు నాగతరుణియుఁ బోలెన్''

క్రోధవివశయై యున్న సత్యభామ నురగాంగనతోఁ బోల్చుటెంతయు నుచితమై మనోజ్ఞముగానున్నది. ఇప్పట్టున నామె స్వరూపమును గవి యిట్లు వర్ణించినాఁడు.

''మాసిన చీరఁ గట్టికొని మౌనముతోడ నిరస్తభూషయై
వాసెనకట్టుఁ గట్టి నిడువాలిక గస్తురిపట్టు వెట్టి లో
గానిలి చీఁకటింటికడ కంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగియై పొరలె గాఢమనోజవిషాదవేదనన్''

''బిసరుహపత్రలోచనకుఁ బెల్లగు మోహము సంఘటిల్లె వె
క్కసమగు నెవ్వగ ల్వొడమెఁ గంపము పుట్టె జెమర్చెమేను మా
నసమున విన్నపాటొదవె నాఁబెగడుం బరితాపవేదనల్
మసకపుఁ బాముకాటు గతి మచ్చరమన్విష మగ్గలింపఁగన్''

''వెడవెడఁ గన్నుమూయుఁ గనువిచ్చు నగుం దలయూచుఁ బాన్పుపైఁ
బడు నుసురంచు లేచుఁ దడబాటును దత్తరముం జలంబులో
నడరఁగఁ గోపవేగమున నగ్గలమైన మనోజబాధలం
బడె మదహస్తిహస్తగత పద్మినియుం బలెసొంపు పెంపఱన్''

పైపద్యములలో సత్యభామాబహిరంతర్మూర్తులు వర్ణింపఁబడినవి. ఈ పద్యములలో సత్యభామను గవి మూఁడింటితో నుపమించినాఁడు.

1. హరిచందన కోటరమున కేగు నాగతరుణి.

2. జలదాంత చంద్రరేఖ.

3 మదహస్తి హస్తగత పద్మిని.

మనకప్పటి సత్యభామాస్వరూపస్వభావములు తేటతెల్లము కాఁగలవు. నాగతరుణితో నామెను సరిపోల్చుటచే నామె క్రోధవివశయై యున్నదనియు, నామె సుందర సుకుమార దేహమా క్రోధతాపమును సహింపలేకున్నదనియు ధ్వనించును. మఱియు నాగతరుణి హరిచందన కోటరమునకుఁ దాపోపశమనార్థమై పోవును. ఇట సత్యభామయుఁ దాపోపశమనార్థమే క్రోధాగారమున కేగినది. తాపశమనార్థమై క్రోధాగారమున కేగనేల? శైత్యోపచారములు చేసికొనరాదా యనరాదు. ఇది క్రోధతాపముగాని విరహతాపము గాదు. విరహతాపమునకే శైత్యోపచారాదులు తగును. క్రోధతాపము పత్యనునయాదులచే మాత్రమే శమించును. తన్నిమిత్తము క్రోధాగారప్రవేశమే తగును. జలదాంత చంద్రరేఖా సాదృశ్యమువలన నామె ఖిన్నభావము ధ్వనించుచున్నది. మదహస్తిహస్తగతపద్మిని యనుటచే నామె శరీరముతోపాటు హృదయమును జిందరవందరయై చీకాకునొంది యున్నదని ధ్వనించుచున్నది. ఇట్లు తిమ్మనార్యుఁడు సత్యభామాపాత్రచిత్రణమునందుఁ గృతకృత్యుఁడైనాఁడు. సత్యభామామానక్రోధవివశత్వమునకుఁ బరమావధి యామె తన పతి నెడమకాలఁ దన్నుటతోఁ గల్గుచున్నది. కేతన పటాంచల చంచలమైన తాల్మితోఁ గృష్ణుఁడు సత్యభామా గృహమున కేతెంచుట—తాళవృంతమునఁ గొని తన ప్రియురాలికి వీచుట తన్నువడియు బుజ్జగించి బ్రతిమాలుకొనుట మొదలగు శ్రీకృష్ణుని చేష్టలన్నియు నానాఁటి పురుషుల రసికత్వమున కుదాహరణములై యున్నవి.

భరతశాస్త్రము ననుసరించి ఖండిత నాయికా పాత్రము నభినయించు నటుఁ డీకావ్యపద్యములనే మాతృకలుగాఁ బెట్టుకొని తన యవయవ విన్యాసమును దిద్దుకొనవచ్చును. సత్యభామాకలాప ప్రదర్శనమునందుఁ గూచిపూడివారు చూపున దీరహస్యమే. పెద్దనవలెఁ దిమ్మకవియు బాత్రచిత్రణమునఁ గృతహస్తుఁడైన శిల్పి. సూక్ష్మాతి సూక్ష్మవిషయములతోఁ బాత్రల మనోధర్మములను నిరూపించి చూచుటలో నొకవేళఁ బెద్దనయు నీయనకుఁ జాలకపోవచ్చును. పెద్దన కావ్యములో నాటకధర్మప్రాధాన్య మెక్కువ. భావానుగుణముగాఁ బదములఁ బ్రయోగించుటలో నీతఁడు మేటి యనవచ్చును. ముక్కుతిమ్మనార్యు ముద్దుపల్కులు తక్కిన కవులకుఁ దక్కినవి కావు,

# కవి ధూర్జటి

నోరి నరసింహశాస్త్రి

## 1

మన భక్తకవులలో పోతన తర్వాత చెప్పుకో దగినవాడు కవిధూర్జటి. వీరిద్దరికీ ఎన్నో పోలికలున్నవి. ఇద్దరూ ప్రధానముగా శివభక్తులే ఐనా హరియందుకూడా సమాన భక్తికలవారు. ఇద్దరూ భక్తితో శృంగారమును జోడించినవారే. ఇద్దరూ రాజనింద చేసినవారే.

పోతన భక్తిలో శృంగారము కలసిపోయి శృంగార మనిపించదు. మూలములోలేని శృంగార భావములెన్నో అతడు తన రచనలో విస్తరించినాడు. దానిమీద ఘన విమర్శకులు ఎక్కువ వివరణచేయనందుచేత సామాన్యపాఠకులదృష్టి ఎక్కువ ప్రసరించలేదు. రాజద్వేషము అతనికి మధ్యలో వచ్చినది. ఐనా ఎవరినో కొందరు రాజులనే మనస్సులో పెట్టుకొని 'ఇమ్మనుజేశ్వరాధములు' అని నిర్దేశించి వారినే నిందించినాడు. తుదకు తన మహాభాగవతమును 'రాజముఖ్యుడు—రాజశేఖరుడు' ఐన రామభద్రునకే అంకితము చేసినాడు. అందువల్ల పోతన భక్తిశృంగారముల మేళనములోగాని రాజనిందలోగాని ఆయన పరిపూర్ణత గోచరిస్తుంది.

కవి ధూర్జటిలో అట్లాకాదు. అతని శృంగారము కేవలము యోగములో పర్యవసించిన ఘట్టాలు లేకపోలేదు కాని అవి కొంచెమే. అతని శృంగార భావము తరుచుగా భగవద్భక్తికి భంగము కలిగించే కామముగాను ఇంద్రియలౌల్యముగాను గోచరిస్తుంది. దానిని జయించడానికి తోడుకమ్మని అతడు ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు.

ఇట్లే రాజుల విషయములో కూడను. రాజసమ్మానములమీద కాంక్షతోపాటు రాజుల దుశ్చర్యలపై వెగటూ ఒకదానితో ఒకటి పెనగులాడుతుంది. ఈ పెనుగులాటలోనుండి తన్ను ఉద్ధరించుమని భగవంతుణ్ణి వేడుకుంటాడు,

ధూర్జటి తన సాటికవుల అసూయకు బాగా గురిఐనవాడని అనిపిస్తుంది. అది సత్కీరుని కథలో కొంచెము ప్రతిధ్వనిస్తుంది. అంతేకాక అతడు బంధువులవల్ల జ్ఞాతులవల్లా చాలా బాధపడి విరక్తుడై సన్యసించదలచినట్లు తోస్తుంది. కాని తనకు వారిపై ద్వేషము నశించనందున అపని చేయడానికిజంకినాడు.

ఈ విధంగా ధూర్జటి పరిపూర్ణత్వము సిద్ధించినవాడు కాడు. కామక్రోధాదులతో క్షోభపడుతూ, వాటినుండి తన్ను విముక్తిణ్ణి చేయుమని పరమార్థుడై భగవంతుని వేడుకొంటాడు అందులో అతనికి దాపరికములేదు. ఈ పరస్పర విరుద్ధభావాల సంఘర్షణ, మనకు—మనబోటి అసంపూర్ణులకు—మనబోటి సామాన్యమానవులకు—కవిధూర్జటిని అత్యంత సన్నిహితుణ్ణిగా చేస్తుంది. అందువల్ల మనల నాతడు ఎక్కువ ఆత్మీయుడుగా ఆకట్టుతాడు.

ఈ స్వరూపముగల కవిధూర్జటి, అతడు రచించిన శ్రీ కాలహస్తిమాహాత్మ్యముతో అతని శ్రీ కాలహస్తీశ్వరశతకము జోడించి పఠించినప్పుడేకాని, నిజస్వరూపముతో గోచరింపడు. ఆ రెంటిలో ఒకటి ముందూ ఒకటి వెనకా రచించినాడనే వీలులేదు. రెంటిరచనా జంటగాసాగి ఉంటుంది.

## 2

జగన్మోహనమైన జంగమాకారము ధరించి శివుడువచ్చి రాజదాసినలన ఇతరోపచారములతోపాటు శయ్యోపచారముకూడా పొందిన కథతో శ్రీ కాలహస్తిమాహాత్మ్యము ఆరంభిస్తున్నది. తుదకు మధురాపురములోని ఇద్దరు వారవనితలు శివభక్తిపరవశలై వారధర్మములను నిరసించి శ్రీ కాలహస్తికి వచ్చి ఈశ్వరునితో ఐక్యముచెంది ముక్తిపొందిన కథతో అది అంతమౌతున్నది.

ధూర్జటి వేశ్యాలోలుడని ప్రసిద్ధమైన ఐతిహ్యామున్నది. అంతేకాక ఆ చాటు పద్యములోని 'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలగల్గెనో యతులిత మాధురీమహిమ?' అనే రాయలప్రశ్నకు బాగము కుమారధూర్జటి సగర్వముగా తన కృష్ణదేవరాయవిజయములోని కెక్కించుకొన్నాడు. ఈకుమారధూర్జటి మన కవిధూర్జటి సోదరుని మనుమడే. అంతేకాదు. కవిధూర్జటి స్వయంగా

"కాయల్ గాచె వధూనఖాగ్రములచే గాయంబు, వక్షోజముల్
రాయన్రాపడె రొమ్ము, మన్మథవిహారక్లేశ విభ్రాంతిచే
బ్రాయంబాయెను, బట్టకట్టె దల, చెప్పన్రోత, సంసారమే
జేయంజాల, విరక్తు జేయగదవే శ్రీ కాలహస్తీశ్వరా!"

అనీ, 'అమరస్త్రీల రమించినం దనిపదు మోహంబింతయున్' అనీ, 'రోసిరోయదు కామినీజనుల తారుణ్యోరు సౌఖ్యంబులన్' అనీ, 'సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వార సౌఖ్యంబులన్' అని, ఇత్యాదిగా ఏమేమో నివేదించుకొన్నాడు. వీటివల్ల కవిధూర్జటి వేశ్యాలోలుడనే కథ సత్యదూరముకాదని మన మూహింపవచ్చును.

ఆకాలములో వేశ్యలతో సాంగత్యము మహాదోషముగా చూచేవారు కాదు. శిష్టులైన మన మహాకవులు పురవర్ణనలలో వేశ్యాతిశయము తప్పనిసరిగా వర్ణించినారు. అబ్దుల్‌రజాక్ మొదలైన విదేశయాత్రికులు వేశ్యావైభవము వర్ణించినారు. జీర్ణమైన హంపీలో నేటికీసూళెబజారు అవశేషాలు కానవస్తున్నవి. శ్రీకృష్ణదేవరాయలకు తనకున్న పన్నెండుమంది భార్యలతోనే కాక కొందరు వేశ్యలతోకూడా సంబంధమున్నట్లు దృష్టాంతాలున్నవి. అందువల్ల రాయలసభలో తెనాలి రామలింగడు 'హా తెలిసెన్' అని పూరించి

నప్పుడు రాయలకు ధూర్జటిమీద ఆదరమే అతిశయించి యుండునుగాని వేరుకాదు. ఈనాటి మనభావాలతో ఆనాటి సంఘభావాలను అనుమేయించుట చారిత్రక దృష్టికి సమ్మతము కానేరదు.

ఇంతకూ ఈశ్వరునికి ఏమనినివేదించుకొన్నాడు ధూర్జటి? "నన్ను విరక్తుఁజేయఁగదవే"అని ప్రార్థించాడు. 'మనంబు ...దేని తుళ్లపడవే'అని వేడుకొన్నాడు. ఈశ్వరప్రణిధానానికి అడ్డు తగులుతున్న కామక్రోధాదిప్రతిబంధకాలు తొలిగించుమని భగవంతుణ్ణి వేడుకోవడము తప్పుకాదుగదా !

## 3

శ్రీకాలహస్తి మాహాత్మ్యములోని మొదటికథలో జంగమశివునికి ఉపచారాలుచేస్తూ, ఒళ్లుమరచి వేళకు తనసేవకు రాక తప్పిన దాసికి రాజు 'తల గొరిగింపఁ బంచి' నాడు. కాని తర్వాత ఆయన మహత్త్వము తెలియగానే పశ్చాత్తప్తుడౌతాడు. నత్కీరుని కథలోని పాండ్యరాజుకూడా మంచివాడే. కాని శతకములో మాత్రము రాజనింద విపరీతముగా ఉన్నది

నత్కీరుడు శ్రీకాళహస్తీశ్వరునిమీద ద్రమిళ భాషలో శతకమొకటి చెప్పినట్లు శ్రీకాలహస్తిమాహాత్మ్యము తృతీయాశ్వాసములో ఉన్నవి. దానికి సంతోషించి ఈశ్వరుడు సాయుజ్య మిచ్చినాడట. అది భక్తులకు పారాయణయోగ్యమైనట్టు చతుర్థాశ్వాసములో 'నియమంబున శ్రీకాలహస్తీశ్వరునకుఁ గవితా చమత్కారంబుమీర నత్కీరుండు చెప్పిన నూరుపద్యంబులు పాఠంబుచేసి నిత్యవ్రతంబుగా. బఠించుచు' అని యొకచోటను, 'ద్రావిళకవి రచితనుతిశత మవిరళగతిఁ జదువుకొనుచు'అని మరియొక సందర్భములోను కలదు సత్కీరుని శతకమిప్పటికి మన పరిశోధకులు బయటపెట్టలేదు. స్కాందము శివరహస్య ఖండములోని నత్కీరునికి శ్రీకాలహస్తితో సంబంధమే

లేదు. అందులో సుందరేశ్వరుడు హరిద్విజునికి వ్రాసి ఇచ్చినది సంస్కృతశ్లోకమే కాని ద్రావిడప్రబంధము కాదు. స్థలపురాణమును అనుసరించి ధూర్జటి నత్కీరుని కథ వ్రాసియుండును. స్కాందములోని నత్కీరుని కథలో ఔచిత్య మెక్కువ ఉన్నది. నత్కీరుడు ద్రమిళభాషలో వ్రాసినాడనె శ్రీకాలహస్తీశ్వరశతకము మనస్సులో ఉంచుకొని ధూర్జటి ఆంధ్రభాషలో తన శతకము వ్రాసియుండునా? ఇది మాత్రము నిస్సందేహముగా శివభక్తులకు నిత్యపారాయణయోగ్యమగు స్థాయిలో వెలసినది.

శతకములో ధూర్జటి తాను రాజులవల్ల 'అంభోజాక్షీ చతురంతయాన తురగీభూషాదులు' పొందినాననీ, అని 'ఆత్మవ్యథాబీజము' లని 'తదపేక్ష చాలు' ననీ 'పరితృప్తిం బొందితి' ననీ 'జ్ఞానలక్ష్మీ జాగత్పరిణామమిమ్ము దయతో' ననీ, ఈశ్వరుణ్ణి వేడుకొన్నాడు 'మదమాతంగములు అందలమ్ములు హరులు మాణిక్యములు పల్లకులు ముదితలు చిత్రదుకూలములు పరిమళములు మోకమిచ్చునా' వట 'మదిలో వీని నపేక్షచేసి అజ్ఞలు నృపధామ ద్వారదేశంబులు గాచిదినంబుల్ వృథపుత్తు' రట. అంతే కాదు, రాయల దర్శనార్థము ఉవ్విళ్ళూరుతూ, రాజద్వారములలో నిత్యమూ ద్వారపాలకుల చేతులలో దర్శనార్థులు పడేబాధలు కన్నులకు కట్టినట్లుగా ఈవిధంగా వర్ణించినాడు :

"ద్వారద్వారములందుఁ గంచుకి జనవ్రాతంబు దండంబులన్
దోరంతస్థ్సలి బగ్గసం బొడుచుచున్ మర్థ్యాషలాడన్మఱిన్
వారిం బ్రార్థనచేసి రాజులకు సేవల్ సేయఁగా...'

ఒకచోట 'రాజుల్ మత్తులు వారిసేవ నరకప్రాయంబు' అన్నాడు. ఇంకొకచోట 'రాజశబ్దంబు ఛీ ఛీ జన్మాంతరంబునందు నొల్లనుజుమీ' అన్నాడు. మరియొకచోట 'కాంతిం బొందితిఁ గాలుఁజాలు బహురాజద్వార సౌఖ్యంబులన్'అన్నాడు. ఇంకా ఎన్నెన్నో

విధాలుగా రాజనింద చేసినాడు. అతడు పడ్డ చిత్త క్షోభ ఈపద్యములో మరి ఎక్కువగా కనబడుతుంది :

"రాజన్నంతనె పోవునా కృపయు ధర్మం బాభి
జాత్యంబు వి
ద్యాజాతక్షమ సత్యభాషణము విద్వన్మిత్ర
సంరక్షయున్
సౌజన్యంబు కృతంబెఱుంగుటయు విశ్వాసంబు
గాకున్న దు
ర్బీజశ్రేష్ఠులునాఁ గతంబుగలదే శ్రీకాల..."

ఈ పద్యంలో ఎవరో గొప్పరాజు, ఎన్నో సద్గుణాలు కలవాడైనా అపసవ్యంగా ప్రవర్తించినట్లు స్ఫురిస్తుంది. ఆ రాజుపేరు చెప్పలేదు కాని ఆ సద్గుణాలు అన్నీ శ్రీకృష్ణదేవరాయలకు స్పష్టంగా అన్వయిస్తవి.

రాయలు అంత్యకాలములో న్యాయముగానో అన్యాయముగానో తిమ్మరుసును అనుమానించి శిక్షించినట్లు సమకాలికుడైన న్యూనిజు వ్రాసినాడు. డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్యగారు భారతిలో వ్రాసిన వ్యాసములలో దానికి సంబంధించిన విషయాలన్నీ క్రోడీకరించి న్యూనిజు వ్రాతను బలపరచినారు. అంత రాయలే అవిధంగా ప్రవర్తించినందుకు. మరి ఎందరివలెనో ధూర్జటిగూడా సంక్షోభపడి ఈ పద్యము చెప్పినట్లు తోస్తుంది. తిమ్మరుసుమీద రాయలకు శంకకలిగించిన ఉద్యోగులపైకూడా కొంత విసురు ఉన్నది. శతకములో :

"ఒకరింజంపి పదస్థులై బ్రతుక దామొక్కొక్క
రూహింతు రే
లొకో తామెన్నఁడుఁ జావరో "

ఇత్యాదిగా విలపించినాడు. ఆ సందర్భములో ధూర్జటి తిమ్మరుసు పక్షము సమర్థింపబోయి రాయలచేత చీవాట్లుకూడా తినెనేమో !

"నిచ్చల్ నిన్నుభజించి చిన్మయమహానిర్వాణ
పీఠంబుపై
రచ్చల్ సేయక యార్జవంబు కుజనవ్రాతంబుచేఁ
గ్రాఁగి భూ
భృచ్చండాలురఁ గొల్చి వారు తనుఁగోపింపన్ బుధుం
డార్తుఁడై
చిచ్చాఱం జమురెల్లఁజల్లుకొనునో శ్రీకాల..."

ఈవిధంగా బాధపడి శ్రీ విద్యానగరము వదలిపెట్టి ధూర్జటి మళ్లీ శ్రీకాళహస్తి చేరుకొన్నాడు.

"నీకుంగాని కవిత్వ మెవ్వరికి నేనీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిన్ బిరుదంబు కంకణము ముంజేఁగట్టితిం
బట్టితిం
లోకుల్ మెచ్చ వ్రతంబు..."

అని ఈశ్వరునికి నివేదించుకొన్నాడు.

## 4

రాజసేవ చాలించుకొని శ్రీకాళహస్తికి వచ్చినా ధూర్జటికి బాధలు పోయినట్లులేదు. ఎక్కడా తృప్తి లేక బాధలు కొనితెచ్చుకొనే స్వభావమేమో అతనిది !

గురువేషధారులైన పండితులనుగూర్చి 'అయవారై చరియింపవచ్చుఁ దనపాదాంభోజ తీర్థంబులన్ దయతోఁ గొమ్మనవచ్చు" కాని వారు నిష్క్రియులై ఆత్మలో ఈశ్వరుణ్ణి కానలేరట! మెట్టవేదాంతులా 'పటువత్ రజ్జుభుజంగవత్' ఇత్యాదిగా మాటలు వల్లిస్తారేకాని వారు చిత్సుఖము అనుభవింపలేరట 'జీవశ్రాద్ధము చేసికొన్నయతులు'కూడా కాలముచేరువౌట ఎరిగికూడా బ్రదికే ఉపాయమేమిటా అని వెదుకుతారేకాని ఈశ్వరుణ్ణి ఇంతైనా చింతింపరట !

ఇక ధూర్జటి కాతని జ్ఞాతులేదో మహాద్రోహము చేసినారు. శ్రీవిద్యానగరంలో అతడుండగా స్వస్థలంలో ఇళ్లూ మాన్యాలూ ఆక్రమించి స్వాహాచేశారేమో !

"జ్ఞాతుల్ ద్రోహులు. వారుచేయు కపటవ్యాపారముల్ దోషముల్
మాతండ్రాన సహింపరాదు, ప్రతికర్మం బించుకేఁ జేయఁగాఁ
బోతే దోషము, గాన మాని యతినై పోఁగోరినన్ సర్వదా
చేతః క్రోధము మాన, దెట్లు నడుతున్ శ్రీకాల..."

అని వాపోయినాడు. అపకారులకు ప్రతికృతిచేయ డానికి పాపభీతి అడ్డువస్తుంది. వదిలించుకొని సన్న్యసిద్దామంటే మనస్సులో క్రోధము శాంతించదు. ఏమి చేసేటట్టు పాపము !

ఈవిధంగా అనేక బాధలుపడుతూనే మధ్య మధ్య భక్తియొక్క పరమధ్యేయము అందుకోగల్గుతున్నాడు ధూర్జటి. అందువల్లనే మనకు కవిధూర్జటి సన్నిహితుడూ ఆత్మీయుడూ అవుతున్నాడు.

ఆతని ఉత్తమానుభూతి ఇటువంటి పద్యాలలో గోచరిస్తుంది :

"ఆరావం బుదయించెఁ దారకముగా నాల్మా ప్రభవిధిన్ మహా
కారోకారమకారయుక్తమగు నోంకారాభిధానంబు చె
న్నారున్ విశ్వమనంగఁ దన్మహిమచే నా నాద బిందుల్ సుఖ
శ్రీరంజిల్ల గడంగు నీ వదెనుమీ శ్రీకాలహస్తీశ్వరా!

# విశ్వనాథనాయకుడు

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

ఆంధ్రుల చరిత్రలోనేకాక దక్షిణ భారతదేశ చరిత్రలోకూడ మధురనాయకరాజుల చరిత్ర మొక మధురాధ్యాయము! 'మేరుసమాన ధైర్యయశస్విలకు' లని పేరు పెంపులు గడించిన యీ తెలుగు దొరల కాలములోనే దక్షిణభారతములో—ముఖ్యముగా తమిళనాడులో—తెలుగుమాటకు, తెలుగుపాటకు నొక క్రొత్త చెలువము, నొక క్రొత్త సోయగము చేకూరినవి. శిల్పచిత్రలేఖనాది సుకుమారకళలకు పాదులువెట్టి, నీరుపోసి, పోషించిన మధురనాయకరాజులు నేటికిని భక్తికముగ సంస్మరింప బడుచున్నారు. వీరెల్లరు మతసహిష్ణుత ప్రదర్శించిన విశాలహృదయులు. ప్రజోపయోగార్థము సప్తసంతానములను సంతరించిన మహనీయులు!

మధురనాయక రాజ్యస్థాపనము 1529 వ సం॥న జరిగెనని శ్రీ ఆర్. సత్యనాథఅయ్యరు గారును, అచ్యుతదేవరాయల కాలములో—అనగా 1542 వ సం॥న నాయకరాజుల పరిపాలన మారంభమై యుండ నోపునని హెరాస్‌దొరగారును అభిప్రాయపడిరి. అచ్యుతదేవరాయలకు పిమ్మట సింహపీఠి నలంకరించిన సదాశివరాయల కాలములో నాయకరాజులు స్వతంత్రులయిరి కనుక 1559 వ సం॥న నాయకరాజుల పరిపాలన మారంభమై యుండవచ్చునను వాదముకూడ కలదు. ఇదియే సోపపత్తికముగా నున్నటుల కనబడుచున్నది. 1560 లో వేయబడిన విశ్వనాథనాయకుని శాసనమునకును, అంతకుపూర్వము వేయబడిన శాసనములకును నడుమ కానవచ్చుచున్న వ్యత్యాసమే పైయభిప్రాయమును బలపరుచుచున్నది. పూర్వశాసనములలో విశ్వనాథనాయకుడు *'భృత్యుడు'*, *'ఊడిగము'*, *'అడపము'* (తాంబూల కరండవాహకుడు) అని పేర్కొనబడినాడు. కాని 1560 వ సం॥పు శాసనములో అతని కుమారుడగు కృష్ణప్పనాయకుడు (మొదటి కృష్ణప్పనాయకుడు)

కూడ తనకు ప్రభుత్వ వ్యవహారములలో సహాయము చేయుచున్నట్లుగా తెలుపబడినది. కనుక 1559 వ సం॥ ర విశ్వనాథనాయకుడు స్వతంత్రుడై రాజ్యాధీకారము చేయదొడగెనని చెప్పవచ్చును. ఏది యెట్లున్నను, మధురనేలిన నాయకరాజులలో విశ్వనాథనాయకుడు ప్రముఖు డనుటలో అభిప్రాయభేదములులేవు.

కాంచీపుర నివాసియు, కాశ్యప గోత్రోద్భవుడునగు నాగమనాయకుని కుమారుడే విశ్వనాథనాయకుడు. సేనాధిపతి, కోశాధిపతి (తోషేఖానా కధిపతి), ముఖ్యకరగ్రాహి మొదలగు పదవులను కడు సమర్ధతతో, నిర్వహించిన ప్రతిభాశాలి నాగమనాయకుడు. సాళువనరసనాయకుని మరణానంతరము తుళువనరసనాయకుడు విజయనగర సింహాసనము నాక్రమించుటకు ప్రయత్నించిన సందర్భములో నాగమనాయకుడతనికి చాల సహాయము చేసి, తుళువవంశీయుల అదరాభిమానములు చూరగొనెను.

కాశికా విశ్వేశ్వరుని కృపవలన నాగమనాయకునికి పుత్రుడు కలిగెననియు, అతడే విశ్వనాథనాయకుడనియు ఈక్రిందిపద్యమువలననుస్పష్టమగుచున్నది [1]

"ఆ నాగవిభుఁడు గంగా
స్నానముఁ గావించి విశ్వనాథు చికృప నెం
తేని తగ విశ్వనాథ
జ్ఞానాధు నిఁ గాంచె వేడుకలు నలువొందన్."

ఈవృత్తాంతము తంజాపూరి యాంధ్రరాజుల చరిత్రలో విపులముగా చెప్పబడినది. రెండవ వేంకటపతిరాయలు వేయించిన కూనియూరు పత్రములలో కూడ ఈ ప్రశంస చేయబడినది.[2] ఈవిషయము విశ్వసనీయమని తోచుచున్నది.

1 ఈపద్యము లింగనమఖి శ్రీ కామేశ్వరకవి రచియించిన 'సత్యభామా సాంత్వనము' నందలిది.

2 చూడుడు: శ్రీ హెచ్. కృష్ణశాస్త్రిగారి వ్యాసము, ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటము 3, పుట 236.

తండ్రివలె, విశ్వనాథనాయకుడు కూడ గొప్ప వీరుడు; ప్రభుభక్తి పరాయణుడు. ప్రభురాజ్ఞను శిరసావహించి, కన్నతండ్రిమీదనే కత్తిగట్టుటకుకూడ అతడు వెనుకదీయలేదు అట్టిది అతని ప్రభుభక్తి!

శ్రీకృష్ణదేవరాయలవారి కాలమున పాండ్యమండలమున (మధుర) చంద్రశేఖరపాండ్యు డనునతడును, చోళమండలమున (తంజావూరు) వీరశేఖర చోళు డనునతడును, రాజ్యాధికారము చేయుచుండిరి. చంద్రశేఖరపాండ్యుడు బలహీను డగుటచే మధురలో శాంతిభద్రతలు లోపించియుండెను. పైపెచ్చు అతడు దాసీపుత్రు డను అపప్రథ యొకటి ప్రచారమున నుండెను. ఈకారణముల నాధారము చేసికొని వీరశేఖరచోళుడు అనాయాసముగా పాండ్యుని జయించి, మధురను వశము చేసికొనెను. తుదిపిమ్మట, రాయలవారి యాజ్ఞానుసారము నాగమనాయకుడు చోళమండలమునకు వెడలి, వీరశేఖరచోళుని జయించెను. మధుర యందలి వాతావరణము అప్రశాంతముగ నుండుటచే, నాగమనాయకుడే స్వయముగా పాండ్యచోళమండలముల పరిపాలనా వ్యవహారములను పర్యవేక్షింపజొచ్చెను. రాయలవారి కిది కోపహేతు వయ్యెను. అనంతరము రాయలవారి యాజ్ఞను తలదాల్చి విశ్వనాథనాయకుడు తండ్రితో యుద్ధము చేయుటకు మధురకు వెడలె ననియు, తండ్రీకొడుకులకు ఘోరయుద్ధము జరిగె ననియు, అందులో విశ్వనాథనాయకుడే జయించె ననియు, పిమ్మట అతడు దక్షిణసింహాసనాధ్యక్షు డయ్యె ననియు తెలియుచున్నది.[3]

3 ఈ విషయాధికము కడు విపులముగా తంజావూరి యాంధ్రరాజుల చరిత్రలో పేర్కొనబడినది. కాని నాగమనాయకుని తిరుగుబాటును సమర్థించు శాసనాధారము లేకుండుట గమనింపదగు విషయము.

విశ్వనాథనాయకుడు మధురలో ప్రవేశించు నాటికి తన్నగరము పూజాపురస్కారములు లేక బూజు పట్టిన యాలయమువలె నుండెను. రాజ్యము నం దెప్పట చూచినను, చిట్టడవులే ఎక్కువగా కాన వచ్చెను, చోరభయము విపరీతముగా నుండెను. దుర్గములు శిథిలావస్థలో నుండెను. గుళ్లుగోపురములు కళావిహీనము లై యుండెను. శాంతిభద్రతలు స్వప్న గత వృత్తాంతములై యుండెను. తుదకు మధురా నగరము కూడ దుస్థితికి పాల్పడియుండెను. కాగా తొలుత మధురను పునరుద్ధరింపదలచి విశ్వనాథ నాయకుడు తన దళవాయి ప్రధాని[4] యగు అరియనాథ మొదలితోను, దళవాయి బిసపాకం కేశవప్పనాయని తోను సంప్రదించి, ఆనగరదుర్గమును పునర్నిర్మించెను. అది ముగిసిన పిదప, మీనాక్షి సుందరేశ్వరులకు కన్నులవండువు గొలుపు కోవెల నిర్మించెను. ప్రజోప యోగములగు పనిపాటులలో పిత్రార్జితమును కూడ అతడు వినియోగించెను. అట్టి త్యాగవీరుడు విశ్వ నాథనాయకుడు. కనుకనే దానశీలు డనియు, ప్రజా రంజక పరిపాలకు డనియు అతడు పేరు పెంపులుగడిం చెను. అతని యేలుబడిలో మధురరాజ్యము సర్వ విధముల అభివృద్ధి చెందె నని నిస్సంశయముగా చెప్పవచ్చును.

తొలుత విశ్వనాథనాయకుడు పాండ్యచోళ మండలములకు రాజప్రతినిధిగా నియమితు డయ్యెను. కాని, కృష్ణదేవరాయలవారి మరణానంతరము రాజ్య మునకు వచ్చిన అత్యుతదేవరాయల కాలములో చోళ మండలము ప్రత్యేక రాజ్యముగా పరిగణింపబడెను. ఆ రాజ్యమునకు చెవ్వప్పనాయకు డనునతడు పరి పాలకు డయ్యెను. అతడు అచ్యుతదేవరాయలవారి మరదలగు మూర్తెమ్మను వివాహమాడెను. ఆ సందర్భమున చెవ్వప్పనాయకునికి తంజావూరు అరణ ముగా లభించినట్లు తెలియవచ్చుచున్నది.

ఈ విభజనానంతరము తిరుచ్చిరాపల్లి మధుర కును, వల్లందుర్గము తంజావూరునకును సంక్రమిం చెను. ఆనాళ్లలో కావేరి కిరువైపుల చిట్టడవులు దట్టముగా పెరిగియుండిన కారణమున చోరభయము చాల ఎక్కువగా నుండెను. ఆవిషయము తెలిసికొని విశ్వనాథనాయకుడు ఆ యడవులను కొట్టించెను. రక్షకభట దళము నేర్పరిచెను. తిరుచ్చిరాపల్లి దుర్గముచుట్టును రెండు ప్రాకారములు నిర్మించి, వాని చుట్టును విశాలమగు కందకమునుకూడ త్రవ్వించెను. తత్ఫలితముగా, తిరుచ్చిరాపల్లికి రక్షణ యేర్పడెను. చోరభయము నశించెను. అనంతరము విశ్వనాథ నాయకుడు తిరుచ్చిరాపల్లి, శ్రీరంగము మొదలగు పుణ్యక్షేత్రములలోని గుళ్లు గోపురములను పునరుద్ధ రించెను. విశ్వనాథనాయకుని కాలమునందే తిరుచ్చిరా పల్లిలో సుందరమగు తటాకమొకటి నిర్మింపబడెను, దీనిని తెప్పకుళ మని వ్యవహరింతురు. ఒక్క శ్రీరంగదేవాలయమునకే అతడు మూడులక్షలపొన్నుల (బంగారునాణెములు) ద్రవ్యమును వెచ్చించినట్లు వ్యక్త మగుచున్నది.

ఈటుల విశ్వనాథనాయకుడు దుర్గములను పునర్నిర్మించియు, దేవాలయములను పునరుద్ధరిం చియు ప్రజానురాగమును చూరగొనుచుండగా, తిరు నెల్వేలి మండలమున ఒక తిరుగుబాటు తలయెత్తెను. ప్రాచీన పాండ్యరాజుల సంతతికి చెందిన యైదుగురు రాజులు ఏకమై విశ్వనాథనాయకుని ప్రతిఘటింప నిశ్చయించిరి. వీరిని పంచపాండ్యులందురు. ఈ తిరుగుబాటును అణచుటకు అరియనాథమొదలినియుక్తు డయ్యెను. నయోక్తులతోనే వారిని వశము చేసికొనుట

---

4 ఇతడు మంత్రిపదవినే కాక సైన్యాధ్యక్ష (దళవాయి) పదవినికూడ నిర్వహించెను. విశ్వనాథనాయకుని కితడు కుడిభుజముగా నుండెను. ఇతనిని కొందరు ఆర్యనాయక మొదలి అనియు వ్యవహరించిరి.

శతడు యత్నించెను కాని లాభము కలుగకపోవు టచే తుదకు యుద్ధమే శరణ్యమయ్యెను. ఆ సందర్భ మున తిరువడిసీమనేలు భూతలవర్మ అనునతడు పంచపాండ్యులకు అండగా నిలిచెను. అందువలన విశ్వనాథనాయకుడు తిరువడిమీదికి కూడా దండెత్తి పోవలసివచ్చెను. ఏకకాలమున రెండు యుద్ధములలో పాల్గొనవలసి వచ్చుటచే, విశ్వనాథనాయకుడు అచ్యుత దేవరాయుల సాహాయ్యము నభిలషించెను.

అచ్యుతదేవరాయలు వెనువెంటనే సైన్యసమే తుడై కదలివచ్చి తిరువడిరాజ్యమును ముట్టడించెను. ఈయుద్ధములో మొదటికృష్ణప్పనాయకుడు ప్రముఖ పాత్ర వహించెనని విదిత మగుచున్నది.

పిమ్మట విశ్వనాథనాయకుడు పంచపాండ్యు లతో యుద్ధమునకు దిగెను. అతడు ప్రదర్శించిన అపార ధైర్యసాహసములకు నిలువజాలక వారు విశ్వనాథనాయకునితో సంధిచేసికొనిరి. తత్ఫలితముగా తిరునెల్వేలి మండలము మధురరాజ్యమునకు సంక్ర మించెను. శాంతి భద్రతలు నెలకొల్పుటయే లక్ష్య ముగా నుంచుకొనిన విశ్వనాథనాయకుడు తిరునెల్వేలి పట్టణమును విస్తృతపరిచెను. వీధులను విశాలము కావించెను. గుళ్లు గోపురములను పునరుద్ధరించెను. క్రొత్తగా గ్రామములు కొన్ని నిర్మించెను. చెరువులు, కాలువలు మొదలగువానిని త్రవ్వించి వ్యవసాయాభి వృద్ధికి మిక్కిలి పాటుపడెను. కాగా, విశ్వనాథ నాయకుని దొరతనము క్రిందికి వచ్చిన పిమ్మట తిరు నెల్వేలి మండలమున శాంతి భద్రతలు నెలకొనెననుట సమంజసము.

అటుల విశ్వనాథనాయకుడు రాజ్యమునం దెల్లెడల అలముకొనియుండిన అరాజకమును రూపు మాపి శాంతిరక్షణలు కల్పించుటకు కృషి చేయుచున్న సమయమున, అతడు మరల ఇంకొకయుద్ధమున పాల్గొనవలసిన వాడయ్యెను. కంబము గూడలూర్ల సీమ నేలు రాజు తాను చోళవంశీయుడ నని చెప్పు కొనుచు విశ్వనాథనాయకుని రాజ్యాధికారమును తిరస్క రించుటయేకాక కట్టవలసిన కప్పమును కట్టుటకు కూడా నిరాకరించెను. విశ్వనాథనాయకుని యాజ్ఞాను సారము రామభద్రప్పనాయడు ససైన్యముగా వెడలి కంబమును ముట్టడించెను అయుద్ధములో మధురకే విజయము లభించెను. అందులకు సంతోషించి వైఘనదీతీరమున నున్న వేదకర్రై అనుపాళెమును విశ్వనాథనాయకుడు రామభద్రప్పనాయనికి సర్వాధి కారములతో నొసగెను.

విశ్వనాథనాయకుని కాలమునందే మధుర మహోన్నతస్థితి నందుకొనెను. అతని రాజ్యమునకు ఉత్తరమున ఉత్రత్తూరు ఎలికొండపురములును, దక్షిణమున కన్యాకుమారియు, పశ్చిమమున కోయం బత్తూరు ధారాపురము ఈరోడులును, తూర్పున రామేశ్వరమును'సముద్రమును సరిహద్దులుగానుండెను. అనగా, నేటి మధుర, రామనాథపురము, తిరునెల్వేలి, తిరుచ్చిరాపల్లి, కోయంబత్తూరు, సేలము జిల్లాలు విశ్వనాథనాయకుని కాలమున మధురరాజ్యమైయుండె నని నుడువదగును.[5] తిరువాంకూరులోని కొంత భాగము కూడ అతని యేలుబడి క్రిందికి వచ్చినట్లు తెలియుచున్నది.

రాజ్యమున శాంతిభద్రతలు నెలకొల్పబడిన పిదప పరిపాలనాసౌష్ఠవము నుద్దేశించి, విశ్వనాథ నాయకుడు ఒకనూతన విధానమును ప్రవేశపెట్టెను. దానికి పాళెము పద్ధతి అని పేరు. ఆవిధానమునకు రూపరేఖలు దిద్దినవారిలో దళవాయిప్రధాని అరియ నాథమొదలి తొలుత పేర్కొనదగినవాడు.

---

5 కోయంబత్తూరు సేలం జిల్లాలు విశ్వనాథనాయకుని కాల మునగాక తిరుమలశౌరినాయకుని కాలమున (1623—59) మధురకు సంక్రమించెనని కొందరు తలచు చున్నారు.

ప్రాచీనపాండ్యరాజుల సంతతివారును, వారి సామంతుల సంతతివారును, మహమ్మదీయులబారి నుండి తప్పించుకొను నుద్దేశముతోనో, మరి యేకారణముననో ఉత్తరమునుండి యేతెంచి దక్షిణభారతమున స్థిరనివాసము లేర్పరుచుకొన్నవారును, వారి అనుయాయులును ఆయా ప్రదేశములందు పలుకుబడి కలిగియుండిరి. వా రెల్లరు సంతుష్టులైనగాని మధురలో శాంతిభద్రతలు సుస్థిరముగా నుండజాలవు. అందువలన విశ్వనాథనాయకుడు రాజ్యమునంతటిని డెబ్బదిరెండు[6] పాళెములుగా విభజించి. ప్రతిపాళెము పట్టునకు నొక్కొక్కయధికారిని నియమించెను. అతనికి పాళెగారను వ్యవహార నామము కలిగెను. పాళెములకు సంబంధించిన సర్వవ్యవహారములందును పాళెగార్లదే తుదిమాట. శత్రువులబారినుండి పాళెములను సంరక్షించుకొను బాధ్యతకూడ వారియందే యుంచబడెను. వారసత్వాధికారము కూడ కల్పింపబడుటచే, పాళెగార్ల సంతతివారికి పాళెములపై హక్కు ఏర్పడెను. ఈవిధానమువలన, ఆయాపాళెములకు పాళెగార్లు ప్రభువు లయిరి. ఈ యధికారములతో పాటు కొన్ని నిబంధనలు కూడ విధించబడెను. పాళెగార్లు కేంద్రప్రభుత్వము నెడల వినయవిధేయతలు ప్రకటించవలెను. తమ రాబడిలో మూడవ భాగమును వారు కప్పముగా చెల్లించవలెను. యుద్ధములు సంభవించుచో, తమ సైన్యములు పంపి పాళెగార్లు, మధురరాజ్యాధిపతికి బాసటగా నిలువవలెను.

పాళెము పద్ధతిని ప్రవేశపెట్టుటతో విశ్వనాథనాయకుడు రాజ్యమునందలి పేరుగల పెద్దల యాదరాభిమానములు చూరగొనెను. ప్రాచీన పాండ్యభూపతుల సంతతికి చెందినవారును, స్థానికముగా విశేషాధికారము హస్తగతము చేసికొనిన ప్రముఖులును విశ్వనాథనాయకు నెడల అవిరళ భక్తివిశ్వాసములు ప్రకటించిరి. అందువలన రాజ్యముతో శాంతిభద్రతలు సుస్థాపితములయ్యెను. ఇంకొక విశేష మేమనగా, పరిపాలనాధికారముతోపాటు బాధ్యతలు కూడ కల్పింపబడిన కారణమున పాళెగార్లు తమ తమ పాళెములను శ్రద్ధానక్తులతో చూచుకొనదొడగిరి. ఈ విధానము అమలులోనికి వచ్చిన పిదవ, రాజ్యమునందలి చిట్టడవులు నిర్మూలింపబడెను. బీడువారియున్న భూమి సాగుచేయబడెను. మొత్తముమీద విశ్వనాథనాయకుని పాళెము పద్ధతి అతని కాలములో సత్ఫలితములకు దారి తీసినను, తరువాతివారి కాలమున ఈవిధానము అనర్థదాయకముగా పరిణమించెనని నుడువవలసి యున్నది.

విశ్వనాథనాయకుడు వస్తుతః బహుముఖప్రజ్ఞాశాలియే అయినను, అతడు రాజ్యవ్యవహారములతో నాగమనాయని ముఖ్యాశ్రితుల సహాయము నపేక్షించెను. అట్టివారిలో అరియనాథ మొదలియు, రామ భద్రప్పనాయడును పేర్కొన దగినవారు. అరియనాథమొదలి కాంచీపురమునకు సమీపమున నున్న యొక కుగ్రామమున పేదకుటుంబమున జన్మించెను. స్వయం కృషివలన అతడు మహోన్నతస్థితికి వచ్చెను. విశ్వనాథనాయకుడు తలపెట్టిన రాజకీయ సంస్కరణము లం దతడు ప్రముఖపాత్ర నిర్వహించెను. విశ్వనాథనాయకుడును అరియనాథమొదలియు కలసి తిరునెల్వేలి మండలములో పంద్రెండు గ్రామ

---

6 ఈవిభజనమూలముగా '*డెబ్బదిరెండు పాళెములు జయించినవాడు*' అను నర్థము నొసగు '*అరువత్తి బ్బర గండడు*' అను బిరుదము విశ్వనాథనాయకునికి కలిగెను. సత్యభామాసాంత్వనము నందలి "డెబ్బది రెండు రాజుల..." అను పద్యమును చూడుడు. 72 పాళెములలో కొన్ని : పాంచాలంగుఱిచ్చి, ఎట్టయాపురం. నాగలాపురం, కడంబూర్, శివగిరి, మన్నారుకోట, కడవూరు, కంబం, కామనాయకనూరు, తుంబిచ్చికాయకనూరు, అమ్మయనాయకనూరు, బోడినాయకనూడు, పెరియకుళం, కూడలూరు, ఉదయప్పనూరు మొ॥నవి.

ములు దానము చేసినట్లు శాసన మొకటి స్పష్టము చేయుచున్నది.[7]

మధురలో శాంతిస్థాపనావసరమున విశ్వనాథ నాయకునికి కుడిభుజముగా నున్నవారిలో రామ భద్రప్పనాయకు డొకడు. చారిత్రక లేఖనముల యం దితడు బహుధా ప్రశంసింపబడినాడు. కాని శాస నములందు రామప్పనాయకుడను నొక పేరు కాన వచ్చుచున్నది. రామప్పనాయకుడే రామభద్రప్ప నాయడని తలచుట సమంజసము.[8] ఆతడు వేదకర్తై పాళెము పట్టుదొరగా ఇరువది సంవత్సరము లాపా ళెము ననుభవించెను. ఆతని మరణవార్తను విని విశ్వనాథనాయకుడు మిక్కిలి పరితపించెనట!

విశ్వనాథనాయకునికి సంబంధించిన శాసనము లన్నియు నతడు చాల గొప్పవాడనియే పేర్కొను చున్నవి. అతడు యుద్ధవీరుడుగానే గాక, దానకర్ణు డనియు వాసికెక్కెను. తన తండ్రి ఆర్జించిన ద్రవ్య మును కూడ ప్రజోపయోగములగు కార్యములకు విని యోగించుటలో అతని విశాలహృదయము వ్యక్తమగు చున్నది. మధుర, తిరుచ్చిరాపల్లి, శ్రీరంగము మొద లగు దివ్యస్థలములందు కళాఖండము లనదగిన ఆలయరాజములు విశ్వనాథనాయకుని కాలమునందే వెలసెను. వివాదములు పరిష్కరించుటలో అతడు కుశలుడని ఒకానొక శాసనమున చెప్పబడెను. అనగా, అతడు సహనశీలి అనియు, బుద్ధికుశలు డనియు తెలియుచున్నది. ఈ విశిష్టగుణము లన్నియు విశ్వ నాథనాయకుని పేరు పెంపులకు వన్నెచిన్నెలు సమ కూర్చినవి.

అట్టి ప్రజ్ఞావంతు డైనను, విశ్వనాథనాయకుడు విజయనగర సార్వభౌమునియందు వినయవిధేయ తలు ప్రకటించి అతని కార్యకర్తగా మాత్రమే సంచ రించెను. అచ్యుతదేవరాయలయు, సదాశివరాయ లయు సార్వభౌమాధికారమును అతడు అంగీకరిం చెను. తుదకు అళియరామరాయలచే అనుజ్ఞాతుడై దక్షిణదేశప్రతినిధియగు విఠ్ఠలరామరాయలు మధురకు వచ్చినప్పుడు విశ్వనాథనాయకు డతనితో సఖ్యభావ మున సంచరించెను.

మధురనాయకరాజ్యమునకు మూలస్తంభ మన దగిన విశ్వనాథనాయకు డెపుడు మరణించెనో యిద మిత్థముగా తెలియవచ్చుటలేదు. 1564వ సంవత్స రము జనవరిలో అతని కుమారుడు మొదటి కృష్ణప్ప నాయకుడు సింహాసనమునకు వచ్చినట్లు తెలియ వచ్చుటచే, విశ్వనాథనాయకుడు అంతకు పూర్వమే అనగా 1563వ సంవత్సరమునందే దైవికం చెందినట్లు విశ్వసింపదగును. మరణించునాటి కతడు రమారమి డెబ్బదియేండ్ల వృద్ధుడై ఉండనోపు నని శ్రీ సత్యనాథ అయ్యరుగారును, అరువదేండ్లకు పైబడి అతడు జీవించి యుండలేదని శ్రీ రంగాచారిగారును పేర్కొనిరి.

7 1530లో వేయబడిన యొక తామ్రశాసనము.

8 తెలుగున వెలసిన చారిత్రక లేఖనములయందు నాయక శబ్దమునకు మారుగా 'నాయనయ్యవారు' అను తెనుగు దన ముట్టిపడు చక్కనిమాట కావవచ్చుచున్నది. నాయ వాచకము నం దిట్లు కలదు : "శ్రీమంతు సకల గుణసంపన్నులయిన మహా మేయ సమానధీరు లైన అఖండిత లక్ష్మీప్రసన్నులయిన శ్రీ మన్మహా మండలేశ్వర రాజమాన్య మహారాజరాజశ్రీ కాశీ విశ్వనాథ నాయనయ్యవారి దివ్యశ్రీ పాదపద్మము లకు..." శాసనములలోకూడ "...నాయనయ్యవారి వారు..." అనియే యున్నది.

# మొల్ల రామాయణము పద్య చిత్రణ

శ్రీమతి నాయని కృష్ణకుమారి

ఆతుకూరి కేసయ గురులింగ జంగమార్చన పరుడును, శివభక్తి రతుడును. ఆయన కూతురు మొల్ల రామాయణము ననువదించుట యొక విశేషమే. ఇహపర సాధనమగు నా పుణ్యచరిత్రమన్న నామెకు ప్రీతిమెండు. భూజన కల్పకమై భుక్తికిని ముక్తికిని మూలమైన యా రఘురాముని నుతించుటయే యామె జన్మ చరితార్థము. చిలుకను పెంచి దానిని దలచుచు రామ రామా యన్న వారాంగనకే ముక్తి లభింపగా సల్లలిత ప్రతాప గుణసాగరుడైన యా రామునే తలచి, రామకథ చెప్పినచో నెంత పుణ్యము! మొల్ల రామకథా కథన కుతూహలాయత్త చిత్తురాలు. తన కవితకు వస్తువు నెన్నుకొనుటలో నెంతశ్రద్ధయో కవితామార్గము నేర్పరించుటలో గూడ నామెకంత యాస్థ. తేనె సోక నోరెట్లు తీయన యగునో కవితయు నొక్కసారి యాస్వాదించిననే సర్వము నర్థవగతము కావలయును. గూఢ శబ్దముల కూర్చిన కావ్యమన్న నెవరికి ముచ్చట! చెవిటివాడు మాటాడిన మూగవా డెట్లు సమాధానించును? మూగవాడు మాట్లాడగల్గి నను చెవిటివాని కెట్లు విననగును? అట్టి కావ్యమును రసాస్వాదన పరులగు పాఠకులపట్ల నట్టి ముచ్చటయే యగును. అలతి యలతి పలుకుల కాహళసంధించిన విధమున కవిత చెప్పవలెనన్న కవిబ్రహ్మయు, మొల్లయు నొక్క మండలమువారే! వారి కవితా దర్శములు నొక్కటియే, కందువమాటలు అందముగా కూర్చి చెప్పిన సామెతలు. పొందై, రుచియై, వీనుల విందై తెలుగు వరితల మనస్సుల హత్తుకో వలయును. తేలుగులో కవిత్వము చెప్పుచుంటి మనుచు, అట్టిచోట ఘనమగు సంస్కృతము చెప్పిన నేమిరుచి? కడు తేటలమాటల, క్రొత్త క్రొత్త రీతుల, తెలుగు భాషయే పొలుపు వహింపవలయును. ఇట్టివి మొల్ల మనస్సున గూడుకట్టుకొనియున్న కవితాదర్శములు.

మొల్ల తన రామాయణమున నీయాదర్శము లకు విఘాతము కలిగించు రచన యెక్కడనో కాని చేయలేదు. కావ్యమంతయు సులభగ్రాహ్యములగు మాటలే పొదుగబడినవి. రచనా పద్ధతిలో క్లిష్టత లేదు. అన్వయకాఠిన్యము కలికమునకైన కానరాదు. ఋజువర్తనుడును, సదాచార సంపన్నుడును, ఆదర్శ పురుషుడు నగు శ్రీరామచంద్రుని చరితమెంత సరళ మైనదో, ఈ కవయిత్రి రచనాపద్ధతియు నంత సరళ మైనది. రామకథను సాధ్యమగునంత సులభముగ, చేతనైనంత వేగముగ, చెప్పుటయందే లగ్నముచేసిన మొల్లమనస్సు, కావ్యాలంకార సామగ్రివైపునకు పార లేదు. చికిలిపనులుచేసి, నగిషీలు చెక్కి చెక్కి భావు కుల మనస్సుల నద్భుతరసమునందు మగ్నముచేసి తీరవలెననెడి కాంక్ష ఛాయామాత్రముగనైన యామె మనస్సునందు లేమ. అట్టి కాంక్షయే యుండినచో నీ రామాయణము వేరొకవిధముగ నుండెడిది. గుమ్మ పాలు త్రాగినచో నా స్వాదుత్వ మెట్లుండును? ఏలకుల పొడియు, మిరియపు పిసరును, మంచుముక్కలను జతచేసి శర్కరాయుతముగ ఫలరసము నాస్వాదించి నచో నా స్వాదుత్వ మెట్లుండును? ఈ రామాయణ మును చదువుచున్నచో గుమ్మపాలు త్రాగినట్లే యుం డును. ఇందలి తీపి ఉండియు లేనట్లుండు తీపి.

రామాయణ కథ నెఱుగని వారెవ్వరు? అది కవిని మించి ఆకథను తీర్చిదిద్దగలవారెవ్వరు? అందు వలన కథాంశము నట్లువతల యుంచినచో మొల్ల కవిత్వ మందలి వైచిత్ర్యములుగాని వైశిష్ట్యములుగాని యెట్టివి!

ఆ రామాయణమును చదువుచు, అందలి పాత్రల యాకార విశేషములను, మనోభావములను, సన్నివేశములను, ప్రకృతిని చక్కగా చిత్రించి పాత కుల యెదుట నిలుపబెట్టుటకై, తెలుపు నలుపు వంటి రంగులను, కాంతి, చీకటివంటి భావాత్మక (abstract) ద్రవ్యములను మొల్ల ఎంతచక్కగా ఉపయోగించుకొన్నదో గమనించిన ఆహ్లాదముకలుగక మానదు. తెలుపు దనమునకు, స్వచ్ఛతకు, అందము నకు, పవిత్రతకు తెల్లని రంగు ప్రతినిధి. జడతకు, అజ్ఞానమునకు, అనుద్రేకమునకు నల్లదనము చిహ్నము. పరాక్రమ శాలిత్వమునకు, భాగ్యమత్త్వమునకు, అహంకారమునకు ఎఱ్ఱరంగు గుర్తు. మొల్ల ఈ రంగుల కలయికలవల్ల, పాత్రల సౌందర్య వర్ణన చక్కగా చేసినది. స్వభావ వర్ణనను మూర్తికట్టించి నది. సన్నివేశములను తీర్చిదిద్ది యాకృతి నొసగి నిలువబెట్టినది. చివరకు ఉదయాస్తమయాది ప్రకృతి వర్ణనలయందును, ఈ వర్ణసమ్మేళనమువలననే మఱపు రాని యద్భుతచిత్రములను కుంచెయు రంగుల పలకయు లేకుండగనే గీచి యిచ్చినది.

వివిధపాత్రల సౌందర్య వర్ణనను పరికించి నచో ఎచట సౌందర్యము కలదో ఆ పాత్రలనే మొల్ల వర్ణించినది. ఎచట సౌందర్యముండునో, అచట ఉజ్జ్వలత్వముండును. ఎచట ఉజ్జ్వలత్వముండునో అచట చాకచక్యమును, తీక్ష్ణత్వముండును. అతైక్ష్ణ్యము గాంతియొక్క సాంద్రతవలన సాధ్యమగును. అట్టి సమయములందు మొల్ల గ్రహించిన కాంతిరేఖలు, కనులు మిరుమిట్లుగొలుపు తెల్లనివియు, మనస్సును రంజింపజేయు ఎఱ్ఱనివియును కొండొకచో నల్లనివియు. ఇష్టదేవతాస్తుతియందు రూపుకట్టిన విఘ్నేశ్వరుడు చంద్రకళా కలాపుడు. కమలవర్ణుడు. విమల రవికోటి తేజుడు. వాహ్యాళి నిమిత్తమై చతురాస్యు డెక్కివచ్చు హంస మేలిమి మంచుకొండ నుపమింప జాలెడిది. ఆయన నెదుర్కొని విద్యాలయ వాణి యిచ్చెడి నివాళు లామె వాలిక తెలిసోగ కన్నులవి— మొల్ల రూపుకట్టించిన శ్రీకృష్ణుడు తెల్లని పుండరీక ముల తేజము మెచ్చని కన్నుదోయివాడు, నల్లని శక్రనీలరుచి నవ్వెడి చక్కని దేహకాంతి గలవాడు. శ్రీరాముడు దూర్వాకుల సన్నిభాంగుడు — అయోధ్యా

పురి నేలెడి దశరథరాజన్యుడు ప్రకటరాజన్య మస్తకాభరణమకుట చారుమాణిక్య దీపిత చరణుడు. ఆయన దినకరాన్వయ పాథోధి వనజవైరి. ఆయన ముగ్గురుభార్యల దౌహృద లక్షణముల తెలుపు నప్పుడుకూడ మొల్ల రంగులలో గారడీచేసెననవచ్చును. వారు ధవళాక్షులను మాట తథ్యము కావింపనెంచియే వారి కన్నులు మిక్కి తేటలై స్వచ్ఛము లయ్యెను. నీలకుంతలలను మాటకు సరిగా నెఱులపై నలుపు చూపెను. చంద్రాస్య లనుమాట సరవి మాన్పుటకునై వారి మోములందలి కళల విలాసము పలుచనయ్యెను. ఈ తెలుపు నలుపుల మేళనమువలన దౌహృదోచిత పరిపాండుర వదనములును, అలసములగు తెలిగన్నుల శ్రాంతశోభయు, స్పష్టముగా కన్నులకు కట్టినట్లు నిలువగలిగినవి.

అట్లే సీతావర్ణనము చేయునపుడు, సీతను బంగారు నీరు నిలువున పొంగారుచునుండ నజుడు పోసినమాడ్కి యలరారినట్లుగా వర్ణించెను. ఆమె కన్నులు కలువలో, కాముబాణంబులో, నెమ్మోము అమృతాంశు బింబమో, అద్దమో, కురులు నీలంబులో తేటి గుంపులో, యనునవి సంశయ పరంపర. ఇట్టి సంశయ మధ్యమునగూడ స్పష్టముగా చిత్రితమైన లావణ్యవిభ్రమమును, అది వెదజల్లు కాంతిపుంజములును గమనింపదగ్గవి. ఆమె దృగ్విలాసములను హరిణవిభు డభ్యసించును. ఆమె నెమ్మోమున రోహిణీశుని నిండు సత్కాంతి నెలకొనియుండును. ఆమె ధమ్మిల్లమున శిఖికులేశుని పక్షవిస్ఫూర్తి వెలయును. ఇట్టి కాంతి పరంపరచే దిక్కుల వెలిగించు సీతాసౌందర్య స్వరూపము అశోకవనియందలి వృక్షచ్ఛాయలో మరియొక విధముగా కన్పించును. మెఱుగారు ఆమె అవయవ శోభ మందవర్ణమగు నల్లదనముయొక్క పలు ఛాయలచే కప్పబడిపోవును. అచటి సీత ధూళి ధూసరంబగు రత్నము. నివురుగప్పిన నిప్పు. మేఘచ్ఛన్న చంద్రబింబము. ఇత్తడిపొదిగిన కుందనపు శలాక. అట్లే శ్రీరామ పదరజముసోకి రమణియైన రాతిని వర్ణించుచు, పదనై, యొప్పిదమై, కదుకదలుచు, బంగారు పూదె కరగిన రీతిం బొదలుచు కడు లావణ్యస్థితి సుదతిగ కనుపట్టెననుట మిక్కిలి మనోహరమైన వర్ణసమ్మేళనపద్ధతి. కేవలము జడరూపమగు శిల, పాదరజము సోకిసోకగనే బంగారు పూదె కరగుచున్నట్లు కాన్పించి, ఇంతలో ఆ కరగెడు క్రమములో వెల్లడియగు కాంతిరేఖ లొకానొక లావణ్యస్థితిని స్థాపించి, అస్థితియే చిట్టచివర యువతీరూపమును పొందినదనుట చక్కని కల్పన.

పాత్రల యాకారవర్ణనమునందేగాక స్వభావ వర్ణనయందుకూడ సహజత్వమును భాసింపజేయుటకు మొల్ల రంగులను వాడినది. హనుమంతుని కట్టి తెచ్చుటకై యాయనలో తలపడిన దానవవీరుల యస్త్రములు నిప్పులు వర్షించు నిశితాస్త్రములు. అవి కపివరునిమీద కప్పబడగా, నాయన శరీరము కెందొగ వానల గప్పిన ఘనశైలమాయెను. ఆయన విజృంభణమునకు ఇంద్రజిత్తు అనలమురీతి మండిపడెను. ఇంద్రజిత్తు కట్టి పట్టుకొని పోయిన గాడుపు పట్టింగని రావణుడు కుటిల భ్రూకుటినటన స్ఫుట ధూమ విలాస పవన ఫూత్కృత జనితోద్భట రోషానల కీలోత్కట నేత్రుడయ్యెను. అట్లయి మండి దైత్యకుల నాయకు డుగ్ర విలోకనంబులం బావన విస్ఫులింగములు పైకొని పార్శ్వగ వీరఘోరదైత్యావళి జూచి హనుమంతుని చంపుడని యానతిచ్చెను, జలరాశిని దాట నుంకించి, లంఘించి యాకసమున దూసికొని పోయిన పావని పసిడియుండ మీటినగతి భాసించెను. శ్రీరామ సమేతయై యరణ్యముల పయనించుచు మార్గశ్రమముప చిక్కి, నలిగిన సీతాదేవి మోము పూర్ణచంద్రుని కాంతి, పున్నమ వేకువ కన్పట్టుగతి కళ విడిచెను. పరిశ్రమాతిశయముచే నామె చేతుల

వేళ్ళక్రమ్మి పొటమరించిన నెత్తురు కెంపుల పోల్కి యయ్యెను. యుద్ధభూమియందు మూర్ఛనందిన లక్ష్మణుని పరిశీలించి, యాయన ప్రాణములో నున్నా డని చెప్పుటకు ఊతగా, పున్నమ చందురుని దెగడి పొల్పెసలారెడు నాయన మోముదమ్మి వికాసము వీడవేసనియు, కల్వలకాంతిని జయించు కన్నులు కాంతి వీడియుండలేదనియు ఆఱవేతులును పాదము లును చెన్ను తరిగియుండలేదనియు నుదాహరించెను. '*ఒప్పుదొరంగక తలపగానున్నవి వర్ణములు!*' అనెడి నిర్ధారణ చాల చక్కగా నున్నది.

కేవల మిట్లు పాత్రల తీర్చి దిద్దునపుడేకాక, వస్తువులను వర్ణించునపుడుకూడ వెలుగు, చీకట్ల వంటి యీ వివిధ వర్ణముల సహాయము గైకొనుట మొల్ల విస్మరింపలేదు. శ్రీరామచంద్రుడేలిన యయోధ్యా పురిని వర్ణించుచు, నా పురము '*భానుకులదీప రాజన్య పట్టభద్ర భాసిత నవరత్నఖచిత సింహాసనమ్ము*' అని పోల్చి, దానిని ధగధగలాడించినది. ఇంతేకాక నీమె రూపుకట్టించిన రథములు కాంచనోజ్జ్వలములు, కేతనములు కిమ్మీర వర్ణయుతములు. ఛత్రము తెలు పైన పట్టువస్త్రపునేత. విమానములు మాణిక్య తప నీయమయ విమానములు. బిరుదు టెక్కెములు కెంబట్టువి. రథములు సూర్యోదయ ప్రభలతో విరాజిల్లునవి.

ప్రకృతి వర్ణనములందుగూడ నీ వర్ణములను వాడుట మొల్ల విడువలేదు. సూర్యోదయాత్పూర్వ సంధ్య మొదలుకొని, ఉదయము, అస్తమయము, ఉత్తర సంధ్య, చీకటులు వ్యాపించుట, చుక్కలు పొడుచుట, చంద్రోదయము, వెన్నెల లలముకొనుట, వేగుచుక్క కాన్పించుట, వేకువ, తిరిగి సూర్యోదయము వరకు మొల్ల తన రామాయణమున వర్ణించుటజరిగెను.

సాయం సమయమున మేలిమి సంధ్యారాగ మును, పలుచని చీకటి రేకలును కలిసి వరుణుని దిశయందు కెంపును నీలమును అతికినట్లుండును. చీకట్లు క్రమ్ముకొనగా కల్పద్రుమమున కోరకములు పుట్టినట్లాకసమున తారకలు పొడసూపెను. కారు మొగులు పోల్కి, కాటుకవలె, నీటి చందాన, ఇంద్ర నీలమువలె, మాషరాశి మాడ్కి అంధకారము రూపు కట్టి దిశలందు వ్యాపించెను. ఆపైన శశిబింబ ముద యించెను. బృహద్భానుని పెట్టెస్ పెఱుగకబజ్జ సుధాంబుధిమీది మీగడలు సమీరుచే తెరలి పూర్వ దిశను కూడుకొని శశిబింబముగా కాన్పించెను. ఈ యుత్ప్రేక్షచే చంద్రబింబమందలి స్నిగ్ధత్వమును, సితత్వమును చక్కగా వర్ణచిత్రణవశి మొల చిత్రింప గలిగినది. ఆపైన జనించి పైకొన్న పండువెన్నెలలు జగత్తంతయును కప్పగా నయోధ్యానగరమంతయు సిత వర్ణ ప్రభాభాసమానమయ్యెను. అచటి సన్మునులు నారదులును, భూజములు నాక మహీజములును, భామినులు శారదలును, శైలములు శంకర శైలములు నయ్యెను. నీరదములు పారదములు కాగా, నాగులు పన్నగ నాయకులైరి. రాత్రి వేగి, తెలతెలవారు నంతలో తూర్పుకొండ పైకి వేంచేయు సూర్యబింబ మునుగూడ చక్కని వర్ణచిత్రముగనే మొల్ల తీర్చిదిద్ది నది. పద్మరాగమణి నొక్కదానిని తూర్పుదిశనేలు నింద్రునకు ఒప్పుగ బట్టిన దర్పణమా యనునట్లు మొల్ల సూర్యబింబము నుత్ప్రేక్షించెను. అక్కడ వెదజల్ల బడిన చిళ్ళచిళ్ళలౌ కాంతి సముదయము సూర్యబింబ వినిర్గత కాంతి రేఖలేకాక, చుట్టును విరిసి నివాళు

లెత్తబడిన సముజ్జ్వల కోకనద ప్రదీప్తులు ఊడను. ఇట్టి ప్రకాశమానత్వమును, ధాళధళ్యమును వర్ణించు టలో నేర్పుచూపిన మొల్ల తెల్లవారుటను వర్ణించుచు. కలకల పక్షులు కూయగ, పలపలనై తారకములు పడమట దోపన్ జలజములు విరియ, తూర్పున పల పలనై తెల్లవారె యని మనోజ్ఞముగ, పూర్వసంధ్యా దృశ్యమును మన కన్నులముందు చకచ్చకితముచేసినది.

స్వతంత్రముకాని కథలో, కేవల కథా కథన మందే యాస్థ చూపి యితరములగు పైపై మెఱుగుల జోలికిపోని రచనలో నింత వర్ణచిత్రణముండగా, నీ కవయిత్రియే యొక స్వతంత్ర కథను, మనోహరమగు వన్నె చిన్నెలు తీర్చిదిద్దుకొన వీలగుదానిని కావ్యముగా రూపొందింప చేపట్టినచో నెట్లుండును? ఇంద్రధనుస్సు లోని రంగులన్నియు నట్టి కావ్యమును రంజితము చేయుననుటలో నేమి సందేహము! కుంచెయు, రంగుల పలకయు చేపట్టకయే కేవలము అలతి యలతి పదములతో వర్ణచిత్రములను మన యెదుట నిలువబెట్టిన మొల్ల స్మరణీయురాలు కాకపోవు టెట్లు ?

# వసుచరిత్ర – తద్విశిష్టత

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

౧

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం
ఏక మాపాతమధురం అన్యదాలోచనామృతమ్'–

చతుష్షష్టికళలలో మిక్కిలి ముఖ్యములైన సంగీత సాహిత్యములు రెండును సరస్వతీస్తనద్వయమఁట! అనఁగా–ఆస్తన్యమును గ్రోలి విద్వత్త గడించిన వ్యక్తులే సరస్వతీపుత్రులు. వారే వాఙ్మయములో చిరంజీవులగు దివ్యమూర్తులు. వారి మూలముననే లోకవృత్తము అకల్పాంతము నిలిచియుండును.

లక్ష్మీసరస్వతులు దూరదూరముగ నుండునట్లు సంగీతసాహిత్యములుసైతము ఆశ్రయభేదము గలిగి యుండును. చక్కని సంగీతముండుచోట సాహిత్యము కఱవైపోవును. సమగ్రమైన సాహిత్యమున్నచోట సంగీతము మృగ్యమైయుండును. రెండును గలిగిన వారు నూటికిఁ గోటికి–ఒక్కఁడు, అఱ. అందును విశిష్య– కవితాపీఠమెక్కిన మహామహులలో ఇది అపూర్వమైన ఘట్టము. 'వాణి నా రాణి'యని ధీమా చూపిన కవిత్వవీరులు కలరు. 'కోఽహం రండే!' యని ప్రశ్నించి. 'త్వమేవాహ'మ్మని సంభావింపఁబడ్డ సరస్వతీస్వరూపులు కలరు. కాని 'ఇదం శాస్త్ర మిదం బ్రాహ్మ' మన్నట్లు, అదిగో! ఈచేతిలో కవిత్వదీప్తి; ఈచేతిలో సంగీతచాతురి. అని చెప్పి చూపి పంచి ఈయనేర్చిన మహావ్యక్తి తెలుఁగునేలలో ఒక్క 'రామరాజభూషణుఁడే' యన్నచో అది స్తవముకాదు, వాస్తవమే.

వసుచరిత్ర మున్నగు మహాకావ్యరత్నములను సృష్టించి యిచ్చిన 'భట్టుమూర్తి'యే తన ప్రతిభవలన 'రామరాజభూషణుఁ'డయ్యెను.

ఏ దేశములోఁగాని ఏ భాషతోఁగాని కానరాని అపూర్వకావ్యసృష్టి మన ప్రబంధయుగములోఁ గానవచ్చును. ఆ స్వర్ణయుగమునకు విజయనగరసామ్రాజ్యమే మూలబంధము. చారిత్రకముగా ఆ సామ్రాజ్యమునకు ఎంత ప్రతిష్ఠ యున్నదో సాహిత్యముగా

దానికి ద్విగుణీకృత ప్రతిష్ఠ ఉన్నదనవచ్చును, తెలుఁగులో 'పంచకావ్యము'లన్న సంప్రదాయము తెచ్చినదీ ఆయుగమే అందు తొలిపూవు మనుచరిత్ర, మలిపూవు వసుచరిత్ర. అవి సంతరించి మనకిచ్చిన వ్యక్తులిర్వురు గురుశిష్యులగుట మఱింత వింతగూర్చు ఘట్టము పైగా 'మనువు' రూఢియైనపిదప 'వసువు' గడింపవలెననుట.

లోకవృత్తము అనఁగా కావ్యవైచిత్రి చూడవలెనన్న -చూపవలెనన్న—సాహితీసౌరభ్యము గుబాళింపఁ జేయనలెనన్న 'మను—వసుచరిత్రలు' విధిగాఁ జదువవలెనన్న మాట. అధోరణిలోనే 'పిల్లవసువరిత్ర' లెన్నో వెలసినవి.

సంస్కృత సారస్వతములోసైతము చవిచూడని ఎన్నో కవితారీతులు వసుచరిత్రలోఁగలవు. అ వాఙ్మయములో గోచరింపని ధ్వనివిశేషములు ఎన్నెన్నో వసుకావ్యములోఁ గానవచ్చును. ఇట్టి విశిష్టత చూచియే ప్రాచీను లెందఱో రామరాజభూషణుని భూషించుటయేగాదు; అనుసరించిరి; అనుకరించిరి; అనువదించిరి. ప్రాయికముగా సంస్కృతము మాతృకవంటిదనియు తెలుఁగు పుత్రికవంటిదనియు ఈదేశములో ఒక సంప్రదాయ మున్నది. దాని కపవాద సూత్రమును 'భూషణుఁడు' సృష్టించెను. కావుననే 'కాళహస్తి'మహాకవి, ఈతెలుఁగు వసుచరిత్రను జదివి ముగ్ధుఁడై 'సంస్కృత వసుచరిత్రను' సంతరించెను. ఈతఁడు సామాన్యుఁడు కాఁడుసుమా ! జగమెఱిఁగిన జగదేకపండితుఁడైన అప్పయ్యదీక్షితులవారికి ఈతఁడు శిష్యుఁడఁట కావ్యరీతిగా వసుచరిత్ర వైభవమునకు మురిసిపోయి 'అంబలత్తాడు మయ్యన్'ఆను అఱవకవి అఱవములో ఈ వసువును అనువదించెనఁట. కవుల చరిత్రలో గొంతకొంత ముమ్మొదటవ్రాసి మనకు రుచి చూపిన కావలి వేంకటరామస్వామి వసుచరిత్రలోని పద్యములను గొన్నింటిని ఆంగ్లములో అనువదించుటయేగాక, రామరాజభూషణుని దివ్యజీవితమును గూర్చి ఆంగ్లములో వ్రాసిపెట్టెను. 'సూరి'యను పేరుగల ఒకానొక కవీశ్వరుఁడు ఈ వసుచరిత్రను జదివి మురిసిపోయి, దీనిని అనుకరించుచు 'వసుమంగళనాటకమును' సంస్కృతములో వ్రాసెనఁట. లింగము వేంకటరాయమంత్రి ఈ కావ్యమును జదివి 'వసుగిరికాపరిణయ'మని యక్షగానము వ్రాసెను.

సంస్కృతవాఙ్మయములో'వ్యాఖ్యానఘట్టముల' కున్న ప్రశస్తి ఏభాషకును లేదనుట నిర్వివాదము. వ్యాఖ్యానములేని మంచికావ్యము సంస్కృతములో లేదు. అనఁగా సంస్కృతములో ప్రసిద్ధకావ్యమునకు ఎక్కడనో ఎవ్వఁడో ఏదో యొక వ్యాఖ్యానమువ్రాసియే యుండును. ప్రసిద్ధకావ్యమునకు ఒక్కరుకాదు; ఇర్వురుకాదు; ఎందఱో వ్రాసిన ఘట్టములు అనేకము లున్నవి. కాళిదాస మహాకవి వ్రాసిన రఘువంశాదికావ్యములనుగూర్చి వ్యాఖ్యాతృచక్రవర్తి మల్లినాథ సూరి ఇట్లన్నాఁడు :

"మల్లినాథకవిః సోఽయం మందాత్మానుజిఘృక్షయా
వ్యాచష్టే కాలిదాసీయ కావ్యత్రయ మనాకులమ్"

"కాలిదాసగిరాం సారం కాలిదాసః సరస్వతీ
చతుర్ముఖోఽథవా సాక్షాద్విదుర్నాన్యేతు మాదృశాః"

"తథాపి దక్షిణావర్త—నాథాద్యైః క్షుణ్ణ వర్త్మసు
వయం చ కాలిదాసోక్తి ష్వవకాశం లభేమహి"

మందబుద్ధులకు సహాయపడునట్లు కాలిదాస కావ్యత్రయమునకు వ్యాఖ్యానము వ్రాసెదనని మల్లినాథుఁడు తన సంకల్పమును వివరించి, అహా ! కాలిదాస వాక్యములసారము గుర్తింపవలెనన్న కాలిదాసే కావలయును లేదా ఆ చతుర్ముఖుఁడో సరస్వతియో దిగిరావలెను. మావంటివారికి సాధ్యమగునా ! అయినను 'దక్షిణావర్తా'దులు చూపినమార్గములో నడచి మేముకూడ ఏదో కొంత అవకాశము తీసికొందుమని వినయముచూపెను. అనఁగా ఆయన 'రఘువంశమునకు' వ్యాఖ్యానము వ్రాయ సంకల్పించుటకు

మున్నే సంస్కృతములో ఆ కావ్యమునకు ఎన్నో వ్యాఖ్యానము లున్నవన్న మాట. వానిలో-ఇవిగో కొన్ని: 1 హేమచంద్ర 2 చారిత్రవర్ధన 3 దక్షిణావర్త 4 నాథ 5 సుమతివిజయ 6 వల్లభ 7 ధర్మ మేరు 8 విజయగణి 9 విజయానందసూరిచరణ సేవక 10 దినకరమిశ్ర.

ఇందఱు వ్రాసిన వ్యాఖ్యానములు పరిశీలించి వానికన్న విశిష్టమైన తీరులో 'కోలచల మల్లినాథ సూరి' 'సంజీవిని' వ్యాఖ్య వ్రాసెను. ఇట్లే 'అభిజ్ఞాన శాకుంతలా'ది రూపక ములకు-చంపువులకు విద్వత్సార్వభౌములైనవారే 'వ్యాఖ్యానానుపానయులు' సిద్ధముచేసి, అమృతీభూతమైన కావ్యరసాయనమును మన కందించిరి.

ఈ 'భిక్ష' తెలుఁగు సాహిత్యములో చాలఁ దఱుగైయున్నది. ఒకప్పుడు తెలుఁగుభారతములో కొంతభాగమునకు గద్యవ్యాఖ్యగా కొందఱు పండితులు వ్రాసిరి కాని, ఆ ప్రతు లిప్పుడు కఱవైపోయినవి. ప్రాచీనాంధ్ర కావ్యములలో ఒక్క వసుచరిత్రకు మాత్రమే సంస్కృత సంప్రదాయముగ వ్యాఖ్యానములు వెలసినవి. అందొకటి 'విద్వజ్జనరంజనీ' వ్యాఖ్య. అది వ్రాసినది సోమకవి. ఈతఁడు కేవలమొక వ్యాఖ్యాతయేకాదు; గొప్పకవియు-మంచి భక్తుఁడును. ఈతఁడు తన వ్యాఖ్యానములో రామరాజభూషణుని గూర్చి,

*"కారణజన్ముఁడై కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై భూరికళాకలాపుఁడలు పొల్పువహించిన*
*భట్టుమూర్తిచే"*

ఇత్యాదిగ భూషించెను.

ఈతనివ్యాఖ్య మూలకావ్యమువోలె సామాన్య జనులకు అందుపాటులో లేదనితోఁచి మఱొక పండితుఁడు 'ప్రతిపదార్థప్రకాశిక' అను మఱొక వ్యాఖ్య వ్రాసెను. అతనిపేరు ములుపాక బుచ్చయ్యశాస్త్రి. బ్రౌనుదొర ఆశ్రితులలో అత డొకఁడు. వసుచరిత్ర కాతఁడీ వ్యాఖ్యానము వ్రాసి దానిని ఆ దొరకంకితమిచ్చె నఁట. నాఁడు వసుచరిత్రకున్న గౌరవము-పండితులకు బ్రౌనుదొరకున్న సంబంధము - విదేశ్యుఁడైన బ్రౌనుదొరకున్న ఆంధ్ర భాషాభిమానము నేఁటి యాంధ్రయువజనము గుర్తింతురుగాక!

ఈవ్యాఖ్యానమువంటిదే జూలూరి అప్పయ్య పండితుఁడుకూడ వ్రాసెనఁట. బ్రౌనుదొర సన్నిధాన వర్తులలో ముఖ్యుఁడైన ఈతఁడు వసుచరిత్రకు వ్యావహారిక ధోరణిలో 'సప్రతిపదటీక' వ్రాసెను. దీని యచ్చుకూర్పులో అందచందములు తెచ్చుటలో బ్రౌను దొరచేయి మిక్కిలిగాఁ గలదఁట. ఇది యన్నియు ఒకయెత్తు; శిష్టు కృష్ణమూర్తి పండితునివ్యాఖ్యమఱొక యెత్తు. ఈతఁడు పేరుమోసిన పండితుఁడేకాదు, విద్వత్కవియు. అపై - సంగీతనిష్ణాతుఁడఁట. ఇతఁడు తిమ్మని బ్రహ్మని-నందిని పందిని జేయఁగా వలఁతి యని వదంతి యున్నది. చిన్నయసూరి శ్రమపడి వ్రాసియిచ్చిన తెలుఁగు వ్యాకరణమునకు సంస్కృతములో ఈతఁడొక రచనచేసి "ఇదియే మూలము - *సూరి రచనయె ఆంధ్రానువాదము"* అన్నంతవఱకు సాగిన ఒకానొక అపవాదమునకు సృష్టికర్తగా పేరు మోసెను. ఇట్టి మోసములకు ఈ మహాపండితుఁడు పెట్టినదిపేరని *"కవుల చరిత్రలు"* ఘోషించినవి. అంత వాఁడు వసుచరిత్రకుఁగూడ వ్యాఖ్యానము వ్రాసె నన్నమాట సంతసము గలిగించును. అదియు సామాన్యముకాదఁట. ఒక్కొక్కఘట్టములో రామరాజభూషణుని పద్యమునకు ఎనిమిది అర్థములు సైతమున్నవని నిరూపించెనఁట. రామరాజభూషణుని పద్యములలో ఏది ఏరాగమునఁ జదువవలెనో నిర్ణయించెనఁట. ఆనిరూపించినట్లు అర్థవైచిత్రి వ్యక్తమగునట్లు ఆసంప్రదాయము నబట్టి వసుచరిత్రను బోధించువారు నేఁటికిని గొందఱున్నారు. కాని

శిష్టుకారి జన్మవిశేషమేమో కాని, ఆయన వ్రాసినమహా కావ్యములవోలె ఈ వ్యాఖ్యానముసైతము పదిమంది కంటిలోఁబడక ఎక్కడనో మాటుమణిఁగిపోవుట ఆయన దౌర్గత్యమే కాదు; ఆంధ్రుల దౌర్భాగ్యమును.

నవీనులలో దేవరాజసుధీమణి యని పిలువఁ బడు శ్రీ తేపప్పెరుమాళ్లయ్య, వసుచరిత్రకు సర్వలక్షణ లక్షితమైన వ్యాఖ్యానమును వ్రాసెను. ఈ వ్యాఖ్యలే గాక ఈమహాకావ్యమునకు ఎందఱెందఱో ఎన్నెన్నో విమర్శనములు చేసిరి హరికథాపితామహులైన శ్రీ ఆదిభట్ల నారాయణదాస పండితుఁడు వసుచరిత్ర లోని పద్యములను విశిష్య-అందలి సీసములను హాయిగా పాటపాడుచు శ్రోతలను తన్మయచిత్తులనుగాఁ జేసెడివారని పెద్దలందురు.

అష్టావధాన శతావధాన వైఖరిలో ఆశుకవితా వైభవములో - ధ్వనికావ్య నిర్మాణములో - సాహితీ సంపదలో-సంగీతశాస్త్ర సంప్రదాయ సమ్మేళనములో-జ్యోతిశ్శాస్త్ర పాండిత్యములో-యోగశాస్త్ర ప్రావీణ్యములో రామరాజభూషణ కవిసార్వభౌమునకున్న ప్రశస్తి సంస్కృతాంధ్రకవులతో నెవ్వరికిని లేదన వచ్చును. వీని కవిత్వమునుగూర్చి ప్రౌఢదొర యాస్థానపండితుఁడైన బుచ్చయ్యశాస్త్రి ఏమని వర్ణించెనో మచ్చుగా నిచట ఇచ్చెదను :

సీ. "ఆది శారదామూర్తియగు మూర్తిచెప్పిన
కావ్యరత్నము జగత్కల్మషఘ్న
మఖిల లక్షణలక్ష్య మతిభావగర్భిత
మలఘుశ్లేషైక వాచ్యార్థమయము
శబ్దార్థ చిత్రతచ్ఛక్తి ప్రశస్త మ
లంకార వృత్త్యను ప్రాసపాక
శయ్యాది కల్పనాశ్లాఘ్య మనేక కో
శాజయ్య శబ్దార్థ సంయుతంబు
వ్యంగ్యమూలంబు నవరసవ్యంజకంబు
గాన, సులభముగాదట్టి కావ్యమునకు
సులభమగుటీక వేసి భూతలమునందు
ఖ్యాతిఁగైకొమ్ము విబుధులందంద మెచ్చ."

శ్రీనాథుఁడు చెప్పినట్టు సోమరిపోతులు కొంద ఱయ్యలు-కౌనని ఈ కావ్యము గొనియాడనేరక పోవచ్చును.

"ఉపమగలిగిన శయ్యలనొప్పియున్న
నంధ్రుఁడుపు ని కావ్యంబు గ్రాహ్యంబుగాదు"

అని కులద్వేషపిశాచగ్రస్తుఁడైన అప్పకవివంటి అల్పుఁడు ఈసడించిన ఈసడింపవచ్చునుగాని, ఈ మహాకావ్యములోని విశిష్టగుణములను గుర్తింపని పండితుఁడేలేఁడు. అనుకరింపని కవియేలేఁడు. శబ్దార్థముల వైచిత్రి—అనన్యసాధ్యములైన శ్లేషభంగికలు—ముద్దుమురిపములుగూర్చు వింతవింతలగు సుద్దులు-అర్థశ్లే[illegible] నాపాదింపని మృగపాక సౌభాగ్య[illegible]—శ్లేషబంధము విడనాడని లలితపదగుంభనము—అక్షరాక్షరము అనుస్యూతమైన అనుప్రాస సౌభాగ్యము—అపూర్వమైన అర్థచమత్కారవైఖరి—అవయవ వర్ణనా సౌందర్య రసోల్బణము—సరస్వతీ కల్పిత ప్రవాహ పరీవాహము—నాటక [illegible] ర్యము—చిత్రవిచిత్ర సందర్భ నిర్మాణ ప్రాగల్భ్యము—అనుక్షణ మింపునింపు నుడికారముల పొంకము—అర్థద్వయ రచనాగుంభితములైన వాఙ్నైపుణములు—చంద్రోదయాది వర్ణనా వైశిష్ట్యము—ఏవం విధసుగుణ గణములకు ఈ మహాకావ్యము ఒక నిక్షేపమువంటిది. ఈ నిక్షేపముత్రవ్వి ఇందలి యమూల్యరత్నముల నేఁటి ఎందఱెందఱో తెలుఁగునేలలో వెదఁజల్లిరి.

ఇప్పటికిని ప్రాచీన సంప్రదాయముగ పాండిత్యము గడించినవారినోట వసుచరిత్ర పద్యములు విన్నచో వానివైఖరి మనోజ్ఞమై నోరూరించును. ఇందలి కొన్ని సీసపద్యములకు రాగాలాపములను జోడించి అర్థవైచిత్రి చెడకుండ అద్భుతముగాఁ జదువుట నాగరమ్మన్యులకు క్రొత్తవార్త కావచ్చును. ప్రతిపదరస స్ఫోరకమైన ఈ మహాకావ్యమందలి పద్యములను వందలకొలఁది కాకపోయినను, పదులకొలఁదియైన

ప్రత్యక్షరము పరిశీలించి వల్లింపవలసిన బాధ్యత నేఁటి విద్యార్థులకున్నది. నవలగా నాటకముగా ఒక సౌరి చదివి అవల పాఱవేయవలసిన కావ్యముగాదిది. దీనిని జదివి ఆనందింపవలెనన్న కొంత భాషాసంస్కారము—చిత్తైకాగ్రత—ప్రతిభ ఉండవలెను.

౨

"ఆంధ్రకవితా పితామహ" అన్న బిరుదములో ఆంధ్రకవిత యనఁగా "ఆంధ్రప్రబంధకవిత" యని యర్థము—పెద్దనకు పూర్వము ప్రబంధకవిత్వము లేదనికాదుగాని ప్రబంధ కవిత్వములో పెద్దనకు పెద్దతిక మున్నదని విమర్శకుల సిద్ధాంతము.

అతని కావ్యము పుట్టిన 'రాయల' యుగ మంతయు తెలుఁగు సాహిత్యములో ఒక బంగారుయుగ మనవలెను. ఆజాతి వాఙ్మయము ఏదేశములోను ఏజాతిలోను లేదని ప్రాజ్ఞులందురు. సంస్కృతవాఙ్మయమందుసైతము ఆ 'జాతికావ్యములు' లేవనుట సాహసముకాదు. విశిష్య — వసుచరిత్రవంటి ది 'న భూతో న భవిష్యతి' కావుననే ఆ మహాకావ్యమును సంస్కృతమందేకాక అరవములోను ఆంగ్లములోను అనువాదము చేసికొనిరి.

ఒకానొక కవి ఒక కావ్యమును నిర్మించెననఁగా ఆకావ్యమందు అతని గుణశీలములు కవితాధర్మములు నాఁటి సాంఘిక పరిస్థితులు ప్రతిబింబించితీరును. ఈ విషయములో ప్రబంధయుగమంతయు ఒకే మూసలో పోసినట్లు పెక్కువిశేషములలో సంవాద మున్నదని కొందరి భావము. ఆ యుగామునకు చక్రవర్తివంటి వసుచరిత్రకర్త, ఇతివృత్త విషయమై ఇట్లని సిద్ధాంతము చేసెను :

*"కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము*
*లాద్యసత్కథల్*
*చావిరిఁబుట్టు రత్నములవారితసత్కవి కల్పనా విభూ*
*సావహపూర్వవృత్తములు సానలఁదీరిన జాతి*
*రత్నముల్*
*గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు*
*పెంపునన్"*

పురాణములలోలేని కేవలకల్పనాకథలు నిక్కముగా గాజుపూసలకింద లెక్క. ఉన్నవి యున్నట్లు వర్ణించు పూర్వరాజులకథలు పుట్టినవి పుట్టినట్లేకన్పట్టు వజ్రములవంటివి. సత్కవుల కల్పనావిశేషములచే అందచందములు పొందిన పూర్వవృత్తములు సానలు దీరిన జాతిరత్నములవంటివఁట. ఆ కథలే మిశ్ర కథలనియు అవియే హృద్యములనియు భట్టుమూర్తి భావము.

అందువలననే అతఁడు పవిత్రమూర్తులైన భరతవంశరాజులకు మూలపురుషుఁడైన వసురాజు కథను గైకొని తన కావ్యములో కావలసిన మార్పులు కూర్పులు చక్కఁగాఁ గావించుకొనెను.

కథావిధానములోఁ గైకొన్న మార్పు కూర్పులు గాని నాటకరీతిగా పాత్రలను నడపించుటగాని ఈ కావ్యములో గౌణముగా ఉండవచ్చునేమోగాని, అవియే ఆ మహాకవికి ప్రధానములుకావు. సాహిత్యములో సంగీతము జతపఱిచి మధురమంజుల వాగ్విలాసములను జూపుచు రసానుభూతికి ప్రాముఖ్య మొసంగుచు శ్లేషభంగికలచే చమత్కృతి కూర్చుచు మృదుమధుర బంధములో ఈప్రబంధమును భట్టుమూర్తి సృష్టించెను. శబ్దయోజనలో అతఁడుచూపిన శక్తియుక్తులు ఉభయకవులలో ఎవ్వఁడు జూపలేదు. "ఇట్టివాని

శ్లేషముక్కలు'— అన్న గిట్టనివట్టి రోతమాటకు, మాత్సర్యగ్రస్తమైన అట్టి పదంతికి చెంపపెట్టుగా చెప్పుదెబ్బగా అతఁడు చూపిన శ్లేషభంగికలు తెలుఁగులో సంస్కృతములో ఇంతవఱ కెవ్వరును జూపి యుండలేదు. ఎక్కడనో ఒక్కెడ ఏదోకొంత నలుసంత ధ్వని యున్నంతమాత్రాన ఆ కావ్యము మహాకావ్యముగా ఆలంకారికు లంగీకరింతురు వసుచరిత్రలో ప్రతిపద్యములో అడుగడుగునకు అన్నిఘట్టములలో ఆద్యంతము ధ్వని విశేషము కానవచ్చునని ప్రాచీనులైన వ్యాఖ్యాతలే పదింబదిగ ప్రస్తుతించిరి. కేవలము అతఁడు కథను నడపించుకొని పోవుటయే ప్రధానముగాఁ జూడఁడు. పద్య మెత్తుగడలోనే ఏదోయొక ధ్వనియో శబ్దవైచిత్రియో అలంకారప్రాభవమో వర్ణనా చమత్కారమో సారస్య విశేషమో ఉండితీరవలెను.

శ్లేషయనఁగా సామాన్యముగా రెండర్థములు వచ్చుట. ఒకేపదములో లేదా—పదముల విఱుపులో లేదా—బాషనుబట్టియో కావలసిన యర్థములు రావలెను. అందొకటి ప్రకృతముగా రెండవది అప్రకృతముగా సాగిపోవలెను. ఆ శ్లేషను కథలో మేళవించి రసస్ఫోరకముగా నడపించినచో అదియే ధ్వనిగా పరిణమించును ఆ ధ్వని కావ్యమే మహాకావ్యమని అలంకారికుల మతము. అట్టి ధ్వని విశేషములకు వసుచరిత్ర పెట్టినదిపేరు.

ఈ కావ్యములో పర్వతములకు న దు ల కు మానవత్వ మారోపించి రసౌచిత్యమును గూర్చెను. శ్లేష భంగికలో కోలాహలుఁడు ఒక పర్వతరాజు. అతని రాచఱికము ఠీవి అభిజాత్య సంపద ఒకశ్రేణిలో నడచుచుండును. రెండవవైపున—అదియొక పెద్ద కొండ. ఆ కొండకు దాపుగ ఒక పేరుగన్న ఏరు. నదీపర్వతముల కలయికలో వింతలు విశేషములు. శ్లేషలో—శుక్తిమతి ఒకానొక లావణ్యవతి. ఆ బిడను వలచినవాఁడు కోలాహలుఁడు వారిరువురి కలయిక వలన గర్భధారణము. ఒకవైపున శరత్కృతుశోభయు వేఱొకవైపు గర్భిణీలక్షణములు స్ఫురింపవలెను. కల్పనలు కావించి వానిలో శ్లేషభంగికలు ఇమిడ్చి అందు పొందికగా రసౌచిత్యమును బొదివి ఆ కథకు ఉదాత్తత గూర్చినవాఁడు తెలుఁగులో రామరాజభూషణుఁడు ఒక్కరుఁడే. సంస్కృతములో సైతము ఒ క్క రో ఇద్దరోమాత్రము అట్టివారుందురు.

కావ్యమునకు శోభ కలిగింపవలెనన్న కవిత్వములో శయ్యారీతులు ప్రధానముగా నుండవలెను. శయ్య—అనఁగా కవనములో ఒకానొక గమనము. దానిలో శబ్దగౌరవ మిచ్చువారు కొందఱు; అర్థగౌరవ మాదరించువారు మఱికొందఱు. అల్పాక్షరములే ప్రయోగించి అనల్పార్థములు చూపనేర్చినవారు వారిలో ముఖ్యులు. నన్నయాదులు ఆ శ్రేణిలో ఎన్నికగన్నవారు. రామరాజభూషణుఁడు ఆ విద్యలో సిద్ధహస్తుఁడు ఆసలు అతఁడు ప్రయోగించు పదములోనే అర్థసౌభాగ్యముతోపాటు 'నాదమహిమ'యు మిశ్రమై మనస్సున కింపునింపును. దానికిఁ దోడుగ సందర్భశుద్ధియు కావలసినంత. అప్పు డాగమనము యమకమై ఒకపాటగా పాడుకొనుటకును శ్రావ్యముగా వినుటకును కారణమైయుండును

'ప్రాయేణయమకే చిత్రే రసపుష్టి ర్న విద్యతే.' ప్రాయికముగా యమకము—చిత్రకవిత్వము ఉన్న చోట రసపుష్టి కానరాదఁట. ఈ సూత్రమునకు వసుచరిత్రలోని యమకము అపవాదమనుటలో సంశయమేలేదు.

ఈ నడకనే మఱియొకతీరులో ఆలంకారికులు 'రీతి' యని పేరుపెట్టి పిలిచిరి. రీతియనగా కావ్యమున కాత్మయనియే కొందఱు సూత్రించిరి. వారి త్రోవలో విశిష్టమైన పదరచనయే రీతియగును. పదరచనలో విశిష్టమనఁగా వైదర్భి ప్రముఖ కావ్య గుణములు కలిగియుండుట-వైదర్భి—గౌడీయ—పాంచాలి,

యని వానికి పేరులు పెట్టి వానిలో వైదర్భికి ప్రాముఖ్య మిచ్చిరి దానినే ఒకానొకడు :—

"అస్పృష్టా దోషమాత్రాభిః సమగ్రగుణగుమ్ఫితా,
విపంచీస్వర సౌభాగ్యా వైదర్భీరీతి రిష్యతే"

అని వర్ణించిరి. అసాధుత్వాది దోషములు లవలేశ మేని పొరయకుండ ఓజఃప్రసాదాదులచే గుంభితమై విపంచీస్వరమును వినిపించునది వైదర్భీరీతియఁట. ఈ దృష్టితోఁ జూచినచో వసుచరిత్రలో ప్రతిపద్యము ఇదేత్రోవలో నడచి రసోత్పాదకమై ఒప్పియున్నదన వచ్చును.

ఉండవలసిన తావులలో నగలు నాణెములు ఉన్నచో ఆ దేహమున కందము చందము కలుగును అలంకారములు కూర్చుటలో భట్టుమూర్తిని మించిన చేయి తెలుఁగులోలేదు. శ్లేషకవిచక్రవర్తి యయ్యు అర్థాలంకారములలో అతఁడు చూపిన నేర్పు కూర్పులు అత్యద్భుతములు. అతని ప్రతి పద్యమును ఎన్నో "కోణముల"తో సరిచూచి అర్థము చేసికోవలసి యుండును పద్యములో ప్రతిపద్యములో ఆఁగి యాఁగి, వేచి వేచి ఆలోచించి మఱి పరిశీలింపవలెను. అప్పుడు గాని ఆ సారస్యములు అనంతముగా స్ఫురింపవు.

అతని కావ్యములో నాలుగింట ఒకవంతు మాత్రమే కథాచమత్కృతికి అవకాశమిచ్చును తక్కిన మూడువంతులలో, పదలాలిత్యము—అర్థగౌరవము అలంకారవైభవము—రసస్ఫూర్తి—మధురశయ్యా— ధ్వనివిశేషములు పరువులిడుచుండును. ఆ పరువులు అందుకొనుటలో "పరువు" దక్కనివారు, వానిలోఁ గొన్నింటిని మూడాడనైనఁ జేతఁగానివారు, సారస్య విశేషములలో అరసికులైనవారు, కథాభాగముతోనే కాలక్షేపము చేయఁదగిన 'తాహతు' గలవారు,' వసు చరిత్రలో కథాకల్పనలేదు; జీవకళలేదు.' అని పలు కుటలో ఆశ్చర్యములేదు. ఆ వసుచరిత్రయను రత్నా కరములో—అంతర్నిహితమైన అమూల్య రత్నరాశి విలువ—అట్టివారి కుఱుచబుద్ధులకు—కొలఁత బద్దలకు అంతవఱకే అంతుపట్టును. అర్థముగాని భాగములకు ఎవ్వరేపేరులు పెట్టినను రామరాజభూషణుని రస పోషణమునకు రవ్వంతేని లోపము వాటిల్లనేరదు.

"పిల్లవసుచరిత్రలు" ఎన్నో బయలుదేరిన వన్నను—సంస్కృతాది భాషలలో అనువాదములు సాగినవన్నను-వీణానినాదమే కవితలో వీనులవిందుగా వినవచ్చునన్నను—పంచకావ్యములలో ఒక మంచి కావ్యముగా పఠింతురన్నను—రామరాజసభకే భూషణ మయ్యెనన్నను-శ్లేషకవిత్వములో చక్రవర్తిగా పట్టము గట్టిరన్నను—సాహిత్యరస పోషణుఁడని పేరుప్రతిష్ఠలు గడించెనన్నను రామరాజభూషణ కవిచంద్రా! నీకే తగును; నీ కావ్యమునకే తగును.

గీర్వాణాంధ్రములలో ఈ మహాకావ్యము మకు టాయమన్నమాట ఈనాఁటిమాటకాదు. సాహిత్య ప్రపంచములో కవితాసామ్రాజ్యములో ఆచంద్రార్క ప్రశస్తి అద్భుతముగా గడింపనేర్చిన రామరాజభూషణ కవిసార్వభౌమా! నీకు—నీ సంగీత సాహిత్యములకు— నీ శాస్త్రపాండితికి ఇవే మా నమోవాకములు.!!

# పాండురంగవిజయ పదగుంఫనము

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

"ఆల్లసానివాని యల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు
పాండురంగవిజయు పదగుంఫనంబును
కాకమాను రాయ నీకుఁ దగుర !

ఈ పద్యము తెనాలిరామకృష్ణుని చాటూక్తులలో నొకటిగాఁ బ్రసిద్ధిచెందినది. పెద్దనాది మహాప్రబంధ నిర్మాతలలో ముగ్గురియందలి ప్రధానగుణము లీ పద్యమునందుఁ బేర్కొనఁబడినవి. తక్కిన కవులయందలి ప్రధానగుణము లేవియో చెప్పుమన్న గడ్డుసమస్యయే తలకొక్కరీతిగాఁ జెప్పుటయు నొకరు చెప్పినదానిని మఱియొకరు వివదించుటయు సంభవించును. ఆ తక్కినవారిలో నీ ముగ్గురిలోవలెనే తక్కిన కవితాగుణములకంటె నొకానొకగుణము ప్రధానముగా నుండి యుండలేదాయన్నచోఁ దప్పక నుండియే తీరును. అట్లుండనిచో నా కావ్యము లింతకాలము నిలిచి యుండవు. కొంతమంది నిరసించినను గొంతమంది భూషించినను దెలుగుఁబాషకు నా పది పదిహేను కావ్యములు మూలస్తంభములని యొప్పికొనకతీరదు. వానినధ్యయనము చేయకుండఁ దెలుఁగుభాషయం దెవ్వడును బండితుఁడగుటకు వీలులేదు. ఆ కావ్యములయొక్క ప్రాశస్త్యమట్టిది. కాని తక్కినకవులలో నాప్రధానగుణము లేవియనగా వానినిబట్టికొని చెప్పఁగలవా డింతవఱకు రాలేదు తెనాలిరామకృష్ణుని ప్రతిభ యిచ్చటనున్నది. ఆ ముగ్గురి కవులయొక్క కావ్యములం దాత్మభూతములైన గుణములను నా యా కవుల విశిష్టతకుఁ గారణములైన గుణముల నతఁడు పైకిలాగి చూపించెను. ఆ యా విశిష్ట గుణముల నాధారముగాఁ జేసికొని యా యా కవు లా యా కావ్యములను నిర్మాణము గావించిరి. పూవులలో దారము వోలె నా విశిష్టగుణము కావ్యమునందు వ్యాపించి యుండును. ఇదిలేనిచో నా కావ్యమునకు స్థితిలేదు. దీని నాశ్రయించి కవియొక్క యనుభావము కావ్యము

నందు దీపించును. కవియొక్క సర్వానుభూతి యీ గుణము నాశ్రయించి వ్యక్తమగుచుండును. కవియొక్క జీవసంపుటియే తన్ముఖముగాఁ గావ్యమునందుఁ బ్రత్యక్షమగుచుండును. కవి జీవసంపుటికి నీ గుణమునకు నట్టి యవినాభావసంబంధమున్నది. అందుచేత సర్వకావ్య నిర్మాణ మిచ్చటనుండి యేర్పడుచున్నది. ఆ యా కావ్యము లా యా భాషలలో నెందుకు నిలిచియున్నవన్న ప్రశ్నకిచట సమాధానము దొరకుచున్నది. ఇది లేకుండ నీ యిష్టమువచ్చినంత భాషాప్రభుత్వము చూపించుము, అలంకారపాటవము చూపించుము, కథావైచిత్రి చూపించుము, లోకజ్ఞత చూపించుము, పాత్రచిత్రణము ప్రదర్శించుము తక్కిన మాధుర్యాదుల సంతరించుము ఆ కావ్యము పట్టుమని కాలూది పదిరోజులు నిలువనేరదు ఆత్మవంతుడైన కవిమాత్రమే యా గుణము కలిగియుండును. అందఱకును నాత్మ లేదా యన్నచో నున్నది కాని దానియందుఁ బ్రస్ఫుటత్వ మందఱియందు దీపించదు. కొందఱియందది బలీయముగానుండును. కొందరియందు దుర్బలముగా నుండును. బలహీనమైన జీవునియందు సర్వానుభవమును నేకముగాఁ బ్రవహింపఁజేయు లక్షణముండదు. కట్టలులేని ప్రవాహమువోలె నది బహుముఖములుగా సాగి యెడారిలో నింకిపోవును. ఆత్మవంతుడైన కవికి నొకబలమైన వేదన, యొకధ్యేయము నుండును. ఈ వేదన యొక విశిష్టమైన మార్గమునఁ బ్రవహించి యాధ్యేయమున లయించును. కవియొక్క వేదనా సర్వస్వ మేకముఖీనమై యేతద్విశిష్టగుణమునందు వ్యక్తమగుచుండును. అందుచేత నీ విశిష్ట గుణము కవియొక్క జీవసంపుటిని జీవుని వేదనను వ్యంజింపఁజేయును. కవియొక్క యాత్మను బట్టియిచ్చును. దీనిని బట్టుకొని కవికావ్యము నర్థముచేసికొనుటకుఁ బ్రయత్నము చేయవలయును. అదవిదల యితడు మెత్తగా వ్రాయలేదు. ధారాశుద్ధిలేదు. ఇచట యతిపోయినది యిచటఁ బ్రాసపోయినది యిత్యాది విమర్శనము చేయుటకన్న భాష కపకారకమైనది మఱియొకటి లేదు.

పై పద్యమునందు మఱియొక చమత్కారమున్నది. "పాండురంగ విజయపదగుంఫన" మన్న మాటలో "పాండురంగవిజయ" మనగా నర్థమేమి? గ్రంథముపేరు పాండురంగమాహాత్మ్యమని ముద్రితప్రతులం దున్నది. పౌండరీకవిభుచరితమని, పౌండరీక మాహాత్మ్యమనియు నున్నది కాని గ్రంథమునకు పాండురంగవిజయమను నామముగూడఁ బ్రచారములో నున్నది. పాండురంగవిజయుఁ డనగా నిచట రామకృష్ణునకు విశేషముగాఁ జెప్పికొనవలయును గాన పాండురంగవిజయమును రచించినవాఁడని చెప్పికొనవలయును. తెనాలిరామకృష్ణుఁడు ఉద్భటారాధ్యచరిత్రము, ఘటికాచలమాహాత్మ్యమునను మఱి రెండు కృతులనుగూడ రచించెను. కాని వానిని వదలి పాండురంగవిజయమును రచించినవాఁడనని మాత్రమే యతఁడు చెప్పికొనెను. పాండురంగవిజయమును రచించుట రామకృష్ణునిదృష్టిలో ఘనకార్యము. తాను సర్వోత్కృష్టముగా దానిని చెప్పితినని యాతని యుద్దేశ్యము. పదికావ్యములు వ్రాయగాఁ గవియొక్క యాత్మ యే యొక్కదానియందో దీపించును. వ్రాసిన యన్నికావ్యములందు దీపించదు. ఈ సూత్రమునకును గొన్ని యెడల నపవాదమును నున్నది. కాని యిది యింతే. ఆ కవి యా కావ్యమును వ్రాయుటకుఁ బుట్టినాడా యన్నట్లా కావ్యముయొక్క పరిణతియుండును. తక్కిన కావ్యములన్నియుఁ దత్కావ్య నిర్మాణమునకై చేసిన సాధన యనిపించును. పాండురంగవిజయమును జెప్పి రామకృష్ణుడు విజయమును బొందినాడుగాన పాండురంగ విజయుడైనాడు, అందుచేతనే.

"ఉదయంబస్తనగంబు సేతువు హిమప్రాయాహం
బునుం జుట్టిరా

పిదితంబైనమహిన్ మహాంధ్ర కవితా విద్యా
బల ప్రౌఢిని
కెదురేరీ సరసార్ధ బోధఘటనా హేలా పరి
ష్కార శా
రద నీ రూపము రామకృష్ణ కవిచంద్రా!
సాంద్ర కీర్తీశ్వరా!"

యనిపించుకొన్నాడు. ఆంధ్రకవితా బలప్రౌఢియన లేదు. 'మహాంధ్రకవితా విద్యాబలప్రౌఢి' యన్నాడు. "మహాకవిత్వ దీక్షావిధి' నొంది యని తిక్కనగారు చెప్పికొన్నారు. రామకృష్ణుడు మహాంధ్రకవితా విద్యా బలప్రౌఢి యన్నాడు తిక్కనాదులు ప్రధానముగా నాంధ్రకవులేయైనను వారికిఁబూర్వము సంస్కృత సాహితీమర్యాదలు ప్రసిద్ధములై యున్నవి. వారికి మార్గదర్శకములునై యున్నవి. రామకృష్ణుని నాటికాంధ్రకవిత్వమొక విద్యగాఁ బరిణమించినది. విద్యయనగా నొక పరిష్కారముచెంధిన స్వరూపము గలది. బహ్వంశములు ప్రధానలక్షణమునందుఁ బర్యవసించుట, అంగాంగిభావము కుదురుకొని యుండుట, సర్వత్ర ప్రధానగుణము దీప్తమగుట, ఒక్క మాటలోఁ బ్రధానలక్షణమును బహుముఖములుగా దీపింపఁజేయుట కవితావిద్య. ఈ లక్షణములు సర్వభాషాకవిత్వములకును సామాన్యమైనవే. ఆంధ్ర భాషాకవిత్వమునకుఁ గొన్ని ప్రత్యేకలక్షణములుగలవు. అట్లే తక్కిన భాషలకు నుండును. ఈ లక్షణములు పద్యరచనకుఁ బలుకుబడికిఁ గూర్పుటందములకు సంబంధించినవి. దానియందలి బలప్రౌఢి కలవాఁడు రామకృష్ణుడు. ఏతాదృశమైన యాంధ్రకవితావిద్య యందు సర్వపృథివీమండలమునందును నతనికి నెదురు లేదట. ఆంగ్లమునందువలె నాకాలమునందుఁ దెలుఁగు భాషయందు సర్వదేశములవారు గ్రంథములను రచించెడి వారన్నమాట. అట్టికాలములో రామకృష్ణుని స్థితి యట్టిది.

రామకృష్ణుడు పూర్వము పేర్కొన్న పద్యరచనా శిల్పమునందు సిద్ధహస్తుడు. ఈతని పద్యరచనాశిల్ప మంతయు విశిష్టపదగుంఫనముఖముగా పాండురంగ మాహాత్మ్యమునందు దీపించుచున్నది. అనగాఁ బద్య రచనాశిల్పగతములైన తక్కిన లక్షణములన్నియుఁ బద గుంఫనమునందుఁ బర్యవసించుచున్నవన్నమాట ఈ పదగుంఫనమునందు సర్వత్ర రామకృష్ణుని విశిష్టతా ముద్రవ్యాప్తమైయుండి యననుకార్యమై యొప్పారు చున్నది. అది రామకృష్ణుని మార్గము. దానియందు మఱియొకడడుగు వెట్టుటకు వీలులేదు. ఈదృశమైన మార్గమొక పెద్దతపస్సుగా సాధనచేసి రామకృష్ణుడు నిర్మించుకొన్నాడు. అందుచేత రామకృష్ణునియందుఁ బ్రధానమైనది రచనామార్గము - చెప్పు... ... నందుకంటె జెప్పెడితీరునందాతని సాధనయున్నదన్న మాట. సర్వకవిత్వము చెప్పెడితీరు all poetry is expression అను ఆంగ్లకవితాలక్షణమొక టున్నది. ఆంధ్రకవిత్వమున కెక్కువగా నాలక్షణము సరిపడును. ఆ పదిమందికవులే నిలుచుటకుఁగారణ మిది. వారియందా చెప్పెడితీరు అంత విశిష్టముగా నంత యనితరసాధ్యముగా నుండుటవల్ల వారి కావ్యములు భాషకు మూలస్తంభములైనవి. వానిని విడిచి యాభాషాసారస్వతము లేకపోవుటకుఁ గారణమది. ఈచెప్పెడితీరును సాధించుటలోనున్న కష్టమును గొంచెము విచారింతము. కావ్యభాషను సంతరించుకొనుటకు రెండుమార్గములున్నవి. ఒకటి పూర్వ కావ్యములను జదివి వానినుండి భాషను గ్రహించుట. రెండవది జనవ్యవహారమునుండి గ్రహించుట. ఈ గ్రహించుటలోగూడ రెండు పద్ధతులున్నవి. అలంకారికులు చెప్పినపద్ధతి యనగా మధురములైనట్టియు మృదులములైనట్టియు శబ్దములను గ్రహించుట వాని యందు ధారాశుద్ధి ప్రసన్నత మొదలైన గుణముల ననుసంధించుట. ఇది పలువు రవలంబించుమార్గము.

మఱియొకటి దీనికిఁ గేవలము వ్యతిరేకమైనది. పదనైన పలుకుబడి, కాకువు, అక్షరసంయోజనము వీనియందలి సూక్ష్మ సూక్ష్మతరభేదములను గ్రహించి యను సంధానించుట. ఈ రెండవమార్గము చాల తక్కువమంది చేయుదురు, ఆ భాష మాట్లాడువాడొకానొక భావమును జెప్పవలసివచ్చినప్పుడెట్లు మాట్లాడునో యే యే శబ్దముల నొత్తిపలుకునో తేల్చిపలుకునో కంఠస్వరము నెట్లు మార్చుచుండునో యిత్యాదులన్నియు జాగ్రత్తగా బరిశీలించి యా యా భావములను జెప్పుసందర్భములో నా యా లక్షణములనన్నింటిని సంగ్రహించుట దానితోబాటు పూర్వకవి సంప్రదాయములను జోడించుట యివి మహాకవియైనవాడు మాత్రమే చేయును. పూర్వకవి సంప్రదాయము, ప్రజావ్యవహారమందలి పదను నీ రెండింటిని గప్పియతని యాత్మలక్షణము-అతని భాష-పైన చెప్పిన రెండు లక్షణములు నతని కంఠస్వరమందు మగ్నములైయుండును. విడదీయరాకయుండును. మనము లోపలికిదిగి వానిని బట్టుకొనవలయును తెనాలి రామకృష్ణు డట్టిమహాకవి. ఇందుచేతనే యితనియందు శబ్దములందుఁగంటె శబ్దములకూర్పునందుఁ గవితాలక్షణమెక్కువ దీపించును. బాషయొక్క ప్రాణమంతయు శబ్దములందుఁగంటె వానిని వాడు తీరునందుఁ గన్పించును. ఈతీరునుబట్టికొని వ్రాయు కవియందు రచన ప్రధానముగా నుండును. రామకృష్ణుని రచన వికటాక్షరబంధముగలది. వక్రోక్తి భూయిష్ఠమైనది. విచిత్రమైన సంస్కృతసమాసరచన గలది. పదనైన తెలుగు పలుకుబడిగలది. వీనినన్నింటిని గలిపి మిక్కిలినేర్పుతోజేసిన పోహళింపుగలది. పద్యముయొక్క యెత్తుగడ, పంచి వ్రాయుట, గణముల విరుపులు, అపుటలు, యతిప్రాసలయందు నామవాచకములు, క్రియలు వాని వానిని ప్రయోగించుటలోని వైచిత్రివిశేషములు నియన్నియుఁ బరిపక్వస్థితిలో మనకు గోచరించుచుండును.

"తాళివిభుండు గట్టినమొదల్ పతి దేవత యా సుశీలపెన్
గోలతనంబునన్ మగడుగొట్టినఁ దిట్టినరట్టు చేసినన్
ధాళి దినంబుతచ్చరణతామరసంబులుగొల్పు నేలయున్
బోలునె యీపెకంచుఁ గృతబుద్ధులు వృద్ధులు ప్రస్తుతింపఁగన్"

ఈ పద్యమునందలి భాషయంతయు నతి సామాన్యమైనదే. సామాన్యమైన వచనములో మాటలయొక్క స్థానమును మార్చి చెప్పినచో నీ భాషయందలి యతి సామాన్యత్వము మనకు బోధపడును. రెండు మూడు పదములను మార్చి చూతము. "విభుడు తాళిగట్టినది మొదలా సుశీల పతిదేవతయై" యని పదముల క్రమమున్నదనుకొందము. ఇది వచనము. పద్యమునందుఁగూడ నీ దృశమైన పదములమార్పే పెట్టుకొని చూతము "విభుఁడును దాళిగట్టినది వెంటఁ బతివ్రత యా సుశీ" యిట్లు వ్రాసిన పద్యమగునుగదా! చెప్పఁదలఁచుకొన్న యర్థము ఒకటి వచనము. మఱియొకటి శిథిలమైన పద్యరచనము. ఈ రెంటియందును నర్థము మొద్దుగా వ్యక్తమగుచున్నది పదనుగా భాసించుటలేదు. రామకృష్ణుని రచనమునం దీ యర్థమే పదనుగా భాసించుచున్నది. ఈ పదను పదముల మార్పులో యతిప్రాసలదుకుటలో పంచి వ్రాయుటలో శబ్దమును విఱచుటలో నొకేపదమును నామవాచకముగను క్రియగను వాడుటలో నీ యర్థమునకుఁ బ్రాణమును దెచ్చినాడు రామకృష్ణుడు. ఇది రచనాశిల్పము. ఇది యుత్పలమాల భరన భారలగములు గలది, పదింట యతిగలది. మొదటి గణము రెండక్షరములకు విరిచి మూడవ యక్షరమునుండి రెండవ గణము రెండవయక్షరమునకు విరిచి యవటనుంచి యతివేయుటతో విరిచి చేసిన విచిత్రమైన రచన. దీనివల్ల పద్యముయొక్క నడకలో నొక విచ్ఛిత్తి

పుట్టి యర్థమునందు విశేషము భాషించును. పదములకు జాతియుండును. తూకముండును ఊవుండును. వానినన్నింటి నెఱిగి యొకదాని తఱువాత నొకటి పెట్టినచో వాని గతియందువచ్చు భేదములనెఱిగి యా గతి భేదములవలన యర్థచ్ఛాయలను బుట్టించుట యనునదియే రామకృష్ణుని విశేషము. ఈ పద్యమునందు తాళి, విభుండు గట్టిన మొదల్ పతిదేవత యింతవఱకు నొకవాక్యము "కట్టినమొదల్ పతిదేవత" యనగా నీ వాక్యము నామవాచకముతో నంతముచేసి దానిని 'అ సుశీల' యన్న కర్తృపదమునందు విశేషణముగా మలచినాడు. ఈ దృశరచనము వల్ల సుశీలయొక్క పాతివ్రత్యమునందలి స్థైర్యము పరాకాష్ఠ మనకు భాసించుచున్నది. రెండవచరణమునందుఁ బై చరణమువంటి రచనకాక యే గణమున కా గణము విరిచి పంచి వ్రాసినాడు. వాక్యమును మూడవ చరణమునందు బ్రాపస్థానముతో మొదటి చరణమునందలి తొలిపదమునే క్త్వార్థకక్రియా పదముగా వాడి విరిచినాడు. గోలతనంబునన్, మగడు, కొట్టిన, దిట్టిన, రట్టుచేసినన్, దాళి—ఇవియే గణమున కా గణమును విరిచి పంచి వ్రాయుటవలన కొట్టిన దిట్టిన రట్టుచేసినన్ అని ద్విత్వటకారమునను వృత్తి చేయుటవలన నామె బాధాసహన మెంతగొప్పదో వ్యంగ్యమగునట్లు చేసినాడు. తాళియని క్త్వార్థకక్రియా పదము వాడుటవలన పద్యమునందలి మొదటి పదమైన తాళియను నామవాచకమునందలి విశిష్టార్థమును భాసింపఁజేసినాడు. తాళియనగా మంగళసూత్రమని సామాన్యార్థము. అమితమైన యోర్పునకు చిహ్నమని విచిత్రార్థ కల్పనము.

తఱువాతి పద్యరచనమంతయుఁ బద్యము తూకముగానుండుటకుఁ జేసినది. "సుశీల పెన్గోల" 'కొట్టిన, దిట్టిన రట్టుచేసినన్' అన్న పై చరణములందలి యనుప్రాసమునకు నుత్తరార్థమునం దనువృత్తిలేనిచోఁ బద్యమునంను తూకము చెడిపోవును. అందుచేత సరిగా మొదటి చరణమునందలి యంత్యగణము-ద్వితీయ చరణమందలి ప్రథమ గణమునందును బాటించిన 'ల' కారానువృత్తి తృతీయ చరణము యొక్క యంత్యగణము చతుర్థ చరణముయొక్క ప్రథమ గణమునందును 'నేలయుంబోలునే' యని యనుప్రాసమును 'కొట్టినఁ దిట్టిన రట్టు చేసినన్' అను ద్వితీయ చరణార్థమునందలి యనుప్రాసమునకు 'కృతబుద్ధులు వృద్ధులు ప్రస్తుతింపఁగన్' అని చతుర్థ చరణార్థమునందును ప్రాసము నిలిపెను. ఇది కేవలము పద్యముయొక్క నడకలోని సొగసు తెలిసి చేసిన రచన. సర్వత్ర పద్యరచన యందితడిట్టి శిల్పమునే పాటించునని చెప్పుటకు వీలులేదు. అది ప్రతిభా లక్షణము కాదుకూడ. చెప్పఁదలఁచుకొన్న యర్థమునుబట్టి యతని పద్యరచన మారుచుండును. కాని మొత్తమునం దంతటను నతనిముద్ర వ్యాపించి యుండును.

ఈతని పద్యరచనాశిల్పమంతయుఁ బదగుంఫన ప్రౌఢియంతయు ద్వితీయాశ్వాసమునందలి దశావతార స్తుతియందుఁ గానగును.

రామకృష్ణుఁడు శ్రీ మహావిష్ణువుయొక్క దశావతారములను స్తుతి విషయములుగా నిర్ణయించుకొనెను. ప్రబంధకవులలోఁ బలువురు దశావతార స్తుతి చేసినవారున్నారు. ఈ దశావతార స్తుతియందలి పద్యరచనకును తక్కిన కావ్యమందంతటి పద్యరచనకును జాల భేదమును వారు పాటించినారు. ఈ దశావతారస్తుతి యిదియొక ప్రత్యేకమైన శిల్పము.

పరమేశ్వరుఁడు పది యవతారములెత్తుటయును నా యా యవతారముల యందాయన చేసినపనులను జెప్పుటయుతో స్తుతి చేసినట్లుగాదు. స్తుతి కవి విషయముమాత్రమే. పరమేశ్వర కృతములైన పనులయందొక యాశ్చర్యము నొక రమణీయత దీపింపవలయును.

అందుచేత నా పరమేశ్వర కార్యములు జగదలంకార భూతములుగాఁ జిత్రింపవలెను. రచన యాముఖముగా సాగవలయును. అలంకారకల్పనము పలుకుబడి పదగుంఫనము పద్యపు టెత్తుగడలు ఏపంచిధమైన శిల్పమంతయు సర్వజన వేద్యములైన దశావతార కథా సందర్భములకు నవ్యత నాపాదించును. పరమేశ్వరుఁడు సంతోషించునది తానుచేసిన పనులను స్తోత్ర చెప్పుటవలనగాదు. స్తోత్రయొక్క భక్తిశ్రద్ధలకుఁ బరమేశ్వరుడు సంతసించును. ఆ భక్తి శ్రద్ధలను బట్టి భావనాపరిణతి యుండును. భావన గుణాలంకార సంయోజనాత్మకము. ఈ దృశస్తుతుల యందలంకార కల్పనము మొదలైనవి ప్రధానమగుటకుఁ గారణమిది. వారివారి ప్రతిభావిశేషములను బట్టి కవు లీ స్తుతి యందుఁ గ్రొత్తకల్పనలు చేసిరి. వారియందఱిలో రామకృష్ణునిది సర్వథా పైచేయి

సోమకాసురుఁడు వేదముల నెత్తికొనిపోయి నాఁడు. పరమేశ్వరుడు మత్స్యావతారమెత్తి సోమకాసురుని జంపి వేదములనుదెచ్చి మరల బ్రహ్మ కొసంగెను. ఇది స్తుతి విషయము. దీనిపై రామకృష్ణుని కల్పన. సోమకాసురుడు వేదములను దన పొట్టలోఁ బెట్టుకొన్నాఁడు. ఆ పొట్టపేగుల నీచుగబ్బు ఆ వేదముల కంటుకొనగా వానిని గీర్తియను గంగలోఁ గడిగి బ్రహ్మదేవుని ముఖకమల గంధమును వానియందుఁ బరమేశ్వరుఁడు సువాసింపఁజేసినాడట. ఈ కల్పన యందున్న యౌచిత్యమిది వేదములు వాగ్రూపములు. వాక్కునందలి సుగంధము వివేకరూపము. కాని విద్యరాక్షసాధీనమైనచో దానియందలి వివేకము ప్రకాశింపదు. వాని యవివేకము సోకి దాని ప్రకాశము తరిగిపోవును.

ఈవిషయ మీకల్పన వెనుకగా దీపింపఁజేసినాఁడు రామకృష్ణకవి. అసురమాయవల్ల వేదములు మఱుగువడగాఁ బరమేశ్వరుఁడు వాని నుద్ధరింపవలసిన యావశ్యకత యేర్పడినది. అయుద్ధరించుటయే వానిని గీర్తియను గంగయందుఁ దొలంచుట. ఇచట నసురాక్రాంతివల్ల వేదములు తిరోహితములగుటచే వీనియందు ద్రవ్యత్వ మారోపితమగుచున్నది. శబ్దము గుణము గాని ద్రవ్యముగాదు. ద్రవ్యము చోరగ్రస్తముకా వచ్చును. గుణమెట్లగును? గుణము అసురమాయాక్రాంతమైనది. కావున గుణముయొక్క యనవభాసమును జెప్పుటకై ద్రవ్యత్వమారోపింపఁబడినది. బురదలోపడి మలినములైన ముత్యములను నీటియందు గడిగినఁ బ్రకాశించునట్లు కీర్తియను గంగలోఁ దొలంచుటచే వేదములు ప్రకాశించినవి. తాత్పర్యము వానియందు మాయాక్రాంతి తొలగింపఁబడినదని. ఈవిధమైన కల్పనమువల్ల రూపకాలంకార మిచట ధ్వనించుచున్నది. ఇది కల్పనయందున్న సొగసు. ఇది యలంకార కృతాలంకారధ్వని. పరమేశ్వరకృతియం దాశ్చర్యము తన్ముఖమున భక్తిపారవశ్యము క్రమవ్యంగములు. స్తుతివిషయము వేదముల నుద్ధరించుటకాని సోమకాసుర సంహారముగాదు.

*ముదమున సోమకాసురుడు ౹ముచ్చిలి యచ్చట చూరగొన్న పా౹*
*జదువులుతెచ్చి తజ్జఠర సాంద్రతరాంత్రములంటు నంటుబల్*
*గదుడుతొలంగ కీర్తియనుగంగఁ దొలంచివిధాతృ విస్ఫురత్*
*వదన సరోజగంధకలితంబులు చేసితిగా జగన్నిధీ!*

ప్రధానముగాఁ బద్యమునందు జెప్పినది వేదోద్ధరణము. అనగా వాని స్థానమున వాని నుంచుట. వానిదీప్తి కానికిఁ గలిగినదనగా సృష్టిసర్వమునందు ధర్మము దీపించినదన్నమాట. అధర్మము నశించినదన్నమాట. ఈ యర్థవిశేషములు భాసించునట్లు అక్షరసన్నివేశము, పదగుంఫనము, గణముల విరుపు, శబ్దాలంకారములు, సమాసములు, సంబోధనలు వాడుటయంతయు రచనాశిల్పము. '౹ముచ్చిలి యచ్చట చూరగొన్న' యను

టులో సోమకాసురుని ద్రుమ్కిడితనము 'తస్కరర సాంద్రత రాంత్రము లంటునంటుబల్ గదురు' అను టులో రకారానువృత్తివలనఁ గ్లిష్టపదగుంఫనమువలన వేదముల కాపాదిల్లిన దుస్థితి, 'విధాతృ విస్ఫురత్ వదన సరోజగంధకలితంబులు' అని గాఢపదబంధము ఓజోగుణమువలన వేదములు తిరిగి పొందినసుస్థితి వ్యంగ్యమగుచున్నది. ఇట్లే తక్కిన పద్యములన్నింట మిక్కిలి విభిన్నములైన కల్పనములు పద్యరచనము రామకృష్ణుడాశ్రయించెను ఒక్కొక్క పద్యమునం దొక్కొక్కమాట పద్యమునకు మూలస్తంభముగా నుండును. ఈ పద్యమునందు 'కీర్తియను గంగఁ గొలంచి' యట్టిది. కూర్మావతారస్తుతియందు 'ఈత కాయయూపై' యనునది యట్టిది. వరాహావతారస్తుతి యందు 'నిజవంష్ట్రకూర్పు తద్రూప' మనునదియు, నృసింహావతారస్తుతియందు 'నెత్తురునీరువెట్టి' యను నదియు, వామనావతార స్తుతియందు "కొండికమచ్చ" యను నదియు. పరశురామావతార స్తుతియందు "బోఃపరశుహంసికి మేతవెట్టవె" యనునదియు, రామావతార స్తుతియందు "దోర్దనుర్వ్యాకణరాజు" అను నదియు, బలరామావతారమందు శేషాయకారికళన్ బుద్ధావతారమందు 'శిఖిపింఛవల్లి' యనునది, 'కల్క్యవతారమునందు జాడ్యప్రతీప' యనునదియునునట్టివి. ఆ యీ పదము లా యీ పద్యరచనమునందుఁ బ్రధాన ములు. అర్థకల్పనమునకు నలంకారకల్పనమునకు రచనాశిల్పమునకుఁ బ్రాణభూతములో వాని నన్నింటిని వివరించి వ్రాయుట కిచట స్థలము చాలదు దీనిని విడచి వట్టి పలుకుబడి చూచినచో నీతనియందు నిర వధికముగా నుండును

'వేదములఁ బోసిన గాదె' 'శాస్త్రములు పుట్టిన యిల్లు' 'కళాకలాపములఁ దాసినరచ్చ' 'రేగొనబుం బ్రాయపుఁదేజుకూన' 'మీనుమీసమువంటి యొంటి జందెము' 'తాలిగోటపుఁజూంగు' 'తరుణఫాలంబు చవిచూచుచుండు' 'కజ్జాయంబులు' 'బండిమీఁదఁ బోవుచున్నాఁడు' (గౌణార్థము) 'అవలివారలవెతికం దిచ్చులాగున' ఇత్యాదులు కొల్లలు—పద్యప్రబెత్తుగడలకు వాక్ప్రౌఢికి నిగమశర్మయొక్క అక్కసంభాషణము—సుశీలావటు సంభాషణములు పరమోదాహరణములు. పదగుంఫనములకు గ్రంథమంతయును ఉదాహరణమే.

"ఈకడజాతినాతికిహీహీమహిదేవుఁడుచిక్కెనంచునన్
రాకకుఁబోకకున్ జనపరంపర కింపగుచూడ్కి
                                        చూచియం
బూకృతమాచరించుటకు బుద్ధితలంక కలంకముక్తచం
ద్రదా కృతిఁబొల్చు నీమొగము నన్నువృతస్థితిగాంచి
                                        మించుటన్"

ఈపద్యమునందుఁ బదగుంఫనము శబ్దాలంకారరూప ముగానుండి నిగమశర్మయొక్క వియోగదుఃఖమునకు వ్యంజకముగా నున్నది. కరుణరసమునకు శబ్దాలం కార మపకర్షక హేతువు. కాని యిచట నది రసవ్యంజ కముగా నున్నది దీనికిఁ గారణము మొదటిచరణము నందలి వాక్య మనువాదమై దానియందలి శబ్దాలం కారము పరిహాసమునకు వ్యంజకముగానుండి తక్కిన చరణములందలి శబ్దాలంకారము వక్తృకంఠస్వరము నందలి హెచ్చుతగ్గులకు సూచకమై దుఃఖాతిశయమై వ్యంజింపఁజేయుట. ఈయన రచనయంతయు మిక్కిలి దంతురము

గతిమధ్యస్తన కుంతలస్తబకవీణాగర్వదుర్వారయా
సతిచే మారమెలూనమయ్యె నిక నిస్సారంబు
                                        పౌరుషంబుదా
ల్చుతగుళ్ గాదని రోసి యావృషలివాలుంజూపుఁ
                                        గొమ్మ టకా
హుతియో బర్హి వ్రగెంచ కుంభిచమరీయూధంబు
                                        లేణాంబులున్

ఈపద్యమిట్లు వ్రాయుట యదియొక మహాప్రతిభా లక్షణము. మొదటిపదమునందు దంతురమైన సమాన రచనము. రెండు మూడు చరణములందు వ్యాసపథ రచనము, నాల్గవచరణమునందు మరల దంతుర

సమాసముతోడి గాఢపదబంధము. పద్యముయొక్క తూకము నిల్పుటకై మానమెలూనమయ్యెనని శబ్దాలంకారమును మూడవచరణమునందు 'వాలుంజూపుఁగ్రొవ్వాలు' యని దిట్టమైన తెల్గుసమాసపుఁగూర్పుచేసి పద్యమును మత్తగజమువలె నడిపింపగల్గినాడు.

"అంతర్మగ్న దిగంత దంతికలు నిర్యద్దాన ధారాఝరా
క్రాంతంబుల్ నిజవేగభగ్నవపుర్యగ్ర గ్రాహముల్
మేఘ ఘో
షాంతేవాసి విశంకట ధ్వనులు నాగావాసగాహుల్
పయ
స్సంతానంబులుగ్రాలు పాలకడలిన్ జాగ్రత్ప్ర
చారంబులై"

ఈపద్యము రామకృష్ణుని పదగుంఫనమునకు మచ్చుతునక. బిందుపూర్వక తకారప్రాసతో పద్యమును పట్టి సమాసములు ఆపినచోట్ల పద్యముయొక్క నడకయందు విచ్ఛిత్తి కల్పించుచు 'నిర్యత్' 'జాగ్రత్' ,అంతేవాసి' 'వపుర్యగ' పయస్సంతాన అంతర్మగ్న మొదలైన శత్రంతములు, గౌణప్రయోగములు, విసర్గ సంధులు, దిగంతదంతి, ధారాఝరా ఉగ్రగ్రాహ మొదలైన వృత్త్యనుప్రాసములుగలిగి పద్యము గంభీరమై యుత్తాలమైన రచనతో నర్థవిచారముతో నిమిత్తము లేకుండగనే సముద్రమును దీసికొనివచ్చి యెట్టయెదుట నిల్పినట్లున్నది రామకృష్ణుని పదగుంఫన మిట్టిది. భక్తునికి సారూప్యసిద్ధిగల్గినదని చెప్పుటకు 'ఉత్తాలధీశిభుగ్గయుత్తాల వృంతాలిలాశాంతఘుస్తాంబులయ్యెమౌచ' ప్రత్యగ్రముక్తాతపత్రీభవ స్ఫేషవారి తాతపమయ్యెచారు మౌళి, ఇత్యాదిగా వ్రాయును. ఏది చెప్పినను విశిష్టముగా జెప్పవలయునని ప్రౌఢముగాఁ జెప్పవలయునని యాతని లక్ష్యము మతంగమౌని శివునివంటివాడని చెప్పడు.

ఓ లలితాంగి యిందుశుభ్రమునుఁడు పృకండుగాధివా
ధూల ముఖాతిరిక్తచరితుండు మతంగమౌనిని
ష్కాలగళుండు నిర్యవతిగాత్రుఁడు నిగ్రులేశ
ఖుండు ని
ర్వ్యాళవిభూషణుండయిన యంబరకేశుడనంగ
నొప్పుచున్.

పిండితార్థమును జూచిన పద్యమునందేమున్నది! మతంగముని శివతుల్యుడనియే. కాని యా యర్థమును జెప్పుటకాయన యవలంబించిన రచన యా యెత్తుగడ యా యంత్యానుప్రాసము ఆసమాసరచనము, ఆవిరుపులు - ఈయన్నియు నాముని మహానుభావత్వమునకును నాయనయందగస్త్యునకున్న గౌరవాతిశయమునకును వ్యంజకముగానున్నవి. అన్నింటిని మించి సర్వరచనమునందున్న యనుస్యూతి ప్రధానమైనది. ఒక పదములో మఱియొకపదము ఒక సమాసమునందు మఱియొక సమాసము, ఒక పద్యమునందు మఱియొక పద్యము గుంఫితమై గ్రంథమంతటికి నొకానొక విశిష్టమైన యనుస్యూతిని దెచ్చినది. ఈయనుస్యూతి రామకృష్ణుని జీవలక్షణము పదగుంఫనమనగా నిదియే 'యత్ప్రౌఢత్వముదారతాచవచసాంయచ్చార్థతో గౌరవం, అను భవభూతి వచనము రామకృష్ణునియందు సంపూర్ణముగా సమన్వయించుచు.

# మల్లన తిమ్మయామాత్యుల విప్రనారాయణ చరిత్రములు

డాక్టర్ పల్లా దుర్గయ్య

ద్రావిడదేశమునందుఁ బరమవైష్ణవ భాగవతులుగా నేఁటికిని వైష్ణవులచే మన్నింపఁబడుచున్న పన్నిద్దరాళ్వారులలో నొకఁడయి, తొండరడిప్పొడి (భక్తాంఘ్రిరేణు) ఆళ్వారను గౌరవనామమునకుఁ బాత్రుఁడయిన విప్రనారాయణుని చరిత్రమునుబ్రత్యేక ప్రబంధముగాఁ జెదలువాడ మల్లన, పొరంగంటి తిమ్మయ లను నిరువు రాంధ్రకవులు క్రీ. శ. పదునారవ శతాబ్ది తుదిభాగమున రచించిరి. ఈ రెండు ప్రబంధముల యందలి కథ యొక్కటియే యగుటచేతను, మఱియు నీకవులిద్దరు నించుమించుగా నొకేకాలమువా రగుటచేతను వీరినిఁగూర్చి వేర్వేఱుగా వ్రాయుట పునరుక్తియే కాఁగలదను భావముచే వీరినిఁగూర్చి యొకేచోటఁ దెలుపుట యసమంజసముకాదని తలఁచి యట్లుచేసితిని. విప్రనారాయణుని చరిత్రము గురుపరంపరయను ద్రావిడప్రబంధమునందును, ద్వాదశసూరి చరితము మఱియుఁ బ్రసన్నామృతమనుసంస్కృత గ్రంథములయందునుఁ గలదు. ఈ మూఁటిలో గరుడవాహన పండితుఁడు సంస్కృతమున రచించిన ద్వాదశసూరి చరితమే మొదటిది. వీనినిఁగూర్చి యిదివరకే యాముక్తమాల్యదనుగూర్చి వ్రాయు సందర్భమునఁ గొంత తెలిపియుంటిని.

ఆళ్వారుల చరిత్రముల గ్రహించి ప్రబంధములు రచించిన యాంధ్రకవులలో శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముఁడే ప్రథముఁడు. పెఱియాళ్వారను విష్ణుచిత్తుని చరిత్రమును మఱి ఆండాళను నాముక్తమాల్యదచరిత్రను బైమూఁడు గ్రంథములనుండి గ్రహించి విష్ణుచిత్తీయమను నాముక్తమాల్యద ప్రబంధము నీతి ప్రౌఢముగ నిబంధించి యీ విషయమున రాయలు మల్లన తిమ్మనలకు మార్గదర్శియయ్యెను.

ఇరువురాళ్వారుల (పరస్పరబంధుత్వముగల) చరిత్రముల నొక ప్రబంధముగాఁ గూర్పఁగాఁ దదను యాయులగు మల్లన తిమ్మయలు విప్రనారాయణుఁడను నొకే యాళ్వారు కథను వేర్వేఱుగాఁ బ్రబంధీకరించిరి.

విష్ణుచిత్తీయమును రచించి కృష్ణరాయ లత్యంతకీర్తి సాంద్రులయిరి. కాని యాయన యాదర్శమున విప్రనారాయణ చరిత్రములను రచించిన మన కవు లత్యంతమగు నపకీర్తికి భాజనులయిరి. విష్ణుచిత్తీయ రచనమునఁ కృష్ణదేవరాయలు శృంగారవర్ణనముతోఁ బాటు వైష్ణవ మతప్రచారమును బ్రధానముగా నుద్దేశించియుండుటయు, విప్రనారాయణ చరిత్రకర్తలు విష్ణుభక్తివర్ణనముతోఁబాటు శృంగారవర్ణనమును బ్రధానముగా నుద్దేశించి యుండుటయు, ఫలవైపరీత్యమునకుఁ బ్రధానకారణముగ భావింతును.

కృష్ణరాయల యనంతరమతని యల్లుఁడైన అళియరామరాజునకు మేనల్లుఁడే యగు సిద్ధిరాజు, తిమ్మరాజు పన్నిద్దఱాళ్వారుల చరిత్రములతోఁ బాటు రామానుజాచార్యుల చరిత్రమునుగూడఁజేర్చి పరమయోగి విలాసమను పేరుతో నైదాశ్వాసముల పద్య కావ్యమును రచించెను. ఈపరమయోగి విలాసము రచనాకాలము క్రీ. శ. 1564 ప్రాంతమని విప్రనారాయణచరిత్ర పీఠికాకారులు నిర్ణయించిరి. తిమ్మరాజు జీవితకాలము క్రీ. శ. 1500–1564 అని శ్రీ శేషయ్యగారి నిశ్చయము. తిమ్మరాజుకంటె నింతక పూర్వమే తాళ్ళపాక తిరువేంగళ నాథుఁడును 'పరమయోగి విలాసము'ను నామముతోడనే, పన్నిద్ద ఱాళ్వారుల చరిత్రాదులనే ద్విపదకావ్యముగా రచించెను. వీరి తరువాత మల్లనకవి విప్రనారాయణ చరిత్రమను పేరను, తమ్మయకవి వైజయంతీవిలాసమను పేరితోడను విప్రనారాయణ చరిత్రమును మాత్రము గ్రహించి ప్రబంధములుగా రచించిరి. ఈ రెంటిలో వైజయంతీవిలాసమునకున్న ప్రసిద్ధి మల్లన విప్రనారాయణ చరిత్రమునకుఁ గలుగలేదు. వైజయంతీవిలాసము ప్రథమ ముద్రణముఁ బొందిన చాలకాలము తరువాత మల్లన విప్రనారాయణచరిత్ర కట్టి ముద్రణ భాగ్యము పట్టుటయు దీనికొక కారణమై యుండును.

విప్రనారాయణుని వృత్తాంతమును దిమ్మరాజు తన పరమయోగివిలాసము తృతీయాశ్వాసమునందు వర్ణించెను. అనేకుల చరిత్రములను వర్ణింపవలసిన వాఁడగుట తొండరడిప్పొడి యాళ్వారు కథను దిమ్మరాజు సంగ్రహముగాఁ జక్కని శైలిలో వర్ణించెను. మల్లన తమ్మయలిద్దఱును తమతమ యిష్టానుసారమీ కథను బెంచుచుఁ గావ్యవర్ణనలతో శృంగారరసప్రధానముగాఁ గూర్చిరి. ఈమూఁడు కావ్యములయందును విప్రనారాయణుని ప్రధానకథ సమానమే. ప్రబంధ కర్తలు కొంత కథాంశమును గల్పించుకొనిరి. అంతియే. తిరువేంగళనాథుని పరమయోగి విలాసమునకు ద్రవిడ ప్రబంధమునందలి యాళ్వారులకథలనుఁ గావ్యవస్తువుగా గ్రహించుటయందుఁ గృష్ణరాయలవలెనే యనేక (వైష్ణవ) భక్తుల చరిత్రములను ద్విపద కావ్యముగఁ గూర్చుటయందు గౌరన కవియు నాదర్శకుఁడయ్యెనని తలంతును. విష్ణుభక్తి ప్రధానము కాకపోయినను గావ్యస్వరూపమునందుఁ దిరువేంగళనాథుని పరమయోగి విలాసమును, గౌరన నవనాథ చరిత్రమును నొకేరీతినిఁజెందినవి. 'పరమయోగివిలాసము'ను నామము శ్రీనాథుని 'హరవిలాసమా' వంటిదని తోఁచును.

విప్రనారాయణుని కథ కడుఁబ్రసిద్ధమగుటచే దానినంతను వివరింపనవసరములేదు. పానుగంటి వారి 'విప్రనారాయణ' నాటకము దేవదేవీ విప్రనారాయణుల కథను నాంధ్రదేశమంతటను బ్రచారము గావించినది. కావున "విప్రనారాయణచరిత్ర" కథాసారాంశమొక వాక్యములో నిట సంగ్రహింపబడుచున్నది.

వన్నెలాడియు, వగలాడియు, వయసుగత్తెయు నగు దేవదేవియను నాటగత్తె తన యక్కతో వాదులాడి వనమాలికి మాలాకైంకర్యము చేయు వైరాగ్యమూర్తి యగు వైష్ణవవటుశిఖామణిని వలపుచేఁగాక వంచనచే

విటశిఖామణినిఁజేసి. శ్రీరంగనాథుని యనుగ్రహమున నుద్ధరింపబడిన యతనితోఁబాటు తానును విరక్తయై విష్ణుభక్తురాలగుటయే విప్రనారాయణుని సారాంశము.

పైకథను మల్లనయుఁ దిమ్మనయుఁ బ్రబంధములుగా నెట్లు వెలయించినను మార్గమును తారతమ్య దృష్టితో పరిశీలింతము.

చెదలువాడ మల్లనకవి "శంభుదాసుని" వంశీయుడు. వంశపరంపరానుబంధ ప్రబంధ నిర్మాణ హేలాధురీణుండు శైవుఁడు; శైవాచారపరాయణుఁడు. విష్ణుభక్తుఁడును గృహపతియునగు సాళువ తిమ్మరాజు కవిని బహుమానించి "విష్ణుభక్తి పరాయణుండగు విప్రనారాయణుని చరిత్రంబు" పద్యకావ్యముగాఁ దన పేరఁజెప్పుమని కోరెను. కావున మల్లన శివభక్తుఁడయ్యు, విష్ణుభక్తుఁడగు విప్రనారాయణుని చరిత్రను బ్రబంధముగా చెప్పెను. వ్రాయుసది వైష్ణవప్రబంధమేయయినను గృత్యాదిలో నీకవి కృతిపతి ప్రీతి కొఱకు మొదట నొకపద్యమునమాత్రము రంగశాయిని నుతించి, తక్కినయిష్టదేవతాస్తుతిలో నీశ్వరుని, బ్రహ్మను, లక్ష్మి, పార్వతి, సరస్వతులను మఱియు దంతిముఖునిఁ గొనియాడి కులగురువగు శంకరస్వామిని నుతించి ముగించెను. వైజయంతీ విలాసకర్తయగు తమ్మయామాత్యుఁడు శ్రీరామచంద్రుని యాజ్ఞచేఁ దదంకితముగ నీకృతిని రచించెను. గోలకొండ కరణమును, రామ భక్తుఁడునునగు తమ్మయ తన ప్రబంధకృత్యాదియందలి యిష్టదేవతాస్తుతిలోఁ గ్రమముగా శ్రీరామచంద్రుని, సీతను, సుదర్శనచక్రమును, ఆదిశేషుని, గరుత్మంతుని, విష్వక్సేనుని. బ్రహ్మను, సరస్వతీదేవిని, గిరీశుని స్తుతించి, ద్వాదశసూరులను. మఱియు గురుఁడగు కంచాళప్పలాచార్యులను నుతించి విరమించెను. దీనిని బట్టి మొత్తముమీదఁ దమ్మకవి యిష్టదేవతాస్తుతిలో శ్రీకృష్ణదేవరాయల ననుసరించె ననుట స్పష్టము. శంకరునిఁగూడ నిష్టదేవతాస్తుతిలో నీకవి చేర్చుటయొక విశేషము. మఱియు నీ తమ్మయ, "జాతివార్తలను, నుపమలను. రీతులను, పదగుంభనలను" విఖ్యాతి గనిన కవులను నుతించెను. దీనినిబట్టి యీకవికి జాతియు. వార్తయు. పదగుంభనయు, ఉపమాద్యలంకారాదులునునిఁ బ్రీతిమెండని తెలియుచున్నది. ఇవి యీతని కావ్యమునఁ బుష్కలముగాఁ గలవనుటవిదితము. మల్లనకవి ప్రత్యేకముగా నిట్టివానిం జెప్పక ధారాశుద్ధిని, ద్రాక్షాపాకమును, రసాదులను బూర్వకవులందుఁ గొనియాడెను. ఇతనికావ్యము రసవంతమై ధారాశుద్ధిని కలిగి ద్రాక్షాపాకమున వెలయుచున్నది. ఇంతవరకుఁ దెలుపఁబడిన గుణము లీకవులప్రత్యేకమతాభిరుచిని కవితాభిరుచినిఁ దెలుపఁజాలును. ఇఁక కథాకల్పనా విధానమును వీరిమార్గములను బరిశీలింతము,

మల్లనకవి పరమయోగి విలాసములోవలెనే చోళదేశవర్ణనముతోఁ గథనారంభించెను తమ్మయ కవి యట్లుగాక, శ్రీరంగవర్ణనముతోఁ గథారంభము గావించెను. తమ్మయకవి విప్రనారాయణుని జననము సంగ్రహముగా వర్ణించెను. విష్ణువు వనమాలయంశమున వ్యసనుడుగా పుట్టించి ... యిట్లవతరించెననియు, నాఖాలుఁడు రెండవ నారాయణుఁడనియు, అగర్వసర్వజ్ఞుడు, నాజన్మవిరాగియు నని కథారంభమునుండియే కథానాయకుఁడగు విప్రనారాయణుని దివ్యపురుషునిగాఁ గారణజన్మునిఁగ జిత్రించెను. ఇతనిని మునిపుంగవునిగాఁ గవి తరువాతఁ జెప్పెను. ఈకవి విప్రనారాయణుని నామము లనుగూడఁ దెలుపలేదు.

తమ్మన యీ కథాభాగము నన్యథావర్ణించెను మండంగుడి పురమునందు లక్ష్మీనారాయణుండను బ్రాహ్మణదంపతులు విష్ణుభక్తి పరాయణులు నతిథి సత్కారశీలురు కలరని వర్ణించెను. ఒకనాఁడొక



డాక్టర్ పల్లా దుర్గయ్య

యతివరుఁడు వీరి గృహమునకేతెంచి యనపత్యుల చేత భిక్షనొల్లననిపోఁగా నామె సంతాన చింతకలుగుటయు, నారాత్రి యామె స్వప్నమున విష్ణువు సాక్షాత్కరించి నల్లని తెల్లనిపూవులుగల దండ నొసఁగిపోయెననియుఁ బిదప నావైజయంత్యంశమున నామె గర్భము దాల్చి పుత్రునిఁగనినట్లు వర్ణించెను. ఇట్లు పుట్టిన శిశువునకు విప్రనారాయణ నామమిడి తలిదండ్రు లుపనయన విద్యాభ్యాసాదులు కావించినట్లు వర్ణించి కవి తన కథానాయకుఁడగు విప్రనారాయణుని విష్ణు ప్రసాదమున జనించిన సాధారణమానవునిగను, విష్ణుభక్తునిగను, విరాగిగను జిత్రించెను. ఈ ఒక్క విషయమే వీరిరువురి ప్రబంధములలోఁ బాత్రపోషణా రీతులందు గోచరించు తారతమ్యమునంతటికిని బ్రధాన హేతువనఁదగియున్నది. కథాకల్పనమునందలి ఈ షడ్భేదమునకును నిదియే మూలము. మల్లన విప్రనారాయణుని సుందరమూర్తిగా వర్ణించి, యతని జ్ఞానవైరాగ్యముల నత్యధికముగా వర్ణించి, పెద్దనామాత్యుని ప్రవరున కతనిఁ బ్రతిబింబముగాజిత్రించెను.

---

తమ్మనకవి విప్రనారాయణునిగాక యతని జననీ జనకులను, (నామాదులనుగూడఁ దెలుపుచు) గొంతవఱకు మనుచరిత్రమునందలి సోమిదమ్మ ప్రవరాఖ్యుల ప్రతిబింబములఁ జిత్రించెను. మల్లనవలె విప్రనారాయణుని చక్కఁదనమును వర్ణింపకుండుట మాత్రమేకాక 'బోడి' యనియు, 'బోడదాసరి' యనియు నతనినిఁజెప్పుచు, దేవదేవి కతఁ 'డుట్టిఁబెట్టిన గుమ్మడికాయ' వలెఁ (పట్టెనామములచే) గనవచ్చెననియు, మరియు నిట్టే 'అఱవకోఁతి' యున్నగుమాటలచె వేశ్యమాతచేత గేలిచేయించెను. ఇతని వైరాగ్యమునుగూడఁ దమ్మయ సాధారణముగ వర్ణించెనేకాని యతిగాఁ జెప్పలేదు. వైజయంతీవిలాసములోని విప్రనారాయణుఁడు సుగుణశీలుఁడునగు సాధారణమానవుఁడేకాని మల్లనకవి కథానాయకునివలె స్వర్గమునుండి యవతరించిన దివ్యపురుషుఁడుకాడు. మల్లన విప్రనారాయణునకు శాపశక్తినిఁగూడ వర్ణించుట గమనింపఁదగియున్నది. ఇట్టి దివ్యశక్తులు కల్పించియు నతనిని శీలభ్రష్టునిగాఁ జేయుట యంత స్వాభావికముగాఁ దోఁపదు. మనుచరిత్రమునందలి ప్రవరునివలె ధీరుఁడుగను, నిశ్చలుఁడుగను నుండఁదగినవాడు. కాని, మల్లన యతని నొక సామాన్యకు లొంగఁజేసెను. కథ ననుసరించి ముందు (ఏ కారణముననైననేమి) గుణభ్రష్టుఁడుగాఁ బోవువాని నింతయుదాత్తముగాఁ జిత్రించుట యుచితముగాదు. తమ్మకవి యట్లుగాక యతనిని గుణవంతుఁడగు సామాన్యమానవునిగానే చిత్రించి కథలోఁ దదనురూపముననే ప్రవర్తింపఁజేసెను. తమ్మనవిప్రుని కురూపిగానే యాదినుండి సృష్టించెను. అట్లుచేయకున్న భవిష్యత్కథకు గొప్పలోపము కలుగు నవకాశముకూడఁ గలదు. విప్రనారాయణుని కథలో దేవదేవి కేవలము తన యక్కతోనాడిన పంతమును నెగ్గించుకొనుటకే యతనిసేవకుఁ గుదిరినదికాని యతనిని వలచికాదు. ధనరూపములను రెంటినే కామించెను. కావునఁ బ్రవరునివంటి యందగాడగు విప్రుని సన్నిధి నేకాంతమున నామె యెన్నడో వరూధినిగా మాఱక యేడాదపాటు నిశ్చలముగా నుండఁగలిగెననుట నమ్మరాని విషయముకదా! దేవదేవి యతినిఁ జూడఁగనే యతని యందమును దనయక్కకు వర్ణించి చూపును గదా! మల్లన వర్ణించిన చందముననుండుట నిజమే యైన నామె నిగ్రహము మెచ్చుకోఁదగినదికదా! కావున విప్రనారాయణుని మిక్కిలి రూపసిగా నీకథలో వర్ణింపకుండుటే కథాశిల్పవిశిష్టము తమ్మకవి విప్రనారాయణుని కురూపిగనే వర్ణించెను. అతఁడట్లు వర్ణించుట మన కవహేళనగాఁ దైకిఁ దోఁచును. కాని నిజమున కది యట్టిదిగాదు. కావ్యశిల్ప మర్మజ్ఞుడు కావుననే తమ్మయకవి విప్రుని విరూపుఁజేసి నిజముగనే పడుచుబోగముది యతనిచెంత నేకాంతమున నిశ్చలముగనుండి క్రమముగా నతనిఁ దనవలలో వైచికొనుట

సంభవమునునట్లు చిత్రించెను. ఇదికదా; పాత్రచిత్ర ణము! కథను అనుసరించి నాయికా నాయకులపాత్రలు చిత్రింపఁబడవలెను. మనుచరిత్రమునఁ బ్రవరుఁడు ధీరుఁడుగను, వరూధిని యధీరగను, మాయాప్రవరుఁడు వంచకుఁడుగానే యుండక తప్పదుగదా!

ఉద్యాన నిర్మాణమునకై కావేరీ తీరమునఁ దోఁటభూమిని పృథ్వీశ్వరుని బ్రార్థించి విప్రనారాయణుఁడు గ్రహించినట్లు మల్లనకవి వ్రాసెను. ఇట్లు చేయుటచేతను విప్రుని దివ్యత్వము గోచరించుచున్నది. తోఁట భూమిని వెలయిచ్చి విప్రుఁడు కొనినట్లు తమ్మ కవి వ్రాయుటయందితని సామాన్యమానవత్వమేకనుఁగట్టుచున్నది. తోఁటను నిర్మించుటను మల్లనకవి వర్ణించినంత విపులముగాఁ దమ్మయ వర్ణింపలేదు. మల్లనకవి వర్ణనము స్వభావసుందరముగను విశేష లోకానుభవద్యోతకముగను నున్నది. దేవదేవీమధుర వాణు లుద్యానమునఁ బ్రవేశించి విప్రనారాయణునిఁ జూడఁగా నతఁడు హరిస్మరణముచేయుచుఁ దోఁటలోని మొక్కలను బరిశీలించుచు వేశ్యలవినోదములకుఁ జెవి యొగ్గక వారినిఁ జీరికిఁగొనకుండుటయే దేవదేవి రోష హేతువైనట్లు మల్లన వ్రాయగా. వారుపోయిన సమయమున విప్రనారాయణుఁ డుట్టిఁబెట్టిన గుమ్మడికాయ వలెఁ గూర్చుండి, యనుష్ఠానముఁజేయుచుండెననియు. ననుష్ఠానము ముగించిపోవునపుడు వారు నమస్క రింపఁగా గ్రహింపక యతఁ డుపేక్షించెననియు నది దేవదేవిరోషమునకు హేతువయినట్లుకల్పించి తమ్మయ కవి యామె రోషమూనుటకుఁ దగినంతకారణము గల్గించెను. విప్రనారాయణుని విటునిగాఁజేయుటకుఁ "పంతము" నేర్పఱచుటయందును నీకవు లిర్వురును భిన్నమార్గము ననుసరించిరి. దేవదేవి యక్కయే తాను దాసియగుదునని ముందుగాఁజెల్లెలితోఁ బన్నిదము చఱచినట్లును, దానికి రోషించి దేవదేవియుఁ బిమ్మట నక్కచేతిలోఁ జేయివైచి వారిని బంపివైచి తా నచ్చటనే యుండినట్లు మల్లనకవి వర్ణించెను. (ఈసందర్భమున నుచ్ఛైశ్రవము రేఁకనలుపు చెప్పునను స్వల్పకారణముచేఁ గద్రువ వినతలు దాసీత్వమును బన్నిదము నఱచుట స్మరణకు రావచ్చును), ఈసందర్భమున దేవదేవి రోషమును గవి స్త్రీజనస్వభావసిద్ధముగా వర్ణించెను.

దేవదేవియే ముందుగాఁ బంతము ప్రసంగము తెచ్చినట్లును, అక్క (విప్రనారాయణుని చరితము నందువలెనే) దాసీత్వమును బన్నిదము చెప్పినట్లును, దానికి దేవదేవి యంగీకరింపక దానిలో విశేషము లేదనియు, నోడినవారు లంజికము వీడవలెననియు, దేవదేవిచెప్పఁగా మధురవాణి యంగీకరించినట్లును, తమ్మయకవి కల్పించెను. దీనిచే మల్లన విప్రనారాయణ చరిత్రములోని పన్నిదమును దమ్మయకవి యాక్షేపించి, అంతకుమించిన పన్నిదము నుంచినట్లుండవలెను, విప్రనారాయణ చరిత్రమును జదివియే దానితరువాత తమ్మకవి వైజయంతీవిలాసమును రచించినట్లు స్పష్టమగుచున్నది. పన్నిదము తరువాత దేవదేవికూడ నక్కతోఁబాటు గృహమునకేఁగి కొన్నిదినములకు మరల దాసరిసాని వేషముతో నుద్యానవనమునకు వచ్చినట్లు తమ్మయచెప్పెను. దేవదేవిచెప్పిన నిజవిరక్తి కారణముగూడ నిరువురు రెండువిధములఁ జెప్పిరి.

ఈ సందర్భమున విప్రనారాయణునకు దేవదేవి తన వృత్తాంతమును దెలిపినట్లును నతఁడామె దాస్యము నంగీకరించినట్లును చెప్పి మల్లనకవి యిరువురకు సంభాషణమును మాత్రము సంఘటింపలేదు. కాని తమ్మకవి వీరిరువురిమధ్య సంభాషణము (సంవాదము)ను బెంచి విప్రనారాయణుని మనోదౌర్బల్యము దెలియఁజేయునట్లు చిత్రవాగ్రచనలో సల్లాపము జరిపించెను. ఈ సంభాషణము మను చరిత్రములోని వరూధినీ ప్రవరాఖ్యుల సంభాషణ

ముఖ్యములని తలంపఁబడినవి ఇటఁ దెలుపబడెను. ఇప్పటికి గ్రంథముల యొక్క ప్రాశస్త్యము యథాశక్తి స్పష్టపరుపఁ బడెను.

ఇఁక నిందలి నీతినిగూర్చికూడ క్లుప్తముగాఁ దెలుప యత్నింతును.

వైజయంతీవిలాసము : నీతి —

విప్రనారాయణచరిత్ర వైజయంతీవిలాసములలో విప్రనారాయణు చరిత్రమున కధిక ప్రసిద్ధిని యశఖ్యాతి కాని విశేషముగా నిప్పటికిని లేదు. కాని వైజయంతి విలాసమునందలి నీతినిగూర్చి కొన్ని యభిప్రాయములు కలవు. కాని ఈ గ్రంథ మవినీతిని బోధించుటకుమాత్ర ముద్దేశింపఁబడినది కాదు. జనసామాన్యమున కత్యంతాపసనమగు గొప్పనీతిని బ్రధానముగా బూరించుటకే కవి ఈ కావ్యమును రచించెను. ఇందలి విప్రనారాయణుని కథాద్వారమున వేశ్యలయొక్కయు, వేశ్యమాతలయొక్కయు వెడమాయలను మరియు వారి కల్లిబొల్లి వలపులలోఁ జిక్కుకొనువారు పొందు సంకటములను స్పష్టముగా వర్ణించి తెలుపుటకును మరియు, యాదార్థ్యమును బోధించుటకును గవి ఈ కావ్యమును రచించెను.

జితేంద్రియుండును విష్ణుభక్తుఁడునగు విప్రనారాయణునివంటి సజ్జనునిగూడ దేవదేవియను వేశ్య యతని నియమము నెట్లైనఁ జెరుపఁ బ్రతిజ్ఞఁజేసి, కల్లబొల్లి మాటలచే నతనిని నమ్మించి దాసురాలిగాఁ జేరి కపటనటనలచే నతని చిత్తమున మోహమువుట్టించి వెఱ్ఱి తలకెక్కించి యతనిని లోఁబఱచుకొని విటరాయనిఁగావించి పంతము తీరఁగనే యతనిని విడిచి తన విజయవార్తను సోదరి కెఱిఁగింపఁ దన యింటికిఁ బయనమయ్యెను. విప్రుఁ డామెవలపుటుచ్చులోఁ దగుల్కొని విడువలేక వెంటఁబడెను. కాని కొన్ని దినములు కాఁగానే యతఁడు ధనహీనుఁడని రోసి దేవదేవి—

కం॥ "పాది నప్పయు నేనును బ
న్నిదమాడిన కోసమితని దెచ్చితి నిఁక నా
కొదవపని తీరెనిఁక ని
కొదవయె యనిపల్కె........"

తల్లిచే నతని నిల్లు వెడలఁగొట్టించెను అట్లు వెడలఁగొట్టఁబడియును నగ్నమగు వలపుచేఁ దనయందు దేవదేవి కధికానురాగముఁ గలుగుచుండెను. వేశ్యల మాయల నెరుఁగఁజాలని యిట్టివిటుల మనస్తత్వమును గవి—

"కేవల పైత్యభ్రాంతుఁడు
భూవలయము దిరుఁగగన్పు పూనికవశుఁడై
తావలచినట్టి వానికి
స్త్రీ వలచిన యట్టులుండుఁ జిత్తము లోనన్—"

అను మాటలలోఁ జెప్పెను. చేయునదిలేక దీనుఁడై, నీ కృపావిభూతి నీ బంటుబంటుల పాదధూళిమీఁద బఱఁగజేయుమని రంగశాయినిఁ బ్రార్థించెను. శ్రీరంగనాథుడు భక్తునిఁ గరుణింపఁదలఁచి శాంబరీపటుడై స్వయమర్థచోరుఁడై గిన్నెతెచ్చి విప్రనారాయణుని శిష్యుడనని చెప్పి వేశ్యమాతకిచ్చెను. ఈ సందర్భమునఁ గవి---

"సతతము బ్రహ్మరుద్రసురసంయమిముఖ్యుల నాత్మమాయ మో
హితులుగజేయుసామి వెలయింతిని మోహితఁ జేయలేక ప్రా
కృతజనునట్లు తాను దనగిన్నె నొసంగెను బంటుకోసమై
యతకరి వేశ్యమాత వెడమాయలజేయలు విష్ణుమాయకున్"

అనిచెప్పి విష్ణుమాయకూడ వేశ్యమాయను జయింపలేదనఁగా మనుజు లెంతవారని కవి సత్యమును బ్రకటించెను. ఇది నిజమే తన మాయానాటకమును దుదకు విష్ణుమూర్తి—

"లీలావినోదమునకై
యీలాగున నేను వీరి నిరువుర రతి రా
ట్కేలింగూర్చితి మధ్యన
మాలికయితఁ డప్సర:ప్రమద యీసతియున్"

రాజసభలో స్వయముగా నెల్లరకుఁ దెల్లముచేసెను. కాని దేవదేవి యెందులకు విప్రనారాయణునకుఁ బరిచారిక యయ్యెనో యేల యిలువెడల నడచెనో యను వారి రహస్యము విప్రనారాయణునకుఁ జీవఅకును రహస్యముగనే యుండిపోయెను. ఈ విప్రనారాయణుని కథను మూడుభాగములుగా విడఁదీయవచ్చును. అందు మొదటిది విప్రనారాయణుని వైరాగ్య విష్ణుభక్తి వర్ణనముతోఁగూడినది. అట్టి వైరాగ్య భక్తిసంపన్నుడగు విప్రనారాయణుని చిత్తదార్ఢ్యమును జయింపఁదలఁచి దేవదేవి కపటోపాయమున నతనిఁజేరి తన హావభావ శృంగారాదులచే నతనివజ్రపంజర నిభంబైన సద్భావము గ్రమముగా ద్రవింప నతని వైరాగ్యముపై విజయము సాధించి పంతము నెగ్గింపుకొను పర్యంతముగల భావము రెండవది అనంతర కథాభాగము మూఁడవది. శ్రీరంగస్వామి తన భక్తుని కొరకు స్వయంచోరుఁడై యతని నిక్కట్టులోఁబెట్టిన వేశ్యమాతకు గిన్నెనిచ్చి యతనిని సంకటావస్థనుండి కడతేర్చుట యను నీ భాగము కొందఱ కాశ్చర్యముగఁ దోఁచును దీనికి కారణ మీ కథ మన పురాణాదుల లోనిదికాక, ద్రవిడ ప్రబంధములలోనిదై యుండుటయు నొక కారణమై యుండవచ్చును ఏలయన రాజద్రవ్యంబును దన కైంకర్యమునకు వినియోగించి తానీషాచేఁ జెఱపెట్టఁబడిన తన బంటగు భద్రాద్రి రామదాసునకు బంటుగానేఁగి శ్రీరామచంద్రమూర్తి ఆఱులక్షల వరహాల నర్పించెనని చెప్పిన మన కే మాత్రము వింతగాఁదోపదు పై కథలో శ్రీరంగనాథుఁడు విప్రనారాయణుని శిష్యుఁడనని పోయిచేసిన పని ఇంచుమించు శ్రీరామచంద్రుఁడు రామదాసు కొఱకుఁ జేసిన పనివంటిదే యనవచ్చునేమో ? విప్రనారాయణుని చెఱుప దేవదేవి పంతముపూనుటకు ఫలితముగా నామెయొక్క పడుపువృత్తిని శాశ్వతముగాఁ బరిత్యజించనది. దేవదేవి విరక్తయై విష్ణుభక్తురాలిగా మారినది విప్రనారాయణుఁడు తొండరడిప్పొడి ఆళ్వారై వైష్ణవులకు సదా పూజ్యుడయ్యెను. కావున నీ కావ్య ముత్తమమైనదే యని తోచును గదా !

**తమ్మయకవికాలము :** ఈకవి కాలమును గూర్చి యభిప్రాయభేదము కన్పట్టుచున్నది. వైజయంతీ విలాసము శ్రీరామచంద్రునకుఁ గృతి యీయఁబడియుండుటచేఁ గృతికర్తనుబట్టి కవికాలమెఱుఁగు నవకాశము లేదు. కృత్యాదిలో నీకవి తాను మహమ్మదు శాహి గోలకొండను బాలించుకాలమున గోలకొండకరణముగానున్నట్లు తెలుపుకొనిన యొక యాధారమునుబట్టి ఈ కవికాలమును బలువురు బలువిధములుగా నిశ్చయించి యున్నారు తమ్మకవి కాలము క్రీ శ. 1581-1614 అని శ్రీ వీరేశలింగము పంతులుగారును, 1465వ సంవత్సర ప్రాంతమని శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారును, 1600 ప్రాంతము రచనా కాలమని విప్రనారాయణపీఠికారచయితలును దెలుపుచున్నారు. కాని కృత్యాదిలోఁ దమ్మయగారు పేర్కొనిన మహమ్మదు శాహి శ్రీ వీరేశలింగముపంతులుగారు తలఁచినట్లు మహమ్మదు కులీకుతుబ్షాహికాఁడనియు, నితఁడు బహమనీ రెండవ మహమ్మదుషాహ (క్రీ శ 1481-1581) అను మఱియొక ప్రభువని తలంపవలయునని తెలుపుచుఁ దమ్మయకవి క్రీ శ. 1500 ప్రాంతమున గోలకొండకుఁ గరణముగానుండ వైజయంతీ విలాసమును వ్రాసియుండునని యొకక్రొత్త సిద్ధాంతమునుజేసిరి. ఆంధ్రకవి తరంగిణి భా. 8. పు. 86లో వీరు 'వైజయంతీ విలాసరచనను క్రీ శ. 1510 ప్రాంతమని స్పష్టపఱుచుచున్నది. అట్లుకాదను

టకు బలవత్తరములైన యుపపత్తులులేవు" అని వ్రాసిరి. కాని తరువాత వీరే యాంధ్రకవితరంగిణి భా. ౧౧ పు. 69 లో "సారంగ తమ్మయ రచించిన వైజయంతీవిలాసమునందలి కథయు, నీ విప్రనారాయణ చరిత్రమందలి కథయు నొక్కటియేయై యున్నవి. ఇరువురును సమకాలికులే. ఒకరికావ్య మొకరు చూడక వ్రాసియుందురు" అని వ్రాసియున్నారు. చెదలువాడ మల్లనకవి కాలము క్రీ. శ. 1580 ప్రాంతమని శ్రీ శేషయ్యగారే యందు నిశ్చయించిరి. వీరిట్లు రెండు గ్రంథములయందు రెండు విధముల వ్రాయుట చింత్యము. అయినను మొదట వ్రాసినదానికంటెఁ బిదప వ్రాసినదే ప్రామాణ్యమగును గావునఁ దమ్మయకవి వీరియభిప్రాయము ప్రకారము కూడఁ బదునారవ (16వ) శతాబ్ది చివరవాఁడే కాఁగలఁడు. కావున శ్రీ వీరేశలింగము పంతులుగారు తెలిపిన కాలమునే ప్రామాణ్యమైనదని నిస్సంశయముగా విశ్వసింపవచ్చును.

చెదలువాడ మల్లనకవినిగూర్చి కూడ నొక విషయము తెలుపవలసియున్నది. ఇతని కాలము క్రీ. శ. 1585వ సంవత్సర ప్రాంతమని విప్రనారాయణ చరిత్ర ప్రథమముద్రణ పీఠికలో శ్రీ మంత్రి రామయ్య పంతులుగారును, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారును నిర్ణయించిరి. ఈ పీఠికాకర్తలలో నొక్కరగు శ్రీ మల్లాదివారే కళాపూర్ణోదయమునకుఁ దాము వ్రాసిన పీఠికలో మట్ల యనంతభూపాలుని సిద్ధవట శాసనము నాధారముగఁ గళాపూర్ణోదయ రచనాకాలము క్రీ. శ 1630 ప్రాంతమైనట్లు నిర్ణయించియుండుట విదితమే. కావున వీరి యభిప్రాయానుసారము మల్లనకవి పింగళి సూరనకవికిఁ బూర్వుఁడగుచున్నాఁడు. కాని విప్రనారాయణ చరిత్రమునందును, గళాపూర్ణోదయమునందును. నొకటి రెండు పద్యములు సమానభావము శైలి కలవిగానుండుటచే మల్లనను సూరనయనుకరించుట సంభావ్యము కాకపోవుటచేతను, గళాపూర్ణోదయమున నా సందర్భముననే యింకను నట్టి భావములుకల పద్యములు చాల నుండుటచేతను పింగళిసూరన కళాపూర్ణోదయములోని పద్యములనే మల్లనకవి యనుకరించినట్లు విశ్వసించి, సూరనకవియే మల్లనకవి కంటె పూర్వుఁడని భావించుచున్నాను. సూరన పదునారవ శతాబ్ద్యుత్తరార్ధమువాఁడగుటఁ బలువురు విమర్శకుల యభిప్రాయముమై యుండుటయు నీ యూహకుఁ బ్రోద్బలకము. కావున నీరెండు గ్రంథములందలియు నా యీ పద్యము లుదాహరింపఁబడుచున్నవి.

"అకటా! యేమని దూఱుదాన మిము నాథా! వేగు
జామయ్యెఁ; బొం
దిక గాఁ బాదములొత్త రమ్మనుట గాని, యింటియేమో
కదా,
నికటస్థానికి నేఁగుదెమ్మనుట గాని కొంత నెయ్యంపుఁ బూ
నికతోఁ గన్నులు విచ్చి చూచుటయె కానీ లేద
యొక్కింతయున్"
(కళా. ఆ 4. ప. 116)

"రామైనఁ గొంతమేల్ నా
రాయణ మిమునసుకంటె! రహీనిక నెపుడున్
మీయింతఁ జవెవరె? యని
యాయంగన యతనిపాద మల్లిఁ బట్టెన్"
(కళా. ఆ. 4. ప 119)

"ఏమని దూఱుదాన నొకయేఁడగానున్నది నిన్నుఁ
జేరియో
భూమిసుపర్వ! తోఁటపనిపూనిక వేళనకాని యెప్పుడుం
బ్రేమను జేరవచ్చుట యభీష్టముఁ జెప్పుట మంచి
చూపుచే
నామొగముం గనుంగొనుట నవ్వుటగాన మ
యించుకేనియున్"

"ఏనుదక్కినట్టి యంతుల యట్లకా
దకట! యధికనే సమస్తవిదుఁడ!
పెక్కులేలయోర్వఁ బియుండ యింకవి డంబ
మనుచుఁ జేరిపట్టెనంఘ్రి తలము" (విప్రనా. చ.)

విప్రనారాయణచరిత్రముసంచలి పై రెండుపద్యములును నాగ్రంథపీఠికనుండి యుదహరింపఁబడినవి. పీఠికలోని సూచననుబట్టి యీ పద్యములు తృతీయాశ్వాసములో 76వ పద్యము తరువాత నుండఁదగినవి. కాని యెంత వెదకినను గ్రంథములోపల నివి గనరాకుండుటఁజేసి పీఠికనుండియే యుదాహృతములయినవి. ఇవి ఇటివంటచే నుభయగ్రంథములనుండి సమానములగు మఱికొన్ని పద్యములు చూపబడుచున్నవి.

"తోరంపుజనుదోయి త్రుళ్ళింతల నిడంగఁ
దగుచోట్లగుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి
వ్రేగైనపిఱుదు బల్విడిఁ జలింపంగను
వడి నిట్టునట్టును నడబి నడచి
యడుసుతుంపురు చెక్కుటద్దంబులను బర్వ
మళ్ళకు మడవలు మార్చిమార్చి
నడుములేదీవియ నకనకల్ గుడువ నిం
పుంచగు మోపులుమోసిమోసి"
(కళా. ఆ. 4 ప. 9 పే.)

"లుబ్ధకాద్భుతసితస్తబ్ధరోమాకృతిఁ దలపోయుచును
నేలద్రవ్విత్రవ్వి
... ... ... ... ... ... ... ...కట్టలుగట్టి కట్టి
... ... ... ... ...వెలుచుచుఁ గాలువల్ దేర్చి తీర్చి
... ... ... ... ... ... ...మళ్ళకుగొలిపికొలిపి"
(విప్రనా. చ. ఆ. 2 ప. 21)

"అంట్లొత్తుపదనున నంట్లొత్తునెలమిఁ గొన్పించు
లేఁగొమ్మలు వంచివంచి
నారువోయఁగవలయుచో నారువోయుఁ
గొమ్మనాటంగఁదగు నెడగొమ్మనాటు"
కళా ఆ 4 ప 78)

"కొన్నిటికి నారునాటుచుఁ
గొన్నింటికి నంట్లుపాదు కొలుపుచు మఱియుం
గొన్నిటికి విత్తనములు త
గన్నాటుచుఁ దోఁటసేయఁగడఁగె నయంబున్"
(విప్ర. చ ఆ 2. ప. 2?)

ఇట్లే ఈక్రింది పద్యములకుఁ గొంతపోలిక కననగును. కళా:-ఆ. 4. ప. 81, 22—విప్ర:-ఆ. 2. ప. 29-32.

ఇటిపోలికలు వెదకిన నింకనుఁ గనరాఁగలవు. వీనివలనఁగూడ పింగళి సూరనకవి యీ చెదలువాడ మల్లనకంటెఁ బూర్వుఁడేయనుట స్పష్టము.

# విజయవిలాసమందలి చేమకూర పాకవిశేషము

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి.

కావ్యమున కాత్మరసమని భరతాదులును, నలంకారమని భామహాదులును, గుణమని దండ్యాదులును, రీతియని వామనాదులును, ధ్వనియని యానందవర్ధనాదులును, వక్రోక్తియని కుంతకాదులును, ననుమితియని మహిమభట్టును, నౌచిత్యమని క్షేమేంద్రుదులును, ప్రతిపాదించినను, పై ధర్మములన్నియు చమత్కారమునం దంతర్భూతమైయున్నవి కాన, చమత్కారముగల కావ్యమే సహృదయ హృదయాహ్లాదనీయమగుచున్నది కాన, చమత్కారములేని కావ్యము, కావ్యమనిపించుకొనదు కాన, చమత్కారమే కావ్యమున ముఖ్యాతిముఖ్యమగు ధర్మముగానుండవలయుననియు, నందుచే నదియే కావ్యమున కాత్మయని యంగీకరింపఁబడినది. చమత్కారము నాలంకారికులందఱు స్థూలముగా నంగీకరించినను నీమతమును స్పష్టముగా ప్రతిపాదించి తన చమత్కారచంద్రికయందు సిద్ధాంత మొనరించినవాడు క్రీ శ. 14వ శతాబ్దమునకుఁ జెందినవాడు విశ్వేశ్వరుడు. ఈ చమత్కారమునే చారుత్వమనియు, వైచిత్రియనియు, విచ్ఛిత్తియనియు, రమణీయతయనియు, వక్రోక్తియనియు వివిధాలంకారికులు బర్యాయపదములుగా వాడినారు.

వివిధకవులు దమకావ్యములలో చమత్కారము ననేకరూపముల చేయుదురు. కొందఱు శబ్ద చమత్కారమును, మఱికొంద అర్ధచమత్కారమును, నింక కొందఱు భావచమత్కారమునుజేసి పాఠకుల నానందపరవశులఁ జేయుదురు అందుచేతనే 'ఉపమా కాళిదాసస్య, దండినః పదలాలిత్యం, భారవే రర్థ గౌరవం' అని యొక్కొక్కరియం దొక్కొక్క గుణవిశేషము ప్రకాశించినది. అట్లే తెలుగుకవులలో 'నన్నయ యక్షర రమ్యత, తిక్కన రసాభ్యుదయతయు, శ్రీనాథుని ప్రౌఢ రచనయు, నల్లసాని పెద్దనార్య నల్లికజిగి, ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు, పింగళి సూరన కథాచమత్కారము, రామరాజభూష

ఱుని శ్లేష వైచిత్రి, తెనాలిరామకృష్ణుని ప్రౌఢవిన్యాసము' ప్రసిద్ధి నొందినవి కాని యీ గుణవిశేషములన్నియు నొకే కవియందు గోచరించుట మాత్రము దుర్లభము అయినను చామకూర వెంకన కవి కృతవిజయవిలాసమున నీ గుణములలో ననేకములు గోచరింపఁగలవు శైలికిసంబంధించి నంతవరకు సంస్కృమున 'దండినఃపదలాలిత్యం' అని యెట్లు ప్రసిద్ధికలదో, తెలుగున పదలాలిత్యమునకు చామకూర వెంకనకవి తన విజయవిలాస రచనమువలన నంత ప్రఖ్యాతి గణించెను. సంస్కృతాంధ్రభాషలలోఁగల లాలిత్యమును గుర్తుకుఁగొని, మృదుమధురముగా విజయవిలాస ప్రబంధము నితడు రచించినాడు. ఇది నన్నయార్యుని యక్షర రమ్యతను, ముక్కుతిమ్మనార్యుని ముద్దుపలుకును గూడ నతిశయించినది. అందుచే,

'సంగీతమపి సాహిత్యం సరస్వత్యాఃస్తనద్వయం
ఏకమాపాత మధుర మన్య మాలోచనామృతం'

అని యనబడినను, చామకూర వెంకన కృతవిజయవిలాసము విశేష చమత్కారములతోఁగూడి యాలోచనామృతమే కాక, సరస మృదుమధుర కవితాశైలి వలన నాపాతమధురమైనది కూడ. ఇందుచే సంగీతమునకు సిద్ధించిన ప్రయోజనముకూడ దీనికి సిద్ధించినదనవలయును ముక్కుతిమ్మన ముద్దుపలుకని ప్రఖ్యాతికెక్కిన పారిజాతాపహరణము ప్రథమాశ్వాసముతోడనే ముద్దంతయు తీరిపోవును, కాని పోను పోను తర్వాతియాశ్వాసములఁ జదువ కుతూహలపడము. అల్లసాని పెద్దనార్యుని యల్లిక జిగియంతయు మను చరిత్రలోని మొదటి మూఁడాశ్వాసములను చదివిన పిమ్మట నాకవితకై తాపత్రయపడము. శృంగార నైషధ చతుర్థాశ్వాసమందలి నలదౌత్యమున మెఱసినట్టి శ్రీనాథుని ప్రౌఢకవిత్వ మితరాశ్వాసములలో నంతగా నొప్పదు. వసుచరిత్రమందలి శ్లేషకవిత్వము మనోరంజకమైనను, నదీపర్వతముల ప్రణయ మస్వాభికముగను, ప్రయత్న పూర్వకమువలెను గనుపించును. పింగళి సూరన కృతకళాపూర్ణోదయము కథాచమత్కారముగలదైనను, ముద్రారాక్షస నాటక కథవలె పాఠకుల నుక్కిరి బిక్కిరి చేయును. అందలి ప్రథమాశ్వాసకథయు, చతుర్థాశ్వాసమందలి సుగాత్రీశాలీనుల కథయువలె నితరభాగములు హృదయావర్జకములుగావు తిక్కనకవితలో ద్రౌపదీ కీచక ఘట్ట, శ్రీకృష్ణ రాయబారములందలి రసవత్తర ఘట్టములవంటి ఘట్టములందంతటను గలదా? అట్లే నన్నయార్యుని కవితలోఁ గూడ నక్షరరమ్యతయు, ప్రసన్న కథాకలితార్థ యుక్తియు సర్వత్రలేదుకదా! కాని పైన నుడివిన వివిధకవుల పలువిధకవితా విశేషములన్నియు విజయవిలాసమున నేదోవిధమున, నెక్కడో యక్కడ వ్యాపించియే యున్నవి ఇతరకావ్యములవలె నిందేదో యొకభాగము మాత్రమే శ్రేష్ఠమైనదని చెప్పరాదు. సామాన్యముగ ప్రతి కావ్యమున మొదటి భాగము మాత్రము రమ్యతరముగానుండి, పోను పోను చివరకు సర్వసామాన్యముగా తేలిపోవును. కాని విజయవిలాసమున మూఁడాశ్వాసములు [illegible] మూఁడు కల్యాణఘట్టములును పూర్వ[illegible] నుత్తరోత్తరములు శ్రేష్ఠతరములుగా పరిణమించినవి. ప్రథమాశ్వాసమందలి యులూచీప్రౌఢ నాయికావిలాసము మనుచరిత్రమందలి వరూధినీ ప్రవరులకథ నతిశయించినది. ఏలన, నందు ప్రేమానురాగ మేకదేశమై చివరకు రసాభాసముగ పరిణమించినది. తాతాశశాంకమున ప్రౌఢనాయికా ప్రణయ వృత్తాంతమయ్యు, రసాభాసము కాకపోయినను, పరకీయ యగుటచే నాయిక, నీతి భ్రష్టమైనది. కాన నుత్తమమైనదికాదు ద్రౌపదీ కీచక వృత్తాంత మేకదేశమై, రసాభాసమగుట యేకాక, నాయిక పరకీయయగుటచే, నీతిభ్రష్టమై చివఱకు కీచకుని ప్రణయము మరణముగాపరిణమించి

చిప్పరు జొంపపు మాపె జీబుమాయము చేసి
పసిడి ముక్కెరగదా బిగిబట్టేమి
నిద్దంపుటొసపులు ఉన్ని యుపాన్పు పగఁబ్రాకు
యలరులపాన్పుదా హత్తుటేమి

గీ॥ మసమసకసంజకెంజాయ మఱుగుపెట్టి,
మిసిమికెంపుల కాంతి దా మెరయుటేమి
మొదలనేగంగతటి నున్నయది యులేదొ
మాయయో కాక యది యంచుమరలిమాడ. I-75

సీ॥ బెళుకు కాటుక కంటి సొలపుఁజూపెవలోన
బట్టియుండెడి ప్రేమఁ బట్టియీయ
జికిలిబంగరు వ్రాత జిలుగుటొయారంపుఁ
బైట సొబ్బులగుట్టు బైలుపేయ
సొగసుగుచ్చలసేటు వగలుకన్నులపండు
గలుగ మాయపుగొనుగలుగఁజేయ
నిడుదసోగమెఱుంగు జడకుచ్చగరువంపు
బిఱుదు రేఖకు గెల్పు బిరుదుచాటు

గీ॥ గంటుపెదనంబు కస్తురి కమ్మవలపు
కప్పురపువీడియవుఁదావిగలసి మెలఁగ
నొఱపులకు నెల్ల నొజ్జయైయుండె నప్పుడు
భుజగగజగామిని మిటారి పొలుపుమీరి. I-76

ఇందు మొదటిపద్యములో నంత్యప్రాసను, రెండవ పద్యమందలి పాదములలో నుత్తరభాగములందు యతిస్థానమునందలి యమకమును గమనించునది. సమాసములలో గణయతిప్రాసముల కనుగుణముగా సంస్కృతి శబ్దములను మలచికొనుటలో శ్రీనాథుడెంత సమర్థుడో, దేశ్యపదములను మలచికొనుటలో చేమకూర వేంకనయంత దక్షుడు.

తిక్కన యచ్చతెలుగు పదములతో సరళముగా దేశ్యపదజాలమును వాడినమాట సత్యమే. కాని యతని రచనకు వెంకనశైలిలోఁగల లాలిత్యము, మాధుర్యము నలవడలేదు. తిక్కన దేశ్యపదజాలము నన్నెచోడుని జాను తెలుగున బోలినది. అది నన్నెచోడుని సంస్కృతశబ్దజాలము ముందు వైలక్షణ్యమును సంపాదించుకొనినదేకాని యంతకంటె విశేషములేమి చూడుడు తిక్కన రచన.

సీ॥ తన్వంగిమవ్వంపుఁ దనులత నెసగెడు
నునుకాంతి వెల్లువ మునుఁగఁబాఱఁ
గిసలయహస్త కెంగేల నేపారు
క్రొమ్మించనులేయెండ మిగుల పర్వఁ
గమలాస్య ముద్దుమొగంబు కేమెఱుగుల
మొత్తంబుపరి చుట్టుముట్టికొనఁగ
ధవళాక్షి తొంగలిఱెప్పల చెన్ను
కప్పును చీకటిగవియు వెర

గీ॥ బెగ్గలంబంతకంతకు నగ్గలింప
నొదవుచెమటతోఁ జిత్తంబు సెదరి యెందు
మెలగఁదలఁపేది యా సింహబలుఁ దనంగు
పట్టియాడెడు జంత్రంబు పగిది నుండె

విరాట-II-37

ఇందు దేశ్యపదములతో తిక్కన తనభావములను దాగుడుమూత లాడించినాడు కాని శబ్దాలంకారముల జోలికి పోలేదు. ఇంక ముక్కుతిమ్మన ముద్దుపలుకులఁ గనుడు.

సీ॥ మగమీలసగఁజాలు తెగఁగీటుకొన వాలుఁ
గనుగవ కొకవింత కాంతియొదవె
వలిజక్కవల పెక్కువలు దక్కువగనిక్క
చనుదోయి కొకవింత చాయదోఁచె
నెలతమ్మెదలనిమ్ము వెలిజిమ్ముచెలువమ్ము
గలవేణి కొకవింత నలుపుమీరె
నలచెందొవల విందు చెలువొందు వెసఁజిందు
మొగమునకొకవింత జిగిదొలంకె

తే॥ జక్కదనమున కొకవింత చక్కదనము
జవ్వనంబున కొకవింత జవ్వనంబు

విభ్రమంబున కొకవింత విభ్రమంబు
గలిగెనద్ది వ్యకుసుమంబుకతన సతికి
పారిజాత I 56.

పై పద్యమున ముక్కుతిమ్మన ముద్దగు దేశీయపదముల కూర్పులో వృత్త్యనుప్రాసముసుగూర్చి శైలికి మెఱుగు పెట్టినాడు. దానికి భావముగూడ తోడైనది. ఈ యనుప్రాసముల కూర్పే ముక్కుతిమ్మన రచనకు ముద్దు తెచ్చినదికదా చేమకూర వెంకన దేశ్యపద జాలము పలుకునుడికారముతో, చమత్కారనైపుణ్యముతో, చిన్నెలు వన్నెలు నలవరచుకొన్నది. అచ్చ తెలుగుపేరితో పొన్నిగంటి తెలగనార్యుడు యయాతి చరిత్రమును, కూచిమంచి తిమ్మన నీలాసుందరీ పరిణయము, నచ్చ తెలుగురామాయణము రచించిరి కాని యా పదములును బాషయు కృత్రిమములును, వికారముగ నున్నవేకాని, సహజముగ లేవు. చేమకూర వెంకన తత్సమభాషను పరిహరించలేదు. కాని సంస్కృత పదజాలముకంటె దేశీయ పదబాహుళ్యమునే బాహాటముగవాడి, యా భాషలోని జన్గుగ్గల సౌయ్యారముగ వాడి చూపినాడు దీనికి తోడనుప్రాసాద్యలంకారములు శైలికి రమ్యము తెచ్చినవి. ఈ పద్ధతి నీతడువాడిన సంస్కృత పదజాలమునఁ గూడ ద్యోతకమగును. ఈతడువాడు దీర్ఘ సంస్కృత సమాసములందుఁగూడ నీనియమము దప్పి వాడుగాడు. నన్నయభట్టక్షరరమ్యతతో నధిక సంస్కృత శబ్దజాలమును తన కవితలో నుపయోగించినాడు కాని యతని పదజాలము దుందుభిధ్వానముతోఁగూడి గంభీరముగ సాగిన దతని సంస్కృత సమాస సంపర్గము చూడుడు.

సీ॥ త్రిభువనలక్ష్మి యేతెంచి యేకాంత మి
ట్లేలకో యున్నది యువ్వనమున
గగనమణిప్రభ గగనంబునందుండి
యవనీతలప్రాప్త యయ్యెనొక్కొ
శంభుండు లావణ్యసద్గుణ సముదాయ
మింద యిమ్మగ సంగ్రహించెనొక్కొ
పొలతియంగంబులఁబొంపిన భూషణ
శ్రీ యేమిపుణ్యంబుఁజేసెనొక్కొ
ఆ॥ అమరకన్యయొక్కొ, యక్షకన్యకయొక్కొ
సిద్ధకన్యయొక్కొ శ్రీ సమృద్ధి
సర్వలక్షణప్రశస్తాంగి యిది దివ్య
కన్యయగు ననంతకాంతి పేర్మి. ఆది: VII-73

నన్నయ తిక్కనల సంస్కృతదేశ్య శబ్దజాలము యథార్థమునకు బంగారువంటిది. కాని చేమకూర వెంకన సంస్కృతదేశ్యపద సమూహముపరంజి బంగారము వంటిది దానిలో వెంకనగూర్చిన యనుప్రాసాలంకారము లీయపరంజి బంగారులో రత్నములవాదిగి నట్లుండును. చేమకూర వెంకన సంస్కృత సమాసములకూర్పు సుకుమార సుందరమై, కుసుమపేశల సదృశమై కోమలహృదయుల నెక్కువగా నాకర్షించు నదైయున్నది. చూడుడు :

"ఉదంచదూర్మికా నికరవిలోల ఫేలదళినీ కలగాన లసత్ప్రఫుల్లహల్లక సుఖదోలికావిహ్వారి లాలసు బాల సమీరణుదొంగిలసి, I-52; నీహారకిరణ భృత్కురీర సాహిత్యము -I- 8; అనయ విద్వంసత్రయరత శిత కల్పమహీరుహంబనన్ -I-57; I-143-పూర్వపశ్చి మోత్తుంగ మహీధరాగ్రగముల తోయజాతప్రమిత్ర బృంద పతగకులాధిపధ్వజుని ప్రాణసుఖుండప్రపారసంబునను, క్షితిధరకన్యకాధిపతికిన్ ప్రతిజోదు సమిజ్జయంబునన్ I-28; అన్మణికంకణ కింకిణీ గణఝంకార సుహరమ్యలలో -I-105; దేవతాసతుల శోభనకాంతవిలాసవైఖరుల్, నాగకన్యకల లోక మనోహరరూపసంపదన్ - II-102; యదువంశ దుగ్ధవారాన్నిధిపూర్ణిమా విశదరశ్మిదరస్మిత చారువక్త్రకై-II-84; మదనమదనాగవలమాన మన సాంబురుహుడు పురుహూతసుతుడు - II-158: అత్తరళాయతేక్షణ కటాక్షవిలాసరసప్రవాహముల్- III-15; అక్కలశాంభోనిధి విచకల్పతరువు- III-

228; భోజావనిజా నిజానిజగృహాంగణసీమకు–III-104; తదీయవర్ణనీయి హావభావధీవయః కరన్మనోజ్ఞరేఖలెన్నగా–I-32."

ఈకవి నన్నయవలె దుందుభిధ్వానముతోనొప్పు దీర్ఘ సంస్కృతసమాస భూయిష్ఠమైన పద్యముల నక్కడక్కడ వ్రాయకపోలేదు. మహాప్రాణపరుషసంయుక్తాక్షరములతో తన పాండిత్యమును సంస్కృతభాషాప్రభావము గూడ ప్రకటించుటకో యను నట్లీపద్యముల నాతడు వ్రాసెను. కథాప్రారంభముననే

శా॥ చంద్రప్రస్తరసౌఖఖేన పరశ్యామాకుచద్వంద్వ ని
స్తంద్రప్రత్యాహలిప్తగంధకలనా సంతోషిత ద్యోధునీ
సాంద్రప్రస్ఫుట హాటకాంబురుహ చంచచ్చంచరీ
కోత్కరం
బింపారన్ హస్తపురంబు బాసిలు రమాహేలాకళా
వాసమై I-1

భుజంగప్రయాతము :

సునాసీరసూనుండు సూచెన్ని మజ్జ
జ్జనౌఘోత్పత త్పంక శంకా కరా త్మో
ర్మినిర్మగ్న నీరేజ రేఖోన్న మద్భ్రం
గనేత్రోత్కవశ్రీని గంగాభవానిన్. I-47.

ఇట్టివి కావ్యమందంతటను కలిపి మొత్తము పది పద్యములైనను కనపడవు. వెంకన సహజశైలి యిది కాదు. ఈతని సహజశైలి కటువును పరిహరించిన సంస్కృతదేశ్యపద సమ్మిశ్రమై యలతి యలతి పదములతోఁగూడిన సరళశైలి. ఈతని సహజశైలితోఁ గూడిన పద్యములలో నవకుసుమపేశల సదృశమైన సంస్కృతపద సమాసములును, తేటతెలుగుమాటల విన్నాణమును గలసిమెలసియుండి. యిది తత్సమము, మిదిదేశ్యపదమని తెలికగ గుర్తింపరాని మాయావిద్య వలెనుండి యనుప్రాసలతోఁగూడి యొప్పును, చూడు డీ పద్యములను

చ॥ జలరుహగంధి వీనులకు లేఁ గెనఁదమ్ముల బేమి
లెక్కసేన్
జెలియనఖాంకురాళి నెలచేడియసైకము దాని
జుక్కసెన్
బొలతుకగబ్బి చన్నుగవపువ్వులచెండ్లను లేదు
బంతసేన్
గలికి ముఖారవిందముల కల్వలరాయనిఁ
ద్రోసిరాజనున్. I-37

సీ॥ కేళికాసరసిలోఁ దేలియాడుటచేసి
శైవాలలతకొంత సాటివచ్చు
బుప్పమాలికలతోఁ బొందుసల్పుటఁజేసి
యెలదేటిగమికొంత యీడువచ్చు
గంటికింపసురేఖ గల్గియుండుటఁజేసి
మినుకుఁగాటుకకొంత దినసువచ్చు
బిరుదునొయ్యారంబు మెఱయుచుండుటఁజేసి
చమరివాలముకింత సమమువచ్చు

తే॥ గాక నీలత్వమున సరిగావుతెలియ
నెఱిగలిగియొక్కమొత్తమై నిడుదలై ద
ళమ్ములై మెఱుగులై కారుక్రమ్ముచున్న
వికచకమలాక్షిచను సోగవెండ్రుకలకు. I–35.

ఈవిధముగా సంస్కృతాంధ్రపదములు కలిసిపోయి శబ్ద భేదము పొడసూపక సాగినది, ఇది యీకవి రచనా విశేషము. ఇతరకవుల రచనలలో నట్లుగాక సంస్కృతాంధ్రపదములు కలిసినను నవి ప్రత్యేకముగ సుస్పష్టముగ తెలికగ గొచరించుచునేయుండును ఈకవి రస సుకుమారకవిత అనుప్రాసాది శబ్దాలంకారములలంకారములైనవి.

క॥ తనువగు శబ్దార్థంబులు
ధ్వనిజీవ మలంక్రియా వితానము సొమ్ముల్
తనరుగుణమ్ములు గుణములు
ఘనవృత్తులు వృత్తులౌర కావ్యేందిరకున్.
నరసభూ. I–53



శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

అనికదా. వానిని వెతకన బహురమణీయముగా వాడి నాడు. అవి సహజాలంకారములకలె నొప్పినవి కాక, మెరుపుసొమ్ములవలె బరువు చేటు కాలేదు. ఈ క్రిందిపద్యములలో వృత్త్యనుప్రాస యెంతమనో రంజకముగ, నవయుత్నముగ సాగినదో చూడుడు.

"విటపాళిర ఏగెటిపాటుర మించు"–I-4
"బాసలుచేసికొన్న వనభాసిలి"–I-5.

ఆ॥ నవ్వుపువ్వు నవ్వుజవ్వని నాసిక
చివురుపవురు జవురునుపిదమోవి
మబ్బుబుబ్బు గెబ్బుబిబ్బోకవతివేణి
మెఱుపునొఱపు బఱపుఁదెఱపమేను I–84

ఇందు 1, 3 పాదములలో వృత్త్యనుప్రాసము. 2, 4 పాదములలో ఛేకానుప్రాసము కలదు.

క॥ రపరవలు నెఱపునేలపు
రపరవణముతోడఁజెలియరాళకచంబుల్
కవకవనవ్వున్ వలి జ
క్కవ కవ కలకలకలకలకుచంబుల్ I-85

ఉ॥ బంగరు బొంగరాల పరిపాటి చనుంగవ, మీలనూటి త
ళ్కుంగనుదోయి, చంద్రుప్రతికోటిమొగం, బెడఁదట్టిధాటిక
న్నం గడుమేటివేణి, పులినంబులపాటిపిఱుం. దయారె చి
తాంగదపాటి జోటిగలదాయని మెచ్చుఁ గిరీటిమాటికిన్. I–150

ఈకవి వృత్త్యనుప్రాసకొఱకు సంజ్ఞావాచకమైన పేరు సందలి యక్షరములను మార్చుటకుఁగూడవెనుకాడడు. చూడుడు,

"కలకల నృగుయమండెడి నవ్యనాచి, నిందోపలరోచిఁ జూచి, తలయూచి- యులూచి రసోచితంబుగన్" I–63

ఇ ందిలూపియను పేరును వృత్త్యనుప్రాసమున కులూచిగా కవి మార్చినాడు. ఇట్టిదే మఱియొకటి. ఇవి ముక్కుతిమ్మన 'మగమీల' అను పద్యమును మించలేదా!

"తఘనయునలేచి, ఎడలేచి, అక్కరాంబుజం బొడిసి పట్టెఁజేసాచి సవ్యసాచి"–II-177.

ఈకవి ఛేకానుప్రాసరచనల సొగసునుగూడ తిలకింపుడు

క॥ రాకొమరు నెఱులునీలపు
రాకొమరు నిరాకరించి రాకాచంద్రున్
రాకొట్టు మొగము కెంజిగు
ర్వాకుఁగవి పరాకుసేయు నౌర పదంబుల్॥ I–65

"శా॥ చందః ప్రస్తర సాధ భేలన పరక్యాయు"

అను కావ్యప్రారంభపద్యమునసె రెండు ప్రాసక్షరములుగ గలవు నాలుగుపాదములందును. ఒకయక్షరము ప్రాసప్రాయుటకే కష్టి లుక్కిరిబిక్కిరి యౌదురే ఈకవి ప్రాసకు రెండక్షరములను, వానికోసం బిందుపూర్వకములు యు ప్రాసము లుంచుట క్లేశకరమో సంతోషకరమో విచారింపుడు. దీనినే కావ్యాలంకార చూడామణికర్త ద్వంద్వత్రిప్రాసమని నాడు (చూ. VII–82-84) ఈజాతికిఁజెందినదే మఱియొక పద్యము "దానవు లెన్నియేని Ac"I-57 ఇట్టివి యెన్నియేని పద్యము లీతని కవితయందున్నవి.

అంత్యప్రాసరచనలలో పోతనామాత్యుడు ప్రసిద్ధి. అతని యమకాలంకారముగూడ సొగసుగనేయుండును. నరకాసుర సంహారఘట్టమున చూడుడు.

"క॥ లేమా! దనుజుల గెలువఁగ
లేమా! నీవేల కడఁగి లేచితి? విటురా
లే, మాను, మానవేనిన్
లే, మావిల్లందికొనుము లీలంగేలన్॥"

"క॥ కొమ్మా! దానవనాథుని
కొమ్మాహవమునకుఁబొలగె; గురువిజయముఁగై

కొమ్మా! మెచ్చితి. నిచ్చెదఁ
గొమ్మాభరణములు నీవు కోరినవెల్లన్"

పై పద్యము లెంత మనోహరముగలేవు! వీనిని మించి నట్లు వెంకన యెన్నియో పద్యములు రచించినాడు చూడుడు.

క॥ ఆలోలనయనఁ గనుగొని
యాలోచనఁజేసె నృపతి యద్భుతమతియై
యాలో నిది, యచ్చరపో
యాలోకాకల్లమరుని యాలోయనుచున్. II-47

క॥ వాతెఱకు నమృతమేతుల
మేతుల కింపుల పిసాళిమిసిమిసి క్రొమ్మిం
చే తుల, చేతుల కజ్జము
లేతుల లేతులనెలందులిచెలి తులయే I-131

క॥ యమునానదిఁ గూడినతో
యమునా నది తనరెఁదత్కచామేచకమై. I-56

క॥ మునుకలు గంగానదిలో
నొనరించుటకన్న భాగ్యమున్నదే యనుచు
న్మను కలుగంగా దగి
.... .... .... .... .... .... .... .... I 55

క॥ ... .......... ... .... ... శుకపికశాలీ
మధులిట్టులు మలయా నిల
మదులిట్టులు తనదుధైర్యమహిమగలంపన్, I-149

ఆ॥ నలినలీలనంచు నలినలిగావించు
నించుమించులాడు నించుమించు
లెమనపుచూపు లేమన నగు బాపు
జగమెఱుంగు దాని జగమెఱుఁగు. I-36

ఆంధ్ర పదశ్లేష, సంస్కృత పదశ్లేష, సభంగశ్లేష, యభంగశ్లేష, భంగాభంగశ్లేష మొదలైన యారువిధము లైన శ్లేషలుకదా పేర్కొనఁబడినవి. ఈ యారు విధములైన శ్లేషలను విడమర్చి యొకప్పుడు ప్రక్క ప్రక్కను, మఱియొకప్పుడు, యథాస్థానమునకు నింకొకప్పుడు ప్రాక్స్థానమునకు జరిపి, యమకాలంకారమునుగూర్చి వెంకనకవి పద్యమును చమత్కారమును గూర్చును. ఇందుచే పద్యమునకు శ్లేషాలంకార సౌభాగ్యమును, యమకాలంకార సౌందర్యమును గూడ సిద్ధించి, శ్రుతి మనోహరముగను, హృదయ రంజకముగనుగూడ నుండి, కవితకు శోభగల్గించు చున్నది. ఈపదజాలము సందర్భశుద్ధిగలిగి పద్య గమనమును కుంటుపడనీయక, కృత్రిమ మనిపింపక, సహజముగ నడిపించుటలోనే యీకవి గొప్పతన మున్నది. ఇందులకు కవికిగల నేర్పేకాక, యత నికిఁగల సంస్కృతాంధ్రశబ్ద సమూహమపారమనియు, నా యా భాషలపై నధికారము గూడ నిరంకుశమనియు విశదమగుచున్నది. సంస్కృతాంధ్రశబ్దముల నఁ దెల్పించిన యట్లుమంగి, కోరినయర్థమీయగలుగను ఇది [illegible] కుతుహలంచు కు తిక్కనయు నాటనుండి [illegible] ములకు వేసు[illegible] సిద్ధు లందురు. కాని యూపద్ధ[illegible] కవి వారిద్దరిక[illegible] మిస్[illegible] నలంకారశో[illegible] గల డని విశదపఱచినాడు. ఇంకను పరిశీలింపుడు.

తే॥ ఈవెలందియొడల్ పైడిలోవెలంది
యూనెలంత లలాటంబు లేనెలంత
యూసుపాణి రదశ్రేణియేసుపాణి
యీ బిడారు మృగమద శ్రీ బిడారు I 130

నెలంత=స్త్రీ; లే+నెల+అంత=లేతనెలయంత, అని. ఇట్లే మిగిలినవి.

క॥ అన్నన్న మొగము వెన్నుని
యన్నన్న జయించు, గన్నులన్న [illegible] వినా
సన్నములు, నడుము మిక్కిలి
సన్నముమాటలు సుధాప్రసన్నము లెన్నన్ I 38

అసన్నము—సన్నము—ప్రసన్నము:— సంస్కృతాంధ్ర పదశ్లేష, సంస్కృతపదశ్లేష.

అన్నన్న—ఆశ్చర్యార్థము; వెన్నుని అన్న + అన్న (బార్యాసోదరుడు)

క॥ అర చందమామ నేలిన
దొరగానెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్
బరువంపు మొల్లమొగ్గల
దొరగాఁబల్కుదురు బల్కుదురు జవ్వనికిన్ II 78

ఇందు ఎన్నుదురు. (నతి+నుతురు) నెన్నుదురు అనియు, పలుకుదురు, పలు+కుదురు అనియు భావము. ఇది తెలుగుపద శ్లేష

ఉ॥ అంగజుడాలు వాలు జూ
పుంగవ యేమిచెప్పు నృపపుంగవ, ముజ్జగమేలు
I—40

క॥ కలలో నెఱుఁగ మేగణి
కలలో నీ చెలువమున్; సకలలోకము లెఱ
కల లోలాక్షుల గిరగిరి
కలలోఁగొనినారొ చంద్రకలలో వీరల్ II 70

ఇందు 'కలల' పద మెన్నివిధములుగా, నెన్ని విధములగా ప్రయోగింపఁబడి చమత్కరింపఁబడినదో పరిశీలింపుడు. గణి 'కలలో'; 'కలలోలాక్షుల; గరగిరి 'కలల'; చంద్ర 'కలలో'; అనువానిలో ఎటుఁబడి నదికదా.

క॥ నాదు హితం బొనఁగూరిచి
నాదుహితం బెండ్లిసేయు నరనాధునకున్ II-10

ఇక్కడ 'నాదు+హితం; నా+దుహితం' అని యన్వయము.

క॥ పట్టినమాత్రనె దేవకి
పట్టికరాబ్జము లలాటపట్టిక చెమటల్ II-178

తే॥ మారుతమ్ములవాడికి మలయ కూట
మారుతమ్ములవేడికి ముల్లుమీలు
చంద్రకిరణమ్ములకు శుకశారికాళి
చంద్రకిరణమ్ములకుఁజాల జలదరించు III-8

ఇందు మారు+తమ్ములనియు, మారుతమ్ములనియు, చంద్ర+కిరణములనియు చంద్రకి+రణమ్ము లనియు నర్థము

తే॥ మనసుభద్ర సుకృతమహిమ యేమనవచ్చు
మనసుభద్ర మయ్యె మనకు నెల్ల III-88

మన+సుభద; మన సు + భద్ర మయ్యెనని యర్థము.

క॥ వింతగమోముననే జిఱునగ
వింత గనంబడగ..................III. 195

'వింతగ' అనియు, 'నగవు + ఇంత + కనఁబడ' అనియునర్థము.

శ్లేషరూపమైన యమకమునేకాక ఉద్దిష్టరూపములను వాడి యీకవి యమకమును ప్రయోగించును. చూడుడు.

ఆ॥ హిమరసైక సైకతమునందు విహరించు
కైరవేసు వేసు ఘన నిభాంగు
ననరుదవుల దవులనేచూచి క్రీడిగా
నెఱిఁగియౌర యౌరగేందువదన I-59

ఇందు 'యౌర' యను నాశ్చర్యార్థకముతో యమకమును నిలుపుటకై 'యురగ' సంబంధమైన 'యౌరగేందువదన' యని వాడఁబడెను

మఱియు 'రస + ఏక = రసైక, సైకతము' అనియు, 'కైరవ + ఇసు = కైరవేసు, వేసు' అనియు, ఛేకానుప్రాసము. 'దవులదవులనే' యనుటలో లాటానుప్రాసమును గలదు.

తే॥ రాజవిధులనెసఁగ నీరాజనములు
కటికవారెచ్చరింపనై కటికభూమి
వందిజనములు పొగడఁ జెల్వందిమిగులఁ
బురము సొత్తెంచెవిజయు డబ్బురముగాగ I 156

ఇందు 'కటిక' శబ్దముతో యమకము నెలువ్పుటకై 'నికట' శబ్దసంబందార్థక తద్ధితరూపమైన "నైకటిక" రూపము వాడఁబడినది. "వంది" పదమునకును

యతిస్థానములో చెప్పిన దిలోని "వంది" పదమునకు, 'బురము' నకు, "అబ్బురము" లోని 'బురమునకు' యతితోఁబాటు యమకము కూడ కూర్చబడినది. రెండర్థములనిచ్చు దేశ్యశబ్దము నీకవి, యతిస్థానమందు, సందర్భశుద్ధితోవాడి పద్యమునకెట్టి శోభగల్గించునో చూడుడు.

తే॥ పాఱఁజూచినఁ బరసేన పాఱఁజూచు
వింటికొరగిన రిపుసేన వింటికొరగు
వేయునేటికి నలపాండవేయుసాటి
విరుడిలలేడు ప్రతి రఘువీరుడొకడు I—29

ఈకవి నోరెత్తినచో రెండర్థముగల పదములు, వెనుక నేను చూపిన శిష్టా సీతారామశాస్త్రిగారివలె, వచ్చును. అవి యతిప్రాసస్థానములందు నిల్చినపు డెక్కువశోభతో ప్రకాశించును.

క॥ కురువీర వసింపఁగ నీ
కురువీరదృఢాంకపాళిఁగోరినదానన్. I–80

ఇందు 'కురువీర' సంస్కృతపదము, కుఱువు+ఈర= తొడనిర–దేశ్యపదము మొదటిది సమానము· రెండవది వ్యస్తపదము· ఇట్టివే మఱికొన్ని

అII-ప. 65 : చెన్నారదా నారదా – చెన్ను+అరదా, నారదా
44 : ఏనుతీర్థములాడ–నేను తీర్థములాడ; ఏను (ఐదు) తిర్థములాడ.
94 : నిగనిగనెఱియందె అవలు నెఱియందెరవల్
నిగనిగనెఱయు+అందెఅవలు నెఱయఁదెరవల్

క॥ (98) చెలియలు సుభద్రవచ్చెన్
చెలియలు వేయారులు నిరుచెంతలఁగొలువన్
దొలకరిమెఱపోయిని యని
తొలకరిదొరబిడ్డ వెఱగుతోడం జూడన్.

చెలియులు=చెల్లెలు ;చెలికత్తెలు; తొలకరిదొర=ఇంద్రుడు

క॥ సైకమునడుము విలాసర
సైకము నెమ్మొగము దీని మృదుమధురోక్తుల్
పైకముఁదెగడు న్నవలా
పైకములో నెల్ల మేలుబంతిది బళిరా. II-107

సైకము – సూక్ష్మము; రసైకము (రస – ఏకము); పైకము=ధనము; సమూహము. ఇందలి యమక విశేషములం గమనించునది.

క॥ పట్టినమాత్రనె దేవకి
పట్టి కరాబ్జము లలాటపట్టిక జెమటల్. II-178

పట్టి–దేవకి 'పట్టిక'రాబ్జము–లలాట 'పట్టిక'–'పట్టిక' యమకము. ఈవిధమైన శబ్దచమత్కారములుగల రచన కంద గీత పద్యములందేకాక, సీసవృత్తములందు గూడ నతినైపుణ్యముతో ధారాళముగ నీకవి చేయును. చూడుడు.

సీ॥ బెళుకుఁగాటుక కంటిసొలపుఁ జూపెదలోనఁ
బట్టియుండెడిప్రేమఁ బట్టియీయు
జికిలిబంగురువ్రాత జిలుగుటొయ్యారంపుఁ
[illegible]
.... .... .... .... [illegible]
[illegible]
.... .... .... .... గపవంపుఁ
బిఱుదురేఖకుగెల్వ బిరుదుచాటు

ఇందుత్తరార్ధమున యతిస్థానమునఁగూడ నదేపదము తాత్పర్యభేదముతో వాడఁబడినది. ఈక్రిందిపద్యమున నేకపదమే సీసపద్య పూర్వపరభాగ ప్రారంభము లందు వాడఁబడి చమత్కరింపఁబడినది

సీ॥ ఆహారమింపౌకు చాఁగమూసికయున్న
నాహారమింపుగా దబ్జవదన
చెఱకుబాలొందవువాతెఱ యూనిచోఁగంటు
చెఱకుఁబాతొదునే చిగురుబోణి

కళలుదేరెడు నెమ్మొగంబు ముద్దిడకున్నఁ
గళలుదేరవుసుమీ కంబుకంఠి
వలఁతేని దరమున నలరింపకున్నన
వ్వల రే నిదురరాదు కలువకంటి.
II–194

ఆ+హారము; ఆహారము; చెఱఁకుబాలొదవు=చక్కెర వంటి; చెఱకు=చెఱసాలకు పొలొదు; కళలు=షోడశ కళలు, రతికళలు; వలతేనిదురము=మన్మథయుద్ధము-రతి, అవ్వల+రే+నిదుర=శర్వాత, రాత్రినిదురరాదని భావము. ఇట్లు శబ్దములను విరిచిగూడ నర్థచమత్కార చెప్పవలెను. ఈకవి సారంగధరలో

క॥ "రారాపులేలచేసెదు; రారానను కలుష
కలువరారామేశన్"

అని చమత్కారముతో పదములను వాడినాడు. ఇతని శక్తియట్టిది. ఇందలి ఛేకానుప్రాస, యమక, ముక్త పదగ్రస్తాద్యలంకారములను గమనింపనది. ఇక నీకవి వృత్తరచనా చమత్కారముగూడ కొంచెము చూతము

ఉ॥ అంగము జాళువాపసిడి యంగము
క్రొన్నెలవంక నెన్నొసల్
ముంగురు లింద్రనీల ముంగురు
లంగజుడాలువాలుఁజూ
పుంగవ, యేమిచెప్ప నృపపుంగవ!
ముజ్జగమేలజాలున
య్యంగనఁబోలు నొక్కసకియంగన
బోనెఱమించ నన్నిటన్. I–40

ఉ॥ దానములెన్నియేనచట తైర్థిక భూసుర
సంఘమెల్ల డెం
దాన ముదంబువెందగ నొనర్చి, దృఢవ్రతచర్య
నిత్యముం
దానముచేయుచున్ హరికథాశ్రవణం బొనరించు
చునుండె నంచు నం
దాన నముచిద్విషత్తనయుఁ డాశ్రితకల్ప మహీ
రుహంబనన్. I–57

ఉ॥ తియ్యని పింటివానివెను తియ్యక దగ్గఱఁజాలు....
I–78

ఉ॥ ఏ, మందముమందయాన మొగమందము
మీరు నవారవిందమున్. I–148

మ॥ విహరించున్, మలయానిలం బచటఁదాపం
జిల్కి నెమ్మేని యా
వి హరించున్, బికనాదముల్ చెవికిఁ
గావించుంజవుల్ పోఁ మా
సహకారాళి పదంబుఁజూడగ వయస్యాహాళి
వాటిల్లెడున్
సహకారాళి పదంబుఁజూడగ వయస్యాహాళి
యౌనేకదా. II–53

పంచచా॥ కనన్స భద్రకున్ సమంబుగాగ చేమ్రగీవిలో
కనన్ నిజంబుగాగ నేజగంబునందుఁజూచి కా
కనన్ తనీయవర్ణనీయ హావభావధీవయః
కనన్మనోజ్ఞరేఖ లెన్నఁగాఁదరంబె గ్రక్కనన్॥
I–32

అంత్యప్రాసరచనకు బమ్మెరపోతనకవి ప్రసిద్ధి కదా! అతడు ప్రతిపద్యమునకుగూడ నంత్యప్రాసను నిలుపఁగలుగఁగా, వెంకన సీసపద్యమునకు మాత్రమే యా నియమమును చేసికొనినాడు. ఇతడు రచించిన సీసపద్యములలో నూటికి తొంబది యంత్యప్రాసకలవియే ప్రథమాశ్వాసమున 122వ సీసపద్యమున నులూచి పడకటిల్లును కవి యతిమనోహరముగ రచించినాడు. కనుడు. మచ్చునకు :

సీ॥ మరునిగెల్పుల కథామహిమమ్మువిలసిల్లు
నొరపుజిత్తరుబొమ్మ నుల్లసిల్లు
వీనుల కమృతంపుసోనలై వర్తిల్లు
శారికాముఖసూక్తి సందడిల్లు

కస్తూరికాది వస్తువులఁ బ్రభవిల్లు
పరిమళమ్ములజోకఁ బరిఢవిల్లు
జెప్పఁజూపఁగరాని సింగారము ఘటిల్లు
పెక్కుశయ్యలసొంపు పెక్కటిల్లు
తే॥ నింతహరువులపనుపు చే విస్తరిల్లు
దివ్యమాణిక్యకాంతులఁదేజరిల్లు
నందములకెల్ల నందమై యతిశయిలు
బాపజవరాలి బంగారు పడకటిల్లు॥

వెంకనకవి యుత్పలమాలారచనలో నొక యొయ్యారపు సొగసును చూపట్టును బిందుపూర్వాక్షరమును గాని, ద్విత్వాక్షరమునుగాని, ప్రాసగావాడి రచించు నప్పుడు, ప్రాసస్థానమున 'చక్కనిలయ కుదురుటేకాక, యొకవిధముగ శబ్దమును మలచుటలో పూర్వపాదాంతాక్షరమునకు నుత్తరపాదాద్యక్షరముతో చమత్కారముగా పొందిక కూర్చుట దీని కుదాహరణములుగా వెనుక నిచ్చిన కొన్ని పద్యములే చాలును. మరికొన్ని

ఉ॥ పున్నమరేల తత్పురముపొంకనె పోశిఖరాళి
దాకి.... I–7

ఉ॥ ... గట్టియుండు నొకటో నెదమించుకలేక....
I–9

ఉ॥ కమ్మని జాజునా నొరయఁగల్గిన చెక్కుల
టెక్కువాడు.... I–70

ఉ॥ సొన్నపు సన్నచేలఁగటి జుట్టి కిరీటము
మౌళిఁదాల్చి... II–84

ఉ॥ ...లి భక్తిఁబూజలు సమున్నతిఁ దా
నొరించి... II–97

వెంకన కవితాశైలికి వన్నెదెచ్చిన మఱియొక గుణము చక్కని లోకోక్తులను దేశీయపు పలుకుబడులను సంప్రదాయపద్ధతితో పొదుగుట ఈగుణము నాచన సోమన రచనలో కలదుకాని, వాని రచనలోకంటె వీని రచనలో నాగుణము హృదయరంజకముగా నొప్పినది ఉదా;—వంటయింటి కుందేలివి యెందు బోఁగలదు—I–6; నిత్యకళ్యాణము పచ్చతోరణము—I–13; మోక్షమునకుఁబోవ మొసలెత్తుగొని పోయె—II–1..; నమ.బం పంచవిస్తర-II-64; అందిన సిగయు నందక యున్న కాళ్ళుపట్టుకొంటయు-III–57; చమడఁబెట్టిన సున్నమితొయుఁలోయె — III–10; ఇక పలుకుబడుల కుదాహరణములు—కాలిగోరులకుఁ బోలరు —I-121; పొలతి కాయొ పండొ పోయినపని—II-1..; చేదోడువాదోడు— II-151; పిలువని పేరంటము, పెండ్లిపెదపులు- I-13; త్రోసిరాజనున్—I-37; తెరచిరాజనున్ — III-114; చెవులుపట్టి యాడించగ—I-90; కుడిచికూర్చుండి బెడద తెచ్చుకొంటి — II-61; నడుమంత్రపుకల్మి, నిక్కుచు నీల్గుచు విఱ్ఱవీగుచున్— I-34; చేరలఁగొల్వగ రానికన్నులు-—II-2.

వెంకనకవి కవితారచన యెంతయు మధురమై సర్వజన సమ్మోదకరమైనది గా, నతని మాటలు, పద్యపాదములును నొక్క జాతీయములు గాను లోకోక్తులుగాను కూడ పరిణమించి, దేశమంతటను వ్యాపించినవి. ముప్పునకు, పెట్టికోలకాదె....I-9; ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా .... I-146; సిగ్గుకు సిగ్గులేదు II-31; చేసినయది జపము, మఱి వేసినది గాలము .. II-135; కలరెకా మరి మానిని బోలు మానినుల్ .. II-139; పాలును బియ్యముచేరి పొంగి పొరలి III-51; తామరసాక్షి యందు తలిదండ్రులు పెట్టినసొమ్ము పెన్నెఱుల్ III-90;

శబ్దచమత్కారము లెన్నియున్నను నర్థచమత్కారములుగల కావ్యమే శ్రేష్ఠమైనదను యాలంకారికుల యభిప్రాయము చామకూర వెంకనకవికిఁ దెలియకపోదు విజయవిలాసము యథార్థమునకు శబ్దచమత్కారములకంటెగూడ నర్థభావ చమత్కారములు విశేషముగాఁగలవు. ఇప్పటికే యనుకొనిన దానికంటె వ్యాసము చాల పెద్దదైనది. కాన నా విషయమును, వెంకనకవి కవిత్వ కళావిశేషము నింకొకమారు మఱెక్కడైనను తెలుపుదును.



శ్రీ శిష్ట్లా రామకృష్ణశాస్త్రి

# మహమ్మదు కుతుబ్‌షాహీ కాలమున వర్తకవ్యాపారము

ప్రొఫెసర్ హెచ్. కె. షర్వాని

పారశీకులవ్రాతలు, కేవలము రాజదర్బారులలో జరిగిన విషయములను, అనాటి గొప్పవ్యక్తుల జీవితచరిత్రల జాబితాలనుమాత్రమే అందించును వానివలన ఆనాటి దేశీయ—ఆర్థికవ్యవస్థ చాలతక్కువగా తెలియగలదు పదిహేడవ శతాబ్ది ప్రారంభ సంవత్సరములలో యూరోపియనుల రాకతో, వారి వర్తక సంఘముల స్థాపనతోలభించు కొన్ని వివరములలో ఆనాటి ప్రజానీకముయొక్క దైనందిన జీవిత చిత్రణకూడ సమ్మిశ్రితమైయున్నది ఇంకను, ఆస్థాన చరిత్రకారులు జారవిడచిన కొన్ని వివరములు, ఆనాటి ఆర్థికవ్యవస్థయొక్క నిర్మాణము, దృశ్యాదృశ్యముగా కాంచగలము.

తెలుగు (తిలంగ) రాజ్యమునకు సంబంధించినంత వరకు యూరోపియనుల వర్తకవ్యాపారములు మచలీపట్టణము రేవును కేంద్రముగ చేసికొనియే సాగింపబడినవి. ఈ ఓడల రేవు కుతుబ్‌షాహీ చక్రవర్తుల వంశమునకు పూర్వమే నిలచియున్నది కాని, యీ వంశము రాజ్యము చేపట్టినతరువాత దాని క్రమవికాసము, అది ఆ రాజ్యమునకు ప్రధానమైన ఓడరేవుగా అగుటయు జరిగినది ఇంగ్లీషువారు డచ్‌వారు వర్తక సంఘములు స్థాపించుటకు పూర్వము మనము నమ్మదగు వివరములు చాలతక్కువగా లభింపగలవు. డచ్‌వారే మొట్టమొదట మచలీపట్టణముద్వారా వర్తకము జయప్రదముగ సాగించవచ్చునని కనుగొనిరి. వారికి తమ అధీనమందు ఈస్టిండీసులోని పెద్ద దీవులను ఉంచుకొన్న అవకాశముకలదు. ఇండోనీషియనులతో డచ్‌వారికి 1596 నుండియే వ్యాపార సంబంధములు కలవు. ఇది 1620 లో డచ్‌వారి సంయుక్తసంఘము స్థాపించ బడినతరువాత కొనసాగింపబడెను. కొద్దిసంవత్సరముల తరువాత ఒక డచ్‌వర్తకుడు తనవ్యాపారసంస్థను మచలీపట్టణములో స్థాపించెను. దీనితో డచ్ వర్తకసంఘమునకు నూత్న

మార్గ మేర్పడెను. 1606 లో సుల్తాను మహమ్మదు కుతుబ్‌షా ఉద్యోగులకును డచ్ వర్తకసంఘమువారి కిని మధ్య ఒడంబడికలపై సంతకములు జరిగెను. దానిననుసరించి వారు మచలీపట్నంలోను సమీప ములోనున్న నిజామపట్టణము (పూర్వము పెటాపోలి) లోను వర్తకసంఘములను స్థాపించిరి. అటుతరువాత 1610 లో పులికాట్ వర్తకసంఘము స్థాపింపబడెను.

ఈ వర్తకసంఘ స్థాపనకు అనుమతినిచ్చుటకు విధింపబడిన నియమములు మిక్కిలి కుతూహలకర ముగా నుండును. రాజోద్యోగులు రేవువద్దనుండి ఎగు మతి అగు అన్నివస్తువులపైనను మామూలుగానున్న 16% రుసుము 'పాపాదలాలా' లేక 'దళారుల ముద్రకు' విధించిరి. అది అనాడు దేశీయులు విదే శీయులు తమ అన్ని బాపతుల అమ్మకములకు చెల్లించ వలసిన రుసుముగా నుండెను. ఈ విషయము డచ్ వారు రాజునకు నివేదించిరి. హైద్రాబాదునుండి ఆజ్ఞలు వచ్చినవి దానినిబట్టి డచ్‌వారు తమ ఎగు మతులపై 4% కు మించిన సుంకము చెల్లించు నవస రము లేకపోయెను. వారి వర్తకసంఘముల కన్నిం టికి 'దళారులముద్ర' నుండి మినహాయింపు లభిం చెను ఇంకను ఆంగ్లేయ వ్యాపారులకు 'జనకేన్సు' (తమిళము—చుంగం) నుండి మినహాయింపు లభించి నది ఈ 'జనకేన్సు' అనునది దేశములో ఒక ప్రదే శమునుండి మరియొక ప్రదేశమునకు సరఫరా చేయ బడు వస్తువులపై వసూలుచేయబడు సుంకమయి యుండెను.

ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ 1600 సంవత్స రాంతిమ దినమున స్థాపింపబడెను. వారు 1611 లో మచలీపట్టణములోను, నాగపట్టణములోను వర్తక సంఘముల స్థాపించిరి. కాని పులికాట్‌లో మాత్రము 1621 వరకు వర్తకసంఘము స్థాపించజాలకపోయిరి.

డచ్‌వారికి ఈస్టిండీసులో జకార్తాను కేంద్రముగా చేసికొని వ్యాపారము సాగింపవలె పై మార్గము కలదు. అట్టి అవకాశము ఇంగ్లీషువారికి లేకుండెను బటేవియాకు జకార్తా అని నామకరణము హాలెండు నకు రోమను నామ మీయబడినతరువాత జరిగెను ఈ రెండు వర్తకసంస్థలు పనిచేసిన పరిస్థితులుకూడ విభిన్నములై యుండెను ఆంగ్లేయులువారు వర్తకము సాగించు అన్ని వస్తువులపైనను సుంకము చెల్లింప వలసియుండెను. కాని డచ్‌వారు మాత్రము వారు సంవత్సరము మొత్తముపై వారు ఎగుమతిచేయు వస్తువులకు ఒకే మొత్తముగా 3,000 పగోడాలు లేక 12, 150 మొగలు రూప్యముల చెల్లించుటకు ఒప్పం దము గావించుకొనిరి.

వ్యాపారపు సరకులు :

కాలము గడచుకొలది వ్యాపారము విస్తరించి నది. ప్రారంభములో ముఖ్యముగా మంచి నూలు దారము, నీలిమందు మాత్రమే సముద్రాంతర వ్యాపా రముచేయు వస్తువులైయుండెను కాని తరువాత సంబారు దినుసులు పింగాణీ, పాదరసము, పటిక, వెదల్పుగడ్డ—మొదలగునవియు, ఇతర వస్తువులు కూడ వర్తకము చేయసాగిరి. ఎల్లూరువద్ద రత్నాల గని కనుగొనబడిన తరువాత రత్న వ్యాపారము కొంత సన్నగిల్లినట్లు తోచును దానికిపూర్వము ఈ గనులు డచ్‌వారికి మక్తాకు ఈయబడెడివి. వారు దానిపై వచ్చు లాభములను తమ మాతృభూమికి తరలించు కొని పోవువారు. కాని 1623 లో రాజు ఈ గనులు కౌలునకు ఈయరాదని ప్రభుత్యోగుల సమగ్రాధి పత్యంక్రింద నుంచుకొనుటకుకే పూర్తిగా నిశ్చయించు కొనెను.

డచ్‌వారికి ఆంగ్లేయులకు మధ్య వర్తకములో ఒకవిధమగు పోటీయుండెడిది. యూరోపులో అమ్మ

కముసాగించి అధికలాభము గడింపదగు క్రొత్త సరకులను ఆంగ్లేయులు అన్వేషింపసాగిరి సుల్తాను మహమ్మదు ఏలుబడి ఆరంభములో గిల్స్‌జేమ్సు అనునతడు ఈ దిగువ వానిని గురించి వివరములు సేకరింపవలసినదిగా నియుక్తుడాయెను. నాలుగున్నర మూరల పొడవు రెండున్నర మూరలు వెడల్పుగా గోల్కొండనుండి తయారగు నారబట్ట ఎటాన్సు (గాజులు) అని పిలువబడెడిది. మరియొక ముడి సరుకు టెస్సా (టసార్) ఈ రెండును ఇంగ్లండునకు తగినవే అయియున్నవి. బంకలక్క, మిరియాలు, శొంఠికూడ వివరములు సేకరింపవలసిన వానిలో నుండెను.

డచ్‌వారికిని ఆంగ్లేయ వర్తక సంఘమువారికిని మధ్య ప్రేమభావ మంతరించినట్లు స్పష్టముగా కానరాదు. డచ్ గవర్నరు వాన్ అఫ్ లెన్ అను నతనిని దేశీయులు కొట్టిన సందర్భమును పురస్కరించుకొని బటేవియాలోని డచ్ వర్తక సంఘాధ్యక్షుడు మచిలీపట్టణమందున్న డచ్ వర్తక సంఘమువారి కిట్లు వ్రాసెను.

"ఇదేగతి ఆంగ్లేయులకుకూడ పట్టగలదను టకు ఇదియొక హెచ్చరిక"

**ధరల పరిస్థితి :**

మచిలీపట్టణమువద్దనున్న వర్తక సంఘము వారికిని మార్పువేశములోనున్న వారికిని జరిగిన రవాణాలవలన మచిలీపట్టణము బజారులో కొన్ని వస్తువుల ధర లెట్లున్నది సూచితమగును 13 అక్టోబరు 1661 తేదిని సీసముకుప్పకు 14½ పగోడాలు అనగా 20 మణుగులుకల బారువవెల 65 మొగలు రూప్యములు. ప్రతిమణుగునకు 26 పౌనులు లేక సుమారు 13 సేర్లుండెడివి లాంగ్‌క్లాత్ వెల ఆరోజున 100 పగోడాలు లేక 3000 ముక్కలు రు 4 500 రూప్యము లుండెడివి. నవంబరు 4, 1621 న పాదరసము యొక్క ధర 150 మహమ్మదీలు అది పౌను 4 షిల్లింగుల 6 పెన్నీలవరకు పడినది. ఇవి ఆనాడు రేవు పట్టణమువద్ద కల ధరలు రాజధానీనగరమున ఇంతకంటె చాలతక్కువ యుండి యుండును

**రేవు ఉద్యోగులు :**

మచిలీపట్టణమువద్ద నున్న గవర్నరు చాల శక్తిసంపన్నుడు అతడు డచ్ గవర్నరును మిక్కిలి కఠినముగా బాధించెను. దీనితరువాత ప్రకరణములో వివరింపబడిన వృత్తాంతమువలన మచలీపట్టణము నుండి అరేబియాతీరమున దక్షిణముగా 2000 మైళ్ళ దూరముననున్న సకోట్రావరకు కుతుబుషాహీ నౌకలు సముద్రముమ సక్రమముగా కాపు కాయుచున్నట్లు తెలియును. రేవు ప్రధానోద్యోగి "షాహ్‌బందారు" అని పిలువబడెడివాడు. ఈ బిరుదము అసఫ్‌జాహి కాలమునుండి వచ్చుచున్నట్లు తెలియును. అతనికున్న విశేషాధికారములనుబట్టి డచ్ వర్తక సంఘమువారు తమ వ్రాతలలో ఇటు వ్రాసిరి. "అతనికుండు ఘనత ననుసరించియే కార్యాలయపారిభాషికములోన 'షాహ్' అనుమాట వాడబడినది" తక్కువశ్రేణికి చెందు ఉద్యోగులలో 'గవర్నరు' అను పదము చాల తప్పుగా పిలువబడెను. కొంచెమించు మించు ప్రస్తుతమున్న "తహశీలుదారు" వలె అతను స్థానికమైన పన్నులను వసూలుచేయుటయందు గొప్పవాడుగా నుండెను. "అతని ముఖ్యవిధి పన్నులు వసూలుచేయుట. కాని యీ పదవి ఆ సంవత్సరము ఎక్కువ వేలముపాడిన వారికీయబడుచుండును.........కాని వారిలో చాల మంది బ్రాహ్మణులును, వైశ్యులును. వారు ఆస్థానమందున్న తమకన్న ఉన్నతోద్యోగులకు ఘనమగు బహుమతుల నర్పించెడివారు." పెటాపోలి (నిజాంపట్టణము) వద్ద తీసుకొను గుత్త 55,000 పగోడాలు (రూ. 2,47,500/లు) కాని దిని కనుబంధముగా

1 000 పగోడాలు పైగా తిరిగి యీయబడెడిది. దీని నుండి 13,000 పగోడాలు జీతములు తదితరము లయిన ఖర్చుల వినియోగమునకు అనుమతింపబడె డిది ఈ ఉద్యోగులందరు కఠినమైన క్రమశిక్షణకు లోబడి యుండెడివారు. ఒక సంవత్సరమున కీయ వలసిన మొత్తము మూడు వాయిదాలలో చెల్లింపవలసి యుండెను. అందుకు తప్పినయెడల కొరడాశిక్ష లభించెడిది.

బాటలు :

డచ్‌వారి దినచర్య పుస్తకములనుండి కొన్ని ప్రధానములైన బాటల వివరములు లభింపగలవు. వారిలో ఒకరు రావెన్సెయిన్. ఆయన మే 1615 నుండి 1616 జనవరిలోగా మచలీపట్టణమునుండి సూరతుకుపోయి అచటనుండి తిరిగి వెనుకకువచ్చెను. ఇక రెండవఆయన వాన్‌డెన్‌బ్రోకె. ఆయన తన బ్రద్ధ లయిన ఓడలోని పరివారములో పశ్చమతీరానగల గందేవినుండి మచలీపట్టణమువరకు 1617 నవంబరు డిసెంబర్లలో యాత్రసాగించెను.

రావెన్సెయిన్ అనునతడు మచలీపట్టణమునుండి సూరతుకు కొన్నివస్తువుల సంపాదించుటకును మరల తిరిగివచ్చునపుడు మొగలుప్రభుత్వకేంద్రమగు బర హాంపూర్ మీదుగా రావలసినదిగా పంపబడెను ఏవిధ మగు విశేషసంఘటనలు ఉల్లేఖింపబడకుండుటచే ఓడరేవునుండి రాజధానివరకుగలబాట సలక్షణము గాను, నిరుపద్రవముగాను నుండెనని తెలియును. మచలీపట్టణమునుండి విజయవాడవరకు కొండపల్లి, నందిగామల మీదుగాను, అటుతరువాత పశ్చిమముగా రాజధానికి మంగలా, నల్గొండలమీదుగాను బాట విస్తరిల్లియుండెను, ఈ రెండువందల మైళ్ళమార్గ మును రావెన్సెయిను పన్నెండు రోజులలో ముగిం చెను. బ్రోకె విజయవాడగురించి యిట్లువ్రాసెను. "విజయవాడ విశాలమై జనాకీర్ణముగానుండెను."

ఇచటనుండి నిజాంపట్టణము పోవుటకు మరియొక బాటకలదు. విజయవాడకు సుమారు ఎనిమిదిమైళ్ళ దూరముననున్న ఇబ్రహీం పట్టణమువద్ద కృష్ణను దాటవలసియుండెను బయటనున్న గ్రామముల గురించి శ్రద్ధతీసికొన్నట్లు తోచదు, నల్గొండ హైద్రా బాదులమధ్య "అసహ్యకరమగు ఇండ్లను, ప్రజలను, వస్తువులను" బ్రోకె కనుగొనెను. అతడు పోవుచు కనుగొనిన యితరగ్రామముల పరిస్థితి యింతకంటె మెరుగై యుండును.

అనాహూతులయిన యూరోపియనులకు రాజ ధానీనగరమున ప్రవేశించుటకాని బయటకు పోవుట కాని మిక్కిలి కష్టముగానుండెను రావెన్సెయిన్ హుసేనుసాగరువద్ద బసచేయవలసివచ్చెను ఏల ననగా, పట్టణమున ప్రవేశించిన విదేశీయుడు అను మతిపత్రములేనిదే తాను కోరినప్పుడు పట్టణము విడు టకును వీలులేదు. ఆ అనుమతిపత్రము లభించుట కూడ ఆనాడు అంత సులభమయిన విషయము కాదు. ఆదేవిధముగా, బ్రోకె బయటకు పోవుటకు అనుమతి పత్రము పొందుటకై పట్టణముబయట ఆగవలసి వచ్చెను. అనుమతిపత్రమునకై 'గవర్నరును'కలియ వలసివచ్చెను. బహుశః గవర్నరనగా ఆయన ఉద్దే శము కొత్వాలు అయియుండును. మూడురోజుల అనంతరము ఆయనకు పట్టణము వీడుటకు అనుమతి లభించెను. గడచిన యిరువదినాలుగు గంటలలో జరిగిన ప్రతివిషయమును కొత్వాలు ప్రతిరాత్రియు సుల్తానుకు నివేదించువాడు "ఏవిషయమును దాచ బడెడిదికాదు."

పశ్చిమముగాపోవుబాట అండాలు, కౌలాస్, దెగ్‌లూరు, ఖాందహారు, పైదాన్, దౌలతాబాద్‌ల సున్నది. కుతుబుషాహి చక్రవర్తుల రాజ్యమునకు సరిహద్దు దెగలూరునకు ఆగ్నేయముగా నాలుగుమైళ్ళ దూరమున నుండెను. అదే ప్రస్తుతము ఆంధ్రప్రదేశము

నకును మహారాష్ట్రకును విభజన రేఖగానున్నదని గుర్తించుట కుతూహలకరము. పేటపద్ద రాజధాని రాజధానినుండి రెండవ మజిలీయగు మాలిక్ తుజ్జర్ పేటవద్దనున్న సత్రముసరాయ్ "మొత్తము రాజ్యములో ఉత్తమముగాను, సుఖకరముగాను నుండెను" అని రావెన్సైయిన్ గుర్తించెను. దెగ్‌లూరునుండి పశ్చిమముగా మాలిక్ అంబరు అధీనమునగల నిజామ్‌షాహీ రాజ్యసీమలోనున్నబాట శిలామయమై మిక్కిలి కష్టదాయకముగానుండెను. పోల్చిచూచినచో కుతుబుషాహి రాజ్యమునందలి బాటలు మంచిపరిస్థితిలో నున్నట్లు గోచరించును.

దీనితరువాత పచ్చిన పరిపాలనలో తెలుగునాటిలోని బాటలగురించి యింకను వివరములు మనకు లభింపగలవు. ఆయేలుబడిలో విదేశీయంత్రశాలలకు మచలీపట్టణము, నిజాముపట్టణములకడ అధికమయిన సౌకర్యములు సమకూర్పబడినట్లుమనము కాంచగలము.

ఆ పాలనలోనే, అబ్దుల్లాకుతుబ్‌షా మొగలు చక్రవర్తి గుమ్మముకడ అరిగాపగునాటికి, ఉత్తర వాయవ్యములనుండి మొగలయీ రాజనైతిక సాంస్కృతిక ప్రభావ వాహినులు చొచ్చుకొని వచ్చుట గమనింపగలము.

(తెనుగుసేత : ఎస్. కే. జి. విశ్వేశ్వరరావు.)

## శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ

శ్రీ జగన్నాధ పండితరాజు ఆంధ్రుడు. ఆతని కృతులనేకములు. అవి తెలుగుదేశమున వ్యాపించినవి. వ్యాపింపలేదు పండితరాయల కృతులలోని విశిష్టత సారస్వతేయ లోకమున సముచితముగవ్యాపింపలేదు, కతిపయవిశిష్టులు కృతివిశిష్టతను గుర్తించియుందురు వారు గుర్తించిన విశిష్టత శిష్టలోకమున ప్రసరింపలేదు. పండితరాయల రసగంగాధరమును గుర్తించినవారు తత్కవితా విశిష్టతనట్లు గుర్తింతురు ఇతరులట్లు గుర్తింపరు. అట్లు గుర్తించుటయె గుర్తించుట యగును. కొందరు రాయల పద్యముల సప్పగింపగలరు వాచ్యముగ స్ఫురించు నర్థమునుగ్రహించి తమ తెలుగనువాదములందు నిబంధించుటకు వారు సమర్థులు కాగలరు. వారి తెలుగుపద్యములందును వ్యంగ్యార్థస్పర్శ యుండవచ్చును. అది తలచి తలచి నిబంధించినది కాకపోవచ్చును. ఆ యాకస్మిక ప్రతిభాసములను తద్రచయితలకు నితరులుద్ఘాటింపగా స్వాత్మ ప్రత్యయమున సంతుష్టులగువా[...]న్నారు. అనువాదకుల కట్టి సంతోషము కలుగు[...]న్నది. వివక్షితముగా వ్యంగ్యధర్మముండుట పండితరాయల చాయ

ఒకరొకనాడు పండితరాజ కృతిని తా మనువదించుటనుజెప్పి నా ప్రయాణమాపి నా[...] వారికై గల గౌరవభావముతోనే నా తెలుగుకృతి వి[...]నట్లు చేసిరి. నే నా యనువాదముపై యభిప్రాయము వ్రాయు టను వా రభిలషించిరి. "వారువ్రాసిరి వారువ్రాసిరి, వీరువ్రాసిరి. వీరునువ్రాసిరి. మీరు[...] వ్రాయవలయు"ననిరి. "వారు వీరు వ్రాసిరికదా! మీకు తుష్టియు నున్నదికదా! నే నేల[...]వ్రాయవలయును?" అనియుంటిని. "మీరు పండితరాయల రసగంగాధరమును నవరస రంగాధరముగ [...]. ఇది పండితరాయలకృతి. ఈ యనువాదము[...] మీ భావము నాకు కావలయును" అని [...]తో వారనిరి. "అయినచో నేను నవరస గంగాధర రచ

యుతగా భావము ప్రకటింతునా ? మీరు రసగంగాధరము చదువలేదంటిరి నవరస గంగాధరమేని చూచితిరా?" "లేదు. మీవద్దగల పుస్తకము తీసికొని చూడవలయును." "నవరసగంగాధరము మఱల ముద్రితముగువఱకు మీరు యోగము పట్టవలసినదే. అయిన నొకటి యందుచు. పండితరాయలు రచనాధర్మ సుర్మముల నెరిగిన రచయిత. అతని రచనా పరిష్కారము గుర్తింపవలెను. జల్లాతడు రచనా వైదగ్ధ్యమును ప్రకటించినాడు. జల్లాతడు రచనా దోషములు నిరూపించినాడు. అతని శ్లోకమాతని పరిష్కారానుగుణము, మీ యనువాదము దోషోదాహరణము. ఈభావమున నేను భావమునువ్రాసియుచ్చి నచో నన్నిట్లె మిరాదరింపగలరా?" యంటిని. వారు నట్ప్రజ్ఞకలవారు. "ఈ భావముతో విశదముగా వ్రాయుడు" అని యని వారు వారి గ్రామమునకేగిరి, "రాక రాక వచ్చిన బంధుకవి కవిబంధువు నట్లంటిరి. ఇక వారి వారేమందురో?" అని నాభార్య అనినది "వారి వారు నీవంటివారు కారు" అని నే ననగా ... భార్య

> "అహహ! చండసమీరణ! దారుణం
> కిమిదమాచరితం చరితం త్వయా
> యదిహ చాతకచంచుపుటోదరే
> పతతివారి తదేవనివారితం"

అని శ్లోకము సఠించినది ఇది పదివత్సరములకు పూర్వపు విషయము. వారు రాలేదు. నాభావము నా లోననె యున్నది ... యేమని యనుటకామెయు నిపుడులేదు,

పండితరాయల రసగంగాధరము తెలుగులోకమున పర్యాప్తముగ వ్యాపింపలేదు, సాహిత్యశిరోమణి సాహిత్యవిద్యాప్రవీణ పరీక్షలనాటినుండి పఠనమె తన ప్రణాళికలో ... చేయున్నదికాని యది యున్నట్లుండలేదు ... పూర్వమని యంతంతగనె ...యున్నది. "ధర్మ...కా ప్రమాణ స్వరూపము పలుకు"డని యొక పండితుడది యొక ప్రమాణమని భావించి పలికెనట ఇంతగా నది వ్యాపించినది. ద్రవిడశిరోమణియయిన అప్పయ్యదీక్షితుని గ్రంథము నాంధ్రజగన్నాథుడు ఖండించినాడని కొంతకాలమది పాఠ్యకోటిలో జేరకుండునట్లు తద్భావులు యత్నింపగా, మారాయడుశాస్త్రి పండితరాయలు పట్టుపట్టి పాఠ్యము చేయించెను. పాఠ్యమయినది. కాని తత్ప్రతిలు కవితలు చూడరు కవితలు చూచువారు ప్రతిశలు కాలేదు. వారిని వీరిని జూచి నేను నవరసగంగాధరము ప్రకటించితిని కాని సంపూర్ణముగా ప్రకటింపలేకపోయితిని. ప్రకటించినంతవఱకది యెంతగా వ్యాపించినదో నేటి కవితలు చూచి సరిచూచువారికి దెలియగలదు.

పండితరాయల కవితలను రసగంగాధరపరిశీలన సంప్రాప్త పాండిత్యవైదగ్ధ్యసామర్థ్య వివేకముతో సమీక్షించుట యుక్తమని యనుటను నేను సుముఖముగ మున నేర్చికొంటిని. ఇప్పటికి ముప్పదియారు హాయనములుగా నోరుతెరచి హృదయమువిప్పి ఉచ్చైస్స్వరమున జెప్పుచుంటిని. అ నేర్పినది చెప్పినది వ్రాయుట యుక్తము. మనన తరితీర్ణవిద్యార్ణవుడు రచించిన కృతుల కృతిత లోకమును వ్యాపించుటను శ్లోకశ్లోకమున తత్పారాయణ సమీక్షాయన మావశ్యకము.

> "నిర్మాయ నూతన ముదాహరణానురూపం
> కావ్యం మయాత్ర నిహితం న పరస్య కించిత్"

రసగంగాధరమునందలి లక్షణములకు తగిన యుదాహరణములను పండితరాయలు నిర్మించెను. స్వయముగ గొన్ని శ్లోకములను సాహిత్యశాస్త్రదృష్టితో సమీక్షించెను. అ సమీక్షాసంప్రాప్తాలోకమున నిన్నిటిని సమాలోచన మొనరించుట యుక్తము. పండితరాజ లఘుకావ్యములను నామమునకు తగిన కొన్ని కావ్య నామములున్నవి. అయినను నిబద్ధకావ్యము లభింపలేదు. లభించినవన్నియు ముక్తకకావ్యములు. ఏ శ్లోకమున కాశ్లోకము స్వపద్ధతిలో స్వయం సంపూర్ణ

ముగ నుండును. శ్లోకాంతర సంబంధమేమియు నా శ్లోకమున కావశ్యకము కాదు ఇట్లు వ్రాయుటలో క్లేశమున్నది వివక్షితభావ ప్రతిపాదనమునకు తగిన విభావానుభావాదులను సర్గబంధకావ్యమున చక్కగా నిరూపింపవచ్చును. అల్పకాయముకల ముక్తకమున నట్లు నిరూపింప వలనుపడదు. స్వస్పంద సుందర మయిన భావమును సావధానముగ ముక్తకమున నిరూపింపవలసియున్నది. జగన్నాథపండితరాయ లట్లుచేసినాడు. తన శ్లోకము లితరకవులు హరింప దగినంతటి సాహితీసంపద్వైభవముకలవి. ఏవరేని హరింపవచ్చును. అందుకొనవచ్చును. అట్లు కారాదు.

"దుర్వృత్తాజారజన్మానః హరిష్యంతీతి శంకయా
మదీయపద్యరత్నానాం మంజూషైషా కృతామయా

పండితరాజ కావ్యసంగ్రహ ముపేరిట ప్రకటిత మయిన పుస్తకములో సముపలబ్ధములయిన పండిత రాజపద్యములన్నియు కలవని ప్రకృతము విశ్వసింప వచ్చును. ప్రకటితములయినవన్నియు పండితరాజ పద్యములను విశ్వాసమందరకు కలుగకపోవచ్చును. రచనా వరిష్కారా విరుద్ధములను తదీయములని యనవచ్చును. పండితరాజపద్యములె యన్న ప్రసిద్ధ ములయిన పద్యములందును కొన్నిటిలో పరిష్కారా విరుద్ధత లేకపోవచ్చును. తావన్మాత్రమున నవి యపండితరాజీయములు కావు పరిష్కారాను గుణ ములుగా నుండునవియన్నియు పండితరాజీయము లన రాదు అపండితరాజులు రచనా పరిష్కారాను గుణ ముగ కొన్ని శ్లోకముల రచించియుందురు. అట్టి వపండితరాజీయములయినను హానిలేదు. ఆతని రచనాసంపద యాతనితో నాగిపోవుట రచయితల లెవరికిని సమ్మతముకాదు. ఆతని రచనానంపదయని మాటవరుస కందుముకాని యాసంపద యాతనిదే కాదు. అది యందరిది. ఆనందవర్ధనాదులె పరిష్క రించిరి. శ్రీ మదభినవగుప్తుడు నిర్ణయించెను. అలం కారికు లామోదించిరి పండితరాయలు పరిష్క రించెను. పండితరాయల రసగంగాధరము ఆనంద వర్ధన ధ్వన్యాలోకమునకు భాష్యమని యందురు. అభినవపదారాధన మాతనికి నిత్యారాధనము. అట్టి రచన కేవలము ధ్వని కారోపజ్ఞముకాదు. వామ నాదుల గుణమయ ఘటనలోనిది యున్నది. భరతుని నాట్యవేదములోను నభినవాభినవ భారతిలో నిట్టి పరి ష్కారము కలదు అది చక్కగా జూచిన జగన్నా థుడు చూడదగిన వాడయినాడు. కుంతుకుని వక్రోక్తి లోని యుక్తి సుందరతను అభినవభారతిలో చన పాట వమున దర్శించిన జగన్నాథుడు రచనాదర్శన వివేక దాత యయినాడు

పండితరాయలు మూడు రచనల పరిష్కరించి నిరూపించెను. మాధుర్య వ్యంజకరచన, ఓజోవ్యంజక రచన, ప్రసాద వ్యంకజకరచన యనురచనాత్రయ స్వరూపమును స్పష్టమొనరించి యుదాహరించెను. పండితరాజ కవితాకృతుల నీ రచనా మర్యాదానుసార ముగనె పరిశీలింపవలెను. పండితరాయలె ప్రసాద వ్యంజక రచనాప్రసక్తిలో నిట్లనెను,

"ఉదాహరణాన్యత్ర ప్రాయశోమదీ
యాని సర్వాణ్యేవ పద్యాని—"

ఆతని పద్యములనట్లె పరిశీలింపవలెను. ఆయానిర్మితి పరిచయమునకై సామాన్యతః వర్జనీయమును విశే షతః వర్జనీయములను రాయలు సావధానముగ సోదా హరణముగ నిరూపించెను. ఇట్టి వర్జనీయ దోషవిశే షముల నుదాహరించుటకు జగన్నాథు డేమిచెయును? ఉదాహరణాను రూపకావ్యము నిర్మించితినని యనెను గదా! అనెను. ఉదాహరణానురూపము రచించితి ననెను. ఉదాహరణవిరూప ముదాహరించుటకు పొడి పొడి మాటలనిచ్చి వివేకము చూపెను ఏవో నాలుగు పిచ్చిశ్లోకము లట్టివానికై వ్రాసెను. కావున పండిత రాజకృతులను రచనాదోషములు లేవను విశ్వాసమున

సమీక్షింపవలెను ప్రసిద్ధ శ్లోకములందును కొన్నిట కొన్ని రచనాదోషము లుండవచ్చును. వానినె పట్టి వ్రేలాడవలసిన పనిలేదు

"నిర్దూషణా గుణవతీ రసభావపూర్ణా
సాలంకృతిః శ్రవణ కోమల వర్ణరాజిః

సా మామకీన కవితా సుమనోభి రామా" తన కవితా విషయమున నాతని కింతటి విశ్వాసముకలదు. ఈని కవితావిషయక విశ్వాసమును కొంద రహంకారమని యందురు. అట్లనువారి కహంకారము కల దని నేనను వారు పరీతభావులై తత్త్వదూరులయి నారని నేనే యేల పలుకవలెను? పండితరాజిట్లనను.

1 గిరాందేవి వీణాగుణరణనహీనాదరకరా
యదీయానాంవాచా మమృతమయమాచామతిరసం
వచస్తస్యా కర్ణ్యశ్రవణ సుభగం పండితపతేః

వాగీశ్వరియు తన వీణావాదనము మాని నా వాచాసుధాచమన మొనరించును. పండితరాజయిన నామాట శ్రవణ సుభగము దీని నెవరు వినరు? విని శిరమూ పనివాడెవడు?

2 మధుద్రాక్షా సాక్షాదమృత మథవామాధర సుధా
కదాచిత్కేషాం చిన్నఖలు విదధీరన్నపి ముదం
ధ్రువంతేజీవంతోఽప్యహహ! మృతకా మందమతయః
న యేషామానందం జనయతి జగన్నాథ భణితిః

ఒకపు డెవరికేని యెపుడేని మధువు ద్రాక్ష అమృతము అధరము మోద మీయకపోవచ్చును. జగన్నాథ భణితి యందరకానందమిమ్మును. ఎవరికేని యది యట్లు కాదేని యామందమతులు జీవించియు జీవము లేనివారె.

3 ధుర్యైరపి మాధుర్యైర్ద్రాక్షాక్షీరేక్షుమాక్షికసానాం
వంద్యైవ మాధురీయం పండితరాజస్య కవితాయాః

ద్రాక్ష పాలు చెఱకు మధువను వాని మాధుర్యములకును పండితరాజ కవితామాధురి నమస్కార్యము.

4 నిర్మాణేయదిమార్మికోఽసినితరామత్యంతపాకద్రవ
న్మృద్వీకా మధుమాధురీపరీవాహోద్ధురాణాంగిరాం
కావ్యంతర్హిసఖే! సుఖేనకథయ! త్వంసమ్ముఖే
మాదృశాం

మంచి పరిపాకమున ప్రసరించు మృద్వీకా మధుపరీవాహాతిశయముకల వాక్కుల నిర్మాణ మర్మజ్ఞత కలదేని నావంటివారి సన్నిధిలో కావ్యము పఠింపుము.

ఇట్టిమాటలు పలుకగల ప్రతిభా విశ్వాసము పండితరాజునకు గలదు. మంచికవి కవితలో స్పష్టముగ గోచరించు వాచ్యార్థమె యాస్వాద్యమని భావింపరాదు అం దభివ్యక్తమగు వ్యంగ్యార్థ మాస్వాద్యము కావలెను.

"వ్యంగ్యవ్యంజకాభ్యామేవహి సుప్రయుక్తాభ్యా
మహాకవిత్వలాభో మహాకవీనాం"

కవి కవియగుట వాచ్యవాచకనిబంధన మాత్రమున గాదు. వ్యంగ్యవ్యంజక సుప్రయోగముననె కవి మహాకవియగును. పండితరాజట్టివాడు. ఆశ్లోకములలో వ్యంగ్యార్థము నాస్వాదింపవలెను

1 స్వరశ్రుతిమధురమయిన శబ్దముల పోహళింపు వీణాధ్వనిలో కలదు. రససముచితముగ నారోహావరోహములు వీణానిక్వాణమున నుండును. స్వసమాన జాతీయ వర్ణసంబంధము సముచిత సహాసనాసీన సహృదయ సంబంధ సదృశమై సంభావితమగును. నా వాక్కులందట్టి శ్రవణసుభగము నన సంపదయున్నది. వాణి వీణను మాని నా మాటలు వినుననుట తప్పులమే. తప్పుల మేకవిధమని భావించుట యగును. సముచితేష్ట ఫలసిద్ధి యయత్నముగ గలుగునపుడు మతికలవారంపరు సమాదరము వహింతురు. శిరఃకంపమున సభినందింతురు. కాన నా కావ్యపాఠకు లందరు నా కావ్య మాస్వాదించుట యుక్తము.

2. మధ్వాదులు మోదజనకము లయినను నిరంతరాస్వాదమున నట్టివి కాకపోవచ్చును నాకృతి తత్సర్వసమరసాస్వాద మిచ్చును సచేత నులకందర కిది యానందప్రదము మధుద్రాక్షాదుల సర్వసంపద యిందున్నది. రసనాగ్రాహ్యమగు రస్యరసము వానిలో నుండవచ్చును ఆ స్వాదనిగ్రాహ్యమగు విశిష్టత యిందున్నది. తతోఽధిక విభవవత్త్వము నా కవితా విశిష్టత. సజీవుల కందరకిది యాజీవమిచ్చును, ఇట్లనుట యిదియంతయు కవితా ప్రశంసాపరమయిన యర్థవాదము.

3. ద్రాక్షాదిగత సర్వవిధమాధుర్యములు స్వోత్కర్ష సంపాదనమునకై నాకవి తనారాధించుననుట నా కవితావైశిష్ట్యద్యోతకము. స్వస్వవియత మాధుర్య విశేషము ద్రాక్షాదులందు గలవి ద్రాక్షాక్షీరేక్షు ప్రముఖములన్నియు ప్రాతిస్వికవిశేషముకలవియె కావున సమబలములగుటచే తమలో నవి స్వసంవాద సుఖమున నుండజాలవు. స్వాధిక సంపదకల నా కవిత నారాధించుటలో నవి సంవాదముకలవి కాగల వని రూపాంతరమున నిరూపించుట యంతయు నా కవితా ప్రశంసయగును

4 నేను కావ్యరచనా సమర్థుడను. కవు లందరు వారి వారి కావ్యములను నాకు వినిపించిన గాని సంతుష్టిపొందలేరు. నా కవిత మధురమధుర వాగ్విలాసములతో నుండును ఇట్లు కవితలువ్రాయ గలవారె నా సమ్ముఖమునకు వత్తురు, కాగా ననేకు లేకవిధమున నా కవిత నభినందింతురు.

ఈవిధముగా నాయా శ్లోకములందలి భావ్య భావముల నాస్వాదింపవలెను. ఇది కవితాహంకార మని కొందరందురేమో? అందురు. వారట్లనుచునే యుందురు వారట్లని యని కవితల నాస్వాద్యరీతి నాస్వాదించి యమందమతులు కాగలరు. అప్పు డభినందింతురు. ఇట్టివిశేషమంతయు రచనామర్యా దానసారి. అందును మధురరచనా వ్యవసాయ సూచకము, ఇంక నోజోరచనా పరిపాటిని ప్రసన్న రచనా పరిపాకమును సూచించు ప్రశంసించు సరచనో క్రమముకూడ సంభావ్యమాన మనోహరమగును. ఇదియంతయు వర్ణవిన్యాసమున సమాసాసమాస మధ్యమసమాసఘటనమున గలుగు విచ్ఛిత్తివిశేషము. ఇది కేవలము శ్రవస్సుభగమగు విన్యాససౌందర్యమె కాదు. వ్యంగ్యవ్యంజన సమర్థముగా నుండుటయు నిందలి విశేషము నిగ్రాహ్యమగును. ఇట్టివానిలో వ్యంగ్యసౌందర్యము ముఖ్యముగా నున్నదా? వ్యంజక పదాది సౌందర్య మధికముగా నున్నదా? అను పర్యనుయోగమున కిందవకాశములేదు. వ్యంగ్య వ్యంజకములు పరస్పరసంబద్ధములు వ్యంజకతా నిర్ణయము వ్యంగ్యాధీనము వ్యంగ్యతానిర్ణయము వ్యంజకాధీనము. ఈ యుభయ ధర్మానుచ్ఛిన్నము లగువానిని పండితరాయలు తన కృతులలో గూర్చినాడు

నేను నిర్మించిన పంచలహరీకృతులు భావధ్వని కుదాహరణములని పండితరాయలు భావించెను. ఆ కృతుల నావిష్కరించి సమీక్షించుట యావశ్యకము. "గంగాలహరి, అమృతలహరి, కరుణాలహరి, లక్ష్మీలహరి, సుధాలహరి" అను లహరీపంచక మాతని కవితాలహరి ఆంధ్రభాషాకవు లీలహరిలో శీకరము లందుకొని ప్రఖ్యాతి వహించినారు గంగనుచూడని వారును గంగాలహరి వ్రాసిరి. గంగానదిపై భక్తిలేని వారును, రసగంగాధరము చదువనివారును గంగాల హరి వ్రాసిరి చదివిన ననువదించుట కుద్యమింప రని మా అమ్మాయి బామతి యనినది. గంగాలహరి లోని శ్లోకములు రసగంగాధరమున నుదాహృతము లయినవి. సమీక్షాపురస్కృతములయినవి ముద్రిత గంగాలహరిలో నొక క్రమమున్నది. ఆ క్రమ మపేక్షితము కాదు. ఈశ్లోకములలోనే క్రమమున్న

నది యక్రమముకాదు ఏ శ్లోకమున కాశ్లోకము స్వయం పరిపూర్ణము గంగాలహరి విషయమున లోకమున కింవదంతులు చాలకలవు వానిని నేను నమ్మను కొన్ని వత్సరములకు పూర్వము విజయ వాడకు విచ్చేసిన విఖ్యాత కాశీపండితుడు పండితరాజ జయంతిసభలో నధ్యక్షుడై యుపన్యసించుచు

*"గంగానదిపై సోపానములపై నుపవిష్టుడయిన జగన్నాథుడు ఆశువుగా గంగాలహరి శ్లోకములు రచించుచుండెను. శ్లోకశ్లోకమునకు గంగ పొంగి పొంగి సోపానము సోపానమెక్కి తుదిశ్లోకముకాగా జగన్నాథుని తడ లహరిలో కలుపుకొనినది."*

అని కథచెప్పెను. *"ఈకథ కవిత"* యంటిని. గంగాలహరి జగన్నాథుని యాశుకవిత యయినచో నిట్లు మనకందునా? అది తుదికవిత యయినచో రసగంగాధరమున నుదాహృతమగునా? ఆశుకవిత లెన్ని యాశువినాశము పొందలేదు. నేను స్వప్నములో ననేక కవితావధానములు చేసితిని. ఒక్కపద్యమేని మిగులలేదు. గుర్తున కొక్కటేనిలేదు. ఇదియంతయు స్వప్నాంతావధానము. సుపరిష్కృతమయిన సుశ్లిష్టమయిన కవితా పరిపాకము.

ఒకప్పుడు వైదేశిక విధర్మిసమాక్రమణమున భారతదేశముసంపదలి దేవక్షేత్ర తీర్థప్రదేశములన్నియు దూషితములయినవి కాశ్మీరమున నేయేప్రదేశమెట్లెట్లు దూషితమయినదో యానాటి యచ్చటి సంస్కృతకవితలు నిరూపించినవి *"నా పవిత్రవితస్తానదీజలము నాకు జీవనము. నే నశుచినై నది చూడను. అపవిత్రుడనై జలము స్పృశింపను. శుచినై వితస్తాజలమున పవిత్రుడనై శాస్త్రీయముగ నాచమనముచేసి యర్ఘ్యమిచ్చితిని. ఆ వితస్తాతీరమున నన్నుత్రొక్కిపట్టి విధర్ములు దూషితకలుషితజలములను స్వాంగప్రక్షాళనజలములను నా నోటిలో పోసిరి"* అని యొకకవి వాపోయినాడు. ఆ సమయమున నాయుత్తరప్రదేశమున కొందరు భాషాకవులు భక్తకవులు దుఃఖాశ్రుధారాసంకలనమున కవితాధారా ప్రసార మొనరించిరి. అట్టి సమయమున జగన్నాథుడు పండితరాజయి తన మాట వారికి పైగంబరు ఖురాను మాటగా తనవారికి తన మాటగా నిరూపించినాడు. నూర్జహాననలేదు. జహంగీరు కాదనలేదు. షాజహాను సంతుష్టుడు. ముంతాజి మురిసిపోయినది. కాజీలు కాదనలేకపోయిరి, దాదా గురువచన సారాయితుడయినాడు రాయముకుందుడు జయసింహుడు జగన్నాథభావులు. అసఫఖానున కిది పట్టదు. ఏవిధర్మియు జగన్నాథు నేమియుననలేదు జగన్నాథుడు యమునా వర్ణన మొనరించెను. యమున *"భాగీరథ్యాః సఖీ"* భాగీరది జగన్నాథుని శరణదేవి యయినది.

*తవాలం బాదంబ! స్ఫురదలఘుగర్వేణ సహసా*
*మయాసర్వేఽవజ్ఞాసరణిమథ నీతాః సురగణాః*
*ఇదానీ మౌదాస్యం వహసియదిభాగీరథి! తదా*
*నిరాధారో హా! రోదిమికథయకేషా మిహపురః*

అందరీవిధముగా భావింపవలెను. భాగీరథీ మనస్కులు కావలెను. ఇట్లు మరి యిట్లు మంచి భావోత్తేజనము కలుగజేసెను. భావదాస్యము పోగొట్టెను. బావకవితాదీప్తి కవితాదీప్తితో కవియకలిపి రసాయనముగ నందించెను. ఉత్తరదేశమున నీనాటికిని గంగానదిలో స్నానమొనరించి జపమొనరించువారు గంగాలహరీ శ్లోకములను పారాయణముచేయుదురు జగన్నాథుడట్లు పారాయణముచేయించెను. సధర్ముల కధర్ముల కాసక్తి కలుగజేసెను

*ఇమాంపీయూషలహరీం జగన్నాథేననిర్మితాం*
*యఃపఠేత్తస్య సర్వత్రజాయంతే సుఖసంపదః*

అని లోకము భావించినది. ఈశ్లోకమునందు జగన్నాథనామమున్నదికాని జగన్నాథకవితాముద్రలేదు. లోకము లహరి పఠించి సుఖసంపదలుపొంది యిట్లు భావించినది. ఈనాడు మనమేమి భావింతుము?

కవిత నేని భావింతుమా ? గొప్ప గొప్పయని వచో భావన మొనరింతుమా ? గంగాలహరీపయఃకణమందరకు భేషజము

*జడానంధాన్ పంగూన్ ప్రకృతిబధిరానుక్తి వికలాన్*
*గ్రహగ్రస్తానస్తాఖిల దురితనిస్తార సరణిం*
*నిలింపైర్నిర్ముక్తాన పిచనిరయాం తర్నిపతతః*
*నరానంబ! త్రాతుంత్వమిహ పరమంభేషజమసి !*

అంటే, 'భాగీరథి', ఇట్లుగా భ్రష్టనష్ట దుష్టుల నందరిని నీవ రక్షించు భేషజమని యనగలవారు నేటి కనవలయును

నిధానం ధర్మాణాంకిమపిచవిధానం నవముదాం
ప్రధానం తీర్థానామమలపరిధానం త్రిజగతః
సమాధానం బుద్ధేరథఖలు తిరోధానమధియాం
శ్రియామాధాననః పరిహరతుతాపంతవవపుః

ఇట్టి పద్యములందలి యనుప్రాస రమ్యత, మాలారూపకాలంకార మనోహరత, వాక్యరచనా చాతుర్యము, అసమస్త పదకృత చమత్కారము. శబ్దార్థాలంకారము లలంకార్య మలంకరించు విధానము, పునఃపునర్దా వర్ణఘటన కృత ప్రతిసత్త్వ ప్రతిపాదనము సర్వమనితర సాధారణ వైభవముగా సయత్న సిద్ధ ప్రతిపాదనముగా భాసించును.

ఈ సమాసరచన భావింపుడు. ఎవరిట్లు సంధానింపగలరో సంభావింపుడు.

మరుల్లీలాలోలల్లహరిలులితాంభోజపటలీ
స్ఖలత్పాంసు వ్రాతచ్ఛురణ విసరత్కౌంకుమ రుచి
సురస్త్రీవక్షోజక్షరదగురుజంబాలజటిలం
జలంతే జంబాలం మమజననజాలం జరయతు
ప్రదోషాన్తర్న్రృత్యత్పురమథనలీలోద్ధృతజటా
తటాభోగప్రేంఖల్లహరిభుజసంతానవిధుతిః
బిలక్రోడక్రీడజ్జలఉమరుడంకారసుభగ
స్తిరోధత్తాంతాపం త్రిదశతటినీ తాండవవిధిః

మొదటిపద్యమున సమాసముకలదు. రెండవ పద్యమున సమాసముకలదు. అదివేరు. ఇదివేరు. కేవల సమాసారంభ ప్రాగ్భారప్రదర్శన ప్రాభవభవ భావభారు లుందురు ప్రతిపాద్యవిషయ సముచిత సమాస రచనా సౌందర్యము పండితరాజునకు పరిచితము.

ఈ గంగాలహరికి పీయూషలహరి యని మారుపేరున్నది. కాని గంగాలహరి గంగాలహరిగనె సర్వప్రసిద్ధముగ నున్నది. గంగాలహరి విని గంగాలహరి పొంగినదట అనూదిత గంగాలహరిని విని గంగ మందాకిని యమునా? సాగరగామిని యమునా? రచయితల యంతరంగము పొంగినది. అది వారికి చాలును. నాకు మీకు చాలకున్ననేమి ?

గీత యనగనే భగవద్గీత భాసించును. లహరి యనగనె గంగాలహరి భాసించును జగన్నాథుడయిదు లహరీకృతుల రచించెను గంగాలహరీ ప్రఖ్యాతి యన్య లహరీకృతులకు కల్గినదా ? అనునాశంకమాని 'అమృతలహరి' నిట్లు భావింతము. ఈ లహరి యమునాలహరి. యమునానదిలో స్నానము చేయునపుడు;

> 'సంజ్ఞాకాంతసుతే ! కృతాంతభగిని ! శ్రీకృష్ణ నిత్యప్రియే !
> పాపోన్మూలిని ! పుణ్యధాత్రి ! యమునే !
> కాలింది !

అని యననలెనని జగన్నాథుడు మంత్ర ముపదేశించినాడు. ఇది కలిందినందినీస్తవము. పదిపద్యముల పరిమితికలది. స్వర్ణస్తేయ పరులపేయ రసికులు బ్రహ్మఘ్నులు గురుతల్పగులు పరిపూతులగుదురని వారిని వారిని కాలిందీవారిని చూచిచూచి జగన్నాథుడనెను. అట్టివారిని చూచి యిట్లు లొనరింపుడనియు ననెను. కవితాకృతి యుపదేశమంతర్గతముగ నున్నది. ఒక్కొక్కపద్య మొక్కొక గమనముతో నున్నది. కేవల

గమన సౌందర్యమె యిందలి సౌందర్యము కాదు. ఉపస్కార్యోపస్కారకత యిందున్నది.

*పాయంపాయమపాయ హారిజనని! స్వారుత్వ*
*దీయం పయో*
*నాయంనాయమనాయనీయకృతినాం మూర్తిం*
*దృశోః కైశవీం*
*స్మారంస్మారమపార పుణ్య విభవం కృష్ణేతి*
*వర్ణద్వయం*
*చారంచార మితస్త తస్తవతటే ముక్తోభవేయం*
*కదా?*

నీ జలము త్రాగి కేశవరూపముచూచి కృష్ణ నామము స్మరించి నీ తటమున సంచరించి నేను ముక్తుడ నయ్యెదనను చిన్నయర్థమె యిందున్నను తత్కథన వైశిష్ట్యము విలక్షణము. 'పాయం పాయం నాయం నాయం స్మారం స్మారం చారం చారం" పదములు క్రియాపౌనఃపున్యము సూచించుసవై సాధకుని స్వాత్మనిష్ఠనవగమింప జేయగలవు.

కరుణాలహరి పేరున 55 శ్లోకముల పరిమితి కల కృతి విశేషమున్నది. ఇది విద్యావివేకసంపద కలవాని యాత్మ నివేదనముగ గోచరించును. ముస్లిం భక్తకవుల భావచ్ఛాయలిందవ భాసించునేమో సర్వాభిజ్ఞులు పరిశోధన మొనరింపవలసి యున్నది.

*సుకృతం నకృతంపురాకదా*
*వ్యధసర్వంకృతమెవదుష్కృతం*
*అథవా గలిత హ్రీయాధయా*
*భగవన్! త్వాంప్రతి కిం నిగద్యతాం*

నేనెపుడు సుకృతమాచరింపలేదు. ఎల్ల దుష్కృతి మొనరించితిని. నే నివుడు సిగ్గువిడిచి యేమి చెప్పుదునని వాచ్యార్థము. నీవు సుకృతలభ్యుడవు. నాకలభ్యుడవు అయినను నన్ననుగ్రహింపుమని కోరుదును. నేనిట్లు కోరవలసిన యవసరమెలేదు సుకృత దుష్కృతముల నీవు సమీక్షింపవు. నీ నిరుపాధిక కృపావిశేషముననె నన్ననుగ్రహింతువు. ఇట్టుగా నిందలి యర్థవిశేషము నవభాసింపజేసికొనవలసి యున్నది.

అనేక శ్లోకముల కేకాన్వయరూపమయిన కులకమీ కృతిలోనున్నది. 13శ్లోకములందు భక్తిభరితాంతరంగు డలౌకికమయిన భగవద్రూపమును భావించురీతి యిందున్నది ఇవి యన్నియు మంత్రపారాయణ పరమార్థముకలవి ఇది యనువాదమునకు దిగవు చిత్తనిగ్రహమున నొక్కొక విశేషణమును అందలి విశేషమును భావింపవలెను భక్తిభావులు వీనిని మనన మొనరింపుడు కవితాభావులు భక్తి కవిత నెట్లుప్రోయవలసియుండునో గుర్తింపుడు. భక్తులకవులగుట, కవులభక్తులగుట వీని భావనమున మనకు భాసింపదు. ఆశ్లోకముల నే నుల్లేఖింపను. పాఠకులు పుస్తకముపట్టి పఠింపవలసినదె. లహరి ప్రవాహము. గంగాలహరి యమునాలహరి యనుట సంగతముగ నున్నది. కరుణాలహరియేమి? భగవానుని యహేతుకమయిన దయారసము కరుణారసము ఆ రసప్రవాహము లహరి. అసలు లహరీ పదాంతము లందంతట కవితారసప్రవాహ సంభావన ముండును. ఇట్లె ఇటివన్నియు సంగతములుకాజాలెను.

లక్ష్మీలహరి నాల్గవలహరి. దీనిలో 41 శ్లోకములు కలవు. అంతట లక్ష్మీ స్తవమున్నది. దృగంత స్తుతి, చరణస్తవము, జంఘోరు నితంబోదర నాభీ కుచభుజ కగ్రీ వావచన కపోలదృషిధమ్మిల్ల స్తుతి యున్నది మంత్రశాస్త్ర సమ్మతమయిన పాదాదికేశాంతస్తుతి యిందున్నది. ప్రకృతి కమనీయస్తుతి విధాన మిందుగలదని జగన్నాథుడె భావించెను.

''శరాయాయాబీజౌ హిమకరకలాకాంత శిరసా
విధాయోర్ధ్వంబిందుఃస్ఫురిత మితిబీజంజలధిజే"

అని శ్రీదేవీమంత్రమునుగూడ గూఢముగా నుల్లేఖించెను. శ్రీదేవీవరివస్యారీతికి సంబంధించిన విశేషము లీ లహరిలో సౌందర్య లహరిలోవలె కవితాగుప్త

ములైయున్నవి, తంత్రమంత్ర విద్యావిశేషములు సంప్రదాయసిద్ధముగ గుర్తించినవారు సంస్కృతభాషాత్మకముగా వ్యాఖ్యానము వ్రాయుట యుక్తము. సరస్వతీ సంపన్నులు సంపదలేదని కుందక జగన్నాథ కవితామర్మము గురించి యీ లక్ష్మీలహరీ పారాయణము చేయుట యుక్తము.

"రమే! పద్మే! లక్ష్మి! ప్రణతజనకల్ప ప్రమలతే!
సుధాంభోధేః పుత్రి! త్రిదశనికరోపాస్తచరణే
పరే! నిత్యం మాతర్గుణమయి! పరబ్రహ్మమహిలే!
జగన్నాథస్యాకర్ణయ! మృదులవర్ణావలి మిమాం"

అని జగన్నాధుడనును. మనకందరకు జగన్నాథుడు ప్రతినిధియై యీ మాటలనినాడు. మనము జగన్నాథ పదములో మనపేరు కూర్చుకొందము.

సుధాలహరిపేరున వేరొక లహరియున్నది. 30 శ్లోకముల పరిమితికల యీ లహరి సూర్యస్తుతి రూపము. "ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్" ఒక్కొక శ్లోకమును పంద్రెండు పర్యాయములు పారాయణ మొనర్పుడు. ద్వాదశాదిత్య స్వరూప సూర్యభగవాన్ గోచరింపగలడు దినమున కొకటిగా సూర్యవందన మొనరించుచు శ్లోకమును మంత్రవత్ పలుకుచు శ్లోకార్థమును భావించునది. మాసమునకొక యావృత్తియగును. పంద్రెండుమాసము లిట్లెచేయునది. కాగా సంవత్సరమునకు ద్వాదశ పర్యాయములు పారాయణముచేసినట్లును. 360 దినములు సూర్యు నిట్లుపాసించినచో సూర్యుడన నేమిగాభావింపవలయునో తెలియును ఇట్లు 12 సంవత్సరములు నియమము పాటింపుడు. 4320 పర్యాయములు సూర్యభావనము చేసినట్లగును. గాయత్రీమంత్రోపాసనాధికారములేనివారు ఉన్నవారును సుధాలహరి ననుసంధానము చేసినచో సూర్యాకృష్టి విద్యారాధనము చేసినట్లగును. జగన్నాధుని కవితవంటి కవిత కల్గుటయకాక సూర్యకిరణ సహస్రాంతః ప్రసారసుషుమ్నా కిరణాంతర్వర్తి సుధాలహరి ప్రసరించును. శారీరసుషుమ్న సహస్రార సుధాలహరీ సమాస్వాద మిచ్చును ఈ విషయమున నింతకన్న నేమివ్రాయుదును? వ్రాయదగినది వ్రాసితిని. ఇక నదికము వ్రాయను ఇంక వ్రాయనివానివంటి వన్నియు సంప్రదాయ గుప్తములట. అభిజ్ఞులభిజ్ఞానముకలవారు కాగలరని యందరివలె విశ్వసింతును.

బాణభట్టు మేనమామ మయూరకవి సూర్యశతకము వ్రాసి యారోగ్యము పొందెనని లోకవార్త యున్నది. ఆ సూర్యశతక విశిష్టతవేరు. ఈలహరి విశిష్టతవేరు. రెండిటి సంవాదసమీక్షచేయుట నా పనికాదు. నా కిష్టముకాదు, మీకు నిష్టముకారాదు. కొందరనిష్టకార్యము చేయుదురు. వారలకును. "ఉదయతుశివం భాస్వతో భానుమాలాః"సూర్యస్వరూప నిరూపణమున వేదభాగములేమియనినవి? మంత్రవిదులేమనిరి? ఉపనిషత్తత్త్వమేమి చెప్పును? ఉపాసకుని యుపాస్యోపాసనావాసన మెట్లుండును? కవితాశ్రుతి బావిపశ్చిన్నాదుని నిరంతరాను సంధానమెట్లుండును? ఇట్టి ప్రశ్నల సమాధానముల కన్వేషణమువలదు. సుధాలహరి సంభావింపుడు.

ఊర్ధ్వంపాపావలిభ్యః స్థితఇతిజగదేయస్యచే
దైయదాఖ్యా
నిస్యూతకప్యాసనాభంఖలు సహచరతాం నేత్రయోః
పుండరీకం
గేష్ఠావృకొన్మయప్య ప్రద్యుతకనకనిభశ్మశ్రుకే
శాఖిలాంగః
సోయం సర్వాంతరాత్మా ఇవదిశతుతరాం వాసరేశః
శివాని

ఈపద్యములో పండితరాయలు నన్నుద్దేశించి "తవ దిశతుతరాం వాసరేశః శివాని" యనెను అని యందరు భావింపవలెను. ఈ లహరికి సంస్కృత భాషలో వ్యాఖ్యానమున్న నెంత బాగుండును! వ్రాయించుటకు దారాలేదు. ప్రాణనారాయణుడు

లేడు. రాయముకుందుడులేడు. ఎవరున్నారో తెలియదు.

ఇంతగా నిద్రవాసి పండితరాయల భామినీ విలాసమును గుఱించి వ్రాయకుండుట పండితరాయల కిష్టమా? సుబ్బరాయల కిష్టమా? మాధవరాయల కిష్టమా? పరాయలకు నిది నిష్టముకాదు. నేనిట నిక భామిని వ్రాయుదును.

భామినీ విలాసమొక మహాకవితావిలాసము. దీనిలో ప్రాస్తావిక విలాసమనదగిన యన్యోక్తివిలాసము 122 శ్లోకములు శృంగారవిలాసము 180, కరుణవిలాసము 19, శాంతవిలాసము 44 మొత్తము భామిని 365 పద్యములతో నున్నది. ఈశ్లోకముల నందరు బాగుగా గ్రహింపుడు. దినమున కొకపద్యము భావింపుడు చాలును. వత్సరభావనము చేయవచ్చును. ఇకనేమికొదువ? భామిని యనుగ్రహము కలుగును. జగన్నాథునకు భామినికటాక్షమున్నది. ఈపాఠకులకు భామినీకటాక్షము కలుగును. నేను కవిని కాను. కవి కవితాభావుకుడను. నాకు భామినీ కటాక్షమక్కఱలేదు. అది లేదును. రసగంగాధర దృష్టి నాకు చాలును. అందరకు భామినీకటాక్షము కలుగునట్లు నేను గంగాధరారాధనము చేయుదును.

భామిని! భామిని! ఏమాభామిని! ఎవరా భామిని! నన్ను విందురా? అయినచో నిదిగో భామిని. భామినీభావనము చేయుడు. చతుష్షష్టికోటియోగినీ గణసేవితయగు మహాకామ కామేశ్వరి జగన్నాథ పండితరాయ లకుపాస్యదేవత. ఆ దేవతానుగ్రహమున వశిన్యాదివాగ్దేవతల యనుగ్రహము జగన్నాథునకు గల్గినది. శ్రీదేవినుపాసించు వారల కభీష్టసిద్ధు లనేక విధముల నుండును. ఇష్టాభీష్ట ప్రదాయిని భామినీ దేవి. దేవీ శ్రీమండల నివాసిని. భామినీ దేవతోపాసనము కవితావిలాసము సంపాదించును. భామిని యుపాసన సంప్రాప్తమయిన కవితావిలాసమును జగన్నాథుడు భామినీవిలాసముగ వ్యవహరించి భామినీ విలాసపదమున కీవిధముగ నర్థము సంభావించుట సముచితము. భామినీపదార్థ మిట్లు నిశ్చేయమగుట తంత్రగ్రంథములందు కలదు.

భామినిలోకభూమిని, 'కోపనాసైవభామినీ అని' యమరుడనెను. ప్రణయాపరాధమువలన చుఱచుఱ లాడు ప్రణయినికోపన యగును గావున నప్పుడామె భామిని. ప్రణయకుపిత ప్రియాప్రసాదన రూపము లయిన పద్యములు భామినీవిలాసములో కలవు. కావున నిది భామినీ (కోపనా) విలాసమనదగును" అని కొందరనవచ్చును. కాని యీ వాదమును సచేతసులు నమ్మవలదు. కోపనయయిన కామిని వర్ణన పరములు కొన్ని కలవు. వానియందును కవితావిలాస మాస్వాద్యమగును.

1 యుద్ధైవమంతుం పరికల్ప్యగంతుం
వ్యవస్థైవరోషాదుపజల్పతో మే
ఉదగ్రుచంచన్నయనా నతాంగీ
గిరం న కాంకామురరీకరోతి

2 వక్షోజాగ్రంపాణినామృశ్యదూరం
యాతస్యద్రాగాననాబ్జం ప్రియస్య
శోణాగ్రాభ్యాం భామినీలోచనాభ్యాం
జోషంజోషంజోషమేవావతస్థే

3 గురుమధ్య గతామయా నతాంగీ
విహతానీరజకోరకేణ మందం
దరకుండల తాండవం నతభ్రూ—
లతికం మామవలోక్య ఘూర్ణితాసీత్

4 వీక్ష్యవక్షసి విపక్షకామినీ
హారలక్ష్మ దయితస్యభామినీ
అంసదేశవినివేశితాం క్షణా
దాచకర్ష నిజబాహువల్లరీం

5 గురుమధ్యే హరిణాక్షీ
మార్తికశకలై ర్నిహంతుకామం మాం
రదయంత్రితరసనాగ్రం
తరలితనయనం నివారయాంచక్రే

ఇట్టి శ్లోకములు కొన్నికలవు. కొన్నిటిలో భామినీ పదమును కలదు. భామినీవిలాసము కోపనావిలాసమె యగునేని యిట్టిపద్యములె యిందుండవలెను. అకోపన వనితావర్ణన పరములయిన పద్యముల కిందవకాశ ముండదు. అవియునున్నవి. భామినీవిలాసము భామినీ విలాసము కారాదు. అన్నింట కవితావిలాసమె యాస్వా ద్యము కావున నేనినిన భామినీవిలాసమగును.

*సర్వేపివిస్మృతిపథంవిషయాఃప్రయాతాః*
*విద్యాపిఖేదగవితావిముఖీబభూవ*
*సాకేవలంహరిణశాబకలోచనామే*
*నైవాపయాతిహృదయాదధిదేవతేవ*

ఈపద్యమునందలి యధిదేవత భామినీదేవతయె యగును. భామినియన్న భామిని లోకభామిని. పర కీయవనిత. అట్టి పరకీయావిలాసమె యిందున్నదని కొందరన గలుగుదురు. వారి నేమియుననను. వారి సామర్థ్యము యుక్తము కాదందును. ఇందు పరకీయా శృంగారము మాత్రమె యున్నదా? నానావిధము లయిన స్వీయాశృంగారవిలాస విధాన విశేషములు నున్నవికదా! పరకీయావిలాసమును జగన్నాథున కేల యంటగట్టవలెను. భావనాభాతి ప్రతిభాతముల నెవరు వర్ణింపజాలరు? దాంపత్యధర్మ శోభావిలాసము కల వారందరు భామినీవిలాసము నందలి శృంగారవిలాస మును భావింపుదు. వారి దాంపత్య మాధుర్యము వారలకు సాక్షాత్కరింపగలదు. దంపతులీ విలాస శ్లోకములను గదిలో పారాయణముచేసి ఫలమనుభ వింపుడు.

భామినీవిలాసము నందలి ప్రాస్తావిక విలాస మున 122 శ్లోకములు కలవు. అన్నియు పండితరాజీ యములగునా? అనుచర్చ మఖల నుపపాద్యముకాదు. అన్యోక్తి విలాసమనదగిన వీనిలో శ్లోకముల ప్రస్తుత ప్రశంసారూపములు. వివక్షితమయిన ప్రస్తుతార్థమును స్ఫురింపజేయుటకు అప్రస్తుతార్థ నిబంధనము వీనిలో నున్నది. వివక్షితరూపమున కన్న చమత్కార కారి యగు నన్యరూపమున నిరూపించుటయు నున్నది అలంకార భేదాప్రభేదమున నావశ్యకములయిన ప్రవిభాగము లన్నియు నిందున్నవి. ఆ యా పద్య ముల గతి సౌందర్యము భావ్యమాన సుందర భావ రమ్యత భావించుటయ సముచితము.

*తావత్కోకిల! విరసాన్*
*యాపయ! దివసాన్వనాంతరేనివసన్*
*యావన్మిలదలిమాలః*
*కోపిరసాలః సముల్లసతి*

*పాటీర! తవ పటీయన్*
*కఃపరిపాటీమిమాం మురీకర్తుం*
*యత్పింషతామపినృణాం*
*పిష్టోపితనోషి పరిమలైః పుష్టిం*

*పుష్టాఃఖలు పరపుష్టాః*
*పరితోదృష్టాశ్చ విటపినఃసర్వే*
*మాకంద! నపపేదే*
*మధుపేనతవోపమా జగతి.*

ఇందలిపద్యముల గూఢార్థములను భావించుటకు రస గంగాధర పరిజ్ఞాన మావశ్యకము. అచ్యుతరాయ రచితభామినీ వ్యాఖ్యానమేని యావశ్యకము వానిని జూడవలెనని యను నామాటయేని యావశ్యకము.

*యశస్సౌరభ్యలశునః*
*శాంతిశైత్యహుతాశనః*
*కారుణ్యకుసుమాకాశః*
*ఖలః సజ్జనదుఃఖదః*

సజ్జన దుఃఖప్రదుడయిన ఖలునందు లశునత్వము హుతాశనత్వము అకాశత్వము సమారోపితమయినది. ఖలుడు యశోదూషకుడు. లశునము సౌరభ్య హాని కరము. ఖలుడు శాంతినాశకుడు. అగ్ని శైత్యనాశ కము. ఖలుడు కారుణ్యశూన్యుడు. ఆకాశము పుష్ప శూన్యము. యశఃప్రభృతములందు సౌరభ్యాది సమా రోపము కలదు కావున ఖలునందు లశునత్వాద్యారో

పము సంగతమగును ఖలుకంము లశునత్వాద్యారోప మున్నది కావుననె యంశము మొదలగువానియందు సౌరభ్యాద్యారోపము సంగతమగును ఇట్టివి పరస్పర సంబంధముకలవయినవి ఇట్టివి పరంపరిత రూపక మగును అనేకారోపము లుండుటచే మాలాత్మకము నగును. లశునత్వాద్యారోపము వైధర్మ్యముతోనుండుట యిందలి విశేషము. ఇట్టి యీ మీమాంసయంతయు నలంకార పక్షాశ్రయము. ఇంకను భావపక్షాశ్రయ మీమాంసయు నిందు చక్కగా సంగతమగును. ఇట్టి మీమాంసావిశేషముల సమన్వయమున నీ శ్లోకముల కవితావిలాసము భావనీయముగ నున్నది.

శృంగారవిలాసము నందలి శ్లోకములలో గూఢ గంభీరార్థములను జగన్నాథుడు రసగంగాధరమున సమర్థముగా చర్చించి నిరూపించినాడు. '*శయితా సవిధేప్యనీశ్వరా, గురుమధ్యగతా మయా నతాంగీ, తల్పగతాపి చ సుతనుః, వీక్ష్యవక్షసి విపక్షకామినీ,*' మొదలగు కొన్ని శ్లోకభావములను నా నవరస గంగాధరమున నిరూపించితిని.

*"లోలాలకావలిచలన్నయనారవింద*
*లీలావశంవదితలోక విలాచనాయా"*

శృంగార నిరూపణమున నిట్టి సమాసముల ఘటన ముచితమని యాతనిజూచి లోకముగుర్తింపవలెను.

*మధురసాన్మధురం హిత వాధరం*
*తరుణిమద్వదనే వినివేశయ*
*మమ గృహాణ కరేణ కరాంబుజం*
*ప-ప-పతామిహ-హా-భ-భ-భూతలే*

మద మత్తుని యీ వచనములలో '*నాకరాంబుజమును నీకరముతో పట్టు*' మని యనుట ప-ప-పతామి భ-భ-భూతలే యనుట స్వభావోచితమైయున్నది ఇట్టి వన్నియు రసగంగాధరమున వ్యాఖ్యాతములు. కరుణ విలాసమునందు 19 శ్లోకములున్నవి. కరుణావిలాస మని ప్రసిద్ధియున్నది

*యందస్మితేన సుధయా పరిషిచ్యయామాం*
*నేత్రోత్పలైర్వికసితైర నిశం సమిజే*
*సానిత్యమంగలమయీ గృహ దేవతామే*
*కామేశ్వరీహృదయతోదయితా నయాతి*

అనుపద్యమున కామేశ్వరీ నామముకలదని జగన్నాథుడీ ధర్మపత్ని కామేశ్వరియని యామె చనిపోగా నాతని శ్లోకములు రచించి నాడని కొందరు తెలిసినట్లు చెప్పుదురు. నాకును కొంత తెలియును గాని నేనట్లు చెప్పను. నాధర్మపత్నియు కామేశ్వరి. ఆమెయు గతించినది. నేను శ్లోకములు వ్రాయలేదు. ఇట్టి శ్లోకశ్లోకము లనుస రింపలేదు. కవి నిత్యజీవనమునకును భావనామయ కవితాజీవనమునకును సంబంధములేదు. ఉండునని పశ్చిమాశ్చిమ విపశ్చిదిందులెందరుచెప్పినను నేను వినను. ఎవడేని గణారాధకుడు నిత్యజీవిత విశేషము లను కవితాజీవితమున కలుపదలచినచో నది కవిత కాదు. సౌరభ్యలశునము. సర్వరసభావ నిర్వర్ణన సమర్థుడగు జగన్నాథుడు కవితావిలాసముగ కరుణా విలాసము రచించెను. ఇది యాతని యేడుపే యయి నచో నెవరికి నాస్వాద్యము కాదానందమీయదు. సహృదయులాస్వాదించుచున్నారు. ఆనందించుచున్నారు. ఇదియు విలాసమయినది. జగన్నాథ శ్లోకమయినది. శోకముకాలేదు. వాల్మీకి శోకము శ్లోకమగుట వేరు. '*నతుమునేఃశోకః*' అని యభినవుడనవె యనెను కరుణావిలాసమున సుందరమయిన కవితా విలాస మున్నది

*రీతింగిరామమృతవృష్టికరింతదీయాం*
*తాంచాకృతింకృతి వరైరభినందనీయాం*
*లోకోత్తరామథకృతిం కరుణారసార్ద్రాం*
*స్తోతుం నకస్యసముదేతి మనఃప్రసారః*

శాంతవిలాసములో 44 శ్లోకములు కలవు. చరమవయసులో శాంతవిలాసము రచించెననరాదు. ఇందలి పద్యములు రసగంగాధరమున నున్నవి.

"వాచానిర్మలయా సుధామధురయా యాంనాథ! శిక్షాగదాః" అని జగన్నాథుని మనమందము, విషయరాగ విముఖుడయిన మానవు డుపనిషన్నిరూపితాద్వైత భావమున పరమాత్మ నారాధించుట యిందున్నది శమముదయింపగా గలుగు చిత్తస్థైర్య మిందు నిరూపిత మయినది. ఇది యీతని కవితావిలాస సంపద.

తైలంగాన్వయమంగలాలయమహాలక్ష్మీదయాలాలితః
శ్రీమత్పేరమభట్ట సూనురనిశం విద్వల్లలాటంతపః
సంతుష్టః కమతాధిపస్య కవితామాకర్ణ్య తద్వర్ణనం
శ్రీమత్పండితరాజ పండితజగన్నాథోవ్యతానీ దిదం

అని యను జగన్నాథుని ప్రాణాభరణకావ్యమొకటి కలదు. జగదాభరణమనియు దానిపేరు, ఇందు 52 పద్యములున్నవి. శ్రీకామరూపేశ్వర వర్ణన పరములయిన యీశ్లోకములకు జగన్నాథుడె కవితా పరవ్యాఖ్యవ్రాసెను. ఇట్టి యీ వ్యాఖ్యాసరణిచూచి జగన్నాథపద్య సమాస్వాదరీతిని అందలి కవితావిలాస సంపద్విశేషమును గుర్తింపవలెను అలంకారనిర్ణ యమున ననేకు లనేకథాభ్రాంత విభ్రాంతులగుదురు. అట్లు కావలదని యిది చెప్పును. రసభావనిర్ణయము నందును జగన్నాథమార్గ మావశ్యకము.

విద్వాంసో వసుధాతలే పరవచః శ్లాఘాసువాచంయమాః
భూపాలాః కమలావిలాసమదిరోన్మీలన్మదాఘూర్ణితాః
ఆస్యేధాస్యతికస్య లాస్యమధునాధన్యస్య కామాలస
స్వర్వామాధరమాధురీమధరయన్ వాచాంవిలాసోమమ

"ఈలోకమున పండితులుపరుల శ్లాఘింపరు. పాలకులు సంపన్నులై చూడరు. ఇక నావాగ్విలాసమెచట ప్రసరింపవలెను" అని వాచ్యార్థము స్వకవితా ప్రశంస వ్యంగ్యము.

"విద్వాంస ఇత్యాది ప్రాయదర్శనాభిప్రాయ మేతత్ । తేన సహృదయైర్న మనాగపి నియనాయితవ్యం ; భావధ్వనిశ్చాయం । ఉత్తరార్ధ ప్రతిపాద్యార్థాలంబనాయాః ఏతత్పద్యప్రయోగానుభావాయాః కవిగతచింతాయాః ప్రాధాన్యేనాభివ్యక్తేః । అనుపాత్తోభయనిమిత్తకో వ్యతిరేకః స్ఫుటోఽలంకారః । కామాలసత్వం వామావిశేషణం అధరమాధురీ ప్రకర్షకం।"

ఇందు విద్వాంసులని యనుట సామాన్యముగా నట్లుందురనుట. కావున సహృదయులు విమనసులు కానక్కరలేదు. ఇందు భావధ్వనియున్నది, ఉత్తరార్థమునందలి యర్థమాలంబనముగా, నీపద్యప్రయోగమను భావముగా కవిగతచింత యిందు ప్రధానముగ నభివ్యక్తమగుచు వ్యతిరేకాలంకారమిందు స్ఫుటముగా నున్నది. వామావిశేషణముగానున్న కామాలసత్వమధరమాధురీ ప్రకర్ష సూచించును. అని యీ వాక్యార్థము. ఇట్లు వ్యాఖ్యారీతి యుక్తము. ఇందలి శ్లోకములన్నియు నెట్లాస్వాద్యములో నిర్దిష్టమయినవి. ఇట్లె యితరము లాస్వాద్యములు.

అవశిష్టాన్యోక్తులను నామమున 538 శ్లోకములు సంగృహీతములై జగన్నాథునిపేరిట ప్రకటితము లయినవి. అపండిత రాజీయము లిందు గలవు. మొత్తముపై 174 విషయములపై రచితము లయిన శ్లోకములుకలవు. పూర్వ శ్లోకములవలెనిం దాస్వాద్యము లధికముగలేవు. కొన్ని యున్నవి, వాని నాస్వాదింపుడు. పండితరాజు సభిమానింపుడు. ఆ యభిమాన మహేతుకము కాకుండునట్లు పరిశీ

లించుట యావశ్యకము. పండితరాజ పద్యసంభావనా బలమున కొందరు కొన్ని శ్లోకములు వ్రాసినచో నవి పండితరాజ పరిష్కార వాసితములను విశ్వాసము కలుగజేసికొని పరిశిష్ట రసగంగాధర రచన మొనరింపవలెనని భావించు నాకు పాదేయోదాహరణములు కాగలవు. ఏ యలంకారములను శ్లోకములందు నిబంధింపవలసి యుండునో సమయాంతరమున గుర్తింపవచ్చును.

పండితరాజ శ్లోకములకు తత్పరిష్కార రమ్యముగా నాంధ్రభాషాత్మకమయిన వ్యాఖ్యానముండుట యావశ్యకము. తత్సంపన్న సారస్వతాలోకులాద్భుతమతులై కవితాసామ్రాజ్య చక్రవర్తిచ్ఛత్రచ్ఛాయా సంచారులు కాగలరు. సాహితీవల్లభుల సముచిత సంకల్పము సహృదయ హృదయ సంవాద సమ్మోద సంభారముకలదియగుట సారస్వతేయుల కభీష్టము.

అస్తు.

# ఆంధ్రవ్యాకరణమాహాత్మ్యము — [illegible]

అమరేశం రాజేశ్వరశర్మ.

*"వాచాం మాంధ్రమయీనాం యః ప్రవక్తా ప్రథమోఽభవత్*
*ఆచార్యం తం కవీంద్రాణాం వందే నాగసు శాసనమ్"*

ఏ శుభముహూర్తమున నెలకూచిబాలసరస్వతీ మహోపాధ్యాయుఁ డాంధ్రశబ్దచింతామణిని లోకము ముం దుంచినాఁడో యానాటినుండి యాగ్రంథమున కాంధ్రవిద్వల్లోకమున బహుళప్రచారము లభించినది. అందు కాగ్రంథము శబ్దశాసనులగునన్నపార్యులు రచించినదనువిశ్వాసము ప్రధానకారణమైయున్నదనుటలో నెవ్వరును విప్రతిపన్నులు కారు కాని యాగ్రంథము నిజముగా నాంధ్రమహాభారతకర్తయగు నన్నయభట్టారకునిచేతనే రచియింపఁబడినదా? లేక తరువాతికాలమున మఱెవ్వరిచేతనో వ్రాయబడినదా? యనువిషయమున మాత్రము పండితులలో నైకమత్యము కానరాకున్నది.

ఆంధ్రశబ్దచింతామణి యేకాలమునఁ బుట్టిననేమి? దానియస్తిత్వము గుఱుతింపఁబడినదిమాత్రము క్రీ॥ శ॥ పదునేడవశతాబ్ది ప్రథమపాదమునసే యనుట నిర్వివాదము బాలసరస్వతికి ముందు వ్రాయఁబడిన యే యాంధ్రవ్యాకరణమునందును జింతామణిప్రసక్తి కానరాదు. కనబడుచున్నయథర్వణకారికావళికాలము, కర్తృత్వము కూడ వివాదాస్పదములే యయినందువలన నాంధ్రశబ్దచింతామణికర్తృత్వప్రశ్నమునకు సమాధానమింతలో లభించునాశ కానరాకున్నది

పోనిండు. బాలసరస్వతికి ముందుండినవారు నన్నపార్యుని వ్యాకరణకర్తఁ గాఁ బేర్కొనకున్న నథర్వణాచార్యునైనఁ బేర్కొనరాదా? అదియును లేదు. అథర్వణుని వ్యాకర్తగాఁ బేర్కొనుటయందు మొదటివాఁడు మండ లక్ష్మీనృసింహపండితుఁడు. అయినను నాతఁడు పేర్కొన్నయథర్వణవ్యాకరణము త్రిలింగ

శబ్దానుశాసనమే కాని యథర్వణకారికావళి కాదు. కారికావళి నీలలక్ష్మీనృసింహపండితుఁ డెఱిఁగియున్నట్లు కానరాదు. కారికావళీకర్త యథర్వణుఁ డని చెప్పినవాఁ డహోబలపతి. ఈతఁడు త్రిలింగశబ్దానుశాసనమును గూర్చి పల్లెత్తుమాటయైన నన్నవాఁడు కాఁడు కాని నృసింహపండితప్రశంసమాత్రము కవిశిరోభూషణమున రెండు మూఁడు తావులందుఁ గానవచ్చుచున్నది. [1] కాని యహోబలపతి పేర్కొన్న నృసింహపండితుఁడు మండలక్ష్మీనృసింహపండితుఁడేనా? యనునది కూడ సందేహాస్పదమే. ఏమయినను ఆంధ్రశబ్దచింతామణ్యథర్వణకారికావళులకర్తృత్వము వివాదాంశముగానే నిలిచిపోయిన దనుట సారాంశము.

ఆంధ్రశబ్దచింతామణికిఁ గర్త యెవరయినఁ గానిండు కాని యా గ్రంథమున కాంధ్రవ్యాకరణప్రపంచమున నద్వితీయస్థానము కలదనుటమాత్రము నిక్కము.

ఎలకూచిమహోపాధ్యాయుని యనంతరము వచ్చిన యాంధ్రవ్యాకరణకర్తలలో నే యొక్కరిద్దఱో తప్ప కడమవారందఱకును నాంధ్రశబ్దచింతామణిడే ప్రథమభిక్షయై యా సంప్రదాయమే వారికి శిరోధార్యమైనది. ఆంధ్రశబ్దచింతామణికిఁ డీకలు పరశ్శతములు. వీనికిఁ గర్త లెందఱో మనకుఁ దెలియదు. వీరిలో నెంద ఱెన్నింటిని దమకై వ్రాసికొనిరో, ఎందఱు నిజముగాఁ దమటీక లితరులకుఁగూడ నుపయోగింపవలయు నని యెంచిరో తేల్చి చెప్పుట కూడ కష్టసాధ్యమే

టీకలవిషయ మటుండనిండు వ్యాఖ్యలు మాత్ర మొకటి రెండా! పదిసంఖ్యను దాటినవి. అనువాదములమాట చెప్పనేపనిలేదు. పద్యరూపమున సూత్రరూపమున నెందఱో యాంధ్రశబ్దచింతామణి

(1) చూ. కవిశిరో. (ఆంధ్రరచయితృసంఘ ముద్రితప్రతి) 156, 218, 229, 246 పుటలు.

సూత్రముల నాంధ్రములోనికిఁ గొనివచ్చినారు. శ్రీ బ్రౌనుపండితుఁడు చింతామణికి [1] కాంగ్లానువాదమును వెలయించినాఁడు.

చింతామణిటీకాకర్తలలో నాద్యుఁ డెలకూచి బాలసరస్వతి, పద్యరూపమునఁ దెలుఁగులో వివరణగ్రంథములు రచించినవారిలో మొదటివాఁ డప్పకవి; సంస్కృతమున వ్యాఖ్యలు రచించినవారిలోఁ బ్రథముఁ డహోబలపత్యాచార్యుఁడు.

అహోబలపతి కనంతరముకూడ చింతామణికి సంస్కృతమున మఱికొన్ని వ్యాఖ్యలు వ్రాయఁబడినవి. కర్త యెవరో తెలియదు కాని తిరుపతి ప్రాచ్యపరిశోధనాలయమున నొకసంస్కృతవ్యాఖ్యాన మున్నది. [2] మఱియొక్కటి బాలసరస్వతీయ మనుపేరున నున్నది [3] ఇది బాలసరస్వతీయమునకు సంస్కృతీకరణము కావచ్చును. కీ॥ శే॥ శ్రీ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు జ్యోత్స్న యనుపేరఁ జింతామణికి సంస్కృతమున వ్యాఖ్య వ్రాసియున్నారు [1] ఆధునికాంధ్రవైయాకరణసార్వభౌములగు శ్రీమత్పరవస్తు చిన్నయసూరిగారుకూడ చింతామణికి సంస్కృతమున వ్యాఖ్యనొకదానిని వ్రాయనారంభించిరట. కాని దానిని వారు పూర్తిగా వ్రాయక నడుమనే యుజ్జగించినారు.

(1) ఇది మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున D 1237 సంఖ్యగల యముద్రితగ్రంథము. ఆం. ర. సంఘమువారు దీనిని కవిశిరోభూషణమున కనుబంధముగా ముద్రింపఁదలచియున్నారు

(2) ఇది మొదట మదరాసు ప్రా. లి. పు భాండాగారమున D 1240 సంఖ్యతో నుండినగ్రంథము. విభాగమున మనకు వచ్చినది

(3) కాకినాడ ఆం. సా పరిషత్తున నున్నది. దీనిని గూర్చి పరి. పుస్త. భాండా. మూఁడవభాగము లక్షణగ్రంథములలో 32 సంఖ్యతో వర్ణింపఁబడియున్నది.

(1) ఇది కాకినాడ ఆం.సా పరి.లో 4678 సంఖ్యతో నున్నది. అముద్రితము.

ఇట్లెందఱుప్రయత్నించినను వారికి మార్గదర్శకుఁడుమాత్ర మహోబలపత్యాచార్యుఁడే. అహోబలపతివ్యాఖ్యకును మఱల-పతంజలిభాష్యముపై ప్రదీపోద్ద్యోతాదివ్యాఖ్యలవలె-వివరణములు బయలుదేరినవి. అందు మొదటిది కీ॥ శే॥ శ్రీ కొంతి భద్రాద్రిరామశాస్త్రిగారు వ్రాసిన తెనుఁగువివరణము. [2] రెండవది మా గురుపాదులు కీ॥ శే॥ బ్ర॥ శ్రీ వేదుల రామశాస్త్రిగారు వ్రాసినది. [3] మూఁడవది అంధ్రరచయితలసంఘము వారిచేఁ బ్రకటింపఁబడుచున్నది.

అహోబలపండితీయ మాంధ్రవిద్వల్లోకమున నాంధ్రవ్యాకరణమహాభాష్యముగాఁ బ్రసిద్ధివడసియున్నది. అహోబలపతి యాంధ్రశబ్దచింతామణికర్తను బ్రథమాచార్యునిఁగను వికృతివివేకకర్తను ద్వితీయాచార్యునిఁగను దనగ్రంథమునఁ బలుమాఱులు పేర్కొని తాను తృతియాచార్యుఁ డయినట్లు సూచించియున్నాఁడు. సంస్కృతవ్యాకరణమునఁ బాణిని ప్రథమాచార్యుఁ డగుటయు కాత్యాయనుఁడు ద్వితీయాచార్యుఁ డగుటయు బ్రసిద్ధము పతంజలిమహర్షి పైయిరువురిరచనములకు సమన్వయము కలిగించుచు మహాభాష్యమును విరచించి తృతీయాచార్యపదము నధిష్ఠించియున్నాఁడు. అహోబలపతియును నాంధ్రవ్యాకరణప్రథమద్వితీయాచార్యులగు చింతామణివికృతివివేకకర్తరచనములకు సమన్వయము కలిగించుచు విపులమగువ్యాఖ్య వ్రాసియున్నాఁడు.

కాత్యాయనగ్రంథము సంస్కృతమున మనకు విడిగా లభింపలేదు. మహాభాష్యముననే మనకు వాని దర్శనము కలుగునది అంధ్రవ్యాకరణమునను ద్వితీయాచార్యుని వికృతివివేకము విడిగా గ్రంథరూపమున లభింపలేదు. అహోబలపతి వ్యాఖ్యయందే యవి కానవచ్చుచున్నవి. సంస్కృతవ్యాకరణ మహాభాష్యమునందువలెనే యహోబలపతి కవిశిరోభూషణమునందును ననేకవిషయములు విపులముగాఁ జర్చింపఁబడియున్నవి సంస్కృతవ్యాకరణ మహాభాష్యమునఁ గొన్నియెడల నొకసూత్రమునకు సంబంధించినవిషయము మఱియెక్కడనో చర్చింపఁబడియుండుట తజ్జ్ఞులకు సువిదితమే. అహోబలపతి రచనమునందును నిట్టిది కానఁగును. సంస్కృతమున మహాభాష్యమునుగుఱించి "మహాభాష్యం నా పాఠయేత్ మహారాజ్యం వా పాలయేత్" అను నొక వచనము వ్యవహారమునఁ గలదు. మహాభాష్య పాఠప్రవచనమువలన నంతటియానందము కలుగు నన్నమాట. అహోబలపతి వ్యాఖ్యయును పాఠప్రవచనమున నట్టియానందమునే కలిగించును. మహాభాష్యాది సంప్రదాయములు క్షుణ్ణముగా నెఱిఁగియున్నందున నహోబలపతి తనగ్రంథమునఁ బలుచోట్ల విరివిగా శాస్త్రచర్చలు గావించియున్నాఁడు. ఒక్క మాటలోఁ జెప్పవలయు నన్నచో నహోబలపతిగ్రంథమే లేనియెడల నాంధ్రవ్యాకరణమునకు శాస్త్రత్వమే సమకూడెడిది కాదు. అనును నిజమే కాని మహాబల పతిమాత్రము తాను రచించినది వ్యాఖ్యానమే యని

"శ్రీమత్ప్రోలురిమాధవర్యకరుణాప్రాప్తప్రభాషాన్ఫురత్సారశ్శాస్త్రవిదర్చితాఖిలబుధో వాతూలవంశాగ్రణీః
సర్వానందదవాగహోబలపతిః వ్యాఖ్యాం
కరోతి స్ఫుటమ్
శ్రీమచ్ఛన్నయభట్టసూత్రవితతేః శ్రీరాయకారుణ్యతః॥"
(కవిశిరో. కృత్యా 7వ శ్లో.)

అను శ్లోకమునందు స్పష్టముగా వచించియున్నాఁడు. తనగ్రంథ మాంధ్రవ్యాకరణమహాభాష్యమని యాతఁ డెచ్చటను వచించినవాఁడు కాఁడు.

(2) ఇది మంజువాణిముద్రణము. నేఁడు దేశమున లభించుముద్రితప్రతులం దున్న వివరణ మిదియే. కాని మొదటిముద్రణమునఁ గల శ్రీ శాస్త్రిగారిపేరు తరువాతిముద్రణములందుఁ దొలగింపఁబడినది.

(3) ఇది అముద్రితము. వారికుమారులకడ నున్నది.

అహోబలపతి తనపాండిత్యమునుఁ గూర్చి వచించిన యీ క్రిందిపద్యము పరిశీలింపఁదగినది.

"కర్కశతర్కవాక్తర్కనాకుంఠిత
విశదమేధావిధా విలసనమ్ము
ఫణిరాజఫక్కికాప్రముఖ శబ్దగ్రంథ
సారసర్వస్వ విజ్ఞానపటుమ
ఉభయమీమాంస సార్థవిభవానుసంధాన
బంధురమేధా ధురంధరతయు
వల్మీకసంభవ వ్యాకృత్యలంక్రియా
కోశాదిపరిచిత కౌశలమ్ము
సరసకవితామహామార్గ సరసగమన
చతురిమయుఁ గల్గుపండితజనుల కెలమి
నెలవుకొనఁజేయు జగతిలో లలితసూక్తి
భూషణంబైన కవిశిరోభూషణంబు."

(కవిశిరో. గ్రంథాంతపద్యములు)

పైపద్యమునందుఁ జెప్పఁబడినయహోబలపతి బహుముఖపాండితి యాతని కవిశిరోభూషణమునం దా యాసంధర్భములలో విస్తరముగాఁ బ్రదర్శిత మయి యున్నది. ఈపద్యమునందుఁ జెప్పఁబడకపోయినను నహోబలపతికి జ్యోతిశ్శాస్త్రమునందును మంచిపాండిత్యము కలదని యాతఁడు "విశ్వశ్రేయః కావ్య"మ్మను సూత్రమునకుఁ గావించినవ్యాఖ్యవలన స్పష్టముగాఁ దెలియుచున్నది.

కవిశిరోభూషణము వ్యాకరణశాస్త్రగ్రంథ మగుటచేత నిందు అహోబలపతి తనతర్కశాస్త్రపటిమను బ్రత్యక్షముగాఁ బ్రదర్శించుటకుఁ దగినంతయవకాశము లేకపోయినను సందర్భానుకూలముగా నక్కడక్కడ తార్కికపరిభాషల నాతఁడు వ్యవహరించి యున్నాఁడు. ఇంతేకాక "సామాన్య రసవృత్తిః" (ఆం. శ. చిం సంజ్ఞా. 3 సూ ) అను సూత్రము వ్యాఖ్యానమునందు వ్యంజనావృత్తిని వివరించుచుఁ దార్కికులయిన యన్వితాభిధానవాదుల మతమును వివరించి యహోబలపతి దాని నాలంకారికసంప్రదాయానుసారముగా ఖండించియున్నాఁడు ఈసూత్రమునందే "శక్త్యా లక్షణయా చ నిర్వాహేన్న వ్యంజనా వృత్త్యంతరమితి తార్కికాః"అని తార్కికమతమును బ్రదర్శించి"తన్నిరసనద్వారా వ్యక్తినిర్వాహప్రకారస్తు మధురానాథీయ గదాధరీయాప్పయదీక్షితీయాది గ్రంథేషు ద్రష్టవ్యః"అని సంక్షేపముగా వ్యక్తినిరూపణమున కాధారగ్రంథసముదాయమును బ్రదర్శించి యున్నాఁడు.

అహోబలపతికి సంస్కృతవ్యాకరణశాస్త్రమునందుఁ దలస్పర్శియగు పాండిత్యము కలదని యాతని వ్యాఖ్యానము నెక్కడఁజూచినను దెలియఁగలదు. సిద్ధాంతకౌముది, బాలమనోరమ, ప్రౌఢమనోరమ, మహాభాష్యము, మహాభాష్యవ్యాఖ్యయగుకైయటము నన్న నాతనికి నల్లేరుపై బండినడక. వాని సారమును మథించినవాఁడగుటచేతనే యహోబలపతి తనగ్రంథమునకు శాస్త్రత్వగౌరవమును సంపాదించుకొనఁగలిగినాఁడు.

అహోబలపతి ''సమాస్తు సమాః'' (ఆం. శ. చిం. అజ 85.)అను సూత్రమునకు వ్యాఖ్యవ్రాయుచు ''సంస్కృతభాషా విదోవిశేషణస్యాఽపి విశేష్యత్వవివక్షాయాం స్నాతాఽనులిప్తఇత్యాదౌ "విశేషణం విశేష్యేణ బహుల"మితిసూత్రేణ సమాసనిర్వాహఇతి వదంతి" [1] అనిచెప్పియున్నాఁడు కీ॥ శే॥ శ్రీ కొంఠి భద్రాద్రిరామశాస్త్రిగా రీవాక్యమునుగూర్చి ఇక్కడ స్నాతానులిప్తః అనునది పూర్వకాలేత్యాదిసూత్రమునకు పాణినీయులుదాహరించుచుండఁగా దీనిలో నొకదానికి విశేష్యవివక్ష చేసి "విశేషణం విశేష్యేణ బహులమ్" అనుసూత్రముచే నిర్వహించుటకుఁ గారణము కనుపింపదు. అని యొక యధోజ్ఞాపికను వ్రాసియున్నారు.

(1) కవిశిరో. ఆం. ర. సం. ముద్ర. 418 పు.

భట్టోజిదీక్షితులు "స్నాతానులిప్తః" అను నుదాహరణమును పూర్వకాలైకసర్వజరత్పురాణనవకేవలాస్సమానాధికరణేన" [2] అను సూత్రముక్రింద నిచ్చియున్నమాట సత్యమే కాని యాసూత్రవివరణ సందర్భమునందే స్పష్టముగా "విశేషణం విశేష్యేణ ఇతి సిద్ధే పూర్వనిపాతనార్థం సూత్రమ్" అని వ్రాసి యున్నారు. ఈ విషయమును బరిశీలించినచో నహోబలపతివ్రాఁత యెంత హేతుబద్ధమో, యాతనిపాణినీయమతవిజ్ఞాన మెంత సునిశితమయినదో గమనింప వచ్చును. అహోబలపతి యనేకస్థలములందు సాధికారముగ "క్రియాన్వయిత్వంవినాకారకత్వం నసంభవతీతి వైకయారణసిద్ధాన్తః" అనువిధమునసంస్కృత వ్యాకరణశాస్త్రసిద్ధాంతముల నుద్ఘోషించుచుండును. ఇది యాతని కాశాస్త్రమునెడఁగల యాత్మప్రత్యయమునకు నిదర్శనము

"నిత్యం దారాదేశ్చ స్యాల్లోర్థుఃయోరురౌ చ తత్రస్థః" [3] అనుసూత్రమువ్యాఖ్యయందు 'రమణ కెక్కు' అనుదానిలోని రమణ శబ్దమునకు ధర్మవాచకత్వమును సాధించుపట్టున 'అకారో మత్వర్థీయః విభక్తమేషామస్తీతివిభక్తాః పితమేషామస్తీతిపీతాఇతి. అథవా ఉత్తరపదలోపోఽత్రద్రష్టవ్యః. విభక్తధనా విభక్తాఃపీతోదకాః పీతాఇతి పాతంజలగ్రంథోఽపి.' అని పాతంజలమహాభాష్యపంక్తులను 'అత్ర లోపశబ్దారో నిరణాయి కైయటేన 'గమ్యార్థస్యాఽప్రయోగ ఏవ లోపోఽభిమత' ఇత్యాదినా గ్రంథేన" అని కైయటోపాధ్యాయుని పలుకులను నుదాహరించి చూపినాఁ డహోబలపతి. [1]

ఇట్లే 'తద్వంద్వేః' [2] అను సూత్రపువ్యాఖ్యయందు 'అనజ్నుతోద్వంద్వే ఇతిసూత్రే ఉత్తరపదేన పూర్వపదం నాఽఽక్షిప్యతఇతి మధ్యమపదస్యాఽప్యానఙ్. తేన హోతృపోతృనేష్టోద్గాతారః. హోతాపోతానేష్టోద్గాతో ఇతి భాష్యే కైయటాదౌ స్థితమ్.' [3] అని అనజ్నుతోద్వంద్వేసూత్రవ్యాఖ్యానవిషయమున భాష్యకారమతమును వివరించియున్నాఁడు. [4] ఈ విధముగాఁ గవిశిరోభూషణమునం దెక్కడఁజూచినను నహోబలపతి సంస్కృత శబ్దశాస్త్రపాండిత్యప్రకర్షమును గ్రహింపవచ్చును.

అహోబలపతి మీమాంసాశాస్త్ర పాండిత్యము కూడఁ దక్కువది కాదు. "సా వాగ్వ్యారసవృత్తిః" అను సూత్రవ్యాఖ్యయందు "అపూర్వం చ యాగాదేరవాంతరవ్యాపారః శక్తిర్వేతి భాట్టాః" అనియును "ప్రాభాకరాస్తు యాగాదివ్యతిరిక్తంలిఙాదివాచ్యమపూర్వమేవధర్మఇతి భేదః" అనియును అపూర్వవిషయమున భాట్టులకును ప్రాభాకరులకునుగల మతభేదమును వివరించియున్నాఁ డహోబలపతి. అందే 'తిఙ్సుబంతచయోవాక్యం క్రియా వా కారకాన్వితా' ఇతి మీమాంసకాద్యైర్వాక్య లక్షణముక్తమని చెప్పియున్నాఁడు. ఆ సందర్భముననే 'నన్వభిహితానాం పదానామర్థాభిధాయినాం వా పదానాం విశిష్టార్థప్రత్యాయనశక్తిస్తాత్పర్యమితి మీమాంసకా మతభేదేన వర్ణయింతి' యని మీమాంసకులైన యభిహితాన్వయవాదుల మతమును వివరించియున్నాఁడు. ఇట్లే 'అనియమాద్వ్రాహ్యంహి' [6] అను సూత్రవ్యాఖ్యానమున హోలాకాధికరణవిషయము ప్రస్తావింపఁబడియున్నది.

(2) పాణి. 2—49

(3) అ. శ. చిం. అజ. 72 సూ.

(1) కవిశిరో. అం ర. సం ముద్ర 386 పు.

(2) అం శ. చిం. అజ. 66 సూ.

(3) కవిశిరో. అం. ర. సం. ముద్ర. 375 పు.

(4) వివరములకయి కవిశిరో. అం. ర. సం. ముద్ర లోని 375, 376, 377, 378 పుటలలోఁ గల యధోజ్ఞాపికలు చూడఁదగినవి.

(5) అం. శ. చిం. సంజ్ఞా 3 సూ.

(6) అం. శ చిం సంజ్ఞా 10 సూ.



అమ్మరేశం రాజేశ్వరశర్మ

వేదాంతమునను నహోబలపతి తనకు విశేష పాండిత్యము కలదనుటను దనవ్యాఖ్యయందుఁ బ్రదర్శించి యున్నాఁడు. "బ్రహ్మ మాయాశబలం తద్ధి సర్వకార్యోపాదాన మితి వేదాంతినో వదంతి"[1] అని యొకచోటను "ప్రాణవస్యాఽన్యత్రసోఽహామ ర్థప్రతిపాదన ముక్తమ్"[2] అని యింకొకచోటను నీవిధముగా వేదాంతవిషయముల నహోబలపతి రచించి యున్నాఁడు. అహోబలపతికి బ్రహ్మసూత్రములపై శంకరభగవత్పాదులు రచియించిన భాష్యము మిక్కిలి యుపస్థితిలో నుండెననుటకు కవిశిరోభూషణమున నాధారములు కలవు. "సాధ్యోహి రసో యథాయథం కవిభిః"[3] అనుసూత్రవ్యాఖ్యానమునం దహోబలపతి బ్రహ్మసూత్రభాష్యములోని శూద్రాధికరణవిషయములను మథించి సారాంశమును గ్రోడీకరించియున్నాఁడు.

వల్మీకసంభవవ్యాకృతి ప్రాకృతవ్యాకరణము. వాల్మీకిరచితములని చెప్పఁబడుచున్న ప్రాకృతవ్యాకరణసూత్రములకు త్రివిక్రముఁడు లక్ష్మీధరుఁడు. అప్పయదీక్షితుఁడు మున్నగువారు వివరణములు కావించిరి లక్ష్మీధరునివ్యాఖ్య షడ్భాషాచంద్రిక. ఈవాల్మీకిప్రాకృతవ్యాకరణమునకుఁ బూర్వకాలమున నాంధ్రదేశమునందు బహుళప్రచారము కలదనుటకు దానిపై లక్ష్మీధరుఁడు ఎలకూచి బాలసరస్వతి, అప్పయదీక్షితులు కావించినవ్యాఖ్యలు సాక్ష్యమిచ్చుచున్నవి. అప్పకవి.[4] బాలసరస్వతి, అహోబలపతి తమగ్రంథములలో వాల్మీకిసూత్రముల నుదాహరించియున్నారు. మల్లినాథమహామహోపాధ్యాయునిసూనుఁడైన కుమారస్వామిసోమపీథి సైతము తన రత్నాపణమున వాల్మీకిప్రాకృతవ్యాకరణసూత్రముల నుదాహరించియున్నాఁడు[5] మంచెళ్ల వాసుదేవకవి రచించిన వైకృతచంద్రికయందును, అథర్వణకృత త్రిలింగశబ్దానుశాసనమునందును, మండ లక్ష్మీనృసింహకవి యాంధ్రకౌముదియందును నీవ్యాకరణమునుండి గైకొనఁబడిన యంశములు కలవు ఈవిధముగాఁ బ్రాచీనకాలమున నింత బహుళప్రచారము నందున్న వాల్మీకిప్రాకృతవ్యాకరణాధ్యయనాధ్యాపనము లిటీవలికాలమున నాంధ్రదేశమునందు లోపించుట కాలపురుషుని విచిత్రలీలయని చెప్పవలసియున్నది.

అహోబలపతి వాల్మీకిప్రాకృతవ్యాకరణమును దఱచిచూచినవాఁ డనుటలో నెట్టి సందేహమును లేదు. అందును నాతఁ డుదాహరించిన యనేకశ్లోకములను బట్టి లక్ష్మీధరునిషడ్భాషాచంద్రిక యాతనికి మిక్కిలి పరిచితమయిన గ్రంథముగా నున్నట్లుతెలియుచున్నది.[1] భాషాప్రదీప భాషావివరణములనుగూడ నాతఁడు పేర్కొనకపోలేదు

ఆంధ్రశబ్దచింతామణియందీవాల్మీకిప్రాకృత వ్యాకరణసంప్రదాయములు కొన్ని కానవచ్చుచున్నవి. "షష్ఠ్యా ఉతోఽచి ను మ్సే"[2] అను సూత్రమున "సే" అనునది "సమాసమున" అనునర్థమున వాడఁబడినది. ఇట్లే క్వచిత్సస్య భవేదిష్టా రుచస్స్యాద్యది మా[3]నసే

1 కవిశిరో. ఆం. ర. సం. ముద్ర. 287 పు,

2 " " 105 పు.

3 ఆం. శ. చిం. సంజ్ఞా 4 సూ.

4 అప్పకవీ అ. తద్భవస్వరూపము- కాని ఇందు సూత్రము లన్నియుఁ దప్పుగా ముద్రితము లయియున్నవి, వానిని సవరించుట యవసరము.

5 ప్రతాపరుద్రీయము (వావిళ 1934) లోని 6, 63, 73, 74, 81 పుటలందలి రత్నాపణపంక్తులు చూడఁదగినవి ఇందును సూత్రములు తప్పుగా ముద్రితము లయినవి.

1 కవిశిరో. (అం. ర. సం- ముద్ర.) 157, 158, 159, 160 పుటలలోని శ్లోకములు.

2 ఆం. శ. చిం. సంధి. 17 సూ.

3 వికృ. వివే. అప 8.

అనుచోటను తయోరమాదౌ సేమాత్రీ[4] అనిస్త్రము నను వికృతివివేకమునఁ గూడ సమాసమునకు సస జ్ఞ వాడఁబడినది. చింతామణియందు సమాసమునకు ససంజ్ఞను విధించుసూత్రము లేదు. "సస్సమాసః" (1-1-7) అను వాల్మీకిప్రాకృతవ్యాకరణసూత్రమే పైవానికి మూలము. ఇట్లే మనవైయాకరణులు తఱచుగా వాడు "అనుక్త మన్యతో గ్రాహ్య" అనున వచనమునకును ప్రాకృతవ్యాకరణములోని "అనుక్త యన్యశబ్దానుశాసనవత్" (వాల్మీ 1-1-2) అను సూత్రమే మూలముగా నున్నది.

ఇట్లే ఆంధ్రశబ్దచింతామణియందు సుస్, టాస్ జేస్, జసిస్, జమ్, జీప్ అను విభక్తిప్రత్యయప్రత్యాహారములు వాడఁబడియున్నవి.[5] వీనిలో 'జీప్' అనున దొక్కటితప్ప నింకెవ్వియును పాణినీయము లోని "ఆదిరంత్యేన సహేతా" అను సూత్రముచేత సిద్ధింపవు. 'న విభక్తౌ తుస్మాః' అను సూత్రముచేత విభక్తిప్రత్యయములలోని తవర్గ సకారమకారముల కిత్త్వము నిషేధింపఁబడుట యిందుకుఁ గారణము జిప్ పాణినీయసాధ్యప్రత్యాహారమే య యినను పాణినీయమునఁ దద్వ్యవహారము లేదు వాల్మీకిప్రాకృత వ్యాకరణములో 'సుప్త్యాది రంత్యేనహ' (1-1-4) అను సూత్రముచేత నీప్రత్యాహారము లన్నియును సిద్ధించును వీనికి వాల్మీకివ్యాకరణమునఁ బలుతావు లందు వినియోగము కూడఁ గలదు కనుక సుసాధ్యపాణినీయవిభక్తిప్రత్యయప్రత్యాహారములు వాల్మీకి ప్రాకృత వ్యాకరణమునుండియే చింతామణిలోనికి వచ్చినవనుట నిశ్చయము. అహోబలపతి యీ విషయ

4 వికృ. వివే. అజ 36

5 చూ. ఆం. శ. చిం. సంజ్ఞా 40, అజ 21, 22, 23, 26, 26 సూ.

ముని జక్కగా నెఱింగినవాఁ డగుటచేత తన గ్రంథమునం దిట్లే వచించియున్నాఁడు.[1]

అహోబలపతి యలంకారశాస్త్ర పాండిత్యము విస్తారముగా మనకుఁగనుపించునది సంజ్ఞాప్రకరణము నందు ఇతరప్రకరణములందును నక్కడక్కడ లేక పోలేదు. అహోబలపతి మమ్మటుఁడు, దండి, వామనుఁడు ఆనందవర్ధనుఁడు, అభినవ గుప్తపాదులు అప్పయదీక్షితులు, విద్యానాథుఁడు మున్నగు సంస్కృతాలంకారికులవచనములను సందర్భానుసారముగా నుదాహరించి సంస్కృతసాహిత్యశాస్త్రసారము నంతటిని తన గ్రంథమునఁ గ్రోడీకరించి యున్నాఁడు. ఇందు కాతనికి ఆంధ్రశబ్దచింతామణి ప్రారంభమునఁ గల కావ్యప్రశంసగల సూత్రములు చక్కగా నవకాశ మొసంగినవి. ప్రతాపరుద్రీయ వ్యాఖ్యయగు రత్నాపణమునుండి యాతఁడు వాక్యములకు వాక్యములనే యథాతథముగ గ్రహించి తనగ్రంథమున నిముడ్చుకొన్నాఁడు. అహోబలపతికిఁ గల కోశపరిచయమును సామాన్య మయినది కాదు

అహోబలపతి నన్నయాదిమహాకవుల గ్రంథములనుండి విరివిగా నుదాహరణముల నొసంగుటయే కాక తానుగూడ స్వయముగా కొన్ని యుదాహరణము లను గావించియున్నాఁడు. సామాన్యముగా నిట్టివి యాతని యిష్టదైవమున సీతారాముల స్తుతిపరముగా నుండును. ఇవి గ్రంథమున మొదటినుండి చివరి వఱకును గలవు.

అహోబలపతి చింతామణిసూత్రమునకుఁ గాని వికృతి వివేకకారికకుఁగాని నన్నయ భారతప్రయోగమునకుఁగాని లొంగని యాంధ్రకవి ప్రయోగ మాత్ర డెంతటివాఁడయిననుసరే దాని నసాధువుగాఁ దీసివైచు

(1) చూ. కవిశిరో. (ఆం. ర. నం. ముద్ర) 210 308, 307 పుటలు.

చుండును. కాని యట్టిసందర్భములందు దాని సాధుత్వసాధనమున కేదయిన ఆధారము సంస్కృతవ్యాకరణశాస్త్రమునఁగాని అలంకారికగ్రంథములందుఁగాని యుండెనా దానిసాధుత్వమును నిలుపును. దీనివలన నాతఁడు కొందఱు మహాకవుల వచనములనే యసాధువులని కొట్టివైచుట సంభవించెను.

అహోబలపతికి చింతామణికర్త నన్నయభట్టారకుఁడే యనువిశ్వాసము దృఢముగాఁ గలదు. కాని యాతఁడు చింతామణిసూత్రములకు నన్నయ భారత ప్రయోగములనుమాత్రమే సాధించువిధముగా నర్థము చేయవలయు ననెడి పట్టుదలగలవాఁడు మాత్రము కాఁడు నిజమునకుఁ బ్రాచీనవ్యాఖ్యాతలలో నెవ్వరును నట్టివారు లేరనియే చెప్పవలయును. వారందఱును సూత్రములయానుపూర్వినిబట్టియే యర్థనిర్ణయము గావించి యుదాహరణముల నిచ్చియున్నారు.

అహోబలపండితీయము వలన మనభాషకు సమగ్రమయిన వ్యాకరణగ్రంథము లభించె ననవీలులేనిమాట నిజమే కాని యటుతరువాతి యాంధ్రవ్యాకరణగ్రంథకర్త లెందఱికో యిందలివిషయము లొజ్జబంతులయిన వనుటలోఁగాని దీనివలన నాంధ్రభాష కొక్కయుత్తమశ్రేణికిఁజెందిన శాస్త్రమర్యాదలుగల మంచి వ్యాకరణగ్రంథ మేర్పడినదనుటయందుఁగాని యావంతయు సందేహము లేదు.

# అబుల్హసన్ తానాషా [illegible]

శ్రీ కె. వి. భూపాలరావు

అబుల్హసన్‌తానాషా ఖుతుబ్షాహీ పరిపాలకులలో తుదివాడు. ఇతడు క్రీ॥శ॥ 1672 నుండి 1686 వరకు గోలకొండరాజ్యమును పాలించెను. ఇతనిని గురించి ప్రచారములోనున్న స్థలపురాణేతిహాసములును, పరస్పరవిరుద్ధములును బహుళములునునగు చరిత్రలును ఇతని జీవితచరిత్రమును కలరూపున ప్రకాశింపజేయు పనిని జటిలముజేయుచున్నవి. పరస్పర విరుద్ధములగు నీగ్రంథములను గాఢలను శోధించి సమన్వయపరచిన స్థూలముగ మూడుసిద్ధాంతములు రూపొందుచున్నవి. (1) అబుల్హసను విదేశీయుడు (2) అబుల్హసను ఖుతుబ్షాహీ రాకుమారుడు (3) కులగోత్రములులేని అనామకుడతడు.

సమకాలికులును, స్థానికులును ప్రామాణికులును నగు చారిత్రకులాతనిని, ఖుతుబుషాహి వంశజుడనియె వ్రాసినారు. శత్రుకూటమివారుకూడ నీవిషయమొప్పుకొన్నారు. అబుల్హసన్‌తానాషా అబ్దుల్లాఖుతుబుషా తమ్ముడగు ఇమాదుల్‌ముల్కు (అయిన్-ఉలీ-ముల్కు) కుమారుడు; హయాతుబుక్షీబేగమున (అబ్దుల్లాతల్లి) కు పౌత్రుడును, ఈయనకు మహమ్మదుఖులీఖుతుబుషాకు కూతురును, మహమ్మదుఖుతుబుషాకు భార్యయును, అబ్దుల్లాఖుతుబుషాకు తల్లియును నగుటచే నబుల్హసన్ తన పూర్వులవలెనే ఖుతుబుషాహీ అర్హమపౌరుషేయములుకలిగి, ప్రత్యక్షముగ రాజ్యార్హుడని అసందిగ్ధముగ దేలుచున్నది. అబుల్హసను మేనల్లుడు షరిఫ్-ఉలీ-ముల్కు, మంత్రి మసూద్‌ఖాన్ అబ్దుల్లారాణి బేగంసుల్తానాలు, ఈ విషయము ససందర్భముగను నిస్సంకోచముచను తెల్పియున్నారు

అబుల్‌హసనుఅరబు, పారసి హద్దాని మరియు మొఘ్లాయి, యని గ్రంథస్థము చేయబడినవిషయము సమన్వయమగుటలేదు. సమకాలికములగు నితర వ్రాతలు స్థిరపరుచుటయును లేదు.

సిద్దిపేటతాలూకాలోని అనంతగిరి మరియు నితరస్థలములందు ప్రచారములోనున్న నితర స్థల పురాణములలో నెట్టి వాస్తవ్యమును లేదు.

**ప్రారంభజీవితము :—** చరిత్రలు సమకాలికుల సంచారసంపుటులు అబుల్హసను ప్రారంభ జీవితమును సమగ్రముగ చిత్రించలేదు. అతని బాల్యమునుగురించిన సమాచారము సమకూర్చనులేదు. అయినను బహుళముఁగు నీ చరిత్రలోను నితరత్రయును లభ్యముఁగు శకలములను, సూచనలను, సమన్వయపరచి సూత్రీకరించిన నీతని కౌమార యౌవనములగురించి తెలిసికొనవచ్చును.

ఖుతుబుషాహీలు విషయలంపటులు. అద్యంతముల రాజులిద్దరుదప్ప, మిగతావారెవ్వరును షష్ఠిపూర్తిజేసుకొనలేదన్న వారి అల్పాయువునకు కారణము నితరత్ర వెదుకనవసరములేదు. అబుల్హసను పుట్టి పెరిగిన వాతావరణమెట్టిదో పై విషయములవల్ల సుగ్రాహ్యము. పరిసర పరిస్థితుల ప్రభావమువల్ల అబుల్హసను "అతనికంటె ఘను డాచంటమల్లన్న" యనునూదిగి విషయలౌల్యమున నెల్లరను తలదన్ను వాడుగ రూపొందెను. అంతఃపురపు ఆదర్శములు పవిత్రతనడలి మలినమైపోయినవి. అంతేవాసినుల మానములు పరిచారికల శీలములు శిధిలములు గాజొచ్చినవి. అతి మెత్తనివాడును విషయలౌల్యుడను నగు అబ్దుల్లాకుగూడ నీతని ప్రవర్తన దుస్సహమైనది. అతడు కల్పించుకొని మందలించెను. రాణులిసడించిరి. రాజును రాణులననుసరించి తిరుగు పరిచారక బృంద మీ మార్పుగమనించి, రాకుమారుని చులకన జేసి యవమానించియుండును.

అవమానములు సహింపక, అభిమానియగు నాతడు తుదకు రాజభోగములను రాజసమును అంతఃపురసౌఖ్యములను త్యజించి ఫతెదర్వాజ (విజయద్వారము) కడ నివసించియున్న విఖ్యాతవిలి (యోగి), షా రాజూఖత్తాలును నాశ్రయించెను. అప్పుడాతని వయస్సు రమారమియిరువది సంవత్సరములనితెలియుచున్నది. అబుల్హసను కడు భయభక్తులతో ప్రేమ విశ్వాసములతో తనగురువును సేవించుచు నాతని కృపకు పాత్రుడయ్యెను అందుచే నావలి, అబుల్హసనును 'తానాషా' యని ముద్దుగ బిలిచెడివాడు. 'తానాషా' యనిన బాలయోగి అని యర్థము. తానాషా గురుశుశ్రూషజేయుచు పదునాల్గు సంవత్సరములు నాయాశ్రమమందే గడిపెను. ఈ యాశ్రమజీవన మాతనిని ప్రజాసామీప్యమునకు దెచ్చి, వారి అవసరములు ఆవేదనలు అవేశ కావేశములు కష్టసుఖములు దెలిసికొని వానిలో భాగస్వామియగుటకు అనేకావకాశములు గల్పించినది. ప్రజాబాహుళ్యములో రాజుగ నితడు సంపాదించిన అనుపమ ప్రేమగౌరవములకే యాశ్రమజీవనము పునాదిరాయియైనది. క్రింది తరగతులవారితో సన్నిహితసంబంధము లేర్పడినవి మత సహనము పీడిత ప్రజానీకమునెడ సానుభూతి విశాల దృక్పథము అలవడినవి అందువల్ల దక్షిణాపథమేలిన నే ముస్లింప్రభువునకు లభ్యముగాని గౌరవప్రతిపత్తులీతనికి తంగేటిజున్నైనవి.

ఇతనిలోవచ్చిన నీ యద్భుతమగు నైతికవుమార్పునుగుర్తించి యింతవరకీతని నేవగించుకొను రాజును అంతేవాసినులు మంత్రి సామంతాదులును నాతనియెడ ననురక్తులైరి. పదునాల్గువత్సరముల యాశ్రమజీవితమువల్ల అతడు పరితప్తుడై పూతుడై పాలకుని యోగ్యత సంపాదించుకొనెను.

**వివాహము :—** అబుల్హసను వివాహము అత్యద్భుత పరిస్థితులలో జరిగినది. అబ్దుల్లా మూడవ కూతురీతనికి మొదట నిశ్చయింపబడెను. కాని అతని దుర్నడతలవల్ల అది బెడిసినది. అబ్దుల్లా పెద్దల్లుడగు

సయ్యదునిజామొద్దీనమ్మదు, అంగీకారముపై అతని గురు పుత్రుడును అరేబియా దేశస్థుడునగు సయ్యదు సుల్తానుతో నా రాకుమారి వివాహము నిశ్చయమైనది. ఏర్పాట్లు చురుకుగ జరుగ సాగినవి, అయినను దైవప్రేరితముగ సయ్యదునిజామొద్దీనహమ్మదు మరియు సయ్యదుసుల్తానులమధ్య తీవ్ర వైషమ్యము లేర్పడినవి కలహభోజనులు వేసిన సమిధలవల్ల నా వైషమ్యజ్వాల మరింత ప్రజ్వలితమైనది. ఆ సంబంధము నదలకున్న తాను సపరివారముగ నౌరంగజేబుతో చేరిపోవునని పెద్దల్లుడును, ఆ వివాహము దప్పకున్న దాత్మహత్య జేసికొందుమని పెండ్లికూతురును అయమ తల్లియును శపించిరి. మంత్రి సామంతులును రాజును చేయునదిలేక దిగ్భ్రాంతినొందిరి. సర్వసన్నాహములు పూర్తియగుటచే వివాహమాపుట మంచిదికాదనియును, అయినను సయ్యదుసుల్తానునకిచ్చి వివాహముచేయుట పొసగదనియు నిరూపితమైనది.

అరిషడ్వర్గముల కతీతుడై సర్వసంగ పరిత్యాగియై, పరితప్తహృదయుడై సర్వజన రంజకుడుగనున్న అబుల్ హసనే ఈ సందర్భమున నెల్లరకును హృద్గోచరుడయ్యెను. రాణులును మంత్రిసామంత హిత పురోహితులును సర్దారులును ముక్తకంఠముగ అబుల్హసనునకే రాజు తన మూడవకూతురు నిచ్చి వివాహము చేయదగునని సూచించిరి. రాజును నబుల్ హసను నెడ అనురక్తుడగటచే దాని కంగీకరించెను

అంతఃపురములో జరుగు స్నాతక వివాహ కలాపములమాదిరులే ఆశ్రమములో కూడ షారాజు ఖత్తాల్ స్వంత పర్యవేక్షణక్రింద జరుగుచుండెను. ఆశ్రమవాసులును ప్రజానీకమును, ఈ వేడుకలను వాని జరిపించు యోగిపుంగవునిని విడ్డూరముగజూచుచుండిరి. షారాజు వారల కా వేడుకలు అబుల్హసను వివాహపు సంరంభమని జెప్పుచుండెను. తపోధనుల ఆశీర్వచనములు భావములు వృధాపోవుగదా!

వివాహపురోజు సుల్తాను ఆజ్ఞప్రకారము సామంత హితపురోహితులు సాలంకృతమును సుసజ్జితమునునగు రాజాశ్వము హైద్రాబాదుకు పడమట విజయద్వారముకడ ఘాజీబండపైనున్న షారాజుఖత్తాల్ ఆశ్రమమునకుదెచ్చి అబుల్ హసనుని దోడ్కొనిపోయిరి. సయ్యదుసుల్తాను వివాహముకొరకు సిద్ధపరుచబడిన సంబారముతో నా సుముహూర్తమునకే సుల్తాను మూడవ కుమార్తెతో అబుల్హసను వివాహమైనది. సత్యాసుల్తాను నౌరంగజేబు చక్రవర్తి కొలువులో ప్రవేశించెను. అబుల్హసనున కీ భార్యవల్ల అబ్దుల్లాజీవితకాలమునసే (పన్నెండు సంవత్సరములు) ఇద్దరు బిడ్డలు ఒక కుమారుడును కలిగిరి.

పట్టాభిషేకము : అబుల్హసను పట్టాభిషేకము గూడ నత్యద్భుతపరిస్థితులలో జరిగినది. పెద్దల్లుడగు సయ్యదునిజామొద్దీనహమ్మదు రాజ్యాంగములపై నధికారము నడుపుచుండెను. క్రీ. శ 1670 లో హయ్యాతుబుక్షీబేగం (అబ్దుల్లాతల్లి) చనిపోయినతర్వాత గోలకొండ పరిపాలనా చక్రమంతయు నిరవశేషముగ సయ్యదునిజామొద్దీను హస్తగతమైనదని చెప్పుటలో నావంతయు నతిశయోక్తిలేదు

ఏప్రిల్ 1672 న అబ్దుల్లా జబ్బుపడెను, 19-4-1672న అతనికి స్మారకముదప్పినది. అతడెట్టి మరణశాసనము వ్రాయలేదు. రెండవ అల్లుడగు మహమ్మదుసుల్తాను తండ్రియగు నాలంఘీరు చక్రవర్తి కోపమునకు గురియై నిర్బంధింపబడి అందె కృశించి మరణించెను. పెద్దల్లుని అవజ్ఞయును, పెద్దబిడ్డ అహంభావమును అబ్దుల్లా కసహ్యముగనుండెను. తన కల్లుడును కొడుకంటివాడును నగు నబుల్ హసనే రాజుగావలయునని అబ్దుల్లా గోరుకొనుచుండినట్లాతని నడవడి సూచిచుచున్న నిదర్శనములు లేకపోలేదు పెద్దకూతురికి సంతానములేదు. అయి



శ్రీ కె. పి. భూపాలరావు

నను తనసవతి కుమారుడగు సయ్యదలీమాసూంనకే ముగుదు ఖుతుబ్షాహీల రాజ్యము నిప్పించవలెనని 'మాంసాహెబు' పట్టుదల. అబుల్ హసను పెద్దబిడ్డను అంతఃపురములో 'మాంసాహెబు బడేసాహెబు' అని వ్యవహరించెడివారు. సైన్యము సర్దారులు బొక్కసము రాజలాంఛనములు, పరిపాలనాచక్రము అన్నియు పెద్దల్లుని చేతులోనేయుండెను.

మరణశయ్యపైనున్న మామను జూచుటకై పోయిన, నబుల్ హసనుని, నంతఃపురములోనికి రానీయలేదు. అతని గుఱ్ఱమును గాయపరచి, అతని నవమానపరచి బంపిరి. సైన్యాధ్యక్షుడును సయ్యదు నిజామొద్దీను నసహ్యించుకొనువాడునునగు సయ్యదు ముజప్ఫరీ సంఘటనను సాకుగదీసికొని, తనకార్యదర్శి పెష్కారులగు అక్కన్న మాదన్నల ధీవిశేషము నాధారముగగైకొని, నెట్టిఅలజడి గానీక, రాజకీయ సైనిక పరిపాలన, అర్థిక ప్రాముఖ్యముగల ప్రదేశములను చేజిక్కించుకొని రాజప్రాసాదమును చుట్టిముట్టి వైచెను. ఇది గమనించి నిజామొద్దీను నేవగించుకొనువారెల్లరు నబ్బుల్హసనున కండగనిల్చిరి. 21-4-1672 న అబ్దుల్లా మరణించెను. సయ్యదునిజామొద్దీనహమ్మదు, మాంసాహెబు మరియు సయ్యదు మాసూంలు నిర్బంధింపబడిరి. మాసూరుల చెఱనుండి పారిపోయి నౌరంగజెబు కొలువులో చేరెను, నిజామొద్దీను బార్యా యుక్తముగ వధింపబడెను. 13-4-1672 న అబ్బుల్హసను రాజుగ ప్రకటింపబడెను.

పరిపాలన: క్రీ. శ. 1672–1673 సంవత్సరములు దక్షిణభారతచరిత్రలో విప్లవాత్మకమగు కాలము. ఇందబ్బుల్హసన్ రాజగుటమాత్రమేగాక శ్రీరంగ రాయలతో విజయనగర సామ్రాజ్యపు మిగిలిన యధికారము పూర్తిగ నశించినది. సయ్యదునిజామొద్దీనహమ్మదు సయ్యదు ముజప్ఫరులు విఫలప్రయత్నులై చరిత్రగతినే మార్చివైచిరి. ఛత్రపతిశివాజి తన రాజ్యమును సుస్థిరమొనర్చుకొనెను. బీజాపుర రాజ్యములో నంతఃకలహములు చెలరేగి పరిపాలనాచక్రమును శిథిలవరచినవి.

అబుల్ హసను రాజుగప్రకటించబడిన ఎనిదవ రోజు అనగ క్రీ॥ శ॥ 1672 ఏప్రిల్ 30 వ తేదికి సరియగు 13 వ మొహర్రం 1083 వ హిజ్రీన నాతని పట్టాభిషేకము జరిగినది. చక్రవర్తియగు నౌరంగజీబునకు వార్షికముగ నాలుగులక్షల కప్పముగట్టుచు భక్తివిశ్వాసములతో నుందునని వ్రాసిబంపెను. చక్రవర్తియు నాతని రాజరిక మొప్పుకొనను [1] తాను రాజగుటకు సాయపడిన సయ్యదుజప్ఫరుమీరుజుమ్లా పదవియందును, అంతఃపుర పాలకుడగు సయ్యదు మూసాఖాన్ ఖానెఖానాన్ అను బిరుదుతో సర్వసైన్యాధిపతిగను కర్నాటక నవాబగు సయ్యదుముస్సెన్‌ఖులీ అమిరుల్-ఉమ్రా-నేక్నాంఖాను బిరుదుతోను సత్కరించబడిరి. అంతియెగాక మాదన్న మజ్మువెదారు (భూమ్యాదాయ శాఖమంత్రి) గను అక్కన్న అతనికి పేష్కారుగను నియమింపబడెను.

సయ్యదుముజప్ఫరుమీరుజుమ్లా కాగనె గర్విష్ఠుడై వక్రమార్గమవలంబించి రాజునెడ నతిక్రాంత మర్యాదుడయ్యెను. రాజ్యశ్రేయస్సునకు వ్యతిరేకముగ ద్రోహించి, వారల నవమానించెను. సర్వసైనాధ్యక్షుడగు మూసాఖాను ననేకవిధముల నవమానించెను. వారిరువురి ఘర్షణ రాజ్యచక్రమును ఛిద్రము చేయసాగెను. నిర్లిప్తుడుగను విషయలోలుడుగను నటించుచు సుల్తాను బహు చాకచక్యముగ నీయిరువురను పదభ్రష్టులనుజేసెను. మజ్మువెదారు మాదన్న మీరుజుమ్లాగ నియమించబడెను. సూర్యప్రకాశరావను బిరుదును శ్వేతఛత్రచామరగజాశ్వాది రాజలాంఛనములు సనుగ్రహింపబడెను. మూసాబేగను నాతడు సర్వసైన్యాధ్య:

1 జఫరెదక్కన్

క్షుడుగ నియమించబడెను సైన్యమునకు వేతనములు తన సమక్షముననే బంచు నేర్పాటుజేసి సుల్తాను సైన్యముతో ప్రత్యక్షముగ సంబంధ మేర్పరుచుకొనెను. మాదన్నను మీరుజుమ్లాగ జేయుటలో అబుల్హసను జాగ్రత్త, వివేచన దూరదృష్టి విశదమగును. జూను 1674 న మాదన్న ప్రధానియైనట్లున్నది. క్రీ॥ శ॥ 1674 నవంబరులో మాదన్న ప్రధానియయ్యెనన్నవాదుకూడ ప్రాముర్యమున నున్నది.

అబుల్‌హసను రాజగునప్పటికి శ్రీకాకుళము నుండి చెంగల్పట్టు దక్షిణమువరకు సుమారు 480 మైళ్ళ కోస్తా గోల్కొండ యధీనములోనుండెను

పరిపాలనావ్యవస్థ: అబుల్‌హసను పరిపాలనలో కేంద్ర, ప్రాంతీయ, గ్రామవ్యవస్థ లీ క్రింది విధముగ నుండెను.

కేంద్రము: రాజు, దివాను, దేశీయాంగ మంత్రి విదేశీయాంగమంత్రి, మజ్మునేదారు. బఖ్షీ-ఉల్-ముమాలిక్-సరెఖేల్ (సరెఖ్షరు)-దారోఘాయె అజం—సదరుఖాజీ—దబీరు—మహల్దారు

ప్రాంతీయము: ఆరఫ్దారు-దీవాను—సరేఖేలు=ఖాజ్-పురోహితుడు (పండితుడు)

సర్కారు, సిమ్తు పరగణ, సమహల్లుల పరిపాలనాధిష్ఠానవర్గముకూడ దాదాపు పీ విధముగనే యుండెను. అబుల్హసనునకు పూర్వము దేశము తరప్-సిమ్తు-సర్దార్-పరగణ, మహల్‌లో విభజించబడుచుండెడిది, వీనిపై శిస్తు నేర్పాటులేదు. ప్రతిసంవత్సరము వానిని వేలమువేసి, అధికమూల్యము జెల్లించు వారికి వానిని స్వాధీనపరచెడివారు. దీనివలన సారవంతమగు దేశము కఱువు కాటకములకు దోపిడీ దౌర్జన్యములకు లోనైనది. సముద్రతీరములు, రేవులు నౌకావ్యాపారకేంద్రములుగూడ నీ తీరుననే ప్రతిసంవత్సరము వేలము వేయబడుచుండెడివి. ప్రభుత్వమునకు రాజ్యాంగము ప్రజలకు భద్రతలేకుండెను. లంచగొండితనము మీరుజుమ్లా మొదలు బంట్రోతువరకు బాహాటముగ ప్రబలియుండెను.

అబుల్హసను తనపరిపాలనలో పైన పేర్కొనబడిన లోపములను సరిదిద్దుటకు పరిస్థితు లనుకూలించుమేరకు తీవ్రమగు కృషి చేసెను. అతడు వ్యయ కర్తనముజేసియు పరిపాలనాచక్రమును కట్టుదిట్టమును జేసియు మన్యబులు తగ్గించియు ఉమ్రావుల స్వైర విహారము నదుపులో బెట్టియు చీకులను ననమర్థులను తొలగించి వారిస్థానే సమర్థులగు యువకాధికారుల నియమించియు పరిపాలనను క్రమబద్ధమును శక్తివంతమును జేసెను. ఈచర్య సామాన్యులలో సంతృప్తి సామంతులలోను, స్థానభ్రష్టులలోను ద్వేషవైరములు కల్పించినవి.

వేలపు పద్ధతివల్ల గ్రామములు నశించి అడవులుబలసి చోరుల కాటపట్టులైనవి. అబుల్హసను జీర్ణగ్రామముల నుద్ధరించి క్రొత్తగ్రామముల సృష్టించి రైతాంగమునకు వ్యవసాయమునకు చేయూతనొసంగెను. చెరువులు కాలువలు రహదారులు గిడ్డంగులు తోటలు సత్రములు బడులు ఔషధాలయములు విరివిగ నెలకొల్పి చోరులబాధ తగ్గించెను.

## గనులు

మూయబడిన వజ్రపుగనులను అబుల్హసను మరల దెరిపించి పనిప్రారంభము జేయించెను. వీనిలో గొల్లపల్లి రాజిపెంట కోలారు రావలకొండ కొదవటికల్లు పరిటేల మున్నగు జగత్ప్రసిద్ధములగు గనులుగలవు. అనుమతిపత్రముపన్ను సగానికి తగ్గించబడినది. కార్మికునిజీతము నెలకు నాలుగు రూప్యములు అనగా దేశీయసైనికునిజీతముతో సమానమన్నమాట. గనులనుండియు ప్రభుత్వమునకు విశేషమగు రాబడియుండెను. గనుల యాజమాన్యము

ప్రభుత్వముది. ద్రవ్యకముల పర్యవేక్షణగూడ ప్రభుత్వముదే "కోహినూరు" మున్నగు జగత్ప్రసిద్ధములగు వజ్రములీ గనులనుండియే లభ్యమైనవి.

వాణిజ్యము.

భూసముద్రవ్యాపారము విశేషముగనుండెడిది దానివల్ల రాబడికూడ అధికమే "యాద్రపన్ను" 11 శాతముమాత్రమె. ప్రభుత్వమునకు స్వయముగ నౌకావ్యాపారముండెడిది. నౌకానిర్మాణకర్మాగారములుగూడ ప్రభుత్వమునకుండెడివి. నర్సాపురము మచ్లీబందరు శాంథోంలలో ముఖ్యమగు నౌకానిర్మాణ కర్మాగారములుండెను. అబుల్లసను ప్రోత్సాహమువల్ల ముఖ్యముగ చిత్రలేఖనము, రంగుపరిశ్రమ అద్దకము చెక్కడము మందుగుండు పరిశ్రమలు చాల యభివృద్ధి చెందినవి.

నాణెములు

ప్రభుత్వపు టంకశాలలో నబుల్లసను కాలమందీ క్రింది నాణెములు సిద్ధమగుచుండెడివి

1 వరహా=పదిహేను (బంగారు) ఫనములు లేక ఎనిమిదిషిల్లింగులు లేక $3\frac{1}{2}$ రూపాయలు.

1 ఫనము=తొమ్మిది (బంగారు) నేవలములు లేక 3 పార్తింగులు లేక 6 పెన్నులు.

1 నేవలము=5 కాసులు

1 కాసు=4 తారలు

1 తార=4 (9) భాగములు

ఈ భాగములు మరల గవ్వలలో విభజించబడినవి

వరహా గుండ్రముగను పలుచగను నుండునది. దీనివెడల్పు $\frac{3}{8}$ ఇంచులు బరువు $52\frac{1}{2}$ గురుగింజలు. మేరుగు $21\frac{3}{4}$ క్యారెట్సు

కొలత ప్రమాణములు.

అబుల్లసను కొలతప్రమాణములనుగూడ క్రమబద్ధ మొనర్చెను. అవి :

1 మూర = 18.7 ఇంచులు

1 గజము = 33.5 ఇంచులు

తూనిక ప్రమాణములు.

1 తులము = 180 గురిగింజలు.

1 శేరు = 20 తులములు.

1 వీశె = 5 శేరులు.

1 మణుగు = 8 వీశెలు

20 మణుగులు = 1 పెట్టి లేక బారువ

అబుల్లసను ఆంతరంగిక విధానము.

అబుల్లస నతిఉదారుడయ్యు నాతికాఠిన్య వర్తన నవలంబించవలసి వచ్చినది. శిథిలమైన రాజ్యాంగములను, ఛిన్నమైన పరిపాలనాచక్రమును, నిండుకున్న బొక్కసమును మరల సుప్రతిష్ఠితము జేయుటకిది యవసరమయ్యెను. ఇది గ్రహించక తొలగించబడిన యధికారులు మున్సబులు జాగీరులు పోగొట్టుకొన్న ఉమ్రావులు అరికట్టబడిన బందిపోటు సర్దారులు క్రీ. శ. 1676 లో నొక తిరుగుబాటులేవనెత్తిరి. అబుల్‌హసను దీని నవలీలగ నణచివైచెను. గజపతుల వారసులును తిరుగుబాటుచేసిరి సుల్తాను దానిని నిర్మూలించి అందు తనకు సాయముజేసిన గజపతి వంశీయుడు అప్పలరాజునకు అప్పులనాయక రావుబహద్దరను బిరుదము అనేక జాగీరులునిచ్చి సత్కరించెను. దేశములో శాంతిభద్రతలు స్థిరపడెను. అబుల్లసను నీతివల్ల దేశము సస్యశ్యామలము సుభిక్షితమునయ్యెను. చోరుల బెడద దూరమైనది. సమర్థులగు నధికారబృందము, భక్తివిశ్వాసములుగల సైన్యము నప్రమత్తతగ దేశసేవయందు నిమగ్నమైనవి. చెరువులు, కాలువలు ఇతరములగు అనేక జలాధార

ములు రాజుచేతను అతని సామంత సర్దారులచేతను నిర్మించబడినవి. దేశము శాంతిసిరుల కాలవాల మైనది.

## విదేశీయ విధానము.

## I

### ఆంగ్లేయులతో సంబంధము

నారోమండలు సముద్రతీరమున డచ్చి ఫ్రెంచి ఆంగ్లేయుల వర్తకపుగిడ్డంగు లేర్పడినవి. త్వరితగతి బలపడుచు రాను రాను అవి వారి రాజ్యవిస్తీర్ణసన్నాహములకు నాటపట్టులయ్యెను వారు పరస్పరము పోరుచు దేశ శాంతి సౌభాగ్యములకు హాని కల్గించుటయేగాక దేశీయ వ్యాపారుల నవమానించుచు స్థానికాధికారుల ధిక్కరించుచు గోలకొండ ప్రభుత్వమును కూడ సరకుగొనక ప్రవర్తించుచుండిరి. అబ్దుల్లాఖుతుబుషా కాలములోను అబుల్హసను పరిపాలనలోని మొదటి రెండు సంవత్సరములు వా రాడినదాట పాడినది పాటగ గడిచినది. అబ్దుల్లా వారికి నాణెములు చెసుకొను నధికారముకూడ నిచ్చెను అబుల్ హసను రాజు కాగనె టంకపు టధికారి మెత్తివేయబడినది వారి వ్యాపారవర్తకములయందలి దుర్నీతి దేశీయవాణిజ్యమున కుపద్రవకారి కాకుండ శాసించబడినది. వారు ప్రాంతీయాధికారుల సరకుగొనక సుల్తానుతోనె ప్రత్యక్షముగ సంబంధము పెట్టుకొనవలెనని చేసిన ప్రయత్నము వమ్మైనది. కొలడబ్బు నెగవేయ వారుజేసిన ప్రణాగములు బూడిదబోసిన పన్నీరైనవి. తాము తప్పుజేసి దానిని స్థానికాధికారులపై రుద్దచేసినరొద అరణ్యరోదనమైనది. క్రీ. శ 1630 నుండి 1686 వరకు ఐరోపీయుల చరిత్ర పరిశీలించిన పైవిషయములు విపులముగ దెలియ నగును.[1]

చెన్నపట్టణము "పూనమల్లి" మండలము లోనిది. 15వ మార్చి 1675న మాదన్న మేనల్లుడగు పొదిలి లింగన్న ఈమండలమున కధికారి యయ్యెను మెలమెల్లగ నీతడు కర్ణాటకప్రాంతమునకు తరఫుదారయ్యెను. మొదట తుపాకి కృష్ణుడును, బాబూరావును, ఆపై పొదిలి లింగన్నయు నీ యాంగ్లేయులను ముఖ్యముగను నితరఐరోపీయులను సాధారణముగను నిర్ణీతమగు నవధులలోనుంచిరి. ఈస్టిండియా కంపెనీ గౌర్నరులు బెరన్‌లాంగుహరన్, సర్ స్ట్రెన్సుహాం, మాస్టరు మరియు గైపోర్డుఅనువారి తలబిరుసుచేష్టలను లింగన్న చిత్తుజేసి మద్రాస్ శాంధోం మున్నగు కోటలను మంటిపాలుజేసి వారిచే 'పాహి పాహి' యనిపించెను వారి శరణాగతిని దయాళువగు సుల్తానుమన్నించి వారియెడ దయ సానుభూతిజూపి కొన్ని సౌకర్యములు గల్పించెను. అబుల్హసను రాజనీతి పొదిలి లింగన్న దక్షత లాంగ్లేయులను, సరియగు నవధుల నతిక్రమించనియలేదు. ఇందువల్ల దేశీయపారిశ్రామికులకు రక్షణ, వ్యాపారవాణిజ్యములకు ప్రోత్సాహము లభించినవి.

## II

### ఆదిల్‌షాహీలతో సంబంధము

అబ్దుల్లాఖుతుబుషా సోదరిభర్త మహమ్మదు ఆదిల్‌షా మరణానంతరము వారి తీవ్రాంతఃకలహములు బీజాపురరాజ్యమును నిర్వీర్యము జేయుటయేగాక మహారాష్ట్రుల దాడుల కవకాశముగల్పించినవి. మహమ్మదు ఆదిల్‌షా తదుపరి రెండవ ఆలీఆదిల్‌షా రాజయ్యెను. క్రీ. శ. 1672 లో నితడు పరమపదించ నీతని కుమారుడు పంచవర్షప్రాయుడగు సికిందరు ఆదిల్‌షా రాజయ్యెను. ఇది యదనుగ నచటి యంతఃకలహములు తారస్థాయి నందుకొన్నవి. క్రీ. శ 1676న మహారాష్ట్రులతో బీజాపురముసంధి

---

Factory Records Fort Saint George Diary and Consultation.

జేసికొన్నదన్న నెపముపై మొఘ్లాయి గవర్నరు బహద్దర్ఖాను బీజాపూర్, అక్కడికోట, నలదుర్గము లను తీవ్రముగ ముట్టడించెను. బీజాపురపుటభ్యర్థన మన్నించి అబుల్‌హసను ఒక ప్రచండసైన్యము నిచ్చి మాదన్నను బంపెను. కాని మాదన్న మొఘ్లాయిలతో తలపడకయే తిరోగమించెను. మొఘ్లాయిలు షుల్బేడువరకు జొచ్చుకొని రాజొచ్చిరి గోలకొండ సర్వసైన్యాధ్యక్షుడగు మహ్మదిబ్రాహీమును మల్ఖేడువద్ద తమ సివారులను రక్షించుటకు తానాషా నియమించెను. రెండుమాసములు భయంకరమగు పోరు జరిగినది. అందు గోలకొండసైన్యము లోడిపోయినవి. అయినను మొఘ్లాయిలు, బీజాపూరీలు ముందడుగిడ సాహసించలేదు. అమితములును అపూర్వములునునగు నష్టకష్టము లనుభవించి ఏడురోజులు పయనించి ఇరువదిమైళ్ళ దూరమునున్న గుల్బర్గ యందలి మొఘ్లాయి శిబిరమునుచేరిరి [2] పరస్పరము తగువులాడుచున్న బీజాపురపు నాయకులమధ్య సంధి జేసి అబుల్హసను అచ్చట తన ప్రతినిధిగ అక్కన్నను నియమించి రక్షణవైదేశికనీతిని నియంత్రించబూనెను. కాని అచ్చటి పరిస్థితులు త్వరితగతిని దిగజారిపో సాగెను. దీనికి కారణమిచ్చటి పాలకుడగు సిద్ది మిసూదుప్రవర్తనయె. తుదకు క్రీ. శ 1679 లో అక్కనను తిరిగి పిలుపించుకొనెను క్రీ శ 1682న ఆలంఘీరు చక్రవర్తి దక్షణమునకువచ్చి 1684 న బీజాపురముపై దాడిసల్పెను. సికిందరు అభ్యర్థనను మన్నించి తానాషా ఒక ప్రచండమగు సైన్యమును 11–8–1685 న అంబాజీరావు అధ్యక్షతను బీజాపురమునకు సాయమంపెను. అంతియెగాక నలుబది వేల సుశిక్షితమగు నాశ్వికదళమును మహమ్మదిబ్రాహీమాధ్వర్యమున బంపుచున్నానని లేఖ వ్రాసెను. ఇది మొఘ్లాయిలకు జిక్కినది. తుదకు బీజాపురమును మొఘ్లాయిలు స్వాధీనపరుచుకొనిరి.

2 J. N. Sarkar Vol. 4.

# III

## మహారాష్ట్రులతో సంబంధము.

క్రీ. శ 1572 న ఛత్రపతిశివాజి పట్టాభిషిక్తుడయ్యెను. అతడు అక్టోబరు 1675 లో మొఘులు మరియు బీజాపూర్ సేనానాయకులగు బహద్దురుఖాను బహ్లూత్ఖానుల సంయుక్తసైన్యముల నోడించెను ఫిబ్రవరి 1676లో బీజాపుర నాయకుడు బహ్లూత్ ఖానుడు మూడులక్షల హోన్నులు యుద్ధవ్యయము క్రిందను, నొకలక్షహోన్నుల వార్షికమును జెల్లించుట కొప్పుకొని శివాజీతో సంధి జేసికొనెను. మధుర నాయకుడగు విజయరాఘవుని మనుమడు చెంగల్వరాయుడు శివాజికి సోదరుడును జింజీపరిపాలకుడును నగు ఎక్కోజీని సాయమర్థించెను, అతడు తంజాపురపు నాయకుడగు చొక్కనాథుని పారద్రోలి మధురను స్వాధీనబరుచుకొనెను. శివాజి, సోదరునినుండి దీనిని స్వాధీనబరుచుకొని కర్ణాటకమును తనయేలుబడిక్రిందికి తేగోరుచుండెను ఇది గోలకొండ సాహాయ్య సానుభూతులవల్లమాత్రమె సాధ్యము. ఉత్తరమున మొఘ్లాయిల ప్రమాదమును, పశ్చిమమున మహారాష్ట్రుల అలజడి, దక్షిణమున ప్రబలిన యరాజకస్థితిని సమర్థవంతముగ శాసించి మహారాష్ట్రులను మొఘులు వెల్లువలనాపుట కుపయోగించుటకై శివాజీతో స్నేహసౌహార్ద్రతను సాధించగోరుచుండెను తానాషా. ఇట్లు పరస్పరముగల అవసరముల నుపయోగించుకొని వారు క్రీ. మార్చి 1677 న నొకసంధి జేసికొనిరి. ఇందలి ముఖ్యాంశము మొఘ్లాయిలతో జరుగు యుద్ధమున మహారాష్ట్రులు గోలకొండకు సాయపడవలయుననునది. అది తానాషా రాజనీతికొక యపూర్వ విజయము. శివాజీ మాదన్నలు చనిపోయిన తదుపరియు నీ సంధి పనిజేసినది. మొఘ్లాయిలు గోలకొండముట్టడించినప్పుడు శంభాజీ పదమూడువేల యాశ్వికదళము ఏబదివేల పదాతి సైన్యములతో గోలకొండకు సాయ

పడెను. అంతేగాక మొఘలాయిల రహదారులుఛేదించి యు, దస్తుల దోచుకొనియు మహారాష్ట్రులు మొఘ్లాయిలను నష్టపరిచినట్లు ఖాఫ్ఖాన్, ఇబ్రాహింజుబేరి, మీరెఆలం మున్నగు ప్రముఖ చరిత్రకారులు వ్రాసినారు

## IV

### మొఘ్లాయిలతో సంబంధము

క్రీ. శ. 1636 లో జరిగిన సంధిప్రకారము గోలకొండ ఢిల్లీకి కప్పముగట్టు సామంతరాజ్యముగ రూపొందినది క్రీ. శ. 1656 జరిగిన యుద్ధము తదుపరి యీస్థితి మరింతదిగజారినది. గోలకొండను జీర్ణించుకొనుటయే మొఘ్లాయిల నీతికి పరమావధి దాని నెదుర్కొనుటయె ఖుతుబుషాహీల రాజనీతికి చుక్కాని. ఉత్తరపు టెల్లలను బలపరచి బీజపురము మహారాష్ట్రులతో సంధిజేసికొని సైన్యవ్యవస్థను బలపరుచుటకై తానాషా చేసిన నిర్విరామమగు కృషి కిదియే ప్రబలమగు కారణము. చక్రవర్తి వలదని ఎన్ని మారులు వ్రాసినను తానాషా అక్కన్న మాదన్నలను చేందీసిన దిందులకే. క్రీ. శ. 1682 లో చక్రవర్తి దక్షిణమునకు రాగానే కప్పమును. పదునైదేనుగులను, కొన్ని మణుగుల బంగారమును బురహానుపూరుపోనున్న నాతనివద్దకు పంపెను. అయినను ఉత్తర, పశ్చిమోత్తర సివారులను బలపరచి ప్రచండసైన్యముతో సర్వసైన్యాధ్యక్షుడగు మహమ్మదిబ్రాహీమును ఎల్లలరక్షణకు నియమించెను. తానాషా నవలంభించిన సంధి నిగ్రహనిరోధములు ఔరంగజేబును నాతని మార్గమునుండి మార్చజాలియుండలేదు. గోలకొండను భుక్తపరుచుకొనవలయునను యీతని దృఢసంకల్పము సడలలేదు. కాఫిరులపోషణ, సురాపానము, మతవ్యతిరేకచర్యలు జారత్వము, చక్రవర్తి శత్రువులగు బీజాపురము శివాజీలకు వలదన్నను సాయముజేయుట మున్నగు నపరాధములుమోపి, క్రీ శ. 1685లో మల్ఖేడు మైదానములో గోలకొండ సైన్యముల మహమ్మదిబ్రాహీము స్వామిద్రోహి నోడించి 1686లో గోలకొండను ముట్టడించి మత విషవాయువులను ప్రేరేపించి స్వామిద్రోహమును ప్రోత్సహించి తుదకు అబ్దుల్లాలారి వాని ద్రోహము నూతగగొని 21-9-1687 గోలకొండను స్వాధీనపరచుకొనెను. తానీషాను బంధించి 28-2-1688 న నాతనిని దౌలతాబాదు చెరసాల యందుంచెను. వార్షికముగ నాతని కేబదివేలరూప్యముల భృతినేర్పఱిచెను. తానాషా చెరసాలయందే క్రీ శ. 1703 లో దివంగతుడయ్యెను.

### సయాంతో సంబంధములు :

గోలకొండకు విస్తృత సముద్ర వ్యాపారముండెడిది. అందువల్ల వ్యాపార నౌకలుమాత్రమేగాక బలీయమగు నౌకాబలమును సర్వసమృద్ధములగు నౌకానిర్మాణకేంద్రములను నుండెడివి. గోలకొండ వ్యాపార నౌకలను సయాంచక్రవర్తి యాంగ్లేయుల ప్రోత్సాహముపై దోచుకొనుచుండెడివాడు. క్రీ శ. 1686 వసంత ఋతువులో సయాంచక్రవర్తి నౌకాబలములను గోలకొండసముద్ర వాహినులు డీకొని సంపూర్ణముగ పరాభవించినవి. 29-10-1686 'ఎల్టం' యను నాంగ్లేయుడు మద్రాసుగౌవర్నరు కైపోర్టుకు వ్రాసిన లేఖవల్ల నీ యుద్ధ వివరములు ధృవపడుచున్నవి. సుదూర సముద్రములపై సైతము విదేశనౌకాబలముల నోడించు శక్తిసంపన్నములగు నౌకాబలముగల గోలకొండ, మొఘలుసామ్రాజ్య కాంక్షకు బలిగాకున్న భారతీయ చరిత్రగతి వేరొకవిధముగ నుండెడిది

### గోలకొండముట్టడి :

5 వ ఫిబ్రవరి 1687 న ఔరంగజేబుచక్రవర్తి గోలకొండ ముట్టడి ప్రారంభించెను. ఇందులకు 1900

శతఘ్నుల ప్రేల్చువారును 42720 తుపాకులు ప్రేల్చు వారును, నూట అరు శతఘ్నులు అందు ఏడు చాల పెద్దవి—నాలుగునుండి నలుబదియొక్క శేరులు బరువు గల గుండ్లను గురిపించజాలినవి యుండెను 89 చిన్న తోపులును 6809 బారువుల తుపాకిమందును, 1244 మణుగుల తుపాకిగుండ్లును, నగడ్తల నింపుటకు 3¾ లక్షల సంచులను సిద్ధపరుచబడెను. [1]

7–2–1687 న ఘోరమగు సంగ్రామముజరిగి పరాజయ మెరుగని మొఘులువాహినులు పరాజితము లైనవి. పెక్కురు సుప్రసిద్ధ దండనాయకులు నిహతు లైరి. అబుల్మకారిం, సయ్యదుబారహా, చీన్‌ఖలీజుఖాన్ వంటి ప్రముఖ సేనానాయకులు క్షతులైరి చీన్‌ఖలీజు ఖాన్ మొదటి అసఫ్‌కు తండ్రి. ఇతడు 10-2-1687న చనిపోయెను. ఇతని సమాధి నేటికిని చూడవచ్చును. మూడుమాసము లిట్లతి భయంకరమగు పోరు జరిగి నది మొఘులుసేన లలసి, చితికి విసిగిపోయినవి. నూతన వాహినులనేకములు ముట్టడిలో ప్రవేశించి నను యుద్ధగతి వక్రముగనుండెను. అందుచే చక్రవర్తి రాత్రి యుద్ధ మారంభించెను. 16–5–1687 రాత్రి మూడవ యామమున కోటగోడలపై కెగబ్రాకి వచ్చు చున్న మొఘులు సైన్యముల నట తిరుగాడుచున్న భైరవమొకటి పసిగట్టి యఱచుటచే గోలకొండ సైనికులు మేల్కొని పైకివచ్చిన మొఘులు సైనికుల నిర్మూలించి త్రాటినిచ్చెనలను గోసివైచిరి. మొఘులు సర్వసైన్యా ధ్యక్షునికి ప్రముఖమగు మూడు బిరుదులుండెను. అందువల్ల నాతనిని "శేతబ్ఖా" యందురు. అబుల్హసను తానాషా ఈశునక రాజమునకు "శేతబ్ఖా" యను బిరు దిచ్చి నవరత్నములు దాపిని మెడపట్టి, బంగారుగొలుసు బహూకరించెను.

తాను చేయునది ధర్మయుద్ధమని "ఫతువా" నిచ్చుటకు నిరాకరించినందువల్ల ఖాజీఅబ్దుల్లా 'సదర్జు సుదూరు' మరియు ఖాజీషేఖు-ఉల్-ఇస్లామును చక్రవర్తి పదవీభ్రష్టులను చేసెను [1] మే నెల యుంతయు నిర్విరామమగు భయంకరయుద్ధము జరగు చునేయుండెను. 16–6–87 పెనుతుఫాను వీచి మొఘులు గుడారములన్నియు నేలమట్టము గావించి నది. అపైకురిసిన మహాతపోతవర్షమునకు మూసీ పొంగి మొఘులు సంభారము సమితిగ తరలించుకొని పోయినది యుద్ధరంగము నిమ్నోన్నత మెరుగని విస్తృత జలాశయమైనది. రెండవ పర్యాయము గోల కొండ వాహినులు మొఘ్లాయిలపై విరుచుకొనిపడి సర్వ నాశనము రచించినవి. సఫెషికన్‌ఖాన్ సలీ-ఖానుల వంటి ప్రముఖయోధులు శతఘ్నికాగోళములు జేసిన బొరియలలో దాగుకొని ప్రాణములు రక్షించుకొనిరి. ఇస్లాంఖాను రణరంగమున వదిలి పారిపోయెను పారి పోవుచున్న ఘైరత్ఖాను, మరియు సర్బరాఃఖానులను గోలకొండ సైనికులు బంధించి కోటలోనికి దెచ్చిరి. అబుల్హసను వారల నుచితరీతి సత్కరించి తన ధన ధాన్యపుగిడ్డంగులు జూపెను. వారలతో"నొక కోటిరూపా యిలు పేష్షముగను, మరొక కోటిరూపాయిలు యుద్ధ వ్యయముక్రిందను నిత్తును. ఇందుకంగీకరించి ముస ల్మానుల నెత్తురు చిందించు టాపవలసినదిగ చెయు నావిన్నపము చక్రవర్తి కందించుడు. నావిన్నప మంగీకరింప బడకున్నను. అన్నాతురులైన మొఘులు సైనికులకొరకు 6 వందలవేల మణుగుల ధాన్య మంపుట కంగీకరించవలసినదిగ చక్రవర్తిని పొడ్డం చుచున్నా' నని తెలుపవలసినదిగ జెప్పి వారలను సబహుమానముగ విడచిపుచ్చెను. ఈ సందేశ మవురంగ జేబును మరింత రెచ్చగొట్టినది.

మూడుపర్యాయములు కోటగోడలక్రింద సొరం గములు త్రవ్వి తుపాకిమందు దట్టించి కోటను శిథిల పరుచజేసిన ప్రయత్నము వమ్మైనది. మొఘులు సైని కుల సాహసప్రతాపములు, దండనాదుల యుక్తిశక్తులు

(1) జదునాథ్‌సర్కారు సంపుటి నాలుగు

(1) హదీఖితుల్—ఆలం

సర్వసైన్యాధ్యక్షుల కార్యకుశలత, చక్రవర్తి రాజనీతి చతురత యిలు బూదిపోసిన పన్నీరైనవి. అపారమగు మొఘులు సేనావాహినులు పరిమితమైనవి. చక్రవర్తి దానభేదోపాయముల నాశ్రయించియు మతోన్మాదము రేకెత్తించియు అనేక ప్రముఖ ఖుతుబుషాహీ దళ వాయులను తనవైపాకర్షించు కొనెను. తానాషాకు చెప్పుకొనదగిన దండనాయకు లిరువురె మిగిలిరి. అందొకడు అబ్దుల్లాఖాన్‌పాని మొఘులాయితో లాలూచి పడి 21-9-1687 రాత్రి మూడవ యామమున "ఫతెదర్వాజ" వద్ద గల నొక చిన్నద్వారమును తెరచి మొఘులులను కోటలోనికి రానిచ్చెను. మొఘులు సైనికులు కోటలో ప్రవేశించి కోటద్వారములు తెరచి వైవ మొఘులు వాహినులు కోటలోప్రవేశించెను. ఈ ద్వారమును నేడు ఫతెదర్వాజ (విజయద్వారము) అందురు. వేరొకచోటనున్న అబ్దుల్ రజాఖులారీ యీ విజయ ఘోష విని పటురయమున నటకేతెంచి మొఘులు వాహినుల నేకాకిగ నెదిరించెను. డెబ్బదిరెండుగాయములు తిని నొసటి చర్మముతెగి కన్నుల కడ్డముబడి తుదకు స్పృహదప్పుటచే గాయపడిన యాతని గుఱ్ఱ మాతనిని నగీనాబాగ్‌లో పడవైచి చనిపోయినది. బైటి విజయఘోషలు, హాహాకారములు, ఖడ్గనాదములు అబుల్హసనునకు పరిస్థితుల నెరుకబరచెను. అతడు అంతఃపురములోని రాణుల నోదార్చి వారిసెలవు దీసి కొని రాజలాంఛనలాంఛితుడై సర్వాలంకరణభూషితుడై దర్బారుహాలులో రత్నఖచితమైన తన సింహాసనముపై కూర్చుండెను రూహల్లాఖాన్ రణమస్తుఖాను మున్నగు మొఘులు యోధులు సభలో ప్రవేశింప వారి సుచిర రీతిని సత్కరించి, వారితో 'నుపాయనము' లారగించి యశ్వారూఢుడై నిర్లిప్తతో కోట బయల్వెడలి అట నిరీక్షించుచున్న అజం రాకుమారునకు వశపడెను. అతడాతనిని చక్రవర్తియొద్దకు దీసికొనిపోయెను. ఇందు శత్రుముల సంపద, పౌరుషము, చతురతకన్న అదృష్టమే బలీయమై కోటను చక్రవర్తికి వశపర్చినది.[1] తానాషా కోరికపై అవురంగజేబాతనిని జానునిస్సారుఖానతో 18-2-1688న దౌలతాబాదును బంపెను. అచ్చట తానాషా 2-2-1688న కాలకోరలో జీవితాంతము వరకు బంధించబడెను. తానాషా బైట కేగగనే నంతఃపురాంగనలు తమ తమ యాభరణములు బావులలో బడ వైచి తామును అందుబడి మరణించిరి. గోలకొండ ధనాగారములో చక్రవర్తి కెనిమిదిలక్షల నేబదొకవేయి బంగారు మొహరములును, రెండుకోట్ల ఏబదిమూడు వేల రూప్యములను లభించినవి అనగా మొత్తము ఆరుకోట్ల యెనుబదిలక్షల పదివేల రూపాయిలును, నూట పదిహేనుకోట్ల 16 లక్షల దరహములును బండ్లకొలది స్వర్ణరజితాభరణములును విస్తారమగు నవరత్నసంచయమును లభ్యమైనది. వీటిజాబితాలు సిద్ధపరుపబడినవి.[2]

అబుల్హసను క్రీ. శ. 1628 జన్మించెను వివాహము క్రీ శ 1661 లో జరిగినది పాలించినది పదిహేను సంవత్సరముల నాలుగుమాసముల ఇరవ డెనిమిది రోజులు చెరననుభవించినది పదునాలు గేడులు. ఇతనిరాజ్యము తెలుగు తమిళ కర్నాటక ప్రాంతములుగ విభాజించబడియుండెను. ఈ రాజ్యములో 58 సర్కారులు 554 పరగణాలుండెను. మూడు కోట్ల నలుబదేడు లక్షల నలుబదియొకవేయి యెన్మిది వందలరూపాయిల-వదుమూడు పైసలు భూమ్యాదాయముగను, ఒకకోటి మూడులక్షల అరువదొకవేయి నారువందల నలువది రూపాయిలు గనులనుండియు, 52, 39, 001,0,0 ఇతర మార్గములనుండియు నాదాయము వచ్చుచుండెడిది ఇట్లు ఇతని కాలములో

(1) హదీఖతుల్ ఆలం. రెండవసంపుటి

(2) జఫరెదక్కను.

వచ్చు మొత్తము ఆదాయము 5, 03, 42, 501, 3-9 రూపాయిలును, మొత్తము వ్యయము 1, 70, 45, 605–1–0 రూపాయిలు. కాగా మిగులు 3, 32, 96, 896, 2–9 రూపాయిలు. మిగులు శాతము, దామాషా అబుల్హసను రాజ్యముయొక పటిష్ఠమగు నార్థికస్థితిని నిరూపించుచున్నది.

అబుల్హసను పండితుడు, ఉదారుడు, భగవద్భక్తి గల ముసల్మానుడు. న్యాయబుద్ధిగల సమర్థుడగు పరిపాలకుడు. సంస్కృతి శుచివైభవము లాతనియందు పరాకాష్ఠ జెందినట్లు దోచును. సంగీతసాహిత్యము లందాతడు సవ్యసాచి. విశాలదృక్పథము మతసహనముగల సూఫీ–సుశీలుడు–నిర్లిప్తుడగు వేదాంతి–దక్షిణభారతములో నే ముస్లింపాలకునకు లభ్యముగాని కీర్తిప్రతిష్ఠలు ప్రజారంజకత, ప్రజల ప్రగాఢభక్తి విశ్వాసము లీతనికి తంగేటిజున్నైనవి. నేటికిని నీతని పేరు జనసామాన్యపు జిహ్వాగ్రమున లాస్యించుచున్న దింక నాతనిని గురించి చెప్పవలసినదేమియు మిగులలేదని భావింపవచ్చును.

# కుతుబుషాహీల తెలుగు సాహిత్య పోషణము

శ్రీ ఆదిరాజు వీరభద్రరావు

గోలకొండ రాజధానిగా కులీకుతుబుషా, జంషీద్ కుతుబుషా, సుభాన్‌కుతుబుషా, ఇబ్రహిం కుతుబుషా, మహమ్మదుకులీకుతుబుషా, మహమ్మదుకుతుబుషా. అబ్దుల్లాకుతుబుషా, అబుల్‌హసన్‌తానాషా—అను ఎనిమిది కుతుబుషాహి సుల్తానులు ఆంధ్రదేశమును క్రీ. శ 1518 నుండి 1687 వరకు పరిపాలించియుండిరి వీరిలో మూడవవాడగు సుల్తాన్‌సుబాన్ కుతుబుషా ఏడు సంవత్సరముల బాలుడు. నామకార్థముగా గద్దెనెక్కి, కొద్దికాలములో పదభ్రష్టుడయినందున అతడు లెక్కలోనికిరాడు. మిగత ఏడుగురుమాత్రమే చరిత్ర ప్రసిద్ధులై యున్నారు

కుతుబుషాహిసుల్తానులు ఇస్లాంమతస్థులయినను హిందూమత ద్వేషులు కారు. వారి హయాములో హిందువులుకూడ సరిసమాన గౌరవ ప్రతిపత్తులుకలిగి రాజ్యపాలనయందు పాల్గొనుచుండిరి ఫారసీ, ఉర్దు భాషలు మాట్లాడుచు వాటియందు అభిమానముగలవారయ్యును, రాజ్యములోని అశేష ప్రజానీకమునకు మాతృభాషయయిన ఆంధ్రభాషనుకూడ అభిమానించి ఆంధ్రభారతిని సమాదరించియున్నారు.

కుతుబుషాహి వంశమునకు మూలపురుషుడగు సుల్తాన్ కులీకుతుబుషా, అతని మూడవ కొడుకగు రెండవసుల్తాన్ జంషిదుకుతుబుషా ఆంధ్రభాషయెడ ఆదరాభిమానములు చూపియుందురు. కాని ఆ విషయములో చరిత్రాధారములు కనిపించుటలేదు. ఇక మూడవసుల్తానగు ఇబ్రహీంకుతుబుషా కాలమునుండి చివరి సుల్తానగు అబుల్‌హసన్ తానాషావరకు 150 సంవత్సరములు ఆంధ్రభాష రాజమర్యాదలను పొంది వెంపొందెననుటకు చరిత్రాధారములు కలవు.

ఇబ్రహింకుతుబుషా పూర్తిపేరు అబుల్ ముజప్ఫర్ ఇబ్రహీం కుతుబుషా. ఈతడు కులీకుతుబుషా యొక్క ఆరవకుమారుడు. కడసటివాడుకూడను. కులీకుతుబుషా కుమారులందరిలోకి ఇబ్రహీంకుతుబుషాయే

యోగ్యతెలుసు. ధైర్యసాహసములు కలవాడు, జనప్రియుడు ఈతని తెలివితేటలను గమనించి కులీ కుతుబుషా ఈతనిని దేవరకొండ పరగణాకు గవర్నరుగా నియమించెను కాని కులీకుతుబుషా మరణముతో ఈతడు కష్టముల పాలయ్యెను. జంషీదు కుతుబుషా పితృవధగావించి, రక్తపాతముతో సింహాసన మెక్కెను తనకు ప్రతిస్పర్ధిగా నుండువాడు ఇబ్రహీం యొక్కడేయని జంషీదు తలంచెను కావున ఏదో మాయోపాయమున ఇబ్రహీంను తుదముట్టించవలయునని జంషీదు ప్రయత్నించెను. దూరదృష్టిగల ఇబ్రహీం రానున్నముప్పును గ్రహించెను. సంకటములనుండి తప్పించుకొనుటకు ఇటు నటు పరుగెత్తెను అప్రయత్నములన్నియు విఫలము కాగా, తుదకు తుంగభద్రాతీరమునకు పరుగెత్తి, విజయనగర సామ్రాట్టు అళియరామరాయల శరణుచొచ్చెను. రామరాయలు ఇబ్రహీం రాకొమరునకు అభయప్రదానముగావించి, గౌరవాదర పురస్సరముగ నాతని తనవద్ద నుంచుకొనెను, విజయనగరమునందు ఏడు సంవత్సరములు హాయిగ అతడు గడపెను.

విజయనగరనివాసమే ఇబ్రహీంకుతుబుషాకు ఆంధ్రభాషయెడ ఆదరాభిమానములు జనించుటకు దోహదమొసంగెను అచ్చట సంస్కృతాంధ్రములు నేర్చెను విజయనగర దర్బారునందు జరుగు పండిత గోష్ఠులలో, కవితావినోదములలో పాల్గొనెను. ఆంధ్రభాషామాధుర్యమును జవిగొనెను.

ఇబ్రహీం అళియరామరాయల సహాయముతో క్రీ శ 1550లో గోలకొండ రాజ్యసింహాసన మధిష్ఠించెను, అతడు రాజ్యముచేసిన 30 సంవత్సరముల కాలములో విజయనగర రాజుల ననుకరించుచు విద్యాగోష్ఠులతో ప్రమోదించెను. ఆంధ్రులయిన పండితులను, కవులను బహుధా గౌరవించుచు ఆంధ్రభారతిని కొలిచెను. "పెక్కుకృతులొంద మత్కృతులు బెంపుగ నందినవాడు."

ఇబ్రహీంకుతుబుషా దర్బారునందు అద్దంకి గంగాధరకవి ఆస్థానకవిగా నుండెను. ఈతడు "తపతీసంవరణోపాఖ్యానము" అను ఆంధ్రకావ్యమును రచించి ఇబ్రహీంకుతుబుషాకు అంకితము చేసెను. ఆస్థానములో మరికొందరు కవులుండి యుందురు కాని వారిపేరు సరిగా తెలియవు. ఇబ్రహీంకుతుబుషా ఆస్థానములో--

సకలవేదపురాణశాస్త్ర పారగులైన
యొంటరివిద్వాంసు లొక్కచోట
అష్టభాషలయందు ఆంధ్యంబులేకుండ
హొంతకారి కవీంద్రులొక్కచోట
ఉండెడువారట !

ఇబ్రహీంకుతుబుషాచే సన్మానింపబడినవారిలో అనూరిమడంగంటి సింగరాచార్యులొకడు. ఇతడు నల్లగొండజిల్లావాడు. మహాపండితుడు, మహాకవి. పెక్కుకావ్యములను రచించి వినుతికెక్కినవాడు. ఈకవిచంద్రుని -- ఈరాజచంద్రుడు అత్యధికముగా గౌరవించెను సింగరాచార్యులకు "మత్తగంధేభ సితచ్ఛత్ర చామరోత్తమాశ్వహాటకాంబర చతురంతయానాగ్రహారములు" ఇబ్రహీంకుతుబుషాయొసగి సన్మానించినాడు. ఒక మహమ్మదీయప్రభువు ఒక ఆంధ్రకవీశ్వరుని అంత ఘనముగా సన్మానించినాడనినచో అప్రభువునకు ఎట్టి ఆంధ్రసంస్కృతికలదో మనమూహింపవచ్చును. ఈప్రభువుచే సన్మానింపబడిన వారిలో మరియొకని పేరు వినవచ్చుచున్నది. అతడు కందుకూరి రుద్రకవి. ఈతడొక దొడ్డకవి. ఈతడు ఇబ్రహీంకుతుబుషాయెదుట తనకవితా ప్రాగల్భ్యమును ప్రకటించి సుల్తానునేగాక, సభాస్తారులందరిని దిగ్భ్రాంతులను గావించినట్లు ఆంధ్రకవులచరిత్రలో పేరెన్నికగన్న మనీషి. రుద్రకవికి రెంటచింతల గ్రామమును అగ్రహారముగా ఈసుల్తాను ఒసంగి తన

సహజౌదార్యమును ప్రకటించి తెలుగు పలుకుల సొలతికి జేజేలర్పించినాడు.

ఈప్రభువు ఘనసమ్మానమునకు పాత్రులైన అద్దంకి గంగాధరకవి, మరింగంటి సింగరాచార్యులు, కందుకూరి రుద్రకవి అను కవిత్రయమేకాకుండ ఆంధ్రకవినని వచ్చిన ప్రతివానికి విచక్షణలేకుండ "నృపకులేశ్వరుడౌ ఇభరాముశాహి. అయతపుణ్యా పూర్తి యతడర్థులువేడిన నిచ్చు వేలును, రెండువేలు, పదివేలును, లక్షలు, కోట్లు ఇచ్చువా"డని కీర్తింపబడినాడు. అద్దంకి గంగాధరకవి యీ సుల్తానును "మల్కిభరాము"డని ముద్దుగా పేర్కొన్నాడు.

ఇబ్రహీంకుతుబుషాయొక్క ఆంధ్ర భాషాభిమానమును, ఔదార్యమునుపురస్కరించుకొని కొందరు దొంగకవులు సత్కరింపబడినారు. కపిత్వమురాని చతురులిద్దరు సభకువచ్చినారు. అందులో నొకడు—

"కరయుగములు చరణంబులు
నురము లలాటస్థలంబు నున్నతభుజముల్
సరి ధరణిమోపి మొక్కిరి
మరిమరి నీశత్రులెల్ల మల్కిభరామా"

అని తనకవిత్వమును ప్రకటించి సమ్మానము బొందినాడట! మరియొకడు—

"యరలవ మదనసయనుచును
బరువడి నీయక్షరములు భయదయతతులన్
నిరతమును వ్రాయనేర్చిరి
మరిమరి నీ పుత్రులెల్ల మల్కిభరామా!"

అని తన కవితాపటిమను ప్రకటించినాడట! ప్రభువు వీరల కవిత్వమునకు కొంత వినోదించియుండును, సరసుడైన యా ప్రభువు వారల కక్కుర్తికవిత్వమునకు కాతణములను గ్రహించి వారలను సత్కరించినాడు. పెద్దవారి లక్షణము లిట్లుకేయుండును గదా!

ఈ నరపాలుడు—

"నవ్వేనాసంగీత నాదవేదవిధిజ్ఞ
ధీరాత్ములకు పదినూరులిచ్చు
రమ్యనెనా సభాపాంథ సత్కవివర
జాలములకు బదివేలునిచ్చు
కూర్చుండుమనియెనా గురువరశాస్త్రజ్ఞ
లక్షణవిదులకు లక్షలిచ్చు
సాబాసురాయన్న సకలాశ్రితానేక
కోవిదులనుమెచ్చి కోటియిచ్చు
బలిరచతురబ్ధి మేఖలాకలితధాత్రి
జక్రనిర్వక్రపాలనా చారుకీర్తి
రమ్యముక్తాతపత్ర రారాజితుండు
చారుతరమూర్తి యిభరాము చక్రవర్తి"

ఇట్లు ఘనముగా వర్ణితుడయిన సుల్తాను ఇబ్రహీం కుతుబుషా మరణించినప్పుడు (1580)

"...నిస్సారపులోభిరాజులను జంపక మల్కిభరామ భూవరున్
చారుయశోధరున్ సుగుణిచంపితి వర్ధులకేమిదక్కు.."

అని యొకకవి బ్రహ్మను దూషించినాడు.

సుల్తాన్ ఇబ్రహీంకుతుబుషా మహమ్మదీయుడైననేమి ఎంతయు కీర్తనీయుడు.

ఇబ్రహీంకుతుబుషా అనంతరము ఆతని కుమారుడు మహమ్మదుకులీకుతుబుషా రాజ్యముచేసెను (1580-1612). ఇతడు ఆంధ్రులయందు, ఆంధ్ర భాషయందు అత్యంతాభిమానము కలిగియుండెను. ఇబ్రహీంకుతుబుషాకు భాగీరథీబాయి అను పేరుగల ఒక భార్యయుండెననియు, ఈభాగీరథీబాయి కుమారుడే మహమ్మదుకులీకుతుబుషా యనియు ఇటీవల డాక్టరు బి. రామరాజుగారు ఆధారపూర్వకముగా నిశ్చయించినారు. అప్పుడు గోలకొండను భాగీరథీపట్టణమనుచుండిరట! మహమ్మదుకులీకుతుబుషా యువరాజపదవియందున్న కాలముననే ఆతనికి ఒక ప్రియురాలుండెను ఆమెపేరు భాగమతి. గోలకొండకు తన తల్లిపేర భాగీరథీపట్టణమను పేరు పెట్టబడినందున, తనభార్య భాగమతిపేర మూసీనదికి దక్షిణభాగమున "భాగానగరము"ను ఈతడు నిర్మి

ణము గావించెను. మహమ్మదుకులీకుతుబుషా తాను రాజపదవి వహించగనే రాజకుటుంబములోని కలవ రమ్మ. మాన్పుటకై భాగామతిని ఇస్లాంమత ప్రవిష్టు రాలిగ చేసి "హైదరుమహల్"అను బిరుదనామమామె కొసంగెను అందువలన భాగానగరము హైదరాబాదు అను క్రొత్తనామమును తాల్చెను. ఈహైదరాబాదు ఇప్పటి ఆంధ్రప్రదేశపు రాజధానీనగరము. భాగీరథీ బాయి, బాగమతి అత్తకోడండ్రు ఇద్దరు ఆంధ్రవనితలు. ఈ ఆంధ్రవనితల ప్రభావము మహమ్మదుకులీకుతు బుషాపై మిక్కిలిగా నుండియుండును,

సుల్తాన్ మహమ్మదుకులీకుతుబుషాకు తెలుగు బాగుగా వచ్చుననియు, తెలుగులో కవిత్వమునుగూడ చెప్పుచుండెననియు చరిత్రకారులు వ్రాయుచున్నారు. కాని అట్టి రచనము లెవ్వియు లభించలేదు. ఈ సుల్తాన్ ఉర్దూలో గొప్ప కవిగూడ నైయుండెను. ఈతని ఉర్దుకవిత్వములో తెలుగుపదములున్నట్లు తెలియుచున్నది.

గోలకొండ సుల్తానుల దర్బారులలో పారం పర్యముగ ఉర్దు, ఫారసీకవులేగాక సంస్కృతాంధ్ర కవులును ఉండుచుండిరి. వీరందరు రాజసమ్మాన మును బొందిచుండినారనుటకు సందేహములేదు.

నేబతి కృష్ణయామాత్యుడు సుల్తాన్ మహమ్మదు కులీకుతుబుషా కాలమువాడని డాక్టరు బి రామరాజు గారు సిద్ధాంతించినారు. ఈసుల్తాన్ కాలములో కృష్ణ యామాత్యుడు సుల్తాన్‌దర్బారునందు ప్రధానిగా, హితుడుగా, కవివరుడుగా నుండెడువాడు. ఈకవి వరుడు రాజనీతి రత్నాకరమను పేరితో ఆరాశ్వాస ముల వైష్ణవ ప్రబంధముగా విరచించినాడు. ఆ శ్వాసాంతములో గద్యమునందు—

*ఇది శ్రీమదనంతసంతత కృపాకటాక్ష సంప్రాప్తసరస విద్యావిధాన రామానుజాచార్య కథానుసంధాన కౌండిన్యసగోత్రపవిత్ర నేబతికమలేంద్ర పుత్త్రసరయ భాగవతకైంకర్యధుర్య కృష్ణయామాత్య ప్రణీతం బైన రాజనీతి రత్నాకరంబు..."*

అని వివరించియున్నాడు. ఈకృష్ణయామాత్యుడు—

*"నాటకాలంకారనయకావ్యనిర్మాణ*
*చాతుర్యధుర్య వాగ్జాలచణుడు*
*కమనీయశృంగారం కవితాచమత్కార*
*సారస్యగూఢ ప్రాచుర్యవర్తి*

అని మహితగుణకీర్తి కృష్ణయామాత్య ఘనుడు" రాజనీతి రత్నాకరమున స్వవిషయమును వర్ణించు కొని యున్నాడు.

కృష్ణయామాత్యుని అసలు ఇంటిపేరేమో తెలి యదు. నేబతియనునది పౌరుషనామముగా గను పడుచున్నది. కృష్ణయామాత్యుని వంశములో అయిదు తరములకు పూర్వమున నాగరాజుకాలములో 'నేబతి' అను గృహనామము ఏర్పడినట్లు రాజనీతిరత్నాకరము నందలి—

*"అతులితకీర్తివైభవ దయానిధియై తగునాగరాజ సం*
*తతము బెడందకోట సులతానుశహా సముఖంబు నందు నే*
*బతిపని యుద్ధరింపి బహుభంగుల జేయగ నాటి నుండి నే*
*బతియన నింటిపేర కడుప్రస్తుతికెక్కె జగద్ధితంబుగన్"*

అను పద్యమువలన తెలియుచున్నది. నేబతిపదము "నియాబత్" అను పదమునకు తెలుగురూపము నియా బత్ అనగా రాయబారిఅనియు, స్థానాపతి అనియు రెండర్థములు కలవు.

కృష్ణయామాత్యునితండ్రి కమలనాభామాత్యుడు. ఈ "నేబతి కమలప్రధానకౌరి" మల్కిభరామ క్ష్మమా నాథ చంద్రుడు మెచ్చగా సత్కీర్తి హెచ్చినాడట. పానుగంటి వరపట్టణాధ్యక్షుడై మించుగా ప్రజల బోషించినాడట! మరియు సరససంగీతమహిమల వర కవిత్వకేళి నాదిమసుకవుల బోలినవాడట!

కృష్ణయామాత్యుని సోదరుడు నరసమంత్రి. ఈతడు—

"చెలిమి నహమ్మదు శాహు సుల్తాను స
మ్ముఖమున జనువెన్న బొదలినాడు
ప్రకటించి కావ్యనాటక శబ్ద నీతిశా
స్త్రప్రవీణుండన దనరినాడు
శృంగార సంగీత భంగీ తరంగ ధు
రీణుడై కీర్తిధరించినాడు
... ... ... ...
నందితజనుండు విలసిల్లె నరసమంత్రి"

అని అభివర్ణితుడయినాడు. ఈ పద్యములోని మహమ్మదుశాహ అని పేర్కొనబడినవాడు సుల్తాన్‌మహమ్మదుకులీకుతుబుషాయే యని డాక్టరు బి. రామరాజుగారి తీర్మానము.

ఇట్టి విద్వత్కవులు మరికొందరుండియుందురు. కాని వారినిగూర్చియు, వారి గ్రంథములనుగూర్చియు తెలియుటలేదు.

మహమ్మదుకులీకుతుబుషా యనంతరమ్ము సుల్తాన్ మహమ్మదుకుతుబుషా రాజ్యముచేసెను. (1612-1626). ఈ సుల్తాన్‌కాలములోనే సారంగు తమ్మకవి యుండినట్లు నా యభిప్రాయము. తమ్మయ తాను రచించిన "వైజయంతివిలాసము" అను ఆంధ్ర కావ్యమునందు తాను గోలకొండ కరణముగా నుండినట్లు ఈ క్రిందిపద్యములో చెప్పికొనియున్నాడు—

"ఇనసమతేజులౌ నృపులనెల్ల మహమ్మదుశాహి యేలునీ
యెనుబదినాల్గు దుర్గముల నేలిన యేలిక గోలకొండ ద
క్షిననగరిస్థలిన్ గరణీకం బొనరించెడు దమ్మమంత్రి యా
జనపతి రమ్ముబొమ్మనకు బ్రజల్ జయవెట్టి గృహస్థులౌననన్"

ఇందు వర్ణితుడయిన "మహమ్మదుశాహి" ఎవడు ? అను విషయములో చరిత్రకారులు భిన్నాభిప్రాయములను వెలిబుచ్చినారు. ఆంధ్రకవులు విచక్షణలేకుండ మహమ్మదీయ ప్రభువులను "మహమ్మదుశాహి" అనుటలో ఈక్లిష్టత ఏర్పడినది. ఒకరు ఇతడు మహమ్మదుకులీకుతుబుషా అన్నారు. మరియొకరు బహమనీ సుల్తానని యభిప్రాయపడినారు గోలకొండ సుల్తానులలో "మహమ్మదుశాహి" అనువాడుండగా వేరువిధముల తర్కించనేల ? ఈ విషయములో ఇదమిత్థమని నిర్ణయించుటకు నేను పూనుకొనలేదు.

సారంగుతమ్మకవి వైజయంతీవిలాసమును పద్యప్రబంధమును రచించినాడు. ఇదియొక చక్కని శృంగారకావ్యము. ఇతనికవిత్వము మృదువై, నిరర్గళమైనశైలికలిగి, ద్రాక్షాపాకమున అతిమనోహరముగా నుండును. ఇది ఒక వైష్ణవ భక్తునికి సంబంధించిన రమ్యమైనగాథ.

మహమ్మదు కుతుబుషా యనంతరము సుల్తాన్ అబ్దుల్లా కుతుబుషా రాజ్యముచేసెను (1626-1672). ఈసుల్తాన్ తల్లి యొక బ్రాహ్మణ స్త్రీ యట! అమె మిగుల చతురసంభాషణా శీలయట! తల్లి మూలకముగనేమో యీ సుల్తాను బ్రాహ్మణులయందు భక్తి భావము కలవాడయియుండెను. ఈతని దర్బారునందు వేద వేదాంగవిదులు, కవులు, పండితులు నుండుకొని యుండెడువారట! ఈ సుల్తాన్ విజ్ఞాన శాస్త్రములు, లలితకళలు, వాఙ్మయము వృద్ధిచేయుటకు ప్రయత్నించినవాడు.

ఈతని ఆస్థానములో గణనాథుడను పండితకవి యుండెను. తులసిమూర్తి అను మరియొకకవి యుండెను పదకవితాప్రసిద్ధుడగు క్షేత్రయ్య ఈ సుల్తానును దర్శించినాడు. అప్పుడు క్షేత్రయ్యకును, తులసిమూర్తికిని సంవాదము జరిగినట్లు తెలియుచున్నది. ఈ విషయమునుగూర్చి

"బలవంతుడౌ గోలకొండ పాదుషా బహుమానమిచ్చి
తులసిమూర్తితో వాదుదలచె నావేళ
వెలయ మువ్వగోపాలుడు వెయ్యిన్నేనూరుపదములు
నలువది దినములలో ర-సన్నుగలసి వినుపించెనే"

అను ఒక పదమునందు వివరించియున్నాడు. క్షేత్రయ్య సుల్తాన్‌గారిచే చక్కగా సమ్మానింపబడినాడు. తులసి మూర్తి గాంధర్వ విద్యాప్రవీణుడై యుండియుండును.

అబ్దుల్లాకుతుబుషా అనంతరము అబుల్‌హసన్ తానాషా సుల్తానయ్యెను (1672-1687). ఈసుల్తాను కూడ కవితాప్రియుడే ఇతడు కంచెర్ల గోపన్న (రామదాసు) మూలకముగా మనకు చిరపరిచితుడైనవాడు అబుల్‌హసన్‌తానాషా కుతుబుషాహి వంశములో కడపటివాడు.

"యథారాజా తథాప్రజా" అనుసూక్తి కలదుగదా! కుతుబుషాహి వంశ రాజన్యులందరు ఆంధ్ర సాహిత్యమును అభిమానించి, ప్రోత్సాహమిచ్చి గౌరవించియున్నారు.

ఇబ్రహీంకుతుబుషా సామంతుడగు అమీన్‌ఖాన్ పొట్లచెరువు (పటన్‌చెరువు) పట్టణము పాలకుడుగా నుండెను. ఈ నవాబు కొలువుకూటమున మరింగంటి అప్పలాచార్యుడను పండితవర్యుడుండెను ఇతడు రాజ పూజితుడు, వేదశాస్త్ర ప్రవీణుడు, సరససాహిత్య లక్షణ చక్రవర్తి, ఉభయభాషా కవిత్వధుర్యుడు ముగ్గురు రాజులచేత మ్రొక్కులు గొన్నట్టి భగవత్సమానుడట!

అమీన్‌ఖాన్ ఆదరమును చూరగొన్న మరియొక కవి పొన్నికంటి తెలగనార్యుడు. ఈ తెలగనార్యుడు 'యయాతిచరిత్ర' మను పేరుతో అచ్చ తెనుగు కావ్యమును రచించి అమీన్‌ఖానునకు అంకిత మిచ్చియున్నాడు ఆంధ్రభాషలో వెలువడిన మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యమిదియె. 'అచ్చతెనుంగు గబ్బమున కాదిపదంబయి పొల్పుభాగ్యముగ్ హెచ్చుగనున్నది' యీ గోలకొండ పట్టణమే.

అమీనుఖానుడును, ఆతని పుత్రులును ఆంధ్రమునందు మంచి ప్రవేశము కలవారుగ గనబడుచున్నారు. అమీనుఖాను బహుభాషావేత్త. ఈతని కుమారుడయిన గతాతఖాను అరబీ, ఫారసీ, గుజరాతి, అరె, అచ్చ తెనుగు, కన్నోజి మొదలగు లిపులు తెలిసి వ్రాయగలవాడట! అబ్దుల్ కరీం అను నాతడుగూడ లిపులు వ్రాయుటలో నేర్పరియట!

అమీన్‌ఖాను పొట్లచెరువులో చిన్నదర్బారు చేసి 'దివ్యతెలు బలియుల్ రౌతుల్ మొదల్గాదనుం గొలువన్ సంతసమంది కబ్బములు పేర్కొని చు' ఆనందించుచుండెడివాడు. ఈ అమీన్‌ఖాను మతద్వేషము లేని మహితాత్ముడు హిందువులను తనవారిపగెనే ప్రేమించెడువాడు 'పుడమివేల్పుల' బిడ్డల పెండ్లి చేయుచుండును. ఇతనికి ముగ్గురు భార్యలు అందరును ఉత్తమ సాధ్వీమణులు. పొట్లచెరువులోని జనులందరికిని చల్లని తల్లులు అందు బడేబీబీ అనునామె పెద్దభార్య ఈమె సాక్షాత్తు అన్నపూర్ణాదేవియే

అత్తవారిండ్లకు నరుగు కన్నియలకు
కట్నంబులిచ్చుచు గారవించు
పొద్దుపొద్దునె యెవ్వడులేచి వాడల
పసిబిడ్డలకునెల్ల పాలుపోయు
అకొన్నవారల కద్దమురేయైన
అరగించగబెట్టు నరసియరసి

తన పుట్టినింటికిని, అత్తవారియింటికిని ఎన్నెదెచ్చిన తుంటవిల్లు తల్లివంటి దీ బడేబీబీ'

పొన్నికంటి తెలగనార్యుడు రచించిన యయాతి చరిత్రమొక అపూర్వకావ్యము. కవితాచమత్కారమునందేమి, వర్ణనావిశేషములందేమి ప్రశంసనీయమై, అచ్చ తెనుగు కావ్యరచనమునకు రాచబాటవైచుటయే గాక ఆనాటి సాంఘిక, సభ్యతావిశేషములను దెలుపునట్టి గ్రంథరాజమైయున్నది

దోమకొండ సంస్థానాధీశులు మహమ్మదు కుతుబుషా సామంతులు. మూలపురుషుడగు కాచన్నపాలశేఖరుడు మహమ్మదు కుతుబుషా ఆహ్వానము ననుసరించి కృష్ణానది దాటి వచ్చినాడట! ఇతడు మెదకు దుర్గాధిపతి యయ్యెను. బిక్కనవోలు రాజధానియై యుండెను. ఈ వంశములోని దొరలు విద్వద్వర్యులు. రాజా మల్లారెడ్డి గొప్ప కవి. సంస్కృతాంధ్రములందు అద్వితీయ ప్రతిభను తన కవనమందు ప్రకాశింపచేసినాడు. అతడొక చాటువులో తాను కుతుబుషా ప్రభువుల ఆస్థానకవినని చెప్పుకొనెను. మల్లారెడ్డి సోదరుడు కామినేని ఎల్లారెడ్డి ప్రభువుగా, పండితుడుగా, కృతికర్తగా, కృతిభర్తగా ప్రఖ్యాతి పొందినవాడు ఎల్లారెడ్డి కవి వాసిష్ఠము, తైంగ్యము అను కావ్యములను విరచించియున్నాడు. మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రము, పద్మపురాణము, శివధర్మోత్తర ఖండము అను మూడు కావ్యములను వ్రాసెను. ఈతని కవిత్వము ప్రౌఢమై, సలక్షణమయి, అనర్గళ ధార కలిగి, కదళిపాకమున రమణీయముగానుండును.

కామినేని ఎల్లారెడ్డి ఆస్థానమున పట్టమెట్ట సోమనాథసోమయాజి యను కవి యుండెను. ఇతడు సూతసంహిత, బ్రహ్మోత్తరఖండము అను కావ్యములను రచించినాడు.

మహమ్మదు కుతుబుషా ఆస్థానకవియగు గణనాథుడు దోమకొండ సంస్థానమును దర్శింపబోయినప్పుడు అతని "సన్మానముతో నెదుర్కొని నమస్కృతి జేసి వసియింపజేసినారట! *ఈ గణనాథకవి ధీనిధి, సాహితియుతుడు ప్రథితయశుడు,కుతుబుషావనీశ్వరాస్థాన మహాకవీంద్రుడు, శ్రీనరసింహపండితునికుమారుడు, ధీరుడు*" అని రాజా మల్లారెడ్డి కవీంద్రుడు పద్మపురాణములో ప్రశంసించియున్నాడు.

ఆంధ్రదేశమున మంత్రి తిమ్మరుసు తరువాత ప్రఖ్యాతిచెందిన సచివోత్తములు అక్కన్న మాదన్నలు అబుల్ హసన్ తానాషా కొలువులోనివారు. వారు కేవలము మహామంత్రులేగాక కృతిభర్తలుగూడ ధీరజన మనోరంజనమనుపేర తెనాలి రామలింగకవి యొక కావ్యమును సంతరించి అక్కన్న మాదన్నలకు కృతి నిచ్చెనని స్వర్గీయ వంగూరి సుబ్బారావుగారు తెలిపియున్నారు.

ఈ సమీక్షకాలములో జరిగొండ ధర్మన్న, హరిభట్టు, పిడపర్తి బసవప్ప, చరిగొండ నరసింహకవి, ఎలకూచి బాలసరస్వతి, కాంచ్రవేటు రామానుజాచార్యులు. బుక్కపట్టణము తిరుమలశ్రీనివాసతాతాచార్యులు, చింతలపల్లి గోపాలమంత్రి, సురభి మాధవరాయకవి, మల్లారెడ్డి దేశాయి, కృష్ణమాచార్యకవి, వనపర్తి రాజాబహిరి గోపాలరావు బహద్దరు, గొలచెలమ నారాయణపండితుడు, ఎలకూచి చిన్నయ్య ప్రభాకరుడు, గద్వాల లక్ష్మీనరసింగమయ్య మొదలగు కవులు పెక్కుకృతులు రచించియున్నారు వీరలకు కుతుబుషాహిసుల్తానుతో ప్రత్యక్షముగనో, పరోక్షముగనో సంబంధముండి యుండును,

కుతుబుషాహి రాజన్యులు ఫర్మానులను ఫారసీలో వ్రాయుంచి, ఇచ్చుచు అవిషయమునే తెలుగులోను వ్రాసియిచ్చిరి. తెలుగు మండలములలో తెలుగుభాషద్వారానే రాజ్య వ్యవహారములను సాగించినారు గొలకొండనేలిన సుల్తానులు తెనుగు వారిని ఆదరించినారు. తెలుగుభాషను పోషించినారు. తెలుగు స్త్రీలను పెండ్లాడినారు.

కుతుబుషాహి రాజన్యులకు పూర్వము, కుతుబుషాహిల యనంతరము, ఆంధ్రులయెడ, ఆంధ్రభాషయెడ ఆదరాభిమానములు మృగ్యము "ఇట్టి పూర్వాపరసంబంధములతో పరికించినచో కుతుబుషాలకు *ఈవిషయములో ధన్యవాదములు సమర్పించుకొనుట* విధియైయున్నది" అని సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసినారు.

# రాధికాసాంత్వనము - ముద్దుపళని ముద్దుపలుకులు

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ

తియ్యని నుడికారపు సొంపునకును, మొత్తని తలపుకలిమికిని, కమ్మని రసప్రచురతకును భారతీయ దేశభాషాసాహిత్యములలో తెలుగు సాహిత్యము పేరున కెక్కినది.

"దేశభాషలందు" ఇట్లు "తెలుగులెస్స"గా లెక్కింపబడుటకు కొంత ముఖ్యకారణము, స్వభావసిద్ధముగా తెలుగుభాషకుంగల తియ్యందనము, మెత్తందనములే. ప్రధానముగా అజాద్యజంతభాష యగుటయు నొకకారణము. భాషాసహజధర్మమును దెలుపు జాతీయములలో, సామెతలలో మృదుమధురములైన అక్షరముల పొందికకల పదముల పొనల్ల పున్యముల తోకూడిన యతిప్రాస నియమములు మొదలగు కారణములచే మన తెలుగుభాష మృదువైనది, మధురమైనదిగ భాషాతత్త్వవేత్తలు తెలుపుచున్నారు. ఇదియే కాక సంస్కృతభాషయొక్క ప్రౌఢగంభీర మృదుమధురత్వాది సర్వలక్షణములను, ద్రావిడభాషయందలి కోమలత్వ ధర్మమును సంపూర్ణముగా స్వీకరింపగల్గినది తెలుగుబాష యొక్కటియే. కావుననే తెలుగుభాషయును, అందలి సాహిత్యమును ముగ్ధమనోహరముగా తీరుతీయములొంది Italian of the East అను ప్రఖ్యాతిని పొందగల్గినది ఇంత మృదుమధురమైన తెలుగుభాషలో ప్రాచీనులెందఱో కవిత్వముచెప్పి కావ్యము లల్లియుండగా ముక్కుతిమ్మనకును, ముద్దుపళనికిమాత్రమే ముద్దుపలుకుల ప్రోడలను ప్రశస్తివచ్చుట గమనింపదగినది.

ప్రౌఢగాంభీర్యములకు, దర్పమునకు ప్రాధాన్యముకల సంస్కృతభాషయందలి సాహిత్యకారులలో దండిమాత్రమే పదలాలిత్యమునకు పేరుగాంచెను.

ఉత్తమ కవితాగుణములలో కొన్నియైన ప్రసాదగుణము, సౌకుమార్యము, అర్ధవ్యక్తిమున్నగు సౌలభ్య ప్రధానములైన గుణములను హెచ్చుగా పాటించి

ఉత్తమకవుల పరిగణనకు చెందిన ఈ ముఫ్వురి విశిష్టత సారస్వతరంగమున ప్రశంసార్హము.

ముద్దులొలుకు కబ్బమును విరచించుటచేతనే ఆంధ్రకవయిత్రులలో పళనికి "ముద్దుపళని" యను నన్వర్థనామ మేర్పడియుండెనేమో.

కావ్యరచనకై అమె చేకొనిన కథావస్తువు రాధామాధవుల ప్రణయప్రసక్తితోడి మధుర శృంగార మగుటయు, ముద్దుల మూటగట్టు తెలుగుభాషయొక్క మెత్తని నుడికారపు సొంపులు బయల్పడు పదసముదాయమును హెచ్చుగా వాడుటయు, శృంగారరసము నందును సౌకుమార్యమునకు హెచ్చు అవకాశముకల పరకీయా విరహమునకు అధిక్యమొసగుటయు, ఆ సందర్భమునందలి సుదిమెత్తని తలంపులను సున్నితముగా వెళ్ళబుచ్చుటయు ముద్దుపలుకు కుందనమై విలసిల్లినది.

రాధికా సాంత్వనమునందలి రచనామృదులత వేఱుగావేఱుగా రూపింపబూనుట చాల హాస్యాస్పదము. కావ్యగతరచనయంతయు ప్రసన్నతకు సౌకుమార్యమునకు, మార్దవమునకు, రమణీయతకులక్ష్యమే యని చెప్పవచ్చును.

దక్షిణనాయకాధ్యక్షుడైన 'మదన గోపాలమౌళి' కావాసమైన వ్రేపల్లెయందు "*వారిధరవేణి రాధికాకీర వాణి బ్రాబలును జెలంగహరి ప్రాణపదమనంగ— రాధ పోషింపదేజరిల్లును మే రిళాదేవియనగ రాజ గోపాలు వి పట్టంపురాణి*" ప్రాణమొకయెత్తుగా ఇళాదేవిని రాధయే బాల్యమునుండియు తనయింటనే యుంచుకొని ప్రత్యేకశ్రద్ధతో పెంచినది.

ప్రత్యేకశ్రద్ధతో పెంచుటలోగూడ అంతలింత లతోకాక 'నాదుసవతిపొదువే'' యని ఇళను ముఱకముపటి యెత్తిముద్దిడి '*ఎప్పుడుచూతునో ఇది శౌరి నెనయ ననుచు*' తనకామె సవతియగునని తెలిసి, తెలిసియే '*దయనప్పుడుపొంగి యిళకు రాధాలతాంగి*' ప్రేమాతిశయముతో మఱి పెంచినది. పెంచి యిళను ఒక శుభహూర్తమున తనకుగానై తనచేతులమీదనే తన వలపుల యెకిమీనికి, రాజగోపాలున కప్పగించినది. ఇంతయు పెత్తనము కట్టుకొని చేతులపై జరిపిన రాధామణి అప్పగించి వెనుదిరిగిన మఱులిప్తయందె

> "*సొమ్ములియ్యవచ్చు సొమ్మంద మియవచ్చు*
> *నియ్యరానిప్రాణ మియ్యవచ్చు*
> *తనదువిభుని వేఱుతరుణిచేతికి నిచ్చి*
> *తాళవశమె ఎట్టిదానికైన"*

యనుచు నంతయు "*కనుమూయక*"యే వగలబొగిలి "*లోవనరి*'' నది. మగనికి మఱియొక పెండ్లియాయెనని సంబరమేకాని తనకు సవతి వచ్చినవెనుక నప్పటి దుస్సహానుభవ మెట్లుండునో తెలియని రాధ గోలతనమును, బేలతనమును నీ పద్దెమునందెంత ముద్దుముద్దుగనో ముద్దుపళని వర్ణించిచూపినది. ఈపద్యమున నచ్చుపడినది మానినీ స్వర్తాహృదయమైనను నది ఎంత సుకుమారముగా నందగించినదో రసజ్ఞులే ఎఱుంగుదురు.

రాధికాసాంత్వనమున మురిపెము లొలుకు పాత్ర రాధ ముంజేతిచిలుక. నిజముగా నిందలి చిలుక పలుకులు కులుకులొలుకు చిలుకపలుకులే రాధికయొక్క పవిత్రప్రణయమునుగూర్చి దక్షిణనాయికాధ్యక్షుడైన శ్రీకృష్ణునితో '*నాతిచేతి చిలుక*'

> '*లేమకును నీవు పొత్తునలేనియట్టి*
> *వాసరము లెల్ల శ్రీహరి వాసరములు*
> *మానినికి నీవు ప్రక్కనులేనియట్టి*
> *రాతిరెల్లను శివరాత్రి యరయ*''

నని సిఫారసుచేసినది. అంతేకాదు కుంభకునింట '*తమయక్కజైనచాలు*' మగువలను మఱచు మగవారిలో నొకడుగా నిందువర్ణింపబడిన శ్రీకృష్ణునిగూర్చి

రాధకు ఒకయుముండునట్లుగా ఎన్నెన్నో చెప్పినది. కు బకుని యింటినుండి రాధికామణిసౌధమునకు తిరిగి వచ్చినపుడు చిలుక

"గోపాలసామిగారా
కాపుర మేపురము చాలకాలమునకబో
మీపాదయుగము గంటిమి
చాపల్య ముపేరనున్న కాంతముడిఁజెన్॥

అని కొంటెతనపు కొమిరెము కొసరుకొనగా తనస్వామి కి రాధకు వకాలతు పల్కినది. ఇందలి చిలుక పలుకుల నయగారమును తెలిసికొని సంతసింపవలసి నదే

పళని భావసౌకుమార్యపు పసయంతయు ద్వితీయాశ్వాసమునందలి "గోపగోపికా సదయు"డైన శ్రీకృష్ణపరమాత్ముని రూపసౌభాగ్యమును తలచితలచి మరులుతో రాధ అరిమురియై కళపెళ గ్రాగిపోయిన ఘట్టమునందును, తృతీయాశ్వాసమునందలి రాధా విరహబాధా ఘట్టమునందును, తేటతెల్లముగా గానం బడును.

"పద్మాక్షుడు యవాను బవళించు పడకయి
ల్లని కనుల్కటికచీకటులు గమ్మ"
"వెన్నెల చిచ్చులు వెదజల్లురేరాజు
కిరణంపుగుంపుల సారిగి సారిగి"
"మరులుకొని చాన తనదునెమ్మనములోన"

రాజగోపాలుని రమణీయ తనూ విలాసము నిట్లుభావించినది. అందును మునుకొని ముందుపడు శృంగార మధురలాలసయే

"రాసి జేసిన శృంగారరసమనంగ
జనులనుబోచు కరుణాతిశయమనంగ
నొకటియైనట్టి మన్మథాయుతమనంగ
బొలుచు గోపాలరూపమ్ము పొగడవశమె"

పొగడ వశముకాని గోపాలుని దివ్యశరీరమున శౌరి శ్రీపాదమ్ములు

"తమ్ములు శౌరిశ్రీపా
దమ్ములుమోదమ్ములొదవ దమ్ములనెల్లన్
తమ్ములనందప మళినా
దమ్ములువేదమ్ములు నినదమ్ములు"

సల్పినవట మదనజనకుని చుబుకము

"మారు డధరామృతంబెంపు జాఱినీక
కొరిపెట్టిన నీలంపుగోరయనగ
గొల్లచెలియలసొమ్ముగా గొనుచుమదనరు
మదనజనకుని చుబుకంబు మధురమొదవె"

సరిలేని శౌరినాసిక :

"సరిలేనిశౌరినాసిక
స్మరశరంబుగాదె మణిదాలితుదన్
వరముక్తాఫలమేటికి
వెఱవగు తిలపుష్పతుహిన బిందుపురీతిన్"

శ్రీకృష్ణునినాసిక తుదనుండ అణిముత్తెము సువ్వుపువ్వు చివరనున్న మంచుబిందువువలె శోభించినదట, ఎంత మనోహరమైన వర్ణనము !

ఇక నాధూర్తగోపాలుని "మాటలు, ముద్దుపద్దులును, మక్కువటెక్కులు," వీనికంటె కాంత యలిగినపుడెల్ల "మొక్కుసొక్కులు"ను వర్ణింప నలవికాని వియె. రసికజన మనోభిరాముని—

"ఆ నడ లామెఱుంగు తొడ
లా రసికత్వము లావిలాస మా
మేనిమెఱుంగు లామొలక
మీసపురంగులు నాబెడంగు లా
సూనశరాసన ప్రతిమవరి
కొధన లామధురస్మితంబు లా
పూనికచొప్పు లావలుకుపోడిమి... ... ..."

అద్భుతమైనది. నిజముగా ఇచట పళని పలుకు పోడిమి పోగారు పనిపోహిళింపే.

కావుననే శృంగారప్రణయ రసాధిదేవతయైన గోపాలచక్రవర్తినే వలచి వలపించుకొన్న ముద్దరాలు

రాధికాకాంత యాతని యెడబాటు నోర్వలేక పెను వలపు కాకలబడి పరవశయై

"విడుదుబంధుల, మగనిని;
విడుదు ధనధాన్య గెహవిభవములెల్లన్,
విడుదు ప్రాణము లొడలన్,
విడంగాజాల హరిని వేయననేలా"

యని వీడజాలని అనురాగబంధముతో వగల పొగిలి పొరికిలి, తనకునుగల జన్మజన్మాంతర సౌహృదమును, అవినాభావ సంబంధమును, తమ ఒకరొకళ్ల జన్మ లందుకల పరమరహస్యమును పనవి పనవి గోముగా విలపించినది. ఆ విలపించుటయందును సౌకుమార్యము వీడని రచనా సౌందర్యము మనలను లాగివైచెను.

"అదరెడుమోవి, తొట్రుపడు యానము, గుబ్బెల జారు పైటయున్
జెదరినముంగురుల్, మిగుల జింతిలుచిత్తము, వాడుమోముతో
బొదలెడువాంఛ, గద్గదిక, మోడ్పుకనుంగవ, మీఱుమారుచే
బెదరుచులేచి యా మెలత వెన్నునిపై దగుమచ్చరంబుచన్"

"పొరలును, గొట్టుకాడు వెతబొందును హాయను..." సహజభావస్ఫూర్తితో చదువువారు సహృదయము రాధిక విరహబాధాగాధకు జాలిబడునంత ముగ్ధరమణీయముగా ముద్దుపళని రాధ విరహమును వివరించినది.

సరి అగ్గలపు విరహము నోర్పుటైనది. అతిశయపువలపు కాకలకు "అంతిమస్వస్తి వాచకమైనది రాజగోపాలస్వామి రాధను బ్రతిమలాడు కొనగా ఏతెంచినాడు ఇక చూడుడు, రాధ కస్సుమన్నది. బుస్సుమన్నది. అంతపఱకు వేగిన వలవంతల సోకులేమైనవో కుబుసంబునూడ్చిన మహాభుజగాంగననా మునుంగు తెప్పున బెనవేసి లేచి ముడిబొమ్మ లెసంగ..." "కావిమోవదర గామినిపల్కెదురాపకోపయై" ...

"ఎవ్వయపిల్చిరిచ్చటికి నెందుకువచ్చితి వేమి కార్య మె
న్నెవ్వాని. నీవెవండవిక నెవ్వరికెవ్వడు దేని కేది మీ
జవ్వనివిన్న రవ్వలిడు జాల్తడవాయెను వచ్చి, లేచిపో
నవ్వెదరెల్లవారలును నన్నును, నిన్నును గోపశేఖరా"

"నిలుకడసున్న, తాల్మినహి, నేస్తముదబ్బఱ, మాటపద్దులే,
వలపుహుళిక్కి, యాన లుసి, వాఖ్యలు పైపయి మేల్మి, నీదు నీ
తులు మెఱమెచ్చు, లాదరణ దూఱు, దయల్సలు, నమ్మవచ్చునే
యిలమగవారి, దన్మహిమ లెన్నగశక్యమె యెందులన్హరీ"

యని కచ్చెయుట్టిపడగ స్వభావ మధురముగ పిచ్చలించినది—"నలువశిరము మెట్టినను నల్లని వానిని నమ్మగూడదు." నేను నమ్మి చెడితినని గొల్లుమన్నది—

'ఏమనిచేరెనోచెలిమి యింతరవంతయు జింత సేయకే
వేమఱు నీదుపాలబడి వేడి పెరంగిన నాటి నుండియున్
బాములెకాని సౌఖ్యమొక పాటనైన నెఱుంగ నైతిరా
రామునిబొందు రామ క్రియ రామునిసోదరుడౌదు వన్నిటన్'

అని రామను గాసివెట్టిన రాముని సోదరుడైన లీలా విగ్రహుని. మాయావిలాసుని కృష్ణుని వలచుటలో తన తెలివిమాలినతనమును గుఱుతువెట్టి చూపి మతి విరవిరలాడినది—గరగరలాడినది— 'వలపు పగవారి కైన వలదు కృష్ణ' యని ప్రణయతత్వవేత్తయై ప్రణయ తత్త్వరహస్యమును వెళ్ళగ్రక్కినది. "చులకనజేసినన్

వలపు చూరలుపుచ్చిన, వీడనాడిన నీకేమి వైకుంఠ మొలికినది" యని యింతకోపమునకును కారణభూత యంతరంగమునందలి యపేక్షలో, నిముడక బయట పడునట్లుగా "వనజాక్ష యింతచేయగ మనసెట్లొప్పెను?" అని రాయిడిచేసి, రవ్వపెట్టి 'అందపు బైటకొంగు వదనాబ్జముపైనిడి' శౌరి చూచునట్లుగా ఇందు నిభాస్య ఎలుగెత్తి ఏడ్చినది—ఇంతఅల్లరి చేసినను ఆగముచేసినను తడియారని తళుకు సొంపుల తోనే రచన అందగించినది.

ముఖ్యముగ ముద్దుపళని కైతయందలి సామెతలు జాతీయములు కడుంగడు కమ్మనైనవి. 'తిరిపెం బెత్తెడువానికి పెనుగుంగూడేమి బ్రాంతి విధుబింబ ముఖీ, 'కొన్నంగడి లోపలనే యన్నన్నా మాఱుబేర మగునే చెలియా' 'ఈకతోక శ్రీకృష్ణుని మాటలు పొలతినమ్మి నానబోసికొనియె' 'తగులుధాకను మేళమగపడ్డ దాళముల్' 'గట్టుచేరినంత బుట్టివానికి బొమ్మ, గట్టుసామ్య మాయె గదవె చెలియ' "ఎల్లవారికి శకునంబులెల్ల బలికి బల్లితాబోయి తొట్టెలో బడినరీతి." తెలుగుబాస తియ్యందనము, దీటుతనమును రెట్టింపజేసిన సామెతలయింపు నూరురెట్లగునట్లుగా ముద్దుపళని వాడియున్నదని పై ప్రయోగములు చెప్పుచున్నవి.

ముద్దైన రాధికముగ్ధసుందర ప్రణయమునకు అన్ని విధముల అర్హమగునట్లుగ, తెలుగుభాషా మార్దవము, రచనావిధానమునందలి సౌందర్య, సౌకుమార్యముల లోతులుతెలిసి యాపాత మధురత చిప్పిలునట్లుగ ముద్దుపళని ముద్దుపలుకులు పచరించి తెలుగు కైతల తల్లికిబట్టిన కర్పూరపుటారతిగ రాధికా సాంత్వనము రచించి యర్పించినది.

# విస్మృత రాజకవి – బిజ్జుల తిమ్మభూపాలుడు

శ్రీ గడియారము రామకృష్ణశర్మ

ఆంధ్రోక్తి మయప్రపంచమున సాహిత్య పోషకులై మహాకావ్యకర్తలైన మహారాజులెందరో వెలసినారు. అట్టి కవిరాజశిఖామణులగు నన్నెచోడదేవ, గోనబుద్ధావనీపాల, శ్రీకృష్ణదేవరాయ, కోమటి వేమారెడ్డిభూపాల, సురభి మాధవరాయ, రఘునాథనాయక నృపాలాది సాహితీ సమరాంగణ సవ్యసాచుల కే మాత్రము తీసిపోని రాజకవి బిజ్జుల చినతిమ్మభూపాలుఁడు. ఈ మహారాజు సంస్కృతమున మురారికవి వ్రాసిన అనర్ఘరాఘవ నాటకమును ఆంధ్రమున శ్రవ్య కావ్యముగ సంతరించినాడు. ఈ రాజకవి అలంపూరు సీమను పరిపాలించెను.

కృష్ణా తుంగభద్రానదులచే పరివేష్టితమైన ఈ అలంపూరుసీమ నేఁడు మహబూబ్‌నగర్ మండలము నందొక తాలూకా అయియున్నది. ఈ సీమకు రాజధాని యగు అలంపూరు తుంగభద్రా తీరమున దక్షిణ కాశీ క్షేత్రముగ ప్రసిద్ధిబొందిన ప్రాచీనాంధ్ర నగరము.

కృతి భర్త :

ఆంధ్రానర్ఘ రాఘవము ప్రాగుటూరి రామేశ్వరస్వామి కంకిత మొసగబడినది. ప్రాగుటూరు అలంపూరుతాలూకాకు చేరిన కృష్ణాతీర గ్రామము. ఇదొక బలిష్ఠదుర్గము. అందు సుందరశిల్ప విరాజితములైన దేవాలయములు నేటికిని చూపర నాకర్షించుచున్నవి. రామేశ్వరాలయము చాల ప్రాచీనమైనది. ఇందలి ముఖమంటప స్తంభములపై కల్యాణిచాళుక్యసార్వభౌముఁడగు త్రైలోక్యమల్లుని కాలపు శాసనములున్నవి. బిజ్జులవారికి ఈ రామేశ్వరస్వామి ఇలువేల్పుగ నుండెను. బిజ్జుల వంశీయులలో పూర్వులు శైవులు. నేఁడు "పల్లెపాడు" లో ఉన్న ఈవ-శమువారు వైష్ణవమును స్వీకరించినారు. చినతిమ్మ భూపాలుని కాలమునాటికి వీరు ప్రాగుటూరి రామేశ్వరస్వామికిని, అలంపూరు బ్రహ్మేశ్వరస్వామికిని భక్తులై యుండిరి.

బి జ్జు ల వం శ ము :

ఈ వంశమున కీపేరెట్లు వచ్చెనో తెలియుట లేదు. కల్యాణిసామ్రాజ్యము నాక్రమించిన కలచురి బిజ్జలునకును ఈ వంశమునకునుగల సంబంధమెట్టిదో తెలుపగల ఆధారములు కానరాలేదు. కలచురి బిజ్జలునికుమారుఁడు భుజబలమల్ల సోమేశ్వరుఁడు అలంపూరుసీమ నేలినట్లు ఇచటి శాసనములు చెప్పుచున్నవి. కావున వీరు బిజ్జలుని సామంతులో కుటుంబములోనివారో అయినందున బిజ్జులవారై యుండవచ్చును. అనర్ఘరాఘవమునందు అవతారికలో నీ వంశము వర్ణింపఁబడినది. మోటాటి రెడ్డి శాఖకు చెందిన బిజ్జులవంశములో దాదభూపాలుఁడు పుట్టెను. ఇతఁడు మూలపురుషుఁడు. కృతికర్తయగు చినతిమ్మభూపాలుఁడు అయిదవ తరమువాఁడు. ఇతని తాత పెదతిమ్మభూపాలుఁడు అలంపూరు రాజదానిగా, కందనవోలిదేశము కాణయాచిగా పాలించి ప్రఖ్యాతి నందినవాడు. గోలకొండనవాబు అబ్దుల్లాకుతుబ్షాహచే పెదతిమ్మభూపాలుడు సన్మానింపబడెను. ఆతనికి సర్‌నాడగౌడు, సర్‌దేశాయి, నాడకంణము అను బిరుదములుకలవు. చినతిమ్మభూపాలునకు పినతండ్రి వరుసవాఁడగు కొండారెడ్డి మహావీరుఁడు. ఇతనికి గండరాదిత్య, గండభేరుండ, అదిగర్భేశ్వర, ఖడ్గనారాయణ, గాయగోవాళగేళాధిరాయ బిరుదములుండినట్లు అనర్ఘరాఘవ కావ్యావతారిక చెప్పుచున్నది. ఈ కొండారెడ్డియే కర్నూలునవాబులకు చిక్కి యొక బురుజులో బంధింపబడియుండెను. నేఁటికిని కర్నూలు "బస్సుస్టాండు"లో నీ కొండారెడ్డిబురుజు కానవచ్చును. ఆ కాలమున తుంగభద్రానది కీవలిప్రక్కనున్న అలంపూరుసీమ గోలకొండ కుతుబ్షాహీలకును, ఆవలి ప్రక్కనగల కర్నూలుసీమ బిజాపురపు ఆదిల్షాహీలకును, లోబడియుండుటవలన గోలకొండ సామంతులగు బిజ్జులవారును, బిజాపుర సామంతులగు కర్నూలు నవాబులును తీవ్రయుద్ధములు చేసికొనుచుండిరి. 1687 సంవత్సరమున నీరెండురాజ్యములును మొగల్ చక్రవర్తి ఔరంగజేబునకు లొంగిపోవుటచే ఆ తరువాత బిజ్జులవాడ కొన్నాళ్ళు మొగలు సామంతులుగను ఉండిరి.

చి న తి మ్మ భూ పా లు డు :

అనర్ఘరాఘవ కృతికర్త చినతిమ్మభూపాలుఁడు బచ్చమ్మ కృష్ణభూపాలురకు పుత్రుఁడు. వనపర్తిసంస్థానపతియగు జనుపల్లి వెంకటరెడ్డికి దౌహిత్రుఁడు సుప్రసిద్ధ విద్వాంసుఁడగు అష్టభాషా గోపాలరాయలకు మేనల్లుడు. గోపాలరాయఁడు వనపర్తినేలిన రాజు. సంస్కృత ప్రాకృతములలో నపార పాండిత్యముగల మహాకవి. సంస్కృతరూపకములలోఁ బేరెన్నికఁ గన్న శృంగారమంజరీ భాణమును రచించినవాఁడు. అతనికి కవిసార్వభౌమ బిరుదముకలదు. భాణాంత్య గద్యలో సమస్తవిద్వజ్జన జేగీయమాన నిరవద్య నిఖిల విద్యా వైశారద్యుఁడననియు, దిశదిశా సీమంతినీ సీమంతముక్తా కలాపాయమాన యశఃకలాపుఁడ ననియు వ్రాసికొన్నాడు. ఇతని మేనల్లుఁడగు బిజ్జుల చినతిమ్మభూపాలుని విద్యాభ్యాసాదికమును గూర్చిన వివరములు తెలియవు. కాని కావ్యావతారికలో *'నిస్సమసారస్వత నిర్మలామృతఝుర జాగ్రత్తరంగాబ్ధి పేరయమహాకవితేజరిల్లె విబుధప్రస్తూయ మానోద్ధతిన్'* అని ప్రస్తుతింపఁబడిన పేరయకవి ఇతని విద్యాగురువైనట్లు ఊహింపవచ్చును. ఈ పేరయకవి పౌత్రుడు కృష్ణకవి తనకు కవిత్వసహాయము చేసినందుకు *"అశేషవిశేషి వైదుష్యప్రతిభ కరస్థలామలకభాస్వరమై తనరారు బుద్ధిమే"* అని తెలిపికొనెను.

కా ల ము :

తిమ్మభూపాలుఁడు గోలకొండ కుతుబ్షాహీ నవాబులలో చివరివాఁడగు అబుల్‌హసన్‌కుతుబ్షాకు సామంతుఁడుగ పాలించెనని వనపర్తి చినగోపాల

రాయనికి పై నవాబొసఁగిన 'సనదు' వలన తెలియుచున్నది. అష్టభాషాగోపాలరాయఁడు చనిపోగా అతని ఔరసుఁడు చిన్నగోపాలరావునకు అబుల్‌హసన్ తానాషా 1087 హిజరీ సంవత్సరమున ఈసనదు నిచ్చెను అందు చిన్నగోపాలరావు మైనరైనందున అతని మేనత్తకుమారుఁడగు బిజ్జుం చినతిమ్మారెడ్డిని పోషకుఁడుఁగ. రాజ్యపాలనా సహాయకుఁడుగ నేర్పాటు చేసినట్లు వ్రాయబడినది. పై హిజరీవత్సరము క్రీ. శ. 1676 సం.తో సమానమగును. అబుల్ హసన్ కుతుబ్షా తానాషా బిరుదముతో 1672-1687 వత్సరములమధ్య గోలకొండ నేలిన కుతుబ్షాహీనవాబులలో కట్టకడపటి నవాబు. ఇతని కాలముననే గోపన్న రామదాసుఁడై భద్రాద్రిరామాలయమును గట్టించెను.

కావ్యావతారికలో చినతిమ్మభూపాలునిచే పరాభూతులైన ముగ్గురు ప్రత్యర్థులు పేర్కొనబడినారు వారు (౧) సిద్దియంబరు. (౨) జోహరు మసూద్ ఖాన్. (౩) పికిలి చెన్నప్పనాయకుఁడు అనువారు. వీరెవరో పరిశీలింతము

(౧) సిద్ధియంబరు: ఇతఁడు తిమ్మభూపాలుని ప్రత్యర్థులలో నగ్రగణ్యుఁడు, బీజాపుర ఆదిల్షాహీల సామంతుఁడై కర్నూలు నేలిన నాలుగవ నవాబు. అరవీటి వంశీయుల తరువాత క్రీ శ. 1613 సం. బిజాపుర సేనానియగు అబ్దుల్‌వహాబ్ కర్నూలు నాక్రమించి పాలించెను. ఈ అబ్దుల్‌వహాబ్ తరువాత చిన్నవహాబ్, మల్లిక్‌సాహెబ్, సిద్దిసాబ్ మొదలైన 13 గురు నవాబులు వరుసగా పాలించినట్లు "కర్నూల్ మ్యాన్యుయల్" చెప్పుచున్నది. ఇతఁడే తిమ్మభూపాలునిచేఁ జంపబడినవాఁడు. సిద్దిసాబు కర్నూలును 1654–1668 సంవత్సరముల మధ్య పాలించినవాఁడు.

(౨) జోహరుమసూద్‌ఖాన్: ఇతఁడు పై సిద్దిఅంబరు జ్ఞాతికావచ్చును. 1660 ప్రాంతమున మహారాష్ట్రవీరుఁడగు ఛత్రపతి శివాజీ శ్రీశైల యాత్రకు వచ్చినపుడు కర్నూలుసమీపమున నెదుర్కొని యుద్ధముచేసిన బిజాపుర సేనానులలో "సిద్ది జోహారు" ఒకఁడు ఇతనిపేరనే కర్నూలునకు అరమైలుదూరమున హంద్రీనదిమొడ్డున జోహరాపురము కట్టబడినది. దానినిపుడు జోళాపురమనుచున్నారు.

(౩) పికిలిచెన్నప్పనాయకుఁడు: ఇతఁడు పత్తికొండ తాలూకాలోని కోటకొండను పాలించిన పాళెగాడు. ఇతని తాత గోనెగండ్ల వెంకన్న 1621 సం॥ ప్రాంతమున ఉళింద కొండలో కావలికాడుగ నుండెను. పికిలి చెన్నప్పమనుమఁడు మాదప్పనాయకుఁడు 1676 సంవత్సరమున బ్రాహ్మణులకొక అగ్రహారమును దానమిచ్చినాఁడు. ఆ దానపత్రమున పికిలివారి వంశము వర్ణింపఁబడినది. పికిలిచెన్నప్ప బీజాపుర నవాబులకు లోబడిన పాళెగాఁడు. కావున సిద్దియంబరుతోగలిసి తిమ్మభూపాలునితో పోరాడి మరణించెను.

చినతిమ్మభూపాలుఁడు దీర్ఘకాలము జీవించి పుత్రపౌత్రులతో ఆనందము ననుభవించెనని కావ్యావతారిక చెప్పుచున్నది. వీని నన్నిటిని పరిశీలించిన తిమ్మభూపాలుఁడు 1640–1720 ప్రాంతములలో నుండెననియు, అనర్ఘరాఘవము చివరిదినములలో రచింపఁబడెననియు చెప్పవచ్చును.

**అనర్ఘరాఘవము:**

ఈ ఆంధ్రకావ్యమును మొదట కనుగొని రెండాశ్వాసములను ప్రకటించి ఆంధ్రలోకమునకు పరిచయముజేసిన గౌరవము సుప్రసిద్ధ విద్వాంసులగు క్రీ. శే. మానవల్లి రామకృష్ణకవిగారికి చెందుచున్నది. తరువాత పూర్తిగ్రంథమును పరిష్కరించి శుద్ధపాఠములతో క్రీ. శే. అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

ప్రకటించిరి. ఈ ప్రౌఢకావ్యమును చక్కగా ముద్రించి లోకమున కందించిన ప్రామాణిక పండితులు శ్రీ శాస్త్రిగారికి ఆంధ్రులు ఋణపడియున్నారు.

ఈ కావ్యము పిల్లవసుచరిత్రయని పిలువబడు శకుంతలాపరిణయ, చంద్రికాపరిణయములవంటి ప్రౌఢకావ్యములతో తులదూగుచు ఆంధ్రవాఙ్మయమునకు నూత్నశోభను గూర్చుచున్నది. కావ్యావతారిక లోని వంశవర్ణనమునందు పలుతావుల వసుచరిత్ర పద్యము లనుకరింపబడినవి. అది ఇతనికి రామరాజభూషణునిపైగల విశేషాభిమానమునకు నిదర్శనమని చెప్పవచ్చును.

"బహుమహీధరకూటపటలి పొలుగజేసె
గంధాంధసింధుర ఘటలనెల్ల"— వసుచరిత్ర
"పరధరాధీశ్వరు పాదంబులెనయించె
నాత్మీయకుంభినీ నాళినెల్ల"— అనర్ఘరాఘవము
"నిరతంబుదుర్మార్గ నిరతులౌ తురకల
సతతసన్మార్గ సంతతులఁజేసె"— వసుచరిత్ర
"పటుమహాసవపూర భరితులౌ తురకల
స్ఫుటమహాసవసారభోక్తలుగను-అనర్ఘరాఘవము
"కావుకావనువారిఁగదిసి తుంగపయోధ
రరదాంతరంబు చేరంగనీదు"— వసుచరిత్ర
"పోరుచేసి కరంబునోరెండి పడువారి
జేరడు తన పయోధారఁగూర్చి"— అ-రాఘవము

దిఙ్మాత్రముగ కొన్ని చూపఁబడినవి.

ఈ కావ్యము సంస్కృతమున బాలవాల్మీకి బిరుదాంకితుఁడగు భట్టమురారి కవిశేఖరుఁడు ప్రౌఢముగ రచించిన అనర్ఘరాఘవ నాటకమునకు ప్రబంధ రూపమున చేయబడిన చక్కని తెలుఁగుసేత. పూర్వ కవులవలెనే ఇతఁడును దృశ్యకావ్యమును శ్రవ్యకావ్యముగ అనువదించినాఁడు. తిమ్మభూపాలుఁడు సంస్కృతాంధ్రములలో అపారపాండిత్యముగలవాఁడు. కావ్యరచనలో తనకు కృష్ణకవి విశేషముగ తోడ్పడెనని చెప్పుకొన్నాడు.

తిమ్మభూపాలునకు రామాయణ కథపైనను, మురారికవిమీదను విశేషప్రీతి గౌరవములున్నట్లు కావ్యావతారికలోని ప్రశంసలు చెప్పుచున్నవి. సంస్కృతమున రామాయణేతివృత్తముగల కావ్యములెన్నియో యున్నప్పటికిని మురారి కృతి నెన్నుకొనుటలో తిమ్మభూపాలుని వైదుష్యము-ప్రత్యేకత వెల్లడి యగుచున్నది.

మురారికవి :

మురారికవి తక్కిన కవులకంటె ఘనిష్ఠపాండిత్యము గలవాఁడు. అతని నాటకము శబ్దకాఠిన్యమునకును అర్థ గాంభీర్యమునకును ప్రసిద్ధికెక్కినది. గూఢార్థ శబ్దప్రచుర మగుటవలన నీనాటకము అంతంత మాత్రము పాండిత్యముగలవారికి అర్థము కాదు. నాటకోచితములైన కొద్దిమార్పులు కూర్పులుతప్ప అంతయు వాల్మీకి ననుసరింపబడినది. విశ్వామిత్రుఁడు యాగరక్షణకై రామలక్ష్మణులను గొనిపోవుట మొదలు రావణ వధానంతరము శ్రీరామాదులు అయోధ్యచేరి పట్టాభిషేకము జరుపుకొనువరకు గల కథ సంగ్రహింపఁబడినది. మురారి పాత్రలన్నియు చక్కగ తీర్చబడి విలక్షణముగ, పాండిత్యపూర్ణముగ మాటలాడును. కథామధ్యమునందలి ప్రకృతివర్ణనలు సుందరముగ చేయబడినవి. అపూర్వపదములను క్లిష్ట వ్యాకరణ ప్రయోగములను వాడుటలో మురారి సిద్ధహస్తుఁడు. ఇతని శైలి జటిలము, అటనట గానవచ్చు, ప్రసాదగుణ మపూర్వమైనది. తిమ్మభూపాలుఁడు తన అనువాదములో మూలమును సమర్థవంతముగ అనువదించినాఁడు. ఇతఁడును శబ్దశాస్త్ర పారంగతుఁడనుటకు క్రిందిపద్యము నుదాహరణముగ గ్రహింపవచ్చును.

"ఇనదబ్జంబు,ధనంజయచ్ఛరము,వా ణీశద్గి
రీశంబు. కో
కనదత్కైరవ,యబ్జరాగదుడురా ట్కాంతంబు,
కాశ్మీరజ
ఘృనసారంబు, సురాలయద్రజ తగో త్రం
బయ్యె బ్రహ్మాండ మా
చినతిమ్మ క్షితిపాలకొండ విభు నక్షిణ్ణప్రతా
పంబునన్
(౧ ఆ–౫౩ ప)

**అనువాదపద్ధతి:**

పూర్వకవులవలె స్వేచ్ఛానువాదము సేయక తిమ్మభూపాలుఁడు భట్టమురారి నాటకమును యథా మాతృకముగ ననువదించినాఁడు. మూలమువలె. అనువాదముగూడ ప్రౌఢముగ నిర్వహింపఁబడినది. తిమ్మ భూపాలుని అనువాదపద్ధతి తెలియుటకై కొన్ని యుదాహరణ లొసంగఁబడినవి.

"దత్తేంద్రాభయదక్షిణాద్భుతభుజా సంభార
గంభీరయా
త్వద్వృత్త్యా శిథిలీకృతత్రిభువన త్రాణాయ
నారాయణః
అంతస్తోషతుషారసౌరభమయ శ్వాసానిలా
పూరణ
ప్రాణోత్తుంగభుజంగతల్పమధునా భద్రేణ
నిద్రాయతే" (మూలము)

మ॥ "అభయం బింద్రునకిచ్చు దావక భుజా
హంకారవృత్తిన్ జగ
త్త్రభిరక్షా నిరపేక్షుడై హరి మనో హర్షాతి
శైత్యోరు సౌ
రభ నిశ్వాస సమీరపారణ పృథు ప్రద్యోత
వాతాశన
ప్రభుశయ్యన్ సుఖనిద్రఁజెందెడుఁ బయః
పాథోధిమధ్యంబునన్" (1–197)

"ఉద్దామ ద్యుమణి ద్యుతివ్యతికర
ప్రక్రీడ దర్కోపల
జ్వాలా జాల జటాలజాంగల తటీ
నిష్కూజ కోయష్టయః
భౌమోష్మప్లవమాన సూచికిరణ
క్రూరప్రకారాదృశో
రాయుష్కర్మ సమాపయంతి ధిగమూ
ర్మధ్యాహ్నఘాన్యాదిశః॥"

మ॥ పరుషోద్యద్ద్యుమణి ద్యుతివ్యతికర
ప్రక్రీడదర్కోపలాం
కురితజ్వాల జటాల జాంగల రట
త్కో యష్టులై భౌమని
ర్భర బాష్పప్లవమాన భాను కిరణో
గ్రప్రక్రియన్ నేత్ర తా
మరసంబుల్ దరికొల్పెడిన్ దశదిశల్
మధ్యాహ్న ఘస్రంబులై"

మూలమును క్లుప్తముగ ననువదించిన విధానముకూడ చక్కగా నున్నది.

"దృష్టస్సాక్షాదసురవిజయీ
నాకినాం చక్రవర్తీ
మాత్స్యో న్యాయః కథయతి యథా
వారుణీదండనీతిః
పాతాలేంద్రాగహే భయమథా
స్త్యేవ నిత్యానుషక్తం
తన్నః పుణ్యైర జని భవతా
వీర రాజన్వతీ భూః"

"కం॥ హరి సాక్షాదసుర విజయి
వరుణనయము మాత్స్యనీతి వక్కాణించున్
కరమహిభయ మహిపురి ను
ర్వర నీచే దనరె వీర రాజన్వతియై"

పెద్దదగు మందాక్రాంతావృత్తమునందలి భావమును చిన్నదగు కందపద్యమున నిమిడ్చి యనువదించుట రచయిత కవితాప్రాగల్భ్యమును సూచించును.

**అనుకరణములు :**

ఆటనట తిమ్మభూపాలుఁడు అనర్ఘరాఘవమున తనకు ముందుండిన పోతన అల్లసాని పెద్దనాదిమహాకవుల శైలులను భావములను అనుకరించిన పట్టు

లును గలవు. ఈ అనుకరణలు పేలవముగా నున్నవి స్వతంత్రముగ రచించిన పద్యములు మృదు మధుర పదగుంఫితములై యున్నవి. మచ్చునకు ఈ పద్యమును చూడుఁడు.

"అపురి నింపు నింపు మల
యాచల చంచల కుంజపుంజ ర
ధ్యాపరభిల్ల పల్లవ ప
దాస్తన శస్త నవాంక సాంకవ
శ్రీపరిణీత శీతల ఝు
రీతతరంగ తరంగ రంగ సం
దీపిత కంజగుంజదళి
నీరవ సారవ వాతపోతముల్" (1-164)

పెద్దన ననుకరించి ఓ రఘురాజవంశ కలశోదధి కల్ప మహీజ! అను పద్యము వ్రాయబడినది. పోతనశైలి ననుకరించి

"తనవెంటన్ రఘురాజ నందను లమం
దస్ఫూర్తి నేతేర న
య్ముని చంద్రుండరుదెంచి కాంచె నెదుటన్
మూర్ధాభిషిక్తచ్ఛటా
ఘనకోటీరమణీ ఘృణిలిఖిత రం
గచ్ఛాత్రత విస్తారమున్
జనకాధీశు జగా హజారము దివ్య
శారంగ శృంగారమున్"

అను పద్యమును వ్రాసినాఁడు. అనర్గళధారతో పద్యమును నడపుటలో తిమ్మభూపాలునకు నైపుణ్యము గలదు.

17 శతాబ్దమునందలి దాక్షిణాత్యకవుల అసభ్య శృంగారములతో, అప్రౌఢానుకరణములతో, అసహ్యకర వర్ణనలతో విసుగుచెందిన తెలుఁగువారికి ఉత్తమ కథాసంవిధానము, రమణీయ శబ్దవిన్యాసము, అర్థగాంభీర్యము, మనోహరశైలీవిశిష్టము అయిన అనర్ఘ రాఘవ మహాకావ్యము ననుగ్రహించి ఆంధ్రప్రబంధ భారతి నలంకరించిన బిజ్జుల తిమ్మభూపాలుఁడు చిరస్మరణీయుఁడు.

# మధురకవితాతరంగిణి—శ్రీకృష్ణలీలాతరంగిణి

శ్రీ వాసిలి వేంకటలక్ష్మీనరసింహారావు

శ్రీకృష్ణతత్త్వ ప్రతిపాదకములయి సంస్కృత సాహిత్యమున మధురకవితా సుధాధారలను వర్షించిన మనోహర రచనములలో లీలాశుకుని శ్రీకృష్ణ కర్ణామృతము, జయదేవుని గీతగోవిందము, నారాయణ తీర్థుని శ్రీకృష్ణ లీలాతరంగిణి చిరస్మరణీయములు. ఈ ముప్వురు మహాకవులకు సంబంధించిన చిత్రమైన యొక జనశ్రుతియు గలదు. లీలాశుకయోగీంద్రులు కృష్ణకర్ణామృతధారలు కురిసియు భగవత్సాయుజ్యము పొందలేక మఱుజన్మమున జయదేవకవియై జన్మించెననియు, ఆ జన్మలోకూడ రాధామాధవ తత్త్వమును మధురముగా గానముచేసియు భగవదైక్యము చెందలేక తరువాతిజన్మమున నారాయణ తీర్థయతియై జన్మించి శ్రీకృష్ణలీలల నుత్తరంగిత హృదయముతో భజనముచేసి భగవంతునిలో గలిసెననియు ఈ జనశ్రుతి సారాంశము. కృష్ణభక్త్యావిష్టము లయిన యీ ముప్వురి కవితాత్మలలో గల సామ్యము నీ జనశ్రుతి చెప్పక చెప్పుచున్నది.

ఈ మహాత్ములు ముప్వురును శ్రుతిస్మృతి పురాణసంహితా మహాకావ్యార్థములను ఆత్మగతము గావించుకొని మనోహర కవిత్వమును కైవసముచేసికొనిన సత్కవులు. లీలాశుకుడు జీవితమునగల రక్తి విరక్తులను చవిచూచిన యోగీంద్రుడు. కృష్ణాఖ్య తేజమే 'నావాఙ్మయజీవిత' మని కవితాగానము చేసిన ముముక్షువు. జయదేవుడు '*శ్రీవాసుదేవ రతికేళి కథాసమేత*' మయి సలక్షణమయిన సత్ప్రబంధమును సృష్టించిన మహాకవి. కవి కలుష నాశకమయిన హరి విపరీత సురతమును మధుర కోమలకాంత పదావళినిబద్ధము గావించి, గాంధర్వవిద్యను స్వాయత్తము చేసికొని, రాధామాధవుల పరమ ప్రేమతత్త్వమును ప్రౌఢముగా పాడుకొనిన పుణ్యుడు. ఇక నారాయణ

తీర్థుడో, 'గోపరమణీ చిత్తమాతంగ మహనీయాలాన భూతు' డగు బాలకృష్ణునిలో 'నిగమగోచర నిత్య నిర్మలానంద ఘన' మగు పరమాత్మతత్త్వమును దర్శించి మృదు మృదంగ తాళగతి పారవశ్యముతో గానముచేసిన కర్మసన్యాసి.

ఈ ముగ్గురి గ్రంథములలో గీతగోవింద, లీలా తరంగిణులయొక్క బాహ్య స్వరూపమునందు కూడ కొన్ని పోలికలు గలవు. కృష్ణకర్ణామృతము శ్లోకమయమయిన మూడాశ్వాసముల గ్రంథము. ఇందు శ్రీకృష్ణుని మనోజ్ఞవేష సౌందర్యాదిక వర్ణనములును, లీలావిలాస వర్ణనములును, సంకీర్ణ వర్ణనములును గలవు. శ్లోకములన్నియు నమృతభావ నిష్యందము లయిన మధుర ముక్తకములు. సంగీత దృష్టితోడను ఆశ్వాసవిభాగ దృష్టితోడను చూచిన గీతగోవింద లీలా తరంగిణులకు పరస్పరసామ్య మెక్కుడు గలదు. గీతగోవింద కథ రాధామాధవ శృంగారమునకు మాత్రమే పరిమితము. లీలాతరంగిణి కథ కృష్ణ జన్మము మొదలుకొని రుక్మిణీకల్యాణ మహోత్సవము వఱకును సాగినది. భాగవతమునందువోలె గీతగోవిందమునందు కథావస్తువు 12 సర్గములుగా విభజింపబడినది కృష్ణలీలా తరంగిణియందు కూడ కథ 12 తరంగములుగా విభజింపబడినది తరంగశబ్దము ఆశ్వాసమునకు పర్యాయముగా ప్రయోగింపబడినను ఆశ్వాసమందలి గేయములకుకూడ తరంగములను ప్రశస్తి కలిగెను. గీతగోవిందములో సుమారు ముప్పది యైదు రాగములలో అష్టపదులును శ్లోకములు సంఘటింపబడినవి. లీలాతరంగిణిలోకూడ సుమారు ముప్పది యైదు రాగములలో తరంగములు, శ్లోకములు, గద్యములు, దరువులు, చూర్ణికలు సంఘటింపబడినవి. జయదేవ నారాయణతీర్థులు తమ గ్రంథములలో సంగీత సాహిత్యములకు రాధామాధవులకుగల సంబంధములను సిద్ధింపజేసినారు.

శబ్దసంయోజనము విషయమునను రసానుభూతి విషయమునను జయదేవనారాయణతీర్థులకు కొంత భేదము గలదు. జయదేవుడు కావ్యసర్గముల కుంచిన శీర్షికలు సాభిప్రాయములు, శ్రావ్యములు, హృదయంగమములు, సామోదదామోదరము, అక్లేశకేశవము, ముగ్ధమధుసూదనము, స్నిగ్ధమధుసూదనము సాకాంక్షపుండరీకాక్షము, ధన్య (దృష్ట) వైకుంఠము, నాగరనారాయణము, విలక్షలక్ష్మీపతి, ముగ్ధముకుందము, చతురచతుర్భుజము, సానందదామోదరము, సుప్రీతపీతాంబరము — ఈ శీర్షికలన్నియు మధురార్ద్ర గుంఫితములు. నారాయణతీర్థుడు పెట్టిన ఆశ్వాస నామములు కేవల కథావర్ణన సూచకములు. శ్రీకృష్ణ ప్రాదుర్భావవర్ణనము, బాలలీలావర్ణనము, శ్రీకృష్ణ గోవత్సపాలనము, గోపాలవర్ణనము, గోపీవస్త్రాపహరణ గోవర్ధనోద్ధారవర్ణనము, గోపీసమాగమవర్ణనము (రెండాశ్వాసములు), రాసక్రీడావర్ణనము, మధురాప్రవేశవర్ణనము, ద్వారవతీప్రవేశవర్ణనము, రుక్మిణీకల్యాణమహోత్సవ వర్ణనము — ఇవియన్నియు వర్ణనాత్మకములు. కథాప్రారంభమునందు జయదేవుడు మాళవరాగములో దశావతారవర్ణనము చేయగా నారాయణతీర్థుడు సౌరాష్ట్రరాగమున దశావతార స్మరణము చేసినాడు

లీలాశుకుడు కృష్ణతత్త్వమును తన కవితలో కొంత వ్యంగ్యముగను కొంత వాచ్యముగను వ్యక్తీకరించెను. జయదేవు డట్లుకాక కావ్యమామూలచూడము ధ్వనిమయము గావించినాడు. నారాయణతీర్థుడు జయదేవునకువోలె గడుసు పోకడలు, నూతిబిగింపులులేక కేవల బ్రహ్మానుభూతి రసికుడై కృష్ణబ్రహ్మముయొక్క వాగ్లక్షణసుధ నాస్వాదించుచు రాసమండల మందలి గోపికలలో తాను నొకడై తరంగభంగిలో తాండవము సేయుచు వాచ్యముగా పరమాత్మను సంకీర్తనము చేసినాడు.

లీలాశుకుడు 11వ. శతాబ్దివాడు. జయదేవుడు 12వ. శతాబ్దివాడు. ఆ పిమ్మట మఱి ఆఱు శతాబ్దములకు నారాయణతీర్థు డవతరించెను. జయదేవుడు వంగదేశీయుడు లీలాశుకుడు ఆంధ్రదేశమందలి శ్రీకాకుళమండల వాస్తవ్యుడను ప్రతీతికలదని కృష్ణ కర్ణామృత పీఠికలో శ్రీ తం తేపప్పెరుమాళ్లయ్యగారు సూచించిరి. నారాయణతీర్థుడు 18వ. శతాబ్ది ప్రారంభమున గోదావరీమండలమందలి కూచిమంచి అగ్రహారమున నివసించినట్లు * సంస్కృత వాఙ్మయ చరిత్రకారులు సప్రమాణముగ వ్రాసియుండిరి. మాధవనలుడను నాతడనేక జన్మములెత్తి తుదకు నారాయణతీర్థుడై అవతరించెనట. ఈ మాధవనలునకు లీలాశుకునకు జన్మపరంపరతో సంబంధము గలదేమో! కాని లీలాశుకుడే మూడవజన్మమున నారాయణతీర్థుడై జన్మించెనను జనశ్రుతిని కావ్యతీర్థ శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు * కృష్ణావతార తత్త్వమునందలి మూడవప్రకరణములో నిట్లు వివరించిరి.

* Narayana tirtha is said to be the last incornation of Madhavanala. He lived at Kuchimanchi Agraharam in Godavary District about 1700 A. D.

I have examined the Inam register from the Collector's Office.

—History of the Sanskrit Literature-Paragraph 301. by Kavyavinoda, Sahityratnakar,

M. Krishnamachariar,
M. A. M. L, Ph.D.

* కృష్ణావతార తత్త్వమునుగూర్చి ఈ గ్రంథము నందనేక విశేషములు వివరింపఁబడినవి.

"లీలాశుకుడే రెండవజన్మమున జయదేవుడను రాజవంశమున జన్మించెను. తిరిగి రాధామాధవులనే వినుతించెను. కాని యీ జన్మమునను భగవంతుడు దూరముగానున్నట్లే అగపడెను. ఎట్లో ఆ జన్మమును గడపి మృతినొంది నారాయణతీర్థయతియై జన్మించెను. కర్మసన్న్యాస మొనరించెను. మృదంగ వాదనము చేయుచు తరంగములనబడు గేయములను బాడుచు పోవుచుండ శ్రీకృష్ణపరమాత్మ పాదారవిందముల గజ్జెలుధరించి నృత్యముసేయుచు వెనుక వెనుకకు పోవుచుండెను. ఇట్లు పోయి పోయి శ్రీ కాశీక్షేత్రమున మణికర్ణికా ఘట్టమున భగవంతుడు గంగలోబడగా నీతడును గంగలోబడి భగవంతుని యందైక్యమయ్యెను."

శ్రీకృష్ణకర్ణామృత, గీతగోవింద, లీలాతరంగిణుల యందలి కృష్ణభక్త్యావేశములలోగల సామ్యమునుబట్టి తత్కవులు మువ్వురయాత్మలు నొకటిగా గోచరించుట సహజమే.

నారాయణతీర్థుడు శివరామానందతీర్థుని శిష్యుడు. ఈ విషయమును లీలాతరంగిణిలోని ఆశ్వాసాంతగద్యలో స్పష్టముగా నున్నది. "ఇతి శివరామానందతీర్థపాదసేవకశ్రీనారాయణతీర్థవిరచితాయాం శ్రీకృష్ణలీలాతరంగిణ్యామ్" నారాయణతీర్థుడు శివరామానందతీర్థునొద్ద దీక్షనొంది యతియై కర్మసన్న్యాసియయ్యెననియు విశ్వసింపదగియున్నది లీలాశుకునకు సోమగిరి యెట్టివాడో నారాయణతీర్థునకు శివరామానందతీర్థు డట్టివాడు కావచ్చును. క్రమక్రమముగా నారాయణతీర్థుడు బ్రహ్మతత్త్వ మన్వేషించుచు అనేక ప్రదేశములలో సంచరించుచు కృష్ణభక్తి పారవశ్యముతో తరంగము లాలపించుకొనుచు తుదకు కాశీలో తనువు చాలించి యుండవచ్చును.

నారాయణతీర్థుని మధుర కవితాతత్త్వ మన్వేషించుటకు అతని జీవితమందలి యీ విశేషములను కొంత ముచ్చటింపవలసి వచ్చినది.

ఒకవిధముగా భారతీయ సాహిత్యమంతయు భగవత్తత్త్వ ప్రతిపాదకమే. సంస్కృత సాహిత్యము నందు దైవతకావ్యము లసంఖ్యాకములు. శ్రీమతా చార్యుల భక్తిరసకావ్యములు జగత్ప్రసిద్ధములు. అంతే కాక మయూరుని సూర్యశతకము, అద్వైతబోధక మయిన పుష్పదంతుని మహిమ్నస్తోత్రము, మధు సూదనసరస్వతి ఆనందమందాకిని, మూకపండితుని పంచశతి, వేదాంతదేశికుల పాదుకాసహస్రము, వేంక టాధ్వరి లక్ష్మీసహస్రము మొదలుగా సంస్కృత సాహిత్య మహోదధిలో నెన్నెన్నో అనర్ఘరత్నమణులు గలవు. ప్రత్యేకముగా కృష్ణతత్త్వ ప్రతిపాదకము లయిన కావ్యములు పరశ్శతముగానున్నవి. వానిలో శ్రీకృష్ణలీలాతరంగిణి కూడ సంస్కృత సాహిత్య మున్నంతకాలము మనగల మధురకృతి.

తీర్థులవారు తనకృతిని శ్రీకృష్ణలీలాతరంగిణి యని గడుసుగా నామకరణము చేసిరి. లీలాశుక యోగి భక్తుల కర్ణములలో అమృతము కురియింపగా, జయదేవకవి తన గీతములతో గోవిందుని సాక్షాత్క రింపజేయగా, తీర్థులవారు లీలామానుష విగ్రహుడగు కృష్ణబ్రహ్మ లీలలను వర్ణించి కృష్ణలీలాతరంగిణి యని పేరు పెట్టెను. తరంగిణి యనగా నది. తాను పాడిన గేయములే అందలి తరంగములు. భగవం తుడు రసస్వరూపుడు. రసమనగా జలము. (అను రాగమనియు నర్థము) నదీజలములను దాటనోరు ఈతగానిసి తరంగములు ఒకదానివెంట నొకటి త్రోసి యెట్లు ఒడ్డునకు చేర్చునో, తీర్థులవారి తరంగ ములు (గేయములు) భక్తులనట్లే అవ్వల యొడ్డునకు చేర్చుచు ప్రేమస్వరూపుడగు పరమాత్మ సాయుజ్య మును చెందింపగలవని అభిప్రాయము.

తీర్థులవారు ప్రయోగించిన సంస్కృతము మిక్కిలి జటిలముకాదు. భక్తితో అయన మనస్సు తేలికవడినట్లే అయననోట వెలువడిన సంస్కృతము కూడ తేలికవడి పరమసారళ్యము వహించినది. తాళమువేసికొనుచు రాగాలాపమున కనువుగా ప్రతి తరంగమును స్వయముగా గానముచేసికొనిన కవిగా యనుటగుటచే కవితయంతయు అనుప్రాస మాధుర్య ముతో మృదుమృదంగ ధ్వనులతో పరవళ్లు త్రొక్కినది. అందువలననేకాబోలు జయదేవుని అష్టపదులకంటె తీర్థులవారి తరంగములే తెనుగునాట బహుళ ప్రచార మందినవి. అలవోకగా ఈ క్రింది తరంగము పాడు కొనని తెలుగువాడొకడైన నున్నాడా ?

*సావేరిరాగము—ఆదితాళము.*

*"శరణంభవ కరుణామయి కురు దీనదయాళో*
*కరుణారస వరుణాలయ కరిరాజకృపాళో*
*అధునాఖలు విధినామయి సుధియాసురహరితం*
*మధుసూదన మధుసూదన హరమామకదురితమ్"*

ఇది శ్రీకృష్ణప్రాదుర్భావవర్ణనమను ప్రథమతరంగము (ఆశ్వాసము) లోనిది. దుష్టజనదురిత భారముతో క్రుంగిపోయిన భూదేవి శ్రీ మహావిష్ణువుతో మొరపెట్టు కొను ఘట్టమిది. శోక సంతప్తమానసమునుండి వెలి కుబుకు వేదనాసర్వస్వమును సావేరిరాగములో నొది గించి ఆలపించినారు తీర్థులవారు.

కథయనుపేరితో కొన్ని సన్నివేశములుగా విభ జించుకొని ద్వాదశతరంగము లనినాడేకాని కథాగమన మిందులో ముఖ్యముగాదు. సన్నివేశము నడ్డమువెట్టు కొని సందుదొరకినపుడెల్ల కృష్ణపరమాత్ముని తనివితీఱ వర్ణించుచు గానముచేసినట్లు కానిపించును. *"మంగళాలయ మామవదేవ"* *"ఏహిముదందేహి, శ్రీకృష్ణ కృష్ణమాంపాహి"* *"యదునందన భక్త చందన కృష్ణకృష్ణమాంపాహి"* యని భక్తిపారవశ్య ముతో సాశ్రునయనుడై రోదించెను. ఒక్కొక్కసారి ప్రేమోన్మత్త గోపబాలికవోలె తాను దర్శించిన పర మాత్మ లీలావిగ్రహమును చూపి తక్కిన సఖులను కూడ చూడుడని హెచ్చరించినట్లు....

"కృష్ణం కలయసఖి సుందరం కృష్ణం గత
విషయ తృష్ణం,
జగత్ప్రభవిష్ణుం, సురారిగణ జిష్ణుం, సదా
బాలకృష్ణం......కలయసఖి"

అని ముఖారిరాగమున ప్రబోధించెను. 'శృంగారరస భరసంగీత సాహిత్య గంగాలహరీఖేలన' పరాయణుడై ఆనందతాండవము చేసినట్లు—ఈతరంగాలపనమున-—దీక్షితులవారు సాక్షాత్కరించుచుందురు.

తీర్థులవారి భక్తితత్త్వము చాలవఱకు సాంప్రదాయకమయిన మధురభక్తితత్త్వమే యయినను కొంతవఱకు విలక్షణము. దీనిని ముందు ముందు వివరింతును.

నిజమారసి చూచినచో భక్తికిని ప్రేమకును భేదములేదు. లోకమున భగవంతునిమీద ప్రేమకు భక్తియనియు తక్కిన జీవులకు పరస్పరముగల మమతకు ప్రేమమనియు ప్రతీతి. ఈ లౌకికప్రేమకూడ భక్తిలో నంతర్భూతమే. సంసారమున జీవులకొకరిపయి నొకరికిగల ప్రేమమును భక్తి యనవచ్చును. పితరులకు బిడ్డపైగల ప్రేమము వాత్సల్యభక్తి. అట్లే ప్రేయసీప్రియుల విషయమైనచో నది మధురభక్తి. సఖుల విషయమున సఖ్యభక్తి. అట్లే సంబంధమునుబట్టి పరమప్రేమరూపమయిన భక్తి బహువిధములు. మధుసూదన సరస్వతి 'భక్తిరసాయనము'న వీనిని స్పష్టముచేసెను. కృష్ణునిపై నందయశోదా దేవకీ వసుదేవులకుగల ప్రేమ, వాత్సల్యభక్తియే. పితృసంబంధమున వారు భగవంతుని ప్రేమించి యుపాసించిరి. అట్లే అర్జునాదులకు సఖ్యభక్తి. కుబ్జాదులకు దాస్యభక్తి. అక్రూర నారదాదులకు శాంతభక్తి. కంస పూతనాదులకు శత్రునిహితభక్తి. అనగా పరమాత్మ సాయుజ్యమునకు వైర మొకసాధనముగా గ్రహించిరని భావము. గోపికాదులకు కృష్ణునిపయి గల పరమప్రేమము మహామధురము. అది మధురభక్తిగా ప్రసిద్ధము. బృందావనమందలి భాండీరవన ప్రాంతమున రాసమండలములో జరిగిన గోపీకృష్ణుల రహస్య క్రీడకు సాంప్రదాయకములగు తత్త్వార్థములువేఱు ఈ తత్త్వార్థమరయుటకు కేవల భాగవత హరివంశగ్రంథముల పరిశీలనము చాలదు. బ్రహ్మవైవర్తపురాణ శ్రీకృష్ణజన్మఖండము, గర్గసంహిత, బ్రహ్మపురాణము, దేవీభాగవతము మున్నుగా అనేక పురాణసంహితార్థముల ననుసంధించుకొనవలయును. లీలాశుకుడు, జయదేవుడు, నారాయణ తీర్థుడు వీని నన్నింటిని అపోఽశనము పట్టినవారే. గీతగోవిందమందలి ప్రారంభశ్లోకమగు "మేఘైర్మేదురమంబరం..." అను దానియందలి నందుడు, అంధకార బంధురమగు రాత్రి కృష్ణుని రాధ కప్పగించిన యైతిహ్యము శ్రీకృష్ణజన్మఖండమందలి పదునైదవ యధ్యాయమున సువిస్తృతముగ వర్ణింపబడినదే. కృష్ణకర్ణామృతమునందును ఇట్టి సందర్భములుగలవు. కృష్ణలీలా తరంగిణియందు కృష్ణుడు కాళియగర్వ భంజనముచేసిన సందర్భమున నాగపత్నిచేసిన శ్రీకృష్ణస్తుతి, శ్రీకృష్ణజన్మఖండ, భాగవత, బ్రహ్మాండపురాణములందును గలదు. వీని యన్నింటిసారమును పిండుకొన్నవాడువోలె నారాయణతీర్థుడు నాగపత్నిచేత"దేవ కురు శిక్షాందేహి పతిభిక్షాం. ఆజ్ఞాపయయదుదిత మస్మాకం జగత్ప్రభో !" యని ముఖారి రాగమునసే ముహుర్ముహుర్ముఖరిత బృందారణ్యముగా శ్రీకృష్ణస్తుతి చేయించినాడు.

శ్రీకృష్ణలీలాతరంగిణి యందలి పంచమతరంగము మొదల్కొని అష్టమ తరంగమువఱకు గల గోపీవస్త్రాపహరణ, గోపీసమాగమ, రాసక్రీడావర్ణనములు గ్రంథమంతటికిని ప్రాణభూతములయినవి. భక్తితత్త్వసర్వస్వమును తీర్థులవారీ నాలుగు తరంగములలో నిక్షేపించినారు. ఇందు వర్ణించిన విశేషములను పరిశీలింపగా, తీర్థులవారు భాగవతకృష్ణజన్మ

ఖండాములనేకాక గర్గసంహితనుకూడ హృదయగతము కావించుకొనె ననకతప్పదు. తీర్థులవారీ గర్గాచార్యుని గూర్చి ద్వితీయతరంగమున అమ్మహాముని "నిర్గత మోహ తిమిరుడనియు, నిర్మలమానసాన్వితుడనియు, స్వర్గాపవర్గాధికారి" యనియు భక్తితో వర్ణించియున్నారు. గర్గసంహిత పురాణము కాకపోయినను తత్ప్రామాణ్యమును భాగవత మంగీకరింపకపోలేదు. "గర్గముని యదుకులపురోహితుడు. బ్రహ్మవిదుడు సర్వభూవిఖ్యాతుడు" ఇట్టి యీగర్గాచార్యునే నందుడు తన తనయులకు విద్యాసంస్కారములు గలిగింపుడని ప్రార్థించినట్లు భాగవత దశమస్కంధమునందుగలదు. ఈ గర్గాచార్య ప్రణీతమయిన (గర్గ) సంహితయందలి మాధుర్యఖండము అక్షరాక్షరము మాధుర్యఖండమే. అందు బహువిధ గోపికాచరిత్రములు వర్ణింపబడినవి భగవద్విరహము నోర్వలేని జీవులే ఆపతాంతరమున శ్రుతిరూపగోపికలుగను, ఋషిరూపగోపికలుగను, మైథిలీ గోపికలుగను, కోసలగోపికలుగను, అయోధ్యాగోపికలుగను యజ్ఞసీతాగోపికలుగను పుళిందగోపికలుగను, జాలంధరీగోపికలకలుగను, ఊర్ధ్వవాసిగోపికలుగను, భూవాసి గోపికలుగను, దేవాంగనా గోపికలుగను నవతరించిరట. వీరిలో మైథిలీగోపికా వృత్తాంతమును స్మరించుచునే తీర్థులవారు గోపీవస్త్రాపహరణఘట్టము వ్రాసినట్లు తోచును. కృష్ణుడపహరించిన గోపికావస్త్రముల ప్రసక్తివచ్చినపుడు తీర్థులవారు అవస్త్రమునకు పర్యాయముగా సంప్రదాయార్థ ద్యోతకమయిన 'ఆవరణ' శబ్దమునే ప్రయోగించిరి. ఆవరణశబ్దమునకు బహిరాచ్ఛాదనము, వస్త్రము నను నవి సాధారణార్థములు. తత్త్వపరిభాషలో పృథివ్యప్తేజో వాయ్వాకాశాహంకార మహత్తత్త్వములగు సప్తావరణములని యర్థము. ప్రకృతితోకూడినచో ఈ సప్తావరణములే అష్టావరణములగును ప్రకృతి మాయావరణోపేత, పురుషుడగు కృష్ణుడు గోపికారూపమగు ప్రకృతియొక్క మాయావరణమును తొలగింప యత్నించెను. తత్ప్రకృతి సిగ్గుపడినది. సిగ్గు (అజ్ఞానము) తొలగనంతవఱకు పర(మ)పురుష సాయుజ్యము సిద్ధింపలేదు. సిగ్గువిడిచి గోపికలు కష్ణునితో రమించిరనగా అజ్ఞానము తొలగిన ప్రకృతి పురుషునితో సాయిుజ్యము చెందినదని యర్థము.

గోపికలకు ఇట్టి సాయుజ్యము రాసమండలమున సిద్ధించినది. కనుకనే రాసమండలమును ప్రకృతి పురుషసమ్మేళన స్థలముగా పేర్కొందురు. గర్గసంహిత ఈ సాంకేతికార్థములకు మణిదర్పణము. తీర్థులవారుకూడ బృందావనమందలి రాసక్రీడామహోత్సవమును వర్ణించుఘట్టమున కృష్ణలీలా తరంగిణిని పొంగించుకొని మధురకవితాకేదారమును పండించుకొనినాడు,

చూర్ణిక : తత్రఖలు బృందావనే... మందారపారిజాత సంతాన కల్పకహరిచందనాది తరుబృందానందిత శుకపిక శారికాది బృందవినందిత నందనోద్యానే సముత్ఫుల్ల శారద మల్లికా మకరంద పరిమళాలసయా సంచరచ్చంచరీక ఝణ ఝణ త్కార నూపుర రవైః విచిత్ర పతత్రి వక్త్రోద్గళిత నానావిధ వినోద నినాద తాళమృదంగ సంగీతాది కలావిశేషైః ఆలక్షితానేకకోటి దేవతా నాట్యరసోత్కటే . గోపరమణీనయనోత్పవాగాధిత మదనగోపాల మూర్తి ర్వాసుదేవో గోపీభిస్సహ రాస కీడా మహోత్సవారంభ సంభ్రమ చేతాః గోపీభిః సార్థమాత్మతత్త్వ ముపదిశ న్నిదమాహ

సమావిష్కృతాత్మతత్త్వముగా వర్ణింపబడిన యీదివ్యఘట్టమున తీర్థులవారు శ్రీకృష్ణుని కృష్ణబ్రహ్మమనియు గోపికలను బ్రహ్మానుభూతి రసికలనియు పేర్కొనెను.

ఈ బ్రహ్మానుభూతి రాసిక్యము ననుసంధించు కొనుకున్నచో జయదేవకవి వర్ణించిన రాధావిషయక కామతృప్త కామినీహాసమును, పౌరుషరస ప్రేమవిలాసమును సామాన్యులకు విపరీతముగా గోచరించును. * రాధ శ్రీకృష్ణుని, తన బాహులచే కట్టివేసి స్తనములచే పీడించి, గోళ్లచే గుచ్చి, పండ్లతో కొఱికి, పిఱుదులతో నెడ పెడ గొట్టి, జుట్టు పట్టుకొని వంగదీసెనట. కుడి తొడమీద కూర్చుండి మదనమహాయుద్ధములో కృష్ణుని జయింపవలెనని మహాసాహసముతో లేచి ఉపరిసురత మారంభింప బోయెనట. సిగ్గువిడిచిన–సిగ్గుతొలగిన– ఈ చెర్యమునకు తాత్త్వికార్థము జోడింపకున్నచో రాక్షసమయిన రతిగా గోచరింపదా ? అట్లు గోచరించుట రాక్షస ప్రకృతి గలవారికి మాత్రమే ! ఈ సందర్భమున ఈ క్రిందివాక్యములు గమనింపదగినవి.

నారాయణ తీర్థులవారుకూడ రాధాదేవినుద్దేశించి వ్రజయువతులచేత *"కథయ కథయ మాధవ॥ హే రాధే"* యను నొక తరంగము పాడించెను. అందు మాధవుడు *'విగతమోహు'* డనియు, *'వేదభాగ విదితుడగు భగవంతు'* డనియు వర్ణించెను. అట్టి పరమాత్మునన్వేషించు గోపికలజతనము *'బ్రహ్మవిద్య'*గా పేర్కొనినాడు *'బ్రహ్మవిద్య'* యనుటలోనే తీర్థులవారు గోపీకృష్ణ తత్త్వ సర్వస్వమును వ్యక్తీకరించినాడు.

* దోర్భ్యాంసంయమితః పయోధరభరేణాపీడితః .... ... గీతగోవిందము 12వ, సర్గము వామాంకే రతికేళి సంకులరణారంభే .... ... గీతగోవిందము — 1 వ, సర్గము రాధాదేవికిగల షోడశదివ్య నామములలో కృష్ణ వామాంక సంభూత యనునదొకటి

Radha is not a women but a Hing representing the materialism and the whole is a gradual story of the Pilgrimage of the soul up to Path of Glory. —C.R. Srinivas Iyengar.

తీర్థులవారి వైష్ణవభక్తి తత్త్వములో నొక వైలక్షణ్యము గలదంటిమి లీలాతరంగిణిలోని ప్రథమ తరంగాంతమున, గీర్వాణగణములచే కొనియాడబడుచు త్రిలోకపూజ్యురాలయి "వైష్ణవి" యను పేర విఖ్యాతయగు దుర్గయొక్క స్తుతికలదు. ఈ వైష్ణవదుర్గ ఎవరను సందేహము కలుగకమానదు.

*జయజయవైష్ణవదుర్గే, జయజయకల్పితసర్గే*
*జయజయతోషితభర్గే జయజయకుచజితదుర్గే*

.........................................

*వీణావినోదిగిరిజే, విద్రుమసన్నిభ గిరిజే*
*మానితలోకసమాజే మదనగోపాలసహజే॥జయ॥*

ఇందు స్తుతింపబడిన వైష్ణవదుర్గముగూర్చి కొంత తెలిసికొనవలసియున్నది. "దుర్గ" చండికకు నామాంతరము. చండిక పరమాత్మునిచ్ఛాశక్తి. కృష్ణుడు పరమాత్ముడనియు తదిచ్ఛాశక్తి రాధ యనియు కృష్ణజన్మఖండమున వివరింపబడియున్నది. రాధతో కృష్ణుడిట్లనినాడు. *"ఓ రాధాదేవి, నన్నొక్కనినైనచో కృష్ణుడందురు నీవు గూడినచో నన్ను శ్రీకృష్ణుడందురు. నీవే శ్రీదేవివి, సర్వశక్తిస్వరూపిణివి. ఆధారస్వరూపిణివి. నేను సర్వబీజ స్వరూపుడను నీవు మూల ప్రకృతివి ఈశ్వరివి అనెను."*

*"వామాంగాంశస్వరూపాత్వం మూలప్రకృతిరీశ్వరీ*
*శక్త్యాబుద్ధ్యాచజ్ఞానేన మయాతుల్యా వరాననే"*

ఔను. ఆ యీశ్వరి శక్తి బుద్ధి జ్ఞానములచే పరమాత్మునితో తుల్యురాలు. అంతేకాదు. అభిన్నురాలు. ఏలయన రసికేశ్వరియైన యా రాసేశ్వరి కృష్ణవామాంగ సంభూత సర్వగోపికా జీవమూలప్రకృతియు శక్తిస్వరూపిణియునగు తత్ప్రకృతి సాహాయ్యములేక పురుషు డేపనియు చేయజాలడు. అందువలననే వైష్ణవదుర్గను తీర్థులవారు మదనగోపాల సహజయని స్తుతించినాడు. ఆమె కృష్ణపరమాత్మ వామాంగ సంభూతగదా !

రాధాదేవికిగల షోడశదివ్యనామములలో (రసికేశ్వరి, రాసేశ్వరి, కృష్ణవామాంగసంభూత మొదలగు) బృందానామము సుప్రసిద్ధము. బృందాదేవికి క్రీడారామము కనుకనే బృందావని కాపే రేర్పడినది. ఆ రసికేశ్వరి పరమేశ్వరునితో విహరించిన యాప్రదేశమే రాసమండలము. తద్విహరణ క్రీడలే రాసక్రీడలు వీనితో నా వైష్ణవదుర్గకుగల సంబంధమే తీర్థులవారు గానము చేసిరనుకొందును.

వైష్ణవదుర్గాప్రధానమగునట్టి మధురప్రేమ తత్త్వము నుపాసించి తీర్థులవారు కృష్ణలీలాతరంగిణిని మధురకవితా తరంగిణిగా వెలయించిరారు. ఆ భక్తశిఖామణి గంగామణికర్ణికాఘట్టమునకు తన్నాకర్షించుకొనుచు వెనుక వెనుకపోయిన తాండవకృష్ణుని దర్శించుచు తనువుచాలించెనందురు. అట్టి తాండవకృష్ణు నాత డెన్నిసారులు సందర్శించెనో! ఆ ప్రభుని కాలిగజ్జెల ఘులంఘులారావములకు పారవశ్యము చెంది ఎన్నితరంగము లాలపించెనో! "*కలభసుందరగమన, కస్తూరికాబితానన, వందనందన, భక్తచందన, శ్రీ వాసుదేవప్రభో పాలయమాం, బాలగోపాల మా ముద్ధర! ఇందిరా మందిర, భక్తసుందరహృదయారవిందబృంద, భక్తి మకరరదనందిత గోపికాబృంద తాంతాహిత దైవత్తతాం తకతోదిమ్మి ఆగిణతోధిమ్మిరె...*" యని ప్రళయపయోవాహగర్జాగంభీర పృధుమృదంగ తాళలయవిన్యాసములతో ఎట్లు తాండవమునల్పెనో!.... నారాయణ తీర్థులకు నారాయణ సాక్షాత్కారమైనది. విశ్వరూపసందర్శనముచేసిన నరునిబోలె "*ఆదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా, పితేవ పుత్రస్య సఖేవసఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవసోఢుమ్*" అనుకొనుచు పులకితాత్మ ప్రకృతిగా భగవదైక్యము చెందియుండును. తీర్థులవారు ధన్యచరితులు!

లీలాతరంగిణీ భక్తిమార్గమున తత్పూర్వాపరముల నెన్నిరచనములులేవు? కృష్ణలీలాతరంగిణీ (శ్రీ బెల్లంకొండ రామశాస్త్రికృతము) కష్ణభవనామృతము, కృష్ణభక్తిచంద్రిక, కృష్ణలీలామృతము, కృష్ణామృతతరంగిక మున్నగువానికి తీర్థులవారి కృతికున్న ప్రశస్తి యున్నదా? గీతగోవిందము ననుసరించి వెలువడిన గీతాగౌరీపతి, కృష్ణగిరీశ, గీతారాఘువ, గీతాగిరీశ, గీతావీతరాగాదులకెంత ప్రశస్తియున్నదో వానికంత ప్రశస్తిగలదు.

తీర్థులవారికృతి యందలి సంగీతతత్త్వము గూర్చి ప్రత్యేకముగా పరిశీలింపవలసియున్నది. దానికిది తావుగాదు. అయినను నొకమాట. కష్ణమాచారిగా రనినట్లు "The Poem is fit for the lyre and showers Sentiments of devotion" తీర్థులవారు ప్రయోగించిన మధ్యమావతి, కాంభోజి, సౌరాష్ట్ర, శంకరాభరణాదులైన 35 రాగములును అయ్యెసందర్భములందలి రసములకు మిక్కిలి యనుగుణములైనవి. అట, త్రిపుట, జంపె, పూరి, ధవళాదులగు నెనిమిది తొమ్మిది తాళగతులతో తరంగములను గూర్చినాడు జయదేవుని కంటె నొకడుగు ముందునకువైచి అనేక ప్రక్రియలలో గద్యములు, చూర్ణికలు, దరువులు, యాలలు సంధించి సంపూర్ణకావ్యాభినయపద్ధతిలో యక్షగానమార్గమున నాడుకొనుటకు పాడుకొనుటకు ననువుగా లీలాతరంగిణిని దిద్దితీర్చినాడు. ఒకటి రెండు దశాబ్దులు వెనుకకుపోయినచో తెనుగునాట తీర్థులవారి తరంగములను మధురముగా భజనముచేసెడి భక్తులెందరో ఉండెడివారు. నేడు వెదకి పట్టుకొందమన్నను అట్టివారిని వ్రేళ్లపై లెక్కింపవలసియుండును. భాగవతుల పుణ్యమనియో, రంగస్థలనాటకములలోని నారదపాత్రధారి పుణ్యమనియో ఆకాశవాణి పుణ్యమనియో అప్పుడప్పు డైదాఱు తరంగములు వినిపించుటయే కాని తీర్థులవారి భక్తిశృంగార సంగీత సాహిత్యము అఖిలభారతీయులకు ఇంకను ఆత్మతృప్తిగా అనుభూతముగాలేదు. ఆ మధురక్షణ మెప్పుడో!

## శ్రీ యస్. వి. ఏ. రామలింగేశ్వరశాస్త్రి

కవిత్వము ప్రదర్శన యోగ్యమైనది. పదిమందికానందం కలిగించాలనే పద్యాలు వ్రాస్తాడు కవి. కాని అలంకారాల బరువుతో ఆదర్శాల పరువుతో కవిత్వాన్ని ముంచెత్తి నింపాలా అన్నది ప్రశ్న. అందం ప్రతివస్తువు కలిగియుండవలసిందే కనుక కవిత్వము అందంగా ఉండవలసిందే. కాని ఆ అందం భూషణాలను ధరించడములోనూ, భాషణా పద్ధతినీ పటిమనూ కృత్రిమౌన్నత్యాలకు తీసికొని వెళ్లడములోనూ ఉందా అన్నది అనుమానాస్పదం. నగా, నట్రా ధరించిన స్త్రీ అందంగానే ఉంటుంది. కాని నగలు లేకుండా, కృత్రిమత్వపు వెలుగు జిలుగులు ప్రదర్శించకుండా, నగలుగల స్త్రీ కంటె ఎక్కువ అందాన్ని చిందించి, ఆనందాన్ని కలిగించే స్త్రీ యొక్క అందమే అందము. ఆమెయొక్క అందమే ఆమెకి భూషణం కావాలి. సహజమైన అందంలో స్వయం ప్రకాశకత్వమూ, నిత్య నిరంతర తేజోవిరాజకత్వమూ ఉంటాయి. కవికి అలంకారము లేకపోవుటే అలంకారము. ఆదర్శాలను దూరంగానే ఉంచి, ఆ మిలమిల మెరిసే నక్షత్రాల వెలుగుల్లో కావ్యాలను రచించుటే ఆదర్శం. సౌందర్యోపాసనే, సహజ ప్రకృతి రామణీయకతా వర్ణనే కవికాదర్శం. భావమందేకాక భాషాపద్ధతిలోకూడా కవి ఈ ఆదర్శాలను పాటించాలి.

పైన చెప్పిన విధంగా, కవి సహజపద్ధతి, సరళ ధోరణీ, సౌందర్యోపాసనా, ప్రకృతివర్ణనా మొదలైన లక్షణాలను కలిగియుండాలనే విషయాన్ని మొదటగా కాకపోయినా. ముఖ్యంగా జగతికి చాటి తన దివ్య కావ్యాల నవ్యగానంలో వీనిని రుచి చూపిన ఆంగ్ల మహాకవి వర్డ్సువర్తు. ఈ రకపు కవిత్వధోరణి మన భారతదేశానికి క్రొత్త కాకపోయినా నవనాగరికత అనే గాడిద బరువును అనవసరంగా, అన్ని వేళలా, అత్యవసరమంటూ మోస్తూ ఉండే పాశ్చాత్యులకి ఈ భావాలు క్రొంగ్రొత్తగా కనిపించేయి, వినిపించేయి. కనులను

తెరిపించేయి. క్రొత్తలోకంలో, చెవులకు వినిపించేయి క్రొత్తరాగాలు. వారు ఈ భావాలను నిరసించబోయి ఏదో అమానుషమైన అమృత రసాన్ని ఈయన కావ్యాలలో గ్రోలడమువలన, నిరసించలేకపోయేరు. వర్డ్స్‌వర్తు కావ్యాలలో వారు రుచిచూచిన క్రొత్తదనం, క్రొత్తరుచి, నిజానికి క్రొత కాదు. ఎన్ని యుగాల క్రితమో వారు మరచిపోయిన ప్రకృతి, అందలి అందమూ. దానినిగురించి మరల ఈ మహాకవి జ్ఞప్తికి తేవడముతో ప్రాత పాతరలను త్రవ్వినట్లయింది. నివ్వెరపోయేరు.

మానవునిలోపల ఆత్మ వున్నదని చెబుతూ, బయట ప్రకృతిలోకూడ ఆత్మ ఉందనీ. ఈ రెండు ఆత్మల తాదాత్మ్యములోనే నిజమైన ఆనందం ఉందని పాశ్చాత్యులకి బోధించినవాడు వర్డ్స్‌వర్తు. మానవుని ఆత్మతో సదృశమైనది ప్రకృతిలోని ఆత్మ ఒక్కటే కనుక, మానవుడు ప్రకృతితో తన సంబంధాన్ని పెంచుకొన్నకొలదీ తన భయాల్నీ, బాధల్నీ మరచి పోతాడు. కనుక ప్రకృతిలోని మహాశక్తిని సంద ర్శించి దానిలో తాను లయమగుటలోనే మానవుని ఆదర్శం ఇమిడివుందని వర్డ్స్‌వర్తు తలంపు.

ఈ ప్రధానమైన తాత్త్వికమైన తలంపులో వర్డ్స్ వర్తు భారతీయ వేదాంత భావాలను, తనకు తెలియ కుండగనే పుణికి పుచ్చుకొనినవాడైనాడు. మన వేద వేదాంగాలు ప్రకృతిలోని సంపదను ప్రోవులుగాపోసిన బంగారు రాసులు మాత్రమే. ప్రకృతిలోని ప్రతి అందమైన భాగంలోను. వేదాలు ఆత్మను సందర్శించి, వర్ణించేయి. ఉషాబాల, సంధ్యాదేవి, వనదేవత, సూర్యదేవుడు. పర్వతరాజు మొదలైన పాత్రలు మన వేదాల్లో వర్ణించడాన్నిబట్టి చూస్తే వేదకాలంలో ప్రకృతి ఎంత అగ్రగణ్యంగా అంగీకరింపబడిందో విదిత మవుతుంది. భారతదేశ సౌభాగ్యమంతా దాని ఉపనిషత్తులలోనే నిలిచియున్నదని పలువురి తలంపు.

అట్టి ఉపనిషత్తులన్నీ అరణ్యాలలో ప్రకృతిమాత యొడిలో మలచబడినవే. మన రామాయణ మహా కావ్యాన్ని రచించిన వాల్మీకి ఎంత ప్రకృతిని ఆరా ధించినవాడో, ఆ కావ్యాన్ని కావ్యంగా దర్శించిన వారి కవగతమవుతుంది ప్రకృతిలోని జీవాన్నీ, శక్తినీ. కావ్యాలుగా వర్ణించినవారు భారతీయులు. అట్టి భారతీయులలో ఒకడు కావలసినవాడు వర్డ్స్‌వర్తు. భారతీయ తాత్త్విక బీజాల్ని నలుదెసలా వ్యాపింప జేయడానికన్నట్లుగా పాశ్చాత్య లోకాల్లో జన్మించాడీ మహానుభావుడు.

మానవుని, అతనియొక్క ఉద్యోగాల అడంబ రముతో కాక, వృత్తుల ఆచూకీలతోగాక అతని ప్రాపంచిక స్నేహితులతోకాక, అతనినొక వ్యక్తిగా సందర్శించి, ఆ వ్యక్తిని ప్రకృతితోముడిపెట్టి, ఉన్నత పర్వతాల ప్రక్కన మానవుని, మహాసముద్రాలలో నరుని, పూలవనాలలో స్త్రీని, స్వర్గంనుండి దిగివచ్చిన శిశువునీ వర్ణించి, పాంచ భౌతిక ప్రకృతికీ, మాన వునికీ గల అతి సన్నిహిత మైత్రిని కావ్యాలలో తనివి తీర తీర్చిదిద్ది మానవుని జగతిలో విశ్వజనీనం చేయ డములో వర్డ్స్‌వర్తుయొక్క ఘనత అంతర్గతమైయుంది. ప్రకృతిలోని రక, రకాల వస్తువులనే తన కావ్యవస్తు వులుగా వర్డ్స్‌వర్తు అంగీకరించేడు. మానవుని కావ్య వస్తువుగా తీసికొనినపుడుకూడ, అతనిని ప్రకృతిలోని అంతర్భాగముగా మాత్రమే అయన అంగీకరించేడు. అందుచేత అయన కావ్యాలలో వర్ణితులైన మనుజులు ప్రకృతితో ఎక్కువ సంబంధం, అన్నివేళలా కలిగి యుండేవారే. పంటచేలమధ్య ధాన్యపు కంకులు కోసికొను స్త్రీ అయనకు కావ్యవస్తువు. అమె తన పనిలో తన్మయయై పాడునపుడు అపాట కోయిలపా టను పోలియుంటుంది. జీవితపు ఎడారిలో విసిగి వేసారిన మనుజులకు దివ్యానందాన్ని అందిస్తుంది. అడవిలో కట్టెలు కొట్టుకొని, పళ్ళు ఏరుకొని జీవించు

అతి సామాన్య మానవుని జీవితము ధన్యమైనదని ఆయన ఊహ. దానికి కారణము అతని జీవితము నిరంతరము అడవిలోని రమ్యమైన ఫలపుష్పభరిత వృక్షశాఖలతో అల్లుకొనిపోయి ఉండుటేనని ఆయన తాత్పర్యము. ఆయన సృష్టించిన స్త్రీకి "అభిమానమే అభరణము, మర్యాదే భూషణము" ఈ మర్యాదే ఆమెను ప్రకృతిదగ్గరకు చేరుస్తుందని ఆయన నమ్మకం.

ఇంక ఆయన ప్రకృతినే వర్ణించేటప్పుడు అతి ఉన్నతములైన విలువలను చూరగొన్నారు. పుస్తకాల లోని నీతులన్నీ ప్రకృతిలో ఉన్నాయి. మానవుని యొక్క శారీరికపు గాయాలనే కాక, మానవికపు పగుళ్ళనుకూడ ప్రకృతి పూడుస్తుంది వర్షువర్షు కనుల ముందు. ప్రకృతిలో ప్రాణమేలేదని తృణీకరించే నవనాగరిక ప్రపంచం కంటె, సముద్రదేవతా, పర్వత రాజూ మొదలైన దేవుళ్లను సృష్టించి, అవి మహాశక్తు లుగా అంగీకరించి, వానిని ఆరాధించే పురాతన నాగ రిక జాతులు ఆయనకి బాగా నచ్చుతాయి. నిజమైన కవి హృదయాన్ని ప్రకృతిలోని చిన్న గడ్డిపూవుకూడ ఆకర్షించి కన్నీళ్ళదాకా కదలించాలి. అనగా హృద యము కన్నీరు కార్చాలి, ఆపూవునుచూచి ఆనందిం చిన మహద్భాగ్యానికి. అంతేకాదు హృదయసాగరము యొక్క లోతును ముట్టి, అట్టడుగున గల రత్నాలను శోధించి, వానిని వెలికితీసికొని రాగలిగినశక్తి ప్రకృతి లోని ఒక చిన్న అడవి గడ్డిపూవుకు కూడ ఉంటుం దని ఆయన దృఢ నమ్మకం.

కవిని శిశువుతో పోల్చవచ్చును. శిశువు అప్పుడే స్వర్గంనుండి తిరిగి రావడమువలన, ఆ స్వర్గంచూచిన కళ్ళకి, ఈ ప్రకృతిలో మనకి కానుపించే అందం కంటే ఏదో కొత్తకాంతి ఉన్నట్లు కానుపిస్తుంది. శిశువు కళ్ళల్లో వెలిగే వెలుగుకి, నోట వెలసిన నవరత్నాలు ఒలికించే చిన్న నవ్వుకి ఈ ప్రకృతిలోని కాంతిని సందర్శించడమే కారణం కావచ్చును. శిశువు ఎదిగే కొలదీ ప్రకృతిలోని అందాన్నే కాక, మానవునిలోని కృత్రిమత్వాన్నీకూడ అర్థం చేసికోవడం వలన ఆ అందాన్ని క్రమక్రమంగా మరచిపోతాడు. ఆవిధంగా మరచిపోని శిశుహృదయాన్నే నిరంతరమూ కలిగి యుండేవాడే కవి. భూతల స్వర్గాన్ని గాంచజాలిన వాడు కవి. ఒక ఇసుకరేణువులో సమస్త ప్రపంచాన్నీ దర్శించగలవాడూ, మహాప్రపంచాన్ని, ఒక ఇసుకరేణువును చూచినంత సమగ్రంగానూ చూడ గలవాడూ కవి అవుతాడు.

ప్రకృతిని దేవతగా ఆరాధించినవానికి ప్రకృతి సర్వవిధాలా తోడ్పడినట్లుగానే, ప్రకృతిని నిరసించి, దానిని జయించి అంతకంటె మేలు శిల్పాలను నిర్మిం చాలని యత్నించే మానవునికి ఆ ప్రకృతే దయ్యము గానో, బ్రహ్మరాక్షసిగానో అవుతుంది. ఆ మానవు నికి ప్రకృతినుండి కలిగే నష్టములు వర్ణనాతీతము లు. నవనాగరిగతమధ్య మసిలే మనుజుడు సుందర శిల్పా లను నిర్మించవచ్చు. మానవోపయోగకారులగు అనేక భవంతులను పార్కులను ఇంకా ఎన్నో రకాల కట్టడా లను నిర్మించవచ్చును. అనేక కర్మాగారాలను, ప్రాజెక్టులనూ గట్టవచ్చును. కాని ఆ పొగగొట్టాల మధ్య, మురికి కాలువల ప్రక్కన లోతుకు పోయిన కళ్ళు, పీకికొనిపోయిన దౌడలు, పొటమరించి పగల డానికి సిద్ధంగ్నుండే నరాలు గల మనుజులు తిరుగు తూంటారుకదా! వారేమి సుఖాన్ని అనుభవిస్తున్నారీ నవనాగరికతలో ? కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకొని ఏమి సంతోషాన్ని పొందుతున్నారు ?

పచ్చికబీళ్లూ, కొండసానువులు, నదీతీరాలు, స్వచ్ఛమైనగాలి, చల్లని చంద్రకాంతి, మొదలైన అనేక వరాలను మన మనుభవించడానికి ప్రకృతి మన కీయగా, వాటిని కాలితోనెట్టి, ఏమి సాధించగలి గాము ? ఇదీ మానవుని ఎదుట నిలిపి వర్షువర్షు సవాలుచేసి అడిగిన ప్రశ్న. వినుగు విరామాలు

లేకుండా, చెప్పిందే పదిమార్లు తన పద్యాలలో చెప్పి, ప్రజలకు ప్రకృతి చాటుచూపినవాడు వర్డ్సువర్తు. ఒక నాడు చిట్టడవులతో, సెలయేళ్లతో అందాలను విర జిమ్మే ప్రకృతి మాత రొమ్ముపై నేడు రాక్షసులవలె అరుస్తూ, కూతలుకూస్తూ ఎక్కికూర్చున్న నగరాలను చూస్తూ, ఏమిచేయలేని విధంగా కూర్చున్న ప్రకృతి కూడ, తనశిక్షను నెమ్మదిగానైనా, చురుకుగా రుచి చూపిస్తుంది, మానవజాతికి. మానవ నాగరికత అంతా ప్రకృతి గుండెలను మండించి, ఆనుస్పై ఏర్పడిన భవనాల మయమేనని వర్డ్సువర్తు భావము ఈ నాశన ఫలితం నాగరితకత అనుభవింపక తప్పదు.

వర్డ్సువర్తు నవనాగరికతనింతగా నిరసించడము లోని అంతరార్థము ప్రకృతి కవికెంత అవసరమో నిరూపించడానికే, కవిత్వమొక తపస్సువంటిది దానికుద్దీపనముగా ప్రకృతి కవికెంతయో అవసరము పూర్వకాలము భారతదేశములో ననేక యోగిపుంగ వులు పట్టణములను వదిలి యడవుల కేగేవారు. అచట తపస్సు వారికి నిర్విఘ్నముగా సాగుచుండేది. అట్టి అడవులు మానసికాహ్లాదానికి ఏంతైనా అవస రము. నేటికాలంలో ఈ రకపు ప్రకృతి సంపద అంతా మృగ్యం కావడమే. వర్డ్సువర్తుకి బాధను కలి గించింది. ఇందులకే ఆయన నవనాగరికతను నిర సించడముకూడా. ఈ విషయంలోకూడ ఈ య న భారతీయభావాలకు అనురూపుడైనాడు

ప్రకృతి మాతను ఇంతగా ఆరాధించిన వర్డ్సు వర్తు, ప్రకృతికీ, ప్రజకీ గల చిత్రమైన సంబంధాన్ని ఇంతస్పష్టంగా అర్థంచేసుకొన్న వర్డ్సువర్తు, ఆత్మ స్వాతంత్ర్యం ప్రకృతిని భోగించే విధానంలోనే కలదని ఇంతగాచాటి చూపిన వర్డ్సువర్తు, ఈ భావాలను పద్యా లలో కూర్చడములోకూడ ఇన్ని రకాల స్వతంత్రపు పోకడలనూ పోయేడు. అందమైన వస్తువును ఏదైనా చూచినపుడు, మన హృదయంలో కదలిన కదలిక్కే మనచే ఆ కదలికకు ఒక రూపునిమ్మని ప్రోత్సహి స్తుంది. అది పద్యాలద్వారా వెలువడవచ్చు. చిత్ర ములద్వారా బయటికిరావచ్చు. లేక ఏ యితర కళ యైనా ఆ సమయంలో అక్కరకు రావచ్చును. ఆ మానసిక సంచలనాన్నే రస భావమంటాము. మామూలు మానవుని మనస్సులోకంటె, కవిహృద యంలో ఈ రసభావాలు, ప్రకృతిలోని అందమైన వస్తు సముదాయాన్ని ఈక్షించినపుడు ఎక్కువగా ఉప్పొంగుతాయి. వర్డ్సువర్తు అనేదేమిటంటే, ప్రకృతి లోని ఏ వస్తువునుచూచినా, హృదయ మానందంతో తాండవించే వ్యక్తి మాత్రమే సిసలైన కవి యనిపించు కొంటాడని ఆతడు పూర్ణహృదయుడు. అతని హృద యంలో ప్రపంచమంతా రూపుతీరి ఉంది. ప్రపంచ మందలి అన్నివస్తువులూ, అతని హృదయంలో స్థానా నాక్రమించుకొంటాయి. కనుక, తన గుండెల్లో పూర్వమే స్థాన మేర్పరుచుకొనిన వస్తువువంటి దానిని బాహ్యప్రపంచంలో తాను గాంచినపుడు, అతనికి హద్దులేని ఆనందం కలుగుతుంది. ఆ హద్దులేని హృదయోద్రేకానికి ఒక స్థాయి ఏర్పడాలన్నది వర్డ్సు వర్తు చెప్పే రెండవ విషయం. అంతదాకా కవి కావ్య సృష్టికి పూనుకొనరాదు. ఆ హృదయోద్రేకం, నదికి వరదలులాగ వచ్చి పోయేదికాకుండా, శాశ్వతత్వం నెలకొల్పుకోవాలి హృదయంలో. ఆ సంతోషాన్ని వస్తువునుచూచిన ఒక క్షణమే కాకుండా. దానిని తలంచుకొన్న ప్రతిక్షణమూ అంత పరిమాణములోను కవి పొందగలుగుతాడని వర్డ్సువర్తు భావము. అట్టి హృదయము కలిగియుండడము కవికొక వరము. అతడు విచారముగా కుమిలిపోయే వేళల్లో తాను పూర్వము ఎప్పుడోచూచిన అందమైన వస్తువులతాలూకు తనహృదయం అనుభవించిన ఆనందపూరిత రస భావము, ఆ విషాద సమయంలో అతడు నెమరు

వేసుకొని విచారాన్ని మరచి ఆనందాన్ని పొందగలుగుతాడు అలా శాశ్వతత్వాన్ని గూర్చుకొన్న హృదయగత రసభావం మాత్రమే కావ్యవస్తువు కాదగినది. ఏ వస్తువును చూచిన తర్వాత ఎన్ని ఏండ్ల తర్వాతనైనా సరే, ఆ వస్తువును చూచిన ఆనందాన్ని కొంతకూడ మరవజాలమో, అట్టి వస్తువును కావ్యవస్తువుగా చేసికొని విరచించిన కావ్యమే చిరకాలము మనగల కావ్యమవుతుంది. ఆ రకంగా ఊహించగలవాడే నిజమైన కవి.

ఉన్నతములైన ఊహలు, ఊహలకు తగిన హృదయమూ కల్గిన కవి తన కావ్యాన్ని ఎట్టి భాషలో వ్రాయాలో ముందే ఆలోచించి, తన కావ్యాలద్వారా ప్రదర్శించి అనేక ఇతర కవులకు ఆదర్శప్రాయుడైనాడు వర్డ్సువర్తు. సామాన్యమానవునీ, అతిసామాన్య వస్తువునూ, కావ్యవస్తువుగా అంగీకరించినతుర్వాత, వర్డ్సువర్తు సాహజంగానే, కావ్యముయొక్క భాష, సామాన్యమానవు డువయోగించు భాష అయి ఉండాలని నిర్వచించేడు. కాని సామాన్యమానవుని భాష సాధారణంగా పూర్తిగా కావ్యానికి పనికి రాకపోవచ్చును. అట్టియెడ, ఆభాషలోని రమ్యమైన పదములు, కావ్యమునకు తగిన వాక్యములు ఎన్నిక చేసికొనవలసిన బాధ్యత కవికి ఉన్నది. సామాన్యమానవుని భాష అర్థముచేసికొని కావ్యంలో నుపయోగించు కొనడములోనూ, దానిని కావ్యమునకు తగినట్లుగా ఎన్నిక చేసికొనడములోనూ, కవియొక్క నేర్పూ, సామర్థ్యమూ ఇమిడి ఉంటాయి.

ఇన్ని లక్షణాలలో సర్వాంగ సుందరంగా కావ్యం తయారు కావడానికి కవియొక్క బుద్ధీ మనస్సూ ఆత్మా పూర్తిగా ఉపయోగపడాలి. ఇవిమూడూ మిళితమైనపుడే, నిజమైనకావ్యము సృంజిపబడుతుంది. ఒక వస్తువును గాంచినపుడు, అది మనస్సులో భావసంచలనము కలిగిస్తుంది అ సంచలన బుద్ధిచేత సంస్కరింపబడి ఆత్మకి సోకాలి. అపుడు ఆత్మలో ఆ భావము శాశ్వతత్వము నెలకొల్పుకొనిన తర్వాత అదే మనస్సుకి చేరుతుంది. అప్పటినుంచి బుద్ధిచేత సంస్కరింపబడి, కావ్యములో చేరుతుంది. ఈక్షాళన జరిగిన భావము కావ్యమునకు తగినదని వర్డ్సువర్తునిర్ణయించుకొన్నాడు. ఇట్టి నిగ్రహము కావ్యలక్షణముగాగల కవులు కొలదిమందిమాత్రమే మనకు దొరుకుతారు. భారత కవులంగీకరించిన ఈ నిగ్రహము వర్డ్సువర్తులో మనము దర్శించగలగడము అదృష్టం. రామాయణమంతటి మహాకావ్యము, ఈ నిగ్రహము కొరవడితే, ఇంకా ఎన్ని వేల శ్లోకాలను భరించవలసివచ్చునో ఊహింపజాలము. మానవుని ఆత్మనుగూర్చి ఇంత స్పష్టభావాలను కలిగియుండుటములోనూ, ప్రకృతిలోని ఆత్మను సందర్శించి దానిని ఆరాధించడములోనూ వర్డ్సువర్తు మన ప్రాచ్య వేదాంత తత్త్వానికి దగ్గర సంబంధం కలవాడైనాడు. అందుకు వర్డ్సువర్తును పాశ్చాత్య వీధుల విహరించే ప్రాచ్యవిహంగమనడం సమంజసం.

# పద్మనాభ యుద్ధము

శ్రీ తల్లాప్రగడ సత్యనారాయణమూర్తి

విశాఖపట్టణమండలి భీమునిపట్టణమునకు సమీపమునగల 'పద్మనాభ'మను గ్రామమువద్ద 1794 సం॥లో కళింగ విజయనగర సంస్థానాధీశ్వరులకును అంగ్లేయులకును యుద్ధమొకటి జరిగెను. ఇందు విజయనగరమువారు పొందిన అపజయమే ఆంధ్ర దేశములో అంగ్లేయుల పాలన సుస్థిరమగుటకు దోహదము చేసినది. అందుచేతనే దీనిని చాల చారిత్రక ప్రాముఖ్యము గల యుద్ధముగ చరిత్రకారులు భావింతురు.

కళింగ విజయనగర సంస్థానమునకు మూల పురుషులు మాధవర్మాభిధానులగు పూసపాటి తిమ్మి రాజుగారు. ఈయనవంశమునకు చెందిన సీతారామ చంద్రుడుగారు 1687లో ఔరంగజీబు గోలుకొండపై దండెత్తివచ్చినపుడాయనకు సహాయముచేసిరి. ఉత్తర సర్కారు మండలములలో కుతుబ్‌షాహి పాలన నంతమొందించి, ఆప్రాంతము లన్నిటిని తన ఏలుబడిలోనికి తెచ్చుకొని 'సార్వభౌమ' బిరుదు వహించి మొగల్‌చక్రవర్తికి కప్పము కానుకలు బంపెను. ఇందుకు మెచ్చి పాదుషా 'జుల్ఫికార్'అను ఖడ్గమును, మొగలుసామంతుల కర్హమైన మరికొన్ని లాంఛనాలంకారములను నాయనకు బంపెను. అనాటినుండి పూసపాటివారు నామమాత్రముగ మొగలు చక్రవర్తికి సామంతులై, చక్రవర్తికిగాని, అయనచే నియమింపబడిన దక్కన్ సుబేదారులకుగాని కప్పము చెల్లించుచు వాస్తవమునకు స్వతంత్రులై "మహామండలేశ్వర", 'మహీమండలరాయ', 'మన్నెసుల్తాన్' అను బిరుదురు వహించి ఉత్తరసర్కారు జిల్లాలలోని అధిక భాగములను పరిపాలించిరి.

1734 నుండి 1757 వర కీసంస్థానమును పాలించిన పెదవిజయరామగజపతిగారు అద్వితీయ ప్రతిభాశాలి. రాజమహేంద్రవరము ఫౌజ్‌దారయిన

మూరుద్దీనును, శ్రీకాకుళము ఫౌజ్‌దారయిన బహదురుల్లాఖానుని, సర్కారు జిల్లాలపై దాడివెడలిన మహారాష్ట్ర పిండారీమూకను ఓడించినధీశాలి. అందుచేతనే "ఢిల్లీలోపల గోలకొండపురి నిండెన్ నీ ప్రశంసల్" అని ఆడిదము సూరకవి ఆయనను ప్రశంసింపగా "కటకంబు మొదల్కొని గోలకొండ పర్యంతము నీవెకా! విజయరామనరేంద్ర! నురేంద్రవైభవా!" అని ఢిట్టకవి, నారాయణకవి కీర్తించెను

1682 లో విశాఖపట్టణములో తమ వర్తక స్థావర మేర్పరచుకొనిన ఇంగ్లీషు కంపెనీవారు పూసపాటివారి దయకు పాత్రులై ఉత్తరసర్కారులో వ్యాపారము జేసికొనెడివారు 1751 నవంబరు 7వ తేదీని పెదవిజయరామగజపతి బెండమూర్లంక రేవు దర్శించినపుడు ఆది తమకు కౌలుకిప్పింపుడని ఇంగ్లీషువారును, ఫ్రెంచివారును నాయనను ప్రార్థించిరి. తమకా రేవుపట్టణము కౌలుకిప్పింపబడనిచో తమ వ్యాపారమునకెంతో నష్టము వాటిల్లునని ఆంగ్లేయులాందోళన జెందిరి కాని, అవసరమయినచో దక్కన్ సుబేదారుని, మొగల్ చక్రవర్తినికూడ ఎదిరించి నిలిచి ఆ గ్రామమును ఇంగ్లీషువారి కిచ్చెదనని విజయరామగజపతి వారికి వాగ్దానము చేసెను. 1

కారణాంతరముల వలన విజయరామగజపతి, ఫ్రెంచికంపెనీ సైనికాధికారియగు 'బుస్సీ' కలసి 1757 జనవరి 24వ తేదీని బొబ్బిలి ముట్టడించి వశముకొనిరి. యుద్ధము ముగిసిన మూడవనాటి రాత్రి విజయరామరాజు తన డేరాలో నిద్రించుచుండగా హత్యచేయబడెను. బొబ్బిలి, విజయనగర రాజ్యముల రెండింటి పతనము కాంక్షించిన ఫ్రెంచివారు కూడా దీనికి బాధ్యులని చాలమంది సమకాలీను లభిప్రాయపడిరి 2 విజయరామరాజుగారి అనంతరము విజయనగరాధీశ్వరుడైన ఆనందరాజు తన తండ్రి గురించి అగౌరవముగా మాట్లాడిన "బుస్సీ" పై "మాతండ్రిగారిని నీ భరువసామీద పంపించినాము. ఆయనను మాత్రము చంపి నీవు బ్రతికి వచ్చుటకు హేతువేమి? ఇంత తప్పు చేసి నిన్ను నుంచుకొని మాతో క్షుద్రపుమాట లాడవచ్చినావా?" అని మండిపడి యాతనిని గోదావరి యవతలవరకు తరుమగొట్టించెను. 3

ఇదే కాలమందు ఇంగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని మూడవ కర్నాటకయుద్ధము సాగుచుండెను 1758 జూన్ నెలలో సర్కారుజిల్లాలలోని ఇంగ్లీషు స్థావరములను, విజయనగరమువారి అనుమతిలేకుండగ, ఫ్రెంచివారు స్వాధీనముచేసికొనిరి అంతే బుస్సీపై పగబట్టియున్న ఆనందరాజు ఈ అదనులో కోస్తాజిల్లాల నన్నిటిని ఫ్రెంచివారి పాలనుండి విముక్తిచేయవలెనని నిర్ణయించుకొని 4 వారిపైయుద్ధము ప్రకటించి తనకు సహాయము రావలసినదిగా మద్రాసులోనున్న ఇంగ్లీషు కంపెనిఅధికారులకును, బెంగాలులో నున్న "క్లైవు" నకును వ్రాసిరి. కాని వారివద్ద

---

1 Letter from the Vizagpatam Chief dated 10-11-1751.

2 "Some people imagine the anamination of Vizayaramaraj at Bobbili was perpetrated by Rangarao's relations out of revenge. Others think the French at the bottom of it ...".
Letter from the Visakhapatnam Chief dated 8-3-1758.
"రాజుచావుకు వంత పరాసుబలము సంతసం బందె హైదరుజంగుతక్క"
రంగరాయచరిత్రము—

3 పూసపాటివారి కైఫీయతు.

4 1753 లోనే సర్కారుజిల్లాలు దక్కన్ సుబేదారగు సిలాబత్‌సింగ్‌చే ఫ్రెంచి కంపెనీకి దఖలుపరుపబడినవి.

నుండి జవాబు రాకపూర్వమే తన దండయాత్రప్రారంభించి 1758 సెప్టెంబర్ 2వ తేదీని విశాఖపట్టణమందలి ఫ్రెంచి కర్మాగారమును స్వాధీనపరుచుకొని, దానిపైగల ఫ్రెంచిపతాకమును దింపించి అంగ్లేయ పతాకము నెత్తించెను[5]. మరి కొద్దిరోజుల యనంతరము 'కర్నల్ ఫోర్డ్'అనుసైనికాధికారియు, 'ఆంధ్రూస్' అను ఉద్యోగియు, ఆనందగజపతి కశింకోటవద్దనున్నప్పుడు ఇంగ్లీషుకంపెనీత రఫునవచ్చి, అయనతో సంభాషణలుజరిపి ఒక సంధిచేసికొనిరి. 1758 నవంబరు 15వ తేదీని సంతకములు జరిగి యీసంధివలన నీ క్రింది ప్రధానాంశములపై నుభయులకు అంగీకారము కుదిరినది :

(అ) యుద్ధకాలమందు సైనికసంబంధమైన ఖర్చుల నిమిత్తము నెలకు రూ 50000 లును, సైనికాధికారుల దినభత్యము నిమిత్తము నెలకు రూ 6000 లును ఆనందగజపతి అంగ్లేయుల కీయవలెను.

(ఆ) ఉభయసైన్యములు కలసి జయించిన ప్రాంతములు ఆనందగజపతి ఏలుబడిక్రిందకు వదలివేయబడవలెను; రేవుపట్టణములు మాత్రము కంపెనీవారి కీయబడవలెను.

(ఇ) ఉభయులలో ఎవరైనను తమ ప్రాంతములనుగాని, స్థావరములనుగాని యితరులకు విక్రయించునపుడుగాని, ఉచితముగా నిచ్చునపుడుగాని, రెండవవారి అనుమతి పొందవలెను[6]

5 Col. Mallesonis 'Decisive Battles of India'

6 'History of the Military Transactions of the British Nation in Indostan' vol. III, By Robert Orme.

ఈ సంధి చేసికొనుటతో అంగ్లేయులు విజయనగరమువారికి ఉత్తరసర్కారుమండలములపైగల సర్వసత్తాధికారమును గుర్తించుటయేగాక, ముందు ఉభయులు కలిసి జయింపబోవు దక్షిణసర్కారు మండలములు కూడ విజయనగరమువారికి చెందునని అంగీకరించిరి.

సంధి జరిగినవెంటనే ఉభయసైన్యములుత్వరితగతిని పురోగమించి చెందుర్తి[7] మచిలీపట్టణములవద్ద ఫ్రెంచిసైన్యములను పూర్తిగా నోడించెను మన దేశములు అంగ్లస్థాపనమునకు దోహదముచేసిన అతిముఖ్యమైన యుద్ధములో ఇవికూడ పరిగణింపబడుచున్నవి[8]. ఈ విజయములకు విజయనగరసైన్యమే ప్రధానపాత్ర వహించుచున్నదని గ్రహించిన దక్కన్ సుబేదారు సలాబత్‌జంగ్ ఇంగ్లీషువారిని విడిచి ఫ్రెంచివారికి సహాయముచేయుమని ఆనందరాజునకు ఉత్తరము వ్రాసెను[9]. కాని ఆనందరాజాడితప్పలేదు. క్లిష్టస్థితిలో చిక్కుకున్న తమకు. ఆనందరాజనుసరించిన విధానమెంతో రక్షణనిచ్చి, బలము చేకూర్చినదని అంగ్లచరిత్రకారులుకూడ నంగీకరించిరి[10] కాని ఆనందగజపతి ఇంగ్లీషువారిపట్ల ప్రదర్శించిన విశ్వాసము వా రాయనయెడల చూపలేదు. అకస్మాత్తుగా కర్నల్ఫోర్డ్ సూబన్‌జంగ్‌తో 1759 మే 14వ తేదీని సంధిచేసికొని, ఒకప్పుడు ఫ్రెంచివారికీయబడినదక్షిణ సర్కారు మండలములను ఇంగ్లీషుకంపెనీకి సంపా

7 'చెందుర్తి' అను గ్రామము తూర్పుగోదావరిజిల్లా గొల్లప్రోలువద్దగలదు అంగ్ల చరిత్రకారులు దీనిని 'కొండూరు' అని పొరపాటుగా వ్రాసిరి.

8 Col. Mallesonis 'Decisive Battles of India'

9 Bronis 'History of the Rise and Progress of the Bengal Army'. Vol. I

10 Ilid

దించెను. అంతేగాక అనంతగజపతి యెడల సలాబత్ జంగ్ తన కిష్టమైన విధానమవలంబింపవచ్చుననియు, అంగ్లేయు లాతని శత్రువులకు సహాయము చేయరనియు వాగ్దానము చేయబడెను[11]. ఈ సంధి చేసికొనుట ద్వారా ఇంగ్లీషువారు 1758 నవంబరు 15వ తేదీని ఖిళింకోటవద్ద అనందగజపతితో చేసికొన్న సంధికి, సంవత్సరము తిరగకుండగనే నీళ్లు వదలినారు. తమ సామ్రాజ్యవ్యాప్తికి వారు మనదేశములో చేసినఅత్యంత విశ్వాసఘాతుక చర్యలలో నిదియొకటి. కానిదక్షిణ సర్కారులతోపాటు ఉత్తరసర్కారులనుకూడ సలాబత్‌జంగ్‌వద్దనుండి స్వీకరించుటను వారికి ధైర్యము చాలలేదు.

ఈ సమాచారము తెలిసిన అనందగజపతి సలాబత్‌జంగ్‌నుండి తన రాజ్యమునకు ముప్పవచ్చునను భయముచే యుద్ధసన్నాహములు చేయనారంభించెను. కాని దురదృష్టవశమున బెజవాడలో మశూచికి గురియై, రాజమహేంద్రవరమువరకు ప్రయాణముచేసి అచ్చట అకాల మృత్యువు వాతబడెను సలాబత్‌జంగ్ ఈ అదను చూచుకొని ఉత్తర సర్కారుల నాక్రమించుట కుద్యుక్తుడగుచుండెను. అయినప్పటికిని పెదవిజయరామరాజుగారి సతీమణి చంద్రమ్మగారు ధైర్యము చిక్కబట్టి రాజ్యవ్యవహారములు చక్కదిద్దుట కుపక్రమించెను. తమ జ్ఞాతులలో ఒకరగు పూసపాటి రామభద్రరాజుగారి రెండవ కుమారుని దత్తతచేసికొని[12], అయనకు చినవిజయరామగజపతియని నామకరణముచేసి వెంటనే పట్టాభిషిక్తునిజేసెను. అటుపిమ్మట తమ సోదరులగు చింతలపాటి నీలాద్రిరాజుగారిని, దివాన్ గుండాల అప్పాజీగారిని, పూసపాటివారికి అత్యంత విశ్వాసపాత్రులైన బుర్రా లచ్చన్నగారిని, తగినంత సిబ్బందిని తీసికొని, చినవిజయరామగజపతిగారితో రాజమహేంద్రవరమువచ్చి, అచ్చట విడిసియున్న సలాబత్‌జంగ్‌తో మంతనముసలిపి, పూసపాటి ప్రతిష్ఠకేమాత్రము భంగము వాటిల్లకుండ, పూర్వమువలెనే దక్కను సుబేదారుద్వారా మొగల్‌చక్రవర్తులకు కప్పముచెల్లించుట కంగీకరించి. చినవిజయరామరాజు పరిపాలనకు సలాబత్‌జంగ్ వద్దనుండి గుర్తింపు పొందెను.

కాని యాంతరంగిక కలహములవలన రాజ్యమరాజక స్థితిలో పడజొచ్చెను. విజయరామరాజు పసివాడు: చంద్రయ్యమ్మ వార్ధకమునందుండెను. అందుచే మహారాజు సవతిసోదరుడైన సీతారామరాజు దివాన్‌గా నియమింపబడి, రాజ్యవ్యవహారములు చూడ నారంభించెను. ఈయన తమ్మునికి ద్రోహముచేసి తానే రాజుకావలెనని ప్రయత్నించిన స్వార్థపరుడు; వంశ పుపేరుప్రతిష్ఠల మంటగలిసి ఇంగ్లీషువారితో చేతులుకలిపిన సంకుచిత స్వభావముకలవాడు. తన కుటిలప్రయత్నముల కడ్డంకులు కల్గించుచున్న చంద్రయ్యమ్మను దేవుపల్లి కోటలో నిర్బంధించిచంపించిన క్రూరుడు. కంపెనీవా రీయని ప్రాపు సంపాదించి రాజ్యాపహరణమునకు తగు యత్నములుచేయ నారంబించిరి. కాని వారికి చట్టము ననుసరించి విజయనగరరాజ్యవ్యవహారములలో కలుగజేసికొనుటకెట్టి హక్కుకాని, అవకాశముగాని లేవు. ఈచిక్కును తొలగించుకొనుటకై 1765 అగస్టు 12వ తేదీన, సామ్రాజ్యముకోల్పోయి నిరాధారుడై, దేశద్రిమ్మరిగా తిరుగుచున్న మొగల్‌చక్రవర్తి 'షాఆలం' వద్దనుండి అలహాబాద్‌లో సర్కారుజిల్లాలను ఇంగ్లీషుకంపెనీకాయన ధారాదత్తముచేసినట్లు కైవొకఫర్మానా సంపా

11 Aitclisois 'Tneaties' Vol, VIII (3rd edition)

12 చినవిజయరామ గజపతిగారు కన్నతల్లిద్వారా పశ్చిమ గోదావరిజిల్లా తెలికిచర్ల సంస్థానాధీశ్వరులైన ఉప్పలపాటివారి దౌహిత్రులు.

దించెను[13] తాము మొగలుచక్రవర్తులకుమాత్రమే సామంతులమని పూసపాటివారు చేయుచున్న వాదనను త్రిప్పికొట్టుటకే తైవు ఈయెత్తుఎత్తెను. కాని ఆనాటి దక్కన్ సుబేదారైన నిజామ్అలీ యీ చర్యను తీవ్రముగా గర్హించెను[14]. ఇందుకు బెదరిపోయిన కంపెనీవారు[15] నిజామ్అలీతోనే 1766 నవంబరు 12 వ తేదీన సంధిచేసికొని ఉత్తరసర్కారులనుకూడ సంపాదించిరి. ఈసంధి నాల్గవ అంశములో "భగవంతుని దయవలన శ్రీకాకుళము సర్కారును (అంటే పూసపాటివారి రాజ్యప్రాంతమని అర్థము) త్వరలోనే ఆక్రమించుకోగలమని" ఆశాభావము వెలిబుచ్చిరి[26]. దీనినిబట్టి విజయనగరమువారికిని కంపెనీవారికిని వైరము తగిన కారణములుండి ఏర్పడినదికాదని, ఇంగ్లీషువారు ముందు దురాక్రమణ స్వభావముతో వైరమువహించి, తరువాత దానిని కొనసాగించు నిమిత్తము కారణములు వెతుకనారంభించిరని తేటతెల్లము కాగలదు.

మొగల్ చక్రవర్తిఫర్మానా, దానికి బూజుపట్టించి నిజామ్‌లో చేసికొన్న మరొక సంధిపత్రము, సీతారామరాజు సహకారము, ఇన్ని ఉన్నను వారు విజయనగర రాజ్యముపై కన్నెత్తి చూడలేకపోయిరి పూసపాటివారు సర్వ స్వతంత్రులనియు వా రేఫర్మానాలను ఖాతరుచేయరనియు వారికి తెలియును. అందుచేతనే ఒక ఒడంబడికద్వారానే విజయనగర రాజ్యములో నడుగుపెట్టవలెనని తలంచి అందుకు మహారాజుపై అనేకవిధముల యొత్తిడి తేనారంభించిరి. చివరకు 1768లో నవాబ్ హసన్అలీఖాన్, కాండ్రేగుల జోగిపంతులు విజయనగరము వచ్చి, విజయ రామగజపతినొప్పించి ఒడంబడికపై సంతకము పెట్టించిరి దీనిప్రకారము విజయనగరమువారు సాలునకు మూడులక్షల రూపాయలు కంపెనీవారికి పేష్కస్ రూపములో చెల్లింపవలసియుండును. (17) అంతరంగికములైన చిక్కులతో బాధపడుచున్న మహారాజు అప్పుడు కంపెనీతో వైరముపూనుట మంచిదికాదని దక్కన్ సుబేదారునకు చెల్లించుచున్న పేష్కస్ కంపెనీకి చెల్లించిన వచ్చిన నష్టమేమియు లేదనినమ్మి యీ ఒడంబడిక కంగీకరించినట్లుతోచును. ఆయన భావించినట్లుగానే యీ ఒడంబడిక విజయనగరమువారిపై కంపెనీవారికి ఎటువంటి రాజకీయాధికారముల నీయలేదు. ఈసంధిమాత్రము సీతారామరాజున కొక ఘనవిజయము. కొంతకాలమాయన హయామునకు పట్టపగ్గాలులేవు. రిచర్డ్ మాథ్యూస్ అను నాంగ్ల సైన్యాధికారిసహాయముతో ఆయన ప్రజలను, జమీందారులను అనేకవిధముల బాధించెను. (18) ఈ చర్యలతో విసిగి వేసారిన మహారాజు 1775 లో సీతారామరాజును దివాన్ పదవినుండి తొలగించెను. కాని పదవీచ్యుతుడైన సీతారామరాజు కంపెనీ హవేలీ భూములను గుత్తకు తీసికొని, వారి సహకారములో తమ్మునిపై కుట్రలను మరింత తీవ్రతరముచేసెను.

1776లో మద్రాసు గవర్నర్‌గానున్న పిగో సర్కారులలోని సంస్థానముల పరిస్థితులగురించి పరిశీలించుటకై ఒక విచారణ సంఘమును నియమించెను. ఆయనతర్వాత గవర్నరుగావచ్చిన థామస్ రంబోల్డ్ యీసంఘు కార్యకలాపముల నాపుచేయించి తానే విచారణ జరుపు నుద్దేశముతో సంస్థానాధిపతులను మద్రాసువచ్చి తనముందు హాజరుకమ్మని తాఖీదులు పంపెను. తాను మద్రాసువెళ్ళి గవర్నర్‌ముందు

13 Aitclisais 'Treaties' Vol. VIII
14 Gleig's 'History of India' Vol.II
15 District Manual
16 Aitclisadis 'Treaties' Vol. VIII

17 Manual of the Administration of Madras Presidency. Vol. I
18 District Manual

హాజరుకాలేననియు, సీతారామరాజు తన శ్రేయోభిలాషి కాదుకనుక అయన తనతరఫున హాజరగుటకు వీలులేదనియు విజయరామరాజు జవాబువ్రాసెను. కాని సీతారామరాజుమాత్రము మద్రాసువెళ్ళి గవర్నర్ కార్యదర్శియైన రెడ్‌హెడ్‌కి ఒక లక్షరూపాయలు లంచమిచ్చి (19) తనకనుకూలమగు నుత్తర్వులను జారీచేయించుకొనెను వీని ననుసరించి దివానును నియమించు నధికారము కంపెనీవారు తీసుకొని సీతారామరాజు నా పదవికి నియమించిరి. విజయరామరాజు తదనంతరము సీతారామరాజు కుమారుడగు నరసింహగజపతి సంస్థానాధీశ్వరుడు కావలెననియు, అయనకు యుక్తవయస్సు వచ్చువరకు తండ్రి రక్షకుడుగా వ్యవహరింపవలెననియు, కౌళ్ళు, కదపాలు అనాటినుండి నరసింహగజపతిపేర వ్రాయబడవలెననియుకూడ తెలియజేసిరి, పైగా ఈ ఉత్తర్వుల నమలుజరపనిచో చాల తీవ్రఫలితముల ననుభవింపవలసి వచ్చునని గవర్నర్ బెదరించుచు మహారాజునకు ఉత్తరము వ్రాసెను. (20) ఇందుకు సమాధానముగా మహారాజు చట్టము ప్రకారము గవర్నర్ ఉత్తర్వులు చెల్లనేరవనియు. అవి తన యధికారము లాగుకొనుటకు ఉద్దేశింపబడినవనియు. వీనిని తాను అమలుజరుపలేననియు ఖండితముగావ్రాసి మద్రాస్ గవర్నరుకు, లండన్‌లోని కంపెనీ డైరెక్టర్ల సమితికి కూడ లేఖల బంపెను. దీనిపై కంపెనీ డైరెక్టర్ల సమితి గవర్నర్ చర్యలను రద్దుచేయుచు మహారాజుకు బాధకలిగించినందుకు విచారము తెలియబుచ్చుచు 1781 జనవరి 10వ తేదీని ఉత్తర్వులను పంపినది. అంతేకాక ఇటువంటి అవకతవకపనులు మరికొన్నికూడ చేసినందుకు గవర్నర్ రంబోల్డును, అయన కౌన్సిల్‌లోని యిద్దరు సభ్యులను బర్తరఫ్ చేసెను. (22)

1776లో ఏర్పరుపబడి విచారణసంఘము 1783లో తిరిగి తనపని ప్రారంభించి 1784 నాటికి నివేదిక సమర్పించినది. ఇందు విజయనగర సంస్థాన పరిస్థితులు చాల దుస్థితికి లోనైయున్నవనియు దీనికి సీతారామరాజు ప్రధానముగా బాధ్యుడనియు పేర్కొనబడెను. కాని యీదుస్థితి తొలగుటకు చేయబడిన ప్రతిపాదనలుమాత్రము చాల విచిత్రమైనవి. జయపురము, పాలకొండ జమీందారీలు విజయనగరము నుండి వేరుచేయవలెననియు, విజయనగర సిబ్బంది తగ్గింపబడవలెననియు, అట్లు తగ్గింపగా మిగిలిన ధనము, ఇదివరకు చెల్లించుచున్న సొమ్ము మొత్తము తొమ్మిదిలక్షల రూపాయలు విజయనగరమువారు కంపెనీవారికి పేష్కస్‌గా సాలునకుచెల్లింపవలెననియు సూచింపబడినది. కంపెనీ అధికారులీ సూచనల నంగీకరించి. సిబ్బంది తగ్గించుకొని, తొమ్మిదిలక్షల పేష్కస్ చెల్లింపుమని, దీనికి బదులుగా అనకాపల్లి జమీందారీ విజయనగరమువారికి దఖలుచేసితిమనియు మహారాజునకు తెలియజేసిరి దీనితో పోటీపరతు లుదాహరింపబడిన కౌలుపత్ర మొకటి మహారాజు సంతకమునిమిత్త మాయనకు పంపబడినది (23). సీతారామరాజు దుశ్చర్యలకు ప్రత్యక్షముగాను, పరోక్షముగాను కంపెనీవారే బాధ్యులు తాముచేసిన అవినీతిపనుల దుష్ఫలితములకు శిక్ష విజయరామరాజు ననుభవింపుమనుట, అందులోను అతీర్పు తామిచ్చుట అంగ్లేయ రాజకీయవేత్తలకు మాత్రమే చెల్లినది. సిబ్బంది తగ్గింపు దుస్థితిలోనున్న పరిస్థితుల నేవిధముగా బాగుపరుచును? అంతేకాక పరిస్థితులు

19 Third report of the Parliamentary Committee of Secrecy.

20 District Manual.

22 Second Report of the Committee of Secrecy.

23 District Manual.

బాగుగా లేసంతమాత్రమున విజయనగరరాజ్యపు అంతరంగిక వ్యవహారములలో జోక్యము కల్పించుకొను హక్కు, అధికారము ఆంగ్లేయుల కెప్పుడు, ఎట్లు సంక్రమించెను ? తమకెటువంటి హక్కులేదని వారికి పూర్తిగా తెలియును. అందుచేతనే క్రొత్తషరతుల కంగీకరించి, తనంత తానుగా కంపెనీ అధికారమునకు లోబడిన ఒక చిన్నజమీందారుస్థాయికి దిగజారి పొమ్మని సూచించుచు విజయరామరాజునకు కౌలు పత్రము పంపిరి. విషయములన్నియు చక్కగా అవగాహన చేసికొన్న మహారాజు గవర్నర్ ఉత్తర్వులను అమలుజరుపలేదు.

ఒకప్రక్క రాజుమీద ఒత్తిడి తీసికొనివచ్చుచు మరొక్కప్రక్క రాజ్యములో అంతఃకలహములను కంపెనీవారు మరింత తీవ్రముగా రెచ్చగొట్ట నారంభించిరి. సీతారామరాజుద్వారా దాట్ల వేంకటపతిరాజు, రోడుగంటి రామజోగివంతులు వుప్పల రమణప్పనాయుడు అను ముగ్గురు సర్దారులను తమవైపు త్రిప్పుకొని విజయనగరమువారి గుట్టుమట్టులు సేకరించిరి. పరిస్థితులు తమకనుకూలముగా పరిపక్వమయిన తర్వాత 1793 మే 29వ తేదీన తాము బాకి పడిన ఆరున్నర లక్షలరూపాయలు వెంటనే చెల్లింపనిచో రాజ్యభ్రష్టులగుదురని హెచ్చరించుచు విజయరామరాజునకొక లేఖనువ్రాసిరి. దీనికి జవాబుగా, పేష్కస్ పెంచు అధికారము కంపెనీకి లేదనియు, ఏవిధముగా చూచినను తాము కంపెనీవారి కీయవలసినబాకీ అంత పెద్దమొత్తము లేదనియు, ఉన్నస్వల్పమైన బాకీ మూడు వాయిదాలలో చెల్లింపగలవాడననియువ్రాసి, దీనికాధారములగు పత్రములతో దగ్గిరాల బుచ్చన్నగారను సంస్థానాధికారిని మహారాజు మద్రాసు పంపెను. సీతారామరాజు మద్రాసులో నున్నప్పుడు విజయరామరాజాయనకు కంపెనీవారికి జమకట్టు నిమిత్తము ఒకలక్ష వెయ్యిరూపాయలు పంపెను. ఇవి న్యాయమని అంగీకరించినప్పటికిని[24], ఆసొమ్ము తమకు ముట్టలేదనియు, అందుచే అవి తిరిగి చెల్లింపవలెననియు ఇంగ్లీషు అధికారులు వాదించిరి. గత 18 సంవత్సరములనుండి కంపెనీవారు విజయనగరమువారికి చెల్లింపవలసిన హాసీల (సరుకుల రవాణాపైపన్ను) నూఱులక్షల ఏబదివేలరూపాయలు తేలినవి ఇది తాము చెల్లించవలసినమాట వాస్తవమేనని అంగీకరించుచు ఇంతకాలమునుండి ఆ సొమ్ము వసూలు చేయని విజయనగరమువారా బాకీ నిప్పుడు చెల్లింపుమని అడుగుటకుహక్కులేదనిరి.[25] అంతేగాక దీనినొక రాజకీయసమస్యగాకూడ వారు పరిగణించిరి. తాము హాసీలు చెల్లించు మహారాజును పేష్కస్‌ను హెచ్చుచేసి చెల్లింపుమని యడుగు నధికారము తమ కెక్కడనుండి వచ్చినది ? అందుచే హాసీలు ఎగవేసినారు చివరకు తాముతేల్చిన బాకీఅయినను వాయిదాలలో చెల్లించుటకు విజయనగరమువారి కనుమతినీయలేదు.

బాకీ చెల్లింపలేదను నెపముమీద ప్రెండర్‌గాస్ట్ అను నాతని నాయకత్వమున ఒక 'ఆంగ్లేయ పటాలము' 1793 అగష్టు 2వ తేదీన విజయనగరము కోట నాక్రమించి, సంస్థాన పరిపాలన స్వాధీనము చేసికొనెను. అంతేగాక విజయరామరాజుపై ఒత్తిడి తెచ్చి ఆయన విశాఖపట్టణము మకాము మార్చుకొనునట్లుచేసిరి. తమకు నమ్మినబంటుగా వ్యవహరించిన సీతారామరాజును నెలకు ఐదువేలరూపాయలు భరణమిచ్చి మద్రాసుపంపిరి. విజయరామరాజు, ఆయన అనుచరులు సామరస్యపూర్వకముగ వివాదము పరిష్కరించుకొనుట కనేకవిధముల కృషిచేసిరి. కాని

24 Third Report, Committee of Secrecy, 1781.

25 District Manual

ఇంగ్లేషువా రీకృషిని విఫలముచేసిరి[26]. కాని ప్రజలు కంపెనీ అధికారులతో సహకరింపలేదు. పరగణాలను ఇజురాకు తీసికొనుట కెవ్వరును ముందుకురాలేదు. తొమ్మిది నెలలపాటు శిస్తువసూళు జరగలేదు[26]. ప్రజలలో మహారాజునకున్న ప్రేమాభిమానముల నర్థముచేసికొనిన కంపెనీయధికారులాయనను మచిలీపట్టణము తరలిపొమ్మని 1794 ఏప్రిల్ నెలలో ఉత్తరువులు జారీచేసిరి. నెలకు పండ్రెండు వందలరూపాయలు భరణ మిచ్చెదమనియు ప్రయాణపు ఖర్చులనిమిత్తము ముప్పదివేల రూపాయలు అప్పుగా నిచ్చెదమనికూడ తెలియజేసిరి.

పిడుగువంటి ఈఉత్తర్వు నందుకొనిన మహారాజు మనసు వికలమయిపోయినది. ఆంగ్లేయులు కోరునది తన సర్వనాశనమని స్పష్టమయినది. నీతిలేని రాజనీతి నవలంబించు కంపెనీవారు సామరస్యపూర్వకముగా వివాదము పరిష్కారము కానీయరని తేలిపోయినది. వారికి కావలసినది విజయనగర సామ్రాజ్యలక్ష్మి దీని సాధనకై వారెట్టి అవినీతిచర్యలకైనను సిద్ధము. కంపెనీవారిక్రింద దాస్యమో లేక వారితో యుద్ధమో తేల్చుకొనవలసిన సమయ మాసన్నమైనది. విజయరామరాజు రెండవదానినే వరించెను. వెంటనే సింహాచలమువెళ్లి ఆచటినుండి సామంతులకు, సర్దారులకు, బంధువులకు వెంటనే తమ తమ ఫౌజులతోవచ్చి కలిసికొనుడని లేఖలువ్రాసి పంపెను. అచ్చటినుండి పద్మనాభముచేరెను. అప్పటి కాయన వద్ద నాలుగువేల సైనికులుచేరిరి. తుదిసారిగా భీమునిపట్టణమునకు చెందిన మార్టిన్ అను వాంగ్లేయ వైద్యునిద్వారా మహారాజు రాజీప్రయత్నములుజేసెను. కాని మద్రాస్ గవర్నర్ చార్లెస్ ఓక్లే చేషరతుగా మహారాజును నిరాయుధులైన సామాన్య—అనుచరులతో విశాఖపట్టణమువచ్చి శరణువేడుమని జాబువ్రాసెను. దీనితో రాజీసంభాషణము లాగిపోయెను. ఇరువది నాల్గుగంటలలో విశాఖపట్టణమువచ్చి చేరవలసినదనియు లేనిచో తీవ్రచర్య గైకొనబడుననియు తుది హెచ్చరిక మహారాజునకు జూలై 7వ తేదిని ఈయబడినది. మరునా డుదయము మహారాజు బంధువులను, సామంతులను, సర్దారులను పద్మనాభస్వామి ఆలయప్రాంగణములో సమావేశపరచి ఆంగ్లేయులేవిధముగ నీయుద్ధము తెచ్చిపెట్టినదియు నిందు తన సోదరుడగు సీతారామరాజువంటి వారి పాత్ర కూడ ఎంతవరకు నున్నదియు, సహేతుకముగా వివరించెను. "*మనచేత పునరుద్ధరింపబడిన ఒకానొక పాశ్చాత్య వర్తకసంఘమువారి యడుగులకు మడుగులొత్తి చేతులార మన సామ్రాజ్యలక్ష్మిని వారి కప్పగించినచో రాబోవు చరిత్రకారులు మనలను గూర్చి యేమని వ్రాయుదురో యూహింపుడు*" అని వారిని హెచ్చరించెను "*దీనులమై, బందరులంకలలో నీచపుచావు చచ్చుటమేలో లేక...వీరస్వర్గము చూరగొనుట మేలో బాగుగా యోచింపుడు*" అనిచెప్పి యీక్రింది వాక్యములతో తన ఉపన్యాసమును ముగించెను. "*ఈ పద్మనాభయుద్ధము చిరస్మరణీయమై యుండకపోదు. ఇందు కంపెనీవారు మాకుటుంబము వారివలన పొందిన మహోపకారములు, వారు మాకు చేసిన అపకారమును, అన్నగారి దౌర్జన్యమును. మీరు చూపుచుండిన అఖండస్వామిభక్తియు దిగంతవిశ్రాంత కీర్తిరమానాయకులగు. మాతండ్రిగారి యాజ్ఞానుసారము మాతల్లిగారగు చంద్రయ్యమ్మగారు మమ్ము నీ సంస్థానమున కధీశ్వరులగాజేసి నందుకు తుచ్ఛప్రాణముల కాశపడి యేమూలనో చావకుండ తండ్రిగారివలె సర్వరాజ్యలక్ష్మి గౌరవ సంరక్షణార్థమై మా యసువులను సమర్పించి నిజ కంఠ రక్తధారలతో మేము మా జననీజనకుల కొన*

26 Ilid
27 Ilid

రించు శాశ్వత పితృతర్పణములను పద్మనాభయును దలచినంతమాత్రమున మనుష్యమాత్రునకు జ్ఞాపకము రాకపోదు"[28]. సచ్ఛీలత, త్యాగనిరతి, ఆత్మాభిమానము, స్వేచ్ఛాభిలాష, అశయపుష్టి, అసమానరాజకీయ దూరదృష్టి ప్రస్ఫుటమైన యీ ఉపన్యాసము విని ఉత్తేజితులై అచటజేరిన యోధులు "విజయమో వీరస్వర్గమో" చవిచూచెదమని పద్మనాభస్వామి ప్రసాదమును, ఖడ్గములను చేతబట్టి ప్రమాణము జేసిరి. అటుపిమ్మట మహారాజు తన సతీమణి సీతయ్యమ్మగారిని, కుమారుడు నారాయణబాబును రావించి వారికి జెప్పవలసిన విషయములుజెప్పి కాకర్లపూడి బాపిరాజుగారిని తోడిచ్చి కాశీపురము బంపెను.

అయన రెండురోజులు శత్రుసైన్యము రాకకై నిద్రలేక నిరీక్షించెను. జూలై 10వ తేదీ తెల్లవారు ఝామున తగు జాగ్రత్తలోనుండుడని ఆయన అనుచరులను హెచ్చరించి కొంచెము విశ్రమించెను. ఈ వార్త గూఢచారులవలన తెలిసికొనిన ఆంగ్లేయ సైన్యము ప్రెండర్‌గాస్ట్, రౌక్స్‌అను వారల నాయకత్వమున యుద్ధక్షేత్రమునకు వచ్చిపడెను. అది వినిన మహారాజు సకలాభరణభూషితుడై, యుద్ధోచితములయిన దుస్తులుధరించి, బంగారపుటంబారీ ఏనుగునెక్కి, ముందు దావూద్‌ఖాన్ ఫిరంగిదళము, ఒకప్రక్క అసన్‌బేగ్ గుఱ్ఱపురౌతుదళము, మఱొక ప్రక్క దాట్ల అప్పలరాజుగారి, వత్సవాయి నరసరాజుగారి తుపాకిఫౌజు, మధ్య వందలాది క్షత్రియవీరులు తన వెంటనంటిరాగా యుద్ధసన్నిద్ధుడయి బయలు దేరెను. ఇంకను తెల్లవారలేదు. శత్రు వేమరి యున్నపుడు ఒక్కుమ్మడిగాముట్టడించి వారిసైన్యమును నాశనముచేయవలెనని మహారాజు తలంపని తోచును.

28 శ్రీ కవికొండ వేంకట సత్యనారాయణమూర్తిగారి "విశాఖమండల చరిత్రము"

అందుచేతనే అయన తుపాకులు ప్రేల్చవలదనియు, సద్దుచేయవద్దనియు తన సైన్యమున కాజ్ఞయిచ్చెను. కాని ఇంగ్లీషువారి ప్రధానాయుధము కుటిలత్వము కదా! వారిదివరకే పండ్రెండువేల రూపాయలు లంచమిచ్చి దావూద్‌ఖాన్‌ను తమవైపు త్రిప్పుకొనిరి. అతడాకస్మికముగా మూడుమార్లు తుపాకులు ప్రేల్చి, మహారాజున్న స్థానమును శత్రువున కెఱింగించి, తన అనుచరులతో యుద్ధరంగమువీడి పారిపోయి అంధ్రదేశమునకు మీర్జాఫరులు లేనిలోటు తీర్చినాడు[29]. వెంటనే శత్రువు కాల్పులు ప్రారంభించెను. కను రెప్పపాటులో తుపాకి ఫౌజు శత్రుసైన్యముల మీదికురికి చాలమందిని నేలకూల్చెను. అసన్‌బేగ్‌దళము ముందుకురికి శత్రువుల ఫిరంగి స్థావరములను కొన్నిటి నాక్రమించినది. ఇందు 'హమ్రాలాజు' అను యోధునిదొక ప్రత్యేకవీరగాథ. అత డొక్కడే దాదాపు 25 మంది శత్రువులను తెగటార్చెను. విజయనగరము వారెంతవీరోచితముగా పోరాడినలాభమేమి? యుద్ధారంభదశలోనే జఱుగకూడని దుర్ఘటన జరిగి పోయెను. దావూద్‌ఖాన్‌చే శత్రుదృష్టికి తేబడిన మహారాజుపై ప్రత్యక్షముగా వారు ఎడతెగని గుండ్ల వర్షము గురిపించిరి. దీనికి గురియై యించుమించు ఇరువదిగుండ్లను వక్షస్థలముపై నిముడ్చుకొని మహారాజు నేలకూలెను. ఆయన చుట్టును రెండువందల ఎనమండుగురు అనుచరులు అయుధహస్తులై పడియుండిరి. ఇందు పూసపాటి, వత్సవాయి, కాకర్లపూడి, దాట్ల, దంతులూరి, చింతలపాటి, జంపన, సాగి, గొట్టుముక్కల, వేజర్ల, కలిదిండి, పెనుమత్స మొదలైన వంశములకుచెందిన నలువది రాజబంధువుల శరీరములు మహారాజు మృతదేహమును బురుజువలె చుట్టుముట్టి పడియుండెను.

29 పూసపాటివారి కైఫీయతు.

తెల్లవారుసరికి యుద్ధము పరిసమాప్తమయ్యెను. విజయనగరరాజ్య స్వాతంత్ర్యభాను డస్తమించెను. ఒక తెలుగు మహారాజు అంధ్రదేశము పాశ్చాత్య పాలనలో బడకుండ చేసిన మహోజ్జ్వలకృషి విఫలమయ్యెను. కాని ఆ మహారాజు, అయన అనుచరులు ప్రాణత్యాగముచేసిన పద్మనాభక్షేత్రము, వారికన్న తెలుగుదేశము, భరతఖండము పునీతమయినవి.

"అత్యక్తసైనికవరః ప్రతిభాతి సవ్య
గద్యాపి దివ్యనృప వైభవలాంఛనశ్రీః
సామంత వీరతనుబృంద సమావృతస్సన్
శ్రీ పద్మనాభ ధరణీధర పార్శ్వభాగే॥"30

---

30 పద్మనాభగిరిపైకల శాసనము.

# ఎమర్సన్ పై భారతీయ తత్వశాస్త్ర ప్రభావము

డాక్టర్ అడపా రామకృష్ణరావు

పాశ్చాత్యదేశవాసులు చిరకాలంగా మనభారత భూమిని రత్నమాణిక్యాలకూ, సుగంధద్రవ్యాలకూ పుట్టినిల్లుగా, భోగభూమిగా భావించినట్టు చాసర్, షేక్స్‌పియర్‌వంటి ఇంగ్లీషు కవుల వర్ణనలవలన తెలుస్తున్నది. ఐతే చారిత్రక విభాతవేళనుంచీ మనకు పాశ్చాత్యులతో ఏదో కొంతసంబంధం ఉంటూవచ్చినా, క్రీస్తుశకం 18వ శతాబ్దంవరకూ వారికి మన సాహిత్య సంస్కృతులనుగురించి ఏవో ఆపోహలూ, కల్పనా కథలేగాని నిశ్చయంగా తెలియదు. అసలు సంస్కృత వాఙ్మయమంతా గడసరులైన మనపండితులు గ్రీకు గ్రంథాలు చదివి చేసిన మిథ్యాకల్పనయేనని చాటిన డుగల్డ్ స్టువర్ట్‌వంటి ప్రబుద్ధులుకూడా కొందరు లేక పోలేదు.

క్రమంగా 18వ శతాబ్దంలో ఈ చీకట్లు తొలగి పోయాయి సర్ విలియమ్ జోన్స్, చార్లెస్ విల్కిన్స్, హెన్రీ కోల్‌బ్రూక్ వంటి బహుభాషావిదులైన పండితులు సంస్కృతభాషను నేర్చుకున్నారు. కలకత్తాలో రాయల్ ఏషియాటిక్ సొసైటీ స్థాపితమయింది. వేదాలూ, పురాణాలూ, ఉపనిషత్తులూ, మేఘ సందేశం, శాకుంతలంవంటి కావ్యనాటకాలూ క్రమంగా ఇంగ్లీషులోనికీ, ఇతర యూరోపియన్ భాషలలోనికీ, అనువదింపబడ్డాయి. అప్పటివరకు రత్నాంత మెరసి మాయమయ్యే విద్యుల్లతవలె దృశ్యాదృశ్యంగా ఉండిన మనప్రాచీన సాహిత్య సౌందర్యం ఉదారచరితులైన పాశ్చాత్యపండితులకు కొందరికి కానాడు స్పష్టంగా గోచరించింది. ప్రాక్తనమానవుడు విశ్వరహస్యాన్ని గురించి, జీవన గమ్యాన్నిగురించి సాగించిన అన్వేషణను గ్రహించడానికి ప్రాచీన సంస్కృతవాఙ్మయమే చక్కని రాజమార్గమని వారు గుర్తించారు.

*"భారతీయ సాహిత్యంలో ఏవంక చూచినా అనంతత్వం మనకు సాక్షాత్కరిస్తుంది. ఈ విస్తృత సాహిత్యాన్ని సాంతం పఠించడానికి జీవితకాలం*

సరిపో" దన్నాడు సర్ విలియమ్ జోన్స్. కేవలం పాశ్చాత్యసాహిత్యంమాత్రమే చదివినవారి దృష్టి సంకుచితంగా, పాక్షికంగా ఉంటుందనీ, భారతీయసాహిత్యాన్నికూడా వారాస్వాదించిననాడే వారి ఆధ్యాత్మిక దృష్టి సమగ్రమై, విశ్వజనీనమై, ఇహానికీ, పరానికీ అది కల్యాణప్రదమవుతుందనీ జర్మన్‌మనీషి మాక్స్ ముల్లర్ భావించాడు. ఏడాది మొదలవిరిసే పుష్పాలూ, తుదిని పండే ఫలాలూ, ఆత్మను సమ్మోహితంచేసి, దానికి తుష్టినీ, పుష్టినీ చేకూర్చే సమస్త సామగ్రీ, స్వర్గమూ, మర్త్యమూ — అన్నీ ఒక్కచోట సంఘటితంకాగా చూడాలంటే శాకుంతల నాటకంలో చూడవచ్చునని మహాకవి గెటే తన ఆనందాతిశయాన్ని వెలడించాడు.

అమెరికన్ దేశస్థులకుకూడా 18వ శతాబ్దం చివరనే మన ఆధ్యాత్మికవాఙ్మయం అనువాదాల రూపంలో అందనారంభించింది, బోస్టన్ రేవుకు కలకత్తానుంచి ఎగుమతి అయిన వస్తువులలో రాయల్ ఏషియాటిక్ సొసైటీవారి ప్రచురణలుకూడా చేరాయి. అమెరికాలో ఎమర్సన్, థొరో, వాల్ట్ విట్మన్ వంటి జిజ్ఞాసువులలో ఆ గ్రంథ పఠనంవలన జనాంతర సౌహృదాయాలు విరిసి, వారికి భారతీయతత్త్వశాస్త్రం అత్యంతాదరణీయ మయింది.

రాల్ఫ్‌వాల్డో ఎమర్సన్ 1803 లో బోస్టన్ నగరంలో జన్మించాడు. తరతరాలుగా ఎమర్సన్ వంశస్థులు క్రైస్తవమతాచార్యులు. ఎమర్సన్ హార్వర్డ్ కాలేజిలో విద్యాభ్యాసానికి వెళ్ళేనాటికి, అక్కడ ప్రాచ్యదేశాల సభ్యతాసంస్కృతులను గ్రహించాలని విజ్ఞులలో ఆసక్తి హెచ్చుగా ఉంది. ఆ వాతావరణంలో చదువుకున్న ఎమర్సన్ విద్యార్థిదశనుంచీ భారతీయ తత్త్వశాస్త్రానికి సంబంధించిన రచనలను శ్రద్ధాసక్తులతో పఠించాడు. ఆ రోజులలోనే 'ఎడింబరో రెవ్యూ' పత్రికలో మనదేశంలోని సాంఘిక, రాజకీయ ధార్మిక, స్థితిగతులనుగురించి దాదాపు ప్రతి సంచికలోనూ కొన్ని వ్యాసాలు ప్రకటితమయ్యేవి. మనమత గ్రంథాలకూ, కావ్యాలకూ, ఇంగ్లీషు అనువాదాలు కూడా ఆ పత్రికలో అచ్చవుతూ ఉండేవి. ఎమర్సన్ హార్వర్డ్ కాలేజీలో ఉండగా, ఆ కాలేజి లైబ్రరీనుంచీ, బోస్టన్ పబ్లిక్ లైబ్రరీనుంచీ 'ఎడింబరో రెవ్యూ' పత్రిక సంపుటాలను పెక్కింటిని తీసుకుని చదివాడు. 1818లో కొన్ని భారతీయకావ్యశకలాల అనువాదాలను (Thomas Duer Broughton, Selections from the Popular Poetry of the Hindoos) ఎమర్సన్ చదివాడు. 1820 లో సర్ విలియమ్ జోన్స్ ప్రచురించిన ఏషియాటిక్ మిసెలనీ (The Asiatic Miscellany) మొదటి సంపుటిని చదివాడు. తరువాత 1830 లో ఎమర్సన్ వేదాల అనువాదాన్నీ, 1832 లో విక్టర్ కజిన్ వ్రాసిన The Course of Philasoply అనే గ్రంథాన్నీ పఠించాడు. 1840 తరువాత ఆయన భగవద్గీతనూ, కఠోపనిషత్తునూ, బృహదారణ్యకోపనిషత్తునూ, భాగవతంలో కొన్ని భాగాలనూ, మనుస్మృతిని చాలా శ్రద్ధతో చదివినట్లు ఆయన డైరీలవలన స్పష్టంగా తెలుస్తున్నది. భాగవతాన్ని గురించి ఒక స్నేహితునితో ప్రసంగిస్తూ "*అది భక్తితో మోకరిల్లి పఠించవలసిన గ్రంథం*" అని ఎమర్సన్ చెప్పినట్లు మాన్‌క్యూర్‌కాన్వే వ్రాశాడు. భగవద్గీతను గురించి ఎమర్సన్ "*ఆ గ్రంథం చదివినప్పుడు ఒక సువిస్తృత మహోజ్జ్వల సామ్రాజ్యం మాతో పలికినట్లనిపించింది. ఈనాటికీ మనల్ని కలవరపరచే సమస్యలకు ఎన్నడో ఆ గ్రంథంలో సమాధానాలు సంగ్రహింపబడిన*" వని వ్రాశాడు. భగవద్గీత ఇంగ్లీషు అనువాదాన్ని తన సొంతప్రతిని ఎమర్సన్ ఆంతరంగిక మిత్రుల కిచ్చి వారిచే చదివించేవాడు. అనేకులు

చదవడంవలన ఆ ప్రతి నలిగిపోయింది. అమెరికాలోనే ఆ గ్రంథాన్ని ముద్రించి ప్రకటిస్తే బాగుంటుంద్ ఎమర్సన్ మిత్రులు ఆయనకు సూచించారు. కాని ఆయన అందుకు సమ్మతించలేదు. అందుకింకా సమయం రాలేదనీ, అపరిణత బుద్ధుల చేతులలో అటువంటి గ్రంథాన్ని ఉంచడం మంచిదికాదని ఎమర్సన్ అన్నాడు.

ఎమర్సన్‌పై భారతీయ తత్త్వశాస్త్ర ప్రభావం స్థూలంగా ఆయన రచనలో సర్వత్ర కనిపిస్తూనే ఉంటుంది. ఐతే ఇందుకు ముఖ్యంగా 'Brahma,, ,Hamatreya, అనే పద్యాలనూ, 'The Over-Soul,' 'Fate,''Ilusions'' 'Plato' అనే వ్యాసాలనూ పేర్కొనవచ్చును. మన తత్త్వశాస్త్ర పఠనం మూలంగా ఎమర్సన్ ఆదిమధ్యాంతరహితమూ, నిర్గుణమూ, నిరాకారమూ అయిన పరబ్రహ్మ స్వరూపాన్నీ, మాయావాదాన్నీ, కర్మసిద్ధాంతాన్నీ, పునర్జన్మను గురించిన భారతీయ విశ్వాసాన్ని చాలా శ్రద్ధతో పరిశీలించి, కొంతవరకు వీటిని తన నమ్మకాలలో చేర్చుకున్నట్లు పై రచనలనుబట్టి మనం గ్రహించవచ్చు

ఉపనిషత్తులలో వర్ణింపబడినట్లు ఈశ్వరుని ఎమర్సన్‌కూడా నిరాకారుడూ, గుణాతీతుడూ అయిన పరబ్రహ్మంగా భావించాడు. ఆ తరతత్త్వమే విశ్వమంతటా వ్యాపించివుందనికూడా ఆయన పేర్కొన్నాడు. భగవద్గీత ద్వితీయాధ్యాయంలోని

'య ఏనం వేత్తి హన్తారం
యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీ తో
నా౽యం హన్తి న హన్యతే'

అనే శ్లోకార్థాన్ని మనస్సులో ఉంచుకొని ఎమర్సన్ 'Brahma' అనే పద్యం వ్రాశాడు. దానిలో ఆయన పరబ్రహ్మానికి దూరమూ, దగ్గరా; చీకటీ, వెలుగూ, అవమానమూ, పూజ్యతా; సంశయాత్ముని సంశయమూ, బ్రాహ్మణస్తోత్రమూ, ఉభయమూ సమానమని, ఋషులకూ, దేవతలకూ దుర్లభమైన ఆ పరబ్రహ్మన్ని ప్రసన్నుడైన భక్తుడు సులభంగానే పొందగలడని వర్ణించాడు.

విష్ణుపురాణంలో రాజులగర్వోన్నతిని గురించి పృథ్వి హసించినట్లుగా మైత్రేయుడు విన్నట్టువర్ణించబడినది. అది ఎమర్సన్ చదివి దానికి అనునాదప్రాయంగా ''Hamatreya'' అనే పద్యాన్ని వ్రాశాడు. ''నేను'' ''నాది'' అనే మాటలు అజ్ఞానజనితములనీ, అశాశ్వతమైన శరీరధారులైన రాజులు ''ఈ భూమినాది, ఇది నా బిడ్డలది, నా వంశస్థులది'' అని గర్వంతో అని, చివరకు మరణించిపోగా, వారి అజ్ఞానానికి భూమి నవ్వుతుంది. విష్ణుపురాణంలో మైత్రేయునకు బోధింపబడిన భాగం ఎమర్సన్ ఆ పద్యంలో వర్ణించాడు. ''Maya'' అనే పద్యంలో మాయ ఏవిధంగా తనవలను పన్ని అజ్ఞానులైన మనుష్యులను సమ్మోహితం చేస్తుందో ఎమర్సన్ వివరించాడు. ''Celestial Love'' అనేపద్యంలో సమస్తజీవులూ చివరకు ఒక్క బ్రహ్మంలో లీనం కావడమూ, ఆదిశేషుడు సమస్తప్రపంచభారాన్ని తాను మోయడమూ మొదలైనవి ప్రస్తావించాడు.

భిన్నత్వంలో ఏకత్వాన్ని చూడగల భారతీయులదృష్టి ఎమర్సన్‌కు చాలా నచ్చింది. భగవద్గీతలో కృష్ణుడు "నేనూ, నీవు ఒక్కటేనని గ్రహించు" అని చెప్పినమాటను ఉదాహరిస్తూ ఎమర్సన్ "ఒక్కటే ఒక్కటే; మిత్రుడూ, శత్రువూ ఒక్కటే; పాలకుడూ, పొలమూ, నేలమీది చీలికా, మూడూ ఒకటే. అజ్ఞానం చేతనే మనుష్యులు భేదాలను ఊహిస్తా"రని వ్రాశాడు. గ్రీక్ తత్త్వజ్ఞుడు ప్లేటో ఏకత్వ, భిన్నత్వాలనుగురించి సూచించిన అంశాలకూ, భారతీయుల మాయావాదా

నికీ చాలా పోలిక ఉన్నదని ఎమర్సన్ గుర్తించాడు; ఆవిధంగానే పునర్జన్మసంబంధమైన భారతీయవిశ్వాసానికీ, ప్లేటోతత్త్వంలోని Doctrine of Reminiscenceకీ ఉన్న సాదృశ్యాన్నికూడా ఎమర్సన్ పేర్కొన్నాడు.

కర్మసిద్ధాంతాన్ని గురించి ఆయన మనుస్మృతిలోనూ, భగవద్గీతలోనూ చదివాడు, "నీవు నాటిన బీజమే చివరకు నీకు ఫలమిస్తుంది... నీవు చేసిన పుణ్యానికీ పాపానికీ ఫలం నీ వనుభవించి తీరాలి" అనే వాక్యాలు మనుస్మృతిలోనివి ఎమర్సన్ గమనించాడు Compensatin అనే వ్యాసంలో ఆయనకూడా అటువంటి అభిప్రాయాలే వెల్లడించాడు. "నేరమూ, శిక్షా ఒకే కొమ్మకొనను ఉద్భవిస్తా" యనీ "దుష్కృత్యాన్నిచేసి దాని ఫలితం అనుభవించకుండా తప్పించుకోవడం ఆసంభవ" మనీ ఎమర్సన్ ఆ వ్యాసంలో వ్రాశాడు.

ఇలా ఎమర్సన్ ఎంతో అభిమానంతో, సానుభూతితో భారతీయతత్త్వశాస్త్రప్రబోధాన్ని ఆలకించాడు. ఇతరులవలె స్థలకాలావధులకు కట్టుబడక, ప్రాచీన భారతీయతాత్త్వికరహస్యాలను ఆయన ఆదరించి స్వీకరించాడు. మన తత్త్వగ్రంథాలను పఠించడం వలన ఆయనదృష్టి మరింత నిశితమూ, విశాలమూ అయినదని, ఆయనభావన చాలా పుష్టినిపొంది విశ్వజనీనమైనదని క్రిస్టీ, కార్పెంటర్‌వంటి అమెరికన్ పండితు లన్నారు.

# త్యాగోపనిషత్

శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రి

త్యాగరాజ-అహ్వయము. త్యాగయోగ సమరసమ్ము.

సంగీతసాహితీ, సంగమేశసీమ
శివకేశవాద్వైతసరణి-తరణి
భవపయోధికి-పుంభావభక్తి
ముక్తికామినీ కాముకమ్మొక కళభజింతు.

పరమార్థతత్త్వమును అత్యంత సన్నిహితముగ స్ఫురింపఁజేయు అనాది అపౌరుషేయవాణి ఉపనిషత్తు.

శ్రీరామ తారకబ్రహ్మానుసంధానమున వెలువడిన శ్రీ త్యాగరాజస్వామివారి కీర్తనలకు, త్యాగోపనిషద్గౌరవము కలదని శ్రీ గురుస్వాముల ఆదేశము. త్యాగ—రాజ శబ్దములు, జ్ఞానయోగములకు సూచకములు. జ్ఞాన—యోగముల కలయికవల్లనే ముక్తి అనుభవరూపమగును. అందుకు భక్తిరాజమార్గము *భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మితత్త్వతః"* అని భగవద్గీత భక్తి ముక్తికి సాక్షాత్సాధనమని పేర్కొన్నది.

వేదాగమ పురాణేతిహాస ప్రవర్తకుడు జ్ఞానమూర్తియైన నారదుడు. భక్తిసిద్ధాంతము నొక మహాప్రస్థానముగ సూత్రీకరించి, భాగవతభక్త పరంపరకు తానే అదిగురువై, పరాశర పుండరీకాది అలౌకికులే గాక జయదేవ, పురందర, రామదాస, త్యాగరాజ-తీర్థనారాయణ, తులసీదాసాదులుగా భక్తపరంపరను ప్రతిష్ఠించినాడు వేదాగమ, పురాణేతిహాసాదులు, ఆర్షసంస్కృతిలో తత్తదధికార విలసితములు. వాటి భావగౌరవము ఆలోచనాత్మకము తపస్సంస్కారవంతము. కావ్యములు ప్రబంధములు, ఆ ఛాయలో తత్తద్దేశభాషలందు భక్తిసాహిత్యమును ప్రబోధించినవి.

## సంగీతము.

నాదవిద్య అపాతమధురము. లలితము జన్మాంతర సంస్కారవశమునఁగాని నాదోపాసనము

సిద్ధించదు. యోగశాస్త్ర మర్యాదలో నాదబ్రహ్మాను సంధానము ప్రసిద్ధమయ్యును భావ, రాగ తాళ స్వర సంభూషితమైన సంగీతమువలె, మధురాతిమధుర ముగ సార్వజనీనముగ ఆస్వాద్యముగాదు. "శిశుర్వేత్తి, పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణిః" అను వచనము పరంపరాప్రాప్తము కేవలము వైఖరీరూపమై సప్తస్వర విక్రతులుగల సంగీతము తాత్కాలికానంద మందించి నను. సంగీతజ్ఞుడు మూలాధారమునుండి నాదము యొక్క ఉత్పత్తివికాసములను గుర్తెరింగినచో వాని గానసంపద విశ్వమోహనమై, పరమార్థలక్ష్యమును కరామలక మొనర్చును.

## నా దో త్ప త్తి.

"ఆకాశం శరీరం బ్రహ్మ"యను శ్రుతి చిన్మయ మైన పరమాత్మ వస్తుస్వరూపమునకు సాకారమందు మొదటి శరీరము ఆకాశమని పేర్కొన్నది. ఆకాశము శబ్దగుణకము. అందు వాయ్వగ్నిసంయోగముచే నాదముత్పన్నమైనది. నాదముయొక్క ప్రథమ అవ తారమే ప్రణవమనియు ఆ ప్రణవరత్నగర్భము నుండియే అకారాది క్షకారాంత వర్ణసముదాయము. అందుండి అనంతశబ్దజాలము విశ్వరూపమైనది. కావునజగత్సృష్టికి నాదమే మూలమైనట్లు అనేక ప్రమాణములుగలవు. ప్రపంచము నామరూపవిలసి తము. ఇవి శబ్దవికృతులే, ఆయా స్వరవిన్యాసముల యొక్కయు, అనుపూర్వికములైన వర్ణసముదాయము. పద సముదాయమువల్లను అర్థశక్తి ఉదయించును. ఇట్లు శబ్దార్థములను పార్వతీ పరమేశ్వరులుగ ఉదాత్త బావనచేసి మహాకవి కాళిదాసు నాదాత్మకములైన సంగీత–సాహిత్యములకు దైవలక్ష్యమును ప్రబోధించి నాడు.

ఇట్టి ఉదాత్తమైన దైవభావనలేనివిద్య అనర్థ కరము, ప్రయోజనశూన్యమని మహానుభావులందరు సిద్ధాంతీకరించిరి. ఈ మహోద్యమ ప్రవర్తకుడు మహాభక్తుడు. ప్రహ్లాదుడు–కేవల భౌతికబలముతో సామ్రాజ్యవాదియై, అహంకారపూరితుడైన హిరణ్య కశిపునకు జన్మాంతర సంస్కారాయత్తమైన భగవద్భావ నముతో మాతృగర్భముసొచ్చి మన్నది మొదలుపరమ భాగవతోత్తముడైన ప్రహ్లాదమూర్తికిని నడుమ చెలరేగిన విప్లవము దైవ సాక్షాత్కారముతో భగవంతుని సర్వవ్యాపకత్వముతో శాశ్వత విజయమందుకొన్నది అందును మిక్కిలి సున్నితమైన నాదోపాసనమును, పరమ పవిత్రసాధనముగ స్వీకరించి, సకలవిద్యా వికాసములను నాదబ్రహ్మమందంతర్లీన మొనర్చి విశ్వ మును అమృతాయమాన మొనర్చిన మహర్షులు–అవ తారమూర్తులు. పరాశర, యాజ్ఞవల్క్య, వాల్మీకి, నారదాదులేకాక, అర్వాచనులైన రాజయోగులు, వాగ్గేయకారులు మహాభక్తులెందరో కలరు.

వారందరలో మనకు మిక్కిలి సన్నిహితుడై జాను తెల్గునుడికారపు సొంపులతో రామతారకనామ మును స్వరలయాదులతో జతగూర్చి సంకీర్తన మొనర్చుటయేగాక, తొంబదియారుకోట్లు రామమంత్ర మును జపించి, అమృతమొల్కు పల్కులతో శ్రీరామ లక్ష్మణులను కన్నులార దర్శించిన నాదయోగి శ్రీ త్యాగరాజస్వామి

ఈ కోవకుచెందిన మహాత్ముల అనుభావ ములు, సదుపదేశములు దైవారాధనమే. వారిచరిత్ర గాని, కేవల లోకమర్యాదలో వారి జన్మమాత్రములైన యంశములు చరిత్రలు కావు.

అయినను కొంత చరిత్రాంశమును స్మరించుట ప్రసక్తము. మహనీయుడు భారద్వాజసగోత్రుడు, ములకనాటి వైదిక బ్రాహ్మణవంశమువాడు. కర్నూలు జిల్లా కాకర్లగ్రామము వీరి అనాదినివాసము వీరి తాతగారు గిరిరాజ బ్రహ్మమనువారు వేదశాస్త్ర పండితులై తంజావూరు మహారాజుల ఆస్థానపండితులై

తొల్త మధుర తాలూకా తిరువాయూరు గ్రామమున సంబంధబాంధవ్యములతో స్థిరనివాస మేర్పరచుకొనిరి.

ఇప్పటికిని తంజాపుర, మధురజిల్లాలలో ఆంధ్ర కుటుంబములు పరస్సహస్రములు కలవు. నేటివరకును ప్రాచీన విద్యలందును, కళలందును అరితేరిన విత్తము లాంధ్రులందు గలరు.

శ్రీ త్యాగరాజు తండ్రి శ్రీరామబ్రహ్మముగారు. నిరంతరము రామాయణమును ప్రవచించుచు, సీతారామ కల్యాణోత్సవములను సల్పుచు తంజాపుర మహారాజుల ఆశ్రయమున తిరువయ్యారు గ్రామమున (పంచనదము) కావేరీతీరమందు స్వగృహవసతికల్గి, తన కుమారులను ఆ గ్రామమందుగల వేదశాస్త్ర గురుకులమందు ప్రవేశపెట్టెను. అందు శ్రీత్యాగరాజు "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" అన్నట్లు వేదశాస్త్ర పండితుడగుటయేగాక, సహజముగ సంగీతమందు అభిరుచి రేకెత్తుటయు, ఆస్థాన వైణికులైన శ్రీ శొంఠి వెంకట రమణయ్యగారివద్ద నిమిత్తమాత్రముగ ఒక్క సంవత్సరము సంగీతము నభ్యసించెను. అంతతో స్వరవిజ్ఞానము-పల్లవి పాడగలనేర్పు అసమానమైన ప్రతిభ ఏర్పడి శ్రీరామ మంత్రానుష్ఠానముతో తన ఇష్టదైవమైన శ్రీరామునిగూర్చి చక్కని గేయములను అప్రయత్నముగ కీర్తించుచు తన తోడివారలకాశ్చర్యమును కల్గింపసాగిరి.

ఆ కాలమున లక్ష్యశుద్ధి సంగీత విద్యచాల అపురూపముగ నుండెడిది. ఉత్తమశ్రేణి గాయకులను అనేక ప్రభుసంస్థానములు, రాజమర్యాదలతో రత్నాంబరాభరణములను కానుకలిచ్చి గౌరవించెడివారు. విశేషించి తంజాపురప్రభువు అఖండ విద్యారసికుడు. శ్రీ త్యాగరాజు సంగీతమును వినవలెనని ఆ మహారాజు తన ఆస్థానపండితులచే వారికి కబురంపెను. అంత శ్రీ త్యాగరాజు తన ఇష్టదైవమైన శ్రీరాముని ఎదుట తన ఆకాంక్షను వెల్లడించుకొనుచు, శ్రీరామా! నా జన్మాంతర సంస్కారవశమున పుణ్యఫలమై నీదయచే, నాకబ్బిన యీ నాదవిద్యను తొల్త నీమహాసన్నిధానమున కీర్తించి, తర్వాత ఇతర ప్రభువుల ఆస్థానములందు ప్రదర్శించుట యుక్తమని తోచెడిది.

*"బంగారు మేలుపొన్నుపై*
*భామామణి సీత*
*శృంగారించుకొని నిన్నుకని*
*పొంగుచు మల్లెవిరుల*
*పూజించువేళ సంగీతమును పాడుమను*
*సామి! త్యాగరాజునితో"*

అని శ్రీ సీతారాముల ఏకాంత-అంతఃపురములో తన సంగీత సభాప్రారంభోత్సవము చేయవలయునని కోరినాడు. ఇందు ఈ మహనీయుని లక్ష్యశుద్ధి పరమార్థ నిష్ఠ అనితర సాధారణములు.

ఇట్లు పవిత్రాశయము మహాకవులలో శ్రీ పోతనకే దక్కినది

అర్థము-పరమార్థము. యీ రెంటినీ తూచి, తుదకు *"సన్నిధి సేవసుఖమా?"* యని భగవత్సేవా భాగ్యమును నాణెముగట్టిన విరాగ శిరోమణి శ్రీ త్యాగయ్య ఇట్లు ఉదాత్తాశయమువల్లనే యీతని గేయములకు ఉపనిషద్గౌరవము కల్గుటలో సందియము లేదు మరొక్కచో, శ్రీరాముని పరమార్థ రూపముం గూర్చి తానితరులతో చర్చించక శ్రీరామునితో *"ఎవరని నిర్ణయించిరిరా? శివుడనియా? మాధవుడనియా? పరంబ్రహ్మమనియ?"* అని ప్రశ్నించి, శివమంత్రమునకు - మ జీవనము - మాధవ మంత్రనకు - రా జీవము - అనగా శివపంచాక్షరీ - నారాయణాష్టరీ మహామంత్రములలో మ - ర - అన జీవాక్షరములు తొలగించినచో, ఆ మంత్రములు అపార్థమిచ్చును. ఇట్లు హరిహరాద్వైత పరమార్థ వస్తుతత్త్వమును మంత్రరహస్యమునుతో సిద్ధాంతీకరించినాడు.

ఉపనిషద్విచారములో ద్వైత - అద్వైతములు ప్రధాన సిద్ధాంతములు. అంతటి విరుద్ధసిద్ధాంతములను ఎంతో సున్నితముగ పరిష్కరించుటలో శ్రీ త్యాగరాజుని సమన్వయము, నిరుపమానము.

**మతసమన్వయము :**

"ద్వైతము సుఖమా? అద్వైతము సుఖమా?" అని ప్రశ్నించి, "అన్ని నీవను మార్గమునను చనితే నన్ను వీడెను భారము - అని అనేవు. నన్ను బ్రోవరా - సదా అంటే - ద్వైతుడనేవు" - అనగా, సర్వము పరమాత్మడే అనే అద్వైత భావనమందు - రక్షింపబడువాడు - రక్షకుడు అను భేదభావమునకు తావులేనందున నాకు రక్షకత్వభారము తొలగినదని రాముడనుట - నన్ను బ్రోవరా! సదా— యని మొర లిడినచో, త్యాగయ్యా! నీవు నేను అనెడి భేదబావము నీకింకను తొలగనందున కేవలం ద్వైతభావనలో నున్నావని రాముడధిక్షేపించునట— ఈ విరోధ పరిహార మెట్లగును? ఈ రెంటిని ఒక్కమాటలో జోడించి లోకమందనుభవశూన్యులు వివదింతురు. అనుభవజ్ఞులు ఈ భూమికలో వేర్వేరుభావనలతో భగవంతుని భావించుట న్యాయము.

"దేహబుద్ధ్యాతు దాసోఽహం
జీవబుద్ధ్యా త్వదంశకః
ఆత్మ బుద్ధ్యాత్వ మేవాహం"

అను శ్రీ శంకరుల సిద్ధాంతము ననుసరించి ఆయా అధికారభేదముతో స్థాయీభేదముతో అన్నియు సమంజసములేయని సమన్వయరీతి సమంజసము. కేవల తాత్త్వికవిషయములేగాక, సాంఘికాచారములందు, దాంభికులను, భిన్నవాదులను గూర్చి శ్రీత్యాగరాజు చక్కని నిర్మాణరూపమైన సద్విమర్శచేయుటలో వశ్యవాక్కుగలవారు.

## సాంఘికము.

ఒకప్పుడు పంచనదీశ్వరాలయమునకు దర్శనార్థమై వెళ్లెనట. అందు స్త్రీపురుషులు లోకవార్తలు చెప్పుకొనుచు కోలాహలము చేయుచుండగా ఈ మహనీయుడువిని, వారితోగాక పరమశివుని సంబోధించి కీర్తనముచేయుచు,

"శివదర్శనము చేయ నాతరమా!" యని
"గోపురంబులను కడుగొప్ప కంబముల భూ
స్థాపితంబగుశిలల తయిలలాటలను
దీపాలవరుసలను, దివ్యవాహనముల
పాపహరా! సేవించి బహిర్ముఖుండైతి
తరలి పదియారు ప్రదక్షిణములొల్లగా
పరనింద్యవచనముల బాగుగాడుచును
ఒరుల భామలజూచుచు ఉప్పొంగితినిగాని
పరశివాక్షరయుగ జపముసేయనైతి"

అని కూలంకష విమర్శయేగాక ఆచరణరీతిజూపుచు "హాటక సమంబైన అద్భుతాకృతిని హృన్నాళకమున నాటు/ జేసికొని మాటి మాటికిజూచి మైమరచి యుండేది ఎటులా!"

యని ధ్యానపద్ధతి నుపదేశించినాడు. ఇక వైరాగ్య బోధలో బహులలితముగా

"ప్రొద్దుపొయ్యేని, శ్రీరామ నిపూని భజించవేమనసా!" ఆయుర్దాయము తరగుచున్నదనుటకు జాతీయముగా సహజముగ "పొద్దుపొయ్యేని" అనుట గేయకవితా శైలిలో వారికేత్వ - మరియు,

"ఊరేలిన తా పండుట, మూడుమూర తావుగాని" జన్మాదినుండి అంతమువరకు మరుపురాని సూత్రము.

"రూకలు పదివేలున్న చారెడునూకలె గతిగాని
కోకలు వెయ్యున్న కట్టుకొనుట కొక్కటెగాని"

యను ఉపదేశవాక్యములు ఎంత సహజములు!

## రాజకీయము.

'రాజ్యాంగముకొరకు నాల్గుజాతుల రక్షణ పరసుఖమో! రాజసులై సన్మార్గ మెరుగక పరాకుసేయటు ఘనమో॥ కాను — ఇప్పేదే గొప్పయనురా! కలిలో రాజులకు' అని, రాజ్యాంగము కేవల అర్థపరమేగాక, ధర్మపరము కావలెనని చెప్పి సార్వ



శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రి

జీవముగ, "ఊరివారు దేశజనులు – వరమునులు – ఉప్పొంగుచు భావుకులయ్యేదట. శ్రీరామరాజ్యము— "నెలకు మూడువానలు.

*అఖిలవిద్యల నేర్పుగల్గి,*
*దీర్ఘాయువుగల్గి – చలము*
*గర్వరహితులుగాలేద*
*సాధుత్యాగరాజ వినుత'*

వస్గమున కొక్కతీరుగ - శాసనములతో పరిపాలన గాక, సర్వసమన్వయముతో, రాజ్యాంగము రూపొందుటయు, తత్ఫలితముగ సకాలవర్షములు. శాంతి— ఆయురారోగ్యము. నిగర్వము - ఆదిగల భారత సంస్కృతిని. తీర్చిదిద్దినట్లు ప్రబోధించినాడు.

ఈ మహనీయుని దివ్యవాణిలో ఉపనిషత్సిద్ధాంతము లింకెన్నియేని కలవు – రచన విస్తృతమగునని విరమించుచు. మనదేశీయులైన – సారస్వత సంస్థలు – సంగీత సమాజములు శ్రీ త్యాగరాజస్వామి వంటి మహనీయుల దివ్యప్రబోధముల నితోధికముగ ప్రబానీకమున కందించి, ఇహ – పర శ్రేయోదాయకమైన ఉత్తమ సంప్రదాయముచే, విశ్వకల్యాణమును సమకూర్తురుగాత! మని కోరుదును,

# వేముల రామభట్టు — గౌరీవిలాసము

డాక్టర్ బి. రామరాజు

మహబూబునగరము మండలమున మానాజీపేట (మానవతీపురము) అను చిన్నజమీందారీ పట్టణము కలదు. దానికి “వేముల” ఇంటిపేరుగల రెడ్లు అధిపతులు. ఆ జమీందారులెందరో కవి పండితుల కాశ్రయమిచ్చి సంస్కృతాంధ్ర వాఙ్మయములకు చక్కని దోహద మొనర్చిరి. కవి పండితులను పోషించుటయేకాక తూము వంశపురెడ్లు తాము స్వయముగా కవులై పండితులై వాసికెక్కినారు. అట్టి వారిలో తూము రామచంద్రావనీపాలుఁడొకడు. ఈతడు “అలమేలుమంగాపరిణయ” మను[1] కావ్యమును రచించెను. ఈ రామచంద్రావనీపాలుడు (రాజా చందూలాల్ సమకాలీనుడను ఆధారమునుబట్టి) పందొమ్మిదవ శతాబ్దము ప్రథమపాదమున నుండినట్లు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు నిశ్చయించినారు. రాజా చందూలాల్ (క్రీ. శ. 1766–1845) అసఫ్జాహీ వంశపు సుల్తానులలో మూడవవాడైన సికిందర్‌జా కాలమునను, నాల్గవవాడైన అసిఫుద్దౌలా కాలమునను ముఖ్యమంత్రిగా నుండినవాడు[2] తూము రామచంద్రావనీపాలుని కాలమును కనుగొనుటకితరాధారములు నాకు వేతేమియు లభించలేదు. ఈ రామచంద్రారెడ్డి కుమారుడు పరశురామరెడ్డి. పరశురామరెడ్డి ప్రాపుననుండి “గౌరీవిలాస” మను నాలాశ్వాసముల మహాప్రబంధమును రచించినవాడు మన వేముల రామభట్టు కనుక తూము రామచంద్రావనీపాలుని కుమారుడగు పరశురామరెడ్డియును, అతని ప్రోపకమునుగాంచిన నీ కవివతంసుడగు వేముల రామభటును (రామాభట్టని వ్రాతప్రతి).

1 ఈకావ్యమును గ్రంథకర్తకు మునిమనుమడగు శ్రీతూము రామకృష్ణారెడ్డిగారు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారిచే పరిష్కరింపించి ప్రకటించినారు, 1949.

2 Journal of Andhra Historical Research Society 1961–62 Pages 90–100.

౧౫వ శతాబ్దము మధ్యభాగము—అనగా నిప్పటికి నూరేండ్లకు పూర్వ ముండినవారని యూహింప వచ్చును

గౌరీవిలాసకావ్యము పూర్వకాలపు దళసరి కాగితములపై వ్రాయబడి హైద్రాబాదు ఆంధ్ర సారస్వతపరిషత్తువారికడ నున్నది. ఇందులో మొదటి రెండు కాగితములు పోయినవి. వీనిలో ఇష్టదేవతా ప్రార్థనాధికములు, పూర్వకవి సంస్మరణము మున్నగు విషయములను సంబంధించిన పద్యములుండి యుండును. పోయినకమ్మలు పోగా మూడవకమ్మ ఇట్లారంభమైనది.

'......*దగిన మహాదేవ చారిత్రంబెయ్యది యని విచారించుచున్న సమయంబున*'—
దీనితరువాత కృతికై ప్రోత్సహించిన పరశురామరెడ్డి వర్ణనము, అతని వంశావతారవర్ణనము మొదలైనవి కలవు. ఇందులో కొన్ని పద్యములు.

సీ॥ తననిశితాసి (....) పంబరాతికాంతా
బృందములకును హృత్తాపమిడగ
తనదానమహిమ చింతారత్న సంతాన
సురధేనువులతోడ సరసమాడ
తనయశోగరిమ సుధాధామ హిమకుభృత్
క్షీరవారాసుల సిగ్గుబరవ
తన రూపలావణ్యత వసంత రతికాంత
నలరాజులను జూచి నగవుచుండ
బరసుతూము కులాబ్ధి శంబరధరుండు
భూరిమేధాకరుడు శివాచారపరుడు
సత్యసంకల్పు డతిధర్మ శాస్త్రములను
కోవిదుండు పరశురామ భూవిభుండు.

ఉ॥ సామజభిత్పరాక్రముడు సంగర రంగధరాతి
రాజ గో
త్రామర రాజధర్మ సదృశాయుధహస్తుడు
దిక్సతీ గళో
ద్దామ సుమల్లికాకుసుమదామ యశఃప్రకటోజ్వ
లుండు శ్రీ
రామజపజ్ఞుడై పరశురామ ధరారమణీశు
డొప్పెడిన్

శా॥ శ్రీ లక్ష్మీనరసింహ మంత్రఫల సంసిద్ధి ప్రకా
శుండు స
చ్ఛీలుండాశ్రిత చందనుండు విలసత్ క్షేపాల
గోత్రాంబుధి
ప్రాతేయాంశుడు (రుద్ర) తాపరిపు జిత్ప్రౌఢుండు
సత్కీర్తి ( )
( . ) లాయుక్తుడురామచంద్రధరణీపాలాత్మజుం
డొక్కెడన్.

సీ॥ ఒకచెంత (సకల) కళాప్రఘటికు
లొకదిక్కు నిఖిలశాస్త్రికచయంబు
నొకతేవ నకలంక సుకవీంద్ర నికరంబు
లొ (కట) సిద్ధాంతజాతక విధిజ్ఞు
లొకవంక మకరాంక సుకుమార ధరణీశు
లొకచేరువను పురాణకసమూహ
మొకపొంత ప్రకటగాయక జనప్రకరంబు
నొకచోట సకలసైనిక గణంబు
ప్రకటసద్గుణ చాతురోపాయ విషయ
శక్తులను యుక్తులను మించు సత్ప్రధాన
వర్యులునుగొల్వ కొల్వుండి వసుమతీశు
డాదికావ్య ప్రసంగంబులాడుచుండి.

శా॥ శ్రీకౌండిన్యసగోత్ర సంభవుని ధీశీలున్
బుధారాధ్యును
శ్లోకున్ లక్ష్మినృసింహయార్యునకు
సంశుద్ధాత్మ వెంకాంబకున్
జోకాపుత్రుని రామయాఖ్యునినన్
సొంపొప్ప బిల్పించి యా
భూకాంతాధిపు డిట్లులం బలికె నంభో
భృద్గభీరంబుగన్.

క॥ క్షేపాలగోత్రజలధి ని
శాపతి మాతండ్రి రామచంద్ర కవీంద్ర
క్ష్మాపాలుం డలమేల్మం
గాపరిణయ మనగ విష్ణుకథ రచియించెన్.

క॥ ఆ వైష్ణవ కథవలెనే
నీవొక శైవప్రబంధ నిర్మాణంబున్
గావించి కీర్తిగనుమని
యావెంటన్ భూధవుడు దయమ్మున బల్కెన్.

క॥ తేనియలు జిలుక నమృతపు
సోనలుగురియంగ బుధులు జు(....)త్వం
బౌ నౌరా రుచి యని గా
ధానంద(....)గదల్చి యాశ్చర్యపడన్.

అటు తరువాతగల దీర్ఘవచనమున నేతత్కావ్యగుణములు వర్ణింపబడినవి. ఆపై పరశురామరెడ్డి వంశావతార వర్ణనము కలదు. ఈ వర్ణనమున రామభట్టు వసుచరిత్రాది పూర్వప్రబంధము లందలి పలు పోకల ననుకరించి చక్కని పద్యములు కూర్చినాడు. వీనిలో మొదటిపద్య మిట్లున్నది.

సీ॥ అచలేశ్వరులుగాని యచలేశ్వరులుగారు
భూరిదర్పోద్యద్వి భూతిగతుల
గోపసింహులుగాని గోపసింహులుగారు
చటులబాహాబల శౌర్యగతుల
నరబిడౌజులుగాని నరబిడౌజులుగారు
వినతారిజయదశావిభవగతుల
రాజాంగజులుగాని రాజాంగజులుగారు
తగ కళారూప సౌందర్యగతుల
ననుచు జనులెన్నగను మిన్నయగు యశస్థి
తిని వహింప నవద్వయద్వీపభూప
మాన్యులగుదురుగాక సామాన్యనృపులె
తూమువంశంబునను బుట్టు భూమిపతులు.

రామభట్టీవిధముగా తూమువంశమువారి నందరిని వర్ణించినాడు. ఈ వర్ణనము ననుసరించి తూమువారి వంశక్రమ మీ విధముగానున్నది.



ఈ వంశావతారమునకును అలవేలు మంగా పరిణయమందీయబడిన వంశావతారమునకును కొలది వ్యత్యాసములున్నవి. అలవేలుమంగా పరిణయమున అయ్యపురెడ్డి కొడుకులందు జ్యేష్ఠుడుగా చెప్పబడిన వెంకటధాత్రీశ్వరుడిందు కనిష్ఠుడుగాను మరియు చిన రామిరెడ్డి సంజమ్మల సంతానముగా చెప్పబడిన రామచంద్రావనీపాలు డిందు (పెద) రామిరెడ్డి సంజమ్మల సంతానముగను చెప్పబడినారు. గౌరీవిలాస కృతి రచనమునకు ప్రోత్సహించిన పరశురామరెడ్డి రామచంద్రావనీపాలుని జౌరసపుత్రుడు కాడనియు దత్తపుత్రుడనియు గౌరీవిలాసము వలన దెలియనగుచున్నది.

కృతికర్త పరశురామరెడ్డిచే ననుజ్ఞాతుడై గృహమునకుబోయి ఆ రాత్రి నిదురింపగా స్వప్నమున పరమేశ్వరుడు సాక్షాత్కరించి కావ్యమును తన కంకితముగా రచింపుమని యాదేశించును. అ పట్టున పరమశివుని వర్ణన మీ తీరుగా నున్నది.

సీ॥ వలనొప్పనెమ్మేన నలదిన పలుబూది గను
గొన చలువ చందనముగాగ
కుడిదెస జారంగవిడిచిన పల్పాప
గమి పైడితీవె జందెములుగాగ
జిమికవాల్ నాగబత్తెము డమరుకము ముమ్మొన
వాలు కైయాయుధములుగాగ
చలిమిరికొండ ముద్దులకూతు రెల్లపు
డరమేన[1] వదలని యతుకగాగ
నొక్కతెలియాలబోతు బల్ జక్కి నెక్కి
కనులపండువుగా నొద్ద గానబడుచు
తొలి మెయిళ్ళ రొదోయన దోచ బిలిచి
గట్టు విలుకాడు కలలోన నిట్టులనియె.

శివుని స్తోత్రముచేయు పద్యములును ఒకదండకమును గలవు. అటుపై కవి వంశావతార మిట్లు గలదు.

1. నొదలని.



కృతికర్త తనతల్లి తాతతండ్రులనుగూడ వర్ణించి యున్నారు. అటుపై షష్ఠ్యంతములుచెప్పి కథా ప్రారంభము చేసినాడు

గౌరీవిలాసము ఆరాశ్వాసముల ప్రౌఢ ప్రబంధము మొదటి ఐదాశ్వాసములందు శివపార్వతుల ప్రణయకలహము. శివుడలుకతో కైలాసమును విడిచి వచ్చి తూమురామచంద్రావనీపాలుడు కట్టించిన శివాలయమున నెలకొనియుండుట, పార్వతీవిరహము, ఆమె సఖులతోగూడి శివుని వెదకుచు మానవతీపుర (తూమువారిరాజధాని) ప్రాంతారణ్యములకు వచ్చుట, శివుని విరహము, చిలుక రాయబారము పార్వతీ శివుల పునస్సమాగమము, పరివారదేవతలతో వారు మానవతీపుర దేవాలయమున నెలకొనియుండుట ఆదిగాగల కథలు ప్రవచింపబడినవి. షష్ఠాశ్వాసమున రామచంద్రావనీపాలుడు రాజ్యభారమును పరశురామ రెడ్డి కప్పగించి, యోగమార్గమున బ్రహ్మపదమలంకరించుట, పరశురామరెడ్డి పరిపాలనము, చెంచుల మొర, మృగయావిహారము పరిపాలనావ్యవస్థ, తండ్రి కట్టించిన శివకేశవాలయముల పునఃప్రతిష్ఠ మున్నగు విషయములు విపులముగా వర్ణింపబడినవి. మొదటి ఐదాశ్వాసముల కథాభాగమునగూడ విష్ణ్వాలయ శివాలయనిర్మాణ సందర్భములందు ఈ రెడ్డిప్రభువులకు ప్రవేశముకల్పించి ఈ గ్రంథకర్త యొకవిలక్షణ మార్గము ననుసరించినాడు

పోయిన కమ్మలందలి పద్యములు పోగా మిగిలిన గ్రంథమున మొత్తము 868 గద్యపద్యములున్నవి. ఈతని యాశ్వా సాంత గద్య మిట్లున్నది.

*"ఇతి శ్రీమన్ మహాలక్ష్మీనృసింహదత్త వరప్రసాద కవిత్వ రచిత సహజపాండిత్య వేములవంశపయః పారావార రాకాసుధాకర కౌండిన్యగోత్ర పవిత్ర లక్ష్మీనృసింహయార్యపుత్ర సకల కవిమిత్ర రామాభట్టాహ్వయ ప్రణీతంబైన శ్రీమద్గౌరీ విలాసంబను మహాకావ్యంబునందు షష్ఠాశ్వాసము"*—

గౌరీవిలాసమున పూర్వ ప్రబంధములలోని చక్కని పద్యములకు భావములకు అనుకరణము లధికముగా గనబడును. మీదుమిక్కిలి కవి తన సమకాలీన విషయము లెన్నింటినో ఈ వర్ణనములందు చొప్పించియున్నాడు. ఈతని కవిత్వాదికములు దెలియుటకై అట నట గల కొన్ని పద్యము లుట్టంకింతును.

మానవతీపుర హర్మ్య గోపురములందున్న హంసముల వర్ణనము.

గీ॥ ఒంటిపాదమూని యొక్క చిత్తము నిల్పి
యూపి రదిమిపట్టి చూపు దాచి
గోపురములమీద కొన్ని రాయంచలు
తముప సేయు మునుల తాల్మి బూని (I–73)

తెలంగాణమున 'చకిలం మొకిలం' అనుమాట ప్రచారమందున్నది. ఇది (భోజనాదులకు) కూర్చుండు విధమువకు పేరు.

వీణవాయించు స్త్రీని వర్ణించుచు కవి యీ పదమును ప్రయోగించినాడు.

చ॥ కనులరమోడ్పు చేసియు చకల్మొకలంబున
గూరుచుండి తా
కనకవిపంచి బొండొడ దగన్ సిడి నాదము
గాంచి తర్జనీ
య నఖముతోటి మీటి నవహాసము మోమున
జిల్క రాజు కాం
తిని గని పాటబాడె నొకతిన్ ప్రతివాణియనంగ
మేడలన్ (I–80)

పురస్త్రీలను వర్ణించు సందర్భమున దశావతారములు వారియం దారోపించిన విధము.

ఆ॥ ఝషకనేత్ర కమఠచరణాబ్జ గోల హ
ర్యక్షమధ్య బాల రామ రాజ
వదన కృష్ణవేణి వరబుద్ధి కల్కి నా
తరుణు లలరిరి పది యవతారగతుల (II–30)

శ్రీనాథుని శృంగార నైషధమునందలి "శేషపుచ్ఛ చ్ఛాయ చెలువారు బిసములు" (I–98) అను పద్య దలపించునట్టి దీ తటాకవర్ణన పద్యము.

సీ॥ అహిరాజపుచ్ఛ పుభానలద్భిసపాళి యం
తరస్థాభ్రము పదంతములుగ
సంఫుల్లసితపద్మ సత్రుభిల్యామినీ
హస్తిరాడ్గమన రేఖాంకురములుగ (?)
ప్రతిఫలితో పాంతవితత భూజాతముల్
కుక్షినిక్షిప్త సత్కుధరములుగ
కమలినీ మకరంద కాంక్షాచలద్భృంగ
జాలముల్ గరళాతి కీలలునుగ
లలితశైవాల జాలికాలతిక లరయ
భీమ బడబానలోద్భవ ధూమములుగ
క్షీరకలశధి బోలె గభీరమైన
యత్తటాకంబు గాంచె దైవోత్తముండు. (II–94)

సఖులతో బయలుదేరి పార్వతి వనములందు శివుని వెదకు సందర్భమున చెలికత్తెల మాటలు.

సీ॥ ఘనసారమా శరద్ఘనసారవర్ణుని ఘన
సారగంధితో గల్వు మనవె
మదనభూజాతమా మదనాపకారు నీ
మదనాగగతి వెతల్మాన్పు మనవె
కాంచనదుర్గమా కాంచనాచలధర్ము
కాంచననాస రక్షించుమనవె
కాదంబమా భూతకాదంబపతి నీలి
కాదంబికాదేవి గల్వుమనవె
కల్పభూజమ భక్తసంకల్పదు విర
గల్పగదె మోహవారధి గల్పకయును
ఏలకీభూజమా సద్దయాలవాలు
నీ లతాంగిని దయతోడ నేలుమనవె (III-23)

చంద్రోపాలంభనము సేయునప్పటి పద్యము.

చ॥ అరుదుగ కుంభభూతుడు మహార్ణవ సప్తకమూర్మి నీరమున్
గరమునగూర్చి పుచ్చుక రయమ్మున గఱ్ఱున దేల్చ పొట్టలో (త్రేన్ప?)
నరుగకముద్దబోలె గళమంద వసించి కృశించి యూర్చునన్
మరలెగదమ్మ వీనినతి మంగళమాత్ర బలమ్ము నేమనన్ (IV–32

మదనుడు పార్వతిమీదికి సన్నద్ధుడై బయలుదేరి వెడలునప్పటి వర్ణనము సమకాలీన యోద్ధల వర్ణనము కాబోలు

సీ॥ విరజాజిమొగ్గ జల్తర రుమాల్ వడిజుట్టి
గేదంగిరేకు నీమా దొడంగి
మంకెనపువ్వు తుమాన్ శిస్తుగాదూర్చి
కడిమి కురువేర్నడు కట్టుగట్టి
మేలైనచిగురాకు సాలువ పైగప్పి
పాటలీదామంబు దాటజుట్టి
పచ్చికస్తురి బొట్టిడి పచ్చవింటి
పూలకోలలు సంధించి భుజమునుంచి
టేకు బూడాల్ మొగిల్రేకు బాకుకత్తి
హత్తి మదనుండు కదన ప్రయాణమయ్యె (IV–54)

మలయానిలుడు మన్మథున కాయత్తపరచిన రథ మీ తీరుగా వర్ణింపబడినది.

సీ॥ కలువరేకులు బండికండ్లుగా సవరించి
మెరుగైన బిసకాండ మిరుసొనర్చి
మొగులు రేకులు రెండు నొగలుగా నొనగూర్చి
మల్లెమొగ్గయు కాడి మూకుజేసి

మొల్లమొగ్గలుతరుల్ మెల్లగా సమకూర్చి
తేటిగంటలు వేడ్కతోటి గట్టి
నిండు సంపెంగ పూలదండ జెండాల్పైచి
గొజ్జంగివిరి గొల్కకు శిరదీర్చి
మీనుమొసలి సిడంబులు మీదికెత్తి
కమ్మపూదేనె కన్నుల కందెనలిడి
శీతగంధవహుండను సూతుడొకడు
మదన కదలుమటని తేరు ఎదుటనిడియె. (IV-57)

మన్మధుని జైత్రయాత్రావర్ణన మిట్లున్నది.

సీ॥ పచ్చపిట్ట పఠాన్‌సిపాయిల్ సవారి భే
షాబాసు వహవా పసందనంగ
మొకములెత్తుకొని శారికవంది మాగదుల్
బహుపరాగ్పొర భళాభళి యనంగ
రభసంపునెమ్మి వీరభటాళిఝుళిపించు
ఉక్కుకత్తులును తళుక్కనంగ
శీతువుపిట్ట బంట్రౌతు తుపాకి చ
ప్పుళ్ళుఢెమిల్లు ఢెమిల్లు మనగ
అంచ లిరువంక చోపుదార్లై గడంగి
జరుగకుడు ఖబర్దార్ఖబరి యనంగ
మారుడవ్వేళ ననికై సవారివెడల
తనబలంబుతో శృంగారవనము జేరె (IV-64)

వసుచరిత్రము పద్యముల కిందెన్నియో అనుకరణము లున్నవి. అట్టివానిలో నొకటి. ఇది "మోహాపదేశ తమో ముద్రితము లైన" అను వసుచరిత్ర పద్యమును (III-180) దలపించును.

సీ॥ ధవుమీది వ్యామోహ తమసంబు పైగప్ప
ముదిత కందమ్ములు మోడ్చెనేమొ
మదనానలంబులో బొదవగామిని తనూ
కలధౌత మీచక్కి గ్రాగెనేమొ
తచ్ఛృమాంభఃకణ తారకల్ గని లేమ
కుచ చక్రవాకముల్ గుందెనేమొ
విభుని పైగలకూర్మి వృంతంబు దురమాగి
యసులతాంత మమ్లానమాగెనేమొ
గాన హిమజలముల గనల్ గడుగరాదు
వనితపై పల్లవపుటంబు లిడగరాదు (?)
చెలికనుల చంద్రఖండముల్ నిలుపరాదు
ఈ చెలువసోక వీవనల్ విసరరాదు (?) (IV-84)

షష్ఠాశ్వాసమున తూమువారి పరిపాలనాదులు సత్కార్యములు వర్ణింపబడినవి. పరశురామరెడ్డి నుద్దేశించి అతని పూర్వులిచ్చిన యగ్రహారాదుల ప్రసక్తి గావించు పద్యమిది.

చ॥ తమపెదతండ్రి రామవసుధాపతి భక్తిని సల్పి నట్టి శ్రీ
రమణుని యుత్సవాదులకు రాసిరులీనెడు శాపురాగ్రహా
రము సమకూర్చె దా నితరరాజులు మెచ్చగ ఛత్ర చామరో
త్తమ తురగంబు లందలము దా గొనె ధీ కుశలార్హ చిహ్నముల్ (VI-31)

రామరాజభూషణుడు అర్ధద్వయమున కభేదాధ్యవసాయముచేసి శివపార్వతుల వర్ణించిన పద్యమును (I-6) మనమునందుంచుకొని గౌరీవిలాసకర్త పరశురామరెడ్డికి స్వప్నమున దాక్షాయణి సాక్షాత్కారమైన విధమును వర్ణించియున్నాడు.

సీ॥ వరనీలకంధరస్ఫురదాభ లిరు ప్రక్క నిరు
ప్రక్క కమలభాసుర కరంబు
ఘనపుండరీక శోభనచేల మిరువంక నిరు
వంక ననలబంధుర దృశంబు
నవసుధాధరబింబ సవిభవం బిరుతేప
నిరుతేవ సిత పయోధర విభాతి
తారకాస్థిర సత్ప్రదామంబు లిరుదెస
నిరుదెస నాహీనకా భరణకాంతి (?)

పలుకుభేదంబుగా బల్కు వలవకయును
వలచియిచ్చిన నరమేనగలసి శౌరి
చెలువుడును దానుగలియుట దెలుపవచ్చి
కలనుభూపాలకునిమ్రోలనిలువబడియె(VI-111)

పరశురామరెడ్డి స్వప్నవృత్తాంతమును వర్ణించుపట్ల నాతని మంత్రియగు పల్ల పురుషోత్తమ రాయడుకూడ వర్ణింపబడినాడు. పరశురామరెడ్డి తనస్వప్నమును వినుపించుటకై రంగాచార్యులను బిలిపించెను.

ఆ యాచార్యుల వర్ణనమిది.

క॥ అర్యమ తేజుల నమరా
చార్య లసత్ప్రచురవాక్ప్ర సంగీకృత ధీ
ధుర్యుల నుక్కలరంగా
చార్యముఖార్యాళిబిల్వ చయ్యనబంచెన్.(VI-136)

ఇటులే సమకాలీన విషయములెన్నియో గౌరీవిలాస ప్రబంధమున గలవు. కొన్నిపద్యములందు ఫారసీ ఉర్దూ భాషాపదములుకూడ ప్రయోగింపబడినవి. విస్తరభీతిచే వానిని విడుచుచున్నాను. షష్ఠాశ్వాసాంతమునగల శివస్తోత్రముతో నీ పరిచయ వ్యాసమును పరిసమాప్తమును చేయుదును.

అమితాహి కులేశ్వరహారధరా
హిమభానుజితాభసరేణకరా
కమలాంబకచేత సగర్వహరా
విమలాభ్రధునీ ధృతవిష్ణుశరా (VI–171)

---

( హైద్రాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారి సౌజన్యముతో )

## శ్రీ చిలకలపూడి వేంకటేశ్వరశర్మ

శ్రీ భద్రాచాలరామదాసు, శ్రీ తూము నరసింహదాసు, శ్రీ అల్లూరు వేంకటాద్రిస్వామియను ముప్పురు నాంధ్రదేశపు సుప్రసిద్ధ భక్తవర్యులు.

ఈ ముప్పురు భక్తవర్యులు వైష్ణవ సంప్రదాయమునననుసరించినవారే. ముగ్గురు శ్రీ భద్రాచల శ్రీరామునకు సేవచేసినవారే. ఈ ముప్పురు ననేక విధములగు భగవత్కైంకర్యములు చేసినవారే. ఈ ముగ్గురు శ్రీ రామానుగ్రహమును బొంది జన్మసాఫల్యము నొందినవారే. ఈ ముప్పురు నాంధ్రులకు చిరస్మరణీయులై యున్నారు. వీరికీర్తనలు అనేక మంది తరించుటకు సాధనములయినవి.

వీరిలో మొదటివారగు శ్రీ భద్రాచలరామదాసుని పేరు వినని యాంధ్రుడుండడు. ఈ భక్తవర్యుడు సుమారు మూడువందల యేండ్ల క్రిందట్ల నిజాము రాష్ట్రమును పాలించుచున్న తానీషాయను హైదరాబాదు నవాబునకు కొలువుకాడై, భద్రాచల తాలుకా తహశీల్దారు పదవి నధిష్ఠించినవాడై, ప్రజలు నవాబుకు బాకీయున్న ఆరులక్షల పైకమును వసూలు చేసి శ్రీరామచంద్రమూర్తికి మహావైభవోపేతమయిన దేవాలయమును నిర్మించి, స్వామివారికి నిత్యోత్సవ మాసోత్సవ బ్రహ్మోత్సవాదులు శాశ్వతముగ జరుగుటకు తగిన శాశ్వతపుటేర్పాట్లను చేసిన మహాత్ముడు. సర్కారు పైకము నిట్లు ప్రభుపునకు దెలియకుండ సర్వలోక ప్రభువగు శ్రీరామచంద్ర పరమాత్మకు కైంకర్యము చేయుటచే నవాబు కోపాగ్నికి గుఱియై పండ్రెండు వత్సరములు ఘోరమగు కారాగృహ శిక్ష ననుభవించి శ్రీరామదేవుని కృపచే విముక్తుడై సర్వ విధముల స్వామిని సేవించి తత్సంపూర్ణ కటాక్ష పాత్రుడై పరమపదమున నధిష్ఠించెను.

ఈ భక్తవర్యుడు ఆ యా సందర్భములందు "భద్రాచలరామదాస" ముద్రతో పెక్కుకీర్తనలను రచించెను. భక్తిరస ప్రపూర్ణమగు 'దాశరథీశతకము

అనునొక చిన్న గ్రంథమును కూడ రచించెను. వీదిబడులయందు నీ శతకమును ప్రతిబాలకునిచేతను చదువుచెడివారు. ఆంగ్లవిద్యాపద్ధతి బాగుగ వ్యాపించినతర్వాత నీ శతకపాఠ మంతరించినది.

శ్రీరామదాసుచరిత్రలో నా యా సందర్భము లందు "జానకీపతి" యను మకుటముతోగూడిన శతక పద్యములుగూడ వ్రాయబడియున్నవి. ఈ పద్యములు ఆపదలలోనున్నవాడు మొఱబెట్టినరీతులతో గూడినవిగా నున్నవి దాశరథీశతకములోనున్నంత శబ్దశుద్ధత ఈ 'జానకీపతి' శతకపద్యములందు గనపడదు, అచ్చటచట వ్యాకరణ విరుద్ధసంధులు గనుపడుచున్నవి. మహాభక్తుల వాక్కులలో సంధిదోషములు శబ్దదోషములను మనము పాటింపకూడదు. పాణినీయ వ్యాకరణ విరుద్ధ ప్రాయోగములు వాల్మీకి రామాయణమందు గన్పడినను వ్యాకరణకర్తలు ఋషిప్రయోగములు యథాతథముగ శుద్ధములే యని శాసించినారు. అట్లే ఈ మహాభక్తుల వాక్కులును, రామదాసుగారు ఆయా సందర్భములందు చెప్పిన కీర్తనలను చేర్చి మఱొక భక్తుడు పద్య గద్యములతోడను, తొహరాలతోను నితరములగు కొన్నికీర్తనములను చేర్చి యొక యనుగతమగు చరిత్రగా రచించినాడు. భద్రాద్రిరామదాస ముద్రతోనున్న కీర్తనలు దాసుడు దొరతో బెట్టుకొను మొఱల రీతులుగ నున్నవి. గోపన్నగారికి తహసీల్దారు పదవి నొసంగినతర్వాత భద్రాచలమునకు జేరినప్పటి నుండియు నాలయనిర్మాణమువరకు రచించిన కీర్తనలు శ్రీరామచంద్రుని కీర్తించుటయందును రామనామ మహిమను, శ్రీరామకటాక్షముచే తనకుగల్గిన బలము, మొదలగు విషయములను దెల్పినారు. "ఎంతో మహానుభావుడవు." "రామనామమే జీవనము" 'శ్రీరామనామమె జిహ్వకు స్థిరమైయున్నది' "తక్కువేమిమనకు — రాముండొక్కడుండువరకు" అను కీర్తనలు పైవాక్యములోని యంశములను ధ్రువపఱచుచున్నవి. రామదాసుగారు నవాబుచే కారాగృహ బంధితుడైనప్పటినుండి తద్విముక్తి వరకు జెప్పిన కీర్తనలనడక మఱొకవిధముగ నున్నది. కారాగృహమందు భక్తునకు గల్గిన బాధల నివారణకై యాతడు శ్రీరామునితో బెట్టిన మొఱల రీతులు పెక్కువిధములు గలవు. భక్తపరాధీనుడైన భగవంతునిపై భక్తునకుగల చనవెట్టిదో యీ కీర్తనలవలన దెలియును.

"దీనదయాళో. దీనదయాళో" "గరుడగమన రారా" "ఏమిరా రామ నావల్లనేరము" "రక్షింపవిదియేమో రాచకార్యముబుట్టె" "రామ నా మనవి చేకొనుము" అను కీర్తనములందు భక్తుని యార్తి విశేషముగ బ్రకటితమగుచున్నది నవాబు భటులు పెట్టుబాధలను సహింపలేక మొఱబెట్టుచు పాడిన కీర్తనలు "ఎటుబోతివో ఎటుబోతివో రామ" "ఏలాగుతాళుదు నేమిసేయుదు" "అబ్బబ్బ దెబ్బలకు తాళలేను" ఎంతకాలమునకు శ్రీరాముడు తన్ను రక్షింపకున్న నిష్ఠురముగ పాడినకీర్తనలు కొన్నిగలవు. అవేవన : "ఇన్నిగల్గి మీ రూరకున్న నేనెవరివాడనౌదు" "శరణాగతరక్షణ బిరుదని నే శరణంటి గదయ్యా" "సీతారామస్వామి నేజేసిన నేరమ్మేమి" "పలుకే బంగారమాయెనా" "ఇక్ష్వాకుకులతిలక ఇకనైన బలుకవు రామచంద్రా" అను కీర్తనలో "ఓ రామచంద్రా! నీకు ఆలయములు, ప్రాకారములు, ఆభరణములు మొదలగునవి సమర్పించుట కెన్ని వేల వరహాలో వెచ్చించినాను, ఇది యెవరబ్బ సొమ్మని కులుకుచున్నావయ్యా!" అని మిక్కిలి కఠినముగ బల్కినాడు భక్తుడు. "నిను బోనిచ్చెదనా" "బిడియమేల నిక మోక్షమిచ్చి నీ వడుగు దాటిపోరా" "అడుగుదాటి కదల నియ్యను-నాక భయమియ్యక నిన్నువిడువను" ఈకీర్తనలు ఎన్నోమొఱలు పెట్టిపెట్టి దయరాకున్న విసిగి చివరకన్న సాహసపు మాటలు. "రామా నీచేతేమికాదుగా" అనితెల్పి సీతమ్మతల్లిని మొఱబెట్టినాడు భక్తుడు. తల్లికటాక్షము

వలన రామదాసుగారి కారాగృహవిముక్తిని రామ లక్ష్మణులు గల్గించిరి.

వీరి కీర్తనములలో శుద్ధ సంస్కృతకీర్తనములు కొన్ని గలవు "*భజరే భజ మానస రామం*" "*వందే రఘురామ*"అను కీర్తనమందు శ్రీనారాయణతీర్థుల వారి సంస్కృతకీర్తనలరీతి ననుసరించిరి. "*వందేరఘురామ*" అను కీర్తనములో "*ధరణిజ సత్కళత్ర - సుచరిత్ర సుచరిత్రమునిస్తోత్ర - హృదయాజ్ఞమిత్ర - సత్పవిత్ర - త్రిశిరజైత్ర - నీరజనేత్ర వారిదగాత్ర - విపులశాత్రవ భైరవ కైరవ పద్మమిత్ర - అజపవిత్ర - విభీషణవర భృతజైత్ర - అమరత్ర*" ఈ చరణమున రామదాసుగారి సంస్కృత రచనాచమత్కృతి సువ్యక్తమగుచున్నది. భక్తిపారవశ్యముచే భక్తుల ముఖము నుండి యిట్టిమనోహర రచనలు తమంతటతామె వెలువడుచుండును. ఇట్టి విశేషములు వీరి కీర్తనములలో పెక్కులు గలవు.

ఇక తెనుగుకీర్తనలలో "*రేపుమాపని జరిపితే నే నాపుజేసెడివాడగాను-పాపునీవని నమ్మికొలిచిన-పాపముల నెడబాపి దయతో - తేపతేపకు నీదుమోమిటు జూపకుండిన నోర్వసుమ్మీ!*"ఇందు పకారప్రాస విశేషము గమనింపదగినది. "*నీటుజిక్కి కరి మాటికి వేసరి నాటకధర నీపాటలుబాడగ - మేటిమకరి తలమీటి కాచుదయ - యేటికి నాపై నేటికిరాదో*" ఇట్టి శబ్దాలంకార రచనలెన్నో రామదాసుగారి పద కవిత్వములోగలవు. ఉత్సవ సంప్రదాయ కీర్తనలు అనగా లాలి జోల మేలుకొలుపులు మొదలగు దైవోపచారములు దెల్పుకీర్తనలు శ్రీ రామదాసుచరిత్ర యందు గన్పడవు. వీరితర్వాత భక్తులు రామదాసు గారికంటె పూర్వుడగు తాళ్లపాక అన్నమాచార్యులు పురందరదాసు మొదలగువారి పద్ధతుల ననుసరించి యుత్సవ సంప్రదాయముల ననుసరించిరి.

## శ్రీ తూము నరసింహదాసుగారు

శ్రీ తూము నరసింహదాసుగారు గుంటూరు పురమున సుమారు రెండువందల సంవత్సరముల క్రిందట జన్మించిరి. వీరిది పరాశరస గోత్రము. తండ్రి తూము అప్పయమంత్రి. తల్లి వెంకమాంబ. ఈ దంపతులకు నరసింహదాసుగారు శ్రీ భద్రాద్రి రాముని కరుణచే బుట్టిన కుమారుడు. పెద్దలందఱు ఈయన ప్రథమ జన్మదినోత్సవ సమయమున గొప్ప భక్తుడు కాగలడని దెల్పుచు నాశీర్వదించిరట. సకాలమున మాతాపితలు ఈయన కుపనయనమొనర్చి సంస్కృతాంధ్రముల పాండిత్యము కల్గువరకు చదివించిరి. సంగీతమునందును కవిత్వమునందును వీరు ప్రజ్ఞ సంపాదించిరి. యుక్తవయస్సునందు ఈడు జోడగు కన్యను విచారించి వివాహముచేసిరి జననీ జనకులు.

ఆ కాలమందలి యొక లౌకికోద్యోగపదవిని సంపాదించి యతి సమర్థతతో నిర్వహించుచు నెడ తెగక శ్రీరామభక్తి తత్పరుడై భగవంతుని సేవచేయు చుండెను. వీరు ప్రతియేడు చైత్రశుద్ధ పాడ్యమి మొదలు నవమివఱకు శ్రీరామోత్సవములను జేయు చుండువారు. ఇట్లు కొంతకాలము చేయగా శ్రీరామ చంద్రుడు సీతాలక్ష్మణ సహితుడై స్వప్నమున దర్శన మిచ్చి భద్రాచలక్షేత్రమునకువచ్చిన నాయనమనోరథ సిద్ధి కాగలదనితెల్పి యంతర్ధానుడయ్యెనట.

పిమ్మట నరసింహదాసుగారు కొందరుభక్తులతో గూడి భద్రాచలక్షేత్రమునకుబోయి. యట కొన్నిదినములుండి శ్రీరామచంద్ర పరమాత్ముని అనేకవిధముల సేవించి, స్వామియాజ్ఞగొని ఉత్తరదేశయాత్రచేసి, అయోధ్యానగరమును దర్శించి, యచనుండి మఱి కొన్ని క్షేత్రములకుబోయి, పిమ్మట స్వస్థలమునకు వచ్చిరి.



శ్రీ చిలకలపూడి వెంకటేశ్వరశర్మ

కొలది కాలములోనే దక్షిణదేశయాత్రకు బయలుదేరి కొందఱుభక్తుల గూడుకొని కాంచీపురము, శ్రీరంగమును దర్శించి వరదరాజస్వామిని, శ్రీరంగనాథుని పలువిధముల కొనియాడి, రామేశ్వరమువరకు బోయి, మఱల చెన్నపట్నమువఱకు వచ్చినపిమ్మట వరదరామదాసు అను భక్తవర్యుడు వీరిని కలిసికొని. వీరిని కొంతకాలము చెన్నపట్నముననిలిపి. భగవద్భజనాది సత్కాలక్షేపములతో గడపెను,

పిమ్మట నీభక్తవర్యు లిరువురు భద్రాచలయాత్ర మఱల చేయ దలచిరి. వీ రిరువురును చెన్నపురినుండి గుంటూరునకువచ్చి యటనుండి భద్రాద్రికి పయనమైరి. వీరు భక్తబృందముతోగలిసి భద్రాచలములకు కొన్ని దినములలో చేరిరి.

అచ్చటిజనులు శ్రీ నరసింహదాసుగారి భక్తి పారవశ్యమును, వైరాగ్య సంపత్తిని నిర్లిప్తతను గని గౌరవించిరి. ఈయనను అచ్చటి యధికారులు స్వామివారి యాలయమునకు ధర్మకర్తగా నుండుడని కోరిరి. వీరట్లంగీకరించి శ్రీభద్రాచలరాములవారికి పలువిధములగు సేవలుచేయింపసాగిరి. ఈ సేవలలో (1) ప్రభుత్వ సేవ. (2) ఏకాంత సేవ. (3) శుక్రవారపు సేవ. (4) బాలలీలావిలాసము ముఖ్యములు. ఈ సేవలకన్నిటికి కావలసినకీర్తనముల రచించిరి ఇప్పటికీ మనదేశమందు చేయబడు శ్రీరామోత్సవాదులలో ప్రభాతసేవలు, బాలలీలలు మొదలగుసేవలయందు శ్రీ నరసింహదాసులవారి యుత్సవకీర్తనలనే పాడుకొనుచున్నారు. ఈ యుత్సవకీర్తనలలో చూర్ణికలు, పరాకులు, హెచ్చరికలు, లాలి, జోలపాటలు, మేల్కొలుపులు, మంగళహారతులు కీర్తనలరూపమున. పద్యరూపమున వీరిచే రచింపబడినవి. ఈకీర్తనలన్ని భక్త్యావేశముగల్గించునట్టివిగా నున్నవి.

ఈ యుత్సవసంప్రదాయ కీర్తనకు. పితామహుడు తాళ్లపాక అన్నమాచార్యులుగారు, పర్వాత నీ సంప్రదాయమును పూర్తిగ శ్రీ త్యాగరాజస్వామి ఆచరణలోనికి దెచ్చినారు. తర్వాతవారగు శ్రీ తూము నరసింహదాసుగారు, అల్లూరు వేంకటాద్రిస్వామిగారు వాడుకలోనికి తెచ్చినారు. ఇంకను తెనుగునాటి యందలి భక్తవర్యులు, ముత్తేవి సుందరరామదాసుగారు, తాడంకి వేంకటదాసుగారు మఱి కొందఱు ఆచరణలోనికి దెచ్చినవారున్నారు.

## శ్రీ అల్లూరు వేంకటాద్రిస్వామిగారు

వీరు ఆంధ్రనియోగి బ్రాహ్మణశాఖీయులు. కృష్ణాజిల్లాలోని జుజూరు పరటాల తాలుకాలోని అల్లూరు వీరిజన్మస్థానము. భారద్వాజసగోత్రుడు, తండ్రి వెంకయ్య. తల్లి వెంకమాంబ వీరు స్మార్త సంప్రదాయమువారు. ఈ తల్లిదండ్రులకు క్రి. వె. 1806 సంవత్సరము, అక్షయనామ సంవత్సరమున దైవకృపచే కుమారుడుగా వేంకటాద్రిస్వామి జన్మించెను. వీరు బాల్యమందు పాఠశాలయందు గురుశిక్షితులై విద్య నేర్వలేదు *"అంభోజగర్భాదు లభ్యసింపగరాని హరిభక్తిపుంభావమైనవాడు"* అన్నట్లు బాల్యమునుండి హరిభక్తియుతుడై విలసిల్లెను సకాలమున నుపనీతుడై దైవచింతనలోలుడై యుండెను. స్వప్రయత్నముచేతను ఆంధ్రగీర్వాణభాషల నభ్యసించెను ఆ యా శాస్త్రముల జ్ఞానము నలవరుచుకొనెను. *"గురులేక యెటువంటి గుణికి దెలియగబోదు"* అని శ్రీ త్యాగరాజస్వామి యన్నట్లు సద్గురుకటాక్షమును బొందినగాని పరమార్థము హస్తగతముగాదని శ్రీ వేంకటాద్రిస్వామి తెలిసికొని యాకాలముననఖండ భక్తిజ్ఞాన సంపన్నుడై ప్రకాశించు శ్రీ తూము నరసింహదాసవర్యుని పదముల నాశ్రయించి తారకమంత్రోపదేశాది భక్తిసాధనలను నభ్యసించి నవవిధ భక్తిమార్గములను అలవరుచుకొనుచుండెను.

భద్రాచలక్షేత్రమున గొంతకాలము. కాంచీపురమున గొంతకాలమును, తిరుపతిక్షేత్రమున గొంత

కాలమును. శ్రీరంగక్షేత్రమున గొంతకాలమును గడపి ఆ యా క్షేత్రములం దనేక భగవత్కైంకర్యముల నొనర్చి వైష్ణవదీక్షను బొంది సన్యసించి ఉభయవేదాంత తిరువేంగడరామానుజ జియ్యరను తురీయాశ్రమ నామమును ధరించి యా యా క్షేత్రములందు నాయా సందర్భములందు పెక్కు కీర్తనముల రచించి భగవంతుని సర్వవిధముల కొనియాడి శ్రీరంగక్షేత్రమునందు తమ భౌతికశరీరమునువీడి శాశ్వత పరమపదమును నలంకరించిరి.

మహాభక్తుల కీర్తన సాహిత్యములు సాహిత్య వేత్తలను ఆలంకారికులను మెప్పించురీతి ననుసరించి రచింపబడవు. భక్త్యావేశముతో భగవంతుని దివ్య రూపవర్ణనలు లీలలవర్ణనలు చేయునపుడును మానస బోధ చేయునపుడును సంసారబంధముస తాముపడు బాములను దీనముగా మనవిచేయునపుడును ఆర్తుడై తన్ను రక్షింపుమని వేడునపుడును తదనుకూలమగు పదజాల మప్రయత్నముగ వారిముఖమునుండి వెలువడును. ఇట్లని నియమబద్ధములు గావనకూడదు. కీర్తనల కుండవలసిన ఛందోనియమములు పాటింపబడును. సుశబ్దప్రయోగము చేయబడును.

శ్రీ వేంకటాద్రిస్వామి సుమారు 175 కీర్తనలను రచించిరి వీరిలో చాలవరకు కంచి వరదరాజస్వామి మీదను శ్రీరంగనాథునిమీదను రచింపబడినవి. సామాన్యముగ నిట్టి భక్తుల కీర్తనలలో మానసబోధలుకొన్ని, లోకబోధలుకొన్ని, భగవద్గుణాభివర్ణనలుకొన్ని, భక్తుడు నదుఃస్థితి భగవంతునితో దెల్పునట్టివికొన్నియు నుండును. భారతదేశమున నేభాషలో నేభక్తుని కీర్తనములు పరిశీలించినను పైదెల్పినరీతులె గన్పడును. పురందరదాసు కన్నడపదములలోను తుకారాము అభంగములలోను కబీరు. సూరదాసు, తులసీదాసు మొదలగు భక్తవర్యుల గేయఫణుతుల లోను నిట్టిరీతులే గన్పట్టుచున్నవి.

శ్రీ వేంకటాద్రిస్వామి, శ్రీ త్యాగరాజస్వామి సమకాలికు లగుటచేత వారి యపూర్వజన్యరాగములను, కీర్తన సాహిత్యధోరణులను అనుసరించినట్లు గన్పడుచున్నది. "నారాయణ దివ్యనామమంత్రమున నాలుకతో పల్కవెమనసా" "ఎందుకే ఉపద్రవములు జెందకె ఓమనసా" ఇట్టి మానసబోధలు ఇంకను కొన్నిగలవు. "దాసానుదాసుడనయ్యా" "ఇంక నీదయరాదా" "చలమేలజేసేవురా" "చింతరావదేరా" "నామొఱాలకింపవేమిరా" "నిను నెఱనమ్మినానురా" "మనవాలకింపర" "శరణు శరణు శరణు శ్రీరామ" "హెచ్చరిక హెచ్చరిక రామా" ఈ పై నడకలు శ్రీ త్యాగరాజస్వామి యనుకరణము లుగ గన్పడుచున్నవి.

అందఱిభక్తులవలె శ్రీ వేంకటాద్రిస్వామికూడ భగవంతుని నిత్యోత్సవాదులు సేయువాడగనుక లాలి, జోలపాటలు, మేల్కొలుపులు, మంగళహారతులును ఆ యా దివ్యస్థల దేవతలమీద రచించినారు. పూర్వుల సంస్కృతగేయములందువలె వీరి గేయములందు భాషాచమత్కృతులంతగా గానరావు ప్రతికీర్తనయు భక్త్యుద్బోధకమై యుండును. శ్రీత్యాగరాజస్వామి గానముచేసిన యీ క్రింది యపూర్వరాగములలో వీరును కీర్తనలరచించి గానమొనర్చిరి. అవేవన, "ఖరహరప్రియ. మాంజి, పూలసేని, ఆరాణ. పంతువరాళి, రీతిగౌళ, ఆసావేరి. శుద్ధవరాళి, గౌడపంతు అనునవి. ఈకీర్తనలలో కొన్ని మన కృష్ణానది ప్రాంతములందుకూడ వ్యాప్తినొంది భజనపరులచే గానముచేయబడుచున్నవి. "కస్తూరి రంగయ్య — కరుణింపవయ్యా" "కుంజరవరదుని పాదకంజములను నమ్మరాదా" "రంగరాజ యిందురారా" "హరి హరి హరి హరి హరి యిందురారా" ఈ కీర్తనలు తరచుగా భజనలలో వినబడునట్టివి. సంగీత విద్వాంసులుకూడ కొన్నిటిని సంగీతకచేరీలలో పాడుచుందురు.



శ్రీ చిలకలపూడి వెంకటేశ్వరశర్మ

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని

ఆంధ్రవాఙ్మయమునఁ గవిరాజులవలెనే రాజకవులును గొందఱున్నారు. వారొకవంక రాజ్యపాలన మొనరించుచు వేఱొకవంక వైరివాహినులపై దండెత్తి విజయపరంపరలను సాధించుచు సమయము చిక్కినప్పుడు సారస్వతోపాసనకుఁగూడఁ గడంగి రసవంతములైన కావ్యములను సృష్టించియున్నారు. ఈ విధముగా వారు రసారాజ్యమునేకాక రసరాజ్యమును గూడఁ బాలించిరని చెప్పవచ్చును. బహు కార్యవ్యగ్రులు భోగలాలసులునైన రాజులకు శాంతచిత్తతతో నిర్వహింపవలసిన సత్కావ్య సృజన వ్యాపారమున కవకాశము లభించునాయను ననుమానముచేతనో, కావ్యసృజనానుకూలమైన పాండితీ ప్రాభవము సంపాదించుట యట్టివారికి సాధ్యమగునా యనుసందేహముచేతనో రాజకవుల రచనలుగాఁ బరిగణింపఁబడుచున్న కావ్యముల కర్తృత్వమునుగూర్చి లోకమునఁ గొన్ని యపవాదములు ప్రబలియున్నవి. కాని యిట్టి యనుమానముల కంతగాఁ దావులేదు. ప్రతిభ దైవమగు గుణవిశేషము. అదిగల వారెట్టి క్లిష్టపరిస్థితులందైన నేదో యవకాశము కలిగించుకొని సృజనవ్యాపారమునకుఁ గడంగుచునేయుందురు. మఱియుఁ బూర్వపు రాజకుమారులు రాజ్యపాలనమునకు బరాక్రమ ప్రదర్శనమునకు గావలసిన మానసిక శారీరక పరిశ్రమనే కాక పాండితీవైభవమును జేకూర్చు విద్యాపరిశ్రమను గూడఁ దత్పరతతోఁ జేయుచుండిరనుట కనేక నిదర్శనములున్నవి. అదిగాక రాజులైన పిమ్మటఁగూడ వారు కావ్యశాస్త్ర గోష్ఠియం దుత్సాహమునఁ బాల్గొనుచుండిరి అసలు విద్వద్గోష్ఠి, రాజుల దైనిక జీవితమందలి యొకయంశము. అట్టియెడ వారు బహు కవి పండితుల కావ్యములను వాగ్వివాదములను వినుటవలననే యపారమైన వ్యుత్పత్తి గౌరవము నార్జించుట కవకాశమున్నది. అందుచే రాజులు కావ్యరచన కావించుట కవకాశముండునాయని యనుమా

నింప నవసరంలేదు. నిజముగా నవకాశములేకున్నను గొందఱు దాని నన్యథా గడిపివేయుదురు. అది వారి యభిరుచి విశేషములపైని మనస్తత్త్వముపైని ఆధార పడియుండును.

సంస్కృతమున బహు మహాకవి పోషకుఁడు గనేకాక మహాకవిగఁగూడఁ బ్రసిద్ధుఁడైన భోజమహా రాజు కొంచెె మించు మించుగా రాజరాజనరేంద్రునకు సమకాలికుఁడు. బద్దెనరచించిన నీతిశాస్త్ర ముక్తావళి పీఠికలో కీ॥ శే॥ మానవల్లి రామకృష్ణకవిగారు భోజ రాజవిభూషణమను నీతి భూషణము పేరుదాహ రించి భోజుఁ డాంధ్రద్రవిడ కర్ణాట భాషలందుఁగూడఁ గవిత్వము చెప్పఁజాలియుండెనని సూచించియున్నారు. మడికిసింగన తన సకలనీతి సమ్మతమున నీతిభూష ణములోని పద్యములు కొన్ని యుదాహరించి యున్నాఁడు ఈ పద్యములలో నవి భోజరాజ రచి తములని చెప్పుటకుఁ దగిన యాధారము లేవియులేవు. మఱియు సింగన తా నేయే గ్రంథములనుండి, యేయే కవులనుండి, పద్యములను సేకరించునో చెప్పిన యవ తారికాభాగమున ''నీతిసార, నీతిభూషణ, క్షేమేంద్ర, భోజరాజ, భూషణ''నామములను బేర్కొని యున్నాఁడు. ఇందు నీతిభూషణ భోజరాజ భూషణ నామములు వేఱువేఱుగానున్నవి. సకలనీతి సమ్మతమున భోజ రాజ భూషణమునందలి పద్యములేవియు నుదాహ రింపఁబడి యుండలేదు. కాని యది యసంపూర్ణ ముగ లభించుటచే లభింపని భాగమున నందలి పద్యము లున్నవేమోయని యనుమానింపవచ్చును. అయినను నీతిభూషణ భోజరాజ విభూషణములను నవి రెండును నొక గ్రంథముయొక్క పేరులని నిశ్చయించుటకు వీలు లేదు. సకలనీతి సమ్మతము పీఠికలో కీ. శే. కవిగారు నీతిభూషణము నాంధ్రభోజుఁడను నొక కవి రచించెననియు, బాలబోధలక్షణమున నందుండి పెక్కు పద్యము లుదాహరింపఁబడియున్నవనియు వ్రాసియున్నారు. దీనినిబట్టి నీతిభూషణకర్త భోజ మహారాజు కాదనియు, నాంధ్రభోజుఁడను బిరుదము గల మఱొకకవి యనియుఁ దెలియుచున్నది. ఈ యాంధ్రభోజుఁడెవ్వరో తెలియదు. కాని యాతఁడు కూడ రాజే యని యూహింపవచ్చును. సకలనీతి సమ్మతమున నీతిభూషణమునందలివనియు నుదాహ రింపఁబడిన పద్యములలోఁ బెక్కుకందములే. ఇవన్ని యు రాజులకు సంబంధించిన నీతులను బోధించుచు రచనయందును, భావములందునుగూడ రమ్యములై యొప్పారుచున్నవి

ఆంధ్ర వాఙ్మయమందలి శైవ కవులలో మొదటివాఁడు నన్నెచోడుఁడు. ఇతనికాలము వివాద గ్రస్తమై యున్నది. ఇతఁడు నన్నయ తిక్కనలనడిమి కాలమువాఁడను వాడమునే పలువు రంగీకరించు చున్నారు. తనతండ్రి చోడబల్లి పాకనాటియం దిరువదియొక్కవేయిటి కధీశు డనియు, తా నొరయూరి కధిపతి ననియు నితఁడు చెప్పుకొని యున్నాఁడు. ఇతనికి టెంకణాదిత్యుఁడనియు, కవిరాజ శిఖామణి యనియు బిరుదములు కలవు. ఇతఁడు రచించిన కావ్యము కుమారసంభవము ఇందు పంద్రెండా శ్వాసములున్నవి. సతీజన్మము, గణాధీశ్వరుజన్మము, దక్షక్రతుధ్వంసము అనెడి పిందలి మొదటి మూఁడా శ్వాసములందు వర్ణింపఁబడిన విషయములు నిజ మున కివి కుమారసంభవకథ కంత యావశ్యకములు గావు. తరువాతి తొమ్మిది యాశ్వాసములలో పార్వతి జన్మము మొదలు కుమారస్వామి జనించి తారకా సురుని సంహరించుట వఱకునుగల వృత్తాంతము నిరూ పింపఁబడినది. నన్నెచోడుఁడు శివపురాణమందలి కుమారసంభవ వృత్తాంతమును, కాళిదాసోద్భటుల కుమారసంభవములందలి కథావిశేషములను గ్రహించి వానికి తమిళకర్ణాట వాఙ్మయములందలి మఱికొన్ని విషయములను సంప్రదాయములను గలిపి యీ

కుమారసంభవకావ్యమును రచించెను. కాళిదాసుని కుమారసంభవమందలి శ్లోకముల కనువాదములో యనుసరణముతో యని చెప్పఁదగిన కొన్ని పద్యము లీతని కుమారసంభవములో నా యా ఘట్టములం దున్నను అది స్వతంత్రరచనయే యని చెప్పఁదగి యున్నది. ఇతని వర్ణనలు సహజములును దేశీయ సంప్రదాయానుసారములునై రమ్యములుగానుండును. కుమారతారకులు పోరునప్పు డీతఁడు కావించిన యుద్ధవర్ణనమే తిక్కన యుద్ధవర్ణనమున కాదర్శ మయ్యెనని యూహింపవచ్చును. కుమారసంభవము నందలి పూర్వార్థమున వీరరసమును జక్కఁగాఁబోషింపఁబడి యున్నవి. ఇందలి వర్ణన రచనాక్రమము లను బరిశీలించిన నిదియే తెలుఁగునందలి మొదటి ప్రబంధమని చెప్పుట కభ్యంతరముండదు. కవిత్వములు, వస్తుకవిత, జానుతెనుఁగు మున్నగు నూత్న సంప్రదాయములను దొలుదొల్త నాంధ్రమునఁ బ్రవేశ పెట్టినవాఁడీతఁడే భాషాప్రయోగమునందును, శైలి యందును నన్నయభారతమునకును నన్నెచోడుని కుమారసంభవమునకును జాల వ్యత్యాసము గోచరించును నన్నెచోడుఁడు కుమారసంభవమునఁగొన్ని వైరి సమాసములను, వింతశబ్దములనుబ్రయోగించెను. ఇతని కర్థశబ్దాలంకారములందువలెనే బంధకవిత్వము నందును ఛందోవైవిధ్యమునందును బ్రీతిమెండు. ఇతని రచన యపరిచిత శబ్దప్రయోగముచేఁ గొంత క్లిష్టముగానున్నను ధారాశుద్ధి శోభితమును బావగంభీరమునై యితని కవిరాజశిఖామణి బిరుదము నన్వర్థము కావించుచున్నది. ఇతఁడీ కావ్యమును దనగురువగు జంగమ మల్లికార్జునున కంకితముకావించి యపారమైన గురుభక్తి ప్రదర్శించెను. తెలుఁగుకవులలో గావ్యారంభమున షష్ఠ్యంతములు, కుకవినింద మున్నగు వానిని రచించి తరువాతివారికిఁ ద్రోవచూపినవాఁ డితఁడే.

ఆంధ్రదేశమును బరిపాలించిన కాకతీయ వంశపు రాజులలో నిరువురు ప్రతాపరుద్రులున్నారు అందు ప్రోలరాజు కుమారుఁడైన మొదటి ప్రతాప రుద్రుఁడు క్రి శ 1140 మొదలు 1195 వఱకును బరిపాలించి యుండెను. ఇతనికి రుద్రదేవ మహారాజనియుఁ బేరుగలదు. ఇతఁడు పలువురు కవి పండితులను బోషించుటయేకాక స్వయముగాఁగూడఁ గావ్యరచన కావించెనని తెలియుచున్నది.

పరువడి నాంధ్రభాషఁగల
బద్దెననీతియు సంస్కృతంబులోఁ
బరఁగఁ బ్రతాపరుద్ర నర
పాలునిచే రచియింపఁబడ్డ యా
నరవరు నీతిసారము వి
నం జదువం గడు మంచి దండ్రు జె
చ్చెరఁగని నీతిపద్ధతులు
చేసె వినోదము బాలబోధకున్.

అను పద్యమున ప్రతాపరుద్ర మహారాజు సంస్కృతమున నీతిసారమను గ్రంథము రచించెనని చెప్పఁబడి యున్నది బద్దెన రచించిన నీతిశాస్త్ర ముక్తావళికిఁ బీఠిక వ్రాయుచు శ్రీ. శే మానవిల్లి రామకృష్ణకవి గారు రుద్రదేవ మహారాజాంధ్రమునఁగూడ నీతిసారమును రచించెనని తెల్పియున్నారు. మడికి సింగన సకలనీతి సమ్మతమున నీతిసారములోని కొన్ని పద్యముల నుదాహరించి యున్నాఁడు. కాని యాతఁడు దానిని రచించినవా రెవ్వరో చెప్పియుండలేదు. ఆంధ్రకవులెవ్వరును రుద్రదేవ మహారాజును బూర్వ కవిస్తుతిలో స్మరించియుండలేదు. అయ్యును ఆంధ్ర నీతి సారకర్త యెవ్వరో నిర్ణయింపఁ బడువఱకు దానిని రుద్రదేవ మహారాజే రచించి యుండెనని భావింపవచ్చును. ఇందలి పద్యములు ప్రసాదగుణభూయిష్ఠములును, రమ్యోపమాన శోభితములునై రాజనీతినిజక్కఁగా వర్ణించుచున్నవి.

విమతు లావెఱింగి వెఱపేది తొడరుట
మిడుత లగ్గిమీఁదఁ బడినయట్లు
తోడులేక యధికుఁ దొడరుట యంబుధిఁ
గలములేక యీఁదఁ గడఁగినట్లు

అను పద్యమునుబట్టి యందలి యితర పద్యముల స్వరూపమును గ్రహింపవచ్చును.

ఆంధ్రమున బహుప్రచారమందిన నీతిశతకములలో సుమతిశతకము ప్రధానమైనది. దీనికర్తృత్వమునుగూర్చి యభిప్రాయభేదములున్నవి. నీతిశాస్త్ర ముక్తావళిలోని.

శ్రీ విభుఁడ గర్వితారి
క్ష్మావర దళనోపలబ్ధ జయలక్ష్మీ సం
భావితుఁడ సుమతిశతకముఁ
గావించిన ప్రోడఁ గావ్యకమలాసనుఁడన్,
రాజవర మకుట మణిగణ
పూజితపదయుగుఁడ హేమభూభృద్ధైర్య
భ్రాజితుఁడ బద్దెనాఖ్యుఁడ
రాజోచిత నీతు లొప్ప రచియింతుఁ దగన్

అను పద్యములనుబట్టి కావ్యకమలాసన (కవిబ్రహ్మ) బిరుదాంకితుఁడైన బద్దెన సుమతిశతకమును. రాజోచిత నీతులతోఁగూడిన నీతిశాస్త్రముక్తావళిని రచించినట్లు తెలియుచున్నది. సుమతిశతకమునఁగూడ రాజోచిత నీతులుకొన్ని యున్నను అందు సామాన్య జనోపయోగమునకై చెప్పఁబడిన నీతులసంఖ్యయే హెచ్చు. ఇట్లే నీతిశాస్త్రముక్తావళిలో సామాన్యనీతులుకూడఁ గొన్ని యున్నను అందు రాజోచితనీతులసంఖ్యయే హెచ్చు. అందుచే బద్దెనయే సామాన్యజనులకై సుమతిశతకమును, రాజులకై నీతిశాస్త్రముక్తావళిని రచించెనని భావింపవచ్చును. పైని పేర్కొనఁబడిన 'శ్రీవిభుఁడ' నిత్యాది పద్యములు కొన్ని తాళపత్రగ్రంథములందే యుండుటచేతను, శ్రీరామవిలాస గ్రంథమాలవారు ప్రకటించిన బద్దెననీతులను ముద్రితగ్రంథమునం దది లేకపోవుటచేతను, గొందఱు సుమతిశతకకర్త బద్దెన యగునో కాదో యని సందేహించుచున్నారు. దీని కుపబలముగా మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమందలి యొక ప్రతిలో "భీమన ... సుమతికి మతి చేకూరఁగ సుమతి నీతి చెప్పఁదొడంగెన్" అని యుండుటచే వారు భీమనయను కవి సుమతిశతకము రచించెనని చెప్పుచున్నారు. మఱియు కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసార సంగ్రహమున సుమతిశతకమందలి "ఎరకుమీ కసుగాయల" నను పద్యము నుదాహరించి యది వేములవాడ భీమకవి కృతమని చెప్పియుండెను. బహుశః భీమన యని యుండుటచూచి యాతఁడాభీమన వేములవాడ భీమకవియేయని యూహించియుండును. అంతేకాని వేములవాడ భీమకవికిని సుమతిశతకమునకును నెట్టి సంబంధమునున్నట్లు కనఁబడదు. సుమతియను జైన కవి యొకఁడు సుమతిశతకమును రచించియుండునను వాద మింకొకటి యున్నది. ఈ వాదములన్నిటిని బరిశీలించి శ్రీ శే చాగంటి శేషయ్యగారు సుమతిశతకములు రెండుండి యుండుననియు నందొకటి బద్దెన రచించినదనియు నిర్ణయించియున్నారు.

బద్దెన చోళశాఖకుఁ జెందిన సూర్యవంశక్షత్రియుఁడు. ఇతనికాలము నిశ్చితముగాఁ దెలియదు. ఇతఁడు క్రీ. శ. 13వ శతాబ్ది పూర్వభాగమున నొక చిన్న సంస్థానమును బాలించుచుండెనని యూహింపవచ్చును. సుమతిశతకము, నీతిశాస్త్రముక్తావళి యనునవి యితని గ్రంథములు. అందు సుమతిశతకము సుందరములైన కందపద్యములతోఁగూడి నీతులకు నిధియై సర్వాంధ్ర జనపరిచితమైయున్న యుత్తమశతకము. అందలి భావము లెంతరమ్యములో శైలీ యంతప్రసన్నమైనది. అందలి ప్రతిపద్యమును బద్దెన లోకజ్ఞతను, నీతినైపుణ్యమును జాటుచున్నది.

నీతిశాస్త్రముక్తావళికి నీతిసారము, రాజనీతి యను నామాంతరములుకూడ నున్నట్లు తాళపత్రప్రతులందలి గద్యలనుబట్టి తెలియుచున్నది. కాని "*శ్రీ విభుఁడైన బద్దెనృపశేఖరు చేసిన నీతిశాస్త్రముక్తావళి శిష్టలోక హితార్థమయ్యెడుఁగావుత*" అను పద్యమునుబట్టి దానిపేరు నీతిశాస్త్రముక్తావళి యనుటయే సమంజసము. ఇది ప్రతాపరుద్రుఁడు సంస్కృతమున రచించిన నీతిసారమున కాంధ్రీకరణమని కొందఱి యభిప్రాయము. కాని యా సంస్కృత నీతిసారము పలభ్యమానము కాకపోవుటచే నందలి సత్యము నిర్ణయించుట కవకాశములేదు. తెలుఁగున నీతిసారమను పేరుగల మఱియొకగ్రంథమున్నది. మడికి సింగన సకలనీతి సమ్మతమున నీతిసార, నీతిశాస్త్రముక్తావళులందలి పద్యములను వేఱువేఱుగా నుదాహరించి యుండుటచే నా రెండుగ్రంథములు భిన్నములైనట్టివే.

నీతిశాస్త్రముక్తావళి పదునేను పద్ధతులతోఁ గూడిన 150 పద్యముల గ్రంథము. బద్దెన యిందు రాజోచితములైన నీతులనుజెప్పి ప్రతిపద్యము చివర కీర్తినారాయణా, ఉదారవైరోచనా, దళదరిశాఖభంజనాంకా, నరేంద్రచతురాననా భూపదిలీపా, రాజమనోజభూభుజా, కావ్యకమలాసనా నన్నగంధవారణా మున్నగు వానిలో నొకదానితో నాత్మసంబోధనము కావించుకొని యున్నాఁడు ఇందలిశైలి ధారాళమై భావగంభీరమై, ప్రౌఢముగా నున్నది.

భాస్కరరామాయణ కర్తలలో కుమార రుద్రదేవుఁడొకఁడు. ఇతఁడయోధ్యాకాండము నేకాశ్వాసముగా రచించి తండ్రియైన సాహిణిమారయ కంకితము కావించెను. ఇతఁడు క్రీ॥ శ॥ 13వ శతాబ్ది తుది పాదమునను 14వ శతాబ్ది ప్రథమ పాదమునను జీవించి ద్వితీయ ప్రతాపరుద్రునికి సామంతుడుగా పలనాటిలోని యఱువది గ్రామములను బాలించెనని కీ॥ శే॥ చాగంటి శేషయ్యగారు వ్రాసియున్నారు. అయోధ్యాకాండమునంతను కుమార రుద్రదేవుఁడే రచించియుండలేదనియు, మంత్రి భాస్కర విరచితమైన యయోధ్యాకాండమున నతఁడు కొంతభాగము నధికముగా రచించి నడుమఁ జేర్చెననియు వారే తెల్పియున్నారు ఆసలు మంత్రి భాస్కరుఁడు రామాయణము రచించెనో లేదో యనునది సందేహాస్పదమైయున్నది. అందుచే కీ॥ శే॥ శేషయ్యగారి యభిప్రాయమును జక్కఁగాఁ బరిశీలింపవలసియున్నది. కుమార రుద్రదేవుని శైలి ప్రౌఢమై రసవంతముగా నుండును. ఇతనికి సంగ్రహరచనపైఁ బ్రీతిమెండు. ఇతఁడు రచించిన అయోధ్యాకాండము భాషామాధుర్యమునకును భావసంగ్రహమునకును నెలవై మనోహరముగా నుండును

ఆంధ్రమునందలి రామాయణములలో సుప్రసిద్ధమైనది రంగనాధరామాయణము. దీనిని రంగనాధుఁడను కవి రచించి గోన బుద్ధారెడ్డిపేరఁ బ్రకటించెననియు తండ్రి యుపదేశమున బుద్ధారెడ్డియే రచించెననియు దీని కర్తృత్వ విషయమున రెండు వాదములున్నవి ఆశ్వాసాంతములందు బుద్ధారెడ్డియే తండ్రియైన విఠ్ఠల క్ష్మానాధునిపేర దీనిని రచించినట్లు స్పష్టముగాఁ జెప్పబడియుండుటచేఁ బలువురు పండితు లీ వాదమునే యంగీకరించుచున్నారు. బుద్ధారెడ్డి దీనిని వాల్మీకిరామాయణము ననుసరించియే రచించినను ఎడనెడ జనశ్రుతినుండి గ్రహించి అవాల్మీకములైన కొన్నివృత్తాంతములఁగూడ నిందుఁ జొప్పించియుండెను. కాలనేమి, జంబుమాలి, సులోచన మున్నగువారి వృత్తాంతములందు ముఖ్యములైనవి. బుద్ధారెడ్డి యిందు రావణ విభీషణ కుంభ కర్ణాదుల చిత్తవృత్తులను, శీలములను జక్కగా వర్ణించియుండెను. ఇతని వర్ణనములు మిక్కిలి యుదాత్తములై రమ్యము

లుగా నుండును. ఇందలి శైలి ప్రసన్నమును లాక్ష ణికమునై ద్విపదమయమయ్యు విసువుగొల్పక మనో జ్ఞముగా నుండును. ద్విపదకావ్యములలోఁ బ్రామాణిక పదప్రయోగముచేతను, రసవంతమైన శైలిచేతను, పవిత్రమైన కథాగౌరవముచేతను రంగనాథరామాయణ మాంధ్రవాఙ్మయమున విశిష్టస్థానము నార్జింపఁజూచి నది. బుద్ధారెడ్డి కుమారులైన కాచవిఠ్ఠులవిభు లిందలి యుత్తరకాండమును రచించి రామాయణమును బూర్తి కావించిరి, వీరిరచన తండ్రి రచనయంత యుత్త మము కాకపోయినను రసవంతముగనే యుండును

క్రీ. శ. 14వ శతాబ్దిలో నాంధ్రదేశమునందలి కొన్ని భాగములను రెడ్డిరాజులును, వెలమరాజులును బరిపాలించిరి. కాకతీయరాజ్య పతనానంతర మాంధ్ర సంస్కృతికిఁ బట్టుకొమ్మలై సంస్కృతాంధ్ర కవిపండిత పోషణమున కీ రెండురాజ్యములును మిక్కిలీ ప్రసిద్ధి గాంచినవి. ఈ రాజ్యములను బరిపాలించిన రాజు లలోఁ బలువురు కవిపండితులను బోషించుటయేకాక స్వయముగాఁగవులై సంస్కృతమున పెక్కు శాస్త్ర గ్రంథములను గావ్యములను రచించియుండిరి. వీ తే కారణముచేతనో యాంధ్రమున రచన సాగించినట్లు కనఁబడదు.

క్రీ శ. 16వ శతాబ్ది యాంధ్రవాఙ్మయమున సువర్ణయుగమని చెప్పఁదగినట్టిది. ఈయుగమునకు రాయలయుగమనియుఁ బ్రబంధయుగమనియు నామాం తరములు. సాహితీ సమరాంగణ సార్వభౌముఁడని ప్రఖ్యాతివడసిన శ్రీకృష్ణదేవరాయల పోషణమున నీయుగమం దల్లసాని పెద్దనాది మహాకవులు రస వంతములైన ప్రబంధములు రచించి యాంధ్రసరస్వతి యతితి కపూర్వాలంకారములు కల్పించిరి. శ్రీకృష్ణ దేవరాయలును గవి పండిత పోషణముతోడను దత్కృత కావ్యగ్రహణముతోడను దృప్తిపడక స్వయ ముగాఁ గవియై సంస్కృతాంధ్రములందుఁ బెక్కు కావ్యములు రచించి కీర్తిగడించెను. మదాలసచరిత్ర, సత్యావధూప్రీణనము, సకలకథా సారసంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి మున్నగున వాతని సంస్కృతరచనలు. ఆంధ్రమున నతఁడు రచించిన ప్రబంధరాజ మాముక్తమాల్యద. గోదా శ్రీరంగేశ్వ రుల ప్రణయవృత్తాంత మందలి వస్తువు. రాయలు వైష్ణవమతమం దభిమానము గలవాఁడగుటచేఁ దన్మత ప్రచారముకావించి శ్రీవిష్ణు పారమ్యమును బ్రకటించు నుద్దేశముతో నీ ప్రబంధమును రచించెను. విష్ణు పురాణము, దివ్యసూరి చరిత్రము, వరాహపురాణము, దివ్యప్రబంధములు మున్నగువానినుండి వస్తువును గ్రహించి యతఁడీ ప్రబంధము నతిప్రౌఢముగను భావ బంధురముగను సంతరించెను. ఇందు ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము, యామునాచార్య చరిత్రము, మాలదాసరి కథ సోమశర్మ వృత్తాంతము మున్నగు నుపాఖ్యానములు నున్నవి. ఈ యుపాఖ్యానములను రచించుటలో రాయ లనన్యసామాన్యమైన కౌశలమును బ్రదర్శించెను. రాయలు వర్ణన ప్రీతిగలవాఁడు. ఆముక్తమాల్యదలో నతఁడు కావించిన ఋతు రాజనీతి వర్ణనము లతివిస్తృతములై యాతని యపార పాండితీ ప్రతిభలను బ్రకటించుచుండును. పైని పేర్కొన బడిన యుపాఖ్యానములును, దీర్ఘవర్ణనములును బ్రత్యే కముగాఁ జూచినచో రసవంతములు నుదాత్తములు నయ్యు నొకవిధముగా నాముక్తమాల్యద యందలి వస్త్వైక్యమునకు భంగముకలిగించినవి. రాయలు గోదాదేవి విరహమును వర్ణించుటలోఁ బ్రబంధ కవుల పద్ధతికంటె భిన్నమైన పద్ధతి నవలంబించెను. అతఁ డామెయందు క్షుద్రమైన కామమునుగాక హార్దమైన యనురాగమును వర్ణించెను. రాయలశైలి నారికేళ పాకముతోఁగూడి ప్రౌఢమై పండితైక వేద్యముగా నుండును. అతఁ డందువర్ణించిన భావములు సహజ

ములును గంభీరములునై యాతని నిశితమైన ప్రపంచ పరిశీలనమును జెప్పక చెప్పుచుండును. విష్ణుచిత్తుఁడును, యామునాచార్యుఁడును వివిధమతముల పండితులతో వాదించి వారి వాదములను ఖండించునప్పుడు రాయ లుపనిషత్తులతోడను బ్రహ్మసూత్రములతోడను దదితరవేదాంత గ్రంథములతోడను గల యపార పరిచయమును బ్రకటించెను ఈ యాముక్తమాల్యదను రాయలవారు వ్రాయలేదనియు, పెద్దనయో మఱి యే వైష్ణవ పండితుఁడో రచించి రాయల పేరఁ బ్రకటించి యుండిరనియు నొక వాదము కలదు. కాని బాహ్యములు నాంతరములునైన నిదర్శనములనుబట్టి పరిశీలించినచో నది రాయల రచనమేయని స్పష్టమగుచున్నది.

పద్మనాయక కులోత్తంసుఁడైన దామెర్ల వెంగళ భూపాలుఁడు (క్రీ. శ. 1540–1600) బహుళాశ్వ చరిత్రమను నైదాశ్వాసముల కావ్యమును రచించి తన తండ్రి కంకిత మొసంగెను. ఇతఁడు కాళహస్తి సంస్థాన పాలకులైన దామెర్లవారికిఁ బూర్వుఁడని కొందఱి యభిప్రాయము. కాని కవికాలమునకు కాళహస్తి సంస్థానమువారిక్రింద నుండెననుట కాధారములులేవు. ఈ కవి పూర్వులేవియో చిన్నసంస్థానమున కధిపతులై కర్ణాటరాజులకు సామంతులై యుండి నట్లూహింపఁదగియున్నదని కీ. శే. చాగంటి శేషయ్యగారు వ్రాసియున్నారు. బహుళాశ్వ చరిత్రమున శ్రీకృష్ణుఁడు తన భక్తుఁడైన బహుళాశ్వుని యింటికి విందారగింపఁబోవుట వర్ణింపఁబడి యున్నది. కృష్ణుని పరోక్షమున ద్వారక యందలి గోపికలు పొందిన విరహమును గవి విపులముగా వర్ణించెను, ఇందుఁ బ్రబంధోచితములైన వర్ణనలన్నియుఁ గల్పించెను. పంచమాశ్వాసమందలి వైశ్యయువకుని కథలో వేశ్యాలోలతవలని యనర్థములు వివరింపఁబడినవి. వేంగళ నాయకుఁడు సంస్కృతాంధ్రములందు మేటి పండి

తుఁడు. కవిత్వమున కాళిదాసాదులు తప్ప నన్యులు తన కీడుకారని యీతఁడు వ్రాసికొని యుండెను. ఇం దించుక యతిశయోక్తి యున్నమాట సత్యమేయైనను ఇతని కవిత్వము ప్రౌఢమును రసవంతమునై యుండు ననుటలో సందియము లేదు. పూర్వపు నైజాము రాష్ట్రమునందలి మెదకు మండలములోని బిక్కనవోలు రాజధానిగా నాప్రాంతమును కామినేని వంశసంజాతులునైన రెడ్లు పరిపాలించుచుండిరి. వారిలో కాచారెడ్డి యను నతనికి నలుగురు పుత్రులుదయించిరి. అందు రెండవ యెల్లారెడ్డి, మల్లారెడ్డి యనువారు కవి పండిత పోషకులై యుండుటేకాక కవులై కావ్యములు కూడ రచించిరి. ఎల్లారెడ్డి వ్రాసిన గ్రంథములేవియు నిప్పుడు లభ్యములగుటలేదు ఇతఁడు వాసిష్ఠ లైంగ ధర్మమును వ్రాసినట్లు తెలియుచున్నది. పట్టమట్ట సరస్వతీసోమయాజి బ్రహ్మోత్తరఖండమును గృతి యిచ్చిన దీతనికే

రెండవ యెల్లారెడ్డి తమ్ముఁడు మల్లారెడ్డి ఇతఁడు 16వ శతాబ్ది యుత్తరార్థమున జీవించియుండెను. ఇతఁడు పెక్కుగ్రంథములను రచించెనని చెప్పుదురుకాని యందు షట్చక్రవర్తి చరిత్రము, శివధర్మోత్తరము, పద్మపురాణము అనునవి లభ్యములగుచున్నవి. షట్చక్రవర్తి చరిత్రమున హరిశ్చంద్రాదు లగు నార్గురు చక్రవర్తుల చరిత్రలు వర్ణింపఁబడినవి. వీనిలో హరిశ్చంద్ర నలచరిత్రలు కొంచెము విపులతరముగా నున్నవి. ఇందలి రచన శ్లేష శబ్దాలంకారాదులతోఁగూడిన వసుచరిత్రరచన ననుకరించుచుండును. ఇందుఁ గవి యేదోసంబంధము కల్పించి ప్రబంధోచిత వర్ణనలన్నియుఁ గావించెను. శివధర్మోత్తరమున శైవమతధర్మము, శైవాచారములు, ఎనిమిదాశ్వాసములలో వర్ణితములై యున్నవి. పద్మపురాణము సంస్కృత పద్మపురాణమునందలి యొకభాగమున కాంధ్రీకరణము. ఇందీశ్వరుఁడు శంభుభట్టా

శకుఁడను విప్రుని వేషమునుదాల్చి అయోధ్యకరుదెంచి శ్రీరామచంద్రునికిఁ బురాణములు వినిపించిన కథ చెప్పఁబడినది ఇందలి నాల్గవ యాశ్వాసమున రామాయణకథ యున్నది. వాల్మీకి రామాయణమునందలి కథకును ఇందలి కథకును బెక్కుభేదములు కాన్పించుచున్నవి. మల్లారెడ్డి యీ కావ్యమున శ్లేషాది శబ్దాలంకారములకై యెక్కువగాఁ బయత్నించని కతమున నిందలిశైలి సహజమును, సులభమునై యలరారుచున్నది. మల్లారెడ్డి కావ్యములలో నితనివినయశీలమును భ్రాతృభక్తియు లెస్సగా వెల్లడిచేయఁబడియున్నవి

కడపమండలము నందలి సిద్ధవటము రాజధానిగా చిన్న సంస్థానమును బాలించిన మట్ల అనంతభూపాలుఁడు (క్రీ. శ. 17వ శతాబ్ది పూర్వభాగము) కకుత్స్థవిజయమును నైదాశ్వాసముల బ్రబంధమును రచించి తన తండ్రియైన యెల్లభూపాలున కంకితమొనర్చెను. మట్లవారు బహు పరాక్రమవంతులై కర్ణాట ప్రభువుల కనేక యుద్ధములలోఁ దోడ్పడి వారికి సామంతులైయుండిరి. కకుత్స్థవిజయమునకు మూలమైన కథ స్వల్పమైనను అనంతభూపాలుఁడు దానిని వర్ణనా కల్పనా చమత్కారములతోఁబెంచి గ్రంథమును జక్కని నాటకశైలిలో రచించెను సంస్కృతభాషయం దితని కపారమైన పాండిత్యమున్నట్లీతని పదప్రయోగమునుబట్టి తెలిసికొనవచ్చును.

బిజ్జల తిమ్మభూపాలుఁడు (క్రీ. శ. 16వ శతాబ్ది యుత్తరభాగము క్రీ. శ. 17వ శతాబ్ది పూర్వభాగము) బాలవాల్మీకి బిరుదాంకితుఁడైన మురారి సంస్కృతమున రచించిన అనర్ఘరాఘవమును నాటకము నాపేరనే యెనిమిదాశ్వాసముల ప్రబంధముగా రచించి ప్రాకటూరునందలి రామేశ్వరస్వామికిఁ గృతి యిచ్చెను. ఈ ప్రాకటూరు గద్వాల సమీపమునఁ గృష్ణానదీ తీరమున నుండిన గ్రామమని తెలియుచున్నది. దీనినిబట్టి యీకవి కర్నూలుమండలమందలి అలంపూరుసీమను బాలించెనని యూహింపవచ్చును రసవంతమైన దృశ్యకావ్యమును మూలసమానముగా ననువదించుట కష్టకార్యమే యైనను తిమ్మభూపాలుఁడు మురారి విజ్ఞానమున కెందును గొఱంతరాకుండునట్లీ ప్రబంధము నతిప్రౌఢముగా రచించెను. ఇందలిశైలి సంస్కృతపద బహుళమయ్యును రసికజన హృదయంగమముగా నున్నది.

అనంతభూపాల తిమ్మభూపాలుర కించుమించుగా సమకాలికుఁడని చెప్పఁదగిన సవరము చిననారాయణనాయకుఁడు కువలయాశ్వ చరిత్రమను పంచాశ్వాసపరిమితమైన యుత్తమ ప్రబంధమును రచించి తన పెంపుడు తండ్రియైన నారాయణప్రభువునకంకితము కావించెను. ఈకవి తన తండ్రి తాతలు బహుపరాక్రమవంతులై మహమ్మదీయులతోఁ బోరాడియున్నట్లు వర్ణించియున్నాఁడు. వీరు స్వతంత్రప్రభువులైయుండినట్లు కన్పింపదు. కాని కర్ణాటరాజులకు సామంతులో దండనాయకులో యై తమ శౌర్యధైర్యములను బకటించియుండిరని యూహింపవచ్చును. కువలయాశ్వ చరిత్రమునందలి కథాకల్పనము మిక్కిలి రమణీయమై పెక్కువిధముల కళాపూర్ణోదయమునందలి కథాకల్పనముతోనీడువచ్చుటయే కాక కొన్ని విషయములందు దానిని్రదోసి రాజనఁగలిగి కూడనున్నదని విమర్శకుల యభిప్రాయము. కథాకల్పనమునందేకాక పదప్రయోగౌచిత్యపోషణము లందుఁగూడ చిననారాయణనాయకుఁడు మిక్కిలి నేర్పరి.

మల్లారెడ్డి దేశాయి యను రెడ్డికులజుఁడు (క్రీ శ. 17వ శతాబ్ది పూర్వార్థము గంగాపురమాహాత్మ్యమను నొక పద్యకావ్యమును రచించెను. ఇది యింకను ముద్రితముకాలేదు. గంగాపురము పూర్వపు నిజాము రాష్ట్రములోనిది. మల్లారెడ్డిదేశాయి వైష్ణవమతాభి

మాని. తిరుమలౌబలుని శిష్యుఁడు. లభించిన కొన్ని పద్యములనుబట్టి చూడ నితని కవిత్వము సరసమును సుబోధమునునై విలసిల్లుచున్నదని చెప్ప వచ్చును.

జటప్రోలు సంస్థానాధిపుఁడును పద్మనాయక కులోత్పన్నుఁడునైన సురభి మాధవరాయలు (క్రీ. శ. 17వ శతాబ్ది పూర్వభాగము) చంద్రికాపరిణయమను ప్రౌఢప్రబంధమును రచించి తన యిష్టదైవతమగు మదనగోపాలస్వామి కంకితము కావించెను. ఎలకూచి బాలసరస్వతి రచించిన చంద్రికాపరిణయ మింకొకటి యున్నది. మాధవరాయల చంద్రికాపరిణయమున వస్తువు చంద్రికాసుచంద్రుల ప్రణయము, చంద్రిక పూర్వజన్మమున చిత్రలేఖయను దేవవేశ్య. వసంతుఁడను మునిశాపవశమున నామె పాంచాలరాజైన క్షణోదయునికిఁ గూఁతురుగాఁబుట్టి తరువాత సుచంద్రునిఁ జెట్టవట్టి శాపమోచనమునొందెను. చంద్రికాపరిణయము కథాకల్పన పద్యరచన భావ సంఘటనము లందు భట్టుమూర్తి వసుచరిత్రనుబోలి, శ్లేషయనుకాద్యలంకార శోభితమై మిక్కిలి ప్రౌఢముగా నున్నది. దీనికి మాధవరాయలే వాఖ్యానముకూడ రచించెను. ఈ కావ్యమును వ్యాఖ్యానమును గర్త బహుముఖమైన పాండిత్య ప్రకర్షను లెస్సగా వ్యక్తము చేయుచున్నవి.

దామెర అంకభూపాలుఁడు (క్రీ శ 17వ శతాబ్ది) ఉషాపరిణయమను నైదాశ్వాసముల శృంగార ప్రబంధమును రచించి శ్రీరామచంద్రుని కంకితము గావించెను ఇతఁడు పద్మనాయక కులసంభూతుఁడు. తిమ్మాంబా చెన్నభూపాలుర తనయుఁడు. బహుళాశ్వచరిత్ర కర్తయైన వెంగళరాయకవి యీతని పినతండ్రి. ఇతనియన్న వెంకటభూపతి చెంజి రాజునుజయించి తన తండ్రిపేర చెన్నసాగరమును నిర్మించినట్లొక పద్యమువలనఁ దెలియుచున్నది. వెంకటభూపతి వాలూరుపురాధీశ్వరుఁడని వర్ణింపఁబడి యున్నాఁడు. "మును కృతులెన్సిన ఘనులరీతుల కన్న వింతయై నేర్పువే వెలయుచుండ. లలితము, గూఢము, లక్షణయుక్తంబు. చిత్రవైఖరియునై చెన్ను మెఱయ" దాను కావ్యము రచించినట్లు కవి చెప్పుకొని యున్నాఁడు. ఈ ప్రబంధమింకను ముద్రితమై యుండలేదు,

తంజావూరు నాయకరాజులకుఁ దలమానికమని చెప్పదగినవాఁడు రఘునాథనాయకుఁడు.(1614-16133) ఇతఁడు శ్రీకృష్ణదేవరాయలవలెనే సాహితీసమరాంగణ సార్వభౌముఁడై వాసికెక్కినవాఁడు. ఇతఁడు సుమారు పందగ్రంథములు రచించెనఁట! వానిలో రామాయణము వాల్మీకిచరిత్రము అను రెండు గ్రంథములు మాత్రమే లభించుచున్నవి. ఇతని రామాయణము బాలకాండము నందలి చతుర్థాశ్వాసములోఁ గొంత భాగముపఱకే కానఁబడుచున్నది. ఇందు ద్వితీయాశ్వాసము నందలి ఋశ్యశృంగుని కథ చాల హృద్యముగా వర్ణింపఁబడినది. మధురవాణి తాను రఘునాథుని రామాయణము నొకదానిని సంస్కృతీకరించినట్లు చెప్పుకొన్నది. కాని యది పరిమాణమునఁ జాల చిన్నదగుటచే పై రామాయణమగునో కాదో చెప్పుటకు వీలులేకున్నది. వాల్మీకి చరిత్ర మాది కవియైన వాల్మీకి పూర్వజీవితమును వర్ణించు మూఁడాశ్వాసముల ప్రబంధము గ్రంథారంభమునందలి తీర్థాదులవర్ణన మనవసర దీర్ఘమై కొంత విసువు కలిగించుచున్నది. ద్వితీయాశ్వాసమందలి రంభోర్వశీ పరాభవవృత్తాంతము ప్రధాన కథతో నంత సన్నిహిత సంబంధము లేనిదయ్యు రమ్యముగా నున్నది శృంగారసావిత్రి యను రెండాశ్వాసముల ప్రబంధమొకటి రఘునాథునిపేర ముద్రితమైనది, అది యాతని రచనమగునో, కాదో, చెప్పఁజాలము. యజ్ఞనారాయణ దీక్షితుఁడు తన సాహిత్య రత్నాకరములో రఘునాథుఁడు యామద్వయమున

పారిజాతాపహరణ కావ్యమును జెప్పి తండ్రిచేఁ గనకాభిషేకము గౌరవమందినాడని తెల్పియున్నాడు. దీనినిబట్టి యతఁ డాశుకవిత్వమునఁగూడ నిపుణుఁడని తెలియుచున్నది.

పైని పేర్కొనఁబడిన గ్రంథములనేకాక రఘునాథుఁడు నలచరిత్ర, అచ్యుతాభ్యుదయము అను రెండు ద్విపదకావ్యములను, రుక్మిణీపరిణయమను యక్షగానమును (శ్రీ రుక్మిణీకృష్ణ వివాహ యక్షగానం ప్రబంధానపినైక భేదాన్) గూడ రచించినట్లు తెలియుచున్నది. నలచరిత్రము నెనిమి దాశ్వాసములలో నలదమయంతులకథ సంపూర్ణముగాఁ జెప్పఁబడినది. ఇందలి వర్ణన విధానమును రసపాత్రపోషణ చాతుర్యమును మిక్కిలి హృదయంగమములుగా నున్నవి. అచ్యుతరాయాభ్యుదయము రఘునాథుని తండ్రియైన అచ్యుతనాయకుని చరిత్రము.

రఘునాథుని కుమారుఁడైన విజయరాఘవుఁడు కూడఁ దండ్రివలెఁ గవియే. ఇతడు ప్రహ్లాదచరిత్ర పీఠికయందుఁ దానేఁబదికృతులను రచించినట్లు చెప్పుకొనియున్నాఁడు. అందుఁ బెక్కు యక్షగానములు. పాదుకాసహస్రము, రఘునాథాభ్యుదయము, మోహినీవిలాసము అనునవి ద్విపదకావ్యములు. రఘునాథాభ్యుదయము ముద్రితమైనది. ఇందు రఘునాథుని రాజ్యవైభవమును, తంజాపురము రాజగృహమునందలి నిత్యజీవితమును విపులముగా వర్ణింపఁబడినవి చారిత్రకులకీ కావ్యము మిక్కిలి యుపయోగకరమైనది. ఆ నాఁటి రాజకీయ సాంఘిక విషయములును, రాచనగరియందలి మర్యాదలును, సంగీతనాట్య విద్యావినోదములును నిందుఁ జక్కగా వర్ణింపఁబడినవి విజయరాఘవుఁడు పై ద్విపద కావ్యములనేకాక గోపికాభ్రమరగీతలు, ఫాల్గుణోత్సవ గోపాలదండకము, వీరశృంగార సంపంగిమన్న సాంగత్యములు మున్నగు లఘుకృతులను గూడ రచించియున్నాఁడు. విజయరాఘవుఁడు రచించిన యక్షగానములు సుమారిరువది వఱకు నుండును. అవి యన్నియు నాటకములనియే పేర్కొనఁబడినవి. అందు రఘునాథాభ్యుదయ విప్రనారాయణ చరిత్రలు మాత్రము ముద్రితములైనవి. విజయరాఘవుఁడు సంస్కృతాంధ్రములందు గొప్ప పండితుఁడు. ఇతఁడు సంస్కృతనాటకములను బాగుగా జదివి యందలి రచనాపద్ధతు లనుసరించి యక్షగానములలోఁ గొన్ని నూతన పద్ధతులను బ్రవేశపెట్టియున్నాఁడు ఇతఁడు యక్షగానములలో రగడలను దగ్గించి వాని స్థానమున దరువు పదము మున్నగు నూతన రచనలకు స్థానము కల్పించినాఁడు. అట్లే కవి సూత్రధార వచనములకు బదులు పాత్రోచిత భాషలో నాటకానుకూలమైన సంభాషణములను జొప్పించినాఁడు రంగాజమ్మ మొదలగు తరువాతి యక్షగానకర్తలీ విధానమునే యనుసరించియున్నారు.

విజయరాఘవుని కుమారుఁడైన మన్నారుదేవుఁడు విజయరాఘవాభ్యుదయము రక్షాబ్జనాయికా పరిణయము అను కృతులు రచించియున్నాఁడు. ఇందు మొదటిది ప్రబంధమో యక్షగానమో తెలియదు. రెండవది యక్షగానమే మన్నారుదేవుఁడు క్షీరసాగర సముద్భూతమైన యమృతమును దేవతలకుఁ బంచిపెట్టి సముద్రుని కూఁతురైన రక్షాబ్జయను నామెను బెండ్లియాడుట యిందలి విషయము

విజయరాఘవుని తరువాత తంజావూరు రాజ్యము మొదట మధురనాయకులకును దరువాత మహారాష్ట్ర రాజులకును వశమైనది ఈ మహారాష్ట్ర రాజులు తెలుఁగుభాష నేర్చుకొని యందు మాటలాడుటేకాక కావ్యములు నాటకములు రచించియున్నారు. వీరికాలమునఁ బెక్కు యక్షగానములును ద్విపదకావ్యములును రచింపఁబడినవి.

మధుర నాయకులలోఁ బ్రముఖుఁడైన విజయ రంగచొక్కనాథుఁడు కవిపండిత పోషణ మొనరించుటే కాక తాను స్వయముగా మాఘమాహాత్మ్యము శ్రీరంగ మాహాత్మ్యము అను వచన గ్రంథములను రచించెను. ఇవి చాటుకభాషలో వ్రాయఁబడినవి. ఇతని యాస్థానమం దుండిన కవులలో సముఖము వెంకటకృష్ణప్ప నాయకుఁడు ప్రధానుఁడు. ఇతఁడహల్యా సంక్రందనము, రాధికాసాంత్వనము అను పద్యకావ్యములను జైమినిభారతము సారంగధర చరిత్ర అను వచనకావ్యములను రచించియుండెను.

పుదుక్కోటను పరిపాలించిన రాజు లాంధ్రులు కాకపోయినను ఆ భాషయెడ నభిమానము వహించి కవిపండితులను పోషించుటే కాక స్వయముగా గ్రంథ రచనకూడఁ గావించిరి. రఘునాథుని పుత్త్రుఁడగు రాయరఘునాథుఁడు (1769–89) వేద వేదాంగములతోడను వాత్స్యాయన కామ సూత్రాది శాస్త్రముల తోడను బరిచయముగలవాఁడై పార్వతీపరిణయమను ప్రబంధమును రచించెను. దీనిని సముఖపాటి వెంకనయను కవి రచించి రఘునాథుని పేరఁ బ్రకటించెనను ప్రవాదకలదు. కాని దానిని సమర్థించుట కాధారములులేవు. ఈ గ్రంథము నూతనములైన పదములతోడను, మధుర మంజులములైన పదములతోడను, సహజములైన వర్ణనలతోడను గూడి సరసముగా నుండును. ఇందచ్చటచ్చట కాళిదాసుని కుమార సంభవము లోని శ్లోకముల కనువాదములు కానవచ్చును. రాయరఘునాథుని తరువాత పుదుక్కోట సింహాసన మధిష్ఠించిన విజయరఘునాథుఁడు కూడఁ గవిపండితులను బోషించి పేరుగాంచెను.

మైసూరు రాజ్యమునఁగూడఁ గొందఱు ప్రభు నాథు లాంధ్రభాషాభిమానము వహించి కొన్ని గద్య గ్రంథములు రచించిరి. అందు కళువె వీరరాజు రచించిన వచన భారతమును అతని కుమారుఁడు నంజరాజు రచించిన హాలాస్యమాహాత్మ్యమును బేర్కొనఁదగినవి.

ఆధునిక యుగమునందుఁగూడ నాంధ్రదేశమునందలి సంస్థానాధీశ్వరులు కొందఱు కవిపండిత పోషణ మొనరించుటేకాక యుత్తమములైన కావ్యములు రచించి పేరుగాంచిరి. వీరిలో వెంకటగిరి, ఉయ్యూరు కపిలేశ్వరపురము, పిఠాపురము మున్నగు సంస్థానముల నేలిన జమిందారులు పేర్కొనఁదగినవారు. ఈ సందర్భమున నుత్కళరాష్ట్రమునందలి జయపుర సంస్థానము పరిపాలించిన రాజా శ్రీ విక్రమదేవవర్మ గారినిగూడఁ బేర్కొనవలసియున్నది. వారు సంస్కృతాంధ్రోత్కళ భాషలు మూఁడింటఁబండితులై రసవంతములైన రచనలు కావించిరి. ఆంధ్రమున శ్రీనివాసకల్యాణము మానవతీవిజయము మున్నగు నాటకములు, గౌతమబుద్ధచరిత్ర మున్నగు కావ్యములు వారి రచనలలో ముఖ్యములైనవి.

ఈ విధముగా నాంధ్రమున రాజులును, సంస్థానాధీశ్వరులును బలువురు రసజ్ఞులై కవిపండితులను బోషించి ప్రోత్సహించుటేకాక స్వయముగాఁ గొన్ని రచనలు కావించి యాంధ్రవాణి కలంకారములు చేకూర్చిరి. అందులోఁ గొందఱు కావించిన రచనలు రసభావాలంకార సుందరములై నేఁటికిని విద్వాంసుల మన్ననలను బొందుచున్నవి. అవి యొకవంకఁ బ్రతిభకును వేఱొకవంకఁ బాండిత్యమునకును బట్టుఁగొమ్మలై యా మహనీయుల సాహిత్యపిపాసను, రసజ్ఞతను జాటుచున్నవి. వారు రసవద్రచనలచేతను, గవిపండిత పోషణముచేతను గావించిన సారస్వతసేవ చిరస్మరణీయమైనట్టిది.

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మ

గీర్వాణాంధ్రశతకములలోఁ గేవలము వ్యాజస్తుతికి సంబంధించినవి మిపుల స్వల్పములు. తక్కిన యలంకారములవలెఁగాక వ్యాజస్తుతికిఁ బ్రత్యేకత యొండు గలదు. వస్తుగుణ సమ్యగ్వీక్షణము ననుసరించి, కవి తన భావనాబలముచేఁ జమత్కారముగ వర్ణిత వస్తువుకం దుత్కృష్టతా నికృష్టత లారోపించు నపుడు, సామ్యపస్తు నికృష్ట తోత్కృష్టతలు నెపములుగఁ గైకొని యీ యలంకారమునకుఁ బరిపుష్టి గూర్చును

వ్యాజస్తు త్యలంకారముం గూర్చి యాంధ్ర సంస్కృతాలంకారికుల యభిప్రాయములు గొన్ని యిటఁ దడవుట యప్రస్తుతము గాదనుకొందును.

౧ ''సంభావ్యవిశిష్టకర్మాకరణాన్నిన్దాస్తోత్రార్థా వ్యాజస్తుతిః'' అత్యన్తగుణాధికో విశిష్టస్తస్యచ కర్మ విశిష్టకర్మ, తస్యసంభావ్యస్య కర్తుం శక్యస్యా కరణాన్నిన్దా విశిష్టసామ్యం సంపాదనేనస్తోత్రార్థా వ్యాజస్తుతిః''

ఉదా॥ "బబన్ధస్సిన్ధుంగిరిచక్రవాళై
ర్విభేదసప్తైక శరేణ తాలాన్ ,
ఏవంవిధంకర్మతతానరామ
స్త్వయాకృతంతత్పునుఞైవగర్వః ॥

"విశిష్టోరామాది రుపమానభూత స్తస్యకర్మసేతు బన్ధనాది తస్య కర్తుం శక్యస్యకర్మణో ఽ కరణాద్వర్ణనీయస్య నిన్దారామాది సామ్యో పాదానాత్ స్తుతి పర్యవసాయిని వ్యాజస్తుతిః॥ బన్ధనేతి: త్వంరామ ఏవాసీతి తాత్పర్యమ్ ॥ నిన్దావ్యాజేన స్తుతిరూపత్వాత్ వ్యతిరేకవిశేషోక్తిభ్యాంభేదః ॥ (వామనస్య 'అలంకార సూత్రవృత్తిః') ''

ఇదానికి 'గంగానాథ ఝా (Ganganadha Jha) గారి అనువాదము:

Where, for the purpose of praising a person there is a deprecation based upon his not doing something that has been done by a very superior person and which (it is implied) is copable of being done (by the person sought to he praisid) it is 'Dissembling Eulogy'

The kind of praise consists in implying the similarity of the person desribed the very superior person mentioned.

Example :—

'రామ' breged up the ocean with hills, of with a single arrow he pierced seven palm trees; not having done these yet thou bearest an unaccountable pride.

(The sense of this is that on all other points except two mentioned thou art quite equal to 'రామ).

౨ 'అప్టే (Apte)' నిఘంటువున ఈ యలంకారము గూర్చిన వివరణము :—

వ్యాజస్తుతిః : Figure of speech resembling the English 'Irony', where in censure is implied by apparent praise, or praise by apparent censure.

'వ్యాజస్తుతిః ముఖేనిన్దాస్తుతిర్వారూఢిరన్యథా'

(కావ్యప్రకాశిక)

ఇఁక ఆంధ్రాలంకారవిదుల యభిప్రాయము లించుక గ్రహింతము :—

3 "వ్యాజస్తుతియనఁగఁ బరి
భ్రాజితమగు నిందవోలెఁ బ్రణుతింపగా,
దేజంబెసఁగెడు కథనము
రాజిల్లెడు మధుర వచన రచనల చేతన్॥

ఉదాహరణము :—

ఈతఁడు పెంద్రపుత్రుఁడటె,
యంశులనేఁపక యేలమాను ? ప్ర
ఖ్యాతవిమాత్ర ఘ్రదుఁడటె,
కాంతలనేఁపక యేల తక్కు? వి
ద్యోత కళావరుండటె, వ
ధూటులనేఁపక యేలయుండు ?, నే
రీతినటంచు విశ్వవిభుఁ
బ్రీతి నుతింపుదు రంగనాజనుల్ ॥

(విన్నకోట పెద్దయ కావ్యాలంకార
చూడామణి. x ఉ)

౪ అగువ్యాజస్తుతి· నిందచేస్తుతియు, స్తో
త్రావాప్తిచేని-దయున్
దగఁగాఁబుమ్మటు నీకుఁదెల్పగలదే?
ద్యోవాహిని, నీవు స్వ
ర్గగులంజేతువు పాపులన్ ! వఱియునా
కైతెప్పయోదూతికా,
యొగినేము చ్చదియింతకంటె నఖదం
తోరుక్షతుల్వోంచితో॥

(రేలనూతల శివరామయ్య 'అలంకార
చంద్రిక).

౫ స్తుతినింద, నిందనుతి సం
స్తుతివ్యాజనుతి; యఘుఁబోతు సుమతివె గంగా,
అతిసాహసికుఁడు నీయరి
సతతముగిరులెక్కు, దాఁటు, సరిదంబుధులన్॥
రతినీపకకాబక, యా
మెతఁగను నీమోవిఁబోలు మిహబింబమునన్

సతి, యెగిరి కే్రపున నెం
తతపంబిదియేని యతినొనర్చె నౌకడఁ(కన్॥

(వేదము వేంకటరాయశాస్త్రి అలంకార సార సంగ్రహము)

సంస్కృత కృతులలోను వ్యాజస్తుత్యలంకార శ్లోకములు మెండుగఁ గానవచ్చెడు ప్రాయికముగ నవి శ్లేషానుప్రాణితములై కవి ప్రతిభాప్రభావ ద్యోతకములయి చమత్కారములుగ నుండును. వానిలో వాంఛేశ్వరకవి (కుట్టికవి) మహిషశతకము ప్రథమ గణ్యమనఁదగును. క్రింది శ్లోకమున మహిషమే రాజుకంటె శ్రేష్ఠమని కవి నిరూపించుటం గనుఁడు :

"సానందం మహిషీశతం రమయసే
మూర్ధాభిషిక్తోఽస్యహమ్ ।
త్వంచామరవ్యజనావధూతి మపక్ష
త్సాప్నోషి శృంగాన్వితః ।
కించస్వాం ప్రకృతిం నముంచసి తృణ
ప్రాయం జగత్పశ్యసి ।
స్వస్తిశ్రీ మహిషేంద్ర! తేఽస్తునియతం
రాజాత్వమే వాసినః॥"

ఓ మహిష ప్రభూ! నీయందు ప్రభులక్షణము లెల్ల వెలయుచున్నవి ఎట్లన : మహారాజులు వందలకొలది పట్టపురాణులతో (మహిషులతో) క్రీడించునట్లు, నీవును గేదెలతోఁ గ్రీడింతువు రాజు పట్టాభిషేకసమయమున మూర్ధాభిషిక్తుఁడగును. నీ వను దినము నీతలను నీటిలో ముంతువు. రాజు ప్రభుత్వముతోఁగూడినవాఁడై చామరవ్యజనాదులచే వీవఁబడును. నీవు కొమ్ములతోఁ (శృంగము-దొరతనము, కొమ్ము) గూడినవాఁడవై వాలవ్యజనముతో విసరుకొందువు రాజు ప్రకృతివర్గమును వీడకుండును. నీవును నీప్రకృతిని (జడస్వభావమును) వీడకుందువు. ఐశ్వర్యాధికారములచే రాజు ప్రపంచమును తృణప్రాయముగఁ జూచును. మేతకయి నీవీప్రపంచమును పచ్చిగడ్డితో నిండినదానిగఁ జూతువు. కాన నీకు సర్వదా మేలగుఁగాక! నీవే మాకుఁ (నిజముగ) మహారాజువు.

"భామినీవిలాసము" నఁగల పండితరాయల వ్యాజస్తుతి శ్లోకములను, వానికి నా యనువాదములను (రెంటి) నొనంగుచున్నాఁడ :

(జలదునిగూర్చిన వ్యాజస్తుతి)

"యత్తాదృశేషు నలినేషు నపక్షపాతో
జాతో బతస్ఫుట మసౌకుటజానురాగః ।
విశ్వైకజీవనచణోపిచ వారివాహ
దుర్వార వాయువశగోపినతద్వి చిత్రమ్॥"

"తమ్మియెడఁగల పక్షపాతమ్మువిడి
యకట, కుటజంబు ననురాగమారఁగనెయ ।
జలద! విశ్వైకజీవన చణుఁడవయ్యు
నబ్బురమె పెనుగాడ్పున కణఁగియుంట॥"

(తేఁటింగూర్చి)

"సరజస్కాంపాండు వర్ణాం
కంటక ప్రకరాన్వితామ్ ।
కేతకీం సేవసే హన్త
కథం రోలంబ, నిస్త్రప॥"

"సరజస్కము, పాండురమును
ఖరకంటకయుతము దగుమొగ్గాలెడు మొగిలిన్।
నిరతము సేవింతువు, బం
భరమా! సిగ్గింతలేని బ్రతుకేల? యయో॥"

సుభాషితరత్న భాండాగారములోని 'లక్ష్మీస్వభావము' గూర్చిన వ్యాజస్తుతికి నా యాంధ్రీకృతపద్యముల రెంటి నవలోకింపుఁడు: (శ్లో. సహితములు)

"యద్వదంతి చపలేత్యపవాదం
నైవదూషణమిదం కమలాయాః ।
దూషణం జలనిధేర్హి భవేత్త
ద్యత్పురాణ పురుషాయ దదౌతామ్॥"

"చపల యను నపవాదంబుఁ జాటు జగము
కమల కిదూషణగట్టుట క్రమయగాదు ।

ఆసతిఁ బురాణపురుషున కర్పణంబు
సేయు జలనిధియూఋులు చెల్లుఁగాన॥''
"హాలాహలం నైవవిషం, విషం రమా
జనాః-పరం వ్యత్యయ మత్ర మన్వతే /
నిపీయ జాగర్తి సుఖేన తం శివః
స్పృశన్నిమాం ముహ్యతి నిద్రయాహరిః॥"
"లచ్చియె విషంబు, హాలాహలంబుగాదు
వ్యత్యయంబుగ నిద్దానిఁ బ్రజదలంచు /
విసమునేత్రావి మెలఁకువవెలసె శివుడు
మాసతిందాకి హరి నిద్రమబ్బుఁగొనియె॥''

కావ్యములలోను చాటువులలోను వ్యాజస్తుతులసంఖ్యాములు :—

(1) పరమేశా! పాశుపతదివ్యాస్త్ర మొకపేడికిచ్చి, గట్టువావిల్లుచేపట్టిన నీవు నిక్కముగఁ బశుపతివే. కాని మహాదేవుఁడ వెట్లయితివి ?

(2) చంద్రా! కళంకుతుంకలద్దైనమునగు నీవా సుధాకరుఁడవు ? నీ కన్న చండకరుఁడగు లోకబాంధవుఁడే మేలు.

శ్రీనాథుఁడొకప్పుడు తృషార్దితుఁడయి చెప్పిన చాటువు :—

"సిరిగలవానికిఁ జెల్లును
దరుణుల పదియారువేలు దగఁ బెండ్లాడన్ /
తిరిపెముర కిద్దఱాండ్రా
పరమేశా! గంగవిడుపు పార్వతి చాలున్''

సిరిగలవానికి = భాగ్యవంతునికి ; శ్రీ మహావిష్ణువునకు (శ్రీకృష్ణునకు) ; తిరిపెమునకు = భిక్షము (బ్రతుకు)నకు ; గంగ = గంగాదేవి, నీరము.

విజయనగరాధీశుఁడయిన 'అళియరామరాయల' తమ్ముఁడగు తిరుమలరాయఁడు ఏకాక్షి. తద్వ్యాజమున ఒకానొకకవి చెప్పిన చాటుధార : —

"అన్నాతిఁ గూడ హరుఁడగు
అవ్నాతిని గూడకున్న నసురగురుండౌ/
ఆన్నా! తిరుమలరాయఁడు
కన్నొక్కటిలేదుగాని, కంతుఁడుగాఁడే?"

ఒకానొకవిటుఁడు ప్రియురాలి మోమునందలి కస్తురిబొట్టును కళంకవ్యాజముగ స్వీకరించి, (నాఁటి చంద్రగ్రహణమున రాహువామె మోమును ముట్టకుండు నట్లాబొట్టును బెట్టుకుమని) యామెను మందలించుచుఁజెప్పిన చాటువు :—

"పంకేజానన! నేఁటిరేయి వినుమా
ప్రాచీనభాగంబునన్
శంకాతంకములేక షోడశకళాసం
పూర్ణుఁడౌచంద్రునిం
బొంకంబార్చెదనంచు రాహు వెలమిం
బొంచుండియున్నాఁడు, నీ
వింకంగస్తురిబొట్టువెట్టకుము, త
స్మిం, ప్రాగ్భాగంబునన్ //

శ్రీనారునాగనార్యుఁడను అధునికకవి, రాజుకంటెఁ గవి యధికుఁడని నిరూపించుచు వ్యాజస్తుతిగ "ప్రణయిని" యను కావ్యమున రచియించిన పద్యములలో రెండుదాహరించెను :—

"చంపకోత్పలములు వనసమితినలరు
రాజునకు, నీకొ—కలమెత్తి, న్యాయ్యఁడౌడఁగ
నవియు వేవేలుపడియుండునంతికమున
నృపవయనికన్న నెచ్చికనీవెమిన్న" //

"రాజునకు యతిరాజ్యలరణ్యమందె
కలవు ; నీకన్న నడగులోపలనెకలరు /
విరయురాజాజ్ఞయతినరుల్ వేడుకొలఁది
నీవుతలఁచినచోటనెనిలిచియుండ్రు" //

ఇఁక శతకములలో భక్తికి సంబంధించిన వానిలోనే వ్యాజస్తుత్యలంకారాన్వితము లెక్కుడుగఁ గాన్పించుచున్నవి నీతిశృంగార వైరాగ్యాదికములలోఁ గ్వాచిత్కములు. కేవలము వ్యాజస్తుత్యలంకారముల తోనే రచింపఁబడిన శతకములు లేకపోలేదు.

(1) ఆంధ్రనాయకశతకము (కాసుల పురుషోత్తమ కవి) (2) శత్రుసంహారము (కవిపేరు తెలియదు); (3) (గోగులపాటి కూర్మనాథకవి) సింహాద్రినారసింహశతకము; (4) (భల్లా పేరయకవి) భద్రగిరిశతకము; (5) (బృహత్తటాకము నాగశాస్త్రి) బాలసుబ్రహ్మణ్యశతకము; (6) (అమలాపురము సన్యాసిరాజకవి) విశ్వనాథశతకము; (7) (వేములపాటి భాస్కర సుబ్బకవి) శ్రీ విల్లూరు పార్వతీశశతకము; (8) (మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారి) మృత్యుంజయ శతకము:—ఇందు 2, 3, 4 సంఖ్యలుగలవి చారిత్రకములుగూడ, తక్కినవన్నియుఁ గేవలము భక్తి ప్రతిపాదకములు

సామాన్యభక్తిశతకములలోని వ్యాజస్తుతులు :

కూచిమంచి తిమ్మకవి భర్గశతకమునుండి :

"అజినంబుల్ స్సకరోటియున్ బునుకలున్
హాలాహలంబు, న్మహా
భుజగంబుల్, శవభస్మముల్ గొరలఁగా
భూతాళితో నుండియున్
ద్విజగన్మంగళదాయకాకృతిఁ గడున్
దీపించుట ప్రబం బహో !
రజనీనాథ కళాశిరోభరణ, భర్గా
పార్వతీవల్లభా !॥"

"తాయన్ దాద యటంచు మాదృశులు చం
డాలాదులైనన్, దాసినన్
బాయుంబు ఖ్యాచయంబులఁ జయపుల్
వల్కంగ. నీవయ్యయో !
బోయం డెంగిలిమాంస మిచ్చుటకు లోఁ
బుల్గాని చేకొంటివే,
ప్రాయశ్చిత్తము కద్దదేనికిఁక, భ
ర్గా, పార్వతీవల్లభా !॥

కూచిమంచి జగన్నాథకవి (జగ్గకవి) భక్తమందార శతకమునుండి : (సర్పవ్యాజమున రాజనింద)

"పలుమారుం ద్విజరాజు లొక్కటఁదమం
బాధింతురంచున్, విషా
నలఘోరాననముల్ ముడుంచుకొని, కా
నన్రాక దుర్గస్థలం
బులవర్తింపుచు 'భుస్సు'రందురిల, నా
భోగీశు లెందైననున్
మలకల్మాని చరింపఁగాఁగలరె?, రా
మా! భక్తమందారమా!"

విన్నకోట వేంకటరత్నశర్మ లోభవ్యాజమున వామన స్తుతి యొనర్చిన ("జగన్మోహనశతక") పద్యము ఈ దిగువది :

"ఏమీ? మూఁడుజగంబులేలుదువుగా
దే నీవు? నీభార్యకా
దా మాకాంత? ధనంబుకావలసి యు
న్నట్టైనచో నాపై యీ
దా? మీ పాములమికునుండవలెనా?
పై బిచ్చమే జీవనం
బా? మెర్మెలగు వామనత్వమది కృ
ష్ణా! శ్రీజగన్మోహనా!"॥

ప్రకృతము పూర్తిగ వ్యాజస్తుతినే ఆశ్రయించిన శతకపద్యములను గమనింతము : ఒక్కొక్క శతకము నుండి యొండు రెండుమాత్రమే యుటంకించెద :

ఆంధ్రనాయకశతకము : (కాసులపురుషోత్తమకవి)

"అలునిర్వాహకురాలు భూదేవియై
యఖిలభారకుఁడను నాఖ్యఁదెచ్చెఁ ;
నిష్టసంపన్నురా లిందిర భార్యయై
కామితార్థదుఁడన్న ఘనతఁదెచ్చెఁ ;
గమలగర్భుఁడు సృష్టికర్త తనూజుఁడై
బహుకుటుంబకుఁడన్న బలిమిఁదెచ్చెఁ ;
గలుషవిధ్వంసియౌ గంగ కుమారియై
పతితపావనుఁడన్న ప్రతిభఁదెచ్చె ;
నాండ్రుబిడ్డలు దెచ్చు ప్రఖ్యాతిగాని
మొదటనుండియు నీవు దామోదరుఁడవె ;
చిత్రచిత్రప్రభావ! దాక్షిణ్యభావ!
హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ"॥

"పట్టి గొల్లది రోటఁగట్టు నోపిన నీకు
రోసంబులేదన్న నిసుగఁదె?

జారచోరాదిచేష్టలఁ బ్రబల ర్తిల్లు నీ
కపకీర్తియన్న భయంబుగలదె?
భార్యచే తన్నులుపడ్డవానికి నీకు
లజ్జలేదనియన్న లాఘవంబె?
కుంఠంబులేదనఁ గొసరిమెక్కిననీకు
హీనతలెంచిన న్యూనమగునె?
కోరిదాసులు నిన్నెంతదూఱుచున్నఁ
బంతము న్నదె నీ కిసు మంతయైన'' ॥చిత్ర॥

"హైదరుదండో లేక "మల్కినేబు" అనుతుఱక సర్దారుసైన్యమో ఉత్తరసర్కారులపై దండెత్తి హిందూ దేవాలయ విధ్వంసము గావింపఁబూనినపుడు మహా భక్తులగు కవులచే "శత్రు సంహార శతకము", "సింహాద్రి నారసింహ శతకము"లువ్రాయఁబడినవి. అందు శత్రుసంహార శతకమునుండి (3 పద్యములు) :

''వద్దయ్య రత్నాల పెద్దకిరీటంబు
ముదుగు కుల్లాయి పెట్టుదువుగాని।
ఏలయ్య ముసలి వాజాలువాపోగులు
నొకపాటి తమ్మంటులుంతుగాని।
మానుమయ్య యనర్ఘ మౌక్తికహారముల్
వనమాలపేరులు వైతుగాని।
తగదయ్య చికిలివిద్దాకుందనపుదట్టి
గోచిగోనము చేసికొందుగాని।
చేటెఱుంగని కూనవై. నీటుపెట్టె
దేమిటికి?, సొమ్ముగల్గిన నెమ్మెసేయ
రాదెమీఁదట? తుఱకలఁ గ్రుమ్ముకొనిన
శత్రుసంహార! వేంకటాచలవిహార!॥''

''జవాలు నిడువాలు జడవ్రేటుగాదుగా
జుఱుకుట్టు గుల్లాపు తఱుటుపెట్టు,
రాకేందుముఖి ముద్దుగాకొట్టుగాదుగా
దానకంపు తుటారి ధగిడితిట్టు,
కులుకుగుబ్బెత గుబ్బ కొనపోటుగాదుగా
మొక్కలంపు గరీబు ముష్టిఘాత,
మలివేణి రతికూజితార్భటిగాదుగా
భర్జించు చాకరిగర్జితంబు,
వలదుమామయ్య, ప్రాణంబుగలిగెనేని
బలుసుటాకేరి తినవచ్చుఁ బాజిపొమ్ము,
దొడ్డకొంచెము తెలుఁగరి తుఱకదొరలు
శత్రుసంహార! వేంకటాచలవిహార॥"

"శ్రీహరిననుకోకు చెండేరుదక్కిణాల్
అదరక 'ముర్తుజాహల్లి' ననుము।
పెరుమాళననుకోకు తుఱకలు మొత్తరు
పేర్మి 'ఖోదా' పేరు పెట్టుకొనుము।
విష్ణుండననుకోకు వేసేరు పారసీల్
'కర్తారు' పేరు వేగమువహించు।
కృష్ణుండననుకోకు కొట్టేరు దానకీల్
పూను 'బాబయ్య' పేరైనఁగాని।
దేవ! నీసొమ్ము గట్టిగాఁ డిన్నకవిని
గానఁ జెప్పితినిఁక నాకుఁ గదుములేదు।
బెదరకటుచూచి మున్నె తప్పించుకొనుము
శత్రుసంహార! వేంకటాచలవిహార!॥"

(గోగులపాటి కూర్మనాథకవి) 'సింహాద్రి నారసింహ శతకము :-'

"జడవిప్పి జునపాలుసవరింపు మిరువంక
బలుకిరీటారాల పాగఁజుట్టు।
బొట్టు నెన్నుదుటిపై బొత్తిగాఁదుడుచుకో
పోఁగులూడ్పుము, చెవుల్పూడవిడువు।
వడిగ 'నంగీయిజా' ర్తొడుగు. దట్టీజుట్టు
కైజారుదోఁపు, డాల్కత్తిఁబట్టు।
బీబినాంచారును బిలిపింపు వేగమే
తుద కభ్యసింపుమీ తుఱకభాష।
శక్తిలేకున్న నిట్టివేషంబు పూను
మన్న సకిలోకవంద్యుఁడవైన నీవె
నీచులకు 'సలాం' చేయ నే సహింప
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ॥"

''నినుఁబూజగావింప ఘనవిప్రులేటికి?
కొదువగాకుండ 'సయ్యదులె' కలరు।
వినుతింపశాస్త్రజ్ఞ విద్యాంసులేటికి?
వీలుగామించు 'మౌల్వీలె' కలరు।

ఆత్మకీర్తనసేయ హరిభక్తులేటికి ?
గేకలువేయ 'ఫకీర్లె' కలరు ।
పూతాత్ములగు నమస్తోతలు నీకేల ?
తఱచుగా 'పీరుజాదాలె' కలరు ।
పట్టియాసలనిటు మెడవట్టి త్రోయఁ
జూఱు వట్టుకపేర్లాడినార, మిట్టి ।
ముచ్చటకె నీవు పశ్చిమముఖుఁడవైతి,
వైరిహరరంహ ! సింహాద్రినారసింహ ॥ ''

భల్లా పేరయకవి క్రీ॥ శ॥ 1830 సం॥ ప్రాంతమువాఁడు. అక్కాలమున భద్రాచలముపై దండెత్తి రానున్న 'ఇబ్రహీంఖాను' నకు జడిసి అచటి భక్తులా దేవుని పోలవరమునకుఁదరలించినట్లును. తరువాత నైదేండ్లకు భద్రాచలమునకుఁ దెచ్చి పునఃప్రతిష్ఠ చేసినట్లు 'భద్రగిరిశతకము' న వివరించెను అట్లు తరలించిన దేవుని (శ్రీరాముని) గూర్చి "ఘనత వ్యాజస్తుతిగా నొనర్చితి సీస శతకమష్టోత్తర శతముగాఁగ" రచించితినని కవియే చెప్పకొనినాఁడు. అందుండి పద్యద్వయము :—

" 'సున్నతీ' లొగిఁ జేయజూతురోయని వేగ
మేలుకొన్నా రింతమేలు గలదె,
'గుడిగుడీ' పొగలుపైకొనఁజూతురె యని
వలసపోతిరి సరివారునగరె ?
మును 'పులావు' ను దినుమనియందురోయని
మొదనెక్కితిరి మీరొగిధరిత్రి ।
'లుడిపీయఖ్మాదు' లిడఁజూతురోయని ।
పాఱిపోయితి రింతపాటిగలదె ।
కులముగలిగిన నందైన స్థలముగలద
టనుచు భక్తులదిగనాడి చనఁగఁదగున ?
భద్రగిరివాస ! శ్రీరామభద్రదాన
పోష బిరుదాంక ! రఘుకులాంబుధిశశాంక ॥ "

"ఆదిభిక్షునిఁ బెండ్లియాడిన పార్వతి
కన్నవస్త్రముల కేమాపదయ్యెఁ ?
గోరి బాపనిఁజేసికొన్న సరస్వతి
కిడుములువచ్చెనే యిల్లులేక ?
కాళ్ళులేనిఫణీంద్రుఁ గట్టికొనినయుర్వి
కూరులేదాయెనే యుండుటకును ?
తనువులేనియొయారిఁ దగిలిన రతిదేవి
సుఖపడదాయెనే సురలుమెచ్చ ?
బళిర మీవంటిప్రభుఁ జెట్టవట్టినీత
సకలవెతలకులోనయ్యె సరవిలోన॥ భద్ర॥ "

బృహత్తటాక నాగశాస్త్రికవి బాలసుబ్రహ్మణ్య శతకము:—

"సతి శిరమునసుంచి సభలోననటియించు
సిగ్గుమాలినయట్టి శివునికొడుక !
భద్రకాళితనానఁ బ్రబలి రుద్రునిచేత
గప్పెరనిచ్చు దుర్గకునుతుండ !
చేసెడుపనులెల్లఁ జెఱచివేసెడుపెన్మ
హోదరునికిఁగూర్మి సోదరుండ !
ధర్మభంగముచేసి ధరఁ బుణ్యజనులను
హరియించి నతని మేనల్లుఁడ ! – యని
ప్రజలుపలికెదు పిక్కిరిపోయునెట్లు ?
లోభమునుద్రోచి బహుదానలోలుఁడవయి
మంచివాఁడని పేరు గల్పించుకొమ్ము ?
సుకనవిజనగేయ ! శ్రీ బాలసుబ్బరాయ ! ॥ "

"కాసుకాసుకువడ్డి కాంచనంబార్జించి
కొండపైనెక్కె నీకూర్మిమామ,
బిచ్చమెత్తినరూక బేరమాడుటకునై
ధనపతిఁజేరె నీ యనుఁగుఁదండ్రి,
రాజ్యాభిలాషచే రజితశైలముఁబాసి
పుట్టినిల్లెడఁబాయఁ ఖోదుతల్లి,
త్రోవజూచుచునుండు నేవేళఁ బరులచే
మోదకానక్కిచే సోదరుండు ।
ఇట్టిదేవత లీవేశమెత్తగనిన
నీమతంబేమొ తెలుపుము, సోమతనయ ॥
శూరసంహార ! కరిగిరి సుకవిహార !
సుకవిజనగేయ ! శ్రీ బాలసుబ్బరాయ ॥ "

అమలాపురపు సన్యాసిరాజకవి విశ్వనాధ శతకము :—

"ఆశ్రితకల్పన మంచుస్తోత్రవు నెట్టు
లింద్రాది సుర లాశ్రయించినారొ ?,

స్త్రీ పున్నపుంసక రూపహీనునకెట్లు
పురుషోత్తముఁడౌనర్చెఁ బూజనంబు,
కులగోత్రములులేని గూఢమార్గునకెట్లు
కులగోత్రపతి తన కూఁతు నొసఁగె ?,
సకలామృతాపేక్షులైన మహర్షులు
విషధారినాత్మ భావించిరెట్లు ?,
నిలఁబుణ్యకృతపుణ్యంబు గణుగనెట్టి
వారలధికారులౌట ధ్రువంబుగాదె ?
భూరిగుణయూథ, కాశికాపురసనాథ
విగళితామర్త్యరిపుయోధ ! విశ్వనాథ ॥"

"కరికాళుఁడొసగు మాకందఫలంబులు
మిక్కుటంబుగఁ గూర్మి మెక్కిమెక్కి !
మాదరచెన్నాఖ్యుఁ డాదరంబునఁబెట్టు
సురుచిరక బళంబు ? జుజ్జి జుజ్జి !
నిమ్మవ్వమదబత్తి నివ్వటిల్లఁగఁబోయు
జావ సంతసముసఁగ్రావితావి
బోయకన్నండెడఁబాయక నర్పిందు
నంజుడు తునకలు నమలి నమలి !
తృప్తిదీరక భిక్షాంగ్రదేహియనుట
జనులుదీర్తురె క్షుత్తువిశ్వంభరునకు ॥"

వేములపాటి భాస్కరసుబ్బకవి శ్రీ విల్లూరు పార్వతీశశతకము: —

"ఈడిగవేడెకై యిగిలించి, యాకల్లు
కుండలోపలదూరు కొన్నదెవరో ?,
శస్మాసుసుఁడు వెంటఁబడఁగానె వెఱగంది
పసుగిడిపోయినపంద యెవరో?
ఓ లియ్యలేక యిల్లాలికర్ధాంగంబు
నమ్మిన యాపేద గుమ్మఁడెవరొ ?
వంచతో నసునికై బవరంబుగావించి
బలముజీ వెలకిలఁబడిన దెవరొ ?
దేవ! యారీతిసత్కీర్తులావహించి
త్రోవచప్పంచి భక్తులఁ గావకునికి!
నుంకుటాశ్చర్యమేగాదె, యురగభూష !
సర్వలోకేశ ! విల్లూరు పార్వతీశ !"

"బంతులు గుండులు మెండుగాఁగల వెండి
కొండ నీ కిల్లుగా, కుధరచాప !
పేంతావనీతలో పేశభూతినిబూయ
పీంతిగా నీకు నోభూతనాథ !
పుసుకకంచము చేతఁబూని భిక్షమునెత్తి
సహజమేగద నీకు సాంబమూర్తి !
శీకరములు పుండరీకచర్మంబులు
కట్టుపుట్టములుగా, గరళకంఠ !
యిట్టి సంపదలును గడు నెలమిఁగన్న
వాఁడవేమని యాచించువాఁడ నేను
చూడు మసమున యోచించి సూటిపడఁగ
సర్వలోకేశ ! విల్లూరు పార్వతీశ !"

మాధవపెద్ది బుచ్చిసుందరరామకవ "మృత్యుంజయ శతకము" అంతయు వ్యాజస్తుతి సంశోభితమే. భావనాచమత్కృతి హాస్యరససమ్మిళితమై, అపూర్వ రామణీయకము ద్యోతకమగుచుండును. చదువరుల నుల్లాసితులఁగించును. విదేశీయములుగాని, స్వదేశీయములుగాని శబ్దములు పద్యములలోఁ దమంత దొరలుకొని పోవుచుండును ధారాధోరణి కీతని కవిత పట్టుసారుప అత్యంత మాధురికుఁడేయయ్యెఁ బ్రాక్తన నవీనకవుల కెవ్వరికి నలఁపడని లోకజ్ఞాన సంపన్నుఁడు. ఈ శతకమునందలి కొన్ని పద్యములు చవిచూడుఁడు :

"మెడనాగయ్యకు నొక్కటేబుసబుసల్
మేనన్ సగంటైన యా
బిడతో నీకిఁగనెప్పుడుం గుసగుసల్
వీక్షించి మీ చందమె
క్కడలేనంతగ నెత్తిపై రుసరుసల్
గంగమ్మకున్ నీచెవిం
బడుటేలాగునొ? మాకుఆల్ తెలియ ద
ప్పా ! మాకు మృత్యుంజయా!॥"
"నీ చక్కందన మివెఱుంగమినొ, నా
నేరావె యీకాలపుం
బోచాయింపుల ముం దిదెక్కడనియే
మో, జాడలేకుంటివే ?

నీ చంద్రార్ధ కిరీటసంస్మరణతో
నె చొక్కుచుండంగ నీ
భూచక్రం, బిఁకఁగొంకనేల? విజయం
బున్‌జేయ, మృత్యుంజయా! ॥"

"ఒక లంబోదరుఁడైర పుత్రకుఁడు ము
న్నున్నట్టిదే నీకుఁజా
లక కాఁబోలును సృష్టిజేసితివి యీ
లంబోదరుంగూడఁ, దీ
గకుఁగాయల్ బరువౌన? కాని, కుడుముల్
గల్పించి యవ్వాని. కే
లొకొయివ్వానికి నొక్కమైని యుడుమల్
మొల్పింతు మృత్యుంజయా!॥"

"ఉండంగావలెనొక్క, నీకొఱకె యే
వో వెండిబంగారపుం
గొండల్ రెం, డొకఁడైన బిడ్డలకు మా
కుం బంచి యీ రాదొ? యొ
క్కండి, ట్టొక్కఁడు, విల్లుగాఁగుదుర నీ
కు౯ నిండెనే మాకు? ఈ
గుండుల్ బంగలె దానఁగొట్టితి, పృథ
క్కుల్ మేలె? మృత్యుంజయా॥"

"ఈవే సృష్టియొనర్పియున్నయెడ, మ
మ్మిరూపులన్నట్టివే
రావేమో? మఱి మాకుఁగూడను గుమా
రస్వామి యారోగ్యములో
యావిఘ్నేశు గజాననమ్ములో యవ
శ్యంబిచ్చి మానుండె యె

న్నో విడ్డూరపు రూపులేర్పడెడి వే
మో? తండ్రి మృత్యుంజయా॥"

"చింతంజేసెడు నట్టి భక్తులయెడన్
జెల్లించుకోవచ్చు, నిన్
సంతంబెట్టెడు నట్టి యూకవులతో
నా నీకుఁ బంతంబులున్
గింతంబుల్ వలదయ్య! వట్టిరణ మెం
కె౯ జెప్పుమన్నాను, ఆ
ల్లితందేరెడు కార్యమింక నొక కొం
డంతౌను, మృత్యుంజయా"॥

"తిన్నుండంత తెగింపకున్నయెడ, ఈ
తీరేగదా, యాతఁడా
కన్నూదంబెఱుకంగనే కుదిరె రో
గంబంతయు౯, నీకదే
వన్నె౯ నన్నును దేకయే విడుతువా?
వాఁడే నయంబన్నదాఁ
కన్నిన్నేనియుదేక యే విడుతునా?
కానిమ్ము మృత్యుంజయా"॥

ఇసుకపాతఱపలె నెంత వ్రాసినను దఱుఁగని యీవిషయము నింతతోఁ జాలింతును. విమర్శనార్థమయి నేను గావించిన యసంఖ్యాక శతకములలోఁ దక్కిన యలంకారములతోఁబాటు, ఈ వ్యాజస్తుతియు వెలయు పద్యములన్నిటి నొక్కెడఁజేర్చిన ఏ రెండు వేలయిన నుండు ననుకొందును ఆ మహాసముద్రమున నా యుదాహృతు లొక కొన్ని బిందువులు మాత్రమే యని విన్నపము.

ప్రణయిత్రులు :



డా॥ ఏ. నారాయణ రెడ్డి
వ్యాసము - 1



ఇంద్రగంటి హనుమంతశాస్త్రి
వ్యాసము - 2



కేతవరపు వెంకటరామకోటి శాస్త్రి
వ్యాసము - 3



వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య
వ్యాసము - 5



డి. అర్క సోమయాజి
వ్యాసము - 6



[illegible]
వ్యాసము - 7



గాలి పార్థసారథి
వ్యాసము - 8



టి. కె. గోపాలస్వామి అయ్యంగార్
వ్యాసం - 9



యడవల్లి అదినారాయణ
వ్యాసము - 22



ఇ. ఎ. వి. రాఘవాచార్యులు
వ్యాసము - 23



భాగవతుల కుటుంబరావు
వ్యాసం - 24



రాపూరి దొరస్వామిశర్మ
వ్యాసము - 25



దీపాల పిచ్చయ్యశాస్త్రి
వ్యాసము - 30



తమ్మారెడ్డి నిర్మల
వ్యాసము - 33



నెలటూరి వెంకటరమణయ్య
వ్యాసము - 34



చెలంచర్ల రంగాచార్యులు
వ్యాసము - 35



వి. రామచంద్రుడు
వ్యాసము - 36



వెంపరాల సూర్యనారాయణశాస్త్రి
వ్యాసము - 37



డి. సి. సరస్వతి
వ్యాసము - 38



ఎమ్. వి. ఎస్. కృష్ణమూర్తి
వ్యాసము - 39



ఖండవల్లి లక్ష్మీరంజనం
వ్యాసము - 44



పాకాల యశోదారెడ్డి
వ్యాసము - 45



జటావల్లభుల పురుషోత్తం
వ్యాసము - 46



పి. బాలకృష్ణమూర్తి
వ్యాసము - 47



ఇంద్రగంటి భానుమూర్తి
వ్యాసము - 48



ముంగాల సేతుమాధవస్వామి
వ్యాసము - 49



కుందూరి ఈశ్వరదత్తు
వ్యాసము - 51



ఆర్. ప్రసన్నసత్యనారాయణ
వ్యాసము - 52



**T.** జయాప్రదాదేవి
**వ్యాసము - 53**



కోవెల సుప్రసన్నాచార్యులు
**వ్యాసము - 54**



చెఱుకుపల్లి జమదగ్నిశర్మ
**వ్యాసము - 55**



కొనరాజు రాఘవయ్యాచౌదరి
**వ్యాసము - 56**



నోరి నరసింహశాస్త్రి
వ్యాసము - 58



శ్రీమతి నాయని కృష్ణకుమారి
వ్యాసము - 60



కొత్త సత్యనారాయణచౌదరి
వ్యాసము - 61



డా॥ పల్లా దుర్గయ్య
వ్యాసము - 63



శిష్టా రామకృష్ణశాస్త్రి
వ్యాసము - 64



H. K. షేర్వాని
వ్యాసము - 65



జమ్మలమడక మాధవరామశర్మ
వ్యాసము - 66



అమరేశం రాజేశ్వరశర్మ
వ్యాసము - 67



K. V. భూపాలరావు
వ్యాసము - 68

సాహితీవాల్లభ్యము



అదిరాజు వీరభద్రరావు
వ్యాసము - 69



ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ
వ్యాసము - 70



గడియారం రామకృష్ణశర్మ
వ్యాసము - 71



వాసిలి వేంకటలక్ష్మీనరసింహారావు
వ్యాసము - 72



**S. V. A.** రామలింగేశ్వరశాస్త్రి
వ్యాసము - 73



తల్లాప్రగడ సత్యనారాయణమూర్తి
వ్యాసము - 74



అడపా రామకృష్ణరావు
వ్యాసము - 75



బి. రామరాజు
వ్యాసము - 77

# ర చ యి త ల గు రిం చి

**1.** పూర్తిపేరు, ఇంటిపేడు, 'కలముపేరు' : సి. నారాయణరెడ్డి.

**2.** పుట్టిన తేదీ : ప్రజోత్పత్తి, ఆషాఢపూర్ణిమ.

**3,** జన్మస్థలము: ఊరు, తాలూకా, జిల్లా : హనుమాజీపేట–సిరిసిల్లతాలూకా, కరీంనగరంజిల్లా.

**4.** విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : ఉస్మానియా విశ్వవిద్యాలయము.

**5.** డిగ్రీలు, బిరుదమును : ఎం. ఏ., పిహెచ్. డి.

**6.** చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : రీడరు, ఆంధ్రశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము.

**7,** రచనలు : ముద్రితములు : అముద్రితములు :

1. నాగార్జునసాగరం.
2. కర్పూర వసంతరాయలు.
3. విశ్వనాథనాయడు.
4. రామప్ప.
5. వెన్నెలవాడ.
6. దివ్వెలమువ్వలు.
7. ఋతుచక్రం — వగైరా.

**8.** అభిరుచులు : సాహిత్యం, సంగీతం.

**9.** చిరునామా ; Reader in Telugu,
Osmania University.

వీరి వ్యాసము : 'భారతీయ సంస్కృతి' 1వ పుట లగాయితు 9వ పుట వరకు.

**1.** పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి.

**2.** పుట్టిన తేదీ : 29—8—1911.

**3.** జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : మాడుగుల — వీరవల్లితాలూకా, విశాఖజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు. గురువులు : సంస్కృతకళాశాల. విజయనగరము, ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము, కొవ్వూరు. శ్రీ వజ్ఝల చిన సీతారామశాస్త్రులుగారు, అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రులుగారు, ఆకొండి వేంకటశాస్త్రులుగారు.

5. డిగ్రీలు, బిరుదులు : ఉభయభాషాప్రవీణ (ఎ) ఆంధ్రవిశ్వవిద్యాలయము.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : సంస్కృతాంధ్రోపాధ్యాయుడు, జిల్లాపరిషత్ సమున్నతపాఠశాల. రామచంద్రపురము — తూర్పు గోదావరి.

7. రచనలు : ముద్రితములు :

అనువాదములు ;

1. స్వప్నవాసవదత్తము.
2. ప్రతిమ.
3. మృచ్ఛకటికము.

స్వతంత్రములు :

1. దక్షారామము (కావ్యము)
2. మధువని (ఖండకావ్యములు)
3. పాటలమంజరి (భావగీతాలు)
4. వ్యాసావళి (సమీక్షలు)
5. విజయదశమి (చిన్నకథలు)

అముద్రితములు :

1. లీలావతి (కావ్యము)
2. కాళిదాసు — కావ్యశిల్పము.
3. రామాయణరమణీయత.

8. అభిరుచులు : ప్రాచీనకావ్యనాటకాలను నవ్యదృష్టితో చూచుట — సంస్కృత కావ్యాలమీద ఎక్కువ ఇష్టం. ఇంగ్లీషు విమర్శమీద అధికశ్రద్ధ.

9. చిరునామా : రామచంద్రపురం, తూ. గో. జిల్లా.

వీరి వ్యాసము : 'రామాయణ రమణీయకము' 10వ పుట లగాయితు 17 పుట వరకు.

డాక్టర్ కె. వెంకటరామకోటిశాస్త్రిగారు, వీరి జీవితచరిత్ర మాకు అందలేదు.
వీరి వ్యాసము : 'మహాభారతనాయకుడు' 18వ పుట లగాయతు 24వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి.

2. పుట్టిన తేదీ : 1920—1—22.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : తెనాలి, గుంటూరు జిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : ఎ. సి. కాలేజి, గుంటూరు; ప్రెసిడెన్సీ కాలేజీ, మద్రాసు; మద్రాసు విశ్వవిద్యాలయము.

5. డిగ్రీలు. బిరుదములు : ఎం. ఏ. – తెలుగు. సంస్కృతము, ఆంగ్లము, ఫిలాసఫీ, ఎం. లిట్,, పిఎచ్. డి.,

6. చేసిన ఉద్యోగములు. ప్రస్తుతోద్యోగము : ఉపాధ్యాయవృత్తి, ఆంగ్లశాఖాధ్యక్షులు, నాగపుర విశ్వవిద్యాలయం.

7. రచనలు : ముద్రితములు :

   భక్తిరసాయనము.
   నాట్యశాస్త్రము (1–6 అధ్యాయము)
   Aristotle's Theory of Poetry & Drama.
   The Vision of Coleridge.
   The Aesthetics of Rigveda.
   Critical Presupposition of Aesthetics.
   Philosophy of Language.
   Indian Epistemological idealism.

   అముద్రితములు :

   నాట్యశాస్త్రము,
   Siva Sankara Sastri's mind and art
   The Aesthetics of Coloridge.

8. అభిరుచులు : లలితకళలు, వేదాంతము, జ్యోతిషము, ప్రాచీన భారతీయ సాహిత్యము, సంస్కృతి.

9. చిరునామా : New Library Building, Ambazheri Road, Nagpur.

వీరి వ్యాసము : 'భాసమహాకవి' 25వ పుట లగాయితు 28వ పుట వరకు.

శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్యగారు, వీరి జీవితచరిత్ర మాకు అందలేదు.
వీరి వ్యాసము : 'హాళకవితాహేళ' 29వ పుట లగాయితు 48వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : ధూళిపాళ అర్కసోమయాజి.

2. పుట్టిన తేదీ : 2—10—1910.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : వెలిచేరు, కొత్తపేటతాలూకా, తూర్పుగోదావరిజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : ఎం. ఏ. మద్రపురీరాష్ట్రకళాశాల, సంస్కృతములో గురుకులపద్ధతిని కావ్యనాటకాలంకార సాహితీ పరిశ్రమ.

5. డిగ్రీలు, బిరుదములు : M. A. B. Ed., Sometime Research Scholar Madras Unversity in Astronomy.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : Head of the Department of Mathematics and Vice-Principal, W.G.B. College, Bhimavaram.

7. రచనలు : ముద్రితములు :
   (1) ఖండఖాద్యసహస్రిక యను సంస్కృత కావ్యము
   (2) జ్యోతిర్విజ్ఞానమను సిద్ధాంతగ్రంథము

   Awarded a prize of Rs. three thousand by U. P. Govt.

   అముద్రితములు :
   1. A Study in Kalidasa.
   2. ,, ,, in Bhavabhuti.
   3. ,, ,, Valmiki.
   4. IInd Volume of Khandakhadya Sahasrika.
   5. A critical study of Hindu Astronomy in the light and language of the Modern.

8. అభిరుచులు : Astronomy, Astrology and Sahitya.

9. చిరునామా : College, Bhimavaram.

10. ఇతర విశేషములు : Academic positions like (1) Chairman of the Board of Studies in Mathematics: (2) Member of the Academic Council. (3) Chief Examing and Paper-Setter in Math.

వీరి వ్యాసము : 'కవికులపతి కాళిదాసు' 49వ పుట లగాయితు 54వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' :

డాక్టరు ॥ శ్రీమతి వారణాసి యశోదాదేవి.
తండ్రి : కవుతా శ్రీరామశాస్త్రి, రచయిత of వేదాంత గ్రంథములు.

Founder of Sarda, 1st monthly in Telugu.

భర్తగారు శ్రీ వారణాసి వేంకటాచలంగారు
Branch Manager, Andhra Insurence, Ernakulam & Madras.

2. పుట్టిన తేదీ :

7-9-1919.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా :

మచిలీపట్నము, కృష్ణాజిల్లా, (A. P.)

4, విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు :

National Theosophical School College, Adayar Madras. Besant Theosophical College, Madanpalle, Presidency College, Madras.

5. డిగ్రీలు, బిరుదములు :

1) B. A (Hons) M. A. 2) M. Litt or) D. Litt 1937 1941 1948
Research Scholar (1937-40)
"Fellow (1942-44) in History Dept: of University of Madras-guidence Padmabhushanam
Porf: K. A. Nilakantha Sastry M. A.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము :

1) Principal-Mahilavidyalaya of Andhra Mahilasabha.
2) Lecturer for I. A. S. Murti tutorial College, Madras. (6 months.)
3) Research Assistant-Sri Venkateswara University.
History Dept. 1 yr 1960-61
4) Lecturer in History S. V. University College from 1961.

7. * రచనలు ముద్రితములు :

1) The History of Andhradesa 1000-1500 AD. Subsidiary dynastics–Journal of ·Andhra Historical research Society Volumes 18 to 27 both inclusive. Thesis for D. Litt.
2) Several Articles in Telugu & English in Journals of Indian History, Sri Venkateswara Oriental, Andhra Historical research Society, Bharathi, Andhra Mahila, Kinnera (Monthlies) Krishna Patrika, Andhra-prabha, Andhra Patrika (weeklies)

అముద్రితములు :

1) The Reddos of Kondedu and Rajahmundry–thesis for M. Litt.
2) Several articles with the Journals already mentioned and the forther coming proceeding volumes of Indian History Congress (1965) & India Oriental Congress (1968)

8. అభిరుచులు : Painting, music, sculpture & Monography, literature, Hindi etc.

9. చిరునామా : Dr. (Mrs) V. Yasoda Devi,
M. A., M. Ltt., D. Ltt.
Lecturer in History, S. V. U. College, Tirupati.
109 G. S. M. St, Tirupati

10. ఇతర విశేషములు : Several Radio talks on Variety of topics-history, literature, current affairs etc. from Madras since 1938 and from Vijayavada from 1963.

వీరి వ్యాసము : 'శాతవాహనసామ్రాజ్యములో రమణీమణులు' 55వ పుట లగాయితు 59వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : పార్థసారథిరావు, గాలి.

2. పుట్టిన తేదీ : 21—12—1934.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : సంతమాగులూరు,
నర్సరావుపేటతాలూకా – గుంటూరుజిల్లా.

4. విద్యాభ్యాసము ; కళాశాలలు, గురువులు : S. R. R. and C. V. R. College లో B.A.– ఉపాధ్యాయులు : శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు. Universty College లో M. A. గురువులు : Dr. C. Kunham Raju.

5. డిగ్రీలు, బిరుదములు : M. A. in I Class.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : Lecturer in Sanskrit Department, Andhra University–Waltair.

7. రచనలు : ముద్రితములు :

1. అర్జునుని నిర్వేదము – భగవానుని సమాధానము.
2. తమసోమాజ్యోతిర్గమయ.
3. అస్మిన్ కలియుగే ప్రథమపాదే.

అముద్రితములు :

1. వెంకటేశ్వర స్తోత్రము.
2. పరమేశ్వర శతకము.

8. అభిరుచులు : తెనుగున, సంస్కృతమున కవిత్వము వ్రాయుట– గైర్వాణివాణియందు ఉపన్యాసము.

9. చిరునామా : గాలి పార్థసారథిరావు, లెక్చరర్, న్యూ ఆర్ట్సు కాలేజి, ఆంధ్రయూనివర్సిటీ – వాల్తేరు.

వీరి వ్యాసము : 'భారవి – అర్థగౌరవము' 60వ పుట లగాయితు 64వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు'; తిరుపతికుమార గోపాలస్వామి అయ్యంగారు

2. పుట్టిన తేదీ : 2–6–1914

3. జన్మస్థలము : ఊరు, తాలూకా. జిల్లా : Tirupathi Chandragiri Tq.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : Madras Presidency College
1) T. K. Tiruvenkata thathacharyulu (father)
2) Mahamahopadhyaya S. Kuppuswamy Sastrulu

5. డిగ్రీలు, బిరుదములు : M. A. Sanskrit College.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : Head of the dept. Philosophy S. V. Sanskrit College. (1936–1948)
Head of the dept. Arts College (1948–58).
Lecturer in Sri Venkateswara University 1958.

7. * రచనలు ముద్రితములు : Author of more than 30 Papers in sanskrit are english comy
1) Nyaya 2) Vedanta 3) Karyas 4) Vedas.

8. అభిరుచులు : Interast in the Vedas Vedri Reserch. సంస్కృతములో వ్రాయుట మాట్లాడుట.

9. చిరునామా :

10. ఇతర విశేషములు : తిరుమలతిరుపతి (T. T. D.) దేవస్థానం ప్రధమాచార్య పుంగవులు భగవద్రామానుజాచార్ల మేనమామయైన శ్రీ శైలవృద్ధులయొక్క వంశస్థులు. తిరుమల దేవస్థానంలో, మంత్ర పుష్ప, వేదపారాయణ మిరాశీదారులు.

వీరి వ్యాసము : 'మాఘకవి శాస్త్రవైదుష్యము' 65వ లగాయతు 70వ పుట వరకు.

శ్రీ కె. ఉమావరమూర్తిగారు, వీరి జీవితచరిత్ర మాకు అందలేదు.
వీరి వ్యాసము : 'శ్రీశైలదేవాలయము' 71వ పుట లగాయితు 87వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : కొత్త భావయ్యచౌదరి,

2. పుట్టిన తేదీ : 2—6—1897.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : సంగంజాగర్లమూడి, తెనాలితాలూకా—గుంటూరుజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : ప్రాథమికపాఠశాలవిద్యతప్ప తక్కినవిద్యస్వార్జితము.

5. డిగ్రీలు, బిరుదములు : డిగ్రీలులేవు. 1953లో విమర్శకాగ్రేసర బిరుదు పామర్రు భారతీసమితివారిచే నీయబడినది. విజ్ఞానచంద్రికామండలి పరీక్షలో నుత్తీర్ణులు—(1915—16) సారస్వతసేవకు గుడివాడలో "ఆంధ్రనలంద"వారొక సన్మానము గావించిరి, (1960) భారతీసమితి పామర్రువారు షష్టిపూర్తి సన్మానముచేసిరి, సంచికముద్రించిరి.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : 1916—25 మధ్య సర్వేశాఖలో ఫీల్డుడిప్యూటీసర్వేయరు పదవులు — ఇప్పుడేమియులేదు.

7. రచనలు : ముద్రితములు : అముద్రితములు.

1. కమ్మవారిచరిత్ర 1, 2, 3 భాగములు (1939—1942) మనుసంభవము (వచనం)
2. డిటో ప్రబోధకుసుమావళి 1944.
.3 కమ్మవారిచరిత్ర (Revised Edition 1962)
4, రెడ్లచరిత్ర పద్యకావ్యం — 1947,
5. కాకతీయరాజులచరిత్ర,, — 1955.
6. వేంగీచాలుక్యరాజ్యచరిత్ర,,—1956.
7. పశ్చిమచాలుక్యరాజ్యచరిత్ర,,
8. కాశ్మీరు, నేపాలుచరిత్రలు(వచనం)1954
9. కల్పవల్లి (ఖండకావ్యం) 1953.
10. గోపాలశతకం—కందపద్యములు—1920.
11. శంకరశతకం—శార్దూలపద్యములు-1928.
12. సంగభూపాలీయము అను కొత్తవారి వంశ చరిత్ర (కావ్యము) 1929.
13. నగరపట్టాభిషేకము—1932.

14. వ్యామోహము (నవల)
(కొండపల్లి వీరవెంకయ్యప్రచురణ) 1930
15. దేవరహస్యాలు (The Prehistorical Secrets of India) 1948–1962.
ద్వితీయముద్రణము: రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్‌వారు.
16. అనేకవ్యాసాలు, పద్యాలు వివిధపత్రికలలో ముద్రితము.
17. ఆంధ్రరాజులు – (వచనం)
(రామా అండ్ కో ప్రచురణ)

8. అభిరుచులు : చారిత్రక పరిశోధన.

9. చిరునామా : కొత్త భావయ్యచౌదరి, గ్రంథకర్త.
P. O. సంగంజాగర్లమూడి, గుంటూరుజిల్లా.

10. ఇతర విశేషములు : కమ్మవారిచరిత్ర, ప్రథమభాగం అరవములో ప్రకటితము.
డిటో సంక్షిప్త మూడుభాగాలచరిత్ర 1954లో ఇంగ్లీషులో ప్రకటితము.
దేవరహస్యాలు అనే గ్రంథము హైకోర్టుజడ్జి లేటు శ్రీ వేపారామేశంపంతులుగారు వగైరాల ప్రశంసల నందినది.

వీరి వ్యాసము : 'ఏకుకొండలవాని పుట్టుపూర్వోత్తరాలు' 88వ పుట లగాయితు 93వ పుట వరకు

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : బి. ఎన్. శాస్త్రి. (భిన్నూరి నరసింహశాస్త్రి)

2. పుట్టిన తేదీ : 1—3—1933.

3, జన్మస్థలము: ఊరు, తాలూకా, జిల్లా : వలిగొండ—తాలూకా రామన్నపేట, జిల్లా నల్లగొండ.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : హైదరాబాదు. ఉస్మానియా విశ్వవిద్యాలయము.

5. డిగ్రీలు, బిరుదములు : ఎం. ఏ.,

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : ఉపాధ్యాయవృత్తి, ప్రస్తుతము 'శాసనములలోనిభాష' పరిశోధనము—ఉస్మానియా విశ్వవిద్యాలయముయ + వ్యాపారము.

7. రచనలు : ముద్రితములు :

1. సంధ్యారాగం.
2. తపోభంగం.
3. తుక్కాదేలి.
4. కాశీఖండం—దాని — ప్రాశస్త్యము.
5. కిరాయదార్.
6. రెండునాటికలు.
7. సహకారం.
8. గ్రామజీవనం.
9. తీరిన కోరిక.
10. రాధ.
11. పాపాయిపతకం.
12. నీరాజనం.
13. ఆంధ్రప్రదేశ్ దేవాలయములు — శిల్పములు.

అముద్రితములు :

Underprinting

1. శాసనసంపుటి.
2. ఆంధ్రుల సాంఘికచరిత్ర. 4th Century B. C. to 11th Century A. D.
3. A Collection of Inscription (in English.)

8. అభిరుచులు : శాసనపరిశోధనము — చరిత్రరచన.

9. చిరునామా ; B. N. Sastry, C/o Nagarjuna Book Depot, Narayanaguda. Hyd.

వీరి వ్యాసము : 'రేనాటిచోళుల శాసనములు' 94వ పుట లగాయితు 112వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : పోచంచర్ల శ్రీరామమూర్తి

2. పుట్టిన తేదీ : 1–5–1934

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : తమ్మవరం, ఒంగోలుతాలూకా, గుంటూరుజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : వి. ఆర్. కాలేజి, నెల్లూరు—ప్రెసిడెన్సికాలేజి, మద్రాసు, Dr. C. Kunhan Raja; Dr. V. Raghavan.

5. డిగ్రీలు, బిరుదములు : యం. ఏ.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : 1956 ఆగష్టునుండి ఆంధ్ర విశ్వకళాపరిషత్ సంస్కృత విభాగమున నుపన్యాసకుడుగా

7. * రచనములు :

ముద్రితములు :

1) ఆధునిక సంస్కృత వాఙ్మయము—విశ్వసాహితి Vol. VI
2) చమత్కారచంద్రిక—A critical edition accepted for publication by A. U.
3) Bhavadipika on Saptasatisara paper read at Srinagar Senior of AOC
4) The Concept of Camatkara—paper read in the Sanskrit Section of the International Congress of Orientalists. 64.

అముద్రితములు :

1) The Contribution of Andhra to Sanskrit literature-Thesis submitted to the A. U. for Ph. D.
2) Some special features of Sanskrit Language and literature cultivated in Andhra desa-paper com municated to Adyar Library bulletin.
3) Critic and critism in Sanskrit-S. V. O. Journal-Communicated.
4) Pratbya Sanne nabhase- A new interpretation – Com to Vikram.
5) Kanakalekhakalyana of Vamana Bhatta Bana com. to Journal of V. V R. I.

8. అభిరుచులు :

1. Editing as many Skt. works of Andhras as possible-Eg. Sahityashintamani is now undertaken.

2. Study of Comparative religion.

9. చిరునామా : P. Sriramamurti M. A, 3/29 Siripuram Quarters, Andhra University Waltair. (A. P.)

వీరి వ్యాసము : 'శ్రీహర్షుని కవితానైపుణ్యము' 113వ పుట లగాయితు 117వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : డాక్టర్ యస్వీ. జోగారావు.

2. పుట్టిన తేదీ : 2—10—1928.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : పార్వతీపురం, శ్రీకాకుళం జిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు.

5. డిగ్రీలు, బిరుదములు : ఎమ్. ఏ., పిహెచ్. డి.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : ఆంధ్రోపన్యాసకుడు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు.

7. * రచనలు ముద్రితములు :

   1. ఆంధ్ర యక్షగానవాఙ్మయచరిత్ర.
   2. పంచకల్యాణి (కావ్యసంపుటి)
   3. సప్తతంతువు (వ్యాససంపుటి)
   4. ఉపనిషత్తు (కావ్యసంపుటి)
   5. అప్సరస (గేయనృత్యనాటికలు)
   6. మధురమాధవం (వచన నాటికలు)
   7. సువర్ణశృంఖల (కథానికలు)

   అముద్రితములు :

   1. సంయుక్తరాష్ట్రాల సాహితీ ప్రస్థానం.
   2. కాదంబరీ కావ్యసమీక్ష.
   3. The Tradition of the Telugu Peoples' Theatre.

8. అభిరుచులు : సాహిత్యము, నాటకకళ.

9. చిరునామా : తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు—వాల్తేరు.

10. ఇతర విశేషములు : "ఊహాప్రహేళిక" అనే నూత్నసాహిత్యప్రక్రియాసృష్టి.

వీరి వ్యాసము : 'కాదంబరీమహాకావ్య మధురసందేశము' 118వ లగాయతు 125వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : వేంకటనృసింహఅప్పారావు, కేసిరాజు. (ఆత్మారామ్)

2. పుట్టిన తేదీ : 14—3—1913.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : దేవిపట్నము. రంపచోడవరం తాలూకా — తూర్పుగోదావరిజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : బోర్డుహైస్కూలు, కొవ్వూరు.
ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము కొవ్వూరు.
శ్రీవాడ్రేవు జోగాయమ్మ వేదసంస్కృతకళాశాల.
(ప్రధానాచార్యులు శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం. ఏ.)

5. డిగ్రీలు. బిరుదములు : ఎం. ఏ. (సంస్కృతము)
ఉభయభాషాప్రవీణ (సంస్కృతము – తెలుగు)
రాష్ట్రభాషావిశారద (హిందీ)
పి. ఓ. యల్. (ఇండో–యూరపియన్ భాషా శాస్త్రము)

6. చేసిన ఉద్యోగములు. ప్రస్తుతోద్యోగము : శ్రీ వా. జో. వేదసంస్కృతకళాశాల (కొవ్వూరు) ఆచార్యత్వము, ఉపప్రధానాచార్యత్వము, ప్రస్తుతము ప్రధానాచార్యత్వము.

7. రచనలు : ముద్రితములు :

1. గంగాలహరీ (స్వతంత్రసంస్కృత ఖండకావ్యము)
2. పంచవటీ ( డిటో )
2. శిక్షణవిచారధార (ఆచార్య వినోబాభావే హిందీగ్రంథమునకు అనువాదము) (తెలుఁగులో)
4. పంచవటి(పై నెం2నకు ఆంధ్రానువాదము)
5. వసుంధరాసాంత్వనము (తెలుఁగు ఖండ కావ్యము 'శాంతి'యను సంకలనగ్రంథములో ముద్రితము)
6. డిటో (హిందీ అనువాదము– శ్రీ ఉన్నవ రాజగోపాల కృష్ణయ్యగారి అభినందన గ్రంథములో ముద్రితము)

అముద్రితములు :

1. గాంధీగీతా (సంస్కృతము)
2, బృందావనమ్ ( ,, )
3. పంచవటీ (స్వరచిత సంస్కృత కావ్యమునకు హిందీ అనువాదము)
4, సంస్కృత కథామంజరీ (విజయవాడ ఆకాశవాణిచే ప్రసారితములు)
5. అభిజ్ఞాన శాకుంతలము (ఆంధ్రానువాదము)

8. అభిరుచులు : సాహిత్యము, సర్వోదయము, సామ్యయోగము.

9. చిరునామా : కే. వే. న్య. అప్పారావు; కొవ్వూరు – పశ్చిమగోదావరిజిల్లా.

వీరి వ్యాసము : 'భవభూతి కవితావిభూతి' 126వ పుట లగాయితు 131వ పుట వరకు.

డా॥ జాస్తి సూర్యనారాయణగారు, వీరి జీవితచరిత్ర మాకు అందలేదు.
వీరి వ్యాసము : 'భవభూతివర్ణించిన గోదావరీప్రాంతము' 132వ పుట లగాయితు 135వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు'; ప్రభాకరశాస్త్రి జొన్నలగడ్డ.

2. పుట్టిన తేదీ : 3—9—1935.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : అవనిగడ్డ, కృష్ణాజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : ఆంధ్రజాతీయకళాశాల, మచిలీపట్టణము.
వివేకానంద కళాశాల, మద్రాసు.
శ్రీమాన్ S. T. G. వరదాచార్యులుగారు.
డా॥ A. శంకరన్‌గారు.

5. డిగ్రీలు, బిరుదములు : M. A.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : ఉపన్యాసకత్వము — ఆంధ్రవిశ్వవిద్యాలయము.

7. రచనలు : ముద్రితములు :

అముద్రితములు :

1. The Personality of the Poet.
2. The Theme of Poetry.
3. Bharata's Conception of Rasa.
4. Solletas Conception of Rasa.

8. అభిరుచులు :

9. చిరునామా : Lecturer, Sanskrit Dept,
A. U. College, Waltair.

వీరి వ్యాసము : 'ధ్వన్యాలోకము — లోచనము' 136వ పుట లగాయితు 141వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : అప్పలాచార్యులు శ్రీభాష్యం.

2. పుట్టిన తేదీ : 6–4–1922 – దుందుభి, చైత్ర శుద్ధ నవమి,

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : పద్మనాభము, భీమునిపట్నం తాలూకా – విశాఖపట్నం జిల్లా.

4. విద్యాభ్యాసము ; కళాశాలలు, గురువులు : విజయనగరం – మహారాజసంస్కృత కళాశాల.
బ్రహ్మశ్రీ పేరి వేంకటేశ్వరశాస్త్రిగారు, శ్రీమాన్ కోయిల్ కందాడై వేంకటార్యమాచార్యులుగారు.
బ్రహ్మశ్రీ కర్రి శ్రీరామమూర్తిశాస్త్రిగారు.

5. డిగ్రీలు, బిరుదులు : M A. వ్యాకరణ విద్యాప్రవీణ – భాషాప్రవీణ.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : ప్రభుత్వకళాశాల–రాజమండ్రి.
సంస్కృతోపన్యాసకుడు.

7. రచనలు : ముద్రితములు : పస్పశాహ్నికము (పాతంజలమహాభాష్యం) ఆంధ్రానువాదము.

అముద్రితములు : మహాభాష్యమునందలి కొన్ని ఆహ్నికములు–అనూదితములు.

8. అభిరుచులు : శాస్త్రకావ్యపఠనాసక్తి.

9. చిరునామా : లెక్చరరు, గవర్నమెంటుఆర్ట్సుకాలేజి, రాజమండ్రి–3

వీరి వ్యాసము : 'వక్రోక్తిజీవితము – రాజానకకుంతకుడు' 142వ పుట లగాయితు పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : శిరుగూరి హనుమంతరావు.

2. పుట్టిన తేదీ : 23–12–1891.

3. జన్మస్థలము: ఊరు, తాలూకా, జిల్లా : పార్వతీపురం - శ్రీకాకులం జిల్లా. ఆంధ్రప్రదేశ్.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : మెట్రిక్యులేషన్, హిందు హైస్కూల్, తిరువళిక్కేణి, మద్రాసు, ఎఫ్.ఏ. 1909–1914 ప్రెసిడెన్సీ కాలేజీ–మద్రాసు.

5. డిగ్రీలు, బిరుదములు : M. A. (Hons) L T. (Madras)

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : Lecturer, Maharaja's College, Vizianagaram 1915–'18 Assistant Professor, Presidency College, Madras 1918–1920

Professor, Nizam College Hyderabad 1920–1948.

University Lecturer, Madras, 1919 Honorary Reader, Madras University, 1918 Formerly Member Board of Studies, Madras, Andhra, Osmania Universities and Examiner, Madras, Andhra, Annamalai, Travancore, Mysore and Osmania Universities.

7. * రచనలు ముద్రితములు :

1. జన్మభూమి 1924 కృష్ణదేవరాయలువారు
2. Indian Social Refarmer 1924 వీరేశలింగం
3. Viswa Eharati 1925 Universal Guest.
4. Journal of Madras University Vol. 1 & 2 Life of Madhwa.
5. Journal of Indian History, 1936, 1937 Ajanta and Ellora and Hindu.
6. Religious movements.

అముద్రితములు :

7. Indian Historical Quarterly 1933 Dasas of the Karnataka Country.
8. Jayasa Vithala Prof. K.V.R, Commemoration Volume 1940
9. Parahthala వావిళ్ల Venkateswara Sastri Common Volume 1941
10 She Breakdown of civilisations early common Vol. 1941

## A bibliography of the writings of Professor S. Hanumantha Rao

1912 Dec Liberty and coereion. The Madras Christian College Magazine.
1920 The problem of Sovereignty : ordinary university Lectures, Madras University.
1923 Dwaita philosophy, Madhwa Journal, Trivandrum
1924 December 11th Krishnadevaraya, "Janma Bhumi"
1925 April 4th The Brahma Samaj, "Hyderabad Bulletin"
1923 Kotagiri plates of the Kakatiya queen Rudramamba. (Hyderabad Archalogical series monograph)
1925 The Universal Guest "The Viswa Bharati Journal'
1924 Veeresalingam Panthulu "The Indian Social Reformer."
1925 Ancient Indian Cultur , Maharaja's College, Magazine, Vizianagaram.
1926 Introduction to poems by Seshadri Ramana Kavulu.
1926 April, Social Service Social Service quarterly.
1926 December. Address to Osmania graduates.
1927 Madras University Readership Lectures on Shri Madhavacharya and his times. Madras University Journal 1927-28. Diwan Bahadur S. Aravanudu Ayangar presiding
1927 July "Hyderabad Teacher" Review of Muslim Epigraphy in H & H The Nizam's Dominions Also, Vol II, No 1 and 2. Historical Research in H. H. The Nizam's Dominions.
1927 August. The Teaching of History, "Educational Review" Madras.
1927 Raja Rammohan Roy. Maharaja's College, Magazine Vizianagaram
1927 Ancient History of Hyderabad "Pictorial Hyderabad"
1927 Dec. Ganapathi Festival, Osmania University Magazine.
1927 Dec Some Aspects of Deccan culture do.
1923 January. Panchamukhi Hanuman Historical Quarterly, Calcutta
1928 Jan. The League of Nations. Lantern Lectures Y.M.C.A. Hyderabad. Principal K. Burnalt presiding

7. రచనలు : ముద్రితములు :

హృద్గీత (1954)
ఆనందలహరి (1956)
(ఈరెండు శ్రీ సంపత్కుమారతో కలసి రచించినవి.)
తేజశ్చక్రము (1958)
అధునా (1964)

అముద్రితములు :

1. వచన పద్య సంపుటి.
2. రామరాజభూషణునిపై పరిశోధనా వ్యాసము.

కొన్ని వ్యాసాలు, ఖండకావ్యాలు.

8. అభిరుచులు : తత్త్వశాస్త్రము.

9. చిరునామా : 9–573–1 గిర్మాజీపేట, వరంగల్లు.

10. ఇతర విశేషములు ; —

వీరి వ్యాసము : 'ఆముక్తమాల్యద – కావ్యశిల్పము' 472వ పుట ల॥ 487వ పుట వరకు

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' ; చెఱుకుపల్లి జమదగ్నిశర్మ – జమదగ్ని.

2. పుట్టిన తేదీ : 5—6—1920. రౌద్రినామసంవత్సర జ్యేష్ఠ బహుళ చతుర్థి.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : గొల్లపల్లి, నూజివీడుతాలూకా – కృష్ణాజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : బి. ఏ. ఆంధ్రవిశ్వవిద్యాలయము. ప్రభుత్వకళాశాల. రాజమండ్రి.

ఎమ్. ఏ. మదరాసు విశ్వవిద్యాలయము – స్వయంకృషి.

బ్రహ్మశ్రీ శిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారు.
,, ప్రయాగ వేంకటరామశాస్త్రిగారు,
,, విశ్వనాథ సత్యనారాయణగారు.

5. డిగ్రీలు, బిరుదములు : ఏమ్, ఏ.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : మొదటినుండి ఉపాధ్యాయవృత్తియే — బందరులో. ఋషీవాలీలో ఉన్నతపాఠశాలాధ్యాపకత్వము. రాజమండ్రి అనంతపురములలో కళాశాలాధ్యాపకత్వము. ప్రస్తుతము విజయవాడలో ఆంధ్రశాఖాధ్యక్షనము.

7. రచనలు : ముద్రితములు :

మహోదయము — నేపథ్యగేయరూపకము.

చిలకా — గోరింకా, మరపురాని ఆవూరు, ప్రతిఫలం, గొల్లహంపన్న, అన్నదమ్ములు } కథానికా సంపుటములు.

అముద్రితములు :

ధర్మదీక్ష, అంతర్యామి } పద్యకావ్య ఖండికలు.

కల్పవృక్షకావ్యానుశీలనము విమర్శ.

కశ్చిద్ధీరః — వేదాంతనవల.

శివోఽహం — తత్త్వప్రతిపాదక కథానికా గుచ్ఛము.

స్వాతంత్ర్యకవచము — భారతదేశ అభ్యుదయానర్థహేతు నిరూపక దేవీస్తోత్రము.

కళ్యాణ కామేశ్వరీ మకుటయుక్తము.

8. అభిరుచులు : స్వధర్మానుష్ఠానము.

9. చిరునామా : C. Jamadagni Sarma, M.A.
Head of the Dept. Telugu S. R. R. and C. V. R. Government. College-
Vijayawada.

10. ఇతర విశేషములు :

వీరి వ్యాసము : 'అల్లసానివాని యల్లిక జిగిబిగి' 488వ పుట లగాయితు 497వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : రాఘవయ్యచౌదరి. కొనరాజు. "కొనరాజు"

2. పుట్టిన తేదీ : 1904.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : అప్పికట్ల, బాపట్లతాలూకా — గుంటూరుజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : సంస్కృతాంధ్రములు.
గురువులు : 1) కొండముది నరసింహంపంతులు.
2) కవిరాజు రామస్వామిచౌదరి.

5. డిగ్రీలు, బిరుదములు : కవిరత్న.

6. చేసిన ఉద్యోగములు. ప్రస్తుతోద్యోగము : ....

7. * రచనలు ముద్రితములు :
మిత్రనీతి.
కడగండ్లు.

అముద్రితములు :
గండికోటయుద్ధము.
కొండవీటిచూపు.
సినిమాడైరెక్టరు.
భానుగీత.
రాఘవయ్యశతకం.
వీరశేఖరశతకం.
కొరడాకుచ్చులు.
కొనరాజుగేయాలు.
రాష్ట్రగీత.

8. అభిరుచులు : ....

9. చిరునామా : 10 గిరియప్పరోడ్డు, టి. నగరు, మద్రాసు—17.

10. ఇతర విశేషములు :

పంద్రెండవయేటనే కవిత్వమును చెప్పుట ప్రారంభించి "బాలకవి" అను బిరుదుబొందిరి పదుమూడవయేట అష్టావధాన శతావధానములుజేసి సభలలో గౌరవసన్మానాలు పొందిరి. అనేక సభలలో వేయిన్నూటపదహార్లు బడసిరి. తిరుతని రైతుమహాసభలో ఇప్పటి బీహారుగవర్నరు శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారిచే "కవిరత్న" అను బిరుదుచే గౌరవింపబడిరి. మద్రాసు ప్రొవిన్షియల్ వార్ కమిటీవారు ఏర్పరచిన యాంటీఫాసిస్టుగీతాల పోటీలో అప్పటి గవర్నరు సర్ఆర్థరుహోప్గారిచే సువర్ణపతకాన్ని పొందిరి.

ఆంధ్రసినిమారంగములో ప్రవేశించి అనేక చిత్రాలకు శతదినోత్సవ రజతోత్సవాలు బడసిన చిత్రాలకు ప్రసిద్ధమగు పాటలువ్రాసి మంత్రులచేతను ప్రజానాయకులచేతను ఎన్నో సువర్ణ రజిత షీల్డులను బడసిరి.

వీరు వ్రాసిన "రోజులుమారాయి" చిత్రంలోని "ఏరువాక" పాట హిందీ, మహరాటా, సిలోన్, మళయాళీ, తమిళ, కన్నడ భాషలలో కాపీచేయబడి భారతదేశంలోనే గొప్ప పాటగా బహుళ ప్రచారం పొందినది.

తెలుగు చిత్రసీమలో "కొసరాజు" అను కలంపేరుతో వీరు ప్రజలకు సుపరిచితులు. వీరి కవిత్వంలో జాతీయత తొణికిసలాడుచుండును. ప్రజలకు సుగమమగు సాహిత్యం అందజేయుటలో వీరిది అందెవేసినచేయి. జానపద సాహిత్యానికి చక్రవర్తులని ప్రసిద్ధి.

వీరి వ్యాసము : 'గంటికోట యాదాస్తు' 498వ పుట లగాయతు 501వ పుటవరకు.

డాక్టర్. కె. వి. ఆర్. నరశింహంగారు, వీరి జీవితచరిత్ర మాకు అందలేదు.
వీరి వ్యాసము : 'పారిజాతసౌరభము' 502వ పుట లగాయితు 507వ పుట వరకు.

| | | |
|---|---|---|
| 1. | పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : | నరసింహశాస్త్రి. నోరి. |
| 2. | పుట్టినతేది : | 6—2—1900. |
| 2. | జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : | గుంటూరు.<br>ప్రస్తుతనివాసము : రేపల్లె. (గుంటూరుజిల్లా) |
| 4. | విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : | గుంటూరు K. E. L. M. College,<br>పచ్చయప్పకాలేజి, మదరాసు.<br>లాకాలేజి, మదరాసు.<br>గురువులు :<br>జగద్గురు శ్రీ కల్యాణానందభారతిస్వామివారు. |
| 5. | డిగ్రీలు. బిరుదములు : | బి. ఏ., బి. యల్. కవిసామ్రాట్. |
| 6. | చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : | రెండేండ్లు ఉపాధ్యాయవృత్తి.<br>1925 నుండి లాయరువృత్తి. |

7. రచనలు : ముద్రితములు :

గీతమాలిక (కావ్యసంపుటి)
భాగవతావతరణము (పద్యనాటిక)
షణ్ణవతి (పద్యనాటిక)
తేనెతెట్టె (నాటికలసంపుటి)
సోమనాథవిజయము (నాటిక)
క్షమాభిక్షుని (నాటిక)
సర్పసత్రము ,,
శబ్దవేధి ,,
శ్రీదేవీభాగవతము 1, 2, 3 స్కందములు
పద్యాంధ్రీకరణము.
నారాయణభట్టు (నవల)
రుద్రమదేవి ,,
మల్లారెడ్డి ,,
కవిసార్వభౌముడు ,,
కర్పూరద్వీపయాత్ర (పిల్లల నవల)
అనేకవ్యాసములు.

అముద్రితములు :

పూజావనము (నాటిక)
కుచేలనాటిక
అసంగకస్త్రైణదృఢేఇఫిర్త్వా (నాటిక)
కవిదూర్జటి (నవల)
సహజపాండిత్య (నవల)
విశ్రాంతి (నవల)
శ్రీ దేవీభాగవతము
(4 & 12 స్కంధములు)
అనేకనాటికలు.
వ్యాసములు, కథలు.

8. అభిరుచులు : ఉత్తమప్రపంచ వాఙ్మయములు.
శ్రీవిద్యోపాసనము,
చతురంగము — క్రికెటు క్రీడలు.

9. చిరునామా : నోరి నరసింహశాస్త్రి, నోరివారు, రేపల్లె.

10. ఇతర విశేషములు : సాహితీసమితి. రేపల్లె — కార్యదర్శి.
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ సభ్యుడు.

వీరి వ్యాసము : 'కవిధూర్జటి' 508వ పుట లగాయితు 512వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : చల్లా రాధాకృష్ణశర్మ.

2. పుట్టిన తేదీ : 6—1—1929.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : సోమవరప్పాడు, గుడివాడ తాలూకా — కృష్ణాజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు :

ఇంటర్మీడియట్ : వేంకటగిరి రాజావారి కళాశాల — నెల్లూరు.
బి. యే., ఆంధ్రక్రైస్తవ కళాశాల, గుంటూరు.
యం. యే., మదరాసు విశ్వవిద్యాలయము.
యం. యే., గురువు : 'ప్రసన్నకవి శిరోమణి' శ్రీ పెన్నా లక్ష్మీనారాయణశాస్త్రి.

5. డిగ్రీలు, బిరుదములు :

యం. యే.,

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము :

ఆరేండ్లు : ఆంధ్రోపన్యాసకుడు, సర్ త్యాగరాయ కాలేజి, మదరాసు, ప్రస్తుతం సాహిత్య అకాడెమిలో ఉద్యోగం.

7. రచనలు : ముద్రితములు :

తెలుగు,

1. తమిళవేదము.
2. తమిళపంచకావ్యకథలు.
3. దళవాయిరామప్పయ్య.
4. మణిమంజీరము,
5. వీరత్రయి.
6. వ్యాసమంజూష.
7. రాజభక్తి.
8. శ్రీవిజయం.
9, అనగనగా.
10. కప్పల బెకబెకలు.

అనువాదములు (తమిళం, ఆంగ్లంనుండి)

11. ఆత్మచింతనము.
12. కడుపులో గారడి.
13. అడ్మిరల్ రిచర్డ్‌బర్డ్,
14. మాతాతయ్య కొక యేనుగుండేది.
15. చిట్టికి చిరుగంట.

తమిళం.

ఆయిరం తలై నాగం.

ఇవికాక 150కి పైబడి వ్యాసములు, ఏకాంకనాటికలు, కథలు. గేయములు మొ॥నవి.

అముద్రితములు :

తెలుగు.

1. మధురనాయకరాజులు.
2. తమిళవాఙ్మయ పరిచయం.

తమిళము,

1. వేమన్న.
2. వ్యాసములు.

ఆంగ్లము.

1. వ్యాసములు.

8. అభిరుచులు : గ్రంథపఠనం — పెద్దల సాంగత్యం.

9. చిరునామా : చల్లా రాధాకృష్ణశర్మ, యం. యే.,
24A తాండవరాయగ్రామణివీధి,
తండియార్పేట, మదరాసు—21.

10. ఇతర విశేషములు :
1. తమిళరచయితలు తమ 75 మహాసభలో సన్మానించారు.
2. ఆంధ్రప్రభుత్వంవారు "కథాపుష్పలోహారానికి" బహుమతి యిచ్చారు.
3. వక్తగా ప్రసిద్ధుడను — తెలుగులోను తమిళంలోనూ.

వీరి వ్యాసము : 'విశ్వనాథనాయకుడు' 513వ పుట లగాయతు 518వ పుట వరకు

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు'; నాయని కృష్ణకుమారి.

2. పుట్టిన తేదీ : 14—3—1930.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : గుంటూరు, గుంటూరుజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : హైస్కూలు చదువు నర్సరావుపేట,
కాలేజీచదువు గుంటూరు.
యూనివర్శిటీచదువు విశాఖపట్నం.

5. డిగ్రీలు, బిరుదములు : తెలుగులో M. A. (Andhra);
సంస్కృతములో M. A. (Osmania)

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : చేసిందీ. చేస్తున్నదీ ఒకటే ఉద్యోగం. అది ఉస్మానియా మహిళాకళాశాలలో తెలుగు అధ్యాపకత్వం.

7. రచనలు : ముద్రితములు :

1. ఆంధ్రుల కథ.
2. గౌతమి.

అముద్రితములు :

చెదురు మదురుగా. వివిధ పత్రికలలో పడిన భాషకూ. సాహిత్యానికీ సంబంధించినవ్యాసాలు కొన్ని కథలూ, గేయాలూ, పద్యాలూ.

8. అభిరుచులు : చదవడం, పిల్లలకు చదువుచెప్పడం.

9. చిరునామా : 898/2 యల్లారెడ్డిగూడా, హైదరాబాదు — 16.

10. ఇతర విశేషములు : ఏమీలేవు.

వీరి వ్యాసము : 'మొల్లరామాయణము వర్ణచిత్రణ' 519వ పుట లగాయితు 523వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : కొత్త సత్యనారాయణచౌదరి.

2. పుట్టిన తేదీ : 1907—12—31.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : అమృతలూరు, తెనాలితాలూకా — గుంటూరుజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : అమృతలూరు సంస్కృతపాఠశాల, చిట్టిగూడూరు సంస్కృత కళాశాల.
1. బ్రహ్మశ్రీ కంబంపాటి స్వామినాథశాస్త్రిగారు.
2. శ్రీమాన్ కరి రామానుజాచార్యులవారు.
3. బ్రహ్మశ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు.
4. యస్. టి. జి. వరదాచార్యులవారు (ముఖ్యులు)

5. డిగ్రీలు, బిరుదములు : ఉభయభాషాప్రవీణ (A)

6. చేసిన ఉద్యోగములు. ప్రస్తుతోద్యోగము : ఇరువది ఎనిమిది సంవత్సరములు గుంటూరు జిల్లా బోర్డులోని హైస్కూళ్లలోని సీనియర్ పండిట్ ఉద్యోగము.
ప్రస్తుతము : 7 సంవత్సరాలుగా నిడుబ్రోలు— పి. బి. యస్. కాలేజిలో తెలుగులెక్చరరుగా.

7. * రచనలు ముద్రితములు :

1. వైదిక వాఙ్మయచరిత్ర.
2. సతీసప్తతి (పద్య)
3. కథావింశతి.
4. చంద్రాపీడచరిత్ర.
5. కామశాస్త్రము (వాత్స్యాయనకృతము)
6. కావ్యమాల (I భా.)
7. కావ్యమాల (II భా.)
8. సుభాషితము
9. ధర్మశాస్త్రము (మనుస్మృతి)
10. కవులకథలు.
11. వరరుచి.
12. ఈశ్వరసేవకులు.
13. విక్రమకథలు.
14. మ్రొక్కుబడి (పద్య)
15. నవనాథము.
16. బృహత్కథలు.
17. వత్సరాజు.
18. విక్రమాదిత్యము.
19. సాలభంజికలు.
20. బాపూజి (పద్య)
21. చారుదత్తము
22. నీతిచంద్రిక (సవ్యాఖ్య)
23. చిన్నయ్య.
24. నైషధము.
25. కలిపురాణము I భా.
26. ప్రతాపసింహము.
27. వీరపూజ.
28. చాణక్యము.
29. దివ్యమూర్తులు.
30. స్వరాజ్యకథలు.
31. మాయాభిక్షువు (పద్య)
32. కలిపురాణము II భా. (పద్య)
33. మాస్వామి (పద్య)
34. మంజరి ,,
35. పంచశతీపరీక్ష.
36. జాతకకథలు.

అముద్రితములు :

1. కల్పవృక్షఖండనము.
2. అంజలి (పద్య)
3. సైరంధ్రి
4. కులపతి (శ్రీవరదాచార్యభీము)
5. స్వరాష్ట్రము (పద్య)
6. కలిపురాణము III భా.
7. కలిపురాణము IV భా.
8. కలిపురాణము V భా.
9. మేవాడవిజయము.
10. మహారథులు,
11. లోకతంత్రము (పద్య)
12. సాహితీసమీక్ష.
13. నాయుపాధ్యాయగిరి.
14. త్యాగయ్య.
15. రామరాజభూషణము.
16. కావ్యకథలు:
17. తెలుగువెలుగులు.
18. చిత్రకథలు.
19. వినోదకథలు.
20. పండితుడు (పద్య)
21. శిశుఘ్న (పద్య)
22. శకుంతలా (సంస్కృతము)
23. కవిత్రయము.
24. తెలుగులక్షణము.
25. వాల్మీకము.
26. మాలిక (పద్య)
27. బాలప్రౌఢ ప్రశ్నోత్తరమాల.
28. సాహిత్యవ్యాసములు.

8. అభిరుచులు : సాహిత్యవ్యాసంగము — కవిత్వదీక్ష — వ్యాసరచనాదికము.

9. చిరునామా : కొత్త సత్యనారాయణచౌదరి Pandit
P. B. N. College, నిడుబ్రోలు—గుంటూరుజిల్లా.

10. ఇతర విశేషములు : 'ఆంధ్రపత్రిక' మున్నగు దినపత్రికలలో, ఉమాస్ రైతు మున్నగు వారపత్రికలలో, భారతి, తెలుగు విద్యార్థి మున్నగు మాసపత్రికలలో, ఉగాది సంచికలలో వ్యాసరచనలు, విజయవాడ—హైదరా బాదు రేడియో ప్రసంగములు ఉపన్యాసములు కలవు.

వీరి వ్యాసము : 'వసుచరిత్ర తద్విశిష్టత' 524వ పుట లగాయతు 530వ పుటవరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : శ్రీరామమూర్తి. ధూళిపాళ.

2. పుట్టిన తేదీ : —

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : —

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : —

5. డిగ్రీలు. బిరుదములు : M. A., Sanskrit; M. A. Telugu.
విద్వాన్ P. O. L. (అలంకారశాస్త్రము)
P. O. L. (ఫైలాలజీ)

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : Lecturer and Head of the Dept., of Telugu S. R. R. Govt., Arts College Karimnagar.

7. రచనలు : ముద్రితములు : అముద్రితములు :

1. భువనవిజయము
2. గృహరాజుమేడ
} ఆంధ్రాయూనివర్సిటీవారి ప్రథమబహుమతి పొందిన నవలలు.

3. మల్లికార్జునశతకము.
4. రాజరాజేశ్వరీ శతకము.
5. జీవునివేదన.
5. భారతిలో విమర్శవ్యాసములు.

8. అభిరుచులు :

9. చిరునామా : Lectuer and Head of the Dept., of Telugu S. R. R. Govt,, Arts College Karimnagar.

10. ఇతర విశేషములు :

వీరి వ్యాసము : 'పాండురంగవిభుని పదగుంఫనము' 531వ పుట లగాయితు 538వ పుట వరకు.

డా॥ పల్లా దుర్గయ్య వీరి జీవితచరిత్ర మాకు అందలేదు.

వీరి వ్యాసము : 'మల్లన తమ్మయ్యకవుల విప్రనారాయణ చరిత్రములు' 539వ పుట లగాయితు 549వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : రామకృష్ణశాస్త్రి శిష్టా.

2. పుట్టిన తేదీ : 18—7—1909.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : బందరు – (కృష్ణాజిల్లా)

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : బందరు నోబుల్‌కళాశాల. శిష్టా నరసింహశాస్త్రిగారు.

5. డిగ్రీలు, బిరుదములు : ఎం. ఎ; బి. ఓ, యల్; విద్వాన్.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : ఆంధ్రాధ్యాపకులు : బందరు నోబుల్ కళాశాల; మద్రాసు క్రైస్తవకళాశాల; సహాయసంపాదకుడు శ్రీవెంకటేశ్వర ప్రాచ్యవిద్యాసంస్థ, తిరుపతి; ఆంధ్రాధ్యాపకుడు – మద్రాసు విశ్వకళాపరిషత్తు.

7. రచనలు : ముద్రితములు :

1. ఆంధ్రవాఙ్మయచరిత్ర సర్వస్వము.
2. నాటకవిమర్శ.
3. వీరశైవాంధ్ర వాఙ్మయము.

అముద్రితములు :

1. నన్నయ తిక్కన పోతనలు – కవివేదాంతులు.
2. భాషాశాస్త్రము – ద్రావిడభాషలు.

4. విమర్శవ్యాసములు.
5. ఆంధ్రనాటకకళ.
6. ఆంధ్రుల హాస్యరసము.

{ భారతి, సాహిత్య పరిషత్పత్రిక, కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, ఉగాది, ఆంధ్రప్రదేశ్ మొ॥వానిలో శతాధిక వ్యాసములు.

8. అభిరుచులు : నాటకము — లలితకళలు.

9. చిరునామా : ఆంధ్రాధ్యాపకులు—మద్రాసు విశ్వకళాపరిషత్తు — మద్రాసు—5.

10. ఇతర విశేషములు: 1947 సం.లో ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే వీర శైవాంధ్ర వాఙ్మయరచనకై పోటీపరీక్షలో సర్. ఆర్. వెంకటరత్నం పరిశోధన సువర్ణపతక పరిగృహీత.

వీరి వ్యాసము : 'విజయవిలాసమందలి చేమకూరపాకవిశేషము' 550వ పుటలగాయితు 561వ పుటవరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : SHERWANI, H. K.

2. పుట్టినతేది : 30th March 1891.

2. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : Dataoli, Dt. Aligarh, U. P.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : M. A. O. College, Aligarh Oxford Uuiversity.
Grenoble and Geniva, Universities.

5. డిగ్రీలు. బిరుదములు :

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము :

7. రచనలు : ముద్రితములు : అముద్రితములు :

— —

8. అభిరుచులు :

9. చిరునామా :

10. ఇతర విశేషములు :

You will find in full biography in
ఆంధ్ర ప్రదేశ్ ఎగువసభ సభ్యులు
1958, p. 46, published by
సత్యనారాయణరావు, B1/50,
పట్టాభిపురం, Guntur – 2
You may kindly add to it that I was the leader of the Indian Delegation at the "International Conference on Asian History" held on August 30 & September 5, at Hangkong
I have already furnished you with my humble photograph.

వీరి వ్యాసము : 'మహమ్మదు కుతుబ్‌సాహీకాలమున వర్తకవ్యాపారము'
562వ పుట లగాయితు 566వ పుట వరకు.

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు, వీరి జీవితచరిత్ర మాకు అందలేదు.

వీరి వ్యాసము : 'శ్రీజగన్నాథ పండితరాజ లఘుకావ్యములు' 567వ పుట లగాయితు 580వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : అమరేశం రాజేశ్వరశర్మ.

2. పుట్టినతేది : సెప్టెంబరు 5, 1930.

2. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : కామారెడ్డి, నిజామాబాదు జిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు :

1. ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము, కొవ్వూరు.
2. ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

గురువులు :

కీ॥ శే॥ బ్ర॥శ్రీ వేదుల రామశాస్త్రిగారు,
కీ॥ శే॥ బ్ర॥శ్రీ చిలుకూరి రామమూర్తిశాస్త్రిగారు,
బ్ర॥శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు.
మ॥హా॥శ్రీ కేశిరాజు వేంకటనృసింహ అప్పారావుగారు,
Prof. ఖండవల్లి లక్ష్మీరంజనముగారు,
Dr. దివాకర్ల వేంకటావధానిగారు.

5. డిగ్రీలు. బిరుదములు : భాషాప్రవీణ, M. A.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము :

1. మొదట ప్రభుత్వోన్నతపాఠశాలలలో నాంధ్రోపాధ్యాయుఁడుగ 8 సంవత్సరములు.
2. హైదరాబాదు వివేకవర్ధనీ కళాశాలలో నొక్క సంవత్సర మాంధ్రోపన్యాసకత్వము.
3. ప్రస్తుతముస్మానియా విశ్వవిద్యాలయము ఆంధ్ర శాఖలో నుపన్యాసకత్వము.

7. * రచనలు ముద్రితములు :

1. నన్నెచోడుని కవిత్వము.
2. వేదం వేంకటరాయశాస్త్రిరూపక సమాలోచనము.
3. తిరుపతి వేంకటకవుల స్వతంత్ర నాటకములు.
4. కాళిదాస కావ్యపరిశీలనము.
5. షష్ఠ్యంతముల పుట్టుపూర్వములు.
6. ఆశ్వాసాద్యంతపద్యములతీరుతెన్నులు.
7. అహోబలపండితీయాంధ్ర వివరణము.

అముద్రితములు :

8. అభిరుచులు :

1. ఆంధ్రవ్యాకరణము, ఆంధ్రసాహిత్యములందు పరిశ్రమ.
2. కథానికలు. ముత్యాలసరములలో కథలు వ్రాయుట.

9. నిరునామా : 16–10–27/63 మలకపేట, హైదరాబాదు-24.

10. ఇతర విశేషములు: —

వీరి వ్యాసము : 'ఆంధ్ర వ్యాకరణమహాభాష్యము అహోబల పండితీయము'
581వ పుటలగాయితు 588వ పుటవరకు.

శ్రీ కె. వి. భూపాలరావుగారు వీరి జీవితచరిత్ర మాకు అంపలేదు.
వీరి వ్యాసము : 'అబుల్హాసన్ తానాషా ఆస్థేయపౌరుషేయములు'
589వ పుట లగాయితు 600వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు': ఆదిరాజు వీరభద్రరావు.

2. పుట్టిన తేదీ : 78 Years.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : దెందుకూరు, మధిరతాలూకా—ఖమ్మంజిల్లా. A. P.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : హైద్రాబాదు గవర్నమెంటు చాదరుఘాటు హైస్కూలు.

5. డిగ్రీలు, బిరుదములు : No.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : ప్రధానాంధ్రపండితుడు. గవర్నమెంటు హైస్కూలు, చాదరఘాటు – హైదరాబాదు.

7. రచనలు : ముద్రితములు :

ప్రాచీనాంధ్రనగరములు.
డిగ్రీకు పురాణకథలు.
షితాబుఖాన్ అను సీతాపతి.
మన తెలంగాణము.
రత్నప్రభ } కథలు.
మిఠాయిచెట్టు } కథలు.
వగయిరా.

అముద్రితములు :

గ్రీకుపురాణ నామచంద్రిక.
మాడపాటి హనుమంతరాయజీవితము.
వగయిరా.

8. అభిరుచులు : చరిత్ర. సాహిత్యవిద్యార్థి.

9. చిరునామా : A-78 ఆజంపురా — హైదరాబాదు.

10. ఇతర విశేషములు : ప్రస్తుత సంగ్రహ ఆంధ్రవిజ్ఞానకోశ నిర్మాణము నందు సంపాదకీయ వ్యవహర్త.

వీరి వ్యాసము: కుతుబ్‌సాహీల తెలుగు సాహిత్యపోషణము' 601వ పుట లగాయతు 607వ పుట వరకు

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ.
కలముపేరు : 'కృష్ణకుమారి' బాల్యంలో కొన్నాళ్లు.

2. పుట్టిన తేదీ : 1917.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : ఏలూరు — పశ్చిమగోదావరిజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : రాజమహేంద్రవరము, ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల.
శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రిగారు,
శ్రీ యరసూరి మల్లికార్జునరావుగారు,
శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు.

5. డిగ్రీలు, బిరుదములు : 1. ఉభయభాషాప్రవీణ, హిందీలో, రాష్ట్రభాష.
2. ఆంధ్రసరస్వతి—విద్వత్కవయిత్రి వాగ్గాహ్నవి.

6. చేసిన ఉద్యోగములు. ప్రస్తుతోద్యోగము : పదవులు : ఉద్యోగమేమీచేయలేదు. తెలుగుభాషా సమితి. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఎకాడమీల సభ్యత్వము. ఆంధ్ర యూనివర్సిటీల సభ్యత్వము, ఆలిండియా రేడియో సలహాసంఘము.

7. రచనలు : ముద్రితములు :

1. ఆంధ్రకవయిత్రులు.
2. పెద్దలసుద్ది
3. తులసిపలుకుబాట
4. ప్రణయమహిమ

హిందీకవుల సంతకవితకు అనువాదములు. ఆంధ్రమహిళ మున్నగు పత్రికలలో ప్రచురితములు.

అముద్రితములు :

1. ఆంధ్రకర్ణాటక సంగీతచరిత్ర.
2. పరమహంస : పద్యకావ్యము.
3. దుర్గాస్తోత్ర హారావళి – (సంస్కృతశ్లోకములు)
4. మనసులు మమతలు – (గేయసంపుటి)
5. సాహిత్యవ్యాసమాల.
6. ప్రాస్తావిక పద్యమంజరి.

8. అభిరుచులు : సంగీతము. వక్తృత్వము. వ్యాసరచన. భారతజాతీయ సంస్కృతిని ప్రతిబింబించు విద్యా ప్రణాళికలు భారతదేశమునకు కావలెనని నా అభిలాష.

9. చిరునామా : C/o ఊటుకూరి హయగ్రీవగుప్తగారు.
Advocate, బాపట్ల – గుంటూరుజిల్లా.

10. ఇతర విశేషములు : వీణావాదనమున ఒకప్పుడు నిపుణత్వముండెడిది.

వీరి వ్యాసము : 'రాధికాస్వాంతనము ముద్దుపళని ముద్దుపలుకులు'
608వ పుట లగాయితు 612వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : రామకృష్ణశర్మ గడియారము. "మైత్రేయ"

2. పుట్టిన తేదీ : కాళయుక్తి – ఫాల్గుణ శు. ౪.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : అలంపూర (తా) మహబూబ్‌నగరం జిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిపాదుల కడ విద్యాభ్యాసము.

5. డిగ్రీలు, బిరుదములు :

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : కార్యదర్శి ; ఆంధ్రసారస్వత పరిషత్తు—హైదరాబాద్.

7. రచనలు : ముద్రితములు :

౧. ఆలంపూరు శిథిలములు.
౨. అలంపుర క్షేత్రము.
౩. వినయాదిత్య పల్లెపాడు తామ్రశాసనము.
౪. తెలుగుసిరి.
౫. ప్రపంచరాజ్యములు.
౬. భారతదేశ చరిత్ర.
౭. దశరూపకసారము.
౮. తెలంగాణా శాసనములు ౨వ సంపుటము.
౯. కన్నడ సాహిత్యచరిత్ర.
౧౦. బ్రహ్మేశ్వర క్షేత్రమాహాత్మ్యము.

అముద్రితములు :

౧. భారతీయ వాస్తుశిల్ప విజ్ఞానము.

8. అభిరుచులు : చరిత్ర పరిశోధనము. శాసన పరిష్కరణము. శిల్పశాస్త్ర పరిశీలనము.

9. చిరునామా : అలంపూరు. (P. O.) మహబూబ్‌నగరం జిల్లా. (సెంట్రల్ రైల్వే.)

10. ఇతర విశేషములు : —

వీరి వ్యాసము : 'విస్మృతరాజకవి బిజ్జుల తిమ్మభూపాలుడు' 613వ పుట లగాయతు 618వ పుటవరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : వేంకటలక్ష్మీనరసింహారావు వాసిలి.

2. పుట్టిన తేదీ : 20—7—1930.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : చేబ్రోలు (P. O.) తెనాలితాలూకా. గుంటూరుజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు :

ఆంధ్ర క్రైస్తవ కళాశాల. గుంటూరు.
శ్రీ తెలికచర్ల వెంకటరత్నంగారు.
ప్రెసిడెన్సీకాలేజి, మద్రాసు :
శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావుగారు.
సంస్కృతాంధ్ర ప్రారంభ విద్యాగురువులు :
శ్రీ పన్నెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారు,
శ్రీ మేడూరి గోవిందాచార్యులుగారు.

5. డిగ్రీలు. బిరుదములు :

బి. ఏ. (ఆనర్సు):
ఎం. ఏ. (ఆంధ్రభాషాసాహిత్యములు).

6. చేసిన ఉద్యోగములు. ప్రస్తుతోద్యోగము :

ఆంధ్రోపన్యాసకుడు (1954–'59) :
ఆంధ్ర క్రైస్తవ కళాశాల, గుంటూరు.
ఆంధ్ర సహాయోపన్యాసకుడు ('59–'62)
పి. ఆర్. ప్రభుత్వకళాశాల, రాజమండ్రి.
ఆంధ్రభాషాశాఖాధ్యక్షుడు ('62–'64) :
ప్రభుత్వకళాశాల. రాజమండ్రి.

7. రచనలు : ముద్రితములు :

ఆనందభిక్షువు (పద్యకృతి)
వివిధసాహిత్యవ్యాసములు. కథానికలు.
నాటికలు, పద్యఖండికలు { భారతి మొదలైన పత్రికలలో ముద్రితము }

అముద్రితములు :

ధర్మవీరులు (నాటిక)
విశ్వర్షి వ్యాసావళి (సాహిత్యవ్యాసములు)
రేడియో ప్రసంగాలు
(ఆకాశవాణిప్రసారితములు)
నాటికలు – కథానికలు.

8. అభిరుచులు :

అక్షరరమ్యమగు ఆంధ్రసాహిత్యము.
భారతీయ శిల్పము.
ఆంధ్రనాటకరంగాభివృద్ధి.

9. చిరునామా :

V. V. L. Narasimha Rao, M. A.
Head of the Telugu Department,
Govt. Arts College, Rajahmundry.

10. ఇతర విశేషములు :

వీరి వ్యాసము: 'మధురకవితాతరంగిణి శ్రీకృష్ణలీలాతరంగిణి' 619వ పుట లగాయితు 626వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : వేంకట అచ్యుత రామలింగేశ్వరశాస్త్రి, శ్రీపాద.

2. పుట్టిన తేదీ : 6—1—1936.

3. జన్మస్థలము: ఊరు, తాలూకా, జిల్లా : గుమ్మలూరు, నరసాపురము తాలూకా — పశ్చిమగోదావరిజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : M. A. (ఆంగ్లము) కాశీ హిందూవిశ్వవిద్యాలయము; వారణాసి.
B. A (గణితము) ఆంధ్ర విశ్వవిద్యాలయము; వాల్తేరు. గురువులు : పెద్దలందరు.

5. డిగ్రీలు, బిరుదములు : —

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : తూర్పు, పశ్చిమగోదావరిజిల్లా పరిషత్ పాఠశాలలలో ఉపాధ్యాయవృత్తి 10 సంవత్సరములు.
ప్రస్తుతం : శ్రీ వేంకటేశ్వర పబ్లిక్‌స్కూలు. హార్స్లీకొండలలో ఉపాధ్యాయవృత్తి.

7. రచనలు : ముద్రితములు :
కొన్నిగేయములు, కథలు ఆంధ్రప్రభ, పత్రిక, భారతిలలో ప్రచురితములు.

అముద్రితములు :
గీతాంజలి తెలుగు అనువాదము.
గేయములు. వ్యాసములు. కథలు.
ఆంగ్లమునందుకూడ గేయములు, కథలు.

8. అభిరుచులు : చిత్రకళ, కవిత్వము, పాఠ్యబోధన.

9. చిరునామా ఉపధ్యాయుడు, శ్రీ వేంకటేశ్వర పబ్లిక్‌స్కూలు, హార్స్లీకొండలు, మదనపల్లితాలూకా — చిత్తూరుజిల్లా.

10. ఇతర విశేషములు : —

వీరివ్యాసము : 'పాశ్చాత్యవీధుల విహరించేప్రాచ్యవిహంగము — వర్డ్సువర్తు'
627వ పుట లగాయతు 631వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : తల్లాప్రగడ సత్యనారాయణమూర్తి.

2. పుట్టిన తేదీ : 2—3—1930.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : తెలికిచర్ల, తాడేపల్లిగూడెం తాలూకా — పశ్చిమగోదావరిజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు :
తెలికిచర్ల, పిట్టలవేమవరం ప్రాథమికపాఠశాలలు,
పిఠాపురం, తణుకు ఉన్నతపాఠశాలలు.
కాకినాడ మహారాజావారి కళాశాల.
ఆంధ్ర విశ్వకళాపరిషత్.
ఈపై విద్యాసంస్థలలో ఆ యా కాలములందు పని చేసిన పూజనీయులైన ఉపాధ్యాయ, ఆచార్య వర్గం.

5. డిగ్రీలు, బిరుదములు : యం. ఎ.

6. చేసిన ఉద్యోగములు. ప్రస్తుతోద్యోగము : చరిత్ర. రాజకీయశాఖ ప్రధానోపన్యాసకులు.
ఎ. ఎం. ఎ. ఎల్. కళాశాల. అనకాపల్లి.

7. రచనలు : ముద్రితములు :
చరిత్రపై వ్యాసములు.
విద్యాసమస్యలపై వ్యాసములు.

అముద్రితములు :
వ్యాసములు.

8. అభిరుచులు : చరిత్రపై కృషి. లలితకళలు.

9. చిరునామా : గాంధీనగరము — అనకాపల్లి.

10. ఇతర విశేషములు : —

వీరి వ్యాసము : 'పద్మనాభ యుద్ధము' 632వ పుట లగాయితు 641వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : అడపా రామకృష్ణారావు.

2. పుట్టిన తేదీ : 15 ఫిబ్రవరి, 1927.

3. స్వస్థలము: ఊరు, తాలూకా, జిల్లా : గుడివాడ, కృష్ణాజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు :

1. హిందూ కాలేజి, బందరు.
2. ప్రెసిడెన్సీ కాలేజి, మదరాసు.
3. విస్కాన్సిన్ యూనివర్సిటీ, మ్యాడిసన్, U. S. A.

5. డిగ్రీలు, బిరుదములు :

[1] బి. ఏ. (ఆంధ్ర) 1948;
[2] యం. ఏ. ఇంగ్లీషు (మదరాసు) 1950;
[3] యం. ఏ. తెలుగు (ఉస్మానియా) 1959;
[4] యం. ఏ. అమెరికన్ సాహిత్యము (విస్కాన్సిన్) 1962;
[5] పిహెచ్. డి. ఇంగ్లీషు (విస్కాన్సిన్) 1964.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము :

1. Sub-Editer, "ఆనందవాణి", మదరాసు– 1945–46.
2. Lecturer in English, A. C. College, Guntur. 1950–1952.
3. Lecturer in English, Osmania University, Since, 1952.

7. * రచనలు : ముద్రితములు :

1. చంద్రనాథ్
(శరత్ బాబు నవలకు అనువాదము, యువ ప్రచురణ.)
2. మాధవరాధిక
(సంగీత నాటిక)

అముద్రితములు :

1. సత్యాన్వేషి
(సోక్రటీస్ జీవితంలోని రసవద్ఘట్టాలతో కూర్చిన రేడియో నాటకం.)
2. నిర్మల
(మేరీ మాగ్దలిన్ శరణాగతిని వర్ణించే రేడియో నాటకం.)

8. అభిరుచులు : ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్యాలతోపాటు, అభిమాన శాస్త్రాలు తత్త్వశాస్త్రం (Philosophy), మనస్తత్త్వశాస్త్రం (Psychology) సంగీతము చిత్రకళ, Photography అంటే ఆసక్తి.

9. చిరునామా 17-A, Sarojini Devi Road, Secunderabad-26. Andhra Pradesh.

10. ఇతర విశేషములు : ఇటలీ, ఫ్రాన్స్. ఇంగ్లండ్, అమెరికాదేశాలలో పర్యటన, Ph. D. thesis ప్రఖ్యాత అమెరికన్ తత్త్వవేత్త ఎమర్సన్ (Emerson) తాత్త్విక చర్చను గురించి.

వీరివ్యాసము : 'ఎమర్సన్‌పై భారతీయ తత్త్వశాస్త్ర ప్రభావము' 642వ పుట లగాయతు 645వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : వీరభద్రశాస్త్రి కల్లూరి.

2. పుట్టిన తేదీ : సుమారు 49 సంవత్సరముల క్రితం విరోధికృత్, జ్యేష్ఠం.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : ప్రక్కిలంక, కొవ్వూరుతాలూకా — పశ్చిమగోదావరిజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : రాజమండ్రి, కొవ్వూరు, పిఠాపురం, కాశీ, మద్రాసు, నెల్లూరు గురుకులాలు.

5. డిగ్రీలు. బిరుదములు : లేవు.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : పౌరాణికుడు — రచనలు — ఉపన్యాసములు.

7. రచనలు : ముద్రితములు :

త్యాగరాజ కీర్తనలు వ్యాఖ్య.

అముద్రితములు :

రామాయణవ్యాఖ్య

ఇంకను అనేక విషయములపై విమర్శలు, వ్యాసములు చాలా ఉన్నవి.

8. అభిరుచులు : సంగీత సాహిత్యములు.

శాస్త్రీయ విజ్ఞానంకల పరమార్థ విషయము.

9. చిరునామా : 4 లైను. చంద్రమౌళినగరం. గుంటూరు-(2)

10. ఇతర విశేషములు :

ప్రపంచమందు అనాది విజ్ఞాననిధి వేదము. ఆ వేదతాత్పర్యమును పురాణేతిహాస రూపమున మహర్షులు చక్కని ఆదర్శములతో విస్తరించిరి. యీ తాత్త్వికమైన విద్యా విజ్ఞానం ప్రజానీకానికి అందించుటకు చక్కని సంస్థ ఉన్నచో స్వతంత్రభారతం రామరాజ్యమగును.

నేడు దేశమందుగల సంగీతసాహిత్య సంస్థలు కేవలం పాశ్చాత్యనాగరికతా సమ్మోహితములై అందలి సభ్యులు, రచయితలు స్వస్థాన వేషభాషా సంప్రదాయములులేక భారత సంస్కృతిని మాట మాత్రములో గౌరవించుచు, వ్యక్తిగతంగా హైందవ సంపత్తిని విడచుచున్నారు. యీ నియమములు వైయక్తికములు కావున సంస్థలతో వ్యక్తిస్వరూప స్వభావములకు సంబంధంలేదని యుక్తివాదమాతో సమర్థింపఁజూతురు. వ్యక్తియే సంఘమునకు స్వరూపము. పదిమంది వ్యక్తులు యీ సదాచారమును పాటింపనిచో సంఘమునకే హానికల్గును. విదేశ, విభాషాదాస్యంలో మనకు ఇరుకుకల్గిననూ, నేడు స్వతంత్ర భారతమును అనుభవించుచున్నందున సంగీత, సారస్వత విద్యోపాసకులు మన సంస్కృతిని ప్రభుత్వమునకు బోధించి, ఆదర్శవంతమైన సంప్రదాయమును నెలకొల్పవలెను. నేడు అన్నిరంగములలో

1. పాశ్చాత్య నాగరికమోహము.
2. రాజకీయ ప్రభావము.

యీ రెండే విలయతాండవ మొనర్చుచున్నవి. కావున విద్యావిలసితులైన సాహిత్యవేత్తలు ఆహార విహార, వేషభాషాదులందు ఆదర్శప్రాయులై సామాన్యజనమునకు, పాలకులకు చక్కని వరవడి తీర్చిదిద్దవలెనని చిరుతనముగ మా తపస్సు. ఇందు ఆ యా వర్ణములు జాతులు వర్గములు తమ తమ ఉనికిని బాగుగా అర్థవంతముగ గుర్తించి, సారస్వతోపాసనమున సమైక్యతను సహృదయత్వమునుచూపి పరస్పర సహకార సద్భావములను వర్ధిల్లఁజేయవలెను. ఇట్టి వికాసము, నైతిక-సాంఘిక-రాజకీయ ఆధ్యాత్మిక విద్యారంగములందు శాంతిని - మాంగళ్యమును ప్రతిష్ఠించును.

వీరి వ్యాసము : 'త్యాగోపనిషత్' 646వ పుట లగాయతు 650వ పుట వరకు

శ్రీ బి. రామరాజుగారు, వీరి జీవితచరిత్ర మాకు అందలేదు.

వీరి వ్యాసము : 'వేముల రామభట్టు గౌరీవిలాసము' 651వ పుట లగాయితు 658వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు'; కీర్తిశేషులైన చిలకలపూడి వేంకటేశ్వరశర్మగారు.

2. పుట్టిన తేదీ : 15—10—1895. శాలివాహనశక ప్రకారము మన్మధనామసంవత్సర ఆశ్వయుజ బహుళ త్రయోదశి మంగళవారము.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : శ్రీకాకుళము. ఊరు : చిలకలపూడి గ్రామము దివితాలూకా — కృష్ణాజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు ;

1. ఆంగ్లవిద్య నోబుల్ కళాశాల. బందరు.
2. సంస్కృతవిద్య — ఆగిరిపల్లి. కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారు.
3. సంగీతవిద్య—పారుపల్లి రామకృష్ణయ్యపంతులు గారు — విజయవాడ.
4. బ్రహ్మవిద్యోపాసన — తెనాలి. శ్రీ భాగవతుల అన్నపూర్ణయ్యశాస్త్రిగారు.

5. డిగ్రీలు, బిరుదములు :

1910 సం॥ S S. L. C.
1919 ,, P. O. L. Mds. University.
1928 ,, U. B. P. Andhra Univesity-Vijayawada. ఉభయభాషాప్రవీణ.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : ప్రధాన తెలుగు పండితుడు 1914 నుండి 1957. స్థానిక పురపాలక సంస్థోన్నతపాఠశాల. విజయవాడ—1.

7. రచనలు : ముద్రితములు :

ఆంధ్రానువాద గ్రంథములు,
రామామాత్యుని — సర్వమేళకళానిధి.
సోమనాథుని — రాగవిబోధ.
అహోబలుని — సంగీతపారిజాతము.
వేంకటమఖి - చతుర్దండిప్రకాశిక.

అముద్రితములు :

Copiling Editions.

1. శ్యామశాస్త్రి కృతితరంగిణి.
2. దీక్షితకృతిరత్నమంజూష మొదటిభాగము.

రెండవభాగము అచ్చులో నున్నది.

పై గ్రంథములుగాక అనేక సుప్రసిద్ధమైన వ్యాసములును, వార్తాపత్రికలలో Articlesను వ్రాసినారు. అవి దాదాపు 30 సంఖ్యకు పైగా వుంటాయి. అవి భారతి, ఆంధ్రప్రభ, నాట్యకళ పత్రికలలో ప్రచురితములైనవి. అంధ్రపత్రిక మద్రాసు ప్రచురణలోను యివి తరచు కనబడుతుండేవి. ప్రధానముగా సంగీత విషయమున ప్రజాబంధు పత్రికలో నేలటూరి అనంతాచార్యులుగారితోపాటు చాలాకీర్తనలను వారం వారం ప్రకటించారు.

8. అభిరుచులు : —

9. చిరునామా : 27-12-35 ఆలీబేగ్‌సాహెబ్ వీధి. గవర్నరుపేట. బకింగ్‌హామ్ పేట పోస్టు, విజయవాడ—2.

10. ఇతర విశేషములు:

(1) సంగీత సాహిత్య పరిషత్‌వారు 1935 సం॥లో "గాయకరత్న" బిరుదప్రదానముచేసిరి. (2) 1961సం॥ డిశెంబరులో మద్రాసు మ్యూజిక్ అకాడెమివారు నిర్వహించిన సంగీత సదస్సులో "సంగీత విద్వాన్" బిరుదప్రదానమొనర్చిరి. (3) 1950 సం॥నుండి ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు నిర్వహించు ఇంటరు మీడియేట్. బి. ఏ. పరీక్షలకును డిప్లమో పరీక్షలకు సంగీత పరీక్షాధికారిగ 1961 వరకు నియమించబడినారు. (4) 1930 నుండి 1942 ప్రభుత్వమువారు నిర్వహించు లోయరు. హైయ్యర్‌గ్రేడు సంగీత పరీక్షలకు అధికారిగా నియమించబడినారు. 1942 నుండి 1950 వరకు S S. L. C. పరీక్షలకు తెలుగు, సంగీత విషయములందు ప్రధానపరీక్షాధికారిగ నున్నారు. (5) 1929లో మద్రాసు మ్యునిసిపల్ కార్పొరేషన్‌వారి ఆధ్వర్యమున నున్న Radioలో ప్రథమముగా కచ్చేరీచేయుట ప్రారంభించినారు, తర్వాత దానిని 1932లో Central Govt. వారు A. I. R. గా మార్చినతర్వాతకూడ సంవత్సరమునకు 6 లేక 7 కచ్చేరీల చొప్పున పాడినారు. 1948 నుంచి విజయవాడలో ఆకాశవాణి కేంద్రము నుండి సంగీతసభలు, కచ్చేరీలు, రాగం తానం, పల్లవులు మొదలుగాగలవానిని నిర్వహించారు. మొదటగా భక్తరంజని కార్యక్రమము నిర్వహించినది, పాడినది వీరె మొదటివారు. యిప్పటికిని వీరుపాడినవి, వీరిచే నిర్వహించబడినవి రేడియోద్వారా నేటికి వినబడుతూవున్నవి.

8—12—1964 మంగళవారం సాయింకాలము షుమారు 8 గంటలకు వారి నివాసగృహమునందు పరమపదించిరి.

వీరి వ్యాసము : 'మహాభక్తత్రయము' 659వ పుట లగాయితు 663వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : డా. వేంకటావధాని, దివాకర్ల.

2. పుట్టినతేది : 1—7—1913.

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : ఆకుతీగపాడు, తాడేపల్లిగూడెం తాలూకా, పశ్చిమగోదావరిజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : స్కూలుఫైనలువఱకు, వుండి బోర్డుహైస్కూలు. ఇంటరు, హిందూకాలేజి — మచిలీపట్టణము. ఆనర్సు, ఆంధ్రవిశ్వవిద్యాలయకళాశాల—వాల్తేరు.

5. డిగ్రీలు. బిరుదములు : బి. ఏ. ఆనర్సు; ఎం. ఏ. ఆనర్సు; పి. హెచ్. డి. కవిభూషణ.

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : ఆంధ్రశాఖాధ్యక్షుఁడు: మిసెస్. ఏ. వి. యన్. కళాశాల, విశాఖపట్టణము. 1934–1951.
రీడరు, ఆంధ్రశాఖ. ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు. 1951–1964.

7. * రచనలు ముద్రితములు :

1. రాజసందర్శనము.
2. మధువనము.
3. త్రివర్ణపతాక.
4. విశాలాంధ్రోదాహరణము.
5. కౌముదీమహోత్సవము.
6. నాగానందము.
7. ప్రాజ్నన్నయయుగము.
8. నన్నయభారతము.
9. ఆంధ్రవాఙ్మయచరిత్ర.
10. ఆంధ్ర నాటక పితామహుఁడు.
11. గురుశిష్యులు.
12. కాదంబరి.
13. వేమన.
14. ప్రకృతివిజయము.
15. మార్గదర్శకులు
16. వ్యాసావళి.
17. మౌలానా ఆబుల్ కలామ్ ఆజాదుస్మారక సంపుటము.

సంపాదితములు :

18. విశ్వసాహితి—ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము VI
19. నన్నయ పదప్రయోగసూచిక.
20. నన్నెచోడ పదప్రయోగసూచిక (ఇతరులతో కలసి)

అముద్రితములు :

1. పరివర్తనము.
2. కిరాతార్జునియము.
3. శ్రీకృష్ణదేవరాయలు-ఆముక్తమాల్యద.
4. శ్రీశంకరాచార్యచరిత్ర.

8. అభిరుచులు : సాహిత్యవిమర్శ, కవిత్వము.

9. చిరునామా : 18/4 R. T. బరకత్పుర; హైదరాబాదు–27.

10. ఇతర విశేషములు :

వీరి వ్యాసము : 'ఆంధ్ర వాఙ్మయమునందలి రాజకవులు' 664వ పుట లగాయితు 674వ పుట వరకు.

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : వేంకటకృష్ణశర్మ, వేదము. 'కౌశిక'

2. పుట్టిన తేదీ : విళంబినామసం॥రము పుష్య శుద్ధ దశమీ (21-1-1898) స్థిరవారము:

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : కార్వేటినగరము, నారాయణవరము తాలూకా. చిత్తూరుజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : నాటకాంత సంస్కృతాభ్యాసము
గురువు, కవి : చెఱుకూరు కష్ణశాస్త్రిగారు.
వైదికవిద్య : శ్రీ తిప్పావఝుల రామశర్మగారు.
ఆంధ్రము : జనకపాదులు శ్రీరామయ్యగారు,
ఆంగ్లము, అఱవము : స్వయంకృషి.

5. డిగ్రీలు, బిరుదములు : మదరాసు విశ్వవిద్యాలయమువారి 'విద్వాన్'–పట్టము
చిత్తూరుజిల్లా పండితోపాధ్యాయమండలి, తిరుపతి మహాసభలో సమావేశమయి–'విద్వత్త్వవిభూషణ' బిరుదము (21–12–1952)

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : పండితోపాధ్యాయుఁడుగ-"సెంటుపాల్సు" "శ్రీకన్యకాపరమేశ్వరీ బాలుర" ఉన్నత పాఠశాలలోను. "సెంటుక్రిస్టఫర్సు" ట్రెయినింగు కళాశాలలలోను నౌకరి. "వర్తమాని" "ఆంధ్రవాణి" "మాతృసేవ" "ఆంధ్రమహిళ" పత్రికలకు సహాయ సంపాదకత్వము. 1961 అన్నియుద్యోగముల నుండియు విరమణము.

7. రచనలు : ముద్రితములు :

× ౧. సద్ధర్మప్రబోధిని. (గ)
× ౨. కలినిగర్హణము. (ప)
× ౩. ఆంధ్ర పాండవగీతలు. (ప)
× ౪. సుభాషిత రత్నమాల. (ప)
× ౫. ధర్మవిమర్శనము. (గ)
× ౬. భక్తకల్పశతకము. (ప)
× ౭. శిష్యనీతిబోధినీశతకము. (ప)
౮. కుందమాల. (నా)
౯. భామినీవిలాసము. (ప)

అముద్రితములు :

౧. కర్ణభారము.
౨. విష్ణుమహామాయావిలాసము.
౩. మహేశమాలా (సంస్కృతశ్లోకములు)
౪. పద్మప్రాభృతకము.
౫. ఝాన్సీరాణి : లక్ష్మీబాయి.
౬. ఆరణ్యకజాతులు.
౭. భక్తియోగము.
౮. బౌద్ధధర్మదీక్షి.
౯. తేనెసోనలు–సం. IV

౧౦. శ్రీరామ లక్ష్మీస్వభావము. (ప)
౧౧. ఊరుభంగము. (నా)
౧౨. తేనెసోనలు సం, I (ప)
౧౩. .... .... II (ప)
౧౪. .... ....III (ప)
౧౫. భక్తవత్సలశతకము. (ప)
౧౬. శ్రీసోమశేఖరీయము. (ప)
౧౭. శ్రీకృష్ణశాస్త్రీయము. (ప)
౧౮. శ్రీఆంజనేయకవీయము (ప)
౧౯. శ్రీనెహ్రూకావ్యము (ప)
౨౦. అభినవాంధ్ర కాదంబరి. (ప)
౨౧. శతకవాఙ్మయసర్వస్వము–సం. I (గ)
× ౨౨. వృకవంచకీయము (ప)
(తోఁడేటి దొరతనము)
౨౩. బాలభారతము. (నా)
౨౪. బాలచరితము. (నా)

౧౦. శతకవాఙ్మయ సర్వస్వము – సం. II *
౧౧. మహాపురుషశతకము.

× ఈ గుఱుతులుగలవి ద్వితీయముద్రణాపేక్షకములు.
* ఈ గుర్తులున్నవి అచ్చులో ఉన్నవి.
(గ) గద్యము. (ప) పద్యము. (నా) నాటకము.
"భారతి"–"గృహలక్ష్మి"–"ఆంధ్రవాణి" మున్నగు పత్రికల్లో అపుడపుడు వ్రాసిన కొన్ని వ్యాసములు. (ఇందుఁ గొన్నిపత్రికలు పేర్కొనబడలేదు.)

8. అభిరుచులు : రాజకీయ సాంఘికవిషయములు, విమర్శనములు, గ్రంథరచనము, పత్రికావిలేఖన కార్యము, సాహితీగోష్ఠులు, సభలలోఁ బాల్గొనుట.

9. చిరునామా : 11. స్వామిపిళ్లైవీధి, చూళ, మదరాసు–7.

10. ఇతర విశేషములు : నాముందుతరమువఱకు మా వంశస్థులు కార్వేటినగరసంస్థానమున, దాని క్షత్రియప్రభువులకు కులబ్రాహ్మణులు. ఆస్థాన విద్వత్కవులు. రాజావాసమునకు పల్లకులలో రాకపోకలు. ప్రభువులిచ్చిన మాన్యములు అగ్రహారములు నా తరమువఱకుండినవి. పెద్దల ఋణములచే నవి చాలవఱకు విధ్వస్తములు.

వీరి వ్యాసము : 'వ్యాజస్తుతి శతకములు' 675వ పుట లగాయితు 683వ పుట వరకు.

# సంపాదకులు

పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : యేలూరిపాటి అనంతరామయ్య, 'అనంతం'

పుట్టిన తేదీ : 30–6–1935

జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : తోగుమ్మి, కొవ్వూరు తాలూకా, పశ్చిమగోదావరిజిల్లా

విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : 1) పొడగట్లపల్లి సంస్కృతపాఠశాల 2) కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము

డిగ్రీలు, బిరుదములు : 1) ఎం. ఏ. (సంస్కృతము) 2) ఎం. ఏ. తెలుగు 3) బి. ఇడి. 4) భాషాప్రవీణ' కవికులరత్నదీప'

చేసిన ఉద్యోగములు : 1) పశ్చిమగోదావరిజిల్లా పరిషత్తు ఉన్నత – బహుళార్థసాధక పాఠశాలలో ఆంధ్ర పండితత్వము 2) 'ముముక్షువు' సహాయసంపాదకత్వ సంపాదక వర్గసభ్యత్వములు 3) ఏలూరు సర్ సి. రామలింగారెడ్డి కళాశాల సంస్కృతోపన్యాసకత్వము; ప్రస్తుతోద్యోగము : ఆంధ్ర శాఖాధ్యక్షులు, విశ్వోదయకళాశాల, వెంకటగిరిటవును, నెల్లూరుజిల్లా

* రచనలు : ముద్రితములు :

1) దామోదరీయము–పద్యకృతి
2) పంచవటి–గేయకావ్యము
3) అభినవ భగీరథుడు–కథాసంపుటి
4) జంఘాలశాస్త్రి క్ష్మాలోకయాత్ర–విమర్శనాత్మక వ్యాససంపుటి
5) జైమినిభారతము–ప్రథమభాగము–వ్యావహారిక వచనాత్మకానువాదము
6) వివిధపత్రికలలో వ్యాసములు, గేయములు, కథానికలు, పద్యకవితలు.

అముద్రితములు :

1) కస్తూరీభిక్ష–పద్యకృతి
2) శ్రీ గౌతమీపుత్రశాతకర్ణి
3) వేడివెన్నెల–గేయాలు
4) వ్యాససంపుటి
5) జైమినిభారతం–సవిమర్శవ్యావహారిక వచనానువాదము
6) సంస్కృత సాహిత్య చరిత్ర – ఆచార్య, పండితబలదేవ ఉపాధ్యాయ హిందీరచనకనువాదము

8. అభిరుచులు : సంగీతము, సాహిత్యము, నటనము

9. చిరునామా : ఆంధ్రశాఖాధ్యక్షులు, విశ్వోదయకళాశాల, వెంకటగిరి టవును, నెల్లూరుజిల్లా

10. ఇతర విశేషములు : 1) తణుకు శ్రీనరేంద్రనాథసాహిత్యమండలి సంయుక్త కార్యదర్శిత్వము 2) సాహితీవాల్లభ్య సంపాదకవర్గ సభ్యత్వము

1. పూర్తిపేరు, ఇంటిపేరు, 'కలముపేరు' : పిల్లలమఱ్ఱి మార్కండేయశాస్త్రి

2. పుట్టిన తేదీ : 4-3-1916

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : గురివిందగుంటఅగ్రహారం, గుడివాడతాలూకా, కృష్ణాజిల్లా

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : శ్రీ మండలీక వేంకటశాస్త్రిగారియొద్ద తర్కము, శ్రీ వేమూరి రామబ్రహ్మశాస్త్రియొద్ద వేదాన్త శాస్త్రము. శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో వేదాన్త శాస్త్రము, మీమాంసా శాస్త్రము చదివిరి.

5. డిగ్రీలు, బిరుదములు : వేదాన్తశిరోమణి, విద్వాన్, బ్రాహ్మీభూషణ

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : సంస్కృతపండితులు, బహుళార్థసాధక పాఠశాల, తణుకు

7. * రచనలు : ముద్రితములు : అముద్రితములు :

1) ఆధ్యాత్మికవ్యాసావళి
2) సిద్ధాన్తసింధుకల్లోలము

8. అభిరుచులు : తత్త్వవిచారణ, సాహిత్యము

9. చిరునామా : తణుకు, పశ్చిమగోదావరిజిల్లా.

10. ఇతర విశేషములు : సాహితీవాల్లభ్య సంపాదకులు.

1. పూర్తిపేరు : ఇంటిపేరు, 'కలముపేరు': మధిర భానుమూర్తి ("భాను")

2. పుట్టిన తేదీ : 4-8-1932

3. జన్మస్థలము : ఊరు, తాలూకా, జిల్లా : తణుకు, పశ్చిమగోదావరిజిల్లా.

4. విద్యాభ్యాసము : కళాశాలలు, గురువులు : తణుకు, భీమవరం, రాజమండ్రి,

5. డిగ్రీలు, బిరుదములు : M. A, B. Ed.,

6. చేసిన ఉద్యోగములు, ప్రస్తుతోద్యోగము : ప్రధానోపాధ్యాయుడు

7. * రచనలు : ముద్రితములు : అముద్రితములు :

కథలు, గేయములు, వ్యాసములు, నాటికలు, వగైరాలు సుమారు 200 వరకు వివిధ పత్రికలలో ప్రచురితమైనవి. కొన్ని ఆకాశవాణిద్వారా ప్రసారమైనవి.

1) "బాధ్యతలేని పెత్తనాలు"
2) "ప్రజలమనిషి" అను నవలలు.

8. అభిరుచులు : సంగీతము, సాహిత్యము. నాటకరంగము.

9. చిరునామా : మధిర భానుమూర్తి ఎం. ఎ., బి. ఇడి.,
ప్రధానోపాధ్యాయుడు, పరిషదున్నత పాఠశాల.
రాఘవపురం. చింతలపూడితాలూకా, (W.G. Dt.)

10. ఇతర విశేషములు :

---

# అనువాదకులు

# సాహితీవాఙ్మయము - ద్వితీయభాగము

| వ్యాసము. | | రచయిత పేరు. |
|---|---|---|
| 55. విచిత్రయాత్రికుడు | | శ్రీ దిగుమర్తి సీతారామస్వామి. |
| 56. చెంబుకొలది | | శ్రీ విద్వాన్ విశ్వం. |
| 57. | (కవిత) | శ్రీ పుట్టపర్తి. |
| 58. దర్శనములు | | శ్రీ పిల్లలమర్రి మార్కండేయశాస్త్రి. |
| 59. నవలలో కనపడనిపాత్రలు | | శ్రీ బుచ్చిబాబు |
| 60. నవ్యమానవ వాదం | | శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి. |
| 61. రచయితగా పేరొందిన రాజకీయనాయకులు | | శ్రీ దేవులపల్లి రామానుజరావు. |
| 62. విశ్వనాధవిజయము | | శ్రీ సంపత్. |
| 63. ధర్మబోధ | (కవిత) | శ్రీ కొండవీటి వెంకటకవి. |
| 64. పైడిపాటి పంచశతి | (కవిత) | శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి. |
| 65. జ్ఞాపకమున్నదా ? | (కవిత) | శ్రీ వేదుల సూరి. |
| 66. తెలుగుభాష సంగీతమునకు ఎక్కువ అనువయినది | | శ్రీ బాలాంత్రపు రజనీకాంతారావు. |
| 67. ఆధునికసంగీతరీతులు | | శ్రీ పాలగుమ్మి విశ్వనాధం. |
| 68. ఇంద్రకాంతి | | శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి. |
| 69. కఠోపనిషత్ | | శ్రీ దేవరకొండ బాలగంగాధరతిలక్. |
| 70. భ్రమరగీతలు | | శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తి. |
| 71. అంతాచూస్తూనేఉన్నారు | (కవిత) | శ్రీ కుందుర్తి ఆంజనేయులు. |
| 72. నటుడు — కవి | | డాక్టర్. పి. యస్. ఆర్. అప్పారావు. |
| 73. నిన్నటి ఆంధ్రసంపాదకులు | | శ్రీ డి. ఆంజనేయులు. |
| 74. పువ్వులెప్పుడూ కోప్పడవు | | శ్రీ ఆరుద్ర. |
| 75. దారితప్పినమనిషి | | శ్రీ బలివాడ కాంతారావు. |
| 76. మరాఠీలోని తెలుగునుడులు | | డాక్టర్ తూమాటి దొణప్ప. |
| 77. అభ్యుదయ సాహిత్యోద్యమం | | శ్రీ దాశరధి. |
| 78. తెలుగులో ఉమర్ ఖయ్యాం | | స్ఫూర్తిశ్రీ |
| 79. నేటికథలు — తీరుతెన్నులు | | శ్రీ పోతుకూచి సాంబశివరావు. |
| 80. పూతపూతన | | శ్రీ ముక్తీవి లక్ష్మణదాసు. |
| 81. లలితసంగీతం | | శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ. |
| 82. సత్యం–శివం—సుందరం | | శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి. |
| 83. ఆంధ్రుల నాట్యకళ | | శ్రీ నటరాజ రామకృష్ణ. |
| 84. | (చిన్నకథ) | శ్రీ మధిర భానుమూర్తి. |

| వ్యాసము. | | రచయిత పేరు. |
|---|---|---|